# మహా భారతము

వికీపీడియా నుండి

(మహాభారతం నుండి దారిమార్పు చెందింది)

*ఇది మహాభారత గాథను గురించిన వ్యాసం. తెలుగులో కవిత్రయం వ్రాసిన గ్రంధాన్ని గురించిన వ్యాసాన్ని **శ్రీ మదాంధ్ర మహాభారతం** వద్ద చూడవచ్చు. భారతము అయోమయ నివృత్తి పేజీ కూడా చూడండి*

**మహాభారతం** పంచమ వేదము గా పరిగణించబడే భారత ఇతిహాసము. ఈ మహాకావ్యాన్ని వేదవ్యాసుడు చెప్పగా గణపతి రచించాడు. 18 పర్వములతో, లక్ష శ్లోకములతో (74,000 పద్యములతో లేక సుమారు 18 లక్షల పదములతో) ప్రపంచము లోని అతి పెద్ద పద్య కావ్యములలో ఒకటిగా అలరారుచున్నది. సంస్కృతములో ఉన్న ఈ మహా కావ్యాన్ని, కవిత్రయము గా పేరు పొందిన నన్నయ, తిక్కన, ఎర్రన (ఎఱ్ఱాప్రగడ)లు తెలుగు లోకి అనువదించారు.

## విషయ సూచిక





వ్యాసుడు చెప్పగా వినాయకుడు మహాభారతాన్ని వ్రాశాడని పురాణ కధనం

## కావ్య ప్రశస్తి

"**యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్**" - "ఇందులో ఏది ఉందో అదే ఎక్కడైనా ఉంది. ఇందులో లేనిది మరెక్కడా లేదు" అని ప్రశస్తి పొందింది. హిందువులకు ఎంతో పవిత్ర గ్రంథాలైన భగవద్గీత, విష్ణు సహస్రనామ స్తోత్రము కూడా మహాభారతంలోని భాగాలే. దీనిని బట్టి ఈ కావ్య విశిష్టతను అంచనా వేయవచ్చును.

ఈ కావ్యవైభవాన్ని నన్నయ ఇలా చెప్పాడు:

> “ దీనిని ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రమనీ, ఆధ్యాత్మవిదులు వేదాంతమనీ, నీతి విచక్షణులు నీతి శాస్త్రమనీ, కవులు మహాకావ్యమనీ అంటారు. లాక్షణికులు సర్వ లక్షణ సంగ్రహమనీ, ఐతిహాసికులు ఇతిహాసమనీ, పౌరాణికులు బహుపురాణ సముచ్చయమనీ కొనియాడుతారు. వివిధ తత్త్వవేది, విష్ణు సన్నిభుడు అయిన వేదవ్యాసుడు దీనిని విశ్వజనీనమయ్యేలా సృజించాడు. ”

మహాభారత గాథను వ్యాసుడు ప్రప్రథమంగా తన శిష్యుడైన వైశంపాయనుడి చేత సర్పయాగం చేయించేటపుడు జనమేజయ మహారాజుకి చెప్పించగా, అదే కావ్యాన్ని తరువాత నైమిశారణ్యంలో శౌనక మహర్షి సత్రయాగము చేయుచున్నప్పుడు సూతమహర్షి అక్కడకు వచ్చిన ఋషులకు చెప్పాడు.

మహాభారతాన్ని చెరకుగడతో పోల్చారు. పర్వము అంటే చెరకు కణుపు. 18 కణుపులు (పర్వములు) కలిగిన పెద్ద చెరకుగడ, మహాభారతం. చెరకును నములుతున్న కొద్దీ రసం నోటిలోకి వచ్చి, నోరు తీపి ఎక్కుతుంది. అలాగే భారతాన్ని చదివిన కొద్దీ జ్ఞానం పెరుగుతుంది.

## మహాభారతంలోని విభాగాలు

మహాభారతంలో 18 **పర్వములు**, వాటిలో జరిగే కథాక్రమం ఇది:

1. ఆది పర్వము: 1-19 ఉపపర్వాలు - పీఠిక, కురువంశం కథ, రాకుమారుల జననం, విద్యాభ్యాసం.
2. సభా పర్వము: 20-28 ఉపపర్వాలు - కురుసభా రంగం, మయసభ, పాచికల ఆట, పాండవుల ఓటమి, రాజ్యభ్రష్టత.
3. వన పర్వము (లేక) అరణ్య పర్వము: 29-44 ఉపపర్వాలు - అరణ్యంలో పాండవుల 12 సంవత్సరాల జీవనం.
4. విరాట పర్వము: 45-48 ఉపపర్వాలు - విరాటరాజు కొలువులో ఒక సంవత్సరం పాండవుల అజ్ఞాతవాసం.
5. ఉద్యోగ పర్వము: 49-59 ఉపపర్వాలు - కౌరవ పాండవ సంగ్రామానికి సన్నాహాలు.
6. భీష్మ పర్వము: 60-64 ఉపపర్వాలు - భీష్ముని నాయకత్వంలో సాగిన యుద్ధం.
7. ద్రోణ పర్వము 65-72 ఉపపర్వాలు - ద్రోణుని నాయకత్వంలో సాగిన యుద్ధం.

8. కర్ణ పర్వము: 73 వ ఉపపర్వము - కర్ణుని నాయకత్వంలో సాగిన యుద్ధం.
9. శల్య పర్వము: 74-77 ఉపపర్వాలు - శల్యుడు సారథిగా సాగిన యుద్ధం.
10. సౌప్తిక పర్వము: 78-80 ఉపపర్వాలు - నిదురిస్తున్న ఉపపాండవులను అశ్వత్థామ వధించడం.
11. స్త్రీ పర్వము: 81-85 ఉపపర్వాలు - గాంధారి మొదలగు స్త్రీలు, మరణించినవారికై రోదించడం.
12. శాంతి పర్వము: 86-88 ఉపపర్వాలు - యుధిష్ఠిరుని రాజ్యాభిషేకం. భీష్ముని ఉపదేశాలు.
13. అనుశాసనిక పర్వము: 89-90 ఉపపర్వాలు - భీష్ముని చివరి ఉపదేశాలు (అనుశాసనాలు)
14. అశ్వమేధ పర్వము: 91-92 ఉపపర్వాలు - యుధిష్ఠిరుని అశ్వమేధ యాగం.
15. ఆశ్రమవాస పర్వము: 93-95 ఉపపర్వాలు - ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతి ప్రభృతులు చివరి రోజులు ఆశ్రమవాసులుగా గడపడం.
16. మౌసల పర్వము: 96వ ఉపపర్వం - యదువంశంలో ముసలం, అంతఃకలహాలు.
17. మహాప్రస్థానిక పర్వము: 97వ ఉపపర్వం - పాండవుల స్వర్గ ప్రయాణం ఆరంభం.
18. స్వర్గారోహణ పర్వము:98వ ఉపపర్వం - పాండవులు స్వర్గాన్ని చేరడం.

హరివంశ పర్వము: శ్రీకృష్ణుని జీవితగాధ వీటిలో మొదటి అయిదు పర్వాలను ఆదిపంచకము అనీ, తరువాతి ఆరు పర్వాలను యుద్ధషట్కము అనీ, ఆ తరువాతి ఏడు పర్వాలను శాంతిసప్తకము అనీ అంటారు.

## మహాభారతం ప్రత్యేకతలు

- మహాభారత రచన చేసినది పరాశర మహర్షి కుమారుడయిన వేదవ్యాసుడు.
- మహాభారతకథను వ్యాసుడు రచన చేసిన సమయం మూడు సంవత్సరాలు .
- మహాభారతకథను చెప్పడానికి స్వర్గలోకంలో నారద మహర్షిని, పితృలోకములో చెప్పడానికి దేవల మహర్షిని, గరుడ గంధర్వ లోకాలలో చెప్పడానికి శుక మహర్షిని, సర్పలోకంలో చెప్పడానికి సుమంతుడిలని, మానవలోకంలో చెప్పడానికి వైశంపాయన మహర్షిని నియమించాడు.
- అంతకు పూర్వం దేవాసురయుద్ధంలా కురుక్షేత్రంలో మహాభారత యుద్ధం జరిగింది.
- ఈ యుద్ధంలో భీష్ముడు 10 రోజులు, ద్రోణుడు 5 రోజులు, కర్ణుడు 2 రోజులు , శల్యుడు అర్ధరోజు సైన్యాధ్యక్షత వహించారు. మిగిలిన సగం రోజు భీముడు దుర్యోధనుడితో యుద్ధం చేసాడు.
- ఈ యుద్ధంలో పోరాడి మరణించిన వారి సంఖ్య 18 అక్షౌహిణులు. వీరిలో కౌరవ పక్షం వహించి పోరాడిన వారి సంఖ్య 11 అక్షౌహిణులు. పాండవ పక్షం వహించి పోరాడిన వారి సంఖ్య 7అక్షౌహిణులు.
- ఈ యుద్ధం జరిగిన ప్రదేశం శమంతక పంచకం. తన తండ్రిని అధర్మంగా చంపిన క్షత్రియ వంశాల మీద పరశురాముడు 21 పర్యాయమపలు భూమండలం అంతా తిరిగి దండయాత్ర చేసి క్షత్రియ వధ చేసిన సమయంలో క్షత్రియ రక్తంతో ఏర్పడ్డ ఐదు తటాకాలే ఈ శమంతక పంచకం. పరశురాముడు తన తండ్రికి ఇక్కడ తర్పణం వదిలి క్షత్రియుల మీద తనకు ఉన్న పగ తీర్చుకున్నాడు.
- పంచమ వేదంగా వర్ణించబడే ఈ మహాభారతాన్ని కవులు మహాకావ్యమని, లాక్షణికులు సర్వలక్షణాలు కలిగిన గ్రంధరాజమని, పౌరాణికులు అష్టాదశపురాణ సారమని, నీతిశాస్త్రపారంగతులు నీతి శాస్త్రమని, తత్వజ్ఞులు ధర్మశాస్త్రమని, ఇతిహాసకులు ఇతిహాసమని ప్రశంసించారు.
- వినాయకుని ఆదేశానుసారం వేదవ్యాసుడు ఆగకుండా చెప్తుంటే వినాయకుడు తన దంతమును విరిచి ఘంటముగా చేసికొని మహాభారతకథను లిఖించాడు.
- మహాభారతంలోని పర్వాలు 100. పైష్యమ, ఆస్తీకము, ఆదివంశావతారం, సంభవపర్వము, జతుగృహదాహము, హైడంబము, బకవధ, చైత్రరధము, ద్రౌపదీస్వయంవరం, వైవాహికం, విదురాగమనము, రాజ్యార్ధలాభము, అర్జునతీర్ధయాత్ర, సుభద్రాకల్యాణం, హరణహారిక, ఖాండవదహనం, మయదర్శనం,

సభాపర్వము, మంత్రపర్వము, జరాసంధవధ, దిగ్విజయము, రాజసూయము, బర్హ్యాభిహరణం, శిశుపాలవధ, ద్యూతము, అనుద్యూతము, అరణ్యము, కిమ్మీరవధ, కైరాతము, ఇంద్రలోకాభిగమనం, ధర్మజతీర్ధయాత్ర, జటాసురవధ, యక్షయుద్ధం, అజగరం, మార్కండేయోపాఖ్యానం, సత్యాద్రౌపదీ సంవాదం, ఘోషయాత్ర, ప్రాయోపవేశం, వ్రీహి ద్రోణాఖ్యానం, ద్రౌపదీహరణం, కుండలాహరణం, ఆరణేయం, వైరాటం, కీచకవధ, గాగ్రహణం, అభిమన్యువివాహం, ఉద్యోగం, సంజయయానం, ధృతరాష్ట్రప్రజాగరణం, సానత్సుతజాతం, యానసంధి, భగవద్యానం, సైనానిర్యాత, ఉలూకదూతాభిగమనం, సమరధ, అతిరధ సంఖ్యానము, కర్ణభీష్మ వివాదం, అబోపాఖ్యానం, జంబూఖండవినిర్మాణం, భూమిపర్వము, భీష్మాభిషేకం, భగవద్గీత, భీష్మవధ, ద్రోణాభిషేకం, సంశప్తకవధ, అభిమన్యువధ, ప్రతిజ్ఞాపర్వం, జయద్రధవధ, ఘటోత్కచవధ, ద్రోణవధ, నారాయణాస్త్రప్రయోగం, కర్ణపర్వం, శల్యపర్వం, హ్రాదప్రవేశం, గదాయుద్ధం, సారసత్వం, సౌప్తిక పర్వం, వైషీకం, జలప్రదానం, స్త్రీపర్వం, శ్రాద్ధపర్వం, రాజ్యాభిషేకం, చార్వాక నిగ్రహం, గృహప్రవిభాగం, శాంతిపర్వం, రాజధర్మానుకీర్తనం, ఆపద్ధర్మం, మోక్షధర్మం, ఆనుశాసనికం, భీష్మస్వర్గారోహణం, అశ్వమేధం, అనుగీత, ఆశ్రమవాసం, పుత్రసందర్శనం, నారదాగమనం, మౌసలం, మహాప్రస్థానం, హరివంశం, భవిష్యత్పర్వం.

## కురు వంశవృక్షం






**సంకేత సూచీ:**

- మగ: **నీలపు టంచు**
- ఆడ: **ఎరుపు టంచు**
- పాండవులు: **ఆకుపచ్చ పెట్టె**
- కౌరవులు: **ఎరుపు పెట్టె**

**సూచనలు**

- **క**: కురు మహా సామ్రాజ్యాన్ని స్థాపించిన పూర్వీకుడు కురుకు కొన్ని తరాల తరువాతి రాజు, శంతనుడు. సత్యవతిని పెళ్ళాడే ముందు అతడు గంగను పెళ్లాడాడు.
- **గ**: విచిత్రవీర్యుని మరణం తరువాత, వ్యాసుని వలన ధృతరాష్ట్రుడు, పాండు రాజు జన్మించారు.
- **చ**: కుంతి వివాహానికి ముందే సూర్యుని వరం చేత ఆమెకు కర్ణుడు జన్మించాడు.
- **డ**: పాండవులు పాండు రాజు పుత్రులైనప్పటికీ, దేవతల వరం చేత కుంతి, మాద్రిలకు వీరు కలిగారు. ఆ వివరాలు:
  - యమధర్మరాజు వలన యుధిష్ఠిరుడు
  - వాయుదేవుని వలన భీముడు
  - ఇంద్రుని వలన అర్జునుడు
  - కవలలైన నకులుడు, సహదేవుడు మాద్రికి అశ్వనీదేవతల వలన కలిగారు.
- **త**: దుర్యోధనుడు, అతని శతసోదరులు ఒకేసారి జన్మించారు.

## తెలుగు సినిమాలలో భారతగాథ

మహాభారత కథ ఇతివృత్తంగా ఎన్నో తెలుగు సినిమాలు వెలువడ్డాయి. పౌరాణిక ఇతివృత్తాలను తెరకెక్కించడంలో తెలుగువారికున్న నైపుణ్యం కారణంగా వాటిలో చాలా సినిమాలు చిరస్థాయిగా జనాదరణ పొందాయి. వాటిలో కొన్ని:

- మాయాబజార్ (కల్పిత కథ)
- పాండవ వనవాసం
- శ్రీకృష్ణ పాండవీయం
- నర్తనశాల
- విరాటపర్వం
- కురుక్షేత్రం
- దానవీరశూరకర్ణ
- భీష్మ
- బాలభారతం

## బయటి లింకులు

# ఆది పర్వము

వికీపీడియా నుండి

వ్యాసుడు రచించిన, మహాభారతములో మొత్తం ౧౮ ఉపపర్వాలు, ౮ అశ్వాసాలు కలవు. సంస్కృత భారతంలోని ఆది పర్వంలో మొత్తం ౯,౯౮౪ శ్లోకాలు ఉంటే, శ్రీమదాంధ్ర మహాభారతంలోని ఆది పర్వంలో మొత్తం పద్యాలు, గద్యాలు కలిపి ౨,౦౮౪ ఉన్నాయి.

మహాభారతంలోని పద్ధెనిమిది పర్వాలలో విషయ క్రమణిక ఇలా ఉంది.

1. **ఆది పర్వము**: పీఠిక, కురువంశం కథ, రాకుమారుల జననం, విద్యాభ్యాసం.
2. సభా పర్వము: కురుసభా రంగం, మయసభ, పాచికల ఆట, పాండవుల ఓటమి, రాజ్యభ్రష్టత.
3. వన పర్వము (లేక) అరణ్య పర్వము: అరణ్యంలో పాండవుల 12 సంవత్సరాల జీవనం.
4. విరాట పర్వము: విరాటరాజు కొలువులో ఒక సంవత్సరం పాండవుల అజ్ఞాతవాసం.
5. ఉద్యోగ పర్వము: కౌరవ పాండవ సంగ్రామానికి సన్నాహాలు.
6. భీష్మ పర్వము: భీష్ముని నాయకత్వంలో సాగిన యుద్ధం.
7. ద్రోణ పర్వము: ద్రోణుని నాయకత్వంలో సాగిన యుద్ధం.
8. కర్ణ పర్వము: కర్ణుని నాయకత్వంలో సాగిన యుద్ధం.
9. శల్య పర్వము: శల్యుడు సారథిగాను, అనంతరం నాయకునిగాను సాగిన యుద్ధం. దుర్యోధనుని మరణం.
10. సౌప్తిక పర్వము: నిదురిస్తున్న ఉపపాండవులను అశ్వత్థామ వధించడం.
11. స్త్రీ పర్వము: గాంధారి మొదలగు స్త్రీలు, మరణించినవారికై రోదించడం.
12. శాంతి పర్వము: యుధిష్ఠిరుని రాజ్యాభిషేకం. భీష్ముని ఉపదేశాలు.
13. అనుశాసనిక పర్వము: భీష్ముని చివరి ఉపదేశాలు (అనుశాసనాలు)
14. అశ్వమేధ పర్వము: యుధిష్ఠిరుని అశ్వమేధ యాగం.
15. ఆశ్రమవాస పర్వము: ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతి ప్రభృతులు చివరి రోజులు ఆశ్రమవాసులుగా గడపడం.
16. మౌసల పర్వము: యదువంశంలో ముసలం, అంతఃకలహాలు.
17. మహాప్రస్థానిక పర్వము: పాండవుల స్వర్గ ప్రయాణం ఆరంభం.
18. స్వర్గారోహణ పర్వము: పాండవులు స్వర్గాన్ని చేరడం.

వీటిలో మొదటి అయిదు పర్వాలను ఆదిపంచకము అనీ, తరువాతి ఆరు పర్వాలను యుద్ధషట్కము అనీ, ఆ తరువాతి ఏడు పర్వాలను శాంతిసప్తకము అనీ అంటారు. ఇవి కాక తరువాతి కథ అయిన శ్రీకృష్ణుని జీవితగాథను తెలుగు మహాభారతంలో భాగంగా కాక హరివంశ పర్వము అనే ప్రత్యేక గ్రంథంగా పరిగణించారు. నన్నయ మొదలుపెట్టిన కథావిభాగాన్నే తిక్కన, ఎఱ్ఱన అనుసరించారు.

ఆది పర్వం ఈ క్రింది సంస్కృత మంగళ శ్లోకంతో ప్రారంభం అవుతుంది. ఈ సంస్కృత శ్లోకం తెలుగు సాహిత్యానికే మంగళ శ్లోకం అనవచ్చును.

శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవాం
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురై
ర్భూయాసు: పురుషోత్తమామ్బుజభవశ్రీకన్ధరా శ్శ్రేయసే.

ఆ తరువాత ఒక వచనం, తరువాత ఈ క్రింది ఉత్పలమాలతో ప్రారంభం అవుతుంది.

రాజకులైకభూషణుడు, రాజమనోహరు, డన్యరాజతే
జోజయశాలిశౌర్యుడు, విశుద్ధయశశ్శరదిందు చంద్రికా
రాజితసర్వలోకు, డపరాజితభూరిభుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుడు రాజమహేంద్రుడున్నతిన్

ఈ ఆదిపర్వంలో నన్నయ తాను ఎందుకు ఈ మహా భారతాన్ని తెలుగు సేయుచున్నాడో, అందుకు ఎవరు తోడ్పడుతున్నారో వివరించాడు. అంతే కాకుండా మహాభారత ప్రశస్తిని, అందులో ఏయే విభాగాలలో ఏ కథాంశం ఉన్నదో కూడా వివరించాడు. ఇది తరువాతి కవులకు, పరిశోధకులకు ఎంతో మార్గదర్శకంగా ఉంది.

## విషయ సూచిక



# ఉపపర్వాలు

మహా భారతంలోని మొత్తం 100 ఉపపర్వాలలో 19 ఉప పర్వాలు ఆది పర్వంలో ఉన్నాయి. కాని తెలుగు మహా భారతంలో ఉప పర్వాల నియమాన్ని పాటించలేదు.

సంస్కృత మూలంలో ఉన్న ఉపపర్వాలు

1. పౌష్య పర్వము
2. పౌలోమ పర్వము
3. ఆస్తిక పర్వము
4. ఆదివంశావతరణ పర్వము
5. సంభవ పర్వము
6. జాతుగృహ పర్వము
7. హిడింబవధ పర్వము

8. బకవధ పర్వము
9. చైత్రరథ పర్వము
10. స్వయంవర పర్వము
11. వైవాహిక పర్వము
12. విదురాగమ పర్వము
13. రాజ్యలాభ పర్వము
14. అర్జునవనవాస పర్వము
15. సుభద్రాహరణ పర్వము
16. హరణహరణ పర్వము
17. ఖాండవదహన పర్వము

## ఆంధ్ర మహాభారతం

అవతారిక, మొదలగున్నవి, శమంత పంచకాక్షౌహిణీ సంఖ్యా కథనము, ఉదంకుడు కుండలాలు తెచ్చి గురుపత్నికిచ్చు కథ, సర్పయాగముకై ఉద్ధవుడు జనమేజయుడిని ప్రోత్సహించుట మొదలగునవి కలవు

## విశేషాలు

## మూలాలు

## బయటి లింకులు

- కిశోరీ మోహన్ గంగూలి ఆంగ్ల అనువాదం (http://www.sacred-texts.com/hin/m01/index.htm)

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

**ఆది పర్వము** • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక |

విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

---

# ఆది పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

ఆది పర్వం ఈ క్రింది సంస్కృత మంగళ శ్లోకంతో ప్రారంభం అవుతుంది. ఈ సంస్కృత శ్లోకం తెలుగు సాహిత్యానికే మంగళ శ్లోకం అనవచ్చును.

శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవాం
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురై
ర్భూయాసు: పురుషోత్తమామ్బుజభవశ్రీకన్ధరా శ్శ్రేయసే.

ఆ తరువాత ఒక వచనం, తరువాత ఈ క్రింది ఉత్పలమాలతో ప్రారంభం అవుతుంది.

రాజకులైకభూషణుడు, రాజమనోహరు, డన్యరాజతే
జోజయశాలిశౌర్యుడు, విశుద్ధయశశ్శరదిందు చంద్రికా
రాజితసర్వలోకు, డపరాజితభూరిభుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుడు రాజమహేంద్రుడున్నతిన్

ఈ ఆదిపర్వంలో నన్నయ తాను ఎందుకు ఈ మహా భారతాన్ని తెలుగు సేయుచున్నాడో, అందుకు ఎవరు తోడ్పడుతున్నారో వివరించాడు. అంతే కాకుండా మహాభారత ప్రశస్తిని, అందులో ఏయే విభాగాలలో ఏ కధాంశం ఉన్నదో కూడా వివరించాడు. ఇది తరువాతి కవులకు, పరిశోధకులకు ఎంతో మార్గదర్శకంగా ఉంది.

## విషయ సూచిక

# ప్రథమాశ్వాసము

అవతారిక, మొదలగున్నవి, శమంత పంచకాక్షౌహిణీ సంఖ్యా కథనము, ఉదంకుడు కుండలాలు తెచ్చి గురుపత్నికిచ్చు కథ, సర్పయాగముకై ఉద్ధవుడు జనమేజయుడిని ప్రోత్సహించుట మొదలగునవి కలవు

## ప్రవేశిక

పాండవ మధ్యముడు అర్జునుడు. అర్జునుడి కుమారుడు అభిమన్యుడు. అభిమన్యుడు కురుంక్షేత్ర యుద్ధంలో మరణించాడు. అభిమన్య, ఉత్తరల కుమారుడు పరీక్షిత్తు. పరీక్షిత్తు కుమారుడు జనమేజయుడు. జనమేజయుడు మహాయజ్ఞం చేస్తున్న సమయంలో అక్కడకు దేవతల శునకం అయిన సరమ కుమారుడు సారమేయుడు వచ్చి ఆడుకోసాగాడు. అది చూసిన జనమేజయుని కుమారులు ఆ కుక్క పిల్లను కొట్టి తరిమారు. సారమేయుడు ఏడుస్తూ తల్లి వద్దకు పోయి ఈ విషయం చెప్పగా సరమ జనమేజయుని వద్దకు వచ్చి " జనమేజయా ! నీకుమారులు విచక్షణ కరుణ లేకుండా నా కుమారుడిని కొట్టారు. రాజా ! యుక్తా యుక్త విచక్షణ లేకుండా మంచి వారికి గాని సాధువులకు గాని అపకారం చేస్తే అనుకోని ఆపదలు వచ్చిపడతాయి." అని పలికి అక్కడి నుడి వెళ్ళిపోయింది. యజ్ఞం పూర్తిచేసి జనమేజయుడు హస్థినాపురం పోయిన తరువాత ఒక రోజు సరమ మాటలు గుర్తుకు వచ్చాయి. జరిగిన అపరాధానికి పరిహారం జరపక పోయినట్లైతే సమస్యలు ఎదురు కాగలవని భావించిన జనమేజయుడు తగిన శాంతి చేయడానికి తగిన ముని కొరకు అన్వేషిస్తూ సుతశ్రవణుడు అనే మునిని కలుసుకుని నమస్కరించి " మీ కుమారుడైన సోమశ్రవణుడిని నాకు ఋత్విక్కుగా పంపించండి" అని ప్రార్ధించాడు. అందుకు సుతశ్రవణుడు అంగీకరించి తన కుమారుడిని జనమేజయుని వద్దకు పంపాడు. జనమేజయుడు అతడి సాయంతో అనేక పుణ్యకార్యాలు చేసాడు.

## అవతారిక

శౌనకుడు నైమశారణ్యంలో సత్రయాగం చూస్తున్న సమయంలో అక్కడకు రోమహర్షుని కుమారుడైన ఉగశ్రవసుడు అను సూతుడు వచ్చాడు. సూతుడు తనను తాను మునులకు పరిచయం చేసుకుని తాను పురాణకధలు చెప్పటంలో సిద్ధహస్థుడినని చెప్పాడు. అక్కడ ఉన్న మునులు పుణ్యకథను వినాలని కోరికను ఉగ్రశ్రవసువునకు తెలిపారు. ఉగ్రశ్రవసువు వారికి ఒక కథ చెప్పటం ప్రారంభించాడు. పూర్వం కృష్ణద్వైపాయనుడు అను మహర్షి ఒకటిగా ఉన్న వేదాలను ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణవేదం అని నాలుగు భాగాలుగా విభజించాడు. తర్వాత బ్రహ్మదేవుని అనుమతి పొంది అష్టాదశ పురాణాలను, భాగవతకథ, అణు, ధర్మశాస్త్రాలను, రాజవంశ చరిత్రలను, ఇతిహాసాలు మొదలైన రచనలను చేసాడు.

ఈ మహా భారతం గ్రంధాన్ని ధర్మజ్ఞులు ధర్మశాస్త్రమని, ఆత్మ జ్ఞానులు వేదాంతమని, నీతి కోవిదులు నీతి శాస్త్రమని, కవులు మహాకావ్యమని, ఇతిహాసికులు ఇతిహాసమని, పౌరాణికులు పురాణమని, లాక్షణికులు సర్వ లక్షణ గ్రంధమని అంటారు. ఈ మహాభారతాన్ని చెప్పటకు దేవలోకంలో నారదుని, పితృలోకంలో దేవలుడిని, గరుడ, గంధర్వ, యక్ష, రాక్షస లోకాలలో చెప్పటకు శుకమహర్షిని, మనుష్యలోకంలో వైశంపాయుని నియమించాడు. వైశంపాయుడు జనమేజయునికి చెప్తుండగా నేను విని అది మీకు చెప్తున్నాను

## శమంతక పంచకము



ఉగ్రశ్రవసుడు చెబుతున్న మహాభారతాన్ని వినుచున్న శౌనకాది మునులు

శౌనకాది మునులు ఉగ్రశ్రవసువునితో " అయ్యా మాకు శమంతక పంచకం గురించి వివరించండి. మహా భారత కధకు మూలమేమిటో వివరించండి భీష్మాది కురువీరుల గురించి సవివరంగా వినాలని ఉంది " అన్నారు. కృతయుగాంతంలో దేవదానవ యుద్ధం జరిగినది. త్రేతాయుగాంతంలో రామరావణ యుద్ధం జరిగినది. ద్వారపరయుగాంతంలో పాండవులకు కౌరవులకు యుద్ధం జరిగింది. త్రేతాయుగ ద్వారపర యుగ సంధిలో జమదగ్ని కుమారుడు పరశురామునికి క్షత్రియుల పట్ల ఏర్పడిన వైరం కారణంగా ఇరవై ఒక్కసార్లు భూ ప్రదక్షిణ చేసి క్షత్రియులను చంపి ఆ రక్తంతో ఐదు మడుగులు ఏర్పరిచాడు. వాటిని శమంతక పంచకం అంటారు. ఆ శమంతక పంచకంలో పాండావులు కౌరవులు యుద్ధం చేసారు కనుక అది ఇప్పడు కురుక్షేత్రం అయింది.



సారమేయుడిని కొడ్తున్న జన మేజయుని తమ్ములు

అర్జునుని ముని మనుమడైన జనమేజయుడు యజ్ఞం చేస్తున్న ప్రదేశంలో సరమ అనే దేవ శునకం కొడుకు ఆడుకుంటూ ఉండగా జన మేజయుని తమ్ములు శ్రుత సేనుడు, భీమ సేనుడు, ఉగ్ర సేనుడును వారు వచ్చి సారమేయుడిని కొట్టారు. సారమేయుడు ఏడుస్తూ తల్లికి చెప్పాడు. సరమ జనమేజయునితో " నీ తమ్ములు నా కుమారుని అకారణంగా కొట్టారు ఇది అధర్మం. ఇలాంటి పనులు చేసే వారికి ఆపదలు వస్తుంటాయి " అని చెప్పినది. జనమేజయుడు దేవశునకం అయిన సరమ పలుకులు విని శాంతి కర్మలు చేయింటానికి సంకల్పించాడు. అందుకు శోమశ్రవుడు అనే మహా మునిని పురోహితునిగా నియమించుకున్నాడు.

## ఉదంకోపాఖ్యానము



వ్యాసమహర్షి శిష్యుడైన పైలుడి శిష్యుడు ఉదంకుడు. ఉదంకుడు అను మునికుమారుడు గురుకులంలో విద్యను అభ్యసించాడు. ఉదంకుడు గురువులను భక్తితో సేవించి అణిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం, మహిమ, ఈశత్వం, వశిత్వం, కామనసాయిత అనే అణిమాది అష్టసిద్ధులు వంటి విద్యలను పోందాడు. ఒకరోజు అతడు తన వయసు మీరి పోయిందని గ్రహించి చితించి గురువుకు చెప్పి బాధ పడగా గురువు అతడిని ఊరడించి తన కహామార్తెను ఇచ్చి వివాహం చేస్తానని మాట ఇచ్చాడు. ఉదంకుడు గురువుకు గురుదక్షిణ ఇవ్వాడానికి సంకల్పించగా గురుపత్ని అతడిని గురుదక్షిణగా పౌష్యుని భార్య కుండలాలు కావాలని అడిగింది. . ఉదంకుడు అందుకు అంగీకరించి పౌష్య మహారాజు వద్దకు బయలుదేరాడు. ఉదంకుడు గురుదక్షిణగా పౌష్యుని భార్య

ఉదంకుడి వృత్తాంతం

కుండలాలు తీసుకురావడానికి బయలుదారి వెళుతున్న సమయంలో ఒక దివ్యపురుషుడు కనిపించి అతడిని గోమయం తినమని సూచించాడు. ఉదంకుడు మారుమాటాడక అలాగే చేసాడు. ఉదంకుడు పౌష్యుని వద్దకు పోయి " నేను నా గురుపత్నికి గురుదక్షిణగా మీ భార్య కుండలాలను తెచ్చి ఇస్తానని మాట ఇచ్చాను. అవి నాకు ఇప్పించారంటే నేను పోతాను " అని అడిగాడు. ఉదంకుడు కోరికను మహారాజు మన్నించిన మహారాజు " మహాత్మా ! నాభార్య వద్దకు వెళ్ళి ఆమెను అడిగి కుండలాలను తీసుకు వెళ్ళండి " అని బదులిచ్చాడు.

ఉదంకుడు అలాగే పౌష్యమహారాణి వద్దకు పోయి అక్కడ ఆమె కనిపించక తిరిగి మహారాజు " వద్దకు వచ్చి " మహారాజా ! నాకు ఆమెకనిపించ లేదు. కనుక మీరు వెళ్ళి తెచ్చి ఇవ్వండి. " అన్నాడు. మహారాజు ఆమె మహాత్మా ! ఆమె మహా పతివ్రత, చాలా పవిత్రురాలు, ఆమె కనిపించాలంటే శౌచం పాటించాలి." అని చెప్పాడు. ఉదంకుడు అప్పుడు తాను గామయం తినిన తరువాత స్నానం ఆచరించని వి,యం గుర్తుకు తెచ్చుకుని కాళ్ళు చేతులు కడుగుకొని ఆచమనం చేసి తిరిగి వెళ్ళగా అప్పుడు అతడికి పౌష్యా దేవి కనిపించింది. ఆమె ఉదంకుడి కోరిక మీద కుండలములను ఇస్తూ " ముని కుమారా ! ఈ కుండలములు " కొరకు మాయలమారి అయిన తక్షకుడు ఎదురు చూస్తున్నాడు. నీవు ఈ కుండలములు అతడి కంట బడకుండా జాగ్రత్తగా తీసుకుని పో" అని చెప్పింది.

## ఉదంకుడు పౌష్యుడు శాపప్రతిశాపాలు ఇచ్చుకొనుట

కుడలములు తీసుకుని రాజు వద్దకు వెళ్ళగా రాజు ఉదంకుని భోజనం చేసిన తరువాత వెళ్ళమని చెప్పాడు. రాజు కోరిక మేరకు ఉదంకుడు పౌష్యుని ఇంటిలో భోజనం చేస్తుండగా అన్నంలో ఒక వెంట్రుక వచ్చింది. అందుకు ఉదంకుడు కోపించి చూడకుండా భోజనం పెట్టినందుకు గుడ్డి వాడివి కమ్మని శపించాడు. పౌష్యుడు కోపించి " ఇంత చిన్న దోషానికి అంత పెద్ద శిక్షా. నేను నీకు ప్రతి శాపం ఇస్తున్నాను. నీవు సంతాన హీనుడవు కమ్ము" అన్నాడు. . తన అపరాధం గ్రహించిన ఉదంకుడు మహారాజుతో అయ్యా ! నాకు సంతానం కావాలి కనుక నా శాపాన్ని ఉపసంహరించు " అని కోరగా పౌష్యుడు " మనసు నవనీతం మాట వజ్రాయుధం ఇది బ్రాహ్మణ స్వభావం. క్షత్రియులకు ఇవి రెండు విపరీతములే కనుక నా శాపం ఉపసంహరించ లేను కనుక నీవు ఉపసంహరించు" అన్నాడు. అందుకు ఉదంకుడు " కొంతకాలం తరువాత నా శాపం ఉపసంహరింపబడుతుంది " అని చెప్పి అక్కడి నుండి వెళ్ళాడు.

## తక్షకుడు కుండలములు తస్కరించుట

అలాగే అని చెప్పి ఉదకుండు సకాలంలో గురుపత్నికి కుండలాలను అందచేయాలని బయలుదేరాడు. మార్గమధ్యంలో ఉదకుండు అనుష్టానం చేసుకోవడానికి కుండలాలను ఒక ప్రదాశంలో దాచి స్నానం చేస్తున్న సమయంలో తక్షకుడు గట్టున ఉన్న కుండలాలను అపహరించి నాగలోకానికి వెళ్ళాడు. అతనిని వెన్నంటి వెళ్ళిన ఉదంకుడు అతడు ఒక రంధ్రంలో దూరడం గ్రహించి తానూ ఆ దారిలో ప్రవేశించి నాగలోకం చేరాడు. నాగ ప్రముఖులకు నమస్కరించి భక్తితో స్తుతిస్తూ " వేయి పడగలతో భూమిని భరిస్తూ నారాయణుడికి శయ్యగా సేవలు చేస్తున్న అనంతా ! నీకు నమస్కారం. సమస్త నాగలోకమును రాక్షసుల బారినుడి రక్షిస్తూ పరమశివుడి మెడలో ఆభరణంగా వెలుగొందుతున్న వాసుకికి వందనం. సమస్త దేవతలతోనూ మానవులతోనూ పూజలందుకొంటున్న నాగదేవతలారా నన్ను అనుగ్రహించండి. కుమారుడైన అశ్వసేనుడితో భూలోకం అంతా సంచరిస్తున్న తక్షకా న్ను అనుగ్రహించు. " అని ప్రార్ధించాడు. అప్పుడు నలుపు తెలుపు దారాలతో వస్త్రములు నేయుచున్న ఇద్దరు స్త్రీలు, పన్నెండు ఆకులుగల చక్రమును తిప్పుతున్న ఆ ఇద్దరు స్త్రీల ఆరుగురు కుమారులు. మహోన్నత గుర్రం మీద ఉన్న ఒక పురుషుడు కనిపించారు. ఆ దివ్యపురుషుడు అతని వద్దకు వచ్చి " ఉదంకా నీ భక్తికి మెచ్చాను. ఏమి కావాలో కోరుకో " అన్నాడు. ఉదంకుడు " ఈ నాగలోకం నాకు వశం కావాలి " అని కోరాడు. అలాగే అని వరమిచ్చిఆ దివ్యపురుషుడు గుర్రం చెవిలో ఊదమన్నాడు. ఉదంకుడు ఆ గుర్రము చెవిలో ఊదాడు వెంటనే ఆ గుర్రం చెవి నుండి భయంకర అగ్ని జ్వాలలు నాగలోకాన్ని చుట్టుముట్టాయి. నాగులంతా ప్రళయం వచ్చిందని తల్లడిల్లి పోయారు. తక్షకుడు భయపడి కుండలాలను ఉదంకుడికి ఇచ్చాడు. అక్కడి నుడి బయటపడే మార్గం లేక ఉదంకుడు అయోమయంలో పడగా దివ్యపురుషుడు " ఉదంకా ! ఈ గుర్రాన్ని ఎక్కి నీవు కోరిన ప్రదేశానికి చేరగలవు " వెంటనే ఉదంకుడు ఈ గుర్రం మీద గురువు ఆశ్రమానికి చేరి కుడలాలను గురుపత్నికి సమర్పించాడు.

## ఉదంకుడు గురుదక్షిణ సమర్పించుట

గురువు ఉదంకునితో " ఉదంకా ! సమీపంలో ఉన్న పౌష్యమహారాజు నుండి కుడలాలు తీసుకురావడానికి ఇంత సమయం

ఎదుకు అయ్యింది " అని అడిగాడు. ఉదంకుడు జరిగిన విషయాలు వివరంగా గురువుకు చెప్పాడు. గురువు " ఉదంకా ! నీవు ధన్యుడివి. ఎద్దును ఎక్కి వచ్చిన వాడు ఇంద్రుడు. ఆ ఎద్దు ఐరావతం. గోమయం అమృతం. అది సేవించడం వలనే నీవు అనుకునిన పని చేయగలిగావు. నాగలోకంలో నీవు చూసిన స్త్రీలు దాత, విధాత. నలుపు తెలుపు దారాలే రాత్రి పగలు. పన్నెండు ఆకులు కలిగిన చక్రం పన్నెండు మాసముపలకు ప్రతీక అయిన కాల చక్రం. వారి ఆరుగురు కుమారులు ఆరు ఋతువులు. గుర్రం మీద వచ్చిన దివ్యపురుషుడు ఇంద్రుడి మిత్రుడైన పర్జన్యుడు. గురుపత్ని కోరిక నెరవేర్చి నీవు గురుదక్షిణ సమర్పించున్నావు. ఇక నీ విద్యాభ్యాసం పూర్తి అయింది " అని పలికాడు.

### తక్షకుని మీద ఉదంకుని ప్రతీకారం

అనుకున్న కార్యం నెరవేరినా ఉదంకునికి తక్షకునిపై ప్రతీకారాగ్ని తీరలేదు. అందు కొరకు అతడు జనమేజయుని వద్దకు వెళ్ళాడు. ఉదంకుడు జనమేజయునితో తక్షకుడు తనకు చేసిన అపకారం గురించి చెప్పాడు. " జనమేజయ మహారాజా ! నీకు శుభం కలుగుగాక. నా పేరు ఉదంకుడు. నేను గురువు గారి కార్యం మీద వెళ్ళిన సమయంలో తక్షకుడు కుటిల బుద్ధితో నాకు అపకారం చేసాడు. నాకే కాదు నీకు కూడా తక్షకుడు మహాపరాధం చేసాడు. శృంగి శాపాన్ని మిషగా తీసుకుని మీ తండ్రైన పరీక్షిత్తు మహారాజును అతి క్రూరంగా కాటు వేసి తన ఘోర విషాగ్ని కీలలకు నీ తండ్రిని బలి చేసి చంపాడు. మహా బలవంతుడైన తక్షకుడు ఆ బ్రాహ్మణుడితో పరీక్షిత్తు మహారాజు అని నచ్చ చెప్పక అది మిషగా తీసుకుని దారుణంగా డంపాడు కదా ! నీ తండ్రిని చంపిన వాడి మీద నీవు ప్రతీకారం తీర్చుకోవడానికి నీవు వెంటనే సర్పయాగం చేసి ఈ తక్షకుడిని యాగాగ్నిలో భస్మం చేసి నీ పగ తీర్చుకో. మహారాజా ! ఒక్కడు తప్పు చేసిన అతడి కులమంతా తప్పు చేసి నట్లే కనుక ఇందులో అపరాధం ఏమీ లేదు. కనుక వెంటనే మీరు సర్పయాగం చేసి నాగలోకాన్ని సమూలంగా నాశనం చేయండి " అని జనమేజయుని రెచ్చకొట్టాడు.

## నాగులకు కద్రువ శాపం

ఈ కోధ వింటున్న శౌనకాది మునులు " మహాత్మా ! నాగలోకం యాగాగ్నిలో పడి భస్మం కావడానికి వేరు కారణం ఏదైనా ఉందా ! " అని అడిగారు. అందుకు సూతుడు " మహామునపలోరా ! పూర్వం కద్రువ తన కుమారులైన నాగులకు ఇచ్చిన శాపం కూడా ఇందుకు ఒక కారణం. జనమేజయుడు చేయబోతున్న యాగంలో కద్రువ శాపకారణంగా సర్పకులమంతా నశిస్తున్న సమయంలో పూర్వం రురుడు సర్పకులాన్ని అంలా నాశనం చేస్తున్న తరుణంలో సమస్రపాదుడు ఆపిన చందంగా సర్పయాగంలో పడి మరణిస్తున్న నాగులను జరత్కారుని కహమారుడైన ఆస్తీకుడు ఆపివేసాడు. ఆ వృత్తాంతం వివరిస్తాను వినండి" అని చెప్పాడు.

## భృగువు

పూర్వం భృగువు అనే మహాముని భార్య పులోమ. అతడి భార్య పేరు పులోమ. ఆమె నిండు గర్భవతిగా ఉన్న సమయంలో భృగువు స్నానానికి వెళుతూ భార్యని హెూమాగ్నిని సిద్ధం చేయమన్నాడు. అప్పుడు పులోముడు అనే రాక్షసుడు పులోమను చూసాడు. అతడికి పులోమ మీద మోహం కలిగింది. అతడు అగ్ని దేవునితో ఆమె ఎవరని అడిగారు. అగ్నిదేవుడు సందిగ్ధంలో పడ్డాడు. ఈ పులోముడు ఒకప్పుడు పులోమను చేసుకోవాలని అనుకున్నాడు. అయితే పులోమ తండ్రి ఆమెను భృగువుకు ఇచ్చి వివాహం చేసాడు. ఇప్పుడు నిజం చెపితే పులోముడు పులోమను ఏమి చేస్తాడో అని భయపడ్డాడు. అదీ కాక భృగువుకు కూగా తన మీద కోపం రావడంమేగాక తనను శపించవచ్చు. కాని నిజం చెప్పకుటే తనకు అసత్య దోషం అంట వచ్చు. అనగ సందిగ్ధంలో పడినా ముని శాపం ఎలాగైనా పోగొట్టుకోవచ్చు. అనుకొని అసత్య దోషానికి భయపడి ఆమె భృగువు భార్య అని నిజం చెప్పాడు. అది వినగానే పులోముడు పులోమను గుర్తు పట్టాడు. వివాహం కాక మునుపు ఆమెను పులోముడు చేసుకోవాలని అనుకున్నాడు. కానీ ఆమెను భృగువు వివాహం చేసుకున్నాడు. ఈ నిజం తెలిసిన రాక్షసుడు పంది రూపంలో పులోమను ఎత్తుకుని వెళ్ళాడు. ఆ కుదుపులకు పులోమ గర్భంలోని శిశువు కింద పడ్డాడు. కింద పడిన కారణంగా అతడికి చ్యవనుడు అన్న పేరు వచ్చింది. చ్యవనుడు కళ్ళు తెరచి చూడగానే ఆ తేజో శక్తికి రాక్షసుడు దగ్ధం అయ్యాడు.

### అగ్నిహెూత్రుడి మీద భృగువు ఆగ్రహించుట

తరవాత పులోమ కుమారునితో భర్త దగ్గరకు చేరింది. ఆ తరుణంలో పులోమ కంటి నుండి జానువారిన కన్నీరు నదిగా మారి ప్రవహించ సాగింది. ఆ నదికి బ్రహ్మదేవుడు వధూసర అని నామకరణం చేసాడు. నదీ స్నానానికి వెళ్ళిన భృగువు ఆశ్రమానికి తిరిగి వచ్చి తేజోవంతుడైన కుమారుడిని చూసాడు. అప్పుడు పులోమ జరిగినది భర్తకు చెప్పింది. భృగువు భార్యతో " నీవు పులోమ అని నా భార్యవు అని అతడికి ఎలా తెలిసింది " అని అడిగాడు. పులోమ " నాథా ! ఈ అగ్నిదేవుడు నేను పులోమ అని నీ భార్యను అని చెప్పాడు. వరాహరూపంలో అతడు నన్ను తీసుకు పోతున్న తరుణంలో కిందకు జారిన చ్యవనుడు తీక్షణతకు రాక్షసుడు భస్మం అయ్యాడు " అని చెప్పింది. అది విని భృగువు కోపించి అగ్నితో " ఆ రాక్షసుడు నా భార్యకు అపకారం చేస్తాడని తెలిసి కూడా నీవు నా భార్య గురించి చెప్పావు కనుక నీవు క్రూరుడవు. అందు వలన నీవు సర్వ భక్షకుడివి అయిపో " అగ్నిదేవుని శపించాడు.

### అగ్నిహోత్రుడి అలక

అగ్నిదేవుడు " మహర్షీ ! అసత్యం పలికిన వాడు నరకానికి పోతాడని నీకు తెలియనిదా. నేను అసత్య దోషానికి భయపడి అలా చెప్పాను. కర్మ సాక్షిని అయిన నేను అసత్యం పలుకగలనా ! నా అపరాధం ఏమీ లేకనే నాకు నీవు శాపం ఇచ్చావు. నేనూ నీకు ప్రతిశాపం ఇవ్వగలను. అయినా పరుషోక్తులు పలికినా, కొట్టినా, తిట్టినా ఉత్తమ బ్రాహ్మణులు పూజనీయులే ! నేను సదా బ్రాహ్మణులను పూజిస్తాను. బ్రాహ్మణుల మీద కోపించడానికి భయపడతాను. నీవు ఉత్తమ బ్రాహ్మణుడవు కనుక నేను నిన్ను శపించను. సమస్త లోకాలకు హితుచేసే నన్ను శపించి లోకాలకు అపకారం చేసావు. నైమిత్తిక కార్యంలో భాగంగా అగ్నిలో వేసే హోమద్రవ్యములను, హవిస్సులను తీసుకు వెళ్ళి దేవతలకు, పితరులకు ఇస్తాను. అందు వలన నన్ను హవ్యవాహనుడు అని అంటారు. నీ శాపకారణంగా నేనిక అపవిత్రుడిని ఔతాను కనుక నేనిక హవిస్సును దానతలకు, పితరులకు అందజేయలేను. నేనా పని చేయకున్న లోకాలు స్థంభిస్తాయి " అని చెప్పాడు. అసత్య దోషానికి భయపడి నిజం చెప్పిన తనకు వచ్చిన శాపానికి కలత చెంది అగ్ని దేవుడు సర్వ భక్షుకుడైన తాను పితృ కార్యానికి, దేవ కార్యానికి పనికి రానని తన జ్వాలలను ఉపసంహరించాడు. లోకంలో దేవక్రతువులు, యజ్ఞయాగములు, ఔపోసనాది కార్యములు ఆగి పోయాయి. దేవతార్చనలో దీపాలు ఆరిపోయాయి. పితరులకు చేసే పిండ ప్రదానాలు ఆగి పోయాయి. అగ్ని కార్యాలు ఆగి పోయాయి. ప్రజలు హాహాకారాలు చేస్తూ మునులు వద్దకు వెళ్ళారు. వారంతా దేవతల వద్దకు వెళ్ళారు. దేవతలు బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళారు. బ్రహ్మదేవుడు అగ్నిదేవుని అనునయించి " అగ్ని దేవా ! నీవు సమస్త భూతములకు నీవు యజమానివి, చరాచర సృష్టికి నీవు హేతుభూతుడవు, సమస్త దేవతలకు నీవు ముఖం వంటి వాడిని. లోకోపావకుడివి అయిన నీవు ఇలా చెయ్యడం ధర్మం కాదు. భృగువు వాక్కు అసత్యం కాదు. సర్వభక్షకుడివి అయినా నీవు సర్వ కార్యాలలో ప్రథముడివి. నీవు ఎప్పటికీ పవిత్రుడవే శుచులలో నీవు శుచుడివి, పూజింప తగిన వారిలో నీవు అగ్రపూజ్యుడివి. కనుక నీ తేజమును తిరిగి ప్రజ్వలింప చేయుము బ్రాహ్మణ సహాయంతో దేవతలకు హవిస్సును ్శదించు " అని అర్ధించాడు. అందుకు అగ్నిదేవుడు సమ్మతించాడు.

## రురుడు ప్రమద్వరల వృత్తాంతం

చ్యవనునికి శర్యాతి కుమార్తె సుకన్యకు వివాహమైంది. వారికి ప్రమతి అనే కుమారుడు ఉన్నాడు. ప్రమతికి క్షీరసాగర సమయంలో అమృత కలశంతో పుట్టిన ఘృతాచి అనే అప్సరసతో వివాహం అయింది. ప్రమతికి ఘృతాచికి పుట్టిన కుమారుడు రురుడు. రురుడు స్థూలకేశుడు అనే ముని ఆశ్రమంలో పెరుగుతున్న ప్రమద్వరను వివాహం చేసుకోవాలని అనుకున్నాడు. విశ్వావసు అనే గంధర్వ రాజుకు మేనకకు పుట్టిన కుమార్తె ప్రమద్వర. ఒక రోజు ప్రమద్వర పాముకాటుతో మరణించింది. ప్రమద్వర మరణానికి ఆశ్రమవాసులు దుఃఖించసాగారు. అది విన్న రురుడు రోదేస్తూ అరణ్యంలోకి పరిగెతుతాడు.

### ప్రమద్వరను బ్రతికించుట

రురుడు శోకిస్తూ ప్రద్వరను బ్రతికించమని దేవతలను " ఓ దేవతలారా ! ఓ బ్రాహ్మణులారా ! నేను దేవ యజ్ఞములు, వేదాధ్యయనం, వ్రతములు, పుణ్యకార్యములు చేసిన వాడిని అయితే, నేను నా గురువులను భక్తితో సేవించిన వాడిని అయితే, నేను ఘోరమైన తపసు చేసిన వాడిని అయితే నా క్రేయసి ప్రమద్వర మీ దయ వలన విషం నుండి విముక్త కాగలదు" ప్రార్ధించాడు. తిరిగి " మంత్ర తంత్రములు తెలిసిన వారు విషతత్వ శాస్త్రములు తెలిసిన వారు ఎవరైనా ప్రమద్వర విషమును హరిస్తే అతడికి నా తపః ఫలమును, అధ్యయన ఇలమును ధారపోస్తాను. " అని రోదించాడు. అప్పుడు ఆకాశం నుండి ఒక దేవత " బ్రాహ్మణోత్తమా !ప్రమద్వర కాలవశమున మరణించింది. ఆయుస్సు తీరింది కనుక దానిని ఆపడం ఎవరి తరం. అయినా దానికి నేను ఒక ఉపాయం చెప్తాను. ఎవరైనా తమ ఆయుష్షులో సగం ఇస్తే ఆమె ముదరి కంటే తేజస్సుతో

బ్రతుకుతుంది అని నేను యమధర్మరాజు అనుమతితో పలుకుతున్నాను " అని పలికాడు. రురుడు అందుకు అంగీకరించి తన ఆయుర్ధాయంలో సగం ఇచ్చి ఆమెను బ్రతికించి వివాహం చేసుకున్నాడు.

# సర్పముల మీద రురుడి పగ

కానీ రురుడికి పాముల మీద కోపం పోలేదు. కర్రతో కనిపించిన పాములను చంపడం మొదలు పెట్టాడు. చెట్ల వెంట పుట్టల వెంట తిరుగుతూ కనిపించిన పామపలను చంపుతూ ఉండసాగాడు. అలా చంపుతూ ఒక రోజు డుండుభం అనే ఒక పామును చంపడానికి కర్రమును పైకి ఎత్తాడు. ఆ పాము భయపడి " తేజోవంతుడివి అయిన బ్రాహ్మణుడివి అయిన నీవు ఇలా పాములను చంపడానికి కారణం ఏమిటి " అని అడిగాడు. రురుడు " నా పేరు రురుడు. నేను ప్రమద్వర అనే ఆమెను ప్రేమించాను. నేను ప్రాణప్రదంగా ప్రేమించిన ప్రమద్వరను !క పాము కాటు వేసింది. అందు వలన నేను పాములను చంపుతున్నాను. నిన్ను కూడా చంపుతాను " అని చెప్పి కర్రను పైకెత్తాడు. వెంటనే ఆ పాము ఒక మునిగా మారి రురుడి ముందు నిలిచింది.


రురుని దర్శనము వలన సర్పరూపము నుడి విముక్తుడైన సహస్రపాదుడు

# ఖగముని వృత్తాంతం

డుండుభం అనే పాముని చంపబోతుండగా ఆ పాము ఒక మునిగా మారాడు. రురుడు ఆ పాముని " ఇదేమిటి పాముగా ఉన్న నీవు మనిషిగా మారడానికి కారణం ఏమిటి య " అడిగాడు. అందుకు ఆ పాముని "నేను సహస్రపాదుడు అనే మునీశ్వరుడను. నా సహచరుడు ఖగముడు. ఒక రోజు నా సహచరుడు ఖగముడు అగ్ని కీర్యం చేస్తున్నాడు. ఆసమయంలో నేను అతడి మీద పరిహాసంగా గడ్డితో చేసిన పాముని వేసాను. అతడు నాపై కోపించి నన్ను విషం లేని పాముగా పడి ఉండమని శపించాడు. నేను అతడిని పరిహాసానికి చేసిన పనికి నన్ను ఇలా శపిస్తావా ! నన్ను క్షమించ లేవా " అని ప్రారంభించాను. నా ప్రార్థన మన్నించి ఖగముడు " మిత్రమా ! నా మాట జరిగి తీరుతుంది. అయినా నీవు పాముగా పడి ఉన్న తరుణంలో రురుడు అనే భృగువంశ సంజాతుడు వస్తాడు. అతడిని చూడగానే నీకు నీ రూపం వస్తుంది. " అని చెప్పాడు. అయ్యా మీరు బ్రాహ్మణులు. దయాగుణం కలవారు. పూర్వం నీ తండ్రి శిష్యుడైన ఆస్థికుడు కద్రువ శాప కారణంగా సర్పయాగంలో ఆహుతి అవుతున్న పాములను కాపాడాడు. నీవు కూడా పాములను చంపడం ఆప లేవా ! " అన్నాడు. రురుడు పాములను చంపడం ఆపివేసాడు. ఈ కథను వింటున్న మునులు " తల్లి కొడుకులకు శాపం ఇవ్వడం ఏమిటి. మాకు సవిస్తరంగా చెప్పండి " అని కోరారు.

# మూలాలు

# బయటి లింకులు

- కిశోరీ మోహన్ గంగూలి ఆంగ్ల అనువాదం (http://www.sacred-texts.com/hin/m01/index.htm)

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

# ఆది పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

మహాభారతం ఇతిహాసంలో మొదటిభాగము పేరు ఆదిపర్వము. ఆ పర్వంలో రెండవ ఉపభాగం **ఆది పర్వము ద్వితీయాశ్వాసము**.

## విషయ సూచిక



# ద్వితీయాశ్వాసము

ఈ అశ్వాసమునందు, గరుడుని కథ, దేవదానవులు సముద్రము మదించి అమృతము సాధించుట, దేవదానవ యుద్ధం, వినతా దాస్యం, నాగుల శాపం, గరుడుని జననం, వినతా దాస్య విముక్తి, పరీక్షిత్తు మహారాజు శాపం, సర్పయాగ విశేషాలు వర్ణించ బడ్డాయి.

ద్వితీయాంవాసం లోని ప్రధానాంశాలు;-

### నాగులకు శాపము

కశ్యప ప్రజాపతి భార్యలైన వినతా కద్రువలు తమకు సంతానం కావాలని భర్తను కోరారు. కశ్యపుడు వారిని " మీకు ఎలాంటి పుత్రులు కావాలి " అని అడిగాడు. కద్రువ తనకు ప్రకాశవంతమైన దేహాలు కలిగిన పుత్రులు వెయ్యి మంది కావాలని కోరింది. వినత తనకు వారి కంటే బలవంతులైన ఇద్దరు పుత్రులు కావాలని కోరింది. పుత్రుల కొరకు కశ్యపుడు పుత్రకామేష్టి యాగం చేసాడు. యాగ ఫలితంగా కద్రువకు వెయ్యి అండాలు వినతకు రెండు అండాలు కలిగాయి. ముందుగా కద్రువ అండాలు పక్వం చెంది వెయ్యి మంది నాగ కుమారులు జనించాయి. అందుకు వినత ఉక్రోష పడి తన అండాలలో ఒకదానిని బలవంతంగా

చిదమింది. దాని నుండి సగము దేహంతో జన్మించిన అనూరుడు " ఎందుకు అమ్మా తొందరపడి అండాన్ని చిదిమావు. నీ వలన నేను సగం దేహంతో పుట్టాను. ఈ దేహం కలిగినందుకు కారణమైన నీవు నీ సవతికి దాసివి అగుదువుగాక " అని శపించాడు. ఆ తరవాత తాను సూర్యునికి సారధిగా వెళ్ళాడు. అనూరుడు వెళుతూ తన తల్లితో " అమ్మా రెండవ అండాన్ని జాగ్రత్తగా కాపాడు. దాని నుండి పుట్టేవాడు మహా బల సంపన్నుడు. అతడి వలన నీకు దాస్య విముక్తి కాగలదు " అని చెప్పి వెళ్ళాడు.

## క్షీరసాగర మథనం


సముద్ర మధనం

ఇలా ఉండగా దేవ దానవులు వాసుకిని కవ్వపు త్రాడుగా చేసి మంధర పర్వతాన్ని కవ్వంగా చేసి పాల సముద్రాన్ని మధించడం మొదలు పెట్టారు. ముందుగా పుట్టిన భయంకరమైన హాలాహలం శంకరుడు గ్రహించి లోకాలను రక్షించాడు. ఆ తరువాత పుట్టిన ఉచ్చైశ్వం, ఐరావతం ఇంద్రుడు స్వీకరించాడు. కౌస్థుభ మణిని, లక్ష్మీ దేవిని విష్ణుమూర్తి స్వీకరించాడు. ఆ తరవాత కల్పవృక్షం, కామధేనువు, అప్సర కాంతలు, సుర మొదలైనవి లభించాయి. చివరగా ధన్వంతరి అమృత కలశంతో అవతరించాడు. అమృత కలశాన్ని రాక్షసులు లాక్కుని వెళ్ళారు. అమృతం


రాహువు తలను ఖండిస్తున్న విష్ణువు

కోసం దేవ దానవులు కలహించారు. విష్ణు మూర్తి మోహిని అవతారంలో రాక్షసులను వంచించి అమృతాన్ని గ్రహించి అమృతాన్ని దేవతలకు మాత్రం పంచసాగాడు. ఇది గ్రహించిన రాహువు, కేతువు దేవతల వేషంలో అమృతం సేవించారు. సూర్య చంద్రులు ఇది గ్రహించి విష్ణు మూర్తికి చెప్పారు. విష్ణు మూర్తి వారి శిరస్సును చక్రా యుధంతో ఖండించాడు. అప్పటికే గొంతు వరకూ దిగిన అమృతం వలన వారి శిరస్సులు చిరాయువు అయ్యాయి మిగిలిన శరీరం పడిపోయింది. అది మొదలు వారు సూర్య చంద్రులపై వైరం పెంచుకున్నారు. వంచించ బడినట్లు గ్రహించిన రాక్షసులు బలి చక్రవర్తితో ఆలోచించి దేవతలతో యుద్ధం చేసారు. యుద్ధంలో ఓడిపోయి సముద్రంలోకి పారిపోయారు. దేవతలు మంధర పర్వతాన్ని స్వస్థలంలో ఉంచి స్వర్గలోకం చేరారు.

## వినతా కద్రువల పందెం

ఇంద్రుని ఉచ్చైశ్వం సముద్రతీరంలో తిరగటం చూసిన కద్రువ వినతతో అంతటి తెల్లని అశ్వం తోక మాత్రం నల్లగా ఉందని చెప్పింది. అందుకు వినత తోక తెల్లగా ఉంది కదా అని చెప్పింది. దీనితో సవతులకు పంతం పెరిగి పందెం కాచారు. ఆ పందెం ప్రకారం గెలిచిన వారు ఓడిన వారికి దాస్యం చేయాలని ఒప్పందం కుదుర్చు కున్నారు. వినత అప్పుడే కావాలంటే దగ్గరకి వెళ్ళి చూద్దామని చెప్పింది. కద్రువ వినతను వారించి మరునాడు చూద్దామని ఇంటికి వెళ్ళింది. ఇంటికి వెళ్ళిన కద్రువ తన కుమారులను పిలిచి ఆగుర్రం తోక నల్లగా మార్చి తల్లిని దాస్య బాధ నుండి కాపాడమని అడుగింది. అది అధర్మమని చేయలేమని నిరాకరించిన కుమారులను జనమేజయుని సర్పయాగంలో పడి మరణించమని శాపం ఇచ్చింది. ఇది చూసి భయపడిన కర్కోటకుడు అశ్వం తోకకు చుట్టుకున్నందు వలన తోక నల్లగా ఉందని భ్రమపడిన వినత కద్రువకు దాస్యం చేయటం మొదలుపెట్టింది.

## వినత దాస్యవిమిక్తి

తరవాత వినత రెండవ అండం నుండి అతి బలవంతుడైన గరుత్మంతుడు జన్మించాడు. గరుత్మంతుడు తల్లితో చేరి దాస్యం అనుభవిస్తున్నాడు. ఒక రోజు కద్రువ గరుడా ! నీ తల్లి నాకు దాసి నీవు దాసీ పుత్రుడవు. కనుక నీవు రోజూ నీ సోదరులైన నాగులను రెక్కలమీద విహారానికిని వెళ్ళు" అన్నది. ఒక రోజు గరుత్మంతుడు నాగులను రెక్కలమీద ఎక్కించుకుని సూర్య మండల సమీపానికి వెళ్ళాడు. వేడికి తట్టుకోలేని నాగులు సొమ్మసిల్లి పడిపోయాయి. కద్రువ ఇంద్రుని ప్రార్ధించి వర్షం కురిపించి పుత్రులను సేద తీర్చింది. పుత్రుల అవస్థకు కారణమైన గరుత్మంతుని తీవ్రంగా దూషించింది. అది సహించలేని గరుత్మంతుడు తమ దాస్యానికి కారణం ఏమిటని వినతను అడిగి తెలుసుకున్నాడు. తల్లి దాస్యాన్ని తాను తీర్చగలనని తెలుసుకున్నాడు. గరుత్మంతుడు తమ దాస్య విముక్తి చేయడానికి ఏమి కావాలని కద్రువను అడిగాడు. ఆమె తన కుమారులకు అమృతం తెచ్చి

ఇస్తే దాస్య విముక్తులు కాగలరని చెప్పింది. గరుత్మంతుడు అమృతం తీసుకు రావడానికి బయలు దేరాడు. మార్గమధ్యంలో తనకు తీవ్రంగా ఆకలి అయింది. ఆకలి తీర్చమని తండ్రిని అడిగాడు. కశ్యపుడు " కుమారా విభావసుడు సుప్రీతకుడు అనే అన్నదమ్ము ఉన్నారు. తమ్ముడు ఆస్తిలో భాగం అడిగినందుకు కోపించి అతడి ఏనుగువు కమ్ము అని విభావసుడు శపించాడు. తమ్ముడు కోపించి అన్నను తాబేలువు కమ్ము అని ప్రతి శాపం ఇచ్చాడు. అప్పడు వారిరువురు మూడు యోజనములు పొడవు పది యోజనము వెడల్పు గల తాబేలు గానూ, ఆరు యోజనముల పొడవు పన్నెండు యోజనముల వెడల్పు కలిగిన ఏనుగుగానూ మారి పోయారు. కానీ ఇప్పటికీ కలహించుకుంటూ ఉన్నారు. నీవు వారిరువురిని పట్టి తిని ఆకలి తీర్చుకో ". గరుడుడు సంతోషించి విభావసుడు అనే ఏనుగుని సుప్రతీకుడు అనే తాబేలును తీసుకుని రోహణుడు అనే వృక్షపు కొమ్మ మీద కూర్చున్నాడు. ఆ బరువుకు ఆ కొమ్మ విరిగింది. ఆ వృక్షపు శాఖలో తపసు చేసుకుంటున్న మునులను చూసాడు. వారు క్రింద పడతారని భావించి ఆ కొమ్మను పట్టుకుని తండ్రి దగ్గరకు వెళ్ళి ఏమి చేయాలి అని అడిగాడు. కశ్యపుడు మునులను చూసి హిమాలయాలకు వెళ్ళి తపస్సు చేసుకొమ్మని ప్రార్ధించాడు. మునులు అంగీకరించి కొమ్మను విడిచి వెళ్ళారు. గరుత్మంతుడు ఆహారాన్ని భుజించి దేవలోకానికి చేరాడు. దేవలోకానికి చేరిన గరుత్మంతుడు అమృత రక్షకులను ఓడించి అమృతాన్ని తీసుకు వెళుతున్నాడు. అప్పడు విష్ణుమూర్తి గరుడుని వద్దకు వచ్చి " నీ సాహసానికి మెచ్చాను వరం ఏమి కావాలి " అని అడిగాడు. అందుకు గరుత్మంతుడు " దేవా సేవించకుండానే చిరంజీవిగా ఉండాలి, విష్ణుమూర్తికి వాహనం కావాలి " అని కోరుకున్నాడు. ఇంతలో ఇంద్రుడు గరుత్మంతునపై వజ్రాయుధాన్ని వేసాడు. తనపై వేసిన వజ్రాయుధాన్ని గౌరవించి ఒక ఈకను మాత్రం తుంచమని చెప్పాడు. ఇంద్రుడు గరుడుని బలానికి అచ్చెరువు చెంది అతనితో మైత్రి చేసుకున్నాడు. గరుడా క్రూరులైన నాగులకు అమృతాన్నిచ్చి లోకాలకు కీడు చేయవద్దని వేడుకొన్నాడు. అందుకు సమ్మతించిన గరుత్మంతుడు "నేను అమృతాన్నిచ్చి నా తల్లితో సహా దాస్య విముక్తులము అవుతాము. ఇంద్రా నీవు వారు అమృతం సేవించే లోపు తిరిగి తీసుకొని వెళ్ళు" అని చెప్పాడు. అలాగే చేసి తల్లిని దాస్య విముక్తి చేసి తన రెక్కలపై పెట్టుకొని తీసుకు వెళ్ళాడు. అమృతం త్రాగే ముందు నాగులు శుచి అగుటకు నదిలో స్నానమాచరించే సమయంలో ఇంద్రుడు అమృతాన్ని తీసుకు వెళ్ళాడు. నిరాశ పడిన నాగులు అమృతం ఉంచిన దర్భలు నాకాయి. ఆ కారణంగా వాటి నాలుకలు రెండుగా చీలి పోయాయి. ఆనాటి నుండి నాగులు ద్విజిహ్వలు అయ్యారు. అమృతం పెట్టిన కారణంగా దర్భలు పవిత్రం అయ్యాయి. ఇదంతా చూసిన ఆదిశేషుడు తల్లి మీద తమ్ముల మీద అసహ్య పడి వారిని విడిచి వెళ్ళి బ్రహ్మను గురించి తపస్సు చేసాడు. అతని సత్య సంధతకు ధర్మనిష్టకు మెచ్చిన బ్రహ్మ దేవుడు భూభారాన్ని మోసే భారాన్ని ఆది శేషునకు అప్పగించాడు.


తాబేలును ఏనుగును మోసుకు వెళుతున్న గరుత్మంతుడు - రాజ్మానామా నుండి ఒక దృశ్యం


గరుత్మంతుడి మీద లక్ష్మీదేతో విష్ణువు

## నాగులను రక్షించే ప్రయత్నం

ఆది శేషువు వెళ్ళగానే కద్రువ కుమారులకు సర్పయాగం భయం పట్టుకుంది. అందు వలన కలత చెందిన వాసుకి నాగులను పిలిచి తనకు పాలసముద్ర మధనంలో సహాయపడిన కారణంగా దేవతలందరూ బ్రహ్మతో చెప్పి నాకు చిరంజీవత్వం లభించేలా చేసారు. మిగిలిన నాగులను రక్షించే ప్రయత్నం చేయాలని చెప్పాడు. అది విని ఏలా పుత్రుడు అనే పాము " అమ్మ శాపం ఇచ్చే సమయంలో నేను అమ్మ ఒడిలో పడుకుని దేవతల మాటలు విన్నాను. దేవతలంతా " బ్రహ్మదేవా ఏ మాత్రం దయ లేకుండా కద్రువ కుమారులకు శాపం ఇచ్చింది. దీనికి విమోచన లేదా " అన్నారు. బ్రహ్మ దేవుడు దేవతలతో " పాములు లోకానికి హాని చేస్తాయి కనుక ఈ శాపం మంచిదే. అయినా మంచి సర్పాలను రక్షించే ప్రయత్నం జరత్కారుడు జరత్కారువు దంపతులకు పుట్టిన ఆస్తీకుడు చేస్తాడు " అని దేవతలు చెప్పగా విన్నాను. ఆ తరవాత వాసుకి తన సోదరి జరత్కారువుని

వివాహమాడటానికి జరత్కారుని కోసం ఎదురు చూస్తున్నాడు. జరత్కారువు ఒక ముని. అతడు వివాహం చేసుకోకుండా బ్రహ్మచర్య వ్రతాన్ని పాటిస్తున్నాడు. ఒక రోజు ఒక మడుగు సమీపంలో ఎలుకలు కొరకగా మిగిలిన రెల్లు దుబ్బులను చూసాడు. వాటిని ఆధారం చేసుకుని వేలాడుతున్న ఋషులను చూసి " మహాత్ములారా ఇలా తలకిందులుగా ఎందుకు వేలాడుతున్నారు. ఇదేమి తపస్సు" అని అడిగాడు. అందుకు వారు " మా వంశంలో పుట్టిన జరత్కారువు అనే పాప కర్ముడు వివాహం చేసుకుని వంశాభివృద్ధి చేయలేదు. అందువలన అతని పితృ దేవతలమైన మాకు ఉత్తమ గతులు కలుగలేదు. నీకు అతడు కనిపిస్తే మా సంగతి వివరించి మాకు ఉత్తమ గతులు కలుగచేయమని చెప్పు " అన్నారు. అది విని జరత్కారువు పితృరుణం తీర్చుకొనే నిమిత్తం వివాహం చేసుకోవడానికి తనపేరు కలిగిన కన్య కోసం వెతకసాగాడు. కానీ అతనికి తన పేరు కలిగిన కన్య లభ్యం కాలేదు. అది తెలుసుకున్న వాసుకి తన చెల్లెలిని తీసుకుని జరత్కారుని దగ్గరకు వెళ్ళాడు. వాసుకి జరత్కారునితో " మహాత్మా ఈమె నీ పేరు కలిగిన కన్య ఈమెను వివాహం చేసుకోండి " అన్నాడు. అందుకు సమ్మతించి జరత్కారువును వివాహం చేసుకున్నాడు. అతడు భార్యతో "నీవు నా మాటను ఎప్పుడూ మన్నించాలి నీవు నాకు ఎదురు చెప్పిన రోజు నేను నిన్ను విడిచి తపస్సు చేసుకోవడానికి వెళతాను" అన్నాడు. ఆమె అందుకు అంగీకరించింది. జరత్కారువు గర్భవతి అయింది. ఒకరోజు సంధ్యా వందనం చేసుకునే సమయం అయిందని తన తొడపై తల పెట్టి నిద్రిస్తున్న భర్తను నిద్ర లేపి చెప్పింది. అందుకు జరత్కారుడు కోపించి " నన్ను నిద్ర లేపి అవమానించావు. కనుక మన ఒప్పందం ప్రకారం నేను నిన్ను విడిచి తపస్సుకు వెళతాను. నీవు నీ అన్న వాసుకి దగ్గరకు వెళ్ళు " అన్నాడు. జరత్కారువు వాసుకి ఇంటికి వెళ్ళింది. వాసుకి ఇంటికి చేరిన జరత్కారువు ఆస్తీకునికి జన్మ ఇచ్చింది. ఆస్తీకుడు చ్యవన మహర్షి కుమారుడైన ప్రమతి వద్ద విద్యాభ్యాసం చేసాడు.

## పరీక్షిత్తు శాపం


వేటాడుతున్న పరీక్షిత్తు

తక్షకుని మీద పగ పట్టిన ఉదంకుడు జనమేజయునికి అతని తండ్రి పరీక్షిత్తు మరణ వృత్తాంతం చెప్పి సర్పయాగానికి ప్రోత్సహించాడు. జనమేజయుడు మంత్రులను రావించి తన తండ్రి మరణ వృత్తాంతం వివరించమని కోరాడు. మంత్రులు ఇలా వివరించ సాగారు. అర్జుని కుమారుడు అభిమన్యుడు. అతని భార్య ఉత్తర. ఉత్తరాభిమన్యుల కుమారుడు మీ తండ్రిగారైన పరీక్షిత్తు. పరీక్షిత్తు మహారాజు వేట నిమిత్తం అడవిలోకి వెళ్ళి దప్పిగొన్నాడు. అడవిలో ఒక మృగాన్ని వేటాడుతూ శమీకుని ఆశ్రమంలోకి వెళ్ళాడు. అక్కడ దీర్ఘ తపస్సులో ఉన్న శమీకుని " అయ్యా ఇటు వైపు నేను వేటాడుతున్న మృగం వచ్చిందా" అని అడిగాడు. ధ్యాన మగ్నుడైన శమీకుడు బదులివ్వలేదు. ఆ కారణంగా ఆగ్రహించిన పరీక్షిత్తు అక్కడ చచ్చి పడిన పామును తీసి అతని మెడలో వేసాడు. ఆ తరవాత హస్థినాపురం వెళ్ళాడు. శమీకుడి శిష్యుడు కృశుడు ఇది చూసాడు. ఆ సమయంలో శమీకుని కుమారుడైన శృంగి లేడు. కృశుడు శృంగి దగ్గరకు వెళ్ళి జరిగినది చెప్పాడు. అది విన్న శృంగి " అడవిలో తపస్సు చేసుకుంటున్న నా తండ్రిని అవమానించిన పరీక్షిత్తు ఈ రోజు నుండి ఏడు రోజులలో తక్షకుడు అనే సర్పరాజుచే మరణించు గాక" అని శపించాడు. జరిగినదంతా శృంగి ద్వారా తెలుసుకున్న శమీకుడు బాధపడి " కుమారా కోపం అనర్ధ హేతువు. మనం అడవిలో ప్రశాంతంగా తపస్సు చేసుకోవడానికి కారణం మనలను రక్షించే రాజే కారణం. పరీక్షిత్తు ధర్మ రక్షకుడు. ఆకలి దప్పులకు ఆగలేక విసుగులో ఈ పని చేసాడు. నీ శాపాన్ని ఉపసంహరించు " అన్నాడు. అందుకు శృంగి అంగీకరించ లేదు. శమీకుడు గౌరిముఖుడు అనే శిష్యుని పిలిచి పరీక్షిత్తుని కలసి జరిగినది వివరించి ఆపద తొలగే ఉపాయం ఆలోచించమని చెప్పాడు. గౌరిముఖుని ద్వారా విషయం తెలుసుకున్న పరీక్షిత్తు తగిన జాగ్రత్తలు తీసుకున్నాడు. పాములన్నీ లోకానికి హాని చేస్తున్నాయని బ్రహ్మ దేవుడు పాము కాటుకు మరణించిన వారిని రక్షించే విద్యను కశ్యపుడు అనే మునికి ఉపదేసించాడు. కశ్యపుడు శాపోపహతుడైన పరీక్షిత్తుని రక్షించడానికి బయలుదేరాడు. శాపాన్ని అమలు చేయడానికి బయలుదేరిన తక్షకుడు కశ్యపుని మార్గ మధ్యంలో కలిసాడు. తక్షకుడు కశ్యపుడు పరీక్షిత్తుని రక్షించడానికి వెళుతున్నాడని తెలుసుకున్నాడు. తక్షకుడు కశ్యపునితో పరీక్షిత్తుని రక్షించడం అసంభవం అన్నాడు. కశ్యపుడు అంగీకరించ లేదు. తక్షకుడు పక్కన ఉన్న వృక్షాన్ని కాటు వేసి దాన్ని బతికించు చూద్దాం అన్నాడు. కశ్యపుడు ఆ బూడిదను మంత్రించి జీవింప చేసాడు. తక్షకుడు కశ్యపునితో " మహాత్మా శృంగి ఇచ్చిన శాపం తిరుగు లేనిది. మహారాజు ఇచ్చేవాటికన్నా నేను అధికం ఇస్తాను తిరిగి వెళ్ళు " అన్నాడు. కశ్యపుడు జరగబోయే దానిని దివ్య దృష్టితో గ్రహించి తక్షకుడు ఇచ్చిన కానుకలు తీసుకుని వెళ్ళాడు. ఇది ఆ చెట్టు పైన ఉన్న కట్టెలు కొట్టే వాడు చూసి హస్థినా పురానికి వచ్చి చెప్పాడు. తక్షకుడు నాగ కుమారులను పిలిచి బ్రాహ్మణ వేషాలలో వెళ్ళి పరీక్షిత్తుకు పండ్లు తీసుకుని ఇవ్వండి అని చెప్పి తాను ఆ పండ్లలో క్రిమి రూపంలో దాక్కున్నాడు. పరీక్షిత్తు దగ్గరకు చేరిన తక్షకుడు ఆయన

పండును వలవగానే బయటకు వచ్చి విషాగ్నులు చిమ్ముతూ కాటు వేసి పరీక్షిత్తును చంపాడు.

## సర్పయాగము


జనమేజయుని సర్పయాగం - 1920 కాలం నాటి చిత్రం

జనమేజయునకు పరీక్షిత్తు మరణ వృత్తాంతం చెప్పిన మంత్రులు " మహారాజా ఇది యుక్తం కాదని అనుకోకుండా తక్షకుడు ఒక బ్రాహ్మణుని ప్రేరణతో నీ తండ్రి మరణానికి కారణమైయ్యాడు. కనుక నీవు కూడా సర్పయాగం చేసి తక్షకుడితో సహా పాములను అన్నింటినీ అంతం చెయ్యి " అన్నారు. ఈ ఉదంతం విన్న జనమేజయుడు ఆగ్రహించి ఋత్విక్కులను రావించి సర్పయాగానికి ఏర్పాట్లు చేసాడు. ఆ సందర్భంలో వాస్తు శాస్త్ర నిపుణుడు ఒకడు జనమేజయునితో " సర్పయాగం మంచిదే కాని ఈ యాగం పూర్తికాదు. మధ్యలో ఆగిపోతుంది " అని చెప్పాడు. అయినా జనమేజయుడు ఆగకుండా సర్పయాగం ఆరంభించాడు.

యాగం మొదలైంది. పాములన్ని యాగంలోపడి మరణిస్తున్నాయి. తక్షకుడు ఇది చూసి కలత చెందాడు. ఇంద్రుని వద్దకు శరణు వేడాడు. ఇంద్రునికి బ్రహ్మ దేవుడు కొన్ని పాములకు అభయం ఇచ్చిన సంగతి తెలుసు. కనుక " తక్షకా నీకేమి భయం లేదు " అని చెప్పాడు. తక్షకుడు రాకపోవడంతో అతడు ఇంద్రుని శరణు వేడినట్లు అర్ధం చేసుకుని ఋత్విక్కులు ఇంద్రునితో సహా తక్షకుని యాగానికి ఆహ్వానిచారు. ఇంద్రుడు భయపడి " తక్షకా నీవు నీ దారిన వెళ్ళు. ఇక నేను నిన్ను రక్షించ లేను " అన్నాడు. పెద్ద పాములన్నీ సర్పయాగంలో పడి మరణించడం చూసిన వాసుకి " అమ్మా పాములన్నీ సర్పయాగంలో పడి మరణిస్తున్నాయి. ఇందుకు పరిష్కారం నీ చేతిలో ఉంది. నీకు నీ భర్త జరత్కారునికి పుట్టిన ఆస్తీకుడు ఈ సర్పయాగం ఆపు చేయగలడని బ్రహ్మ దేవుడు చెప్పాడు. కనుక ఆస్తీకుని పంపి ఈ యాగాన్ని ఆపించు " అన్నాడు. అది విన్న జరత్కారువు ఆస్తీకుని పిలిచి "కుమారా నీ మేనమామ మాట విన్నావు కదా నీవు వెళ్ళి సర్పయాగాన్ని నిలుపు" అని కోరింది.

ఆస్తీకుడు జనమేజయుని వద్దకు వెళ్ళాడు. ఆస్తీకుడు బయలు దేరి వెళ్ళి జనమేజయునితో "జనమేజయా నీ పూర్వీకులైన రఘువు, మాంధాత, దశరధుడు, రాముడు, ధర్మరాజు మొదలైన మహారాజులలో ఉన్న గుణాలన్నీ నీలో ఉన్నాయి. నీవు యజ్ఞ యాగాదులు చేసి పునీతుడివి అయ్యావు. నీవు చేస్తున్న యాగం గొప్పది. సర్వ శాస్త్ర సంపన్నులచే ఈ యాగం నిర్వహించ పడుతుంది. వ్యాసుడు మొదలైన వారి రాకతో ఈ యాగం వైభవాన్ని సంతరించుకున్నది. నీకు శుభం కలుగుతుంది" అన్నాడు. ఆ స్తుతికి సంతోష పడి జనమేజయుడు ఆస్తీకునితో " మహాత్మా ఏమి వరం కావాలో కోరుకో " అన్నాడు. ఆస్తీకుడు " జనమేజయా ఈ సర్పయాగం ఆపించి నా బంధువులను రక్షించు " అన్నాడు. గొప్ప తపస్వి అయిన ఆస్తీకుడు కోరాడు కనుక జనమేజయుడు సర్పయాగాన్ని ఆపించాడు. తక్షకుడు వెను తిరిగి నాగలోకం చేరాడు. ఆస్తీకుడు యాగాన్ని ఆపి సర్పాలను రక్షించినందుకు యాగశాలలోని వారంతా సంతోషించారు.

# ఇవి కూడా చూడండి

- గరుత్మంతుడు
- క్షీరసాగర మథనం

# బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

# ఆది పర్వము తృతీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



# తృతీయాశ్వాసం

అర్ధాంతరంగా ఆగిపోయిన సర్పయాగం తరవాత జనమేజయుడు ఋత్విక్కులకు దక్షిణాది సత్కారాలను చేసాడు. వ్యాస భగవానుని చూసి మీవంటి పూజ్యులచే పంచి ఇవ్వబడిన రాజ్యాన్ని పాలించకుండా కురు పాండవులు యుద్ధం ఎందుకు చేసారు అని అడిగాడు. వ్యాసుడు వైశంపాయుని చూసి జనమేజయునకు భారత కధను వివరించమని ఆదేశించాడు. జనమేజయుడు వైశంపాయునకు పూజలు చేసి బంధు మిత్ర పురోహిత సహితంగా భారతగాధను వినడానికి అతని ముందు కూర్చున్నాడు.

### ఉపరిచరవసువు

చేది రాజ్యాన్ని పాలిస్తున్న వసువు ఒక నాడు వేటకు వెళ్ళి అక్కడ తపమాచరిస్తున్న మునులను చూసి ముచ్చట పడి తాను కూడా తపస్సు చేయడం మొదలు పెట్టాడు. అది చూసిన ఇంద్రుడు రాజా ! రాజ్యపాలన చేయవలసిన నీకు ఈ తపసేమిటి నాతో స్నేహం చేస్తే నేను నీకు దైవత్వాన్ని ఇస్తాను ఇంద్రలోకానికి వస్తూ పోతూ ఉండచ్చు అని చెప్పి ఇంద్రుడు వసువుకు ఏ ఆయుధానికి లొంగని పూల మాలనూ దుష్ట శిక్షణా శిష్ట రక్షణా సామర్ధ్యం కలిగిన వేణు ఇష్టి (విమానము)ను ఇచ్చి వెళ్ళాడు. వసువు ఆ విమానం ఎక్కి ఇంద్ర లోకానికి రాకపోకలు సాగించడంతో అతనికి ఉపరిచర వసువు అనే నామాంతరం కలిగింది. ఆ తరవాత అతడు ప్రతి సంవత్సరం రాజ్యంలో ఇంద్రోత్సవాలు జరిపించ సాగాడు. చేది రాజ్యానికి సమీపంలో కోలాహలము అనే పర్వతాన్ని ఆనుకుని శుక్తిమతి అనే నది ప్రవహిస్తుండగా కోలాహలుడు ఆ నది అందానికి మురిసి ఆమెను మోహించి నదికి


సభలోని వారికి భారత గాధను వినిపిస్తున్న వైశంపాయనుడు - రజ్మానామా నుండి ఒక దృశ్యం

అడ్డం పడ్డాడు. అటుగా వచ్చి అది చూసిన వసువు నదికి అడ్డంగా ఉన్న పర్వతాన్ని తొలగించాడు. శుక్తిమతి కోలాహలునికి జన్మించిన గిరిక అనే ఆడపిల్లను వసుపదుడు అనే మగ పిల్ల వాడిని శుక్తిమతి వసువుకు బహూకరించింది. వసువు గిరికను వివాహమాడి వసుపదుడిని సేనాధిపతిని చేసాడు. ఒక రోజు వేటకు వెళ్ళిన వసువుకు భార్య గుర్తుకు వచ్చి వీర్య పతనం జరుగగా వసువు దానిని ఒక దోనెలో భద్రపరచి ఒక డేగకు ఇచ్చి గిరికకు పంపించాడు. మార్గమద్యంలో మరొక డేగ దానిని తినే పదార్ధమని భ్రమించి కలహించడంతో ఆ దొప్పలోని వీర్యం నేరుగా బ్రహ్మ శాపవశాన చేపగా మారి యమునా నదిలో తిరుగుతున్న అద్రిక అనే అప్సర నోట్లో నేరుగా పడింది. అద్రిక గర్భం దాల్చింది. జాలరి వాళ్ళ వలలో పడిన అద్రిక గర్భంలో ఉన్న ఆడపిల్లనూ మగ పిల్లవాడిని చూసి జాలర్లు వారిని దాశరాజుకు సమర్పించారు. ఆ పిల్లవాడు పెరిగి మత్స్యదేశ రాజైనాడు. దాశ రాజు ఇంట మత్స్యగంధి పేరిట ఆ పిల్ల పడవ నడుపుతూ ఉంది.

## వ్యాసజననం

మత్స్యగంధి పడవ నడిపే తరుణంలో ఒక రోజు ఆ పడవలో వశిష్ట మహాముని కుమారుడైన శక్తి మహాముని కుమారుడు పరాశరుడు ప్రయాణిస్తూ మత్స్యగంధిని చూసి మోహించి ఆమెతో సంగమించగా వారిరువురికి వ్యాస భగవానుడు జన్మించాడు. పుట్టగానే వ్యాసుడు తల్లికి నమస్కరించి తనను తలచిన మరుక్షణం ఆమె ఎదుట ఉంటానని మాటిచ్చి తపసు చేసుకోవడానికి వెళ్ళాడు. ఆ పై వైశంపాయనుడు దేవ దానవ అంశలతో పాండవులు కౌరవులు పుట్టారని చెప్పగా జనమేజయుడు దేవాంశతో పుట్టిన వారు యుద్ధం ఎందుకు చేశారని సందేహం వెలుబుచ్చాడు. సమాధానంగా వైశంపాయనుడు పరశురామ దండయాత్రకు క్షత్రియులంతా బలి కాగా రాజుల భార్యలు వంశాభివృద్ధి కొరకు ఆకాల ధర్మం అనుసరించి ఉత్తములైన బ్రాహ్మణుల అనుగ్రహంతో సంతానవతులైయ్యారు. మరలా రాజులు ధర్మపరిపాలన సాగించగా భూమి సుభిక్షంగా ఉండి ప్రజల ఆయుర్ధాయం పెరిగి మరణాలు తగ్గాయి భూభారం ఎక్కువైంది. భూదేవి త్రిమూర్తుల వద్దకు వెళ్ళి భూభారాన్ని తగ్గించమని వేడుకొనగా వారు భూదేవితో దేవతల అంశంతో పాండవాది రాజులు రాక్షసాంశతో కౌరవాది రాజులు పుట్టి పరస్పరం కలహించుకొని కురుక్షేత్రమనే యుద్ధం చేస్తారు. ఆ యుద్ధంలో జనక్షయం జరిగి భూభారం తగ్గకలదని భూదేవితో చెప్పారు.

## దేవదానవ జననం

జనమేజయుడు దేవదానవ జన్మ వృత్తాంతం వివరించమని వైశంపాయనుని కోరాడు. ఆయన ఇలా చెప్పాడు. సృష్టికి మూలం బ్రహ్మ దేవుడు. ఆయన మానస పుత్రులు మరీచి, అంగీ రసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు అనే ఆరుగురు. మరీచి కొడుకు కశ్యప ప్రజాపతి. బ్రహ్మ దేవుని కుడి బొటనవ్రేలి నుండి దక్షుడు ఎడమ బొటన వ్రేలి నుండి ధరణి జన్మించారు. వారిరువురికి వెయ్యిమంది మహా పురుషులు జన్మించారు. దక్షునికి ఏభై మంది కుమార్తెలు జన్మించారు. వారిలో పదమూడు మందిని కశ్యప ప్రజాపతికి ఇచ్చాడు. వారిలో దితికి హిరణ్య కశిపుడు అతనికి ప్రహ్లాదుడు అతనికి విరోచనుడు అతని కొడుకు బలి చక్రవర్తి అతని కొడుకు బాణాసురుడు. దను అనే మరో భార్యకు 40 మంది దానవులు జన్మించారు. సింహిక అనే దానవ వనితకు రాహువు జన్మించాడు. వినతకు గరుత్మంతుడు, అనూరుడు జన్మించారు. కద్రువకు నాగ కుమారులు జన్మించారు. బ్రహ్మ మానస పుత్రులలో రెండవ వాడైన అంగీరసునకు ఉతథ్యుడు, బృహస్పతి, సంవర్తనుడు అనే కుమారులు కలిగారు. బృహస్పతి ఇంద్రునికి గురువైయ్యాడు. మూడవ మానస పుత్రుడైన అత్రికి అనేక మంది మహా మునులు జన్మించారు. నాల్గవ మానస పుత్రుడైన పులస్త్యునకు రాక్షసులు పుట్టారు. ఐదవ మానస పుత్రునికి కిన్నెరలు, కింపురుషులు పుట్టారు. క్రతువు అనే మానస పుత్రునికి పక్షి జాతి పుట్టింది. దేవ్పుడు అనే వసువు కొడుకు ప్రజాపతి అతనికి అష్ట వసువులు జన్మించారు.


అదితి కుమారుడు దేవతల రాజు ఇంద్రుడు

వారిలో ప్రభావసునికి విశ్వకర్మ జన్మించాడు. బ్రహ్మ హృదయం నుండి భృగు మహర్షి జన్మించాడు. భృగువు కుమారుడు కవి అతని కుమారుడు శుక్రుడు. శుక్రుడు రాక్షస గురువైయ్యాడు. భృగువు కుమారుడు చ్యవనుడు అతని కుమారుడు ఔర్యుడు. ఔర్యుని కుమారుడు జమదగ్ని. జమదగ్ని కుమారుడు పరశురాముడు. ఇక భూమి పైన దేవ దానవాంశలతో రాజులు జన్మించారు. విష్ణు మూర్తి అంశతో కృష్ణుడు, ఆదిశేషుని అంశతో బలరాముడు, లక్ష్మీ దేవి అంశతో రుక్మిణీ, అప్సరసల అంశతో పదహారు వేల గోపికలు, ప్రభాసుని అంశతో భీష్ముడు, బృహస్పతి అంశతో ద్రోణుడు జన్మించారు. ద్రోణునికి కామ క్రోధములు కలసి అశ్వత్థామగా జన్మించాడు. మరుత్తుల అంశతో విరాటుడు, సాత్యకి, ద్రుపదుడు జన్మించారు. సిద్ధి బుద్ధి అంశతో కుంతి మాద్రి జన్మించారు. ఏకాదశాంశతో కృపాచార్యుడు, సూర్యుని అంశతో కర్ణుడు జన్మించారు. హంసుడు అనే గంధర్వుడు ధృతరాష్ట్రునిగానూ మతి అనే దేవత గాంధారిగానూ జన్మించారు. కలి అంశతో దుర్యోధనుడు,హిరణ్యకశిపుడు శిశుపాలునిగా, ప్రహ్లాదుడు శల్యునిగా, కాలనేమి అంశతో కంసుడు, విప్రచిత్తి అనే దానవుడు జరాసంధుడిగా పుట్టారు. అశ్వపతి కృతవర్మగా గుహ్యకుడు శిఖండిగా, మరుద్గణాంశతో పాండురాజు జన్మించారు.మాండవ్యముని శాపకారణంగా యమ ధర్మరాజు విదురుడిగా జన్మించాడు. యముడి అంశతో ధర్మరాజు, వాయుదేవుని అంశతో భీముడు, ఇంద్రుని అంశతో అర్జునుడు, అశ్వినీ దేవతల అంశతో నకుల సహదేవులు జన్మించగా శ్రీ అంశతో ద్రౌపది, అగ్ని అంశతో ధృష్టద్యుమ్నుడు జన్మించారు.

## భారత చక్రవర్తులు


ఊర్వశీ పురూరవులు - రాజా రవి వర్మ చిత్రం

అదితి కశ్యపుల పుత్రుడైన వివస్వతుని కుమారుడైన వైవస్వత మనువుకు చతుర్వర్ణాలు కలిగిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య,శూద్రులు కలిగారు. చంద్రుడి కొడుకు బుధుడు. బుధుని కుమారుడు పురూరవుడు. అతడు ధనాశాపరుడై బ్రాహ్మణ ధనాన్ని అపహరించగా అది బ్రహ్మదేవునకు తెలిసి విషయం తెలుసుకుని రమ్మని సనత్కుమారాది మునులను పురూరవుని వద్దకు పంపాడు. పురూరవునిచే పరిహసించబడిన మునులు కోపించి పురూరవుని వెర్రివాడివి కమ్మని శపించారు. పురూరవుని భార్య ఊర్వశి అనే అప్సర. వారికి ఆరుగురు కుమారులు. వారిలో ఆయుషుడు అనే కుమారునికి కలిగిన నహుషుడు చక్రవర్తి అయ్యాడు. నహుషుని భార్య ప్రియంవద. వారి పుత్రుడు యయాతి. యయాతికి దేవయాని వలన ఇద్దరు కుమారులు కలిగారు. వృషపర్వుడనే రాక్షస రాజు కుమార్తె శర్మిష్ట వలన ముగ్గురు కుమారులు కలిగారు. శుక్రుని శాపం వలన యయాతికి ముసలి తనం వచ్చింది. యయాతి తన కుమారులను పిలిచి వారి యవ్వనాన్ని తనకు ఇమ్మని అడిగాడు. వారిలో పూరుడు తన యవ్వనాన్ని తండ్రికి ఇచ్చి అతని ముసలితనాన్ని గ్రహించాడు. అప్పుడు జనమేజయుడు వైశంపాయినుని వద్ద ఒక సందేహం వెలిబుచ్చాడు. మహర్షీ క్షత్రియుడు చక్రవర్తీ అయిన యయాతి బ్రాహ్మణుడు రాక్షస గురువూ అయిన శుక్రుని కుమార్తెను ఎలా వివాహమాడాడు " అని అడిగాడు. సమాధానంగా వైశంపాయనుడు ఇలా చెప్పాడు.

## కచ దేవయానుల వృత్తాంతం

వృషపర్వుడు అనే రాక్షస రాజుకు శుక్రాచార్యుడు గురువుగా ఉన్నాడు. శుక్రాచార్యుని కుమార్తె దేవయాని. శుక్రాచార్యునికి మృతసంజీవిని తెలుసు. ఆ విద్యతో దేవాసుర యుద్ధంలో మరణించిన రాక్షసులను బ్రతికిస్తూ వచ్చాడు. అందు వలన రాక్షసబలం అంతకంతకూ పెరుగుతూ వచ్చింది. దేవతలు దేవగురువు కుమారుడైన కచుని వద్దకు వెళ్ళి అతనితో శుక్రుని వద్దకు వెళ్ళి అతని కుమార్తె దేవయాని అభిమానం సంపాదించి ఆమె ద్వారా మృతసంజీవని విద్య తెలుసుకు రమ్మని లేనియడల రాక్షసులను జయించుట కష్టమని అడిగారు. శుక్రునికి దేవయాని మీద అత్యంత ప్రేమ కనుక ఇది సాధ్యం కాగలదని చెప్పారు. కచుడు సమ్మతించి శుక్రుని వద్దకు వెళ్ళి బృహస్పతి కుమారునిగా తనను తాను పరిచయం చేసుకుని శిష్యుడుగా చేరాడు. క్రమంగా కచుడు దేవయాని శుక్రుల అభిమానం చూరకొన్నాడు. అది మిగిలిన రాక్షస శిష్యులకు నచ్చక అతనిని అనేక యాతనలకు గురిచేసి చివరకు అతనిని చంపి బూడిద చేసి శుక్రునికి మద్యంలో కలిపి ఇచ్చారు. దేవయాని ద్వారా అది తెలుసుకున్న శుక్రుడు ఆమె దిగులు పోగొట్టటానికి తన కడుపులోని కచునకు మృతసంజీవిని నేర్పాడు. కచుడు ఆవిద్యతో బయటకు వచ్చి తిరిగి శుక్రుని బ్రతికించాడు. కొంత కాలానికి కచుడు శుక్రుని వద్ద శలవు తీసుకుని తన లోకానికి పోయే సమయంలోదేవయాని అడ్డు వచ్చి అతనిని పోవద్దని తనను వివాహ మాడమని బ్రతిమాలింది. కచుడు గురుపుత్రి సోదరితో సమానం కనుక వివాహం పొసగదని చెప్పాడు. అందుకు కోపించిన దేవయాని తన దయతో సంపాదించిన

మృతసంజీవని అతనికి పనిచేయకూడదని శపించింది. కచుడు అది తనకు ఉపయోగించక పోయినా తన వద్ద ఉపదేశం పొందిన వారికి పని చేస్తుందని చెప్పి, తనకు కలిగిన శాపానికి ప్రతి శాపంగా దేవయానిని క్షత్రియుడు పెళ్ళాడతాడని చెప్పి తన లోకానికి వెళ్ళాడు.

## శర్మిష్ఠ దేవయానీ

ఒక రోజు రాక్షసరాజ పుత్రి శర్మిష్ట గురు పుత్రి దేవయాని వేయి మంది చెలికత్తెలతో వన విహారానికి వెళ్ళారు. అక్కడ కొలను తీరంలో వారు దుస్తులు విడిచి స్నానం చేస్తున్న తరుణంలో గాలికి బట్టలన్నీ కలసి పోయాయి. బయటకు వచ్చిన దేవయాని దుస్తులు శర్మిష్ట వేసుకుంది. కానీ దేవయాని తాను బ్రాహ్మణ కన్యనని ఒకరు విడిచిన దుస్తులు వేయనని చెప్పింది. శర్మిష్ట కోపగించి నా తండ్రి దగ్గర సేవచేసే బ్రాహ్మణుని పుత్రికి నా దుస్తులు పనికి రాలేదా అని నిందించి ఆమెను ఒక పాడు బడ్డ బావిలో త్రోసి చెలికత్తెలతో వెళ్ళి పోయింది. ఆ సమయానికి అటుగా వచ్చిన యయాతి మహారాజు ఆమెను రక్షించి ఆమె వృత్తాంతం తెలుసుకుని తనరాజ్యానికి వెళ్ళాడు. ఆ తరవాత దేవయాని అక్కడకు వచ్చిన తన చెలికత్తెతో తాను తిరిగి వృషపర్వుని రాజ్యానికి రానని తన తండ్రికి చెప్పమని చెమ్మంది. శుకృడు దేవయానిని ఎంత అనునయించినా నిఫలం కావడంతో శుకృడు కూడా నగరాన్ని విడిచి వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు. విషయం తెలిసి అక్కడకు వచ్చిన వృషపర్వుడు శుకృని దయలేకుండా తాము జీవించలేమని వారు ఏది కావాలన్నా ఇస్తానని వేడుకున్నాడు. శుకృని తరఫున దేవయాని శర్మిష్ట వేయి మంది చెలికత్తెలతో తనని సేవిస్తే తామిరువురు నగరంలో ఉంటామని చెప్పింది. వృషపర్వుడు అందుకు అంగీకరించాడు.

## యయాతీ దేవయానుల వివాహం

దేవయాని తన చెలికత్తెలతో అదే వనవిహారానికి వెళ్ళి అక్కడ తిరిగి యయాతిని చూసింది. దేవయాని యాయాతి తో తామిరువురికి ఒకసారి పాణి గ్రహణం జరిగింది కనుక తనను అతడు వివాహం చేసుకోవాలని కోరింది. యయాతి బ్రాహ్మణుడు క్షత్రియ కన్యను వివాహమాడవచ్చు కాని క్షత్రియుడు బ్రాహ్మణ కన్యను వివాహమాడటం ధర్మం కాదని చెప్పాడు. పట్టువదలని దేవయాని తన తండ్రిని రప్పించి తండ్రిచే అందుకు అంగీకారాన్ని పొంది యయాతిని వివాహమాడింది. యయాతి తన భార్యతోనూ ఆమె చెలికత్తెలతో తన రాజ్యానికి చేరుకోవడానికి ఆయత్తమైన సమయంలో శుకృడు శర్మిష్ట వృషపర్వుని కూతురని ఆమెను దూరంగా ఉంచమని ప్రత్యేకంగా చెప్పాడు.

### యదువంశజులు

దేవయానీ యయాతికి యదువు, తుర్వసుడు అనే ఇద్దరు కుమారులు పుట్టారు. శర్మిష్ట తన జీవితం వృధా అయినందుకు బాధ పడి ఒంటరిగా ఉన్న యయాతి మహారాజుని కలసి దేవయాని చెలికత్తె కనుక తాను కూడా భార్యతో సమానమని చెప్పి అతనిని ఒప్పించి అతని వలన దృహ్యుడు, అనువు, పూరుడు అనే ముగ్గురు పుత్రులను పొందింది. మొదట దేవయానికి ఆ విషయం దాచి ఒక ముని వలన సంతానం కలిగిందని అబద్దం చెప్పింది. కానీ శర్మిష్ట పుత్రులను అడిగి విషయం గ్రహించిన దేవయాని జరిగినది తన తండ్రికి చెప్పగా అతడు యయాతికి శాపం ఇచ్చాడు. శాపవశాన వచ్చిన ముసలితనాన్ని శర్మిష్ట కుమారుడైన పూరునికి ఇచ్చి అతడి యవ్వానాన్ని తాను గ్రహించి వేయి సంవత్సరముల తరవాత పూరునికి యవ్వనాన్ని తిరిగి ఇచ్చి కృతజ్ఞతగా అతనిని చక్రవర్తిని చేసాడు. యయాతి కోరికకను నిరాకరించిన అతని కుమారులు నలుగురికి శాపం ఇచ్చాడు. శాపకారణంగా యదు వంశస్తులు రాజ్యార్హత శాశ్వతంగా పోగొట్టుకున్నారు, తుర్వసులు కిరాతకులకు రాజులయ్యారు, ద్రుహ్యులు అతని వంశస్తులు జలమయ ప్రదేశాలకు రాజలయ్యారు, అనువు వంశజులు యవ్వనంలోనే మరణం పాలయ్యారు. శర్మిష్ట కుమారునికి రాజ్యం ఇవ్వనచ్చని ప్రజలకు నచ్చ చెప్పి యయాతి తపోవనానికి వెళ్ళి వేయి సంవత్సరాలు తపస్సు చేసి బ్రహ్మ లోకానికి వెళ్ళాడు. అక్కడ కొన్ని కల్పములు ఉండి ఇంద్ర లోకానికి వెళ్ళాడు. ఇంద్రుడు యయాతిని పరీక్షించడానికి నీ తపస్సు చాలా గొప్పది కనుక స్వర్గ లోక భోగాలనుభవిస్తున్నావని అన్నాడు. అందుకు యయాతి కొంచం అతిశయించి దేవ, మానవ, మునిగణాలలో ఎవరూ తనకు మించిన తపస్సు చేయలేదని చెప్పగానే అతని పుణ్యం నశించింది. ఇంద్రుడు యయాతిని తిరిగి మానవ లోకానికి వెళ్ళమనగా యయాతి తాను తిరిగి మానవలోకానికి వెళ్ళలేనని నక్షత్ర లోకానికి వెళతానని ఇంద్రుని కోరాడు. ఇంద్రుని అనుమతితో నక్షత్రలోకం చేరిన యయాతి అక్కడ అతడు తన దహౌత్రులను చూసి వారికి తన వృత్తాంతం తెలిపాడు. వారు యయాతిని అడిగి అనేక ధర్మ సూత్రాలు పిండోత్పత్తి రహస్యాలు తెలుసుకున్నారు. యయాతి సాహచర్యంతో పుణ్యం కలిగి అతని మనుమలు అష్టకుడు మొదలైన వారు తిరిగి యయాతితో పుణ్యలోకాలకు వెళ్ళారు.

# ఆది పర్వము చతుర్థాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



# చతుర్థాశ్వాసం

పూరుడు జనరంజకంగా రాజ్యపాలన చేసాడు. పూరుని కుమారుడు జనమేజయుడు,అతని కుమారుడు ప్రాచిన్వంతుడు,అతని కుమారుడు సంయాతి అతని కుమారుడు అహంయాతి అతని కుమారుడు సార్వభౌముడు ఆతని కుమారుడు జయత్సేనుడు అతని కుమారుడు అవాచీనుడు అతని కుమారుడు అరిహుడు అతని కుమారుడు మహాభౌముడు అతని కుమారుడు యుతానీకుడు అతని కుమారుడు అక్రోధనుడు అతని కుమారుడు దేవాతిధి అతని కుమారుడు రుచీకుడు అతని కుమారుడు రుక్షుడు అతని కుమారుడు మతినారుడు. మతినారుడు సరస్వతీ తీరాన పన్నెండు సంవత్సరములు సత్రయాగం చేసాడు. సరస్వతీ నది అతనిని భర్తగా చేసుకుంది. వారికి త్రసుడు అనేకుమారుడు కలిగాడు. అతని కుమారుడు ఇలీనుడు అతని కుమారుడు దుష్యంతుడు.

### శకుంతలా దుష్యంతుల పరిచయం


దుష్యంతునికి లేఖ వ్రాస్తున్న శకుంతల

దుష్యంతుడు చిన్ననాటి నుండి అడవులలో తిరుగుతూ పులులను సింహాలనూ వేటాడి పట్టుకుంటూ ఆడుకొనేవాడు. దుష్యంతుని రాజ్యపాలనలో ప్రజలు ధర్మ మార్గం అవలంబిస్తూ ప్రశాంత జీవితం అవలంబిస్తూ జీవిస్తున్నారు. ఒక రోజు దుష్యంతుడు వేటకు వెళ్ళి వేటాడుతూ ఒక తపోవనానికి చేరుకున్నాడు. అది బద్ద శత్రువులైన సింహాలూ ఏనుగులూ లాంటి జంతువులనేకం కలసి సహజీవనం చేస్తున్న మహర్షి కణ్వాశ్రం. దుష్యంతుడు మిగిలిన వారిని వదిలి మహర్షి దర్శనార్ధం ఆశ్రమంలోకి ఒంటరిగా వెళ్ళాడు. అక్కడ అతడు సౌందర్యవతి అయిన కణ్వ మహర్షి పెంపుడు కూతురు శకుంతల ను చూసాడు. ఆమె అందానికి ముగ్ధుడైయ్యాడు. శకుంతలనూ దుష్యంతుని అందం ఆకర్షించింది. పరస్పర పరిచయా లయ్యాక ఆమె కణ్వమహర్షి కూతురని తెలుసుకున్నాడు. దుష్యంతుడు శకుంతలతో బ్రహ్మచారి అయిన కణ్వమహర్షికి కూతురెలా కలిగిందని సందేహం వెలిబుచ్చాడు.

## మేనకా విశ్వామిత్రుల వృత్తాంతం-శకుంతల జననం


శకుంతల జననం

రాజర్షి విశ్వామిత్రుడు ఒకానొకసారి ఘోర తపమాచరిస్తున్నాడు. అది తెలిసిన ఇంద్రుడు అతని తపస్సును భగ్నం చేయటానికి మేనకను నియోగించాడు. దేవేంద్రుని ఆనతి మీరలేని మేనక భయపడుతూనే విశ్వామిత్రిని తపస్సు భంగం చేయడానికి ప్రయత్నించింది. ఆమె ప్రయత్నం ఫలించి విశ్వామిత్రుడు ఆమె మీద మనసు పడ్డాడు. ఫలితంగా వారిరువురికి ఒక ఆడ శిశువు జనించగానే మేనక తన పని అయిందని భావించి ఇంద్రలోకానికి వెళ్ళింది. జరిగిన పొరబాటు గ్రహించిన విశ్వామిత్రుడు ఆ శిశువును వదలి తపోభూమికి వెళ్ళాడు. ఆ తరవాత శకుంత పక్షులచే రక్షింపబడుతున్న ఆడ శిశువును చూసిన కణ్వుడు ఆమెకు శకుంతల అను నామకరణం చేసి తన కన్నబిడ్డవలె చూసుకున్నాడు.

## శకుంతలా దుష్యంతుల వివాహం


శకుంతలా దుష్యంతుల వివాహం

శకుంతల క్షత్రియ కన్య అని తెలుసుకుని దుష్యంతుడు ఆమె మీద మనసుపడి గంధర్వ రీతిన వివాహం చేసుకున్నాడు. వివాహ సమయంలో శకుంతలకు పుట్టిన బిడ్డను చక్రవర్తిని చేస్తానని వాగ్దానం చేసాడు. రాజలాంఛనాలతో ఆమెను రాజధానికి తీసుకు వెళతానని మాటిచ్చి రాజధానికి వెళ్ళాడు. కణ్వమహర్షి ఆ విషయం దివ్యదృష్టి ద్వారా గ్రహించి వారి వివాహానికి అనుమతించి శకుంతల పుత్రుడు చక్రవర్తి కాగలడని దీవించాడు. ఆపై శకుంతలకు ఆమె పుత్రుడు మహా బలవంతుడై ఆయురారోగ్య ఐశ్వర్యవంతుడు కాగలడని వరం ప్రసాదించాడు. మహర్షి మాటలను నిజంచేస్తూ శకుంతలకు మహాబలవంతుడైన భరతుడు చక్రవర్తి లక్షణాలతో జన్మించాడు. కణ్వమహర్షి శకుంతలను అత్తవారింటికి పంపడం ఉచితమని భావించి శిష్యులను తోడిచ్చి ఆమెను కుమారునితో సహా దుష్యంతుని వద్దకు పంపాడు. దుష్యంతుడు శకుంతలను తెలియనట్లు నటిస్తూ ఆమెను నిరాకరించాడు. శకుంతల దుఃఖిస్తూ పలువిధాల ప్రార్ధించినా దుష్యంతుడు ఆమెను స్వీకరించడానికి అంగీకరించలేదు. చివరిగా ఆకాశవాణి శకుంతల మాటలు సత్యమని చెప్పడంతో దుష్యంతుడు లోకనిందకు వెరచి భార్యా బిడ్డలను నిరాకరించానని ఒప్పుకుని వారిరువురిని స్వీకరించి భరతునికి

యువరాజ్య పట్టాభిషేకం చేసాడు.

## భరతవంశం


అడవిలో సింహములతో ఆడుకొనుచున్న భరతుడు - రాజా రవి వర్మ గీచిన చిత్రం

భరతునికి పట్టాభిషేకం చేసి దుష్యంతుడు భార్యతో వానప్రస్థానికి వెళ్ళాడు. రాజ్యాన్ని జనరంజకంగా పాలించిన భరతుడు వంశకర్త అయ్యాడు. భరతునకు భుమన్యుడు జన్మించాడు. భుమన్యుని కుమారుడు సహోత్రుడు అతని కుమారుడు హస్థి. అతని పేరు మీద హస్థినాపురం వెలసింది. హస్తి కుమారుడు వికుంఠనుడు. అతని కుమారుడు అజఘీడుడు. అజఘీడునకు నూట ఇరవై నాలుగు మంది కుమారులు. వారిలో సంవరణుడు అనే వాడు సూర్యుని కుమార్తె తపతిని వివాహం చేసుకున్నాడు. వారికి కురు జన్మించాడు. కురు మరొక వంశకర్త అయ్యాడు. అతని పేరు మీద కురువంశం ఆరంభం అయింది. కురువంశస్థులు యుద్ధం చేసిన భూమి కురుక్షేత్రం అయింది. కురు కుమారుడు విధూరుడు. అతని కుమారుడు అనశ్వుడు. అతని కుమారుడు పరీక్షిత్తు . అతని కుమారుడు భీమశేనుడు. అతని కుమారుడు ప్రదీపుడు. అతని కుమారుడు ప్రతీపుడు. అతని కుమారుడు శంతనుడు. శంతనునికి గంగాదేవికి దేవవ్రతుడు పుట్టాడు. అతడు తండ్రి కోసం భీషణ ప్రతిజ్ఞ చేసి భీష్ముడుగా పిలువబడ్డాడు. శంతనుడు తనను గంగాదేవి విడిచివెళ్ళిన చాలా కాలంతరవాత మత్స్యగంధి అనే కారణ నామధేయం ఉండి యోజన గంధిగా మారిన దాశరాజు పెంపుడు కూతురైన సత్యవతిని వివాహం చేసుకున్నాడు. వారికి చిత్రాంగధుడు విచిత్ర వీర్యుడు అనే ఇద్దరు కుమారులు పుట్టారు. జనమేయజయుడు శంతన మహారాజు గంగాదేవి వారి కుమారుడైన భీష్ముల గురించి వివరంగా చెప్పమని వైశంపాయుని అడిగాడు.

## భీష్ముని జన్మవృత్తాంతం

పూర్వం ఇక్ష్వాకు వంశస్థుడైన మహాభీషుడు వెయ్యి ఆశ్వమేధ యాగాలూ నూరు రాజసూయ యాగాలూ చేసి బ్రహ్మలోక ప్రాప్తి పొందాడు. ఒక రోజు గంగాదేవి బ్రహ్మ సభకు వచ్చినప్పుడు గాలి బలంగా వీచడంతో ఆమెచీర తొలగింది. దేవతలంతా అది చూడకుండా తలలు పక్కకు తిప్పగా మహాభీషుడు ఆమెవంక ఆసక్తిగా చూసాడు. అది చూసిన బ్రహ్మదేవుడు మహాభీషుని మానవలోకంలో జన్మించమని శపించాడు. మహాభీషుడు తన తప్పు గ్రహించి పుణ్యాత్ముడైన ప్రతీపునకు కుమారునిగా జన్మించేలా చేయమని బ్రహ్మదేవిని ప్రార్ధించాడు. బ్రహ్మ దేవుడు అందుకు అంగీకరించాడు. తనవంక ఆసక్తిగా చూసిన మహాభీషునిపై


గంగా నది ఒడ్డున ఒక అందమైన స్త్రీని చూచిన హస్తినాపుర మహారాజు శంతనుడు

మనసుపడిన గంగాదేవి అతనిని తలచుకుంటూ భూలోకానికి వస్తూ విచార వదనంతో ఉన్న అష్ట వశువులను చూసింది. వారి విచారానికి కారణం ఏమిటని గంగాదేవి వారిని అడిగింది. దానికి సమాధానంగా వారు " వశిష్ట మహర్షి శాపవశాన తాము భూలోకంలో జన్మించడానికి వెళుతున్నామని ఒక పుణ్యవతి గర్భంలో జన్మించడానికి వెతుకుతున్నాము. ప్రతీపునకు కుమారుడుగా జన్మించిన శంతనుని వివాహమాడి నువ్వు మాకు జన్మను ప్రసాదించు " అని వేడుకున్నారు. వశువులు పుట్టిన వెంటనే తమను గంగలో పడవేసి ముక్తిని ప్రసాదించమని వారిలో ఎనిమిదవ వాడిని మాత్రం దీర్గాయువౌతాడని అది వశిష్ట శాపమని కోరుకున్నారు. గంగాదేవి వారి కోరికను మన్నించింది. గంగాదేవి ఒక రోజు తపస్సు చేసుకుంటున్న ప్రతీపుని చూసి అతని కుడితొడపై కూర్చుని అతనిని వివాహమాడమని కోరింది. పుత్రులు మాత్రం తండ్రి కుడి తొడపై కూర్చుంటారని కనుక పుత్రికా సమానమని కనుక వివాహమాడనని కుమారుడైన శంతనుని వివాహమాడమని ప్రతీపుడు చెప్పాడు. బ్రహ్మ వాక్కు ప్రకారం ప్రతీపునకు సునందకు జన్మించిన శంతనునికి


పిల్లవాడిని గురించి గంగను అడుగుతున్న శంతనుడు

పట్టాభిషేకం చేసి తపోవనానికి పోతూ ప్రతీపుడు గంగాదేవి గురించి శంతనునికి చెప్పి ఆమెను వివాహం చేసుకొమ్మని చెప్పాడు. శంతనుడు గంగాతీరంలో కనిపించిన గంగాదేవిని ఆమె నిబంధనలకు అంగీకరిస్తూ వివాహం చేసుకున్నాడు. ముందుగా పుట్టిన ఏడుగురు వశువులను వారికి ఇచ్చిన మాట ప్రకారం గంగలో వదిలి ఎనిమిదవ సంతానాన్ని గంగలో వదులుతున్న తరుణంలో శంతనుడు వారించగా నిభంధలను అతిక్రమించిన శంతనుని గంగాదేవి వదిలి తన కుమారునితో వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోతూ ఎనిమిదవ వాడు దీర్గాయుష్మంతుడని అతనికి విద్యాబుద్దులు నేర్పించి అప్పగిస్తానని శంతనునితో చెప్పింది. చెప్పినట్లే గంగాదేవి తన పుత్రుడికి దేవవ్రతుడని నామకరణం చేసి సర్వవిద్యాపారంగతుడూ మహావీరుని చేసి యుక్త వయసులో శంతనునికి అప్పగించింది.

## అష్టవశువుల వృత్తాంతం


కామదేనువు అపహరించమంటున్న ప్రభాసుని భార్య

గంగాదేవి శంతనుని విడిచి వెళ్ళే సమయంలో తమకు పుట్టిన కుమారులు అష్టవసువులని తెలుసుకుని గంగాదేవిని దేవతలైన వసువులు మానవులుగా ఎందుకు పుట్టారని సందేహం వెలిబుచ్చారు.సమాధానంగా గంగాదేవి "మహారాజా వరుణుడి కుమారుడు వశిష్టుడు.అతడు మేరుపర్వత గుహలో ఆశ్రమం ఏర్పరచుకుని తపమాచరిస్తున్నాడు.నందిని అనే కామదేనువు వశిష్టుడికి కావలసిన సమస్త వస్తువులూ సమకూరుస్తూ అతనిని సేవిస్తూ ఉంది.ముని వద్దకు వచ్చిన అష్ట వసువులలో ఎనిమిదవ వాడైన ప్రభాసుని భార్య ఆ ధేనువు తనకు తీసి ఇస్తే దానిని తన


దేవవ్రతుని శంతనునికి అప్పగిస్తున్న గంగా దేవి

స్నేహితురాలైన జీతవతికి బహూకరిస్తానని భర్తను కోరింది.మిగిలిన వసువులు కూడా ఆమె కోరికకు వంతపాడి ఆధేనువును వశిష్టుడి నుండి పట్టుకుని వెళ్ళడానికి తోడ్పడ్డారు.యోగదృష్టితో ఇది గ్రహించిన వశిష్టుడు వసువులకు మానవలోకంలో జన్మించమని శాపం ఇచ్చారు.వసువులు తప్పు గ్రహించి వశిష్టుని కాళ్ళ మీద పడి భూలోకంలో పుట్టిన వెంటనే ముక్తిని ప్రసాదించమని వేడుకున్నారు. వశిష్టుడు అలాగే జరుగుతుంది కానీ ఎనిమిదవ వసువైన ప్రభాసుడు దీనికంతటికీ మూలం కనుక దీర్ఘకాలం సంతాన హీనుడై జీవిస్తాడని మాటిచ్చాడు." అని శంతన మహారాజుకు చెప్పి ఎనిమిదవ కుమారునిగా పుట్టిన ప్రభాసునికి దేవవ్రతుడని నామకరణం చేసింది. ఆ పుత్రునికి విద్యాబుద్ధులు చెప్పి అప్పగిస్తానని చెప్పి శంతనుని విడిచి వెళ్ళింది.

## భీష్మ ప్రతిజ్ఞ

గంగాదేవి శంతనునికి ఇచ్చిన మాట ప్రకారం ఒకరోజు మహారాజు గంగాతీరంలో విహరిస్తున్న సమయంలో అతడి కుమారుడైన దేవవ్రతుడిని అతడికి అప్పగించింది. శంతనుడు దేవవ్రతుడిని యువరాజుని చేసాడు. ఒకరోజు శంతనుడు యమునానదీ తీరంలో యోజన గ్రంధిని చూసి ఆమెపై మనసుపడ్డాడు . ఆమెను వివాహమాడ నిశ్చయించి యోజన గ్రంధితో ఆమె తండ్రి అయిన దాశరాజు ఇంటికి వెళ్ళి ఆమెను తనకు ఇచ్చి వివాహం చెయ్యమని కోరాడు.అందుకు దాశరాజు సంతోషించినా సత్యవతిని శంతనునికి ఇవ్వడానికి ఒక నిభంధన పెట్టాడు. తన కూతురైన సత్యవతి కుమారులను


యమునానదీ తీరంలో యోజన గ్రంధిని చూసి ఆమెపై మనసుపడ్డ శంతనుడు

చక్రవర్తిని చేయాలన్నది ఆ నిబంధన. శంతనుడు గాంగేయుడైన దేవవ్రతుని విడిచి వేరొకరిని రాజ్యాభి షిక్తుని చేయడానికి మనస్కరించక విచారిస్తూ రాజ్యానికి తిరిగి వెళ్ళాడు. దేవవ్రతుడు తనతండ్రి విచారం గ్రహించి మంత్రుల ద్వారా సత్యవతి విషయం తెలుసుకుని


రవివర్మ చిత్రించిన భీష్మప్రజ్ఞ చిత్రం

ఆమెతో తండ్రికి వివాహం జరపాలని నిశ్చయించుకున్నాడు. అతడు దాశరాజు వద్దకు వెళ్ళి తన తండ్రి శంతనునికి సత్యవతిని ఇమ్మని అడిగాడు. దాశరాజు దేవవ్రతునితో " ఆమె ఉపరిచర మనువు కుమార్తె అని ఆమెను శంతనునికి ఇవ్వాలన్నది ఉపరిచర మనువు అభిమతమని చెప్పాడు. అందువలన ఆమెను దేవలుడు అడిగినా ఇవ్వలేదని చెప్పాడు. ఆ తరువాత ఆమెకు కలిగిన సంతానం చక్రవర్తి కావడానికి సమ్మతిస్తేనే వివాహమని చెప్పాడు. గాంగేయుడు వెంటనే అక్కడ ఉన్నవారిని చూసి సత్యవతి సంతానమే రాజ్యానికి వారసులని చెప్పాడు. కానీ దాశరాజు గాంగేయునికి పుట్టబోయే కుమారులు రాజ్యాన్ని అడిగితే ఎలా అని సందేహం వెలిబుచ్చాడు. అందుకు గాంగేయుడు పంచభూతముల సాక్షిగా ఆ జన్మ బ్రహ్మచారిగా ఉంటానని భీషణ ప్రతిజ్ఞ చేసాడు. అలా గాంగేయునికి భీష్ముడనే కారణ నామధేయం కలిగింది. ఆ తరవాత దాశరాజు శంతనునితో సత్యవతి వివాహం జరిపాడు. తన కోసం ఇంతటి త్యాగం చేసినందుకు ఆనంద పడిన శంతనుడు భీస్ముడికి ఇచ్చామరణం అనేవరాన్ని ఇచ్చాడు.

## చిత్రాంగద విచిత్రవీర్యులు

ఆ తరవాత శంతనునికి చిత్రాంగదుడు విచిత్రవీర్యుడు అనే ఇద్దరు కుమారులు కలిగారు. వారి చిన్న వయసులోనే శంతనుడు మరణించాడు. భీష్ముడు తమ్ములను పెంచి పెద్ద చేసాడు. చిత్రాంగదుని చక్రవర్తిని చేసాడు. అహంకారి అయిన చిత్రాంగదుడు ఒకసారి ఒక గంధర్వునితో యుద్ధానికి తలపడి మరణించాడు. తరవాత భీష్ముడు విచిత్రవీర్యుని చక్రవర్తిని చేసాడు. కాశీరాజు తన కుమార్తెలు అయిన అంబ, అంబిక, అంబాలికలకు స్వయంవరం ప్రకటించిన తరుణంలో భీష్ముడు అక్కడకు వెళ్ళి సాళ్వుడితో సహా అక్కడకు వచ్చిన రాజులను జయించి వారిని తీసుకు వెళ్ళి విచిత్ర వీర్యునికి ఇచ్చి వివాహం చేయడానికి ఏర్పాటు చేస్తున్న సమయంలో అంబ తను సాళ్వుని ప్రేమించినట్లు భీష్మునితో చెప్పింది.వేరొకరిని ప్రేమించిన కన్యతో వివాహం తగదని భావించి భీష్ముడు ఆమెకు బ్రాహ్మణులను తోడిచ్చి సాళ్వుని చెంతకు పంపి అంబిక, అంబాలికలను మాత్రం విచిత్ర వీర్యునకిచ్చి వివాహంచేసాడు. విచిత్ర వీర్యుడు భోగ లాలసుడై చివరకు మరణించాడు. ఇలా రాజ్యం రాజులేనిది అయింది.

## దేవర న్యాయం

ఒక రోజు సత్యవతి భీష్ముని పిలిపించి రాజ్యానికి రాజు లేకపోవడం హానికరం కనుక పట్టాభిషిక్తుడై వివాహం చేసుకుని వంశోద్దరణ చేయమని కోరింది. భీష్ముడు తాను ఆడిన మాట తప్పనని చెప్పి వంశోద్దరణ కోసం దేవరన్యాయం పాటించమని తల్లికి నచ్చ చెప్పాడు. ఉదాహరణగా పూర్వం పరశురాముని దండయాత్రలో రాజులందరూ మరణించగా వారి పత్నులు ఉత్తమ బ్రాహ్మణులందు సంతానం పొంది వంశాలను నిలిపారని చెప్పాడు. అలాగే బృహస్పతి ఒక రోజు తన తమ్ముడైన ఉతథ్యుని భార్య మమతపై మనసు పడగా అప్పుడు ఆమె గర్భస్థ శిశువు దానికి అభ్యంతరం చెప్పగా అతనిని పుట్టు గుడ్డివి కమ్మని బృహస్పతి శపించాడు. అతడే దీర్ఘతముడు. అతడు గుడ్డి వాడైనా వేదవేదాంగాలనూ అభ్యసించాడు. అతని భార్య ప్రద్వేషిణి. అతనికి చాలా మంది పుత్రులు కలిగినా భార్య అతనిని ద్వేషిస్తూ ఉంది. చివరికి ఆమె అతనిని ఇక భరించలేనని

తనను విడిచి వెళ్ళమని చెప్పింది. దీర్గతముడు ఆమెపై కోపించి " స్త్రీలు ఎంతటి వారైనా భర్త లేని ఎడల అలంకార హీనులులై బ్రతుకుదురుకాక " అని శపించాడు. అందుకు కోపించిన ప్రద్వేషిణి తన కొడుకులతో చెప్పి వారితో దీర్గతముని తాళ్ళతో బంధించి నదిలోకి త్రోసి వేయించింది. అతడు వేదాలు వల్లెవేస్తూ నదిలో కొట్టుకు పోతున్నాడు .అది చూసిన బలి అనే రాజు అతనిని విడిపించి తనతో తీసుకు వెళ్ళాడు. బలి దీర్గతమునితో సంతాన హీనుడినైన తనకు ఉత్తమ బ్రాహ్మణుడివయిన నీవు సంతానం ప్రసాదించాలని వేడుకున్నాడు. దీర్గతముడు అందుకు అంగీకరించాడు. అతనిద్వారా సంతానము కని ఇవ్వమని భార్య అయిన సుదేష్ణను కోరాడు. సుదేష్ణ దీర్గతముని చూసి అసహ్యపడి అతని వద్దకు తన దాసీని పంపింది. దాసీకి అతని వలన పదకొండు మంది కుమారులు కలిగారు. దీర్గతముని వలన వారు దాసీ పుత్రులని తెలుసుకుని సుదేష్ణను తిరిగి అతని తగ్గరకు పంపాడు విధిలేక సుదేష్ణ అతని వలన ఒక కుమారుని కన్నది . అతడే అంగరాజు. కనుక విధిలేని పరిస్థితిలో క్షత్రియులు ఉత్తమ బ్రాహ్మణుల వలన సంతానం పొందడం ధర్మ విరుద్ధం కాని అనాదిగా వస్తున్న ఆచారమని కనుక ఉత్తమమైన బ్రాహ్మణుని తీసుకు వచ్చి వంశోద్ధరణ మార్గం చూడమని భీష్ముడు సత్యవతితో చెప్పాడు.

## దృతరాష్ట్రుడు పాండురాజు విదురుల జననం

భీష్ముని సలహా విన్న తరవాత సత్యవతికి తనకు పరాశరుని వలన కలిగిన వ్యాసుడు గుర్తుకు వచ్చాడు. ఆవిషయం భీష్ముకు చెప్పింది. వ్యాసుడు సమస్త ధర్మాలూ తెలిసిన వాడు. మహాతపశ్శాలి వేదవేదాంగ పారంగతుడు అతడు నీ తమ్ముని భార్యలకు సంతానం ప్రసాదించగలడు అని చెప్పింది. ఆమె వెంటనే మనసారా వ్యాసుని ప్రార్థించింది. వ్యాసుడు ప్రత్యక్షమై తల్లికి నమస్కరించాడు. సత్యవతి వ్యాసునకు పరిస్థితి వివరించి దేవర న్యాయం అనుసరించి తనకు మనుమలను ఇచ్చి వంశోద్ధరణ చేయమని కోరింది. వ్యాసుడు తల్లి ఆజ్ఞను శిరసా వహిస్తానని మాటిచ్చాడు. ముందుగా పెద్దకోడలైన అంబికను వ్యాసుని వద్దకు పంపగా ఆమె సన్నని నల్లని జటలతో భయంకరంగా ఉన్న వ్యాసుని చూసి కన్నులను మూసుకున్నందువలన ఆమెకు మహాబలవంతుడైన కుమారుడు గుడ్డిగా పుట్టాడు. అతడే ధృతరాష్ట్రుడు .రెండవ రోజు రెండవ కోడలయిన అంబాలికను పంపగా ఆమె వ్యాసుని తేజస్సుకు భయపడి పాలిపోయినందున ఆమెకు పాండు వర్ణంతో కుమారుడు కలిగాడు. అంబికకు గుడ్డి వాడు కలిగినందుకు దు:ఖించిన సత్యవతి తిరిగి అంబికను వ్యాసుని వద్దకు పంపింది. అంబిక అత్తగారి మాట కాదనలేక సమ్మతించినా అందుకు ఆమె మనసు సమ్మతించక తన దాసీని అలంకరించి వ్యాసుని వద్దకు పంపింది. ఆ దాసీకి మాండవ్య మహాముని శాపం అందుకున్న యమధర్మరాజు కుమారునిగా జన్మించాడు. అతడే విదురుడు.అది విన్న జనమేజయుడు మాండవ్య ముని యమధర్మ రాజుకు శాపం ఎందుకు ఇచ్చాడని వైశంపాయనుని అడిగాడు.

## మాండవ్యముని వృత్తాంతం

మాండవ్యముని ఊరి వెలుపల ఆశ్రమం నిర్మించుకుని ప్రశాంతంగా తపస్సు చేసుకుంటున్నాడు. ఒక రోజు కొందరు దొంగలు రాజధనాన్ని అపహరించి రాజభటులు వెంట తరమగా మాండవ్య ముని ఆశ్రమంలో దాక్కున్నారు.రాజభటులు వచ్చి ఇటుగా ఎవరైనా దొంగలు వచ్చారా అని ప్రశ్నించగా మౌనవ్రతంలో ఉన్న ముని జవాబు చెప్పలేదు. రాజభటులు ఆశ్రమంలో ప్రవేశించి దొంగలను పట్టుకుని మాండవ్యునికి వారితో సంబంధం ఉన్నదని అనుమానించారు. వారు మునిని బంధించి రాజుగారి ముందు నిలపెట్టారు. రాజుగారు దొంగలకు మరణశిక్ష విధించి వారితో సంబధం ఉందని అనుమానించి మాండవ్యమునికి ఇనుప శూలం మీద కూర్చోపెట్టమని మాండవ్యునికి శిక్ష వేసాడు. అందుకు భయపడని మాండవ్యుడు తన తపసుని కొనసాగించారు. ఒక రోజు రాత్రి కొంతమంది మహఋుషులు పక్షి రూపాలతో అక్కడకు వచ్చి మాడవ్యుని చూసి " మహానుభాడవైన నీకు ఈ శిక్ష ఏమిటి ఇలా ఎవరు చేసారు " అని ప్రశ్నించారు.అందుకు ముని అది తన పూర్వజన్మ పాపమని అందుకు ఎవ్వరిని నిందించ వలదని చెప్పాడు. ఈ విషయం భటులు విని రాజుగారికి చెప్పారు. రాజుగారు వెంటనే అతనిని క్రిందకు దింపించి అతని శరీరంలోని శూలం తీయమని చెప్పాడు.శూలం అతని శరీరంలోనుండి బయటకు రానందున దానిని నరికించగా శరీరంలో కొంతభాగం మాత్రం మిగిలి పోయింది. ఆ తరవాత అతడు ఆణి మాండవ్యుడునే పేరుతో ప్రసిద్ధి చెందాడు. ఆ తరవాత యమపురికి వెళ్ళిన మాండవ్యుడు యమధర్మరాజుని మహారాజు ఈ శిక్ష వేయటానికి కారణం ఏమిటని అడిగాడు. యమధర్మరాజు మాండవ్యునితో " మహా మునీ చిన్నతనంలో నీవు తూనీగలను పట్టుకుని ఆనందించే వాడివి. అందు వలన ఈ శిక్ష అనుభవించావు. " అన్నాడు. అది విన్న మాండవ్యుడు కోపంతో " పదునాలుగేళ్ళ వరకూ పిల్లలు ఏమి చేసినా తెలియక చేస్తారు. అందు వలన ఇక మీదట పదునాలుగేళ్ళ బాలురు చేసే తప్పుకు ఫలితం వారిది కాదు. వారికి ఎవరైనా అపరాధం చేస్తే అది మాత్రం వారిది అవుతుంది. కానీ యమధర్మరాజా నేను బాల్యమందు తెలియక చేసిన ఇంత చిన్న తప్పుకు ఇంత పెద్ద శిక్ష విధించావు కనుక నీవు శూద్ర గర్భమందు జన్మించెదవు కాక " అన్నాడు. ఆ కారణంగా వ్యాసుని వలన యమధర్మరాజు దాసీ గర్భంలో విదురుడుగా పుట్టాడు అన్నాడు వైశంపాయనుడు.

# ఆది పర్వము పంచమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



## పంచమాశ్వాసం

ధృతరాష్ట్రుడు, పాండురాజు,విదురుడు భీష్ముని సంరక్షణలో పెరుగుతున్నారు. భీష్ముడు వారికి ఉపనయనం చేయించాడు. ముగ్గురూ అన్ని విద్యలలో ఆరితేరిన తరవాత ధృతరాష్ట్రునికి యువరాజ పట్టాభిషేకం చేయించాడు. విదురుని బుద్ధి బలంతో తన పరాక్రమంతో కౌరవ రాజ్యాన్ని సుభిక్షంగా పాలిస్తూ వచ్చాడు. భీష్ముడు ధృతరాష్ట్రునికి వివాహం చేయాలని నిశ్చయించుకున్నాడు. గాంధారదేశ రాజకుమారి గాంధారి ధృతరాష్ట్రునికి తగిన కన్యగా నిర్ణయించాడు . గాంధారికి నూరుగురు పుత్రులు కలుగుతారని వరం ఉంది కనుక వంశం చక్కగా అభివృద్ధి చెందుతుందని విదురుని అభిప్రాయం. పురోహితులను గాంధార దేశానికి పంపి గాంధారిని ధృతరాష్ట్రునికి ఇమ్మని కోరాడు. గాంధార రాజు బంధువులు ఈ వివాహానికి అంగీకారం తెలుపక పోయినా సుబలుడు గాంధారి మాత్రం ఈ వివాహానికి అంగీకరించారు. గాంధారి తండ్రి మాటిచ్చాడు కనుక ధృతరాష్ట్రుని భర్తగా ఎంచి అతనికి కళ్ళు లేవు కనుక తాను కూడా కళ్ళకు గంతలు కట్టుకుంది. గాంధారరాజు సుబలుడు గాంధారిని ఆమె సోదరుడైన శకునిని హస్థినా పురానికి పంపాడు. భీష్ముడు గాంధారితో ధృతరాష్ట్రుని వివాహం జరిపాడు. అదే సమయంలో భీష్ముడు గాంధారి పది మంది చెల్లెళ్ళతోనూ మరొక నూరు మంది కన్యలతోనూ ధృతరాష్ట్రునికి వివాహం జరిపించాడు. నూట పదకొండు మంది భార్యలతో ధృతరాష్ట్రుడు సంతోషంగా కాలం గడుపుతున్నాడు. ధృతరాష్ట్రుని తమ్ముడైన పాండురాజు కూడా సకల విద్యలలో ఆరి తేరాడు. వేదాలూ, శాస్త్రాలూ, యుద్ధ విద్యలో నైపుణ్యం సంపాదించాడు. భీష్ముడు పాండురాజుకు వివాహంచేయ నిశ్చయించుకున్నాడు.

## కుంతీ దేవి


పాండురాజుతో కుంతీదేవి

యాదవ రాజైన శూరుడు తన కుమార్తె పృధను తన మేనత్త కుమారుడైన కుంతి భోజునకు సంతానం లేని కారణంగా పెంచు కునేందుకు ఇచ్చాడు. ఒక రోజు కుంతి భోజుని ఇంటికి దుర్వాసుడు వచ్చి కొంత కాలం అతని ఇంట ఉండి పూజలు చేసుకుంటానని అన్నాడు. కోపిష్టి అయిన దుర్వాసునికి ఓర్పుగా సేవలు చేయడానికి కుంతి భోజుడు కుంతిని నియమించాడు. ఆమె అతి శ్రద్ధగా అతనిని సేవించింది. దుర్వాసుడు వెళుతూ కుంతి సేవలకు మెచ్చి ఆమెకు ఒక మంత్రాన్ని ఉపదేశించి ఆ మంత్ర బలంతో కోరిన దేవతలు వచ్చి కుమారులను ఇవ్వగలరని చెప్పాడు. ఒక రోజు కుంతి గంగా స్నానం చేసి సూర్యునికి అర్ఘ్యం వదులుతున్న సమయంలో దుర్వాసుని మంత్రం గుర్తుకు రాగా ఆ మంత్రాన్ని పరీక్షించాలని అనిపించింది. వెంటనే ఆమె మంత్రం పఠించి సూర్యుని పిలిచి దేవా నీవంటి కుమారుని ప్రసాదించు అని వేడుకుంది. కుంతికి ప్రత్యక్షమైన సూర్యుడు ఆమె తాను కన్యనని వారించినా వినక తన దర్శనం మంత్ర మహిమ ఊరికే పోదని చెప్పి ఆమె కన్యాత్వం చెడదని హామీ ఇస్తూ సహజ కవచకుండలాలతో కుమారుని ప్రసాదించాడు. ఏమి చేయాలో తోచని సమయంలో అమూల్యమైన రత్నాలతో పొదగబడిన బంగారు పేటిక ఒకటి నదిపై తేలుతూ వచ్చింది. లోకోపవాదుకు భయపడిన కుంతి అమితమైన వేదనతో ఆకుమారుని ఆ పేటికకలో పెట్టి గంగా నదిలో ఒదలి వేసింది. సహజ కవచకుండలాలతో పుట్టాడు కనుక అతనికి కర్ణుడు అనే నామధేయం కలిగింది. నదిలో తేలుతూ పోతున్న ఆపేటిక ఒక సూతుని చేతిలో చిక్కింది అతనికి సంతానం లేని కారణంగా అతడు ఆబాలుని భార్య రాధకు ఇచ్చి పెంచమన్నాడు. బంగారము మణులతో దొరికినందు వలన అతనికి వశుషేణుడు అని పేరు పెట్టి పెంచు కుంటున్నారు.

## కుంతీ మాద్రి పాండురాజుల వివాహం


జింక రూపములోని ముని కిందమునిపై బాణం వేస్తున్న పాండు మహారాజు

కుంతిభోజుడు తన కుమార్తె కుంతికి స్వయం వరం ప్రకటించాడు. స్వయంవరంలో పృధ పాండురాజుని వరించింది. వారిద్దరికి వివాహం అయింది. ఆతరవాత పాండురాజు భీష్ముని అనుమతితో మద్రరాజు కుమార్తెను వివాహం చేసుకున్నాడు. వివాహం తరవాత పాండురాజు ద్విగిజయ యాత్ర చేసి నాలుగు దిశలలో ఉన్న రాజులను కురు సామ్రాజ్యానికి సామంతులను చేసాడు. పాండురాజు నూరు అశ్వమేధ యాగాలు చేసాడు. ఒక రోజు పాండురాజు వేట నిమిత్తం అడవికి వెళ్ళాడు. ఆయనతో కుంతి మాద్రికూడా వెళ్ళారు.ఒకరోజు ఎంత వెతికినా ఒక్క జంతువు కనపడక విసిగి చివరకు ప్రణయకలాపంలో ఉన్న జింకలపై బాణం వేసాడు. అందులో ఆడుజింక చనిపోగా మగజింక పాండురాజుని చూసి " రాజా వేటాడుట రాజుల ధర్మం అయినా పరుగెత్త లేనివి, రోగంతో బాధపడేవి, ప్రణయకలాపంలో ఉన్నవి అయిన జంతువులను వేటగాడు కూడా కొట్టడు. అన్ని ధర్మాలు తెలిసిన రాజువు ఇలా కొట్టావు కనుక నీవు భార్యలను చేరిన మరుక్షణం మరణిస్తావు " అని శపించి మరణించింది. ఆ శాపం విన్న పాండురాజు దు:ఖించి తనదగ్గర ఉన్నవి అన్నీ దానం చేసి భార్యలను చూసి మీరు కూడా హస్తినాపురం వెళ్ళండి అన్నాడు. వారు వెళ్ళటానికి నిరాకరించి భర్తతోనే ఉండి పోయారు. పాండు రాజు ఉత్తర దిక్కుగా ప్రయాణం చేసి ఆశ్రమం నిర్మించుకుని ముని వృత్తిని అవలంబించి తపసు చేసుకోవడం మొదలు పెట్టాడు. ఒక రోజు మునులందరూ బ్రహ్మలోకానికి ప్రయాణం కావడం చూసి పాండురాజు కూడా వారితో బయలుదేరాడు. ఋషులు వారిని చూసి ఇవి దేవ మార్గాలు వీటి వెంట మీరు రాలేరు అన్నారు. పుత్రులు లేరు కనుక తను వెళ్ళడానికి తగనివాడని పాండురాజు గ్రహించి మునులతో ఆ విషయం అన్నాడు. వారు దివ్యదృష్టితో చూసి " పాండురాజా నీకు సంతాన యోగం ఉన్నది సంతానం కోసం ప్రయత్నించు " అని చెప్పారు.

## పాండురాజు కోరిక

పాండురాజు తనలో పురుషునికి ఈ లోకంలో దేవఋణం, ఋషి ఋణం, పిత్రుఋణం, మనుష్య ఋణం ఉంటాయి. ఆ ఋణాలు తీర్చకపోతే పుణ్యలోకాలు ఉండవు యజ్ఞముల వలన దేవఋణం, వేదాధ్యయనం వలన ఋషి ఋణం,దయాగుణంతో మనుష్య ఋణం తీర్చుకున్నాను. కుమారులు లేనందున పిత్రు ఋణం తీరదు. శాపం వలన పుత్రుల యోగం లేదు కదా అని చింతించాడు.కుంతీ దేవిని పిలిచి సంతానం లేకుండా జీవించడం కంటే మరణించడం మేలు.కుంతీ నాకు ధర్మ మార్గంలో కుమారులను కని ఇవ్వవా అని అడిగాడు." కుంతీ పుత్రులు ఆరు రకాలు ఔరసుడు, సహోఢుడు, క్రీతుడు, పౌనర్భవుడు, స్వయందత్తుడు, జ్ఞాతుడు. వారిలో ఔరసుడు క్షేత్రజ్ఞుడు ముఖ్యులు. ఔరసుడు పుట్టే యోగ్యత మనకు లేదు కనుక క్షేత్రజ్ఞుడు మేలు . దేవరన్యాయంతో పుట్టిన పుత్రుడు ఉత్తముడు. పూర్వం కేకయ రాజుకు సంతానం లేని కారణంగా ఆయన భార్యను ఆకార్యానికి నియోగించగా ఆమె పుంసవన హోమం చేయించి ఋత్విజ్ఞుల ద్వారా ముగ్గురు కుమారులను పొందింది. కాబట్టి క్షేత్రజ్ఞులను కని ఇవ్వు" అని వేడుకున్నాడు. బదులుగా కుంతీ దేవి " రాజా మీ ధర్మపత్నులమైన మేము వేరెవరిని తలపలేము. పూర్వం పూరు వంశంలోని వ్యుతితాష్వుడు అనే రాజు నూరు అశ్వమేధ యాగాలు చాసాడు. ఆయన విపరీతమైన భోగలాలసతో క్షయరోగం వచ్చి మరణించగా అతని భార్య అతనిని స్మరించి సంతాన వతి అయింది. కనుక పాండురాజా నువ్వు కూడా అలా సంతానాన్ని పొందవచ్చు" అన్నది. పాండు రాజు కుంతి చెప్పిన మార్గం ఆచరణ సాధ్యం కాదని అనుకున్నాడు. పాండు రాజు కుంతితో పూర్వం స్త్రీలు సర్వస్వతంత్రులు వారు భర్త అనుమతితో కానీ భర్త అనుమతి లేకుండా కానీ సంతానవతులయ్యేవారు. ఒకరోజు ఉద్దాలకుని భార్య ఋతుమతి అయిన తరుణంలో ఇంటికి అతిధిగా వచ్చిన ఒక వృద్ధ బ్రాహ్మణుడు ఆమెయందు సంతానం పొందాలని అనుకున్నాడు. అది చూసిన ఉద్దాలకుని కుమారుడు కోపించి అది ధర్మ విరుద్ధమని భావించాడు. ఆరోజు నుండి అతడు ఆ రోజు నుండి స్త్రీలు పరపుషులను కోరకూడదని అలా చేస్తే పాపం వస్తుందని కట్టడి చేసాడు. అప్పటి నుండి స్త్రీలు భర్త అనుమతి లేకుండా పర పురుషుని చేరడం లేదు కానీ భర్త అనుమతితో పొందవచ్చు. కల్మషపాదుడు తన భార్య దమయంతిని దేవరన్యాయం ప్రకారం సంతానాన్ని ఇవ్వమని నియోగించగా ఆమె వశిష్టుని వలన అశ్మకుడు అనే కుమారుని పొందింది. అలాగే నీవు కూడా దేవర న్యాయంతో నాకు పుత్రులను పొంది ఇవ్వు నీకు చేతు లెత్తి నమస్కరిస్తాను.అని దీనంగా వేడుకున్నాడు.

## పాండవ కౌరవ జననం

పాండురాజు ఆవేదనకు విచలిత అయిన కుంతీ దేవి పాండురాజుకు తనకు దుర్వాసముని ఇచ్చిన వరం గురించి చెప్పింది. కాని కర్ణుని జననం తప్ప అంతా వివరించింది. కుంతి ఆ మంత్ర సాయంతో సంతానం కలుగుతుంది కనుక ఏదేవత సాయంతో సంతానం పొందాలో ఆనతివ్వమని పాండురాజుని అడిగింది. పాండురాజు ధర్మదేవతకు మించిన దైవం లేదు కనుక అతనిని స్మరించి పుత్రుని పొందుము . అలా భర్తచేత నియోగించబడిన కుంతి యమధర్మరాజుని స్మరించి కుమారుని కన్నది. అతనికి యుధిష్టురుడు అని నామకరణం చేసాడు. ఋషులు అతను కురు వంశానికి రాజై ధర్మ బద్ధంగా రాజ్యం చేస్తాడు అని పలికారు. హస్థినలో గాంధారి కుంతిదేవి కంటే ముందే గర్భం ధరించినా ముందుగా ప్రసవించ లేక పోవడంతో అసూయ చెంది తన గర్భాన్ని కొట్టుకుంది. అందువలన ఆమెకు గర్భస్రావం అయింది. అది విని వ్యాసుడు అక్కడకు వచ్చి ఆ మాసం ముక్కలను నూట ఒక్క నేతి కుండలలో భద్రపరిచి గాంధారితో ఆ కుండలను భద్రపరిస్తే వాటి నుండి నూరుగురు పుత్రులు ఒక కుమార్తె కలుగుతుందని చెప్పాడు. పాండురాజుకు మరొక కుమారుడు కావాలని కోరిక కలిగి వాయుదేవుని సాయంతో ఒక కుమారుని పొందమని చెప్పాడు. కుంతి వాయుదేవుని సాయంతో కుమారుని పొందింది. ఆకాశవాణి ఆ కుమారునికి భీమసేనుడు అని నామకరణం చేసింది. హస్థినా పురంలో గాంధారికి కలి అంశతో దుర్యోధనుడు జన్మించాడు. ఒక్కోరోజుకు ఒక్కో కుమారుడు కలిగారు. నూరుగురు కుమారులు జన్మించిన తరవాత దుస్సల అనే కుమార్తె జన్మించింది. దుర్యోధనుని జనం తరవాత గోచరించిన దుశ్శకునాలను చూసిన భీష్మ, విదుర, పురోహితాదులు కలత చెంది అతడు కులక్షయ కారకుడని అతనిని వదిలి వేసి అందర్ని రక్షించమని మిగిలిన కుమారులను పెంచుకోమని చెప్పారు. కానీ పుత్రుని మీద మమకారంతో దృతరాష్ట్రుడు దుర్యోధనుని వదలడానికి అనుమతించ లేదు. కుంతీ దేవి ఒకసారి భీముని ఎత్తుకుని దేవాలయానికి వెళుతున్న తరుణంలో ఒక పులి ఆమె మీదకు ఉరికింది. పాండురాజు దానిని చంపేలోగా కుంతీ భీముని ఒక బండరాతిపై జారవిడిచింది కేవలం పది రోజుల శిశువు పడగానే ఆ రాళ్ళు పొడి పొడి అయ్యాయి. భీముని బలానికి పాండురాజు ఆశ్చర్య పడ్డాడు. దృతరాష్టునికి నూరుగురు కుమారులు కలిగారని విని పాండురాజుకు కూడా ఇంకొక కుమారుడు కావాలని కోరిక కలిగింది. అతడు దేవేంద్రుని గురించి తపసు చేసాడు దేవేంద్రుడు ప్రత్యక్షమై ముల్లోకాలను జయించ కలిగిన కుమారుడు కలుగుతాడని వరమిచ్చాడు. కుంతీ దేవితో దేవతల అధిపతి అయిన ఇంద్రుని అంశతో ఒక కుమారుని పొందమని చెప్పాడు. కుంతీ దేవికి ఉత్తరఫల్గుణి నక్షత్రంలో తేజోవంతుడైన పుత్రుడు కలిగాడు. అప్పుడు ఆకాశవాణి " ఇతను కార్తవీర్యార్జునికంటే వీరుడౌతాడు. కనుక అర్జునుడని పిలువబడుతాడు " అని పలికింది. కుంతీదేవి గాంధారి సంతాన వతులైన తరవాత మాద్రి సంతానం కొరకు చింతించడం చూసి పాండురాజు మంత్ర మహిమ ద్వారా మాద్రికి సంతానం కలిగించమని అడిగాడు. కుంతీ

మాద్రికి మంత్రోపదేశం చేయించగా మాద్రి అశ్వినీ దేవతల అంశతో నకులసహదేవులను పొందింది.

## పాండురాజు మరణం మాద్రి సహగమనం

పాండురాజు భార్యలతో పిల్లలతో సంతోషంగా కాలం గడుపుతున్నాడు. ఒక వసంత కాలం సమయంలో ప్రకృతి మనోజ్ఞంగా ఉన్న సమయంలో పాండురాజు మాద్రి సౌందర్యానికి ఆకర్షితుడై బలవంతంగా ఆమెను చేరాడు. ఆ పై శాపకారణంగా మరణించాడు. ఇది చూసిన మాద్రి భయంతో ఒణికి పోతూ భర్త శవాన్ని చూసి రోదించ సాగింది. అక్కడకు వచ్చిన కుంతీ దేవి జరిగిన విషయం గ్రహించి సహగమనానికి సిద్ధపడింది. కానీ మాద్రి అందుకు అంగీకరించలేదు. భర్త తన వలన మరణించినందున తాను సహగమనం చేస్తానని చెప్పి తనకంటే సమర్ధురాలైన కుంతికి ఐదుగురు పుత్రులను కాపాడే భాధ్యతను అప్పగించి తాను భర్తతో సహగమనం చేసింది. కుంతీదేవికి అక్కడి మునులు సహకరించి వారిని తీసుకుని హస్థినాపురానికి వెళ్ళారు. పాండురాజు కుమారులను చూడటానికి హస్థినాపురం ప్రజలు తరలి వచ్చారు. దుర్యోధనుడు తన తమ్ములతో పురోహిత సమేతంగా ఎదురువచ్చి వారిని సాదరంగా తీసుకు వెళ్ళాడు. భీష్ముడు, విదురుడు, సత్యవతి, అంబిక, అంబాలిక వారికెదురు వచ్చి మునులకు నమస్కరించి కుంతీదేవిని ఓదార్చి పాండు కుమారులను ఎత్తుకుని ముద్దాడారు. మునులు కుంతీ సహితంగా పాండు కుమారులను వారికి అప్పగించి పాండురాజు మరణ వార్త మాద్రి సహగమన వార్తను చెప్పారు. ఆ తరవాత భీష్ముడు పాండుసుతులతో పాండురాజుకు ఉత్తర సంస్కారం చేయించాడు. ఆ సందర్భంగా అక్కడకు వచ్చిన వ్యాసుడు తన తల్లి సత్యవతితో "అమ్మా దృతరాష్టుని కుమారులు దుర్మార్గులు. వారి ఆగడాలు మీరు చూడలేరు కనుక మీరు తపోవనానికి వెళ్ళి ప్రశాంతంగా జీవించండి "అని చెప్పాడు. సత్యవతి అంబిక ,అంబాలికలను తీసుకుని తపోవనానికి వెళ్ళింది. కాక్రమేణా ఆ ముగ్గురు స్వర్గస్థు లైయ్యారు. దృతరాష్ట్రుడు తన కుమారులను తమ్ముని కుమారులను భేదభావం లేకుండా పెంచుతున్నాడు. భీముడు తన బలంతో దుర్యోధనుని తమ్ములను ఆటలలో ఓడిస్తూ ఉండటం దుర్యోధనునికి సహింపరానిది అయింది. అతని బలసంపన్నతకు ఈసు భయంకలిగిన దుర్యోధనుడు మేనమామ తమ్ముడు దుశ్శాసనుడు, శకునితో చేరి కుటిలోపాయాలు ఆలోచించ సాగారు. భీముని చంపి ధర్మరాజుని చెరలో పెట్టితే కానీ తనకు రాజ్యం దక్కదని అనుకున్నాడు. దీనికి శకుని వంత పాడాడు. ఒకరోజు పిల్లలంతా జలక్రీడలలో మునిగి తేలి అలసిపోయి నిద్రిస్తున్న సమయంలో దుర్యోధనుడు తమ్ములతో చేరి భీముని తీగలతో కట్టించి గంగానదిలో త్రోయించాడు. భీముడు ఒళ్ళు విరవగానే ఆ తీగలన్నీ పటాపంచలైనాయి. మరొక రోజు దుర్యోధనుడు సారధిని ప్రేరేపించి భీముని నల్ల త్రాచులతో కరిపించాడు. భీముని వజ్రశరీరాన్ని ఆ పాముకోరలు చేధించ లేకపోయాయి. ఒకరోజు దుర్యోధనుడు భీమునికి కాలకూట విషం ఆహారంలో కలిపి తినిపించాడు. భీ ముడు ఆ ఆహారాన్ని జీర్ణించుకున్నాడు. భీష్ముడు కుమారులందరికి వివిద్యను మొదట కృపాచార్యుని వద్ద ఆ తరవాత ద్రోణాచార్యుని వద్ద నేర్పించ సాగాడు. అప్పుడు జనమేజయుడు మహర్షీ కృపాచార్యుడు, ద్ రోణాచార్యుల జన్మ వృత్తాంతం తెలుపగలరా అని వైశంపాయనుని అడిగాడు.

## కౌరవుల నామధేయాలు

|1.దుర్యోధనుడు, 2.దుశ్శాసనుడు, 3.దుస్సహుడు 4.దుశ్శలుడు, 5.జలసంధుడు, 6.సముడు, 7.సహుడు, 8.విందుడు, 9,అనువిందుడు, 10.దుర్ధర్షుడు, |11.సుబాహుడు, 12.దుష్ప్రధర్షనుడు, 13.దుర్మర్షణుడు, 1 4.దుర్ముఖుడు, 15.దుష్కర్ణుడు,16. కర్ణుడు,17. వివింశతుడు,18. వికర్ణుడు,19. శలుడు 20.సత్వుడు, |21.సులోచనుడు, 22.చిత్రుడు, 23.ఉపచిత్రుడు, 24.చిత్రాక్షుడు, 25.చారుచిత్రుడు, 26.శరాసనుడు, 27.దుర్మధుడు, 28.దుర్విగాహుడు, 2 9.వివిత్సుడు, 30.వికటాననుడు, |31.నోర్ణనాభుడు, 32.సునాభుడు, 33.నందుడు, 34.ఉపనందుడు, 35.చిత్రాణుడు, 36.చిత్రవర్మ, 37.సువర్మ, 38.దుర్విమోచనుడు, 39.అయోబాహుడు, 40.మహాబాహుడు, |41.చిత్రాంగుడు, 42.చిత్రకుండలుడు, 43.భీమవేగుడు, 44.భీమలుడు, 45.బలాకుడు, 46.బలవర్ధనుడు, 47.నోగ్రాయుధుడు, 48.సుషేణుడు, 4 9.కుండధారుడు, 50.మహొదరుడు, |51.చిత్రాయుధుడు, 52.నిషింగుడు, 53.పాశుడు, 54.బృందారకుడు, 55.దృఢవర్మ, 56.దృఢక్షత్రుడు, 57.సోమకీర్తి, 58.అనూదరుడు, 59.దృఢసంధుడు, 60.జరాసంధుడు, |61.సదుడు, 62.సువాగుడు, 63.ఉగ్రశ్రవుడు, 64.ఉగ్రసేనుడు, 65.సేనాని, 66.దుష్పరాజుడు, 67.అపరాజితుడు, 68.కుండశాయి, 69.విశాలాక్షుడు, 70.దురాధరుడు, |71.దుర్జయుడు, 72.దృఢహస్థుడు, 73.సుహస్తుడు, 74.వాయువేగుడు, 75.సువర్చుడు, 76.ఆదిత్యకేతుడు, 77.బహ్వాశి, 78.నాగదత్తుడు, 79.అగ్రయాయుడు, 80.కవచుడు, |81.క్రధనుడు, 82.కుండినుడు, 83.ధనుర్ధరోగుడు, 84.భీమరధుడు, 85.వీరబాహుడు, 86.వలోలుడు, 87.రుద్రకర్ముడు ,88.దృఢరదాశ్రుడు, 89.అదృష్యుడు, 90.కుండభేది, |91.విరావి, 92.ప్రమధుడు, 93.ప్రమాధి, 94.దీర్గరోముడు, 95.దీర్గబాహువు, 96.ఊడోరుడు, 97.కనకద్వజుడు, 98.ఉపాభయుడు, 99.కుండాశి, 100.విరజనుడు. నూట ఒకటవ కుండనుండి దుస్సల అనే ఆడపిల్ల జన్మించింది.

## కృపాచారుడు ద్రోణాచార్యుడు ద్రుపదుడు జన్మ వృత్తాంతం


గురువుగా ద్రోణాచార్యుడు

గౌతముడు అనే మహామునికి శరద్వంతుడు అనే కుమారుడు ఉన్నాడు .అతనికి వేదాధ్యనంలో ఆసక్తి లేక ధనుర్విద్యలో ప్రావీణ్యం సంపాదించాడు. ఇంకా సంపాదించాలని ఆశించి ఘోరమైన తపమాచరించాడు. అతని తపస్సు భగ్నంచేయడానికి ఇంద్రుడు జలపద అనే యువతిని పంపించాడు. ఆమెను చూసిన శర్వందుడు పరవశుడైనాడు. అతని చేతిలోని ధనుర్బాణాలు జారవిడిచాడు. అతనికి వీర్యపతనం జరిగి ఒక రెల్లు పొదలపై బడింది. శరద్వంతుడు తిరిగి తపస్సుకు వెళ్ళాడు. పతనమైన వీర్యం రెండు భాగాలుగా విడిపడి ఒక ఆడపిల్ల ఒక మగ పిల్లవాడు జన్మించారు. ఒకరోజు శంతన మహారాజు వేటకు వచ్చి ఆ బిడ్డలను పక్కన ఉన్న ధనుర్బాణాలు, జింకచర్మాలు చూసి వారు బ్రాహ్మణ బాలురని గ్రహించి తీసుకు వెళ్ళి పెంచుకున్నాడు. వారికి కృపి, కృపుడు అని పేర్లు పెట్టాడు. ఒకనాడు శరద్వంతుడు వచ్చి వారు తన పిల్లలని చెప్పి కృపునకు ఉపనయనం చేసి ధనుర్విద్య నేర్పించాడు. అలాంటి కృపాచార్యుని భీష్ముడు పాండవ కౌరవులకు గురువుగా నియమించాడు. భరద్వాజముని గంగా తీరంలో తపసు చేసుకుంటున్నాడు.ఘృతాచి అనే అప్సరస గంగా నదిలో జలకాలాడు తున్నప్పుడు ఆమె వస్త్రం తొలగిన సమయంలో భద్వాజుడు చూసాడు. అది చూసిన భరద్వాజునకు వీర్యపతనం జరిగింది. అతడు ఆ వీర్యాన్ని ఒక ద్రోణంలో (కలశంలో) దాచాడు. ఆ వీర్యం నుండి శుక్రాచార్యుని అంశతో ద్రోణుడు జన్మించాడు. భరద్వాజుని స్నేహితుడు పాంచాల దేశ రాజైన పృషతుడు. అతడు అరణ్యాలకు వెళ్ళి తపస్సు చేసాడు. అతడికి ఒకరోజు మేనక అనే అప్సరసను చూసి వీర్యపతనం జరుగగా దాని నుండి ద్రుపదుడు జన్మించాడు. పృషతుడు ఆ బాలుని భరద్వాజుని ఆశ్రమంలో ఉంచి పాంచాలదేశానికి వెళ్ళాడు. భరద్వాజ ఆశ్రమంలో ద్రోణుడు ద్రుపదుడు కలసి విద్య నభ్యసించారు. ద్రుపదుడు పాంచాల దేశానికి వెళ్ళి రాజయ్యాడు. ద్రుపదుడు అగ్నివేశుని వద్ద అస్త్రవిద్య నేర్చుకున్నాడు. కృపాచార్యుని చెల్లెలెలు కృపిని ద్రోణుడికి ఇచ్చి భరద్వాజుడు వివాహం చేసాడు. వారిరువురికి అశ్వర్థామ అనే కుమారుడు కలిగాడు. పరశు రాముడు తన ధనాన్ని బ్రాహ్మణులకు దానం చేస్తున్నాడని తెలుసుకుని ధనార్థియై ద్రోణుడు పరశురాముని వద్దకు వెళ్ళాడు. కానీ అప్పటికే ధనమంతా దానంచేసిన పరశురాముడు మిగిలి ఉన్న అస్త్రశస్త్రాలు మాత్రమే ఇవ్వగలనని చెప్పాడు. ద్రోణుడు అవి చాలని చెప్పి అస్త్రశత్రాలను ప్రయోగం ఉపసంహారాలతో నేర్చుకున్నాడు. ఒక రోజు ద్రోణుడు చిన్ననాటి స్నేహం పురస్కరించుకుని ద్రుపదుని వద్దకు వెళ్ళాడు. ద్రుపదుడు గర్వియై స్నేహమంటే సమాన అంతస్థు ఉండాలని పేద బ్రాహ్మణునితో స్నేహమేమిటని అవమానించి పంపాడు. ఆ అవమానం భరించలేక ద్రోణుడు రాజ్యం విడిచి హస్థినాపురానికి వెళ్ళాడు.

## పాండవులు కౌరవుల విద్యాభ్యాసం

ద్రోణాచార్యుడు హస్థినలో ప్రవేశించే సమయంలోజరిగిన సంఘటన ఆయనను పాండు సుతులకు కౌరవులకు గురుపైయ్యేలా చేసింది. పాండవులు కౌరవులు బంతితో ఆడుకునే సమయంలో అది ఒక లోతైన నూతిలో పడింది. వారు దానిని తీయటానికి విఫల ప్రయత్నం చేసి నిస్సహాయంగా చూస్తున్న సమయంలో అక్కడకు కుటుంబ సహితంగా వచ్చిన ద్రోణాచార్యుడు ఆ బంతిని ఒకదాని తరవాత ఒక బాణాన్ని వేస్తూ బయటకు తీసి ఇచ్చాడు. రాజకుమారుల ద్వారా ఈ విషయం తెలుసుకున్న భీష్ముడు ద్రోణుని రాజకుమారులకు ఆ చార్యునిగా నియమించాడు. విద్య నేర్పడానికి ముందు అతడు రాకుమారులను చూసి మీలో నాకోరికను తీర్చగలవారు ఎవ్వరు అని ప్రశ్నించాడు. అందరూ సంశయిస్తుండగా అర్జునుడు మాత్రం ముందుకు వచ్చి గురుదేవా నేను మీరు ఏది కోరితే అది చేస్తాను అన్నాడు. దేశదేశాల నుండి వచ్చిన రాకుమారులతో ద్రుపదుని కుమారుడు కర్ణుడు కూడా ద్రోణుని వద్ద విద్యనభ్యసించ సాగాడు. కర్ణుడు మాత్రం ఎప్పుడూ దుర్యోధన పక్షం వహించేవాడు. అర్జునుడు మాత్రం గురువును వినయ విధేయతలతో సేవిస్తూ ద్రోణుని ప్రేమాభిమానానికి పాత్రుడైయ్యాడు. అశ్వర్థామకు అర్జునుడంటే విద్యామత్సరం ఉండేది. ఒక రోజు అర్జునుడు భోజనం చేస్తుండగా దీపం ఆరిపోయింది. అర్జునుడు చీకటిలో అన్నంతింటూ ఉండగా చీకటిలో బాణప్రయోగం కూడా చేయవచ్చన్న ఆలోచన వచ్చి అలా అభ్యాసం చేయనారంభించాడు. అది చూసి ద్రోణుడు అర్జునుని పట్టుదలకు మెచ్చి పరశురాముని వద్ద తాను నేర్చుకున్న విద్యనంతా నేర్పించాడు. దుర్యోధనాదులు భీముని బలం అర్జునిని విలువిద్యా నైపుణ్యం సహించలేక పోయారు. ఒకరోజు ద్రోణుడు రాజకుమారులకు విలువిద్యలో పరీక్ష పెట్టాడు. ఒక పక్షి బొమ్మను చెట్టు కొమ్మకు కట్టి ఒక్కొక్కరిని పిలిచి వారి ఏకాగ్రతను పరీక్షించగా అర్జునుడికి తప్ప ఎవరికీ తగినంత ఏకాగ్రత లేదని గ్రహించాడు. ఒకరోజు ద్రోణుడు నదిలో స్నానమాచరిస్తుండగా ఒక మొసలి అతని కాలును

పట్టుకుంది. అతడు రక్షించమని వేసిన కేకలకు రాకుమారులంతా దిక్కు తోచక పరుగెడుతున్న సమయంలో అర్జునుడు చాకచక్యంగా బాణం వేసి గురువుని రక్షించాడు. ఎప్పటికైనా అర్జునుడు ఒక్కడే ద్రుపదుని పట్ల తనకు కలిగిన పగ చల్లార్చ గలడని గ్రహించి ద్రోణుడు అ ర్జునునికి ది వ్యాస్త్రాలను ఇచ్చాడు.


యుధిష్టురినితో భీష్ముడు-రాజ్మానామా నుండి ఒక దృశ్యం

## ఏకలవ్యుడు


కలవ్యుని సాధన

ద్రోణుని కీర్తి విని హిరణ్యధన్వునుడు అనే ఎరుకల రాజు కుమారుడు ఏకలవ్యుడు అతనిని తన గురువుగా ఎంచుకున్నాడు .అతడు ద్రోణుని వద్దకు వెళ్ళి విలువిద్య నేర్పమని కోరాడు. హీనజాతి వాడికి విలు విద్య నేర్పడానికి ద్రోణుడు అంగీకరించలేదు. పట్టువదలని ఏకలవ్యుడు అడవిలో ద్రోణుని విగ్రహం పెట్టి భక్తితో విలు విద్యను సాధన చేసాడు. ఒక రోజు పాడవులు, కౌరవులు సమయంలో పాండవుల వేట కుక్క తప్పించుకు పోయింది. అది ఏకలవ్యుడు సాధన చేస్తున్న ప్రదేశంలో మొరగ సాగింది. ఏకలవ్యుడు ఏడు బాణాలు సంధించి ఆ కుక్క నోట్లో కొట్టాడు. ఆ బాణాలతో ఆ కుక్క పాండవుల చెంతకు రాగా అది చూసిన రాకుమారులు ఆబాణాలు సంధించిన నైపుణ్యం విస్మయపరచింది. వారు వెతుక్కుంటూ ఏకలవ్యుని చూసి అతడు ద్రోణుని శిశ్యుడని అతనిద్వారానే తెలుసుకున్నారు. అర్జుడు ద్రోణునితో "గురువర్యా నేను మీ ప్రియశిషుణ్ణి అని చెప్పారు కదా నాకంటే ఏకలవ్యుని విలువిద్యలో నైపుణ్యత అధికంగా ఇచ్చారెందుకు " అని వేదనగా అడిగాడు. ద్రోణుడు అర్జునునితో ఏకలవ్యునికి దగ్గరకు వెళ్ళి అతని వద్ద గురుదక్షిణగా అతని బొటన వ్రేలిని గ్రహించి అ ర్జునిని జగదేక వీరునిగా చేసాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక |

విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి |

# ఆది పర్వము షష్టమాశ్వాసము

వికీపీడియా నుండి

==షష్ఠాశ్వాసం==

## విషయ సూచిక

## అస్త్ర విద్యా ప్రదర్శన

పాండవులూ కౌరవులూ అస్త్రశస్త్ర విద్యాభ్యాసంలో నైపుణ్యం సాధించారు. ఒక రోజ ద్రోణుడు దృతరాష్ట్రుని వద్దకు వెళ్ళి భీష్ముడు, వ్యాసుడు, విదురుడు, శల్యుడు, కృపుడు, శల్యుడు, సోమదత్తుడు, శకుని లాంటి పెద్దల ముందు రాజ కుమారుల విద్యా ప్రదర్శన ఏర్పాటు చేయమని కోరాడు. విదురుడు అందుకు సమ్మతించి విదురుని పిలిచి తగు ఏర్పాట్లు చేయమని కోరాడు. విదురుడు ప్రదర్శనశాలను నిర్మింపచేసాడు. అస్త్ర విద్యా ప్రదర్శనకు దృతరాష్ట్రుడు గాంధారి సమేతంగా వచ్చాడు. వ్యాసమహర్షి, కృపాచారుడు, శల్యుడు, భీష్ముడు, సోమదత్తుడు, విదురుడు తమతమ ఆసనాలలో ఆశీనులైయ్యారు. తేజోమయుడై ద్రోణాచార్యుడు తెల్లని వస్త్రాలతో అక్కడకు వచ్చాడు. ఆయన వెనుక పాండవులూ కౌరవులూ వయసు క్రమంగా వరుసగా నిలిచారు. ముందుగా రాకుమారు లందరూ అస్త్రశత్ర ప్రదర్శన చేసారు. ఆ తరవాత భీముడు, దుర్యోధనుడు గధాయుద్ధ ప్రదర్శన ప్రారంభించి తమ నైపుణ్యం చూపించసాగారు. వారిరువురు తీవ్రంగా పోరాడు కుంటున్నారు. వారి యుద్ధాన్ని చూస్తున్న పౌరులు కావేషాలు పెంచుకుంటున్నారు. విదురుడు దృతరాష్ట్రునికి గాంధారికి జరుగుతున్నవి వివరించి చెప్తున్నాడు. పరిస్థితి చేయి దాటుతుందని గ్రహించిన ద్రోణుడు అశ్వథామను భీమ, దుర్యోదన యుద్ధాన్ని ఆపించాడు. ఆ తరవాత అర్జునిని విలువిద్యా ప్రదర్శన ఉంటుందని ప్రకటించాడు. అర్జునుడు రంగప్రవేశం చేయగానే జనులు ఆనందోత్సాహాలతో జయజయ ధ్వానాలు చేయడం ప్రారంభించారు. కొడుకు ప్రయోజకుడై నందుకు కుంతీ దేవి ఆనందించింది. విదురుని ద్వారా ఆ కలకలానికి కారణం తెలుసుకుని దృతరాష్ట్రుడు గాంధారి సంతోషించారు. అర్జునుడు గురువు అనుమతి తీసుకుని ఆగ్నేయాస్త్రం, వారుణాస్త్రం, వాయవ్యాస్త్రం, మేఘాస్త్రం మొదలైనవి ప్రదర్శించాడు. ప్రజలు అర్జునిని అస్త్ర విద్యా నైపుణ్యం చూసి ఆశ్చర్యచకితులైయ్యారు. ఇంతలో కర్ణుడు రంగస్థల ప్రవేశం చేసాడు. సహజ కవచకుండలాలతో ప్రకాసిస్తున్న కర్ణుని చూసి జనులు విస్మయం చెందారు. కర్ణుడు సభామధ్యమంలో నిలబడి గురువుకు నమస్కరించి అర్జునితో " అర్జునా ఈ విద్యలు ప్రదర్శించటానికి ప్రావీణ్యం అవసరం లేదు జనం మెచ్చేలా ఈ విద్యలు నేను కూడా ప్రదర్శించగలను " అన్నాడు. అది చూసి అర్జునుడు కోపించాడు. దుర్యోధనుడు సంతోషించాడు. కర్ణుడు ద్రోణుని అనుమతితో అర్జునుడు చేసిన విద్యలన్నీ ప్రదర్శించాడు. దుర్యోధనుడు ఆనందంతో కర్ణుని వద్దకు వెళ్ళి తనతో చెలిమి చేయమని కోరాడు. కర్ణుడు అర్జునితో ద్వందవిద్యా ప్రదర్శన ఏర్పాటు చేయడానికి ద్రోణుని అనుమతి కోరాడు. పిలవకుండా వచ్చినందుకు అర్జునుడు కర్ణుని ఆక్షేపించాడు. కర్ణుడు అస్త్ర విద్యా ప్రదర్శన వీరుల సొత్తు కనుక ఎవరూ పిలవనవసరం లేదని అభిప్రాయం వెలిబుచ్చాడు. దుర్యోధనుడు వెంటనే కర్ణినికి అర్జునినితో ద్వందయుద్ధానికి అనుమతి ఇచ్చాడు. ఇరువురి మధ్య యుద్ధం గోరంగా సాగింది. ఒకసమయంలో కర్ణుడు ప్రయోగించిన పర్జన్యాస్త్రం అర్జునిని కనిపించకుండా చేయగానే కుంతీదేవి మూర్చ పోయింది. అర్జునుడు వాయవ్యాస్త్రంతో ఆ మేఘాలను పారద్రోలాడు. వ్యవహారం శృతి మించుతుందని గ్రహించిన కృపాచార్యుడు ఇద్దరి మధ్యా నిలిచి " కర్ణా ఇతడు పాండు సుతుడు క్షత్రియుడు అర్జునినితో యుద్ధం చేయాలంటే నీవు నీ వంశక్రమం తల్లి తండ్రుల గురించి చెప్పాలి " అన్నాడు. కర్ణుడు బదులు చెప్పలేక సిగ్గుతో తలవంచుకున్నాడు. అప్పుడు దుర్యోధనుడు ముందుకు వచ్చి కులము, శౌర్యమూ, అధిక సేన కలవారు రాజులుగా అంగీకరింపబడతారు కనుక కర్ణుని ఇప్పుడే అంగరాజ్యానికి రాజుని చేస్తాను " అనిచెప్పి చెంటనే భీష్మ దృతరాష్ట్రుల అనుమతితో రాజ్యాభిషిక్తుని చేసాడు. కర్ణుడు పొంగిపోయి ఆనందంతో నాకు నీవిచ్చిన ఈ గౌరవానికి నీకు నేను ఏమి చెయ్యగలను అన్నాడు. దుర్యోధనుడు బదులుగా అతని స్నేహం కావాలని కోరాడు. కర్ణుడు అందుకు అంగీకరిస్తూ జీవితాంతం తన స్నేహాన్ని అందిస్తానని మాటిచ్చాడు. అప్పుడు అక్కడకు చేరిన కర్ణుని తండ్రిని చూసిన భీష్ముడు సూత పుత్రుడ వైన నీవు రథం నడుపుకోక అర్జునినితో యుద్ధం ఎందుకు అని చులకనగా మాట్లాడాడు. అందుకు దుర్యోధనడు " ఇంతటి తేజశ్శాలి సూత కులంలో పుడతడా అయినా దేవతల పుట్టుక, ఋషుల పుట్టుక, నదుల పుట్టుక, వీరుల పుట్టుక ఎంచక్యడదని నీకు తెలియదా? దేవేంద్రుని వజ్రాయుధం దధీచి వెన్నెముక నుండి పుట్ట లేదా? పరమ శివుని కుమారుడు రెల్లు పొదలలో పుట్టలేదా? మన గురువు గారు కుంభంలో పుట్టలేదా? ఉత్తమ క్షత్రియులందరూ బ్రాహ్మణులకు పుట్టలేదా? అంత వరకూ ఎందుకు మీ పుట్టుకలు ఎలాంటివి? కాబట్టి కర్ణుని జన్మ గురించి యోచించ పని లేదు అతడు ఇప్పుడు రాజు " అలా సూర్యాస్తమయం అయింది. అంతటితో విద్యా ప్రదర్శన ముగిసింది. దుర్యోధనుడు కర్ణునితో రాజ సౌధానికి వెళ్ళాడు. కుంతీదేవి కర్ణుని గుర్తించినా లోకనిందకు వెరచి చెప్పలేక పోయినందుకు వేదన పడింది.

## గురుదక్షిణ

రాకుమారుల విద్యాప్రదర్శన పూర్తి అయింది. గురుదక్షిణ ఇచ్చే సమయం ఆసన్నమయింది. రాకుమారులంతా గురువుకు ఏమి కావాలో చెప్పమని అడిగారు. పాత పగ గుర్తుకు వచ్చిన ద్రోణుడు గర్వాంధుడైన దృపధుని తెచ్చి గురు దక్షిణగా ఇవ్వమని కోరాడు. వెంటనే దుర్యోదనాదులు ద్రోణుని తీసుకుని పాంచాల దేశానికి బయలు దేరారు. దుర్యోధనాదులు దృపదునితో యుద్ధం చేయడానికి ఉపక్రమించారు. వీరుడైన దృపదుడు కౌరవుల నందరిని ఓడించాడు. అది చూసిన అర్జునుడు ధర్మరాజును, ద్రోణుని దూరంగా ఉంచి దృపదునితో యుద్ధానికి తలపడ్డాడు. భీముడు దృపదుని సైన్యాన్ని చీల్చి

చెండాడాడు. అర్జునుడు ద్రుపదునితో ద్వంద యుద్ధం చేసి అతనిని ఓడించి రదచక్రానికి కట్టి తీసుకు వచ్చి ద్రోణుని ముందు పడవేసాడు. ద్రోణుడు ద్రుపదుని చూసి "ద్రుపద మహారాజు ఇలా దీనంగా పడి ఉన్నారు? ఇప్పటి కైనా మదం తగ్గిందా నన్ను గుర్తు పట్టారా?" అని హేళన చేసి అతనిని విడిచి పెట్టాడు. ద్రుపదుడు ఆ అవమానాన్ని సహించ లేక పోయాడు. తగిన ప్రతీకారం చెయ్యాలని నిశ్చయించు కున్నాడు.

## ధర్మరాజ యౌవ రాజ్య పట్టాభిషేకం దుర్యోదనాదులకుట్ర

తరవాత ధృతరాష్ట్రుడు ధర్మరాజుని యువరాజుని చేసాడు. నలుగురు తమ్ములు నాలుగు దిక్కులను జయించి రాజ్యాన్ని విస్తరించగా చక్రవర్తిలా ప్రకాశించ సాగాడు. భీమార్జున పరాక్రమం నకుల సహదేవుల శత్రు భయంకరం ప్రజల మెప్పు పొందాయి. ద్రోణుడు అర్జునిని పరాక్రమానికి మెచ్చి బ్రహ్మ శిరం అనే అస్త్రాన్ని ఇచ్చాడు. ద్రోణుడు ఆ అస్త్ర మహిమను ఇస్తూ "అర్జునా నాకు అగ్నివృశుడు ఇచ్చిన ఈ అస్త్రం అమోఘ శక్తి కలది. ఇది లోకాలను మాడ్చి వేస్తుంది. దీనిని సామాన్య మానవుల మీద ప్రయోగించ రాదు. ఇప్పుడు నీవు నాకు మరొక గురు దక్షిణ ఇవ్వాలి ఏ కారణం చేతనయినా నీకు నువ్వుగా నాతో యుద్ధం చేయరాదు " అన్నాడు. ధర్మ రాజు వైభవం దుర్యోధనుడు సహింప లేక పొయ్యాడు. ఒక రోజు తండ్రి దగ్గరకు వెళ్ళి " తండ్రీ పాండవులు మహా వీరులు నీవు ధర్మరాజును రాజుని చేసావు. మంత్రులూ, సామంతులూ, ప్రజలు అతనిని గౌరవిస్తున్నారు. నీవు గుడ్డి వాడివి తాత భీష్ముని ప్రతిజ్ఞ వలన ధర్మరాజు మాత్రం తగిన రాజని ప్రజలు విశ్వసిస్తున్నారు. మమ్మల్ని ఎవరూ లక్ష్యపెట్టడం లేదు. నీవు మార్గాంతం ఆలోచించి వారిని కొంత కాలం ఇక్కడి నుండి పంపించి నట్లైతే ప్రజలు వారిని మరచి పోతారు కాబట్టి మాకు గౌరవం దక్కుతుంది " అన్నాడు. ధృతరాష్ట్రుడు బదులుగా " నాయనా దుర్యోధనా నాకు అన్నీ తెలుసు. నేను అంధుడను కనుక రాజ్య కార్యాలను స్వయంగా నిర్వహించ లేను. పాండురాజు నాచే యజ్ఞ యాగాలు చేయించాడు. రాజులను జయించి రాజ్యాన్ని విస్తరించాడు. నన్ను భక్తితో సేవించాడు. కనుక నీకంటే పెద్దవాడైన ధర్మరాజుని యువరాజుని చేసాను ఇప్పుడు తొలగించ లేను " అన్నాడు. దుర్యోధనుడు " తండ్రీ రాజ్యాధికారం వారస్త్వంగా లభించేది నీవు అంధుడవు కనుక నీ తమ్ముడు రాజ్యం చేసాడు. అతని మీద అభిమానం చూపిన ప్రజలు ధర్మరాజుని రాజుగా చూడాలని కోరుతున్నారు ఆపై అతని కుమారుడు ఆ పై వారి వంశం రాజులౌతారు. మేము వశ పారంపర్యముగా బానిసలుగా ఉండవలసినదేనా? ఈ రాజ్యం నీది నీ తరవాత మాకు చెందాలి ప్రజాభిమతం మార్చడానికి కొంతకాలం పాండవులను వారణావతం పంపుతాము. ప్రజలు కొంత మరచిన తరవాత వారు తిరిగి వస్తారు " అన్నాడు. ధృతరాష్ట్రుడు " నాయనా నా అభిప్రాయం కూడా అదే కానీ ఇందుకు విదురుడు భీష్ముడు అంగీకరించరు " అన్నాడు. దుర్యోదనుడు మీరు చక్రవర్తి కాబట్టి అందరూ మీ ఆజ్ఞను పాటిస్తారు. భీష్ముడు సమభావం కలవాడు కనుక ఏమీ అనడు, అశ్వత్థామ నాతో ఉంటాడు కనుక అతని మీద ప్రేమతో ద్రోణుడు నన్ను విడువడు. బావ మీద ప్రేమతో మనల్ని కృపుడు విడివడు. విదురుడు పాండవ పక్షపాతి అయినా ఒక్కడే ఏమి చేయడు. కనుక మీరు ఇందుకు సమ్మతించి తీరాలి " అని బలవంతం చేసాడు. గత్యంతరం లేక ధృతరాష్ట్రుడు అందుకు అంగీకరించాడు.

## పాండుసుతులు వారణావతానికి వెళ్ళుట లక్కాగృహ దహనం

తండ్రి అనుమతి తీసుకుని దుర్యోధనుడు తన కపటోపాయం అమలులో పెట్టాడు. ముందుగా కొందరు మంత్రులను పంపి పాండవులకు వారణావతం గురించి ఆసక్తి కలిగేలా చెప్పించాడు. గొప్పగా వర్ణించిన వారణావతం చూడాలన్న కుతూహలం పాండవులలో కలిగింది. ఒకరోజు ధృతరాష్ట్రుడు పాండవులను పిలిచి "నాయనా ధర్మరాజా నీతండ్రి పాండురాజు గొప్ప కీర్తి గడించాడు. కాలవశాత్తు ఆయన ఇప్పుడు లేనప్పటికీ నీవు మీ తమ్ములు తండ్రికి తగిన తనయులు. ఇంత కాలం రాజ్యభారాన్ని మోసి అలసి పోయారు కనుక వారణా వతంలో మీ తల్లితో కొంతకాలం విశ్రాంతి తీసుకుని రండి. గంగా తీరాన ఉన్న ఆనగరం అత్యంత సుఖప్రదమైన నగరం అని విన్నాను. నా మాట కాదనరు కనుక నేనిది చెప్తున్నాను " అన్నాడు. పెద్ద తండ్రి ప్రేమతో చెప్పిన మాటను తిరస్కరించ లేక ధర్మరాజు భీష్మ, ద్రోణ, కృపాచారుల ఆశీర్వాదం తీసుకుని తల్లిని, తమ్ములను వెంట పెట్టుకుని వారణావతం బయలుదేరాడు. ఇది చూసిన దుర్యోధనుడు ఆనంద పడ్డాడు. పురోచనుడు అనే గృహ నిర్మాణ నిపుణుని పిలిచి వారణావతంలో పాండవుల కొరకు లక్క, మట్టి, నెయ్యి, మిశ్రమంతో చేసిన గృహాలను నిర్మించి వాటిలో పాండవులు ఏమరుపాటుగా ఉన్న సమయం చూసి ఆగృహాలను తగులపెట్టు. వారి మరణ వార్త తీసుకువస్తే నీవు జీవితాంతం భోగాలను అనుభవించ వచ్చు. అని అతనిని ప్రలోభ పెట్టాడు. పురోచనుడు అందుకు అంగీకరించాడు. పాండవులు శతశృంగం నుండి వచ్చే సమయానికి వారి వయసు వరుసగా 16, 15, 14, 13, 13 సంవత్సరములు. అని ఇక్కడ ప్రస్తావించబడింది. ఆ తరవాత వారు 13 సంవత్సరములు ఉన్నారు. వారణావతానికి వెళ్ళే సమయంలో వారి వయసు వరుసగా 29, 28, 26, 25, 25 సంవత్సరాలు. తల్లితో సహా వారణావతానికి బయలు దేరుతున్న పాండవులను చూసి పౌరులు పాండవుల అడ్డు తొలగించు కోవాలని వారిని వారణావతానికి పంపుతున్నారని గ్రహించారు. భీష్ముడు మొదలైన వారు అడ్డు చెప్ప నందుకు కలత చెందారు. పాండవులు లేని రాజ్యంలో ఉండలేమని భావించి వారి వెంట నడవ సాగారు.

వారితో ధర్మరాజు పెదనాన కోరిక మీద వెళుతున్నామని తిరిగి రాగలమని నచ్చ చెప్పి వారిని మరలించాడు. విదురుడు మాత్రం మరికొంత దూరం వారి వెంట వెళ్ళి నర్మగర్భంగా కొన్ని మాటలు చెప్పాడు. తరవాత కుంతీ దేవి వద్ద శెలవు తీసుకుని మరలి వెళ్ళాడు. విదురుని మాటలు అర్ధం కాని కుంతీ దేవి విదురుడు ఏమి చెప్పాడు అని ధర్మరాజుని అడిగింది. ధర్మరాజు తల్లితో " అమ్మా విషాగ్నుల వలన అపకారం జరుగవచ్చని అప్రమత్తంగా ఉండమని చెప్పాడు. దుర్యోధనుని వెంట ఉండి అతను మనకు అపకారం తలపెడితే మనకు తెలియ చేస్తానని చెప్పాడు " అన్నాడు. విదురుని ప్రేమకు కుంతీతో సహా అందరూ ఆనందించారు.

## పాండవుల వారణావత వాసం

వారణావత ప్రజలు కుంతీదేవికి పాండవులకు ఘనంగా స్వాగతం చెప్పారు. వారికోసం పురోచనుడు నిర్మించిన గృహాలను చూపి ఉండమన్నారు. శిల్పాచారుడైన పురోచనుని తగిన విధంగా పూజించి సత్కరించారు. పుణ్యాహ వచనం చేసి గృహప్రవేశం చేసారు. ఆ గృహాన్ని అణువణువు పరిశీలించిన ధర్మరాజుకు అందులో ఏదో కృత్రిమత్వం గోచరించింది. భీముని పిలిచి ఆగోడలను చూపి వాటి నుండి ఏదో వింత వాసన వస్తుందని చెప్పాడు. భీముడు అది చూసి " అన్నయ్యా వీటి నుండి లక్క, తైలం కలిపిన వాసన వస్తుంది. గృహం సమీపంలో ఆయుధాగారం ఉంది. ప్రమాదం పొంచి ఉంది " అని అభిప్రాయం వెలిబుచ్చాడు. విదురుడు చెప్పిన విషాగ్నులు ఇవే నని వారికి అర్ధం అయింది " అది అర్ధం చేసుకున్న భీముడు ఆవేశపడి " అన్నయ్యా మనం ఇప్పటి వరకూ ఉన్న పాత ఇంటిలో ఉండి పురోచనుని ఇంటితో తగులపడదాము " అన్నాడు. ధర్మరాజు భీమునితో " భీమా తొందరపడకు. విషయం మనకు తెలిసింది కనుక అప్రమత్తంగా ఉందాము. మనకు ఈ విషయం తెలిసిందని తెలిస్తే దుర్యోధనుడు పురోచనుడు వేరే ఉపాయం పన్నుతారు. అది మనకు తెలిసే అవకాశం రాక పోవచ్చు కనుక ఏమీ తెలియనట్లు ఉందాము " అన్నాడు. పురోచనుడు పాండవుల సేవ నిమిత్తం ఒక బోయ వనితను నియమించాడు. ఆమెకు ఐదుగురు కొడుకులు. వారంతా పాండవుల కదలికలను ఎప్పటికప్పుడు పురోచనునిని చేరవేస్తున్నాడు. హస్థినలో దుర్యోధనుని కుతంత్రం తెలుసుకున్న విదురుడు ఒక మనిషిని పాండవుల వద్దకు పంపాడు. విదురుడు చెప్పిన సంకేతం చెప్పి తనను పరిచయం చేసుకున్నాడు. అతడు ధర్మరాజుతో " ధర్మ నందనా రాబోవు కృష్ణ చతుర్ధశి నాడు పురోచనుడు లక్క ఇంటిని తగుల పెట్టకలడు. కాబట్టి ఈ గృహం నుండి సొరంగ మార్గం త్రవ్వమని విదురుడు నన్ను పంపాడు " అన్నాడు. ధర్మరాజు విదురుని దూరదృష్టికి ఆశ్చర్య పడి ఆ ఖనకుడికి అనుమతి ఇచ్చాడు. ఖనకుడు లక్క ఇంటి నుండి వెలుపలికి బిల మార్గం ఏర్పాటు చేసాడు. భీముడు దానిని పరిశీలించి తృప్తి పడ్డాడు.

## పాండవులు లక్క ఇంటి నుండి తప్పించుకొనుట


నిప్పులో తగలబడిపోతున్న పాండవుల లక్క ఇల్లు

కృష్ణ చతుర్ధశి నాడు కుంతీదేవి వారణావతంలోని ముత్తైదువలకు, బ్రాహ్మణులకు భోజనం పెట్టి దక్షిణలిచ్చి సత్కరించింది. ఆ రోజు రాత్రి బోయ వనిత కొడుకులతో కల్లు సేవించింది అందరూ మత్తుగా నిద్రలోకి జారుకున్నారు. తరవాత భీముడు తల్లిని సోదరులను సొరంగ మార్గంలో పంపించి ముందుగా పురోచనుని ఇంటికి నిప్పు పెట్టి ఆ తరవాత తాము నివసించిన ఇంటికి నిప్పు పెట్టి ఆఖరుగా ఆయుధాగారానికి నిప్పు పెట్టి ఖనకుడికి తాము క్షేమంగా ఉన్నామని చెప్పాడు. ఆ తరవాత తాను కూడా సొరంగ మార్గం ద్వారా అన్న తమ్ములను, తల్లిని కలుసు కున్నాడు. వడి వడిగా నడుస్తూ వెళుతున్న మిగిలిన వారు భీముని వేగాన్ని అందుకోలేక పోయారు. భీముడు తల్లిని వీపు మీద ఎక్కించుకుని ధర్మరాజుని, అర్జునిని చెరి ఒక భుజంపై ఎక్కించుకుని నకుల,సహదేవులను రెండు చేతులతో ఎత్తుకుని వడి వడిగా నడిచాడు. తెల్లవారగానే వారణావత ప్రజలకు లక్క ఇల్లు తగలబడిన విషయం తెలిసింది. దృతరాష్టుని కుయుక్తికి ప్రజలు ఎంతగాగానో అతనిని నిందించారు. అందరూ వచ్చి బూడిద కుప్పలలోని బోయ వనితను ఆమె కుమారుల శవాలను చూసి కుంతీదేవి పాడవులనుకుని భోరున విలపించారు. ఖనకుడు జనంలో చేరి పోయాడు. బూడిద కుప్పలను తొలగిస్తున్నట్లు నటిస్తూ తాను త్రవ్విన సొరంగ మార్గంలో పోసి దానిని కనపడకుండా చేసాడు. వెంటనే హస్థినా పురానికి వెళ్ళి విదురునికి పాండవులు క్షేమంగా తప్పించుకున్నారని చెప్పాడు. వారణావతంలోని ప్రజలు పాడవులు మరణించారని దృతరాష్టునికి తెలియ చేసారు. భీష్ముడు, కృపుడు, ద్రోణుడు ఎంతో దుఃఖించారు. వారితో చేరి విదురుడు దుఃఖిస్తున్నట్లు నటించాడు. దుర్యోధనుడు ఎంతో

సంతోషించినా పురోచనుని మరణం బాధ కలిగించింది.

## హిడింబాసుర వధ

బిలమార్గం నుండి పాండవులు వారణావతానికి దక్షిణంగా ప్రయాణించారు. అందరూ అలసిపోగా వారిని ఒక చెట్టు క్రింద విశ్రమింప చేసి భీముడు వారికి కాపలా ఉన్నాడు. అలసి ఉండటం చేత అందరూ నిద్రలోకి జారుకున్నారు. భీముడు జరిగినది తలచుకుంటూ కూర్చున్నాడు. వారు విశ్రమించిన ప్రదేశానికి దగ్గరలో హిడింబుడు అనే రాక్షసుడు నివసిస్తున్నాడు. అతడు తమ ఆవాసానికి దగ్గరగా మానవులు వచ్చిన విషయం గ్రహించాడు. తన చెల్లెలు అయిన హిడింబను పిలిచి "హిడింబా ఇక్కడ పరిసర ప్రాంతానికి నరులు వచ్చారు నానోరు చవిచెడి ఉన్నది వారిని చంపి నాకు వండి పెట్టు" అన్నాడు. అలాగే నని పాండవుల దగ్గరకు వెళ్ళిన హిడింబ అక్కడ కాపలాగా ఉన్న భీముని చూసింది. అతని మీద మనసు పడింది. అన్న మాట మరచి పోయింది. మానవ కాంతగా మారి పోయింది. తనను చూసి ఎవరని అడిగిన భీమసేనునితో " మహాభాగా నేను హిడింబుని చెల్లెలైన హిడింబను. నీ పై మనసు పడ్డాను. నా అన్న మహా బలవంతుడు. ఇది అతని వనము అతి భయంకరుడైన అతనిని చూసి భయపడని వారు లేరు నీవు ఏమాత్రం. నీవు నన్ను వివాహమాడినచో అతడు నిన్ను విడువగలడు. లేకున్న అతడు మిమ్మలిని బ్రతుక నీయడు. నా వెంట వస్తే కోరిన చోటికి తీసుకు పోతాను " అన్నది. వీరు నా తల్లీ అన్నతమ్ములు వీరిని విడిచి రాలేనని భీముడు అన్నాడు. అయితే అందరం వెళదామని హిడింబ చెప్పింది. ఒక రాక్షసుడికి భయపడి నా తల్లీ సోదరుల నిద్ర చెడగొట్టనా " అన్నాడు. చెల్లెలు ఎంతకీ రాలేదని హిడింబాసురుడు అక్కడికి వచ్చాడు. భీముడు భీకరంగా ఘర్జించి " నిన్ను సంహరించడం ఉచితం కనుక నిన్ను చంపి ఈ అడవిలో రాక్షస భయం లేకుండా చేస్తాను " అని హిడింబునిపై లంఘించాడు. ఇద్దరికీ మధ్య ఘోర యుద్ధం జరిగింది. వారి ఘర్జనలకు మిగిలిన వారు నిద్ర లేచి హిడింబను అడిగి విషయం తెలుసుకున్నారు. అర్జునుడు వారు యుద్ధం చేస్తున్న చోటికి వెళ్ళి " భీమసేనా తూర్పు ఎర్ర బారుతుంది. ఇది రాక్షసులకు అనుకూలమైన వేళ కనుక ఉపేక్షించక అతడిని చంపు " అని అరిచాడు. ఆ మాట విని భీముడు విజృంబించి హిడింబుని గిరాగిరా త్రిప్పి నేలకు కొట్టాడు. హిడింబుడు నడుములు విరిగి ప్రాణాలు వదిలాడు.

## హిడింబ భీమసేనుల వివాహం- ఘటోత్కచుని జననం

భీముని బలం హిడింబను ఆశ్చర్యపరచింది. భీముడు హిడింబను చూసి "నీవు రాక్షస కాంతవు మేము నిన్ను నమ్మము వెను తిరిగి వెళ్ళుము" అన్నాడు. హిడింబ కుంతీదేవి వద్దకు వెళ్ళి "అమ్మా నేను భీమునిపై మనసు పడ్డాను. అతను నిరాకరిస్తే ప్రాణాలు వదులుతాను. నన్ను మీ కోడలుగా స్వీకరిస్తే మీకు సహాయంగా ఉంటాను. నాకు జరుగుతున్నది జరగబోయేది తెలుసు. మీరు శాలిహోత్రుని ఆశ్రమానికి వెళ్ళి అక్కడి కొలను లోని నీరు త్రాగారంటే మీకు ఆకలి దప్పులు ఉండవు. అక్కడకు కృష్ణద్వైపాయనుడు వచ్చి మీకు హితోపదేశం చేస్తాడు. కోరికలు అందరికీ ఒకటే కనుక మిమ్మల్ని అర్ధిస్తున్నాను " అన్నది. కుంతీదేవి హిడింబ మాటలు విన్నది. ఆమెపై విశ్వాసం కలిగి భీముని చూసి " భీమసేనా ఈమె ఉత్తమురాలు ఈమెను వివాహమాడితే మనకు మంచి జరుగుతుంది. నా మాట మీ అన్న ధర్మరాజు మాటగా మన్నించి ఈమెను వివాహమాడు " అని చెప్పింది. తల్లి మాటను మన్నించి హిడింబను వివాహమాడి ఆమెతో చేరి శాలిహోత్రుని ఆశ్రమానికి చేరుకున్నారు. ఒక రోజు వేదవ్యాసుడు అక్కడికి వచ్చాడు. కుంతీదేవితో " అమ్మా కష్టాలు కలకాలం ఉండవు. మీకు త్వరలో మంచి రోజులు వస్తాయి. రాజ్యం లభిస్తుంది. ఇక్కడ కొన్ని రోజులు ఉండి తరవాత బ్రాహ్మణ రూపాలలో ఏకచక్ర పురం వెళ్ళండి. ఆ తరవాత నేను వచ్చి మీరి చెయ్య వలసిన కర్తవ్యం చెప్తాను" అన్నాడు. వ్యాసుని మాట ప్రకారం పాండవులు కొంతకాలం శాలిహోతుని శ్రమంలో గడిపారు. హిడింబ గర్బం ధరించి ఘటోత్కచుడిని కన్నది. అతను కామరూపుడు అమిత బలవంతుడు. ఘటోత్కచుడు కుంతీ దేవిని తండ్రులను చూసి " అమ్మా నేను ఇక్కడ నాతల్లితో ఉంటాను. మీరు తలచిన వెంటనే మీ దగ్గరకు రాగలను " అని చెప్పి అందరికీ నమస్కరించి తల్లితో తిరిగి వెళ్ళాడు.

## ఏకచక్రపురం బకాసురవధ

శాలిహోత్రుని ఆశ్రమంలో పాండవులు ధర్మశాస్త్రాలు, నీతిశాస్త్రాలు అభ్యసించారు. ఆ తరవాత వారు జింక చర్మాలు నార చీరలు ధరించి వేద పఠనం చేస్తూ బ్రాహ్మణ వేషాలలో ఏకచక్రపురం అనే అగ్రహారం చేరారు. ఒక బ్రాహ్మణిని ఇంట్లో నివాసం ఏర్పరచు కున్నారు. పాండవులు ప్రతి రోజు మౌనంగా భిక్ష స్వీకరించి తల్లికి ఇచ్చేవారు. కుంతీ దేవి ఆభిక్షలో సగం భీమునికి పెట్టి సగం మిగిలిన నలుగురు కుమారులతో చేరి భుజిస్తూ వచ్చింది. సహృదుయులు, సత్ప్రవర్తనులు అయిన వారిని చూసి అగ్రహార ప్రజలు ఆనందించారు. ఒక రోజు భీముడు ఇంట్లో ఉన్నాడు మిగిలిన వారు భిక్ష స్వీకరించటానికి వెళ్ళారు. ఆ సమయంలో ఆ ఇంటిలో రోదనలు వినపడ్డాయి. కుంతీ దేవి భీమునితో " భీమసేనా ఈ ఇంటి వారికి ఏదో కష్టం కలిగి నట్లుంది.

వీరు చేసిన ఉపకారం గుర్తించడం పుణ్యం ప్రత్యుపకారం మరింత పుణ్యం చేసిన దానికంటే అధిక ఉపకారం చేయడం ఉత్తమ పుణ్యం" అని చెప్పింది. భీమసేనుడు తల్లితో " అమ్మా నీ ఆజ్ఞను నెరవేరుస్తాను. నీవు వారిని అడిగి వారికి ఏమి కష్టం వచ్చిందో చెప్పావంటే నేను వారికి ప్రత్యుపకారం చేస్తాను" అన్నాడు.

## బ్రాహ్మణ కుటుంబం విలపించుట

కుంతీ దేవితో ఆ ఇంటి యజమాని " అమ్మా జననం మరణం సంయోగం వియోగం సహజమే అయినా వేదోక్తంగా వివాహం చేకున్న భార్యను కాని కన్యాదానం చేసి అత్త వారిటికి పంపవలసిన కూతురుని కాని, నాకూ నా పితృలకు పిండోదకాలు ఇవ్వవలసిన నా కుమారుని కానీ రాక్షసునికి ఆహారంగా పంప లేక నేనే ఆహారంగా వెళతానని చెప్పాను అందుకు వీరు సమ్మతించక విలపిస్తున్నారు " అన్నాడు. అందుకు భార్య "నాధా మిమ్మల్ని వివాహమాడి సంతాన ప్రాప్తి కలిగించాను. భర్త కంటే ముందు మరణించి పుణ్య లోకాలకు వెళతాను. భర్త లేని భార్య లోకంలో అవమానాలు భరిస్తూ కష్టపడవలసి వస్తుంది. మీరు వేరు వివాహం చేసుకుని పిల్లలకు విద్యా బుద్ధులు నేర్పించి ప్రయోజకులను చెయ్యండి. నేను ఆహారంగా వెళతాను" అన్నది. అంతలో కూతురు " అమ్మా నేను వివాహం చేసుకుని మీకు మనుమలను ఇచ్చేకంటే నేనే ఆహారంగా వెళతాను. మీరు జీవించి ఉంటే సంతానాన్ని పొందవచ్చు" అన్నది. ఇంతలో చిన్న వాడైన కుమారుడు కర్ర తీసుకుని " తండ్రీ! నేను వెళ్ళి ఆ రాక్షసుని చంపుతానని " అన్నాడు.

## బకాసురుడి వృత్తాంతం విని కుంతి బ్రాహ్మణుడికి అభయమిచ్చుట


బ్రాహ్మణ దంపతులను ఓదారుస్తున్న కుంతి

కుంతీ దేవి " రాక్షసుడు ఎవరు? మీరు అతడికి ఆహారంగా ఎందుకు వెళ్ళాలి? నాకు వివరించండి " అడిగింది. అందుకు సమాధానంగా బ్రాహ్మణుడు " అమ్మా ఇక్కడకు ఆమడ దూరంలో యమునా నదీ తీరాన బకుడు అనే రాక్షసుడు ఉన్నాడు. అతడు గ్రామం మీద పడి అందరినీ తిన సాగాడు. అందువలన మేమంతా అతడితో రోజుకు ఒకడు వాడికి ఆహారంగా వెళ్ళాలని ఒప్పందం కుదుర్చుకున్నాము. ప్రతి రోజూ ఒక బండి ఆహారం, రెండు దున్నపోతులు, ఒక మనిషి ఆతడికి ఆహారంగా వెళ్ళాలి ఈ దేశాన్ని ఏలే రాజుకు కూడా వాడిని ఎదిరించే శక్తి లేక మిన్న కున్నాడు. ఈ రోజు ఈ ఇంటి నుండి అతడికి ఆహారంగా వెళ్ళాలి " అన్నాడు. అందుకు కుంతీ దేవి " అయ్యా ! చింతించ వలదు మీకు ఒక్కడే కుమారుడు. నాకు ఐదుగురు ఉన్నారు. నా కుమారులలో ఒకడిని పంపుతాను " అన్నది. ఆ బ్రాహ్మణుడు కుంతీ దేవితో " అమ్మా! అతిథిని పంపుట తగదు అందునా బ్రాహ్మణ హత్య మహాపాపం " అన్నాడు. కుంతీ దేవి " అయ్యా ! ఆలోచించ వద్దు నా కుమారుడు మహా బలవంతుడు అతడు ఇంతకు ముందు రాక్షసులను చంపాడు. అంతడు తప్పక బకుని చంపి వస్తాడు " అన్నది. ఆమె భీమునితో జరిగినది అంతా చెప్పింది. అందుకు భీముడు సంతోషంగా అంగీకరించాడు.

## భీముని ఉత్సాహము చూసి ధర్మరాజు కలతపడుట

అంతలో ధర్మరాజాదులు అక్కడికి వచ్చారు. సంతోషంగా ఉన్న భీముని చూసి తల్లితో " అమ్మా భీముని సంతోషం చూస్తే అతడు ఎవరితోనో యుద్ధానికి సన్నద్ధం ఔతున్నట్లుంది. తనంత తానే వెళుతున్నాడా లేక నీవు పంపుతున్నావా " అని అడిగాడు. కుంతీ దేవి జరిగినది ధర్మరాజుకు చెప్పింది. ధర్మరాజు కలత చెంది " అమ్మా ! పరాయి వారి కోసం నీ కన్న కొడుకును బలి ఇస్తావా ? నీకు మతి భ్రమించిందా భీముడు విడువ తగిన వాడా? " అన్నాడు. కుంతీదేవి " నాయనా ధర్మరాజా ! కలత చెంద వలదు. భీముని బలం నీకు తెలియదు. అతడు వజ్రకాయుడు. అతడు పుట్టిన పదవ రోజునే ఒక బండ రాయి మీద పడగా అది పొడి పొడి అయ్యింది. భీముడు రాక్షసుని చంపి ఈ ఆగ్రహారానికి రాక్షస పీడ వదిలిస్తాడు. క్షత్రియ ధర్మాలు వ్యాసుని నోట విన్నది నీకు చెబుతాను. ఉత్తమ క్షత్రియుడు ఇతరులను రక్షించడానికే పుడతాడు. మృత్యు భయంతో ఉన్న బ్రాహ్మణులను రక్షిస్తే పుణ్యలోకాలకు వెళతాడు. సాటి క్షత్రియుని రక్షిస్తే కీర్తిని పొందుతాడు. వైశ్యుని శూద్రుని రక్షిస్తే అనురాగాన్ని పొందుతాడు. ఆపదలో ఉన్నవారిని రక్షించడం క్షత్రియ ధర్మం. మనకు ఉపకారం చేసిన ఈ

బ్రాహ్మణుని రక్షించడం మనధర్మం " అని చెప్పింది.

### బకాసుర వధ

ఆ ఊరి వారంతా ఆహారం తయారు చేసి ముందుగా భీమునికి తృప్తిగా ఆహారం పెట్టి బండిని ఆహార పదార్ధాలతో నింపారు. భీముడు ఆ బండిని తోలుకుంటూ యమునా తీరానికి పోయి బకాసురుని పిలువసాగాడు. అతడు రావడం ఆలస్యం కావడంతో ఆహారాన్ని తానే భుజించ సాగాడు. ఆహారం ఎంతకీ దగ్గరకు రాక పోయేసరికి బకుడు ఆకలితో మండి పడుతూ వెతుక్కుంటూ వచ్చాడు. అక్కడ తనకు తెచ్చిన ఆహారాన్ని భుజిస్తున్న భీమసేనుని చూసి పిడి గుద్దులు గుద్దాడు. భీమసేనునికి చీమ కుట్టినట్లైనా లేక పోవడంతో ఉక్రోష పడి పక్కనే ఉన్న చెట్టును పెరికి భీమునితో కలియబడ్డాడు. భీముడు బకాసురునితో ఘోర యుద్ధం చేసి అతడిని చంపాడు. బకాసురుని కేకలకు అతని బంధువులు పరుగున వచ్చారు. భీముని వారిని చూసి ఆ ఊరు వదిలి వెళ్ళక పోతే మీకూ ఇదే గతి పడుతుందని అరిచాడు. వారు భయపడి పారిపోయారు. బకాసురుని కళేబరాన్ని ఊరి పొలిమేరలో పడవేసాడు. ఏక చక్రపుర ప్రజలు భీముని పరాక్రమాన్ని వేనోళ్ళ కొనియాడారు. ఇంటికి వెళ్ళి జరిగినది సోదరులకు కుంతీ దేవికి చెప్పాడు. ఊరి ప్రజలు భీమసేనుడు సామాన్య బ్రాహ్మణుడు కాదని మంత్రసిద్ధి కలవాడని అతనిని చూడటానికి తరలి వచ్చారు.



బకాసురునితో పోరాడుతున్న భీముడు

## నన్నయ తెలుగు అవతారికలో విశేషాలు

## కొన్ని ప్రసిద్ధ పద్యాలు, శ్లోకాలు

## సంస్కృత మూలానికి, తెలుగు అనువాదానికి భేదాలు

## సాహితీ విశేషాలు

## ఆధ్యాత్మిక విశేషాలు

## ఇవి కూడా చూడండి

## మూలాలు

## వనరులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

# బయటి లింకులు

- sacred-texts. com/hin/m01/index. htm Translation కిశోరీ మోహన్ గంగూలి ఆంగ్ల అనువాదం (http://www.)

"http://te.wikipedia.org/w/index.php?title=ఆది_పర్వము_షష్ఠమాశ్వాసము&oldid=760773" నుండి వెలికితీశారు

వర్గం: మహాభారతం

---

- ఈ పేజీకి 06:44, 25 సెప్టెంబర్ 2012న చివరి మార్పు జరిగినది.

# ఆది పర్వము సప్తమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



## సప్తమాశ్వాసం

బకాసురుని వధ తరవాత పాండవులు కొంతకాలం ఏకచక్ర పురంలో ఉన్నారు. ఒక రోజు ఒక బ్రాహ్మణుడు వారింటికి వచ్చాడు. ధర్మరాజు బ్రాహ్మణునికి అతిధి సత్కారాలు కావించి అతనితో " బ్రాహ్మణోత్తమా ! మీరు ఏఏదేశాలు తిరిగారు? అక్కడి విశేషాలు ఏమిటి? " అని అడిగాడు. అందుకు బ్రాహ్మణుడు ఇలా చెప్పాడు " నేను ఎన్నో దేశాలు చూసాను కానీ ద్రుపద దేశాన్ని మించింది లేదు. ద్రుపద మహారాజుకు యజ్ఞగుండం నుండి పుట్టిన కుమార్తె ఉన్నది. ఆమె పేరు ద్రౌపది. ద్రుపదుడు ఆమెకు వివాహం చేయ నిశ్చయించాడు " అని చెప్పాడు. అది విన్న ధర్మరాజు ఆశ్చర్యపడి " బ్రాహ్మణోత్తమా ! ఆమె ఎందుకు మానవులకు జన్మించ లేదు? ఆమెను ద్రుపదుడు ఎలా పొందాడు? సవిస్తరంగా మాకు చెప్పండి " అని అడిగాడు. అందుకు

బ్రాహ్మణుడు " ద్రుపదుడు ద్రోణుడు చిన్ననాటి మిత్రులు ద్రోణుడు ద్రుపదునిచే అవమానించ బడ్డాడు. ద్రోణుడు తన శిష్యులచే ద్రుపదుని తెప్పించి ప్రతీకారం తీర్చుకున్నాడు. ద్రుపదుడు ఆ అవమానాన్ని సహించలేక ద్రోణుని చంపే కుమారుని అర్జునిని వివాహమాడే కుమార్తెను పొందాలని యజ్ఞం చేసాడు. " యజ్ఞం నుండి భయంకర శరీరంతో ధనుర్బాణాలతో ఒక పురుషుడు ఉద్భవించాడు. తరవార అద్భుత సౌందర్య రాశి అయిన ఒక స్త్రీ వచ్చింది. ఆకాశవాణి ఆ పురుషునకు దృష్టద్యుమ్నుడు స్త్రీకి ద్రౌపది అని పేరు నామకరణం చేసాడు. ద్రుపద మహారాజు అర్జునుని మరణ వార్త బాధ పెట్టింది. కానీ ఆయన పురోహితుడు పాడవులకు అన్నీ శుభ శకునాలు గోచరిస్తున్నాయి. వారు జీవించే ఉన్నారు అని చెప్పాడు. అందుకు ఒక ఉపాయం ఆలోచిన ద్రుపదుడు మత్స్య యంత్రాన్ని చేయించాడు. దానిని భేదించిన వాడికి ద్రౌపదిని ఇచ్చి వివాహం చేస్తానని ప్రకటించాడు. ద్రౌపది స్వయం వరానికి రాజులంతా తరలి వెళుతున్నారు " అని చెప్పాడు. కుంతీ దేవి ఇదంతా విని " ధర్మరాజా మనం ఈ బ్రాహ్మణుని ఇంట ఎక్కువ రోజులు ఉన్నాము. ఎక్కువ రోజులు ఒకరి ఇంట ఉండటం ఉచితం కాదు. కనుక మనం పాంచాల దేశం వెళతాము " అని చెప్పింది. అందుకు ధర్మరాజు అంగీకరించాడు. అందరూ పాంచాల దేశానికి ప్రయాణ మయ్యారు. వారు పాంచాల దేశం వెళుతూ మార్గ మద్యంలో వ్యాస మహా ముని ఆశ్రమం దర్శించారు. వ్యాసుడు వారిని దీవించి మీరు పాంచాల దేశం వెళ్ళినట్లైతే మీకు మేలు జరుగుతుంది అన్నాడు.

## అంగారపర్ణుడు

ఆ తరవాత వారు గంగా తీరంలో ప్రయాణిస్తూ సోమశ్రవ తీర్థం చేరుకున్నారు. వారు అక్కడ స్నానం చేయాలని అనుకున్నారు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన అంగారపర్ణుడు అనే గంధర్వుడు " మానవులారా ఇది రాక్షసులు, యక్షులు, గంధర్వులు తిరిగే సమయం. ఈ వేళలో మానవులకు తిరగడం ఉచితము కాదు. ఇది నా ఆధీనంలో ఉన్న భూమి ఇక్కడ మీరు స్నానం చేస్తే ఆపదల పాలౌతారు. మీరు వెళ్ళక పోతే నా బాణాగ్నికి దగ్ధం అవుతారు " అన్నాడు. అర్జునుడు " నీవు చెప్పింది సామాన్య మానవులకు సరిపోతుంది. మా వంటి వీరులకు కాదు పవిత్రమైన గంగానది ఏ ఒక్కరి స్వంతం కాదు. భూమి మీది జల వనరులు అందరి స్వంతం " అని అంగారపర్ణునితో అన్నాడు. తనకు ఒక మానవుడు ఎదురు చెప్పటమేమిటని అంగారపర్ణుడు కోపించి అర్జునినిపై పదునైన బాణాలు వేసాడు. అర్జునుడు ఆ బాణాలను చేతిలోని కొరివితో అడ్డుకుని అంగారపర్ణునిపై ఆగ్నేయాస్త్రం ప్రయోగించి అతని రధాన్ని బుగ్గి చేసాడు. నిస్సహాయంగా చూస్తున్న అంగారపర్ణుని ధర్మరాజు వద్దకు తీసుకు వెళ్ళాడు. ధర్మరాజు " అర్జునా ఓడి పోయిన వారిని, శౌర్యం కోల్పోయిన వారిని, శిక్షించ రాదు కనుక అతనిని విడిచి పెట్టు " అన్నాడు.

## అర్జున అంగారుపర్ణుల స్నేహము

అంగారపర్ణుడు " అర్జునా నీ పరాక్రమానికి మెచ్చాను. నీతో స్నేహం చేయాలని ఉంది. నీకు చాక్షుసీ విద్యను, మహా వేగం కలిగిన గుర్రాలను ఇస్తాను నువ్వు నాకు ఆగ్నేయాస్త్రం నాకు ఇవ్వు " అన్నాడు. అర్జునుడు " గంధర్వా మనం ఎంత స్నేహితులమైనా నీ వద్ద నేను విద్యను, ధనాన్ని స్వీకరించరాదు. నేను నీకు ఆగ్నేయాస్త్రాన్ని ఇస్తాను. నీ వద్ద గుర్రాలను స్వీకరిస్తాను " అన్నాడు. అర్జునుడు గంధర్వునితో " ధర్మపరులమైన మమ్మల్ని చూసి గర్వంగా ఎందుకు మాట్లాడావు " అని అడిగాడు. అందుకు అంగారపర్ణుడు " అర్జునా ! ఆడవారితో ఉన్న వాడు వివేకం కోల్పోవడం సహజం కానీ ఆ సమయంలో మనకు పురోహితుడుంటే ధర్మా ధర్మ విచక్షణ చేస్తాడు. తాపత్యా ! మీరు పురోహితుడు లేకుండా తిరగటం మంచిది కాదు. అందువలన ఒక ఉత్తమ బ్రాహ్మణుని పురోహితునిగా చేసుకొండి " అని చెప్పాడు. అర్జునుడు " మిత్రమా ! మేము కుంతీ పుత్రులమైన మేము తాపత్యులము ఎలా అయ్యాము " అని అంగారపర్ణుని అడిగాడు. అంగారపర్ణుడు ఇలా చెప్పాడు " అర్జునా ! సూర్యుని కూతురుకు సావిత్రికి చెల్లెలు తపతి అనే కన్య మహా సౌందర్యవతి. ఆజామీడుని కొడుకు సంవర్ణుడు. అతడు సూర్యుని గురించి తపసు చేసాడు. తన కూతురు తపతికి సంవర్ణుడు తగిన భర్త అని అనుకున్నాడు. ఒక రోజు సంవర్ణుడు తపతిని చూసి మోహించి ఆమె సమీపానికి వెళ్ళి ఆమెను ప్రశ్నించాడు. ఆమె మౌనంగా అక్కడ నుండి వెళ్ళినా ఆమెకు కూడా అతనిపై మోహం కలిగింది. పిచ్చి వాడిలా తిరుగుతున్న సంవర్ణునిని చూసి అతని బాధను అర్ధం చేసుకుని తాను కన్యనని స్వతంత్రురాలిని కాదు కనుక తండ్రి అనుమతితో వివాహమాడమని చెప్పింది. ఒక రోజు వశిష్టుడు సంవర్ణుని కలిసి అతని బాధను తెలుసుకున్నాడు. వశిష్టూడు సూర్యుని వద్దకు వెళ్ళి " పూరు వంశస్తుడు, ధర్మపరుడు, సద్గుణ సంపన్నుడైన సంవర్ణునికి నీ కుమార్తె తపతిపై మోహం కలిగింది కనుక నువ్వు నీ కుమార్తెను అతనికి ఇచ్చి వివాహం చెయ్యి అని చెప్పాడు. సూర్యుడు తన కోరిక తీరు తున్నందుకు సంతోషించి తపతిని వశిష్టునితో పంపాడు. వశిష్టుడు వారిద్దరికి వివాహం చేసాడు. వారికి కురు మహారాజు జన్మించాడు. మీరు కురు వంశజులు కనుక మిమ్మల్ని తపత్యా అని పిలిచాను " అని చెప్పాడు.

## వశిష్టుడు


విశ్వామిత్రునకు విందు ఏర్పాటు చేయవలసినదిగా సబలను కోరుతున్న వశిష్టుడు

అర్జునుడు అంగారపర్ణుని చూసి " గంధర్వా ! మా పూర్వులకు గురువు పురోహితు డైన వశిష్టుడిని గురించి వినాలని ఉంది " అడిగాడు. అంగార పర్ణుడు అర్జునితో ఇలా చెప్ప సాగాడు. " అర్జినా ! పూర్వం కన్యాకుబ్జ నగరాన్ని విశ్వామిత్రుడు అనేరాజు పాలిస్తున్నాడు. ఒక రోజు అతడు తన సేనలతో సహా వేటకు వెళ్ళి అలసి పోయి వశిష్టుని ఆశ్రమంలోకి సైన్యంతో సహా వెళ్ళాడు. ఇరువురు పరస్పర కుశలం విచారించుకున్న తరువాత వశిష్టుని బలవంతం కారణంగా ఆశ్రమంలో భోజనం చేయడానికి అంగీకరించాడు. నందినీ అనే కామధేనువు సాయంతో అపార సేనావాహినితో సహా విశ్వా మిత్రునకు వశిష్టుడు షడ్రశోపేత మైన విందు భోజనం పెట్టాడు. అది విశ్వామిత్రుని ఆశ్చర్యచకితుని చేసింది. అలాంటి ధేనువు తన వద్ద


విశ్వామిత్రుని సైన్యంపై నందిని కోపం

ఉండటం ఉచిత మని ఎంచి వశిష్టుని వద్దకు వెళ్ళి ఆధేనువును ఇమ్మని కోరాడు. వశిష్టుడు అది తనకు ప్రాణాధారం కనుక ఇవ్వలేనని చెప్పాడు. విశ్వామిత్రుడు రాజ్యంలోని నొత్తుపై రాజుకు అధికారం ఉంటుంది కనుక తాను తీసుకు వెళతానని బలవంతంగా నందినిని తీసుకు వెళ్ళాడు. తిరిగి వశిష్టుడిని చేరిన నందినీ తన నుండి అపార సైన్యాన్ని సృష్టించి విశ్వామిత్రుని సైన్యాన్ని చీల్చి చెండాడింది. విశ్వామిత్రునికి జ్ఞానోదయం కలిగి క్షాత్ర బలం కటే తపో బలం గొప్పదని తెలుసుకుని రాజ్యాన్ని విడిచి పెట్టి తపసు చేసుకోవడానికి వెళ్ళాడు.

## విశ్వామిత్రుడి మత్సరం

తపస్సు వలన దివ్యశక్తులు సాధించినా విశ్వామిత్రునికి వశిష్టునిపై మత్సరం పోలేదు. వశిష్టుడు కల్మషపాదునికి యాజకుడుగా చేస్తున్నాడు. విశ్వామిత్రునకు కూడా కల్మషపాదునికి యాజకునిగా ఉండాలని ఉండేది. ఒక రోజు కల్మషపాదుడు వేటకు వెళ్ళి తిరిగి వస్తున్న తరుణంలో వశిష్టుని పెద్ద కుమారుడు శక్తిముని ఎదురు పడ్డాడు. రాజు శక్తితో ! పక్కకు తొలగి నాకు దారి ఇవ్వు " అని అడిగాడు. శక్తి " మహారాజా ! ఎంతటి వారైనా బ్రాహ్మణుడు ఎదురైతే ముందుగా తొలగి దారి ఇవ్వడం ధర్మం " అని చెప్పాడు. రాజు ఆగ్రహించి చేతి కర్రతో శక్తిని కొట్టాడు. శక్తి కోపించి " రాజా ! రాక్షసుడిలా నన్ను కొట్టావు కనుక రాక్షసుడివై నరమాంస భక్షకుడివైపో " అని శపించాడు. అప్పుడు కళ్ళు తెరచిన కల్మషపాదుడు శాపవిమోచనం ఇవ్వమని వేడు కున్నాడు. దూరంగా ఇదంతా గమనిస్తున్న విశ్వామిత్రుడు కల్మషపాదునిలో కింకరుడు అనే రాక్షసుని ప్రవేశపెట్టాడు. అప్పటి నుండి కల్మషపాదుడు రాచకార్యాలు మానివేసాడు. ఒక రోజు ఒక బ్రాహ్మణుడు కల్మషపాదుని మాంసాహారం పెట్టించమని అడిగాడు. అప్పటికి సరేనని ఆ తరవార మరచి పోయినా రాత్రికి గుర్తు వచ్చి వంటవాడిని పిలిచి ఆ బ్రాహ్మణునికి మాంసాహార భోజనం పెట్టమన్నాడు. వంటవాడు ఆ సమయంలో మాంసం లభ్యం కాదని చెప్పాడు రాజు ఆవేశంతో నరమాంసం అయినా పెట్టమన్నాడు. వంటవాడు నరమాంసం వండి ఆ బ్రాహ్మణునికి పెట్టాడు. తాను తిన్నది నరమాంసం అని గ్రహించిన బ్రాహ్మణుడు " కల్మషపాదుని చూసి నాచేత నరమాంసం భుజింప చేసావు కనుక నీవు రాక్షసుడవై నరమాంసం తింటూ జీవించు " అని శపించాడు. కల్మషపాదుడు వెంటనే రాక్షసుడైనాడు. వెంటనే శక్తి దగ్గరకు వెళ్ళి " దీనికంతా కారణం నీవే కనుక ముందు నిన్నే భక్షిస్తాను " అని చెప్పి అతనితో చేరి వశిష్టుని నూరుగురు కుమారులను భక్షించాడు.

## వశిష్టుడి ఆత్మహత్యా ప్రయత్నము

తన నూరుగురు కుమారులు చనిపోవడం సహించలేని వశిష్టుడు ఆత్మహత్యకు పాల్పడ బోతుండగా శక్తి భార్య అదృశ్యవంతి గర్భస్థ శిశువు సుస్వరంతో వేదాలను వల్లించడం విన్నాడు. వశిష్టుడు మనుమని చూడాలని ఆశతో ఆత్మహత్యా ప్రయత్నం మానుకున్నాడు. ఒక రోజు కల్మషపాదుడు అదృశ్యవంతిని భక్షింపబోయాడు. వశిష్టుడు అతనిపై మంత్ర జలం చల్లాడు. వెంటనే కల్మషపాదునికి రాక్షసత్వం పోయి శాప విముక్తుడు అ య్యాడు. వశిష్టుడు కల్మషపాదునితో " బ్రాహ్మణులను అవమానిస్తే వచ్చే అనర్ధం తెలుసింది కదా ఇక మీదట బ్రాహ్మణులను పూజించు " అని హితభోధ చేసాడు. రాక్షసునిగా ఉన్న సమయంలో కల్మాషపాదుడు ప్రణయకాలాపం లో ఉన్న బ్రాణుని చంపి తిన్నాడు. బ్రాహ్మణుని భార్య కోపించి " ప్రణయకాలాపంలో ఉన్న నా భర్తను చంపావు కనుక నీవు స్త్రీతో ప్రణయకాలాపం చేస్తే మరణిస్తావు " అని శపించింది. అందువలన కల్మాషపాదుడు సంతానం పొందలేక పోయాడు. సంతానం కావాలనే కోరిక అధికం కావడంతో వశిష్టుని వద్దకు వచ్చి తనకు సంతానం ప్రసాదించమని వేడుకున్నాడు. వశిష్టుడు అందుకు అంగీకరించాడు. కల్మాషపాదుని భార్య మదయంతి యందు సంతానం కలిగేలా అనుగ్రహించాడు. మదయంతి గర్భం ధరించింది. పన్నెండేళ్ళు గడచినా ప్రసవం కానందున ఆమె పదునన రాతితో గర్భాన్ని చీల్చుకుంది. ఆమెకు అశ్మకుడు అనే రాజర్షి జన్మించాడు. అదే సమయంలో శక్తి భార్య అదృశ్యంతికి పరాశరుడు జన్మించాడు. అతడు తల్లి వలన తన తండ్రిని ఒక రాక్షసుని వలన మరణించాడని విని ఆగ్రహం చెంది లోకాలను భస్మం చేస్తానని శపధం చేసాడు. అది విని వశిష్టుడు అతనిని వారించాడు.

## ఔర్యుడు

పరాశరుని కోపము చూసి అతడి తాత వశిష్టుడు " పరాశరా ! అకారణంగా అందరిని హరించడం తగదు. పూర్వం కృతవీర్యుడు భృగువంశ వంశ బ్రాహ్మణులను యాజ్ఞికులుగా చేసుకుని ఎన్నో యజ్ఞాలను చేసాడు. కృతవీర్యుడు వారికి మిక్కుటమైన ధనాన్ని ఇచ్చాడు. దానిని వారు దాచుకున్నారు. కొంత కాలానికి కొంత మంది క్షత్రియులు భృగు బ్రాహ్మణులు కృతవీర్యుడి ధనాన్ని దాచుకున్నారు అని అపప్రధ పుట్టించారు. అది విని కొంత మంది బ్రాహ్మణులు ధనాన్ని క్షత్రియులకు ఇచ్చారు. కొంత మంది ధనాన్ని భూమిలో పాతి పెట్టారు. క్షత్రియులు ఇది చూసి ఆ బ్రాహ్మణులను చంపి ఆ ధనాన్ని తీసుకు వెళ్ళారు. భృగువంశ బ్రాహ్మణుల గర్భస్థ శిశువులతో సహా చంపి వేసారు. స్త్రీలు భయపడి హిమాలయాలకు పారిపోయారు. అందులో ఒక బ్రాహ్మణుని భార్య తన తొడలో గర్భాన్ని దాచింది. ఆమె తొడ నుండి తేజో వంతుడైన ఔర్యుడు అనే కుమారుడు జన్మించాడు. అతని తేజస్సుతో కృతవీర్యుని వంశంలోని క్షత్రియులందరూ అంధులయ్యారు. ఔర్యుడు త తండ్రితో సహా బంధులందరిని చనిపోయారని తెలుసుకున్నాడు. లోకాలను నాశనం చేయటానికి ఘోర తపస్సు చేయడం సంకల్పించాడు. ఔర్యుని పితృదేవతలు ప్రత్యక్షమై " మేము అసమర్ధులమై క్షత్రియుల చేతిలో మరణించ లేదు. ధనాపేక్షతో ధనాన్ని దాచలేదు. మేము గొప్పగా తపస్సు చేయడం వలన మాకు మరణం రాలేదు. ఆత్మ హత్య చేసుకుందామని అనుకుంటే అది పాపమని చేయలేక పోయాము. ఈ మనుష్య లోకంలో అధిక కాలం ఉండలేము. కనుక క్షత్రియులతో వైరం తెచ్చుకుని వారి చేతిలో మరణం తెచ్చుకున్నాము. కనుక నువ్వు లోకాలను నాశనం చేయడం ధర్మం కాదు " అని పలికారు. వారి మాటలను విన్న తరవాత ఔర్యుడు తన సంకల్పం విరమించుకున్నాడు.

## పరాశరుని సత్రయాగం

ఔర్యుని వృత్తాంతం విని పరాశరుడు సంకల్పం విరమించుకున్నా రాక్షసుల మీద కోపం పోలేదు. అందు వలన పరాశరుడు రాక్షస వినాశనానికి సత్రయాగం చేయ సంకల్పించాడు. వశిష్టుడు అందుకు అభ్యంతరం చెప్పలేదు. ఆ సత్రయాగంలో రాక్షసులందరూ పడి భస్మం అవుతున్నారు. అలా రాక్షస జాతి అంతరిస్తుంటే పులస్త్యుడు, పులహుడు, క్రతువు వశిష్టుని దగ్గరకు వచ్చి పరాశరుడు చేసే రాక్షస వినాశనం ఆపమని వేడుకున్నారు. వారి కోరికను మన్నించి పరాశరుడు సత్రయాగాన్ని, రాక్షస వినాశనాన్ని ఆపి వేసాడు.

## ధౌమ్యుడు

అర్జునుడు అంగారపర్ణునితో " మాకు ఇక్కడ తెలిసిన వాళ్ళు లేరు. మాకు నువ్వు దారి చూపి పురోహితుడిని ఎవరో చెప్పు " అని అడిగాడు. అందుకు అంగారపర్ణుడు " ఇక్కడకు ఉత్కంచం అనే పుణ్య తీర్ధం ఉంది. అక్కడ ధౌమ్యుడు అనే బ్రాహ్మణుడు తపసు చేసుకుంటున్నాడు. మీరు అతనిని పురోహితునిగా చేసుకోండి " అని అర్జునినితో అన్నాడు. తరవాత పాండవులు ధౌమ్యుని వద్దకు వెళ్ళారు. అతనిని తమ పురోహితునిగా ఉండమని కోరారు. ధౌమ్యుడు అందుకు సమ్మతించాడు.


దారిలో వ్యాసుని కలసిన పాండవులు

పాండవులు కుంతీ దేవి ధౌమ్యుని వద్ద ఆశీర్వాదం తీసుకుని ఆయనతో పాంచాల దేశానికి బయలు దేరారు. దారిలో మరి కొందరు బ్రాహ్మణులు వారిని అనుసరించారు. పాంచాల దేశంలో వారు ఒక కుమ్మరి ఇంట బస చేసారు.

## ద్రౌపదీ స్వయంవరం


ద్రౌపది స్వయంవరం గురించి సభలో ప్రకటించుచున్న దుష్టద్యుమ్నుడు

స్వయంవర మండపంలో అనేక మంది రాజులు ఉపస్థితులై ఉన్నారు. వారిలో ఒకరిని వరించడానికి కృష్ణ సిద్ధంగా ఉంది. దుష్టద్యుమ్నుడు మత్స్య యంత్రం గురించి రాజులకు రాజుల గురించి కృషణకు చెప్పాడు. స్వయంవరానికి దుర్యోధనాదులు, కర్ణుడు, భూరి శ్రవుడు, సోమదత్తుడు, శృతసేనుడు, అశ్వత్థామ, శల్యుడు, విరాటుడు, జరాసంధుడు, గాంధార రాజులు, సారణుడు, సాత్యకి, సాంబుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, కృతవర్మ, యుయుధానుడు, సుమిత్రుడు, సుకుమారుడు, సుశర్మ, సుదక్షిణుడు, సుషేణుడు, సేనాబిందుడు, చంద్రసేనుడు, సముద్రసేనుడు, ఔశీనరుడు, చేకితానుడు, జనమేజయుడు, శిశుపాలుడు, జయద్రధుడు, బృహద్రధుడు, సత్యవ్రతుడు, చిత్రంగదుడు, శుబాంగధుడు, భగీరధుడు, భగదత్తుడు, పౌండ్రక వాసుదేవుడు, వత్సరాజులు, యదు, వృష్టి, భోజ, అంధక వంశ రాజులు మొదలైన రాజులతో సంభావనల కోసం


స్వయంవరంలో మత్స్య యంత్రమును ఛేదించిన అర్జునుడు

బ్రాహ్మణ సమూహాలు వచ్చారు. అన్న బలరామునితో వచ్చిన శ్రీకృష్ణుడు పాండవులను గుర్తించాడు. కను సైగతో యదువీరులను స్వయంవరంలో పాల్గొన వద్దని ఆదేశించాడు. ఒక్కొక్కరే స్వయంవరంలో పాల్గొని విల్లు కూడా ఎక్కు పెట్టలేక పోయారు. కర్ణుడు, శల్యుడు లాంటి వారు ఎక్కు పెట్టినా మత్స్య యంత్రాన్ని చేధించ లేక పోయారు. అది చూసిన అర్జునుడు ధర్మరాజు వైపు చూసాడు. ధర్మరాజు వెళ్ళమని సైగ చేసాడు. సభాస్థలి వైపు వెళుతున్న అర్జునిని చూసి కొంతమంది ఇతనికి ఎందుకు. ఇతని వలన ఏమౌతుందని చులకనగా చూసినా కొందరు బ్రాహ్మణులు మర్యాద కాపాడాలని వేడుకున్నారు. అతి సులువుగా విల్లు ఎక్కు పెట్టి ఐదు బాణాలను వదిలి మత్స్యయంత్రాన్ని పడగొట్టాడు. రాజులంతా చేష్టలుడిగి చూస్తున్నారు. బ్రాహ్మణులు అత్యంత ఉత్సాహం చూపెట్టారు. ధర్మరాజు భీముని అర్జుననుకి తోడు ఉంచి తను విడిదికి వెళ్ళాడు. ద్రుపద రాజ పుత్రి అర్జునిని మెడలో వరమాల వేసింది.

## రాజులందరినీ కూర్చి సుయోధనుడు భీమార్జునులను ఎదుర్కొనుట

రాజులందరూ ఇది చూసి అగ్రహోదగ్రులైయ్యారు. దుర్యోధనుని నాయకత్వంలో " విద్యా పటిమ చూపించి గెలుచు కున్న బ్రాహ్మణుని తప్పలేదు. కానీ దృపదుడు మనలను పిలిపించి అమర్యాద చేసాడు. ఇతని బలాన్ని అణచివేయాలి " అని అన్నాడు. బ్రాహ్మణులు అర్జునిని ప్రోత్సహిస్తూ రాజులతో కలియబడ్డారు. దృపదుడు అర్జునిని ప్రక్కన నిలబడ్డాడు. అర్జునుడు బ్రాహ్మణులను వారించి భీమునికి సైగ చేసి రాజులతో తలపడ్డాడు. ఇక్కడ మహాభారతంలో శ్రీకృష్ణుని ప్రవేశం అవుతుంది. శ్రీకృష్ణుడు ఇదంతా ఆశ్చర్యంగా చూస్తున్నాడు. బలరామునితో " అన్నయ్యా! పాండవులను చూసావా వెళ్ళి పోయిన వారు

ధర్మరాజు నకుల సహదేవులు. చెట్టు పెరికి యుద్ధం చేస్తున్న వాడు భీముడు. బాణాలను సంధించి యుద్ధం చేసున్న వాడు అర్జునుడు " అన్నాడు. లక్క ఇంటిలో మరణించారని అనుకున్న వాళ్ళు ఇక్కడ కనపడటం బలరామునికి ఆశ్చర్యం కలిగించింది. కర్ణుడు అర్జునిని నైపుణ్యం చూసి " నన్ను ఎదిరించడం దేవేంద్రునికి, అర్జునినికి , పరశురామునికి తప్ప సాధ్యం కాదు నువ్వు ఎవరు? " అని అర్జునిని అడిగాడు. అర్జునుడు " నేను వీరిలో ఎవరిని కాను కాని ముందు యుద్ధం చెయ్యి " అన్నాడు. భీమడు శల్యునితో యుద్ధం చేసి ఓడించాడు. ఈ బ్రాహ్మణుల్తో యుద్ధం ఏమిటి అని రాజులు వెనుతిగారు. కానీ దుర్యోధనుడు మాత్రం " ఈ బ్రాహ్మణులు ఎవరు? ఎక్కడినుండి వచ్చారు ? " అని విచారిస్తుండగా శ్రీకృష్ణుడు సుయోధనా, ఇతరులు చేయలేని కార్యం ఈ బ్రాహ్మణుడు చేసాడు. ద్రౌపదిని భార్యగా పొందాడు. ఇక అతని గూరించి మనకు ఎందుకు పదండి " అని వారించాడు. దుర్యోదనాదులు సరే అని వెళ్ళి పోయారు.

## ద్రౌపదిని భీమార్జునులు కుంతీవద్దకు తీసుకు వెళ్ళుట

కుంతీదేవి విడిదిలో ఆందోళన పడసాగింది. స్వయంవరానికి వెళ్ళిన పాండవులు ఎంతకీ రాక పోయేసరికి దుర్యోధనాదులు గుర్తించి చంపివేసేరేమోనని కలత పడింది. ముందుగా ధర్మరాజు నకుల సహదేవులు వచ్చారు. తరువాత అర్జునుడు భీముడు ద్రౌపదితో వచ్చారు. రాగానే అర్జునుడు కుంతీ దేవితో " అమ్మా ! మేము ఒక బిక్ష తీసుకు వచ్చాము " అన్నాడు. వారిని చూడకుండానే కుంతీ " మీరు ఐదుగురు ఉపయోగించండి " అని చెప్పింది. ఆ తరవాత కొడుకు తీసుకు వచ్చింది ఒక కన్యనని తెలుసుకుని అధర్మం పలికినందుకు భయపడింది. ఆమె " ధర్మరాజా ! ఏమి తెచ్చారో తెలియక అలా పలికాను. ఇది అధర్మం, లోక విరుద్ధం. ఇప్పుడు ఏమి చేయాలి?" అని అడిగింది. అప్పుడు ధర్మరాజు అర్జునిని చూసి " అర్జునా ! ఈమెను నీవు గెలుచు కున్నావు కనుక నీవు వివాహం చేసుకో " అన్నాడు. అందుకు అర్జునుడు ధర్మరాజుతో " అన్నయ్యా ! పెద్ద వారు మీరుండగా నేను వివాహం చేసుకోవడం ఉచితం కాదు. ఈమెను మీరు వివాహం చేసుకోండి " అన్నాడు. ధర్మరాజు " మనలో మనకు తగువెందుకు మనం అయిదుగురం వివాహం చేసుకుంటాము " అన్నాడు. శ్రీ కృష్ణుడు బలరామ సహితంగా అక్కడకు వచ్చి తనని తాను పరిచయం చేసుకుని ధర్మరాజుకు కుంతీ దేవికి నమస్కరించాడు. ధర్మరాజు శ్రీకృష్ణునితో బ్రాహ్మణ వేషాలలో ఉన్న మమ్మలిని ఎలా గుర్తు పట్టారు. అన్నాడు. శ్రీకృష్ణుడు " ధర్మజా ! సూర్యని మేఘములు కమ్మినంత మాత్రాన తేజస్సు దాగుతుందా ! మీరు ఏ వేషంలో ఉన్నా మీ తేజస్సు మిమ్మలిని గుర్తించేలా చేసింది. మత్స్యయంత్రాన్ని అర్జునుడు కాక మరెవ్వరు ఛేదించగలరు. ఎలాగో లక్క ఇంటి నుండి తప్పించుకున్నారు. మీకు శుభం కలుగుతుంది " అని చెప్పి బలరామునితో వెళ్ళి పోయాడు.

## ధృపదుడు పాండవుల పుట్టుపూర్వోత్తరాలు కనుగొన ప్రయత్నించుట

ధృపదుడు కుమారుని పిలిచి " ధృష్టద్యుమ్నా ! ఎవరో బ్రాహ్మణుడు మత్స్యయంత్రాన్ని కొట్టి ద్రౌపదిని తీసుకు వెళ్ళారు. నీవు పోయి వారి పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకుని రా " అని చెప్పాడు. ధృష్టద్యుమ్నుడు భీమార్జునుల వెంట వెళ్ళి జరిగినది చూసివచ్చాడు. ధృపదునితో " తండ్రీ ఆ ఇరువురూ ద్రౌపదిని తీసుకుని ఒక వయసు పైబడిన స్త్రీకి చూపించారు. అందరూ ఆమెకు నమస్కరించారు. అందులో పెద్దవాడు చెప్పినది విని మిగిలిన నలుగురు వెళ్ళి బిక్ష తీసుకుని వచ్చారు. అందులో కొంత భాగం బలి దానాలకు, అతిథులకు పెట్టారు. మిగిలిన దానిలో సగభాగం బలిష్టుడైన రెండవ వానికి పెట్టారు. మిగిలినది మిలినవారు తిన్నారు. చెల్లి ద్రౌపది వారికి విసుక్కోకుండా సేవలు చేసింది. వారందరికి దర్భలతో పడకలు తయారు చేసింది. వారంతా ఏనుగులు, గుర్రాలు, యుద్ధాలు గురించి మాట్లాడు కుంటున్నారు. వారి నడవడి బ్రాహ్మణుల వలె లేదు శ్రేష్టమైన రాజకుమారుల వలె ఉన్నారు " ధృష్టద్యుమ్నుడు చెప్పాడు. అయినా ధృపదునికి నమ్మకం కురదక తన పురోహితుని పిలిచి " విప్రోత్తమా ! నీవు వెళ్ళి వారి వద్దకు పుట్టు పూర్వోత్తరాలు కనుక్కుని రా " అని పంపాడు. పురోహితుని చూసి ధర్మరాజు తగిన విధంగా సత్కరించాడు. ఆ పురోహితుడు ధర్మరాజుతో " బ్రాహ్మణోత్తమా ! ధృపదుడు ఆడపిల్ల తండ్రి కదా. మీ కులగోత్రాలు అడిగి రమ్మన్నాడు " అన్నాడు. ధర్మరాజు " విప్రోత్తమా ! మీ రాజు మత్స్యయంత్రం కొట్టిన వాడికి పిల్లనిస్తానని చెప్పాడు. మా సోదరుడు సాధించాడు. మా కులగోత్రాలు తెలుసుకుని ఏమి చేస్తాడు? వీరుడు కాని వారు మత్స్యయంత్రం కొట్టగలరా ? మీ మహారాజు కోరిక తీరింది కదా విచారమేల? " అని మర్మంగా మాట్లాడాడు. చేసేది లేక ఆ విప్రుడు ఆ విషయాన్ని ధృపదునికి చెప్పాడు.

## ధృపదుడు పాండవులను గుర్తించుట

విప్రుని మాటలకు ధృపదుని సందేహం కొంతవరకు తీరినా మనసులో ఇంకా ఏదో సందేహం. అది తీర్చు కోవడానికి నాలుగు జాతుల వారికి అనువయిన రధాలను సిద్ధం చేయించి ధృష్టద్యుమ్నుని పాండవులను తీసుకురావటానికి పంపాడు.

పాండవులు క్షత్రియులకు ఉచితమైన రథాలను ఎక్కి ద్రుపదుని వద్దకు వచ్చారు. పాండవులకు ఎదురేగి అతిథి సత్కారాలు గావించి వారికి అనేక కానుకలు పంపాడు. పాండవులు క్షత్రియులకు ఉచితమైన ఆయుధాలను మాత్రం తీసుకున్నారు. ద్రుపదుడు సంతోషించాడు. వారు క్షత్రియులన్న నిర్ధారణకు వచ్చారు. కానీ వారి నోటితో చెబితే బాగుంటుందని ధర్మరాజుతో " అయ్యా ! మీరు దేవతలా, గంధర్వులా, క్షత్రియులా లేక బ్రాహ్మణులా చెప్పి నా సందేహం తీర్చండి. మీ నిజ స్థితి తెలియకుండా నా కుమార్తెను ఎలా ఇవ్వగలను? " అన్నాడు. ఇక దాచడం భావ్యం కాదని ధర్మరాజు ద్రుపద " మహారాజా ! మేము క్షత్రియులము. పాండురాజ పుత్రులము. నా పేరు ధర్మరాజు. వీరు భీమార్జున నకుల సహదేవులు. మత్స్యయంత్రాన్ని నా తమ్ముడు అర్జునుడు మత్స్యయంత్రాన్ని ఛేదించాడు. ఈమె మా తల్లి కుంతీ దేవి " అని చెప్పాడు.

## ద్రౌపది వివాహ ప్రస్థావన

అది విన్న ద్రుపదుడు తన చిరకాల కోరిక నెరవేరిందని పొంగిపోయాడు. ధర్మ రాజు పక్కన కూర్చుని " విచిత్రవీర్యుని మనుమడు పాండురాజు కుమారుడు నాకు అల్లుడు కావడం నాకు సంతోషంగా ఉంది. స్వయంవరంలో అతడిని వరించిన కన్యతో అర్జుననికి వివాహం చేస్తాను " అన్నాడు. దానికి ధర్మరాజు " అర్జునుడి కంటే ఇద్దరం పెద్దవాళ్ళం ఉన్నప్పుడు అదెలా కుదురుతుంది " అన్నాడు. ద్రుపదుడు " అయితే పెద్దవాడివైన నీవు వివాహం చేసుకో ధర్మబద్ధంగా ఉంటుంది " అన్నాడు. ధర్మరాజు " అలా కాదు. అర్జునుడు తెచ్చిన భిక్ష ఐదుగురు పంచుకోవాలని మాతల్లి గారి కోరిక. అందువలన ఈ కన్యను మేము ఐదుగురం వివాహం చేసుకుంటాము " అన్నాడు. అది విన్న ద్రుపదుడు " అదేమిటి? ఒక పురుషుడు చాలా మంది కన్యలను వివాహం చేసుకోవచ్చు. ఒక కన్యను మాత్రం ఎక్కువ మంది వివాహమాడటం లోక విరుద్ధం కనుక ఆలోచించి రేపు నిర్ణయం తీసుకుంటాము " అన్నాడు. మరునాడు వ్యాసుడు అక్కడకు వచ్చాడు. అందరూ సమావేశమైన సమయంలో ద్రుపదుడు వ్యాసునితో జరిగినదంతా వివరించి " మహాత్మా ! ఒక కన్యను ఐదుగురు పురుషులకు ఇవ్వడం లోక విరుద్ధం కాదా ? తమరే ధర్మ నిర్ణయం చేయండి " అన్నాడు. ధర్మరాజు చేతులు జోడించి " మాకు మా తల్లి దైవం. ఆమె మాటను మేము జవదాటం. నేను మాట వరుసకు కూడా అబద్ధం చెప్పను. నానోట ఈ మాట ఎలా వచ్చిందో తెలియడం లేదు. పూర్వం జటిల అను ఋషి కన్య ఏడుగురు ఋషులను వివాహమాడింది. దాక్షాయిని అనే కన్య ప్రచేతనులు అనబడే పదిమందిని వివాహం చేసుకుంది. కనుక ద్రుపద మహారాజా ! ఆలోచించక నీ కుమార్తెను మా ఐదుగురికి ఇచ్చి వివాహం చేయవచ్చు" అన్నాడు. ఇరువురి వివాదం విన్న వ్యాసుడు కాసేపు ఆలోచించాడు. ద్రుపదునితో " మహా రాజా ! నీ కుమార్తెను ధర్మరాజు చెప్పినట్లు వారైదుగురికి ఇచ్చి వివాహం చెయ్యి. ఇది ధర్మ నిర్ణయం. ఇందుకు కారణం చెపుతాను " అని చెప్పి ద్రుపదుని ఏకాంతానికి తీసుకు వెళ్ళాడు.

## ద్రౌపది పూర్వజన్మల వృత్తాంతం

వ్యాసుడు ద్రుపదుడితో " ద్రుపదమహారాజా ! పూర్వం మౌద్గల్య ముని భార్య ఇంద్రసేన మహా పతివ్రత. మౌద్గల్యుడు కుష్టురోగంతో బాధ పడుతున్నాడు. అయినా అసహ్యించు కోకుండా సేవలు చేస్తుంది. ఒక రోజు భర్తకు భోజనం పెట్టి మిగిలిన అన్నం తింటూ ఉన్నప్పుడు అందులో భర్త వేలు ఊడిపడి ఉండటం చూసి అది పక్కన పెట్టి మిగిలిన అన్నం తింటూ ఉంది. ఇది చూసి మౌద్గల్యుడు ఆశ్చర్య పోయాడు. " ఇంద్రసేనా ! నీ పతి భక్తి అమోఘం. నీకు ఏమి వరం కావాలో కోరుకో ఇస్తాను " అన్నాడు. " నాధా ! నాకు వాంఛలు తీరలేదు. అందుకు మీ రూపం అందుకు అడ్డు వస్తుంది. మీరు అందమైన ఐదు రూపాలుగా మారి నా కోరికలను తీర్చండి " అని అడిగింది. అందుకు అంగీకరించిన మౌద్గల్యుడు మనోహరమైన ఐదు రూపాలు ధరించి భార్య కోరిక తీర్చాడు. తరువాత అతడూ బ్రహ్మలోకానికి వెళ్ళాడు. కానీ కోరికలు తీరని ఇంద్రసేన మరు జన్మలో కాశీరాజు కూమార్తెగా జన్మించింది. ఆమె చాలా కాలం కన్యగా మిగిలి పోయింది. శివుని గురించి తపస్సు చేసింది. శివుడు ప్రత్యక్షమై ఏమి కావాలో కోరుకో అన్నాడు. శివుని చూసిన ఇంద్రసేన తన మనసులోని బలవత్తరమైన కోరికతో శివుని చూసిన తత్తరపాటుతో " నాకు భర్త కావాలి " అని అయిదు సార్లు చెప్పింది. శివుడు ఆమెతో " తథాస్తు మరు జన్మలో నీకు ఐదుగురు భర్తలు లభిస్తారు " అన్నాడు. అది విని ఆమె తన పొరపాటు గ్రహించింది. " దేవా ! ఒక కన్యకు ఐదుగురు భర్తలు లభించటం లోక విరుద్ధం కాదా నాకు ఈ వరం వద్దు " అన్నది. అందుకు శివుడు " సాధ్వీ నీవు ఐదుగురు భర్తలతో ధర్మబద్ధం అయిన కాపురం చేస్తావు " అన్నాడు. అలా ఐతే



ద్రౌపది పూర్వజన్మల వృత్తాంతం గురించి ద్రుపదునకు వివరిస్తున్న వ్యాసుడు

నాకు నిరంతర పతి సేవాభాగ్యం కావాలి . నాకు ఒక్కొక్కరితో ఏకాంత జీవితం కావాలి. కన్యాత్వం చెడకుండా కాపురం కావాలి " అని అడిగింది. శివుడు ఆమె కోరిన విధంగా వరాలు ఇచ్చాడు. " నువ్వు వెళ్ళి గంగా తీరంలో ఉన్న ఇంద్రుడిని తీసుకురా " అన్నాడు. ఆ సమయంలో యమ ధర్మరాజు సత్ర యాగం చేస్తున్నాడు. యాగ దీక్షలో ఉన్నాడు కాబట్టి ప్రాణి హింస చేయలేదు. లోకంలో మరణాలు తగ్గి భూభారం ఎక్కువైంది. ఇంద్రాది దేవతలు బ్రహ్మ లోకానికి వెళ్ళి " దేవా మరణం లేకుంటే మానవులకు మాకు తేడా ఏమిటి? అందుకు తరుణోపాయం తమరే చెప్పాలి " అన్నారు. అందుకు బ్రహ్మ దేవుడు " యముని సత్ర యాగం ముగిసే దాకా మీరు నిశ్చింతగా ఉండండి. ఆ తరవాత అతడు మానవులను అంతమొందిస్తాడు. మీ తేజస్సు, యముని తేజస్సుతో పుట్టిన వీరులు ఆయనకు సహాయంగా ఉంటారు " అన్నాడు. దేవతలు ఇంద్రలోకం వెళుతూ గంగా తీరంలో ఏడుస్తున్న కాశీరాజు కూతురిని చూసాడు. ఇంద్రుడు " ఎందుకు ఏడుస్తున్నావు " అని అడిగాడు. ఆమె " అది తెలిసుకోవాలంటే నా వెంట రావాలి " అని శివుని దగ్గరికి తీసుకు వెళ్ళింది. ఆ సమయంలో శివుడు ఒక యువతితో పాచిక లాడుతున్నాడు. ఇంద్రుడు " ముల్లోకాలకు అధిపతిని నాముందు జూదం ఆడుతావేమి? " అని అహంకారంతో అన్నాడు. అందుకు శివుడు కోపించి " గర్వంతో మాట్లాడకు నీకు చేతనైతే ఆకొండ గుహను చీల్చు" అన్నాడు. ఇంద్రుడు సరేనని గుహను చీల్చగానే తనలాంటి నలుగురిని చూసి ఆశ్చర్య పోయాడు. శివుడు నిజరూపం ధరించి " మీ ఐదుగురు ఇంద్రులు మానవ లోకంలో జన్మించండి. కాశీ రాజ పుత్రిక మానవ కాంతగా జన్మించి మీకు భార్య అవుతుంది " అన్నాడు. వ్యాసుడు " దృపద మహారాజా ఆ ఐదుగురు ఇంద్రులే పాండవులు. కాశీ రాజు కుమార్తె నీ ఇంట పెరుగుతున్న యజ్ఞసేని. నీకు అనుమానం అయితే వారి నిజరూపాలు చూడు" అని తన తపో మహిమతో వారి రూపాలు చూపగా. వెలుగుతున్న వారి నిజరూపాలను చూసాడు. వ్యాసుడు " దృపదా ! పూర్వం నితంతుడు అనే రాజర్షి కుమారులు కూడా ఔశీనర పుత్రికను స్వయంవరంలో గెలిచి వివాహ మాడారు. కనుక నీ కూతురిని పాండవులకిచ్చి వివాహం జరిపించు " అన్నాడు.

## ద్రౌపదితో పాండుసుతుల వివాహం


ద్రౌపదితో పాండవుల వివాహం

వ్యాసుని మాటలతో దృపదుని సందేహం తీరింది. ద్రౌపదిని పాండవులకు ఇవ్వడానికి సమ్మతించాడు. పాడవుల తరపున ధౌమ్యుడు పౌరోహిత్యం వహించాడు. సర్వాలంకార భూషిత అయిన ద్రౌపదిని ముందుగా వేదోక్తంగా ధర్మరాజుకు ఇచ్చి వివాహం చేయించారు. తరవాత పరమ శివుని ప్రార్ధించగానే తిరిగి కన్యాత్వం సిద్ధించింది. ఆ తరువాత భీమసేనునికి ఆ తరువాత అర్జునినికి ఆ తరువాత నకుల సహదేవులకు వేదోక్తంగా వివాహం జరిపించారు. ఆపై కుంతీ దేవి ఆశీర్వాదం పొంది ఆపై పెద్దల ఆశీర్వాదం పొందారు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

# ఆది పర్వము అష్టమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



# అష్టమాశ్వాసం

ద్రౌపదీ స్వయంవరం తరువాత దృపదుడు పాండవులకు ఆభరణాలను ఏనుగులను గుర్రాలను కానుకగా ఇచ్చాడు. ద్రౌపది కూడా పతివ్రతా ధర్మంతో ఐదుగురు భర్తలకు సేవచేస్తూ ఉంది. కుంతీ దేవి కూడా కోడలిని సకలైశ్వర్య వంతురాలిగా సంతాన వతిగా దీవించింది. ద్వారకా నగరంలో ఉన్న శ్రీకృష్ణుడు పాండవుల వివాహ సమయంలో అనేక కానుకలు పంపాడు. ఆ విధంగా పాండవులు ఒక సంవత్సరకాలం రాజభోగం అనుభవించారు. దుర్యోధనుడు వేగుల వలన మత్స్యయంత్రాన్ని ఛేదించింది అర్జునుడని తెలుసుకుని పాండవులు లక్క ఇంట్లో మరణించ నందుకు చింతించాడు. విదురుడు ఈ విషయం తెలిసి సంతోషించాడు. దృతరాష్ట్రుడు మాత్రం దృపదుని కుమార్తె ద్రౌపదిని చేసుకుని పాండవులు మిత్ర లాభం పొందారని అనుకున్నాడు. ఒకరోజు విదురుడు దృతరాష్ట్రుని వద్ద లేని సమయం చూసి దుర్యోధనుడు కర్ణునితో వచ్చి " తండ్రీ ! పాండవులు బ్రతికి ఉన్నారు. విదురుడు పాండవ పక్షపాతి అని తెలిసి కూడా నీవు అతనికి విలువ ఇవ్వడం దురదృష్టకరం "

అన్నాడు. ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో " నాయనా ! నేను పైకి పాండవులంటే ఇష్టమున్నట్లు ఉంటాను కానీ అది నిజం కాదు. విదురునికి అది తెలియనీయను. మనం ఒక విషయం మరువ కూడదు. పాండవులకు దైవ బలం ఉంది. మనం వారిని ఏమీ చేయ లేము " అని చెప్పాడు.

## సుయోధనుడు తండ్రితో సమాలోచన

దుర్యోధనుడు " తండ్రీ పాండవులు ఇప్పుడు ధృపద రాజ పురంలో ఉన్నారు. వారికి పాంచాల రాజు అండగా ఉన్నాడు. శ్రీకృష్ణుడు, వృష్టి, అంధక రాజులు తోడుగా వున్నారు. వారిని బలహీనులను చెయ్యాలంటే పాంచాలరాజు నుండి వేరు చెయ్యడం ఒక మార్గం. రెండవది కుంతీ పుత్రుల మధ్య మాద్రీ పుత్రుల మధ్య విభేధం సృష్టించడం. మూడవది అందగత్తె లైన స్త్రీలను ప్రయోగించి పాడవులు ద్రౌపది మధ్య విభేదం సృష్టించడం. నాల్గవది కుటిలో పాయంతో భీముని చంపి పాడవులను నిర్వీర్యులను చేయడం. వీటిలో ఏది మంచిదో మీరే నిర్ణయించండి " అన్నాడు. కర్ణుడు దుర్యోధనునితో " దుర్యోధనా ! సజ్జనులు సత్ప్రవర్తనులు అయిన పాండవులను ధృపదుడు వదులుకోడు, ద్రౌపది కోరి పాండవులను వివాహ మాడింది కనుక విభేధం సృష్టించడం సాధ్యం కాదు. భీముని చంపడం సాధ్యమైన పని కాదు. ఇప్పటి వరకూ చేసిన అటువంటి ప్రయత్నాలు విఫలం అయ్యాయి. కనుక ధృపదుని ఓడించి పాండవులను పట్టుకు వస్తాము " అన్నాడు. ధృతరాష్ట్రుడు " పెద్దలతో ఆలోచించి రేపు నిర్ణయం తీసుకుంటాము" అని అన్నాడు.

## ధృతరాష్ట్రుడు భిష్మాదులతొ సమాలోచన చేయుట

మరునాడు ధృతరాష్ట్రుడు భీష్ముడు, ద్రోణుడు, విదురుడు మొదలైన వారితో సమావేశమై విషయం వివరించాడు. భీష్ముడు దుర్యోధనునితో " సుయోధనా ! నాకు మీరు పాండు సుతులు సమానమే. పాండవులతో యుద్ధానికి నేను అంగీకరించను. పాండవులు కూడా ఈ రాజ్యానికి వారసులు కనుక వారికి అర్ధ రాజ్యం ఇచ్చి కీర్తిమంతుడివికా " అన్నాడు. ద్రోణుడు " సుయోధనా కర్ణుని మాట వినవద్దు. తాతగారి మాట పాలించు " అన్నాడు. ఈ మాటలు కర్ణునికి ఆగ్రహం కలిగించాయి " సుయోధనా ! వీరిమాటలు వినవద్దు వీరు నీ సంపదను అపహరించి నీకు తలపెడతారు " అన్నాడు. ద్రోణుడు " కర్ణా ! మేము కీడు తలపెట్టు వారమా ? నీవు మేలు తలపెట్టు వాడవా ? నీ వలననే ఈ కౌరవ కులానికి శాంతి లేకుండా పోయింది " కర్ణునితో అన్నాడు. విదురుడు కలుగ చేసుకుని వారిద్దరిని వారించి " పెద్దలైన భీష్మ ద్రోణుల మాటలను పాటించడం నీ ధర్మం. పాండవులు అజేయులు. ఇపుడు ధృపద మహారాజు అండ ఉంది. శ్రీకృష్ణుడు, బలరాముడు, సాత్యకి వంటి మిత్రుల బలం ఉన్నది. వారిని జయించడం అసాధ్యం. పురోచనునితో లక్క ఇంట్లో పెట్టి తగులబెట్టిన అపకీర్తి పోవాలంటే అర్ధ రాజ్యం ఇవ్వడం ఉచితం " అన్నాడు. గత్యంతరం లేక ధృతరాష్ట్రుడు పాండవులను తీసుకు రావడానికి విదురుని పంపాడు.

## విదురుడు ధృపదుడి వద్దకు వెళ్ళుట

విదురుడు ధృపదునితో " ధృపద మహారాజా ! మీతో బంధుత్వం కలసినందుకు భీష్ముడు, ద్రోణుడు, కృపా చార్యాదులు సంతోషిస్తున్నారు. పాండవులను, కుంతీదేవిని, కోడలైన ద్రౌపదిని చూడాలని ధృతరాష్ట్రుడు కుతూహల పడుతున్నాడు. మీరనుమతిస్తే పాండవులను నా వెంట హస్తినకు పంపగలరు " అన్నాడు. ధృపదుడు విదురునితో " విదురా ! నీవు, భీష్ముడు, ద్రోణుడు, శ్రీకృష్ణుడు పాండవుల శ్రేయస్సును కోరుతుంటారు. మీరి ఏది చేసినా అది వారికి క్షేమమే " అన్నాడు. శ్రీకృష్ణుడు " మనం ఆలోచించనవసరం లేదు. విదురుడు సదా పాండవుల క్షేమం కోరుతుంటాడు. పాండవులు కోరుకున్నది సిద్ధిస్తుంది " అన్నాడు. ధర్మరాజు చేతులు జోడించి " భీష్ముడు, ద్రోణుడు, విదురుడు మాకు పెద్దలు శ్రీకృష్ణుడు మా శ్రేయోభిలాషి వారి మాట మాకు శిరోధార్యం " అని అన్నాడు. ధృపదుని అనుమతి తీసుకుని తల్లీ కుంతీ దేవి, భార్య ద్రౌపది, సోదరులతో సహా విదురుని వెంట హస్తినకు పయనమైయ్యాడు. దుష్టద్యుమ్నుడు శ్రీకృష్ణుడు అంతులేని సైన్యంతో వారి వెంట వచ్చారు. వికర్ణుడు, చిత్రసేనుడు, ద్రోణుడు, కృపా చార్యుడు ఎదురేగి పాండవులకు స్వాగతం పలికారు. హస్థినాపుర ప్రజలు పాండవులకు ఉన్న దైవ బలం వారిని ఆపదలనుండి రక్షించిందని ఇక ధర్మరాజు మనల్ని పరిపాలిస్తాడని సంతోషించారు. పాండవులు అంతఃపురంలో ప్రవేశించి భీష్మునికి, ధృతరాష్ట్రునికి, గాంధారికి నమస్కరించారు. ఇలా ఆనందంగా అయిదు సంవత్సరాలు గడిచాయి.

## అర్ధరాజ్యాభిషేకం

ఒక రోజు భీష్మ, ద్రోణ, విదుర, దుర్యోదనాదులు సమావేశమై ఉండగా శ్రీకృష్ణుని సమక్షంలో ధృతరాష్ట్రుడు పాండవులతో "


పాండవులు కౌరవుల మధ్య మధ్యవర్తిత్వం నెరుపుతున్న శ్రీకృష్ణుడు - రాజ్మానామా నుండి ఒక దృశ్యం

ధర్మరాజా పెద్దల ఎదుట శ్రీ కృష్ణుని సాక్షిగా మీకు అర్ధ రాజ్యం ఇస్తున్నాను. మీ తండ్రి ఐశ్వర్యం మీకిస్తున్నాను స్వీకరించండి. ఖాండవప్రస్థాన్ని రాజధానిగా చేసుకుని మీ రాజ్యాన్ని పాలించుకోండి " అని చెప్పి ధర్మరాజుని అర్ధ రాజ్యాభిషిక్తుని చేసాడు. భీష్ముడు, ద్రోణుడు ఇందుకు అంగీకరించారు. పాండవులు తల్లిని, భార్యని, తమ్ములను తీసుకుని ఖాండవప్రస్థానికి వెళ్ళాడు. శ్రీకృష్ణుడు ఇంద్రుడిని పిలిపించి పాండవులకు రాజధాని నిర్మించి ఇవ్వమని చెప్పాడు. ఇంద్రుడు దేవశిల్పి మయుని సహాయంతో విలాస వంతమైన నగరాన్ని నిర్మించి ఇచ్చాడు. పాండవులు శ్రీకృష్ణుడు, వ్యాసుని అనుమతితో నగర ప్రవేశం చేసారు. ధర్మరాజు పట్టాభిషేకం చేసి శ్రీకృష్ణుడు ద్వారకకు వెళ్ళాడు. ధర్మరాజు జనరంజకంగా రాజ్యపాలన చేస్తూ ఉన్నాడు.


ద్రౌపది సమేత పాండవులు

## నారద మహాహర్షి రాక - సుందుడు ఉపసుందుల వృత్తాంతం


దేవర్షి నారదుడిని పూజిస్తున్న పాండవులు

ఒక రోజు ఇంద్ర ప్రస్థానానికి నారదమహార్షి వచ్చాడు. ధర్మరాజు ఆయనను సాదరంగా ఆహ్వానించి " మహర్షీ ! మాపూర్వ జన్మ సుకృతంగా మీ దర్శనభాగ్యం లభించింది " అన్నాడు. నారదుడు పాండవులను ఏకాంతానికి పిలిచి " మీకు అన్ని ధర్మాలు తెలుసు. మీకు తెలియని ధర్మం లేదు. ద్రౌపది మీ ఐదుగురి భార్య. ఇది లోక విరుద్ధం, శాస్త్ర విరుద్ధం. కనుక ఈమె వలన మీలో మీకు విరోధం రాకూడదు. స్త్రీ వలన విరోధం రావడం సహజం. సుందోప సుందులనే రాక్షసులకు ఒక స్త్రీ వలన వివాదం వచ్చి వారిలో వారు కొట్టుకుని మృతి చెందారు. నికుంభుడు అనే రాక్షసునికి సుందుడు ఉపసుందుడు అనే ఇద్దరు కుమారులు ఉన్నారు. వారిరువురు బ్రహ్మను గురించి గోరమైన తపమాచరించారు. బ్రహ్మ దేవుని వద్ద వారు కామ గమనం, కామ రూపం, మరణమే రాకుడదని వరాలు కోరారు. బ్రహ్మదేవుడు మిగిలిన వరాలు ఇచ్చి మరణమే రాకుండా వరమివ్వడం మాత్రం సాధ్యం కాదని చెప్పాడు. అప్పుడు వారు వేరే వారి చేతిలో చావు రాకూడదని అడిగారు. బ్రహ్మదేవుడు అందుకు సరేనని అంగీకరించాడు.

వర బలంతో వారు తాపసికులను, రాజులను వేధించ సాగారు. వారంతా బ్రహ్మదేవునికి మొర పెట్టుకున్నారు. బ్రహ్మదేవుడు వారికి వేరే వారి చేతిలో మరణం లేదు కానీ ఒకరి చేతిలో ఒకరు మరణించ వచ్చు కదా అనుకుని విశ్వకర్మని పిలిచి లోకోత్తర సుందరిని సృష్టించమని అడిగాడు. విశకర్మ అంగీకరించి తిలోత్తమ అనే సుందరిని సృష్టించాడు. తిలోత్తమ బ్రహ్మదేవునితో తనను సృష్టించిన కారణమేమిటి? అని అడిగింది. బ్రహ్మదేవుడు ఆమెతో సుందోపసుందుల వృత్తాంతం చెప్పి వారిరువురికి ఒకరిలో ఒకరు కలహించుకుని మరణించేలా చేయమని చెప్పాడు. తిలోత్తమ అలాగేనని బ్రహ్మదేవునికి భక్తితో ప్రదక్షిణ చేసింది. బ్రహ్మదేవుడు ఆమె అందానికి ముగ్ధుడై నలుపక్కల ముఖం తిప్పటంతో అతడు అప్పటి నుండి చతుర్ముఖుడైనాడు. తిలోత్తమ అందానికి దేవేంద్రునికి రెండు కళ్ళు చాలక వళ్ళంతా కళ్ళు పెట్టుకుని చూడటంతో అప్పటి నుండి అతడు సహస్రాక్షుడైనాడు. తిలోత్తమ సుందోపసుందుల కంట పడగానే వారు కామ మోహితులై తిలోత్తమ నాది నాది అని చెరి ఒక చేయి పట్టుకుని లాగుతూ నీకు ఎవరు కావాలి అని అడిగారు. తిలోత్తమ వారితో మీలో ఎవరు బలవంతులో వారిని ప్రేమిస్తాను అని చెప్పింది. విచక్షణ కోల్పోయి వారిద్దరూ పరస్పంరం యుద్ధం చేసికొని ఇద్దరూ మరణించారు. కనుక


సుంద ఉపసుందుల వృత్తాంతము

ఎంతటి బలవంతులకూ, ధైర్యవంతులకూ స్త్రీ కారణంగా విరోధం రావచ్చు" అన్నాడు. నారదుని మాటలోని అంతరార్ధం పాండవులు గ్రహించారు.

## అర్జునుని తీర్ధయాత్ర



అంత:పురాన్ని దర్శించిన యువరాజు -రాజ్మానామా నుండి ఒక దృశ్యం

నారదుడు మాటలో అంతరార్ధం గ్రహించిన పాండవులు ద్రౌపది విషయంలో ఒక నియమం ఏర్పచుకున్నారు. ద్రౌపది ఒక్కొకరి ఇంట్లో ఒక సంవత్సరం ఉండాలని ఏర్పాటు చేసుకున్నారు. ఆ సంవత్సర కాలం మిగిలిన వారు ఆ ఇంటి వైపు కన్నెత్తి కూడా చూడకూడదని పొరపాటున అలా చేస్తే పన్నెండు నెలల తీర్ధ యాత్ర చేయాలని ఒప్పందం చేసుకున్నారు. నారదుని ఎదుట ఒప్పంద చేసుకున్నట్లు నడచుకుంటామని పాండవులు ప్రతిజ్ఞ చేసారు. ప్రతిజ్ఞ చేసినట్లు నడుచు కోసాగారు. ఒక రోజు ఒక బ్రాహ్మణుని ఆవును కొందరు దొంగిలించారు. ఆ బ్రాహ్మణుడు అర్జునిని వద్దకు వచ్చి దొంగలను శిక్షించి గోవును తెచ్చి ఇవ్వమని అడిగాడు. ఆయుధగారంలో ఉన్న తన ధనస్సు తీసుకోవాలంటే అక్కడ ధర్మరాజు ద్రౌపదితో ఆయుధగారంలో ఉన్నాడు. అక్కడకు వెళితే నియమ భంగం ఔతుంది కానీ బ్రాహ్మణుని బాధను నివారించడం తన ధర్మమని భావించి ఆయుధగారానికి వెళ్ళి ధనస్సు తెచ్చి దొంగలను చంపి గోవును తెచ్చి ఇచ్చాడు. నియమభంగం జరిగినందుకు అర్జునుడు తీర్ధయాత్ర చేయాలని నిశ్చయించికున్నాడు. ధర్మరాజు మాత్రం వచ్చింది సత్కార్యం నిమిత్తం కనుక నియమ భంగం జరుగలేదని చెప్పాడు. అర్జునుడు " అన్నయ్యా !ఏదో సాకుతో ధర్మం తప్పడం భావ్యం కాదు కనుక తీర్ధయాత్ర చేయడానికి నాకు అనుమతి ఇవ్వండి.

## అర్జునుడి తీర్ధయాత్ర



అర్జునుని చూసిన ఉలూచి

బ్రాహ్మణులతో పౌరాణికులతో అర్జునుడు తీర్ధయాత్రకు బయలుదేరి ముందుగా గంగా తీరం చేరాడు. ఒకరోజు ఉలూచి అనే నాగకన్య అర్జునుని చూసి మోహించింది. అర్జునుడు తాను బ్రహ్మచర్య వ్రతంలో ఉన్నానని అన్నగారి ఆదేశంతో తీర్ధయాత్ర చేస్తున్న నన్ను ఇలా కోరడం భావ్యం కాదని వారించాడు. ఉలూచి అర్జునినితో " మీ గురించి అంతా నాకు తెలుసు. ఇందు వలన వ్రత భంగం కాదు. నా కోరిక తీర్చకుంటే ఆత్మహత్య చేసుకుంటాను. అలా జరిగితే ఎన్ని దానధర్మాలు చేసినా ఆ పాపం పోదు " అన్నది చేసేది లేక అర్జునుడు ఆమె కోరిక తీర్చాడు. ఉలూచి గర్భవతి అయి ఇలావంతుడు అనే కుమారుని కన్నది. తతవాత అర్జునుడు గయ, గంగా సాగర సంగమం మొదలైన క్షేత్రాలు సందర్శిస్తూ మణిపురం నగరానికి వెళ్ళాడు. ఆ దేశపురాజు చిత్రాంగదుడు. చిత్రాంగదుని కుమార్తె చిత్రాంగదను అర్జునుడు ప్రేమించాడు. చిత్రాంగదుడు అర్జునినితో " అర్జునా నా కుమార్తెను నీకు ఇవ్వడానికి అభ్యంతరం లేదు. కానీ మా వంశస్తులకు ఒక వారసుడు మాత్రం జనిస్తాడు. నాకు మాత్రం కుమార్తె జనించింది కనుక రాజ్యానికి వారసుడు లేడు. చిత్రాంగదకు పుట్టబోయే కుమారుడు నాకు వారసుడుగా కావాలి. అందుకు అంగీకరిస్తే ఈ వివాహానికి అంగీకరిస్తాను " అన్నాడు. అర్జునుడు అందుకు అంగీకరించి చిత్రంగదను వివాహం చేసుకున్నాడు. వారికి బభ్రువాహనుడు పుట్టాడు. అర్జునుడు అక్కడి నుండి ద్వారకకు బయలుదేరాడు.

## సుభద్రార్జునుల వివాహం

అర్జునుడు ద్వారకకు పోతూనే సుభద్ర గుర్తుకు వచ్చింది. ఆ లోకోత్తర సుందరి అని విన్నాడు. శ్రీ కృష్ణుని దయ ఉంటే సుభద్రను వివాహం చేసుకోవచ్చు అని అర్జునుడు అనుకున్నాడు. యాదవులకు సన్యాసులంటే ప్రీతి కనుక సన్యాసి వేషంలో ద్వారకకు వెళ్ళాడు. ద్వారకను సమీపించగానే శ్రీ కృష్ణునిని భక్తితో తలచుకున్నాడు. శ్రీ కృష్ణుడు అర్జునుని ఆగమనాన్ని తెలుసుకుని


ప్రభాస క్షేత్రంలో అర్జునుడిని కలసిన కృష్ణుడు

అర్జునిని వద్దకు వచ్చాడు. అర్జునిని మాటలలో అతనికి సుభద్ర మీద మనసున్నదని గ్రహించాడు. అర్జునిని ద్వారకకు తీసుకు వచ్చి రైవతకాద్రి గుహలో ఉంచాడు. ద్వారకకు వెళ్ళి యాదవులకు రైవతకోత్సవం చేయాలని ఆదేశించాడు. అందరూ రైవతకాద్రికి బయలు దేరారు. శ్రీ కృష్ణుడు భార్యలతోనూ సుభద్రతోనూ యాదవ ప్రముఖులైన అక్కరుడు, ఉద్దవుడు, సాత్యకి, ఉగ్రసేనుడు మొదలైన వారు బయలుదేరారు. సుభద్రకు కూడా అర్జునిని మీద మనసు ఉంది. అర్జునుడు ఎలా ఉంటాడో సుభద్రకు తెలవదు. రైవతకాద్రికి ప్రదక్షిణం చేసే సమయంలో అర్జునుడు సుభద్రను చూసాడు. శ్రీకృష్ణుడు అర్జునినితో " అర్జునా ! నీకు నా చెల్లెలు సుభద్ర మీద మనసుందని తెలుసు. దేవకీ వసుదేవులకు చెప్పి నీ కోరిక సఫలం చేస్తాను. బలరాముడు అర్జునిని నిజమైన


కృష్ణార్జునులు ఉన్న రథాన్ని నడుపుతున్న సుభద్ర

సన్యాసి అనుకుని నమస్కరించి అతని చాతుర్మాస వ్రతం పూర్తి అయ్యేవరకు ద్వారకలో ఉండమని చెప్పాడు. అర్జునుడు అంగీకరించాడు. బలరాముడు సుభద్రను అర్జునినికి సేవలు చేయడానికి నియోగించాడు. శ్రీ కృష్ణుడు అర్జునుడు క్షేమంగా ఉన్నాడని ఇంద్ర ప్రస్థానికి సమాచారం పంపాడు. ఒక రోజు సుభద్ర అర్జునిని గురించి చెప్పమని అడిగింది. అర్జునుడు ఇక దాచి ప్రయోజనం లేదని అసలు విషయం చెప్పాడు. అర్జునుడు గాంధర్వ వివాహం చేసుకుంటానని అన్నాడు. సుభద్ర తన వాళ్ళకు ఈ వివాహం ఇష్టం కనుక వాళ్ళే ఈ వివాహం చేస్తారని చెప్పింది. శ్రీ కృష్ణుడు దేవకీ వసుదేవులను వివాహానికి ఒప్పించాడు. బలరాముని కొంత మంది యాదవులను అంతర ద్వీపానికి పంపించి తాను కూడా వారితో వెళ్ళి నట్లు వెళ్ళి వెనుకకు వచ్చాడు. శ్రీ కృష్ణుడు దేవేంద్రుని పిలిపించి అందరి సమక్షంలో సుభద్ర, అర్జునుల వివాహం వైభవంగా జరిపించాడు.

## సుభద్రార్జునులు హస్థినకు వెళ్ళుట

సుభద్రను తీసుకుని రథం మీద ప్రస్థానికి వెళ్ళమని చెప్పాడు. దేవేంద్రుడు కుమారునికి అనేక కానుకలు ఇచ్చాడు. శ్రీ కృష్ణుడు ఏమీ తెలియనట్లు అంతర ద్వీపానికి వెళ్ళాడు. సుభద్రా అర్జునుల వివాహ విషయం తెలియని ద్వార పాలకులు వారిని అడ్డగించారు. అర్జునుడు వారందరిని ఓడించాడు. యాదవులు బలరామునికి ఈ విషయం చెప్పారు. యాదవులు ఉద్రేకపడి అర్జునినితో యుద్ధం చేసి సుభద్రను తీసుకు వస్తామని అన్నారు. బలరాముడు శ్రీ కృష్ణునితో నీకు నిజంగా ఈ విషయం తెలియదా అన్నాడు. శ్రీ కృష్ణుడు తన మేన మరదలిని వివాహం చేసుకున్నాడు.

ఇందులో దోషం లేదు. అర్జునిని జయించడం దుస్సాధ్యమని మీకు తెలియనిదా అన్నాడు. బలరాముడు ఏమీ చేయలేక ఊరకున్నాడు. ఇంద్ర ప్రస్థానం వెళ్ళిన అర్జునుడు సుభద్రతో మనం ఇలా వెళితే ద్రౌపది పౌరుషంగా మాట్లాడ వచ్చు కనుక నీవు ముందుగా వెళ్ళి నీ అత్త గారు కుంతినీ ద్రౌపదిని చూసి వారి అనుగ్రహం సంపాదించు. తరువాత అర్జునుడు నగర ప్రవేశం చేసి పెద్దల దీవెనలు పొందాడు. బలరాముడు సుభద్ర, అర్జునలకు అనేక కానుకలు పంపాడు. సుభద్రకు అభిమన్యుడు జన్మించాడు. ద్రౌపదికి పాండవుల వలన ప్రతి వింధ్యుడు, శ్రుత సోముడు, శ్రుత కీర్తి, శతా నీకుడు, శ్రుత సేనుడు అను ఐదుగురు ఉప పాండవులు జన్మించారు. వారంతా ధౌమ్యుని వద్ద వేద వేదాంగాలు అర్జునిని వద్ద అస్త్ర, శస్త్రాలు నేర్చుకున్నారు.

## కృష్ణార్జునులు ఖాండవ వనముకు వెళ్ళుట

ఒకరోజు అర్జునుడు శ్రీకృష్ణునితో " బావా ! ఇక్కడ ఎండలు అధికంగా ఉన్నాయి. మనం వన ప్రాంతాలకు వెళ్ళి కొన్ని రోజులు


కుంతి ద్రౌపదిలను సేవించుచున్న సుభద్ర

గడిపి వద్దామా " అడిగాడు. శ్రీకృష్ణుడు అంగీకరించడంతో అందరూ వన ప్రాంతాలకు వెళ్ళారు. వారిద్దరూ విహరిస్తున్న సమయంలో అగ్ని దేవుడు బ్రాహ్మణ వేషంలో అక్కడికి వచ్చాడు. కృష్ణార్జునులు అర్ఘ్యపాద్యాలు ఇచ్చి సత్కరించిన పిమ్మట అతడు " అయ్యా ! బాగా ఆకలి వేస్తుంది. తమరు భోజనం పెట్టగలరా ? " అడిగాడు. అందుకు వారు " విప్రోత్తమా !మీకు ఏది ఇష్టమో చెప్పండి పెడతాము " అన్నారు. అగ్ని దేవుడు నిజస్వరూపం చూపి " కృష్ణార్జునులారా ! నేను అగ్ని దేవుడిని. నేను ఖాండవ వనాన్ని దహించాలి. అందుకు ఇంద్రుడు అడ్డుపడుతున్నాడు. ఇంద్రుడు మిత్రుడు ఆ వనంలో ఉండటమే అందుకు కారణం. ఇంద్రుడు చేసే ఆటంకం తొలగిస్తే నేను ఖాండవ వనాన్ని నిరాటంకంగా భుజిస్తాను " అని అన్నాడు. అర్జునుడు అగ్ని దేవునితో " అయ్యా నీకు ఖాండవ వనాన్ని దహించాలన్న కోరిక ఎందుకు కలిగింది" అని అడిగాడు.

## శ్వేతకి యజ్ఞము

అందుకు అగ్ని దేవుడు అర్జునునితో " శ్వేతకి అనే రాజర్షి 100 సంవత్సరాల కాలం సత్ర యాగం చేయ సంకల్పించాడు. అంత దీర్ఘ కాలం జరపడానికి ఏ ఋత్విక్కు ఒప్పుకోలేదు. శ్వేతకి ఈశ్వరుని కొరకు ఘోరంగా తపస్సు చేసి ఈశ్వరుని ప్రత్యక్షం చేసుకున్నాడు. దేవా నేను నూరు సంవత్సర కాలం చేయ సంకల్పించిన సత్ర యాగానికి నువ్వు ఋత్విక్కుగా ఉండాలి " అని కోరుకున్నాడు. అందుకు ఈశ్వరుడు " శ్వేతకీ! యజ్ఞాలు చేయవలసిన భాధ్యత బ్రాహ్మణులది. అందుకని నీకు దుర్వాసుని యాజ్ఞికునిగా నియమిస్తున్నాను. నీవు నూరు సంవత్సరాలు ఎడతెగని నేతి ధారతో యజ్ఞం చేసి అగ్ని దేవుని తృప్తిపరచుము " అని చెప్పి అంతర్ధానం అయ్యాడు. ఆ ప్రకారం శ్వేతకి చేత నూరు సంవత్సరాలు నిరాఘాటముగా జరిగిన సత్ర యాగంలో త్రాగిన నెయ్యి నాకు అజీర్ణ వ్యాధిని ఇచ్చింది. ఖాండవ వనంలో ఉన్న ఔషధులను దహిస్తే కానీ ఈ వ్యాధి తగ్గదు అని బ్రహ్మ దేవుడు చెప్పాడు. అందుకని ఖాండవ వనాన్ని దహించాలని అనుకుంటున్నాను " అన్నాడు. అర్జునుడూ " అగ్నిదేవా ! నీకు నెను సహాయము చెయ్యాలంటే మాకు ఆయుధాలు కావాలి కదా ! నా వద్ద ప్రస్తుతము ఆయుధాలు లేవు " అనాడు. అగ్ని దేవుడు " అర్జునా ! నికు ఆ చిన్తు వలదు . నీకు కావలసిన ఆయుధాలు నేను సమకూరుస్తాను " అని వెంటనే అగ్నిదేవుడు వరుణుని స్మరించగానే వారి ముందు వరున దేవుడు ప్రత్యక్షం అయ్యాడు. అగ్నిదేవుడు " వరుణదేవా ! నీకు బ్రహ్మ దేవుడు ఇచ్చిన ధనస్సు, అమ్ముల పొది, రధం అర్జునినికి ఇచ్చి, చక్రాన్ని, గధని శ్రీ కృష్ణునికి ఇవ్వు" అన్నాడు. వరుణుడు గాండీవమనే ధనస్సును, అక్షయ తుణీరాన్ని, కపిధ్వజంతో కూడిన రధాన్ని అర్జునునకు ఇచ్చాడు. అలాగే సుదర్శనం అనే చక్రాయుధాన్ని, కౌమోదకి అనే గధను శ్రీ కృష్ణునికి ఇచ్చాడు. ఆ అయుధాల సహాయంతో రక్షించమని చెప్పి వారి వద్ద అభయం తీసుకుని రెట్టించిన ఉత్సాహంతో ఖాండవ వన్నాన్ని దహించడం మొదలు పెట్టాడు.

## ఖాండవ వన దహనము

కృష్ణార్జునులు ఇరువైపులా రక్షణకు నిలబడ్డారు. అడ్డగించిన వన రక్షకులను సంహరించారు. వనంలోని జంతువులు, పక్షులు, పాముల అగ్నిజ్వాలలో పడి మరణించసాగాయి. దేవతల ద్వారా ఇది తెలుసుకున్న ఇంద్రుడు మేఘాలను పిలిచి ఖాడవ వనంపై కుంభవృష్టి కురిపించమని ఆజ్ఞాపించాడు. ఇంద్రుడు కురిపించే కుంభవృష్టి ఖాడవ వనం మీద పడకుండా బాణాలతో ఒక కప్పు నిర్మించాడు. అగ్ని జ్వాలల నుండి రక్షించుకోవడానికి తక్షకుని కుమారుడైన ఆశ్వసేనుడు తల్లి తోక పట్టుకుని ఆకాశంలోకి ఎగిరాడు. ఇది చూసిన అర్జునుడు తన బాణాలతో అశ్వసేనుని కొట్టాడు. అది చూసిన ఇంద్రుడు అర్జునునిపై మోహినీ మాయను ప్రయోగించి అశ్వసేనుని అతని తల్లిని కాపాడాడు. ఇంద్రుడికి అర్జునునికి మధ్య ఘోరమైన యుద్ధం జరిగింది. కుమారుని పరాక్రమానికి ఇంద్రునికి సంతోషం కలిగినా తక్షకుని రక్షించడానికి యుద్ధం చేస్తూనే ఉన్నాడు. ఇంతలో ఆకాశవాణి " దేవేంద్రా! వీరు నరనారాయణులు వీరిని జయించడం నీకు సాధ్యం కాదు. తక్షకుడు తప్పించుకుని కురుక్షేత్రం వెళ్ళాడు" అని పలికింది. అది విని ఇంద్రుడు తన సేనలతో దేవలోకానికి వెళ్ళాడు.

## ఖాండవ వనము నుండి తప్పించుకున్న వారు


పాండవులకు సభను నిర్మించమని మయుడిని అడుగుతున్న శ్రీకృష్ణుడు


ఖాండవవన రక్షణకు వచ్చిన దేవతలతో పోరాడుతున్న కృష్ణార్జునులు

నముచి అనే రాక్షసుని తమ్ముడు గయుడు అర్జునిని శరణుజొచ్చి ప్రాణాలు దక్కించుకున్నాడు. ఇలా మయుడు, అశ్వపాలుడు, అతని తల్లి, నలుగురు శార్జకులు ప్రాణాలతో తప్పించుకున్నారు. కథ వింటున్న జనమేజయుడు " మహాత్మా ! మంద పాలుడు ఎవరు. వారు ఎలా తప్పించుకున్నారు " అని అడిగాడు. పూర్వం మంద పాలుడనే మహా ముని బ్రహ్మచర్యం అవలంబించాడు. మరణానంతరం కుమారులు లేని కారణంగా పుణ్యలోకాలకు వెళ్ళలేక పోయాడు. ఆ కారణంగా త్వరగా సంతానం పొందడానికి పక్షిగా జన్మించి జరితతో చేరి నలుగురు కుమారులను పొందాడు. వారంతా ఖాండవ వనంలో ఉన్నాడు. అగ్ని దేవుడు ఖాండవ వనాన్ని దహించే ముందు మంద పాలుడు తన కుమారులను రక్షించమని అగ్నిదేవుడిని ప్రార్ధించాడు. అందుకు అగ్ని దేవుడు అంగీకరించాడు. మంద పాలుడు తన కుమారుల దగ్గర ఉన్నాడు. కుమారులను కలుగులో దాక్కోమని చెప్పాడు. వారు " తండ్రీ ! కలుగులో దాక్కుంటే ఎలుకలు తింటాయి. ఇక్కడ ఉంటే పవిత్రమైన అగ్నికి ఆహుతి కావడం మంచిది కదా " మంద పాలుడు అందుకు అంగీకరించాడు. జరిత పైకి ఎగిరి పోయింది. శార్జకులు వేద పఠనం చేస్తూ రక్షించమని ప్రార్ధించాయి. అది విన్న అగ్ని దేవుడు వారు మంద పాలుని కుమారులుగా గుర్తించి ఆ చెట్టుని వదలి వేసాడు. కుమారులు సురక్షితంగా ఉన్నారని తెలుసుకుని మంద పాలుడు పుణ్యలోకాలకు వెళ్ళిపోయాడు. అగ్ని దేవుడు నిర్విఘ్నంగా ఖాండవ వనాన్ని దహించి తన రోగం పోగొట్టుకున్నాడు. కృష్ణార్జునులను దీవించాడు. దేవేంద్రుడు కుమారుని పరాక్రమానికి మెచ్చి అర్జునునికి వారుణాస్త్రం, ఆగ్నేయాస్త్రం, వాయవ్యాస్త్రం ఇచ్చాడు. కృష్ణార్జునులు మయుని వెంట పెట్టుకుని ఇంద్ర ప్రస్థానికి వెళ్ళి ధర్మరాజాదులకు జరిగినది చెప్పి మయుని పరిచయం చేసాడు.


కృష్ణార్జునులకు వరములిస్తున్న ఇంద్రాదిదేవతలు

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ

# సభా పర్వము

వికీపీడియా నుండి

**సభాపర్వము**, మహాభారతంలోని రెండవ పర్వము. కురుసభా రంగం, మయసభ, పాచికల ఆట, పాండవుల ఓటమి, రాజ్యభ్రష్టత ఇందులోని ముఖ్యకథాంశాలు.

## విషయ సూచిక



## సంస్కృత మహాభారతం

## ఆంధ్ర మహాభారతం

## విశేషాలు

## మూలాలు

## బయటి లింకులు

- కిశోరీ మోహన్ గంగూలి ఆంగ్ల అనువాదం (http://www.sacred-texts.com/hin/m01/index.htm)

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

### పర్వాలు

ఆది పర్వము • **సభా పర్వము** • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

### పాత్రలు

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

### ఇతర విషయాలు

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

# సభా పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



# ప్రథమాశ్వాసము

అర్జునుని చూసిన దానవ శిల్పి మయుడు " అర్జునా ! నీ దయ వలన నేను అగ్నికి ఆహుతి కాకుండా బ్రతికాను. నేను దానవ శిల్పిని. చిత్ర విచిత్రమైన నిర్మాణాలు చేయగలను. మీకు ఇష్టమైనది ఏదో చెప్పండి చేస్తాను " అన్నాడు. అర్జునుడు కృష్ణుని వంక చూసాడు. శ్రీకృష్ణుడు " కురువంశ మహారాజు ధర్మరాజు వైభవానికి తగినట్లు ఒక భవనం నిర్మించి ఇవ్వు " అని మయునితో అన్నాడు. మయుడు " ఈ భూమిపై ధర్మరాజుని మించిన రాజు లేడు. అందుకని ప్రజలు మెచ్చేలా చిత్ర విచిత్రమైన భనాన్ని నిర్మించి ఇస్తాను. వృషపర్వుడనే రాక్షస రాజుకు ఒక సభ నిర్మించడానికి ఉపకరణాలు సమకూర్చుకున్నాను. కారంణాంతాల వలన నిర్మించ లేక పోయాను. ఉపకరణాలను బిందుసరము అనే సరోవరంలో దాచాను వాటిని తెచ్చి భవన నిర్మాణం చేస్తాను. నా వద్ద భౌమాదిత్యుడు దాచిన గద, శంఖము ఉన్నాయి. గదను భీమసేనునికి దేవదత్తము అనే శంఖమును అర్జునినికి ఇస్తాను " అన్నాడు.

## మయసభా వైభవం


మయ సభ వైభవము

మయుడు బిందుసరములో ఉన్న దూలాలూ, కంభములను ఉపయోగించి చిత్ర విచిత్రమైన భవనాన్ని నిర్మించాడు. నీటికి బదులు ఇంద్రనీల మణులను, పద్మరాగ మణులతో ఎర్రని పద్మాలను, రజితముతో తెల్లటి తామరలను, రాజహంసలను, వజ్రాలతో చేపలను, ముత్యములతో తెల్లటి నురగలను, మరకత మణులతో నీటిలోని నాచుని తయారు చేసాడు. అవి నిజమని భ్రమించేలా నిర్మించాడు. నీటి యంత్రాలు, చెట్లు, నీటీ పక్షులు, పాక్షిగూళ్ళు మొదలైనవి వివిధ రత్న కాంతులతో శోభిల్లే భవనం పదునాలుగు మాసాలు శ్రమించి నిర్మించాడు. దానిని ఎనిమిది వేల మంది బలిష్టులతో ఆకాశమార్గాన మోసుకు వచ్చి ధర్మరాజుకు బహూకరించాడు. ధర్మరాజు ఒక శుభ ముహూర్తాన పురోహితుడైన ధౌమ్యుని ఆశీర్వాదంతో భార్యతో తమ్ములతో మయసభా ప్రవేశం చేసాడు. సామంతరాజులు ధర్మరాజు ని దర్శించి కానుకలు సమర్పించారు.

## నారదమహర్షి రాక

ఒకరోజు ధర్మరాజు వద్దకు నారదమహర్షి వచ్చాడు. ధర్మరాజు నారదమహర్షికి అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి సత్కరించాడు. నారదమహర్షి ధర్మరాజు ను రాజనీతి సంబంధమైన విషయాలు అడిగాడు. ధర్మరాజా నీవు ధర్మ మార్గము అనుసరిస్తున్నావు కదా ! రాజకార్యాలను ధర్మనిష్టతో , స్వబుద్ధితో అర్ధరాత్రి దాటిన తరవాత కూడా ఆలోచిస్తున్నావు కదా ! రాజోద్యోగాలలో యోగ్యులను, స్థిరచిత్తులను నియమించావు కదా! సమర్ధులైన బ్రాహ్మణులను, శాస్త్ర నియమాలు తెలిసిన వారిని మంత్రులుగా నియమించావు కదా ! నీ విజయానికి కారణమైన రహస్యాలోచనం ఎవరికి తెలియకుండా రక్షిస్తున్నావు కదా ! నీ చేత యజ్ఞములు చేయించిన యాజ్ఞికుడు యజ్ఞాలు సక్రమంగా నిర్వహిస్తున్నాడు కదా ! ఎల్ల వేళలా నీ మేలు కోరేవారిని విశ్వాసపాత్రులను సైన్యాధ్యక్షులుగా నియమించావు కదా ! పలుకుబడి కలిగిన మంత్రి నీకు వ్యతిరేక కార్యాలలో దిగి నీకు ద్రోహం తలపెట్ట లేదు కదా ! ఎందు కంటే ధనము అధికారం ఎలాంటి వారికైనా గర్వం, దురాశను కలిగిస్తుంది. నీ రాజ్యంలోని శాస్త్రజ్ఞులు రాబోయే ఉత్పాతాలను కనిపెట్టి శాంతి క్రియలు చేపడుతున్నారు కదా ! ఆయుర్వేద వైద్యులు ప్రజలకు ప్రేమతో సేవ చేస్తున్నారు కదా ! ఆర్ధిక సంబంధిత కార్యాలలో నైపుణ్యం కలవారిని, పాపరహిత చరిత్రులను, నీతి నియమాలు కలవారిని, ధర్మ పరీక్షలో నెగ్గిన వారిని నియమించావు కదా! యోగ్యతను దృష్టిలో ఉంచుకుని ఉత్తమ, మధ్యమ అధమ ఉద్యోగాలలో నియమించావు కదా ! నీ ఉద్యోగులకు సకాలంలో జీతభత్యాలు అందచేస్తున్నావు కదా ! లేకుంటే రాజుకు అది కీడు కలిగించ వచ్చు. వంశపారంపర్యంగా నీకు సేవ చేస్తూ ప్రాణాలు అర్పించటానికి సిద్ధంగా ఉన్న ఉద్యోగులను గుర్తించి సత్కారాలు చేస్తున్నావు కదా ! నీ రాజ్యంలో నీ కోసం ప్రాణాలు అర్పించిన వారి కుటుంబాలకు తిండి, బట్ట, నీడ కల్పిస్తున్నావు కదా ! లోభబుద్ధి కలవాళ్ళను, దొంగలను, శత్రువులతో స్నేహంగా ఉండేవాళ్ళను, పిరికి వాళ్ళను, దుర్మార్గులను రాజకార్యాలను నిర్వహించడానికి పంపడం లేదు కదా! నీ రాజ్యంలో అనావృష్టి లేదు కదా ! చెరువులన్నీ నిండి ఉన్నాయి కదా ! పేద రైతులకు ఉచితంగా విత్తనాలు, తదితరాలు ఇస్తున్నావు కదా ! పౌరులకు నూటికి ఒకటి చొప్పన వడ్డీకి ఋణసౌకర్యం కల్పిస్తున్నావు కదా ! నీ రాజ్యం లోని కుంటి గుడ్డి, వికలాంగులు, అనాధలు, దిక్కులేని వారిని దయతో పోషిస్తున్నావు కదా ! యుద్ధంలో శరణన్న వారిని కాపాడుతున్నావు కదా ! నీకు మేలు చేసిన వారిని ఉచితరీతిన సత్కరిస్తున్నావు కదా ! నీకు వచ్చిన ఆదాయంలో నాల్గవ లేక రెండవ లేక మూడవ భాగాన్ని మాత్రమే ఖర్చు చేస్తున్నావు కదా ! ఆయుధాగారానికి , ధనాగారానికి సమర్ధులు మరియు నీతి మంతులను నియమించావు కదా ! వృద్ధులైన శిల్పులను, గురువులను, వర్తకులను పేదరికం లేకుండా పోషిస్తున్నావు కదా ! మంత్రులూ సేనానులూ అధికంగా ఉండగా కొలువు తీరుతున్నావు కదా ! బయట ఉన్న వారి వలన కాని లోపల ఉన్న వారి వలన కానీ శత్రురాజుల వలన కానీ ముప్పురాకుండా నిన్ను నీవు వేగులను నియమించి కాపాడు కుంటున్నావు కదా ! మంచి విద్వత్తు కలిగిన ప్రముఖులతో రాగద్వేష రహితంగా ధర్మం పాటిస్తూ వ్యవహారాలు చక్కపెడుతున్నావు కదా ! నీ పరి రక్షణలో ఉన్న ప్రాంతాలు,కోటలు, రాజ్యాలు అన్నీ ధనదాన్య సమృద్ధిగా ఉన్నాయి కదా ! ఉప్పు, పులుపు, కారము కలిగిన ఆహార పదార్ధాలు వివిధ పానీయాలు వంటసామాగ్రి ,వంటచెరుకు సమృద్ధిగా ఉన్నాయి కదా ! నీ కోటలన్నీ శత్రువులకు అభేద్యంగా ఉన్నాయి కదా ! నీవు నీ అంత:శత్రువులను జయించి పాలిస్తున్నావు కదా ! మదాంధులైన శత్రువులను జయిస్తున్నావు కదా ! నీ శత్రురాజులు నీపై దండెత్తకుండా వారిపై సామ, దాన, బేద, దండోపాయాలను ఉపయోగిస్తున్నావు కదా! అని నారద మహర్షి రాజులకు ఉపయుక్తమైన విధులన్నీ ప్రస్తావించాడు.

## రాజులు చేయకూడని పనులు

అలాగే ధర్మజా ! రాజు చేయకూడని పనులు చెప్తాను విను అన్నాడు. రాజు నాస్తికుడిగా ఉండకూడదు. అబద్ధం ఆడకూడదు. ప్రమాదాలను ఆలస్యంగా గుర్తించ కూడదు. తెలివి తక్కువ వాళ్ళతో సమాలోచన చెయ్యకూడదు. ఎక్కువగా కోపగించ కూడదు. చేయవలసిన పనులను నాన్చకూడదు. ఆలస్యం చేయకూడదు. తెలివి కలిగిన వారిని ఆలస్యంగా గుర్తించ కూడదు. ప్రయోజకమైన విషయాలు తప్ప అప్రయోజక ఆలోచనలు చేయకూడదు. నిర్ణయించిన పనులు ఆపకూడదు. ప్రభుత్వ రహస్యాలను బయటపడనీయ కూడదు. ప్రజాహితకార్యాలు చేయకుండా జాగు చేయకూడదు. ఇంద్రియ సుఖాలకు ముఖ్యత్వం ఇవ్వకూడదు. సోమరితనం, నిర్లిప్తత, నిష్క్రియా తత్వం రాచకార్యాలలో తగదు. నారద మహర్షి మాటలను శ్రద్ధగా ఆలకించిన ధర్మరాజు " మహర్షీ ! నా యధాశక్తిన అధర్మాన్ని వదిలి ధర్మ మార్గంలో పాలన సాగిస్తున్నాను. తమరు మయ సభను చూసారా ఎలా ఉన్నది " అని అడిగాడు.

## రాజసూయ యజ్ఞానికి నాంది

నారదుడు " ధర్మరాజా ! నేను దేవేంద్ర, యమ, వరుణ , కుబేర, బ్రహ్మదేవుల దివ్యసభలే కాక ఇంకా ఎన్నో సభలు చూసాను. అన్నింటి కన్నా మయసభ అపూర్వంగా ఉంది " అన్నాడు. ఒక సారి నేను బ్రహ్మ సభను చూసాను. దాని రూపం అద్భుతం. మరీచి,మనువు, సూర్యచంద్ర గ్రహాలు, దేవగణాలు ,వసువులు, రుద్రులు, సిద్ధులు, సాధ్యులు, మహర్షులు, అశ్వినీ దేవతలు, విశ్వకర్మ, పితృదేవతలు, ధర్మార్ధ, కామ మోక్షాలు, శబ్ధ, గంధ, రూపాలు, తపస్సు , దమం, ధృతి, శ్మృతి, మేధ, క్షమ, బుద్ధి, కీర్తి, సంకల్పం, వికల్పం, ప్రణవం, క్షవం, లవం, తృటి, కాష్ఠ, ముహూర్తం, పగలు ,రాత్రి, పక్షం, మాసం మొదలైన విభాగాలతో కూడిన కాలచక్రం, చతుర్వేదాలు, వేదాంగాలు, పురాణేతిహాసాలు, సాకారంగా బ్రహ్మదేవుని సేవిస్తుండగా సరస్వతీ సమేతుడై పద్మాసనంపై కూర్చుని జీవసృష్టి చేస్తుంటాడు. ఇది వింటున్న ధర్మరాజు కు ఒక సందేహం కలిగింది. నారదుడు వివిధ సభలను వర్ణిస్తూ కృతవీర్యుడు, జనమేజయుడు, పాండురాజు యమసభలో ఉన్నట్లు చెప్పాడు. కానీ మహారాజు హరిశ్చంద్రుడు ఇంద్రసభలో ఉన్నట్లు చెప్పాడు. " మహర్షీ ! పరమ ధర్మాత్ముడైన నా తండ్రిగారు యమసభలో ఉండగా హరిశ్చంద్రుడు మాత్రం ఇంద్రసభలో ఎలా ఉన్నాడు " అని అడిగాడు. " ధర్మరాజా ! త్రిశంకు మహారాజు పుత్రుడైన హరిశ్చంద్రుడు అందరు రాజులను జయించి రాజసూయ యాగం చేసాడు. అందువలన ఇంద్రసభలో ఉన్నాడు. నీ తండ్రిని యమసభలో సందర్శించినప్పుడు పాండురాజు నాతో " రాజసూయ యాగం చేసిన రాజులు ఇంద్రసభలో ఉంటారు. కనుక నా కుమారుడు ధర్మరాజు ని రాజసూయ యాగం చేయమని ఆజ్ఞాపించానని చెప్పండి " అని అడిగాడు. కనుక ధర్మజా నీ తండ్రి ఆజ్ఞ ప్రకారం రాజసూయ యాగం చేసి నీతండ్రిని ఇంద్రసభకు వెళ్ళేలా చెయ్యి " అని చెప్పి నారద మహర్షి నిష్క్రమించాడు.ధర్మరాజు తన పురోహితుడు ధౌమ్యుడు ఇతర మంత్రులతో రాజసూయయాగం గురించి చర్చించాడు. అందుకు ధౌమ్యుడు " ధర్మరాజా నీ తండ్రి కోరిక తీర్చడం నీకర్తవ్యం. ఈ యాగం వలన సమస్త రాజులు సామంతులు ఔతారు. నీవు సంపదలు సమకూర్చుకోవడానికి ఇది తగిన సమయం " అని అన్నాడు. ధర్మరాజు తన తమ్ములతో కూడా చర్చించి రాజసూయ యాగం చేయడానికి నిర్ణయం తీసుకున్నాడు. ఈ యాగ నిర్వహణకు శ్రీకృష్ణుడు తగిన సమర్ధుడు అని శ్రీకృష్ణుని తీసుకు వచ్చేందుకు ద్వారకకు ఆప్తులను పంపాడు. ధర్మరాజు సందేశం అందుకుని శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థానికి వచ్చాడు. ధర్మరాజు శ్రీకృష్ణుని తగిన రీతిని సత్కరించాడు.

## జరాసంధుడు

శ్రీకృష్ణుడు ఎంతో సంతోషించాడు. ధర్మరాజుతో " ధర్మనందనా ! నీ నిర్ణయం ప్రశంశనీయం. పూర్వం జమదగ్ని కుమారుడైన పరశురాముడు క్షత్రియ వంశాలన్నీ నిర్మూలించాడు. అప్పుడే ఇక్ష్వాకు, ఇల అనే రెండు వంశాలు మిగిలాయి. అవి రెండే సహజ వంశాలు. మిగిలినవి మిశ్రమ వంశాలే. ఆ రెండు వంశాలు నూటొక్క వంశాలుగా వృద్ధి చెందాయి. యయాతి భోజవంశాల వలన మరో పదునాలుగు వంశాలు ఏర్పడ్డాయి. ఈ రాజవంశాలనన్నింటిని జరాసంధుడు జయించాడు. చేది భూపాలుడు శిశుపాలుడు జరాసంధునికి సైన్యాధి పతి. హంసడింబకులు అనే మహా బలవంతులు జరాసంధునికి ఆప్తులు. కౌశిక చిత్రసేనులు జరాసంధునికి కుడి ఎడమ భుజాలు. చేది రాజులలో పురుషోత్తముడు, అంగ, వంగ, పుండ్ర, కిరాత రాజులు పౌండ్రక



జరాసంధుని కథ

వాసుదేవుడు జరాసంధుని సేవిస్తున్నారు. తూర్పు దక్షిణదేశాల రాజులు పురుజితుడు, కరూశుడు, కలభ, నకుల, సంకర్షణ, సూపహిత, మనోదత్త, చక్ర, సాల్వేయ, యవనులు జరాసంధుని కొలుస్తున్నారు. ఉత్తర దిక్కున పద్దెనిమిది మంది రాజవంశాలు భయంతో జరాసధుని కొలుస్తున్నారు. నేను వధించిన కంశుని భార్య జరాసంధుని కూమార్తె. అందు వలన జరాసంధుడు నా పై పగబూని ఉన్నాడు. ధర్మరాజా! ఆ హంస ఢింబకులు జరాసంధుడు మూడు లోకాలను జయించగలరు. ఒకసారి హంసఢింబకులతో మధురమీద దండెత్తారు. ఒక ఉపాయంతో హంసఢింబకులను చంపాము. ఇప్పుడు జరాసంధుడు నిస్సహాయుడు. మేము జరాసంధునితో విరోధం వలన రైవతకాద్రిలో కోట కట్టుకుని ఉన్నాము. మనం ముందు జరాసంధుని వధించాలి. అప్పుడు రాజసూయం సాధ్యపడుతుంది. నీ రాజ్యం స్థిరపడుతుంది. జరాసంధుడు ఎంతటి బలవంతుడైనా దుర్మార్గుడు కనుక పతనం తప్పదు " అని శ్రీకృష్ణుడు అన్నాడు.

### జరాసంధ జననం

అప్పుడు భీముడు ధర్మరాజు తో " అన్నయ్యా ప్రయత్నంతో అన్ని విజయములు సమకూడుతాయి శ్రీకృష్ణుని దయ అర్జునిని సహాయం నీ అనుమతి ఉంటే జరాసంధుని సంహరిస్తాను " అన్నాడు. అర్జునుడు " అన్నయ్యా రాజులందరిని జయిస్తాము. రాజసూయం నిర్వహిస్తాము. లేకపోతే రాజసూయం, మయసభ, గాండీవం ఎందుకు " అని అన్నాడు . భీమార్జునుల మాటలు విని శ్రీ కృష్ణుడు సంతోషించాడు. ధర్మరాజు " కృష్ణా !అసలు జరాసంధుడు అంతటి బలవంతుడు ఎలా అయ్యాడు ? " అన్నాడు. శ్రీకృష్ణుడు " ధర్మనందనా ! మగధరాజైన బృహద్రధుడు కాశీరాజు పుత్రికలను వివాహమాడాడు. వారికి సంతానం కలుగలేదు. అతడు భార్యలిద్దరితో అరణ్యాలకు పోయి ఛండకౌశికుడు అనే మునిని భక్తితో సేవించారు. వారి సేవలకు ఛండకౌశికుడు సంతోషించి వారిని చూసి " ఏమి వరం కావాలి కోరుకో " అన్నాడు. అందుకు బృహద్రదుడు " మహాత్మా నాకు పుత్రసంతానం ప్రసాదించండి " అని కోరాడు. అప్పుడు ఒక మామిడి చెట్టు మీద నుండి ఒక మామిడి పండు ఆ మహర్షి తొడమీద పడింది. మహర్షి ఆ పండును మంత్రించి బృహద్రదునికి ఇచ్చాడు. ఈ పండుని తిన్న వారికి సంతానం కలుగుతుంది అని చెప్పాడు. సంతోషంతో ఆ పండును ఇద్దరు భార్యలకు కోసి ఇచ్చాడు. ఇద్దరు గర్భం ధరించి ప్రసవించారు. ఇరువురికి నిలువుగా సగం చీలిన శరీరంతో రెండు శిశువులు జన్మించారు. ఆ శిశుఖండాలను చూసి భార్యలిరువురు భయపడ్డారు. బృహద్రధునికి చూపించటానికి సిగ్గుపడి పరిచారికలకు ఇచ్చి బయట పారేయించారు. వారు వాటిని నాలుగుదారుల కూడలిలో పారవేసారు. అర్ధరాత్రి జర అనే రాక్షసి వాటిని తినాలని పట్టుకుని రెండు ముక్కలను పట్టుకుని చూడగా ఆశ్చర్యంగా రెండూ కలిసి ఒక బాలుని రూపంగా మారింది. ఆ బాలుని ఏడుపు విని అంతఃపురం లోని స్త్రీలు పరుగెత్తుకు వచ్చారు. వారిని చూసి రాక్షసి పారి పోయింది. ఇంలో అక్కడికి వచ్చిన బృహద్రధుడు బాలుని చూసి సంతోషించాడు. ఇది గమనించిన రాక్షసి బృహద్రధుని వద్దకు వచ్చి " మహారాజా ! నేను జర అనే రాక్షసిని. ఆ శిశుఖండాలు నా చేతిలో బాలుని రూపం ధరించాయి . ఇతడు వజ్రశరీరం కలవాడు. ఇతనిని స్వీకరింపుము " అని చెప్పింది. బృహద్రధుడు జరతో " నీ దయ వలన నా వంశం ఉద్ధరింప బడింది. కనుక ఈ బాలునికి జరాసంధుడు అని నామకరణం చేస్తాను. నీవు నాపాలిట పుణ్య దేవతవు " అన్నాడు. ఒకసారి ఛండకౌశికుడు బృహద్రధుని వద్దకు వచ్చాడు . బృహద్రధుడు ఆ మహర్షిని పూజించి తన కుమారుని చూపించాడు. ఛండకౌశికుడు బృహద్రధునితో " వీడు పరాక్రమవంతుడౌతాడు. ఎలాంటి ఆయుధములు, అస్త్రములు, ఇతనిని చంప లేవు. ఇతడు రాజులందరిని జయిస్తాడు. ఆ రాజుల సంపదలన్నీ పొందుతాడు. ఆ పరమశివుని ప్రత్యక్షం చేసుకుంటాడు " అన్నాడు. అందువలన జరాసంధుడు అసమాన బలాఢ్యుడు అయ్యాడు. బృహద్రధుడు జరాసంధునికి రాజ్యం అప్పగించి తపోవనాలకు వెళ్ళాడు. ధర్మజా ! భీమసేనుడు ఒకడే జరాసంధుని చంపగల సమర్ధుడు. అందుకని భీమార్జునులను నాతో పంపు " అన్నాడు. " కృష్ణా ! నీ అండ ఉండగా మాకు పొంద లేనిది ఏమున్నది. ఇక జరాసంధుడు మరణించినట్లే . నేను రాజసూయం నిర్విఘ్నంగా నెరవేర్చినట్లే " అని భీమార్జునులను దీవించి శ్రీకృష్ణునితో పంపాడు.

### జరాసంధ వధ

శ్రీకృష్ణుడు భీమార్జునులతో కలసి కపట బ్రాహ్మణ రూపాలలో కపట స్నాతక వ్రతం స్వీకరించారు. జరాసంధుని నగరమైన గిరివ్రజపురం సమీపించారు. ఆ పురం చుట్టూ ఉన్న పర్వతాలు ప్రాకారాలలా ఆ పురాన్ని రక్షిస్తున్నాయి. పక్కనే చైత్యకమనే కొండ ఉన్నది. దానిపై మూడు ఢక్కలు ఉన్నవి. శ్రీకృష్ణుడు భీమార్జునులకు ఆ ఢక్కలను చూపి " భీమా నగరంలోకి ఎవరన్నా కొత్త వారు ప్రవేశిస్తే ఆ ఢక్కలు మోగుతాయి " అని చెప్పాడు. భీమార్జునులు ఆఢక్కలను పగులకొట్టి చైత్యకపర్వత మార్గంలో నగరంలో ప్రవేశించారు. శ్రీకృష్ణుడు భీమార్జునులు సిగలో పూలు అలంకరించుకున్నారు. స్నాతకుల మాదిరి గోశాలలో ప్రవేశించారు. జరాసంధునికి బ్రాహ్మణులంటే భక్తి ప్రపత్తులు మెండు కనుక బ్రాహ్మణులు రాజమందిరంలోకి ఎప్పుడైనా వెళ్ళవచ్చు. బ్రాహ్మణవేషాలలో ఉన్న శ్రీకృష్ణుడు భీమార్జునులకు అర్ఘ్యపాద్యాలను ఇచ్చాడు. వారు వాటిని పుచ్చుకోలేదు. జరాసంధుడు సందేహపడి వారిని " మీరు గంధపుష్పాలు ధరించినా స్నాతకులుగా లేరు. మీ


జరాసంధుని భవనంలో కృష్ణార్జునులు భీముడు


భీమ జరాసంధుల పోరాటం

ఆకారాలు క్షత్రియుల మాదిరి ఉన్నాయి. మీరు ఎవరు? ఎందుకు వచ్చారు? " అని అడిగాడు. అందుకు శ్రీకృష్ణుడు, భీమార్జునులు " మేము క్షత్రియ స్నాతకులము. ముఖద్వారం గుండా మిత్రుల ఇంటికి, దొంగ ద్వారం గుండా శత్రువుల ఇంటికి ప్రవేశించడం క్షత్రియ ధర్మం " అన్నారు. జరాసంధుడు " నేను ఎవరికి అపకారం చేయలేదు. నేను బ్రాహ్మణులకు, దేవతలకు, మునులకు భక్తుడను. ఉత్తమ క్షత్రియ ధర్మాలు ఆచరిస్తున్నాను. మీకు నేనెలా శత్రువునైయ్యాను " అన్నాడు. " ఓ జరాసంధా ! ధర్మరాజు ఆజ్ఞపై శత్రుసంహారానికి వచ్చాము. ఉత్తమ క్షత్రియుడిని అని చెప్పకుంటున్న నీవు క్షత్రియులను పట్టి బంధించి శివునకు బలి ఇచ్చి శివపూజలు ఎలా నిర్వహిస్తావు? ఉత్తమ క్షత్రియులు ఇలా చేస్తారా ? నిష్కారణంగా సాధు హింస చేసే వారు, జనులను హింసించే వారు అందరికి శత్రువులు కారా ? నిర్దోషులైన సాటి కులం వారిని చంపడం పాపం కాదా. అలాంటి పూజలు ఫలిస్తాయా ? నీలాంటి పాపులను విడిచి పెడితే మాకు పాపం వస్తుంది. కనుక నీతో యుద్ధానికి వచ్చాము. నేను కృష్ణుడిని, ఇతను భీముడు, అతడు అర్జునుడు. ఇప్పటికైనా చెరలో ఉన్న రాజులను విడిచిపెడితే సరి లేని యడల వీరు నీ గర్వమణచి వారిని విడిపించ కలరు " అని శ్రీకృష్ణుడు అన్నాడు. జరాసంధుడు కోపించి " పరాక్రమంతో రాజులను జయించడం నేరమా. పరమ శివునకు బలి ఇవ్వడానికి తెచ్చిన వారిని నేను ఎందుకు


జరాసంధుని ముక్కలుగా చీలుస్తున్న భీముడు

వదిలి పెడతాను. సైన్యంతో వస్తే సైన్యంతో యుద్ధం చేస్తాను. లేనియడల మీ ముగ్గురితో కానీ, ఇద్దరితో కానీ, ఒక్కరితో కానీ యుద్ధం చేస్తాను మీకు ఏది ఇష్టమో చెప్పండి " అన్నాడు. శ్రీకృష్ణుడు " ముగ్గురు నీతో యుద్ధం చేయడం ధర్మంకాదు. మా ముగ్గురిలో నీకు సరిజోడుని కోరుకో. అతను మల్ల యుద్ధంలో నిన్ను జయిస్తాడు " అని అన్నాడు. జరాసంధుడు " నాకు సరిజోడు భీముడే. కనుక అతనితో యుద్ధం చేస్తాను " అని చెప్పాడు. జయాపజయాలు దైవాధీనం కనుక జరాసంధుడు ముందుగా కుమారుడు సహదేవునికి రాజ్యాభిషేకం చేసాడు. పురోహితుల చేత మంగళ శాసనాలు పొంది భీముని మల్ల యుద్ధానికి పిలిచాడు. భీముడు జరాసంధుడు ఘోరంగా తలపడ్డారు. ఒకరిని ఒకరు జయించాలన్న కాంక్షతో ఒకరిని మించి ఒకరు భీకరంగా తల పడ్డారు. ఇలా కార్తీక శుద్ధ పాడ్యమి నుండి త్రయోదశి వరకు సాగింది. అప్పటికి జరాసంధుడు అలసి పోయాడు. శ్రీకృష్ణుడు " భీమా ! జరాసంధుడు అలసి పోయాడు. ఇది తగిన సమయం అతడిని సంహరించు " అన్నాడు. భీమసేనుడు తన తండ్రి వాయుదేవుని తలచుకుని జరాసంధుని గిరా గిరా తిప్పి నూరు సార్లు విసిరి వేసాడు. అతడి ఎముకలు విరిచి ఘోరంగా సంహరించాడు. జరాసంధుని మృతదేహాన్ని అతని ముఖద్వారం ముందు పడవేశాడు. శ్రీకృష్ణుడు మగధవాసులకు అభయం ఇచ్చాడు. జరాసంధుని చెరలో ఉన్న రాజులను విడిపించాడు. జరాసంధుడి కుమారుడైన సహదేవునికి ధైర్యం చెప్పాడు. తరవాత వారు ఇంద్రప్రస్థానికి బయలుదేరాడు. ధర్మరాజు కు జరిగినది చెప్పి విడిపించిన రాజులను చూపించాడు. రాజులంతా వారి వారి రాజ్యాలకు పయనమయ్యారు. శ్రీకృష్ణుడు ద్వారకకు చేరుకున్నాడు.

## జైత్ర యాత్ర

ధర్మరాజు తన నలుగురు తమ్ములను నలుగురిని పిలిచి నాలుగు దిక్కులకు జైత్రయాత్రకు పంపాడు.

### అర్జునిని జైత్రయాత్ర

అర్జునుడు ఉత్తర దిక్కుకు వెళ్ళాడు. ఉత్తర దిక్కున ఉన్న పుళిందుడిని, ప్రతివీద్యుడిని, ఆఖిలద్వీప మండలాధీశులను ఓడించి సామంతులను చేసాడు. ప్రాగ్జోతిషపుర మహారాజు భగదత్తుడి మీద దండెత్తాడు. అతనితో ఎనిమిది రోజులు యుద్ధం చేసాడు. భగదత్తుడు తన బలం క్రమంగా కోల్పోయాడు. భగదత్తుడు " అర్జునా ! మనమిరువురం ఇంద్రుని పుత్రులం. మనం యుద్ధం చేయడం ఉచితం కాదు. నీకు ఏమి కావాలో చెప్పు " అన్నాడు. అర్జునుడు " భగదత్తా ! ధర్మరాజు రాజసూయ యాగం చేస్తున్నాడు. నీవు కప్పం చెల్లించు. యాగానికి రా " అన్నాడు. తరవాత అర్జునుడు అంతర్గిరి, బహిర్గిరి, ఉపగిరి రాజులను జయించి కప్పం గ్రహించాడు. ఉలూక దేశాధిపతి బ్రహంతుని, ఉత్తర ఉలూక దేశాధిపతులను, దేవప్రస్థ రాజు సేనా బిందుడిని, విష్వగశ్వుడిని, పర్వత రాజులను, బర్బర, శబర, తురుష్క రాజులను, మాళవ, పౌండ్ర, కాశ్మీరాది దేశాధిపతులను ఓడించాడు. సింహపురాధీశుడు, చిత్రాయుధుని, ఆటవిక రాజులను, దస్యులను, కాంభోజ కటక రాజును జయించాడు. మేరు పర్వతాన్ని దర్శించాడు. ఉత్తర కురుదేశాలమీద దండెత్తి ఓడించాడు. వారివద్ద కప్పములు , రత్నాభరణాలు గ్రహించాడు. ఈ విధంగా అర్జునుడు ఉత్తరదేశ జైత్ర యాత్ర పూర్తి చేసాడు.

### భీమసేనుని జైత్రయాత్ర

భీమసేనుడు తూర్పుదేశా జైత్ర యాత్రకు వెళ్ళాడు. పాంచాలదేశం, విదేహదేశం, దశార్ణ దేశం జయించి ఛేది దేశంలో అడుగుపెట్టాడు. ఛేది రాజు శిశుపాలుడు భీమసేనుడికి లొంగిపోయి కప్పం కట్టాడు. ఆ విధంగా భీమసేనుడు తూర్పుదేశాలను జయించాడు. కోట్లసంఖ్యలో రత్నములు, వజ్రములు, బంగారం, ధనం కప్పంగా తీసుకు వచ్చాడు.

### సహదేవుని జైత్రయాత్ర

సహదేవుడు దక్షిణ దిశగా జైత్ర యాత్రకు వెళ్ళాడు. సుమిత్రుడు, శూరసేనుడు, దంతవక్తుడు, యవనులను జయించాడు. నర్మదా నది తీరాన అవంతీ రాజులను ఓడించాడు. మహిష్మతీ పురం చేరాడు. ఆ దేశపురాజు నీలుడితో యుద్ధం చేసాడు. సహదేవుని సైన్యం మీద నీలుడు అగ్ని దేవుని పురికొల్పాడు. పూర్వం నీలుని వంశస్థుడు అయిన నిషాధుడు రాజ్యం చేసే సమయంలో అగ్ని దేవుడు బ్రాహ్మణ రూపంలో మహిష్మతి పురంలో వేదాధ్యనం చేస్తున్నాడు. ఆ సమయంలో పొరపాటున పరస్త్రీతో సంగమించాడు. రాజభటులు అగ్ని దేవుని పట్టుకుని నిషధుని ముందు నిలబెట్టారు. అగ్ని దేవునికి కోపం వచ్చి తన నిజరూపం చూపించాడు. తన అగ్ని కీలలతో బుసలు కొట్టారు. నిషధుడు భయపడి అతనికి మొక్కాడు. అగ్ని దేవుడు శాంతించి నిషధుడిని వరం కోరుకొమ్మని చెప్పాడు. నిషధుడు " అగ్ని దేవా ! భవుష్యత్తులో మహిష్మతిపురం మీద దండెత్తిన వారిని దగ్ధం చేయి " అడిగాడు. బదులుగా అగ్నిదేవుడు నిషధుణ్ణి " మహిష్మతీపుర వనితలు శృంగారవతులు. వారి స్వేచ్ఛావివాహానికి నీవు అనుమతి ఇవ్వాలి " అని అడిగాడు. అగ్ని దేవుని ప్రభావంతో సహదేవుని సైన్యాలను అగ్ని కీలలు చుట్టుముట్టాయి. సహదేవుడు శుచియై అగ్ని దేవుని స్థుతించాడు. అగ్ని దేవుడు అభయం ఇచ్చాడు. విషయం తెలుసుకున్న నీలుడు సహదేవునితో స్నేహంచేసి విలువైన కానుకలు కప్పంగా ఇచ్చాడు. సహదేవుడు అక్కడ నుంచి రుక్మి, భీష్మక, శూర్పాక, దండక రాజులను జయించాడు. వారు సహదేవునికి కప్పం చెల్లించాడు. దక్షిణ సాగర ప్రాంతరాజులను జయించాడు. తాళవనం, పాండ్య, కేరళ, కాళింగ, ద్రవిడ, యవన, కరహాటక, రాజులను జయించాడు. చివరిగా లంకాధిపతి విభీషణునికి ధర్మరాజు రాజసూయ యాగం గురించి, తన దక్షిణదేశ జైత్ర యాత్ర గురించి వివరించి విభీషణుని వద్ద కప్పం తీసుకురమ్మని దూతలను పంపాడు. విభీషణుడు అందుకు అంగీకరించి కప్పం పంపాడు. సహదేవుని జైత్రయాత్ర పూర్తి చేసాడు.

### నకులుని జైత్రయాత్ర

నకులుడు పశ్చిమదిశగా జైత్రయాత్రకు బయలుదేరాడు. మహితక దేశాన్ని, మరు, మాళవ, బర్బర, కర్బర, శైరీషక, దాశార్ణ దేశాలు జయించాడు. ద్వారకకు వచ్చి శ్రీకృష్ణునకు తన రాక తెలిపాడు. తన మేనమామ మద్రదేశాధిపతి శల్యుని వద్దకు వెళ్ళి అతని వద్ద నుండి మర్యాద పూర్వకంగా కప్పం కట్టించుకున్నాడు. మిగిలిన దేశాలను జయించి కప్పం కట్టించుకుని తిరిగి వచ్చాడు.

## రాజసూయ యాగం ఏర్పాట్లు

భీమసేనుడు, అర్జునుడు, సహదేవుడు, నకులుడు నాలుగు దిక్కులను జయించి అసంఖ్యాకంగా ధన, కనక, వస్తు, వాహనములు తీసుకు వచ్చారు. ద్వారక నుండి శ్రీకృష్ణుడు అశేష ధన, కనక, వస్తు, వాహనాలతో వచ్చాడు. అవన్నీ ధర్మరాజుకు ఇచ్చి గౌరవించాడు. ధర్మరాజు అవి చూసి సంతోషించి రాజసూయయాగం ప్రారంభించాడు. ధర్మరాజు శ్రీకృష్ణునితో " కృష్ణా ! నీ దయ వలన సార్వభౌమత్వం లభించింది. అశేష సంపదలు లభించాయి. నన్ను రాజసూయయాగం చేయడానికి నియోగించు " అన్నాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజు తో " కృష్ణా ! నీవు రాజసూయ యాగం ప్రారంభించు అందుకు నీ ఇష్టం పనికి నన్ను నీ ప్రియం కోరే ఇతరులను నియోగించు " అన్నాడు. శ్రీకృష్ణుని అనుమతి పొంది ధర్మరాజు రాజసూయం ప్రారంభించాడు. యాగానికి కావలసిన ఏర్పాట్లను చూడటానికి సహదేవుని నియమించాడు. శిల్పులను పిలిపించి యజ్ఞశాలను నిర్మింపచేసాడు. నానా దేశాధీసులకు ఆహ్వానం పంపాడు. ఆహారధాన్యాలను సమృద్ధిగా సమకూర్చారు. ధర్మరాజు ఆహ్వానాన్ని మన్నించి భీష్ముడు, ధృతరాష్ట్రుడు, విదురుడు, ద్రోణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, సోమదత్తుడు, కర్ణుడు, భూరిశ్రవుడు, శల్యుడు, శకుని, సైంధవుడు, దుర్యోధనుడు, దుశ్శాసనుడు, వికర్ణుడు తదితరులు రాజసూయయాగానికి విచ్చేసారు. వచ్చినవారిని ధర్మరాజు తగిన రీతిన సత్కరించి వసతి ఏర్పాట్లు చేసాడు. అందరికి దానధర్మాలు చేయడానికి అధిపతిగా కృపాచార్యుని, కార్యాచరణకు భీష్ముని, ద్రోణుని, సకల వస్తు వ్యయమునకు విదురుని, నానాదేశరాజులు తెచ్చిన కానుకలు స్వీకరించటానికి దుర్యోధనుడిని నియోగించాడు. శుభముహూర్తములొ ధర్మరాజు యజ్ఞ దీక్ష తీసుకుని యజ్ఞశాలలో ప్రవేశించాడు. పైలుడు, ధౌమ్యుడు ఋగ్వేద ఋత్విక్కులుగానూ, యాజ్ఞవల్క్యుడు యజుర్వేద ఋత్విక్కునిగానూ, సుసాముడు సామవేద ఋత్విక్కుగానూ, వేదవ్యాసుడు ప్రధాన ఋత్విక్కుగానూ నారదాది మహర్షులు సదస్యులుగానూ భీష్ముడు సహాయకుడుగానూ ఉండగా యాగం మొదలైంది.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభ్రువాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రథుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

# సభా పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



## ద్వితీయాశ్వాసం


రాజసూయ యాగమును చేయుచున్న యుధిష్టురుడు


సభలో కృష్ణుని గొప్పతనమును గురించి చెప్పుచున్న భీష్ముడు

రాజసూయయాగం ప్రారంభం అయింది. భీష్ముడు ధర్మరాజు తో

ఇలా అన్నాడు " ధర్మరాజా ! స్నాతకుడు, ఋత్విజుడు ,భూతలేశుడు, సద్గురుడు, జ్ఞానసంపన్నుడు, అందరికీ ఇష్టుడు అయిన మహానుభావుని ఒకరిని పూజించు " అని అన్నాడు. ధర్మరాజు భీష్మునితో " పితామహా ! అటువంటి మహానుభావుడెవరో మీరే శలవీయండి " అన్నాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఇంక ఎవ్వరున్నారు ? సాక్షాత్తు మహావిష్ణు స్వరూపుడైన శ్రీకృష్ణుడే అగ్ర పూజకు తగిన వాడు " అని ధర్మరాజు తో చెప్పాడు. తనమనసులో మాట చెప్పినందుకు ధర్మరాజు ఆనందపడి సహదేవుడు తెచ్చిన అర్ఘ్యపాద్యాలను శ్రీకృష్ణునకు సమర్పించాడు. ఇది చూసి శిశుపాలుడు సహించలేక పోయాడు. ధర్మరాజు ని చూసి " ఓ ధర్మరాజా! ఈ సభలో ఎందరో మహారాజులు, బ్రాహ్మణోత్తములు ఉన్నారు. వారిని కాదని ఈ గాంగేయుడు చెప్పాడని చెడు నడవడి కలిగిన ఈ కృష్ణుని పూజిస్తావా ? ఇది అవివేకం కాదా ? ఈ భీష్మునికి ఆలోచనలేకపోతే నీ బుద్ధి ఏమైంది? మీకు కృష్ణుడు కావలసిన వాడైతే మీ ఇంటికి తీసుకు వెళ్ళి పూజలు చేయండి. ఈ మహాసభలో పూజించి మమ్మల్ని అవమానించ కండి. కృష్ణుడు ఇంతటి మర్యాదకు అర్హుడు కాదు " అంటూ శిశుపాలుడు సభ విడిచి వెళ్ళాడు. ధర్మరాజు శిశుపాలుని వెంట వెళ్ళి " శిశుపాలా ! నీ వంటి ప్రభువులు ఇలా పరుషంగా మాటాడ తగునా ? శ్రీకృష్ణుడు సాక్షాత్తు మహావిష్ణు అవతారం కనుక భీష్ముడు అగ్రపూజ చేయమన్నాడు. లోకోత్తరుడని అందరిచే శ్లాగించబడే కృష్ణుని నువ్వు ఇలా కాదనడం భావ్యమా ? " అని శిశుపాలునికి నచ్చచెప్ప పోయాడు. భీష్ముడు " ధర్మరాజా ! శిశుపాలుడు బాలుడు, చెడు నడత కలిగిన వాడు. పెద్దలను అకారణంగా నిందించే వాడు. కొద్దిపాటి రాజ్యం లభించగానే మదం ఎక్కిన వాడు. వాడికి ధర్మాధర్మాలు తెలియవు. అతడిని ఒప్పించే ప్రయత్నం ఎందుకు చేస్తావు ? " అని శిశుపాలుని చూసి " శిశుపాలా! బుద్ధిహీనుడా శ్రీకృష్ణునికి అగ్రపూజకు అర్హత లేదా ? ఇక్కడ ఉన్న రాజులంతా జరాసంధుని నుండి విడిపించింది ఈ మహానుభావుడే కదా. బాలుడైనా జ్ఞానవృద్ధుడు పూజనీయుడే. అమిత పరాక్రమవంతుడైన క్షత్రియుడు పూజనీయుడే. శ్రీకృష్ణుడు మహాజ్ఞాని, మురుడు అనే రాక్షసుని సంహరించిన పరాక్రమ వంతుడు. ఇతరులను పూజిస్తే వారు మాత్రం తృప్తి చెందుతారు. లోకారాధ్యుడైన కృష్ణుని పూజిస్తే లోకమంతా తృప్తి చెందుతుంది " అన్నాడు. ఇంతలో సహదేవుడు లేచి " శ్రీకృష్ణునికి అగ్రపూజ చేయడం మా ఇష్టం . కాదన్న దుర్జనులను నా పాదం క్రింద అణిచివేస్తాను " అంటూ పాదం ఎత్తి భీకరంగా నిలబడ్డాడు. సభ అంతా సహదేవుని భీకరరూపంచూసి భయపడింది. శిశుపాలుని సైన్యాధిపతి తన సైన్యాన్ని తమపక్షాన ఉన్న రాజులందరిని ఒకటిగా చేర్చి యుద్ధానికి సిద్ధం



యుద్ధానికి సిద్ధమౌతున్న శిశుపాలుడు

అయ్యాడు. ఈ పరిణామానికి ధర్మరాజు కలత చెందాడు. భీష్ముని చూసి " పితామహా ! ఆహుతులైన రాజులంతా కలత చెంది ఉన్నారు. తమరే శాంతింప చేయాలి " అన్నాడు . భీష్ముడు " ధర్మజా! కలత పడకు. సకల రాక్షస సంహారుడు శ్రీకృష్ణుడు యాగరక్షకుడుగా ఉండగా ఈ యాగాన్ని ఎవరూ విఘ్నం చేయలేరు " అన్నాడు. ఆ మాటకు శిశుపాలుడు కోపించి " ఈ ముసలి భీష్ముడు యాదవుని పరమేశ్వరునిగా చేసాడు. ఈ పాండవులు ధర్మాత్ములూ, ధీరులూ అయితే ఇక్కడున్న రాజులు అధర్మవర్తనులూ అధీరులా ? పూతన అనే స్త్రీని చంపుట, ప్రాణ రహితమైన బండిని తన్నుట, పుచ్చిన చెట్లను పడత్రోయుట, చిన్న పుట్టలాంటి కొండను ఎత్తుట పరాక్రమమా ? స్త్రీ వధ చేసినవాడికి మర్యాదలా ? అలాంటి వారిని పొగిడే వారిని సహస్ర చీలికలుగా చేయాలి. ఇక తమరి సంగతి మరొకరు ప్రేమించిన కన్యను తమ్ముడికి కట్టబెట్టాలని చూసావు. కాని ధర్మం తెలిసిన నీ తమ్ముడు అంబను విడిచి పెట్టాడు. సంతాన హీనుడివి నాకు ధర్మపన్నాలు చెప్తావా! ఈ కృష్ణుడు వీరత్వం తెలియనిదా. మహావీరుడైన జరాసంధునికి భయపడి పది సార్లు పారిపోయాడు. కపట బ్రాహ్మణవేషాలలో వెళ్ళి చంపడం వీరత్వమా ? " అని దూషించాడు. శ్రీకృష్ణుని తూలనాడటం సహించలేని భీముడు శిశుపాలుని చంపటానికి ముందుకు దూకాడు. భీష్ముడు భీముని ఆపాడు.

## శిశుపాలుని జన్మవృత్తాంతం-వధ

భీష్ముడు భీమునితో " భీమసేనా! ఈ శిశుపాలుని నువ్వు చంపరాదు. ఈ దుర్మార్గుడు దమఘోషుడు సాత్వతికి పుట్టాడు. పుట్టుకతోనే నాలుగు భుజాలతో, నొసటి మీద కంటితో, గార్ధభ స్వరంతో పుట్టాడు. తల్లి తండ్రులు ఆ బాలుని చూసి కలత చెందారు. అప్పుడు అశరీరవాణి ఈ బాలుడిని ఎవరు ఎత్తుకున్నప్పుడు మామూలు రూపం పొందుతాడో అతని చేతిలో ఇతడు హతుడు కాగలడు " అని పలికింది. అప్పటి నుండి ఆ బాలుని ఇంటికి ఎవరు వచ్చినా చేతికి ఇవ్వసాగారు. ఒకరోజు బలరామ కృష్ణులు ఆ బాలుని చూడటానికి వచ్చారు. శ్రీకృష్ణుడు ఎత్తుకోగానే ఆ బాలునికి మామూలు రూపం వచ్చింది. అప్పుడు శ్రీకృష్ణుని చేతిలో అతని మరణం తథ్యమని భావించిన సాత్వతి శ్రీకృష్ణుని చూసి " కృష్ణా ! నీ మరిది అయిన శిశుపాలుని

రక్షించు " అని కోరింది. అలాగే అన్నాడు కృష్ణుడు. ఇతని నూరు తప్పులు సహిస్తాను అవి పూర్తి కాగానే నా చేతిలో హతుడౌతాడు " అని చెప్పాడు భీష్ముడు. అప్పటికి శిశుపాలుడికి బుద్ధి రాలేదు." కృష్ణా! ఈ ముసలి భీష్ముడు పాండవులు నిన్ను



నరకాసురుని మరణము తరువాత అదితి కుండలములను తిరిగి ఇస్తున్న అతని తల్లి భూదేవి



శిశుపాలునిపై చక్రాయుధం ప్రయోగించిన కృష్ణుడు

సన్మానించడం నేను సహించలేను. నాతో యుద్ధానికి సిద్ధం కండి " అన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు సభాసదులను చూసి " మేము ప్రాగ్జ్యోతిష పురం మీద దండెత్తినప్పుడు ఈ శిశుపాలుడు ద్వారకను తగులబెట్టాడు. భోజరాజులు రైవతకాద్రి మీద భార్యలతో గడుపుతుంటే వారిని దారుణంగా చంపాడు. నా తండ్రి వసుదేవుడు అశ్వమేధయాగం చేస్తుంటే అశ్వాన్ని అపహరించాడు. బభ్రుని భార్యను తన భార్యగా చేసుకున్నాడు. నా అత్త సాత్వతి కోరిక ప్రకారం నూరు తప్పులు సహించాను. ఇతడు నాకు పరమ శత్రువు అయ్యాడు " అన్నాడు. శిశుపాలుడు శ్రీకృష్ణుని చూసి " నేను వివాహమాడదలచిన కన్యను అపహరించి సిగ్గులేకుండా మాట్లాడుతున్నావా ? " అని దూషించావు .ఇక శ్రీకృష్ణుడు సహించలేక పోయాడు . తన చక్రాయుధం ప్రయోగించి శిశుపాలుని శిరస్సు ఖండించాడు. తరువాత శ్రీకృష్ణుడు ధర్మరాజు తో అతని అంత్యక్రియలు జరిపించమన్నాడు. శిశుపాలుని కుమారుని ఛేదిదేశానికి రాజుని చేసాడు. శిశుపాలుని వధతో రాజసూయం పరిసమాప్తి అయింది.

## రాజసూయయాగం అనంతర విశేషాలు



నేల^అని భ్రమపడి నీటిలో పడ్డ ధుర్యోధనుడు

ధర్మరాజు రాజసూయానికి విచ్చేసిన దేవతలను, గురువులను, బ్రాహ్మణులను తగు రీతిని సత్కరించి తృప్తిపరిచాడు. ధర్మరాజు ఆజ్ఞ ప్రకారం భీమసేనుడు భీష్మ , దృతరాష్ట్రులను సాగనంపాడు. అలాగే అర్జునుడు ద్రుపదుని సాగనంపారు. నకులుడు శల్యుని, సుబలుని సాగనంపాడు. సహదేవుడు ద్రోణ, కృప అశ్వత్థామ లను సాగనంపాడు. శ్రీకృష్ణుడు కూడా ధర్మరాజు వద్ద శలవు తీసుకుని ద్వారకకు పయనమైయ్యాడు. పాడవులందరూ శ్రీకృష్ణుని సాగనంపారు. మయసభా విశేషాలు చూడటానికి శకుని దుర్యోధనుడు ఇంద్రప్రస్థంలో ఉన్నారు. ఒక రోజు సుయోధనుడు ఒంటరిగా మయసభను చూడటానికి వెళ్ళాడు. దాని అపూర్వ సౌందర్యానికి ఆశ్చర్యపడ్డాడు. దుర్యోధనుడు మయసభను చూసే సమయంలో అక్కడక్కడా భంగపడ్డారు. తెరచిన ద్వారం మూసి ఉన్నట్లు గానూ, మూసిన ద్వారం తెరచినది గాను భ్రమించి లలాటం కొట్టుకున్నాడు. నీరులేనిచోట ఉన్నదని, నీరు ఉన్న చోట లేదు అని భ్రమపడి దిగి దుస్తులు తడుపుకున్నాడు. అతని అవస్థ చూసి ధర్మరాజు సుయోధనునికి నూతన వస్త్రాలు ఇచ్చాడు. కానీ దుర్యోధనుడు అది తనకు జరిగిన అవమానంగా భావించి రోషపడ్డాడు. హస్థినకు బయలుదేరాడు. మయసభా విభవం పాండవుల వైభవం అతనిలో అసూయా అగ్ని జ్వాలలా రగిలించింది. దుర్యోధనుడు అసూయతో రోజురోజుకు కృశించి పోసాగాడు. శకుని ఇది గమనించి " సుయోధనా నీకు ఏమైంది? " అని అడిగాడు. దుర్యోధనుడు " మామా మయసభ చూసావు కదా. అంతటి మయసభ కలిగిన ధర్మరాజు ఎంతటి అదృష్ట వంతుడు. ధర్మరాజు చక్రవర్తి అయ్యాడు. రాజులంతా ధర్మరాజు కు అమూల్యమైన కప్పములు సమర్పించారు. శ్రీకృష్ణుడు శిశుపాలుని వధించినా రాజులు పొగిడారు కాని ఏమని

అడగలేదు. పాండవుల ఐస్వైర్యం సహించరానిదిగా ఉంది. అభిమానధనుడు దాయాదుల వైభవాన్ని సహింపకలడా ? " అని దుఃఖించాడు. శకుని " సుయోధనా ! దృతరాష్ట్రుని అనుమతి పొంది నా మాట పాటిస్తే పాండవ లక్ష్మిని నీకు చెందేలా చేస్తాను " అన్నాడు.

## మాయా జూదానికి నాంది

దుర్యోధనుడు శకునినితో దృతరాష్ట్రుని వద్దకు వెళ్ళాడు. కుమారుడు కృశించి పోతున్నాడని విని ధృతరాష్ట్రుడు చింతించాడు. " నాయనా సుయోధనా ! కౌరవ సంపదనంతా నీకు ఇచ్చాను కదా. దేవేంద్రునితో సమానమైన భోగభాగ్యాలు నీకు ఉన్నాయి కదా. నీవిలా కృశించడం ఎందుకు ? " అని అడిగాడు. " తండ్రీ ! పాండవుల ఐశ్వర్యం దేవేంద్రుని కంటే గొప్పది. వారి కీర్తి నలుదిశలా వ్యాపించింది. వారితో పోలచడానికి మూడు లోకాలలోని రాజులు సరిపోరు. హరిశ్చంద్రుడు చేసిన రాజసూయయాగం కంటే పాండవులు చేసిన రాజసూయ యాగం గొప్పది. సామంతుల వలన అశేషరత్నాభరణాలు కప్పంగా పొందారు. ధర్మరాజుకు సాత్యకి ముత్యాల ఛత్రం పట్టాడు. భీముడు చామరం వీచాడు. రాజులందరి చేత శ్రీకృష్ణుడు ధర్మరాజుకు మొక్కించాడు. సాటి రాజ కుమారుడుగా నేనిది సహించలేను " అన్నాడు. శకుని దుర్యోధనునితో " ధర్మరాజు జూద ప్రియుడు. అందులో కపటం తెలుయని వాడు. నేను అక్షవిద్యలో నేర్పరిని. జూదంలో ధర్మరాజు ని అక్రమంగా ఓడించి అతని సంపద అంతా సుయోధనుని హస్తగతం చేస్తాను " అన్నాడు. సుయోధనుడు సంతోషించి " తండ్రీ ! ఇందుకు మీరు అంగీకరించండి " అన్నాడు. ధృతరాష్ట్రుడు " విదురుడు చాలా దూర దృష్టి కలవాడు. నీతి కోవిదుడు. మీ ఇరువురి క్షేమం కోరేవాడు. అతనితో చర్చించి నిర్ణయం తీసుకుంటాము " అని అన్నాడు. దుర్యోధనుడు " తండ్రీ !విదురుడు పాడవ పక్షపాతి. అతడు ఇందుకు అంగీకరించడు. మీరు అంగీకరించనిచో నేను అగ్ని ప్రవేశం చేస్తాను మీరు విదురుడు సంతోషంగా ఉండండి " అన్నాడు. జూదం తగదని సంశయిస్తూనే ధృతరాష్ట్రుడు కుమారుని సంతోషపెట్టడానికి సభానిర్మాణానికి ఏర్పాట్లు చెయ్యమని చెప్పాడు. ఒక నాడు విదురునితో సుయోధనుని అభిప్రాయం చెప్పాడు. విదురుడు " ఇందుకు నేను అంగీకరించను. పాండవులకు కౌరవులకు విరోధం కలగడానికి పునాది వెయ్యద్దు. ఎంతటి శాంత స్వభావులకైనా జూదం విరోధం కలిగిస్తుంది. పాండవులు కౌరవులు కలసి ఉండేలా ఏర్పాటు చెయ్యి " అన్నాడు. ధృతరాష్ట్రుడు " విదురా ! నీవు అనవసరంగా అనుమాన పడవద్దు. మీరు భీష్ముడు ఉండగా అన్నదమ్ముల మధ్య విరోధం ఎందుకు వస్తుంది. కనుక నీవు ఈ జూదానికి అంగీకరించి ఇంద్రప్రస్థానికి వెళ్ళి పాండవులను జూదానికి తీసుకురా " అన్నాడు. ధృతరాష్ట్రుడు " దుర్యోధనా ! ఈ జూదం వలన మీకు విరోధం వస్తుంది మీ విరోధం భూమి మీద ప్రజలందరికి కీడు చేస్తుంది. విదురునికి ఇందులో అంగీకారం లేదు. నీకు సంపద కావాలంటే నీవు కూడా యాగం చెయ్యి. మీ రిద్దరూ రాజ్యాన్ని పాలించండి " అన్నాడు. దుర్యోధనుడు " మహారాజా ! ధర్మరాజు జూదం ఆడుతుండగా చూడటం ఒక యజ్ఞం. నేను సకలైశ్వర్యములు పొందడానికి అది మార్గం. శత్రువుల అభివృద్ధిని ఉపేక్షించిన మనలను అది నాశనం చేస్తుంది. పాండవుల ఐశ్వర్యాన్ని కొల్లగొడితే కాని నాకు ఉపశమనం లేదు " అన్నాడు. వెంటనే శకుని " సుయోధనా! ఎలాంటి సైన్యం లేకుండా యుద్ధం రక్త పాతం లేకుండా పాచికలాడించి పాండవ రాజ్యలక్ష్మిని నీకు ఇస్తాను. జూదం కాక వేరు ఏ విధంగా పాండవులను జయించడం ఎవరి తరం కాదు " అన్నాడు. ధృతరాష్ట్రుని మనసు జూదానికి అంగీకరించలేదు. " మీరు ఎన్ని చెప్పినా నేను వినను. విదురుడు జూదం అనర్ధ హేతువని చెప్పాడు. అతడు నీతి కోవిదుడు.నేను అతని మాట మీరను జూదం వదిలి ఎప్పటిలా ఉండు " అని దుర్యోధనునితో అన్నాడు. దుర్యోధనుడు " తండ్రీ !విదురుడు పాండవ పక్షపాతి అతడు మనకు ఆప్తుడు కాడు. జూదం పురాణంలో ఉంది. స్నేహంతో ఆడుకునే జూదం హాని కాదు. కనుక శకుని తో జూదం ఆడ్డానికి అనుమతి ఇవ్వండి " అన్నాడు.

### జూదానికి ఆహ్వానం

తప్పని సరి పరిస్థితిలో ధృతరాష్ట్రుడు విదురునితో " విదురా! మనము ఒక సభ నిర్మించాము కదా దానిని చూడటానికి ధర్మరాజుని అతని తమ్ములతో ఆహ్వానించి నీతో తీసుకుని రా. పొద్దు పోవడానికి దుర్యోధనునితో జూదం ఆడుతాడు " అన్నాడు. విదురుడు జూదం అనర్ధమని ఎన్ని మార్లు చెప్పినా ప్రయోజనం లేక పోయింది. ఇక తప్పదని ఇంద్రప్రస్థానికి వెళ్ళాడు. ధర్మరాజు విదురుని సాదరంగా ఆహ్వానించాడు. విదురుని రాకకు కారణం తెలుసుకున్న ధర్మరాజు విదురునితో " విదురా ! మా పెదనాన ఆహ్వానం మన్నించి నీ వెంట వస్తాము . సభను చూస్తాము కానీ జూదం తగునా జూదం వలన విభేదాలు వస్తాయి. అయినా దృతరాష్ట్రుని ఆజ్ఞ మాకు శిరోధార్యము . అందుకని మీతో వస్తాము " అన్నాడు. హస్థినాపురంలో కుమారులతోను భీష్ముడు, ద్రోణుడు, శల్యుడు , శకుని, అశ్వత్థామ, సైంధవుడు మొదలైనవారితో ఉన్న దృతరాష్ట్రుడికి, భానునుమతి మొదలైన కోడళ్ళతో ఉన్న గాంధారి కి ధర్మరాజాదులు నమస్కరించారు. ద్రౌపది సౌందర్యానికి గాంధారి కోడళ్ళకు ఆశ్చర్యంతో కూడిన అసూయ చెందారు. దుర్యోధనునితో కలసి పాడవులు సభను తిలకించి సుఖానుశీనులైనారు.

## జూదం ప్రారంభం


ధర్మరాజు జూదంలో ఓడిపోవుట

ఆ సమయంలో దుర్యోధనుడు " ధర్మజా! కొంచెం సేపు జూదం ఆడతాము. నీకు జూదం ఆడటంలో ఆసక్తి ఉంది కదా " అన్నాడు. ధర్మరాజు " సుయోధనా ! జూదం అందులో మోసపూరిత జూదం క్షత్రియ ధర్మం కాదు. రాజులు జూదం ఆడుట ధర్మం కాదు. కుటిలులతో జూదం తగదు. దాని వలన ఎంతటి వారైనా సంపద కోల్పోతారు. ధర్మ జూదంలో గెలవడం పుణ్యం , కపట జూదంలో గెలవడం పాపం " అన్నాడు. శకుని " జూదంలో నేర్పరులు, లోకజ్ఞానం కలవారు, సుక్షత్రియులు, రాజనీతి తెలిసినవారు జూదాన్ని నిందించటం తగదు. బలహీనులు బలవంతులను ఓడించటానికి మాయలు పరిపాటి కదా. నీకు భయమైతే వద్దు " అన్నాడు. ధర్మరాజు " బలవంతంగా జూదానికి పిలువబడ్డాము. ఆడక తప్పుతుందా. ఇక మాటలెందుకు కానివ్వండి " అన్నాడు. ధర్మరాజు " మీలో నాతో ఎవరు జూదం ఆడుతారు " అని అడిగాడు. దుర్యోధనుడు " ధర్మజా! నా తరఫున శకుని జూదం ఆడతాడు అతడు ఓడిన ధనరాశులు నీవి " అన్నాడు. ధర్మరాజు " ఒకరి కోసం ఒకరు ఇది అక్రమం " అనుకున్నాడు. చేసేది లేక తన చేతి రత్న ఖచిత కంకణాన్ని ఫణంగా పెట్టాడు. జూదం స్నేహపూరితంగా జరుగుతున్నది. భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యుడు, విదురుడు వికల మనస్కులై చూస్తున్నారు. శకుని తనకోసం చేయించుకున్న ప్రత్యేక పాచికలతో జూదం ఆడి గెలుస్తున్నాడు. ధర్మరాజు లో పంతం పెరిగింది. ఒకటి తరవాత ఒకటిగా ఒడ్డుతూ ఓడుతున్నాడు. బంగారు బండాగారాలు, వజ్రాల బండాగారాలు, రత్నబండాగారాలు, బంగారు నిధులు, అశ్వములు, ఏనుగులు, సేవకులు, దాసదాసీ జనాలు, గూవులు, సేనావాహిని, అన్నింటినీ ఓడి పోయాడు. ఇది చూసి విదురుడు ధృతరాష్ట్రునితో " దుర్యోధనుడు పాపాత్ముడు కురు వంశం పాపంతో నిండిపోతుంది. దుర్యోధనుని నివారించు. ధర్మాన్ని రక్షించు. వినాశనాన్ని ఆపించు. దుర్యోధనుని బహిష్కరించు. అతడు బలవంతులతో యుద్ధానికి కాలుదువ్వుతున్నాడు. జూదాన్ని ఆపు ఉపేక్షించకు " అన్నాడు. పుత్రుల మీద మమకారంతో ధృతరాష్ట్రుడు మిన్నకున్నాడు. విదురుడు దుర్యోధనునితో " సుయోధనా ! నువ్వు ఈ ప్రకారంగా శకుని సహకారంతో పాండవులను కొల్లగొడుతుంటే ప్రజలు ఛీ కొట్టరా ? ఇలా మోసం చెయ్యటం మంచిదా " అన్నాడు. అప్పుడు దుర్యోధనుడు విదురుని చూసి కోపంతో " నువ్వు ఎప్పుడూ పాండవుల పక్షాన మాట్లాడతావు. నువ్వు మా ఇంట్లో ఉంటే విష సర్పం ఉన్నట్లే. శత్రువుల సంపదను సులభ మార్గంలో అపహరించడం రాజధర్మం. కనుక మాకు బుద్ధులు చెప్పొద్దు " అని దూషించాడు. శకుని ధర్మరాజు తో " ధర్మజా! నీవు నీ సంపదనంతా పందెంలో ఒడ్డి ఓడావు. తరవాత పందెం ఏమిటి " అన్నాడు. అప్పటికే ధర్మరాజు జూదానికి బానిస అయ్యాడు. తన సమస్త రాజ్యాన్ని ఒడ్డి ఓడిపోయాడు. తరువాత బ్రాహ్మణులకు, దేవాలయాలకు ఇచ్చిన భూములు తప్ప మిగిలిన ఆస్తులను ఒడ్డి ఓడిపోయాడు. తన తమ్ములను ఒడ్డి ఓడిపోయాడు ఆఖరున తనను తాను ఒడ్డుకున్నాడు. అప్పుడు శకుని " ధర్మజా ! అదేమిటి నిన్ను నీవు ఒడ్డుకున్నావు. నీ వద్ద ఒడ్డడానికి మరొక ధనం ఉంది మరిచి పోయావా ? నీ భార్య ద్రౌపది నీ ధనం కాదా?" అని ఎత్తి పొడిచాడు. అప్పుడు పాచికలు అందుకున్న ధర్మరాజు ద్రౌపది ని ఫణంగా పెట్టి ఓడి పోయాడు. అప్పుడు ఆట చాలించాడు.

## ద్రౌపదికి సభలో అవమానం

ఇదంతా చూస్తున్న భీష్మునకు నోట మాటరాలేదు. విదురుడు దు:ఖిస్తున్నాడు. కర్ణుడు, సైంధవుడు ఆనందంతో ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. అప్పుడు ధృతరాష్ట్రునికి తెలివి వచ్చింది. " విదురా! ఏమైంది? ఎవరెవరు ఏ పందాలు ఒడ్డారు?" అని అడిగాడు. అప్పుడు దుర్యోధనుడు విదురుని చూసి " నా ఇల్లు తుడవటానికి దాసి ద్రౌపదిని పిలుచుకురా " అని ఆజ్ఞాపించాడు. విదురుడు " ఛీ నీవంటి మూర్ఖుడు లేడు. ఇలాంటి పనికి నన్ను పంపుతారా. ద్రౌపది ఎవరు ? సమస్త భూమండలానికి పట్టమహిషి. ఆ సాధ్విని అవమానిస్తారా ! " అని అడిగాడు. సుయోధనుడు ప్రాతిగామి అను సూతనందనుని పిలిచి " నీవు పోయి ద్రౌపదిని సభకు తోడ్కొని రా " అన్నాడు. ప్రాతిగామి ద్రౌపది వద్దకు పోయి " అమ్మా ! ధర్మరాజు జూదంలో సమస్త సామ్రాజ్యాన్ని, తమ్ములను, తనను, నిన్ను ఓడిపోయాడు. దుర్యోధనుడు నిన్ను సభకు తీసుకురమ్మని నన్ను పంపాడు. పదమ్మా పోదాము " అన్నాడు. అప్పుడు ద్రౌపది " అయ్యా! ఏ యుగంలోనైనా ఇలాంటి చెడ్డ జూదగాడు ఉంటాడా ? ధర్మరాజు ఇలా చేసాడా? తనను కూడా ఓడాడు అంటున్నావు. తన్నోడి నన్నోడెనా ? నన్నోడి తన్నోడెనా ? తెలుసుకుని


కురుసభలో ద్రౌపదికి అవమానం

వచ్చి నన్ను తీసుకు పో " అన్నది. ప్రాతిగామి తిరిగి వచ్చి ఇదే విషయం అడిగాడు. " ఇది సమాధానం చెప్ప వీలులేని విషయం. ఇక్కడికే వచ్చి అడగమను. నీవుపోయి ద్రౌపది ని తీసుకు రా " అని పంపాడు. ప్రాతిగామి ద్రౌపది వద్దకు పోయి " అమ్మా! నీవు అడిగిన విషయం తెలుసుకోవడానికి నిన్ను అక్కడికి రమ్మన్నారు " అన్నాడు. చేసేది లేక ద్రౌపది ఏకవస్త్రంతో సభకు వచ్చింది. దృతరాష్టుని పక్కన నిలబడింది. ద్రౌపది దుస్థితి చూడలేక పాండవులు తలలు వంచుకున్నారు. అప్పుడు దుర్యోధనుడు దుశ్శాశనుని చూసి " నీవు పోయి ద్రౌపది ని ఇక్కడికి తీసుకు రా " అన్నాడు. ద్రౌపది ఒక్క పరుగున గాంధారి పక్కకు పోయి నిలబడింది. దుశ్సాసనుడు ద్రౌపదితో ఎక్కడికి పోతావు నిన్ను శకుని జూదంలో గెలిచాడు. నువ్వు దుర్యోదనుని సొత్తు అయినావు " అంటూ దగ్గరికి వచ్చాడు. " అయ్యా నేను రజస్వలను. ఏకవస్త్రను. నన్ను ముట్టవద్దు. సభకు రాలేను " అన్నది. దుశ్శాసనుడు నవ్వి " ఏకవస్త్రనైనా విగత వస్త్రనైనా రాక తప్పదు. నేను నిన్ను తీసుకు పోతాను " అంటూ దుశ్సాసనుడు ద్రౌపది కురులు పట్టుకుని ఈడ్చుకుంటూ సభకు తీసుకు వచ్చాడు. ద్రౌపది కురువంశ పెద్దలను చూసి " అయ్యా! దుశ్శాసనుడు నన్ను ఈ సభకు ఈడ్చుకు వచ్చాడు. మీరందరూ చూస్తుండగా అవమానించాడు. అధర్మం పెరిగి పోయింది " అని అంటూ భయంతో మనసులో శ్రీకృష్ణుని ధ్యానించింది. భీముడు ధర్మరాజు ని చూసి " ఓ ధర్మజా! ఈ రాజ్యం, నీ తమ్ములు నీ వశంలో ఉన్నాము కనుక జూదంలో ఒడ్డావు. దృపదరాజ పుత్రిని జూదంలో పెట్టడం తగునా ? అందు వలన ద్రౌపది అవమానాల పాలైంది. జరుగుతున్నది అధర్మ జూదమని తెలిసి నువ్వు జూదం ఆడావు. నీ చెయ్యి కాల్చాలి కదా " అర్జునుడు " అన్నయ్యా ! స్నేహంగా ఆడుకునే జూదానికి , ధర్మయుద్ధానికి పిలిస్తే పోవడం రాజధర్మం. అందుకనే ధర్మరాజు ధర్మం పాటించి ఆడాడు కాని విధి వైపరీత్యానికి ఏమి చేస్తాం ? " అన్నాడు.

## వికర్ణుడు

దుర్యోధనుని తమ్ముడు వికర్ణుడు " ఈ సభలో ఉన్న కురువృద్ధులు , గురువులు, పెద్దలు అందరూ మౌనంగా ఉన్నారు. మిగిలిన వారైనా ధర్మం చెప్పండి. ఆలోచించండి ఇక్కడ జరుగుతున్నది ధర్మమా ? " అన్నాడు. ఎవరూ బదులు చెప్పక పోవడం చూసి వికర్ణుడు " నేను ఇక్కడ ధర్మనిర్ణయం చేస్తాను. జూదం, వేట, మద్యపానం, అతిగా తినడం దుర్వ్యసనాలు. వీటి వలన మానవులు ధర్మం తప్పి ప్రవర్తిస్తారు. అలాంటి వారు చేసే పనులు లెక్కలోకి రావు. ఒక జూదరి చేత పిలువబడిన వ్యసనపరుడైన మరో జూదరి ధర్మరాజు పాండవుల ఉమ్మడి ధనమైన ద్రౌపది ని ఫణంగా పెట్టి ఆడి ఓడడం ధర్మం కాదు. పైగా ఏకవస్త్రను సభకు తీసుకు రావడం అన్యాయం " అన్నాడు. కర్ణుడు వికర్ణుని చూసిన కర్ణుడు " ఎందుకీ అధిక ప్రసంగం ? చిన్నవాడివి ధర్మం గురించి నీకేమి తెలుసు. ఇంత మంది పెద్దలు ఉండగా ధర్మ నిర్ణయం చెయ్యడం నీకు తగదు. ద్రౌపది ధర్మరాజు ధనం. కనుక ధర్మ విజిత. లేకుంటే పాండవులు అంగీకరిస్తారా. పెక్కు మంది భర్తలు కలిగిన ద్రౌపది బంధకి. అలాంటి వారిని ఏకవస్త్రగానే కాదు. విగత వస్త్రగా తెచ్చినా అధర్మం కాదు " అన్నాడు. దుర్యోధనుడు ఇలా అన్నాడు " కర్ణుడు బాగ చెప్పాడు. దుశ్శాశనా ! ద్రౌపది పాడవుల వస్త్రాలు తీసుకో " అన్నాడు. దుశ్శాసనుడు ఇది ధర్మం కాదు అని ఆలోచించక ద్రౌపది కట్టుకున్న చీరను లాగాడు. విచిత్రంగా ద్రౌపది నడుముకు ఉన్న చీర నడుము భాగాన్ని వదలలేదు. లాగుతుంటే అలాంటి వస్త్రాలు వస్తూనే ఉన్నాయి. విప్పిన చీరలు గుట్టలుగా పడ్డాయి కాని ద్రౌపది నడుముకు చీర అలాగే ఉంది. ఇది చూసి దుశ్శాసనుడు సిగ్గుతో తల వంచుకున్నాడు. ఇది చూసి భీముడు ఆగ్రహంతో " కురువృద్ధులు, బంధువులు సభాసదులు చూస్తుండగా ద్రౌపది ని ఇలా అవమానించిన దుశ్శాశనుని సుయోధనుడు చూస్తుండగా యుద్ధ భూమిలో ఘోరంగా చంపి అతని రక్తం దోసిలి పట్టి తాగకుంటే నేను నా పితృ పితామహులకు పుట్టలేదు " అని భీముడు భీకర ప్రతిజ్ఞ చేసాడు. సభలోని వారు " కుమారుడి మీద ప్రేమతో ధృతరాష్ట్రుడు ద్రౌపది అడిగిన దానికి ఉపేక్షించాడు " అని అనుకున్నారు.

## ద్రౌపదికి వరాలు రాజ్యాన్ని తిరిగి పొందటం

విదురుడు లేచి " అందరూ శాంతంగా ఆలోచించండి. వికర్ణుడు చిన్న అయినా బృహస్పతిలా ధర్మం చెప్పాడు. ధర్మం తెలిసి కూడా పక్షపాతంతో కాని ,లోభంతో కాని చెప్పక పోతే అసత్య దోషం అంటుకుంటుంది. పూర్వం ప్రహ్లాదుని కొడుకు విరోచనుడు, సుధన్వుడు అనే బ్రాహ్మణుడు ఒక కన్య కొరకు తగులాడుతూ ప్రహ్లాదుని వద్దకు తీర్పు కోసం వెళ్ళారు. కొడుకు విషయంలో


ప్రహ్లాదుని న్యాయం

తీర్పు చెప్పటానికి జంకి ప్రహ్లాదుడు కశ్యపుని సలహా అడిగాడు. న్యాయమూర్తి సాక్ష్యాన్ని ధర్మాన్ని అనుసరించి ధర్మ బద్ధమైన తీర్పు చెప్పాలి. అలా చెయ్యకపోతే న్యాయమూర్తికి సభాసదులకు పాపం వస్తుంది. కనుక కామక్రోధాలకు అతీతంగా తీర్పు చెప్పు " అని కశ్యపుడు చెప్పాడు. ప్రహ్లాదుడు సంతోషించి తన కొడుకు అని ఆలోచించక సుధన్వుడికి అనుకూలంగా తీర్పు చెప్పాడు. కనుక మనం ఈ నాడు ద్రౌపదికి న్యాయం చేయకుంటే అందరికి పాపం వస్తుంది " అన్నాడు. దుర్యోధనునికి భయపడి ఎవరూ బదులు చెప్పలేదు. ద్రౌపది సభాసదులను చూసి " నేను పాండవుల ఇల్లాలిని లోకారాధ్యుడైన శ్రీకృష్ణ సోదరిని. ఇలా అవమానింప బడ్డాను. నేను అడిగిన దానికి ఎందుకు బదులు చెప్పరు ? నేను దాసినా కాదా చెప్పండి "


ధృతరాష్ట్రునికి సభలో జరిగిన దానిని గురించి చెప్పచున్న గాంధారి

అని దు:ఖంతో అడిగింది . భీష్ముడు " అమ్మా! నీ ప్రశ్నకు ధర్మరాజు ఒక్కడే సమాధానం చెప్పగలడు " అని అన్నాడు. కర్ణుడు " తరుణీ ! ఐదుగు భర్తలకన్నా ఒక్క భర్త మేలు కదా ! జూదంలో భార్యను ఓడి పోని వ్యక్తిని భర్తగా ఎంచుకో " అని ఎగతాళి చేసాడు. సుయోధనుడు వచ్చి నా తొడపై కూర్చో. అని సైగ చేసాడు. అది చూసి భీముడు " రాజ్య సంపద వలన కలిగిన మదంతో ద్రౌపదిని తొడ మీద కూర్చోమని సైగ చేసిన ఈ దుర్మార్గుని తొడలు నా గధతో విరుగ కొడతాను " అని ముందుకు ఉరికాడు. భీష్ముడు, ద్రోణుడు, విదురుడు ఇది తగిన సమయం కాదిని శాంతింప చేసారు. అప్పటికి చలించిన గాంధారి విదురుని తీసుకుని దృతరాష్టుని వద్దకు వచ్చి ద్రౌపదికి జరిగిన అవమానాన్ని వివరించింది. ధృతరాష్ట్రుడు " సుయోధనా ! పాండవ పట్టమహిషిని ఇలా అవమానించడం తగునా ? నీ కారణంగా పాండవులు దు:ఖితులైయ్యారు " అని ద్రౌపదిని పిలిచి " అమ్మా ! ద్రౌపది నా కోడళ్ళలో నీవు గౌరవించ తగిన దానివి. నీకు ఏమి వరం కావాలో కోరుకో ఇస్తాను " అన్నాడు. ద్రౌపది " ముందు నా భర్తను దాశ్యం నుండి విముక్తుని చేయండి " అని అడిగింది. ఇంకో వరం కోరుకో అన్నాడు. " ధర్మరాజు నలుగురు తమ్ములను దాస్యవిముక్తులను చేసి వారి వారి ఆయుధములను ఇప్పించండి " అన్నది. సరే ఇచ్చాను ఇంకో వరం కోరుకోన్నాడు. " వైశ్య సతికి ఒక వరం, క్షత్రియ సతికి రెండు వరాలు కనుక ఇక వరాలు కోర రాదు " అన్నది. ద్రౌపది ధర్మనిరతికి ధృతరాష్ట్రుడు సంతోషించి పాండవులను పిలిచి జూదంలో పోగొట్టుకున్న రాజ్యాన్ని సమస్త సంపదను తిరిగి ఇచ్చి " నేను బుద్ధి లేక జూదాన్ని ఉపేక్షించాను. వృద్ధుడను, అల్ప బుద్ధిని మీ తల్లి గాంధారి ముఖం చూసి దుర్యోధనాదులు మీ పట్ల చేసిన అపచారం క్షమించండి . మీరు ఇంద్రప్రస్థానికి వెళ్ళి హాయిగా రాజ్యం చేసుకోండి " అని దీవించాడు.

## సతీసమేతంగా పాండుసుతులు అరణ్యములకు వెళ్ళుట

భీముడు " సతి కారణంగా పాండుసుతులకు రాజ్యం సంప్రాప్తించింది అనిపించుకోవడం కంటే యుద్ధం చేసి పొందడం మేలు కదా " అన్నాడు. ధర్మరాజు భీముని వారించి ఇంద్రప్రస్థానికి తీసుకు వెళ్ళాడు. దుర్యోధనుడు కర్ణుడు, శకునితో ఆలోచించి దృతరాష్టుని వద్దకు వెళ్ళి " తండ్రీ ! శత్రువును చంపడం వివేకమని దేవగురువు బృహస్పతి చెప్పాడు. పాండవులు మనకు శత్రువులు ఎంత చేసినా మనం వారికి మంచి వాళ్ళము కాదు. మనం వాళ్ళను విడిచి పెట్టి తప్పు చేసాం. అర్జునుడు గాండీవం, భీముడు గదాయుధం , ధర్మరాజ, నకుల సహదేవులు వారి వారి ఆయుధాలు పడితే మనం వారిని గెలవడం సాధ్యం కాదు. కనుక పాండవులను తిరిగి జూదానికి పిలిచి జూదం ఆడించి నిర్వాసితులను చెయ్యడం తక్షణ కర్తవ్యం " అన్నాడు. ధృతరాష్టుడు అంగీకరించాడు. మరల జూదానికి రమ్మని ప్రాతిగామిని పంపించాడు. తండ్రి మాట మీరరాదని ధర్మరాజు జూదానికి వచ్చాడు. అందరూ కూర్చున్నారు. శకుని " ధర్మరాజా! దృతరాష్ట్ర మహారాజు మీరు పోగొట్టుకున్న సమస్త సంపదలు రాజ్యాన్ని ఇచ్చాడు. ఇక అవి జూదంలో పెట్టడం తగదు. ఓడిన వారు వల్కలములు ధరించి కందమూలములు తింటూ పన్నెండేళ్ళు వనవాసం ఒక్క సంవత్సరం అజ్ఞాత వాసం చేయాలి ఇదీ పందెం ఇందుకు మీరు అంగీకరిస్తే " అన్నాడు. ధర్మరాజు " సరే " అన్నాడు. జూదం ఆడాడు ఓడి పోయాడు. అరణ్యానికి పోవడానికి సిద్ధం అయ్యారు. పాండవులు భీష్ముడు,


అరణ్యానికి వెళుతున్న పాండవులు

ద్రోణుడు, కృపాచార్యుల వద్ద శలవు తీసుకున్నారు. కుంతీ దేవి వద్దకు వచ్చారు. ఆమె " పుత్రులారా! ఇలాంటి దుస్థితి వస్తుందని ముందుగా ఊహించి మీ తండ్రి, మాద్రి స్వర్గానికి వెళ్ళారు. నేను దురదృష్టవంతు రాలిని కృష్ణా ! నా కుమారులను కాపాడు " అని ప్రార్ధించింది. కొడుకులను కౌగలించి దీవించి పంపింది. అందరూ అడవికి పయనమయ్యారు. కోపం నిండిన చూపులకు జనం దహించబడతారని ధర్మరాజు ముఖానికి వస్త్రం అడ్డం పెట్టుకుని వెళ్ళాడు, ఎట్టకేలకు యుద్ధంలో బాహు బలం ప్రదర్శించే అవకాశం వచ్చిందని భీముడు రొమ్ము విరుచుకుంటూ వెళ్ళాడు. ఇంత కంటే ఎక్కువగా అస్త్ర సంధానం చేసి శత్రు సంహారం చేస్తానని అర్జునుడు చేతితో ఇసుక చల్లుకుంటూ వెళ్ళాడు. తమ అందచందాలు చూసి జనులు దుఃఖిస్తారని నకులసహదేవులు మలిన వస్త్రాలతో వెళ్ళారు. తడిసిన బట్టలతో విడిన కురులతో దు:ఖిస్తూ యుద్ధంలో భర్తలను పోగొట్టుకున్న కౌరవుల భార్యలు ఇలా రాజ్యం వదిలి వెళతారని సూచిస్తూ ద్రౌపది వెళ్ళింది. పాండవులతో ధౌమ్యుడు, వేలాది బ్రాహ్మణులు పాండవులను అనుసరించారు. ఇలా పాండవులు అడవులకు బయలు దేరారు.

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

## పర్వాలు

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

## పాత్రలు

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠిరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | దృపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

# వన పర్వము

వికీపీడియా నుండి

**వనపర్వము** లేదా **అరణ్య పర్వము** మహాభారతం ఇతిహాసంలోని మూడవ భాగము. సంస్కృతమూలం వ్యాసుడు రచించాడు. ఆంధ్ర మహాభారతంలో కొంత భాగాన్ని నన్నయ అనువదించాడు. నన్నయ మరణించడం వలన అది అసంపూర్తిగా ఉండిపోయింది. షుమారు 200 యేండ్ల తరువాత అరణ్య పర్వ శేషాన్ని ఎఱ్ఱన తెలుగులోనికి అనువదించాడు.

సభాపర్వంలో భంగపడిన పాండవులు జూద నియమానుసారం పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం చేయడం ఈ పర్వంలో ముఖ్య కధాంశం.

## విషయ సూచిక



## కధా సంగ్రహం

ఈ పర్వంలో ఏడు ఆశ్వాసాలున్నాయి

- వన పర్వము ప్రథమాశ్వాసము
- వన పర్వము ద్వితీయాశ్వాసము
- వన పర్వము తృతీయాశ్వాసము
- వన పర్వము చతుర్థాశ్వాసము

- వన పర్వము పంచమాశ్వాసము
- వన పర్వము షష్టమాశ్వాసము
- వన పర్వము సప్తమాశ్వాసము

# సంస్కృత రచనా విశేషాలు

# కవిత్రయం రచనా విశేషాలు

సాహిత్య అకాడమీ ముద్రించిన అరణ్య పర్వము ముగింపులో ఆ భాగం సంపాదకులు డా. పాటిబండ్ల మాధవశర్మ ఇలా వ్రాశాడు -

తననాటి కవీశ్వరులచే ప్రబంధ పరమేశ్వరుడని కొనియాడబడిన ఎఱ్ఱన, నన్నయభట్ట తిక్కనకవినాథులకెక్కిన భక్తి పెంపున అరణ్యపర్వ శేషమును పూరించి, గంగాయమునలవంటి ఆ మహనీయుల కవితా నదీమతల్లుల నడుమ సరస్వతీనదివంటి తన కవితను అంతర్వాహినిగా చేసి ఆంధ్రమహాభారతమునకు కవితా త్రివేణీసంగమ పవిత్రతను సమకూర్చెను. ఎఱ్ఱన ఎంత సౌమ్యమతియో ఆయన కవిత అంత సౌందర్యవతి. విఖ్యాతమాధుర్యమనోహరముగా ఆయన రచించిన అరణ్యపర్వశేషము ప్రతిపద్యరమణీయమైన పుణ్యకథాప్రబంధ మండలి. దానియందములు సవిస్తరముగా వర్ణించుటకు ఈ పీఠిక చాలదు. నాకు శక్తియు చాలదు.

# ఆధ్యాత్మిక, తాత్విక విశేషాలు

# ఇవి కూడా చూడండి

# బయటి లింకులు

- ఇంటర్నెట్ ఆర్చీవులో అరణ్యపర్వము (http://www.archive.org/details/sriandhramahabar023368mbp) - సాహిత్య అకాడమీవారి ప్రచురణ

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • **వన పర్వము** లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస

పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభ్రువాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

# వన పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

**వనపర్వము** లేదా **అరణ్య పర్వము** మహాభారతం ఇతిహాసంలోని మూడవ భాగము. సంస్కృతమూలం వ్యాసుడు రచించాడు. ఆంధ్ర మహాభారతంలో కొంత భాగాన్ని నన్నయ అనువదించాడు. నన్నయ మరణించడం వలన అది అసంపూర్తిగా ఉండిపోయింది. షుమారు 200 యేండ్ల తరువాత అరణ్య పర్వ శేషాన్ని ఎఱ్ఱన తెలుగులోనికి అనువదించాడు.

సభాపర్వంలో భంగపడిన పాండవులు జూద నియమానుసారం పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం చేయడం ఈ పర్వంలో ముఖ్య కధాంశం.

## విషయ సూచిక

# ప్రధమాశ్వాసం


అరణ్యానికి వెళుతున్న పాండవులు

ఆ ప్రకారం పాండవులు ఆయుధాలతో ద్రౌపది వెంటరాగా అరణ్యానికి బయలు దేరి ఉత్తర దిక్కుగా పయాణం సాగించారు. వారి వెంట వారి సేవకులు పధ్నాలుగు వేల రధాలతో తరలి వెళ్ళారు. వారి వెంట సుభద్ర, అభిమన్యుడు, ఉపపాండవులు వెళ్ళారు. ఆ దృశ్యాన్ని చూసి పురజనులు " ఎక్కడో ఉన్న పాండవులను పిలిపించి జూదం ఆడించి సర్వస్వం హరించి అడవులకు పంపడం భావ్యమా " అనుకుని కంట తడి పెట్టారు " భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యుడు, విదురుడు క్రూరులైన దుర్యోదనాదులను ఎందుకు ఆపలేదు? ఇక్కడ ధర్మం ఎక్కడుంది. కనుక మేము మీతో అరణ్యాలకు వస్తాము " అని పౌరులు పాండవుల వెంట బయలు దేరారు. ధర్మరాజు " ఆయ్యలారా మీరు మా పట్ల చూపిస్తున్న అభిమానానికి కృతజ్ఞులము. మీరు ఈ వన క్లేశం భరించ లేరు. మీరు మా వెంట రా వద్దు మరలి పొండి " అన్నాడు. ధర్మరాజు మన్నించి పౌరులు వెనుకకు మరలి వెళ్ళారు. తరవాత వారు గంగా తీరం చేరారు. కాని వారి వెంట నిత్యాగ్ని హోత్రులు వారి శిష్యులు వచ్చి చేరారు. ధర్మరాజు " బ్రాహ్మణోత్తములారా! మీరు పూజ్యులు. మేము అడవులలో కందమూలములు తింటూ బ్రతకాలి. మీరు మా వెంట కష్ట పడటం ఎందుకు? మరలి వెళ్ళండి " అన్నాడు. అందుకు వారు " అయ్యా మీరు లేక మేము బ్రతుక జాలము మీ వలె మేము కంద మూలాలు తింటూ ఉంటాము. మా ఆహారం మేము సంపాదించుకుంటాము. మీరు లేని హస్థినలో మేము ఉండజాలము " అన్నారు. అది చూసిన ధర్మరాజు దుఃఖిస్తూ " మంచి భోజనం తినే వీరు కందమూలాలను ఎలా తినగలరు? " అన్నాడు.

## శౌనకుడు


సూర్యుని ప్రార్థించి అక్షయపాత్రను వరముగా పొదుతున్న ధర్మరాజు

అది విని శౌనకుడు " ధర్మరాజా ! ఇందుకు ఇంత చింతించ తగునా. వివేకులు ఎందుకూ దుఃఖించరు, వికలురు కారు. ఈ బంధాలు తాత్కాలికాలు కనుక కలత చెందవద్దు. బంధం వలన అభిమానం, అభిమానం వలన కోరిక, కోరిక వలన కోపం, దాని వలన ఆశ పుడతాయి. ఆశ సమస్త దోషాలకు మూలం కనుక ఆశను వదిలి పెట్టు. ధనం మీద కోరిక కలవాడు పతనమౌతాడు. ధనవంతుని చుట్టూ బంధువులు చేరి అతనిని పీడించి ధనాన్ని హరిస్తారు. ధనం వలన గర్వం, అహంకారం, భయం కలుగుతాయి. కనుక ధనార్జనకు పాల్పడ వద్దు. తామరాకు మీద నీటి బొట్టులా ఉండు " అని హితవు చెప్పాడు. అందుకు ధర్మరాజు " అయ్యా! ధనం నా కోసం కాదు. ఈ బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి కదా! వారు మా అతిధులు. గృహస్తుకు అతిధి పూజ పరమ ధర్మం కదా! ఆర్తునకు శయ్య, భయంతో ఉన్న వాడికి శరణు, అలసిన వాడికి ఆసనం కూర్చడం గృహస్తు ధర్మం. తనకోసం మాత్రం వండుకొని తినడం పాపం. కనుక అతిధి సత్కారం చేయడం నా ధర్మం" అన్నాడు. అందుకు శౌనకుడు " ధర్మరాజా! ఇంద్రియాలు సుఖాలను కోరతాయి. ఎంతటి జ్ఞానులకైనా ఇంద్రియాలు లొంగవు. ఇంద్రియ సుఖాలకు లోబడి దేహదారులు సంసార చక్రంలో పడి తిరుగుతుంటారు. కానీ మహనీయులు ప్రేమ, అసూయలను వదలడం, చక్కని చిత్తవృత్తిని అలవరచు కోవడం, ఇంద్రియాలను వశపరచు కోవడం, తనకు నచ్చిన దీక్షను స్వీకరించడం, గురువులను సేవించడం, నియమంగా ఆహారం తినడం, విద్యను అభ్యసించడం, ఫలితం మీద ఆశ లేకుండా పనులు చేయడం అనే నియమాలను ఆచరించే వారు సంసార బంధాలను అధిగమిస్తారు. కనుక ధర్మరాజా నీవు కూడా గురుసేవా, పెద్దలు చెప్పినది వినడం విన్నదానిని అర్ధం చేసుకోవడం . అర్ధం చేసుకున్నదానిని మనసులో నిలుపుకోవడం, అవసరమైన దానిని ఆచరించడం , అవసరం లేనిదానినీ వదిలిపేయడం వీటిని ఆచరించు. వసువులు, రుద్రులు, ఆదిత్యులు, తపస్సు చేసి ఐశ్వర్యాన్ని పొందారు. కనుక తపస్సు చేసి నీ కోరికలు తీర్చుకో " అన్నాడు. ధర్మరాజు ధౌమ్యుడితో " అయ్యా ! ఇదేమో

అడవి. బ్రాహ్మణులు మా మాట వినరు. వీరికి మేము ఆహారం ఎలా సమకూర్చగలను " అని అడిగాడు. ధౌమ్యుడు ధర్మరాజుతో " ధర్మరాజా! జీవకోటికి ఆహారాన్ని నీటిని ప్రసాదించేది సూర్యుడు. కనుక నీవు సూర్యుని ప్రార్ధించి నీ కోరిక నెరవేర్చుకో " అని చెప్పి ధర్మరాజుకు నూట ఎనిమిది ఆదిత్య నామాలు అర్ధంతో సహా ఉపదేశించాడు. ధర్మరాజు నిష్టతో సూర్యుని పూజించాడు. సూర్యుడు ప్రత్యక్షమై ధర్మరాజుకు ఒక రాగి పాత్రను ఇచ్చి " ధర్మరాజా ! ఈ పన్నెండేళ్ళు అరణ్యవాసంలో మీరు అడవిలో సేకరించిన కంద మూలాలు ఫలాలు మీ భార్య ద్రౌపదిచే వండించిన, అది నాలుగు విధములైన వంటకములుగా ఏర్పడతాయి. అవి ఎప్పటికీ అక్షయంగా ఉంటాయి " అని వరం ఇచ్చి వెళ్ళి పోయాడు.

## హస్థినా పురం

హస్థినా పురంలో దృతరాష్ట్రుడు విదురునితో " విదురా పాండవులు ఏమి చేస్తుంటారు " అని అడిగాడు. దానికి విదురుడు " పాండవులు దైవసంభూతులు. జూదం వలన అన్నదమ్ములకు వైరం వస్తుందని చెప్పాను. నీవు విన లేదు. ఇప్పటికైనా నా మాట విని పాండవులను పిలిపించి వారి రాజ్యం వారికి ఇచ్చి ధర్మం నిలబెట్టు. కర్ణుడు శకుని మాటలు విని చెడు పనులు చేసే నీ కొడుకుని సుయోధనుని విడిచి పెట్టు. ద్రౌపదికి, భీమునికి దుశ్శాసనునితో క్షమాణలు చెప్పించు అన్నాడు. ఆ మాటలకు దృతరాష్ట్రుడికి కోపం వచ్చి " సుయోధనుడు నా కన్న కొడుకు వాడిని నేను ఎలా వదలను. నీకు నాకొడుకులంటే పడదు. వారు ఉన్నతులైతే సహించలేవు. నీ సాయం నాకు అక్కర లేదు. నీవు పాండవుల దగ్గరికే వెళతావో ఇంకెక్కడి వెళతావో నీ ఇష్టం " అన్నాడు. వెంటనే విదురుడు కామ్యక వనంలో ఉన్న పాండవుల వద్దకు వెళ్ళాడు. ధర్మరాజు తన పెద నాన్న గురించి అడిగాడు. విదురుడు జరిగినది చెప్పాడు. దృతరాష్ట్రునికి విదురుడు పాండవుల వద్ద ఉన్నాడని తెలిసింది. విదురుని విడిచి ఉండ లేక విదురుని కొరకు సంజయుని పంపాడు. సంజయుడు కామ్యకవనం వెళ్ళి విదురునికి నచ్చచెప్పి తీసుకు వచ్చాడు. దృతరాష్ట్రుడు " విదురా ! నీవు నీతి మంతుడవు. నాకు బుద్ధి లేదు. అందుకే నిన్ను వెళ్ళగొట్టాను నన్ను క్షమించు " అన్నాడు. విదురుడు "దృతరాష్ట్రా! నీవు నీ కొడుకులు ధర్మం తప్పి నడుస్తున్నప్పుడు మీకు ధర్మం చెప్పడం నా ధర్మం. మహా పరాక్రమవంతులైన పాండవులతో వైరం మంచిది కాదు " అన్నాడు. విదురుడు తిరిగి రావడం దుర్యోధనుడు నచ్చలేదు. కర్ణ, శకుని, దుశ్శాశనులతో చర్చిస్తూ " పాండవుల దగ్గరకు వెళ్ళిన విదురుడు మరల వచ్చాడు. మనకు మంత్రి అయ్యాడు. ఒకవేళ విదురుడు, దృతరాష్ట్రుడు కలసి పాండవులను తిరిగి రమ్మంటే ఏమి చేయాలి? " అన్నాడు. శకుని " సత్య సంధులైన పాండవులు ఎట్టి పరిస్థితిలో తిరిగి రారు. ఆ భయం నీకు వద్దు " అన్నాడు. కర్ణుడు " ఈ అదను చూసుకుని వారి మీద యుద్ధం చేసి వారిని హతమారుస్తాము. శత్రుశేషం లేకుండా చేద్దాం " అన్నాడు. కర్ణుని మాట విని దుర్యోధనుడు సేనలను సమీకరిస్తున్నాడు. పాండవులపై యుద్ధానికి సన్నద్ధం అయ్యాడు. ఇది తెలిసి వ్యాసుడు దృతరాష్ట్రుని వద్దకు వచ్చి " నీ కుమారుడు పాండవుల మీదకు యుద్ధానికి వెళుతున్నాడు. పాండవుల అరణ్య, అజ్ఞాత వాసం తరవాత ఎలాగూ యుద్ధం తప్పదు తొందరెందుకు " అన్నాడు. దృతరాష్ట్రుడు " మహాత్మా! నన్ను ఏమి చెయ్యమంటారు. జూదం వలన చెడు జరిగింది. నేను పుత్ర వాత్సల్యం వలన నా కొడుకుని విడువలేను " అన్నాడు. వ్యాసుడు " దృతరాష్ట్రా! పుత్ర వాత్సల్యం ఉండవలసిందే కానీ అడవిలో ఉండే పాండవుల మీద దయ చూపించు. నాకు ఇద్దరూ సమానులే. ధర్మరాజు స్నేహంతో నీ కొడుకు సుయోధనుడు మారవచ్చు" అన్నాడు.దృతరాష్ట్రుడు " అయ్యా! వాడు నా మాట వినడు. మీరే వాడికి నచ్చ చెప్పండి " అన్నాడు. వ్యాసుడు " మైత్రేయ మహర్షి వచ్చి నీ కొడుక్కు నచ్చ చెబుతాడు " అని వెళ్ళి పోయాడు.

## మైత్రేయుడు

వ్యాసుడు చెప్పినట్లు కొన్ని రోజుల తరవాత మైత్రేయుడు ముందుగా పాండవులను చూచి హస్థినాపురం వచ్చాడు. దృతరాష్ట్రుడు మైత్రేయునికి అర్ఘ్యపాద్యాలు ఇచ్చాడు. మైత్రేయుడు " నేను కామ్యక వనంలో ఉన్న పాండవులను చూసి వచ్చాను. వారు అడవులలో కందమూలాలను తిని జీవిస్తున్నారు " అన్నాడు. పాండవులు క్షేమంగా ఉన్నారా " అని దృతరాష్ట్రుడు అడిగాడు. మైత్రేయుడు " ఓ రాజా! పాండవులు ధర్మబుద్ధి కలవారు. వారికి మహర్షుల దీవెనలు ఉన్నాయి. అందు వలన క్షేమమే " అన్నాడు. దుర్యోధనుని వైపు తిరిగి " కుమారా! నీకు బుద్ధి ఉంటే పాండవులతో వైరం వదులుము. అలా చేస్తే నీవు కురువంశానికి మేలు చేసిన వాడివి ఔతావు. పాండవులు వజ్ర శరీరులు. భీముడు హిడింబుని, బకాసురుని, జరాసంధుని, కిమ్మీరుని వధించిన బలాఢ్యుడు. అతనిని వధించగల యోధులు లేరు. శ్రీకృష్ణుడు, దుష్టద్యుమ్నుని బంధుత్వం పాండవులకు మరింత బలాన్నిచ్చింది. కనుక నీవు పాండవులతో స్నేహం చేయటం మంచిది " అన్నాడు. ఆ మాటలు విన్న దుర్యోధనుడు తన తొడలు చరిచి మహర్షిని అవమానించాడు. అందుకు మైత్రేయుడు ఆగ్రహించి " సుయోధనా ! యుద్ధభూమిలో భీముని గదాఘాతం నీ తొడలను విరవకలదు " అని మైత్రేయుడు అన్నాడు. దృతరాష్ట్రుడు భయపడి మహర్షిని శాపవిమోచనం ఇవ్వమని వేడుకున్నాడు. మైత్రేయుడు "మహారాజా! నీ కొడుకు పశ్చాత్తాపం చెంది మంచి బుద్ధి కలిగి ఉంటే ఈ శాపం వర్తించదు " అన్నాడు.

## కిమ్మీర వధ

దుర్యోధనునికి శాపం ఇచ్చిన తరవాత దృతరాష్ట్రుడు " మహాత్మా! కిమ్మీరుడనే రాక్షసుడు భీముని చేతిలో ఎలా చనిపోయాడో వవరిస్తారా? " అని అడిగాడు. మైత్రేయుడు " నా మాటను నీ కొడుకే వినలేదు. నేనెందుకు చెప్పాలి విదురుని అడిగి తెలుసుకో " అని చెప్పి వెళ్ళి పోయాడు. విదురుడు కిమ్మీరుని వృత్తాంతం ఇలా వివరించ సాగాడు. " పాండవులు ఒకరోజు అడవిలో విశ్రమించవలసి వచ్చింది. వికృతాకారుడైన రాక్షసుడు పాండవుల దారికి అడ్డంగా నిలిచాడు. ఆ రాక్షసుని చూసి ద్రౌపది భయంతో కళ్ళు మూసుకుంది. ఇంతలో ధౌమ్యుడు తన మంత్రశక్తితో ఆ రాక్షసుని మాయను భగ్నం చేసాడు. ఆ రాక్షసుని చూసి ధర్మరాజు " నీ వెవరు ఈ అడవిలో ఎందుకు ఉన్నావు " అని ఆడిగాడు. దానికి ఆ రాక్షసుడు " నేను బకుడు అనే రాక్షసుని తమ్ముడిని. నా పేరు కిమ్మీరుడు. మనుష్యులను చంపి తింటూ ఉంటాను నాకు భయపడి ఎవెరూ ఈ అరణ్యానికి రారు. మీరు ఎవెరు? ఈ అరణ్యానికి ఎందుకు వచ్చారు? " అని అడిగాడు. ధర్మరాజు " నా పేరు ధర్మరాజు వీరు నా సోదరులు. మేము వనవాసం చేస్తూ ఇక్కడకు వచ్చాము " అన్నాడు. ఇది విని ఆ కిమ్మీరుడు " నా అన్న బకుని చంపిన భీముడు వీడేనా . వీడిని చంపి నా ఆకలి తీర్చుకుంటాను. నేను వీడి కోసమే వెతుకుతున్నాను " అని వికటాట్టహాసం చేసాడు. ఇది విని అర్జునుడు గాండీవం ఎక్కు పెట్టాడు కానీ ఈలోగా భీముడు కిమ్మీరుని ఎదుర్కొన్నాడు. ఇద్దరూ ఘోరంగా యుద్ధం చేసారు. చెట్లతోనూ రాళ్ళోనూ కొట్టుకున్నారు. చివరకు భీముడు కిమ్మీరుని అతని అన్న బకుని చంపినట్లు అతని దేహాన్ని విరగదీసి చంపాడు. ఈ విధంగా భీముడు కామ్యక వనంలో రాక్షస భయం లేకుండా చేసాడు " అని చెప్పాడు. ఇది విని దృతరాష్ట్రుడు కలత చెందాడు.

## కామ్యకవనానికి శ్రీకృష్ణుని విజయం


ద్రౌపది ఓదార్చుచున్న శ్రీకృష్ణుడు

అర్జునుడు శ్రీకృష్ణుని చూసి " కృష్ణా! నీవు పురాణ పురుషుడవు. నీవు గంధమాదన పర్వతం మీద పదివేల సంవత్సరాలు తపస్సు చేసావు. పుష్కరంలో పదుకొండు వేల సంవత్సరాలు తపస్సు చేశావు. సరస్వతీ తీరంలో పన్నెండు సంవత్సరాలు వ్రతం చేసావు. దితి కుమారులను దనువు కుమారులను సంహరించి ఇంద్ర పదవి సుస్థిరం చేసావు. నీవు అదితి కుమారుడివి. ఇంద్రుని తమ్ముడవు ఉపేంద్రుడివి. మొదట వామనుడిగా తరవాత త్రివిక్రమునిగా లోకాలను ఆక్రమించావు.లోక కంటకులైన శిశుపాల కంసులను వధించావు. నీవు అవతార మూర్తివి. అనృతం ,మదము, కోపం, మత్సరం నీ దగ్గరకు రావు " అని స్తుతించాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునినితో " అర్జునా! నీవు నరుడవు. నేను నారాయణుడను. మనం ఒకరికి ఒకరం మిత్రులం " అన్నాడు. అప్పుడు ద్రౌపది కృష్ణుని చూసి " దేవా! నీవు యజ్ఞ పురుషుడివి. సర్వవ్యాపివి. సజ్జనులకు నీవే దిక్కు. నీకు తెలియనిది లేదు. నాకు జరిగిన పరాభవం చెప్తాను. నేను చక్రవర్తి పాండురాజు కోడలిని. పాండవుల భార్యను. మహావీరుడైన దుష్టద్యుమ్నుని సోదరిని. అట్టి నన్ను దుశ్శాసనుడు వెంట్రుకలు పట్టి ఈడ్చించాడు. నా వలువలు విప్పాడు. దారుణంగా నిండు సభలో అవమానించాడు. భీమార్జునులు నా మొర ఆలకించ లేదు. వీరి పరక్రమమెందుకు? కర్ణుడు నన్ను చూసి నవ్వాడు. ఎందరూ ఉండి ఎవరూ లేనిదానిని అయ్యాను. ఆ నవ్వు నా మనస్సును కాలుస్తుంది. ఆ కౌరవులు భీమునకు విషం పెట్టారు, పాములతో కరిపించారు. లక్క ఇంట్లో పెట్టి కాల్చాలనుకున్నారు. ఇప్పుడు జూదమాడి మా రాజ్యం లాక్కున్నారు. పాండవులు తమ శౌర్యం మరచి ఉన్నారు. కాని నేను మరువలేకున్నాను " అన్నది. కృష్ణుడు " అమ్మా! అర్జునిని శరాఘాతాలకు కౌరవులు చచ్చుట తథ్యం ఊరడిల్లుము " అన్నాడు . శ్రీకృష్ణుడు " ధర్మరాజా ! జరిగినదంతా యుయుధానుడు చెప్పగా విని దు:ఖించాను. ఆసమయంలో నేను మీదగ్గర లేను. ఉంటే ఇంత అనర్థం జరిగేది కాదు. నేను ఆ సమయంలో సాల్వుడితో యుద్ధం చేస్తున్నాను " అన్నాడు. దర్మరాజు శ్రీకృష్ణునితో " కృష్ణా ! ఆ వృత్తాంతం వివరించు " అన్నాడు.

## సాల్వునితో శ్రీకృష్ణుని యుద్ధం

శ్రీకృష్ణుడు ఇలా చెప్పసాగాడు " రాజసూయయాగం సమయంలో శిశుపాలుడు నా చేతిలో మరణించిన విషయం తెలుసు

కదా. శిశుపాలుని తమ్ముడు సాళ్వుడు. అన్నను చంపిన దానికి పగ తీర్చుకోవడానికి ద్వారక మీదకు యుద్ధానికి వచ్చాడు. అప్పుడు నేను మీ వద్ద ఉన్నాను. ద్వారకాపురిని ముట్టడించి నగరం వెలుపలి వనాలను నాశనం చేసాడు. ఆ సమయంలో ద్వారకలో ఉన్న సాంబుడు, ప్రద్యుమ్నుడు సాళ్వునితో ఘోరంగా యుద్ధం చేసారు. ప్రద్యుమ్నుడు సాళ్వునిపై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. సాళ్వుడు మూర్చపోయాడు. ప్రద్యుమ్నుడు సాళ్వుని చంపబోగా నారదుడు అడ్డుపడి " కుమారా ! ఇతనిని నువ్వు చంపరాదు. ఇతడు నారాయణుని చేతిలో హతుడు కావలసి ఉంది " అన్నాడు. కనుక ప్రద్యుమ్నుడు ఊరుకున్నాడు. సాళ్వుడు తిరిగి వెళ్ళాడు. నేను ద్వారకకు వెళ్ళగానే సాళ్వుడు ధ్వంశం చేసిన వనాలను చూసాక నాకు కోపం వచ్చింది సాళ్వుని మీదకు యుద్ధానికి వెళ్ళాను. సాళ్వునికి నాకు ఘోర యుద్ధం జరిగినది. సాళ్వుడు నాతో గెలవలేక మాయా యుద్ధం మొదలు పెట్టాడు. నేను వాడి మాయలు వమ్ము చేసాను. ఇంతలో ద్వారక నుండి వసుదేవుడు సాళ్వుని చేతిలో చిక్కాడని నేను వెళ్ళి రక్షించాలని వార్త వచ్చింది." ద్వారకలో బలరాముడు ఉండగా వసుదేవుడు సాళ్వునికి ఎలా చిక్కాడు? " అనుకున్నాను. ఇంతలో సౌంభకమను సాళ్వుని రథం నుండి వసుదేవుడు దిగటం చూసి నా చేతిలో ధనస్సు జారి కింద పడింది. నాకు కొంత సేపు స్పృహ తప్పింది. తెలివి వచ్చి చూసేసరికి సౌంభకంలో వసుదేవుడు లేక పోవడం చూసి అది రాక్షస మాయ అని గ్రహించాను. మరల నాకు సాళ్వునికి మధ్య ఘోరయుద్ధం జరిగింది. చివరికి సాళ్వునిపై చక్రాయుధాన్ని ప్రయోగించి అతడిని వధించాను " అని శ్రీకృష్ణుడు చెప్పాడు.

## ద్వైత వనం

తరవాత శ్రీకృష్ణుడు తన చెల్లెలు సుభద్రను తీసుకుని ద్వారకకు వెళ్ళాడు. దుష్టద్యుమ్నుడు ఉపపాండవులను తీసుకుని పాంచాలదేశం వెళ్ళాడు. బ్రాహ్మణులు తమ ముఖ్య సేవకుడైన ఇంద్రసేనుని, ధౌమ్యుడు మొదలైన బ్రాహ్మణులని తీసుకుని ద్వైతవనానికి వెళ్ళారు. ధర్మరాజు " ఈ అడవిలో క్రూరమృగాలు ఉన్నాయి.రాక్షసులు ఉన్నారు. మనం జాగ్రత్తగా ఉండాలి " అని మిగిలిన వారితో అన్నాడు. వారు అక్కడ కుటీరాలు నిర్మించుకుని సంతోషంగా కాలం గడుపుతున్నారు. ఒకరోజు మార్కడేయ మహర్షి వచ్చాడు. ధర్మరాజు ఆ మహర్షిని తగురీతి సత్కరించాడు. " ధర్మరాజా ! నాడు తండ్రి ఆజ్ఞమేరకు అడవులకు వెళ్ళిన రాముడిని , సీతను, లక్ష్మణుని చూసాను తరువాత మిమ్మల్ని చూస్తున్నాను. పూర్వపు రాజులైన సగరుడు, నలుడు, భరతుడు, యయాతి, వైన్యుడు, నభాగుడు మొదలైన వారు సత్య ధర్మాలు పాటించు ఉత్తమ లోకాలు పొందారు. మీకు శుభం కలుగుతుంది " అని చెప్పి ఆశీర్వదించి వెళ్ళాడు.


యుధిష్టురిని కలవడానికి వచ్చిన శ్రీకృష్ణుడు అతనిని అతని అనుచరులను కుంతిని సుభద్రను తీసుకు వెళ్ళడానికి వచ్చిన గరుడుడు-రాజ్మానామా నుండి ఒక దృశ్యం

### ద్రౌపది ధర్మరాజు సంభాషణ


యుధిష్టురినితో ద్రౌపది భీమసేనుల

ఒకరోజు ద్రౌపది ధర్మరాజుని చూసి " దృతరాష్టుడు తన కొడుకు మాటవిని మిమ్మల్ని రాజ్యం నుండి వెళ్ళగొట్టాడు. కాని అతనికి మీ మీద కోపం పోయిందా. పోదు ఎందుకంటే అతని హృదయం పాషాణం. తన కొడుకు మిమ్మల్ని నిష్టూరంగా మాట్లాడినప్పుడు అతడు వారించ లేదు. రాజభోగాలు అనుభవించ వలసిన మీరు అడవులలో కష్టాలు పడుతున్నారు. ఇది నేను భరించలేను. ఆ దృతరాష్టుడి లాగా బ్రహ్మదేవుడు మీకు శత్రువైనాడా ఏమి? " అని బాధపడి మళ్ళీ " నీ ఆజ్ఞానువర్తనులైన నీ తమ్ములు తమ పరాక్రమం విడుచి ఉన్నారు. నాడు సామంతుల కిరీట కాంతులతో ఎర్రబడ్డ మీ పాదాలు నేడు బండ రాళ్ళ మీద నడిచి ఎర్రబడ్డాయి. అనేక బ్రాహ్మణులకు భోజనం పెట్టిన మీరు కందమూలాలు తింటున్నారు. ఇట్టి దుర్దశలో కోపం విడిచి పెట్టడం తగదు కదా. అమిత బలశాలి భీముడు కందమూలాలు తిని చిక్కి పోయాడు. ధనుర్విద్యా పారంగతుడు అర్జునుడు అడవి జంతువుల మధ్య తిరుగుతున్నారు. వారిని చూసి కూడా

సంవాదము

ఓర్పు వహిస్తున్నారా? క్షమను తేజస్సును సమయానుకూలంగా ఉపయోగించని రాజు ప్రజల మన్నన పొందజాలడు అనే కథ మన ఇతిహాసంలో ఉంది . పూర్వం బలి చక్రవర్తి క్షమ గొప్పదా ? తేజస్సు గొప్పదా ? అని తన తాత అయిన ప్రహ్లాదుని అడిగాడు. అందుకు ప్రహ్లాదుడు అన్ని సమయాలలో క్షమ పనికిరాదు. అలాగే సదా ప్రతాపం చూపకూడదు రెండూ సమపాళ్ళలో చూపాలి. ఎప్పుడూ క్షమిస్తుంటే సేవకులు పనిచేయరు యజమానిని గౌరవించరు. ఎక్కువ కర్కశంగా ఉంటే ప్రజా కంటకుడౌతాడు " అని ప్రహ్లాదుడు చెప్పాడు. ఒక తప్పు చేస్తే క్షమించవచ్చు కానీ అదేపనిగా తప్పులు చేస్తున్న కౌరవులను క్షమించ వచ్చునా? కనుక ఇది పరాక్రమం, తేజస్సు చూపించ వలసిన సమయం " అన్నది. అందుకు ధర్మరాజు " ద్రౌపదీ! కోపం మహాపాపం. కోపం కలవాడు కర్తవ్యం విస్మరిస్తాడు. చంపకూడని వారిని చంపుతాడు. కోపం వదిలిన వాడు తేజోవంతుడు ఔతాడు. క్షమ కలవాడికి విజయం సిద్ధిస్తుంది. దుర్యోధనునికి క్షమా గుణం లేదు కనుక అతడు పతనం కాక తప్పదు " అన్నాడు. అందుకు ద్రౌపది " ఓ అజాత శత్రువా! నీవు ధర్మంతో వర్ధిల్లుతున్నావు. కానీ క్షమ శత్రువుల వద్ద తగునా? వంచకుల పట్ల వంచనతో ప్రవర్తించాలి ఓ బ్రహ్మదేవా! నీవు వంచకులకు అభ్యుదయాన్నిచ్చి, ధర్మాత్ముల సంపద పోగొడుతున్నావా? వంచకులు నీకు బంధువులు, ధర్మాత్ములు శత్రువులా? " అని నిర్వేదంతో పలికింది. ధర్మరాజు " ద్రౌపదీ! నీవు నాస్తికురాలి వలె మాట్లాడుతున్నావు. అది తప్పు కదా? ధర్మాత్ములైన మార్కండేయ, వ్యాస, నారదాది మహా మునులు ధర్మాత్ముడనని నన్ను గౌరవిస్తున్నారు. ఇతరులు నా పట్ల అధర్మంగా ప్రవర్తించినా నేను ఎందుకు ధర్మం తప్పాలి? పుణ్యకార్యాలకు ఫలితం లేకుంటే మునిజనాలు వాటిని ఎందుకు ఆచరిస్తారు. నీవు దుష్టద్యుమ్నుడు పుణ్య ఫలమున పుట్టిన వాళ్ళు కదా " అన్నాడు. ద్రౌపది " కర్మఫలానికి విధి కారణం కాదు అనే దానిని కాదు. కాని కర్మ చేయడం మానవ ధర్మం కదా? కర్మ ఫల ప్రాప్తికి మనుష్య ప్రయత్నం తరువాత దైవ బలం సమకూరాలి. పురుషుడు సంకల్పించి తరవాత ప్రయత్నం చేయాలి అప్పుడు దైవం సాయం చేస్తాడు. నువ్వు గింజలో నూనె ఉన్నా, కర్రలో నిప్పు ఉన్నా పురుష ప్రయత్నం లేని ఎడల నూనె రాదు, నిప్పు పుట్టదు కదా? పురుష ప్రయత్నం లేకుండా దైవాన్ని , ధర్మాన్ని నమ్ముకుంటే ఫలితం ఉంటుందా? కనుక మీ తమ్ముల పరాక్రమం ఉపయోగించి లక్ష్యమును నిర్ణయించి ఫలసిద్ధి పొందమని నా ప్రార్థన " అన్నది.

## భీముని ఆవేదన

ద్రౌపది మాటలకు భీమసేనుడు వంతపాడాడు. " అన్నయ్యా! రాజ్యం మన తండ్రి తాతలది దానిని నీవు అన్యుల పరం చేసి ఇక్కడ ధర్మవచనాలు పలుకుతున్నావు. చెడ్డ వారిని ధర్మబుద్ధితో జయించగలమా? అది సాధ్యమా ? పరాక్రమంతో శత్రువులను జయించాలి కాని ధర్మం ధర్మం అంటూ పలవరించడం తగదు. పరాక్రమం లేని వాడు కృంగి పోవాలి కాని నీ వంటి వారు కాదు. ఆ నాడే శత్రువులను చంపి ఉంటే మనకు ఈ వనవాసం ప్రాప్తించేది కాదు. ఒప్పందాన్ని మీరు అతిక్రమించలేక పోవడం కౌరవులకు చులకన అయింది అది మన పిరికితనం అనుకుంటున్నారు. నీవు అనుసరిస్తున్న ధర్మం మనకు ,మన బంధు వర్గాలకు బాధ కలిగిస్తుంది. శత్రువులను జయించడం, ప్రజల భయాన్ని పోగొట్టడం, దానధర్మాలు చేయడం, యజ్ఞయాదులు చేస్తూ బ్రాహ్మణులను పూజించడం క్షత్రియ ధర్మం. కేవలం ధర్మాచరణతో శత్రువులను జయించ లేము. మోసాన్ని మోసంతో జయించాలి. ఒప్పందాన్ని పక్కన పెట్టి వాళ్ళను జయిద్దాం. రాజులంతా మనకు సాయం చేస్తారు. కౌరవ రాజ్యంలోని ప్రజలు నీ పాలన కోరుకుంటున్నారు " అని భీముడన్నాడు. ధర్మరాజు " భీమా ! నీ మాటలు ధర్మ సమ్మతమే కానీ నేను సభలో పన్నెండేళ్ళు అరణ్యవాసం ఒక ఏడు అజ్ఞాతవాసం చేస్తానని చెప్పాను. క్షణిక సుఖాలకు ఆశించి సత్యాన్ని ధర్మాన్ని విడువను. మనకు మేలు జరిగే వరకూ వేచి ఉంటాను " అన్నాడు. భీముడు " అన్నయ్యా ! మృత్యువు ఎప్పుడూ మన వెంట పొంచి ఉంటుంది. ఈ జీవితాలు ఆశాశ్వతం కనుక శాశ్వతం అనుకుని వేచి ఉండుట తగునా ? మరణించే ముందు పగ తీర్చుకోవాలి కదా? " అన్నాడు." శత్రువులపై ప్రతీకారం చేయాలని నా హృదయం తపిస్తుంది. నా తమ్ముల యొక్క ద్రౌపది యొక్క దు:ఖం తీర్చడం కుండా ధర్మం, దయా అంటూ కూర్చోవడం తగునా? నీవనుసరించే మార్గం బ్రాహ్మణులకు తగును కానీ క్షత్రియులకు కాదు. క్షాత్ర ధర్మం ప్రకారం యుద్ధం చేస్తాము. అడవిలో పన్నెండేళ్ళు గడప వచ్చు. కానీ జనపదాలలో పన్నెండు నెలలు గడపడం అసాధ్యం. జగత్ప్రసిద్ధులమైన మనం దాగుట అసాధ్యం కనుక తిరిగి అరణ్యవాసం అజ్ఞాత వాసం ఇలా ఎన్నాళ్ళు. కనుక ఇప్పటి మన పదమూడు నెలల వనవాసం పదమూడేళ్ళుగా భావించడంలో తప్పేమి లేదు " అని భీముడన్నాడు. ధర్మరాజు భీమునితో " భీమా ! నీకు పాండిత్యం, పరాక్రమం, దర్పం ఉన్నాయి. కనుక నేను చెప్పేది ఆలోచించు. కౌరవులతో యుద్ధం సామాన్యమైనది కాదు. కనుక బాగా ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి దూకుడు తగదు. అప్పుడే మనకు దైవం అనుకూలిస్తాడు. దృతరాష్ట్రుని కుమారులు మహావీరులు పైగా దుర్మార్గులు. వారికి కర్ణుడు, భూరిశ్రవుడు, శల్యుల అండ ఉన్నది. రాజసూయయాంలో మనచేత ఓడింపబడిన రాజులంతా కౌరవ పక్షాన చేరారు. కర్ణుడు మహావీరుడు, కవచకుండల ధారి. భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యుల వంటి మహా యోధులకు మనపట్ల విరోధం లేకున్న ధర్మాన్ని అనుసరించి దుర్యోధనుని పక్షాన యుద్ధం చేస్తారు. వారిని ముందుగా జయించి కాని దుర్యోధనుని జయించ లేము . కనుక యుద్ధానికి ఇది తగిన సమయం కాదు " అని చెబుతుండగా వ్యాసుడు అక్కడకు వచ్చాడు.

## అర్జునుడు దివ్యాస్త్రాలను సంపాదించుట

ధర్మరాజు వ్యాసుని సాదరంగా ఆహ్వానించి అర్చించాడు." ధర్మరాజా! నీ మనస్సులో ఉన్న చింతను గుర్తించి ఇక్కడకు వచ్చాను. నేను నీకు ప్రతిస్మృతి అనే విద్యను నేర్పిస్తాను. దానిని నీవు అర్జునునకు ఉపదేశించు. దాని ప్రభావంతో అర్జునుడు అధికంగా తపస్సు చేసి దేవతలను మెప్పించి దివ్యాస్త్రాలను సంపాదిస్తారు. మీరు ఈ అడవిని విడిచి వేరే అడవికి వెళ్ళండి " అని చెప్పాడు . వ్యాసుని ఆజ్ఞ ప్రకారం పాండవులు కామ్యక వ నానికి వెళ్ళారు. ధర్మరాజు ఒకరోజు అర్జునినితో " అర్జునా ! భీష్ముడు, ద్రోణుడు దివ్యాస్త్ర సంపన్నులు. వారిని గెలవాలంటే మనకూ దివ్యాస్త్ర సంపద కావాలి. వ్యాసుడు అందుకు మార్గం చెప్పి మంత్రోపదేశం చేసాడు. నేను నీకు ఆ మంత్రం ఉపదేశిస్తాను. నీవు తపస్సు చేసి దివ్యాస్త్రాలు సంపాదించు. వృత్తాసురుడికి భయపడి దేవతలంతా తమతమ అస్త్రాలను ఇంద్రునికి ఇచ్చారు. అవి నీకు లభిస్తాయి. పరమ శివుని ఆరాధించి పాశుపతాస్త్రం సంపాదించమని వ్యాసుడు ఆదేశించాడు " అని చెప్పి అర్జునునకు వ్యాసుడు ఉపదేశించిన ప్రతిస్మృతి అనే విద్యను ఉపదేశం చేసాడు. అన్న అనుమతి తీసుకుని అర్జునుడు తపస్సు చేయడానికి గంధ మాదన పర్వతం చేరుకున్నాడు. అక్కడ ఒక ముసలి బ్రాహ్మణుడు అర్జునిని చూసి " వీరుడా నీవు ఎవరు? ఇక్కడ ఎందుకు ఉన్నావు? ఇక్కడ శాంతస్వభావులైన బ్రాహ్మణులు తపమాచరించే ప్రదేశం. ఆయుధధారివైన నీకు ఇక్కడ ఏమి పని ? నీ ఆయుధములు విడిచి పెట్టు " అన్నాడు. ఆ మాటలకు చలించకుండా స్థిరంగా ఉన్న అర్జునిని సాహసానికి మెచ్చి బ్రాహ్మణుని రూపంలో ఉన్న ఇంద్రుడు అర్జునుడికి ప్రత్యక్షమైయ్యాడు. " అర్జునా నీ ధైర్యానికి మెచ్చాను. నీకేమి కావాలో కోరుకో " అని అన్నాడు. అర్జునుడు " నాకు దివ్యాస్త్రాలు కావాలి " అన్నాడు. ఇంద్రుడు " ఎలాగూ అవి లభిస్తాయి. అమరత్వం కావాలా? " అని అడిగాడు. అర్జునుడు " ముందు నాకు దివ్యాస్త్ర సంపద కావాలి. అవి నాకు ప్రసాదించండి " అన్నాడు. ఇంద్రుడు " అలా అయితే ముందు నీవు పరమేశ్వరుని గురించి తపస్సు చెయ్యి " అన్నాడు.

## అర్జునుడు శివుడి కొరకు తపమాచరించుట


అర్జునుడు శివుడి కొరకు తపమాచరించుట, శివునితో అర్జునుని యుద్ధము

వెంటనే అర్జునుడు ఇన్ద్రకీలాద్రి కి వెళ్ళి అక్కడ శివుని గురించి ఘోర తపస్సు మొదలు ఆరంభించాడు. పరమ శివుడు అర్జునుడుని పరీక్షించదలిచాడు. ఒక కిరాతుడి వేషంలో అర్జుని దగ్గరకు వచ్చాడు. అక్కడ మూకాసురుడు అనే రాక్షసుడు అర్జునుడిని చంపడానికి పంది రూపంలో వచ్చాడు. అర్జునుడు ఆ పందిని బాణంతో కొట్టాడు. అదే సమయంలో కిరాతుని వేషంలో ఉన్న శివుడు కూడా పందిని కొట్టాడు. రెండు బాణాలు తగలగానే ఆపంది ప్రాణాలు వదిలింది. అర్జునుడు కిరాతునితో " నేను కొట్టిన జంతువును నువ్వు ఎందుకు కొట్టావు? వేటలో అలా కొట్టకూడదన్న ధర్మం నీకు తెలియదా " అన్నాడు. ముందు నేను కొట్టిన బాణంతో ఆ పంది చనిపోయింది. నువ్వు కొట్టినట్లు చెప్పుకోవడానికి సిగ్గు లేదా ? చేవ ఉంటే నాతో యుద్ధానికి రా " అన్నాడు శివుడు.



అర్జునుడు శివుని మీద బాణవర్షం కురిపించాడు. కానీ శివుడు చలించ లేదు. అర్జుననకు ఆశ్చర్యం వేసింది " ఇతను సామాన్యుడు కాదు దేవేంద్రుడైనా పరమ శివుడైనా అయి ఉండాలి " అని కున్నాడు. కాని ఈ ఎరుక నాపై వేసిన బాణాలు నన్ను బాధిస్తున్నాయి. ఇవి దివ్యాస్త్రాల వలె ఉన్నాయి " అని మనసులో అనుకున్నాడు. మరల బాణం వేయడానికి గాండీవం తీసుకున్నాడు. అతని చేతిలోని గాడీవం అదృశ్యం అయింది. ఇక ఇరువురు ద్వంద యుద్ధానుకి దిగారు. శివుని దెబ్బలకు తాళలేని అర్జునుడు మూర్చబోయాడు. శివుడు తన నిజ రూపం ధరించాడు. అర్జునుడు కైమోడ్చి శివునకు నమస్కరిస్తూ అనేక విధాల స్థితించాడు. " పరమశివా! నిన్ను సామాన్యుడిగా ఎంచి నీతో యుద్ధం చేసాను. నా తప్పు మన్నించు " అన్నాడు. అందుకు శివుడు " అర్జునా! నిన్ను క్షమించాను. నీవు సామాన్యుడివి కాదు. పూర్వజన్మలో నువ్వు నరుడు అనే దేవఋషివి . ఇదిగో నీ గాడీవం .ఇంకా ఏదైనా వరం కోరుకో " అన్నాడు. అర్జునుడు " త్రయంబకా! నాకు పాశుపతం అనే అస్త్రం ప్రసాదించు. ఈ లోకంలో బ్రహ్మశిరం, పాశుపతం మహాస్త్రాలు. శత్రు సంహారానికి అవి అవసరం కనుక నాకు వాటిని ప్రసాదించు " అన్నాడు.

ఈశ్వరుడు సంతోషించి అర్జునుడికి పాశుపతాన్ని మంత్ర, ధ్యాన, జప, హోమ పూర్వకంగా పాశుపతాస్త్రం , సంధానం, మోక్షణము,

పందికి గురిపెడుతున్న అర్జునుడు


అర్జునుడికి పాశుపతాన్ని ఉపదేశిస్తున్న ఈశ్వరుడు

సంహారం సహితంగా అర్జునుడికి ఉపదేశించాడు.శివుడు అర్జునుడితో " అర్జునా! ఈ పాశుపతాన్ని అల్పులపై ప్రయోగిస్తే జగత్తును నాశనం చేస్తుంది. ఈ దివ్యాస్త్ర ప్రభావంతో నీవు అఖిల లోకాలను జయిస్తావు " అని చెప్పి అంతర్ధానం అయ్యాడు. పరమశివుని చూసినందుకు అర్జునుడు సంతోషించాడు. పరమశివుని స్పర్శతో అర్జునిని శరీరం దివ్యకాంతితో ప్రకాశిస్తుంది. ఈ విషయం తెలుసుకుని ఇంద్రుడు, కుబేరుడు, యముడు, వరుణుడు, అశ్వినీ దేవతలతో కలసి అర్జునిని వద్దకు వచ్చాడు. " అర్జునా నీ పరాక్రమానికి మెచ్చి నీకు వరాలివ్వడానికి వచ్చాము " అన్నాడు ఇంద్రుడు. యముడు తన దండాన్ని అర్జునుడికి ఇచ్చాడు. వరుణుడు వరుణపాశాలను, కుబేరుడు కౌబేరాస్త్రాన్ని దానం చేసారు. అర్జునుడు వారిని దర్శించినందుకు, వారిచ్చిన అస్త్రాలకు పరమానందం చెందాడు. దేవేంద్రుడు అర్జునుడికి రథం పంపి ఇంద్రలోకానికి ఆహ్వానించాడు.

## ఇంద్రలోకంలో అర్జునుడు


అర్జునికి ఊర్వశి శాపం

దానిపై అర్జునుడు ఇంద్రలోకం వెళ్ళాడు. ఇంద్రలోకంలో సూర్య చంద్రులు లేకనే స్వయంప్రకాశంతో వెలిగి పోతున్న అమరావతి నగరాన్ని చూసాడు అర్జునుడు. పురద్వారం వద్ద ఐరావతం అర్జునుడికి స్వాగతం చెప్పింది. అర్జునుడు దేవేంద్రునికి నమస్కరించాడు. అర్జునుడికి ఆనందం కలిగించడానికి దేవేంద్రుడు ఊర్వశిని నియమించాడు. ఊర్వశి అర్జునుడి ముందు నాట్యం చేసింది. అర్జునుడు ఆమెకు నమస్కరించి " అమ్మా! నా మీద పుత్ర ప్రేమతో నన్ను ఆశీర్వదించడానికి వచ్చావా? " అంటూ మాతృభావంతో ఊర్వశికి నమస్కరించాడు. " అర్జునా ! నేను నీ పొందు కోసం వచ్చాను. ఇది దేవలోకం నేను దేవ వేశ్యని. మాకు వావివరసలు ఉండవు. నీకు నేను ఏవిధంగా తల్లిని అయ్యాను " అన్నది. " మా వంశకర్త పురూరవుని భార్యవు నీవు. నా తండ్రి అయిన ఇంద్రునికి పరిచర్యలు చేస్తుంటావు కనుక నీవు నాకు మాతృ సమానురాలివి. స్వేచ్ఛా శృంగారం దోషం, పాపం " అన్నాడు. ఊర్వశి కోపించి " కోరి వచ్చిన నా కోరిక తీర్చనందుకు భూలోకంలో నపుంసకుడివై ఆడవాళ్ళ మధ్య సంచరించు " అని శపించి వెళ్ళి పోయింది. ఇది తెలిసిన ఇంద్రుడు అర్జునుడుతో " అర్జునా! నీ వంటి ధైర్యవంతుని నేను ఇదివరకు చూడలేదు. నీవు ధర్మబుద్ధివి, జితేంద్రుడివి. బాధపడకు ఊర్వశి శాపం అనుభవించక తప్పదు. కాని అది నీ అజ్ఞాతవాస సమయంలో ఉపయోగపడుతుంది. ఎవ్వరికీ తెలియకుండా నపుంసక రూపంలో ఉంవడచ్చు. నీ అజ్ఞాతవాసం ముగియగానే నీ శాపం తొలగి పోతుంది " అని ఊరడించాడు. తరవాత అర్జునుడికి ఇంద్రుడు ఎన్నో దివ్యాస్త్రాలను ఇచ్చాడు. అర్జునుడు ఇంద్రలోకంలో ఉన్న సమయంలో భూలోకంలో ఐదు సంవత్సరాలు గడిచాయి. ఒకనాడు రోమశుడు అనే మహర్షి దేవేంద్రుని వద్దకు వచ్చి ఇంద్రుని అర్ధ సింహాసనంపై కూర్చున్న అర్జునుని చూసి " ఎవరీతుడు ? " అని ఇంద్రుని అడిగాడు. దానికి దేవేంద్రుడు " మహర్షీ ! ఇతడు పూర్వజన్మలో నరుడు అనే మహర్షి. ఇప్పుడు నా అంశతో కుంతీ గర్భాన జన్మించాడు. పరమేశ్వరుడు ఇతనిని అనుగ్రహించి పాశుపతాన్ని ఇచ్చాడు. నేను కూడా ఇతనికి దివ్యాస్త్రాలెన్నో ఇచ్చాను. ఇతను నివాత కవచులను రాక్షసులను సంహరించగలడు. కాని తమరు భూలోకమునకు పోయి అర్జునుడు నా వద్ద ఉన్నాడు అని ధర్మరాజుకు చెప్పండి. ధర్మజుని తీర్ధయాత్రలు చేయమని నా తరఫున చెప్పండి. తీర్ధయాత్రల వలన అతడు పాప రహితుడు కాగలడు " అని రోమశునితో చెప్పాడు.

## ధృతరాష్ట్రుని చింత

భూలోకంలో ధృతరాష్ట్రునికి అర్జునుడు దివ్యాస్త్రాలను సంపాదించిన విషయం వ్యాసుని వలన తెలిసి కలత చెందాడు. సంజయుని పిలిచి "సంజయా! అర్జునుడు శ్రీకృష్ణుని సాయంతో ఖాండవ వనాన్ని దహించాడు. నాలుగు దిక్కులు జయించి ధర్మరాజుతో రాజసూయం చేయించాడు. పరమశివుని మెప్పించి పాశుపతం పొందాడు. అలాంటి అర్జునుడు ఉండగా

పాండవులను జయించడం ఎలా? వారు ధర్మవర్తనులు వారిని విజయలక్ష్మి వరిస్తుంది " అన్నాడు . సంజయుడు " సుయోధనుడు నిండు సభలో ద్రౌపదిని అవమానించే సమయంలో వారిని వారించకుండా ఇప్పుడు వగచి లాభం ఏమి? పాండవులు ఇప్పుడు కామ్యకవనంలో ఉన్నారు. శ్రీకృష్ణుని అనేక మంది రాజులను వెంట పెట్టుకుని కామ్యక వనానికి వెళ్ళి పాండవులను పరామర్శించాడు. సుయోధనుని జయించి ధర్మరాజుకు పట్టాభి షేకం చేస్తానని అన్నాడట. మిగిలినవారు వారించి అర్జునినికి సారధ్యం వహించమని అన్నారట. శ్రీకృష్ణుని సాయంతో అరణ్య అజ్ఞాత వాసాలు పూర్తి అయ్యాక నీ కొడుకుతో యుద్ధం చేస్తారు. నీ కొడుకులు అర్జునిని దివ్యాస్త్రాలకు, భీముని గధాఘాతాలకు తట్టుకోగలరా? " అన్నాడు సంజయుడు. ధృతరాష్ట్రుడు " నేనేం చేసేది సంజయా ! నేను ముసలి వాడిని. నాకొడుకు నా మాట వినడు. వాడు ఒక దుర్బుద్ధి. వాడికి భీష్మ, ద్రోణుల మాటలు నచ్చవు. ఆ కర్ణుని, శకుని మాటలు నచ్చుతాయి. నేనేంచేయుదును " అని పరితపించాడు. ధరమరాజు కామ్యకవనంలో అర్జునిని కోసం ఎదురు చూస్తున్నాడు. భీముడు " అన్నయ్యా! నువ్వే కదా అర్జునిని తపసుకు పంపింది. మన బతుకులన్నీ అర్జునిని మీద ఆధారపై ఉన్నాయి. మీరు వెంటనే శ్రీకృష్ణుని పంపి అర్జునిని వెంటనే తీసుకు రమ్మని చెప్పండి. నేను అర్జునుడు శ్రీకృష్ణుని సాయంతో దుర్యోధనాదులను జయించి నిన్ను కౌరవ సామ్రాజ్యానికి పట్టాభిషిక్తుని చేస్తాము. రణరంగంలో నన్ను ,అర్జునిని ఎదిరించే వారు లేరు" అన్నాడు. అందుకు ధర్మరాజు " భీమసేనా! ఆ విషయం నాకు తెలియును కాని యుద్ధానికి ఇది సమయం కాదు. పదమూడు సంవత్సరాల తరవాత నీవు, అర్జునుడు శత్రువులను జయించండి విజయులు కండి. నిండు సభలో కౌరవులతో చేసిన ఒప్పందానికి నేను విరుద్ధంగా ప్రవర్తించను " అన్నాడు ధర్మరాజు.

# మూలాలు

# బయటి లింకులు

- ఇంటర్నెట్ ఆర్చీవులో అరణ్యపర్వము (http://www.archive.org/details/sriandhramahabar023368mbp) - సాహిత్య అకాడమీవారి ప్రచురణ

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి |

# వన పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



# ద్వితీయాశ్వాశం

ఒకరోజు బృహదశ్వుడు అనే ముని పాండవుల వద్దకు వచ్చాడు. ధర్మరాజు ఆ మునికి అతిధిసత్కారాలు కావించి కౌరవుల వలన తాము పడుతున్న బాధలు అన్నీ వివరించి "మహాత్మా! రాజ్యాన్ని, నివాసాన్ని పోగొట్టుకుని మాలాగ అడవిలో కష్టాలుపడుతున్నవారు ఎవరైనా ఉన్నారా? ఉంటే చెప్పండి" అని అడిగాడు. అందుకు బృహదశ్వుడు "ధర్మరాజా! నీవు కష్టాలు పడుతూ అడవులలో ఉన్నా, నీ వెంట నీ అన్నదమ్ములు, నీ భార్యా, నీ హితం కోరే విప్రులు నీ వెంట ఉన్నారు.

పూర్వం నలుడనే మహారాజు నీవలె జూదంలో సర్వం కోల్పోయి, పుష్కరునికి రాజ్యాన్ని అప్పగించి భార్యా సమేతుడై ఒంటరిగా అరణ్యాలకు వెళ్ళాడు", అని చెప్పాడు. అది విని ధర్మరాజు "మహాత్మా! నాకు నలుని కధ వివరించండి" అని అడిగాడు.

## నలదమయంతులు

బృహదశుడు ధర్మరాజుకు ఇలా వివరించ సాగాడు. "నిషిధదేశాన్ని వీరసేనుడి కుమారుడైన నలుడు పరిపాలిస్తున్నాడు. తన పరాక్రమంతో ఎన్నో దేశాలను జయించి ప్రజారంజకంగా పరిపాలిస్తున్నాడు. అతనికి జూదం అంటే ఎక్కువ ప్రీతి. ఆ కాలంలో విదర్భ దేశాన్ని భీముడనే అనేరాజు పరిపాలిస్తున్నాడు. చాలా కాలం అతనికి సంతానం లేదు. అతనికి దమనుడు అనే ముని ఇచ్చిన వరము వలన దమయంతి అనే కూతురు, దముడు, దమనుడు, దాంతుడు అనే కుమారులు కలిగారు. దమయంతి సౌందర్యరాశి, గుణవంతురాలు. దమయంతి నలుని గుణగణాలను గురించి విన్నది. నలుడు దమయంతి గురించి, ఆమె సౌందర్యం గురించి విన్నాడు. ఇరువురి నడుమ ప్రేమ అంకురించింది.

## నలదమయంతుల మధ్య హంస రాయబారం


అంత:పురం ముందు విహరిస్తున్న హంసను చూసి ముచ్చట పడుతున్న దమయంతి

ఒకరోజు నలుడు ఉద్యానవనంలో ఉండగా హంసల గుంపు వచ్చి అక్కడ వాలింది. ఆ హంసలను చూసి ముచ్చట పడి నలుడు వాటిలో ఒకదానిని పట్టుకున్నాడు. మిగిలిన హంసలు తోటి హంసను విడిచి వెళ్ళలేక ఆకాశంలో తిరుగుతున్నాయి. నలునితో అతని చేతిలోని హంస మానవభాషలో ఇలా అన్నది. "ఓ మహారాజా! నీవు దమయంతిని ప్రేమిస్తున్నావు. నేను దమయంతి వద్దకు వెళ్ళి నీ గురించి, నీ అందచందాల గురించి గుణగణాల గురించి చెప్పి నీమీద అనురాగం కలిగేలా చేస్తాను" అని పలికింది. ఆ హంస పలుకులు విని నలుడు ఆనంద పడి, దానిని విడిచిపెట్టాడు. ఇచ్చిన మాట ప్రకారం ఆ హంస విదర్భదేశానికి ఎగిరిపోయింది. అంత:పురం ముందు విహరిస్తున్న హంసను చూసి దమయంతి ముచ్చట పడింది. చెలికత్తెల సాయంతో దమయంతి ఆ హంసను పట్టుకుంది. ఆ హంస దమయంతితో "దమయంతీ! నేను నీ హృదయేశ్వరుడైన నలుని వద్ద నుండి వచ్చాను. నలుడు సౌందర్యవంతుడు, సంపన్నుడు, సద్గుణ వంతుడు. నీవు సౌందర్యంలో, గుణంలో అతనికి తగినదానివి. అతనికి భార్యవైతేనే నీకు రాణింపు" అని పలికింది. దమయంతి "ఓ హంసా! నలుని గురించి నాకు ఎలా చెప్పావో అలాగే నలునికి నా గురించి చెప్పు" అన్నది. ఆ హంస అలాగే చేసింది. ఇలా ఇరువురికి ఒకరిపై ఒకరికి అనురాగం అధికమైంది.

## దమయంతి స్వయంవరం

నల దమయంతుల ప్రణయ విషయం దమయంతి చెలికత్తెల ద్వారా తెలుసుకున్న భీమమహారాజు కుమార్తెకు స్వయంవరం ప్రకటించాడు. ఆహ్వానాన్నందుకున్న రాజులంతా స్వయంవరానికి విచ్చేశారు. నలుడు కూడా స్వయంవరానికి పోతున్నాడు. ఇంద్రునికి దమయంతి స్వయంవర విశేషం తెలిసి దిక్పాలకులతో స్వయం వరానికి బయలుదేరాడు. మార్గమధ్యంలో నలుని చూసిన ఇంద్రుడు నలునితో "నిషధ రాజా !నీవు నాకు దూతగా పని చేయాలి" అన్నాడు. నలుడు "అలాగే చేస్తాను. ఇంతకీ మీరెవరు? నేను నీకేమి చేయాలి?" అని అడిగాడు. ఇంద్రుడు నలునితో "నేను ఇంద్రుడను. వీరు దిక్పాలకులు. నీవు పోయి దమయంతికి మా గురించి చెప్పి ఆమె మమ్ములను వరించేలా చేయాలి" అన్నాడు. నలుడు ఇంద్రునితో "అయ్యా! నీకిది ధర్మమా? నేను కూడా అదే పనిమీద పోతున్నాను కదా" అన్నాడు. ఇంద్రుడు నలునితో "నీవు మాకు మాటిచ్చావు కనుక, ఈ కార్యం చేయవలసిందే. ఇది దేవతాకార్యం, నీవు చేయగలవు. మాట తప్పడం ధర్మం కాదు. మా మహిమచేత అంత:పురానికి వెళ్ళడానికి నీకు ఎవరూ అడ్డు చెప్పరు" అన్నాడు. గత్యంతరం లేక, నలుడు దమయంతి అంత:పురంలో ప్రవేశించాడు. నలుడు దమయంతిని మొదటి సారిగా చూసి, 'హంస చెప్పినదాని కంటే దమయంతి సౌందర్యవతి' అనుకున్నాడు. దమయంతి, ఆమె చెలికత్తెలు నలుడుని చూసి ఆశ్చర్యపోయారు. దమయంతి నలుని చూసి "మహాత్మా మీ రెవరు? ఎక్కడి నుండి వచ్చారు? ఈ అంత:పురంలో ఎవరికీ కనపడకుండా ఎలా ప్రవేశించారు?" అని అడిగింది. నలుడు దమయంతితో "నా పేరు నలుడు. నేను దేవదూతగా వచ్చాను. దిక్పాలకులు, వారిలో ఒకరిని వరించమని నీకు చెప్పమని

నన్ను పంపారు" అన్నాడు. నలుని మాటలకు ఆమె మనసు కష్టపడింది. "అయ్యా! నేను మానవకాంతను. నమస్కరించ వలసిన దేవతలను వరించడం ధర్మమా? నాడు హంస చెప్పినది మొదలు, నిన్నే నా భర్తగా తలచుకుంటున్నాను. నా తండ్రి భీమరాజు మిమ్ము ఇక్కడికి రప్పించడానికే స్వయంవరం ప్రకటించాడు. మీరే నాభర్త, కనుక నన్ను స్వీకరించండి. లేకుంటే నా ప్రాణాలను తీసుకుంటాను కాని, ఇతరులను వరించను" అని దమయంతి ప్రార్ధించింది. నలుడు దమయంతితో "దమయంతీ! దేవతలు ఐశ్వర్యవంతులు, జరా మరణాలు లేని వారు, వారిని కాదని జరామరణాలకు ఆలవాలమైన నన్ను కోరడం న్యాయమా?" అని అన్నాడు. ఆ మాటలు విని దమయంతి దు:ఖించింది. ఆమె నలునితో "నేను ఒక ఉపాయం చెప్తాను. అందరి ముందు నేను దేవతలను ప్రార్ధించి నిన్ను వివాహమాడతాను. అప్పుడు మీకు దేవతల మాట వినలేదన్న దోషం ఉండదు" అన్నది. ఆ మాటలు నలుడు ఇంద్రునికి చెప్పాడు. అది విని దిక్పాలకులు "దమయంతి మమ్మల్ని ఎలా వరించదో చూస్తాము" అని అందరూ నలుని రూపంలో స్వయంవరానికి వచ్చారు. స్వయంవరమండపంలో ఒకేసారి ఐదుగురు నలులు కనిపించారు. దమయంతి వరమాల పట్టుకుని వచ్చింది. మనస్సులో ధ్యానించి "దేవలారా! నలుని గుర్తు పట్టడంలో నాకు సహకరించండి. మీ నిజరూపాలతో ప్రత్యక్షం అవండి" అని ప్రార్ధించింది. వారు దమయంతిని కరుణించి తమ నిజరూపాలతో ప్రత్యక్షం అయ్యారు. నలదమయంతులకు వైభవోపేతంగా వివాహం జరిగింది. ఇంద్రాది దేవతలు అనేక వరాలిచ్చి అనుగ్రహించారు.


నల దమయంతుల వివాహం

## నలదమయంతులపై కలిప్రభావం


రాజ్యాన్ని కోల్పోయి అడవులకు వెళుతున్న నలుడు

దమయంతి స్వయంవరం చూసి దేవలోకం వెళుతుండగా, దేవతలకు కలి పురుషుడు కనిపించాడు. ఇంద్రుడు కలి పురుషుని చూసి "ఎక్కడికి పోతున్నావు?" అని అడిగాడు. "భూలోకంలో జరుగుతున్న దమయంతి స్వయంవరానికి పోతున్నాను" అన్నాడు. అ మాటలకు వారు నవ్వి "దమయంతి స్వయంవరం జరిగింది. ఆమె నలుని వివాహమాడింది" అన్నారు. కలికి కోపం వచ్చింది. నలుడిని రాజ్యభ్రష్టుని చేసి వారిరువురికి వియోగం కల్పించాలని అనుకున్నాడు. నలుడు ధర్మాత్ముడు, కలి ప్రవేశానికి చాలా కాలానికి గాని అవకాశం రాలేదు. ఒకరోజు నలుడు మూత్ర విసర్జన చేసి పాదప్రక్షాళన చేయకుండా సంధ్యా వందనం చేశాడు. ఆ అశౌచాన్ని ఆధారం చేసుకుని కలి అతనిలో ప్రవేశించాడు. నలుని దాయాది అయిన పుష్కరుని వద్దకు వెళ్ళి నలునికి జూదవ్యసనం ఉందని అతనితో జూదమాడి అతని రాజ్యాన్ని గెలువవచ్చని నమ్మబలికాడు. బ్రాహ్మణ వేషంలో పుష్కరునితో నలుని వద్దకు వెళ్ళి జూదానికి ఆహ్వానించాడు. జూదానికి పిలిస్తే పోకపోవడం ధర్మం కాదని, నలుడు జూదమాడటానికి అంగీకరించాడు. జూదం మొదలైంది. నలుడు తనరాజ్యాన్ని, సందలను వరుసగా పోగొట్టుకుంటున్నాడు అయినా ఆడటం మానక, సమస్తం పోయే వరకు ఆడాడు. దమయంతి దు:ఖించి "ఓడేకొద్ది గెలవాలని పంతం పెరుగుతుంది. ఏమీ చెయ్యలేము" అని సరిపెట్టుకుంది. పుష్కరుడు గెలవటం, నలుడు ఓడటం తథ్యమని గ్రహించిన దమయంతి తన కుమార్తె ఇంద్రసేనను, కుమారుడు ఇంద్రసేనను సారధిని తోడిచ్చి విదర్భలో ఉన్న తండ్రి వద్దకు పంపింది. నలుడు తన రాజ్యాన్ని కోల్పోయి, నగరం వెలుపల మూడు రోజులు ఉన్నాడు. జూదంలో సర్వం పోగొట్టుకున్న నలుని చూడటానికి ఎవరూ రాలేదు. ఆకలికి తట్టుకోలేక పోయాడు. ఆకాశంలో ఎగురుతున్న పక్షులను పట్టడానికి తన పైవస్త్రాన్ని వాటి మీద విసిరాడు. ఆ పక్షులు ఆ వస్త్రంతో సహా ఎగిరిపోయాయి. నలుడు ఖేదపడి తన భార్య కొంగును పైవస్త్రంగా కప్పుకున్నాడు. ఆ దుస్థితికి తట్టుకోలేని నలుడు "దమయంతీ! ఇక్కడ నాలుగు మార్గాలు ఉన్నాయి. ఇది, నీపుట్టిల్లు విదర్భ దేశానికి పోయే దారి. ఇది, దక్షిణ దేశానికి పోయే మార్గం, ఇది కోసల దేశానికి పోయే మార్గం, ఇది ఉజ్జయినికి పోయే మార్గం.. వీటిలో మనకు అనుకూలమైన మార్గమేదో చెప్పు. నీవు అడవులలో

కష్టాలు పడలేవు, నీ తండ్రి ఇంటికి వెళ్ళి సుఖంగా ఉండు" అని చెప్పాడు. "అవును నాథా, మనం విదర్భకు వెళ్ళి సుఖంగా ఉంటాము" అని చెప్పింది. నలుడు "దమయంతీ! మహారాజుగా విదర్భలో తిరిగిన వాడిని, రాజ్యభ్రష్టునిగా ఎలా రాగలను చెప్పు. అన్ని రోగాలకన్నా పెద్ద రోగం దు:ఖం అందుకు భార్య పక్కన ఉండటం పరమౌషధం. అందుకని నీవు పక్కన ఉంటే, ఎన్ని కష్టాలైనా సుఖాలుగానే ఉంటాయి" అన్నాడు నలుడు. దమయంతి "నిజమే అందుకనే నన్ను ఎప్పుడూ మీ వెంట ఉండటానికి అనుమతించండి" అన్నది. అందుకు నలుడు అంగీకరించాడు.

## నలదమయంతుల వియోగం


దమయంతిని అడవిలో వదిలి పోతున్న నలుడు - రాజా రవి వర్మ గీచిన చిత్రం

ఒకరోజు అడవిలో నలుని తొడమీద తల పెట్టుకుని, దమయంతి నిద్రపోతూ ఉంది. అమెను చూసి నలుడు "ఈ సుకుమారి నాతో అడవులలో కష్టాలు పడుతోంది. నా వెంట ఉండటమే ఈమె కష్టాలకు కారణం. నేను లేకపోతే ఈమె పుట్టింటికి వెళ్ళి సుఖ పడుతుంది" అని మనసులో అనుకుని, తాను ధరించిన చీరభాగాన్ని చింపి, పైన వేసుకుని ఆమెను వదలలేక వదలలేక విడిచి వెళ్ళాడు. నిద్రలేచిన దమయంతి భర్త లేకపోవడం చూసి దు:ఖించింది. భర్తను తలచుకుంటూ అడవిలో తిరుగు తున్న దమయంతిని ఒక కొండచిలువ పట్టుకుంది. భయంతో దమయంతి కేకలు వేసింది. ఆ కేకలు విని ఒక కిరాతుడు తన కత్తితో ఆ కొండచిలువను చంపి, దమయంతిని రక్షించాడు. ఆ కిరాతుడు దమయంతి గురించి తెలుసుకున్నాడు. ఆమె నిస్సహాయతను తెలుసుకుని, ఆమెను తాకబోవగా, దమయంతి అతనిని భస్మం చేసింది.


దమయంతి తేజస్సు వలన దగ్ధమవుతున్న కిరాతుడు

భర్తను తలుచుకుంటూ అడవిలో దారీతెన్నూ లేకుండా ప్రయాణిస్తూ ఉండగా, ఆమెకు ఒక మునిపల్లె కనపడింది. అక్కడ ఆమె మునిశ్రేష్టులను చూసింది. మునులు దమయంతిని చూసి "అమ్మా! నీవు ఎవరు? ఒంటరిగా ఎందుకు తిరుగుతున్నావు?" అని అడిగారు. సమాధానంగా దమయంతి "మునిపుంగవులారా! నేను నలచక్రవర్తి భార్యను. నా పేరు దమయంతి. విధివశంతో నా భర్త నన్ను విడిచి వెళ్ళాడు. నాకు వారి జాడ చెప్పగలరా? నేను భర్త లేనిదే జీవించ లేను" అని అడిగింది. మునులు "అమ్మా! నీకు త్వరలోనే భర్త సమాగమం జరుగుతుంది. చింత పడకుము" అని చెప్పి, వెళ్ళారు. దమయంతి పిచ్చిదానిలా భర్తను వెతుక్కుంటూ ఆ అడవిలో తిరుగుతూ ఉంది. ఇంతలో అటుగా పోతున్న బాటసారులు ఆమెను చూసి చూసారు. కొందరు ఆమెను పిచ్చిది అని ఎగతాళి చేసారు. కొందరు ఆమెకు మొక్కారు. వారిలో ఉన్న వ్యాపారి ఆమెను గురించి తెలుసుకుని "అమ్మా! నేను నలుని చూడలేదు, కానీ మేము ఛేది దేశానికి వెళుతున్నాము" అన్నాడు. దమయంతి వారితో "నేను కూడా మీ వెంట వస్తాను" అన్నది. ఆ వ్యాపారి ఆమెను తమ వెంట తీసుకు వెళ్ళాడు. వారు అడవి మార్గంలో రాత్రి వేళ నిద్రిస్తున్న సమయంలో ఒక ఏనుగుల గుంపు వారిలో చాలా మందిని తొక్కివేసింది. వారిలో చాలామంది మరణించడం చూసి, దమయంతి తన దురదృష్టానికి దు:ఖించింది. తనను చంపలేదని రోదిస్తున్న ఆమెను కొందరు బ్రాహ్మణులు ఓదార్చి ఆమెను తమ వెంట సుబాహు నగరానికి తీసుకు వెళ్ళారు. ఛేదిదేశ రాజధాని సుబాహుపురం చేరింది. ఒళ్ళంతా దుమ్ముతో వీధిలో వెళుతున్న దమయంతిని రాజమాత చూసి దాసీలను పంపి దమయంతిని అంత:పురానికి పిలిపించింది. రాజమాత దమయంతితో "అమ్మా! నిన్ను చూస్తుంటే రాచకళ ఉట్టి పడుతుంది. నీవు ఎవరు?" అని అడిగింది. దమయంతి "అమ్మా! నా భర్త జూదంలో రాజ్యం పోగొట్టుకున్నాడు. నన్ను అడవిలో ఒంటరిగా విడిచి వెళ్ళాడు. అతనిని వెతుకుతూ తిరుగుతున్నాను" అని చెప్పింది. రాజమాత "అమ్మా! ఇకనుండి నువ్వు నా దగ్గర సైరంధ్రిగా ఉండు. నీకు ఏ లోటూ రాకుండా నేను చూస్తాను. నీ భర్తను వెతికిస్తాను" అని చెప్పింది. దమయంతి అందుకు అంగీకరించి "అలాగే ఉంటాను, కానీ నేను సైరంధ్రిగా ఎవరి ఎంగిలీ తినను, పరులకు కాళ్ళుపట్టను, పరపురుషులతో మాట్లాడను. కేవలం నా భర్తను వెతుకుతూ వెళ్ళే బ్రాహ్మణులతో మాత్రం

మాట్లాడు తాను" అని చెప్పింది. రాజమాత అంగీకరించి తన కుమార్తె సునంద వద్దకు పంపింది. దమయంతి అక్కడే ఉండిపోయింది.

## నలుడు వికృతరూపుడగుట


అడవిలో ఒంటరిగా మిగిలిన దమయంతి - రాజా రవి వర్మ గీచిన చిత్రం

దమయంతిని వదిలివెళ్ళిన నలుడు అడవిలో ప్రయాణిస్తుండగా, అడవి అంతటా దావానలం వ్యాపించింది. ఆ మంటల మధ్యనుండి "రక్షించండి రక్షించండి" అన్న ఆర్తనాదం వినిపించింది. ఆ ఆర్తనాదం విని నలుడు అగ్నికీలల నడుమ ఉన్న నాగ కుమారుని రక్షించాడు. ఆ పాము నలుని కాటు వేసింది. పాము కాటుకు నలుడు వికృత రూపుడయ్యాడు. అప్పుడు ఆ పాము తన నిజరూపంతో ప్రత్యక్షం అయి నలునితో "నలమహారాజా! నా పేరు కర్కోటకుడు. నేను నిన్ను కాటువేసానని భయపడకు. ఇక నిన్ను ఎవరూ గుర్తించరు. పాముకాటు నిన్ను ఏమీ చేయదు. నీ రాజ్యం నీకు ప్రాప్తిస్తుంది, నీ భార్య నీకు దక్కుతుంది, నీకు ఎప్పుడు నిజరూపం కావాలన్నా, నన్ను తలచుకుంటే నీ వద్దకు ఒక వస్త్రం ఎగురుతూ వస్తుంది. దానిని కప్పుకుంటే నీ పూర్వాకృతి వస్తుంది. నీకు మరొక విషయం చెప్తాను.. ఇక్కడికి దగ్గరలో ఇక్ష్వాకు వంశస్థుడైన రుతుపర్ణుని రాజ్యం ఉంది. నీవు అక్కడికి వెళ్ళు. బాహుకుడు అనే పేరుతో అతని వద్ద రథసారధిగా చేరు. నీవు అతనికి అశ్వహృదయం అనే విధ్యను ఇచ్చి అతనినుండి అక్షహృదయం అనేవిద్యను గ్రహించు", అని చెప్పి కర్కోటకుడు వెళ్ళాడు. నలుడు ఋతుపర్ణుని వద్ద సారధిగా చేరాడు. అలాగే వంటశాలలో చేరి రుచికరమైన వంటలు వండి పెట్టసాగాడు. నలునికి జీవలుడు సహాయకుడుగా ఉన్నాడు. ఎక్కడ ఉన్నా, నలుడు ఎప్పుడూ దమయంతిని తలచి దు:ఖిస్తూ ఉండేవాడు. ఒకరోజు నలుడు దమయంతిని తలచుకుని దు:ఖిస్తూండగా జీవలుడు విని ఈ వికృతరూపి ప్రియురాలు ఎంత వికృతరూపంతో ఉంటుందో అనుకుంటూ నలుని దగ్గరకు వచ్చి, విషయం ఏమిటని అడిగాడు. అందుకు నలుడు జీవలునితో "అయ్యా నాకు ఒక ప్రేయసి కూడానా. నాకు తెలిసిన ఒక సైనికుడు తన ప్రేయసిని గురించి దు:ఖిస్తుండగా చూసాను. అతనిని అనుకరిస్తూ ఏడుస్తున్నాను" అన్నాడు.

## దమయంతి విదర్భ దేశానికి చేరుట

విదర్భదేశంలో ఉన్న భీమునికి నలుని విషయాలు తెలిసాయి. తన కూతురు, అల్లుడు ఏమయ్యారో అని పరితపించాడు. వారిని వెదకడానికి నలువైపులా బ్రాహ్మణులను పంపించాడు. ఎన్నో బహుమానాలు ప్రకటించాడు. ఛేదిదేశం చేరిన బ్రాహ్మణుడు, దమయంతి నుదుటన ఉన్న పుట్టుమచ్చని చూసి ఆమెను గుర్తించాడు. అతడు దమయంతితో "అమ్మా! నేను నీ తండ్రి వద్దనుండి వస్తున్నాను. అక్కడి వారంతా క్షేమం. నేను నీ సోదరుని మిత్రుడను" అనగానే దమయంతి వారిని తలచుకుని పెద్దగా రోదించింది. అది చూసిన రాజమాత ఆ బ్రాహ్మణుని చూసి "బ్రాహ్మణోత్తమా! ఈమె ఎవరి భార్య? ఎవరి కూతురు? ఇలా ఉండటానికి కారణం ఏమిటి?" అని అడిగింది. అందుకు అతడు "అమ్మా! ఈమె విదర్భరాజు కుమార్తె. నలచక్రవర్తి భార్య. ఈమె పేరు దమయంతి. అతడు విధివశాత్తు రాజ్యాన్ని పోగొట్టుకుని అడవుల పాలయ్యాడు. భీముని ఆజ్ఞపై ఈమెను వెతుకుతూ ఇక్కడికివచ్చి ఈమెను గుర్తించాను" అన్నాడు. అది విని దయంతిని కౌగలించుకున్న రాజమాత "దమయంతీ! నీవు నాకు పుత్రికా సమానురాలివి. నేను, నీ తల్లి దశార్ణరాజు కుమార్తెలము. నీ తల్లి విదర్భరాజును వివాహమాడింది. నేను వీరబాహును వివాహమాడాను" అన్నది. అందుకు అందరూ ఆనందపడ్డారు. దమయంతి బ్రాహ్మణునితో పుట్టింటికి ప్రయాణం అయింది.

## దమయంతికి ద్వితీయ స్వయంవరం ప్రకటించుట

రాజ సౌధంలో ఉన్నా దమయంతి భర్తృవియోగంతో బాధపడుతూనే ఉంది. ఆమె తనతండ్రితో "నా భర్తను తక్షణం వెతికించండి. ఆయన లేకుండా నేను బ్రతక లేను" అన్నది. భీముడు వెంటనే బ్రాహ్మణులను పిలిచి నలుని వెతకమని చెప్పాడు. వారితో దమయంతి ఇలా చెప్పింది. "నా భర్త ఇప్పుడు రాజ్యభ్రష్టుడు కనుక, మారు వేషంలో ఉంటాడు. మీరు వెళ్ళిన రాజ్య సభలలో ఈ విధంగా ప్రకటించండి. "నీవు సత్యసంధుడవు కాని, నీ సతిని వంచించావు. ఆమె సగం వస్త్రం ధరించి వెళ్ళావు. అలా చెయ్యడం ధర్మమా? నాపై కరుణ చూపు" అని చెప్పండి. ఈ మాటకు ఎవరైనా రోషపడి బదులిస్తే, నా

వద్దకు వచ్చి చెప్పండి" అన్నది. అలా నలుని వెదకడానికి వెళ్ళినవారంతా నలుని జాడ తెలుపక పోయినా, వారిలో పర్ణాదుడు అనే విప్రుడు దమయంతితో "అమ్మా! నేను ఋతుపర్ణుని రాజ్యంలో నీవు చెప్పినట్లే చెప్పాను. అక్కడ ఒక కురూపి వంటవాడు, సారధి అయిన బాహుకుడు అనేవాడు నన్ను రహస్యంగా కలుసుకుని, 'అయ్యా! భర్త కష్టాలలో ఉన్నా సహించి, ఆదరించే భార్య ఇహలోకంలోనూ పరలోకంలోనూ సుఖపడుతుంది' అన్నాడు" అని దమయంతితో చెప్పాడు. దమయంతి ఆలోచించగా అతడు నలుడు కాకపోతే అలా ఎందుకు బదులిస్తాడు అనుకుంది. తన అనుమానం దృఢపరచుకోవడానికి తల్లి అనుమతితో సుదేవడనే బ్రాహ్మణుని పిలిపించింది. "సుదేవా నీవు ఋతుపర్ణుని రాజుతో, "రాజా! భీముడు తన అల్లుని కొరకు వెతికించినా ఫలితం లేదు కనుక ద్వితీయ స్వయంవరం ప్రకటించాడు. భూమండలం లోని రాజులంతా వస్తున్నారు. మరునాడే స్వయంవరం కనుక వెంటనే బయలుదేరు" అని చెప్పు" అని చెప్పి పంపింది. సుదేవుడు ఋతుపర్ణునితో దమయంతి చెప్పమన్నట్లే చెప్పాడు.

## నలుడు స్వయంవరానికి బయలుదేరుట

దమయంతి బ్రాహ్మణుని ద్వారా పంపిన సందేశం విని ఋతుపర్ణుడు స్వయంవరానికి వెళ్ళాలని అనుకున్నాడు. ఒకరోజులో విదర్భను చేరటం ఎలా? అనుకుని సారధి అయిన బాహుకుని పిలిచి "బాహుకా! దమయంతికి ద్వితీయ స్వయంవరం ప్రకటించారు. నాకు చూడాలని ఉంది. ఒక్కరోజులో మనం విదర్భకు వెళ్ళాలి. నీ అశ్వసామర్ధ్యం ప్రకటించు" అన్నాడు. సరే అని చెప్పినా బాహుకుడు మనస్సు కలతకు గురైంది. "నేను అడవిలో నిర్దాక్షిణ్యంగా వదిలి రాబట్టే కదా, దమయంతి రెండవ స్వయంవరం ప్రకటించింది. అవివేకులైన పురుషులు తాము ఏమి చేసినా భార్య ప్రేమిస్తుందని అనుకుంటారు, కాని అది నిజంకాదు. నా మీద కలిగిన కోపంతో దమయంతి ఇలా చేసింది. అని దు:ఖించాడు. "అయినా దమయంతి పతివ్రత. ఇద్దరుపిల్లల తల్లి. ఈ విధంగా రెండవ పెళ్ళి చేసుకుంటుందా? ఏమో? ఆ వింత చూస్తాను" అని మనసులో అనుకున్నాడు. వెంటనే రధానికి గుర్రాలను కట్టి విదర్భకు ఋతుపర్ణుని తీసుకుని ప్రయాణం అయ్యాడు. ఋతుపర్ణునికి రధం పోయే వేగం చూస్తుంటే అది సూర్యుని రధంలా, బాహుకుడు అనూరుడిలా అనిపించింది. పక్కనే ఉన్న వార్ష్ణేయుడికి అదే సందేహం కలిగింది. "భూలోకంలో నలునికి మాత్రమే ఇలాంటి నైపుణ్యం ఉంది, కాని ఈ కురూపి నలుడెలా ఔతాడు" అని మనసులో అనుకున్నాడు. ఇంతలో ఋతుపర్ణుని ఉత్తరీయం జారి, క్రింద పడింది "బాహుకా రధం ఆపు, వార్ష్ణేయుడు దిగి ఉత్తరీయం తీసుకు వస్తాడు" అన్నాడు. బాహుకుడు "మహారాజా! మనం ఆమడ దూరం వచ్చేసాం. అంతదూరం నడుచుకుంటూ ఎలా తీసుకు రాగలడు?" అన్నాడు. అతని రధ సారధ్యానికి ఋతుపర్ణుడు ఆశ్చర్యచకితుడయ్యాడు. తన పరిజ్ఞానాన్ని బాహుకునికి చూపించాలన్న ఆసక్తి కలిగింది. అంతలో రధం ఒక పెద్ద వృక్షాన్ని దాటింది. ఋతుపర్ణుడు బాహుకునితో "బాహుకా ఆ వృక్షంలో ఎన్ని కాయలు, ఎన్ని పూలు, ఎన్ని ఆకులు ఉన్నాయో నేను చెప్పగలను " అని అన్నాడు. బాహుకుడు "చెప్పండి మహారాజా" అని అడిగాడు. ఋతుపర్ణుడు చెప్పాడు లెక్కించి చూస్తే కాని నమ్మను అని రధం ఆపి ఆ చెట్టుని పడగొట్టించి లెక్కించాడు. ఋతుపర్ణుడు చిప్పిన లెక్కకు ఖచ్చితంగా సరిపోయింది. బాహుకుడు ఆశ్చర్యపడి ఆ విద్యను తనకు ఉపదేశించమని అడిగాడు. ఋతుపర్ణుడు "బాహుకా ఇది అక్షవిద్య అనే సంఖ్యాశాస్త్రం" అన్నాడు. అప్పుడు బాహుకుడు "మహారాజా! ఇందుకు ప్రతిగా నేను నీకు అశ్వహృదయం అనే విద్యను నేర్పుతాను" అన్నాడు.ఋతుపర్ణుడు "ఇప్పుడు కాదు, తరవాత అడిగి నేర్చుకుంటాను" అన్నాడు. అక్షహృదయ విద్య మహిమవలన నలునిలో నుండి కలి వెలుపలికి వచ్చాడు. తనను క్షమించమని నలుని వేడుకున్నాడు. నలుడు ఆగ్రహించి శపించబోయాడు. కలి నలునితో "నలమహారాజా! నిన్ను ఆవహించి నీలో ఉన్న సమయంలో నిన్ను కర్కోటకడు కాటువేయడం వలన అనుక్షణం కాలి పోయాను. ఇంతకంటే శాపం ఏముంది, నన్ను క్షమించి విడిచిపెట్టు" అని వేడుకున్నాడు.

నలుని రధం విపరీతమైన ఘోషతో విదర్భలో ప్రవేశించింది. ఆ ఘోష విని, దమయంతి అది నలుని రధం అని గుర్తుపట్టింది. కాని రధంలో ఋతుపర్ణుని చూసి నిరాశ చెందింది. భీముడు ఎంతో ఆనందంతో ఋతుపర్ణుని ఆహ్వానించి విడిది చూపాడు. ఋతుపర్ణునికి విదర్భలో స్వయంవరం జరుగుతున్న సందడి కనిపించ లేదు. బాహుకుడు రధాన్ని అశ్వశాలలో నిలిపి, సేదతీరాడు.

## నలదమయంతుల కలయిక

దమయంతి తన దాసితో "వచ్చింది ఋతుపర్ణ మహారాజు అతని సారధి వార్ష్ణేయుడు. వారు నాకు తెలుసు, కాని వారి వెంట ఉన్న కురూపి ఎవరు? అతనిని చూసి నా మనస పరవశించి పోతుంది. అతని వివరాలు తెలుసుకుని రా" అని పంపింది. దాసి నలుని వద్దకు వచ్చి "అయ్యా! రాకుమారి మీ యోగ క్షేమాలు కనుక్కుని రమ్మంది" అని చెప్పింది. నలుడు "మీ రాకుమారి స్వయంవరం ప్రకటించింది కదా, దానికి నేను మా మహారాజును ఒక్కరోజులో నూరు ఆమడల దూరం ప్రయాణించి తీసుకు వచ్చాను అని చెప్పు "అన్నాడు. "మీతో వచ్చిన మూడవ వ్యక్తి ఎవరు?" అని దాసి అడిగింది. నలుడు "అతడు


తిరిగి కలుసుకున్న నల దమయంతులు

వార్ష్ణేయుడు. ఇంతకు ముందు నలుని సారధి" అన్నాడు. దాసి "అతనికి నలుని జాడ తెలుసు కదా?" అని అడిగింది. నలుడు దాసితో "తనరాజ్యాన్ని పోగొట్టుకునేముందు నలుడు తన పిల్లలనిచ్చి వృష్ణేయుని విదర్భకు పంపాడు. ఆ తరవాత వార్ష్ణేయుడు ఋతుపర్ణుని వద్ద సారధిగా చేరాడు. నలుని గురించి నలునికి తెలియాలి, లేదా అతని భార్యకి తెలియాలి, వేరొకరికి తెలిసే అవకాశం లేదు" అన్నాడు బాహుకుడు. దాసి "అయ్యా! నలుడు తనను ప్రాణపదంగా చూసుకునే భార్యను నిర్దాక్షిణ్యంగా అడవిలో విడిచి వెళ్ళాడు. దమయంతి నలుడు విడిచి వెళ్ళిన సగంచీర ధరించి కాలం గడుపుతోంది. ఆమెను ఇలా విడిచి వెళ్ళడం ధర్మమా?" అని అడిగింది. నలుని కంట నీరు పెల్లుబికింది. అది దాసికి తెలియ కూడదని మొహం తిప్పుకున్నాడు. దమయంతికి దాసి జరిగినదంతా వివరించింది. దమయంతి దాసితో "సందేహం లేదు, అతడు నలుడే. అయినా ఈ వికృత రూపం ఏమిటి? అతను వంటవాడు అని చెప్పారు కనుక, వంట ఎలా చేస్తాడో పరీక్షించు" అని పంపింది. దాసి వెళ్ళి నలుని నిశితంగా పరిశీలించి "అమ్మా! అతను సామాన్యుడు కాదు. అతడు ఏ పని అయినా సునాయాసంగా చేస్తున్నాడు. అతడు గడ్డిని విదిలిస్తే మంటలు వస్తున్నాయి. వంట పూర్తయే వరకు అలా మండు తున్నాయి. వంటలు అద్భుతంగా ఉన్నాయి" అని దమయంతికి చెప్పింది. దమయంతి నలుడు వండిన వంటలు తెప్పించి రుచి చూసి "సందేహం లేదు, ఇవి నలుని వంటలే" అని గ్రహించి, దాసితో తన పిల్లలను నలుని వద్దకు పంపింది. నలుడు వారిని చూసి చలించి ఎత్తుకుని ముద్దాడాడు. దాసితో "అమ్మా! ఏమీ అనుకోవద్దు, వీరిని చూస్తే నా బిడ్డలు గుర్తుకు వచ్చారు అందుకే అలాచేసాను. ఇక నువ్వు నా వద్దకు రావద్దు. ఎవరైనా చూస్తే ఏదైనా అనుకుంటారు. అయినా మేము విదేశాలనుండి వచ్చిన అతిధులం మాతో నీకేం పని?" అన్నాడు. ఇది విని దమయంతి సంతోషపడి తన తల్లి వద్దకు వెళ్ళి "ఋతుపర్ణుని సారధిగా వచ్చిన కురూపి బాహుకుడే నలుడు. అమ్మా అతను ఇక్కడకు వస్తాడా, నేను అక్కడకు వెళ్ళాలా నువ్వే నిర్ణయించు" అని అడిగింది. భీమరాజు అనుమతితో ఆమె బాహుకుడిని దమయంతి వద్దకు రప్పించింది. దమయంతి నలుని చూసి, "అయ్యా నిస్సహాయంగా ఉన్న నన్ను నా భర్త నలమహారాజు నట్టడవిలో నిర్దాక్షిణ్యంగా వదిలి వెళ్ళాడు. అలా సంతానవతినైన నన్ను విడిచి పెట్టడం ధర్మమా? అలా చేయడానికి నేనేమి అపకారం చేసాను? అగ్ని సాక్షిగా విడువను అని నాకు ప్రమాణం చేసిన భర్త అలా చేయవచ్చా?" అని దు:ఖించింది. నలుడు "సాధ్వీ! ఆ సమయంలో నన్ను కలి ఆవహించి ఉన్నాడు. అందువలన నేను అలా చేసాను. జూదంలో సర్వం పోగొట్టుకుని బాధలు పడుతున్న నేను, నాతోపాటు బాధలు పడుతున్న నీ బాధను సహించ లేక, నిన్ను విడిచి వెళ్ళాను. అలా చేస్తే నువ్వైనా నీ తండ్రి ఇంటికి వెళ్ళి సుఖంగా ఉంటావని అలా చేసాను. నీపై అనురాగంతో మిమ్మల్ని చూడటానికే నేను ఇక్కడకు వచ్చాను. మరొక భర్తకోసం స్వయంవరం ప్రకటించడం కులస్త్రీలకు తగునా? అలా ఎందుకు చేసావు? అందుకే కదా ఋతుపర్ణుడు వచ్చాడు.ఇది ధర్మమా?" అని దమయంతిని అడిగాడు. దమయంతి "నాధా నేను మీకోసం గాలిస్తూ పంపిన విప్రులలో అయోధ్యకు వెళ్ళిన విప్రుడు మిమ్ములను గుర్తించాడు. మమ్మలిని రప్పించుటకే ఇలా చేసాను. మీరుకాక, ఇంకెవరు నూరు యోజనములు దూరం ఒక్క రోజులో ప్రయాణించగలరు? నాలో ఎటువంటి పాపపు తలపు లేదు అని మీ పాదములు అంటి నమస్కరించి ప్రమాణం చేస్తున్నాను" అని దమయంతి నలుని పాదాలకు నమస్కరించింది. వెంటనే ఆకాశం నుండి వాయుదేవుడు "నలచక్రవర్తీ! ఈమె పవిత్రురాలు, పతివ్రత. నేను, సూర్యుడు, చంద్రుడు ఈమె సౌశీల్యం కాపాడుతున్నాము" అని పలికాడు. నలుడు కర్కోటకుని స్మరించాడు వెంటనే ఒక వస్త్రం వచ్చింది. అది ధరించగానే నలునికి ఇంద్రతేజస్సుతో సమానమైన మనోహరమైన పూర్వరూపం వచ్చింది. దమయంతిని పరిగ్రహించాడు.

## నలదమయంతులు రాజ్యాన్ని పొందుట

నలుడు విదర్భలో ఒక మాసం ఉండి, తన రాజధానికి వెళ్ళి పుష్కరుని కలిసాడు. నలుడు పుష్కరునితో "పుష్కరా!జూదమాడటం నీకు ప్రియం కదా. నేను నా భార్య దమయంతిని ఫణంగా పెడతాను, నీవు నీ సర్వస్వం పెట్టి నాతో ఆడతావా? లేదా నాతో యుద్ధం చెయ్యి, ఎవరు గెలిస్తే వారిదే రాజ్యం. నీకేది ఇష్టమో నిర్ణయించుకో" అన్నాడు. పుష్కరుడు జూదప్రియుడు పైగా ఒకసారి జూదమాడి గెలిచాడు కనుక అతడు నలునితో "నేను జూదమే ఆడతాను" అన్నాడు. నలుడు పుష్కరునితో జూదమాడి రాజ్యాన్ని గెలుచుకున్నాడు. పుష్కరునితో "పుష్కరా, నేను ఇదివరకు నీతో జూదమాడినపుడు నన్ను కలి ఆవహించి ఉన్నాడు. కనుక ఓడి పోయాను, నీబలం వలన కాదు. నీవు నా పిన తండ్రి కుమారుడివి కనుక, నిన్ను ఏమి చేయను వెళ్ళు" అని చెప్పి పంపాడు.

## ధర్మరాజు వద్దకు నారదుని రాక


సభలో నల దమయంతులు

మహాముని బృహదశ్వుడు నలచరిత్రను ధర్మరాజుకు తెలిపి "ధర్మరాజా! జూదంలో కోల్పోయానని బాధపడకు. నీవు దైవ సహాయంతో, నీ స్వప్రయత్నంతో విజయం సాధిస్తావు " అని ధైర్య వచనాలు పలికి తన వద్ద ఉన్న అక్షవిద్యను ధర్మరాజుకు చెప్పి వెళ్ళి పోయాడు. ధర్మరాజు అర్జుని కోసం నిరీక్షిస్తున్న సమయంలో అతని వద్దకు నారద మహర్షి వచ్చాడు.ధర్మరాజు నారదునికి అతిధి మర్యాద చేసాడు. ఆ యనను చూసి ధర్మరాజు " మునీంద్రా నాకు ఒక ధర్మ సందేహం ఉంది. తీర్చగలరా ?" అని అడిగాడు. నారదుడు నవ్వి అలాగే అడగమన్నాడు.ధర్మరాజు " ఈ భూమిలో తీర్ధములు సేవించిన ధన్యులకు ఎలాంటి ఫలితం కలుగుతాయి " అని నారదుని అడిగాడు.నారదుడు ధర్మరాజా చెబుతాను విను " పూర్వం భీష్ముడు గంగాతీరంలో వేదాధ్యనం చేస్తూ చాలా మంచి పనులు చేసూ ఉండే వాడు. భీష్ముని వద్దకు ఒక సారి పులస్త్యుడు అనే ముని వచ్చాడు. అతనికి అతిధి మర్యాదలు చేసిన పిమ్మట భీష్ముడు పులస్త్యుని చూసి నీవు నన్ను అడిగినట్లే అడిగాడు. ఆ మహర్షి భీష్మునితో చెప్పిన విషయాలు నీకు చెప్తాను " అని ధర్మరాజుతో అన్నాడు.

## తీర్ధ మహిమ

ఇంద్రియాలను త్రికరణ శుద్ధిగా పెట్టున్న వారు, దృఢమైన మనసు కలిగిన వారు, అహంకారం లేని వారు, ఇతరుల నుండి ఏమీ ఆశించని వారు మిత భోజనం చేసేవారు, ఎల్లప్పుడూ సత్యం పలికే వారు, శాంత స్వభావం కలిగిన వారు తీర్ధయాత్రలు చేసిన వారుఎన్నో యజ్ఞాలు చేసిన ఫలితం వస్తుంది. మలిన మనస్కులు, పాపాత్ములు ఎన్ని తీర్ధాలు చేసినా ఫలితం శూన్యం.దాన ధర్మాలు చేయని వారు తాము చేసిన అపరాధం వలన దరిద్రులు ఔతారు.అలాంటి వారు దరిద్రులు యజ్ఞములు చేయ లేరు. కనుక పుణ్య తీర్ధములు చేసి పుణ్యం పొందవచ్చు. సాధారణంగా బ్రహ్మదేవుడు తీర్ధాలలో విహరిస్తుంటాడు. అందులో పుష్కరతీర్ధం ప్రశిద్ధమైంది. దానిలో స్నానమాచరించిన పది అశ్వమేధ యాగాలు చేసిన ఫలితం వస్తుంది. ఆ పష్కరంలో పది సంవత్సరాలు నివసించిన బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది. జంబూ మార్గంలోని అగస్త్యవటం అనే తీర్ధంలో స్నానం చేస్తే అశ్వమేధం చేసిన ఫలితం వస్తుంది. కణ్వాశ్రమం, ధర్మారణ్యం, యయాతి పతనం అనే పుణ్యక్షేత్రం దర్శించిన వారికి అన్ని పాపాలు పోతాయి. ఇంకా మహాకాళం, కోటి తీర్ధం, భద్రపటంలో శివుని పూజించినా నర్మదా నదీ స్నానం, దక్షిణ నదీ స్నానం, జర్మణ్వతీ నదీ స్నానం ఎంతో పుణ్యాన్నిస్తుంది. వశిష్టాశ్రమంలో ఒకరోజు నివాసం, పింగం అనే పుణ్యతీర్ధ సేవనం, ప్రభాస తీర్ధ స్నానం, వరదాన తీర్ధ స్నానం, సరస్వతీ నదీ సంగమ స్నానం పుణ్యఫలాన్నిస్తుంది. ద్వారావతీ పురం లోని పిండారక తీర్ధంలో శివుని పూజించినా, సాగర సింధు సంగమంలో స్నానమాచరించినా, శంకు కర్ణేశ్వరంలో శివిని పూజించినా, వసుధారా, వసు సరంలో తీర్ధమాడినా, సింధూత్తమంలో స్నానం చేసినా, బ్రహ్మతుంగ తీర్ధం సేవించినా, శక్రకుమారీ యాత్ర చేసినా, శ్రీకుండంలో బ్రహ్మదేవుని సందర్శించినా, బడబ తీర్ధంలో అగ్ని దేవుని సేవించినా ఎన్నో గోదానాలు భూదానాలు చేసిన ఫలితం వస్తుంది. శివుడు నివసించే దేవికా క్షేత్రాన్ని , కామ క్షేత్రాన్ని, రుద్రతీర్ధాన్ని, బ్రహ్మవాలుకాన్ని, దీర్గసత్రాన్ని సేవించిన వారికి అష్ట కామ్య సిద్ధి కలుగుతుంది. వినశనంలో మాయమైన సరస్వతీ నది నాగోద్భేద, శివోద్భేద, చమసోద్భేద లలో స్నానం చేసిన నాగలోక ప్రాప్తి కలుగుతుంది. శశియాన తీర్ధం స్నానం సహస్ర గోదాన ఫలం వస్తుంది. రుద్రకోటిలో శివుని అర్చించిన కైలాస ప్రాప్తి లభిస్తుంది. ధర్మజా కురుక్షేత్రం, నైమిశ తీర్ధం, పుష్కర తీర్ధం అనేవి మూడూ పవిత్ర క్షేత్రాలు. కురుక్షేత్రం సరస్వతీ నదికి దక్షిణంలో దృషద్వతీ నదికి ఉత్తరంలో ఉన్నది. ఆ కురుక్షేత్రంలో శమంతక పంచకం నడుమ రామహ్రదం అనే సరస్సు మధ్య పితామహుడు బ్రహ్మదేవుని ఉత్తరవేది అనే క్షేత్రం దర్శించిన వారికి సర్వపాపక్షయం కలుగుతుంది. విష్ణు స్థానంలో విష్ణు మూర్తిని పూజించినా, పారిప్లవ తీర్ధంలో, శాలుకినీ తీర్ధంలో, సర్పతీర్ధంలో, వరాహతీర్ధంలో, అ శ్వినీ తీర్ధంలో, జయంతిలో ఉండే సోమతీర్ధంలో, కృతశౌచ తీర్ధంలో స్నానమాచరించిన ఎంతో పుణ్య ప్రాప్తి కలుగుతుంది. అగ్నివట క్షేత్రంలో, ముంజవట క్షేత్రంలో శివారాధన చేసినా యక్షిణీ తీర్ధంలో స్నానం చేసినా కామ్యసిద్ధి కలుగుతుంది. "ధర్మజా! జమదగ్ని కుమారుడైన పరశురాముడు, తన గొడ్డలితో రాజులందరిని వధించినప్పుడు వారి రక్తం ఐదు పాయలుగా పారింది. వాటిని శమంతక పంచకం అంటారు. అందులో పరశురాముడు తన తండ్రికి తర్పణం విడిచాడు. అప్పుడు పితృదేవతలు సాక్షాత్కరించి వరాలు కోరుకొమ్మని అడిగారు. పరశురాముడు తనకు రాజులను సంహరించిన పాపం నశించాలి అని తనకు పుణ్యలోక ప్రాప్తి కలగాలని కోరుకున్నాడు. ఈ శమంతక పంచకం పవిత్రత సంతరించు కోవాలి అని కోరాడు. అప్పటి నుండి శమంతక పంచకం పుణ్యతీర్ధాలుగా భాసిల్లుతున్నాయి. వాటిలో స్నానం చేస్తే అశ్వమేధ యాగం చేసిన ఫలితం కలుగుతుంది. కాయసోధనం, లోకోద్ధారం, శ్రీతీర్ధం, కపిలతీర్ధం, సూర్యతీర్ధం, గోభనం, శంఖినీ తీర్ధం, యక్షేంద్రతీర్ధం, సరస్వతీ నది, మాతృతీర్ధం, బ్రహ్మవర్తం, శరవణం, శ్వావిల్లోమాపహం, మానుష తీర్ధం, ఆపగ నదీ తీర్ధం,

సప్తఋషి కుండం, కేదారం, కపిల కేదారం, సరకం, ఇలాస్పదం, కిందానం, కింజప్యం అనే తీర్ధాలలో స్నానం చేస్తే అనంతమైన పుణ్యాలు కలుగుతాయి . నారద నిర్మిత అంబాజన్మం అనే తీర్ధంలో చనిపోతే పుణ్య లోకాలకు పోతారు.పుండరీకం అనే తీర్ధంలో ఉన్న వైతరణిలో స్నానమాడినా, ఫలకీ వనం, మిశ్రకం, వ్యాసవనం, మనోజవం, మధువటి, కౌశికీనది, దృషద్వతీ నదీ సంగమంలో సమస్త పాపాలు నశిస్తాయి. కిందర్త తీర్ధంలో తిలోదానం చేస్తే పితృ ఋణం తీరితుంది. అహస్సు, సుదినం, అనే తీర్ధాలలో స్నామాచరిస్తే సూర్యలోక ప్రాప్తి కలుగుతుంది. మృగధూమం అనే క్షేత్రంలో గంగా స్నానమాచరించి శివుని ఆరాధించిన అశ్వమేధ ఫలం కలుగుతుంది. వామన తీర్ధంలో స్నానం చేస్తే విష్ణు లోకానికి పోతారు. పావన తీర్ధంలో స్నానమాచరించిన వంశం పవిత్రమౌతుంది. శ్రీకుంజంలో తీర్ధాన్ని దర్శిస్తే బ్రహ్మలోకం సిద్ధిస్తుంది. సప్తసారస్వతాలు అనే తీర్ధంలో స్నానంచేస్తే సమగ్ర సారస్వతప్రాప్తి కులుగుతుంది. ఔశనశం, కపాలమోచనం, విశ్వా మిత్రం, కార్తికేయం అనే తీర్ధాలలో స్నానమాచరిస్తే పాప విముక్తులౌతారు. పృధూక తీర్ధంలో చనిపోతే పాపాల నుండి విముక్తులౌతారు.గంగా, సరస్వతీ సంగమంలో స్నానమాచరిస్తే బ్రహ్మ హత్యా పాతకం పోతుంది.శతం, సహస్రం అనే తీర్ధాలలో తపస్సు చేస్తే అంతులేని పుణ్యం వస్తుంది. రుద్రపత్ని అనే తీర్ధంలో స్నానం చేస్తే సర్వదుఃఖ విముక్తి కలుగు తుంది. స్వస్తి పురం అనే తీర్ధం చుట్టూ ప్రదక్షిణ చేస్తే వేయి ఆవులను దానం చేసిన పుణ్యం కలుగుతుంది. ఏకరాత్రం అనే తీర్ధంలో ఉపవాసం చేస్తే స్వలోకం సిద్ధిస్తుంది. ఆ దిత్యాశ్రమంలో సూర్యుని ఆరాధిస్తే సూర్యలోక ప్రాప్తి కలుగుతుంది. దధీచి తీర్ధంలో మూడురాత్రులు నివసిస్తే ఇంద్రలోక ప్రాప్తి కలుగుతుంది. స్యర్యగ్రహణ సమయంలో సన్నిహిత తీర్ధంలోస్నానం చేస్తే నూరు అశ్వమేధాలు చేసిన ఫలం పొందుతారు. ధర్మతీర్ధంలో స్నానం చేస్తే ధర్మాచరణ కలుగుతుంది. జ్ఞానపావనం, సౌగంధికం అనే తీర్ధాలలో స్నానం చేస్తే సర్వపాపాలు పోతాయి.సరస్వతీ హ్రదం నుండి వచ్చే జలంలో స్నానం చేస్తే అశ్వమేధయాగమ్ ఛశీణా ఫాళామ్ వ్పుంది. శాకంబరీ తీర్ధంలో ఒకరోజు శాకాహార తపస్సు చేస్తే పణ్యం లభిస్తుంది. ధూమావతీ, రధావర్తం అనే తీర్ధాలలో స్నానం చేస్తే దుఃఖం నుండి విముక్తులౌతారు. అందరూ పుణ్య తీర్ధాలలో స్నానం చేయలేరు. నోములు నోచని వారు, చెడ్డవారు, ఉపవాసాలు చేయని వారు, శుచిత్వం లేని వారు తీర్ధయాత్రలు చేయలేరు. కనుక నీవు తీర్ధ యాత్రలకు వెళ్ళి రమ్ము. రోమశుడు అనే మహర్షి నీ దగ్గరకు వచ్చి నిన్ను తీర్ధయాత్రలు చెయ్యమని ఆదేశిస్తాడు. నీవు ధౌమ్యుని అనుమతితో తీర్ధయాత్రలు చేసి రా " అని చెప్పి నారదుడు వెళ్ళాడు.

## రోమశుని రాక

నారదముని వెళ్ళిన తరవాత ధర్మరాజు ధౌమ్యునితో "అర్జునుడు దివ్యాస్త్రాలు సాధించటానికి వెళ్ళాడు. ఇంకా రాలేదు. అర్జునుడు లేని కామ్యకవనం శోభించడం లేదు. మేమంతా అర్జునిని రాక కొరకు నిరీక్షిస్తున్నాం " అన్నాడు. ధౌమ్యుడు "ధర్మజా నీకు మేలు జరుగుతుంది. అర్జునుడు విజయుడై తిరిగి వస్తాడు. నారదుడు చెప్పినట్లు మనం తీర్ధయాత్రలు చేద్దాం " అన్నాడు. ఇంతలో రోమశ మహర్షి వారి వద్దకు వచ్చాడు. ధర్మరాజుతో రోమర్శమహర్షి "ధర్మజా! నేను ఇంద్రలోకం వెళ్ళినపుడు అక్కడ దేవేంద్రుని పూజలందుకుంటున్న అర్జునిని చూసాను. పరమశివుడు, దేవతలు అర్జునినికి దివ్యాస్త్రాలు ఇచ్చారు. అర్జునిని విషయం నీకు చెప్పమని దేవేంద్రుడు నన్ను పంపాడు. అలాగే నిన్ను తీర్ధయాత్రలు చేయమని ఆదేశించాడు " అన్నాడు . ఆ మాటలకు ధర్మరాజు ఆనందపడి "మహర్షీ! అర్జునిని క్షేమవార్తకు దేవేంద్రుని తీర్ధయాత్రలు చెయ్యమని దేవేంద్రుడు ఆదేశించినందుకు ఆనందంగా ఉంది. నారద మహర్షి ఆదేశం అదే కనుక నేను ఇప్పుడు తీర్ధయాత్ర చేయాలను కుంటున్నాను " అన్నాడు. ధర్మరాజు వెంటనే తీర్ధయాత్రకు బయలు దేరాడు. విప్రులందరూ వెంట వస్తామని అన్నారు. ధర్మరాజు అంగీకరించాడు. ఆ సమయంలో వ్యాసుడు అక్కడకు వచ్చాడు.వ్యాసుడు ధర్మరాజుతో " ధర్మజా ! మనో బుద్ధి సౌచం, శ్రీర నియమాలు ఆచరిస్తూ సన్మార్గంలో తీర్ధాలు సేవించండి. నీ పూర్వులైన మహాభిషుడు, నా భాగుడు, భరతుడు, భగీరధుడు, ముచుకుందుడు, మాంధాత , సగరుడు, సార్వభౌముడు, అష్టకుడు, రోమపాదుడు మొదలైన చక్రవర్తులు తీర్ధయాత్రలు చేసి సుఖాలు పొందారు. వారి వలెనె నువ్వు తీర్ధయాత్రలు చేసి సుఖించు " అని ఆశీర్వదించాడు. ధర్మరాజు రోమశుని చూసి "మహర్షీ! లోకంలో అధర్మపరులకు, దుర్జనులకు అభివృద్ధి కలుగుతుంది. కాని ధర్మం ఆచరించే వారికి కష్టాలు ప్రాప్తిస్తున్నాయి ఎందుకు?" అని అడిగాడు.రోమశుడు "ధర్మరాజా! అధర్మపరులకు అభ్యుదయం ఎల్లకాలం ఉండదు. త్వరలో నశిస్తుంది. రాక్షసులు అధర్మవర్తనులై నాశనమైనారు. దేవతలు ధర్మాచరణులై వృద్ధి పొందుతున్నారు.కౌరవులు వారి అధర్మవర్తనం వలన అచిరకాలంలో నశిస్తారు. అధర్మవర్తనం వలన గర్వం పుడుతుంది గర్వం వలన అహంకారం పుడుతుంది అహంకారం క్రోధానికి మూలం క్రోధ వలన సిగ్గు విడుస్తుంది అలాంటి వారిని లక్ష్మి వదిలి వెడుతుంది. మీరు ధర్మపరులు మీకు జయం కలుగుతుంది " అన్నాడు.ఆ తరవాత ధర్మరాజు తీర్ధయాత్ర్కు బయలు దేరాడు. అన్నీ తీత్ర్ధాలు సేవిస్తూ గయ చేరుకున్నాడు. అక్కడి నుండి అగస్త్యాశ్రమం చేరుకున్నాడు.

## ఆగస్త్యమహాముని వృత్తాంతం

అగస్త్యాశ్రమం చేరిన తరవాత రోమశుడు అగస్త్యుని గురించి వివరించసాగాడు. "ధర్మజా పూర్వం వాతాపి ఇల్వలుడు అనే

ఇద్దరు రాక్షసులు ఉండే వారు. వారిరువురు అన్నదమ్ములు. వారిలో పెద్దవాడైన ఇల్వలుడు ఒక బ్రాహ్మణుని పూజించి అయ్యా అన్ని కోరికలు తీర్చే మంత్రం ఉపదేశించమని అడిగాడు. రాక్షసులకు అలాంటి మత్రం ఉపదేశించటానికి వీలు పడదని అతడు చెప్పాడు. తరవాత వాతాపి తమ్ముడైన వాతాపిని మేకకా మార్చి ఆ మేకను చంపి వండి ఆ బ్రాహ్మణునికి వడ్డించాడు. బ్రాహ్మణుడు భుజించిన తరవాత ఇల్వలుడు "వాతాపి బయటకురా " అన్నాడు. వెంటనే వాతాపి బ్రాహ్మణుని పొట్ట చీల్చుకుని బయటకు వచ్చాడు. ఆ బ్రాహ్మణుడు మరణించాడు. ఇలా అన్నదమ్ములు అతిధులుగా పిలిచి బ్రాహ్మణులను చంపుతూ వచ్చారు. ఒక రోజు బ్రహ్మ చర్య వ్రతంలో ఉన్న అగస్త్యుడు లేచిగురుటాకులను ఆధారం చేసుకుని వ్రేలాడుతున్న తన పితరులను చూసాడు. అగస్త్యుడు వారితో "అయ్యా! మీరెవరు? ఇలా ఎందుకు వ్రేలాడుతున్నారు " అని అడిగాడు. బదులుగా వారు "నయనా!మేము నీపితరులము. నీవు వివాహం చేసుకొనకుండా సంతాన హీనుడవ్వావు. కనుక మేము ఉత్తమ గతులు లేక ఇలా అయ్యాము. కనుక నీవు వివాహం చేసుకుని సంతానం పొంది మాకు ఉత్తమగతులు ప్రసాదించు " అన్నారు. అగస్త్యుడు అలాగే అన్నాడు.ఆ సమయంలో విదర్భ రాజు సంతానం కోసం పరితపిస్తున్నాడు. అగస్త్యుడు తన తపో మహిమతో అతనికి ఒక కూతురిని అనుగ్రహించాడు. ఆమె యవ్వనవతి అయ్యింది. ఆమె పేరు లోపాముద్ర. లోపాముద్రకు వివాహ ప్రయత్నాలు చేస్తున్నాడని విని అగస్త్యుడు లోపాముద్రను తనకిమ్మని అడిగాడు. రాజు " ఈ నిరుపేద బ్రాహ్మణుడా నాకుమార్తె భర్త. ఇతడిని చేసుకుని నా కూతురు నారచీరెలు ధరించవలసినదేనా? " అని పరితపించాడు. లోపాముద్ర తనను అగస్త్యునికి ఇచ్చి వివాహం చేయమని తండ్రిని కోరింది. గత్యంరం లేక ఆమె తండ్రి అలాగే ఆమెను అగస్త్యునకిచ్చి వివాహం చేసాడు. ఆమె నారచీరెలు ధరించి భర్త వెంట వెళ్ళింది. ఒకరోజు అగస్త్యుడు కోరికతో భార్యను చేరాడు. లోపాముద్ర "నాధా! సంతానం కోసం భార్యను కోరడం సహజం. నన్ను సర్వాలంకార భూషితను చేసి నన్ను కోరండి " అన్నది. అగస్త్యుడు " నా వద్ద ధనం, ఆభరణములు లేవు వాటి కొరకు తపశ్శక్తిని ధారపోయడం వ్యర్ధం " అనుకుని ధనం కొరకు అగస్త్య శతర్వురుడు అనే రాజు వద్దకు వెళ్ళాడు. శతర్వురుడు తనవద్ద ధనం లేదని చెప్పాడు. అగస్త్యుడు, శతర్వురుడు బృహదశ్వుని వద్దకు అనే రాజు వద్దకు వెళ్ళి ధనం అడిగాడు. ఆ రాజు కూడా తనకు ఆదాయ వ్యయాలు సమానంగా ఉన్నాయని కనుక ధనం లేదని చెప్పాడు. ఆ తరువాత ఆ ముగ్గురూ ధనం కొరకు త్రసదస్యుడి వద్దకు వెళ్ళారు. అతను కూడా ధనం లేదని చెప్పి "మునీద్రా! ఇల్వలుడు ధనవంతుడు. అతడిని అడిగితే మీకోరిక తీరుతుంది " అన్నాడు.వెంటనే అందరూ ఇల్వలుడి దగ్గరకు వెళ్ళారు. అగస్త్య ఇల్వలుని ధనం అడిగాడు. ఇల్వలుడు మామూలుగా వాతాపిని వండి వడ్డించాడు. ముందు అగస్త్యి భుజించమని చెప్పాడు. ఈ విషయం గ్రించిన రాజఋషులు "మునీంద్రా! ఇల్వవుడు తన తమ్ముని మేకగా మార్చి వండి బ్రాహ్మణులచే తినిపించి అతనిని బయటకు రమ్మంటాడు. అతడు పొట్టను చీల్చుకుని ఆబ్రాహ్మణుని చంపి బయటకు వస్తాడు. కనుక మీరు భుజించరాదు " అన్నారు అగస్త్యుడు చిరునవ్వు నవ్వి ఆ భోజనం తినేశాడు. అగస్త్యుడు పొట్టను తడుముకుని తేన్చాడు. అంతే వాతాపి జీర్ణం అయ్యాడు. ఇల్వలుడు "వాతాపీ బయటకు రా " అన్నాడు. అతను రాకపోవడంతో అతను జీర్ణం అయ్యాడని తెలుసుకుని భయపడి అగస్త్యునితో "అయ్యా మీరు కోరిన ధనం ఇస్తాను " అన్నాడు. ఆ ధనంతో అగస్త్య లోపాముద్ర కోరికను తీర్చాడు. అగస్త్యుడు లోపాముద్రతో "నీకు పది మందితో సమానమన నూరుగురు కొడుకులు కావాలా? లేక నూరుగురుతో సమానమైన ఒక్క కొడుకు కావాలా? లేక నూరుగురు కొడుకులతో సమానమైన వెయ్యి మంది కొడుకులు కావాలా లేక వెయ్యి మందికి సమానమైన ఒక్క కొడుకు కావాలా ? " అని అడిగాడు.అందుకు లోపాముద్ర "నాకు వేయి మందితో సమాన మైన బల వంతుడూ, బుద్ధి మంతుడూ అయిన ఒక్క కుమారుని ప్రసాదంచండి " అని కోరింది. లోపాముద్ర గర్భందాల్చి తేజోవంతుడూ, గుణ వంతుడూ అయిన దృఢస్యుడు అనే కొడుకును కన్నది.ఆ విధంగా అగస్త్యుడు తన పితృదేవతలకు ఉత్తమ గతులు కలిగించాడు.

## మూలాలు

## బయటి లింకులు

- ఇంటర్నెట్ ఆర్చీవులో అరణ్యపర్వము (http://www.archive.org/details/sriandhramahabar023368mbp) - సాహిత్య అకాడమీవారి ప్రచురణ

# వన పర్వము తృతీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# తృతీయాశ్వాసం

ధర్మరాజు కోరికపై రోమశుడు అగస్త్య మహాముని కథను సవిస్తరంగా వివరించసాగారు. కృతయుగంలో వృత్తాసురుడు అనే రాక్షసుడు ఉండేవాడు. అతడు తన అనుచరుడైన కాలకేయులతో కలిసి దేవతలను పీడిస్తూ ఉండేవాడు. దేవతలు బ్రహ్మదేవుని దగ్గరికి వెళ్ళి వృత్తాసురుని చంపడానికి మార్గం చెప్పమన్నారు. బ్రహ్మదేవుడు " మీరు సరస్వతీ నదీ తీరంలో తపస్సు చేసుకుంటున్న దధీచి మహర్షి దగ్గరికి వెళ్ళి ఆయన ఎముకలను దానంగా అడిగి తీసుకుని ఆ ఎముకలతో ఆయుధాన్ని చేయండి. ఆ ఆయుధంతో వృత్తాసురుని సంహరించండి " అని చెప్పాడు. దేవతలు దధీచి మహర్షి ఎముకలను దానంగా అడగగానే ఆ మహర్షి శరీరాన్ని విడిచి ఎముకలను దానంగా ఇచ్చాడు. వాటితో త్వష్ట ప్రజాపతి వజ్రాయుధం చేసి ఇంద్రునికి ఇచ్చాడు. ఇంద్రుడు వజ్రాయుధంతో వృత్తాసురుని సంహరించాడు. వృత్తాసురుని అనుచరులైన కాలకేయులు సముద్రగర్భంలో దాగి రాత్రివేళలో బయటకు వచ్చి జనులను ఋషులను బాధిస్తుండే వాళ్ళు. ఇంద్రాది దేవతలు విష్ణుమూర్తికి మొర పెట్టుకున్నారు. విష్ణుమూర్తి దేవతలతో " కాలకేయులు మహా బలవంతులు. పైగా సముద్ర గర్భంలో ఉన్నారు కనుక సంహరించడం వీలు కాదు. సముద్రంలో నీరు ఇంకిపోతే సంహరించవచ్చు. కనుక మీరు అగస్త్యుని వద్దకు వెళ్ళి తరుణోపాయం అడగండి " అని చెప్పాడు. దేవతలు అగస్త్యుని వద్దకు వెళ్ళి " పూర్వం వింధ్య పర్వతం పెరిగి జగత్తుకు విపత్తుగా పరిణమించినప్పుడు తమరి వలన ఆ కీడు తొలగింది. అలాగే ఇప్పుడు కూడా మా కష్టాన్ని మీరే పోగొట్టాలి " అని అడిగారు.


ధధీచి వృత్తాంతం

## వింధ్యపర్వతం పెరుగుట


సముద్రజలములను త్రాగుచున్న ఆగస్త్యుడు

అగస్త్యుని గురించి వింటున్న ధర్మరాజు రోమశుని చూసి " అయ్యా! వింధ్య పర్వతం పెరగటం ఏమిటి? వివరించండి " అని అడిగాడు. రోమశుడు ధర్మరాజుతో " ప్రతి రోజు సూర్యుడు మేరుపర్వతానికి ప్రదక్షిణం చేస్తుంటాడు. అది చూసి వింధ్య పర్వతానికి కోపం వచ్చింది. " సూర్యదేవా! నేను పర్వతాలకు రాజును, నువ్వు నాకు ప్రదక్షిణం చేయకుండా మేరు పర్వతానికి ప్రదక్షిణం ఎందుకు చేస్తావు? " అని అడిగాడు. సూర్యుడు " బ్రహ్మదేవుని ఆజ్ఞానుసారం ఇలా చేస్తున్నాను " అని పలికాడు. ఆ మాటకు వింధ్యపర్వతానికి ఆగ్రహం కలిగింది. అలా అలా పైపైకి ఎదుగుతూనే ఉన్నాడు. అలా సూర్యచంద్రుల మార్గాలను నిరోధించాడు. లోకాలు అంధకారంలో మునిగి పోయాయి. దేవతలంతా అగస్త్యుని వద్దకు వెళ్ళి మొరపెట్టుకున్నారు. అగస్త్యుడు తన భార్య లోపాముద్రతో వింధ్యపర్వతం వద్దకు వెళ్ళి " వింధ్యపర్వతమా ! నేను దక్షిణదిక్కుగా వెళుతున్నాము మాకు దారి ఇచ్చి తిరిగి వచ్చేవరకు అలాగే ఉండు " అన్నాడు. అలాగేనని అంగీకరించిన వింధ్య పర్వతం భూమికి సమానంగా దిగి వచ్చాడు. అప్పటి నుండి

పెరగడం ఆపివేసాడు. తరవాత రోమశుడు కథను పొడిగిస్తూ " అగస్త్యుడు దేవతల కోరికపై సముద్ర జలాలను త్రాగి వేసాడు. దేవతలు కాలకేయుడు మొదలైన వారిని సంహరించారు. చావగా మిగిలిన వారు పాతాళానికి పారి పోయారు.దేవతలు " మహర్షీ! మీ దయ వలన మాకు రాక్షస బాధ తప్పింది. మరల సముద్రాలను జలంతో నింపండి " అని ప్రార్ధించారు. అగస్త్యుడు " దేవతలారా! అది నాకు సాధ్యం కాదు. సముద్రజలం నా పొట్టలో ఇంకి పోయాయి " అన్నాడు. అగస్త్యుడు సముద్ర జలాలను తిరిగి ఇవ్వలేనని చెప్పడంతో దేవతలంతా బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి మొరపెట్టుకున్నారు. బ్రహ్మదేవుడు " సముద్ర జలాలను రప్పించడం ఇప్పడు సాధ్యం కాని పని. చాలా కాలం తరవాత భగీరధుడు ఈ సముద్రాన్ని జలంతో నింపగలడు, అని బ్రహ్మదేవుడు చెప్పాడు " అని రోమశుడు ధర్మరాజుతో చెప్పాడు.

## భాగీరధుడు

రోమశుని మాటలు విని ధర్మరాజు " మహర్షీ ! భగీరధుడు సముద్రాన్ని జలంతో ఎలా నింపాడు? " అని అడిగాడు. రోమశుడు ధర్మరాజుతో " ధర్మజా! పూర్వం ఇక్ష్వాకు వంశంలో సగరుడు అనే రాజు ఉన్నాడు. అతనికి వైదర్బి, శైబ్య అనే ఇద్దరు భార్యలు. అతనికి సంతానం లేదు. అందుకని సగరుడు కైలాసం వెళ్ళి ప్రసన్నం చేసు కున్నాడు. సగరుడు సంతానం కావాలని శివుని కోరాడు. శివుడు అలాగే వరమిచ్చాడు. సగరుని భార్యలు ఇద్దరు గర్భం ధరించారు. వైదర్బి గర్భాన ఒక అలబూఫలం (ఆనపకాయ) పుట్టింది. శైబ్య గర్భాన అసమంజసుడు అనే కొడుకు పుట్టాడు. అప్పుడు ఆకాశవాణి " రాజా ఆ కాయలోని విత్తనాలు నేతికుండలలో పెట్టి కాపాడితే నీకు అరవైవేల మంది కుమారులు జన్మిస్తారు " అని పలికింది. సగరునికి అరవై వేల మంది కుమారులు జన్మించారు. సగరుని కుమారులు లోక కంటకులుగా తయారయ్యారు. దేవతలను, ఋషులను బాధిస్తున్నారు. దేవతలు బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి మొరపెట్టుకున్నారు. బ్రహ్మదేవుడు దేవతలతో " వారి గర్వం ఎక్కువ కాలం ఉండదు. త్వరలోనే వారు చనిపోతారు " అని చెప్పాడు.

## సగరుని అశ్వమేధయాగ సంకల్పం

సగరుడు అశ్వమేధయాగం చేయ సంకల్పించాడు. యాగాశ్వాన్ని రక్షించే బాధ్యతను కుమారులకు ఇచ్చాడు. యాగాశ్వం నీళ్ళు లేని సముద్రంలోకి వెళ్ళి మాయమైంది. సగరుడి కొడుకులు యాగాశ్వాన్ని వెదుకుతూ సముద్రాన్ని తవ్వారు. వారికి ఈశాన్యంలో కపిల మహాముని ఆశ్రమంలో యాగాశ్వం కనిపించింది. కపిలుడే తమ అశ్వాన్ని దొంగిలించాడని సగరకుమారులు అతడిని అవమానించారు. ఆ మహాముని కోపాగ్నితో సగరకుమారులను భస్మంచేసాడు. నారదుని వలన ఆ విషయం సగరునికి తెలిసింది. సగరుడు దుఃఖించాడు. ఆ సమయానికి అసమంజసునికి జనించి పెరిగి పెద్దవాడైన అంశుమంతుడు అనే కుమారుడు ఉన్నాడు. సగరుడు అంశుమంతుని చూసి " నాయనా! నాకుమారులు చనిపోయినందుకు నేను భాధపడను కానీ అశ్వమేధయాగం సగంలో ఆగిపోయింది దానిని నీవు పూర్తి చెయ్యి " అని కోరాడు. అలాగే అని అంశుమంతుడు కపిలమహామునిని చూసి నమస్కరించి తను వచ్చిన పని చెప్పాడు. కపిల మహర్షి అంశుమంతునికి యాగాశ్వాన్ని అప్పగించాడు. కపిల మహాముని " అంశుమంతా! ఈ యాగాశ్వంతో నీ తాత సగరుడు అశ్వమేధయాగం పూర్తి చేస్తాడు. నీ మనుమడు భగీరధుడు గంగను భూమి మీదకు తీసుకువచ్చి సాగరాన్ని జలంతో నింపుతాడు " అని చెప్పాడు. అలాగే సగరుడు అశ్వమేధం పూర్తిచేసాడు. సముద్రాన్ని తన కుమారునిగా స్వీకరించాడు. అందుకే సముద్రానికి సాగరం అనేపేరు వచ్చింది.



తప్పిపోయిన యాగాశ్వాన్ని కపిలుని ఆశ్రమ సమీపన చూసిన సగర కుమారులు



సగర కుమారులను భస్మము చేయువచున్న కపిలుడు

## భాగీరధుని తపసు


ఆకాశము నుండి భూమికి వచ్చుచున్న గంగను తన జటాఝూటముతో బందిస్తున్న శివుడు

అంశుమంతుని కుమారుడు దిలీపుడు. దిలీపుని తరువాత అతడి కుమారుడు భగీరధుడు రాజ్యపాలనకు వచ్చాడు. కొంతకాలం భగీరధుడు జనరంకంగా రాజ్యం చేసాడు. సగరుని వృత్తాంతం తెలుసుకున్న భగీరధుడు సాగరాన్ని జలంతో నింపాలనుకున్నాడు. హిమాలయాలకు వెళ్ళి గంగను గురించి ఘోరతపస్సు చేసి ఆమెను ప్రత్యక్షం చేసుకున్నాడు. భగీరధుడు గంగాదేవిని " అమ్మా! నీవు దేవమార్గాన్ని వదిలి భూమికి రావాలి సాగరాన్ని జలంతో నింపాలి. సగర పుత్రులకు మోక్షం కలిగించాలి " అని కోరాడు. గంగాదేవి " అలాగే, వస్తాను కానీ నా ఉద్ధృతిని భరించే శక్తి ఒక్క పరమ శివునికే ఉంది. కనుక నువ్వు శివుడిని ప్రసన్నుని చేసుకో " అని చెప్పింది. తరవాత భగీరధుడు కైలాసానికి వెళ్ళి శివుని ప్రార్ధించాడు. శివుడు భగీరధుని కోరిక మన్నించి " నీవు గంగను తీసుకురా నేను భరిస్తాను " అన్నాడు. మరల భగీరధుడు గంగను ప్రార్ధించాడు. గంగ భగీరధుని వెంట భూమికి దిగి వచ్చింది. శివుడు తన జటాజూటంలో ఉధృతంగా దుముకుతున్న గంగను ధరించాడు. తరవాత గంగ భూమి మీదకు వచ్చి సాగరాన్ని నింపింది. అప్పటి నుండి గంగానదికి భాగీరధి అనే నామం వచ్చింది " రోమశుడు గంగావతరణం గురించి ధర్మరాజుకు వివరించాడు. తరవాత ధర్మరాజు గంగ, నంద, అపరనంద, నదులలో స్నానం చేసాడు. తరవాత వారు హేమకూట పర్వతాన్ని చేరుకున్నాడు. అక్కడ రాళ్ళ నుండి అగ్ని పుడుతూ ఉంది. ఆ అగ్నికి మేఘాలు ఆకర్షితమౌతున్నాయి. ఆ తరవాత వారు విశ్వామిత్రుని ఆశ్రమాన్ని చేరారు. అక్కడికి సమీపంలో ఉన్న ఋష్యశృంగుని సరోవరం చూసారు.

## ఋష్యశృంగుడు


శాంతతో అయోధ్యకు వెళుతున్న ఋష్యశృంగుడు

రోమశుడు ధర్మరాజుకు ఋష్యశృంగుని గురించి చెప్పసాగాడు. " ధర్మరాజా ! కశ్యపుని కుమారుడు విభాండకుడు. అతను ఒకరోజు సరసులో స్నానం చేస్తున్నాడు. అతనికి ఆ సమయంలో దేవ వేశ్య ఊర్వశి కనిపించింది. అతడు ఆమె పట్ల వ్యామోహ పీడితుడైన కారణంగా రేతఃపతనం జరిగి సరస్సులో పడింది. అతని రేతస్సుతో కూడిన నీటిని త్రాగిన దుప్పి గర్భందాల్చి ఋష్యశృంగుని ప్రసవించింది. విభాండకుడు కుమారుని గుర్తించి పెంచుకోసాగాడు. ఋష్యశృంగునికి తండ్రి తప్ప వేరే ప్రపంచం తెలియదు. ఆ సమయంలో అంగదేశాన్ని రోమపాదుడు అనే రాజు పాలిస్తున్నాడు. అతను తన పురోహితునకు చేసిన అపరాధం కారణంగా రాజ్యంలో క్షామం ఏర్పడింది. రోమపాదుడు తన తప్పు గ్రహించి బ్రాహ్మణులను తిరిగి రప్పించాడు. వారిని వానలు కురవడానికి ఉపాయం చెప్పమని అడిగాడు. వారు " రాజా! ఋష్యశృంగుని నీ రాజ్యానికి రప్పిస్తే వానలు కురుస్తాయి " అన్నారు. రోమపాదుడు ఋష్యశృంగుని రాజ్యాన్ని రప్పించటానికి కొంత మంది వేశ్యలను పంపాడు. ఒకరోజు విభాంకుడు ఆశ్రమంలో ఋష్యశృంగుని వదిలి పండ్లు, సమిధలు తీసుకురావడానికి వెళ్ళాడు. ఆ సమయంలో రోమపాదుడు పంపిన వేశ్య ఆశ్రమానికి వచ్చింది. ఋష్యశృంగుడు ఆమె తనలాగే ఋషి కుమారుడు అనుకుని ఆమెకు అతిధి సత్కారం చేసాడు. ఆమె ఋష్యశృంగుని తనతో స్నేహం చెయ్యమని కోరింది. ఆపై ఆటపాటలతో అలరించి తిరిగి వెళుతూ ఇంటికి రమ్మని ఋష్యశృంగుని ఆహ్వానించింది. ఋష్యశృంగుడు ఆమె ధ్యాసలో పడి ఆహారపానీయాల కూడా ధ్యాస మరిచాడు. విభాంకుడు కొడుకు పరధ్యానం గ్రహించి కారణం అడిగాడు. ఋష్యశృంగుడు జరిగినది చెప్పాడు. విభాంకుడు " నాయనా! ఋషుల తపస్సు చెడగొట్టడానికి రాక్షసులు ఇలా మాయవేషాలలో తిరుగుతుంటారు. జాగ్రత్తగా ఉండు " అన్నాడు. మరునాడు కూడా వేశ్య విభాంకుడు లేని సమయం చూసి ఆశ్రమానికి వచ్చింది. ఆమె మోహంలో పడి ఋష్యశృంగుడు ఆమె వెంట అంగరాజ్యానికి వెళ్ళాడు. ఋష్యశృంగుని రాకతో అంగ రాజ్యంలో వానలు కురిసాయి. రోమపాదుడు సంతోషపడి తన కుమార్తె శాంతను ఋష్యశృంగునికి ఇచ్చి వివాహం చేసాడు. విభాండకుడు ఆశ్రమంలో కుమారుని జాడ లేక పోవడంతో వెతుక్కుంటూ అంగదేశానికి వచ్చాడు. అక్కడ కొడుకు కోడలిని

చూసి సంతోషించి వారిని తన ఆశ్రమానికి తీసుకు వచ్చాడు " అని చెప్పాడు.

## పరశురాముడు

ఆ తరవాత ధర్మరాజు కళింగదేశంలో ఉన్న వైతరణి నదిని దర్శించారు. అక్కడి నుండి మహేంద్రగిరికి వెళ్ళాడు. అక్కడ ఉన్న మునులను " మునులారా! ఇక్కడ పరశురాముడు ఉంటాడు కదా మీరెప్పుడైనా చూసారా? " అని అడిగాడు. పరశురాముని శిష్యుడైన అకృతవర్ణుడు అనే ముని " ధర్మజా! రేపు చతుర్దశి మనం ఇక్కడ పరశురాముని చూడవచ్చు" అన్నాడు. ధర్మరాజు " మహర్షీ! నాకు పరశురాముని గురించి వనాలని ఉంది వివరిస్తారా? " అన్నాడు. అకృతవర్ణుడు ఇలా చెప్పసాగాడు. పూర్వం కన్యాకుబ్జం అనే నగరాన్ని గాధిరాజు పాలించేవాడు. అతని కుమార్తె సత్యవతి. ఆమెను బృగుమహర్షి కొడుకు ఋచీకుడు వివాహమాడాలని అనుకున్నాడు. అతడు గాధిరాజు వద్దకు వచ్చి సత్యవతిని ఇమ్మని అడిగాడు. అందుకు గాధిరాజు " మహాత్మా! ఒక చెవి నల్లగా మిగిలిన శరీరం తెల్లగా ఉండే వేయి గుర్రాలను కానుకగా ఇచ్చి నా కూతురిని వివాహం చేసుకో " అని అన్నాడు. ఋచీకుడు అలాగేఅని చెప్పాడు. అతడు వరుణుని ప్రార్ధించాడు. అప్పుడు గంగా నది నుండి వేయి గుర్రాలు ఋచీకుడు కోరిన విధంగా పుట్టాయి. అప్పటి నుండి గంగా నదికి అశ్వతీర్ధం అనే పేరు వచ్చింది. ఆ గుర్రాలను కానుకగా ఇచ్చి ఋచీకుడు గాధి కూతురిని వివాహమాడాడు. ఒక సారి బృగు మహర్షి వారి ఇంటికి వచ్చి కొడుకు కోడలిని దీవించాడు. కోడలిని వరం కోరుకొమ్మని అడిగాడు. ఆమె మామగారిని చూచి నాకు ఒక కుమారుడు అలాగే నా తల్లికి ఒక కుమారుని ప్రసాదించండి అని కోరింది. అలాగే అని భృగువు " మీరిరువురు స్నానం చేసి నీవు మేడి చెట్టును మీ తల్లి అశ్వత్థ వృక్షాన్ని కౌగలించుకోడి మీ కోరిక నెరవేరుతుంది " అన్నాడు. సత్యవతి, ఆమె తల్లి స్నానం చేసి ఆమె అశ్వత్థవృక్షాన్ని, ఆమె తల్లి మేడి వృక్షాన్ని పొరపాటున కౌగలించుకున్నారు. ఆ విషయం తెలిసిన భృగువు కోడలితో " అమ్మా! నీకు బ్రహ్మకుల పూజ్యుడైన కుమారుడు జన్మిస్తాడు. కాని అతడు దారుణమైన క్షాత్రధర్మాన్ని అవలంబిస్తాడు. నీ తల్లికి ఒక క్షత్రియ కుమారుడు జన్మిస్తాడు. కాని అతడు మహా తపశ్శాలి, బ్రహ్మజ్ఞాని ఔతాడు " అన్నాడు. అప్పుడు సత్యవతి దారుణమైన క్షాత్రధర్మం తన కుమారునికి లేకుండా తన మనుమడికి రావాలని కోరింది. భృగువు అలాగే జరుగుతుందని చెప్పి వెళ్ళాడు. సత్యవతి గర్భం ధరించి జమదగ్ని అనే కుమారుని కన్నది. ఆ జమదగ్ని ప్రసేన జితుడు అనే రాజు కుమార్తె రేణుకను వివాహమాడాడు. వారికి ఋమణ్వంతుడు, సుషేణుడు, వసుడు, విశ్వావసుడు, రాముడు అనే కుమారులు కలిగారు.

### జమదగ్ని ఆగ్రహం

ఒకరోజు జమదగ్ని భార్య రేణుక నీటికోసం ఒక సరస్సుకు వెళ్ళింది. ఆసమయంలో చిత్రరధుడు అనే రాజు తన రాణులతో జలకాలాడటం చూసింది. ఆ రాజును చూచి రేణుకకు మోహం కలిగింది. రేణుక మనసు చలించడం గ్రహించిన జమదగ్ని ఆగ్రహించి వరసగా తన కుమారులను పిలిచి ఆమెను వధించమని ఆజ్ఞాపించాడు. వారు తల్లిని చంపుట మహాపాపమని నిరాకరించారు. జ్ఞమదగ్ని ఆగ్రహించి వారిని అడవిలో మృగప్రాయులుగా తిరగమని శపించాడు. ఆఖరిగా రాముని పిలిచి రేణుకను వధించమని చెప్పాడు. అతడు ఎదురు చెప్పక తన చేతిలోని గొడ్డలితో తల్లి తల నరికాడు. జమదగ్ని సంతోషించి " నా మాట మన్నించి నందుకు నీకేమి వరం కావాలి ? కోరుకో " అన్నాడు. రాముడు " తండ్రీ ! ముందు నా తల్లిని బ్రతికించండి. తరవాత నా అన్నలను శాపవిముక్తులను చేయండి. నాకు దీర్ఘాయువు, అమితమైన బలం ప్రసాదించండి. సదా శత్రుజయం ప్రసాదించండి " అని కోరాడు. జమదగ్ని అతనుకోరిన వరాలన్నీ ఇచ్చాడు.

### కార్తవీర్యార్జునుడిని సమ్హరించుట

ఒకరోజు సహస్రబాహువులు కలిగిన కార్తవీర్యార్జునుడు వేటాడుతూ అలసిపోయి జమదగ్ని ఆశ్రమానికి వచ్చాడు. జమదగ్ని అతనికి తగిన అతిధి సత్కారాలు చేసాడు. కార్తవీర్యుడు రాజగర్వంతో జమదగ్నిని ఇతర మునులను అవమానించాడు. పోతూ పోతూ ఆశ్రమంలోని హెూమధేనువును దూడను తీసుకు వెళ్ళాడు. రాముడు ఆసమయంలో ఆశ్రమంలో లేడు. రాముడు రాగానే జరిగినదంతా తండ్రి ద్వారా తెలుసుకున్నాడు. రాముడు ఆగ్రహించి కార్తవీర్యునితో యుద్ధం చేసి అతనిని వధించాడు. కార్తవీర్యుని కొడుకులు రాముడి పై పగపట్టారు. కానీ అతనిని ఏమి చెయ్యలేమని గ్రహించి రాముడు ఆశ్రమంలో లేని సమయం చూసి జమదగ్నిని చంపి మునులను నిందించి ఆశ్రమాన్ని ధ్వంశం చేసి వెళ్ళారు. రాముడు ఆశ్రమానికి రాగానే తండ్రి మరణ వార్త విని కృద్ధుడై " అనఘుడు, వీతరాగుడు, కరుణాతరంగుడు అయిన నా తండ్రిని బుద్ధి పూర్వకంగా చంపారు కనుక నేను దుర్జనులైన క్షత్రియులను అందరిని చంపుతాను " అని ప్రతిజ్ఞ చేసాడు. ఇలా భూలోకంలోని క్షత్రియులందరిని సంహరించి ఆ భూమిని కశ్యపునకు దానం ఇచ్చాడు. ఆ తరువాత విరాగియై మహేంద్రగిరిపై తపస్సు చేసుకుంటున్నాడు "

అని పరశురాముని శిష్యుడైన అకృతవర్ణుడు చెప్పాడు. చతుర్దశి నాడు పరశురాముని దర్శించి అక్కడి నుండి దక్షిణదిశగా ప్రయాణం అయ్యాడు. త్రయంబకంలో పుట్టిన గోదావరిని దర్శించి అక్కడి నుండి ప్రభాస తీర్థం చేరాడు.


అర్జునుడు చేసిన దారుణములను రామునికి చెప్పుచున్న జమదగ్ని

## ప్రభాస తీర్థం


పాండవులను చూడటానికి ప్రభాస తీర్థానికి వచ్చిన యాదవులు

పాండవుల రాకను తెలుసుకున్న శ్రీకృష్ణుడు బలరాముడు యాదవ ప్రముఖులను వెంటపెట్టుకుని వారిని చూడటానికి వచ్చారు. ధర్మరాజు తాము పడుతున్న కష్టాలు అర్జునుడు ఇంద్రలోకం వెళ్ళడం వారికి వివరించాడు. బలరాముడు " ఆ దృతరాష్ట్రుడు బుద్ధి లేని వాడై ఇంతటి పాపానికి ఒడి గట్టాడు. కనుక మనమంతా ధర్మరాజు పక్షాన నిలిచి అతని రాజ్యాన్ని అతనికి వచ్చేలా చేద్దాం " అని తనతో వచ్చిన వృష్టి రాజులతో పలికాడు. ఆ మాటలు విని సాత్యకి " అనుపమ శౌర్యవంతులు, అమిత బలవంతులు అయిన మీరు శ్రీకృష్ణుడు, సాంబుడు, సారణుడు లాంటి మహావీరులు ఉండగా పాండవులు ఇలా అడవులలో తిరగటం భావ్యమా? భయంకర మైన యాదసేనల ధాటికి కౌరవసేనలు తట్టుకోగలవా? మనము కేకయరాజులు, సృంజయులు, పాంచాలురు, వృష్టి, భోజక, అంధక మహావీరులతో కలసి శ్రీకృష్ణుని అనుమతితో కౌరవులను సంహరించి పాండవులను రాజ్యాభిషిక్తులను చేద్దాం. అభిమన్యుని అఖిలరాజ్య రక్షకునిగా నిలుపుదాం ఏమంటారు " అని ఆవేశంగా అన్నాడు. ధర్మరాజు " అయ్యా! మేము ఒక నియమం ప్రకారం అరణ్యవాసం చేస్తున్నాము. కాబట్టి మీరు శాంతించండి " అని యాదవ వీరులను శాంతపరిచాడు. తరవాత శ్రీకృష్ణుడు, బలరాముడు ద్వారకకు వెళ్ళారు. ధర్మరాజు అక్కడి నుండి బయలు దేరి పయోష్ణి నదిలో స్నానం చేసాడు. అక్కడి నుండి వారు నర్మదా నది తీరానికి చేరాడు. అక్కడ వారు వైడూర్య పర్వతాన్ని చూసారు. రోమశుడు ధర్మరాజుకు ఆ స్థల మహత్యాన్ని చెప్పసాగాడు.

## చ్యవనుడు

రోమశుడు ధర్మరాజుతో " ధర్మరాజా! భృగుమహర్షి కుమారుడైన చ్యవనుడు ఈ ప్రదేశంలో చాలాకాలం తపస్సు చేసాడు. దీర్ఘకాల తపస్సు కారణంలేత ఆ ముని శరీరం చుట్టూ పుట్టలు వాటి పై తీగలతో కప్పబడింది. ఒక రోజు శర్యాతి మహారాజు కుమార్తె సుకన్య చ్యవనుడు తపస్సు చేస్తున్న ప్రదేశానికి వచ్చింది. ఆ పుట్టలో ఉన్న చ్యవనుని కళ్ళు మిలమిలలాడాయి. అది చూసిన సుకన్య కుతూహలంతో ఆ పుట్టను తవ్వించింది. చ్యవనుడు కోపించి శర్యాతిని ససైన్యంతో మూత్రం, పురీషం బంధించాడు. ఈ విషయం తెలుసుకుని శర్యాతి చ్యవనుని వద్దకు వచ్చి తన కుమార్తె తెలియక చేసిన తప్పు క్షమించమని వేడుకున్నాడు. రాజకుమారి సుకన్యని తనకిచ్చి వివాహం చేస్తే క్షమిస్తానని చ్యవనుడు చెప్పాడు. శర్యాతి మహారాజు అందుకు అంగీకరించి సుకన్యను చ్యవనునికి ఇచ్చి వివాహం చేసాడు. సుకన్య చ్యవనుడికి సేవలు చేస్తూ ఉంది.

### అశ్వినీదేవతల ఆగమనం

ఒకరోజు అశ్వినీ దేవతలు ఆశ్రమానికి వచ్చారు. వారు సుకన్యను చూసి ఆమెను " అమ్మా!నీవెవరు? " అని అడిగారు. సుకన్య " అయ్యా! నేను శర్యాతి మహారాజు కుమార్తెను. చ్యవనుని భార్యను " అని చెప్పింది. వారు ఆశ్చర్యపోయి " నీ వంటి అందెగత్తెకు చ్యవనుని లాంటి వృద్ధుడా భర్త. ఇంకనైనా తగిన వరుని కోరుకో. మేము వాడిని తీసుకు వస్తాము " అన్నారు. అందుకు సుకన్య ఆగ్రహించి " నాకు నా భర్త మీద ప్రేమ ఉంది " అని చెప్పింది. తరవాత ఆమె ఈ విషయం చ్యవనునికి

చెప్పింది. చ్యవనుడు సుకన్యతో " వారు చెప్పినట్లు చేయవచ్చు కదా " అన్నాడు. సుకన్య చ్యవనునితో " మీ అనుమతి ఉంటే అలాగే చేస్తాను " అన్నది. ఆమె అశ్వినులతో " నాకు నవయవ్వన వంతుడైన వరుని ప్రసాదించండి " అని అడిగింది. అప్పుడు అశ్వినీ దేవతలు చ్యవనుడు ఈ కొలనులో ప్రవేశించారు. కొలను నుండి ముగ్గురు నవయవ్వనులు బయటకు వచ్చారు. అశ్వినులు సుకన్యతో " మాలో ఎవరు కావాలో కోరుకో " అన్నారు. సుకన్య వారిలో చ్యవనుని గుర్తించి ఆయనను వరించింది. చ్యవనుడు అశ్వినులతో " మీ వలన నేను యవ్వనవంతుడనైనాను. అందుకు ప్రతిఫలంగా శర్యాతి మహారాజు చేస్తున్న యాగంలో దేవేంద్రుడు చూస్తుండగా మీచే సోమరసం తాగిస్తాను " అన్నాడు. అశ్వినులు సంతోషంతో వెళ్ళిపోయారు.


అశ్వినీదేవతల ఆగమనం

## అశ్వినులకు సోమపానము కలిగించుట

తన అల్లుడు నవయవ్వనవంతుడు అయ్యాడని తెలుసుకున్న శర్యాతి వారిని చూడటానికి వచ్చాడు. చ్యవనుడు శర్యాతితో " రాజా! నేను నీచే ఒక మహా యజ్ఞం చేయిస్తాను " అని అన్నాడు. శర్యాతి అందుకు అంగీకరించాడు. ఆ యజ్ఞంలో చ్యవనుడు అశ్వినులకు సోమరసం ఇచ్చాడు. ఇంద్రుడు చ్యవనునితో " వారు దేవ వైద్యులే కాని దేవతలు కారు. కనుక మాతో సమానంగా సోమపానానికి అర్హులు కారు " అన్నాడు. చ్యవనుడు ఇంద్రుని మాట లక్ష్య పెట్టక అశ్వినులకు సోమరసం ఇచ్చాడు. ఇంద్రుడు ఆగ్రహించి చ్యవనుని మీదకు వజ్రాయుధం ఎత్తాడు. చ్యవనుడు తన తపశ్శక్తితో వజ్రాయుధాన్ని నిగ్రహించాడు. వెంటనే చ్యవనుడు హొమంచేసి హొమం నుండి ఒక భయంకరాకారుడిని సృష్టించాడు. ఆ రాక్షసుడు ఇంద్రుని మీదకు రావడంతో ఇంద్రుడు భీతిచెందాడు. ఇంద్రుడు చ్యవనుడితో " మహర్షీ ! మీ తపశక్తి తెలియక అపరాధం చేసాను క్షమించండి. నేటి నుండి అశ్వినులకు సోమరసానికి అర్హులు " అని అంగీకరించాడు. చ్యవనుడు సృష్టించిన రాక్షసుడు కాముకులైన స్త్రీలలోను, మద్యం లోనూ, పాచికలలోను, మృగములలోను ప్రవేశించాడు " అన్నాడు.

## మాంధాత

ఆ తరవాత ధర్మరాజు సైంధవారన్యంలోకి ప్రవేశించాడు. అక్కడ ప్రవహించుచున్న యమునా నదిని చూసి రోమశుడు ఇలా చెప్పసాగాడు. ధర్మరాజా ఇది యమునా నది గంగా నదితో సమానమైనది. దీని తీరాన మాంధాత అనే మహారాజు ఎన్నో యాగాలు చేసాడు. ఆయన చరిత్ర చెపుతాను విను. పూర్వం ఇక్ష్వాకు వంశంలో ధార్మికుడు, కీర్తివంతుడు, ధర్మశీలుడు, బలవంతుడూ అయిన యవనాశ్వుడు అనే రాజు ఉండే వాడు. అతనికి సంతానం లేదు. అతడు భృగుమహర్షి ఆశ్రమానికి వెళ్ళి సంతానం కోసం అర్ధించాడు. అతని కోరిక మన్నించి భృగుమరుర్షి పుత్రకామేష్టి యాగం చేసాడు. మంత్రజలం నిండిన పాత్రను జాగ్రత్తగా కాపాడమని ఋత్విక్కులను నియోగించాడు. ఒక అర్ధరాత్రి యవనాశ్వుడు దాహంవేసి తెలియక ఆ మంత్రజలం త్రాగాడు. ఇది భృగుమహర్షికి తెలిసి యవనాశ్వునితో " రాజా ! విధి అనుల్లంఘనీయం. నీ భార్యకు ఇవ్వవలసిన జలాన్ని నీవు త్రాగావు. కనుక నీవు గర్భం ధరిస్తావు. నీకు ఒక కుమారుడు పుడతాడు " అని చెప్పాడు. యవనాశ్వుడు గర్భం ధరించాడు. అతని ఎడమభాగాన్ని చీల్చుకుని కుమారుడు కలిగాడు. అతనే మాంధాత. ఆ శిశువును చూడటానికి ఇంద్రుడు వచ్చాడు. ఇంద్రుడు ఆ బాలుని నోట్లో చూపుడు వ్రేలిని పెట్టి " ఇది అమృతమయము దీనిని త్రాగుము " అని అన్నాడు. అందువలన అతనికి మాంధాతృడు అని నామకరణం చేసాడు. మాంధాత ఎన్నో ఏళ్ళు రాజ్యపాలన చేసాడు. తన పరాక్రమంతో ఎన్నో రాజ్యాలు జయించాడు. యజ్ఞయాగాలు చేసాడు. ఇంద్రునితో యుద్ధం చేసి రాజ్యంలో సకాలంలో వానలు కురిసేలా చేసాడు. మాంధాత యజ్ఞం చేసిన చోటు ఇదే. ధర్మజా! సోమకుడు మహర్షి యాగం చేసిన ప్రదేశం. ఇది నహుషుడు యజ్ఞం చేసిన ప్రదేశం. ఇది అంబరీషుడు యాగం చేసిన పుణ్యభూమి.ఇది సరస్వతీ వది నిషధ దేశంలో మాయమై ఇక్కడ చమసోద్భేదం అనే చోట బయటపడింది. ధర్మజా ఇది విష్ణుప్రద తీర్ధం, ఇది కాశ్మీర మండలం, ఈ క్షేత్రానికి మానసద్వారం అని పేరు. దీనిని పూర్వం పరశురాముడు నిర్మించాడు.

## శిబిచక్రవర్తి

ఒకరోజు ఇంద్రుడు శిబి చక్రవర్తిని పరీక్షించాలని అగ్నిదేవునితో కలసి తాను డేగరూపంలోనూ అగ్నిదేవుడు పావురం


శిబిచక్రవర్తి వృత్తాంతం

రూపంలోనూ మారారు. డేగ రూపం లోని ఇంద్రుడు పావురంరూపంలో అగ్నిదేవుని తరముతూ ఉన్నాడు. ఆ పావురం శిబి చక్రవర్తి దగ్గరకు వచ్చి శరణు వేడింది. శిబి పావురానికి అభయం ఇచ్చాడు. డేగ శిబి చక్రవర్తిని చూసి " రాజా! ఇది నాకు ఆహారం. దీనిని నాకు ఇవ్వండి. ఈ ఆహారం లేకుంటే నేను బ్రతకలేను " అని అడిగింది. శిబి చక్రవర్తి " ఈ డేగ నన్ను శరణుజొచ్చింది. అభయం ఇచ్చిన వారిని విడిచిపెట్టడం ధర్మంకాదు. నీవు వేరే ఆహారం చూసుకో " అన్నాడు.డేగ శిబితో " రాజా! ఇది నాకు దేవుడిచ్చిన ఆహారం. దీనికి సమానమైన ఆహారం నాకిచ్చి దీనిని నువ్వు తీసుకో " అని చెప్పింది. అందుకు అంగీకరించిన శిబి ఒక కత్తి తీసుకుని తన దేహాన్ని కోసి మాంసం తీసి త్రాసులో వేసాడు. ఎంత మాంసం వేసినా పావురం ఎత్తు తూగకపోవడం చూసి ఆశ్చర్య పడిన శిబి తనకు తానే త్రాసులో కూర్చుని ఆత్మార్పణం చేసుకున్నాడు. అతని త్యాగనిరతికి మెచ్చి ఇంద్రుడు, అగ్నిదేవుడు తమ నిజరూపాలు ధరించి " రాజా! నీ త్యాగనిరతికి సంతోషించాము. నీకీర్తి అజరామరమై చిరకాలం వర్ధిల్లుతుంది " అన్నారు.

## అష్టావక్రుడు

ఆ తరవాత రోమశుడు ధర్మరాజుకు అష్టావక్రుడిని గురించి చెప్పసాగాడు. పూర్వం ఏకపాదుడనే ముని ఉండే వాడు. అతని భార్య పేరు సుజాత. అతను ఘోరమైన తపస్సు చేశాడు. తన శిష్యులకు సదా విద్యాబుద్ధులు నేర్పుతుండే వాడు. కొంత కాలానికి సుజాత గర్భం ధరించింది. ఒకరోజు సుజాత గర్భంలో ఉన్న శిశువు ఏకపాదునితో ఇలా అన్నాడు. " మీరు ఇలా అహూరాత్రులు పాఠాలు చదివిస్తుంటే వారికి విద్య ఎలా వస్తుంది. వారికి నిద్ర లేక పోవడం చేత విశ్రాంతి లేక జఢులౌతారు. ఇది మంచిదా? " అని అడిగాడు. అందుకు ఏకపాదుడు ఆగ్రహించి " నేను చేయించిన వేదాధ్యయనాన్ని వక్రించి చెప్పావు కనుక నీవు అష్టా వక్రడిగా పుట్టు " అని శపించాడు. సుజాత పురిటి సమయానికి తిండి గింజలు సంపాదించడానికి ఏకపాదుడు జనకుని వద్దకు వెళ్ళాడు. కాని అక్కడ ఉన్న వందితో వాదించి పరాజయం పొందాడు. సుజాత అష్టావక్రుడిని ప్రసవించింది. అష్టావక్రుడు పెద్దవాడయ్యాడు. తన తండ్రిని వెతుకుతూ మేనమామ కొడుకు శ్వేతకేతునితో జనక మహారాజు చేస్తున్న యజ్ఞానికి వెళ్ళాడు. కాని వారిని ద్వారపాలకులు అడ్డగించి " మీరు బాలురు ఇది విద్వాంసులు, పెద్దలు, ఋత్విక్కులకు మాత్రమే ప్రవేశార్హత మీకు లేదు " అని అడ్డగించారు. అష్టావక్రుడు " అయ్యా! వయస్సుతో జ్ఞానం రాదు కదా? కనుక జ్ఞానం కలవాడు బాలుడైనా అర్హుడే? మేము ఈ మహారాఉజు కొలువులో ఉన్న విద్వాంసులను జయించడానికి వచ్చాము " అని అన్నాడు. ఈ విషయం తెలిసి మహారాజు వారిని లోనికి పిలిపించాడు. అష్టావక్రుడు అక్కడున్న విద్వాంసులను, వందిని ఓడించి తండ్రిని మిగిలిన బ్రాహ్మణులను చెర నుండి విడిపించాడు. జనక మహారాజు అష్టావక్రుని ఘనంగా సన్మానించాడు. అష్టావక్రుడు తన తండ్రితో కలసి స్వస్థలానికి వెళ్ళాడు.

## యువక్రీతుడు

ఆ తరవాత ధర్మరాజు సంగమ నదీ తీరం చేరాడు. రోమశుడు ధర్మరాజుకు రైభ్యాశ్రమం, భరద్వాజాశ్రమం చూపించి యువక్రీతుని గురించి చెప్పసాగాడు. రైభ్యుడు, భరద్వాజుడు అనే మహా ఋషులు ఉన్నారు. వారిరువురు మిత్రులు. వారిద్దరు అడవిలో తపస్సు చేసుకుంటున్నారు. రైభ్యునికి అర్ధావసుడు, పరావసుడు అనే కుమారులు ఉన్నారు. వారిద్దరూ మంచి విద్యావంతులు. భరద్వాజునికి ఒక కుమారుడుండే వాడు. అతని పేరు యువక్రీతుడు. యువక్రీతునకు అర్ధావసు పరావసు అంటే అసూయ. అందుకని కష్టపడకుండా సకల విద్యలు రావాలనే సంకల్పించి ఇంద్రిని గురించి తపస్సు చేసాడు. ఇంద్రుడు ప్రత్యక్షమై "ఏ కోరికతో ఇంత ఘోర తపస్సు చేసావు ? " అని అడిగాడు. యువక్రీతుడు " నాకు చదవకుండానే సకల శాస్త్రాలు, వేదాలు అవగతం కావాలి " అని కోరాడు. ఇంద్రుడు " ఇది అసంభవం. తపస్సు వలన వచ్చే విద్య మత్సరాన్ని కలిగిస్తుంది. అది మంచిది కాదు. విద్య గురు ముఖత: నేర్చుకోవడం ఉత్తమం " అన్నాడు. అందుకు యువక్రీతుడు అంగీకరించ లేదు. ఇంద్రుడు వెళ్ళి పోయాడు. యువక్రీతుడు తపస్సు కొనసాగించాడు. మరల ఇంద్రుడు ఒక వృద్ధ బ్రాహ్మణ రూపంలో వచ్చి అక్కడ ప్రవహిస్తున్న గంగా ప్రవాహానికి అడ్డంగా పిడికిళ్ళతో ఇసుక పోసి సేతుబంధనం చేయసాగాడు. అది చూసి యువక్రీతుడు నవ్వి " వృద్ధుడా! ఇదేమి పని? ఇలా ఎన్ని రోజులు చేస్తే ఈ సేతువు పూర్తి ఔతుంది " అన్నాడు. ఆ వృద్ధుడు " నేను నీలా సాధ్యం కాని దాని కోసం ప్రయత్నిస్తున్నాను " అన్నాడు. ఇంద్రుడు నిజరూపం చూపి " యువక్రీతా ! నేను చేసిన పని ఎంత నిరర్ధకమో నీవు చేసే తపస్సు అంతే నిరర్ధకం. కనుక నీ ప్రయత్నం మానుకో " అన్నాడు. అందుకు యువక్రీతుడు అంగీకరించక తనకు సకల విద్యలు కావలసిందే నని పట్టు పట్టాడు. ఇంద్రుడు చేసేది లేక అతనికి సకల విద్యలు

ప్రసాదించాడు. తన కోరిక తీరిందని గర్వంతో తన తండ్రి వద్దకు వచ్చాడు. తన పాండిత్యంతో ఎంతో మందిని ఓడించాడు.

### యువక్రీతుడు వధిమ్పబడుట

ఒకరోజు యువక్రీతుడు తన తండ్రి మిత్రుడైన రైభ్యుని చూడటానికి వెళ్ళాడు. అక్కడ రైభ్యుని పెద్ద కుమారుడైన పరావసు భార్య అయిన కృష్ణ అనే సుందరిని చూసాడు. ఆమెను మోహించి తన కోరిక తీర్చమని అడిగాడు. ఆమె ఆముని శాపానికి భయపడి ఏదో సాకు చెప్పి తప్పించుకుని పోయింది. ఆమె ఆ విషయం తన మామగారికి చెప్పి కన్నీరు పెట్టింది. రైభ్యుడు ఆగ్రహించి తన జటాజూటం తీసి అగ్నిలో వేసి ఒక రాక్షసుని సృష్టించాడు. మరొక జటను లాగి అగ్నిలో వేసి కృష్ణ లాంటి కన్యను సృష్టించాడు. వారిరువురిని చూసి " మీరు యువక్రీతుని వధించండి " అని పంపాడు. ముందు ఆయువతి అందంతో యువక్రీతుని మైమరపించి కమండలం సంగ్రహించింది. కమండలం పోగానే యువక్రీతుడు అపవిత్రుడు అయ్యాడు. వెంటనే రాక్షసుడు యువక్రీతుని వధించాడు. ఆ తరవాత రైభ్యుడు ఆ యువతిని రాక్షసునికి ఇచ్చి వివాహం చేసాడు. ఆశ్రమానికి వచ్చిన భరద్వాజుడు కుమారుని మరణ వార్త విని పుత్ర శోకం భరించ లేకగ్ని ప్రవేశం చేసి మరణించాడు.

### పరావసు తండ్రిని చంపుట

తరవాత కొన్నాళ్ళకు బృహద్యుముడు అనే రాజు సత్రయాగం చేస్తున్నాడు. ఆ యాగానికి పరావసు, అర్ధావసులను ఋత్విక్కులుగా నియమించాడు. యజ్ఞం జరుగుతున్న సమయంలో ఒక రాత్రి పరావసు ఆశ్రమానికి వచ్చేసమయంలో ఏదో అలికిడి వినిపించింది. పరావాసు ఏదో క్రూరమృగం వస్తుంది అనుకుని పొరపాటు ఎదురుగా వస్తున్న రైభ్యుని ఆత్మరక్షణార్ధం చంపాడు. దగ్గరికి వచ్చి చూసి తన తండ్రిని గుర్తించి కుమిలి పోయాడు. అతనికి దహన సంస్కారాలు ముగించాడు. తన అన్న వద్దకు పోయి జరిగినది చెప్పి పరావసు తన అన్న అర్ధవసుతో " అన్నయ్యా ! నీవు ఒక్కడివి ఆ యాగాన్ని నిర్వహించ లేవు కాని నేను ఒక్కణ్ణి చేయగలను. కనుక నేను ఆ యాగాన్ని పోయి ఆయాగాన్ని పూర్తి చేస్తాను. నీవు పోయి నాకు కలిగిన బ్రహ్మహత్యాపాతకానికి పరిహారం చెయ్యి " అన్నాడు. అలాగే అని అర్ధావసు తమ్ముని బదులు అన్ని ప్రాయశ్చితములు పూర్తి చేసి యాగశాలకు తిరిగి వచ్చాడు. అతనిని చూసి పరావసు బృహద్యుమ్నినితో ఇలా అన్నాడు " మహారాజా! ఇతడు యాగశాలలో ప్రవేశించడానికి అర్హుడు కాదు. పవిత్రమైన యాగక్రతువును విడిచి బ్రహ్మహత్యా ప్రాయశ్చిత కార్యం చేస్తున్నాడు " అన్నాడు. రాజు అనుచరులు పరావసుని యాగశాలలోకి రాకుండా అడ్డుకున్నారు.

### అర్ధావసు కోరిక మీద రైభ్యాదులు బ్రతుకుట

అర్ధావసు రాజును చూసి " రాజా బ్రహ్మహత్యా పాతకం చేసినది నేను కాదు. ఈ పరావసు చేసిన బ్రహ్మ హత్యకు నేను ప్రాయశ్చిత కర్మలు చేసి అతడిని బ్రహ్మహత్యా పాతకము నుండి విముక్తుడిని చేసాను " అని సత్యం చెప్పాడు. అందుకు దేవతలు సంతోషించి " అర్ధవసూ! నీ సత్యవ్రతం గొప్పది. నీ తమ్ముడు చేసిన బ్రహ్మహత్యకు నీవు ప్రాయశ్చితం చేసావు. ఏమి వరం కావాలో కోరుకో " అని అడిగారు. అర్ధవసుడు " అయ్యా! నా తండ్రిని, భరద్వాజుని, యువక్రీతున బ్రతికించండి అలాగే నా తమ్మునికి దోషం కూడా పరిహరించండి " అని కోరుకున్నాడు. దేవతలు అందరిని బ్రతికించారు. యువక్రీతుడు దేవతలను చూసి " దేవతలారా! నేను ఎన్నో విద్యలు చదివాను, వ్రతాలు చేసాను కాని రైభ్యునిచే చంపబడ్డాను. కారణం ఏమిటి? " అని అడిగాడు. దేవతలు " యువక్రీతా! గురుముఖతః నేర్చుకున్న విద్య ఫలిస్తుంది, తపస్సు వలన నేర్చుకున్నవి ఫలించవు కనుక నీ విద్యలు నిర్వీర్యం అయ్యాయి. రైభ్యుని విద్య గురువు నేర్పినది కనుక అతడు నీ కంటే శక్తిమంతుడు అయ్యాడు. అని పలికి స్వర్గానికి వెళ్ళారు.

## గంధమాధన పర్వతం

ఆ తరవాత ధర్మరాజు తమ్ములతోనూ, ద్రౌపదితోనూ కలసి ఎన్నో ప్రయాసలకోర్చి గంధమాదన పర్వతం చేరుకున్నారు. మార్గం రాళ్ళతూనూ ముళ్ళతోనూ చేరి దుర్గమంగా ఉంది. భీముడు తనకుమారుడైన ఘటోత్కచుని స్మరించాడు. ఘటోత్కచుడు తండ్రి ముందుకు వచ్చి నులబడ్డాడు. ధర్మరాజు కోరిక మేరకు ఘటోత్కచుడు అందరిని వీపుమీద ఎక్కించుకుని ఆకాశమార్గంలో బదరికావనం చేర్చాడు. రోమశుడు తన మంత్ర మహిమతో ఆకాశమార్గాన బదరికావనం చేరాడు. అందరూ నరనారాయణులు తపస్సు చేసుకుంటున్న ఆశ్రమం చేరారు.

## భీముడు ఆంజనేయుని కలుసుకొనుట


భీమునికి సౌగంధికా పుష్పాలను చూపుచున్న ద్రౌపది

ఒకరోజు ద్రౌపది భీముడు గంధమాధన పర్వతచరియలలో విహరిస్తున్నారు. వారి ముందు సహస్రదళ పద్మం గాలిలో ఎగురుతూ వచ్చి పడింది. దానిని చూసి ద్రౌపది ముచ్చట పడింది. అలాంటి పద్మాలు మరికొన్ని కావాలని భీముని కోరింది. ద్రౌపది కోరిన సౌగంధికా పుష్పాలు తెచ్చేందుకు బయలుదేరాడు. అలా వెళుతూ భీముడు సింహనాదం చేసి శంఖం పూరించాడు. ఈ శబ్దాలను అక్కడ ఉన్న హనుమంతుడు విన్నాడు. ఆ వచ్చినది తన సోదరుడు భీముడని గ్రహించాడు. గుహలో నుండి బయటకు వచ్చి అక్కడ ఉన్న చెట్లను పెరికి దారికి అడ్డం వేసాడు. తాను కూడా దారికి అడ్డంగా పడుకుని తోకను విలాసంగా ఆడించసాగాడు. భీముడు అక్కడికి వచ్చి హనుమంతుని చూసి సింహనాదం చేసాడు. ఆ శబ్దానికి హనుమంతుడు కళ్ళు తెరిచి " ఎవరయ్యా నీవు? పెద్దవాడిని, అలసిపోయి పడుకున్న వాడిని పడుకుని ఉంటే ఇలా అరవడం తగునా? అడవిలో ఉన్న పండ్లు ఫలాలు తిని వెళ్ళు ఇలా అరవకు " అన్నాడు హనుమంతుడు. భీముడు " నేను పాండురాజు పుత్రుడను, ధరాజు తమ్ముడిని. నా నామధేయం భీమసేనుడు. నేను కార్యార్ధినై వెళుతున్నాను. నాకు దారి వదులు " అన్నాడు. హనుమండు " నేను ముసలి వాడిని కదలలేను. నీవే నా తోకను పక్కన పెట్టి నీ దారిన నీవు వెళ్ళచ్చు " అన్నాడు హనుమంతుడు. భీముడు అదెంత పని అని తోకను ఒక్క చేత్తో ఎత్తి పెట్టబోయాడు. తోక కదల లేదు.రెండు చేతులు ఎత్తి పట్టుకుని ఎత్తబోయాడు. అప్పుడూ కదల లేదు. భీముడు అది చూసి ఆశ్చర్య పోయాడు.భీముడు హనుమంతునితో " అయ్యా! మీరెవరో నాకు తెలియదు. కాని మీరు మహాత్ములు. నన్ను మన్నించండి " అన్నాడు. హనుమంతుడు భీమునితో " భీమా! నేను హనుమంతుడిని, నీ అన్నను వాయు పుత్రుడను. నేను రామబంటును. రావాణుడు రాముని భార్యను అపహరించగా నేను లంకకు వెళ్ళి సీతమ్మ జాడను తెలుసుకుని రామునికి తెలిపాను. రాముడు రావణుని సంహరించి సీతమ్మను పరిగ్రహించాడు. రాముడు నా సేవలకు మెచ్చి నన్ను చిరంజీవిగా ఉండమని దీవించాడు " అప్పటి నుండి నేను గంధమాధన పర్వతంపై నివసిస్తున్నాను " అని చెప్పాడు. అది విన్న భీముడు సంతోషించి " ఆంజనేయా! నీవు అలనాడు సముద్రాన్ని లంఘించిన రూపాన్ని చూడాలని కోరికగా ఉంది. ఒక్క సారి చూపించవా? " అని అడిగాడు. హనుమంతుడు " భీమా! అది ఎలా కుదురుతుంది. ఆ కాలం వేరు ఈ కాలం వేరు యుధర్మాలు కృతయుగంలో ఒకలా , త్రేతాయుగంలో వేరేలా, ద్వాపరంలో మరోలా ఉంటుంది. అలాగే కలియుగంలో పూర్తి విరుద్ధంగా ఉండబోతుంది " అన్నాడు.

## హనుమంతుడు చెప్పిన యుగధర్మాలు

భీముడు " అన్నయ్యా! ఆయా యుగాలలోని ఆచారాల గురించి చెప్పవా? " అన్నాడు. హనుమంతుడు ఇలా చెప్పసాగాడు " భీమసేనా! కృతయుగంలో అన్నీ కృతములే కాని చెయ్యవలసినది ఏమీ లేదు. అందుకనే ధర్మం నాలుగు పాదాలతో నడిచింది. అప్పుడు శ్రీమన్నారాయణుడు శుక్లవర్ణంతో ప్రజలను కాపాడాడు. సనాతన ధర్మం వర్ధిల్లింది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు వేదాలు తమకు విధించిన విధులు నిర్వర్తించారు. వారు కోరకుండానే తగిన ఫలితాలు కలిగాయి. కనుక వారు పుణ్యలోకాలకు పొందారు. ఆ యుగంలో జనులకు అసూయ, ద్వేషము, గర్వము, మదము, మాత్సర్యము, కోపము, భయం, సంతాపం, ప్రజాక్షయం, అవయవక్షయం లాంటివి లేవు. తరవాత త్రేతాయుగం ఆరంభమైంది. ధర్మం మూడుపాదాలతో నడిచింది. ఆ రోజుల్లో ప్రజలు సత్యసంధులు, యజ్ఞయాగాదులు చేసే వారు, తపస్సులు చేసే వారు, దానాలు చేసేవారు. అప్పుడు విష్ణువు రక్తవర్ణంతో ప్రజలను రక్షించాడు. ద్వాపరయుగం వచ్చింది. ధర్మం రెండు పాదాలతో నడిచింది. వేదములు, శాస్త్రములు విధించిన ధర్మము కామము అనుసరించబడ్డాయి. కాని ద్వాపరయుగంలో ప్రజలు మాటమీద నిలవరు, సత్యము శమము హీనమౌతుంది. ప్రజలు కామ్యార్ధం మాత్రమే యజ్ఞాలు చేస్తారు. ఈ యుగంలో విష్ణువు కృష్ణవర్ణంతో ప్రజా రక్షణ చేస్తాడు. తరవాత వచ్చునది కలియుగం . ఈ యుగంలో ధర్మం ఒక పాదంతో నడుస్తుంది. విష్ణువు పసుపు పచ్చని వర్ణంతో లాలాలను రక్షిస్తాడు. కలియుగంలో జనులు తమోగుణంతో ప్రవర్తిస్తారు. జనులు కామము, క్రోధము మొదలైన వాటికి వశులై అధర్మ వర్తనుడై ప్రవర్తిస్తారు. కలియుగంలో తపస్సు, ధర్మము, దానము లాంటి పుణ్యకార్యాలు స్వల్పంగా ఆచరించబడతాయి. కాని వాటికి ఫలితం విశేషంగా ఉంటాయి " అని హనుమంతుడు చెప్పాడు. భీముడు " ఆంజనేయా ! అలనాడు నీవు సాగరం దాటిన భీమరూపాన్ని చూడకుండా నేను ఇక్కడ నుండి కదలను "

అన్నాడు.

## హనుమంతుడి బృహద్రూపం

ఆంజనేయుడు సాగరాన్ని దాటినప్పటి రూపాన్ని భీమునకు చూపాడు. రెండవ మేరు పర్వతమా అని భ్రమింప చేసే ఆంజనేయుని విరాట్రూపం చూసి భీముడు భీతి చెంది ఆ రూపాన్ని ఉపసంహరింపమని హనుమంతుని వేడుకున్నాడు. హనుమంతుడు రూపాన్ని ఉపసంహరించి " భీమసేనా! నీవు కావాలి అనుకున్న సౌగంధికా పుష్పములు ఉన్న కొలనును యక్షుల, గంధర్వులు సంరక్షిస్తుంటారు. అక్కడ నీ శౌర్యప్రతాపాలు పనికి రావు. ఆ పుష్పాలు దేవతలు అనుభవిస్తుంటారు. దేవతలు భక్తికి లొంగుతారు కనుక ధర్మమెరిగి ప్రవర్తించు. సదాచారం నుండి ధర్మం పుడుతుంది. ధర్మం వలన వేదం ప్రతిష్టించ బడుతుంది. వేదముల వలన యజ్ఞాలు చేస్తారు. యజ్ఞాలవలన దేవతలు సంతృప్తి చెందుతారు. దేవతల తృప్తి చెందితే సకాల వర్షాలు పడి సంపదలు వృద్ధి చెందుతాయి. ఆలోచించి నిర్ణయించుకో. పిల్లలతో, గర్వం కలవారితో, నీచులతో వ్యర్ధ ప్రసంగం చెయ్యవద్దు. నున్ను చూస్తే సంతోషం కలుగుతుంది. నీకేమి కావాలో అడుగు. భీమా! నీకు, నీ వారికి అపకారం చేసిన కౌరవులు, దృతరాష్టుడు మొదలైన వారిని సంహరించి హస్థినా పురం నేల మట్టం చెయ్యమంటావా ? " అన్నాడు. భీముడు " అమిత బలశాలివి అయిన నూకు అది అసాధ్యంకాదు. కాని మా శత్రువులను మేమే జయించడం ధర్మం కదా " అన్నాడు. హనుమంతుడు " భీమా! యుద్ధభూమిలో నన్ను తలచిన ఎడల నేను అర్జునిని రధం మీద ఉన్న ధ్వజంపై ఉండి మీకు విజయం కలగడంలో సహకరిస్తాను. అలాగే మీ ధైర్య సాహసాలు ప్రత్యక్షంగా చూస్తాను " అన్నాడు. తరవాత హనుమంతుడు భీమునకు సౌగంధికా సరోవరానికి మార్గం చూపి వెళ్ళి పోయాడు.

## భీముడు సౌగంధికా పుష్పములు తెచ్చుట

హనుమంతుడు చూపిన మార్గంలో ప్రయాణించి భీముడు కుబేరుని వనంలో ఉన్న సౌగంధికా పుష్పముల తోటను చేరాడు. భీముని వనరక్షకులైన రాక్షసులు అడ్డగించారు.వారు భీమునితో " అయ్యా ఇది కుబేరుని తోట కుబేరుడు ఇందులో విహరిస్తున్నాడు. ఇక్కడ ఉండటం ప్రమాదం " అని హెచ్చరించారు. భీముడు " నేను పాండు రాజు కుమారుడిని. నాపేరు భీమసేనుడు. నా భార్య ద్రౌపది ఈ సౌగంధికా పుష్పములు కావాలని కోరింది. వీట్ని తీసుకు పోవడానికి వచ్చాను " అన్నాడు. వనరక్షకులు భీమునితో " అయ్యా! నూవు ధర్మరాజు సోదరుడివి ధర్మం తెలిసి నడచుకో. నీవు కుబేరుని అడిగి ఈ పుష్పములను తీసుకు పో " అన్నారు. భీముడు " ప్రకృతి స్విద్ధమైన ఈ కొలను కుబేరునికి మాత్రమే స్వంతం కాదు అందరిది. నేను క్షత్రియుడను, ఎవ్వరినీ యాచించను, నా భుజ బలంతో తీసుకువెళతాను " అని చెప్పి కొలనులో దిగి పుష్పములు కోయసాగాడు. వనరక్షకులు భీమునితో యుద్దానికి దిగారు. భీముడు వారినందరిని జయించాడు.వారు కుబేరునితో ఈ విషయం చెప్పారు. కుబేరుడు భీముని పరాక్రమం గురించి విని ఉన్నాడు కనుక ఉదారంగా విడిచి పెట్టాడు. భీముడు సౌగంధికా పుష్పాలతో తిరిగి వెళుతున్న సమయంలో ధర్మరాజు నకులసహదేవులు, ద్రౌపదితో కలసి భీమునికి ఎదురు వచ్చాడు. భీముడు ద్రౌపదికి సౌగంధికా పుష్పాలను ఇచ్చాడు. ఇంతలో కొంత మంది యక్షులు వారి వద్దకు వచ్చి " అయ్యా! ఈ ప్రదేశంలో యక్షులు రాక్షసులు తిరుగుతుంటారు. ఇక్కడ ఉండటం సురక్షితం కాదు " అని చెప్పారు. అందుకు అంగీకరించి ధర్మరాజాదులు అక్కడి నుండి కొంతదూరం వెళ్ళి నివాసం ఏర్పరచుకున్నారు.

## జటాసురుడు

ఒకరోజు జటాసురుడు అనే రాక్షసుడు బ్రాహ్మణ వేషంలో వారి దగ్గరకు వచ్చారు. అతడు పాండవులతో " నేను వేదాలను చదువుకున్నాను పరశురాముని శిష్యుడను " అని చెప్పి వారి నివాసంలో ఉంటూ వారితో పాటు తింటూ ఉంటూ ఉన్నాడు. ఒక రోజు భీముడు వేటకు వెళ్ళాడు. జటాసురుడు ఇదే అదనుగా భావించి తన నిజరూపం ధరించాడు. ధర్మరాజు, ద్రౌపదిని, నకులసహదేవులను తీసుకుని ఆకాశమార్గంలో పరుగెత్తసాగాడు. అక్కడ ఉన్న బ్రాహ్మణులు అది చూసి భీతి చెందారు. నకులుడు రాక్షసునితో " అయ్యా! ఇప్పటి వరకు మా ఇంట భుజించి మాకు అపకారం తలపెట్టడం భావ్యమా? " అని అడిగాడు. ఆ రాక్షసుడు బదులు చెప్పలేదు. " అయితే నాతో యుద్ధం చెయ్యి " అని నకులుడు అన్నాడు. ఇంతలో విప్రుల వలన విషయం తెలుసుకున్న భీముడు వాయు వేగంతో అక్కడికి వచ్చాడు. భీముడు రాక్షసునితో " మర్యాదగా ధర్మరాజును, ద్రౌపదిని, నకులసహదేవులను విడిచి పెట్టు లేకుంటే బకాసురుడు, హిడింబుడు చచ్చినట్లు చస్తావు " అని హెచ్చరించాడు. జటాసురుడు " ఓయి భీమా! నిన్ను యుద్ధంలో చంపి బకాసురునికి, హిడింబునకు, కిమ్మీరునకు రక్త తర్పణం చేస్తాను " అని భీమునితో యుద్ధానికి దిగాడు. ఇద్దర్కి మధ్య ఘోరంగా యుద్ధం జరిగింది. జటాసురుడు అలసిపోవడం గ్రహించిన భీముడు అదనుగా తీసుకుని జటాసురుని పై విజృంభించి అతనిని వధించాడు. రోమశుడు, ధౌమ్యుడు, ధర్మరాజు భీముని శౌర్యం

చూసి ప్రశంసించారు.

# మూలాలు

# బయటి లింకులు

- ఇంటర్నెట్ ఆర్చీవులో అరణ్యపర్వము (http://www.archive.org/details/sriandhramahabar023368mbp) - సాహిత్య అకాడమీవారి ప్రచురణ

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

# వన పర్వము చతుర్థాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# చతుర్థాశ్వాసం

పాండవులు నరనారాయణులు వసించిన స్థానంలో కొన్ని దినములు గడిపారు. ఒకరోజు ధర్మరాజు తమ్ములతో ఇలా అన్నాడు. " అర్జునుడు మనలను విడిచివెళ్ళి అయిదు సంవత్సరాలు గడిచాయి. దివ్యాస్త్రాలతో అతను వచ్చే సమయం ఆసన్నమైంది " అని చెప్పాడు. పాండవులు అర్జుని కోసం ఉత్తర దిక్కుగా ప్రయాణం సాగించారు. వారంతా మాల్యవంతము అనే పర్వతం చేరుకున్నారు.

## ద్రౌపది భీమసేనుని పంచవర్ణ పుష్పములు కోరుట

ఒక రోజు ద్రౌపది భీమసేనుడు ఆ పర్వత సానువులలో విహరిస్తున్నారు. అప్పుడు పంచ వర్ణములు కలిగిన పువ్వు గాలిలో ఎగురుతూ వారి ముందు పడింది. ద్రౌపది ఆ పువ్వులను చూసి ముచ్చట పడి భీమసేనుని అలాంటి పువ్వులు మరికొన్ని తీసుకు రమ్మని కోరింది. భీముడు ఆ పువ్వు వచ్చిన దిక్కుగా వెళ్ళాడు. పువ్వులను వెదుకుతూ భీముడు కుబేరుని నివాసానికి వెళ్ళాడు. అక్కడ కాపలా ఉన్న యక్ష, రాక్షస భటులు భీముని అడ్డగించారు. భీముడు వారితో యుద్ధం చేసాడు. ఆ యుద్ధంలో కుబేరుని సేనాని మరియు ప్రియ మిత్రుడైన మణిమంతుడు మరణించాడు. ఆ విషయాన్ని భటులు కుబేరునికి తెలిపారు. ఇంతలో ద్రౌపది వలన విషయం తెలుసుకున్న ధర్మరాజు సోదరులను తీసుకుని ద్రపదీ సమేతంగా అక్కడికి చేరుకున్నాడు. వారు కుబేరుని మందిర సమీపంలో చనిపోయిన యక్షులు, మణిమంతుని భీకరంగా కనపడుతున్న భీముని చూసారు. కుబేరుడు జరిగినది భటుల వలన తెలుసుకుని అక్కడకు వచ్చి ధర్మరాజాదులను చూసి ధర్మరాజుకు నమస్కరించి " ధర్మరాజా! నా మిత్రుడు మణిమంతుని నీ సోదరుడు భీముడు చంపాడని చింతించ వలదు. అతడు శాపవశాత్తు మరణించాడు. మీరు ఈ ప్రాంతంలో హాయిగా ఉండండి. నాసేవకులు మీకు సేవలు చేస్తారు. మీరు పదిహేను దినములపాటు ఆర్ష్టిషేణాశ్రమంలో నివసించండి. మీ తమ్ముడైన అర్జునుని నేను ఇంద్రసభలో చూసాను. అర్జునుడు మీ వద్దకు రావడానికి సిద్ధంగా ఉన్నాడు " అన్నాడు.

## అర్జునుని రాక

కుబేరుని మాట ప్రకారం ధర్మరాజాదులు ఆర్ష్టిషేణాశ్రమం చేరుకున్నారు. ఒకరోజు వారికి ధౌమ్యుడు మేరుపర్వతం చూపించి " ధర్మజా! అది మేరుపర్వతం దానిని దిక్పాలకులు కావలి కాస్తుంటారు. మేరువు చుట్టూ సూర్యుడు చంద్రుడు, నక్షత్రమండలం ప్రదక్షిణం చేస్తంటారు. ఈ పర్వతం మీద త్రిమూర్తులు కొలువు తీరి ఉంటారు " అని చెప్పాడు. ఇంతలో మాతలి తోలుతున్న రధం మీద అర్జునుడు వచ్చాడు. అర్జునుడు రాగానే ధౌమ్యుడు, ధర్మరాజు, భీములకు నమస్కరించాడు. ఇంతలో ఇంద్రుడు అక్కడకు వచ్చి " ధర్మరాజా! నీ తమ్ముడు అర్జునుడు చాలా గొప్పవాడు. ఎన్నో దివ్యాస్త్రాలు సంపాదించాడు. నివాత, కవచులను వధించాడు. దేవతలకు మేలు చేసాడు " అని చెప్పి ధర్మరాజుకు అర్జునిని అప్పచెప్పి ఇంద్రలోకం వెళ్ళాడు. ధర్మరాజు అర్జునునితో " అర్జునా! నీవు పరమశివుడు, ఇంద్రుడు, వరుణుడు, అగ్నిదేవుడు మొదలగు వారిని మెప్పించి ఎన్నో దివ్యాస్త్రాలను సాధించావు అని ఇంద్రుడు చెప్పాడు. ఆ వివరాలను మాకు వీనుల విందుగా చెప్పు " అని అడిగాడు. అర్జునుడు ఈవిధంగా చెప్పసాగాడు " అన్నయ్యా ! నేను నీ ఆదేశం మేరకు హిమవత్పర్వతానికి వెళ్ళాను. నాకు ఇంద్రుడు బ్రాహ్మణ రూపంలో కనిపించి శివుని గురించి తపస్సు చెయ్యమని ఆదేశించాడు. నేను చేసిన తపస్సుకు మెచ్చి శివుడు కిరాతుడి రూపంలో దర్శనం ఇచ్చాడు. నాతో యుద్ధం చేసి నా శౌర్యం మెచ్చి నాకు పాశుపతాస్త్రం అనుగ్రహించాడు. తరవాత ఇంద్రాది దేవతల వలన అనేక దివ్యాస్త్రాలు పొందాను. అందుకు ప్రతిగా ఇంద్రుడు నన్ను నివాతకవచులను చంపి దేవతలకు మేలు చేకూర్చమన్నాడు. నాకు దేవదత్తము అనే శంఖాన్ని బహూకరించాడు.

## నివాతకవచులు


అర్జునుని రాక

నేను మాతలి రథం తోలగా రథం ఎక్కి నివాతకవచుల దగ్గరికి వెళ్ళాను. వారు సముద్రంలో ఉన్న నగరంలో ఉన్నారు. నేను శంఖాన్ని పూరించాను. అది విని రాక్షసులు నా మీదకు యుద్ధానికి వచ్చారు. వారికి నాకు మధ్య ఘోర యుద్ధం జరిగింది ఇంతలో దేవతల సారధి మాతలి స్పృహతప్పి పడిపోయాడు. ఇది చూసి రాక్షసులు మా మీద బాణప్రయోగం చేసారు. నేను స్వయంగా రథాన్ని నడుపుతూ వారితో యుద్ధం చేసాను. వారు తిమిర బాణాన్ని వేసారు. లోకమంతా చీకటి అయింది. అది చూసి మాతలి పెద్దగా అరిచాడు. ఎవరూ ఎవరికీ కనిపించలేదు. నేసు దేవేంద్రుడు ఇచ్చిన సూర్యాస్త్రాన్ని ప్రయోగించాను. చీకటి తొలగి వెలుగు వచ్చింది. నేను నా గాండీవం నుండి అస్త్రప్రయోగం చేసాను. ఆబాణములకు రాక్షసులు అందరూ మరణించారు. ఆ విధంగా నేను రాక్షసులను జయించి దేవలోకం వెళుతూ మార్గ మధ్యంలో నేను హిరణ్య పురం చూసాను. అందులో పౌలోమ, కాలకేయులు అనేరాక్షసులు నివసిస్తున్నారు. వారు దేవతలచే చంపబడరు అని నాకు మాతలి చెప్పాడు. నేను ఆ పురానికి వెళ్ళాను. నన్ను చూసి దేవేంద్రుడు అనుకుని రాక్షసులు నన్ను చుట్టు ముట్టారు. మా మధ్య ఘోరయుద్ధం జరిగింది. వారు నాతో మాయా యుద్ధం చేయసాగారు. వారు వారి పట్టణంతో సహా ఆకాశానికి ఎగిరి అక్కడి నుండి యుద్ధం చేయసాగారు. నేను శివుని స్మరించి పాశుపతాన్ని ప్రయోగించాను. ఆ అస్త్రానికి రాక్షసులంతా మరణించారు. ఆ తరవాత నేను దేవలోకానికి వచ్చి ఇంద్రునితో జరిగినది వివరించాను. ఇంద్రుడు నాతో " అర్జునా ! నీ కోసం నీ సోదరులు ఎదురు చూస్తున్నారు. నీ విజయ వార్తలు వినటానికి ఉవ్విళ్ళూరుతున్నారు " అని చెప్పి మాతలితో నన్ను ఇక్కడికి పంపించాడు " అని అర్జునుడు చెప్పాడు. అర్జునుని విజయగాధలు విని ధర్మరాజాదులు సంతోషించారు. ధర్మరాజు " అర్జునా! నీకు దేవతలు ఇచ్చిన అస్త్రాలు మాకు చూపించు " అన్నాడు. అర్జునుడు ప్రయోగించి చూపడానికి ఉద్యుక్తుడు కాగా అక్కడకు వచ్చిన నారదుడు " అర్జునా! అవి దివ్యాస్త్రాలు. ఆ అస్త్రాలు లక్ష్యం లేకుండా ప్రయోగించకూడదు. అలా ప్రయోగిస్తే అవి మూడు లోకాలను దహించగలవు " అని చెప్పాడు. నారదుని ఆదేశం మేరకు అర్జునుడు అస్త్ర ప్రయోగాన్ని ఆపి వేసాడు. తరవాత ధర్మరాజు తన సోదరులతో అక్కడ పది మాసాలు గడిపాడు. తరవాత దేవఋషి రోమశుడు దేవలోకం వెళ్ళాడు. తరువాత పాండవులు బదరీ వనంలోని సుబాహు పురం వచ్చి అక్కడి నుండి ఘతోత్కచుని తన పరివారంతో సహా పంపి వేసాడు. తరవాత వారు హిమవత్పర్వతమునందలి అనేక ప్రదేశములు దర్శిస్తూ ఒక సంవత్సరం గడిపారు.

## నహుషుడు

ఒకరోజు భీముడు వేట నిమిత్తం హిమాలయ శిఖరం మీదకు వెళ్ళాడు. అక్కడ ఒక కొండచలువ భీముని ఆహారంగా పట్టుకుంది. అది భీముని తన శరీరంతో చుట్టేసింది. భీముని బలం ఆ కొండచిలువ బలం ముందు చాలలేదు. భీముడు ఆశ్చర్యపడి " నా వంటి బలవంతుని ఇలా బంధించే శక్తి నీకు ఎలా వచ్చింది? నీవు వరప్రసాదివా? " అని అడిగాడు. ఆ కొండచిలువ భీమునితో ఇలా పలికింది " భీమసేనా ! నేను నహుషుడు అనే మహారాజును. ఒకప్పుడు దేవేంద్ర పదవిని అధిష్టించాను. కాని ఒక మునివరుని శాపం వలన సర్పరూపం దాల్చాను " అని దుఃఖించాడు. ఇంతలో భీమసేనుడు కనపడలేదని కలత పడి ధర్మరాజు అతడిని వెతుకుతూ వచ్చాడు. కొండచులువ బంధించి ఉన్న భీముని చూసి " ఆహా ఏమి కాల మహిమ? అపరిమిత బలము కలిగిన భీముడు ఒక పాము చేతిలో బంధీకృతుడు కావడమా? " అనుకున్నాడు. ధర్మరాజు కొండచిలువను చూసి " అయ్యా ! నీవు ఎవరు? రాక్షసుడివా దేవతవా చెప్పు. నేను పాండురాజు పుత్రుడను. నా పేరు ధర్మరాజు. నీవు నా తమ్ముని కేవలం ఆహారం కొరకు పట్టు కుంటే అతడిని విడిచిపెట్టు. నేను నీకు తగినంత మృగ మాంసం సమకూరుస్తాను " అన్నాడు. ధర్మజా! నేను నీ వంశంలో పుట్టిన వాడను. నా పేరు నహుషుడు. నేను ఇంద్రుడితో సమానుడను. ఐశ్వర్య గర్వంతో వివేకం లేక సప్త ఋషులతో పల్లకి మోయించుకుని వారిని అవమానించాను. ప్రత్యేకంగా అగత్యుడిని అవమానించి కారణంగా అతడు నన్ను పాముగా పడి ఉండమని శపించాడు. ఆ శాపప్రభావంతో ఇక్కడ సర్పరూపంలో పడి ఉన్నాను. నా శాపవిమోచనం కొరకు నాకు పూర్వజన్మ స్మృతి ఉండేలా అనుగ్రహించమని వేడుకున్నాను. అగస్త్యుడు కరుణించి నా ప్రశ్నలకు ఎవరు సమాధానం చెప్తారో వారి వలన శాపవిముక్తి కలుగుతుందని చెప్పాడు. ఆ మహానుభావుని కొరకు నిరీక్షిస్తూ ఇలా పడి ఉన్నాను. నీకు శక్తి ఉంటే నా ప్రశ్నలకు సమాధానం చెప్పి నీ తమ్ముని విడిపించుకో.

## నహుషుని ప్రశ్నలు

ధర్మరాజు " అయ్యా! నీవు అడిగే ప్రశ్నలకు విజ్ఞులైన బ్రాహ్మణులు మాత్రమే చెప్పగలరు నాకు సాధ్యమా? అయినా ప్రయత్నిస్తాను. అడుగు " అన్నాడు. కొండచిలువ రూపంలో ఉన్న నహుషుడు మొదటి ప్రశ్న ఇలా వేసాడు.ఏ గుణములు కలవాడు బ్రాహ్మణుడు? అతను తెలుసుకోదగిన విషయమేమిటి? " అని అడిగాడు. జవాబుగా ధర్మరాజు " సత్యము, క్షమ, దయ, శౌచము, తపము, దానము, శీలము మొదలైన గుణములు కలిగిన వాడు బ్రాహ్మణుడు. సుఖము దు:ఖముల ఎడల సమబుద్ధి కలిగి ఉండటమే అతను తెలుసుకోదగిన ఉత్తమ విద్య " అన్నాడు. నహుషుని రెండవ ప్రశ్న " శూద్రుడు పైన చెప్పిన గుణములు శూద్రునిలో కనిపిస్తే అతను బ్రాహ్మణుడు అని పిలువ బడతాడా? అలా అయితే కుల విభాగములు ఎందుకు? అధికులు హీనులు అనే వివేకం అపార్థం కాదా? ధర్మరాజు " మహాత్మా! ఏకారణం చేతనైనా వర్ణసంకరం ఏర్పడినప్పుడు ఎవరు ఏ వర్ణమునకు చెందిన వారు అని తెలియజేయుటకు స్వాయంభువమనువు ఒక పరీక్ష పెట్టాడు. సత్యమూ మొదలగు గుణములు కలిగిన శూద్రుడు ఉత్తమమైన శూద్రుడు కాగలడు కాని బ్రాహ్మణుడు కాగలడా? అదే విధంగా సత్యమూ మొదలగు గుణములు లేని వాడు బ్రాహ్మణుడు కాగలడా? కనుక ఒక వ్యక్తి గుణములు నిర్ణయించుటకు అతని గుణశీలములు ముఖ్యము. గుణశీలములు కలవాడు ఇంకా ఉత్తముడు కాగలడు. గుణశీలములు లేనివాడు వాటిని కాపాడుకోలేడు. కనుక ధనాన్ని రక్షించటం కంటే గుణశీలములు కాపాడుకోవడం ఉత్తమం " అని జవాబిచ్చాడు. నహుషుని మూడవ ప్రశ్న " పరులకు అపకారం చేసి, అసత్యములు చెప్పి కూడా అహింసను కఠినంగా ఆచరించినవాడు ఉత్తమ గతులు పొందగలడు. అహింస అంత పవిత్రతను పొందింది ? " అని అడిగాడు. ధర్మరాజు " దానం చెయ్యడం, ఇతరులకు ఉపకారం చెయ్యడం, సత్యం పలకడం, అహింసను పాటించడం అనేవి నాలుగు ఉత్తమ ధర్మములు కాని వాటిలో అహింస విశేషమైంది. దేవతా జన్మ, జంతుజన్మ, మానవజన్మ అనునవి మానవునికి కలుగు జన్మలు. దానము మొదలగు కర్మలు ఆచరిస్తూ అహింసా వ్రతం ఆచరించువాడు దైవత్వాన్ని పొందుతాడు. సదా హింస చేయువాడు జంతువుగా పుడతాడు. అందుకని అహింస పరమ ధర్మంగా పరిగణించ బడుతుంది " అని జవాబిచ్చాడు. ఈ సమాధానం విని నహుషుడు భీముని వదిలాడు. తన అజగర రూపం వదిలి దివ్యమైన మానుషరూపం పొందాడు. తరవాత ధర్మరాజు భీముని తీసుకుని తమ కుటీరానికి తీసుకువెళ్ళాడు.

## శ్రీకృష్ణ సత్యభామల విజయం


శ్రీకృష్ణ సత్యభామల విజయం

శరత్కాలంలో దక్షిణదిశగా అగస్త్య నక్షత్రం కనిపించింది. శరదృతువులో పాండవులు సరస్వతీ నదిలో స్నానం చేస్తూ కొంత కాలం గడిపారు. తరవాత కామ్యకవనం చేరారు. కామకవనానికి శ్రీకృష్ణుడు పాండవులను చూడటానికి సత్యభామా సమేతుడై వచ్చాడు. ఆ సమయంలో చిరంజీవి అయిన మార్కండేయ మహర్షి కూడా వారిని చూడటానికి వస్తున్నట్లు వర్తమానం అందింది. ధర్మరాజు శ్రీకృష్ణుని సాదరంగా ఆహ్వానించి సత్కరించాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజుని చూసి " ధర్మజా ! కౌరవులు నిన్నూ, నీ సోదరులను, భార్యనూ ఎన్నో బాధలకు గురిచేసారు. ధర్మం నీ పక్షంలో ఉన్నది. నీకు విజయం తథ్యం. అంధక, వృష్ణి, బోజక మొదలగు భూపతులు నీ పక్షాన ఉన్నారు. ఈ సామ్రాజ్యానికి నీవే చక్రవర్తివి కాగలవు చింతింపకుము " అని అనునయంగా చెప్పాడు. ధర్మరాజు " దేవా ! అరణ్యవాస కాలం చాలా వరకు గడచి పోయింది. అలాగే అజ్ఞాత వాసం పూర్తి చేసి మా ధర్మం తప్పకుండా మా రాజ్యాన్ని మేము జయిస్తాము. నీ దయ మా మీద ఉంటే మాకు చాలు. భారం అంతా నీ మీద మోపుతున్నాను " అన్నాడు. శ్రీకృష్ణుడు అక్కడే ఉన్న ద్రౌపదిని చూసి " అమ్మా! ద్రౌపదీ నీ కుమారులు యాదవరాజకుమారులతో కలసి సంతోషంగా ఉన్నారు. అస్త్రశస్త్ర విద్యలు అభ్యసిస్తున్నారు. నా చెల్లెలు సుభద్ర తన కుమారుని కంటే నీ కుమారుల మీద ఎక్కు ప్రేమ చూపిస్తుంది. వారిని గురించి నీవు చింత పడవద్దు " అని ఓదార్చాడు.

## మార్కండేయ మహర్షి రాక

ఒకరోజు మార్కండేయ మహర్షి పాండవుల దగ్గరకు వచ్చాడు. ధమరాజు శ్రీకృష్ణాదులతో మహర్షికి అతిథి సత్కారాలు చేసాడు. ధర్మరాలు మార్కండేయ మహర్షితో " ఓ మహర్షీ మేము ఎప్పుడూ ధర్మం తప్పి చరించ లేదు. మేము ఈ విధంగా బాధలు

పడుతున్నాము. దార్తరాష్టులు అధర్మ వర్తనులు అయినా పాపకార్యాలు చేస్తూనే సకల సౌఖ్యాలు అనుభవిస్తున్నారు. ఈ విపరీతానికి కారణం ఏమిటి? మనుషులు తాము చేసిన కర్మల ఫలాన్ని ఈ లోకంలోనే అనుభవిస్తారా? లేక ఈ లోకం లోను పరలోకంలోను అనుభవిస్తారా? ఈ విశ్వకర్త అయిన ఈశ్వరుని చూడని వాడు కర్మఫలం అనుభవించడా? ఈ దేహంతోనే కర్మలు వెడలి పోతాయా ? నాకు ఇవన్నీ వివరంగా తెలుపగలరా? " అని అడిగాడు.

## కాలధర్మాలు

మార్కండేయ మహర్షి ఈ విధంగా చెప్పాడు. " ధర్మజా! తొలుత ప్రధమ కల్పంలో అత్యంత నిర్మలమైన శరీరాలను సృష్టించాడు. ఆ ప్రకారం పుట్టిన మానవులు మహా సత్వగుణ సంపన్నులు, సత్యం పలికే వారు, సత్యవ్రతులై ఉన్నారు. జ్ఞాన సముపార్జన చేసారు, స్వేచ్ఛగా జీవించారు. దేవతల మార్గంలో పయనించారు. అధిక శ్రమ లేకుండా ఎక్కువ ఫలితాన్ని పొందారు. ధర్మం తప్పకుండా చరించారు. వారికి మత్సరం వంటి దుర్గుణాలు లేవు. అధిక సంతానవంతులై వేల సంవత్సరాలు జీవించారు. కాలక్రమేణా వారిలో కామము, లోభము, మదము, మాత్సర్యము లాంటి దుర్గుణాలు ప్రవేశించాయి. దేవతలు వారిని వదిలి వేసారు. మానవులలో బలం క్షీణించింది. సంపదలు తొలగి పోయాయి దరిద్రులు అయ్యారు. చేసిన కర్మలకు సత్ఫలితాలు రావడం తగ్గింది. రోగగ్రస్తులు అవడం మొదలైంది. మానవులకు దేవుని మీద నమ్మకం సన్నగిల్లి నాస్తికులు అయ్యారు. ఒకరంటే ఒకరికి పడటం లేదు. పాపాలు చేస్తున్నారు. నరకానికి పోతున్నారు. జంతు జన్మలు ఎత్తుతున్నారు. ఈ సంసారంలో తిరుగుతూ జనన మరణ చక్రంలో పడి సతమౌతున్నారు.

## పాపుణ్యాలు ఫలితాలు

ఈ విధంగా మానవులు చేసే పుణ్యం పాపం మరణానంతరం కూడా నశించవు. వారి పాపపుణ్యములు నశించక వాసనలుగా వారి వెంట వెళతాయి. కొందరు వారు చేసిన పాపపుణ్యములకు ఈ జన్మలోనే ఫలితం అనుభవిస్తారు. కొందరు స్వర్గం లోనూ, నరకం లూనూ అనుభవిస్తారు. కొందరికి ఈ లోకంలోనూ పరలోకంలోనూ సుఖం ఉండదు. కొందరు ఎక్కువ ధనం సంపాదిస్తారు. కాని మోహం లోభం కలిగి స్వసుఖాలకు మాత్రమే ధనం ఉపయోగిస్తారు. ఇంద్రియ సుఖాలకు మాత్రమే వెచ్చిస్తారు. పుణ్యకార్యాలు చెయ్యరు. ధర్మజా! నీవు ఎక్కువ పుణ్యకార్యాలు చేసావు. వేదాధ్యయనం, తీర్ధయాత్రలు చెయ్యడం లాంటి పుణ్యకార్యాలనేకం చేసావు. ధర్మవర్తివి కనుక ఈ లోకంలో కష్టాలు అనుభవించినా పరలోక సుఖం లభిస్తుంది. ఎల్లవేళలా ధర్మకార్యాలు చేస్తూ, ధర్మాచరణచేసూ, ధర్మబద్ధంగా అర్జిస్తూ, ధర్మబద్ధంగా వివాహం చేసుకుని సంతానం పొందిన వారికి ఇహలోక, పరలోక సుఖాలను అనుభవిస్తారు. ఎల్లప్పడూ అసత్య వచనం పలుకుతూ ఇంద్రియ లోలులై చరిస్తూ, శుచిసుభ్రం లేకుండా, నాస్తికులై అపరాధాలు చేసే వారు ఇహలోకంలోనూ పరలోకంలోనూ దు:ఖం అనుభవిస్తారు. ధర్మజా ! మీరు దేవతాంశలతో జన్మించారు. మీరు ధర్మం తప్పకుండా చరించి శత్రువులను జయిస్తారు. భూభారాన్ని తగ్గిస్తారు. ఎన్నో యజ్ఞ యాగాదులు చేసి దేవత్వాన్ని పొందుతారు " అని మార్కండేయమహర్షి చెప్పాడు.

## బ్రాహ్మణ ప్రభావం

ధర్మరాజు మార్కండేయుని బ్రాహ్మణ ప్రభావం గురించి చెప్పమని కోరాడు. మహర్షి " ధర్మనందనా! పూర్వం హైహవ వంశోద్భోడైన దుంధుమారుడు అనే రాజు వేట నిమిత్తం అడవిలో త్రుగుతూ ఒకచోట జింక చర్మాన్ని ఉత్తరీయంగా కట్టుకున్న బ్రాహ్మణుని చూసి అది మృగమనుకుని బాణంతో కొట్టాడు. తరువాత తాను చంపినది బ్రాహ్మణుడిని అని తెలుసుకుని దు:ఖించాడు. వంశ పెద్దలను వెంటపెట్టుకుని తార్క్షుడు అనే ముని దగ్గరకు వెళ్ళి పరిహారం చెప్పమని అడిగాడు. ఆ మహాముని చిరునవ్వుతో తన కుమారుని పిలిచి " ఇతడేనా మీ రాజు చంపిన బ్రాహ్మణుడు " అని అడిగాడు. హైహవులు ఆశ్చర్యపడి " మహాత్మా! ఈ ముని కుమారుడు మా మహారాజు చేతిలో చనిపోయాడు కదా మరలా ఎలా బ్రతికాడు? " అని అడిగారు. అందుకు ఆ ముని " మేము కొన్ని నియమాలు పాటిస్తాము. అన్నీ పనులూ సకాలంలో చేస్తాము. నియమిత ఆహారం తీసుకుంటాము. శాంతితో జీవిస్తాము. సత్యాన్ని మాత్రమే పలుకుతాము. బ్రహ్మచర్యం పాటిస్తాము. అతిధులను సత్కరిస్తాము . అందువలన మాకు మృత్యు భయం లేదు, రోగాలు రావు. కనుక మీరు నిశ్చింతగా వెళ్ళండి " అన్నాడు. వారు మునికి నమస్కరించి వెళ్ళారు. బ్రాహ్మణ ప్రభావం అంతటి మహోన్నతమైంది " అన్నాడు.

## బ్రాహ్మణ క్షత్రియ స్వరూపములు

ఆ తరవాత మార్కండేయుడు " ధర్మజా! నీకు బ్రాహణ క్షత్రియ స్వరూపాలను గురించి చెప్తాను విను అని చెప్ప సాగాడు.

పూర్వం అత్రి మహర్షి తపస్సు చేసు కోవడానికి అడవికి పోతూ భార్యను పిలిచి " నేను తపస్సు చేసుకోవడానికి వెళుతున్నాను. నీవు నీ పుత్రుల వద్ద ఉంటావా? నాతో వస్తావా? " అని అడిగాడు. అందుకు ఆమె " నాధా! పుత్రుల పోషణకు తగిన ఏర్పాటు చేయకుండా మీరు వెళ్ళడం ధర్మం కారు. కనుక మీరు వైన్యమహారాజును అడిగి కొంత ధనం తీసుకు రండి " అన్నది. అది విని అత్రి వైన్యమహారాజు దగ్గరికి వెళ్ళి దగ్గరకు వెళ్ళాడు. ఆసమయంలో వైన్యమహారాజు అశ్వమేధయాగం చేసి బ్రాహ్మణులకు దానధర్మాలు చేస్తున్నాడు. అత్రి ఆయన దగ్గరకు వెళ్ళి " రాజా ! నీవు బ్రహ్మదేవునితో సమానుడవు. ఇంద్రునితో సమానుడవు. నీవు సమస్త జనులకు ఈశ్వరుడవు. నీకు అన్ని ధర్మములు తెలియును. నీతో సమానమైన రాజు ఈ భీమి మీద లేడు. అందరూ ఋషులు నిన్ను పొగుడుతారు " అన్నాడు. అక్కడే ఉన్న గౌతమ మహర్షి ఇది విని ఆగ్రహించి " కేవలం ధనం కోసం జంకు లేకుండా మానవమాత్రుడైన రాజును ఇంద్రుడు, బ్రహ్మదేవుడు, ఈశ్వరుడు అని పొగడటం తగునా? " అని అన్నాడు. అత్రి " ఏది యుక్తము ఏది యుక్తము కాదు అని తెలియకుండా మాట్లాడ వద్దు. నీతివంతుడై, పరాక్రమ వంతుడై, నిర్మలుడై సమస్త లోకాన్ని పాలించే రాజు ధర్మానికి మూలం అటువంటి రాజును ప్రశంసించడం నాకు తగదా? " అని బదులు చెప్పాడు. గౌతముడు " కేశములు తెల్లబడినంత మాత్రాన నీవు జ్ఞానివి కాదు. సభలో జ్ఞానవృద్ధులకు మాత్రమే విలువ కదా " అన్నాడు. అత్రి గౌతముల వాదన విన్న కశ్యపుడు అనే మహాముని విని " అయ్యా ! ఈ వివాధం మనం తీర్చలేము. సనత్కుమారుడు అనే మహామునిని అడుగుదాము " అన్నాడు.

## సనత్కుమారుని తీర్పు

తరవాత అందరూ సనత్కుమారుని దగ్గరకు పోయి అత్రి గౌతముల వాదన వివరించారు. సనత్కుమారుడు " అత్రి నిజమే చెప్పాడు. ఈ భూమి సమస్తము తన భుజస్కందాల మీద మోసే సుక్షత్రియుడు అందరిని కాపాడే ప్రభువు. కనుక శత్రువులను సంహరించి అందరిని కాపాడే రాజే ఈశ్వరుడు, బ్రహ్మ. రాజు జనులందరికి పూజ్యుడు. అతని రక్షణలో సజ్జనులు, మునులు తమ తమ విధులు చక్కగా నెరవేర్చగలరు. అందరూ అతని ఆజ్ఞాబద్ధులే. రాజే సామ్రాట్టు, విరాట్టు అదృష్టాన్ని జయించిన వాడు. సత్యసంధుడు, ధర్మాత్ముడు, సక్రమంగా పాలించేవాడు అని వేదాలలో వర్ణించారు. పూర్వం అధర్మమునకు భయపడి బ్రాహ్మణులు తమ తేజస్సును రాజులయందు నిక్షేపించారు. అప్పటి నుండి బ్రాహ్మణ్యం వలన క్షాత్రం ప్రవర్తిసుంటుంది. కనుక బ్రాహ్మణ్యము క్షాత్రము ఒక దానిని ఒకటి ఆశ్రయించుకుని ఉన్నాయి. సూర్యుడు చీకటిని తరిమినట్లు క్షత్రియుడు బ్రాహ్మణులను సేవించి తేజోవంతుడై అధర్మాన్ని అణచి ధర్మాన్ని నిలబెడతాడు కనుక క్షత్రియుడు అధికం అని చెప్పవచ్చు " అన్నాడు. అప్పుడు వైన్యమహారాజు అత్రికి కావలసినంత ధనం ఇచ్చాడు.

## సరస్వతీ గీత


తార్క్ష్యునికి భోదిస్తున్న సరస్వతీ దేవి

ఆ తరువాత మార్కండేయ మహర్షి " సరస్వతి గీత గురించి చెప్పడం ప్రారంభించాడు. పూర్వం తార్క్ష్యుడు అనే మహాముని సరస్వతీ దేవిని ఆరాధించాడు. సరస్వతి దేవి ప్రత్యక్షంకాగానే తార్క్ష్యుడు ఆమెను కొన్ని ప్రశ్నలు అడిగాడు " అమ్మా! మానవుడు ఆచరించ వలసిన ధర్మం ఏది? మానవుడు ఏవిధంగా పుణ్యాత్ముడై పుణ్య లోకాలకు వెళతాడు? " అని అడిగాడు. సరస్వతీదేవి ఈ విధంగా జవాబిచ్చింది. " ఎన్నో వేదములు చదివిన బ్రాహ్మణుడు ఎన్నో యజ్ఞాలు చేసి పుణ్యకార్యాలు చేసి స్వర్గానికి వెళతాడు. మంచి పాలు ఇచ్చే ఆవును దానంగా ఇచ్చే బ్రాహ్మణుడు కూడా స్వర్గానికి పోతాడు. ఆవు శరీరం పై ఎన్ని రోమాలు ఉంటాయో అన్ని సంవత్సరాలు స్వర్గంలో ఉంటాడు. మంచి కోడె ఎద్దును దానం చేసిన వాడికి పది ఆవులను దానము చేసిన పుణ్యం లభిస్తుంది. వస్త్రదానం చేసిన వాడు చంద్రలోకం పోతాడు. బంగారం దానం చేసిన వాడు స్వర్గలోకం చేరతాడు. ఏడు సంవత్సరాలు అగ్నిదేవుని నేతితో ప్రీతిగా హోమం చేసిన వాడు తన పదునాలుగు తరాల పిత్రు దేవతలతో స్వర్గానికి పోతాడు. ఎల్లప్పుడూ శుచిగా ఉంటూ నిరంతరం అగ్ని హోత్రం చేసిన వాడు గోలోకం చేరతాడు. ఎందుకంటే అగ్నిహోత్రం నా స్వరూపం. సకల యజ్ఞ సంభారాలు నాకు సంభందించినవే. నేను అగ్నిహోత్రం ముఖంనుండి పుట్టాను. నేను విద్వాంశులందరి సందేహం తీర్చగలను. ఎల్లప్పుడూ వేదం చదువుతూ దాన ధర్మములు చేయు తపోధనులు శోకము అనేది తెలియకుండా ఎక్కడ నివసిస్తారో నేను అక్కడ నివసిస్తాను. యగ్న యాగాదులు చేసిన పుణ్యాత్ములు మరణానంతరం నా లోకానికి చేరగలరు " అని సరస్వతి చెప్పింది " ధర్మరాజుకు చెప్పాడు.

## వైవస్వత మనువు


కల్పాంతంలో మనువును రక్షిస్తున్న మత్స్యం

ధర్మరాజు మార్కండేయుని " వైవసత్వ మనువు ఏ విధంగా ప్రభావితుడైయ్యాడు " అని అడిగాడు. మార్కండేయుడు " ధర్మజా! చాక్షుస మన్వంతరంలో వైవసత్వుడు పది వేల సంవత్సరాలు తపస్సు చేసాడు. ఒకరోజు వైవసత్వుడు ఒక జలాశయంలో స్నానం చేసి ఒడ్డున ఉండగా ఒక చేప తీరానికి దగ్గరగా వచ్చి " అయ్యా ! ఈ జలాశయంలో నా కంటే బలవత్తరమైన జలచరములు ఉన్నాయి. నన్ను వేరే చోటికి తీసుకు పో. నీకు నేను ఉపకారం చేస్తాను " అని అడిగింది. వైవసత్వుడు ఆ చేపను తీసుకు వెళ్ళి ఒక బావిలో విడిచిపెట్టాడు. ఆ చేప పెద్దది అయింది " అయ్యా! నాకు ఈ బావి చాలడం లేదు వేరే ప్రదేశానికి తీసుకు వెళ్ళు అని అడిగింది.అది విని వైవసత్వుడు ఆచేపను మరింత పెద్ద బావిలో విడిచిపెట్టాడు. కొన్నాళ్ళకు ఆ బావి కూడా చాలలేదు. ఆ చేప కోరిక మేరకు దానిని ఒక మడుగులో వదిలి వేసాడు. కొద్ది రోజులకు ఆ మడుగు కూడా చాలకపోవడంతో దానిని సముద్రంలో వదిలి వేసాడు. ఆ చేప వైవసత్వుని చూసి " అయ్యా! కొద్ది రోజులలో ప్రళయం రాబోతుంది. అన్ని సముద్రాలు కలవబోతున్నాయి . దీనిని మన్వంతర సంధి అంటారు. నీవు ఒక ఓడను నిర్మించు అందులో అన్ని రకాల ధాన్యాలు, ఔషధాలు నింపు. సప్తఋషులతో కలసి ఆ ఓడ ఎక్కి నన్ను తలచుకో. నేను నీకు మేలు చేస్తాను " అని చెప్పింది. వైవసత్వుడు అలాగే ఒక ఓడను నిర్మించి ధాన్యాలతోను విత్తనాలతోనూ నింపి సప్తఋషులతో సముద్రాన్ని చేరాడు. ఆ చేపను మనసులో తలిచాడు. ఇంతలో ఆ చేప వచ్చింది. ఆచేప తలపై ఒక కొమ్ము ఉంది. ఆ ఓడ తాటిని తన కొమ్ముకు తగిలించుకుని సముద్ర మధ్యానికి తీసుకు వెళ్ళింది. ఆ తరవాత కుంభవృష్టి కురవడం మొదలై సముద్రాలన్నీ ఏకం అయ్యాయి. భూమి జలమయం అయ్యింది. ఆ చేప అనేక వేల సంవత్సరాలు ఆ ఓడను లాగుతూ ఉంది. ప్రళయం అంతరించింది. ఆ చేప వైవసత్వుని సప్తఋషులను చూసి "అయ్యా! ప్రళయ కాలంలో నేను మిమ్మల్ని కాపాడాను. ఈ వైవసత్వుడు మరలా సృష్టి కొనసాగించగలడు " అని చెప్పింది " అని ధర్మరాజుతో చెప్పాడు.

## కల్పాంతం

ధర్మరాజు మార్కండేయుని " మహర్షీ ! నీవు చిరంజీవివి ఎన్నో ప్రళయాలు చూసావు. ఈ చరాచర జీవరాశుల సృష్టి స్థితి లయలను ఎన్నో సార్లు చూసావు. ఈ లోకాలు ప్రళయకాలంలో ఎలా ఉంటాయి " అని అడిగాడు. మార్కండేయుడు " ధర్మజా! నూవు అడిగిన ఈ ప్రశ్నకు సాక్షాత్తు విష్ణు మూర్తి స్వరూపమని చెప్ప బడుతున్న శ్రీకృష్ణుని అనుమతితో సమాధానం చెబుతున్నాను. సావధానంగా వినుము " అని చెప్పసాగాడు. " కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం అని నాలుగు యుగములు. ఇవి పన్నెండు వేల దివ్య సంవత్సరములు. ఈ నాలుగు యుగములు క లసి ఒక మహా యుగం అని పిలువబడతాయి. ఇలాంటి మహా యుగాలు వెయ్యి కలిస్తే బ్రహ్మదేవునికి ఒక పగలు ఔతుంది. అలాంటి బ్రహ్మదివసము ఆఖరున నూరు సంవత్సరాల వరకు తీవ్ర అనావృష్టి ఏర్పడుతుంది. సూర్యుడు తీవ్రంగా ఉంటాడు. విపరీతమైన గాలులు వీస్తాయి. అంతలోనే మేఘాలు కమ్ముకుంటాయి. ఉరుములు మెరుపులతో విపరీతంగా వర్షం కురుస్తుంది. నదులు సముద్రాలు నిండి పోతాయి. అనావృష్టి అంతరించి అతి వృష్టి వస్తుంది. భూభాగమంతా జలమయం ఔతుంది. గాఢాంధకారం భూమండల మంతా వ్యాపిస్తుంది. ఇంతలో బ్రహ్మ ఆజ్ఞ మేరకు ఆ మేఘాలను విపరీతమైన గాలి వీచే చెదరగొడతాయి. బ్రహ్మదేవుడు అప్పుడు ఆ ఘోరమైన నీటి మధ్య పద్మంపై నిద్రిస్తాడు. ఈ విధంగా కల్పాంతం ఔతుంది. ఇలాంటి కల్పాలు ఎన్నో గడిచాయి. ఇక ముందు ఎన్నో రానున్నాయి.

## వటపత్రశాయి

ధర్మజా! ఈ కల్పాంతంలో నేను దిక్కుతోచక తిరిగాను. జలప్రళయంలో పెద్ద మర్రి చెట్టు కనపడింది. ఆ మర్రి ఆకు మీద నీల మేఘశ్యాముడైన శ్రీ మహావిష్ణువు చిన్ని బాలుని వలె పడుకుని ఉన్నాడు. ఈ మహాప్రళయంలో ఈ చిన్ని బాలుడు ఎలా ఉన్నాడా అని ఆశ్చర్య పోయాను. నేను ఆ బాలుని దగ్గరగా పోయాను. ఆ బాలుడు నన్ను చూసి నవ్వుతూ " మహానుభావా ! నీకు విశ్రాంతి లేక అలసి పోయి ఉన్నావు. నా దేహంలో ప్రవేశించి కొంచెం విశ్రాంతి తీసుకో " అంటూ తన నోరు

తెరిచాడు. నేను ఆ నోట్లోకి బలవంతంగా నెట్టబడ్డాను. ఆ బాలుని నోట్లో గంగ లాంటి మహానదులూ, మేరు పర్వతం లాంటి పర్వతాలు, సముద్రాలు, నగరాలు, జనపదాలు, ప్రజలు, పశుపక్ష్యాదులూ, సువిశాల భాగాలూ సూర్య చంద్రులూ, నక్షత్ర సముదాయాలు, అనంతాకాశం, ఇంద్రాది దేవతలు, యక్ష, రాక్షస, కిన్నెర, కింపురుషులు, విద్యాధరులు, సమస్త దేవతా సమూహములు, సమస్త జగములు అన్నీ నేను ఆ చిన్ని బాలుని ఉదరంలో చూసాను. అక్కడ నేను నూరు సంవత్సరములు తిరిగాను. తరువాత నాకు నాకు భయం వేసింది. అప్పుడు ఆ బాలుడు వదిలిన గాలికి నేను బయటకు విసిరి వేయబడ్డాను. తిరిగి మర్రి చెట్టు ఆకు పై పవళిచి ఉన్న ఆ బాలకుని చూసాను. ఆ బాలుడు నన్ను " మహాత్మా! నా ఉదరములో విశ్రాంతి తీసుకున్నావా? " అని అడిగాడు. నేను ఆ బాలునికి నమస్కరించి దేవా ! నీ ప్రభావం వలన సమస్త లోకములు నీ ఉదరంలో చూసాను. నీ మాయ అర్ధం కావడంలేదు. నీవా చిన్న బాలుడివి. నీ ఉదరంలో సమస్త లోకాలున్నాయి. ఈ జల ప్రళయం ఏమిటి ? దేవా ! నీవు నా భ్రాంతిని తొలగింపుము " అని అడిగాను.


మర్రి ఆకు మీద చిన్ని బాలుని వలె పడుకుని ఉన్న నీల మేఘశ్యాముడైన శ్రీ మహావిష్ణువు

#### నారాయణ తత్వం

మార్కండేయునికి నారాయణుడు తనను గురించి వివరించ సాగాడు. " మహాత్మా ! జలమును నారములంటారు. అందుకే నన్ను నారాయణుడంటారు. ఈ లోకమును నేనే సృష్టిస్తాను. నేనే పోషిస్తాను. నేనే నాలో లయం చేసుకుంటాను. బ్రహ్మ, ఇంద్రుడు, కుబేరుడు తదితర దేవతలందరూ నా అంశలే. నాకు భూమి పాదం, అగ్ని ముఖం, సూర్యచంద్రులు నేత్రాలు, ఆకాశం శిరస్సు. ఈ అద్భుతమైన ఆకారంలో నేను భాసిల్లుతాను. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు యజ్ఞయాగాదులతో నన్ను ఆరాధిస్తారు. ప్రళయకాలంలో ఈ భూమిని యజ్ఞవరాహావతారంతో ఉద్ధరించింది నేనే , ఈ భూమండలాన్ని భరిస్తున్నది నేనే. అగ్ని రూపంలో సముద్ర జలాలను త్రాగి వర్ష రూపంలో విడిచి పెడతాను. సృష్టి ఆరంభంలో నేను నా ముఖం నుండి, భుజముల నుండి, తొడలనుండి, పాదముల నుండి నాలుగు వర్ణాలను సృజిస్తాను. ప్రళయకాలంలో వీటన్నిటినీ నాలో లయం చేసుకుంటాను. అహంకారం విడిచి క్రోదం లేక ఎల్లప్పుడూ సత్యం పలుకుతూ కోరికలను జయించి అసూయకు లోబడక ఆత్మ జ్ఞానం పొందిన వారు అయిన ఋషులు ఎల్లప్పుడూ నన్ను ఆరాధిస్తుంటారు. ఈ జగత్తులో ఉండే గ్రహములు, గాలి, వర్షము అన్నీ నేనే. సప్త సముద్రాలను నేను పడకగా అమర్చుకుని పడుకుంటాను. మహర్షీ ! సత్యము పలకడమూ, తపము, అహింస, జ్ఞానము మొదలగు సాత్విక గుణములు నా స్వరూపాలు. ఆలాగే కోరికలూ, కోపం, ద్వేషం, అసూయ, తామసము, అజ్ఞానం అన్నీ నేనే. ఈ జగత్తులో కనిపించునదీ, కనిపించనిదీ అంతా నేనే. ధర్మానికి హాని కలిగి అధర్మం పెరిగినప్పుడు కౄరాత్ములు, రాక్షస ప్రవృత్తి కలిగిన వారు విజృంభించి ధర్మాత్ములు, సజ్జనులు హీనత పొందినప్పుడు నేను వారి ఇండ్లలో జన్మించి ధర్మమును నిలుపుతాను. నేను కృత, త్రేతా, ద్వాపర, కలి యుగాలలో వరుసగా శ్వేత, రక్త, నీల, పసపు వర్ణాలతో చరిస్తూ ధర్మ స్థాపన చేస్తాను. ఆ కాలచక్రాన్ని నేను అవిశ్రాంతంగా నడుపుతాను. లయ కాలమందు నేను కాల యముడినై నాలో లీనం చేసుకుంటాను. ముల్లోకాలను సృష్టించు బ్రహ్మదేవుడు నాలో సగభాగమే . నా పేరు నారాయణుడు. నేను శంఖ చక్ర గధా ధారినై బాలుని రూపంలో ప్రళయకాల మందు వేయి సంవత్సరాలు యోగ నిద్రలో ఉంటాను. ఈ కల్పాంతం చూసి నీవు భయపడతావని నా ఉదరంలో ఉంచాను. ఇక నీ ఇచ్చ వచ్చిన చోటికి వెళ్ళ వచ్చు . ఇక బ్రహ్మదేవుడు మేలుకుని ఈ లోకాలను సృష్టిస్తాడు " అని చెప్పి బాలకుడు మాయం అయ్యాడు. ఇది నేను కనులార చూసినాను. ఆ బాలుడే శ్రీకృష్ణుని రూపంలో మీకు సఖుడై ఉన్నాడు. ఈ నాడు నన్ను దయతలచి నాకు దర్శనం ఇచ్చాడు. ఈ మహానుభావుని దర్శనం వలన నేను గతస్మృతులు గుర్తుకు వచ్చి మీకు చెప్పగలిగాను " మార్కండేయుడు ధర్మారాజుకు తనకు నారాయణుడు వివరించిన విషయాలు చెప్పాడు.

### కలియుగ ధర్మం

ధర్మరాజు కలియుగంలో కలిగే ధర్మహాని గురించి వివరించమని మార్కండేయ మహర్షిని అడిగాడు. మార్కండేయ మహర్షి " ధర్మనందనా ! కృతయుగంలో ధర్మం నాలుగు పాదాలతో నడుస్తుంది, త్రేతాయుగంలో మూడుపాదాలతో నడుస్తుంది, ద్వాపరయుగంలో రెండు పాదాలతో నడుస్తుంది. కలియుగంలో ఒక్క పాదంతో నడుస్తుంది. ధర్మం క్షీణిస్తుంది. అధర్మం రాజ్యమేలుతుంది. నరులు సత్యం చెప్పరు. మానవుల ఆయుస్షు క్షీణిస్తుంది, విద్యలు క్షీణిస్తాయి. విద్యా హీనత వలన మోహం కలుగుతుంది. మోహము వలన లోభము, లోభము వలన కామము, కామము వలన క్రోధం, క్రోధం వలన వైరం

ఇలా ఒక దాని వెంట ఒకటి వస్తుంది. వైరం వలన వర్ణ భేధం కలుగుతుంది. వర్ణ బేధము వలన వర్ణసంకరం జరుగుతుంది. హింస ప్రబలుతుంది. బ్రాహ్మణుడు తన ధర్మాలైన జపము, తపము, నియమము, స్వాధ్యాయము విడుస్తారు. శూద్రులు తపస్సు చేస్తారు. జనపదాలు క్రూరమృగాలతో నిండి పోతాయి. అరాచకం ప్రబలుతుంది. రాజులు దుష్టులౌతారు. రాజ్యాధికారం నశిస్తుంది. క్షత్రియులు తమ ధర్మాలైన క్షాత్రము, తేజము, శౌర్యము విడిచి పెట్టి సేవకా వృత్తి అవలంబిస్తారు. పంటలు సరిగా పండవు. చెట్లకు, కాయలు, పూలు, పండ్లు సరిగా కాయవు. బ్రాహ్మణుడు తన ధర్మాన్ని వదిలి వ్యాపారం, వ్యవసాయం చేస్తాడు. నాస్తికులు ప్రబల మౌతారు. దేహ సంరక్షణయే ప్రధానము అనుకుంటారు. పాపం, పుణ్యమూ అనే మాటలకు విలువ ఉండదు. వానలు సకాలంలో కురవవు. విత్తనాలు తాలుగా ఉంటాయి. కొనుగోలు అమ్మకాలు మోసపూరితమౌతాయి. తాకట్టుఅ పెట్టిన ఆభరణాలు అపహరిస్తారు. సాధు చరితులు, సజ్జనులు రోగపీడితులౌతారు. అధర్మ వర్తనులు దీర్గాయువులై భోగభాగ్యాలు అనుభవిస్తారు. పనికిరాని పంటలు ఎక్కువ ఔతాయి. మానవులలో వివాహేతర సంబంధాలు ఎక్కువ ఔతాయి. పితృ కార్యాలలో అర్పించిన పిండములు ఒకరివి మరొకరు తింటారు. దైవకార్యాలు పితృకార్యాలు కాలానుగుణంగా జరగవు. బ్రాహ్మణులు హేతువాదులౌతారు. వేదాలను నిందిస్తూ పూజలు వ్రతములు విడనాడి దుర్మార్గులు ఔతారు. బంధువులను, దీనులను, దుర్బలులను, దీనులను మోసగించి వారి ఆస్తులను అపహరిస్తారు. తల్లి తండ్రులను, కన్నపిల్లలను చంపు వారిని, విచ్చలవిడిగా ప్రవర్తించు వారిని ప్రజలు పూజిస్తారు. వారి ధనానికి ఆశపడి బ్రాహ్మణులు వారిని ఆశ్రయిస్తారు. ప్రజలను రక్షించి భూమి పాలించ వలసిన ప్రభువు వారి ధనాన్ని దోచుకుంటాడు. స్త్రీలను, ధనాన్ని, భూములను హరిస్తారు. రాజులు వారిలో వారు కలహించి యుద్ధాలు చేసుకుంటారు. అందువలన ప్రజా క్షయం ఔతుంది. కొడుకులు తండ్రులను అవమానిస్తారు. భార్యలు భర్తను అవమానిస్తారు. భార్యాభర్తలు పరస్పరం కలహిస్తారు. ఎవరి ఇష్టం వచ్చినట్లు వారు ప్రవర్తిస్తారు. దేవకార్యం, పితృకార్యం నడవవు. వేదాధ్యయనం అంతరిస్తుంది. ఈ భూమి మొత్తం దుర్జనులతో నిండి పోతుంది. పదహారు ఏండ్లకే నూరేళ్ళు నిండుతాయి. ఏడెనిమిదేళ్ళకే స్త్రీలు సంతానవతులౌతారు. దానం చేసే వాళ్ళు ఉండరు. ప్రజలు ఒకరిని ఒకరు దోచుకుంటారు. అన్ని తెలిసిన జ్ఞానులు సైతం అధర్మంగా ప్రవర్తిస్తారు. అన్నాన్ని ధనం కోసం అమ్ముకుంటారు. బ్రాహ్మణులు వేదాన్ని అమ్ముకుంటారు. స్త్రీలు మానాన్ని ధనానికి అమ్ముకుంటారు. శూద్రులు అత్యంత బలవంతులై ఇతరులను సంహరిస్తారు. బ్రాహ్మణులు దిక్కు తోచక నాలుగు దిక్కులకు పారిపోతారు. దోపిడీదారులు, దొంగలూ ప్రజల ధన, ప్రాణాలను దోచుకుంటారు. ప్రజలు అడవులలో తలదాచుకుంటారు. శూద్రులు వేదాంతవిషయాలు వివరిస్తుంటే బ్రాహ్మణులు వింటుంటారు. బ్రాహ్మణులు ధైర్యం వీడి శూద్రులకు సేవకులై చేయరాని పనులు చేస్తారు. కలియుగంలో దేవాలయాలు, పవిత్రమైన ఆశ్రమాలు, బ్రాహ్మణ గృహాలు పాడై పోతాయి. అడవులను ధ్వంశం చేస్తారు. వ్యభిచారం, మద్యపానం ప్రబలి పోతాయి. శిష్యుడు గురువును లక్ష్యపెట్టడు. గురువు శిష్యుడిని మోసం చేస్తాడు. కరవు కాటకాలు ఏర్పడతాయి. ప్రజలలో భయం ఏర్పడుతుంది. కలియుగంలో క్రమంగా ధర్మం క్షీణించి అధర్మం వర్ధిల్లుతుంది.

## కల్కి అవతారము

ఇలా కలియుగం ఆఖరి దశకు చేరగానే శంబళ గ్రామంలో కల్కి అవతరిస్తాడు. అతని పేరు విష్ణుయశుడు. అతనికి సంస్మరణ చేతనే సకల వేదాలు, శాస్తాలు అవగతమౌతాయి. అతను సార్వభౌముడౌతాడు. అతడు అధర్మవర్తనులను సంహరించి ధర్మం నిలబెడతాడు. ఆ పై అశ్వమేధయాగం చేస్తాడు. అతను నిలిపిన ధర్మం అనుసరించి బ్రాహ్మణులు తమ ధర్మం నిర్వర్తిస్తారు. కృతయుగం ఆరంభమౌతుంది. ధర్మం నాలుగు పాదాల విలసిల్లుతుంది. దేవాలయాలు ఆశ్రమాలు పూర్వవైభవం సంతరించుకుంటాయి. సకాలంలో వానలు కురుస్తాయి. పంటలు సమృద్ధిగా పండుతాయి. ప్రజల ఆయుష్షు వృద్ధి చెందుతుంది. ఆరోగ్యంగా ఉంటారు. తిరిగి కాలచక్రం మొదలౌతుంది. " కనుక ధర్మనందనా ! నీవు బ్రాహ్మణులను అవమానించకు వారికి ఇష్టం వచ్చినవి చేయుము. సమస్త భూతముల యందు అయకలిగి ఉండు. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించు. పాపాత్ములను శిక్షించు. అజ్ఞానం ప్రబలకుండా చూడు. అహంకారం వదిలి పెట్టు. ఎల్లప్పుడూ సత్యమే చెప్పు. నీవు భరతవంశ సంజాతుడవు నీకు అన్నీ తెలుసు. ప్రాజ్ఞుడవు నీకు చెప్పవలసిన పని లేదు " అన్నాడు. ధర్మరాజు " మహాత్మా! మీరు ఆనతిచ్చిన ప్రకారం నేను లోభం, మత్సరం లేకుండా ప్రవర్తిస్తాను. ధర్మం ఆచరిస్తాను " అన్నాడు.

### పరీక్షిత్తు వృత్తాంతము

ధర్మరాజు " మహర్షీ ! బ్రాహ్మణ ప్రభావం గురించి వివరించడి " అని అడిగాడు. మార్కండేయుడు " పూర్వకాలంలో పరీక్షిత్తు అనే రాజు అయోధ్యను పాలిస్తుండేవాడు. ఆ రాజు అడ్విలో వేటాడుతూ ఒక సుందరిని చూసి మోహించి " ఓ సుందరీ ! నీ వెవరు? ఈ అడవిలో ఒంటరిగా ఎందుకు తిరుగుతున్నావు? " అని అడిగాడు. అందుకు ఆ యువతి " నేను అవివాహితను. తగిన వరుని కోసం వెతుకుతున్నాను " అన్నది. అందుకు ఆ రాజు తనను వివాహమాడమని కోరాడు. అందుకు ఆమె అంగీకరించింది. కాని తనను జలవిహారానికి ఎప్పుడూ తీసుకు వెళ్ళకూడదని కోరింది. అందుకు అంగీకరించి ఆమెను వివాహమాడి రాజధానికి తీసుకు వెళ్ళాడు. ఒకరోజు వారు ఉద్యానవనంలో విహరిస్తున్న సమయంలో రాజు కొలనులో స్నానం

చేస్తూ ఆమెను కూడా పిలిచాడు. ఆమె అలాగే కొలనులో దిగి అదృశ్యం అయింది. వెంటనే రాజు భటులను పిలిచి ఆ కొలనులోని నీటిని బయటకు పోయించాడు. కొలను అడుగున అసంఖ్యాకంగా కప్పలు ఉన్నాయి. ఆ కప్పలే తన భార్యను మాయం చేసి ఉంటాయని భావించాడు. వెంటనే లోకంలోని కప్పలన్నిటినీ నాశనం చెయ్యమని ఆజ్ఞాపించాడు. సేవకులు రాజు చెప్పినట్లే కప్పలను వెతి వెతికి చంపడం మొదలు పెట్టారు. కప్పల నాయకుడు ఒక మహర్షి రూపంలో రాజు వద్దకు వచ్చి కప్పలను చంపవద్దని అర్ధించాడు. అందుకు రాజు " అవి నా ప్రేయసిని మింగేసాయి అందుకే చంపుతున్నాను " అన్నాడు. కప్పల నాయకుడు " మహారాజా! నేను కప్పల దొరను. ఆమె నా కూతురు. ఆమె నీ లాగే చాలా మందిని మోసం చేసింది " అన్నాడు. పరీక్షిత్తు " ఐతే ఆమెను తెచ్చి నాకు అప్పగించు " అని రాజు చెప్పాడు. ఆ కప్పలదొర తన కూతురును అక్కడకు పిలిపించి ఆమెతో కప్పల నాయకుకుడు " ఎంతో మంది రాజులను మోసగించావు కనుక నీకు పుట్టే బిడ్డలు దుర్మార్గులు, మోసగాళ్ళు ఔతారు " అని శపించాడు. తరువావత వారికి శలుడు, నలుడు, వలుడు అనే ముగ్గురు కుమారులు జన్మించారు. తరవాత ఆ రాజు శలునికి రాజ్యం అప్పగించి తపోవనాలకు వెళ్ళాడు.

### వామదేవుడు

ఒకరోజు శలుడు వేటకు వెళ్ళాడు.ఒక మృగం అతని బాణం దెబ్బ తిని పారిపోయింది. రాజు సారధితో ఆ మృగాన్ని వెంటాడమని చెప్పాడు. సారధి రాజా ఆ మృగం చాలా వేగంగా పరుగెత్తింది. మనం ఎంత వేగంతో రధం నడిపినా దానిని చేరలేము. మన గుర్రాలు వామ్య జాతికి చెందినవి అయితేనే ఆ మృగాన్ని పట్టగలము. అలాంటి గుర్రాలు వామదేవుడు అనే మహర్షి దగ్గర ఉన్నాయి " అని అన్నాడు. వెంటనే ఆ రాజు వామదేవుని వద్దకు వెళ్ళి " మునీద్రా! నేను ఒక మృగాన్ని కొట్టాను. అది దెబ్బతిని పారి పోయింది. ఆ మృగాన్ని పట్టుకోడానికి నీ అశ్వములను ఇవ్వు " అని అడిగాడు. వామదేవుడు " రాజా! ఆ గుర్రాలను తీసుకు వెళ్ళి నీపని కాగానే నాకు తిరిగి ఇవ్వు " అన్నాడు. అలాగే అని చెప్పి శలుడు ఆ అశ్వములను తీసుకు వెళ్ళి మృగాన్ని పట్టుకుని రాజధానికి వెళ్ళాడు. ఇంత వేగం కలిగిన గుర్రాలు రాజుల వద్ద ఉండాలి కాని ఆ మునికి వీటితో పని ఏమి? అనుకుని వాటిని తన వద్దనే ఉంచుకున్నాడు. ఎన్ని రోజులకు రాజు తన గుర్రాలను తిరిగి ఇవ్వక పోవడంతో వామదేవుడు తన శిష్యుడు ఆత్రేయుడిని ఆ గుర్రాలను తీసుకు రమ్మని రాజు వద్దకు వెళ్ళాడు. ఆత్రేయుడు రాజు వద్దకు వెళ్ళి " రాజా! మీరు నా గురువుగారైన వామదేవుని దగ్గర ఉన్న అశ్వములను తీసుకుని తిరిగి ఇవ్వలేదు. వాటిని స్నేహపూర్వకంగా ఇస్తే నేను వాటిని తీసుకు వెళతాను " అన్నాడు. అందుకు శలుడు కోపించి " ఆయన పంపడం నీవు రావడం చాలాబాగుందిలే వెళ్ళు " అన్నాడు. ఆ త్రేయుడు ఆ విషయం తన గురువుకు చెప్పాడు.

### శలుడి గర్వభంగము

వామదేవుడు ఆగ్రహించి రాజు వద్దకు వచ్చాడు. " రాజా! నీకు ఇది తగదు. నీవు అప్పగా తీసుకున్న గుర్రాలను తిరిగి ఇవ్వు. నీ పని అయింది కదా. అప్పగా తీసుకున్న సొమ్ము తిరిగి ఇవ్వక లోభంతో అలాగే ఉంచుకోవడం పాపం కదా. అలాంటి పాపం చేసిన వాళ్ళూ నరకానికి పోతారు " అన్నాడు. శలుడు " అయ్యా ! విప్రులకు గుర్రాలు ఎందుకు కావాలంటే రెండు ఎద్దులను ఇస్తాను తీసుకుపో. అవి నచ్చక పోతే కంచరగాడిదలను ఇస్తాను కానీ గుర్రాలను మాత్రం ఇవ్వను. ఊరికే ఆశలు పెట్టుకోవద్దు " అన్నాడు. వామదేవుడూ " రాజా ఇది అధర్మం. విప్రుల సొమ్ము తీకుని ఇవ్వననడం, పాపం కాదా " అన్నాడు. శలుడికి కోం వచ్చింది. " ఈ బ్రాహ్మణుని పట్టి బంధించి శూలాలతో పొడిచి చంపండి " భటులకు ఆజ్ఞాపించాడు. వామ దేవుడికి కోపం వచ్చింది. అతని ముఖం నుండి ఎందరో రాక్షసులు పుట్టుకు వచ్చి రాజును భటులను అంపారు. శులుడు చనిపోయిన తరవాత నలుడు రాజయ్యాడు. వామదేవుడు నలుని దగ్గరకు వచ్చి " రాజా మీరు ధర్మ పరులు నాగుర్రాలను నకు ఇప్పించండి " అని అడిగాడు. నలునికి కూడా కోపం వచ్చింది " ఈ బ్రాహ్మణుడిని చంపటానికి విషం పూసిన బాణం తెప్పించండి " అని భటులను ఆజ్ఞాపించాడు. అందుకు వామదేవుడు నవ్వి " రాజా! అంతఃపురంలో ఉన్న నీ కుమారుని అది చంపగలదు జాగ్రత్త " అని హెచ్చరించాడు. అంతలో అంతఃపరం నుండి ఆహాకారము చేస్తూ చనిపోయిన రాజకుమారుని తీసుకు వచ్చారు. అది చూసి నలుడు కోపంతో ఒళ్ళు మరచి " అహంకారంతో మాట్లాడుతున్న ఈ బ్రాహ్మణుని నేనే సంహరిస్తాను " అని విల్లు ఎక్కు పెట్టాడు కాని అతని రెండు చేతులు విల్లు బాణం స్తంభించి పోయాయి. రాజుకు గర్వం దిగి పోయింది. ప్రజలను చూసి " నా గర్వం అణిగి పోయింది బ్రాహ్మణశక్తి ముందు నా శక్తి పనికిరాదని తెలుసుకున్నాను వామదేవుడికి నమస్కరిస్తున్నాను " అన్నాడు. వామదేవుడు ప్రసన్నుడై రాజకుమారుని బ్రతికించి నలుని యస్థితికి తీసుకు వచ్చాడు. నలుడు గుర్రాలను వామదేవుడికి తిరిగి ఇచ్చాడు. ధర్మరాజా బ్రాహ్మణుల మహిమ అలాంటిది అని మార్కండేయుడు చెప్పాడు.

### ఇంద్రద్యుమ్నుడు

ధర్మరాజు మార్కండేయునితో అయ్యా " అయ్యా! మీరు చిరంజీవులు కదా మీ కంటే వయసులో పెద్ద వారున్నారా? " అని అడిగాడు. మార్కండేయుడు " ధర్మజా! పూర్వం ఇంద్రద్యుమ్నుడు అనే రాజు ఉండే వాడు. అతను చేసిన పుణ్యం కారణంగా చాలా కాలం స్వర్గ సుఖాలు అనుభవించాడు. పుణ్యం క్షీణించడం వలన అతనిని తిరిగి భూలోకానికి పెళ్ళమన్నారు. అతడు నా దగ్గరకు వచ్చి " మహర్షీ నేనెవరో మీకు తెలుసా? " అని అడిగాడు .అందుకు నేను " అయ్యా! మీరెవరో నాకు తెలియదు. హిమాలయాలలో నాకన్నా వయసులో పెద్ద వాడు ఉన్నాడు. అతని పేరు ప్రవార కర్ణుడు అనే గుడ్లగూబ. దానిని అడుగుము " అని చెప్పాను. ఇంద్రద్యుమ్నుడు నన్ను కూడా తనతో రమ్మన్నాడు. నేనే వృద్ధాప్యంతో రాలేనని చెప్పాను. అతను గుర్రం రూపం ధరించి నన్ను తీసుకు వెళ్ళాడు. ఆ గుడ్లగూబను కృడా నన్ను ప్రశ్నించినట్లే ప్రశ్నించాడు. ఆ గుడ్లగూబ కూడా " అయ్యా! నేను నిన్ను ఎరుగను కానీ ఇంద్రద్యుమ్నం అనే కొలనులో నాడీజంఘుడు అనే కొంగ ఉన్నది. దానికి తెలిసి ఉంటుంది అన్నది. ఇంద్రద్యుమ్నుడు నన్ను గుడ్ల గూబను తీసుకుని నాడీ జంఘుడిని వద్దకు తీసుకు వెళ్ళి నన్ను అడిగినట్లే అడిగాడు. అందుకు నాడీ జంఘుడు " అయ్యా ! నేను కూడా ఎరుగను నా కంటే పెద్ద వాడైన అకూపారుడు అనే తాబేలుకు తెలిసి ఉండచ్చు. దానిని అడగచ్చు " అన్నది. ఇంద్రద్యుమ్నుడు నన్ను, గుడ్లగూబను, కొంగను, తాబేలు వద్దకు వచ్చాడు. తాబేలును కూడా నన్ను అడిగినట్లే అడిగాడు. ఆ తాబేలు " అయ్యా! నేను ఎరుగక పోవడం ఏమిటి. ఆయన మహాత్ముడు గుణవంతుడు ఆయన నన్ను ఎన్నో ఆపదల నుండి కాపాడాడు. ఆయన ఎన్నో యజ్ఞాలు చేసాడు బ్రాహ్మణులకు ఆవులను దానాలు చేసాడు. ఆ యన దానాలు చేసిన ఆవుల గిట్టల రాపిడితోనే ఈ మడుగు ఏర్పడింది " అని చెప్పింది. తాబేలు చెప్పిన మాటలకు దేవతలు స్వర్గం నుండి విమానం తీసుకు వచ్చి " అయ్యా! మీరు పుణ్యాత్ములు మీకు శాశత స్వర్గలోక ప్రాప్తి లభించింది " అని చెప్పారు. ఇంద్రద్యుమ్నుడు " అయ్యా నా మాట ప్రకారం వీరంతా నా వెంట వచ్చారు వీరిని వారి వారి స్వస్థలాలలో వదిలి వస్తాను " అని చెప్పి అందరిని వారి వారి స్థలాలలో దింపి వచ్చి స్వర్గానికి వెళ్ళాడు.

### దుంధుమారుడు

ధర్మరాజు మార్కండేయునితో " మహర్షీ! మీ కన్నా వయసులో పెద్దల గురించి చెప్పారు అలాగే ఇక్ష్వాకు వశ్యంలో జన్మించిన కువలయాశ్వునికి ఆ పేరెలా వచ్చిందో వివరించండి " అని అడిగాడు. అందుకు మార్కండేయుడు " ఉదంకుడనే మహర్షి వృష్ణువుని గురించి తపస్సు చేసాడు. అతని తపస్సుకు మెచ్చి విష్ణుమూర్తి " ఏ మి కావాలో కోరుకో" అని అడిగాడు . ఉదంకుడు " దేవా! నీవు ప్రత్యక్షం కావడం కంటే వేరే వరం ఎందుకు. సదా నా మనస్సు నీపై లగ్నం అయ్యేలా వరమిస్తే అదే చాలు. అన్నాడు. విష్ణువు " ఉదంకా ! నీకు జ్ఞానం సిద్దిస్తుంది అలాగే నీ వలన ఒక మహత్కార్యం సిద్ధిస్తుంది. లోకకంటకుడైన దుంధుడు అనే రాక్షస సంహారానికి నీవు సహకరిస్తావు. ఇక్ష్వాకు వంశంలో పుట్టిన కువలయాశ్వునికి నా చేత ప్రసాదించబడిన యోగబలానికి నీ ప్రయాత్నం తోడైతేనే సంహరింపబడగలడు. నీవు అతనిని సమాయత్తం చేసి ఈ కార్యం నెరవేర్చి లోకాలకు మేలు కలిగించు " అని చెప్పి మాయమయ్యాడు. ఉదంకుడు తన తపస్సు కొనసాగించాడు. ధర్మజా ! కువలయాశ్వుడు ఇక్ష్వాకు వంశంలో జన్మించిన వాడు. ఇక్ష్వాకు కుమారుడు అనసేనుడు. అతడి కుమారుడు పృధుడు. అతడి కుమారుడు విషగ్వుడు. అతడి కుమారుడు ఆర్దుడు. అతడి కుమారుడు యవనాశ్వుడు. అతడి కుమారుడు శ్రావస్తుడు. అతడి కుమారుడు బృహదశ్వుడు. బృహదశ్వుని కుమారుడూ కువలయాశ్వుడు. కువలయాశ్వునికి ఇరవై ఒక్క వేల కుమారులు ఉన్నారు అందరూ మహా బలవంతులు విలు విద్యలో ఆరితేరిన వారు. బృహదశ్వుడు కువలయాశ్వునికి రాజ్యం ఇచ్చి తపోవనాలకు వెళ్ళాలని అనుకున్నాడు.

### ఉదంకుడి కోరిక

ఆ తరుణంలో ఉదంకుడు బృహదశ్వుని వద్దకు వెళ్ళి " రాజా! నీవు అడవులలో ఉండి తపమాచరించే కంటే ప్రజా రక్షణ చేస్తూ రాజ్య పాలన చేయడం మేలు కదా! అలాగైతేనే సాధువులైన మాకు మేలు అధికం. మధుకైటబుల కుమారుడు దుంధుడు మా ఆశ్రమ సమీపంలో తపస్సు చేస్తున్నాడు. దుంధుడు బ్రహ్మదేవుని మెప్పించి వరాలు పొందాడు. అతడు విడిచేగాలికి రేగే ధూమం వలన మేము అనేక అవస్థలు పడుతున్నాము. కనుక నీవు దుంధుడిని సంహరించి మమ్ములను రక్షించాలి అన్నాడు. విష్ణుమూర్తి కూడా ధుంధుడిని సంహరించడానికి యోగబలం అందిస్తానని చెప్పాడు. నీవు ఆరాక్షసుని సంహరించి మాకు రక్షణ కలిగించాలి " అని కోరాడు. బృహదశ్వుడు " మహాత్మా! దుంధుడిని సంహరించడానికి నా కుమారుని పంపుతాను. నాకు తపో వనాలకు వెళ్ళడానికి అనుజ్ఞ ఇవ్వండి " అని కోరాడు. ఉదంకుడు అందుకు అంగీకరించాడు. ఉదంకుని కోరిక ప్రకారం బృహదశ్వుడు కువలయాశ్వుని ధుంధుడిని సంహరించమని పొంపాడు. విష్ణుమూర్తి తన యోగశక్తిని కువలయాశ్వునిలో ప్రవేశ పెట్టాడు. కువలయాశ్వుడు ఇసుక తిన్నెలను తవ్వించి అక్కడ నిద్రిస్తున్న రాక్షసుని నిద్ర లేపారు. అతడు వదిలిన గాలి అగ్నిజ్వాలలై కువలయాశ్వుని ముగ్గురు కుమారులు తప్ప అందరూ మరణించారు. కువలయాశ్వుడు ఆ రాక్షసునితో ఘోరంగా యుద్ధం చేసి చివరిగా బ్రహ్మాస్త్రం ప్రయోగించి రాక్షసుని సంహరించాడు. అప్పటి నుండి కువలయాశ్వుడు దుంధుమారుడుగా పిలువబడ్డాడు. అప్పుడు, ఉదంకుడు, దేవతలు, మహర్షులు కువలయాశ్వుని వరం

కోరుకొమ్మని అడిగారు. కువలయాశ్వుడు " మహాత్ములారా ! నాకు ఎల్లప్పుడూ విష్ణు భక్తి, బ్రాహ్మణభక్తి, దానం చేసే శక్తి అనుగ్రహించండి " అని వేడుకున్నాడు. అతను కోరిన వరాలు ప్రసాదించి అందరూ తిరిగి వెళ్ళారు.

### మధు కైటబులు


మధు కైటబుల వధ

కువలయాశ్వుని వృత్తాంతంలో మధుకైటబుల ప్రస్తావన రాగానే ధర్మరాజు మార్కండేయుని మధుకైటబుల గురించి చెప్పమని కోరాడు. మార్కండేయుడు ధర్మరాజుతో " ధర్మరాజా! ముల్లోకాలు జలమయమై ఉండగా విష్ణుమూర్తి ఆది శేషునిపై నిద్రిస్తూ యోగ నిద్ర లో ఉన్నాడు. కొంత కాలానికి మధుకైటబులనే రాక్షసులు విజృంభించి దేవతలను బాధించి చివరకు విష్ణువు నాభి నుండి ఉద్భవించిన బ్రహ్మదేవుని కుడా బాధించారు. బ్రహ్మదేవుని ఆక్రందనతో యోగనిద్ర నుండి మేల్కొన్న విష్ణువు మధుకైటబుల ఆగడాలను విన్నాడు. విష్ణువు మధుకైటబులను చూసి "మధుకైటబులారా! మీ బలపరాక్రమాలకు మెచ్చాను. ఏమి వరం కావాలో కోరుకోండి " అని అడిగాడు. అందుకు వారు గర్వంతో "మేమే నీకు వరాలు ఇస్తాం ఏమి కావాలో కోరుకో " అని చెప్పారు. విష్ణు మూర్తి మధుకైటబులారా! నేను వరాలు కోరుకుంటున్నాను ఆడిన మాట తప్పక నాచే మృత్యువును పొంది లోకాలకు ప్రీతి కలిగించండి " అన్నాడు. అందుకు వారు "దేవా! మేము ఆడిన మాట తప్పము మేము ప్రాణాలు ఇవ్వడానికి సిద్ధం అయితే జలం లేని చోట మమ్ములను సంహరించండి " అన్నారు. ఆ సమయంలో ముల్లోకాలు జలమయమై ఉన్నాయి కనుక విష్ణువు వారిని తన తొడపై కూర్చుండబెట్టి చక్రాయుధంతో సంహరించాడు.

## మూలాలు

## బయటి లింకులు

- ఇంటర్నెట్ ఆర్చీవులో అరణ్యపర్వము (http://www.archive.org/details/sriandhramahabar023368mbp) - సాహిత్య అకాడమీవారి ప్రచురణ

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

# వన పర్వము పంచమాశ్వాసము

వికీపీడియా నుండి

**వనపర్వము** లేదా **అరణ్య పర్వము** మహాభారతం ఇతిహాసంలోని మూడవ భాగము. సంస్కృతమూలం వ్యాసుడు రచించాడు. ఆంధ్ర మహాభారతంలో కొంత భాగాన్ని నన్నయ అనువదించాడు. నన్నయ మరణించడం వలన అది అసంపూర్తిగా ఉండిపోయింది. షుమారు 200 యేండ్ల తరువాత అరణ్య పర్వ శేషాన్ని ఎఱ్ఱన తెలుగులోనికి అనువదించాడు.

సభాపర్వంలో భంగపడిన పాండవులు జూద నియమానుసారం పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం చేయడం ఈ పర్వంలో ముఖ్య కధాంశం.

## విషయ సూచిక

# పంచమాశ్వాసం

ధర్మరాజు మార్కండేయునితో " మహర్షీ! నాకు గొప్ప పతివ్రతల గురించి వినాలని ఉంది. సంతానం కొరకు తల్లి తండ్రులలో ఎవరు ఎక్కువ కష్టపడతారు? తల్లి తండ్రుల పట్ల పుత్రుని బాధ్యత ఎలాంటిది? తక్కువ జాతిలో పుట్టినా ధార్మికులు పొందు లోకాలను పొందడమెలా? అన్నవి నాకు వివరించండి " అని అడిగాడు.

## సంతానం తల్లితండ్రులు

ధర్మరాజు అడిగిన దానికి మార్కండేయుడు " ధర్మజా! తల్లి బిడ్డను నవమాసాలు కడుపున పెట్టుకుని మోసి ప్రాణాలకు లెక్క చేయక ప్రసవిస్తుంది. తండ్రి సంతానం క్షేమం కొరకు శ్రమించి అర్ధం సంపాదించి యగ్న యాగాదులూ, దానధర్మాలు లాంటి కార్యాలు నిర్వర్తిస్తుంటాడు. కనుక తల్లి తండ్రులు ఇరువురూ సంతానం కొరకు సమానంగా కష్టపడతారు. తల్లి తండ్రులు తమ కుమారుడు ధర్మ వర్తనుడై తమపట్ల వినయ విధేయతలు ప్రదర్శించాలని కోరుకుంటారు. తల్లితండ్రుల ఆశలను నెరవేర్చిన పుత్రుడు ఉత్తమడై ధనం, కీర్తి గడించి ఉత్తమ లోకాలను పొందగలడు . ఏ స్త్రీ భర్తను సేవించడంలో ఆసక్తి కలిగి ఉంటుందో ఆమె యజ్ఞయాగాదులు చేసిన పుణ్యం పొందగలదు ఉదాహరణగా నీకు కౌశికుని వృత్తాంతం చెబుతాను విను " అన్నాడు.

## కౌశికుడు

పూర్వం కౌశికుడు అనే బ్రాహ్మణుడు ఉండే వాడు. అతడు ధర్మపరుడు ఎన్నో యగ్న యాగాదులు చేసాడు. ఒకరోజు అతడు ఊరి బయట చెట్టు కింద కూర్చుని వేదాలు వల్లిస్తున్న సమయంలో ఒక కొంగ అతని మీద రెట్ట వేసింది. కౌశికుడు ఆగ్రహించి ఆ కొంగ వైపు తీక్షణంగా చూసాడు. ఆ చూపుల తీక్షణతకు ఆ కొంగ చచ్చి పోయి కింద పడింది. కౌశికుడు అది చూసి కలత పడింది. " అయ్యో ! నేను ఎంత నిర్ధయగా ఈ కొంగను చంపాను. నా పాపానికి నిష్కృతి లేదు " అని విలపించాడు. ఇంతలో మధ్యాహ్నం అయింది ఒక ఇంటికి బిక్షకు వెళ్ళాడు. ఆ ఇంటి ఇల్లాలు అతనికి బిక్ష వేయడానికి పాత్రను సిద్ధం చేస్తున్న సమయంలో ఆమె భర్త ఆకలితో ఇంటికి వచ్చాడు. ఆమె భర్తకు అభ్యంగన స్నానం చేయించి భోజనం పెట్టి అతని కాళ్ళు వత్తే సమయంలో బిక్షకు వచ్చిన బ్రాహ్మణుడు గుర్తుకు వచ్చాడు. ఆమె ఒక పాత్రలో అన్నం తీసుకు వచ్చి బిక్ష వేయాటానికి రాడం చూసి కౌశికుడు కోపించి " ఏమీ ఇంత గర్వమా! నన్ను చూసిన వెంటనే పొమ్మంటే పోదును కదా! ఇంత సేపు ఎందుకు ఆలస్యం చేసి అవమానించావు? " అని అడిగాడు. అయ్యా మీకు బిక్ష తెచ్చేటప్పుడు నా భర్ధ వచ్చాడు. అయనకు పరిచర్యలు చేసి వచ్చేసరికి నాకు ఆలస్యం అయింది ఓర్పు వహించండి " అన్నది. కౌశికుడు " నీకు ఇంత గర్వమా బ్రాహ్మణులు లోకవంద్యులు. బ్రాహ్మణుల కంటే భర్త ఎక్కువా? సాక్షాత్తు దేవేంద్రుడు కూడా బ్రాహ్మణులను గౌరవిస్తాడు. వారి ఆగ్రహానికి గురైతే లోకాలు భస్మం కాగలవు " అన్నాడు. ఇల్లాలు " అయ్యా ! బ్రాహ్మణుల మహిమ నాకు తెలియనిది కాదు. వాతాపిని జీర్ణం చేసుకున్నది, సముద్ర జలాలను త్రాగరానివిగా చేసినది, దండకారణ్యం తగుల బెట్టినది మొదలైన ఎన్నో మహత్తర కార్యములు చేసిన బ్రాహ్మణులను అవమానించి కోరి కష్టాలు తెచ్చుకుంటానా ? నాకు భర్తే పరమ దైవం అంతకంటే స్త్రీకి ఉత్తమ ధర్మం లేదు. బ్రాహ్మణోత్తమా మీకు ఆగ్రహం ఎక్కువ అని నా పాతివ్రత్య మహిమతో తెలుసు కున్నాను. కోపం, మోహం మనిషికి ప్రధమ శత్రువులు వాటిని జయించని బ్రాహ్మణులు ఉత్తములు కాజాలరు. మీరు మీ పై రెట్ట వేసిన కొంగను దహించిన విషం నేనెరుగుదును. ఇంద్రియములను జయించిన వాడు, అహింసను కలిగిన వాడు, సత్య వ్రతమును ఆచరించిన వాడు, సకల జనుల యందు సమ భావం కలిగిన వాడు, గురువులను పూజించే వాడు, ధర్మవర్తనుడు అయిన బ్రాహ్మణుడు పూజనీయుడు కాగలడు. సత్ప్రవర్తన, వేదాధ్యనం లాంటి ఉత్తమ కర్మలే బ్రాహ్మణ సంపదలు. ధర్మం బహు సూక్ష్మమైనది. నేను ఆడుదానిని నాకు వివరంగా తెలియదు. నీకు తెలిపగల వాడు మిధిలా నగరంలో ఉన్నాడు. అతని పేరు ధర్మవ్యాధుడు. అతడు ఒక కిరాతుడు. అతడు సత్య వ్రతుడు, సద్గుణ సంపన్నుడు, ధర్మవర్తనుడు, మాతాపితలను పూజించే వాడు. అతని దగ్గరకు పోయి ధర్మం గురించి తెలుసుకో. నీవు సాధ్యాయన పరుడవే కాని ధర్మసూక్ష్మములు ఎరుగవు. నేను చెప్పిన దానిలో అపరాధం ఉంటే నన్ను మన్నించు " అన్నది. కౌశికుడు " అమ్మా! నీ వలన నాకు జ్ఞానోదయం అయింది. నా మనసుకు శాంతి లభించింది " అని చెప్పి మిధిలకు ప్రయాణమయ్యాడు. కౌశికుడు ఆ పతివ్రత మహిమకు అచ్చెరువంది ఆమెను దూషించి నందుకు పశ్చాత్తాపపడ్డాడు.

## ధర్మవ్యాధుడు

మిథిలకు చేరుకుని కౌశికుడు ధర్మవ్యాధుడు ఉన్న ప్రదేశానికి చేరుకున్నాడు. ధర్మ వ్యాధుడు మాంసం విక్రయిస్తున్నాడు. అది చూసిన కౌశికుడు అసహ్యించుకుని ఒక ప్రక్కకు ఒదిగి నిలబడ్డాడు. బ్రాహ్మణుని చూసిన ధర్మవ్యాధుడు అతని దగ్గరకు వచ్చి భక్తితో నమస్కరించి " మహానుభావా ఆ మహాపతివ్రత నిన్ను నా వద్దకు పంపిందా? చాలా సంతోషం రండి మా ఇంటికి పోదాం " అని చెప్పి కౌశికుని తన ఇంటికి తీసుకు వెళ్ళాడు. పతివ్రత పంపిన విషయం ధర్మవ్యాధునికి ఎలా తెలిసిందోనని ఆశ్చర్యపోయాడు. కౌశికుడు ధర్మవ్యాధుని చూసి " అయ్యా! మీరు అన్ని ధర్మాలు తెలిసిన వారు. ఇలాంటి వృత్తి స్వీకరించి జీవహింస చేయడం ధర్మమా? " అని అడిగాడు. అందుకు బదులుగా ధర్మవ్యాధుడు " అయ్యా! బ్రాహ్మణులకు స్వాధ్యయనం, తపస్సు, సత్యము, శౌచం, బ్రహ్మచర్యం పరమ ధర్మం. క్షత్రియులకు ప్రజా రక్షణ, దండనీతి ధర్మం. శూద్రులకు సేవించడం ధర్మం. మృగ మాంసం విక్రయించడం నా ధర్మం. మిధిలా నగరాధీశుడైన జనకుడు ఎవరి ధర్మాన్ని వారు మాత్రమే ఆచరించాలని కోరతాడు. స్వధర్మం ఆచరించని వాడు కొడుకైనా అతనికి శిక్షార్హుడే. కనుక నేను నా ధర్మం ఆచరిస్తున్నాను. కాని నేను జీవహింస చేయను. ఇతరులు చంపి తెచ్చిన వాటిని మాత్రమే విక్రయిస్తాను. నేను గురువులను, దేవతలను, అతిధులను పూజిస్తాను. సత్యమును, శౌచమును ఆచరిస్తూ అణుకువతో ఉంటాను. బంధువులను ఆదరిస్తాను. ఏకపత్నీ వ్రతుడను. అసూయలేదు, కోరికలు లేవు, ఇతరులలో దోషం ఎంచను. ఉపవాస నియమాలతో ఆహారం తీసుకుంటాను. పొగడ్తలకు లొంగను, తెగడ్తలకు కుంగను. అందువలన హీనకులములో పుట్టినా నిర్మలంగా జీవిస్తున్నాను. అడిగావు కనుక చెప్పాను కాని నను నేను కీర్తించుకోవడం తగదు. నీవు నా వద్ద ధర్మసూక్ష్మం తెలుసుకోవడానికి వచ్చావు కనుక చెపుతాను విను . కులధర్మం ఆచరించతగిన పరమ ధర్మం. త్యాగ గుణం కలిగి ఉండటం, ఇతరుల భావాలను మన్నించడం, సత్పురుషులను గౌరవించడం, సత్యం పలకడం సహనం కలిగి ఉండడం ఉత్తముల లక్షణం. కోరికలను ధర్మమార్గంలో మాత్రమే తీర్చుకోవాలి. కషాన్ని, సుఖాలను సమదృష్టితో చూడాలి. అపకారికి ఉపకారం చేయాలి. అపకారం చేసిన వాని పాపం వాడిని దహించి వేస్తుంది. నాస్తికులు దేవుడు లేడని వాదిస్తారు. వారిని చూసి ధర్మాన్ని విడువరాదు. పశ్చాత్తాపానికి

సగం పాపం పోతుంది. ఆ పాపాన్ని పరిత్యజించడంతో మొత్తం పాపం పోతుంది. పాపానికి మూలకారణమైన కోపం, లోభం లాంటి దుర్గుణాలను విడిచి పెట్టాలి. చెడు కార్యములు దట్టమైన గడ్డితో నిండిన ఉబివలె అందంగా కనిపిస్తాయి కనుక వాటిని పరిత్యజించాలి " అని చెప్పాడు.

## శిష్టాచారములు

కౌశికుడు ధర్మవ్యాధుని " అయ్యా! శిష్టాచారముల గురించి వివరిస్తారా " అని అడిగాడు. ధర్మవ్యాధుడు " దానము, సత్యము, ధర్మము, మంచితనం, కోపాన్ని త్యజించడం, ఇంద్రియ నిగ్రహం, సదా ఆనందంగా ఉండటం, వేదాధ్యనం, డాంభికత్వం లేకుండుట, యజ్ఞము, నిరాశ, దైన్యం దరి చేరనీయక పోవడం, అసూయను అహంకారాన్ని వదలడం, సత్ప్రవర్తన, తీర్ధయాత్రలు చేయడం, మితభాషణ, పారిశుభ్రం, ఆశ్రిత రక్షణ మొదలైనవి శిష్టాచారములు అని పెద్దలు చెప్తారు. అసూయను విడిచి సత్ప్రవర్తనతో జీవించడంలోగల హాయి ఇతర మార్గంలో జీవించే వారికి ఉండదు. కనక శిష్టాచారాలు పాటిస్తూ గురువులను గౌరవిస్తూ వేదాధ్యయనం చేస్తూ కామము, మోహము, క్రోధం అనే మొసళ్ళు ఉన్న సంసారసాగరాన్ని చెరగని ధైర్యం అనే నావ మీద పయనించి దాటకలిగిన వాడు ధన్యుడు. మహాత్మా! అహింస అన్ని ధర్మాలలో ఉత్తమమైనది. దానిని సత్యముతో చేర్చి ఆచరించాలి. వేద సమ్మతాలు, శాస్త్ర సమ్మతాలు, శిష్టాచారాలు అని ధర్మములు మూడు విధములుగా వర్ధిల్లు తుంటాయి. వేదాధ్యయనం చేసిన వాడు శిష్టాచార మార్గంలో ప్రయాణించి బుద్ధి అనే మేడను అధిరోహించి మోహము అనే ఉబిలో కూరుకున్న వాడిని చూసి నవ్వుకుంటాడు.

## హింస అహింస

మహాత్మా! నేను చేస్తున్నది హింస కాదా అని ప్రశ్నించారు. నేను సమాధానం చెప్పాను. ఏది హింస ఏది అహింస అని చెప్పటం ఎవరి తరం కాదు. ప్రాణి పుట్టుకకు మరణానికి అతడు చేసిన కర్మలే కారణం. చంపే వాడు కేవలం నిమిత్త మాత్రుడు. పండ్లు, వేర్లు, ఔషధాలు, శాకములు, జంతువులు ప్రాణులకు ఆహారంగా భగవంతుడు ఏర్పరచాడని వేదాలు చెప్తున్నాయి. పూర్వం శిబి తనమాంసాన్ని డేగ రూపంలో ఉన్న ఇంద్రునికి ఇచ్చి పుణ్యం సంపాదించ లేదా? రంతి దేవుడు వేలకొలది ఆవులను వధించి సంతర్పణ చేసి పుణ్యలోకాలు సాధించలేదా? వేదాలు చదివిన వారు యజ్ఞయాగాలు చేస్తూ పశువధ చేస్తారు కదా? పితృ కార్యాలలో, దైవ కార్యాలలో మాంసాహారాన్ని ఉంచి మిగిలిన దానిని భుజించడం ధర్మమని ఋషి వాక్కు చెప్పలేదా? రైతులు నాగలితో దున్నుతున్నప్పుడు ఎన్నో జీవులు నశిస్తాయి కనుక అది హింస కాదా? మానవులు నడిచేటప్పుడు కాళ్ళ కింద పడి అనేక జీవులు నశించడం హింస కాదా? నీరు భూమి ఆకాశం జీవులతో నిండి ఉన్నది. మనిషి చేసే ప్రతి కర్మలో అహింస అనివార్యం. ముని వృత్తిని స్వీకరించి అరణ్యాలలో జీవిస్తున్న మునులు తాము అహింసను ఆచరిస్తున్నామని భ్రమ పడుతుంటారు. వారు భుజించే ఆకులూ, పండ్లూ, కందమూలాలలో కూడా జీవం ఉంది కదా? కనుక ఈ లోకంలో హింస చేయని వాడు లేడు. కనుక తెలిసీ జీవులను హింసించక పోవడమే అహింస. ధర్మం పలు విధాలు దాని సూక్ష్మం గ్రహించడం కష్టం. కనుక వేదవిహితమైనదీ, పెద్దలు చెప్పినదీ, మునులు ఆచరించేదీ గమనించి ధర్మ నిర్ణయం చేయడం ఉత్తమం.

## ధర్మమూ సత్యమూ

ధర్మం చాలారకాలుగా ఉంటుంది. చాలా సూక్ష్మంగా ఉంటుంది. వేదవిహితము, పెద్దలమాటలూ , వారి ఆచరణ చూసి ధర్మసూక్ష్మాన్ని గ్రహించాలి. సత్యవ్రతం గొప్పది. కాని ఇతరులకు జరిగే అపాయాన్ని నివారించడానికి చెప్పే అబద్ధం నిజం కంటే గొప్పది. ఏ ప్రాణికైనా అపకారం కలిగించే నిజం అబద్ధం చెప్పడంతో సమానం. ప్రాణాపాయ స్థితిలో, వివాహసమయంలో చెప్పే అసత్యం నిజంతో సమానం. కులవృత్తి దైవ సమానం. ఇష్టాయిష్టాలతో పని లేకుండా దానిని ఆచరించడం మానవ ధర్మం. మనము అనుభవించే కష్టసుఖాలు మనం పూర్వజనమలో చేసిన పాపపుణ్యాలే కారణం. ఇది తెలియని మూఢులు దైవాన్ని దూషిస్తారు. మానవులు తాము చేసే పనులకు తామే కర్తలమని భావిస్తారు. అది అజ్ఞానం అదే నిజమైతే తాము చేసే కార్యములన్నీ ఎందుకు ఫలించడం లేదు. ధర్మాత్ములు, నీతిమంతులు చేసే కార్యములు ఒక్కోసారి నిష్ఫలమతున్నాయి కాని దుర్మార్గులు చేసే పనులు ఫలిస్తున్నాయి. కొందరికి అనాయాసంగా ధనరాశులు వచ్చి పడుతున్నాయి. కొందరికి ఎంత శ్రమించినా పేదరికం పోదు. కటిక దరిద్రులకు పేదవారికి వద్దన్నా సంతానం కలుగుతుంది. కొందరు ధనవంతులకు ఎన్ని వ్రతాలు చేసినా సంతానం కలుగదు. ఇదంతా పూర్వజన్మ కర్మ ఫలమే. మానవులు కర్మాధీనులు కాకుంటే రోగాలు, మరణం లేకుండా బ్రతకవచ్చు కదా. కనుక ఈ శరీరం కర్మ ఫలంగానే ఏర్పడుతుంది. శరీరం చేయవలసిన పనులు కర్మవశాన నిర్ణయించబడతాయి. మరణానంతరం కర్మఫలాన్ననుసరించి దేహధారణ నిర్ణయించ బడుతుంది.

## జీవుడియాత్ర

ఇక జీవుడు ఎలాంటి వాడో చెప్తాను. జీవుడు అనఘుడు, సనాతనుడు, శాశ్వతుడు. జీవునికి పాపం అంటదు. కర్మానుసారం శరీరాన్ని ధరిస్తూ ఉంటాడు. కొంత కాలానికి శరీరం జీర్ణమై మరణిస్తుంది కాని జీవుడు మరణించడు. శరీరాన్ని విడిచిన జీవుడు వేరు శరీరాన్ని ధరిస్తాడు. ఆ శరీరంలో సుఖదు:ఖాలు అనుభవిస్తాడు. ఇలా జీవుడు ఎన్నో దేహబంధాలలో చిక్కుకుంటాడు. మహానుభావా! నీవు పాపపుణ్యముల వలన కలుగు దేహ బంధముల గురించి వివరిస్తాను. స్థిరమైన పుణ్యం చేసిన వాడికి దైవత్వం సిద్ధిస్తుంది. కొంత పాపం కొంత పుణ్యం చేసిన వాడికి మనుష్య జన్మ లభిస్తుంది. పాపములు మాత్రమే చేసే జనులు క్రిమి కీటకాదులుగా పుట్టుతూ మరణిస్తూ జన్మబంధాలలో చిక్కుకుంటాడు. ఇలా కోరికలు అను సముద్రంలో కొట్టు మిట్టాడుతూ ఎన్నటికీ ఒడ్డుకు చేరుకో లేడు. ఇది ఎరిగిన వాడు పాపకార్యాలజోలికి వెళ్ళక ధర్మమార్గాన పయనిస్తాడు. మదమూ, అహంకారం విడిచి పుణ్యకార్యాలు చేస్తాడు. ధర్మాచరణ వలన మనసు నిర్మలమౌతుంది. కోరికలను విడిచి సుఖాలు ఎందుకూ పనికి రానివని గ్రహిస్తాడు. తపస్సు, ఇంద్రియ నిగ్రహం, సత్యం పలకడం మేలని గ్రహించి వాటిని ఆచరించి దైవత్వాన్ని పొందుతాడు.

## ఇంద్రియ నిగ్రహం

కౌశికుడు ధర్మవ్యాధుని " ఇంద్రియ నిగ్రహం అంటే ఏమిటి? ఇంద్రియాలను నిగ్రహించకుంటే కలిగే పాపం ఏమిటి? ఇంద్రియాలను నిగ్రహించడం వలన కలిగే పుణ్యం ఏమిటి? " అని అడిగాడు. ధర్మవ్యాధుడు కౌశికునితో " మనం మనసుతో విషయాలను గ్రహిస్తాము. మనస్సు ఎప్పుడూ కోరికలతో, కోపముతో నిండి ఉంటుంది. వాటి వలన లోభం ఏర్పడుతుంది. లోభంతో ఏర్పడిన విషయ వాంఛల వలన మానవుడు సదా సతమతమౌతుంటాడు. లోభికి కరుణ లోపించి పాపములతో కోరికలు తీర్చుకుంటాడు. మంచి మాటలు చెవికెక్కవు. దుర్మార్గులతో చెలిమి చేస్తాడు. చెప్పే మాటలకు చేసే పనికి పొంతన ఉండదు. అలాంటి వాడు దు:ఖంలో మునిగి తేలుతుంటాడు. కనుక మానవులు విషయ వాంఛలకు లొంగక జ్ఞానమార్గం అవలంబించి మోక్షప్రాప్తికి ప్రయత్నించడం ఉత్తమం " అన్నాడు. " మహాత్మా! ఇంద్రియములను నిగ్రహించడం ఎలా? అని నన్ను అడిగారు. బ్రహ్మకోవిదులు చెప్పతగిన బ్రహ్మ విద్యను గురించి నేను చెప్పకూడదు. కాని బ్రాహ్మణోత్తముడివి అడిగావు కనుక బ్రహ్మ కోవిదులకు నమస్కరించి చెప్తాను సావధానంగా విను. అనంతాకాశం, గాలి, అగ్ని, నీరు, భూమి అనేవి పంచ భూతములు. మరలా భూమి నీటిలోను, గాలి అగ్ని లోను, అగ్ని వాయువులోను, వాయువు ఆకాశంలోను లీనమౌతాయి. మొదట ఆకాశానికి హద్దులు లేని అనంతాకాశం. అంతా చీకటి, శూన్యము. ఆ ఆకాశంలో నుండి ప్రచండ వాయువు, ఉధృతమైన గాలి ఆగాలిలోని ధాతు సంయోగంతో నీరు పుడుతుంది. ఆ నీరు ఘనీభవించి మంచుఖండాలు, ధూళి మేఘాలు ఏర్పడతాయి. అవి శిలా రూపం చెంది భూమి ఏర్పడుతుంది. మరలా అదే క్రమంలో ప్రళయ కాలంలో సముద్రాలన్నీ ఏకమై భూమి జలమయమౌతుంది. అనావృష్టి ప్రారంభమై ఎండలు అధికమై ఆ ప్రంచండాగ్నికి నీరు ఆవిరై వాయు రూపం పొంది ఆకాశంలో లయమౌతుంది. చెవితో వినడం, నాలుకతో రుచి చూడటం, కంటితో చూడటం, ముక్కుతో వాసన చూడటం పంచేద్రియాలు చేసే పనులు. అంటే పంచ భూతములస్కు గుణములైన శబ్ధ, స్పర్శ, రూప, రస, గంధాలు ఇంద్రియవిషయాలు. పంచేద్రియములకు మూలం మనసు. మనసు ఆరవది, బుద్ధి, అహంకారం మనసుకు తోడు మొత్తం ఎనిమిది. సత్వ, రజో, తమో గుణాలు మానవులకు సహజం. ఈ భూత ప్రపంచం అవ్యక్తము నుండి సృష్టింపబడి అవ్యక్తంలో లీనమౌతాయి. అవ్యక్తమనగా వ్యక్తముకానిది. కాని పంచేద్రియాలకు ఈ అవ్యక్త రూపం దైనందిన కార్యాలలో గోచరమౌతూ ఉంటుంది. అది నిరాకారమైన మనో భావనలో వివిధ రూపాలలో గోచరమౌతుంది. మానవులు పంచ గుణాలకు వశుడై భోగలాలసుడౌతున్నాడు. మానవుడు పంచేద్రియాలను అదుపులో పెట్టుకుని జీవిస్తూ జ్ఞాన సముపార్జన చేయాలి. జ్ఞానం కలిగిన వాడు అన్ని భూతాలలో తనను చూసుకుంటాడు. విషయవాంఛల నుండి మనసుని మళ్ళించడమే తపస్సు, వైరాగ్యం. ఇంద్రియముల నివారించిన స్వర్గం ఇంద్రియములకు లొంగి పోయిన నరకం. కోరికలతో సతమమయ్యే మనసును అదుపులో పెట్టుకోవడమే మోక్షం. దేహం రధమైతే ఇంద్రియాలే గుర్రాలు ఆత్మ సారధి, ధైర్యం పగ్గాలు. మానవుడు మనసును నిగ్రహించి ధైర్యమనే పగ్గాలతో ఇంద్రియాలనే గుర్రాలను అదుపు చేస్తూ మోక్షమనే గమ్యాన్ని చేరాలి. ఇంద్రియము పోవు చోటుకు మనసు పోతుంది కనుక ఇంద్రియములను అదుపు చేస్తూ జ్ఞాని యోగి.

## త్రిగుణములు

గుణములు మూడు. సత్వగుణము, రజోగుణము, తమోగుణము. వీటిలో తమోగుణము నీచమైనది, నింద్యార్హమైనది. సత్వగుణము ఉత్తమమైనది. జ్ఞాన సముపార్జనకు అనుకూల మైనది. రజోగుణము ఈ రెండింటి మిశ్రితం. పరిశుభ్రం లేని ఆకారం, అతి నిద్ర, దీనత్వం, అసహనం, హద్దులేని కోరికలు తమో గుణ లక్షణాలు. ధైర్యం, శాంతి, కరుణ, సంతోషం,

విద్యలయందు ఆసక్తి సాత్వికగుణ లక్షణం. సాత్వికుడైన వాడు మానవుడు జ్ఞానాన్ని సంపాదిస్తాడు. ఈ లోకంలోని సమస్తం అశాశ్వతం అని తెలుసుకుంటారు. సుఖదు:ఖాలకు అతీతంగా ఉంటాడు. అహంకారాన్ని వదిలి ఇంద్రియ నిగ్రహాన్ని సాధించి ఉత్తమ శాంతి పొందుతాడు. సత్వగుణ సంపన్నుడు శూద్రుడైనా తరవాతి జన్మలలో వైశ్యునిగా, క్షత్రియునిగా, బ్రాహ్మణుడిగా జన్మించి కడకు కైవల్యాన్ని చేరుకుంటాడు " అని చెప్పాడు.

## అగ్ని వాయువు

కౌశికుడు " అయ్యా ! ఈ శరీరంలో అగ్ని ఎలా పుడుతుంది. వాయువులు శశరీరంలో ఎక్కడెక్కడ ఉంటాయి " అని అడిగాడు. ధర్మవ్యాధుడు " మహాత్మా! మన శరీరంలో ఆత్మ అనే అగ్ని శరీరం అంతా నాభి ఆధారంగా వ్యాపించి ఉంటుంది. నాభి నుండి తల వరకు వ్యాపించి ఉన్న ఈ అగ్నిలో ప్రాణవాయువు సంచరిస్తూ ఉంటుంది. ఆ ప్రాణవాయువే సకల జీవులకు ఆధారం. ప్రాణవాయువు, ఆపానవాయువు కలిసి ప్రాణాగ్నిని జ్వలింప చేస్తుంటాయి. మానవుడిలో ఆపానము, పొత్తికడుపు, బ్రహ్మరంధ్రం మధ్యలో ప్రాణాగ్ని ప్రజ్వరిల్లుతూ ఉంటుంది. ఆపానము మలమూత్రముల విసర్జనా స్థానం. కంఠంలో ఉండే ఉదానము అనే వాయువు కర్మలను నియంత్రిస్తుంటుంది. వ్యానము అనే వాయువు శరీరావయవాల కలయికలో సంచరిస్తూ ఉంటుంది. ప్రాణ ఆపాన వాయువులను ఆధారం చేసుకుని సమాన వాయువు మనం తినే ఆహారాన్ని జీర్ణం చేసి రక్తంలో కలుపుతుంది. నాభి వద్ద ఉండే ఆ వాయువు శరీరంలోని సకల ధాతువులను పోషిస్తుంది. పంచప్రాణములను, ఆత్మాగ్నిని గురించి తెలుసుకున్న యోగులు నిరంతర అభ్యాసము వలన ఆత్మను మూర్ధత్వ స్థానమున నిలుపుకుంటారు. ఆపాన సమాన వాయువులలో సంచరిస్తున్న అగ్ని శరీరమందు జీవాత్మగా వెలుగుతున్నాడు. ఆ జీవాత్మ తామరాకు మీద నీటి బొట్టులా శరీరంలో ఉంటూ నిర్లిప్తంగా ఉంటాడు. శరీరాన్ని విడిచిన జీవాత్మయే పరమాత్మ. అచేతనంగా పడి ఉన్న శరీరాన్ని పరమాత్మ జీవాత్మగా చైతన్యవంతం చేస్తాడు. పరమాత్మ ఈలోకాలను సృష్టించే సృష్టికర్త. బుద్ధిమంతులు తమ బుద్ధి కుశలతతో జీవాత్మను పరమాత్మగా తెలుసుకుంటారు. మహాత్మా! బ్రహ్మవిద్యాతత్వం ఆచరణ సాధ్యం చేయటమెలా అన్నది వివరిస్తాను. పండితుడు శుభం, అశుభంలలో ఆసక్తి లేక సమానంగా స్పందిస్తాడు. క్రమంగా సుఖ దు:ఖములు, రాగద్వేషములు, శీతోషణముల పట్ల సమంగా ప్రవర్తిస్తాడు. అటువంటి వాడు పుణ్యాత్ముడై ఇంద్రియములను జయించి యోగసాధన చేస్తాడు. తన ఆత్మలో పరమాత్మను దర్శించి గాలి లేని చోట నిశచలంగా జ్వలించే దీపంలా ప్రకాశించి అమరత్వం పొందుతాడు. కనుక కామక్రోధాలను వదిలి కర్మఫలత్యాగం చేసి కర్మలను ఆచరించడం ఉత్తముల ధర్మం. జీవితం అశాశ్వతం అనే ఎరిగి ఇతరులకు అపకారం చేయడం వదిలి వేయాలి. ఉన్న దానికి సంతృప్తి చెంది ఇతరుల ఎడ దయ, కరుణ, మైత్రితో ప్రవర్తించాలి. ఇందియ నిగ్రహాన్ని సాధించిన వాడు పరమ సుఖాన్ని పొందుతాడు " అని చెప్పాడు. కౌశికుడు " మహాత్మా! నీవు సర్వజ్ఞుడవు. నీ వలన ధర్మసూక్ష్మాలు ఎరిగి ప్రబుద్ధుడనయ్యాను " అన్నాడు.

## మాతాపితలను సేవించడం

ధర్మవ్యాధుడు " మహర్షీ! నేను సర్వజ్ఞుడిని కావడానికి మూలమైన ధర్మం నీకు తెలుపుతాను " అన్నాడు. అతనిని గృహాంతర్భాగానికి తీసుకు వెళ్ళాడు. అక్కడ సుఖాశీనిలై ఉన్న తల్లి తండ్రులకు నమస్కరించి కుశలం అడిగాడు. వారు " కుమారా! నీవంటి కొడుకు ఉండగా మాక్షేమమునకు లోటు ఏమి? నీ ధర్మం నీకు తోడుగా ఉండి ఆయురారోగ్యాలు ప్రసాదిస్తాయి. నీ వలన మన వంశం పవిత్రమైనది. నీవు మనుష్య జన్మ ఎత్తిన దేవతామూర్తివి. త్రికరణ శుద్ధిగా తల్లితండ్రులను సేవించే నీవు పరశురాముని కన్నా గొప్పవాడివి " అన్నారు. అప్పుడు ధర్మవ్యాధుడు కౌశికుని తల్లి తండ్రులకు పరిచయం చేయగా వారు కౌశికుని కుశలం అడిగారు. ధర్మవ్యాధుడు కౌశికునితో " వీరు నా జననీ జనకులు వీరిని సేవించి నేను ఇంత జ్ఞానం సంపాదించాను. నేను ఇతర దేవుళ్ళను ఎరుగను తల్లితండ్రులే నా దైవాలు. నేను వీరికి పండ్లు, ఆహారం, వస్త్రములు ఇచ్చి వీరిని సేవిస్తుంటాను. నా భార్యా బిడ్డలు వీరికి సేవ చేస్తుంటారు. యజ్ఞాలు, క్రతువులూ, వేదాలూ అన్నీ వీరే అని భావిస్తాను. తల్లి, తండ్రి, గురువు, అగ్ని, ఆత్మ ఈ అయిదిటిని ఎవరు పూజిస్తారో వారే మహాత్ములు. అయ్యా! పతివ్రత పంపగా ధ్రమసూక్ష్మం తెలుసుకోవడానికి నా దగ్గరకు వచ్చారు. ఆమె అనుగ్రహంతో నేను నీకు చెప్పగలిగాను. నీ వంటే నాకు అప్రియంగా ఉంది. అందుకు కారణం నీవు నీ తల్లి తండ్రుల అనుమతి లేకుండా వేదాద్యయనానికి వెళ్ళి వారిని వ్యాకులతకు గురి చేసావు. వారి పట్ల కౄరంగా ప్రవర్తించావు. నీవు వేదజ్ఞానం


కౌశికునికి తన తల్లి తండ్రులను

చూపిస్తున్న ధర్మవ్యాధు

సంపాదించినా నీ తల్లి తండ్రులను బాధించినందుకు నాకు నీ ఎడల అప్రియం కలిగినది. నీ తల్లితండ్రులు నీ కొరకు రోదించి గుడ్డి వాళ్ళు అయ్యారు. ఆ సంగతి నీకు తెలుసా? ఇకనైనా వారి వద్దకు వెళ్ళి వారి శోకమును చల్లార్చు. నీ జ్ఞానం పుణ్యం తల్లి తండ్రులను బాధించడం వలన నిష్ఫలం ఔతాయి. నేను చెప్పినది విని వారిని సేవించి తరించు " అని ధర్మవ్యాధుడు చెప్పాడు. కౌశికుడు " మహాత్మా! నీవు చెప్పినట్లే వెళ్ళి నా తల్లితండ్రులను సేవించుకుంటాను. నేను చేసిన పాంపం నుండి నీ బోధనలతో విముక్తుడని అయ్యాను. నా భాగ్యవశమున నీ పరిచయ భాగ్యం కలిగినది. నా మనసు ఆహ్లాదం అయింది. నీవు నాకు దైవ సమానుడవు. నీ వలె ధర్మమార్గాన సంచేరించే వాడు అరుదు. వేలకొలది మానవులలో ఏ ఒక్కరో నీ వంటి వాడు ఉంటాడు. నేను నిన్ను శూద్రునిగా తచడంలేదు. భూత, భవిష్యత్తు, వర్తమానాలను ఎరిగిన నీవు ఏలా ఈ శూద్ర జన్మను ఎత్తావో చెప్పు " అన్నాడు.

### ధర్మవ్యాధుని పూర్వ జన్మ వృత్తాంతం

అయ్యా మీరడిగినది చెప్పడం నాధర్మం. నేను పూర్వజన్మలో బ్రాహ్మణుడను. వేదవేదాంగాలు చదువుకున్నాను. నాకు ఒక రాజకుమారునితో మైత్రి కలిగిన కారణంగా విలువిద్య కూడా నేర్చుకున్నాను. ఒకరోజు నేను రాజకుమారునితో వేటకు వెళ్ళి అనేక మృగములను చంపాను. నే విడిచిన ఒక బాణం పొదల మాటున గడ్డిచాటున ఉన్న మునీశ్వరునికి తగిలింది. నేను మునీశ్వరుని వద్దకు వెళ్ళి బాధతో నేలమీద దొర్లుతున్న ఆయనతో అనునయ వాక్యాలు పలికాను. ఆయన బ్రాహ్మణుడుగా పుట్టి శూద్రునిలా మృగములను చంపావు కనుక మృగములను చంపు వ్యాధుడిగా జన్మించు " అని శపించాడు. ఎరుగక తప్పు చేసిన నన్ను మన్నించి శాపవిమోచనం కలిగించమని ఆయనను వేడుకున్నాను. ఆ ముని కరుణించి " నా శాపానికి తిరుగు లేదు వ్యాధుడిగా జన్మించినా నీకు ధర్మసూక్ష్మములు తెలియగలవు. నీవు తల్లితండ్రులను సేవించినంత కాలం పూర్వ జన్మ స్ఫురణ ఉంటుంది. సత్కర్మాచరణము వలన నీవు తిరిగి బ్రాహ్మణ జన్మ పొందగలవు " అని పలికాడు. నేను ఆ ముని శరీరం నుండి బాణం బయటకు తీసి ఆయనను ఆశ్రమానికి చేర్చి గాయానికి మందు వేసి బ్రతికించాను. కానీ నాకు ఈ వ్యాధుని జన్మ తప్పలేదు " అన్నాడు.

### కౌశికుడు ధర్మవ్యాధుని అనునయించుట

కౌశికుడు ధర్మవ్యాధునితో " అయ్యా! నీవు వ్యాధుని జన్మ ఎత్తిననూ బ్రాహ్మణుని వలె ప్రవర్తిస్తున్నావు. నీవు నిజంగా బ్రాహ్మణుడివే. ఎందుకనగా పుట్టుకతో బ్రాహ్మణుడైనా శుద్రుని వలె ప్రవర్తించిన అతడు శూద్రుని కంటే నీచుడు ఔతాడు. జన్మత: శూద్రుడైనా సత్యమూ, శౌచమూ, ధర్మము అవలంబించిన అతడు స ద్బ్రాహ్మణునితో సమానమని పెద్దలు చెప్పారు కదా! నీ కర్మల వలన శుద్రుడిగా జన్మించినందుకు బాధపడ వలదు. మనం చేసే కర్మల వలన సుఖదుఃఖాలు ఏర్పడతాయి ప్రాజ్ఞులు రెండింటిని సమానంగా చూస్తారు. సత్కర్మలచే పాపాన్ని పోగొట్టుకుంటారు. మూఢులు అప్రియానికి కలత చెంది, ప్రియములు జరిగినప్పుడు ఆనందిస్తారు. అందువలన హృదయతాపం హెచ్చుతుందే కాని తగ్గదు. ధీరులు రెండింటినీ సమ దృష్టితో చూస్తారు. జరిగిన దానికి జరగబోవుదానికి దు:ఖించక అన్నిటినీ సమదృష్టితో చూడటం ప్రాజ్ఞుల ధర్మం. దుఃఖం వలన విచక్షణ కోల్పోతారు. కనుక అన్నింటినీ సమదృష్టితో చూసి శుభములు పొంది ఆనందంగా ఉండుము. అన్ని భూతములందు సమత్వము కలిగి ధీరుడవై ఉండుము నీకు మేలు జరుగుతుంది " అని అనునయ వాక్యాలు చెప్పాడు. ధర్మవ్యాధుడు " మహానుభావా! తమరు చెప్పినట్లే నేను దుఃఖమును వదిలినాను. నాకు మేలు జరుగుతుందని ఆశిస్తున్నాను " అన్నాడు. కౌశికుడు " మహాత్మా! నీవు పుణ్యమూర్తివి. నీ దర్శనంతో నాకు ఎన్నో ధర్మాలు తెలిసాయి నా జన్మ ధన్యం అయింది. ఇక నాకు శలవు ప్రసాదించండి " అని అడిగాడు. ఆ తరవాత కౌశికుడు తన తల్లితండ్రులను చేరుకుని వారిని సేవించి తరించాడు. కనుక ధర్మరాజా ! నీవు అడిగినట్లు పతివ్రతా ధర్మము, మాతాపితల శుశ్రూష, హీనకులములో పుట్టినా ఎలా ధర్మాత్ముడు కాగలడో వివరించాను కదా " అన్నాడు మార్కండేయ మహర్షి.

## అగ్నిదేవుని తపసు

ధర్మరాజు " మహర్షీ ! నీ దయవలన ఎన్నో విషయములు తెలుసుకున్నాను. పూర్వము అగ్ని దేవుడు ఎందుకు తపస్సు చేసాడు? అంగీరసుడు అగ్నిగా మారటానికి కారణం ఏమిటి? అ గ్నులు ఎన్ని విధాలు? వివరిస్తారా " అని అడిగాడు. మార్కండేయ మహర్షి " ధర్మనందనా ! అగ్ని దేవుడు హవ్యవాహనుడు. యజ్ఞ యాగాదులలో వేసే హోమద్రవ్యాలను అగ్ని దేవుడు దేవతలకు చేరుస్తాడు. ఇలా చేసి విసుగు చెందిన అగ్ని దేవుడు హవిస్సులను అందించడం మాని అడవులకు వెళ్ళి తపస్సు చేయనారంభించాడు. అతని దేహం కృశించి పోయింది. అగ్ని మనసులో " నేను ఇలా నా విధులను విడిచి తపసు

చేసుకుంటున్నాను ఏమిటి. నేను లేకపోతే లోకం స్థంభించదు కదా ! అలా స్థంభించిన బ్రహ్మదేవుడు వేరొకరిని నా పదవిలో పెట్టాడా! ఇక నేను ఇక్కడ ఉండక వెంటనే పోవలయును " అని తలచి తపము చాలించి తన స్వస్థలముకు వెళ్ళుచుండగా బ్రహ్మదేవుడు తన పదవిలో నియమించిన అంగీరసుడనే అగ్ని మూడు లోకాలలో అగ్ని కార్యములు నిర్వర్తించడం చూసి భయపడ్డాడు.

## అంగీరసుడు అగ్నిదేవుని పదవిని తిరిగి తిసుకొనమని చెప్పట

తిరిగి వెళ్ళబోతున్న అగ్నిదేవుని చూసి అంగీరసుడు " అగ్నిదేవా! నీవు పాపరహితుడవు ముల్లోకాల చీకటిని పారద్రోలకలవు. బ్రహ్మదేవుడు మొదట నిన్ను ఈ పదవిలో ఉంచాడు కనుక నీవు నీ పదవిని సంశయించక తీసుకొనుము. నేను ఈ పదవిలో ఉండలేను " అన్నాడు. అగ్నిదేవుడు " అయ్యా! నా కీర్తి లోకాలలో నిస్తేజమై పోయింది. ముల్లోకాలలో పూజ లందుకుంటున్నావు. కనుక ఈ అగ్ని పదివి నీకే కాని నాకు పనికి రాదు. నీవు చెప్తున్నావు కనుక నీవు ప్రధమ స్థానంలో ఉండు. నేను రెండవ స్థానంలో ప్రజాపత్య అగ్నిగా ఉంటాను " అన్నాడు. అంగీరసుడు " దేవా! నీవు నన్ను అలా ఆజ్ఞాపించ వలదు. ప్రధమ పదవి నీదే నన్ను నీకుమారునిగా అంగీకరించి ఆదరింపుము " అని వేడుకున్నాడు. అగ్నిదేవుడు అందుకు అంగీకరించాడు. ఈ విధంగా అంగీరసుడు రెండవ అగ్నిగా ప్రకాశించ సాగాడు.

## అంగీరసుడి వంశం

అంగీరసునికి భార్య శివ వలన అతనికి బృహత్కీర్తి, బృహజ్జ్యోతి, బృహద్బ్రహ్మ, బృహన్మనసుడు, బృహన్మంతుడు, బృహత్భానుడు, బృహస్పతి అనే ఏడుగురు కుమారులు కలిగారు. భానుమతి, రాగ, సినీవాలి, కుహువు, నశ్చిష్మతి, మహిష్మతి, మహామతి అను ఏడుగురు కుమార్తెలు జన్మించారు. అంగీరసుని కుమారుడు బృహస్పతికి శంయుడు జన్మించాడు. యాగములలో నేతి హవిస్సును అతనికి సమర్పించే వారు. శంయుని భార్య సత్య. వారికి భరద్వాజుడు, భరతుడు అనే కుమారులు కలిగారు. భరతునకు భారతుడు అనే కుమారుడు , భారతి అనే కుమార్తె కలిగారు. భరద్వాజునకు వీరుడు పుట్టాడు. వీరునకు భానుడు అనే కొడుకు పుట్టాడు. భానునికి నిశ్చ్యవనుడు పుట్టాడు. నిశ్చ్యవనునికి నిష్కృతి అనే కుమారుడు పుట్టాడు. నిష్కృతి అనే అగ్నిని ఆరాధించేవాడికి పాపాలన్నీ పోతాయి. నిష్కృతికి రుజస్కరుడు పుట్టాడు. రుజస్కరునకు క్రోధుడు పుట్టాడు. క్రోధునికి రుసుడు అనే కుమారుడు కలిగాడు. రుసునికి స్వాహా అనే కుమార్తె, కాముడు అనే కుమారుడు కలిగారు. కామునికి అమోఘుడు, అమోఘునికి సక్థుడు పుట్టారు. కాశ్యపుడు, వాశిష్టుడు, ప్రాణుడు, అంగీరసుడు, చ్యవనుడు అనే అయిదుగురు తమకు తేజోవంతుడైన కొడుకు పుట్టాలని తపస్సు చేసారు. వారికి కలిగిన కుమారునికి తల నిప్పు రంగులోను, చేతులు సూర్యునిలా, కళ్ళు బంగారు రంగులో, శరీరం నలుపు రంగులో ఉంది. బలవంతుడైన అతడు అయిదుగురు తండ్రులకు జన్మించిన కారణంగా పాంచజన్యుడయ్యాడు. అతడు పది వేల సంవత్సరాలు తపస్సు చేసాడు. అతని తల నుండి బృహద్రథంతరులు, ముఖమునుండి హరి, నాభినుండి శివుడు, బలము నుండి ఇంద్రుడు, ప్రాణముల నుండి వాయువు, అగ్ని జనించగా భుజముల నుండి దంతముల నుండి సమస్త భూతములు స్పష్టించబడ్డాయి. తపుడు అనే అగ్ని నిరంతరం తపస్సు చేసి పదునైదు మంది కుమారులను కన్నాడు. కాని వారంతా కపటులు అయ్యారు. వారు వరుసగా సుభీముడు, అతి భీముడు, భీముడు, భీమబలుడు, అతి బలుడు, అను వారు ఒక పక్క సుమిత్రుడు, మిత్రవంతుడు, మిత్రజ్ఞుడు ఒక పక్క సురప్రవీరుడు, వీరుడు, సువేషుండు, సువర్చలుడు, సురహంత అను వారలు చేరి యజ్ఞ ఫలములు అపహరిస్తూ ఉండే వారు. వారి దుశ్చర్యలకు బ్రాహ్మణులు తరచూ అగ్ని శాంతి చేయవలసి వచ్చేది. వారి పనులకు బ్రాహ్మణులు మంత్రశక్తితో భయపెట్టి వారిని యజ్ఞశాలలకు దూరంగా ఉంచే వారు. తపునకు మరి అయిదుగురు పుత్రులు ఉన్నారు. వారిలో వైశ్వానరుడు బ్రాహ్మణులచే చాతుర్మాస వ్రతములో పూజింపబడే వాడు. రెండవ వాడు విశ్వపతి. అతడు జగత్ప్రభువు. మూడవ వాడు విశ్వకుడు. నాల్గవవాడు విశ్వభుక్కు అతను భూతములు తినే ఆహారాన్ని జీర్ణం చేసే వాడు. ఐదవ వాడు గోపతి అతడు సమస్త ధర్మక్రియలకు కారణ భూతుడు. భానుడు అనే అగ్నికి ఆరుగురు కుమారులు నిశ అనే కుమార్తె కలిగారు. పురంధరుడు అనే అగ్నికి మనువు అనే కుమారుడు కలిగాడు. అతను నిశను వివాహమాడాడు. ఆ మనువుకే ప్రజాపత్యుడు అనే పేరు కూడా ఉంది. ఆ విధంగా సకల విధ అగ్నులు సకల ధర్మ కార్యాలకు కారణమయ్యాయి. ఆపుడు అనే అగ్నికి ముదిత అనే కన్యకు అగ్ని జన్మించాడు. మూడు లోకాలలో జరిగే అన్ని వ్యవహారాలను ఆ అగ్ని నిర్వహిస్తున్నాడు. యజ్ఞాలలో సమర్పించే హవిస్సును దేవతలకు అందిస్తుంటాడు.

## అగ్ని సముద్రములో దాగుట

కార్యభారంతో అలసి పోయిన అగ్ని అధర్వునితో ఇలా చెప్పాడు " యజ్ఞయాగాదులలో సమర్పించే హవిస్సులను దేవతల

కందించి నేను అలసి పోయాను. ఇకపై ఆ కార్యాన్ని నీవు నిర్వహించు " అని చెప్పి అగ్ని సముద్రంలో దాక్కున్నాడు. దేవతలందరూ అగ్ని ఎక్కడున్నాడో తెలియక వెదక సాగారు. ఇంతలో సముద్రంలోని చేపలు అగ్ని సముద్రంలో దాక్కుని ఉన్న విషయం దేవతలకు అందించాయి. అగ్నిదేవుడు ఆగ్రహించి " మీ చేపజాతిని మానవులు నిర్ధయులై తినెదరు కాక " అని శపించాడు. దేవతలంతా " అగ్నిదేవా! నీవు యధావిధి మాకు హవిస్సులను అందించు అని అడిగారు " కాని అందుకు అగ్ని సమ్మతించక శరీరాన్ని విడిచి భూమిలో ప్రవేశించాడు. భూమి పై పడిన అగ్ని నుండి అనేక ధాతువులు ఆవిర్భవించాయి. చీము నుండి గంధకం, ఎముకల నుండి దేవదారు వృక్షములు, కఫం నుండి కర్పూరం, పిత్తం నుండి పచ్చలు, వాతము నుండి నల్లటి పాషాణము, గోళ్ళనుండి అభ్రకము, రక్తనాళముల నుండి పగడములు ఏర్పడ్డాయి. అగ్ని దేవుడు భూగర్భంలో తపస్సు చేసుకుంటున్నాడు. అధర్వుడు అగ్ని కార్యములన్నీ నిర్వహిస్తున్నాడు. దేవతలంతా అధర్వుని పూజిస్తున్నారు. అధర్వుని కాంతిని దేవతలు అతనిచే తృప్తి పడటాన్ని ఓర్వలేక అగ్ని బయటకు వచ్చి మరల హవిస్సును అందిస్తానని ముందుకు వచ్చాడు. ధర్మరాజా ఆ విధంగా ఎందరో అగ్నులు ఉన్నా అందరిలో వెలిగే అగ్ని ఒకటే " అన్నాడు మార్కండేయుడు.

## కుమారస్వామి

ధర్మరాజు "మహర్షీ ! మహాసేనాని అని పిలువబడే కుమారస్వామి అగ్నిదేవునికి, కృత్తికలకు, శివునకు కుమారుడెలా అయ్యాడు " అని అడిగాడు.

### దేవసేన

మార్కండేయుడు " ధర్మరాజా ! పూర్వం దేవేంద్రుడు రాక్షసులతో యుద్ధం చేసి ఓడి పోయాడు. రాక్షసులను గెలవడమెలా అని దేవేంద్రుడు మానస అనే కొండ మీద ఆలోచించే సమయంలో ఒక స్త్రీ ఆర్తనాదం వినపడింది. దేవేంద్రుడు ఆ స్త్రీని రక్షించాలని వెళ్ళి కేశి అనే రాక్షసుడు ఒక స్త్రీని ఆకాశమార్గంలో తీసుకు వెళ్ళడం చూసాడు. డేవేంద్రుడు తనవజ్రాయుధంతో అతనిని వెంబడించాడు. అతడు తన గధాయుదాన్ని ఇంద్రుని మీద విసరగా ఇంద్రుడు వజ్రాయుధంతో గధను ముక్కలు చేసాడు. కేశి ఆస్త్రీని వదిలి పారిపోయాడు. ఇంద్రుడు ఆ కన్యను చూసి " నీవెవరు? ఈ రాక్షసుడికి ఎందుకు చిక్కావు? " అని అడిగాడు. ఆమె " అయ్యా! నాపేరు దేవసేన, నా అక్క పేరు దైత్య సేన మేము అరిష్టనేమి అనే ప్రజాపతి పుత్రికలము. మేము ఇక్కడ విహరిస్తుండగా ఈ రాక్షసుడు కామచేష్టలతో మమ్ము వేధిస్తున్నాడు. నా సోదరి దైత్యసేనకు అవి నచ్చాయి ఆమె అతనితో వెళ్ళింది. నాకు నచ్చలేదు కనుక నేను వెళ్ళలేదు. అతడు అంతటితో ఆగక తిరిగి వచ్చి నన్ను బలవంతంగా తీసుకు పోతున్నాడు. ఆ సమయంలో తమరు వచ్చి నన్ను రక్షించారు " అని చెప్పింది. ఇంద్రుడు మీ తల్లి మాతల్లి దక్షుని పుత్రికలు. అందు వలన నీవు నాకు సోదరివి. నీకేం వరం కావాలో కోరుకో " అని దేంద్రుడు అడిగాడు. ఆమె " దేవేంద్రా! మా తండ్రి నా చిన్నతనం నుండి నాకు మహా పరాక్రమవంతుడు, కీర్తిప్రతిష్టలు కల వాడు భర్తగా రాగలడని చెప్పాడు. ఆ మాటను మీరు నిజం చెయ్యండి. దేవతలకు రాక్షసులకు గెలువ శక్యం కాని వాడు, భయంకరమైన రాక్షసులను సంహరించే వాడు, ముల్లోకాలను రక్షించే వాడు, నీకు ఇష్టమైన వాడిని నాకు భర్తగా ప్రసాదించు " అని కోరింది. ఆమె మాటలు విని దేవేంద్రుడు " ఈ రోజు అమావాస్య సూర్యచంద్రులు ఏక రాశిలో ఉంటారు. ఇది సూర్యోదయం రౌద్ర ముహూర్తం. అగ్ని మునులు అర్పించిన హవిస్సులను తీసుకుని సూర్య మండలంలో ప్రవేశిస్తున్నాడు. కనుక సూర్యుడు, చంద్రుడు, అగ్ని తేజములతో జన్మించిన వాడు ఈమెకు భర్త కాగలడు " అని అనుకున్నాడు. దేవసేనను తీసుకుని బ్రహ్మ వద్దకు వెళ్ళి దేవసేనకు తగిన భర్తను ప్రసాదించమని కోరాడు. బ్రహ్మదేవుడు " దేవేంద్రా! ఈ కన్యకు గొప్ప వీరుడు భర్త కాగలడు. అతడు దేవసేనకు సేనాదిపతి కాగలడు. నీ కష్టములు తీర్చగలడు " అన్నాడు.

### కుమారసంభవం

వశిష్టుడు మొదలైన సప్తఋషులు అమావాస్య హోమం చేస్తున్నారు. హవిస్సులను స్వీకరించి దేవతలకు ఇవ్వడానికి అగ్ని దేవుని ఆహ్వానించారు. అగ్నిదేవుడు సర్వాలంకార భూషితలై భర్తల ప్రక్కన సప్త ఋషి పత్నులను చూసి మోహించాడు. వారిని తన జ్వాలలతో తాకాలని ఆరాటపడ్డాడు. హోమం ముగిసింది అగ్ని దేవుడు విరహంతో బాధపడ్డాడు. అగ్ని భార్య స్వాహాదేవి ఇది పసికట్టింది. తన భర్త కోరిక తీర్చడానికి అంగీరసుని భార్య శివ రూపంలో భర్త దగ్గరకు వచ్చి " నేను అంగీరసుని భార్యను. నా తోటి వారైన సప్త ఋషుల భార్యలపై నీకు వలపు ఏర్పడింది మేమంతా నీ కోరిక తీర్చాలనుకున్నాము. నీ మనస్సు తెలుసు కోవడానికి నన్ను పంపారు " అన్నది. అగ్ని దేవుని ఆనందానికి అవధులు లేవు ఆమె యందు తన కోరిక తీర్చుకున్నాడు. స్వాహాదేవి గరుడ పక్షిగా మారి భర్త తేజస్సును వాయువేగంతో వెళ్ళి

శ్వేతపర్వతంలో అక్కడ ఉన్న రెల్లు కుండలో దాచింది. ఇలా ఆమె ఆరు రూపాలలో భర్తను కూడి తేజస్సును కుండలో భద్రపరచింది. ఆమె ఒక అరుంధతి రూపం ధరించ లేక పోయింది.

## కుమార జననం

ఆ విధంగా ఆరు మార్లు కూర్చిన అగ్ని తేజస్సుతో కుమారస్వామి ఆరు ముఖాలతో అగ్ని తేజస్సుతో పన్నెండు చేతులతో జన్మించాడు. శుక్లపక్ష పాడ్యమి నందు వీర్య సేకరణ, విదియ నందు గర్భం ధరించడం, తదియ నందు రూపం ఏర్పడటం, చవితి నందు అన్ని అవయవాలు ఏర్పడి, పంచమి నాడు పూర్తి ఆకారంతో నిలబడి శివుని విల్లు ధరించడం జరిగింది. కుమారస్వామి విల్లు ఎక్కు పెట్టగానే ఆ ధ్వనికి ఐరావతం, సుప్రీతకం అనే ఏనుగులు కుమారస్వామి మీదకు లంఘించాయి. కుమారస్వామి వాటిని తన చేతులతో అణచి పెట్టాడు. ఒక చేత్తో తనకు సహజసిద్ధంగా లభించిన శక్తి ఆయుధాన్ని పట్టుకున్నాడు. ఒక చేత్తో వినోదంగా కోడిని పట్టుకుని శంఖం పూరించాడు. బొటన వేలిని చప్పరిస్తూ ఆకాశాన్ని చేతులతో చరిచాడు. ఒక బాణంతో క్రౌంచ పర్వతాన్ని, శక్తి ఆయుధంతో శ్వేతపర్వతాన్ని భేదించాడు. ఆరు ముఖాలతో సింహనాదంచేసాడు. ఆ సింహనాదానికి పర్వతాలు చలించాయి, సముద్రాలు పొంగాయి, భూమి కంపించింది. ఆ ఉత్పాతాలకు భయపడి ఋషులు శాంతి హోమాలు చేసారు. అప్పుడు చైత్రరథం అనే అడవిలో ఉన్న జనం " సప్తఋషి పత్నులకు అగ్నిదేవుని వలన జన్మించిన బాలుని వలన ఈ ఉత్పాతాలు సంభవిస్తున్నాయి " అని ఆక్రోశించారు. ఈ అపనిందని భరించలేక ఋషులు తమ భార్యలను వదిలి వేసారు. కొందరు మాత్రం " ఇందులో ఋషిపత్నుల దోషం ఏమీ లేదు. అగ్నిదేవుని భార్య స్వాహాదేవి ఋషిపత్నుల రూపంలో అగినిదేవుని చేరింది " అని చెప్పుకున్నారు. స్వాహాదేవి " అయ్యా! ఈ బాలుడు నాకు నా భర్తకు జన్మించాడు. మీ పత్నులకు ఇందులో ఎలాంటి సంబంధం లేదు. వారిని స్వీకరించండి " అని చెప్పింది. ఋషులు ఆమె మాటలు విశ్వసించ లేదు. తరవాత విశ్వామిత్రుడు అనే ముని అగ్ని కుమారునకు జాతక కర్మలు చేసాడు.

## దేవేంద్రుడు యుద్ధముకు వచ్చుట

దేవతలు దేవేంద్రుని వద్దకు వెళ్ళి " దేవేంద్రా! అగ్ని కుమారుడు తేజోవంతుడు, గర్వం కలవాడు. అతని వలన నీ పదవికి ముప్పు రాగలదు. నీ పదవి దక్కాలంటే వెంటనే అతనిని సంహరించడం మంచిది " అన్నారు. దేవేంద్రుడు సప్త మాతృకలను పిలిచి " మీరు అగ్ని కుమారుని సంహరించండి " అని ఆజ్ఞాపించాడు. అందుకు అంగీకరించి వెళ్ళిన సప్త మాతృకలు బాలుని తేజస్సు చూసి భయపడి అతనిని శరణు వేడారు. కుమార స్వామి వారిని మన్నించాడు. సప్త మాతృకలు బాలుని సంరక్షణ కొరకు లోహితాస్య అనే దాదిని సృష్టించారు. అగ్నిదేవుడు కుమారుని సంరక్షణా భారం స్వీకరించాడు. ఇది తెలుసుకున్న దేవేంద్రుడు ఆగ్రహించి తన సేనలతో కుమారస్వామి మీదకు దండెత్తి వచ్చాడు. కుమారస్వామి ముఖము నుండి వెలువడిన అగ్ని జ్వాలలకు భయపడిన దేవతలు అతనిని శరణుజొచ్చారు. దేవేంద్రుడు కుమారస్వామి మీదకు వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. అది కుమారస్వామి కుడి భాగాన్ని తాకగా అందు నుండి బంగారు చాయతో, మేషముఖంతో శక్తి ఆయుధంతో ఒక పురుషుడు జన్మించాడు. అతని పేరు విశాఖుడు. అతనితో పాటు అనేక మంది బాల బాలికలు పుట్టారు. ఇది చూసిన దేవేంద్రుడు భయపడి కుమారస్వామిని శరణు వేడాడు.

## కుమారస్వామి దేవతల మన్ననలను అందుకొనుట

దేవతలు సింహనాదాలు చేస్తూ కుమారస్వామి చెంత చేరారు. దేదీప్యమానంగా వెలుగుతున్న అగ్ని పుత్రుని చూసి లక్ష్మీ దేవి సాకారమై అతని చెంతన నిలిచింది. ఆరవదినం ఋషులు కుమారస్వామిని భక్తితో నమస్కరించి " దేవా! నీవు పుట్టిన ఆరుదినములకే లోకాలను జయించావు. దుష్ట శిక్షణ, శిష్టరక్షణ, సుపరిపాలనా దేవేంద్రుని కర్తవ్యం. షణ్ముఖా నీవు అందుకు తగిన వాడివి కనుక ఇంద్ర పదవిని స్వీకరించుము " అని దేవతలు, ఋషులూ అడిగారు. ఇంద్రుడు " కుమారస్వామీ! నీవు శౌర్యవంతుడవు కనుక ఇంద్రపదవిని అంగీకరించుము " అని అడిగాడు. " దేవేంద్రా! నాకు ఇంద్ర పదవి అక్కర లేదు. నీ తేజస్సు చూసి దేవతలు తిరిగి నీవే ప్రభువు అని మోహంకలుగ చేసిన నీకు నాకు శత్రుత్వం వస్తుంది కనుక ఆ పదవిలో నీవే ఉండు " అని కుమారస్వామి అన్నాడు. దేవేంద్రుడు ఆ మాటలకు ఆనందించాడు. " కుమారా! నీవు మా సేనలకు ఆదిపత్యం వహించు " అని ఇంద్రుడు కుమారస్వామిని అడుగగా అతడు అందుకు అంగీకరించాడు. ఋషులు దేవతలు జయజయధ్వానాలు చేసి కుమారస్వామిని దేవ సేనాధిపతిగా అభిషేకించారు. మహాశివుడు అక్కడకు వచ్చి కుమారస్వామిని చేరదీసి విశ్వకర్మచే కూర్చ బడిన బంగారు పుష్పమాలను బహూకరించాడు " అని చెప్పగా ర్మరాజు ఇక్కడ ఒక సందేహం వెలిబుచ్చాడు " మహర్షీ! కుమారస్వామి రుద్రాంశ సంభూతుడంటారు కదా అదెలా సంభవించింది " అని అడిగాడు.


దేవసేనను చూపిస్తున్న ఇంద్రుడు

మార్కండేయుడు ధర్మరాజుతో " ధర్మరాజా! పూర్వం శివుడు తన తేజస్సును అగ్నియందు ప్రవేశపెట్టాడు. ఆ వీర్యము చేత అగ్నిహోత్రుడు కుమారస్వామిని పుట్టించాడు. అగ్నికి రుద్రుడనే నామాంతరం కూడా ఉంది. అందుచే కుమారస్వామిని అగ్ని పుత్రుడు, శివపుత్రుడు అని కూడా అంటారు " అన్నాడు. అగ్నిదేవుని భార్య స్వాహాదేవి కృత్తికల రూపంలో ఆరుగురు ముని పత్నుల రూపంధరించి భర్తను చేరి కుమారస్వామికి జన్మ ఇచ్చినందున కార్తికేయుడనే నామం కలిగింది. ఈ సమయమున దేవేంద్రుడు తన వద్ద పెంచుకుంటున్న దేవసేనను అక్కడకు రప్పించి " కుమారా! ఈ కన్యను బ్రహ్మదేవుడు నీ కొరకే సృష్టించాడు ఈమెను స్వీకరించు " కుమారస్వామి అందుకు అంగీకరించి దేవసేనను వివాహమాడాడు.

## కుమారస్వామి పదవులను ఇప్పించుట

ఈ సమయమున భర్తలచే విడువబడిన సప్తఋషి పత్నులు అక్కడకు వచ్చారు. " కుమారా! దుర్జనులు కొందరు మేము అగ్నిదేవునితో చేరి నిన్ను కన్నామని అసత్యప్రచారం చేసారు. ఏ పాపం ఎరుగని మమ్ము భర్తలు వదిలి వేసారు. పుత్ర సమానుడవైన నీవే మమ్ములను రక్షించాలి " అని ప్రార్ధించారు. కుమారస్వామి దేవేంద్రునితో " అమ్మా! మీరు నాకు తల్లులు సందేహం లేదు" అని " దేవేంద్రా వీరికి తగిన పదవులు ఇమ్ము " అన్నాడు. దేవేంద్రుడు " కుమారా! దక్షప్రజాపతి కుమార్తెలు చంద్రుని వివాహమాడి అతని చుట్టూ తారలుగా విరాజిల్లు తున్నారు. అందులో రోహిణి నక్షత్రం పక్కన ఉన్న అభిజిత్ అనే తార చంద్రుని ప్రేమను అందరికన్నా అధికంగా పొందాలని తపస్సు చేసుకోవడానికి వెళ్ళింది. ప్రస్తుతం ఆస్థానంలో ఈ ఆరుగురు కృత్తికలను ఉంచవచ్చు " అన్నాడు. ఇంతలో స్వాహాదేవి అక్కడకు వచ్చి " కుమారా! నీవు నా పుత్రుడవు నాకు ఎప్పుడూ నీ దగ్గర ఉండాలని కోరికగా ఉంది " అన్నది. " అలాగే నీవు ఎల్లప్పుడూ నా చెంతనే ఉండి నాచే మీ కోడలుచే సపర్యలందుకుంటూ సుఖంగా ఉండు" అన్నాడు. ఇంతలో సప్తమాతృక లైన హవిష, కాళి, కౌశికి, ఉద్ధత, శారిక, ఆర్య, వైధాత్రి అక్కడకు వచ్చారు. వారు "షణ్ముఖా! ఇప్పుడు లోకమాతలుగా ఉన్న వారిని తొలగించి మమ్ములను ఆపదవిలో ఉంచు " అన్నారు. కుమారస్వామి " ఇప్పటివరకు ఉన్న మాతలను ఎలా తొలగిస్తాం. మీరు వేరే వరం కోరుకోండి " అన్నాడు.వారు "లోకంలోని పసిపాపలను బాధించి పీడించే వరం ప్రసాదించు " అన్నారు. కుమారస్వామి " ఇలాంటి వరం కోరడం అనుచితము అలాంటి వరం ఇస్తున్నాను. మీకు మొక్కిన బాలలను ఎలాంటి హాని లేకుండా రక్షించండి. మీరి నరులను పదనారు వయసు వచ్చేదాకా బాధించండి. మీకు నా అంశతో పుట్టిన వాడిని రక్షగా నియమిస్తాను " అన్నాడు. ఇంకా శకుని మాత వినత, దైత్యమాత దితి, గోమాత సురభి, శునక మాత సరమ, వృక్షమాత కరంజ, సర్ప మాత కద్రువ, కుమారుని మాత లోహితాస్య ఈ మాతృకలతో కలసి శిశువులను బాధిస్తూ ఉంటారు. అలాగే దేవ గ్రహములు, పితృ గ్రహములు, గంధర్వ గ్రహము లు, యక్ష గ్రహములు నరులను బాధిస్తుంటాయి. కాని ధర్మరాజా ! శివభక్తులను, పరిశుభ్రంగా ఉండే వారిని, శాంతి కాముకులకు, ఇంద్రియాలను జయించిన వారిని భాధించవు " అన్నాడు.

## కుమారస్వామి స్వాహాదేవిని అనుగ్రహించుట

ఇంతలో అగ్నిదేవుని భార్య అక్కడకు వచ్చి " కుమారా! నేను దక్షప్రజాపతి కూతురును. నా తండ్రి నన్ను చిన్నతనంలోనే అగ్నిదేవునకిచ్చి వివాహం చేసాడు. నా భర్తకు నాపై అనురాగం లేదు నీవెలాగైనా అనురాగం కలిగేలా చెయ్యి " అని కోరింది. కుమారస్వామి " అమ్మా! బ్రాహ్మణులు అగ్నిలో హవ్యములు వేసేటప్పుడు స్వాహా కార మంత్రంతో వేస్తారు. అందు వలన నీకు నీ భర్తతో నిరంతర సాన్నిహిత్యం లభిస్తుంది " అన్నాడు. బ్రహ్మదేవుడు అక్కడకు వచ్చి అక్కడ ఉన్న శివుని చూసి " కుమారా! ఈయన మహాశివుడు త్రినేత్రుడు, త్రిపురాంతకుడు. ఈమె ఈయన భార్య పర్వతరాజ పుత్రి పార్వతి వీరు నీ తల్లి తండ్రులు. వీరు యోగ బలంచే తమ తేజస్సును అగ్నియందు అతని భార్య యందు ప్రవేశపెట్టి నిన్ను కన్నారు. వీరిని భక్తితో ఆరాధించు " అన్నాడు. కుమారస్వామి పార్వతీపరమేశ్వరులను భక్తితో నమస్కరించాడు. శివుడు కుమార సమేతుడై భద్రవటం చేరుకున్నాడు. వారి వెంట కుబేరుడు, దేవేంద్రుడు, అమోఘుడు అనే యక్షనాయకుడు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, యముడు, ఆదిత్యుడు, చంద్రుడు, వరుణుడు, వాయుదేవుడు, అగ్నిదేవుడు వెంట నడిచారు.

# మహిషాసురమర్ధన

ధర్మరాజా ! ఆ సమయంలో మహిషాసురుడు రాక్షస సేనలతో దండెత్తి వచ్చాడు. క్షణాలలో దేవసైన్యాన్ని చిందరవందర చేసాడు. ఇది చూసి దేవతలు యుద్ధం చేయడం ఆపి పారిపోయారు. దేవేంద్రుడు వారికి ధైర్యం చెప్పి యుద్ధోన్ముఖులను చేసాడు. దేవతలకు రాక్షసులకు మద్య భీకర పోరు జరిగింది. ఆ యుద్ధంలో శివుడు కూడా పాల్గొన్నాడు. మహిషాసురుడు శివుని రధం పట్టుకున్నాడు. దేవతలు శివుడు మహిషాసురుని చేతిలో మరణిస్తాడని భయపడ్డారు. శివుడు కుమారస్వామిని చూసి " కుమారా! చూసితివా వీడి సాహసం. నా రధాన్ని పట్టుకున్నాడు. వీడికి ఆయుషు మూడింది. వెంటనే వీడిని సంహరించు " అన్నాడు. కుమారస్వామి శక్తి ఆయుధాన్ని మహిషాసురుని పై ప్రయోగించాడు. అది మహిషాసురునితో అతని సైన్యాన్ని దహించింది. దేవతలు కుమారస్వామిని స్తుతించారు. శివుడు దేవతలతో " ఇతని పరాక్రమం చూసారా! ఇకపై మీరి నన్ను ఎలా పూజ్య భావంతో సేవిస్తారో ఇతనిని అలాగే సేవించండి " అని చెప్పి భద్రవటానికి వెళ్ళాడు. ఈ విధంగా కుమారస్వామి దేవతల శత్రువులను ఒక్క రోజులో జయించాడు.


మహుషుని వధ

## ద్రౌపది సత్యభామలు

ధర్మరాజు మార్కండేయ మహర్షి వద్ద అనే విషయాలు తెలుసుకుంటున్న సమయంలో ద్రౌపది సత్యభామలు ఇష్టాగోష్టి సలుపుతున్నారు. సత్యభామ ద్రౌపదిని " ద్రౌపదీ ! నీకు ఐదుగురు భర్తలు. వారియందు నీవు భక్తి కలిగి ఉన్నావు. వారు నీయందు అనురాగం కలిగి ఉన్నావు. ఇదెలా సాధ్యం నీ వద్ద ఏదైనా మంత్రమూ ఔషధమో ఉన్నదా? ఈ మహిమ నీకు ఎలా చేకూరింది. నీ అలంకరణా సామర్ధ్యమా లేక సంభాషణా చాతుర్యమా నాకు ఎరిగింపుము. ఆ నేర్పరితనంతో నేను నా భర్త అయిన శ్రీకృష్ణుని వశం చేసుకుంటాను " అని అడిగింది. ఆ మాటలకు ద్రౌపదికి కించిత్ కోపం వచ్చింది. ఆమె సత్యభామతో " సత్యా! నీవు నన్ను దుష్టస్త్రీగా జమకట్టడం తగదు. ఆ పురుషోత్తమునకు నీవు భార్యగా తగవు అని నా భావన. మంత్ర తంత్రములతో భర్తను వశం చేసుకోవాలి అనుకోవడం నీ భ్రమ. అలాంటి పనులు చేస్తే భర్తకు భార్య మీద ఉన్న ప్రేమ కూడా పోతుంది. అలాంటి భార్యతో చెలిమి పాముతో చెలగాటం అని భావిస్తాడు. అలాంటి మందులకు భర్తకు రోగం, భార్యకు అపకీర్తి వస్తుంది. భర్తల పట్ల భార్యలు ఇలాంటి కపటాలతో మోసగించిన నరకం తప్పదు. భర్తకు అనుకూలవతిగా చరించడమే భార్యకు ఉత్తమ ధర్మం. నేను పాండవుల పట్ల ఎలా ప్రవర్తిస్తానో నీకు వివరిస్తాను. నా భర్తలు పరస్త్రీలతో చరించినా నేను అసూయ చెందను. వారి పట్ల అహంకరించక పూజ్యభావంతో ఉంటాను. నా భర్తలు తప్ప మిగిలిన వారు దేవతలైనా, యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుషులైనా నాకు తృణప్రాయం. స్నానం భోజనం శయనం ఏదైనా భర్తలకు సమకూర్చి నేను అనుభవిస్తాను. భర్తల మనసెరిగి వారికి కావలసినవి సమకూరుస్తాను. భర్తల యొక్క బంధు మిత్రుల ఎడ ఆదరం చూపిస్తాను. గృనిర్వహణలో పరిశుభ్రత పాటిస్తాను. ఏదీ వ్యర్ధం చేయను. అనవసర ఖర్చులు చేయను. భర్తలు ఇంట లేనప్పుడు పువ్వులు ధరించను. అలంకారం చేసుకోను భర్తలయందు మనసు నిలిపి వారి కోసం నిరీక్షిస్తుంటాను. ఎక్కువ సేపు వాకిట నిలబడటం, అతిగా నవ్వడం, దుష్టులతో స్నేహం చెయ్యడం చేయను. నా భర్తలు ఎంతటి సున్నిత మనస్కులో అంతటి కోపాన్ని ప్రదర్శిస్తారు. వారి పట్ల భయభక్తులతో ప్రవర్తిస్తాను. మా అత్త కుంతికి స్నానపానాదులు నేనే సమకూరుస్తాను. నా భర్త ధర్మరాజు ప్రతి రోజు పదివేల బ్రాహ్మణులకు పదివేల యతీశ్వరులకు అన్న సంతర్పణ చేస్తాడు. ఆ ఏర్పాట్లు నేను స్వయంగా చేసి వారికి ఆనందం సమకూరుస్తాను. అంతఃపురంలో పనిచేసే వేలకొలది సేవకుల బాగోగులు నేనే స్వయంగా చూస్తాను. వారు వారి విధులను క్రమశిక్షణలో నిర్వర్తించేలా చూస్తాను. భండాగారంలో ఉన్న రత్నాలు, మణులు, ఆభరణాలు, ధనం మొదలైన లెక్కలు నాకు తెలియును. పని వారికి ఇవ్వవలసిన జీతభత్యములు నేనే ఇస్తాను. అందు వలన పాండవులు సంసార భారం నా మీద మోపి నిశ్చింతగా ఉంటారు. నాకు రాత్రి ఒక ఝాము మాత్రమే నిద్రపోవడానికి సమయం ఉంటుంది. భోజనం చేయటానికి సరిగా సమయముండదు. ఇలా ప్రవర్తించి నేను భర్తల ఆదరణ పొందుతున్నాను కాని మందులు ఔషధాలు ఉపయోగించి కాదు. ఇంద్రజాలం అసలే కాదు " అని అన్నది.

### ద్రౌపది సత్యభామకు హితవు చెప్పట

సత్యభామ సిగ్గుపడి " ద్రౌపదీ! నాకు నీ సంగతి తెలియక ఏదో పరిహాసంగా అన్నాను. నన్ను మన్నింపుము " అన్నది. ద్రౌపది " సత్యా! దానిదేముంది అలాగే పరిహాసంగా తీసుకుంటాను. భర్త మనసు చూరగొనే ధర్మమైన ఉపాయం చెప్తాను విను. పతిని మించిన దైవం భార్యకు లేదు. భర్త దయ వలన భార్యకు కీర్తి ప్రతిష్టలు కలుగుతాయి. సమస్త సంపదలు సమకూడుతాయి. భర్తకు సేవలు చేస్తే భార్యకు సులువుగా పుణ్యం లభిస్తుంది. కనుక భర్తకు ప్రతి రోజు ప్రేమతో ఆరాధనతో


ద్రౌపది సత్యభామల సంవాదము

సేవలు చెయ్యి. నీకు భర్త అనురాగం లభిస్తుంది. భర్త రాగానే చిరునవ్వుతో ఎదురేగి స్వాగతం పలుకు. భర్త సేవలకు సేవకులను నియోగించక స్వయంగా నువ్వే చెయ్యి. నీ భర్త మాటల సందర్భంలో చెప్పిన రహస్యం బట్టబయలు చేసి సపత్నుల ముందు అవమానపడకు. అందు వలన భర్త అనురాగం సన్నగిల్లుతుంది. నీ భర్తకు అపకారం చేసే వారు నీకు మిత్రులైనా వారిని ఆదరింపకుము. భర్త బంధుమిత్రులను ఆదరించు. నీ పుత్ర సమానులైన ప్రద్యుమ్నాదులతో కూడా ఒక శయ్యపై కూర్చుండ రాదు. కుల స్త్రీలతో మాత్రం స్నేహసంబంధాలు పెట్టొకో. విలాసజీవితంపై ఆసక్తి కలవారు అహంభావులైన స్త్రీలతో స్నేహం వద్దు. ఇలా ప్రవర్తిస్తే నీకు పరమ సౌభాగ్యం కలుగగలదు " అన్నది. సత్యభామ ద్రౌపదితో " నీ భర్తలు దైవసమానులు. నీవు ధర్మం తెలిసిన దానివి. నీ కుమారులు పరాక్రమవంతులు, నీవు వీరమాతవు. వారిని ద్వారకలో రుక్మిణీ సుభద్రలు తమ కుమారుల కంటే ప్రేమగా చూసుకుంటున్నారు కలత చెంద వద్దు. వారు ద్వారకలో క్షేమంగా ఉన్నారు. త్వరలోనే మీకు మీ రాజ్యం లభిస్తుంది. దుర్యోధనాదులు కష్టాలు అనుభవించగలరు " అన్నది. శ్రీకృష్ణుడు ధర్మరాజు మార్కండేయ మహర్షి వద్ద సెలవు తీసుకుని ద్వారకకు పయనమైయ్యాడు. మార్కండేయ మహర్షి ధర్మరాజుతో అనునయ వాక్యాలు పలికి తన ఆశ్రమానికి వెళ్ళాడు. పాండవులు కామ్యక వనం వదిలి ద్వైత వనానికి వెళ్ళారు.

## దుర్యోధనుని అవమానభారం

ఇంతవరకు కధను వింటున్న జనమేజయుడు వైశంపాయుని చూసి " మహర్షీ! ఎల్లప్పుడూ పాండవులకు హాని తలపెట్టే దుర్యోధనుడు శత్రువులచే బంధింపబడి పాండవులచే రక్షింపబడిన అవమాన భారాన్ని ఎలా భరించాడు. భరించి ఎలా హస్థినకు చేరాడు " అని అడిగాడు.

## హస్థినాపురం

హస్థినాపురవాసి అయిన బ్రాహ్మణుడు ద్వైతవనానికి వెళ్ళి పాండవులను కలుసుకుని తిరిగి హస్థినకు వెళ్ళాడు. దృతరాష్ట్రుడు ఆ బ్రాహ్మణుని చూసి పాండవుల యోగక్షేమాలు విచారించాడు. ఆ బ్రాహ్మణుడు పాండవులు ద్రౌపది అడవులలో పడే కష్టాలు వివరించాడు. దృతరాష్ట్రుడు అది విని ఎంతో దుఃఖించాడు. " అయ్యో! నా కుమారుని దుర్నీతి వలన కదా ఇంత కష్టం దాపురించింది. దీనికంతకు నాచేతకాని తనమే కారణం. ధర్మరాజును నా పెద్ద కొడుకుగా భావిస్తాను అతనికి బ్రహ్మదేవుడు ఎన్ని కష్టాలు రాసాడు. హంసతూలికా తల్పంపై నిదురించే ధర్మరాజు కటిక నేలపై నిదురిస్తున్నాడు కదా. అనిల కుమారుడు అతి బలవంతుడైన భీముడు అడవి సింహంలా వనాలలో తిరుగుతున్నాడు కదా. అన్నదమ్ములు ద్రౌపది పడుతున్న కష్టాలు చూసి అర్జునుడు మనసులో రగిలి పోతున్నాడు కదా. సుకుమారులైన కవలలు అడవులలో ఎన్ని కష్టాలు పడుతున్నారో. వాయు పుత్రుడైన భీముడు అతి బలవంతుడైనా అన్న మాటకోసం అరణ్యవాసం చేస్తున్నాడు కాని లేకున్న అతనిని ఆపడం ఎవరి తరం. శకుని వంచన, దుశ్శాసనుని దుశ్చర్యలు, కర్ణుని తులువతనం, దుర్యోధనుని అనీతి అతని మనసులో ముల్లులా గుచ్చుకుంటున్నాయి కదా. భీముని చేతిలో నా కుమారుల మరణం తప్పదేమో. కర్మఫలం అనుభవించక తప్పదు కదా. ఏమి చేయుదును విచారించిన ఏమి ఫలం నేను ఎంత వారించినా జూదం ఆపలేక పోయాను. కష్టముల వెంట సుఖాలు వస్తాయి అంటారు కదా. అర్జునుడు పరశివుని మెప్పించి పాశుపతాన్ని సాధించాడు. సశరీరంగా స్వర్గానికి పోవడమే కాక ఇంద్రుని అర్ధ సింహాసనం అధిష్టించాడు. అర్జునుడు ఏ జన్మలో చేసిన పుణ్యమో కదా " అని పపరి విధాలుగా విలపించేడు. దుర్యోధనుడు అది చూసి "మామా! మా తండ్రిగారు ఇలా భీతిల్లుతున్నాడు. దీనిని గురించి ఆలోచించ వలెను " అన్నాడు. వారిరువురు కర్ణునితో చేరి ఏకాంతప్రదేశంలో మంతనాలు జరిపారు. కర్ణుడు " సుయోధనా పాండవుల సంపదలన్నీ నీ వశమైనాయి. వారు అడవుల పాలయ్యారు. రాజులంతా నీకే కప్పం చెల్లిస్తున్నారు. సార్వభౌముడివైన నీ పాలన ప్రజామోదాన్ని పొందింది. నీవు ద్వైత వనానికి వెళ్ళి అక్కడ ఇడుములు పడుతున్న పాండవులకు నీ భోగభాగ్యములు ప్రదర్శించి వారికి ఖేదము కలిగించ వలెను. అలాగే వారు పడుతున్న కష్టములు చూసి ఆనందించి మన జన్మ సాఫల్యం పొందవచ్చు. ద్రౌపది నీ భార్యల సౌభాగ్యం చూసి దుఃఖించ వలెను " అని దుర్యోధనునితో అన్నాడు.

## ద్వైతవనానికి దుర్యోదనాదుల ప్రయాణం

కర్ణుని మాటలు విన్న దుర్యోధనుడు " మిత్రమా కర్ణా! నా అభిప్రాయం కూడా అదే. మనం ద్వైతవనానికి పోవడానికి దృతరాష్ట్రుడు అంగీకరించాలి కదా. ఇటీవల దృతరాష్ట్రుడు పాండవులను చూసి అంతులేకుండా భయపడుతున్నాడు. పాడవుల శౌర్యపరాక్రమాలను తలచుకుని కలత చెందుతున్నాడు. ఇందుకు పాండవ పక్షపాతి అయిన విదురుడు వారిని ప్రశంసిస్తూ వంత పాడుతున్నాడు. కనుక దృతరాష్టుడు మన ప్రయాణానికి అంగీకరించడేమో నీవు శకుని ఏదైనా ఉపాయం ఆలోచించండి " అన్నాడు. మరునాడు కర్ణుడు దుర్యోధనుని వద్దకు వచ్చి " సుయోధనా! ద్వైత వనంలో మనకు ఆవుల మందలు ఉన్నాయి కదా. వాటిని చూచు నెపంతో దృతరాష్టుని అనుమతి తీసుకుంటాము " అన్నాడు. దుర్యోధనుడు కర్ణుని అభిప్రాయంతో తన అభిప్రాయం అదేనంటూ ఏకీభవించాడు. వెంటనే వారు ఒక గొల్లవాడిని పిలిపించి దృతరాష్ట్రునితో ఎలా మాట్లాడాలో నేర్పించారు. ఆ తరవాత ముగ్గురూ దృతరాష్ట్రుని వద్దకు వెళ్ళి మాట్లాడుతూ ఉన్నారు. అంతలో వారు ఏర్పాటు చేసిన గొల్లవాడు వచ్చి దృతరాష్టునితో " మహారాజా! నేను ద్వైతవనం నుండి వచ్చుచున్నాను అక్కడ ఇప్పటి వరకూ క్షేమంగా ఉన్న మన ఆవులకు ఇటీవల కౄరమృగాల బెడద ఎక్కువయినది. మీరు సత్వరం తగు చర్య తీసుకోవాలని మనవి చేస్తున్నాను " అన్నాడు. శకుని కర్ణుడు చేరి గోపాలుని మాటలు సత్యమనిపిస్తున్నాయని సుయోధనుని గోసంరక్షణార్ధం ద్వైతవనానికి పంపమని నమ్మ పలికారు. దృతరాష్టుడు " గోసంరక్షణ చేయడం మంచిదే కాని అక్కడ పాండవులు ఉన్నారు. మీరు అక్కడికి వెళ్ళి పాండవులను అవమానిస్తారు. వారు ఇప్పటికే మీచే అవమానించబడి ఉన్నారు కనుక మిమ్మల్ని వది పెట్టరు. మీ మీద ఆగ్రహించి ఉన్న భీముని రెచ్చగొట్టడం మంచిది కాదు. అమోఘమైన అస్త్రసంపద సాధించిన అర్జునుని ఎదిరించడం క్షేమంకాదు. మీరు వారికి హానితలపెట్టడం అవివేకం. గోసంరక్షణకు సమర్ధిలైన వారి పంపుదాం. మీరు వెళ్ళద్దు " అన్నాడు. ఆ మాటలకు శకుని "మహారాజా! పాండవులు అమిత శౌర్య పరాక్రమాలు కలవాళ్ళు. వారికి మేము హాని ఎలా తలపెడతాము. మేము అలా చేసినా ధర్మాత్ముడైన ధర్మరాజు ఆడిన మాట తప్పడు. అతని తమ్ములు అతని మాట జవదాటరు. మాకు కూడా వేటాడవలెనని కోరిక కలిగినది మాకు అనుజ్ఞ ఇమ్ము. మేము ఆవులను మాత్రం రక్షిస్తాము. అందువలన పాండవులకే కీడు కలుగదు " అని నచ్చచెప్పాడు. దృతరాష్ట్రుడు చివరకు అంగీకరించాడు. వెంటనే దుర్యోధనుడు ఘోషయాత్రను ప్రకటించాడు.

## ఘోషయాత్ర

కర్ణుడు, శకుని, సోదరులు, బంధువులను తీసుకుని పరివారంతో వాహనము ఎక్కి ద్వైతవనానికి దుర్యోధనుడు బయలుదేరాడు. ఒక చోట శిబిరాలను ఏర్పరచుకుని గొల్ల వారిని అడిగి గోవుల మంచిచెడులు విచారించి అడవికి వెళ్ళి వేటాడాడు. ఎన్నో మృగాలను చంపాడు. ఆ సమయంలో ధర్మరాజు సద్యస్కందం అనే యాగాన్ని అక్కడి మునుల సాయంతో చేస్తున్నాడు. అక్కడకు చేరిన సుయోధనుడు తన వైభానికి తగినట్లు క్రీడా గృహములు నిర్మించమని చెప్పాడు. అక్కడ కాపలా ఉన్న గంధర్వులు వారిని అడ్డగించారు. వారు " ఇది చిత్రసేనుడనే గంధర్వరాజుకు చెందిన కొలను. ఇక్కడకు మీరు రాకూడదు. వెనక్కు వెళ్ళండి " అన్నారు. భటులు " ఇక్కడకు సుయోధన సార్వభౌములు వచ్చారు. అందు వలన మీరే ఇక్కడ ఉండక వెళ్ళండి " అని బదులిచ్చారు. గంధర్వులు ఆగ్రహించి " మీ రాజుకు తన బలం ఎదిరి బలం అసలు తెలియదు. గంధర్వరాజు దగ్గర ఇలాంటి దుశ్చర్యలు చెల్లవని చెప్పండి " అని హేళనగా పలికారు. భటుల ద్వారా విషయం తెలుసుకున్న దుర్యోధనుడు భటులతో " మీరు తక్షణం వెళ్ళి ఆ గంధర్వుల గర్వం అణచండి. దేవతలు దేవేంద్రునితో సాయం వచ్చినా వారిని కూడా జయించండి " అని ఆజ్ఞాపించాడు. కౌరవులు తమబలాలతో గంధర్వుల మీదకు దండయాత్రకు వెళ్ళారు. గంధర్వులు వారితో " మీకు మాకు ద్వేషం ఏముంది? ఆగండి " అన్నా వారు లక్ష్యపెట్టక వారి పై ఆయుధాలు ప్రయోగించారు. గంధర్వులు చిత్రసేనునికి జరిగినది వివరించారు. చిత్రసేనుడు ఆగ్రహించి " కౌరవసేనలను చీల్చి చెండాడండి " అని ఆజ్ఞాపించాడు. గంధర్వసేనలు కౌరవసేనను చీల్చి చెండాడాయి. గంధర్వుల ధాటికి నిలువ లేక దుశ్శాసనుడు పారిపోగా కర్ణుడు మాత్రం ధైర్యంగా పోరాడుతుండగా దుర్యోధనాదులు ఇది తెలుసుకుని యుద్ధరంగానికి వచ్చారు. కౌరవులకు గంధర్వులకు మధ్య జరిగిన ఘోరమైన పోరులో గంధర్వులు ఓడి పోయారు. వారు చిత్రసేనునికి జరిగినది చెప్పారు.

### సుయోధనుడు గంధర్వుల చేతిలో బంధీ అగుట

చిత్రసేనుడు స్వయంగా యుద్ధానికి వచ్చాడు. చిత్రసేనుడు మాయాయుద్ధ నిపుణుడు. అతని మాయా యుద్ధానికి కౌరవ సేన తట్టుకొనలేక పోయింది. కర్ణుడు తప్ప మిగిలిన వారంతా పారి పోయారు. దుర్యోధనుడు కర్ణునికి సాయంగా ఉన్నాడు శకుని దుర్యోధనుని సోదరులు దుర్యోధనునికి సాయంగా నిలిచారు. గంధర్వులు కర్ణుని రధం విరగకొట్టారు. కర్ణుడు పక్కనే ఉన్న వికర్ణుని రధం ఎక్కి యుద్ధం నుండి బయటకు వెళ్ళాడు. అప్పడు చిత్రసేనుడు దుర్యోధనుని రధం విరిచి దుర్యోధనుని జుట్టు

పట్టుకుని నేల మీద పడవేసి తన రధానికి కట్టి గట్టిగా సింహనాదం చేసాడు. అది చూసిన మిగిలిన గంధర్వులు మిగిలిన కౌరవులను, వారి భార్యలను దుర్యోధనుని భార్యను, కౌరవ రాకుమారులను మంత్రులను పట్టి చిత్రసేనుని ముందు ఉంచారు. అది చూసి మిగిలిన వారు అక్కడే ఉన్న ధర్మరాజు వద్దకు వెళ్ళి రక్షించమని మొర పెట్టుకున్నారు. అది విన్న భీముడు " ఆహా మనం చేవదలచిన కార్యం గంధర్వులే చేసారు. ఏ విధమైన శ్రమ లేకుండా మనకు విజయం చేకూర్చి గంధర్వులు మనకు మహోపకారం చేసారు. పుట్టిన నాటి నుండి పాపాలు చేసిన మాత్రమే చేయటానికి అలవాటు పడిన దుర్యోధనునికి ఈ నాటికి గర్వభంగం చేసిన బ్రహ్మ ఎంత నేర్పరో కదా. అడవులలో అష్టకష్టాలు పడుతున్న మనల్ని అవమానించటానికి వచ్చిన దుర్యోధనునికి తగిన పరాభవం జరిగింది. అందు వలన దుర్యోధనుని పై దయ చూపరాదు " అన్నాడు.

## ధర్మరాజు సుయోధనుడిని విడిపించుటకు తమ్ములను పంపుట


యుద్ధానికి సిద్ధమౌతున్న భీమార్జునులు

ఆ మాటలు విన్న ధర్మరాజు " భీమసేనా! పరుషపు మాటలు తగునా. శరణన్న వారిని రక్షించాలి కాని చులక చేయడం తగునా. దాయాదుల మధ్య తగాదాలు సహజం. అంత మాత్రంచే ప్రేమలు అంతరిస్తాయా? దాయాదులు వారిలో వారు కలహించుకున్నా పరాయి వారి చేతిలో పరాభవం జరిగినప్పుడు ఒకరికి ఒకరు సాయపడాలి. అలా చేయకపోతే లోకులు నిందించరా. సుయోధనుడు దుర్నీతి కలవాడే కాని భార్యలతో సహా పట్టుబడ్డాడు. మనం ఉపేక్షించిన కులహాని కలుగుతుంది. శరణు కోరిన వారిని రక్షించడం క్షత్రియ ధర్మం నీ వంటి పరాక్రమశాలికి అది ధర్మం కనుక నీవు నీ తమ్ములతో సాయుధులై రధముల మీద వెళ్ళి చిత్రసేనుని సుయోధనుని వారి భార్యలను పరివారమును రక్షించండి " అని చెప్పాడు. భీముడు " అన్నయ్యా! దయ లేకుండా నన్ను నీటిలో తోయించి, విషాహారం పెట్టి చంపాలనుకున్నాడు. మనలను లక్క ఇంట్లో దహించాలని అనుకున్నాడు. మన సంపదలను వంచనతో అపహరించాడు. ద్రౌపది వలువలు నిండు సభలో ఊడదీయించి అవమానించాలని చూసాడు. అతడు చేసిన దుశ్చర్యలు తలచకుండా ఇలా ఔదార్యం చూపడం తగునా " అని భీముడు పలికాడు. ధర్మరాజు " భీమసేనా! రక్షించమని అడిగితే ఎంతటి దుర్బలులైనా సాయం చేయడానికి ప్రయత్నిస్తాడు. నీ వంటి బలవంతునకు ఊరకుండటం తగునా. శత్రువునైనా శరణుజొచ్చిన రక్షించాలని పెద్దలు చెబుతారు. సుయోధనునికి మన బలపరాక్రమములు తెలుయును అందువలన మనం రక్షిస్తామని


చిత్రసేనునితో పోరాడుతున్న అర్జునుడు

ఆశతో ఎదురు చూస్తుంటారు. ఇది మనకు పుణ్యం కలుగు సమయం. నేను వెళ్ళి రక్షించగలను నేను యజ్ఞ దీక్షలో ఉన్నాను కనుక నిన్ను అర్ధిస్తున్నాను. కనుక మీరు వెళ్ళి గంధర్వులకు మంచి మాటలతో చెప్పి వారిని విడిపించండి. లేని ఎడల వారితో యుద్ధం చేసి వారిని విడిపించండి. నా యజ్ఞాన్ని సఫలం చెయ్యండి " అన్నాడు. ఎలాగైతేనేం భీముడు అంగీకరించి తన తమ్ములతో ఆయుధాలు ధరించి గంధర్వుల దగ్గరకు వెళ్ళారు. భీముడు వారితో " గంధర్వులారా! మీకు మాకు విరోధం లేదు. మీరు స్నేహపూర్వకంగా సుయోధనుని విడిచి పెట్టండి. ఇది ధర్మరాజు ఆజ్ఞ అనుల్లంఘనీయము అని తెలుసుకోడి " అన్నాడు. గంధర్వులు "ధర్మరాజు మాకు రాజు కాదు కనుక అతని ఆజ్ఞను మేము ఎందుకు పాటించాలి. మా రాజు దేవేంద్రుడు చెప్తేనే మేము వింటాము " అన్నారు. భీముడు " గంధర్వులారా! మీరు మంచి మాటలకు వినేలా లేదు మా ప్రతాపం రుచిచూపిస్తాము. సుయోధనుని విడిపిస్తాము " అని తమ్ములతో గంధర్వులతో తలపడ్డాడు. పాండవులకు గంధర్వులకు మధ్య పోరు భీకరంగా సాగింది. అర్జునుడు తన బాణాలతో అన్ని దిక్కులను బంధించాడు. చిత్రసేనుడు గధాయుదాన్ని అర్జునిపై ప్రయోగించాడు. అర్జునుడు తన బాణంతో దానిని ముక్కలు చేసాడు. చెత్రసేనుడు మాయాయుద్ధం ఆరంభించాడు. అర్జునుడు శబ్దవేదితో బాణములతో చిత్రసేనుని వేదించాడు. ఇక చేసేది లేక చిత్రసేనుడు అర్జునిని ముందు నిలిచాడు. అర్జునుడు " చిత్రసేనా! నీకు కౌరవులతో శత్రుత్వం ఎందుకు వారిని విడిచి పెట్టు " అన్నాడు. చిత్రసేనుడు " అర్జునా! నీకు నాకు

ఎలాంటి శత్రుత్వంలేదు పైగా నీవు నా మిత్రుడివి. అసలు విషయం ఏమిటంటే ఈ దుర్యోధనుడు పరమ దుర్మార్గుడు. మీరు అడవిలో పడుతున్న కష్టాలు చూసి హేళన చేయడానికి ఘోషయాత్ర మిష మీద వచ్చాడు. ఇది తెలుసుకున్న ఇంద్రుడు ఈ దురాత్ముని పట్టి బంధించి తన వద్దకు తీసుకు రమ్మన్నాడు. అందుకే ఇతనిని పట్టి బంధించి తీసుకు వెళుతున్నాను " అన్నాడు.

### సుయోధనుడిని ధర్మరాజు వద్దకు తిసుకు వెళ్ళుట

అర్జునుడు " మిత్రమా చిత్రసేనా! ఇతడు ఎంతటి దుర్మార్గుడైనా మాకు సోదరుడు. ఇతనిని విడిచి పెట్టి ధర్మరాజుకు ఆనందం కలిగించు. దేవేంద్రుని ఆజ్ఞ అయినా ఇతనిని ధర్మరాజు దగ్గరకు తీసుకు వెళతాము. అతడు చెప్పినట్లు నడచుకుంటాము " అన్నాడు. చిత్రసేనుడు అందుకు సమ్మతించాడు. అందరూ ధర్మరాజు వద్దకు వెళ్ళారు. చిత్రసేనుని ధర్మరాజు సాదరంగా పూజించి " చిత్రసేనా! సుయోధనుడు, సోదరులు, పరివారంలో ఏరికీ నీ వలన ప్రాణహాని కలుగలేదు. మాకుటుంబం సురక్షితంగా ఉన్నందుకు సంతోషం. ఇతని అపరాధం మన్నించి విడిచి పెట్టు " అని ప్రార్ధించాడు. ధర్మరాజు మాత చిత్రసేనుడు మన్నించి సుయోధనుని పరివారంతో సహా విడిచి పెట్టాడు. చిత్రసేనుడు జరిగినది దేవేంద్రునికి చెప్పాడు. దేవేంద్రుడు అమృత వర్షాన్ని కురిపించి యుద్ధంలో మరణించిన గంధర్వులను బ్రతికించాడు. ధర్మరాజు దుర్యోధనుని బంధవిముక్తుని చేసి " సుయోధనా! ఎప్పడూ ఇలాంటి సాహసం చేయద్దు. దుర్మార్గులు మాత్రమే ఇలాంటి క్రియలు చేసి నశిస్తారు. నీవు మనసులో ఎలాంటి విరోధం పెట్టుకొనక తమ్ములను పరివారాన్ని వెంట పెట్టుకునహస్థినకు వెళ్ళుము " అన్నాడు. సుయోధనుడు దీనవదనుడై అక్కడి నుండి వెళ్ళి పోయాడు. ధౌమ్యుడు బ్రాహ్మణులు ధర్మరాజు ఔదార్యాన్ని కొనియాడారు.

## ఇవి కూడా చూడండి

- వన పర్వము

## మూలాలు

## బయటి లింకులు

- ఇంటర్నెట్ ఆర్కీవులో అరణ్యపర్వము (http://www.archive.org/details/sriandhramahabar023368mbp) - సాహిత్య అకాడమీవారి ప్రచురణ

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము •

స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభ్రువాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రథుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

"http://te.wikipedia.org/w/index.php?title=వన_పర్వము_పంచమాశ్వాసము&oldid=760763" నుండి వెలికితీశారు

వర్గం: మహాభారతం

---

- ఈ పేజీకి 06:38, 25 సెప్టెంబర్ 2012న చివరి మార్పు జరిగినది.

# వన పర్వము షష్ఠమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# షష్టాశ్వాసం

అంత వరకు కధను వింటున్న జనమేజయుడు వైశంపాయనుని పాండవులకు హాని మాత్రమే చేసే దుర్యోధనుడు శత్రువులచే అవమానం పొందటమే కాక పాండవులచే రక్షింపబడ్డాడు కదా ఆ అవమానాన్ని ఎలా సహించి హస్థినకు చేరాడు. ఆ పై దుర్యోధనుడు ఎలా ప్రవర్తించాడు " అని అడిగాడు.

## దుర్యోధనుని అవమానభారం

వైశంపాయనుడు " పాండవులచే రక్షింపబడిన దుత్యోధనుడు అవమానభారంతో, మితిమీరిన దు:ఖంతో తన సేనలను మరల్చుకుని కొంత దూరం వెళ్ళి విడిది చేసాడు. సుయోధనునికి నిద్ర పట్టలేదు. అతడు కుటీరంలో ఏకాంతంగా దు:ఖిస్తూ ఉండగా కర్ణుడు వెళ్ళి " సుయోధనా! మానవులకు సాధ్యం కాని పని నీవు సాధించావు. గంధర్వులతో యుద్ధం చేసి గెలిచావు. నేను కూడా నా శక్తి వంచన లేకుండా యుద్ధం చేసాను. కాని మనసేనలు నాకు సహకరించ లేదు. నా రధం విరిగి పోవడంతో నేను వికర్ణుని రధంపై పక్కకు పోయాను. నీవు శత్రువులను జయించావని విని ఆనందించాను " అన్నాడు. ఆ మాటలు విన్న దుర్యోధనుడు కర్ణునికి విషయం తెలియక మాట్లాడుతున్నందుకు చింతించి సిగ్గుతో తలంచుకుని " కర్ణా! నేను తమ్ములు గంధర్వులతో యుద్ధం చేసాము. చిత్రసేనుడు నన్ను, నా భార్యను పరివార సమేతంగా బంధించి తీసుకు వెళుతున్న సమయంలో మనవాళ్ళు కొందరు ధర్మరాజుని శరణు వేడారు. ధర్మరాజు తన తమ్ములను పంపాడు. వారు ముందు గంధర్వులకు నచ్చ చెప్పి చూసారు. వారు వినక పోవడంతో యుద్ధం చేసి గంధర్వులకు మంచి మాటలు చెప్పి మమ్ము ధర్మరాజు వద్దకు తీసుకువెళ్ళారు. ధర్మరాజు నన్ను విడిపించాడు. కర్ణా! ఇంత అవమానం జరిగిన తరవాత బ్రతకటం వ్యర్ధం. నన్ను చూసి ప్రజలు నవ్వరా. వారిని ఎలా పాలించగలను. ఇంత కంటే గంధర్వుల చేతిలో మరణించటం మేలు కదా అలాగైతే స్వర్గం ప్రాప్తించేది " అని తిరిగి " నేను ప్రాయోపవేశం చేయుట ఉత్తమం. నా తరవాత దుశ్శాసనుడు మీకు నాయకుడు. నేను ఈ అవమాన భారంతో హస్తినకు రాలేను, పది మందిలో తిరుగలేను, తండ్రి ధృతరాష్టునితోను తాత భీష్ముడితోను సంభాషించలేను . ఇది స్వయంకృతాపరాధం అనుభవించి తీరవలెను. చెడ్డ వాడు సిరి సంపదలను కూర్చ వచ్చును, విద్యలు నేర్వ వచ్చును కాని వాటిని సద్వినియోగం చేయలేరు. నానూ అంతే. నా అంతటి వాడిని గంధర్వుడు పట్టుకోవడం ఎంత అవమానం. ఆత్మాభిమానం పోయిన తరవాత ప్రాణాలతో జీవించడం నిరర్ధకం కనుక ప్రాయోపవేశం చేసి నా ప్రాణాలను త్యజించడం తధ్యం నా మాటకు తిరుగు లేదు " అన్నాడు.

## కర్ణుడు సుయోధనుడిని ఓదార్చుట

సుయోధనుడు పక్కనే ఉన్న దుశ్శాసనిని చూసి " దుశ్శాసనా! నీకు రాజ్యాభిషేకం చేస్తాను. శకుని , కర్ణుల సాయంతో ఈ భూమండలం ఏలుకుంటూ నీ తమ్ములకు సంతోషం కలిగించు. బ్రాహ్మణును సన్మానించుతూ, గురువులను భక్తితో పూజిస్తూ ప్రజలను పాలించు " అన్నాడు. ఇది విన్న దుశ్శాసనుడు తల్లడిల్లి పోయి " అన్నా! భూమి బద్ధలనా, సముద్రాలన్నీ ఇంకిపోయ్నా, సూర్యచంద్రులు తేజమును కోల్పోయినా నీవే సార్వభౌముడవు. నేను ఈ రాజ్యభారాన్ని భరించ లేను " అంటూ ఏడవసాగాడు. కర్ణుడు వారిరువురుని చూసి " సుయోధనా! మీరిరువురు శోకమును విడువండి. ఈ విధంగా శోకించిన శత్రువులు సంతోషిస్తారు. చంద్రవంశపు రాజువు ఇలా అల్పునిలా దు:ఖించ తగునా. ఎన్నో భోగములు అనుభవించ వలసిన ఈ శరీరమును ఇలా త్యజిస్తావా. నీవే ధర్యం కోల్పోయిన మమ్ములను ఎవరు ఓదారుస్తారు. నువ్వు పాండవుల

వలన విముక్తుడవైనావని దుఃఖిస్తున్నావు కాని అది సరి కాదు. ఏ రాజ్యంలో పౌరులు నిశ్చింతగా జీవిస్తున్నారో వారు ఆ రాజుకు సేవకులు. ఆ రాజు ఆపదలో ఉన్నప్పుడు పౌరులు తమ సౌర్యంతో అతనిని రక్షించాలి. పాండవులు నీ రాజ్యంలో నివసిస్తున్న నీ కింకరులు ఆపదలో ఉన్న నిన్ను రక్షించుట వారి ధర్మం. పాండవులు జూదంలో సర్వమూ పోగొట్టుకుని నీకు దాసులైన వారు. ఈ మాత్రం చేయడంలో వారి గొప్ప ఏమున్నది " అన్నాడు.

### శకుని సుయోధనుడికి హితవు చెప్పట

శకుని దుర్యోధనుని చూసి " సుయోధనా! కర్ణుని మాటలు విని నీ దుఃఖము విడువుము. నేను పాండవుల రాజ్యం నీకు కట్టబెట్టాను. నీ పరాక్రమంతో సాధించినవి కాదు. కనుక నీవు ప్రాయోపవేశం చేసిన నా మనసుకు బాధ కలుగుతుంది. చిన్నపటి నుండి సిరి సంపదలతో పెరిగావు. పెద్దలకు సేవ చేయలేదు కనుక నీకు లోకజ్ఞానం లేదు. రాజుకు పిరికితనం, ఏమరుపాటుతనం, మెతకతనం ఉండరాదు. మనసు వికలమైనప్పుడు, కోపం వచ్చినప్పుడు వాటిని అంతమొందించాలి. నీకు మేలు చేసిన పాండవులకు ప్రత్యుపకారం చెయ్యి. పరాక్రమవంతులు, ధర్మాత్ములు, సద్గుణసంపన్నులైన పాండవులను పిలిచి గగు సత్కారం చేసి వారి రాజ్యం వారికి ఇచ్చిన నీకు ఎనలేని కీర్తి కలుగుతుంది. నీ సోదరులైన పాండవులతో రాజ్యపాలన చేస్తూ అందరూ సంతోషంగా ఉండండి " అన్నాడు. దుర్యోధనుడు " మీరు నన్ను అడ్డగించ వద్దు. నాకు ఈ భోగభాగ్యాలపై ఆసక్తి లేదు. నాకు అడ్డు చెప్పక మీ ఇష్టం వచ్చిన చోటుకు వెళ్ళండి " అన్నాడు. వారు " నీవు తప్ప మాకు ఎవ్వరు ఉన్నారు . మేము నీతో సహగమనం చేస్తాం " అన్నారు. దుర్యోధనుడు శుచిగా స్నానమాచరించి ధర్భాసనంపై కూర్చున్నాడు.

## కృత్య దుర్యోధనుని పాతాళమునకు తీసుకువెళ్ళుట

రాత్రి అయింది. దేవతచే ఓడించబడి పాతాళంలో ఉన్న దైత్యులు ఈ విషయం తెలుసుకుని శుక్రాచార్యుని వద్దకు వెళ్ళి మొరపెట్టుకున్నారు. శుక్రాచార్యుడు కృత్య అనే భయంకరాకారాన్ని సృష్టించి సుయోధనుని పాతాళానికి తీసుకు రమ్మని పంపాడు. కృత్య సుయోధనుని పాతాళానికి వచ్చింది. దానవులు అతనిని కౌగలించు కుని కుశల మడిగారు. వారు " సుయోధనా! శూరుడైపై భరతకులోద్భాడవైన నీవు ఇలా ఆత్మహత్యకు సాహసించడం తగునా. ఆత్మ హత్య చేసుకున్న లోకనింద, దుర్గతి, హీనత తప్పదు. నీ వంటి బుద్ధిమంతులకు ఇది తగదు. నీ నిర్ణయం మార్చుకుని ధైర్యమును ప్రతాపమును చూపి శత్రువులను ఓడించుము. నీ జన్మ వృత్తాంతం చెప్తాను వినుము. మేము పరమేశ్వరుని గురించి తపస్సు చేయగా పరమేశ్వరుడు నిన్ను మాకు ప్రసాదించాడు. నీ శరీరం పైభాగం వజ్రసమానం. ఏ విధమైన అస్త్రములు దానిని ఛేధించలేవు. నీవు కారణ జన్ముడవు నీకు సాయంగా అనేకమంది దానవులు క్షత్రియులుగా జన్మించారు. వారే భదత్తుడు మొదలైన వారు. భీష్మ, ద్రోణ, కృపాచార్యులు దేవతాంశలతో జన్మించినా వారి భావనలో రాక్షసాంశ ఉండటం చేత యుద్ధంలో పుత్రులు, పౌత్రులు, మిత్రులు, వృద్ధులు, బాలురు, శిష్యులు అనే భేధం లేక పాండవ సైన్యాలను నాశనం చేస్తారు. అర్జునుడంటే భయపడుతున్నావు ఏమి భయం లేదు. కృష్ణునిచే సంహరింప బడిన నరకాసురుని ఆత్మను కర్ణునిలో ప్రవేశపెట్టాము. కనుక కర్ణుడు శ్రీకృష్ణునిపై అర్జునిని పై పగబట్టి చంపగలడు. దేవేంద్రుడు కుమారుడైన అర్జునిని రక్షించుటకు బ్రాహ్మణ వేషంలో కర్ణుని కవచకుండలాలను దానంగా గ్రహిస్తాడంటే అర్జునుడు కర్ణుని గెలవలేడనే కదా. లక్షల మంది రాక్షస వీరులు సంశక్తులు పేరున జన్మించారు. వారిచే అర్జునుడు ఓడింపబడతాడు. దైన్యం వీడి వెళ్ళు ఈ భూమండలాన్ని నీవు పాలించగలవు " అన్నారు. కృత్య దుర్యోధనుని తిరిగి స్వస్థానంలో వదిలింది. సూర్యోదయం కాగానే నిద్రలేచిన దుర్యోధనునికి రాత్రి జరిగినది కలో నిజమో అర్ధం కాకున్నా. పాండవులను జయించ గలనన్న ఆత్మ విశ్వాసం కలిగింది.

### సుయోధనుడు ప్రాయోపవేశ నిర్ణయాన్ని విడచుట

కర్ణుడు తిరిగి దుర్యోధనుని దగ్గరకు వచ్చి " సుయోధనా! చచ్చి సాధించేది ఏముంది. బ్రతికి ఉంటే శత్రువులను జయించి సమస్త సౌఖ్యములు పొందవచ్చు. అర్జునిని పట్ల నీకున్న భయం పోగొట్టుకో. అరణవాసం, అజ్ఞాతవాసం ముగిసిన తరవాత నేను అర్జునిని సంహరిస్తానని ఈ ఆయుధంపై ప్రతిజ్ఞ చేస్తున్నాను " అన్నాడు. రాత్రి రాక్షస వీరుల పలుకులు ఇప్పుడు కర్ణుని ప్రతిజ్ఞ దుర్యోధనునిలో కొత్త ఆశలు నింపగా ప్రాయోపవేశ నిర్ణయాన్ని నిలిపి హస్తినకు చేరాడు. ఒక రోజు భీష్ముడు " సుయోధనా! పెద్దల మాటలు పెడచెవిన పెట్టి ఘోషయాత్రకు వెళ్ళి అవమానం పొందావు. చివరకు ధర్మరాజు వలన బయటపడ్డావు కాని లేకున్న గంధర్వుని చెరలో మగ్గేవాడివి కదా. నువ్వు నమ్మిన కర్ణుడు నిన్ను రక్షించ లేదు నిన్ను నీ తమ్ములను వదిలి పారిపోయాడు. అతని యుద్ధ నైపుణ్యం చూసావు కదా. పాండవులు పరాక్రమ వంతులు . వారి ముందు కర్ణుడు వీశమెత్తు కూడా చెయ్యడు. అతడు మాటల వీరుడు. నీమేలు కోరి చెప్తున్నాను కర్ణుని నమ్మి వంశనాశనం చేసుకొనక

పాండవుల్తో సంధి చేసుకుని సుఖంగా ఉండు " అని హితవు పలికాడు. సుయోధనుడు భీష్ముని మాటలు లెక్క చేయక కర్ణునితో, శకునితో కలసి వ్వుకుంటూ వెళ్ళాడు.

## దుర్యోధనుని వైష్ణవయాగం



యుధిష్టురుడిని కలవడానికి వచ్చిన ధుర్యోధనుని దూత

ఒక రోజు దుర్యోధనుడు కర్ణునితో " కర్ణా! ధర్మరాజు రాజసూయయాగం చేసాడుకదా. అలాంటి యాగం నేను చేయాలని అనుకుంటున్నాను. తగు సన్నాహాలు కావించు " అన్నాడు. కర్ణుడు వెంటనే " అదెంతపని సుయోధనా ! ఈ భూమండలంలోని రాజులంతా నీ సామంతులు. అందరికి ఆహ్వానాలు పంపించు. బ్రాహ్మణులను సత్కరించు. యాగశాలలు నిర్మించు. అన్న సంతర్పణకు సంభారాలు సమకూర్చు. దేవేంద్రుడు మాదిరి యాగం చెయ్యి " అన్నాడు. సుయోధనుడు బ్రాహ్మణులను పిలిపించి రాజసూయయాగానికి తగిన సన్నాహాలు చేయమన్నాడు. వారు " సుయోధనా! పాండవులు నీ శత్రువులు. వారిని జయించి కాని నీవు రాజసూయ యాగం చేయలేవు. రాజసూయయాగం వంటిదే వైష్ణవయాగం. దానిని ఇది వరకు వాసుదేవుడు చేసాడు. అది నీకు తగిన యాగం " అని చెప్పారు. సుయోధనుడు అందుకు సమ్మతించి తల్లితండ్రులైన గాంధారిదృతరాష్ట్రుల వద్ద గురుదేవులైన ద్రోణ, కృపుల వద్ద, భీష్ముని వద్ద అనుమతి తీసుకున్నాడు. రాజులకు, బ్రాహ్మణోత్తములకు ఆహ్వానాలు పంపాడు. పాండవులకు ఆహ్వానం పంపాడు. దూత " ధర్మరాజా ! సుయోధన చక్రవర్తి చేసే వైష్ణవయాగానికి మిమ్మలిని పిలువడానికి నన్ను పంపాడు. కనుక మీరు తప్పక వేంచేయాలి " అని అర్ధించాడు. ధర్మరాజు " సుయోధనుడు యాగం చేయటం మాకు చాలా సంతోషం. దీని వలన మా వంశం పావనమౌతుంది. మేము చేసుకున్న ఒప్పందం కారణంగా మేము అరణ్యవాస సమయంలో నగరప్రవేశం చేయడం సమజసం కాదు. ఆ విషయం దయచేసి మీ రాజుకు చెప్పండి " అన్నాడు. పక్కనే ఉన్న భీముడు " అరణ్యాజ్ఞాత వాసములు గడచిన పిమ్మట మేమే పిలవ కుండానే వచ్చి మా ఆయుధాలతో అగ్ని గుండం వేల్చి అందులో నీ రాజు దుర్యోధనుని అతని నూరుగురు తమ్ములను యజ్ఞ పశువులుగా అర్పించగలము " అని చెప్ప అన్నాడు. దూత అవే మాటలను సుయోధనునికి చెప్పాడు. దృతరాష్ట్రుడు యాగనిర్వహణకు, అతిథి సత్కారానికి విదురుని నియోగించాడు. యాగం నిర్విఘ్నంగా సమాప్తి అయింది. యాగానికి వచ్చిన కొందరు సుయోధనుని పొగిడినా కొందరు ధర్మరాజు చేసిన రాజసూయ యాగంతో అది సరి పోలదని అన్నారు. కర్ణుడు సుయోధనుని చూసి " సుయోధనా! వైష్ణవ యాగం నిర్విఘ్నంగా జరిపించావు. ఇదే విధంగా పాండవులను జయించి రాజసూయ యాగం కూడా నెరవేర్చగలవు. నేను అర్జునుని చంపే వరకు నా కాలి గోళ్ళు కూడా కడగను " అని భీషణ ప్రతిజ్ఞ చేసాడు. అందుకు సుయోధనుడు ఆనందించి " నీ సాయం ఉంటే పాండవులను జయించడం నాకు కష్టం కాదు " అన్నాడు.

## వేదవ్యాసుడు పాండవుల వద్దకు వచ్చుట

కర్ణుడు చేసిన శపథం విని ద్వైతవనంలో ఉన్న ధర్మరాజు భయపడ్డాడు. ఒక రోజు ధర్మరాజు నిద్రిస్తుండగా అతని స్వప్నంలో ఒక అడవి జంతువు కనపడి " ధర్మరాజా! ప్రతి రోజు మీరు మమ్మల్ని చంపితింటున్నారు. మా జాతులు నామ మాత్రం అవుతున్నాయి. మా వంశాలు నాశనం కాక ముందే మీరు ఇక్కడి నుండి వెళ్ళి పొండి " అని అభ్యర్ధించాయి. మరునాడు ధర్మరాజు తన తమ్ములు, ద్రౌపది, పురోహితులతో కలసి ద్వైత వనాన్ని విడిచి కామ్యక వనం వెళ్ళాడు. అక్కడ వాళ్ళు పండ్లు కాయగూరలు మాత్రం తింటూ జీవ హింస చేయకుండా గడిపారు. ఇలా అరణ్యవాసంలో పదకొండు సంవత్సరాలు అడిచాయి. ఒకరోజు వేదవ్యాసుడు ధర్మరాజు వద్దకు వచ్చారు. అతనిని తగురీతిని సత్కరించిన పిదప ధర్మరాజు " మహాత్మా! తపస్సు దానం గొప్పవి అంటారు కదా! ఆ రెండింటిలో ఏది గొప్పది? " అని అడిగాడు. అందుకు వేద వ్యాసుడు " ధర్మజా ! దానం అంటే తనకు ఉన్న దానిని పరులకు ఇవ్వటం. మానవులు ఎన్ని కష్టాలు పడినా ధనం కోసమే. కనుక ధనం మానవులకు ప్రాణం కంటే మక్కువ ఎక్కువ. కష్టపడి సంపాదించిన ధనం పరులకు ఇవ్వడం గొప్పది. సాధారణంగా బుద్ధి హీనులు తాము అక్రమంగా సంపాదించిన ధనం దానం చేస్తుంటారు. అందువలన పుణ్యం ఏమీ రాదు. న్యాయంగా సంపాదించినది మాత్రమే కొంచం దానం చేసినా పుణ్యం వస్తుంది. అలాంటి ధనం సకాలంలో సరి అయిన ప్రదేశంలో యోగ్యుడైన వాడికి దానం చేయాలి. అపాత్ర దానం చేయకూడదు. ఉదాహరణగా నీకు వ్రీహి ద్రోణో పాఖ్యానం చెప్తాను విను.

## ముద్గలుని వృత్తాంతం

ధర్మజా! పూర్వం కురుక్షేత్రంలో ముద్గలుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు పొలములో రాలిన ధాన్యం ఏరుకుని జీవించేవాడు. కటిక దరిద్రుడు. సత్యవ్రతుడు నిష్టాగరిష్టుడు. ఉన్నంతలో అతిథులను సత్కరించే వాడు. ఒక రోజు అతని ఇంటికి దుర్వాసుడు అనే ముని వచ్చాడు. అతడు చూడటానికి పిచ్చి వాని వలె ఉన్నాడు. ముద్గలుడు దుర్వాసునికి తగిన సత్కారం చేసి భోజనం పెట్టాడు. అలా ప్రతి అమావాస్య పౌర్ణమికి ముద్గలుని ఇంటికి దుర్వాసుడు వస్తూనే ఉన్నాడు. ముద్గలుడు అతను నిరాహారుడై అతనికి భోజనం పెట్టే వాడు. ఆ విధంగా ఆరు పర్వదినాలు వరసగా ప్రీతిగా భోజనం పెట్టిన ముద్గలుని చూసి దుర్వాసుడు ఆశ్చర్య పోయాడు. దుర్వాసుడు " ముద్గల మహర్షీ! నీ వంటి దాన శీలిని నేను ఇంతవరకు చూడలేదు. నీవు సద్గుణ సంపన్నుడవు, పుణ్యమూర్తివి. ఏమాత్రం ఏవగించు కోకుండా కోపం లేకుండా, అవమానించక నాకు అతిథి పూజ చేసావు. నీ అన్నదానం, సత్యం, ధైర్యం, పరుల సొత్తును ఆశించక పోవడమే నీ సంపద. మనసును ఇంద్రియములను అదుపులో ఉంచేదే తపసు. అటువంటి తపసు నీవు చేసావు. అతిథి సత్కారానికి నేను తృప్తి చెందాను. నీకు సశరీరంగా స్వర్గలోక ప్రాప్తి జరుగు తుంది " అని చెప్పి వెళ్ళి పోయాడు.

#### దేవదూతను తిరిగి పంపుట


స్వర్గానికి రావలసిందిగా ఆహ్వానిస్తున్న దేవదూతతో రానని చెబుతున్న ముద్గలుడు

ఒక దేవదూత విమానం తీసుకు వచ్చి ముద్గలునితో " మహామునీ! నీవు చేసినా పుణ్యం వలన నీకు స్వర్గలో లోక ప్రాప్తి కలిగింది. విమానం ఎక్కుము " అని చెప్పారు. ముద్గలుడు ఆ దేవదూతను చూసి " అయ్యా! దేవలోకం ఎలా ఉంటుంది " అని అడిగాడు " తపస్సు చేసి సిద్ధి పొందిన మహ మునులు, యజ్ఞాలు చేసిన వాళ్ళు, సత్యసంధులు, ఇంద్రియములు జయించిన వారు, దానం చేసిన వారు. యుద్ధంలో మరణించిన వారు దేవలోకంలో నివసిస్తారు. ఇంకా అప్సరసలు, సిద్ధులు, సాధ్యులు, దేవమునులు, మరుత్తులు నివసిస్తంటారు " మేరు పర్వత శిఖరం అక్కడే ఉంది. నందనోద్యానం ఉంది. అక్కడ ఆకలి దప్పులు ఉండవు. వ్యాధులు, ముసలితనం ఉండదు. అక్కడ అందరికి తేజోమయ దేహాలు ఉంటాయి. స్వర్గంలో ఉన్నంత కాలం దు:ఖం ఉండదు, నిరంతర సౌఖ్యం, ఆనందం ఉంటాయి. స్వర్గలోకం పైన బ్రహ్మలోకం ఉంటుంది. అక్కడ మనువులు, మహర్షులు మాత్రం ఉంటారు. అక్కడ పునర్జన్మ ఉండదు. ప్రళయకాలంలో అన్ని లోకాలు నాశనం అవుతాయి. బ్రహ్మలోకం మాత్రం నిలిచి ఉంటుంది. మనుష్యుడు భూలోకంలో చేసిన పుణ్యాలకు ఫలితం స్వర్గలోకంలో అనుభవిస్తారు. అక్కడ ఎలాంటి పుణ్యం చేసుకోవడానికి వీలు లేదు. చేసిన పుణ్యఫలం అనుభవించిన తరవాత మరల భూలోకానికి వస్తారు. వచ్చిన మానవుడు వాటిని విడువలేక వేదనకు గురి ఔతాడు. స్వర్గలోకంలో ఉన్నవారు కూడా తమకంటే ఉన్నత స్థిలో ఉన్న వారిని చూసి మనసులో బాధ పడతారు. బ్రహ్మలోకం శాశ్వతం. స్వర్గలోకం అనుభవానికి మాత్రమే. భూలోకం కర్మభూమి. భూలోకంలో చేసిన సత్కర్మల ఫలం స్వర్గలోకంలో అనుభవిస్తారు " అని చెప్పి స్వర్గ లోకానికి రమ్మని ముద్గలుని పిలిచాడు. ముద్గలుడు " అయ్యా! నాకు అశాశ్వతముల్లైన స్వర్గసుఖములు అవసరం లేదు. ఏ లోకానికి పోతే తిరిగి జన్మలేదో ఆ లోకానికి పోవడానికి ప్రయత్నిస్తాను " అన్నాడు. దేవదూత వెళ్ళి పోయాడు. ఆ తరవాత ముద్గలుడు ద్వందముల యందు ఆసక్తి వదిలి, అంతటా సమభావంతో చూసి జ్ఞానయోగి అయ్యాడు. జీవన్ముక్తుడు అయ్యాడు. కనుక ధర్మరాజా ! నీవు రాజ్యం పోయినందుకు చింతించ వలదు " అని హితబోధ చేసాడు. తరవాత తన ఆశ్రమానికి వెళ్ళాడు.

## సైంధవుడు ద్రౌపదిని చూచుట

కొంత కాలం గడిచింది ఒక రోజు పాండవులు అడవికి వేటకు వెళ్ళారు. ద్రౌపది కుటీరంలో ఒంటరిగా ఉంది. ఆ సమయంలో సింధు దేశాన్ని పాలించే సైంధవుడు తన చతురంగ బలాలతో సాళ్వరాజ పుత్రిని వివాహం చేసుకోవడానికి పయనిస్తూ మార్గ మధ్యంలో కామ్యకవనం చేరుకున్నాడు. కుటీరం ముందు నిలిచి ఉన్న ద్రౌపదిని చూసి మోహ పరవశుడైయ్యాడు. తన మిత్రుడైన కోటికాస్యుని పిలిచి " ఈ సుందరాంగి ఎవరు? ఆమెపట్ల నా మనసు లగ్నం అయింది. ఆమెతో మాట్లాడి ఎలాగైనా నన్ను చేరేలా చెయ్యాలి " అన్నాడు. కోటికాస్యుడు ద్రౌపది వద్దకు వెళ్ళి " లలనా! నీవెవరు, వన్యమృగాలు తిరిగే ఈ అడవిలో

ఎందుకు ఉన్నావు. వనదేవతవా? శచీదేవివా? లక్ష్మీ దేవివా? నీ భర్త ఎవరు? నీ పేరేమి? నా పేరు కోటికాస్యుడు. మహా బలవంతుడను. అడుగో అక్కడౌన్న వాడు త్రిగర్త దేశాధి పతి, ఆ పక్కన కళింగ దేశాధిపతి, ఆ పక్కన ఉన్నది సింధు దేశాధీశుడు జయద్రధుడు. అతనికి నీ మీద మనసు కలిగింది. అందుకే నన్ను పంపాడు " అన్నాడు. ఆ మాటలు విన్న ద్రౌపది " అన్నా నేను ఒంటరి దానను, పుత్రవతిని నీవు నా దగ్గరకు రావడం తగదు. నన్ను సామాన్య స్త్రీగా ఎంచ వద్దు. నేను పాంచాలరాజ పుత్రిని, నా పేరు కృష్ణ, పాండవుల ధర్మ పత్నిని వారితో వనవాసం చేస్తున్నాను. కొంత సేపట్లో నా భర్తలు వస్తారు. ఈ సమీపంలో కొంత సమయం ఉండండి. వారు రాగానే అతిథి సత్కారం చేస్తాను " అన్నది. కోటికాస్యుడు జరిగినది జయద్రధునికి చెప్పాడు. ఎలాగైనా ద్రౌపదిని అపహరించాలన్న ఉద్దేశంతో జయద్రధుడు కుటీరంలో ప్రవేశించాడు.

## సైంధవుడు ద్రౌపదిని తీసుకుని పోవుట

ద్రౌపదితో " ద్రౌపదీ! నీవూ పాండవులు క్షేమమేనా? " అన్నాడు. ద్రౌపది " అయ్యా! అందరూ క్షేమమే నీవు మా అతిథివి. నా భర్తలు వేటకు వెళ్ళారు. వారు రాగానే మీకు అతిథి సత్కారాలు చేస్తారు " అన్నాడు. సైంధవుడు " ద్రౌపదీ! నీ మీద నాకు మనసైంది. రాజ్యమును కోల్పోయిన పాండవులతో నీవు పొందే సుఖం ఏమి? నాతో వచ్చిన సౌఖ్యములు అనుభవించగలవు " అన్నాడు. ఆ మాటలకు ద్రౌపది భయపడింది. పాండవులు వచ్చే వరకు నిరీక్షించాలని అనుకుంది. అంతవరకు అతనిని ఎలాగైనా మాటలలో పెట్టాలని అనుకుంది. " అయ్యా! నీవు నాభర్తల సోదరి దుస్సల భర్తవు. ఆమె నా భర్తల సోదరి కనుక నీవు నాకు సోదరుడివి. నువ్వు ఇలా మాట్లాడటం తగదు. జయద్రధుడు " ద్రౌపదీ ! రాజులకు ఆడువారి విషయంలో వావి వరసలు లేవు. అది రాజధర్మం. రాజులు తమకు ఇష్టం వచ్చినట్లు వినోదించవచ్చు. స్త్రీలు ఏ ఒక్కరి సొత్తు కాదు. ఏవరినైనా కోరిన పొందవచ్చు" అన్నాడు. ద్రౌపది ఇక వీడు మంచి మాటలతో వినడు అనుకుంది. " ఒరి ! క్షత్రియ కులములో పుట్టిన అధముడా ! పాండవుల పరాక్రమం తెలిసి నన్ను అవమానిస్తున్నావు. ఫలితం అనుభవిస్తావు. జయద్రధా భీముని సంగతి తెలుసు కదా గుహలో నిద్రిస్తున్న సింహాన్ని జూలుపట్టుకు లాగుతున్నావు. అర్జునిని గురించి అతని గాడీవం గురించి తెలియునా? అతనికి ఆగ్రహం తెప్పించిన వాడు బ్రతకడం అసాధ్యం. నకులసహదేవులను అవమానించడం త్రాచుపాములను తొక్కడం వంటిది. ఎలాగైనా నేటితో నీకు చావు మూడింది కనుకనే ఇలా మాట్లాడుతున్నావు. జాగ్రత్త " అని హెచ్చరించింది. ఆ మాటలకు జయద్రధుడు నవ్వి " పాండవుల పరాక్రమం నాకు తెలియును. నన్ను భయపెట్టకు. మేము పరాక్రమవంతులమే. ఇక మారు పలుకక ఆ బంగారురధంలో ఎక్కుము " అన్నాడు. " జయద్రధా! నేను మహా వీరుల ధర్మపత్నిని. శ్రీకృష్ణుడు నా అన్న. నేను పతివ్రతను. నా పాతివ్రత్యం నిన్ను దహించ గలదు. అర్జుని గాండీవం, భీమసేనుని గధా పాతానికి నీ మదం అణుగుతుంది " అన్నది. కాని సైంధవుడు వినక ఆమె చీరపట్టుకుని లాగాడు. ఆమె అతడిని బలంగా నెట్టింది సైంధౌడు కింద పడ్డాడు. ద్రౌపది గట్టిగా అరుస్తూ ధౌమ్యుడిని పిలిచింది. సైంధవుడిలో పట్టుదల పెరిగి ద్రౌపదిని బంధించి రథం పై ఎక్కించి తీసుకుపోసాగాడు. అది చూసిన ధౌమ్యుడు " అయ్యా! రాజులకు ఇలా దుష్కర్మలు చేయడం తగునా! ఆమెను వదిలి పెట్టుము. నీ పాపం నిన్ను నాశనం చేస్తుంది " అంటూ రథం వెంట పరుగెత్తాడు. పాండవులు ఇంటికి రాగానే వారికి దుశ్శకునాలు గోచరించాయి. ద్రౌపది పరిచారిక వారికి జరిగినది వివరించింది. పాండవులకు కోపం వచ్చింది వెంటనే సైంధౌడు వెళుతున్న దిక్కుకు పరుగెత్తారు. రథం వెనుక పరుగెడుతున్న ధౌమ్యుని వెనుకకు పంపి పాండవులు సైంధౌని వెంబడించారు. తన రథం వెనుక వస్తున్న పాండవులను చూసిన సైంధవుడు " ద్రౌపదీ! వారిలో నీ భర్తలు ఎవరు చెప్పవా? " అని చమత్కరించాడు. ద్రౌపది " నీవు! పాండవులను గురించి తెలుసుకున్నా ప్రయోజనం లేదు. ఇక నీకు శిక్ష తప్పదు. అయినా అడిగావు కనుక చెప్తాను. చచ్చే ముందు వారి గురించి తెలుసుకో " అని పాండవుల గురించి వివరంగా చెప్పింది.

## సైంధవుడి పరాభవం

జయద్రధుడు తన సైన్యాలను యుద్ధసన్నద్ధం చేసాడు. కోటికాస్యుడు భీముని ఎదుర్కొన్నాడు. పాండవుల ధాటికి సైంధవ సేనలు ఆగలేక పోయాయి. ఆ యుద్ధంలో త్రిగర్త దేశాధీశుడు సుధన్వుడు, సురధుడు మరణించారు. భీముడు కోటికాస్యుని చంపాడు. అర్జునుడు సృంజయుడు, స్తుకుడు, శత్రుంజయుడు, సుప్రబుద్ధుడు, శుభంకరుడు, భ్రమంకరుడు, శూరుడు, రథి, గుహకుడు, బలాఢ్యుడు అనే పేరుగల సౌవీర వీరులను చంపాడు. ఆ సమయంలో సైందవుడు ద్రౌపదిని తన రథం నుండి దింపి రథం తోలుకుంటూ పారి పోయాడు. అది చూసిన అర్జునుడు సైంధౌడు పారి పోతున్నాడు ఇక అమాయకు లైన వీరిని వధించడం ఆపు అన్నాడు. అందరూ ద్రౌపది దగ్గరకు వెళ్ళారు. అర్జునుడు ధర్మరాజుతో " అన్నా! నువ్వూ, ద్రౌపది, నకుల సహదేవులు, ధౌమ్యుని తీసుకుని కుటీరానికి వెళ్ళండి. నేను భీమసేనుడు సైంధవుని వెంబడిస్తాము " అన్నాడు. ద్రౌపది " సైంధవుడు దుర్మార్గుడు వాడి పట్ల దయ చూపవద్దు వధించండి " అన్నది. అర్జునుడు సైంధవుని వెంబడించి అతని గుర్రాలను కొట్టాడు. జయద్రధుడు రథం దిగి పారిపోసాగాడు. భీముడు అర్జునుడు వాడిని వెంబడించి పట్టుకున్నారు. భీముడు వాడిని చితక కొట్టి మెడమీద కాలు వేసి పట్టుకున్నాడు. వాడు స్పృహ తప్పాడు. అర్జునుడు " ఇక చాలు ఇంకా కొడితే వీడు చస్తాడు. అన్నగారి మాట మన్నించి వీడిని విడిచి పెట్టు " అన్నాడు. భీముడు " అయ్యో! వీడిని వదిలితే ఎన్ని అనర్ధాలు

జరుగుతాయో. వీడికి తగిన శాస్తి చేస్తాను " అని పదునైన కత్తి తీసుకుని తల అయిదు శిఖలుగా గొరిగి " జయద్రధా! నీవు పోయిన చోటంతా నేను పాండవుల దాసుడను అని చెప్ప లేకుంటే చస్తావు " అన్నాడు. తరవాత వాడిని రధానికి కట్టి ధర్మరాజు వద్దకు తీసుకు వచ్చాడు. భీముడు జయద్రధుని ధర్మరాజు పాదాలపై పడవేసి " అన్నయ్యా! వీడు పాండవదాసుడు జయ ద్రధుడు " అన్నాడు. ద్రౌపది వాడిని హేళనగా చూసింది. ధర్మరాజు " జయద్రధా ! ఇక మీదట ఇలాంటి చెడ్డ పనులు చేయక బుద్ధిగా ఉండు " అని వదిలి పెట్టాడు. అవమాన భారంతో జయద్రధుడు గంగా తీరానికి వెళ్ళి శివుని గురించి ఘోరంగా తపస్సు చేసాడు. శివుడు ప్రత్యక్షం కాగా జయద్రధుడు " దేవా! యుద్ధంలో నేను పాండవులను జయించేలా వరం ప్రసాదించు " అని కోరాడు. శివుడు " జయద్రధా! అది అసాధ్యం. పాండవులను జయించడం ఎవరికి సాధ్యం కాదు. నీవు అడిగావు కనుక ఒక్క రోజు మాత్రం అర్జునుడు తప్ప మిగిలిన వారిని జయించే వరం ఇస్తున్నాను. ఇందులో అంతరం గ్రహించి మసలుకో " అని చెప్పి అంతర్ధానం అయ్యాడు. తరవాత జయద్రధుడు సింధు దేశానికి వెళ్ళాడు.

## మార్కండేయౌని రాక

ఒకరోజు మార్కండేయుడు ధర్మరాజు వద్దకు వచ్చాడు. ధర్మరాజు అతిథి మర్యాదలు చేసాడు. ధర్మరాజు " మహర్షీ! మేము, ద్రౌపది మేము అడవిలో ఇన్ని కష్టాలు పడుతున్నాము. మా వలె కష్టాలు పడుతున్న వారెవరైనా ఉన్నారా? " అందుకు మార్కండేయుడు "ధర్మజా! పూర్వము ఇక్ష్వాకు వంశంలో అజుడు అనే రాజు ఉండే వాడు. అతని కుమారుడు దశరధుడు. అతనికి ముగ్గురు భార్యలు. వారిలో కౌసల్య అనే భార్యకు రాముడు, కైకేయి అను భార్యకు భరతుడు, సుమిత్ర అను భార్యకు లక్ష్మణుడు, శత్రుఘ్నుడు అనే కుమారులు కలిగారు. బ్రహ్మకు మానస పుత్రుడైన పులస్త్యునకు వైశ్రవణుడు అనే కుమారుడు జన్మించాడు.

## సంక్షిప్త రామాయణం

ఇక్ష్వాకు వంశంలో అజుడు అనే రాజు ఉండే వాడు. అతని కుమారుడు దశరధుడు. అతనికి ముగ్గురు భార్యలు. వారిలో కౌసల్య అనే భార్యకు రాముడు, కైకేయి అను భార్యకు భరతుడు, సుమిత్ర అను భార్యకు లక్ష్మణుడు, శత్రుఘ్నుడు అనే కుమారులు కలిగారు. బ్రహ్మకు మానస పుత్రుడైన పులస్త్యునకు వైశ్రవణుడు అనే కుమారుడు జన్మించాడు. వైశ్రవణుడు తన తండ్రి మాట వినకుండా బ్రహ్మను గురించి తపస్సు చేసాడు. ప్రత్యక్షమైన బ్రహ్మ వద్ద నలకుబేరుడు అనే కుమారుని శివునితో సాన్నిహిత్యాన్ని ధనాధిపత్యాన్ని కోరుకున్నాడు.



ధశరథుని కుమారుల జననము వారి నామకరణముల గురించి ప్రకటించగా దశరథుని సభలో వేడుకలు జరుగుతున్న దృశ్యం

### రావణ కుంభకర్ణాదుల పుట్టుక

పులస్త్యుడు తన శరీరం నుండి విశ్రవసువును సృష్టించి వైశ్రవణునికి హాని చెయ్యమని పంపాడు. ఇది తెలిసిన వైశ్రవణుడు విశ్వవసువు వద్దకు వెళ్ళి " అయ్యా! నేను నీ పుత్ర సమానుడను దయ చూపుము " అని చెప్పి విశ్వవసువుకు నృత్యగాన విశారదలైన పుష్పోత్కట, మాలిని, బక అనే రాక్షస వనితలను సృష్టించి ఇచ్చాడు. వారు విశ్వవసువుకు సేవలు చేస్తున్నారు. విశ్రవసువు వారికి సంతానాన్ని ప్రసాదించాడు. పుష్పోత్కటకు రావణుడు, కుంభకర్ణుడు మాలినికి విభీషణుడు బకకు ఖరుడు, శూర్పణఖ అనే కవలలు జన్మించారు. వారిలో రావణుడు పది తలలు కల వాడు, కోపిష్టి. కుంభకర్ణుడు కఠిన హృదయుడు, గర్విష్టి. విభీషణుడు మంచి గుణములు కలవాడు. ఖరుడు దుర్మార్గుడు. బ్రాహ్మణులను అవమానించే వాడు. రక్త, మాంసాలను ఆహారంగా తీసుకునే వాడు. శూర్పణఖ కూడా అధర్మపరురాలు, పాపాత్మురాలు. ఆ రాక్షస వీరులు తండ్రి విశ్వవసువు దగ్గర వేద వేదాంగాలు విలువిద్య అభ్యసించారు.

### రావణ సోదరుల తపస్సు

ఒకరోజు వైశ్రవణుడు వారిని చూడటానికి వచ్చాడు. రావణాదులు అతని


బ్రహ్మ వరము వలన, రావణుడు కట్టించిన ప్రత్యేక భవనములో గుర్రు పెట్టి నిద్రపోతున్న కుంభకర్ణుడు

వైభవాన్ని చూసారు. అది అంతా అతని తపస్సు వలన సమకూరినది అని తెలుసు కున్నారు. వారంతా తపస్సు చేయడానికి బయలుదేరి బ్రహ్మను గురించి వెయ్యి సంవత్సరాలు తపస్సు చేసారు. వారికి శూర్పణఖ, ఖరుడు సేవలు చేస్తున్నారు. కాని బ్రహ్మ దేవుడు ప్రత్యక్షం కాలేదు. రావణుడు వెయ్యి సంవత్సరాలకు ఒక తల చొప్పన తొమ్మిది తలలు అగ్నిలో వేస్చి హోమం చేసాడు. పదివేల సంవత్సరాలు పూర్తి కాగానే పదవ తల అగ్నిలో వేయడానికి సంసిద్ధం అయిన తరవాత బ్రహ్మదేవుడు ప్రత్యక్షం అయ్యాడు. రావణునికి ఖండించిన తొమ్మిది తలలను ఇచ్చి ఏమి వరం కావాలో కోరుకొమ్మన్నాడు.రావణుడు " దేవా! నేను దేవతల చేతగాని, పితరుల చేతగాని, రాక్షసుల చేతగాని, పాముల చేత గాని, గంధర్వ, యక్ష, కిన్నెర, కింపురుష, విద్యాధరుల చేతగాని ఓడి పోకూడదు. విశ్వంలో ఎక్కడికైనా ఇచ్చానుసారం సంచరించే వరం ప్రసాదించు అని అడిగాడు. బ్రహ్మ దేవుడు " రానణా! మానవులు వలన తప్ప ఇంకెవరి వలన నీకు మరణ భయం లేదు " అని వరం ఇచ్చాడు. బ్రహ్మదేవుడు కుంభకర్ణుని చూసి " నీ కేమి వరం కావాలో కోరుకో " అన్నాడు. విధి వశాత్తు కుంభకర్ణుడు తనకు అత్యంత ప్రియమైన నిద్రను ప్రసాదించమని అడిగాడు. అలాగే నని వరమిచ్చాడు. తరవాత విభీషణుని చూసి నీకేమి వరం కావాలో కోరుకో అని అడిగాడు. విభీషణుడు " దేవా! ఎన్ని కష్టాలు వచ్చినా నాలో పాప చింతన పొడ చూపకుండా అనుగ్రహించు " అని ప్రార్ధించాడు. అందుకు బ్రహ్మ " విభీషణా! నీవు రాక్షస వంశంలో జన్మించినా ధర్మబుద్ధిని కలిగ ఉన్నావు. నీకు అమరత్వం ప్రసాదిస్తున్నాను. నీవు కోరిన వరాన్ని ప్రసాదిస్తున్నాను " అని చెప్పి అంతర్ధానం అయ్యాడు. బ్రహ్మదేవుడిచ్చిన వరగర్వంతో రావణుడు కుబేరునికి స్వంతమైన లంకపై దండెత్తాడు. రావణుని శక్తి తెలుసుకున్న కుబేరుడు పుష్పక విమానం ఎక్కి లంకను వదిలి పారి పోయాడు. రావణుడు కుబేరుని వెంబడించి అతని విమానం అపహరించాడు. అందుకు యక్ష రాజైన కుబేరుడు కోపించి " పెద్ద వాడినైన నన్ను అవమానించి నా విమానాన్ని అపహరించావు. ఇది పరుల పాలు ఔతుంది " అని శపించాడు. తరవాత రావణుడు దేవలోకం మీద దండెత్తి ఇంద్రుడిని దేవతలను జయించాడు.

## దేవతలు బ్రహ్మదేవుని వద్ద మొరపెట్టుకొనుట

అప్పడు ఋషులు, దేవతలు అందరూ కలసి అగ్ని దేవుని వెంట పెట్టుకుని బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళారు. " విశ్రవసుని కుమారుడు రావణుడు దేవతలను జయించి వారిని తన దాసులుగా చేసుకున్నాడు. లోకాలు భయంతో వణికి పోతున్నాయి. మీరే మమ్ము రక్షించాలి " అని వేడుకున్నారు. బ్రహ్మదేవుడు " అయ్యలారా! ఈ విషయంలో నేను నారాయణుడితో ఆలోచించి ఒక నిర్ణయం తీసుకున్నాను. శ్రీ మహా విష్ణువు మానవుడిగా జన్మించి అతనిని హత మారుస్తాడు. ఇంద్రుడు మొదలైన వారు కోతులుగా ఎలుగు బంట్లుగా జన్మించి నారాయణునికి తోడ్పడుతారు " అని చెప్పి దుందుభి అనే యక్ష కాంతను పిలిచి మంధర అనే పరిచారికగా జన్మించి దేవకార్యం నెరవేర్చమని చెప్పాడు. బ్రహ్మదేవుని మాటను శిరసా వహించి దేవతలు కొండల వంటి వజ్రశరీరంతో అత్యంత పరాక్రమమైన కోతులుగా జన్మించారు.

## అయోధ్య

ఇలా ఉండగా అయోధ్యలో నారాయణుడు ఆదిశేషునితో సహా అన్నదమ్ములుగా దశరథ మహారాజుకు జన్మించాడు. వారు పెరిగి పెద్దవారై వేద వేదాంగాలు చదువు కున్నారు. విలు విద్యలో నిష్ణాతులైయ్యారు. దశరధుడు వారికి వివాహాలు జరిపించాడు. శ్రీరాముని యౌవరాజ్య పట్టాభిషిక్తుని చేయాలని నిశ్చయించాడు. మంత్రులను పౌరులను సంప్రదించి ముహూర్తం నిశ్చయించాడు. ఆ సమయంలో మంధర కైకేయి వద్దకు పోయి " అమ్మా! నీ భర్త నీ పై ప్రేమ చూపించి నట్లు చూపించి నిన్ను మోసం చేసాడు. అతనికి కౌశల్య మీదనే ప్రేమ అందుకే ఆమె కుమారుడైన రామునికి పట్టాభిషేకం చేస్తున్నాడు. ఇక నీవు నీ కుమారుడు వారికి దాస్యం చేస్తూ బ్రతకండి " అన్నది. ఆమె మాటల ప్రభావానికి లొంగి పోయిన కైక దశరధునితో " ఇది వరలో మీరు నాకు మూడు వరాలు ఇస్తానని మాటిచ్చారు కదా. అవి ఇప్పడు ఇవ్వండి " అని కోరింది. అందుకు అంగీకరించిన దశరధునితో " నా కుమారుడైన భరతునికి పట్టాభిషేకం చేసి శ్రీరాముని పదునాలుగేండ్లు అరణ్యాలకు పంపమని కోరిది " ఆ మాటలు విని దశరధుడు దినమైనా రాముని వదలలేనని చెప్పి స్పృతప్పి పడిపోయాడు. కైకేయి


రాముడిని అడవికి పంపమని అడుగుతున్న కైకేయి

వరాలు తండ్రి ఆవేదన గ్రహించిన రాముడు తండ్రి మాట నిలబెట్టడానికి అరణ్యాలకు పయన మయ్యాడు. రామునితో లక్ష్మణుడు, రాముని భార్య సీత అరణ్యాలకు పయనమయ్యాడు. స్పృహ నుండి తేరుకున్న దశరధుడు కుమారుడైన రాముడు లక్ష్మణుడు, సీతను వెంట పెట్టుకుని అడవులకు వెళ్ళటం సహించలేక మరణించాడు. కైకేయి భరతుని పిలిపించి " కుమారా! మీ తండ్రి దశరధుడు మరణించాడు. నీ అన్నలు వనవాసం వెళ్ళారు. ఈ రాజ్యానికి వారసుడివి నువ్వే కనుక రాజ్యభారాన్ని వహించు " అని చెప్పింది. భరతుడు " అమ్మా! నీవు మా సూర్యవంశానికి మచ్చ తెచ్చావు. కోరరాని కోరిక కోరి నా తండ్రి మరణానికి కారకురాలివైయ్యావు. నా అన్న రాముని, లక్ష్మనుని, వదిన సీతమ్మను అరణ్యాలకు పంపావు. నీ పాపాలకు అంతు లేదా " అని నిందించాడు.

## పాదుకాపట్టాభిషేకం


రాముని పాదుకలు అడుగుతున్న భరతుడు

భరతుడు తరవాత తండ్రికి అంత్య క్రియలు జరిపాడు. మంత్రులు, సామంతులు, ముగ్గురు తల్లులు, తమ్ముడు శత్రుఘ్నుడితోను సకల పరివారంతో చిత్రకూటంలో ఉన్న రాముని దగ్గరకు వెళ్ళాడు. జటా వల్కములను, నార చీరలు ధరించిన రాముని చూసి ఆవేదనకు గురి అయ్యాడు. భరతుడు రామునితో " అన్నా! మన తండ్రి మరణించాడు. నీవే మాకు దిక్కు నీవు అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడవై మమ్మల్ని పాలించు " అని ప్రార్ధించాడు. కాని రాముడు అంగీకరించక తన పాదుకలను మాత్రం ఇచ్చి భరతుని తిరిగి పంపాడు. భరతుడు రామపాదుకలను సింహాసనం మీద ఉంచి పట్టాభిషేకం జరిపించి నందిగ్రామంలో రాజప్రతినిధిగా మాత్రం రాజ్య పాలన చేస్తూ రామునిలా మునివృత్తిని అవలంభించాడు. తరవాత రాముడు శరభంగ ఆశ్రమానికి వెళ్ళాడు.

## దండకారణ్యం


రాక్షసులతో యుద్ధం చేయుచున్న రాముడు

శరభంగ ఆశ్రమం నుండి రాముడు దండకారణ్యం వెళ్ళాడు. గోదావరి తీరంలో లక్ష్మణుడు అన్నకు, వదినకు నిర్మించిన పర్ణశాలలో అందరూ ప్రశాంత జీవితం జరుపుతున్నారు. దశకంఠుని చెల్లెలు శూర్పణఖ రాముని చూసి మోహపరవశ అయి వారికి అపకారం చేయబోతుండగా లక్ష్మణుడు ఆమె ముక్కు చెవులు కోసాడు. శూర్పణఖ పురికొల్పగా ఖరుడు, దూషణుడు అనే ఆమె సోదరులు పదునాలుగు వేల రాక్షసులతో రాముని మీదకు యుద్ధానికి వచ్చారు. రాముని చేతిలో వారంతా హతులైయ్యారు. శూర్పణఖ రావణుని కాళ్ళపై పడి రోదించింది. రావణుడు " సోదరీ! నీకు పరాభవం చేసిన వాడెవడో చెప్పు. వెంటనే వాడిని వధిస్తాను. వాడి ఆయుష్షు తీరింది " అన్నాడు. శూర్పణఖ తాను రాముని చూసిన దగ్గర నుండి ఖర దూషణులను వధించడం వరకు అంతా చెప్పింది.

## మాయలేడి

రావణుడు వెంటనే గోకర్ణం వెళ్ళి మారీచుని చూసి కలిసాడు. మారీచుడు రాముని చేతిలో పరాభవం చెంది శివుని గురించి తపస్సు చేసు కుంటున్నాడు. ఒకప్పుడు రావణునికి మంత్రిగా పని చేసిన మారీచుడు రావణుని ఆహ్వానించాడు. రావణుడు " మారీచా! రాముడనే వాడు మన


రామునితో బంగారు లేడిని తెమ్మని చెబుతున్న సీత - రాజా రవివర్మ చిత్రం

ఖరదూషణులను సంహరించాడు. వాడిని పరాభవించటానికి నీవు సహకరించాలి " అన్నాడు. ఆ మాటలు విన్న మారీచుడు వణుకుతూ " యుద్ధంలో రాముని పరాక్రమం నీవు వినలేదేమో! శివుడు కూడా రాముని బాణానికి ఎదురు నిలువ లేడు. నీకు చేటు కాలం దాపురించి ఈ కార్యానికి పూనుకున్నావు. నేను రాముని చేతిలో ఓడిపోయి ఇలా శివుని గురించి తపస్సు చేస్తున్నాను " అన్నాడు. " మారీచా నా మాట వినకున్న నేను నిన్ను సంహరిస్తాను " అన్నాడు. ఇక రావణుడు వినడని తెలుసుకుని మారీచుడు రావణుని చేతిలో మరణించే కంటే ధర్మాత్ముడైన రాముని చేతిలో మరణించడం మేలని తలిచాడు. రావణుడు " మారీచా నీవు మాయలేడి రూపం ధరించి సీతను ప్రలోభ పెట్టు. సీత ఆ లేడిని కావాలని కోరుతుంది. రాముడు బంగారు లేడి కోసం వెళ్ళినప్పుడు నేను సీతను అపహరిస్తాను. సీతా వియోగంతో రాముడు పరితపిస్తాడు " అన్నాడు. రావణాసురుని ఆదేశం మేరకు మారీచుడు బంగారు లేడి రూపంలో ఆశ్రమ సమీపంలో తిరుగుతున్నాడు. విధి పేరితయై సీత బంగారు లేడిని తెమ్మని రాముని కోరింది. రాముడు సీత రక్షణను లక్ష్మణునుకి అందించి బంగారు లేడి కోసం వెళ్ళాడు. అందినట్లే అందుతూ ఆలేడి రాముని అడవిలో చాలా దూరం తీసుకు వెళ్ళింది. అప్పటికి రాముడు యదార్ధం గ్రహించి శరం సంధించి మారీచుని కొట్టాడు. మారీచుడు " హా సీతా, హా లక్ష్మణా " అని రాముని కంఠాన్ని అనుకరిస్తూ ప్రాణాలు వదిలాడు. ఆ అరుపులు విన్న సీత " లక్ష్మణా! మీ అన్నయ్య ఆపదలో ఉన్నట్లున్నాడు. నీవు వెళ్ళి రక్షించు " అన్నది. లక్ష్మణుడు " అమ్మా! సీతా మా అన్నయ్య పరాక్రమ వంతుడు. బయపడకుము మా అన్నయ్య శత్రుసంహారం చేసి రాగలడు " అన్నాడు. సీతకు కోపం వచ్చింది. ఆ ఆవేశంలో లక్ష్మణుని పై అనుమానం వచ్చింది. "లక్ష్మణా! నీ తలపు అర్ధం అయింది నీకు నా మీద ఆశ ఉంది. నేను చావనైనా చస్తాను కాని నీకు దక్కను " అని కఠోరంగా పలికింది. ఆ మాటలు భరించలేని లక్ష్మణుడు విల్లంబులు పట్టుకుని రాముడు వెళ్ళిన మార్గంలో వెళ్ళాడు.

### సీతాపహరణం


సీతను రక్షించడానికి వచ్చిన జటావుయును చంపతున్న రావణుడు

అవకాశం కోసం చూస్తున్న రావణుడు సన్యాసి వేషంలో అక్కడికి వచ్చాడు. మార్గాయాసంతో అలసినట్లు కనిపిస్తున్న రావణుని చూసి అతిధి సత్కారాలు చేసింది. సీతను చూసిన రావణుడు మోహవివశుడై " సుందరీ! నా పేరు రావణుడు, దానవ నాయకుడను నా రాజధాని లంక. నీవు నన్ను భర్తగా వరించి భోగాలు అనుభవించు. రాజ్యాన్ని కోల్పోయి అడవుల వెంట తిరుగుతున్న రామునితో ఏమి సుఖపడతావు. వేరు ఆలోచించక నన్ను వరించు " అన్నాడు. సీత " అయ్యా! మీరు ఇలా మాట్లాడటం తగునా! సూర్యచంద్రులు తేజం కోల్పోయినా, ఆకాశం నేల కూలినా, సముద్రములు ఇంకి పోయినా, భూమి బద్దలు అయినా నేను నా భర్త రాముని తప్ప అన్యుని తలవను " అన్నది. రావణుడు సీతను బలవంతంగా పట్టుకుని ఆకాశానికి ఎగిరాడు. అప్పుడు సీత పెద్దగా కేకలు వేస్తూ " దేవతలారా ! నేను జనక మహారాజు కూతురిని, రాముని భార్యను. ఈ రావణుడు నన్ను బలవంతంగా ఎత్తుకు పోతున్నాడు. మీకు నమస్కరిస్తాను నన్ను కాపాడండి " అని రోదించింది. ఆ అరుపులు జటాయువు అనే పక్షి విని రావణుని అడ్డగించాడు. " ఓరి రావణా! ఈమెను ఎందుకు బలవంతంగా ఎత్తుకుపోతున్నావు. ఈమెను విడవకున్న నిన్ను సంహరిస్తున్నాను " అన్నాడు. జటాయువుకు రావణునికి మధ్య పోరు ఘోరంగా జరిగింది. జటాయువు తన ముక్కుతో, గోళ్ళతో రావణుని గాయ పరచింది. రావణుడు జటాయువు రెక్కలు ఖండించాడు. జటాయువు నేల కూలాడు. రావణుడు సీతను ఎత్తుకు పోతున్నాడు. సీత ఇక తనను రక్షించే వారు లేరని అనుకుంటున్న సమయంలో ఋష్యమూక పర్వతంపై ఉన్న వానరములను చూసి తన ఆభరణములు చీర కొంగున మూటకట్టి పడవేసింది. రావణుడు సీతను లంకకు తీసుకు వెళ్ళాడు. సీతను అశోకవనంలో ఉంచి రక్షణగా రాక్షస స్త్రీలను కాపలా ఉంచారు.

## సీతాన్వేషణ


లక్ష్మణుడ్ని మందలిస్తున్న రాముడు

దండ కారణ్యంలో మారీచుని సంహరించి రాముడు కుటీరానికి తిరిగి వస్తున్నాడు. దారిలో లక్ష్మణుడు ఎదురు వచ్చాడు. రాముడు " లక్ష్మణా! రాక్షసులు తిరిగే ఈ అరణ్యంలో సీతను ఒంటరిగా ఎందుకు వదిలి వచ్చావు అని మందలించాడు " అన్నాడు. లక్ష్మణుడు సీత తనను ఆక్షేపించిన విషయం వివరించాడు. రాముడు జరిగిన దానికి చింతించాడు. రామునికి దుశ్శకునాలు గోచరించాయి. సీతకు ఏదో ఆపద వచ్చిందని మనస్సు శంకించింది. కుటీరంలో సీత కనపడ లేదు అక్కడ కనిపించిన సంకేతాలు చూసి సీత అపహరణకు గురి అయినట్లు గ్రహించి వేదన పడ్డారు. సీత కోసం అన్వేషించటం మొదలు పెట్టారు. దారిలో కొన ఊపిరితో ఉన్న జటాయువు కనపడి " రామా! నా పేరు జటాయువు. నేను నీ తండ్రి దశరధునికి మిత్రుడను. నీ భార్య సీతను రావణుడు అపహరించి దక్షిణ దిక్కుగా పోయాడు. నేను అడ్డగించినందుకు నా రెక్కలు ఖండించాడు " అని చెప్పి ప్రాణాలు విడిచాడు. రాముడు జటాయువుకు అంతిమ సంస్కారములు చేసాడు.

### కబంధుడు

రామలక్ష్మణులు సీతను వెదుకుతూ దక్షిణ దిశగా వెళ్ళారు. దారిలో కబంధుడు లక్ష్మణుని పట్టుకున్నాడు. కబంధుడు ఒక వింత జీవి. దాని గుండెలో కళ్ళు పొట్టలో నోరు ఉంది. చేతులు మాత్రం చాలా పొడవు అది కూచున్న చోటు నుండి కదలక చేతులను చాచి చిక్కిన జంతువులను పట్టుకుని తింటూ జీవిస్తుంది. లక్ష్మణుడు కంబంధుడి పట్టు నుండి తప్పించుకో లేక పోయాడు. " అన్నా! శ్రీరామా! నన్ను రక్షించు. నీకు రాజ్యం పోయింది, తండ్రి మరణించాడు, భార్యను పోగొట్టుకున్నావు ఇప్పుడు ఈ కబంధుడు నన్ను పట్టుకున్నాడు. నా వంటి దురదృష్టవంతుడు ఉంటాడా " అని అరిచాడు. రాముడు లక్ష్మణునికి ధైర్యం చెప్పి బాణాలతో కబంధుని హస్తాలు ఖండించి లక్ష్మణుని విడిపించాడు. ఒక కత్తి తీసుకుని కబంధుని పొట్ట చీల్చగా అతడు ఒక దివ్య పురుషుడుగా మారి పోయాడు. " రామా! నేను విశ్వావసు అనే గంధర్వుడను. బ్రహ్మదేవిని శాపం వలన నాకు ఈ రాక్షస జన్మ వచ్చింది. నేడు నీ వలన నాకు మోక్షం కలిగింది. రావణుడు అనే రాక్షసుడు నీ భార్యను తీసుకు వెళ్ళి లంకలో ఉంచాడు. పంపా సరస్సు ఒడ్డున ఉన్న ఋష్య మూక పర్వతం పై వాలి సోదరుడైన సుగ్రీవుడు నివసిస్తున్నాడు. అతనితో నీవు సఖ్యం చేసిన నీ కార్యం సిద్ధిస్తుంది " అని చెప్పి గంధర్వుడు వెళ్ళి పోయాడు.


రామ లక్ష్మణులకు తన వృత్తాంతమును వివరిస్తున్న కబంధుడు.

### కిష్కింద

రామలక్ష్మణులు పంపా సరోవర తీరాన తమ పితరులకు తర్పణం విడిచారు. అక్కడి నుండి చాలా ఎత్తుగా కనపడు తున్న ఋష్యమూక పర్వతాన్ని చేరారు. ఋష్యమూక పర్వతం పైనున్న వానరరాజు సుగ్రీవుడు రామలక్ష్మణులను చూసి వారి వృత్తాంతం తెలుసుకు రమ్మని మంత్రి అయిన హనుమంతుని పంపాడు. హనుమంతుడు చాకచక్యంగా వ్యవహరించి రామలక్ష్మణుల గురించిన సకల వృత్తాంతం గ్రహించి సుగ్రీవునకు నివేదించాడు. రామలక్ష్మణులకు సుగ్రీనికి మైత్రి చేసాడు. సుగ్రీవుడు సీతాదేవి కిందకు జారవిడిచిన ఆభరణాలు చూపించాడు. రాముడు ఆ ఆభరణాలు గుర్తు పట్టాడు. సుగ్రీవుడు తన అన్న వాలి తన భర్యను అపహరించి తన మీద నిష్కారణ కక్ష పెంచుకుని తనను రాజ్యం నుండి వెడలగొట్టాడని తన అన్నను చంపి తనకు రాజ్యం ఇప్పించమని కోరాడు. బదులుగా సీతాన్వేషణలో తాను సాయం చేస్తానని చెప్పాడు. రాముడు అందుకు ఒప్పుకున్నాడు.


శ్రీరాముడు, సుగ్రీవుల మైత్రి

## వాలి వధ


వాలి మరణం

అందరూ కిష్కిందకు బయదేరి నగరం వెలుపల నిలిచి సుగ్రీవుడు తన అన్న వాలిని యుద్ధానికి పిలిచాడు. వాలి సుగ్రీవునితో యుద్ధానికి పోతుండగా వాలి భార్య తార " నాధా! సుగ్రీవుడికి ఏదో సాయం లభించినట్లు ఉందు. అయోధ్య రాజు దశరధుని కుమారులైన రామ లక్ష్మణులతో సుగ్రీవునకు మైత్రి కుదిరిందని చారుల ద్వారా విన్నాను. రాముని భార్య సీతను రావణుడు అపహరించాడు. రాముడు సుగ్రీవుని సాయం కోరాడు. సుగ్రీవుడు అంగీకరించాడు. ప్రతిఫలంగా సుగ్రీవునకు సాయం చేస్తానని అన్నాడంట. మహా బలవంతులైన మైందుడు, ద్వివిదుడు, హనుమంతుడు, జాంబవంతుడు అతనికి మంత్రులుగా ఉన్నారు. కనుక ఇప్పుడు సుగ్రీవునితో యుద్ధానికి పోవడం ప్రమాదకరం " అని తార వాలిని వారించింది. కాని వాలి భార్యమాట లక్ష్యపెట్టక సుగ్రీవునితో యుద్ధానికి సిద్ధం అయ్యాడు. సుగ్రీవుని చూసి వాలితో " ఓరీ! మంద బుద్ధీ నేను ఎన్నో మార్లు నిన్ను ఓడించి తరిమి వేసాను. మరల సిగ్గు లేకుండా యుద్ధానికి ఎందుకు వచ్చావు " అన్నాడు. సుగ్రీవుడు " వాలీ! నేను భార్యను పోగొట్టుకుని రాజ్యభ్రష్టుడనయ్యాను. నేను ఉండి చేసేదేముంది అందుకే యుద్ధానికి వచ్చాను " అని వాలితో అన్నాడు. వాలి సుగ్రీవులు చెట్లతోను, బండలతోను యుద్ధం చేసుకున్నారు. తరవాత ఒకరితోనొకరు ముష్టి యుద్ధం చేసుకుంటున్నారు. కవలలైన వారిని పోల్చలేక రాముడు వాలిని చంపలేక పోయాడు. సుగ్రీవుడు తిరిగి వచ్చి రామునితో నిష్టూరంగా మాట్లాడాడు. రెండవ సారి రాముని సలహాతో గుర్తు కొరకు వనపుష్ప మాలను ధరించి సుగ్రీవుడు వాలితో యుద్ధంచేసాడు. రాముడు వేసిన బాణాలకు వాలి నేల కూలాడు. తనను చంపడం అధర్మమని వాలి రామునితో వాదించాడు. రాముడు చెప్పిన ధర్మసూక్ష్మాలను అంగీకరించి తనభార్యను సుగ్రీవునికి అప్పగించి కుమారుడైన అంగదుని యువ రాజుని చేసే భాద్యత రామునికి అప్పచెప్పి ప్రాణాలు వదిలాడు. సుగ్రీవుడు రామునకు నమస్కరించి " రామా నీమాట నీవు నిలబెట్టు కున్నావు. ఇప్పుడు ఎండా కాలం తరువాత వర్షాకాలం సీతాన్వేషణకు ఇది తరుణం కాదు కనుక నేను వర్షాకాలం ముగియ గానే సీతాన్వేషణ ప్రారంభిస్తాను " అన్నాడు.

## అశోకవనం త్రిఝటా స్వప్నం

అశోకవనంలో సీత రాముని తలచుకుంటూ కాలం గడుపుతుంది. సీతకు కాపలాగా రాక్షస స్త్రీలైన త్ర్యక్షి, లలాటాక్షి, త్రిస్తని, ఏకపాద, దీర్ఘజిహ్వ, అజిహ్వ, త్రిజట, ఏకలోచన మొదలైన వారు సీత చుట్టూ కాపలా ఉన్నారు. వారు రావణుని వరించమని ఆమెను వేధిస్తున్నారు. సీత వారి మాటలు వినలేక " అమ్మా! నేను రాముని తప్ప అన్యులను మనసులో కూడా తలవను ఇది సత్యం నాకు జీవించవలెను అన్న కోరిక లేదు. నన్ను ఏమైనా చెయ్యండి " అన్నది. సీత చావటానికి భయపడ లేదని చెప్పడానికి కొందరు స్త్రీలు రావణుని వద్దకు వెళ్ళారు. అప్పుడు త్రిజట " అమ్మా! సీతా నీకు సంతోషం కలిగించే మాట ఒకటి చెప్తాను. రాముని మేలు కోరే వాడు అవింధ్యుడు అనే వాడు నన్ను ఇక్కడ నియమించాడు. నీకు హితమైన మాటలు చెప్పమన్నాడు. రామలక్ష్మణులు నిన్ను వెతుకుతూ సుగ్రీవుని కలుసుకుని మైత్రి చేసుకున్నారు. సుగ్రీవుడు నిన్ను వెతికించే కార్యము మొదలు పెట్టాడు. రావణునికి రంభ కారణంగా నలకూబరుడు ఒక శాపం పెట్టాడు. ఆ కారణంగా రావణుడు నిన్ను బలాత్కరించడు కనుక భయపడ వలదు. దుర్మార్గుడైన రావణునికి చేటు కాలం దాపురించిందని తెలిపే కల నాకు వచ్చింది. గాడిదలు కట్టిన రథం పై ఒంటి నిండా నూనె రాసుకుని తల విర బోసుకుని రావణుడు దక్షిణదిక్కుగా వెళుతున్నాడు. అతని వెంట కుంభకర్ణుడు ఇతర రాక్షసులు ఎర్రని పూలు ధరించి జుట్టు విరబోసుకుని బిగంబరులై యముని దిక్కుగా వెళుతున్నారు. విభీషణుడు తెల్లని వస్త్రములు ధరించి, తెల్లని పూలు ధరించి తెల్లని కొండపై మంత్రులతో కొలువు తీరటం నేను స్వప్నంలో చూసాను. సీతా! అలాగే రాముడు ఏనుగునెక్కి లక్ష్మణునితో కలసి సంతోషంగా పాయసం సేవిస్తున్నట్లు కనబడింది నా కల నిజమౌతుంది. నీవు నీ భర్తను త్వరగా చేరగలవు " అని పలికింది.

### రావణుడి ప్రేలాపన

రావణుడు సీత మీది మోహంతో అశోక వనానికి వచ్చి సీతతో " ఓ సీతా! నీ మీద నేను మనసు పడ్డాను. అన్న పానీయాలు విడిచి ఎందుకు నీవు ఇలా కృశిస్తావు. కృపతో నన్ను ఏలుకొమ్ము. నేను దేవతలను, యక్షులను, రాక్షసులను జయించిన వాడిని. ఎంతో మంది స్త్రీలు నా ఆధీనంలో ఉన్నా నేనా మనసు నీ మీద లగ్నం అయింది. రాజ్యం పోగొట్టుకుని పిచ్చి వాడి వలె అడవులలో తిరిగే అల్పుడైన రాముడు నా ముందెంత? నేను సకల లోకములకు ఈశ్వరుడను. రాక్షసులు యక్షులు వేల సంఖ్యలో నన్ను కొలుస్తున్నారు. విశ్వవసుడు నా తండ్రి, కుబేరుడు నా అన్న. గంధర్వ కన్యలు, అప్సరసలు నన్ను సేవిస్తున్నారు. నన్ను పంచమ లోక పాలకుడని ముల్లోకాలు కీర్తిస్తున్నాయి. దేవేంద్రుని వద్ద నున్న సమస్తం నా వద్ద ఉన్నాయి నా జీవితమునకు రాణివై నన్ను పాలించుము " అని పలికాడు. సీత ఒక గడ్డి పోచను రావణునికి తనకు మధ్య పెట్టి " నేను పరస్త్రీని, అబలను, మానవాంగనను, పతివ్రతను. నీవు రాక్షసుడవు నీయందు నాకేమాత్రం ప్రేమ లేదు. నాతో ఏమి సుఖిస్తావు. బ్రహ్మావుని మనుమడిని, కుబేరుని తమ్ముడిని అని చెప్పుకునే నీకు ధర్మం తెలవాలి. చెడు ప్రవర్తన విడిచి పెట్టాలి కాని ఇలా సుగ్గు లేకుండా మాట్లాడటం ధర్మమా? " అని సీత ఏడుస్తుంటే రావణుడు కొన్ని దుర్భాషలాడి వెళ్ళి పోయాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభ్రువాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

---

# వన పర్వము సప్తమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# సప్తమాశ్వాసం

## సుగ్రీవుడు సీతాన్వేషణకు కపులను పంపుట


సీత గురించి వానరులకు చెబుతున్న సంపాతి

సుగ్రీవుడు రాజ్య భోగాలను అనుభవిస్తున్నాడు. రామలక్ష్మణులు మాల్యవంతం అనే గుహలో ఉన్నారు. వర్షాకాలం గడిచి పోయింది. రాముడు లక్ష్మణునితో " లక్ష్మణా! సుగ్రీవుడు రాజ్య భోగములతో గడుపుతూ మనలను మరచి నట్లున్నాడు. నీవు సుగ్రీవుని వద్దకు వెళ్ళి హెచ్చరించి రమ్ము. అతడు అనుకూల వర్తనుడైతే ఇక్కడకు తీసుకురా " అని పంపాడు. అన్న మాటలను విని లక్ష్మణుడు సుగ్రీవుని హెచ్చరించాడు. సుగ్రీవుడు వణికి పోయాడు. " నేను ఇచ్చిన మాట మరచు నీచుడిని కాను సీతను వెతుకుతూ వానరులను నలుదిక్కులకూ పంపాను. నెల రోజులు గడువు ఇచ్చాను. గడువు తీరటానికి అయిదు రోజులు ఉంది. సీతాదేవి జాడ తెలియగానే నేను రాముని వద్దకు వస్తాను " అన్నాడు. ఆ సమాధానంతో తృప్తి చెందిన లక్ష్మణుడు సుగ్రీవుని తీసుకుని రాముని వద్దకు వెళ్ళాడు. సుగ్రీవుడు తాను చేసిన ఏర్పాట్లు రామునికి చెప్పాడు. రాముడు తృప్తి చెందాడు. కొన్ని రోజులకు అన్ని దిక్కుల నుండి కోతులు వచ్చి సీతమ్మ జాడ దొరకలేదని చెప్పారు. దక్షిణ దిక్కు వెళ్ళిన కపులు ఇంకా రాలేదు. కొంతమంది వానరాలు సుగ్రీవుని వద్దకు వచ్చి " మహారాజా! తమరు అత్యంత ప్రియంగా పెంచుకున్న మధువనంలో అంగదుడు హనుమంతుడు మొదలైన వారు ఇష్టం వచ్చి నట్లు విహరిస్తూ ఫలములు తింటున్నారు వనరక్షకులమైన మేము వారిని వారించగా మమ్ములను కొట్టారు " అని చెప్పారు. సుగ్రీవుడు దక్షిణ దిక్కుగా వెళ్ళిన అంగదుడు, హనుమంతుడు మొదలగు వారు సీతను చూసి ఉంటారు. అందుకే వారు ఆనందోత్సాహాలను ప్రదర్శించి ఉంటారు " అనుకున్నాడు.

## సీత జాడ రామునికి తెలుపుట

దక్షిణ దిక్కుగా వెళ్ళిన వానరులంతా వచ్చారు. హనుమంతుడు సుగ్రీవుడు, రాముని చూసి " దేవా! సీతను చూసాను. దక్షిణ దిశగా వెళ్ళి అశోక వనంలో రావణ కట్టుబాటులో ఉన్న సీతను నేను చూసాను. మేము సీతను వెదుకుచూ వెళుతుండగా మాకు ఒక పెద్ద సొరంగం కనపడింది. ఆ సొరంగంలో ప్రవేశించి కొన్నాళ్ళకు ఒక నగరం చేరుకున్నాము. అక్కడ మాకు ఒక తాపసి కనపడింది. మమ్మలిని ఆదరించింది. తరవాత మలయ పర్వతం చేరుకున్నాము. అక్కడ ఒక పెద్ద సముద్రం. ఆ సముద్రం దాటటానికి ఎవరికి శక్యం కాలేదు. సీతను వెదకకుండా వెనుకకు మరలడం కంటే చావడం మేలనుకున్నాము. అక్కడ ఒక పక్షిరాజు మాకు కనిపించాడు. మేము జరిగినదంతా చెప్పుకుని విచారిస్తుండగా ఆ పక్షిరాజు " అయ్యా! మీ మాటలలో జటాయువు అనే పేరు వినవచ్చింది. నేను నా తమ్ముడు ఒకసారి సూర్య మండలానికి ఎగిరాము నా రెక్కలు మాడి పోవడంతో నేను ఇక్కడ పడి ఉన్నాను. నా తమ్ముడు జటాయువు గురించి మీకు తెలిస్తే చెప్పండి " అని అడిగాడు. నేను సంపాతితో రావణుడు సీతను ఎత్తుకు వెళ్ళడం జటాయువును చంపడం చెప్పాను. జటాయువు మరణ వార్త విన్న సంపాతి " అయ్యా! నాకు రావణుని గురించి తెలియును. వాడు రాక్షసుడు. ఇక్కడికి నూరు యోజనముల దూరంలో ఉన్న లంకను రాజధానిగా చేసుకుని రావణుడు రాజ్యం చేస్తున్నాడు. మీకు అక్కడ సీతాదేవి కనిపించ వచ్చును " అన్నాడు. మాలో ఎవరికి సముద్రాన్ని దాటే శక్తి లేదు. నా తండ్రి వాయు దేవుని వలన నాకు సముద్రాన్ని దాటే శక్తి కలిగింది. నేను లంకకు వెళ్ళి సీతాదేవిని చూసి నన్ను రామ దూతగా నన్ను పరిచయం చేసుకుని మీ ముద్రికను ఇచ్చాను ఆమెకు మీ క్షేమం చెప్పాను .


అశోక వనములో సీతను చూచిన హనుమంతుడు

ఆమె నన్ను నమ్మ లేదు రావణుడు కామ రూపియై వచ్చాడు అనుకుంది. నేను ఆమెకు విశ్వాసం కలిగించాక ఆమె నన్ను నమ్మింది. తన ఆనవాలుగా ఈ శిరోభూషణం మీకు ఇమ్మంది. సుగ్రీవుని సాయంగా తీసుకు వచ్చి అతి త్వరలో తను తీసుకు పొమ్మని మీకు చెప్పమని చెప్పింది. ఆమెకు నేను ధర్య వచనాలు చెప్పి వచ్చాను. ఆమె నాకు చిత్రకూటం పై జరిగిన కాకాసురుని వృత్తాంతం చెప్పింది " అన్నాడు. హనుమంతుడు రామునికి శిరోభూషణం అందించాడు. రాముడు ఆ శిరోభూషణాన్ని గుండెలకు హత్తుకున్నాడు.

### లంకపై దండెత్తుట


సముద్రంపై వంతెనను నిర్మిస్తున్న వానరులు

రాముడు సుగ్రీవునితో " సుగ్రీవా! ఇక ఆలస్యం ఎందుకు లంకపై దండెత్తుటకు తగు సన్నాహాలు చెయ్యి " అని చెప్పాడు. సుగ్రీవుడు వానరు లందరికి వర్తమానం పంపాడు. నలు దిక్కుల నుండి వానరాలు కోట్ల సంఖ్యలో తరలి వచ్చారు. గవయుడు, గజుడు, కుముదుడు, సుషేషణుడు కోట్ల కొలది వానరాలతో తరలి వచ్చారు. జాంబ వంతుడు భల్లూక సేనతో తరలి వచ్చాడు. శుభముహూర్తం చూసి రాముడు రావణుని పై దండయాత్రకు బయలు దేరాడు. హనుమంతుడు సేనా నాయకత్వం వహించాడు. అంగదుడు, నీలుడు, నలుడు అతనికి సాయం నిలిచారు. కపి సైన్యం దక్షిణ తీరానికి చేరింది. రాముడు సుగ్రీవునితో " సుగ్రీవా ఈ సముద్రాన్ని దాటే ఉపాయం నువ్వే చెప్పాలి " అన్నాడు. కొంత మంది వానరులు తెప్పలు కట్టుకుని దాటుదాం అన్నారు. రాముడు " ఇన్ని కోట్ల సైన్యం మన సైన్యం లెక్కకు మించి ఉన్నది. వీరికి సరిపోవు తెప్పలు పడవలు తయారు చేయడం అసాధ్యం. మనం దాటే సమయంలో శత్రు సైన్యం మన సైన్యాలను సముద్రంలో ముంచి వేయడానికి ప్రయత్నిస్తాయి. నేను ఉపవాస దీక్ష వహించి సముద్రుని పూజిస్తాను. అతని సహాయం లేక ఏమీ చేయలేము. సముద్రుడు లొంగక పోతే నా బాణాలతో సముద్రాన్ని ఇంకిస్తాను " అన్నాడు. ఉపవాస దీక్షతో ఆరాధిస్తున్న రామునికి సముద్రుడు ప్రత్యక్షమైయ్యాడు. రాముడు " మాకు ససైన్యంగా దారి ఇవ్వు లేకున్న సముద్రాన్ని ఇంకిస్తాను " అన్నాడు. సముద్రుడు " రామా! నేను నీకు ఎటువంటి ఆటకంకలిగించను. నీవు ఈ రోజు ఇంకిస్తే ఇతరులు ఆ మార్గాన్ని అనుసరిస్తారు. నన్ను వశపరచుటకు ప్రయత్నిస్తారు. అది మంచిది కాదు. కపి వీరులలో నలుడు అనే శిల్పకర్మ ఉన్నాడు. వాని సాయంతో సేతువు నిర్మించండి. నేను దానిని సాగర జలాల్లో మునగ కుండా కాపాడతాను మీరు ఆ సేతువు మీద ప్రయాణించి సముద్రం దాటవచ్చు " అన్నాడు. నలుడు వంద యోజనములు పొడొగు పది యోజనములు వెడల్పున్న ఒక వారధి నిర్మించాడు.

### విభీషణుడు రాముని చేరుట

విభీషణునికి రావణుడితో పొసగ లేదు. అతడు లంక నుండి బయటకు వచ్చి శ్రీరాముని శరణు జొచ్చాడు. శ్రీరాముడు విభీషణునికి అభయం ఇచ్చాడు. శ్రీరాముడు వానర సేనలతో విభీషణునితో వారధి దాటి లంకును చేరుకున్నాడు. శ్రీరాముడు త్రికూట పర్వతంపై ఎక్కి లంకకు నాలుగు వైపులా సైనిక శిబిరాలు ఏర్పాటు చేయించాడు. రావణుని గూఢాచారులైన సారణుడు, శకుడు అనే వారు వానర రూపాలు ధరించి వానరులలో కలిసి పోయారు. విభీషణుడు వారిని రామునికి పట్టి ఇచ్చాడు. రాముడు వారికి సైన్యమంతా చూపించి రావణుని వద్దకు పంపాడు. వారు రావణుని వద్దకు పోయి రాముడి సేన అజేయమని గెలువ సాధ్యం కానిదని చెప్పాడు. రావణుడు లంకకు తగిన రక్షణ కల్పించాడు. శ్రీరాముడు అంగదుని పిలిచి " అంగదా! నీవు రావణుని వద్దకు వెళ్ళి సీతను విడువమని చెప్పు . తగిన విధముగా బుద్ధి మతి చెప్పుము " అన్నాడు. అంగదుడు రావణుని కొలువు కూటమిలో ప్రవేశించి " రావణా! సూర్య వంశ సంభూతుడు రాముడు నీతో ఇలా చెప్పమన్నాడు. అడవులలో తపస్సు చేసుకుంటున్న మునులను చంపావు, దేవతాస్త్రీలను బంధించి మహాపరాధం చేసావు ఇవన్నీ ఒక ఎత్తు నీవు నాపట్ల చేసిన అపరాధం ఒక ఎత్తు. నా భార్య సీతను అపహరించి మహాపరాధం చేసావు. ఆమెను


రాముడ్ని శరణు వేడుతున్న విభీషణుడు

నాకు అప్పగించు లేకున్న నాతో యుద్ధం చెయ్యి. నీకు మరొక మార్గం లేదు. నీకు మానవులంటే చులకన భావం ఉంది రాక్షసకులం అన్నది లేకుండా చేస్తాను జాగ్రత్త " అని అంగదుడు రాముడు చెప్పమన్నది చెప్పాడు. రావణుడు కను సైగ చేయగానే కొంతమంది రాక్షసులు అంగదుని పట్టు కోవడానికి వచ్చారు. అంగదుడు పైకి ఎగిరి వారిని కిందకు తోసాడు. ఆ తోపిడికి వారు మరణించారు. తరువాత అంగదుడు రాముని వద్దకు పోయి జరిగినది చెప్పాడు.

## యుద్ధారంభం


రామాయణ యుద్ధములో కుంభకర్ణునిపై బాణాలు ఎక్కుపెట్టిన రామలక్ష్మణులు (బాలాసాహెబ్ పండిత్ పంత్ ప్రతినిధి చిత్రం, 1916)

శ్రీరాముడు యుద్ధానికి అనుమతి ఇచ్చాడు. వానరులు లంకను చుట్టిముట్టి రాక్షసులను తరిమి కోట గోడలను ధ్వంశం చేసారు. ఇది తెలిసిన రావణుడు తన సైన్యాన్ని యుద్ధానికి పంపాడు. రాముడు, లక్ష్మణుడు కూడా యుద్ధానికి ఉపక్రమించారు. రాక్షసులు మాయా యుద్ధం చేస్తున్నారు. మాయా యుద్ధంలో ఆరితేరిన విభీషణుడు విజృంభించి రాక్షసులను చంపాడు. రాక్షసులు ఈ విషయం రావణునికి చెప్పారు. రావణుడు స్వయంగా యుద్ధానికి బయలుదేరాడు. రామరావణ యుద్ధం ఆరంభం అయింది. లక్ష్మణుడు రావణుని కుమారుడైన ఇంద్రజిత్తును తన వాడి బాణాలతో ముంచెత్తాడు. రాముని బాణముల ధాటికి ఆగలేక తిరిగి పోయాడు. వీరుడైన ప్రహస్తుని యుద్ధానికి పంపాడు. విభీషణుని నాయకత్వంలో వానరులు, ప్రహస్తుని నాయకత్వంలో రాక్షస వీరులు యుద్ధం చేస్తున్నారు. విభీషణుడు శక్తి ఆయుధాన్ని ప్రయోగించి ప్రహస్తుని చంపాడు. అతని స్థానంలో ధూమ్రాక్షుడు యుద్ధానికి వచ్చాడు. అతనిని హనుమంతుడు ఎదుర్కొన్నాడు. హనుమంతుని ముందు రాక్షస సేనలు ఆగలేక పోయాయి. హనుమంతుడు ధూమ్రాక్షునితో యుద్ధం చేసి అతనిని సంహరించాడు. ప్రహస్తుని, ధూమ్రాక్షుల మరణం విని చింతించి రావణుడు కుంభ కర్ణుని నిద్రలేపాడు. " కుంభకర్ణా! నీవు హాయిగా నిద్రపోతున్నావు. నేను ఇక్కడ ఆపదలో ఉన్నాను. నేను దశరధ కుమారుడైన రాముని భార్యను అపహరించి తెచ్చాను. రాముడు వానర వీరుల సాయంతో యుద్ధానికి వచ్చాడు. ప్రహస్తుడు, ధూమ్రాక్షుడు మరణించారు. కనుక నీవు యుద్ధానికి బయలు దేరాలి. ప్రమాదుడు, వజ్రవేగుడు తోడుగా ఉంటారు " అని రావణుడు కుంభకర్ణునితో చెప్పాడు. కుంభకర్ణుడు యుద్ధానికి బయలు దేరాడు. కుంభకర్ణుని భయంకర ఆకారాన్ని చూసి వానరులు ఆశ్చర్యపోయారు. వానర వీరులను లక్ష్యపెట్టకుండా రామలక్ష్మణుల వైపు దూసుకు పోతున్నాడు. అతనిని ఆపటానికి ముందుకు వెళ్ళిన వానర వీరులను కుంభ కర్ణుడు మింగుతూ చంపుతూ ముందుకు వెళుతున్నాడు. కుంభకర్ణుడు సుగ్రీవుని పట్టుకున్నాడు. ఇది చూసి లక్ష్మణుడు కుంభకర్ణుని తన భాణాలతో కొట్టాడు. ఆ దెబ్బకు కుంభకర్ణుడు సుగ్రీవుని విడిచి లక్ష్మణుని వైపు తిరిగాడు. లక్ష్మణుడు కుంభకర్ణుని రెండుచేతులు నరికాడు. కుంభకర్ణునికి మరలా నాలుగు చేతులు పుట్టుకొచ్చాయి. అలా తిరిగి తిరిగి చేతులు మొలవడం చూసి లక్ష్మణుడు బ్రహ్మాస్త్రం ప్రయోగించి కుంభకర్ణుని సంహరించాడు. కుంభకర్ణుడు మరణించటం చూసి వజ్రవేగుడు, ప్రమాదుడు లక్ష్మణుని వైపు దూసుకు వచ్చారు హనుమంతుడు, నీలుడు రెండు కొండలు తీసి వారి మీద వేసారు. వజ్రవేగుడు, ప్రమాదుడు మరణించారు. కుంభకర్ణుడు, వజ్రవేగుడు, ప్రమాదుడు మరణ వార్త విని రావణుడు చాలా చింతించాడు.

## లక్ష్మణ ఇంద్రజిత్తుల యుద్ధం

ఇంద్రజిత్తు తండ్రి బాధ పడటం చూసి " తండ్రీ ! నన్ను యుద్ధానికి పంపండి వానర వీరులను హతమార్చి రామ లక్ష్మణులను బంధించి తెస్తాను " అన్నాడు. మేఘనాధుడిని రావణుడు ఆశీర్వదించి యుద్ధానికి పంపాడు. ఇంద్రజిత్తు యుద్ధానికి వెళ్ళి లక్ష్మణుని యుద్ధానికి ఆహ్వానించాడు. ఇంద్రజిత్తు, లక్ష్మణుడు ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధం చేసారు. ఇంతలో అంగదుడు విసురుగా వెళ్ళి ఒక పెద్ద చెట్టుతో ఇంద్రజిత్తును మోదాడు. అంగదుని మీదకు ఇంద్రజిత్తు ఒక ఈటెను విసిరాడు.


ఇంద్రజిత్తును చంపుతున్న లక్ష్మణుడు

లక్ష్మణుడు దానిని బాణంతో విరిచాడు. ఇంద్రజిత్తు అంగదుని రధాన్ని బాణాన్ని చిత్తు చేసాడు. ఇంద్రజిత్తు ఆకాశానికి ఎగిరి అదృశ్య యుద్ధం చేస్తున్నాడు. రామ లక్ష్మణులు శబ్దవేధి బాణాలు ప్రయోగించారు. ఇంద్రజిత్తు నాగాస్త్రాన్ని ప్రయోగించి రామ లక్ష్మణులను బంధించాడు. రామ లక్ష్మణులు మూర్చిల్లారు. అది చూసి సుగ్రీవుడు, హనుమంతుడు దు:ఖించారు. విభీషణుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి రామలక్ష్మణులను బంధవిముక్తులను చేసాడు. సుగ్రీవుడు విశల్య కరణి అనే ఔషధంతో వారి శరీరంలోని విషాన్ని తొలగించాడు. విభీషణుడు రామలక్ష్మణులను చూసి " రామా! కుబేరుడు మీకోసం దివ్యజలాలను పంపాడు. ఈ జలంతో మీ కన్నులను ప్రక్షాళన చేసుకుంటే మీకు అదృశ్యులైన వారు కూడా స్పష్టంగా కనిపిస్తారు. అని దివ్యజలాలను ఇచ్చాడు. రామ లక్ష్మణులు ఆ జలాలతో తమ కన్నులు ప్రక్షాళన చేసుకున్నారు. ఆ జలప్రభావం వలన ఆకాశంలో అదృశ్యంగా తిరుగుతున్న ఇంద్రజిత్తు వారికి కనిపించాడు. లక్ష్మణుడు ఒక్క సారిగా విజృంభించి ఇంద్రజిత్తు రెండు చేతులు ఖండించాడు. ఒక బల్లెంతో ఇంద్రజిత్తు తల నరికాడు. కుమారుని మరణ వార్త విన్న రావణుడు తల్లడిల్లి పోయాడు. దీనికంతా కారణం సీతేనని ఆమెను సంహరించబోయాడు. అక్కడే ఉన్న అవింద్యుడు " రావణా! మహేంద్రుని వంటి వారిని జయించిన నీకు ఈ స్త్రీని చంపుట తగదు. నీకు పౌరుషం ఉంటే యుద్ధానికి వెళ్ళి రాముని గెలువుము. అంతే కాని స్త్రీ హత్య చేసి అపనింద తెచ్చుకోకు " అన్నాడు.

### రామరావణ యుద్ధం


రావణ సంహారం

అవింద్యుని మాటలతో కొంత కోపాన్ని ఉపసంహరించుకుని యుద్ధసన్నద్ధుడై రాముని మీదకు యుద్ధానికి వెళ్ళాడు. రామరావణ యుద్ధం మొదలైంది. రావణుని శరీరం నుండి వేలకు వేలు రాక్షస వీరులు పుట్టుకు వస్తున్నారు. వారందరిని రాముడు తన బాణాలతో సంహరిస్తున్నాడు. ఇంతలో మాతలి అనే ఇంద్రుని సారధి వైజయంతి అనే ఇంద్రుని రధాన్ని తెచ్చి రామునకిచ్చి " రామా! ఇది ఇంద్రుని రధం. దీనిని ఎక్కి ఇంద్రుడు ఎంతో మంది రాక్షసులను సంహరించాడు. నీవు కూడా దీనిని అధిరోహించి యుద్ధం చేసి విజయం సాధించు " అన్నాడు. శ్రీరాముడు సంతోషించి మాతలిని అభినందించాడు. ఆ రధాన్ని ఎక్కి రావణునితో యుద్ధం చేయసాగాడు. రామ రావణులకు భీకరంగా యుద్ధం జరిగింది. బ్రహ్మాస్త్రాన్ని ఉపయోగించి రాముడు రావణుని సంహరించాడు. లోక కంటకుడైన రావణుడు సంహరింపబడటం చూసి మూడు లోకాలు ఉత్సవాలు జరుపు కున్నాయి. అవింద్యుడు విభీషణుడు వెంటరాగా సీతా దేవిని రామునకు అప్పగించాడు.

### సీతాదేవి అగ్నిప్రవేశం



తన భార్య సీతను చూసి రాముడు " సీతా! చెడ్డ వాడైన రావణుని ఇంట ఇంత కాలం ఉన్న కారణంగా నిన్ను నేను స్వీకరిస్తే ధర్మహాని జరుగుతుంది. నాకు జరిగిన పరాభవానికి రావణిని చంపాను కాని నీ కోసం కాదు. నీవు మంచిదానివైనా, చెడ్డదానివైనా నిన్ను నేను పరిగ్రహించను. నీ పరిస్థితి కుక్క ముట్టిన యజ్ఞ ద్రవ్యమైంది. నీవు నీ ఇష్టమైన చోటుకు వెళ్ళ వచ్చును " అన్నాడు. ఆ మాటలు విని భరించ లేక సీత నేలపై వాలి పోయింది. తిరిగి లేచి " రామా ! నీకు ధర్మ హాని కలుగకుండా ఉండటానికి, ప్రజలకు నా నిర్మలత్వం నిరూపించడానికి నేను అగ్ని ప్రవేశం చేసి బయటకు వస్తాను అనుమతి ఇవ్వండి " అన్నది. సీత అగ్ని ప్రవేశం చేయడానికి అనుమతి తీసుకుని " నేను ఎల్లప్పుడు నీ పాదములు తప్ప

సీతాదేవి అగ్నిప్రవేశం

ఇతరములు మనసులో తలచ లేదు. అలా కాకపోతే ఈ పంచభూతాలు నన్ను దహించుగాక " అని పలికింది. వెంటనే పంచ భూతాలు తమతమ పేర్లు చెప్పి " రామా! సీత ఉత్తమురాలు నీవు సందేహ పడవలసిన పని లేదు " అని పలికారు. ఆ సమయంలో బ్రహ్మ దేవుడు సకల ముని గణాలతో అక్కడకు వచ్చారు. శ్రీరాముడు బ్రహ్మదేవుని సత్కరించాడు. బ్రహ్మదేవుడు " రామా! నీవు లోక కంటకుడైన రావణుని చంపి లోకాలకు హితం చేసావు. రావణునికి నలకూబరుని శాపం ఉంది అందు వలన అతడు ఇతర స్త్రీలను తాకలేడు. బలాత్కారం చేయలేడు. నీ ధర్మ పత్నికి ఏ హాని జరగ లేదు. నీవు ఏవిధమైన శంక లేకుండా ఈ మెను స్వీకరింపుము " అని బ్రహ్మదేవుడు పలికాడు. రాముని కోరికపై యుద్ధంలో చనిపోయిన వానరవీరులను బ్రతికించి వెళ్ళాడు. దేవేంద్రుని సారధి మాతలి కూడా తన రధాన్ని తీసుకుని దేవలోకం వెళ్ళాడు. రాముడు సీతా లక్ష్మణ సమేతుడై అయోధ్యకు పుష్పక విమానం ఎక్కి వెళ్ళాడు. " ధర్మరాజా ! నీవలెనే రాముడు కూడా రాజ్యాన్ని వదిలి అరణ్యవాసం చేసి రాజ్య సుఖాలను అనుభవించాడు. నీవు కూడా అలాగే అరణ్యవాసం పూర్తి చేసి కౌరవులను జయించి రాజ్య భోగాలను అనుభవించ గలవు " అన్నాడు మార్కండేయుడు.

## సతీ సావిత్రి

రామ కధను విన్న ధర్మరాజు రాముని పరాక్రమము సీత పాతివ్రత్యానికి అబ్బుర పడ్డాడు. ధర్మరాజు మార్కండేయుని చూసి " మహర్షీ! సీతా దేవిలా పతివ్రతలు ఇంకా ఉన్నారా? " అని అడిగాడు. మార్కండేయుడు ధర్మరాజుకు ఇలా చెప్పసాగాడు. " పూర్వం మద్రదేశాన్ని అశ్వపతి అనే రాజు పాలించే వాడు. అతనికి సంతానం లేనందున సావిత్రీ దేవిని పదునెనిమిది సంవత్సరాలు భక్తితో సేవించాడు " సావిత్రీ దేవి ప్రత్యక్షమై " ఏమి వరం కావాలో కోరుకో " అని అడిగింది. అశ్వపతి " అమ్మా! నాకు ఒక పుత్రుని ప్రసాదించు " అని అడిగాడు. కాని సావిత్రీ దేవి నీకు ఒక కన్య జన్మిస్తుంది అని వరమిచ్చింది. అశ్వపతి సావిత్రీ దేవిని " అమ్మా! నిన్ను భక్తితో కొలిచాను నా కోరిక మన్నించి నీవు వచ్చావు నా కోరిక తీరాలి కదా " అని అడిగాడు. సావిత్రీ దేవి " రాజా! నీ కోరిక గురించి బ్రహ్మదేవునితో చర్చించాను. ఆయన నీకు కూతురు కలుగుతుంది అని నిర్దేశించాడు. ఆయన ఆజ్ఞ అనుల్లంఘనీయము. నీ పుత్రిక కారణంగా నీకు నూరుగురు కుమారులు కలుగుతారు " అని చెప్పి అంతర్ధానం అయింది. కొన్ని రోజుల తరవాత ఆశ్వపతికి ఒక కుమార్తె జన్మించింది. ఆమె పేరు సావిత్రి. ఆ కన్య దినదిన ప్రవర్ధ మానంగా పెరుగుతుంది.

### సావిత్రీ సత్యవంతుల వివాహం


అడవిలో నడుస్తున్న సావిత్రీ సత్యవంతులు

అశ్వపతి సావిత్రికి యుక్త వయసు రాగానే ఆమెకు పెళ్ళి చేయాలని నిశ్చయించుకున్నాడు. సావిత్రి తన చెలికత్తెల వలన ద్యుమత్సేనుడి కుమారుడైన సత్యవంతుడు రూపవంతుడు, గుణవంతుడు అని విని అతని మీద మనసు పడింది. కాని సిగ్గుపడి ఆ విషయం ఎవరికి చెప్పలేదు. ఒక రోజు నారదుడు అశ్వపతి వద్దకు వచ్చాడు. నారదునికి ఉచిత సత్కారం చేసాడు. సావిత్రి కూడా నారదునికి నమస్కరించింది. నారదుడు ఆ కన్యను చూసి " రాజా! నీ కుమార్తెకు ఇంకా వివాహం ఎందుకు చెయ్యలేదు " అని అడిగాడు. ఆశ్వపతి " అమ్మా! నారదుడు చెప్పినది విన్నావుగా నీకు తగిన భర్తను నీవే ఎంచుకో " అని అడిగాడు. సావిత్రి " తండ్రీ! సాళ్వభూపతి కుమారుడైన సత్యవంతుడు నాకు తగిన భర్త అని నేను అనుకుంటున్నాను. కాని ఆ సాళ్వ భూపతి విధి వశాత్తుగా అతను కళ్ళు పోగొట్టు కున్నాడు. శత్రువుల వలన రాజ్యం పోగొట్టుకుని అడవులలో నివసిస్తున్నారు. అయినా నేను సత్యవంతునే వివాహం చేసు కుంటున్నాను " అన్నది. ఆశ్వపతి నారదునితో " మహర్షీ ! సత్యవంతుని గుణగణాలు ఎలాంటివి " అని అడిగాడు. నారదుడు. రాజా అతడు ఎప్పుడూ సత్యం పలుకుటచే అతనికి సత్యవంతుడనే సార్ధక నామధేయం వచ్చింది. అతని అసలు పేరు త్రాశ్వుడు. బుద్ధిలో బృహస్పతి వంటి వాడు. శౌర్యంలో దేవేంద్రుని మించిన వాడు. తేజస్సులో చంద్రుడు అందంలో అశ్వినీదేవతల వంటి వారు. శమము, దమము, బ్రాహ్మణ భక్తి అతనికి ఎక్కువగా ఉన్నాయి. కాని అతడు అల్పాయుష్కుడు . వివాహం అయిన ఒక సంవత్సరంలో మరణిస్తాడు " అన్నాడు. అశ్వపతి కుమార్తెతో " అమ్మా నీకు అల్పాయుష్కుడైన భర్త ఎందుకు వేరొకరిని వరించు " అన్నాడు. సావిత్రి " తండ్రీ ! త్రికరణములలో మనను ప్రధానం కదా. ఆ మనసులో

నేను సత్యవంతుని వరించింది. అతను ఎలాంటి వాడైనా నాకు అతనితోనే వివాహం జరిపించండి. నేను వేరు వరుని వరించాను " అని పలికింది. నారదుడు " నీ కుమార్తె గుణ వంతురాలు. ఆమె మనసు మరల్చడం సాధ్యం కాని పని. ఆమెను సత్యవంతునికిచ్చి వివాహం జరిపించు. ఈమె చేసిన పుణ్యం వలన సత్యవంతుడు దీర్గాయుష్మంతుడు కాగలడు " అని దీవించి వెళ్ళాడు. నారదుని ఆనతి మేరకు అశ్వపతి వివాహ సంభారాలతో అడవిలో ఉన్న ద్యుమత్సేనుని వద్దకు వెళ్ళాడు. ద్యుమత్సేనుడు అశ్వపతిని తగురీతిని సత్కరించాడు. అశ్వపతి " ద్యుమత్సేన మహారాజా ఈమె నా కుమార్తె సావిత్రి. ఈ మెను నీకోడలిగా స్వీకరించుము " అన్నాడు. ద్యుమత్సేనుడు " అయ్యా! మేము రాజ్యం కోల్పోయి అడవులలో ఉన్నాము. సుకుమారి అయిన నీ కుమార్తె ఈ అడవులలో కష్టాలకు తట్టుకుంటుందా " అన్నాడు. అశ్వపతి "రాజా! సంపదలు శాశ్వతం కాదు కదా. ఈరోజు ఉంటాయి రేపు పోతాయి ధీరులు వాటి కొరకు దు;ఖించరు. నా కుమార్తె ప్రౌఢ ఆమె ఆలోచించే ఈ నిర్ణయం తీసుకుంది. కాదనకండి " అన్నాడు. ద్యుమత్సేనుడు కాదనలేక పోయాడు. సావిత్రీ సత్యవంతుల వివాహం జరిగింది. అశ్వపతి తన కుమార్తెకు వివిధ ఆభరణాలు వస్తువులు ఇచ్చి తన రాజధానికి వెళ్ళాడు. సావిత్రి భర్తతోపాటు నార చీరలు ధరించి అత్తమామలకు సేవ చేస్తూ భర్తతో కాపురం చేస్తుంది. సంవత్సరం గడవటానికి ఇక నాలుగు రోజులు మాత్రమే ఉంది. సావిత్రి మూడు రాత్రుల దీక్ష తీసుకుంది. ఆఖరి రోజు ఉదయమే స్నాదికాలు ముగించి అత్త మామలకు నమస్కరించింది. యదావిధి అందరికి సేవ చేసింది. సావిత్రితో భర్త " సావిత్రీ! నేను అడవికి వెళ్ళి పండ్లు తీసుకు వస్తాను " అని అన్నాడు. సావిత్రి భర్తను అడిగి నేను మీ వెంట వస్తానని అతని వెంట బయలుదేరింది. అడవిలో అందాలు చూస్తునే సావిత్రి భర్తను కనిపెడుతూ అతనిలో మార్పులు గమనిస్తూ ఉంది. సత్యవంతుడు కొన్ని పండ్లు కోసిన తరవాత సమిధల కోసం ఒక ఎండు చెట్టును గొడ్డలితో కొడుతున్నాడు. ఇంతలో తల భారంగా ఉందని గొడ్డలిని కింద పెట్టి తూలుతూ కూర్చున్నాడు. సావిత్రి వెంటనే తన తొడపై అతని తల పెట్టుకుని అతనికి సపర్యలు చేస్తూ ఉంది. కొంత సేపటికి సత్యవంతుడు స్పృహకోల్పోయాడు.

## యమధర్మరాజు సత్యవంతుని ప్రాణములు తీసుకువెళ్ళుట


సావిత్రికి వరమిస్తున్న యమిడు

ఇంతలో నల్లటి ఆకారం కలవాడు, కోరలు కలవాడు, ఎర్రని నేత్రములు కలవాడు, బంగారు వస్త్రాలు కలవాడు, అత్యంత భీకరాకారుడు చేతిలో పాశం ధరించిన వాడు అయిన దేవతా మూర్తి అక్కడికి వచ్చాడు. అతనిని చూసి సావిత్రి " అయ్యా ! మీరెవరు? " అని అడిగింది. " సావిత్రీ! నా పేరు యమధర్మరాజు. నీవు పతివ్రతవు కనుక నన్ను చూడగలిగావు. నేను ఇతరులకు కనబడను. నీ భర్త సత్యవంతునికి ఆయువు తీరింది. అతడు గొప్ప పుణ్య పురుషుడు. అందుకే అతని ప్రాణములు గ్రహించుటకు నేనే స్వయంగా వచ్చను " అని పలికి యమధర్మ రాజు తన పాశమును సత్యవంతునపై విసిరి అతని శరీరం నుండి జీవుణ్ణి బయటకు లాగాడు. వెంటనే దక్షిణ దిక్కుకు పయనమయ్యాడు. సావిత్రి తన భర్త దేహమును ఎవరికి తెలియకుండా పొదల మాటున ఉంచి యమధర్మ రాజుని అనుసరించింది. తనను అనుసరించి వస్తున్న సావిత్రిని చూసి " అమ్మా! నీవు ఎందుకు నా వెంట వచ్చావు. ఇంక మీదట ఈ దారి వెంట రాలేవు " అని పలికాడు. సావిత్రి " యమ ధర్మరాజా! భర్తలు వెళ్ళిన మార్గంలో వెళ్ళటం భార్యల ధర్మం కదా. నీ దయ వలన నా పాతివ్రత్యం వలన నేను రాలేని చోటు ఉందా? మార్గములలో ధర్మమార్గం ప్రధానం. ధర్మమునకు ఆధారం సజ్జనులు. సజ్జన దర్శనం ఎప్పుడూ వృధా కాదు. నీ వంటి సజ్జనమూర్తి దర్శనం వలన పరమ శుభములు పొందక నేను మామూలు మనిషి వలె ఎలా వెనుకకు పోగలను " అని పలికింది సావిత్రి. ఆమె మాటలకు యమ ధర్మరాజు ఆశ్చర్యపోయి " అమ్మా! నీ మాటలకు మెచ్చాను. నీ భర్త ప్రాణములు తప్ప ఒక వరం కోరుకో ఇస్తాను " అన్నాడు. సావిత్రి " యమ ధర్మరాజా ! నా మామగారు సాళ్వరాజుకు కంటి చూపులేదు. అతనికి చూపు వచ్చేలా అనుగ్రహించండి " అని కోరింది. యమధర్మరాజు " అలాగే నీ మామగారికి చూపు ప్రసాదించాను దీనితో తృప్తి పడి మరలి పో " అన్నాడు. సావిత్రి యమధర్మరాజుని వెంబడించింది. " కాని యమధర్మరాజా ! మనస్సు, వాక్కు, కర్మలతో ఎవరికి కీడు తలపెట్టకుండా ఉండుట, దీనుల ఎడ కరుణ చూపుట, దాన ధర్మములు చేయుట, ఆశ్రితులను ఆదరించుట ఆదరించుట ఆర్య ధర్మములు అని మీకు తెలియును కదా. నీవు ధర్మదేవతవు నీకు తెలియనిది ఏమున్నది. అందరి ఎడల సమబుద్ధితో ఉంటావు కనుక నిన్ను సమవర్తీ అంటారు కదా నిన్ను యముడు, శమనుడు అని పిలుస్తారు కదా " అని పలికింది సావిత్రి. యమ ధర్మరాజు " అమ్మా! సావిత్రి నీ మాటలు అమృతోపమానము ఇకొంక వరం కోరుకొనుము " అన్నాడు. సావిత్రి " యమ ధర్మరాజా నా మామగారి రాజ్యం విరోధులు ఆక్రమించారు అతని రాజ్యం అతనికి ఇప్పించండి " అని కోరింది. యమ ధర్మరాజు " అలాగే నీవు కోరినట్లు వరం ఇస్తాను. ఇంక నిలువుము ఇక్కడి నుండి నీవు రావటానికి లేదు " అని అన్నాడు. సావిత్రి " ఓ ధర్మరాజా! నీకు తెలియనిది ఏమున్నది. ధర్మాత్ములు ఎట్టి పరిస్తితిలోనూ ధర్మాన్ని విడువరు కదా. భర్తను అనుసరించడం

భార్య ధర్మం కనుక నేను ఎలా విడిచేది " అని పలికింది. యమధర్మరాజు " సావిత్రీ ! నీ ధర్మ బుద్ధికి మెచ్చాను. మరొక వరం కోరుకో నీ భర్త ప్రాణములు తప్ప " అన్నాడు. సావిత్రి " యమ ధర్మరాజా! నా తండ్రి అశ్వపతికి పుత్రసంతతి లేదు. ఆయనకు నూరుగురు కుమారులను అనుగ్రహింపుము " అని కోరింది. మధర్మరాజు " అలాగే నీ తండ్రికి నూరుగురు కుమారులను ఇస్తాను చాలా అలసి పోయావు ఇక వెనుకకు మరలుము " అన్నాడు. సావిత్రి " యమ ధర్మరాజా! సతికి భర్త సేవయే పరమార్ధం. నా మనస్సు నా భర్త పాదసేవలో లగ్నమైంది. నాకు అలుపెక్కడిది. తన ధర్మం తప్పక చరించే వాళ్ళు అరుదుగా కనిపిస్తారు. వారి ధర్మ నిష్ఠతోనే సూర్య చంద్రులు క్రమంగా సంచ రిస్తున్నారు. ఎవరితోనైనా ఏడు మాటలు మాట్లాడితే బంధువులు ఔతారు అని అంటారు నేను మీతో ఎన్నో మాటలాడాను. ఇప్పుడు నేను మీకు బంధువునయ్యాను. కనుక నా కోరికను మన్నించుము " అని అడిగింది. అందుకు యమధర్మరాజు సంతోషించి " సావిత్రీ! నీకు మరొక వరం ఇచ్చెదను కోరుకొనుము " అని చెప్పాడు. అందుకు సావిత్రి " యమధర్మరాజా! ఇప్పటి దాకా నువ్వు ఏ వరం కోరుకొమ్మన్నా నీ పతి ప్రాణములు దక్క అన్నావు. ఇప్పుడు ఆ మాట చెప్పలేదు కనుక నా ఇష్టం వచ్చిన వరం కోరుకుంటాను. యమధర్మరాజా! సతికి పతియే దైవము . పతి లేని జీవితం సతికి దుర్భరం. ఏ శుభ కార్యానికి ఆమెను పిలువరు. కనుక సాళ్వభూపతి తనయుడైన సత్యవంతుని పునరుజ్జీవుని చేయుము " అని కోరింది. ఆమె పట్టుదలకు యముడు సంతోషించి సత్యవంతుని జీవుని అతడి శరీరంలో ప్రవేశ పెట్టాడు. యమధర్మరాజు సావిత్రితో " సావిత్రీ! నీ భర్త నాలుగు వందల సంవత్సరాలు జీవిస్తాడు. నీకు నూరుగురు కుమారులు కలుగుతారు. నీవు కీర్తిమంతురాలవు ఔతావు " అని చెప్పి వెడలి పోయాడు.

### సావిత్రి సత్యవంతులు తిరిగి వెళ్ళుట

సావిత్రి వెను తిరిగి సత్యవంతుని దేహమున్న చోటుకు వచ్చింది. భర్త తలను తన ఒడిలో పెట్టుకుని కూర్చున్నది. కొంతసేపటికి సత్యవంతుడు నిద్రలో లేచినట్లు లేచాడు. సత్యవంతుడు " ఏమిటి సావిత్రీ! ఇంతసేపు నిద్రపోయాను లేపలేదా. కాని ఎవరో నన్ను పట్టి లాగినట్లు ఉంది. అది కల కాదు నిజమే అన్నట్లు ఉంది. ఎవరై ఉంటారు " అన్నాడు. సావిత్రి " నాధా! ఇప్పటికే చాలా పొద్దు పోయింది. మీ తల్లి తండ్రులు మనకోసం ఎదురు చూస్తుంటారు. వెంటనే ఆశ్రమానికి వెళ్ళాలి " అని ఇద్దరూ ఆశ్రమానికి వెళ్ళారు. అప్పటికే ద్యుమత్సేనుడికి చూపు వచ్చింది. ఎదురుగా కుమారుడు కనిపించక పరితపిస్తున్నారు. వారు రాగానే ఆలస్యానికి కారణం అడిగారు. సత్యవంతుడు తనకు తలనొప్పి రావడం, పడుకోవడం ఎవరో మహానుభావుడు కనిపించడం వరకు చెప్పాడు. సావిత్రి " మహారాజా! నా భర్త సత్యవంతునికి ఈ రోజు మరణం అని చెప్పారు కదా. అందుకని నేను నా భర్తతో అడవికి వెళ్ళాను. అప్పుడు నా భర్త స్పృహ తప్పి పడి పోయాడు. యమధర్మరాజు నా భర్త ప్రాణములు తీసుకు పోవుచుండగా నేను అతనిని వెంబడించాను. అతనిని స్తుతించి అతని కృపను పొంది నాలుగు వరాలు పొందాను అందులో చివరిది నా భర్త ప్రాణములు. మరొక వరం తమకు చూపు వచ్చుట, మరొక వరం మీ రాజ్యం ప్రాప్తించుట. నాల్గవది నా భర్త ప్రాణములు " అన్నది. సాళ్వభూపతి " అమ్మా! ఆపత్సమయంలో ఉన్న మాకు నావలా ఆదుకున్నావు. నీ పుణ్య చరితము కీర్తినీయము " అన్నాడు. ఆ తరవాత సాళ్వభూపతి అంతరంగికులు వచ్చి వారి శత్రువులు వారిలో వారు కలహించుకుని మరణించారని ద్యుమత్సేనుని రాజ్యపాలన చేయమని కోరారు. ద్యుమత్సేనుడు తిరిగి రాజయ్యాడు. సత్యవంతుడు యువరాజయ్యాడు. సావిత్రి సమస్త రాజభోగములు అనుభవించింది. కనుక ధర్మరాజా పతివ్రత అయిన ద్రుపది కూడా మీకు శుభములు చేకూరుస్తుంది " అని చెప్పి మార్కండేయుడు తిరిగి తన ఆశ్రమానికి వెళ్ళాడు.

## కర్ణుని సహజ కవచకుండలములు

జనమేజయుడు వైశంపాయునితో " మహర్షీ! ఇంద్రుడు కర్ణుని కవచ కుండలములు దానంగా తీసుకున్నాడు కదా. ఆ కధ వివరించండి " అని అడిగాడు. వైశం పాయనుడు ఇలా చెప్పసాగాడు పాండవులు పన్నెండేళ్ళు అరణ్యవాసం చేసారు. ఆఖరు సంవత్సరంలో ఉండగా ఇంద్రుడు పాండవులకు మేలు చేయ దలిచాడు. కర్ణుని కవచ కుండలాలు మాయో పాయముచే గ్రహించాలనుకున్నాడు. ఈ విషయం సూర్యునికి తెలిసింది.

### సూర్యుడు తన పుత్రుడైన కర్ణుని కలుసుకొనుట

సూర్యుడు బ్రాహ్మణ వేషం ధరించి కర్ణుని వద్దకు అతడు ఏకాంతంలో ఉండే సమయం చూసి వెళ్ళాడు. సూర్యుడు కర్ణునితో " కర్ణా! నేను నీ మేలు కోరి ఒక విషయం చెప్పటానికి వచ్చాను. దేవేంద్రుడు కపటో పాయంతో నీ కవచకుండలాలను సంగ్రహించ టానికి వస్తున్నాడు. నీవు బ్రాహ్మణులు ఏది అడిగినా లేదన కుండా ఇస్తావని బ్రాహ్మణ వేషంలో వచ్చి నీ కవచకుండలాలు దానంగా గ్రహించి నిన్ను నిర్వీర్యుని చేయాలనుకుంటున్నాడు. నీ కవచకుండలములు అమృతమయములు. అవి నీ వంటి మీద ఉన్నంత కాలం నిన్ను ఎవరూ చంపలేరు. అందుకని నీవు మోసపోవద్దని నిన్ను

హెచ్చరిస్తున్నాను" అన్నాడు. కర్ణుడు సూర్యునితో " అయ్యా ! మీరెవరో నాకు తెలియదు. దయచేసి మీరెవరో నాకు చెప్పండి " అని అడిగాడు. సూర్యుడు " కర్ణా! నేను సూర్యుడను. నా మనసులో నీ మీద మమకారం ఎక్కువ అందుకే వచ్చాను " అన్నాడు. కర్ణుడు సూర్యునితో " ఓ సూర్యదేవా! నేను బ్రాహ్మణులు ఏది అడిగినా ఇస్తాను. దేవేంద్రుడే దేహీ అడిగితే నా ప్రాణాలు ఇమ్మన్నా ఇస్తాను. అలాంటిది కవచ కుండలములు ఒక లెక్కా. అదియును కాక ముల్లోకాలను ఏలే ఇంద్రుడు ధర్మం తప్పి మారు వేషంలో నా వద్దకు రావడమా. అది అతని కీర్తికి హాని కదా. ఏది ఏమైనా నేను ధన్యుడను. ఈ లోకంలో కీర్తికి మించినది లేదు. కీర్తి తల్లి వలె నన్ను కాపాడుతుంది. అపకీర్తి పొందిన వాడిని అన్ని కీడులు ఆవహిస్తాయి. బ్రాహ్మణులు కోరితే ఉన్నంతలో దానం చేయడం, బలవంతులైన శత్రువులను చంపడం, యుద్ధంలో చావడం, శరణు వేడిన వారిని కాపాడటం, బ్రాహ్మణులను, వృద్ధులను, బాలురను, స్త్రీలను చంపక పోవడం నా వ్రతం. కనుక ఇంద్రుడు వచ్చి అడిగితే నా కవచ కుండలాలను సంతోషంగా ఇస్తాను " అని కర్ణుడు చెప్పాడు. సూర్యుడు " కర్ణా! నీ హితులు చెప్పే మాటలు నీవు వినవు. తన వారికి మేలుకలిగే కార్యములు చేసి కీర్తి గడించడం మంచిదే కాని నీకు అపకారం కలిగించే కీర్తి ఎందుకు. నీవు జీవించి ఉన్న మరింత కీర్తి గడించ వచ్చును. నీవు జీవించి ఉన్న నీ భార్యా బిడ్డలు మరింత సౌఖ్యములు అనుభవించగలరు. మరణించిన పిదప మనిషి బూడిద ఔతాడు. తన కీర్తి తాను చూడ లేడు. మృత్యునికి వచ్చే కీర్తి శవానికి చేసే అలంకారం వంటిది. నీవు నా భక్తుడవు భక్త రక్షణ నా కర్తవ్యం. ఇందులో ఒక దేవ రహస్యం కలదు. కాలక్రమేణ అది నీఅకు తెలియగలదు. నీకు కవచ కుండలములు ఉన్నచో నీ శత్రువు అర్జునుడు నిన్ను చంపలేడు " అని సూర్యుడు నచ్చ చెప్పాడు. కర్ణుడు " సూర్యదేవా! నీకు నా మీద ఉన్న దయతో చెప్పావు కాని నేను చెప్పేది విను. నేను అసత్యానికి భపడినట్లు యమునికి కూడా భయపడను. నా వ్రతము వీడను. అర్జునుని నేను గెలవలేను అని తలప వద్దు. నా వద్ద ఉన్న అస్త్రములు నీకు తెలియును. పరశు రాముడు, ద్రోణుడు నాకు ప్రసాదించిన అస్త్రములు సామాన్యమైనవి కావు. వాటి సాయంతో నేను అర్జునిని సంహరించ గలను. మీరు వేరు విధంగా తలపక నన్ను ఆశీర్వదించండి " అన్నాడు. సూర్యుడు " కర్ణా! నీవు నిశ్చయంగా నీ కవచ కుండలములు ఇంద్రునికి దానం చేయాలనుకుంటే ఇంద్రుని వద్ద నుండి అత్యంత శక్తి వంతమైన శక్తి అనే ఆయుధాన్ని ప్రతిఫలంగా తీసుకో " అని వెళ్ళి పోయాడు. కర్ణుడు దేవేంద్రుని రాకకై ఎదురు చూస్తూ ఉన్నాడు.

## కర్ణుని జన్మవృత్తాంతం

వైశంపాయనుడు చెప్పగా జనమేజయుడు " ఓ మహర్షీ! సూర్యుడు కర్ణుని గురించి ఒక దేవ రహస్యం చెప్పాడు కదా! అది ఏమిటో వివరించెదరా " అన్నాడు. వైశంపాయనుడు ఇలా చెప్పసాగాడు. పాండవుల తల్లి కుంతీ దేవి కుంతి భోజుని కుమార్తె పృథ. ఆమెకు వివాహం కాక పూర్వం ఒక రోజు దుర్వాస మహాముని వారి వద్దకు వచ్చాడు. కుంతిభోజుడు వారికి అతిథి సత్కారాలు గావించాడు. దుర్వాసుడు " మహారాజా ! కొంతకాలం మీ ఇంట్లో నాకు ఎలాంటి లోపం రాకుండా పరిచర్యలు చేయగలరా? " అని అడిగాడు. కుంతి భోజుడు అందుకు సమ్మతించాడు. ఆయన తన కుమార్తె పృథను పిలిచి " దుర్వాస మహాముని కొంత కాలం మన ఇంట ఉంటాడు. నీవు ఈయనకు ఎటువంటి లోపం రాకుండా సపర్యలు చేయుము. నీవు వినయశీలివి కనుక ఇతనికి కోపం రానీయక భక్తితో సేవింపుము " అని చెప్పాడు. కుంతి " తండ్రీ ! నాకు కూడా బ్రాహ్మణులకు సేవ చాయాలని ఉన్నది. ఈ రోజుకు నా కోరిక తీరింది. నా మీద భారం ఉంచు. నేను నీవు కోరిన విధముగా ఇతనికి పరిచర్యలు చేయగలను " అన్నది. కుంతి భోజుడు " ఓ మహర్షీ! ఈ చిన్నది నా కుమార్తె పృథ. తమరు నా చెంత ఉన్నంత కాలం తమరికి పరిచర్యలు చేస్తుంది. ఎప్పుడైనా చిన్నతనం చేత పొరపాటు చేస్తే మన్నించండి " అన్నాడు. తండ్రి కోరిక మేరకు పృథ దుర్వాసునికి సేవలు చేసింది. దుర్వాసుడు కూడా ఆమెను అప్పుడప్పుడు పరీక్షించే వాడు. ఉదయం వస్తానని రాత్రికి వచ్చే వాడు. రాత్రికి వస్తానని అప్పుడే వచ్చే వాడు. పృథ అప్రమత్త అయి అతడిని సేవించింది. ఈ విధంగా ఒక సంవత్సర కాలం గడిచింది. దుర్వాసుడు వెళ్ళబోతూ " కుమారీ! నీవు చాలా చక్కగా సపర్యలు చేసావు. ఒక వరం కోరుకో " అన్నాడు. అందుకు పృథ " అయ్యా! నీకు సంతోషం కలిగించాను. నా తండ్రి మాట నెరవేర్చాను నాకు అది చాలు " అని వినయంగా బదులు చెప్పింది. దుర్వాసుడు " పృథా! నీకు ఒక మంత్రం ఉపదేశిస్తాను. ఆ మంత్రం జపించి నీవు ఏదేవతను ఆహ్వానిస్తే అతడు నీకు వశమౌతాడు " అని చెప్పాడు. కుంతికి దుర్వాసుడు మంత్రోపదేశం చేసి వెళ్ళీ పోయాడు.

## కుంతి మంత్రాన్ని పఠించుట

ఒక రోజు పృథ దుర్వాసుని మంత్రాన్ని పరీక్షించ దలచుకుంది. ఉదయాన్న స్నానం ఆచరించి ఉదయిస్తున్న సూర్యుని చూసింది. వికసించిన పద్మంలా ప్రకాశిస్తున్న సూర్య భగవానుని చూసి ఆమెలో అనురాగం కలిగింది. మంత్రం పఠించి " నాకు నీవంటి కుమారుని ప్రసాదించు " అని కోరుకుంది. సూర్యుడు మానవ రూపంలో కుంతి ముందు సాక్షాత్కరించి " కుమారీ ! మంత్ర బలంచే నేను ఇక్కడికి వచ్చాను. నేను నీవాడను నీ మనసుకు ప్రియమైంది చేస్తాను " అని అన్నాడు. కుంతీ దేవి " ఇక్కడ మీరు చేయవలసింది ఏమీ లేదు. ఏదో కుతూహలంచేత మంత్రం జపించాను. మీరు వెళ్ళండి " అన్నది. సూర్యుడు " కుంతీ ! నేను తప్పాక వెళతాను నీ మనస్సులో ఏమి కోరుకున్నావో చెప్పు. నా మాదిరి కవచకుండలాలతో ఉన్న తేజశ్శాలి

అయిన కుమారుడు నా వలన కావాలని కోరుకున్నావు. నీ కోరిక నేను నెరవేర్చక తప్పదు. నీ కోరినట్లు తేజశ్శాలి అయిన కుమారుని ఇస్తాను. నీవు అంగీకరించని ఎడల నీ తల్లితండ్రులను దహించి వేస్తాను. అదియును కాక నీ ప్రవర్తనని ఎరుగక నీకు మంత్రం ఉపదేశించిన దుర్వాసుని దహిస్తాను. అటు చూడు దేవతలంతా నన్ను చూసి నవ్వుతున్నారు " అని సూర్యుడు కోపంతో అన్నాడు. కుంతీ దేవి " అయ్యా ! నన్ను నీకు సమర్పించుటకు నా తల్లి తండ్రులు సమ్మతించాలి. కాని నాకు నేను ఎలా అంగీకరించ గలను. నేను కేవలం బాల్య చాపల్యంచే మంత్ర మహిమను పరీక్షింప కోరి ఇలా చేసాను. నన్ను క్షమించు " అని బ్రతిమాలింది. కాని సూర్యుడు ఒప్పుకోలేదు. కుంతి సూర్యునితో " మహాను భావా! కన్యకు పెద్దల సమక్షంలో వివాహం జరిగిన తరవాత ఆమె తనభర్తను చేరవచ్చును. వివాహ పూర్వం ఇలా పర పురుషునితో చేరుట అధర్మం. ఈ విధంగా నన్ను అధర్మానికి పాల్పడ మనడం ధర్మమా! నీకు తెలియని ధర్మం ఏమున్నది తల్లితండ్రుల అనుమతి లేకుండా నిన్ను చేరుట ధర్మమని నీకు తోచిన అట్లనే కానిమ్ము అందువలన వచ్చు అపనిందను నేనే భరిస్తాను " అన్నది. సూర్యుడు ఆమెను చూసి " కుమారీ ! నీ తల్లి తండ్రులు నీకు కన్యాదానం చేయుటకు కర్తలు కారు. నీ శరీరానికి నీవే యజమానురాలివి. ఇది నీ అంతరంగిక విషయం. కన్య తనకుగా తన కోరికలను తీర్చుకోవడం అపరాధం కాదు. ఇది అధర్మం అయితే నేను ఎందుకు ప్రోత్సహిస్తాను. దీని వలన నీకు ఎలాంటి నింద రాదు. నీ కన్యాత్వానికి ఎలాంటి భంగం రాదు. నా వలన నీకు మహాతేజశ్శాలి అయిన కుమారుడు జన్మిస్తాడు " అని కుంతీదేవిని అంగీకరింపచేసాడు. తరవాత సూర్యుడు కుంతీ దేవికి గర్భదానం చేసాడు. ఆమె దాల్చిన గర్భం దినదిన ప్రవర్ధమానమై పెరుగుతూ ఉంది. కుంతీ దేవి గర్భందాల్చిన విషయం ఆమె దాది కూతురికి మాత్రమే తెలియును. ఒకనాటి రాత్రి వేళ కుంతీ దేవి ఒక కుమారుని ప్రసవించింది. ఆ కుమారునికి సహజ కవచ కుండలములు, పొడవైన చేతులు, దృఢమైన శరీరం ఉన్నాయి. లోకాపవాదుకు భయపడి కుంతీ దేవి ఆ బిడ్డను ఒక పెట్టెలో పెట్టి తన భవనం పక్కనే ప్రవహిస్తున్న అశ్వనదిలో వదిలి వేసింది. ఆ చిన్ని బాలుని నదిలో వదిలినందుకు ఎంతో దుఃఖించింది.

## కర్ణుడు అతిరధుని చేరుట

ఆ తెప్ప మీద ఉన్న పెట్టె ప్రవాహ వేగానికి కొట్టుకుని పోయి ముందుగా చర్మణ్వతీ నదిలో చేరింది. అక్కడి నుండి కొట్టుకుని పోయి యమునా నదిలో చేరింది. ఆఖరిగా గంగానదిలో చేరి కొట్టుకు పోతూ పంపా నగర సమీపానికి చేరింది. ఆ సమయంలో ధృతరాష్ట్రుని స్నేహితుడైన అతిరధుడనే సూతుడు భార్యతో జలకాలాడుతూ ఆ పెట్టెను చూసి ఆ పెట్టెను తెప్పించి తెరిపించాడు. అందులో సహజ కవచ కుండలాలతో ప్రకాశిస్తున్న బాలుని చూసాడు. తన భార్య రాధను చూసి " సంతానం లేని మనకు ఆ దేవుడు కరుణించి ఈ బిడ్డను ప్రసాదించాడు. వీడు మానవ బాలుడు కాదు దేవతలకు పుట్టిన బాలుడు. ఈ బిడ్డను మనం పెంచుకుంటాము " అన్నాడు. ఆ బిడ్డ సహజ కుండలాలు ఉన్నవాడు కనుక కర్ణుడు అని నామకరణం చేసాడు. బంగారు చాయ మేనివాడు కనుక సంషేణుడు అని వేరొక నామం కూడా పెట్టాడు. ఆ విధంగా సూర్య పుత్రుడు సూత పుత్రుడు అయ్యాడు. ఇదంతా కుంతి తన అంతరంగిక దాదులద్వారా తెలుసుకుని ఊరట చెందింది. కర్ణునికి యుక్తవయసు రాగానే అతిరధుడు అతనికి ద్రోణాచార్యుని వద్ద విలువిద్య నేర్పించాడు. తరవాత కర్ణుడు కృపాచార్యుని వద్ద, పరశు రాముని వద్ద విలువిద్య నేర్చుకున్నాడు. ఎన్నో అస్త్రాలు సాధించాడు. కర్ణునికి దుర్యోధనునితో స్నేహం ఏర్పడింది. దుర్యోధనుని స్నేహం వలన పాండవులకు విరోధి అయ్యాడు. అది చూసి ధర్మరాజు ఎంతో భయపడు తుండే వాడు. అతని భయం పోగొట్టడానికి ఇంద్రుడు కర్ణుని కవచ కుండలాలను సంగ్రహించాలని అనుకున్నాడు.

## ఇంద్రుడు కర్ణుని కవచకుండలములు కోరుట


కర్ణునకు ఇంద్రశక్తిని ఇచ్చుచున్న దేవేంద్రుడు

ఒక రోజు బ్రాహ్మణ వేషధారియై ఇంద్రుడు కర్ణుని వద్దకు వచ్చాడు. ఆ సమయంలో కర్ణుడు సూర్యోపాసన చేసి బ్రాహ్మణులకు దానధర్మాలు చేస్తున్నాడు. అప్పుడు ఇంద్రుడు " బిక్షాందేహి " అన్నాడు. కర్ణుడు "మీకు ఏమి కావాలో కోరుకోండి " అని అడిగాడు. ఇంద్రుడు " నాకు నీ కవచ కుండలాలు కావాలి ఇమ్ము " అన్నాడు. కర్ణునికి విషయం అర్ధం అయింది. కర్ణుడు "బ్రాహ్మణోత్తమా! ఎందుకు పనికి రాని ఈ కవచకుండలాలు నీ కెందుకు వాటికి బదులుగా ధనం, బంగారం, మణి మాణిక్యాలు కోరుకో " అన్నాడు. ఇంద్రుడు తనకు కవచ కుండలాలు మాత్రమే కావాలని పట్టుబట్టాడు. కర్ణుడు " బ్రాహ్మణోత్తమా పోనీ నా అంగ రాజ్యాన్ని నీకు ఇస్తాను తీసుకో " అన్నాడు. అందుకు దేవేంద్రుడు అంగీకరించ లేదు. కర్ణుడు " దేవా! నిన్ను నేను గుర్తుపట్టాను. నీవు

దేవేంద్రుడవు మేము దేవతలైన మిమ్ము వరం అడగాలి కాని మీరు వచ్చి నన్ను యాచించటం తగునా. వింతగా ఉందే " అన్నాడు. దేవేంద్రుడు " కర్ణా! నీకు నీ తండ్రి సూర్యుడు అన్ని విషయములు చెప్పి ఉంటాడు. అందుకనే నన్ను గుర్తించావు. నేను కోరిన కవచ కుండలాలు నాకు ఇచ్చి పంపు " అన్నాడు. కర్ణుడు "దేవా! బదులుగా నాకు నీ వద్ద ఉన్న సకల శక్తి సంపన్న మైన శక్తి అనే ఆయుధాన్ని ప్రసాదించి కవచ కుండలాలను గ్రహించండి " అన్నాడు. ఇంద్రుడు " కర్ణా! నీకు శక్తిని సంతోషంగా ఇస్తాను. కాని యుద్ధ సమయంలో నేను శత్రువులపై శక్తి ఆయుధాన్ని ప్రయోగించిన అది శత్రు సంహారం చేసిన తరవాత నాదగ్గరకు వస్తుంది. కనుక నీవు నీ శత్రువుపై ఆ శక్తి ఆయుధాన్ని ప్రయోగించగానే అది శత్రు సంహారం చేసి నీ వద్దకు రాదు నా దగ్గరకు వస్తుంది. కనుక నీవు దానిని ఒక సారి ప్రయోగించగానే అది నన్ను చేరుతుంది. కనుక దానిని నీవు ఒకసారి మాత్రమే ప్రయోగించగలవు. ఈ నియమానికి అంగీకరించి శక్తి ఆయుధాన్ని తీసుకో " అన్నాడు. కర్ణుడు " దేవేంద్రా! నాకు ఉంది ఒకే శత్రువు అర్జునుడు. ఈ శక్తి ఆయుధం అతనిని వధించిన చాలు " అన్నాడు. ఇంద్రుడు నవ్వి " కర్ణా! నీ మనోరధం నాకు తెలియును. నీవు అర్జునిని చంపాలని అనుకుంటున్నావు. కాని కృష్ణుడు అర్జునిని పక్కన ఉన్నంత కాలం నీవు ఏమీ చేయలేవు " అన్నాడు. కర్ణుడు "దేవా! అది సరేకాని కవచ కుండలములు చీల్చి ఇచ్చిన నా శరీరం వికృతం ఔతుంది కదా ఎలా? " అన్నాడు. ఇంద్రుడు " కర్ణా! నీకు ఆ చింత లేదు. నీ శరీరం నీ తండ్రి సూర్యునిలా ప్రకాశిస్తుంది " అని వరం ఇచ్చి అతని కవచ కుండలాలను తీసుకుని దేవేంద్రుడు దేవలోకం వెళ్ళాడు. ఈ వృత్తాంతం పాండవులు ఆనందించారు కౌరవులు దుఃఖించారు. జనమేజయా ఈవిధంగా ఇంద్రుడు మాయోపాయంతో కర్ణుని కవచ కుండలాలు సంగ్రహించాడు " అని వైశంపాయనుడు జనమే జయునకు చెప్పాడు.

## యక్షప్రశ్నలు

అరణ్యావాసంలో ఆఖరి సంవత్సరం ఉన్న పాండవుల వద్దకు ఒక రోజు ఒక బ్రాహ్మణుడు వచ్చి " అయ్యా! నేను నా అరణిని చెట్టుకు వేలాడగట్టాను. ఒక లేడి పరిగెత్తు కుంటూ వచ్చింది. దాని కొమ్ములకు నా అరణి తగులుకుంది. ఆ లేడి నా అరణితో పారి పోయింది. దయచేసి నా అరణిని నాకు తెచ్చి ఇవ్వండి " అని ధర్మరాజును అడిగాడు. ధర్మరాజు విల్లంబులు పట్టుకుని తమ్ములతో ఆ లేడిని వెంబడించాడు. కాని అతను వేసిన బాణములు ఒక్కటి కూడా ఆ లేడికి తగల లేదు. అలా కొంత దూరం ఆ లేడి పరిగెత్తి మాయం అయింది. పాండవులు అలసి పోయి ఒక చెట్టుకింద విశ్రాంతి తీసుకుంటున్నారు. అప్పుడు నకులుడు ధర్మరాజును చూసి " అన్నయ్యా ! మనం ఉన్నత వంశంలో పుట్టాము. ధర్మశాస్త్రాలు చదువుకున్నాము. అందరి ఎడల కరుణ కలిగి ఉన్నాము. కాని ఇంతటి దుర్గతి రావడానికి కారణం ఏమిటి? " అని అడిగాడు. ధర్మరాజు నవ్వి " నకులా! సుఖం కాని దు:ఖం కాని మనకు కలగడానికి కారణం మన చేసుకున్న కర్మే. వేరే ఏమి కాదు " అన్నాడు. భీముడు నకులుని చూసి " తమ్ముడూ ! ఆ రోజు పాత్రిగామి ద్రౌపదిని కొలువు కూటమికి తీసుకు వచ్చినప్పుడే ఆ కౌరవులను నరికి ఉంటే ఈ కష్టాలు తప్పేవి " అన్నాడు. నకులుడు " అన్నయ్యా భీమా ! అదియును కాక ఆ రోజు కర్ణుడు కొలువులో పలికిన మాటలకు మనం ఆగ్రహించక ఇలా పిరికి వారి వలె అడవులకు వచ్చాము. అదే అసలు కారణం. అన్నయ్యలూ ! ఆ రోజే మాయజూదం ఆడిన శకునిని అడ్డంగా నరికి ఉంటే ఈ దుర్దశ తప్పేది కదా " అన్నాడు సహదేవుడు. ఆ మాటలు వింటున్న ధర్మరాజు " తమ్ముడూ! ప్రస్తుతం నీ అన్నయ్యలు అందరూ చాలా దాహంతో ఉన్నారు. నీళ్ళు ఎక్కడైనా ఉన్నాయేమో చూడు " అన్నాడు.

### దాహార్తులై పాండవులు కొలను చేరుట

నకులుడు చెట్టు ఎక్కి నలుపక్కలా చూసి కొంచం దూరంలో కనిపిస్తున్న కొలను చూసి అన్నలతో చెప్పాడు. ధర్మరాజు " అయితే నీవు పోయి నీరు త్రాగి మాకు కొంత నీరు తీసుకురా " అన్నాడు. నకులుడు కొలను వద్దకు వెళ్ళాడు. నీళ్ళు త్రాగబోయే సమయంలో ఒక శబ్దం వినిపించింది. " అన్నా! ఈ తటాకము నాది. నీవు ఈ తటాకములో నీరు త్రాగాలంటే నా ప్రశ్నలకు ప్రత్యుత్తరం ఇవ్వాలి " అన్న మాటలు వినిపించాయి. నకులుడు దానిని పట్టించు కోకుండా నీరు త్రాగారు. కొలను బయటకు వచ్చి స్పృహతప్పి పడి పోయాడు. నీళ్ళకు వెళ్ళిన నకులుడు ఎంతకీ రాకపోయే సరికి ధర్మరాజు సహదేవుని చూసి " సహదేవా! నీ అన్నయ్య నకులుడు నీళ్ళు తీసుకు రావటముకు వెళ్ళి ఎంతకూ రాలేదు. నీవు పోయి చూసి రా " అని చెప్పి పంపించాడు. సహదేవుడు నకులుడు వెళ్ళిన దిశగా వెళ్ళి నీళ్ళు త్రాగటానికి కొలనులో దిగపోయే సమయంలో " మహానుభావా! ఈ కొలను నాది. సాహసంతో ఇందులో దిగవద్దు. నా ప్రశ్నలకు సమాధానం చెప్పి ఆ తరవాత నీరు త్రాగు " అన్న మాటలు వినిపించాయి. సహదేవుడు ఆ మాటలు లక్ష్యపెట్టక కొలనులో దిగి నీరు త్రాగాడు. నకులుని లాగానే స్పృహతప్పి పడి పోయాడు. పోయిన ఇద్దరూ ఎంతకీ రాక పోయే సరికి ధర్మరాజు అర్జునిని చూసి " అర్జునా! నీ తమ్ములు నీళ్ళకు వెళ్ళి ఎంతకూ రాలేదు. ఏం జరిగిందో చూసి రా " అని చెప్పి పంపించాడు. అర్జునుడు కొలను సమీపించగానే అశరీరవాణి " ఎవరన్నా ఈ కొలనులో నా ప్రశ్నలకు సమాధానం చెప్పకుండా నీరి త్రాగితే స్పృహతప్పి పడి పోతారు " అన్నాడు. అర్జునుడు " ఎవడురా నువ్వు? చాటుగా మాట్లాడు తున్నావు. ఉండు నిన్ను సంహరిస్తాను " అంటూ శబ్దవేది బాణాన్ని ప్రయోగించాడు. మరలా అవే మాటలు వినిపించాయి. అర్జునుడు ఆ మాటలు లక్ష్యపెట్టక కొలనులో దిగి నీరు

త్రాగాడు. అర్జునుడు కూడా స్పృహతప్పి పడి పోయాడు. వెళ్ళిన ముగ్గురూ రాక పోయే సరికి ధర్మరాజు ఆందోళన చెంది భీముని చూసి " భీమా వెళ్ళిన ముగ్గురూ తిరిగి రాలేదు. ఏ మి జరిగిందో చూసిరా " అని పంపాడు. భీముడు కొలను సమీపించగానే మరలా అదే అశరీరవాణి " ఎందుకయ్యా ఇంత సాహసానికి పూనుకుంటావు నీకు శక్తి ఉంటే నాప్రశ్నలకు సమాధానం చెప్పి నీళ్ళు త్రాగు " అన్నది. భీముడు ఆ మాటలు వినిపించుకోకుండా కొలనులో నీళ్ళు త్రాగి స్పృహతప్పి పడి పోయాడు.

## ధర్మరాజుని కొలను వద్దకు చేరుట

వెళ్ళి తమ్ము లెవరూ రాకపోవడం చూసి కలత చెందిన ధర్మరాజు కలత చెంది స్వయంగా కొలను వద్దకు వెళ్ళాడు. పరిసరాలను పరిశీలించగానే స్పృహతప్పి పడిపోయిన తమ్ములు కనిపించారు. అతని హృదయం తల్లడిల్లింది. కొంచం సేపటికి తేరుకుని చుట్టూ కలయ చూసాడు. అక్కడ ఏమీ ఇతరుల అడుగుజాడలు కనిపించ లేదు. " వారికై వారు అలా కూలి పోవడానికి కారణం తెలియలేదు. ఈ కొలనులో నీరు విషపూరితం అనడానికి వారి శరీరంలో విష ప్రయోగం జరిగిన లక్షణాలు కనిపించ లేదు. ఒక వేళ సుయోధనుడు అతని మిత్రు లెవరైనా ఇలా చేసారా కుంతీ దేవికి ఏమి చెప్పాలి " అనుకుంటూ కొలనులో దిగాడు. అప్పుడు ఆకాశవాణి " ధర్మరాజా! నేను ఒక కొంగను ఈ కొలను నాది నీ తమ్ములు నా మాట వినక ఈ కొలనులో నీరు త్రాగి ఇలా స్పృహతప్పి పడి పోయారు. నూవు నా మాట వినక కొలనులో నీరు త్రాగితే వారికి పట్టిన గతే నీకు పడుతుంది కనుక నా ప్రశ్నలకు జవాబు చెప్పి ఈ కొలనులో నీళ్ళుత్రాగు " అని పలికింది. ధర్మరాజు " అయ్యా! కొంగ రూపం ధరించిన రుద్రుడవో, అగ్నిదేవుడవో, వాయుదేవుడివో నాకు తెలియదు. లేని ఎడల అత్యంత పరాక్రమవంతులైన నా తమ్ములు ఇలా పడి పోరు. నీవు ఎవరు? నీ తలపు ఏమిటి, చెప్పు " అని అడిగాడు.

## యక్షడు ప్రశ్నించుట

ఆ కొంగ ధర్మరాజుతో " వాస్తవానికి నేను కొంగను కాను యక్షుడను. నీ తమ్ములు నన్ను అవమానించి పడి పోయారు. అంటూ ధర్మరాజు ముందు నిలబడ్డాడు. నా అనుమతి లేకుండా నీరు త్రాగితే ఎవరైనా ఇలా పడిపోతారు. నీవు తెలివి కలవాడవు కనుక నీరు త్రాగలేదు. కనుక నేను వేసే ప్రశ్నలకు సమాధానం చెప్పు " అన్నాడు. ధర్మరాజు " అయ్యా! నీ వంటి వారికి సమాధానం చెప్పటం నా తరమా. అయినను నాకు తెలిసిన విధంగా సమాధానాలు చెప్తాను " అన్నాడు.


కొంగరూపములోని యక్షునితో మాట్లాడుచున్న యుధిష్టురుడు

- యక్షుడు:- సూర్యుని ఎవరు నడుపుతున్నారు? సూర్యుని ఎవరు కొలుస్తున్నారు? సూర్యుడు అస్తమించడం అంటే ఏమిటి? సూర్యునికి ఆధారభూతం ఏమిటి?.
- ధర్మరాజు;- సూర్యుని బ్రహ్మం నడుపుతుంది. దేవతలు సూర్యుని కొలుస్తారు. సూర్యుడు ధర్మంచే అస్తమిస్తాడు. సూర్యునికి సత్యమే ఆధారం.
- యక్షుడు:- శ్రోత్రియుడు ఎలా ఔతాడు? పురుషునికి మహిమలు ఎలా సిద్ధిస్తాయి? పురుషునికి సాయం ఎవరు? పురుషుడు బుద్ధిమంతుడు ఎలా ఔతాడు?
- ధర్మరాజు;- శ్రుతం వలన శ్రోత్రియుడు ఔతాడు. అనగా వేదము అధ్యయనం వలన. తపస్సు వలన మహిమలు సిద్ధిస్తాయి. పురుషునకు అతని ధైర్యమే అతని సాయం. గొప్పవారికి, జ్ఞానులకు సేవచేయడం వలన బుద్ధిమంతుడు ఔతాడు.
- యక్షుడు;- బ్రాహ్మణుడు దైవత్వం ఎలా పొందుతాడు? అతనికి సాధు భావము ఎలా ఏర్పడుతుంది? అతడు

దుష్కృతుడు ఎలా ఔతాడు? బ్రాహ్మణుడు మానవుడు ఎలా ఔతాడు?

- ధర్మరాజు;- వేదపఠనం చేత దైవత్వం పొందుతాడు. అధికమైన నిష్ఠ వలన సాధు స్వభావం ఏర్పడుతుంది. నిష్ఠను కోల్పోయినప్పుడు దుష్కృతుడు ఔతాడు.

శుచిత్వం ఆచరించని బ్రాహ్మణుడు మరణ భయంతో మానవుడు ఔతాడు.

- యక్షుడు;- జీవన్మృతుడు అనగా ఎవరు?
- దేవతలకు, అతిథులకు, పితృదేవతలకు, తన వద్ద సేవకులకు పెట్టకుండా తినేవాడు జీవించి మరణించినట్లే.
- యక్షుడు;- భూమికంటే బరువైనది ఏది? ఆకాశం కంటే పొడవైనది ఏది? గాలి కంటే వేగమైనది ఏది? గడ్డికంటే వేగంగా పెరిగేది ఏది?
- ధర్మరాజు;- భూమికంటే బరువైనది కన్నతల్లి. ఆకాశంకంటే పొడవైన వాడు కన్న తండ్రి. గాలి కంటే వేగ మైనది మనసు. మనసులో కలిగిన చింత గడ్డికంటే వేగంగా పెరుగుతుంది.
- యక్షుడు;- కన్నులు తెరిచి నిద్రించేది ఏది? పుట్టిన తరవాత కూడా కదలలేనిది ఏది? రూపం ఉండి కూడా హృదయం లేనిది ఏది? వేగం వలన వర్ధిల్లేది ఏది?
- ధర్మరాజు ;- కన్నులు తెరిచి నిద్రించేది చేప. పుట్టిన తరవాత కదలలేనిది అండము. రూపం ఉండి హృదయం లేనిది పాషాణం. వేగం వలన వర్ధిల్లునది ఏరు.
- యక్షుడు;- బాటసారికి, రోగగ్రస్తునకు, గృహస్తునకు, చనిపోయిన వారికి ఎవరు బంధువు?
- ధర్మరాజు;- బాటసారికి తోటి ప్రయాణీకుడు, రోగ గ్రస్తునకు వైద్యుడు, గృహస్తునకు మంచి భార్య, చని పోయిన వారికి అతను ఆచరించిన ధర్మములు బంధువులు.
- యక్షుడు;- ధర్మమునకు ఆధారం ఏది? కీత్రికి ఆశ్రయం ఏది? దేవలోకమునకు పోవు మార్గం ఏది? సుఖించుటకు మూలం ఏది?
- ధర్మరాజు;- కరుణ స్వభావం ధర్మమునకు మూలం. దానం చేయుట వలన కీర్తి వస్తుంది. సత్యం పలుకుటయే దేవలోకము పోవుటకు మార్గం. మంచి ప్రవర్తన అన్ని సుఖములకు మూలం.
- యక్షుడు;- నరునకు ఆత్మ ఏది? దైవీకమైన చుట్టము ఎవరు? అతడు ఏ ఆధారంగా జీవిస్తాడు? నరుడు ఎందువలన మంచితనం పొందుతాడు?
- ధర్మరాజు;- పుత్రుడే నరునకు ఆత్మ. భార్య దేవుడిచ్చిన చుట్టము. అతనికి జీవనం మేఘములు కల్పిస్తాయి. దానం వలన నరుడు మంచితనం పొందుతాడు.
- యక్షుడు;- ధర్మములలో గొప్ప ధర్మం ఏది? ఏది మనకు పరిపూర్ణ ఫలితం ఇస్తుంది? ఏది వదిలి పెడితే మనకు ఆనందం కలుగుతుంది? ఎవరితో స్నేహం ఎప్పుడూ చెడిపోదు?
- ధర్మరాజు;- అహింస పరమ ధర్మము. యగ్న యాగాదులు మనకు పూర్తి ఫలితాలు ఇస్తాయి. అహంకారం వదిలి పెడితే మనకు ఆనందం కలుగుతుంది. మంచి వారితో స్నేహం ఎప్పుడూ చెడిపోదు.
- యక్షుడు;- ఈ లోకములకు దిక్కు ఎవరు? అన్నం, జలం ఎందు వలన సంభవిస్తాయి? విషము అనగా ఏమి? శ్రాద్ధ కర్మలకు ఏది సమయము?
- ధర్మరాజు;- మంచివారే ఈ లోకమునకు దిక్కు. నీరు, అన్నం మేఘం వలన సంభవిస్తాయి. బ్రాహ్మణిని ధనం విషతుల్యం. బ్రాహ్మణుడు వచ్చినప్పడే శ్రాద్ధమునకు మంచి సమయం.

- యక్షుడు;- మనుజుడు ఏది వదిలి పెడితే సర్వజన ప్రియుడు, శోకము లేని వాడు, ధనం కలవాడు, సుఖి ఔతాడు?
- ధర్మరాజు;- గర్వం వదిలి పెడితే సర్వజన ప్రియుడు ఔతాడు. కోపం వదిలి పెడితే దుఃఖం ఉండదు. లోభి కాని వాడు సంపన్నుడు ఔతాడు. అత్యాశను వదిలి పెడితే సుఖాన్ని పొందుతాడు.
- యక్షుడు;- పురుషుడు ఎవరు? అత్యంత ధనంకలవాడు ఎవరు?
- ధర్మరాజు;- ఎవడు కీర్తివంతుడో అతడే పురుషుడు. ప్రియము, అప్రియము, సుఖదుఃఖములు, జరిగినవి, జరగబోవునవి, ఏవరు సమముగా చూచునో అతడే అత్యంత ధనవంతుడు.ధనవంతుడు.

#### యక్షుడు ధర్మరాజును పరీక్షించుట

ధర్మరాజు చెప్పిన సమాధానాలు విని యక్షుడు తృప్తి చెందాడు. " ధర్మరాజా! నా ప్రశ్నలకు సమయోచితంగా బదులు చెప్పి నన్ను తృప్తి పరిచావు. నీ తమ్ములలో ఒకరి ప్రాణం తిరిగి ఇచ్చెదను కోరుకొనుము " అన్నాడు. ధర్మరాజు "మహాత్మా! నా తమ్ముడు నకులునకు ప్రాణములు తిరిగి ఇమ్ము " అన్నాడు. యక్షుడు " అదేమిటి భీమార్జునులను వదిలి నకులుని కోరుకున్నావు " అని అడిగాడు. ధర్మరాజు " అయ్యా! నా తల్లికి కుంతీదేవి కుమారులలో నేను జీవించి ఉన్నాను. మా తడ్రి రెండవ భార్య మాద్రి పుత్రులలో నకులుడు పెద్దవాడు. అందుకని అతనిని కోరుట ధర్మం కదా? " అన్నాడు. యక్షుడు " ధర్మరాజా నీ ధర్మ నిరతికి మెచ్చాను. నీ తమ్ములు అందరూ పునరుజ్జీవితులు కాగలరు " అని వరం ఇచ్చాడు. వెంటనే భీమార్జున నకుల సహదేవులు నిద్ర నుండి లేచినట్లు లేచారు. ధర్మరాజు " మహాత్మా! నీవు మామూలు యక్షుడవు కావు. నీ వెవరో ఎరిగింపుము " అని ప్రార్ధించాడు.

#### యక్షుని నిజ రూపం

యక్షుడు " ధర్మరాజా ! నేను యమధర్మరాజును. నిన్ను చూడవలెనని కోరిక కలిగి వచ్చాను. సత్యము, సౌచము, దానము, తపము, శమము, కీర్తి, వివేకము నా యొక్క మూర్తులు. పైగుణములను ఆశ్రయించిన వారు దుర్గతిని పొందరు. నీవు కోరిన వరాలు ఇస్తాను కోరుకో " అన్నాడు యమధర్మరాజు. ధర్మరాజు " యమధర్మరాజా ! నా ఆశ్రమంలో నివసిస్తున్న ఒక బ్రాహ్మణుని అరణిని ఒక లేడి అపహరించింది. దానిని తిరిగి ప్రసాదింపుము " అని అడిగాడు. యమధర్మరాజు " ధర్మరాజా ! నేనే ఆ లేడిని, నీ మనస్సు ఎలా ప్రవర్తిస్తుందో తెలుసుకోవడానికి ఆ అరణిని నేనే తీసుకు వచ్చాను, ఇదిగో అరణి తీసుకో " అని అరణిని తిరిగి ఇచ్చాడు. యమధర్మరాజు " పాండవులారా ! మీకు పన్నెండేళ్ళు అరణ్యవాసం పూర్తి అయింది. ఇక ఒక సంవత్సరం అజ్ఞాత వాసం మిగిలి ఉంది. అజ్ఞాత వాస సమయంలో మీకు ఏరూపాలు కోరితే ఆరూపాలు వస్తాయి. మిమ్మలిని ఎవరూ గుర్తింపకుండా వరం ఇస్తాను. మరొక వరం కోరుకో " అన్నాడు. ధర్మరాజు " దేవతలలో ఆది దేవుడవైన నీ దర్శనం కంటే నాకు కావలసినది ఏముంది. నా మనస్సు ఎల్లప్పడూ ధర్మమార్గాన చరించేలా, క్రోధము, మోహం వంటి దుర్గుణాలు నా దరి చేరకుండా వరం ప్రసాదించు " అన్నాడు. యమధర్మరాజు అలాగే వరం ఇచ్చి అంతర్ధానం అయ్యాడు. ధర్మరాజు అరణిని బ్రాహ్మణునికి ఇచ్చి అతని ఆశీర్వాదం పొందారు. ఆ ప్రకారం పాండవులు తమ అరణ్యవాసం పూర్తి చేసారు.

## మూలాలు

## బయటి లింకులు

- ఇంటర్నెట్ ఆర్చీవులో అరణ్యపర్వము (http://www.archive.org/details/sriandhramahabar023368mbp) - సాహిత్య అకాడమీవారి ప్రచురణ

# విరాట పర్వము

వికీపీడియా నుండి

**విరాట పర్వము**, మహాభారతం ఇతిహాసంలోని నాలుగవభాగము. సంస్కృతమూలం వ్యాసుడు రచించాడు. ఆంధ్ర మహాభారతంలో తిక్కన రచన ఈ పర్వంనుండి ఆరంభమౌతుంది.

సభాపర్వంలో భంగపడిన పాండవులు జూద నియమానుసారం పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం తరువాత అజ్ఞాతవాసం చేయడం ఈ పర్వంలో ముఖ్య కథాంశం.

## విషయ సూచిక



## కథా సంగ్రహం

## సంస్కృత రచనా విశేషాలు

## కవిత్రయం రచనా విశేషాలు

## ఆధ్యాత్మిక, తాత్విక విశేషాలు

## ఇవి కూడా చూడండి

# బయటి లింకులు

- ఇంటర్నెట్ ఆర్కీవులో అరణ్యపర్వము (http://www.archive.org/details/sriandhramahabar023368mbp) - సాహిత్య అకాడమీవారి ప్రచురణ

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • **విరాట పర్వము** • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభ్రువాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

---

# విరాట పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

**విరాట పర్వము**, మహాభారతం ఇతిహాసంలోని నాలుగవ భాగము. ఆంధ్ర మహాభారతంలో తిక్కన రచన విరాట పర్వంతో ఆరంభమవుతుంది.

సభాపర్వంలో భంగపడిన పాండవులు జూద నియమానుసారం పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం గడిపిన తరువాత పదమూడవ యేట అజ్ఞాతంగా విరాటరాజు కొలువులో గడపటం ఈ పర్వంలో ముఖ్య కధాంశం.

## విషయ సూచిక



## ప్రథమాశ్వాసం

పాండవుల అరణ్యవాసం ముగిసిందని వైశంపాయనుడు చెప్పగా విన్న జనమేజయుడు " మహర్షీ ! మా తాతలు పాండవులు వనవాసానంతరం అజ్ఞాత వాసమును అతి రహస్యంగా, చాతుర్యంగా, కౌరవులకు తెలియకుండా ఎలా గడిపారు వివరంగా

చెప్తారా " అని అడిగాడు. వైశంపాయనుడు " జనమేజయా ! పాండవులు తమ వనవాస కాలాన్ని పూర్తి చేసారు. ధర్మరాజు తమతో వచ్చిన బ్రాహ్మణులను చూసి " అయ్యా ! ఇన్నాళ్ళు మాతో పాటు మీరూ అడవులలో ఎన్నో కష్టాలు అనుభవించారు. ఇక మేము అజ్ఞాతవాసం గడపవలసి ఉంది. మా అజ్ఞాతవాసం మేము నిర్విఘ్నము గా గడపాలని మమ్మల్ని ఆశీర్వదించండి " అని నమస్కరించాడు. ధౌమ్యుడు " ధర్మరాజా ! నీవు ధర్మ స్వరూపుడవు నీ వలెనే పూర్వము ఇంద్రుడు బ్రహ్మహత్యా పాతకము పోగొట్టు కొనుటకు నిషాధాచలము మీద, హరి అధితి గర్భములో వామన మూర్తిగానూ, ఔర్యుడు తన తల్లి తొడలోనూ అజ్ఞాతవాసం చేసారు. కాలం కలసి వచ్చిన తరవాత పూర్వ వైభవం పొందారు. నీవు కూడా అలాగే నీ అజ్ఞాత వాసానంతరం పూర్వ వైభవం పొందగలవు " అన్నాడు. బ్రాహ్మణు లందరూ పాండవులను దీవించి తమతమ ప్రదేశాలకు వెళ్ళారు.

## పాడవులు ద్రౌపది వారివారి పనులను నిర్ణయించు కొనుట

ధర్మరాజు తమ్ములను చూసి " మనం అయిదుగురం ద్రౌపది అజ్ఞాతవాసం గడిపే ఉపాయం చెప్పండి " అన్నాడు. అర్జునుడు " అన్నయ్యా! మనకు యమ ధర్మరాజు ఇచ్చిన వరం ఉన్నది కదా ! మనం ఎక్కడకు వెళ్ళినా ఎవరూ గుర్తుపట్టలేరు. కురు దేశం చుట్టూ పాంచాల, చేధి, మత్స్య, సాళ్వ, విదేహ, బాహ్లీక, దశార్ణ, శూరసేన, కళింగ, మగధ దేశములు సుభిక్షంగా మనకు నివాస యోగ్యంగా ఉన్నాయి. ఈ దేశాలలో మనకు అనుకూలంగా ఉన్న దేశంలో మనం అజ్ఞాతవాసం గడుపుదాం " అన్నాడు. ధర్మరాజు " నాకు తెలిసి విరాటరాజు సద్ధర్మవర్తి, మంచివాడు, బలవంతుడు అతని పాలనలో మనం అజ్ఞాత వాసం గడపటం ఉచితమని నాకు అనిపిస్తుంది. విరాట రాజు కొలువులో ఎవరెవరు ఏమి పనులు చేయగలరో నాకు వివరంగా చెప్పండి " అన్నాడు. అర్జునుడు " అన్నయ్యా ! నీవు మహనీయ మూర్తివి. సుకుమారుడవు, ఎంతో ప్రాభవం అనుభవించిన వాడివి. అటువంటి వాడవు ఎలా ఇతరులను సేవించ గలవు " అన్నాడు. అర్జునా " నాకు శ్రౌతము, స్మార్తము, శకునము, జ్యోతిషము మొదలగునవి తెలియును. ఈ విద్యలు ప్రదర్శిస్తూ నేను కాలం గడపగలను. నేను జ్యూద ప్రియుడనని నీకు తెలుసు కదా. విరాటరాజును జ్యూదముతో అలరిస్తాను. ఆయన నా గురించి అడిగితే నేను పూర్వం ధర్మరాజు వద్ద స్నేహంగా ఉండేవాడినని చెప్తాను " అన్నాడు. ధర్మరాజు భీమసేనుని చూసి " భీమసేనా ! బకాసుర, కిమ్మీరాదులను చంపిన నీవు సేవకా వృత్తి ఎలా చేస్తావు " అన్నాడు. భీమసేనుడు " అన్నయ్యా! నాకు రుచికరంగా వంటలు చేయడం వచ్చు కదా. వంటలవాడిగా విరాటరాజు కొలువులో చేరతాను. పైగా నాకు మల్ల యుద్ధంలో ప్రావీణ్యం ఉంది కదా. అతని కొలువులో మల్ల విద్యా ప్రదర్శనలు ఇస్తూ అందరికి వినోదం కలిగిస్తాను. నా పూర్వ చరిత్ర అడిగితే నేను ధర్మరాజు కొలువులో వంటవాడిగా ఉన్నానని చెప్తాను " అన్నాడు. ధర్మరాజు అర్జునుని చూసి " అర్జునా ! నీ సంగతి ఏమిటి నీవు ఎలాంటి కొలువు చేస్తావు " అని అడిగాడు. అర్జునుడు " అన్నయ్యా ! నేను దేవేంద్రుని దగ్గరకు వెళ్ళినప్పుడు నన్ను ఊర్వసి కామించగా నిరాకరించాను. అప్పుడు ఊర్వశి నపుంసకుడివి కమ్మని శపించింది. దేవేంద్రుడు నన్ను ఆ శాపాన్ని అజ్ఞాత వాస కాలంలో అనుభవించమని చెప్పాడు. అజ్ఞాతవాసం కాగానే శాపవిమోచనం కాగలదని చెప్పాడు. ఆ శాపవశమున నేను విరాటరాజు కొలువులో పేడి రూపం దాల్చి విరాటుని కొలువులో ప్రవేశిస్తాను. నాకు నాట్య విద్యలో ప్రవేశం కలదు. నేను అంతఃపురకాంతలకు నాట్యం నేర్పుతాను. నా పూర్వ చరిత్ర అడిగితే నేను ద్రౌపది అంతఃపురంలో నాట్యాచారుడిగా ఉన్నానని చెప్తాను " అని అన్నాడు. తరవాత నకులుని చూసి " ఇతడు చాలా సుకుమారుడు, అందగాడు ఇతడు తన నిజ రూపమును ఎటుల దాచగలడు. ఒరులను ఎలా సేవించ గలడు " అన్నాడు. నకులుడు " అన్నయ్యా ! నాకు అశ్వ శిక్షణలో ప్రవేశమున్నది. నేను అశ్వ శిక్షకుడిగా విరాటుని కొలువులో చేరతాను. అశ్వశాలలోని గుర్రాలకు ఎలాంటి వ్యాధులు రాకుండా చూసుకుంటాను. ధామగ్రంధి నామంతో సంచరిస్తాను. ఇంతకు పూర్వం నేను ధర్మరాజు కొలువులో అశ్వశిక్షకుడిగా పని చేసానని చెప్తాను " అన్నాడు. ధర్మరాజు నవ్వి " సహదేవుని వైపు చూసాడు. సహదేవుడు " అన్నయ్యా ! నాకు పశు పోషణలో అనుభవం ఉంది. తంత్రీ పాలుడనే పేరుతో గోరక్షకుడిగా విరాటుని కొలువులో ప్రవేశిస్తాను. ఇంతకు పూర్వం ధర్మరాజు కొలువులో గోరక్షకుడిగా పని చేసానని చెప్తాను " అన్నాడు. ధర్మరాజు ద్రౌపదిని చూసి " సుకుమారీ ! ఇంత వరకు పనులు చేయించు కున్నది కాని ఎవరిని సేవించి ఎరుగదు. ఇంతటి ఉదాత్తచిత్త ఏ పని చేయగలదు " అని మనసులో బాధపడ్డాడు. అది గ్రహించిన ద్రౌపది " నేను సైరంధ్రీ వేషంలో మాలిని అనే పేరుతో విరాటరాజు అంతఃపురానికి వెళతాను. విరాటరాజు భార్య సుధేష్ణను ప్రసన్నం చేసుకుంటాను. అందరూ గౌరవించే విధంగా సైరంధ్రీ వ్రతం సాగిస్తాను " అన్నది. అందరికి అన్ని పనులు కుదిరాయి. మనం అందరం అజ్ఞాత వాసాన్ని నిరపాయంగా గడుపుదాం. ధౌమ్యుల వారు అగ్ని హోత్రం రక్షిస్తుంటారు. మిగిలిన వారు వారి వారి స్వస్థలాలకు వెళతారు. ఎవరైనా మా గురించి అడిగితే ద్వైతవనం నుండి ఎటో వెళ్ళారని చెప్పండి " అని ధర్మరాజు ఆదేశించాడు.

## రాజకొలువులో ప్రవర్తించవలసిన పద్ధతులు

ధౌమ్యుడు పాండవులను చూసి " ధర్మరాజా ! మీరు కురువంశంలో జన్మించారు. గౌరవంగా బ్రతికారు. ఇలాంటి మీరు

పరులను సేవించుట కష్టమే. కాని మనకు అనుకూలం కాదని మరచి పోవద్దు. మీరు పరాక్రమాలు ప్రదర్శిస్తే అజ్ఞాతవాసం భగ్న మౌతుంది. రాజులను సేవించేటప్పుడు చాలా జాగ్రత్త వహించాలి. రాజుతో చనువుగా ఉన్నాను అనుకుని రాజమర్యాద అతిక్రమిస్తే హాని కలుగుతుంది. రాజుకన్నా విలువైన దుస్తులు ధరించటం కాని, రాజుకన్నా అధికంగా మాట్లాడటం కాని, రాజగృహంకన్నా ఆడంబరమైన గృహంలో నివసించటం కాని చేయకూడదు. సహజంగా రాజులు తమ ఆజ్ఞను ఉల్లంఘించిన వారు పుత్రులైనా మిత్రులైనా శత్రువులుగా చూస్తారు. తాను చేయలేని పని తలపై వేసుకో కూడదు అందువలన భంగపాటు తప్పదు. రాజుల యందు మౌనంగా ఉండకూడదు అలాగని అతిగా భాషించ కూడదు. మితమైన చతుర సంభాషణచే రాజులను మెప్పించాలి. అంతఃపుర రహస్యాలను బయట పెట్టకూడదు. రాజుకు చెప్పదగినవి, వినదగినవి అయిన మాటలనే చెప్పాలి. రాజు అనుమతి మీదనే ఆసనాన్ని అధిరోహించాలి. రాజుకన్నా ఉన్నతాసనం పై ఎప్పటికీ అధిరోహించకూడదు. రాజు అభిమానించాడని పొంగి పోకూడదు. అలాగే అవమానిస్తే కుంగి పోకూడదు. రాజు చెప్పిన పనిని ఎండ, వాన, ఆకలి, దప్పిక, కాలము ప్రదేశం నిమిత్తం లేకుండా చేయాలి. రాజధనాన్ని విషంతో సమానంగా చూడాలి. రాజధనాన్ని సంగ్రహించడం ప్రాణాల మీదకు తెచ్చుకోవడమే. రాజు కొలువులో నవ్వటం ఆవులించడం చేయకూడదు. రాజుగారి శత్రువులతోకాని, వారి దూతలతో కాని సన్నిహితంగా మెలగ కూడదు. భటుడు సంపద కలదు కదా అని అధికంగా భోగింపరాదు. రాజుకు కంటగింపుగా ఉంటుంది. కనుక అజ్ఞాతవాస సమయమున మీరు అణగి మెణగి మెలగవలసి ఉంటుంది " అన్నాడు.

### విరాటనగరానికి పయనం

ధర్మరాజు ధౌమ్యుని బుద్ధిమతి విని " మాకు అన్నీ మీరే. మాకు తెలియని అనేక విషయాలు చెప్పారు. వాటిని తప్పక పాటిస్తాము " అన్నారు. ధౌమ్యుని ఆశీర్వాదం పొంది పాండవులు ధౌమ్యుడు అక్కడి నుండి విరాటనగరానికి వెళ్ళారు. యమునా నది వెంట నడుస్తున్నారు. మత్స్యదేశ పొలిమేర చేరగానే అక్కడ ఒక ఆశ్రమంలో ధౌమ్యుడు ఆగాడు. పాండవులు అరణ్యాల వెంట తమ ప్రయాణం సాగించారు. విరాటనగరానికి వెళ్ళటానికి చాలా దూరం నడిచారు. ద్రౌపది ఇక నడవ లేక పోయింది విశ్రాంతి తీసుకుంటాము అనుకుంది. ధర్మరాజు అందుకు ఒప్పు కోలేదు త్వరగా విరాట నగరం చేరాలన్నది అతని కోరిక పట్టుదల. ద్రౌపది ఇక ఒక అడుగు కూడా వేయలేనని చెప్పింది. ధర్మరాజు నకులుని చూసి " నకులా! ద్రౌపది అలసి పోయింది. కొంచం ఎత్తుకుని తీసుకు రాగలవా " అని అడిగాడు. నకులుడు " నేను కూడా అలసి పోయాను అన్నయ్యా " అన్నాడు. ధర్మరాజు సహదేవుని అడిగాడు. సహదేవుడు అలాగే సమాధానం ఇచ్చాడు. ఇక అర్జునిని వంతు వచ్చింది. అర్జునుడు ద్రౌపదిని అవలీలగా ఎత్తుకుని విరాట నగరం వైపు నడిచాడు. అందరూ విరాట నగర పొలిమేర చేరగానే కొంత తడవు ఆగారు. ధర్మరాజు తమ్ములతో " మనం ఈ ఆకారాలతో ఆయుధాలతో నగరంలో అడుగు పెడితే మనలను సులువుగా గుర్తిస్తారు. మనం మన ఆయుధాలను దాచాలి " అన్నాడు.

### పాండవులు తమ ఆయుధాలను దాచుట

ధర్మరాజు మాటలు విని అందరూ చుట్టూ పరికించారు. పక్కనే శ్మశానం ఉంది. అక్కడకు సామాన్యంగా ఎవరూ రారు. భూత, ప్రేత, పిశాచాలు అక్కడ తిరుగు తాయని ప్రజలు అక్కడకు రారు. అందువలన ఆయుదాలను దాచడానికి అదే అనువైనదని భావించారు. ఆ శ్మశానంలో ఒక జమ్మి చెట్టు ఉంది. ఆ జమ్మి చెట్టు ఆకాశాన్ని అంటే కొమ్మలతో దట్టమైన ఆకులతో పగటి పూట చూడటానికి కూడా భీతి కొల్పేలా భయంకరంగా ఉంది. ఆ జమ్మి చెట్టును చూసిన అర్జునుడు " అన్నయ్యా ! మనం మన ఆయుధాలను ఇక్కడ భద్రపరుస్తాము " అన్నాడు. పాండవులు తమ ఆయుధాలను ఒకచోట చేర్చి వాటిని వెంట్రుకలు ఉన్న చని పోయిన మృగ చర్మంతో కట్టారు. పక్కనే పడి ఉన్న ఒక జంతు చర్మాన్ని సహదేవుని సాయంతో తీసుకు వచ్చి దానితో ఆమూట కట్టారు. ఆ పక్కనే ఒక అనాధ శవం పడి ఉంది. ఆ శవాన్ని ఆయుధాల మూటతో చేర్చి కట్టారు. ధర్మరాజు ఆ జమ్మి చెట్టు ఎక్కి ఆయుధాల మూటను చెట్టుకు వ్రేలాడ కట్టాడు. ధర్మరాజు ఆ ఆయుదాల మూటకు నమస్కరించి తనకు అర్జునికి తప్ప మిగిలిన ఎవరికైనా అవి సర్పాల వలె కనపడాలని ప్రార్థించాడు. భీముడు వస్తే అస్సలు కనపడ వద్దని వేడుకున్నాడు. ధర్మరాజు చెట్టు దిగి చుట్టూ పరికించాడు. దూరంగా కొంతమంది పశువుల కాపర్లు కనిపించారు. వారి దగ్గరకు పోయి " అయ్యలారా! మా తల్లి చనిపోయింది. మా కులాచారం ప్రకారం శవాన్ని జమ్మి చెట్టుకు వ్రేలాడ కట్టాలి అందుకే కట్టాము " అని శవాకృతిలో ఉన్న ఆయుధాల మూట చూపించాడు. అమాయకులైన గొల్లలు భయభ్రాంతులై ఇతరులకు చెప్పటానికి పరుగు పరుగున వెళ్ళారు.

### పాండవుల వేషధారణ

ఆ తరవాత ధర్మరాజు యమ ధర్మరాజును ప్రార్థించాడు. వెంటనే ధర్మరాజుకు సన్యాసి వేషం , భీమునకు వంట వాడి వేషం,

అర్జునినికి పేడి వేషం, నకులునికి అశ్వ రక్షకుడి వేషం, సహదేవుడికి పశుపాలకుని వేషం లభించాయి. మీరు అందరూ ఒకరి వెంట ఒకరు వచ్చి నగరంలో ప్రవేశించండి అని చెప్పి ధర్మరాజు ముందుగా కమండలం తీసుకుని పాచికల కట్ట చంకన పెట్టుకుని నగర ప్రవేశం చేసారు.

## ధర్మరాజు కొలువులో చేరుట



కంకుభట్టుగా ధర్మరాజు

దైవవశాత్తు విరాటరాజు ఆరోజు నగరసంచారం చేస్తున్నాడు. దూరం నుండి సన్యాసి వేషంలో వస్తున్న ధర్మరాజుని చూసి " ఆహా ఏమి ఠీవి, ఏమి రాజసం , రాజ్యాలను ఏలే చక్రవర్తిలా ఉన్నాడు " అనుకుని ధర్మరాజుకు ఎదురు పోయి నమస్కరించాడు. ధర్మరాజుతో " అయ్యా! మీరెవరు? ఏ ఊరు? మా నగరుకు ఎందుకు వచ్చారు? వివరించండి " అన్నాడు. ధర్మరాజు చిరునవ్వు నవ్వి " నేను బ్రాహ్మణుడను. కురుదేశంలో జన్మించాను. సన్యాసాశ్రమం స్వీకరించాను. నాకు జూదంలో ప్రవేశముంది. శత్రువులు జూదంలో ఓడించి నా సంపదనంతా అపహరించారు. ఆ అవమానం భరించలేక దేశం విడిచి వచ్చాను. నన్ను కంకుడు అంటారు. నేను తమరు సజ్జనులైన మహారాజులని విని వచ్చాను. నేను నీచ వృత్తి చేయను. ఒక సంవత్సరం వ్రతం ఉన్నది . ఆ వ్రతకాలం మీ వద్ద ఉంటాను అనుగ్రహించండి. ఆ తరవాత నన్ను అవమానించిన వారిని వెతుక్కుంటూ వెళతాను " అన్నాడు. విరాటరాజు " అయ్యా ! తమరు మా రాజ్యంలో ఉండటం కంటే మాకు భాగ్యం లేదు. నాకు జరిగే మర్యాదలు అన్నీ నీకు జరుగుతాయి. తమరు సంతోషంగా మా నగరంలో ఉండండి " అన్నాడు. ధర్మరాజు " నాకు రాజభోగాలతో పని లేదు. నేల మీద నిద్రిస్తాను. హోమం చేయగా మిగిలినది తింటాను " అన్నాడు. విరాటరాజు అందుకు అంగీకరించాడు. ధర్మరాజు కొలువులో ప్రవేశించాడు.

## భీముడు కొలువులో చేరుట



వలలుడిగా భీముడు

తరవాత భీముడు వంటలవాడిగా చేతితో గరిటతో నగర ప్రవాశం చేసాడు. విరాటరాజుకు అభివాధం చేసాడు. భీముడు " అయ్యా! నేను నాల్గవజాతి వాడను. వంటలు చేయగలను. తమరి కొలువులో వంటల వాడిగా ఉంటాను. నేను ఇదివరకు ధర్మరాజు వద్ద వంటలవాడిగా ఉన్నాను. ఆ యనకు ప్రీతికరమైన వంటలు చేసేవాడిని. ఆయనను సేవించినట్లు మిమ్మల్ని సేవిస్తాను. నాకు మల్ల యుద్ధం వచ్చు. తమరికి వినోదం కలిగిస్తాను అనుగ్రహించండి. తమరికి ఇష్టం లేకుంటే వేరొక చోటికి పోతాను " అన్నాడు. విరాటరాజు " నీమాటలకు నేను ముగ్ధుడ నయ్యాను. నీవు వంటవాడిగా చేరు " అన్నాడు. భీముడు విరాటుని కొలువులో వంటల వాడయ్యాడు.

## అర్జునుడు కొలువులో చేరుట




అర్జునుడు అందమైన చీరె కట్టుతో, రవికతో, చక్కని తలకట్టుతో ఆడవేషంలో విరాటుని కొలువులో ప్రవేశించాడు. అర్జునినిలో నపుంసకత్వం ఆడతనం మూర్తీభవిస్తున్నాయి. విరాటుని చూసి " మహారాజా! నా పేరు బృహన్నల. నేను పేడి వాడిని. ఆడపిల్లలకు ఆట పాట నేర్పుతాను. నన్ను మీ కొలువులో చేర్చుకోండి " అన్నాడు. విరాటరాజు " అయ్యో ఇంత అందమైన నీకు పేడి రూపమా " అడిగాడు. అర్జునుడు " ఔను మహారాజా! శాపవశాన పేడితనం ప్రాప్తించింది. పేడి తనం వలన ఏ పని చేయలేను. సంగీతం, నృత్యం నేర్చుకున్నాను, అన్ని రకముల వాద్యాలను వాయించ గలను. అలంకార కళలో ప్రవేశం ఉంది " అన్నాడు. అతడి పేడి రూపంలో ఏమీ దోషం లేదని గ్రహించి ఉత్తరను కొలువుకు రప్పించాడు. మందగమన ఉత్తర కొలువుకూటమికి వచ్చింది. విరాటరాజు " బృహన్నలా ! ఈమె నా కూతురు ఉత్తర. ఈమెకు నాట్యం

బృహన్నలగా అర్జునుడు

నేర్పగలవా " అన్నాడు. బృహన్నల వినయంగా నేర్పుతాను అన్నాడు. విరాటరాజు " బృహన్నలా! నా కూతురు ఇంకా చిన్న పిల్ల. ఆట పాటల మీద మక్కువ ఇంకా పోలేదు. నీవు ఆమెకు కళల యందు ఆసక్తిని కలిగించి నాట్యంలో శిక్షణ ఇవ్వవలసిన బాధ్యత నీదే. నీవు ఈమెకు రక్షకుడిగా ఉండాలి " అని ఉత్తరను చూసి " అమ్మా! ఈమె నీ గురువు ఆమె ఎలా చెపితే అలా భక్తితో నడచుకో " అని బృహన్నలకు ఉత్తరను అప్పగించాడు. ఆ విధంగా అర్జునుడు విరాటుని కొలువులో ప్రవేశించాడు.

### నకులుడు కొలువులో చేరుట



తామగ్రంధిగా నకులుడు

తరవత నకులుడు అశ్వపాలకుని వేషంలో విరాటుని కొలువులో ప్రవేశించాడు. ఆ సమయంలో విరాటుడు తన వద్దకు కొనిరాబడిన గుర్రాలను పరిశీలిస్తున్నాడు. నకులుడు కూడా అశ్వాలను తదేకంగా చూస్తున్నాడు. ఇది గమనించిన విరాటుడు అతనికి అశ్వవిద్యలో ప్రవేశం ఉన్నదని గ్రహించాడు.అతని గురించి వివరాలు కనుక్కొని రమ్మని మంత్రులను ఆదేశిస్తున్న తరుణంలో నకులుడు విరాటనుని దగ్గరకు వచ్చాడు. నకులుడు " మహారాజా ! నా పేరు తామగంధి. నాకు అశ్వవిషయములు అన్ని తెలుసు అశ్వపోషణ చేయగలను. అశ్వ ఆయుఃప్రమాణాన్ని చెప్పగలను. నేను ఇంతకు ముందు ధర్మరాజు వద్ద అశ్వ రక్షకుడుగా ఉంటున్నాను. కాని ధర్మరాజు అందరిని వదిలి పోయాడు. విరాటరాజు సుజనుడు, లోకోత్తరుడు అని విని నేను తమరి కొలువులో చేరి తమరిని సేవించాలని వచ్చాను " అన్నాడు. విరాటుడు అతని నైపుణ్యానికి మెచ్చి అతనిని తన అశ్వశాలలో చేర్చుకున్నాడు.

### సహదేవుడు కొలువులో చేరుట


తంత్రీపాలుడుగా సహదేవుడు

సహదేవుడు చేతిలో ముల్లుగర్రతో, తలమీద తాళ్ళ మూటతో గోపాలుడి వేషంలో విరాటుని వద్దకు వచ్చాడు. సహదేవుడు విరాటునితో " మహారాజా ! నాపేరు తంత్రీ పాలుడు. నేను ఆల మందలను చక్కగా పెంచుతాను. నాకు పశువులలో ఉన్న రకాలు తెలుసు. పశువుల వ్యాధులకు చికిత్స చేయగలను. ఇంతకు ముందు ధర్మరాజు పాలనలో పశు పాలకుడిగా ఉండే వాడిని. నన్ను తమరి కొలువులో పశు పాలకునిగా నియోగించండి " అని కోరాడు. విరాటుడు అతని మాటలకు మెచ్చి అతనిని కొలువులో పశు పాలకుడిగా నియోగించాడు. ఈ విధంగా పాండవులు అయిదుగ్గురు కొలువులో చేరారు.

## ద్రౌపది అంతఃపురంలో చేరుట

ద్రౌపది సైరంధ్రి వేషానికి తగినట్లుగా తలకు కొప్పు పెట్టుకుంది. మాసిన చీర కట్టుకుంది. దాసీభావాన్ని మనసులో నింపుకుంది. విరాటనగర రాజవీధిలో నడుస్తూ అంతఃపురం చేరుకుంది. ఆ సమయంలో విరాట రాజపత్ని సుధేష్ణాదేవి విహారనిమిత్తం రాజప్రాసాదం పైకి ఎక్కి విహరిస్తూ రాజవీధి వెంట విహరిస్తున్న సైరంధ్రిని చూసింది. ఆమె అందానికి ఆశ్చర్యపోయింది. ఆమెను తీసుకు రమ్మని చెలికత్తెలను పంపింది. వారు వెళ్ళి సైరంధ్రి వేషంలో ఉన్న ద్రౌపదిని సుధేష్ణ సముఖానికి తీసుకు వచ్చారు. సుధేష్ణ ద్రౌపదితో " మానినీ నీవు ఎవరు? ఏమి కులం? నీ పేరేమి? ఏ పని మీద ఈ నగరానికి వచ్చావు? " అని అడిగింది. ద్రౌపది " అమ్మా ! సైరంధ్రీ జాతి స్త్రీని. నా పేరు మాలిని. నాకు అయిదుగురు భర్తలు. నేను ఒక కారణంపై నా భర్తల ముందే అవమానింప బడ్డాను. భర్తలతో అడవులలో నివసించాను. బ్రహ్మచారిగా కాలం గడిపాను. నాకు ఇంకొక్క వ్రతం ఉన్నది. మీరు ధర్మ వర్తనులు అని విని వ్రతకాలం మీ రాణివాసంలో గడపాలని వచ్చాను. నేను ఇంతకు ముందు శ్రీకృష్ణుని భార్య సత్యభామ వద్దా, పాండవ పత్ని ద్రౌపది వద్దా పని చేసాను. నాకు పూలమాలలు, చెండ్లు కట్టడం తెలుసు. రకరకాలుగా తిలకం దిద్దగలను. అందంగా కురులను అల్లగలను ముడువ గలను " అన్నది. ఆమెను అంతఃపురంలో చేర్చుకోవడానికి సుధేష్ణకు కొంత సందేహం ఉంది " సైరంధ్రీ! నీవు అందగత్తెవు. నిన్ను చూసి మహారాజు నీ మీద మనసు పడితే నేను ఏమి చేయాలి?


సైరంధ్రిగా ద్రౌపది

ఆడవాళ్ళే నీపై చూపు మరల్చలేక పోతున్నారే ఇక మగవాళ్ళ విషయం చెప్పేదేముంది. నిన్ను అంతఃపురంలో ఉంచుకోవడం అంటే నా వినాశనం నేను కోరుకోవడమే " అన్నది సుధేష్ణ. ద్రౌపది " అమ్మా! తమరు అలా అనవలదు. నా భర్తలు బలవంతులు. నా విషయంలో అప్రమత్తంగా ఉంటారు. ఏవరైనా నన్ను నీచభావంతో చూసినా చాలు వారిని సంహరిస్తారు. కనుక ఎవరూ నన్ను దుర్బుద్ధితో చూడరు. నాకు అలాంటి నీచ బుద్ధులు లేవు. నన్ను మీరు నమ్మి మీ సేవకురాలిగా స్వీకరించండి. కాని నాకు కొన్ని నియమాలు ఉన్నాయి. నేను ఇతరుల ఎంగిలి తినను. నీచపు పనులు చేయను " అని పలికింది. సైరంధ్రి మాటలకు సుధేష్ణ సంతోషించి ఆమెను తన పరిచారికగా స్వీకరించింది. అలా ద్రౌపది కూడా విరాటుని కొలువులో చేరింది. పాండవులు ద్రౌపది విరాటుని కొలువులో సంతోషంగా కాలం గడుపుతున్నారు.

## ఇవి కూడా చూడండి

## మూలాలు

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

# విరాట పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



# ద్వితీయాశ్వాసం

ధర్మరాజు విరాటరాజు కొలువులో ధర్మప్రసంగములు చేస్తూ, జూదక్రీడతో కాలం గడుపుతూ అందులో అర్జించిన ధనం తమ్ములకిస్తూ కాలం గడుపుతున్నాడు. భీముడు రాజుకు రుచిగా వండిపెడుతూ మిగిలిన ఆహార పదార్ధములను అన్నదమ్ములకిస్తూ కాలం గడుపుతున్నాడు. అర్జునుడు తన కళాప్రదర్శనలలో గడించిన బహుమతులు అన్నదమ్ములకిస్తూ కాలం గడుపుతున్నాడు. నకులసహదేవులు తమ విధి నిర్వహణలో అర్జించిన ధనాన్ని అన్నదమ్ములకిస్తూ కాలం గడుపుతున్నారు. ఆ విధంగా నాలుగు నెలలు గడిచాయి.

### మల్లయోధుని వలలుడు ఓడించుట

ఒక రోజు విరాటుని కొలువులోకి ఒక మల్లుడు ప్రవేశించాడు. అతని భయంకరాకారం చూసి విరాటుని కొలువులోని వారంతా భయపడ్డారు. మల్లుడు " రాజా ! నేను అనేక రాజ్యాలు సందర్శించాను. ఎక్కడా నన్ను మల్లయుద్ధంలో గెలిచే వీరుడు కనిపించ లేదు. అందుకే మీ వద్దకు వచ్చాను " అన్నాడు. కొలువులో ఉన్న మల్లులు కూడా అతనిని భంకరాకారాన్ని చూడగానే వెనుకడుగు వేసారు. విరాటుని మొహం చిన్నబోయింది. ధర్మరాజు విరాటుని చూసి " విరాటరాజా ! ఇదివరకు నేను ధర్మరాజు కొలువులో ఉండగా ఒక మల్లుని చూసాను. అతడు ఇప్పుడు మీ కొలువులో వంటవాడిగా ఉన్నాడు. అతడు ఎందరో మల్ల యోధులను ఓడించాడు " అని చెప్పి ఊరకున్నాడు. విరాటరాజు వెంటనే వలలుని పిలిపించాడు. వలలుడు రాగానే విరాటరాజు " నీవు ఇతనితో మల్ల యుద్ధానికి సిద్ధం కమ్ము" అన్నాడు. అప్పుడు భీముడు అన్నగారి వైపు చూసాడు. ధర్మరాజు అనుజ్ఞ ఇస్తూ కను సైగ చేసాడు. వలలుడు " మహారాజా! నేను ఇదివరకు ధర్మరాజ సభలో అనేక మంది మల్ల యోధులతో పోరాడి ఆయనకు వినోదం కలిగించాను. అలాగే మీకూ వినోదం కలిగిస్తాను " అన్నాడు. వలలుని వేషంలో ఉన్న భీముడు మల్లయోధునితో యుద్ధం మొదలు పెట్టాడు. భీముడు ఉత్సాహంతో తొడలు కొట్టాడు. ఇరువురు ఒకరిని ఒకరు చూసుకున్నారు. కిందికి వంగి మట్టిని వంటికి రాసుకున్నాడు. ఆఖరికి మల్లుని పట్టుకుని ముక్కు మీద గుద్ది బయటికి విసిరి వేసి భీముడు మల్లుని ఓడించాడు. విరాటరాజు వలలునికి ఎన్నో కానుకలిచ్చి సత్కరించాడు. భీముడు అక్కడున్న పేదవారికి ఆకానుకలు పంచి ఇచ్చి తిరిగి వంటశాలకు వెళ్ళాడు. ఆవిధంగా భీముడు మల్లులతో పోరుతూ అంతఃపుర కాంతలకు వినోదం కలిగిస్తున్నాడు. మల్లులు లేనప్పుడు సింహములతో, పులులతో పోరి వినోదం కలిగించాడు.

## కీచకుడు ద్రౌపదిని చూచుట



ద్రౌపది అందానికి ఆశ్చర్యపోతున్న కీచకుడు

అజ్ఞాతవాసం ప్రశాంతంగా కొన్నిరోజులలో ముగుస్తున్న సమయంలో విరాటుని బావమరిది కీచకుడు అంతఃపురంలో అక్కను చూడటానికి వచ్చి యాదృచ్చికంగా ద్రౌపదిని చూసాడు. కీచకుడు మంచి అందగాడు, బలవంతుడు, కాని వివేక హీనుడు. అతడికి బలగర్వం, సౌందర్య గర్వం ఎక్కువ. అతడు విరాటరాజు కొలువులో దండనాయకుడు. కీచకుడు ద్రౌపది అందానికి ఆశ్చర్యపోయి ఆమె నుండి చూపులు మరల్చుకోలేక పోయాడు. అతడు మనసులో " అహ్! మానవులు ఎవరైనా ఇంతటి అందగత్తెను చూసి ఉండరు. ఇంతటి అందగత్తె మన్మధుని వద్ద ఉంటే ఆనాడు అతడు శివుని కూడా జయించే వాడు కదా. బ్రహ్మదేవుడు మన్మధుని అయిదు బాణాలు కలిపి ఈమెను సృష్టిండో ఏమో. మన్మధుడు కూడా విరహతాపంలో వేగిపోతాడేమో. ఈ సుందరాంగి తల్లితండ్రులు ఎవరో, అదృష్టవంతుడైన భర్త ఎవరో, పేరు ఏమో, ఈమెను పొందే మార్గమేమిటో, ఈ పనికి ఎవరు నాకు సాయపడగరు " అని పరిపరి విధాల ఆలోచించాడు. మాసిన చీర ధరించిన ద్రౌపది అతని వికారపు చూపులకు అసహ్యించుకుంది. ఆమె మనసులో " ఇతడు ఏమిటి ఇలా చూస్తున్నాడు. ఇప్పుడు నన్ను ఇతని నుండి రక్షించే దిక్కెవరో " అనుకున్నది. కీచకుడు అదేమి పట్టించు కోకుండా ఆమె చూపులను చూసి శృంగార చేష్టలని అపోహ పడ్డాడు. పక్కనే సుధేష్ణ, పరిచారికలు చూస్తున్నా పట్టించుకోకుండా ఆమె వైపు మోహంతో తధేకంగా చూసాడు. తరవాత తేరుకుని అక్క సుధేష్ణకు నమస్కరించాడు. ఆమె అతనికి ఉచితాసనం చూపించింది.

## కీచకునికి సుధేష్ణ బుద్ధిమతి చెప్పుట

కీచకుని మాటలు విన్న సుధేష్ణ " నేను అనుకున్నంత అయింది. ఈ సైరంధ్రిని చూసి కీచకుడు మోహావేశంలో పడ్డాడు. వీడికి ఏమి కీడు మూడుతుందో? వద్దన్నా వినే వాడు కాదు. నేనేమి చేసేది? నా శక్తి వంచన లేకుండా చెప్పి చూస్తాను " అనుకున్నది. సుధేష్ణ " తమ్ముడా కీచకా! నీ అంతఃపురంలో అతి సుందరులైన కాంతలు ఉన్నారు. ఈ నీరసాకార అయిన సైరంధ్రి ఎందుకు " అని అనునయంగా చెప్పింది సుధేష్ణ. కీచకుడు " అక్కా! ఈ సైరంధ్రిని పోలిన అందగత్తె ఈ భూమి మీదే కాదు దేవతలలో కూడా లేదు ఇది నిజం. ఆమె నేత్రాలు, పద్మాలవంటి కళ్ళు, ఆ కోకిల కంఠం, ఆ మేని సొంపు నన్ను ఆకర్షిస్తున్నాయి. ఏ ఉపాయం అయిన సరే ఆమె నాకు కావాలి " అన్నాడు. కీచకుడు మామూలు మాటలతో వినడని సుధేష్ణ కొంచం కటువుగా చెప్ప సాగింది. " తమ్ముడా కీచకా! పరస్త్రీ సాంగత్యం వలన నీ ఆయుష్షు, ఐశ్వర్యం, కీర్తి హరింపబడతాయని తెలియదా? ధర్మాత్ములు దీనిని హర్షించరు. భర్తకు తెలిస్తే ప్రాణం మీదకు వస్తుందని, ఇతరులు చూస్తే పరువు పోతుందని, సాటి ఆడువారికి తెలిస్తే గౌరవం పోతుందని, బంధువులకు తెలిస్తే వంశనాశనం ఔతుందని క్షణ క్షణం భయపడుతూ,

భయపడుతూ, వ్యధతో ఉండే పరస్త్రీతో ఏమి సుఖపడతావు. జారిణితో పొందు సుఖం కాదని అందరూ దూరంగా ఉంటారు. ఆమె భర్తలు గంధర్వులు వాళ్ళ చేతిలో నీవు మరణించవచ్చు. దానిని మర్చిపోరా తమ్ముడూ. చెడు మార్గంలో చరించే వారికి వినాశనం తప్పదు నీ లాంటి బుద్ధి మంతులకు ఇది తగదు " అన్నది సుధేష్ణ. అక్క చెప్పిన మాటలు కీచకుని చెవికెక్క లేదు. " ఓ సుధేష్ణా! ఒక్క మాట చెప్తున్నాను విను. ఈ భూలోకంలో నన్ను ఎదిరించి నిలువగల వీరుడు లేడు. నా బాహుబలంతో గంధర్వాదులను సంహరించగలను. కనుక నాకు బుద్ధి చెప్పట మాని నా కోరిక మార్గం సుగమం చెయ్యి " అని వంగి అక్క పాదాలకు నమస్కరించాడు. సుధేష్ణ " ఇక వీడు ఏమి చెప్పినా వినడు. వీడికి ఆమెను జతచేస్తే సరి. ఆమె భర్తలైన గంధర్వుల చేతిలో చస్తాడు. లేకున్న మన్మధుడి చేతిలో చస్తాడు. ఎలాగైనా వీడికిక చావు తధ్యం " అనుకున్నది సుధేష్ణ.

## సుధేష్ణ మాలినిని కీచకుని ఇంటికి పంపుట

సుధేష్ణ కీచకుని మంకుపట్టు గ్రహించి " తమ్ముడా కీచకా! ఎందుకు ఆరాట పడతావు. ఆమెను నీ వద్దకు పంపుట కష్టం కాదులే నీవు వెళ్ళు సైరంధ్రిని నీ వద్దకు పంపుతాను ఆ తరవాత నీ ఇష్టం " అన్నది.క్క మాటలు విన్న కీచకుడు సంతోషంతో తన మందిరానికి వెళ్ళాడు. విందు భోజనం సిద్ధం చేసాడు, మధుర రసాలు ఏర్పాటు చేసాడు, పని వారందరిని పంపివేసాడు చేసాడు. తన మందిరంలో ఎవరూ లేకుండా చూసుకుని అందమైన ప్రదేశంలో కూర్చుని సైరంధ్రి కొరకు ఎదురు చూస్తూ ఉన్నాడు. సుధేష్ణ సైరంధ్రిని పిలిచి " మాలినీ! నాకు చాలా దాహంగా ఉంది. నా తమ్ముని కీచకుని ఇంట్లో రుచికరమైన మధ్యం ఉంది తీసుకురా " అన్నది ఈ మాటలు విన్న ద్రౌపది మనసు తల్లడిల్లింది. ఆమెకు శరీరం నిండా చెమట పట్టింది. ఈ ఆపద నుండి ఎలా గట్టెక్కాలా అని భగవంతుని ప్రార్ధించింది. ద్రౌపది " అమ్మా! నన్ను వదిలి పెట్టు. మధిరను తీసుకురావటానికి వేరొకరిని పంపు. నేను మీకు నీచపు పనులు చేయనని చెప్పాను. మీ గృహం అతి నిర్మలమయినదని నా భర్తలు దూరంగా ఉన్నా మిమ్ము నమ్మి మీ ఇంట ఉన్నాను. మిమ్ము నమ్మిన నా వంటి అనాధను ఇలాంటి నీచపు పనులకు పంపడం భావ్యమా " అన్నది. సుధేష్ణ " మాలినీ! నేను మనసు పడి త్రాగాలని మద్యం తేవడానికి నిన్ను పంపుతున్నాను. ఇందుకు నీచజాతి వారిని పంపగలనా. మన స్నేహం ఇంతేనా అని తెలియకుంది " అని నిష్టూరంగా మాట్లాడింది. దేవుని మీద భారం వేసి ద్రౌపది కీచకుని ఇంటికి బయలుదేరింది. దారిలో ఆమె సూర్యునికి నమస్కరించి " ఓ సూర్య భగవానుడా! నేను పాండు పుత్రులను తప్ప అన్యులను మనసునైనా తలపనేని నాకు ఈ కీచకుని వలన ఎటువంటి ఆపద కలగ కుండా కాపాడు " అని ప్రార్ధించింది. సూర్యుడు కరుణించి ద్రౌపదికి రక్షణగా ఒక రాక్షసుని పంపాడు. అతడు అదృశ్య రూపంలో ద్రౌపదిని వెన్నంటి వస్తున్నాడు. ద్రౌపది తడబడే అడుగులతో కీచకుని ఇంట ప్రవేశించింది. కీచకుడు ఆమె రాకకోసమే ఎదురు చూస్తున్నాడు.



కీచకుని సభకు పాలు తేనెలను మోసుకు వెళుతున్న సైరంధ్రి

## ద్రౌపది విరాటుని కొలువులో ప్రవేశించుట



ద్రౌపది కీచకునితో " మాదేవి తృష తీరటానికి మధిర తీసుకు రమ్మంది. త్వరగా మధిరను ఇవ్వండి " అన్నది. కీచకుడు " మీ దేవి తృష్ణ తీర్చినట్లే నా తృష్ణ తీర్చవా " అన్నాడు. ద్రౌపది " ఆలస్యం అయితే మా దేవి కోపిస్తుంది. త్వరగా మధిరను ఇవ్వండి " అన్నది. కీచకుడు " మద్యం వేరే వాళ్ళతో పంపుతాను. నీవు ఈ మద్యంత్రాగి నా తాపాన్ని పోగొట్టు. నిన్ను నా రాణిని చేసుకుంటాను. అపారమైన మణిభూషణాలు, విలాస గృహాలు నీకు సమర్పిస్తాను. నా భార్యలను నీకు దాసిని చేస్తాను. నేను నీ కనుసన్నలలో మెలుగుతాను " అంటూ కీచకుడు ద్రౌపదిని పట్టుకోబోయాడు. అంతలో ద్రౌపదికి రక్షగా ఉన్న రాక్షసుడు ఆమెలో ప్రవేశించాడు. అంత బలాడ్యుడైన కీచకుని ఆమె విదిలించి కొట్టి బయటకు వచ్చింది. కీచకుడు ఆ మెను వెంబడించాడు.

విరాటుని సభలో ద్రౌపది - రాజా రవి వర్మ చిత్రం

ద్రౌపది పరుగెత్తి విరాటుని కొలువులో ప్రవేశించింది. కీచకుడు ఆమె వెంట కొలువులో ప్రవేశించి ఆమె జుట్టు పట్టుకుని లాగి కింద పడేసాడు. ఆ సమయంలో ఆమెలో ఉన్న రాక్షసుడు కీచకుని కొట్టి లాగి కింద పడవేసాడు. కీచకుడు ఆ బదెబ్బకు అవమానంతో కుంగి పోయాడు. ఆసమయంలో అన్నగారితో పాటు కొలువు కూటంలో ఉన్న భీముడు ఆగ్రహంతో ఊగి పోయాడు. ఒక్క క్షణం తమ అజ్ఞాత వాస విషయం మరిచాడు. కీచకుని పైన పట్టరాని కోపంతో వెంటనే పక్కన ఉన్న వృక్షాన్ని చూసి అలాగే అన్నగారి వైపు చూసాడు. ధర్మజుడు భీముని కను సైగతో వారించాడు. ధర్మరాజు విరాటునితో " మహారాజా! మన వంటల వాడు వలలుడు ఎక్కడ చూసాడో కాని వంట చెరకు కొరకు వేరు వృక్షాలు లేవా? ఫలపుష్పాదులతో ఉండి నలుగురికి నీడ నిచ్చే వృక్షాన్ని వంట చెరకు కొరకు ఖండించడం తగునా " అన్నాడు. భీముని కోపం ధర్మరాజు వారింపు ద్రౌపది చూసి విరాటునితో " అయ్యా! ధర్మాధర్మాలు తెలిసిన వారు, శత్రువులను అవలీలగా చంపగలిహిన వారు, గంధర్వులు అయిన నా భర్తలు అయిదుగురు నన్ను ఈ కీచకుడు అవమానిస్తుంటే చూస్తూ ఊరకున్నారు. ఇక సామాన్యమైన స్త్రీలకు రక్షణ ఏది. ఈ విరాటరాజు కొలువులో స్త్రీకి అవమానం జరుగుతుంటే ఎవరూ పలకరేమి? ఎవరికీ కరుణ లేదా? ధర్మరక్షణ చేయవలసిన రాజు ఇలా మిన్నకుండటం భావ్యమా? " అని సూటిగా ప్రశ్నించింది. అది చూసిన విరాటరాజు కీచకుని మందలించడానికి ధైర్యం లేక ద్రౌపదిని అనునయించాడు. అది చూసి కీచకుడు తన మందిరానికి వెళ్ళాడు. కలత చెందిన మనసుతో ధర్మరాజు ద్రౌపదిని చూసి " సైరంధ్రీ! నీకు న్యాయం జరుగుతుంది. నువ్వు అంతఃపురానికి వెళ్ళు. నీకు జరిగిన అవమానానికి నీ భర్తలు మాత్రం కోపించరా? ఇది సమయం కాదని ఊరకుండి ఉంటారు. నీ భర్తలను నిందించడం తగదు. కులస్త్రీ నిండు సభలో ఇలా మాట్లాడటం భావ్యమా " అన్నాడు. కాని ద్రౌపది అక్కడి నుండి కదలక ఏదో మాట్లాడాలని ప్రయత్నిస్తుంటే ధర్మరాజు " ఓ సైరంధ్రీ! ఏమిటిది పదిమందిలో నాట్యకత్తెలా నిలబడ్డావు. కులస్త్రీలకు ఇది తగదు " అన్నాడు. ద్రౌపది రోషంగా తల ఎత్తి ధర్మరాజును చూసి " ఓ కంకు భట్టా! నా భర్త ఒక నటుడు ఇది సత్యము. పెద్దల ప్రవర్తన చూసి పిన్నలు ప్రవర్తిస్తారు. నా భర్త నటుడు కనుక నేను నర్తకినే. నా భర్త నటుడే కాదు జూదరి కూడా. ఒక జూదరి భార్యకు గౌరవ మర్యాదలు ఎలా లభిస్తాయి ? " అంటూ ద్రౌపది సభ నుండి వెళ్ళి పోయింది.

## ద్రౌపది సుధేష్ణ వద్ద విలపించుట

ద్రౌపది తనను ఒక దూర్తుని ఇంటికి మదిరకు పంపిన సుధేష్ణకు తన బాధ చెప్పకోటానికి ఆమె మందిరానికి వెళ్ళింది. సుధేష్ణ ద్రౌపదిని చూసి కంగారు నటిస్తూ " మాలినీ ! ఏందుకు ఇలా ఉన్నావు. నిన్ను ఎవరేమి అన్నారు. ఏమి జరిగిందో చెప్పు వారి అంతు చూస్తాను " అన్నది. ద్రౌపది నిర్వేదంగా నవ్వి " అమ్మా ! అన్నియు తెలిసి కూడా ఇలా అడిగితే ఏమి చెప్ప గలను. నీవు కీచకుని ఇంటికి మధిర కోసం నన్ను పంపావు. అతను నన్ను పట్టుకోవడానికి ప్రయత్నించాడు. నేను పరుగెత్తాను. అతడు నన్ను వెంబడించి నా జుట్టు పట్టుకుని కొట్టాడు. ఇంతకంటే ఏమి చెప్పేది " అన్నది. సుధేష్ణ ద్రౌపదితో " ద్రౌపదీ! విచారించకు నేను ఆ కీచకుని దండిస్తాను " అని అనునయంగా అన్నది. ద్రౌపది సుధేష్ణతో " అమ్మా! తమరు అంతగా చింతించ పనిలేదు. నా భర్తలైన అయిదుగురు గంధర్వులు కీచకునిపై పగతీర్చుకుంటారు " అని పలికింది. ఆ మాటలు విన్న సుధేష్ణ భయప్రాంత అయింది. ద్రౌపదిని ఎన్ని విధాలుగానో ఓదార్చింది. ద్రౌపది కోపం తగ్గలేదు. అన్న పానీయాలు విసర్జించి తన నివాసమునకు పోయి రోదిస్తూ ఉంది.



విరాటుని భార్యతో సైరంధ్రి వేషంలోని ద్రౌపది

## ద్రౌపది భీముని సహాయం అర్ధించుట

ద్రౌపది మనసులో " కీచకుడు మహాబలవంతుడు. అతనిని చంపగలిగిన సామర్థ్యం భీమునికి మాత్రమే ఉందని తలచింది " తలచింది. ఆ రోజు అందరూ నిద్రపోతున్న సమయంలో భీముని వద్దకు వెళ్ళింది. హాయిగా నిద్రపోతున్న భీముని చూసి " ఆహా ! నన్ను అవమానించిన కీచకుడు హాయిగా నిద్రపోతున్నాడు. కాని అది చూసిన మీరు నిశ్చింతగా ఎలా నిద్రపోతున్నారు. అన్నగారు ఇది తగిన సమయం కాదని చెప్పాడనా " అనుకుంటూ అతడిని తట్టి లేపింది. భీముడు ఉలిక్కిపడుతూ నిద్రలేచి " ఎవరు? " అని అడిగాడు. ద్రౌపది " నేను మాలినిని " అన్నది. భీముడికు ద్రౌపది ఎందుకు వచ్చిందో అర్ధమైనా ఆమె నోట వినాలని " ఏమిటి ఇంత పొద్దుపోయి వచ్చావు?. ఎవరు చూడకుండా వచ్చావా? " అని అడిగాడు. ద్రౌపది " అన్ని తెలిసి నన్ను అడుగుతారేమి. నా నోట వినాలనుందా. విరాటుని బావమరిది కీచకుడు సుధేష్ణ ఇంటికి వచ్చినప్పుడు నన్ను చూసాడు. తడు నన్ను


భీముని సహాయం అర్థించుచున్న ద్రౌపది

మోహించి అనరాని మాటలాడి నన్ను అవమానించాడు. నేను అతనితో నా భర్తలైన గంధర్వులు నిన్ను హతమార్చగలరు జాగ్రత్త " అన్నాను. సుధేష్ణ పంపగా మధిర కోసం కీచకుని ఇంటికి వెళ్ళాను. అతను నన్ను పట్టుకోవాలనుకున్నాడు నేను అతనిని విదిలించి పరుగెత్తుతూ సభా మండపానికి వచ్చాను. అతడు నన్ను వెన్నంటి తరుముతూ వచ్చాడు. అలనాడు కురుసభలో దుశ్శాసనుడు నన్ను అవమానించాడు. అడవిలో సైంధవుడు అవమానించాడు. ఈ నాడు విరాటుని కొలువులో కీచకునిచే అవమానించబడ్డాను. ఈ అవమానాలు నాకు కొత్తగాదు. స్త్రీ ఆర్తనాదం విన్నా, గోమాత అరుపు విన్నా రక్షించడం వీరుల ధర్మం. నేను ఇలా విలపిస్తుంటే ధర్మరాజు చూస్తూ ఎలా ఉన్నాడు? " అన్నది. భీముడు " ద్రౌపదీ! కీచకుడు నిన్ను అవమానించడం చూసిన నన్ను ధర్మరాజు అడ్డుకోకపోతే విరాటునితో సహా కీచకుని అతని సైన్యాన్ని హతమార్చే వాడినే. కాని అజ్ఞాతవాసం భగం అయితే మరలా అరణ్యవాసం అజ్ఞాతవాసం ప్రాప్తించేవి. దీనికంతా కారణం నీవు నేను అని అందరూ మనలను నిందించరా. కనుక నన్ను నివారించిన ధర్మరాజును నిందించ వలదు. సమయం మించి పోలేదు. కీచకుని చంపి నీకు ఆనందం కలిగిస్తాను అదెంత పని. కాని అది బహిరంగంగా జరగరాదు. రహస్యంగా చేయాలి కదా " అన్నాడు. ద్రౌపది " నేను ఎవరికి భయపడ లేదు. అత్తగారు కుంతిని చూసి కాని భర్తలైన మిమ్మల్ని చూసి కాని భయపడ లేదు. కాని సుధేష్ణను చూసి భయం కలుగుతుంది. మూర్ఖుడైన కీచకుని వలన జరిగిన అవమాన భారంతో అన్నాను కాని విషయం తెలియక కాదు. ధర్మరాజుని నిందించడం నా అభిమతం కాదు " అన్నది.

#### ద్రౌపది భర్తల అవస్థలను తలచుకుని దు:ఖించుట

ఇంకా ధర్మరాజును గురించి ద్రౌపది ఇలా చెప్పింది. " భీమసేనా! రాజసూయ యాగ కర్త, అజాతశత్రువు, ధర్మనిరతుడనే పేరు ధర్మరాజుకే చెల్లింది కాని వెరెవరికి తగదు. అతని గంభీర్యం, కరుణ, నిత్య సత్యవ్రతం మరెవరికి ఉంటాయి. అతడు సామాన్య మానవుడు కాదు. అట్టి మహాత్ముడు ఒకరి కింద ఊడిగం చేస్తుంటే బాధగా ఉంది. కిమ్మీరుడు, బకాసురుడు మొదలైన రాక్షసులను చంపిన నీ లాంటి వీరుడు కట్టెలు కొట్టడం, వంటలు చేయడం ఎంత బాధాకరం. పరమేశ్వరుని మెప్పించి పాశుపతాన్ని సంపాదించిన అర్జునుడు పేడి రూపంలో అంతఃపుర కాంతలకు నాట్యం నేర్పుతుంటే చూడటానికి కూడా మనసు ఒప్పు లేదు. అత్యంత సుందరాంగుడు అరివీర భయంకరుడు అయిన నకులుడు ఒకరి కింద ఊడిగం చేస్తుంటే కన్నుల నీరు ఆగడం లేదు. అత్యంత సుకుమారుడైన సహదేవుడు పశువులను మేపుతుంటే దు:ఖభారం ఆగలేదు. తల్లి తండ్రుల ప్రేమాభిమానాలు పొంది, రాజసూయ యాగంతో పునీతనై కుంతీదేవి లాంటి మహానుభావురాలి మన్ననలందిన నేను నేడు సైరంధ్రిగా సామాన్యురాలిగా సేవిస్తున్నాను. భీమసేనా! కీచకుని వధించక పోతే నాకు మనశ్శాంతి లేదు " అని దు:ఖించింది. భీముడు " ద్రౌపదీ! నీవు ఇంతగా చెప్ప పని లేదు. రేపటి రోజున కీచకునికి నా చేతిలో చావు మూడింది. నీవు నిశ్చింతగా ఉండు. మన అజ్ఞాతవాసం ముగియనున్నది. రేపు నువ్వు కీచకుని కోర్కె అంగీకరించినట్లు నటించి అతనిని నర్తనశాలకు ఒంటరిగా రమ్మని చెప్పు. నేను అతనిని చంపుతాను. తెల్లవారబోతుంది ఇక వెళ్ళు " అన్నాడు.

### ద్రౌపది కీచకుని నర్తన శాలకు ఆహ్వానించుట

మరునాడు ఉదయం కీచకుడు నిద్రలేచాడు. కాలకృత్యాలు నిర్వర్తించాడు. ద్రౌపది మీది కోరిక కలిగింది. చక్కగా అలఖరించుకున్నాడు. ద్రౌపది కోసం సుధేష్ణ అంతఃపురానికి వెళ్ళాడు. సైరంధ్రిని చూడగానే అతని మనసు చలించింది. ధైర్యాన్ని, వివేకాన్ని కోల్పోయి ఆమె దగ్గరగా పోయాడు. భీముడు చెప్పిన మాటలు మననం చేసుకుంది ద్రౌపది. అతనిని చూసి చూడనట్లు నటించింది. కీచకుడు ద్రౌపదితో " మాలినీ ఈ తిరస్కారం ఏమిటి? నేనంటే ఇష్టం లేదా? అసలు మగాళ్ళంటేనే ఇష్టం లేదా? నా సంపదలకు నీవే రాణివి. ఈ రాజ్యాన్నలే విరాటరాజు పేరుకు మాత్రమే రాజు. నేనే అతనికి కూడు పెడుతున్నాను. ఈ రాజ్యంలో ప్రజలందరూ నన్నే రాజుగా ఆరాధిస్తారు. ఈ రాజ్యంలో ప్రజలెవరికీ నా మాట కాదనే ధైర్యం ఎవరికీ లేదు " అన్నాడు. ద్రౌపది కొంచం మెత్తబడినట్లు నటించి " కీచకా! ఎంత కాదన్నా వినకుండా నా మీద మనసు పారేసుకున్నావు. నీలాగే ఎదుటి వారూ మనసు పారేసుకుంటారు కదా. మీరి పురుషులు కనుక బయట పడతారు కాని మగువలు అలా కాదు కనుక కీచకా రహస్యంగా కలుసుకుంటే నీ కోరిక తీరగలదు " అంటూ నమ్మబలికింది ద్రౌపది. కీచకుడు ఆనందపరవశుడై " మాలినీ నీ మనసు తెలిసింది కదా మరి నా కోరిక ఎప్పుడు ఎలా తీరుస్తావో చెప్పు " అని అడిగాడు. ద్రౌపది

" ఈ రోజు ఒంటరిగా నర్తనశాలకురా " అన్నది. కీచకుడు " మాలినీ! నీ అనుమతి ప్రకారం ఒంటరిగా నర్తనశాలకు వస్తాను. మాట మీద ఉండు " అన్నాడు. ద్రౌపది " నీవు ఒక్కడివే రావాలి. లేకుంటే నేను వెడలి పోవుట నిశ్చయం. ఇక మనమిరువురము ఇక్కడ ఉండుట భావ్యం కాదు వెళ్ళి పొండి " అన్నది.

## కీచక వధ

కీచకుడు వెళ్ళగానే ద్రౌపది వంటశాలకు వెళ్ళింది. అక్కడ భీమునితో " నేను నాపని పూర్తి చేసాను. ఇక మీ పని మీరు పూర్తి చెయ్యండి. ఈ రాత్రికి కీచకుని చంపాలి ఎలా చంపుతారో చెప్పండి " అన్నది. భీముడు ద్రౌపదితో " ద్రౌపదీ! నీవు కీచకుడు ఏమి మాట్లాడుకున్నారో చెప్పు" అని అడిగాడు. ద్రౌపది జరిగినది చెప్పగానే అది విన్న భీముడు ఆహ్లాదం పొందాడు. భీముడు " ద్రౌపదీ ! ఇక చాలు ఆ కీచకుని మీద పగ తీర్చుకుంటాను కాని అతడు చెప్పినట్లు ఒంటరిగా వస్తాడా! లేక బుద్ధిహీనుడై అందరికి చెప్తాడా? అయినా ఎందుకు చెబుతాడులే. వాడు నర్తనశాలకు తప్పక వస్తాడు. నిశ్చలంగా పడుకున్న నన్ను తడిమి చూస్తాడు. నీవు కాదని తెలిసుకుంటాడు. నేను ఒడిసి పట్టుకుని వాడి అంతు చూస్తాను. వాడు నా చేతిలో హతం కావడం నిశ్చయం ద్రౌపదీ! ఇక నీవు నిశ్చింతగా ఉండు " అన్నాడు. భీముని ఆవేశం చూసి ద్రౌపది భయపడింది. కోపావేశంలో గుట్టు బయటపడి అజ్ఞాతవాస భంగం ఔతుందేమో అనుకున్నది. ద్రౌపది " భీమసేనా! కోపావేశంలో గుట్టు రట్టు చేయకు ధర్మరాజాదులు అజ్ఞాతవాస భంగానికి మనమే కారణమని నిందిస్తారు. కార్యాన్ని అతి గుప్తంగా పూర్తి చేయాలి " అన్నది. భీమసేనుడు " ద్రౌపదీ !వాడు ఎదిరించి నిలబడితే ఇది రహస్యంగా చేయాలని గుర్తుంటుందా. అయినా నీవు చెప్పినట్లు రహస్యంగా చంపడానికి ప్రయత్నిస్తాను " అన్నాడు. ద్రౌపది " సుధేష్ణ నా కొరకు వెతుకుతుంటుంది నేను పోయి వస్తాను " అని వెళ్ళి పోయింది.

### కీచకుడు, ద్రౌపది, భీమసేనుడు రాత్రి కొరకు ఎదురుచూచుట

కీచకుడు మనసు పరి పరి విధాల తపిస్తుంది అతడు మనసులో " అయ్యో ! ఎంతకీ రాత్రి కాదేమి. మాలిని వస్తుందో రాదో, వచ్చినా ఏమంటుందో, రాత్రిలోగా మనసు మారుతుందేమో, ఆమెకు అయిదుగురు గంధర్వులు భర్తలుగా ఉన్న మాట నిజమేనా, మాలిని వచ్చే వేళకు సుధేష్ణ ఏదైనా పని చెప్తుందేమో అనుకున్నాడు. మరలా మాలిని ఎందుకు రాదులే అంత కఠినాత్మురాలా . ఆమె వచ్చే ముందు నేనే ఆమెను తీసుకు రావచ్చు కదా " అనుకున్నాడు. కీచకుడు ఉద్యానవనంలో విహరిస్తూ అస్తమించనందుకు సూర్యుని నిందించాడు. తన కోసం బ్రహ్మ రాత్రి రాకుండా పగలే ఉంచాడని అనుమాన పడ్డాడు. ఎట్టకేలకు సూర్యుడు అస్తమించాడు. చంద్రోదయం అయింది ద్రౌపది కూడా సమయం కోసం ఎదురుచూస్తూ ఉంది. చంద్రుడు కూడా అస్తమించాడు. బాగా పొద్దు పోగానే ద్రౌపది వంటశాలకు వెళ్ళి సమయం ఆసన్నమయినదని భీమసేనుని తొందర పెట్టింది. భీముడు ఒక చీరని తలపాగాలా చుట్టుకుని నర్తనశాలకు బయలుదేరాడు. ద్రౌపది అతనిని అనుసరించింది.

### నర్తనశాల

ఇద్దరూ నర్తనశాలను చేరుకున్నారు. నర్తనశాలలో ఒక పక్కగా ఉత్తర పడుకునే పాన్పు మీద భీముడు పడుకున్నాడు. ద్రౌపది పక్కనే కనపడకుండా దాక్కున్నది. ఇంతలో కీచకుడు మద్యం సేవించి మత్తుగా అక్కడకు వచ్చాడు. మాలిని అప్పటికే అక్కడికి వచ్చి ఉంటుందని అనుకున్నాడు. మంచంలో పడుకున్న భీముని చూసి పిచ్చివాడై తన చేతిని ఆ శయ్య పై వేసాడు. భీమునికి పట్టరాని కోపం వచ్చింది. కీచకుడు భీమునిపై చేయి వేసి " మాలినీ! నీ కోసం ఎన్నో కానుకలు తెచ్చాను. ఇంత వరకు నా కోసం వచ్చే స్త్రీలు నాకు కానుకలు సమర్పించే వారు. నన్ను చూసిన స్త్రీలు మరొకరిని కన్నెత్తి చూడరు. నా కోసమే తపిస్తారు. అలాంటిది నేను నీకోసం తపిస్తున్నాను " అన్నాడు కీచకుడు. భీముడు కూడా స్త్రీ సహజమైన గొంతుతో " మిమ్మల్ని మీరు పొగుడు కుంటున్నారు కాని అసలు నా వంటి స్త్రీ మీకు దొరుకునా. నా సరీరానికి నీశరీరం తగిలినప్పుడు కలిగే అనుభూతి తెలుసుకుంటావులే. నన్ను తాకిన నీకు మరొకరిని తాకే పని ఉండదులే . నన్ను తాకిన ఫలితం అనుభవిస్తావులే " అని తటాలున పైకి లేచాడు. కీచకుని తల పట్టుకుని వంచాడు. కీచకుడు మాలిని భర్త గంధర్వుడు వచ్చాడు అనుకున్నాడు. భీముని పట్టు విడిపించుకుని కింద పడవేసి మోకాళ్ళతో అదిమాడు.


పోరాడుతున్న కీచక భీములు

### కీచక భీములపోరాటం


కీచకుని వధ

ఇరువురి మధ్య భయంకర యుద్ధం సాగింది. ఒకరిని మించి ఒకరు పోరాడుతున్నారు. ఇరువురిలో కొంత భయం ఉంది పరువు పోతుందని కీచకుడు అజ్ఞాతవాస భంగం ఔతుందేమోనని భీముడు మౌనంగా యుద్ధం చేస్తున్నారు. క్రమంగా కీచకుని బలంతగ్గి పోయింది భీన్మసేనుని బలం ద్విగుణీకృతం అయింది. ఆ విషయం గ్రహించిన భీముడు కీచకుని ఉదరభాగంలో భయంకరంగా పొడిచాడు. ఆ దెబ్బకు కీచకుడు విలవిలా తన్నుకున్నాడు. కీచకుని దారుణంగా చంపాలనుకున్న భీముడు కీచకుని తలని, కాళ్ళను, చేతులను మొండెంలోకి జొనిపి నేల మీద వేసి పొర్లించి నలిపి మాంసం ముద్దగా చేసాడు. కీచకుడు మరణించాడు. భీముడు ద్రౌపదిని పిలిచి కీచకుని శవాన్ని చూపించాడు. ద్రౌపది ఆనందంగా చూసింది. ఆమె మనసులో " కీచకా! ఇందుకా ఈ సుఖం పొందటానికా ఇంతగా ఆరాట పడ్డావు " అనుకున్నది. భీముడు " ద్రౌపదీ! నీ మాట నెరవేర్చాను ఆనందమేగా. నిన్ను ఎవరైనా దుర్బుద్ధితో చూస్తే వారికి నా బుజబలంతో ఇలాంటి మరణాన్ని ప్రసాదిస్తానని తెలుసుకున్నావా. నీ మనసు శాంతించింది కదా " అన్నాడు. ద్రౌపది ఆనందంతో " నిన్న కొలువులో కీచకుడు నన్ను అవమానించినప్పుడు నీవు చూపిన నిగ్రహం మెచ్చతగినది. ఈ నాడు ఇలా మరొకరి సాయం లేక కీచకుని వధించిన నీ శౌర్యం కొనియాడ నా తరమా భీమసేనా " అన్నది. ద్రౌపది మాటలకు భీముడు పొంగి పోయాడు. అతనిలో వివేకం మేలుకొంది. ద్రౌపదీ " ఇక నేను ఇక్కడ ఉండటం మంచిది కాదు వెళుతున్నాను" అని చెప్పి వడివడిగా వంటశాలవైపు వెళ్ళాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | |

# విరాట పర్వము తృతీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



## తృతీయాశ్వాసం

కీచకుని వధించిన భీముడు వంటశాలను చేరాడు. శరీరాన్ని శుభ్రంగా కడిగాడు. ఒంటికి రక్త వాసన వాసనలు తెలియకుండా పూత పూసాడు. తన శయ్యపై కూర్చున్నాడు. ద్రౌపది తన భర్త క్షేమంగా చేరుకున్నాడని దృవపరచుకుని అక్కడ ఉన్న కావలి వాళ్ళను పిలిచింది. వారితో " నా భర్తలైన గంధర్వుల వలన ఇతడు ఎలాంటి దుర్గతి పాలయ్యాడో చూడండి " అన్నది. వారు అది విని కలవపడి పెద్దగా అరచుకుంటూ నర్తనశాలలోకి ప్రవేశించారు.

### ఉపకీచకుల వధ

కావలి వాళ్ళ అరుపులు విని ఉపకీచకులు అక్కడకు చేరుకున్నారు. అక్కడ మాంసపు ముద్దలా పడి ఉన్న కీచకుని చూసి పెద్దగా దొర్లుతూ ఏడ్చారు. ఇంతలో వారి బంధువులు కూడా అక్కడికి వచ్చారు. వారిలో వారు " ఎన్నో చావులు చూసాము కాని ఇలాంటి వింత చావు చూడలేదు. అసలు వీడికి చేతులు ఏవి? కాళ్ళు ఏవి ? గంధర్వులు ఇలాగే చంపుతారేమో. ఎందరినో యుద్ధ భూమిలో జయించిన సింహబలుని బలం ఎందుకూ కొరరానిదైంది కదా " అనుకున్నారు. ఉపకీచకులలో ఒకడు " ఎంత సేపు ఏడ్చినా పోయిన వాడు తిరిగి వస్తాడా. ఇతనికి అంత్య క్రియలు చేస్తాము " అన్నాడు. మిగిలిన కీచకులు

సరే అన్నారు. ద్రౌపది వారికి దగ్గరగా నిలబడి వారు ఏమి చేస్తున్నారో చూస్తూ ఉంది. ఆమెను చూసిన కీచకులు కోపంతో రెచ్చి పోయారు. తమ అన్న మరణానికి కారణం ఆమె అని అనుకున్నారు. ఒక్కసారిగా ద్రౌపది మీదకు దూకి ఆమెను పట్టుకున్నారు. ఆమె చేతులు వెనక్కు విరిచి కట్టారు. వారు " దీని వలనే దీని అందం చూసి మోహించే కీచకుడు మరణించాడు. అంతటికీ కారణం ఈమే కనుక ఈమె ఇక బ్రతుక కూడదు. అన్న శవంతో చేర్చి కాల్చి వేయాలి " అని నిర్ణయించారు. తమ నిర్ణయాన్ని విరాటరాజుకు తెలిపి అతని అనుమతి తీసుకోవడానికి వెళ్ళారు. అప్పటికే కీచకుని మరణవార్త విన్న విరాటుడు కీచకుని మరణానికి ఎంతో దు:ఖిస్తున్నాడు. " మహారాజా! మేము ఈ సైరంధ్రిని కీచకుని శవంతో చేర్చి దహనం చేయాలని అనుకున్నాము ఇందుకు మీరు అనుమతించాలి " అని అడిగారు. విరాటుడు " మీకు తోచని విధంగా చేయండి " అని చెప్పాడు. ఉపకీచకులు ద్రౌపదిని ఈడ్చుకు వెళ్ళి కీచకుని శవంతో కట్టారు. అందరూ శ్మశానానికి బయలుదేరారు. అనుకోని ఈ పరిణామానికి ద్రౌపది కలత చెందింది. ఆపత్సమయంలో ఒకరిని ఒకరు పిలుచు కోవడానికి పాండవులు నిర్ణయించుకున్న మారు పేర్లతో ద్రౌపది భర్తలను ఎలుగెత్తి పిలువ సాగింది. " జయా! జయంతా! విజయా! జయత్సేనా! జయత్బలా! నన్ను ఈ దుర్మార్గులు కీచకుని శవంతో కట్టి దహనం చేయడానికి తీసుకు పోతున్నారు. రక్షించండి " అని తన రక్షణ కోసం పెద్దగా ఏడుస్తూ పాండవులను పిలిచింది. ద్రౌపది కేకలు భీముని చేరాయి. భీముడు ఆగ్రహోదగ్రుడై వారికంటే ముందుగా శ్మశానం చేరాడు. ఒక పెద్ద చెట్టును మొదలంటా పెకిలించి భుజంపై పెట్టుకుని ఉప కీచకుల రాకకై ఎదురు చూస్తున్నాడు. శ్మశానం చేరుకున్న ఉపకీచకులు భయంకరాకారంతో నిలబడి ఉన్న భీముని చూసి గంధర్వుడు వచ్చాడనుకుని భయపడి శవాన్ని అక్కడే వదిలి పారిపోయారు. భీముడు వారిని తరిమి తరిమి కొట్టి సంహరించాడు. తరువాత ద్రౌపదిని విడిపించి " త్వరగా సుధేష్ణ మందిరానికి వెళ్ళు " అని ద్రౌపదికి చెప్పి తాను వడివడిగా వంటశాల చేరుకున్నాడు.

## సైరంధ్రీ బృహన్నలలు కలుసుకొనుట

ఉపకీచకుల మరణ వార్త విన్న విరాటుడు తన భార్య సుధేష్ణ వద్దకు వెళ్ళి " సుధేష్ణా! ఈ ఎలాగైనా ఇక్కడి నుండి బయటకు పంపు. ఆమె ఇక్కడ ఉంటే మగవాళ్ళు ఆమె పక్కకు పోతేనే ప్రమాదంలో చిక్కు కుంటున్నారు. ఆమె ఇక్కడ ఉంటే మరింత అనర్ధాలు జరిగేలా ఉంది. నా మాటగా చెప్పి ఆమెను పంపించు " అన్నాడు విరాటుడు. శవాన్ని తాకిన మైల పోవడానికి ద్రౌపది సచేల స్నానం చేసింది. సుధేష్ణ మందిరానికి చేరటానికి పురవీధులలో నడిచి వస్తుండగా ప్రజలు ఆమెను చూసి భయభ్రాంతికి లోనయ్యారు. " ఈ మెను కోరిన కీచకుడంతటి వానికే ఈ గతి పట్టింది ఇక మనమెంత ? " అంటూ ఆమెను చూడటానికే భపడ్డారు. వంటశాలను సమీపించిన ద్రౌపది ఎవరికీ అర్ధం కాకుండా " కీచకుల బారి నుండి నన్ను రక్షించిన నా గంధర్వ పతికి నమస్కరిస్తున్నాను " అన్నది. భీముడు కూడా అలాగే ఎవరికీ అర్ధం కాకుండానే " ఆపదలో ఉన్న భార్యను రక్షించడం భర్త కర్తవ్యం కదా దానికి పొగడ్త ఎందుకు " అన్నాడు. ద్రౌపది అక్కడి నుండి నర్తనశాలకు వెళ్ళింది. నాట్యం నేర్చుకుంటున్న కన్యలను చూస్తూ నిలబడింది. ఆమెను చూసిన కన్యలు " అయ్యో ఆ కీచకుడు ఇంత పని చేసాడా. తగిన శాస్తి జరిగింది. ఉప కీచకులు నిన్ను కీచకుని శవంతో కట్టి తీసుకు పోవడం ఏమిటి? నీ భర్తలచే వారికీ తగిన శాస్తే జరిగిందిలే " అన్నారు. ఆమెను చూసిన బృహన్నల " మాలినీ ఏమి జరిగిందో వివరంగా చెప్పు " అని అడిగాడు. ద్రౌపది " బృహన్నలా ! అంత:పురంలో కన్యలకు ఆటపాటల నేర్పుకుంటున్న నీకు ఈ సైరంధ్రికి ఏమి జరిగినా పట్టదు కదా. అందుకే ఏమి జరిగిందని అడుగుతున్నావు " అన్నది. బృహన్నల " అయ్యో ! సైరంధ్రీ నీవు పడుతున్న కష్టాలు తెలిసినా నిన్ను ఆదుకోలేని పుట్టుక నాది. ఏమి చెయ్యగలను మనసులో నేను పడే బాధ ఎవరికి తెలుస్తుంది చెప్పు ? నీవు ఏ అపరాధం చేయవని నేనెరుగనా నీ కష్టాలు నన్ను బాధించవా " అని నిగూఢంగా అన్నాడు బృహన్నల. ద్రౌపది " అయ్యో ! నీ సంగతి నాకు తెలియనిదా. అంత:పురంలో నీవు నీకు తగిన విధంగా ఉండటమే నాకు కావలసింది " అన్నది ద్రౌపది.

## ద్రౌపది సుధేష్ణను మరికొంత గడువు కోరుట



ఆమె మిగిలిన అంత:పుర కాంతలతో చేరి సుధేష్ణ మందిరంలో ప్రవాశించింది. సుధేష్ణ ఆమెను సాదరంగా ఆహ్వానించి తన పక్కన కూర్చొబెట్టుకుంది. ఆమె ద్రౌపదితో " సైరంధ్రీ! నీవు చక్కని దానవు. కాని మగవాళ్ళు ఏమాత్రం నిగ్రహం లేని వాళ్ళని విరాటరాజు భయపడుతున్నాడు. నీ భర్తలైన గంధర్వులు నిన్ను చూసినంతనే మగవాళ్ళను హతమారు స్తున్నారు. ప్రజలు నిన్ను చూస్తేనే భయపడుతున్నారు. విరాటరాజు నిన్ను నువ్వు కోరిన చోటికి పంపమని తన మాటగా నాకు చెప్పాడు. కనుక నీవు మా దేశం విడిచి ఎక్కడికైనా వెళ్ళు " అన్నది. ద్రౌపది " అమ్మా ! సుధేష్ణా ఇక పదమూడు రోజులు మాత్రం నన్ను ఎప్పట్లా మీ ఇంట ఉండనివ్వండి చాలు. అంతటితో నా వ్రతం పూర్తి ఔతుంది. ఆ

తరవాత నా భర్తలు మీకు కనిపించి మీ కోరిక తీరుస్తారు. వారు దయామయులు పరోపకార పరాత్పరులు. వారికి ఉపకారం చేసిన విరాటునికి వారు ప్రత్యుపకారం చేయడానికి ప్రయత్నిస్తారు. కనుక సందేహించకు. ఇంత కాలం నన్ను మీతో సమానంగా ఆదరించి ఇప్పుడు విడిచి పెట్టడం భావ్యమా " అని వేడుకుంది. ద్రౌపది మాటలకు చలించిన సుధేష్ణ " మాలినీ! నీ వ్రతం పూర్తయ్యే వరకు నా ఇంట ఉండవచ్చు. నా భర్తను, కుమారుని రక్షించుము. నీవు ఇక అంతఃపురం దాటి రావద్దు. నీకు కావలసినవన్ని నేను సమకూరుస్తాను " అని పలికింది. మత్స్యదేశంలో ప్రజలు జరిగిన ఉదంతం గురించి నానా విధాలుగా అనుకుంటున్నారు. " అత్యంత బలశాలి అయిన విరాటుని బావమరిది ఒక్క ఆడదాని కోసం గంధర్వుని చేతిలో మరణించాడు " అనుకోసాగారు.

సుధేష్ణను కలసిన ద్రౌపది

## దుర్యోధనుడు పాండవుల జాడకై ప్రయత్నించుట


పాండవులను వెతుకుటకు అంగీకరించుచున్న భీష్ముడు

హస్థినలో దుర్యోధనుడు చారుల ద్వారా ఈ విషయం విన్నాడు. వెంటనే సభ ఏర్పాటు చేసాడు. దుర్యోధనుడు " పాండవులు అరణ్యవాసం అజ్ఞాత వాసం ముగించుకుని రాజ్యభాగాన్ని అడగక ముందే వారిని తిరిగి అరణ్యాలకు పంపే మార్గం ఆలోచించండి " అని దుర్యోధనుడు తన మంత్రులను ఆదేశించాడు. కర్ణుడు లేచి " సుయోధనా ! మనం వేలకొలది చారులను మారు వేషాలలో దేశం నలుమూలలకు పంపుదాం. వారు తప్పకుండా పాండవులను గుర్తిస్తారు " అన్నాడు. దుశ్శాసనుడు లేచి " పాండవుల గురించి నీవు భయపడవలసిన పని లేదు. వారు ఎప్పుడో అడవులలో కౄరమృగాలకు బలి అయి ఉంటారు. వారిని గురించి ఆలోచించడం అనవసరం " అన్నాడు. ద్రోణుడు లేచి " సుయోధనా! పాండవులకు ఆపద కలగడం అసంభవం. కనుక వారిని వెతికించే ఏర్పాట్లు ముమ్మరం చెయ్యండి " అన్నాడు. భీష్ముడు " సుయోధనా ! ద్రోణాచార్యులు చెప్పింది సత్యం. పాండవులు బాహుబలంలోనూ, బుద్ధిబలంలోనూ అసమానులు. దైవబాలం కూడా తోడైంది కనుక వారికి ఆపద కలుగుట అసంభవం. నాకు పాండవులు మీరు సమానులు కాని అడిగావు కనుక చెబుతున్నాను. పుణ్యత్ముడైన ధర్మరాజు ఏ రాజ్యంలో ఉంటే అక్కడ సుభిక్షంగా ఉంటుంది. అక్కడి ప్రజలు ధర్మవర్తనులై ఉంటారు. అక్కడ పశుసంపద అభివృద్ధి చెందుతాయి. కనుక అలాంటి దేశాన్ని గుర్తించి అక్కడ వెదికించడం మంచిది " అన్నాడు. అది విన్న కృపాచార్యుడు " ఆలస్యం చేయకుండా వెదికించడం మంచిది. పాండవులు అరణ్యవాసం పూర్తి చేసారు. అజ్ఞాత వాసం దాదాపు పూర్తి అయింది. పగవాడు అల్పుడైనా అతని పట్ల అప్రమత్తంగా ఉండాలి. పాండవులు మహా బలవంతులు పైగా సుయోధనునిపై కోపంగా ఉన్నారు. కనుక వారితో సంధి చేసుకొనుట సముచితం. లేకున్న యుద్ధం అనివార్యం. పాండవులు సంధికి అంగీకరించకున్నా యుద్ధం తప్పదు. వారు అరణ్యాలలో మరణించారనుకున్నా వారి మిత్రదేశరాజులు మనపై దండెత్తే అవకాశం ఉంది కనుక మనం సైన్యాన్ని సమాయత్త పరచడం మంచిది " అన్నాడు. దుర్యోధనుడు అందరి మాటలను సావధానంగా విని సభను ఉద్దేశించి " కీచకుడు, భీముడు, శల్యుడు, బలరాముడు అసమాన బలాఢ్యులు. వీరితో వోలిన వారు భూమిలో ఎవరూ లేరు. వారిలో వారే ఒకరిని ఒకరు గెలవాలి. మత్స్యదేశ సైన్యాధ్యక్షుడు కీచకుని గంధర్వుడెవరో చంపాడని తెలిసింది. ఒక కాంత కారణంగా చంపారు అని తెలిసింది. కీచకుని చంపాలంటే మిగిలిన ముగ్గురిలో ఒకరు చంపాలి. బలరాముడు , శల్యుడు మత్స్య దేశానికి దూరంగా ఉన్నారు కనుక వారు చంపలేరు. ఉపకీచకులతో చేర్చి కీచకుని వధించిన గంధర్వుడు అజ్ఞాతవాసంలో ఉన్న భీముడై ఉండచ్చు. ఆ కాంత ద్రౌపది కావచ్చు. తాతగారైన భీష్ముడు చెప్పిన లక్షణాలు మత్స్య దేశంలో కానవస్తున్నాయి. కనుక మనం పాండవుల కొరకు మత్స్యదేశంలో వెదకడం మంచిది. విరాటుడు మన శత్రువు కనుక అతని గోధనాన్ని అపహరిస్తే పాండవులు అతనికి సహాయంగా బయటికి వస్తారు. సమయభంగం అయినదని వారిని గుర్తించి తిరిగి అరణ్యవాసానికి పంపచ్చు. పాండవులు లేకున్నా అతని సంపదనంతా కొల్లగొడతాము కనుక మనకు ఎలాగైనా లాభమే. ఇది అందరికి సమ్మతమైతే యుద్ధప్రయత్నాలు చేయండి " అన్నాడు.

## దుశ్శాసనుడి వ్యూహం

దుర్యోధనుని మాటలు విన్న త్రిగర్త దేశాధిపతి " సుయోధన సార్వభౌమా! ఇంతకు పూర్వం కీచకుడు నన్ను యుద్ధంలో గెలిచాడు. అతడు మరణించి నందున అతనితో యుద్ధం చేసే వీలు లేదు. నన్ను విరాటుని మీదకు యుద్ధానికి పంపండి.

నేను విరాటుని ఓడించి అతని పశుధనం పట్టుకొస్తాను. అలాగే పాండవుల జాడ తెలుసుకొస్తాను " అన్నాడు. అది విన్న కర్ణుడు " సుయోధనా! త్రిగర్త దేశాధీసుడు ఉచితముగా చెప్పాడు. అందుకు మీరు అనుమతి ఇవ్వండి " అన్నాడు. సుయోధనుడు ఆలోచించి చూసి దుశ్శాసనునితో " ఈ సభలోని పెద్దలు నీకు అనుమతి ఇచ్చారు. మన సైన్యాలను సిద్ధం చెయ్యి. ముందురోజు సుశర్మ విరాటుని మీదకు యుద్ధానికి వెళతాడు. మరునాడు మనం విరాటుని మీదకు యుద్ధానికి వెళతాము " అని సుయోధనుడు అన్నాడు. దుశ్శాసనుడు అలాగే అన్నాడు. దుర్యోధనుడు తన వ్యూహాన్ని ఇలా వివరించాడు. " ముందుగా సుశర్మ తన బలగాలతో వెళ్ళి ఒక వైపు గోవులను మళ్ళిస్తాడు. విరాటుడు సుశర్మతో యుద్ధానికి దిగుతాడు. మరునాడు మనం మరొక వైపు నుండి విరాటుని గోవులను పట్టుకుందాం. అప్పుడు గత్యంతరం లేక పాండవులు మనతో యుద్ధానికి వస్తారు " అంటూ సుశర్మను చూసి " రాబోయే బహుళ అష్టమి నాడు నీవు నీ సేనతో విరాటుని గోగణాన్ని అపహరించు. మేము మరునాడు వేరొక వైపు నుండి విరాటుని గోవులను పట్టుకుంటాము " అన్నాడు. అందరూ యుద్ధానికి సిద్ధం అయ్యారు కాని అప్పటికే పాండవుల అజ్ఞాతవాసం పూర్తి అయిందని ఎవరూ ఊహించ లేదు.

### దక్షిణ గోగ్రహణం

సుశర్మ తన సైన్యాలతో మత్స్యదేశం పై దండెత్తాడు. చారుల వలన గోసమూహాలు ఎక్కడ ఉన్నాయో తెలుసుకుని వాటిని పట్టుకోవడానికి ముందుకు సాగాడు. గోసమూహాలను చేరి వాటిని మళ్ళిస్తున్నాడు. గోరక్షకులు సుశర్మతో పోరాడుతున్నారు కాని సుశర్మ సైన్యాల ధాటికి ఆగలేక పోతున్నారు. వారంతా విరాటుని వద్దకు పరుగెత్తారు. విరాటడు వారిని చూసి కలవర పడ్డాడు. వారు " మహారాజా ! సుశర్మ తన సేనలతో వచ్చి మన గోసమూహాలను మళ్ళించుకు పోతున్నాడు. తమరు వచ్చి కాపాడాలి " అన్నారు. అది విన్న విరాటుడు ఆశ్చర్య పోయి ఇలా అన్నాడు. " మీరు చెప్పేది నిజమా. మన చేతిలో చావు దెబ్బ తిన్న సుశర్మకు ఇంతలో ఇంత ధైర్యం ఎలా వచ్చింది " అంటూ మంత్రులను చూసి " ఇప్పుడు మనం మన సేనలను తీసుకు వెళ్ళి సుశర్మతో యుద్ధం చేయాలి. లేకుంటే మన పశుధనం మనకు దక్కదు. వెంటనే యుద్ధానికి సిద్ధం కండి " అన్నాడు.

#### విరాటుని యుద్ధసన్నాహం

విరాటుడు చారుల ద్వారా సుశర్మ గోగణాలతో ఎటు వెళుతున్నాడో తెలుసుకుని అటు వైపు తన సేనలను నడిపించాడు. విరాటుని తమ్ముళ్ళు శతానీకుడు, మదిరాశ్వుడు, సూర్యదత్తుడు తమతమ సేనలతో విరాటుని వెంబడించారు. విరాటుని కుమారుడు శంఖుడు కూడా తన శంఖాన్ని భయంకరంగా పూరిస్తూ యుద్ధానికి సిద్ధం అయ్యాడు. ఈ సమర సన్నాహాలను చూసిన ధర్మరాజు తతమ్ములను తీసుకుని విరాటుని వద్దకు వచ్చాడు. ధర్మరాజు విరాటునితో " మహారాజా నేను ఇది వరకు ఒక ఋషి వద్ద ఎన్నో శాస్త్రాలు అభ్యసించాను. నాకు యుద్ధం చేయడంలో నైపుణ్యం ఉంది. తమరు యుద్ధానికి వెళుతుంటే నేను ఊరకుండటం న్యాయమా నేను కూడా నీతో యుద్ధానికి వస్తాను " అన్నాడు. విరాటుడు అందుకు అంగీకరించాడు. వెంటనే ధర్మరాజు తన తమ్ములైన భీమ, నకుల, సహదేవులను రమ్మని సైగ చేసాడు. ధర్మరాజు విరాటునితో " మహారాజా ! ఇతడు మన వంటవాడు వలలుడు మల్లయుద్ధంలో నేర్పరని మీకూ తెలుసు మనకు యుద్ధంలొ అవసర పడగలడు. అలాగే మన అశ్వపాలకుడైన తామ్రగంధికి యుద్ధంలో ప్రావీణ్యం ఉంది. అలాగే గోరక్షకుడైన తంత్రీపాలునికి యుద్ధంలో నేర్పు ఉంది. అందుకని వీరిని కూడా యుద్ధానికి పిలుచుకు పోవడం మంచిది అని నాకు అనిపిస్తుంది " అన్నాడు. విరాటుడు శతానీకుని పిలిచి వారికి కూడా రధాలను సిద్ధ పరచమని చెప్పాడు.

#### సుశర్మ విరాటరాజుల యుద్ధం

అందరూ కలసి విరాటుడు సుశర్మ గోవులను మళ్ళించి వైపు సైన్యాలను నడిపించాడు. సుశర్మ సేనలను చేరుకున్నాడు. సుశర్మ సేనలకు విరాటుని సేనలకు ఘోరయుద్ధం జరిగింది. శతానీకుడు తన సేనలతో సుశర్మ సేనలను చుట్టు ముట్టాడు. మదిరాశ్వుడు తన సేనలతో సుశర్మ సేనలను నుగ్గు నుగ్గూ చేస్తున్నాడు. సూర్యదత్తుడు కూడా తన సేనలతో సుశర్మ సేనలను కకావికలు చేస్తున్నాడు. విరాటుడు కూడా యుద్ధరంగంలో ఎక్కడ చూసినా తానే అయి యుద్ధం చేస్తున్నాడు. విరాటుడు సుశర్మ రధాన్ని చూసాడు. విరాటుడు సుశర్మను ఎదుర్కొన్నాడు. ఇద్దరూ భీకరంగా పోరు సాగించారు. విరాటుని ధాటికి తాళ లేక సుశర్మ సేనలు తిరుగు ముఖం పట్టాయి. ఇంతలో సూర్యాస్తమయం అయింది. చీకట్లు అలుముకున్నాయి. కళ్ళు కనిపించక యుద్ధం ఆపివేసారు. కొంతసేపటికి చంద్రోదయం అయింది పండు వెన్నెల వచ్చింది. ఆ వెన్నెల వెలుగులో ఇరు పక్షాలు మరలా యుద్ధానికి సిద్ధ పడ్డాయి. సుశర్మ రెట్టించిన ఉత్సాహంతో యుద్ధానికి వచ్చాడు. విరాటుని సారధిని గుర్రాలను చంపి విరాటుని పట్టుకున్నాడు. తన రధం మీదకు విరాటుని లాగిన సుశర్మ పెద్దగా సింహనాదం చేసాడు. విజయ దుంధుభులు మ్రోగించారు.

## సుశర్మచేతిలో చిక్కిన విరాటుని పాండవులు విడిపించుట


సుశర్మను బాదుచున్న భీముడు

సుశర్మ విరాటుని పట్టుకున్నాడన్న వార్త అందరికీ తెలిసింది. ధర్మరాజు భీముని పిలిచి " భీమా! ఈ విరాటుని కొలువులో మేము తలదాచుకుని బ్రతుకు తున్నాము. సుశర్మ విరాటుని బంధీగా పట్టుకున్నాడు. అతన్ని విడిపించడం మన ధర్మం. సుశర్మను వెంబడించి విరాటుని విడిపించి తీసుకురా " అన్నాడు. భీమసేనుడు " అన్నయ్యా! అదెంత పని ఈ మద్ది చెట్టును పెకిలించి సైన్యాన్ని చావగొట్టి విరాటుని విడిపించుకు వస్తాను " అన్నాడు. ధర్మరాజు నవ్వి భీమసేనా " నువ్వలా చేస్తే నువ్వు భీముడవని అందరికి తెలిసి పోతుంది. మన అజ్ఞాత వాసం భంగం ఔతుంది. కనుక విల్లు అంబులతో యుద్ధం చెయ్యి. నకుల, సహదేవులు నీకు చక్ర రక్షకులుగా ఉంటారు " అని అన్నాడు. భీముడికి నిరాశ కలిగినా అన్న మాట ప్రకారం చెట్ల జోలికి పోకుండా " అన్నయ్యా! తమరు చెప్పినట్లే చేస్తాను నా భుజబలంతో శత్రువులను ఓడిస్తాను. విరాటుని తెచ్చి అప్పగిస్తాను " అన్నాడు. అంతట ధర్మరాజు తాను ముందుండి సేనలను నడిపించాడు. త్రిగర్త సైనికులు ఇది చూసి ధర్మరాజు పై కత్తులు బాణాలతో దాడి చేసారు. భీముడు శత్రువుల రధాలను విరగొట్టాడు, సారధులను చంపాడు. ధర్మరాజు సుశర్మను ఎదుర్కొని యుద్ధం చేస్తున్నాడు. ఇది చూసిన సుశర్మ రథంలో ఉన్న విరాటుడు పక్కనే ఉన్న గధ ఒకటి తీసుకుని రథం మీద నుండి కిందికి దూకి సుశర్మను మోదాడు. అదే అదనుగా తీసుకుని భీముడు సుశర్మ రథం మీదకు దూకాడు. సుశర్మను పట్టుకుని అతని చేతులు విరిచి పట్టుకుని గట్టిగా సింహనాదం చేసాడు. సుశర్మ సేనలు ఆశ్చర్య పోయాయి. సుశర్మ చక్రరక్షకులు పారి పోయారు. సుశర్మ సైన్యాలు వెనుదిరిగాయి. భీముడు వారిని వెంబడించి తరిమాడు. సుశర్మ తోలుకు పోతున్న పశువులను మళ్ళించాడు.

## విరాటుడు పాండవులకు కృతజ్ఞత చెప్పుట

అన్నగారు ధర్మరాజుతోను నకుల సహదేవులతోను భీముడు విరాటుని దగ్గరకు వచ్చాడు. విరాటుడు సంభ్రమాశ్చర్యాలతో వారిని అభినందనలతో ముంచెత్తాడు. విరాటుడు ధర్మరాజును చూసి " మీరు నా ధన, మాన, ప్రాణాలను కాపాడారు. అందుకు ప్రతిగా నేను ఏమిచ్చుకోగలను. నా రాజ్యాన్ని మీకు సమర్పించుకుంటాను. ఇది మీరు కాపాడిన శరీరం, ఈ రాజ్యం మీరు జయించింది. కనుక ఈ మత్స్యదేశాన్ని మీరే తీసుకోడి " అన్నాడు. ధర్మరాజు విరాటునితో " మహారాజా! ఇది మీకు మా మీద ఉన్న మర్యాద. మీరు విజయోత్సాహంతో మత్స్యదేశంలో విజయం చేయడం కంటే నాకు మరొక ఆనందం లేదు. నన్ను ఇంతగా పొగడ తగదు " అన్నాడు. విరాటరాజు ధర్మరాజుని చూసి " కంకా ! నాకు అర్ధం కానిది ఒకటి ఉంది. నువ్వు చేసింది నాకు ఉపకారమా లేక నావద్ద ఉన్నందుకు సేవాతత్పరతా ! నాపై కృతజ్ఞతా ! లేక నాపై కృపా ! లేక శత్ర సంహార మొనర్చి నీవు కీర్తి పొందుదామనా? ఏ కారణంతో నీవు ఈ శత్రు సంహారం చేసావు. అయినా వంటల వాడేమిటి? అతని పరాక్రమం ఏమిటి? ఆ యుద్ధం చేయడమేమిటి? ఇతడే కదా నన్ను యుద్ధంలో గెలిచింది. ఈ అశ్వశిక్షకుడు, గోపాలకుడు వీరిద్దరే యుద్ధంలో గాయపడకుండా శత్రుసంహారం చేసింది. ఆపదలో ఉన్నప్పుడు సాయంచేసిన వాడే నిజమైన మిత్రుడు. కంకా ! నీ మైత్రిని నేను మరువలేను. మీ ఇష్టం వచ్చినవి కోరుకోండి గజములా ! అశ్వములా ! కాంచనమా! రత్నములా ! వజ్ర వైఢూర్యములా ! దేవతా కాంతల పోలు అందగత్తెలా ! నానావిధ భోగభాగ్యములా ! మీ ఇష్టం వచ్చినవి కోరుకోండి నేను మీకు సమర్పించుకుంటాను " అన్నాడు. అది విన్న పాండవులు " మహారాజా ! మీరు మమ్ము ఇలా గౌరవించడం మాకు ఎంతో ఎక్కువ. దీని కంటే మీరు ఇస్తానన్న కానుకలు ఎక్కు కాదు. మనం అందరం నగరానికి చేరుకున్న తరవాత మమ్ములను తగురీతిన సత్కరించండి " అన్నారు. ధర్మరాజు విరాటుని చూసి " మహారాజా ! నా దొక మనవి. మీరు కోరుకోమని చెప్పారు కనుక కోరుతున్నాను. ఈ సుశర్మను అతని బంధు మిత్రులతో ససైన్యంగా విడుదల చెయ్యండి. ఇదే నేను కోరుకొనేది. వెంటనే మన నగరంలో ఈ విజయ వార్తను ప్రకటించండి. విజయోత్సవాలు జరిపించండి " అని అన్నాడు. ధర్మరాజు కోరిన ప్రకారం విరాటుడు సుశర్మను అతని బంధుమిత్రులను ససన్యంగా విడుదల చేసాడు. ఆ రాత్రి అక్కడే గడిపి మరునాడు విరాట నగరానికి ప్రయాణ మయ్యారు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

"http://te.wikipedia.org/w/index.php?title=విరాట_పర్వము_తృతీయాశ్వాసము&oldid=760826" నుండి వెలికితీశారు

వర్గం: మహాభారతం

---

- ఈ పేజీకి 07:08, 25 సెప్టెంబర్ 2012న చివరి మార్పు జరిగినది.

# విరాట పర్వము చతుర్థాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



## చతుర్థాశ్వాసం

సుశర్మ తన సేనలతో విరాటుని గోవులను పట్టుకున్న మరునాడు ఉదయం దుర్యోధనుడు భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు

మొదలైన వీరులతో కలసి విరాటనగరం వైపు బయలుదేరాడు. విరాట నగరానికి కొద్ది దూరంలో ఉన్న విరాటుని పశు సంపదను ముట్టడించారు. అక్కడ ఉన్న కొద్ది పాటి సైన్యం అసంఖ్యాకంగా ఉన్న కౌరవ సైన్యాన్ని ఎదిరించ లేక పోయింది. విరాటుని గవాధ్యక్షుడు వెంటనే రథం తీసుకుని విరాట నగరానికి వెళ్ళాడు. ఆ సమయంలో నగరంలో ఉత్తర కుమారుడు మాత్రమే ఉన్నాడు. గవాధ్యక్షుడు " ఉత్తరకుమారా ! కురు సైన్యములు మన ఆవుల మందల మీద విరుచుకు పడ్డాయి. ఆవుల మందలను అపహరించుకుని పోతున్నాయి మీరు వెంటనే వచ్చి వారితో యుద్ధం చేసి ఆవులను రక్షించండి " అన్నాడు. తమరి తండ్రి విరాటరాజు తమపరాక్రమం గురించి, తమ బాహుబలం గురించి, తమరి శౌర్యపరాక్రమాల గురించి చెప్తూ తమరు ఈ భూభారాన్ని వహించడానికి తగిన వారని చెప్తుంటారు. తమరి పరాక్రమం ప్రదర్శించే సమయం ఆసన్నమైంది. వెంటనే బయలుదేరి మన ఆలమందలను రక్షించండి " అని ప్రార్ధించాడు.


ఉత్తర గోగ్రహణం

## ఉత్తరకుమారుని ప్రగల్భాలు

గవాధ్యక్షుని పొగడ్తలకు ఉత్తర కుమారుడు పొంగి పోయాడు. " గవాధ్యక్షా! నిజం పలికావు. నేను కౌరవ సేనలను చిత్తు చేసి ఆవుల మందలను క్షణంలో విడిపిస్తాను. కాని నాకు తగిన సారథి లేడు కదా! అందుకని బాధగా ఉంది. సమర్ధుడైన సారథి దొరికితే కౌరవ సేనలను జయించడం ఎంత పని. భీష్మ, ద్రోణ, కర్ణ, కృపాచార్య, అశ్వద్ధామలను నేను చీసే యుద్ధంతో అర్జునిని తలపింప చేసి ఆలమందలను విడిపించకుంటే నాతండ్రి నా పరివారం నన్ను మెచ్చుతారా. ఆలస్యం చేస్తే ఆలమందలను తోలుకు పోతారు. వెంటనే తగిన సారధిని వెతకండి " అన్నాడు. ఆ సమయంలో అక్కడ ఉన్న ద్రౌపది ఉత్తర కుమారుడు తనను తాను అర్జునినితో పోల్చుకోవడం చూసి నవ్వుకుంది. వెంటనే అర్జునిని దగ్గరకు వెళ్ళి పరిస్థితి వివరించింది. అర్జునుడు లెక్కలు వేసి చూసి అజ్ఞాతవాసం ముగిసిందని తెలుసుకున్నాడు. ఇక తమను తాము ఎరుక పరచుకొనే సమయం ఆసన్నమైనదని గ్రహించాడు. ద్రౌపదిని చూసి " నీవు పోయి మన బృహన్నలకు సారథ్యం చేయు సామర్ధ్యం కలదు. పూర్వం అర్జునినికి సారథ్యం వహించి అతనికి ఖాండవ వనదహనంలో సహాయం చేసి అతని ప్రశంశలందు కున్నాడు. అతని సహాయంతో కౌరవ సేనలను జయించడంలో సందేహం లేదని చెప్పి ఎలాగైనా అతనిని ఒప్పించు " అన్నాడు. ద్రౌపది వెంటనే వెళ్ళి ఉత్తరను కలుసుకుని " అమ్మా! మన రాకుమారుడు సారథి కొరకు వెతుకు తున్నాడు అని తెలిసింది. మీ గురువుగారు బృహన్నలకు రథం నడపడంలో అర్జునుడు మెచ్చుకునే సామర్ధ్యం ఉంది. ఖాండవ వన దహనంలోను ఇతర సమయాలలోను అర్జునునికి సారధిగా ఉండి అతనికి విజయం చేకూర్చాడు. ఈ విషయం రాకుమారునికి చెప్పు " అన్నది.

## బృహన్నల సారధ్యమును ఒప్పించుట

ఉత్తర మాలినితో చేరి అన్నయ్య వద్దకు వెళ్ళి విషయమంతా చెప్పింది. అది విన్న ఉత్తర కుమారుడు ఫక్కున నవ్వాడు. ద్రౌపదితో " సైరంధ్రీ ! నన్ను ఎగతాళి చేస్తావా ! నేను బృహన్నల వంటి వారిని కన్నెత్తి కూడా చూడను. అలాంటి బృహన్నలను నాకు సారధిని చేస్తావా. కౌరవుల సేనలు వచ్చి గోవులను పట్టుకుని నేను వారిపై యుద్ధానికి వెళ్ళి ప్రతాపం చూపవలసిన తరుణంలో నేను బృహన్నల సారధ్యంలో వెళితే నలుగురూ నవ్వరా? అయినా మనదేశంలో సారధులకు ఇంత కరువొచ్చిందా " అన్నాడు. సైరంధ్రి " రాకుమారా! ఒక్క కౌరవ సైన్యం మాత్రమే కాదు ముల్లోకాలు ఒకటై వచ్చినా బృహన్నల సారధిగా ఉన్నచో నువ్వు గెలువవచ్చు. కారణాంతరాల వలన పేడి తనం వచ్చినంత మాత్రాన అతని సామర్ధ్యం పోతుందా " అన్నది. ఉత్తర కుమారుడు గత్యంతరం లేక బృహన్నలను సారధిగా అంగీకరించాడు.

## బృహన్నలతో ఉత్తరకుమారుడు సమరానికి బయలుదేరుట

ఉత్తర కుమారుడు బృహన్నల సారధ్యాన్ని అంగీకరించగానే ఉత్తర బృహన్నల వద్దకు పరుగెత్తింది. గురువు గారికి నమస్కరించు " మా అన్నయ్య సారధి ఒక యుద్ధంలో మరణించాడు. మరల వేరే సమర్ధుడైన సారధి లభించ లేదు. ఈ రోజు కౌరవ సేన మా గోవులను అపహరించింది. మా అన్నయ్య యుద్ధానికి పోవడానికి తగిన సారధి లేడని బాధ పడుతున్నాడు. మీ సారధ్య సామర్ధ్యం గురించి సైరంధ్రి చెప్పింది. అందుకని మా అన్నయ్యకు సారధిగా మిమ్మలిని తీసుకు పోవడానికి

వచ్చాను నా మాట మన్నించి నా మీద వాత్సల్యంతో తమరు ఒప్పుకోవాలి " అన్నది. బృహన్నల నవ్వి అమ్మా " అమ్మా! ఉత్తరా నాకు సారధ్యం చేసే నేర్పు ఉందా? ఏమో భయంగా ఉంది. నీ మాట ఎందుకు కాదనాలి. నువ్వు అడిగావు కనుక సారధ్యమే కాదు ఎంతటి కష్టమైన పని అయినా చేసి పెడతాను " అన్నాడు. బృహన్నల అంత దూరంలో ఉండగానే ఉత్తరకుమారుడు " నేను కౌరవులతో యుద్ధం చేయాలి. నీవు సారధిగా నా రథం నడపాలి. త్వరగా రథం ఎక్కు. నీ గురించి సైరంధ్రి చెప్పింది " అన్నాడు. బృహన్నల ఉత్తరునితో " రాకుమారా! ఏదో ఆట పాటలకు నన్ను పిలువ వచ్చు కాని యుద్ధం చేయుటకు సారధిగా నన్ను పిలుచుట ఉచితమా. ఎక్కడైనా బలాఢ్యుడైన వాడిని సారధిగా నియమించు " అని అన్నాడు బృహన్నల. " అదేమిటి బృహన్నలా! నాడు ఖాండవవన దహనాన సమయమున అర్జునిని రథం నీవు నడిపావట కదా. అర్జునినికి విజయం చేకూర్చావట కదా మరి ఆచాతుర్యం శౌర్యం నీలో తగ్గి పోయాయా. మరో మాట మాటాడక యుద్ధానికి సిద్ధంకా " అన్నాడు ఉత్తరుడు. అయిష్టంగా ఉన్నట్లు ఒప్పుకున్నాడు బృహన్నల.

## యుద్ధానికి బయలుదేరుట

తరవాత ఉత్తర కుమారుడు బృహన్నలకు కవచం తెప్పించాడు. బృహన్నలకు ఇచ్చి తొడుక్కోమన్నాడు. దానిని తల క్రిందులుగా తొడిగి అందరినీ నవ్వించాడు బృహన్నల. ఉత్తర కుమారుడు బృహన్నలకు కవచం తొడిగాడు. " బృహన్నలా త్వరగా రథమునకు హయములను పూన్చుము. ధ్వజమును ఎత్తుము. మనం త్వరగా పోయి గోవులను విడిపించ వలెను " అన్నాడు. బృహన్నల " నీవు ఏమి చెప్పిన అది చేయ వలెను. నీవు రమ్మన్న రావలయును,పొమ్మన్న చోటికి పోవలెను. నా బలం తెలుసుకుని నా చేత పని చేయించుకుని విజయం సాధించు " అన్నాడు. బృహన్నల రథం సిద్ధం చేసాడు. కేతనం ఎగురవేసాడు. యుద్ధానికి వెళుతున్న అన్నయ్యను చూసి ఉత్తర " అన్నయ్యా! నీవు కౌరవ వీరులను గెలిచినపుడు వారి తల పాగా కుచ్చులను నాకు బొమ్మ పొత్తికలుగా తీసుకు రావా " అన్నది. బృహన్నల " ఉత్తరా! అదెంత పని రాకుమారుడు విజయంతో తిరిగి వస్తాడు. నీకు బొమ్మ పొత్తికలు తెస్తాడు " అన్నాడు. బృహన్నల వివిధ రకముల ఆయుధములు రథంలో పెట్టించి రథం ఎక్కాడు. ఉత్తరుడు పశువుల కాపరులను అడిగి కౌరవులు పశువులను ఏ పక్కకు తోలుకు వెళ్ళారో తెలుసుకుని ఆ దిక్కుగా రథం పోనివ్వమన్నాడు. బ్రాహ్మణుల, పుణ్యాంగనల దీవెనలందుకుని ఉత్తరకు మారుడు ఊరి వలుపలికి వచ్చాడు.

## కౌరవ సేనలను చూసి ఉత్తరకుమారుడు భీతిల్లుట

అల్లంత దూరంలో రేగిన మట్టిని చూసి కౌరవ సైన్యాన్ని చేరుకున్నాడు. కౌరవ సేనను తేరిపార చూసిన ఉత్తర కుమారుడు భయపడ్డాడు. " బృహన్నలా! భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, దుర్యోధనుడు మొదలగు వీరులు అసఖ్యాకమైన శస్త్రాస్త్రాలతో కౌరవ సేన భయంకరంగా ఉన్నది. నేను వీరితో యుద్ధం చేయగలనా. నాకు విలు విద్యలో అంత ప్రావీణ్యత లేదు. బాలుడను విలువిద్యలో నిష్ణాతులైన శకుని, జయద్రధ, దుర్ముఖ, వికర్ణ, కర్ణ మొదలైన వీరులతో నేనేమి యుద్ధం చేయగలను. ఇక్కడ పరిస్థితి ఇలా ఉంటుందని వచ్చాను. నీవేమో నీపాటికి రథం నడుపుతున్నావు. నేను కౌరవసేనతో యుద్ధం చేయలేను. రథమును వెనుకకు పోనిమ్ము. ఎవరి ప్రాణములు వారికితీపి కదా. నా శరీరం వణుకుతుంది " అన్నాడు. అర్జునుడు " ఉత్తరకుమారా ! అసంఖ్యాకంగా ఉన్న కౌరవసేనల వైపు రథం ఎందుకు నడిపిస్తాను. కొద్ది పాటి సైన్యాల రక్షణలో ఉన్న గోసమూహాల వైపు రథాన్ని నడిపిస్తాను. వారిని ఎదిరించి మన గోవులను మళ్ళిస్తాము. అంత:పురంలోని కాంతలతో గోవులను మళ్ళించి తీసుకువస్తాను అని చెప్పావు కదా ఇప్పుడు ఇలా బెదిరి పోవడం తగునా " అన్నాడు. ఉత్తరుడు " అమ్మో! గోవుల మాటలు దేవుడెరుగు. అంత:పుర కాంతల సంతోషంతో నాకేమి పని " అన్నాడు. అర్జునుడు " అదికాదు ఉత్తరకుమారా! నీ బలం ఎదిరి బలం చూసుకుని కొంచం సేపు యుద్ధం చేసి మరలవచ్చు. కౌరవసేనలు నిన్ను ఇంకా చూడకనే మనం మరలి పోవడం యుక్తము కాదు వీరులిది మెచ్చరు " అన్నాడు అర్జునుడు. " బృహన్నలా ! సుశర్మ మనగోవులను తరలించుకు వెళ్ళాడు కనుక మా తండ్రిగారు సైన్యాలతో అతనిని ఎదిరించడానికి వెళ్ళారు. నాకు సాయంగా సైన్యం లేరు కౌరవ సైన్యామో అసంఖ్యాకం దీనిని నేను ఒంటరిగా ఎలా ఎదిరించను చెప్పు. వాళ్ళు మనలిని చూడక మునుపే రథం మళ్ళించుట మంచిది వెనుదిరుగుము " అన్నాడు ఉత్తరుడు. అర్జునుడు " అదికాదు రాకుమారా ! ఇలా ఆవులను వదిలి వెళితే నగరిలో అప్రదిష్ట కాదా. పిరికి వాళ్ళను లోకం మెచ్చదు. నీకు సారధి లేడని సైరంధ్రి చెపితే నీకు నేను సారధిగా వచ్చాను. ఇప్పుడు ఆవులను శత్రువులక్కు వదిలి మరలలేను. నీకేం భయం వద్దు మనసు చిక్కపట్టుకో. కౌరవ సైన్యాలను ఏదో ఉపాయంతో ఓడించవచ్చు " అన్నాడు. ఉత్తరుడు " బృహన్నలా! నలుగురు నవ్వితే నాకేమి? నీకు ధైర్యం ఉంటే నువ్వే యుద్ధం చెయ్యి " అంటూ ధనుర్బాణాలను రథం పై వదిలి వెను తిరిగి పరుగెత్త సాగాడు. బృహన్నల కూడా ఉత్తరకుమారుని వెంబడించాడు. ఇది చూసిన కౌరవ సేనలు నవ్వుకున్నాయి. బృహన్నల ఉత్తరుని పట్టుకున్నాడు. ఉత్తర కుమారుని నోరు, ఎండిపోతూ ఉంది, కాళ్ళూ చేతులు గడగడ లాడుతున్నాయి, నోరు ఎండి పోయింది, మొహం వెలవెల పోయింది గొంతు పూడుకు పోయి పరిస్థితి దారుణంగా ఉంది.

## ఉత్తరకుమారుని అనునయించి అర్జునుడు యుద్ధానికి సిద్ధపడుట

ఉత్తర కుమారుడు " బృహన్నలా! నీకు అనేక బహుమతులు ఇస్తాను నన్ను వదిలి పెట్టు. మా అమ్మ నా కోసం ఎదురు చూస్తుంటుంది ఆమెను చూడాలి " అన్నాడు. అర్జునుడు ఉత్తర కుమారుని చూసి అనునయంగా " ఉత్తర కుమారా! భయపడకుము నీవు యుద్ధం చెయ్యలేకపోతే నా రధానికి సారధిగా ఉండు. నేను కౌరవ సేనను జయించి గోవులను మరలిస్తాను " అంటూ అర్జునుడు ఉత్తర కుమారుని తీసుకుని రధం వైపు వచ్చాడు. తాను కూడా రధం ఎక్కి రధాన్ని తాము ఆయుధాలను దాచిన శ్మశానం వైపు మరలించాడు. ఇది చూసిన కౌరవసేనలు కలవర పడ్డాయి. వారికి కొన్ని అపశకునాలు గోచరించాయి. ద్రోణుడు ధైర్యంగా ఉండమని వారిని హెచ్చరించాడు.

## కౌరవ సేనలో ప్రముఖుల వాదోపవాదాలు

ద్రోణుడు భీష్ముని చూసి " వీడు ఎవరో మహా గర్విష్టి వలె ఉన్నాడు. వీడు ఎవరో తెలుసుకోవాలి " అన్నాడు. భీష్ముడు దుర్యోధనునితో " సుయోధనా ! మనం శత్రువులకు అనుకూలమైన ప్రదేశాన్ని దాటాము. ఇంక మనం శత్రువలకు భయపడ వలసిన పని లేదు " అని సుయోధనునికి చెప్తున్నట్లు ద్రోణుడికి అన్యాప దేశంగా బదులిచ్చాడు. ఆ మాటలను బట్టి పాండవుల అజ్ఞాత వాసం ముగిసింది ఇక వారు బయటికి రావచ్చు అన్న విషయం గ్రహించిన ద్రోణుడు ఉత్సాహ భరితుడై సుయోధనుని చూసి " సుయోధనా ! ఆకలితో నకనక లాడుతున్న సింహం గుహ నుండి బయటకు వస్తున్నట్లు అర్జునుడు అరణ్యవాసం, అజ్ఞాతవాసం ముగించుకుని మన మీద యుద్ధానికి వస్తున్నాడు. అతడితో యుద్ధం చేయతగిన వీరుడు మనలో ఎవరు ఉన్నారు. అర్జునుడు గోవులను తరలించుకు వెళ్ళటం తథ్యం " అన్నాడు. ఆ మాటలను విన్న కర్ణుడు కోపంగా " పాండవ పక్షపాతంతో మాట్లాడు తున్నావు. కౌరవ సేనలలో నీవు ఒక్కడివే వీరుడివా. అర్జునుడు అంతటి జయించలేని వీరుడా. అతడితో నేను ఒక్కడినే యుద్ధం చేసి ఓడించగలను. పెద్దలని మన్నించి ఇంతకంటే మాటాడలేక పోతున్నాను " అన్నాడు. సుయోధనుడు కర్ణుని చూసి " కర్ణా! నీవు తప్పు పలికావు. అతడు నిజంగా అర్జునుడైతే మరల అరణ్య, అజ్ఞాతవాసాలు చేస్తాడు. కాకుంటే వాడిని నేనే జయిస్తాను " అన్నాడు. సుయోధనుని మాటలకు అంగీకరించినట్లు తలూపుతోనే భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ మనసులో నవ్వుకున్నారు.

## అర్జునుడు ఉత్తరకుమారునకు తనను తాను వెల్లడించుట


జమ్మిచెట్టు వద్ద తన ఆయుధములను ఉత్తరునికి చూపించుచున్న అర్జునుడు

బృహన్నల రధాన్ని జమ్మి చెట్టు వద్దకు తీసుకు వెళ్ళి " ఉత్తర కుమారా ! ఇవి మామూలు ధనస్సులు ఇవి నా ప్రతాపానికి సరిపోవు. నీవు ఈ చెట్టు ఎక్కి అక్కడ ఉన్న గాండీవాన్ని నాకు అందించు. పాండవులు తమ ఆయుధాలను ఇక్కడ దాచారు " అంటూ శవాకారంలో ఉన్న ఆయుధాల మూటను చూపాడు. ఉత్తరకుమారుడు " బృహన్నలా ! రాజ కుమారుడైనైన నన్ను శవాన్ని తాకమని చెప్పట తగునా " అన్నాడు. అర్జునుడు " ఉత్తరకుమారా ! అది శవము కాదు. పాండవుల ఆయుధములు. వారు ఇతరులు చేపట్టకుండా వాటిని శవాకారంలో శ్మశానంలో ఈ జమ్మి చెట్టుపై దాచారు " అన్నాడు. బృహన్నల మాటలతో ఉపశాంతిని పొందిన ఉత్తరుడు చెట్టు ఎక్కి ఆయుధాల మూటను విప్పాడు. అవి అతనికి సర్పాల వలె కనపడ్డాయి. అది చూసి ఉత్తరుడు భయపడ్డాడు. అర్జునుడు ప్రార్థించగానే అవి ఉత్తరునుకి ఆయుధముల వలె కనిపించాయి. ఉత్తరుడు వాటిలో ఉన్న గాండీవమును చూసి " బృహన్నలా ! ఈ ధనస్సు ఇలా భయంకరంగా ఉన్నదే దీనిని పాండవులలో ఎవరు ఉపయోగిస్తారు " అన్నాడు. అర్జునుడు ఉత్తరునితో " ఉత్తరకుమారా ! అది గాండీవము దానిని అర్జునుడు ధరిస్తాడు. దాని ప్రభావంతో అర్జునుడు దేవదానవులను జయించాడు. దీనిని బ్రహ్మ లక్ష సంవత్సరాలు ధరించాడు. తరవాత ప్రజాపతి అరవైనాలుగు వేల సంవత్సరాలు ధరించాడు. తరవాత ఇంద్రుడు ఎనభై ఐదేండ్లు ధరించాడు. తరవాత చంద్రుడు ఐదు వందల సంవత్సరాలు ధరించాడు. తరవాత అగ్ని దేవుడు వరుణుడి నుండి దానిని తీసుకుని అర్జునునికి ఖాండవ వన దహనం సమయంలో ఇచ్చాడు. ఈ గాడీవాన్ని అర్జునుడు అరవై ఐదేళ్ళు ధరిస్తాడు " అని చెప్పి అలాగే మిగిలిన పాండవుల ఆయుధాల వివరాలు చెప్పాడు. ఉత్తరకుమారుడు సందేహంగా " బృహన్నలా! పాండవులు

తమ ఆయుధాలను ఇక్కడ పెట్టి ఎక్కడకు వెళ్ళారో. వారు నా బంధువులు, మిత్రులు. అయ్యో ఆ ధర్మరాజు ఎక్కడ ఉన్నాడో. వాయుపుత్రుడు ఎన్ని అవస్థలు పడుతున్నారో. అర్జునుడు ఎక్కడ దాగాడో. కవలలు ఎన్ని తిప్పలు పడుతున్నారో. మహాసాధ్వి ద్రౌపది ఎన్ని కష్టాలు అనుభవిస్తుందో " అంటూ ఆవేదన పడ్డాడు. అర్జునుడు అనునయంగా ఉత్తరునితో " ఉత్తరకుమారా! చింతించ వలదు. పాడవులు అరణ్యవాసం పూర్తి అయిన తరవాత అజ్ఞాత వాసాన్ని మన నగరంలోనే గడుపుతున్నారు. కంకు భట్టు ధర్మరాజు, వలలుడే భీమసేనుడు, దామ్రగంధి, తంత్రీ పాలుడు నకుల సహదేవులు. ఇక దాచడమేల అర్జునడను నేనే. మాలిని పేరొతో సైరంధ్రిగా ఉన్నది సాధ్వి ద్రౌపది. ఆమె కారణంగానే భీముడు కీచకుని, ఉపకీచకులను చంపాడు " అని అన్నాడు.

## అర్జునుడి దశనామాలు

ఆ మాటలు విన్న ఉత్తరకుమారుడు సంభ్రమాశ్చర్యాలతో సందేహంగా " బృహన్నలా! అర్జునికి పది పేర్లున్నాయి వాటిని వివరిస్తే నేను నిన్ను అర్జునుడని నమ్ముతాను " అన్నాడు. బృహన్నల చిరునవ్వుతో ఉత్తరుని చూసి " కుమారా! అర్జునుడు, పల్గుణుడు, పార్ధుడు, కిరీటి, శ్వేతవాహనుడు, బీభత్సుడు, విజయుడు, జిష్ణువు, సవ్యచాచి, ధనుంజయుడు అనే దశ నామాలు ఉన్నాయి " అన్నాడు. అప్పటికీ ఉత్తరునికి విశ్వాసం కుదరక " బృహన్నలా ! ఆ దశనామాలు వివరిస్తే నువ్వే అర్జునుడవని నమ్ముతాను " అన్నాడు. అర్జునుడు " కుమారా! నేను ధరణి అంతటిని జయించి ధనమును సముపార్జింతిని కనుక ధనుంజయుడ నయ్యాను. ఎవ్వరితోనైనా పోరాడి విజయం సాధిస్తాను కనుక విజయుడి నయ్యాను. నేను ఎల్లప్పుడూ నా రధమునకు తెల్లటి అశ్వాలను మాత్రమే పూన్చుతాను కనుక శ్వేత వాహనుడిని అయ్యాను. నాకు ఇంద్రుడు ప్రసాదించిన కిరీటం నా తలపై ప్రాకాసిస్తుంటుంది కనుక కిరీటి నయ్యాను. యుద్ధంలో శత్రువులతో పోరాడే సమయంలో ఎలాంటి భిభత్సమైన పరిస్తితిలో కూడా సంయమును కోల్పోయి జుగ్గుప్సాకరమైన, భీభత్సమైన పనులు చెయ్యను కనుక భీభత్సుడి నయ్యాను. నేను గాండీవాన్ని ఉపయోగించే సమయంలో రెండు చేతులతో నారిని సంధిస్తాను. కాని ఎక్కువగా ఎడమచేతితో అతి సమర్ధంగా నారిని సంధిస్తాను కనుక సవ్యసాచిని అయ్యాను. నేను ఎక్కవ తెల్లగా ఉంటాను కనుక నన్ను అర్జునుడు అంటారు. నేను ఉత్తర పల్గుణీ నక్షత్రంలో జన్మించాను కనుక ఫల్గుణుడిని అయ్యాను. మా అన్నయ్య ధర్మరాజు. నా కంటి ముందర ఆయనను ఎవరైనా ఏదైనా హాని కలిగించిన దేవతలు అడ్డు తగిలినా వారిని చంపక వదలను. కనుక జిష్ణువు అనే పేరు వచ్చింది. మా అమ్మ అసలు పేరు పృధ. కుంతి భోజుని కుమార్తె కనుక కుంతీదేవి అయింది. పృధపుత్రుడిని కనుక పార్ధుడిని అయ్యాను. అయినా ఉత్తర కుమారా! నేను ఎల్లప్పుడూ సత్యమునే పలికే ధర్మరాజు తమ్ముడిని నేను అసత్యం చెప్పను. నేను శ్రీకృష్ణుని సాయంతో ఖాండవ వనదహనంలో అగ్ని దేవునికి సాయపడి నందుకు బ్రహ్మ, రుద్రులు ప్రత్యక్షమై నాకు దివ్యాస్త్రాలతో పాటు నాకు కృష్ణుడు అనే పదకొండవ నామం బహూకరించారు. నేను నివాత కవచులను సంహరించిన సమయంలో ఇంద్రుడు ఈ కిరీటాన్ని బహుకరించాడు. దేవతలందరూ మెచ్చి ఈ శంఖమును ఇచ్చారు కనుక దీనిని దేవదత్తము అంటారు. చిత్రసేనుడు అనే గంధర్వుడు సుయోధనుని బంధీని చేసినపుడు గంధర్వులతో పోరాడి వారిని గెలిచాను కనుక నీవు భపడ వలసిన పని లేదు. మనం కౌరవ సైన్యాలను ఓడించి గోవులను మరల్చగలం " అన్నాడు.

## ఉత్తరకుమారుడు స్వస్థుడగుట

ఉత్తర కుమారుడు చెట్టుదిగి సంభ్రమాశ్చర్యాలతో అర్జునినికి నమస్కరించాడు. ఉత్తర కుమారుడు " అర్జునా ! నా అదృష్ట దేవతలా నువ్వు నాకు కనిపించావు. చాపల్యంతో నేను ఏదైనా నిన్ను అని ఉంటే నన్ను మన్నించు. నీ అండ దొరికి నందుకు నా ఆనందానికిక అవధులు లేవు నన్ను కనికరించు " అన్నాడు. అర్జునుడు రధం దిగి ఉత్తరుని ప్రియమార కౌగలించు కున్నాడు. ఉత్తరుడు రధం ఎక్కి అర్జునా ఇప్పుడు నా భయం తొలగి పోయింది. అర్జునినికి సారధిని కావలెనన్న నా కోరిక ఈడేరింది. నీవు నన్ను ఆజ్ఞాపించి సారధ్యం చేయించుకుని కౌరవులను జయించి గోవులను మరల్పుము " అన్నాడు. అర్జునుడు వాత్సల్యంతో " కుమారా! భయపడకుము నీ మీద గాలి కూడా సోకనివ్వను. నీకు రక్షణ కల్పించడమే నా కర్తవ్యం " అన్నాడు. ఉత్తరుడు " అర్జునా! నీ నిజరూపం తెలిసిన వెంటనే నా భయం పటాపంచలైంది. ఈ పేడి రూపం ఎలా వచ్చిందో తెలుసు కోవాలని ఉంది " అన్నాడు. అర్జునుడు " ఉత్తరకుమారా ! మా అన్నగారి ఆజ్ఞను అనుసరించి బ్రహ్మచర్య వ్రతం స్వీకరించిన సమయంలో దేవేంద్రుని ఆహ్వానంపై ఇంద్రలోకం వెళ్ళాను. అక్కడ ఊర్వశి కోరికను నిరాకరించిన నన్ను పేడి రూపం ధరించమని శపించింది. అజ్ఞాతవాస సమయంలో అది నాకు వరంలా పరిణమించింది. అజ్ఞాత వాసం ముగియగానే పేడి రూపం పోయింది ఇప్పుడు నేను అర్జునుడను " అన్నాడు. ఉత్తరుడు " అర్జునా ఇప్పుడు నన్ను ఏమి చెయ్యమటావు " అని అడిగాడు. అర్జునుడు " నీవు గాండీ వమును తుణీరములను ఇతర ఆయుధములను తీసుకుని మిగిలిన ఆయుధములను అలాగే ఉంచు " అన్నాడు. ఉత్తర కుమారుడు అలాగే చేసాడు. అర్జునుడు వాటిని ధరించి గాండీవాన్ని ఎక్కు పెట్టి అల్లె త్రాటిని మ్రోగించి అగ్ని దేవుని తలచగానే అమోఘుమైన కపిధ్వజం సాక్షాత్కరించింది. ఉత్తర కుమారుని సింహపతాకమున్న ధ్వజం శమీవృక్షం మీద పెట్టి కపిధ్వజాన్ని రధమునకు కట్టాడు. మనమున తలవగానే చేతికి

దేవదత్తము వచ్చినది.

## అర్జునుడు యుద్ధానికి సిద్ధం అగుట

అర్జునుడు " ఉత్తరకుమారా! నీవు రధమును జమ్మిచెట్టుకు ప్రదక్షిన చేయించి ముందుకు పొమ్ము ఇప్పటికే ఆలస్యం అయినది. పశువులు చాలా దూరం వెళ్ళి ఉంటాయి " అన్నాడు. ఉత్తరుడు రథం మరల్చగానే అర్జునుడు దేవదత్తం పూరించాడు. ఆ ధ్వని భూన భోనాంతరాలలో వ్యాపించింది. రథమునకు కట్టిన గుర్రాలు మూర్చిల్లాయి. అర్జునుడు గుర్రాలను నిమిరి వాటికి చైతన్యం కలిగించి " కుమారా! యుద్ధసమయంలో ఇది సహజం కలత చెందకు " అన్నాడు. ఉత్తరుడు " అర్జునా! యుద్ధ సమయంలో అనేక శంఖారావాల విన్నాను. కాని ఈ శబ్దానికి నా గుండెలు అవిసి పోయాయి, దిక్కులు తిరిగి పోయాయి, చెవులు బద్దలయ్యాయి నా మనసు నీరు కారింది. ఈ కపిధ్వజాన్ని చూస్తుంటేనే నా కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. నీ తేజము చూసి నేను వివశుడిని అయ్యాను " అన్నాడు.


శంఖాన్ని పూరిస్తున్న అర్జునుడు

## భీష్ముడు వాదోపవాదాలను నివారించుట

అర్జునుడు నవ్వి మరలా శఖాన్ని పూరించాడు. ద్రోణుడు " సుయోధనా! ఆ ధ్వని విన్నావా. ఆ ధనుష్టంకారం గాండీవం కాదూ, వచ్చేది అర్జునుడు కాదూ, ఉజ్వలంగా ప్రకాశిస్తున్న ఆ కిరీటం అర్జునికి ఇంద్రుడు ప్రసాదించినది కాదూ, సమరోత్సాహంతో అర్జునుడు కాక మరెవ్వరు. అతనిని ఎదుర్కోడానికి సన్నాహాలు చెయ్యండి " అంటూ కృపాచార్య అశ్వర్థామలను చూసి ముందు మనం రారాజు సుయోధనుని పంపుదాము. ఆ వెనుక గో సమూహాలను పంపుదాం. ఆ వెనుక మనం ఉంటాము. అర్జునుడు వచ్చిన అతనితో మనం యుద్ధం చేస్తాము " అన్నాడు. ఆ మాటలు విన్న సుయోధనుడు భీష్మ, కర్ణ, వికర్ణుల వంక చూసి నేను మీకు ఇదివరకే చెప్పాను. పాండవులు జూదంలో ఓడి పోయి పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం ఒక సంవత్సరం అజ్ఞాత వాసం ఒప్పందం చేసుకూన్నారు. ఇంకా ఆ సమయం పూర్తి కాకుండా పార్ధుడు భయట పడ్డాడు కనుక పాండవులు అరణ్య, అజ్ఞాత వాసములు చేయాలి. ఈ విషయం మనం మోహంతో కాని పాండవులు లోభంతో కాని గమనించ లేదు. తాత భీష్ముడే దానిని నిర్ణయించటానికి అర్హులు " అన్నాడు. " వచ్చునది ఉత్తర కుమారుడు కాకుండా గాండీవి అయితే మన పని సఫలం అయినట్లే. అసలు సుశర్మ దక్షిణ దిక్కుగా మనం ఉత్తర దిక్కుగా గోవులను పట్టుకోవడానికి వచ్చింది మత్స్యదేశంలో ఉన్న పాండవులను బయట పెట్టడానికే గదా. ఆ వచ్చిన వాడు అర్జునుడైతేనేమి దేవతలైతేనేమి మనం గోవులను పట్టుకున్నాం. వాటి కోసం యుద్ధం చేస్తాము కాని వెరువనేల కనుక ముందు మనమే యుద్ధం చేస్తాము. అయినా అర్జునుడు ఒక్కడే ఇంత పెద్ద కురు సైన్యాలతో ఎలా యుద్ధం చేస్తాడు. విన్న వారు నవ్వుతారని కూడా అనుకోకుండా శత్రువును నందుల వలె పొగడుట ఈ ద్రోణునికి తగునా. అయినా ఆచార్యుల వారు దూరంగా నిలిచి పర్యవేక్షిస్తుంటారు. భోజన సమయాలలో, విద్యగరిపే సమయాలలో, నీతిని భోదించే సమయాలలో గురువులను సంప్రదించాలి కాని యుద్ధ విషయాలు వారికేం తెలుస్తాయి అడగటానికి. అయినా వారు యుద్ధం చేయరు వెనుక ఉండి మన విజయం కాంక్షిస్తుంటారు " అన్నాడు సుయోధనుడు.

## అశ్వర్థామ ఆగ్రహం

తండ్రిని అలా తూలనాడటం విన్న అశ్వర్థామ " సుయోధనా! పశువులను కాచేవారిని బెదిరించి ఆవులను పట్టుకున్నంతా మాత్రాన ఇలా మాట్లాడటం తగదు. మనమింకా యుద్ధం చేయ లేదు, శత్రువులను జయించ లేదు, నగరం చేర లేదు యుద్ధసంలో గెలిచిన వారు కూడా ఇలా మాట్లాడరు. యుద్ధమంటే జూదంలో రాజ్యాన్ని అపహరించటం కాదు, యుద్ధభూమిలో జూదం ఆడటం కుదరదు. పాండవుల జయించేనా ద్రౌపదిని సభకు పిలిపించింది? ఈడ్చుకు రమ్మని ఆజ్ఞాపించింది. శకుని మాట వినేగా అవన్నీ చేసింది ఇప్పుడు ఆ శకుని యుద్ధం చేస్తాడులే . సభలో నీచే అవమానించ బడిన కపికేతనుడు నీపై యుద్ధానికి వస్తున్నాడు. గురువును అధిక్షేపించావు కాని దేవదానవులను జయించిన అర్జునుని నీవు ఒక్కడివే ఎదుర్కొన గలవా? వీరుని పొగడటం సహజం. పుత్ర సమానుడైన ప్రియ శిష్యుడైన అర్జునిని పొగడటం నేరమా. ఇంత జరిగిన తరవాత సిగ్గు లేకుండా నా తండ్రి యుద్ధం చేయ వచ్చు కాని నేను చేయను. సుయోధనా! యముడు చెలరేగినా, అగ్ని ఆగ్రహించినా,

మృత్యు దేవత పురులు విప్పినా కొంత అయినా మిగులుతుంది. అర్జునుడు బాణాలు సర్వనాశనం చేస్తాయి. నీ కుటిల బుద్ధులు ఇక్కడ పని చేయవు. అర్జునుడు గాండీవంతో శరసంధానం చేసి బాణాలు విసురుతాడు కాని పాచికలు విసరడు. మనం మత్స్య దేశాధీశుని గోవులను పట్టుకున్నందుకు మత్స్యదేశాధీశుడు ససైన్యంతో వస్తే ఎదిరిస్తాము కాని అర్జునిని ఎదిరించ లేము " అన్నాడు.

### కర్ణుడి ఆగ్రహం

ఆ మాటలకు కర్ణుడు ఊగిపోయాడు " మనం వచ్చింది పాండవులను పట్టు కోవడానికి. పాండవులను గుర్తించడానికి. అర్జునిని చూసి బెదరడం భావ్యమా. సుయోధనుని పిచ్చివాడిని చేయటం తగునా? మీకు భయంగా ఉంటే మీరు ఊరుకోండి. ఒక్కని ఎదిరించడానికి ఎంత మంది కావాలి. నేను ఒక్కడినే ఎదిరిస్తాను. కపిధ్వజాన్ని విరగొట్టి, దాని చుట్టూ ఉన్న పిశాచాలను తరిమి కొడతాను. సారథిని చంపి అర్జునిని శరీరాన్ని నా బాణాలతో తూట్లు చేస్తాను. నా బాహు బలాన్ని చూడండి. అర్జునుడు పమూడేళ్ళ అరణ్యాజ్ఞాత వాసాలు ముగించుకొని యుద్ధ భూమిలో అడుగు పెడుతున్నాడు. కౌరవసేనలో మహా వీరుడనైన నేను అతనిని ఎదుర్కొంటాను. రారాజు ఋణం తీర్చుకోవడానికి, పరశురాముని వద్ద నేర్చుకున్న అస్త్రప్రయోగం చేయడానికి కర్ణార్జునులలో ఎవరు గొప్పో తేలడానికి ఇది సమయం. అర్జునిని గెలిచి సుయోధనునికి ముదము చేకూర్చెదను. ఇష్టం ఉన్న వారు మా ద్వంద యుద్ధం చూడండి లేని ఎడల ఆవుల వెంట నగరానికి పొండి " అన్నాడు.

### కృపాచార్యుని వాదం

కర్ణుని మాటలు విన్న కృతవర్మ " కర్ణా! నీవు ఎప్పుడూ కయ్యానికి కాలు దువ్వుతావు. కార్యసిద్ధి గురించి నీకు పట్టదు. కార్యసాధనలో యుద్ధం ఒక నీచమైన ప్రక్రియ అని రాజనీతిజ్ఞులైన పెద్దలు చెప్తారు. దేశ, కాల, పరిస్థితిని అర్ధం చేసుకుని తన బలాన్ని ఎదిరి బలాన్ని బేరీజు వేసుకుని యుద్ధం చేయాలి కాని మూర్ఖంగా దుస్సాహసంతో యుద్ధానికి దిగితే ఓటమి తప్పదు. అర్జునుడు ఒంటరి వాడని నువ్వు అంటున్నావు. ఖాండవవన దహన సమయంలో ఇంద్రునితో యుద్ధం చేసింది అర్జునుడు ఒక్కడే, యాదవ సైన్యంతో పోరాడి సుభద్రను చేపట్టింది అర్జునుడు ఒక్కడే, రాజసూయ యాగమున దిగ్విజయం చేసింది అర్జునుడొక్కడే, నివాతకవచులను సంహరించి దేవతలకు మేలొనరించించింది అర్జునుడొక్కడే, దేవేంద్రునికి అజేయులైన కాలకేయులను సంహరించింది అర్జునుడొక్కడే. అంతెందుకు ద్రౌపది స్వయవరంలో అబేధ్యమైన మత్స్యయంత్రాన్ని కొట్టి ద్రౌపదిని చేపట్టడమే కాక అనంతరం తిరగబడిన రాజులను జయించినది అర్జునుడు ఒక్కడే. నువ్వూ అక్కడే ఉన్నావు కదా. పాండవులు అందరూ తమతమ శక్తి కొద్దీ దిగ్విజయం చేసారు. నీవేమో హస్థినా పురంలో కూర్చుని ప్రగల్భాలు పలుకుతున్నావు. నీవు అర్జునుని గెలుస్తానని చెప్పడం ఒంటి చేత్తో సముద్రం ఈదడం లాంటిది. కనుక దుస్సాహసం విడిచి మనమంతా రారాజును కాపాడు కోవాలి కాని యుద్ధోన్మాదులం కాకూడదు. అందరం కలసి అర్జునిని ఎదుర్కొందాం నువ్వొక్కడివే పోరాడతానని చెప్పడం అవివేకం " అన్నాడు.

### కర్ణుడు కృపాచార్యుని తూలనాడుట

కర్ణుడు కోపంగా " కృపాచార్యా! శత్రువుల మిత్రుడవని తెలిసీ నిన్ను తీసుకురావడం సుయోధనుని అమాయకత్వం. బాలురు, బంధువులు రాజు సంపదను ఆరగిస్తారు కాని సమయానికి తప్పుకుంటారు. ఇంటికి వెళ్ళి హాయిగా మృష్టాన్నాలు ఆరగించు. అనవసరంగా రాజు నిన్ను యుద్ధంలో ప్రవేశపెట్టాడు. మారు మాటాడక వెళ్ళు. నేను ఒక్కడినే పదునాలుగు భువనాలను గెలుస్తాను. ఒక్క రధికుడు అర్జును డెంత " అన్నాడు. భీష్ముడు కృపాచార్యుడు, ద్రోణుడు, అశ్వత్థామ సముచితంగా మాట్లాడాడు. కర్ణుడు వీరోచితంగా మాట్లాడాడు. కాని ఒకరిని ఒకరు నిందించు కోవడం న్యాయం కాదు. అంత శక్తి ఉన్న వాడు యుద్ధం చేయాలి కాని ఇలా ఇతరులను నిందించడం ఎందుకు? శత్రువులు ముట్టడించక ముందే ఉపాయం ఆలోచించాలి. శత్రువు పరాక్రమ వంతుడైతే పొగడటం సజ్జనులకు ఉచితం. పెద్దలను గౌరవించాలి కాని నిందించడం తగదు. ప్రస్తుత కర్తవ్యం ఆలోచిద్దాం. ఆచార్యా అర్జునుడు మమీద యుద్ధానికి వస్తున్నాడు. మనం అందరం కలసి ఎదిరిస్తాం. విభేదాలకు ఇది సమయం కాదు. ఎవరో ఏదో అన్నారని మీరు కోపగించ డానికిది సమయం కాదు. నన్ను క్షమించి ముందుకు పదండి ఆచార్యా " అన్నాడు. కృపాచార్యుడు " అయ్యో మీరు క్షమించంచ మని అడుగ తగునా. నేనంతటి వాడనా. ద్రోణుడు శాంతిస్తే చాలు " అన్నాడు. కృపాచార్యుడు, భీష్ముడు, కర్ణునితో పోయి ద్రోణాచార్యుని అశ్వత్థామను క్షమించమని కోరారు.

### ద్రోణుడి వ్యూహ రచన

ద్రోణుడు " భీష్ముని మాటలతో నా కోపం పోయింది. ముందుకు పదండి ముందు మనం రారాజును కాపాడు కుంటాము. అర్జునుడు చాలా కసితో ఉంటాడు కనుక అందరం అర్జునిని ఎదుర్కొందాము. అజ్ఞాత వాసం గురించి సుయోధనుడు అడిగిన దానికి భీష్ముడు వివరణ ఇస్తాడు " అన్నాడు. ద్రోణుని ఆంతర్యం గ్రహించిన భీష్ముడు కాల నిర్ణయం చేయవలసిన సమయం ఆసన్న మయినదని గ్రహించాడు. అతడు " సుయోధనా! మన ప్రస్తుత కాలమానం ప్రకారం రెండు సంవత్సరాలకు ఒక అధిక మాసం వస్తుంది. ఈ పదమూడేళ్ళ కాలంలో వచ్చిన అధికమాసాలను గణనలోకి తీసుకుంటే నిన్నటితో పాండవుల అజ్ఞాత వాసం పూర్తి అయింది. ఈ విషయం తెలిసే అర్జునుడు నిజ రూపంతో మనముందుకు వచ్చాడు. అతడు ధర్మం తప్పడు. అలా తప్పే వాడైతే జూదంలో ఓడి పోయిన నాడే మూర్ఖత్వంతో మనతో యుద్ధానికి దిగే వాడు. ధర్మంకోసం కట్టుబడ్డారు కనుకనే ఇంత కాలం వేచి ఉన్నారు. మనతో యుద్ధానికి వచ్చింది అర్జునుడని తెలిసి పోరాటానికి దిగితే మనం గెలువ వచ్చు ఓడి పోవచ్చు. జయాపజయాలు దైవాధీనం కనుక మనం సంధి చేసు కోవడం ఉత్తమం " అన్నాడు భీష్ముడు. సుయోధనుడు " మనకు పాండవులతో సంధి ఎలా పొసగుతుంది. పాండవులకు నేను రాజ్యభాగం ఇవ్వను. యుద్ధం నిశ్చయం ఇందులో తిరుగు లేదు " అన్నాడు. ఇది చూసిన ద్రోణుడు " యుద్ధ సమయంలో నిర్ణయాధికారం రాజుకు మాత్రమే ఉంటుంది. కనుక ఎవరూ రాజు మాట నిరాకరించ లేరు కనుక మనం యుద్ధ వ్యూహాన్ని చేయాలి. సైన్యంలో నాల్గవ భాగాన్ని తీసుకుని సుయోధనుడు ముందు నడుస్తాడు. మరొక నాల్గవభాగం గోవులతో నడుస్తుంది. మిగిలిన సగం సైన్యంతో మనం వెనుక కదులుదాము. నేను మధ్యలో ఉంటాను. నా కుడి వైపు కృపాచార్యుడు, ఎడమ వపు అశ్వత్థామ ఉంటారు. ముందు భాగంలో కర్ణుడు ఉంటాడు. దుశ్శాసనుడు, వికర్ణుడు, శకుని, జయద్రధుడు, భూరిశ్రవుడు, బాహ్లికుడు, సోమదత్తుడూ అక్కడక్కడా మొహరిస్తారు. అర్జునుడు ఎవరితో యుద్ధం చేస్తే వారిని మనంమంతా రక్షిస్తాము. ఇం,దుకు భీష్ముడు ఆమోదాన్ని తెలిపాడు. తాను వెనుక ఉండి సైన్యాలను నడిపించాడు.

### యుద్ధారంభం

ఆ యుద్ధం చూడటానికి దేవతలంతా విమానాలెక్కి ఆకాశ వీధిలో నిలబడ్డాఋ. అర్జునుడు తన దేవదత్తాన్ని పూరిస్తూ అమిత వేగంతో కురు సైన్యాన్ని చేరుకున్నాడు. అతని పరాక్రమానికి కురు సైన్యం బెదిరి పోయింది. అర్జునుడు ఉత్తర కుమారునితో " కుమారా! సైన్యం రెండు భాగాలుగా పోతుంది ఇందులో సుయోధను డెక్కడ ఉన్నాడో తెలుసుకుని యుద్ధం చేయాలి. రధాన్ని సేనకు ఎడమ వైపుగా పోనియ్యి. రాజును పట్టుకుంటే కురు సైన్యం విచ్చిన్న మౌతుంది. మన పని సులభం ఔతుంది గోవులను మళ్ళించడంతో పనౌతుంది. గోవులు ఎక్కడ ఉన్నాయో అక్కడకు వెళితే వాట్ని రక్షించడానికి సుయోధనుడు అక్కడకు వస్తాడు " అన్నాడు అర్జునుడు. అర్జునుడు రధాన్ని ఎడమ వైపు నడిపిస్తూ సైన్యాన్ని కలయచూసి సుయోధనుడు లేడని తెలుసుకుని ముందుకు సాగాడు. పోతూ కృపాచార్యునకు, ద్రోణాచార్యునకు, భీష్ముడికీ తగిలీ తగలనట్లు నమస్కార బాణాలు వేసాడు. అర్జునిని గురు భక్తికి, పెద్దల ఎడ భక్తికి భీష్ముడు, కృపుడు, ద్రోణుడు ఆనందించారు. " అచార్యా ! అర్జునుడు మనతో యుద్ధం చేయక ముందుకు పోతున్నాడంటే సుయోధనుని కోసం వెతుకు తున్నాడు. కనుక మనం సుయోధనుని రక్షించాలి " అంటూ భీష్ముడు సైన్యాలను ముందుకు నడిపించాడు. ఇంతలో అర్జునుని రధం ఆవుల మందలను చేరుకుంది. అర్జునుడు " నేను ఆలమందలకు రక్షణగా ఉన్న సైన్యాన్ని ఎదిరిస్తాను వారిని రక్షించడానికి సుయోధనుడు వస్తాడు. మన చేతికి చిక్కుతాడు " అంటూ అర్జునుడు రధాన్ని తూర్పు దిక్కుకు నడప మన్నాడు. గోవులకు కాపలాగా ఉన్న సైన్యం అర్జునిని శరపరంపర ధాటికి ఆగలేక చెల్లాచెదరైంది. అర్జునుడు గోవులను వెనుకకు మళ్ళించాడు. గోవులు గోపాలురు వెంట రాగా వెనుకకు పరుగెత్తాయి. అర్జునుడు తనరధాన్ని గోవులకు సైన్యాలకు మధ్యగా నిలిపి గోవులకు రక్షగా నిలిచి గోపాలురను చూసి " మీరు గోవులను తీసుకు వెళ్ళండి " అన్నాడు. గోగణం మత్స్యదేశ పొలిమేరలో చేరుకున్నాయి. కురు సేనలు అర్జునిని చుట్టుముట్టాయి.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ

# విరాట పర్వము పంచమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# పంచమాశ్వాసం

అర్జునుడు దూరంగా ఉన్న సుయోధనుని చూడగానే " ఉత్తర కుమారా ! అడుగో సుయోధనుడు. రథం అటు పోనివ్వు " అన్నాడు. ఇంతలో కౌరవ సేనలోని ప్రముఖులైన వారు ఒక్కొక్కరు ఒక వెయ్యి రథములను తీసుకుని సుయోధనుని వైపు వెళ్ళారు. సుయోధనుడికి అర్జునినికి మధ్య సైన్యం మూడు నిలిచారు. చేత చిక్కిన గోగణములు అర్జునుడు తోలుకు పోవడం చూసి సుయోధనుడు నిట్టూర్చాడు.

### ఉత్తరకుమారుడికి కురువీరులను పరిచయము చేయుట

అర్జునుడు కురు సేనను తేరి పార చూసాడు. " ఉత్తరకుమారా ! కురుసేనను చూడు. కాంచనమయ వేదిక కేతనముగా కలవాడు ద్రోణాచార్యుడు. ఎగురుతున్న సింహం తోక కేతనముగా కలవాడు అశ్వత్థామ. బంగారు గోవును కేతనముగా కలిగిన వాడు కృపాచార్యుడు. తెల్లని కేతనమ కల వాడు కర్ణుడు. పాము పడగను కేతనముగా కలిగిన వాడు సుయోధనడు. తాటి చెట్టును కేతనముగా అలంకరించిన వాడు భీష్ముడు " అని తిరిగి " ఉత్తరకుమారా ! ఇప్పుడు మన రథం గురువు గారు ద్రోణాచార్యునకు ప్రదక్షిణగా పోనిమ్ము. ధనుర్విద్యలో అపార పాండిత్యము కలిగిన గురువు గారిని అవమానించ కూడదు. కనుక నేను ముందుగా సుయోధనునితో యుద్ధం చేస్తాను. సుయోధనుని రక్షించడానికి గురువు గారు వస్తారు అప్పుడు నేను ఆయనతో యుద్ధం చేస్తాను. గురు పుత్రుడు అశ్వత్థామ శివుని వరం వలన పుట్టాడు. భీకరమైన యుద్ధం చేయగల సమర్ధుడు. ఆ ప్రక్కన ఉన్న వాడు కృపాచార్యుడు. నాకు చిన్న నాటి గురువు, ద్రోణ సమాన పరాక్రమవంతుడు. కనుక వారితో యుద్ధం వద్దు , రథం పక్కకు పోనివ్వు. అక్కడ సుయోధనుని మిత్రుడు కర్ణుడున్నాడు చూడు పరశురాముని శిష్యుడైన ఇతడు మహా పరాక్రమ శాలి నాకు సరి జోడు . ఇతనితో యుద్ధం చేయాలని నా కోరిక. నన్నుచూస్తే ఊరుకోడు. కనుక రథం అతనికి ముందుగా నిలిపి మేము చేయబోయే యుద్ధం చూడు. మా పెదనాన కుమారుడు సుయోధనుడు. అతడు అభిమానధనుడు కోపం ఎక్కువ, పరాక్రమ వంతుడు, అత్యంత దుష్టుడు, మా మీద ద్వేషం పెంచుకున్న వాడు. అతడు కనపడితే వదల వద్దు. అదుగో పితామహుడైన భీష్ముడు, అత్యంత పరాక్రమ వంతుడు, బుద్ధి కుశలత కలిగిన వాడు, పరశురామని ఎదిరించిన ధీశాలి, ఎన్నో శస్త్ర రహస్యాలు తెలిసిన వాడు. ఆయనకు కోపం రానివ్వ వద్దు. అలా చేస్తే నన్ను సుయోధనుని దగ్గరకు చేరనివ్వడు " అని కురు వీరులను ఉత్తరునికి పరచయం చేసాడు.

### అశ్వత్థామ ఎత్తి పొడుపు

ఆ సమయంలో అశ్వత్థామ కర్ణుని చూసి " కర్ణా నిన్ను నీవు పొగుడు కున్నావు కదా! అర్జునుడు వచ్చాడు పోరాడు నీకు ఒక వేళ చేత కాకపోతే శకునితో మంతనాలు చెయ్యి. రారాజు ఈ యుద్ధ భారం నీ మీద పెట్టాడు కదా! తప్పుతుందా " అన్నాడు పరిహాసంగా. కర్ణుడు ఆగ్రహించి " నేను నీలా భీరువుని కాదు యుద్ధం, నుండి తప్పుకోవడానికి అర్జునుడే కాదు అతని తండ్రి ఇంద్రుడు వచ్చినా నేను ఎదిరించగల పరాక్రమ వంతుడను కావాలంటే చూడు " అన్నాడు. కర్ణుడు అలా మాట్లాడుతూ ఉండగానే భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ సుయోధనునికి రక్షణగా నిలిచారు. వారి వెనుక బాహ్లిక సోమదత్తులు తమతమ సైన్యాలతో పోరాడారు.

### అర్జునుని వీరవిహారం

అర్జునుడు గాండీవాన్ని ధరించి కురు సైన్యాలను నుగ్గు, నుగ్గు చేసాడు. కురు సైన్యం వజ్రవ్యూహంగా ఏర్పడి అర్జునిని ఎదిరించ సాగాయి. ఉత్తర కుమారుడు అర్జునిని పరాక్రమానికి పొంగి పోయి శ్లాఘించాడు. అర్జునుడు చెలరేగి యుద్ధం చేయసాగాడు. గాండీవం గుండ్రంగా తిప్పుతూ ఇరు పైడలా ఉన్న అమ్ముల పొది నుండి బాణాలు తీసి రెండు చేతులతో ఎడతెరిపి లేకుండా యుద్ధం చేస్తూ వజ్రవ్యూహాన్ని ఛేధించాడు. అర్జునిని ధాటికి గుర్రములు రథం విడిచి పారి పోతున్నాయి. రథికులు రథం నుండి కింద పడుతున్నారు.కింద పడ్డ వారిని విడిచి పెడుతూ ముందుకు సాగుతున్నాడు. ఒకసారి కనిపించిన వారు మరలా కనిపించడం లేదు. ఉత్తరకుమారుని జాగ్రత్తగా కాపాడు కుంటూ యుద్ధం చేస్తున్నాడు. అర్జునినితో యుద్ధం చేయడానికి ఎవరూ సాహసించడం లేదు. అప్రతిహతంగా సైన్యాల మధ్య అర్జునిని ధాటికి సన్యాలు నిస్తేజం ఔతున్నాయి.ద్రోణాదులపై శరసంధానం చేసాడు కర్ణుని రథసారథిని బాణంతో కొట్టాడు, అతని రథాన్ని విరగకొట్టాడు, విల్లును విరిచాడు, దేవదత్తాన్ని పూరించాడు. కర్ణుని అవస్థ చూసి కురు సైన్యాలు భీష్ముని వెనక చేరారు. భీష్ముడు వారిని ఉత్సాహ పరిచాడు. కృపాచార్యుడు, ద్రోణుడు, వికర్ణుడు సుయోధనునికి రక్షణ కవచంగా నిలిచారు.

## అర్జునుడు కర్ణునితో తలపడుట

అర్జునుడు ఉత్తర కుమారునితో " ఉత్తర కుమారా! కొంచం సేపు రధాన్ని ఆపు. మనముందు మొహరించిన సైన్యాలను చూడు. కర్ణుని ముందు రధాన్ని ఆపు వాడి పొగరు అణిస్తే కాని సుయోధనుని పొగరు అణగదు " అన్నాడు. ఉత్తర కుమారుడు రధాన్ని కర్ణుని ముందుకు పోనిచ్చాడు. కర్ణుని వైపు శరవేగంతో దూసుకు వెళుతున్న అర్జునుని చూసి చిత్రాంగధుడు, చిత్రరధుడు, సంగ్రామ చిత్తుడు, వివిశంతి, దుష్ప్రహుడు, చిత్రసేనుడు, దుర్ముఖుడు, దుర్జయుడు, వికర్ణుడు, శంత్రుంతపుడు, దుశ్శాసనుడు మొదలైన కురు కుమారులు అర్జుననిపై ఒక్క సారిగా ఉరికారు. ముందుగా వికర్ణుని విల్లు విరిచాడు వికర్ణుడు పారిపోయాడు. తరువాత శత్రుంతపుని చంపాడు. దానితో కురు కుమారులు పారి పోయారు. తరవాత కర్ణుని తమ్ముడు సంగ్రామ జిత్తుడు అర్జునిని ఎదుర్కొన్నాడు. అర్జునుడు ఒక బల్లెంతో వాడిని పొడిచి చంపాడు. కర్ణుడు కోపంతో అర్జునినిపై బాణం వేసాడు. ఈ విధంగా అర్జునుడు కర్ణుడు తలపడ్డారు. కౌరవ సేనంతా యుద్ధం చేయడం ఆపి వీరిని చూస్తూ నిలబడ్డారు. అర్జునుడు కర్ణుని చూసి " కర్ణా ! నిండు సభలో నాకు ఎదురు లేదని పలికావు ఇదిగో యుద్ధం వచ్చింది సభలలో ప్రగల్భాలు పలకడం కాదు ఇప్పుడు నీ ప్రతాపం చూపు నీ తమ్ముని చావు కనులార చూసావు కదా ఇంత దాకా వచ్చి పారిపోవడానికి ప్రయత్నించ వద్దు. ద్రౌపదిని నిండు సభలో అవమానించి నందుకు ఫలితం అనుభవించాలి కదా. ఆ రోజు ధర్మరాజు మాటకు కట్టుబడి నిన్ను వదిలాను ఇప్పుడు చిక్కావు తప్పించుకోలేవు " అన్నాడు. కర్ణుడు " అర్జునా! అన్నగారి మీద పెట్టి తప్పుకుంటావా ! అంత వీరుడివా? ఎలాగైనా అడవులలో తిరిగితే రాజ్యం వస్తుందిలే అని అడవులలో తిరిగిన పిరికి పందలు మీకు ధైర్యసాహసాలు ఉన్నాయా? నీవు ఏమేమో చేసావని అన్నారు నిన్ను చూస్తుంటే అవి అన్నీ అసత్యాలు అనిపిస్తున్నాయి " అంటూ అర్జునిపై బాణాలు సంధించాడు. అర్జునుడు బదులుగా బాణాలతో సమాధానం ఇస్తున్నాడు. కర్ణుని విల్లు విరగ కొట్టాడు. కర్ణుడు శక్తి బాణాలను అర్జునినిపై ప్రయోగించాడు. అర్జునుడు దానిని తుత్తునియలు చేసాడు. కర్ణుడు విల్లు తీసుకుని అర్జునిని సారధిపై ఆరు బాణాలు అర్జునినిపై పది బాణాలు వదిలాడు. అర్జునుడు కోపించి కర్ణునిపై బల్లెములు వర్షంలా కురిపించాడు. కర్ణుడు వాటి ధాటికి ఆగలేక పారి పోయాడు. అర్జునుడు విజయ చిహ్నంగా దేవదత్తం పూరించాడు. అర్జునుడు " ఉత్తరకుమారా! కురుసేనలో ముఖ్య వీరుడు కర్ణుడు పారి పోయాడు. ఇక మనకు ఎదురు నిలిచేది ద్రోణాచార్యులు మాత్రమే " అంటూ కురు సేనను చూసాడు. ఉత్తరకుమారుడు అర్జునినితో " అర్జునా ! నిన్ను చూస్తుంటే ఆశ్చర్యం, భయం, విహ్వల భావం కలుగుతున్నాయి. నీ ధైర్యం, నీ శౌర్యం చూస్తుంటే నాకు భయం కలుగుతంది. నా మనసు వశం తప్పుతుంది, కాళ్ళు, చేతులు వణుకుతున్నాయి రధం నడప శక్యం కాకున్నది. ఇలాంటి యుద్ధం నేనిది వరకు చూడ లేదు. మనసు పరవశించి పోతుంది " అన్నాడు.

## అర్జునుడు ద్రోణునితో తలపడుట

అర్జునుడు నవ్వి " ఉత్తరకుమారా! భయం వలదు నేనున్నాను నిర్భయంగా రధాన్ని ద్రోణుని వైపు మళ్ళించు ఎర్రని గుర్రాలు పూన్చిన రధాన్ని అధిరోహించి వారె ద్రోణుడు నాకు గురువు నాకు హితుడు బహు శస్త్రాస్త్ర కోవిధుడు రాజ ధర్మంగా ఇప్పుడు నేను ఆయనతో పోరాడవలసి వచ్చినది " అన్నాడు. ఉత్తరుడు అలాగే చేసాడు. అర్జునుడు గురువును చూసి " గురుదేవా! నమస్కారం. అడవులలో పన్నెండేళ్ళు , అజ్ఞాతంలో ఒక ఏడు గడిపి ఎన్నో బాధలు పడ్డాము. ఇది మంచి తరుణం అని ఎంచి మీ ముందుకు వచ్చాను. నా మీద కోపగించకండి ముందుగా మీ పై బాణప్రయోగం చేయలేను ముందుగా మీరే నాపై బాణప్రయోగం చెయ్యండి " అని వేడుకున్నాడు. అతని మాటలకు సంతోషపడి ద్రోణుడు అర్జునినిపై పది బాణాలు ప్రయోగించాడు. అర్జునుడు వాటిని మధ్యలో త్రుంచి వేసాడు. ఇప్పుడు అర్జునినికి ద్రోణుడికి ద్వంధ యుద్ధం ఆరంభమైంది. అతిరధులు, అస్త్రకోవిదులు, పరాక్రమోపేతులైన వీరి యుద్ధాన్ని కౌరవ సేనలు కుతూహలంతో చూస్తున్నాయి. ద్రోణుని అస్త్రాలను సమర్ధంగా ఎదుర్కొని అర్జునుడు వాటిని నిర్వీర్యం చేస్తున్నాడు. కురుసేనను తనుమాడుతున్న అర్జునిని చూసి ద్రోణుడు ఆశ్చర్య చకితు డౌతున్నాడు. కురు సేనలు తరిగి పోతున్నాయి. అర్జునిని గెలవడం అసాధ్యమని అనుకున్నాడు. అర్జునుడు ద్రోణుని శరీరాన్ని, కేతనాన్ని, సారధిని ఒక్క సారిగా బాణాలతో కొట్టాడు. కురు సైన్యాలు హాహాకారాలు చేసాయి. తండ్రి పరిస్థితి చూసి అశ్వత్థామ అతనికి సాయం వచ్చాడు.

## అశ్వత్థామ కృపాచార్యులతో అర్జునిని యుద్ధం

అశ్వత్థామ విల్లందుకుని అర్జునిని గాండీవంలోని అల్లెత్రాటిని కొట్టాడు. అల్లెత్రాటిని బిగిస్తున్న అర్జునినిపై అశ్వత్థామ ఎనిమిది బాణాలు ప్రయోగం చేసాడు. అర్జునుడు అల్లెత్రాటిని బిగించి అశ్వత్థామ బాణాలను మధ్యలోనే త్రుంచాడు. అశ్వత్థామపై అర్జునుడు శరపరంర సంధించాడు. అశ్వథామకు అర్జునిలా అక్షయతుణీరం లేదు కనుక అర్జునిపై బాణ ప్రయోగం చేయలేక పోయాడు. ఇది గమనించిన కృపాచార్యుడు అశ్వత్థామకు సాయంగా వచ్చాడు. అర్జునుడు కృపాచార్యునిపై బాణప్రయోగం

చేసాడు. కృపాచార్యుడు విజృంభించి అర్జుని కపిధ్వజాన్ని కొట్టి జయధ్వానాలు చేసాడు. అర్జునుడు కోపించి కృపాచార్యుని రథాన్ని విరగకొట్టి, గుర్రాలను చంపాడు. విరథుడైన కృపాచార్యుడు ధైర్యంగా శక్తి ఆయుధాన్ని అర్జునినిపై విసిరాడు. అర్జునుడు శక్తి ఆయుధాన్ని ముక్కలు చేసాడు. కృపుడు చేసేది లేక కత్తి డాలు తీసుకుని అర్జునిని ఎదుర్కొన్నాడు. అర్జునుడు కృపుని కత్తి విరిచాడు. కృపుడు అశ్వత్థామ రథం ఎక్కాడు.

## కురుసేనలను ఛేదిస్తూ అర్జునుడు భీష్మునితో తలపడుట

కృపాచార్యునికి పట్టిన గతి చూసి కురు సేనలు భీష్ముని వెనుక చేరాయి. ఇది చూసి వృషసేనుడు అర్జునిని ఎదుర్కొన్నాడు. అర్జునుడు బల్లెం తీసుకుని వృషసేనుని విల్లు విరిచి అతని గొడెలపై పొడిచాడు. ఆ దెబ్బకు వృషసేనుడు పారి పోయాడు. పక్కనే ఉన్న దుర్ముఖుడు, వివిశంతి, దుశ్శాసనుడు, వికర్ణుడు, శకుని ఒక్క సారిగా అర్జునిని చుట్టుముట్టారు. అర్జునుడు వారి రథాలను, విల్లును విరిచాడు. అర్జునిని ధాటికి తాళ లేక వారంతా పారి పోయారు. అర్జునుడు " ఉత్తర కుమారా ! ఇక మా తాత గారైన భీష్ముడు మాత్రమే మిగిలి ఉన్నాడు. తాళవృక్ష కేతనమున్న భీష్ముని వైపు రథాన్ని పోనిమ్ము " అన్నాడు. ఉత్తరుడు భీష్ముని వైపు రథం పోనిచ్చాడు. అర్జునుని చూసి భీష్ముడు శంఖం పూరించాడు. రెండు వృషభముల వలె వారు ఒకరిని ఒకరు చూసుకున్నారు. భీష్ముడు బాణాలతో కపిధ్వజాన్ని, దాని వెంట ఉన్న భూతములను, రథసారధిని కొట్టాడు. ఆ బాణముల్సన్నిటిని మధ్యలోనే అర్జునుడు తుంచేసాడు. అర్జునుడు తన బాణాలతో భీష్ముని కప్పాడు. అర్జునుడు వేసే ప్రతి బాణాన్ని భీష్ముడు తునాతునకలు చేసాడు. అర్జునుడు తన అస్త్రాలను తాతగారి ముందు ప్రదర్శిస్తుంటే వారు బాగున్నాయి ఇంకా చూపించు అన్నట్లుంది వారి యుద్ధం. అర్జునుడు కోపించి తాత విల్లు విరుగకొట్టాడు. తాతగారికి కోపం వచ్చి మనుమడిపై శరపరంపరను కురిపించారు. అర్జునుడు తాతగారి బాణాలను అన్నీ తుంచి భీష్ముని ఆయన రథాన్ని, సారధిని, గుర్రాలను కొట్టాడు. భీష్ముడు మరొక విల్లు తీసుకునే లోపు అర్జునుడు భీష్ముని గుండెలపై కొట్టాడు. భీష్ముడు రథంపై సోలి పోయాడు. సారధి రథాన్ని పక్కకు తొలిగించాడు.

## అర్జునుడు సుయోధనుని ఎదుర్కొనుట

అర్జునుడు ఎవరు మిగిలి ఉన్నారా అని చూడగా అక్కడ కర్ణుడు, ద్రోణుడు, కృపుడు నిలబడి ఉండటం చూసి అర్జునుడు " ఉత్తరకుమారా ! రథాన్ని వారి వైపు పోనివ్వు " అన్నాడు. అర్జునుడు తమవైపు రావడం చూసి అశ్వత్థామ " కర్ణా ! అర్జునుడు మన వైపు వస్తున్నాడు. అతనిని ఎదుర్కొని ఓడించ గలిగిన సమర్ధుడవు నువ్వే " అని కర్ణుని పరహాసంగా ముందుకు తోసాడు. కర్ణుడు " నేను ఇప్పుడే అర్జునిని ఎదుర్కొంటాను చూడు " అన్నాడు. అర్జునుడు కౌరవవీరు లందరినీ మట్టి కరిపించాడు. ఒక్కొక్కరే వారంతా అలసి పోయి తొలగి పోయారు. ఇక్కడ ఉత్తరకుమారుని పరిస్థితి అలాగే ఉంది అతడు అర్జునితో " అర్జునా! నీవేమో అలుపు లేకుండా యుద్ధం చేస్తున్నావు. నాకు దాహం వేస్తుంది కనీసం నీళ్ళు త్రాగ కుండా యుద్ధం చేయడమెలా? ఇక నేను సారధ్యం చేయలేను " అన్నాడు. అర్జునుడు " ఉత్తర కుమారా! ఓపిక పట్టు ఇక సుయోధనుడు మాత్రమే మిగిలి ఉన్నాడు. అభిమానధనుడు నాతో యుద్ధానికి సిద్ధం ఔతున్నట్లు ఉంది. రథం నడపడంలో నీకు నేను సాయం చేస్తాను. భయపడకు " అన్నాడు. సుయోధనుని వైపు రథాన్ని నడిపించాడు అర్జునుడు. అర్జునుడు ఆకలిగొన్న పులి వలె సుయోధనునిపై విరుచుకు పడ్డాడు. బదులుగా సుయోధనుడు అర్జునుని గుండెలపై రెండు బాణాలు వేసాడు. అర్జునిని నుదిటిపై రెండు బాణాలు వేసాడు సుయోధనుడు. వాటిని సునాయాసంగా విరిచి సుయోధనునుపై శరపరంపరను వేసాడు అర్జునుడు. సుయోధనుకి సాయంగా వికర్ణుడు ఏనుగు మీద ఎక్కి రాగా అర్జునుడు ఏనుగు కుంభ స్థలంపై పిడికిలితో కొట్టాడు. ఆదెబ్బకు ఏనుగు కూలబడింది. వికర్ణుడు ఏనుగు మీద నుండి పడి పక్కనే ఉన్న వివిశంతి రథంపై ఎక్కాడు. అర్జునుడు మరలా సుయోధనుని గుండెలను గురి పెట్టి పది బాణాలను వేసాడు. సుయోధనుడు గాయపడ్డాడు. సాయంగా వచ్చి వారందరిని అర్జునుడు గాయపరచగా విధి లేక సుయోధనుడు వెను తిరిగాడు. అర్జునుడు సుయోధనుని తరిమాడు. అది చూసి కర్ణుడు భీష్మునితో " అర్జునుడు తరుము కొస్తుండగా సుయోధనుడు పారి పోతున్నాడు. మనం అతనిని కాపాడాలి " అన్నాడు. కర్ణుని మాటలను భీష్మ ద్రోణ, కృపాచార్యులు లెక్క చెయ్య లేదు. సుయోధనుడు దీనంగా " అదేమిటి ఇలా ఒంటరిగా రాజైన నన్ను వదిలి పోవడం ధర్మమా? రాజైన నేను పరాజయం చెందు తున్నప్పుడు నన్ను ఆదుకోవడం మీ ధర్మం కాదా? " అన్నాడు. అందరూ సుయోధనుని మాటలకు ఆగారు. భీష్ముడు సుయోధనుని ఓదార్చాడు. అర్జునుడు సుయోధనుని చూసి " ఏమిటి సుయోధనా ! అలా పారి పోతున్నావు. ఇది క్షత్రియ ధర్మమా? నేను ఒక్కడిని కుంతీ పుత్రులలో చిన్న వాడిని ఒంటరిని నీవో గాంధారి పుత్రులలో అగ్రజుడవు అపార సేనా వాహినితో వచ్చావు మితులు సాయం ఉన్నారు ఇలాంటి నీవు ఇలా పారిపోతే సాటి వారు ఎగతాళి చేయరా? కౌరవేశ్వరా ఇక నీవు హస్తినా పురంలో ఏనుగు మీద ఎలా ఊరేగగలవు. మణిమయ భూషణములు ధరించి నిండు సభలో ఎలా సింహాసనాధిష్టుడివి కాగలవు? కర్పూర చందన సుగంధ ద్రవ్యాలను సేవిస్తూ భోగభాగ్యములను ఎలా అనుభవించగలవు? సుందరీ మణులతో ఎలా క్రీడించగలవు? సుయోధనా నా మాట విను యుద్ధమున మరణిస్తే స్వర్గ సుఖాలు గెలిస్తే ఇహలోక

సుఖాలు అనుభవించవచ్చు కాని వెను తిరిగి పారిపోవండం తగునా? ఇది రణరంగం జూదం ఆడి గెలుచుట సాధ్యం కాదు. నీలాటి రారాజు పారి పోవడమేమిటి చీ సిగ్గుగా లేదా? " అని అధిక్షేపించాడు.

## అర్జునుని సమ్మోహన అస్త్రప్రయోగము

ఈ మాటలు విన్న సుయోధనుడు రోషంతో భీష్మద్రోణ కృపాచార్యులను యుద్ధసన్నద్ధులను చేసి ఒక్కసారిగా అర్జునిని మీద దాడి చేసాడు. వారంతా సుయోధనుని రక్షిస్తూ అర్జునినితో యుద్ధం చేస్తున్నారు. అర్జునుడు సారథిని కాపాడు కుంటూ వారందిరితో యుద్ధం చేస్తున్నాడు. అర్జునుడు మనసులో " సుయోధనుని ఇప్పుడు చంపడం భావ్యం కాదు అది భీమసేనుని ప్రతిజ్ఞ. కువీరులందరితో యుద్ధం చేయడమైంది. ఇక వీరోచితంగా తప్పుకోవడం ఉచితం. ఉత్తరకుమారికి బొమ్మ పొత్తికలు తీసుకు వెళ్ళాలి. కురువీరుల తలపాగాలు పట్టుకెళ్ళడం అంటే వారందరిని జయించినట్లే. అందుకని కుబేరుడిచ్చిన సమ్మోహనాస్త్రాన్ని వీరిపై ప్రయోగిస్తాను " అనుకుని కురు సైన్యంపై సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించాడు. అస్త్ర ప్రభావానికి కురు సైన్యమంతా నిస్తేజంగా పడి పోయింది. ఆ అస్త్రానికి అధి దేవత ఇంద్రుడు. అర్జునుడు " ఉత్తరకుమారా! కౌరవులంతా స్పృహతప్పి పడిపోయారు. నీవు పోయి సుయోధనుడు, అశ్వత్థామ, ద్రోణుడు, కృపాచార్యుడు, కర్ణాది వీరుల తపాగాలు తీసుకురా. భీష్ముని జోలికి మాత్రం పోవద్దు. అతడిని ఈ అస్త్రం ఏమాత్రం ప్రభావితం చేయజాలదు అతడు నిద్ర నటిస్తున్నాడంతే " అన్నాడు. ఉత్తరకుమారుడు అర్జునుడు చెప్పినట్లే తపాగాలు తీసుకుని రథం ఎక్కాడు. ఉత్తరకుమారునితో చెప్పి అర్జునుడు రథాన్ని కొంచం దూరం యుద్ధరంగంలో నుండి తీసుకు పోయి ఆగాడు. ఇంతలో కురువీరులందరికి తెలివి వచ్చింది. సుయోధనుడు అర్జునినితో యుద్ధానికి సిద్ధం అయ్యాడు. భీష్ముడు " సుయోధనా! జరిగినది నీవు ఎరుగవు. మీరంతా అస్త్రప్రభావానికి తెలివి తప్పారు అర్జునుడు మీ తల పాగాలు మాత్రమే తీసుకు వెళ్ళాడు. మీ తలలు నరికి తీసుకు వెళితే ఏమయ్యేది అర్జునిని కరుణ నిన్ను రక్షించింది. తిరిగి యుద్ధానికి సిద్ధం అయితే పూర్ణాహుతి ఇప్పుడే జరుగుతుంది. విడిపించిన గోవులు విరాటనగరానికి చేరాయి. జరిగినది చాలు వెనుకకు మరలుము " అన్నాడు. ఆ మాటలకు సుయోధనుడు నిట్టూర్చాడు. అర్జునిని వదలాలని లేకున్నా తాతాగారి మాటకు తలవంచాడు. కురుసైన్యం కూడా సుయోధనిని అర్జునుని బారి నుండి రక్షించాలంటే యుద్ధ విరమణ మంచిది అనుకున్నారు. కురు సైన్యం వెనుతిరిగింది.

## అర్జునుడు కురుసేనకు వీడ్కోలు పలుకుట

ఇదంతా దూరం నుండి చూస్తున్న అర్జునుడు దేవదత్తం పూరించాడు. భీష్మ, ద్రోణ, కృపాచార్యులకు నమస్కరించాడు. ఒక్క బాణంతో సుయోధనుని కిరీటంలోని మణులను ఊడగొట్టాడు. ఇక నేను పోయివస్తానని పెద్దగా అరచి చెప్పాడు. ఉత్తరకుమారుని చూసి " కుమారా ! మనం కురుసేనను జయించాము, గోవులను మరలించాము, ఉత్తరకుమారికి బొమ్మ పొత్తికలు సేకరించాము ఇక రాజధానికి మరలి వెడతాము " అన్నాడు. ఉత్తరుడు రథాన్ని వెనుకకు మరల్చాడు. అర్జునుడు " కుమారా ! కురుసేనలను నీవే జయించావని చెప్పు " అన్నాడు. ఉత్తరుడు నవ్వి " అర్జునా ! కురుసేనలను నేను జయించలేనని అక్కడ వారందరికి తెలుసు. నిజం దాచడం కష్టం కాని నీ మాట కాదనలేను. నీవు చెప్పుమన్నప్పుడే నిజం చెప్తాను " అన్నాడు. రథం శమీవృక్షాన్ని చేరుకుంది. గాండీవం మొదలైన ఆయుధాలను తిరిగి శమీవృక్షం మీద దాచారు. అర్జునుడు బృహన్నల వేషం ధరించి సారధ్యం చేపట్టాడు. ఉత్తరుడు రథాన్ని అధిరోహించాడు. అర్జునుడు " కుమారా ! మన విజయ వార్తను ముందుగా వెళ్ళి విరాటునికి తెలుపమని గోపాలురకు చెప్పు " అన్నాడు. వార్తాహరులు అలాగే వెళ్ళారు.

## విజయవార్తను విరాటునికి తెలుపుట

దక్షిణ గోగ్రహణంలో విజయం సాధించి నగరానికి తిరిగి వచ్చిన విరాటుని ఉత్తర గోగ్రహణం విషయం కలవర పరచింది. భీష్మ, ద్రోణ, కృపాచార్య, అశ్వత్థామ, కర్ణాది మహా వీరులతో దండెత్తి వచ్చిన సుయోధనుని ఎదిరించడానికి బృహన్నల సారధ్యంలో వెళ్ళిన ఉత్తరుని తలచుకుని పరితపించాడు. వెంటనే సేనలను ఉత్తరకుమారునికి సహాయంగా వెళ్ళమని ఆజ్ఞాపించాడు. ఉత్తరకుమారుని క్షేమం తెలుసుకుని రమ్మని వార్తాహరులను పొమ్మని ఆజ్ఞాపించాడు. అంతలో అక్కడకు వచ్చిన వార్తా హరులు ఉత్తరకుమారుని విజయవార్త చేరవేసారు. విరాటుడు ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. కళ్ళవెంట ఆనంద బాష్పాలు రాలాయి. " ఏమి మన ఉత్తరుడు కురుసైన్యాలను గెలిచాడా. వెంటనే నగరమంతా చాటింపు వేయించండి. సువాసినులను, బ్రాహమణులను ఉత్తరునికి స్వాగతం చెప్పటానికి పంపండి " అని విరాటుడు ఉత్సాహంగా చెప్పాడు. కంకుభట్టుని చూసి " కంకా! ఈ ఆనంద సమయంలో ఒక ఆట ఆడదామా " అన్నాడు. ధర్మరాజు " మహారాజా! తమరు ఆనందంలో ఉన్నారు. నేను ఈ రోజు మీతో ఆడి గెలవగలనా " అన్నాడు. విరాటుడు పెద్దగా నవ్వి " సైరంధ్రీ! పాచికలు తీసుకురా " అని అక్కడ ఉన్న ద్రౌపదిని ఆజ్ఞాపించాడు.

## విరాటుడు ధర్మరాజు మిదకు పాచికలు విసరుట

ఆట ప్రారంభం అయింది విరాటుడు ధర్మరాజుతో " కంకా! అశేషమైన కురుసైన్యాలను జయించి నా కుమారుడు మా వంశ ప్రతిష్ఠ కాపాడాడు. అతని బాహుబలం ఎంత గొప్పదో కదా " అన్నాడు. ధర్మరాజు " సుయోధన, భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామ, కర్ణులతో కూడిన కురు సైన్యాలను జయించి గోవులను మరల్చాడంటే అతను లోక ప్రసిద్ధుడు కదా " అన్నాడు. విరాటుడు ఆ మాటలకు ఆగ్రహించి " కంకుభట్టా ! నా కుమారుని విజయాన్ని సందేహిస్తున్నావా? ఇంత వరకు నీవు ఏమి మాట్లాడినా సహించాను ఇక మీదట అలా కాదు " అన్నాడు. కాని కంకుభట్టు అంతంటితో వదల లేదు " ఒక్క కౌరవ సేనే కాదు. దేవతలు, రాక్షసులు కలసి వచ్చినా బృహన్నల రథ సారధ్యం వహిస్తుండగా ఉత్తరుని జయించడం ఎవరికి సాధ్యం కాదు " అన్నాడు. విరాటుడు కోపం పట్ట లేక పోయాడు " కంకూ! ఇక చాలు నీవు ఎన్నో వింతలు చెప్పగా విన్నాను. ఒక పేడి అదియూ సారధి శత్రువులను జయించడమా! నా కుమారుని విజయాన్ని ఎందుకు అంగీకరించవు. ఇక నీ మూర్ఖపు మాటలు కట్టి పెట్టు విపుడా " అన్నాడు. కాని ధర్మరాజు ఆపకుండా " అవును విరాటరాజా ! బృహన్నలకు యుద్ధం చేయాలని ఆశ కలిగి ఉంటుంది. ఉత్తరుని సారధిగా చేసి కౌరవసేనను జయించి గోవులను మరలించాడు. నా మాట అసత్యం కాదు. బృహన్నల విజయ వార్తను నగరంలో చాటించు " అన్నాడు. విరాటుడిక ఆగలేక " ఆ పేడిని నా ముందు పొగుడుతావా " అంటూ పాచికలను ధర్మరాజుపై విసిరాడు. అందులో ఒక పాచిక ధర్మరాజు నుదిటిపై బడి గాయం చేసింది. ధర్మరాజు అక్కడే నిలబడి ఉన్న ద్రౌపదిని చూసి తల వంచాడు. ద్రౌపది వెంటనే పరుగున వచ్చి ధర్మరాజు నుదిటి మీద స్రవిస్తున్న రక్తాన్ని తన పైట కొంగుతో అదిమింది. పక్కనే బంగారు కలశంలో ఉన్న నీటితో తన పైట తడిపి తుడిచింది. ఇదిచూసి విరాటుడు " సైరంధ్రీ ! అతని రక్తం నేలపై పడకుండా అలా తుడుస్తున్నావేంటి అన్నాడు " మహారాజా ! ఉన్నత వంశ సంజాతుడైన ఈ బ్రాహ్మణుని రక్తం ఎన్ని చుక్కలు భూమి మీద పడితే అన్ని రోజులు ఈ దేశంలో వర్షాలు పడవు. మన దేశానికి కలుగబోయే కీడుని నివారించడానికే అలా చేసాను " అన్నది సైరంధ్రి.

## ఉత్తరకుమారునికి నగరం స్వాగతం పలుకుట

ఉత్తరకుమారుని విజయానికి ఆనందపడి ఉత్తర తన చెలికత్తెలతో అన్నయ్యకు ఎదురు వెళ్ళి వారిరువురి మీద చందనం, కుంకుమ, పూవులు చల్లి స్వాగతం పలికింది. మిగిలిన వారు కూడా ఉత్తరునికి ప్రంశ్సల జల్లు గురిపించారు. ఉత్తర కుమారునికి ప్రశంశలకు తట్టుకోలేక బృహన్నల సహకారంతో ఈ విజయం సాధించానని నర్మ గర్భంగా చెప్పాడు. ఇంతలో ఉత్తర కుమారుడు విజయుడై వస్తున్నాడన్న వార్త విరాటునికి చేరింది. విరాటుడు ఆనందంగా వారిని రమ్మని చెప్పమని సేవకులను ఆజ్ఞాపించాడు. ఉత్తర కుమారుడు తండ్రికి నమస్కరించాడు. పక్కనే ఉన్న కంకుభట్టును చూసి నమస్కరించాడు. కంకుభట్టు నుదుటి మీద గాయాన్ని చూసి ఎలా జరిగిందని అడిగాడు. విరాటుడు " నేను నీ విజయాన్ని పొగుడుతుంటే విజయం నీది కాదు బృహన్నలది అన్నాడు. అందుకని నాకు కోపం వచ్చి పాచికలు విసిరాను. కంకుభట్టుకు గాయం అయ్యింది " అన్నాడు ఉత్తరునితో. ఉత్తరుడు తండ్రితో " తండ్రీ ! మహాపరాధం చేసారు. ఇలాంటి మహాత్ములను అగౌరవపరిస్తే మనకు ఆయువు, ఐశ్వర్యం క్షీణిస్తాయి. ముందు వారిని క్షమాపణ అడగండి " అన్నాడు. విరాటుడు కుమారుని మాట పాటించి కంకుభట్టును క్షమాపణ కోరాడు. కంకుభట్టు నవ్వి ఉత్తర కుమారునితో " అసలు నాకు కోపమే రాలేదు ఇక క్షమాపణలతో పని ఏమి?. విరాటుడు ఉత్తముడు. ఏదో చెడు ఘడియలో అలాచేసాడు " అన్నాడు. విరాటుని మనస్సు కుదుట పడింది.

## విరాటుడు ఉత్తరకుమారుని వద్ద యుద్ధవిశేషాలు వినకోరుట

విరాటుడు కుమారుని చూసి " కుమారా భీష్మ, ద్రోణ, అశ్వత్థామ, కృపాచార్యుల వంటి మహారథులున్న సుయోధన సైన్యాలను నువ్వు ఒక్కడివే ఎలా గెలిచావు. ఒక్కడు పరశురాముని గెలిచిన వాడు. ఒకడు శివుని వరాన పుట్టిన వాడు. ఒకడు అర్జునినికి యుద్ధ విద్యలు నేర్పిన ఆచార్యుడు. దృతరాష్ట్ర కుమారులు ఒక్కొక్కరు ఈ భూమిని గెలువగల సమర్ధులు. అలాంటి వారిని నీవు ఒక్కడివే ఒక్క గాయం కూడా పడకుండా ఎలా గెలిచావు ఆవులను ఎలా మరలించావు. ఒక్కరిని కొడితే పది మంది చుట్టు ముడుతారు కదా. సుయోధనుడిని ఎలా పలాయనం చేయించావు. వినాలని కుతూహలంగా ఉంది చెప్పు " అన్నాడు ఉత్తరుడు " తండ్రీ! కౌరవ సేనలను నేను గెలవ లేదు, గోవులను నేను మరల్చ లేదు. దైవాధీనంగా ఒక దైవాంశ సంభూతుడు వచ్చి కౌరవ సేనలను గెలిచి గోవులను మరల్చి సుయోధనుని పలాయనగతుని చేసాడు. అసలు యుద్ధం ఎలా జరిగిందో చెబుతాను వినండి " అని ఉత్తరుడు చెప్పనారంభించాడు. " బృహన్నలను సారధిగా చేసి నేను యుద్ధానికి వెళ్ళాను. కురు సేనలను చూడగానే నాకు కాళ్ళు చేతులు ఒణకసాగాయి. రథం దిగి పోయాను అప్పుడు ఒక మహానుభావుడు వచ్చి నాకు ధైర్యం చెప్పి నన్ను సారధిగా చేసి కౌరవ సేనలను ఓడించి గోవులను మరలించాడు. సుయోధనుని అడ్డగించి అతనితో

ఘోరంగా పోరాడాడు. కౌరవ సేనలను చిత్తు చేసాడు. కర్ణుని తమ్ముని చంపాడు. భీష్మునిపై బాణ ప్రయోగం చేసాడు. ద్రోణుని ఎదిరించాడు. రణ రంగంలో వీరవిహారం చేసాడు " అని చెప్పాడు. విరాటుడు ఆ మహాను భావుని చూపించమని అడుగగా ఉత్తరుడు అతడు అంతర్ధాన మయ్యాడని నేడో రేపో కనపడగలడని చెప్పాడు. కంకు భట్టు తన గాయాన్ని బృహన్నల చూడకుండా ఉత్తరీయాన్ని గాయంపై కప్పుకుంటూ జాగ్రత్త పడుతూ అంతా అర్జునిని పరాక్రమే అని ఆనంద పడ్డాడు.

## ధర్మజుని మందిరంలో పాడవుల ద్రౌపది సహిత సమావేశం

బృహన్నల ఉత్తరుని సమయస్ఫూర్తికి మెచ్చుకున్నాడు. వారిరువురు సుధేష్ణ వద్దకు వెళ్ళి ఆమె ఆశీర్వాదం పొందారు. ఉత్తర కొరకు నర్తనశాలకు వెళ్ళారు. ఉత్తరుడు బొమ్మ పొత్తికలను ఉత్తరకు ఇచ్చాడు. ఆమె అన్నయ్య పరాక్రమానికి మురిసి పోయింది. ఆ తరవాత పాండవులందరూ ద్రౌపదితో కలిసి ధర్మరాజు మందిరంలో రహస్యంగా సమావేశ మయ్యారు. అర్జునుడు జరిగినదంతా చెప్పాడు. తల వంచుకుని ఉన్న ధర్మజుని చూసి భీమునితో అర్జునుడు " అన్నయ్య నా వైపు ఎందుకు చూడటం లేదని అడిగాడు. ఇక దాచడం కుదరదని ధర్మరాజు " అర్జునా! విరాటుడు తన కుమారుని పొగుడుతుంటే నేను బృహన్నల ఉండగా ఉత్తరుడు విజయం సాధించడంలో విశేష మేమిటని అన్నాను. విరాటుడు కోపించి ఒక పేడిని పొగుడుతావా అని వివేకం నశించి పాచికలు నాపై విసిరాడు. నాకు చిన్న గాయం అయింది " అన్నాడు. ఆమాటలకు భీముడు ఉగ్రుడై " ఆ దురాత్ముని సకుంటుంబంగా యమపురికి పంపి వాని రాజ్యం మనం కైవశం చేసుకుంటాము " అన్నాడు. ధర్మరాజు వారిరువురిని వారించి " కష్టకాలంలో మనకు ఆశ్రయం ఇచ్చిన విరాటుని చంపడం భావ్యము కాదు. అతని పట్ల మనం కృతజ్ఞత మాత్రమే చూపాలి. మనమెవ్వరమో అతనికి వివరిస్తాము. ఆతరవాత కూడా అతడు మనపట్ల అమర్యాదగా ప్రవర్తిస్తే అప్పుడు మీ ఇష్టం అన్నాడు.

## పాండవులు తమను తాము బహిరంగ పరచుకొనుట

మరునాటి ఉదయం పాండవులు ద్రౌపది తమ నిజరూపాలు తెలిసేలా వస్త్రధారణ చేసి సభా ప్రవేశం చేసారు. ధర్మరాజు విరాటుని సింహాసనాన్ని అధిష్టించాడు. విరాటుడు కొలువుకు రాగానే సింహాసనంపై కూర్చున్న ధర్మరాజుని చూసి " ఏమిటిది కంకా ! మా సింహాసనం అధిష్టించింది చాలక మమ్ములను చూసి కూడా లేవకుండా కూర్చున్నావా ఇంతటి అహంకారమా? " అన్నాడు. అర్జునుడు " విరాటా ! ఈయన ధర్మరాజు ఎంతో మంది సామంతులను కను సన్నలతో శాసంచగల చక్రవర్తి. భూమిని నాలుగు చెరగులా జయించి రాజసూయాన్ని నిర్వహించిన మహాను భావుడు. అజాతశత్రువు, సత్యవ్రతుడు, ధర్మమూర్తి అయిన ఇతడు దేంద్రుని సింహాసనాన్ని అధిష్టించడానికి కూడా అర్హుడు నీ ఇంత చిన్న సింహాసనాన్ని అధిష్టించడానికి తగడా? " అన్నాడు. అది విన్న విరాటునికి ఆశ్చర్యం, ఆనందం, అనుమానం ఒకేసారి కలిగి " మరి ఈయన ధర్మరాజైతే మిగిలిన వారు ఎవరు. ద్రౌపది ఎక్కడ? " అని అడిగాడు. అర్జునుడు " మహారాజా! ఇప్పటి వరకు నీ వంట శాలలో రుచికరమైన వంటలు చేసి, మల్లయుద్ధాలు చేసి నిన్ను మెప్పించిన వలలుడే భీముడు. అతడు బకాసురుడు, కిమ్మీరులను వదించిన బలశాలి. నీ అశ్వశాలలో అశ్వాలను రక్షిస్తూ నిన్ను సేవించే తంత్రీ పాలుడే మా తల్లీ మాద్రి పెద్ద కుమారుడు నకులుడు. గోశాలలో గోవులను కాపాడుతూ సేవిస్తున్న దామ్రగంధి మాద్రి చిన్న కుమారుడు సహదేవుడు. అంతఃపురంలో సైరంధ్రిగా సుధేష్ణను సేవించే మాలినియే ద్రౌపది. ఆమెను అవమానించినందుకే భీముడు కీచకుని, ఉపకీచకులని వధించాడు " అనగాగానే భీముడు అందుకుని " నర్తనశాలలో నాట్యం నేర్పే బృహన్నల అర్జునుడు. ఇంద్రలోకంలో ఊర్వశి ఇచ్చిన శాపం అర్జునినికి ఇలా అజ్ఞాతవాస సమయంలో సహాయపడింది. ఖాండవవనాన్ని దహించి ఇంద్రుని జయించిన మహా వీరుడు. కాలకేయులను చంపిన ఘనుడు. అతడే " అన్నాడు. ఇదంతా కలా నిజమా అని విరాటుడు సంభ్రమాశ్చర్యాలతో మునిగి తేలుచున్న సమయంలో ఉత్తరకుమారుడు " అవును తండ్రీ! నేను చెప్పిన దైవాంశ సంభూతుడు ఇతడే. భయంతో వణుకుతున్న నాకు ధైర్యం చెప్పి యుద్ధం చేసి మనలను గెలిపించిన దివ్యపురుషుడు ఇతడే.

## ఉత్తరకుమారుడు అర్జునిని గురించి వర్ణించుట

అంత ఘోరయుద్ధం నేను ఇంతవరకు చూడ లేదు. రధాన్ని కూడా నడప లేకపోయిన నాకు ధైర్యం చెప్పి కురు సైన్యాలను చిత్తు చేసిన మహా వీరుడు. అతని అభ్యర్ధన వలన నేను నిన్న ఇతని పేరు వెల్లడించ లేదు. విరాటుడు పరవశించి పోయాడు. అర్జునిని గట్టిగా కౌగలించుకున్నాడు. ధర్మరాజు పాదాలకు నమస్కరించాడు. భీమ నకుల సహదేవులను ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. అర్జునుడు తన తమ్ములను ఉత్తర కుమారునికి పరిచయం చేసాడు. విరాటుడు తన తమ్ములను, కుమారులను, మంత్రులను పాండవుల దర్శనానినికి పిలిపించాడు. ద్రౌపదిని గురించి చెప్పి తగురీతిన గౌరవించమని సుధేష్ణకు వర్తమానం పంపాడు. అర్జునుడు " విరాటరాజా ! దుస్తరమైన అజ్ఞాతవాసాన్ని మీతో నిర్భయంగా గడిపాము "

అన్నాడు. విరాటుడు " అర్జునా ! నేను పరాయి వాడినా. మీ అజ్ఞాతవాసం మా వద్ద గడపటం నా పూర్వజన్మ సుకృతం. ఇక ఈ మత్స్యదేశం మీది. మేమంతా మిమ్మలిని సేవించుకుంటాము. కౌరవుల మీదికి దండెత్తి రావలసి వస్తే మేము మీతో యుద్ధం చేస్తాము " అన్నాడు. ఉత్తరుడు " అదేమిటి తండ్రీ ! మమనకంటూ ఒక రాజ్యం ఉందా? కౌరవులతో యుద్ధం చేసి మనలను గెలిపించి మన రాజ్యాన్ని గెలిపించింది వీరే కదా. ఇక ఇది వీరి రాజ్యం. వారి రాజ్యం వారికి ఇవ్వడం హాస్యాస్పదం కాదా. ఇంత కాలం నివురు కప్పిన నిప్పులా ఉన్న వీరిని మనం కూడా అవమానించి అనరాని మాటలన్నాం. వీరిని క్షమాపణ అడగడం మన ధర్మం. ఈ సంపద ఈ సామ్రాజ్యం వీరిదే కనుక వీరికి కానుక ఇవ్వాలంటే ఉత్తరకుమారిని పిలిపించండి " అని తండ్రితో చెప్పాడు.

## అర్జునుడు విరాటునితో వియ్యమందుటకు అంగీకరించుట

ఉత్తరకుమారుని పలుకులు విన్న విరాటుడు ఉత్తరను తీసుకురమ్మని సేవకులను ఆజ్ఞాపించాడు. వారు సుధేష్ణ అనుమతితో ఉత్తరను సర్వాలంకార భూషితను చేసి తీసుకు వచ్చారు. ఉత్తరకు ఎదురు వెళ్ళి విరాటుడు ఆమను చేయి పట్టి ధర్మరాజు వద్దకు తీసుకు వచ్చి ధర్మరాజుతో " ధర్మరాజా! అజ్ఞానంతో నీ పట్ల చేసిన అపరాధాలు మన్నించి మమ్ము క్షమించమని ప్రార్ధిస్తున్నాను. మీతో బంధుత్వం మాకెంతో శ్రేయస్కరం మా కుమార్తె ఉత్తరను అర్జునుని కిచ్చి వవాహం చేయడం మాకు సమ్మతం. మీ అంగీకారం తెలుపితే ఆనందం " అన్నాడు. ఇదంతా గమనిస్తున్న అర్జునుడు ధర్మరాజు వైపు చూసి అతని చూపులలో అర్ధం గ్రహించి విరాటునితో " విరాటరాజా ! నేను ఉత్తరకు గురువును గురువు తండ్రితో సమానం. కాబట్టి ఈమెను కోడలిగా స్వీకరిస్తాను. నా కుమారుడు అభిమన్యుడికిచ్చి వివాహం చెయ్యండి. అభిమన్యుడు శ్రీకృష్ణుని మేనల్లుడు సుభద్ర కుమారుడు సౌందర్య వంతుడు, విద్యావంతుడు, బాహుబలం కలిగిన వీరుడు, ఉదారుడు, శౌర్యపరాక్రమం కలిగిన వాడు, గుణవంతుడు, పెద్దలమన్నలను పొందిన వాడు " అని కుమారుని గుణగణాలను వివరించాడు. ఆ మాటలకు విరాటుడు సంతోషించి " అర్జునా ! నీతో వియ్యమందడం కంటే కావలసినదేముంది. అన్నగారు కార్య నిర్ణయం చేసి చెపితే దానిని మేము ఆచరిస్తాము " అన్నాడు. ధర్మరాజు " అర్జునుడు మాట్లాడినది ఎంతో సముచితంగా ఉంది. ఇది నాకు సమ్మతమే. మన బందు మిత్రులకు ఈ విషయం తెలియచేయండి " అన్నాడు. విరాటుడు మీ కురువంశంతో వియ్యమందడంతో మా మత్స్యదేశం పావనం అయింది అని ఉత్తర కుమారిచే భీమ, అర్జున, నకుల సహహదేవులకు ప్రణామము చేయించాడు. వారాంతా ఉత్తరను మనసారా దీవించారు. ఉత్తరకుమారి అంతఃపురానికి వెళ్ళింది. పురోహితులను పిలిపించి సుమూహూర్తం నిర్ణయించారు. ఇరు పక్షాలవారికి వివాహఆహ్వాన పత్రిక పంపించారు. ధర్మరాజు విరాటుని కౌగలించుకుని " విరాటా! అజ్ఞాతవాస సమయంలో మాకు ఆశ్రయం ఇచ్చి ఆదుకున్నందుకు కృతజ్ఞతలు. మాకు శ్రీకృష్ణుడెంతో ఇకపై మీరూ అంతే " అని అభినందనలు తెలిపాడు.

## సుయోధనుని సందేహం

విరాటరాజు కొలువులో పెళ్ళి సంరంభం జరుగుతుండగా హస్తినకు తిరిగి వెళుతున్న సుయోధనునికి ఇంకా సందేహం నివృత్తి కాలేదు. అతనికి కర్ణుడు, శకుని మాటల మీద ఉన్న నమ్మకం భీష్ముని పలుకులపై లేదు. సందేహ నివృత్తి కొరకు ధర్మరాజు వద్దకు ఒక దూతను పంపి " ధర్మరాజా ! మీ అజ్ఞాతవాసం ముగియక ముందే అర్జునుడు బయట పడ్డాడు. నీవు లెక్క చూసి ఏది ఉచితమో అది చెయ్యి " అని చెప్పించాడు. ఆ మాటలలో ఉన్న అంతరార్ధం గ్రహించి ధర్మరాజు నవ్వి " మేము సమ్మతించి నట్లు పదమూడు సంవత్సరాలు నిండాయి. ఇది నిజం ఈ మాట నీవు భీష్మ, ద్రోణ, కృపాచార్యులు వింటుండగా సుయోధనునికి తెలియ చెయ్యి " అని దూతతో చెప్పాడు. దూత ఆవిషయాన్ని అలానే చెప్పాడు. సుయోధనుడు తాను దూతను పంపిన విషయం దాచి " తాతాగారూ ! ఆచార్యా ! మనం మోసపోయి అనవసరంగా అర్జునినితో యుద్ధం చేసాము. అర్జునుడు పదమూడేళ్ళు నిండిన తరవాత బయటకు వచ్చాడా లేదా అన్న విషయం మనం సరిగా విచారించ లేదు " అన్నాడు. భీష్ముడు " సుయోధనా ! జరిగింది చాలు ప్రతిజ్ఞా భంగం కాలేదు నీ మాటకు ఇక కట్టి పెట్టు ఎవరైనా వింటే నవ్వగలరు. మారు మాటాడక హస్థినకు పద " అన్నాడు. చేసేది లేక సుయోధనుడు హష్తినకు మరలి వెళ్ళాడు.

## పాండవులు ఉపప్లావ్యం చేరుట బంధుమిత్రుల రాక

పాండవులు శమీ వృక్షం దగ్గరకు వెళ్ళి ఆయుధాలకు తగినట్లు పూజించి తమ వెంట తీసుకు వెళ్ళారు. పాడవులు అంతా ఉపప్లావ్యం చేరుకున్నారు. విరాటుని ఆజ్ఞపై ప్రజలంతా పాండవులకు కానుకలు సమర్పించారు. విరాటుడు సమకూర్చిన సౌకర్యాలతో పాండవులు ఉపప్లావ్యంలో సుఖంగా ఉన్నారు. ఈ విషయం తెలుసుకున్న శ్రీకృష్ణుడు బలరాముడు రుక్మిణి, సత్యభామ, సుభద్ర, అభిమన్యుడు, సాత్యకి, కృతవర్మ, సాంబుడు, ప్రద్యుమ్నుడు, యుయుధానుడు, రుక్మి, అకౄరుడు,

ఇంద్రసేనుడు మొదలగు వీరులు వెంట రాగా యాదవప్రముఖులతో ఉపప్లావ్యం చేరాడు. పాండవులు శ్రీకృష్ణునికి ఎదురేగి సాదరంగా ఆహ్వానించారు. ద్రుపద మహారాజు, కాశీరాజు శైబ్యుడు తమతమ భార్యా పుత్రులతో ససైన్యంగా ఉపప్లావ్యం చేరారు. అనేక దేశాలనుండి రాజులు ఉత్తరాభిమన్యుల వివాహానికి ఆహుతులుగా వచ్చారు. వివాహ వేదిక అత్యంత శోభాయమానంగా తయారైంది. ఉత్తరను పెండ్లి కూతురుగా అలంకరించారు. పాండవులను పెండ్లికి తరలి రమ్మని పురోహితులతో విరాటరాజు ఆహ్వానం పంపాడు. అభిమన్యుని కూడా పెండ్లి కుమారునిగా అలంకరించి అందరూ పెండ్లికి తరలి వెళ్ళారు. విరాటుడు శ్రీకృష్ణుని, పాండవులను సాదరంగా ఆహ్వానించాడు. పెళ్ళి తంతు ఆరంభం కాగానే శ్రీకృష్ణుడు, బలరాముడు, ధర్మరాజు, అర్జునుడు, విరాటరాజు సముఖంలో వధూవరులు తెరదగ్గర నిలిచారు. జ్యోతిష్కులు నిర్ణయించిన శుభమూహూర్తం సమీపించింది అని తెలిపిన పిమ్మట వధూవరులు ఒకరిని ఒకరిని చూసుకుని ఆనందించారు. దోసిళ్ళతో తలంబ్రాలు పోసుకున్న పిమ్మట అభిమన్యుడు ఉత్తరపాణి గ్రహణం చేసి ఆపై ఒకే ఆసనంపై ఆసీనులైయ్యారు. విరాటరాజు పాండవులకు, శ్రీకృష్ణునికి, ద్రౌపతిపకి, సుభద్రకు వస్త్రాభరణాలు బహూకరించాడు. ఉత్తరా భిమన్యుల వివాహం వైభవంగా జరిగింది.

## బయటి లింకులు

### మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం

### పర్వాలు

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

### పాత్రలు

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

### ఇతర విషయాలు

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

# ఉద్యోగ పర్వము

వికీపీడియా నుండి

**ఉద్యోగ పర్వము**, మహాభారతం ఇతిహాసంలోని ఐదవ భాగము. ఆంధ్ర మహాభారతంలో ఈ భాగాన్ని తిక్కన అనువదించాడు.

ఉద్యోగము అనగా "ప్రయత్నము". యుద్ధానికీ, శాంతికి జరిగే యత్నాలు ఈ పర్వంలో ముఖ్య కధాంశం. సంస్కృత మూలంలో 6,698 శ్లోకాలు ఉన్నాయి. సనత్సుజాతీయము ఉద్యోగ పర్వంలో ఒక భాఘం (41 నుండి 46 వరకు అధ్యాయాలు). దీనిపై ఆది శంకరాచార్యులు వ్యాఖ్యానం వ్రాశాడు.

## విషయ సూచిక



## సంస్కృత మహాభారతం

## ఆంధ్ర మహాభారతం

## విశేషాలు

## మూలాలు

## బయటి లింకులు

- కిశోరీ మోహన్ గంగూలి ఆంగ్ల అనువాదం (http://www.sacred-texts.com/hin/m01/index.htm)

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • **ఉద్యోగ పర్వము** • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

"http://te.wikipedia.org/w/index.php?title=ఉద్యోగ_పర్వము&oldid=709647" నుండి వెలికితీశారు

వర్గం: మహాభారతం

---

# ఉద్యోగ పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

**ఉద్యోగ పర్వము**, మహాభారతం ఇతిహాసంలోని ఐదవ భాగము. ఆంధ్ర మహాభారతంలో ఈ భాగాన్ని తిక్కన అనువదించాడు.

ఉద్యోగము అనగా "ప్రయత్నము". యుద్ధానికీ, శాంతికి జరిగే యత్నాలు ఈ పర్వంలో ముఖ్య కధాంశం. సంస్కృత మూలంలో 6,698 శ్లోకాలు ఉన్నాయి. సనత్సుజాతీయము ఉద్యోగ పర్వంలో ఒక భాఘం (41 నుండి 46 వరకు అధ్యాయాలు). దీనిపై ఆది శంకరాచార్యులు వ్యాఖ్యానం వ్రాశాడు.

## విషయ సూచిక

## ప్రధమాశ్వాసం



పాండవుల సమావేశం

ఉత్తరాభిమన్యుల వివాహం గడిచి నాలుగు రోజుల తరవాత ధర్మరాజు తన సోదర, పుత్ర సమేతంగా విరాటరాజు కొలువు కూటంలో ప్రవేశించాడు. అప్పుడు విరాటరాజు కృష్ణుడు, బలరాముడు, వారి పుత్రులు బంధువులతో ఇష్టాగోష్టి జరుపుతున్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అందరినీ చూసి " పాండవులు అరణ్యవాసం, అజ్ఞాతవాసం విజయవంతంగా పూర్తి చేసారు. వారు ఎంతటి ధర్మపరులో అందంరికి తెలుసు. సుయోధనుడు శకుని సాయంతో పాండవులను మాయా జూదంలో ఓడించి పాండవుల రాజ్యలక్ష్మిణి అన్యాయంగా అపహరించాడు. కనుక పాండవులకు కౌరవులకు క్షేమకరమైన ఒక మార్గం అన్వేషించి పాండవుల రాజ్యం వారికి సంక్రమింప చేయాలి. పాడవులకు పితృధనంగా కొంతరాజ్యం లభించింది. ధర్మరాజు రాజసూయ యాగం నిర్వహించి రాజ్యాన్ని విస్తరించి మాయా జ్యూదంలో అంతా దుర్యోధనుని పరం చేసి అడవులలో సోదర, పత్నీ సమేతంగా అనేక ఇడుములు పడ్డాడు. సుయోధనుడు శకుని, దుశ్శాసన, కర్ణాదులతో చేరి వారిని అనేక అవమానాల పాలు చేసాడు. పాండవులు సాయం సంతరించుకునే లోపే వారిని ఎదుర్కోవడానికి సన్నాహాలు చేస్తున్నాడు. కనుక పాండవులు వారికి సహాయాన్నందించే వారిని సమీకరించడం అనివార్యం వారి బలపరాక్రమాలను ప్రదర్శించ వలసిన సమయం ఆసన్నమైంది. అయినా కౌరవుల మనసులో ఏముందో తెలుసుకుని తదుపరి కార్యక్రమ రచన చేయడం ఉచితం కనుక హస్తినా పురానికి ఒక దూతను పంపుట ఉచితం. వారు పాండవులకు రాజ్యభాగం శాంతి మార్గంలో ఇస్తే ఇరువర్గాలకు మంచిది. లేకుంటే ఏది ఉచితమో తరువాత నిర్ణయిస్తాము " అన్నాడు. అప్పుడు బలరాముడు లేచి " తమ్ముడు శ్రీకృష్ణుడు చెప్పినది ఉచితం. ఇరువర్గాలకూ ఇది క్షేమకరం. మనం ఒక దూతను కౌరవేంద్రుని వద్దకు పంపుదాము. సుయోధనుని అతిశయానికి లోబడి ధర్మనందనుడు సౌమ్యం ప్రదర్శించి రాజ్యాన్ని కోల్పోయాడు. సుయోధనునికి జూదవిద్యలో ప్రావీణ్యం లేదు కనుక శకునిని నియమించాడు. అతని ప్రావీణ్యంతో రాజ్యాన్ని జూదంలో గెలిచి సుయోధన పరం చేసాడు. ఇందులో దుర్యోధనుని అపరాధం ఏమీ లేదు కనుక దూత వినయంతో కార్యాన్ని చక్కబెట్టేలా ఉండాలి " అన్నాడు.

## సాత్యకి ఆవేశం


విరాటుడి సభలో మాట్లాడుచున్న శ్రీకృష్ణుడు

బలరాముని మాటలు సాత్యకికి కోపం తెప్పించాయి " బలరామా ! నువ్వు ఇలా మాట్లాడటం తగదు. ఇలా మాట్లాడటం నీకే తగింది. అయినా నిన్నని ఏమి లాభం. దుర్యోధనుడు మంచి వాడంటున్న నిన్ను మాట్లాడించి వింటున్న వారిని అనాలి. ధర్మరాజు వేడుక పుట్టి జూదం ఆడాడా? దుర్యోధనాదులంతా కుట్రపన్ని ధర్మరాజుని జూదానికి పిలిచి కపట జూదం ఆడి అతడి రాజ్యలక్ష్మిని అపహరించి అతని సోదరలను ధర్మ పత్నిని అవమానించ లేదా? ధర్మరాజు ధర్మగుణం లోకానికి తెలియనిదా? పాండవుల వద్ద అపహరించిన రాజ్యం పాండవులకు ఇవ్వక తప్పదు లేకున్న యాచనతో పని లేదు పాండవులు యుద్ధంలో వారి రాజ్యాన్ని పొందగలరు. భీమార్జునలను ఎదిరించి నిలవగలవారు లేరు. సుయోధనుడు సోదర సమేతంగా వారి చేతిలో హతుడగుట నిక్కము. నేను వారితో ఉండగా యుద్ధభూమిలో నిలువగల వాడెవడు. విరాటుని పరాక్రం తక్కువా? పాంచాల వీరులు, వృష్టి వీరులు యుద్ధంలో తలపడి సుయోధనుని తమ్ములను హతమార్చక మానరు. రాజ్యం ఇవ్వకుంటే యుద్ధం తప్పదు. దూతను పంపండి కానీ న్యాయంగా ఇస్తే సరి యాచన వలదు " అన్నాడు.

## ద్రుపదుడు తన అభిప్రాయం వెలిబుచ్చుట

సాత్యకి మాటలను ప్రోత్సహిస్తూ ద్రుపదుడు లేచి " సాత్యకి చెప్పింది సమ యోచితంగా ఉంది. బలరాముని మాటలు అంగీకరించడం వీలుకాదు. సుయోధనుడు మంచి మాటలతో వినకుంటే యుద్ధమే శరణ్యం. భీష్మ, ద్రోణాదులు సుయోధనుని ఆశ్రయంలో ఉన్నారు కనుక వారు అతనికి సహాయంగా ఉంటారు. అశ్వత్థామకు సుయోధనుడంటే అభిమానం మెండు కనుక అతడు సుయోధనుని వైపు యుద్ధం చేస్తాడు. పుత్రప్రేమను జయించలేని ద్రోణుడూ సుయోధనుని వీడడు. కృపాచార్యుని బంధుత్వం అతడిని సుయోధనుని వైపు కట్టుబడేలా చేస్తుంది. దృతరాష్ట్రునికి పుత్రుడంటే విపరీతమైన ప్రేమ కనుక అతడు సుయోధనుని అకృత్యాలను ఖండించి రాజ్యభాగాన్ని పాండవులకు ఇప్పించలేడు. శకుని మేనల్లుని అకృత్యాలను పెంచి పోషిస్తాడు, కర్ణుడు యుద్ధోన్మాది అతడు సుయోధనుని యుద్ధానికే ప్రోత్సహిస్తాడు దుశ్శాసనాది సోదరులు అన్న ఆజ్ఞ మీరరు కనుక సుయోధనుడు సంధికి అనుకూలంగా స్పందించడు. యుద్ధం అనివార్యం సుయోధనుడు ఇప్పటికే ఆప్రయత్నాలు కొనసాగిస్తుంటాడు. రాజులు ముందుగా అడిగిన వారికే సహాయపడతారు కనుక మనము రాజుల సహాయాన్ని ముందుగా కోరడం మంచిది. వెంటనే మనం మన మిత్ర రాజులైన కేకయరాజు, జరాసంధుని కుమారుడు, దుష్టకేతు మొదలైన వారికి సమాచారం అందించి సహాయం కోరడం తక్షణ కర్తవ్యం " అని చెప్పాడు ద్రుపదుడు ఆపై తన పక్కనే ఉన్న బ్రాహ్మణుని చూపి " ఇతడు నాకు అగ్ర పురోహితుడు. ఇతడు చతురసంభాషణలో ఘటికుడు. ఇతడు భీష్మ, ద్రోణ, దృతరాష్ట్రాదులతో యుక్తంగా మాటాడగలడు. ఇతడి అన్ని విషయములు చెప్పి మన దూతగా దృతరాష్ట్రుని వద్దకు పంపుతాము " అన్నాడు.

## ద్రుపదుడు దూతను పంపుట

శ్రీకృష్ణుడు ద్రుపదునితో " ధర్మజా! మీరు ద్రుపదుడు చెప్పిన మాట జరిగేలా చెయ్యండి. పెళ్ళికి వచ్చిన వారము ఎక్కువ రోజులు ఇక్కడ ఉండటం మంచిది కాదు మేము వెళతాము " అని ద్రుపదుని చూసి " మీరు అందరికీ గురు స్థానంలో ఉన్నారు. మీ మాట అంటే దృతరాష్ట్రునికి మన్నన, భీష్ముడు మిమ్ము ఆదరిస్తాడు, ద్రోణ, కృపులతో మీకు స్నేహం ఉంది. కనుక పాండవుల తరఫున దూతను పంపు భాధ్యత మీదే. మీ మాట మేము అంతా ఆదరిస్తాము. మీరు కోరినట్లు సుయోధనుడు రాజ్యం ఇవ్వకపోతే యుద్ధం తప్పదు. మీరంతా మీమీ నగరాలకు వెళ్ళి యుద్ధ సన్నాహాలు చెయ్యండి " అని శ్రీకృష్ణుడు తన వారితో ద్వారకకు వెళ్ళాడు. పాండవులు , ద్రుపదుడు, విరాటుడు యుద్ధ సన్నాహాలు చేస్తున్నారు. ఈ విషయాలు చారుల ద్వారా తెలుసుకుని దుర్యోధనుడు తాను కూడా యుద్ధ సన్నాహాలు చెయ్యడం మొదలు పెట్టాడు. పాండవుల తరఫున దూతగా వెళ్లిన బ్రాహ్మణుని పిలిచి ద్రుపదుడు " విప్రోత్తమా! నీవు మాకు హితుడవు, బుద్ధి కుశలత కలవాడవు, చరురభాషణలో నేర్పరివి, సమయస్ఫూర్తి కలవాడవు, ఉన్నతకుల సంజాతుడవు మాకు సన్నిహితుడవు కనుక నిన్ను దూతగా పంపుతున్నాను. ధర్మరాజు ధర్మాత్ముడు దుర్యోధనుడు కుటిలుడు. నీవు దృతరాష్ట్రునితో మాట్లాడి పాండవుల రాజ్యం ఇమ్మని అర్ధించాలి. పాండవులు అడవులలో పడిన కష్టాలు చెప్పి అక్కడి వారిని ఒప్పించాలి. శ్రీకృష్ణాదులు పలికిన పలుకులు సమయోచితంగా తెలియజేయాలి. భీష్మ, ద్రోణ, కృపాచార్యుల మనసెరిగి మాట్లాడాలి. దైవకృప వలన సుయోధనుడు అంగీకరిస్తే అందరికీ క్షేమమే " అని చెప్పాడు. విప్రుడు అందరి వద్ద శలవు తీసుకుని హస్థినకు వెళ్ళాడు.

## సహాయార్థియై దుర్యోధనుడు ద్వారకకేగుట


అర్జున ధుర్యోధనులు కృష్ణుని సహాయము అర్థించుటకు వచ్చుట

హస్థినలో కూడా ఇలాంటి చర్చలే జరుగుతున్నాయి. శ్రీకృష్ణుని వద్దకు దూతను పంపాలనుకున్న దూర్యోధనుడు మనసు మార్చుకుని తనే స్వయంగా ద్వారకకు పయనమయ్యాడు. అర్జునుడు కూడా అదే రోజు ద్వారక చేరాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు శయనించి ఉన్నాడు. ముందుగా వచ్చిన సుయోధనుడు శ్రీకృష్ణుని తలవైపు ఉన్న ఆసనంపై కూద్చున్నాడు. తరవాత వచ్చిన అర్జునుడు శ్రీకృష్ణుని కాళ్ళ వైపు కూర్చున్నాడు. శ్రీకృష్ణుడు నిద్రలేచి ముందుగా అర్జునిని వైపు చూసి తరవాత దుర్యోధనుని చూసాడు. ఇద్దరినీ తగురీతిన సత్కరించి వచ్చిన కారణం అడిగాడు. సుయోధనుడు ముందుగా " కృష్ణా! పాండవులకు మాకు యుద్ధం సంభవిస్తే యుద్ధంలో మాకు మీ సహాయం కోరడానికి వచ్చాను. నీకు పాండవులెంతో మేము అంతే పైగా నేను ముందు వచ్చాను ముందుగా వచ్చిన వారిని ఆదరించడం లోక నీతి కనుక నాకు నీ సహాయాన్ని అందించ కోరుతున్నాను. అందుకు శ్రీకృష్ణుడు " సుయోధనా నీవు ముందు ఏతెంచిన మాట వాస్తవం. కాని నేను ముందుగా అర్జునిని చూసాను కనుక మీ ఇద్దరికి సహాయాన్నందించడం నా విధి. మీ ఇద్దరికీ సమ్మతమయ్యేలా ఒక మార్గం చెప్తాను. నా వద్ద సుశిక్షితులైన " నారాయణ " నామంగల పదివేల మంది యుద్ధ విద్యా నిపుణులు ఉన్నారు. వారిని ఎంచుకున్న వారి వైపు వారు యుద్ధం చేస్తారు. నేను ఒక వైపు ఉంటాను అయితే నేను మాత్రం యుద్ధం చేయను. ఆయుధం పట్టను. కోరుకున్న వారికి హితుడుగా ఉంటాను. మీరిరువురు ఎవరికి ఇష్టమైంది వారు కోరుకోండి. అర్జునుడు చిన్నవాడు కనుక అత్సడు ముందు కోరుకోవడం ధర్మం " అన్నాడు. వెంటనే అర్జునుడు " నాకు శ్రీకృష్ణుడు కావాలి " అన్నాడు. సుయోధనుడు మనసులో సంతోషించి పది వేల సైన్యం తీసుకుని బలరాముని వద్దకు వెళ్ళి సహాయం కోరాడు. బలరాముడు " సుయోధనా! అభిమన్యుని వివాహ సమయంలో నేను నిన్ను సమర్ధించాను. అందుకు కొందరు వ్యతిరేకించారు. నాకు కృష్ణుడంటే అభిమానం. అందుకని అప్పడే నేను ఏమి అనలేక పోయాను. కనుక నేను ఎవరి పక్షం వహించక ఊరక ఉంటాను " అన్నాడు. సుయోధనుడు బలరాముని వద్ద వీడ్కోలు తీసుకుని కృతవర్మ వద్దకు వెళ్ళి సహాయం అర్ధించాడు. కృతవర్మ ఒక అక్షౌహిణి సైన్యాన్ని సహాయంగా ఇచ్చాడు. దానిని తీసుకుని సుయోధనుడు హస్థినకు తిరిగి వెళ్ళాడు.

## అర్జునుని అంతర్యం

శ్రీకృష్ణుడు " అర్జునా! అదేమిటి నన్ను కోరుకున్నావు. ఆయుధము పట్టని యుద్ధం చేయని నా వల్ల నీకు మేలు ఏమిటి " అన్న్నాడు. అర్జునుడు " కృష్ణా నిన్ను యుద్ధంలో గెలువగల మొనగాడెవడు. నిన్ను ఎదిరించి నేను గెలువగలనా? పైగా నీవు ఉన్న వైపు విజయలక్ష్మి ఉంటుంది కనుక నీ తోడ్పాటు చాలు. దానితో నేను యుద్ధం చేసి రాజ్యం హస్థగతం చేసుకుని ధర్మరాజుని నిలపడమే అతనికి ఖ్యాతి గాని నీవు గెలిచిన రాజ్యానికి ధర్మజుని రాజుని చేయడం ధర్మమా? నీవు మాకు పక్క బలంగా ఉంటే చాలు. నా చిరకాల వాంఛ అయిన నీ సారధ్యం ప్రసాదించి నన్ను అనుగ్రహించు అదేచాలు " అన్నాడు. శ్రీ కృష్ణుడు " అర్జునా! నీ కోరిక తప్పక తీరుతుంది. నీకు సారధ్యం వహించి విజయలక్ష్మిని నీకు స్వంతం చేస్తాను. మనం వెళ్ళి ధర్మరాజుతో ఆలోచించి తదుపరి కార్యాచరణ చేద్దాము పద " అని అర్జునినితో ఉపప్లావ్యం చేరాడు.


కృష్ణుని తన వైపు నుండ వలనని కోరుకున్న అర్జునుడు

## శల్యుడు సుయోధనునికి సాయం అందించుట

ధర్మరాజు పంపిన దూతలు శల్యుని వద్దకు వెళ్ళి పాండవులకు సైన్య సహాయం చేయమని ధర్మజుని కోరిక వెలిబుచ్చారు. శల్యుడు ఆనందంగా సైన్య సమేతుడై ఉపప్లావ్యం చేరాడు. చారుల ద్వారా విషయం గ్రహించిన సుయోధనుడు శల్యుడు వచ్చు మార్గంలో తన మనుషుల ద్వారా వారి సైన్యానికి సకల మర్యాదలు, సౌకర్యాలు సమకూరేలా చేసాడు. విందులూ , వినోదాలు ఏర్పాటు చేసి రాజమర్యాదలు చేసాడు. ఇవి చూసిన శల్యుడు " ఈ మర్యాదలు చేస్తున్న వారు నా మర్యాదకు అర్హులు. ఈ ఏర్పాట్లను చేసిన ధర్మరాజు అమాత్యులను పిలిపించండి " అన్నాడు. అప్పుడు సుయోధనుడు శల్యుని వద్దకు వెళ్ళి అవన్నీ తాను చేసినట్లు చెప్పాడు. శల్యుడు సంతోషించి " నీకు ఏమి కావాలో కోరుకో " అన్నాడు. అందుకు సుయోధనుడు " ఆర్యా ! నీకు మేము పాండవులు ఒకటే కదా ! కనుక నన్ను కూడా వారితో సమానంగా ఆదరించండి " అని అడిగాడు. శల్యుడు " సుయోధనా! నీవు చెప్పినది నిజం. నాకు మీ ఇరువురి నడుమ భేదం లేదు. నీకు ఏమి కావాలో కోరుకో " అన్నాడు. సుయోధనుడు " నీ సహాయ సహకారలందించడం కంటే కావలసినది ఏముంది " అన్నాడు. శల్యుడు అందుకు సమ్మతించాడు. ఆ తరవాత శల్యుడు నేను ధర్మరాజు వద్దకు వెడుతున్నాను. అతనిని దర్శించిన తరవాత నీ దగ్గరకు వస్తాను " అన్నాడు. సుయోధనుడు " అలాగే వెళ్ళండి కాని నాకిచ్చిన మాట మరవ వద్దు " అన్నాడు. శల్యుడు అందుకు అంగీకరించి ధర్మరాజు చూడటానికి ఉపప్లావ్యం చేరాడు. ధర్మరాజు తన తమ్ములు, ద్రౌపది, సుభద్ర, అభిమన్యుడు ఇతర బంధు మిత్రులతో శల్యునికి సాదర స్వాగతం పలికాడు. శల్యుడు ధర్మరాజును ఆలింగనం చేసుకుని " ధర్మరాజా! కష్టసాధ్యమైన అరణ్యవాసాన్ని, అంతకటే కష్టమైన అజ్ఞాత వాసాన్ని పూర్తి చేసారు. మీరు నమ్ముకున్న సత్యనిష్ఠా, ధర్మ నిష్ఠకు నిలబడ్డారు " అని శ్లాఘించి సుయోధనునికి ఇచ్చిన వరాన్ని వివరించాడు. ధర్మరాజు " మీరు సుయోధనునికి ఇచ్చిన వరం మంచిదే. కాని దానిని నెరవేర్చండి. అలాగే నా కోరిక నెరవేర్చండి. రాబోవు యుద్ధంలో అర్జునునకు శ్రీకృష్ణుడు సారధ్యం వహిస్తున్నాడు. సుయోధనుని పక్షంలో మీకంటే సారధ్యంలో నేర్పరి లేడు. కర్ణుడు అర్జునుని మీద పగద్వేషంతో రగిలి పోతుంటాడు. కనుక కర్ణునికి మిమ్మల్ని సారధ్యం చేయమంటే ఆ బాధ్యత తీసుకుని కర్ణుని మనసులో అనుక్షణం కలత కలిగిస్తూ అవసర సమయంలో సహాయ నిరాకరణ చేసి అర్జునిని కాపాడండి. ఐది అకృత్యం అని తలపక నా కోరిక మన్నించండి " అని కోరాడు. శల్యుడు ధర్మరాజు అంతర్యం గ్రహించాడు " ధర్మనందనా ! సుయోధనుడు కోరితే కర్ణునికి సారధ్యం వహించి నీ కోరిక నెరవేరుస్తాను. కర్ణుని వంటి దుర్మార్గునికి కర్ణకఠోరమైన నా మాటలతో కలత కలిగించి అర్జునిని చేతిలో ఓడిపోయేలా చేస్తాను " అన్నాడు. " ధర్మజా ! ఇదే కాదు నీవు ఇంకేమి కోరినా చేస్తాను. మీకు జరిగిన అవమానం అడవులలో మీరు పడిన కష్టాలు మరవడం ఎవరి తరం? నువ్వే కాదు ఇంతకు పూర్వం ఇంద్రుడు కూడా ఇలాగే అనుభవించాడు. విధి రాతను తప్పించడం పరమ శివునకు కూడా సాధ్యం కాదు కదా? " అన్నాడు.

## ఇంద్రుడు పదవీచ్యుతుడై తిరిగి పట్టాభిషిక్తుడగుట

శల్యుని మాటలు విన్న ధర్మరాజు " మహానుభావా! ఇంద్రుడు, శచీదేవి ఎందుకు కష్టాల పాలయ్యారు. కొంచం వివరించండి " అన్నాడు. శల్యుడు ఇలా చెప్ప సాగాడు. దేవతలలో త్వష్ట అనే వాడు ఉన్నాడు. అతడు ఉత్తముడు. అతడు తన తపోశక్తితో మూడతలలున్న ఒక వ్యక్తిని సృష్టించాడు. అతని పేరు విశ్వరూపుడు. విశ్వరూపుడు ఇంద్ర పదవి కోరి ఘోరతస్సు చేస్తున్నాడు. ఇది తెలుసుకున్న ఇంద్రుడు అతని తపస్సు భగ్నం చేయటానికి అప్సరసలను పంపాడు. విశ్వరూపుడు అప్సరసల తళుకుబెళుకులకు లొంగక పోవడంతో ఇంద్రుడు విశ్వరూపుని చంపి ఆ విషయం ఒక సంవత్సరం రహస్యంగా దాచాడు. తరవాత అందరికీ ఆవిషయం తెలిసి ఇంద్రుని చర్యను నిరసించారు, అతడు బ్రహ్మహత్యా పాతకం చేసాడని ఖండించారు. తనకు అంటిన బ్రహ్మహత్యా పాతకం పోగొట్టడానికి ఒక యాగం చేసి తనకంటిన పాపాన్ని సముద్రానికి, స్త్రీలకు, వృక్షాలకు పంచి పెట్టి బ్రహ్మహత్యా దోషాన్ని కడిగి వేసాడు.

### వృత్తాసుర వధ

ఇది తెలిసిన త్వష్ట కోపించి నిష్కారణంగా నిరపరాధి అయిన విశ్వరూపుని చంపినందుకు ఇంద్రుని చంపడానికి ఒక శక్తిని సృష్టించి అతడికి వృత్తుడు అని నామకరణం చేసాడు. అధిక బల సంపన్నుడైన వృత్తుడు ఇంద్రుని జయించి అతనిని మింగి కడుపు బరువెక్కడంతో నిద్రకుపక్రమించి గట్టిగా ఆవలించాడు. అప్పుడు ఇంద్రుడు తన శరీరాన్ని చిన్నదిగా చేసి బయటకు వచ్చాడు. ఇంద్రుడు తిరిగి వృత్తాసురునితో యుద్ధానికి దిగాడు. వృత్తుని ధాటికి తట్టుకోలేక దేవతలు మంధర పర్వత శిఖరానికి చేరి వృత్తుని చంపే ఉపాయంకోసం ఆలోచించారు. అందరూ మహా విష్ణువు వద్దకు వెళ్ళి వృత్తుని చంపే ఉపాయం చెప్పమని అర్ధించారు. మీరు వెళ్ళి ఇంద్రునికి వృత్తునికి సంధి చేయండి. నేను తగిన సమయం చూసి ఇంద్రుని వజ్రాయుధంలో ప్రవేశించి అతడు అంత మయ్యేలా చేస్తాను " అన్నాడు. ఋషులంతా వృత్తుని వద్దకు వెళ్ళి " ఇంద్రుడు అజేయుడు నీవా అధిక బలశాలివి మీరు ఒకరిని ఒకరు జయించడం ఎన్నటికీ సాధ్యం కాదు. కనుక ఇంద్రునితో మైత్రి చేసుకో " అని నచ్చచెప్పారు. వృత్తుడు అందుకు అంగీకరిస్తూ " బదులుగా నాకు ఒక వరం ప్రసాదించండి. నేను తడిసిన దానితో కాని ఎండిన దానితో కాని రాత్రి కాని పగలు కాని సంహరించబడకూడదు. అందుకు ఒప్పుకుంటే ఇంద్రునితో సంధి చేసుకుంటాను "

అన్నాడు. వృత్తుడు మత్రి చేసుకున్నా ఇంద్రుడు మాత్రం వృత్తుని సంహరించే మార్గం అన్వేషిస్తూ ఉన్నాడు. ఒక రోజు అసుర సంధ్యలో సముద్రతీరంలో విహరిస్తున్న వృత్తుని చూసి అతడిని సంహరించడానికి అది తగిన సమయమని గ్రహించిన ఇంద్రుడు విష్ణువుని ప్రార్థించి తన వజ్రాయుధాన్ని సముద్ర జలాల నురుగులో ముంచాడు. విష్ణువు ఆనురుగులో ప్రవేశించాడు. ఆ నురుగు సాయంతో వృత్తుని సంహరించాడు.

#### నహుషుడు

ఈ విషయం తెలిసిన భూతాలు బ్రహ్మ హత్య చేసినందుకు నిందించాయి. బ్రహ్మహత్యా పాతకం వెంట తరమగా ఇంద్రుడు పదవీచ్యుతుడై నిషాధచలంలో తలదాచుకున్నాడు. దేవతలంతా ఇంద్రపదవి కోసం తగిన వాడి కోసం అన్వేషిస్తూ భూలోకంలో నూరు అశ్వమేధయాగాలు చేసిన నహుషుడు అనే మహారాజుని ఆ పదవిలో కుర్చోమని అర్థించారు. నహుషుడు మాత్రం అందుకు అంగీకరించ లేదు ఇంద్ర పదవి అధిష్టించేంత సామర్ధ్యం తనకు లేదన్నాడు. యముడు, అగ్ని, వరుణాది దేవతలు తమ శక్తిని అతనికి పంచారు. నహుషుడు దానితో అధిక బల సంపన్నుడైనాడు. నహుషుడు ఇంద్రపదిని అధిష్టించి ధర్మ పరుడై సమస్త లోకాలను పాలిస్తున్నాడు. కిన్నెరలూ, కింపురుషులు, యక్షులు, సిద్ధులు, విధ్యాధరులు, గంధర్వులు, గరుడులూ సమస్త దేవతల నుండి తేజో భాగములు స్వీకరించి అత్యంత తేజోమయుడయ్యాడు. మునులంతా నహుషుని సేవిస్తున్నారు, తుంబురు నారదులు గానంతో వినోదం అందిస్తున్నారు, రంభ, మేనక, తిలోత్తమ, ఊర్వశి మొదలైన అప్సరసలు నాట్యంతో వినోదం కలిగిస్తున్నారు. ఇన్ని భోగాలు ఒక్క సారిగా సంక్రమించగానే నహుషునిలో గర్వం తొంగిచూసింది.

##### నహుషుడు శచీదేవిని కోరుట

నహుషుడు ఇంద్రుని భార్య శచీదేవిని చూసి ఆమె అందానికి ముగ్ధుడై ఆమెను మోహించాడు. అతడు దేవతలను పిలిచి " నేను స్వర్గాధి పతిని అందరూ నన్ను చూడటానికి వచ్చారు. కాని శచీ దేవి మాత్రం నా వద్దకు రాలేదు. వెంటనే ఆ సుందరాంగి శచీదేవిని ఇక్కడకు పిలిపించండి " అని ఆజ్ఞాపించాడు. అది విని శచీదేవి భయపడి దేవ గురువు బృహస్పతిని శరణు వేడింది. జరిగినదంతా విన్న బృహస్పతి " అమ్మా! శచీదేవి ఊరడిల్లుము. నీభర్త తిరిగి రాగలడు. నేను నిన్ను కాపాడతాను " అన్నాడు. ఇది తెలిసిన నహుషుడు " నేను కోరిన వనితకు బృహస్పతి రక్షణ కల్పిస్తాడా? " అని ఆగ్రహించగా దేవతలు " దేవేంద్ర పదవిలో ఉన్న మీరు పరస్త్రీలను కోరుట తగదు " అని నచ్చ చెప్పారు. అందుకు నహుషుడు నవ్వి " ఇంద్రుడు గౌతముని భార్యను కామించినప్పుడు ఈ బుద్ధులు మీరెందుకు చెప్ప లేదు? మీరు వెంటనే శచీదేవిని నా వద్దకు తీసుకు రండి " అన్నాడు. దేవతలు మునులతో బృహస్పతి వద్దకు పోయి " గురుదేవా! ఇంద్రపదవిలో ఉన్న నహుషుడు శచీదేవిని కోరడానికి అర్హుడు. కనుక శచీదేవిని అతని వద్దకు పంపి అతని కోపం పోగొట్టండి " అని ప్రార్థించారు. బృహస్పతి నవ్వి " నహుషుడు శచీదేవిని కోరడమా? అందుకు మీరు అంగీకరించడమా? ఇది లోక హితమా? ఇంతటి మహా కార్యాన్ని ఆచరించ వలసినదే కాని శరణు వేడిన వారిని విడుచుట ధర్మం కాదు కనుక నేను ఆమెను పంపను " అన్నాడు. మునులు " అయితే తగిన కర్తవ్యం ఆలోచించండి " అని అర్థించారు. బృహస్పతి " ఒక పని చేద్దాము శచీదేవి నహుషుని వద్దకు వెళ్ళి కొంత సమయం అడుగుతుంది. ఆ తరవాత జరగ వలసినది ఆలోచిస్తాము " అన్నాడు. బృహస్పతి ఆదేశానుసారం శచీదేవి నహుషుని వద్దకు వెళ్ళింది " నేను ఇంద్ర పత్నిని ఇంద్రుడు ఉన్నాడో లేదో తెలియలేదు. నా మనసు శంకిస్తుంది ఏవిషయం తెలియకుండా తొందర పడకూడదు. నాకు కొంత సమయం కావాలి " అన్నది. నహుషుడు అందుకు అంగీకరించాడు. మునులు రహస్యంగా విష్ణుమూర్తిని కలుసుకుని ఇంద్రుని పాపం పోగొట్టమని అడిగారు.

##### శచీదేవి ఇంద్రుని వద్దకు పోవుట

విష్ణుమూర్తి " ఇంద్రునిచేత అశ్వమేధయాగం చేయించండి అతని పాపం పోతుంది " అన్నాడు. మునులు అలాగే ఇంద్రునిచేత అశ్వమేధయాగం చేయించారు. ఇంద్రుని పాపం పరిహారం కాగానే అమరావతికి వెళ్ళాడు. అక్కడ నహుషుడు అమిత తేజోమయుడై ఉండటం చూసి భయపడి ఎవ్వరికీ చెప్పకనే వెళ్ళి పోయాడు. ఇంద్రుని జాడ తెలియని శచీదేవి కలత పడి ఉపశ్రుతి అనే దేవతను ఆరాధించి ఆమెను సాక్షాత్కరింప చేసుకుంది. ఉపశ్రుతి " అమ్మా శచీదేవి! నేను నీ పాతివ్రత్యానికి మెచ్చి వచ్చాను. నీవు నా వెంట వచ్చిన ఎడల నీ భర్తను చూడగలవు " అని ఉపశ్రుతి శచీదేవిని హిమాలయాలకు ఉత్తర దిక్కున ఉన్న మంజుమంతము అనే పర్వతము వద్దకు తీసుకు వెళ్ళింది. అక్కడ ఉన్న సరోవరంలో ప్రవేశించారు. ఆ తరువాత ఒక తామరపుష్ప కాడలో ప్రవేసించారు. అక్కడ సూక్ష్మరూపంలో ఉన్న ఇంద్రుని చూపి ఉపశ్రుతి " అమ్మా! నీ భర్త ఇక్కడ ఉన్నాడు చూడు " అని చెప్పి ఉపశ్రుతి అదృశ్యమైంది. ఇంద్రుడు ఆశ్చర్యపడి " నేను ఇక్కడ ఉన్నది నీకెలా తెలుసు " అని శచీదేవిని అడిగాడు. శచీదేవి జరిగినది అంతా చెప్పి " నాధా! నీవు నహుషుని చంపి నన్ను రక్షించాలి " అని వేడుకుంది.

ఇంద్రుడు " దేవీ ! నహుషుడు ఇప్పుడు నా కంటే బలవంతుడు. దేవతలు ఋషులు అతనికి తమ శక్తులు ప్రసాదించారు. కనుక అతను అజేయుడు. శత్రు శక్తి సంపన్నుడై ఉన్నప్పుడు వేచి ఉండటం రాజనీతి. అతనికి నీ మీద మోహం కలిగింది మనం దానిని అనుకూలంగా మార్చుకోవాలి. నీవు అతనితో సఖ్యం నటించి " నీవు నన్ను పొందాలంటే సప్తఋషి వాహనంపై రమ్మని చెప్పు దానితో అతని పుణ్యం క్షీణించి పతనం కాక తప్పదు. ఆ పై నేను అతనిని జయించడం సులువు " అన్నాడు. అందుకు అంగీకారం చెప్పి శచీదేవి అమరావతికి తిరిగి వచ్చింది. నహుషుడు మరలా శచీదేవి వద్దకు వచ్చి తన కోరిక తీర్చమని అడిగాడు.శచీదేవి " మహేంద్రా! నేను పెట్టిన గడువు ఇంకా మిగిలి ఉంది. ఆ గడువు తీరగానే నీవు సప్తఋషి వాహనం మీద వస్తే నేను నిన్ను వరించగలను " అని చెప్పింది. మోహావేశంలో ఉన్న నహుషుడు ఉచితానుచితాలు మరచి మునులను వాహనంగా చేసుకుని తిరగసాగారు. శచీదేవి " బృహస్పతి వద్దకు పోయి నన్ను నా నాధుని రక్షించండి " అని అడిగింది. బృహస్పతి " శచీదేవీ! చింతించ పని లేదు నహుషుడు ఋషి వాహనంతో శక్తిని కోల్పోతాడు " అన్నాడు.

#### బృహస్పతి ఇంద్రుని వెతికించుట

బృహస్పతి అగ్ని దేవుని పిలిచి ఇంద్రుడు ఎక్కడ ఉన్నాడో వెతకమని చెప్పాడు. అగ్ని ఒక స్త్రీ రూపం ధరించి మనోవేగంతో అంతా వెతికి చూసాడు. అష్ట దిక్కులు, భూమి , అంతరిక్షం, కొండలు అడవులు ఎక్కడ వెతికినా ఇంద్రుని జాడ తెలియ లేదు. అగ్ని " దేవగురూ! నాకు సాధ్యమైనంత వెతికాను ఎక్కడా కనిపించ లేదు. సృష్టి క్రమంలో నీటి నుండి అగ్ని బ్రాహ్మణుల నుండి క్షత్రియులు, రాళ్ళ నుండి లోహములు పుట్టాయి. ఆ విధంగా పుట్టిన వాటికి తమ ప్రతాపం ఎక్కడ చెల్లినా తమ జన్మ స్థానంలో చెల్లదు. కనుక నాకు జలప్రవేశం నిషిద్ధం కనుక అక్కడ నేను వెతకలేను " అన్నాడు. బృహస్పతి " అగ్నిదేవా! నీకు సకల చరాచరములలో ప్రవేశం కలదు. నీవు చేరజాలని ప్రదేశం లేదు. నీకు నేను నీటిలో ప్రవేశించే అర్హత కలిగిస్తాను. అక్కడ కూడా ఇంద్రుని కొరకు వెతుకు " అన్నాడు. ఆ తరవాత అగ్ని జలరాశులలో కూడా వెతికి తామర తూడులో ఉన్న ఇంద్రుని కనుగొన్నాడు. వెంటనే బృహస్పతి ఇంద్రుని వద్దకు వెళ్ళాడు. అతనితో " ఇంద్రా! నీ తప్పు ఏమీ లేదు. వృత్తాసురుని వధ ఎలా పాపం ఔతుంది. నీ తప్పు లేకనే నువ్వు పదవి త్యజించావు. మార్గాంతరం లేక నహుషునికి పదవి ట్టి పెడితే అతడు దేవతలు ఇచ్చిన శక్తితో బలగర్వితుడై ప్రవర్తిస్తున్నాడు. తనను మోయడానికి ముని పల్లకి ఉపయోగించి తన శక్తి క్షీణింప చేసుకున్నాడు కనుక ఇది అతనిని జయించడానికి తగిన సమయం. నీవు వచ్చిన సమయంలో నహుషుడు బలవంతుడు కాని ఇప్పుడు అతడు శక్తి హీనుడు. అశ్వమేధయాగం చేసి పాపాన్ని పోగొట్టుకున్న నీవు ఇప్పుడు ఇంద్ర పదవికి అర్హుడవు కనుక నీవు వచ్చి నహుషుని జయించి నీ పదవిని తిరిగి స్వీకరించు " అన్నాడు. అష్టదిక్పాలకులు కూడా ఇంద్రుని వద్దకు వచ్చారు. అందరూ నహుషుని జయించే ఉపాయం గురించి ఆలోచిస్తున్న సమయంలో అగస్త్యుడు అక్కడకు వచ్చి " ఇంద్రా నహుషుడు పదవీ భ్రష్టుడు అయ్యాడు. ఇక నీవీ నీ సింహాసనం అధిష్టించ వచ్చు " అన్నాడు.

#### నహుషుడు పదవీ భ్రష్టుడు అగుట



వాహనముపై నుండి పడిపోవుచున్న నహుషుడు

ఇంద్రుడు అగస్త్యునకు నమస్కరించి నహుషుడు ఎలా పదవీచ్యుతుడైనాడు చెప్పని అడిగాడు. అగస్త్యుడు " మునులంతా అతని వాహనం మోస్తూ బాధపడుతున్న సమయసంలో ఒకనాడు నహుషుడు బ్రాహ్మణులతో ఇష్టాగోష్టి జరుపుతున్న సమయంలో ఋషులు ఇలా అడిగాడు " గో సంప్రోక్షణమందు బ్రాహ్మణములయిన మంత్రములు చెప్పబడినవి అవి నీకు ప్రమాణ భూతములా " అని అడిగారు. అందుకు నహుషుడు " గర్వంతో అవి నాకు ప్రమాణములు కావు " అన్నాడు. నేను అతనికి అడ్డు చెపుతూ " ఋషులచే అభినందితమైన మంత్రములను నిందించుట అజ్ఞానము " అన్నాను. అందుకు నహుషుడు కోపించి నా తలపై తన్నాడు. దానితో అతని పుణ్యమూ, తేజమును కోల్పోయాడు. అప్పుడు నేను " నహుషా ! మునులను వాహనంగా చేసుకుని వారిని అవమానించావు. వారు గౌరవించు మంత్రములు ప్రమాణములు కాదని నిరసించావు. నన్ను అవమానించావు కనుక నీవు పదవీ భ్రష్టుడివై ఇంద్రలోకం నుండి పతనమై భూలోకమున సర్ప రూపమున అనేక సంవత్సరములు నివసించెదవు కాక " అని శపించాను. నహుషుడు నన్ను పరి పరి విధాల ప్రార్ధించగా అతడికి శాపవిమోచనం చెప్పాను. ధర్మపరుడు సత్పురుషుడైన యుధిష్టరుని చూసిన తరవాత అతని పాపములు పరిహారమై పుణ్యలోక ప్రాప్తి కాగలదు అని చెప్పాను " అన్నాడు. ఇంద్రుడు అగస్త్యునికి పూజించాడు. అమరావతి అంతా అక్కడికి వచ్చి ఇంద్రుని అభినందించింది. ఇంద్రుడు

అమరావతికి పోయి ఇంద్ర పదవిని అధిష్టించి శచీదేవితో సుఖంగా ఉన్నాడు " అని వివరించాడు. శల్యుడు మరలా " ధర్మరాజా! ఇంద్రుని వంటి వారే తమ అధికారానికి భంగం జరిగినప్పుడు అజ్ఞాతవాసం అనుభవించాడు. కనుక మీరు మీ దురవస్థకు దు:ఖించ వలదు. దుర్యోధనుడు నహుషుని వలె నశించక తప్పదు " అన్నాడు. ధర్మరాజు శల్యునికి కర్ణుని నిరుత్సాహ పరచడం గురించి గుర్తు చేసాడు. శల్యుడు అందుకు అంగీకారం తెలిపి సేనలతో హస్థినకు బయలు దేరాడు.

## సేనలసమాయత్తం

సాత్యకి ఒక అక్షౌహిని సేనతో పాండవుల వద్దకు వచ్చాడు. చేధి దేశాధీశుడు దుష్టకేతు, జరాసంధుని కుమారుడు సహదేవుడు ఒక్కొక్క అక్షౌహిని సేనతో వచ్చి కలిసారు. కేకయ రాజులు కూడా ఒక్క అక్షౌహినితో కలిసాడు. ద్రుపదుడు బంధువులతో ఒక్క అక్షౌహినితో కలిసాడు. పర్వత రాజు ఒక్క అక్షౌహినితో కలిసాడు. విరాట రాజు తన సైన్యముతో కలిసాడు. పాండ్యరాజు ఒక్క అక్షౌహినితో కలిసాడు. ఇలా పాండవ సైన్యం ఏడు అక్షౌహినులైంది. ఇక సుయోధనుడు కూడా తన సైన్యాన్ని సమాయత్తం చేస్తున్నాడు. భగదత్తుడు ఒక్క అక్షౌహినితోను, కాంభోజరాజు సుదక్షిణుడు ఒక్క అక్షౌహినితోను, భూరిశ్రవుడు ఒక్క అక్షౌహినితోనూ, శల్యుడు ఒక్క అక్షౌహినితోను, సింధురాజు జయద్రధుడు ఒక్క అక్షౌహినితోనూ, మాహిష్మతీపతి నీలుడు ఒక్క అక్షౌహినితోనూ, యాదవరాజు కృతవర్మ ఒక్క అక్షౌహినితోను, అవంతీరాజులు విందాను విందులు తలా ఒక్క అక్షౌహినితోనూ , వివిధదేశముల నుండి వచ్చిన సైన్యం మూడు అక్షౌహినులయ్యాయి. మొత్తం పదకొండు అక్షౌహినుల సైన్యం కౌరవపక్షాన చేరింది.

## ద్రుపదరాజు పంపిన పురోహితుని రాయభారం

ద్రుపదరాజు పంపిన పురోహితుడు హస్థినకు చేరాడు. అతడు భీష్ముని, ద్రోణుని, కృపాచార్యులను, విదురుని కలుసుకుని తరవాత దుర్యోధనుని కలుసుకున్నాడు. మరునాడు దృతరాష్ట్రసభలో " దృతరాష్ట్రుడు, పాండురాజు అన్నదమ్ములు. వారి పుత్రులైన కౌరవ, పాండవులకు రాజ్యంపై సమాన హక్కు ఉందని మీకంతా తెలుసు. పాండవులను చంపడానికి చేసిన ప్రయత్నాలు వాటి నుండి వారు తప్పించుకున్న విధం మీకు తెలుసు. పాడవులు తమ బాహు బలంతో సంపాదించిన రాజ్యం కుట్రపన్ని దుర్యోధనుడు అపహరించిన విషయం మీకు తెలుసు. వీటుఇన అంగీకరించిన దృతరాష్ట్రుని ఏమనాలి. పాండవపత్నిని సభలో వలువలు వలిచి అవమానించిన విషయం, వారి రాజ్యం అపహరించిన విషయం ఎలా మరువగలము. ఇప్పుడు వారు అరణ్య అజ్ఞాత వాసాలు ముగించుకుని వారి రాజ్యభాగం కోరుతూ సంధి నిమిత్తం నన్ను పంపారు. కౌరవ, పాండవ ప్రవర్తను ఎరిగిన మీరు దృతరాష్ట్రునికి నచ్చ చెప్పటం మంచిది కాదా! పాండవులు బల హీనులు కారు. వారి వైపు ఏడు అక్షౌహినుల సైన్యం ఉంది. మీ బలం పదకొండు అక్షౌహినులు అనుకుంటున్నారేమో సాత్యకి, భీముడు ఒక్కొక్కరు వెయ్యి అక్షౌహినులకు సమం. అర్జునిని ఎదిరించి నిలువగలిగిన వీరుడు ముల్లోకాలలో లేడు. అన్నిటికి మించి చతురోపాయములో సమర్ధుడైన శ్రీకృష్ణుడు వారి వైపు ఉండగా వారిని విజయలక్ష్మి వరించకుండా ఉండ కలదా? వారిని పిలిపించి వారి రాజ్య భాగం ఇప్పించి అందరూ క్షేమంగా సుఖంగా ఉండండి " అని చెప్పి కూర్చున్నాడు.

## దృతరాష్ట్ర సభలో సంధివిషయంలో చలరేగిన వివాదాలు

బ్రాహ్మణుని మాటలు విన్న భీష్ముడు లేచి " పాండవులు శ్రీకృష్ణునితో కలసి ఉండటం వారు శాంతియుతంగా సమస్యా పరిస్కారానికి దారుల్కు వెదకడం అదృష్టం. మీ మాటలు వినడానికి కొంత కటువుగా ఉన్నాఆమోదయోగ్యం. పాడవులు అనుభవించిన కష్టాలు మనందరికి తెలుసు. కనుక వారిని సగౌరంగా పిలిచి వారి రాజ్య భాగాన్ని ఇవ్వడం సముచితం. కాని పక్షంలో ఆగ్రహించిన అర్జునిని బాణాగ్నికి సర్వం ఆహుతి కాక తప్పదు " అన్నాడు. ఆ మాటలకు కర్ణుడు లేచి " అందరికి తెలిసిన విషయాన్ని మాటి మాటికి ప్రస్తావించడం వ్యర్ధం. దుర్యోధనుని కొరకు శకుని జూదం ఆడాడు ధర్మరాజు సకలము ఓడాడు. ఇందులో అపరాధం లేదు. అనుకున్న ప్రకారం అజ్ఞాత వాసం ముగియకనే రాజ్యభాగం కోరడం తప్పు. విరాటుడు, ద్రుపదుడు సహాయంగా ఉన్నారని రాజ్యభాగం అడగటంలో ఏమి న్యాయం ఉంది? ఇంత అన్యాయం ఎక్కడైనా ప్రపంచంలో ఎక్కడైనా ఉందా? " అన్నాడు. అందుకు భీష్ముడు బాధపడుతూ " కర్ణా! ఏమిటిది? పెద్ద వీరుడి మాదిరి మాట్లాదుతున్నావు. గోగ్రహణంలో అర్జునుడు మనందరిని గెలిచాడు. ఇప్పుడు నువ్వు మాటలతో గెలుస్తున్నావు. గోగ్రహణ సమయంలో సుయోధనునికి నేను అజ్ఞాత వాసం ముగిసిందని చెప్ప లేదా ఇప్పుడు మరలా ఆ ప్రస్తావన ఎందుకు ? " అని కోపంగా అన్నాడు. దృతరాష్ట్రుడు భీష్ముని శాంతింప చేసాడు " విప్రోత్తమా! మీరు చెప్పింది సావధానంగా ఉన్నాను. తగు విధంగా ఆలోచించి మేము ఒక సౌమ్యుని పాండవుల వద్దకు పంపి మా మనసులో మాట తెలియచేస్తాము. మీరు వెళ్ళి రండి " అన్నాడు.

## సంజయుని సంధి కొరకు ఉపప్లావ్యం పంపుట

దృతరాష్ట్రుడు సంజయుని పిలిచి " సంజయా! పాండు రాజకుమారులు ఉపప్లావ్యంలో ఉన్నారు. నీవు వారి వద్దకు వెళ్ళి శ్రీకృష్ణుని సాన్నిధ్యంలో వారితో అరణ్య, అజ్ఞాతవాసాలు ముగించుకున్నందుకు అభినందిస్తున్నాని చెప్పు. సుయోధనుడు వివేచనా శూన్యుడు కనుక ఇన్ని అనర్ధాలు జరిగాయి అని తెలుపుము. ధైర్యవంతులు, ఉత్సాహవంతులు అయిన పాడవుల దోషం ఏమీ లేదని చెప్పు. పాలు, నీళ్ళ లాగా అన్నదమ్ములను కలిసి ఉండమని చెప్పు. వారు వారి తండ్రి రాజ్యభాగానికి అర్హులని చెప్పు. మనలను అసత్యవాదులని పాండవులు నమ్మరు. కాని ధర్మాత్ముడైన ధర్మరాజుకు రాజ్యభాగం ఇవ్వకుండా ఉండలేము కదా. మేము గర్వించి ఇవ్వకున్న శ్రీకృష్ణుని సారధ్యంలో అర్జునుడు ముల్లోకాలను క్షోభపెట్టగలడు. భీముని తలచిన దడ పుడుతుంది. నకుల, సహదేవుల పరాక్రమం సామాన్యం కాదు. ద్రుపద, సాత్యకులు తక్కువ వారు కాదు. వారి మిత్రులు కేకయ రాజు, పాండ్యుడు ఎవరికీ తీసి పోరు. ఇక ధర్మజుని ఆగ్రహం ఎదుర్కొనుట రుద్రునికైనా సాధ్యం కాదు. కనుక ధర్మజుని వద్దకు వెళ్ళి అతని తమ్ములకు ఆగ్రహం కలుగకుండా ప్రీతి కలిగేలా మాట్లాడు. శాంతి కలిగేలా మాట్లాడి కార్యం సఫలం చేసుకుని రా " అన్నాడు.

## సంజయుని రాయభారం

సంజయుడు ఉపప్లావ్యం చేరి అర్జునినితో కూడి ఉన్న శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళాడు. మరునాడు సభలో ధర్మజునితో " ధర్మజా ! నిన్ను కలుసుకోవడం నా అదృష్టం. మీ తండ్రి దృతరాష్ట్రుడు మీరు ఇక్కడ క్షేమంగా ఉన్నందుకు ఆనందించాడు. మీ యోగ క్షేమం కనుక్కు రమ్మని నన్ను పంపాడు " అన్నాడు. ధర్మరాజు " మా పెదనాన దయ వలన మేము క్షేమంగా ఉన్నాము. మా క్షేమం కొరకు పెదనాన మిమ్ము పంపడం మా అదృష్టం. మా పెదనాన క్షేమమా, వారి పుత్రులు క్షేమమా, మనుమలు క్షేమమా, భీష్మ ద్రోణ, కృప అశ్వధామలు క్షేమమా? కౌరవులు వారిని ఆదరిస్తున్నారా? బ్రాహ్మణులను కౌరవులు ఆదరిస్తున్నారా? మేమిచ్చిన దానములు వర్ధిల్లుతున్నాయా ? ప్రజలు మమ్ము తలచుకుంటున్నారా? కార్యానికి, ఖడ్గానికి ఒక్కే మంత్రం చెప్పే కర్ణుడూ క్షేమమేనా? సంజయా మనం మధ్యస్థులం అర్జునిని గాండీవానికి ఎదురు నిలబడ కలిగిన వారు ఉన్నారా ? " అన్నాడు. సంజయుడు దానిలో అంతరార్ధం అర్ధం చేసుకుని తన వాదన వినిపించడం మొదలు పెట్టాడు " ధర్మజా! సుయోధనుని చుట్టూ అవినీతి పరులు, దురంహంకారులు, నీతి మంతులు, సత్యసంపన్నులు ఇలా అనేక ప్రవృత్తులు కలవారు ఉన్నారు కదా! వారు ఒకరి మాట ఒకరు వినరు కనుక నేను చెప్పేది విను. ధర్మజా! నీవు మంచి మనసుతో సంధి ప్రయత్నం చేసావు కాని వృద్ధుడైన దృతరాష్ట్రునికి మనసు నిలకడగా లేదు. కొడుకుల మాట కాదన లేక పోతున్నా మనసులో మధన పడుతున్నాడు. కనుక అజాత శత్రువైన నీవు పెద్ద మనసు వహిస్తే బాగుంటుంది. ఇచ్చిన దానం తిరిగి స్వీకరించడం ధర్మమా? హస్థినాపుర ప్రజలు శత్రువులు ఎదుర్కొన్నప్పుడు మిమ్ములను తలచుకుంటున్నారు. పగవారికి కూడా హాని తలపెట్టరని మిమ్ము కీర్తిస్తున్నారు. ధర్మజా! శ్రీకృష్ణుని సమక్షంలో నిడు సభలో నీతమ్ములు వింటుండగా నాకు తోచినది చెప్తాను " అనగానే ధర్మరాజు " సంజయా నీవు చెప్పదలచినది చెప్పవచ్చు " అన్నాడు.


పాండవులను కలసిన సంజయుడు

### సంజయుడి దౌత్యం

సంజయుడు అందరిని ఒక్క సారి పరికించి " మీ పెదనాన దృతరాష్ట్రుడు శాంత చిత్తుడై ఇరుపక్షములకు సంధి చేయమని నన్ను పంపాడు. ఇది మనం సంయమనం పాటించ వలసిన సమయం. ధర్మస్వరూపులు, శాంత స్వభావులూ అయిన మీకు సుయోధనుని వలన కల్మషం అంటినది. దానిని నీవు తుడిచి వేయాలి. యుద్ధం వలన జన నష్టం, జయాపజయములు సుఖాన్ని ఇవ్వవు. బంధువులు, మిత్రులు, బాలలు, వృద్ధులు నశిస్తారు. అందరిని పోగొట్టుకుని ఎవరు మాత్రం సుఖ పడతారు. మీకు శ్రీకృష్ణుడు పెట్టనికోట, దృపదుడు, సాత్యకి మేరు పర్వతాలు. భీమార్జునులు అరివీర భయంకరులు ఇక నిన్ను గురించి చెప్పనవసరం లేదు. మిమ్ము దేవతలైనా జయించ లేరు. సుయోధనుని పక్షాన భీష్మ, ద్రోణ, కృపాచార్య, అశ్వత్థామ,కర్ణ, శల్యులు అతని కొరకు తమ ప్రాణాలు అర్పించడానికి సిద్ధంగా ఉన్నారు. సుయోధనుని తమ్ములూ,

కుమారులు అజేయులు. సోమదత్త, బాహ్లికులను శివుడు కూడా జయించ లేరు. ఇలాంటి వారు ఒకరితో ఒకరు యుద్ధానికి తలపడితే వినాశనం కాక ఇంకేమి మిగులుతుంది. కృష్ణార్జునలారా మీకు చేతులెత్తి నమస్కరిస్తాను. మిగిలిన పాండవులు వారి బంధు మిత్రులందరికి సవినయంగా మనవి చేస్తున్నాను. పాండవులారా శాంతించండి ఆగ్రహమును వీడండి మిమ్ము శరణు వేడుతున్నాను. ఇది సర్వలోక సమ్మతం. ఇందుకు భీష్మాదులు సంతసిస్తారు " అని పలికి కూర్చున్నాడు.

## సంజయునికి ధర్మజుని స్పందన

ధర్మరాజు " సంజయా! నా మాటలలో యుద్ధం అన్న మాట ధ్వనించిందా? మాకు మాత్రం యుద్ధమంటే ప్రియమా? యుద్ధానికి దిగకనే కార్య సాఫల్యత కలిగితే కావలసిన దేముంది. భీమార్జునులు జనహితమైన పనులే చేస్తారు కాని అప్రియములు చేయరు. దురాశకు పోయి యుద్ధానికి దిగితే యుద్ధం దుఃఖం కాక సుఖం ఇస్తుందా? సంజయా! మా పెదనాన దృతరాష్ట్రుడు తాను అక్రమ మార్గాన నడుస్తూ నన్ను ధర్మ మార్గాన నడవమనడం న్యాయమా? తాము ఉత్తమ మార్గాన నడుస్తూ ఎదుటి వారికి చెబితే బాగుంటుంది. ఇప్పుడు మాకు సంపద లేదు, బలం లేదు. మమ్ము పిలిచి ఆదరించడానికి దృతరాష్ట్రుడు వెర్రి వాడా? ఆయన ప్రవర్తన మాకు కొత్త కాదు అప్పుడే పెద్దల మాటలు వినని వాడు ఇప్పుడు వింటాడా? జూదపు సిరికి ఆశపడకూడదని విదురుడు అప్పుడు చెప్పిన మాటలు విని ఉంటే ఇప్పుడు ఇంత దూరం వచ్చేది కాదు. అతడు సుయోధనుడు విషం తాగమన్నా త్రాగుతాడు కాని మంచి మాటలు వింటాడా? దృతరాష్ట్రునికి సుయోధనుడు అత్యంత పరాక్రమ వంతుడని నమ్మకం. సుయోధనుడు కర్ణుని బుజబలంతో రాజ్యం నిష్కంటకం చేసుకోవాలని అనుకుంటున్నాడు. అతడు అర్జునికి, శ్రీకృష్ణునికి భయపడడు. దృతరాష్ట్రుడు దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణాదుల మాటలు వింటాడు కాని మంచి మాటలు వినరు. అన్నీ తెలిసిన నీవు ఇలా మాట్లాడటం అవివేకమా లేక లౌకికమా? భీష్మాదులకు యుద్ధం అంటే తెలియదా? ఆశాపాశ బంధితులై కళ్ళు కానని వారికి అర్జునిని గాండీవ కాంతులు పూర్తిగా గుడ్డి వారిని చేయక మానవు . సంజయా ! మా పరాక్రమం పొగుడుతూనే వారితో పోరి గెలవలేమని చెప్తున్నావు. నీకు పక్షపాత బుద్ధి ఏల. యుద్ధంలో గెలువగలమా లేదా అన్నది విడువుము. నీవు గుణవంతుడవు కనుక మా కోపం పోయేలా మాట్లాడావు. మేము ఇప్పటి వరకూ ఎవరికీ అపకారం చేయ లేదు ఇక ముందు అలాగే సహనంగా ఉంటాము. నిజంగా దృతరాష్ట్రుడు మంచి వాడై మా మీద ప్రేమ ఉంటే మమ్ములను పిలిచి గౌరవించి మారాజ్యభాగం మాకు ఇచ్చి బంధుత్వం నిలుపమని చెప్పు. ఇంద్రప్రస్థం కాని వేరొకూరు కాని మాకిమ్మని చెప్పు " అన్నాడు.

## సంజయుని ప్రతి స్పందన

సంజయుడు లేచి ఎన్ని తప్పులనైనా సహించి ఓర్పు వహించగలవు కనుకనే కొన్ని మాటలు చెప్పాను. నీవు నమ్మిన సత్యం అహింసలే నీకు సపదలు. కౌరవులు మీకు రాజ్యభాగం ఇవ్వకున్న మీకు ఆ నెత్తురు కూటికన్నా బిక్షమెత్తి జీవించుట మేలు కదా? రాజసూయం నిర్వహించిన నీ చరిత్ర హింసతో కళంకితం కాకూడదు. నీతో మాయాజూదం ఆడి నిన్ను అవమానపరచిన కౌరవులను లోక నిందితులను చేసావు. అరణ్యములలో కష్టాలు అనుభవించిన నీవు ఇలా నీచమైన యుద్ధానికి తలపడి బంధు మిత్రులను చంపుట ధర్మం కాదు. హాలాహలం దిగమింగిన ఈశ్వరుడిలా నీవు నీ కోపాన్ని దిగమింగి నీ కీర్తి సాధకం చేసుకో " అన్నాడు.

## సంజయునికి ధర్మజుడు బదులిచ్చుట

సంజయుని మాటలు విన్న ధర్మరాజు " సంజయా! నీవు పలికింది నిజమే. కొన్ని కర్మలు పైకి ధర్మంగా కనపడినా తరచి చూసిన అధర్మములని తెలుస్తాయి. కనుక నన్ను నిందించదలచుకున్న నేను చేసినది అధర్మం అని నిరూపించి నిందించు. నువ్వు చెప్పినట్లు కోపం నివారించదగినది అహింస పరమ ధర్మమే. లోక కంటకులను, వంశనాశకులను, పాపాత్ములను నిర్మూలించి ప్రజలను రక్షించుట క్షత్రియ ధర్మమని పెద్దలు చెప్పగా విన్నాను. కర్తవ్యాకర్తవ్యములను, ధర్మాధర్మములను నిర్ణయించుటకు శ్రీకృష్ణుడు ఉన్నాడు. శ్రీకృష్ణుడు ఉచితానుచితములు చెప్పగల దిట్ట. అతని ఆధ్వర్యంలో అంధక, భోజక, యదు, వృష్టి, సృంజయ, కేకయ రాజులు నడుచుకుంటున్నారు. మాకు అతని మాట శిరోధార్యం " అన్నాడు.

## సంజయునికి శ్రీకృష్ణుడి సమాధానం

ఈ మాటలు విన్న శ్రీకృష్ణుడు " సంజయా! నేను ఎల్లప్పుడూ పాండవుల మేలు కోరుతుంటాను. దృతరాష్ట్రుడు కూడా పాండవుల మేలు కోరు వాడు. అతనికి కీడు తలపెట్టడం భావ్యం కాదు. అతడు ఇప్పుడు తెలివి తెచ్చుకుని పాడవులను

పరామర్శించడానికి నిన్ను పంపాడు. నీవూ నీకు తోచిన ధర్మాన్ని వినయంగా చెప్పావు. నీ శాంతి వచనాలు సంతోషం కలిగించాయి. పైకి సవ్యంగా కనిపిస్తున్నా ధర్మరాజు మాటలు సంధి పొసగదని తెలుస్తూ ఉంది. ధర్మరాజు మాటలు సరి అయినవే. దుర్మధాంధుడైన దుర్యోధనుడు, కొడుకు మాటలు మాటలు విని అధర్మాన్ని ఆచరించే దృతరాష్ట్రుని తీపి మాటలకు పాండవులు రాజ్య భాగం వదులుతారా? గతాన్ని మరచి పాండవులు కౌరవులతో సఖ్యంగా బ్రతకాలని అనుకుంటున్నారు. అది వారి కరుణ గొప్పతనం. ధర్మం ప్రకారం తమ తండి రాజ్యం పాండవులకు ఇవ్వకుంటే వారు యుద్ధానికి సన్నద్ధం కావడం అధర్మమా? అవమానాలు నిరంతరం సహిస్తూ బతకడం కంటే యుద్ధం చేయడం మేలు అని నాకు అనిపిస్తుంది. యుద్ధం క్షత్రియ ధర్మం కాదా? అని ధర్మరాజు అడిగాడు కదా! ద్విజులకు ధర్మాధర్మాలు నిర్ణయించిన పెద్దలు క్షత్రియులు యాచించ కూడదు వారు ఇవ్వడమే కాని తీసుకోకూడదు అని చెప్పిన విషయం లోక విదితం. వర్ణాశ్రమ ధర్మ రక్షకులైన క్షత్రియులు వారి ధర్మాన్ని వదులుతారా? ధర్మంగా సంపాదించిన సంపదను అధర్మ మార్గాన కాజేసిన వారిని శిక్షించడం ధర్మమని శాస్త్రాలు భోదించ లేదా? సంజయా! ఇక్కడ వచించిన ధర్మాలు కౌరవులకు చెప్పలేదా ? వారు కాదా అధర్మంగా ప్రవర్తించినది. నిండు సభలో ద్రౌపదిని వలువలు లాగి అవమానించి పాండవులకు అవమానం కలిగించినది. లోకంలో జూదం ఎవరూ ఆడలేదా వారిని ఇలాగే అవమానించారా? " అని శ్రీకృష్ణుడు సంజయుని నిలదీసాడు.

## శ్రీకృష్ణుడు కౌరవుల తప్పులను ఎత్తి చూపుట

సంజయుడు " కృష్ణా! నీవే ఇలా మాట్లాడితే సంధి ఎలా పొసగుతుంది? " అన్నాడు. శ్రీకృష్ణడు " ఆ రోజు సభలో భీష్మ, ద్రోణ, కృపాచార్యులు నోరు మెదిపారా? కుమారుల అకృత్యాలను దృతరాష్ట్రుడు ఆపగలిగాడా! దుశ్శాసనుడు ద్రౌపదిని నిందిస్తూ సభకు ఈడ్చుకు వస్తుంటే మామగారైన దృతరాష్టుడు ఎలా సహించాడు ఆమె ఏడ్పులు వినిపించ లేదా ? విని ఓర్చుకున్నాడా! ఇప్పుడు తగుదునమ్మా అని పాండవుల యోగక్షేమం కనుక్కుని రమ్మన్నాడా! భార్యను అవమానిస్తుంటే పాండవులు మిన్న కున్నారు. ఆమె తనను తాను రక్షించుకున్నది కాబట్టి కౌరవులు బ్రతికి పోయారు లేకుంటే ఆరోజే చచ్చి ఊరకుండే వారు. పాండవులు ఎల్ల కాలం ఇలాంటి అవమానాలను సహించి ఊరకుండవలసినదేనా ! సభలో కర్ణుడు " జూదంలో నీ భర్తలు నిన్ను ఓడారు కనుక వారు ఉండీ లేనట్లే కనుక సభలో నీకు నచ్చిన వారిని భర్తగా ఎంచుకో అనలేదా ! " శూలాలలా ఆ మాటలు ద్రౌపదిని బాధించిన విషయం నీకు తెలవదా? దుశ్శాసనుడు " ఇక్కడ రోషం ఉన్న మగాడెవరు? నీకు భర్తలు ఉండీ లేనట్లే " అన లేదా? పాండవులు అప్రయోజకులే అయినా అలా మాట్లాడటం వలన వారికి కలిగిన మేలు ఏమి? ఆ తరవాత జరిగినవి సభలో చెప్పతగినవి కాదు. ఈ సంధి పొసగదు. అయినా పాండవులకు నచ్చ చెప్పి నేను ఒప్పించి హస్థినకు వస్తాను. కౌరవులకు బుద్ధి చెప్పి వారి రాజ్య భాగం వారికిమ్మని అడుగుతాను ఇస్తారా బ్రతికి పోతారు. ఏమైనా కుటిలోపాయం చేసారా పాండవుల బాణాగ్నికి వారు సమూలంగా నాశనం కావడం తథ్యం. అలా జరగదని ఆశిస్తున్నాను. సంజయా! సుయోధనుడు రోషంతో కూడిన మహా వృక్షం దానికి కాండం కర్ణుడు, కొమ్మలు శకుని ఫల పుష్పాదులు దుశ్శాసనాది సోదరులూ ఇతరులు దానికి మూలం దృతరాష్ట్రుడు. అలాగే ధర్మరాజు ధర్మము అనే మహావృక్షం దానికి అర్జునుడు కాండం భీముడు శాఖోపశాఖలు ఫలపుష్పాలు నకుల సహదేవులు ఈ వృక్షానికి మూలం సద్బ్రాహ్మణులు, వేదములు. నిష్పక్షపాతంగా యోచించి రెండింటిలో ఏది మేలో నీవే చెప్పు. దృతరాష్ట్రుడు అతని కుమారులు పాండవులు అందులో తిరిగే సింహాలు. సింహాలు లేని అడవిని కొట్టేస్తారు. అడవి లేక సింహాలు మనజాలవు. కనుక రెండు ఒకరిని ఒకరూ ఆశ్రయించుకుంటే అందరికీ మేలే. నేను హాషినకు వస్తాను దృతరాష్టుడు పాండవులను కుమారులలా ఆదరిస్తే వారు కౌరవులను అనుసరించి ఉంటారు.నా మాట అంగీకరిస్తాడో లేదో చూసి కర్తవ్యం నిర్ణయిస్తానని దృతరాష్ట్రుడికి నికి చెప్పు " అన్నాడు.

## ధర్మరాజు కౌరవుల ప్రముఖులకు ప్రణామలు చెప్పుట

సంజయుడు " నేను వచ్చిన పని సఫలం అయిందని ఆశిస్తాను " అని ద్రుపదాదులను చూసి " నాకు అనుజ్ఞ ఇస్తే నేను పోయి వస్తాను . ధర్మజా! నా పలుకులలో తప్పేమి లేదు కదా? " అన్నాడు. ధర్మరాజు " సంజయా! నీ పలుకులలో అనుచితంలేదు అధర్మమైన మాటలు నీవు చెప్పవు కదా! నీ ఓర్పు నేర్పు ఎవరికి ఉంటాయి చెప్పు. నీవు హస్థినకు పోయి తాత భీష్మునకు , గురువు ద్రోణునకు, కృపాచార్యునకు నా నమస్కారాలు అందచెయ్యి. మా తండ్రి దృతరాష్టునికి నమస్కరించానని చెప్పు . దుర్యోధనుని సోదర సమేతంగా క్షేమమడిగానని చెప్పు. విదురుని , శల్యుని వినయంగా అడిగినట్లు చెప్పు. అశ్వర్ధామను అక్కున చేరుకున్నానని చెప్పు. బాహ్లికుని, సోమదత్తుని ప్రియంగా పలుకరించానని చెప్పు. కర్ణుడు, శకుని, సైంధవుడు, కృతవర్మలకు వృద్ధులైన రాజులకు మాతో యుద్ధం చేయ సిద్ధమైన సకల రాజులకు ఎవరికి తగినట్లు వారికి సముచిత రీతిలో వినయంగా, వాత్సల్యంగా, బంధుప్రీతిగా నా ప్రణామములు అందచెయ్యి. శత్రువులను జయించి మేము దాసదాసీ జనములను ఉదాసీనపరచకుండా ఆదరించగలమని చెప్పు.

### ధర్మరాజు కౌరవులకు పంపిన సందేశం

మా తండ్రి దృతరాష్ట్రుడు సభలో ఉండగా " అనఘా! శంతనుని రాజ్యాన్ని కాపాడుతున్న నీవు మమ్ము నాదరించి చిన్న వయస్సులోనే మా రాజ్య భాగాన్ని మాకిచ్చి ఆదరించావు. అలాగే ఇప్పుడు మాకు సంధి చేసి సకల ప్రజానీకాన్ని రక్షించి రాజ్యాన్ని అధర్మం నుండి కాపాడమని చెప్పు. అలా చేస్తే బ్రాహ్మణులు , రాజులు సంతోషిస్తారని చెప్పు అలాగే తాత భీష్మునితో పాండవులు ఇప్పటికీ శాంతి కాముకులని చెప్పు. యుద్ధం తలపెట్టరని చెప్పు. సుయోధనునితో మేము అత్యంత బలవంతులమైనా మమ్ములను రాజ్యం నుండి వెళ్ళగొట్టిన నీ వెర్రి తనం, అడవులలూ వెన్నంటి వచ్చి మమ్ము కష్టపెట్టిన నీ దురుసుతనం, నిండు సభలో ద్రౌపదిని అవమానించిన నీ తులువతనం ధర్మరాజు సహించాడు అని చెప్పు. అతనిని అతని సోదరులను యుద్ధభూమిలో మరణించ వలదని చెప్పు, పరుల సొమ్ముకు ఆశించక మా రాజ్యభాగం మాకిచ్చి క్షేమంగా ఉండమని చెప్పు, యుద్ధానికి దూరంగా ఉండటం వారికే మేలని చెప్పు, సుయోధనునికి ఎవరూ చెప్పేవారు లేక నేను పెద్ద వాడిని కనుక చెప్తున్నాను, మావైపు ఉన్న ధర్మం అతని వైపు ఉన్న అధికబలాన్ని మహా వీరులను హరించగలదని చెప్పు, శ్రీకృష్ణుడు మా పక్షంలో ఉన్నందున మేము జయించగలమని చెప్పు. నా మాట మన్నించి యుద్ధానికి దూరంగా ఉండి అందరినీ కాపాడమని చెప్పు. ఎవరి రాజ్యం వారు చేస్తూ సఖ్యంగా సుఖంగా ఉందామని చెప్పానని చెప్పు, మాకు అర్ధరాజ్యం ఇవ్వ లేకున్న కుశస్థలి, వృకస్థలి, వాసంతి వారణావతం ఇచ్చి యుద్ధాన్ని నివారించిన బంధు మిత్రులు క్షేమంగా ఉండగలరని చెప్పు. ఇందు వలన కురు, పాంచాల, మత్స్య, యాదవ, వృష్టి రాజులు పరస్పరం సఖ్యంగా ఉండగలరని చెప్పు. సంజయుడు " ధర్మజా! మీరు ఆనతి ఇచ్చిన ప్రకారం చేస్తాను. మీ తండ్రి గారికి, మీకు, మీ సోదరులకు, వాసు దేవునికి ప్రియంకలిగేలా చేస్తానని విశ్వసిస్తున్నాను " అన్నాడు. అర్జునుడు " మిత్రమా! నీవు నాకు బాల్య మిత్రుడవు. నీ మంచితనం మాకు తెలుసు. ఆ రోజు ధర్మరాజు దయాగుణం అనే అంకుశంతో భీముని ఆపాడు. ఈ రోజు అదే జరుగుతుంది. ఇక సుయోధనునికి విచారమెందుకు వెళ్ళిరా " అన్నాడు. సంజయుడు అందరి వద్ద శలవు తీసుకుని హస్తినకు బయలుదేరాడు.

## ఇవి కూడా చూడండి

## మూలాలు

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక |

విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి |

# ఉద్యోగ పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



# ద్వితీయాశ్వాసం

ఆ విధంగా సంజయుడు ధర్మజుని వద్ద శలవు తీసుకుని ఉపప్లావ్యం వదిలి హస్తినా పురం చేరాడు. దృతరాష్ట్రుని అంత:పురానికి వెళ్ళి దర్శించాడు. దృతరాష్ట్రుడు సంజయుని చెంతన కూర్చుండజేసి జరిగిన విషయం వివరించమని అడిగాడు. సంజయుడు " మహారాజా! ధర్మరాజు మీ క్షేమం మీ కుమారుల క్షేమం అడిగాడు " అన్నాడు. దృతరాష్ట్రుడు " సంజయా! ధర్మరాజు అతని సోదరులు క్షేమమేనా? అతని బంధు మిత్రులు అతని పట్ల ప్రీతితో మెలగు తున్నారు కదా " అన్నాడు. సంజయుడు " మహారాజా! ధర్మరాజు అతని సోదరులు క్షేమమే. ధర్మరాజుకు దైవ చింతన మెండు కదా. అతడు ధర్మాన్ని నమ్ముకున్నాడు కనుక భారం నీమీద పెట్టాడు. నీవు నీ కొడుకులను నమ్మావు. అతడేమో కర్ణుని, శకుని నమ్మి వారి ఆధీనంలో ఉంటాడు. కడుపుకు అన్నం తినేవాడు నీ కొడుకులు చేసే దుర్మార్గాలు చూస్తూ ఊరకుంటారా? లోకంలో ఎవరికి కొడుకులు లేరా కొడుకులు దుర్మార్గం చేస్తుంటే బుద్ధి చెప్పక నీ మాదిరి చూస్తూ ఊరక ఉండేవారు ఎవరయినా ఉంటారా? ప్రజలంతా నిన్ను తిడుతుంటే విన లేక చెవులు తూట్లు పడుతున్నాయి. నువ్వూ , నీకుమారులు శకుని ఆడించినట్లు ఆడుతున్నారు. పాండవులు మంచి వాబు కనుక సరి పోయింది. లేకున్న మీరంతా ఈ సరికి నాశనం అయి ఉండే వారు. సుయోధనుడు ధర్మరాజు శాంతగుణాన్ని పిరికితనం అనుకుంటున్నారు. అది పొరబాటు. ధర్మరాజు తన తమ్ములను అదుపులో పెడుతున్నారు కనుక మీరు జీవించి ఉన్నారు. లేకున్న ఈ సరికి మీరు ప్రాణాలతో ఉండే వారు కాదు. జూదం ఆడిన రోజే అవినీతికి బీజం పడింది. అది కార్చిచ్చులా ఇప్పడు రగులుతుంది. ధర్మరాజు మెత్తని పులి, అవసరం వచ్చినప్పడు అతడి తిరగబడితే అతనిని ఆపగలవారు లేరు " అన్నాడు.

## దృతరాష్ట్ర విదురుల ఆలోచన


దృతరాష్ట్ర విదురుల ఆలోచన

దృతరాష్ట్రుడు వెంటనే విదురుని మందిరానికి పిలిపించి " విదురా! సంజయుడు నన్ను తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టాడు. మనసు వికలమయింది నిద్ర రావడం లేదు " అన్నాడు. విదురుడు " దృతరాష్ట్రా! బలవంతుని చేతిలో దెబ్బలు తిన్న బలహీడు, ఇతరుల డబ్బు అపహరించ కాచుకున్న వాడు, ధనం సంపద పోగొట్టుకున్న వాడు, కామంతో కైపెక్కిన వాడు నిద్రపట్టక అవస్థ పడతాడు. వీటిలో నీకు ఏ దోషం ఉంది. ఇతరుల సొమ్ము అపహరించి నీవు ఒక్కడివే అపహరించాలని అనుకున్నావు అందుకే నీకు నిద్ర రావడం లేదు " అన్నాడు. దృతరాష్ట్రుడు " అది కాదు విదురా! ధర్మరాజు మనో గతం అవగతం కాక నిద్ర రావడం లేదు అన్నాడు. విదురుడు " రాజా! నీ బంధువు, హితుడు, సేవకుడు, శాంతమూర్తి అయిన ధర్మరాజు నీకు కీడు తలపెడతాడా? అతని రాజ్యాన్ని అతనికి ఒప్పగించి ఇప్పటికైనా నీవు నీ కుమారులు చేసిన తప్పు సరిదిద్దు. ధర్మరాజు నిన్ను పెదనాన పైనా తండ్రిలా చూస్తున్నాడు కనుక సహిస్తున్నాడు. నీవు రాజ్య భారాన్ని దుర్యోధన, శకుని, కర్ణ, దుశ్శాసనుల మీద మోపడం మంచికి కాదు అది నీకూ తెలుసు " అన్నాడు. దృతరాష్ట్రుడు " విదురా! రేపు సభలో సంజయుడు చెప్పినది విని మాకు ఏది క్షేమమో అది చేయించు. ఇప్పుడు నా మనసుకు శాంతి కలిగేలా నీ అమృత వచనం నా మీద కురిపించు " అన్నాడు.

## విదురనీతి

దృతరాష్ట్రుడు అడిగిన దానికి విదురుడు ఇచ్చిన బదులు విదురనీతిగా ప్రసిద్ధి పొందింది. విదురుడు " రాజా! మనిషి తనను లోకులు నిందించే పని చేయక లోక హితమైన కార్యాలు చేయాలి. పరుల సంపదకు ఈర్ష్యపడక నలుగురితో కలిసి మెలిసి బ్రతకాలి. కోపం, పొగడ్తలకు పొంగి పోవడం , గర్వించడం, ఎంత ఉన్న అసంతృప్తి, దురభిమానం, ఏపనీ చేయక పోవడం దుర్జనుల లక్షణం. తనను పాలించే రాజును , లోకాన్ని రక్షించే భగవంతుని, కట్టుకున్న భార్యను, బంధువులను సముచితంగా ఆదరించక పోతే ఏ కార్యం సత్ఫలితాన్ని ఇవ్వదు. అవివేకులు తమను ప్రేమించే వారిని వదిలి ద్వేషించే వారి వెంట పడతారు. ఎదుటి వాడు బలవంతుడని తెలిసినా వారిని హింసిస్తాడు. ధనము, విద్య,వంశము మంచి వారికి గౌరవాన్ని అణుకుకువను కలిగిస్తే చెడ్డవారికి మదాన్ని గర్వాన్ని కలిగిస్తుంది. ఒకని బాణం శత్రువును నిర్జించ వచ్చు లేక తప్పి పోవచ్చు కాని ఒకని నీతి శత్రువును నాశనం చేస్తుంది. తాను ఒక్కడే తినడమూ అందరూ నిద్రిస్తున్నప్పుడు ఒక్కడే ఆలోచించడం , ఒంటరిగా ప్రయాణం చేయడమూ మంచిది కాదు. లోకంలో సత్యానికి మించిన మంచి గుణం లేదు. క్షమాగుణాన్ని చేతగాని గుణంగా భావిస్తారు కాని దానికి మించిన ధర్మం లేదు. పరుషవాక్యములు మాట్లాడక పోవడం, పాపపు పనులు చేయక పోవడం వలన మనిషి ఉత్తముడు అవుతాడు. బలవంతుడై శాంతంగా ఉండే వాడు, పేద వాడైనా దానం చేసే వాడు పుణ్యపురుషుడు అనిపించు కుంటాడు. న్యాయార్జితమైన ధనాన్ని అర్హులకు ఇవ్వక పోవడమూ అనర్హులకు ఇవ్వడమూ వలన కీడు కలుగుతుంది. పరస్త్రీ వ్యామోహం, మద్యపానం, వేటాడటం, పరుషభాషణ, వృధాగా ధనమును ఖర్చు చేయడమూ, పోట్లాడటమూ సప్త వ్యసనాలని విజ్ఞులు చెప్తారు. కనుక వారు వాటి జోలికి పోరు. తనకు ఉచితమైన దుస్తులు ధరించడమూ, ఆత్మ స్తుతి చేయక పోవడమూ, దానిమిచ్చి పిదప చింతించక ఉండుట, కష్ట కాలంలో కూడా ధర్మ మార్గాన్ని విడనాడక ఉండుట మంచి నడవడి అనిపించుకుంటుంది. స్నేహం, మాటలు, పోట్లాట తనకు సమానులతో చేయాలి కాని అల్పులతోను అధికులతోను కాదు. తనకు ఉన్నంతలో ఇతరులకు ఇవ్వాలి, శత్రువనా కోరిన సహాయం చేయాలి. ఎక్కువగా కష్టపడి తక్కువగా సుఖపడాలి. మంచి వారు పొగడ్తలకు మేలు చేస్తారు కాని కీడు చేయరు. నేను చెప్పిన లక్షణాలు ధర్మజునిలో ఉన్నాయి. నీవు వారిని ఆదరించి ఇప్పుడు నిరాదరణకు గురి చేసావు. వారి రాజ్యభాగాన్ని వారికి ఇచ్చి వారిని ఆదరించడం నీ ధర్మం. మీరు కలసి ఉన్నంత కాలం దేవతలు కూడా మీ వంక కన్నెత్తి చూడలేరు " అన్నాడు.

## దృతరాష్ట్రునికి విదురుడు బుద్ధిమతి చెప్పుట

విదురుని మాటలు విన్న దృతరాష్ట్రుడు " విదురా? నన్ను ఇప్పుడు ఏమి చేయమంటావు " అని అడిగాడు. విదురుడు " అలా అడిగితే నేను ఏమి చెప్పను? రాజ్యం దక్కింది కదా అని తమ్ముని రాజ్యం కాజేయాలని చూసావు. చేపతో సహా గాలం కూడా మింగిన చందాన ఉంది నువ్వు చేస్తున్న పని. పక్వానికి రాక మునుపే పండును కోసిన రుచిగా ఉండక పోవడమే కాక దాని


ప్రహ్లాదుని న్యాయం

విత్తనం తన ప్రయోజనాన్ని కోల్పోతుంది. పరుల ధనానికి, విద్యకు, పరాక్రమానికి ఈర్ష్య చెందే వాడు ఏరోగం లేక పోయినా బాధ పడక తప్పదు. ఎదుటి వానికి ప్రియం కలిగించేలా మాట్లాడలేక పోయిన ఊరక ఉండటం మంచిది. మాటల వలననే పగ, చెలిమి, తెలివి, కలత, ధర్మము, పాపము, కీర్తి, అపకీర్తి కలుగుతాయి. గొడ్డలితో నరికిన చెట్టు కూడా చిగురిస్తుంది కాని మాటలతో చెడిన కార్యం సిద్ధించదు. మనసుకు తగిలిన గాయం మాన్పవచ్చు కాని శరీరానికి తగిలిన గాయం మాన్పలేము. ధర్మరాజు నోటి వెంట ఒక చెడు మాట కూడా రాదు కాని నీ కుమారులు నీచపు మాటలు నీకు తెలియనివా? చేటు కాలం దాపురించిన చెడ్డ మాటలు కూడా తీయగా ఉంటాయి. దుష్టులు చేసే దుర్మార్గం కూడా బాగానే ఉంటుంది. కాని మనసుకు అవి తగని పనులని తెలుసు. ధర్మ నిరతుడైన ధర్మరాజు తన సంపదకు దూరం కావడం ధర్మమా? అతడు నీ పెద్దరికాన్ని గౌరవిస్తున్నాడు కాని నీవు పాండవుల విరోధం కోరుతున్నావు.ఎన్ని పుణ్య కార్యాలు చేసినా అవి ధర్మవర్తనకు సరి రావు. ఉత్తముడు లంభించిన కీర్తి ఇహ లోకంలో ఉన్నంత కాలం అతడు పరలోకంలో పుణ్యగతులు పొందగలడు. పూర్వం ప్రహ్లాదుడు రాక్షస కులంలో జన్మించినా ధర్మ మార్గం తప్పక అంగీరసునికి తన కుమారునికి వచ్చిన వివాదంలో పక్షపాత రహితంగా అంగీరసుని పక్షాన న్యాయం చెప్పాడు. కనుక నీవు కూడా నీ కుమారుల పట్ల పక్షవాతం వదిలి ఇరువుకి సంధి చెయ్యి. అందు వలన అందరూ సుఖపడతారు. పెద్దలు లేని సభ సభ కాదు, న్యాయం మాటాడలేని వారు పెద్దలు కారు, సత్యం లేని ధర్మం ధర్మం కాదు, ఏదో ఒక మిష మీద చెప్పేది సత్యము కాదు. నీతి మార్గంలో నడవడం ఉత్తమం, శౌర్యంతో సంపదలు పొందుట మధ్యమము, భారంగా బ్రతుకు లాగుట అధమం. నీతి దూరులను ఉత్తములు మెచ్చరు. నీ పుత్రులు ఎప్పుడూ నీతి మాలిన కార్యాలను మాత్రమే చేస్తారు. యుద్ధోన్మాదంలో ఉరకలు వేస్తుంటారు. దానికి కర్ణుడు అగ్నికి ఆజ్యం పోస్తున్నట్లు ప్రోస్త హిస్తుంటాడు. నీకేమో నీతి పట్టదు. పాండవులు కయ్యానికి కాలు దువ్వరు; కయ్యానికి పిలిచిన వారిని వదలరు. పాడవులు నిన్ను తండ్రి మాదిరి గౌరవిస్తున్నారు నీవు అలాగే వారిని కన్న కొడుకులుగా చూడటం మంచిది. మేలు చేసిన వాడికి కీడు చేసిన వాడి శవాన్ని కుక్కలు కూడా ముట్టవు. నీ తమ్ముడు పాండు రాజు నీకు పరమ భక్తుడు, పాండవులు నీకెంతో మేలు చేసారు. వారిని ఆదరించడం మంచిది. ప్రతి మనిషికి సుఖ దు:ఖాలు సహజం. దు:ఖించడం వలన శక్తి నశిస్తుంది, మతి చెడుతుంది, శరీరం కృశిస్తుంది, రోగం వస్తుంది శత్రువుకు అది బలాన్ని చేకూరుస్తుంది కనుక దు౦ఖించడంమాను " అన్నాడు. దృతరాష్ట్రుడు " విదురా! నేను ధర్మతనయుని నా మాటలతో చేతలతో బాధించాను. అందు వలన నా కుమారులకు మరణం తధ్యం. నేను దు:ఖించక ఎలా ఉండగలను " అన్నాడు. విదురుడు " రాజా! నీవు లోభం విడిచి మనసు అదుపులో పెట్టుకుంటే మనశ్శాంతి అదే లభిస్తుంది . జ్ఞాతి వైరం వదిలి పెట్టు. గోవులను, బ్రాహ్మణులను అగౌరవ పరచ వద్దు. అన్నదమ్ములు కలిసి ఉండేలా చూడు. ఒక్క చెట్టును కూల్చడం తేలిక అదే అనేక చెట్లు ఒకటిగా ఉండగా పెను గాలి కూడా వాటిని కూల్చ లేదు.పాండు పుత్రులను పిలిచి వారికి హితం కలిగించి నీ పుత్రులను బ్రతికించుకో. జూదం ఆడిన నాడే నేను వద్దని చెప్పాను నీవు విన లేదు. కాకుల వంటి నీ కుమారులను నమ్మి నెమళ్ళ వంటి పాండవులను వదులుకుని ఇప్పుడు తల్లడిల్లి పోతున్నావు. కుల నాశకుడైన కుమారుని వదిలితే వచ్చే నష్టం ఏమిటి. భీష్ముడు, కర్ణుడు, ద్రోణుడు, పాండుపుత్రులు సుయోధనాది పుత్రులు మనుమలైన లక్ష్మణ కుమారుడు, అభిమన్యుడు నిన్ను సేవిస్తుంటే నీ వైభవం ఎలా ఉంటుంది. శత్రు రహితమైన ఆ వైభవంతో సాటి ఏమి ? " అన్నాడు. దృతరాష్ట్రుడు " విదురా! నీవు చెప్పిన మాటలు బాగున్నా నా కుమారులను వదల లేను కనుక ధర్మం జయిస్తుంది " అన్నాడు. విదురుడు " రాజా! నీవు నీ కుమారులను వదల వద్దు పండవులను దూరం చేసుకోవద్దని మాత్రమే నేను చెప్తున్నాను. నీ కుమారులను ఒప్పించి పాండవులకు ఐదు ఊళ్ళైనా ఇప్పించు.ఉద్ధం నివారించడానికి కొడుకులను వదల మన్నాను కాని సంధి చేసుకుంటే అందరికీ క్షేమమే కదా! ఎన్ని భోగాలు అనుభవించినా మహారాజులకైనా చావు తప్పదు. కనుక నీకొడుకులను సం౦ధికి ఒప్పించు ధర్మరాజును శాంత పరచు " అన్నాడు. దృతరాష్ట్రుడు " విదురా! నీ మాటలు బాగున్నాయి. అలాగే చేస్తాను " అన్నాడు.విద్రుడు " ఆ మాట మీద ఉండు దుర్యోధనుని చూసి మనసు మార్చుకోకుండా ధర్మరాజుతో సంధి చేసుకో " అని చెప్పి తన మందిరానికి వెళ్ళాడు.

## సభలో సంజయుని సంధి ప్రస్థావన

మరునాడు దృతరాష్ట్రుడు సభ తీర్చాడు. భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యుడు, అశ్వథామ, భూరిశ్రవుడు, సోమదత్తుడు, శల్యుడు, దుర్యోధనాదులు సభ ప్రాంగణంలో ఉన్నారు. సంజయుడు సభను ఉద్దేశించి దృతరాష్ట్రునితో " రాజా! మీరు ఆదేశించినట్లు ఉపప్లావ్యం వెళ్ళి ధర్మరాజును చూసాను ధర్మరాజు పేరు పేరున మిమ్మలిని యోగక్షేమాలు అడిగాడు. నేను వివరించాను అలాగే కృష్ణార్జు నులను కలిసాను. శ్రీకృష్ణుడు నాతో ఇలా అన్నాడు " సంజయా! అజాత శత్రువైన ధర్మరాజుకు


ధృతరాష్ట్రుని సభలో పాండవుల సందేశమును వినిపిస్తున్న సంజయుడు

కోపం వస్తే నీటిలో నిప్పు పుట్టిన చందాన ఉంటుంది దానిని ఆర్పడం ఎవరి తరం కాదు. యుద్ధం అనివార్యం అయితే మీరు మీ సమస్త సంపదలు యోగ్యులకు పంచి బంధు మిత్రులతో భోగములను అనుభవించి యుద్ధ భూమికి రండి. నాడు సభలో ద్రౌపది గోవిందా రక్షించు అని నన్ను వేడుకున్నది ఇంకా చెవిలో వినిపిస్తుంది. తీర్చలేని ఆ అప్పు తీర్చకనే నేను సారధ్యం వహిస్తున్నను. అర్జునుని గాండీవానికి కౌరవ సేన దగ్ధం కాక తప్పదు " అన్నాడు. అప్పుడు అర్జునుడు " సంజయా! ధరాజు అడిగినట్లు రాజ్య భాగం ఇవ్వకుంటే యుద్ధం తప్పదు భీముడు నేను దుర్యోధనుని అకృత్యాలకు బదులు చెప్పక వదలము. దుర్యోధనుని యుద్ధ భూమిలో అంపశయ్య మీద పరుండ చేయకుంటే ధర్మరాజు భూశయనం చేసిన దానికి అర్ధము లేదు. భీముడు యుద్ధ భూమిలో గధ తీసుకుని వీర విహారం చేస్తుంటే దుర్యోధనుడు రాజ్యం ఇవ్వక ఏమి చేస్తాడు. కౌరవులు మాటలతో సంధి చేయరు. కేవలం యుద్ధము తోనే మాట వింటారు. నకుల సహదేవులు, అభిమన్యుడు, సాత్యకి యుద్ధ భూమిలో వీర విహారం చేస్తున్నప్పుడు సుయోధనుడు సంధి చేస్తాడులే. సుయోధనుడు మరణించిన తరవాత భీష్మని మీదకు శిఖండి ఉరికి నప్పడైనా కౌరవులకు సంధి చేయక తప్పదు. దుస్టద్యుమ్నుడు ద్రోణుని మీదికి యుద్ధానికి దిగినప్పడైనా సంధి చేయక తప్పతుందా? సుయోధనుడు మహాత్ముడైన శ్రీకృష్ణుని లక్ష్య పెట్టడు, మేము భీష్మ, ద్రోణ, కృపాచార్యులకు నమస్కరించి యుద్ధానికి దిగుతాము. మా రాజ్యభాగాన్ని అధర్మంగా అపహరించి నియమభంగం చేసి తిరిగి మా రాజ్యాన్ని మాకు ఇవ్వని కౌరవులను సంహరించి మా రాజ్యాన్ని తీసుకుంటే ధర్మం గెలిచినట్లే కాని ఇందు అధర్మం ఏమీ లేదు. ఇలా నిండు సభలో దృతరాష్టునికి చెప్పు .భీస్మ, ద్రోణ, కృపాచార్య, అశ్వథామ, శల్యులు నిర్ణయించినది జరుగుతుంది. యుద్ధాన్ని నివారిస్తే సుయోధనుడు ఆయుష్మంతు డౌతాడు " అని చెప్పారు అన్నాడు.

### భీష్ముడు

ఈ మాట్లు విన్న భీష్ముడు " శ్రీకృష్ణుడు అర్జునుడు నర నారాయణులు ధర్మాన్ని స్థాపించడానికి అధర్మాన్ని నిర్మూలించ డానికి ప్రతి యుగంలోను అవతరిస్తారు. ఇప్పటికే కాలకేయులను, నివాతకవచులను సంహరించారు. వారిరువురు రెండుగా కనిపించే ఒకే శక్తి .వారిరువురిని గెలవడం హరునికైనా సాధ్యం కాదు. శ్రీకృష్ణుని సారధ్యంలో అర్జునుడు గండీవం ఎక్కు పెట్టినప్పుడు నీకు తెలుస్తుందిలే. అయినా సుయోధనా నీవు గర్విష్టివి నా మాటలు లెక్క చేయవు దుర్మార్గులైన కర్ణ, శకుని, దుశ్శాసనుల మాటలు నీకు వీనుల విందులు. దీని ఫలితంగా యుద్ధ భూమిలో మా అందరి మరణ వార్తలు వింటావు " అనగానే కర్ణుడు లేచి " మీరు ఇలా మాటాడ తగునా నేనుేమి చేసాను ? సుయోధనుని కొలువులో ఉంటూ అతను పెట్టిన అన్నం తింటున్నను కనుక అతనికి హితముగా మాట్లాడుతాను. నేను దృతరాష్ట్ర సతీ, పుత్ర, పౌఉత్రులకు హితము చేస్తాను లేకున్న సుయోధనుడు నన్ను ఇంత వాడిని చేస్తాడా? " అన్నాడు. భీష్ముడు " దృతరాష్ట్రా! ఈ కర్ణుడు పాండవులకు ఇసుమంత అయినా పోలడు. పాండవులను గెలుస్తానని ప్రగల్భాలు చేసే వీడిని నమ్మి సుయోధనుడు పాండవులతో శత్రుత్వం వహించి యుద్ధానికి దిగుతున్నాడు. పాండవులు ఎన్నో విజయాలు సాధించారు. వీడు ఇప్పటికి ఒక్క విజయం పొందాడా? ఉత్తర గోగ్రహణంలో వీడి తమ్ముని చంపి గోవులను అర్జునుడు తరలించుకు పోతుంటే అక్కడే ఉన్నా వీడు ఏమి చేసాడు? ఘోష యాత్రలో నీకుమారుని ఓడింప చేసిన వీడు ప్రగల్భాలు పలుకు తుంటే నీవు వింటున్నావు " అన్నాడు. ద్రోణుడు లేచి " మహారాజా! భీష్ముడు మీకందరికి ఆప్తుడు ఇరువురికి కావలసిన వాడు. కనుక మీ హితవు కోరి సంధి చేయమంటున్నాడు. ఖాండవ వన దహనం మొదలు అర్జునిని విజయాలు ఆలోచించండి. ఎంతో మంది ధస్సు పట్టిన వీరులు ఉన్నా విజయుడు అన్న పేరు ఒక్క అర్జునినికి మాత్రమే దక్కింది . అర్జునుడు అన్నంత పని చేస్తాడు " అన్నాడు. భీష్మ ద్రోణుల మాటలు విననట్లే ఉన్న దృతరాష్టుడు వారికి సమాధానం చెప్పక " సంజయా ! ధర్మరాజుకు మన సైన్యం గురించి తెలుసా? మనసైన్యం గురించి అతడు ఏమని అనుకుంటున్నాడు? అతని వైపు ఎవరు ఉన్నారు? " అని అడిగాడు. ఆ మాటలు విన్న సంజయుడు " దృతరాష్టుడు ఇంత వెర్రి వాడా ! పాండవుల బలాబలాలు అడుగు తున్నారు. ఇతనికి ఏమి చెప్పి ఏమి ప్రయోజం " అనుకుని " దేవా! మరలా చెప్తున్నాను మీరు సగ భాగం ఇస్తే యుద్ధ మాట తలపెట్టడు. అతడు సంధికి సిద్ధం అంటున్నాడు. యుద్ధం వస్తే అతడు ఎవరిని లక్ష్య పెట్టడు. నీకు తెలియనిది ఏమున్నది .బకుడిని, హిడింబుని, కీచకుని , కిమ్మీరుని వధించిన భీముడు వారి పక్షమే కదా! ఫాలాక్షుని ఓడించిన అర్జునుడు వారి పక్షమే ద్రుపది కుమారులు, అభిమన్యుని కుమారులు వారికి కాక ఎవరికి చేస్తారు. శ్రీకృష్ణుడు , సాత్యకి వారికి బాసటగా ఉన్నారు. ద్రుపదుడు, కేకయరాజులు, సరాసంధుని కుమారు డైన సహదేవుడు, జయత్సేనుడు, శిశుపాలుని కుమారురులు వృషభుడు, దృష్టకేతు, మాయావిద్య విశారధుడు భీముని కుమారుడు ఘటోత్కచుడు వారి పక్షాన తలపడటానికి సిద్ధం. ఇంకా తూర్పు ఉత్తర

దేశరాజులు ధర్మరాజుకు సాయంగా ఉన్నారు. శ్రీకృష్ణుని సాయం కన్నా మించినది లేదు కదా! ధర్మరాజుకు మనతో పోరు సల్పడానికి ఇంకేమి కావాలి? " అన్నాడు సంజయుడు.

**దృతరాష్ట్రుడు**

ఇది విని దృతరాష్ట్రుడు " సంజయా! నీవు చెప్పినది నిజము. వారంతా ఒక ఎత్తు భీముడు ఒక ఎత్తు. అతడిని తల్చుకుంటే భయంగా ఉన్నది. మనలో అతడిని ఎదుర్కోడానికి ఎవరున్నారు. చిన్నప్పటి నుండి అతడు నామాట వినడు. భీముని చేతిలో కష్టాలు పడుతూ కూడా సుయోధనుడు కయ్యానికి కాలు దువ్వు తున్నాడు.. వాడికి ఏ ఆయుధమూ పని లేదు. జరాసంధుని ఒక్క ఒక్క పోటుతో చంపాడు. వాడికి ఏ ఆయుధమూ పని లేదు చేతితోనే ఎందరినైనా చంపగలడు. అగ్నికి ఆజ్యం తోడైనట్లు వాడికి అర్జునుడు సాయం ఉన్నాడు. ఇక ఏమి చెప్పను. అర్జునితో సమానంగా యుద్ధం చేసే వాడిని మనం చూసామా? అతనికి సారధి శ్రీకృష్ణుడు ఉన్నాడు. ముగ్గురూ కలిస్తే కౌరవ సేనను దహిస్తారు.వారి గురించి భీష్మ, ద్రోణులకు తెలిసినంతగా ఎవరికి తెలియదు. అయినా వారు మన కొరకు యుద్ధం చేస్తారు. వారికి కురు పాండవులు సమానమే కదా? నా మాట నా కుమారులు వినరు. మొదటి నుండి విదురుడు చెప్పినది జరుగుతుంది సంజయా ! నేనేమి చేయను, నా కేది దారి నా కేది శరణ్యము . ధర్మరాజు వినయ వంతుడు. అతనికి వుదురుడు , దృపదుడు, సోదరులు, శ్రీకృష్ణాదులు తోడు ఉండగా ధర్మరాజుతో పోరుకు తలపడటం మిడతలు పోయి మంటలో పడటం లాంటిది. వంశ నాశనం తప్పదు శాంతి మార్గమే మేలు నా కుమారులకు చెప్పడానికి ప్రయత్నిస్తాను " అన్నాడు. సంజయుడు " దేవా! మీరు చెప్పినది సబబు అప్పుడు ధర్మరాజుని వదిలావు కాని అతడు నిన్ను వదలక ఘోష యాత్రలో నీ కుమారులను రక్షించాడు. అతడు మిమ్ము ఎన్నటికి అతిక్రమించడు. అతడిని పిలిపించి సంధి కావించండి " అన్నాడు.

**సుయోధనుడు**

దుర్యోధనుడు " తండ్రీ! మీ మాటలు విచిత్రముగా ఉన్నవి ఎక్కడో అడవులలో ఇడుములు పడుతున్న వారిని తెచ్చి కొంత మంది పిరికి వాళ్ళను జత చేసినంత మాత్రాన పాండవులు గెలుస్తారా? నీకు ఇంత భీతి వలదు మన బలాన్ని తక్కువగా ఛూడకు. మేము గెలుస్తాము. పరశురాముని గెలిచిన భీష్ముడు మన పక్షాన ఉన్నాడు. ద్రోణుడు, కృపాచారులు సామాన్యులా? ఈశ్వర వర ప్రసాదితుడి అశ్వథామ సామాన్యుడా? సహజ కవచ కుండల ధారి కర్ణుని ఎదిరించ గలవాడు పాండవులలో ఎవరు? బాహ్లికుడు, సింధురాజు, సోమదత్తుడు, గాంధారరాజు సామాన్యులా? వీరిని గెలుచుట పాండవులకు శక్యమా ? మీరు సందేహించ కండి మేము వారి అడుగులకు మడుగులు వత్తము. యుద్ధము చేస్తాము పారి పోము; ఇదే మా నిశ్చిత అభిప్రాయము. మా చేత బాధలు పడ్డవాళ్ళు దండెత్తి వస్తే పారిపోవడం చిన్నతనం కాదా? వారిని చూసి భయపడి మాకు తలవంపులు తేకండి. భీముడే కాదు నాతో తలపడి గధా యుద్ధం చేయగల వాడు ముల్లోకాలలో లేడు. భీముని నేను చంపగలను అతడు మరణిస్తే పాండవ పక్షాన యుద్ధం చేయగల వారు లేరు. అందుకే ధర్మరాజు ఐదు ఊళ్ళు ఇమ్మని అడిగాడు. కర్ణుని వద్ద ఉన్న శక్తి అర్జునిని చంపుతుంది. భీష్మాదుల శరాగ్ని వారి సేనను నాశనం చేస్తుంది. ఇక నీమిగిలిన కుమారులు అత్యంత శక్తి మంతులు కారా? మన సైన్యం పదకండు అక్షౌహినులు వారి సైన్యం ఏడు అక్షౌహినులు ఇది తెలియక ఎందుకు దుఃఖిస్తున్నావు? " అని సంజయుని చూసి " సంజయా! ఇంతకూ అల్లరి మూకను తయారు చేసుకున్న ధర్మరాజు ఏమంటున్నాడో చెప్పు" అన్నాడు. సంజయుడు చెప్పసాగాడు " సుయోధనా! పాండవులు యుద్ధంఅంటే భపడలేదు ఏదో పెండ్లికి పోతున్నట్లు భావిస్తున్నారు.అర్జునిని పాశుపతం, భీమ్కుని గధాయుధం నమ్మి యుద్ధానికి దిగుతున్నారు " అని చెప్పి దృతరాష్ట్రుని చూసి " దేవా! వారి మాటలను బట్టి భీష్ముడు శిఖండి వంతు, ద్రోణుడు దుష్టద్యుమ్నుని వంతు, దుర్యోధనుడు అతని తమ్ములు భీముని వంతు మీలోని యువకులు అభిమన్యుని వంతు, అశ్వత్థామ, కర్ణుడు, సైంధవుడు మొదలగు మహా వీరులు అర్జునిని వంతు కృతవర్మ సాత్యకి వంతు సోమదత్తుడు చేకితానుడు అనే యాదవ రాజు వంతు శకుని నకుల సహదేవుల వంతు, శల్యుని ధర్మరాజు సంహరిస్తాడు . ఇక మీరి ఆలోచించీ నిర్ణయించండి " అన్నాడు. అదివిన్న దృతరాష్ట్రుడు " అయ్యో ఇక నాకు దిక్కెవరు? ధర్మరాజు శ్రీకృష్ణుడు ఉన్న సైన్యాన్ని నా కొడుకు లెక్క చేయక పోవడం నా కర్మ. ఇక చెప్పకు అలా జరగాలంటే అలా జరుగుతుంది " అన్నాడు. అలా దుఖిస్తున్న తండ్రిని చూసి సుయోధనుడు " తండ్రీ మేము పాండవులు ఒకే చోట పుట్టి పెరిగాము కదా మా కంటే పాండవులు బలవంతులు ఎలా అయ్యారు? నువ్వు ఎప్పుడూ వారిని పొగుడు తుంటావు ఈ రాజ్యం మాది మాకు దక్కాలని భగవంతుడు నిర్ణయించారు. భాదపడ వద్దు " అన్నాడు. దృతరాష్ట్రుడు " సంజయా! చూసావా నా కొడుకు పిచ్చిపిచ్చిగా మాట్లాడు తున్నారు. పాండవుల వైపు వారిని ఎవరు రెచ్చ కొడుతున్నారు? " అన్నాడు. సంజయుడు " దేవా! దుష్టధ్యుమ్నుడు పాండవులలో అగ్నిని రెచ్చ కొడుతుంటాడు. తాను ఒక్కడే కౌరవ సైన్యాన్ని హతమారుస్తాను అంటాడు. ధర్మరాజు "నువ్వు అన్నంత పని చేస్తావు అంటాడు " అప్పడు దుష్టధ్యున్మడు నన్ను చూసి మహేశ్వరుడు, ఇంద్రుని అనుగ్రహం పొందిన మా అర్జునునితో సరి పోలు వారు కౌరవ సేనలో ఎవరున్నారు? ధర్మరాజును శరణు వేడి బ్రతకమని సుయోధనునికి చెప్పు "

అన్నాడు. అది విన్న దృతరాష్ట్రుడు " కుమారా నీకు సగం రాజ్యం చాలదా? ధర్మరాజుకు సగరాజ్యం ఇచ్చి హాయిగా బ్రతకవచ్చు కదా పెద్దల మాటలు నీకు ఎందుకు వినవు? శకుని, కర్ణుల మాటలు ఎందుకు వింటావు " అన్నాడు.ఆమాటలకు కోపించిన దుర్యోధనుడు " నామాటలు ద్రోణుడు , భీష్మాదులు అంగీకరించడం లేదు. నేను ధర్మరాజుకు సూది మొన ఒపినంత భూమి కూడా ఇవ్వను కర్ణుడు, దుశ్శాసాదుల సహాయంతో యుద్ధం చేసి పాండవులను గెలుచుట నిశ్చయం. ఇదే నా నిర్ణయం " అన్నాడు.దృతరాష్ట్రుడు " కుమారా ! నా మాట విని యుద్ధం మాను. భీముడు యుద్ధ రంగంలో నిన్ను నీ సైన్యాన్ని చీల్చి చెండాడు తున్నప్పుడైనా నా మాట వింటావా? అర్జునుడు ఛండ ప్రఛండుడై సైన్యాన్ని దునుమాడుతున్నప్పుడైనా నామాట వింటావా? నీది కేవలం మానవ శక్తి పాండవులది దైవ శక్తి అర్జునుడు అగ్ని దేవుని వలన అక్షయ తుణీరాన్ని పొందాడు. వాయు దేవుడు, ఇంద్రుడు, యముడు, అశ్వినీ దేవతలు వారిని కాపాడు తుంటారు. కనుక వారిని చంపడం భీష్మునికి వీలు కాదు. దేవతలకు వీలు కాని రాక్షసులను అర్జునుడు చంపాడు, కనుక అతడు దేవతలను మించిన వాడు. కనుక శాంతి ఒక్కటే ప్రస్తుత కర్తవ్యం " అన్నాడు. సుయోధనుడు " తండ్రీ ! రాగద్వేషాలకు అతీతు లైన దేవతలు వారికి ఎలా సాయం వస్తారు. వారు పక్షపాత బుద్ధి వహిస్తే వారికి దైవత్వం ఎలా సిద్ధిస్తుంది? పాండవులకు దేవతల సాయం ఉంటే అరణ్యాలలో ఎందుకు కష్ట పడతారు? ఆత్మస్తుతి క్షమార్హం కాదు కాని నాకు కోపం వస్తే పాండవులను దేవతలు కూడా రక్షించ లేరు. ధర్మ తనయుడు, అతని సోదరులు, పాంచాలురు, విరాటుడు, అతని తమ్ములు, కుమారులు వాసుదేవాది యాదవులు, కేకయ, పాండ్య, మగధ, చైద్య, ప్రముఖ వీరులు నా బారిన పడి అణగారి పోవడం మీరు వింటారు. వారి తేజస్సు , శౌ ర్యము నాకు సాటి రావు, పితామహ, ద్రోణ , అశ్వథామ , కృపులకు తెలిసిన సమస్త అశ్త్రాలు నాకు తెలుసు " అన్నాడు.

### కర్ణుడు భీష్ముడు

తరవాత కర్ణుడు లేచి " మిత్రమా! నాకు గురువుగారి కోపం కారణంగా అస్త్రషస్త్రాలు గుర్తుకు రావు అని లోకులు అంటారు. కాని ఆ మహాను భావుడు నాకు వాటి స్పురణ ప్రసాదించాడు. కావున నాకు అస్త్ర సంపద ఉన్నది నిశ్చయము. దేవతలకు కూడా నన్ను గెలవడం కష్టం అర్జునుడు ఎంత నేను పాండవులను గెలుచుట తథ్యం " అన్నాడు. భీష్ముడు లేచి " కర్ణా! యముని ప్రేరణతో మాట్లాడుతున్న నిన్ను వారించడం మా తరమా? పాండవులు యుద్ధంలో రాలి పోతారా? అనవసరంగా నోరు నొప్పి పుట్టేలా వాగకు. దేవేంద్రుడు ఇచ్చిన శక్తితో అర్జునుని చంపగలనని అనుకుంటున్నావు. శ్రీకృష్ణుని చేతిలో అది ముక్కలు కాక తప్పదు. అర్జునిని కొరకు నీ వద్ద ఉన్న సమస్త అస్త్రాలను శ్రీకృష్ణుడు నాశనం చేస్తాడు. దృతరాష్ట్రా! దాయాదులు కలిసి ఉంటే క్షేమంగా ఉంటారు లేకున్న సస్టం కోల్పోతారు. కనుక సంధి చేసుకో " అన్నాడు. భీష్ముడు " సుయోధనా సంధి చేసుకుని ధర్మరాజుతో చేరు భీష్ముడు మన హితం కోరుతాడు. అతడి మాటను మన్నించు " అన్నాడు. సుయోధనుడు ఆ మాటలను లక్ష్యపెట్ట లేదు. ఆ మాటలకు కోపించిన " సుయోధనా! మాట్లాడ వెందుకు అర్జునుడు గోగ్రహణంలో ఒకసారి ఒంటరిగానే విజృంభించి నపుడు నీ సైన్యం పారి పోలేదా? కర్ణుడు నీ చెంత ఉండి ఏమి చేసాడు. కాని ఇప్పుడు అలా కాదు. శ్రీకృష్ణుని సారధ్యంలో అర్జునుడు విజృంభిస్తే ఎదుర్కోవడం ఎవరి తరం కాదు. కర్ణా యుద్ధంలో మరణించి వీరుడవు అనిపించు కుంటావు. సుయోధనుని మరణానికి కారకుడవు అవుతావు " అన్నాడు.కర్ణుడు విరక్తిగా " సుయోధనా! భీష్ముని మాటలు నా మనసుని కలచి వేస్తున్నాయి. ఈ భీష్ముడు చచ్చే వరకు నేను యుద్ధభూమిలో అడుగు పెట్టను. ఆతరవాత నేను నా ప్రతాపం చూపిస్తాను అన్నాడు " అని అస్త్ర సన్యాసం చేసిన కర్ణుడు ఇక అక్కడ ఉండలేక సభ వదిలి వెళ్ళాడు. అప్పుడు భీష్ముడు నవ్వుతూ " అయ్యో సుయోధనా! ఇంతటి మహా వీరుడు అలిగితే ఎలాగా! కుమారా నీవు ఈ కర్ణుని అండ చూసుకుని యుద్ధానికి దిగాతావు. అప్పుడు మా ప్రతాపములో వ్యత్యాసం చూడు. సుయోధనా! నేను, బాహ్లీకుడు, ద్రోణుడు కలసి శత్రు నాశనం చేస్తాము " అన్నాడు. సుయోధనుడు కర్ణుడు పోయాడన్న బాధ భరించ లేక " తెలిసో తెలియకో అందరూ పాండవులు గెలుస్తారని అంటున్నారు. మొదట నిన్ను, ద్రోణుని, బాహ్లికుని నమ్మాను. కాని ఇప్పుడు చెప్తున్నాను. కర్ణుడు, దుశ్శాసనుడు నా వెంట ఉంటే విజయం నాదే నాకు వేరొకరితో పనిలేదు " అన్నాడు. సుయోధనుని మాటలకు కలత చెందిన దృతరాష్ట్రుడు " విదురా! నా కుమారుడు కర్ణునితో కలసి మృత్యు పాశంలో ఇరుక్కున్నాడు. ఈ సమయంలో ఏమి చేయాలి చెప్పు " అన్నాడు. విదురుడు " మహారాజా! మన వాళ్ళు దుర్బలులై ఒకరిలో ఒకరు కలహించుకోవడం మనకు మరింత ప్రతికూలం అర్జునునకు అనుకూలం. మాటలు కట్టిపెట్టి పాండవులను పిలిచి సంధి చేయించు " అన్నాడు. దృతరాష్ట్రుడు సంజయుని చూసి " సంజయా ! మరలి వచ్చు నపుడు అర్జునుడు నీతో ఏమన్నాడో చెప్పు " అని అడిగాడు. సంజయుడు " దేవా! అర్జునుడు నాతో " ధర్మరాజు న్యాయంగా మాకు రావలసిన రాజ్య భాగం అడుగు తున్నాడు. దర్పంతో ఇవ్వకుంటే మాచేత వారు యుద్ధభూమిలో చావక మానరు " అన్నాడు.

### దృతరాష్ట్రుడు సంజయుని జయాపజయాలు వివరించమని కోతుట

ఆ పై దృతరాష్ట్రుడు " సభ ముగించాడు. అందరూ వెళ్ళిన తరవాత అక్కడ ఉన్న సంజయుని చూసి దృతరాష్ట్రుడు "



భీమసేనుని బలమును గురించి విని విలపిస్తున్న ధృతరాష్టుడు

సంజయా ! నీకు ఇరు పక్షాలలో ఉన్న వీరు లందరూ తెలుసు. యుద్ధం వస్తే ఎవరు గెలుస్తారో చెప్పగలవా " అని అడిగాడు. సంజయుడు " దేవా ! ఈ విషయం నన్ను అడగడం కన్నా గాంధారిని, మీ తండ్రి వ్యాసుని పిలిపించి అడగడం మంచిది " అన్నాడు. వెంటనే దృతరాష్టుడు " తన తండ్రి వ్యాసుని ధ్యానించాడు. గాంధారిని పిలిపించాడు. వ్యాసుడు స్సంజయుని చూసి " సంజయా! నీకు అన్నీ తెలుసు. నేను వినేలా దృతరాష్టుని ప్రశ్నకు సమాధానం చెప్పు " అన్నాడు. సంజయుడు " దృతరాష్ట్రా ! నీవు కౌరవ పండవ సేనకు కల తారతమ్యం గురించి అడిగావు. పాండవ పక్షాన శ్రీకృష్ణుడు ఉన్నాడు. మీ పక్షాన ఎవరున్నారు చెప్పు. పాండవుల బలం శ్రీకృష్ణుడే . సమస్త లోకాలు ఒక పక్కన శ్రీ కృష్ణుడు ఒక పక్కన నిలిచినా శ్రీకృష్ణుడు గెలుస్తాడు. సత్యం, ధర్మం , న్యాయం ఎక్కడ ఉన్నాయో శ్రీకృష్ణుడు అక్కడ ఉంటాడు. శ్రీకృష్ణుని ఆశ్రయించిన వారికి జయం తప్పదు " అన్నాడు. దృతరాష్టుడు " సంజయా! కృష్ణుని గురించి నాకు తెలియక పోవడానికి నీకు తెలియడానికి ఏమి కారణం " అన్నాడు. సంజయుడు " లోకంలో విద్య అవిద్య అని రెండు ఉన్నాయి. అవిద్యతో అలమటిస్తున్న వారు తమో గుణంతో విష్ణువు అవతారమైన శ్రీకృష్ణుని తెలుసుకో లేరు. విద్యా వినయ భూషితుడు తెలుసు కొనగలడు. దృతరాష్టుడు " విద్య అంటే ఏమిటి? అవిద్య అంటే ఏమిటి వివరించు " అన్నాడు. సంజయుడు " దేవా ! ప్రతి మనిషికి సత్వ, రజో, తమో గుణాలు ఉంటాయి. నేను వాటికి లోబడక పక్షపాత రహితంగా నిర్వికారంగా ఉండి పవిత్ర భావంతో ధర్మంగా ఉంటాను. అందువలన నేను విష్ణువును తెలుసు కున్నాను. నీకు గాని పేరెవరికైనా విష్ణువును తెసుకోవడానికి ఇది తక్క వేరు మార్గం లేదు. ఇందుకు భిన్నమైన దానిని అవిద్య అంటారు " అన్నాడు. దృతరాష్టుడు " పక్కనే ఉన్న సుయోధనుని చూసి " నాయనా సుయోధనా ! సంజయుడు మన శ్రేయోభిలాషి. అతని మాట విని శ్రీకృష్ణుని ఆశ్రయించి నీవు నీ తమ్ములతో క్షేమంగా ఉండండి " అన్నాడు. సుయోధనుడు " తండ్రీ ! ఈ లోకాలు సర్వ నాశనం అయినా నేను ధైర్యం వదలను శ్రీకృష్ణుని శరణు వేడను " అన్నాడు. దృతరాష్టుడు నిర్వేదంగా " గాంధారి ! విన్నావా నీ కుమారుని మాటలు. వీడు దుర్మార్గుడు, నీతి బాహ్యుడు, గర్విష్టి, అసూయాద్వేషాలు కలవాడు నా మాట వినడు. వీడు చెడి పోతాడు. వీడికిక బ్రతుకు లేదు " అన్నాడు. గాంధారి " సుయోధనునితో " కుమారా సుయోధనా ! ఈ ఐశ్వర్యం , సంపద , రాజ్యం, నీ ఆయుషు ఎందుకు వదులు కుంటావు. దైవం భీముని రూపంలో నిన్ను చంపుతుంది. నీ లాంటి అవినీతిపరుడు ఎక్కడైనా ఉంటాడా ? " అన్నది. వ్యాసుడు " దృతరాష్టునితో " నీకు శ్రీకృష్ణుడంటే భక్తి అందుకే సంజయుని రాయబారిగా పంపావు. సంజయుని మాట విని శ్రీకృషుని ఆశ్రయించు. రాగ ద్వేషాలు వదిలి ఏకాగ్రతతో ఆరాధించిన వారికి శ్రీకృష్ణుడు చేరువ ఔతాడు. కామక్రోధాలతో అలమటించే వారికి అతను దూరంగా ఉంటాడు.అన్నాడు. దృతరాష్టుడు " మీరు చెప్పినట్లే చేస్తాను " అన్నాడు. దృతరాష్టుడు " శ్రీకృష్ణునికి వాసు దేవుడనే పేరు ఎలా వచ్చింది. సంజయుడు " శ్రీకృష్ణుడు అంతటా ఉంటాడు. సకల జగము అతనిలో ఉంటాయి కనుక అతనిని వాసుదే వుడంటారు. ఇందియ నిగ్రహంతో అతనిని ధ్యానిస్తే అతని వశం ఔతాడు. నీవు కూడా అన్ని చింతలు వదిలి అతనిని ధ్యానించు " అన్నాడు. దృతరాష్టుడు " వ్యాసమహర్షి ! నేను శ్రీకృష్ణుని శరణు వేడుతాను . శ్రీకృష్ణుని దివ్య మంగళ రూపాన్ని దర్శింప లేను. నిరంతరం కృష్ణుని సన్నిధిలో ఉండే వారు ఎంతటి పుణ్యాత్ములో కదా " అని విచారించాడు. అంతట వ్యాసుడు నిష్క్రమించాడు. దుర్యోధనుడు, గాంధారి, సంజయుడు తమ తమ నివాసములకు వెళ్ళారు.

ఉద్యోగ పర్వం రెండవ భాగం కొరకు ఉద్యోగ పర్వము-2 చూడండి.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

# ఉద్యోగ పర్వము తృతీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# తృతీయాశ్వాసము


ధర్మరాజుతోను అతని తమ్ములతోను మాట్లాడుతున్న కృష్ణుడు

సంజయుడు ధర్మరాజు వద్ద శలవు తీసుకుని హస్థినకు బయలు దేరగానే ధర్మరాజు తన తమ్ములతోను సామంత రాజులతోను సమావేశమై ఇలా అన్నాడు " మనం అందరం శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళి ఆయనను రాయబారానికి హస్థినకు పంపుతాము. అందువలన యుద్ధాన్ని నివారించి దయాదులు ఒకరిని ఒకరు చంపుకునే దురవస్థ తప్పించే అవకాశం ఉంది " అన్నాడు. ఆ తరవాత ధర్మరాజుతో అందరూ ద్వారకు వెళ్ళి శ్రీకృష్ణుని చూసి " దేవా! మా తండ్రి పాండురాజు నిన్ను మాకు పెద్ద దిక్కుగా చూపాడు. నీవు మాకు మిత్రుడవు. నీవు హస్థినకు వెళ్ళి సుయోధనుని సంధికి ఒప్పించాలి. అతడు నీ మాట వింటాడని మా విశ్వాసము. అలా జరిగితే మాకు రాజ్య ప్రాప్తి కలుగుతుంది. మమ్ము నీ పుత్రుడు ప్రద్యుమ్నునితో సమానంగా చూసి మమ్ములను కాపాడు " అని వేడుకున్నాడు. ఆ మాటలకు శ్రీకృష్ణుడు " ధర్మరాజా ! అలాగే చేస్తాను నేను ఏమి చేయాలో చెప్పు " అన్నాడు.

## హస్థినకు ధర్మరాజు శాంతి సందేశం పంపుట

ధర్మరాజు " కృష్ణా ! మా తండ్రి తలపు సుయోధనుని నిర్ణయము సంజయుని ద్వారా తెలుసుకున్నము. వారి చిత్తము సంజయునికి బాగా తెలుసు. మమ్ము బుజ్జగించి రాజ్య భాగం ఇవ్వకుండా ఉండాలని చూస్తున్నారు. ధర్మాన్ని అనుసరించి అరణ్య అజ్ఞాత వాసములు పూర్తి చేసిన మా మాటను వారు మన్నించడం లేదు. మా పెదనాన తన కుమారుని మీద ఉన్న దురభిమానం చేత సుయోధనుని వక్ర బుద్ధి మాన్పలేక ఉన్నాడు. ఇది మాకు ఆపత్కారం మా తల్లికి బంధు మిత్రులకు ఆనందం కలిగించేలా సంధి కుదర్చక ఊరకుండటం పౌరుషం అనిపించుకోదు. వాసుదేవా ! నాడు నిండు సభలో ఐదు ఊళ్ళు ఇచ్చినా చాలు అని చెప్పాను. అది యదార్ధమే అయినా కాని సుయోధనుడు అదైనా ఇస్తాడో లేదో తెలియదు. అంతమాత్రాన యుద్ధం చేయడానికి నాకు మనస్కరించడం లేదు . కాని నన్ను ఆశ్రయించిన వారిని పోషించవలసిన బాధ్యత నాకు ఉంది కనుక సంధి అవసరం ఎంతైనా ఉంది. కృష్ణా ! వారు మమ్ము కష్టాలు పాలు చేసారు. కాని వారిని చంపాలని ఎందుకు కోరుకోవాలి? యుద్ధం తప్ప వేరు మంచి మార్గం లేదా? కౌరవపక్షంలో ఉన్న మా బంధు మిత్రులను రాజ్యం కోసం చంపడం ధర్మమా? ఇంతటి దురవస్థ ఎల్లా సహించను. కృష్ణా ! క్షాత్ర ధర్మం ఇంత కష్టమా? యుద్ధం చేస్తే రాజ్యం వస్తుంది అలాగే వంశ నాశనం ఔతుంది. పరధర్మం ఆచరించడం తగదని పెద్దలు చెప్తారు. యుద్ధంచేసి ప్రాణహాని జరుగుతుంది కనుక అది నా అభిమతం కాదు. యుద్ధంలో గెలువ వచ్చు ఓడవచ్చు ఓటమి మరణం కంటే వేదన కలుగ చేస్తుంది. యుద్ధం జోలికి వెళ్ళకుండా పనులు చక్కపరచు కునే వాడు ఎక్కువ సుఖపడతాడు. పాముతో కాపురం చేయడం ఎంత కష్టమో పగతో మెలగడం అంత కష్టం కనుక దానిని అణచడం శ్రేయస్కరం. విరోధాన్ని విరోధంతో అణచి వేయలేము, విరోధి చేతిలో బాధలు పడలేము. పగను నిర్మూలించా లంటే క్రూరంగా ప్రవర్తించాలి. పగ వలన కీడే కాని మేలు జరగదు కనుక శాంతి మార్గము ఒక్కటే శ్రేయస్కరం. కృష్ణా ! మేము యుద్ధం లేకుండా రాజ్యం కావలని కోరు కుంటున్నాము. కనుక శాంతి యుతంగా కార్యాన్ని చక్క పెట్టడం మంచిది. కృషా ! నీవు మా మీద పక్షపాతం చూపనవసరం లేదు. ఇరు పక్షాలకు ఆమోద యోగ్యమైన మార్గం చూడు. మెత్తని మాటలతో వినకుంటే మందలించి అయినా కార్యం చక్కపెట్టు. మనకు కురువృద్ధులు ముఖ్యము కనుక దుర్యోధనుడు పరుషంగా మాటాడినా సహించు. దృతరాష్ట్రుడు కుమారుని మాట విని ఏదీ తేల్చక పోయినా కోపం తెచ్చుకోవద్దు. నా మనసు సంకట పడుతుంది నీవే మమ్ము సక్రమ మార్గాన నడిపించు. నీ మాట మాకు శిరోధార్యము. సుయోధనుడు దుర్మార్గుడు అతని వద్దకు నిను పంపడం మంచిది కాదని నాకు తోస్తుంది. వారు ఎంతకైనా తెగిస్తారు. నీ మాటలు లక్ష్య పెట్టడు. నీకు కష్టం కలిగించే విధంగా లభించే దేవేంద్ర పదవి కూడా నాకు వద్దు. కనుక ఒంటరిగా కురు సభకు

వెళ్ళకు " అన్నాడు.

## ధర్మరాజుకు శ్రీకృష్ణుడు స్వాంతన పలుకుట

ధర్మజుని మాటలు విన్న శ్రీకృష్ణుడు " ధర్మజా! దుర్యోధనుడే కాదు. అతని తండ్రి దృతరాష్ట్రుడు అటువంటి వాడే. నీ కలత నాకు తెలుసు అనుమానం వద్దు నేను ఆగ్రహిస్తే యుద్ధం చేయటానికి ఎవరూ మిగలరు. నన్ను పంపించడం మంచిది. హస్థినలో వారికి మన మనసులో మాట చెప్పండం మంచిది " అన్నాడు. ధర్మరాజు " కృష్ణా! నీకు మంచిది అనిపిస్తే హస్థినకు వెళ్ళి సంధి కుదుర్చు. మా గురించి నీకు తెలుసు వారి గురించీ తెలుసు మైత్రి గురించి తెలుసు క్లిష్ట సమయంలో ఎలా నడచు కోవాలో నీకు చెప్పతగిన వాడిని కాదు. సంధి అన్ని వధాల మంచిదని నాకు తోస్తున్నది " అన్నాడు. శ్రీకృష్ణుడు " ధర్మజా! నాడు సంజయుడు పలికినది విన్నాను నేడు నీవు చెప్పింది వన్నాను. నీవు ధర్మ నిష్ట కల వాడివి. వారు విరోధమును వదిలి పెట్టరు. భీష్మ, ద్రోణులు వారి వైపు ఉన్నారని వారికి గర్వం కనుక మీరు క్షత్రియ ధర్మం వదిలి వారికి అణిగి మణిగి ఉండనవసరం లేదు. అక్రమంగా రాజ్యం అనుభవిస్తున్న వారు మీకు రాజ్యంలో భాగం ఇస్తారా? దృతరాష్ట్రుని కుమారులు అన్యాయానికి, అధర్మానికి జంకరు. నీవు సందేహించక యుద్ధం చేసి శత్రువులను జయించి రాజ్యాన్ని కైవశం చేసుకుని అనుభవించి కీర్తి గడించు. నాడు కౌరవ సభలో భీష్మ, ద్రోణ, కృపాచార్యుల వంటి పెద్దల సమక్షంలో మీకు అపకారం చేసారు. వారు ఈ నాటికి పశ్చాత్తాప పడలేదు. అట్టి వారిపై నీవు జాలి, దయ, కరుణ చూపడం కోపం తెచ్చుకోక పోవడం న్యాయము కాదు. కపట జ్యూదంలో మిమ్మల్ని ఓడించి అవమానించి దుర్యోధనుడు, కర్ణుడు, శకుని, దుశ్శాసనుడు అన్నమాటలు నా నోటితో తిరిగి చెప్ప తగినవి కాదు. ఆ మాటలు విన్న అందరూ దృతరాష్ట్రుని నిందించారు. ధర్మానికి కట్టుబడి పరాక్రమవంతులైన మీరు అడవులకు వెళ్ళినప్పుడు ఆశ్చర్యపడని వారు లేరు. ఆ పాపాత్ములు , క్రూరాత్ములు అయిన కౌరవులు ఇప్పటికే దైవము చేత చంపబడి ఉంటారు కనుక వారిని చంపడం తేలిక. అటువంటి వారు నీకు చంపతగని వారు ఎలా అయ్యారు. పాత్ములను క్రూరాత్ములను పాములను చంపినట్లు చండమే మానవుని కర్తవ్యం. దీనికి యోచించ నవసరం లేదు. నీవు కురు వృద్ధులైన భీష్మ, ద్రోణ, క్రుపాచార్యులకు భక్తి ప్రపత్తులు చూపు నీ తరఫున నేను నీ సత్ప్రవర్తనను, వినయ విధేయతను, ధర్మనిరతిని కౌరవ సభలో వారికి తెలియచేస్తాను. నా మాటలు వినక దుర్యోధనుడు అధర్మంగా మాటాడినా దృతరాష్ట్రుడు ఊరకున్నా సభలోని వారు వారి దుష్ప్రవర్తనకు ఈ సడించు కుంటారు. మనకు కావలసింది కూడా అదే. ధర్మజా నా శక్తి కొలది సంధి ప్రయత్నాలు చేస్తాను. సంధి కుదిరితే మేలే. సంధి చెడినా వారి మనోభావాలు అవగత మౌతాయి. వారి యుద్ధ ప్రయత్నాలు, బలాబలాలు తెలుసు కోవడం మేలే. సుయోధనుడు తన దేహంలో ప్రాణం ఉన్నంత వరకు నీకు రాజ్యంలో భాగం ఇవ్వడు. కనుక యుద్ధ వాతావరణమే అంతటా గోచరిస్తుంది. యుద్ధం అనివార్యము కనుక నీవు కూడా యుద్ధ సన్నాహాలలో ఉండు " అన్నాడు.

## భీమసేనుడు

ఆ మాటలు విన్న భీమసేనుడు " యుద్ధం యుద్ధం అంటూ మమ్ము భయపెట్టకు. నీవు ముందు హస్థినకు వెళ్ళి ఆ కుబుద్ధి అయిన దుర్యోధనునికి సౌజన్యంతో చెప్పి పని సానుకూల మైయ్యేలా చూడు. అక్కడ అతడి మాటకు ఎదురులేదు. అత్నడు నీ మాట వినడు. అతడు మమ్మల్నే కాదు తన వారిని కూడా కష్ట పెడుతున్నాడు. అతడికి నేనంటే కూడా గిట్టదు లక్ష్యము లేదు. మొదటి నుండి నేను ఎక్కడికి పోతే అక్కడికి వచ్చి కయ్యానికి కాలు దువ్వు తుంటాడు. కాని ఏమి చేస్తాము మా అన్నగారి మాటకు తలవంచి సంధికి అంగీకరించక తప్పదు. మేమంతా కలసి మెలసి ఉన్నాము కదా ! అతడే కదా దుర్బుద్ధితో ఇంత చేసి కురువంశ నాశనానికి కారణం ఔతున్నాడు. భరతవంశం అపకీర్తి పాలౌతుందన్న చింతకూడా వాడికి లేదు. వాడు చచ్చేవరకు మారడు. కృష్ణా ! నువ్వైనా వాడికి బుద్ధి చెప్పు " అన్నాడు. కృష్ణా ! నిండు సభలో మాతాతగారు , మా గురువులు, పెద్దలు వినుచుండగా నా మాటగా వాడికి చెప్పు " మనం అన్నదమ్ములము. పరాయి వాళ్ళు వేలెత్తి చూపేలా నడచుకోవడం తగదు. పెద్దల మాటలు విని రాజ్యాన్ని పంచుకుని ఉండటం ఉత్తమము కదా " కనుక కృష్ణా ! ఎలాగైనా సంధి పొసగేలా చూడు అందరం కలసి మెలసి ఉంటే లోకం అంతా సుఖంగా ఉంటుంది కదా! " అన్నాడు. భీముని మాటలకు కృష్ణుడు నవ్వి " ఏమిటిది భీమసేనా ! నువ్వేనా అన్నది నేనేనా విన్నది. అగ్ని చల్లారి నట్లు , పర్వతం తేలిక అయినట్లు ఇలా సంధి మాటలు నీ నోట వినబడుతున్నాయి. అసలు నీ సంకల్పం ఎటువంటిది మరచావా ! యుద్ధం చేయడము దుర్యోధనుని గడగడ లాడించడం మీ అన్నకి రాజ్యం కట్టబెట్టడం ఇదే కదా నీ లక్ష్యం. భయం అంటే ఎరగని నీవు ఇలా పిరికి మాటలు మాట్లాడు తున్నావు ఇది నీకు ఎవరు నేర్పారో " అంటూ నవ్వగానే భీమునుకి కోపం వచ్చి " కృష్ణా! పెద్ద పెద్ద మాటలు చెప్పొద్దు. మా అన్న ధర్మజుని మాటకు మేము ఎదురు చెప్పము. నా శక్తి ఏమిటో తెలియక మాట్లాడుతున్నావు. నాకు కోపం వస్తే భూమ్యాకాశాలు ఏకం చేస్తాను " అన్నాడు. కృష్ణుడు " భీమా ! ఏదో పరిహాసానికి అన్న మాటకు అంత కోపం ఎందుకయ్యా ! నీకు నీ సోదరులకు కౌరవులు చేసిన కీడు మరచి పౌరుషం లేకుండా మాట్లాడుతుంటేది క్షత్రియ ధర్మం కాదని చెప్పాను అర్జునినికి నేను సారధ్యం వహిస్తుంటే నీవు పక్కన లేకుంటే మాకు విజయం చేకూరుతుందా చెప్పు " అన్నాడు.

భీముడు ! సరేలేవయ్యా ఈ మాటలకు భీముడు కోపించడులే. ముందు హస్థినకు వెళ్ళి మా అన్న ధర్మరాజు మనసు కుదుట పడేలా సంధి కుదుర్చుకుని రా. యుద్ధమే జరిగితే ఈ భీముడు ఏనుగుల కుంభస్థలాలు పగుల కొడతాడు, గుర్రములను నేల కూలుస్తాడు. అప్పుడు ఏమాత్రం అలసి పోని నన్ను చూసి నువ్వు ఆశ్చర్య పోతావులే " అన్నాడు. కృష్ణుడు " భీమసేనా! నువ్వు అన్నదానికంటే ఎక్కువ చేస్తావు. నీ శక్తి నాకు తెలియనిదా ! కురు సభకు వెళ్ళి సంధి ప్రయత్నాలు చేస్తాను. యుద్ధమే వస్తే మాకందరికి నువ్వే దిక్కు " అన్నాడు నవ్వుతూ.

### అర్జునుడు

ఆ తరవాత " వాసుదేవా! మా అన్న ధర్మరాజు చెప్పిన తరవాత నేను చెప్పటానికి ఏముంది. మాపెదనాన చాలా దురాశా పరుడు. అతడు రాజ్యంలో భాగం ఇవ్వడు. సుయోధనుడు దుర్మార్గుడు అతడు మాకు రాజ్య భాగం ఇవ్వడానికి అంగీకరించడు. ఈ పరిస్థితిలో నువ్వే మాకు మార్గదర్శకుడివి. నీవు తలపెట్టిన ఏ కార్యమైనా దిగ్విజయం ఔతుంది. అది నీ సంకల్ప బలం. ఆనాడు ధర్మరాజును మాయా జ్యూదంలో ఓడించి నిండు సభలో అవమానించి అడవులకు పంపిన ఆ దుర్మార్గులు చంప తగిన వారే. అందుకే నీకు మామీద ఉన్న వాత్సల్యం కారణంగా యుద్ధం అనివార్యము అన్నావు. మేము ద్రౌపదిని నిండు సభలో కొప్పు పట్టుకుని అవమానించినా ఊరక ఉండి తలవంచు కుని అడవులకు వెళ్ళాము. నీవు అవన్నీ మనసున తలచక ఇరుపక్షాలకు సంధి కుదిర్చి అందరికీ సంతోషం కలుగ చేయి. నేను కోరేది ఇదే " అన్నాడు. శ్రీకృష్ణుడు " అదేమిటి అర్జునా! నీవు అంతగా చెప్పాలా నా శాయ శక్తులా సంధికి ప్రయత్నిస్తాను. అయినా సుయోధనుడు రాజ్యం ఇచ్చేవాడైతే చిన్నప్పటి నుండి మిమ్ము ఇలా కష్టాల పాలు చేస్తాడా ? ఉత్తర గోగ్రహణంలో భీష్ముడు " వచ్చిన వాడు ఫల్గుణుడు అతనిని గెలవడం కష్టం జయాపజయాలు దైవాధీనం కనుక సంధి కుదుర్చుకుంటాము " అన్నప్పుడు ఏమన్నాడో మరచావా? పాండవులకు మాతో పొత్తు ఎలా కుదురుతుంది. నేను వారికి రాజ్యం ఇవ్వను వారిని యుద్ధంలో గెలిచి రాజ్యం అంతా నేను అనుభవిస్తాను " అనలేదా ! ఇప్పుడు సంధి ఎలా చేస్తాడులే పోనీలే సంధి మాట ఎలా ఉన్నా నేను వారి మనోభావాలు తెలుసుకుంటాను " అన్నాడు.

### నకులుడు

తరవాత నకులుడు ఇలా అన్నాడు " కృష్ణా ! మా అన్నయ్యల మాటలు మాకు అనుసరణీయాలు. వనవాస కాలంలో ఉన్న ఆవేషకావేషాలు ఇప్పుడు లేవు. వాళ్ళు తప్పు చేసారని మేము తప్పు చేయాలా ! గోగ్రహణ సమయంలో అర్జునుని చేతిలో ఓడి పోయిన తరవాత వారి మనోభావాలలో మార్పు వచ్చి ఉంటుంది. మా పక్షాన నువ్వు, ఏడు అక్షౌహినుల సైన్యం ఉందని వారికి తెలిసే ఉంటుంది. పాంచాల, యాదవ, మత్స్య, పాండ్యాది దేశాల ఆండే కాక నీ అండ భీమార్జునుల పరాక్రమము ఉన్నాయని తెలిసి భయపడకుండా ఉంటారా ! భీష్మాది పెద్దలు వారికి హితవు చెప్పరా ! నీమాటలు వారిలో పరివర్తన తీసుకు రాదా . నీ ప్రయత్నం సఫల మౌతుంది. మనకు విజయం సిద్ధిస్తుంది.

### సహదేవుడు

అన్నీ విన్న సహదేవుడు " మా అన్నయ్యలు శాంతి వచనాలు పలకడం నీవు వినడం బాగుంది. భీమార్జునులు తమ పరాక్రమము మరచి ఇలా దీనంగా ఆలోచించడం బాగుందా ! మనకోసం యుద్ధం చేయడానికి వచ్చిన రాజులు ఏమంటారు. బంధువులు మిత్రులు మనలను నిందించరా! ధర్మరాజు రాజ్యభాగం కోసం యాచించడం శ్రీకృష్ణుడు దానిని కురుసభలో అడగటం వారు గర్వంతో కాదనడం ఇంతకంటే హీనమైన కార్యం ఇంకొకటి ఉందా! ఈ బిచ్చపు కూడు రుచిస్తుందా ! మీ రాయభారానికి ఒప్పకుని వారు ఎంతో కొంత మాకు ఇచ్చినా ఈ సంధి పొసగదు. యుద్ధమే శరణ్యము కనుక నా మాటగా సుయోధనునికి ఇలా చెప్పు " సుయోధనా ! నువ్వు కూడా నీ తమ్ములతో అరణ్యాలలో ఉండి వచ్చి రాజ్యభాగం అడిగి మేము ఇవ్వకుంటే మీకు ఎలా ఉంటుంది. కనుక మాకు రాజ్యభాగం ఇవ్వక తప్పదు. లేకుంటే నీకు చావు తప్పదు. ఇక నీ మాయ మాటలు వినే స్థితిలో మేము లేము అని చెప్పు " అన్నాడు. సహదేవుని మాటలకు సాత్యకి సంతోషించాడు. " సహదేవా ! చక్కగ చెప్పావు. సుయోధనునికి నీతులు చెపితే మన పరువు పోవడం తప్ప ప్రయోజనం లేదు . ఏ విధంగా చూసినా సంగ్రామమే మన కర్తవ్యం ఇక్కడ చేరిన రాజులకు అదే ఇష్టం " అన్నాడు సాత్యకి . సహదేవుడు, సాత్యకి మాటలకు అందరూ హర్షద్వానాలు చేస్తూ తమ అంగీకారం తెలిపారు.

### ద్రౌపది


ముడివేయని జుట్టుని శ్రీకృష్ణునకు చూపించి భాదపడుతున్న ద్రౌపది

తరవాత ద్రౌపది " మా రాజ్యాన్ని అపహరించి మమ్మల్ని అడవులకు పంపినది చాలక సంజయుని పంపి ఊరడింపు మాటలు చెప్పించాడు. ఆ మాటలకు ధర్మరాజు పొంగి పోయి ఐదు ఊళ్ళు ఇచ్చినా చాలు అనడమా? ఏమి వింత. ధర్మరాజు సుయోధనుని మీద ప్రేమాతిశయంతో ఇన్ని అవమానాలను సహించి ఊర కున్నాడేమో కాని రాజ్యభాగం తీసుకోకుండా ఊరకుంటే పాండవులంతటి పిరికి వాళ్ళు, అసమర్ధులు, అవివేకులు, సిగ్గులేని వారు లేరని లోకులు నిందించరా ! పాండవుల ముందు కౌరవులు ఎంత. పాండవులు కౌరవుల ఆగడాలు సహించి ఊరు కోవడానికి వారు బ్రాహ్మణులా ! క్షత్రియులా ! అసలు వారి తక్కువ వారని ఎందుకు నిరూపించు కోవాలి. అసలు ఈ సంధి కౌరవులకే మేలు చేసేలా ఉంది. సుయోధనుడు ఎవరికి భయపడడు. అతడు నీ మాటలు ఆలకిస్తాడో లేదో సంధి కుదరక పోతే పాండవులు యుద్ధం చేస్తారో తిరిగి అడవులకే పోతారో వారికే తెలియాలి. నాకు తోచింది చెప్పాను. మీకు తోచింది చెయ్యండి . నేను అగ్నిలో పుట్టాను. భరత వంశానికి వచ్చాను. పాండు రాజుకు కోడలును అయ్యాను. లోకవంద్యులైన భర్తలను పొందాను. సౌందర్య వంతులైన పుత్రులను కన్నాను. నీ చెల్లెలు సుభద్ర కంటే ఎక్కువగా నీ అభిమానాన్ని పొందాను. కృష్ణా అటువంటి నన్ను రాజసూయ యాగానంతరం అవభృదనైన నన్ను కొప్పు పట్టుకుని సభలోకి ఈడ్చి వలువలు లాగాడు. లోకంలో మరే స్త్రీ కైనా ఇటువంటి అవమానం జరిగిందా? ఆసమయంలో మాటాడ లేక ఊరకుంటే నేను నిన్నే కదా నమ్మాను. ఈ విషయం సంధి మాటలు మాటాడే సమయంలో నీవు గుర్తు పెట్టుకోవాలి. ఆ సమయాంలో నన్ను కోడలిగా తలపక దాసిలా తలచిన దృతరాష్ట్రుని వద్దకు నా భర్తలతో వెళ్ళినప్పుడు కోడరికం చెయ్యాలా? దాసిలా ఊడిగం చెయ్యాలా ? నువ్వే చెప్పు " అంటూ ద్రౌపది ఒక్క సారి లేచి నిలబడి తన నిడుపాటి వెంట్రుకలు చూపి " కృషా ! ఈ శిరోజాలు ఆ నాడు దుశ్శాసనుడి చేతిలో చిక్కి మిగిలినవి. నా కురులు పట్టి ఈడ్చిన వాడి చేతులు యుద్ధభూమిలో నరకబడి నప్పడే నాకు మనశ్శాంతి. నా మనసుస్సులో చెలరేగుతున్న అగ్ని మామూలు మాటలకు చల్లారదు . నేను ధర్మజనితో సుయోధనుని శవాన్ని కనులారా చూడకుంటే అర్జునిని గాండీవం తగులబెట్టనా ! మహా వీరులైన భర్తలు నీ వంటి అన్న ఉండగా పరాభవాగ్నిని ఇంకా ఎన్నాళ్ళు ఒడిలో పెట్టుకోను ! " అని ద్రౌపది నిట్టూర్పు విడిచింది. ఆ మాటలకు కృష్ణుడు ద్రౌపదితో " అమ్మా ! అమ్మా కౌరవులు మనకు రాజ్య భాగం ఇవ్వరు. నీవు అనుకున్నట్లు యుద్ధమూ శత్రు సంహారం తప్పక జరుగుతుంది. నీ శోఖం మరచిపో . ఇప్పటి వరకు నీవు అనుభ వించిన దు:ఖం కంటే అధికంగా కౌరవ కాంతలు అనుభవించే రోజు ఇక ఎంతో దూరంలో లేదు. యముని వాహనమైన దున్నపోతు మెడగంటలు వినవలసిన కౌరవులకు నా హితవులు చెవి కెక్కవు. కనుక యుద్ధం అనివార్యం " అని ఊరడించాడు.

## శ్రీకృష్ణుని హస్థినకు ప్రయాణం


హస్తినాపురమునకు వెళ్ళు దారిలో శ్రీకృష్ణుని కలసిన మునులు

అర్జునుడు " కృష్ణా! ఇరువర్గాలకు మేలు చెయ్యి. ఇదే నేను కోరేది " అన్నాడు. ధర్మజుడు కృష్ణుని చూసి కృష్ణా నీ జన్మ నక్షత్రం రోహిణి రేపు రేవతి నక్షత్రం . నీకు చంద్రబలం తారాబలం బాగున్నది. కనుక రేపే నీ హస్థిన ప్రయాణానికి సుముహూర్తం " అని ప్రయాణ ముహూర్తం నిశ్చయించాడు. శ్రీకృష్ణుడు సాత్యకిని పిలిచి తన ఆయుధాలైన గధను, సుదర్శన చక్రాన్ని రధంలో పెట్టించ మన్నాడు. యాదవులలో తన వెంట రావలసిన వారిని నిర్ణయించాడు. దారుకుని పిలిచి రధాన్ని సిద్ధం చెయ్య మన్నాడు. సాత్యకిని చూసి " సాత్యకీ ! కౌరవులు కుటిల బుద్ధులు నువ్వు కూడా నా వెంట రా " అని హస్థినకు పయనమయ్యాడు. అర్జునుడు ధర్మరాజు శ్రీకృష్ణుని వెంట ఊరి వెలుపలి వరకు వచ్చి సాగనంపారు. చివరిగా ధర్మరాజు " కృష్ణా! నీవు మాతల్లి కుంతీ దేవి వద్దకు వెళ్ళి ఆమెకు నా నమస్కారములు చెప్పు. ఆమెను ఊరడించు. మా గురువు ద్రోణ, కృపాచార్యులకు నా నమస్కారములు చెప్పు. భీష్మునికి, విదురునికి నా నమస్కారములు అందించు " అన్నాడు. శ్రీకృష్ణుడు సరేనని చెప్పి హస్థినకు పయన మయ్యాడు. మార్గ మధ్యములో కుశస్థలిలో విడిది చేసాడు.

## శ్రీకృష్ణునకు హస్థినాపుర స్వాగతము


కృష్ణునికి స్వాగతం చెబుతున్న ధృతరాష్ట్రాదులు

శ్రీకృష్ణుడు కుశస్థలిలో విడిది చేసిన విషయం ధృతరాష్టునికి తెలిసి వెంటనే భీష్ముని, ద్రోణునీ, కృపాచార్యుని, విదురుని, దుర్యోధనుని , శకునిని, కర్ణుని, సైంధవుని పిలిపించి " శ్రీకృష్ణుడు పాండవ కార్యార్ధి అయి కుశస్థలి వరకు వచ్చాడు. మనమంతా అతనికి ఘనంగా స్వాగత సత్కారాలు చేయాలి సన్నద్ధం చెయ్యండి " అన్నాడు. ఆ మాటలు విన్న భీష్ముడు ద్రోణుడు ఎంతో సంతోషించారు. సుయోధనుడు స్వాగత సన్నాహాలు చేస్తున్నాడు. ధృతరాష్టుడు విదురుని చూసి " విదురా ! శ్రీకృష్ణునినికి విడిది ఎక్కడ ఏర్పాటు చెయ్యాలి? శ్రీకృష్ణునికి ఇష్టమైన ఏ వస్తువులు కానుకగా ఇవ్వాలి ? " అని అడిగాడు. విదురుడు " రాజా ! పాండవులకు ఐదు ఊళ్ళు కూడా ఇవ్వలేని మనం శ్రీకృష్ణునికి కానుకలు సమర్పించ గలమా అన్నాడు. నీ మనసులో మాట గ్రహించాను. శ్రీకృష్ణునికి ఏవో కానుకలు ఇచ్చి లోబరుచు కోవాలని పాండవులతో విబేధం కలిగించాలని చూస్తున్నావు. నీవు ఇంత తెలివి హీనుడివా ! మేరు పర్వతాన్ని ఇచ్చినా శ్రీకృష్ణుడు అర్జునిని విడువడు. కనుక నువ్వు శ్రీకృష్ణునికి కాళ్ళకు నీళ్ళిచ్చి కుశల మడిగితే చాలు. శ్రీ కృష్ణుడు ఏ పనికి వస్తున్నాడో అది నెరవేర్చడం తప్ప వేరేమి శ్రీకృష్ణునకు పని లేదు. ఇంకేమిచ్చినా అది అతనికి ప్రియము కాదు " అన్నాడు. అందుకు సుయోధనుడు " తండ్రీ ! విదురుడు చక్కగా చెప్పాడు. మనము ఏమిచ్చినా కృష్ణుడు పాండవులను విడువడు. మనము కానుకలు ఇచ్చి అతనిని లోబరుచు కోవడానికి ప్రయత్నిస్తే పాండవులకు భయపడి ఇదంతా చేస్తున్నామని లోకులు అనుకుంటారు. ఇది చూసి మన అల్పత్వం బయటపడి శత్రువులు రెచ్చి పోవడం మనకు మంచిది కాదు " అన్నాడు. భీష్ముడు ధృతరాష్టుని చూసి " రాజా ! నువ్వు కానుకలు ఇస్తే ఒకరకంగా ఇవ్వకుంటే ఒకరకంగా చేసే వాడా శ్రీకృష్ణుడు. అతని ధర్మయుక్తమైన మాటలు సావధానం గా విని అతని పని సఫలం చేసి పంపడమే నీ బాధ్యత " అన్నాడు. సుయోధనుడు " కృష్ణుడు పాండవులకు రాజ్యంలో సగ భగం ఇవ్వమంటాడు. నేను ఇవ్వనంటాను. మీరు చెప్పినట్లు శ్రీకృష్ణుడు పాండవులకు సర్వస్వం కనుక అతనిని పట్టి బంధించి కారాగారంలో పెడితే పాండవులు రెక్కలు తెగిన పక్షులు ఔతారు. యాదవులు, పాంచాలురు మనపక్షం వహిస్తారు. దానినికి నేను తగిన సన్నాహాలు చేస్తున్నాను. ఇక మీరేమి చేస్తారో చెయ్యండి " అన్నాడు. అతని మాటలు విని అంతా నిర్గాంత పోయారు. ధృతరాష్టుడు " సుయోధనా ! ఏమి నువ్వు శ్రీకృష్ణుని బంధిస్తావా నీకు మతి భ్రమించ లేదు కదా! లోకాని కంతటికీ కీడు చేస్తావా! శ్రీకృష్ణుడు మన వద్దకు దూతగా వస్తున్నాడు. దూతను మర్యాద చెయ్యడం ధర్మం. బంధించడానికి అతడు చేసిన అపరాధం ఏమిటి " అన్నాడు. " రాజా ! నీ కుమారుడు శ్రీకృష్ణుని బంధిస్తే సర్వనాశనం ఔతాడు. ఇక నేను ఇక్కడ ఉండలేను " అని భీష్ముడు అక్కడి నుండి వెళ్ళాడు. ధృతరాష్టుడు " కుమారా ! ఇంతటి కొరగాని పనులు మానుము. దీని వలన నీకు కీడే కాని మేలు కలుగదు . ఆ పై నీ ఇష్టం " అన్నాడు. ఆ తరువాత ధృతరాష్టుడు భీష్ముని , బాహ్లీకుని, ద్రోణుని తీసుకుని శ్రీకృష్ణునికి స్వాగతం చెప్పడానికి నియమించాడు. శ్రీకృష్ణుడు తనకు స్వాగతం చెప్పిన వారిని తగురీతిన గౌరవించి వారిలో తన మిత్రుడైన కృతవర్మను తన వెంట బెట్టుకుని హస్థినలో ప్రవేశించాడు. ధృతరాష్టుడు శ్రీకృష్ణునికి ఎదురేగి కౌగలించుకున్నాడు. శ్రీకృష్ణుడు అందరి యోగక్షేమాలు అడిగాడు. మిగిలిన వారి యోగక్షేమాలు అడగటానికి సాత్యకిని నియమించాడు. ధృతరాష్టుడు శ్రీకృష్ణునికి ఉన్నత ఆసనమిచ్చి అర్ఘ్యపాద్యములు సమర్పించాడు. శ్రీకృష్ణుడు భీష్మ, ద్రోణ, కృపాచార్యులకు నమస్కరించి ధృతరాష్ట్రుని అనుమతి తీసుకుని విదురుని మందిరానికి వెళ్ళాడు.

## కుంతీదేవి ఆవేదన

శ్రీకృష్ణుడు " విదురునితో పాండవులను గురించిన విషయాలు చర్చించిన తరవాత కుంతీ దేవి మందిరానికి వెళ్లాడు. కుంతీ దేవి తన మేనల్లుడిని పట్టుకుని ఏడ్చి " కృష్ణా ! నీకు తెలియనిది ఏమున్నది. నాయనా ! ధర్మాత్ములు, నీతి మంతు లైన పాండురాజ కుమారులై ఎన్నో సుఖాలు అనుభవించ వలసిన వారు అడవుల పాలు అయ్యారు. తండ్రి లేని వారికి తల్లినైన నేను కూడా దూరం అయ్యాను. నాయనా క్రుష్ణా ! ధర్మరాజు క్షేమమే కదా ! బకుని చంపిన భీముడు క్షేమమే కదా ! అర్జునుడు బాగున్నాడా ! నకుల, సహదేవులు బాగున్నారా ! నా కోడలు దౌపది ఎలా ఉంది ? ఆమె అంటే నాకు ఎంతో ఇష్టం . ఆమె నాకు చేసిన సేవలు మరువ లేను. ఆ సాధ్వికి కురు సభలో జరిగిన అవమానం తచుకుంటే మనసు రగిలి పోతుంది. విదురుడు తప్ప సభలో ఎవరు వారిని ఖండించారు? కృష్ణా ! ఈ పదమూడేళ్ళు దాయాదుల దయ మాలిన తిండి తినడం

ఎంతో బాధగా ఉంది. నేను మాత్రం సుయోధనాదులను నా కన్న కొడుకులతో సమానంగా ప్రేమించానన్నదానికి ఆ దేవుడే సాక్షి. జరిగిన దానికి ఎవరిని నిందించ గలము ? క్రుష్ణా ! ఒకరిని అర్ధించి ఆర్జించిన సంపదలు ఎవరిని ఆనంద పెడతాయి. పరాక్రమము లేని క్షత్రియుని ఎవరు గౌరవిస్తారు? " అని ధర్మజునికి చెప్పు. " క్షత్రియ కన్య పుత్రులను ఎందుకు కంటుంది తన కుమారులు అత్యంత పరాక్రమ వంతులు కావాలనే కదా ! అలా కాక పోతే వారు మగవారు అనిపించుకోరు కదా ! " అని భీమార్జునులకు చెప్పు. " భుజబలంతో జీవించడం క్షత్రియ ధర్మమని అలా కాక పిరికి వారిలా జీవించడం హేయమని నకుల, సహదేవులకు చెప్పు. ఇంకా తెలియకున్న ద్రౌపదిని అడిగి తెలుసు కోమని చెప్పు " అని పలికింది. శ్రీకృష్ణుడు " అత్తా ! నీ మనసులో మాట నెరవేరుతుంది. కలత పడవద్దు నీ కుమారులు వీరోచిత సంపదలు మాత్రమే అనుభవిస్తారు. " అని శ్రీకృష్ణుడు పలికాడు. " కృష్ణా ! పాండవులకు తల్లి తండ్రి దైవం అన్నీ నువ్వే నిన్ను నమ్ముకున్న వాళ్ళకు ఆపద దరి చేరదు " అని పలికింది.

## సుయోధనుని మందిరంలో శ్రీకృష్ణుడు

విదురుని మందిరం నుండి బయలు దేరిన శ్రీకృష్ణుడు కృతవర్మను, సాత్యకిని తీసుకుని సుయోధనుని మందిరానికి వెళ్ళాడు. ఆ సమయంలో సుయోధనుడు భీష్మ, ద్రోణ, కర్ణ, శకుని, సైంధవుడు, దుర్ముఖుడు , మొదలగు వారు పర్యవీష్టి ఉండగా సింహాసము పై కూర్చున్నాడు. శ్రీకృష్ణుని రాక తెలుసుకుని అతడిని ఎదురు వెళ్ళి తోడ్కొని వచ్చాడు. శ్రీకృష్ణుడు సుయోధనుని, దుశ్శాసనుని ఆలింగనము చేసుకుని కుశల ప్రశ్నలు వేసాడు. సుయోధనుడు శ్రీ కృష్ణునికి ఉచిత ఆసనం ఇచ్చి సత్కరించాడు. తన ఇంటిలో భోజనానికి ఆహ్వానించిన సుయోధనుని శ్రీకృష్ణుడు సున్నితంగా తిరస్కరించాడు. సుయోధనుడు " కృష్ణా ! మా ఇంటికి వచ్చి భోజనం చేయకుండా వెళ్ళడం న్యాయం కాదు. నీవు కురు పాండవులకు సమానుడవు. మా తండ్రికి ఇష్టుడవు. మా ఇంట భోజనం చేయక పోవడానికి కారణం ఏమిటి " అన్నాడు. " సుయోధనా! నేను రాయబారిగా వచ్చాను. వచ్చిన పని పూర్తి కాకుండా మీ ఇంట విందులు కుడవడం కానుకలు స్వీకరించడం ధర్మం కాదు కదా! నేను వచ్చిన పని పూర్తి అయిన తరవాత నీ ఇంట విందుకు వస్తాను " అన్నాడు. సుయోధనుడు " అదేమిటి కృషా ! రాయబారం వేరు. విందు వేరు. దానికీ దీనికీ లంకె ఏమిటి? హాయిగా భోజనం చేసి పనులు చక్క పెట్ట వచ్చు భోజనం చేయనంటే ఎలా ? కనుక నీవు మా ఇంట విందు చేయననడానికి కారణం లేదు " అన్నాడు. సుయోధనా " ప్రేమతో పెట్టు భోజనం అత్యంత ప్రియమైనది ఆపద ఉన్న చోట భోజనం మంచిది కాదు. నాకు మీ పట్ల ప్రేమ ఉంది మీ ఇంట నాకు ఆపద లేదు. కాని అయినా ప్రస్తుతం భోజనం చేయలేను. పగ వారి ఇంట భోజనం వారు ఏమి పెడతారో అని అనుమాన పడేలా చేస్తుంది. నాకు పాండవులు అంటే ప్రాణం నీకు వారంటే పగ. చిన్నతనం నుండి నువ్వు అకారణంగా పాండవులకు అపకారం చేస్తూనే ఉన్నావు. అటువంటి పుణ్యాత్ములతో వైరం న్యాయమా? అటువంటి పుణ్యాత్ములకు అపకారం చేసే మీ ఇంట భోజనం మంచిది కాదు. కనుక నేను విదురుని ఇంట భోజనం చేస్తాను " అన చెప్పి సుయోధనుని ఇంట శలవు తీసుకుని విదురుని ఇంటికి వెళ్ళాడు.

## విదురుని ఇంట విందు

విదురుడు అత్యంత ఆదరంగా భక్తి శ్రద్ధలతో శ్రీకృష్ణునికి మర్యాదలు చేసి విందు భోజనం సమకూర్చాడు. విందు పూర్తి అయిన తరవాత విశ్రాంతిగా శ్రీకృష్ణునితో " కృష్ణా ! దుర్యోధనుడు దురభిమాని, నీచుడు, దుష్టబుద్ధి అతడు నీ మాట వింటాడా ! అతడు తన పదకొండు అక్షౌహినుల సైన్యాన్ని చూసి గర్వి స్తున్నాడు. కర్ణుడు ఒక్కడే విజయం చేకూరుస్తాడని నమ్ముతున్నాడు. నీ వస్తున్నావని విని నీ మాటలు విన కూడదని , పాండవులకు రాజ్య భాగం ఇవ్వక ఈ భూమి నంతా తానే ఏలుకోవాలని చూస్తున్నాడు. రాజసూయ యాగంలో ఓడిన రాజులంతా ఇక్కడ చేరారు. వారంతా ఒక్కటై పాండవులకు వ్యతిరేకంగా యుద్ధం చేయటానికి సిద్ధం అయ్యారు కనుక సంధి పొసగదు. కౌరవులకు చేటు కాలం సమీపించింది కనుక కయ్యానికి కాలు దువ్వుతున్నారు. ఆ దుర్మార్గుల ఎదుట కూర్చుని వారు కూయు కారు కూతలు విని వారి చేతిలో అవమానపడటం మంచిది కాదు. కనుక నీవు కురు సభకు వెళ్ళ వద్దని నా అభ్యర్ధన " అని ఆవేదన చెందాడు. సమాధానంగా శ్రీకృష్ణుడు " విదురా! నీవు నా హితము కోరి చెప్పినా నేను ఎందుకు వచ్చానో వారికి తెలియాలి. వారి మనసులో ఉన్నది తెలుసుకుని దానికి అనుగుణంగా చేయాలి కదా ! దుర్యోధనుని దుర్మార్గం నాకు తెలుసు ఈ సంధి పొసగదని నాకు తెలుసు. ఒకడు పని కట్టుకుని పుణ్యం చేసినా పాపం చేసినా అది సిద్ధిస్తుంది. నా మాట ఫలించక పోయినా దాని ఫలితం సిద్ధిస్తుంది. బంధువులతో ఏర్పడిన వైరాన్ని పోరాడి ఆ వైరాన్ని మాన్పాడం ధర్మమని పెద్దలు అంటారు కదా! కనుక అసాధ్యమైనా కురు పాండవ సంధికి నా ప్రయత్నం చేస్తాను. నన్ను పాండవ పక్షపాతిగా శంకించి సుయోధనుడు నా మాట వినడు. అదీ మంచిదే . అన్నదమ్ములకు వైరం వచ్చినప్పుడు ఇరువురికీ కావలసిన కృష్ణుడు చూస్తూ ఊరక ఉన్నాడన్న అపప్రధ నాకు రాకుండా చూస్తాను. నా మాట వింటే సుయోధనుడు బాగు పడతాడు. లేకున్న లేదు అంతే " అన్నాడు. విదురుడు శ్రీకృష్ణుని వద్ద శలవు తీసుకుని వెళ్ళాడు.

## కురుసభకు శ్రీకృష్ణుడు ప్రవేశించుట


కురుసభలో ప్రవేశించిన శ్రీకృష్ణుడు

మరునాడు శ్రీకృష్ణుడు కాలకృత్యములు తీర్చుకుని కృతవర్మ సాత్యకులతో కూర్చుని ఉన్నాడు. సుయోధనుడు కర్ణుడు, దుశ్శాసనులను వెంట పెట్టుకుని శ్రీకృష్ణుని వద్దకు వచ్చాడు. అందరూ కొంత సమయం ఇష్టాగోష్టి మాట్లాడు కున్న తరవాత సుయోధనుడు శ్రీకృష్ణుని చూసి " కృష్ణా! నా తండ్రి దృతరాష్ట్రుడు బంధు మిత్ర సమేతంగా కొలువు తీర్చి ఉన్నాడు " అన్నాడు. శ్రీకృష్ణుడు సాత్యకి, కృతవర్మలు వెంట రాగా కురు సభలో సుయోధనాదులతో రాజ భవనానికి వచ్చాడు. విదురుడు శ్రీకృష్ణునికి ఎదురు వచ్చి శ్రీకృష్ణుని సాదరంగా ఆహ్వానించాడు. కర్ణుడు , సుయోధనులు దారి చూపగా శ్రీకృష్ణుడు సభలోకి ప్రవేశించి దృతరాష్ట్రాదుల సాదర స్వాగతాన్ని అందుకుని తనకై ప్రత్యేకించిన ఉన్నతాసనం మీద కూర్చున్నాడు. సాత్యకి కృతవర్మ శ్రీకృష్ణునికి ఇరివైపులా కూర్చున్నారు. ఆ సభకు నారదాది మహామునులు వచ్చి ఆసీనులై ఉన్నారు.విదురుడు శ్రీకృష్ణుని వెనుక కూర్చుని ఉన్నాడు. సుయోధనుడు, కర్ణుడు పక్కపక్కన కూర్చున్నారు. శకుని తన కుమారులతో ఒక పక్క ఆసీనుడై ఉన్నాడు. సభలోని వారందరూ శ్రీకృష్ణుడు ఏమి చెప్తాడో అని అతురతగా ఎదురు చూస్తున్నారు.

## శ్రీకృష్ణుని సందేశం


కౌరవసభలో శ్రీకృష్ణుడు

శ్రీకృష్ణుడు లేచి సభను ఉద్దేశించి " మహారాజా ! నీకు తెలియనిది ఏమున్నది. అయినా భరత వంశ క్షేమం కొరకు ఇరు కుటంబాలకు మేలు కలిగేలా నాకు తోచినది చెప్తున్నాను. మీ భరత వంశం ధర్మము, సత్యము, కరుణ, ఐకమత్యము, అభివృద్ధి కలిగి ప్రసిద్ధి చెంది ఉంది. అట్టి వంశములో నీవు, నీ సహోదరుడు పాండురాజు జన్మించారు. కనుక నీ పుత్రులు పాండు పుత్రులు పాలు నీళ్ళ వలె కలిసి ఉండక పోతే అప్రతిష్ట పాలు కావాలసి ఉంటుంది. అలా నడిపించ వలసిన భాద్యత నీది. అయినా నీకు నీ కుమారులు పాండు కుమారులూ సమానమే కదా ! ఈ కురు వంశముకు నీవే పెద్దవి కనుక నీ వంశం మంచి చెడులకు నీవే భాద్యుడవు. కనుక ఇరు కుటుంబాల యోగక్షేమం దృపిటిలో పెట్టుకుని మెలగాలి. కాని నీ కుమారుల నడవడి మంచిది కాదు వారు ధర్మం తప్పి బంధు మిత్రులను బాధకు గురి చేస్తున్నారు. కౌరవులూ పాండవులూ సఖ్యతతో ఒకే మార్గంలో పయనించడం అందరికీ మంచిది. అలా కాకుండా యుద్ధం సంభవిస్తే వినాశనం తప్పదు. కనుక ఇరు పక్షాలకు సంధి చేయుట మంచిది అది నీ చేతిలోనే ఉంది. ఇక బలాబలాలకు వస్తే భీమార్జునులతో యుద్ధం చేయటానికి మీ పక్షంలో ఎవరున్నారో చెప్పు. ఇక్కడ ఉన్న భీష్మ ద్రోణులను ఎదుర్కొనే వాళ్ళు వారి పక్షంలో లేరు. ఇరు పక్షంలో వారు చని పోవడం తప్ప కంటే సంధి మేలు కదా! కురు సామ్రాట్టువైన నువ్వు నీ కుమరులైన కౌరవ, పాండవులలో ఒకరి పట్ల శతృత్వం వహించడం తగదు. ఈ సమయంలో నీ ఉపేక్ష భూ ప్రజలందరికీ చేసే ద్రోహం. అంతే కాదు నీకు నువ్వే చేసుకునే ద్రోహం. కురు, పాండవులలో ఎవరు మరణించినా కీడు నీకే కదా! అది నీకు మేలు చేయదు కదా! పండితులూ, బలాఢ్యులూ, పరాక్రమ వంతులూ అయినా కురు వంశజులు ఈ కొరగాని యుద్ధంలో మరణించకుండా నీ రాజ నీతిని ప్రదర్శించి అందరి మెప్పు పొంది కీర్తి మంతుడివి కా. నీకు సదా వినమ్రులూ, సహోదర పుత్రులూ, తండ్రి లేని వారూ అయిన పాండు పుత్రులను చిన్నప్పటి నుండి ఆదరించి విధ్యాబుద్ధులు గరిపి తండ్రి లాంటి నువ్వు చివరికి ఇలా నిష్కారణంగా విడుచుట తగునా ! వారు ముక్త కంఠంతో నాతో ఇలా చెప్తారు " తండ్రీ ! నీ మాట ప్రకారం మేము అరణ్య అజ్ఞాత వాసాలను పూర్తి చేసుకున్నాము. ఇప్పుడు మా తండ్రి గారి అర్ధ రాజ్యానికి అర్హులమని అనుకుంటున్నాము. మాకు తల్లీ, తండ్రీ, గురువు, దైవం అయిన నీవు మా వలన తెలియక జరిగిన అపరాధాన్ని మన్నించి శాసించండి. సుయోధనాదులకు మా క్షేమం అవసరం లేదు మాకు అన్ని నువ్వే కనుక ధర్మం తప్పక మాకు క్షేమం కావించి ధర్మాన్ని నిలపండి. ధర్మాన్ని , సత్యాన్ని రక్షించగలిగే అవకాశం ఉండీ దానిని రక్షించడంలో ఉపేక్ష వహిస్తే అది వారికి కీడు కలిగించక మానదు " అని మీకు చెప్పమన్నారు. కనుక మహారాజా! నీ సమధానం ఏమిటో చెప్పు.

నేను మీ ఇరు కుటుంబాల బంధుత్వం దృష్టిలో పెట్టుకుని ధర్మం, నీతిని రక్షించడానికి ఈ మాటలు చెప్పాను. మీరు క్రోధం మత్సరం విడిచి పాండవులకు న్యాయం చేస్తూ వారి రాజ్య భాగాన్ని వారికి ఇవ్వడం కంటే మంచి ధర్మం ఏముంది. కనుక మహారాజా! నీవు సముచిత నిర్ణయం తీసుకుని వారి రాజ్యభాగాన్ని వారికి ఇచ్చి మిగిలినది మీ కుమారునికి ఇచ్చి పుత్ర పౌత్రాదులతో సుఖంగా జీవించు. ధర్మరాజు నిన్ను ఆశ్రయించిన తీరు అతని ధర్మనిష్ఠ నీవు ఎరుగనిదా! నీవు పంచి ఇచ్చిన ఇంద్ర ప్రస్థంలో రాజసూయ యాగంతో దిగ్విజయంతో సంపాదించిన రాజ్యంతో కీర్తి ప్రతిష్టలతో తన రాజ్యంలో తమ్ములతో , తల్లితో సుఖంగా ఉన్నాడు. నీ కుమారులు అతడిని జూదానికి పిల్చి అతని సంద హరించి అవమానించి అడవులకు వెళ్ళగొట్టాడు. వారి ప్రియ సతిని నిండు సభలో అమానించారు. ఇవి అన్నీ నీ అంగీకారంతోనే చేసాడు. అడవులకు పంపి అష్టకష్టాలకు గురి చేసినా వారు ఇంకా మీతో సఖ్యత కోరుతూ సంధి ప్రయత్నాలు చేస్తున్న ధర్మజుని ధర్మనిష్ట , సత్య వ్రతం ఎవరికి ఉంటుంది. దృతరాష్ట్ర మహా రాజా! నీ కుమారుల క్షేమం కోరి ఇవన్నీ నీకు చెప్పున్నాను. నీ కుమారుని దురాశను తొలగించి పాండవులను పిలిపించి వారి రాజ్యభాగాన్ని వారికి ఇవ్వడం మంచిది. పాండవులు మీ పాద సేవ చేయడానికి సిద్ధంగా ఉన్నారు. నీకు అది ఇష్టం లేకున్న వారు యుద్ధానికి కూడా సిద్ధమే నీకు ఏది కావాలో నువ్వే నిర్ణయించు " అని చెప్పి శ్రీకృష్ణుడు కూర్చున్నాడు.

### జమదగ్ని హితబోధ

సభ అంతా అయింది నిశబ్దం అయింది. అందరూ శ్రీకృష్ణుని మాటలు నిశబ్దంగా విన్నారు ఎవరికీ బదులు చెప్పే ధైర్యం లేక నిశ్చేష్టులు అయ్యారు. ఇంతలో జమదగ్ని మహా ముని లేచి " సుయోధనా ! పూర్వం ధంభోద్బవుడు అనే మహారాజు ఉండే వాడు. అతడు ఈ లోకంలో తనకు ఎదురు ఎవరు లేరని గర్వించాడు. ఆ సమయంలో నర నారాయణులు గంధమాదన పర్వతం పై తపస్సు చేసు కుంటున్నారు. ఆ దంభోద్బవుడు వారి మీదకు యుద్ధానికి వెళ్ళాడు. అక్కడ తపస్సు చేసు కుంటున్న మునులు ఎంత చెప్పినా వినలేదు. ఆ సమయంలో నరుడు చేత దర్బలు ధరించి దంభోద్భవునితో యుద్ధం చేసి ఓడించి ప్రాణాలతో వదిలి వేసాడు. ఆ నర నారాయణులే ఈ కృష్ణార్జునులు. కనుక దంభోద్భవునిలా గర్వంతో వారిని ఎదిరించక సంధి చేసుకో " అన్నాడు.

### కణ్వమహర్షి హితబోధ

ఆ తరువాత కణ్వ మహాముని లేచి " సుయోధనా ! తన బలం ఎదిరి బలం తెలియక గర్వంతో, అహంకరంతో యుద్ధానికి తలపడటం మంచిది కాదు. పూర్వం ఇలా గరుత్మంతుడు అహంకారం పూరితుడై గర్వభంగ పడ్డాడు. దేవేంద్రుని రధసారధి మాతలి తన కూతురు గుణకేశికి సర్ప నాయకుడు ఆర్యకుని మనుమడు కురుడి కుమారుడైన సుముఖుడిని భర్తగా నిర్ణయించాడు. ఆ విషయం ఆర్యకునితో చెప్పగా అతడు " అయ్యా ! నా కుమారుడు కురుడిని గరుత్మంతుడు చంపాడు. ఆ తరవాత సుముఖుని కూడా ఒక నెలరోజులలో చంపుతానని చెప్పి కోపంతో వెళ్ళాడు కనుక ఈ సంబంధానికి నేను ఒప్పుకొన లేను అన్నాడు. అందుకు మాతలి నేను దేవేంద్రునితో చెప్పి సుముఖుని ప్రాణాలు కాపాడ గలను రండి " అని దేవేంద్రుని దగ్గరకు తీసుకు వెళ్ళాడు. ఆ సమయంలో దేవేంద్రునితో మహా విష్ణువు ఉన్నాడు. దేవేంద్రుడు మాతలి ద్వారా విషయం తెలుసుకుని మహా విష్ణువు అనుమతితో సుముఖుని దీర్ఘాయుష్మంతుని చేసాడు. మాతలి తన కుమార్తెను సుముఖునికి ఇచ్చి వివాహం జరిపాడు. ఇది విని గరుత్మంతుడు కోపావేశంతో అక్కడికి వచ్చి విష్ణువు ముందరే " ఇంద్రా ! నీవు అధితి పుత్రుడవు నేను వినతా పుత్రుడను. మన ఇద్దరికి తండ్రి కశ్యపుడు. మనం ఇద్దరం రాక్షసులను వెతికి వెతికి చంపుదాం. నీ కంటే నేను ఎందులో తక్కువ నా నిర్ణయానికి నీవు ఎందుకు అడ్డుపడ్డావు " అన్నాడు. అందుకు ఇంద్రుడు " ఇది నా నిర్ణయం కాదు విష్ణు మూర్తి తీసుకున్న నిర్ణయం " అన్నాడు. గరుత్మంతుడు " తమ్ముడా! నేను ఏమిటో నా బలమెంతో నీకు తెలియదు నీ దేవతా కులమంతా నా ఒంటి మీది ఒక ఈకతో సమం కాదు " అన్నాడు. విష్ణు మూర్తి " నీవు అంత బలవంతుడివా ఏదీ చూపించు " గరుడుని వీపుపై చేతిని ఉంచి అన్నాడు. ఆ భారానికి గరుడుడు కుప్ప కూలి పెద్దగా అరిచాడు. విష్ణుమూర్తి చేయి తీయగానే లేచి నిలబడ్డాడు. విష్ణు మూర్తి నవ్వి " గరుడా! గర్వము మంచిది కాదు బుద్ధిగా ఉండు " అని చెప్పి వెళ్ళి పోయాడు. ఇలా చెప్పి కణ్వ మహర్షి ఈ సంగతి నారదునికి కూడా తెలుసునని అన్నాడు. కనుక సుయోధనా బలగర్వం పనికి రాదు. పాండవులతో ఇకనైనా సఖ్యంగా ఉండు అన్నాడు.

### నారద మహాముని

తరువాత నారదుడు " సుయోధనా! మనం ఎంత బలవంతులమైనా ఎదిరి బలం ఎక్కువై నప్పుడు మన బలం తక్కువే కదా ! ఎంతటి శక్తివంతుల కైనా ధర్మ మార్గాన పయినించి నపుడే అది బలం చేకూరుస్తుంది. శక్తివంతుడైనా అహంకారం బలహీన

పరుస్తుంది. ఏది ఏమైనా నేను అనుకున్నది చేస్తాను అంటే గాలవుడికి కలిగిన ఆపదలే ఎదురౌఉతాయి. గాలవుడు అనే ముని కుమారుడు విశ్వామిత్రుని వద్ద విద్యను అభ్యసించాడు. విధ్యాభ్యసము పూర్తి కాగానే గురుదక్షిణ ఇస్తానని అన్నాడు. విశ్వా మిత్రుడు వద్దు అన్నాడు, గాలవుడు అంగీకరించక మూర్ఖంగా గురుదక్షిణ అడగాలి అని పట్టుపట్టాడు. విశ్వామిత్రుడు కోపంచి ఒక చెవి మాత్రం నల్లగా ఉన్న తెల్లని గుర్రములు ఎనిమిది వందలు సమర్పించు కొమ్మని చెప్పాడు. గాలవుడు అందుకు అంగీకరించి అశ్వములను వెతుకుతూ బయలు దేరాడు. కాన్ని అతనికి ఎక్కడ వెతికినా అలాంటి గుర్రాలు దొరక లేదు. గాలవుడు నిద్రాహారాలు మాని గుర్రాల కొరకు వెదకడం మొదలు పెట్టాడు. మార్గ మధ్యంలో అతడు తన చిన్న నాటి నేస్తం అయిన గరుత్మంతుని కలిసాడు. గరుత్మంతుడు గాలవుని సమస్య తెలుసు కుని అతడిని వీపు మీద ఎక్కించు కుని యయాతి అనే రాజు వద్దకు తీసుకు వెళ్ళాడు. గాలవుని కోరిక విన్న యయాతి తన వద్ద అలాంటి గుర్రలు లేవని తన కుమార్తె మాధవిని అతనికి ఇచ్చి వివాహం చేసాడు. మాధవితో సహా గాలవుడు గుర్రాలను వెదకడం మొదలు పెట్టాడు. అలా అతడు గుర్రాల కొరకు ఇక్ష్వాకు మహారాజు వద్దకు వెళ్ళాడు. ఇక్ష్వాకు మహారాజు వద్ద అలాంటి గుర్రాలు రెండు వందలు ఉన్నాయి. సంతానం కొరకు పరితపిస్తున్న ఇక్ష్వాకు హయములను ఇచ్చి బదులుగా ఒక సంతానం కలిగే వరకు మాధవిని తన వద్ద ఉంచమని ఒప్పందం కుదుర్చుకున్నాడు. ఇక్ష్వాకు మాధవి ద్వారా వసుమనస్సుడు అనేకుమారుని పొందిన తరువాత మాధవిని గాలవునికి ఇచ్చాడు. ఇదేవిధంగా మిగిలిన హయములను సమకూర్చుకొమ్మని చెప్పి గరుత్మంతుడు వెళ్ళాడు. గాలవుడు కాశీరాజు దివోదాసుకు మాధవిని ఇచ్చి రెండు వందల గుర్రాలను తీసుకున్నాడు. మాధవి వలన దివోదాసుకు ప్రత్యర్దనుడు అనే కుమారుడు కలిగాడు. తరవాత గాలవుడు మాధవిని భోజ పురాధీశుడు ఔశీనరునికి ఇచ్చి మరొక రెండు వందల గుర్రాలను పొందాడు. ఔశీనరుడికి మాధవి వలన శిబి అనే కుమారుడు జన్మించాడు. అయినా మాధవి కన్యాత్వం చెడలేదు. మిగిలిన గుర్రాల కొరకు గాలవుడు వెదుకుచుండగా గరుత్మంతుడు వచ్చి గాలవునితో " గాలవా ! ఇలాంటి గుర్రాలు ప్రపంచంలో ఇక లేవు. ఈ ఆరు వందల గుర్రాలను నీ గురువు గారికి ఇచ్చి రెండు వందల గుర్రాలకు బదులు మాధవిని అతనికి ఇమ్ము " అని చెప్పాడు. అందరూ విశ్వామిత్రుని వద్దకు వెళ్ళాడు. గరుత్మంతుడు " అయ్యా ! గాలవుడు పసివాడు అతనిని కరుణించి ఈ ఆరువందల గుర్రాలను తీసుకుని మాధవిని మిగిలిన రెండు వందల గుర్రాలకు బదులు స్వీకరించండి అన్నాడు. విశ్వామిత్రుడు అందుకు అంగీకరించి ఆమె ద్వారా అష్టకుడు అనే కుమారుని పొంది తిరిగి మాధవిని గాలవునికి ఇచ్చాడు. కనుక గాలవుని మాదిరి మూర్ఖుడిలా ప్రవర్తించ వద్దు. గురు దక్షిణ వద్దు అన్నప్పుడు విజ్ఞతతో ఊరక ఉంటే ఇంత అవస్థలు ఉండేవి కాదు కదా ! దురంహంకారం వదిలి పాండవులతో మైత్రి చేసుకుని కురువంశ వినాశనాన్ని ఆపు. శ్రీకృష్ణుని మాట విను " అన్నాడు. మునీశ్వరుల మాటలు పట్టించుకోని సుయోధనుడు " మునీశ్వరులారా! బ్రహ్మ దేవుడు ఎలా రాస్తే అలా జరుగుతుంది. ఇక మీరు మాటలు చాలించండి " అన్నాడు.

## శ్రీకృష్ణుని హితవు

ఆ మాటలు విన్న దృతరాష్ట్రుడు " మునీశ్వరులారా! మీ మాటలు నా కుమారుడు విని ఉంటే మంచిది వనక పోతే నేను చేసేది ఏమీ లేదు కదా ! కృష్ణా ! ఇహమూ పరమూ కలిగే విధంగా నీవు చెప్పావు కాని నీవు చెప్పినది చేసే మార్గం నాకు కనిపించ లేదు. నా కుమారుడు మూఢుడు అతనిని నువ్వు మన బంధుత్వం పురస్కరించుకుని శాంతింప చెయ్యి " అన్నాడు. కృష్ణుడు " కుమారా సుయోధనా ! మంచి వంశంలో పుట్టిన నీవు ఈ దురాగతాలకు పాల్పడటం ఏమిటి. నీ వంటి మహారాజుకు ఇది తగునా ! అల్పుల మాటలు నమ్మి ఆపదలు కొని తెచ్చుకోవద్దు. శకుని, కర్ణుని మాటలు నిన్ను పెడదారిన పెడతాయి. నీ బంధు మిత్రులు, కుమారులు కూడా చెడు మార్గాన పడకుండా పాండవులతో సంధి చేసుకో. పాండవులు నీ పై ఎన్నడూ శత్రుత్వం వహించ లేదు అత్యంత పరాక్రమ వంతులైన వారిని వదిలి అల్పులను ఆశ్రయించి కుల వినాశనం చేయకు. మీరు పాండవులతో సంధి చేస్తే మిగిలిన రాజులు మీకు సామంతులు ఔతారు. మీ ఇరువురి నడుమ కయ్యాలు పెట్టిన రాజులు పాండవులకు ఎందునా సాటిరారు. అర్జునినితో సాటిగా యుద్ధం చేయగల వాడు ఒక్కడు నీ చెంత ఉన్నా యుద్ధం చేయ తగును. లేకున్న జన నష్టం తప్పదు. ఆ నాడు అర్జునుడు నిన్ను ససైన్యంతో ఓడించి గోవులను తోలుకు వెళ్ళ లేదా ! ఈ రోజు అర్జునినికి తోడుగా నేను సారధ్యం చేస్తుండగా అతనిని గెలవడం ఎవరి తరం. అనవసరంగా యుద్ధానికి పాల్పడి నీ బంధు, మిత్ర, సోదర, కుమారులతో మాడి మసై పోయి కుల నాశకుడివి అన్న పేరు తెచ్చుకోకు. నీ తండ్రి సింహాసనంపై కూర్చుంటే నీవు యువరాజువై పాండు పుత్రుల స్నేహంతో రాజ్యం వహిస్తుంటే ఎలా ఉంటుంది. పాండవుల సంధి హస్తాన్ని నిరాకరించి రానున్న లక్ష్మిని నిరాకరించకు " అన్నాడు.

## భీష్మద్రోణుల హితవు

భీష్ముడు " సుయోధనా ! నీ తండ్రి మాటలు ప్రశాంతంగా విను . మనవంశం పావనం చేయడానికి శ్రీకృష్ణుడు మంచి మాటలు చెప్పాడు. ఆయన మాటలు వినక నీ తండ్రి కీర్తిని రాజ్యాన్ని ఎందుకు అపకీర్తి పాలు చేస్తావు. కృష్ణార్జునలతో విరోధం కేవలం నీ ఒక్కడికే యావత్ప్రపంచానికే వినాశనం. ద్రోణుడు లేచి " సుయోధనా ! మేము నీ మేలు కోరు తున్నాము. శ్రీకృష్ణుని మాటలు

వింటే నీకు మేలు కలుగు తుంది. నీ సిరి సంపదలు నిలిస్తాయి లేకున్న లేదు అంటే నేను చెప్పేది " అన్నాడు. దృతరాష్ట్రుడు " కుమారా ! పెద్దలు గురువుల మాటలు విని నీవు శ్రీకృష్ణుని వెంట వెళ్ళి మీ అన్న ధర్మరాజును కలుసుకో, నీకు మేలు కలుగు తుంది " అన్నాడు. ఆ మాటలు విన్న భీష్మ ద్రోణులు " అవును సుయోధనా ! శ్రీకృష్ణుని సారధ్యంలో అర్జునుడు యుద్ధరంగంలో అడిగిడక మునుపే కౌరవ వంశాన్ని కాపాడు. ధర్మజుని ముందు నిలబడితే అతడు నిన్ను గాఢంగా కౌగలించుకుంటాడు. భీముడు, నీవు ఒకరిని ఒకరు ఆలింగనం చేసుకోడి. అర్జున, నకుల, సహదేవులు నమస్కారం అందుకుని ఆదరించు. మీ సఖ్యత చూచి లోకం హర్షిస్తుంది. మీ కొరకు యుద్ధం చేయడానికి వచ్చిన రాజులు మీ అన్యోతకు ఆనందిస్తూ వారి రాజ్యాలకు వెళుతుంటే లోకం హర్షిస్తుంది. కురువంశం వర్ధిల్లుతుంది " అన్నారు.

## సుయోధనుడు తనను తాను సమర్ధించుకొనుట

ఈ మాటలు సావధానంగా విన్న సుయోధనుడు " కృష్ణా ! తాత భీష్ముడు, గురువు ద్రోణుడు , మా తండ్రి దృతరాష్ట్రుడు నన్ను ఎప్పుడూ నిందిస్తుంటారు. నువ్వు కూడా అలాగే న్యాయం ఆలోచించక నన్ను నిందిస్తే నేనేమి చేసేది. మేము ద్రౌపదిని అవమానించాము, పాండవులను అరణ్యాలకు పంపాము అని మా మీద అకారణ వైరం పెంచుకుని మమ్మల్ని చంపాలని చూస్తున్నారు. కృష్ణా ! న్యాయంగా ఆలోచిస్తే నా తప్పు ఏమి ఉంది ధర్మరాజు జూదరి. జూదం ఆడతానని శకుని వెంట పడి జూదం ఆడి రాజ్యం మొత్తం పోగొట్టు కున్నాడు. అంతటితో ఊరుకొనక మరలా పందెం ఒడ్డి ఓడాడు. ఏమి చేసినా తన ఇష్టానికి చేసాడు కాని మేమేమి బలవంతం చేయ లేదు. అతడు చేసిన తప్పలకు నేను కారణం ఎలా ఔతాను? ఇప్పుడు మత్స్యరాజును పాంచాల రాజును తీసుకుని మా పైన యుద్ధానికి వస్తున్నాడు. మేమెప్పుడైనా ఇలాంటి అఘాయుత్యానికి పాల్పడ్డామా? కృష్ణా క్షత్రియ ధర్మం ప్రకారం యుద్ధంలో మరణిస్తే వీరుడన్న పేరే కాక వీర స్వర్గం లభిస్తుంది. క్షత్రియ ధర్మం విడిచి నేను దేవేంద్రుని ముందు కూడా మోకరిల్లను చిన్నప్పుడు మా తండ్రిగారికి తెలియక రాజ్యం పంచి ఇచ్చాడు. ఇప్పుడు నా శక్తి సామర్ధ్యాలు తెలియక అలా చేస్తే నేను ఊరక ఉంటానా! నేను సూది మొన మోపినంత రాజ్యం కూడా వారికి ఇవ్వను. యుద్ధంలో జయించిన వారు రాజ్య పాలన చేస్తారు ఇదే నా నిశ్చయం " అన్నాడు.

## శ్రీకృష్ణుడు సుయోధనుని దుష్కృత్యములు ఎత్తి చూపుట

సుయోధనుని మాటలకు కృష్ణుడికి కోపం వచ్చినా తమాయించు కుని నవ్వుతూ " సుయోధనా ! నువ్వు చెప్పింది తధ్యం. రేపే యుద్ధం వస్తుంది అందులో నువ్వు నేల కూలడం తధ్యం. ఏమీ నువ్వు తప్పే చేయలేదా ! నీవు పాండవులకు కీడు చేయనిది ఎప్పుడో చెప్పు. వారు పుట్టినది మొదలు జన్మవైరం సాగించ లేదా? భీమ సేనుని బలం సహించ లేని నువ్వు అతడిని కాళ్ళు చేతులు కట్టి నీళ్ళలో పడవేయ లేదా ! కాలకూట విషం పెట్టి భీముని చంపాలని చూడ లేదా ! పెను బాముల చేత కరిపించినది నువ్వు కాదా ! ధర్మరాజును యువరాజుని చేసినందుకే కదా ! నీ చిన తండ్రి భార్య తల్లితో సమాన మైన కుంతిని సపుత్ర సమేతంగా లక్క ఇంట్లో పెట్టి చంపాలని అనుకున్నది ! పాండవుల ధర్మ నిరతి, సత్య సంధత వారిని కాపాడింది. రాజసూయ యాగానికి పిలిచి సత్కరించిన పాపానికి వారు పరాక్రమంతో సాధించు కున్న రాజ్యాన్ని కూడా జూదానికి పిలిపించి నీ తండ్రి అనుమతితో కాజేయ లేదా ! అన్నదమ్ములతో జూదం ఆడి రాజ్యాన్ని కాజేసింది చాలక కుల సతి ద్రౌపదిని నిండు సభలో చీరలు ఊడదీసి అనరాని మాటలు అని అవమానించిది నువ్వు కాదా ! ఆ నాడు నువ్వు, కర్ణుడు, దుశ్శాసనుడి మాటలు సభలో చెప్ప దగినవేనా ! ప్రజల కళ్ళ ముందు ద్రౌపదిని కులసతిని అవమానించింది చాలక నేనేమి నేరం చేసానని అడగటానికి నీకే చెల్లింది. ఇంతా చేసి పాండవులు నీ పై కయ్యానికి కాలు దువ్వుతారని అంటావా ! నీ తండ్రి, తాత, గురువులు చెప్పేది పెడ చెవిన పెట్టావు. నీకూ పాండవులకు పొత్తు కుదరదని తెలిసి కూడా కుల వనాశనం ఆపాలని శాంతి కాముకడనై ఇంత దూరం చెప్తున్నాను. సంధి చేసుకో బాగు పడతావు " అన్నాడు.

## సుయోధనుడు సభనుండి నిష్క్రమించుట

శ్రీకృష్ణుని మాటలకు సుయోధనునికి కోపం వచ్చింది. అది చూసిన దుశ్శాసనుడు " అన్నయ్యా ! మన తండ్రి , తాత, గురువు నీకు చెప్పే విధం ఇది కాదు. నిన్ను వీళ్ళు ఎలా అయినా సంధికి ఒప్పుకునేలా చేస్తారు. కనుక ఇక్కడ ఉండటం మంచిది కాదు " అన్నాడు. అది విని సుయోధనుడు సభా మర్యాదను లెక్క చేయక అక్కడి నుండి నిష్క్రమించాడు. అతని వెంట అతని సోదరులు, శకుని, కర్ణుడు, అతని మిత్ర రాజులు అందరూ కలసి వెళ్ళి గుంపుగా మంతనాలు చేయడం ప్రారంభించారు. అది చూసిన భీష్ముడు " ఏమిటి వీడు ఇలా వెళ్ళాడు మతి కాని చలించ లేదు కదా! వీడు మదము, లోభము, మోహము మాత్సర్యములతో కొట్టుకుంటున్నాడు. వాడి వెంట వీరంతా వెళ్ళారు. అందరూ కలసి ఏమి చేస్తారో " అనుకుంటూ శ్రీకృష్ణుని వద్దకు వచ్చి " కృష్ణా ! వీరందరికి కాలం మూడి నట్లుంది, లేకుంటే ఇలా ప్రవర్తిస్తారా ! " అన్నాడు. శ్రీకృష్ణుడు "

సభికులను చూసి " చూసారా ! ఈ సుయోధనుడు ఎంత గర్విష్ఠి. వంశగౌరవం కాపాడటానికి ఇలాంటి వారిని విడిచిపెడితే నష్టం లేదు. కంసుడు ఇలాగే వంశ ప్రతిష్టను నాశనం చేస్తుంటే నా బంధువులు నాతో చెప్పుకున్నారు. నేను ఆ దుష్టుని చంపి వంశ ప్రతిష్టను నిలిపి అతని తండ్రి ఉగ్రసేనునికి పట్టం కట్టాను. మీరు కూడా అలా చేయటం మంచిది. దుర్యోధనుడు పీడ విరగడ అయితే కురు వంశం వర్ధిల్లుతుంది. కురు పాండవులు కలిసి జీవించే అవకాశం దొరుకుతుంది " అన్నాడు.

## దృతరాష్ట్రుడు గాంధారిని పిలిపించుట


ధుర్యోధనుడిని కోపగించుకుంటున్న గాంధారి

శ్రీకృష్ణుని మాటలు దృతరాష్ట్రుని నిశ్చేష్టుడుని చేసింది వెంటనే విదురుని పిలిచి " విదురా ! నీవు వెంటనే గాంధారిని పిలుచుకురా. కనీసం తల్లి మాట అయినా వింటాడేమో ! " అన్నాడు. విదురుడు వెంటనే వెళ్ళి గాంధారిని తీసుకుని వచ్చాడు. దృతరాష్ట్రుడు " గాంధారి! నీ కుమారుడు గర్వంతో సభను విడిచి వెళ్ళాడు. ఇంతంటి దుర్మార్గుడు ఎక్కడైనా ఉంటాడా ! నీ వైనా వీడిని శాంతిప చెయ్యి. అప్పుడే ఈ కురువంశం బతికి ఉంటుంది " అని అన్నాడు. గాంధారి " మహారాజా ! నీ కుమారుడు అవినీతి పరుడని తెలిసి అతడిని నీవు సమర్ధిస్తావు. నీవు పాండవులకు అర్ధరాజ్యం ఇస్తే నిన్ను కాదనే వారు ఎవరు " అని పలికి విదురునితో " నేను చెప్పానని సుయోధనుని సభకు తీసుకు రండి " అన్నది. సుయోధనుడు ఒక్కడే వచ్చి సభలో కూర్చున్నాడు. మిగిలిన వారు అక్కడే నిలబడ్డారు. గాంధారి కూడా తనకు తోచిన విధంగా ధర్మం, నీతి, పాండవులతో చుట్టరికం, వారి బ్రతుకు తెరువు, వారి శక్తి యుక్తులు వివరించి సుయోధనుని బిజ్జగించి ఆ పై ఆగ్రహించి మాట్లాడింది. కాని సుయోధనుడు ఆమెను లక్ష్యపెట్ట లేదు. మళ్ళీ వెళ్ళి మంతనాలు జరుపు తున్నాడు. " శ్రీకృష్ణుని తలపు మంచిది కాదు. భీష్ముని, ద్రోణుని తన వశం చేసుకుని మన మీద వత్తిడి తెస్తున్నాడు. తను కంసుని చంపిన విషయం చెప్తున్నాడు. ఇతడిని పట్టి బంధిస్తే కాని పాండవుల గర్వం అణగదు. కృష్ణుడు లేక పోతే పాండవులు కోరలు తీసిన పాము కనుక వారిని జయించడం సులువు " అన్నాడు. ఇదంతా చూస్తున్న సాత్యకి కృతవర్మను పిలిచి కృతవర్మా! మన సైన్యాన్ని సిద్ధం చేసి నువ్వు వాకిలిలో నిలువు ఇక్కడ విషయం నేను చూసుకుంటాను " అని కృష్ణుని అనుమతి తీసుకుని భీష్మ, ద్రోణులతో " సుయోధ నాదులు కృష్ణుని బంధించాలని చూస్తున్నారు. అతడిని పట్టుకోవడం అంటే అగ్నిని మూట కట్టడమే ఔతుంది " అన్నాడు. ఆ మాటలు విన్న విదురుడు " దృతరాష్ట్రుని చూసి " మహారాజా! నీ కుమారులు శ్రీకృష్ణుని బంధించ ప్రయత్నిస్తున్నారు. మాడి మసై పోతారు జాగ్రత్త " అన్నాడు. శ్రీకృష్ణుడు " మహారాజా ! కౌరవులు ఇలా చేయడం తగునా ! నాకు అనుజ్ఞ ఇవ్వండి నేను వారికి బుద్ధి చెప్పి వెళ్ళిపోతాను " అన్నాడు. దృతరాష్ట్రుడు వెంటనే నీవు పోయి సుయోధనుని నా దగ్గరకు తీసుకురా " అన్నాడు. విదురుడు వెళ్ళి సుయోధనుని తీసుకు వచ్చాడు. దృతరాష్ట్రుడు " సుయోధనా ! ఏమిటీ దుర్బుద్ధి శ్రీకృష్ణుని పట్టి బంధించాలని చూస్తున్నావు మీరంతా నాశనం ఔతారు. నేనేమి చేయలేను " అన్నాడు. శ్రీకృష్ణుడు " సుయోధనా ! నేను ఒక్కడిని అని నన్ను బంధించాలని చూస్తావా ! నేను ఎవరో చూస్తావా ! " అని ఒక్క చిరునవ్వు నవ్వాడు.

## విశ్వరూప సందర్శనము

అలా నవ్వగానే శ్రీకృష్ణుని నుదుట బ్రహ్మ , వక్షస్థలంలో విరూపాక్షుడు, ముఖంలో అగ్ని, పార్శ్యంలో ఇంద్రుడు, యముడు, వరుణుడు, కుబేరుడు, ఆదిత్యుడు, మరుత్తులు, విశ్వదేవతలు, అశ్వినిలు ఉద్భవించారు. బాహువుల నుండి బలరాముడు , అర్జునుడు భుజముల నుండి ధర్మరాజు, భీముడు, నకుల, సహదేవులు , యదు, వృష్టి, అంధక, భోజ వీరులు ఉద్భవించారు. శంఖం, చక్రము, గధ, ఖడ్గం మొదలగు ఆయుధములు చేతులలో వచ్చి చేరాయి. నేత్రములు, చెవులు, ముక్కుల నుండి ధూమముతో కూడిన మంటలు లేచాయి. రోమ కూపాల నుండి సూర్య కాంతులు వెదజల్లు తున్నాయి. ఆ ప్రకారం శ్రీకృష్ణుని చూడ శక్యం కాక ఉన్నది. అందరూ భయంతో కళ్ళు మూసుకున్నారు. శ్రీకృష్ణుడు అక్కడ ఉన్న మునులకు, భీష్మాదులకు దివ్య దృష్టి ప్రసాదించారు. దేవతలు, సిద్ధులు, సాధ్యులు, విధ్యాధరులు జయ జయ ధ్వానాలు చేసారు. ఆ కలకలం విన్న దృతరాష్ట్రుడు అది దేవ దేవుని విశ్వరూపం అని గ్రహించి " వాసు దేవా! నన్ను అనుగ్రహించి నిన్ను దర్శించే భాగ్యం ప్రసాదించు " అన్నాడు. శ్రీకృష్ణుడు దృతరాష్ట్రునికి దృష్టి ప్రసాదించాడు. దృతరాష్ట్రుడు కనులారా విశ్వరూపం చూసి " దేవా! నీ దివ్య మంగళ రూపం చూసిన ఈ కళ్ళతో ఇతరము చూడ లేను. నన్ను తిరిగి అంధుడిని


కురుసభలో విశ్వరూప సందర్శనము

చెయ్యమని ప్రార్ధించాడు. శ్రీకృష్ణుడు అందుకు అంగీకరించి తన విశ్వరూపాన్ని ఉపసంహరించి సాత్యకి, కృతవర్మలను తీసుకుని సభను విడిచి వెళ్ళాడు " అని వైశంపాయనుడు వివరించాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

### పర్వాలు

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

### పాత్రలు

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

### ఇతర విషయాలు

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

"http://te.wikipedia.org/w/index.php?title=ఉద్యోగ_పర్వము_తృతీయాశ్వాసము&oldid=760842" నుండి

# ఉద్యోగ పర్వము చతుర్థాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# చతుర్థాధ్యాయము

శ్రీకృష్ణుడు కురు సభనుండి వెలుపలికి వచ్చాడు. అతడిని కురు ప్రముఖులు వెంబడించారు. వెలుపల దారుకుడు రధంతో సహా వెలుపల ఉన్నాడు. శ్రీకృష్ణుడు మిగిలిన వారిని చూసి " మీరంతా ఉండండి ఇక నేను వెళతాను " అన్నాడు. దృతరాష్ట్రుడు " కృష్ణా ! కౌరవ పాండవులు కలసి జీవించ డానికి నేను చేయ వలసిన ప్రయత్నం చేసాను ఇందులో నా తప్పు ఏమీ లేదు అది నీవు తెలుసుకుంటే నాకు చాలు " అన్నాడు. శ్రీకృష్ణుడు " భీష్మ , ద్రోణ, కృప, బాహ్లికులను చూసి " సభలో జరిగినది అంతా మీరు కనులార చూసారు, చెవులార విన్నారు దృతరాష్ట్రుడు తన తప్పు ఏమి లేదు అంటున్నాడు. కనుక నాకు ఇక్కడ ఉండ వలసిన పని లేదు. నేను పోయి వచ్చెదను ధర్మ పుత్రునకు జరిగినది వివరించ వలెను కదా ! " అన్నాడు. అయినా కౌరవ ప్రముఖులు అతడిని వెంబడించారు.

## శ్రీకృష్ణుడు కుంతీదేవి మందిరానికి వెళ్ళుట

అంతా కుంతీదేవి మందిరానికి వెళ్ళారు. కుంతీదేవిని చూసి శ్రీకృష్ణుడు జరిగినది అంతా చెప్పాడు. కుంతీదేవి " కృష్ణా! కౌరవులు ఇన్నాళ్ళు బాగా తిని పొగరు పట్టి జరగబోయేది తెలియక ఉన్నారు. అర్జునిని గాండీవం నుండి వెలువడే బాణాగ్ని దహించేది చూసిన కాని వారికి బుద్ధి రాదు " అన్నాది. శ్రీకృష్ణుడు " అత్తా ! నేను పాండవుల వద్దకు వెళుతున్నాను వారికి చెప్ప వలసినది ఏదైనా ఉందా ! " అని అడిగాడు. కుంతీ దేవి " క్షత్రియులు పరాక్రమము నమ్మి జీవించ వలెను కాని ఇతర మార్గములు నిషిద్ధము అని చెప్పు. ఉత్తమ క్షత్రియ వంశజులు క్షత్రియ ధర్మాన్ని ఆశ్రయిస్తారు. బుద్ధి హీనులు దీనంగా జీవిస్తారు. నీ బావ మరుదులు సంధి ప్రయత్నాలు చేసారు. అది విఫలం కావడం మంచికే. క్షత్రియులకు వీరత్వమే ధర్మము తన పరాక్రమం చూపకున్న అర్జునుడు పలుచన కాడా! భీమునికి ఈ సంధి తగునా ! వారి మాటలు విని ఈ సంధికి నీవు రాతగునా ! పరమాత్ముడు ఈ సంధి విఫలం చేసి మంచి చేసాడు. ద్రౌపదికి నిండు సభలో జరిగిన అవమానం పాండవులు ఎలా మరచారు. ధర్మానికి తల ఒగ్గి అడవులకు వెళ్ళిన వారు ఈ అధర్మాన్ని సహించ తగునా న్యాయంగా తమకు రావలసిన రాజ్యాన్ని యుద్ధం చేసి తీసుకోవద్దా ! అధర్మ వర్తనులైన కౌరవులకు బుద్ధి చెప్పవలసిన బాధ్యత వారికి లేదా ! ఇది వారికి ఒకరు చెప్పవలసిన పని లేదు " అని పాండవులకు నా మాటగా చెప్పు. కృష్ణా నేను ఇక్కడ బాగా ఉన్నాను. పాండవులకు వీరులుగా బ్రతకమని చెప్పానని చెప్పు ఇక నీవు పోయి రా కృషా ! " అన్నది.

## శ్రీ కృష్ణుడు కర్ణుని జన్మ గురించి వివరించుట


కర్ణుని జన్మ గురించి వివరించుచున్న శ్రీ కృష్ణుడు

శ్రీకృష్ణుడు తనతో వచ్చిన వారిని ఇక ఉండమని చెప్పి కర్ణుని చూసి " కర్ణా ! రావయ్యా పొలిమేర వరకు నన్ను సాగనంపవా ! " అని తన చేతిని అందించి రధం ఎక్క మన్నాడు. శ్రీకృష్ణుని చేయి పట్టి రధం ఎక్కిన కర్ణుడు కృష్ణుని రధాన్ని అనుగమించాడు. దృతరాష్ట్రుడు తిరిగి తన కొలువు కూటముకు వెళ్ళాడు. అందరూ జరిగిన విషయములు చర్చిస్తూ భీష్ముడు, ద్రోణుడు " అదేమిటి కుంతీ అలా మాట్లాడింది. ఆమె మాటలు నాకు చాలా ఆశ్చర్యం కలిగించాయి. శ్రీకృష్ణుడు అలాగే మాట్లాడాడు. ఇక ధర్మరాజును పట్టడం మన తరం కాదు " అని సుయోధనుని చూసి " సుయోధనా ! ఇప్పటికీ మించినది ఏమి లేదు. నీవు వెంటనే వెళ్ళి ధర్మ పుత్రుని కలుసుకో . మార్గమధ్యంలో శ్రీకృష్ణుని కలుసుకో సమస్యను శాంతి యుతంగా పరిష్కరించు, సంధి వయసులో ఉన్న మాకు ఈ యుద్ధం ఏల తెచ్చెదవు . మేము చెప్పేది చెప్పాము ఇక నీ ఇష్టం " అని సభ విడిచి వెళ్ళారు. శ్రీకృష్ణుడు ఒక నిర్జన ప్రదేశంలో రధం ఆపి తమ మాటలు ఎవరూ విన లేదని ధృవ పరచుకుని " కర్ణా ! నీకు పెద్దల ఎడల గౌరవ మున్నది. నేను చెప్పేది సావధానంగా విను కుంతీ దేవి కన్యగా ఉన్నప్పుడు దుర్వాసుని మంత్ర మహిమ చేత నిన్ను కన్నది. నీవు కుంతీ పుత్రుడివి పాండవులలో అగ్రగణ్యుడివి ధర్మరాజుకు ఈ విషయం తెలిసిన నీకు సాష్టాంగ పడి నిన్ను కురు సామ్రాజ్యానికి పట్ట బద్రుడిని చేస్తాడు. నీవు చక్రవర్తిగా రధంలో వస్తుంటే ధర్మరాజు నీకు వింజామర వీస్తాడు, వాయు పుత్రుడు నీకు ఛత్రం పడతాడు, సవ్యసాచి అర్జునుడు నీ రధానికి సారధ్యం వహిస్తాడు. పాంచాల యాదవ రాజులు నీ వెంట ఉంటారు. అభిమన్యుడు మొదలైన వారు నీ వెంట వస్తారు. దేవేంద్ర వైభవం

పొందుతూ రాజ్యాన్ని పాలించు. మరొక విషయం ద్రౌపది తన ఐదుగురు భర్తలతో నిన్ను ఆరవ భర్తగా స్వీకరిస్తుంది " అన్నాడు. ఇది విని కర్ణుడు " కృష్ణా ! ఈ మాట నేను ఇది వరకే విన్నాను. కుంతీ దేవి దయా విహీన అయి నదిలో వదిలి వేసిన నన్ను ఒక సూతుడు దయతో పెంచి పెద్ద చేసాడు. అతని భార్య కూడా నన్ను ప్రేమతో చూసింది వారు తమ కుమారుల కన్నా మిన్నగా నన్ను చూసుకున్నారు. సూత కులాచార కర్మలన్నీ నాకు జరిపించారు. నీవే కదా ! నాకు పెద్దలంటే గౌరవం అని చెప్పావు. నా తల్లి తండ్రులకు నేను చేయ వలసిన విద్యుక్త కర్మలన్నీ నేను నిర్వహించాలి కదా ! అది విడిచి ఇప్పుడిలా రాజకుమారుడిని అని పాండవుల వద్దకు రావడం ధర్మమా ! ఒక సూతునిగా నాకు బంధు మిత్రులు ఉన్నారు. వారిని విడుచుట ధర్మమా ! సూతుడని చూడక చక్రవర్తి అయిన రారాజు నన్ను తన తమ్ముల కంటే అధికంగా చూసుకుని రాజుని చేసాడు. యుద్ధం ముంచుకొస్తున్న వేళ అతడిని ఎలా విడువ గలను. అర్జునినికి ధీటుగా నన్ను రారాజు తలస్తున్నాడు. అర్జునినితో తలపడక పాండవ పక్షాన చేరిన లోకులు నిందించరా ! కృష్ణా ఈ విషయం ఎవరికి చెప్పక నీ మనసులో దాచుకో ధర్మ పుత్రునికి ఈ విషయం తెలిసిన రాజ్యాధికారానికి ససేమిరా ఒప్పుకోడు. అంతటి ధర్మాత్ముడు రాజ్యం చేయాలి కాని నేను కాదు. ధర్మరాజు యుద్ధమనే యజ్ఞం చేస్తున్నాడు. మిగిలిన పాండవులు ఋత్విక్కులు నీవు ఉపద్రష్టవు. ఆ యజ్ఞంలో కౌరవులనే పశువులను సంహరించి హోమం చేస్తారు. ఆ ధర్మ యజ్ఞంలో పుణ్య భూమి అయిన కురుక్షేత్రంలో మేమంతా సద్గతులు పొందుతాము " అన్నాడు.

## కుంతీదేవి కర్ణుని కలుసుసు కొనుట

విదురుడు కుంతీ మందిరానికి వెళ్ళి ఆమెతో " అమ్మా కుంతీ దేవి ! కురు వంశం అంతరించే విధంగా కురు పాండవ యుద్ధం దాపురించింది. ఎవరూ శ్రీకృష్ణుని మాట మన్నించ లేదు. పాండవుల బలపరాక్రమాలు తెలిసీ అందునా అర్జునుని గాండీవ మహిమ తెలిసీ కౌరవులు ఈ యుద్ధానికి సిద్ధ పడ్డారు. ఏమి జరుగు తుందో ఏమో " అని ఆందోళన పడ్డాడు. కుంతీదేవి బదులు చెప్పలేదు విదురుడు తన మందిరానికి వెళ్ళాడు. కుంతీ దేవి మనసులో ఎంతో మధన పడింది. ఆమె " కేవలం రాజ్యం కోసం , సంపదల కోసం తమ వారిని చంపు కోవడం ధర్మమా? యుద్ధం చేయడం అంటే క్లేశం కొని తెచ్చుకోవడమే కాని ధు:ఖ రాహిత్యం కాదు. భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు మొదలైన మహావీరుల వీరావేశం చల్లార్చడం సామాన్యమా ! మిగిలిన వారికి యుద్ధంలో అంత ఉత్సాహం లేక పోయినా కర్ణుని మనసు యుద్ధోత్సాహం మరియు పగలతో రగిలి పోతుంది. కర్ణునికి తన జన్మ వృత్తాంతం చెప్పి పాండవుల పై ప్రేమ కలిగిస్తే కర్ణుడు యుద్ధం మానుకోవచ్చు " అనుకుంది. ఆ సమయంలో కర్ణుడు అనుష్టానం కొరకు గంగా తీరానికి వెళతాడని ఊహించి అతని కొరకు అక్కడకు వెళ్ళింది. కర్ణుడు అనుష్టానం పూర్తి చేసి అక్కడ కుంతీ దేవి కూర్చుని ఉండటం చూసి ఆమెకు తన గోత్రనామాలు చెప్పుకుని అభివాదం చేసాడు " అమ్మా కుంతీదేవి ! తమరు వచ్చిన కార్యం తెలుసుకొన వచ్చునా ! " అన్నాడు. కుంతీ దేవి " కుమారా ! అందరూ అనుకున్నట్లు నీవు సూత పుత్రుడివి కాదు. నేను కన్యగా కుంతి భోజుని ఇంట ఉండగా దుర్వాసుడిచ్చిన వర ప్రభావాన్ని పరిశీలించా లన్న నా చాపల్యం వలన మంత్ర ప్రభావంతో సూర్యుడు నాకు ప్రసాదించిన పుత్రుడివి . కనుక నేటి ధర్మం ప్రకారం నీవు పాండు పుత్రుడివి. క్షత్రియుడివి అయిన నీవు మరొకరికి సేవ చేయవలసిన అవసరం లేదు కౌరవ , పాండవులలో ప్రధముడివి నువ్వే చక్రవర్తివి. ఇక రాధేయుడిగా ఉండవలసిన అవసరం నీకు లేదు. చక్రవర్తివై ఈ లోకాన్ని పాలిస్తూ వైభవాన్ని అనుభవించు " అన్నాది. ఆ సమయంలో సూర్య బింబం నుండి " ఇది నిజం ఆమె చెప్పినట్లు నడుచుకో " అన్న వాణి వినిపించింది. కర్ణుడు " అమ్మా ! నీవు చెప్పినది నీవు చెప్పింది నిజమే కాని క్షత్రియో చితమైన సంస్కారములకు నన్ను దూరం చేసి ఇప్పుడు నన్ను క్షత్రియునిగా నీ కుమారుని చేసి రమ్మనడం భావ్యమా ! నా జన్మ నిందించ తగినది కాదు నేను సూర్య పుత్రుడను ఇన్ని రోజులు గోప్యంగా ఉంచిన విషయం ఇప్పుడు లోకానికి తెలియ చేసి నేను సూర్య పుత్రుడిని కుంతీదేవికి జన్మించానని చెప్పుకుంటూ పాండవ పక్షం చేరితే ఏమి బాగుంటుంది. పరాక్రమంతో వెలుగుతున్న అర్జునినికి భయపడి పాండవ పక్షంలో చేరానని నలుగురూ నన్నూ నా పరాక్రమాన్ని శకించి నిందించరా ! అమ్మా ! నేను సుయోధనుని వలన రాజుని అయ్యాను, అతని వలన పేరు ప్రతిష్టలు గడించాను అతడు నన్ను నమ్ముకుని ఈ యుద్ధానికి సిద్ధం అయ్యాడు. అతని ఉప్పు తింటున్న నేను అతడిని విడవటం న్యాయమా ! సుయోధనునికి ద్రోహం చేస్తే సాటి రాజులు నన్ను నిందించరా ! అమ్మా! నేను సుయోధనిని తరఫున నీ కుమారులను ఎదుర్కోవడం నిశ్చయం. అయినా నీవు అడిగినందుకు ఒక మాట ఇస్తున్నాను. ధర్మరాజు, భీముడు, నకులుడు, సహదేవుడు ఎదురుపడినా వారిని నేను చంపను అర్జునిని మాత్రం చంపక వదలను అర్జునిని చేతిలో చచ్చినా లేక అతడిని చంపినా కీర్తి నిశ్చయం సుయోధనుడు నన్ను అర్జునిని కొరకు మాతమే చేరదేసాడు అతడిని నమ్మకాన్ని నేను వమ్ము చేయ లేను . అర్జునుడు లేకున్న నాతో అయిదుగురు లేక నేను లేకున్న అర్జునినితో అయిదుగురు ఎలా అయినా నీకు పుత్రులు అయిదుగురే " అన్నాడు. కుంతీ దేవి " విధి ఎలా ఉంటే అలా జరుగుతుంది. నీవు అర్జునిని మాత్రం చంపడానికి నేను అంగీకరిస్తున్నాను. మిగిలిన వారిని విడిచి పెట్టు " అన్నది. అందుకు కర్ణుడు అంగీకరంచాడు.

## కృష్ణుడు ఉపప్లావ్యం చేరుట

ఉపప్లావ్యం చేరిన శ్రీకృష్ణుని పాండవులు ఎదురేగి సాదరంగా ఆహ్వానించారు. శ్రీకృష్ణుడు " ధర్మరాజా ! దుర్యోధనాదులకు కళ్ళు మూసుకు పోయాయి. వారు నా మాట విన లేదు యుద్ధం తప్పదు " అని అక్కడ జరిగిన విషయములు అన్నీ చెప్పి తన మందిరానికి వెళ్ళాడు. ఆ రోజు రాత్రి పాండవుల వద్దకు చేరిన శ్రీకృష్ణుడు " ధర్మరాజా ! నేను స్నేహపూర్వకంగా ఎన్నో మాటలు చెప్పాను. కాని నా మాటలు సుయోధనుడు పెడచెవిన పెట్టాడు. ఏవేవో చెప్పి నన్ను హేళన చేసాడు. అవన్నీ చెప్పి ప్రయోజనం లేదు " అన్నాడు. ధర్మరాజు " కృష్ణా ! సుయోధనుడు నిన్ను హేళన చేస్తుంటే భీష్ముడు, ద్రోణుడు వారించ లేదా? " అన్నాడు. శ్రీకృష్ణుడు " దృతరాష్టుడు తన శయశక్తులా ప్రయత్నించాడు. గాంధారిని పిలిపించి చెప్పించాడు. దుర్యోధనుడు పెడచెవిన పెట్టాడు. నేను కూడా కురు వంశం , శంతన మహారాజు ఖ్యాతి గురించి వివరించాను. మీ తండ్రి, దృతరాష్టుని పుట్టుక గురించి , మీ తండ్రి గారి రాజ్య విస్తరణ నీవు చేసిన రాజ్యసూయ యాగం , మాయా జూదం మిమ్మ్ము అధర్మంగా అడవుల పాలు చెయ్యడం గురించి చెప్పాను. మీకు చేరవలసిన రాజ్యభాగం మీకు ఇవ్వకున్న యుద్ధం తప్పదని హెచ్చరించాను. సభకు విచ్చేసిన మునులు కౌరవ ప్రముఖులు కూడా అనేక విధముల చెప్పారు అన్నీ పెడచెవిన పెట్టిన దుర్యోధనుడు సభా మర్యాదను లెక్క చేయక సభను వదలి వెళ్ళాడు. గాంధారి వచ్చి సుయోధనుని సభకు రప్పించి అనేక విధముల చెప్పింది కాని అన్నీ నిష్ఫలం అయ్యాయి. నేను కూడా కోపం తెచ్చుకున్నాను. కాని తిరిగి శాంతం వహించి పరి పరి విధముల భోదించాను. సుయోధనుడు నన్ను బంధించ చూసాడు. నేను నా మాయను ప్రదర్శించి దానిని నివారించాను. నా సంధి ప్రయత్నం విఫలం అయింది ఇక యుద్ధం అని వార్యం " అన్నాడు.

## పాండవుల యుద్ధ సన్నాహ నిర్ణయం


పాండవ సేనాని ధృష్టధ్యుమ్నుడు

ధర్మరాజు శ్రీకృష్ణుడు చెప్పినది తమ్ములకు వివరించి యుద్ధ సన్నాహాలకు దిగమని చెప్పాడు. కృష్ణుని చూసి " కృష్ణా ! మా గురించి పాండవుల గురించి తెలిసిన నీవే కర్తవ్యాన్ని బోధించు " అన్నాడు. శ్రీకృష్ణుడు " ప్రస్తుతం యుద్ధమే తక్షణ కర్తవ్యం. మీ తల్లి గారు మిమ్ము మీ పరాక్రమాలు ప్రదర్శించి రాజ్యాన్ని పొందమని ఆదేశించింది " అన్నాడు. ధర్మరాజు " కృష్ణా ! బంధు, మిత్ర నాశనం అయిన యుద్ధానికి నా మనస్సింకా అంగీకరించుట లేదు వేరు మార్గం అన్వేషించుట మంచిది కదా౹! " అన్నాడు. అర్జునుడు " అన్నా! ఏది హితమో ఏది ధర్మమో మనకంటే కృష్ణుడే ఎరిగిన వాడు. మన తల్లి గారి ఆదేశం అదే ఇక మనకు సందేహం ఎందుకు " అన్నాడు. ధర్మరాజు " అన్నా ! అఖిల ధర్మజ్ఞాని శ్రీకృష్ణుడు చెప్పిన మాటకు తిరుగు లేదు యుద్ధ సన్నాహాలు చెయ్యక తప్పదు. మనకున్నది ఏడు అక్షౌహినుల సైన్యం. దానిని సమర్ధంగా నిర్వహించడానికి భీష్మునికి నిగరైన సైన్యాధ్యక్ష్యుని నిర్ణయించి అభిషిక్తుని చెయ్యడం మన కర్తవ్యం. అటువంటి వీరుడెవరో నాకు చెప్పండి " అని తమ్ములను ఉద్దేశించి అన్నాడు. సహదేవుడు " అధిక బాహుబలం కలవాడు పుత్రులు, పౌత్రులు , సోదరులు కలవాడు అయిన మత్స్య దేశాధిపతి , విరాటుడు మనకు తగిన సైన్యాధ్యక్షుడు " అని సహదేవుడు అన్నాడు. ఆ తరవాత నకులుడు లేచి " అన్నయ్యా ! ఎక్కువ బలగము బాహుబలం కలిగిన ద్రుపద మహా రాజు మనకు తగిన సైన్యాధ్యక్షుడు. అర్జునుడు లేచి " అన్నయ్యా ! కేవలం ద్రోణుని చంపుటకు అగ్ని కుండములోనుండి పుట్టిన వాడు, ధనుర్బాణములతో పుట్టిన వాడు, అత్యధిక బాహుబలం పరాక్రమం కల వాడు అయిన దృష్టద్యుమ్నుడు మనకు తగిన సైన్యాధ్యక్షుడు . అతను తప్ప భీష్ముని అడ్డుకుని నిలబడ గలవాడు వేరొకడు లేడు. అతని తమ్ముడు శిఖండి పరాక్రమ వంతుడు. భీష్ముని చంపటానికి పుట్టిన వాడు కనుక దృష్టద్యుమ్నుడు మన సైన్యాధ్యక్షుడు " అని పలికాడు . ధర్మరాజు " కృష్ణా ! నీవే చెప్పు సకలము తెలిసిన నీవే తగిన సైన్యాధ్యక్షుని నిర్ణయించి మన ఏడు అక్షౌహినుల సైన్యానినికి ఒక్కొక్క అక్షౌహినికి ఒక నాయకుని నిర్ణయింపుము " కృష్ణుని వేడుకున్నాడు. కృష్ణుడు " ధర్మజా ! అర్జునుడు చెప్పిన విధముగా దుష్టద్యుమ్నుడే మన సైన్యానికి తగిన నాయకుడు. అతడిని సర్వ సైన్యాధ్యక్షునిగా అభిషేకింపుము. అలాగే ద్రుపదుడిని, విరాటుని, సాత్యకి, జరాసంధుని కుమారుడైన సహదేవుడు, చేకితాసుడు, శిశుపాలుని కుమారుడు దుష్టకేతు, ద్రుపద కుమారుడైన శిఖండి మొదలైన ఏడుగురిని అక్షుహినీ నాయకులను చేద్దాము. ఇక నీ తమ్ములతో కలిసి యుద్ధానికి బయలు దేరుము " అన్నాడు.

## పాండవులు యుద్ధానికి బయలు దేరుట

కృష్ణుని మాట శిరసా వహించిన ధర్మరాజు మరునాడు సభలో యుద్ధ ప్రకటన చేసాడు. ముందుగా అనుకున్నట్లు

సైన్యాధ్యక్షులను నియమించి యుద్ధ భేరీలను మ్రోగించమని ఆజ్ఞాపించాడు. ముందుగా పాండవులు ద్రౌపది దగ్గరకు వెళ్ళి ఆమె వద్ద వీడ్కోలు తీసుకున్నారు. బ్రాహ్మణులను అర్చించి వారి దీవెనలను తీసుకున్నారు. కృష్ణుడు రథం ఎక్కి సారథి స్థానంలో కూర్చున్నాడు. గాండీవం, అక్షయ తుణీరాలతో అర్జునుడు రథం అధిరోహించాడు. అర్జునుడు పాంచజన్యము శ్రీకృష్ణుడు దేవదత్తం అనే శంఖాలను పూరించారు. కురుక్షేత్రానికి అంతా పెళ్ళికి వెళుతున్నట్లు బయలు దేరారు. దృష్టద్యుమ్నుడు ధర్మరాజుకు నమస్కరించి సైన్యాధ్యక్షుడుగా ముందుకు నడిచాడు. అతని వెంట ధర్మరాజు తమ్ములతో, యుద్ధమునకు వచ్చిన రాజులతో బయలు దేరాడు. వారి వెంట సమస్త సైన్యం , భటులు, పరిచారకులు నడిచారు. వారంతా కురుక్షేత్రానికి చేరి హిరణ్వతీ నదీ తీరాన ఒక చదునైన ప్రదేశంలో విడిది చేసారు.

## కౌరవ యుద్ధ సన్నాహం

వేగుల వారి వలన పాండవ సైన్యాల రాకను గురించి తెలుసుకున్న ధుర్యోధనుడు ఏమీ తెలియని వాడి వలె ప్రవర్తిస్తూ కురుసభలో " కృష్ణుడు తనకు అనుకూలంగా ప్రవర్తించ లేదని మన మీద కోపంతో పాండవులను రెచ్చగొట్టి యుద్ధానికి సన్నద్ధం చేసి దండయాత్రకు తీసుకు వస్తాడు. కనుక మనం కూడా యుద్ధం ప్రకటిస్తాము. అన్నాడు. మన సైన్యాలతో కురుక్షేత్రంలో విడిది చేద్దాం" అన్నాడు. ఆ పై దుశ్శాసనుడిని చూసి " నీవు, కర్ణుడు, శకుని యుద్ధానికి తగిన ఏర్పాట్లు చేయండి అని అజ్ఞాపించాడు. సుయోధనుని అజ్ఞను సారం యుద్ధం ప్రకటించ బడింది. మరునాడు సుయోధనుడు సభలో భీష్ముని, కర్ణుని, అశ్వథామను, బాహ్లికుని, శల్యుని, కృపాచార్యుని, భూరి శ్రవుని, శకునిని, కృతవర్మను, కాంభోజి రాజును, సైంధవుని తన పదకొండు అక్షౌహినులకు నాయకులుగా అభిషేకించి వారితో భీష్ముని వద్దకు వెళ్ళాడు. భీష్మునితో " పితామహా ! వీరంతా మన పదకొండు అక్షౌహినిల అధ్యక్షులు వివిధ దేశములకు చెందిన వీరిని ఒక తాటి మీద నడిపించ వలసిన బాధత మీ మీద ఉన్నది కనుక మీరు మా సర్వ సైన్యాలకు అధ్యక్షత వహించండి " అని ప్రార్ధించాడు. భీష్ముడు " సుయోధనా ! నాకు మీరు పాడవులు సమానమే నేను మీ వద్ద ఉన్నాను కనుక మీ తరఫున యుద్ధం చేస్తాను. నేను నీవు కోరినట్లు సర్వసైన్యాధ్యక్ష పదవి వహిస్తాను . నన్ను ఎదిరించగల వీరుడు అర్జునుడు మాత్రమే. నేను శత్రువులను అందరినీ సంహరిస్తాను కాని పాండు కుమారులను ఏమీ చేయను. వారు కూడా నన్నేమి చేయరు. కాని విధి నిర్ణయం ఎలా ఉంటే అదే జరుగుతుంది. కాని ముందు నేను యుద్ధం చేయాలా కర్ణుడు యుద్ధం చేయాలో నిర్ణయించు. అది తేలితేనే నేను సకల సైన్యాధిపత్యం వహిస్తాను " అన్నాడు. కర్ణుడు " ఈ ప్రస్థావన మళ్ళీ ఎందుకు. భీష్ముడు ఎప్పుడు పడి పోతాడో అప్పుడు నేను యుద్ధానికి వస్తాను అని ముందే చెప్పాను కదా " అన్నాడు. భీష్ముడు " సుయోధనా! అలాగే జరుగుతుంది లే " అన్నాడు. ద్రోణ, కృపాచార్య తదితరుల వద్ద అనుమతి తీసుకుని భీష్ముని సర్వసైన్యాధ్యక్షుని చేసాడు. తల్లి తండ్రుల వద్ద అనుమతి తీసుకుని సుయోధనుడు యుద్ధానికి బయలుదేరి కురుక్షేత్రానికి చేరి రమణీయమైన ప్రదేశంలో విడిది చేసాడు.

## బలరాముని వేదన

కురువంశంలో అనివార్యమైన యుద్ధానికి బలరాముని మనసు క్లేశం చెందింది. అతడు చాలా దు:ఖించాడు. అతడు ధర్మరాజు వద్దకు వచ్చాడు. ధర్మరాజు సోదర సమేతంగా బలరాముని సాదరంగా ఆహ్వానించాడు. బలరాముడు " కౌరవ పాండవులు అత్యంత క్రూరులై ఈ భూమిలో ఉన్న రాజులకు కీడు కలిగే యుద్ధం చేయ సమకట్టడం తగునా ! యుద్ధం నాకు సమ్మతం కాదు. కృష్ణునితో సంధి కుదర్చమని చెప్పాను అతడు నా మాటను లెక్క చేయక యుద్ధాన్ని సమకూర్చాడు. మాట్లాడటం చేతగాని వారిని మంచి మాటలతో ఒప్పించాలి కాని వారిని రెచ్చగొట్టి సంధి చెడగొట్టడం మంచి పనా. కృష్ణునికి పాడవులు కౌరవులూ సమానమే కాని అతడు అర్జునిని పట్ల అభిమానం పెంచుకుని పాండవులను ఒక చోట నిలువ నీయక వెంట వేసుకుని తిప్పుతున్నాడు. అయినా పాండవులకు జయం కౌరవులకు అపజయం తప్పదు. నేను ఈ యుద్ధం చూడలేను నా శిష్యులైన సుయోధన , భీములు ఒకరిని ఒకరు కొట్టు కుంటుంటే నేను ఎలా చూడగలను. కనుక నేను సరస్వతీ తీరానికి వెడుతున్నాను " అని కృష్ణుడు ధర్మరాజు సాగనంపగా తీర్ధ యాత్రకు బయలు దేరాడు .ఆ తరవాత కృష్ణుని బావమరిది కుండిన నగరాధీశుడైన రుక్మి ధర్మరాజును చూడవచ్చాడు. రుక్మి అర్జునిని చూసి " అర్జునా ! నీకు యుద్ధం చేయ భయమైన నాకు చెప్పు నేను యుద్ధం చేస్తాను నన్ను గెలిచే వీరుడు ఈ భూలోకంలో లేరు " అన్నాడు. అతని ప్రగల్భాలకు అర్జునుడు నవ్వి " రుక్మీ ! నేను గంధర్వులతో యుద్ధం



పాండవుల శిబిరములో బలరాముడు

చేయునప్పుడు , గోగ్రహణంలో పోరు సల్పినప్పుడూ తమరు ఎక్కడ ఉన్నారు ! నాకు నీ సాయం అక్కర లేదు. నీ సాయం ఎవరికి అవసరమో వారికి సాయం చెయ్యి అన్నాడు. నాకు యుద్ధం అంటే భయం కలిగి నిన్ను పిలిచి నపుడు కదా నీవు రావలసింది అప్పుడు నాకు సాయపడటానికి వీరంతా ఉన్నారు " అన్నాడు. రుక్మి సుయోధనుని వద్దకు పోయి అలాగే ప్రగల్భాలు పలుకగా అతడు కూడా రుక్మి సాయాన్ని నిరాకరించాడు. బలరాముడు, రుక్మి తప్ప మిగిలిన రాజులంతా యుద్ధంలో పాల్గొన్నారు.

## సంజయుడు దృతరాష్ట్రునికి యుద్ధాన్ని గురించి వివరించుట

దృతరాష్ట్రుడు సంజయుని పిలిచి " విధి ఎలా ఉంటే అదే జరుగుతుంది మార్చడం మన తరంకాదు కదా ! యుద్ధభూమిలో మరణించడం కంటే రాజులకు గౌరవం ఏమున్నది. యుద్ధభూమిలో ఏమి జరుగుతుందో వివరించు " అన్నాడు. అందుకు సంజయుడు " మహారాజా ! నీ కుమారుడు సుయోధనుడు దుశ్శాసన, కర్ణ, శకునులతో యోచించి శకుని కుమారుడైన ఉలూకుని ధర్మరాజు వద్దకు రాయభారం పంపాడు. ధర్మరాజు శ్రీకృష్ణ, ద్రుపద, విరాటాదులతో సభ కూర్చి ఉన్న సమయంలో చెప్పమని ఇలా పలికాడు. ఉలూకుడు దర్మరాజు వద్దకు వెళ్ళి " ధర్మరాజా ! నా మీద కోపం తెచ్చుకొనక సుయోధనుని మాటగా నేను పలుకుతున్న మాటలను సావధానంగా వినండి " అన్నాడు. ధర్మరాజు " ఉలూకా ! నీవు ఆ బుద్ధిమంతుడు చెప్పిన తులువ మాటలు నిర్భయంగా చెప్పవచ్చు " అన్నాడు.

### పాండవులకు సుయోధనుడు పంపిన హెచ్చరిక

ఉలూకుడు " ధర్మరాజా ! యుద్ధం చేయడానికి చాలా రోజులు ఆలోచించి యుద్ధానికి వచ్చావు. సంజయునితో మీరు చాలా అధికంగా మాట్లాడావు. మీ రాజ్యమును పోగొట్టు కున్నందుకు , ద్రౌపదిని మేము అవమాన పరచినందుకు కోపించి నీ వారిని మొహరించుకుని యుద్ధానికి వచ్చావు. ఇక నీవు తప్పించుకోలేవు. ఇక మీకు భీష్మ , ద్రోణుల బాణధాటి తప్పదు. అర్జునుడు వారి బాణాల బారిన పడక తప్పదు. కృష్ణుడు మీ పక్కన ఉండగా మాకు భయ మెందుకులే. అతడే మీ పనులన్నీ చక్క బెట్టగలడులే . భీమ సేనా ! నీవు నూతిలో కప్పలా ఊహిస్తావు ఎదుటి వాడి బలం నీకు తెలియదు. దుశ్శాసనుడి రక్తం తాగుతానని శపధం చేసావుగా ఆలస్య మెందుకు రా ముందుకు ఎలా తాగుతావో నేను చూస్తాను. అర్జునా ! తాటి చెట్టంత విల్లు ఉందని కృష్ణుడు పక్కన ఉన్నాడని విర్రవీగకు నీకు భయపడి రాజ్యం ఇస్తానని అనుకోకు. ద్రౌపదిని దుశ్శాసనుడు సభకు ఈడ్చుకు వస్తున్నప్పుడు మీ ఆయుధాలు ఎక్కడకు పోయాయి. పేడి రూపంతో అర్జునుడు, వంటల వాడిగా భీముడు సిగ్గులేకుండా సామంతుని సేవించడం శూర లక్షణమా ! సిగ్గు లేక రాజ్యాన్ని పొందాలని యుద్ధానికి వచ్చారా ! మీరు ఎంత ప్రగల్భాలు పలికినా ఏభై వేల భీమార్జునులు కలసి వచ్చినా యుద్ధం చేస్తాను కాని రాజ్యం పంచి ఇవ్వను " అన్నాడు.

### పాండవుల సమాధానం

ఆ మాటకు నకుల, సహదేవులూ, భీమార్జునులు కోపంతో ఊగి పోయారు. కృష్ణుడు వారిని వారించి " ఉలూకా ! నువ్వు సుయోధనుని వద్దకు వెళ్ళి ఇలా చెప్పు. సుయోధనా ! రేపే యుద్ధం వీరుడవైతే యుద్ధం చేసి మరణించు. నా సారధ్యంలో అర్జునుడు నిన్ను వెంట తరిమి నీ సైన్యాలను చీల్చి చెండాడినప్పుడు నీకు ఎవరు వీరులో తెలుస్తుందిలే. భీముడు దుశ్శాసనుని రక్తం తాగటం తప్పదు. మీ వీరుల పరాక్రమ మేమిటో రేపు యుద్ధంలో చూడగలవు. వృద్ధుడైన భీష్ముని బలాన్ని నమ్ముకుని యుద్ధానికి వచ్చిన నీ గర్వాన్ని అర్జునుడు వమ్ము చేయక మానడు. భీస్ముని ప్రతాపం అడ్డు పెట్టుకుని గెలవాలని అనుకుంటున్నావు మొదటి ముద్దగా అతడిని మింగక మానము. ఆ పై ద్రోణుడు, కర్ణుడు మడియక మానరు అప్పుడు కాని అతని ఆశ చావదు. సోదర , కుమారుల బంధువుల మరణానంతరం భీముని గధా గాతంతో నేలపై పొర్లుతున్నప్పుడైనా పశ్చాత్తాప పడతాడో లేదో ! నీవు వెంటనే వెళ్ళి సుయోధనుని యుద్ధానికి ధైర్యంగా సిద్ధం కమ్మని చెప్పు " అన్నాడు. ఆ పై ధర్మరాజు ఉలూకునికి తాంబూలాలు ఆభరణాలు ఇచ్చి పంపాడు.

## సుయోధనుడు భీష్ముని అడిగి తన సైన్యంలోని బలాబలాలు తెలుసుకొనుట

ఉలూకుడు ధర్మరాజు చెప్పినది యధాతధంగా సుయోధనునికి చెప్పాడు. ఉలూకుని మాటలువిని భీష్ముడు " సుయోధనా నేను ఉండగా నీకు భయం ఎందుకు నేను సేనలను సమర్ధవంతంగా నడిపి నీకు జయం చేకూరుస్తాను " అన్నాడు. సుయోధనుడు " తాతా మీరు , ద్రోణుడు తోడు ఉండగా నాకు భయం ఎందుకు. చిటికలో వారి మదం అణచగలను. గంధర్వ, కిన్నెర, దానవులకు భయపడని నేను అల్పులైన పాండవులకు భయపడతానా ! మన పక్షంలో శత్రు పక్షంలో ఉన్న వీరుల


భీష్మ ధుర్యోధనుల సంవాదము

గురించి చెప్పండి " అన్నాడు. భీష్ముడు " సుయోధనా ! అతిరధుడవైన నీవు, సమరధులైన నీ తమ్ములు, నా గురించి నీకు చెప్పవలసిన పని లేదు, అతిరధులైన శల్యుడు, భూరిశ్రవుడు ఉన్నారు. సైంధవుడు మహారధుడు, కాంభోజరాజు , సుదక్షిణుడు సమరధులు, మహిష్మతి అధిపతి నీలుడు అర్ధరధుడు, అవంతీ దేశాధీశులు విందాను విందులు అర్ధరధులు, త్రిగర్తాధీపతులు ఐదుగురు మహారధులు, నీకుమారుడు లక్ష్మణకుమారుడు సమరధుడు, బృహద్బలుడు అర్ధరధుడు, దండధారుడు అర్ధరధుడు, శకుని సమరధుడు, కృపాచార్యుడు అతిరధ శ్రేష్టుడు, ద్రోణాచార్యుడు అతిరధ శ్రేష్టుడు, అశ్వథామ అర్జుననితో సమానంగా యుద్ధం చేయగల వాడు. బాహ్లికుడు, అతని కుమారుడు సోమదత్తుడు అతిరధులు, అలంబసుడు, భగదత్తుడు సమరధులు, కర్ణుడు అర్ధరధుడు అతడు జన్మత: లభించిన కవచ కుండలాలను కోల్పోయాడు , పరశురాముని శాపకారణంగా శక్తి హీనుడైయ్యాడు కనుక అర్జునిని గెలువలేడు " అన్నాడు భీష్ముడు. అప్పుడు ద్రోణుడు " అంతే కాదు అతడు ప్రగల్బములు చెప్పటంలో అతడు ముందు ఉంటాడు. పిరికితనంతో వెనుతిరగడంలో నేర్పరి. ఎల్లప్పడూ పరాకుగా ఉంటాడు. కనుక భీష్ముడు చెప్పినట్లు అతడు అర్ధరధుడే " అన్నాడు ద్రోణుడు.

### కర్ణుడి ఉద్రేకం

కర్ణుడు ముఖం కోపంతో ఎర్రబడగా " పితామహా ! నా మీది ద్వేషంతో ఇలా పలుక తగునా ! నాడు సభలో ఇలాగే చెప్పావు సుయోధనుని ముఖం చూసి ఓర్చుకున్నాను. నా దృష్టిలో నీవూ అర్ధ రధుడివే " అని మిగిలిన వారిని ఉద్దేశించి ఇతడిని మనం హితుడని నమ్మ వచ్చునా ! ఒక్కొక్క రాజుని చూసి ఎక్కువ తక్కువలు చూపుతున్నాడు ఇది విన్న వారు ఏమి అనుకుంటారు " అని సుయోధనునితో " మిత్రమా ! కార్యం చెడింది. నీ సముఖంలో ఇలా జరగడం విచారకరం. అసలు భీష్ముని బలం ఏపాటిది పాండవ పక్షపాతి అయిన అతడిని నమ్మి ఎలా యుద్ధం చేయగలం. ఇతడిని వదిలించుకుంటే మనకు వచ్చే నష్టం ఏమి. మిగిలిన రాజుల మనసు కుదుట పడుతుందిగా. ఇతడి అధ్యక్షతలో మన రాజులు యుద్ధం ఎలా చేయగలరు. వయసులో పెద్ద వాడు కనుక ఇతడి మాటలు గౌరవించండి కాని మన్నించకండి ఇతడు యుద్ధ భూమిలో ఉన్నంత వరకు నేను యుద్ధం చేయను అన్నాడు " అన్నాడు. భీష్ముడు కర్ణుని మాటలు విని " ఏమి కర్ణా! నేను ముసలి వాడినా ! నా అస్త్రబలం ఎలాంటిదో నా గురువు పరశురాముని అడిగి తెలుసుకో ! నన్ను ఎదిరించిన వారికి పట్టిన గతి లోకానికి తెలుసు. నీ పడచుదనం నా ముసలి తనం అర్జునుడు చూస్తాడులే సూతనందనా ! నీ వలన నా గురించి చెప్పకోవలసి వచ్చింది. నీ కార్యాలోచనతో కౌరవులకు తెచ్చిన అనర్ధాన్ని తొలగించడానికి మా శక్తి చాలదు. యుద్ధం చేయభయపడి నా మీద నెపం పెట్టి తప్పించుకున్నా తరవాత యుద్ధం ఎదుర్కొనక తప్పదు. యుద్ధంలో నీ ప్రతాపం చూపించు. క్రమక్రమంగా యుద్ధంలో అర్జునిని చేత అతిరధ, మహారధులంతా చావగా మిగిలిన సైన్యాలతో యుద్ధం చేసే సమయంలో నీ యుద్ధ పటిమ సుయోధనుడు తెలుసు కుంటాడులే. సుయోధనుడు నా పై యుద్ధభారం పెట్టాడు కనుక నీ మాటలు సహించి నిన్ను ప్రాణంతో వదులు తున్నా ఇక ఊరుకో " అన్నాడు. సుయోధనుడు కలవరపడి " పితామహా ! మీరు ఇలా మాటాడ తగునా నా కొరకు ముందు ఉన్న కార్యసాధన కొరకు సహించండి " అని గాంగేయుని శాంతపరచి. కర్ణునితో " కర్ణా! నీవు పితామహుడు ఒకటై కార్య సాధన చేయాలి కాని ఇలా వాదులాడటం తగదు " అని కర్ణుని శాంతపరచి భీష్ముని చూసి " పితామహా ! పాండవపక్షంలో ఉన్న వీరులగురించి వివరించండి " అని కోరాడు . భీష్ముడు " సుయోధనా! నేను పాండవ పక్షంలో ఉన్న వీరుల గురించి చెపితే కర్ణుని మనసు నొచ్చు కుంటుంది నీకు ఎలా ఉంటుందో నాకు తెలియదు. వారి గురించి చెప్పక పోవడమే మంచిది " అన్నాడు.

## సుయోధనుడు భీష్ముని అడిగి పాండవ సైన్యంలోని బలాబలాలు తెలుసుకొనుట

సుయోధనుని బలవంతం మీద భీష్ముడు పాండవ సైన్యంలోని వీరుల గురించి చెప్పసాగాడు " ధర్మరాజు అతిరధుడు, భీమసేనుడు అతిరధ శ్రేష్టుడే కాక మహా బలవంతుడు, నకుల, సహదేవులు సమరధులు, అర్జునుడు ఇలాంటి వాడని చెప్పడం నాకు శక్యం కాదు అతనికి సమాన వీరులు ఈ భూమి మీద ఇప్పటి లేరు ఇక పుట్టడు. అతడికి శ్రీకృష్ణుడు తోడు ఉన్నందున ఇక చెప్పవలసిన పని లేదు. అతడు ఒక్కడే తన సేనలను రక్షిస్తూ శత్రు సేనలను నాశనం చేయ గలడు. ఇక ద్రౌపదికి పుట్టిన ఉపపాండవులు మహారధులు, ఉత్తరుడు వారికి సమానుడు, అభిమన్యుడు అతిరధ శ్రేష్టుడు యుద్ధనైపుణ్యం తెలిసిన వాడు కృష్ణార్జునులకు సమానుడు. సాత్యకి అతిరధుడు, ద్రుపదుడు, విరాటుడు, శిఖండి మహారధులు,

దృష్టద్యుమ్నుడు అతిరధుడు అతని కుమారుడు దృతవర్మడు అర్ధరధుడు, ఉత్తమౌజుడు, యుధామన్యుడు, క్షత్రదేవుడు, జయంతుడు, అమితౌజుడు, విరాటుడు, సత్యజితుడు మహారధులు. కేకయ రాజులు అయిదుగురు మహారధులు. కాశీశుడు, నీలుడు, సూర్యదత్తుడు, మదిరాక్షుడు, శంఖుడు, మహారధులు. చత్రాయునుడు, చేకితానుడు, చంద్రదత్తుడు, వ్యాఘ్రదత్తుడు మహారధులు. కాశ్యుడు సమరధుడు, కుంతిభోజుడు అతిరధుడు, భీముని కుమారుడు ఘటోత్కచుడు అతిరధుడు రాక్షస నాయకుడు. వీరందరిని ఎలాగైనా నేను చంపగలను కాని శిఖండిని నేను చంపలేను " అన్నాడు.

## శిఖండి పూర్వజన్మ వృత్తాంతం

సుయోధనుని కోరికపై భీష్ముడు శిఖండి గురించి చెప్పసాగాడు " సుయోధనా ! నేను రాజ్యాధికారం వహించనని వివాహం చేసుకోనని మా తండ్రి వివాహ సమయంలో ప్రతిజ్ఞ చేసాను. కనుక నా తండ్రి మరణానంతరం నా తమ్ముడు చిత్రాంగదునికి రాజ్యాభిషేకం చేసాను. దుందుడుకు స్వభావం కలిగిన చిత్రాంగధుడు గంధర్వునితో తలపడి అతడి చేతిలో మరణించాడు. ఆ తరువాత విచిత్రవీర్యునికి రాజ్యాభిషేకం చేసాను. అతడికి వివాహ వయసు రాగానే వివాహ ప్రయత్నాలు మొదలు పెట్టాను. ఆ సమయంలో కాశీరాజు తన కుమార్తెలకు స్వయంవరం ప్రకటించాడు నేను అతడి కుమార్తెలైన అంబ, అంబిక, అంబాలికలను రధంపై ఎక్కించుకుని బలవంతంగా హస్థినాపురానికి తీసుకువచ్చాను. వారిని ముగ్గురిని విచిత్రవీర్యుని వివాహం చేసుకొమ్మని చెప్పాను. వారిలో అంబ అప్పటికే సాళ్వుని ప్రేమించి ఉంది ఆ విషయం తెలియని కాశీరాజు స్వయంవరం ప్రకటించాడు నాకూ ఆ విషయం తెలియకుండా ఆమెను హస్థినకు తీసుకు వెళ్ళాను. అంబ నాతో " మీరు ధర్మాత్ములు నేను మనసారా సాళ్వుని ప్రేమించాను కనుక మనసులేని మనువు చేసుకొనజాలను నన్ను సాళ్వుని వద్దకు పంపించు " అని అడిగింది. నేను నా తప్పు గ్రహించి ఆమెను సాళ్వుని వద్దకు పంపాను కాని అతడు " భీష్ముడు నిన్ను బలవంతంగా తీసుకు వెళ్ళాడు కనుక నేను నీ కన్యాత్వాన్ని నమ్మజాలను కనుక తిరిగి అతని వద్దకే వెళ్ళు " అన్నాడు. ఆమె జరిగినది అంతా వివరించి సాళ్వుని ఎంత వేడినా ఫలితం శూన్యం. ఆమె ఇదంతా భీష్ముని వలనే జరిగిందని చింతించి అతనిపై ఎలాగైనా పగతీర్చు కోవాలని నిర్ణయించుకుని మహా వీరుడైన భీష్ముని జయించడానికి తపస్సు తప్ప మరే మార్గం లేదని గ్రహించి తపోభూమికి చేరుకుంది. అక్కడ ఉన్న మునులకు తనగాధ వివరించింది. వారు ఆమెకు తపస్సు స్త్రీలకు కఠినమని తండ్రి వద్దకు వెళ్ళమని చెప్పారు. ఆమె వారితో " అయ్యా ! నేను ఇక నా తండ్రి వద్దకు కాని , బంధువుల వద్దకు గాని వెళ్ళలేను. కనుక ఇక్కడ తపస్సు చేసుకోవడమే నా నిర్ణయం " ఆ సమయంలో అక్కడకు వచ్చిన హొూత్రవాహనుడు అనే రాజర్షి అక్కడకు వచ్చి అంబను గురించి తెలుసుకుని " అంబా ! నీవు నాకు వరసకు మనవరాలివి. నిష్కారణంగా శిక్షింపబడిన నీవు తపసు చేయడమెందుకు ? ఇందుకు నేను ఒక మార్గం చెప్తాను నీకు అపకారం చేసిన భీష్ముని గురువైన పరశురాముని వద్దకు వెళ్ళి సహాయం అడిగావంటే అతడు తన శిష్యుడైన భీష్మునికి చెప్తాడు అతని మాటను భీష్ముడు మీరజాలడు " అన్నాడు.

### అంబ పరశురాముని శరణు వేడుట

శిష్యుడు చెప్పిన విధంగా పరశురాముడు హొూత్రవాహనుడి ఇంటికి వచ్చాడు. హొూత్రవాహనుడు పరసు రాముని సాదరంగా ఆహ్వానించి అర్ఘ్యపాద్యములు ఇచ్చి సత్కరించిన పిదప అంబ వృత్తాంతం వివరించాడు. పరశురాముడు అంబను చూసి " అంబా ! నీకు భీష్ముడు, సాళ్వుడు ఇద్దరూ అపకారం చేసారు. నేను ఎవరిని శిక్షించాలో నీవే విర్ణయించు " అన్నాడు. అంబ " మహాత్మా ! ఏది ఏమైనా సాళ్వుడు ఇక నన్ను స్వీకరించడు. కనుక భీష్ముని వద్దకు వెళ్ళి న్యాయం అడగాలి " అన్నది. పరశురాముడు అంబను వెంట పెట్టుకుని నా వద్దకు వచ్చాడు. అతడు ముందుగా సరస్వతీ తీరాన విడిది చేసి నాకు వర్తమానం పంపాడు. నేను గురువుగారిని దర్శించి అర్ఘ్యపాద్యములు సమర్పించి సత్కరించాను. నా వినయ విధేయతలకు సంతోషించిన పరశురాముడు " గాంగేయా ! ఈ కన్యను బలవంతంగా ఎందుకు తెచ్చావు. వచ్చిన తరవాత తిరస్కరించడం ధర్మమా ! " అని అడిగాడు. నేను ఆమె ప్రేమవృత్తాంతం విని ఆమెను సాదరంగా సాళ్వుని వద్దకు పంపాను ఇందు నా అపరాధం ఏమున్నది " అన్నాను. పరశురాముడు కోపించి అంబను నీ తమ్మునికి ఇచ్చి వివాహం చేయకున్న నిన్ను నీ బంధు మిత్రులను, పరి వారాన్ని నాశనం చేస్తాను " అన్నాడు. భీష్ముడు " నాకు విద్య నేర్పిన నీవే నా మీద కోపించడం తగునా ! " అన్నాను. పరశురాముడు " గాంగేయా ! నీవెన్ని చెప్పినా నీవు అంబను నీ తమ్మునికి ఇచ్చి వివాహం చేయనిదే నా కోపం తగ్గదు " అన్నాడు. నేను " గురువర్యా ! మీరు నన్ను అధర్మం చెయ్యడానికి పట్టుబడుతున్నారు. వేరొకరి మీద మనసు పడిన కన్యను నేను ఎలా నా తమ్మునికిచ్చి పరిణయం చేయగలను. ఇంతకన్నా మీ ఆగ్రహానికి గురి కావడమే మేలు. అధర్మానికి పురికొల్పే వాడు గురువైనా దండనార్హుడే అని పెద్దలు చెప్పారు కదా ! " అన్నాడు. పరశురాముడు ఆ మాటలకు కోపించి గాంగేయా ! యుద్ధానికి సిద్ధంగా ఉండు " అన్నాను నేను " గురువర్యా ! మీరు ఇదివరకే అహంకరించి క్షత్రియ వంశం నాశనం చేసారు. అప్పుడు భీష్ముడు లేడు ఇప్పుడు ఉన్నాడు. ఇక మీ ఆటలు సాగవు నేను యుద్ధం చేయ సిద్ధంగా ఉన్నాను " అన్నాను.

## పరశురామునితో భీష్ముని యుద్ధం

నేను నా తల్లి సత్యవతీదేవికి జరిగినది వివరించి ఆమె వద్ద ఆశీర్వాదం తీసుకుని యుద్ధానికి సిద్ధం అయ్యాను. నా తల్లి గంగాదేవి ఇది విని పరశురాముని చూసి నచ్చ చెప్పబోయింది ఆయన వినక పోవడంతో ప్రయోజనం లేదని ఆమె వెను తిరిగింది. అకృతవర్ణుని సారధ్యంలో పరశురాముడు యుద్ధభూమికి వచ్చాడు. నేను నా గురువుకు నమస్కరించి యుద్ధం ఆరంభించాను. పరశురాముడు నాపై శరవర్షం కురిపించాడు. నేను వాటిని అన్నిటినీ తుంచి పరశురాముని విల్లు విరిచాను అతడు మరో విల్లు తీసుకున్నాడు. నా బాణప్రయోగంతో అతని ఒళ్ళంతా తూట్లు చేసాను. అధిక రక్త స్రావం వలన పరశురాముడు మూర్చిల్లాడు. అతడిని చూసి నన్ను నేనే నిందించుకున్నాను. పరశురాముడు తేరుకుని నా పై అస్త్రం సంధించాడు. అది ఏమి అస్త్రమో నాకు తెలియదు అది నన్ను గాయపరిచింది సారధి నన్ను పక్కకు తీసుకు వెళ్ళాడు. ఇంతలో నేను తేరుకుని పరశురాముని బాణాలతో ముంచాను. ఈ విధంగా మేమిరువురము ఘోరంగా ఇరవై రెండు రోజులు యుద్ధం చేసాము. చివరకు నేను పరశురామునిపై శక్తి ఆయుధాన్ని ప్రయోగించాను. దాని ప్రభావానికి పరశురాముడు మూర్చిల్లాడు. అక్కడి మునులంతా వ్యాకులపడ్డారు. మూర్చలో నుండి తేరుకుని అతడు నా సారధిని చంపి నన్ను బాణాలతో కొట్టాడు. ఆ ధాటికి నేను మూర్చిల్లాను. ఆ సమయంలో బ్రాహ్మణులు కొందరు నాకు సేవ చేసారు. నా తల్లి గంగాదేవి నా రధం నడిపింది. నేను మూర్చ నుండి తేరుకున్నతరు వాత నా తల్లి నాకు రధం అప్పగించి వెనుతిరిగింది. ఆ రోజు రాత్రి ఆ బ్రాహ్మణులు కలలోకి వచ్చి భీష్మా మేము నీవు ఒక్కటే పరశురాముని జయించగల అస్త్రం ఇదొక్కటే అని నాకు మోహనాస్త్రం ఇచ్చారు. నేను దానిని ప్రయోగ ఉపసంహారాలతో అభ్యసించి యుద్ధానికి వెళ్ళాను. పరశురాముడు " నిన్న సగం చచ్చి వెళ్ళావు కదా ! ఈ రోజు నీ మదం అణచగలను రా అని నా పై అనేక బాణాలు సంధించాడు. నేను అతని పై శక్తి అస్త్రం ప్రయోగించాను. ఆ ప్రభావానికి అతడు మూర్చిల్లగా అకృతవర్ణుడు అతడిని మూర్చ నుండి తేరుకునేలా చేసాడు. ఆయన ఆగ్రహంతో నాపై బ్రహ్మాస్త్ర ప్రయోగం చేసాడు. నేను ఆయన అస్త్రాన్ని అదే అస్త్రంతో నివారించాను. ఆ అస్త్రాలు లోకాల్లో విలయాన్ని సృష్టిస్తున్నాయి.

## పరశురామ భీష్ముల యుద్ధ విరమణ

నేను అతడిపై మోహనాస్త్రాన్ని ఆవాహన చేసాను. ఇంతలో నారదుడు వచ్చి " గాంగేయా ! మోహనాస్త్రప్రయోగం నీకు ఉచితం కాదు అన్నాడు " అని వారించాడు. అష్ట వసువులు కూడా నన్ను వారించారు నేను వారి మాట విని బాణాన్ని ఉసంహారం చేసాను. పరశురాముని తండ్రి పితృ దేవతలతో వచ్చి " పరశురామా ! భీష్ముడు సామాన్యుడు కాదు అష్టవసువులలో అగ్రగణ్యుడు అతడిని గెలవడం ఎవరి తరం కాదు. నరనారాయణులలో ఒకరైన అర్జునుడు భీష్ముని సంహరించగల ధీరుడు . బ్రాహ్మణుడి వైన నీకు ఈ అనవసర యుద్ధం తగదు " అని జమదగ్ని చెప్పినా పరశురాముడు వినలేదు. నేను పట్టు వీడ లేదు. నా తల్లి గంగాదేవి కూడా అక్కడకు వచ్చింది ఆమె చెప్పినా నేను విన లేదు. పలువురు పరిపరి విధాల మా ఇద్దరికి నచ్చ చెప్పి యుద్ధం మాన్పించారు. బ్రాహ్మణులు నా వద్దకు వచ్చి " గాంగేయా ! నీ గురువు అతి పరాక్రమ వంతుడు బ్రహ్మకోవిదుడు అయిన పరశురాముని వద్దకు వెళ్ళి నమస్కరించి క్షమాపణ అడిగి దీవెనలు అందుకో " అన్నారు. గంగాదేవి నారదునితో పరశురాముని వద్దకు వెళ్ళి " భార్గవరామా! దేవవ్రతుడు నీ శిష్యుడు అతడు ధర్మాన్ని విడువజాలక నీతో తలపడ్డాడు కాని నీపై విరోధం లేదు అతడిని దయతో మన్నించు " అని చెప్పారు. నేను పరశురామునికి నమస్కరించాను అతడు నన్ను మన్నించి నన్ను లేవనెత్తి వాత్సల్యంతో కౌగలించుకున్నాడు. అంబతో " అంబా ! చూసావు కదా ! నేను చేయగలిగినది చేసాను ఇక నీ దారి నువ్వు చూసుకో " అన్నాడు. అంబ " మహాత్మా ! మీకు వీలైనంత చేసారు. నేను తపమాచరించి నా పగ తీర్చుకుంటాను ఈ జన్మలో వీలు కాకున్న మరో జన్మలో తీర్చుకుంటాను " అని అక్కడ నుండి వెళ్ళి పోయింది.


భీష్మ పరశురాముల యుద్ధము మధ్యలో వచ్చిన నారదుడు

## శిఖండి జననం


శివుని వరమడుగుతున్న ద్రుపద మహారాజు - రాజ్మానామా నుండి ఒక దృశ్యం

హస్థినకు చేరినా భీష్ముని మనసులో అంబను గురించిన చింత వదల లేదు. ఒక రోజు నారద మహర్షి భీష్ముని వద్దకు వచ్చి భీష్ముడు కోరగా అంబను గురించి ఈ విధంగా చెప్పాడు. " గాంగేయా ! అంబ శివుని గురించి తపస్సు ప్రారంభించింది అన్ని ముని ఆశ్రమాలను సందర్శించింది. ఒక రోజు గంగ అంబను చూసి ఆడుదానివి నీకు ఈ ఘోరతపము తగదు అని చెప్పింది. అంబ ఆమె మాటకు " నాకు భీష్ముని మీద కోపం ఉంది కనుక అతని చావు కోరి తపము చేస్తున్నాను అని బదులిచ్చింది. అందుకు గంగాదేవి కోపించి నదిపై ప్రవహించు అని శపించింది. అంబ ఆమె మాటను లక్ష్యపెట్టక మత్స్య దేశముకు వెళ్ళి ఘోర తపమాచరించింది. ఆ తపో మహిమను సగం ధారపోసి అక్కడ నదిగా ప్రవహించి మిగిలిన తపో బలంతో శరీరాన్ని కాపాడుకుంది. తిరిగి శివుని గురించి ఘోర తపము ఆచరించింది. ఆమె తపసుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మని అడిగాడు. అంబ శివుని వద్ద నుండి భీష్ముని చంపే వరం పొందింది. ఆమె శివుని తాను ఏవిధంగా సంహరించగలను అని అడిగింది. శివుడు " నీవు ఈ శరీరం విడిచి ద్రుపద మహారాజుకు కుమార్తెగా జన్మించి మరలా పురుష రూపం ధరిస్తావు. అత్యంత పరాక్రమం, విలువిద్యా నైపుణ్యం ప్రదర్శించి యుద్ధభూమిలో భీష్ముని ఎదిరించి సంహరించగలవు " అని వివరించాడు. వెంటనే అంబ అక్కడ చితి పేర్చి " నేను భీష్ముని సంహరిస్తాను " అని తిరిగి తిరిగి అంటూనే అగ్నిలో దూకి ప్రాణాలు విడిచింది. ద్రుపద మహారాజుకు భీష్ముని పై కోపం ఉంది . అతనికి సంతానం లేక రోజు రోజుకు కృశించి పోతున్నాడు. చివరికి అతడు భీష్ముని చంపగల కుమారుని ప్రసాదించమని శివుని గురించి తపస్సు చేసాడు. శివుడు అతడికి భీష్ముని చంప గలిగిన కుమారుడు కలుగుతాడని చెప్పి ముందుగా కుమార్తె జన్మిస్తుందని ఆమె తరవాత కుమారుడుగా మారి భీష్ముని సంహరిస్తాడని చెప్పాడు. ద్రుపదుడు అంతా భార్యకు వివరించాడు. వారికి ఒక కుమార్తె జన్మించింది వారు ఆమెకు శిఖండి అని నామకరణం చేసి కుమారునిగా పెంచారు. ఆమెకు ద్రోణాచార్యుని వద్ద విలువిద్య నేర్పించారు. ఆమె యవ్వనవతి కాగానే శివుని వరం వృధా పోదు అని విశ్వసించి పురుషత్వం రాక మునుపే ఆమెకు వివాహం చేయా నిశ్చయించారు. వారు దశార్ణ దేశ రాజైన హేమవర్మ కుమార్తెతో వివాహం జరిపించారు. శిఖండి ప్రవర్తన ఆమె భార్యకు ఆశ్చర్యం కలిగించగా శిఖండిని గురించిన రహస్యం తెలుకున్నా మౌనంగా ఉండి పోయింది. ఆమె చెలికత్తె ద్వారా ఈ విషయం తెలుసుకున్న దశార్ణ మహారాజు ద్రుపదుని వద్దకు దూతద్వారా యుద్ధానికి సిద్ధంకమ్మని వర్తమానం పంపాడు. ద్రుపదుడు దూతను నచ్చ చెప్పి పంపాడు. హేమవర్మ ఆగ్రహించి తన సేనలతో పాంచాల దేశాన్ని ముట్టడించాడు.

## శిఖండి పురుషరూపం పొందుట

శిఖండి తన పురుషత్వం గురించి రెండుదేశాలు యుద్ధం చేసుకోవడం చూసి సిగ్గుపడ్డాడు. అర్ధరాత్రి లేచి అరణ్యంలోకి వెళ్ళాడు. ఆ అరణ్యంలో స్థూలకర్ణుడు అనే యక్షుడు నివసిస్తున్నాడు. అతనికి భయపడి మనుషు లెవరూ ఆ అరణ్యంలో ప్రవేశించరు. అది తెలిసే శిఖండి అడవిలో ప్రవేశించాడు. ఆ విషయం గ్రహించిన యక్షుడు శిఖండిని చూసి " కుమారీ నీ వెవెరు ప్రాణముల మీద ఆశ వదలి ఇక్కడికి ఎందుకు వచ్చావు " అని అడిగాడు. శిఖండి జరిగినది అంతా అతనికి వివరించి నాకు ఇప్పుడు పురుషత్వం కావాలి కాని అది శివుని వలననే సాధ్యం కాగలదు అని చెప్పాడు. అది విన్న యక్షుడు " అదెంత పని నేను నీకు ఒక్క పది రోజుల కాలం నా పురుషత్వం నీకు ఇచ్చి నీ స్త్రీ రూపం నేను ధరిస్తాను . ఈ లోపు నీవు హేమవర్మ వద్దకు వెళ్ళి నీ పురుషత్వం నిరూపించు కుని పరిస్థితిలు చక్కబడగానే ఇక్కడికి వచ్చి మరలా మనమిరువురం ఎవరి రూపం వారు పొందవచ్చు " అన్నాడు. శిఖండి అందుకు అంగీకరించి యక్షుని నుండి పురుషత్వం స్వీకరించి తల్లి తండ్రుల వద్దకు వద్దకు వెళ్ళాడు. జరిగినది వారికి వివరించగానే వారు సంతోషించి సమస్యకు తాత్కాలిక పరిష్కారం లభించిందని తెలుసుకుని హేమవర్మ వద్దకు దూతలను పంపి తన వద్దకు రప్పించి శిఖండి పురుషుడేనని నిరూపించాడు. హేమవర్మ తన తొందర పాటుకు చింతించి ద్రుపదునికి క్షమాపణ చెప్పాడు. ద్రుపదుడు వారికి విందులు వినోదాలు ఏర్పాటు చేసి వారిని సగౌరవంగా సాగనంపాడు. ఇలా రెండు రోజులు అయిన తరవాత కుబేరుడు తన విమానంపై అక్కడికి విహరించవచ్చి స్థూలకర్ణుని మందిరానికి వెళ్ళాడు. ఎంతకూ స్థూలకర్ణుడు తనను ఆహ్వానించడానికి రాక పోవడంతో కోపించి కిన్నెరులను కొంత మందిని లోపలకు పంపి స్థూలకర్ణుని విషయం కనుక్కుని రమ్మని కబురు పంపాడు. లోపలికి వెళ్ళిన కిన్నెరలు జరిగిన విషయం అంతా స్థూలకర్ణుని వలన తెలుసుకుని కుబేరునికి వద్దకు వచ్చి చెప్పారు. కుబేరుడు " పరావాలేదు అతడిని స్త్రీరూపంతోనే రమ్మనండి " అన్నాడు. తన వద్దకు వచ్చిన స్థూలకర్ణునితో " జరిగినదేదో జరిగింది. ఇది దైవ సంకల్పం నీవు ఇక ఇలాగే

ఉండు " అన్నాడు. స్థూలకర్ణుడు కుబేరుని కాళ్ళపై బడి విమోచనన మార్గం చెప్పమని బ్రతిమాలాడు. కుబేరుడు " స్థూలకర్ణా ! దైవ సంకల్పానికి అనుగుణంగా జరిగిన ఈ మార్పిడిని శిఖండిని జీవితాంతం పురుషునిగానే ఉండనివ్వు . జరగవలసిన ఈశ్వర సంకల్పం నెరవేరగానే శిఖండి మరణిస్తాడు. ఆతరవాత నీ పురుష రూపం నీకు వస్తుంది " అని చెప్పి తన విమానంపై అలకాపురికి తిరిగి వెళ్ళాడు. శిఖండి మాత్రం తిరిగి అథూలకర్ణుని కలుసుకుని తన పురుషత్వాన్ని స్వీకరించి స్త్రీత్వాన్ని తిరిగి ఇవ్వమని చెప్పాడు. స్థూలకర్ణుడు " జరిగినదంతా దైవ సంకల్పం కనుక నీవు ఇక పురుషుడుగానే సంచరించ వచ్చు " అని చెప్పాడు. శిఖండి పరమ సంతోషం చెంది తన తల్లి తండ్రులకు జరిగనది వివరించాడు. అతడు బ్రాహ్మణులను దేవతలను పూజించి ఎన్నో వ్రతాలను ఆచరించి ద్రోణాచార్యుని వద్దకు వెళ్ళి అతడి శిష్యునిగా చేరి ద్రోణాచార్యుని వలన విలువిద్యా ప్రావీణ్యాన్ని పొందాడు" . అని నాకు నారదుడు వివరించాడు .

## సుయోధనుడు తన సైన్యంలోని వారి సామర్ధ్యం తెలుసుకొనుట

భీష్ముడు సుయోధనునికి శిఖండి గురించి వివరించి " సుయోధనా ! అంబ నా పై పగబూని శిఖండిగా అవతరించి నన్ను సంహరించాలని చూస్తుంది. ఆమె శిఖండిగా యుద్ధంలో నన్ను ఎదుర్కొంటే నేను అస్త్రసన్యాసం చేస్తాను. ఎందుకంటే నేను స్త్రీలతో కాని పురుషులుగా మారిన వారితో కాని యుద్ధం చేయనని నాకు నేనే విధించుకున్న నియమమం ఉంది. ఏ కారణంతోనైనా నేను నియమభంగం చేయనని నీకు తెలుసుకదా " అన్నాడు. అది విన్న సుయోధనుడు కొంత చింతించినా భీష్ముని ధీరత్వాన్ని మనసులోనే శ్లాఘించాడు. సుయోధనుడు " పితామహా ! పాండవ సైన్యాన్ని పూర్తిగా నశింప చేయడానికి మీకు ఎంత సమయం పడుతుంది. అలాగే ద్రోణుడు, అశ్వథామ, కృపాచార్యుడు, కర్ణుడు ఎంత సమయంలో చేయగలరు " అని భీష్ముని అడిగాడు. భీష్ముడు " సుయోధనా ! నీవు మా బలాబలాలు తెలుసు కోవడానికి ప్రయత్నించడం మంచిదే ! వారి వారి సామర్ధ్యం గురించి వారే చెప్పగలరు. నేను నన్ను గురించి చెప్తున్నాను. ఒక రోజుకు వెయ్యిమంది రధికులను చంపగలను. అర్జునుని బాణాలు నా శరీరాన్ని ఛేదించే వరకూ నేను శత్రువులతో పోరాడుతుంటాను. మొత్తంగా ఒక రోజుకు పదివేలమంది సైన్యాన్ని చంపగలను కనుక పాడవ సైన్యాలను సంహరించడానికి నాకు ఒక నెల రోజుల సమయయం పడుతుంది " అన్నాడు. సుయోధనుడు ద్రోణుని చూసి తన బలం చెప్పమని అడిగాడు. ద్రూణుడు " సుయోధనా ! నేను వృద్ధుడను కనుక నా ఓపిక కొలది యుద్ధం చేస్తే పితామహునిలా నాకు ఒక నెల రోజుల సమయం పడుతుంది " అన్నాడు. అశ్వద్ధామ వారిరువురిలానే ఒక నెల రోజుల కాలంలో పాండవ సైన్యాలను హతమార్చ గలనని చెప్పాడు . కర్ణుడు మాత్రం తాను అయిదు రోజులలో పాండవ సైన్యాలను హతమార్చగలనని చెప్పాడు. అది విన్న భీష్ముడు నవ్వి " సూతనందనా! సుయోధనుడు పక్కన ఉన్నంత వరకు నీవు ఏమి మాట్లాడినా చెల్లుతాయి. ఒట్టి మాటలు ఎవరైనా చెప్పవచ్చు. యుద్ధభూమిలో అర్జునిని గాండీవం యొక్క అల్లెత్రాటి శబ్ధం నీ చెవులను బద్దలు చేసేదాకా నీవు ప్రగల్భాలు చెప్పడం ఆపవు కదా! " అని పలికాడు.

## ధర్మ రాజు తన సైన్యంలోని బలాబలాలు తెలుసుకొనుట

ధర్మరాజు చారుల ద్వారా సుయోధనుని విడిదిలో జరిగినది తెలుసుకున్నాడు. ధర్మరాజు తన తమ్ములను చూసి " మన చారుల ద్వారా సుయోధనుని విడిదిలో జరిగిన విషయాలు తెలిసాయి. భీష్ముడు మన సైన్యాలను ఒక నెల రోజులలో చంపగడంట . ద్రోణుడు, అశ్వథామకూ అదే సమయం పడుతుందట, కృపాచార్యుడు రెండునెలలు పడుతుందని చెప్పాడు. కర్ణుడు అయిదు రోజులు చాలు అన్నాడు. అర్జునా నీకు కౌరవ సైన్యాలను హతమార్చడానికి ఎన్ని రోజులు పడుతుంది " అని అడిగాడు. అర్జునుడు " అన్నయ్యా ! భీష్ముడు, ద్రోణుడు విలువిద్యా పారంగతులు అవక్రపరాక్రమ వంతులు. కాని అన్న మాటలు నెరవేర్చుకోవాలి కదా! అన్నయ్యా నా శక్తీ , పరాక్రమమూ ఎంతటిదో నీకు తెలియనిది కాదు. శ్రీకృష్ణుని సాయంతో నేను ఒక్క నిమిషకాలంలో సర్వ సైన్యాలను సంహరించగలను. నేను ఈశ్వరుని మెప్పించి పొందిన పాశుపతాస్త్రాన్ని సంధిస్తే ఒక్క నిమిషంలో సకల భూమి భస్మీపటలం ఔతుంది అయినా నేను దానిని ప్రయోగించను. నా పరాక్రమాన్ని చూపి బుజ బలం చూపి శత్రువులతో పోరాడి విజయం సాధిస్తాను. జయాపజయాలు దైవాధీనాలు చింతించనేల . మన వైపు భీముడు, నకుల సహదేవులు, అభిమన్యుడు, ద్రౌపదీ పుత్రులు, ఘతోత్కచుడు, సాత్యకి, విరాటుడు, ద్రుపదుడు, దృష్టద్యుమ్నుడు, శిఖండి, ఉత్తమౌజుడు, యుధామన్యుల వంటి అతిరధ మహారధులు ఉన్నారు.



పాండవుల విశాల సైన్యము

ఇక నీ శక్తి నీవు ఎరుగవు నీకు కోపం వస్తే కౌరవ సేన నీకు లెక్కలోనిది కాదు. కనుక మనకు విజయం తథ్యం మీరు నిశ్చింతగా ఉండండి " అన్నాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

---

# భీష్మ పర్వము

వికీపీడియా నుండి

**భీష్మ పర్వము**, మహాభారతంలోని ఆరవ భాగము. ఈ పర్వంలో కురుక్షేత్ర యుద్ధం ఆరంభమవుతుంది. భీష్ముని నాయకత్వంలో జరిగిన పది రోజుల యుద్ధం భీష్మపర్వంలో ఉన్నది. భగవద్గీత ఈ పర్వంలో ఒక భాగం. పర్వం ఆరంభంలో వ్యాసుడు యుద్ధాన్ని ఆపుజేయమని ధృతరాష్ట్రునికి బోధిస్తాడు కాని ఆ ప్రయత్నం ఫలించదు. ఇక యుద్ధాన్ని చూడడానికి సంజయునికి అతీంద్రియ శక్తులను ప్రసాదిస్తాడు వ్యాసుడు. ఆ శక్తుల ద్వారా తాను చూసిన యుద్ధాన్ని సంజయుడు ధృతరాష్ట్రునికి వర్ణిస్తూ ఉంటాడు.భీష్ముడు పదవనాటి యుద్ధంలో నేలకు ఒరిగి అంపశయ్యపై చేరడంతో ఈ పర్వం ముగుస్తుంది.

## విషయ సూచిక



## కథా సంగ్రహం

ఈ పర్వంలో రెండు ఆశ్వాసములున్నాయి. వాటిలోని విషయం సంగ్రహంగా ఇలా ఉన్నది.

### భీష్మ పర్వము ప్రథమాశ్వాసము

- దృతరాష్ట్ర సంజయుల సంభాషణ
  - జంబూద్వీప విశేషాలు
- దృతరాష్ట్ర సంజయుల వాదం

  - భరత వర్షంలోని సంపదలు
- యుద్ధ సమాచారములు సంజయుడు దృతరాష్ట్రునికి చెప్పట
- కౌరవుల యుద్ధ సన్నాహం
- భీష్ముడు సైన్యాలను యుద్ధోన్ముఖులను చేయుట
- పాండవుల యుద్ధసన్నాహం
- సంజయుడు యొద్ధాన్ని ఎదుర్కొను పాండవుల ధైర్యాన్ని వర్ణించుట
- ధర్మరాజు పితామహ గురువుల వద్ద యుద్ధానికి అనుమతి తీసుకొనుట
- భగవద్గీత
  - పాండవ సన్నాహం
  - కృష్ణుడు అర్జునినికి ఆత్మజ్ఞానం భోధించుట
  - విశ్వరూప సందర్శనం
  - గీత పరిసమాప్తి
- యుద్ధారంభం
  - కౌరవ ప్రముఖులు పాండవ ప్రముఖుల మధ్య భీకర యుద్ధం
  - భీకర సమరం
- కౌరవ సేనల విజృంభణ
- అపహార్ణం పై యుద్ధం

## భీష్మ పర్వము ద్వితీయాశ్వాసము

- రెండవ రోజు యుద్ధం
- రెండవ రోజు యుద్ధారంభం
- పాంచాల సేనలు ద్రోణుల మధ్య సమరం
- భీమసేనుని భీకర యుద్ధం
- అభిమన్యుని యుద్ధము
- మూడవ రోజు యుద్ధం గరుడవ్యూహం అర్ధ చంద్ర వ్యూహం
- అర్జున భీష్ముల పరాక్రమం
- సుయోధనుని నిష్ఠూరపు మాటలు భీష్ముని రౌద్ర రూపం
- శ్రీకృష్ణుడు సుదర్శన చక్రాన్ని చేత పట్టుట
- అర్జునిని ప్రతాపం
- నాల్గవరోజు యుద్ధం
- అభిమన్యుని ప్రతాపం
- శల్యుని కుమారుని మరణం



అంపశయ్యపై భీష్ముడు - 17వ శతాబ్దానికి చెందిన చిత్రం

- దృతరాష్ట్రుడు యుద్ధ పరిణామమునకు వగచుట
- భీముని ప్రతాపం
- దృతరాష్ట్రకుమారులను భీముడు హతమార్చుట
- ఘటోత్కచుని యుద్ధం
- తనవారి పరాజమునకు దృతరాష్ట్రుడు పరితపించుట
- భీష్ముడు నరనారాయణుల గురించి సుయోధనునికి వివరించుట
- అయిదవరోజు యుద్ధం మకర వ్యూహం డేగవ్యూహం
- పాండవులతో ద్రోణ, భీష్ముల యుద్ధం
- భీమసేనుని పరాక్రమం
- పాండవ కౌరవ సేనల మధ్య సంకుల సమరం
- ఆరవరోజు యుద్ధం
- దృతరాష్ట్రుని సందేహం
  - యుధిష్టరుడు ధృష్టద్యుమ్నుడికి సాయం పంపుట

# ఆధ్యాత్మిక విశేషాలు

భీష్మ పర్వములో మొదటి పది రోజుల కురుక్షేత్ర సంగ్రామం వర్ణింబడింది. కాని యద్ధమే కాక ఈ పర్వంలో అనేక ఆధ్యాత్మిక విశేషాలున్నాయి.

## భగవద్గీత

ఈ పర్వంలో అంతర్గత భాగంగా ఉన్న భగవద్గీత హిందువుల పవిత్ర గ్రంధాలలో ఒకటిగా పరిగణింపబడుతున్నది.భగవద్గీత , భీష్మ పర్వము 25వ అధ్యాయము మొదలు 42వ అధ్యాయము వరకు 18 అధ్యాయములు భగవద్గీతగా ప్రసిద్ధము. కాని గీత ఒక ప్రత్యేక గ్రంధముగా భావింపబడుతుంది. సాక్షాత్తు కృష్ణ భగవానుడు బోధించిన జ్ఞానము గనుక ఇది హిందువుల పరమ పవిత్ర గ్రంధాలలో ఒకటి. సిద్ధాంత గ్రంథమైన భగవద్గీతయందు వేద, వేదాంత, యోగ విశేషాలున్నాయి. భగవద్గీతను తరచుగా "గీత" అని సంక్షిప్త నామంతో పిలుస్తారు. దీనిని "గీతోపనిషత్తు" అని కూడా అంటారు.భగవద్గీతలో భగవంతుని తత్వము, ఆత్మ తత్వము, జీవన గమ్యము, గమ్యసాధనా యోగములు బోధింపబడినవి.

## దుర్గా స్తోత్రము

యద్ధారంభంలో కృష్ణుని సలహా మేరకు అర్జునుడు విజయాన్ని ఆశించి దుర్గాదేవిని స్తుతిస్తాడు.

నమస్తే సిద్ధ సేనాని, చార్యే, మందార వాసిని
కుమారి, కాళి, కాపాలి, కృష్ణపింగళే,
భద్రకాళి నమస్తుభ్యం మహాకాళి నమోస్తుతే
చండి, చండే నమస్తుభ్యం తారిణీం, వరవర్ణిని
కాత్యాయిని, మహాభాగే, కరాళి, విజయే, జయే
శిఖిపింఛ ధ్వజధరే, నానాభరణ భూషితే,
వేదశ్రుతి మహాపుణ్యే, బ్రహ్మణ్యే, జాతవేదసే
జంబూకటక చైత్యేషు నిత్యం సన్నిహితాలయే
స్వాహాకార: స్వధాచైవ కళా కాష్ఠా సరస్వతి

సావిత్రీ వేదమాతాశ్చ తథా వేదాంతరూపిణి!
స్తుతాసిత్వం మహాదేవి! విశుద్ధేనాంతరాత్మనా
జయో భవతు మే నిత్యం త్వత్ప్రసాద్రణాజిరే

ఆ స్తోత్రం విని దేవి ప్రసన్నయై అర్జునునికి విజయం తప్పక లభిస్తుందని వరమిస్తుంది.

## వ్యాసుని రచనా విశేషాలు

సంస్కృత రచనలో ఈ పర్వంలో 60 నుండి 64 వరకు ఉపపర్వములు ఉన్నాయి.

## కవిత్రయం రచనా విశేషాలు

ఆంధ్ర మహాభారతంలో ఈ పర్వాన్ని తిక్కన సోమయాజి వ్రాశాడు. తిక్కన యద్ధ వర్ణనా కౌశల్యం ఆయన రచనలో స్పష్టంగా కనిపిస్తుంది. ఆంధ్రీకరణలో తిక్కన భగవద్గీతను వదలి వేశాడు. ఇందుకు వివిధ కారణాలను విమర్శకులు ఊహిస్తున్నారు. భగవద్గీత స్వయంగా భగవంతుని వాక్కు గనుక దానిని తెలుగు చేయకుండా తిక్కన వదలివేశాడని. మరొక కారణం తిక్కన కధన విధానానికి ఈ భాగం అనుకూలంగా లేదని.

## మూలాలు, వనరులు

## బయటి లింకులు

- కిశోరీ మోహన్ గంగూలీ ఆంగ్లానువాదము (http://www.sacred-texts.com/hin/m01/index.htm)

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • **భీష్మ పర్వము** • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక |

విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి |

యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు

# భీష్మ పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# ప్రథమాశ్వాసం


సంజయునికి శీఘ్రగమనము , దూరశ్రవణం మొదలైన శక్తులు ప్రసాదిస్తున్న వ్యాసుడు

జనమేజయుడు వైశంపాయనుని చూసి " ఒకరిని ఒకరు గెలవవలనన్న తలపుతో పాండవులు కౌరవులు ఎలా ప్రవర్తించారు. యుద్ధం ఎలా జరిగిందో నాకు వివరించండి " అని అడిగాడు. వైశంపాయనుడు ఇలా చెప్పసాగాడు. పుణ్య క్షేత్రమైన కురుక్షేత్రంలో చేరిన ఇరు పక్షముల వారు కదనోత్సాహంతో విడిసి ఉన్నారు. తన కుమారుల అవిధేయతకు కలత పడిన ధృతరాష్ట్రుడు సంజయుని పిలిపించుకుని ఇంతలో వ్యాసుడు అక్కడకు వచ్చాడు. ధృతరాష్ట్రుడు అర్ఘ్యపాద్యములు సమర్పించిన పిమ్మట వ్యాసుడు " ధృతరాష్ట్రా ! ఈ భూమి మీద ఉన్న రాజులందరికి కాలం తీరింది కనుకనే ఈ యుద్ధం సంప్రాప్తమైంది. ఇందుకు నీవు చింతించ పని లేదు. నీకు నేను దివ్య దృష్టి ప్రసాదిస్తాను నీవు యుద్ధ భూమిలో ఏమి జరుగుతుందో స్వయంగా చూడవచ్చు " అన్నాడు. ధృతరాష్ట్రుడు " వ్యాసమహర్షీ ! అన్నదమ్ములు ఘోరంగా యుద్ధం చేసుకోవడం నేను ఎలా చూడగలను . నాకు యుద్ధ విశేషాలు వినే భాగ్యం ప్రసాదిస్తే చాలు " అన్నాడు. వ్యాసమహర్షి " సంజయుని చూసి " సంజయా ! నీవు ధృతరాష్ట్రునుకి యుద్ధ విశేషాలు వివరించడానికి అనువుగా నీకు రెండు పక్షములలో జరిగే రహస్య సంభాషణ లు , వారి మనో వృత్తులు తెలుసుకునే శక్తిని ప్రసాదిస్తున్నాను. నీవు తలచిన వెంటనే యుద్ధ భూమిలో ప్రవేశించి అంతటా సురక్షితంగా సంచరించగలవు ఏ అస్త్ర శస్త్రం నీకు హాని కలిగించదు. కనుక నీవు చూసినది చూసినట్లు ధృతరాష్ట్రునికి వర్ణించు " అన్నాడు. వ్యాసుడు ఆ తరవాత సంజయునికి శీఘ్రగమనము , దూరశ్రవణం మొదలైన శక్తులు ప్రసాదించాడు. వ్యాసుడు " ధృతరాష్ట్రా ! భూభారం తగ్గించడానికి సంభవించిన ఈ యుద్ధానికి చింత వలదు. పలు దుశ్శకునాలు గోచరిస్తున్నాయి. కనుక కుల క్షయం తప్పదు. అనేక రాజులు నశించక తప్పదు. ధర్మం జయిస్తుంది ఇప్పటికైనా మించి పోలేదు నీ కుమారులను ఒప్పించి పాండవుల రాజ్యభాగం ఇప్పించి ఈ మారణ హోమాన్ని ఆపించు " అన్నాడు. ధృతరాష్ట్రుడు " మహాత్మా ! నా కుమారులు అవిధేయులు నా మాట వినరు. నా దోషం లేకుండా నేను అనేక విధముల చెప్పాను. అన్నీ నిష్ప్రయోజనం అయ్యాయి నేను ఏమి చేయగలను " అన్నాడు. వ్యాసుడు " ధృతరాష్ట్రా ! జయాపజయాలు దైవాధీనాలు ఎలా జరగాలో అలాగే జరుగుతుంది " అని చెప్పి వెళ్ళాడు.

## ధృతరాష్ట్ర సంజయుల సంభాషణ

ధృతరాష్ట్రుడు సంజయుని చూసి " సంజయా ! ఈ భూమి కోసం ఎందరో యుద్ధాలు చేసి తమ ప్రాణాలు పోగొట్టు కున్నారు. భూమి అంటే అంత తీపి ఎందుకు? సంజయా ఈ భూమి యొక్క పరిమాణం , స్వరూపం గురించి నాకు వివరించు " అన్నాడు. సంజయుడు " రాజా ! ఈ భూమి నానా విధ చరాచరములకు నిలయం . ఆకాశం యొక్క గుణం శబ్దం. వాయువు గుణం శబ్దం, స్పర్శ. అగ్ని గుణములు శబ్దం, స్పర్శ, రూపములు. జలము యొక్క గుణము శబ్ద, స్పర్శ, రూప, రసములు. భూమి యొక్క గుణం శబ్ద, స్పర్శ, రూపం, రసము, గంధం (వాసన). కనుక పంచ భూతములలో ప్రధానమైనది. మేరు పర్వతమునకు దక్షిణమున సుదర్శనం అను పేరు కలిగిన ఒక సువిశాల ప్రదేశం కలదు. దాని వైశాల్యం 2,500 యోజనములు. అందు మధురసభరితమైన ఒక జంబు (నేరేడు) వృక్షం కలదు. దాని పండ్లు నేల రాలి చితికి ఆ రసము ఏరులై ప్రవహిస్తూ పర్వతములకు ప్రదక్షిణ చేస్తూ కురు భూమి గుండా ప్రవహించి సముద్రంలో చేరుతుంది. ఆ నదిని జంబు నది అంటారు. ఆ నదిలో ప్రవహించు నీరు సోకిన ప్రదేశం బంగారు మయమగును. కనుక బంగారమునకు జంబూనదం అనే పేరు కూడా కలదు. ఆ జలం త్రాగిన వారికి ముసలి తనం, రోగములు, దాహం , ఉండదు. కనుకనే ఈ భూమికి జంబూ ద్వీపం , సుదర్శన ద్వీపం అనే పేర్లు వచ్చాయి. ఈ ద్వీపమునకు తూర్పు పడమరలు సముద్రముచే ఆవహించి ఉండును. ఈ ద్వీపమున హిమాలయం, దానికి ఆవల హేమకూటం, నిషిద పర్వతం క్రమముగా నీల, శ్వేత, శృంగ పర్వతములు ఉంటాయి. వీటన్నిటి నడుమ మేరు పర్వతం భూమి లోనికి చొచ్చుకొని 16,000 వేల యోజనములు విస్తరించి 84,000 యోజనములు పొడవున ఉన్నది. మేరు పర్వతములో దేవతలు, దేవమునులు, గంధర్వులు, కిన్నెర, కింపురుష, దిక్పాలకులు, బ్రహ్మదేవుడు విహరిస్తున్నారు. దానికి ఉత్తరంలో కర్ణికార వనంలో ఈశ్వరుడు గౌరీసమేతుడై విహరిస్తుంటాడు.

### జంబూద్వీప విశేషాలు

జంబూద్వీపంలో ఉన్న జనపదాలు తొమ్మిది భాగాలుగా విభజించబడ్డాయి. వాటిని వర్షములు అంటారు. వాటిలో మొదటిది ఉత్తర సముద్రం శృంగవంతం మద్య భాగాన్ని ఐరావత వర్షం అంటారు. రెండవది శ్వేతపర్వము శృంగవంతం మద్య ఉన్న భూభాగం దీనిని హిరణ్మయము అంటారు. మూడవది నీల శైలముకు ఉత్తర మున ఉన్న ప్రదేశము దీనిని రమణక వర్షం అంటారు. నాలుగవది నీల శైలముకు దక్షిణమున ఉన్న ప్రదేశం దానిని నీలాకృత వర్షం అంటారు. ఐదవది మేరు పర్వతానికి తూర్పున ఉన్న ప్రదేశం దీనిని భద్రాశ్వ వర్షం అంటారు. ఆరవది మేరుపర్వతానికి పశ్చిమమున ఉన్న ప్రదేశం. దీనిని కేతు మాలా వర్షం అంటారు. ఏడవది మేరు పర్వతానికి ఉత్తరమున ఉన్న ప్రదేశం దీనిని హరి వర్షం అంటారు. హిమవత్పర్వతానికి అటు ఉన్న ప్రదేశం వీటిని కింపురుష వర్షం ఇటు వైపు ఉన్న ప్రదేశం దీనిని భారత వర్షం అంటారు. ఈ జంబూ ద్వీపము విస్తీర్ణం 80,600 యోజనములు. దీనికి రెండింతల విస్తీర్ణం కలిగి లవణ, ఇక్షురస, ఘృత, దధి, క్షీర , శుద్ధ జల సముద్రములు క్రమముగా ఒకదాని కంటే ఒకటి రెండింతల విస్తీర్ణం కలిగి ఉన్నాయి. ఇందు లక్షద్వీపము, శాల్మల ద్వీపము, కౌంచద్వీపము, కుశద్వీపము, శాకద్వీపము, పుష్కరద్వీపము అను ఆరు ద్వీపములు ఉన్నాయి. ఈ ద్వీపములో అనేక పర్వతములు, నదులు, జనపదములు ఉన్నాయి.

## దృతరాష్ట్ర సంజయుల వాదం

ఈ జంబూద్వీపానికి కర్త భర్త అయిన శ్రీమన్నారాయణుడు పాలసముద్రానికి ఆవల కనక మయమైన ఎనిమిది చక్రములు కలిగిన దివ్య రథం మనోజ్ఞ దివ్య రథము పైన వైకుంఠములో విహరించు చున్నాడు " అన్నాడు సంజయుడు. దృతరాష్ట్రుడు " సంజయా ! ఈ భరత వర్షం పైన దురాశతో పాండవులు కౌరౌవులు యుద్ధం చేస్తున్నారు కదా ! ఇంతకంటే దురాశపరులు ఈ లోకంలో ఉంటారా " అన్నాడు. సంజయుడు " రాజా ! నీవు అనవసరంగా పదే పదే పాండవులను నిందిస్తున్నావు నీ కుమారులే శకుని మాటలు విని వారి రాజ్యభాగాన్ని అన్యాయంగా అపహరించారు. పాండవులకు నీ రాజ్యంపై ఎలాంటి ఆశ లేదు. ఎందరో రాజులు పాండవులను గెలవాలనే తలపుతో సుయోధనుని పక్షాన యుద్ధం చేస్తున్నారు. వారిని నిందించి ప్రయోజనమేమి. పూర్వం యయాతి, భగీరధుడు, రఘువు, నహుషువు లాంటి మహానుభావులు రాజ్య విస్తరణ కొరకు యుద్ధాలు చేసారు. యజ్ఞ యాగాదులు చేసి యశస్సు గడించారు. రత్నగర్భ అయిన ఈ భారత దేశ సంపదల మీద ఆశతోను ఈ ర్ష్యతోను యుద్ధములు చేయుట అనివార్యం.

### భరత వర్షంలోని సంపదలు

ఈ భరతవర్షమున మలయము, శక్తిమంతము, వింధ్య, పారియాత్ర, మహేంద్రము, ఋక్షవంతము, సహ్యాద్రి, పారియాత్ర, మహేంద్రం, ఋక్షవంతం, అను పది పర్వతములు ఉన్నాయి. ఈ భూమిలో రత్నములు, మణులు, ఇనుము, రాగి, తగరం, బంగారం, వెండి మొదలైన ఖనిజాలు ఉన్నాయి. ఇందు గంగ, తుంగభద్ర, వేత్రవతి, వేదవతి, కృష్ణవేణి, పెన్న, యమున, తమస, శారావతి, కావేరి, గోదావరి, నర్మద, బహుద, సరయు, శతద్రువు, వితస్త, విపాత, తామ్రపర్ణి అను మహా నదులు ప్రవహించి భరతవర్షాన్ని సశ్యశ్యామలం చేస్తున్నాయి. ఈ భూమి పాండిపంటలకు ధనధాన్యములకు పుట్టినిల్లు. భరతవర్షమున పాంచాల, పాండ్య, బర్బర, వత్స, మత్స్య, మగధ, మళయాళ, కళింగ, కుళింగ, కురు, కొంకణ, టెంకణ, త్రిగర్త, సాముద్ర, సాళ్వ, శూరసేన, సుధేష్ణ, సుహ్మ, కరూశ, కాశ, కోసల, యవన యుగంధర, ఆంధ్ర, సింధు, ధేది, చోళ, పుళింద, పుండ్రక, పాండ్య, అభీర, సావీర, సౌరాష్ట్ర, మహారాష్ట్ర, విదేహ, విదర్బ, ద్రవిడ, దశార్ణ, కర్ణాట, గౌళ, అంగ, వంగ, మరాఠ, లాట, బాహ్లీక, బహుదాన, కిరాత, కేకయ, అశ్మంతక, కాశ్మీర, గాంధార, కాంబోజ, కేరళ, మాళవ, నేపాళ, గూర్జర, కుంతల, అవంతి మొదలైన జనపదములలోని జనులు సమస్త వస్తు సంపదలతో సుఖజీవనం చేస్తున్నారు. సమస్త జనులకు రాజులకు ఈ భూమి కామధేనువు వంటిది. ఈ భూమి మీద మమకారంతో రాజులు ఒకరిని ఒకరు అన్నదమ్ములు, తండ్రీ కొడుకులు అని కూడా చూడక చంపు కుంటున్నారు. ఈ భూమి మీద రాజులకు వోగాలం దాపురించి ఈ యుద్ధభూమిన చేరారు. ఏమి జరుగనున్నదో " అని చింతించాడు.

## యుద్ధ సమాచారములు సంజయుడు దృతరాష్ట్రునికి చెప్పుట

దృతరాష్ట్రుడు " సంజయా ! ఇక నీవు యుద్ధభూమికి వెళ్ళి ఏమి జరుగుతుందో చూసి రా " అని పంపాడు. యుద్ధభూమికి వెళ్ళిన సంజయుడు కొన్ని రోజుల తరవాత తిరిగి వచ్చి దృతరాష్ట్రుని ఏడుస్తూ పాదముల పై పడ్డాడు. అయ్యో రాజా ! పరాక్రమ వంతులలో పరాక్రమవంతుడైన భీష్ముడు అంపశయ్యపై పడి ఉన్నాడు. పరశురాముని జయించిన వీరుడు శిఖండి చేత భంగపడ్డాడు. ఏ భీష్ముని అండ చూసుకుని నీకొడుకు జూదంలో పాండవులను గెలిచాడో ఆ భీష్ముడు యుద్ధమనే జూదంలో ఓడి పోయాడు. పది వేల సైన్యం ఎదురు వచ్చినా ఒక్కడుగా ఎదుర్కొనగల వీరుడు పది రోజుల వీరోచిత పోరు


కురు పాండవ యుద్ధము గురించి ధృతరాష్ట్రునకు వివరిస్తున్న సంజయుడు

సలిపిన పిదప నేలకొరిగాడు " అని విలపించసాగాడు. భీష్ముడు నేలకొరిగిన వార్త విన్న ధృతరాష్ట్రుడు మూర్చిల్లాడు. కొంతసేపటికి తేరుకుని " సంజయా ! దేవాసురులు ఒకటై వచ్చినా చలించని భీష్ముడు నేలకొరిగాడా ! శస్త్రాస్త్ర ప్రకరణములతో విరోధుల మద మణచుచున్న భీష్ముని శిఖండి ఒంటరిగా ఎదిరించడం కంటే ఆశ్చర్యం ఏమి ! ప్రచండ ఛండమారుతం లాంటి భీష్ముని శిఖండి అనే చిరుగాలి ఎదిరించిందా ! అంబ కొరకు పోరిన పరశురాముని ఎదిరించి నిలిచిన భీష్ముడు పాండవుల కొరకు శిఖండి చేతిలో నేల కొరిగాడా ! అతని సత్వము, శౌర్యము, శీలము, పరాక్రమము, అతని శుద్ధ వ్రతము నాశం లేనివని నమ్మాను కదా ! ఇప్పుడు ఏమి చేయాలి " అని రోదించి తిరిగి " సంజయా ! భీష్ముని పై అస్త్ర వర్షం కురిపిస్తు న్నప్పుడు మన వాళ్ళు అడ్డుకొనలేదా ఇన్ని అక్షౌహినుల సైన్యం ఒక్క భీష్ముని రక్షించలేక పోయిందా ! ద్రోణుడు, అశ్వథామ, కృపుడు, శల్యుడు పారి పోయారా ! లేకున్న భీష్మునికి ఈ విధమైన స్థితి ఏమిటి . కుల వృద్ధుడైన గాంగేయుని వధించి రాజ్యా ధికారాన్ని చేపట్టడానికి ధర్మరాజు సాహసించడం అధర్మం కాదా ! అధర్మానికి ఒడికట్టిన పాండవులకు దైవం తోడైంది కదా ! కౌరవ సేన అనాధ అయింది కదా ! నా కుమారులు ఎంత కలత పడుతున్నారో కదా ! ఈ పది రోజులు యుద్ధం ఎలా సాగింది ? భీష్ముడు పోరు ఎలా సాగించాడు. నాకు సవివరంగా వివరించు " అన్నాడు. సంజయుడు " మహారాజా ! నీ అవినీతి వలనే కదా పాండవులు ఇన్ని కష్టాల పాలు అయింది. ధర్మపరులైన పాండవులకు అపకారం చేసినందుకు ఫలితం అనుభవించక తప్పదు " అని చెప్పి సంజయుడు యుద్ధం గురించి వివరించ సాగాడు.

## కౌరవుల యుద్ధ సన్నాహం


ద్రోణునకు తన సైన్యాన్ని చూపిస్తున్నధుర్యోధనుడు

సంజయుడు వ్యాసభగవానుని స్మరించి వివరణ ప్రారంభించాడు. " రాజా ! ముందుగా నేను మన సైన్యం విడడిది చేసిన ప్రదేశంలో నీ కుమారుని స్థావరానికి వెళ్ళాను అక్కడ సుయోధనుడు గాంగేయాదుల మధ్య కూర్చుని మంతనాలు జరుపుతూ " దుశ్శాసనా ! పాండవులతో యుద్ధం చేయాలన్న మన కుతూహలం ఈ నాటికి తీరనున్నది. భీష్ముడు మన సైన్యాలకు ఆరవ ప్రాణం అతడు ఒక్కడే పాండవ సైన్యాలను అంత మొందించగల యోధుడు . మనలను రక్షించు భీష్ముని మనం కంటికి రెప్పవలె రక్షించుకోవాలి . ఈతడిని ఎదిరించి నిలువగలిగిన వీరుడు ఈ అవనిలో లేడు. శిఖండి తప్ప ఈడిని నిలుప గలిగిన వారు లేరు. కనుక మనం ఈ మహానుభావుడికి శిఖండి చేతిలో మరణం సంభవించకుండా కాపాడుకోవాలి. భీష్మునికి శిఖండి ఎదురు రాకుండా జాగ్రత్తగా చూడండి " అన్నాడు. ఆపై శంఖములు, దుందుభులు , మంగళ వాద్యముల నడుమ కౌరవ సేనలు యుద్ధానికి బయలు దేరాయి. సువర్ణ తాళ కేతనముతో భీష్ముడు, కాంచన వేదిక కేతనముగా ద్రోణుడు, బంగారు గోవు కేతనంగా కృపుడు, తోకసహిత సింహం కేతనంగా అశ్వద్ధామ, అరటి చెట్టు కేతనంగా శల్యుడు మొదలైన వీరులు బయలు దేరారు. యాదవ బలంతో కృతవర్మ, ససైన్య సమేతంగా మహారధుడైన జయద్రధుడు, గజబలంతో విందానువిందులు, కళింగ సైన్య సమేతంగా భగదత్తుడు, ససైన్య సమేతంగా తన కుమారులు తమ్ములు వెంట రాగా గాంధార రాజు శకుని , సోమదత్తుడు, భూరి శ్రవుడు, బాహ్లికుడు తమ తమ సైన్యాలతో మొహరించారు. కాంభోజరాజు సుదక్షిణుడు, కోసలరాజు బృహద్బలుడు, మహిష్మతీ పురాధీశుడు నీలుడు, త్రిగర్తాధిపతి సుశర్మ, అసుర వీరుడు అలంబసుడు, సాళ్వ, సౌవీర, శూరసేన, యవన రాజులంతా పది అక్షౌహినుల సైన్యంతో సిద్ధంకాగా నీ కుమారుడు తన అక్షౌహిని సైన్యంతో పాము పడగ కేతనంతో యుద్ధానికి తరలి వెళ్ళారు. నీ కుమారునికి ఇరు వైపుల దుశ్శాసనుడు, దుర్మరణుడు, వివింశతి , వికర్ణుడు ఉన్నారు.

## భీష్ముడు సైన్యాలను యుద్ధోన్ముఖులను చేయుట

సైన్యాధ్యక్షుడైన భీష్ముడు " మహావీరులారా ! క్షత్రియ వీరులకు యుద్ధభూమిలో స్వర్గద్వారాలు తెరిచి ఉంటాయి. ఇంతకు ముందు ఎందరో యుద్ధంలో మరణించి ఆ మార్గంలో ప్రయాణించారు. క్షత్రియ వీరులకు ఇంట్లో రోగాల బారిన పడి మరణించడం కంటే మరో పాపం లేదు కనుక మీరు కూడా ఆ మార్గంలో పయనించండి. రణరంగం క్షత్రియులకు పెన్నిధి వంటింది " అన్నాడు. ఆ మాటలు విన్న క్షత్రియ వీరులు ఉత్సాహంగా " మేమంతా మీ వెంట ఉండి విజయమో వీరస్వర్గమో తేల్చుకుంటాము " అన్నారు. తరవాత సుయోధనుని అడిగి కర్ణుడు తన పుత్ర, మిత్ర, అమాత్య, బంధు సహితంగా యుద్ధభూమిలో లేడని నిర్ధారించుకున్నాడు. సుయోధనుడు కర్ణుడు అతని సంబంధితులు యుద్ధ భూమిలో లేరని భీష్మునకు తెలిపి అలాగే వ్యూహ రచన చేయమని వేడుకున్నాడు. భీష్ముడు వ్యూహరచన చేసాడు. భీష్ముడు, ద్రోణుడు పడమర ముఖంగా నిలబడ్డారు. తమకు ఒక వైపు కృపాచార్య అశ్వథామలు, మరొక పక్క కృతవర్మ, శల్యులను నిలిపాడు. వెనుక బాహ్లీక సోమదత్తులు ఉన్నారు. నడుమ సుయోధనుడు ఉన్నాడు. సుశర్మ మొదలైన వారిని అక్కడక్కడ నిలిపారు.

## పాండవుల యుద్ధసన్నాహం


పాండవ సేనాని ధృష్టద్యుమ్నుడు

పాండవులు యుద్ధ సన్నద్ధులై రణ భూమిలో ప్రవేశించారు. యుధిష్టరుడు అగ్రభాగాన వెలిగి పోతున్నాడు. ధర్మరాజుకు ఒక వైపు భీముడు గధను ధరించి నిలువగా మరొక వైపు అర్జునుడు గాండీవధారి అయి నిలిచాడు. శ్రీకృష్ణ సారధ్యంలో , కపిధ్వజం రెపరెపలాడు చుండగా అర్జునుడు ధనుష్టంకారం చేసాడు. నకుల సహదేవులు అర్జునిని అనుసరించారు. ద్రౌపదీ సుతులు తమ సైన్యాలతో మొహరించారు. ప్రతి వింధ్యుడు, శ్రుతసోముడు, శతానీకుడు, శ్రుతసేనుడు, సౌభద్రుడు తమ సైన్యాలతో రణభూమిలో ప్రవేశించారు. గజసైన్య సహితంగా ద్రుపదుడు, అతనికుమారులు, అన్నదమ్ములతో వచ్చాడు. మత్స్య దేశాధిపతి విరాటుడు, యాదవ సైన్యాలతో సాత్యకి, వీర ప్రలాపములు చేస్తూ చేకితానుడు, వీరుడు, శిఖండి యుద్ధ భూమిలో విహరిస్తున్నారు. మగధాధీశుడు సహదేవుడు సముద్రం వంటి తన సైన్యంతో యుద్ధ భూమిలో ప్రవేశించాడు. దృష్టకేతు అధిక పరాక్రమంతో సోదర సహితంగా యుద్ధ భూమిలో ప్రవేశించాడు. భీముని పుత్రుడైన ఘతోత్కచుడు రాక్షస సైన్యంతో యుద్ధ భూమిలో ప్రవేశించాడు. కేకయ రాజులు అయిదుగురు, పాండ్య రాజు, శైభ్యుడు , ఇతర దేశముల నుండి వివిధ రాజులు తమ సైన్యాలతో పాండవ పక్షాన యుద్ధం చేయవచ్చారు. దృష్టధ్యుమ్నుని అధ్యక్షతలో పాండవ సైన్యం యుద్ధ భూమిలో ప్రవేశించింది. తన సైన్యంతో తూర్పు ముఖంగా నిలబడి యుధిష్టరుడు " వీరాధి వీరులారా ! ఈ యుద్ధం మనకు జయాన్నిచ్చిన భూమిని అంతా కైవశం చేయవచ్చు లేని ఎడల వీరస్వర్గం ఇవ్వనూ వచ్చు మనం ఎందుకైనా సిద్ధంగా ఉండాలి " అన్నాడు. ఆ మాటలకు దేశాధిపతులు ఉత్సాహ పూరితులై జయజయ ధ్వానాలు చేసారు.

## సంజయుడు యొద్ధాన్ని ఎదుర్కొను పాండవుల ధైర్యాన్ని వర్ణించుట

దృతరాష్టుడు సంజయునితో " సంజయా ! అత్యధికమైన మన సైన్యంతో పోరుసల్పడానికి అల్పసైన్యం కలిగిన పాండవులు ఎలా సాహసించారు ? " అని ప్రశ్నించాడు. సమాధానంగా సంజయుడు " రాజా ! అర్జున యుధిష్టరుల సంభాషణ వింటే ఇది మీకు అవగతమౌతుంది . ధర్మరాజు అర్జునితో " అర్జునా ! కౌరవ సైన్యం బలంగా ఉంది మనసైన్యం స్వల్పం " అన్నాడు. అర్జునుడు " అన్నయ్యా ! పూర్వం నారదుడు భీష్మ, ద్రోణాదులు వింటూ ఉండగా ఇలా చెప్పాడు. అధర్మ వర్తనులైన సేనలు అధికమైనా ధర్మవర్తనులైన స్వల్ప సైన్యాలు వారిని గెలువగలవు అన్నాడు. అది కాక అసాధారణ భీముని గధాఘాతానికి తట్టుకుని నిలువ ఎవరికి శక్యం కాదు. దృష్టద్యుమ్న, శిఖండి మొదలైన పాంచాల భూపతుల గెవడం ఎవరి తరం. మత్స్య భూపతి విరాటుని బలం నీకు తెలియనిది కాదు. సాత్యకి, చేకితానుల పరాక్రమం మనకు తోడుగా ఉంది. అవక్ర పరాక్రమ వంతుడైన అభిమన్యుడు , మాయా విధ్యా కోవిదుడైన ఘటోత్కచుడు మనకు చేదోడుగా ఉన్నారు. శ్రీకృష్ణుని తోడు మన కున్నది. నీ ధర్మనిరతి మనకు రక్షగా ఉంది. నా గాండీవం శక్తి నీకు తెలియనిది కాదు. నీ శక్తి నీకు తెలియదు. నీవు కోపించిన దేవతలు కూడా నీ ముందు నిలువ లేరు. కనుక కలత చెంద వద్దు " అన్నాడు. అర్జునిని మాటలకు ఆనందించిన ధర్మరాజు కౌరవులకు ధీటుగా ఒక వ్యూహం పన్నమని దృష్టద్యుమ్నునకు చెప్పమని చెప్పాడు. అర్జునుడు అలాగే చేసాడు. దృష్టద్యుమ్నుని వ్యూహరచన ప్రకారం అభిమన్య, ఉప పాండవ, నకుల సహదేవుల సహితంగా భీముడు సైన్యాలకు అగ్రభాగంలో నిలబడ్డాడు. చేకితానుడు , సాత్యకి, పాంచాల దేశాధిపతులు, మత్స్యదేశాధీసుడు తమ తమ సన్య సమేతంగా

ఉత్తర దక్షిణ భాగంలో నిలిచారు. నడుమ గజారూఢుడై ధర్మరాజు నిలిచాడు. అందరికన్నా ముందు అర్జునిని రక్షణలో శిఖండి భీష్ముని ఎదుట నిలిచాడు. వెనుక భాగంలో మగదాధీశుడు, దుష్టకేతువు నిలిచారు. రధములు, అశ్వములు, కాల్బలములతో శమంతక పంచకం నిండి పోయింది. ఈ భూమి పైన బాలవృద్ధులు తప్ప మిగిలిన మగవారంతా యుద్ధ భూమిలో ఉన్నారు. దృతరాష్టుడు " సంజయా ! ఇరువైపులా ఉన్న సైన్యంలో ఎవరు బలవంతులు " అన్నాడు. సంజయుడు " రాజా! ఇరువైపులా ఉన్న సైన్యాలు ఎవరికి వారే తమ బలం ఎక్కువని చెప్పుకుంటున్నారు. నాకు మాత్రం శ్రీకృష్ణుని అండ ఉన్న పాండవ సైన్యం బలమైనదని తోచుచున్నది " అన్నాడు.

## ధర్మరాజు పితామహ గురువుల వద్ద యుద్ధానికి అనుమతి తీసుకొనుట


పితామహ వద్ద యుద్ధానికి అనుమతి తీసుకొనుచున్న ధర్మరాజు

కృష్ణార్జునులు పాంచజన్యం, దేవదత్తంలు పూరించగా అవి పాండవ సైన్యంలో ఉత్సాహాన్ని కౌరవ సైన్యంలో కలతను కలిగించాయి. కౌరవ సైన్యాలకు ఉత్సాహం కలిగించే విధంగా మంగళ తూర్య నాధాలు మ్రోగించారు. ఆ సమయంలో ధర్మరాజు తన ఆయుధములను కవచాన్ని రధంలో వదిలి భీష్ముని వైపు పాదచారి అయి నడువ సాగాడు. అది చూసిన కృష్ణ , సాత్యకి ఇతర ధర్మరాజ సన్నిహితులు కలవర పడి రధాలు దిగి ధర్మరాజును అనుసరించారు. " ఇందరం నీ వెంట ఉండగా నీవు ఇలా పాదచారివై వెడలుట ఏమి. శత్రువులు మనది పిరికితనం అని హేళన చేయరా " అని సోదరులు తలా ఒక విధంగా అడుగుతున్నా ధర్మరాజు మౌనం వీడక చేతులు ముకుళించి నడచి పోతునే ఉన్నాడు. అది చూసిన శ్రీకృష్ణుడు " ధర్మజుని తలపు నాకు తెలుసు. అతడు భీష్మ, ద్రోణ, కృపాచార్య, శల్యులకు నమస్కరించి యుద్ధం చేయడానికి అనుమతి తీసుకోవడానికి వెళుతున్నాడు. అలా చేస్తే విజయం తధ్యం " అన్నాడు. ఆ మాటలు విని అందరూ మౌనంగా జరిగేది వీక్షించ సాగారు. కృషార్జున, నకులసహదేవ, భీమాదులతో ధర్మరాజు భీష్ముని ఎదుట నిలువగా కౌరవ ప్రముఖులు మాత్రం ధర్మరాజులోని రాకకు అంతర్యం తెలియక భీమార్జున, నకులసహదేవ, ద్రుపద, సాత్యకుల అండ ఉన్న ధర్మరాజుకు భయమేల అని కొందరు అనుకోసాగారు. ధర్మరాజు పిరికి వాడు కాదు అయినా ఈ సమయంలో ఈ రాకలోని అంతర్యం ఏమిటో అనుకున్నారు. మానధనుడైన ధర్మరాజు ఏమి మాట్లాడతాడో, భీష్ముడు ఎలా సత్కరిస్తాడో, కృష్ణార్జునుల అంతర్య మేమిటో, భీమాదులు ఏమి చెప్తారో అని పలు పలు విధాలుగా ఆలోచించసాగారు. ధర్మరాజు భీష్ముని ఎదుట నిలిచి " మహానుభావా ! మీ ఎదుట నిలిచి యుద్ధం చేయవలసిన దుస్థితికి చింతిస్తున్నాను. మీ దీవెనలకు అనుమతికి వచ్చాను నాకు యుద్ధం చేయడానికి అనుమతి ఇచ్చి నన్ను దీవించండి . మీ దీవెనలు నాకు విజయాన్ని ప్రసాదిస్తుంది " అన్నాడు. భీష్ముడు ఆనందించి " ధర్మనందనా ! ఈ సమయంలో నీ రాక సముచితమే కాక ఎంతో శ్రేయస్కరం కూడా . నీవిట్లు చేయకున్న నా శాపానికి గురికావలసి ఉండేవాడివి. ఇక నీకు జయం కలుగుతుంది. నీ పక్షాన యుద్ధం చేయడం తప్ప ఏదైనా వరం కోరుకో అనుగ్రహసిస్తాను. నీకు మేలు జరుగుతుంది " అన్నాడు. ధర్మరాజు " పితామహా ! మీరు రారాజు తరఫున యుద్ధం చేయండి కాని మాకు మేలు చేయండి " అని కోరాడు. భీష్ముడు " ధర్మరాజా ! నీ ఆంతర్యం వివరించు " అన్నాడు. ధర్మరాజు " పితామహా ! మరేమి లేదు మీతో యుద్ధం చేసి గెలవడము ఎలాగో వివరించండి " అన్నాడు. భీష్ముడు చిరునవ్వుతో " ధర్మరాజా ! నాతో రణరంగాన గెలవడం దేవతలకు కూడా సాధ్యం కాదు. అడిగావు కనుక చెప్తాను. నే చేతి ఆయుధం కింద పడిన కాని అది సాధ్యం కాదు. ఇప్పటికి ఇంతకంటే చెప్పను . ఈ సారి మన కలయిక నీ మనోరధాన్ని నెరవేర్చ గలదు " అన్నాడు. భీష్ముని వద్ద అనుమతి పొందిన ధర్మరాజు తన వారితో కలసి ద్రోణ, కృపాచార్య, శల్యులకు నమస్కరించి వారి అనుమతి పొందాడు. ద్రోణుడు " ధర్మజా ! శ్రీకృష్ణుని అండ ఉన్న నీకు విజయం తధ్యం అన్నాడు. ధర్మరాజు ద్రోణుని అతడిని గెలిచే ఉపాయాన్ని చెప్పమని ప్రార్ధించాడు. ద్రోణుడు " ధర్మరాజా ! నా చేతిలో ఆయుధమున్నంత వరకు నన్ను గెలవడం సాధ్యం కాదు కాని నేను అస్త్రసన్యాసం చేసినా ప్రాయోపవేశం చేసినా నన్ను వధించగలరు. అశుభ వార్త వినినంతనే అస్త్రసన్యాసం చేస్తాను " అన్నాడు . కృపాచార్యుని గెలిచే ఉపాయం అడుగగా అతడు " నేను ఎవరి చేత చంపబడను కాని నీకు జయం తధ్యం " అన్నాడు. శల్యుని చూసి ధర్మరాజు తనకిచ్చిన మాట గుర్తు ఉంచుకొమ్మని చెప్పగా. అతడు ధర్మరాజుతో అతడికి ఇచ్చిన మాట గుర్తు ఉన్నదని అలాగే చేస్తానని నిశ్చింతగా ఉండవచ్చని మాట ఇచ్చాడు. శ్రీకృష్ణుడు యుద్ధాన్ని కుతూహలంతో చూడవచ్చిన కర్ణుని చూసి " కర్ణా ! భీష్ముని మీద కోపంతో అతడు పడిపోయే వరకు యుద్ధం చేయనని చెప్పావట కదా ! అప్పటి వరకు పాండవ పక్షాన యుద్ధం చేస్తూ వినోదించవచ్చు కదా ! " అన్నాడు. కర్ణుడు " కృష్ణా ! నేను భీష్ముని మీద కోపంతో యుద్ధం నుండి పైతొలిగాను కాని సుయోధనునికి ఇచ్చిన మాట తప్పనని నీకు తెలియనిదా " అన్నాడు. ఆ పై ధర్మజుడు రధాన్ని అదిరోహించి కవచాన్ని ధరించి కౌరవ పక్షంవైపు కొంత ముందుకు

వెళ్ళి " కౌరవ ప్రముఖులారా ! మీలో ఎవరైనా నాపై ఉన్న అభిమానంతో నా పక్షంలోకి రావచ్చు నేను వారిని నా తమ్ముల వలె చూసుకుంటాను " అన్నాడు. ఆ మాటలు విన్న యుయుత్సుడు ధర్మరాజు పక్షంలో చేరటానికి అంగీకరించాడు. యుయుత్సుడు సుయోధనుని దుష్కృత్యములను నిందిస్తూ పాండవులను పొగుడుతూ తన సైన్యాలతో పాండవ పక్షంలో చేరాడు. ధర్మరాజు సంతోషంగా యుయుత్సుని ఆహ్వానించాడు.

## భగవద్గీత


భగవద్గీత

దృతరాష్టుడు " సంజయా ! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో యుద్ధం చేయు నిశ్చయంతో సమావేశం అయిన నావారైన కౌరవులు, పాండవులు ఏమి చేసారు ?" అని అడిగాడు. సంజయుడు " రాజా ! నీ కుమారుడైన సుయోధనుడు పాండవులు పన్నిన వ్యూహం చూసి ద్రోణుని వద్దకు వెళ్ళి " ఆచార్యా ! దృష్టద్యుమ్న విరచిత సేనలో పాండవ బలం తిలకించండి. భీమార్జున సమాన సాత్యకి, ద్రుపదుడు, చేకితానుడు, పురుజిత్తు, కాశీరాజు, కుంతిభోజుడు, సైభ్యుడు, యుధామన్యుడు, ఉత్తమౌజుడు, అభిమన్యుడు, ద్రౌపదీ పుత్రులు మొదలైన సైన్యాలు భీమ రక్షితమై పరిమితమై ఉన్నది. ఇక మన సేనలో మీరు, భీష్ముడు, శల్యుడు, వికర్ణుడు, భూరిశ్రవుడు పెక్కు మంది రధికులు అస్త్రాస్త్ర కోవిదులు నా కొరకు ప్రాణాలు ఒడ్డి యుద్ధం చేయ సిద్ధమై ఉన్నారు. భీష్మ రక్షితమైన మన సేనలకు మీరంతా రక్షణగా ఉండి భీష్మునికి రక్షణ కల్పిస్తూ ముందుకు సాగండి " అన్నాడు. భీష్ముడు సుయోధనునికి సంతోషం కలిగించేలా శంఖనాదం చేసాడు. అదివిన్న మిగిలిన వారంతా శంఖధ్వానాలు చేసారు. తూర్యనాదాలు మిన్నంటాయి.

## పాండవ సన్నాహం

పాండవ పక్షంలో కృష్ణుడు పాంచజన్యాన్ని, అర్జునుడు దేవదత్తాన్ని, భీముడు పౌండ్రాన్ని, యుధిష్టరుడు అనంత విజయాన్ని, నకుల సహదేవులు సుఘోష, మణి పుష్పకములు వారితో ద్రుపద, విరాట, సాత్యకి, దుష్టద్యుమ్నుడు, శిఖండి ఇతర ప్రముఖులు తమతమ శంఖములను పూరించారు. ఆ శంఖనాదాలు కౌరవ హృదయాలను ఛేదిస్తూ పాండవ సైన్యాలలో ఉత్సాహం కలిగించింది. అర్జునుడు వింటిని సారించి గాండీవానికి నారిని సంధించి కృష్ణుని చూసి " కృష్ణా ! నేను ఎవరితో యుద్ధం చేయాలో చూడాలి కనుక రధాన్ని ఇరు సైన్యాల మధ్యలోకి తీసుకు వెళ్ళాడు. కృష్ణడు రధాన్ని ఇరుసైన్యాల మధ్య భీష్మ, ద్రోణ, ప్రముఖ యోధుల ఎదుట నిలిపి వారిని చూడమని చెప్పాడు. అర్జునుడు కౌరవ సైన్యంలో ఉన్న కురు వృద్ధులను, గురువులను, అన్నలను, తమ్ములను, కుమారులను, బంధువులను, మిత్రులను చూసి మనసు విషాదంతో నిండి పోగా కృష్ణునితో " కృష్ణా ! దుర్మధాంధుడైన సుయోధనుని వలన ఈ యుద్ధం దాపురించిది కదా. ఇరుపక్షాలలోని బంధు మిత్రులను చూసి నా మనసు వికలమైంది. గాండీవం జారిపోతుంది కాళ్ళు వణికి పోతున్నాయి. ఈ యుద్ధం నేను చేయజాలను. ఎవరి సుఖం కొరకు ఈ యుద్ధం చేస్తున్నామో వారందరి రక్తంలో తడిసిన రాజ్యభోగాలు నాకు సుఖాన్ని ఇస్తాయా ! ఇందువలన కీర్తి, యశస్సు ఎలా వస్తుంది. పదునాలుగు భువనాలను ఏలడానికి కూడా ఈ పాపపు యుద్ధం నేను చేయజాలను. యుద్ధం వలన సంభవించే దుష్పరిణామాలు యోచించక సుయోధనుడు అహంకార పూరితుడై దురాశతో యుద్ధం చేస్తే చేయనీ నేను మాత్రం పెద్దలను, గురువులను, బంధువులను , మిత్రులను సంహరించడమే కాక కుల క్షయానికి కారణమైన ఈ యుద్ధం చేయ నాకు మనస్కరించ లేను. కులక్షయం వలన ధర్మం నశిస్తుంది ధర్మం నశించడం వలన వర్ణ సంకరం ఔతుంది. కుల నాశకులకు నరకం తప్పదు. బంధు మిత్రులను చంపి పాపం మూట కట్టుకొనే ఈ యుద్ధం


అర్జునుడికి భోదిస్తున్న కృష్ణుడు

నేను చేయజాలను " అని రధంపై కూలబడ్డాడు. ఇలా శోక విహ్వాలుడైన అర్జునిని చూసి కృష్ణుడు " ఈ విపత్కర సమయంలో నీకు పిరికితనంతో కూడిన ఈ మోహం ఎలా కలిగింది. అవివేకులకు ఇది తగును కాని నీకు కాదు పిరికి తనం వదిలి యుద్ధానికి సన్నద్ధంకా అర్జునా ! లెమ్ము " అన్నాడు. అర్జునుడు " కృష్ణా ! పూజనీయులైన భీష్మ, ద్రోణాదులపై బాణాలు సంధించి జీవించడం కంటే బిక్షమెత్తుకు బ్రతకడం మేలు కదా ! నేను సోదరులైన దృతరాష్ట్ర కుమారులను చంగలనా ! నా హృదయం శోకతప్తమైంది ఇంద్ర పదవి కూడా ఈ శోకాగ్ని చల్లార్చదు . యుద్ధంలో ఎవరు గెలిచినా బంధునాశనం తప్పదు. కార్పణ్య దోషంతో కొట్టబడిన నేను ధర్మా ధర్మ విచక్షణ చేయ లేకున్నాను. నన్ను నీ శిష్యుని చేసుకొని కర్తవ్యాన్ని బోదించు కృష్ణా " అని చేతులు ముకుళించి ప్రార్ధించాడు.

## కృష్ణుడు అర్జునినికి ఆత్మజ్ఞానం భోధించుట


అర్జునినికి ఆత్మజ్ఞానం భోధిస్తున్న కృష్ణుడు

శ్రీకృష్ణుడు " అర్జునా ! శోకించ తగని వారి కొరకు శోకిస్తున్నావు. కాని పండితుని వలె మాట్లాడుతున్నావు. పండితులు జీవించి ఉన్న వారిని గురించి కాని మరణించిన వారి గురించి చింతించరు. అవివేకంతో నీవు పడుతున్న వేదన వివేకంతో ఆలోచించిన పటాపంచలు కాగలదు. పరమ జ్ఞానవంతమైన వాక్యములు చెప్తాను విను జీవుడు ఈ లోకమున బాల్యం, యవ్వనం, వార్ధక్యం ఎలాగో మరణానంతరం చిరిగిన వస్త్రం విడిచి కొత్త వస్త్రాన్ని ధరించిన విధంగా జీర్ణ శరీరాన్ని వదిలి వేరొక నూతన శరీరాన్ని ధరిస్తాడు. పుట్టుక మరణం శరీరానికే కాని ఆత్మకు కాదు. ఆత్మను ఖడ్గం ఖండించ లేదు, అగ్ని దహించ లేదు, జలం తడప లేదు, వాయువు ఆర్పివేయనూ లేదు ఆత్మ శాశ్వితుడు, పురాతనుడు మరణం శరీరానికే కాని ఆత్మకు కాదు. ఆత్మ నిర్గుణుడు ఎవరినీ బాధించడు తాను బాధపడడు. సుఖ దు:ఖములకు కారణం అహంకారం కనుక పార్ధా ! నీవు అహంకారమును వదిలి యుద్ధం చేయుము. స్వధర్మం ఆచరణ యోగ్యం పర ధర్మం పాపం. చక్కగా అనుష్టించ బడిన పరధర్మం కంటే లోప భూయిష్టమైన స్వధర్మం మంచిది. అర్జునా ! క్షత్రియులకు యుద్ధం పరమ ధర్మం తెరిచి ఉంచిన స్వర్గధామం. సందేహం వదిలి యుద్ధం చేయ సన్నద్ధిడివి కా . అర్జునా ! మనుష్యుడు కర్మానిని మాత్రమే ఆచరించ వలెను ఫలితాన్ని దైవానికి వదిలి వేయాలి. దీనిని కర్మ సన్యాసం అంటారు. ఇలా కృష్ణుడు అర్జునినికి తత్వజ్ఞానం అందించి అతని సందేహాలను తీర్చాడు.

### విశ్వరూప సందర్శనం

అర్జునుడు తేలిక పడిన మనసుతో " కృష్ణా ! గుహ్యమైన ఈ శాస్త్రజ్ఞానమును నాకు దయతో ఉపదేశించి నాలోని అజ్ఞానాన్ని పటాపంచలు చేసావు. నా లోని భ్రమలు తొలిగించావు. యోగుల హృదయములకు మాత్రం చూడ సాధ్యమైన నీ అతులిత అయిశ్వరై విభూతులతో కూడిన నీ రూపమును చూడవలెనన్న నా కోరికను మన్నించు కృష్ణా ! " అన్నాడు. కృష్ణుడు " అర్జునా ! నానావిధ శోభితము అనేక ఆకృతులు కలిగిన నా స్వరూపం నీవు ఈ మాంస నేత్రములతో దర్శించ జాలవు కనుక నీకు నేను దివ్య దృష్టిని ప్రసాదించగలను నా దివ్య రూపమును వీక్షించు " అని అర్జునినికి తన విశ్వరూపమును చూపించాడు. వేయు సూర్యుల సమాన కాంతితో వెలిగి పోతున్న ఆ విశ్వరూపుని రూపాన్ని చూసిన అర్జునుడు ఆశ్చర్యం ఆనందం ముప్పిరి గొనగా అనేక దండ ప్రమాణాలు ఆచరించి " దేవా ! బ్రహ్మ దేవుడు, దేవతలు, రాక్షసులు , కిన్నెర, కింపురుషాది సమస్త చరాచర జగత్తు నీ అందు నేను చూస్తున్నాను. అనేక ముఖములు, బాహువులు, కరములు, కన్నులు కనపడుచున్నవి. అనేక కిరీటములు, ఆయుధములు, భూషణములు కనపడుచున్నవి. ఆది, మధ్య, అంతం ఏదో తెలియక ఉన్నది. అప్రమేయమైన నీ రూపం దేదీప్యమై వెలుగుచున్నది. భూమి ఆకాశం నీవే అయి ఉన్నావు. సూర్య, చంద్రులు నీ కన్నులుగా పెద్ద కోరలు కలిగిన నీ ముఖం ప్రజ్వలించుచున్నాయి. నీలో రుద్రులు, ఆదిత్యులు,



విశ్వరూప సందర్శనం

మరుత్తులు, వసువులు లాంటి సకల జగత్తు ప్రవేశిస్తూ ఉన్నది. గుంపులు గుంపులుగా మహామునులు నిన్ను స్తుతిస్తున్నారు. సిద్ధ, సాధ్య, గంధర్వులు నిన్ను ఆశ్చర్యంగా చూస్తున్నారు. దృతరాష్ట్ర సంతతి, భీష్ముడు, ఈ సమస్త రాజలోకము ససైన్య సమేతంగా అగ్ని జ్వాలలు ప్రజ్వలిస్తున్న నీ ముఖం లో ప్రవేసిస్తున్నారు. దుర్నిరీక్షమై ఉగ్రమై ఉన్న నీ విశ్వరూపం చూడ భీతి కలుగుతున్నది. నా ధైర్యం సడలి పోతున్నది అవయవములు పటుత్వం కోల్పోతున్నవి . ఓ మహానుభావా ! నాయందు కరుణ చూపి నీ వెవరో తెలిపి భయంకరమైన నీ విశ్వరూపమును ఉపసంహరించుము. " అర్జునా ! నేనే పరమేశ్వరుడను, కాలుడను, ఇక్కడున్న ఈ జనములను నాశనం చేయుటకు ఉపయుక్తుడనై ఉన్నాను. ఇప్పటికే భీష్మ, ద్రోణాది వీరులను సంహరించాను. నాచే సంహరించబడిన వీరిని నీవు చంపుట కేవలం నిమిత్త మాత్రమే. కనుక అర్జునా లెమ్ము యుద్ధము చేసి రాజ్యాన్ని కైవశం చేసుకొనుము " అన్నాడు. ఆ మాటలకు అర్జునుడు గడగడా వణుకుచూ " వాయుదేవుడను, వరుణ దేవుడవు, అగ్ని దేవుడవు, సూర్యుడు, చంద్రుడు నీవే. అనేక తత్వసారము నీవే, నీవే పుండరీకాక్షుడవు, శాశ్వతుడవు, అచ్యుతుడవు నీవే. నీ మహిమ ఎరుగక నీవు యాదవుడవని సఖుడవని నా మేన బావవని నీతో సరస సల్లాపములు ఆడాను. సఖుడవన్న చనువుతో నీ పట్ల తెలియక అపరాధం చేసి ఉంటాను. నీ దివ్య రూపం కనులారా చూసాను ఆనందం, భీతిని కలిగిస్తున్నది తల్లి తండ్రులు బిడ్డల అపరాధములు మన్నించినట్లు నన్ను మన్నించు దేవా " ని ప్రార్ధించాడు. " అర్జునా ! అనేక తపములు ఆచరించిన వారికి, వేదాధ్యయనం చేసిన వారికి దుర్లభమైన నా దివ్యరూపం నీ యందు కలిగిన ప్రీతి చేత నీకు నాయందు కలిగిన భక్తి భావం చేత నీకు లభించింది. నీవు భయభ్రాంతులు విడిచి సంప్రీత మనస్కుడవు కమ్ము " అని పలికి శ్రీ కృష్ణుడు తన విశ్వరూపం ఉపసంహరించి సహజ రూపం ధరించాడు . స్వస్థత చెందిన అర్జునిని చూసి కృష్ణుడు " అర్జునా ! నా యందు అచంచల భక్తి ఉంచి నన్నే పూజించు వాడు నన్నే పొందగలడు. అత్యంత గుహ్యమైన జ్ఞానమును నీకు అందించాను. సర్వ ధర్మములను నాకు సమర్పించి నన్ను శరణు వేడుము. నన్ను ఆశ్రయించిన నీ సకల దురితములు తొలగించి నీకు మేలు చేస్తాను. నా యందు భయ భక్తులైన వారికి ఈ శాస్త్రమును ప్రీతితో చెప్పము . అర్జునా చక్కగా వింటివా నీ అజ్ఞానం తొలగి పోయిందా " అన్నాడు. అర్జునుడు " దేవా! నీ దివ్యరూపం చూసిన నా సందేహాలు తొలగి పోయాయి. సర్వలోక నిర్వాహకుడైన నీ మాటలు నాకు శిరోధార్యము. స్థిర చిత్తుడనై నీవు చెప్పినట్లు నడచుకుంటాను " అని చెప్పి శ్రీకృష్ణునికి నమస్కరించి గాండీవాన్ని చేత ధరించాడు.

### గీత పరిసమాప్తి

శ్రీకృష్ణుని జ్ఞాన భోధను చూసిన సంజయుడు " దేవా! వ్యాసుని దయ వలన కృష్ణార్జుల సంవాదం విన్నాను. మహా యోగీంద్ర ఆనంద కరుడైన పరమాత్ముని దివ్యరూప సందర్శనం నాకు లభించింది. ఆ మహాను భావుని అమృత తుల్యమైన పలుకులు విని ధన్యుడనైనాను. నా మనసు ఆనందంతో నిండి పోయింది. గుహ్యమైన జ్ఞానం విని పులకించాను. ఎక్కడ యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు ధనుర్ధారి అయిన అర్జునుడు ఉంటారో అక్కడ ధర్మము, నీతి, సిరి సంపదలు, విజయము ఉంటాయి " అని భక్తి పారవశ్యంతో చెప్పాడు.

## యుద్ధారంభం

దృతరాష్ట్రుడు " సంజయా ! ఒకరికి ఒకరు ఎదురుగా నిలిచిన కౌరవులు పాండవులు ఏమి చేసారో చెప్పు " అని అడిగాడు. సంజయుడు " మహారాజా ! నీ కుమారుడైన సుయోధనుడు తరఫున దుశ్శాసనుడు తన వారిని పురికొల్పాడు. కౌరవ సైన్యం భేరి, మృదంగం, శంఖనాదం చేసారు. భీష్ముడు ముందుగా కదిలాడు. పాండవులు కూడా యుద్ధ సన్నద్ధమైయ్యారు. తూర్యనాదాలు మిన్నంటాయి. ఒకరిని ఒకరు ఘర్జించు కుంటున్నారు. భీముడు సింహనాదం చేసాడు. యుద్ధం మొదలైంది. భీష్ముని దుశ్శాసనుడు, దుర్ముఖుడు, దుష్ప్రహుడు, దుర్మరణుడు, వివిశంతి, వృషసేనుడు, చిత్రసేనుడు, వికర్ణుడు, పురుమిత్రుడు ఎదుర్కున్నాడు. అది చూసిన సుయోధనుడు సంతోషించాడు. నకులసహదేవులు, అభిమన్యుడు, ఉపపాండవులు దుష్టద్యుమ్నుని ఆధ్వర్యంలో శరపరంపర కురిపించారు. వారి పరాక్రమం చూసిన ఇరు పక్షాలు ఆశ్చర్య చకితులైయ్యారు. ధర్మరాజు, సుయోధనుడు తమ తమ సైన్యాలను యుద్ధానికి పురికొల్పారు. ఉభయ సైన్యాలు ఒకరితో ఒకరు తలపడ్డారు. రధములు, హయములు, గజములు, కాల్బలములు ఒకరితో ఒకరు ఒకరితో ఒకరు భీకరంగా పోరుతున్నారు. భీష్ముడు కౌరవ సైన్యాలకు ఉత్సాహం కలిగిస్తూ మధ్యందిన మార్తాండుని వలె వెలిగి పోతున్నాడు. అర్జునుడు శంఖం పూరించి గాండీవం ధరించి నారి సారించి భీష్మునితో తలపడ్డాడు. ఇరువురు ఒకరిపై ఒకరు అస్త్ర శస్త్ర పరంపర కురిపించుకున్నారు. సాత్యకి కృతవర్మను ఎదుర్కొని భీకరంగా పోరు సల్పారు. ఇరువురి శరీరాలు రక్తంతో తడిసి పోయాయి. అభిమన్యుడు కోసల రాజుతో యుద్ధం చేస్తున్నాడు. కోసల రాజు అభిమన్యుని సారధిని పడగొట్టి హయములను చంపాడు. అభిమన్యుడు కోసల రాజు కేతనములను, విల్లును విరిచి అతడిని గాయపరిచాడు. భీమునిపై భీష్ముడు బాణములు విడిచాడు. ఇరువురి నడుమ పోరు భీకరంగా పోరు జరుగుతుంది. నకులుని దుశ్శాసనుడు ఎదుర్కొన్నాడు. నకులుడు అతడి


ఆరంభమైన యుద్ధం

విల్లును ఒకేఒక బాణంతో విరిచి వేసాడు. దుశ్శాసనుడు వేరొక విల్లు అందుకుని నకులుని మీద శరవర్షం కురిపించాడు. సహదేవునితో దుర్ముఖుడు యుద్ధం చేస్తున్నాడు. అతడు సహదేవునిపై శరపరంపర కురిపించ సాగాడు. సహదేవుడు అతని బాణములు తుంచి, హయములను చంపి, సారథిని కొట్టాడు. యుధిష్టరుడు శల్యునితో యుద్ధానికి తలపడ్డాడు. యుధిష్టరుడు శల్యుని విల్లును తుంచాడు. శల్యుడు వేరు విల్లు తీసుకుని యుదిష్టరునిపై బాణములు కురిపించాడు.

## కౌరవ ప్రముఖులు పాండవ ప్రముఖుల మధ్య భీకర యుద్ధం

ధృష్టద్యుమ్నుడు ద్రోణునిపై ఉరికాడు. ద్రోణుడు అతడి విల్లును మూడు ముక్కలుగా విరిచాడు. ధృష్టద్యుమ్నుడు వేరొక విల్లును తీసుకుని ద్రోణునిపై పదునాలుగు బాణాలు వేసాడు. మగధ రాజైన భూరిశ్రవునితో యుద్ధం చేస్తున్నాడు. వారిరువురు ఇంద్రుడు వృత్తాసురుని వలె యుద్ధం చేస్తున్నాడు. దుష్టకేతువు బాహ్లికునితో తలపడ్డాడు. మహావీరుడైన శిఖండి అశ్వధామతో తలపడ్డాడు. అశ్వధామ శిఖండి శరీరం నిండా శరములతో చీల్చుతున్నాడు. శిఖండి అశ్వద్ధామ హృదయాన్ని చీలుస్తూ శరసంధానం చేసాడు. భగదత్తుడు విరాటునిపై ఉరికి ఆకాశం నిండిపోయేలా బాణములు వదిలాడు. కేకయరాజు కృపాచార్యుని ఎదుర్కొన్నాడు. ఇరువురు ఒకరి కేతనములు వేరొకరు విరిచారు. రధములు దిగి ఇరువురు కత్తి తీసుకుని యుద్ధం చేసుకుంటున్నారు. అది చూసిన జయద్రధుడు, ద్రుపదుడు వారికి సాయంగా నిలబడ్డారు. వికర్ణుడు యుధామన్యుడితో తపపడి ఒకరితో ఒకరు రౌద్రంగా పోరుతున్నారు. చేకితానుడు త్రిగర్తాధిపతి సుశర్మతో తలపడి అతడి ఒళ్ళంతా శరపరంపరతో తూట్లు పొడిచాడు. శకుని యుధిష్టరుని కుమారుడు ప్రతివింధ్యునితో పోరు సల్పుతున్నాడు. భీముని కుమారుడు శ్రుతసోమునితో పోరు సల్పుతున్నాడు. అర్జునిని కుమారుడు ఇరావంతుడు శ్రుతాయువుతో యుద్ధం చేస్తున్నాడు. వారిరువురు ఒకరి రధాన్ని ఒకరు విరుగ కొట్టుకుని వేరు రధములపై ఎక్కి యుద్ధం చేస్తున్నారు. విందాను విందులు కుంతి భోజుడు అతని కుమారునితో తలపడ్డారు. కుంతి భోజుని బాణములుఎదుర్కొంటూ అనువిందుడు అతనిపై శరపరంపర కురిపించాడు. కేకయ రాజులు అయిదుగురు గాంధార రాజు అయిదుగురితో తలపడ్డారు. విరాటుని కుమారుడైన ఉత్తరునిపై నీ కుమారుడు దీర్ఘబాహుడు తలపడ్డాడు. నకులుని కుమారుడు శతానీకుడు ఉలూకునితో తలపడ్డాడు. చతురంగ బలాలు పదులు, వందలు, వేలుగా ఒకరితో ఒకరు పోరుతున్నారు. కత్తులతోను, బాణములతోను ఒకదానితో ఒకటి తలపడ్డాయి.

## భీకర సమరం

ఏనుగుల దంతములు ఒరుసుకుంటున్నాయి. రధములు రధములతో ఢీకొన్నాయి. ఏనుగుల రధముల తాకిడికి కాల్బలములు నిలువ లేక పోతున్నాయి. గజారోహకులు విచక్షణా రహితంగా తొక్కుకుంటూ విహరిస్తున్నారు. బాణవర్షాలు, కత్తులు, ఈటెలు, గధలు, అస్త్ర శస్త్రములు, హయములు, రధములు, విన్యాసాల శబ్దాలు, హాహాకారాలతో యుద్ధభూమి మారు మ్రోగి పోతుంది. వారి రక్తంతో యుద్ధ భూమి తడిసి పోతుంది. ఒక కాలు తెగినా విడువక ఎదుటి వాడిపై రౌద్రంగా దూకుతున్నారు. ఒక చేయి తెగిన పిమ్మట వేరొక చేతితో యుద్ధం చేస్తున్నారు. తల తెగి పడినా విడువక ఎదుటి వాడి తల నరికి కింద పడుతున్నారు. కింద పడినా తలలలో కూడా వీరత్వం వీడ లేదు. తమ రధములు, హయములు పోయినా పక్క వాడి రధాలను ఎక్కి యుద్ధం చేస్తున్నారు. గాయపడినా లెక్క చేయక బంధు మిత్రులకు సాయపడుతున్నారు. శత్రు బలంగంలో ఉన్నది బంధుపైనా తలపడుతున్నారు. సారధి చనిపోగా రధములు దిక్కు తోచక పరుగెడుతున్నాయి. పదాతి దళములు రధముల కింద పడుతున్నాయి వారినిఏనుగు తొక్కుతూ దంతంతో ఎత్తి ఆవల విసురుతున్నాయి. ఈ విధంగా మంధర పర్వతంతో చిలికినప్పడు పాల సముద్రంలా యుద్ధభూమి అల్లకల్లోలమై ఉంది. ఇలా మధ్యాహ్న సమయం వరకూ యుద్ధం సాగింది.

## కౌరవ సేనల విజృంభణ

కురుక్షేత్రంలో భీకర పోరు జరుగుతున్న సమయంలో నీ కుమారుడు ప్రేరేపించగా దుర్ముఖుడు, కృపాచార్యుడు, కృతవర్మ,


ఉత్తర కుమారుని మరణం

శల్యుడు, వివిశంతులు తమ బాణాగ్నితో పంచాగ్ని హోత్రంలా భీష్మునికి ఇరు వైపులా చేరి పాండవ సేనలను తరిమి తరమి కొడుతున్నారు. భీష్ముడు విజృంబించి పాండవ సేనలను తుత్తునియలు చేస్తున్నాడు. ఛేది, పాంచాల, కేకయరాజుల వారి ధాటికి తట్టుకోలేక పోతున్నారు. తెగిపడుతున్న తలలు, విరిగిన విల్లులు, నేలకూలిన శరీరములు, విరిగి పడుతున్న రధాలు తమ పక్షంలో తరుగుతున్న సైన్యాలను చూసి పాండవ సైన్యం తల్లడిల్లుతుంది. ప్రళయ కాల రుద్రుడు వలె విజృంబిస్తున్న భీష్ముని ఎదిరించే వారు లేక పాండవ సైన్యం కకావికలై పోతుంది. ఇంతలో అభిమన్యుడు విజృంభించి శల్యుని అయిదు బాణాలతో కొట్టాడు. ఒక బాణంతో కృతవర్మ హృదయాన్ని చీల్చాడు. మరి ఒక బాణంతో దుర్ముఖుని సారధిని కొట్టాడు. ఇంకొక బాణంతో వివిశంతి విల్లు విరిచాడు. మూడు బాణాలతో కృపాచార్యుని రధముకు కట్టిన హయములను చంపాడు. తరవాత భీష్ముని మీద శరవర్షం కురిపించాడు. అంతా అభిమన్యుని పరాక్రమానికి ఆశ్చర్య పోతున్నారు భీష్ముడు " ఏమిటి వీడు అర్జుననిలా విజృంభిస్తున్నాడు.వీడు సామాన్యుడు కాదు " అనుకున్నాడు. భీష్ముడు వెంటనే అభిమన్యుని కేతనమును విరిచాడు. సారధిని చంపి అభిమన్యునిపై శరవర్షం కురిపించాడు. మిగిలిన వారు కూడా భీష్ముని అనుసరించారు. అభిమన్యుడు ఉగ్రుడై వారి అందరి బాణాలు తిప్పి కొట్టాడు. భీష్ముని తాళ ద్వజాన్ని విరుగకొట్టాడు. పాండవ సేనలు హర్షద్వానాలు చేయగా కౌరవ సేనలో కలకలం రేగింది. ఇంతలో భీముడు సింహనాదం చేస్తూ అభిమన్యునికి సాయం వచ్చాడు. భీష్ముడు భీముని కేతనమును విరిచాడు. భీముడు మూడు బాణాలతో భీష్ముని కొట్టాడు. కృపాచార్యుని, కృతవర్మను ఎనిమిది బాణాలతో కొట్టాడు. శల్యుని ఎదుర్కొన్నాడు శల్యునికి సాయంగా ఉన్న వీరులు భీముని ఎదుర్కొన్నారు. భీముడు రౌద్రుడై వారి సారధులను హయములను చంపి వారిని విరధులను చేసాడు. తరువాత సాత్యకి, విరాటుడు, కేకయరాజులు, దృష్టద్యుమ్నుడు, అతని కుమారులు, ఊత్తరుడు విరాటుని కుమారుడు ఉత్తరుడు భీమునికి సాయంగా వచ్చారు. భీష్ముడు వారినిందరిని సమర్ధవంతంగా ఎదుర్కొని మూడు బాణాలతో వారిని గాయపరిచాడు. విరాటుని కుమారుడు తన గజబలంతో శల్యుని ఎదుర్కొన్నాడు. ఉత్తరుని ఏనుగు శల్యుని రధం విరుగ కొట్టి హయములను నలిపి వేసాయి. ఇది చూసి కోపించిన శల్యుడు ఉత్తరుని గుండెలకు గురి పెట్టి శక్తి ఆయుధాన్ని విసిరాడు. అది విష్ఫులింగాలను విసురుకుంటూ ఉత్తరుని గుండెను చీలుస్తూ బయటకు వెళ్ళింది. ఉత్తరుడు భూమిపై పడి వీరస్వర్గం అలంకరించాడు. అంతటితో శల్యుని కోపం ఆగలేదు. ఉత్తరుడి గజమును తొండం నరికి దానిని చంపి వేసాడు. తన అనుజుని మరణం కళ్ళారా చూసిన శంఖుడు కోపించి శల్యునిపై దాడి చేసాడు. తన గజబలంతో శల్యునితో ఘోరంగా యుద్ధం చేస్తున్న తరుణంలో శంఖుని వెంట ఉన్న రధికులు ఒక్క మారుగా శల్యుని మీద పడ్డారు. అది చూసిన భీష్ముడు మరి కొంత మంది రధికులను వెంట పెట్టుకుని శల్యునికి సాయంగా వచ్చాడు. భీష్ముని ధాటికి శంఖుడు రధికులు ఆగలేక పోయారు. అది చూసిన అర్జునుడు శంఖునికి సాయంగా వచ్చి భీష్మునకు మధ్యగా నిలిచాడు. అర్జుననకు భీష్మునకు మధ్య భయంకరంగా పోరు సాగింది. ఇంతలో అపహార్ణం అయింది.

## అపహార్ణం పై యుద్ధం

అప్పటి వరకు కృతవర్మ రథంపై ఉన్న శల్యుడు రథం దిగి గధ తీసుకుని శంఖుని రథం విరుగ కొట్టాడు. రథం విరిగిన శంఖుడు వేగంగా కత్తి తీసుకుని అర్జునిని రథం చాటుకు వెళ్ళాడు. భీష్ముడు శంఖుని విడిచి వేగంగా పాండవ సేనలోకి చొచ్చుకు వెళ్ళి వీరవిహారం చేస్తున్నాడు. మంచి ఎండలో రగిలిన కార్చిచ్చు అడవిని దహించిన విధంగా భీష్ముని ధాటికి పాండవ సైన్యం నేల కూల సాగింది. కేకయ రాజులను చికాకు పరచి భీష్ముడు తన రథాన్ని చిత్ర విచిత్ర రీతుల నడుపుతూ అంతటా తానై యుద్ధం చేస్తూ విరాట సైన్యాలను దునుమాడు తున్నాడు. భీష్ముని చేతిలో తన బలం చావు దెబ్బ తినడం చూసిన పాండవులు నివ్వెర పోయారు. ఇంతలో సూర్యుడు పడమట వాలాడు. అయినప్పటికీ భీష్ముడు మధ్యదిన మార్తాండుని వలె తేజస్సుతో వెలుగు తుండగా మొదటి రోజు యుద్ధం పాండవుల మనసులో గుబులు పుట్టిస్తూ ముగిసింది.

# వనరులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

### పర్వాలు

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

### పాత్రలు

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

### ఇతర విషయాలు

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

"http://te.wikipedia.org/w/index.php?title=భీష్మ_పర్వము_ప్రథమాశ్వాసము&oldid=760852" నుండి వెలికితీశారు

వర్గం: మహాభారతం

# భీష్మ పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# రెండవ అశ్వాసం

ఇలా తన పక్షానికి కలిగిన విజయానికి సంతోషించిన ధృతరాష్ట్రుడు సంజయుని చూసి " సంజయా ! ఆపై యుద్ధం ఎలా జరిగింది చక్కగా వివరించుము " అని ఉత్సాహంగా అడిగాడు. సంజయుడు ఇలా చెప్పసాగాడు. " ఆరాత్రి ధర్మరాజు మొదటి రోజునే తమకు ఓటమి సంభవించి నందుకు దుఃఖిస్తూ తమ్ములతో సహా శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళాడు. ధర్మరాజు శ్రీకృష్ణుని చూసి " కృష్ణా! చూసావు కదా భీష్ముడు కార్చిచ్చు వలె మన సేనలను కాల్చి వాసాడు. మనకు అతడిని చంపు మార్గం కనిపించుట లేదు లోక భీకరుడైన అతడిని సాధారణ వీరునిగా తలచి భంగపడ్డాను. నీ మరుదులు బాగా గాయపడ్డారు. భీష్మునితో యుద్ధం చేయడానికి దిక్పాలకులు చాలరని మనకు తెలిసింది. భీష్ముని గెలవగలడని మనం అర్జునిని నమ్ముకున్నాము. ఈ రోజు అర్జునుడు తన పరాక్రమం ఏమీ చూప లేదు. భీముడు తన యావచ్ఛక్తి ఉపయోగించి యుద్ధం చేసాడు. నాకు ఏమి చేయాలో పాలు పోవడం లేదు. అయినా ఎవరిని అనుకుని లాభం ఏమిటి ? మనకు సాయంగా వచ్చిన రాజులను భీష్మునికి ఎర వేయడం కంటే యుద్ధం మానుకుని ఆకులు అలములు తినడం మేలు. నీ వలన ఇప్పటి వరకు అపజయమెరుగక మేము క్షేమంగా ఉన్నాము. కనుక నీవు ఎలా చెపితే అలా చేస్తాము. మాకు కర్తవ్యం నీవే నిర్ణయించు " అని వేడుకున్నాడు. ధర్మనందనుని భయాన్ని పోగొట్టే విధంగా శ్రీకృష్ణుడు " ధర్మరాజా ! ఏమిటి ఈ ఆవేదన ఎందుకు చెప్ప. నీకు ఎదురు నిలువ గల సమర్ధులు ఎవరు. నీ తమ్ములు మూడు లోకాలను గెలువ సమర్ధులు. భీష్ముని చంపడానికి శిఖండి ఉన్నాడు భయ మెందుకు. సాత్యకి పరాక్రమం ఆశ్చర్యకరమైన అతని యుద్ధ రీతులు నీకు అవగతం కాలేదు. దృపదుడు, విరాటుడు నీకై తమ ప్రాణములు సహితం ఇవ్వ సిద్ధంగా ఉన్నారు. నీవు నిరుత్సాహ పడవద్దు. దృష్టద్యుమ్నుడు పరాక్రమానికి కౌరవ సేన నిలువజాలదు " అన్నాడు. ధర్మరాజు దృష్టద్యుమ్నుని చూసి " నాడు కృష్ణుని ఆదేశం పై నిన్ను సర్వ సైన్యాలకు అధ్యక్షుని చేసాము. శ్రీ కృష్ణుడు, నేను, నా సోదరులు, మిత్ర రాజులు నీకు సాయం ఉంటాము. నీ సర్వ శక్తులు ఒడ్డి మాకు విజయం చేకూర్చు " అన్నాడుధృష్టద్యుమ్నుడు" ధర్మనందనా! నన్ను ద్రోణుడిని చంపుటకు మాత్రమే బ్రహ్మ శృష్టించిన విషయం జగమెరిగిన సత్యం. భీష్మునితో చేర్చి కురు సేనలను ఎలా మట్టు పెట్టగలనో చూడు " అన్నాడు. ఆ మాటలు విన్న పాడవులు, మిత్రరాజులు సంతసంచారు. ధర్మరాజు దృష్టద్యుమ్నునితో " పూర్వం దేవదానవ యుద్ధమున దేవేంద్రుని కొరకు బృహస్పతి పన్నిన అతి భయంకర మయిన క్రౌంచ వ్యూహమును రేపటి యుద్ధములో మనసైన్యం కొరకు నీవు పన్నుము " అన్నాడు. తేలిక పడిన మనసుతో ధర్మనందనుడు తన తమ్ములతో స్థావరానికి వెళ్ళగానే అందరూ తమ తమ నివాసములకు వెళ్ళారు.

## రెండవ రోజు యుద్ధం

మరునాటి ఉదయాన పాండవ సైన్యం నూతనోత్సాహంతో సిద్ధం అయింది. క్రౌంచ వ్యూహాన్ని పరిశీలించడానికి ధర్మరాజు బయలు దేరాడు. అర్జునుడు తన గాండీవంతో కపిధ్వజంతో చేరి క్రౌంచ వ్యూహం ముక్కు భాగంలో నిలిచాడు. కుంతిభోజుడు, శైభ్యుడు క్రౌంచ పక్షి నేత్ర స్థానంలో నిలిచాడు. ద్రుపదుడు క్రౌంచ పక్షి శిఖలా నిలిచాడు. దశార్ణ, శూరసేన, కిరాత దేశాధీశులు క్రౌంచ పక్షి కంఠాకారంలో నిలిచారు. భీమసేనుడు దృష్టద్యుమ్నుడు క్రౌంచ పక్షి రక్కల స్థానంలో నిలిచారు. అభిమన్యుడు, పౌండ్రుడు, ఉపపాడవులు, చోళులు, పాండ్యులు భీమ సేనుని పక్కన నిలువగా నకుల సహదేవులు, ఘటోత్కచుడు, శంబరులు, వత్సరాజులు ధృష్టద్యుమ్నుని పక్క నిలిచారు. కేకయ, కాశీ రాజులతో కూడి విరాటరాజు క్రౌంచ పక్షి జఘున భాగాన నిలిచారు. హెూణపతి మొదలైన ప్రముఖులు చుట్టూ ఉండగా ధర్మరాజు క్రౌంపక్షి వెన్ను భాగంలో నిలిచాడు. కౌరవ పక్షాన సుయోధనుడు " మీరు ఒక్కొకరు పాండవ బలాన్ని గెలువగల సమర్ధులు మీరంతా ఒక చోట ఉన్న మిమ్ము గెలువ సాక్షాత్తు పరమేశ్వరునికైనా సాధ్యం కాదు. కాని పాండవ సైన్యం క్రౌంచ పక్షి రూపంలో నిలిచినందున మనం అందుకు ధీటైన వ్యూహం పన్నడం ఎంతో అవసరం " అన్నాడు. సుయోధనుని మాట మేరకు కౌరవ సేన భీష్ముని ఆధ్వర్యంలో ప్రతి వ్యూహంలో నిలిచారు. దుశ్శాసన, వికర్ణ, విందాను విందులు, శూరసేనుడు, త్రిగర్త రాజులు ఒక పక్క నిలువగా ద్రోణ, కుంతల, దశార్ణ, విదర్భ దేశాధీశులు, గాంధార, సింధు, సౌవీర రాజులు ఒక పక్క నిలిచారు. భీష్ముడు మహా సైన్యంతో నడుమ భాగంలో నిలిచాడు. కృతవర్మ, శల్యుడు, అశ్మంత , కాశ్మీర రాజులు , కొంత మంది సుయోధనుని తమ్ములు సుయోధనుడు భీష్ముని

వెనుక నిలిచారు.

## రెండవ రోజు యుద్ధారంభం

దుర్యోధనుడు సజ్ఞ చేసి యుద్ధం ఆరంభించగానే కౌరవ సైన్యం పాండవ సైన్యంలోకి చొచ్చుకుని వెళ్ళింది. భీష్ముడు క్రౌంచ వ్యూహాన్ని చీల్చి చెండాడాడు. రెక్కలు చించాడు. కంఠమును త్రుంచి, తల పగుల కొట్టి క్రౌంచ వ్యూహాన్ని కకావికలు చేసాడు. అంతటా తానై విజృంభించాడు. అది చూసిన అర్జునుడు శ్రీ కృష్ణుని చూసి " బావా ! భీష్ముడు మన సేనలను చిందరవందర చేస్తున్నాడు. అయినా నా వైపు రావడంలేదు అతడి పొగరు అణచాలి రధాన్ని అతని వైపు పోనిమ్ము " అన్నాడు. శ్రీ కృష్ణుడు " అర్జునా ! అలాగే చేస్తాను. నా మాట కొంతవిను . కంగారు పడక నీ పరాక్రమంతో భీష్ముని సామర్ధ్యంగా ఎదిరించి శల్యాది కౌరవ ప్రముఖుల మనసును భయంతో నింపు " అన్నాడు. అర్జునుడు అడ్డు వచ్చిన శూరసేనుడి సైన్యాలను చిందరదర చేస్తూ భీష్ముని మీదకు భీకరంగా వచ్చాడు. ఇది చూసిన భీష్ముడు అర్జునుని డెబ్బై ఏడు క్యూర బాణాలతో కొట్టాడు. ద్రోణుడు ఇరవై అయిదు బాణాలతోను, కృపాచార్యుడు అయిదు వందల బాణాలతోను, వికర్ణుడు మూడు బాణాలతోను, దుర్యోధనుడు అరవై నాలుగు బాణాలతోను, శల్యుడు తొమ్మిది బాణాలతోను అర్జునిని పై లంఘించాడు. శర వర్షాన్ని చూసిన అర్జునుడు కొండవలె స్థిరంగా నిలిచాడు. అర్జునుడు ఇరవై బాణములతో భీష్ముని, అరవై బాణాలతో ద్రోణుని, తొమ్మిది బాణాలతో కృపుని, వికర్ణుని, శల్యుని తలా మూడు బాణాలతో , దుర్యోధనుని అయిదు క్రూర బాణాలతో ఎదిరించాడు. ఆ సమయంలో సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, ఉపపాండవులు, అభిమన్యుడు అక్కడకు చేరుకుని భీష్మునికి తోడుగా ఉన్న వారిపై లంఘించారు. భీష్ముడు ఏభై బాణాలతో అర్జునిని బాధించాడు. ఆ బాణములను లక్ష్య పెట్టక అర్జునుడు కౌరవ సేనలపై విజృంభించి వారిని తరిమి తరిమి కొట్టాడు. అర్జునుడు తన రధాన్ని కౌరవ సేనల మధ్యకు నడిపి వారిని విచక్షణా రహితంగా చీల్చి చెండాడాడు. రధికులను సారధూలను హయములను తెగ నరికాడు. అర్జునిని పరాక్రమానికి కౌరవ సేనలు భయపడ్డాయి. ఇది చూసిన దుర్యోధనుడు " అర్జునుడు మన సేనలను విచక్షణా రహితంగా చంపుతున్నాడు అతడిని ఎదుర్కొన గలిగిన కర్ణుని యుద్ధానికి రానివ్వక మీరూ ఇలా చూస్తూ ఊరు కోవడం ఏమన్నా బాగా ఉందా " అన్నాడు. భీష్ముడు " నా శాయ శక్తులా యుద్ధంచేస్తున్నా ఇలా అంటున్నాడేమిటి " అని అనుకుని అర్జునుని వైపు రథం మళ్ళించి వికర్ణుడు, అశ్వత్థామ వెంట రాగా అర్జునిపై ఒక్క సారిగా లంఘించి బాణ వర్షం కురిపించాడు. అర్జునునికి సాయంగా నకుల సహదేవులు, భీముడు, ధర్మరాజు వచ్చారు. అర్జునినికి గాంగేయునకు మధ్య పోరు లోకభీకరంగా జరిగింది. భీష్ముడు శ్రీకృష్ణుని గుండెలకు తాకేలా బాణప్రయోగం చేసాడు. అది శ్రీకృష్ణుని గుండెను చీల్చి రక్తం పైకి చిమ్మింది. అది చూసిన అర్జునుడు కోపంతో ఊగిపోతూ భీష్మునిపై బాణవర్షం కురిపించాడు. ఆ బాణములను తిప్పికొట్టడమే కాక అర్జునుని రధాన్ని శరములతో ముంచెత్తాడు. ఇలా ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధం చేస్తుండగా మధ్యాహ్నం అయింది.

## పాంచాల సేనలు ద్రోణుల మధ్య సమరం

మధ్యాహ్నసమయం వరకు యుద్ధం సాగిన పిదప ధృష్టద్యుమ్నుడు ద్రోణుని ముందుకు రధాన్ని పోనిచ్చి ద్రోణుని తన నిశిత శరములతో నొప్పించాడు. ద్రోణుడు కోపించి దృష్టద్యుమ్నుని సారధిని కొట్టి, తరవాత నాలుగు బణాలు వేసి అశ్వాలను చంపాడు. అతడి విల్లును నడిమికి విరిచి కేతనమును విరిచాడు అయినా ధృష్టద్యుమ్నుడు బెదరక అమిత కోపంతో ద్రోణుడిని ఎదిరించాడు. ద్రోణుని పైన శరపరంపర కురిపించాడు. ద్రోణాచార్యుడు వాటిని సమర్ధవంతంగా ఎదుర్కొని ధృష్టద్యుమ్నునిపై శరపరంపర కురిపించాడు. ధృష్టద్యుమ్నుడు వాటిని సర్ధవంతంగా ఎదుర్కొని ద్రోణిపై శరపరంపర కురిపించాడు. ఇలా ఇరువురి నడుమ భంయంకరమైన పోరు కొనసాగింది. ధృష్టద్యుమ్నుడు ద్రోణునిపై గదాయుధం ప్రయోగించాడు ద్రోణుడు దానిని పొడి చేసాడు. ధృష్టద్యుమ్నుడు బల్లెం విసిరాడు. ద్రోణుడు దానిని కూడా విరిచాడు. మరొక విల్లు తీసుకుని ధృష్టద్యుమ్నుడు ద్రోణునిపైన శరపరంపర కురిపించాడు. ద్రోణుడు ధృష్టద్యుమ్నుని సారధిని, హయములను చంపి విల్లును విరిచాడు. ధృష్టద్యుమ్నుడు రధము దిగి గధను తీసుకుని గిరగిరా తిప్పి ద్రోణుని పై విసిరాడు. ద్రోణుడు దానిని బాణములతో నుగ్గు చేసాడు. ధృష్టద్యుమ్నుడు కరవాలంతో విజంభించాడు. ఇలా ఇరువురి నడుమ ఘోర యుద్ధం కొనసాగింది. ద్రోణుని శరపరంపరకు ధృష్టద్యుమ్నుడు తట్టుకోలేక పోయాడు. ఇది చూసిన భీముడు ధృష్టద్యుమ్నునికి సాయం వచ్చాడు. ద్రోణునిపై ఏడు బాణములు వేసి ధృష్టద్యుమ్నుని వేరు రథం ఎక్కించాడు. ఇది చూసిన సుయోధనుడు కళింగ రాజుకు సైగ చేసి భీముని ఎదుర్కొనమని చెప్పాడు.

## భీమసేనుని భీకర యుద్ధం

సుయోధనుని సైగను గ్రహించిన కళింగ రాజు తన సైన్యంతో భీముని మీదకు వచ్చాడు. ఇంతలో ద్రోణుడు విజృంభించి


భీమ భీష్ముల యుద్ధం

విరాటుని పైన , ద్రుపదుని పైన బాణములు సంధించాడు. ధర్మరాజు ఇంతలో ధృష్టద్యుమ్నునికి సాయం వచ్చాడు. ఛేది, కురుదేశాల రాజులు భీమునికి అడ్డుగా నిలిచాడు. కేతుమంతుడు భీముని మీదకు ఉరికాడు. కేతుమంతునికి ధాటికి పాండవ సైన్యాలు మంటలలో పడిన పురుగులులా భస్మం అయ్యారు. మిగిలి వారు పారి పోయారు. కేతుమంతుడు విజయోత్సాహంతో భీమునిపై ముందు వెనుకలు చూడక బాణవృష్టి కురిపించాడు. కేతుమంతుడు భీముని హయములు చంపగా భీముడు కుపితుడై గధను తీసుకుని వాడి పైన విసరగానే ఆ గదాఘాతానికి వాడి రధం విరిగి , కేతనం విరగటమే కాక నిముషాలలో కేతుమంతుని స్వర్గలోకానికి పంపింది. భీముడు తన కత్తిని తీసుకుని వీరవిహారం చేసాడు. అది చూసిన కళింగ రాజు కుమారుడు శక్రదేవుడు ఆగ్రహంతో భీముని మీదకు వచ్చి కరకు బాణాలతో భీమసేనుని రధాశ్వాలను వధించి భీముని శరీరమంతా బాణములతో కొట్టగా భీమసేనుడు బెదరక ఒక్క గదా ఘాతంతో శక్రదేవుని సంహరించాడు. కుమారుని చావు చూసి కుపితుడైన కళింగరాజు భీమునిపై పదునాలుగు తోమరములు విసిరాడు. భీమసేనుడు వాటిన అన్నిటినీ తన కరవాలంతో తుత్తునియలు చేసాడు. కళింగ రాజు సోదరుడు భానుమంతుడు తన గజబలంతో భీముని ఎదుర్కొని భీమునిపై శరవర్షం కురిపించాడు. ఒక ఏనుగును భీమునిపై నడిపించాడు. భీమసేనుడు చేసిన సింహనాదానికి దిక్కులు దద్దరిల్లాయి. భీముడు ఆ ఏనుగును పట్టుకుని దంతములు, తొండము నరికి భానుమంతుని నరికి వేసి అతని ఏనుగును నరికాడు. అది చూసిన కళింగరాజు ఒక్క సారిగా భీమసేనుని పైన పడమని తన గజ సన్యాలను పురికొల్పాడు. ఒంటరిగా నేలపై ఉన్న భీముడు కత్తితో ఏనుగుల తోడములు నరక సాగాడు. రధికులను, సారధులను, రధములకు కట్టిన అశ్వములను నరక సాగాడు. ఇంతలో భీముని సారధి భీముని రధాన్ని తీసుకు వచ్చి అతని ముందు నిలుపగా భీమసేనుడు అతడిని శ్లాఘిస్తూ రధం ఎక్కి విల్లు తీసుకున్నాడు. కళింగుని అయిదు బాణాలతో కొట్టగా అతడు మూర్చిల్లాడు. కళింగుని చక్రరక్షకులు అయిన సత్యుడు, సత్యదేవులను చంపాడు. కౌరవ సేన కకావికలై పోయింది. కళింగుని సారధి అతడిని పక్కకు తీసుకు వెళ్ళాడు. భీమసేనుడు తన శంఖమును పూరించాడు. అది విన్న భీష్ముడు తిరిగి శంఖాన్ని పూరించి కౌరవ సైన్యాలను ఉత్సాహపరిచాడు. ఇంతలో ధృష్టద్యుమ్నుడు, సాత్యకి, శిఖండి భీమునికి తోడుగా వచ్చి భీష్ముని ఎదుర్కొన్నారు. భీష్ముడు శిఖండిని వదిలి మిగిలిన వారితో యుద్ధం చేస్తున్నాడు. భీష్ముడు భీముని రధానికి కట్టిన హయములను చంపగా భీముడు కోపించి రధం దిగి భీష్మునిపై ఉరికాడు. సాత్యకి భీమునికి భీష్మునికి మధ్యగా నిలిచి భీష్ముని రధసారధిని చంపాడు. రధాశ్వాలు సారధి లేని రధాన్ని భీష్ముని పక్కకు తీసుకు వెళ్ళాయి. అదను చూసి భీముడు కౌరవ సేనను దనుమాడాడు. భీముని ధాటికి తాళలేని కౌరవ సేనలు పలాయనం చిత్తగించాయి. ధృష్టద్యుమ్నుడు వచ్చి భీమసేనుని తన రధం పైకి ఎక్కించాడు. ఇంతలో సాత్యకి రధంపై వచ్చి భీమసేనా " ఒంటరిగా కళింగుని బలం అణిచావు. అతని పుత్రులను సోదరులను, ఆప్తులను ఒంటరిగా దునుమాడావు " అని భీమసేనుని ప్రశంసించాడు.

## అభిమన్యుని యుద్ధము

కళింగరాజు పరాజయమును చూసిన కృపాచార్యుడు, శల్యుడు, అశ్వద్ధామ అక్కడకు వచ్చారు. వారిని చూసిన ధృష్టద్యుమ్నుడు భీముని కిందకు దింపి " భీమసేనా నీవు నా వెనుక ఉండి నన్ను రక్షించు " అని వారి వైపు రధం నడిపి అశ్వద్ధామ రధానికి కట్టిన హయములను తొమ్మిది బాణాలు వేసి చంపాడు. అశ్వథామ శల్యుని రధం ఎక్కి ధృష్టద్యుమ్నుని మీద అస్త్ర ప్రయోగం చేసాడు. ధృష్టద్యుమ్నుడు ఒంటరిగా అశ్వద్ధామ, శల్య, కృపాచార్యులను ఎదుర్కోవడం చూసిన అభిమన్యుడు తన రధం వారి వైపు నడిపి అశ్వద్ధామ, కృపులపై తొమ్మిది బాణాలు వేసాడు. శల్యునిపై బాణపరంపర కురిపించాడు. వారుకూడా అభిమన్యునిపై ఒక్కొక్కరు పన్నెండు బాణాలు సంధించారు. ఆ సమయంలో సుయోధనుని కుమారుడైన లక్ష్మణకుమారుడు అభిమన్యునితో తలపడ్డాడు. మర్మభేదులైన బాణములతో అభిమన్యుని నొప్పించాడు. అభిమన్యుడు ఏభై బాణాలతో లక్ష్మణుని తిప్పి కొట్టాడు. లక్ష్మణుడు అభిమన్యుని విల్లు విరిచాడు. కౌరవ సేన హర్షధ్వానాలు చేసాయి. అభిమన్యుడు వేరొక విల్లు తీసుకుని లక్ష్మణునిపై బాణవృష్టి కురిపించి అతని కవచాన్ని భేదించాడు. ఇది చూసిన సుయోధనుడు తన రధాన్ని అభిమన్యుని వైపు మరలించాడు. సుయోధనునికి సాయంగా భీష్మ, ద్రోణ ఇతర ప్రముఖులు వచ్చారు. అభిమన్యుడు బెదరక నవ్వుతూ వారితో యుద్ధం చేయసాగాడు. అర్జునుడు ఇది చూసి దేవదత్తం పూరిస్తూ అభిమన్యునికి సాయం వచ్చి భీష్మ, ద్రోణులపై శరవర్షం కురిపించాడు. ఇది చూసిన ధర్మరాజు తన సేనలకు సైగ చేసి అందరినీ అక్కడకు తీసుకు వచ్చాడు. అర్జునుడు వివిధ బాణములు వేసి కౌరవసేనను తుత్తునియలు చేస్తున్నాడు. అర్జునిని బాణాలు ఆకాశాన్ని కప్పాయి. విరిగిన కరవాలములు, శరములు, గధలు, తలలు, మొడెములు మొదలైన వాటితో యుద్ధభూమి

భాయానకంగా ఉంది. గజారోహకులు అడ్డు వచ్చిన వారిని తొక్కుతూ వీరవిహారం చేస్తున్నారు. శ్రీకృష్ణుడు , అర్జునుడు శంఖాలను పూరించాడు. భీష్ముడు ద్రోణాచార్యులను చూసి " ఆచార్యా ! అర్జునుడు శ్రీకృష్ణుని సారధ్యంలో చెలరేగి పోయాడు. నన్ను కూడా లక్ష్యపెట్ట లేదు. అతడిని ఎదుర్కొనే వీరుడు లేడు. సూర్యుడు పశ్చిమాద్రికి చేరుకున్నాడు. మన సేనలు అలసి పోయాయి. కనుక ఈ రోజుకు యుద్ధం చాలిస్తాము " అన్నాడు ద్రోణాచార్యుడు అందుకు అంగీకరించాడు. యుద్ధం ఆపమని సైన్యాలకు సూచించి అందరూ తమ నివాసాలకు చేరారు.

## మూడవ రోజు యుద్ధం గరుడవ్యూహం అర్ధ చంద్ర వ్యూహం

మూడవరోజు యుద్ధానికి భీష్ముడు తన సేనలను గరుడవ్యూహంలో నిలిపాడు. ఆవ్యూహానికి తాను ముక్కు భాగంలో నిలిచాడు. ద్రోణుడు, కృతవర్మలను కళ్ళు ఉండే స్థానంలోను, కృతవర్మ, అశ్వత్థామలు తలభాగంలోను నిలిచారు. త్రిగర్తలతో చేరి భూరిశ్రవసుడు , శల్యుడు, భగదత్తుడు, సావీరుడు, జయద్రధుడు కంఠ భాగాన నిలిచారు. సుయోధనుడు, సుయోధనుని తమ్ములు వెన్ను భాగమున నిలిచారు. విందాను విందులు, కాంభోజరాజు, శూరసేనుడు తోక భాగమున నిలిచారు. మగధ, కళింగ రాజులు కుడి రెక్కగా నిలిచారు, కర్ణాటక కోసల రాజులు ఎడమ రెక్కగా నిలిచారు. ధృష్టద్యుమ్నుడు పాండవ సేనలను అర్జునుని కోరికపై అర్ధచంద్ర ఆకారంలో నిలిపాడు. పాండ్య, మగధ రాజులతో భీమసేనుడు చంద్రుని కుడి కొమ్ము భాగాన నిలిచారు. భీమసేనునికి ఎడమ పక్కన విరాటుడు, ద్రుపదుడు, నీలుడు తమ తమ సైన్యంతో నిలిచారు. శిఖండి సహితంగా ధృష్టద్యుమ్నుడు ముందు నిలువగా ధర్మరాజు మధ్య భాగాన నిలిచాడు. వారి పక్కన సాత్యకి, నకులసహదేవులు, ఉపపాండవులు, అభిమన్యుడు, ఘటోత్కచుడు, కేకయ రాజులు తమ సైన్యాలతో నిలిచారు. అర్జునుడు సైన్యాలకు ఎడమ కొమ్ము దగ్గర నిలిచాడు. భేరి తూర్య నాదాలు మిన్నంటాయి. మూడవ రోజు యుద్ధం ఆరంభం అయింది. ఇరు పక్షములు ఒకరితో ఒకరు తలపడ్డాయి.

## అర్జున భీష్ముల పరాక్రమం

యుద్ధం ఆరంభం కాగానే అర్జునుడు గాండీవమును సారించి కౌరవ సేనలోని రధములను, రధమునకు కట్టిన హయములను, ధ్వజములను, సారధులను , రధికులను నుగ్గు చేస్తున్నాడు. గాంధారీ పుత్రులు ఉక్కుమ్మడిగా అర్జునుని మీదకు వచ్చారు. పాండవులు ఇది చూసి తమసైన్యములతో అర్జునినికి సాయం వచ్చారు. భీముని కనుసన్నలలో పాండవసైన్యం, భీష్ముని ఆధ్వర్యంలో కౌరవ సైన్యం ఘోరంగా యుద్ధం చేస్తున్నాయి. భీష్ముడు, శకుని, సైంధవుడు, వికర్ణుడు ఒక్క సారిగా పాండవ సేనలపై పడగా భీమసేనుడు, సాత్యకి, శైభ్యుడు, ఘుతోత్కచుడు, ఉప పాండవులు, చేకితానుడు వారిని ఎదుర్కొన్నారు. పోరు ఘోరంగా సాగుతుంది, దుర్యోధనుడు తన రధమును భీముని వైపు పోనిచ్చాడు. భీష్ముడు, ద్రోణుడు అతడికి సాయం వచ్చారు. ఇది చూసిన అర్జునుడు తన రధమును వారి మధ్య నిలిపి సుయోధన, భీష్మ, ద్రోణులపై శరసంధానం చేసి వారిని శరములతో ముంచెత్తాడు. అర్జునినికి సాత్యకి సాయం వచ్చాడు. ఇద్దరూ కౌరవ సేనలను చీల్చి చెండాడారు. శకుని తన బాణంతో సాత్యకి రధం విరిచాడు. సాత్యకి రధం దిగి అభిమన్యుని రధం ఎక్కి శకునిని శరములతో వేధించారు. యుధిష్టరుడు భీష్మునితో పోరు సాగించారు. సుయోధనుడు భీమునిపై శరప్రయోగం చేసాడు. భీముడు వాటిని మధ్యలో ఆపి వేసి సుయోధనుని వక్షస్థలముకు గురి పెట్టి ఒక్క బాణం వేసాడు. ఆబాణం తాకిడికి సుయోధనుడు రధంపై మూర్చిల్లాడు. కంగారుగా సారధి సుయోధనుని పక్కకు తొలిగించాడు. కౌరవ సేనలు ఇది చూసి భీతిల్లాయి. ధృష్టద్యుమ్నుడు కౌరవ సేనలను తరమ సాగాడు. భీష్మద్రోణులు కౌరవ సేనలతో " సుయోధనుడు క్షేమంగా ఉన్నాడు కంగారు పడకండి పారిపోకండి " అని అరిచినా ప్రయోజనం లేక పోయింది. సాత్యకి, అభిమన్యుడు శకునిని అదే పనిగా తరుముతున్నారు. శకుని తన బంధు జనాలతో పారి పోయాడు. మరొక పక్క అర్జునుడు కౌరవ సేనలను తరమ సాగాడు. సుయోధనుడు మూర్చ నుండి తేరుకుని తన రధమును పక్కకు తీసుకు వచ్చినందుకు సారధి మీద కోపగించుకున్నాడు. భీష్మ, ద్రోణుల మనసు కుదుటపడి సైన్యాలను పారి పోకుండా ఆపారు.

## సుయోధనుని నిష్ఠూరపు మాటలు భీష్ముని రౌద్ర రూపం

సుయోధనుడు భీష్మ ద్రోణుల వద్దకు వెళ్ళి " పితామహా ! మూడు లోకములు ఒక్కటిగా వచ్చినా ఒంటరిగా పోరి గెలువగల సమర్ధులు మీరు ఉండగా మన సేనలకు ఈ దురవస్థ ఏమిటి మీరు పాడవులతో యుద్ధం చేయనని ఆనాడే చెప్పి ఉంటే నేను కర్ణునికి నచ్చ చెప్పి యుద్ధమునకు తీసుకు వచ్చే వాడిని నిన్ను నమ్మి భంగపడ్డాను అనుకుని ప్రయోజనం ఏమిటి " అన్నాడు. ఆ మాటలకు భీష్ముడు చిరు నవ్వు నవ్వి " సుయోధనా ! దేవ సేనతో ఇంద్రుడు వచ్చినా పాండవులను గెలుచుట సాధ్యం కాని పని. అన్నీ తెలిసి నీవు ఇలా మాటాడ తగదు. నా వంటి వృద్ధులు, ఇప్పటికే సగం చచ్చిన వారు, దుర్బుద్ధి కల

వారిచే పాండుకుమారులు ఓడి పోరు. నాకు చేతనయినంత వారితో పోరాడుతాను " అన్నాడు. మరునాడు భీష్ముడు కౌరవ సేనలు శంఖములు పూరించగానే పాడవులు తమ శంఖములు పూరించారు. భీష్ముడు విజృంభిస్తూ అర్జునుని మీదకు రధం నడిపాడు. ఇరు వర్గాల మధ్య పోరు ఘోరమైంది. హూంకారములు, అదలింపులు, రంకెలు, ధిక్కారములు, పొగడ్తలు, వీరాలాపములు చేస్తూ సైన్యం వీర విహారం చేస్తున్నాయి. విరిగిన రధములు, మొండెములు, రక్తపు మడుగులు, పడిన గుర్రములు, తలలు తెగిన ఏనుగులు మొదలైన వాటితో యుద్ధ భూమి భీకరంగా ఉంది. సైన్యంలో కొంత మంది అక్కడ తిరగడం ఇష్టం కాక దూరంగా గుంపులుగా నిలిచి చూస్తున్నాయి. భీష్ముడు భీకరాకారంతో అంతటా తానై యుద్ధం చేస్తున్నాడు. అతడి ఒక్కొక్క బాణంలో వేయి బాణములు పుడుతున్నాయి. పాడవ సేనలను తుత్తునియలు చేస్తున్న భీష్ముని ఎదిరించడం ఎవరి శక్యం కావడం లేదు. ప్రళయ కాల రుద్రుని వలె ఉన్న భీష్ముని చూసి పాండవ సేనలు భయభ్రాంతమయ్యాయి. ఇది చూసిన శ్రీ కృష్ణుడు " అర్జునా ! ద్రోణ, కృపాచార్య సహితంగా భీష్ముని మట్టు పెట్టగలనని చెప్పి ఇలా చూస్తూ ఊరుకున్నావేమి " అన్నాడు. అర్జునుడు " అలా అనకు బావా. రధమును భీష్ముని ఎదుటికి పోనిమ్ము అతడి పని పడతాను " అన్నాడు.

## శ్రీకృష్ణుడు సుదర్శన చక్రాన్ని చేత పట్టుట


భీష్మునిపై దయ చూపిస్తున్న శ్రీకృష్ణుడు

అర్జునుడు తన ఎదుటికి రాగానే భీష్ముడు అర్జునిని రధానికి కట్టిన హయముల మీద, అర్జునిని మీద, శ్రీకృష్ణుని మీద శరములు సంధించాడు. తన మీద బాణములు వేసిన భీష్ముని మీద శ్రీకృష్ణుడు ఆగ్రహించాడు. అది చీసిన అర్జునుడు భీష్మునిపై ఒకే బాణం సంధించి అతని విల్లును విరిచాడు. భీష్ముడు మరొక విల్లు అందుకున్నాడు. అర్జునుడు దానిని కూడా విరిచాడు. భీష్ముడు మరొక విల్లు అందుకుని కృష్ణార్జునుల మీద శరవర్షం కురిపించి నొప్పించాడు. కృష్ణుడు చిత్రవిచిత్ర రీతుల రధాన్ని నడుపుతూ భీష్ముడి ఆ బాణముల బారి నుండి అర్జునుడిని తప్పిస్తూ వచ్చాడు. అర్జునుడు కూడా భీష్మునిపై క్రూరమైన బాణములు విడిచాడు. శ్రీకృష్ణుడు బాగా అలసి పోయాడు బాగా గాయపడిన అర్జునిని చూసి ఇలా అనుకున్నాడు " పాండవ సైన్యం భీష్ముని ధాటికి ఆగలేక పోతున్నాయి. అర్జునుడు బాగా గాయపడ్డాడు. పరిస్థితి ఇలా కొనసాగితే దుర్యోధనుని సమస్త కోరికలు భీష్ముడు ఈ రోజే నెరవేర్చగలడు. కేకయరాజులు, పాంచాలురు, యాదవులు పారి పోతున్నారు. కౌరవ సేనలు ఉన్మాదంతో ఊగి పోతున్నారు. ఇక ఉపేక్షించి లాభం లేదు భీష్ముని వధించి ధర్మ తనయుని గెలిపిస్తాను " అన్నాడు. ఇంతలో భీష్ముడు అర్జునినిపై శరవర్షం కురిపించాడు. అర్జునుడు శరసంధానం చేయలేక పోతున్నాడు. ఇది గమనించిన కృపాచార్యుడు, అశ్వత్థామ, భూరిశ్రవుడు, సైంధవుడు, వికర్ణుడు ఒక్క సారిగా అర్జునిని వైపు తమ రధాలను మరల్చారు. సాత్యకి తన గజ బలమును అర్జునినికి సాయంగా నిలిపాడు. సాత్యకి పాండవ సేనలను చూసి " ఎందుకు పారి పోతున్నారు మీరు పలికిన పలుకులు మరిచారా భీష్ముడు మనలను ఏమి చేయలేడు. కౌరవ సేనలను నరకండి తరమండి " సేనలను ప్రోత్సహిస్తూ ముందుకు వచ్చాడు. శ్రీకృష్ణుడు " సాత్యకీ ! పోయే పిరికి వారిని ఎందుకు ఆపుతావు ఈ రోజు నేను భీష్ముని చంపి ద్రోణుని పని పడతాను. కౌరవ సైన్యాలను నాశనం చేసి ఈ నాలుగు సముద్రముల నడుమ ఉన్న రాజ్యమంతా పాండు తనయునకు కట్టబెడతాను " అని పలికి సుదర్శన చక్రాన్ని మనసున తలచిన వెంటనే శ్రీకృష్ణుని చేతిలో సుదర్శన చక్రం ప్రత్యక్షమైంది. పగ్గములను నొగల మీద పెట్టి కట్టు పంచ జారుతున్నా లక్ష్యపెట్టక కోపంతో రగిలి పోతూ భీష్ముని పైకి లంఘించాడు " కౌరవ సేనలు నిశ్చేష్టులై చూస్తూ ఊరక ఉన్నారు. భీష్ముడు పారవశ్యంతో రధం దిగి శ్రీకృష్ణునికి ఎదురు వెళ్ళి " కృష్ణా ! రావయ్యా! నన్ను సంహరించి కృతార్ధుడిని చెయ్యి " అని చేతులు జోడిస్తూ ప్రార్ధించాడు. ఇది చూసిన అర్జునుడు రధం దిగి శ్రీకృష్ణుని వెనుక నుడి పట్టుకున్నాడు. కాని శ్రీకృష్ణుని బలానికి ఆగలేక చతికిల పడి తిరిగి లేచి శ్రీకృష్ణుని గట్టిగా పట్టుకుని " కృష్ణా ! నీ కోపం వదలవయ్యా యాదవులకు పాండవులకు నీవే దిక్కు నీవే ఇలా అధైర్య పడి అలిగిన పాండు పుత్రుల అందునా ధర్మతనయుని ధైర్యం, పరాక్రమం, వీర్యం ఏమి కావాలి . లోక నాయకా శాంతించ వయ్యా నీ సాయంతో కౌరవ సేనను రూపు మాపుతాను నాకు అపకీర్తి తీసుకు రాకయ్యా " అని ప్రార్ధించగా శ్రీకృష్ణుడు శాంతించి కోపం ఉపసంహరించి తిరిగి రధం ఎక్కి పగ్గములు చేత పట్టాడు. కృష్ణార్జునులు పాచజన్య దేవదత్తములు పూరించారు.

## అర్జునిని ప్రతాపం

కృష్ణార్జునుల శంఖారావం విన్న భీష్ముడు,భూరిశ్రవుడు, శల్యుడు, దుర్యోధనుడు ఒక్క సారిగా అర్జునినిపై శక్తి, గదా, తోమరములు ప్రయోగించారు. అర్జునుడు వాటిని అన్నింటిని ఒక్కసారిగా తుంచి వేసి వారిపై ఇంద్రాస్త్రాన్ని ప్రయోగించాడు. ఇంద్రాస్త్రం కౌరవ సేనలను విధవిధాలుగా నాశనం చేసాయి. అర్జునుడు భీష్మునిపై అతి క్రూరమైన బాణములు వేసాడు, భూరిశ్రవుని విల్లు విరిచాడు, తొమ్మిది బాణములను శల్యునిపై సంధించాడు. పాంచాల విరాట సైన్యాలు అక్కడకు చేరాయి. అర్జునిని పరాక్రమం చూసి కౌరవ సేన బెదిరి పోయింది. కౌరవులు అందరూ కలసి అర్జునిని రధమును చుట్టుముట్టారు. ఇంద్రాస్త్ర తాపనాకి కౌరవ సేనలు చాప చుట్టలా పడి పోతున్నాయి. హయములు, రధములు, ఏనుగులు కూలి పోతున్నాయి. ఆయుధములు, ఛామరములు, కేతనములు, ఛత్రములు తుక్కు తుక్కుగా అయినాయి. కృషార్జునులు పాంచజన్య దేవదత్తములు పూరించి సింహనాదం చేసారు. అర్జునిని ధాటికి ఆగలేని కౌరవ సేన ఆరోజుకు యుద్ధాన్ని ఆపి తమ నివాసములకు చేరుకున్నాయి. వంధిమాగదులు పాండవుల విజయానికి కీర్తిస్తుండగా పాండవ సేనలు తమ నివాసములకు చేరాయి.

## నాల్గవరోజు యుద్ధం

నాల్గవ రోజు యుద్ధానికి భీష్ముడు అపారమైన సైన్యాలను తీసుకుని వచ్చాడు. ద్రోణుడు, సుయోధనుడు, బాహ్లికుడు రణరంగం చేరుకున్నారు. భీష్ముడు భీకరంగా శంఖనాదం చేసాడు. గజ సమూహాలు ఘీంకారం చేసాయి. పాండవ సేనలు కూడా రణరంగ ప్రవేశం చేసాయి. కృషార్జునులు సూర్య చంద్రులలా ప్రకాశిస్తూ పాంచజన్య దేవదత్తములు పూరించారు. మిన్నంటే భేరి తూర్య నాదముల మధ్య ఇరుపక్షాలు యుద్ధ సద్ధం అయ్యాయి. ఇరు పక్షాలు తలపడ్డాయి. తోమరములు, క్షురికలు, బల్లెములు, గధలు, కుంతములు మొదలైన ఆయుధములతో కాల్బలం పోరు సాగిస్తుంది. కరవాలములు తిప్పబడుతున్నాయి. గధలు, ముసలములు, ముద్గరములతో ఒకరిని ఒకరు మోదుకుంటున్నారు. భీష్ముడు అంతటా తానై యుద్ధం చేస్తున్నాడు. సుయోధనుడు, ద్రోణుడు, వివిశంతి, కృపాచార్యుడు , శల్యుడు, సోమదత్తుడు భీష్ముని వెన్నంటి ఉన్నాడు. ఇది చూసిన అభిమన్యుడు ఒక్కడే వారినీందరిని ఎదుర్కొని వారంతా ప్రయోగించిన బాణములను తుంచి వేస్తున్నాడు. భీష్ముడు అభిమన్యుని విడిచి అర్జునినితో పోరాడుతున్నాడు. భీష్మార్జునుల పోరు భీకరం కాగానే ఇరు పక్షముల వారి అది తిలకించ సాగారు.

## అభిమన్యుని ప్రతాపం

అశ్వత్థామ, భూరిశ్రవుడు, శల్యుని కుమారుడు, చిత్రసేనుడు ఒక్కుమ్మడిగా అభిమన్యుని ఎదుర్కొన్నారు. అభిమన్యుడూ చిరు నవ్వు నవ్వుతూ అశ్వత్థామ గుండెలకు గిరి పెట్టి బాణమును విడిచాడు. భూరిశ్రవుని ఓడించాడు. అభిమన్యుని వంటి వీరుడు కౌరవ సేనలో కరువయ్యారు. అర్జునుడు అభిమన్యుని చూస్తూ కౌరవ సేనలను అంతటా తానై చీల్చి ఛండాడుతున్నాడు. సుయోధనుడు సుశర్మ, కృతవర్మ, కేకయ రాజులతో ముప్పై అయిదు వేల రధికులతో అభిమన్యుని చుట్టుముట్టాడు. అర్జునుని కొంత దూరంలో చూసిన ధృష్టద్యుమ్నుడు తన రధమును అటు పోనిచ్చాడు. అర్జునిని దాటి ముందుకు వెళ్ళి కృపాచార్యునిపై మూడు శరములను, శల్యునిపై పది శరములను, కృతవర్మపై ఒక్క బాణమును వేసి వారి హయములను, రధములను కూల్చాడు.

## శల్యుని కుమారుని మరణం

అప్పుడు శల్యుని కుమారుడు ధృష్టద్యుమ్నుని మీద పది శరములు సంధించి అతని సారధిని మరొక పది అమ్ములతో కొట్టాడు. ధృష్టద్యుమ్నుడు కోపించి ఒక బల్ల బాణంతో శల్య కుమారుని విల్లును తుంచాడు. నాగాస్త్రమును సంధించాడు. శల్యతనయుని రధమును, హయములను కొట్టాడు. శల్యతనయుడు కిందకు దిగి కత్తి డాలుతో శత్రువులను తనుమాడు తున్నాడు. ధృష్టద్యుమ్నుడు గదాయుధంతో శల్యకుమారుని ఎదుర్కొన్నాడు. ధృష్టద్యుమ్నుని గధాఘాతముకు శల్యకుమారుని కత్తి, డాలు విరిగి పోయాయి. రెండవ దెబ్బకే శల్యకుమారుని తల పగిపోయింది. కుమారుని మరణం చూసి శల్యుడు క్రుద్ధుడై ధృష్టద్యుమ్నునిపై అద్భుత బాణములను సంధించాడు.

## దృతరాష్ట్రుడు యుద్ధ పరిణామమునకు వగచుట

సంజయుని ద్వారా యుద్ధవిశేషాలు వింటున్న దృతరాష్ట్రుడు " అయ్యో సంజయా ! దైవ బలం ముందు మానవ బలం నిష్ప్రయోజనం అని తెలియక పోయింది కదా. పాండవులు మన సేనలను నిర్మూలం చేయడం తథ్యం . నా కుమారుని

దుర్బుద్ధి వలనే కదా ఇది అంతయు సంభవించింది. ఇంతటి దుర్వార్తలు వినవలసి వస్తుంది కౌంతేయులను గెలుచు మార్గం గోచరించుట లేదు " అన్నాడు. సంజయుడు " రాజా ! ఇప్పుడే ఏమి చూసావు ఇంకా ఎంతో మంది వీరులు చనిపోయారు చెపుతాను విను . శల్యుడు ధృష్టద్యుమ్నుని మీద శరవర్షం కురిపించి వివిధములైన అస్త్రములతో నొప్పించాడు. అది చూసిన అభిమన్యుడు ధృష్టద్యుమ్నునికి సాయంగా శల్యుని మీదకు వచ్చాడు. ఇది చూసి సుయోధనుడు దుర్ముఖుడు, దుర్మషణుడు, సత్యవ్రతుడు, వికర్ణుడు, చిత్రసేనుడు, పురుమిత్రుడు, వివిశంతి వారి వారి సేనలతో అభిమన్య , ధృష్టద్యుమ్నులను ముట్టడించారు. వారినందరిని ధృష్టద్యుమ్నుడు ఎదుర్కొని అందరి పైన బాణములు సంధించాడు. నకుల, సహదేవులు కూడా వారికి సాయంగా నిలిచారు. శల్యుడు వారిని బాణములతో వేదించి తరిమి కొట్టారు. పాంచాల, మత్స్య దేశాధిపతులు వారికి ఇరుపైపలా నిలిచి శల్యునితో యుద్ధం చేసి కౌరవ సేనలను తరిమి కొట్టాడు. ఇది చూసిన మిగిలిన సేన శల్యునికి సాయం వచ్చారు. అప్పటి సూర్యుడు నడి నెత్తి మీదకు వచ్చాడు. భీమసేనుడు తీవ్రకోపంతో నీకుమారుడైన సుయోధనుని ముందుకు గధాయుధము పట్టుకుని నిలిచాడు. అది చూసిన నీ కుమారుడు కలవర పడ్డాడు. సుయోధనుడు మగధ దేశాధీశుని గజ బలముతో భీముని ఎదుర్కొనమని చెప్పాడు. మగధ దేశాధీసుని గజబలమును చూసిన భీముడు చిరునవ్వుతో గధను తన భుజం మీద పెట్టుకున్నాడు. సింహనాదం చేస్తూ పర్వతముల పైన ఇంద్రుడు పడినట్లు గజసమూహముల మీద పడ్డాడు. ఆ సింహనాదంకే ఏనుగుల గుండెలు పగిలాయి. మిగిలిన వాటిని దొరికిన దానిని దొరికినట్లు భీముడు చంపివేస్తున్నాడు. ఇంతలో నకులసహాదేవులు, ధృష్టద్యుమ్నుడు, ద్రౌపదీ తనయులు భీమునకు ఇరు వైపులా నిలబడి ఏనుగుల సమూహంపై శరవర్షం కురిపించారు. మగధ రాజు తన ఏనుగును అభిమన్యునిపై నడిపించగా అభిమన్యుడు ఒక్క బాణంతో ఏనుగును, మరొక బాణంతో మాగధుని కొట్టాడు. మగధరాజు వెంటనే మట్టి కరిచాడు. ధృష్టద్యుమ్నుడు ఏనుగులను చీల్చి చెండాడాడు. భీముడు వాటిని కొట్టి చంపుతున్నాడు. కొన్నిటికి తొండములు తెగిపడగా కొన్నిటికి దంతములు తెగిపడ్డాయి, మరి కొన్నిటికి కుంభస్థలములు పగిలాయి, కొన్నిటికి కాళ్ళు తెగిపడ్డాయి. భీముని శరీరం రక్తసిక్తమై ఉంది. భీముని ధాటికి ఏనుగులు పారిపోనారంభించాయి. భీమాదులు వాటిని పశువులను తోలినట్లు తోలారు. ఇది చూసిన సుయోధనుడు కకావికలౌతున్న తనసైన్యములను కూడదీసి సుయోధనుడు భీమునిపై పురికొల్పాడు.

## భీముని ప్రతాపం

సముద్రం పొంగినట్లు భీముని మీదకు ఉరికిన కౌరవ సేనలను భీముడు చెలియలి కట్టలా నిలువ రించాడు. ధృష్టద్యుమ్నుడు, అభిమన్యుడు, ఉప పాడవులు భీమునికి అండగా నిలిచి శరపరంపరలతో కౌరవ సేనలను తనుమాడుతున్నారు. కార్చిచ్చు అడవిని కాల్చినట్లు భీమసేనుడు కౌరవ సేనలను దహిస్తున్నాడు. గజరాజు తామరతూడులతో ఆడినట్లు భీమసేనుడు కౌరవ సేనల మధ్య ఆడుకుంటున్నాడు. కౌరవ సేనలు గుండెలు జారి కకావికలై ప్రాణభయంతో పారిపోసాగారు. ఇది చూసిన భీష్ముడు తన రధాన్ని భీముని వైపు మళ్ళించాడు. అప్పుడు సాత్యకి భీష్ముని ఎదుర్కొన్నాడు. ఇది చూసిన అలంబసుడనే రాక్షస వీరుడు సాత్యకితో తలపడి పది బాణములతో సాత్యకిని కొట్టాడు. సాత్యకి నాలుగు బాణములతో అలంబసుని కొట్టాడు. సోమదత్తుని కుమారుడైన భూరిశ్రవుడు సాత్యకిని తొమ్మిది బాణములతో కొట్టాడు. సాత్యకి భూరిశ్రవుని బాణవర్షంలో ముంచెత్తాడు. ఇది చూసిన సుయోధనుడు తన తమ్ములతో భూరిశ్రవునికి సాయంగా వచ్చాడు. అందరూ ఒక్కుమ్మడిగా సాత్యకిని చుట్టుముట్టారు. ఇది చూసిన భీముడు రెచ్చి పోయాడు. సుయోధనుని మీద అతని తమ్ముల మీద బాణవర్షం కురిపించాడు. భీముని ధాటికి ఆగలేక సుయోధనుని తమ్ములు తలొక దిక్కుగా పారి పోయారు. తమ్ముల అవస్థ గమనించిన సుయోధనుడు భీముని పైన తొమ్మిది బాణములు ప్రయోగించాడు. భీముడు నేలపై నుండి రధము ఎక్కి సుయోధనునిపై పది బాణములు వేసాడు. మూడు బాణములు సుయోధనుని సారధిపై వేసాడు. ప్రతిగా సుయోధనుడు భీమునిపైన అతని సారధిపైన అరవై బాణములు వేసాడు. ఒక బాణంతో భీముని విల్లు తుంచాడు. భీముడు మరొక విల్లందుకుని బల్లె బాణం సంధించి సుయోధనుని విల్లు తుంచాడు. సుయోధనుడు వేరొక విల్లు అందుకుని వజ్రసమాన బాణంతో భీముని గుండెలు గురి చూసి కొట్టాడు. ఆ దెబ్బకు భీమసేనుడు మూర్చిల్లాడు. అది చూసిన అభిమన్యుడు ధృష్టద్యుమ్న, ఉపపాడవులతో ఒక్క సారిగా సుయోధనుని పైన పడ్డారు. ఇంతలో భీమసేనుడు సేదతీరి ఒక్క సారిగా కౌరవ సేన పై పడ్డాడు. వారంతా శల్యుని పై, సుయోధనుని పై శరపరంపర కురిపించారు. సింహమును చూసిన ఏనుగులా కౌరవ సేన పలాయనం చిత్తగించింది.

## దృతరాష్ట్రకుమారులను భీముడు హతమార్చుట

ఆ సమయంలో దృతరాష్ట్ర కుమారులైన సేనాపతి, సుషేణుడు, జలసంధుడు, సులోచనుడు, భీముడు, భీమరధుడు, భీమబాహుడు, దుష్ప్రదర్షుడు, వివిత్సుడు, దుర్ముఖుడు మరి కొందరు ఒక్కుమ్మడిగా భీముని ఎదుర్కొని భీమునిపై బాణవర్షం కురిపించారు. భీముడు వారిపై పెద్దపులి బాలమృగములపై పడినట్లు పడి సేనాపతి శిరము తుంచాడు. మూడు బాణములు వేసి సుషేణుని వక్షము చీల్చాడు. మూడు బాణములతో జలసంధుని చంపాడు, భీమబాహుని అయిదు బాణములతో చంపాడు, ఉగ్రుని శిరము తుంపాడు, భీముని, భీమరధుని ఒకేసారి చంపాడు. సులోచనుని నాలుగు

బాణములతో చంపాడు. భీముని వీరవిహారం చూసిన కౌరవ సైన్యం భభ్రాంతులకు లోనై పారిపోయింది. భీముని ఉగ్రరూపం చూసిన భీష్ముడు తన సేనలోని యోధాను యోధులను చూసి " యోధులారా ! భీముడు రాజ కుమారులను నరుకుతున్నాడు. ఉపేక్షించక భీమసేనుని ఆపండి " అని హెచ్చరించాడు. అది విన్న భగదత్తుడు భీముని మీదకు తన ఏనుగును నడిపి భీమునిపై సూర్యుని పై మేఘాలు కమ్ము కున్నట్లు శరవర్షం కురిపించించాడు. భీముని రథం కొంత సేపు కనిపించనంతగా బాణాలు వేసాడు. ఇది చూసిన అభిమన్యుడు, ఉప పాండవులు కోపించి భగదత్తుని ఏనుగుపై బాణవర్షం కురిపించారు. భగదత్తుని ఏనుగు అదుపుతప్పి ఘీంకరిస్తూ పాండవ సేనను తొక్కుతూ తొండంతో విసురుతూ ఇష్టం వచ్చినట్లు పాండవ సేనను చంపి వేసింది. ఇది చూసి పొంగిపోతూ సుయోధనుడు తన ఏనుగును భీముని మీదకు తోలి భీమున గుండెలను తాకేలా పలుబాణములు వేసాడు. భీముడు కొంతసేపు దిమ్మెర పోయాడు. ఇది చూసిన ఘతోత్కచుడు తండ్రికి సాయంగా వచ్చాడు. సాయంకాలం సమీపించడంతో అది తన మాయా యుద్ధమునకు అనువైనదని అనుకుని ఏనుగు ఎక్కి కౌరవ సేనను ఎదుర్కొన్నాడు. అతడు దిక్పాలకులను వెంట పెట్టుకుని ఇంద్రుడే వస్తున్నాడా అని భ్రమ కలిగించాడు. ఘతోత్కచుడు సుయోధనుని మీదకు తన ఏనుగును పోనిచ్చాడు. భగదత్తుడు ఘతోత్కచుని అడ్డుకున్నాడు. ఘటోత్కచుడు భగదత్తుని పట్టుకుని ఏనుగును చంపి భగదత్తుని విసిరి వేసాడు. ఘతోత్కచుడు తిరిగి సుయోధనుని ఎదుర్కొన్నాడు. ఇది చూసిన భీష్ముడు ద్రోణునితో " ఆచార్యా ! మాయా యుద్ధంలో ఘతోత్కచుడు ఆరితేరిన వాడు. ఇప్పటికే భదత్తుని ఏనుగుతోసహా చంపాడు. భదత్తుని వంటి మహా వీరుని ఒక్క దెబ్బతో మట్టికరిపించిన ఘటోత్కచుని చేతిలో సుయోధనుడు పడకుండా కాపాడాలి " అని చెప్పి " కౌరవ వీరులారా ! ఘటోత్కచుని నుండి సుయోధనుని కాపాడాలి రండి ఘతోత్కచుని ఎదుర్కొనండి " అని సేనలను సమాయత్తం చేసాడు.

## ఘటోత్కచుని యుద్ధం

ఇది చూసిన ఘతోత్కచుడు తండ్రికి సాయంగా వచ్చాడు. సాయంకాలం సమీపించడంతో అది తన మాయా యుద్ధమునకు అనువైనదని అనుకుని ఏనుగు ఎక్కి కౌరవ సేనను ఎదుర్కొన్నాడు. దిక్పాలకులను వెంట పెట్టుకుని ఇంద్రుడే వస్తున్నాడా అని భ్రమ కలిగించాడు. ఘతోత్కచుడు సుయోధనుని మీదకు తన ఏనుగును పోనిచ్చాడు. భగదత్తుడు ఘతోత్కచుని అడ్డుకున్నాడు. ఘటోత్కచుడు భగదత్తుని పట్టుకుని ఏనుగును చంపి భగదత్తుని విసిరి వేసాడు. ఘతోత్కచుడు తిరిగి సుయోధనుని ఎదుర్కొన్నాడు. ఇది చూసిన భీష్ముడు ద్రూణునితో " ఆచార్యా ! మాయా యుద్ధంలో ఘతోత్కచుడు ఆరితేరిన వాడు. ఇప్పటికే భదత్తుని ఏనుగుతోసహా చంపాడు. భదత్తుని వంటి మహా వీరుని ఒక్క దెబ్బతో మట్టికరిపించిన ఘటోత్కచుని చేతిలో సుయోధనుడు పడకుండా కాపాడాలి " అని చెప్పి " కౌరవ వీరులారా ! ఘటోత్కచుని నుండి సుయోధనుని కాపాడాలి రండి ఘతోత్కచుని ఎదుర్కొనండి " అని సేనలను సమాయత్తం చేసి తనూ అక్కడకు చేరుకున్నాడు . భీష్ముని పిలుపందుకుని కౌరవ సైన్యం ఘతోత్కచుని పై ఒక్కుమ్మడిగా పడ్డారు. ఇది చూసిన యుధిష్టరుడు మత్స్య, పాంచాల సైన్యాలతో దండనాయకులను చేర్చుకుని కౌరవ సేనలను ఎదుర్కొన్నాడు. యుద్ధం భీషణ రూపందాల్చింది. భీష్ముడు పాండవ సేనలను వీరవిహారం చేస్తూ తనుమాడు తున్నాడు. ఘతోత్కచుడు సింహనాదం చేసాడు అతడి సింహనాదం విన్న కౌరవ సేనలు నిజంగానే సింహం వచ్చినదని భ్రమపడి కకావికలై పోయారు. ఇది చూసిన భీష్ముడు ద్రోణునితో " ఆచార్యా ! సూర్యుడు అస్తమిస్తున్నాడు. ఘతోత్కచుని బలం ఇక ద్విగుణీకృతం ఔతుంది కనుక ఇప్పుడు అతనితో పోరు ఆపదకు దారి తీస్తుంది కనుక మనం ఈ రోజుకు పోరు నిలిపి రేపు వస్తాము అన్నాడు. ద్రోణుడు అందుకు అంగీకరించి కౌరవ సేనలను వెనుకకు మరల్చాడు. భేరి, తూర్య, భీషణ గోషతో , సింహనాదం చేసుకుంటూ పాండవ సేనలూ నివాసములకు చేరాయి.

## తనవారి పరాజయమునకు దృతరాష్ట్రుడు పరితపించుట

ఇది విన్న దృతరాష్ట్రుడు " సంజయా ! నీవు ఎప్పుడూ పాడవుల పరాక్రమం చెప్తూ నా వారిని తక్కువ చేసి మాట్లాడుతావు. భీష్ముడు, ద్రోణుడు, శల్యుడు యుద్ధంలో పరాక్రమం చూపడం లేదా ! అయినప్పటికి పాండవులు విజయం సాధించుటకు ఏమి కారణం " అన్నాడు. సంజయుడు " ధృతరాష్ట్రా ! పాండవుల వద్ద ధర్మం, సత్యం తప్ప ఏ మంత్రం, తంత్రం, ఔషధం లేదు. నీ కుమారులు ధర్మం తప్పారు. వారు అధర్మ మార్గాన నడవడం నీకు తెలిసినా నీవు అది ఆపలేదు. ధర్మమేవజయతే అన్నది ఆర్యోక్తి కనుక పాండవుల విజయం కౌరవుల అపజయం సత్యము. విదురుడు చెప్పినది తెలుసుకదా ! నీలానే సుయోధనుడు భీష్ముని అడిగాడు. అందుకు భీష్ముడు ఏమి చెప్పాడో చిత్తగించండి " అని ఇలా చెప్ప సాగాడు.

## భీష్ముడు నరనారాయణుల గురించి సుయోధనునికి వివరించుట

సుయోధనుని సందేహం తీర్చడానికి భీష్ముడు " సుయోధనా ! పాండవులకు వాసుదేవుడు సాయంగా ఉన్నాడని కనుక వారికి అసాధ్యం అయినది ఏదీ లేదని నీకు ఎన్నోసార్లు చెప్పాను నీవు విన లేదు. ఆ పరమేశ్వరుని మహత్యం ఎరిగిన వారు ఎవరూ లేరు ఎరిగిన వారికి అపజయం లేదు పాండవులు శ్రీకృష్ణుని మహత్యం తెలిసిన అతడిని ఆశ్రయించారు. నీవు అతడి మాటలు పెడచెవిన పెట్టావు. ఒక సారి బ్రహ్మదేవుడు మానసరోవరం ఉత్తర పర్వత శిఖరాన దేవతలు, మునులు, గంధర్వులు, అప్సరసలు మొదలైన వారితో కొలువుతీరి ఉన్నాడు. అప్పుడు ఆకాశమార్గాన ఒక విమానం ఎగురుతూ ఉండటం చూసి ఆ విమానంలో పరమాత్ముడు తన సఖునితో ఉన్నాడని తెలుసుకుని దిగ్గున లేచి నమస్కరించి " ఈ లోకముల సృష్టి, స్థితి, లయ కారకుడవై మునిగణములతో అర్చించబడుతూ భయనిర్మూలనం గావించు నిర్గుణ మూర్తికి శుభకరుడికి ఇదే నమస్కారం " అని స్తుతించాడు. " నారాయణా ! నీవు నా తండ్రివి నేను నీ ఆనతిన సృష్టి కార్యము నెరవేర్చాను. నీ రక్షణలో వర్ధుల్లుతున్న ఈ లోకములు ఇప్పుడు తల్లడిల్లి పోతున్నాయి. అసుర ప్రవృత్తి ప్రబలుచున్నది. నీవు యదు వంశమున పుట్టవ వలసిన సమయం ఆసన్నమైంది. నీకు సఖుడైన నరుడు నీతో చేరి భూలోకమున జన్మించి నానా విధ దైత్యులను సంహరించి భూభారమును తగ్గించ వలసిన సమయమూ ఆసన్నమైంది స్వామి " అన్నాడు. నారాయణుడు బ్రహ్మదేవునికి కోరిన వరం అనుగ్రహించి వెళ్ళి పోయాడు. బ్రహ్మ కొలువులో ఉన్న వారు బ్రహ్మదేవునితో " దేవా ! నీవు వినమ్రుడవై నమస్కరించిన వీరెవరు ? " అని అడిగారు. బ్రహ్మ " వీరు ఆది పురుషులు పరమ మునులు నరనారాయణులు నాకు ఆరాధ్యులు అందుకే ధర్మసంరక్షణార్ధం వారిని భూలోకాన జన్మించమని కోరాను అందుకు వారు అంగీకరించారు. భూలోకమున జన్మించు వీరిని కేవలం మర్త్యులు అని అనుకున్న వారు చెడి పోతారు. వారి ఏడల భక్తి ప్రపత్తులు కనబరిచిన వారికి సకల శుభములు కలుగగలవు " అని చెప్పి బ్రహ్మ సత్యలోకానికి వెళ్ళగా మిగిలిన వారు కూడా వారి వారి లోకాలకు వెళ్ళారు. సుయోధనా నేను ఈ కధను పరశురాముడు, నారదుడు, వ్యాసుడు చెప్పగా విన్నాను . ఇంతకు మునుపే నేను, మహా మునులు నారనారాయణులతో వైరం మంచిది కాదని హెచ్చరించాము. కాని నీవు మదాంధుడవై వారి మాట విన లేదు . ఇప్పటికీ మించినది లేదు శ్రీకృష్ణుని శరణు వేడి పాండవులతో స్నేహం చేసి ఈ వినాశనాన్ని ఆపు " అన్నాడు. నీ కుమారుడు పితామహుని మాట పెడచెవిన పెట్టాడు. రాజా ! నువ్వు నీ కుమారులు మంచి మాటలు వినరు కదా ! అది సరే అయిదవరోజు యుద్ధం చెప్తాను విను " అని తరవాతి యుద్ధం వర్ణించ సాగాడు.

## అయిదవరోజు యుద్ధం మకర వ్యూహం డేగవ్యూహం

అయిదవ రోజు యుద్ధానికి కౌరవ సేనల భీష్ముని సారధ్యంలో మకర వ్యూహంలో నిలిచాయి. ప్రతిగా పాండవ సేనలు శ్యేన వ్యూహంలో నిలిచాయి. వ్యూహాన్నికి ముఖ భాగాన భీమసేనుడు నిలబడ్డాడు. కన్నుల భాగాన ధృష్టద్యుమ్నుడు, శిఖండి నిలబడ్డారు. తల భాగాన సాత్యకి నిలిచాడు. మెడభాగాన అర్జునుడు నిలువగా ఎడమ రెక్కగా విరాటుడు, ద్రుపదుడు ససైన్యంగా నిలిచారు. కుడి రెక్క భాగాన కేకయరాజులు ససైన్యంగా నిలిచారు. తోక భాగాన నకులసహదేవులతో యుధిష్టరుడు నిలిచాడు. భేరి, తూర్య, శంఖనాదాలతో యుద్ధం ఆరంభం అయింది. ముందు భాగాన ఉన్న భీముడు కౌరవ సేనలోకి చొచ్చుకొని పోయి సేన్యాన్ని కకావికలు చేసాడు. నేరుగా భీష్ముని ఎదుర్కొని శరవర్షం కురిపించాడు. భీష్ముడు ఆ బాణములను మధ్యలోనే తుంచి తిరిగి భీమునిపై శరవర్షం కురిపించాడు. ఇంతలో అర్జునుడు భీమునికి సాయంగా రావడమే కాక భీష్మునితో తలపడి కౌరవ సేనలను చీల్చి చెండాడాడు. భీమార్జునులు కౌరవ సేనలను తనుమాడుతున్న సమయంలో సుయోధనుడు కలత పడి " ఆచార్యా ! మీరు కౌరవ సైన్యాలను పట్టి పల్లారుస్తారని అనుకున్నాను. భీష్ముడు అలిగిన దేవతలు కూడా అతని ముందు నిలువ లేరు అనుకున్నాను. కాని మీరిరువురు భీమార్జునుల విజృంభణను ఆపలేక చూస్తూ ఉన్నారేమిటి " అని నిష్టూరంగా అన్నాడు. ద్రోణుడు " సుయోధనా ! అర్జునుడు శౌర్యధనుడు. అతడి జయించుట అసాధ్యం అని నేను ముందే చెప్పాను. అయినా మాకు చేతనయినంత యుద్ధం చేస్తాము. యుద్ధాన్ని ఒక్క రోజులో గెలవడం ఎవరి తరం " అన్నాడు.

## పాండవులతో ద్రోణ, భీష్ముల యుద్ధం

సాత్యకి ముందుగా ద్రోణుని మీద బాణవర్షం కురిపించాడు. ద్రోణుడు ప్రతిగా సాత్యకి మీద బాణ ప్రయోగం చేసాడు.ఇది చూసిన భీముడు సాత్యకి సాయంగా రధాన్ని నడిపిస్తూ వచ్చి చేరి ద్రోణునిపై అతి క్రూర బాణాలు సంధించాడు. ఇది చూసిన శల్యుడు ద్రోణ, భీష్ములకు బాసటగా నిలిచి భీమునిపై బాణవర్షం కురిపించాడు. ఇంతలో ద్రౌపతీ సుతులు, అభిమన్యుడు భీమునకు సాయంగా వచ్చారు. శిఖండి భీష్మిని ఎదుర్కొన్నాడు. భీష్ముడు పక్కకు తప్పుకున్నాడు. ఇది చూసిన సుయోధనుడు ద్రోణుని శిఖండి మీదకు పురికొల్పాడు. ద్రోణుడు శికండిపై బాణాలను గుప్పించాడు. పోరు భీకర రూపం దాల్చింది. రధ, గజ, తురగ, పదాతి దళముల పదఘట్టనల హోరు మిన్నంటింది, ధూళి ఆకాశాన్ని కప్పేసింది. గుర్రముల ప్రేగుల గుట్టలు, ఏనుగుల కళేబరములతో రణభూమి భయానకంగా ఉంది. రక్తం కాలువలు కట్టింది. భీమార్జునుల, భీష్మ ద్రోణులు ఇరువైపులా నిలిచి భీకర పోరు సాగిస్తున్నారు.

## భీమసేనుని పరాక్రమం

దృతరాష్ట్ర కుమారులంతా చేరి భీమునిపై మూకుమ్మడిగా పడ్డారు. ఎత్తైన కొండను మేఘాలు కప్పినట్లు భీమసేనుని ఎదుర్కొన్న నీ కుమారులను చూసిన అర్జునుడు భీమసేనునికి సాయంగా వచ్చి వారి పై శరములు గుప్పించాడు. అర్జునిని గాండీవతాకిడికి ఆగలేక కౌరవ సేనలు భీష్ముని వెనుక చేరాయి. తన సేనలు పారిపోవడం చూసిన సుయోధనుడు చేయి వూపుతూ అక్కడకు చేరగానే అది గమనించిన కంభోజ, సౌవీర, సింధు, గాంధార, త్రిగర్త, కళింగ రాజులు తమ సేనలతో అక్కడకు చేరి భీమార్జునులను ఎదుర్కొన్నారు. ఇది చూసిన ధర్మరాజు చేది, కాశ, కరూస, విరాట సేనలను ధృష్టద్యుమ్నుని నాయకత్వంలో భీమార్జునులకు సాయంగా తీసుకు వచ్చాడు. విందాను విందులు కాశీరాజుని, జయద్రధుడు భీమసేనుని, సహదేవుని వికర్ణుడు, చిత్రసేనుడు శిఖండిని, సుయోధనుడు విరాటుని, త్రిగర్తలు నకులుని, ద్రోణుడు చేకితాన, సాత్యకులను, కృపాచార్యుడు ధృష్టద్యుమ్నుని, అభిమన్యుడు సాళ్వ కేకయరాజులను, ధృష్టకేతు, ఘటోత్కచులు నీకుమారులను ఎదుర్కొన్నారు. సమరం సంకులమైంది. అస్త్ర, శస్త్రములు ఒకదానితో ఒకటి తాకి మంటలను రేపుతున్నాయి. ఏనుగుల ధాటికి నలిగిన రధములు రధముల ధాటికి దెబ్బతిన్న ఏనుగులు, గుర్రముల ధాటికి నేల కూలిన పదాతి దళములు యుద్ధరంగాన్ని భీభత్సం చేసాయి. భీముని పరాక్రమం చూసి భీష్ముడు వాడి అయిన బాణములు వేసి అతడిని నొప్పించాడు.

## పాండవ కౌరవ సేనల మధ్య సంకుల సమరం

ఇది చూసిన సాత్యకి క్రూర బాణములను భీష్మునిపై గుప్పించాడు. భీష్ముడు కుపితుడై సాత్యకి సారధిని చంపాడు. సాత్యకి రధం ఊగిసలాడింది. రధముకు కట్టిన గుర్రములు కకావికలై పోగా వికల రధుడైన సాత్యకితో పోరు సల్ప ఇష్టపడక భీష్ముడు అతడిని విడిచి పాండవ సైన్యాలపై తన ప్రతాపం చూపసాగాడు. ఇంతలో విరాటుడు భీష్ముని ఎదుర్కొని మూడు బాణాలతో భీష్ముని కొట్టాడు. భీష్ముడు ఆ బాణములను మధ్యలో త్రుంచి పది బాణములతో విరాటుని కొట్టాడు. భీష్ముని ఎదుర్కోవడానికి వచ్చిన అర్జునిని అశ్వద్ధామ అడ్డం వచ్చి ఆరు బాణములతో అర్జునిని కొట్టాడు. అర్జునుడు నవ్వుతూ అశ్వద్ధామ విల్లును విరిచాడు. అశ్వద్ధామ మరొక విల్లందుకుని అర్జునిని మీద శరపరంపర కురిపించాడు. అశ్వద్ధామ అస్త్ర, శస్త్ర ధాటికి నరనారాయణులు బాగా నొచ్చుకున్నారు. కుపితుడైన అర్జునుడు అశ్వథామ శరీరాన్ని బాణాలతో కొట్టి రక్తసిక్తం చేసాడు. భీష్ముని ఎదుర్కొన్న భీముని సుయోధనుడు అడ్డుకుని అయిదు బాణములు ప్రయోగించి భీముని కవచాన్ని ఛేదించాడు. ఇరువురి మధ్య పోరు తీవ్ర రూపం దాల్చింది. సుయోధనునికి సాయంగా భీష్ముడు, చిత్ర సేనుడు, పురుమిత్రులు వచ్చారు. వారిని అభిమన్యుడు సమర్ధవంతంగా ఎదుర్కొన్నాడు. అభిమన్యుని బాణములను వారిరువురు సమర్ధవంతంగా ఎదుర్కొని అభిమన్యునిపై బాణవర్షం కురిపించాడు. అభిమన్యుడు కోపించి వేసవిలో అడవిని దావాగ్ని దహించిన విధంగా బాణపరంపర ప్రయోగించి చిత్ర సేనుని విల్లు విరిచి అతడి రధాశ్వాలను చంపాడు. అలా పరాక్రమాన్ని ప్రదర్శిస్తున్న అభిమన్యుని సుయోధన కుమారుడైన లక్ష్మణ కుమారుడు ఎదుర్కొన్నాడు. అభిమన్యుడు ముందు లక్ష్మణుని గుర్రములను చంపి తరవాత సారధిని చంపి అతని రధమును విరుగ కొట్టాడు. విరధుడైన లక్ష్మణుడు శక్తి బాణమును అర్జునిపై ప్రయోగించాడు. అభిమన్యుడు దానిని మధ్యలోనే విరిచి లక్ష్మణుని శరీరం తూట్లు పడేలా బాణ ప్రయోగం చేసాడు. ఇది గమనించిన కృతవర్మ లక్ష్మణుని తన రధంపై ఎక్కించుకుని తీసుకు పోయాడు. సుయోధనుడు తన సేనలను పోరుకు ఉత్సాహపరిచాడు. భీష్ముడు పాండవ సేనుని తనుమాడ సాగాడు. సాత్యకి తన శరములతో కౌరవ సేనలను చికాకు పరుస్తున్నాడు. ఇది గమనించిన సోమదత్తుని కుమారుడు భూరిశ్రవుడు ఎదుర్కొని సాత్యకిని చికాకు పరిచాడు. సాత్యకి పుత్రులు భూరిశ్రవుని ఎదుర్కొని " భూరిశ్రవా ! నీతో యుద్ధం చేసి వినోదించడానికి వచ్చాము. కనుక మాలో ఒకరిని ఎన్నుకుని నీ పరాక్రమం చూపించు " అన్నారు. భూరిశ్రవుడు " మీరంతా ఒక్కటిగా వచ్చినా నాకు భయం లేదు " అన్నాడు. వారంతా ఒక్కుమ్మడిగా బాణవర్షం భూరిశ్రవునిపై కురిపించగా భూరిశ్రవుడు వారిని శరపరంపరలో ముంచెత్తాడు. వీరోచితంగా పోరాడుతున్న సాత్యకి పుత్రులను భూరిశ్రవుడు వారి తలలు నరికి నేల కూల్చాడు. ఇది చూసిన కౌరవ సేనలోఉత్సాహం పెల్లుబికింది. తనకుమారుల మరణం సాత్యకిని ఆగ్రహోదగ్రుని చేయగా కౌరవ సేనపై విరుచుకు పడి దొరికిన వారిని దొరికినట్లు చంపి భూరిశ్రవుని రధాశ్వములు, సారధిని చంపాడు. భూరిశ్రవుడు కూడా సాత్యకి రధం విరుగ కొట్టాడు. ఇరువురు నేల మీదకు దుమికి కరవాలంతో యుద్ధం చేయసాగారు. ఇంతలో సాత్యకిని భీముడు భూరిశ్రవుని సుయోధనుడు తమ తమ రధములపై ఎక్కించుకుని తీసుకు వెళ్ళారు. అర్జునుడు కౌరవ సేన మీదకు దూకి తన శరపంపరతో కౌరవ సేనుని నుగ్గు నుగ్గు చేసాడు. సూర్యుడు పశ్చిమాద్రికి చేరుకుంటున్న తరుణంలో భీష్ముని ఆదేశంతో ఆనాటి యుద్ధం ముగుసింది.

## ఆరవరోజు యుద్ధం

ఆరవ రోజు యుద్ధానికి అర్జునిని సూచన మేరకు ధృష్టద్యుమ్నుడు పాండవ సైన్యాలను మకర వ్యూహములో నిలిపాడు. తల ముందు భాగంలో అర్జునుడు, పాంచాలరాజు, కన్నుల భాగంలో నకుల సహదేవులు , నోటి భాగంలో భీముడు అభిమన్యుడు, ఉపపాండవులు, ఘటోత్కచుడు దవడలుగా సాత్యకి సమేత యుధిష్టరుడు కంఠభాగమున, ధృష్ట ద్యుమ్న సహిత విరాటుడు వెన్ను భాగమున, ఎడమ పక్క కేకయరాజులు, కుడి పక్క దుష్టకేతు, కరూశరాజు, కుంతిభోజ, శతానీకులు జఘన భాగమున శిఖండి, ఇరావంతుడు తోకభాగమున నిలిచారు. ఈ మరవ్యూహమునకు ధీటుగా భీష్ముడు క్రౌంచ వ్యూహమును పన్నాడు. తలభాగమున కృతవర్మ సేనలతో నిచిచాడు. ద్రోణుడు, భీష్ముడు ముక్కు భాగమున నిలిచారు. కృపాచార్యుడు, అశ్వథామ కన్నులుగా నిలిచారు. శూరసేనుడితో సహా సుయోధనుడు కడుపుభాగమున నిలిచారు. కాంభోజ బాహ్లికులు కంఠ భాగమున నిలిచారు. సౌవీరుడు వీపు భాగమున నిలిచారు. విందానువిందులు ఏడమ వైపున, సుశర్మ కుడిపక్కన, యవన రాజు, శ్రుతాయువు, భూరి శ్రవుడు తోక వైపు నిలిచారు. యుద్ధం ఆరంభం కాగానే మకర వ్యూహ తలవైపు చొరబడుతున్న ద్రోణుని చూసి భీముడు తన రధాన్ని అతని మీదకు నడిపాడు. భీముని ధాటికి ద్రోణుని ముందు ఉన్న సేనలు పోరి పోవడం చూసి ద్రోణుడు ఉగ్రుడై భీమునిపై క్రూర బాణములు ప్రయోగించాడు. భీముడు ద్రోణుని సారధిని చంపాడు. తానే రధాన్ని తోలుతూ ద్రోణుడు వైరి వీరులను చెండాడు తున్నాడు. ఇది చూసి భీష్ముడు ద్రోణునికి సాయంగా వచ్చాడు. భీష్మద్రోణుల ప్రతాపానికి కేకయ రాజులు భయంతో వెనక్కి తగ్గారు. ఇది చూసిన భీముడు కౌరవ సేనలను చావకొట్టి చాపలా చుట్టి పారేస్తున్నాడు. ధర్మరాజు, సుయోధనులు తమ తమ సేనలను చేతులు ఆడిస్తూ ప్రోత్సాహ పరుస్తున్నారు. ఇరు సేనలు ఉత్సాహంగా పోరుతున్నారు.

## దృతరాష్ట్రుని సందేహం

దృతరాష్ట్రుడు యుద్ధ విశేషాలు వింటూ సంజయునితో " సంజయా ! మన సేనలో ఎంతో మంది ఉండి కూడా పాండవులను గెలవ లేక పోవడానికి కారణం ఏమిటి?. ఇది దైవ లీల కాక మరేమిటి? ఇలా జరుగుతుందని విదురుడు ముందే చెప్పాడు. దుర్మార్గుడైన నా కుమారుడు వినలేదు. బుద్ధి కర్మానుసారిణి అన్నారు కదా! " అని విరక్తి చెందాడు. సంజయుడు " మహారాజా ! నీ కుమారుడు తెలియని వాడు. యుక్తా యుక్త వివేచన లేని వాడు. నాడు జూదం ఆడినప్పుడే మనం ఊరుకోకుండా ఆపి ఉంటే ఈ దారుణ యుద్ధం సంబవించేది కాదు కదా ! ఇక పశ్చాతాపం మాని యుద్ధక్రమాన్ని ఆలకించు " అన్నాడు. ఆ సమయంలో భీముడు కౌరవ సేనలోకి చొచ్చుకుని పోతూ దృతరాష్ట్ర కుమారులైన దుశ్శాసనుడు, జయుడు, దుస్సహుడు, జయత్సేనుడు, వికర్ణుడు, చిత్రసేనుడు, చారుమిత్రుడు, సుదర్శనుడు, సువర్ముడు, దుష్కరణుడు ఒకచోట ఉండటం గమనించి రధాన్ని వారి ముందు నిలిపాడు. అది చూసి వారు " అడుగో భీముడు వాడిని అందరం కలసి చంపుతాము రండి " అని తమ సేనలతో ఒక్క సారిగా చుట్టుముట్టారు. భీముడు తన సారధితో చెప్పి రధాన్ని అక్కడే నిలిపి దిగి కాలి నడకన వారిని ఎదుర్కొని యుగాంతమున యమధర్మరాజు వలె కౌరవ సైన్యాన్ని చంపసాగాడు. ఏనుగుల కుంభస్థలములను మోదుతూ, హయములను చంపుతూ రధములను నుగ్గు చేస్తున్నాడు. నేలపై నిలబడి అందరితో ఒక్కడై యుద్ధం చేస్తున్నాడు. ద్రోణునితో యుద్ధం చేసి అలసి పోయిన ధృష్టద్యుమ్నుడు ఆ ప్రదేశానికి వచ్చి భీముని రధం చూసి ఖిన్నుడై సారధిని " భీముడెక్కడ ? అతడు నా బహిర్ప్రాణం అతడు లేక నేను ఉండ లేను " అని అడిగాడు. సారధి " మహారాజా ! అడుగో భీముడు నన్ను ఇక్కడ నిలిపి తాను అక్కడ ఒక్కడే యుద్ధం చేస్తున్నాడు " అని భీముని చూపాడు. ధృష్టద్యుమ్నుడు భీముని చెంతకు వెళ్ళి " భీమసేనా ! నీ పరాక్రమం చూపు నేను కూడా నీకు సాయంగా కౌరవ సేనలను నుగ్గు చేస్తాను " అని కౌరవ సేనలను చెండాడం మొదలు పెట్టాడు. అది చూసిన నీ కుమారుడు " ఈ ధృష్టద్యుమ్నుని వదలకండి చంపండి " అన్నాడు. అది విని అతని సోదరులు ధృష్టద్యుమ్నుని చుట్టుముట్టారు. ధృష్ట ద్యుమ్నుడు తన గురువు ప్రసాదించిన ప్రమోహనాస్త్రం వదిలాడు. నీ కుమారులంతా మూర్చిల్లారు. భీముడు పక్కనే ఉన్న మడుగు వద్దకు వెళ్ళి దాహం తీర్చుకుని ధృష్టద్యుమ్నుని కలుసుకున్నాడు. ధృష్టద్యుమ్నుడు తప్పుకున్న తరవాత పాంచాలరాజు ద్రోణునితో యుద్ధానికి తలపడ్డాడు. ద్రోణుని ధాటికి ఆగలేక పాంచాలరాజు పక్కకు తప్పుకున్నాడు. తన నుండి తప్పుకున్న ధృష్టద్యుమ్నుడు ఎక్కడా అని పరికించి చూడగా కౌరవ సేనలు ప్రమోహనాస్త్రానికి కట్టుబడ్డారని గ్రహించి ప్రజ్ఞాస్త్రాన్ని ప్రయోగించి వారిని విముక్తులను చేసాడు. మూర్చ నుండి తేరుకున్న నీ కుమారులు ద్రోణుని అండ చూసుకుని భీమసేన ధృష్టద్యుమ్నుల మీదకు తిరిగి ఉరికారు.

### యుధిష్టరుడు ధృష్టద్యుమ్నుడికి సాయం పంపుట

ఇది చూసిన యుధిష్టరుడు కేకయరాజులు, ఉపపాండవులను, ధృష్టకేతులను చూసి " మీరంతా అభిమన్యునితో కలసి భీమ, ధృష్టద్యుమ్నులకు సాయం వెళ్ళండి " అని ఆదేశించారు. వారి సాయంతో భీముడు పాదచారియై ఉచకోత కోస్తున్నాడు. ద్రోణుడు ధృష్టద్యుమ్నుని విల్లు విరిచాడు. అతడు మరొక విల్లు తీసుకోగానే దానిని కూడా విరిచాడు. వెంటనే ధృష్టద్యుమ్నుడు అభిమన్యుని రధం ఎక్కాడు. అది చూసిన పాండవ సేనలు వెనుకక తగ్గాయి. సుయోధనుడు భీముని ఎదుర్కొన్నాడు.

ధృష్టద్యుమ్నుని సారథి మరొక రథం తీసుకు వచ్చి అందులో అతడిని ఎక్కించుకున్నాడు. ధృష్టద్యుమ్నుడు తిరిగి ద్రోణుని ఎదుర్కొన్నాడు. విశోకుడు రథం తీసుకు వచ్చి భీముని ఎక్కించుకున్నాడు. భీముడు సుయోధనుని పై బాణములు గుప్పించాడు సంధించాడు. సుయోధనుడు భీముని శరములతో కప్పాడు. నీ కుమారులు ఎలాగైనా భీమును పట్టాలని ముందుకు కదిలారు. అభిమన్యుడు, ధృష్టకేతు, ఉపపాండవులు వారిని ఎదుర్కొన్నారు. భీముడు కూడా వారిని తరిమి కొట్టాడు. " ఈరోజుకు నా చేతిలో చచ్చారు " అంటూ వారిని తరుముతున్న భీముని సుయోధనుడు భీముని ఎదుర్కొమ్మని సైన్యాలను పురికొల్పాడు. భీమసుయోధనుల మధ్య పోరు సంకులమైంది. వికర్ణుడు, చిత్రసేనునితో కలిసి అభిమన్యుని ఎదుర్కొన్నాడు. అభిమన్యుడు ఇరవై బాణములు ప్రయోగించి వికర్ణుని రధాశ్వములను కొట్టాడు. వికర్ణుడు చిత్రసేనుని రథం ఎక్కి పారిపోయాడు. ఉపపాండవులు భీమునికి అండగా వచ్చి సుయోధనుని ఎదుర్కొని సుయోధనుని శరీరాన్ని రక్తసిక్తం చేసారు. అయిదు బాణాలతో సుయోధనుని నొప్పించారు. గంగేయుడు పాండవ సేనను ధ్వంశం చేస్తుంటే అర్జునుడు గాంగేయుని ఎదుర్కొన్నాడు. రక్తం ఏరులై ప్రకాశిస్తున్నా యోధు లిరివురు ప్రారాక్రమాన్ని విడువక పోరు సాగిస్తున్నారు. వాయు నందనుడైన భీముడు సుయోధనుని ఎలాగైనా సంహరించాలన్న తలపుతో అతడికి ఎదురుగా నిలిచి " సుయోధనా ! ఎంతో కాలంగా ఎదురుచూస్తున్న సమయం ఆసన్నమైంది. కుంతీ దేవి దు:ఖం , ఆమె కోడలు ద్రౌపది పగ తీర్చుకునే సమయం వచ్చింది. నాడు శ్రీకృష్ణుని మాటలు లక్ష్య పెట్టనందుకు ఉలూకుని చేత పరుషమైన మాటలు పలికించినందుకు నా పరాక్రమంతో సమాధానం చెప్తాను " అని పలుకుతూ సుయోధనుని రధాశ్వాలను చంపి, కేతనమును విరుగకొట్టి, రధసారధిని చంపి, అతని విల్లు విరుగ కొట్టాడు. సుయోధనుడు మరొక విల్లు అందుకునే లోపల అతనిపై పది బాణములు విడిచాడు. సుయోధనుని శరీరం నుండి రక్తం పెల్లుబుకి మూర్చ వచ్చినంత పనైంది. ఇంతలో జయద్రధుడు తన సైన్యంతో వచ్చాడు. కృపాచార్యుడు తన రధంలో ఎక్కించుకుని సుయోధనుని తీసుకు వెళ్ళాడు. అభిమన్యుడు, ఉపపాండవులతో కలిసి భీమునితో జధ్రధ సైన్యాలను ఎదుర్కొన్నారు. చిత్రసేనుడు, చిత్రుడు, చిత్రాక్షుడు, చారుత్రుడు, సులోచనుడు, నందుడు, ఉపనందుడు రౌద్రంతో అభిమన్యునితో పోరాడుతున్నారు. అభిమన్యుడు వారిని ఎదుర్కొని ఒక్కొక్కరిని అయిదు బాణములతో కొట్టి వారి శరీరాన్ని రక్తసిక్తం చేసాడు. వికర్ణుడు మరొక రథం ఎక్కి సోదరులకు సాయం వచ్చాడు. అభిమన్యుడు వికర్ణుని విల్లుతుంచి, సారధిని చంపి, రధాశ్వములను చంపి, కేతనమును విరిచాడు. ఇది చూసిన కురు కుమారులు ఒక్క సారిగా అభిమన్యునిపై పడ్డారు. ఉపపాండవులు అభిమనునికి అడ్డుగా నిలిచి కురుకుమారులను ఎదుర్కొని వారి కేతనములు విరిచి వారిపై బాణవర్షం కురిపించాడు. నీ కుమారులు వారి ధాటికి ఆగలేక పోయారు. నకులుని కుమారుడైన శతానీకుడు తన సైన్యముతో కేకయ పాంచాల రాజులకు సాయం వచ్చి వారితో కలిసి కౌరవ సేనుని తనుమాడసాగారు. సూర్యుడు అస్తమించచగానే భీష్ముడి సూచన మేరకు ఆరవరోజు యుద్ధం చాలించారు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక |

విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి |

యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు

| యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి |

బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ |

# భీష్మ పర్వము తృతీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# మూడవ అశ్వాసం

ధృతరాష్ట్రుడు ఆరవరోజు యుద్ధంలో తనకుమారులు వెనుక పడినందుకు ఖేదపడి మిగిలిన విషయాలు చెప్పమని సంజయుని కోరాడు. సంజయుడు " మహారాజా ! నీ కుమారుడైన సుయోధనుడు పితామహుని వద్దకు వెళ్ళి " పితామహా ! పాండవ బలం రోజురోజుకు పెరిగి పోతుంది. ఈ రోజు నేను నీముందే భీముని చేతిలో భంగపడ్డాను. ఇంతకంటే అవమానం ఏమున్నది. కుంతీ తనయులను నీ సాయంతో గెలుస్తానని అనుకున్నాను. నీవేమో పాండుసుతులను అడ్డలేక పోతున్నావు. వారికింత బలం ఎలా వచ్చింది. భీష్ముడు " సుయోధనా! నన్నేల నిందించెదవు. నేను నా శాయశక్తులా యుద్ధం చేస్తూనే ఉన్నాను. నేను నీకు ముందే చెప్పాను పాండుసుతులను గెలవడం సులభ సాధ్యం కాదని అయినా నీవు నామాటను లక్ష్య పెట్ట లేదు. అయినా నేను నీకు విజయం కలిగేలా యుద్ధం చేస్తాను " ఆ మాటలకు సుయోధనుడు కొంత ఊరట చెందాడు. మరునాడు యుద్ధంలో కురు సైన్యాలు మండల వ్యూహంలో నిలిచాయి. నీ కుమారులంతా అతనికి ఇరువైపులా పుట్టారు. ఇది చూసిన యుధిష్టరుడు ధృష్టద్యుమ్నునితో చెప్పి తన సైన్యాలను వజ్రవ్యూహంలో నిలిపాడు. తూర్యనాదాల నడుమ ఏడవ రోజు యుద్ధం ఆరంభమైంది. ద్రోణుడు విరాటుని, అశ్వత్థామ శిఖండిని, దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుని, శల్యుడు నకుల సహదేవులను, విందాను విందులు యుధామన్యుని, పెక్కు మంది రాజులు అర్జునిని ఎదుర్కొన్నారు. భీమసేనుడు కృతవర్మను, అభిమన్యుడు చిత్రసేన, దుశ్శాసన, వికర్ణులను , అలంబసుడు సాత్యకిని, ధృష్ట కేతువు భూరిశ్రవుని, చేకితానుడు కృపాచార్యుని, ధర్మరాజు శ్రుతాయువును, పలువురు రాజులు భీష్ముని ఎదుర్కొన్నారు.

## అర్జునిని ప్రతాపం

తన మీదకు వచ్చిన రాజులను అర్జునుడు రెండు చేతులతో గాండీవం నుండి బాణాలను వదులుతూ శరవర్షం కురిపిస్తున్నారు. వారంతా ఒక్క పెట్టున విజృంభించి కృష్ణార్జునులను తమ బాణాలతో ముంచెత్తారు. అది చూసిన నీ కుమారులు జయజయధ్వానాలు చేసారు. అప్పుడు అర్జునుడు కోపించి మహేంద్రాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రం కౌరవ సేనలు ప్రయోగించిన అస్త్రములను చీల్చి చెండాడి, వార రధాశ్వాలను చంపి మంధరపర్వతం పాలసముద్రాన్ని చిలికినట్లు కౌరవ సేనలను కలచి వేసింది. మహేంద్రాస్త్రం ధాటికి తట్టుకోలేని కౌరవ సేన భీష్ముని వెనుకకు చేరింది. త్రిగర్తాధీశులు తమ సైన్య సమేతంగా పక్కకు వెళ్ళారు. భీష్ముడు మాత్రమే అర్జునిని ముందుకు వెళ్ళి నిలిచాడు. ఇది చూసిన సుయోధనుడు " కౌరవ యోధులారా ! తాత భీష్ముని ఒంటరిగా వదిలి పారిపోతున్నారా మీ వంటి వారు ఎక్కడైనా ఉంటారా ! వెళ్ళండి భీష్మునకు తోడుగా ఉండండి " అని అరిచాడు. రోషం వచ్చి కౌరవ సేనలు భీష్మునికి సాయంగా నిలిచాయి.

## ద్రోణ విరాటుల పోరు

ద్రోణుడు విరాటుని విల్లును, ధ్వజమును రెండు బాణాలతో విరిచాడు. విరాటుడు మరొక బాణముతో ద్రోణుని శరీరంలో శరములు దించాడు. ద్రోణుని రధసారధిని చంపాడు, మరొక నాలుగు బాణములను వేసి ద్రోణుని విల్లు విరిచాడు. ద్రోణుడు కోపించి ఎనిమిది బాణాలను ప్రయోగించి విరాటుని రధాశ్వములను చంపాడు. రధమును కూల్చాడు. విరాటుడు తన కుమారుడైన శంఖుని రధాన్ని అధిరోహించి ద్రోణునిపై శరవర్షం గుప్పించాడు. వెంటనే ద్రోణుడు ఒక దివ్యాస్త్రాన్ని స్మరించి శంఖుని కొట్టాడు. ఆ బాణం శంఖుని గుండెలను చీల్చింది. శంఖుడు రధంపై వాలి మరణించాడు. తన కుమారుని మరణానికి ఖేదపడిన విరాటుడు చేసేది ఏమి లేక తన సైన్యాలను తీసుకుని పారిపోయాడు. అది చూసిన శిఖండి అశ్వర్థామ ఫాలభాగమున మూడు బాణములు నాటాడు. అశ్వర్థామ కోపించి తన బాణపరపరతో శిఖండి రధాశ్వములను చంపి, సారధిని చంపి, విల్లును విరిచి , కేతనమును విరిచాడు. శిఖండి రధం దిగి కత్తి దీసి అశ్వర్థామ బాణములను అడ్డుకున్నాడు. అశ్వత్థామ బాణము ప్రయోగించి శిఖండి కత్తిని ఖండించాడు. శిఖండి వెంటనే సాత్యకి రధం ఎక్కాడు.

## దుర్యోధన ధృష్టద్యుమ్నుల పోరు

ధృష్టద్యుమ్నుడు సుయోధనునిపై శరవర్షం కురిపించాడు. సుయోధనుడు వాటినిమధ్యలోనే త్రుంచి ధృష్టద్యుమ్నునిపై అతి క్రూరమైన బాణప్రయోగం చేసాడు. ధృష్టద్యుమ్నుడు కోపించి సుయోధనుని విల్లు విరిచాడు అతడు మరొక విల్లు తీసుకునే లోపే దానిని కూడా త్రుంచి వేసి అతడి రధాశ్వములను చంపి, రధం విరుగ కొట్టాడు. సుయోధనుడు తన కరవాలము తీసుకుని నేలపై దుముకి ధృష్టద్యుమ్నిపై దూకాడు. అంతలో శకుని వచ్చి సుయోధనుని తన రధం పై ఎక్కించుకుని వెళ్ళాడు. సాత్యకి అలంబసునిపై అతి క్రూర బాణ ప్రయోగం చేసాడు. అలంబసుడు సాత్యకిపై అర్ధ చంద్రాకార బాణ ప్రయోగం చేసి సాత్యకి విల్లు విరిచి, అతడి శరీరాన్ని శరములతో తూట్లు చేసాడు. అప్పుడు సాత్యకి ఇంద్రాస్త్రం ప్రయోగించి అలంబసుని మాయలు మటుమాయం చేసి అలంబసుని ముప్పతిప్పలు పెట్టి సింహ నాదం చేసాడు. అలంబసుడు అక్కడి నుండి పారి పోయాడు. సాత్యకి కురు సేనలపై విరుచుకు పడ్డాడు. కృతవర్మ భీమసేనునితో పోరు సల్ప సాగాడు. భీముడు కృతవర్మ రధాశ్వములను చంపి, సారధిని చంపి, రధమును విరుగకొట్టి కృతవర్మ శరీరమంతా బాణములతో ముంచెత్తాడు. కృతవర్మ వృషకుని రధం ఎక్కి అక్కడి నుండి వెళ్ళాడు. భీమసేనుడు కృతవర్మను వదిలి కురు సేలపై విరుచుకుబడ్డాడు. ఇది విన్న ధృతరాష్ట్రుడు " సంజయా ! నువ్వు ఎప్పుడూ కౌరవ సేనల రధములు విరిగాయి, కౌరవులు చచ్చారు అని మన వారి వినాశనం గురించి చెప్తావు పాండవ సేనలో వినాశనం జరగ లేదా ? ఎప్పుడూ వారి విజయులైనట్లు చెబుతావేమి ఇదేమి మాయ " అని వాపోయాడు. సంజయుడు " మహారాజా ! కౌరవ సేనలు కూడా వారి శక్తివంచన లేకుండా పోరుతున్నాయి. కాని సముద్రంలో కలసిన నదుల వలె దాని స్వరూపం మారి పోతుంది పాండవ బలమునకు తాళ లేక పోతున్నారు. అది వారి తప్పు కాదు నువ్వు నీ కుమారుడు చేసిన తప్పుకు వారిని నిందించి ప్రయోజనం లేదు " అన్నాడు. అవంతీ దేశాధీసులగు విందాను విందులను యుధామన్యుడు శరపరంపరతో కప్పేసాడు. అనువిందుడు విందుని రధం ఎక్కాడు. యుధామన్యుడు అనువిందుని రధ సారధిని చంపాడు. రధాశ్వములు చెదిరి పోగా వారి సైన్యాలు కకావికలు అయ్యాయి. మరొక చోట భగదత్తుని ధాటికి పాండవ సేనలు చెదిరి పోగా ఘటోత్కచుడు అడ్డుకుని సేనలకు ధైర్యం చెప్పి యుద్ధోన్ముఖులను చేసాడు. ఘతోత్కచుడు భగదత్తునిపై శరవర్షం కురిపించాడు. భగదత్తుడు వాటిని మధ్యలోనే త్రుంచి వేసి పదు నాలుగు బాణములను ఘతోత్కచునిపై ప్రయోగించాడు. ఘటోత్కచుడు శక్తి ఆయుధమును ప్రయోగించగా భగదత్తుడు దానిని మధ్యలోనే త్రుంచి ఘతోత్కచునిపై బాణపరంపరతో నొపించాడు. భగదత్తుని ధాటికి ఆగలేని ఘతోత్కచుడు పారిపోగా భగదత్తుడు పాండవ సేనపై విరుచుకు పడ్డాడు. శల్యునిపై నకులసహదేవులు శరములు గుప్పించారు. శల్యుడు బెదరక నకులుని రధం విరిచాడు. నకులుడు సహదేవుని రధం ఎక్కి శల్యునిపై ఒక క్రూర బాణం వేసి అతడిని మూర్ఛిల్ల చేసాడు. శల్యుడు రధంపై పడి పోగానే సారధి రధాన్ని పక్కకు తీసుకు వెళ్ళాడు. నకుల సహదేవులు సింహనాదం చేసి శంఖనాదం చేసారు.

## శ్రుతాయువుపై ధర్మరాజు విజయం

యుధిష్టరుడు శ్రుతాయువు మీద తొమ్మిది శమములు ప్రయోగించాడు. శ్రుతాయువు వాటిని త్రుంచి వేసి ఏడు బాణాలు యుధిష్టరుని మీద వేసాడు. యుధిష్టరుడు కోపించి వరాహముఖాన్ని కర్ణమును పోలిన నారాచబాణాన్ని ప్రయోగించి శ్రుతాయువు వక్షస్తలాన్ని చీల్చాడు. మరొక బాణముతో అతని కేతనమును విరిచాడు. శ్రుతాయువు ఏడు బాణములు ప్రయోగించి ధర్మరాజును భాదించాడు. ధర్మరాజు మహోగ్రుడై శ్రుతాయువు రధముకు కట్టిన గుర్రములను చంపి, విల్లు విరిచి, కేతనమును విరిచి, అతని శరీరాన్ని రక్తసిక్తం చేసాడు. శ్రుతాయువు బెదిరి పారిపోయాడు. అది చూసిన కౌరవసేన కకావికలై పోగా పాండవ సేనలు జయధ్వానాలు చేసారు. కృపాచార్యుడు చేకితానుడితో పోరుతున్నాడు. చేకితానుడు కృపాచార్యునిపై

నిశిత బాణములు ప్రయోగించగా , కృపాచార్యుడు చేకితానుని రధాశ్వములను చంపాడు. చేకితానుడు గదాయుధంతో కృపాచార్యుని రథం విరుగకొట్టి, రథముకు కట్టిన హయములను చంపాడు. కృపాచార్యుడు చేకితానుని పదహారు నిశిత బాణములతో కొట్టాడు. చేకితానుడు కృపాచార్యునిపై గదను విసిరాడు. కృపాచార్యుడు ఆ గదను మధ్యలో త్రుంచి వేసాడు చేకితానుడు రధము దిగి వాడి అయిన ఖడ్గం తీసుకున్నాడు. అది చూసిన కృపాచార్యుడు ఖడ్గం తీసుకుని చేకితానునిపై కలియపడ్డాడు. ఒకరికొకరు గాయపరచుకుని ఇరువురు మూర్చిల్లాడు. అది చూసి కౌరవ సేన నుండి శకుని కృపాచార్యుని, పాండవ సేన నుండి కరకర్షణుడు వచ్చి చేకితానుడిని రధముల మీద ఎక్కించుకుని తీసుకు వెళ్ళారు. ధృష్టకేతు భూరిశ్రవునితో ఘోరయుద్ధం సాగిస్తున్నాడు. ధృష్టకేతు భూరిశ్రవునిపై తొమ్మిది బాణములు వేసాడు. భూరిశ్రవనుడు కోపించి ధృష్టకేతుని రధాశ్వములను చంపి అతడిపై కరకుటమ్ములు ప్రయోగించాడు. అలసి పోయిన ధృష్టకేతు శతానీకుని రధముపై ఎక్కి అవతలకు వెళ్ళాడు. అభిమన్యునికి వికర్ణ, చిత్రసేన, దుశ్శాసనుల మధ్య భయంకర పోరు సాగుతుంది. అభిమన్యుడు వారందరి రథములను విరుగకొట్టి వారిని చంపకుండా భీమసేనుని శపధం గుర్తుకు వచ్చి విడిచి పెట్టాడు. ఇది గమనించిన భీష్ముడు దుశ్శాసనునికి సాయంగా వచ్చాడు. ఒంటరిగా ఉన్న అభిమన్యునికి తోడుగా అర్జునుడు తన రధముతో అక్కడకు వచ్చాడు. త్రిగర్తాధిపతి అర్జునిని అడ్డగించి ఎదుర్కొన్నాడు. అర్జునుడు " మీరు కౌరవ సేనలో మేటి వీరులని విన్నాను భయము వదిలి నాతో యుధం చెయ్యి " అని అతనిపై శరవర్షం కురిపించాడు. అది గమనించిన కురు సైన్యం ఒక్క పెట్టున అర్జునిపై పడింది. పాండవ సైన్యం అర్జునునికి సాయంగా వచ్చాయి. పోరు ఘోరమైంది. అర్జునుడు తన నిశిత శరాఘాతముతో కౌరవ వీరుల రథముకు కట్టిన హయములను చంపుతూ, రథములను విరుగ కొడుతూ, కేతనములు విరుస్తూ, విల్లులను విరుస్తూ యుద్ధరంగమంతా స్వేచ్ఛగా విహరిస్తున్నారు.

## సాయంకాలాంతర పోరు

త్రిగర్తాధీశుడు తన చక్రరక్షకులైన ముప్పై రెండు మందిని అర్జునినిపై పంపాడు. అర్జునుడు అరవై నాలుగు బాణము ప్రయోగించి వారిని చంపాడు. త్రిగర్తాధీశుడు స్వయంగా అర్జునితో తలపడ్డాడు. ఇంతలో శిఖండి మధ్యలో అడ్డుకుని సుశర్మను ఎదుర్కొన్నాడు. తనకు ఎదురుగా దుర్యోధనుడు ఉన్నా అతడిని దాటి భీష్ముని ఎదుర్కొన్నాడు అర్జునుడు. తన మీదకు వస్తున్న శల్యుని విడిచి భీమ , నకులసహదేవులతో కూడి అర్జునినికి సాయంగా వెళ్ళాడు ధర్మరాజు. పాడవులతో భీష్ముడు పోరు సాగిస్తున్నాడు. ఇంతలో నీ కుమారుడు సుయోధనుడు సైంధవునితో చేరి పాండవులను ఎదుర్కొన్నాడు. శలుడు, శల్యుడు, చిత్రసేనులు కృపాచార్యునితో చేరి పాడవులను ఎదుర్కోడానికి చేరారు. ఇంతలో శిఖండి భీష్ముని ఎదుర్కొన్నాడు. భీష్ముడు శిఖండితో యుద్ధం చేయక అతడి విల్లును త్రుంచి పక్కకు పోయాడు. ఇది చూసిన యుధిష్టరుడు " శిఖండీ భీష్ముని చంపుతానని శపధం చేసావుగా మరిచావా!" అని అరిచాడు. ఆ మాటలు విని శిఖండి భీష్మునిపై శరవర్షం కురిపించాడు. అది చూసిన శల్యుడు శిఖండిపై అగ్నేయాస్త్రాన్ని వేసాడు. శిఖండి బెదరక శల్యునిపై వారుణాస్త్రాన్ని ప్రయోగించాడు. భీష్ముడు ధర్మరాజు విల్లు విరిచి, కేతనమును విరిచాడు. అది చూసిన భీముడు తన రథం దిగి సుయోధనుని మీదకు వెళ్ళాడు. సైంధవుడు అయిదు వందల వాడి బాణములను భీమునిపై ప్రయోగించాడు. భీముడు నిర్లక్ష్యంతో వాటిని తన గధతో త్రుంచి సైంధవుని రధాశ్వాలను చంపి, రథం విరిచాడు. సైంధవుడు వేరొక రథం ఎక్కి పారిపోయాడు. అతనితో కౌరవ సైన్యం పారి పోయింది. ఇది చూసిన సుయోధనుడు పారిపోవద్దని తన సైన్యాలను వారిస్తూ భీమునితో తలపడ్డాడు. ఇంతలో చిత్రసేనుడు భీముని అడ్డుకుని శక్తి ఆయుధాన్ని భీమునిపై ప్రయోగించాడు. భీముడు తనగధను శక్తి ఆయుధంపై విసిరాడు. అది గిరగిరా తిరుగుట చూసిన కౌరవులుది ఎవరి మీద పడుతుందో తెలియక భీతి చెంది రారాజు మాట వినక పారిపోసాగారు. ఆ గధ తన మీదకు రావడం చూసి చిత్రసేనుడు రథం దిగి పారిపోయాడు. ఆ గధ చిత్రసేనుని రధాన్ని అశ్వములతో సహా నుగ్గు చేసింది. వికర్ణుడు చిత్రసేనుని తన రథంపై ఎక్కించుకుని తీసుకు వెళ్ళాడు. భీష్ముడు ధర్మతనయుని రధాశ్వాలను చంపి అతడి శరీరాన్ని శరపరంపరతో గాయపరిచాడు. ధర్మనందనుడు కోపించి శక్తి ఆయుధాన్ని భీష్మునిపై ప్రయోగించాడు. భీష్ముడు శక్తి ఆయుధాన్ని త్రుంచాడు. ధర్మనందనుడు నకులసహదేవుల రధాన్ని అధిరోహించాడు. భీష్ముడు నకులసహదేవుల మీద శరసంధానం చేసి వారిని నొప్పించాడు. ధర్మనందనుని ఆదేశంపై పాండవ సేనలోని రాజులంతా తమ సైన్యాలతో భీష్ముని ఎదుర్కొన్నారు. భీష్ముడు జంకక పాండవ సేనలోని వారి తలలను ఖండిస్తూ స్వైర విహారం చేయడం పాండవ సేనను ఆశ్చర్యచకితులని చేసింది. ఇంతలో శిఖండి భీష్మునిపై నిశితశరములను వేసాడు. భీష్ముడు వాటిని,లక్ష్యపెట్టక పాండవ సైన్యాలను చెండాడుతున్నాడు. కురు సేనలను తనుమాడుతున్న సాత్యకి, ధృష్టద్యుమ్నులను విందాను విందులు ఎదుర్కొని ధృష్టద్యుమ్నుని రధాశ్వాలను చంపారు. విరధుడైన ధృష్టద్యుమ్నుడు సాత్యకి రథం ఎక్కాడు. ఇది చూసిన ధర్మరాజు వారికి సాయంగా వచ్చాడు. రారాజు తన సైన్యములకు ధర్మరాజును ఎదుర్కొనమని సైగ చేసి తాను కూడా భీష్మ, ద్రోణులతో చేరి ధర్మరాజును ఎదుర్కొన్నాడు. ధర్మజునికి సాయంగా వచ్చిన అర్జునినిపై ద్రోణుడు క్రూర బాణప్రయోగం చేసాడు. ఇది గమనించిన కౌరవసేనలు ఇనుమడించిన ఉత్సాహంతో పాండవ సైన్యాలను ఎదుర్కొన సాగారు. ధర్మరాజు తన సేనలకు ధైర్యం కలిగిస్తూ యుద్ధానికి పురికొల్పాడు. ఇరు సైన్యాలు ఘోరమైన పోరు సాగిస్తుండగా సూర్యుడు అస్తమించసాగాడు. త్రిగర్తాధీశుడు సుశర్మ , సైంధవుడు మొదలైన ప్రముఖులను ఓడించి ధర్మరాజుకు ఆనందం కలిగించాడు. అన్నగారికి బాసటగా నిలిచి భీమసేనుడు కురుసేనలను తనుమాడాడు. ఆ రోజుకు యుద్ధం చాలించి అందరూ శిబిరాలను చేరారు.

# ఎనిమిదవరోజు యుద్ధం

ఎనిమిదవ రోజు యుద్ధానికి కురు సైన్యాలు కూర్మ వ్యూహంలోను పాండవ సేనలు శృంగాటక వ్యూహములో నిలిచాయి. ఇరు పక్షసైన్యాలు భేరి మృదంగనాద్యాల మధ్య యుద్ధానికి సన్నధమైయ్యాయి. హయములు,ఏనుగులు, రధములు, కాల్బముల రణరంగ విహారంతో రణభూమిలో దుమ్ము ఆకాశాన్ని కప్పింది. భీష్ముడు సింహనాదం చేస్తూ పాడవ సైన్యంలో చొచ్చుకుని వెళ్ళి వీరవిహారం చేయసాగాడు. భీష్ముని పరాక్రమానికి ఆగలేక పాండవ సేనలు పలాయనం చిత్తగించాయి. అది చూసిన భీమసేనుడు ఆగ్రహంతో భీష్ముని ఎదుర్కొని ఒకే బాణంతో భీష్ముని సారధిని చంపాడు. భీష్ముని అశ్వములు పట్టుతప్పి ఇష్టం వచ్చినట్లు పరుగెత్తాయి. అది చూసిన పాడవ సేనలు జయజయ ధ్వానాలు చేసాయి. అది చూసి నీ కుమారుడు సునాభుడు అమితపరాక్రమంతో భీమసేనుని ఎదుర్కొన్నాడు. భీమసేనుడు ఒకే బాణంతో సునాభుని తల నరికి భీకరంగా సింహనాదం చేసాడు. అది చూసి ఖిన్నులైన నీ కుమారులు ఆదిత్యకేతుడు, అపరాజితుడు, బహ్వాసి, పండితుడు, కుండధారుడు, వశాలాక్షుడు, మహోదరుడు ఒక్కుమ్మడిగా భీమసేనునిపై పడ్డారు. తమ తమ బాణములతో భీమసేనుని శరీరమును కొట్టారు. భీమసేనుడు జంకకుండా వారి మీద అతి క్రూర బాణములు ప్రయోగించి అర్ధ చంద్రాకార బాణములతో వారినందరిని యమసదనమునకు పంపాడు. ఇది చూసి నీ కుమారులు " నాడు కురు సభలో చేసిన శపధం భీమసేనుడు ఈ రోజే తీర్చుకునేలా ఉంది " అనుకుని " విదురుని ని పలుకులు సత్యము ఔతున్నాయి " అని మనసులో అనుకుని భీమసేనుని ధాటికి తాళలేక పారిపోయారు.

### సుయోధనుడు కలవరపడుట

సుయోధనుడు భీష్ముని చూసి " తాతా చూచితిరా ! భీమసేనుడు నా తమ్ములను అందరిని చంపుతుంటే మీరంతా చూస్తూ ఊరకుంటారా. మీకు పౌరుషం రాలేదా మిగిలిన వారి చావు కోరి మౌనంగా చూస్తున్నారా " అని వాపోయాడు. సుయోధనుని మాటలకు భీష్ముడు చలించి పోయి " సుయోధనా నేను నీకు ముందే చెప్పాను. నీ తమ్ములలో ఎవరు భీమసేనునికి ఎదురైనా వారిని రక్షించడం నాకే కాదు ఎవరికి తరం కాదు. ఇందుకు చింతించి ప్రయోజనం లేదు. యుద్ధంలో మరణించిన స్వర్గలోక ప్రాప్తి కలుగుతుందన్న ఒకే ఆశతో పోరాడటమే మనకున్న ఒకే మార్గం. శక్తి కొలది పోరాడుతాము విజయం మనలను వరించ వచ్చు కదా! " అన్నాడు " అన్న సంజయుని పలుకులు విని దృతరాష్ట్రుడు " అయ్యో ! ఎంతటి దురవస్థ దాపురించింది. భీష్మ ద్రోణలు ఉండి కూడా నా కుమారులు భీముని చేత దారుణంగా చంపబడ్డారే. వగచి లాభమేమి నా మాట వినక సుయోధనుడు తమ్ముల మరణం కొని తెచ్చుకున్నాడు " అని దు:ఖించాడు. సంజయుడు తిరిగి చెప్పసాగాడు. " భీష్ముడుని కురుకుమారుల మరణం ఆగ్రహొదగ్రుని చేసింది. అతడు భీముని వైపు పోవడం చూసిన ధర్మరాజు ధృష్టద్యుమ్నుని, సాత్యకిని, శిఖండిని భీమునికి సాయంగా పిలిచాడు. సుయోధన ప్రేరేపిత రధికులు అర్జునిని ఎదుర్కొన్నారు. చేకితానుడు, ద్రౌపదీ తనయులు అర్జునినికి సాయంరాగా అర్జునుడు కురు సైన్యాలపై విరుచుకు పడ్డాడు. అభిమన్యుడు, ఘటోత్కచుడు కురు సైన్యాలపై విరుచుకు పడుతున్నారు. ద్రోణాచార్యులు చిత్రవిచిత్ర రీతుల రధాన్ని నడుపుతూ ద్రుపదుని సేనలపై శరవర్షం కురిపిస్తున్నాడు. భీమసేనుడు తన నిశిత శరములతో కౌరవ గజబలమును నేల కూలుస్తున్నాడు. నకులసహదేవులు తమకరవాలంతో కౌరవ అశ్వదళమును మట్టుపెడుతున్నారు.

### ఇరావంతుని పరాక్రమం

అర్జున ఉలూచిల కుమారుడు ఇరావంతుడు తన అశ్విక దళంతో కౌరవ సైన్యమును చుట్టుముట్టాడు. అది చూసిన శకుని తమ్ములు శుకుడు, శర్మవంతుడు, వృషకుడు,ఆర్జవుడు, గజుడు, గవాక్షుడు అను ఆరుగురు తమ అశ్వ సైన్యంతో ఇరావంతుని ఎదుర్కొని ఘోరంగా పోరుతున్నాడు. శకుని తమ్ములు ఇరావంతుని అశ్వమును చంపారు. ఇరావంతుడు తన అశ్వమును దిగి కరవాలంతో యుద్ధం చేస్తున్నాడు. శకుని తమ్ములు కూడా కిందకు దిగి ఇరావంతుని ఎదుర్కొన్నారు. ఇరావంతుడు రకరకముల విన్యాసములు చేస్తూ శకుని తమ్ములతో యుద్ధం చేస్తూ అదను చూసి వారిని పన్నెండు ముక్కలుగా నరికాడు. అది చూసిన సుయోధనుడు అలంబసుని పిలిచి " అలంబసా ! వీడు ఈ రోజే మనసైన్యాలను నాశనం చాసేలా ఉన్నాడు. వెంటనే నీవు అతడిని ఎదుర్కొని హతమార్చు " అని చెప్పాడు. అలంబసుడు ఇరావంతునికి సమాంతరంగా మరొక అశ్వబలమును సృష్టించాడు. రెండు దళాలు ఒకదానితో ఒకటి పోటీ పడి నశించాయి. ఇరావంతుడు ఒంటరిగా పోరాడుతూ అలంబసుని ఖడ్గం, విల్లు విరిచాడు. అలంబసుడు ఆకాశానికి ఎగిరాడు. ఇరావంతుడు ఆకాశానికి ఎగిరి అలంబసునితో మాయా యుద్ధం చేస్తున్నాడు. ఇరావంతుడు అలంబసుని తల నరికాడు. అయినా అతడు చావ లేదు. ఇరావంతుడు తన తల్లిని, తాతాగారిని తలచుకుని విషనాగులను సృష్టించాడు. అలంబసుడు డేగరూపం ధరించి ఆ నాగులను చంపి వెంటనే ఇరావంతుని తల నరికాడు. ఇరావంతుడు మరణించాడు.

## ఘటోత్కచుని పోరు

ఇరావంతుని మరణం చూసి ఘటోత్కచుడు తన రాక్షస సైన్యంతో కౌరవ సన్యంతో తలపడ్డాడు. తన శూలాయుధంతో గజ, అశ్వ, పదాతి దళాలను గుచ్చి పైకెత్తి నేలకేసి బాది చంపుతున్నాడు. అందరిని మూకుమ్మడిగా చంపుతున్నాడు. ఇది చూసి సుయోధనుడు, వంగదేశాధిపతి తమ గజ సైన్యంతో ఘటోత్కచుని ఎదుర్కొన్నారు. ఆ గజబలమును చూసిన ఘటోత్కచుడు పొంగి పోయి బుజములు చరిచి కరవాలంతో గజముల తొండములను, దంతములను, శిరములను ఖండించసాగాడు. ఇది చూసిన సుయోధనుడు తానే ఘటోత్కచుని ఎదుర్కొని అతని ప్రధాన అనుచరులైన వేదవంతుడు, విద్యుత్జిహ్వుడు, బహ్వాసి మొదలగు వారిని చంపి ఘటోత్కచుని శరీరాన్ని శరములతో కప్పాడు. ఘటోత్కచుడు కూడా విల్లు అందుకుని సుయోధనునిపై శరవర్షం కురిపించి సుయోధనునితో " సుయోధనా ! నాడు నిండు సభలో ధర్మం మరిచి నా తాల్లి పాండవుల సతి అయిన ద్రౌపదీ మాతను అవమానపరిచావు. అందుకు ప్రతి ఫలం అనుభవించు " అని నల్ల త్రాచుల వంటి బాణములను సుయోధనుని పై ప్రయోగించాడు. సుయోధనుడు వాటిని మధ్యలో త్రుంచి ఇరవై ఉగ్రమైన శరములను ఘటోత్కచునిపై వేసాడు. ఘటోత్కచుడు శక్తి ఆయుధమును సుయోధనునిపై ప్రయోగించాడు. వంగ దేశాధిపతి శక్తి ఆయుధాన్ని ఎదుర్కొన్నాడు. ఆ ఆయుధము వంగరాజు గజమును చీల్చి వేసింది. వంగరాజు పారిపోయి ప్రాణములు దక్కించుకున్నాడు. ఇది చూసి అతడి సైన్యం హాహా కారాలు చేస్తూ పారి పోయారు. సుయోధనుడు ధైర్యంగా ఘతోత్కచుని ఎదుర్కొని తాను నేర్చిన అన్ని అస్త్రములు ప్రయోగించి ఘటోత్కచుని ఎదుర్కొన్నాడు. వాటిన్నంటిని ఆకాశంలో పొడి చేసి ఘటోత్కచుడు సింహనాదం చేసాడు. అది విన్న భీష్ముడు " ఘతోత్కచుడు దేవతలకు కూడా అజేయుడు సుయోధనుని అతడి బారి నుండి రక్షించండి " అని అరిచాడు. అది విని ద్రోణుడు, అశ్వత్థామ, కృపాచార్యుడు, చిత్రసేనుడు, బృహద్బలుడు, బాహ్లికుడు, అవంతి నాధుడు, భూరిశ్రవుడు, సైంధవుడు, సోమదత్తుడు, వివిశంతి, వికర్ణుడు ఒక్కుమ్మడిగా రధములు నడుపుతూ నీ కుమారునికి రక్షణగా నిలిచి ఘటోత్కచునితో పోరాడుతున్నారు. వారిని చూచి ఘటోత్కచుడు రెట్టించిన ఉత్సాహంతో వారందరి మీద తన నిశిత శరములు కురిపించాడు. వారి రధ సారధులను చంపి, విల్లులు విరిచి, రధములను విరిచి వారిని చికాకు పరిచాడు. ద్రోణాచార్యుడు మొదలైనా పన్నెండు మంది ఘటోత్కచునిపై మహాస్త్రాలు ప్రయోగించాడు. ఘటోత్కచుడు ఆకాశానికి ఎగిరి మాయా యుద్ధం చేయసాగాడు.

## భీమసేనుని పరాక్రమం


ధుర్యోధనునితో మాయయుద్ధము చేయుచున్న ఘటోత్కచుడు

ఇది చూసిన ధర్మరాజు భీముని చూసి " అర్జునుడు భీష్ముని ఎదుర్కొంటున్నాడు. నీవు వెళ్ళి ద్రోణాదులతో పోరుతున్న ఘటోత్కచుని రక్షించు " అన్నాడు. సుయోధనుడు ఒక అర్ధచంద్రాకార బాణమును ఘటోత్కచునిపై వేసాడు. సింహ నాదం చేసుకుంటూ అక్కడుకు చేరిన భీమసేనుని ధనస్సును సుయోధనుడు ఖండించాడు. మరొక నారాచ బాణమును ప్రయోగించి భీముని వక్షస్థలము మీద కొట్టాడు. ఆ దెబ్బకు భీమసేనుడు దిమ్మెర పోయాడు. అది చూసిన ద్రౌపదీ సుతులు సుయోధనుని ఎదుర్కొన్నాడు. ఇంతలో అభిమన్యుడు, ఘటోత్కచుడు వారికి సాయం వచ్చారు. అందరూ కలిసి సుయోధనునిపై నిశితమైన శరవర్షం కురిపించారు. కృపాచార్యుడు, బాహ్లికుడు, భూరిశ్రవనుడు మొదలైన కురు వీరులు పాండుకుమారులను ఎదుర్కొన్నారు. ఇంతలో భీమసేనుడు తేరుకుని తిరిగి శత్రువుల మీద లంఘించాడు. ద్రోణుడు క్రూర శరములతో భీమసేనుని కొట్టాడు. భీమసేనుడు నారాచబాణముతో ద్రోణుని గుండెకు గురిపెట్టి కొట్టాడు. ఆ బాణముల ధాటికి ద్రోణుడు మూర్చిల్లాడు. తండ్రి అవస్థ చూసిన అశ్వత్థామ, సుయోధనులు తమ బలగంతో వచ్చి భీమసేనుని ఎదుర్కొని శక్తి వంతమైన బాణములు భీమునిపై ప్రయోగించారు. భీముడు రధము నుండి కిందకు దూకి ఆ బాణములను తన గధాయుధంతో చిన్నాభిన్నం చేస్తున్నాడు. ఇంతలో ద్రోణుడు తేరుకుని వచ్చి భీమునిపై శరపరంపర కురిపించాడు. ఇది గమనించిన అభిమన్యుడు, ఘతోత్కచుడు, ద్రౌపదీ సుతులు భీమునికి సాయంగా వచ్చారు. భీమసేనుని మిత్రుడు నీలుడు అశ్వత్థామను ఎదుర్కొన్నాడు. అశ్వత్థామ వాడి అయిన బాణములు ప్రయోగించి నీలుని తీవ్రంగా గాయపరిచాడు. ఇది చూసిన ఘటోత్కచుడు అశ్వత్థామ మీద శరవర్షం కురిపించాడు. ద్రోణుడు ఘటోత్కచుని క్రూరమైన బాణములతో నిలువెల్లా కొట్టాడు. ఘటోత్కచుడు మాయా యుద్ధం ప్రారంభించాడు. తన అపూర్వ మాయా శక్తితో ద్రోణుడు, సుయోధనుడు, కృపాచార్యుడు మొదలైన వారు తన బాణములకు తీవ్రంగా గాయపడి రక్తం ఒడుతున్నట్లు కౌరవ సేనలకు తెలిసేలా చేసాడు. అది చూసిన

కౌరవ సేనలు పారిపోసాగారు. అది చూసిన భీష్ముడు " ఆగండి ఇది అంతా రాక్షస మాయ అందరూ క్షేమంగానే ఉన్నారు అని ఎంత చెప్పినా వినక సేనలు యుద్ధ భూమి విడిచి పారిపోసాగాయి. ఇది చూసిన సుయోధనుడు " తాతా ! మీరు ద్రోణాచార్యులు యుద్ధభూమిలో ఉండగానే ఇంత అవమానం జరిగింది కదా. ఇంత కంటే తలవంపులు ఏమున్నాయి. నేను ఒంటరిగానే పాండవులను ఎదుర్కొంటాని విజయమో వీరస్వర్గమో తేల్చుకుంటాను " అన్నాడు. భీష్ముడు " సుయోధనా ! నీవొక్కడివి పాండవులను ఎలా ఎదుర్కొంటావు రాక్షస మాయలు ఎదుర్కోడానికి మేము లేమా నీవు నిశ్చింతగా ఉండు " అని భగదత్తుని చూసి " భగదత్తా ! రాక్షస మాయలు నీ వద్ద పని చేయవు. నీవు పోయి ఘటోత్కచుని ఎదిరించు " అన్నాడు. భీష్ముని మాటలకు భగదత్తుడు పొంగి పోయి సుప్రీతకం అనే ఏనుగును ఎక్కి తన సేనలతో ఘటోత్కచుని ఏదుర్కొన్నాడు. ఇది చూసి కౌరవ సేనలు ధైర్యము తెచ్చుకుని తిరిగి చేరాయి. సాయం సమయం అయింది.

## సాయంకాలాంతర యుద్ధము

పర్వతంలాంటి తన ఏనుగును ఎక్కి ఘటోత్కచుడు భగదత్తుని ఎదుర్కొన్నాడు. భీమసేనుడు, అభిమన్యుడు, ద్రౌపదీ సుతులు ఘటోత్కచునికి సాయం వచ్చారు. ఘటోత్కచుడు బల్లెంవంటి బాణమును వేసి భగదత్తుని ఏనుగును గాయపరిచి మరొక శూలమును తీసుకుని భగదత్తుని మీద వేసాడు. దాన్నిని త్రుంచి భగదత్తుడు ఘటోత్కచుని రధాశ్వములను చంపాడు. అభిమన్య , ద్రౌపదీ సుతుల రధాశ్వములను చంపి వారిపై శరవర్షం కురిపించాడు. పాలసముద్రమును మంధర పర్వతం చిలికిన విధంగా పాండవ సేనల మధ్య తిరుగుతూ వారిని చికాకు పరిచాడు. సుప్రీతకము తనకు ఎదురు వచ్చిన హయములను, గజములను , కాల్బలమును కాళ్ళతో తొక్కుతూ విహరింస్తూ ఉండగా సుయోధనుడు, ద్రోణుడు, కృపాచార్యుడు రధములతో వచ్చి వీర విహారం చేయ సాగారు వారి ధాటికి పాండవ సైన్యాలు బెదిరి పారిపోసాగారు. ఇది చూసిన ధర్మరాజు తన సైన్యాలకు చేయి ఊపి ప్రోత్సహించాడు. అర్జునుడు, పాంచాల భూపతితో చేరి కౌరవ సైన్యాలను ఎదుర్కొన్నారు. అర్జునుడు ధనుష్టంకారం చేస్తూ శంఖమును పూరించుచూ గాండీవం తీసుకుని కురు సేనలపై శరపరంపర కురిపించాడు. అప్పుడు అతడి వద్దకు భీముడు వచ్చి ఇరావంతుని మరణ వార్తను చెప్పాడు. అర్జునుడు ఖిన్నుడై భీముడు దారి చూపగా ఇరావంతుడు పడిఉన్న చోటికి వెళ్ళాడు. తల తెగి నేలపై పడి ఉన్న ఇరావంతుని చూసి కళ్ళ నిండా నీళ్ళు నిండాయి. సుయోధనుని అవినీతి ధర్మతనయుని సంధి ప్రయాత్నములు సుయోధనుని మూర్ఖత్వం తలచుకుని బాధపడ్డాడు. పుత్రశోకంతో అలమటిస్తున్న అర్జునిని చూసి శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వాడు. కృష్ణుని ఆంతర్యం అర్జునుడు అర్ధం చేసుకున్నాడు. " నా నోటి నుండి గుహ్యమైన యోగ శాస్త్రము విని ఎనిమిది రోజులు అవక మునుపే ఈ విషాదం ఏమిటి " అన్నట్లు ఉంది ఆ నవ్వు. " పరంధామా నీ నోటి వెంట వచ్చిన గీతా శాస్త్రం విని రాగద్వేషములు వదిలాను " అనుకుని కృష్ణుని అడిగి రధమును నడిపించి తన కర్తవ్య నిర్వహణకు వారి మధ్యకు రాగానే కృతవర్మ బాహ్లికుడు అతడిని ఎదుర్కొన్నారు. నీ కుమారుడు ద్రోణునితో చేరి భీముని ఎదుర్కొన్నాడు. ద్రోణుడు , సుయోధనుడు వేసే బాణాలను మధ్యలో త్రుంచి వేసి నిశిత బాణాలతో భీమసేనుడు వారిని నిశిత బాణాలతో నొప్పించాడు. ఆ శరముల ధాటికి నీ కుమారులైన కుండభేది, అనాధృష్యుడు, కనకధ్వజుడు, విరావి, సుబాహుడు, దీర్ఘబాహుడు, దీర్ఘలోచనుడు మరణించారు. భీమసేనుడు కౌరవ సేనలో ప్రవేశించి దొరికిన వారిని దొరికినట్లు హతమార్చున్నాడు. ఇది చూసిన సుయోధనుడు భీతిల్లక తన సేనలను ప్రోత్సహిస్తూ భీమసేనుని ఎదుర్కొన్నాడు. భీమసేనుని పరాక్రమం చూసిన పాండవ సైన్యం విజృంభించి కౌరవ సేనలను చీల్చి చెండాడుతున్నాయి. రక్తం ఏరులై ప్రవహిస్తుంది. చని పోయిన సైనికుల ఆభరణములతో రణభూమి ప్రకాశించింది. ఇంతలో సూర్యాస్తమయం కావడంతో యుద్ధం చాలించి ఇరు సైన్యాలు తమ నెలవులకు చేరాయి.

## తొమ్మిదవ రోజు యుద్ధం

తమ్ముల మరణంతో కలత చెందిన సుయోధనుడు దుశ్శాసనుని పిలిచి వెంటనే కర్ణుని, శకునిని పిలుచుకురమ్మని కబురు పంపాడు. దుశ్శాసనుడు కర్ణ, శకునులతో సుయోధనుని వద్దకు వచ్చాడు. ఏకాంతంలో సుయోధనుడు " తాత భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యుడు తటస్థంగా ఉన్నారు. పాండవులను వారు చంపడం లేదు. పాండవ సైన్యం మన సైన్యం అతి వేగంగా తరిగి పోతుంది ఏమి చేయాలి " అన్నాడు. కర్ణుడు రణక్రీడా ఉత్సాహుడై " సుయోధనా ! భీష్ముని రావద్దని చెపితే నేను రణరంగ ప్రవేశం చేస్తాను. పాండవులూ వారి సేనల మదం అణచగలను " అన్నాడు. ఆ మాటలు విని సుయోధనుడు " దుశ్శాసనా ! తాతగారి వద్దకు వెళ్ళి ఈ విషయం చెబుతాము రా " అని ఇరువురు సుయోధనుని వద్దకు వెళ్ళి ఆయనకు నమస్కరించి " పితామహా ! మిమ్మలిని నమ్మి యుద్ధానికి దిగాను. కాని మీరు యుద్ధ రంగమున దేవదానవులను దిక్కరించగల మీరు ఏమీ చేయక ఎనిమిది రోజుల నుండి దిక్కులు చూస్తూ పాండవులను చంపక నిరీక్షిస్తున్నారు. అర్జునిని చంపడం మీకు చేతకాలేదు కాని నా తమ్ములు మాత్రం మరణిస్తున్నారు. కనుక మీరు రణరంగం నుండి తప్పకుని కర్ణునికి యుద్ధం చేసే అవకాశం ఇవ్వండి " అన్నాడు.

## భీష్ముని వ్యధ

వాడి బాణాల వలె ఉన్న సుయోధనుని మాటలకు భీష్ముడు నొచ్చుకుని కొంత సేపు మౌనం వహించి గాఢంగా నిట్టూర్చి " సుయోధనా ! అర్జునుడు సామాన్యుడు కాదు. ఖాండవ వన సమయంలో ఇంద్రుని జయించాడు. శివునితో హోరాహోరీ పోరి పాశుపతాన్ని పొందాడు. నిన్ను నీ వారిని గంధర్వుల బారి నుండి రక్షించింది అర్జునుడే. అప్పుడు కర్ణుడు పారి పోయిన విషయం నీకు తెలియనిది కాదు. అర్జునుడు, నిన్ను, ద్రోణుని, అశ్వద్ధామను, కృపాచార్యుని , కర్ణుని సమ్మోహితులని చేసి గోవులను తీసుకు పోయిన విషయం మనమెరిగినదే ! అర్జునిని విజయపరంపర మనము వినే ఉన్నాము. ఏనిమిది రోజులు నా శాయశక్తుల యుద్ధం చేసి నీ నోటి వెంట ఈ మాటలు విన్నాను. నేను ఇప్పడే చెప్తున్నాను నేను గాండీవిని గెలువలేను. శిఖండిని చంపను వీరిద్దరు తప్ప రణమున ఎవరు ఎదురైనా నేను చంపగలను. నేను పాండవ సైన్యంలో పాంచాలరాజు, మత్స్యదేశాధిపతి, యాదవులు వారి సైన్యములను చెండాడుతాను నీవు నీ తమ్ములు పాడవులను, వారి పుత్రులను వారి సైన్యములను మీ పరాక్రమంతో గెలవండి. ఇక వట్టి మాటలు కట్టి పెట్టి నీ తమ్ములతో పాండవుల మీద ప్రతాపం చూపి విజయం సాధించు. నీకు తగని పని అని తెలిసి పాండవులతో పగ పూనావు. నా మాట లక్ష్యపెట్ట లేదు. అయినా రేపు నా పరాక్రమం చూడగలవు. పరాక్రమం చూపి గెలవాలి కాని ఇలాంటి ములుకుల వంటి మాటలతో విజయాన్ని సాధించ లేవు " అన్నాడు. భీష్ముని మాటలకు మనసులో సంతసించి సుయోధనుడు అక్కడి నుండి వెళ్ళాడు. మరునాటి యుద్ధం ఆరంభమయ్యే సమయంలో సుయోధనుడు " మహాయోధులారా ! పాంచాలరాజుతో సహా అందరిని సంహరిస్తానని పాండవులను గెలువ గలనని నిన్న రాత్రి భీష్ముడు నాతో అన్నాడు. మనమందరం అతడి మాటను నెరవేరుద్దాం " అని వ్యంగ్యంగా అన్నాడు. అతడి మాటలకు ఆగ్రహించిన భీష్ముడు కోపాన్ని మనసులో దాచుకున్నాడు. ఇది గమనించిన సుయోధనుడు దుశ్శాసనునితో " మీరు తాతగారి వద్ద ఉండి అతడిని కాపాడండి. అతడికి సాయంగా ఇరవై రెండు వేల రధికులను ఉంచండి " అన్నాడు. తరువాత మిగిలిన వారిని చూసి " మహామహులారా! నిత్యసత్యవ్రతుడైన భీష్ముడు శిఖండితో యుద్ధం చేయనని ప్రతిన పూనిన విషయం తెలుసు కనుక మనం ఆనీచ శిఖండిని భీష్ముని ఎదుటకు రాకుండా చూడాలి " అన్నాడు.

### యుద్ధారంభం

తొమ్మిదవ రోజు యుద్ధానికి కౌరవ సేన సర్వతోభద్ర వ్యూహమున నిలిచారు. కృపాచార్యుడు, కృతవర్మ, శల్యుడు, శకుని, సుదక్షిణుడు, సైంధవుడు, కురుకుమారులు, భీష్మునితో వ్యూహం ముందు భాగంలో ఉన్నారు. ద్రోణుడు, భూరిశ్రవసుడు, భగదత్తుడు అతడి కుడి వైపున సోమదత్తుడు, అశ్వత్థామ, విందాను విందులు ఎడమ వైపున శ్రుతాయువు వెనుక వైపున త్రిగర్తాధీసునితో సుయోధనుడు మధ్యభాగమున నిలిచారు. ఈ వ్యూహము చూసి ధర్మరాజు " ధృష్టద్యుమ్నా ! తాత భీష్ములు పన్నిన వ్యూహమును చూసావు కదా మనం ఈ రోజు శిఖండిని ముందుంచి అతనికి సాయంగా మనం నిలిచి పోరాడవలెను. అందుకు అనువైన వ్యూహ రచన చేయుము " అన్నాడు. సాత్యకి, విరాటుడు కుడి వైపున , అభిమన్యుడు, పాంచాల కేకయ రాజులు ఎడమ వైపున కుంతి భోజుడు వెనుక వైపున, యుధిష్టరుడు, నకులసహదేవ , ద్రౌపదీ పుత్రులతో మధ్యభాగమున నిలిచారు. శిఖండిని ముందు నిలిపి అతడికి ఒక వైపున ఘటోత్కచుడు, భీమసేనుడు నిలువగా అర్జునుడు వేరొక వైపు నిలువగా సకల యోదులు వారికి రక్షణగా నిలువగా ధృష్టధ్యుమ్నుడు యుద్ధానికి సిద్ధం అయ్యాడు. భేరి నినాదములు, శంఖముల పూరింపుల శబ్దాలు మిన్నంటుతుండగా యుద్ధం మొదలైంది.

### అభిమన్యుని పరాక్రమం

అభిమన్యుడు కౌరవ వ్యూహంలోకి చొచ్చుకొని పోయి దూదిని నిప్పంటుకున్నాట్లు కౌరవ వీరులను మట్టు పెడ్తుతున్నాడు. తన రధమును గుండ్రంగా తిప్పుతూ ద్రోణా, కృపాచార్య, సైంధవులను సమర్ధవంతంగా ఎదుర్కొంటున్నాడు. ఇది చూసి సుయోధనుడు అలంబుని పిలిచి " అలంబసా ! చూసావా అభిమన్యుడు చిచ్చెర పిడుగులా విజృంభిస్తున్నాడు. వాడిని ఎదుర్కొనగలిగిన వాడివి నీవే నీవే వాడిని చంపాలి " అన్నాడు. అలంబసుడు తన రాక్షస మూకతో అభిమన్యుని ఎదుర్కొన్నాడు. వారి ధాటికి పెను గాలికి ఎండుటాకుల వలె పాండవ సైన్యం కకావికలైంది. ఇది చూసి ద్రౌపదీ సుతులు అభిమన్యునికి సాయంగా వచ్చి రాక్షసులను హతమారుస్తున్నారు. కోపించిన అలంబసుడు పాండవ కుమారులపై శరవర్షం కురిపించారు. ద్రౌపదీ సుతులు అలంబసునిపై జడివానలా బాణములు కురిపించారు. ఆ బాణముల ధాటికి అలంబసుడు తెలివి తప్పి మరు క్షణంలో తేరుకుని ద్రౌపతీ సుతులపై పుంకానుపుంఖాలుగా బాణములు గుప్పించి వారి విల్లులు, కేతనములు విరిచి ఒక్కొక్కరిపై అయిదు బాణములు వేసాడు. సోదరుల అవస్థ అలంబసుని విజృంభణ చూసిన అభిమన్యుడు అలంబసునిపై అతి క్రూరమైన నారాచ బాణములు ప్రయోగించాడు. మిగిలిన వారు అలంబసుడు మాయావిధ్యా


అభిమన్యుని యుద్ధకౌశలము

ప్రవీణుడు అభిమన్యుడు దివ్యాస్త్ర సంభూతుడు వీరిరువురి యుద్ధం ఎంత రసవంతరమో అని చూస్తున్నారు. అభిమన్య అలంబచులు దేవేంద్ర వృత్తాసురుల వలె యుద్ధం చేస్తున్నారు. అలంబసుడు తన మాయాశక్తితో రణభూమిని అంధకార బంధురం చేసాడు. అభిమన్యుడు భాస్కరాస్త్ర ప్రయోగంతో ఆ చీకట్లను పటాపంచలు చేసాడు. అలంబసుడు అనేక మాయలు చేయగా అభిమన్యుడు వాటిని అన్నిటినీ తిప్పి కొట్టాడు. అభిమన్యుని శస్త్రధాటికి తాళలేక అలంబసుడు రథం దిగి పారిపోయాడు. అలంసుడు పారి పోగానే అభిమన్యుడు విజృంభిస్తూ కౌరవ సేనలో చొచ్చుకు పోయి ఊచ కోత కోయడం మొదలుపెట్టాడు. కౌరవ సేనలు అభిమన్యుని ధాటికి గజగజలాడాయి. అది చూసి భీష్ముడు అనేక మంది రధికులతో అక్కడికి చేరి అభిమన్యుని ఎదుర్కొన్నాడు. అభిమన్యుడు జంకక అనేక రూపములతో వీరవిహారం చేస్తున్నాడు. అది గమనించిన అర్జునుడు కుమారుని పరాక్రమానికి సంతసిస్తూ భీష్ముని ఎదుర్కొన్నాడు.

## కురు పాండవ వీరుల పోరు


పోరాడుతున్న కురు పాండవ వీరులు

భీష్మునికి అర్జునునికి మధ్య పోరు ఘోరరూపందాల్చింది. ఇంతలో కృపాచార్యుడు అభిమన్యునిపై శరవర్షం కురిపించాడు. వెంటనే సాత్యకి కృపాచార్యుని శరములు త్రుంచి అనేక క్యూర బాణములు అతడిపై ప్రయోగించాడు. వాటిని అశ్వత్థామ మధ్యలోనే త్రుంచి సాత్యకి విల్లును త్రుంచాడు. వెంటనే సాత్యకి మరొక విల్లు అందుకుని అశ్వత్థామ మూర్చిల్లేలా ఒక క్రూరబాణంతో కొట్టాడు. అశ్వత్థామ వెంటనే తేరుకుని సాత్యకి గుండెలకు గురి పెట్టి శరసంధానం చేసి అతడి కేతనమును విరిచి భీకర ఘర్జన చేసాడు. ఆగ్రహించిన సాత్యకి అశ్వత్థామ రథం కనిపించ కుండా కొట్టాడు. అది చూసిన ద్రోణుడు సాత్యకి శరవర్షం కురిపించాడు. అది చూసి అర్జునుడు సాత్యకికి సాయం వచ్చి ద్రోణుని ఎదుర్కొన్నాడు. " అని సంజయుడు చెప్పగా దృతరాష్టుడు " సంజయా ! అర్జునుడు ద్రోణుని ప్రియ శిష్యుడు కదా ! అర్జునినికి ద్రోణుడంటే గురుభక్తి అధికం . మరి వారిరువురు ఎలా యుద్ధం చేసారు " అని అడిగాడు. సంజయుడు అర్జున ద్రోణుల మధ్య జరిగిన యుద్ధం వర్ణించసాగాడు. " మహారాజా ! క్షత్రియ ధర్మం ప్రకారం యుద్ధభూమిలో తలపడిన తరవాత గురువు, తండ్రి, తమ్ములు, పుత్రులు, పౌత్రులు, శిష్యులు, మామలు అనే భేదం విడిచి యుద్ధం చేయాలి కనుక అర్జునుడు, ద్రోణుడు యుద్ధ భూమిలో శత్రువుల వలెనే యుద్ధం చేసారు. అర్జునుడు ద్రోణునిపై మూడు క్రూర నారాచములు ప్రయోగించాడు. ద్రోణుడు వాటిని త్రుంచి అర్జునిపై శరవర్షం కురిపించాడు. సుయోధనుని ప్రేరణపై త్రిగర్తాధిపతి ద్రోణుని దాటి పోయి అర్జునిపై భల్ల బాణములు ప్రయోగించాడు. అర్జునుడు ఆ బాణమును మధ్యలో త్రుంచి త్రిగర్తాధీశుని సైన్యంపై వాయవ్యాస్త్రమును ప్రయోగించాడు. ఆ వాయవ్యాస్త్రధాటికి త్రిగర్తాధీసుని సైన్యం చెల్లాచెదురు అయింది. ద్రోణుడు వాయవ్యాస్త్రానికి విరుగుడుగా శైలాస్త్రం సంధించి దాని ప్రభావాన్ని తగ్గించాడు. అది చూసిన అర్జునుడు వాడి అయిన బాణములను ప్రయోగించి త్రిగర్తాధీసుని కుమారులను తరమి కొట్టాడు. అది చూసిన సుయోధనుడు కృపాచార్యుడు, బాహ్లికుడు, శల్యుడు మొదలైన రధికులతో చేరి అర్జునిని ఎదుర్కొన్నాడు. సుయోధనాదులనే కాక ద్రోణుని కూడా తన వాడి శరములతో అర్జునుడు చికాకు పరిచాడు. ఇంతలో భీష్ముడు అర్జునుని ఎదుర్కొని అతడిపై శరవర్షం కురిపించి తన క్రూర బాణములతో వేలకు వేల శత్రువుల శిరస్సులను ఖండించాడు. మరొక పక్క శకుని, భూరిశ్రవనులు నకుల సహదేవులను ఎదుర్కొన్నారు. కళింగరాజు, భగదత్తులు తమ గజబలంతో భీమునితో పోరుతున్నారు. కొండ మీద నుండి దూకే సింహంలా భీముడు రథం నుండి కిందికి దూకి గజ సైన్యముల కుంభస్థలములను పగుల కొడుతున్నాడు. భీమసేనుని గధాఘాతముకు గజబలం బెదిరి పారి పోయాయి. శ్రుతాయువు, భగదత్తులు వాడి అయిన బాణాలతో భీమసేనుని కవచం చీల్చారు. మరొక వైపు భీష్ముడు పాండవ సైన్యాలను చెండాడుతున్నాడు. ఇది గమనించిన ధర్మరాజు భీముని రమ్మని చెప్పాడు. భీముడు కళింగ రాజు, భగదత్తులను విడిచి అన్నయ్య దగ్గరకు వచ్చాడు. ముందే విరాటుడు, ద్రుపదుడు, ధృష్టద్యుమ్నుడు, శిఖండి అక్కడకు చేరి ఒక్కుమ్మడిగా భీష్ముని ఎదుర్కొన్నారు. భీష్ముడు శిఖండిని వదిలి వారిని ఎదుర్కొని శరములు వేయసాగాడు.

రధికులు ప్రతిగా శరములు వదులుతున్నారు . పోరు సంకలమైంది.

## మధ్యాహ్నానంతర సమరం

మధ్యాహ్నం అయింది విరిగిన రధములు, చచ్చిన హయములు, రక్తపుటేరులతో రణభూమి భయానకంగా ఉంది. ఉభయ సైన్యములు పోరు సల్పుతున్నా మన సన్యంలో నైతిక బలంతగ్గుతుంది. వారిలో వారు " అయ్యో సుయోధనుని లోభత్వం, మూర్ఖత్వం వల్లనే ఇంతటి మారణహోమం జనక్షయం దాపురించింది. అసలు పాండవులను జయించగల వారు ఎక్కడినా ఉన్నారా ? " అని తమలో తాము తర్కించుకున్నారు. వారి మాటలను సావధానంగా వింటున్న సుయోధనుడు " వారి పనికి మాలిన మాటలు వినసేల అనేకులు అనేక విధముల అనుకుంటారు. మనం యుద్ధం చేస్తాము రండి " అని అందరిని రణముకు ప్రోత్సహించాడు. ఆ సమయంలో భీమసేనుడు రణరంగంలో వీరవిహారం చేస్తూ శత్రువులను ఊచకోత కోస్తున్నాడు. ఇంతలో భీమసేనుని రధం తెచ్చి సారధి నిలవగానే దానిని అధిరోహించి అత్యంత నిశిత శరములతో బాహ్లికుని రధము విరుగకొట్టాడు. చిత్రరధుడు చిత్ర విచిత్రమైన తన నిశిత శరములు ఉపయోగించి అభిమన్యుని చికాకు పెడుతున్నాడు. అభిమన్యుడు చిత్రరధుని రధము విరుగకొట్టి, సారధిని చంపి, రధాశ్వములను చంపాడు చిత్రరధుడు దుర్ముఖుని రధం ఎక్కి అక్కడి నుండి వెళ్ళారు. ద్రుపదుడు ద్రోణునిపై శస్త్రప్రయోగం చేసాడు. ఆగ్రహించిన ద్రోణుడు పదునైన బాణములు ప్రయోగించి ద్రుపదుని కవచము చీల్చాడు. ద్రోణుని ధాటికి తాళ లేక ద్రుపదుడు అక్కడి నుండి వెళ్ళాడు. సుశర్మ అర్జునితో యుద్ధం చేస్తూ అర్జునిని మీద కృష్ణుని మీద శరవర్షం కురిపించాడు. వాటిని మధ్యలో త్రుంచి అర్జునుడు క్రూరబాణములతో సుశర్మను తరిమి తరిమి కొట్టాడు. అతడి సైన్యం చెదిరి పోగా అర్జునిని ధాటికి ఆగ లేక సుశర్మ ససైన్యంగా పైదొలిగాడు. అది చూసిన భీష్ముడు అర్జునుని ఎదుర్కొని విజృంభించాడు. మధలో సాత్యకి భీష్ముని ఎదుర్కొని అతడిపై శరవర్షం కురిపించాడు. భీష్ముడు కోపించి శక్తి ఆయుధమును సాత్యకిపై విసిరాడు. శరీరం వంచి దానిని వడిసి పట్టి తిరిగి భీష్మునిపై విసిరి సింహనాదం చేసాడు. భీష్ముడు తన ఆయుధమును తానే త్రుంచి సాత్యకిపై పది పదునైన బాణములు వేసాడు. పాండవ సైన్యం ఒక్కుమ్మడిగా భీష్మునిపై పడింది. సుయోధనుడు దుశ్శాసనుడిని పిలిచి " దుశ్శాసనా ! తాత ఒంటరిగా పోరుతున్నాడు. శకునిని తీసుకుని సాయంగా వెళ్ళు " అన్నాడు. దుశ్శాసనుడు అలాగే వెళ్ళి శకునితో చేరి భీష్మునికి సాయంగా పాండవ సైన్యాలను కకావికలు చేస్తున్నారు. ఇది గమనించిన ధర్మరాజు నకులసహదేవులను అక్కడకు వెళ్ళమని చేయి ఊపాడు. నకుల సహదేవులు భీష్ముని ఎదుర్కొన్నారు. సుయోధనుడు పది వేల అశ్విక దళమును పాండవ సైన్యాలను ఎదుర్కొనమని పంపాడు. వారు పాండవ సేనలో చొరబడి విచక్షణ లేకుండా చంపసాగారు. అది చూసిన నకులసహదేవులు, ధర్మరాజు తమ వాడి శిలీకంతో గుర్రములను కొట్ట సాగారు. కాళ్ళు తెగి గుర్రములు పడి పోతూ రణరంమును భీభత్సం చేసింది. అశ్వసైన్యం అంతకంతకూ తరిగి పోయి సైనికులను లక్ష్యపెట్టక దిక్కు తోచక పరుగెట్టాయి. వాటి కింద పడి సైనికులు చనిపోసాగారు. అనేక హయములు రౌతులనుక్రింద వేసి చంపసాగాయి. అనేకులు తమ గుర్రాల క్రింద పడి మరణించారు. అశ్వదళము నశించగానే పాండవులు భేరి తూర్యనాదాలు చేసారు. ఇది చూసిన సుయోధనుడు " మద్రనరేంద్రా ! పాండవ సేనలు చెలియలి కట్ట దాటిన సముద్రంలా విరుచుకు పడి మనసైన్యాలను ఊచ కోత కోస్తున్నాయి. వాటిని నీవే ఆపాలి. శల్యుడు తన సేనలతో నకులసహదేవ, ధర్మనందనులను ముట్టడించి పెక్కు బాణములు వేసి వారిని నొప్పించాడు. అది చూసిన భీమార్జునులు శల్యునిపై విరుచుకు పడి శల్యునిపై బాణవర్షం కురిపించారు. ఇది చూసిన భీష్మద్రోణులు భీమార్జునులను ఎదుర్కొని వివిధ అస్త్రములను వేసి వారిని నొప్పించారు. సాయం కాలం అయింది.

## సాయం కాలానంతర యుద్ధం

భీష్ముడు ప్రచండునిలా పాండవ సేనలోకి చొచ్చుకు వెళ్ళి పన్నెండు నారాచ బాణములను ధర్మరాజు పైన అర్జున, భీమ, నకులసహదేవులపై ఒక్కొకరిపై మూడేసి ప్రయోగించాడు. సాత్యకి, ధృష్టద్యుమ్నులపై వాడి శరములు వేసి నొప్పించాడు. వెంటనే మగధ, విరాట, కురు దేశాధీసులు, సోమకుడు తమ సైన్యాలతో భీష్ముని చుట్టు ముట్టారు. ద్రోణాచార్యుడు తన వాడి అయిన బాణములతో సాత్యకిని, పాండు సుతులను ఎదుర్కొని అంతటా తానై వీరవిహారం చేస్తున్నాడు. భీష్ముడు తనను ఎదిరించిన వారిని శరపరంపరతో అస్త్రశ్త్రములతో వేధిస్తూ రధమును చిత్ర, విచిత్ర రీతుల నడుపుతూ పాండవ సైన్యాలను చెండాడుతున్నాడు. తన శరములతో హయములను, గజములను తనుమాడుతున్నాడు. రణభూమి అంతా చనిపోయిన హయ, గజములతో నిడి పోయింది. పాండవ సైన్యమంతా భీష్ముని ధాటి చూసి భయకంపితమైనది. భీష్ముని ఆపగలిగిన వారు లేక పోయారు. కనిపించిన వారిని కనిపించినట్లు చంపుతున్నాడు. హయముల, విరిగిన రధముల, సైన్యముల హాహాకారములతో, గజముల ఘీంకారధ్వనులతో రణ రంగం మార్మోగి పోయింది.

## శ్రీకృష్ణుడు అర్జునుడిని హెచ్చరించుట


భీష్మునితో పోరాడుతున్న అర్జునుడు - రాజ్మానామా నుండి ఒక దృశ్యం

భీష్ముని విజృంభణ చూసిన శ్రీకృష్ణుడు " ఈ రోజు భీష్ముడు అత్యంత శౌర్యంతో మన సేనలను తనుమాడు తున్నాడు. నీవేమో చోద్యం చూస్తున్నావా " అని ఎత్తి పొడిచాడు. అర్జునుడు డోలాయ మనస్కుడై మిన్నకున్నాడు. అది చూసిన కృష్ణుడు " అర్జునా ! నా మాట విన లేదా! నిన్ను నమ్మి యుద్ధమునకు వచ్చిన రధికులు నిన్ను చూసి నవ్వరా ! నాడు విరాటుని కొలువులో సంజయునితో నీవాడిన మాటలు మరిచావా " అన్నాడు. అర్జునుడు " కృష్ణా ! సకల బంధుజనాన్ని చంపి ఏమి ఘనకార్యం చేసానని ఈ రాజ్యాన్ని ఏలుకోను. యుద్ధం చేయ మనస్కరించుట లేదు కాని క్షత్రియ ధర్మం విడవలేను కదా " అని నిర్వేదంగా భీష్ముని ఎదుర్కొన్నాడు. పారి పోతున్న సైన్యాలను " ఆగండి అందరమూ కలిసి భీష్ముని ఎదుర్కొంటాము " అన్నాడు. అర్జునుడు సింహనాదం చేసి గాండీవం సంధించి మహాస్త్రములను భీష్మునిపై సంధించాడు. భీష్ముడు అర్జునిని బాణములు త్రుంచి తిరిగి బాణములు వేసి అర్జునిని శరీరం రక్తసిక్తం చేసాడు. అవమాన భారంతో క్రుంగిన అర్జునుడు పదునైన బాణమును వేసి భీష్ముని విల్లు విరిచాడు. భీష్ముడు మరొక విల్లు తీసుకోగా అర్జునుడు దానిని కూడా విరిచాడు. మనుమడి నైపుణ్యానికి మురిసిపోతూనే పాండవ సైన్యంపై శరవర్షం కురిపిస్తూ అర్జునిని శరీరాన్ని తూట్లు పడేలా కొట్టాడు. అర్జునుడు అలసి పోయాడు. శరీరమంతా బాణపు దెబ్బలకు బాధపడుతూ ఉంది. వివశుడైన అర్జునిని మరింతా తన శరములతో బాధించ సాగాడు భీష్ముడు. మిగిలిన వారు భీష్మునికి ఎదురు నిలువ లేక పారి పోయారు.

## శ్రీకృష్ణుడు భీష్ముని ఎదుర్కొనబూనుట


భీష్మునిపై దయ చూపిస్తున్న శ్రీకృష్ణుడు

పరిస్థితి విషమించడం చూసిన శ్రీకృష్ణుడు ఆగ్రహోదగ్రుడై పగ్గములను నొగల మీద ఉంచి ఒక్క ఉదుటున ధరణీ చక్రం కదిలిందా లేక దిక్కులన్నీ కంపించాయా అన్నట్లు భీష్మునిపై లంఘించాడు. పీతాంబరం జారిపోతున్నా లెక్క చేయక కారు మేఘములు కదిలి వచ్చాయా అన్నట్లున్న శ్రీకృష్ణుని చూసి కౌరవ సేనలు " ఈ రోజుతో భీష్మునకు అంతిమ ఘడియలు సమీపించాయి " అనుకుంటూ నిశ్చేష్టులై చూడ సాగారు. ఇది చూసిన భీష్ముడు " రావయ్యా కృష్ణా ! వచ్చి వేగమే నన్ను సంహరించి నాకు విముక్తి కలిగించు " అని చేతులు ఎత్తి నమస్కరిస్తూ శ్రీకృష్ణుని ముందు మోకరిల్లి ప్రార్ధించాడు. ఇది చూసిన అర్జునకు మతి పోయినంత పనై కృష్ణుని వెనుక నుండి లాగుతూ కృష్ణుడు విదిలించుకుని పరుగెడుతున్నాడు. మరలా వెనుక పరుగెత్తి కృష్ణుని పట్టి " బావా కృష్ణా ! యుద్ధము చేయనని నాకు ఇచ్చిన మాట మరువకయ్యా. నీవు ఇచ్చిమాట నీవే తప్పితే లోకం ఏమంటుంది. నాకు అపవాదు తీసుకు రాకు. నా అలసట తీరింది భీష్మునితో పోరాడుతాను " అనగానే శాంతించి శ్రీకృష్ణుడు తిరిగి రథం అధిరోహించి పగ్గములు చేత పట్టాడు. ప్రళయకాల రుద్రునివలె ఘర్జించి అర్జునుడు గాండీవం సంధించి కౌరవ సేనను రూపు మాపసాగాడు. మహదవకాశం జారి పోయిన భీష్ముడు తిరిగి విల్లు ఎక్కు పెట్టి కృష్ణార్జునుల మీద శరములు నాటాడు. పాంచాల సేనలను భీష్ముడు భారీ కాయుడు చీమలను నలిపినట్లు నలుపుతుంటే కృష్ణునితో సహా పాండవులు నిశ్చేష్టులై చూడ సాగారు. ఈ ఘోరదృశ్యం చేడలేనట్లు సూర్యుడు అస్తమించగానే ఆ నాటి యుద్ధం పాండవులలో భీతిని కలిగితూ ముగిసింది. అందరూ వారి వారి నెలవులకు చేరారు.

# పదవరోజు యుద్ధం

తొమ్మిదవనాటి భీష్ముని విజృంభణ చూసిన ధర్మనందనుని మన్సు కలత చెందింది. కౌరవ శిబిరంలో ఆనందోత్సాహాలు మిన్నంటాయి. భీష్ముని వేనోళ్ళ పొగిడారు. నీ కుమారుల ఆనందానికి హద్దు లేదు. భీష్ముని ఉదాత్త హృదయంతో ప్రస్తుతి చేసారు. ఆరోజు రాత్రి ధర్మనందనునికి నిద్ర పట్ట లేదు. తన తమ్ములను తీసుకుని కృష్ణుని శిబిరానికి వెళ్ళాడు. " కృష్ణా ! చూసావు కదా కార్చిచ్చు అడవిలోని మృగములను నాశనం చేసినట్లు భీష్ముడు పాండవ సేనలను ధ్వంశం చేసాడు. ఆ మహా

వీరుని ముందు మనవాళ్ళెవరూ నిలువ లేక పోయారు. కార్యాచరణ విచక్షణ లోపించి నేను వినాశకరమైన యుద్ధానికి అంగీకరించాను. బంధు మిత్రులను చంపుకుని నేను ఈ రాజ్యాన్ని ఎలా పాలించగలను. కనుక నేను అడవులకు పోయి నిశ్చింతగా ఆకు అలములు తింటూ తపస్సు చేసుకుంటాను. నా తమ్ములతో కూడి ముని వృత్తి స్వీకరిస్తాను వాళ్ళంతా నా కారణంగా ఆడవులలో కష్టాలు అనుభవించారు. వారిని నేను భీష్మునికి బలి ఇవ్వలేను. నా తమ్ముల క్షేమమే నాకు ముఖ్యం కృష్ణా ! మా మీద దయ ఉంచి ధర్మ మార్గాన్ని ఉపదేశించు " అని వేడుకున్నాడు. ఆ మాటలు విన్న కృష్ణుడు " ధర్మనందనా ! నీవు సత్యవాక్పరిపాలకుడవు. నీ తమ్ములు నాలుగు దిక్కులు జయించిన వారు. మీకు ఎలాంటి దుర్గతి కలుగదు. నా సహాయసంపత్తితో మీకు అమాత్యుడనై మీకు రాజ్యసిద్ధి కలుగ చేస్తాను. అర్జునుడు నాకు భక్తుడు, సఖుడు, బంధువు, శిష్యుడు అతని కోసం నేను నా శరీరాన్ని అయినా కోసి ఇస్తాను. ఉపప్లావ్యంలో అర్జునుడు పలికిన పలుకులు నిజం చేయవలసిన బాధ్యత నా మీద ఉన్నది. నేను మీకు సాధకంగా శపధం చేసాను. అవన్నీ నిజం చేయవలసిన బాధ్యత నాకు ఉంది. ఒక వేళ అర్జునుడు తెగువ చేసి భీష్ముని వధించకున్న నేను ఆపని చేసి అయినా మీకు విజయం చేకూరుస్తాను " అన్నాడు. అది విన్న ధర్మనందనుడు " కృష్ణా ! నీవు యుద్ధం చేయనని కేవలం సహాయ సహకారాలు అందిస్తానని చెప్పావు. నీ చేత యుద్ధం చేయించి నీ మాట అసత్యం చేయటం భావ్యం కాదు. అకటా దైవం నాకు ఎన్ని ఇక్కట్లు కలుగ చేస్తున్నాడు.

## ధర్మరాజు భీష్ముని పడగొట్టడానికి నిశ్చయించు కొనుట

భీష్ముడు కౌరవుల పక్షాన యుద్ధం చేసినా నాకు మేలు చేస్తానని మాట ఇచ్చాడు. మా తండ్రి పోయిన నాటి నుండి మమ్మలను ఆదరించి అల్లారు ముద్దుగా పెంచిన భీష్మునికి కీడు చెయ్యడానికి మనసు రావడం లేదు. అయినా తప్పేలా లేదు అయినా రాజ ధర్మం ఎంతటి క్రూరమైందో కదా " అని ఖేదంతో పలికాడు. కృష్ణునికి ధర్మనందనుని ఆంతర్యం అర్ధం అయింది. భీష్ముని వధోపాయం తెలుసుకోవాలని అనుకుంటున్నాడు. ఆరోజు భీష్ముడు మరలా కలవమని చెప్పడంలో అంతర్యం ఇదే కాబోలు అనుకుని ధర్మనందనా ! నీ ఆలోచన బాగుంది. భీష్ముడు కోపంతో చూస్తే అతడి ముందు ఎవరు నిలువలేరని నీవే చెప్పావు కదా ! నీవు వెళ్ళి అడిగితే చాలు భీష్ముడు తనను వధించే ఉపాయం నీకు తప్పక వివరించగలడు. కనుక మనమందరం భీష్ముని సందర్శించి ఆయనను భక్తితో ప్రార్ధించి అతని వలన ఉపదేశం పొందవలెను " అని పలికాడు. అప్పుడు ధర్మరాజు సౌమ్య వేషధారణతో తన తమ్ములను తీసుకుని భీష్ముని చూడడానికి వెళ్ళాడు. భీష్మునికి సాష్టాంగ నమస్కారం చేసాడు. భీష్ముడు వారిని సాదరంగా ఆదరించి పేరు పేరునా వారి క్షేమం అడిగి " ధర్మనందనా ! ఈ సమయంలో మీరు నన్ను చూడవచ్చిన కార్యమేమి ? సందేహించక అడుగు ఎంతటి దుష్కర కార్యమైనా నెరవేర్చగలను " అని పలికాడు. దీనవదనుడై ధర్మరాజు " పితామహా ! మాకు రాజ్యప్రాప్తి ఎలా కలుగుతుంది. మా సైన్యం క్షీణించకుండా కాపాడే మార్గం సెలవివ్వండి " అని అడిగాడు.

## భీష్ముడు తనను పడొగొట్టే మార్గము చెప్పుట


భీష్ముని సేవలో శ్రీకృష్ణుడు మరియు పాండవులు

భీష్ముడు " ధర్మనందనా ! నేను యుద్ధ భూమిలో ఉన్నంత కాలం మీకు రాజ్యప్రాప్తి కలుగదు. నన్ను నిర్జిస్తేగాని మీకు రాజ్యప్రాప్తి కలుగదు " అన్నాడు. ధర్మరాజు " పితామహా ! రణభూమిలో మీరు త్రిశూలం ధరించిన రుద్రునిలా నిలబడినంత కాలం మిమ్ము గెలుచు వీరుడేవ్వడు. కనుక మిమ్ము గెలుచు ఉపాయము మాకు చెప్పవా " అన్నాడు. " ధర్మనందనా ! నీవు చెప్పింది యధార్ధం నా చేత ఆయుధం ఉండగా నన్ను గెలుచుట అసాధ్యం . నా శక్తి తెలుసుకుని నన్ను గెల్చు ఉపాయం తెలుసుకొన వచ్చారు. మీకు సహాయం చేయుట కంటే సుకృతం ఏముంది. నేను ఆయుధం విసర్జించిన నన్ను గెలువ వచ్చు. నేను కవచం తీసిన వాడిని, ఆయుధం ధరింపని వాడిని, కేతనమును దించిన వాడిని, స్త్రీలను, స్త్రీగా ఉండి పురుషునిగా మారిన వాడిని, తలపాగా తీసిన వాడిని, అన్నదమ్ములు లేని వాడిని, పుత్రులు లేని వారు ఎదురైన వారితో యుద్ధం చేయను. వెంటనే నా ఆయుధములను విడిచి పెడతాను. పుట్టుకతో పురుషుడు కాక దైవత్వంతో పురుషుడైన వాడితో నేను యుద్ధం చేయను. ద్రుపద కుమారుడు శిఖండి పుట్టకతో స్త్రీ అయి దైవీకంగా పురుషత్వం పొందాడు. శిఖండిని ముందు పెట్టుకుని అర్జునుడు యుద్ధం చేసిన నేను ఆయుధము విసర్జిస్తాను అప్పుడు అర్జునుడు శిఖండిని అడ్డుపెట్టుకుని నన్ను

సంహరించవచ్చు. తరవాత బంధు మిత్ర సహితంగా సుయోధనుని గెలుచుట సులభం " అన్నాడు. వచ్చిన కార్యం సఫలమైంది అనుకుని ధర్మనందనుడు తమ్ములతో తమ శిబిరానికి మరిలాడు. దారిలో " తన మరణమునకు తానే దారి చెప్పిన భీష్ముని తలచుకుని విషాదం నిండిన హృదయముతో అర్జునుడు " కృష్ణా ! భీష్ముడు లోక మాన్యుడు, దయాళువు, వయోవృద్ధుడు అలాంటి మహానుభావుని చంపడానికి నాకు మనస్కరించుట లేదు. మట్టిలో ఆడుకుని వచ్చిన నన్ను ఎత్తుకుని ముద్దాడి చిన్నతనంలోనే గతించిన నా తండ్రిని తలచుకుని ఆయన కంట తడి పెట్టుకునే వాడు. తండ్రిని కోల్పోయిన మమ్ము చేరదీసి అల్లారు ముద్దుగా పెంచిన తాతాగారిని నేను ఎలా చంపగలను. పితామహుడు పరాక్రమంతో సైన్యాలను అంతమొందించినా ఉపేక్షిస్తానుకాని చంపను ధర్మనందనుని తమ్ములు అంత కృరులు కాదు కదా " అన్నాడు. ఆ పలుకులు విని కృష్ణుడు " అర్జునా ! నీకు క్షత్రియ ధర్మం తెలియదా! క్షత్రియులు కొంచెం క్రూరత్వం అవలంబించి కలత చెందక శత్రు సంహారం చేసి ప్రజలను కంటికి రెప్పలా కాపాడాలి. ప్రజలు కట్టు పన్నుతో ప్రజాశ్రేయస్సు కొరకు పాటు పడాలి. రాజధర్మం ఇదేనని బృహస్పతి ఇంద్రునకు చెప్పాడు. నీవు భీష్ముని చంపుతానని ప్రతిన చేసావు. ఆ మాట తప్పుట న్యాయమా ! లోకులు నిన్ను చూసి నవ్వరా. ఇది రాజ ధర్మమే కాని క్రూరకర్మము కాదు. ఖేదము వదిలి భీష్ముని చంప ప్రయత్నించు " అన్నాడు. " అది సరే కృష్ణా ! భీష్ముని చంపడానికి శిఖండి పుట్టాడు అంటారు కదా ! శిఖండిని చూసిన పితామహుడు యుద్ధం చేయడు కదా ! నేను వేరొకరిని చంపుతాను. శిఖండి భీష్ముని చంపుతాడు " అన్నాడు. " అర్జునా ! ఇక మాటలేల భీష్ముని మరణం నీ చేతిలో ఉన్నది. నీ వెంత కాదన్నా విధి లిఖితం మార్చుట అసాధ్యము. ఇతర మాటలతో కాలయాపన చేయక భీష్ముని వధించు " అన్నాడు. అర్జునుడు " రేపటి యుద్ధం ఎలా జరగాలో అలా జరుగుతుంది మీరు చెప్పినట్లే చేస్తాను " అన్నాడు. అందరూ తమ శిబిరాలకు వెళ్ళారు. అది విన్న ధృతరాష్ట్రుడు " సంజయా ! పాండుసుతులు ఎలా శిఖండిని ముందు పెట్టుకుని భీష్మునితో యుద్ధం చేసారు నాకు వివరించు " అన్నాడు.

## యుద్ధారంభం

సూర్యోదయం కాగానే పాండవులు సేనాసమేతులై రణముకు బయలుదేరారు. సేనకు ముందు భాగంలో శిఖండిని నిలిపారు. ఇరువైపులా భీమార్జునులను, వెనుక వైపు అభిమన్యుని, ద్రౌపదీ పుత్రులను, వారికి ఇరువైపులా చేకితానుడు, సాత్యకి వారి వెనుక ధృష్టద్యుమ్నుడు మొదలగు పాంచాలకుమారులను నిలిపారు. నకుల సహదేవులను ఇరిపైపులా నిలువగా ధర్మరాజు వీరందరిని పరిరక్షిస్తూ విరాటరాజు, ద్రుపదుడు మొదలగు రాజులు, కేకయరాజులు, ధృష్టద్యుమ్నుడు మొహరిస్తున్నారు. భేరి తూర్య నాదములు మిన్నంటగా యుద్ధం ఆరంభం అయింది. ఇరుపక్షాలు తీవ్రంగా పోరాడుతూ దేవదానవ యుద్ధాన్ని తలపింపి చేస్తుంది. నకుల సహదేవులు చెలరేగి కౌరవ సేనలను తనుమాడుతున్నారు. భీమార్జునులు కౌరవ సేనను ఊచకోత కోస్తున్నారు. మొత్తం పాండవసేన విజృంభించి కౌరవ సేనను ధ్వంశం చేయ సాగింది. ఇది చూసిన భీష్ముడు కల్పాంతంలో విజృంభించిన రుద్రిడిలా పాండవ సేనపై శరవర్షం కురిపిస్తున్నాడు. రధాశ్వములు, గజములు, కాలబలం నేల కూలుతూ ఉన్నాయి. శిఖండి భీష్మునిపై మూడు బాణములు వేసాడు. భీష్ముడు " నిన్ను బ్రహ్మ స్త్రీగా సృష్టించాడు. నీవు మధ్యలో పురుషత్వం పొందావు. నీవు నా మీద శరవర్షం కురిపించినా నేను నీ మీద కోపం తెచ్చుకోకుండా చిరునవ్వుతోనే నిలబడతాను కాని నీతో యుద్ధం చేయను " అన్నాడు. అది విన్న శిఖండి " భీష్మా ! ఎంతో మంది రాజులను గెలిచావు. పరశురామునితో పోరి నిలిచావు. నీ శౌర్యం నాకు చూపవా ! నీవు నాతో యుద్ధం చేయకున్నా నేను మాత్రం నిన్ను వదలను క్రూరశరములు వేసి నిన్ను చంపుతాను. నేను ఎవరైతే ఎందుకు నాతో యుద్ధం చెయ్యి " అని కవ్వించాడు శిఖండి. ఇది చూసిన అర్జునుడు " నేడు శిఖండి వైఖరి వింతగా ఉంది. భీష్ముడు పడిపోవుటకు సమయం ఆసన్నమైనట్లు కనపడుతుంది. అందుకే దైవ ప్రేరితుడై శిఖండి ఇలా ప్రవర్తిస్తున్నాడు " అని మనసులో అనుకున్నాడు. అర్జునుడు " శిఖండీ ! ఇన్ని మాటలాడి ఊరకున్న లోకం నిన్ను చూసి నవ్వుతుంది. నీ వెనుక నేను ఉన్నాను నిర్భయంగా భీష్ముని మీద నీ వాడి శరములు వేసి హతమార్చు " అన్నాడు. కాని గాంగేయుడు " అక్కడి నుండి తొలగి పోయి పాంచాల సైన్యమును తనుమాడుతున్నాడు. అర్జునుడు తన సైన్యముతో భీష్ముని ఎదుర్కొన్నాడు. అర్జునిని ధాటికి కౌరవ సేన నిలువలేక పారి పోయింది. సుయోధనుడు అది చూసి " పితామహా ! మీరు చూస్తుండగానే సేనలు పారిపోతుంటే చూస్తూ ఊరుకోవడం న్యాయమా " అన్నాడు. ఆ మాటలకు నొచ్చుకున్న భీష్ముడు " సుయోధనా నేను పది రోజులకు పది వేల మందిని చంపుతానని మాటిచ్చాను. పదివేల మందిని చంపి నీ రుణం తీర్చుకున్నాను. ఈ రోజు యుద్ధంలో నన్ను పాండవులో వారిని నేనో చంపడం తథ్యం. కాని నేను మానవమాత్రుడను వారు దైవాంశ సంభూతులు కనుక నా చేతిలో వారు మరణించుట అసాధ్యం అయినా నా శక్తి వంచన లేక యుద్ధం చేస్తాను " అని భీష్ముడు బదులిచ్చి తరువాత భీష్ముడు సైన్యమును వెంటబెట్టుకుని పాండవ సైన్యాలను నిర్మూలించ సాగాడు. భీష్మునికి సాయంగా నీ కుమారులు అక్కడ నిలిచి పోరాడుతున్నారు. ఇది చూసిన పాండవులు మత్స్య, పాంచాల, కేకయ, పాండ్య, యాదవ రాజులు తమ సైన్యాలతో వచ్చి ఒక్కుమ్మడిగా భీష్మునిపై లంఘించారు. సమరం సంకులమైంది.

## అర్జునుడు శిఖండిని ప్రోత్సహించుట

అర్జునుడు " శిఖండీ ! నీవు భీష్ముని ఎదిరించు నేను నీ పక్కనే ఉంటాను నీవేమి భపడ వద్దు. నిన్ను చూసి భీష్ముడు అస్త్ర సన్యాసం చేస్తాడు. నేను భీష్ముని కూలుస్తాను " అని ప్రోత్సహించాడు. ఈ పలుకులు విని ధృష్టద్యుమ్నుడు " రండి మన వీరులంతా ఒక్క సారిగా భీష్ముని ఎదుర్కొనండి మనకు తోడుగా అర్జునుడు ఉన్నాడు " అని అరిచాడు. అది విని ధర్మరాజు, భీముడు, నకులసహదేవులు, అభిమన్యుడు, ద్రౌపదీ సుతులు, విరాటుడు, చేకితానుడు, సాత్యకి, ధృష్టకేతు, కేకయరాజులు, మాగధులు మొదలైన రాజులంతా తమ సన్య సమేతంగా భీష్ముని చుట్టుముట్టారు. ఇది చూసిన అశ్వత్థామ , భూరిశ్రవనుడు, కాంభోజరాజు, కృపాచార్యుడు, కృతవర్మ, వికర్ణుడు, వివిశంతి, దుర్ముఖుడు, చిత్రసేనుడు మొదలైన యోధులు భీష్మునికి సాయంగా వచ్చారు. శిఖండిని ముందు నిలిపి యుద్ధం చేయుచున్న అర్జునునికి భీష్మునికి మధ్యలో దుశ్శాసనుడు నిలిచి కృష్ణార్జునుల మధ్య ఇరవై పదునైన బాణములు వదిలాడు. వాటిని మధ్యలో త్రుంచిన అర్జునుడు దుశ్శాసనునిపై నూరు నారాచబాణములు వేసాడు. దుశ్శాసనుడు అయిదు బాణములు అర్జునుని నుదుటన నాటాడు. అర్జునుడు దుశ్శాసనుని విల్లు త్రుంచాడు. దుశ్శాసనుడు వేరొక విల్లు తీసుకుని అర్జునునిపై ఇరవై బాణములు వేసాడు. అర్జునుడు వాటిన త్రుంచి వాడి అయిన బాణముతో దుశ్శాసనుని వక్షస్థలం పై కొట్టాడు. దుశ్శాసనుడు మూర్చిల్లాడు. దుశ్శాసనుని సారధి రధమును భీష్ముని వెనుకకు తీసుకు వెళ్ళాడు. తెలివి తెచ్చుకున్న దుశ్శాసనుడు తిరిగి భీష్ముని ముందుకు వచ్చి అర్జునినితో పోరు సాగించాడు. సాత్యకితో అలంబస భగదత్తులు, అభిమన్యునితో సుదక్షిణుడు, విరాట ద్రుపద మహారాజులతో అశ్వత్థామ, సహదేవునితో కృపాచార్యుడు, నకులునితో వికర్ణుడు, ఘటోత్కచునితో దుర్ముఖుడు, భీమసేనునితో భూరిశ్రవసుడు, చేకితానునితో చిత్రసేనుడు, ధర్మరాజుతో ద్రోణుడు పోరు సల్పుతున్నాడు. ఇరువైపులా ఉన్న యోధులు ఒకరి కేతనములు ఒకరు విరుస్తూ, గుర్రములను, ఏనుగులను చంపుతూ, ఒకరిని ఒకరు నరుక్కుంటూ ఉన్నారు. రక్తం ఏరులై పారుతుంది. ఇంతలో మధ్యాహ్నం అయింది. దుశ్శాసనుని అస్త్రశస్త్రములన్నీ త్రుంచిన అర్జునుడు అతడి కేతనమును పడగొట్టి, విల్లు విరిచి శరీరం నిండా శరములు గుచ్చి జయధ్వానాలు చేసాడు. అర్జునుని ధాటికి తాళలేని దుశ్శాసనుడు అక్కడి నుండి వెళ్ళి పోయాడు.

## మధ్యాహ్న సమయసమరం

దుశ్శాసనుడు వైతొలగిన తరవాత అర్జునుడు భీష్ముని ముందు నిలిచిన కౌరవ సేనలను చెండాడుతున్నాడు. అది చూసిన ద్రోణుడు మహా కోపంతో అర్జునుని ఎదుర్కొన్నాడు. ఇంతలో అపార సేనావాహినితో అక్కడకు వచ్చిన ధర్మరాజు ద్రోణుని ఎదుర్కొన్నాడు. ఈ పరిణామం చూసి ద్రోణుడు అశ్వత్థామను పిలిచి " కుమారా ! ఈ రోజు నా మనసెందుకో తడబడుతుంది. దివ్యాస్త్రములు స్పురణకు రావడం లేదు. చేతులు వణుకుతున్నాయి, విల్లు జారిపోతుంది, పిడికిలి పట్టు సడలుతుంది, మనస్సు వశం తప్పుతుంది ఈ రోజుతో అర్జునుడు గాంగేయుని వధించి తన శపధం నెరవేర్చుకుంటాడు అనిపిస్తుంది. అది చూడు అర్జునిని ధాటికి గుర్రములు, ఏనుగులు కూలుతున్నాయి. రధములు విరిగి పడుతున్నాయి యమధర్మరాజులా అర్జునుడు రణభూమిలో విహరిస్తున్నాడు. యుధిష్టరుని ముఖంలో కోపం ప్రజ్వరిల్లుతుంది. భీష్మునికి కీడు కలుగుతుందేమో అని అనుమానంగా ఉంది. ద్రౌపదేయులు, నకుల సహదేవుల సహితంగా పోరాడుతున్న ధర్మతనయుని విడిచి నేను రాలేను. కనుక నీవు భీష్మునికి సాయంగా వెళ్ళు " అన్నాడు. తండ్రి ఆదేశం మేరకు అశ్వత్థామ భీష్మునికి సాయంగా వెళ్ళాడు. భీమసేనుడు భీష్ముని ముందు రక్షణగా ఉన్న సైన్యాలను నిర్మూలించాడు. అది చూసిన భగదత్తుడు, కృపాచార్యుడు, కృతవర్మ, శల్యుడు, సైంధవుడు, చిత్రసేనుడు, దుర్మర్షణుడు, విందానువిందులు భీష్మునికి రక్షణగా నిలిచి నానాస్త్రములతో భీముని దుర్కొన్నారు. భీముడు చలించలేదు. అర్జునుడు భీమసేనునికి సాయంగా వచ్చి నిలిచి యోధులందరి కేతనములు విరిచి, విల్లులు త్రుంచి, రధములు విరుగకొడుతూ వీరవిహారం చేస్తున్నాడు. ఇది చూసి సుయోధనుడు సుశర్మను పిలిచి భీమార్జునులను ఎదుర్కొనమని చెప్పాడు. సుశర్మ పదిమంది యోధులతో భీమార్జునులను ఎదొర్కోడానికి వెళ్ళాడు. కాని ఏ ఒక్కరు ఒక్క అడుగు కూడా ముందుకు వేయ లేక పోతున్నారు. సుయోధనుడు కలవర పడి తనసైన్యం యావత్తు అక్కడకు రమ్మని ఆదేశించాడు.

## భీమార్జునులకు సాత్యకి సాయం వచ్చుట

భీమార్జునులు ఒంటరిగా పోరుతున్నారని తెలిసి సాత్యకి మొదలైన ప్రముఖ వీరులు తమ సైన్యాలతో అక్కడకు చేరారు. పాండవుల విజయోత్సాహం చూసి కోపించిన భీష్ముడు అనేక అస్త్రశస్త్రాలతో వారిని ఎదుర్కొన్నాడు. భయంకర ఈ సమరరంలో రధములు విరిగి పడుతున్నాయి, అశ్వములు, గజములు నేల కూలుతున్నాయి. సారధులు చనిపోతున్నారు. భీష్ముడు రణరంగం అంతా తానై తిరుగుతున్నాడు. పొద్దు వాలి పోవడం ఆరంభం అయింది . భీష్ముడు మనస్సులో " ఈ పది రోజుల నుండి ఎంతో మంది ఉత్తమ క్షత్రియులను హతమార్చాను. వేలకొలది సైనికులను దారుణంగా చంపి విసిగి అలసి పోయాను ఇక ఈ శరీర బంధం తెంచుకొనుట మంచిది " అని తలచి భీష్ముడు తన రధమును యుధిష్టరుని వద్దకు పోనిచ్చాడు. అతనితో యుద్ధం చేస్తున్నట్లు నటిస్తూ " యుధిష్టరా ! పుట్టినది ఆదిగా ఎంతో మంది రాజులను చంపాను ఇంకా

చంపుతున్నాను. నాకు వయసు అయిపోయింది. ఈ రాక్షసమయ జీవితంతో విసిగి పోయాను అసహ్యం కూడా కలుగుతుంది. మీరు నా మేలు కోరే వారైతే శిఖండిని ముందు పెట్టుకుని అందరూ నాపై యుద్ధానికి రండి ఆలస్యం చేయక నాకు ఈ దేహం నుండి విముక్తిని ప్రసాదించండి " అని రధమును మళ్ళించి యధావిధిగా శత్రు సైన్యమును నిర్మూలించడం మొదలు పెట్టాడు.


భీష్ముడు ఇక తను యుద్ధము చేయనని శ్రీకృష్ణునకు చెప్పుట

## సాయం సమయం తరవాత సమరం

భీష్ముని పలుకులు విన్న యుధిష్టరుడు పక్కనే ఉన్న ధృష్టద్యుమ్నునితో " భీష్ముని పలుకులు విన్నావు కదా ! నువ్వు, భీమసేనుడు, అర్జునుడు మన సైన్యంలోని యోధాను యోధులతో కలిసి ఒక్కుమ్మడిగా భీష్ముని చుట్టు ముట్టండి " అని ఆదేశించాడు. ధృష్టద్యుమ్నుడు మత్స్య, కేకయ రాజులను తక్కిన యోధాను యోధులకు భీష్ముని వద్దకు వెళ్ళమని సైగ చేసి తాను కూడా భీమార్జునులను తీసుకుని భీష్ముని చుట్టుముట్టాడు. ఇది చూసిన సుయోధనుడు కూడా తన తమ్ములు మిగిలిన వారిని కూడగట్టుకుని భీష్మునికి అండగా నిలిచాడు. ఇరుపక్షాల మధ్య పోరు ఘోరమైంది. అభిమన్యుడు సైన్యంతో సుయోధనుని మీదకు దూకి అతడిని క్రూర నారాచబాణములు వేసి నొప్పించాడు. అశ్వత్థామ సాత్యకి శరీరం నిండా శరములు నాటాడు. భీమసేనుడు రారాజును ఎదుర్కొన్నాడు. " భీష్ముని వెంటనే చంపండి " అంటూ పాండవ సైన్యాలు " భీష్ముని రక్షించండి " అని కౌరవ సైన్యాలు వీరాపాలు పలుకుతూ పోరాటం సాగిస్తున్నారు. రెండు సింహాలు పోరుతున్న విధంగా అర్జునుడు భీష్ముడు పోరాడుతున్నాడు. వారిద్దరి మధ్యకు దుశ్శాసనుడు తన సైన్యంతో వచ్చి అర్జునుని ఎదుర్కొన్నాడు. అర్జునుడు తన పదునైన బాణాలతో దుశ్శాసనుని కొట్టి అక్కడి నుండి తరిమి కొట్టాడు. అర్జునిని ధాటికి తట్టుకోలేని దుశ్శాసనుడు భీష్ముని వెనుక దాక్కున్నాడు. అర్జునుడు భగదత్తుని ఎదుర్కొని అతడి గజమును గాయపరిచాడు. భగదత్తుడు అర్జునిని వదిలి పాంచాల భూపతి మీదకు వెళ్ళాడు. అర్జునుడు శిఖండిని చూసి " భీష్ముని గుండెలకు గురి పెట్టి బాణములు వదులు అన్నాడు. తనను ఎదుర్కొన్న కౌరవ యోధులను దూది పింజంలా ఎగురగొట్టాడు. శిఖండి భీష్ముని వక్షస్థలం, భుజముల మధ్య భాగం, మర్మస్థానాలకు గురిపెట్టి బాణం వేస్తున్నాడు. భీష్ముడు శిఖండిని చూడకనే అర్జునుని ఎదుర్కొంటున్నాడు. అది చూసి దుశ్శాసనుడు కోపంతో రగిలి పోతూ భీష్మునికి అడ్డం వచ్చి అర్జునుని ఎదుర్కొన్నాడు. సుయోధనుడు కూడా కళింగ, మాళవ, బాహ్లీక, విదేహరాజులను, శూరసేనుడు మొదలైన ప్రముఖులను చూసి చేయి ఊపుతూ అక్కడకు రమ్మని సైగ చేసాడు. వారంతా తమతమ సేనా వాహినులతో అర్జునుని ఎదుర్కొన్నారు. అర్జునుడు తొట్రు పడక వారందరిని సైన్యంతో సహా కట్టడి చేసి తరిమాడు .

## అర్జునుడు భీష్ముడిని ఎదుర్కొనుట


భీష్మార్జునుల యుద్ధం

అర్జునుడు శిఖండిని చూసి భీష్మునిపై శరసంధానం చేయమని ఆదేశించాడు. అర్జునుని అండ చూసి శిఖండి భీష్ముని వక్షస్థలానికి గురి పెట్టి క్రూరమైన నారాచములతో కొట్టాడు. భీష్ముని శరీరం రక్తసిక్తం అయింది. శిఖండి శంఖం పూరించి సింహనాదం చేసాడు. దుశ్శాసనుడు తేరుకుని కృపాచార్యుడు, వివిశంతి, వికర్ణుడు మొదలైన యోధులను కూడగట్టుకుని భీష్మునికి అర్జునునికి మధ్య ప్రవేశించాడు. అర్జునుడు వారందరి రధములు విరుగ కొట్టాడు. ఇది చూసిన సుయోధనుడు, అతని తమ్ములు క్రోధంతో రగిలి పోయారు. సుయోధనుడు తన అక్షౌహిని సైన్యాన్ని అర్జునుని ఎదుర్కొనమని చేయి ఊపి సైగ చేసాడు. సుయోధనుని సైన్యం అర్జునిని చుట్టుముట్టాయి. భీష్ముడు ఒక ఉగ్రమైన అస్త్రమును ప్రయోగించి పాండవ సేనను నిర్మూలించాలని అనుకున్నాడు. అస్త్రప్రయోగం చేయబోయే సమయానికి శిఖండి కనిపించగానే ఆ ప్రయత్నం విరమించుకుని విరాటుని సేనలతో యుద్ధం చేయనారంభించాడు. భీష్ముని ధాటికి విరాటుని సేనలు నిలువ లేక పోయాయి. విరాటుని

తమ్ముడు శతానీకుడు తన సైన్యముకు ధైర్యం చెబుతూ భీష్మునిపై విరుచుకు పడ్డాడు. భీష్ముని వక్షస్థలంపై అతి క్రూర నారాచములు ప్రయోగించాడు. భీష్ముడు కోపంతో ఊగిపోతూ శతానీకుని విల్లు విరిచాడు, కేతనం కూల్చాడు, రధసారధిని చంపాడు రధాశ్వములను చంపాడు. భీష్ముని ప్రతాపానికి తట్టుకోలేని శతానీకుడు తన వద్ద ఉన్న శక్తి ఆయుధాన్ని భీష్మునిపై విసిరాడు. భీష్ముడు దానిని మధ్యలోనే త్రుంచి వేరొక నిశిత అస్త్రంతో శతానీకుని శిరస్సు ఖండించాడు. ఇది చూసిన విరాటుని సేనలు పారి పోయాయి. ఇది చూసిన కృష్ణుడు అర్జునితో " అర్జునా ! భీష్ముని ధాటికి మన సేనలు నిలువ లేక పోతున్నాయి. ఇక నీవు భీష్ముని చంపక తప్పదు. భయంకరమైన అస్త్రాలను ప్రయోగించి భీష్ముని సంహరించు " అన్నాడు. కృష్ణుని మాటను శిరసావహించిన అర్జునుడు భీష్ముని మీద శరములు సంధించి అతని సారధిని చంపాడు, రధాశ్వాలను చంపాడు. ఇది చూసిన శిఖండి భీష్మునిపై వాడి శరములు సంధించాడు. శిఖండిని చూసిన అర్జునుడు భీష్ముని విల్లు త్రుంచాడు. అది చూసి సహించ లేని శల్యుడు, భూరిశ్రవనుడు, కృపాచారుడు, కృతవర్మ, చిత్రసేనాది ప్రముఖులు అర్జునిపై సైన్యమును పురికొల్పుతూ దివ్యాస్త్రాలను ప్రయోగిస్తూ భీష్మునికి అడ్డం వచ్చారు. ఇది చూసిన విరాటుడు, సాత్యకి, భీముడు, అభిమన్యుడు, ఘతోత్కచుడు, ద్రుపదాది పాండవ యోధులు తమ సైన్యంతో కౌరవ యోధులను ఎదుర్కొన్నారు. పోరు గోరంగా సాగింది. అర్జునుడు అంతటా తానై వీరవిహారం చేస్తున్నాడు. ఇంద్ర, వారుణ, ఆగ్నేయాస్త్రాలను ప్రయోగించాడు. మరొక పక్క శిఖండిని భీష్మునిపై శర ప్రయోగం చేయమని ప్రోత్సహిస్తున్నాడు. భీష్ముడు ఎన్ని విల్లులు తీస్తున్నా విరిచి వేస్తూ భీష్ముడు శరసంధానం చేయకుండా ఆపుతున్నాడు. విసిగి పోయిన భీష్ముడు భయంకర శక్తి ఆయుధాన్ని అర్జునిపై ప్రయోగించాడు. అర్జునుడు దానిని మధ్యలోనే త్రుంచి భీష్ముని సారధిని చంపి, కేతనమును విరిచి దేవదత్తం పూరించాడు.

## భీష్ముడు విశ్రమించాలని కోరుకొనుట

అర్జునుని పరాక్రమం చూసిన భీష్ముడు " కృష్ణుని తోడు లేకున్న ఈ అర్జునుని నేను నిర్జించలేనా పోనిమ్ము ధర్మరాజాదులు కోరికపై నా మరణాన్ని నేనే కోరుకున్నాను. ఇప్పుడు వీరావేశంతో పోరాడే ప్రయోజన మేమిటి. ఇక విశ్రాంతి తీసుకుంటాను " అనుకున్నాడు . భీష్ముని నిర్ణయాన్ని మహా మునులు , దేవతలు అభినందించారు. వ్యాసభగవానుని కరుణ వలన నాకు ఆ మాటలు వినపడ్డాయి. కాని యుద్ధం చేయని ఎడల సుయోధనాదులు నిందించగలరని భీష్ముడు విల్లు అందుకుని శరసంధానం చేయబోయాడు. శిఖండి భీష్మునిపై దారుణ శరమును సంధించాడు. భీష్ముడు దానిని లక్ష్యపెట్ట లేదు. అర్జునుడు భీష్మునిపై పుంఖాను పుంఖాలుగా శరవర్షం కురిపించాడు. భీష్ముడు ఆగ్రహించి వాటిని త్రుంచి తిరిగి వాడి అయిన శరములను గుప్పించాడు. అర్జునుడు వాటిని త్రుంచి భీష్ముని విల్లు త్రుంచి భీష్ముని వక్షస్థలముకు గురి పెట్టి క్రూర నారాచమును ప్రయోగించాడు. అది చూసిన సుయోధనుడు నిశ్చేష్టుడైయ్యాడు. భీష్ముడు సుయోధనుని పిలిచి సుయోధనా ! చూసితివా అర్జునుని ప్రతాపం దేవతలైనా అతడిని గెలువ లేరు. ఇక మానవ మాత్రుడిని నేనెంత " అన్నాడు.

## భీష్ముడు పడి పోవుట

ఇంతలో అర్జునుడు తన వింటిని శిఖండి చేతిలో ఉన్న విల్లు వెనుక పెట్టి అతి క్రూర నారాచములను భీష్మునిపై ప్రయోగించాడు. తన శరీరమున నాటుకున్న నారాచములను చూసి దుశ్శాసనుని దగ్గరకు పిలిచి " దుశ్శాసనా ! చూసితివా ఇవి శిఖండి వింటి నుండి వచ్చిన బాణములు కాదు. అర్జుని గాండీవం నుండి వచ్చిన బ్రహ్మ దండము వంటి బాణములు. నా మర్మస్థానములకు సూటిగా తగులు చున్నవి. యమదూతలవంటి ఇలాంటి దృఢమైన బాణములు వేయడం శిఖండికి చేతకాదు. నిశితమై, దీప్తివంతమై లక్ష్యం తప్పక మర్మస్థానాలకు తగులుతున్న ఈ శరములు అర్జునుడు కాక మరెవరు వేయగలరు " అన్నాడు. వెంటనే తన యావచ్ఛక్తిని ఉపయోగించి అర్జునిపై శక్తి ఆయుధమును వేసాడు. అర్జునుడు దానిని మధ్యలోనే త్రుంచి వేసాడు. భీష్ముడు కత్తి డాలు తీసుకుని రధము దిగాలనుకున్నాడు. అర్జునుడు వాటిని తునియలు చేసి సింహనాదం చేసి " భయపడకండి భీష్మునితో పోరాడండి అతనిని చుట్టుముట్టండి చంపండి " అని సేనలను ప్రోత్సహించాడు. పాండవ యోధులు " పొడవండి, వేయండి, నరకండి , చంపండి " అంటూ భీష్ముని పైకి పోసాగారు. వారిని కౌరవ సేన అడ్డుకుంది . ఇరుపక్షాలలో పోరు ఘోరంగా సాగింది. సూర్యుడు అస్థమించ సాగాడు. అర్జునుడు భీష్ముని శరీరంలో క్రూర నారాచములను నాటి అతడిని పడగొట్టి సింహనాదం చేసి దేవదత్తం పూరించాడు. భీష్ముడు రధం పై నుండి క్రిందికి పడ్డాడు. భీష్ముని తల తూర్పుకి పెట్టి భూమిపై కూలాడు. అతని శరీరం



అర్జునుడి బాణములతో గాయపడి నేలకు ఒరిగిన భీష్ముడు-రాజ్మానామా నుండి ఒక దృశ్యం

నేలకు తగల కుండా అతని శరీరంలోని బాణాలు శయ్యలా మారాయి.

## అంపశయ్యపై భీష్ముడు

నేల కూలిన భీష్మునిలో పారమార్ధిక చింత మొదలైంది. దైవీక భావం ఆవేశించింది. దివి నుండి చూస్తున్న దేవతలు " అయ్యో ఇది దక్షిణాయనము కదా ! భీష్ముడు దక్షిణాయనంలో మరణిస్తాడేమో " అని కలవర పడ్డారు. వారి మనోభావం గ్రహించిన భీష్ముడు " దేవతలారా దక్షిణాయనమున ప్రాణము విడుచుట మంచిది కాదని శాస్త్రములు చెప్పాయి కనుక నా ప్రాణములు నా మేనిలో ఉత్తరాయణము వచ్చేవరకు నిలుపుకుంటాను. నా తండ్రికి సత్యవతితో వివాహము జరిపించిన సమయంలో నా తండ్రి నాకు ఇచ్చా మరణం వరంగా ప్రసాదించాడు కనుక నా ప్రాణములు నా వశంలో ఉంటాయి " అన్నాడు. అది విన్న దేవతలు సంతోషించారు. భీష్ముని తల్లి గంగాదేవి హంసల రూపంలో కొంతమంది మునులను భీష్మునికి దక్షిణాయనము గురించి తెలపడానికి పంపింది. వారు భీష్మునికి ఆ విషయం ముందే తెలిసిందని తెలుసుకుని సంతోషించి తిరిగి వెళ్ళారు. భీష్ముని స్థితి తెలుసుకున్న దుర్యోధనుడు ఈ విషయం ద్రోణునికి అందించమని దుశ్శాసనుని పంపాడు. దుశ్శాసనుడు ఈ విషయం తెలుపగానే ద్రోణుడు మూర్చిల్లాడు. కొంత సమయానికి తేరుకుని భీష్ముడు కూలిపోయినందుకు విలపిస్తూ భీష్ముడు పడిపోయిన ప్రదేశానికి వెళ్ళాడు. భీష్ముడు పడిపోయినందుకు పాండవ సేనలో ఆనందోత్సాహాలు వెల్లి విరిసాయి. పాండవేయులు, మత్స్య, పాంచాల, యాదవ రాజులు సంతోషించారు. తూర్యనాదాలు మంగళ వాద్యాలు మిన్నంటాయి. నీ కుమారులు కౌరవ ప్రముఖుల ముఖాలలో విషాదం చోటు చేసుకుంది. ఆ తరవాత యుద్ధం ఆగిపోయింది. సూర్యాస్తమయం అయింది " అని సంజయుడు పదవ నాటి యుద్ధ విశేషాలు వివరించాడు. దృతరాష్ట్రుడు " సంజయా ! ఇంతటి ఘోర వార్త విని కూడా నా మనసు ఆవంతయు చలించుట లేదు నాది హృదయమా పాషాణమా ! " అన్నాడు.

## అంపశయ్యపై భీముడు


అంపశయ్యపై భీష్ముడు

సంజయుడు " మహారాజా ! అప్పుడు పాండవులు తమతమ ఆయుధములు విడిచిపెట్టి గాంగేయుని వద్దకు వెళ్ళారు. ధనుంజయుడు మాత్రం తన గాండీవంతో సహా తాతాగారి చెంతకు వెళ్ళాడు. ఆ సమయంలో ఇరు పక్షాలు తమతమ ఆవేష కావేషములు విడిచి పితామహుని ముందు నిలిచారు. భీష్ముడు నీ తనయుల వంక చూసి " నా తల వాలి పోతుంది దానికి ఒక ఆధారం కావాలి అన్నాడు. నీ పుత్రులు వెంటనే సుతి మెత్తని దొడ్లు తీసుకుని వచ్చారు. భీష్ముడు వాటిని సున్నితంగా తిరస్కరించి అర్జునుని వైపు చూసాడు. అర్జునుడు కళ్ళలో నీరు పెట్టుకుని పితామహుని తల వైపు మూడు బాణములు సంధించాడు . వాటిపై భీష్ముడు తన తలకు విశ్రాంతి ఇచ్చాడు. భీష్ముడు పాడవులను, కౌరవులను చూసి " నేను ఉత్తరాయణ పుణ్య కాలం వచ్చు వరకు ఈ శరతల్పమున శయనిస్తాను అందుకు కావలసిన రక్షణ ఏర్పాట్లు చేయండి అన్నాడు. వారు వెంటనే భీష్ముని చుట్టూ ఒక ప్రాకారం అత్యంత భక్తి శ్రద్ధలతో నిర్మించారు. సుయోధనుని వైద్యులు వచ్చి భీష్మునికి వైద్యం చేయడానికి అనుమతి కోరారు. గాంగేయుడు వారి సహాయమును తిరస్కరించాడు. ఇంతలో గాంగేయునికి దాహం వేసి నీటి కొరకు సైగ చేసాడు. నీ కుమారులు మధురమైన శీతల పానీయములు తెప్పించారు. భీష్ముడు " శరతల్ప గతుడనైన నేను ఇతరములైన జలమును ముట్టను. నేను తేజోమయమైన అస్త్రవిన్యాసంతో బయటకు వచ్చిన భూగర్భజలాలను మాత్రమే స్వీకరిస్తాను " అన్నాడు. నీ కుమారులు భూగర్భ జలములు తీసుకు వచ్చేది ఎలా అని ఆలోచించుచుండగా . భీష్ముడు అర్జునుని చూసి " అర్జునా ! ఈ బాణములవలన కలుగు బాధ నా సర్వాంగములను వేధించుతున్నది. నా దాహం తీర్చు జలములు నీవే తీసుకురావాలి " అన్నాడు. అప్పుడు అర్జునుడు భీష్మునికి ప్రదక్షిణం చేసి దివ్యాస్త్రం సంధించి భూగర్భ జలాన్ని బయటకు తీసుకు వచ్చాడు.

ఆ జలమును సేవించి భీష్ముడు సేదతీరి అర్జునుని చెంతకు పిలిచి " అర్జునా! నేను నారదుని వలన నిన్ను నరునిగా తెలుసుకున్నాను.

## కౌరవులకు భీష్ముడు హితవు చెప్పుట

నరనారాయణులైన నీవు శ్రీకృష్ణుడు కలిసిన మీకు అసాధ్యమయినది లేదు. మీ ఇద్దరితో వైరము తగదు అని ఎన్నిమార్లు చెప్పినా కురునాధుడు విన లేదు. అతడు భీముని చేతిలో తగిన ఫలితము అనుభవించుట తధ్యము " అని పలికి నీ కుమారుడైన సుయోధనుని చూసి " సుయోధనా ! అర్జునుడు నరుడు అమిత పరాక్రమ శాలి అతడికి శ్రీకృష్ణుడు ఆప్తుడు కనుక నరనారాయణులను జయించుట అసాధ్యము. నా మాట విని అజాత శత్రువైన ధర్మనందనునికి ఇంద్రప్రస్థముతో సహా సగరాజ్యం పంచి ఇచ్చి మిగిలిన సోదరులతో నిండు నూరేళ్ళు బ్రతకండి " అన్నాడు. ఎవ్వరూ భీష్మునికి బదులు పలుకకనే వారి వారి శిబిరాలకు తిరిగి వెళ్ళారు. ఆ సమయమున కృష్ణుడు " ధర్మరాజా ! దేవతలకు కూడా అజేయుడైన అర్జునుని గెచుట ఎవరికిని అసాధ్యం " అన్నాడు. అందుకు ధర్మరాజు " కృష్ణా ! ఈ విజయం అంతా నీ వలన ప్రాప్తించిందే కాని ఇందు ఇసుమంత అయినా మా పరాక్రమము లేదు " అన్నాడు. అలా ఒకరిని ఒకరు ప్రశంసించుకుంటూ తమ నెలవులకు వెళ్ళారు.

## కర్ణుడు భీష్ముని కలుసుకొనుట

ఆ సమయమున కర్ణుడు ఒంటరిగా భీష్ముని వద్దకు వెళ్ళి భక్తితో పాదములకు నమస్కరించి " పితామహా! నా మీద కోపము మాని వాత్సల్యం చూపి నాకు తగిన చల్లటి మాటలాడండి " అని ప్రార్ధించాడు. భీష్ముడు కర్ణుని ప్రేమతో దగ్గరకు పిలిచి ఒక చేయి ఎత్తి కౌగలించుకున్నాడు. అక్కడ ఉన్న రక్షక భటులను వెళ్ళమని చెప్పి తమ మాటలు ఎవరూ వినలేదని దృఢపరచుకుని " కర్ణా ! నీ మీద కోపము నా కెందుకయ్యా ! నీవు కుల భేదముతో మాట్లాడుతున్నావని కురు పాండవుల మధ్య వైరము ఎగత్రోయుచున్నావని నిన్ను నిందించానే కాని నాకు నీపై ఎలాంటి ప్రత్యేక కోపం లేదు. అది పెద్ద వాడిగా నేను నీకు వేసిన శిక్షే కాని ద్వేషం చూపుట కాదు. నీ పుట్టుక దైవీకము. అందు వలన నిన్ను గెలుచుట సాధారణ మానవులకు అసాధ్యము. నీవు కుంతీ పుత్రుడవు కానీ రాధేయుడవు కాదు. ఈ విషయం నేను వ్యాసుడు ఏకాంతంగా చెప్పగా విన్నాను. నాకు నీ పరాక్రమము తెలియును నీవు పాండు పుత్రుడవు కనుక నీ యందు నాకు వాత్సల్యం ఉన్నది. నేను సుయోధనునికి పాండవులతో వైరము తగదు దైవాంశ సంభూతులైన వారిని జయించుట అసాధ్యం అదియును కాక సాక్షాత్తు నారాయణుడు అయిన శ్రీకృష్ణుని అండ వారికి ఉంది అని చెప్పాను . అతడు అది లక్ష్యపెట్ట లేదు. నీవు కూడా నీ తలపు మానుకుని పాండవులతో స్నేహంగా ఉండు " అని హితవు పలికాడు. అందుకు కర్ణుడు " పితామహా ! నేను కౌంతేయుడినని రాధేయుడను కానని నాకు ఇంతకు మునుపే తెలిసింది. పాండవులు మహాబలులు వారికి శ్రీకృష్ణుని అండ ఉన్నది. వారిని జయించుట కుదరని పని ఇది తధ్యము. కాని నాకు ఇప్పుడు కుంతీ పుత్రులతో పొత్తు ఎలా కుదురుతుంది చెప్పు అన్నాడు. నేను ఇప్పటి వరకు సుయోధనుని ప్రాపున మన్ననలంది విపత్కర సమయమున అతడిని విడుచుట న్యాయమా, ధర్మమా? కృతఘ్నుడనని లోకం నన్ను నిందించదా? నన్ను పిరికి వాడని నిందించదా ! అది కాక పాండవులకు నేను అనేక విధముల కీడు చేసాను. కురుసభలో పాండవులను పెక్కు విధముల అవమానపరిచాను. ద్రౌపదిని నీచంగా మాట్లాడాను. వారికి నేనంటే అసహ్యము పుట్టేలా ప్రవర్తించాను. అహర్నిశలు వారికి కీడు తలపెట్టాను. కౌరవులకు పాండవులకు మధ్య వైరము రగిల్చి పెంచి పోషించాను. ఈ సమయంలో నాకు వారితో యుద్ధమే కాని పొత్తు సాధ్యం కాదు. నన్ను నమ్మిన సుయోధనుని వంచించలేను. జయాపజయములు దైవాధీనము. నాకు పాండవులతో యుద్ధమే శరణ్యం. నా సేవాధర్మం నెరవేర్చేలా నన్ను దీవించండి. నా పరాక్రమం కృష్ణార్జునులకు చూపించే తరుణం ఆసన్నమైంది " అని పలికాడు కర్ణుడు. భీష్ముడు " కర్ణా ! నీవు అంతటి పరాక్రమశాలివి అనినాకు తెలియును. సుయోధనునికి నీ బుజబలమే సహాయకారి. రారాజుకు ప్రియం కలిగేలా ప్రవర్తించుటకు నేను నీకు అనుజ్ఞ ఇస్తున్నాను " అని పలికాడు. భీష్ముని ఆదర పూర్వకమైన పలుకులు విని ఆనందించిన మనసుతో కర్ణుడు తన నివాసముకు వెళ్ళాడు " అని పలికి సంజయుడు పది రోజుల యుద్ధవిశేషాలు చెప్పడం ముగించాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభ్రువాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

"http://te.wikipedia.org/w/index.php?title=భీష్మ_పర్వము_తృతీయాశ్వాసము&oldid=760864" నుండి వెలికితీశారు

వర్గం: మహాభారతం

- ఈ పేజీకి 07:24, 25 సెప్టెంబర్ 2012న చివరి మార్పు జరిగినది.

# ద్రోణ పర్వము

వికీపీడియా నుండి

**ద్రోణ పర్వము**, మహాభారతం ఇతిహాసంలోని ఏడవ భాగము. ఆంధ్ర మహాభారతంలో ఈ భాగాన్ని తిక్కన అనువదించాడు. ద్రోణాచార్యుని నాయకత్వంలో జరిగిన కురుక్షేత్ర సంగ్రామం ఈ పర్వం కథాంశం

## విషయ సూచిక



## సంస్కృత మహాభారతం

## ఆంధ్ర మహాభారతం

## విశేషాలు

## మూలాలు

## బయటి లింకులు

- కిశోరీ మోహన్ గంగూలి ఆంగ్ల అనువాదం (http://www.sacred-texts.com/hin/m01/index.htm)

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • **ద్రోణ పర్వము** • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

# ద్రోణ పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# ప్రధమాశ్వాసం

దేవవ్రతుడు శాంతి పొందిన విషయం తెలుకున్న ధృతరాష్ట్రుడు ఏమి చేసాడు? వివరించండి అని జనమేజయుడు వైశంపాయన మహర్షిని అడిగాడు. వైశంపాయనుడు భారత కధను ఈ విధంగా చెప్పసాగాడు . భీష్ముడు పడి పోయిన విషయం ధృతరాష్ట్రుని ఖిన్నుడిని చేసింది. " సంజయా | నీవు యుద్ధభూమికి వెళ్ళి తరువాత జరిగిన యుద్ధవిశేషాలు తెలుసుకుని రా " అని చెప్పి సుయోధనుని విజయాన్ని ఆకాంక్షిస్తున్న ధృతరాష్ట్రుడు చెప్పాడు. కొన్ని దినములు గడిచిన పిదప వ్యాసుని మహిమ వలన ఉభయ సైన్యాల విశేషాలు ప్రత్యక్షంగా చూసిన సంజయుడు ఒక అర్ధరాత్రి సమయమున హస్థినకు తిరిగి వచ్చాడు. వెంటనే ధృతరాష్ట్రుని మందిరముకు వెళ్ళాడు. ధృతరాష్ట్రుడు అతడికి ఉచితాసనము ఇచ్చి సత్కరించి " సంజయా ! మా తండ్రిగారైన భీష్ముడు యుద్ధరంగమున పడి పోయిన తరవాత నాకుమారులైన కౌరవులు ఎవరి సాయంతో పాండవుల మీద యుద్ధం సాగించారు. ఉభయుల మధ్య యుద్ధం ఎలా జరిగింది " అని అడిగాడు. సంజయుడు " మహారాజా ! భీష్ముడు దేవభావం పొందడం. శాంతనవుడు చెప్పిన హితవాక్యాలకు కోపము తెచ్చుకుని నీ కుమారుడు అక్కడ నుండి వెళ్ళి పోయాడు. నేను నీ వద్ద నుండి వెళ్ళిన తరువాత రోజు వేకువ ఝామున యుద్ధ రంగముకు వెళ్ళాను. కురు సైన్యాలు మరునాటి యుద్ధానికి సిద్ధం ఔతున్నాయి. కాని కురు వీరుల ముఖాలు వివర్ణమై ఉన్నాయి. భీష్ముడు లేక పోవడంతో కౌరవ సేనలు కాంతులు కోల్పోయి కళావిహీనంగా ఉన్నాయి. అందరూ కర్ణుని రాక కొరకు ఎదురు చూస్తున్నారు. రధికులు సుయోధనుని వద్దకు వెళ్ళి " సుయోధనా ! భీష్ముడు లేని కురుసేనలు పతిని కోల్పోయిన సతిలా, పంటలు లేని భూదేవిలా కళావిహీనమై ఉన్నాయి. భీష్ముడు లేక పోవడంతో పాండవ సేనలు ఉత్సాహంగా విజృంభిస్తాయి. కనుక కర్ణుడే ఈ సమయానికి మనలను ఆదుకోగలడు. భీష్ముని మీద అలిగి కర్ణుడు యుద్ధరంగముకు రాలేదు. కనుక ఇప్పుడు మనవారంతా కర్ణుని కొరకు ఎదురు చూస్తున్నారు " అని సంజయుడు చెప్పగానే ధృతరాష్ట్రుడు " సంజయా ! తరవాత ఏమైంది కర్ణుడు వచ్చాడా ! పాండవులను ఓడించాడా ! మన వారి మనోరధం నెరవేరిందా ! " అని అడిగాడు. సంజయుడు ఇలా చెప్ప సాగాడు " మహారాజా ! ఆ సమయంలో కర్ణుడు అక్కడకు వచ్చాడు. సుయోధనుడు కర్ణుని సాదరంగా ఆహ్వానించాడు. కర్ణుడు అక్కడి రాజులను చూసి " దమము, సత్వగుణము, తపము, దానగుణము, శీలము, అస్త్రవిధ్యా నైపుణ్యం, వీరము శౌర్యము ఆభరణముగా కలిగిన భీష్ముడు రణరంగమున పడిపోయిన తరవాత ఆయన నాయకత్వం లేని ఈ అక్షౌహినుల సైన్యం ఉండీ ఏమి ప్రయోజనం సుయోధనుని సమస్త సంపదలు సమసి పోయినట్లే " అని దు:ఖించాడు. అక్కడ ఉన్న రాజులు కూడా అందుకు దు:ఖించారు. కర్ణుడు ఉపశమనం పొంది " భీష్ముడు మేరుపర్వతంలా పడి పోయిన సమయంలో నేను అతడి స్థానంలో ఉండి కౌరవ సేనలను రక్షిస్తాను. అర్జునిని మదం అణుస్తాను. కృష్ణుని అండ చూసుకుని విర్రవీగుతున్న పాండవులను నా శరపరంపరతో హతమారుస్తాను. భీష్మునిలా చెలరేగి శత్రు సేనలను చీల్చి చెండాడి ఈ సువిశాల సామ్రాజ్యానికి సుయోధనుని పట్టాభిషిక్తుని చేస్తాను. అలా కాని పక్షంలో కౌరవులను రక్షిస్తూ, పాండవులను నిర్జిస్తూ కీర్తి గడిస్తూ స్వర్గంలో భీష్ముని కలుసుకుంటాను " అని సగర్వంగా చెప్పగానే సుయోధనుడు సంతోషించాడు.

## కర్ణుడు భీష్ముడిని కలుసుకొనుట

తరువాత కర్ణుడు రధమును అధిరోహించి భీష్ముని వద్దకు వెళ్ళి కన్నీటితో పాదములకు నమస్కరించి " పితామహా ! రాధేయుడు తమ దర్శనార్ధం వచ్చాడు. కళ్ళు తెరవండి తమరు ఇలా అంపశయ్య మీద ఉండటం విధి విలాసం కాక మరేమిటి. నేను ఈ రోజు నుండి పాండవుల మీద యుద్ధానికి పోతున్నాను. పరమ పావనమైన మీ పలుకులతో నన్ను ఆశీర్వదించండి " అని పలికాడు. భీష్ముడు కళ్ళు తెరవగానే కర్ణుడు నమస్కరించి " అనఘా ! అర్జునుని అహంకారం నేను ఒక్కడినే అణుస్తాను. పాండవులను గడ్డిగరిపిస్తాను నన్ను ఆశీర్వదించండి " అన్నాడు. భీష్ముడు " కర్ణా ! సుయోధనుడు నీ అండ చూసుకునే ఉన్నాడు. కౌరవులకు సుయోధనుడు నువ్వూ అంతే జన్మత: వచ్చిన బంధుత్వం కంటే స్నేహమే గొప్పది కదా ! కౌరవ సేన భారం వహించి సుయోధనునికి మేలు చెయ్యి. అంబష్ట, పౌండ్రాది దేశములు జయించి సుయోధనుని ఆధీనము కావించిన నీకు చెప్పవలసిన పని ఏమి ? కౌరవ సేనను నడిపించి అతడికి విజయం చేకూర్చు. నాకు సుయోధనుడు ఎంతో నువ్వూ అంతే " అన్నాడు. కర్ణుడు మరొక్క సారి భీష్ముని పాదములకు నమస్కరించి అక్కడ నుండి యుద్ధరంగముకు వెళ్ళాడు. రధ,

గజ, తురంగ, పదాతి దళాలను సమీకరించి వారికి ఉత్సాహం కలిగించాడు. అంతలో సుయోధనుడు అక్కడకు వచ్చి " కర్ణా ! నీ రాకతో కౌరవ సేనలు ఉత్సాహాన్ని పుంజుకున్నాయి. మన సేనలు యుద్ధానికి ఉరకలు వేస్తున్నాయి. మన ప్రస్థుత కర్తవ్యం ఏమిటి " అన్నాడు. కర్ణుడు " సుయోధనా ! రారాజువైన నీ ఆజ్ఞ మాకు శిరోధార్యము. నీవే కర్తవ్యాన్ని నిర్ణయించు " అన్నాడు. సుయోధనుడు " కర్ణా ! భీష్ముని నాయకత్వంలో ఈ పది రోజులు మన సేనలు నడిచాయి. ప్రస్థుతం మనకు ఒక సేనా నాయకుడు కావాలి. కౌరవ సేనలకు నాయకత్వం వహించుటకు ఎవరు అర్హులో నీవే నిర్ణయించాలి " అన్నాడు . కర్ణుడు " సుయోధనా ! మన యోధులందరూ నాయత్వ అర్హత ఉన్న వారే ఒకరిని నియమించిన వేరొకరికి మత్సరం కలుగుతుంది. కనుక ద్రోణుని సైన్యాధ్యక్షుని చేసిన అందరికీ అమోద యోగ్యముగా ఉంటుంది. ఆచార్యుడు, వివిధ రణతంత్ర కోవిదుడు, పూజ్యుడు , శూరుడు, వయోవృద్ధుడైనా వీరుడు అతడిని సైన్యాద్యక్షునిగా అభిషేకించండి " అన్నాడు.

## ద్రోణుని సైన్యాధ్యక్షుని చేయుట


ద్రోణుని సైన్యాధ్యక్షుని అభిషేకిస్తున్న సుయోధనుడు

కర్ణుని మాటలు విన్న సుయోధనుడు తన తమ్ములను, మిత్రరాజులను వెంట పెట్టుకుని ద్రోణాచార్యుని వద్దకు వెళ్ళి ఆయనతో సవినయంగా " ఆచార్యా ! కురుసైన్యంలో అస్త్రవిద్యా ప్రావీణ్యంలోను, శౌర్య ప్రతాపాలలోను మీరు అగ్రగణ్యులు. ఇప్పటివరకు పితామహుని నాయకత్వంలో నడిచిన కురుసైన్యాలకు నేటి నుండి మీరు నాయత్వం చేసి నడిపించండి. మేమంతా మీ ఆజ్ఞానువర్తులమై ప్రవర్తిస్తాము. దేవ సేనను నడిపించిన కుమారస్వామి వలె మన సైనాలను మీరు నడిపించండి " అన్నాడు. ఆ మాటలకు సంతోషించిన ద్రోణుడు " సుయోధనా ! నేను బ్రాహ్మణుడను వేద వేదాంగములను అభ్యసించిన వాడిని. నాలో క్షత్రియోచిత లక్షణములైన ధైర్యము పరాక్రమము లేవు. అయినను నన్ను మీరందరూ ఇంతగా ఆదరిస్తున్నారు కనుక మీ కోరిక మన్నించి స్వర్వసైన్యాధిపత్యం వహిస్తాను. చెదిరి పోయిన మన సైన్యాలను సమీకరించి పాండవులతో పోరాడి మనకు విజయం చేకూర్చెదను " అన్నాడు. ద్రోణాచార్యుని మాటలకు సంతసించిన సుయోధనుడు వెంటనే సువర్ణ కలశంతో గంగాజలాలను తెప్పించి పుణ్యాహవాచన కార్యక్రమములు కావించి, పుణ్యాంగనల ఆశీర్వాదములతో వంధి మాగధుల స్తోత్రపాఠముల మధ్య ద్రోణునికి సైన్యాధ్యక్షునిగా అభిషేకం చేసాడు. కౌరవ ప్రముఖుల శంఖారావములు, భేరిమృదంగ నాదములు మిన్నంటగా ద్రోణుడు సైన్యాధ్యక్షుడుగా ముందు నిలువగా కౌరవ సేనలు యుద్ధ సన్నద్ధమై ముందుకు నడిచాయి. ద్రోణా చార్యుడు అయిదు రోజులు పాండవ సైన్యముతో హోరా హోరి పోరాడి ఒక అక్షౌహిని పాండవ సైన్యాలను సంహరించాడు. ఆ మహావీరుని ధాటికి ఎందరో వీరులు వీరస్వర్గం అధిరోహించారు. ఆ మహా యోధుడు అయిదు దినములు నిరంతర వీర విహారం చేసి వీర స్వర్గం అలంకరించాడు " అని సంజయుడు పలికాడు.

## ద్రోణుని మరణవార్త విని ధృతరాష్ట్రుడు దు:ఖించుట

ద్రోణుని మరణ వార్త విన్న ధృతరాష్ట్రుడు ఎంతో దు:ఖించాడు. " సంజయా ! అస్త్రశత్రవిధ్యా ప్రవీణ్యుడు, మహా పరాక్రమవంతుడు అయిన ద్రోణుడు పాండవుల చేతిలో ఎలా మరణించాడు ? పాంచాలురు అతని విల్లు విరిచారా, రధాశ్వములను చంపారా, రధము విరిచిచారా, సారధిని లేక ద్రోణుడు అలసి ఉన్న తరుణంలో ఆ పాపాత్ముడైన నీచ ధృష్టద్యుమ్నుడు అతి క్రూరంగా వధించాడా. అంతటి మహావీరుని మరణ వార్త నా గుండెను ముక్కలు చేయలేదేమి, నాది గుండె కాదు పాషాణము అని పరి పరి విధముల దు:ఖించి మూర్చిల్లాడు. మరలా తెలివి తెచ్చుకుని " సంజయా ! నరనారాయణులు రధికుడు సారధి అయినప్పుడు ఆ రధము ఎప్పుడూ సిద్ధ మనోరధము ఔతుంది కదా! అమిత ప్రాక్రమవంతులైన నకుల సహదేవులు, ఉత్తమౌజుడు, సాత్యకి, ధృష్టకేతువు, శిఖండి, రెండవ రుద్రుడైన అభిమన్యుడు, మానధనుడు చేకితానుడు, అజేయులైన ద్రౌపదీ సుతులు,బలాఢ్యులైన కేకయరాజులు, యుయుధాముడు, ద్రోణుని చంపడానికే జన్మించిన ధృష్టద్యుమ్నుడు, అత్యంత బలశాలి అయిన ఘటోత్కచుడు, అతి లోక వీరులు యాదవులు, జయింప శక్యముకాని భీముడు, దేవతలకు కూడా గెలువ శక్యము కాని సత్యానిత్యా గరిష్టుడు, ధర్మాత్ముడు ఉన్న పాండవ సైన్యం సాధించ లేని ఏమున్నది. సంజయా ! లోక రక్షణారధం యదుకులంలో జన్మించి, వ్రేపల్లెలో బాల్యక్రీడలను సాగిస్తూనే రాక్షస సంహారం చేసి కంసుని వధించి, పారిజాత వృక్షాన్ని దేవలోకం నుండి భూలోకం తీసుకు వచ్చి, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ

చేసిన మహానుభావుడు శ్రీకృష్ణుని ప్రాపు సంపాదించిన పాండవులను జయించ కలిగిన వారెవ్వరు. హరికి ఆత్మ అర్జునుడు అర్జునునికి ఆత్మ హరి శరీరాలు వేరైనా ఆత్మలు ఒక్కటైన వారిరువురిని రెండు కళ్ళుగా చేసుకున్న పుణ్యమూర్తి ధర్మరాజు యుద్ధముకు ఎందుకు భయపడతాడు. కౌరవులకు చేటుకాలం దాపురించింది కనుకనే సుయోధనుడు ఈ యుద్ధాన్ని కోరుకున్నాడు " అని పరి పరి విధముల దుఃఖించాడు. " సంజయా ! జరిగినది తలచి ప్రయోజన మేమి ద్రోణుడు యుద్ధం చేసిన విధము వినవలెనని నా మనసు కుతూహల పడుచున్నది " అన్నాడు.

## ద్రోణుని సుయోధనుని ఒక కోరిక కోరుకొమ్మని చెప్పట

ద్రోణుని పరాక్రమవంతమైన యుద్ధం గురించి సంజయుడు వివరించసాగాడు. " మహారాజా ! సర్వసన్యాధిపత్యం వహించిన ద్రోణుడు చాలా సంతోషించి అందరూ వింటూ ఉండగా సుయోధనా ! నన్ను ఇంతగా గౌరవించినందుకు ప్రతి ఫలంగా నీవు ఏదైనా ఒకటి కోరుకో నెరవేర్చెదను " అన్నాడు. సుయోధనుడు కర్ణ, దుశ్శాసనులతో " ఆచార్యా ! మీరు కోరుకోమన్నారు కనుక కోరుకుంటున్నాను . ధర్మరాజును ప్రాణముతో పట్టి నాకు తెచ్చివ్వండి " అని కోరాడు. ద్రోణుడు అందుకు విస్మయపడి " సుయోధనా ! అజాతశత్రువైన ధర్మరాజును చంపమని కోరక ప్రాణములతో పట్టి ఇవ్వమని కోరడంలో ఆంతర్యం ఏమిటి ? వారికి అర్ధరాజ్యం కట్టబెడతావా! ధర్మరాజును ప్రాణములతో పట్టి తెస్తే ఏమి చేస్తావు ? " అన్నాడు. అందుకు సుయోధనుడు " గురువర్యా ! ధర్మరాజును యుద్ధంలో చంపిన ఎన్నో అనర్ధములు జరుగుతాయి. అర్జునుడు తన గాడీవంతో సమస్త కురు సైన్యాలను వధించి తన పగ తీర్చుకుంటాడు. ఒక వేళ మేము పాండవులను అందరను చంపినా కృష్ణుడు సుదర్శన చక్రంతో కురు వంశాన్ని అంతమొందించి కుంతీదేవికైనా రాజ్యాన్ని కట్టబెడతాడు. అలా కాక మీరు ధర్మరాజును అప్పగించిన జ్యాద ప్రియుడైన ధర్మరాజును అతడిని అతని తమ్ములు, భార్యా, బిడ్డలతో జీవితాంతం అరణ్యములకు పంపి నేను సమస్త కురు సామ్రాజ్యాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలుకుంటాను " అన్నాడు. సుయోధనుని కుటిల బుద్ధికి మనసులోనే అసహ్యపడి ఆనాలోచితంగా తాను ఇచ్చిన వరముకు విఘాతం కలిగించ తలచి " సుయోధనా ! నీ కోరిక సమంజసమే ఇందులో చిన్న చిక్కు ఉన్నది ధర్మరాజు పక్కన అర్జునుడు ఉన్నంత కాలం దేవతలు సైతం అర్జునుని కన్నెత్తి చూడలేరు. ఇది జగమెరిగిన సత్యము కనుక అర్జునుని ఎలాగైనా ధర్మరాజుకు దూరముగా తీసుకు వెళితే నేను నీకు ధర్మరాజును ప్రాణములతో పట్టి ఇవ్వగలను " అన్నాడు ద్రోణుడు. ఆమాటలకు సుయోధనుడు పొంగి పోయాడు. అప్పడే ధర్మరాజును ప్రాణములతో పట్టి ఇచ్చినట్లు పొంగి పోయి ఈ విషయాన్ని కౌరవప్రముఖు లందరికి చెప్పాడు. కౌరవవీరులు ఆనందోత్సాహాలతో సింహనాదం చేసారు. భేరి మృదంగ నాదాలు మిన్నంటాయి.

## ధర్మరాజు ద్రోణుని నుండి తనను కాపాడమని అర్జునునికి చెప్పట

ఈ విషయాలు చారులద్వారా ధర్మరాజు తెలుసుకుని తమ్ములతో సమావాశమైయ్యాడు. ధర్మరాజు అర్జునుని చూసి అర్జునా " ద్రోణాచార్యుల ప్రతిజ్ఞ వింటివి కదా నన్ను ప్రాణములతో పట్టి సుయోధనునికి ఇస్తానని మాట ఇచ్చాడట. నీవు సదా నా ప్రక్కన ఉండి దానిని వమ్ము చేయవలెను " అన్నాడు. ఆ మాటలు విన్న అర్జునుడు ధర్మరాజుతో " అన్నయ్యా ! నేను యుద్ధరంగంలో నిన్ను ఒంటరిగా వదిలి నేను వేరే చోట యుద్ధం చేయుట అసంభవం. అది గురువును వధించినంత పాపం అంత పాపం నేను చెయ్యను. సదా నీ ప్రక్కన ఉండి నిన్ను రక్షిస్తూ ఉంటాను. అయినా కౌరవుల దురాశ కాని నేను నీ పక్కన ఉండగా ఆ ద్రోణుడే కాదు ముల్లోకాలు ఒక్కటైనా నిన్ను ఏమి చెయ్య లేరు " అని అన్నాడు. అర్జునుని మాటలకు ధర్మరాజు ఎంతో సంతోషించాడు. మంగళ వాధ్యాలు భేరి మృదంగాలు తూర్య నాదాలు మ్రోగుచుండగా పాండవులు యుద్ధరంగానికి బయలు దేరారు.

## యుద్ధారంభం

పాండవులు ఆ రోజు క్రౌంచ వ్యూహం పన్నారు. వ్యూహం ముందు భాగమున అర్జునుడు నిలబడ్డాడు. అర్జునుని ప్రక్కన ధృష్టద్యుమ్నుడు నిలిచాడు. భీముడు, నకులుడు, సహదేవుడు, ద్రౌపదీ సుతులు, అభిమన్యుడు వారి వారి స్థానములలో నిలబడ్డారు. యుధిష్టరుడు వ్యూహం మధ్యభాగంలో నిలబడ్డాడు. నీ కుమారులు అంధుకు ధీటుగా శకటవ్యూహం పన్నారు. సింధురాజు, కళింగభూపతి, వికర్ణుడు, దక్షిణ భాగమున నిలిచారు. వారి ప్రక్కన శకుని దక్షిణ భాగమున ససైన్యంగా నిలిచాడు . కృతవర్మ, విశంతి, చిత్రసేనుడు, దుశ్శాసనుడు ఉత్తర భాగంలో నిలిచారు. కాంభోజ, శక, యవన రాజులు తమ తమ స్థానాలలో నిలిచారు. త్రిగర్త, మద్ర, శూరసేన దేశాధీశులు తమ తమ సేనావాహినితో సుయోధనునికి రక్షగా నిలిచారు. వారి అందరికి ముందు అంగరాజు కర్ణుడు తన సేనలతో సుయోధనునికి అండగా నిలిచాడు. కురు సేనలకు తిలకంగా నిలిచిన కర్ణుని కౌరవ సేనలు సంతోషపడి " ఇన్ని రోజులు భీష్ముడు పక్షపాత బుద్ధితో పాండవులను ఉపేక్షించాడు. కర్ణుడు పాండవుల


సైన్యాధ్యక్షుడుగా ద్రోణుడు

ఉధృతికి అడ్డుకట్ట వేస్తాడు. కర్ణుడు అర్జునునికి సరి జోడు " అని తమలో తాము అనుకున్నారు. ద్రోణుని నాయకత్వంలో యుద్ధముకు బయలు దేరిన మనసేనలకు అనేక దుశ్శకునములు గోచరించాయి. సుయోధనుడు వాటిని లక్ష్యపెట్ట లేదు. అర్జునుడు కర్ణుడు యుద్ధం చేస్తుంటే చూడాలన్న కోరికతో ఇరు పక్షములు ఎంతో ఆత్రంగా ఎదురు చూస్తున్నాయి.

## యుద్ధారంభం

యుద్ధం ఆరంభం అయింది రధములు, ఏనుగులు, గుర్రముల పదఘట్టనలతో రేగిన ధూళి ఆకాశం అంతా దట్టంగా కమ్మింది. శరములతో శరములు ఖడ్గములతో ఖడ్గములు అస్త్రములతో అస్త్రములు ఢీకొని వాటి నుండి చెలరేగిన మంటలు సూర్యకాంతిని తలపింప చేస్తున్నాయి. పగిలిన ఏనుగుల కుంభస్థలములు, తెగిపడిన హయముల అవయవములు, విరిగిన రధములు వివిధ కాల్బలముల కళేబరములు, ఏరులై పారుతున్న రక్తముతో రణరంగం భీభత్సంగా తయారైంది. ద్రోణా చార్యుడు తన రధమును చిత్రవిచిత్ర రీతుల నడిపిస్తూ ఎక్కడ చూసినా తానే అయి పాండవ సేనలపై శరవర్షం కురిపిస్తున్నాడు. గజములను చంపుతున్నాడు, గుర్రముల కళేబరములు తేలు తున్నాయి, రధములు విరుగుతున్నాయి. ద్రోణుని ధాటికి తాళలేని పాండవసేనలు పారిపోసాగాయి. అది చూసిన ధర్మరాజు కలవర పడి అర్జునుడిని, ధృష్టద్యుమ్నుడిని పిలిచి ద్రోణాచార్యుని ఉధృతి ఆపమని ఆదేశించాడు. ధృష్టద్యుమ్నుడు తమ సేనలతో ద్రోణుని ఎదుర్కొన్నాడు. అర్జునుడు పారి పోతున్న పాండవ సేనకు ధైర్యవచనములు చెప్పి యుద్ధోన్ముఖులను చేసాడు. అందరూ ద్రోణుని నలువైపులా ఎదుర్కొన్నారు. ద్రోణుడు వృద్ధుడైనా అవక్ర పరాక్రమంతో ఎదుర్కొని పాండవ సేనపై విజృంభించాడు. అయినా పాండవ సైన్యాలు ద్రోణుని ధైర్యంగా ఎదుర్కొన్నాయి. ద్రోణునిని కొట్టి , హయములను గాయపరిచాయి, ద్రోణుని శరములను మధ్యలోనే త్రుంచి ద్రోణుని సేనలపై అనేక అస్త్రసస్త్రములు ప్రయోగించాయి. ద్రోణ ధృష్టద్యుమ్నుల మధ్య పోరు వృధృతంగా సాగింది. వారిరువురు ఒకరిపై ఒకరు వేసుకున్న బాణములతో గగనతలము నిండి పోయింది. ఇది చూసిన ధర్మరాజు తన సైన్యంతో ద్రోణునిపై శరవర్షం కురిపించాడు. శకుని సహదేవునితో యుద్ధం సాగిస్తున్నాడు. శకుని సహదేవుని కేతనము కొట్టి, గుర్రములను చంపాడు సహదేవుడు కోపించి శకుని కేతనం విరుగకొట్టాడు. శకుని తన గధ తీసుకుని క్రిందికి దిగి సహదేవుని రధమును విరుగ కొట్టాడు. సహదేవుడు కూడా క్రిందికి దిగి గధతో శకునితో తలపడ్డాడు. భీమసేనుడు వివిశంతి మీద శరవర్షం కురిపించాడు. వివిశంతి బెదరక భీమసేనుని విల్లు రెండు ముక్కలు చేసాడు. భీమసేనుడు క్రిందకు దిగి వివిశంతి రధాశ్వములను చంపాడు. భూరిశ్రవసుడు అన్నాడు " ధృష్టద్యుమ్నుని ఎదుర్కొని అతడి శరీరం అంతా శరములు నాటాడు. అన్నయ్య పరిస్థితి చూసిన శిఖండి అతడిని ఎదుర్కొని భూరిశ్రవసుని తరమి తరిమి కొట్టాడు. ఘటోత్కచుడు అలంబసుడు మాయా యుద్ధం చేతున్నారు. క్షత్రదేవుడు లక్ష్మణునితో యుద్ధం చేస్తున్నాడు. చేకితానుడు అనువిందునితో యుద్ధం చేస్తున్నాడు. శల్యుడు నకులునితో యుద్ధం చేస్తున్నాడు. నకులుడు శల్యుని కేతనమును విరిచి, రధమును విరుగకొట్టాడు. ద్రుపదుడు త్రిగర్తాధిపతి ఒకరి బలాబలములు ఒకరు పరిక్షిస్తున్నారు. పౌరవరాజు అభిమన్యునితో తలపడ్డాడు.

## అభిమన్య ప్రతాపం

అభిమన్యుడు పౌరవరాజు కేతనమును ధనస్సును విరిచి అయిదు బాణములతో రధాశ్వములను చంపి మరొక బాణంతో శిరస్సు ఖండించబోగా కృతవర్మ అడ్డుపడి రెండు బాణములతో అభిమన్యుని విల్లు ఖండించాడు. అభిమన్యుడు కత్తి, డాలు తీసుకుని పౌరవరాజు రధము విరిచి సారధిని క్రిందికి లాగాడు. పౌరవ రాజును చంపడానికి అతడి మెడ పట్టుకున్నాడు. అంతలో సైంధవుడు అభిమన్యుని కత్తితో ఎదుర్కొన్నాడు. అభిమన్యుడు పౌరుని వదిలి సైంధవుని ఎదుర్కొని అతడి డాలు కత్తి విరుగకొట్టాడు. అభిమన్యుని ధాటికి తట్టుకోలేక సైంధవుడు పారిపోయాడు. అభిమన్యుడు సైంధవుని సేనలపై పడి వారిని నరుకుతున్నాడు. పారి పోతున్న సైధవుని చూసి రాజులు ఒక్కుమ్మడిగా అభిమన్యుని మీద పడ్డారు. శల్యుడు అభిమన్యునిపై భీకర శక్తిఆయుధం ప్రయోగించాడు. అభిమన్యుడు దానిని పట్టుకుని తిరిగి శల్యునిపై విసిరాడు. అది శల్యుని రధ సారధి శిరస్సును ఖండించింది. అప్పడు విరాటుడు, ద్రుపదుడు, ధృష్టకేతు, యుధిష్టరుడు, సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, కేకయరాజులు, భీమసేనుడు, నకులసహదేవులు, ద్రౌపదీ సుతులు, శిఖండి అభిమన్యునికి సాయం వచ్చి రక్షణగా నిలబడి శత్రుసేనలను తనుమాడసాగారు. ఇది చూసిన నీ కుమారులు అభిమన్యునిపై శరములు, భల్లబాణములు కురిపించారు. తన సారధి చనిపోవడంతో శల్యుడు రధం దిగి గధతో అభిమన్యుని ఎదుర్కొన్నాడు. అభిమన్యుడు కూడా రధం దిగి శల్యుని

ఎదుర్కొన్నాడు. అది చూసిన భీమసేనుడు శల్యుని చేయి పట్టి లాగి తనతో గధాయుద్ధం చేయమని ఘర్జించాడు. శల్యుడు అభిమన్యుని వదిలి భీమసేనునితో గధాయుద్ధం చేస్తున్నాడు. ఒకరి చుట్టు ఒకరు తిరుగుతూ చిత్రవిచిత్ర గతులతో యుద్ధం చేస్తున్నాడు. సమాన బలాఢ్యులైన వారిద్దరూ ఒకరి గదాఘాతాలకు ఒకరు తట్టుకోలేక ఇద్దరూ మూర్చ పోయారు. ఇది చూసిన కృతవర్మ శల్యుని రథంపై ఎక్కించుకుని దూరంగా తీసుకు వెళ్ళాడు. అంతలో మూర్చ నుండి తేరుకున్న భీమసేనుడు శల్యుడు కనపడక కౌరవ సేనపై పడి నిర్మూలించసాగాడు. అది చూసిన నీ కుమారులు భీముని చుట్టుముట్టి అతడిపై అనేక అస్త్రశస్త్రములు ప్రయోగించారు. అంతలో నకుల సహదేవులు భీమునకు సాయం వచ్చారు. ఆ ముగ్గురూ నీకుమారులను సమర్ధవంతంగా ఎదుర్కొన్నారు.

## అపహార్ణము తరువాత యుద్ధము

అపహార్ణం అయ్యే సమయానికి ఆ రోజు యుద్ధం లో పాండవులదే పై చేయి అయింది. పాండవ సేనలో జయజయధ్వానాలు మిన్నంటాయి. కర్ణుని కుమారుడు వృషసేనుడు సింహనాదం చేస్తూ పాండవ సేనలో జొరబడి ఊచకోతకోయసాగాడు. అతడి పరాక్రమానికి పాండవ సేనలు తట్టుకోలేక పోయాయి. హయములు, ఏనుగులు తెగిపడుతున్నాయి. సారధులు చనిపోతున్నారు, రధములు విరుగుతున్నాయి, కాల్బలము నశించి పోతుంది, రక్తం ఏరులై ప్రవహిస్తుంది. వృషసేనుని పరాక్రమానికి పాండవ సేన తట్టుకోలేక పోతుంది. ఇది చూసిన నకులుని కుమారుడు శతానీకుడు వృషసేనునిపై లంఘించి అతడి పైన పది బాణాలు గుప్పించాడు. వృషసేనుడు శతానీకుని కేతనం విరిచి, విల్లు త్రుంచాడు. ఇది చూసిన మిగిలిన ద్రౌపదీ పుత్రులు శతానీకునకు సాయంగా నిలిచి అనేక అస్త్రశస్త్రాలను అతడి మీద ప్రయోగించారు. అశ్వత్థామ తన సైన్యాలతో పాండవసేనను ఎదుర్కొన్నాడు. ద్రుపదుడు, ధర్మరాజు, కేకయరాజులు, విరాటుడు వారి వారి సేనలతో అశ్వత్థామను, వృషశేనుని ఎదుర్కొన్నారు. ఉభయ పక్షాల మధ్య పోరు ఘోరమైంది. భీముడు కర్ణుని, కృపాచార్య, ద్రోణ అశ్వత్థామలను ధృష్టద్యుమ్నుడు, విరాటుడు ఎదుర్కొన్నారు. కొంతసేపటికి పాండవ సేనల ఉధృతికి తాళ లేక మన సైన్యాలు పారిపోసాగాయి. ఇది చూసిన ద్రోణుడు నిలువమని ఎంత చెప్పినా నిలువక కౌరవ పారిపోసాగాయి.

## ద్రోణుడి విజృంభణ

అది చూసి ద్రోణుడు " సారధీ ! చూసావా ! మనసేనలన్నీ పారిపోతున్నాయి. ధర్మజుని ముఖం గర్వంతో వెలిగి పోతుంది. నేను పాండవుల మీద విజృంభించకపోతే సేనలను ఆపలేము. ధర్మజుడు, భీముడు, ద్రుపదుడు, విరాటుడు వారి కుమారులు, నా ముందు నిలువలేరు అర్జునునికి విధ్య నేర్పింది నేనే నీ చాతుర్యము చూపించి రధము నడుపుము నా చేతుల దురద తీరేవరకు ఒళ్ళు దాచుకొనక యుద్ధం చేస్తాను " అన్నాడు. ఆ మాటలకు పొంగిపోయిన ద్రోణుని సారధి చిత్రవిచిత్ర రీతుల రధం నడుపుతుండగా ద్రోణుడు పాండవసేనలో ప్రవేశించి చీల్చి చెండాడసాగాడు. పొంగుతున్న సముద్రంలా విజృంభించిన ద్రోణుని ధర్మనందనుని చక్రరక్షకుడు సుకుమారుడు చెలియలి కట్టలా అడ్డుకున్నారు. ద్రోణుడు ఒకే బాణంతో సుకుమారుని తల తెగనరికాడు. అది చూసిన పాండవ యోధులంతా ద్రోణుని చుట్టుముట్టారు. ద్రోణుడు అయిదు బాణములతో నకులుని, అయిదు బాణములతో సహదేవుని తిమ్మిది బాణములతో విరాటుని, ఏడు బాణములతో సాత్యకిని, మూడేసి బాణములతో ద్రౌపదీ సుతులను ఇరపై బాణములతో విశంతిని, పన్నెండు బాణాలతో ధర్మజును శిఖండిని కట్టడి చేసాడు. ఎదురు వచ్చిన రధికులు ఎవ్వరూ ప్రాణాలతో పోలేదు. యుగంధరుడు ధర్మరాజు ద్రోణులకు మధ్యకు వచ్చి ద్రోణుని ఎదుర్కొన్నాడు. ద్రోణుడు కోపించి ఒకే బాణంతో యుగంధరుని చంపాడు. అది చూసి కేకయరాజులు, ద్రుపదుడు, సింహసేనుడు, వ్యాఘ్రదత్తుడు, మొదలైన యోధులు ద్రోణునిపై తలపడ్డారు. సింహసేనుడు, వ్యాఘ్రదత్తుడు ద్రోణునిపై అస్త్రశస్త్రములు ప్రయోగించాడు. వారిపై కన్నెర్ర చేసిన ద్రోణుడు వారిపై రెండు వాడి అయిన అమ్ములు వేసి వారి శిరస్సులు ఖండించాడు. ఇది చూసిన మిగిలిన రధికులు పక్కకు తొలిగారు. ద్రోణుడు సింహనాదం చేసాడు. ఈ అలజడి చూసిన పాండవ సేనలో కలకలం రేగింది వారు " ద్రోణుడు ధర్మరాజును పట్టుకుని సుయోధనుని సముఖముకు తీసుకు వెళుతున్నాడు " అని ఆక్రోశించారు. అది కార్చిచ్చులా వ్యాపించి పాండవసేనలు కంపించాయి. ఇది విని అర్జునుడు ద్రోణునుని ముందుకు రధం పోనిచ్చాడు. అది చూసిన కౌరవ సేనలు ద్రోణునికి అండగా నిలిచాయి. అర్జునుడు తన గాండీవం సంధించి కౌరవ సేనలపై శరవర్షం కురిపించాడు. కౌరవ సేనలు తలలు తెగిపడుతున్నాయి రక్తం ఏరులై ప్రవహిస్తుంది. మొండెములు నేలకూలుతున్నాయి. అర్జునిని ధాటికి కౌరవ సేనలు తట్టుకోలేక పారిపోసాగాయి. ఇంతలో సూర్యుడు అస్తమించగానే ఆ రోజు యుద్ధం ముగించారు.

## ద్రోణుని సారధ్యంలో రెండవ రోజు యుద్ధం

ద్రోణ సారధ్యంలో రెండవ రోజు యుద్ధానికి కౌరవ సైన్యం సిద్ధం అయింది. ద్రోణుడు సుయోధనునితో " సుయోధనా ! నిన్నటి రోజు నేను నా ప్రతిజ్ఞ నెరవేర్చుకోనలేక పోయాను. అర్జునుడు ధర్మజుని ఒక్కక్షణం కూడా విడువ లేదు. ఆఖరిక్షణంలో కూడా మన సేనలను తనుమాడాడు. అర్జునుడిని దూరంగా తీసుకు వెళ్ళకుండా ధర్మజుని పట్టుట సాధ్యం కాదు. అర్జునుడు లేకున్న ధర్మజుడు నన్ను చూసి పారిపోతాడు. అప్పుడు నేను వెన్నంటి ధర్మజుని పట్టగలను " అన్నాడు. ఆ మాటలు విన్న సుశర్మ " ఆ మాటలువిన్న సుశర్మ " సుయోధనా ! అర్జునుడు ఎప్పుడూ మమ్ము అవమానిస్తుంటాడు. మాకు అతడి మీద కోపంగా ఉంది. ఈ రోజు అర్జునుడైనా ఉండాలి లేక సుశర్మ అయినా ఉండాలి. అర్జునుడికి మేము ఏవిధంగా తీసిపోము " అని ప్రగల్భములు పలికి సుశర్మ తన తమ్ములను తీసుకుని అర్జునుడితో యుద్ధానికి సన్నద్ధమయ్యారు. సుశుశర్మతో అతడి తమ్ముల సత్యవర్ముడు, సత్యవ్రతుడు, సత్యకర్ముడు చేరగా కేరళ, మాళవ, శిలీంధ్ర, మగధాధీసులు చేరగా పదిహేను మంది యోధులను తీసుకుని జయజయ ధ్వానములు చేస్తూ యుద్ధానికి సిద్ధం అయ్యారు. అది చూసి సుయోధనుడు ఆనందభరితుడయ్యాడు. వారు స్నానాధికములు చేసి అగ్ని రగిల్చి అగ్ని సాక్షిగా " మేమంతా ఈ రోజు రణరంగమున అర్జునుడిని చంపుతాము. లేని ఎడల మేము గోవధ, స్త్రీ వధ, బ్రాహ్మణవధ, బ్రాహ్మణ ధనం దోచుకొనుట, ఇతరుల ధనం అపహరించుట, గురువుకు అపకారం చేయుట, శరణు వేడిన వారిని రక్షించక పోవడం, అబద్ధం పలుకుట, మద్యపానం చేయుట, దేహీ అన్నవారికి లేదనుట, గృహదహనం చేయుట, ఇతరుల భార్యలతో వ్యభిచరించుట మొదలైన పాపములు చేసిన వారు ఏలోకాలకు వెళతారో ఆ లోకాలు మాకు సంప్రాప్తిస్తాయి మేము అర్జునుడి చేతిలో మరణించిన మాకు మాకు వీరస్వర్గం లభించగలదు " అని ప్రమాణాలు చేసి రణరంగ ప్రవాశం చేసారు.

## యుద్ధారంభం

రెండవ రోజుయుద్ధానికి ద్రోణుడు కౌరవ సైన్యాలను గరుడవ్యూహంలో నిలిపాడు. గరుడపక్షి ముక్కు స్థానమున ద్రోణుడు ముక్కు స్థానమున నిలిచాడు. సుయోధనుడు అతడి తమ్ములు తలవపు నిలిచారు. కృపాచార్యుడు కృతవర్మ నేత్రస్థానాలలో నిలిచారు. సింహళ అభీర, శూరసేన రాజులు మెడ భాగమున నిలిచారు, బాహ్లిక, భూరిశ్రవస, సోమదత్త, శలుడు, శల్యుడు కుడి రెక్క వైపున, అశ్వత్థామ, సుదక్షిణుడు, విందుడు, అనువిందుడు ఎడమ రెక్క వైపున నిలిచారు. శకుని, పౌండక, అంబష్ట , శకుని, కళింగుడు, మగధరాజు వెన్ను భాగమున నిలిచారు. కర్ణుడు తన సైన్యముతో తోకభాగమున నిలిచాడు. సైంధవుడు మొదలైన రాజులు అక్కడక్కడా తమ సైన్యాలతో నిలచారు. భగదత్తుడు తన గజము మీద ఎక్కి మధ్యభాగమున నిలిచాడు.

### త్రిగర్తదేశాధీశులు అర్జునుడిని యుద్ధముకు పిలుచుట

త్రిగర్త దేశాధీసులు వ్యూహముతో కలవక విడిగా దక్షిణమున నిలిచారు. వారు అర్జునిని పిలిచి యుద్ధముకు రా అని కవ్వించారు. అర్జునుడు అది చూసి " త్రిగర్తాధీశుడు అతడి తమ్ములతో నన్ను యుద్ధముకు రమ్మని పిలుస్తున్నాడు. యుద్ధానికి పిలిచినపుడు పోవడం ధర్మం . నేను పోయి వారిని ఓడించి విజయుడినై తిరిగి వస్తాను అనుజ్ఞ ఇవ్వండి. ఈ కొంచం సేపట్లో నీకు ఏమీ కాదు అన్నాడు " అని నమస్కరించి అనుమతి కోరాడు. ఆ మాటలు విన్న ధర్మరాజు అర్జునుడితో " అర్జునా ! ద్రోణుని శౌర్యప్రతాపములు నీకు తెలియనివి కాదు. నన్ను పట్టి సుయోధనునికి ఇస్తానని ద్రోణుడు ప్రతిజ్ఞ చేసాడు. మనమా ప్రతిజ్ఞ భంగపరచ వలెను. నీకు ఏది మంచిది అనిపించిన అది చేయి " అన్నాడు. ఆ మాటలకు అర్జునుడు " అన్నయ్యా ! యుద్ధానికి పిలిచినపుడు పోకున్న లోకం నన్ను పిరికి వాడు అని గేలిచేస్తుంది. కనుక నేను త్రిగర్తలతో యుద్ధానికి పోక తప్పదు. ఇతడి పేరు సత్యజిత్తు. ఇతడు నీ పక్కన ఉండగా ఏమీ భయపడవలసిన పని లేదు. ఒకవేళ ఇతడు మరణిస్తే యుద్ధము నుండి తొలగి పోవడం మంచిది. అంతకంటే వేరు మార్గం లేదు " అన్నాడు. ధర్మరాజు చేసేది లేక అర్జునుడు సంశక్తులతో యుద్ధానికి వెళ్ళడానికి అనుమతించాడు. అర్జునుడు సంశక్తులతో యుద్ధానికి వెళ్ళడం చూసిన కౌరవ సైన్యంలో ఆనందోత్సాహాలు వెల్లి విరిసాయి. జయ జయ ధ్వానాలు చేసారు.



అర్జునునిపై సుపర్ణాయుధమును

### ద్రోణ సారధ్యంలో రెండవ రోజు సమరం

ప్రయోగించిన సుశర్మ - రాజ్మానా నుండి ఒక దృశ్యం

ధర్మరాజు ధృష్టద్యుమ్నుని చూసి " ద్రోణుడు గరుడ వ్యూహము పన్నాడు అందుకు ప్రతిగా మన సేనలను నీవు మండలార్ధ వ్యూహమున నిలుపు " అన్నాడు. ధృష్టద్యుమ్నుడు సేనలను మండలార్ధ వ్యూహమున నిలిపాడు. ఉభయ సైన్యములలో భేరి, మృదంగ నాదాలు మిన్నంటాయి. ధర్మరాజు ధృష్టద్యుమ్నుని చూసి " నేను ద్రోణునికి చిక్కకుండా ఉండాలంటే " నేను ద్రోణుని చేతికి చిక్కకుండా ఉండాలంటే మీరంతా నన్ను అతి జాగరూకతతో వెన్నంటి ఉండాలి మీ శౌర్య ప్రతాపములు చూపి కౌరవ సేనలను ఒక్క అడుగు ముందుకు రానీయక చూడవలసిన భాధ్యత మీదే " అన్నాడు. ధృష్టద్యుమ్నుడు ధర్మనందనా నేను ఉండగా ద్రోణుడు నీ దరిదాపులకు కూడా రాలేడు. ద్రోణుడు ఎన్నటికీ నన్ను గెలువ లేడు " అన్నాడు. యుద్ధం ప్రారంభం అయింది ధృష్టద్యుమ్నుడు పాండవ సేనకు ముందు నిలిచి తన రధమును ద్రోణుని ముందు నిలిపాడు. యుద్ధ ప్రారంభంలో ధృష్టద్యుమ్నుని చూడటం అరిష్టమని తలచిన ద్రోణుడు పక్కకు తిరిగి పాంచాలసేనతో యుద్ధం చేయసాగాడు.

## సంశక్తులతో అర్జునుడి యుద్ధం



సుధన్వుని మరణం - రాజ్మానామా నుండి ఒక దృశ్యం

అర్జునుడు ఆకలిగొన్న సింహమువలె సంశక్తులను ఎదుర్కొన్నాడు. వారు అర్ధచంద్రాకారంలో మొహరించి అర్జునుడిని ఎదుర్కొన్నారు. అర్జునుడు దేవదత్తఘోష విన్న సంశక్తుల హృదయాలు దద్దరిల్లాయి అంతలోనే తేరుకుని ఒకరిని ఒకరు ప్రోత్సహించుకుంటూ అర్జునుడిని ఎదుర్కొన్నారు. అర్జునుడిని చుట్టిముట్టి వాడి అయిన శరములు అర్జునిపై ప్రయోగించారు. అర్జునుడు వాటిని మధ్యలో త్రుంచి తన వాడి అయిన బాణములతో పది వేలమంది రధికులను చంపాడు. తన మీద పది శరములను ప్రయోగించిన వారిని కేవలం అయిదుబాణాలతో యమసదనానికి పంపాడు. సుశర్మ, సుభాహుడు, సుధన్వుడు, సురధుడు అర్జునితో పోరాడుతున్నారు. అర్జునుడు వారి కేతనములు విరుగకొట్టాడు. సుధన్వుని హయములను చంపి , విల్లువిరిచి, ఒకేఒక బాణంతో అతడి తల నరికి విజయ సూచకంగా శంఖారావం చేసాడు. అర్జునుడు సంశక్తుల సైన్యంపై పడి వారి రధములను విరుగకొట్టాడు. అర్జునిని ధాటికి సంశక్తుల సేన చెల్లాచెదురు అయ్యాయి. అది చూసి సుశర్మ కలవర పడి " భయపడకండి వెనక్కు రండి అర్జునిని పరాక్రమం మనకు తెలియనిదా ! చేసిన ప్రతిజ్ఞ మరిచారా ! సుయోధనుని ముందు తల ఎత్తుకుని ఎలా తిరుగగలము " అని బిగ్గరగా అరిచాడు. అతడి మాటాలకు సైన్యం వెనుతిరిగి వచ్చి అర్జునుడితో తలపడింది. అర్జునుడు " కృష్ణా ! త్రిగర్తులు ప్రాణం ఉన్నంత వరకు పోరాడుతుంటారు. రధమును వెనుకకు మరల్చి వీరిని యమసదనముకు పంపినగాని మన పని పూర్తి కాదు " అన్నాడు.

### నారాయణాభిదాసుల సమరం

కృష్ణుడు రధమును వెనుకకు మరల్చాడు ఆ సమయంలో నారాయణాభిదాసులు పదివేల మంది వారిని ఎదుర్కొన్నారు. వారందరికి కృష్ణార్జునుల మీద కోపంగా ఉంది. యుద్ధానికి ముందు ద్వారకకు వచ్చి అర్జునుడు, సుయోధనుడు సహాయం కోరిన సమయంలో అర్జునుడు తమను కృష్ణుని నుండి వేరు చేసి సుయోధనుడి పరం చేసినందుకు వారికి కృషార్జునుల ఇరువురి పైన కసిగాను కోపంగాను ఉంది. వారు కృష్ణార్జునులపై శరవర్షం కురిపించాడు. వారిని చంపనిచ్ఛగించని అర్జునుడు తనకు త్వష్ట ప్రజాపతి ప్రసాదించిన దివ్యాస్త్రమును వారిపై ప్రయోగించాడు. ఆ అస్త్ర ప్రభావంతో నారాయణాభిదాసులలో ప్రతి వారికి తన ఎదుటి వాడు అర్జుడిలా కనిపించసాగాడు. ఆ అస్త్ర ప్రభావంతో ఒకరిని ఒకరు నరుక్కుని అనేక మంది చని పోయారు. ఇంతలో అస్త్ర ప్రభావం తగ్గి పోయింది. మిగిలిన నారాయణాభిదాసులు మగధ, కేరళ మొదలగు రాజులతో కలిసి మహోగ్రంగా కృష్ణాంజులను చుట్టుముట్టి అర్జునుడిపై శక్తి వంతములైన అస్త్రశస్త్రములు వేసారు. అర్జునుడు వారి అస్త్రములను త్రుంచి వారి శిరములను తన వాడి బాణములతో ఖండించాడు. వారి సైన్యములోని హయములు, ఏనుగులు, కాల్బలము అర్జునుడి బాణములకు ఆహుతి అయ్యాయి.

### అర్జునుని సంశక్తులు తిరుగి ఎదుర్కొనుట

ఇంతలో సంశక్తులు తమ సైన్యాలను సమీకరించి అర్జునుడిని ఎదుర్కొని అర్జునుడి మీద శరవృష్టి కురిపించారు. వారిలో కొంత మంది రథములు దిగి అర్జునుడి రథము మీద హయముల మీద దాడి చేసారు. అన్ని దిక్కుల నుండి శరప్రయోగం చేయడంతో పాండవ సేనకు అర్జునుడి రథం కనిపించ లేదు. కృష్ణార్జునులు సంశక్తుల చేతిలో మరణించారు అనుకుని ఆందోళన పడ్డారు. వారి ఆందోళన గమనించి సంశక్తులు సింహనాదాలు చేసి శంఖారావములు చేసారు. నొగల మీద కూర్చున్న కృష్ణునికి అర్జునుడు కనిపించక కలవర పడి " అర్జునా! అర్జునా ! " అని ఎలుగెత్తి అరిచాడు. పరిస్థితి అర్ధం చేసుకున్న అర్జునుడు వాయవ్యాస్త్రం ప్రయోగించి సంశక్తుల సైన్యాలను చెదుమదురు చేసాడు. కృష్ణార్జునులు కనిపించగానే పాండవ సైన్యం ఊపిరి తీసుకుని హర్షధ్వానాలు చేసారు. సంశక్తులు తిరిగి సైన్యములను కూడగట్టుకుని ఒక్కుమ్మడుగా అర్జుడి మీద దాడి చేసారు. అర్జునుడు వారు వేసిన శరములు మధ్యలో త్రుంచి వారిపై అతి క్రూర నారాచములు వేసి వారి సైనికుల శిరస్సులను త్రెంచాడు. ఏనుగులు, హయములు , రథములు తునాతునకలు ఔతున్నాయి. మొండెములు ఇతర అవయవములు ఎగిసి పడుతున్నాయి. అయినా బెదరక సంశక్తులు అర్జునుడిపై శరపరంప కురిపించారు. తీవ్రంగా పోరు సాగుతుంది.

## ద్రోణుడు పాండవసైన్యమును ఎదుర్కొనుట

ద్రోణుడు ఎలాగైనా ధర్మరాజును పట్టుకోవాలని ప్రయత్నంతో పాండవ సైన్యాలను తరిమి తరిమి కొట్టి ధర్మజుని సమీపించాలను చూస్తున్నాడు. దుర్ముఖుడు ధృష్టద్యుమ్నుని ఎదుర్కొన్నాడు. ద్రోణుని ధాటికి పాండవ సన్యాలు వెనక్కు తగ్గాయి. ధర్మరాజు తనసేనను ప్రోత్సహిస్తూ యుద్ధోన్ముఖులను చేస్తున్నాడు. ద్రోణుని చేతిలో వేలకు వేలు సైనికులు వీరస్వర్గం చేరుకున్నారు. రక్తం ఏరులై ప్రవహిస్తుంది. రథముల క్రింద కొందరు, ఏనుగుల పాదముల క్రింద కొందరు మరణిస్తున్నారు. మదపుటేనుగులు తమ తొండముతో సైనికులను పైకెత్తి నేలకేసి కొడుతున్నాయి. యుద్ధభూమి భయానకంగా ఉంది. ద్రోణుడు తన సైన్యంతో ధర్మరాజు మీదకు వెళ్ళాడు. అతడిని ధర్మరాజు ఎదుర్కొన్నాడు. ద్రోణుడు సత్యజిత్తు విల్లు విరిచాడు. సత్యజిత్తు వేరు విల్లు తీసుకుని క్రూర భల్ల బాణాలు ముప్పది ద్రోణుని మీద వేసాడు. పాంచాల రాకుమారుడు వృకుడు సత్యజిత్తుతో కలిసి అరవై బాణములు ద్రోణునిపై ప్రయోగించాడు. అది చూసి పాండవసేన హర్షధ్వానాలు చేసాడు. ద్రోణుడు కోపించి సత్యజిత్తుని, వృకుని తన బాణపరంపరతో ముంచెత్తాడు. వారిరువురు వెరువక ద్రోణుని సారధిని, హయములను, కేతనములను కొట్టారు. ద్రోణుడు సత్యజిత్తు శరీరంపై పది నారాచములు వేసాడు. సత్యజిత్తు మరొక విల్లు తీసుకుని ద్రోణునిపై శిలీఖములు వేసాడు. ద్రోణుడు సత్యజిత్తు విల్లు విరిచి వృకుని తల నరికి సత్యజిత్తు రథమును విరిచి , హయమును, సారధిని చంపాడు. సత్యజిత్తు వేరొక విల్లు తీసుకుని ద్రోణునిపై శరవర్షం కురిపించాడు. ద్రోణుడు సత్యజిత్తు విల్లు విరిచాడు సత్యజిత్తు తీసుకుంటున్న ప్రతి విల్లు విరుస్తూ అతడి శిరస్సుని ఒక అర్ధ చంద్ర బాణంతో ఖండించాడు. సత్యజిత్తు మరణం చూసిన ధర్మరాజు అర్జునుడి మాటలు గుర్తుకు వచ్చి కలవరపడి ద్రోణునికి పట్టుబడక అక్కడి మెల్లగా నుండి తప్పుకున్నాడు. తనకు ఎదురు వచ్చిన వారినందరిని చంపుతూ ధర్మజుని కొరకు వెతుకుతున్నాడు. అంతలో విరాటుని తమ్ముడు సూర్యదత్తు ద్రోణుని ఎదుర్కొని అతడిపై కరకుటమ్ములు ప్రయోగించాడు. చిరాకు పడ్డ ద్రోణుడు ఒకే బాణంతో అతడి శిరస్సు ఖండించాడు. అది చూసి విరాటుని సేనలు పారిపోయాయి. ద్రోణునికి ఎదురు నిలిచేవారు లేక పోయారు. ఆ రోజు అలాగైనా ధర్మజును పట్టుకోవాలన్న ధృఢ సంకల్పంతో ఉన్నాడు. అప్పుడు యుధామన్యుడు, ఉత్తమౌజుడు, వసుదాసుడు, శిఖండి ఒక్కుమ్మడిగా ద్రోణుడిని ఎదుర్కొని ఒక్కొక్కరు అయిదేసి బాణములు ద్రోణునిపై ప్రయోగించారు. సాత్యకి పన్నెండు బాణములు, క్షాత్రధర్ముడు పది బాణములు ద్రోణునిపై ప్రయోగించారు. యుధిష్టరుని కాపాడుతూ ధృష్టద్యుమ్నుడు, చేకితానుడు ద్రోణుని ఎదుర్కొని ద్రోణుని మీద ఒక్క సారిగా మూడు వందల బాణములు వేసారు. వారి అండతో ధైర్యం తెచ్చుకుని ధర్మరాజు ద్రోణునికి ఎదురుగా వచ్చి ద్రోణునిపై పన్నెండు బాణములు ప్రయోగించాడు. ధర్మజుని చూసి రెచ్చి పోయిన ద్రోణుడు ఒకే శరముతో వసుదాసుని శిరస్సు ఖండించాడు. ఉత్తమౌజుడు, సాత్యకి, శిఖండి మీద కరకుటమ్ములు వేసాడు. ధర్మరాజు వైపు ద్రోణుడు రావడం గ్రహించి ధర్మరాజు అక్కడి నుండి నిష్క్రమించాడు. చేతికి చిక్కిన ధర్మజుడు కనపడక ద్రోణుడు చిరాకు పడ్డాడి పాండవ సేనను చెండాడ సాగాడు. రథములు, కేతనములు విరిగి పడుతున్నాయి, హయములు, గజములు నేల పడుతున్నాయి. కౌరవ సేనలు ఉత్సాహంగా పాండవ సేనలను తరుముతున్నాయి. ఇంతలో వార్ధక్షేమి, చిత్రసేనుడు, సేనాబిందుడు, సువర్చనుడు, ధృష్టద్యుమ్నుడు, చేకితానుడు, సుమిత్రుడు, సాత్యకి, శిఖండి తమ సేనలతో ఒక్కుమ్మడిగా ద్రోణుని ఎదుర్కొన్నారు. ద్రోణుడు రథమును వేగంగా త్రిప్పితూ అనేక రూపములు ధరించాడా అన్నట్లు శరవర్షం కురిపిస్తూ సుమిత్రుని చంపాడు. ఇది చూసిన కేకయరాజులు, మత్స్య రాజులు తమ సేనలతో పారిపోయారు. ధృష్టద్యుమ్నుడు, సేనాబిందుడు, సాత్యకి మొదలగు ప్రముఖులు నిశ్చేష్టులై ద్రోణుని యుద్ధ వైఖరిని చూడ సాగారు. ఇది చూసిన సుయోధనుడు " కర్ణా ! చూసావా పెను గాలికి కూలి పోయిన వృక్షములవలె పాండవ సేన కూలి పోయింది. ద్రోణుని ఎదిరించగలిగిన వాడు పాండవ సేనలో లేడు. భీముడు ఒంటరిగా నిస్సహాయం నిలబడి ఉన్నాడు చూడు అన్నాడు. ద్రోణుని అస్త్రధాటికి నిలువ లేక రాజ్యకాంక్ష వీడి పారి పోతున్నాడు చూడు " అని ఆనందంగా అన్నాడు. కర్ణుడు " సుయోధనా ! పాండవులను అంత తేలికగా తీసి వేయకు. వారు మహావీరులు. అంతా కలిసి భీముని ముందు నిలిపి ద్రోణుని ఎదుర్కొంటారు. మనం ద్రోణుని రక్షణకు వెళ్ళాలి " అన్నాడు.

## కురు పాండవసేనల ఘోర సమరం

కర్ణుడు ఊహ నిజం చేస్తూ ధర్మరాజు నకులసహదేవులను పిలిచి భీమునికి ఇరువైపులా నిలిపి ద్రుపద, మత్స్య, యాదవ ప్రముఖులను మొహరించి విరాటుని, ద్రుపదుని, సాత్యకి వంటి ప్రముఖులను వెనుక నిలిపి ఒక్కుమ్మడిగా భీష్ముని ముట్టడించారు. పాండవ సైన్యములు మేఘములు కొండ శిఖరమును ఆవహించినట్లు ద్రోణుని చుట్టుముట్టగా ద్రోణుని రధం కనిపించకుండా పోయింది. ద్రోణుడు పాండవుల చేతులో మరణించాడని కౌరవ సేనలు కవర పడ్డాయి. సుయోధనుడు తన సేనలను వెంటబెట్టుకుని పాండవ సేనపై విరుచుకు పడ్డాడు. సాత్యకితో కృతవర్మ, క్షత్రధర్మని సైంధవుడు, యుయుత్సుని సుబాహుడు, నకులుని దుశ్శాసనుడు, సహదేవుని చిత్రవర్మడు, ధర్మనందనుని శల్యుడు, ద్రుపదుని బాహ్లికుడు, విరాటుని విందానువిందులు, శృతకీర్తిని వివిశంతి, శ్రుత సేనుని సాల్వుడు, శ్రుత సోముని చిత్రసేనుడు, శతానీకుని శ్రతవర్మ, ప్రతివింధ్యుని అశ్వత్థామ, అభిమన్యుని లక్ష్మణుడు, శిఖండిని వికర్ణుడు, కుంతి భోజుని దుర్ముఖుడు, కేకయేరాజులను కర్ణుడు, కాశీరాజును జయుడు, పాండ్యరాజును జయత్సేనుడు, వార్ధక్షేమిని కృపాచార్యుడు, మణిమంతుని భూరిశ్రవసుడు, ఘటోత్కచుని అలంబసుడు ఎదుర్కొన్నారు. అలా ద్రోణుని చంపడానికి పాండవసేనలు ప్రయత్నించాయి. ఇరుపక్షముల పోరు సంకులమైంది. ఒకరి కేతనములు ఒకరు వుగకొడుతున్నారు. హయములను చపుతున్నారు, సారధుల తలలు ఎగిరి పడ్తున్నాయి. రధములు విరుగుతున్నాయి. రక్తం వరదలై పారుతుంది . ఇలా మధ్యాహ్న సమయం అయింది. తన మీదకు వస్తున్న ధృష్టద్యుమ్నుని ద్రోణుడు తన బాణ పరంపరతో కట్టడి చేస్తున్నాడు. సుయోధనుడు తన గజబలంతో భీముని ఎదుర్కొన్నాడు. భీముడు క్రూర బాణములతో సుయోధనుని గజబలమును నాశనం చేస్తున్నాడు. వంగ దేశాధిపతి ఏనుగు ఎక్కి భీమునిపై అస్త్రప్రయోగం చేసాడు. భీముడు కోపించి వంగదేశాధీశుని ఒకే బాణంతో చంపాడు. అది చూసి వంగసేన పారిపోయింది.

## భగదత్తుడు సుప్రీతకముతో వచ్చి పోరు సల్పుట

ఆ సమయంలో భగదత్తుడు సుప్రీతకం అనే తన ఏనుగును ఎక్కి పాండవ సేనతో యుద్ధానికి దిగాడు. సుప్రీతకం మొదట ఇంద్రుని వాహనం. దానిని ఎక్కి ఇంద్రుడు దానవసంహారం చేసాడు. నరకాసురుడు ఇంద్రలోకం నుండి నరకాసురుడు తీసుకు వెళ్ళాడు. నరకాసుర వధానంతరం అది భగదత్తుని చేరింది. అలాంటి సుప్రీతకం ఎక్కి భగదత్తుడు పాండవసేనలను చిన్నాభిన్నం చేసాడు. సుప్రీతకం భీముని మీదకు అత్యంత వేగంగా వెళ్ళడంతో పాండవసేనలో సుప్రీతకం భీముని చంపివేసిందనే కలకలం రేగింది. ధర్మరాజు భీమసేనుడు క్షేమంగా ఉన్నాడని అరచి సేనను యుద్ధోన్ముఖులను చేసాడు. భగదత్తుని సుప్రీతకం పాండవసేనను నుగ్గు నుగ్గు చేస్తుంది. రధములను, హయములను, ఏనుగులను తొండంతో ఎత్తి నేలకేసి బాది విసిరేస్తుంది. వందలకొద్ది సైన్యాలను కాళ్ళ క్రింద తొక్కి చంపింది. ఇది చూసిన దశార్ణ భూపతి తన గజము ఎక్కి వచ్చి భగదత్తుని ఎదుర్కొన్నాడు. సుప్రీతకం కోపించి దశార్ణ భూపతి ఏనుగును తొక్కింది. దశార్ణ భూపతి క్రింద పడ్డాడు. భగదత్తుడు దశార్ణభూపతిని పది తోమరములు వేసి చంపాడు. అది చూసిన పాండవసేనలో భయాందోళనలు మొదలైయ్యాయి. సాత్యకి భగదత్తుని ఎదుర్కొని సుప్రీతకంపై శరవర్షం కురిపించాడు. సుప్రీతకం గిర్రున తిరిగి శరముల నుండి తప్పించుకుని సాత్యకి రధమును ఎత్తి పారేసింది. సాత్యకి లాఘవంగా క్రిందకు దూకి తప్పించుకున్నాడు. సారధి రధం దెబ్బ తినక పోవడం చూసి తిరిగి సాత్యకిని ఎక్కించుకున్నాడు. భీముడు భదత్తుని ఎదుర్కొన్నాడు. కాని సుప్రీతకం ధాటికి తట్టుకోలేక రధాశ్వములు భీముని పక్కకు లాగుకుని వెళ్ళాడు. ఆ సమయంలో సుపర్ణుడు సుప్రీతకమును ఎదుర్కొని దాని కాళ్ళ క్రింద పడి నలిగి పోయాడు. అది చూసిన అభిమన్యుడు, ద్రౌపదీ సుతులు, చేకితానుడు, ధృష్టకేతుడు, యుయుత్సుడు ఒక్కుమ్మడిగా సుప్రీతకమును ఏదుర్కొని శరవర్షం కురిపించాడు. కాని అవన్నీ వ్యర్ధం అయ్యాయి. సుప్రీతకం కోపించి వారి రధాలను కాళ్ళతో తొక్కి విరిచింది. యుయుత్సుని సారధిని చంపింది. యుయుత్సుడు అభిమన్యుని రధం ఎక్కాడు. అభిమన్యుడు మొదలైన వారు వేసిన అస్త్రాలన్నీ సుప్రీతం శరీరానికి తాకి ముక్కలైనాయి. భగదత్తుడు సుప్రీతకమును నలుదెసలా పరుగెత్తిస్తూ పాండవ సేనలోని పదాతి రథ, గజ, తురగ, దళాలను నాశనం చేస్తున్నాడు.

## సుప్రీతకంను ఆపాలని వెళుతున్న అర్జునుని సంశక్తులు అడ్డగించుట

దూరం నుండి సుప్రీతకం చేస్తున్న విధ్వసాన్ని చూసిన అర్జునుడు కృష్ణునితో " కృష్ణా ! భగదత్తుని గజము సుప్రీతకం పాండవ సేనను చిన్నాభిన్నం చేస్తుంది. ఎవరూ ఎదుర్కోలేక పోతున్నాడు. మనం లేక పోవడంతో ధర్మరాజాదులు ఎన్ని కష్టాలు పడుతున్నారో కదా ! మన రధమును వెంటనే భగదత్తుని వైపు మళ్ళింపుము " అన్నాడు. కృష్ణుడు రధమును భగదత్తుని వైపు మళ్ళించాడు. ఇంతలో సంశక్తులు వీరాలాపములు పలుకుతూ పదునాలుగు వందలమంది కృష్ణార్జునులను చుట్టుముట్టి శరవర్షం కురిపించారు. అర్జునుడు " కృష్ణా ! మన బలమును తరవాత చూసుకోవచ్చు ముందు సంశక్తులను

వధించాలి " అన్నాడు. శ్రీకృష్ణుడు రధమును సంశక్తుల వైపు మళ్ళించాడు. అర్జునుడు గాండీవం సంధించి దేవదత్తము పూరించి దివ్యమైన బాణములను సంశక్తులపై ప్రయోగించాడు. అర్జునుడి అస్త్రధాటికి రధ, గజ, తురగములు నాశనం ఔతున్నాయి. పదాతి దళముల తలలు ఎగిరి పడుతున్నాయి. కాళ్ళు చేతులు తెగిపడుతున్నాయి. అర్జునుడి విజృంభణ చూసి కృష్ణుడు ప్రశంసించాడు. కృష్ణుని ప్రంశలకు పొంగి పోయిన అర్జునుడు మరింత ఉత్సాహంతో విజృంభించి సంశక్తుల సేనను సర్వ నాశనం చేసాడు. అర్జునుడు కృష్ణునితో " ఇక్కడ సంహారం పూర్తి అయింది. రధమును మనసేన వైపు మళ్ళించు " అన్నాడు. కృష్ణుడు రధమును మళ్ళించగానే సంశక్తులు వెనుక నుండి " అదేమిటయ్యా ! మేము యుద్ధానికి పిలుస్తుంటే పారిపోతున్నావు " అని అరిచారు. " కృష్ణా ! యుద్ధానికి పిలుస్తుంటే మరలి పోవడం వీరుల లక్షణం కాదు. మన సైన్యం దైన్య స్థిలో ఉంది. నాకు సరి అయిన మార్గం తోచడం లేదు. నీవే తగు నిర్ణయం తీసుకో " అన్నాడు. కృష్ణుడు మారు మాటాడక సంశక్తుల వైపు రధాన్ని మళ్ళించాడు. అర్జునుడు మహోగ్రంతో త్రిగర్తుని విల్లు త్రుంచి కేతనము విరిచాడు. త్రిగర్తుని సోదరులను చంపాడు త్రిగర్తుడు మూర్చపోయాడు.

## అర్జునుడు సుప్రీతకమును భగదత్తును ఖండించుట


అర్జునుని చేతిలో భగదత్తుని మరణం

ఇంతలో పాండవ సేనలు పారిపోవడం చూసిన అర్జునుడు " కృష్ణా ! అటు చూడు సుప్రీతకం ధాటికి ఆగలేని మన సేనలు పారిపోతున్నాయి . రధమును అటు మళ్ళించు " అన్నాడు. శ్రీకృష్ణుడు అమిత వేగంతో రధమును పాండవ సేన వైపు పరుగెత్తించాడు. అర్జునుడు దేవదత్తము పూరించి భగదత్తుని మీద కరకుటమ్ములు ప్రయోగించి సుప్రీతకముకు ఎదురుగా నిలిచాడు. భగదత్తుడు అర్జునుడిపై ఉగ్రమైన బాణములు ప్రయోగించాడు. అర్జునుడు చిరునవ్వుతో వాటిని ముక్కలు చేసి భగదత్తుని మీద సుప్రీతకం మీద అతి దృఢమైన బాణ ప్రయోగం చేసాడు. ఆ బాణములు సుప్రీతకమును నొప్పించడంతో కృష్ణార్జునుల వైపు అతి వేగంగా దూకింది. సుప్రీతము ధాటికి కృష్ణార్జునులు ప్రాణాలు కోల్పోయారన్న వార్తతో పాండవ సేనలో హాహాకారాలు చెలరేగాయి. అప్పుడు కృష్ణుడు రధమును పక్కకు తప్పించంతో అది సేనలో దూసుకు పోయి వందల కొద్ది సైనికులను కాళ్ళతో తొక్కి చంపింది. ఇది చూసిన అర్జునుడికి కోపం వచ్చినా మనసులోనే అణచుకుని " కృష్ణా ! మన రధమును సుప్రీకం ఎదురుగా నిలుపుము " అన్నాడు. కృష్ణుడు రధమును భగదత్తుడికి ఎదురుగా నిలపగా భగదత్తుడు తండ్రిని చంపిన కృష్ణుని మీద కోపంతో కృష్ణునిపై అతి క్రూర బాణములు ప్రయోగించాడు. అర్జునుడు వాటిని ఖండించి , భగదత్తుని విల్లు విరిచి, భదత్తుడిపై శరీరంలో వాడి అయిన బాణములు నాటాడు. భగదత్తుడు అమిత కోపంతో అర్జునుడిపై పదునాలుగు తోమరములు అర్జుడిపై ప్రయోగించాడు. అర్జునుడు వాట్ని మధ్యలో త్రుంచి సుప్రీతకం కవచమును భేధించాడు. సుప్రీతకం మేఘములు తొలగిన కొండవలె ప్రకాశించింది. భగదత్తుడు ప్రయోగించిన శక్తి బాణమును అర్జునుడు నిర్వీర్యం చేసాడు. భగదత్తుడు అర్జునుడి కిరీటంపై తోమరం వేయగా అర్జునుడు కోపించి భగదత్తుని పై ఏడు బాణములు ప్రయోగం చేయగా భగదత్తుడు తన చేతిలో ఉన్న అంకుశాన్ని వైష్ణవాస్త్రంగా మంత్రించి అర్జునుడిపై ప్రయోగించాడు. అర్జునుడి వైపు అమిత రౌద్రంగా వస్తున్న వైష్ణవాస్త్రానికి కృష్ణుడు నొగల మీదనుండి లేచి నిలబడి తన వక్షస్థలాన్ని చూపాడు. రౌద్రంగా వచ్చిన వైష్ణవాస్త్రం శ్రీకృష్ణుని వక్షస్థలం తాకి పూవు వలె క్రింద పడింది. అర్జునుడు కోపం పట్ట లేక " కృష్ణా ! నా మీద దయ వలన నాకు సారధ్యం చేయడానికి ఒప్పుకున్నావు. కాని యుద్ధం చేయనని మాట ఇచ్చావు. ఈ విధంగా యుద్ధంలో పాలు పంచుకోవడం భావ్యంగా ఉందా ! చూసిన వారు అర్జునుడు చేతగాని వాడిని అనుకోరా ! ఇక మాటలెంకులే రధమును పోనిమ్ము " అన్నాడు నిష్టూరంగా. కృష్ణుడు అర్జునుడిని చూసి " అర్జునా ! రధ సారధిగా నిన్ను కాపాడు కోవడం నా ధర్మం . నీకో విషయం చెప్పాలి. శ్రీ మహావిష్ణువు యోగ నిద్ర నుండి లేచిన సమయమున భూదేవి అతడిని కోరుకుంది. మహావిష్ణువు ఆమె కోరికను మన్నించి తరువాత ఆమెకు వైష్ణవాస్త్రాన్ని ప్రసాదించాడు. వారి సంగమ ఫలితంగా వారికి నరకాశురుడు జన్మించాడు. భూదేవి ఆ అస్త్రమును నరకాశురుడికి ఇచ్చింది . నరకాశురును నుండి అది భగదత్తుడికి సంక్రమించింది. ఆ వైష్ణవాస్త్రము అత్యంత మహిమాన్వితము. విష్ణాంశతో జన్మించిన నా వలన మాత్రమే అది నిర్వీర్యం ఔతుంది. అందూకే నా గుండెను అడ్డు పెట్టి దానిని నిర్వీర్యం చేసాను. అంతే కాని నీవు వీరుడివి కాదు అని కాదు. నీ పరాక్రమం శంకించి కాదు. తాను ప్రయోగించిన వైష్ణవాస్త్రం నిర్వీర్యం అయినందుకు భగదత్తుడు నిరాశతో ఉన్నాడు. కనుక ఇది మంచి తరుణం నేను నరకారుశుని చంపినట్లు నీవు భగదత్తుని సంహరించు " అన్నాడు. అర్జునుడు గండీవమును సంధించి ఒక క్రూర నారాచమును సంధించి సుప్రీతకం కుంభస్థలముకు గురిపెట్టి కొట్టాడు. ఆ దెబ్బకు సుప్రీతకం కుంభస్థలం పగిలి క్రిందికి ఒరిగింది. దాని మీద నుండి భగదత్తుడు కింద పడ్డాడు. వెంటనే అర్జునుడు ఒక అర్ధచంద్రాకార బాణమును ప్రయోగించి

భగదత్తుని శిరస్సు ఖండించాడు.

## అర్జునుని ఎదుర్కొన్న శకుని భంగపాటు

భగదత్తుని మరణం చూసిన నీ కుమారుడు శకుని అతడి తమ్ములు వృషకుడు అచలుడు కలిసి అర్జునుడి మీదకు దూకారు. అప్పుడు అర్జునుడు వృషకుని హయములు, రధమును, కేతనమును ఖండించాడు. వృషకుడు తన సోదరుని రధం ఎక్కాడు. అర్జునుడు తనకు అడ్డుపడిన గాంధార రధికులు అయిదు వందల మందిని చంపాడు. ఒకే రధం మీద ఉన్న వృషకుని, అచలుని అర్జునుడు ఒకే ఒక్క బాణంతో చంపాడు. వారి మరణం కళ్ళార చూసిన నీ కుమారుడు సంతాపం చెందాడు. శకుని కోపంతో రగిలి పోయి అర్జునుడిని ఎదుర్కొన్నాడు. శకుని తన మాయా శక్తితో అనేక మాయలు కల్పించాడు. రాళ్ళ వర్షం పడుతున్నట్లు, సరీసృపాలు , పెద్ద పులులు మీద పడుతున్నట్లు భ్రమ కల్పించాడు. అర్జునుడు దివ్యాస్త్ర ప్రయోగం చేసి ఆ మాయను పటాపంచలు చేసాడు. అర్జునుడు " శకుని చూసి మామా ! నీ మాయలన్నీ మాయా ద్యూతముతోనే అంత మొందాయి. ఇది యుద్ధ రంగము ఇక్కడ నీ పాచిక పారదు . ఇక్కడ తీవ్రమైన శరములు మాట్లాడతాయి వెళ్ళు " అంటూ శకుని మీద అతి క్రూరమైన శరములు వేసాడు. ఆ బాణ ధాటికి తట్టుకోలేని శకుని తన సైన్యంతో పారిపోయాడు. అప్పుడు సాత్యకి భీమసేనుడు అర్జునుడికి చెరి ఒక వైపు నిలిచారు. వారు ముగ్గురు అమిత పరాక్రమంతో సుయోధనుడి వైపు రధమును మళ్ళించాడు. వారి బాణధాటికి తట్టుకోలేని కురుసేన రెండు పాయలుగా విడిపోయి సుయోధనుని వెనుక ద్రోణుని వెనుక దాక్కున్నారు. పాండవ సేనలు ఉత్సాహంతో " ద్రోణుని నరకండి చంపండి " అంటూ కౌరవ సేన మీదికి లంఘించారు. కౌరవ సేన ద్రోణుని చుట్టూ చేరి అతడికి రక్షణ కవచంగా నిలిచారు. ఇరు పక్షములకు పోరు గోరంగా సాగుతుంది. ధృష్టద్యుమ్నుడు ద్రోణుడికి ఎటు పోతే అటు ఎదురు నిలిచి అతడితో యుద్ధానికి తలపడుతున్నాడు. ఒక పక్క ధర్మరాజు మరోపక్క సుయోధనుడు తమ సేనలను ప్రోత్సహిస్తున్నారు. ఇంతలో నీలుడు అనే రాజు అశ్వత్థామను ఎదుర్కొన్నాడు. అశ్వత్థామ ఒకే బాణంతో అతడి తల ఖండించాడు. అతడి సేనలు పారి పోయాయి. ఇది చూసిన పాండవ సేన కలత పడింది. ధృష్టద్యుమ్నుడు వారిని ప్రోత్సహిస్తూ యుద్ధోన్ముఖులను చేసాడు. ఇంతలో అర్జునుడు చంపగా మిగిలిన సంశక్తులు తమ సైన్యాలను కూడగట్టు కుని " అర్జునా ! మేమేమన్నా ! ఓడిపోయామా పారిపోయామా మమ్మలిని వదిలేసి వచ్చావు. ఏడీ అర్జునుడు మాతో సమరం మానితే విజయం చేకూరుతుందా ? మాకు భయపడి దాక్కున్నావా రా బయటికి రా " అని కవ్వించారు. ఆ మాటలకు రోషం తెచ్చుకున్న అర్జునుడు తమ రధాన్ని దక్షిణం వైపు మళ్ళించాడు. కౌరవసేన శరవర్షానికి పాండవ సేన చెదిరిపోయింది. భీముడు పాండవ సేనను ప్రోత్సహిస్తూ బాహ్లికునిపై క్రూర బాణాలు ప్రయోగించాడు. అది చూసిన సుయోధనుడు, కర్ణుడు, ద్రోణుడు, అశ్వత్థామ భీమునిపై శరవర్షం కురిపించారు. అది చూసిన ధర్మరాజు సాత్యకిని, అభిమన్యుని, నకుల సహదేవులను భీమునకు సాయంగా పంపాడు.

## అపహార్ణ సమయానంతర సమరం

అప్పటి వరకు జరిగిన భీకర సమరానికి గుర్తుగా యుద్ధభూమిలో రధములు విరిగి పడుతున్నాయి, తలలు తెగిపోతున్నాయి, మొండెముల నుండి ప్రేవులు బయట పడుతున్నాయి, కాళ్ళు చేతులు తెగిపడుతున్నాయి, కుంభస్థలములు పగిలి ఏనుగులు కింద పడి దొర్లుతున్నాయి, ఏనుగుల మీది వీరులు అంకుశములతో సహా కింద పడి మరణిస్తున్నారు. ఏనుగుల కాళ్ళ కింద పడి మరణిస్తున్నా సైనికులు తమ చేతిలోని కరవాలములు వీడకున్నారు, తల తెగిన తరవాత కూడా వీరులు కరవాలమును కొంతసేపు ఝుళిపించి తరవాత కింద పడుతున్నారు. రణరంగము పీనుగుల పెంటగా మారింది. ధృష్టద్యుమ్నుడు ద్రోణుని చంపుటకు తగిన సమయం వచ్చిందని తన సైన్యంతో ద్రోణుని ఎదుర్కొని అనేక దివ్యాస్త్రములు సంధించాడు. ఇంతలో సంశక్తులను పూర్తిగా నిర్మూలించిన అర్జునుడు తిరిగి పాండవ సైన్యాలను చేరి భీమునికి తోడుగా నిలిచాడు. ముగ్గురి వీరుల ధాటికి తట్టుకోలేని కౌరవ సేన " కర్ణా ! మాకు నీవే దిక్కు " అని ఆక్రోశించాయి. కర్ణుడు నిలవండి పారిపోకండి. మీకేమి భయం లేదు " అని ధైర్యవచనాలు పలికి ఎదురుగా ఉన్న అర్జునుడిపై ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. అర్జునుడు వారుణాస్త్రాన్ని ప్రయోగించి ఆగ్నేయాస్త్రాన్ని నిర్వీర్యం చేసాడు. భీముడు, సాత్యకి, ధృష్టద్యుమ్నుడు కర్ణుని శరీరంలో మూడేసి బాణాలు నాటారు. కర్ణుడు అర్జునుడి బాణములను త్రుంచి భీమ, సాత్యకి, ధృష్టద్యుమ్నుల ధనస్సులను విరిచాడు. ఆ ముగ్గురు కర్ణునిపై శక్తి బాణములు ప్రయోగించాడు. కర్ణుడు వాటిని నిర్వీర్యం చేసాడు. అర్జునుడుఏడు బాణములతో కర్ణుని కొట్టి అతడి ముగ్గురు తమ్ముల తలలు నరికి భూదేవికి బలి ఇచ్చాడు. భీముడు రధం దిగి గధను భుజం మీద పెట్టుకుని కర్ణుని సైనికులను పదివేల మందిని సంహరించి తిరిగి రధం అధిరోహించాడు. మరొక విల్లు తీసుకుని వాడి అయిన బాణములతో కర్ణుని శరీరం అంతా కొట్టాడు. సాత్యకి, ధృష్టద్యుమ్నులు వేరు విల్లు తీసుకుని కర్ణుని సారధిని చంపి, విల్లు త్రుంచాడు. దుర్యోధనుడు, ద్రోణుడు, జయద్రధుడు వచ్చి కర్ణుడిని అక్కడ నుండి తప్పించారు. ఇరు పక్షములు ఘోర యుద్ధం చేస్తున్నారు. రధ, గజ, తురంగ, పదాతి దళాలు నేలకూలుతున్నాయి. కాలువలై ప్రవహిస్తున్న రక్తంలో శరీరాలు తేలియాడుతున్నాయి. రధ, గజ, తురగ, మానవుల ప్రేవులు మాంసపు ముద్దలు గుట్టలుగా పడుతున్నాయి. రణ భూమి

భయానకంగాను, రౌద్రంగాను, భీభత్సంగాను కనపడుతుంది. అర్జునుడు, ద్రోణుడు భీకరంగా యుద్ధం చేస్తుండగా సూర్యుడు పశ్చిమాద్రి చేరుకున్నాడు. రణరంగంలో పడి ఉన్న శవములు తినుటకు గ్రద్దలు ఆకాశంలో తిరుగుతున్నాయి. ఇరు పక్షములు ఆ రోజు యుద్ధం ముగించారు. ఆనందోత్సాహంతో పాండవసేనలు, నిరుత్సాహంతో కురుసేనలు, తమశిబిరాలకు మళ్ళాయి. కురుసైన్యం లోని అందరూ ద్రోణుడు ఆరోజు కూడా తనశపధం నెరవేర్చుకోక పోవడం అర్జునుడి పరాక్రమం కృష్ణుడు తోడు నిలిచి అనుక్షణం కాపాడటం గురించి చర్చించుకోసాగారు.

## సుయోధనుడు ద్రోణుని నిందించుట

ఆ సమయంలో సుయోధనుడు ద్రోణుని చూసి " ఆచార్యా ! ధర్మరాజును పట్టి బంధిస్తానని నాకు వరం ఇచ్చారు. రెండు రోజులైనా మీ మాట చెల్లించుకోలేక పోయారు. ధర్మజుడు చేజిక్కినా మీరు ఆ అవకాశం చేజార్చుకున్నారు. లోకుల దృష్టిలో మీరు నేను అసమర్ధులం అయ్యాము. ఈ విధంగా కుటిల వ్యర్ధమైన మాటలతో ప్రయోజనమేమిటి ? మీ వంటి ఆశ్రిత గుణశ్రేష్టుడు ఇలా వంచించ తగునా ? " అని కర్ణ కఠోరంగా పలికాడు. ద్రోణుడు సుయోధనుని మాటలకు నొచ్చుకున్నా అది బయట పడనీయక " సుయోధనా ! నరుని పరాక్రమము, నారాయణుని మహిమ తెలిసీ నీవు నన్ను నిందించ తగదు. నిన్న ఈ రోజు ధర్మజుని వదిలి అర్జునుడు ఒక్క క్షణమైనా ఉన్నారా! రేపటి రోజు అర్జునుడిని రణరంగం నుండి తీసుకు పోవుటకు ఎవరినైనా నియోగింపుము. నేను నా ప్రతిజ్ఞ నెరవేర్చెదను. నవ్వునకైనా నా నోట అసత్యము రాదు. గుర్తు పెట్టుకో నేను నా ప్రతిజ్ఞ పెరవేర్చుకుంటాను " అన్నాడు ద్రోణుడు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన సంశక్తులు "సుయోధనా ! అర్జునుడిని మరల్పగల ధైర్యం మాకు దక్క వేరెవరికి ఉంది " అని ప్రగల్భములు పలికారు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

# ద్రోణ పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# ద్వితీయాశ్వాసము

## సంజయుడు అభిమన్యుని మరణ వార్త ధృతరాష్ట్రునికి చెప్పుట

ధృతతరాష్ట్రా ! ఆ ప్రకారం మూడవ రోజు యుద్ధంలో సంశక్తులు అర్జునుడిని తమతో యుద్ధానికి రమ్మని కవ్వించారు. అర్జునుడు వారితో యుద్ధముకు దిగాడు. ద్రోణుడు పద్మవ్యూహం పన్నాడు. ధర్మరాజు అనుమతితో అభిమన్యుడు ఆ వ్యూహమును భేదించి వ్యూహమున ప్రవేశించి బృహద్బలుడు, లక్ష్మణకుమారుడు మొదలైన పెక్కుమందిని చంపి పద్మవ్యూహం నుండి బయటకు వచ్చు మార్గం తెలియక కౌరవుల చేతిలో మృతిచెందాడు. కురుసేనలో ఉత్సాహం పాండవసేనలో విషాదాన్ని నింపుతూ ద్రోణసారధ్యంలో మూడవ రోజు యుద్ధం ముగిసింది " అని సంజయుడు వివరించాడు. అభిమన్యుడు రణరంగమున మరణించాడు అన్న మాటవిన్న ధృతరాష్ట్రుడు ఎంతో పరితపించాడు. " సంజయా ! నా మనుమడు అమిత తేజశ్శాలి, సద్గుణసంపన్నుడు అయిన అభిమన్యుడు ఉగ్రమనస్కులైన యోధుల చేతిలో ఎలా మరణించాడు " అని సంజయుని అడిగాడు.

## మూడవరోజు యుద్ధం

సంజయుడు " మహారాజా ! మూడవ రోజున ద్రోణుడు కురు సేనలను పద్మవ్యూహంలో నిలిపాడు. దానిని చక్రవ్యూహం అని కూడా అంటారు. వివిధ దేశాధీశులు పద్మవ్యూహముకు రేకులవలె నిలిచారు. వారి కుమారులంతా కేసరముల వలె నిలిచారు. కర్ణుడు, దుశ్శాసనుడు తమ తమ సేనలతో పద్మము యొక్క అంతర్భాగమున వారి మధ్య భాగమున సుయోధనుడు సేనలతో నిలిచాడు. సైంధవుడు, అశ్వత్థామ, కృపాచార్యుడు, శకుని, కృతవర్మ, భూరిశ్రవసుడు, శలుడు, శల్యుడు, నీ కుమారుడు, నీ మనుమలు తమతమ స్థానాలలో నిలిచారు. పాండవ సేనలో భీమసేనుడు, సాత్యకి, దృష్టద్యుమ్నుడు, కుంతిభోజుడు, చేకితాణుడు, క్షత్రధర్ముడు, క్షత్రవర్మ, దృష్టకేతు, నకుల సహదేవులు, ఉత్తమౌజుడు, శిఖండి, యుధామన్యుడు, ఘతోత్కచుడు, విరాటరాజు, ద్రుపదుడు, ద్రౌపదీసుతులు, కేకయ రాజులు సంజయులు ఒక్కుమ్మడిగా ద్రోణునితో తల పడ్డారు. ద్రోణుడు వారి విజృంభణకు జంకక వారిపై వాడి అయిన బాణములు ప్రయోగించాడు. ద్రోణుని పరాక్రమానికి బెదిరి పాండవ వీరులు పారిపోసాగారు. వారిలో ఎవ్వరికీ ద్రోణుడు పన్నిన పద్మ వ్యూహంలో చొరపడడానికి సాధ్యం కాలేదు. ధర్మరాజు " పద్మవ్యూహములో ప్రవేశించడానికి అభిమన్యునికి తప్ప వేరెవరికి సాధ్యం కాదు " అని తలచి అభిమన్యుని వద్దకు వెళ్ళి " కుమారా ! పద్మవ్యూహమున ప్రవేశించుట నీకు, నీ తండ్రి అర్జునుడికి, శ్రీకృష్ణునికి తప్ప మరెవరికి సాధ్యం కాదు. మనలను నీ తండ్రి హేళన చేయకుండా ఉండాలంటే నీవు ఆ వ్యూహమును ఛేదించ వలెను "


అభిమన్యునికి వీడ్కోలు పలుకుతున్న ఉత్తర

అన్నాడు. అభిమన్యుడు " తండ్రీ ! నాకు పద్మవ్యూహమున ప్రవేశించుట మాత్రమే తెలుసు. కనుక వ్యూహమున ప్రవేశించి కురుసేనను చీల్చి చెండాడుతాను. ధర్మరాజు " అది చాలు కుమారా ! నీవు త్రోవ చూపి వ్యూహమున ప్రవేశించిన వెంటనే మేమంతా నీ వెంట వస్తాము " అన్నాడు. భీముడు కూడా " కుమారా ! వ్యూహములో ప్రవేశించిన చాలు నీ వెంట నేను, దృష్టద్యుమ్నుడు, ద్రుపదుడు, సాత్యకి, విరాటుడు వచ్చి సేనలను మట్టు పెడతాము " అన్నాడు. అభిమన్యుడు " పెదనాన గారూ ! మీరు ఇలా అడుగ వచ్చునా పద్మ వ్యూహమును రచించిన ద్రోణుడు మెచ్చగా నేను వ్యూహమున ప్రవేశించి శత్రు నిర్మూలన గావించి ధర్మరాజు మాట నిలిపి నా తల్లి తండ్రులకు నా ప్రావీణ్యము ప్రదర్శిస్తాను. ఇంత చిన్నవాడు కురు సేనలను చెండాడుతున్నాడని నా మేనమామ శ్రీకృష్ణుడు మెచ్చేలా కురుభూపతి అచ్చెరువందేలా నా తండ్రి సంతసించేలా రణభూమిలో వీరవిహారం చేస్తాను " అన్నాడు. ఆ మాటకు సంతసించిన ధర్మరాజు " కుమారా! నీ ధైర్యమూ , నీ శౌర్యమూ, నీ బలము, నీ కీర్తి వర్ధిల్లుగాక " అని దీవించాడు. అభిమన్యుడు సుమిత్రుడనే సారథితో రథమును ద్రోణుని వైపు పోనిమ్మని చెప్పాడు. సుమిత్రుడు " కుమారా ! నీవు బాలుడవు నీ ఎదుటున్నది ద్రోణుని సైన్యము. వారు అతిరథులు, మహారథులు, క్రూరాత్ములు కనుక నీ చేతిలో మరణించు వారు కాదు. కనుక వ్యూహమున ప్రవేశించే ముందు ఆలోచించు " అన్నాడు. అభిమన్యుడు నవ్వి " సుమిత్రా ! దేవేంద్రుడే దేవగణముతో వచ్చినా , తన భూతగణముతో రుద్రుడే భూతగణముతో వచ్చినా, నా తండ్రి వచ్చినా , నా మేనమామ శ్రీకృష్ణుడే నాతో యుద్ధానికి వచ్చినా నన్ను యుద్ధమున గెలువ లేరు సందేహం వదిలి రథమును ద్రోణుని మీదికి పోనిమ్ము " అన్నాడు. సందేహం వీడకున్ననూ సుమిత్రుడు రథమును ద్రోణుని వైపు పోనిచ్చాడు. అది చూసి కురు సేన ఒక్కసారిగా అభిమన్యుని ఎదుర్కొన్నది సమరం సంకులు మైంది. అయినా అభిమన్యుడు మెరుపు మెరిసినట్లు కురు సేనలను ఛేధిస్తూ వ్యూహంలో ప్రవేశించాడు.

## అభిమన్యుని ప్రతాపం


చక్రవ్యూహం

దుర్భేద్యమైన వ్యూహంలో ప్రవేశించిన అభిమన్యుడు రుద్రుడై కార్చిచ్చు అడవిని దహించినట్లు కురుసేనలను దహిస్తున్నాడు. అభిమన్యుడు ప్రయోగిస్తున్న అస్త్రముల ధాటికి రథ, గజ, తురంగ, పదాతి దళములు నాశనం ఔతున్నాయి. కేతనములు విరిగిపడుతున్నాయి. సారధులు మరణిస్తున్నారు. ధనస్సులు విరుగుతున్నాయి. శత్రుసైన్యముల శరీరంలో అత్యంత క్రూర శరములు నాటుకున్నాయి. రణరంగం కకావికలైంది. పీనుగులు కుప్పలుగా పడ్డాయి. అభిమన్యుని ధాటికి పద్మవ్యూహం చెదిరి పోయింది. కురు సేన పారి పోసాగింది. అది చూసిన సుయోధనుడు అభిమన్యుని ఎదుర్కొన్నాడు. అది చూసిన ద్రోణుడు తమ సైన్యంలోని అతి రథ మహారథ యోధులను పిలిచి సుయోధనుడు అభిమన్యుని ఎదుర్కొంటున్నాడు. మీరంతా వెళ్ళి సాయం చెయ్యండి " అన్నాడు. అప్పుడు కృపాచార్యుడు, అశ్వత్థామ, కృతవర్మ, కర్ణుడు, శకుని, పౌరవుడు, వృషసేనుడు అంతా కలిసి సుయోధనునికి సాయంగా వెళ్ళి ఒక్కుమ్మడిగా అభిమన్యుని చుట్టుముట్టి శరవర్షం కురిపించారు. చేత చిక్కిన సుయోధనుడు చేజారినందుకు అభిమన్యుడు క్రుద్ధుడై అతి రథ మహారథుల మీద అస్త్రశస్త్రములు కురిపించాడు. అభిమన్యుని ధాటికి కురుసేన పారి పోసాగింది. ఇది చూసిన ద్రోణుడు అభిమన్యుని ఎదుర్కొని అభిమన్యునిపై శరములు గుప్పించాడు. పారి పోతున్న కురుసేన తిరిగి వచ్చి అభిమన్యునితో పోర సాగాయి. అభిమన్యుడు అతి లాఘవంగా వారు ప్రయోగించిన శరములు త్రుంచి వారి శరీరాలు తూట్లు పడేలా కొడుతున్నాడు. అభిమన్యుని శౌర్యం చూసి ఆశ్చర్యపడిన సుయోధనుడు చకితుడైనాడు.

## కురుప్రముఖులు అభిమన్యుని ఒక్కుమ్మడిగా ఎదుర్కొనుట

పారి పోతున్న తన సేనలను చేయి ఊపి పిలుస్తూ అభిమన్యుని ఎదుర్కొన్నాడు. సుయోధనుడు, భూరిశ్రవసుడు, కృపాచార్యుడు ఒక్కొక్కరు మూడేసి బాణములు , ద్రోణుడు పదిహేడు, వివిశంతి ఇరవై బాణములను, అశ్వత్థామ అయిదు బాణములు, బృహద్బలుడు ఎనిమిది బాణములను, శల్యుడు ఆరు బాణములతోను, దుశ్శాసనుడు పన్నెండు బాణములతో ఒక్క సారిగా అభిమన్యుని కొట్టారు. ఆ బాణములన్నీ త్రుంచిన అభిమన్యుడు వారి శరీరంలో మూడేసి బాణములు గుచ్చాడు. అశ్మకుని కేతనము త్రుంచి, విల్లు త్రుంచి అతని శిరస్సు ఖండించాడు. అది చూసిన కురుసేన భీతి చెంది పారిపోసాగింది, ద్రోణుడు వారిని తిరిగి యుద్ధోన్ముఖులను చేసాడు. నీకుమారులు అందరిని కూడగట్టుకుని అభిమన్యునిపై బాణములు గుప్పించారు. అభిమన్యుడు బెదరక వారి శరీరాలను శరములతో బాధించాడు. కర్ణుని కవచమును భేదించి వక్షస్థలము మీద క్రూరమైన బాణమును గుచ్చాడు. ఆ దెబ్బకు కర్ణుడు మూర్చపోయాడు. నీ కుమారులందరిని వెనక్కు తరిమాడు. శల్యుడు అభిమన్యుని ఎదుర్కొనగా అభిమన్యుడు శల్యుని అత్యంత పదునైన బాణంతో కొట్టి మూర్చిల్ల చేసాడు. అభిమన్యుడు సింహనాదం చేసాడు. కురుసేనలు ద్రోణుడు వద్దని ఎంత వారించినా వినక పారి పోయాయి " అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు " సంజయా అభుమన్యుని తరవాత ఎవరు ఎదుర్కొన్నాడు " అన్నాడు. సంజయుడు " శల్యుడు మూర్చపోవడం చూసి అతడి తమ్ముడు అభిమన్యుని ఎదిరించి అభిమన్యునిపై పది బాణములు వేసాడు. అభిమన్యుడు ఆ బాణములు మధ్యలో త్రుంచి శల్యుని తమ్మునిపై రధమును విరిచి, హయములను చంపి, చేతులు నరికి ఆఖరుగా శిరస్సు ఖండించాడు, ఇది చూసిన మిగిలిన రాజకుమారులు భయభ్రాంతులైయ్యారు. ద్రోణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, కృతవర్మ, బృహద్బలుడు, కర్ణుడు మొదలైన ప్రముఖ యోధులు ఒకరిని ఒకరు పిలుచుకుని ధైర్యం చెప్పకుంటూ అభిమన్యుని ఎదుర్కొన్నారు. అది చూసి అభిమన్యుడు సాక్షాత్తు అర్జునుడే అక్కడ ఉన్నట్లు భ్రమ కలిగిస్తూ గుండ్రటి విల్లు ధరించాడా అన్నట్లు అందరిపై శరవర్షం కురిపించాడు. అభిమన్యుడు కౌరవ వీరుల మీద భల్లములు, అంజలకములు, క్షురపములు, కూర్మనఖములు మొదలయిన బాణములు ప్రయోగిస్తున్నాడు. అభిమన్యుని ప్రతాపము విని ధృతరాష్ట్రుడు మోదము ఖేదముల మ్మిశ్రిత భావోద్వేగానికి లోనయ్యాడు. ఆ తరవాత ఏమైంది అని ఆత్రంగా అడిగాడు. సంజయుడు " ఆ ప్రకారం పారిపోతున్న కౌరవ సేనలను అభిమన్యుడు పారిపోనీయక వారిచుట్టూ తన రధమును తిప్పుతూ ఎడతెరిపి లేని శరములు గుప్పిస్తూ రణరంగాన్ని పీనుగుల పెంట చేసాడు. అభిమన్యుని ప్రతాపం చూసి ద్రోణుడు కృపాచార్యునితో " అచార్యా ! చూసారా తన తల్లితండ్రులు, మామలు, స్నేహితులు, సోదరులు సంతోషించే విధంగా అభిమన్యుడు శత్రు సంహారం చేస్తున్నాడు. రధ, గజ, తురంగాదులను నేల కూలుస్తున్నాడు. అతడి ముందు మన సైన్యంలో వీరులు ఎవరూ నిలువ లేకున్నారు " అన్నాడు.

## సుయోధనాదులు అభిమన్యుడిని ఎదుర్కొనుట


అభిమన్యు దుశ్శాసనుల పోరాటం

ఆ మాటలు విన్న సుయోధనుడు అతి దీనవదనంతో ముఖము మీద చిరునవ్వు తెచ్చుకుని కర్ణుడు, భూరిశ్రవసుడు మొదలగు వారితో ఇలా అన్నాడు " విన్నారా ! మన గురువుగారు ద్రోణార్యుని మాటలు విన్నారా! విల్లు పట్టి నేర్చుకున్న ప్రతి వాడికీ ద్రోణాచార్యులే గురువు. అలాంటి వాడు ఒక పసి బాలుడిని మహా వీరుడని పొగుడుతూ చంపడానికి ప్రయత్నించ లేదు. ఎంతైనా పార్ధుని కుమారుని పార్ధునికి అనుకూలుడైన ద్రోణుడు చంపుతాడా! అయినా ద్రోణుడు ఉపేక్షించబట్టి అభిమన్యుడు చెలరేగిపోతున్నాడు. మనమంతా కలిసి అభిమన్యుని ఎదుర్కొంటాము అన్నాడు. ఇది విన్న దుశ్శాసనుడు ముందుకు వచ్చి " అన్నయ్యా ! ఈ మాత్రం దానికి యోధాను యోధులు కావాలా! అవక్ర పరాక్రమంతో అభిమన్యుని చంపుతాను. అభిమన్యుడు మరణించాడు అన్న వార్త విన్న అర్జునుడు, శ్రీకృష్ణుడు మరణిస్తారు మన పగ చల్లారుతుంది " అన్నాడు. దుశ్శాసనుడు విల్లు సారించి శరములు గుప్పిస్తూ అభిమన్యుని ఎదుర్కొన్నాడు. అభిమన్యుడు దుశ్శాసనుచే ప్రయోగించబడిన శరములు త్రుంచి అతని మీద ఇరవై ఆరు అతి క్రూర బాణములు ప్రయోగించాడు. వారివురి యుద్ధాన్ని మిగిలిన వారు యుద్ధం ఆపి చూస్తున్నారు. ఇంతలో అభిమన్యుడు దుశ్శాసనుని విల్లు విరిచి దుశ్శాసనుడి ఒళ్ళంతా తూట్లుగా కొట్టి నవ్వుతూ " దుశ్శాసనా ! నాడు నిండు పేరోలగములో నా తండ్రిగారు ధర్మరాజును తూలనాడిన నీ తల ఖండించి నా తల్లి తండ్రులకు మోదము కలిగిస్తాను " అంటూ రెండు వాడి అయిన బాణములు దుశ్శాసనుని వక్షస్థలముపై కొట్టాడు. ఆ దెబ్బకు దుశ్శాసనుడు మూర్చిల్లి రధముపై బడ్డాడు. అలా మూర్చపోయిన అతడిని రధసారధి పక్కకు తీసుకు

పోయాడు. అభిమన్యుడు దారి చేయగా లోనికి ప్రవేశించిన పాండవ సైన్యం అది చూసి హర్షధ్వానాలు చేసారు. సుయోధనుడు కర్ణునితో " కర్ణా ! దుశ్శాసనుడు అభిమన్యుని చేతిలో మూర్చిల్లాడు కదా " అన్నాడు. ఆ మాటలు విని కర్ణుడు తన సైన్యంతో అభిమన్యుని మీదకు వెళ్ళి డెబ్బై మూడు బాణములు అభిమన్యునిపై ప్రయోగించాడు. అభిమన్యుడు వాటిని లక్ష్యపెట్టక మధ్యలోనే త్రుంచి కర్ణుడు అలసి పోయేదాకా శరములతో కొట్టాడు. కర్ణుని తమ్ముడు అభిమన్యుని ఎదుర్కొని అభిమన్యుని హయముల మీద సారధి మీద శరములు గుప్పించాడు. అభిమన్యుడు చిరునవ్వుతో ఒకేఒక భల్లభాణముతో అతడి శిరస్సును త్రుంచాడు.

### అభిమన్యుని విజయోత్సాహం

తమ్ముని మరణం చూసి కర్ణుడు తన సైన్యంతో పక్కకు తొలిగాడు. ఇది చూసిన కురుసేన విజృంభించింది.అభిమన్యుడు కురుసేనను బాణ వర్షంతో కట్టడి చేస్తూ పారి పోతున్న కర్ణుని తరిమాడు. కర్ణుడు ప్రాణభయంతో పారిపోయాడు. అతని వెంట కురుసైన్యమూ పారిపోయింది. అది చూసి ద్రోణుడు తల్లడిల్లి పోయి " కృపాచార్యా ! కర్ణా ! నిలవండి మీ లాంటి యోధాను యోధులు పారి పోవడము భావ్యమా ! సుయోధనా ! బాహ్లికా ! మీ పరాక్రమం చూపవలసిన తరుణం ఇదే కదా ! వెను తిరిగి వచ్చి అభిమన్యునితో పోరుసాగించండి " అని వారించినా వినక పారిపోసాగారు. అది చూసి అభిమన్యుడు సింహ నాదం చేసి విల్లు సారించి శరములు గుప్పిస్తూ కురుసేనను నాశనం చేసుతున్నాడు. రణరంగం విరిగిన ఆయుధములు, కేతనములు, ధనస్సులు, రధముల కుప్పలు హయములు, గజములు, సైనికుల కళేబరములతో నిండాయి. విరిగిన కాళ్ళు చేతుల విషయం అంతులేదు. రెండవ సూర్యునిలా ప్రకాశిస్తున్నాడు అభిమన్యుడు " అన్నాడు ధృతరాష్ట్రునితో సంజయుడు. ఆ మాటలు విన్న ధృతరాష్ట్రుడు ఇప్పటి వరకు అభిమన్యుడు మాత్రమే యుద్ధం చేస్తున్నాడని చెప్తున్నావు కాని మిగిలిన పాండవులు, ద్రుపదుడు, విరాటుడు ఏ మయ్యారు ఎందుకు సాయం రాలేదు " అని అడిగాడు.

## పాండవులను జయద్రధుడు ఎదుర్కొనుట

ధృతరాష్ట్రునికి సమాధానంగా సంజయుడు ఇలా చెప్పసాగాడు " మహారాజా ! పాండవ ప్రముఖులు అభిమన్యునికి సాయంగా పద్మవ్యూహంలో ప్రవేశించి కురుసేనను నిర్మూలించడం మొదలు పెట్టారు. అది చూసిన కౌరవ యోధులు నిశ్చేష్టులు అయ్యారు. పాంచాల, మత్స్య, యాదవ, కేకయ ప్రముఖులు ధర్మరాజుకు తోడుగా నిలిచి పోరాడుతున్నారు. అప్పుడు సైంధవుడు పాండవులను ఎదుర్కొన్నాడు. ఆ మాటలు విన్న ధృతరాష్ట్రుడు " అదేమిటి సైంధవుడు మహావీరుడే అయినా అతడు పాండవులను ఎదుర్కొనడమేమిటి. అంతటి శక్తి రావడానికి అతడు చేసిన తపస్సేమిటి " అన్నాడు. సంజయుడు ధృతరాష్ట్రునితో " మహారాజా ! పాండవులు అరణ్యవాసం చేసే సమయంలో ఒక రోజు సైంధవుడు భీముని చేతిలో ద్రౌపది కారణంగా భంగపడ్డాడు కదా ! ఆ అవమానం భరించ లేక ఈశ్వరుని గురించి తపస్సు చేసి ప్రసన్నుని చేసుకుని పాండవులను జయించు వరం కోరాడు. అందుకు శివుడు " అర్జునుడిని తప్ప మిగిలిన వారిని ఒక్క రోజు మాత్రం నివారించ గలవు " అని వరం ప్రసాదించాడు. ఆ వర ప్రభావంతో సైంధవుడు పాండవులను అడ్డగించగలిగాడు. అభిమన్యుడు పద్మవ్యూహంలో ప్రవేశించగానే సైంధవుడు వర ప్రభావం కారణంగా వారిని అడ్డుకుని మూడు బాణములతో సాత్యకిని, ఎనిమిది బాణములతో ధృష్టద్యుమ్నుని, ఇరవై బాణములతో, విరాటుని, పది బాణములతో శిఖండిని, ఏడు బాణములతో పాంచాల భూపతిని , పదిహేను బాణములతో దరుపదీ సుతులను, ఇరవై అయిదు బాణములతో కేకయరాజులను, డెబ్బై అయిదు బాణములతో ధర్మరాజుని కొట్టాడు. ధర్మరాజు సైంధవిని విల్లు విరిచి అతడిపై అతి క్రూర బాణములు గుప్పించాడు. సైంధవుడు మరొక విల్లు అందుకుని మంటలు విరజిమ్మే బాణములను ధర్మజుని పైన అతడి అనుచరముల పైన వేసాడు. భీమసేనుడు సైంధవుని ఎదుర్కొని మూడు బాణములతో అతడి విల్లును, కేతనమును, ఛత్రమును విరిచాడు. నీ అల్లుడు మరొక బాణమును చేతబట్టి భీముని ఛత్రమును, కేతనమును, కేతరుగకొట్టానమును, రధమును విడు. రధము విరిగిన భీముడుపక్కనే ఉన్న సాత్యకి రధము ఎక్కి సైంధవునిపై అనేక అస్త్రములు వేసాడు. సైంధవుడు వాటిన్నటిని మధ్యలోనే త్రుంచి పాండవ సేన మీద అతిక్రూర నారాచములు వేసాడు. సైంధవుని అస్త్ర ధాటికి తట్టుకోలేని పాండవసేన పారిపోయింది. ఈ ప్రకారం సైంధవుడు పాండవ సేనను పద్మవ్యూహములో ముందుకు పోకుండా అడ్డుకున్నాడు. పాండవులకు సైంధవునకు సమరం ఘోరంగా సాగుతుంది.

## అభిమన్యుని శౌర్యం

ద్రోణుని ప్రోత్సాహంతో వెనుతిరిగిన కౌరవ సైన్యం తిరిగి వచ్చి అభిమన్యుని చుట్టుముట్టి అతడి మీద బాణములు గుప్పించారు. అభిమన్యుడు వారిని అందరిని సంహరించి సింహఘర్జన చేసి కౌరవ సేనలో భయోత్పాతాలు సృష్టించాడు. వృషసేనుడు తన సైన్యంతో అభిమన్యుని ఎదుర్కొని క్రూరనారాచములు ప్రయోగించాడు. అభిమన్యుడు కోపంతో వృషసేనుని కేతనము విరిచి,


అభిమన్యుని చేతిలో ప్రముఖులైన కురు వీరుల మరణం

అశ్వములను గాయపరిచాడు. వృషసేనుడి శరీరం అంతా పదునైన బాణములు దింపి మూర్చిల్ల చేసాడు. అతడి రధమును ఈడ్చుకుంటూ రధాశ్వములు ఎటో తీసుకు వెళ్ళాయి. ఇంతలో శౌర్యధనుడైన వసాపతి భూపతి ఆరు బాణములతో అభిమన్యుని కొట్టాడు. అభిమన్యుడు ఒకే బాణంతో వసాపతి భూపతిని కొట్టాడు. అతడి చావు చూసిన కురుప్రముఖులు తమ సైన్యాలతో అభిమన్యునిపై లంఘించి అభిమన్యుని క్రోధాగ్నిలో కార్చిచ్చులో పడిన మిడుతల వలె మాడి పోయారు. కురుసేన అభిమన్యుని ధాటికి ఆగలేక మిగిలిన పారిపోయారు. అది చూసిన కురు వీరులు యోధులు నానాదేశ రాజులు అందరూ ఆలోచించుకుని ఒక్కుమ్మడిగా అభిమన్యుని మీదకు ఉరికారు. అభిమన్యుడు లేళ్ళ గుంపు మీదకు ఉరికిన పులి వలె వారి మీదకు లంఘించి వారందరిని మట్టుబెట్టాడు. తెగి పడిన అంగములు, మాంస ఖండములు, ఏనుగులు, హయములు, కళేబరములు రణరంగం అంతా చెదిరి పడ్డాయి.

### అభిమన్యుడు కౌరవసేనను మట్టుబెట్టుట

అభిమన్యుడు ఎదుట నిలువడానికి ఎవరికి ధైర్యం లేదు. దొరికిన వారిని దొరికినట్లు చంపుతున్నాడు. కురుసేన అంతా భయంతో నలుదిక్కుల పారిపోయారు. శల్యుని కుమారుడు రుక్మరధుడు వచ్చి " వీడికి నేను ఓడేదేమిటి. నేను వీడిని పట్టి ఇస్తాను నా పరాక్రమము ఏమిటో మీకు తెలుస్తుంది. మీకేమి భయం లేదు " అన్నాడు. అని అభిమన్యుని ఎదుర్కొని తొమ్మిది బాణములను అభిమన్యుని భుజముల మీద వక్షస్థలము మీద నాటాడు. అభిమన్యుడు ఒకే బాణంతో వాడి తల నరికాడు. రుక్మధరుని మరణము చూసిన అతడి స్నేహితులు, సాటి రాజులు ఒక్కుమ్మడిగా అభిమన్యుడి మీద విజృంభించి అతడి మీద శరములు గుప్పించారు. వారి శరములలో కనిపించని అభిమన్యుని రధం చూసి సుయోధనుడు అభిమన్యుడు మరణించాడని సంతోషించాడు. అభిమన్యుడు తన శత్రువులపై గంధర్వ మాయను ప్రయోగించాడు. ఆ గంధర్వ మాయ పూర్వము అర్జునుడి తపస్సుకు మెచ్చి తుంబురుడు అర్జునుడికి ప్రసాదించాడు. అర్జునుడు దానిని అభిమన్యునికి ప్రసాదించాడు. గంధర్వ మాయా ప్రభావం వలన ఎంతో మంది వీరులు తమపై బాణములు కురిపిస్తున్నట్లు భ్రమ కలిగిస్తుంది. ఆ దృశ్యములకు శత్రుసేన భయముతో వణికింది. అభిమన్యుడు వారి చుట్టూ తిరుగుతూ వారిని సంహరిస్తున్నాడు. కొంతసేపటికి వారంతా మృతులై ఉన్నారు. అభిమన్యుని యుద్ధనైపుణ్యం చూసి కౌరవసేన ఆశ్చర్యపోయింది. ఇది పనికాదని తలచి సుయోధనుడు స్వయంగా అభిమన్యునితో యుద్ధం చేసాడు. కాని అభిమన్యుని ధాటికి ఆగలేక ప్రాణములు దక్కించుటకు అక్కడి నుండి తొలగి పోయాడు. దృతరాష్టుడు అభిమన్యుని పరాక్రమము విని " సంజయా ! ఒక్క బాలుడు ఇంత మందిని వధించాడా ! నమ్మ లేక పోతున్నాను. అవునులే అభిమన్యుడు ధర్మాన్ని ఆశ్రయించాడు. ధర్మం ఎప్పుడూ అధర్మాన్ని జయిస్తుంది కదా ! " అన్నాడు.

## అభిమన్యుడు లక్ష్మణ కుమారుని వధించుట

అభిమన్యుని పరాక్రమ ధాటికి ఎందరో రాజులు మరణించారు. సుయోధనుడు మొదలగు వారు పారిపోయారు. నీ కుమారులకు చెమటలు పట్టి దిక్కులు చూస్తున్నారు. పారిపోయిన సుయోధనుడు అశ్వత్థామ, కృప, కర్ణ, కృతవర్మ, బృహద్బలుడు, శకుని మొదలగు వారిని కూడగట్టుకుని అభిమన్యుని ఎదుర్కొన్నాడు. అభిమన్యుడు మేఘఘర్జన చేసి పిడుగు వలె వారి మీద పడ్డాడు. సుయోధనుని కుమారుడు నీ మనుమడు లక్ష్మణకుమారుడు అభిమన్యుని ఎదుర్కొని నిరంతర శర ప్రయోగం చేసాడు. తన కుమారుని విడువలేని సుయోధనుడు అభిమన్యునితో పోరు చేస్తున్నాడు. అభిమన్యుడు లక్ష్మణకుమారుని మీద బాణములు గుప్పించాడు. ఇరువురి నడుమ పోరు ఘోరరూపం దాల్చింది. అభిమన్యుడు ఒకే బాణంతో లక్ష్మణకుమారుని తల తెగనరికాడు. తన కుమారుని మరణం కళ్ళారా చూసిన సుయోధనుడు మిక్కుటమైన కోపంతో ఊగిపోతూ వీడిని కొట్టండి, నరకండి, చంపండి అని ఆక్రోశించాడు. కృతవర్మ, కృపాచార్యుడు, ద్రోణుడు, అశ్వత్థామ, కర్ణుడు, బృహద్బలుడు అత్యంత ప్రభావం కల శరములు అభిమన్యునిపై వేసారు. అభిమన్యుడు ఆ బాణములను త్రుంచి తన సారధితో రధమును సైంధవుని వైపు మళ్ళించమని చెప్పాడు. ఇంతలో కళింగులు నిషాదులు తమ తమ సైన్యంతో వచ్చి అభిమన్యుని ఎదుర్కొన్నారు. అభిమన్యుడు వారితో వీరావేశంగా పోరుతున్నాడు. అక్కడ సైంధవుడు పాండవులను పద్మవ్యూహం లోకి రానీయకుండా అడ్డుకుంటున్నాడు. అభిమన్యుడు ద్రోణునిపై ఏభై బాణములు, కృతవర్మ

మీద ఎనభై బాణములు, అశ్వత్థామ మీద పది బాణములు కర్ణుని మీద ఒక్క బాణము వేసి నొప్పించాడు. కృపాచార్యుని రధము విరుగకొట్టాడు. బృహద్బలుని శరీరంపై ముప్పై బాణములు వేసి నొప్పించాడు. వారికి సహాయంగా ఉన్న వారిని అంసంఖ్యాకమైన బాణములతో నిర్మూలించాడు. క్రోధలిప్తుడు, బృందారకుడు అను రాజులు శిరస్సులు ఖండించాడు. కృపాచార్యుడు వేరొక రధం ఎక్కి అభిమన్యునిపై బాణములు గుప్పించాడు. బృహద్బలుడు వారినందరిని తోసుకుని వచ్చి అభిమన్యుని ఎదుర్కొన్నాడు. అభిమన్యుడు వాడి అయిన బాణములతో బృహద్బలుని సారధిని చంపి విల్లు విరిచి కేతనమును విరిచి, రధాశ్వములను చంపాడు. బృహద్బలుడు కత్తి డాలు తీసుకుని అభిమన్యునితో యుద్ధం చేయ సాగాడు. అభిమన్యుడు ఒకే భల్లబాణంతో బృహద్బలుని శిరస్సు ఖండించాడు. అది చూసి తమ రాజును చంపినందుకు కోసలరాజు బంధు మిత్రులు ఒక్కసారిగా అభిమన్యునిపై పడ్డారు. వారినందరిని యమపురికి పంపి అభిమన్యుడు కర్ణుని మీదకు వచ్చాడు. అభిమన్యునికి కర్ణునికి మధ్య పోరు ఘోరమైంది. ఒకరి శరీరములు ఒకరు రక్తసిక్తం చేసుకున్నారు. ఇంతలో కర్ణుని సైన్యాధిపతులు ఆలోచించుకుని ఒక్కసారిగా అభిమన్యుని ఎదుర్కొన్నారు. అభిమన్యుడు వారిని చూసి చిరునవ్వు నవ్వి వారిని ఒక్కొక్క బాణంతో ఒక్కొక్కరిని అంతమొందించాడు. తరవాత ద్రోణుడు మొదలగు కౌరవ ప్రముఖుల మీదకు దృష్టి మళ్ళించాడు. మగధరాజ కుమారుడు బాలుడైనా అభిమన్యుని ధైర్యంగా ఎదుర్కొన్నాడు. అభిమన్యుడు అతడి సూతుని, హయములను చంపి మరొక బాణంతో అతని తల తెగనరికాడు. అభిమన్యుడు సింహనాదం చేసాడు. అది చూసి దుశ్శాసనుడి కుమారుడు అభిమన్యుని ఎదుర్కొన్నాడు అభిమన్యుడు అతడి రధాశ్వములను, సారధిని కొట్టి " కుమారా ! నీ తండ్రి దుశ్శాసనుడు నా ముందు నిలువ లేక పారిపోయాడు. ఇప్పుడు నువ్వు వచ్చావా ! నా ప్రతాపం రుచి చూడు " అని ఒకేఒక నారసముతో బాణంతో దుశ్శాసనుడి కుమారుని వక్షస్థలము మీద కొట్టాడు. ఇంతలో అశ్వత్థామ ఆ బాణమును మధ్యలో త్రుంచి దుశ్శాసనుని కుమారుని రక్షించాడు. అభిమన్యుడు కనీసం అశ్వత్థామ వైపు చూడకుండా దుశ్శాసన కుమారుని విల్లు త్రుంచి, అతడి సారధిని చంపి, ఆరు బాణములు అతడి గుండెలో దించాడు. అభిమన్యుని ధాటికి తాళలేక దుశ్శాసనుడి కుమారుడు పారిపోయాడు.


అభిమన్యుడు లక్ష్మణ కుమారుని వధించుట

## అభిమన్యుని మరణం

అపహార్ణం వరకు యుద్ధం సంకులంగా జరిగింది. శత్రుంజయుడు, సువర్చనుడు, చంద్రకేతుడు, సూర్యభానుడు, మేఘవేగుడు మొదలైన వారు ఒక్కుమ్మడిగా అభిమన్యునిపై పడ్డారు. అభిమన్యుడు తన అస్త్రశస్త్రములతో వారిని అందరిని దూరంగా తరిమి కొట్టాడు. శకుని అభిమన్యుని ఎదుర్కొన్నాడు. అభిమన్యుడు అతడిని తీవ్రమైన శరాఘాతముతో నొప్పించి తనరధమును సుయోధనుని వైపు పోనిచ్చాడు. ఇది చూసిన కర్ణుడు " ఆచార్యా ! కౌరవ సేనలో మహామహులను ఓడించినభిమన్యుడు సుయోధనుడి మీదికి పోతున్నాడు. ఈ సమయంలో మీరు ఊరక ఉండుట తగునా ! ఏదైనా ఉపాయం ఆలోచించి అభిమన్యుని చంపండి " అని సుయోధనుడికి సాయంగా వెళ్ళాడు. అప్పుడు ద్రోణుడు " అభిమన్యుడు చిన్న వాడైనా తన తండ్రి అర్జునికి సమానంగా యుద్ధం చేస్తున్నాడు ఇక ఉపేక్షించరాదు. మనమంతా ఒక్కుమ్మడిగా అతడిని ఎదుర్కొన వలెను " అని పలికాడు. ఇంతలో అభిమన్యుని చేతిలో చావు దెబ్బలు తిని కర్ణుడు అక్కడికి వచ్చి ద్రోణుడితో " ఆచార్యా ! చూసారా అభిమన్యుడు నన్ను ఎలా దెబ్బ తీసాడో ! నేను మీ దగ్గరే ఉంటాను ఇంతకంటే నాకు సురక్షిత ప్రదేశం లేదు. అర్జునుడి పరాక్రమం గురించి విన్నాను కాని అతడి కొడుకు అంతకంటే పరాక్రమవంతుడు అని అర్ధం అయ్యింది " అన్నాడు.

### అభిమన్యుడిని కపటోపాయముతో చంపమని ద్రోణుడు చెప్పుట

అప్పుడు ద్రోణుడు కర్ణుని చూసి " కర్ణా ! నేను అర్జునుడికి కవచధారణ విధ్య ఉపదేశించాను. దానిని అర్జునుడు తన కుమారుడికి ఉపదేశించాడు. ఆ కవచ ధారణ విధ్య వలన అతడి శరీరంపై ఎవరూ శరములు నాట లేరు. ఎదో వంచన చేసి అతడిని మనం చంపాలి. అభిమన్యుని చేతిలో విల్లు ఉన్నంతవరకు మనం అతడిని చంపలేము. యోధులంతా అతడిపై దాడి చేసి ఒకరు అతడి విల్లును త్రుంచాలి, వేరొకరు అతడి సారధిని చంపాలి, మరొకరు అతడి రధం విరుగ కొట్టాలి కాని ఇవన్నీ ఏక కాలంలో జరగాలి. నీకు చేతనైతే అభిమన్యుని ఈ కపటోపాయంతో చంపు " అన్నాడు. అది విని కర్ణుడు ఆలోచించి అక్కడి యోధులను కూడగట్టుకుని ఒక్కుమ్మడిగా అభిమన్యునిపై లంఘించాడు. కొంత మంది అతడి విల్లు విరిచారు, ద్రోణుడు అతడి


అభిమన్యునిపై ఒకేసారి దాడి చేసిన అనేక మంది మహారథులు

రధాశ్వములను చంపాడు, కృపాచార్యుడు అతడి రధసారధిని చంపాడు, అభిమన్యుడు నిరాధయుడు విరధుడు అయ్యాడు. అదే తగిన సమయమనుకుని బాహ్లికుడు, శకుని, శల్యుడు, అశ్వత్థామ, కృతవర్మ అతడి మీద బాణవర్షం కురిపించారు. అభిమన్యుడు ఖడ్గము డాలు తీసుకుని రధము మీద నుండి కిందకు దూకి గాలిలో గిరగిరా తిరుగుతూ కౌరవ యోధులను ఖండించాడు. అభిమన్యుడు ఎప్పుడు తన తల ఖండిస్తాడో అని యోధులంతా అక్కడి నుండి పారి పోయారు. ద్రోణుడు ఒక బల్లెము తీసుకుని అభిమన్యుడి ఖడ్గం విరిచాడు. కర్ణుడు అభిమన్యుని డాలు విరిచాడు. అప్పుడు అభిమన్యుడు రధములోని చక్రాయుధం తీసి దానిని గిరగిరా త్రిప్పుతూ శత్రు సేనలను చంపుతూ సింహనాదం చేసాడు. రక్తసిక్తమైన అతడి ముఖమును చూసిన శత్రు సేనలు భయభ్రాంతం అయ్యాయి. అభిమన్యుడు తన చక్రాయుధంతో శత్రువులు వేస్తున్న బాణములు ఖండిస్తూ శత్రుసంహారం చేస్తున్నాడు. ద్రోణుని వైపు దూసుకు పోతున్నాడు. అడ్డు వచ్చిన కౌరవ సైన్యాన్ని చీల్చి చెండాడుతున్నాడు. ఆ సమయమున శకుని, కృతవర్మ, కృపాచార్యుడు, శల్యుడుమొదలైన యోధులు ఒకటిగా కూడి అభిమన్యుని చక్రయుధం ఖండించారు. అప్పుడు అభిమన్యుడు తన గధను తీసుకుని అశ్వత్థామను ఎదుర్కొన్నాడు. అభిమన్యుని దెబ్బకు భయపడి అశ్వత్థామ రధం నుండి దూకి రధం వెనక్కు పోయి దాక్కున్నాడు. అప్పుడు అభిమన్యుడు అశ్వత్థామ సారధిని, రధాశ్వాలను చంపాడు. అభిమన్యుడు శకుని మీద లంఘించి అతడికి సాయంగా ఉన్న ఇరవై ఏడు మంది యోధులను గధాయుధంతో చంపాడు. గజములపై పది మంది యోధులు అభిమన్యుని ఎదుర్కొన్నారు అభిమన్యుడు వారిని గజములతో సహా యమపురికి పంపాడు. కేకయరాజులను ఏడుగురిని ఒక్క సారిగా యమపురికి పంపాడు. ఇంతలో దుశ్శాసనుడి కుమారుడు అభిమన్యుని ఎదుర్కొని అభిమన్యునిపై


అభిమన్యుని మరణం

అనేక శరములు గుప్పించాడు. అభిమన్యుడు అతడు వేసిన బాణములను గధాదండంతో అడ్డుకుని అతడి అశ్వములను, సారధిని చంపి అతడి రధమును విరుగకొట్టాడు. దుశ్శాసనుడి కుమారుడు గధాయుధంతో అభిమన్యుని ఎదుర్కొన్నాడు. వారిరువురి మధ్య పోరు ఘోరంగా సాగింది. ఇరువురి శరీరం నుండి రక్తం ధారగా కార సాగింది. యోధులంతా యుద్ధం మాని వారి పోరు చూస్తున్నారు. అభిమనుడు దుశ్శాసన కుమారుడు గధలతో మోదుకుని కిందపడ్డారు. గాయపడిన వారి శరీరముల నుండి ప్రాణములు వేరయి స్వర్గలోకం చేరాయి. అప్పటికీ కసి తీరని కౌరవ యోధులు చుట్టుముట్టి కత్తులతో పొడిచి పొడిచి చంపారు. సూర్యుడు అస్తమించాడు. పాండవుల కీర్తిని ఇనుమడింప చేస్తూ అభిమన్యుడు కౌరవయోధులతో అత్యంత పరాక్రమంతో పోరాడి వీరస్వర్గం అలంకరించాడు. ధృతరాష్ట్ర మహారాజా ! ఆ విధంగా యోధాను యోధుడైన అభిమన్యుడు రణరంగమున మరణించగానే కౌరవసేనల్లో ఆనందోత్సాహాలు వెల్లివిరిసాయి. ఆ సమయాన అక్కడ చేరిన భూతగణాలు " అభిమన్యుని అమానుషంగా అధర్మ యుద్ధంలో అన్యాయంగా పలువురు కలిసి వధించారు " అని ఆక్రోశించాయి. అభిమన్యుడు మరణించగానే పాండవ సేనలు పారిపోయాయి. ఇదంతా దూరం నుండి చూస్తున్న ధర్మరాజు " మన అభిమన్య కుమారుడు దుర్భేద్యమైన వ్యూహంలో ప్రవేశించి హయములను, గజములను చంపి రధములను విరిచి, పదాతి దళమును తనుమాడి. అనేక సైనిక ప్రముఖులను చంపి ద్రోణుడు మొదలైన మహాయోధులను భయభ్రాంతులను చేసి వీరస్వర్గం అలంకరించాడు. అటువంటి మహాయోధుని మరణముకు చింతించ పని లేదు " అన్నాడు. అప్పటికే చీకట్లు కమ్మాయి. ఆ రోజుకు యుద్ధము మాని వారి వారి శిబిరాలకు వెళ్ళారు. కౌరవ సేనలో ఆనందోత్సాహాలు నిండగా పాండవ యోధుల్లో విషాద ఛాతలు కమ్ముకున్నాయి.

## ధర్మరాజు అభిమన్యుని మరణానికి చింతించుట

ధర్మరాజు తన శిబిరంలో కూర్చుని ఇలా " చింతిస్తున్నాడు. " ద్రోణాచార్య సురక్షితంమైన దుర్భేద్యమైన పద్మవ్యూహం

ఛేధించుటకు అభిమన్యుని ఏల పంపవలె. నన్ను సంతోషపెట్టుటకు అభిమన్యుడు ఏల పద్మవ్యూహంలోకి చొరబడవలె. దుశ్శాసనాధి కురుప్రముఖులను ఓడించుట అనేక మంది యోధులను చంపుట పసి బాలునకు సాధ్యమా ? ఇది ఒరులకు ఏల సాధ్యము. అర్జునుడు వచ్చి ఏడీ నా కొడుకు అని అడిగిన నేను ఏమి చెప్పవలె. కృష్ణుడు వచ్చి నా గారాల మేనల్లుడు ఏడీ అని అడిగిన నేను ఏమి చెప్పవలె? అయ్యో ! బాలుడు సుకుమారుడు అయిన అభిమన్యునికి యుద్ధరీతులు ఏమి తెలియును. మహావీరులకే దూర శక్యముకాని పద్మవ్యూహము లోకి నేను ఎందుకు పంపించాను. పెద్దలు పిన్నలకు బహు ప్రియముగా బహుమానము ఇత్తురు నేను యుద్ధమునకు పంపి మరణముకు కారణమయ్యాను. నేను ఎంతటి పాషాండుడను. అభిమన్యునితో నేను పాటు నేను ఎందుకు మరణించ లేదు. పుత్రశోకంతో అలమటించే అర్జుడిని నేను ఎలా ఓదార్చగలను. కాలకేయులను చంపి ఇంద్రుడు అంతటి వాడిని ఆదుకున్న అర్జునుడు కుమారుడు ఇలా పగవారి చేత హతుడుకావలసిన దుర్దశ దాపురించింది కదా! తన కొడుకును చంపారన్న కోపంతో అర్జునుడు ద్రోణాదులను చంపవచ్చును కాని మరణించిన కుమారుడు రాడు కదా! ఈ భూమిలోని సకల సంపదలు స్వర్గలోక సుఖములు సహితం చిరునవ్వులు చిందించు అభిమన్య ముఖారవిందముకు సాటి రావు కదా ! " అని పరి పరి విధముల విలపిస్తున్నాడు.

## వ్యాసుని రాక

అప్పుడు ధర్మరాజు వద్దకు వ్యాసుడు వచ్చాడు. ధర్మరాజు ఆ మహామునికి అర్ఘ్యపాద్యములు సమర్పించి సత్కరించి ఇలా అన్నాడు. " మహానుభావా ! శత్రుసేనలను జయించడానికి నేను అభిమన్యుని పంపాను. అభిమన్యుడు శత్రుసేనలను ఎదుర్కోడానికి పద్మవ్యూహములో జొరపడ్డాడు. వెంటనే మేము కూడా వెళ్ళాము కాని పరమశివుని వరప్రభావంతో సైంధవుడు మమ్ము అడ్డుకున్నాడు. అప్పుడు కౌరవయోధులు పెక్కు మంది అభిమన్యుని చుట్టుముట్టి రకరకములైన ఆయుధములతో అధర్మంగా చంపారు. బాలుని ఒంటరిగా యుద్ధముకు పంపిన నాలాంటి పాపాత్ముడు ఎక్కడైనా ఉంటాడా ! విపరీతమైన దు:ఖంతో నా మనసు ఉడికి పోతుంది నా పాపానికి నిష్కృతి లేదు " అని విలపించాడు. వ్యాసుడు " ధర్మజా ! శోకింపకుము. ఎంతోమంది యోధాను యోధునులను చంపిన అభిమన్యుడు బాలుడా ! శత్రువులు అతడి మీద క్రూరబాణములు వేయక పూలబాణములు వేస్తారా ! తెలివి విపత్తులు కలవారు నీలా శోకించరు. మరణం ఈ లోకంలోని ప్రాణులకు సహజం . గరుడ, ఉరగ, దానవులకే మరణం జయింప శక్యము కానిది. మానవ మాత్రులము మనమెంత . విధిని తప్పించుట ఎవరికి సాధ్యము. కనుక ధైర్యము తెచ్చుకుని కాగల కార్యము గురించి ఆలోచింపుము " అని పలికాడు. మునీంద్రా ! ఈ భూమిని ఏలిన ధైర్యశాలులైన, పరాక్రమవంతులైన రాజులు మహాత్ములు ఒక్కరు కూడా మృత్యుముఖము నుండి తప్పించుకొనుటకు సాధ్యము కాలేదే ఎందుకు " అని అడిగాడు.

## అకంపనుని గాధ

ధర్మరాజు అడిన దానికి సమాధానంగా వ్యాసుడు ఇలా చెప్పాడు. " ధర్మరాజా ! పూర్వం అకంపనుడు అనే రాజు పుత్రశోకంతో పరితపిస్తూ నారదుని వలన మృత్యువు గురించి వవరంగా విన్నాడు. ఆ కథ వింటే నీ మనసుకు శోకము పోయి శాంతి చేకూరుతుంది. పూర్వము అకంపనుడు అనే రాజు ఉండే వాడు. అతడి మీద శత్రువులు దండెత్తి వచ్చి అతడిని పట్టి బంధించి కారాగారంలో బంధించాడు. అది చూసిన అతడి కుమారుడు హరి అను వాడు శత్రువులను ఎదిరించి వారిని జయించి తన తండ్రి అకంపనుడిని చెర నుండి విడిపించి తిరిగి శత్రువులతో పోరాడగా వారు ఒక్కుమ్మడిగా చుట్టుముట్టి అతడిని చంపారు. అకంపనుడు విజృంభించి తన అవక్ర పరాక్రమంతో వారిని జయించి రాజధానిలో అడుగు పెట్టాడు. అయునా పుత్రశోకంతో దు:ఖిస్తుండగా నారదుడు అక్కడకు వచ్చాడు. అకంపనుడు నారదమహర్షికి అర్ఘ్యపాద్యములు ఇచ్చి సత్కరించి జరిగినదంతా చెప్పి తనకు లభించిన విజయం కూడా కుమారుని మరణం వలన సంతోషం కలిగించలేదని విలపించాడు. అకంపనుడు నారదునితో " నారద మునీంద్రా ! మృత్యువును ఈ లోకంలో ఎవరూ ఎదిరించ లేదని విన్నాను. అది ఎలా మృత్యువు జననం గురించి వనవలెనని కుతూహలంగా ఉన్నది వివరించండి " అని అడిగాడు.

## ప్రజాపతి తన కోపానలంతో లోకాలను దహించుట

నారదుడు " అకంపనా ! బంధువుల మరణం వలన కలుగు దు:ఖం పోగొట్టు కధను వినిపించెదను వినుము. మొదట ప్రజాపతి ప్రజలను సృష్టించాడు కాని చావును సృష్టించ లేదు. వారికి చావు లేని కారణంగా భూమికి భారం ఎక్కువైంది. ప్రజలు చనిపోవడానికి తగిన ఉపకరణం కనిపించక ప్రజాపతి చింతాక్రాంతుడై ఉండగా అతని ఇంద్రియముల నుండి మంటలు చెలరేగి భూమి మీద ఉన్న భూతకోటిని దహించసాగాయి. మహాశివుడు సృష్టి అలా దహించుకు పోవడం చూసి సహించ లేక పోయాడు మహాశివుడు. లోక కల్యాణార్ధం బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళాడు. ప్రజ్వరిల్లి పోతున్న బ్రహ్మదేవుడు శివుని చూసి "

మహాశివా ! నీవు నా వద్దకు వచ్చిన కారణమేమి అడుగుము నెరవేర్చెదను " అన్నాడు. అప్పుడు శివుడు " బ్రహ్మదేవా ! అఖిల సృష్టికి కర్తపైన నీవే ఇలా దహించుట తగునా! నా అందు దయ ఉంచి సప్త లోకములను దయతో ఆదరింపుము " అన్నాడు. బ్రహ్మదేవుడు " పరమశివా! నా యందు కోపము కాను కామము కాని లేవు. ప్రజలను సృష్టించాను కాని మరణం సృష్టించ లేదు. కనుక భూభారం ఎక్కువైంది. భూభారం ఎక్కువైందని భూదేవి నన్ను కోరింది. భూదేవికి హితము చేయకోరి ఈ సంహార క్రియ చేయుచున్నాను. భూభారం తగ్గించుటకు నాకు ఇంతకన్నా ఉపాయం తోచలేదు. ఆ కారణంగా నాలో కోపం ప్రవేశించింది. నా కోపానల జ్వాలలలో భూతకోటి భస్మీపటలం ఔతుంది " అని పలికాడు. శివుడు " అనఘా ! నీ ఆజ్ఞ మేరకు నీవు సృష్టించిన ప్రాణులను నేను పాలిస్తున్నాను. నీవు ఇప్పుడు నీ కోపానల జ్వాలలతో భూతకోటిని భస్మీ పటలం కావించుట న్యాయమా ! ఇది నీకు తగునా ! భూభారం తగ్గించుటకు చరాచర జగత్తును ఒక్క పెట్టున భస్మీపటలం కావించవలెనా ! వేరొక ఉపాయం ఆలోచించి సంహారక్రియ ఒక పద్ధతి ప్రకారం సాగించవచ్చు కదా ! ఈ సంహార క్రియ అనే వరం నాకు ప్రసాదించండి " అని కోరాడు. బ్రహ్మదేవుడు తన కోపానలము ఉపసంహరించుకున్నాడు. సకల భువనాలు శివుని, బ్రహ్మదేవుని స్తుతించాయి.

### మృత్యుదేవత జననం

కోపానలము ఉపసంహరించుకున్న సమయంలో బ్రహ్మదేవుని నుండి ఎర్రటి కన్నులతో, ఎర్రని చీర కట్టుని రక్త వర్ణంతో ఒక స్త్రీ ఆవిర్బవించింది. ఆమె వారిరువురిని చూసి దక్షిణదిశగా పోతుంది. అప్పుడు బ్రహ్మదేవుడు " ఓ మృత్యుదేవతా ! ఎక్కడికి పోతున్నావు ఇలారా " అనగానే ఆమె బ్రహ్మదేవుని ఎదుట నిలిచింది. బ్రహ్మదేవుడు " ఓ మృత్యుదేవతా ! నాలో సంహారం చేయాలన్న కోరిక కలగగానే నీవు పుట్టావు కనుక నీవు పక్షపాతబుద్ధి లేక ఒక పద్ధతి ప్రకారం ఈ చరాచర జగతిని సంహరిపుంము. నీవు నా ఆజ్ఞను అనుసరించి ఈ కార్యము నిర్వహిస్తున్నావు కనుక నీకు పాపం అంటదు " అని ఆజ్ఞాపించాడు. అది విన్న మృత్యుదేవత దుఃఖించింది. బ్రహ్మదేవుడు ఆమె కన్నీటిని దోసిట పట్టి ఆమెను ఎన్నో విధముల అనునయించాడు. అప్పుడు మృత్యుదేవత శోకంతో " ఓ మహానుభావా ! నీవు నన్ను సృష్టించి ఈ పాపకార్యానికి నియోగిస్తావా? బంధుమిత్రుల మరణం వలన శోకంతో విలపిస్తున్న వారి రోదనలు వినలేను. ఈ అధర్మమునకు నేను ఒడిగట్టలేను స్వామీ నా మీద దయ ఉంచి తపస్సుచేసుకొనుటకు అనుమతిస్తే నేను ధేనుకాశ్రమము పోయి తపస్సు చేసుకుంటాను " అని పలికింది. అప్పుడు బ్రహ్మదేవుడు " ఓ మృత్యుదేవతా ! నేను నిన్ను సంహారముకు మాత్రమే సృష్టించాను కనుక సంశయం వదిలి నా ఆజ్ఞ ప్రకారం సంహారక్రియ నెరవేర్చుము " అని ఆజ్ఞాపించాడు. ఆ యనకు భయపడి అంగీకరించినట్లు అక్కడే నిలబడిపోయింది మృత్యుదేవత. తన ఆజ్ఞ పాటించినందుకు బ్రహ్మదేవుడు సంతోషించాడు. తాను సృష్టించిన లోకాల వైపు చూడగా అవి అన్ని సంతోషించాయి. తాను వచ్చిన పని అయినందుకు పరమశివుడు కూడా కైలాసముకు వెళ్ళాడు. మృత్యుదేవత బ్రహ్మకు నమస్కరించి ధేనుకాశ్రముకు వెళ్ళి అచ్చట నంద, కౌశికి నదుల చెంత అత్యంత నియమ నిష్టలతో ఎన్నో వ్రతములు చేసింది. హిమాలయ పర్వతాల మీద ఘోరతపస్సు చేసింది. ఆమె తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమైన బ్రహ్మదేవుడు " ఓ మృత్యుదేవతా ! నీవు ఎందుకు ఇంత నియమ నిష్టలు ఆచరిస్తావు " అని అడిగాడు. అందుకు మృత్యుదేవత " నేను ప్రజల మెడలు నులిమి చంపలేను నన్ను ఈ పనికి పంప వద్దు. ఇది అధర్మమన్న భయంతో నిన్ను ఆశ్రయించాను. ఆర్తితో నిన్ను శరణువేడుతున్నాను " అన్నది. బ్రహ్మదేవుడు " నీవు నా ఆజ్ఞను అనుసరించి చేస్తున్నావు కనుక ఇందు అధర్మం లేదు. నీకు కీర్తి ప్రతిష్టలు కలిగేలా నేను పరమేశ్వరుడు వరమిస్తాము. నేను సంకల్పించిన పని చేసిన నీకు అధర్మము అంటదు. నాలుగు విధములైన భూతకోటిని సంహరింపుము " అన్నాడు. మృత్యుదేవత " దేవా! నేను నీ ఆజ్ఞను నీవు చెప్పినట్లు చేస్తాను. నాదొక్క విన్నపము వినుడు. ప్రాణులలో లోభము , క్రోధము, లోభము, ఈర్ష్య, అసూయ కలిగేలా చేస్తే నేను నా విధిని సక్రమంగా నెరవేర్చగలను " అని కోరింది.

### వ్యాధులు రోగాలు

బ్రహ్మదేవుడు " అలాగే చేస్తాను అంతేకాదు నీవు దుఃఖించినపుడు నీ కన్నీటి బిందువులను నా దోసిట పట్టాను కదా ! ఆ కన్నీరు ఒక్కొక్క అశ్రువు ఒక్కొక్క వ్యాధిగా ప్రజ్వరిల్లి భూతకోటిని పీడిస్తుంది కనుక వారు వ్యాధి కారణంగా మరణిస్తారు కనుక నిన్ను నిందించరు నీకు పాపము అంటదు అది అధర్మము కాదు. పరబ్రహ్మ ఆజ్ఞనుసారం ప్రాణుల ప్రాణాలు గ్రహిస్తావు కనుక నీవు పరమధర్మము నిర్వర్తిస్తుంటావు కాని అది అధర్మము కాదు. నీవు ధర్మస్వరూపిణివి, పరమేశ్వరివి సమస్త జీవుల ప్రాణములు నీ చేతిలో ఉన్నాయి. కనుక నీవు నిర్భయంగా నీ ధర్మము నెరవేర్చుము. దుర్మార్గులను వారి అధర్మపు కార్యాలే వధిస్తాయి " అని పలికాడు. తనకు పాపము అంటదని అది అధర్మము కాదని బ్రహ్మదేవుడు వచించటంతో బ్రహ్మదేవుని ఆజ్ఞను నెరవేర్చక పోయిన శాపానికి గురి కావలసి వస్తుందన్న భయం చేత మృత్యుదేవత సంహార క్రియకు అంగీకరించింది. సమస్త జీవుల దేహములు వ్యాధులతో కృశించినపుడు వారి ప్రాణములు హరిస్తూ ఉంది. జీవులు ఒక దేహమును వదిలి వేరొక దేహము ఆశ్రయిస్తున్నాయి. మానవులు కూడా అలా మాణానంతరం వేరొక దేహమును ఆశ్రయిస్తున్నాయి .

వాయుదేవుడు సర్వ వ్యాపి అపరిమిత తేజశ్శాలి ఈ చరాచర జగత్తుకు ప్రాణదాత. ప్రాణవాయువు ఈ శరీరంలో ప్రవేశించిన జననం శరీరాన్ని వదిలినపుడు మరణం సంభవిస్తాయి. దేవతలు కూడా కర్మ చేయాలంటే మానవులుగా అవతరిస్తారు. మరల మానవులు తమ ధర్మాచరణతో దైవత్వం కనుక పొందగలరు. కనుక నీ కుమారుడు స్వర్గసుఖాలు అనుభవిస్తున్నాడు. చింత వద్దు ఈ జగత్తు అంతా దు:ఖ భూఇష్టం నీకుమారుడు దు:ఖం అంటే వినపడని పుణ్య లోకమునకు పోయాడు. బ్రహ్మకల్పితమైన మరణముకు ధీరులైన వారు దు:ఖింపరు " అని నారదుడు మృత్యుదేవతా ప్రభావం గిరించి వివరించాడు. అకంపనుడు నారదునితో " నీవు చెప్పినది విన్న నా మనసున దు:ఖం తొలగి పోయి స్వస్థత చేకూరింది " అని నారదునికి నమస్కరించాడు. అప్పుడు అకంపనుడు అక్కడ నుండి అశోకవనముకు వెళ్ళాడు " అని వ్యాసుడు ధర్మరాజుకు చెప్పి " ధర్మరాజా ! ఈ కథ వ్రాసిన వారికి చదివిన వారికి ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగుతాయి. అభిమన్యుడు రణరంగమున వివిధములైన ఆయుధములతో శత్రువులతో పోరాడి వీరస్వర్గము అలంకరించి ప్రపంచ ఖ్యాతి గడించాడు. కనుక నీవు చింతింప తగదు" అని చెప్పాడు.

## ధర్మరాజు వ్యాసుని అడిగి యజ్ఞగాగాదులు వాటి ఫలితాలు తెలుసుకొనుట

వ్యాసుని మాటలతో ఊరట చెందిన ధర్మరాజు క్షత్రియ ధర్మమును అనుసరించి వీరస్వర్గమలంకరించిన అభిమన్యుడు స్వర్గ సుఖాలు అనుభవిస్తాడు కదా అనుకుని " మునీంద్రా ! ఇది వరకు ఉన్న మహారాజులు చేసిన యజ్ఞయాగములు ఏమిటి ? వాటి ఫలితము ఏమిటి " అని అడిగాడు. ధర్మరాజు మనసులో మాట గ్రహించిన వ్యాసుడు " ధర్మరాజా ! నీ కుమారుడు అభిమన్యుడు కూడా పూర్వపు మహారాజుల వంటి వాడే కనుక అభిమన్యునికి ఎలాంటి పుణ్యలోకాలు లభిస్తాయో అని ఆలోచిస్తున్నావు కదా " అన్నాడు. ధర్మరాజు మహాత్మా ! నీ దివ్యచిత్తముకు తెలియనిది ఏమున్నది దానిని గురించి వినగోరుతున్నాను " అని అన్నాడు. వ్యాసుడు " ఎన్నో యజ్ఞ యాగములు చేసిన వారు, తపస్సు చేసిన వారు, దానధర్మములు చేసిన వారు, ఉదాత్తమైన సద్గుణములు కలవారు తాము మరణించిన తరవాత పుణ్యలోకాలకు వెళ్ళి సుఖపడుతున్నారు. నిశ్వార్ధంగా అభిమన్యునిలా యుద్ధము చేసి వీరమరణం పొందిన వారు అంతకంటే ఉన్నతమైన పుణ్యలోకాలు పొందగలరు. అదీ కాకుండా మహితాత్ములైన మహారాజులు చేసిన యజ్ఞయాగాదులు వారి కర్మానుష్టానం గురించి తెలుసుకోవాలని అనుకున్నావు కనుక చెప్తాను విను.

### సృంజయుని కథ

వ్యాసుడు ధర్మరాజుకు సృంజయుని కథ వివరించుట. " పూర్వము సృంజయుడు అనే రాజు పాలిస్తుండే వాడు. అతనికి సంతానము లేదు సంతానము కొరకు అతడు ఎప్పుడూ బ్రాహ్మణులను పూజిస్తుండే వాడు. అతడికి నారదుడు ప్రియ మిత్రుడైనందు వలన సృంజయుని వద్దకు పలుమార్లు వస్తుండే వాడు. ఒక రోజుక్కడ ఉన్న బ్రాహ్మణులు అంతా కలిసి సృంజయుని కోరిక తీర్చమని ప్రార్థించారు. నారదుడు సృంజయుని వద్దకు పోయి " మిత్రమా ! నీ మనసులో ఉన్న కోరిక ఏమిటి ? నాకు ఇంత కాలము ఎందుకు చెప్పలేదు? " అని అడిగాడు. సృంజయుడు " నారదునితో తనకు గుణవంతుడు రూపవంతుడు అయిన కుమారుడు కావాలని ఆ పుత్రుని స్వేదము, మూత్రము, పురీషము, కన్నీరు అన్నీ బంగారుమయంగా ఉండాలని అలాంటి కుమారుడు కావాలని కోరుకున్నాడు. నారదుడు నవ్వి సృంజయుని కోరిక తీరుతుందని చెప్పాడు. నారదుని వర ప్రభావమున జన్మించిన కుమారునికి సృంజయుడు సువర్ణష్ఠీవి అని నమకరణం చేసి అల్లారుముద్దుగా పెంచుకుంటున్నాడు. ఆ కుమారుని వలన అతడి ఇంట్లో బంగారం దినదినాభివృద్ధిగా పెరగ సాగింది. అతడి ఇంట్లో ప్రతి వస్తువు బంగారు మయం అయింది. పడుకునే మంచము, కూర్చునే ఆసనము, ఇళ్ళు, ప్రాకారం మొదలైన సమస్త వస్తువులు బంగారుమయం అయ్యాయి. ఇది చూసిన కొందరు దొంగలు ఒక రోజు సృంజయుని కుమారుని అపహరించుకుని అరణ్యముకు పారి పోయారు. అక్కడ వారు రాజకుమారుని చంపి పొట్ట చీల్చి చూసి బంగారం కనపడక పోయేసరికి ఆ శవమును అక్కడ పారవేసి పోయారు. కాని వారు చేసిన హత్య వారిని వెంటాడి వారిలో వారికి తగాదాలు వచ్చి వారిలో వారు కొట్టుకుని మరణించారు. సృంజయుడు తన కుమారుని కానక అతడి కొరకు వెతికించి అడవిలో అతడి మృతదేహాన్ని చూసి అంత్యక్రియలు చేసాడు.

### నారదుడు రారాజులకు సైతం మరణం తప్పదని సృంజయునకు వివరించుట

పుత్రశోకంతో అలమటిస్తున్న సృంజయుని చూచుటకు నారదుడు వచ్చి " సృంజయా ! పోయిన వారిని గురించి ఏడిస్తే తిరిగి వస్తారా ! ఇలా ఏడుస్తుంటే నీ ప్రాణాలు కూడా నిన్ను విడిచి పోగలవు. కనుక శోకించ తగదు. నీతో నాకున్న మైత్రి వలన నేను నీకు కొన్ని విషయములు చెప్పదలచుకున్నాను. పూర్వము మరుత్తు అనే రాజు ఎన్నో ఎజ్ఞయాగాదులు చేసి బంగారం వెండి

వస్త్రములు దానం చేసి అమితమైన కీర్తిగడించాడు. అలాంటి మరుత్తు ఇప్పుడు ఉన్నాడా ! కాల గర్భములో కలిసి పోలేదా ! సుహోత్రుడు అనే మహారాజు అనేక పూజలు వ్రతాలు చేసాడు. అనేక అశ్వమేధయాగాలు చేసాడు కాని అతడు కూడా మరణించాడు కాని శాశ్వతంగా ఉన్నాడా ? అంగుడు అనేరాజు ఎన్నో రత్నాలు, మణిహారాలు, మణులు బ్రాహ్మణులకు దానం చేసాడు అతడు కూడా పరలోకం చేరుకోలేదా ! ఏడు దీవులలో రధాన్ని నడిపిన శిబి చక్రవర్తి ధనం కొరకు ప్రజలను అడిగింది లేదు. పరమేశ్వరుడు ఇచ్చిన ధనంతో అనేక అశ్వమేధాలు నిర్వహించాడు. లెక్కలేనన్ని గోవులను బ్రాహ్మణులకు దానం చేసాడు. ఈ లోకాన్ని విడిచి పోలేదా ! మరి శ్రీరాముని చరిత్ర నీకు తెలిసిందే కదా! చిన్న వయసులో రాక్షస సంహారం చేసి దశకంఠుని సంహరించి జనరంజకంగా రాజ్యమేలిన దశరధరాముడు పరలోకము చేరలేదా ! గంగను భూమికి తీసుకు వచ్చి అనేక యజ్ఞయాగాదులు నిర్వహించి అనేక దానములు చేసిన భగీరధుడు పరలోప్కగతుడు కాలేదా ! ఇక దిలీప మహారాజు చేసిన క్రతువులో మేనక, విశ్వావసువు, గంధర్వులు స్వయంగా పాల్గొన్నారు. ఎంతో మంది దేవరుషులు వచ్చారు. ఎన్నో దానధర్మములు చేసాడు, అతడు చేసిన అశ్వమేధయాగాలకు ఇంద్రుడే స్వయంగా వచ్చి యాగాశ్వన్ని తీసుకు వెళ్ళాడు. అంతటి దిలీప మహారాజు స్వర్గధామము చేరలేదా ! ఇక చెప్ప పనిలేదు పన్నెండు రోజుల శిశువుగా ఉన్నప్పుడు ఇంద్రుని బొటన వ్రేలి నుండి స్రవించిన అమృతాన్ని సేవించిన అదృష్టవంతుడు. పన్నెండవ ఏట సామ్రాజ్యాధీశుడు అయి ఈ భూమిని ఏలిన మహనీయుడు కాలం తీరిన పిదప ఒక్క క్షణం ఉన్నాడా ! యయాతి మహారాజు దేవాసుర యుద్ధములో ఇంద్రుడికి తోడుగా ఉండి జీవితం ధార పోసాడు. మనుష్యులలో వర్ణాశ్రమ ధర్మాలు ఏర్పరచాడు. ఈ భూమిని అంతా పాలించి అగ్నిష్టోమము, అశ్వమేధము, వాజిపేయి, అతి రాత్రము, పౌండరీకము మొదలైన యజ్ఞములు చేసి కీర్తి గడించిన యయాతి పరలోకము చేర లేదా! తనమీదకు దండెత్తి వచ్చిన శత్రువులను జయించి తన శరణు జొచ్చిన వారిని కరుణతో మన్నించి అనేక యజ్ఞ యాగములు నిర్వహించి అనేక దానధర్మములు చేసిన అంబరీషుడు ఇప్పుడు పరలోకమున నివసించుట లేదా ! శశిబిందు మహారాజుకు లక్ష మంది భార్యలు. ఒక్కొక్క భార్యకు వెయ్యి మంది కుమారులు. వారు అంతా మహా పరాక్రమవంతులు. అనేక అశ్వమేధయాగాలు చేసిన వాడు నేడు పరలోకగతుడు కాలేదా ! ఘోరతపమాచరించి అగ్నిదేవుని ప్రసన్నము చేసుకున్న గయ మహారాజు అగ్ని దేవుని అనుగ్రహమున శమము, దమము, బ్రహ్మచర్యము, సౌశీల్యము, పాండిత్యము, అహింస దానధర్మములు మొదలగు సద్గుణములతో విరాజిల్లాడు. ముప్పై ఆరు యోజనముల వేదికను ఏర్పరచి దానిపై మహాయజ్ఞము నిర్వహించి బ్రాహ్మణులకు ఎన్నో దానములు చేసాడు. ఇప్పటికీ గయలో అతడి పేరున ఒక మర్రి చెట్టు ఉంది. అంతటి మహానుభావుడు పరలోకమునకు ఏగలేదా ! ఇరవై వేల వంట వాళ్ళను పెట్టి వండించి నిరంతర అన్నదానం చేసాడు రంతిదేవుడు. సత్రయాగం నిర్వహించాడు. అటువంటి రంతిదేవునికి మరణం తప్ప లేదు కదా! చిన్న తనంలో క్రూరమృగములను మచ్చిక చేసుకుని వాటి మీద విహరించిన ధీశాలి భరతుడు. ఏకఛత్రాధిపత్యంగా ఈ భూమిని ఏలి, గంగా, యమునా, సరస్వతీ తీరాన అనేక యజ్ఞయాగాదులు నిర్వహించి రధ, గజ, తురంగములను ప్రీతితో బ్రాహ్మణులకు దానము చేసాడు. అటువంటి భరతునికి కాలంతీరి పోలేదా ! ఎగుడు దిగుడుగా ఉండి రధములు తిరగ శక్యము కాని భూమిని చదును చేసిన మహారాజు పృధు చక్రవర్తి. అతడి పేర భూమికి పృధివి అనే నామధేయం వచ్చింది. అతడు చేసిన యజ్ఞయాగాదులు లెక్కలేదు. ప్రజలను కన్నబిడ్డలవలె పాలించాడు. ఈ భీమినంతా బ్రాహ్మణులకు దానమిచ్చి ఖ్యాతి గాంచిన వాడు. ఈ భూమి మీద అతడూ శాశ్వతముగా ఉండ లేదు. తన తండ్రిని చంపిన కార్తవవీర్యార్జునిడిని చంపి క్షత్రియ ద్వేషంతో ఈ భూమి మీద ఇరవై ఒక్క ప్రదక్షిణం చేసి క్షత్రుయుల మీద దండెత్తి క్షత్రియ కుల నాశనం చేసిన భార్గవరాముడు. ఈ భూమిని అంతా ఏలిన వాడు. ఎన్నో యజ్ఞయాగాదులు నిర్వహించిన వాడు పరశురాముడు బ్రతికి ఉన్నాడా. అలాంటి వారికే మృత్యువు సహజమైనప్పుడు ఇక సామాన్యుల సంగతి చెప్పవలెనా ! కనుక సృంజయా వీరికంటే ఉదాత్తుడైన నీ కుమారుడైనా మృత్యువు నుండి తప్పించుకొన జాలడు " అన్నాడు.

### సృంజయుని కుమారుడు జీవించుట

ఆ మాటలు విని మిన్నకున్న సృంజయుని చూసి నారదుడు " ఇప్పటి వరకూ చెప్పినది నీ బుద్ధిలోకి ప్రవేశించిందా లేక నిష్ఫలమేనా !" అన్నాడు. సృంజయుడు " నారదా ! నీ మాటలు నాకు ఊరట కలిగించాయి నేను ప్రశాంత చిత్తుడను అయ్యాను " అన్నాడు. నారదుడు " సృంజయా ! నీకు ఏమి కావాలో కోరుకో " అని అడుగగా సృంజయుడు " దేవా ! నీవు నాకు ప్రసన్నుడవు అయ్యావు నాకు ఇంత కంటే కావలసినదేమిటి " అన్నాడు. నారదుడు " సృంజయా ! చోరుల మూర్ఖత్వముకు బలి అయిన నీ కుమారుని నీకు తెచ్చి ఇస్తాను " అన్నాడు. ఇచ్చిన మాట ప్రకారం నారదుడు సువర్ణష్ఠీవిని సృంజయునకు తెచ్చి ఇచ్చాడు. సృంజయుడు తన కుమారునికి అస్త్రశస్త్ర విద్యలు నేర్పి వివాహం చేసాడు. అతడు సంతాన వంతుడు అయ్యాడు. కాలం తీరగానే అతడూ మరణించాడు. ధర్మరాజా ! మృత్యువును జయించుట ఎవరితరం కాదు. నీ కుమారుడు అభిమన్యుడు వీరస్వర్గము అలంకరించి సురలోక భోగములు అనుభవించుచున్నాడు. అతడి మృతికి నీవు చింతించుట అనవసరం. కనుక నామాటలు ఆలకించావు కనుక స్వస్థ చిత్తుడవై ధైర్యము వహించి ధీరుడవై కర్తవ్య నిర్వహణ కావింపుము " అని చెప్పి వ్యాసుడు అక్కడి నుండి వెళ్ళాడు.

## అర్జునుడు మనసు కలత చెందుట

వ్యాసుడి రాక ధర్మరాజుకు ఉరట కలిగించినా అర్జునుడు వచ్చి తనకుమారుని గురించి అడిగినా ఎలాబదులు చెప్పాలి. అతడిని ఎలా ఓదార్చగలను అని మధనపడసాగాడు. సంజయుడిలా చెప్పగానే ధృతరాష్ట్రుడు " సంజయా ! సంశక్తులతో యుద్ధానికి వెళ్ళిన అర్జునుడు ఏ విధంగా యుద్ధము చేసాడు. అభిమన్యుని మరణవార్త అతడికి ఎలా తెలిసింది " అని అడిగాడు. సంజయుడు " మహారాజా ! సంశక్తులను అర్జునుడు సమూలంగా నాశనం చేసి తిరిగి వస్తుండగా అనేక దుశ్శకునాలు గోచరించాయి. అర్జునుడు శ్రీకృష్ణుని చూసి " ఎన్నడూ లేనిది నాకు దుర్నిమిత్తములు గోచరిస్తున్నాయి. నా మనస్సు అలజడి చెందుతుంది, శరీరం గగుర్పాటు చెందుతుంది ద్రోణాచార్యుడు సామాన్యుడు కాదు. మా అన్నయ్య ధర్మజునికి ఎలాంటి అపాయము జరగలేదు కదా !" అన్నాడు. ఆ మాటలు విన్న కృష్ణుడు " అర్జునా ! ధర్మజునుకి అతడి తమ్ములకు ఎలాంటి ఆపదా కలుగదు. మిగిలిన వారికి కలిగిన మనకు త్వరలో తెలుస్తుంది " అన్నాడు. కృష్ణార్జునులు పాండవ శిబిరంలో ప్రవేశించగానే అక్కడ అలముకున్న నిస్తేజమైన వాతావరణం చూసి కలత చెందిన అర్జునుడు " కృష్ణా ! సైనికులు అందరూ నన్ను చూసి తల దించుకుంటున్నారు. వారి ముఖాలలో విషాదచ్ఛాయలు గోచరిస్తున్నాయి. మన శిబిరంలో సందడి లేదు. నేను రాగానే నాకెదురు వచ్చు అభిమన్యుడు నేడు రాలేదు. ఎలాంటి దుర్వార్త వినవలసి వచ్చునో అని మనసు వ్యాకులపడుతుంది. ఎలాంటి దుర్వార్త వినవలెనో అని భయంగా ఉంది " అన్నాడు. కృష్ణుడు బదులు చెప్పలేదు. అర్జునుడు వెంటనే ధర్మరాజు శిబిరానికి వెళ్ళాడు. అక్కడ ధర్మరాజు మొదలైన వారు కూర్చుని ఉన్నారు. వారిలో అభిమన్యుడు లేడు. అది చూసిన అర్జునుడికి కాళ్ళు తొట్రుపడ్డాయి.

## అర్జునుడు అభిమన్యుని కొరకు వెదకుట

అర్జునుడు ధర్మజుని చూసి " అన్నయ్యా ! మీరంతా విచారవదనంతో కూర్చుని ఉన్నారు. మీ మధ్య అభిమన్యుడు కనబడుట లేదు. అతడికి ఏమైయ్యిందో చెప్పండి. ఈ రోజు ద్రోణుడు పద్మవ్యూహం పన్నాడు దానిలో నేను మాత్రమే ప్రవేశించి వెలుపలకు రాగలను. అభిమన్యునికి ప్రవేశించుట మాత్రమే తెలియును మీరు అభిమన్యుని పద్మవ్యూహం భేధించుటకు పంలేదు కదా! మీరు కోరారని పద్మవ్యూహమున ప్రవేశించి వెలుపలికి రాలేక ప్రాణములు కోల్పోలేదు కదా ! శ్రీకృష్ణుని మేనల్లుడు, కుంతీదేవి మనుమడు, నా కుమారుడు, యుద్ధవిద్యా నిపుణుడు, దివ్యశరసంధానం తెలిసిన వాడు అయిన అభిమన్యుని శత్రువులు ఏ మాయోపాయంతో చంపారో కదా! గురువుఎడ భక్తి కలవాడు, అత్యంత ఉదారుడు, కరుణాత్ముడు, శౌర్యవంతుడు, ధైర్యశాలి, ఇంద్రుని మనుమడు అయిన అభిమన్యుడు లేక పోవడం దుస్సహము కదా ! చిరు నవ్వు చిందించే మోము, విశాల నేత్రాలు, విశాలవక్షము కలిగిన అభిమన్యుని వదనారవిందం చూసి కదా నేను జీవిస్తున్నది. అభిమన్యుని మోము చూడక నేను ఎలా బ్రతుకగలను. హంసతూలికా తల్పమున నిదురించు అతడి శరీరం నేడు కఠిన శిలలపై శాశ్వతంగా నిద్రిస్తుందా ! తెల్లని ఛత్రముల నీడన ప్రకాశించు మోము నేడు ధూళిదూసరితమై ఉన్నదా! సదా అందమైన నెచ్చెలుల మధ్య సంచరించే అభిమన్యుడు నేడు క్రూరమైన నక్కల మధ్య ఉన్నాడా! నానా జనులకు నాథుడైన అభిమన్యుడు ఎంతో వినయ విధేయతలు కలిగిన సుభద్ర తనయుడు , దేవేంద్రుని మనుమడైన నా కుమారుడు ఇక లేడా! అయినా నా వంటి మందభాగ్యునికి అంతటి కుమారుడు ఎలా ఉండగలడు. విధాత ఎంతటి నిర్ధయుడో కదా ! మంచి వారిని ఎక్కువ రోజులు బ్రతకనీయడు కదా ! ఆ సంశక్తులు పిలిచిన నేను ఏల యుద్ధముకు పోవలె. నాకుమారుని ఏల పోగొట్టుకున వలె " అని శోకిస్తూ అర్జునుడు అక్కడే కూలబడ్డాడు. అభిమన్యా ! ధర్మరాజు ముద్దులకొడకా ! నీ తల్లి సుభద్రను విడిచి వెళ్ళుట నీకు ధర్మమా ! నీ మేనమామ కృష్ణుడు వచ్చాడు ఒక్కసారి లేచి రావా ! నీ ప్రియమైన మాటలతో నీ భార్యను ఊరడింపవా ! " అని పరి పరి విధముల పరితపించాడు.

## అభిమన్యుని మరణానికి ధర్మరాజును నిందించుట

అభిమన్యుని కొరకు విలపిస్తున్న అర్జునుడు ధర్మరాజును చూసి " అన్నయ్యా ! ఇది ఎలా జరిగింది? భీమసేనుడు ఏమయ్యాడు ? ధృష్టద్యుమ్నుని వెంట పంపక వేరొక చోటకు పంపావా ? మహా వీరుడు విరాటుడు ఏమయ్యాడు? నీవు ఎందుకు అభిమన్యుని కాపాడ లేదు ? మరొక చోటున యుద్ధం చేస్తున్నావా ? ఇలా అందరూ ఉండీ నా కొడుకుని దిక్కు లేని చావుకు గురి చేసారా ! రణరంగమున నా కుమారుడు అత్యంత ధైర్యసాహసాలు ప్రదర్శించి మరణించాడు కదా ! నాకుమారుని పలువురు చుట్టుముట్టి తమ వివిధ ఆయుధములతో చంపుతుండగా తనకు ఎవ్వరూ తోడు లేరని నా కుమారూడు ఎంత బాధను అనుభవించాడో కదా ! " తండ్రీ ! శత్రువులను వధించి నన్ను కాపాడు " అని ఎంత బాధపడ్డాడో కదా ! అయినా నాకుమారుడు కృష్ణుని మేనల్లుడు అమిత ధైర్యశాలి మిన్ను విరిగి మీద పడినా ధైర్యంగా పోరాడుతాడు కాని వేరొకరి సహాయం అర్ధిస్తాడా ! నా కుమారుని మరణ వార్త విన్న నా హృదయం ముక్కలు కాలేదేమి ? పలువురు కూడి వధించునప్పుడు నా

గాండీవం కాని శ్రీకృష్ణుని సుదర్శనం కాని గుర్తుకు రాలేదా ఏమి ? మరణించిన నా కుమారుడు నెత్తుటి మడులో ఎక్కడ పడి ఉన్నాడో నాకు చూపు వారెవరు ? రణరంగమున పడిఉన్న నాకుమారుడి మోము ఉదయించిన చంద్రుని వలె ఉందేమో ? ప్రాణం కంటే మిన్నగా చూసుకొనే సుభద్ర తన కొడుకు మరణాన్ని తట్టుకొనగలదా ! కుమారుని కొరకు తపించే ద్రౌపది శోకం ఎవరు మాన్పగలరు ? " అని పరి పరి విధముల పరితపిస్తూ ధర్మరాజు ముఖము చూసి " ధర్మరాజా ! నేను సంశక్తులతో పోరుతున్నప్పుడు కౌరవవీరుల సింహనాదం విన్నాను. యుయుత్సుడు ఎలుగెత్తి అన్న మాటలు విన్నాను. " మీరు అభిమన్యుడితో పోరాడలేక బాలుడైన అభిమన్యుని పలువురు చేరి చంపారు. ఇప్పుడు మీకు సంతోషం కలిగిందా ! అర్జునుడికి , కృష్ణుడికి అపకారం చేసి బతుకగలరా ! ఈ దుష్కార్యం వలన కలిగిన పాపాం వారిని దహించక ఉంటుందా? " అని పలికిన యుయుత్సుని మాటలు నేను చెవులారా విన్నాను. నేను కృష్ణుడు ఆ మాటలు విని కూడా నమ్మలేదు. ధర్మజా ! తగిన సమయంలో నాకు తెలిపిన నేను అభిమన్యుని చుట్టుముట్టిన వారిని ఎదిరించి అభిమన్యుని రక్షించుకునే వాడిని కదా ! అని విలపిస్తున్న అర్జునుడిని శ్రీకృష్ణుడు పొదివి పట్టుకుని " అర్జునా ! ఏమిటీ వెర్రి ! రణరంగమున యోధులకు మరణం సహజము కదా! నీ కుమారుడు అభిమన్యుడు ఒంటరిగా అనేక మంది కౌరవ యోధులను వీరోచితంగా ఎదుర్కొని మరణించినందుకు సంతోషించక దు:ఖించుట తగునా ! తెలుకొనతగిన విధ్యను తెలుసుకున్న జ్ఞానివి. నీ వారంతా ఎలా శోకిస్తున్నారో చూడు నీవిలా దు:ఖిస్తుంటే వారిని ఓదార్చేదెవరు " అన్నాడు. అర్జునుడు " నాకుమారుడైన అభిమన్యుని చంపిన వారెవరు. నేను వెంటనే వారినందరిని సంహరిస్తాను. ఈ రోజు యుద్ధం ఎలా జరిగిందో వివరించండి. ఇంత మంది అస్త్రకోవిదులు, మహావీరులు ఉండగా అభిమన్యిని ఇలా దారుణంగా చంపుటకు వారికి ఎలా సాధ్యమైంది. ధర్మజా ! మిమ్ము పాంచాలురను నమ్మి ఇలా మోసపోయాను. మీకు నా కుమారుని రక్షించు శౌర్యం లేదని తెలిసీ నేనే వచ్చి నా కుమారుని కాపాడలేక పోయాను. ఇంతకూ అభిమన్యుని వెన్నంటకుండా మిమ్ము అడ్డగించిన దెవరు ? అయినా మీకు అంతటి ధైర్య సాహసములు ఏవి ? ఇందరు ఉండీ ఒక్కడిని రక్షించ లేక పోయారు. మీరంతా బలహీనులు యుద్ధానికి జంకు వారు అని తెలిసీ మిమ్మలిని నమ్మి నా కుమారుని మీకు వదిలి పోగొట్టుకున్నందుకు నన్ను నేనే నిందించుకోవాలి. మిమ్ము అని ప్రయోజనము ఏమి పైకి శూరుల వలె కన్పట్టుచున్న మీ ఆయుధములు కేవలం అలంకార ప్రాయమే కాదా! కాకున్న నాకుమారుని రక్షించరా ! " అని అర్జునుడు కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నాడు. అక్కడ ఉన్న రాజులకు అర్జునుడితో మాట్లాడే ధైర్యము చాల లేదు. కృష్ణుడు మాత్రమే అర్జునుడిని అనునయిస్తున్నాడు.

## ధర్మరాజు అభిమన్యుని మరణవిధానము వివరించుట

అభిమన్యుని మరణం తలచుకుని పరి పరి విధముల రోదిస్తున్న అర్జునుడితో " అర్జునా ! నీవు సంశప్తకులతో యుద్ధం చేయడానికి వెళ్ళావు కదా ! ద్రోణుడు పద్మవ్యూహం పన్నాడు. మేము ఎంత ప్రయత్నించినా ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేక పోయాము. కనుక నేను అభిమన్యుని వద్దకు వెళ్ళి " కుమారా ! వ్యూహమున ప్రవేశించుట మాకెవరికి తెలియదు ముందు నీవు మార్గము చూపుతూ ప్రవేశించిన మేము నిన్ను అనుసరించి వస్తాము " అని చెప్పాను. అందుకు అభిమన్యుడు అంగీకరించి వెంటనే తన రధముతో పద్మవ్యూహమున ప్రవేశించి కౌరవ సేనను చీల్చి చెండాడుతున్నాడు. మేము కూడా అతడిని అనుసరిస్తూ ముందుకు ఉరికాము. కాని సైంధవుడు ఈశ్వరవర ప్రభావమున మమ్ము అడ్డుకున్నాడు. మేము అతడిని అనుసరించ లేక పోయాము. అభిమన్యుడు అత్యంత పరాక్రమంతో అరివీర భయంకరుడై కౌరవ సేనను ఎదిరించి చీల్చి చెండాడి కర్ణాది వీరులను భయభ్రాంతులను చేసాడు. ద్రోణుడు, కర్ణుడు, కృతవర్మ, అశ్వత్థామ, కృపాచార్యుడు మొదలైన కురువీరులు ఒక్కుమ్మడిగా అభిమన్యుని ఎదుర్కొన్నారు అయినా వెరువక అభిమన్యుడు లక్ష్మణకుమారుని, బృహద్బలుడు మొదలైన రాజకుమారులను హతమార్చాడు. వారు తన రధం విరుగ కొట్టగా అభిమన్యుడు గధాయుధముతో వారితో తలపడ్డాడు. దుశ్శాసన కుమారుడు అభిమన్యుని ఎదుర్కొన్నాడు. ఇద్దరూ ఘోరయుద్ధం చేస్తూ క్రింద పడి గధాఘాతాలకు ప్రాణాలు వదిలారు. అలా అభిమన్యుడు తన తల్లి తండ్రుల మేనమామల కీర్తి ప్రతిష్టలను ఇనుమడింప చేస్తూ వీరస్వర్గం అధిష్టించి అక్కడ స్వర్గ సుఖాలను అనుభవిస్తున్నాడు " అన్నాడు.

## అర్జునిని ప్రతిజ్ఞ

తన కుమారుని మరణించిన విధానం తెలుసుకున్న అర్జునుడు మనస్సు వికలమై మూర్చపోయాడు. శ్రీకృష్ణుడు యుధిష్టరుడు అర్జునుడికి ఉపచారములు చేసారు. మూర్చ నుండి తేరుకున్న అర్జునుడు కోపంతో ఊగిపోతూ ముఖం అంతా ఎర్రబడగా " అందరూ వినండి ఇదే నా ప్రతిజ్ఞ. సైంధవుని రేపు సూర్యాస్తమయం లోపు చంపుతాను. ఆ సైంధవుడు నిన్ను శరణు వేడినా శ్రీకృష్ణుని శరణు వేడినా కడకు నన్నే శరణు వేడినా యుద్ధ భూమి నుండి పారిపోతే తప్ప అతడిని వదలను. సైధవుని రక్షించుటకు కౌరవసేన ఏకమై నా మీద అస్త్రశస్త్రములు ప్రయోగించినా వాడిని వదలను. నేను ఈ ప్రతిజ్ఞ తప్పిన ఎడల గురుద్రోహం, బ్రహ్మహత్య, మద్యపానము మొదలగు ఘోర పాపములు చేసిన వాడను ఔతాను. దేవతలు, కింపురుషులు, రాక్షసులు వాడికి రక్షణగా వచ్చినా నేను వాడిని వదలను. లేని ఎడల అగ్ని ప్రవేశం చేసి ఆత్మాహుతి



సైంధవుని చంపుతనని ప్రతిజ్ఞ చేయుచున్న అర్జునుడు

చేసుకుయంటాను " అని ప్రతిజ్ఞ చేసాడు. వెంటనే తన గాండీవం తెచ్చి పూజాదికములు నిర్వహించాడు. నారి సారించాడు శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. అర్జునుడు దేవదత్తం పూరించాడు. పాండవ సైన్యములో తూర్యనాదములు మిన్నుముట్టాయి. సైనికులు సింహనాదములు చేస్తున్నారు. అర్జునుడి అక్షయ తుణీరంలోని అస్త్రశస్త్రాలు వీరావేశంతో నృత్యం చేసాయి. పక్కనే ఉన్న భీమసేనుడు అర్జునుడితో " అర్జునా ! నీ వెంట నేను ఉన్నాను. విజృంభించు సైంధవుని త్రుంచు. దేవదత్తము, పాంచజన్య ఘోషలు విని కౌరవ వీరుల గుండెలు పగులుతాయి ఇది తథ్యం " అని అన్నాడు.

## కౌరవ శిబిరంలో కలవరం

ఆ రాత్రి సమయంలో పాండవ శిబిరంలో పాంచజన్య, దేవదత్త ఘోషలు విని కౌరవసేనలలో కలవరం రేగింది. వెంటనే వారు చారులను పిలిచి అడుగగా వారు జరిగినది అంతా సవిస్తరంగా చెప్పారు. అది విన్న సైంధవుని శరీరం కంపించింది. అక్కడ నిలువ లేక సిగ్గు విడిచి నీ కుమారుని శిబిరానికి పరుగు తీసి " సుయోధనా ! నేను ఒక్కడినే అపకారం చేసినట్లు అర్జునుడు నాపై పగబూని నన్ను చంపుతానని ప్రతిజ్ఞ చేసాడట. మీరంతా సంతోషంగా ఉన్నారు. నేను మాత్రం ఎందుకు దు:ఖపడాలి ? అర్జునుడి ప్రతిజ్ఞకు దేవాసురులు, సిద్ధసాధ్యులుగాని అడ్డుపడగలరా ! సుయోధనా ! ద్రోణుడు, కృపుడు, కర్ణుడు, శల్యుడు, బాహ్లికుడు నీవు తలచిన యమపురి పోయిన వాడిని తీసుకురాగలరు. కానీ మీరు కాపాడవలెనని అనుకున్నట్లు లేరు కనుక నాకిక దేవుడే దిక్కు " అన్నాడు. అతడి పెదవులు ఎండి పోతున్నాయి కాళ్ళు తడబడుతున్నాయి నిలబడ లేక పోతున్నాడు. " సుయోధనా ! ముందు నేను అర్జునుడి కంట పడకుండా దాక్కుంటాను. మీకిక శలవు బ్రతికుంటే రేపు కలుస్తాను " అని వెళ్ళబోయాడు.

## సైంధవుడికి ధైర్యం చెప్పుట

సుయోధనుడు " సైంధవా ! ఏమిటీ వెర్రి ! ఇప్పుడే కదా ! మా పరాక్రమము పొగిడావు. ద్రోణుని శౌర్యము, సోమదత్తుని ధైర్యము, శకుని వీరము, శల్యుని బలము నీకు తెలియనిదా ! మేము నిన్ను విడిచి పెడతామా భయపడకుము నిన్ను వెన్నంటి ఉంటాము " అని ధైర్యము చెప్పాడు. వెంటనే సుయోధనుడు సైంధవుని వెంటబెట్టుకుని ద్రోణుని వద్దకు వెళ్ళాడు. సైంధవుడు ద్రోణునితో అర్జునుడికి తనకు ధనుర్విధ్యలో కల తారతమ్యాలు అడిగాడు. ద్రోణుడు " సైంధవా ! మీరందరూ నా దగ్గర విలు విధ్య అభసించారు. నేను మీకందరికి ఒకే విధంగా నేర్పాను కాని అర్జునుడు కఠోర శ్రమకు ఓర్చి ఎన్నో ప్రయోగములు చేసి విలువిధ్యలో మెళుకువలు తెలుసుకున్నాడు. కనుక మీ కంటే అర్జునుడు అధికుడు కాని నీవు అర్జునుడికి భయపడ పని లేదు నా రక్షణలో ఉండగా నిన్ను దేవతలు కూడా తేరిపార చూడ లేరు. అర్జునుడు కూడా భేదింప లేని వ్యూహము రేపు పన్నుతాను. నీవు క్షత్రియ ధర్మము ప్రకారం యుద్ధం చెయ్యి. వేదవేదాంగాలు అభ్యసించి, యజ్ఞయాగాదులు చేసిన నీవిలా మృత్యువుకు భయపడ తగునా ! యాదవులు, పాండవులు, కౌరవులు మొదలైన ఎవరైనా ఈ భూమిపై శాశ్వతులా కాలం తీరగానే అందరూ పోవలసిన వారే కదా ! మహా మునులు యజ్ఞము చేసి పొందు ఫలం వీరులు యుద్ధభూమిలో మరణించిన పొందవచ్చు. కనుక నిశ్చింతగా ఉండు " అన్నాడు. ఆ మాటలకు ఊరట చెందిన సైంధవుడు సుయోధనునితో కలిసి తమ శిబిరానికి వెళ్ళాడు. ఇరుపక్షముల సైన్యాలు జరిగిన విషాదం తలపక రేపటి యుద్ధము గురించి ఆలోచించ సాగారు. సుయోధనుడు మరునాటి యుద్ధానికి సమాలోచనలు జరుపుతున్నాడు. ధర్మరాజు పాంచాల, కేకయ, మత్స్య, పాండ్య, యాదవ రాజులను మరునాటి యుద్ధానికి సమాయత్త పరుస్తున్నాడు.

## అర్జునుడు ప్రతిజ్ఞకు శ్రీకృష్ణుడు కలత చెందుట

అర్జునుడు చేసిన భీకర ప్రతిజ్ఞకు కృష్ణుడు కలవరపడి " అర్జునా ! నాతో ఏమాత్రం ఆలోచించక ఘోర ప్రతిజ్ఞ చేసావు. దుస్తరమైన ఈ ప్రతిజ్ఞను నీవు నెరవేర్చక పోయిన నాకు కలిగే బాధను నువ్వు అర్ధం చేసుకున్నావా! చారులు తెచ్చిన సమాచారం ఏమంటే నీ ప్రతిజ్ఞ విన్న కౌరవ శిబిరంలో కలకలం రేగింది. వారు నీవు ఎప్పుడైనా నీ కుమారుని మరణానికి కారకులైన వారి మీద విరుచుకు పడతావని గ్రహించారు. సైంధవుడు సిగ్గు విడిచి సుయోధనుడి వద్ద తనను రక్షించమని

వేడుకొనగా ద్రోణ, కృప, అశ్వత్థామ, శల్య, కర్ణాది కౌరవ వీరులు సైంధవుని ప్రాణానికి అభయం ఇచ్చారట. ద్రోణుడు అత్యంత క్లిష్టమైన వ్యూహము పన్ని సైంధవుని నీ కంట పడకుండా చేసి నిన్ను ఆపగలనని చెప్పాడట. అంత కట్టుదిట్టమైన వ్యూహంలో సకల కౌరవ యోధుల రక్షణలో ఉన్న సైంధవుని ఒక్క పగటిలో సంహరించుట సామాన్యం కాదు. కనుక దీని గురించి మనకు ఆప్తులైన వారితో ఆలోచించవలసిన అవసరం ఉంది " అన్నాడు. అర్జునుడు " కృష్ణా ! కౌరవ ప్రముఖుల బలాబలాలు నాకు తెలియనిదా. నా గురించి వారికి తెలియును నీ సహాయ సంపత్తి నా యడల ఉన్న సైంధవుని రక్షించగలిగిన వారెవ్వరు. సైంధవుని చంపునపుడు అడ్డగించ వారెవరైనా వారు నా క్రూర నారాచబాణములకు బలికాక తప్పదు. కౌరవ వీరుల అస్త్రశస్త్రములు నా అస్త్రశస్త్రముల ధాటికి నిలువ లేవు. ఒక్క సుయోధనుడి సేనలే కాదు సాక్షాత్తు పరమేశ్వరుడే వచ్చినా సైంధవుని రక్షించుటకు వీలు కాదు. నీ మీద, నా అస్త్రశస్త్రములు, దివ్యాస్త్రముల మీద ఆన రేపు గాండీవం నుండి వెలువడిన బాణము సైంధవుని తల త్రెంచుట ఖాయం. కృష్ణా ! నీ అండ దండలు నాకుండగా నాకిక అడ్డేమి. నా ప్రతిజ్ఞ నెరవేర్చు విధంగా ఆలోచన ఒసగి నన్ను కృతార్థుని చెయ్యి " అని నమస్కరించాడు. కృష్ణుడు అర్జునుడి మాటలకు సంతసించి నీ మనస్సు స్థిరముగా ఉన్నది నీవు పోయి నిద్రించుము " అన్నాడు. అర్జునుడు తన శిబిరముకు వెళ్ళాడు.

## శ్రీకృష్ణుడు సుభద్రను ఊరడించుట

అర్జునుడు శిబిరానికి వెళ్ళే సమయానికి అక్కడకు సుభద్ర , ఉత్తర, పాంచాలి వచ్చి ఉన్నారు. ఈ విషయం తెలిసిన శ్రీకృష్ణుడు ఈ విషయం తెలిసిక్కడకు చేరికుని సుభద్రను ఓదార్చ సాగాడు " అమ్మా సుభద్రా ! క్షత్రియకంతలు యుద్ధములో మరణించిన వారి కొరకు విలపించుట తగునా ! క్షత్రియ వీరులు రణరంగమున మరణించుట వీర స్వర్గమును అంకరించుట సహజమే కదా ! నీ కుమారుడు తుచ్ఛమైన ఈ లోకమును వదిలి పుణ్యలోకముకు పోయాడు. తపస్సు, బ్రహ్మచర్యము, ఉదాత్తమైన దానధర్మాలు చేసి పొందు లోకాలను నీ కుమారుడు యుద్ధమున వీరమరణం పొంది సులభంగా పొందాడు. అందుకు నీవు చింతించనేల ! క్షత్రియ కాంతలకు వీరులను పుత్రులుగా పొందుట వారు అతిలోక వీరులై ప్రఖ్యాతి గాంచుట అతడి తల్లి వీరమాత అగుట అతడి భార్య వీర పత్ని అగుట ఎంత సహజమో అతడు వీరస్వర్గం అలంకరించుట అంత సహజము కదా! అలాంటి పుత్రుని కన్నందుకు సంతోషించాలి కాని దుఃఖిస్తారా చెప్పు ! ఎంతటి గొప్ప వారైనా కాలం తీరిన మరణించుట తధ్యం. ఈ విషయం తెలిసీ పామరుల వలె చింతించుట తగునా! నీవే ఇటుల శోకించిన నీ కోడలిని ఓదార్చు వారెవ్వరు. మాకు ధైర్యం చెప్పవలసిన దానివి ధైర్యవంతురాలివి నీవే ఇటుల శోకించ తగదు. నీ కోడలిని ఓదార్చుము. నీ భర్త రేపు సూర్యాస్తమయం లోపు సైంధవుని సంహరించుట తధ్యము. నా మాట నమ్మి నీవు ధైర్యముగా ఉండుము " అన్నాడు.

### సుభద్ర శోఖం

కాని సుభద్ర పుత్రశోకము తట్టుకొన లేక శోకిస్తూ " నాయనా అభిమన్యా ! నేను పుణ్యం చేసుకుని నిన్ను కనే భాగ్యాన్ని పొందాను కాని నీ ముద్దు ముచ్చటలు చూసే భాగ్యానికి కరువయ్యాను. అత్యంత పరాక్రమవంతులైన కౌరవ వీరులను హతమార్చిన నీవు ఇలా దిక్కు లేని మరణం పొందుట నా మనస్సు కలచి వేస్తుంది. శిశువుగా సగం శరీరం నా మీద మిగిలిన శరీరం మెత్తటి శయ్య మీద ఉండేలా శయనించిన నీవు ఇలా కటిక నేలపై పరున్నావా! వంధి మాగధుల శోత్రపాఠములను విను నువ్వు ఇప్పుడిలా నక్కల ఊళలు వింటున్నావా ! ఇంతమంది మహా యోధులు పాండవులు విరాట, ద్రుపద, సాత్యకి, భీమసేనుల పరాక్రమం నిన్ను రక్షించ లేక పోయిందా! మహావీరుడైన అర్జునుడి కుమారుడవు శ్రీకృష్ణుని మేనల్లుడవు నీవు ఇలా శత్రువుల చేత మరణించుట చోద్యము కాక మరేమి ! నాయనా నీ భార్య ఉత్తర వచ్చింది చూడు లేచి ఆమెను ఓదార్చు " అని పలు విధముల రోదిస్తూ ఉన్నది. ద్రౌపది తన రెండు చేతులతో సుభద్ర, ఉత్తరలను పొదివి పట్టుకుని అలాగే వివశురాలై భూమి మీద పడి పోయింది. శ్రీకృష్ణుడు వారిని ఉచిత వచనములతో ఓదార్చి పాండవుల వద్దకు వచ్చి అందరిని వారి వారి శిబిరములకు వెళ్ళమని చెప్పాడు. తాను కూడా అర్జునుడితో అతడి శిబిరానికి వెళ్ళాడు.

## కృష్ణార్జునులు ఆయుధపూజ చేయుట

శిబిరానికి వెళ్ళిన కృష్ణార్జునులు ఒక ప్రదేశమున దర్భాసనము వేసి దానిపై గాండీవము, దేవదత్తము, పాంచజన్యము, సుదర్శనము మొదలైన ఆయుధములు అమర్చారు. శ్రీకృష్ణుడు అర్జునుడిని వాటి మధ్య నిద్రించమని చెప్పాడు. ఆ తరవాత తన సారధి దారుకునితో తన శిబిరానికి వెళ్ళాడు. తాను కూడా నిద్ర పోదామని అనుకున్నా! నిద్ర రాలేదు. పాండవ శిబిరములో ఎవరికి నిద్ర రాలేదు. పాండవులు " కుమారుని మరణనానికి క్రుద్ధుడైన అర్జునుడు భీకర ప్రతిజ్ఞ చేసాడు. దానిని కౌరవులు ఎలాగైనా వమ్ము చేయ ప్రయత్నిస్తారు. రేపు పొద్దుకుంకే సమయానికి అర్జునుడు సైంధవుని చంపలేకున్న అగ్నిప్రవేశం చేస్తాడు. అప్పుడు పాండవులు ఏమౌతారు మనమేమి ఔతాము. అతడి పూజలు ఫలించి అర్జునుడు సైంధవుని

వధించాలి. ద్రోణుల వంటి వారు పది వేల మంది రక్షించినా సైంధవుడు అర్జునుడి చేతిలో మరణించాలి " అని ముక్కోటి దేవతలను ప్రార్ధిస్తూ వేడుకున్నారు. శ్రీకృష్ణుడికి కూడా నిద్ర పట్ట లేదు. సారధి దారుకుని చూసి " దారుకా ! అర్జునుడి ప్రతిజ్ఞ విన్నావు కదా ! రేపటి లోపల సైంధవుని చంపుట సాధ్యమా ! ఒక వేళ చంపలేకున్న ఎంత దుర్ధశ సంభవించగలదు. అర్జునుడు నా బహిర్ప్రాణము నాలో సగము అతడు లేక నేను జీవించ లేను ఇది నీకు తెలుసు. కనుక అతడిని రక్షించుకోవడం నా కర్తవ్యం. నాకు ఈ ద్రోణుడు ఒక లెక్క కాదు. రేపు ఈ చరాచర ప్రపంచం నా పరాక్రమము తిలకిస్తాయి. పాండవుల మీద నాకున్న ప్రేమ లోకానికి తెలియజేస్తాను. రేపు నేను విజృంభించి సైంధవుని హతమారుస్తాను. గర్వాంధుడు సుయోధనుడు సకల సైన్యంతో నన్ను అడ్డుకున్నా అందరిని హతమార్చి సైంధవుని చంపుట తధ్యం " అన్నాడు. " దారుకా ! నా రథం సిద్ధం చెయ్యి. శైబ్య, సుగ్రీవ మొదలగు అశ్వరాజములను రథముకు కట్టు. గరుడ ధ్వజము ఎత్తించు. నా ఆయుధములైన సుదర్శనచక్రము, గధ వంటి ప్రముఖ ఆయుధములు రథములో పెట్టు. రేపు అత్యంత జాగరూకుడివై నేను పాంచజన్యం పూరించినంత రథమును అతి వేగంగా తీసుకు వచ్చి నా ముందుంచు. నేను నా రథము ఎక్కి సైంధవుని వధిస్తాను " అన్నాడు. దారుకుడు " మహానుభావా! నీ ఆజ్ఞ శిరసావహిస్తాను. రథము సిద్ధము చేసి మీ ఆజ్ఞ కొరకు వేచి ఉంటాను. అసలు మీరు అర్జునుడి రథం ఎక్కి పాంచజనన్యం పూరించగానే కౌరవుల గుండెలు జారిపోతాయి. తమరు యుద్ధం చేసే అవకాశం ఉండదు అయినా తమరి ఆజ్ఞకొరకు వేచి ఉంటాను " అన్నాడు.

## శ్రీకృష్ణుడు అర్జునుడికి ధైర్యము చెప్పుట


అర్జునుని కల

శ్రీకృష్ణుడు దారుకునితో మాట్లాడుతున్న సమయంలో అర్జునుడు దర్భాసనంపై కలత నిద్రలో ఉన్నాడు. అప్పుడు అర్జునుడికి ఒక స్వప్నం వచ్చింది. ఆ స్వప్నంలో శ్రీకృష్ణుడు అర్జునుడి వద్దకు వచ్చాడు. అర్జునుడు కృష్ణుని భక్తితో ఆసనుని చేసి పూల మాలికలతో పూజించి పక్కనే నిలబడ్డాడు.శ్రీకృష్ణుడు " అర్జునా ! శోకించకుము. శోకార్తుడు శత్రువుల చేత ఓడింపబడతాడు. నీ ప్రతిజ్ఞ నెరవేరు ఉపాయము ఆలోచింపుము " అన్నాడు. అర్జునుడు కృష్ణా ! నాకు శోకము కాక మరేమి ఉన్నది. నేను సైంధవుని చంపెదనని ప్రతిన పూనాను. ద్రోణుడు కాపాడెదనని ప్రతినబూనాడు. సైంధవుడు నాకు కనబడక వారి వెనుక దాగి ఉంటాడు. అది తలచిన నాకు శోకము కాక మరేమి కలదు " అన్నాడు. కృష్ణుడు " అర్జునా ! నీవన్నది నిజమే అయినా నీవు తూర్పు ముఖంగా నిలిచి అత్యంత భక్తి శ్రద్దలతో పరమశివుని ప్రార్ధించి పాశుపతము నీకు మనస్సున ప్రస్ఫుటము కావాలని కోరుము. పాశుపతము నీ వశమైన సైంధవుడు ఎక్కడ ఉన్నా వధించ కలవు " అన్నాడు. అర్జునుడు ఆచమనం చేసి సుచి అయి ధర్భాసనంపై కూర్చుని భక్తితో ప్రమేశ్వరుని ధ్యానించాడు. ఆ పరమేశ్వరుని కృప వలన అర్జునుడు కృష్ణుడు గగన మార్గమున పయనించసాగారు. సిద్ధులు, చారణులు, గంధర్వులు సేవించు మార్గమున పోతున్నారు. కైలాసం చేరుకుని అక్కడ ఒక మందిర ప్రవేశం చేసారు. కృష్ణార్జునులు అక్కడ పార్వతీదేవితో ప్రమద గణాలతో పరివేష్టితుడైన శివుని దర్శించి సాష్టాంగ దండ ప్రమాణాలాచరించారు. పరమశివుడు మందహాసం చేసి " నరనారాయణులకు స్వాగతము. మీరు వచ్చిన కారణమేమి మీ కోరికను అవశ్యము తీర్చెదను " అన్నాడు. కృష్ణార్జునులు మనసులోనే భక్తి పొంగిపొరలగా స్తుతించారు. కృష్ణుడు " దేవా! దయ ఉంచి పాశుపతమును అర్జునుడికి ఉపదేశింపుము " అన్నాడు. అర్జునుడు శివుని చూసి ఆశ్చర్య పోయాడు. తాను కృష్ణునికి సమర్పించిన పూల మాలికలు పూజా ద్రవ్యములు శివుని దివ్యశరీరంపై ఉండుట చూసి శివకేశవులు ఒక్కటే భేదము లేదని తెలుసుకున్నాడు. అర్జునుడు కూడా తనకు పాశుపతం ప్రసాదించమని వేడుకున్నాడు. శివుడు మందహాసం చేసి " అర్జునా ! ఆ తామర కొలనులో ఉన్న నా విల్లు బాణములు తీసుకు రా " అన్నాడు. అర్జునుడు వాటిని స్పర్శించగానే అవి సర్పాలలా బుసలు కొట్టాయి . అర్జునుడు పాద ప్రక్షాళన చేసుకుని మహాశివుని ధ్యానించి రుద్రము జపించగానే ఆ సర్పాలు విల్లు అమ్ములు అయ్యాయి. వాటి తీసుకుని శివుని వద్దకు రాగానే అక్కడ నిలుచున్న నీలలోహిత వర్ణము కలిగిన బాలుడు ఆ విల్లంబులు తీసుకుని శరసంధానం చేసాడు. అర్జునుడు ఏకాగ్రతతో మంత్ర సహితంగా పాశుపతాన్ని ప్రయోగ ఉపసంహారాలు నేర్చుకుని శివుని ఆజ్ఞానుసారం విల్లంబులను తిరిగి సరస్సునందు ఉంచాడు. అరణ్యవాసంలో ఈశ్వరుని చేత అనుగ్రహించబడిన పాశుపతం ఇప్పుడు సమంత్రసహితంగా ప్రయోగ ఉపసంహారాలతో అర్జునుడికి అనుగ్రహించాడు పరమశివుడు. అర్జునుడి మనసు పరవశించింది. కృష్ణార్జునులు శివునకు ప్రణమిల్లి కురుక్షేత్రము లోని తమ శిబిరాలకు చేరుకున్నారు. అర్జునుడు ఈ రకంగా కల కన్నాడు. " అని సంజయుడు ధృతరాష్ట్రునికి వివరించాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రథుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

---

# ద్రోణ పర్వము తృతీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



## తృతీయాశ్వాసం

సైంధవుని చంపడానికి శ్రీకృష్ణుడు మార్గం చూపాడు అని విన్న ధృతరాష్ట్రుడు ఉలిక్కిపడ్డాడు. సంజయా ! సైంధవుని పాండవులు నిర్జించారా ! లేక ద్రోణుడు సైంధవుని రక్షించాడా నాకు వివరంగా చెప్పు. సంజయుడు " ధృతరాష్ట్ర మహారాజా ! మరునాడు ధర్మరాజు వంధిమాగధుల స్తోత్రపాఠాలతో నిద్రలేచి కాలకృత్యములు తీర్చుకుని పూజాధికములు ముగించి దానధర్మములు చేసి ఆ స్థాన మండపముకు వచ్చాడు. అప్పడు అక్కడకు వచ్చిన శ్రీకృష్ణుని ధర్మరాజు సాదరంగా ఆహ్వానించి ఉచితాసనం చూపించాడు. భీముడు, నకులసహదేవులు, సాత్యకి, ద్రౌపదేయులు, ఘటోత్కచుడు, ద్రుపదుడు, విరాటుడు, కేకయరాజులు మొదలైన వారు వారి ఆసనములు అలంకరించారు. అప్పడు ధర్మరాజు శ్రీకృష్ణునితో " కృష్ణా ! ఇప్పటి వరకు మాకు అన్ని విధాల నీ సహాయ సహకారాలు అందించావు. ఇప్పడు ఈ ఆపదనుండి మమ్ము నీవే కాపాడాలి " అన్నాడు.


ధర్మరాజుకు ధైర్యం చెబుతున్న కృష్ణుడు

శ్రీకృష్ణుడు " ధర్మజా ! ఈ రోజు అర్జునుడు రణరంగమున వీరవిహారం చేసి సైంధవుని వధించుట తధ్యం " అని పలికాడు. ఇంతలో అక్కడకు వచ్చిన అర్జునుడు ముందు రోజు రాత్రి తాను కన్న కలను గురించి సభాసదులకు వివరించాడు. అది విన్న సభికులు విశ్మయమందారు. తరవాత అందరూ యుద్ధసన్నాహాలు చేసారు. శ్రీకృష్ణుడు, అర్జునుడు, సాత్యకి అందరూ కలిసి అర్జునుడి శిబిరానికి వెళ్ళారు. శ్రీకృష్ణుడు రధము ఎక్కి సారధిగా కూర్చున్నాడు. అర్జునుడు రధము ఎక్కి సాత్యకిని చూసి " సాత్యకీ ! మనకు మంచి శకునములు కనపడుతున్నాయి. ఈ రోజు నేను సైంధవుని వధించి నా శపధం నెరవేర్చుకుంటాను. సైంధవవధ ఎంత ముఖ్యమో ధర్మరాజు రక్షణా అంత ముఖ్యమే. ద్రోణాచార్యుని ప్రతిజ్ఞ గురించి మనం ఆలోచించాలి. కనుక నీవు ధర్మరాజు రక్షణ బాధ్యత వహించాలి " అన్నాడు. అర్జునుడి మాట మేర సాత్యకి ధర్మరాజు రక్షణకు వెళ్ళాడు. అని సంజయుడు చెప్పగానే ధృతరాష్ట్రుడు " సంజయా ! కుమారుని మరణం కలిగించిన శోకము కోపమూ కలగలసి మృత్యుదేవతగా వచ్చిన అర్జునుడిని కౌరవులు ఎలా ఎదుర్కొన్నారు. సైంధవుని ఇంట్లో ఆర్తనాదాలు వినపడుతున్నాయి. సంజయా ! నేను, భీష్ముడు, ద్రోణుడు చెప్పిన మాటలు వినక కర్ణుడు, శకుని, దుశ్శాసనుని మాటలు విన్నాడు. సంధి చెడగొట్టాడు తన వాళ్ళందరిని చంపుకుంటున్నాడు. శివుని ఓడించిన అర్జునుడితో వైరం పెట్టుకుంటున్నాడు. శ్రీకృష్ణుని చెలికానితో వైరం వద్దని చెప్పిన రాజ్యం మీద లోభంతో నా మాట వినలేదు. నేను చెయ్యగలిగినది ఏమి ? " అని వగచాడు. సంజయుడు " మహారాజా ! గతజల సేతుబంధన మేలనయ్యా ! మాయా జూదం నాడే నీవు అడ్డుకోవలసింది. సంధి ప్రయత్నంతో వచ్చిన శ్రీకృష్ణుడి మాటను ఆదరించి ఉండ వలసినది. నీ తమ్ముడు పాండురాజు రాజ్యపాలన చేసి విస్తరించిన రాజ్యంలో భాగాన్ని అతడి కుమారులకు ఇవ్వడానికి నీకు అభ్యంతరం ఎందుకు ? నీవు చేసిన పనికి నీ కుమారుని నిందించుట తగునా ! లోకులు నిన్ను లుబ్ధుడు, అధర్మపరుడు అనక ఏమి చేస్తారు. నీ దుర్నీతికి తగిన ఫలితం అనుభవిస్తున్నావు . ఇందుకు కౌరవులేమి చేస్తారు. గాండీవ ఘోష, పాంచజన్య తీవ్ర ధ్వని, కపిధ్వజ రెపరెపలు సహించుటకు దేవతలకు కూడా శక్యము కాదు. ఇక నీ కుమారులు ఎంత!

## యుద్ధారంభం

ద్రోణుడు రణరంగమున ప్రవేశించి శంఖం పూరించి సైంధవునితో ఇలా అన్నాడు. నీవు, భూరిశ్రవసుడు, కర్ణుడు, శల్యుడు, అశ్వత్థామ, వృషసేనుడు, కృపాచార్యుడు అందరూ కలసి ఉండండి. మన బలములో పదునాలుగు వేల ఏనుగులు, అరవై వేల రధములు, ఒక లక్ష గుర్రములు, పది లక్షల పదాతి దళము మీ వెంట ఉంటుంది. నేను పన్ను యుద్ధ వ్యూహముకు మీరంతా మూడు యోజనముల దూరములో ఉండండి. అప్పుడు పాండవులు మీ వంక చూడ లేరు. ఆ తరవాత ద్రోణుడు పన్నెండు యోజనముల పొడవు అయిదు యోజనముల వెడల్పు కలిగిన శకట వ్యూహమును రచించాడు. ఆ శకట వ్యూహముకు పడమటగా ఉన్న అర్ధభాగం లోపల పద్మవ్యూహం పన్నాడు. ఆ పద్మవ్యూహం మధ్యభాగం నుండి శకటవ్యూహం మొదలు వరకు ఒక సూచీవ్యూహము నిర్మించాడు. ఆ సూచీవ్యూహ ముఖభాగమున కృతవర్మ , అతడి వెనుక కాంభోజరాజు , వారి వెనుక ఒక లక్షమంది యోధులు. సుయోధనుడు వారందరికి మూల స్థానమున సైంధవుని నిలిపాడు. దుర్మర్షణుడు అనే వాడు ఈ వ్యూహములో నేను నిలుచుట ఏమిటి అని నేను ఒక్కడినే అర్జునుడిని చంపగలను అని వ్యూహముకు దూరంగా తన సేనలతో నిలిచాడు. ద్రోణుడు పన్నిన వ్యూహముకు పదిహేను వందల ధనస్సుల దూరంలో దుశ్శాసనుడు, వికర్ణుడు సైంధవుని రక్షించుటకు సిద్ధంగా ఉన్నారు. ద్రోణా చార్యుడు శకట వ్యూహముకు ముందు భాగంలో ఉన్నాడు. ఈ వ్యూహము చూసి సుయోధనుడు సంతోషించాడు.

## అర్జునుడి యుద్ధరంగ ప్రవేశం

పాండవ సైన్యాధ్యక్షుడు ధృష్టద్యుమ్నుడు వ్యూహానికి ప్రతి వ్యూహం పన్నాడు. కపిధ్వజము రెపరెపలాడగా అర్జునుడు యుద్ధరంగ ప్రవేశం చేసాడు. ఇరు పక్షాలలో యుద్ధభేరీలు మ్రోగాయి. ముందుగా దుర్మర్షణుడు విజృంభించాడు. అది చూసి అర్జునుడు " కృష్ణా! మన రధము దుర్మర్షణుడి వైపు పోనిమ్ము. ముందు వాడిని చంపి ఈ రోజు యుద్ధంలో వాడిని మొదటి కబళంగా భక్షిస్తాను " అన్నాడు. కృష్ణుడు రధమును దుర్మర్షణుడి వైపు పోనివ్వగానే దుర్మర్షణుడి గజసైన్యం అర్జునుడు ఒంటరివాడని తలచి చుట్టుముట్టి శరములు గుప్పించారు. మరుక్షణంలో రణభూమి ఏనుగు కళేబరాలతో సైనికుల తలలతో


దుర్మర్షణుడి గజసైన్యంలోకి ప్రవేశిస్తున్న కృష్ణార్జునులు

నిండి పోయింది. కౌరవులు కూడా అర్జునుడి మీద తమ శరములు గుప్పించారు. అర్జునుడు వాటిని మధ్యలోనే త్రుంచి వేస్తూనే దుర్మర్షణుడి గజబలమును, అశ్విక బలమును, రధికులను ముక్కలు ముక్కలు చేసాడు. దుర్మర్షణుడి ధనస్సులు, రధములు, కేతనములు విరిగాయి. అర్జునుడి ధాటికి ఆగలేక దుర్మర్షణుడు పారి పోయాడు. అతడి వెంట అతడి సేనలు పారి పోయాయి.

## దుశ్శాసనుడితో యుద్ధం

ఇంతలో దుశ్శాసనుడు అర్జునుడిని ఎదుర్కొన్నాడు. దుశ్శాసనుడిని చూడగానే అర్జునుడు ఆగ్రహోదగ్రుడై గాండీవం సంధించి ధారాపాతగా అమ్ములు గుప్పించాడు. నిలబడిన ఏనుగులు నిలబడినట్లే ఉండగా వాటి మీద ఉన్న సైనికుల తలలు మాత్రం తాటి పండ్ల మాదిరి ఎగిరి పడుతున్నాయి. సైనికుల కాళ్ళు చేతులు తెగి నేల మీద దొర్లుతున్నాయి. తన సైన్యంతో పారిపోతున్న దుశ్శాసనుడిని చూసి అర్జునుడు " దుశ్శాసనా ! ఆగు ఎక్కడికి పారిపోతావు పారిపోతే చావు తప్పదు. అనాడు కురు సభలో మాటాడిన దానికి ఫలితం అనుభవించవా ! " అంటూ దుశ్శాసనుడిపై బాణములు వేసాడు. దుశ్శాసనుడు తిరిగి చూడకుండా ద్రోణుడి వద్దకు పోయాడు.

## ద్రోణాచార్యుని ఎదుర్కొనుట

కృష్ణుడు చెప్పగా అర్జునుడు ద్రోణాచార్యునికి చేతులెత్తి నమస్కరించి " భూసురోత్తమా ! నాకు అన్న ధర్మరాజు బావ కృష్ణుడు ఎలాగో మీరు అలాగే. మీరు నా శ్రేయోభిలాషులు. మీరు మీ కుమారుడు అశ్వత్థామను ఆదరించినట్లే నన్ను ఆదరించారు. నేను వ్యూహంలో ప్రవేశించి సైంధవుని చంపడానికి దయచేసి దారి ఇచ్చి నా ప్రతిజ్ఞ నెరవేర్చండి " అని ప్రార్ధించాడు. ద్రోణుడు " అర్జునా! నేను ఇక్కడ ఉండగా నీవు సైంధవుని ఎలా చంపగలవు " అని అర్జునుడిపై శరములు గుప్పించాడు. ముందు గురువుగారు బాణములు వెయ్యగానే అర్జునుడు విజృంభించి ద్రోణుని తొమ్మిది బాణములతో కొట్టాడు. ద్రోణుడు వాటిని మధ్యలోనే త్రుంచి కృష్ణార్జునులపై బాణవర్షం కురిపించి వింటి త్రాటిని త్రుంచి అర్జునుడి రధాన్ని బాణములతో కప్పాడు. అర్జునుడు తన వింటి నారిని బిగించి ద్రోణుని వదిలి అతడి సైన్యాలను ఎదుర్కొన్నాడు. అర్జునుడి గాండీవం నుండి వెలువడుతున్న బాణములు కురుసైన్యాలను తుత్తునియలు చేతున్నాయి. ద్రోణుడు ఆ బాణములను ఎదుర్కొని సైన్యములను రక్షిస్తూ అర్జునుడి రధమును బాణములతో కప్పాడు. అర్జునుడు ద్రోణుని దాటి ఒక్క అడుగు ముందుకు వేయ లేక పోయాడు. కృష్ణుడు అర్జునుడితో " అర్జునా! ద్రోణుని మీద కోపం ఎందుకు అతడిని వదిలి శకట వ్యూహములో ప్రవేశించు " అన్నాడు. అర్జునుడు " అలాగే కృష్ణా ! మన రధమును చక్ర వ్యూహంలోనికి పోనిమ్ము " అన్నాడు. తనను తప్పించుకు వెళుతున్న అర్జునుడితో " అదేమిటయ్యా ! అర్జునా! యుద్ధం చేస్తున్న వాడిని వదిలి పక్కకు వెళుతున్నావు. శత్రువును చంపవా! అన్నాడు " అని అన్నాడు. అర్జునుడు " ఆచార్యా ! మీరి నా గురువుగారు శత్రువు కాదు. అయినా! మిమ్మలిని జయించడం ఈశ్వరుడికే సాధ్యం కాదు నేనెంత " అన్నాడు. అర్జునుడితో అతడి చక్రరక్షకులు యుధామన్యుడు, ఉత్తమౌజుడు వ్యూహంలోకి ప్రవేశించారు.

## అర్జునుడితో కౌరవ వీరులు పోరుట

ముందుగా కృతవర్మ, కాంభోజరాజు, శ్రుతాయువు అర్జునుడిని చూసారు. కృతవర్మ కృష్ణార్జునుల మీద ఇరవై అయిదు బాణములు వేసాడు. అర్జునుడు కృతవర్మ ధనస్సును విరిచి కృతవర్మ మీద ఇరవై అయిదు బాణాలు వేసాడు. కృతవర్మ మరొక విల్లు తీసుకుని అర్జునుడి గుండెలకు గురిపెట్టి పది బాణములు వేసాడు. కృష్ణుడు అర్జునుడితో " అర్జునా ! కృతవర్మ మీద జాలి చూపకు అతడిని చంపు " అన్నాడు. వెంటనే అర్జునుడు కృతవర్మను మూర్చిల్లజేసి ముందుకు పోతున్నాడు. ఇంతలో కృతవర్మ లేచి అర్జునుడి చక్రరక్షకులను అడ్డుకున్నాడు. వారు కృతవర్మ విల్లును విరిచారు. కృతవర్మ మరొక విల్లు తీసుకుని ఉత్తమౌజుడు, యుధామన్యుల విల్లు త్రుంచాడు. వారు కృతవర్మ వేయు బాణములను అడ్డుకున్నారు. కృతవర్మ అర్జునుడిని వెంబడించ లేక పోయారు. ముందుకు పోతున్న అర్జునుడిని శ్రుతాయువు అడ్డుకుని అర్జునుడి పతాకము త్రుంచి కృష్ణార్జునులపై తొంబై బాణములు వేసాడు. అర్జునుడు కోపించి శ్రుతాయువు విల్లు త్రుంచి గుండెలకు గురిపెట్టి ఏడు బాణములు వేసాడు. శ్రుతాయువు మరొక విల్లు తీసుకుని అర్జుడి గుండెలకు గురిపెట్టి తొమ్మిది బాణములు వేసాడు.


కౌరవులతో పోరాడుతున్న అర్జునుడు

అర్జునుడు శ్రుతాయువు సారధిని చంపి, రధాశ్వములను చంపి, శరీరం అంతా తూట్లు పడేలా కొట్టాడు. శ్రుతాయువు వరుణుడి కుమారుడు. ఆ గధ అతడికి వరణుడు ఇచ్చాడు. ఆ గధ ధరించిన వాడు అజేయుడు దానిని ఎవరి మీద ప్రయోగించినా వాడిని తప్పక చంపుతుంది. ఆ గధ నిరాయుధుని మీద యుద్ధానికి సిద్ధంగా లేని వాడి మీద ప్రయోగిస్తే అది ప్రయోగించిన వాడినే చంపుతుంది. శ్రుతాయువుకు ఆవేశంలో ఆ విషయం గుర్తుకు రాక దానిని శ్రీకృష్ణుడిపై ప్రయోగించాడు. కేవలం సారధిగా ఉన్న శ్రీకృష్ణుని ఆ గధ ఏమి చేయలేక తిరిగి వచ్చి ప్రయోగించిన శ్రుతాయువును వధించింది. అది చూసి అతడి సైన్యం పారిపోయింది. ఆ సమయంలో అక్కడ ఉన్న కాంభోజరాజు అర్జునుడిని ఎదుర్కొన్నాడు. ఇరువురు ఒకరిపై ఒకరు శరప్రయోగం చేసుకున్నారు. అర్జునుడు అతడి కేతనమును విరిచి, విల్లును త్రుంచి, సారధిని చంపి, హయములను చంపి పదునైన నారాచములు వేసి అతడి గుండెలు పగులగుట్టాడు. ఆ దెబ్బకు కాంభోజరాజు మరణించాడు. తరువాత శిబి, వసాతి, మొదలగు మహారాజులు అర్జునుడిని చుట్టుముట్టారు. అర్జునుడు తన బాణఘాతములతో వారినందరిని యమసదననానికి పంపాడు. తరువాత శ్రుతాయువు, అయుతాతువు అర్జునుడిని ఎదొర్కొన్నారు. అర్జునుడుఇంద్రాస్త్రం ప్రయోగించి వారిని వధించాడు. అది చూసి సుయోధనుడు కళింగులు, దక్షిణాత్యులు, ఆటవికులు కలిసి వారి గజబలముతో అర్జునుడిని ఎదుర్కొన్నారు. అర్జునుడు ఆ గజసేనలను చీల్చిచెండాడాడు. తెగిన తొండములు, కాళ్ళు, క్రిందపడిన మావటీలతో ఆ ప్రదేశం భీభత్సమైంది. తరవాత యవనులు, పారదులు, శకులు అర్జునుడిని ఎదుర్కొన్నారు. అర్జునుడు వారినందరిని తన బాణపరంపరతో అంతమొందించాడు. అంబష్ట దేశపు రాజు శ్రుతాయువు అర్జునుడిని ఎదుర్కొన్నాడు. అర్జునుడు అతడి వింటిని విరిచి, హయములను చంపాడు. శ్రుతాయువు గధతో శ్రీకృష్ణుని కొట్టాడు. అర్జునుడు ఆ గధను విరుగ కొట్టి వేరొక శరముతో శ్రుతాయువు తల నరికాడు.

## ద్రోణుడు సుయోధనుడికి కవచధారణ విధ్యను ఉపదేశించుట

అర్జునుడి పరాక్రమము చూసిన సుయోధనుడు ద్రోణుని వద్దకు వెళ్ళి " ఆచార్యా ! నిన్ను లెక్క చేయక అర్జునుడు ముందుకు వెళ్ళి అందరిని చంపుతున్నాడు. మీరు చూస్తూ ఊరక ఉన్నారు. అర్జునుడి వంక కూడా చూడలేదు. తమరు నా కిచ్చిన వరం ఏమైనట్లు ? సైంధవుడు మిమ్ము నమ్మి ఎటూ పోకుండా రణరంగమున ఉన్నాడు. మీరు అతడిని రక్షించు ప్రయత్నము చేయ లేదు. అతడి చావు చూడాలని ఉందా. మీరు అసలు మనుషులేనా అని నాకు అనుమానంగా ఉంది . నా మనస్సు బాధపడుతుంది కనుక మిమ్మిలా అడుగుతున్నాను. సైంధవునికి రక్షణగా ఉన్న రధికులంతా పారి పోతున్నారు. అతడిని రక్షించండి " అన్నాడు. ద్రోణుడు సుయోధనుడిని చూసి నవ్వి " సుయోధనా! నీ మాటలకు అశ్వత్థామ మాటలకు కోపిస్తానా! శ్రీకృష్ణుని తలపు కంటే అతడి గుర్రాలు వేగంగా పయనిస్తున్నాయి. అంతకంటే వేగంగా అర్జునుడి బాణాలు వెలువడుతున్నాయి. వాటిని ఆపగలిగిన శక్తి నాకు ఉందా! నేను ఈ స్థానం నుండి కదిలానంటే సైన్యం అల్లకల్లోలం ఔతుంది. ఆ పై సైంధవుని రక్షించుట కష్టం. కనుక నేను సేనా ముఖం నుండి కదలక ధర్మరాజును బంధించే ప్రయత్నం చేస్తాను. నేను వృద్ధుడిని కనుక అర్జునుడితో పరుగిడ లేను. నువ్వు అర్జునుడికి సమవయస్కుడవు కనుక అర్జునుడిని ఎదుర్కో " అన్నాడు. సుయోధనుడు " మిమ్ము కృతవర్మను ఎదుర్కొని దాటి వెళ్ళిన అర్జునుడిని ఎదుర్కొనుట నాకు సాధ్యమా! మీరు చెప్పారు కనుక వెళ్ళి పోరాడతాను " అన్నాడు. ఆ మాటకు సంతోషించి ద్రోణుడు " సుయోధనా ! నీకు కవచధారణ విధ్యను నేర్పుతాను. దీనితో నువ్వు రక్షింపబడతావు. అర్జునుడు వేసిన శరములు నీ శరీరాన్ని తాకవు " అని ఒక బంగారు కవచం పై కవచధారణను ఆవహింప చేసి అది సుయోధనుడికి తొడ్డొక్కోవడానికి ఇచ్చాడు. ద్రోణుడు " సుయోధనా! మొదట ఈ కవచ ధారణ విధ్యను దేవతల సంరక్షణార్ధం బ్రహ్మదేవుడు ఇంద్రునికి ఇచ్చాడు. దేవేంద్రుడు దానిని అంగీరసునికి ఇచ్చాడు. అంగీరసుడు బృహస్పతికి, బృహస్పతి అగ్నివేశుడికి, అగ్నివేశుడు నాకు ఇచ్చాడు. నేను అది ఇప్పుడు నీకు ఇస్తున్నాను. ఇది ధరించి విజయుడివి కమ్ము " అని దీవించాడు. సుయోధనుడు కవచ ధారణ చేసి అర్జునుడితో యుద్ధానికి సన్నద్ధం అయ్యాడు.

## కురుపాండవ యుద్ధము

కురు పాండవ సేనలు ఒకరికి ఒకరు తీసిపోకుండా ఘోరయుద్ధం చేస్తున్నారు. ధృష్టద్యుమ్నుడు ద్రోణుని ఎదుర్కొని కౌరవ సేనలను పీనుగుల కుప్పలుగా చేసాడు. ఎవ్వరికీ అతడి ముందు నిలవాడానికి ధైర్యం చాల లేదు. అది చూసి ద్రోణుడు పాంచాల కేకయ సేనలను ఎదుర్కొన్నాడు. అది చూసి ధర్మరాజు తన తమ్ములను తీసుకుని ధృష్టద్యుమ్నునికి సాయంగా వచ్చాడు. అది చూసి వికర్ణుడు వివిశంతిని, చిత్రసేనుడు భీముని, బాహ్లికుడు ఉపపాండవులను, దుశ్శాసనుడు సాత్యకిని, శకుని నకుల సహదేవులని, సోమదత్తుడు శిఖండిని, అలంబసుడు ఘటోత్కచుని ఎదుర్కొన్నారు. శల్యుడు సైంధవుని పక్కనే ఉండి అతడిని రక్షిస్తూ అప్పడప్పడూ ధర్మరాజుపై బాణము వేస్తున్నాడు. దుశ్శాసనుడు సాత్యకిని మూర్చపోయేలా కొట్టాడు. కాని తేరుకున్న సాత్యకి దుశ్శాసనుడిని తరిమి తరిమి కొట్టారు. నకుల సహదేవుల పరాక్రమానికి తట్టుకోలేక శకుని ద్రోణుని వెనుక దాక్కున్నాడు. ద్రోణుడు ధృష్టద్యుమ్నుని భీముని ధర్మరాజును ఎదుర్కొన్నాడు. ద్రోణుడు తను పన్నిన శకటవ్యూహం చెదరకుండా కాపాడుతున్నాడు. రణరంగం విరిగిన రథములు, విల్లులు, కేతనములు, చిందరవందరాగా పడిన దుస్తులు కాళ్ళు చేతులు , ఏనుగుల కళేబరాలు, గుర్రముల శవాలు పదాతి దళాల పీనుగులతో భీకరంగా ఉంది. ద్రోణుని రథమును ధృష్టద్యుమ్నుడు ఢీకొట్టి డాలు కత్తి తీసుకుని ద్రోణుని మీద కలియబడ్డాడు. ద్రోణుడు ఈ హటాత్పరినామానికి జంకక ధృష్టద్యుమ్నుని కత్తిని ముక్కలు చేసి డాలును విరిచి రథాశ్వములను, సారధిని చంపి ధృష్టద్యుమ్నుని మీద క్రూర నారాచమును వేసాడు. సాత్యకి ఆ నారాచమును విరిచాడు. ధృష్టద్యుమ్నుడు సాత్యకి రథం ఎక్కి పక్కకు తప్పుకున్నాడు. చేతికి చిక్కిన ధృష్టద్యుమ్నుని తప్పించినందుకు ద్రోణునికి సాత్యకి మీద కోపం వచ్చి సాత్యకిని కోపంగా ఎదుర్కొన్నాడు. సాత్యకి జంకక తన రథమును ద్రోణుని ముందు నిలిపాడు. వారిరువురు ఘోరయుద్ధం సాగించారు. రథములు విరుగుతున్నాయి, కేతనములు తెగి పడుతున్నాయి. సైనికుల శరీరములు మట్టిలో దొర్లుతున్నాయి. అప్పుడు సాత్యకి ద్రోణుని విల్లు విరిచాడు, ద్రోణుడు మరొక విల్లు తీసుకుని సంధేచే లోపల దానిని విరిచాడు. ఆ విధంగా ద్రోణుడు ఎన్ని విల్లులు తీసుకున్నా వాటిని విరిచాడు సాత్యకి. పట్టువదలని ద్రోణుడు ఆఖరికి ఒక విల్లు తీసుకుని బాణములు సంధించి అత్యంత వేగంగా సాత్యకిపై శరములు ప్రయోగించాడు. సాత్యకి వాటినిన్నంటిని తుతునియలు చేసాడు. ద్రోణుడు సాత్యకిపై ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. భీకర జ్వాలలను చిమ్ముతూ సాత్యకి వైపు వచ్చిన ఆగ్నేయాస్త్రాన్ని వారుణాస్త్రం ప్రయోగించి సాత్యకి నిర్వీర్యం చేసాడు. సాత్యకికి బాసటగా ధర్మరాజు, భీముడు, నకులుడు, సహదేవుడు నిలిచారు. ద్రోణునికి బాసటగా దుశ్శాసనాదులు నిలిచి యుద్ధం చేస్తున్నారు.

## అర్జునుడి సమరం

అర్జునుడు తాను వెళ్ళే మార్గంలో ఎదురైన యోధులను హతమారుస్తూ సైంధవుని కొరకు ముందుకు దూసుకు వెళుతున్నాడు. ఇంతలో విందాను విందులు తమ సైన్యంతో అర్జునుడిని చుట్టుముట్టి కృష్ణార్జునుల మీద శరవర్షం కురిపించాడు. అర్జునుడు వారి ధనస్సులును విరిచి, పతాకములు పడగొట్టి, వారి రథాశ్వములను చంపి ముందుగా విందుని తల తెగ నరికాడు. అన్న గారి మరణానికి ఆగ్రహించి అనువిందుడు గధను తీసుకుని రథం దిగి అర్జునుని రథం సమీపించి తన గధను శ్రీకృష్ణుని మీద విసిరాడు. అర్జునుడు ఆ గధను విరిచి మరొక బాణంతో అనువిందుని శిరస్సు ఖండించాడు. విందానువిందులు మరణించగానే వారి సేనలు అర్జునుడిని చుట్టుముట్టాయి. అర్జునుడు వారినందరిని తన శరాఘాతంతో తరిమి తరిమి కొట్టాడు.

## కృషార్జునులు రథాశ్వముల సేద దీర్చుట


అర్జునుని అశ్వములకు సేవలు చేస్తున్న కృష్ణుడు

అప్పటికి అర్జునుడు అలసి పోయాడు రథాశ్వాలు కూడా అలసి పోయాయి. సైంధవుడు కను చూపు మేరలో కనుపించ లేదు. ఈ పరిస్థితి గమనించిన కౌరవ సేనలు సింహనాదాలు చేస్తూ పాండవ సేనలను తరుముతున్నారు. అర్జునుడు " కృష్ణా ! నేను వీరిని నిలువరిస్తాను నువ్వు రథాన్ని ఆపి రథాశ్వాలకు విశ్రాంతి నిమ్ము " అన్నాడు. ఇదే తగిన సమయమని కౌరవ యోధులు అర్జునుడిని చుట్టుముట్టి శరవర్షం కురిపించారు. అర్జునుడు వాటిని మధ్యలో త్రుంచి వారి మీద ప్రయోగించాడు. సముద్ర తరంగం వలె తన మీద పడుతున్న సైన్యాలను చెలియలి కట్ట వలె అడ్డుకుని అర్జునుడు భల్ల బాణములతో రథములను విరిచి, అర్ధ చంద్ర బాణాలతో ఏనుగులను చంపుతున్నాడు. క్రూర నారాచములతో హయములను నేల పడదోస్తున్నాడు. రణరంగం అంతా మాంస ఖండములతోను, తెగిన తలలతోను, ఏనుగుల అశ్వముల

కళేబరములతో నిండి పోయింది. అప్పుడు కృష్ణుడు అర్జునుడితో " అర్జునా! మన గుర్రములు సేద తీరాయి కాని వాటికి దాహం వేస్తున్నట్లుంది. అవి నీరు త్రాగితేగాని తెప్పరిల్లవు ఎలా " అన్నాడు. అర్జునుడు " దానిదేముంది కృష్ణా ! ఇక్కడే ఇప్పడే నీరు తెప్పిస్తాను " అని తన బాణములతో భూమిని చీల్చి ఒక కొలను ఏర్పరచి దానిని నీటితో నింపాడు. అది చూసిన కౌరవ సేనలు ఆశ్చర్య పోయాయి. శ్రీకృష్ణుడు సంతోషించి అర్జునుడిని ప్రశంసించి అశ్వాలతో నీరు త్రావించి రధముకు కట్టి రధము సిద్ధము చేసాడు. అర్జునుడు రధం ఎక్కాడు. శ్రీకృష్ణుడు నొగల మీద కూర్చున్నాడు. అంతలో దూరం నుండి వస్తున్న సుయోధనుడిని చూసి కృష్ణుడు రధమును సుయోధనుడి వైపు పోనిచ్చాడు. అది చూసిన కౌరవయోధులు " ఇప్పటి వరకు కౌరవ సేనలను పీనుగు పెంటలు చేసాడు. ఇప్పుడు సుయోధనుడిని ఎదుర్కొంటున్నాడు ఏమౌతుందో ఏమో " అని తమలో తాము అనుకున్నారు. ఇంతలో పొద్దు వ్రాలడం గమనించి పాంచజన్య, దేవదత్తములు పూరించారు. ఆ ధ్వనికి కౌరవ రాజులు గుండెలు పగిలి సైంధవుడి సంగతి దేవుడెరుగు మన ప్రాణాలు రక్షించుకోవాలి అనుకుని సైంధవుని రక్షణ వలయం నుండి తొలగి పోయారు. అర్జునుడు " కృష్ణా! అడుగో సైంధవుడు. వాడికి చుట్టూ కృపాచార్యుడు, శల్యుడు, అశ్వత్థామ, బాహ్లికుడు, కర్ణుడు కర్ణుని కుమారులు రక్షణగా నిలిచి ఉన్నారు. వాడి చావు నా చేతిలో మూడింది. వీరంతా సైంధవుని రక్షించగలరా . వీరే కాదు దేవతలు దండెత్తి వచ్చినా ఈ రోజు పొద్దు వాలే లోపు వీడిని చంపి తీరుతాను " అన్నాడు. అమిత శౌర్యంతో సైంధవుని వైపు వస్తున్న అర్జునుడిని చూసి కౌరవ యోధులు సైంధవునిపై ఆశలు వదులుకున్నారు. అర్జునుడు సింహనాదం చేసాడు. కృష్ణుడు సైంధవుని వైపు రథం పోనిచ్చాడు. ఇంతలో ద్రోణుడు ఇచ్చిన కవచధారణ చేసిన సుయోధనుడు అర్జునుడిని ఎదుర్కొన్నాడు.

### అర్జునుడు సుయోధనుడిని ఎదుర్కొనుట

సుయోధనుడు అర్జునుడిని ఎదుర్కోవడం చూసిన కౌరవ సేన ఉత్సాహంగా అర్జునుడిని చుట్టుముట్టారు. తమ ఎదుట నిలబడిన సుయోధనుడిని చూసి శ్రీకృష్ణుడు " ఈ సుయోధనుడు మన మీద నిరంతర కోపంతో ఉన్నాడు. ఇప్పుడు మనకు సుయోధనుడికి మధ్య జరిగే జూదంలో సైంధవుడు పందెంగా ఉన్నాడు. ఈ సుయోధనుడిని జయించి అతడికి మన మీద ఉన్న కోపాన్ని నిర్మూలించు . మీ కష్టాలన్నిటికీ ఇతడే కారకుడు. మాయా జూదంలో ధర్మజుని ఓడించి అతడిని అవమానాల పాలు చేసిన పాపాత్ముడు. నిండు పేరోలగంలో ద్రౌపది కొప్పు పట్టి ఈడ్పించి వలువలు పట్టి లాగించిన దుర్మార్గుడితడే. ఇతడికి నీ పరాక్రమము రుచి చూపు. నీకు శుభం కలుగుతుంది. వీడు మన ఎదుటకు వచ్చుట మన అదృష్టం. ఇది దేవుడిచ్చిన వరం దీనిని సద్వినియోగం చేసుకో. వీడి తల వెంటనే నరుకు. వీడు చస్తేగాని పీడ వదలదు. అర్జునా! నీ ఎదుటకు వీడు రావడం నీ గాండీవానికి ఎరగావడం నీ పూర్వ జన్మ సుకృతం. సందేహించక ఇతడిని వధించిన కౌరవ సేన చెరిది పోతుంది ఆపై సైంధవుడు బయటకు వస్తాడు. అప్పుడు అతడిని తరిమి తరిమి వధించుట సులభం " అని చెప్పాడు. అర్జునుడు " కృష్ణా! సుయోధనుడు మాకు చేసిన అవమానములు కష్టములు ఎటుల మరువగలను . సత్వరమే ఇతడిని చంపి నా పగ తీర్చుకుంటాను. కృష్ణా! రధము సుయోధనుడి వైపు తిప్పు " అన్నాడు. సుయోధనుడు కవచ ధారణతో లభించిన అమితమైన గర్వంతో అర్జునుడిని ఎదుర్కొన్నాడు. కృష్ణార్జునులు శంఖములను పూరించారు. కృష్ణార్జునుల ఆవేశాన్ని కనులార చూసిన కౌరవ సేనలు అర్జునుడి చేతిలో సుయోధనుడి మరణం నిశ్చయం అనుకున్నారు. సుయోధనుడు అర్జునుడిని చూసి అర్జునా! నీ దగ్గర దివ్యాస్త్రములు ఉన్నాయని విర్ర వీగుతున్నావు కదా ! ఆ పేరు ఈ రోజుతో చెల్లి పోయింది. నీ బలము కృష్ణుని నేర్పరి తనం చూడాలని వచ్చాను. నీవు నిజంగా పాండురాజు కుమారుడవైతే నీ శౌర్య ప్రతాపాలు చూపి అస్త్ర కౌశలం చూపించు " అని క్రూర నారాచములను అర్జునుడిపై వేశాడు. నాలుగు బాణాలతో అర్జునుడి రధాశ్వములను కొట్టి పది బాణాలతో కృష్ణుడిని కొట్టాడు. అర్జునుడు కోపించి సుయోధనుడి పై పదునాలుగు బాణములు ప్రయోగించగా అవి సుయోధనుని శరీరం తాకి కింద పడ్డాయి. అర్జునుడు తిరిగి ఇరవై ఏడు బాణములు సుయోధనుడి మీద వేసాడు. అవి కూడా సుయోధనుడి శరీరం తాకగానే పడిపోయాయి. ఇది చూసిన కృష్ణుడు " అర్జునా! ఏమిటీ ఆశ్చర్యం నీ చేతులలో బలం తగ్గిందా? నీ శరముల శక్తి చచ్చిపోయిందా ? ఏమైంది నిజం చెప్పు నీ ఒక్కొక్క బాణం పిడుగుపాటు వలె శత్రువులను తనుమాడ కలిగినవే. నేడు ఇలా నిర్వీర్యం కావడం చూసిన నా మనసు కలత చెందుతుంది " అన్నాడు. అర్జునుడు " కృష్ణా ! నా చేతిలో బలం తగ్గ లేదు శరముల వేడి తగ్గ లేదు. ద్రోణుడు సుయోధనుడికి కవచధారణ శక్తి ఇచ్చాడు. కవచధారణ విధ్య ద్రోణుడికి మాత్రమే తెలుసు. అతడు దానిని నాకు మాత్రమే నేర్పాడు. ఇప్పుడు సుయోధనునికి ఇచ్చాడు. ఆ కవచమును భేదించుట ఎవరికీ శక్యము కాదు. సుయోధనుడు కవచం తొడుకున్నాడు కాని దానిని గురించి తెలియదు. చూస్తుండు నా గాండీవంతో కవచధారణ చేసినప్పటికీ సుయోధనుడిని ముప్పతిప్పలు పెట్టగలను . కృష్ణా అంగీరసుడు నిఖిల కవచ భేద్యము అనే అస్త్రాన్ని దేవేంద్రుడికి ఇచ్చాడు. దేవేంద్రుడు దానిని నాకు ఇచ్చాడు. అది ఎటువంటి కవచాన్నైనా భేదిస్తుంది. నేను సుయోధనుడి కవచాన్ని ఈ మహాస్త్రంతో చీలుస్తాను " అన్నాడు. అని వెంటనే అర్జునుడు సుయోధనుడిపై ప్రయోగించడానికి అస్త్రాన్ని సంధించి మంత్రాన్ని జపించాడు . అది గమనించిన అశ్వత్థామ రానున్న ప్రమాదాన్ని గ్రహించి ప్రయోగించక మునుపే బాణాన్ని వేసి దానిని ముక్కలు చేసాడు. అర్జునుడు కృష్ణుని వంక చూసి " కృష్ణా ! అశ్వత్థామ మహాస్త్రాన్ని నిర్వీర్యం చేసాడు. దానిని తిరిగి ప్రయోగించడం నాకే కీడు. కనుక నేనిక నా అస్త్రాలను నమ్ముకుంటాను " అని అంటూ ఉండగానే సుయోధనుడు ఒక్కొక్కరిపై తొమ్మిదేశి బాణాల లెక్కన కృష్ణార్జునులపై వేసాడు. అర్జునుడు ఆగ్రహించి ఇక

ఉపేక్షించి లాభం లేదనుకుని సుయోధనుని సారధిని, రధాశ్వములను చంపి కేతనమును విరిచి సుయోధనుడి అరచేతిలో బాణాలు నాటాడు. గాయపడ్డ సుయోధనుడు ఖిన్నుడై ఈ కవచం బాగా లేదని దానిని విడిచి మరొక కవచం తొడుకున్నాడు. ఇది చూసిన కౌరవ యోధులు అర్జునుడిని చుట్టుముట్టారు.

## అర్జునుడు కౌరవ వీరులను ఎదుర్కొనుట

అర్జునుడు కౌరవ సేనలను తనుమాడ సాగాడు. రధములు విరుగుతున్నాయి. అశ్వముములు నేల కూలుతున్నాయి. ఏనుగుల కుంభస్థలములు పగులుతున్నాయి. సైనికుల తలలు బంతుల్లా తెగి పడుతున్నాయి. రణరంగం అంతా భీభత్సంగా తయారైంది. కౌరవ సైన్యం భయంతో పారి పోయింది. సింధురాజుకు రక్షణగా ఉన్న యోధులు సింహనాదం చేసారు వారి ఉత్సాహం చూసి అర్జునుడు రధమును సుయోధనుడి వైపు పోనిచ్చాడు. సుయోధనుడికి రక్షణగా ఉన్న ఎనిమిది మంది యోధులు అర్జునుడిని ఒక్కుమ్మడిగా ఎదుర్కొన్నారు. అర్జునుడు దేవదత్తమును పూరిస్తూ వారిని దాటి సైంధవుని వైపు పోతున్నాడు. అది గమనించి మిగిలిన వారు అర్జునుడి మీద శరవృష్టి కురిపించారు. అశ్వత్థామ రెచ్చి పోయి డెబ్బై మూడు బాణాలతో కృష్ణుని మూడు బాణాలతో అర్జునుడిని కొట్టాడు. అర్జునుడి కేతనమును విరిచాడు. అర్జునుడు కోపించి నూట ఆరు బాణములు అశ్వత్థామ మీద ప్రయోగించి పది బాణములతో కర్ణుడిని కొట్టాడు. వృషసేనుడిపై మూడు బాణములు ప్రయోగించి ఒకే ఒక బాణంతో శల్యుని విల్లు విరిచాడు. శల్యుడు వేరొక విల్లు తీసుకుని అర్జునుడి మీద ఏడు బాణములు ప్రయోగించాడు. కర్ణుడు మూడు బాణములు భూరిశ్రవసుడు వృషసేనుడు తలా అయిదు బాణములు కృపాచార్యుడు పది బాణములు అశ్వత్థామ అరవై బాణములు అర్జునుడి మీద ప్రయోగించాడు. అనేక దివ్యాస్త్రాలు అర్జునుడి మీద ప్రయోగించారు. సైంధవుడు వారి చాటున నిలబడి డెబ్బై మూడు బాణములు అర్జునుడిపై వేసాడు. అది చూసిన అర్జునుడికి ఏడుపు నవ్వు ఏక కాలంలో కలిగాయి. అర్జునుడు కర్ణుడి మీద పన్నెండు బాణములు అతడి కుమారుని మీద మూడు బాణములు వేసాడు. ఒకే ఒక బాణంతో శల్యుని విల్లు తుంచి తొమ్మిది బాణములతో శల్యుని కొట్టాడు. మూడు బాణములతో భూరిశ్రవసుని ఎనిమిది బాణములతో అశ్వత్థామను ఇరవై రెండు బాణములతో కృపాచార్యుని కొట్టాడు. మరొక ఇరవై రెండు బాణాలతో అశ్వత్థామ శరీరం అంతా గుచ్చాడు. సైంధవుడు కనిపించినప్పడల్లా అతడి మీద బాణప్రయోగం చేస్తున్నాడు. సైంధవుడు అర్జునుడికి కనుపించ కుండా వారి వెనుక దాక్కుంటున్నాడు. కౌరవ సైన్యం ఒకరికి ఒకరు ధైర్యం చెప్పకుని ఒకటిగా చేరి అర్జునుడిని చుట్టుముట్టారు. అర్జునుడు వారిని తన బాణములకు ఎరగా వేసాడు.

## కౌరవ పాండవ సమరం

ధర్మరాజు ద్రోణుడు ఉన్న రణరంగమున పరిస్థితి భయంకరంగా ఉంది. యుద్ధం ఘోరంగా సాగుతుంది. బృహత్క్షత్రుడిని క్షేమధూర్తి, ధృష్టకేతుడిని వీర ధ్వనుడు, నకులుడిని కర్ణుడు, సహదేవుడిని దుర్ముఖుడు, సాత్యకిని వ్యాఘ్రదత్తుడు ఎదుర్కొని యుద్ధం చేస్తున్నాడు. శల్యుడు మాత్రం అటు శకట వ్యూహం నుండి పద్మవ్యూహం వరకు అటూ ఇటూ తిరుగుతునే మధ్యలో ఉపపాండవులతో యుద్ధం చేస్తున్నాడు. అలంబసుడు భీముని ఎదుర్కొన్నాడు. ద్రోణాచార్యుడు ధర్మరాజును ఎదుర్కొన్నాడు. ధర్మరాజు ద్రోణాచార్యుని శరీరంపై తొంభై బాణములు గుచ్చాడు. ద్రోణుడు ధర్మరాజు గుండెలకు గురిపెట్టి ఇరవై అయిదు బాణాలు వేసాడు. ద్రోణుడు తన బాణములతో ధర్మరాజు రధమును ముంచెత్తాడు. ధర్మరాజు ద్రోణుడు వేసిన బాణములు నిర్వీర్యం చేసాడు. ద్రోణుడు కోపించి ధర్మరాజు విల్లును త్రుంచాడు. అది చూసిన వారంతా ఈ రోజు ద్రోణుని చేతిలో ధర్మరాజు బంధీ అయ్యాడు అనుకున్నారు. ధర్మరాజు వేరొక విల్లు అందుకుని ద్రోణుడు వేసిన బాణాలన్నింటిని త్రుంచి వెంటనే ద్రోణుని మీద శక్తి ఆయుధాన్ని వేసాడు. ధర్మరాజు ప్రయోగించిన శక్తి ఆచార్యుని దహిస్తుంది అని అందరూ అనుకున్నారు. ద్రోణుడు బ్రహ్మాస్త్రంతో శక్తి ఆయుధాన్ని అడ్డుకుని నిర్వీర్యం చేసి శక్తి ఆయుధాన్ని ధర్మరాజు మీద వేసాడు. శక్తి అయ్యుధము ధర్మరాజు వైపు దూసుకు వస్తుంది. ధర్మరాజు బ్రహ్మాస్త్ర ప్రయోగం చేసి ఆ అస్త్రాన్ని నిర్వీర్యం చేసాడు. ద్రోణుని శరీరం మీద అయిదు బాణాలు వేసి ద్రోణుని విల్లు తుంచాడు. ద్రోణుడు ధర్మజుని మీదకు గధాయుధాన్ని విసిరాడు. ధర్మజుడు కూడా గధాయుధాన్ని విసిరాడు. రెండు గధలు ఒక దానిని ఒకటి ఢీకొన్నాయి. ద్రోణుడు ధర్మజుని రధం విరుగకొట్టాడు. ధర్మజుడు విరిగిన రధం దిగి నిస్సహాయుడై చేతులు జోడించాడు. ద్రోణుడికి దయారసం పెల్లుబుకింది ధర్మజుని చంపడానికి మనస్కరించక ఆ కోపం చల్లారడానికి పాండవ సైన్యాలను కసితీర చంపాడు. ఇది చూసి అందరూ ధర్మజుని ద్రోణుడు బంధీ చేస్తాడు అనుకునేంతలో ధర్మరాజు పరుగున వెళ్ళి సహదేవుడి రధం ఎక్కాడు. సహదేవుడు ధర్మరాజును తీసుకుని దూరంగా వెళ్ళాడు. క్షేమధూర్తి అనే వాడు బృహత్క్షత్రుని వింటిని తృంచాడు. అతడు వేరొక వింటిని తీసుకుని క్షేమధూర్తి రధాశ్వాలను చంపి అతడి రధాశ్వములను చంపి, కేతనమును త్రుంచి, మరొక బాణముతో క్షేమధూర్తి తలను నరికాడు. ఇంతలో త్రిగర్త దేశాధిపతి వీరధ్వనుడు ధృష్టకేతు ధనస్సు విరిచి మరొక బాణంతో తల నరికాడు. సహదేవుడు తిరిగి వచ్చి సుయోధనుడి తమ్ముడు దుర్ముఖుని ఎదుర్కొని అతడి రధాశ్వములను సారధిని చంపి అతడి శరీరం మీద అయిదు బాణములు గుచ్చాడు. దుర్ముఖుడు పక్కన ఉన్న త్రిగర్త రాకుమారుడు నిరమిత్రుడి రధము ఎక్కి పారిపోయాడు. అది చూసి పాండవసైన్యం

హర్షధ్వానాలు చేసింది. సహదేవుడు అప్పుడు కూడా వారిని వదలక నిరమిత్రుడిని తరిమి తరిమి చంపాడు. నకులుడితో తలపడిన వికర్ణుడు ఎక్కువ సేపు నిలువ లేక పారిపోయాడు. సాత్యకితో తలపడిన వ్యాఘ్రదత్తుడు సాత్యకిని శరవర్షంలో ముంచాడు. కోపించిన సాత్యకి వ్యాఘ్రదత్తుని సారధిని రధాశ్వములను చంపి వ్యాఘ్రదత్తుని తల నరికాడు. శల్యుడు ద్రౌపదీ సుతులను ఎదుర్కొని ఒక్కొక్కరిని అయిదేసి బాణాలతో నొప్పించాడు. ఉపపాండవు లందరూ శల్యుని ఒక్క మారుగా చుట్టుముట్టారు. అర్జునుడి కుమారుడు శల్యుని రధాశ్వములను చంపాడు, భీముని కుమారుడు శల్యుని ధనస్సును, ధర్మరాజు కుమారుడు శల్యుని కేతనమును విరిచారు. నకులుడి కుమారుడు శల్యుని రధసారధిని చంపారు. భీముడు అలంబసుడితో యుద్ధం చేస్తున్నాడు. అలంబసుడి ధాటికి భీముడు మూర్చిల్లి అంతలోనే తేరుకుని అలంబసుడి శరీరం మొత్తం బాణములతో కొట్టాడు. అలంబసుడు తన శరీరాన్ని పెంచగానే ఆ బాణములన్నీ అతడిని ఏమి చేయలేక పోయాయి. అలంబసుడు భీమసేనుడితో " భీమసేనా ! నా తండ్రి బకాసురుని చంపినపుడు నేను లేను ఇప్పుడు నాపై నీ ప్రతాపం చూపు " అన్నాడు. అది విని భీముడు కోపించి అతడిపై బ్రహ్మాస్త్రం ప్రయోగించి అలంబసుని తరిమి తరిమి కొట్టాడు. ద్రోణుడు సాత్యకి మొదలైన పాండవ వీరులను ఎదుర్కొని తన బాణ ప్రయోగంతో వారిని ముందుకు పోకుండా ఆపుతున్నాడు.

## అలంబసుడి యుద్ధం


ఘటోత్కచుని చేతిలో అలంబసుని మరణం

ఇంతలో ద్రోణుడిని ఘటోత్కచుడు ఎదుర్కొన్నారు. అది చూసి అలంబసుడు ఘటోత్కచుడిని ఎదుర్కొన్నాడు. తనకు అడ్డంగా ఉన్న సాత్యకిని పక్కకు నెట్టి ఘటోత్కచుడు అలంబసుడి మీద శరవర్షం కురిపించాడు. అలంబసుడు ఘటోత్కచునిపై పెద్ద చక్రం వేసాడు. ఘటోత్కచుడు దానిని నుగ్గు నుగ్గు చేసాడు. తన చక్రాయుధము నిరుపయోగం కావడంతో అలంబసుడు ఘటోత్కచునిపై అనేక మాయలు ప్రయోగించాడు. ఘటోత్కచుడు వాటిని తన అర్ధచంద్ర బాణములతో ఎదుర్కొన్నాడు. ఒకరికి ఒకరు తీసిపోకుండా భీకరంగా ద్వంద యుద్ధం, మాయా యుద్ధం సాగిస్తున్నారు. ఉపపాండవులు అలంబసుడిని తమబాణములతో కప్పారు. అలంబసుడు ఆబాణములకు జంకక భీముని ఇరవై అయిదు బాణములతోను, ధర్మరాజును మూడు బాణములతోను ఉపపాడవులను, సహదేవుడిని, ఘటోత్కచుడిని ఇరవై అయిదు బాణములతో కొట్టి సింహనాదం చేసాడు. ఘటోత్కచుడు అలంబసుడి రధాశ్వములు చంపి, సారధిని చంపి, రధమును విరిచాడు. తన రధము విరిగి పోగా అలంబసుడు నేల మీదకు దూకి తన మాయాజాలముతో పాండవ సేనపై మాయాశరములను వేసాడు. ఘటోత్కచుడు కూడా రధము దిగి అలంబసుడితో మాయా యుద్ధముకు తలపడి అలంబసునిపై మాయాసరములు గుప్పించాడు. అలంబసుడు ఖడ్గం తీసుకుని ఆకాశానికి ఎగిరాడు. ఘటోత్కచుడు కూడా ఖడ్గపాణి అయి ఆకాశానికి ఎగిసాడు. ఇద్దరూ మేఘాలపై ఒకరిని ఒకరు చుట్టుకుంటూ చిత్ర విచిత్రంగా యుద్ధం చేస్తున్నారు. తరువాత ఇద్దరూ భూమి మీద పడి ఒకరిపై ఒకరు కత్తులు విసురుకున్నారు. ఒకదానికి ఒకటి కొట్టుకొని అవి పడి పోగానే ఇద్దరు ద్వంద యుద్ధానికి తలపడ్డారు. ఒకరిని ఒకరు తోయుచూ, పొడుచుకుంటూ, కొట్టుతూ అనేక విధముల పోరు సాగించారు. చివరకు అలంబసుడు అలిసి పోగానే ఘటోత్కచుడు తగిన సమయం వచ్చిందని అలంబసుని కిందకు తోసి మీద కూర్చుని చేతులతో, కాళ్ళతో తన్ని పొడిచి, కుమ్మి యుద్ధం చేసాడు. చివరకు అలంబసుడు ఘటోత్కచుడి చేతిలో ప్రాణాలు విడిచాడు. ధర్మరాజు ఘటోత్కచుడిని కౌగలించుకుని అభినందించాడు.

## ధర్మరాజు సాత్యకిని అర్జునుడికి సాయంగా పంపుట

సాత్యకి కౌరవ సేనలను దొరికిన వాడిని దొరికినట్లు చంపుతూ తరుముతున్నాడు. అది చూసిన ద్రోణుడు సాత్యకిని ఎదుర్కొన్నాడు. సాత్యకి ద్రోణునిపై ఇరవై అయిదు బాణములతో కొట్టాడు. ద్రోణుడు సాత్యకిని మూడు బాణములతో కొట్టాడు. సాత్యకి ద్రోణుడిని ఏభై నారాచములతో కొట్టాడు. ద్రోణుడు వాటిని తొమ్మిది బాణములతో ఎదుర్కొన్నాడు. వాటిని సాత్యకి ఎదుర్కొంటున్న సమయంలో ద్రోణుడు సాత్యకిపై నూరు బాణములు వేసాడు. సాత్యకి నిస్సహాయంగా నిలబడ్డాడు. అది చూసి నీ కుమారులు సింహనాదం చేసారు. ధర్మరాజు అది చూసి " యోధులారా ! రండిసాత్యకి ఆపదలో ఉన్నాడు రక్షించండి " అని అరిచాడు. ఆ మాటలు విన్న భీముడు ఒక్క పరుగున సాత్యకి వద్దకు వచ్చాడు. మిగిలిన పాండవ వీరులు సాత్యకిని దాటిపోయి ద్రోణుని ఎదుర్కొన్నారు. వారిని చూసి ద్రోణుడు చిరు నవ్వు నవ్వి వారిపై వాడి అయిన శరములు వేసి పాంచాలురు ఇరవై మందిని కేకయ రాజులను నూరు మందిని తలలు నరికి యమసదనానికి పంపాడు. పాండవసైన్యం


కౌరవ సైన్యములో ప్రవేశించి యుద్ధము చేయుచున్న సాత్యకి

ద్రోణుని దాటి ఒక్క అడుగు ముందుకు వేయ లేదు. ఇంతలో పాంచజన్య ఘోష వినపడింది. అది విన్న ధర్మరాజు సాత్యకిని చూసి " సాత్యకీ ! అర్జునుడి దేవదత్తము వినిపించకనే పాంచజన్య ఘోష వినవస్తుంది. అశ్వత్థామ, కర్ణ, శల్య, కృప, శల్య, భూరిశ్రవసులు అర్జునుడిని చుట్టుముట్టినట్లున్నారు. అర్జునుడు ఆపదలో ఉన్నట్లున్నాడు. ఈ సమయంలో నాకు నీవు తప్ప ఎవ్వరూ లేరు. నీవు వెళ్ళి అర్జునుడిని కాపాడు " అన్నాడు. సాత్యకి ధర్మజునితో " నీవు చెప్పినది సత్యము. కాని అర్జునుడు నన్ను నీ రక్షణకై నియోగించి " సాత్యకీ ! నేడు శకునము బాగుంది. నేను సైంధవుని వధించడానికి వెళుతున్నాను. నీవు నా బదులుగా ధర్మజుని రక్షిస్తూ ఉండు. సైంధవ వధ ఎంత ముఖ్యమో ధర్మజుని రక్షణా అంత ముఖ్యము. నా పక్కన కృష్ణుడు ఉన్నట్లు నీవు ధర్మజుని పక్కన ఉండు " అన్నాడు. ద్రోణుడు మిమ్ము బంధించాలని చూస్తున్నాడు. ద్రోణుడు తమను బంధిస్తే అర్జునుడు సైంధవుని వధించినా ఏమి ప్రయోజనం. శ్రీకృష్ణుడు తోడుగా ఉన్నంత వరకు అర్జునుడికి భయం ఏమి లేదు. కనుక నేను మిమ్ము విడిచి వెళ్ళలేను " అన్నాడు సాత్యకి. ధర్మరాజు " సాత్యకీ నీవు చెప్పినది యధార్ధమైనా నీవు ఇప్పడు అర్జునుడికి సాయంగా వెళ్ళడం యుక్తమైనదిగా నాకు అనిపిస్తుంది. అర్జునుడు క్షేమముగా ఉంటేనే మనకందరికి రక్షణ. కనుక నీవు నా మాట కాదనక అర్జునుడికి సాయంగా వెళ్ళు. నాకు ఇక్కడ ద్రోణుని చంపడానికే పుట్టిన ధృష్టద్యుమ్నుడు, విరాటరాజు, ద్రుపదుడు, ఉపపాండవులు, కేకయరాజులు, శిఖండి ఇంకా యోధాను యోధులనేకులు ఉన్నారు. నాకేమి భయం లేదు " అన్నాడు. ధర్మజుని మాటకు బదులు చెప్పలేక సాత్యకి భీముని ధర్మజునికి రక్షణగా ఉంచి ధర్మజుని అనుమతి పొంది సైంధవుని చంపి విజయుడినై తిరిగి వస్తానని ప్రతిజ్ఞ చేసి అర్జునుడికి సాయంగా వెళ్ళాడు.

## వనరులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభ్రువాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | దృపదుడు | |

# ద్రోణ పర్వము చతుర్థాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# చతుర్థాశ్వాసం

అప్పటి వరకూ సంజయుని మాటలు వింటున్న ధృతరాష్ట్రుడు సంజయునితో " సంజయా! ధర్మరాజు అనుమతి తీసుకుని వెళుతున్న సాత్యకి ద్రోణుని ఎలా దాటగలిగాడు. మన సైన్యం ఎవరూ సాత్యకిని అడ్డుకొన లేదా ! సాత్యకి అర్జునుడిని కలిసాడా ! వివరంగా చెప్పు " అని అడిగాడు. సంజయుడు చెప్పసాగాడు " ధర్మరాజు ఆజ్ఞా బద్ధుడైన సాత్యకి అడ్డువచ్చిన కౌరవ సేనలను చంపుతూ ముందుకు దూసుకు వెళుతున్నాడు. తనను అడ్డుకున్న ఏడుగురిని యమపురికి పంపాడు సాత్యకి. అది చూసి ద్రోణుడు సాత్యకిని అడ్డుకుని అతిక్రూర శరములతో కొట్టాడు. సాత్యకి రధమును, సారధిని కొట్టాడు. అందుకు సాత్యకి కోపించి ద్రోణునిపై బాణములు గుప్పించాడు. ద్రోణుడు వాటిని త్రుంచి తిరిగి సాత్యకిపై బాణములు గుప్పించి " సాత్యకీ ! నా పరాక్రమముకు తట్టుకోలేక నీ గురువు అర్జునుడు నాతో యుద్ధము చేయకుండా పారి పోయాడు. ఇప్పుడు నువ్వు వచ్చావు నా బాణముల రుచి చూద్దువుగాని " అన్నాడు. సాత్యకి ద్రోణునికి నమస్కరించి " ఆచార్యా! నేను అంతటి వాడిని కాను. ధర్మరాజు ఆజ్ఞ మేరకు అర్జునుడికి సాయం వెడుతున్నాను. దయ ఉంచి నన్ను విడువుము . నా వంటి పిన్నలను మన్నించుట మీ వంటి పెద్దల ధర్మము కదా ! " అన్నాడు. అయినా ద్రోణుడు సాత్యకికి దారి విడువ లేదు. సాత్యకి తనకు అడ్డుగా ఉన్న అంగ, బాహ్లిక, దాక్షిణాత్య సేన మధ్య నుండి ఆవలకు వెళ్ళాడు. ఇంతలో కృతవర్మ సాత్యకిని అడ్డుకుని ఆరు బాణములతో సాత్యకిని కొట్టాడు. నాలుగు బాణములతో సాత్యకి రధాశ్వములను కొట్టాడు. సాత్యకిని కృతవర్మ అడ్డుకొనడం చూసిన ద్రోణుడు ధర్మరాజు వైపు వెళ్ళాడు. సాత్యకి కృతవర్మను పదహారు శరములతో కొట్టాడు. అతడి సారధి చంపి, అతడి విల్లు విరిచాడు. కృతవర్మ తన రధమును తానే తోలుకుంటూ యుద్ధం చేస్తూ కృతవర్మ సాత్యకిని వదిలి భీముని వైపు పోయాడు. సాత్యకి కాంభోజుని సేనలో ప్రవేశించి అక్కడి వీరులను తనుమాడుతున్నాడు. ఇంతలో ద్రోణుడు కృతవర్మకు మరొక రధమును ఏర్పాటు చేసాడు.

## కృతవర్మ పరాక్రమం

కృతవర్మ ధర్మరాజును అతడికి సాయంగా ఉన్న వీరులను ఎదుర్కొన్నాడు. భీమసేనుడు వారికి సాయంగా వచ్చాడు. భీముడు, ధృష్టద్యుమ్నుడు మూడేసి బాణములతోను ధర్మరాజు, ద్రుపదుడు అయిదేసి బాణమలతోను విరాటరాజు పదిహేను బాణములతోను సహదేవుడు ఇరవై ఐదు బాణములతోను, శిఖండి ఇరవై బాణములతోను, ఉపపాడవులు డెబ్బై అయిదు బాణములతోను, నకులుడు నూరు బాణములతోను కృతవర్మను చుట్టుముట్టి కొట్టారు. కృతవర్మ జంకక ఒక్కొక్కరిని ఐదేసి బాణములతో కొట్టి భీమునిపై ఏడు బాణములు వేసి, భీముని విల్లు పతాకము తుంచి డెబ్బై బాణములతో భీముని గుండెలకు గురిపెట్టి కొట్టాడు. ఆ దెబ్బకు భీముడు మూర్చిల్లాడు. ఇంతలో పాండవ వీరులు ఒక్కుమ్మడిగా కృతవర్మను చుట్టుముట్టారు. ఇంతలో భీముడు తేరుకుని కృతవర్మ మీద ఉజ్వలమైన శక్తిని ప్రయోగించాడు. కృతవర్మ దానిని మూడు ముక్కలుగా కొట్టాడు. కృతవర్మ దానిని మూడు ముక్కలు చేసాడు. భీముడు కృతవర్మను నెత్తురు కారేలా కొట్టాడు. కృతవర్మ భీమునిపై మూడు బాణములు వేసాడు. పాండవ సైన్యం కృతవర్మను చుట్టుముట్టి తీవ్రమైన బాణములతో కొట్టారు. కృతవర్మ కూడా జంకక శిఖండి విల్లు తుంచి భీముని వంటి రధికులపై శరములు గుప్పించి శిఖండి పైన బాణములు గుప్పించాడు. ఆ దెబ్బకు శిఖండి రధముపై పడ్డాడు. సారధి శిఖండిని పక్కకు తీసుకు వెళ్ళాడు. శిఖండి పడిపోవడం చూసి మత్స్య, కేకయ, చేధి రాజులు ఒక్కుమ్మడిగా తమసైన్యములతో కృతవర్మను ఎదుర్కొన్నారు. కృతవర్మ వారందరిని మర్మభేది బాణములు ప్రయోగించి బాధించాడు. కృతవర్మ ధాటికి పాండవ సైన్యాలు పారి పోవడం చూసిన సాత్యకి అర్జునుడి వద్దకు పోవడం కంటే ధర్మజుని రక్షణే ముఖ్యం అని తలచి ద్రోణుని పక్క నుండి ధర్మజుని వద్దకు వచ్చి కృతవర్మను ఎదుర్కొన్నాడు.

## సాత్యకి శౌర్యం

సాత్యకి కృతవర్మను ఎదుర్కొని భల్ల బాణములతో కృతవర్మ వింటిని తుంచి నాలుగు బాణములు వేసి రధాశ్వములను చంపి, ఒక్క అగ్నిబాణముతో సారధిని కొట్టి , ఇంతలో తనకు అడ్డు వచ్చిన త్రిగర్త సైన్యమును నాశనం చేసాడు. రధము విరిగిన కృతవర్మను పాండవ సైన్యం చుట్టుముట్టింది. ఇది చూసిన ద్రోణుడు సాత్యకిని వదిలి పాండవ సైన్యమును ఎదుర్కొన్నాడు. ఇంతలో జలసంధుడు అనే రాజు సాత్యకిని ఎదుర్కొని తన ఏనుగును సాత్యకి మీదకు తోలాడు. సాత్యకి అతడిని అడ్డుకున్నాడు. జస్లసంధుడు సాత్యకి వింటిని విరిచి ఏభై బాణములతో సాత్యకి గుండెలకు గురి చూసి కొట్టాడు. సాత్యకి కోపించి జలసంధుని అరవై బాణములు జలసంధుని శరీరంపై నాటాడు. జలసంధుడు ఒక తోమరంతో సాత్యకిని కొట్టి కత్తితో అతడి విల్లు విరిచాడు. సాత్యకి వెంటనే మరొక విల్లు తీసుకుని ఆలస్యం చేయక జలసంధుని క్రూరమైన బాణముతో చేతులు నరికి, మరొక బాణముతో అతడి తల నరికి మరొక బాణంతో అతడి ఏనుగును తరిమాడు. సాత్యకి పరాక్రమానికి కౌరవసైన్యం భయకంపితం అయింది. ఇది చూసిన ద్రోణుడు కృతవర్మను వ్యూహము వద్ద నిలిపి తాను సాత్యకిని ఎదుర్కొన్నాడు. తనకు

ఎదురుగా ద్రోణుడు రావడం చూసాడు సాత్యకి అతడి వెనుక కురుకుమారులైన దుర్మర్షణ, దుర్ముఖ, దుశ్శాసన, దుస్సహ, వికర్ణ, చిత్రసేనాదులు రావడం చూసాడు. ఇంతలో సుయోధనుడు వారితో చేరాడు. వారిని చూసిన ద్రోణుడు సుయోధనుడు తన సహోదరులతో సాత్యకిని ఎదిరించగలడు అనుకుని తిరిగి వ్యూహరక్షణకు వెళ్ళాడు. సాత్యకి కురుకుమారులకు ఒక్కొక్కరికి ఒక్కొకడిలా కనిపిస్తూ వారందరితో ఏక కాలంలో యుద్ధం చేస్తున్నాడు. అలా యుద్ధం చేస్తూ సుయోధనుడి విల్లు విరిచి అతడి శరీరం తూట్లు పడేలా కొట్టాడు. ఇది చూసిన కురుకుమారులు సాత్యకిపై బాణవర్షం కురిపించారు. సాత్యకి వారి అందరిపై ఒక్కొక్కరిపై అయిదేసి బాణము వేసి సుయోధనుడి మీద ఎనిమిది బాణములు వేసి అతడి వింటిని తుంచి, కేతనమును విరిచి, సారధిని కొట్టి, రధాశ్వములను చంపాడు. సుయోధనుడు సాత్యకి పరాక్రమానికి భయపడి పక్కనే ఉన్న చిత్రసేనుడి రధం ఎక్కి పారిపోయాడు.

## సాత్యకి కౌరవ సేనలను ఎదుర్కొనుట

సుయోధనుడిపై సాత్యకి పైచేయి కావడం చూసిన కౌరవసేన హాహాకారాలు చేసింది. అది చూసి కృతవర్మ అక్కడకు చేరాడు. సాత్యకి కూడా తన రధమును కృతవర్మకు ఎదురుగా నిలిపాడు. ఇద్దరూ ఒకరి మీద ఒకరు శరవర్షం కురిపించుకున్నారు. సాత్యకి కృతవర్మ విల్లు విరిచి, సారధిని చంపి మరొక బాణంతో కృతవర్మను మూర్చపోయేలా కొట్టాడు. ఆ దెబ్బకు కృతవర్మ రధంపైన పడ్డాడు. కృతవర్మ మరణించాడని అనుకుని సాత్యకి అర్జునుడి వద్దకు పోవడానికి ఆయత్తమయ్యాడు. కృతవర్మ తేరుకుని తిరిగి యుద్ధానికి వచ్చాడు. ద్రోణుడు కృతవర్మను వ్యూహద్వారము వద్ద నిలిపి తాను సాత్యకిని అడ్డగించడానికి వెళ్ళి మూడు క్రూర బాణములతో సాత్యకి నుదుటన కొట్టాడు. సాత్యకి అందుకు ప్రతిగా ద్రోణుడిపై బాణప్రయోగం చేసాడు. ఇరువురి మధ్య పోరు ఘోరమైంది. ద్రోణుడు ప్రయోగించిన శక్తి ఆయుధం విధి వశమున సాత్యకి రధమును తాకింది. సాత్యకి ద్రోణుడి భుజం మీద బాణమును వేసాడు. ద్రోణుడు సాత్యకి విల్లు తుంచి, సారధిని మూర్ఛిల్లేలా కొట్టాడు. సాత్యకి తానే రధము తోలుతూ యుద్ధము చేస్తున్నాడు. సాత్యకి ద్రోణుని రధసారధిని చంపాడు. సారధి లేని ద్రోణుని రధాన్ని గుర్రములు ఎటో లాక్కెళ్ళి చివరకు వ్యూహద్వారం చేర్చాయి. ద్రోణుని అడ్డు తొలగగానే సాత్యకి తన రధమును అర్జునుడి వైపు నడిపాడు. శరవేగంతో దూసుకుపోతున్న సాత్యకిని సుదర్శనుడు ఎదుర్కొని సాత్యకిపై బాణములు గుప్పించాడు. సాత్యకి ఆ బాణములను తునాతునకలు చేసి సుదర్శనుడి రధాశ్వములను చంపి, సారధిని చంపి చివరకు సుదర్శనుడి తల నరికాడు. సాత్యకి రధసారధితో " మహాసముద్రం వంటి ద్రోణుడిని దాటి వచ్చాను. ఈ పిల్ల కాలువలు ఒక లెక్కా ! " అన్నాడు. " ఆ విషయం నాకు తెలియనిదా ! ఇప్పుడు మనమెవరిని ఎదుర్కోవాలి " అన్నాడు సారధి. సాత్యకి " సారధీ! ఇక్కడ రధములు విరిగి పడి ఉన్నాయి. చనిపోయిన ఏనుగులు, హయములు, సైనికుల శవాలు పడి ఉన్నాయి. వీరిని అర్జునుడే చంపి ఉంటాడు. కనుక రధాన్ని ఈ మార్గంలో పోనిమ్ము అదిగో గాండీవం యొక్క ధనుష్టంకారం వినిపిస్తుంది అటు పోనిమ్ము. ఇంతలో కాంభోజరాజ సైన్యములు సాత్యకిని చుట్టుముట్టాయి. సాత్యకి వారి బాణములను ఎదుర్కొని అందరిని యమసదనముకు పంపాడు. ఆ ప్రాంతం అంతా పీనుగుల పెంట అయింది. వారి మీదనుండి రధము నడుపుతూ సాత్యకి ముందుకు సాగాడు.

## దుర్యోధనుడు సాత్యకిని వెంబడించుట

ముందుకు పోతున్న సాత్యకిని సుయోధనుడు తన సోదరులైన దుశ్శాసనుడు, వివిశంతి, చిత్రసేనుడు, దుర్మర్షణుడు, దుస్సహుడు, శకుని మొదలైన యోధులతో సాత్యకిని తరుముకొస్తున్నారు. వారిని చూసిన సాత్యకి " సారధీ ! రధము వెనుకకు తిప్పు వీరి సంగతి చూసి అర్జునుడి వద్దకు పోతాము " అన్నాడు. రధము వెనుకకు తిరిగి వారి ముందుకు రాగానే కురుసేనలు వారిని చుట్టుముట్టాయి. సాత్యకి భయపడక నాలుగు వందల ఏనుగులను మూడు వందల హయములను ఒకే సారి చంపాడు. కౌరవ యోధులలో సాత్యకి బాణముల రుచి చూడని వాడు లేడు. సుయోధనాదులు సాత్యకి మీద ధారాపాతంగా శరములు గుప్పించాడు. సాత్యకి వారినందరిని ఎదుర్కొని వారి రధములను, కేతనములను విరిచి, సారధులను, హయములను చంపాడు. ఇంతలో శకుని సుయోధనుడికి సాయంగా రాగా ఇద్దరూ సాత్యకిని ఎదుర్కొన్నారు. సాత్యకి విజృంభించి శకుని సారధి చంపి, సుయోధనుడి విల్లు విరిచాడు. శకుని రధమును గుర్రములు ఎటో ఈడ్చుకు వెళ్ళాయి. సుయోధనుడు అతడి తమ్ములు తప్పుకోగా సాత్యకి నిరాటంకంగా ముందుకు సాగాడు. దుశ్శాసనుడు కొండ జాతి వారిని సాత్యకి మీద పురికొల్పాడు. వారు సాత్యకిని ఎదుర్కొని అతడిపై రాళ్ళతో యుద్ధం చేయసాగారు. సాత్యకి వారి రాళ్ళను బాణ ప్రయోగంతో పొడి పొడి చేయగా వాళ్ళు సాత్యకి ధాటికి ఆగ లేక పారి పోయారు.

## దుశ్శాసనుడిని ద్రోణుడు తూలనాడుట

దుశ్శాసనుడు అక్కడ నుండి ద్రోణుని వద్దకు వెళ్ళగా అతడిని చూసిన ద్రోణుడు " యువరాజా ! ఏమిటిలా పరుగెత్తుకు వచ్చావు. సుయోధనుడు క్షేమమే కదా! అర్జునుడు సైంధవుడిని ఏదైనా చేసాడా! నీ వెందుకు పారిపోతున్నావు. అయినా దుశ్శాసనా ! అధికార మధంతో పాండవులను అవమానించినందుకు అష్టకష్టాలు పెట్టినందుకు ఫలితం అనుభవించాలి కదా! ద్రౌపది జుట్టుపట్టి ఈడ్చిన విషయం మరిచావా! పాడవులను హేళన చేసి పలికిన పలుకులు మరిచావా! ఆ నాటి అధికారం గర్వం ఏమయ్యాయి ఇలా భీరువులా పరుగెడుతున్నావు. అయినా ఎంతటి వారికైనా ప్రాణములంటే తీపి కదా ! దుశ్శాసనా ! నీకు నాలుగు కాలాలపాటు బ్రతకాలనుకుంటే ప్రాణాల మీద ఆశ ఉంటే నీ అన్న సుయోధనుడిని సంధికి ఒప్పించి అందరి ప్రాణాలు కాపాడు. అయినా నీ అన్న ఒట్టి వెర్రివాడు తాత భీష్ముని మాట వినక ఒక్కొక్క తమ్ముడిని చంపు కుంటున్నాడు నీ వంతు వస్తుందిలే అదిగో సాత్యకి నీ పక్షాన యుద్ధముకు వచ్చిన రాజులను తరుము తున్నాడు వెళ్ళి వారికి సాయపడక ఇలా భయపడి పారిపోయి రావచ్చునా! " అన్నాడు. ద్రోణుడి మాటకు రోషం తెచ్చుకున్న దుశ్శాసనుడు తిరిగి సాత్యకితో యుద్ధం చేయడానికి వెళ్ళాడు.

## ద్రోణుడి పరాక్రమము

ద్రోణుడు పాండవ వీరులతో యుద్ధం చేస్తుండగా వీరకేతుడు ద్రోణుని ఎదుర్కొని మరుక్షణంలో ద్రోణుని బాణాలకు బలి అయ్యాడు. వీరకేతుని మరణం చూసి సుధన్వుడు, చిత్రకేతుడు, చిత్రవర్మ, చిత్రరధుడు మొదలగు యోధులు ఒక్కుమ్మడిగా ద్రోణుని ఎదుర్కొన్నారు. కోపించిన ద్రోణుడు వారినందరినీ ఒక్కొక్క బాణముతో చంపి వారి శిరస్సులను భూదేవికి బలి ఇచ్చాడు. ఇది చూసి బాధపడిన ధృష్టద్యుమ్నుడు మహోగ్రంతో ద్రోణుని ఎదుర్కొని అతడి రధమును తన బాణములతో కప్పి అతడి వక్షస్థలంపై కొట్టాడు. ద్రోణుడు ఆ దెబ్బకు మూర్చిల్లాడు. ధృష్టద్యుమ్నుడు కత్తి డాలు తీసుకుని ద్రోణుని రధము ఎక్కి అతడి తల నరకబోయాడు. ఆ సమయానికి కోలుకున్న ద్రోణుడు అందిన ఆయుధము తీసుకుని ధృష్టద్యుమ్నుని ఒళ్ళంతా వొడిచాడు. ఆ బాధ భరించలేని ధృష్టద్యుమ్నుడు తిరిగి తన రధము ఎక్కి ద్రోణునిపై శరవర్షం కురిపించాడు. కోపించిన ద్రోణుడు ధృష్టద్యుమ్నుని సారధిని చంపి, విల్లు విరిచి, గుర్రములను కొట్టాడు. ఆ బాధ భరించ లేని గుర్రాలు ధృష్టద్యుమ్నుని పక్కకు లాక్కెళ్ళాయి. ద్రోణుని పరాక్రమానికి భయపడిన పాండవ సేన అతడి ఎదుట పడటానికి జంకుతున్నారు. ద్రోణుడు తన మాటకు రోషపడి సాత్యకితో యుద్ధము చేయడానికి వెళ్ళిన దుశ్శాసనుడికి సాయంగా మూడు వేల మంది త్రిగర్త సైనికులను పంపాడు. సాత్యకి వారిని ఎదుర్కొని ఒకే దెబ్బకు ఐదు వందల మందిని చంపి మిగిలిన వారిని కూడా తెగ నరక సాగాడు. త్రిగర్త సైనికులు భయపడి ద్రోణుని వైపు పారిపోయారు. ఎదురుగా నిలబడిన దుశ్శాసనుడిని చూసిన సాత్యకి అతడి విల్లు తుంచాడు. దుశ్శాసనుడు వేరొక విల్లు తీసుకుని సాత్యకిపై శక్తి బాణము వేసాడు. సాత్యకి తిరిగి దుశ్శాసనుడి విల్లు విరిచి, సారధిని చంపి, కేతనమును పడగొట్టి దుశ్శాసనుడిని మూర్చ వోయేలా కొట్టాడు. అప్పుడు సాత్యకి భీముని ప్రతిజ్ఞ గుర్తుకు తెచ్చుకుని దుశ్శాసనుడిని చంపక వదిలి అర్జునుడి వైపు వోసాగాడు.

## కురు పాండవుల సంకుల సమరం

ధర్మరాజు సాత్యకికి సాయంగా వెళ్ళాలని ధృష్టద్యుమ్నుని, భీముని, నకుల సహదేవులను ముందుంచుకుని కౌరవ సేనలను తరుముతున్నాడు. అర్జునుడు కౌరవ సేనలో దూరి వారిని హతమారుస్తున్నాడు. సాత్యకి అర్జునుడిని చేరాలని ఎదురైన కురు సేనలను చెండాడుతున్నాడు. ద్రోణుడు పాండుకుమారులను వ్యూహంలోకి రాకుండా అడ్డుకుంటూ పాండవసేనలను తనుమాడుతున్నాడు. ఈ విధంగా ఇరుపక్షల యోధులు మరణిస్తూ మారణహోమము తీవ్రంగా జరుగుతూ రణరంగం భీతి కొల్పుతుంది. అక్కడ ఏమి జరుగుతుందో చూడాలని సుయోధనుడు వచ్చి పాండవులను చూసి భీముని మీద పది బాణములు నకుల సహదేవులు, ఉపపాండవులు, ద్రుపదుడు, విరాటరాజు మీద మూడేసి బాణములు , కేయరాజులు ఐదుగురి మీద శిఖండి మీద మూడు బాణములు, ధృష్టద్యుమ్నుని మీద ఇరవై బాణములు వేసాడు. ధర్మరాజు దుర్యోధనుడి విల్లు విరిచాడు. మిగిలిన పాండవులు అతడిని చుట్టుముట్టారు. సుయోధనుడు తిరిగి సైంధవుని వద్దకు వెళ్ళాడు. ద్రోణునికి కేకయరాజులకు యుద్ధం జరుగుతుంది. ద్రోణుని బాణములను కేకయరాజులు తిప్పి కొడుతున్నారు. ద్రోణుడు అరవై బాణములతో బృహక్షత్రుని కొట్టాడు. బృహక్షత్రుడు కోపించి ద్రోణుని ఎదుర్కొన్నాడు ఇంతలో శిశుపాలుని కొడుకు ధృష్టకేతు ద్రోణుని మీద లంఘించాడు. ద్రోణుడు అతడి విల్లు విరిచాడు. ధృష్టకేతు తన గధతో ద్రోణుని కొట్టాడు. ద్రోణుడు ఆ గధను తుత్తునియలు చేసి మరొక బాణంతో ధృష్టకేతు గొండెలకు గురిపెట్టి కొట్టాడు. ఆదెబ్బకు ధృష్టకేతు యమసదనం చేరాడు. ధృష్టకేతు కుమారుడు తండ్రి మరణానికి ఆగ్రహించి ద్రోణాచార్యుని ఎదుర్కొన్నాడు. ఒక్క బాణంతో ద్రోణుడు ధృష్టకేతు కుమారుని తుదముట్టించాడు. వెంటనే జరాసంధుని కుమారుడు ద్రోణుని ఎదుర్కొన్నాడు. ద్రోణుడు వాని పటాటోపాన్ని చూసి అతడి సైన్యం ముందే అతడిని చంపాడు. అది చూసిన భీముడు " ధృష్టద్యుమ్నా ఈ బ్రాహ్మణుడు మన సైన్యాలను అవిశ్రాంతంగా చంపుతున్నాడు " అన్నాడు. ఇంతలో క్షత్రవర్మ ద్రోణుని విల్లు విరిచాడు. ద్రోణుడు మరొక విల్లు అందుకుని అగ్నిశిఖలు విరజిమ్మే బాణాలతో క్షత్రవర్మను చంపాడు. చేకితానుడు ద్రోణుని ఎదుర్కొని అతడి రధము విరిచి, అతడి సారధిని

చంపి శరీరం అంతా బాణములు నాటాడు. కోపించిన ద్రోణుడు చేకితానుడి భుజము నరికి సారధిని చంపి, హయములను చంపాడు. ద్రోణుడి పరాక్రమము తట్టుకోలేని చేకితానుడు అక్కడి నుండి పారిపోయాడు. ఇది చూసి ద్రుపదుడు ద్రోణుని ఎదుర్కొన్నాడు. ఇరువురికి పోరు ఘోరమైంది.

## ధర్మరాజు భీమసేనిడిని అర్జునుడికి సాయంగా పంపుట

ధర్మరాజు మనసులో ఇలా అనుకుంటున్నాడు. " అర్జునుడుకి సాయంగా పంపిన సాత్యకి జాడ తెలియ లేదు అర్జునుడుఏలా ఉన్నాడో తలితెలియ లేదు " అనుకుంటూ భీముని పిలిచి " భీమసేనా ! నీ తమ్ముడు అర్జునుడి జాడ తెలియ లేదు. అతడికి సాయంగా వెళ్ళిన సాత్యకి ఏమయ్యాడో తెలియ లేదు. నాకు చాలా ఆందోళనగా ఉంది " అన్నాడు. భీముడు " అన్నయ్యా ! నేను ఏమి చెయ్యాలో చెప్పు . సత్వరం ఆచరిస్తాను " అని అన్నాడు. " భీమసేనా ! నాకు పాంచజన్యం శబ్దం మాత్రం వినవచ్చింది. అర్జునుడి దేవదత్త శంఖధ్వని వినరాలేదు అందు వలన సాత్యకిని పంపాను. అతడి జాడ తెలియ లేదు. నీవు వెళ్ళి అర్జునుడి క్షేమం కనుక్కుని రా ! " అని అన్నాడు. " అదేమిటి అన్నయ్యా ! అర్జునుడి పరాక్రమము గురించి నీకు తెలియదా! అతడి గురించి దిగులు ఎందుకు అయినా నీ ఆజ్ఞ శిరసావహించి నేను వెడుతున్నాను నన్ను ఆశీర్వదించు " అని అన్నగారి ఆశీర్వచనాలు తీసుకుని ధృష్టద్యుమ్నుని చూసి " ధృష్టద్యుమ్నా! నీకు ద్రోణుని ప్రతిజ్ఞ గురించి తెలుసుకదా ! అన్నగారు జాగర్త నేను అర్జునుడికి సాయంగా వేడుతున్నాను " అన్నాడు. " భీమసేనా ! ఈ ధృష్టద్యుమ్నుని మేనిలో ప్రాణమున్నతంత వరకు ధర్మజుని మీద ఈగ వాలనివ్వను నీవు క్షేమముగా వెళ్ళి రమ్ము " అన్నాడు ధృష్టద్యుమ్నుడు. ఇంతలో పాంచజన్య ఘోషవినిపించింది. ధర్మరాజు కంగారుగా ఉన్నాడు " భీమసేనా ! విన్నావుగా కృష్ణుడు పాంచజన్యం పూరిస్తున్నాడు. అర్జునుడి దేవదత్త ఘోష వినరాలేదు అర్జునుడు ఆపదలో ఉన్నాడనడానికి ఇది సూచన. నీవు త్వరగా అర్జునుడికి సాయంగా వెళ్ళు " అని భీమసేనుడిని తొందర పెట్టాడు. వెంటనే భీముడు పాంచజన్య శంఖ శబ్ధం వినవచ్చిన దిక్కుగా తన రధమును నడిపించాడు.

## భీముడు కురు రాకుమారులను వధించుట

ఇంతలో నీ కుమారుడు దుశ్శలుడు, వివిశంతి, కుండభేధి, చిత్రసేనుడు, దుర్ముఖుడు, దుస్సహుడు, వికర్ణుడు, శలుడు, విందుడు, అనువిందుడు, సుముఖుడు, దీర్గబాహుడు, సుదర్శనుడు, బృందారకుడు, సుహస్తుడు, సుషేణుడు, దీర్గలోచనుడు, అభయుడు, రౌద్రకర్ముడు, సుశర్మ, దుర్విమోచనుడు మొదలైవ వారు భీమసేనుడిని అడ్డుకున్నారు. భీమసేనుడు వారిని నిలువరిస్తూ అర్జునుడి వైపు పోతూ బృందారకుని, అభయుని, రౌద్రకర్ముని, దుర్విమోచనుడిని చంపాడు. కురుకుమారులు అందుకు జడవక భీముని చుట్టుముట్టారు. భీముడు కోపించి విందానువిందులను, సుశర్మను చంపి సుదర్శనుడిని భూమి మీద పడేలా కొట్టాడు. ఆ దెబ్బకు కౌరవ సేన పారిపోయారు. ఆ దెబ్బకు కౌరవ సేన పారిపోయారు. భీమసేనుడు సింహనాదం చేస్తూ ముందుకు సాగుతున్నాడు.

## ద్రోణుడు భీముని అడ్డగించుట

ద్రోణుడు అర్జునుడికి సాయంగా వెడుతున్న భీముని అడ్డగించి అతడి మీద బాణవర్షం కురిపించి " భీమసేనా ! నీవు నన్ను జయించి కాని నీవు లోపలకు వెళ్ళలేవు. నీ తమ్ముడు అర్జునుడు కూడా నా అనుమతి తీసుకుని లోపలకు వెళ్ళాడు " అన్నాడు. అది అర్ధం చేసుకోని భీముడు కోపంగా " ద్రోణాచార్యా ! నా తమ్ముడు ఎప్పుడూ అటువంటి పని చేయడు. అర్జునుడు ఒక రధికుని సాయంతో లోపలకు వెడతాడా ! అది అసంభవం. ఏవేవో తియ్యటి మాటలు చెప్పి పక్క నుండి తప్పుకు పోవడానికి నేను పార్ధుడిని కాను. నేను భీమసేనుడిని నా తండ్రిగా గురువుగా మిమ్ము గౌరవిస్తాను. కాని మీరు శత్రుపక్షాన చేరి వారికి విజయం కట్టబెడుతుంటే చూస్తూ ఎలా ఊరుకుంటాను " అంటూ తన గధను ద్రోణుని మీదకు విసిరాడు. అది ఆకాశంలో చక్కర్లు కొడుతూ ద్రోణుని రధంపై పడి నుగ్గు నుగ్గు చేసి, సారధిని, హయములులను చంపింది. అది చూసిన నీ కుమారులు భీమసేనుడిని ఎదుర్కొని


ద్రోణుడి రథాన్ని దూరంగా విసిరి వేస్తున్న భీముడు

నిలువ లేక పారిపోయారు. ద్రోణుడు మరొక రథం ఎక్కి మరొక విల్లు అందుకుని భీమసేనుడిపై శరవర్షం కురిపించాడు. భీమసేనుడు తన రథం దిగి ద్రోణుడి బాణవర్షంలో నుండి నడిచి వెళ్ళి ద్రోణుడి రథం తీసుకుని ఎత్తి విసిరాడు. తిరిగి ద్రోణుడి రథం నుగ్గు నుగ్గు అయింది. ద్రోణుడు మరొక రథం ఎక్కి వీడితో మనకెందుకు అని పైదొలిగాడు. భీముని రథసారధి విశోకుడు భీమసేనుని రథం తీసుకు వచ్చి నిలిపాడు. భీమసేనుడు అర్జునుడి వపు సాగిపోసాగాడు. ద్రోణుని జయించి ముందుకు పోతున్న భీముని చూసి కాంభోజ, భోజ, యవన సేనలు భయంతో పైదొలిగి పోయాయి. కౌరవ సేనలో భీముని ఎదుర్కొనే ధైర్యం ఎవరికి లేక పోయింది. భీముడు కౌరవ సేనతో యుద్ధం చేస్తున్న సాత్యకిని చూస్తూ ముందుకు సాగి అర్జునుడిని చేరుకుని కృష్ణార్జునులను చూసి సింహనాదం చేసాడు. భీముని చూసి కృష్ణార్జునులు సింహనాదం చేసారు. ఈ కలకలం విన్న ధర్మరాజు అర్జునుడు కృష్ణుడు క్షేమంగా ఉన్నారని తెలుసుకుని ఆనంద పరవశుడయ్యాడు " అని సంజయుడు చెప్పగా విన్న ధృతరాష్ట్రుడు " అదేమిటి సంజయా ! మన సైన్యంలో భీముని ఎదుర్కొనే వీరుడే లేడా ? అవునులే భీముడు నా కుమారులను చంపడానికే పుట్టాడు అతడికి ఎదురేముంటుంది లే " అని మనసులో అనుకున్నాడు.

## సుయోధనుడు ద్రోణుని నిందించుట

భీమసేనుడిని చూసిన కర్ణుడు అతడిని ఎదుర్కొని ఇరవై బాణములు అతడి మీద వేసాడు. భీమసేనుడు ఆబాణములు త్రుంచి భీముని మీద అరవై నిశిత శరములు కురిపించాడు. వేరొక బాణము వేసి కర్ణుని కేతనము విరిచి, విల్లు విరుగ కొట్టాడు. కర్ణుడు మరొక విల్లు తీసుకుని భీముని మీద శరసంధానం చేసాడు. భీముడు తిరిగి శరసంధానం చేసి కర్ణుని విల్లు విరిచి, సారధిని, హయములను చంపాడు. కర్ణుడు వృషసేనుడి రథము ఎక్కి పారిపోయాడు. ఇది చూసి కౌరవ సేనలో కలకలం రేగింది అది విని సుయోధనుడు " ఆచార్యా ! అటు చూడండి అర్జునుడు, సాత్యకి, భీమసేనుడు సైంధవుడు ఉన్న చోటికి చేరుకున్నారు. అర్జునుడు చొరబడితే పరవా లేదు కాని సాత్యకిని, భీముని లోనికి వదలడం మీకు భావ్యమా ! ఆఖరికి సాత్యకిని ఆపలేక పోవడం మా దౌర్భాగ్యం కాక మరేమిటి " అని నిష్ఠూరంగా మాటాడాడు. ఆ మాటలకు ద్రోణుడు " సుయోధనా ! ఇక్కడ ఎవరు ఎలా వెళ్ళారు అన్నది మనకు ముఖ్యం కాదు. సైంధవుని రక్షణ మాత్రమే మనకు ముఖ్యము. ఈ రోజు యుద్ధం ఒక జూదం అందు సైంధవుడు పందెం. ఈ జూదం శకుని తెలివి తేటలతో గెలిచేది కాదు. యుద్ధకౌశలంతో గెలువతగినది. కనుక నీవు ధైర్యంగా సాగి కర్ణుడు, అశ్వత్థామ మొదలైన వీరులతో సైంధవుని కాపాడు. నేను ఇక్కడ నిలిచి అర్జున, భీమ, సాత్యకులకు పాండవ సేన సాయం అందకుండా చూస్తాను. నేను ఇక్కడ నుండి కదిలితే సైన్యం చెదురుతుంది అప్పుడు సైంధవుని రక్షించడం సాధ్యం కాని పని. నేను లేకున్న పాండవ సైవ్యాలకు ద్వారం తెరిచి నట్లే నేను నీతో రాలేను నీవు వెళ్ళు " అన్నాడు.

## సుయోధనుడు పాండవ యోధులను ఎదుర్కొనుట

సుయోధనుడు ద్రోణుని మాట మన్నించి తిరిగి వెళ్ళాడు. అప్పుడు సాత్యకి కృతవర్మను జయించి అర్జునుడి వద్దకు చేరాడు. సుయోధనుడు వారి ముగ్గురను ఎదుర్కొన్నాడు. సాత్యకి పక్కన ఉన్న ఉత్తమౌజుడు సుయోధనుడి మీద బాణప్రయోగం చేసి సుయోధనుడి విల్లు విరిచి, అతడి గుండెలకు గురి చూసి నిశిత బాణములతో కొట్టాడు. సుయోధనుడు మరొక విల్లు అందుకుని ఉత్తమౌజుని సారధిని, రథాశ్వములను చంపాడు. ఉత్తమౌజుడు సాత్యకి రథం ఎక్కి సుయోధనుడి విల్లు విరిచి, రథమును విరిచాడు. సుయోధనుడు తన రథము దిగి గధతో సాత్యకి రథం విరిచాడు. సాత్యకి ఉత్తమౌజులు రథం నుడి కిందకు దిగగానే సుయోధనుడు శల్యుని రథం ఎక్కాడు. సాత్యకి ఉత్తమౌజులు తమ గధాయుధములతో శల్యసుయోధనులను చావగొట్టి వారిని రథము నుండి కిందికి త్రోసి ఆ రథము ఎక్కి అర్జునుడిని చేరుకున్నారు " అని చెప్పిన సంజయుని పలుకులు విని " అదేమిటి సంజయా ! మన వాళ్ళు కర్ణుడు పాండవులను గెలిచి మనలను కాపాడుతాడనుకుంటే ఇలా అయిందేమిటి ? కర్ణుడు ఎక్కడకు వెళ్ళాడు ఏమి చేస్తున్నాడు వివరించు " అని అడిగాడు.

## భీముడు కర్ణుని ఎదుర్కొనుట

వృషసేనుడి రథము ఎకి పారి పోయిన కర్ణుడు " భీమసేనా! " అని ఎలుగెత్తి పిలిచాడు. ఆ పిలుపు విని కోపించిన భీముడు కర్ణుని మీద శరవర్షం కురిపించాడు. కర్ణుడు కూడా భీముని బాణములు తుంచి అతడి మీద అతి క్రూర బాణములు వేసాడు. ఇరువురి నడుమ పోరు ఘోరమైంది. భీముడు కర్ణుని రథాశ్వములను , సారధిని చంపాడు. కర్ణుడు చికాకు పడి పక్కకు పోయి వేరొక రథం ఎక్కాడు " అన్న సంజయునితో ధృతరాష్ట్రుడు " ఛా! సుయోధనుడు ఎంతగానో నమ్మిన కర్ణుడు ఇలా చేస్తుంటే బుద్ధి హీనుడైన సుయోధనుడు ఏమనుకున్నాడో ఏమో అన్ని డంబములు పలికిన కర్ణడు ఆతరవాత ఏమి చేసాడు ? " అన్నాడు. సంజయుడు " అవమాన భారంతో రగిలిపోతున్న కర్ణుడు తిరిగి భీమసేనుడిని ఎదుర్కొన్నాడు.


భీముని చేతిలో కర్ణుని పరాజయం

ఇరువురి మధ్య పోరు ఘోరమై భీమసేనుడి చేతిలో కర్ణుడి సైన్యం మొత్తము హతమైంది " అనగానే ధృతరాష్ట్రుడు " సంజయా ! కర్ణుడు అర్జునుడిని జయిస్తాడన్న అహంతోనే కదా సుయోధనుడు మదమెక్కి పాండవులతో యుద్ధానికి దిగాడే ఈ కర్ణుడు కనీసం భీమ సేనుడిని కూడా జయించ లేక పోతున్నాడు. వీడు అర్జునుడిని కృష్ణుని మిగిలిన పాండవులను గెలువగలడా. ఆనాడు శ్రీకృష్ణుని సంధి తిరస్కరించినందుకు ఫలితం అనుభవించ తప్పుతుందా ! " అన్నాడు. తన సేన మొత్తం నాశనం కావడం చూసి కర్ణుడు కోపించి భీమునిపై ముప్పై నిశిత శరములు ప్రయోగించాడు. భీముడు కర్ణుడి రధసారధిని చంపి అతడి రధాశ్వములను చంపాడు. కర్ణుడు తన రధమును తానే తోలుతూ భీమునిపై శక్తి ఆయుధమును ప్రయోగించాడు. భీముడు ఆ శక్తిని తునా తునకలు చేసి కర్ణుని తొమ్మిది వాడి అయిన బాణములతో కొట్టాడు. కర్ణుడు మరొక విల్లు తీసుకుని భీమునిపై అవిశ్రాంతంగా శరవర్షం కురిపించాడు. ఇరువురూ సింహనాదాలు చేస్తూ ఒకరితో ఒకరు పోరుతున్నారు. భీముడు కర్ణుని హయనులు చంపి, విల్లు విరిచి, కర్ణుని శరీరమంతా బాణములు గుప్పించాడు.

### భీముడు కురు రాజకుమారులను వధించుట

కర్ణుడు భీముని చేతిలో ఓడుట చూసి సుయోధనుడు కర్ణునికి సాయంగా దుర్జయుని పంపాడు. దుర్జయుడు అత్యంతసాహసంతో భీమసేనుడిని ఎదుర్కొని భీముడి రధాశ్వములను, సారధిని గాయపరిచాడు. భీముడు ఆగ్రహించి కర్ణుని కంటి ముందే ఒకేబాణంతో దుర్జయుని తల నరికాడు. కర్ణుడు భీముని ఎదుర్కొని భీముని వక్షస్థలం మీద ఒక వాడి అయిన బాణం నాటాడు. భీముడు తన గధ తీసుకుని కర్ణుని రధము విరుగకొట్టాడు. రధము విరిచి, కేతనము తుంచి,సారధిని చంపాడు. అయినా కర్ణుడు వెనుదిరుగ లేదు. సుయోధనుడు తన తమ్ముడైన దుర్ముఖుని కర్ణుడికి సాయంగా పంపాడు. భీముడు ఒక పక్క కర్ణునితో యుద్ధము చేస్తూనే తనను ధైర్యంగా ఎదుర్కొన్న దుర్ముఖుని తొమ్మిది నిశిత బాణములు ప్రయోగించి చంపాడు. దుర్ముఖుని చావు కళ్ళారా చూసిన కర్ణుడు కుమిలిపోయి తిరిగి భీమసేనుడిని ఎదుర్కొన్నాడు. ఇరువురి నడుమ పోరు ఘోరమై భీముడు అత్యంత క్రూరబాణములు కర్ణుడి గుండెలకు గురి చూసి కొట్టాడు. భీమునిని దెబ్బకు తాళ లేక కర్ణుడు తన రధమును పక్కకు తొలిగించాడు " అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు విధి వైపరీత్యము కాకుంటే కర్ణుడు భీముని చేతిలో పరాజుతుడు కావడమేమిటి ఈ కర్ణుని నమ్మే కదా నా కుమారుడు సుయోధనుడితో వైరము పెంచుకుని ఈ యుద్ధానికి దిగాడు. కర్ణుడు పాండవులను జయించగలడు అని పొగిడే సుయోధనుడు ఇది చూసి ఎంత బాధ పడ్డాడో కదా ! అయినా సంజయా ! నాగులకు, దేవతకూ కూడా భయపడని భీమునికి కర్ణుడు ఒక లెక్కా! జరాసంధుని చంపిన భీమసేనుడిని పసి వారైన దుర్జయుడు, దుర్ముఖుడు ఎందుకు ఎదుర్కొన్నారు. భీముడేమి సాత్యకి తక్కువ వాడా! సుయోధనుడు సాత్యకిని మాత్రం ఎదుర్కొనగలడా ! మన వాళ్ళకు ఓటమి తప్పదని అనిపిస్తుంది " అని బాధపడ్డాడు. అది విన్న సంజయుడు " మహారాజా ! కావాలని విషం త్రాగి శరీరం బాధ పడుతుంది శోకించి ప్రయోజనం లేదు. మారు మాటాడక మిగిలిన విశేషాలు వినండి " అన్నాడు. " కర్ణుడు ఓడి పోవడం చూసిన నీ కుమారులు దుర్మర్షణుడు, దుర్మదుడు, దుస్సహుడు, విజయుడు, విచిత్రుడు, ఒక్కుమ్మడిగా భీముని చుట్టుముట్టారు. వారి అండ చూసుకుని కర్ణుడు కూడా శరప్రయోగం చేయసాగాడు. భీముడు విజృంభించి నీ కుమారుల రధములు విరిచి వారిని తన శరములతో యమసదనానికి పంపాడు. అది చూసి కర్ణుడు భీమునిపై డబ్బై ఐదు బాణములు వేసాడు. భీముడు విజృంభించి నూట ఐదు బాణములను కర్ణుని శరీరంలో గుచ్చి కర్ణుని సారధిని చంపి, విల్లు విరిచాడు. కర్ణుడు భీమసేనుడిపై గధను విసిరాడు. భీముడు ఆ గధను ముక్కలు చేసాడు. కర్ణుడు మరొక విల్లు తీసుకుని భీమసేనుని కవచమును భేధించాడు. భీమసేనుడు కూడా కర్ణుని కవచమును కొట్టాడు. కర్ణుడు నేలపై నిలబడి యుద్ధం చేయడం చూసిన సుయోధనుడు తన సోదరులైన చిత్రుడు, విచిత్రుడు, చారుచిత్రుడు, చిత్రధ్వజుడు, చిత్రాయుధుడు, చిత్రకర్ముడు మొదలైన వారిని భీమసేనుడి పైకి పంపాడు. భీమసేనుడు వారి రధుములను అన్నింటినీ విరిచి , సారధులను చంపి వాడి అయిన బాణములతో నీ ఏడుగురు కుమారుల తలలను నరికాడు. ఈ వ్యవధిలో కర్ణుడు మరొక రధం ఎక్కి భీమసేనుడిని ఎదుర్కొన్నాడు. ఇరువురి నడుమ పోరు ఘోరమైంది. ఒకరికి ఒకరు తీసి పోకుండా పోరుతున్నారు. ఇంతలో నీ కుమారులైన శత్రుంజయుడు, శత్రుసహుడు, సుదేహుడు, మదనుడు, ధ్రుముడు, చిత్రబాహుడు, వికర్ణుడు మొదలైన వారు కర్ణుడికి రక్షణగా వచ్చి భీమసేనుడిని ఒక్కుమ్మడిగా చుట్టుముట్టి భీముడి మీద శరవర్షం కురిపించారు. భీముడు పట్టరాని కోపంతో వారందరిని ఒక్కొక్కరిని ఒక్కొక్క బాణంతో యమసదనానికి పంపి విజయోత్సాహంతో సింహనాదం చేసాడు. భీముని చేతిలో తన తమ్ములు మరణించడం చూసి సుయోధనుడు ఎంతో బాధ పడ్డాడు " అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు దు:ఖంతో " సంజయా ! ఆ నాడు జూదం జరుగుతున్నప్పుడు విదురుడు చెప్పిన మాటలు నిజమౌతున్నాయి. సుయోధనుడి కుయుక్తి కారణంగా నా కుమారుల దుర్మరణం గురించి వినవలసిన దుస్థితి దాపురించింది. శోకించడం తప్ప నాకు మిగిలినదేమిటి

ఎవరిని అనుకుని ఏమి ప్రయోజనం " అన్నాడు.

## కర్ణుడు భీముని ఎదుర్కొనుట


కర్ణునిపై ఏనుగులను విసురుతున్న భీముడు

భీముడి సింహనాదం విన్న కర్ణుడు కోపంతో ఊగిపోయి తిరిగి భీమసేనుడి మీదకు విజృంభించాడు. కౌరవసేనలు భీమసేనుడిని కమ్ముకున్నాయి. భీమసేనుడు వారందరితో యుద్ధం చేస్తూ వారి రథములు విరుస్తూ, కేతనములను విరిచి, రథసారథులను రథాశ్వములను చంపుతూ, కౌరవసేనలను తెగనరకసాగాడు. వారి నెత్తురు కాలువలుగా ప్రవహిస్తుంది. చావగా మిగిలిన కౌరవ సేన భీముని ఎదుట పడకుండా తప్పించుకుంటున్నారు. భీముడికి కౌరవసైన్యంలో ఎదురులేక పోయింది. కర్ణుడు మాత్రమే ఎదురుగా ఉన్నాడు. కర్ణుని నుదిటి మీద వరుసగా బాణములు నాటాడు. కర్ణుడు తిరిగి భీముని మీద నూరు బాణములు ప్రయోగించాడు. భీముడు కోపించి కర్ణుని విల్లు విరిచాడు. కర్ణుడు మరొక విల్లు తీసుకుని భీమసేనుడి మీద శర పరంపర గుప్పిస్తున్నాడు. కర్ణుడు భీముని కేతనమును పడగొట్టి, విల్లు విరిచి, సారధిని కొట్టాడు. భీముడు కర్ణుని మీద శక్తి బాణము వేసాడు. కర్ణుడు తొమ్మిది బాణములు వేసి శక్తి ఆయుధమును త్రుంచాడు. భీముడు కత్తి డాలు తీసుకున్నాడు. కర్ణుడు భీముని డాలును విరుగకొట్టాడు. భీముడు తన కత్తితో కర్ణుని విల్లు విరిచాడు. కర్ణుడు వేరే విల్లు తీసుకునే లోపు భీముడు కర్ణుడి రథము మీదకు లంఘించాడు. కర్ణుడు భయపడి తన రథము వెనుక దాక్కున్నాడు. భీముడు నలు దిక్కుల చూసి కర్ణుడు కానరాక రథము కిందకు చూసాడు. ఆ సమయంలో కర్ణుడు భీముని మీద బాణప్రయోగం చేసాడు. ఆ బాణముల ధాటికి ఆగలేని భీముడు పక్కన పడి ఉన్న శవముల గుట్టలో దూరాడు. భీముని దైన్య స్థితి చూసి కర్ణుడు అతడి మీద విల్లు పెట్టి విలాసంగా నిలబడి " ఓరి భీమసేనా! తిండిపోతా ! నీకు యుద్ధము ఎందుకురా కడుపు నిండా మింగి ఒక పక్క కూర్చొనకుండా నీకు యుద్ధమెందుకురా ! అడవిలో మృగముల మాదిరి ఆకులలములు, పచ్చి మాంసము తిన్న మీకు యుద్ధమెందుకు ఈ మిడిసి పాటు ఎందుకు అయినా నీ శక్తి తెలుసుకుని నీకు తగిన వాడితో యుద్ధం చెయ్యి కాని నాతో పెట్టుకోకు. కృష్ణార్జునుల వద్దకు వెళ్ళి తల దాచుకో పో " అని భీముని నిందించాడు.

## అర్జునుడు కర్ణునితో తలపడుట

భీముని కర్ణుడు అవమానకరంగా మాటాడుట చూసి అర్జునుడు భీముని దు:ఖమును నివారించడానికి కర్ణునితో యుద్ధానికి తలపడ్డాడు. ఇది చూసి కర్ణునికి సాయంగా అశ్వత్థామ వచ్చాడు. అర్జునుడు కర్ణుని మీద ప్రయోగించిన బాణములన్నీ అశ్వత్థామ మధ్యలోనే తుంచి అర్జునుడిపై అరవై నాలుగు బాణములు వేసాడు. అర్జునుడు అశ్వత్థామను తరిమాడు. అశ్వత్థామ ఏనుగుల సేనలో దూరి తప్పించుకున్నాడు. విశోకుడు రథం సిద్ధం చేసి భీముని వద్దకు వచ్చాడు. భీముడు రథము ఎక్కి అర్జునుడి వద్దకు వచ్చాడు. ఆ సమయంలో సాత్యకి కూడా అర్జునుడి వద్దకు వచ్చాడు " అని సంజయుడు చెప్పగానే ధృతరాష్ట్రుడు సంజయా ! బలవంతులతో వైరము ఎన్నటికీ మంచిది కాదు కదా ! ఇప్పటికైనా పాండవుల రాజ్యభాగం వారికి మంచిది కదా ! నా కుమారుడు పెద్ద మూర్ఖుడు వాడికి తెలియదు ఒకరు చెప్పినా వినడు. నా మాటంటే లక్ష్యం లేని సుయోధనుడు సంధికి ఒప్పడు. నేనేమి చేయగలను ? అర్జునుడు ద్రోణుడి శకటవ్యూహములో ప్రవేశించగానే సైంధవుడు సగం చచ్చాడు. సాత్యకి, భీమసేనులు వచ్చి చేరిన పిమ్మట సైంధవుని చావు ఇక తథ్యం " అన్నాడు.

## అర్జునాదులు కౌరవసేనలతో పోరుట

భీమ సాత్యకులు అర్జునుడి వద్దకు చేరగానే అలంబసుడు అనే రాజు వారిని చేరుకున్నాడు. సాత్యకి, అలంబసుడు ఘోరంగా చేస్తున్నాడు. ఒకరి విల్లు ఒకరు విరిచారు. కవచాలను చీల్చుకున్నారు. సాత్యకి కోపించి అలంబసుని రథసారథిని, హయములను చంపి ఒక అర్ధచంద్ర బాణంతో అలంబసుని తల తెగనరికాడు. ఇంతలో నీ కుమారులు అందరూ దుశ్శాసనుడిని ముందుంచుకుని సాత్యకిని ఎదుర్కొన్నారు. సాత్యకి దుశ్శాసనుని హయములను చంపి రథము మీదకు దూకబోయాడు. అది చూసి త్రిగర్త సైనికులు అతడిని ఎదుర్కొన్నారు. సాత్యకి వారిని ఎదుర్కొని వెంటనే ఏబై మందిని

చంపాడు. అది చూసి మిగిలిన సైనికిలు పారిపోయారు. సాత్యకి శూరసేనదేశాధీశుని వెంబడించాడు. కళింగ సైనికులను నాశనం చేసాడు. అతడి బలపరాక్రమము చూసిన కృష్ణుడు " అర్జునా ! అటు చూడు నీ శిష్యుడు సాత్యకి నీ పేరు నిలబెడుతున్నాడు. ద్రోణుడు అంతటి వాడిని జయించి లోపలకు వచ్చాడు. ధర్మరాజు మీద భక్తి, నీతోటి మైత్రి అతడిని ఇంత వరకు తీసుకు వచ్చింది " అని ప్రశంసించాడు. అర్జునుడు " కృష్ణా ! నేను సాత్యకిని ధర్మరాజుకు రక్షణగా ఉండమన్నాను. నా మాట వినక ఇక్కడకు వచ్చాడు. అక్కడ ధర్మజుని పరిస్థితి ఎలా ఉందో కదా! అతడు ద్రోణుని బారిన పడ్డాడు. ఇక్కడ నేను సైంధవుడిని ఇంకా చంప లేదు. పొద్దు వాలి పోతుంది. సాత్యకి కృపాచార్యుడు, కృతవర్మ మొదలైన యోధులను ఎదిరించి అలసిపోయాడు. భూరిశ్రవసుడు అతడితో తలపడుతున్నాడు. సాత్యకి ఎలా యుద్ధం చేస్తాడో ఏమో ! ద్రోణాచార్యుడు పక్షి కొరకు ఎదురు చూస్తున్న డేగవలె మా అన్నయ్య ధర్మజుని కొరకు ఎదురు చూస్తున్నాడు అని ధర్మజునికి ఎందుకు అర్ధం కాలేదు " అని మనసులో పరితపిస్తున్నాడు. ఇంతలో సోమదత్తుని కుమారుడు భూరిశ్రవసుడు సాత్యకిపై విరుచుకు పడ్డాడు. ఇరువురి నడుమ పోరు ఘోరమైంది. ఒకరి మీద ఒకరు బాణవర్షం కురిపించారు. ఒకరి రధాశ్వములను ఒకరు చంపారు. ఒకరి రధసారధిని ఒకరు చంపుకున్నారు. రధము దిగి నేల మీద కత్తి సాము చేస్తున్నారు. అవి కూడా వదిలి మల్ల యుద్ధము చేయసాగారు. చివరకు భూరిశ్రవసుడిదే పైచేయిగా ఉండటము చూసి కృష్ణుడు చూసి " అర్జునా! ఏమిటి అలాచూస్తున్నావు నీకు సాయంగా వచ్చిన సాత్యకి భూశ్రవసునితో యుద్ధమ చేసి అలసి ఉన్నాడు. సత్వరమే రక్షించు " అన్నాడు. అప్పుడు భూరిశ్రవసుడు సాత్యకిని కింద పడ వేసాడు. అది చూసిన కృష్ణుడు " అర్జునా! ఇది న్యాయం కాదు నీకు సాయం చేయడానికి వచ్చిన నీశిష్యుడు ఆపదలో ఉన్నాడు సతరం రక్షించడం నీ కవర్తవ్యం " అన్నాడు. అర్జునుడు " కృష్ణా ! మల్లయుద్ధం చేసుకుంటున్న ఇరువురి నడుమ నేను బాణ ప్రయోగం చేయడం ధర్మం కాదు అయినా నా మిత్రుడిని నేను రక్షిస్తాను " అన్నాడు. అర్జునుడు అలా అంటుండగా భూశ్రవసుడు సాత్యకిని నేలపై వేసి గొండెలపై కాలు వేసి సాత్యకి తల నరకడానికి కత్తి తీసుకుని చేయి పైకెత్తాడు. అది చూసిన కృష్ణుడు " అర్జునా! ఇక ఆలస్యం చేయకు బాణ ప్రయోగం చెయ్యి " అన్నాడు. అర్జునుడు గాండీవం ఎక్కు పెట్టి ఒకే ఒక బాణంతో ఎత్తిన భూశ్రవసుడి చేయి నరికాడు. భూరిశ్రవుసుడి చేయి తెగి పడింది వెంటనే భూరిశ్రవడు " అర్జునా ! ఇంతటి అన్యాయానికి పాలు పడతావని అనుకోలేదు. సాత్యకితో యుద్ధం చేస్తున్న నా చేయి నరకడం న్యాయమా, ధర్మమా ! ఇంటటి నీచ రాజ నీతిని నీకు నీరువు ద్రోణుడు నేర్పాడా ! నిన్ను పుట్టించిన ఇంద్రుడు నేర్పాడా ! పాశుపతం అందించిన శివుడు నేర్పాడా! నీ పక్కన కూర్చుని శ్రీకృష్ణుడు ఇది చూసి ఎలా సహించాడు " అన్నాడు. అర్జునుడు ఆ మాటలకు నవ్వి భూరిశ్రవసా! నీవు నాకు నీతులు నేర్పే వాడివా యుద్ధరంగమున యుద్ధం చేస్తున్న వీరులను వారి బంధువులు కాపాడరా ! అలసి పోయి నిరాయుధుడైన సాత్యకిని చంపబూనడం ధర్మమా ! అతడిని నేను రక్షించడం అధర్మమా! మీరంతా కలసి బాలుడైన అభిమన్యుని వధించడం మాత్రం అధర్మమం కాదా! " అన్నాడు. చేయి తెగిన భూరిశ్రవసుడు బాణములను భూమి మీద పరచి వాటిపై కూర్చుని ప్రాయోపవేశం చేసాడు. ఇది చూసి సాత్యకి భీమసేనుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, కర్ణుడు, శ్రీకృష్ణుడు, అర్జునుడు వారిస్తున్నా వినక భూరిశ్రవుసుడి తల నరికి వారించిన వారిని అభిమన్యుని చంపిన వారిని ఇలా చంపడం అధర్మము కాదని సమర్ధించుకున్నాడు " అని సంజయుడు చెప్పగా

## భూరిశ్రవసుడి కథ

భూరిశ్రవసుడి మరణం గురించి వన్న ధృతరాష్టుడు " సంజయా! మహా బలవంతుడైన సాత్యకి భూరిశ్రవసుడి చేత ఎందుకు అవమానాల పాలైయ్యాడు " అని అడిగాడు. సంజయుడు " మహారాజా ! చంద్ర వంశపు రాజైన యయాతి మహారాజు వలన వచ్చిందే యాదవ కులము. యాదవ కులమున పుట్టి దేవమీఢుని కుమారుడు శూరుడు అతడి కొడుకు వసుదేవుడు. దేవకుడనే రాజు తన కుమార్తె దేవకికి స్వయం వరం ప్రకటించగానే యాదవకుల రాజైన శిని దేవకిని వసుదేవుడికి ఇచ్చి వివాహం జరపాలని స్వయంవరానికి వచ్చిన రాజులను ఓడించి బలవంతంగా తీసుకు పోయాడు. అప్పుడు శినిని ఎవరూ ఎదిరించి నిలువ లేకపోగా సోమదత్తుడు మాత్రం ఎదుర్కొని యుద్ధం చేసాడు. ఇరువురు ఘోరంగా పోరాడిన పిదప శిని సోమదత్తుని ఓడించి అతడి జుట్టు పట్టుకుని ఈడ్చి చంపక వదిలాడు. ఆ అవమాన భారం భరించ లేక సోమదత్తుడు రాజ్యం విడిచి అడవులకు వెళ్ళి శివుని గురించి ఘోర తపమాచరించాడు. శివుడు ప్రత్యక్షం అయ్యాడు అప్పటికి శిని , అతడి కుమారుడు చనిపోయారు కనుక శిని మనుమడైన సాత్యకిని ఓడించే కుమారుడిని ప్రసాదించమని అడుగగా శివుడు అందుకు అంగీకరించాడు. శివుని వరప్రభావంతో సోమదత్తుడికి భూరిశ్రవసుడు పుట్టాడు. కనుక భూరిశ్రవసుడి చేతిలో సాత్యకి అవమానం పొందాడు " అని చెప్పాడు.

## సాత్యకి భీమార్జునులు కర్ణుని ఎదుర్కొనుట

అలా సాత్యకి చేతిలో భూరిశ్రవసుడు మరణించగానే అర్జునుడు తన రధమును సైంధవుడు ఉన్న వైపుకు పోనిచ్చాడు. సుయోధనుడు, అశ్వత్థామ, కర్ణుడు మొదలైన వారు అర్జునుడిని ఎదుర్కొన్నారు. సాత్యకి కర్ణుని ఎదుర్కొన్నాడు. కృష్ణుడు పాంచజన్యం పూరించగానే ముందు రోజు కృష్ణుడు చెప్పినట్లే దారుకుడు రధం సిద్ధం చేసి తీసుకు వచ్చి వారి ముందు

నిలిపాడు. ఆ రధము గరుఢ ధ్వజముతో, శైల్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకము, అను హయములు కట్టి ఉన్నాయి. శ్రీకృష్ణుడు సాత్యకితో " తమ్ముడా ! ఆ రధము ఎక్కి కర్ణునితో యుద్ధము చేయి " అన్నాడు. సాత్యకి ఆ రధమును అధిరోహించి కర్ణుని ఎదుర్కొన్నాడు. ఇది ఆశ్చర్యంగా చూస్తున్న అర్జునుడి చూసి శ్రీకృష్ణుడు " ఆర్జునా! తరవాత ఆశ్చర్యపడవచ్చు ముందు సైంధవుడిని కనిపెట్టు " అన్నాడు.అర్జునుడు సాత్యకి ఎలా అని అడుగగా కృష్ణుడు " సాత్యకి కర్ణులు ఒకరికి ఒకరు తీసిపోరు. సాత్యకిని నా చక్రరక్షకులు రక్షిస్తారు. వారి సంగతి విడిచి సైంధవుని వెదుకుట మన కర్తవ్యం " అన్నాడు. రెట్టించిన ఉత్సాహంతో సాత్యకి కర్ణుని శరీరం తూట్లు పడేలా కొట్టి, రధము విరుగ కొట్టి కేతమును తుంచు, రధాశ్వములను చంపి, సారధిని చంపాడు. అది శ్రీకృష్ణుని రధము కనుక దారుకుడు దానిలో సమృద్ధిగా ఆయుధములు పెట్టాడు కనుక సాత్యకి కర్ణుని అతడి సేనను తరిమి తరిమి కొట్టాడు. నీ కుమారులు వేరొక రధమును తీసుకు వచ్చి కర్ణుడి ముందు నిలిపారు. కర్ణుడు ఆ రధము ఎక్కి సాత్యకిని ఎదుర్కొన్నాడు. కర్ణుడి చేత అవమానం పొందిన భీముడు తల వంచుకుని అర్జునుడి వద్దకు వచ్చి కర్ణుడు అన్న మాటలన్నీ చెప్పి " తమ్ముడూ ! నేను వెంటనే కర్ణుడికి తగిన గుణపాఠం చెప్పాలి " అన్నాడు. అర్జునుడు " అన్నయ్యా ! నిన్ను అనడం నన్ను అన్నట్లే కనుక నేను వెంటనే వెళ్ళి కర్ణుని మదం అణుస్తాను " అన్నాడు. శ్రీకృష్ణుడు కర్ణుడి ఎదుట రధం నిలపగానే అర్జునుడు " ఏరా కర్ణా! మా అన్నయ్య భీమసేనుడిని తూలనాడతావా! భీమసేనుడు తరిమినప్పుడు వెనక్కు పరిగెత్తావే అప్పుడు నిన్ను మేము తిట్టామా ! యుద్ధంలో ఒక సారి ఓడుట ఒక సారి గెలుచుట సహజము కాదా ! ఒక్క సారి భీమసేనుడి మీద పైచేయి కాగానే ఇంత గర్వమా ! ఇప్పుడు సాత్యకి చేతిలో నీవు ఓడి పోలేదా ! ఎంతటి విశారదులకైనా గెలుపోటములు సహజం నీ బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు నీకులమేమిటో నీ బుద్ధిఏమిటో అందరికి తెలుసులే. నేను లేనప్పుడు నా కుమారుని అభిమన్యుని అందరు కలసి చంపారు. ఇప్పుడు నేను నీ కుమారుని వృషసేనుడిని నీ కళ్ళ ముందే చంపుతాను నిన్నే కాదు నిన్న నా కుమారుడిని అధర్మంగా చంపిన అందరినీ ఏం చేస్తానో చూస్తూ ఉండండి " అంటూ కర్ణుడిని తరిమాడు. అప్పుడు కౌరవసేన అర్జునుడిని ఎదుర్కొంది. పోరు ఘోరం అయింది. పొద్దు వాలసాగింది.

## సైంధవ వధ


సైంధవుని తల నరికిన అర్జునుడు

సుయోధనుడు కర్ణుని చూసి " కర్ణా ! సాత్యకి, భీముడు తోడు రాగా అర్జునుడు సైంధవుడి వైపు సాగుతున్నాడు. ఇంకా కొంచెం సమయం అర్జునుడిని ఆపకలిగిన పొద్దు వాలి అర్జునుడి ప్రతిజ్ఞా భంగం అయి మనకు విజయం చేకూరుతుంది. నువ్వు, నేను, కృపాచార్యుడు, అశ్వత్థామ, శల్యుడు కలసి అర్జునుడిని ఆపగలమా! అర్జునుడికి పోగాలము దాపురించి ఇలా ప్రతిజ్ఞ చేసాడు. దానిని మనం సద్వినియోగం చేసుకుంటాము. అర్జునుడు మరణిస్తే పాండవులు బ్రతుక లేరు. కనుక కురుసామ్రాజ్యాన్ని మనం ఏకఛత్రంగా ఏలవచ్చు కనుక మీ మీ ప్రతాపాలు చూపండి. కర్ణుడు " సుయోధనా! ఈ మాత్రం చేయక పోతే కర్ణుడు ఎందుకు. నా బలపరాక్రమం చూపుతాను ఆ మీద దైవ నిర్ణయం " అన్నాడు. భీమసేనుడు సాత్యకి తోడు రాగా కౌరవ సేనను తుత్తునియలు చేస్తున్నాడు. రక్తం ఏరులై ప్రవహిస్తుంది. కర్ణుడు, వృషసేనుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, శల్యుడు మొదలైన వారు అర్జునుడుని ఎదుర్కొన్నారు. వారు వేసిన బాణములను అర్జునుడు ముక్కలు చేసాడు. వారు ఒక్కుమ్మడిగా అర్జునుడిని ఎదుర్కొని కృష్ణార్జునుల శరీరం అంతా బాణములు వేసి నొప్పించారు. వాటిని లక్ష్యపెట్టక అర్జునుడు సైంధవుని వైపు దూసుకు పోతున్నాడు. భీముడు, సాత్యకి, కర్ణుడి మీద శరవర్షం కురిపించారు. అందుకు కోపించిన కర్ణుడు అరవై బాణములను భీమ సాత్యకుల మర్మ స్థానంలో వేసి బాధించాడు. అర్జునుడు కర్ణుని నూరు బాణములతో కొట్టగా అయిదు వందల బాణములతో కర్ణుడు వాటిని తిప్పి కొట్టాడు. అర్జునుడు కర్ణుని విల్లు తుంచి కర్ణుని గుండెలకు గురి పెట్టి బాణప్రయోగం చెయ్యగా అశ్వత్థామ వాటిని తన అర్ధచంద్ర బాణంతో అడ్డుకున్నాడు. అర్జునుడు వేరొక విల్లు తీసుకున్నాడు. ఒకరిపై ఒకరు తీవ్రమైన బాణము వేసుకుంటున్నారు. సుయోధనుడు తన సైన్యమూ కర్ణునికి సాయంగా పంపగా అర్జునుడు కర్ణుని రధాశ్వములను , సారధిని చంపి కర్ణుడి మీద భయంకర బాణ ప్రయోగం చేసాడు. అశ్వత్థామ కర్ణుడిని తాన రధం మీద ఎక్కించుకున్నాడు. శల్యుడు అర్జునుడిని ఎదుర్కొన్నాడు. కృపాచార్యుడు, అశ్వత్థామ, వృషసేనుడు శల్యునితో చేరి అర్జునుడిని ఎదుర్కొన్నారు. సైంధవుడు వారి వెనుక దాక్కున్నాడు. అర్జునుడు వారందరి బాణములు అడ్డుకుంటూ సైంధవుడి మీద బాణములు వేస్తున్నాడు. సైంధవుడు ఆపదలో ఉన్నాడని గ్రహించి సుయోధనుడు తన సేనలను అక్కడకు రమ్మని సైగ చేసాడు. కౌరవ సేనలు అర్జునుడిని చుట్టుముట్టాయి. సైంధవుడు కంటబడగానే అర్జునుడికి ఉత్సాహం కలిగింది. కౌరవసేనలను పటాపంచలు చేస్తూ సైంధవుని మీద బాణములు

ప్రయోగిస్తున్నాడు. సైంధవుడి వరాహకేతనము విరిచి సైంధవుని సారధిని చంపాడు. అది చూసి కౌరవసేన బయకంపితమైంది. కృపాచార్యుడు, అశ్వత్థామ, వృషసేనుడు, శల్యుడు సైంధవునికి అడ్డంగా నిలిచారు. వారి వెనుక ఉన్న సైంధవుడిని కొట్టే మార్గం లేక అర్జునుడు సూర్యుని వంక చూసాడు. అది గమనించిన కృష్ణుడు " అర్జునా! ఇప్పుడు న్యాయం ధర్మం అని ఆలోచిస్తే ప్రయోజనము లేదు. సూర్యుడు పశ్చిమదిక్కుకు పోతున్నాడు. నేను ఒక ఉపాయం చెప్తాను. నేను మాయోపాయంతో సూర్యమండలాన్ని మరుగుపరుస్తాను. సూర్యుడు అస్తమించాడని కౌరవ ప్రముఖులు సైంధవుడు నీ ప్రతిజ్ఞ భంగమైందన్న ఆనందంతో యుద్ధభూమి అంతా తిరుగుతూ విచ్చల విడిగా తిరుగుతుంటారు. అప్పుడు నీవు సైంధవుడిని చంపు " అన్నాడు. కాని అర్జునుడు అందుకు మనసారా అంగీకరించ లేదు ఒక పరాక్రమవంతుడైన వీరుడు చేయతగిన కార్యం కాదని మదన పడినా చేసేది లేక ఊరకున్నాడు. కృష్ణుడు తన మాయతో సూర్యుని కప్పి చీకట్లు ముసురుకునేలా చేసాడు. అది సూర్యాస్తమయమని భావించిన కౌరవులు పొంగిపోతూ గర్వంగా సింహనాదాలు చేసారు. సైంధవుడు తల ఎత్తి సూర్యుని వంక చూస్తుండగా కృష్ణుడు " అదుగో అర్జునా! సైంధవుని తల సూర్యుని వంక చూస్తుంది వెంటనే తెగనరుకు " అన్నాడు. అర్జునుడు వెంటనే ఒక వాడి అయిన బాణం గాండీవంలో సంధించి ఒక్క వేటుతో సైంధవుడి తల తెగనరికాడు " ఆకాశంలో డేగ పక్షిని తీసుకు పోతున్నట్లు అర్జునుడి బాణం సౌంధవుడి తల ఎగరేసుకు పోతుంది. సైంధవ వధ కాగానే కృష్ణ మాయ తొలగి పోయి చీకట్లు తొలగి సూర్యుడు ఆకాశంలో ప్రకాశించసాగాడు. ఇది చూసిన కౌరవ ప్రముఖులు ఆశ్చర్యపోయారు. వారు ఆగ్రహంతో ఊగిపోతూ అర్జునుడిని చుట్టుముట్టారు.

## సైంధవుని మరణం


జయద్రధుని ఖండించిన తల అతని తండ్రి ఒడిలో పడుట

కృష్ణుడు " అర్జునా! సైంధవుని తల నేల మీద పడితే ప్రమాదం. కనుక దానిని ఆపు " అన్నాడు. అర్జునుడు ఒక దాని వెంట ఒక బాణం సంధిస్తూ ఆ తల నేల మీద పడకుండా ఆపాడు. సైంధవుని తల బంతిలా తిరుగుతూ ఉంది. ఒక వైపు యుద్ధం చేస్తూనే ఒక వైపు బాణప్రయోగంతో సైంధవుని తలని ఆపుతూ " కృష్ణా ! ఎంత సేపు ఈ తలని ఇలా ఆపాలి " అన్నాడు. కృష్ణుడు " సైంధవుని తండ్రి వృద్ధక్షత్రుడు. అతడు సింధు దేశపు రాజు. అతడికి వర ప్రసాదంగా సైంధవుడు జన్మించాడు. ఒక రోజు ఆకాశవాణి " సైంధవుని తల యుద్ధంలో నరకబడుతుంది " అని చెప్పింది. అది విన్న వృద్ధక్షతుడు " నా కుమారుని తల నేల మీద పడవేసిన వాడి తల ముక్కలౌతుంది " అని శపించాడు. అతడు ఇప్పుడు తపమాచరించుటకు అడవులకు వెళ్ళాడు. కనుక నీవు పాశుపతాస్త్ర సాయంతో సైంధవుని తల అతడి తండ్రి వృద్ధక్షతుడి ఒడిలో పడేలా చేయి " అన్నాడు. అర్జునుడు " కృష్ణా! వృద్ధక్షతుడు ఇప్పుడు ఎక్కడ ఉన్నాడు " అన్నాడు. కృష్ణుడు " అర్జునా! వృద్ధక్షతుడు ఇప్పుడు శమంతక పంచకం సమీపంలో తపస్సు చేసుకుంటున్నాడు. నీవు అతడి తలను వృద్ధక్షతుడి ఒడిలో పడేలా అస్త్ర ప్రయోగం చేయి " అన్నాడు. అర్జునుడు పరమశివుని భక్తితో స్మరించి పాశుపతాన్ని ప్రయోగించాడు. సైంధవుడి తల ఆశ్రమంలో తపస్సు చేసుకుంటున్న వృద్ధక్షతుడి ఒడిలో పడేలా చేసాడు. హటాత్తుగా తన ఒడిలో పడిన మానవ మస్తకాన్ని చూసి కంగారు పడిన వృద్ధక్షతుడు దానిని నేల మీద విసిరి వేసాడు. వెంటనే శాపప్రభావంతో అతడి తల ముక్కలైంది. కృష్ణుడుఅర్జునుడిని ప్రశంసించాడు. కౌరసేన భయంతో పారిపోయింది. సైంధవుని తల నేల మీద పడే వరకు అలాగే ఉన్న సైంధవుని మొండెము సైంధవుని తల నేల మీద పడగానే కింద పడింది. ఇది చూసి అందరూ ఆశ్చర్య పడ్డారు. శ్రీకృష్ణుడి సాయంతో అర్జునుడు ప్రతిజ్ఞ నెరవేర్చుకొనడం చూసి సాత్యకి, భీముడు సింహ నాదాలు చేసారు. కౌరవ సేనలో విషాదఛాయలు కమ్ముకున్నాయి. అది విని ధర్మరాజు ఆనందసాగరంలో మునిగాడు. పాడవుల ఆనందానికి అంతు లేకుండా పోయింది. పాండవసైన్యం తూర్యనాదాలు, భేరి, మృదంగ నాదాలు చేసారు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

# ద్రోణ పర్వము పంచమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# పంచమాశ్వాసము

## పాండవ శిబిరంలో ఆనందోత్సాహాలు


సైంధవుని మరణానంతరం ధర్మజుని కలసిన కృష్ణార్జునులు

సైంధవవధా సందర్భమున కృష్ణార్జునులు చూపిన ప్రతిభ ధృతరాష్ట్రుడిలో భయోత్పాతాలు కలిగించాయి. " సంజయా ! సైంధవ వధానంతరం నా కుమారులు ఏమి చేసారో వివరించుము " అన్నాడు. సంజయుడు " మహారాజా ! సైంధవవధ కలిగించిన ఉత్సాహంతో పాండవసేన కౌరవసేనతో తలపడింది. కృపాచార్యుడు, అశ్వత్థామ అర్జునుడి మీద శరవర్షం కురిపించారు. అర్జునుడు ఆ శరములన్నీ ఖండించి తిరిగి వారి మీద శరవర్షం కురిపించాడు. శరధాటికి కృపాచార్యుడు స్పృహతప్పాడు. అతడి సారథి కృపాచార్యుని పక్కకు తీసుకు వెళ్ళాడు. అశ్వత్థామ కూడా అతడి వెంట వెళ్ళి పోయాడు. అది చూసి అర్జునుడు ఖిన్నుడయ్యాడు. కృష్ణుడు అర్జునుడుని ఓదారుస్తూ " అర్జునా ! దేవేంద్రునికైనా గెలువ సాధ్యం కాని కురుసేనను ఒంటి చేత్తో గెలిచిన నీ పరాక్రమము ప్రశంశనీయము. సైంధవుని తల వృద్ధక్షతుడి ఒడిలో పడవేసి మహా తపోధనుడి శాపం నుండి తప్పించు కున్నావు. ఇంద్రుడిచ్చిన శక్తాయుధంతో విర్ర వీగుతున్న కర్ణుని జయించి ప్రశంశా పాత్రుడవు కమ్ము " అన్నాడు. అర్జునుడు కృష్ణా ! అలా అనకు నీ కృపతో నేను సైంధవుని వధించగలిగాను. నీ కటాక్షవీక్షణం పొందిన వాడికి కార్య సిద్ధి కలుగక మానదు " అన్నాడు. ఆ మాటలకు కృష్ణుడు చిరునవ్వు నవ్వి " అర్జునా! మన కొరకు ధర్మరాజు ఎదురు చూస్తుంటాడు. మనం వెళ్ళాలి " అన్నాడు. అర్జునుడు, సాత్యకి, భీముడు, ఉత్తమౌజుడు ధర్మరాజు వద్దకు వెళుతుండగానే సూర్యాస్తమయం అయింది. ఇరు పక్షాలు యుద్ధం మాని తమ శిబిరాలకు వెళ్ళారు. ధర్మరాజు శిబిరం చూసి కృష్ణుడు పాంచజన్యం పూరించాడు. ఆ శంఖధ్వని విని ధర్మరాజు వెలుపలకు వచ్చి ఒకే సారి వారిద్దరిని కౌగలించుకొని ఆనందభాష్పాలు రాల్చి " అర్జునా! అర్జునా! నీ శపధము నెరవేర్చుకున్నావు. ఈ మహానుభావుని దయ వలన ఈ గండం గడిచి బయట పడ్డాము " అని శ్రీకృష్ణుని కృతజ్ఞతాభావంతో చూసాడు. శ్రీకృష్ణుడు " ధర్మజా! కౌరవుల మీద మీకు ఉన్న కోపమే ఈ విజయానికి కారణం అయింది. మీ వంటి సత్పురుషుల కోపాన్ని తట్టుకోవడం ఎవరి తరం ? ఒక్క అర్జునుడే కాదు, సైంధవుని వధించుటే కాదు, ఇలాంటి దుస్సాధ్యమైన కార్యాలు ఎన్నైనా ఎవరైనా అవలీలగా చేయగలరు. మీలాంటి సత్పుషుల కోపానికి ఉన్న ప్రభావం అలాటింది " అన్నాడు శ్రీకృష్ణుడు. ధర్మరాజు " కృష్ణా! నీవే అలిగిన దేవాసురులు సహితం రూపు మాసిపోతారు. నీ దయ ఉంటే మాత్రమే జీవులు సుఖంగా జీవించగలరు. మా మీద నీ దయ ప్రసరించినంత కాలము మాకు కార్య సిద్ధి లభిస్తుంది " అన్నాడు వినయంగా. ఇంతలో భీముడు, సాత్యకి ధర్మరాజుకు నమస్కరించారు. ధర్మరాజు వారిని లేవనెత్తి కౌగలించుకున్నాడు. శత్రు సంహారంతో ధర్మరాజు ఆనందానికి అవధులు లేక పోయింది.

## కౌరవశిబిరంలో విషాదచ్ఛాయలు

కౌరవ శిబిరంలో విషాదచ్ఛాయలు అలముకున్నాయి. సుయోధనుడు తనలో తాను ఇలా తర్కించుకున్నాడు. " అర్జునుడికి కోపం వచ్చిన దేవతలకే అలవి కాడు. ఇక ద్రోణుడు, కర్ణుడు ఎంత అని నేడు తేటతెల్లం అయింది. ద్రోణుడు, కర్ణుడు మమ్ము ఎంత ఆదుకొనవలెనని ప్రయత్నించినా అర్జునుడి ముందు శక్తిహీనులు అయ్యారు " అనుకుంటూ ద్రోణుని వద్దకు వెళ్ళి " ఆచార్యా ! ప్రతిరోజు యుద్ధంలో మనకు అపజయం పాండవులకు విజయం లభిస్తుంది. నా తమ్ములతో సహా అనేక యోధులు మరణించారు. ఆ శిఖండి కారణంగా మహాబలవంతుడైన భీష్ముడు పడిపోయాడు. మన సైన్యంలో ఏడు అక్షౌహినుల సైన్యం మరణించారు. సైంధవుడు మరణించాడు, మన కొరకు ప్రాణాలు లెక్క చేయక యుద్ధము చేయవచ్చిన రాజులు అసువులు బాసారు. ఇక నేను పాండవులను వధించి విజయం సాధించడమో లేక వీరస్వర్గం అలంకరించడమో మాత్రమే మిగిలి ఉంది . మరేదైనా మార్గం ఉంటే శలవివ్వండి. మీకు అర్జునుడు ప్రియశిష్యుడు ఆ కారణంగా అతడు చేజిక్కినా చంపక వదిలివేయడమే

కాక అతడికి సాయం చేస్తున్నారు. కర్ణుడు ఎంతటి వీరుడైనా యుద్ధనైపుణ్యంలో కాని కార్య సాధనలో కాని మీకు సాటి రాడు. ఉపాయము అనుభము ఉన్న మీరు మాకు సహకరించడం లేదు. కర్ణుడు ఎంత ప్రయత్నించినా సైంధవుని రక్షించ లేక పోయాడు. సామర్ధ్యం కలిగిన మీరు కాపాడ లేదు " అన్నాడు.

## ద్రోణుని వ్యధ

సుయోధనుడి ములుకుల వంటి మాటలకు నొచ్చుకున్నద్రోణుడు " సుయోధనా ! నా గుండెలు తూట్లు పొడిచే మాటలు ఎందుకు మాట్లాడతావు. కృష్ణుని సాయం ఉన్నంత వరకు అర్జునుడిని గెలవడం అసాధ్యమని నీకు ముందే చెప్పాను నీవు వినలేదు. దేవతలకే గెలువ శక్యము కాని భీష్ముని పడగొట్టిన అర్జునుడికి సాధ్యము కానిదేముంది. నేను నీ పక్షాన యుద్ధము చేస్తున్నది నా అభిమానం కాపాడు కోవడనికే కాని పాండవులను జయిస్తానని కాదు. సుయోధనా ! నాడు నిండు సభలో శకుని చేత పాచికలాడించి పాండవులను అనేక విధముల అవమానించి హింసించావు. నేడు ఆ పాచికలే అర్జునుడి బాణాలై నిన్ను బాధిస్తున్నాయి. వాటిని నిలువరించడం ఎవరి తరం చెప్పు. విదురుడు ఎంత చెప్పినా వినక నాడు పాండుసతిని కొలువు కూటముకు ఈడ్చి చేసిన అవమానం ఊరక పోతుందా ! ఆ వీరపత్నిని నిండు సభలో నీవు, దుశ్శాసనుడు, కర్ణుడు తూలనాడి అన్న మాటలు ఊరకే పోతాయా ! ప్రశస్త చరితులైన పాండుసుతులను అధికారమదంతో కళ్ళు నెత్తికెక్కి చేసిన అవమానం మీకు చెరుపు చేయదా ! సుయోధనా ! మీరు చేసిన అవమానములు సహించి అరణ్య అజ్ఞాత వాసం ముగించుకుని అంతా మరచి వారికి రావలసిన అర్ధభాగం అడిగితే నీవు కనికరం లేక నిర్ధాక్షిణ్యంగా నిరాకరించావు. ఇంత అధర్మవర్తనుడిపైన నీ తరఫున యుద్ధం చేస్తున్న నేను ఒక బ్రాహ్మణుడినా ! నాది ఒక బ్రాహ్మణ జన్మా ! నేనంటే శకట వ్యూహం వద్ద ఉన్నాను సైంధవునికి సమీపంలో ఉన్న నువ్వు, కర్ణుడు మిగిలి యోధులు ఏమి చేసారు. నీవు వారందరిని మాటలతో ఎందుకు బాధించవు నన్ను మాత్రమే నిందుస్తున్నావెందుకు వారు నీకు కావలసిన వారు నేను కానా ! యుద్ధసమయంలో పాండవయోధులు వారి శరములతో బాధిస్తున్నారు అలసి వచ్చిన నా మనసును నీవు నీ మాటలతో బాధిస్తున్నావు ఇది నీకు న్యాయమా ! గతజల సేతుబంధన మేలనయ్యా ! రేపటి యుద్ధంలో మీరంతా వీరోచితంగా పోరాడండి. నా వంతుకు నేను పాంచాలురను వధిస్తాను. కావలసిన కార్యము మీద మనసుంచి సైన్యాలను యుద్ధోన్ముఖులను చెయ్యి. వారి మనసులో ఉత్సాహాన్ని నింపి నీవు కూడా నీ పరాక్రమము చూపు. రేపు నేను యుద్ధభూమికి వెళ్ళి జరగరానిది జరిగి తిరిగి రాకుంటే అశ్వత్థామ తట్టుకోలేడు. నా మాటగా అశ్వత్థామకు చెప్పు " నాయనా అశ్వత్థామా ! బ్రాహ్మణుల ఎడ, వృద్ధుల ఎడ భక్తి శ్రద్ధలు చూపుతూ ధర్మవర్తనుడవై మెలగుము. నేను చంపగా మిగిలిన పాంచాల వీరులను నీవు తుదముట్టించుము. ఇదే నా కడపటి సందేశం " అన్నాడు.

## కర్ణుడు సుయోధనుడిని ఓదార్చుట

ద్రోణశిబిరం నుండి కర్ణుని వద్దకు వెళ్ళి " కర్ణా ! నేడు జరిగిన యుద్ధం చూసావు కదా ! మన గురువు ద్రోణుడు శత్రుదుర్భేద్యమైన శకటవ్యూహము పన్ని అర్జునుడిని, సాత్యకిని లోనికి వదిలాడు. అర్జునుడు ఒక్కడే లోనికి ప్రవేశించి వీరవిహారం చేసి సైంధవునికి రక్షణగా ఉన్న రాజులను ససైన్యంగా తుద ముట్టించి సైంధవుడిని ఎలా చంపగలడు. అర్జునుడి శత్రుసంహారం ద్రోణుడు ఆపలేక పోయాడు అంటే మనం నమ్మాలా ! అసలు ద్రోణుడు సైంధవుడిని రక్షిస్తాను అనబట్టే మనం సైంధవుని యుద్ధానికి తీసుకు వచ్చాము. లేకున్న అతడు తన ఇష్టానికి ఎక్కడో ఉండే వాడు. మనం ఇంత సైన్యాన్ని నష్టపోవలసిన అవసరం ఉండేది కాదు. కేవలం సైంధవుడిని రక్షించడానికి మనం ఇంత సైన్యాలను నష్టపోవలసి వచ్చింది. ద్రోణుడికి మనం ఎంత కావలసిన వారము కాదో అర్జునుడు అంత కావలసిన వాడు అయ్యాడు. ఈ పరిస్థిలో మనం ద్రోణుని నమ్మి యుద్ధం చేయడం సమంజసమా ! " అన్నాడు. సుయోధనుడి మాటలు సావధానంగా విన్న కర్ణుడు " రారా రాజా! మనం ద్రోణుని నిందించడం ఎందుకు ? అతడు తన శక్తి కొలది యుద్ధం చేస్తున్నాడు. అర్జునుడిని చంపలేక పోవడం నిజమే ద్రోణునికి కూడా అర్జునుడిని చంపడం సాధ్యము కాదేమో ! పాండవులను చంపడానికి మనం ఎంత ప్రయత్నించాము. విషం పెట్టాము, లక్క ఇంట్లో పెట్టి కాల్చాము, అడవులకు పంపాము అయినా వారు నాశనం కాలేదు. ఇది దైవఘటన కాక మరేమి. సైంధవుని చంపడం విధి విలాసమే ! అర్జునుడు నిమిత్తమాత్రుడు. కనుక నీవు ధైర్యం కోల్పోవద్దు. మన శక్తి వంచన లేక యుద్ధం చేస్తాము. ఫలితం దైవ నిర్ణయం. సైంధవుడిని రక్షించడానికి మనం చేయవలసినది చేసాము ఇక కలత చెందుట ఎందుకు " అన్నాడు.

## ద్రోణసారధ్యంలో ఐదవనాటి యుద్ధం

ఇరు పక్షములు యుద్ధ భూమిలో మొహరించాయి. సుయోధనుడు సైంధవుని మరణంతో కలిగిన వ్యధతో తెగించాడు. అంత

సాహసం పనికిరాదు అని ద్రోణుడు, అశ్వత్థామ, కృపుడు ఎంత చెప్పినా వినక పాండవులతో ఘోరయుద్ధం చేస్తున్నాడు. భీముని పది బాణములతోను, నకులుడిని మూడు బాణములతో, శిఖండిని నూరు బాణములతో, ధృష్టద్యుమ్నుని డెబ్బై బాణములతోను, ధర్మరాజును, సాత్యకిని ఐదేసి బాణములతోను కేకయరాజులను లెక్కకు మించిన బాణములతోను ఎదుర్కొని సింహనాదం చేసాడు. ఇది చూసి ధర్మరాజు కోపంతో ఊగిపోతూ సుయోధనుడి విల్లు విరిచి అతడిని మూర్చిల్లేలా కొట్టాడు. సుయోధనుడు రధము మీద కుప్పకూలగానే అతడు మరణించాడని వార్త గుప్పమంది. పాండవ సైన్యంలో సంతోషం వెల్లి విరిసింది భేరి నాదాలు మోగాయి. ఇది చూసి ద్రోణుడు పాండవసేనలపై విరుచుకు పడ్డాడు. ఇంతలో సుయోధనుడు తేరుకుని ధర్మరాజును ఎదుర్కొన్నాడు. కౌరవ సేనలు పాండవులు సేనలను ఎదుర్కొన్నాయి. పాడవులు, సాత్యకి మొదలుగా యాదవవీరులు, విరాటరాజాది మత్స్యదేశపు వీరులు, ద్రుపదుడు మొదలైన పాంచాలవీరులు , ఉపపాడవులు ద్రోణుని మీద శరవర్షం కురిపించాడు. కర్ణుడు, ద్రోణుడు పాండవ సేనలపై విజృంభించారు. ఇరుపక్షముల మధ్య పోరు ఘోరమై రక్తం ఏరులై పారుతుంది. ద్రోణుడు పాండవపక్షంలో ఉన్న కేకయవీరులను, ధృష్టద్యుమ్నుని కుమారులను హతమార్చాడు. అప్పుడు శిబి ద్రోణుని ఎదుర్కొని అతడి సారధిని చంపి శరీరం మీద ముప్పై బాణములు క్రూరంగా నాటాడు. ఆగ్రహించిన ద్రోణుడు ఆరు భల్లబాణాలతో శిబి హయములను, సారధిని నరికి మరొక బాణంతో శిబి తల నరికాడు.

## భీమసేనుని పరాక్రమం

భానుమంతుని కుమారుడు భీమసేనుని ఎదుర్కొని అతడి మీద శరవర్షం కురిపించాడు. భీమసేనుడు భానుమంతుని కుమారుని మీదకు రధమును పోనిచ్చి అతడి రధమును ఢీకొట్టి అతడి రధము మీదకు లంఘించి అతడిని కాలితో తన్ని ఎముకలు విరిచి చంపాడు. ఇది చూసిన పాంచాలసేనలు జయజయధ్వానాలు చేసాయి. అది సహించలేని కళింగ రాజకుమారుని సోదరులు ధ్రువుడు, జయరాధుడు భీముని మీద విరుచుకు పడ్డారు. భీముడు ధ్రువుడి రధము మీదకు ఎక్కి అతడిని పిడికిలితో కొట్టి చంపి జయరాధుని రధము ఎక్కి అతడిని సారధిని తుదముట్టించాడు. ఇది చూసిన కర్ణుడు తన శక్తి ఆయుధమును భీమునిపై విసిరాడు. భీముడు దాన్ని పట్టుకుని తిరిగి కర్ణుడి మీద వేసాడు. అది చూసి శకుని తన భల్ల బాణంతో దానిని ముక్కలు చేసాడు.

### భీమసేనుడు కురురాజకుమారులను వధించుట

ఇంతలో ధృతరాష్ట్రకుమారులు దుర్మదుడు, దుష్కర్ణుడు భీమసేనుని ఎదుర్కొన్నారు. భీమసేనుడు కోపించి దుర్మదుడి రధము మీదకు లంఘించి అతడి సారధిని చంపాడు. దుర్మదుడు, దుస్కర్ణుడి రధము మీదకు దూకి భీమసేనుడి మీద శరవర్షం కురిపించి భీముని రధము కూలత్రోసారు. భీముడు తన రధమును తన్ని తాను కూడా వారి రధము ఎక్కి వారిని కాళ్ళతో చేతులతో మర్ధించి ఇద్దరిని మాంసపు ముద్దలు చేసి చంపాడు. ఇది చూసి సుయోధనుడు ఏమి చేయలేక పోయాడు. భీముని పరాక్రమము చూసిన కౌరవ సేనలు పారిపోయాయి. అప్పుడు ద్రోణుడు, కర్ణుడు ఒకటై భీమసేనుడిపై బాణములు గుప్పించారు. భీమునికి సాయంగా ధర్మరాజు, నకులసహదేవులు, సాత్యకి, విరాటుడు యుద్ధం చేస్తున్నారు.

## సాత్యకిని సోమదత్తుడు ఎదుర్కొనుట

సోమదత్తుడు సాత్యకిని ఎదుర్కొని " ఓ సాత్యకీ ! నిలువుము ప్రాయోపవేశం చేస్తున్న భూరిశ్రవసుడిని కిరాతకంగా చంపడం వీరత్వమా ! అదే రాజ ధర్మమా ! ఈ రోజు నీవు నా చేతిలో మరణించావులే " అంటూ సాత్యకి మీద దూకాడు. ఆ మాటలకు సాత్యకి నవ్వి " సోమదత్తా ! భూరిశ్రవసుని చంపడం రాజధర్మమని నువ్వు అనుకుంటే ఇప్పుడు నిన్ను చంపి రాజధర్మం ఏమిటో నిరూపిస్తాను కాచుకో " అన్నాడు. అంటూ సోమదత్తునితో తలపడ్డాడు. అంతలో సుయోధనుడు తన సైన్యంతో సోమదత్తునికి సాయంగా వచ్చాడు. ఒంటరిగా పోరుతున్న సాత్యకికి ధృష్టద్యుమ్నుడు తన అపారసైన్యముతో సాయంగా వచ్చాడు. సోమదత్తుడు నిశిత తొమ్మిది బాణములతో సాత్యకిని కొట్టాడు. బదులుగా సాత్యకి తొమ్మిది బాణములతో కొట్టి సోమదత్తుడిని మూర్చిల్లజేసాడు. సోమదత్తుడి రధసారధి సోమదత్తుడిని దూరంగా తీసుకు వెళ్ళాడు. తరువాత అశ్వత్థామ సాత్యకిని ఎదుర్కొన్నాడు. మధ్యలో ఘటోత్కచుడు తన రాక్షస సైన్యంతో అశ్వత్థామను ఎదుర్కొన్నాడు. ఇది చూసి భయపడిన దుర్యోధనుడు, కర్ణుడు మొదలైన వారు అక్కడి నుండి పక్కకు తొలిగారు.

### అంజనపర్వ అశ్వత్థామల పోరు

అప్పుడు సంధ్యా సమయం అయింది. సంధ్యాసమయంలో రాక్షసులకు బలం పెరుగుతుంది కనుక కురు సైన్యంలోని

మహాయోధులు కూడా ఘటోత్కచుని ముందు నిలువ లేక పోయారు. కాని అశ్వత్థామ మాత్రం నిలిచి ఘటోత్కచునితో పోరుసాగిస్తూ ఘటోత్కచుని గుండెలకు గురి పెట్టి పది బాణములు వేసాడు. ఘటోత్కచుడు తన చక్రాయుధాన్ని అశ్వత్థామ మీద వేసాడు. అశ్వత్థామ దానిని మధ్యలోనే నరికాడు. ఘటోత్కచుని కుమారుడు అంజనపర్వుడు అశ్వత్థామను ఎదుర్కొని అశ్వత్థామ మీద శరవర్షం కురిపించాడు. అశ్వత్థామ అంజనపర్వుని విల్లు విరిచి అతడి రధము విరిచాడు. అంజనపర్వుడు ఒక ఖడ్గం తీసుకుని అశ్వత్థామ మీద లంఘించాడు. అశ్వత్థామ ఆ ఖడ్గమును విరిచాడు. ఆ రాక్షస వీరుడు ఆకాశంలోకి ఎగిరి అశ్వత్థామ మీద శరవర్షం కురిపించాడు. అశ్వత్థామ వాటిని తుత్తునియలు చేసి అంజనపర్వుని శరీరాన్ని శరములతో నింపాడు. ఆ బాధభరించ లేక అంజనపర్వుడు భూమి మీదికి దిగి రధము ఎక్కి అశ్వత్థామ మీద శరసంధానం చేసాడు. అశ్వత్థామ ఒక వాడి అయిన బాణంతో అంజనపర్వుని తల తెగనరికాడు.

## ఘటోత్కచుడు అశ్వత్థామను ఎదుర్కొనుట

తరవాత అశ్వత్థామ పాండవసైన్యమును సంహరిస్తున్నాడు. కుమారుని మరణం చూసి ఘటోత్కచుడు తీవ్రమైన కోపంతో అశ్వత్థామను చూసి " అశ్వత్థామా! నిలువుము నీవు ఈ రోజు నన్ను తప్పించుకుని పోలేవు అని అశ్వత్థామను ఎదుర్కొన్నాడు. అశ్వత్థామ " ఘటోత్కచా ! నీవు బాలుడవు నాతో యుద్ధం చేయ లేవు. నీవు నాకు పుత్రసమానుడవు నీ మీద నాకు కోపం కలగడం లేదు కనుక నీతో యుద్ధం చేయలేను వెళ్ళు " ఘటోత్కచుడు బదులుగా " అశ్వత్థామా ! కొడుకును పోగొట్టుకున్న దుఃఖంలో ఉన్న నాకు నువ్వు ఎక్కడి తండ్రివి నా తండ్రి భీమసేనుడు. నేను నిన్ను వధించక మానను " అని ఘటోత్కచుడు వెంటనే తన అసుర మాయలు అశ్వత్థామ మీద ప్రయోగించాడు. అశ్వత్థామ వాటిని తిప్పి కొట్టి కొండ వలె తన మీదకు వస్తున్న ఘటోత్కచుని తన వజ్రాస్త్రంతో కొట్టాడు. ఘటోత్కచుడు మేఘంలా మారాడు. అశ్వత్థామ వాయవ్యాస్త్రం ప్రయోగించి ఆ మేఘమును చెదరగొట్టాడు. వెంటనే ఘటోత్కచుడు ఉగ్రమైన ఆకారందాల్చాడు అతడి అనుచరులు భయంకరాకారాలతో కౌరవ సైన్యాలతో తలపడి సుయోధనుడు బలములు నిర్మూలిస్తున్నాడు. అది చూసి ఖిన్నుడైన సుయోధనుడు స్వయంగా తానే ఘటోత్కచుని ఎదుర్కొన్నాడు. అశ్వత్థామ రారాజా ! ఘటోత్కచుని ఎదుర్కొనుటకు నీవు కావాలా ! నేను చాలనా నువ్వు చూస్తుండు చాలు " అని ఘటోత్కచునితో తలపడ్డాడు. సుయోధనుడు శకునిని చూసి " మామా! ఇక మనకు భయం లేదు ఘటోత్కచుడితో సహా పాండవసైన్యం నిర్మూలించబడినట్లే మనం జయించామని ప్రకటించు నీవు, కృపాచార్యుడు, కర్ణుడు మొదలైన యోధులు అశ్వత్థామకు సాయం వెళ్ళండి అని తాను అశ్వద్దామకు సాయంగా వెళ్ళాడు. ఘటోత్కచుడు అశ్వత్థామ విల్లు విరిచాడు. అశ్వత్థామ మరొక్క విల్లు తీసుకుని ఘటోత్కచుని రాక్షస సైన్యమును నాశనం చేస్తున్నాడు. అది చూసి సుయోధనుడు అశ్వత్థామను ఎంతగానో కొనియాడాడు. పాండవ వీరులు అశ్వత్థామ ధాటికి ఆగలేక దిక్కుతోచక చూస్తున్నారు. ఘటోత్కచుడు అశ్వత్థామ మీదకు పరిఘను విసిరాడు. అశ్వత్థామ దానిని పట్టుకుని తిరిగి ఘటోత్కచుని మీదకు విసిరాడు. ఘటోత్కచుడు ధృష్టద్యుమ్నుని రధము మీద ఎక్కి దాని నుండి తప్పించుకున్నాడు. అశ్వత్థామ విసిరిన పరిఘ ఘటోత్కచుని రధమును సారధిని ధ్వంశం చేసింది. ఘటోత్కచుడు దుష్టద్యుమ్నునితో చేరి యుద్ధం చేస్తుండగా భీమసేనుడు వారి వద్దకు వచ్చి యుద్ధం చేయసాగాడు. అశ్వత్థామ వారి ముగ్గురిని ఎదుర్కొని శరవర్షం కురిపించాడు.

## అశ్వత్థామ పరాక్రమం

ఆ రోజు విజృంభించి యుద్ధం చేస్తున్న అశ్వత్థామ రణరంగాన్ని పీనుగుల పెంట చేసాడు. విరిగిన రధములు, ఏనుగుల గుర్రముల కళేబరములు యుద్ధభూమిలో చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. అలా ఒక్కరోజే అశ్వత్థామ ఒక అక్షౌహిని సైన్యాలను నిర్మూలించాడు. అది చూసి ద్రుపదుని కుమారులైన సురధుడు, శత్రుంజయుడు, బలానీకుడు, జయానీకుడు, పృషధ్రుడు, జయానీకుడు, జయుడు, చంద్రసేనుడు అశ్వత్థామను ఎదుర్కొని అశ్వత్థామ మీద శరవర్షం కురిపించారు. మరుక్షణంలో అశ్వత్థామ వారినందరిని యమసదనానికి పంపాడు. ఆ తరవాత కుంతిభోజుని కుమారులు అశ్వత్థామను ఎదుర్కొన్నారు. అశ్వత్థామ వారిని తృటికాలంలో సంహరించి కాలదండం లాగ ఉన్న బాణమును ఘటోత్కచుని మీదకు ప్రయోగించాడు. ఆ బాణము ధాటికి ఘటోత్కచుడు రధము మీద పడి మూర్చిల్లాడు. వెంటనే దుష్టద్యుమ్నుడు ఘటోత్కచుడిని తీసుకు వెళ్ళాడు. అది చూసి అశ్వత్థామ సింహనాదం చేసాడు. ధర్మరాజు, సాత్యకి వచ్చి భీమునికి సాయంగా యుద్ధం చేయసాగారు. ఇంతలో ఘటోత్కచుడు మూర్చ నుండి తేరుకుని అశ్వత్థామను ఎదుర్కొన్నాడు. పాండవ సైన్యాలు ఒక వ్యూహముగా ఏర్పడి అశ్వత్థామను చుట్టుముట్టాయి. అది చూసి కౌరవసేనలు సోమదత్తుని బాహ్లికుని ముందుంచుకుని పాడవ సేనతో తలపడ్డాయి.

## భీమసేనుడి విజృంభణ

సాయంసమయం అయింది. సాత్యకి సోమదత్తుని ఒక నిశితశరముతో కొట్టాడు. ఘటోత్కచుడు సోమదత్తుడిని ముద్గర అనే ఆయుధముతో కొట్టాడు. ఆ దెబ్బలకు సోమదత్తుడు సొలిపోయాడు. తన కుమారుడు సోమదత్తుడు సొలిపోగానే బాహ్లీకుడు సాత్యకితో యుద్ధముకు తలపడ్డాడు. భీముడు బాహ్లీకునితో తలపడి బాణప్రయోగం చేసాడు. బాహ్లీకుడు శక్తి ఆయుధంతో భీముని కొట్టాడు. ఆ శక్తిఆయుధ ఘాతానికి భీముడు మూర్చిల్లినా వెంటనే తేరుకుని బాహ్లీకుని ముద్గర అను ఆయుధముతో కొట్టాడు. ముద్గర దెబ్బకు వయోధికుడైన బాహ్లీకుడు తలపగిలి చనిపోయాడు. పాండవసేనలు జయజయధ్వానాలు చేసాయి.

### భీమసేనుడి చేతిలో కురురాజకుమారులు మరణించుట

బాహ్లీకుని మరణం చూసి దుర్యోధనుడి తమ్ముడు పది మంది భీముడితో తలపడ్డారు. తనను చుట్టుముట్టిన పది మంది రాకుమారులను భీముడు పది బాణములతో సంహరించాడు. అది చూసి కర్ణుని తమ్ముడు వృకరధుడు భీమునితో తలపడ్డాడు. తనను సమీపించిన వృకరధుని భీముడు ఒకే దెబ్బతో చంపాడు. తరువాత భీమునితో శకుని తమ్ములు పన్నెండు మంది తలపడ్డారు. భీముడు వారిని అవలీలగా సంహరించాడు. భీముని పరాక్రమానికి ఎదురు లేక పోయింది. భీముని ఎదుర్కొన్న వారు ప్రాణాలతో బయటపడటం కష్టమైంది. ఆ తరవాత త్రిగర్త, బాహ్లీక, శూరసేన, మాళవ, వసాతి సేనలు ఒక్కుమ్మడిగా భీమసేనుని చుట్టుముట్టాయి. అది చూసి ధర్మరాజు తన సేనలతో భీమసేనుడిని చేరి కౌరవ సేనలను చీలి చెండాడటం మొదలు పెట్టారు. కౌరవ సేన క్రమంగా సన్నగిల్ల సాగింది.

## ద్రోణుడు పాండవులను ఎదుర్కొనుట

కురుసేన క్షీణించడం చూసి సుయోధనుడు ద్రోణునికి జరిగిన విషయం వివరించగానే ద్రోణుడు వెంటనే ధర్మరాజును ఎదుర్కొని అతడి మీద దివ్యాస్త్రప్రయోగం చేసాడు. ధర్మరాజు వాటిని సమర్ధవంతంగా ఎదుర్కొన్నాడు. ద్రోణుడు ధర్మరాజు మీద ఇంద్రాస్త్రాన్ని ప్రయోగించాడు. ధర్మరాజు తిరిగి ఇంద్రాస్త్ర ప్రయోగంతో దానిని నిర్వీర్యం చేసాడు. ద్రోణుడు దర్మజునిపై బ్రహ్మాస్త్ర ప్రయోగం చేయగా ధర్మరాజు అదే అస్త్రాన్ని ప్రయోగించి దానిని నిర్వీర్యం చేసాడు. ఇంతలో ధృష్టద్యుమ్నుడు ద్రోణుని ఎదుర్కొన్నాడు. ద్రోణుడు అతడిని లక్ష్యపెట్టక పాంచాలసేనను సంహరిస్తూ వారిని తరిమి కొట్టాడు. అదే సమయంలో మత్స్య కేకయ సేనలు కురుసేనను చుట్టుముట్టాయి.

## కృపాచార్యకర్ణుల వాదం

సుయోధనుడు కర్ణుని వద్దకు వెళ్ళి తన పరాక్రమం చూపమని అర్ధించాడు. కర్ణుడు " అర్జునా! అర్జునుడు, భీముడు నాకు ఒక లెక్కా ! నేను ఒక్కడినే వారిరువురిని సంహరించి నీకు ఆహ్లాదం కలిగిస్తాను " అన్నాడు. కర్ణుని మాటలు విన్న కృపాచార్యుడు " కర్ణా ! చాలా బాగా పలికావు ఈ రోజుతో పాండవులను చంపి సుయోధనుడికి పట్టం కట్టేలా ఉన్నావు. ఈ పరాక్రమం ఘోషయాత్ర సమయాన, ఉత్తర గోగ్రహణ సమయాన ఏమైంది. ప్రగల్బములు వదిలి కార్యశూరత్వం చూపించు. అయినా నీవు ఇంత వరకు పాండవులను ఎదుర్కొన్నదే లేదు వారిని ఎలా గెలుస్తావు. మనమందరం అర్జునుడి చేత ఎన్ని సార్లు ఓడిపోయాము. ఇప్పుడు అతడికి ధర్మరాజు, భీముడు, ఘటోత్కచుడు ఉన్నారు. సాత్యకి విషయం సరేసరి. వీరినందరిని నీవు ఒక్కడివే గెవడం సాధ్యమేనా ! " అన్నాడు. ఆమాటలకు కర్ణుడు రోషపడి " కృపాచార్యా ! నేను ఆడిన మాట తప్పను పాండవులను జయించి అన్న మాట నెరవేర్చుకుంటాను. మీరంతా ఎప్పుడూ పాండవులను పొగిడి కౌరవసేనలో ఉత్సాహం తగ్గిస్తున్నారు. మన సైన్యంలో నేను, ద్రోణుడు, అశ్వత్థామ, శల్యుడు మొదలైన అతిరధ మహారధులు లేరా నీ మాటలు వారిని కాని వారిని చేస్తున్నాయి. నీవు బ్రాహ్మణుడివి కనుక నీ అధిక ప్రసంగం సహించాను. ఇక ఒక్క మాట మాట్లాడినా నీ నాలుక కోస్తాను జాగర్త " అన్నాడు. తన మేనమామను దూషించడం చూసి అశ్వత్థామ క్రుద్ధుడై కత్తి తీసుకుని కర్ణుని మీదకు లంఘించాడు. సుయోధనుడు అశ్వత్థామను వారించగా కృపాచార్యుడు అశ్వత్థామను గట్టిగా పట్టుకుని " నాయనా అశ్వత్థామా ! అంతకోపం పనికి రాదు శాంతం వహించు " అని అనునయించాడు. సుయోధనుడు అశ్వత్థామను చూసి " గురుపుత్రా ! మీ అందరి లక్ష్యం పాండవులను జయించి నన్ను ఈ భూమండలానికి పట్టాభిషిక్తుడిని చేయడం. మనలో మనం కలహించుకుంటే విజయం ఎలా ప్రాప్తిస్తుంది. కర్ణుడి బదులుగా మీ అందరిని నేను క్షమాపణ అడుగుతున్నాను అతడిని క్షమించండి " అన్నాడు. ఆ మాటలకు కర్ణుడు, అశ్వత్థామ శాంతించి తిరిగి యుద్ధసన్నద్ధమైయ్యారు.

## కురు పాండవుల సమరం

కర్ణుడు యుద్ధానికి రావడం చూసిన పాండవ యోధులు అందరూ " మన పాండవులు ఇంతటి దుర్దశకు ఈ వినాశనానికి

కారణమైన కర్ణుని వదలకండి వధించండి " అని అతడిని చుట్టుముట్టారు. కర్ణుడు అందుకు బెదరక ధైర్యంగా వారిని ఎదుర్కొని చీల్చిచెండాడసాగాడు. అది చూసి అర్జునుడు కర్ణుని ఎదుర్కొని ముప్పది బాణములతో అతడిని కొట్టాడు. కర్ణుని చేతిలో నుండి విల్లు జారిపోయింది. వేరొక విల్లు అందుకుని కర్ణుడు అర్జునుడు ఆశ్చర్యపడేలా శరములు గుప్పించాడు. అర్జునుడు ఆగ్రహించి ఒకే బాణంతో కర్ణుని విల్లు విరిచి, సారధి, హయములను చంపి కర్ణుని శరీరం నిండా శరములు గుచ్చాడు. వెంటనే కర్ణుడు కృపాచార్యుని దూషించానన్న సిగ్గు వదిలి పక్కనే ఉన్న అతడి రధము ఎక్కి తలదాచుకున్నాడు. కృపాచార్యుని రధము అక్కడి నుండి నిష్క్రమించింది. కర్ణుని పరాజయం చూసి కౌరవ సైన్యం పారిపోసాగింది. సుయోధనుడు " సైనికులారా ! పారిపోకండి నేను ఉన్నాను పాండవులను జయించగలము రండి " అని అర్జునుడిని ఎదుర్కోడానికి ముందుకు ఉరికాడు. ఇది గమనించిన కృపాచార్యుడు అశ్వత్థాను చూసి " కుమారా! అశ్వత్థామా ! రారాజు తన బలం ఎంతో ఎరుగక అర్జునుడితో యుద్ధానుకి సన్నద్ధమౌతున్నాడు. అలా జరిగితే అతడు అర్జునుడికి పట్టుబడగలడు. నీవు ఇక్కడ ఉండగా అది జరుగరాదు. కనుక నీవు రారాజుకు సాయంగా వెళ్ళు " అన్నాడు. అశ్వత్థామ సుయోధనుడిని సమీపించి " సుయోధనా ! నేనుండగా నీ కెందుకు శ్రమ నేను అర్జునుడిని ఎదుర్కొంటాను నువ్వు వెళ్ళు " అన్నాడు. సుయోధనుడు " గురుపుత్రా ! నీకు నీ తండ్రికి అర్జునుడంటే వల్లమాలిన ప్రేమ మీరు అర్జునుడితో మనసారా యుద్ధం చేసి అతడిని చంపరు. ఇప్పటికే నా తమ్ములు చనిపోయారు సైన్యం క్షీణించింది. కనుక మీరు పాండవుల వద్దకు రావద్దు. మీరు పాండవులతో యుద్ధం చెయ్య వద్దు నేను వారితో యుద్ధం చేస్తాను. మీరు వారి సేనలను నశింపచేయండి " అన్నాడు. అశ్వత్థామ " రారాజా ! నాకు నా తండ్రికి అర్జునుడంటే అభిమానం ఉన్న మాట నిజమే అయినా యుద్ధరంగంలో శత్రుపక్షాన ఉన్న వారు మిత్రులైనా, బంధువులైనా, అభిమానాలకు తావుండదు. మేము మా ఒళ్ళు దాచక యుద్ధం చేయడం చూస్తూనే నువ్వు మమ్ము నమ్మడం లేదు నువ్వు ఎవరినీ నమ్మవు అసలు నిన్ను నువ్వే నమ్మవు. అదంతా ఎందుకు నేను శత్రు సైన్యంలో ప్రవేశించి ధృష్టద్యుమ్నుని ఎదుర్కొని అతడి సైన్యమును పారతోలుతాను " అంటూ పాండసేనలో ప్రవేశించాడు.

## అశ్వత్థామ ధృష్టద్యుమ్నుని ఎదుర్కొనుట

అది గమనించిన కేకయ, పాంచాల సేనలు అశ్వత్థామను చుట్టుముట్టాయి. అశ్వత్థామ వారి మీద శరవర్షం కురిపించి వారిని పారతోలాడు. అది చూసి ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామను ఎదుర్కొని " అశ్వత్థామా! నేను నీ తండ్రి ద్రోణుని చంపడానికి పుట్టిన వరప్రసాదిని. నీ తండ్రినే కాదు నిన్ను కూడా వధిస్తాను రా! " అన్నాడు. అశ్వత్థామ " ధృష్టద్యుమ్నా ! నీ కోసమే ఎదురుచూస్తున్నాను రా! నా బాణములకు నిన్ను బలిచేస్తాను రా! " అంటూ ధృష్టద్యునుని ఎదుర్కొన్నాడు. ధృష్టద్యుమ్నుడు " నీ తండ్రి పని తరవాత చూడవచ్చు ముందు నీ పని పడతాను " అంటూ అశ్వత్థామ మీద శరములు గుప్పించాడు. అశ్వత్థామ కోపించి ధృష్టద్యుమ్నుని కేతనము ఖండించి, సారధిని, హయములను చంపి అతడి చక్రరక్షకులను నూరు మందిని చంపి సింహనాదం చేసాడు. పాంచాల సేనలు అశ్వత్థామ ధాటికి నిలువ లేక చెదిరి పోయాయు. అది చూసి ధర్మరాజు, భీముడు తమ సైన్యాలతో ధృష్టద్యుమ్నునికి సాయం వచ్చారు. సుయోధనుడు ద్రోణుని తీసుకుని అశ్వత్థామకు సాయం వచ్చాడు. అది చూసిన అర్జునుడు ధృష్టద్యుమ్నునికి సాయం వచ్చాడు. ఇరు పక్షాల నడుమ పోరు ఘోరమైంది. అర్జునుడు తన వాడి అయిన బాణములతో మగధ, మద్ర, వంగదేశముల నాశనం చేస్తున్నాడు. భీముడు అంబష్ట, శిబి, వంగదేశ సైన్యములను తుద ముట్టించాడు. అది చూసి ఆగ్రహించిన ద్రోణుడు వాయవ్యాస్త్రమును ప్రయోగించి పాండవసేనలను చెల్లాచెదురు చేసాడు. అర్జునుడు, భీముడు ద్రోణునికి రెండు వైపుల నిలిచి శరములు గుప్పించాడు. ద్రోణుడు బెదరక పాండవ సేనలను తనుమాడుతున్నాడు. సుయోధనుడు పాండవ సేనలను చెల్లాచెదురు చేస్తున్నాడు. అప్పుడు సోమదత్తుడు పాండవ సేనలను ఎదుర్కొన్నాడు. సాత్యకి సోమదత్తుడిని ఎదుర్కొన్నాడు. సోమదత్తుడు ఒకే బాణంతో సాత్యకి విల్లు విరిచి సాత్యకిని ముప్పై అయిదు బాణాలతో కొట్టాడు. సాత్యకి మరొక విల్లందుకుని సోమదత్తుని విల్లు విరిచాడు . సోమదత్తుడు మరొక విల్లు తీసుకున్నాడు. అది చూసి భీముడు సోమదత్తుడిని ఎదుర్కొన్నాడు. ఘటోత్కచుడు సోమదత్తుడి మీద పరిఘను విసిరాడు. సోమదత్తుడు దానిని రెండు ముక్కలు చేసాడు. సాత్యకి ఒక వాడి అయిన బాణములతో సోమదత్తుడి సారధిని, హయములను చంపి మరొక నారసముతో సోమదత్తుడి తల నరికాడు. సోమదత్తుడి మరణం చూసి కౌరవ సేనలు సాత్యకిని ఒక్కుమ్మడిగా ఎదుర్కొన్నాయి. అది చూసిన ధర్మరాజు సాత్యకిని అక్కడి నుండి తప్పించి తాను ద్రోణుని ఎదుర్కొన్నాడు. ద్రోణుడు ధర్మరాజు విల్లు విరిచి, కేతనము పడగొట్టి ధర్మజుని శరీరం తూట్లు పడేలా కొట్టాడు. ధర్మరాజు ఉగ్రరూపందాల్చి మరొక విల్లందుకుని ద్రోణుని శరీరంలో గుచ్చుకునేలా బాణములు సంధించాడు. ద్రోణుడు తన రధము మీద మూర్చిల్లాడు. కొంచెం సేపటికి తేరుకున్న ద్రోణుడు తేరుకుని పాండవ సైన్యం మీద వాయవ్యాస్త్రాన్ని ప్రయోగించాడు. ధర్మరాజు కూడా వాయవ్యాస్త్రాన్ని ప్రయోగించి దానిని నిర్వీర్యం చేసి ద్రోణుని మీద శరములు గుప్పించాడు. అది చూసిన శ్రీకృష్ణుడు ధర్మజుని వద్దకు వెళ్ళి " ధర్మజా ! నిన్ను పట్టుకుని సుయోధనుడికి అప్పగిస్తానన్న ద్రోణుని ప్రతిజ్ఞ మరిచావా ! ద్రోణునితో యుద్ధము మంచిది కాదు వెంటనే ఇక్కడి నుండి వెళ్ళి భీముడికి సాయపడు " అన్నాడు. కృష్ణుడి మాట మన్నించి ధర్మజుడు భీముని వద్దకు వెళ్ళాడు. ద్రోణుడు ధర్మజుడిని వదిలి పాంచాల సేనలను ఎదుర్కొన్నాడు. ధర్మరాజు, భీముడు, ధృష్టద్యుమ్నుడు, సాత్యకి కౌరవ సేనలను తనుమాడుతున్నారు. కృపాచార్యుడు, కర్ణుడు, ద్రోణుడు వారిని ఎదుర్కొన్నారు. యుద్ధం ఘోరరూపందాల్చింది. సేనల పదఘట్టనలకు రేగిన ధూళి ఆకాశాన్ని తాకి సూర్యుడిని

మరుగున పరిచి చీకట్లు కమ్ముకున్నాయి. సైనికులకు కళ్ళు కనిపించడం కష్టమైంది. ద్రోణాచార్యుడు ఒక వైపు సుయోధనుడిని ఒక వైపు కురు సేనలను ప్రోత్సహిస్తూ యుద్ధోన్ముఖులను చేసి అప్పటికప్పుడు ఒక వ్యూహమును ఏర్పరిచాడు.

## రాత్రి సమయంలో పోరు

ద్రోణుడు పన్నిన వ్యూహానికి ముఖభాగంలో అతడే నిలబడ్డాడు. వ్యూహమునకు రెండు వైపులా అశ్వత్థామను శకుని నిలిపాడు. మధ్యలో శల్యుడు నిలబడ్డాడు. సుయోధనుడు వ్యూహం అంతా తిరుగుతున్నాడు. సుయోధనుడు తన సైనికులను దివిటీలను పట్టుకుని నిలబడమని చెప్పాడు. వెంటనే సైనికులకు దివిటీలు అందించబడ్డాయి. రధికునకు అయిదు దివిటీలు , గజముకు మూడు దివిటీలు, హయముకు ఒక దివిటీ చొప్పున ఇచ్చారు. వ్యూహముకు ముందు భాగమున సైనికులు దివిటీలు పట్టుకుని బారులు తీరారు. పాండవసైనికులు దివిటీలు పట్టుకున్నారు. రధముకు పది దివిటీలు, గజముకు ఏడు దివిటీలు, హయముకు రెండు దివిటీలు పట్టుకున్నారు. సుయోధనుడు తన సోదరులను పిలిచి " సోదరులారా ! మీరూ, శల్యుడు, కృతవర్మ మొదలైన యోధులు ధృష్టద్యుమ్నుడు ద్రోణునితో తలపడకుండా చూడండి ద్రోణుడు మిగిలిన వారితో యుద్ధము చేస్తున్నాడు. కర్ణుడు ధృష్టద్యుమ్నుని చంపి తరువాత అర్జునుడిని జయిస్తాడు. నేను భీమునితో యుద్ధము చేసి గెలుస్తాను " అని పలికి సైన్యమును కదలమని సైగ చేసాడు. ధర్మరాజు ద్రోణుని ఎదుర్కొను సమయంలో మధ్యలో కృతవర్మ ఎదుర్కొని యుద్ధం చేయసాగాడు. సాత్యకితో భూరి అను రాజు, సహదేవునితో కర్ణుడు, భీమునితో సుయోధనుడు, నకులునితో శకుని, శిఖండితో కృపాచార్యుడు, ప్రతివింధ్యునితో దుశ్శాసనుడు, అశ్వత్థామతో ఘటోత్కచుడు, ద్రుపదునితో వృషసేనుడు, విరాటరాజుతో శల్యుడు, శతానీకునితో చిత్రసేనుడు, అర్జునుడితో అలంబసుడనే రాక్షసరాజు యుద్ధం చేస్తూ మరొక పక్క ద్రోణుని కాపాడుతున్నారు. పాండవపక్షంలోని అతిరధ మహారధులు ద్రోణునితో తలపడడానికి ప్రయత్నిస్తుంటే కౌరవ యోధులు శయశక్తులా అడ్డుకుంటున్నారు. ద్రోణుడు సోమకసైన్యంతో పోరి వారిని హతమార్చాడు. ధృష్టద్యుమ్నుడు ద్రోణుని ఎదుర్కొన్నాడు. వారిరువురు ఘోరంగా యుద్ధం చేసుకుంటున్నారు. కృతవర్మ ధర్మరాజు విల్లు విరిచాడు. ధర్మరాజు మరొక విల్లు తీసుకుని కృతవర్మ విల్లు విరిచి కృతవర్మ మీద శక్తి ఆయుధమును ప్రయోగించాడు అది కృతవర్మను చేతిని చీల్చింది. కృతవర్మ మరొక విల్లు తీసుకుని ధర్మరాజు రధసారధిని, హయములను చంపి ధర్మరాజు విల్లు విరిచాడు. ధర్మరాజు తోమరము అనే ఆయుధాన్ని తీసుకున్నాడు. కృతవర్మ ఆ అయుధమును రెండు ముక్కలు చేసి ధర్మరాజు కవచము చీల్చే విధంగా బాణముతో కొట్టాడు. కృతవర్మతో యుద్ధం చేయ లేక ధర్మరాజు యుద్ధభూమి నుండి తొలగి పోయాడు. సాత్యకి కురు వంశీయుడైన భూరి అనేరాజుతో తలపడి అతడి విల్లు విరిచాడు. భూరి మరొక విల్లు తీసుకుని అతడి వింటిని ముక్కలు చేసాడు. సాత్యకి శక్తి ఆయుధాన్ని ప్రయోగించి భూరి తల తెగనరికాడు. ఇది చూసిన ఇది చూసి అశ్వత్థామ సాత్యకితో తలపడ్డాడు. ఇంతలో ఘటోత్కచుడు అశ్వత్థామతో తలపడి పది బాణములతో అశ్వత్థామ వక్షస్థలం మీద కొట్టాడు. ఆ బాణముల ధాటికి తాళ లేక అశ్వత్థామ రధము మీద సొమ్మసిల్లి పడి వెంటనే తేరుకుని ఘటోత్కచుడి గుండెలకు గురిపెట్టి తీవ్రమైన బాణములతో కొట్టాడు. ఆ బాణముల ధాటికి ఘటోత్కచుడు సొమ్మసిల్లి పడిపోయాడు. ఘటోత్కచుడి రధసారధి రధమును పక్కకు తీసుకు వెళ్ళాడు.

## భీమసుయోధనుల పోరు

మరొక పక్క సుయోధనుడు భీముడు తలపడి ఘోర యుద్ధం సాగిస్తున్నారు. భీముడు సుయోధనుడి ధనస్సు ముక్కలు చేసి, అతడి కేతనమును విరిచి అతడి శరీరాన్ని తూట్లు పడేలా కొట్టాడు. సుయోధనుడు మరొక విల్లందుకుని భీముని విల్లు విరిచాడు. భీముడు మరొక విల్లందుకుని ఏడు బాణములతో సుయోధనుడిని తీవ్రంగా గాయపరిచి అతడి విల్లు విరిచాడు. సుయోధనుడు మరొక విల్లు తీసుకొనగానే దానిని కూడా విరిచాడు. భీముడు అలా సుయోధనుడి నాలుగు ధనస్సులు విరిచి రధాశ్వములను, సారధిని చంపాడు. సుయోధనుడికి భీముడంటే భయమేసింది. ఎవరూ చూడకుండా పక్కకు తప్పుకున్నాడు. అది గమనించని భీముడు సుయోధనుడు చనిపోయాడనుకుని సింహనాదం చేసాడు. సుయోధనుడు కనిపించక కౌరవ సేనలు కలవరపడ్డాయి. పాండవ సేనలో ఆనందోత్సాహాలు పెల్లుబికాయి. ఇంతలో సుయోధనుడు వేరొక రధము మీద రావడంతో కల్లోలం సద్దు మణిగింది.

## కర్ణ సహదేవుల పోరు

కర్ణుడు సహదేవునితో తలపడ్డాడు. సహదేవుడు కర్ణుని తొమ్మిది బాణములతో కొట్టాడు. కర్ణుడు సహదేవుని నూరు బాణములతో మర్మస్థానములలో కొట్టి సహదేవుని ధనస్సును ముక్కలు చేసాడు. సహదేవుడు మరొక విల్లందుకున్నాడు.

కర్ణుడు సహదేవుని సారధిని, రధాశ్వములను చంపాడు. సహదేవుడు కత్తి డాలు తీసుకున్నాడు. కర్ణుడు వాటిని ముక్కలు చేసాడు. సహదేవుడు కర్ణుని మీద గధాయుధాన్ని విసిరాడు. కర్ణుడు ఆ గధను మధ్యలోనే తుంచాడు. సహదేవుడు కర్ణుని మీద శక్తి ఆయుధాన్ని ప్రయోగించాడు. కర్ణుడు దానిని ముక్కలు చేసాడు. ఇక చేసేది లేక సహదేవుడు రధచక్రాన్ని కర్ణుని మీద వేసాడు. కర్ణుడు దానిని కూడా తన బాణ్ములతో ముక్కలు చేసాడు. కర్ణునితో యుద్ధం చేయలేక సహదేవుడు అక్కడ నుండి తప్పుకుంటున తరుణంలో కర్ణుడు అతడిని వెంబడించి పట్టుకుని చంపబోయి కుంతికి ఇచ్చిన మాట గుర్తుకు వచ్చి చంపకుండా వదిలి హేళనగా " సహదేవా! నీ బలం ఎదుటి వాని బలం తెలుసుకుని యుద్ధం చెయ్యి. నీ కన్నా బలవంతులతో యుద్ధం చెయ్యడం అవివేకమని తెరులుసుకో పో " అని పంపాడు. సహదేవుడు అవమానభారంతో కుమిలి పోతూ అక్కడ నుండి వేరొక రధము ఎక్కి వెళ్ళాడు.

## శల్యవిరాటుల యుద్ధం



కృపాచార్య శిఖండిల పోరాటము

శల్యుడు విరాటునితో యుద్ధం చేస్తూ విరాటుని అశ్వములను చంపాడు. శల్యుని మీద విరాటుడు శరములు గుప్పించాడు. విరాటుని తమ్ముడు శతానీకుడు అన్నకు సాయంగా వచ్చి విరాటుని తన రధము మీద ఎక్కించుకున్నాడు. శల్యుడు వాడి అయిన బాణమును ప్రయోగించి శతానీకుని సంహరించాడు. తమ్ముని మరణం విరాటునిలో భయం కలిగించినా పైకి ధైర్యంగా ఉండి శల్యుని ఎదుర్కొన్నాడు. శల్యుడు పదునైన బాణమును ప్రయోగించి విరాటుని మూర్చిల్లేలా కొట్టాడు. విరాటుని రధసారధి రధమును పక్కకు తీసుకు వెళ్ళాడు. విరాటుని సేనలు శల్యుని ధాటికి ఆగ లేక పక్కకు తొలిగాయి. అది చూసి అర్జునుడు ఆ సైన్యములను ఆపి శల్యునితో తలపడ్డాడు. అలంబసుడిని ఎదుర్కొన్న అర్జునుడు అతడి విల్లు కేతనమును విరిచి, హయములను చంపాడు. అలంబసుడు ఒక కత్తి తీసుకుని అర్జునుడితో తలపడ్డాడు. అర్జునుడు ఆ కత్తిని విరిచి నాలుగు భయంకరమైన బాణములతో ఆ రాక్షసుని కొట్టాడు. అర్జునుడి ధాటికి ఆగ లేక అలంబసుడు పారి పోయాడు. నకులుడి కుమారుడు శతానీకుడు సుయోధనుడి తమ్ముడైన చిత్రసేనుడిని ఎదుర్కొని చిత్రసేనుడి కవచమును చీల్చి, కేతనము విరిచి, విల్లు విరిచాడు. చిత్రసేనుడు వేరొక విల్లందుకుని శతానీకుని మీద బాణ ప్రయోగం చేసాడు. శతానీకుడు చిత్రసేనుడి రధాశ్వములను, సారధిని చంపాడు. చిత్రసేనుడు శతానీకుని ఇరవై అయిదు బాణములతో శరీరం తూట్లు పడేలా కొట్టాడు. శతానీకుడు ఒకే బాణంతో చిత్రసేనుడి విల్లు విరిచి రధమును విరిచాడు. చిత్రసేనుడు రధము నుండి దూకి పక్కనే ఉన్న హార్ధిక్యుడి రధము ఎక్కి పారిపోయాడు. ద్రుపదుడు కర్ణుని కుమారుడైన వృషసేనుని ఎదుర్కొన్నాడు. ద్రుపదుని మీద వృషసేనుడు పైచేయిగా ఉన్నాడు. ద్రుపదుని నిస్సహాయత చూసి పాంచాల సేనలు వృషసేనుడితో తలపడ్డాయి. కాని వృషసేనుడితో తలపడ లేక పారి పోయారు. దుశ్శాసనుడు ధర్మజుని కుమారుడైన ప్రతి వింధ్యుని ఎదుర్కొని అతడి ధ్వజమును, విల్లును విరిచి, సారధిని, హయములను చంపాడు. ప్రతివింధ్యుని సోదరులు అతడికి సాయంగా వచ్చి పోరుతున్నారు. భీముని కుమారుడైన శ్రుతసేనుడు ప్రతి వింధ్యుని తన రధము మీద ఎక్కించుకున్నాడు. ప్రతివింధ్యుడు మరొక విల్లందుకుని దుశ్శాసనుడితో తలపడ్డాడు. నకులుడు శకునితో యుద్ధం చేస్తున్నాడు. శకుని పదునైన బాణంతో నకులుని మూర్చపోయేలా కొట్టాడు. నకులుడు తేరుకుని శకుని విల్లు, కేతనమును విరిచి శకుని తొడలపై బాణములతో కొట్టి అతడిని కదలకుండా చేసాడు. నకులుని బాణధాటికి శకుని మూర్చపోయాడు. శకుని రధసారధి రధమును పక్కకు తీసుకు వెళ్ళాడు. కృపాచార్యుడు శిఖండితో యుద్ధం చేస్తున్నాడు. శిఖండి కృపాచార్యుని విల్లు విరిచాడు. కృపాచార్యుడు వేరొక విల్లందుకుని శిఖండి మీద శక్తి ఆయుధాన్ని ప్రయోగించాడు. శిఖండి దానిని నిర్వీర్యం చేసాడు. కృపాచార్యుడు మరొక ధృడమైన బాణంతో శిఖండిని మూర్చిల్లచేసాడు. కృపాచార్యుడు శిఖండిని చంపడానికి వేరొక బాణం తీయగానే పాంచాలవీరులు అడ్డుకుని కృపాచార్యునితో యుద్ధానికి దిగారు. రధసారధి శిఖండి రధమును పక్కకు తప్పించాడు. కాగడాల వెలుతురులో ఆ నాటి యుద్ధం రసవత్తరంగా సాగింది. ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుని అయిదు బాణాలతో కొట్టాడు. ద్రోణుడు ధృష్టద్యుమ్నుని విల్లు విరిచాడు. ధృష్టద్యుమ్నుడు వేరొక విల్లందుకుని అగ్ని బాణమును ప్రయోగించాడు. కర్ణుడు అది చూసి దానిని మధ్యలోనే తుంచాడు. సుయోధనుడు, శల్యుడు, దుశ్శాసనుడు అక్కడకు చేరి ధృష్టద్యుమ్నుని ఎదుర్కొన్నారు. ధృష్టద్యుమ్నుడు వారితో ఒంటరిగా పోరు సాగించాడు. కర్ణుడితో తలపడిన ద్రుమసేనుడిని ఒకే బాణంతో కర్ణుడుసంహరించాడు. అది చూసిన ధృష్టద్యుమ్నుడు కోపించి కర్ణుని విల్లు విరిచాడు. కర్ణుడు మరొక విల్లందుకుని ధృష్టద్యుమ్నుని ఎదుర్కొన్నాడు. ఇంతలో సాత్యకి నిర్వీర్యం చేసి కర్ణుని ఎదుర్కొన్నాడు. ఇంతలో వృషసేనుడు మధ్యలో వచ్చి సాత్యకిని ఎదుర్కొన్నాడు. సాత్యకి ఒకే బాణంతో వృషసేనుని మూర్చిల్లజేసాడు. కర్ణుడు తన కుమారుడు మృతిచెందాడనుకుని సాత్యకి మీద శరవర్షం కురిపించాడు. వృషసేనుడు తేరుకుని కర్ణుడితో చేరి సాత్యకిని ఎదుర్కొన్నాడు.

## సుయోధనుడికి కర్ణుడి సలహా

అర్జునుడు దేవదత్తము పూరించాడు. ఇది విని కర్ణుడు " రారాజా ! అర్జునుడు ఇటు వైపు వస్తున్నాడు. అతడిని సాత్యకిని చేరకుండా ఆపగలిగితే మనము సాత్యకిని వధించ వచ్చు. ఇలా చేస్తేనే సాత్యకిని అభిమన్యుని చంపినట్లు చంపగలము. మన విజయానికి అదే నాంది. సాత్యకి మరణం తెలిసిన అర్జునుడు ఇక్కడకు వస్తాడు కనుక అతడికి సాత్యకి మరణం తెలియకుండా మన మహాయోధులను పంపి అర్జునుడిని ఇక్కడకు రాకుండా నిలువరించు " అన్నాడు. సుయోధనుడికి కర్ణుడి ఆలోచన నచ్చింది పక్కనే ఉన్న శకుని చూసి " మామా ! నీవు పదివేల ఏనుగులను, పదివేల రధములను తీసుకుని అర్జునుడిని ఎదుర్కొని అతడు ఇక్కడకు రాకుండా ఆపు. నీకు తోడుగా నా తమ్ములు దుశ్శాసనుడు, సుబాహుడు, దుష్ప్రదర్షణుడు, దుర్విషహుడు తోడుగా వస్తారు. నీవు అర్జునుడు, భీముడు, ధర్మరాజులను ఎదుర్కొని విజయం సాధించు " అన్నాడు. సుయోధనుడి మాటను అనుసరించి శకుని మేనల్లుళ్ళను తీసుకుని అర్జునుడిని ఎదుర్కొనుటకు వెళ్ళాడు. కర్ణుడు సాత్యకిని ఎదుర్కొన్నాడు కాని సాత్యకి యుద్ధ కౌశలానికి కౌరవ సేన నిలువలేక పోయింది. సుయోధనుడు సాత్యకిని ఎదుర్కొన్నాడు. సాత్యకి సుయోధనుడి సారధిని, రధాశ్వములను చంపి, విల్లు విరిచాడు. సుయోధనుడు కిందకు దూకి పక్కనే ఉన్న రధమును ఎక్కి తప్పించుకున్నాడు. సుయోధనుడి పరాజయం చూసి కౌరవసేన పారిపోయింది. శకుని తన కుమారుడైన ఉలూకునితో చేరి అర్జునుడిని ఎదుర్కొన్నాడు. ఉలూకుడు అర్జునుడి మీద శరములు గుప్పించాడు. అర్జునుడు శకుని సారధిని, రధాశ్వములను చంపి, అతడి వింటిని, రధమును విరిచాడు. శకుని కుమారుని రధము ఎక్కి అర్జునుడిని ఎదుర్కొన్నాడు. కాని వారు అర్జునుడి గాండీవం నుండి వెలువడుతున్న శరముల ధాటికి తాళలేక పోయారు. శకునికి సాయంగా వచ్చిన రధికులు యుద్ధం చేయలేక పారి పోయారు. శకుని అతడి కుమారుడు దిక్కు తోచకుండా నిలబడ్డారు. ధృష్టద్యుమ్నుడు ద్రోణుని ఎదుర్కొని అతడి వింటి నారిని విరిచాడు. ద్రోణుడు మరొక విల్లందుకుని శరప్రయోగం చేసాడు. అర్జునుడు, సాత్యకి, ధృష్టద్యుమ్నుడు కౌరవ సేనలను తనుమాడుతున్నారు. విజయ సూచకంగా అర్జునుడు దేవదత్తమును శ్రీకృష్ణుడు పాంచజన్యము , ధృష్టద్యుమ్నాది యోధులు తమతమ శంఖములు పూరించారు.

## కర్ణుని విజృంభణ

కర్ణుడు పాడవుల విజయోత్సాహానికి క్రుద్ధుడై విజృంభించి పాండవసేనలను తరుముతూ దొరికిన వారిని దొరికినట్లు చంపసాగాడు. అది చూసిన ధర్మరాజు అర్జునుడితో " అర్జునా ! చూసావా మధ్యందిన మార్తాండునిలా ఉన్న కర్ణుని విజృంభణ చూస్తే మనం ఊరకున్న ఈ రోజే పాండవ సేనను నాశనం చేసేలా ఉన్నాడు. నీవు అతడిని ఆపే మార్గం ఆలోచించు " అన్నాడు. అర్జునుడు శ్రీకృష్ణుని చూసి " కృష్ణా ! అన్నయ్య ధర్మజుడు మన సేనలు పారి పోవడం చూసి భయపడుతున్నాడు. ఒక వైపు కర్ణుడు, మరొక వైపు ద్రోణుడు మన సైన్యాలను తరుముతున్నారు. ద్రోణుడిని తరవాత చూడవచ్చు ముందు కర్ణుని ఆపాలి మన రధం కర్ణుని ముందు నిలుపు " అన్నాడు. కృష్ణుడు " అర్జునా ! రాత్రులందు రాక్షసులకు బలం ఎక్కువ కనుక నీవు ఇప్పుడు ఘటోత్కచుడిని పంపి కర్ణుడిని నిలువరించుట ఉత్తమం. మాయా విద్యా ప్రవీణ్యుడు దివ్యాస్త్ర సంపన్నుడైన ఘటోత్కచుడు కర్ణుడిని నిలువరించగల సమర్ధుడు. మనం ద్రోణుని ఎదుర్కొంటాము " అన్నాడు. కృష్ణుని మాట విన్న అర్జునుడు ఘటోత్కచుడిని పిలిచి " కుమారా ఘటోత్కచా ! కర్ణుడి పరాక్రమానికి పాండవ సేన చెదిరి పోతుంది. నీవు నీ పరాక్రమాన్ని చూపి అతడిని నిలువరింపుము. రాత్రి సమయంలో కర్ణుడు నీ అంత సమర్ధవంతంగా యుద్ధం చేయలేడు కనుక నీవు అతడిని కట్టడి చేయగలవు కనుక కర్ణుడిని ఎదుర్కొని నీ తండ్రుల పేరు నిలుపు " అన్నాడు. ఘటోత్కచుడు అర్జునుడికి నమస్కరించి కర్ణుడిని ఎదుర్కొనుటకు వెళ్ళాడు.



కర్ణుని ఎదుర్కొనుటకు ఘటోత్కచుడుని పంపుతున్న కృష్ణుడు

## ఘతోత్కచాలంబసుల యుద్ధం

ఆసమయంలో జటాసురుడి కుమారుడైన అలంబసుడు సుయోధనుడి వద్దకు వచ్చి " రారాజా ! నాకు ఎప్పటి నుండో పాండవుల మీద పగ ఉన్నది. మీరు అనుజ్ఞ ఇస్తే పాండవులను సంహరించగలను " అన్నాడు. సుయోధనుడు


ఘతోత్కచుని రథం

ఆనందపరవశుడై అందుకు అంగీకరించాడు. అలంబసుడు కర్ణుడిని దాటి ఘటోత్కచుడిని ఎదుర్కొన్నాడు. ఇరువురు మొదట విల్లంబులతో యుద్ధం మొదలు పెట్టారు. ఆ తరువాత రాక్షస మాయలు ప్రయోగించి యుద్ధం చేయసాగారు. ఒకరు సర్పంగా మారితే ఒకరు గరుడునిగా మారారు. ఒకడు ఏనుగుగా మారిన వేరొకరు సింహంగా మారారు. ఒకరికి ఒకరు తీసి పోకుండా యుద్ధం చేయసాగారు. చివరికి ముష్టి యుద్ధానికి దిగారు. చివరకు ఘటోత్కచుడు అలంబసుడిని కిందకు తోసి గొండెల మీద కాలు పెట్టి అలంబసుడి తల గుండ్రంగా తిప్పి అతడి తల తెంచాడు. ఆ తలను తీసి సుయోధనుడి రధము మీద విసిరాడు. అది చూసి ఆశ్చర్య పోతున్న సుయోధనుడితో " ఓ సుయోధనా! ఇది నీ స్నేహితుడి అలంబసుడి తల ఇంకొంచెం సేపటికి కర్ణుడి తల నీ రథం మీదకు వేస్తాను నీ వంతు వచ్చినప్పుడు నీ తల విసరగలను. నేను భీమసేనుడి కుమారుడినని తెలుసు కదా ! జాగర్త " అని గర్జించాడు.

## ఘటోత్కచ కర్ణుల పోరు

భయంకరాకారంతో తన వైపు వస్తున్న ఘటోత్కచుడిని చూసి కర్ణుడు అతడి మీద పదునైన బాణములు గుప్పించాడు. ఇరువురు ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధం చేస్తున్నారు. కర్ణుడు ప్రయోగించిన దివ్యాస్త్రములను ఘటోత్కచుడు తిప్పికొట్టాడు. ఘటోత్కచుడు ప్రయోగించిన అస్త్రములు కర్ణుడు తిప్పి కొడుతున్నాడు. ఘటోత్కచుడు మాయా యుద్ధం ప్రకటించి మాయా సైన్యం సృష్టించాడు. ఆ మాయా సైన్యం కౌరవులు అది వరకు చూడని వివిధ ఆయుధములను కౌరవసేన మీద ప్రయోగించారు. ఆ ఆయుధ ధాటికి కౌరవ సేన పారిపోయింది. ఘటోత్కచుడు కర్ణుడి మీద చక్రాయుధమును ప్రయోగించాడు. కర్ణుడు దానిని ఖండించాడు. ఘటోత్కచుడు తన గధాయుదాన్ని కర్ణుడి పై విసిరాడు. కర్ణుడు దానిని ముక్కలు చేసాడు. ఘటోత్కచుడు ఆకాశానికి ఎగిరి రాళ్ళను చెట్లను వర్షంలా కురిపించాడు. కర్ణుడు వాట్ని నుగ్గు నుగ్గు చేస్తున్నాడు. ఘటోత్కచుడు కిందికి దిగి తన రధము అధిరోహించి కర్ణుడిని ఎదుర్కొన్నాడు. కర్ణుడు వెంటనే ఘటోత్కచుడి సారధిని, హయములను చంపి రధమును ముక్కలు చేసి ఘటోత్కచుడి శరీరం నిండా నిశితమైన శరములు నాటాడు. ఘటోత్కచుడు నోరు గుహలా తెరిచి కర్ణుడు వేసే బాణములు అన్నీ మింగాడు. కర్ణుడు అతడి ముఖం నిండా బాణములతో నింపాడు. ఘటోత్కచుడు మరణించాడని అందరూ అనుకుంటున్న తరుణంలో ఘటోత్కచుడు తేరుకుని కర్ణుడి రధాశ్వములను చంపి అతడి విల్లు ముక్కుల చేసాడు.

### ఘటోత్కచుడు అలాయుధునితో పోరుట

కర్ణుడు మీద ఘటోత్కచుడు పైచేయిగా ఉన్న సమయంలో బకాసురుడి తమ్ముడు అలాయుధుడు సుయోధనుడి వద్దకు వచ్చి " సుయోధనా ! మా అన్న బకాసురుడిని చంపిన భీముని మీద ప్రతీకారం తీర్చుకోవాలని అనుకుంటున్నాను. నాకు అనుమతి ఇవ్వు " అన్నాడు. సుయోధనుడు ఆలోచించాడు. ఘటోత్కచుడు కర్ణుని మీద పైచేయిగా ఉన్నాడు. కృపాచార్యుడు, అశ్వత్థామ ఆశ్చర్యంగా యుద్ధాన్ని తిలకిస్తున్నారు. అందరూ కర్ణుని మీద ఆశలు వదులుకున్న తరుణంలో అలాయుధునికి అనుజ్ఞ ఇవ్వడం మంచిదని అనుకుని " అలాయుధా ! నీవు వెంటనే నీ శత్రువైన భీముని కుమారుడైన ఘటోత్కచుడితో యుద్ధం చేసి ఓడించి తరువాత భీముని మీద అతడి అన్నదమ్ముల మీద ప్రతీకారం తీర్చుకో " అన్నాడు. ఆ మాటకు సంతోషించిన అలాయుధుడు తన రాక్షస సైన్యంతో ఘటోత్కచుడిని ఎదుర్కొన్నాడు. ఘటోత్కచుడు అలాయుధుల మధ్య యుద్ధం మొదలైంది. సమ ఉజ్జీలైన ఇరు రాక్షస వీరులు ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధం చేస్తున్నారు. కర్ణుడు అక్కడ నుండి తప్పుకుని భీమునితో యుద్ధము చేయుటకు వెళ్ళాడు. భీముడు కర్ణుని దాటుకుని తన కుమారుడైన ఘటోత్కచుడి వద్దకు వెళ్ళాడు. అలాయుధుని అనుచరులైన రాక్షస వీరులు ఒక్కొక్కరుగా భీమసేనుడిని చుట్టుముట్టారు. భీమసేనుడు వారందరిని ఒక్కసారిగా చంపాడు. అలాయుధుడు ఒంటరిగా యుద్ధం చేస్తూ తన సేనలను పాంచాలసేనలతో యుద్ధానికి ప్రేరేపించాడు. అది చూసిన కృష్ణుడు " అర్జునా ! రాత్రి పూట రాక్షసులకు బలం ఎక్కువ కనుక సాత్యకి, నకులసహదేవులను వారితో యుద్ధం చేయడానికి పంపు. కర్ణుని మీదకు ధృష్టద్యుమ్న శిఖండులను పంపి నీవు ద్రోణునితో పోరాడు " అన్నాడు. భీముడు అలసి పోవడం గమనించిన కృష్ణుడు ఘటోత్కచుడిని పిలిచి " నాయనా ! ఘటోత్కచా! నీ తండ్రి భీమసేనుడు అలాయుధుడితో పోరాడి అలసి పోయాడు. ఇక నీవు వెళ్ళి అలాయుధుని ఎదుర్కో " అని పంపాడు.

వెంటనే ఘటోత్కచుడు కర్ణుడిని వదిలి అలాయుధుని ఎదుర్కొన్నాడు. అతడితో నకులుడు మొదలైన పాండవయోధులు చేరి రాక్షస సేనను తరిమారు. కర్ణుడు పాంచాల సేనలతో పోరుతున్నాడు. అది చూసి భీముడు కర్ణుడిని ఎదుర్కొన్నాడు.

## ఘటోత్కచుడు అలాయుధాన్ని చంపుట

అలాయుధుడు ఘటోత్కచుడి మీద ఒక పరిఘను విసిరి అతడిని మూర్చిల్లజేసాడు. ఘటోత్కచుడు వెంటనే తేరుకుని తన గదను గిరిగిరా తిప్పి అలాయుధుని మీద విసిరాడు. ఆ గద అలాయుధుని సారధిని, అతడి రధాశ్వములను, ధ్వజమును, రధమును నుగ్గు చేసాయి. వెంటనే అలాయుధుడు ఒక మేఘంగా మారి ఆకాశం నుండి నెత్తురు కురిపించాడు. ఘటోత్కచుడు కూడా ఆకాశానికి ఎగిరి అలాయుధుని మాయను తిప్పి కొట్టాడు. తరువాత రాక్షస వీరులు భూమికి దిగి రాళ్ళతో చెట్లతో యుద్ధం చేయసాగారు. అలాయుధుడు కత్తి తీసుకుని ఘటోత్కచుని ఎదుర్కొన్నాడు. ఘటోత్కచుడు కూడా కత్తి తీసుకుని అలాయుధుని ఎదుర్కొన్నాడు. చివరికి ఘటోత్కచుడు అలాయుధుడిని కింద పడవేసి అతడి కంఠము తెగనరికి సింహనాదం చేసాడు. పాండవ సైన్యం ఆనందోత్సాహాలతో మిన్నంటేలా భేరీ నాదాలు చేసారు. ఘటోత్కచుడు అలాయుధుని తల తీసుకుని సుయోధనుడి రధము మీదకు విసిరాడు. అది చూసి సుయోధనుడు చింతాక్రాంతుడైయ్యాడు. తరువాత ఘటోత్కచుడు పాండవ సేనలను నాశనం చేస్తున్న కర్ణుడిని ఎదుర్కొన్నాడు.

## ఘతోత్కచ మరణం


ఇంద్ర శక్తితో ఘటోత్కచుని చంపుతున్న కర్ణుడు- రాజ్మానామా నుండి ఒక దృశ్యం

కర్ణుడు తనను ఎదుర్కొన్న ఘటోత్కచుని రధాశ్వములను చంపాడు. వెంటనే ఘటోత్కచుడు రధంతో సహా మాయం అయ్యాడు. ఘటోత్కచుడు ఎవరి ముందు ప్రత్యక్షమై ఎవరిని చంపుతాడో అని కౌరవ సేనలో భయాందోళనలు మొదలైయ్యాయి. ఘటోత్కచుడు మేఘంలాగా మారి ఆకాశంలో నుండి కౌరవ సేన మీద పెద్ద పెద్ద బండరాళ్ళు విసరి కౌరవ సేన రధములను నుగ్గు చేస్తున్నాడు. కురుసేన ఏవైపు నుండి బండరాళ్ళు పడతాయోనని బెదిరి పోతున్నారు. కాని కర్ణుడు మాత్రం ధైర్యంగా నిలబడి తన దివ్యాస్త్రములతో రాక్షస మాయను విచ్చిన్నం చేస్తున్నాడు. కర్ణుడు రాళ్ళ వాన కురిపిస్తున్న మేఘమును విచ్చిన్నం చేయడంతో కౌరవసేనలో ధైర్యం వచ్చింది. వారు కర్ణుడితో " కర్ణా ! నీవు మహా వీరుడవు లేకున్న రాక్షస మాయను విచ్చిన్నం చేయలేవు. కాని నిన్ను నీవు కాపాడుకోవాలంటే ఘటోత్కచుడిని సంహరించక తప్పదు. కనుక ఇంద్రుడు నీ కవచకుండలములు దానంగా పరిగ్రహించిన తరుణంలో ప్రసాదించిన అమోఘమైన శక్తిని అతడి మీద ప్రయోగించి అతడిని సంహరించు. దానిని ఎప్పుడో భీమార్జునులను చంపడానికి దాచి ఏమి ప్రయోజనం మనం అప్పటి వరకు ఘటోత్కచుడి ధాటీకి ప్రాణాలతో ఉంటే కదా! కనుక ఆ శక్తిని ఘటోత్కచుడి మీద ప్రయోగించు " అని కర్ణుడిని వత్తిడి చేసారు. ఆ సమయంలో ఘటోత్కచుడు గధతో కర్ణుని మీద కలబడి అతడి రధమును విరిచాడు. రధవీహీనుడై నిలబడిన కర్ణుడిని చంపడానికి గధ ఎత్తి నిలబడిన ఘటోత్కచుడి చేతిలో చావు తప్పదనుకుని గత్యంతరం లేని పరిస్థిలో మీద ఇంద్రుడు ప్రసాదించిన శక్తి ఆయుధమును ఘటోత్కచుడి మీద ప్రయోగించదలిచాడు. ఇంద్రదత్తమైన ఆ ఆయుధము మహా భయంకరమైంది. దానిని ప్రయోగించన తరవాత ఒక్కరిని మాత్రమే సంహరించి తిరిగి ఇంద్రుని వద్దకు చేరుతుంది. అర్జునుడి మీద ప్రయోగించాలని భద్రంగా ఉంచిన ఆ ఆయుధాన్ని కర్ణుడు ఘటోత్కచుడిని లక్ష్యంగా చేసి ప్రయోగించాడు. తన మీదకు దూసుకు వస్తున్న ఆ శక్తి ఆయుధాన్ని చూసి ఘటోత్కచుడు భయపడ్డాడు. ఆ శక్తి ఆయుధం ఘటోత్కచుడి మాయశక్తులను హరించి అతడి గుండెను చీల్చుకుంటూ బయటకు వెళ్ళింది. ఆ దెబ్బకు ఒక మహావీరుని ప్రాణాలు అనంతవాయువులలో కలిసాయి. కౌరవసేన ఆనందోత్సాహాలతో సింహనాదాలు చేస్తూ హర్షధ్వానాలు చేసారు. అందరూ కర్ణుడిని పలు విధముల శ్లాఘించారు. సుయోధనుడు పరుగు పరుగున వచ్చి కర్ణుని కౌగలించుకున్నాడు.

## ఘటోత్కచుని మరణానికి పాండవసేనలో స్పందన

ఘటోత్కచుడి మరణ వార్త విన్న పాండవులు కన్నీరు మున్నీరుగా విలపించారు. భీమసేనుడి దుఃఖముకు అంతు లేదు. కాని కృష్ణుడు రధము మీద నిలబడి నాట్యమాడసాగాడు. కేరింతలు కొట్టి సింహనాదం చేసి ఆనందంతో పాంచజన్యం పూరించారు. కృష్ణుడి విపరీత ప్రవర్తన చూసి అర్జునుడు ఆశ్చర్యపోతూ " కృష్ణా ! ఆపు ఏమిటిది మేమంతా ఘటోత్కచుడి మరణానికి విలపిస్తుంటే నీవు ఆనందంతో గంతులు వేస్తున్నావు. ఇక చాలు ఆపు ఎవరన్నా చూస్తే నవ్వుతారు " అన్నాడు ఈసడింపుగా. కాని కృష్ణుడు తన ఆనంద హేల ఆపక అలా పాడుతూ ఆనందంతో గెంతుతూ ఉన్నాడు. కాని అంతలో అర్జునుడు తెలివి తెచ్చుకుని కృష్ణునితో " కృష్ణా! నీవు అన్నీ తెలిసిన వాడివి. మహానుభావుడివి నీ వింత ప్రవర్తనకు ఏదో కారణం ఉంటుంది నాకు చెప్పవా " అన్నాడు. అని అనునయంగా అన్నాడు. కృష్ణుడు " అర్జునా! నీ తండ్రి నీ క్షేమము కోరి కర్ణుడి వద్ద నుండి కవచకుండలములు దానంగా పరిగ్రహించాడు. ఆ సమయంలో కర్ణుడికి ప్రతిగా ఒక మహత్తర శక్తిని కానుకగా ఇచ్చాడు. అది ఒక సారి ప్రయోగిస్తే ఒకరిని మాత్రమే చంపి తిరిగి ఇంద్రుని చేరగలదు. దానిని కర్ణుడు నిన్ను చంపడానికి మాత్రమే దాచాడు. కాని గత్యంతరం లేని పరిస్థితిలో దానిని కర్ణుడు ఘటోత్కచుడి మీద ప్రయోగించాడు. కనుక ఇక కర్ణుడు నిన్ను ఏమీ చేయ లేడు. అర్జునా! కర్ణుడు దైవాంశ సంభూతుడు సామాన్యుడు కాదు. అతడి వద్ద ఇంద్రుడు ఇచ్చిన శక్తి ఉన్నంత వరకు నా సుదర్శన చక్రము కాని నీ గాండీవం కాని ఏమి చేయలేదు. నీ తండ్రి కర్ణుడి కవచ కుండలములు పరగ్రహించకున్న అతడిని నీవే కాదు ముల్లోకాలలో ఎవరూ ఏమీ చేయ లేరు. అతడిప్పుడు సాధారణ మానవుడయ్యాడు కనుక అతడిని ఇక నీవు సులభంగా జయించ వచ్చు . ఇది నాకు సంతోషం కాదా! " అన్నాడు. నేను జరాసంధుని, శిశుపాలుని నీ కొరకు చంపించాను. వారు బ్రతికి ఉన్న సుయోధనుడితో చేరి నిన్ను ఎదుర్కొనేవారు. వారందరూ కర్ణుడితో కలిస్తే జయించుట అసాధ్యం. ఇక ఘటోత్కచుడు ఎంత భీముడి కుమారుడైనా రాక్షసవంశ సంజాతుడు. ధర్మద్వేషము, హరిద్వేషము అతడి నరనరాలలో జీర్ణించుకుని ఉంది. అతడు బ్రతికి ఉన్నా ఎప్పటికైనా నా మీద తిరగబడగలడు. అప్పుడు నేను చేయవలసిన పని ఇప్పుడు కర్ణుడు పూర్తి చేసాడు. నీవు నాకు అత్యంత ఆప్తుడవు నీ క్షేమమే నాకు ముఖ్యము. ఇక నీకు కర్ణుడు హాని చేయజాలడు. మన సైన్యములు అలసి ఉన్నాయి. వారికి కొంత విశ్రాంతినిచ్చి తిరిగి యుద్ధానికి ఉపక్రమించ వచ్చు " అన్నాడు.

## ధృతరాష్ట్రుని సందేహం

సంజయుడు ఘటోత్కచుడు మరణించిన వృత్తాంతం చెప్పగానే ధృతరాష్ట్రునికి ఒక అనుమానం వచ్చింది. " సంజయా ! మరి అంతప్రభావం కలిగిన శక్తిని తన వద్ద పెట్టుకున్న కర్ణుడు ఇంత కాలము అర్జునుడిని చంపకుండా ఎందుకు వదిలాడు. ఒక్కరిని మాత్రమే చంపగలిగిన శక్తి ఆయుధాన్ని అర్జునుడి మీద వేసి చంపితే యుద్ధం ఎప్పుడో ముగింపుకు వచ్చేది కదా! పాండవులు ఎప్పుడో యుద్ధం నుండి విరమించే వారు. మనలనువిజయలక్ష్మి వరించేది. ఇంత జన నష్టం తప్పి పోయేది కదా! యుద్ధానికి పిలిస్తే అర్జునుడు కర్ణునితో యుద్ధం చేయకపోతాడా ! కర్ణుడు ఇంత బుద్ధిహీనుడుగా ఎందుకు ఉన్నాడు. నా కుమారుడు కర్ణునికి ఎరందుకు గుర్తు చేయ లేదు అన్నాడు. అక్కడే ఉన్న నీవు కూడా ఎందుకు గుర్తు చేయ లేదు. చేతిలో ఉన్న మామిడి పండు తినడం మరచినట్లు ఉంది కదా! దీనికి మరేదైనా కారణము ఉందా " అని ధృతరాష్ట్రుడు ఆత్రంగా సంజయుని అడిగాడు. సంజయుడు " మహారాజా ! మేము గుర్తు చేయకుండా ఎందుకు ఉంటాము. ప్రతి రోజు మేమంతా సుయోధనుడితో కలసి మరునాడు నీవు శక్తి ఆయుధమును ప్రయోగించి అర్జునుడిని చంపాలి అని చెప్తూనే ఉన్నాము. కర్ణుడు కూడా అలాగే చంపుతానని అంటుండే వాడు. కాని మరునాడు యుద్ధ భూమిలో ప్రవేశించగానే కర్ణుడితో సహా మేమంతా ఆవిషయం మరచి పోతుంటాము. తిరిగి రాత్రి సమయంలో శిబిరాలకు చేరిన తరువాతగాని మాకు గుర్తుకు వచ్చేది కాదు. అది దైవమాయ కాక మరేమిటి చెప్ప అంతే కాదు. సుయోధనుడు " కర్ణా ! అర్జునుడిని మాత్రమే చంపితే కృష్ణుడు మనలనందరిని చంపి పాండునందనుడికి పట్టం కడతాడు. ఆ శక్తితో కృష్ణుడిని చంపితే మనం ఈ ధరాతలాన్ని ఏకచ్ఛత్రంగా పాలించ వచ్చు " అనే వాడు. కర్ణుడు అలాగే చంపుతాను అనే వాడు. కాని మరునాడు అంతా మరిచిపోయే వాడు అదేమి చిత్రమో. మరొక విషయము వినండి. ఘటోత్కచుడి మరణసమయాన శ్రీకృష్ణుడు రధము మీద నాట్యం చేసాడు కదా ! పాండవ శిబిరానికి వెళ్ళి చాటుగా ఉండి వారి మాటలు విన్నాను. కృష్ణుడు ప్రవర్తనకు కారణమేమిటని అర్జునుడు అడిగిన విషయం పక్కనే ఉన్న సాత్యకి విని " అన్నయ్యా ! కర్ణుడు ఇంత కాలము మహా శక్తిని ప్రయోగించి అర్జునుడిని ఎందుకు చంప లేదు " అన్నాడు. కృష్ణుడు " సాత్యకి ! సుయోధనాదులు ప్రతి రోజు ఆ శక్తి ఆయుధంతో అర్జునుడిని చంపమని చెప్తుండే వారు. నేను కర్ణుడు యుద్ధరంగమున ప్రవేశించగానే నా మాయలో పడవేసి అతడికి ఆశక్తి ఆయుధం గుర్తుకు రాకుండా చేసేవాడిని. ఆ కారణంగా కర్ణుడుఅర్జునుడి మీద ఆ శక్తి ప్రయోగించ లేక పోయాడు. సాత్యకీ ! నీ కంటే, ధృష్టద్యుమ్నుడి కంటే మిగిలిన పాడుసుతుల కంటే నాకు అర్జునుడంటే వల్లమాలిన ప్రేమ. అర్జునుడు నా బహిర్ప్రాణం ఇంత కాలం కర్ణుడి వద్ద ఉన్న శక్తి కారణంగా అర్జునుడికి ప్రమాదం పొంచి ఉన్నదని భయపడుతునే ఉన్నాను. నిద్రలేని రాత్రులు గడిపాను. ఇక నేను సుఖంగా నిద్రిస్తాను " అన్నాడని సంజయుడు ధృతరాష్ట్రునుకి చెప్పాడు. ధృతరాష్ట్రుడు " సంజయా ! దురదృష్టం సుయోధనుడిని వెన్నంటి ఉన్నప్పుడు మనమేమి చేయగలము " అన్నాడు.

## ఘటోత్కచుని మరణానికి ధర్మజుడు విలపించుట

ఘటోత్కచుడి మరణానికి దు:ఖంతో ధర్మరాజు రధము మీద కూలబడి రోదిస్తున్నాడు. కృష్ణుడు దగ్గరకు వెళ్ళి " ధర్మనందనా! ఏమిటీ వెర్రి. యుద్ధమున వీరులు మరణించరా ! అందుకు ఇంత చింతించ తగునా ! నీవిలా చింతించిన సైన్యమును నడుపగల వాడేవడు. నీ సోదరులను ఓదార్చగలవారెవరు లే వారిని ఓదార్చి యుద్ధసన్నద్ధులను చేయి " అన్నాడు. నీకు తెలియనిది ఏముంది ఘటోత్కచుడికి మేమంటే ఎంత ప్రేమాభిమానాలున్నాయో మమ్ము ఎంత గౌరవిస్తాడో. అరణ్యవాస సమయంలో మాకు ఎంత సహకరించాడు. నాకు ఘటోత్కచుని మీద సహదేవునికన్నా ప్రేమ ఎక్కువ. అటువంటి ఘటోత్కచుడు మరణుస్తే దు:ఖించక ఎలా ఉండగలను " అన్నాడు. అంతలోనే ఉగ్రుడై కృష్ణా ! దీనికంతటికి కారణం కర్ణుడు నాడు అభిమన్యుని విల్లు విరిచి అతడి మరణానికి కారణం అయ్యాడు. నేడు ఘటోత్కచుడిని స్వయంగా చంపాడు. కర్ణుడి మీద ప్రతీకారం చేయాలి. కర్ణుడికి సాయం చేసిన వాడు ద్రోణుడు నేను కర్ణుడిని చంపుతాను భీముడు ద్రోణుడిని చంపుతాడు " అంటూ తన రధమును వేగంగా ముందుకు నడిపాడు. కృష్ణుడు కలవరపడి అర్జునా ! అటు చూడు మీ అన్నయ్య కర్ణుడి మీద యుద్ధానికి పోతున్నాడు అతడిని అనుసరించు అన్నాడు. అలా వేగంగా పోతున్న ధర్మరాజు ఎదుటికి వ్యాసమహర్షి వచ్చాడు. ధర్మరాజు వ్యాసుడికి నమస్కరించాడు. వ్యాసుడు " ధర్మనందనా ! కర్ణుడు శక్తి ఆయుధాన్ని అర్జునుడిని చంపడానికి ఉంచాడు. అది ఇప్పుడు ఘటోత్కచుడి మీద ఉపయోగించబడింది లేకున్న అర్జునుడిని చంపి ఉండే వాడు. అది జరిగి ఉంటే నీ దు:ఖం వర్ణించనలవి కాదు. ఇప్పుడు నీవు కొద్ది ధు:ఖంతో బయటపడటం మంచికే జరిగింది. కనుక అకారణంగా కోపం తెచ్చుకొనక వివేకంగా ఆలోచించి నీ వారినందరిని కలుపుకొని యుద్ధం కొనసాగించు. ఇకొంక విషయం చెప్తాను. నేటికి సరిగా అయిదవ నాటికి నిన్ను విజయలక్ష్మి వరిస్తుణంది. దీనిలో సందేహం లేదు " అన్నాడు.

## ధర్మరాజు ద్రోణుని వధించమని సైన్యాలను పురికొల్పుట

వ్యాసుడు వెళ్ళిన తరువాత ధర్మరాజు మనసును కుదుటపరచుకుని ధృష్టద్యుమ్నుడితో " భీముడు ద్రోణుడితో యుద్ధం చేస్తున్నాడు. ఇక మీదట నీవు ద్రోణుడితో యుద్ధము చెయ్యి. నీవు ద్రోణుడిని చంపడానికే పుట్టావు. శిఖండిని పాంచాల సైన్యాలను వెంట తీసుకుని ద్రోణుడిని ఎదిరించు " అని చెప్పి మిగిలిన వారిని చూసి చూసి " విరాటరాజా ! ద్రుపద మహారాజా! సాత్యకీ ! నకుల సహదేవులారా! ఉపపాండవులారా! మన ముందున్న ఏకైక లక్ష్యం ద్రోణ వధ. పార్ధుని నాయకత్వంలో మీరంతా ద్రోణుడిని ఎదుర్కొనండి " అన్నాడు. అప్పటికే ఇరుపక్షముల సేనలు ఒక పగలు ఒకరాత్రి యుద్ధం చేసి అలసి పోయాయి. నిద్రమత్తులో క్షణం ఒక యుగంగాఉవస్థ పడుతున్నారు. నిద్ర మత్తులో తూలుతున్నారు. ఇది గమనించిన అర్జునుడు ఇరుపక్షముల యోధులను ఉద్దేశించి " సైనికులారా! మీరంతా బాగా అలసి పోయి ఉన్నారు. నిద్రావస్థతో జోగుతున్నారు. కనుక మీరంతా కొంతసేపు నిద్రపొండి. మరొక ఝాములో చంద్రోదయం ఔతుంది. చంద్రుడు వచ్చిన తరువాత వెన్నెల వెలుగులో మనమ్ము తిరిగి యుద్ధము చేస్తాము " అన్నాడు. ఈ సూచనకు ఇరుపక్షముల సైనికులు సంతోషంగా అంగీకరించారు. కౌరవ సైనికులు సహితము అర్జునుడి దయాగుణానికి శ్లాఘించారు. సైనికులంతా ఎక్కడి వారక్కడే నిద్రకు ఉపక్రమించారు. అలా నిద్రిస్తుండగా చంద్రోదయం అయింది. పండు వెన్నెల కాయగానే పాండవ కౌరవ సేనలు నిద్ర మేల్కొని యుద్ధానికి సిద్ధం అయ్యాయి.

### సుయోధనుడు ద్రోణుని నిందించుట

సుయోధనుడు ద్రోణాచార్యుని వద్దకు వెళ్ళి " ఆచార్యా ! నీవు చాలా గొప్పవాడవు, మహావీరుడవ నీముందు నిలువగలవారెవరు లేరు. కాని నీవు నీ శిష్యులైన పాండవులను చంపక వదిలి పెట్టడం నా దురదృష్టం కాక మరేమిటి ? " అన్నాడు. ఆ మాటలకు ద్రోణుడు కోపించి " సుయోధనా ! నీ ఉద్దేశం నేను పాండవులను నా శిష్యులని వదిలి వేస్తున్నాననే కదా ! ఖాండవ వన దహన సమయంలో అర్జునుడు అగ్నిదేవునికి సాయంగా ఉన్నప్పుడు. ఇంద్రుడు నా శిష్యుడనే అతడిని వదిలి వేసాడా ? నాడు ఘోషయాత్రా సమయాన చిత్రసేనుడు నిన్ను బంధీగా పట్టుకున్న సమయాన నీ కొరకు యుద్ధము చేసిన అర్జునుడిని చిత్రసేనుడు నా శిష్యుడనే వదిలాడా? కాలకేయులనే రాక్షసులు అర్జునుడు నా శిష్యుడనే అతడి చేతిలో మరణించారా ? అర్జునుడి పరాక్రమం తెలిసీ నన్ను నిందించడం తగదు " అన్నాడు. సుయోధనుడు " ఆచార్యా ! మీరు అవకాశం వచ్చినప్పుడల్లా అర్జునుడిని పొగుడుతూనే ఉన్నారు. మీరు అలాగే చేస్తూ పాండవులను అర్జునుడిని నాకు వదలండి. నేను కర్ణ, దుశ్శాసన, శకుని సాయంతో పాండవులను అంత మొందిస్తాను. మీరు మీకిష్టమైన వారితో యుద్ధము చేయండి " అన్నాడు. ఆ మాటలకు ద్రోణుడు నవ్వి " సుయోధనా ! అలాగే మీరు అర్జునిడి ని ఎదుర్కొనండి మీరే గెలుస్తారేమో ! నాకు మాత్రం అర్జునుడి చేతిలో మరణించే భయం పోగొట్టావు అంతే చాలు " అన్నాడు.

### ద్రోణుడు పాంచాల సేనను ఎదుర్కొనుట

తరువాత ద్రోణుడు పాంచాల సైన్యాంతో యుద్ధం చెయ్యడానికి వెళ్ళాడు. అప్పటికే తెల్లవారు ఝాము అయింది. సుయోధనుడు, కర్ణుడు, దుశ్శాసనుడు, శకుని ఒక్కసారిగా అర్జునుడిని ఎదుర్కొని అతడి మీద శరవర్షం కురిపించారు. మహా వీరుడైన ద్రోణుడు అతిరధ మహారధులతో యుద్ధం చేయక తమలాంటి సామాన్య సైనికులుతో యుద్ధం చెయ్యడమేమిటని పాంచాల సైనికులు ఆశ్చర్య పోతున్నారు. అంతటి మహావీరునితో యుద్ధము చేసి చచ్చినా పరవాలేదని కొందరు అతడిని ఎదుర్కొంటున్నారు. ఇంతలో విరాటరాజు, ద్రుపదుడు, అతడి మనుమలు, కేకయ రాజులు తమ సైన్యాలతో ద్రోణుడిని ఎదుర్కొన్నారు. ద్రోణుడు తన వాడి అయిన బాణాలతో పాంచాల మత్స్య సేనలను హతమార్చడమే కాక ద్రుపదుని మనుమలను ముగ్గురిని హతమార్చాడు. కేకయ రాజుల తలలను పండ్లు రాల్చినట్లు నేమీద పడ వేసాడు. అది చూసి విరాటుడు, ద్రుపదుడు వీరావేశంతో ద్రోణుడిని ఎదుర్కొన్నాడు. ద్రోణుడు వారిద్దరినీ అమిత పరాక్రమంతో ఎదుర్కొని వారిద్దరినీ చెరి ఒక బాణంతో నేల కూల్చాడు. తన తండ్రి మరణం కళ్ళారా చూసిన ధృష్టద్యుమ్నుడు " నేను కనుక ద్రోణుడిని చంపకపోతే నా కులాచారాన్ని ధర్మాలను తప్పిన వాడిని ఔతాను. అని ఘోర ప్రతిజ్ఞ చేసి పాంచాల సేనను తీసుకుని ద్రోణుడిని ఎదుర్కొన్నాడు. అది చూసి సుయోధనుడు కర్ణుడితో వచ్చి ధృష్టద్యుమ్నుడిని అడ్డుకున్నాడు. అంతలో భీమసేనుడు వచ్చి ధృష్టద్యుమ్నుడికి తోడుగా ద్రోణుడిని ఎదుర్కొన్నాడు.

### కురు పాండవ యోధుల సమరం

అప్పటికి సూర్యోదయం అయింది. ఇరు పక్షముల వారు కొంతసేపు యుద్ధము ఆపి కాలకృత్యములు తీర్చుకుని కొంత విశ్రాంతి తీసుకుని మరలా యుద్ధము చేయుటకు ఉపక్రమించారు. సుయోధనుడు నకులుడిని, దుశ్శాసనుడు సహదేవుడిని, ద్రోణుడు అర్జునుడిని, భీముడు కర్ణుడిని ఎదుర్కొని పోరాడుతున్నారు. సహదేవుడి సారధిని దుశ్శాసనుడు చంపాడు. సహదేవుడు తానే రధము తోలుకుంటూ దుశ్శాసనుడి హయములను గాయపరిచాడు. ఆ దెబ్బకు దుశ్శాసనుడి హయములు దుశ్శాసనుడిని రధముతో సహా ఎటో లాక్కెళ్ళాయి. భీముడు కర్ణుడు పదునైన బాణములతో ఒకరిని ఒకరు ఎదుర్కొన్నారు. తరువాత గధాయుద్ధము చేసారు. తిరిగి కర్ణుడు తన విల్లు తీసుకుని భయంకరమైన బాణములతో భీముని రధమును విరిచాడు. భీముడు సహదేవుడి రధము మీదకు దూకాడు. ద్రోణుడు అర్జునుడు ఒకరి మీద ఒకరు బాణ ప్రయోగం చేసుకుంటున్నారు. ఒకరు ప్రయోగించిన అస్త్రముకు వేరొకరు ప్రత్యస్త్రము ప్రయోగించుకుంటున్నారు. ఎవరు ఎప్పుడు ఏ అస్త్రము ప్రయోగించారో తెలియక చూసే వారు ఆశ్చర్యపోతున్నారు. ఈ విధంగా గురుశిష్యులు ఘోరయుద్ధము సాగిస్తున్నారు. ఆకాశం నుండి వీరి యుద్ధం చూస్తున్న దేవతలకు పరమేశ్వరుడు రెండు రూపాలుగా విడి పోయి ఒకరితో ఒకరు తలపడి వినోదిస్తున్నాడా ! అన్నట్లు ఉంది. ద్రోణుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించడానికి నియమ నిష్టలతో మంత్రజపం చేసాడు. దేవతలు భయంతో వణికి పోయారు. దిక్కులు కంపించాయి. సముద్రాలు పొంగాయి. అది ఏమీ లక్ష్యపెట్టని ద్రోణుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. అర్జునుడు బెదరక బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి దానిని ఉపసంహరించాడు. రెండు బ్రహ్మాస్త్రాలు ఒకదానిని ఒకటి ఢీకొని నిర్వీర్యం అయిపోయాయి. ఒకరితో ఒకరు యుద్ధము సేసి ప్రయోజనము కవిపించక అర్జునుడు కౌరవ సేనల వైపు ద్రోణుడు పాంచాల సేనల వైపు వెళ్ళి పోయారు. అప్పుడు దుశ్శాసనుడు ధృష్టద్యుమ్నుడిని ఎదుర్కొని అతడి అస్త్రధాటికి తట్టుకొన లేక పారి పోయాడు. నకుల సహదేవులు వెంట రాగా ధృష్టద్యుమ్నుడు ద్రోణుడి వైపు వెళ్ళాడు. సుయోధనుడు సాత్యకి ఎదురుపడ్డారు. వారిరువురు చిన్ననాటి స్నేహితులు. కొంతసేపు విరోధము మరచి రధములు పక్కపక్కన నిలిపి చిన్న నాటి చిలిపి పనులు ఆనాటి కబుర్లు బాల్యం గుర్తు తెచ్చుకుని పొంగిపోయారు. ఒకరితో ఒకరు యుద్ధం చేయవలసిన పరిస్థితి తీసుకు వచ్చిన క్షత్రియ ధర్మం గురించి తలచుకుని బాధపడి తప్పదు కనుక కొంతసేపు యుద్ధము చేద్దాము అనుకుని యుద్ధము చేయసాగారు. మిత్రత్వము మరచి శత్రువుల వలె యుద్ధము చేయసాగారు. సాత్యకి సుయోధనుడి విల్లు విరిచి అతడి శరీరాన్ని తూట్లు పొడిచాడు. సుయోధనుడు అలసి పోయి యుద్ధరంగం నుండి తొలగి పోయి కొంతసేపు విశ్రాంతి తీసుకుని తిరిగి వచ్చి సాత్యకిని ఎదుర్కొన్నాడు. సుయోధనుడికి సాయంగా కర్ణుడు సాత్యకిని ఎదుర్కొన్నాడు. అది చూసి భీముడు కర్ణుడితో పోరు సాగించాడు. కర్ణుడు భీముని సారధిని మూర్చిల్లజేసి భీముని విల్లు విరిచాడు. భీముడు తన గధ గిరగిరా తిప్పి కర్ణుడి రధము మీద విసిరాడు. ఆ గధ పోయి కర్ణుడి సారధి తల పగుల గొట్టి కర్ణుడి రధాన్ని ముక్కలు చేసింది. కర్ణుడు మరొక రధము ఎక్కి యుద్ధము చేయసాగాడు.

### ద్రోణుడి మరణం

ధర్మరాజు మత్స్య పాంచాలసేనలు వెంటరాగ ద్రోణుడి మీదకు యుద్ధానికి సన్నద్ధం అయ్యాడు. అప్పటికి రెండు ఝాముల పొద్దు ఎక్కింది. నకుల సహదేవులు భీముడు అర్జునుడిని చూసి " అర్జునా ! ఇక్కడ ద్రోణుడు మన సేనలను అంతమొందిస్తున్నాడు. నీవు అతడికి సాయంగా ఉన్న కౌరవ సేనలను తరుముతుండు. అప్పుడు ద్రోణుడు ఒంటరిగా

చిక్కుతాడు. పాంచాల సేన అతడిని అంతమొందిస్తుంది " అని అరుస్తూ ద్రోణుడిని ఎదుర్కొన్నారు. ద్రోణుడు తనకు అడ్డం వచ్చిన సైనికులను హతమారుస్తూ వేలాది సైనికులను చంపుతున్నాడు. ధర్మరాజు భీముడు నకుల సహదేవులు నిస్సహాయంగా చూస్తూ " ద్రోణుడు ఈ రోజు చెలరేగి పోతున్నాడు. ఇలా వదిలేస్తే ఈ రోజు పాండవసేనలను అంతమొందించి మనలను కూడా అంతమొందించి సుయోధనుడికి పట్టం కట్టేలా ఉన్నాడు. ఇతడిని నిలువరించడం మన తరం కాదు. నిలువరించ తగిన అర్జునుడు గురువును చంపుట పాపమని ఉపేక్షిస్తున్నాడు " అనుకున్నారు.

## ద్రోణుడు అస్త్రసన్యాసం చేయుటకు శ్రీకృష్ణుడు మార్గం చెప్పుట

వారు పడుతున్న మధన గమనించిన కృష్ణుడు రధమును వారి వైపు మళ్ళించి ధర్మరాజాదులు వినేలా " అర్జునా ! ద్రోణుడు తన చేత ధనస్సు ఉన్నంత వరకు అతడిని మానవ మాత్రులే కాదు దేవదానవులు కూడా ఎదుర్కొన లేరు. ద్రోణుడు అస్త్రసన్యాసం చేయాలంటే ఒకటే మార్గం " అశ్వత్థామ చని పోయాడు " అని చెపితే ద్రోణుడు అస్త్రసన్యాసం చేస్తాడు. అప్పుడు ద్రోణుడు అస్త్ర సన్యాసం చేస్తాడు. అప్పుడు మీరు అతడిని సులభంగా చంపవచ్చు. కనుక అశ్వత్థామ చపోయాడని ఎవరైనా అతడికి చెప్పాలి " అన్నాడు. అది విని భీముడు వెంటనే పోయి మాళవరాజు ఏనుగైన అశ్వత్థామను చంపి వెనక్కు వచ్చి " ఆచార్యా ! అశ్వత్థామ చనిపోయాడు " అని చెప్పాడు. ద్రోణుడి మనస్సు ఒక్కసారి ఝల్లు మంది. అయినా తన కుమారుడి బలపరాక్రమాలు తలచుకుని భీముడి మాట నిర్లక్ష్యం చేసాడు. అయినా మనస్సులో అనుమానం వేదిస్తూనే ఉన్నా ధృష్టద్యుమ్నుడి మీద శరవర్షం కురిపించసాగాడు. అయినా భరించరాని వ్యధతో పది వేల మంది పాంచాల సైన్యాలను వధించాడు. మత్స్యదేశ సైన్యంలో అయిదు వందల రధములను విరిచి పదివేల గజములను, పదివేల హయములను విరిచాడు. ద్రోణుడు మధ్యందిన మార్తాండునిలా వెలుగ సాగాడు.

## మహామునులు ద్రోణునికి శాంతించమని చెప్పుట

ఇంతలో విశ్వామిత్రుడు, జమదగ్ని, భరద్వాజుడు, గౌతముడు, కశ్యపుడు, వశిష్టుడు ఇంకా ఇతర మునులు తమ దివ్య రూపాలతో వచ్చి " ఓ భరధ్వాజా! నీవు బ్రాహ్మణ వంశ సంజాతకుడవు. వేదవేదాంగ విదుడవు ఇలా క్షాత్ర ధర్మం వహించి యుద్ధము చేయుట తగునా ! ఇప్పటి వరకు చేసిన సంహారం చాలు నీకు కాలం పూర్ణంగా తీరిపోయింది. మా మాట మన్నించి యుద్ధము చేయుట ఆపి శాంతి వహించు " అన్నారు. ద్రోణుడికి ఒక్క సారిగా భీముడు అశ్వత్థామ మరణించాడని చెప్పిన మాట గుర్తుకు వచ్చింది. అవకాశం కొరకు ఎదురు చూస్తున్న ధృష్టద్యుమ్నుడిని చూసాడు. మనసు వికలమైంది. దు:ఖం ముంచుకు వచ్చింది. అయినా సంశయం తీర్చుకోవడానికి అశ్వత్థామ మరణం నిజమేనా అని ధర్మజుని అడిగాడు. ధర్మజుడు అసత్యం పలుకడని ద్రోణుడి నమ్మకం. కృష్ణుడు ధర్మజునితో " మనం ద్రోణుడిని ఇలా వదిలితే సాయంత్రానికి మన సైన్యాలను ద్రోణుడు అంతమొందించడం ఖాయం. మమ్ము ద్రోణుని అస్త్రధాటి నుండి రక్షించడానికి నీవు అసత్యం ఆడక తప్పదు. ప్రాణరక్షణకు సత్యమాడటం అధర్మము కాదని ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నాయి " అన్నాడు. భీముడు " అన్నయ్యా ! నీవు అసత్యం పలుక పని లేదు. కృష్ణుని మాట వినగానే నేను మాళవరాజు ఏనుగైన అశ్వత్థామను చంపి ఆ మాట ద్రోణుడికి చెప్పాను. కాని ద్రోణుడు నా మాట నమ్మ లేదు. నీవు కూడా అదే చెప్పు నీవు చెప్పిన ద్రోణుడు అస్త్రసన్యాసం చేయగలడు. మన హితవు కోరి కృష్ణుడు చెప్పిన మాట మన్నించు " అన్నాడు. కృష్ణుడు, భీముడు చెప్పిన మాటలు ధర్మజుని మీద ప్రభావం చూపాయి. వెంటనే ద్రోణుడి వద్దకు వెళ్ళి " ఆచార్యా! అశ్వత్థామ మరణించాడు " అని పెద్దగా చెప్పి అది ఒక ఏనుగు అని మెల్లగా చెప్పాడు. ధర్మరాజు నోట అశ్వత్థామ మరణించాడు అన్న మాట విన్న తరువాత ద్రోణుడికి మరొక మాట వినిపించ లేదు.

## ద్రోణుడిలో పరివర్తన

ద్రోణుడు అలాగే రధము మీద వాలి పోయాడు. ద్రోణునిలో పరివర్తన మొదలైంది. తాను పాండవుల చేసిన పాపాం తలచుకుని కుమిలి పోయాడు. ఋషులు మాటలు చెవుల్లో మారు మోగుతున్నాయి. తాను ఎంతో మంది అమాయకులైన సైనికులను నిర్దాక్షిణ్యంగా చంపాడు. తన పాపానికి నిష్కృతి లేదు. ఇలా అనుకుని పైకి చూడగానే ఎదురుగా ధృష్టద్యుమ్నుడు అవకాశం కొరకు ఎదురు చూస్తుండటం చూసి అతడితో యుద్ధము చేయాలను ఉన్నా చేతులు రాలేదు. ధనుర్బాణాలు చేతి నుండి జారాయి. అతడిలో ఉన్న యుద్ధనిష్ఠ, శౌర్యము, గర్వము నశించాయి. తన కుమారుడు మరణించాడు అన్న దు:ఖం అతడిని కుంగదీసింది. అతడి అవయవములు ముడుచుకు పోయి అలాగే రధము మీద కూర్చుండి పోయాడు. ద్రోణవధ కొరకు అగ్ని నుండి జన్మించిన ధృష్టద్యుమ్నునికి ద్రోణుడిని వధించాలి అన్న కోరిక బలీయంగా కలిగి అతడి మీద శరవర్షం కురిపించాడు. ద్రోణుడికి యుద్ధం చేయాలని ఉన్నా దివ్యాస్త్రములు స్ఫురణకు రాక మామూలు బాణాలతో ధృష్టద్యుమ్నుడి బాణాలు

ఖండిస్తూ ధృష్టద్యుమ్నుడి రథమును, ధ్వజమును ఖండించి, సారథిని చంపాడు. ధృష్టద్యుమ్నుడు రథము నుండి దిగి గధను తీసుకున్నాడు. ద్రోణుడు ఆ గధను తన బాణములతో ఖండించాడు. ధృష్టద్యుమ్నుడు కత్తి డాలు తీసుకుని ద్రోణుని మీదకు ఉరికి అతడి హయములను, సారధిని చంపాడు ద్రోణుడు తన బాణములతో ధృష్టద్యుమ్నుడి కత్తిని ఖండించాడు. ఆ సమయంలో సాత్యకికర్ణుడు, కృపాచార్యుడు, కృతవర్మలతో యుద్ధము చేస్తున్నాడు. దూరం నుండి ఇది గమనించి పది బాణము ద్రోణుడి మీద వేసాడు. భీముడు తన రథము మీద వచ్చి ధృష్టద్యుమ్నుడిని తన రథము మీద ఎక్కించుకుని తీసుకు వెళ్ళాడు. ద్రోణుడు అతడిని పోనీలే అని వెంబడించక వదిలాడు.

### ద్రోణుడు ప్రశాంతిని పొందుట

ఇప్పుడు ద్రోణుడి మనస్సు ప్రశాంతమైంది. తన రథము మీద కూర్చుని యోగ నిమగ్నుడయ్యాడు. మనసులో శాంతి పొంది చుట్టూ చూసాడు. " ఓ కర్ణా! ఓ కృతవర్మా ! ఓ సుయోధనా ! మీరు నన్ను యుద్ధం చేయడం లేదని ఎత్తి పొడుస్తూనే ఉన్నారు. అయినా నేను నా చేతనైనంత యుద్ధం చేసాను. ఇంక నిశ్చింతగా పైలోకాలు చేరుకుంటాను. నేను నా ధనుర్బాణాలు విడిచి అస్త్రసన్యాసం చేస్తున్నాను. మీరంతా ఇకనైనా తెలివిగా ప్రవర్తించండి " అని ఎలుగెత్తి అరిచాడు. ద్రోణుడు తన ధనుర్బాణాలు రథము మీద వదిలి తేజోమయమైన ఆత్మతో వెలుగొందు తున్నాడు. ఆ సమయంలో ధృష్టద్యుమ్నుడు కత్తి తీసుకుని ద్రోణుడి వైపు నడిచాడు. అది చూసి ఉభయసైన్యాలు హాహాకారాలు చేసాయి. కాని అప్పటికే ద్రోణుడి ప్రాణాలు అనంతవాయువులలో కలిసి పోయాయి. అతడి ఆత్మ జ్యోతి రూపంలో పైకెగసి పరమాత్మను చేరుకుంది. అతడి ఆత్మ తేజో రూపంతో పకి వెళ్ళడం నేను, కృపాచార్యుడు, కృష్ణుడు, అర్జునుడు, ధర్మరాజు మాత్రమే చూసాము. మిగిలిన వారికి అది గోచరించ లేదు. ఇంతలో ధృష్టద్యుమ్నుడు కత్తి తీసుకుని ద్రోణుని రథము ఎక్కి అతడి జుట్టు పట్టుకుని మెడ నరకడానికి కత్తి పైకి ఎత్తాడు. వద్దు, వద్దు అని అర్జునుడు అరుస్తున్నా, అది ధర్మవిరుద్ధమని ధర్మజుడు ఎంత అరచినా వినక అతడి తలను నరికి మొండెమును నుండి తలను వేరుచేసి నేల మీదికి వేసాడు.


ధ్యాననిమగ్నుడై ఉన్న ద్రోణుడి దేహం నుండి వచ్చిన ఆత్మ దివ్యలోకములకు ప్రయాణించుట

## అశ్వత్థామకు తండ్రి మరణం ఎరిగించుట

కౌరవ సైన్యము సైన్యాధ్యక్షుడి మరణంతో కలత చెంది ఉన్న తరుణంలో పాండవసేన విజృంభించి కౌరవసేనలను ఎదుర్కొని తరిమింది. పాండవ సేనల ధాటికి ఆగలేని కౌరవ సేనలు పారిపోసాగాయి. నీ కుమారులు వారిని వెంబడించారు. కృతవర్మ, కృపాచార్యుడు, కర్ణుడు, శకుని మొదలైన వారంతా వెనుతిరిగి చూస్తూ పోతూ పోతూ వారు " ఎంత ఘోరం జరిగింది. ఏమి చేయాలో తోచక ఉంది. ఈ నరమేధం ఇక ఆగదా " అనుకున్నారు. వేరొక చోట యుద్ధము చేస్తున్న అశ్వత్థామ కౌరవ యోధులు వెనుదిరుగుతూ తిరోగమించడం చూసి సుయోధనుడిని సమీపించి " సుయోధనా ! మన సైన్యాలకు ఏమైంది ఇలా వెనుకకు చూసుకుంటూ పరుగెడుతున్నారు? కృపాచార్యుడు, కర్ణుడు ఎందుకింత మ్లానవదనులై ఉన్నారు " అని అడిగాడు. సుయోధనుడు బదులు పలుక లేక పోయాడు. దు:ఖంతో మాట రాక అశ్వత్థామకు తండ్రి మరణం గురించి ఎలా చెప్పాలి అనుకుంటున్నాడు.

### కృపాచార్యుడు అశ్వత్థామకు తండ్రి మరణ వార్త ఎరిగించుట

కృపాచార్యుడు అశ్వత్థామకు తండ్రి మరణ వార్తను ఇలా చెప్పాడు. " కుమారా ! నీ తండ్రి పాంచాలసేనలో చాలా పెద్ద మొత్తాన్ని చంపుతున్నాడు. పాండవులు ఎలాగైనా నీ తండ్రిని చంపాలనుకున్నారు. భీముడు నీ తండ్రి వద్దకు పోయి అశ్వత్థామ మరణించాడు అని అబద్ధం చెప్పాడు. నీ తండ్రి అతడి మాట నమ్మక యుద్ధం చేస్తూనే ఉన్నా సందేహం తీర్చుకోవడానికి ధర్మజుడు అబద్ధం చెప్పడని నమ్మకంతో అతడిని నిజం చెప్పమని అడిగాడు. అంతకు ముందే భీముడు అశ్వత్థామ అనే ఏనుగును చంపడం వలన ధర్మరాజు కూడా అశ్వత్థామ చనిపోయినట్లు చెప్పాడు. ఆ మాట వినగానే నీ తండ్రి అస్త్రసన్యాసం చేసి యోగసమాధిలోకి వెళ్ళాడు. అప్పుడు ధృష్టద్యుమ్నుడు నీ తండ్రి రథము మీదకు దూకి నీ తండ్రి తల

తెగనరికాడు. అర్జునుడు ధర్మరాజు వద్దని అది ధర్మము కాదని ఎంత అరచినా వినలేదు. నీ తండ్రి మరణించగానే మాకు కాళ్ళు చేతులు ఆడలేదు. మనసైన్యాలు భయపడి పారిపోతున్నాయి. కాని నాకు ఇదంతా కృష్ణుడు ఆడించిన నాటకం అనిపిస్తుంది. లేకున్న భీముడికి ఇన్ని తెలివితేటలు లేవు. ధర్మరాజు ఇంతటి అధర్మానికి ఒడిగట్టడు " అన్నాడు.

### తండ్రి మరణానికి అశ్వత్థామ ప్రతి స్పందన

కృపాచార్యుడు చెప్పినది ప్రశాంత చిత్తతంతో విన్న అశ్వత్థామ " మామా ! కృపాచార్యా ! జాతస్య మరణం ధృవం. పుట్టిన వానికి మరణం తప్పదు. పైగా యుద్ధం చేస్తుంటే మరణం వెన్నంటి ఉంటుంది. కాని లోకారాధ్యుడైన నా తండ్రిని నీరాయుధుడై యోగసమాధిలో ఉన్న సమయాన జుట్టు పట్టుకుని మెడ నరకడమే బాధాకరంగా అవమానకరంగా ఉంది. సుయోధనా నాకు నా తండ్రి ప్రసాదించిన దివ్యాస్త్రాలు, నా అస్త్ర విద్య నాతండ్రిని కాపాడు కోవడానికి పనికి రాలేదు. నా గురువు, నా దైవం , నా పితృదేవుడు అలా దిక్కు మాలిన చావు చస్తుంటే ఆపలేక పోయాను. సుయోధనా ! దీనికి కారణం ధర్మరాజు పేరుకు ధర్మరాజు చెప్పినది అసత్యం. అతడిని అంతమొందించిన కాని నా మనస్సు శాంతించదు. సుయోధనా నా తండ్రి కుమారుని కన్నది అవసానదశలో ఇలా అవమానం పొందడానికా ! ఇదిగో ఇదే నా ప్రతిజ్ఞ. దేవతలు అడ్డుపడినా సరే ఆ కృష్ణుడే అడ్డుపడినా నేను పాండవులను సంహరిస్తాను " అన్నాడు. సుయోధనా ! నా పరాక్రమం నేను చెప్పకో కూడదు. నా తండ్రికి జరిగిన అవమానం తట్టుకోలేక ఇలా అన్నాను. ఇప్పుడు కాకున్న ఎప్పుడైనా ఎలాగైనా నేను పాండవులను వధించి తీరతాను " అన్నాడు. తిరిగి అశ్వత్థామ " సుయోధనా ! నా తండ్రి శ్రీమన్నారాయణుడిని ఆరాధించి నారాయణాస్త్రం పొందాడు. దానిని నా తండ్రి నాకు ప్రసాదించాడు. ఆ అస్త్రం వారు వీరు అన్న తేడా లేకుండా అందరిని హతమార్చి విధ్వంసాన్ని సృష్టిస్తుంది. నేను ఇప్పుడు నారాయణాస్త్రం ప్రయోగించి శత్రువులను గెలుస్తాను " అన్నాడు. అది విన్న సుయోధనుడు ఆనంద పడి తన వారినందరిని సమాయత్త పరచి శంఖం పూరించాడు. అది చూసి ధర్మరాజాదులు యుద్ధానికి సమాయత్తమయ్యారు.

## పాండవ సేనలో కలకలం

ధర్మరాజు అర్జునుడితో " అర్జునా ! ద్రోణుడు మరణించగానే చెదిరి పోయిన కౌరవసేన తిరిగి యుద్ధానికి సమాయత్తం కావడం ఆశ్చర్యంగా ఉంది. ఇందుకు కారణం ఏమిటి. కౌరవసేనలో ఆనందం మిక్కుటంగా ఉంది. మనము ద్రోణుడిని చంపామని ఆగ్రహించి నీ తండ్రి ఇంద్రుడు దేవసైన్యంతో మనమీదకు యుద్ధానికి వచ్చాడా ! " అన్నాడు.

### అర్జునుడు ధర్మరాజాదులకు అశ్వత్థామ గొప్పదనాన్ని తెలుపుట

అర్జునుడు ధర్మరాజుతో " అన్నయ్యా ! అస్త్రసన్యాసం చేసిన ఆచార్యుని అధర్మంగా వధించిన వారిని అశ్వత్థామ వదిలుతాడా ! అతడి వద్ద దివ్యాస్త్ర సంపద ఉంది. అతడు సహజంగా మహాద్భుత శౌర్య సంపన్నుడు. ఈ సమయంలో అతడిని ఎదుర్కొనుట చాలా కష్టం. అన్నయ్యా ! అశ్వత్థామ పుట్టగానే ఉచ్చైశ్రవము మాదిరి సకిలించాడట. అప్పుడు ఆశరీరవాణి అందరూ వింటుండగా ఆ బాలుడు అశ్వత్థామ అనే పేరోతో వర్ధిల్లగలడు అని పలికిందట. ఇప్పుడు కౌరవ సేన విజృంభణకు అశ్వత్థామయే కారణం. ఎప్పుడూ పాపం చేసి ఎరగని ఓ ధర్మరాజా ! నిన్ను తన శిష్యుడని, అసత్యం పలుకుతావని, ధర్మం తప్పని వాడివని అత్యంత ఆదరంతో ద్రోణుడు తన కుమారుడి మరణం గురించి అడిగాడు. కాని నీవు ధర్మహానికి తలపడి అశ్వత్థామ మరణించాడని అసత్యం పలికావు. అది నమ్మి ద్రోణుడు అస్త్రసన్యాసం చేసాడు. ఇంత అధర్మానికి పాల్పడి రాజ్యం సంపాదించడం అవసరమా ! లోకం దూషించదా ! ఇందు వలన పొందిన సంపద మనకు ఆనందాన్ని ఇస్తుందా ! అది అధర్మము, వద్దు అని మనం అరుస్తున్నా వినక ఆ ధృష్టద్యుమ్నుడు ద్రోణుడి జుట్టు పట్టుకుని తల నరకవచ్చా ! అది అధర్మం కాదా ! మనం ఇలా ధర్మ విరుద్ధమైన పనులు చేసిన అతడి కుమారుడు అశ్వత్థామ మనపై ఆగ్రహించి యుద్ధం చేయక మానుతాడా ! మన సేనలను సర్వనాశనం చేయడానికి అశ్వత్థామ ఉగ్రుడై వస్తున్నాడు సిద్ధం ఉండండి. అయినా అతడి బారి నుండి ధృష్టద్యుమ్నుడిని కాపాడటం నీకూ నాకే కాదు మరెవరి తరం కాదు " అన్నాడు.

### పాండవ యోధుల మధ్య వాద ప్రతివాదాలు

అర్జునుడి మాటలను విని భీముడు కోపంతో ఊగిపోతూ " అర్జునా ! నీవు వీరుడివా ! లేక ఋషిపుంగవుడివా! ఏమిటీ పిరికి మాటలు. గురువును చంపడం మహాపాపమని మన సైన్యాలను ధ్వంశం చేస్తున్న ద్రోణుడిని నీవు వదలడం న్యాయమా ! యుద్ధరంగమున ప్రవేశించిన పిదప గురుశిష్య సంబంధాలు, బంధు మిత్ర అభిమానాలు వదిలి నిష్పక్షపాతంగా యుద్ధము చేయాలని రాజనీతి ఘోషిస్తున్నా నీవు రాజధర్మాన్ని తప్పి ద్రోణుడిని వదలడం ధర్మమా ! కౌరవులు అధర్మవర్తనులు కారా!

నిండు కొలువులో శీలవతి అయిన ద్రౌపదిని వలువలు ఊడ్చి అవమానించిన నీతి బాహ్యులకు వారికి సహకరించి యుద్ధము చేస్తున్న వారికి ఇలాంటి ఎన్ని అధర్మములు చేసినా మనకు పాపం అంటదు. అర్జునా ! మనలను ఎదుర్కోడానికి వస్తున్న శత్రువులను జయించడం ఎలా అని మేము ఆలోచిస్తుంటే నీవిలా పిరికి మాటలు మాట్లాడటం ధర్మమా ! అర్జునా ! నేనేమిటో నా పరాక్రమము ఏమిటో సుయోధనుడికి తెలుసు. మన మీదకు వస్తున్న వారిని సర్వ నాశనం చేయక వదలను " అని భీముడు రోషంతో పలికాడు.

### ధృష్టద్యుమ్నుడి వాదం

అప్పుడు ధృష్టద్యుమ్నుడు అర్జునుడితో " అర్జునా ! నీ గురువు ద్రోణుడు మాత్రం అధర్మం చేయలేదా ! కేవలం చేత ఉన్న ఆయుధములు తప్ప ఇతర ఆయుధ ప్రయోగం తెలియని, యుద్ధ ప్రక్రియలు తెలియని వారు, అస్త్రశస్త్రములు ఎరుగగని వారు, బలహీనులు అయిన సాధారణ పాంచాల సైనికుల మీద దివ్యాస్త్ర ప్రయోగం చేసి వేలకొలది సైనికులను క్షణకాలంలో హతమార్చుట ధర్మమా !. అది క్రూరత్వము కాదా ! నిర్దయ కాదా ! అర్జునా ! నేను ద్రోణుడిని చంపుటకు అగ్ని నుండి ఉద్భవించాను. చంపాను ఇందు పాప పుణ్యముల ప్రసక్తి లేదు అంతే. అర్జునా ! నీవు చేసినదేమిటి ? నీ తండ్రికి మిత్రుడైన భగదత్తుని చంపలేదా ! శిఖండిని అడ్డుపెట్టుకుని తాతను పడగొట్ట లేదా ! నీ మీద యుద్ధము చేయని వారిని చంపుట ధర్మమా ! నా తండ్రిని చంపి నా పాంచాల సేనలను చంపి నన్ను ఎదుర్కొన్న ద్రోణుడిని చంపుట అధర్మమా ! ఇదెక్కడి ధర్మమయ్యా ! ధర్మరాజు చేసినది అధర్మం కాదు. అతడు చేసినది పాపం కాదు. అతడి పలికినది అసత్యము కాదు. అశ్వత్థామ అనే ఏనుగును భీముడు చంపాడు. ఆ విషయం చెప్పి తన సైన్యమును రక్షించుకున్నాడు. నేను తన శిష్యులను వంచించిన ద్రోణుడిని చంపి నా సైన్యాలను రక్షించుకున్నాను. ద్రోణుని వధతో నీ మార్గం నిష్కంటకం అయింది. శత్రువులను జయించి విజయలక్ష్మిని వరించు " అని నిర్ద్వందంగా పలికాడు. ధృష్టద్యుమ్నుని మాటలకు ద్రోణుని వధ కలిగించిన దుఃఖంతో పెల్లుబుకుతున్న అశ్రువులతో అర్జునుడు " ధృష్టద్యుమ్నా! చాలు ఇక ఇలాంటి అసహ్యకరమైన మాటలు కట్టి పెట్టు. చేసింది చాలక ఇంకా దానిని సమర్ధించుకుంటున్నావా ! " అన్నాడు.

## సాత్యకి ధృష్టద్యుమ్నుల రోషావేశాలు

ధృష్టద్యుమ్నుని మాటలకు సాత్యకి కోపించి " ఔను ధృష్టద్యుమ్నా! నీవు చేసింది ముమ్మాటికీ అధర్మమే ! నీవు ఇన్ని మాటలు అన్నా నీ నాలుక చీలక నీ తల పగలక ఉంది అంటే అది ధర్మరాజు నీ పక్కన ఉండుటయే ! ఇక ఒక్క మాట అన్నా నేను అన్నది జరుగుతుంది. భీష్ముడిని చంపటానికి శిఖండి జన్మించాడు. చంపాడు అతడికి అర్జునుడు తోడున్నాడు అంతే ! భీష్ముడు తనను పడగొట్టమని అది అర్జునుడే చేయాలని ధర్మరాజుకు చెప్పాడు. అదే విధంగా ధర్మరాజు అర్జునుడిని, శిఖండిని ఆదేశించాడు. అది భీష్ముని ఇష్టానుసారం జరిగింది. ఓ ధృష్టద్యుమ్నా! నీవు, శిఖండి పాంచాల వంశాన పుట్టి ఆ వంశానికి కళంకం తెచ్చారు " అన్నాడు. ఆ మాటలకు ధృష్టద్యుమ్నుడు నవ్వి " ఓ సాత్యకీ ! నీవా నాకు నీతులు చెప్పేది. అర్జునుడు భూరిశ్రవసుడి చేతిని నరికిన తరువాత నీవు ప్రయోపవేశం చేసిన అతడిని చంప లేదా ! మహావీరుడవైన నీకిది ధర్మమా ! వివేక హీనుడా ! భూరిశ్రవసుడు నీ మీద నిలిచి చంపడానికి కత్తి దూసినప్పుడు నీ వీరత్వము ఏమైంది. ప్రాయోపవేశం చేసిన భూరిశ్రవసుడి తల నరకడం అధర్మము కాదా ! నీ తప్పు తెలుసుకుని ఎదుటి వారి తప్పులు ఎంచు. ద్రోణుడు ఎన్ని సార్లు మనలను ఎదుర్కొన్నాడు. అప్పుడు నీవు ఎక్కడ ఉన్నావు ? ఏమి చేస్తున్నావు? ఎందుకు ఎదిరించ లేదు ? నీవు భూరిశ్రవసుడిని చంపిన పరిస్థిలో నేను ద్రోణుడిని చంపాను. నీకు అంటని పాపాపం నాకు అంటదు. అంతటి పరాక్రమశాలి ద్రోణుడిని చంపినందుకు అభినందించవలసినది పోయి తప్పు పట్టడం న్యాయమా! ఓ సాత్యకీ ! నీవు అనవసరంగా నా విషయంలో జోక్యం చేసుకుని నాకు కోపం తెప్పిస్తున్నావు. ఇంకొక్క మాట మాట్లాడితే నీ తల పగుల కొడతాను. మనం పాండవుల తరఫున యుద్ధం చేయ వచ్చాము. మన ధర్మం మాత్రం నిర్వర్తిస్తాము రా " అన్నాడు. ఆ మాటలకు సాత్యకి రోషావేశ భరితుడై రధము మీద ఉన్న గధను చేతబట్టాడు. ఇది అంతా వినోదంగా చూస్తున్న కృష్ణుడు సాత్యకిని ఆపడానికి భీముని పంపాడు. వెంటనే భీముడు రధము దిగి వెళ్ళి సాత్యకిని కదల కుండా పట్టుకున్నాడు. ఇంతలో సహదేవుడు అక్కడకు వచ్చి " యాదవులు పాంచాలురు మాకు బంధువులు. మాకు కావలసిన వారే. మీలో మీరు ఇలా తగవులాడితే శత్రువులు మనలను చూసి హేళన చేస్తారు. తగవులు మానండి " అన్నాడు. ధృష్టద్యుమ్నుడు " భీమా ! సాత్యకిని ఆపవద్దు రానివ్వు ఏమి చేస్తాడో చూస్తాను. అతడి పొగరు అణుస్తాను నేనేమి చెయ్యి తెగిన భూశ్రవసుడిని కాదు అతడి చేతిలో చావడానికి " అన్నాడు. ఇక కొనసాగించడం మంచిది కాదని భావించిన కృష్ణుడు, ధర్మరాజు పోయి వారికి సర్ది చెప్పారు. ఇంతలో ఇరుపక్షముల యుద్ధభేరీలు మ్రోగాయి. ఇరు పక్షాలు యుద్ధసన్నద్ధమైయ్యాయి. ద్రోణుడిని జయించిన ధైర్యంతో పాండవ సేనలు, అశ్వత్థామ ఇచ్చిన ధైర్యంతో కౌరవసేన తలపడ్డాయి.

## అశ్వత్థామ నారాయణాస్త్రం ప్రయోగించుట


నారాయణాస్త్రం ప్రయోగించుచున్న అశ్వత్థామ

అశ్వత్థామ నారయణాస్త్రాన్ని ధ్యానించి విల్లు సంధించాడు. నారయాణాస్త్రాన్ని పాండవసేనల మీద ప్రయోగించాడు. ఆ అస్త్రధాటికి భూమి దద్దరిల్లింది. దిక్కులు పిక్కటిల్లాయి. సముద్రములు పొంగాయి. ఆ దివ్యాస్త్రం నుండి అనేక ఆయుధములు పుట్టి పాండవ సేన మీదకు వస్తున్నాయి. పాండవ సేన దానిని శాయశక్తులా ఎదుర్కొంటున్నారు. కాని దాని ధాటికి తాళ లేక పోతున్నారు. నారయణాస్త్రం పాండవ సేనను నాశనం చేస్తుంది. అది చూసి ధర్మరాజు అర్జునుడి వంక చూసాడు. అర్జునుడు మాటాడ లేదు. ధర్మరాజు అర్జునుడు, కృష్ణుడు వినేలా ధృష్టద్యుమ్నుడు సాత్యకులతో ఇలా అన్నాడు. " ఆ ద్రోణుడు ఎంత క్రూరుడంటే నాడు నిండు కొలువులో ద్రౌపదిని అవమానిస్తుంటే చూస్తూ ఊరుకున్నాడు కాని ఒక్క మాట అన లేదు. బాలుడైన అభిమన్యుని మరణానికి కారణమయ్యాడు. సూర్యాస్తమయం అయితే అర్జునుడు అగ్ని ప్రవేశం చేయాలని తెలిసీ మనలను అర్జునుడికి సాయంగా వెళ్ళ నీయక అడ్డుకున్నాడు. మరి అలాంటి ధర్మపరునితో మనం సరి తూగగలమా ! ఈ నారాయణాస్త్ర సాక్షిగా చెప్తున్నాను. మీరంతా పారి పోయి మీ ప్రాణాలను దక్కించుకొండి. అప్పుడు అర్జునుడు కోరిక నెరవేరుతుంది. శ్రీకృష్ణుడేమి చేస్తాడో ఆయన ఇష్టం " అని నిష్టూరంగా అన్నాడు. ఇక కృష్ణుడు ఊరక ఉండలేక రధము మీద నిలబడి " ఓ సైనికులారా ! పాండవ వీరులారా ! భయపడకండి. మీరంతా మీ మీ రధములు వాహనములు గజములు హయములు దిగి ఆయుధములు కింద పడవేయండి. నారాయణాస్త్రానికి ఇదే విరుగుడు. వేరు ఉపసంహారం లేదు " అన్నాడు.

## నారాయణాస్త్రాన్ని భీముడు ఎదుర్కొనుట

శ్రీకృష్ణుడి మాటలకు సైనికులు తమ తమ వాహనములు దిగుతుండగా భీముడు " మహా వీరులారా ఆగండి వాహనములు దిగకండి వీరోచితంగా పోరాడండి. నేను ఉన్నాను, మహాస్త్రాలను ప్రయోగిస్తాను, నా గధతో అందరిని గెలుస్తాను " అని ఎలుగెత్తి అరచి తన గధ తీసుకుని అశ్వత్థామ మీదకు ఉరికాడు. అశ్వత్థామ నారాయణాస్త్రాన్ని భీముని మీదకు మళ్ళించాడు. భీముని మాట వినక అందరూ తమతమ వాహనములు దిగి ఆయుధములు కింద పెట్టారు. ఆ నారాయణాస్త్రము వారిని విడిచి ఆయుధధారి అయిన భీముని వెంటబడింది. అది చూసి భీముడు వారుణాస్త్రాన్ని ప్రయోగించాడు. వారుణాస్త్ర ప్రభావానికి నారాయణాస్త్రం శక్తి కొంత తగ్గింది. వెంటనే అశ్వత్థామ దాని శక్తిని పెంచాడు. ఆ నారాయణాస్త్రం భీముడిని భీకర అగ్నిజ్వాలలను విరజిమ్ముతూ చుట్టుముట్టింది. అది గమనించిన కృష్ణార్జునులు తమ ఆయుధములను రధము మీద ఉంచి రధము దిగి భీముని రధము వద్దకు పరుగెత్తి అతడిని రధము మీద నుండి కిందకు దించుటకు ప్రయత్నించారు. భీముడు రధము దిగక మూర్ఖంగా అలాగే ఉన్నాడు. అప్పుడు కృష్ణుడు " భీమసేనా ! మహా వీరా! ఈ అస్త్రమును ఉపసంహరించే శక్తి అశ్వత్థామకు కూడా లేదు. దీనికి ఆయుధములు కింద పెట్టడమే విరుగుడు. నా మాట విని ఆయుధములు విడిచి రధము దిగవయ్యా " అంటూ కృష్ణుడు బతిమాలుతూ భీముని చేతి నుండి ఆయుధములు లాగాడు. అర్జునుడు, కృష్ణుడు కలసి ఒక్క తోపుతో రధము నుండి కిందకు తోసారు. ఇక పాండవ సైన్యంలో ఎవరి చేతా ఆయుధములు లేక పోయే సరికి ఆ ఆయుధము శాంతించి వెను తిరిగింది. వెంటనే అందరిని ఆయుధములు ధరించి యుద్ధముకు సిద్ధం కమ్మని కృష్ణుడు ఆదేశించడంతో పాండవసైన్యం తిరిగి కౌరవ సైన్యంపై విజృంభించింది.

## సుయోధనుడు నారాయణాస్త్రాన్ని తిరిగి ప్రయోగించమని అశ్వత్థామకు చెప్పుట

అప్పుడు సుయోధనుడు " గురు పుత్రా ! నారాయణాస్త్రమును తిరిగి ప్రయోగింపుము " అన్నాడు. అశ్వత్థామ సుయోధనా ! రారాజా ! ఈ నారాయణాస్త్రం ఒక్క సారే ప్రయోగించాలి రెండవ సారి ప్రయోగిస్తే ప్రయోగించిన వారిని సంహరిస్తుంది. నారాయణుడు నా తండ్రికి ఈ అస్త్రమును ఇచ్చినప్పుడు అలాగే ఆదేశించాడు. యుద్ధములో వాహనములు దిగి ఆయుధములు కింద పెట్టడం మరణించుటతో సమమే కదా! అందుకని వాహనములు దిగి ఆయుధములు కింద పెట్టిన వారిని ఆ అస్త్రం ఏమీ చేయదు. శ్రీకృష్ణుడికి ఆ విషయం తెలుసు కనుక తన వారిని రక్షించుకున్నాడు. ఇక మనమేమి చేయగలము చెప్పు " అన్నాడు. సుయోధనుడు " అశ్వత్థామా ! పోనీలే. నారాయణాస్త్రం నిరుపయోగమైనంత మాత్రాన

నిరుత్సాహపడవలసిన పని లేదు. మన వద్ద ఇంకా దివ్యాస్త్రాలు ఉన్నాయి కదా! వాటిని ఉపయోగించి పాండవులను గెలుస్తాము " అన్నాడు. అశ్వత్థామ అవును సుయోధనా ! అలాగే చేద్దాము.

## అశ్వత్థామ పాండవులను ఎదుర్కొనుట


అర్జునునిపై ఆగ్నేయాస్త్రమును ప్రయోగించిన అశ్వత్థామ

అని పాండవుల మీదకు యుద్ధానికి బయలుదేరాడు. యుద్ధభూమిలో అశ్వత్థామకు ధృష్టద్యుమ్నుడు కనపడగానే కోపంతో ఊగిపోయాడు. తన నిశిత బాణాలతో ధృష్టద్యుమ్నుడి రధమును కూల్చి, అశ్వాలను చంపాడు. అతడి విల్లు తుంచి, కేతనమును విరిచాడు. ఇంతలో సాత్యకి ధృష్టద్యుమ్నుడికి సాయం వచ్చాడు. అశ్వత్థామ ఒకే బాణంతో సాత్యకిని మూర్చపోయేలా కొట్టాడు. తరువాత ధృష్టద్యుమ్నుడిని మూర్చిల్లజేసి విజయోత్సాహంతో సింహనాదం చేసాడు. అది చూసి భీమార్జునులు అశ్వత్థామను ఎదుర్కొన్నారు. వారికి తోడుగా చేది దేశపురాజు సుదర్శనుడు, వృద్ధక్షత్రుడు వారికి సాయంగా వచ్చారు. అశ్వత్థామ తన పదునైన బాణాలతో వృద్ధక్షత్రుడిని, సుదర్శనుడిని తలలు నరికివేసాడు. అశ్వత్థామ ఎక్కడ చూసినా తానే అయి యుద్ధము చేస్తున్నాడు. అశ్వత్థామ పరాక్రమానికి పాండవ సేనలు పారిపోతున్నాయి. భీమార్జునులు తమ శాయశక్తులా పాండవ సేనలకు ధైర్యం చెప్తున్నారు. అర్జునుడు అశ్వత్థామ మీద నిశిత శరములు ప్రయోగించాడు. అశ్వత్థామ కోపించి ఆగ్నేయాస్త్రాన్ని అర్జునుడి మీద ప్రయోగించాడు. ఆ అస్త్రం అగ్ని జ్వాలలను విరజిమ్ముతూ అర్జునుడి మీదకు వచ్చి త్రుటికాలంలో పాండవుల సైన్యం ఒక అక్షౌహినిని నాశనం చేసింది. కౌరవ ప్రముఖులంతా కృష్ణార్జునులతో సహా ఆగ్నేయాస్త్రానికి బలి కాగలరు అనుకుని జయజయధ్వానాలు చేసారు. కాని అర్జునుడు తన వద్ద ఉన్న బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి ఆగ్నేయాస్త్రాన్ని నిర్వీర్యం చేసాడు. కృష్ణార్జునులు శంఖనాదం చేసారు. పాండవ సేనలు జయజయధ్వానాలు చేసారు. అప్పటి వరకు జయధ్వానాలు చేసిన కౌరవసేనలు ఇది చూసి పారిపోయాయి. అశ్వత్థామ పరాభవంతో తలదించుకున్నాడు. తన చేతిలోని దివ్యాస్త్రాలను కింద వేసి. నాకు దివ్యాస్త్ర బలం లేదని తెలిసి పోయింది. సిగ్గు మాలి ఇంకా ఎందుకు యుద్ధం చేయడము. వెంటనే యుద్ధం మాని వేస్తాను " అని మనసులో అనుకుని రధము దిగి పాదచారి అయి యుద్ధభూమిని విడిచి పోతున్నాడు.

## వ్యాసుడు అశ్వత్థామకు నరనారాయణుల గురించి వివరించుట


అశ్వత్థామను సాంత్వన పరుస్తున్న

అశ్వత్థామ కొంత దూరం పోగానే వ్యాసుడు ఎదురు వచ్చాడు. అశ్వత్థామ వ్యాసమహామునికి వినయంగా నమస్కరించి " మునీంద్రా ! నాదొక సందేహం నేను సంధించిన ఆగ్నేయాస్త్రం మహిమాన్వితమైంది. దేవదానవులు, గంధర్వులు కూడా దాని ముందు నిలువలేరు. కాని సామాన్యమానవులైన కృష్ణార్జునులను అది ఏమీ చేయ లేక పోయింది ఎందుకని " అని అడిగాడు. అందుకు వ్యాసుడు " ఓ అశ్వత్థామా ! పూర్వం నారాయణుడు లోకములు రక్షించుటకు నారాయణ మునిగా అవతరించాడు. నారాయణ ముని తపస్సు చేయుటకు మైనాక పర్వతానికి వెళ్ళాడు. అక్కడ శివుని గురించి ఘోర తపస్సు చేసాడు. ఆ తపస్సుకు మెచ్చి మహాశివుడు నారాయణునికి ప్రత్యక్షం అయ్యాడు. నారాయణుడు మహాశివుని అనేక విధముల స్తోత్రం చేసి " మహేశ్వరా ! నిన్ను ఎల్లప్పుడూ భక్తితో భజించు నాకు అనన్య సులభమైన ప్రభావము నొసగుము " అని అడిగాడు. అందుకు శివుడు సంతసించి నీవు, నర, సుర, గంధర్వ, గరుడ, కిన్నర, ఉరగ మొదలైన భూతకోటిని అవలీలగా గెలువగలవు. పరమ తేజోవిరాజమానుడవై ఉండగలవు. నీకు ఏ అస్త్రముతోగాని, శస్త్రముతోగాని, అగ్నితోగాని, జలముతోగాని, తడి వస్తువుతోగాని, పొడి వస్తువుతోగాని, స్థావరజంగములతోగాని, వజ్రాయుధముతోగాని బాధగాని చావుగాని ఉండవు. ఒక వేళ నేనే నీ మీదకు యుద్ధానికి వచ్చినా నన్ను కూడా జయింపగలవు " అని

వ్యాసుడు

వరము ఇచ్చాడు. కనుక నారాయణుడు అజేయుడు. అశ్వత్థామా ! నారాయణుడు తపస్సు చేసుకుంటున్న సమయమున అతడి తేజస్సు నుండి పుట్టిన వాడు నరుడు. వారు నరనారాయణులుగా ప్రసిద్ధి చెందారు. వారిద్దరూ విష్ణ్వంశ సంభూతులు. వారిరువురు మహాఋషులు. నారాయణుడు తన లీలతో జగన్మోహనుడై విహరిస్తూ దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేస్తుంటాడు. ఈ మహాత్ములు ఇద్దరూ దానవులను వధించుటకు ధర్మసంస్థాపనకు అవసరమనిపించినప్పుడల్లా అవతరిస్తుంటారు. నారాయణుడే కృష్ణుడు, నరుడే అర్జునుడు.

### అశ్వత్థామకు నరనారాయణులకు కల తారతమ్యము

ఓ అశ్వత్థామా! నీవు కూడా తపస్సు , తేజస్సు, విద్య, విభవము కలిగిన దేవతా మూర్తివే. నీకు నారాయణునికి కల అంతరమును చెప్తాను విను. నీవు మృత్తికతో ఒక మూర్తిని చేసి పరమాత్మను ఆవహింపజేసి అత్యంత భక్తితో నిష్టతో పూజించావు. కాని నారాయణుడు ఆ గౌరీపతిని లింగాకృతిలో పూజించారు. ఏవిధంగా పూజించినా సర్వకామ్య సాధకమే అయినా లింగాకృతిలో పూజించుట ప్రతిమా కృతిలో పూజించుట కంటే అనేక రెట్లు ఎక్కువ. కనుక పరమాత్ముని లింగాకృతిలో పూజించిన నరనారాయణులను ప్రతిమాకృతిలో పూజించిన నీవు గెలువ లేవు. మీరు గతజన్మలో సేసిన అర్చనలో కల తారతమ్యము వలన మీ మధ్య ఈ తేడా సంభవించింది కనుక అనుభవించక తప్పదు " అన్నాడు. అశ్వత్థామ పులకాంకితుడై మనసులో పరమేశ్వరుడిని భక్తితో ధ్యానించాడు. వ్యాసుడికి నమస్కరించి తిరిగి తన రధము వద్దకు వచ్చి రధము ఎక్కాడు. కాని అప్పటికే సాయం సమయం అయింది కనుక ఆ రోజుకు యుద్ధము చాలించమని సుయోధనుడికి చెప్పాడు. పాండవ సేనలు మంగళతూర్యములతో కౌరవసేనలు విషణ్ణవదనాలతో తమతమ శిబిరాలకు వెళ్ళారు.

## అర్జునుడు వ్యాసుని తన సందేహం తీర్చని కోరుట

అశ్వత్థామను వదిలి వ్యాసుడు అర్జునుడి శిబిరానికి వెళ్ళాడు. సాక్షాత్తు ధర్మమూర్తి అయిన వ్యాసునికి అర్ఘ్యపాద్యాలు ఇచ్చి సత్కరించిన అర్జునుడు భక్తితో నమస్కరించి తన మనస్సులో మెదులుతున్న సందేహం వ్యాసుని ముందు బయట పెట్టాడు. " వ్యాస మునీంద్రా ! నేను రణరంగమున యుద్ధం చేస్తున్నప్పుడు నా ముందు ఒక ఆకారం పాదములు నేలకంటకుండా అగ్నిదేవునిలా వెలుగుతూ తన చేతిలో ఉన్న శూలముతో నేను చంపబోయే వారిని ముందుగా తానే చంపుతున్నాడు. ఆశూలము నుండి అనేకనేక శూలములు ఉద్భవించి శత్రుసంహారం చేస్తున్నాయి. ఆ తేజోమూర్తి చంపుతున్న వారిని నేను నామ మాత్రంగా నా బాణములతో చంపుతున్నాను. నేను చంపుతున్నట్లే ఉన్నా నిజానికి నేను ఎవరిని చంప లేదు. కాని వారిని చంపిన కీర్తి విజయం మాత్రమే నాకు దక్కాయి. ఆ మహానుభావుడు ఎవరు ? అలా ఎందుకు చంపుతున్నాడు "అని అడిగాడు.


అరునునికి శివుని మహిమను గురించి చెబుతున్న వ్యాసుడు

### వ్యాసుడు అర్జునుడి సందేహం నివృత్తి చేయుట

అర్జునుడి మాట విన్న వ్యాసుడు " అర్జునా ! అతడు ఆదిమధ్యాంత రహితుడు, సృష్టికి మూలకర్త, ఈ లోకములకు అన్నింటికి ప్రభువు, అవ్యయుడు, వేదమూర్తి, భక్త పరాధీనుడు, త్రినేత్రుడు, పార్వతీ పతి అతడే. యోగీశ్వర హృదయ విహారి, ప్రకృతీ అతడే, పురుషుడూ అతడే, భక్త సులభుడు, నిరాకారుడు, నీలఖంటుడు, నిత్యుడు, సత్యస్వరూపుడు, ప్రళయాగ్నిని తన చల్లని కిరణములతో చల్లార్చగల బాల చంద్రుని శిరోభూషణముగా కలవాడు. నిర్మలుడు, సర్వాంతర్యామి, శాంతి ప్రియుడు అయ్న రుద్రుడే నీ ముందు నిలిచి నీకు బదులుగా ముందుగా సంహార క్రియ గావిస్తున్నాడు " అని ఇంకా తనివి తీరక ఆ పరమేశ్వరుని లీలలు విపులంగా వర్ణించాడు. " ఓ అర్జునా ! ఆ పరమ శివుడు నీ సన్నిధిలో ఉండి నిన్ను కరుణించాడు. పేదకు పెన్నిధి దొరికినట్లు నీకు ఈశ్వరకటాక్షం లభించింది. నీవు ధన్యుడివి. ఆ పరమేశ్వర అనుగ్రహంతో నీవు విజయుడివి ఔతావు. సాక్షాత్తు ఆ పరమశివుడే నీకు ముందుగా శత్రుసంహారం చేస్తుంటే విజయం నీకు కాక వేరెవరికి లభిస్తుంది. నీ తపస్సుకు మెచ్చి పాశుపతము ప్రసాదించిన పశుపతి తనివి తీరక తన భక్త పరాధీనతను నిరూపించుకున్నాడు. నీవు పుణ్యాత్ముడవు. ఆ

పరమేశ్వరుని ఆత్మలోనిలిపి ధ్యానించిన నీకు సకల సౌభాగ్యములు ఆయురారోగ్యములు కలిగి సకల అభీష్టములు నెరవేరగలవు " అన్నాడు. అర్జునుడు పరమేశ్వరునికి భక్తితో నమస్కరించి తరువాత వ్యాసునికి ప్రమాణం చేసి భక్తితో అతడి ఆశీర్వచనములు పొందాడు. ఆ తరువాత వ్యాసుడు అక్కడి నుండి వెల్లాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠిరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

---

# కర్ణ పర్వము

వికీపీడియా నుండి

**కర్ణ పర్వము**, మహాభారతం ఇతిహాసంలోని ఎనిమదవ భాగము. ఆంధ్ర మహాభారతంలో ఈ భాగాన్ని తిక్కన అనువదించాడు.

కర్ణుని నాయకత్వంలో జరిగిన కురుక్షేత్ర సంగ్రామం ఈ పర్వం కథాంశం

## విషయ సూచిక



## సంస్కృత మహాభారతం

## ఆంధ్ర మహాభారతం

## విశేషాలు

## మూలాలు

## బయటి లింకులు

- కిశోరీ మోహన్ గంగూలి ఆంగ్ల అనువాదం (http://www.sacred-texts.com/hin/m01/index.htm)

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • **కర్ణ పర్వము** • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

---

# కర్ణ పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# ప్రథమాశ్వాసం

సంజయుడు రెండు రోజులు యుద్ధరంగమున పర్యటించి యుద్ధ విశేషములు ధృతరాష్ట్రుడికి చెప్పుటకు హస్థినకు వచ్చి ధృతరాష్ట్రుడికి వర్తమానం పంపాడు. ధృతరాష్ట్రుడు వెంటనే సంజయుని లోపలకు రమ్మని చెప్పాడు. సంజయుడు ధృతరాష్ట్రుడితో " మహారాజా ! రెండు రోజుల పాటు యుద్ధరంగమున పర్యటించి యుద్ధమును చూసి వచ్చాను. నేను చూసినది మీకు విన్నవిస్తాను " అన్నాడు.

## ధృతరాష్ట్రుడు కర్ణ దుశ్శాసనుల మరణం గురించి వినుట

సంజయుడు " మహారాజా ! కర్ణుడు అత్యంత పరాక్రమంతో పాండవసేనని చెదరగొట్టాడు. రెండు రోజులు పాండవసేనలను హడలగొట్టి చివరకు అర్జునుడి పరాక్రమానికి తలవంచి అతడి చేతిలో ప్రాణములు విడిచాడు. మదించిన ఆంబోతు పెద్ద పులికి ఆహారమైనట్లు అర్జునుడికి కర్ణుడు బలి అయ్యాడు. పాండవుల పగ చల్లారింది " అని చెప్పి తాను కూడా దు:ఖించాడు. ఒక నిట్టూర్పు విడిచి " మహారాజా ! ఇంకొక విషాద వార్త నీ కుమారుడి ఆశ అడుగంటి పోయేలా భీమసేనుడి చేతిలో దుశ్శాసనుడు హతుడయ్యాడు. భీమసేనుడు నీ కుమారుడి గుండెలు చీల్చి అతడి రక్తము తాగాడు. భీముడు నాడు నిండు సభలో చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాడు. మహారాజా ! మీ వంతు వచ్చిన రాజ్యభాగమును మీరు అనుభవించక దురాశతో పాండుసుతుల రాజ్యం అపహరించ వలెనని మీరు చేసిన అకృత్యములకు ఫలితం అనుభవించక తప్పతుందా " అన్నాడు.

### దుశ్శాసనుడి మరణవార్త నిని ధృతరాష్ట్రుడు మూర్చిల్లుట

దుశ్శాసనుడు మరణించాడు అని వినగానే సుయోధనుడు కూడా మరణించాడని తలచి ధృతరాష్ట్రుడు శరీరం కంపించగా మూర్చిల్లాడు. అప్పుడు అక్కడకు వచ్చిన విదురుడు సేవకుల సాయంతో ధృతరాష్ట్రుని శయ్యపై చేర్చి శైత్యోపచారాలు చేసారు. కొంతసేపటికి తేరుకున్న ధృతరాష్ట్రుడు తమకు ఈ దుస్థితి కల్పించిన విధిని తిట్టుకున్నాడు. కన్న కుమారులను అదుపులో పెట్టలేని తన అసమర్ధతను నిందించుకున్నాడు. పాడుసుతుల ధర్మనిరతిని, నీతిని మెచ్చుకున్నాడు. ఇంతటి వినాశనానికి కారణమైన శకునిని తిట్టాడు. తరవాత సంభాళించుకుని " సంజయా ! నీవు చెప్పినది సరిగా విన లేదు. సుయోధనుడు క్షేమమే కదా! లేక అతడు కూడా మరణించాడా " అన్నాడు. " మహారాజా ! రెండు రోజుల యుద్ధములో కర్ణుడు అతడి తమ్ములు కుమారులతో సహా మరణించాడు. భీమసేనుడు నీ కుమారుని దుశ్శాసనుడిని సంహరించి అతడి గుండెలు చీల్చి నెత్తురు తాగాడు. ఆ దృశ్యం చూడడానికి అసహ్యంగా, భయంకరంగా ఉంది " అని సంజయుడు చెప్పగానే " ఆపు సంజయా ! ఇక చాలు ఊరుకో నా మనసు కలత చెంది ఉంది. నీ మాటలు వినే స్థితిలో లేను " అన్నాడు ధృతరాష్ట్రుడు. సంజయుడు కొంత సేపు మౌనం వహించాడు. ధృతరాష్ట్రుడు తిరిగి " సంజయా ! నేను అనుసరించిన దుర్నీతి వలన సుయోధనుడి బుద్ధి హీనత వలన ఇలా జరిగింది. నాకు కలిగిన దు:ఖం ఉపశమించడానికి మార్గము కనిపించ లేదు. ఇరు పక్షములలో

మరణించిన వారెవరు. జీవించి ఉన్న వారెవరు " అని అడిగాడు.

## ధృతరాష్ట్రుడు ఇరుపక్షాలలో మరణించిన జీవించి ఉన్నవారి గురించి తెలుసుకొనుట

సంజయుడు " మహారాజా ! మన పక్షమున భీష్మ, ద్రోణ, కర్ణ, వికర్ణ, వృషసేన, దుశ్శాసన, లక్ష్మణులు మరణించారు. వారిలో విరాజుడు, శతానీకుడు, విరాటుడు, ద్రుపదుడు, అభిమన్యుడు, ఘటోత్కచుడు, పాండ్యరాజులు మరణించారు " అన్నారు. ధృతరాష్ట్రుడు " సంజయా ! ప్రస్తుతం కురుసేనలో ఉన్న యోధులు ఎవరు " అని అడిగాడు. సంజయుడు " మహారాజా ! కౌరవసేనలో కృతవర్మ, శల్యుడు, శకుని, కృపాచార్యుడు, ఇంకా నీకుమారులు కొంత మంది కర్ణుడి కుమారులు కొంత మంది బ్రతికి ఉన్నారు. వీరి సాయంతో నీ కుమారుడు పాండవులను జయించగలను అని ధైర్యము వీడక ఆశతో ఉన్నాడు. ధృతరాష్ట్రుడు ఊరట చెంది " సంజయా ! మదించిన ఆంబోతువలె ఉన్న కర్ణుడు అర్జునుడి చేతిలో చావడం ఆశ్చర్యంగా ఉంది. కృష్ణార్జునులను ఇసుమంత కూడా లక్ష్యపెట్టని కర్ణుడు వారిని గెలుస్తానని చెప్తూనే మరణించాడు. ఈ కర్ణుడి అండ చూసుకునే కదా నా కుమారుడు పాండవులతో వైరము పెంచుకున్నది. అలాంటి కర్ణుడే లేనప్పుడు సుయోధనుడికి బ్రతుకెక్కడ. రేపటి నుండి యుద్ధము ఎలా చేయగలడు. ఇక యుద్ధము చేయడం వృధా.

### ధృతరాష్ట్రుని నిరాశ

సంజయా ! ఇన్ని వార్తలు విన్న తరువాత కూడా నా గుండె పగలేదంటే ఇది గుండేనా లేక పాషాణమా ! నా బ్రతుకు చూసావా ! నా కుమారులు మనుమలు చనిపోయారని విని శిలలా ఉన్నాను. ఇక నా వల్ల కాదు. ఎక్కడైనా దూకుతాను లేకపోతే విషం తాగుతాను. లేకున్న ప్రాయోపవేశం చేస్తాను. ఇంతటి వార్తలు వింటూ బ్రతకడం వృధా " అంటూ బలవన్మరణానికి పాల్పడ్డాడు. సంజయుడు " మహారాజా ! ఏమిటీ వెర్రి. నీ లాంటి చక్రవర్తి మనోధైర్యం సడలి ఇలా బేలగా మారవచ్చా. నీవు చదివిన చదువులు నీ గొప్పదనం ఒక్క సారి గుర్తుకు తెచ్చుకుని ధైర్యంగా ఉండు " అన్నాడు. సంజయా ! కర్ణుడి మరణం నాలో నిరాశ మిగిల్చింది. ఇక నా కుమారుడు ఎవరున్నారన్న ధైర్యంతో యుద్ధం చేస్తాడు. అంతటి కర్ణుడు మరణించాక మనం ఇక ఓడిపోతాము అన్న భావన కలిగి నాలో నిరాశ ఆవహించింది. భయపడకు అయినా నేను చావనులే అంత త్వరగా చచ్చే వాడినే అయితే నా కుమారుడు దుశ్శాసనుడు, కర్ణుడు చనిపోయారన్న మాట విన్నప్పుడే నా గుండె ముక్కలైయ్యేది. నాకిక దీర్ఘాయువే. ఒకప్పుడు అందరి గౌరవ మర్యాదలను అందుకున్న నేను ఇక నన్ను చూసి జాలి పడే వారి జాలి చూపులు ఎదుర్కో వలసిన దుర్దశ దాపురించింది. వారి జాలి చూపులు నేను భరించ లేను. అయినా భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, దుశ్శాసనుడు ఒకరి తరువాత ఒకరు మరణిస్తుంటే నేను ఎలా తట్టుకుంటాను . కర్ణుడి చావు నాకు ఆశా నిపాతం అయింది. సుయోధనుడు గెలుస్తాడు అనుకోవడం ఇక అడియాస కదా ! మన సాహసాలు కోల్పోయాము కదా ! సుయోధనుడు గెలుస్తాడని అనుకోవడమిక కుంటి వాడు నడుస్తాడని అనుకోవడమే. ముసలి వాడు పడుచు వేశ్యల కొరకు ఆశపడటమే కదా ! సంజయా ! అనాడు ధర్మరాజు మనలో మనకు కలహం ఎందుకు సామరస్యంగా ఉంటాము అని వర్తమానం పంపినా మూర్ఖత్వంతో తిరస్కరించాను. ఇప్పుడు అనుభవిస్తున్నాను. భీష్ముడు శరతల్ప గతుడైన సమయాన అర్జునుడు భూగర్భ జలమును తెచ్చాడు. అతడి ప్రతిభ చూసి భీష్ముడు యుద్ధము మాని సంధి చేసుకొమ్మని అన్నప్పుడైనా విని ఉంటే ఇప్పుడీ దుర్గతి పట్టక పోను.

### ధృతరాష్ట్రుడు కర్ణుడి మరణానికి ఆశ్చర్యపడుట

సంజయా! గతజలసేతు బంధనమేల ! అసలు కర్ణుడు ఎలా చనిపోయాడు ? అర్జునుడు కపటోపాయంతో భీష్ముని చంపినట్లు కర్ణుడిని చంపడానికి కూడా కపటో పాయం పన్నాడా ! మన సైనికిలు వీరులూ కర్ణుని రక్షించడానికి ప్రయత్నించ లేదా ! కర్ణుడిని వంటరిగా వదిలి అందరూ పారిపోయారా ! సంజయా ! కర్ణుడు సామాన్యుడు కాదు. పరశురాముడి శిష్యుడై బ్రహ్మాస్త్రం పొందాడు , సర్పముఖ శాస్త్రం తెలిసిన వాడు. దివ్యాస్త్ర బల సంపన్నుడు, బహుముఖ ప్రజ్ఞాశాలి, ఉపాయశాలి. ఆ ఉపాయంతోనే అభిమన్యుడిని చంపాడు కదా ! అసురవీరుడూ, మాయావీ, నిశాచరుడు, యుద్ధవిద్యా నిపుణుడు అయిన ఘటోత్కచుని సంహరించిన వాడు. నకుల సహదేవుల గెలిచి వదిలిన వాడు. అతడి దివ్యాస్త్రాలు ఏమయ్యాయి. అవి నశించాయా ! లేక నిష్ప్రయోజనం అయ్యాయా ! అతడి రధము విరిగి పోయిందా ! సంజయా ! అతడి సారధి శల్యుడు ఏమి చేస్తున్నాడు. అర్జునుడు కర్ణుని చంపుతున్నప్పుడు శకుని, కృపాచార్యుడు, అశ్వత్థామ ఏమి చేస్తున్నారు. కృతవర్మను సుయోధనుడు ఎక్కువగా అభిమానిస్తుంటాడు. అతడు కూడా కర్ణుడిని కాపాడటానికి రాలేదా ! నా కుమారుడు సుయోధనుడు ఏమి చేస్తున్నాడు. అశ్వత్థామ, శకుని, కృపాచార్యుడు, కృతవర్మలు వెంట ఉండగా నిష్కారణంగా కర్ణుడు ఎలా చచ్చాడు. పాండవులు కర్ణుని మీద ఎలా దాడి చేసారు. కర్ణుడి సర్పముఖాస్త్రాన్ని అర్జునుడు ఎలా తప్పించుకున్నాడు.

మిగిలిన పాండవులు కర్ణుడితో ఎలా యుద్ధము చేసారు. ఈ రెండు రోజుల యుద్ధము ఎలా జరిగింది " అన్నాడు.

## కౌరవ సైన్యాధ్యక్ష నిర్ణయం

సంజయుడు " మహారాజా ! ద్రోణాచార్యుడు పడిపోయిన తరువాత సాయంత్రం వరకు యుద్ధం జరిగింది ఆ తరవాత యుద్ధం చాలించి తమ తమ శిబిరాలకు వెళ్ళారు. సుయోధనుడు తమ శిబిరంలో అశ్వత్థామ, కర్ణుడు, దుశ్శాసనుడు, శకుని మొదలగు యోధులతో సమాలోచనలు జరిపి తరువాతి సైన్యాధ్యక్షుడు ఎవరిని నియమించాలి అని అశ్వత్థామను అభిప్రాయం అడిగాడు. అశ్వత్థామ సుయోధనుడు ఆలోచనకు అనుగుణంగా " సద్గుణ సంపన్నులైన భీష్ముడు, ద్రోణుడు వెళ్ళి పోయారు. మన సైన్యంలో సర్వ సైన్యాధ్యక్ష పదవికి అర్హులు ఎందరో ఉన్నారు. వారిలో ఒకరిని ఎంచుకో. నా అభిప్రాయం ప్రకారం కర్ణుడు ఇందుకు సమర్ధుడు. అతడి వద్ద అశేషమైన దివ్యాస్త్రసంపద ఉంది. శత్రు సైన్యమును నాశనం చేయడంలో మేటి. విశ్వాసపాత్రుడు, నీ ప్రియ మిత్రుడు. కనుక అతడిని సైన్యద్యక్షిడిని చెయ్యి " అన్నాడు. అశ్వత్థామ పలుకులు విని సుయోధనుడికి ఆనందానికి అవధులు లేక పోయింది. కర్ణుడిని చూసి " మిత్రమా కర్ణా ! భీష్మ, ద్రోణుల తరువాత అంతటి సమర్ధుడివి నీవే. ఇన్ని రోజులు భీష్మ, ద్రోణులు పాడవపక్షపాతంతో వారిని చంపక వదిలారని నీవు సేనాపతివి అయి ఉంటే పాండవ నిర్మూలనము ఎప్పుడో జరిగి ఉండేది. ఇప్పటికి యుద్ధము ముగిసి మనను విజయలక్ష్మి వరించేది " అన్నాడు. ఈ మాటలకు " కర్ణుడు పొంగి పోయి " సుయోధనా ! నేను నీకు పాండవులను అందరినీ జయిస్తాను అని మాట ఇచ్చాను. ఇప్పుడు ఆ మాట నెరవేర్చుకుని నిన్ను ఆనంద పరుస్తాను. ఈ యుద్ధానికి నేను ఒక్కడినే చాలు నీవు చూస్తూ పక్కన ఉంటే చాలు. పాండవులను జయించి నిన్ను సర్వంసహా భూమండలానికి పట్టాభి షిక్తుడిని చేస్తాను " అన్నాడు.

### కర్ణుని సైన్యాధ్యక్షుని చేయుట

సుయోధనుడు పుణ్య నదీ జలాలు తెచ్చి, ఉన్నతాసనము వేసి, కర్ణుని అందు ఆశీనుడిని చేసి, నదీ జలముతో అభిషేకము చేసి, పుణ్యాహవాచనము చేసి మొదలగు క్రతువులు చేయించి వంధి మాగధుల జయజయ ధ్వనుల మధ్య కర్ణుని సర్వ సైన్యాధ్యక్షుని చేసాడు. కర్ణుడు సుయోధనుడిని చూసి " మిత్రమా ! నాడు నన్ను అంగరాజ్యానికి అభిషిక్తుడిని చేసి పది మందిలో నా పరువు నిలిపావు. నేడు నన్ను సైన్యాధ్యక్షుడిని చేసి గౌరవించావు. ఇందుకు ప్రతిగా నేను నీకు ఏమి ఇవ్వగలను ? బంధు మిత్రసమేతంగా పాండవులను చంపి నిన్ను సమస్త కురు సామ్రాజ్యానికి చక్రవర్తిగా పట్టాభిషిక్తుని చేస్తాను నీవు పుత్ర పౌత్ర సమేతంగా సుఖంగా ఆచంద్రార్కం పాలించు " అన్నాడు. సుయోధనుడు ఆ మాటలకు పరమానంద భరితుడయ్యాడు.

## ఇరుపక్షముల వ్యూహ రచన

మరునాటి ఉదయం కర్ణుడు సైన్యాధ్యక్షుడుగా మకరవ్యూహాన్ని పన్నాడు. మొసలి నోరు భాగములో తాను నిలిచాడు. కళ్ళ భాగంలో శకుని, ఉలూకుడు నిలిచారు. తల భాగాన అశ్వత్థామ మెడ భాగాన తన తమ్ములను నిలిపాడు సుయోధనుడు. ముందరి కాళ్ళ భాగాన కృపాచార్యుడు, కృతవర్మలు, కడుపు భాగాన సుయోధనుడు, వెనుక కాళ్ళ భాగాన సుషేషణుడు, శల్యుడు తోక భాగాన చిత్రసేనుడు తమతమ సైన్యములతో నిలిచారు. మిగిలిన సేనలను వ్యూహము చుట్టూ నిలిపాడు. యుధిష్టరుడు కూడా తమ సైన్యముతో యుద్ధరంగమున నిలిచాడు. సైన్యాధ్యక్షుడుగా కర్ణుని చూసాడు. అంతకు ముందు యుధిష్టరుడికి కర్ణుడంటే భయం ఉండేది. ఇప్పుడది లేదు సహజ కవచకుండలములు లేవు, ఇంద్రుడిచ్చిన శక్తి లేదు, ద్రోణుని అండ లేదు. కనుక సులభంగా కడతేర్చవచ్చును అనుకున్నాడు. అర్జునుడిని చూసి " అర్జునా ! చూసావా ! కర్ణుడు సర్వసైన్యములకు అధిపతి అయ్యాడు. మన అరణ్యవాస, అజ్ఞాతవాసములకు, అవమానములకు , అనుభవించిన సకల కష్టాలకు మూల కారణం ఇతడే. ఇక నీవు అతడి మీద పగ తీర్చుకో. కౌరవ సేన తరఫున చెప్పకోతగ్గ వీరుడితడే ఇతడిని వధించిన కౌరవులను మనం అనాయాసంగా జయించవచ్చు. కర్ణుడు పన్నిన మకర వ్యూహముకు తగిన వ్యూహమును రచించు " అన్నాడు. అర్జునుడు తన సేనలను అర్ధచంద్ర వ్యూహమున నిలిపాడు. ఎడమ కొమ్మున భీముని, కుడికొమ్మున ధృష్టద్యుమ్నుడిని, ధర్మరాజ నకుల సహదేవులను వ్యూహము వెనుక భాగమున నిలబెట్టాడు. అర్జునుడి చక్రరక్షకులుగా యుధామన్యుడు, ఉత్తమౌజుడు నిలిచారు. కర్ణుడి చేతిలో కృష్ణార్జునులు ఓడిపోతారని నీ కుమారుడు, అర్జునుడి చేతిలో కర్ణుడు ఓడగలడని ధర్మరాజు గట్టిగా నమ్మారు.

## యుద్ధారంభం

తమ తమ సైన్యాధ్యక్షులు ఇచ్చిన ఆజ్ఞతో ఇరు పక్షములు ఢీకొన్నాయి. ఏనుగులు రథములు, హయములు, కాల్బలములు క్షణంలో నాశనం ఔతున్నాయి. ఏనుగుల కాళ్ళ కింద రథచక్రముల కింద పడి సైనికులు చితికి పోతున్నారు. అర్జునుడు కర్ణుడు ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధము చేస్తున్నారు. సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, చేకితానుడు, ఉపపాండవులు కలిసి కౌరవ సేనలో ఉన్న ప్రభద్రక, చేది, మద్య, పాండ్య, వంగ, చోళ మొదలైన సైన్యములను తరుముతున్నారు. భీమసేనుడు తన గజవాహనము మీద విహరిస్తున్నాడు. దానికింద పడి కౌరవ వీరులు మరణిస్తున్నారు.

### క్షేమధూర్తి భీముని ఎదుర్కొనుట

ఇంతలో కులూత దేశపు రాజు క్షేమధూర్తి ఏనుగు మీద వచ్చి భీమసేనుడిని ఎదుర్కొన్నాడు. ఇద్దరూ ఒకరి మీద ఒకరు ఈటెలు విసురుకున్నారు, ఒకరి విల్లు ఒకరు విరుచుకున్నారు. ఏనుగులు కూడా ఒక దానిని ఒకటి ఎదుర్కొన్నాయి. క్షేమదూర్తి భీమసేనుడి గుండెలలో ఈటెను దించి భీమసేనుడి ఈటెలను మధ్యలోనే విరుస్తున్నాడు. భీమసేనుడి శరీరం మీద అరవై బాణాలు వేసాడు. భీమసేనుడు క్షేమధూర్తి ఏనుగు శరీరం నిండా బాణములు వేసాడు. ఆ బాధకు తాళ లేక ఏనుగు అక్కడి నుండి పారిపోయింది. భీమసేనుడు క్షేమధూర్తి ఏనుగును తరిమాడు. క్షేమధూర్తి అతి కష్టము మీద ఏనుగును అదుపులోకి తెచ్చుకుని భీమసేనుడి మీద అతడి ఏనుగు మీద శరప్రయోగం చేసాడు. భీమసేనుడి ఏనుగు కింద పడింది. గధ తీసుకుని కిందకు దిగిన భీమసేనుడు క్షేమధూర్తి ఏనుగును ఒక్క దెబ్బతో పడగొట్టాడు. క్షేమధూర్తి ఏనుగును దిగి కత్తి దూసాడు. భీమసేనుడు గధ ఎత్తి క్షేమధూర్తి తల మీద మోదాడు. క్షేమధూర్తి అక్కడికక్కడే తల పగిలి మరణించాడు. క్షేమధూర్తి మరణం చూసి అతడి సైన్యాలు చెదిరి పోయాయి. భీమసేనుడు ఉత్సాహంతో కర్ణుడి వైపు పోయాడు.

## కురు పాండవ యోధుల సమరం

కర్ణుడు బాణములు వేసి పాండవ సేనలోని ఏనుగులను కొడుతున్నాడు. అవి తలలు పగిలి చచ్చి కిందపడుతున్నాయి. నకులుడు కర్ణుడిని ఎదుర్కొన్నాడు. సాత్యకి కేకయరాజులైన విందానువిందులను, భీమసేనుడు అశ్వత్థామను, చిత్రసేనుడు శ్రుతవర్మను, ప్రతివింద్యుడు చిర్తుడు అనే రాజును, సుయోధనుడిని యుధిష్టరుడు, అర్జునుడు సంశక్తులను, ధృష్టద్యుమ్నుడు కృపాచార్యుని, శిఖండి కృతవర్మను, శ్రుతకీర్తి శల్యుడిని, సహదేవుడు దుశ్శాసనుడిని ఎదుర్కొన్నారు. పోరు ఘోరమైంది.

### సాత్యకి విందానువిందులు

సాత్యకి విందానువిందుల విల్లులు నరికాడు. వారిశరీరముల నిండా బాణములతో ముంచెత్తాడు. విందాను విందులు తిరిగి విల్లందుకుని సాత్యకి మీద శరప్రయోగం చేసారు. సాత్యకి ఒక పదునైన బాణంతో అనువిందుడి తల నరికాడు. తమ్ముడు చనిపోయాడన్న కోపంతో విందుడు సాత్యకి అనేక బాణములతో కొట్టాడు. సాత్యకి విందుడు ఒకరి సారధిని ఒకరు చంపుకున్నారు. ఒకరి హయములను ఒకరు చంపారు. ఒకరి రథమును ఒకరు విరిచారు. ఇరువురు రథములు దిగి కత్తి దూసి యుద్ధము చేయసాగారు. ఆ యుద్ధములో సాత్యకి పక్కకు ఒంగినట్లు ఒంగి కత్తితో విందుని తల ఒక్క వేటుతో తుంచాడు. విందాను విందులను చంపి సాత్యకి పక్కనే ఉన్న యుధామన్యుడి రథము ఎక్కాడు. త్వరలో రథము సమకూర్చుకుని కేకయ సైన్యమును తరిమాడు.

### శ్రుతకర్మ చిత్రుడిని చంపుట

చిత్రసేన మహారాజు సహదేవుడి కుమారుడైన శ్రుతకర్మతో యుద్ధము చేస్తున్నాడు. చిత్రసేనుడు అయిదు వాడి అయిన బాణములతో శ్రుతకర్మను కొట్టాడు. శ్రుతకర్మ కోపించి చిత్రసేనుడిని మూర్చిల్లేలా కొట్టాడు. చిత్రసేనుడు తేరుకుని శ్రుతకర్మ విల్లు విరిచాడు. శ్రుతకర్మ మరొక విల్లందుకుని వాడి అయిన బాణంతో చిత్రసేనుడి తల ఎగురకొట్టాడు. తమ మహారాజు మరణించడం చూసి సైన్యం ఒక్కసారిగా విజృంభించి శ్రుతకర్మను చుట్టుముట్టాయి. శ్రుతకర్మ అమిత పరాక్రమంతో వారిని తరిమి కొట్టాడు. చిత్రుడితో యుద్ధము చేస్తున్న ప్రతి వింధ్యుడు చిత్రుడి రథసారధి గుండెల్లో మూడు నారములు దించాడు. అతడి కేతనమును, వింటిని త్రిచి, చిత్రుడు విసిరిన ఈటెను రెండు ముక్కలు చేసాడు. అందుకు కోపించిన చిత్రుడు తన గధను ప్రతి వింధ్యుడి మీద విసిరాడు. ఆదెబ్బకు ప్రతివింధ్యుడి రథము విరిగి సారధి మరణించాడు. ఆగ్రహించిన ప్రతి వింధ్యుడు ఒక తోమరము విసిరి చిత్రుడి గుండెను చీల్చాడు. చిత్రుడు మరణించగానే కౌరవ సేనలు ప్రతివింధ్యుడి మీద విరుచుకు పడ్డాయి. పాండవ సేనలు ప్రతివింధ్యునకు సాయం వచ్చాయి. ప్రతివింధ్యుని ధాటికి కౌరవసేనలు పారి పోయాయి.

### భీముడు, శ్రుతకీర్తిల యుద్ధము

భీముడు అశ్వత్థామతో యుద్ధము చేస్తున్నాడు. అశ్వత్థామ భీముడిని రథమును తన బాణములతో కప్పాడు. భీమసేనుడు అశ్వత్థామ పై శరవర్షం కురిపించాడు. ఇరువురు ఒకరి కేతనము ఒకరు కొట్టారు. ఒకరి సూతుని ఒకరు గాయపరిచారు. ఒకరి దేహమును ఒకరు గాయపర్చుకున్నారు. అది చూసి సూతులు వారిరువురిని అక్కడి నుండి తప్పించారు. అర్జున కుమారుడు శ్రుతకీర్తి శల్యుడిని ఎదుర్కొన్నాడు. శల్యుడు శ్రుతకీర్తి విల్లు విరిచి అతడి మీద ఏడు బాణములు నాటాడు. శ్రుతకీర్తి మరొక విల్లు తీసుకుని అరవైనాలుగు బాణములు వేసాడు. శల్యుడు తిరిగి తొంబై బాణములు వేసి తిరిగి శ్రికీర్తి విల్లు విరిచాడు. శ్రుతకీర్తి తనగదను తీసుకున్నాడు. శల్యుడు దానిని కూడా విరిచాడు. శల్యుడు శ్రుతకీర్తి సారథిని నరికాడు. రథాశ్వములు బెదిరి రథమును ఎటో లాక్కుని వెళ్ళాయి.

### దుశ్శాసనుడు సహదేవుడిని ఎదుర్కొనుట

సహదేవుడు దుశ్శాసనుడితో యుద్ధము చేస్తున్నాడు. దుశ్శాసనుడు సహదేవునిపై నిశిత బాణములు వేసాడు. సహదేవుడు కోపించి డెబ్బై బాణములతో దుశ్శాసనుడిని కొట్టాడు. దుశ్శాసనుడు సహదేవుడి విల్లు విరిచి డెబ్బై బాణములు అతడి మీద వేసాడు. సహదేవుడు కోపించి కత్తి తీసుకుని దుశ్శాసనుడి విల్లు విరిచాడు. దుశ్శాసనుడు కత్తి తీసుకుని సహదేవుని మీద విసిరాడు. సహదేవుడు దానిని మధ్యలోనే విరిచాడు. దుశ్శాసనుడు మరొక విల్లు తీసుకుని సహదేవుడిపై అరవైనాలుగు బాణములు ప్రయోగించాడు. సహదేవుడు వాటిని మధ్యలోనే తుంచాడు. సహదేవుడు నూరు శిలీఖములను దుశ్శాసనుడి మీద వేసాడు. దుశ్శాసనుడు వాటన్నిటినీ మూడు బాణములతో తుంచి రెండు సాయకములను సహదేవుడి మీద వేసాడు. సహదేవుడు కాంతులు వెదజల్లే ఒక అస్త్రమును దుశ్శాసనుడి మీద వేసాడు. ఆ అస్త్రము దుశ్శాసనుడి కవచము చీల్చి అతడిని మూర్ఛిల్లజేసింది. అతడి సారథి వణుకుతూ రథమును అక్కడి నుండి దూరంగా తీసుకు వెళ్ళాడు.

### నకులుని భంగపాటు

నకులుడు కర్ణుడిని ఎదుర్కొని " కర్ణా ! ఈ రోజు మంచి రోజు కనుక నువ్వు నా ఎదుట పడ్డావు. కురు పాండవుల వైరముకు మూల కారణం నీవు. నిన్ను చంపనిది నా కోపము చల్లారదు. నేటితో నీ ఆయువు సరి " అన్నాడు. కర్ణుడు " ఓ నకులరాజకుమారా ! మహాస్త్రకోవిదుడవైన నువ్వు ఇలా మాట్లాడటం సహజమే. రా మనిద్దరము యుద్ధము చేసి బలాబలాలు తేల్చుకుంటాము " అన్నాడు. కర్ణుడు నకులుని మీద డెబ్బై బాణములతో కప్పాడు. నకులుడు కూడడెబ్బై వాడి అయిన బాణాలు నకులుని మీద వేసాడు. మరొక బాణముతో కర్ణుడి ధనస్సు విరిచి మూడు వందల బాణములు కర్ణుడి మీద ప్రయోగించాడు. కర్ణుడు మరొక విల్లు తీసుకుని అయిదు బాణములు నకులుడి వక్షస్థలంలో దింపాడు. నకులుడు ఏడు బాణములతో కర్ణుడి విల్లు విరిచాడు. కర్ణుడు కర్ణుడు మరొక విల్లందుకున్నాడు. అప్పుడు ద్రుపదుడి సేనలు నకులుడికి సాయంగా వచ్చాయి. కర్ణుడు అతి క్రూరబాణ ప్రయోగం చేసి వారిని చెదరగొట్టాడు. కర్ణుడు నకులుడి విల్లు విరిచి అతడి హయములను చంపి, సారథిని గాయపరిచాడు, అతడి చక్రరక్షకులను చంపి, నకులుడి కేతనము విరిచాడు. నకులుడు కత్తి డాలు తీసుకుని కర్ణుడిని ఎదుర్కొన్నాడు. కర్ణుడు వాటిని ముక్కలు చేసాడు. నకులుడు గధ తీసుకుని కర్ణుడిని ఎదుర్కొన్నాడు. కర్ణుడు దానిని ముక్కలు చేసి నకులుడి ఆయువు పట్టులో బాణములతో కొట్ట సాగాడు. నకులుడు ఆ దెబ్బలు భరించ లేక పారిపోయాడు. కర్ణుడు వెంబడించి పట్టుకుని " నకులా ! నన్ను ఇందాక అనవసరంగా అనరాని మాటలనడం తప్పు కదా ! మాటాడేటప్పుడు ఎవరితో మాట్లాడుతున్నవు, ఎన్ని మాటలు మాటాడాలి, ఎలా మాటాడాలి అని తెలుసుకుని మాట్లాడు. ఇప్పటికైనా నూవు నాకంటే తక్కువస్థాయి వీరుడవని తెలుసుకున్నావు. యుద్ధము చేసేటప్పుడు నీ బలము ఎదిరి బలము తెలుసుకుని యుద్ధము చెయ్యి. అంతే కాని నీకన్నా బలవంతుని ఎదుర్కొని ఇలా పారిపోకూడదు. నీవు నాకంటే చిన్న వాడివి కనుక నిన్ను నేను చంపను. కుమారా ! నీవు అర్జునుడి వద్దకు వెళ్ళు " అన్నాడు. నకులుడు సిగ్గుతో తలవంచుకుని ధర్మరాజు రథము ఎక్కాడు. నకులుడి పరాభవంతో కర్ణుడు విజృంభించి పాండవసేనను చిన్నాభిన్నం చేయసాగాడు. సారథులను చంపుతున్నాడు, రథికుల తలలు నరుకుతున్నాడు. హయములను చంపుతున్నాడు. రథములు విరుగ కొడుతున్నాడు. పాండవసేనను నిర్మూలం చేస్తున్నాడు.

### ఉపపాండవుల సమరం

యుయుత్సుడు ఉలూకుడిని ఎదుర్కొన్నాడు. ఉలూకుడు యుయుత్సుని విల్లు విరిచి కేతనము విరిచాడు. యుయుత్సుడు మరొక ధనస్సు తీసుకుని ఉలూకుడి వక్షస్థలము మీద అయిదు బాణములు గుచ్చాడు. ఉలూకుడు ఒకే బాణంతో

యుయుత్సుడి సారధిని చంపాడు, తరువాత రథాశ్వములను చంపాడు. యుయుత్సుడు తన రథము దిగి వేరొక రథము ఎక్కాడు. ఉలూకుడు తన రథమును పాంచాల సేనల వైపు పోనిచ్చాడు. శ్రుతకర్మ నకులుడి కుమారుడైన శతానీకుడిని ఎదుర్కొని అతడి సారధిని , హయములను చంపాడు. శతానీకుడు తన గదను తీసుకుని శ్రుతకర్మ మీద విసిరి అతడి రథము విరిచి అతడి సారధిని రథములను చంపాడు. భీముడి కుమారుడు శ్రుతసోముడు శకునితో యుద్ధము చేస్తున్నాడు. శ్రుతసోముడు శకుని మీద అనేకాస్త్రములు ప్రయోగించాడు. వాటన్నిటినీ ముక్కలు చేసి శకుని వాడి అయిన బాణముతో శ్రుతసోముడి రథము విరిచి, కేతనము విరిచి, హయములను చంపాడు. శ్రుతసోముడు కిందకు దూకి నేల మీద నుండే శకుని మీద బాణవర్షం కురిపించాడు. శకుని పదునైన బాణముతో శ్రుతసోముని విల్లు విరిచాడు. శ్రుతసోముని కత్తిని శకుని ఒకే బాణముతో ఖండించాడు. విరిగిన కత్తిని విసిరి శకుని విల్లును విరిచి వెంటనే శ్రుతకీర్తి రథం ఎక్కాడు.

### కృపాచార్యుడు, కృతవర్మల శౌర్యం

కృపాచార్యుడు తన బావగారిని చంపిన ధృష్టద్యుమ్నుడిని చంపాలని శతవిధాల ప్రయత్నిస్తున్నాడు. అతడిని ఎదుర్కొని అతడి మీద అనేక పదునైన శరములు ప్రయోగించి సారధిని హయములను కొట్టాడు. ఇది చూసి ధృష్టద్యుమ్నుని సారధి అతడితో " ధృష్టద్యుమ్నా! ఈ బ్రాహ్మణుడు ప్రజ్ఞా శాలి, దివ్యాస్త్ర సంపన్నుడు. ఇతడితో యుద్ధము మంచిది కాదు. ఇతడిని నువ్వు చంప లేవు. ప్రస్తుతం మన రథమును అవతలకు తీసుకు వెళ్ళమంటావా ! " అని అడిగాడు. సారధి ఆలోచన సముచిత మని తలచిన ధృష్టద్యుమ్నుడు అతడి సూచనకు అంగీకారం తెలిపాడు. సారధి రథమును అక్కడ నుండి భీమసేనుడి వద్దకు తీసుకు వెళ్ళాడు. కృపాచార్యుడు మహోత్సాహంతో ధనుష్టంకారం చేసి శంఖం పూరించాడు. పాండవసేనలో చొరపడి సేనను నాశనం చేయసాగాడు. శిఖండి కృతవర్మను ఎదుర్కొన్నాడు. శిఖండి కృతవర్మ గుండెలకు గురి పెట్టి అయిదు బాణములు వేసాడు. కృతవర్మ అరవై బాణములతో శిఖండిని నిలువెల్లా కొట్టి అతడి విల్లు విరిచి అరవై బాణములతో శిఖండిని నిలువెల్లా కొట్టాడు. శిఖండి మరొక విల్లు తీసుకుని డెబ్బై బాణములతో కృతవర్మను శరీరం అంతా రక్తం కారేలా కొట్టాడు. కృతవర్మ ప్రయోగించిన నారాచముల ధాటికి శిఖండి మూర్చిల్లాడు. శిఖండి రథసారధి రథమును అక్కడి నుండి తీసుకు వెళ్ళాడు. శిఖండి సైన్యం పారిపోయింది.

## త్రిగర్త మహారాజు అర్జునుడిని ఎదుర్కొనుట


మిత్రసేనుని తలను ఖండిస్తున్న అర్జునుడు

అర్జునుడు త్రిగర్తలతో యుద్ధము చేస్తున్నాడు. త్రిగర్తులకు శిబి, సాళ్వ, సంశక్తక సైన్యములు తోడైనాయి. త్రిగర్త మహారాజు సోదరులైన సత్యదేవుడు, చంద్రదేవుడు, మిత్రదేవుడు, మిత్రవర్మ, సౌశ్రుతి, సువర్మ, సుశర్మ మొదలైన వారు అతడికి సాయంగా ఉన్నారు. వారంతా అర్జునుడి మీద శరవర్షం కురిపించాడు. ఆ శరములకు చలించక అర్జునుడు వారిపై బాణములు గుప్పించాడు. అయిదు బాణములు వేసి సౌశ్రుతిని చంపాడు. ఎనిమిది బాణములతో చంద్రదేవుని చంపాడు. శిలీఖములు వేసి శత్రుదేవుడిని చంపాడు. సత్యసేనుడు విసిరిన ఈటె కృష్ణుడి భుజమును చీల్చింది. కృష్ణుడి చేతి కొరడా కింద పడింది. అది చూసి అర్జునుడు కోపోద్రిక్తుడై ఒకే బాణము వేసి సత్యసేనుని తలనరికాడు. మరొక బాణంతో మిత్రవర్మను చంపాడు. అది చూసి త్రిగర్త సైనికులు అర్జునుడిని చుట్టుముట్టారు. అర్జునుడు తన బాణములతో వారిని చెల్లాచెదురు చేసి వెండి మొన గల బాణమును వేసి మిత్రసేనుడి తల నరికాడు. మరొక ఇనుప బాణం వేసి సువర్మ వక్షస్థలంలో కొట్టాడు. సంశక్తులు అర్జునుడిని చుట్టుముట్టి అర్జునుడి మీద అనేక బాణములు, అస్త్రములు వేసారు. వారి ఆర్భాటం చూసిన అర్జునుడు చిరు నవ్వు నవ్వి వారి మీద ఇంద్రాస్త్ర ప్రయోగం చేసాడు. ఆ ఇంద్రాస్త్రము నుండి అనేక భల్లము, అంజలికము, మొదలైన అనేక విధములైన ఆయుధములు వెడలి సంశక్తులను సంహరించసాగాయి. పతాకములు పతన మౌతున్నాయి, సారధులు మరణిస్తున్నారు, గజ, అశ్వ, సైనిక కళేబరములతో రణభూమి నిండి పోయింది. రక్తం ఏరులై పారసాగింది. అర్జునుడి అస్త్ర, శస్త్ర ధాటికి ఆగలేక సంశక్తులు ససైన్యంగా పారిపోయారు.

## సుయోధనుడు ధర్మజుడిని ఎదుర్కొనుట

సుయోధనుడు ధర్మరాజును ఎదుర్కొని ధర్మరాజు మీఊద తొమ్మిది బాణములు ప్రయోగించి ఒక బాణంతో సారధిని కొట్టాడు. అందుకు ధర్మజుడు కోపించి సుయోధనుడి హయములను, సారధిని కొట్టి, పతాకమును విరిచి, సుయోధనుడు పట్టుకున్న ఖడ్గమును విరుగ కొట్టాడు. సుయోధనుడు రధము దిగి యుద్ధము నుండి తొలగిపోయాడు. అది చూసి కర్ణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ ఇతర రాజులు సుయోధనుడికి సాయం వచ్చారు. భీమార్జున నకుల సహదేవులు ధర్మరాజుకు సాయం వచ్చారు. అప్పటికి అపహార్ణం అయింది. యయోధులంతా ఒక చోటుకు చేరుకుని ఒకరిని ఒకరు ఉత్సాహపరుస్తూ యుద్ధము చేస్తున్నారు. యుద్ధము భయంకరంగా జరుగుతూ ఉంది " అని చెప్తున్న సంజయుడి మాటలకు అడ్డు తగిలిన ధృతరాష్ట్రుడు " సంజయా ! అందరి గురించి చెప్తున్నావు మా సుయోధనుడు ఏమయ్యాడు " అని అడిగాడు. సంజయుడు " ధృతతాష్ట్ర మహారాజా ! సుయోధనుడు విరధుడు అయ్యాడే కాని యుద్ధము నుండి పారి పోలేదు. వేరొక రధము సమకూర్చుకుని ధర్మరాజును ఎదుర్కొన్నాడు. ధర్మరాజు సుయోధనుడిని దూరము నుండి చూసి సారధితో సుయోధనుడి రధము ముందుకు పోనిమ్మని చెప్పాడు. మహా కోపంతో సుయోధనుడు ధర్మరాజు విల్లు విరిచాడు. ధర్మరాజు మరొక విల్లందుకుని నీ కుమారుడి విల్లు తుంచాడు. నీ కుమారుడు మరొక విల్లందుకొని ధర్మరాజు పై బాణములు గుప్పించాడు. ఒకరి మీద ఒకరు బాణములు గుప్పించి తీవ్రంగా గాయపరచుకున్నారు. సుయోధనుడు విసిరిన బల్లెమును తుంచి ధర్మరాజు ఒక శిలీఖముతో సుయోధనుడిని శరీరం చీలేలా కొట్టాడు. సుయోధనుడు గధతో కిందికి దిగి ధర్మరాజు మీదకు రాసాగాడు. ధర్మరాజు శక్తి బాణమును సుయోధనుడి మీదకు వేసాడు. సుయోధనుడు తిరిగి రధము ఎక్కి ధర్మజుని మీద బాణప్రయోగం చేసాడు. కాని అప్పటికే సుయోధనుడికి బాగా రక్త స్రావం అయింది కనుక ఒకింత మూర్చిల్లాడు. అది చూసి కృతవర్మ ధర్మరాజును ఎదుర్కొన్నాడు. భీన్మసేనుడు కృతవర్మను అడ్డుకున్నాడు. అప్పుడు కౌరవ సైన్యము కృతవర్మకు సాయంగా వచ్చాడు.

|=== కురు పాండవుల సమరం ===


కర్ణార్జునుల యుద్ధం

సుయోధనుడు తేరుకుని ఎదురుగా కనిపించిన అర్జునుడి మీద పదునైన బాణములు వేసాడు. వెంటనే అర్జునుడు సుయోధనుడి పతాకమును తుంచి సారధిని హయములను కొట్టాడు. అశ్వత్థామ ఆ బాణములను మధ్యలోనే కొట్టాడు. అశ్వత్థామ ఆబాణములను మధ్యలో తొంచాడు.అర్జునుడు సుయోధనుడిని వదిలి అశ్వత్థామను ఎదుర్కొని అతడి విల్లు విరిచి హయములను సంహరించాడు. ఇంతలో కృపాచార్యుడు అర్జునుడిని ఎదుర్కొన్నాడు. అర్జునుడు కృపాచార్యుని ధనస్సును ఖండించాడు. కృతవర్మ అర్జునుడిని ఎదుర్కొన్నాడు. అర్జునుడు కృతవర్మ విల్లు ఖండించి పతాకమును పడేలా కొట్టి హయములను చంపాడు. ఇంతలో తనను ఎదుర్కొన్న దుశ్శాసనుడిని అర్జునుడు ఎదుర్కొని అతడి విల్లు రెండుగా ఖండించాడు. అర్జునుడు వీరిని వదిలి కర్ణుడి వైపు తన రధము పోనిచ్చాడు. అది చూసి కర్ణుడు అర్జునుడిని మూడు బాణములతోను కృష్ణుడిని ఇరవై బాణములతోను శరీరం చీరుకు పోయేలా కొట్టాడు. కర్ణుడు అప్పటి వరకు సాత్యకితో యుద్ధము చేస్తూ అర్జునుడు రాగానే ఇరువురిని ఎదుర్కొన్నాడు. అది చూసి యుయుత్సుడు, శిఖండి, చేకితానుడు, నకుల సహదేవులు, ద్రౌపదేయులు, ధృష్టద్యుమ్నుడు, ఉత్తమౌజుడు, ప్రభద్రకము, ఛేది, కరూశ, మాత్స్య, కేకయ రాజకుమారులు అర్జునుడికి సాయంగా వచ్చికర్ణుడు మీద పలు అస్త్ర, శస్త్రములు ప్రయోగించారు. కాని కర్ణుడు అత్యంత చాకచక్యముతో ఆ అస్త్రములను తిప్పికొట్టి పాండవ యోధులను వారి సైన్యాలను కకా వికలు చేసాడు. అది చూసి అర్జునుడు, కర్ణుడు ప్రయోగించిన అస్త్రములను అన్నింటినీ నిర్వీర్యము చేసి తన శిలీఖములతో కౌరవసేనను చెదరగొట్టాడు. అప్పటికి సాయం సమయం అయింది నలుపక్కలా చీకట్లు కమ్మాయి. అర్జునుడి ధాటికి ఆగలేక కౌరవ సేనలు పారి పోయాయి. పాండవసేనలు తమ విడిదికి చేరాయి. ఇలా కర్ణుడి మొదటి రోజు యుద్ధము ముగిసింది " అని సంజయుడు ధృతరాష్ట్రుడితో చెప్పాడు.

## ధృతరాష్ట్రుని సందేహం

అది విన్న ధృతరాష్ట్రుడు " సంజయా ! నాకు తెలియక అడుగుతాను. అర్జునుడు కౌరవులను అందరిని చంపదల్చుకుంటే కర్ణుడు అడ్డు వచ్చినా అందరిని ఆరోజే చంపి ఉండేవాడు. దేవేంద్రుడి కొడుకైన అతడికి నాకుమారుల వంటి మానవమాత్రులు ఒక లెక్కా ! అతడు సామాన్యుడా ! యాదవ వీరులను ఎదిరించి సుభద్రను వివాహమాడలేదా! ఇంద్రుడిని ఎదిరించి ఖాండవ వన దహనం చేయలేదా ! కిరాతరూపంలో ఉన్న పరమశివునితో యుద్ధము చేయలేదా! కాలకేయులను ఒంటి చేత్తో

చంపలేదా! గంధర్వుల చేత చిక్కిన నా కుమారుడిని వారితో పోరి జయించ లేదా ! ఇన్ని చేసిన వాడికి ఈ యుద్ధము ఒక లెక్కా! అర్జునుడి చేతిలో ఓడిపోవడమూ కీర్తే కనుక మన వారిని అర్జునుడి చేతిలో ఓడారని నిందించ పనిలేదు " అన్నాడు. సంజయుడు తిరిగి " సుయోధనుడు ! ముఖ్యులతో ఆ రోజు విశేషములు చర్చిస్తున్నాడు. కర్ణుడు సుయోధనుడితో ఇలా అన్నాడు. " రారాజా ! మనమంతా ఒకటి గుర్తుంచుకోవాలి. అర్జునుడు అత్యంత శక్తి యుక్తులు కలవాడు. అందుకు తోడు అతడికి తగు సమయంలో సలహాలు ఇవ్వడానికి కృష్ణుడు ఉన్నాడు. నేను ఇంద్రప్రసాదిత శక్తిని అర్జునవధ కోసం అట్టిపెడితే దానిని ఘటోత్కచుడి మీద ప్రయోగించేలా చేసి మనలను వంచించి ఘటోత్కచుడిని చంపించి అర్జునుడిని రక్షించాడు. అయినా మన శక్తిని నమ్ముకుంటాము. నా అస్త్రశస్త్రములతో నేను రేపు కృష్ణార్జునులను రూపుమాపుతాను " అన్నాడు.

## కర్ణసారధ్యంలో రెండవరోజు యుద్ధము

మరునాడు ఉదయం ఇరు పక్షాలు యుద్ధానికి సిద్ధం అయ్యాయి.ధర్మరాజు పూర్వం బృహస్పతి పన్నిన దుర్జయ వ్యూహము పన్నాడు. అందుకు ప్రతిగా మరొక వ్యూహము కొరకు కౌరవసేనలు కర్ణుని ఆనతి కోసము ఎదురుచూస్తున్నాయి " అని సంజయుడు చెప్పగానే ధృతరాష్ట్రుడు " సంజయా ! కర్ణుడు వచ్చి మాత్రం చేసేది ఏముంది. తనను సర్వసైన్యాధ్యక్షునిగా చేసిన మొదటి రోజే సుయోధనుడికి పరాజయం మూటగట్టాడు. రెండవ రోజు మాత్రం ఏమి చేస్తాడు. అయినా నా కుమారుడు బుద్ధిహీనుడు కనుక అలాంటి వారిని నమ్మాడు. కర్ణుడి బాహుబలం, శకుని కపట నీతి గెలిపిస్తాయని నమ్మి ఈ యుద్ధానికి దిగాడు. జూదం ఆడిన రోజు నుండి మనకు దుర్దశ మొదలైంది. అది ఇప్పటికి పెరిగి నిరంతర దు:ఖంగా మారింది. నేను, నా కుమారుడు కాని పనులు చేసాము ఫలితం అనుభవిస్తున్నాము. సంజయా ! ఇన్ని రోజుల యుద్ధములో పాండవులు ఒక్కరూ మరణించ లేదు. కాని నా కుమారులు అనేక మంది మరణించారు. భీష్మ, ద్రోణులు పడిపోయారు. పాండవులు మన వారి మధ్యలో అంత:పుర స్త్రీలతో సరసమాడుతున్నట్లు హాయిగా తిరుగుతున్నారు. అంతా విధి విలాసము " అన్నాడు.సంజయుడు " మహారాజా ! జరిగిన దానికి వగచి ప్రయోజనము లేదు. అందుకు నీ కుమారుడైన సుయోధనుడిని మాత్రము నిందించి ప్రయోజనము లేదు. అతడు చెప్పిన దానికి అంతా నువ్వు తల ఊపి ఇంతటి అనర్ధము తీసుకు వచ్చినది నువ్వు కాదా ! నాడు విదురుని మాట విని జూదము ఆపిన ఇంత దూరము రాక పోను. పాండవులకు నీవు చేసిన అపరాధములు నిన్ను కట్టి కుడుపుతున్నాయి. తరువాతి యుద్ధ విశేషములు చెప్తాను విను.

### కర్ణుడు శల్యుని తనకు సారధిని చెయ్యమని అడుగుట

కర్ణుడు " సుయోధనా ! ఈ రోజు నుండి యుద్ధము నాకు అర్జునుడికి మధ్య మాత్రమే జరుగుతుంది. అర్జునుడిని చంపడమే నా లక్ష్యము. నా వద్ద ఇంద్ర శక్తి లేదని అర్జునుడు తప్పక విజృంభిస్తాడు. కనుక మనం అర్జునుడిని చంపుటకు ఉపాయం ఆలోచించాలి. నా వద్ద ఉన్న అస్త్రములు అర్జునుడి వద్ద ఉన్న అస్త్రములు సమానమే. యుద్ధములో చురుకుగా కదలడంలో అర్జునుడి కన్నా నేనే మిన్న. అర్జునుడికి గాండీవం ఉంది. నా వద్ద లేదు. పూర్వము విశ్వకర్మ,అ ఇంద్రుడికి ఒక అస్త్రము తయారు చేసి ఇచ్చాడు. దానితో ఇంద్రుడు అసురసంహారం చేసాడు. ఇంద్రుడు దానిని పరశురాముడికి ఇచ్చాడు. నా మీద కలిగిన వాత్సల్యంతో నా గురువైన పరశురాముడు దానిని నాకు నాకు ఇచ్చాడు. ఆ మహనీయచాపంతో నేను ఈ రోజు అర్జుడిని చంపి యుద్ధము పూర్తి చేసి నీకు కురుసామ్రాజ్యాన్ని కట్టబెడతాను. ఇక అర్జునుడికి ఎన్నటికీ మరణించని హయములు, అపూర్వమైన రధము, అక్షయ తుణీరములు ఉన్నాయి. వాటి గురించి నాకు భయము లేదు నా వెంట అనేక ఆయుధములున్న శకటములు ఉంటాయి. నిరంతరము నాకు ఆయుధములు అందుతూ ఉంటాయి కనుక అక్షయతుణీరముకు సమానమే. అనేక మేలు జాతి అశ్వములు నా వెంట ఉంటాయి కనుక అశ్వములు పడి పోగానే వేరు వాటిని సమ కూర్చుకుంటాను. అలాగే అనేక రధములు నా వెంట ఉంటాయి కనుక రధము విరిగిన వేరు రధమును ఏర్పరచు కొనగలను. అర్జుడికి కృష్ణుడి సారధ్యము ఉంది. నాకు అతడికి ధీటైన సారధి కావాలి. మద్రదేశాధిపతి శల్యుడు అందుకు తగిన వాడు. అతడికి అశ్వహృదయం తెలుసు. రధము నడపడంలో కృష్ణుడికంటే నేర్పరి. కనుక నీవు అతడిని నాకు సారధిని చేయాలి. సుయోధనుడు " కర్ణా ! అదెంత పని. నేను ఇప్పుడే మద్ర దేశాధిపతిని ఒప్పించి నీకు సారధిని చేస్తాను. నీ వెంట అనేక శకటములు ఆయుధములతో నడుస్తాయి. శతాధిక రధములు, అనేక అశ్వములు నీ వెంట ఉంటాయి. రా మనం శల్యుని వద్దకు పోతాము " అన్నాడు.

## శల్యుని కర్ణుడికి సారధ్యం వహించమని కోరుట

సుయోధనుడు శల్యునికి నమస్కరించి " మీరు మాకు పెద్దలు నిత్యసత్యవ్రతులు, పూజ్యులు కనుక నేను మిమ్ము అధికంగా గౌరవిస్తాను. ఇందరి మధ్య నేను మిమ్ము ఒక కోరిక అడుగుతున్నాను కాదనకుండా తీర్చండి. ఇతడు కర్ణుడు, నా మిత్రుడు,

మన స్వర్వసైన్యాధ్యక్షుడు, అర్జునుడిని సంహారముకు దీక్షాబద్ధుడు, అర్జునుడి సారధి కృష్ణుడు, కృష్ణుడికి ధీటుగా సారధ్యం చేయగల సామర్ధ్యం మీకే ఉంది. భీష్మ ద్రోణులు చని పోయిన తరువాత నేను నిన్ను, కర్ణుడిని నమ్మి యుద్ధము చేస్తున్నాను. మీరు కర్ణుడికి సారధ్యం వహిస్తేనే అతడు అర్జునుడిని వధించ కలడు " అన్నాడు. ఆ మాటలకు శల్యుడు కోపంతో ఊగిపోతూ " సుయోధనా ! నేనెవరో తెలిసీ నన్ను ఇలాంటి నీచపు కోరిక అడుగుతావా ! నీకు వర్ణాశ్రమ ధర్మాలు తెలువవా ! మద్రదేశాధిపతిని, సుక్షత్రియుని నన్ను ఒక సూతునికి సారధ్యం వహించి అతడిని సేవించమని అడుగుతావా! నేను ఒక సూతకుల సంజాతునికి సారధిగా ఉండలేను. నేను నీకు సాయం చేయ వచ్చాను. నువ్వు ఎవరితో యుద్ధం చేయమంటే వారితో యుద్ధం చేసి శత్రు సంహారం చేస్తాను. అందరిని ఒక్కసారిగా ఎదుర్కొనమని చెప్పినా చేస్తాను. నేను రణరంగమున అర్జునుడిని కృష్ణుడినే లెక్క చేయను నా బలములో పదహారవ వంతు కూడా శక్తి లేని ఈ కర్ణుడు నాకు ఎంత. తెలియక పోతే సరే అన్నీ తెలిసి నన్ను కర్ణుడికి సారధిగా ఉండమంటే నేను నా దారిన పోతాను. అంతే కాని ఇలాంటి నీచపు పని చెయ్యను " అని చెప్పాడు.

## సుయోధనుడు శల్యుని నచ్చ చెప్పి ఒప్పించుట


కర్ణునకు సారథిగా ఉండమని శల్యుడిని అడుగుతున్న సుయోధనుడు

మద్రదేశాధీశా ! నేను ఆ ఉద్దేశ్యంతో అన లేదు. కర్ణుడొక్కడే కాదు ఈ భూమండలంలో నీకు సాటి రాగల వారెవరు. నీవు సార్ధక నామదేయుడవు. నీ కంటే కర్ణుడెక్కువ వాడు అని నేను ఇది అడగలేదు. అర్జునుడికి ధీటుగా యుద్ధం చేయగల వాడు కర్ణుడే. కాని కృష్ణుడు మన ఎత్తులన్నీ కృష్ణుడు తన నేర్పుతో భంగపరుస్తున్నాడు. కృష్ణుడికి సమంగా ఎత్తుకు పై ఎత్తు వేయగలిగిన సమర్ధత మీకు గాక ఎవరికి ఉంది. కనుకనే మిమ్ము అడిగాను కాని కర్ణుడికంటే మిమ్ము తక్కువ చేసి అవమానించడానికి కాదు. ఈ మహత్కార్యం చేయడానికి మీరు తప్ప వేరొకరు లేరు " అన్నాడు. ఆ పొగడ్తలకు పొంగి పోయిన శల్యుడు " సుయోధనా ! నీ మనసు తెలియక కోపగించుకున్నాను. కృష్ణుడికంటే నన్ను గొప్పవాడిని అని ప్రశంసించావు నాకు అదే చాలు. నేను నువ్వు అడిగినట్లు కర్ణుడికి సారధ్యం వహిస్తాను. కాని నాదొక్క నియమం నేను ఇతడితో నాకు ఇష్టము వచ్చిన రీతిలో మాట్లాడతాను. అతడు కోపగించక తనపని తాను చేసుకు పోవాలి " అన్నాడు. కాదంటే శల్యుడు ఎక్కడ కాదంటాడో అని సుయోధనుడు అందుకు అంగీకరించాడు.

## త్రిపురాసుర వధ

శల్యుడు కర్ణసారధ్యం వహించడానికి అంగీకరించిన తరుణంలో సుయోధనుడు " మద్రదేశాధీశా ! ఒక నాడు మార్కండేయ మహర్షి మా తండిగారితో చెప్తుంటే విన్నాను. దేవాసుర యుద్ధములో తారకాసురుడు మరణించాడు. అతడి ముగ్గురు కుమారులైన విద్యున్మాలి, తారకాక్షుడు, కమలాక్షుడు బ్రహ్మను గురించి అత్యంత నియమ నిష్టలతో తపస్సు చేసాడు. వారి తపస్సుకు బ్రహ్మదేవుడు మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షం అయి వరం కోరుకొమ్మని అడిగిన తరువాత వారు ముగ్గురూ ఒక్కసారిగా " బ్రహ్మదేవా ! సకల భూతముల వలన సర్వకాలములో చావు లేకుండా వరం ఇవ్వండి " అన్నారు. బ్రహ్మదేవుడు " ఇలాంటి కోరిక ఎవ్వరైనా కోరతారా ! మీరు కోరిన కోరిక నేను ఇవ్వ కూడదు మీరు పుచ్చుకోకూడదు. నేను ఇవ్వడానికి అనువైన కోరిక కోరండి " అన్నాడు. వారు " అలా అయితే మా ముగ్గురికీ మూడు పురములు ఇవ్వండి. అవి మా ఇచ్ఛ వచ్చిన చోటికి పయనించేలా ఉండాలి. దేవ, దానవ, యక్ష, కిన్నెర, కింపురుష, గంధర్వ, ఉరగాదుల వలన ఆ నగరములు నశింపకుండా వరం ఇవ్వండి. అప్పుడు మేము నిర్భయంగా అంతటా సంచరించగలము " అని కోరారు. అందుకు బ్రహ్మగారు " అలాగే ఇస్తాను. కాని దేనికైనా ఒక అంతం ఉండాలి. ఆ మూడు పురములు ఒక చోట చేరిన సమయాన బలవంతులెవరిచే అయినా నాశనం కాగలవు. అవి విడి విడిగా ఉన్నంతవరకూ సురక్షితంగా ఉంటాయి. ఇక మీరు మీ ఇచ్ఛ వచ్చిన రీతిన పురములు నిర్మించుకున్న అవి మీరు కోరిన విధంగా ప్రతిభావంతులు కాగలవు " అని వరము ఇచ్చి బ్రహ్మదేవుడు అంతర్ధానం అయ్యాడు. బ్రహ్మవరాన్ని పొందిన ఆముగ్గురు రాక్షసులు మయుడి వద్దకు వెళ్ళి తమ కొరకు మూడు నగరాలు నిర్మించి ఇవ్వమని అడిగారు. మయుడు తారకాక్షుడికి సువర్ణపురమును, కమలాక్షునికి రజిత పురమును, విద్యున్మాలికి ఇనుప పురమును నిర్మించి ఇచ్చాడు. స్వర్ణ పురముతో దేవలోకములోను, రజిత పురముతో ఆకాశములోను, ఇనుప పురముతో భూలోకములోను సంచరించసాగారు. ఆ ముగ్గురూ మూడు లోకాలు ఆక్రమించుకుని యదేచ్ఛగా తిరుగుతూ కోట్ల సంవత్సరాలు గడిపారు.

### హరి కోరిన వరం

తారకాక్షుడికి హరి అను కుమారుడు కలిగాడు. అతడు బ్రహ్మను గురించి తపస్సు చేసాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షంగానే అతడు " త్రిపురాలలో ఎవరనా మరణిస్తే వారిని ఒక నూతిలో వేయగానే దాని నుండి చని పోయిన వాడి అంత బలంతో పది మంది జన్మించాలి. అలాంటి నూతులు మూడు పురములలో సర్వకాలమూ ఎండని జలములతో ఉండేలా అనుగ్రహించు " అని కోరాడు. ఈ విధంగా త్రిపురాలలో ప్రజలు చావులేని వారైనారు. ఒక వేళ చచ్చినా ఒకరికి పది మందిగా వృద్ధి చెందారు. వారిని చూసి దేవతలు కూడా హడలెత్తి సాగారు. త్రిపురాలలో నుడి వారు దేవ, పితృ, ముని లోకాలను హింసించసాగారు. ఇంద్రుడు కూడా వారితో యుద్ధము చేసి పరాజితుడైనాడు. దేవతలు మునులు బ్రహ్మదగ్గరకు వెళ్ళి మొర పెట్టుకుని త్రిపురాధీశులను చంపే ఉపాయం చెప్పమని అడిగారు. బ్రహ్మ వారితో " వారి ముగ్గురిని ఒకే బాణంతో చంపాలి. ఆ పని ఒక్క రుద్రుడే చేయాలి. కనుక మీరు శివుడి వద్దకు వెళ్ళి ప్రార్ధించండి " అన్నాడు.

### దేవతలు బ్రహ్మదేవునితో చేరి ఈశ్వరుడిని వేడుకొనుట


త్రిపురాసురులను చంపమని శివుని అడుగుతున్న దేవతలు

దేవతలు, మునులు, ఇంద్రుడు, బ్రహ్మదేవునితో చేరి శివుని వద్దకు చేరి " పరమేశ్వరా ! నీవు జ్ఞానమూర్తివి, సత్యస్వరూపుడవు నీకు తెలియనిది లేదు " అని స్తుతించగా ఈశ్వరుడు " సంతోషించి ఏమి కావాలి ? " అన్నాడు. బ్రహ్మ పరమేశ్వరునితో " పరమేశ్వరా ! నీవు నన్ను ప్రజాపతిగా చేసావు. ఆ అధికారమును వినియోగించి నేను ఈ ముగ్గురు రాక్షసులకు వరములు ప్రసాదించాను. వారు ఆ వరగర్వంతో మూడు పురములు నిర్మించుకుని ముల్లోకాలను గడగడలాడిస్తున్నారు. ఇంద్రునికి కూడా అతడిని గెలువ శక్యము కాలేదు. నీవుగాక వారిని సంహరించగల వారు లేరు. కనుక అందరమూ నిన్ను శరణు జొచ్చాము. ఆ రాక్షసులను సంహరించి ముల్లోకములను కాపాడాలి " అని వేడుకున్నారు. ఈశ్వరుడు " బ్రహ్మదేవా ! నీను చెప్పినది నిజమే. వారు చంపదగిన వారే అయినా వారు మహాబలవంతులు నేను ఒక్కడినే వారిని జయించ లేను. కనుక నేను నా తేజస్సులో సగభాగము ఇస్తాను మీరంతా వారిని సంహరించండి " అన్నాడు. దేవతలు " పరమేశ్వరా ! ఆ ముప్పురి బలముకంటే మా బలము సగమే ఉంది కనుక మేము వారిని గెలువలేము. నీ మహా తేజస్సు మేము భరించరానిది. కనుక మా శక్తులను మీకు ధార పోస్తాము. కనుక నీవే వారిని సంహరించు " అన్నాడు. ఆ మాటలకు శివుడు " దేవతలారా ! నాకు మీరు రాక్షసులు సమానమే. అంతే కాదు నాకు సర్వప్రాణులు నాకు సమానమే. అందరికీ సమానంగా ఆనందం కలిగిస్తాను కనుక నాకు శివుడు అనే నామం వచ్చింది. దుష్టశిక్షణ శిష్టరక్షణ నా కర్తవ్యం. పరులను పీడించే దుర్జనులను సంహరించి ధర్మవర్తనులైన మిమ్ము రక్షిస్తాను. కనుక మీరంతా మీ తేజస్సు బుజ బలము నాకు చెందేలా చేయండి. నేను ఈ కార్యము నిర్వహించడానికి ముల్లోకములకు పశుత్వము నాకు పశుపతిత్వము కావాలి నేను ఈ కార్యము చేయడానికి నాకు పశుపతిత్వము కావాలి ఈ లోకాలకంత పశుత్వము కావాలి. అప్పుడు కాని పశువులను చంపిన పాపం నన్ను అంటదు. మీరందరూ కలిసి నాకు ఒక దివ్యరధమును, ఒక సారధిని, దివాశ్వములను, ఒక విల్లు, ఒక బాణం కావాలి. అప్పుడు నేను ఆ రాక్షసుల మూడు పురములను ఒక్కసారిగా నాశనం చేయగలను.

### పాశుపత వ్రతము

శివుని మాటలు విన్న దేవతలు సంకోచిస్తూ తలలు వంచుకున్నారు. తమకు కూడా పశుత్వము వస్తుంది అని శకించారు. వారి అనుమానం అర్ధం చేసుకున్న శివుడు దేవతలారా ! మీరు భయపడ వద్దు. మీకు కలిగిన పశుత్వము నుండి బయటపడటానికి ఒక మార్గం ఉంది. మీరంతా పాశుపత వ్రతం ఆచరించి మీ పశుత్వము పోగొట్టుకొని మోక్షము పొంద వచ్చు. ఆ వ్రతము పన్నెండు సంవత్సరములు చేయవలెను. చేసే వారి నిష్టానుసారం ఒక సంవత్సరము కాని ఆరు నెలలు కాని, ఒక రుతువులో కాని, ఒక మాసముకాని, కనీసం పన్నెండు దినములలో కాని ఫలితం ఇస్తుంది. ఆ మాటలకు దేవతలు సమ్మతించి అన్ని లోకములకు పశుత్వము రావడానికి అంగీకరించి. శివునకు పశుపతిత్వము కలగడానికి ఒప్పుకుని అతడిని పశుపతిగా కీర్తించారు. దేవతలంతా తమ తేజస్సులో సగము శివునకు ధారపోసారు. ఆ తేజస్సును

అందుకున్న పరమ శివుడు తేజోవంతుడయ్యాడు. ఇంద్రుడు దేవతలతో కూడి శివుడిని త్రిపురాసుర సంహారానికి అభిషేకించారు. దేవతలందరూ త్వష్ట ప్రజాపతిని చూసి శివుడికి మహోత్కృష్టమైన ఒక విల్లును, ఒక రధమును, అమ్మును, హయములను తయారు చేసి ఇమ్మని అడిగారు.

### త్రిపురాసుర సంహారానికి కావలసిన రధము

దేవతల కోరిక మన్నించి త్వష్ట ప్రజాపతి విశ్వంభరా చక్రమును రధముగా చేసాడు. సూర్య చంద్రులను చక్రములుగా చేసి మహాసముద్రాలను ఇరుసులుగా చేసాడు. హిమవత్పర్వతము, వింధ్యాచలము, అస్తాచలమును స్థంభములుగా చేసాడు. త్రేతాగ్నులను హశ్వములకు త్రాళ్ళుగా చేసాడు. మేరు పర్వతమును ఛత్రముగా అమర్చాడు. నాలుగు వేదములను నాలుగు అశ్వములుగా అమర్చాడు. ఒక సంవత్సర కాలమును విల్లుగా చేసి విష్ణుమూర్తిని బాణంగా ఉండమని కోరాడు. ఈ విధంగా రధమును చేసాడు త్వష్ట ప్రజాపతి. అది చూసి శివుడు సంతోషించిన పరమశివుడు గ్రహమండలమును ఉపాదానముగా చేసి విశ్వకర్మ చేసిన కవచమును తొడుగుకొన్నాడు. వృషభమును ధ్వజము మీద నిలిపి త్వష్టప్రజాపతి తన కొరకు రూపొందించిన రధము అధిరోహించి విల్లును పట్టుకున్నాడు. శివుడు ఇంద్రుడితో " దేవేంద్రా ! నాకు సారధి ఎవరు " అని అడిగాడు. ఇంద్రుడు " నీకు ఇష్టము అయిన వాడిని ఎన్నుకో " అన్నాడు. శివుడు " దేవేంద్రా ! నా సారధి నాకంటే అధికుడై ఉండాలి. అలాంటి వాడిని నాకు సారధిగా నియమించండి " అన్నాడు. దేవతలు మునులతో సంప్రదించి బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి " బ్రహ్మదేవా ! నీవు కోరిన ప్రకారము ఆ దేవదేవుడు మా కోరిక మన్నించి త్రిపురాసుర సంహారముకు అంగీకరించారు. మేము అతడు కోరినట్లు రధమును సమకూర్చాము. కాని ఆయన కోరినట్లు మాకు అతడిని మించిన సారధి దొరక లేదు. రుద్రుడికి సారధ్యం వహించడానికి మీకంటే ఎవరూ మాకు కనిపించుట లేదు కనుక మీరు రుద్రుడికి సారధ్యం వహించాలి " అప్పుడు బ్రహ్మదేవుడు వారి కోరిక మన్నించి రుద్రుడికి సారధిగా ఉండటానికి అంగీకరించాడు. బ్రహ్మదేవుడు సారధిగా రధమును అధిరోహించగానే రధాశ్వములు ఇద్దరు మూర్తులను భరించ లేక కింద పడుకున్నాయి. బ్రహ్మదేవుడు ఆ అశ్వములను లేపి వాటికి బలము, శౌర్యము ఇచ్చి త్రిపురాసురులతో యుద్ధానికి సన్నద్ధం చేసాడు. అప్పుడు పరమశివుడు " బ్రహ్మ దేవా ! ఆ రాక్షసులు ఉన్న వైపు రధము పోనిమ్ము " అన్నాడు. బ్రహ్మదేవుడు వాయువేగ మనో వేగాలతో రధమును తోలాడు. అధర్వుడు, అంగీరసుడు తనకు చక్రరక్షకులుగా రాగా పరమేశ్వరుడు రాక్షసులతో యుద్ధానికి వెళ్ళాడు. అప్పుడు పరమేశ్వరుడు తన విల్లు ఎక్కు పెట్టి పాశుపతమును మనసున స్మరించి ఆ మూడు పురములను తలిచాడు. వెంటనే పరమశివుని సంకల్పము మేరకు మూడు పురములు ఒక చోట చేరాయి. అప్పుడు రుద్రుడు పాశు పతమును ప్రయోగించి త్రిపురములను దగ్ధం చేసాడు. కాని ఆ పాశుపతాగ్ని జ్వాలలకు మూడు లోకములు దహించుకు పోసాగాయి. అప్పుడు శివుడు ఆ అగ్ని జ్వాలలను ఆర్పి వేసాడు. మహా మునులు , దేవతలు పరమశివుని స్తుతించారు. కనుక శల్య మహారాజా మీరు కర్ణుడి కంటే అర్జునుడి కంటే కృష్ణుడి కంటే బలము శౌర్యములో గొప్ప వాడివి. నా జీవితము, నా రాజ్యము మీ చేతిలోఉన్నాయి.

## భార్గవరాముని కధ

సుయోధనుడు శల్యునితో భార్గవ రాముని గురించి చెప్పసాగాడు. " నా తండ్రి గారికి ఒక ధర్మ ప్రవీణుడగు బ్రాహ్మణుడు చెప్పగా విన్నాను. జమదగ్ని మహామునికి రాముడనే నిర్మల హృదయుడు పుత్రునిగా అవతరించాడు. అతడి శివుడి గురించి తపస్సు చేసి శివుని ప్రత్యక్షము చేసుకుని తనకు దివ్యాస్త్రములు ప్రసాదించమని కోరాడు. మహాశివుడు నేను ప్రసాదించు దివ్యాస్త్రాలు అశుచిగా ఉన్న వారిని దహిస్తాయి కనుక నీవు శుచి అయి వచ్చిన దివ్యాస్త్రములు లభించగలవు " అన్నాడు. రాముడు " నేను ఈ అస్త్రములు గ్రహించుటకు ఎప్పుడు పాత్రుడను అని నీవు తలుస్తావో అప్పుడే వాటిని నాకు ప్రసాదించ వచ్చు " అన్నాడు. ఒక రోజు శివుడు పార్వతికి పరశురాముని చూపి " దేవీ ఇతడు రాముడు. నన్ను నిష్కలంక చిత్తముతో ఆరాధిస్తున్నాడు. నాకు పరమ భక్తుడు " అన్నాడు. ఆ సమయంలో దేవతలు తమను రాక్షస బాధ నుండి రక్షించమని శివుని వేడారు. శివుడు భార్గవరాముని చూసి " వెంటనే నీవు వెళ్ళి రాక్షస సంహారం చెయ్యి " అన్నాడు. అందుకు రాముడు " దేవా ! నేను ఏ అస్త్రములు అభ్యసించ లేదు కనుక బలవంతులైన రాక్షసులను నేను సంహరించగలనా ! " అని సందేహం వెలిబుచ్చాడు. పరమశివుడు " రామా ! నేను నా సంకల్పము నీ మీద ఉంచుతాను. నా సంల్ప బలం చేత నీవు రాక్షసులను నిర్జించు " అన్నాడు. రాముడు రాక్షసులతో భయంకర యుద్ధము చేసి వారిని నిర్జించాడు. అప్పుడు రామునికి అయిన గాయాలను అతడి శరీరం అంతా శివుడు నిమరగానే మాయం అయ్యాయి. రామా నా స్పర్శ పొందిన నీకు ఎలాంటి ఆయుధములు తగిలినా గాయము కాదు. నా వద్ద వరములు పొందుటకిది తగిన సమయము " అన్నాడు. అప్పుడు రాముడు శివుడిని కోరి అనేక దివ్యాస్త్రములను ఆయుధములను పొంది తన ఆశ్రమముకు వెళ్ళాడు. తరువాత కర్ణుడు భార్గవ రాముని సేవించి అనేక దివ్యాస్త్రములను పొందాడు. హీనకులజుడైన కర్ణుడికి భార్గవరాముడు దివ్యాస్త్రములను ఎందుకు ఇస్తాడు. భార్గవ రాముని ఆదరణ పొందిన అతడు ఉత్తమ కులజుడనే తలుస్తాను. అతడి ఆజానుబాహువైన ఆకారము

దేవకుమారుని తలపిస్తుంది. ఒక సాధారణ స్త్రీ సకజ కవచకుండలములతో సూర్యప్రభలా వెలిగి పోయే బిడ్డను కనగలదా ! సూతుని చేత పెంచబడటము వలన కర్ణుడికి సూతుడనే అపవాదు వచ్చింది. కనుక శల్య మహారాజా ! శివుడి శిష్యుడైన భార్గరాముని శిష్యుడైన కర్ణుడికి సారధివై రుద్రుడికి బ్రహ్మదేవుడు సారధి అయినట్లు రధికుడికంటే సారధి గొప్పవాడన్న కీర్తి నిలబెట్టు " అన్నాడు.

## కర్ణ సుయోధనులు శల్యుని శ్లాఘించుట

సుయోధనుడి యుక్తాయుక్తమైన మాటలకు శల్యుడు పొంగి పోయాడు. సుయోధనుడిని ఆదరంతో కౌగలించుకున్నాడు. సుయోధనా ! నన్నూ నా పరాక్రమాన్ని నీవు గ్రహించి మెచ్చుకుని నాకు ఆనందం కలిగించావు. కాని ఒక్క మాట నేను నాకు తోచినట్లు మాట్లాడి సలహాలు ఇస్తుంటాను. మీరు కోపించక ఓపికగా ఏమీ అనుకోకుండా వినాలి " అన్నాడు. కర్ణుడు " మహానుభావా ! ఆ పరమేశ్వరునికి బ్రహ్మవలె, అర్జునుడికి శ్రీకృష్ణుడి వలె నాకు సారధ్యం వహించు " అన్నాడు. శల్యుడు " నేను ఇంద్రుడికైనా ! సారధ్యం వహించ గలను. నా రధికుని క్షణమైనా ఏమరిపాటుగా ఉండనివ్వను. కృష్ణుడి సారధ్యంలో ఘనుడైన అర్జుడిని గెలువడానికి నా సారధ్యము కోరుతున్నావు కనుక నేను నీకు సారధ్యం వహిస్తాను " అని అన్నాడు. సుయోధనుడు " కర్ణా ! కృష్ణుడికంటే శల్యుడు సారధ్యంలో సమర్ధుడు. ఇంద్రుడి సారధి మాతలికంటే కూడా శల్యుడు ఘనుడు అటువంటి మహాఘనుడు నీ భాగ్యవశాత్తు నీకు సార్ధ్యం వహిస్తున్నాడు. ఇక నీవు అర్జునుడిని గెలువగలవు " అన్నాడు. వెంటనే శల్యుడు కర్ణ సార్ధ్యానికి తగిన రధమును సమాయత్తం చేయమని చెప్పాడు. రధముకు పూజాది కార్యములు నిర్వహించారు. కర్ణుడు రధముకు ప్రదిక్షిణము చేసి శల్యుని ముందుగా రధమును అధిరోహించమని తాను తరువాత రధమును అధిరోహించాడు. ఆ ప్రకారముగా శల్యుడి సారధ్యంలో కర్ణుడి రధము యుద్ధముకు కదిలింది " అన్నాడు సంజయుడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభ్రువాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

# కర్ణ పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# రెండవ అశ్వాసం

కర్ణుడికి శల్యుడు సారధ్యం వహించడానికి అంగీకరించిన పిదప సుయోధనుడు కర్ణుని చూసి " కర్ణా ! భీష్ముడు, ద్రోణుడు పాండవులను సంహరిస్తారని ఆశించాను. కాని వారికున్న పాండవపక్షపాతం కారణంగా నా ఆశ నెరవేర లేదు. కనీసం నీవైనా ధర్మరాజును బంధించి పాండవ సైన్యాలను నిర్మూలించి నా మనసుకు ఆనందం కలిగించు " అన్నాడు. కర్ణుడు శల్యునితో " నేను వేయు నారాచములు మొదలగు బాణములు చూసి పాండవులు భయపడతారు. నా భుజబలం చూసి దేవతలు మెచ్చుకుంటారు. నీవు కూడా మెచ్చుకునేలా యుద్ధం చేస్తాను " అన్నాడు.

## శల్యసారధ్యము

కర్ణుడి మాటలు విన్న శల్యుడు " కర్ణా ! పాండవులు సత్యసంధులు, భుజబల పరాక్రమవంతులు, తేజో మూర్తులు, అస్త్రశస్త్ర పారంగతులు, దివ్యాస్త్రసంపన్నులు, అఖిల శాస్త్రపారంగతులు ఇంద్రునికే భయం కలిగించకలిగిన మహిమాన్వితులు వారిని గురించి నీవు ఇలా మాటాడతగదు. అర్జునుని గాండీవ ధ్వని నీ చెవులు బద్దలు చేస్తుంది, భీముడి గదా నైపుణ్యం నీ కళ్ళను మిరుమిట్లు కొల్పుతుంది. పాండవులు వారి పరాక్రమంతో నిన్ను గజగజలాడించగలరు. అర్జునుడి శరాఘాతానికి నీ రధము కూలుతుంటే, భీముని గధాఘాతాలకు గజసైన్యములు కూలుతున్నప్పుడు, ధర్మరాజు నకులసహదేవులతో చేరి నీ సైన్యాలను చీల్చి చెండుతున్న సమయంలో నీవు ధైర్యంగా నిలిచి ఉంటే నీ మాటలు నమ్మగలను " అన్నాడు. ఆ మాటలు వినీ వననట్లు కర్ణుడు " శల్యా ! నా పరాక్రమము చూపిస్తాను పాండవుల ఎదుటకు రధము పోనిమ్ము. నేను విల్లు ఎక్కుపెడితే దేవేంద్రుడు కూడా నా ముందు నిలువలేడు. అసలు పాడవుల బలం ఏపాటిదని భీష్ముడు, ద్రోణుడు వారి చేతిలో చచ్చారు. నీవు చూస్తూ ఉండు నేను అర్జునుడిని చిటెకెలో సంహరిస్తాను. పాండుకుమారులు ఒక్కుమ్మడిగా నా మీద పడినా నేను జంకక పాడవసైన్యాలను చీల్చి చెండాడి భీష్మ, ద్రోణులు పోయినా సుయోధనుడికి విజయం చేకూర్చడానికి దివ్యాస్త్రసంపన్నుడైన కర్ణుడు ఉన్నాడని నిరూపిస్తాను " అని పగల్భాలు పలికాడు.

### శల్యుడు కర్ణుడి ప్రగల్భాలను త్రోసి పుచ్చుట

కర్ణుడి మాటలకు శల్యుడు నవ్వుకుని " కర్ణా ! ఎందుకయ్యా ఈ వ్యర్ధ ప్రగల్భాలు. ఎవరైనా వింటే నవ్వగలరు. నీవు ఎప్పటికీ అర్జునుడికి సరిరావు. అది అందరికీ తెలుసు. అర్జునుడి చేతిలో ఓడి పోయిన గంధర్వుడు అంగారపర్ణునికన్నా, సుయోధనుడిని బంధించిన చిత్రసేనుడికన్నా, వరాహం కొరకు అర్జునుడితో పోరిన పరమేశరుడికన్నా నీవు ఎందులో గొప్పవాడివి. వారిలో ఎవరికీ సరి పోలని నీవు అర్జునుడిని గెలుస్తానని అనడం నోటి దురదగాక మరేమి. కర్ణా ! ఉత్తర గోగ్రహణ సమయాన అర్జునుడి చేతిలో మీరు పొందిన భంగపాటు అప్పడే మరిచావా ! లేక అర్జునుడి బాణములు అప్పడే తుప్పు పట్టాయని అనుకున్నావా ! ఇంతకు ముందులా కాకుండా ప్రాణాలకు తెగించి అర్జునుడితో పోరాడుతానని అన్నావు కదా! అదే నిజమౌతుందేమో ! ఎందుకంటే అర్జునుడి చేతిలో నువ్వు చచ్చినా ! నీ మాట నిలబడుతుంది " అన్నాడు. శల్యుని మాటలకు కర్ణుడికి కోపము కట్టలు తెంచుకున్నా ఆపుకుని " శల్యా ! నీవు అర్జునుడిని పొగడడమే పనిగా పెట్టుకున్నావు. నేను అర్జునుడితో యుద్ధము చేస్తున్నప్పుడు ఎవరు పరాక్రమవంతులో చూసి అప్పుడు పొగుడు. అప్పటి వరకు నోరుమూసుకుని రధము నడుపు " అని అన్నాడు. శల్యుడు నవ్వుకుంటూ రధము తోలుతున్నాడు. కర్ణుడు తన పక్కన ఉన్న సైనికులను చూసి " సైనికులారా ! అర్జునుడేడి నాకు చూపించండి. అర్జునుడి రధం ఎక్కడుందో చూపిన వారికి నేను కోరిన కానుకలు ఇస్తాను " అని కర్ణుడు తన శంఖం పూరించాడు. ఆ మాటలకు శల్యుడు పకపకా నవ్వి " కర్ణా ! అర్జునుడిని ఒకరు చూపేదేమిటి నువ్వే చూడగలవు. నీ వద్ద ధనం ఎక్కువగా ఉంటే దానిని సద్వినియోగపరచాలి గాని ఇలా అపాత్రాదానాలు చేయకూడదు. అయినా కర్ణా ! ఎక్కడైనా నక్క సింహాన్ని జయిస్తుందా! అర్జునుడితో స్వయంగా యుద్ధము చేయడము అంటే

నీకు నీవే అగ్నిలో ప్రవేశించడమే ! అందుకని ఎల్లప్పుడూ నీ సైన్యమును దగ్గర ఉంచుకో. నేను సుయోధనుడికి మిత్రుడను కనుక ఇదంతా నీకు రుచించకున్నా ఇది చెప్తున్నాను. నా మీద కోపగించక నా మాట విను " అన్నాడు. కర్ణుడు కోపంతో " శల్యా ! నేను నీమాటలకి భయపడను. ఇంద్రుడు అడ్డుపడినా అర్జునుడితో ఒంటరిగా యుద్ధము చేయక వదలను. ముందు రధము పోనిమ్ము " అన్నాడు. కర్ణుడిని ఇంకా ఉడికించాలని శల్యుడు " కర్ణా ! నా మాటలు నీ చెవికి ఎక్కవులే అర్జునుడి గాండీవం నుండి జనించే శబ్దం నీ చెవులు బద్దలు కొడుతుండగా గాండీవం నుండి వర్షంలా వచ్చి పడే బాణములు నీ మీద పడే వరకు నీకు బుద్ధి రాదులే ! కర్ణా ! అర్జునుడితో ద్వంద యుద్ధము అంటే మాటలా ! సింహముతో జింకపిల్ల, ఏనుగుతో కుందేలు, పులితో నక్క, గ్రద్దతో పాము యుద్ధము చేయడం లాంటిది. నీకు అర్జునుడితో పోరాడగలిగిన బలము, శక్తి, సామర్ధ్యము ఉన్నాయంటావా " అన్నాడు.

## కర్ణుడు శల్యుని మీద ఆగ్రహించుట

శల్యుడి మాటలకు కర్ణుడి ఆగ్రహం హద్దులు దాటింది. " శల్యా ! ఆపు నీ అధిక ప్రసంగం. గుణవంతుడి నైన నా వంటి వాడి గుణాలు గుణహీనుడవైన నీకేం తెలుసు. అర్జునుడి గురించి నాకు తెలిసినంతగా నీకేం తెలుసు. నాకు క్రిష్ణార్జునుల బలాబలములు తెలుసు కనుకనే నేను వారిని సంహరిస్తానని నమ్ముతున్నాను. నా చేత నిత్యమూ పూజలందుకుంటున్న సర్పముఖాస్త్రము నుండి తప్పించు కొనుటకు కృష్ణార్జునులే కాదు మరెవ్వరికి సాధ్యము కాదు. అది తప్పితే భార్గవాస్త్రముతో చంపుతాను. కనుక అర్జునుడికి నా చేత చావు తథ్యము. కృష్ణార్జునుల కపిధ్వజము, గాండీవము నన్ను భయపెట్ట లేవు. వెయ్యి మంది కృష్ణులు పది వేల మంది అర్జునులూ వచ్చినా బెదరక పోరాడగలను పాండవపక్షపాతముతో నీటికి వచ్చినట్లు మాట్లాడక రధము పోనిమ్ము ఇంకా ఇలా మాటాడుతూ ఉంటే నీ ప్రాణములు నీ చెంత ఉండవు " అన్నాడు కర్ణుడు. శల్యుడు ఏదో మాట్లాడబోయే సమయంలో " శల్యా ! ఆగు నీవు నీచుడివి, పాపాత్ముడవు, క్షత్రియాధముడవు నీకు దుర్బుద్ధి కాక సద్బుద్ధి ఎలా ఉంటుంది. మీ మద్రదేశం వాళ్ళంతా దుష్టులు, దుర్మార్గులు, మిత్రద్రోహులు. నీకూ ఆ గుణముల లేకుండా ఉంటాయా ! మీ దేశం వాళ్ళంతా వావి వరసలు లేకుండా ఆడామగా కలుస్తారట కదా ! అది మీకు తప్పు కాదట. పుట్టిన శిశువులకు తల్లి పాలకంటే ముందే మధ్యం సేవించే మీకు ఉత్తమ గుణములు ఎలా వస్తాయి. నిత్యమూ మధ్యపాన మత్తులో వావివరసలు లేక తిరుగుతూ ఎవరు ఎవరికి పుట్టారో కూడా తెలియని మీకు గుణము శీలము గురించి ఎలా తెలుస్తుంది. నీవు శత్రుపక్షం మేలు కోరే వాడివని నాకు తెలియదా ! యుద్ధమున శత్రువులను తనుమాడి వీర మరణం చెందినా చెందుతాను గాని యుద్ధము చేయుటకు వెనుకాడను. నాకు ఇంకా కోపం తెప్పిస్తే ఈ గధతో నీ తల బద్దలు కొడతాను. రధమును పోనిమ్ము " అన్నాడు.

### శల్యుడు కర్ణుని సమాధానపరచుట

శల్యుడు " అదేమిటి కర్ణా ! అలా అంటావు ఉన్న మాట చెప్పడంలో తప్పేమిటి. సుయోధనుడికి సాయం చేయ వచ్చాను కనుక అతడికి అతడి మిత్రుడవైన నీకు నాకు తోచిన హితవు చెబుతున్నాను. సారధి అంటే ఏమిటి ? అశ్వముల బలము, రధికుని బలము, రధికుని పరిస్థితి తెలిసి మెలగాలి. సమయస్ఫూర్తితో రధికుని కాపాడుతుండాలి. ఆయుధప్రయోగము, యుద్ధములో మెళుకువలు తెలిసి ఉండాలి. అన్నీ తెలిసిన నేను నీ హితవు కోరి నాకు తోచిన మాటలు చెప్పడంలో తప్పేమిటి. నీకు కోపం వచ్చినా సారధిగా చెప్పడం నా ధర్మము, నీతి. నేనేం తప్పు చేసానని నా తల బద్దలు కొడతావు. నీవు ఎన్ని చెప్పినా నీ శ్రేయోభిలాషిగా నీకు హితవు చేయక మానను. నీకు ఒక దృష్టాంతం చెప్తాను విను . అది విని నీవు నేను చెప్పినట్లు చేయక పోయినా నాకు బాధ లేదు.

### కాకి హంసల కధ

ఒక దీవిలో ధర్మవర్తనుడైన ఒక వైశ్యుడున్నాడు. అతడు యజ్ఞ యాగాదులు చేసిన సత్కర్ముడు. కరుణా మూర్తి, దాన శీలుడు, శాంతి వంతుడు ఉత్తముడు. అతడు ధనధాన్యములతో శోభిల్లుతున్నాడు. అతడికి అనేక మంది సంతానము ఉన్నారు. వారి ఇంటికి ఒక కాకి వచ్చింది. అతడి కుమారులు ఆ కాకికి తాము తినగా మిగిలిన అన్నము పెట్టి పెంచసాగారు. వారు పెట్టిన ఆహారము తిని బలిసిన ఆ కాకి మిగిలిన పక్షులను నిర్లక్ష్యము చేయసాగింది. కొంత కాలానికి ఆ దీవికి కొన్ని హంసలు వచ్చాయి. అవి చాలా పెద్దవి. వైశ్యకుమారులు కాకిని చూసి " ఓ కాకీ ! ఆ హంసలు చూడు ఆకాశంలూ ఎంత అందంగా విహరిస్తున్నాయో. నీవు కూడా అలా విహరించి వాటిని ఓడించాలి " అన్నారు. మూర్ఖులైన వారి మాటలు విని ఆ కాకి హంసలను " నాతో సమానంగా ఎగురగల వారు మీలో ఎవరైనా ఉన్నారా ! " అన్నది. ఆ హంసలు " ఓ కాకి ! మేము మానసరోవరంలో విహరించే హంసలము. మాకు ఎంత దూరం ఎగిరినా అలుపుండదు. నీవేమో మాలో బలవంతులెవరని

అడుగు తున్నావు. అసలు కాకులు ఎక్కడైనా హంసలతో సమానంగా ఎగురగలవా " అన్నాయి. కాకి " నేను నూటొక్క రీతుల ఎగురగలను. శతయోజనముల దూరము పోగలను. భూమి నుండి నేరుగా ఆకాశంలోకి ఎగిరి భూమి మీదకు రాగలను. నేను ఎలాంటి హంసనైనా ఓడించగలను " అన్నది. వాటిలో ఒక హంస ముందుకు వచ్చి " నీవు చిత్ర విచిత్ర రీతుల ఎగురగలవా ! అయితే నాతో సమానంగా ఎగురు " అన్నది. అక్కడ ఉన్న మిగిలిన కాకులు వద్దు నీవు హంసతో సమానంగా ఎగుర లేవు " అన్నా వినక ఆ కాకి హంసతో పోటీ పడింది. హంస మెల్లగా ముందుకు పోసాగింది. కాకి వేగంగా ముందుకు వెళ్ళి హంసను దాటి ముందుకు వెళ్ళి తిరిగి హంస వద్దకు వచ్చి " నీవు ఇంకా ఇక్కడే ఉన్నావా " అని చెప్పి ముందుకు సాగింది. ఇది చూసిన కాకులు హంసను గేలి చేసాయి. కొంత సమయానికి కాకికి ఆయాసం వచ్చింది. కాని హంస అలుపెరుగక ముందుకు సాగింది. కాకి హంసతో పోటీ పడ లేక వెనుకబడి " అయ్యో ! అనవసరంగా హంసతో పోటీ పడ్డానే ఎక్కడ దిగుదామన్నా నేల కానరాలేదు. కింద పడ్డానంటే జలచరాలు తినేస్తాయి " అని దిగులుగా ఎగర సాగింది. ఆ కాకిని చూసిన హంస ఇది ఏరకమైన విన్యాసమ్ము నా కంటే వెనుక బడ్డావు ఎందుకు అన్నది. ఎగరడానికి బలం చాలక అంతకంతకు కిందకు పోతూ ఆ కాకి " వైశ్యకుమారులు పెట్టిన ఎంగిలి మెతుకులు తిని కొవ్వెక్కి నాకంటే బల వంతులు లేరని గర్వించాను. గరుత్మంతుని కూడా గెలువగలనని తలిచాను. ఇప్పుడు నా బలమేమిటో తెలిసింది. దయ చేసి నన్ను తీసుకు వెళ్ళి మిగిలిన కాకులతో చేర్చు " అని వేడుకుంది. హంస నీటిలో మునుగబోతున్న కాకిని తన కాళ్ళతో పట్టుకుని ఒడ్డుకు చేర్చింది. " ఇటువంటి తెలివి తక్కువ పని ఇక ఎప్పుడూ చేయకు " అని మిగిలిన కాకులు మందలించాయి .

## శల్యుడు కర్ణుడిని హేళన చేయుట


కాకి హంసల కధ చెప్పి కర్ణుడిని హేళన చేయుచున్న శల్యుడు

కాకి హంసల కధ చెప్పిన శల్యుడు " కర్ణా ! కాకి కధ విన్నావు కదా ! వైశ్యకుమారులు పెట్టిన ఎంగిలి మెతుకులు తిని కాకి గర్వించినట్లు నీవు కూడా కురు కుమారులు పెట్టిన మృష్టాన్నములు తిని గర్వించి హంసతో పోటీ పడిన కాకిలా నీకంటే బలవంతుడైన అర్జునుడిని గెలవగలనని ప్రగల్భములు చెప్తున్నావు. దీని వలన హాని నీకే ఉత్తర గోగ్రహణ సమయాన నీ ముందే నీ తమ్ముని సంహరించి గోవులను మరలించినపుడు నీవేమైనావు? ఘోషయాత్ర సమయాన సుయోధనుడిని వదిలి ఎందుకు పారిపోయావు ? నాడు నిండు సభలో కృష్ణార్జునుల భుజబలం గురించి మహర్షులు చెప్ప లేదా ! ఆ మాటలు విని కూడా నీవు అర్జునుడితో తలపడటానికి సాహసిస్తున్నావు. అర్జునుడితో ఆ పరమశివుడు కూడా పోటీ పడలేడు. కనుక నీకు తగిన వీరులతో పోటీపడుట మంచిది. నీ మంచి కోరి ఇది చెప్తున్నాను " శల్యుడు.

### కర్ణుడు శల్యునికి బదులు చెప్పుట

శల్యుని మాటలకు " అదేమిటి శల్యా ! నేను కృష్ణార్జునుల బలము తెలియక వారితో యుద్ధముకు తలపడుతున్నానా ! నీవు ఎన్ని చెప్పినా ! కృష్ణార్జునులతో యుద్ధము చేయక మానను. ఈ యుద్ధములో చివరకు నేనో అర్జునుడో ఎవరో ఒకరే మిగలాలి. వ్యర్ధముగా మాటాడక రధము నడుపుము " అని తిరిగి " శల్యా ! నాకు పరశురాముడి కోపము, బ్రాహ్మణ శాపం ఉన్నాయి. లేకున్న నేను అర్జునుడిని లక్ష్యపెట్టను. నేను అస్త్రవిద్య నేర్చుకొనుటకు పరశురాముడి వద్దకు వెళ్ళినపుడు ఆయన నన్ను నా కులము ఏమిటని అడిగాడు. పరశురాముడు బ్రాహ్మణులకు క్షత్రియులకు తప్ప వేరెవరికి అస్త్ర విద్య నేర్పడు కనుక, నేను బ్రాహ్మణుడనని అబద్ధము చెప్పి అస్త్ర విద్య అభ్యసించాను. నాకు ఎన్నో అస్త్రశస్త్రములు నేర్పి బ్రహ్మాస్త్ర ప్రయోగము కూడా నేర్పాడు. బ్రహ్మాస్త్రము మాత్రము అత్యవసర సమయమున ఆపదలో ఉన్నప్పుడు మాత్రము ఉపయోగించమని చెప్పాడు. ఒక నాడు నా గురువు పరశురాముడు అలసి పోయి నా తొడ మీద తల పెట్టి నిద్రిస్తున్నాడు. అప్పుడు ఒక పురుగు నా తొడను తొలవ సాగింది. నేను నా గురువుకు నిద్రా భంగము ఔతుందని బాధను సహించాను. ఆ పురుగు చేసిన గాయం నుండి స్రవించిన రక్తము తగిలి నా గురువు నిద్ర లేచాడు. నా నుండి జరిగిన విషయం తెలుసుకుని నా సహనశక్తికి పరశురాముడు ఆశ్చర్యపడ్డాడు. అప్పుడు నా గురువు " నిజం చెప్పు నీవు బ్రాహ్మణ కుమారుడివా ! బ్రాహ్మణ కుమారుడికి ఇంత సహనశక్తి అరుదు " అని అడిగాడు. నేను భయపడుతూ బ్రాహ్మణుడను కాను సూత కుమారుడనని చెప్పాను. నేను అతడిని అసత్యముతో వంచించినందుకు ఆగ్రహించి పరశురాముడు ఆపద సమయంలో బ్రహ్మాస్త్రము, భార్గవాస్త్రము గుర్తుకు రావని శపించాడు. పరశురాముడి శాపమే కాక నాకు మరొక బ్రాహ్మణ శాపం కూడా తగిలింది. ఒకసారి నేను అస్త్రవిద్యను అభ్యసిస్తుండగా నా బాణము గురి తప్పి ఒక ఆవు దూడకు తగిలి మరణించింది. ఆ బ్రాహ్మణుడు " హోమధేనువు అయిన

దూడను చంపావు కనుక నీ ప్రాణములు యుద్ధ భూమిలో హరించబడతాయి అని శపించాడు. నీ రథచక్రములు భీమిలో దిగబడతాయి. నీవు ఎవరిని చంపాలని ఇన్ని అస్త్రవిద్యలు నేర్చావో వారి చేతిలో నీవు సంహరించబడతావు " అన్నాడు. నేను భయపడి " బ్రాహ్మణోత్తమా ! నీవు కోల్పోయిన ధేనువుకు బదులుగా వెయ్యి ఆవులు, ఆరు వందల ఎద్దులు, నూరు రథములు, నూరు మంది స్త్రీలను, ఏడు వందల ఏనుగులను ఇస్తాను. నన్ను శాపవిముక్తుడిని చెయ్యి " అని వేడుకున్నాను. కాని ఆ బ్రాహ్మణుడు నన్ను కరుణించ లేదు " నా శాపముకు తిరుగు లేదు. కాని ఉత్తమ గతులు పొందటానికి నా శాపము అడ్డు రాదు " అన్నాడు. శల్యా ! నేను గురు శాపముకు బ్రాహ్మణ శాపముకు భయపడుతున్నాను కాని కృష్ణార్జునులకు కాదు. శల్యా ! నాకు ఇంకా బ్రహ్మాస్త్రము గుర్తుకు వస్తుంది రథమును అర్జునుడి ముందు నిలుపు " అన్నాడు. అప్పుడు శల్యుడు తనలో తాను " నా పలుకులు విని కర్ణుడు తాను అర్జునుడి చేతిలో మరణించడం తథ్యము అనుకుంటున్నాడు. అందుకే బ్రాహ్మణ శాపము, గురు శాపము, తనలోవున్న లోపాలను గురించి అందరికీ చెప్పాడు. నేను అర్జునుడి బలపరాక్రమములు వివరించడం వలన వీడి మనసు బాగా బలహీన మైంది. ధర్మరాజుకు ఇచ్చిన మాట నెరవేర్చుకున్నట్లే " అనుకున్నాడు.

## శల్యుడు కర్ణుడు ఒకరిని ఒకరు నిందించు కొనుట

తనను కాకితోను అర్జునుడిని హంసతోను పోల్చడం కర్ణుడికి కోపానికి కారణం అయింది అతడు ఇక సహించ లేక " నీచుడా ! నన్ను ఇలా నీచంగా పోలుస్తావా ! అయినా నీచులకు నీచమైన మాటలే కదా వస్తాయి. అర్జునుడి పరాక్రమము గురించి నిన్ను అడిగానా అనవసరంగా అర్జునుడిని పొగిడి మిత్రుడినైన నాకు ద్రోహము చేస్తావా ! యుద్ధములో శత్రుపక్షమును పొగిడి వారిని క్షమించ కూడదు. సుయోధనుడు నిన్ను నాకు సూతుడుగా నియమించాడు కనుక ఊరక ఉన్నాను. సుయోధనునితో నా మైత్రి లోకోత్తరమైంది. నీవు నాకు బద్ధ విరోధివి. నీకు బాధ కలించేలా సుయోధనుడికి ఆనందం కలిగించేలా నేను అర్జునుడిని గెలుస్తాను. నా రథము భూమిలో కూరుకు పోక నిలిచిన అర్జునుడిని గెలుచుట నాకు అసాధ్యము కాదు " అన్నాడు. శల్యుడు నవ్వి " కర్ణా ! ఏలనయ్యా ! ఈ వ్యర్ధ ప్రేలాపనలు. నీలాంటి కర్ణులు వేయి మంది అయినా అర్జునుడిని గెలువ లేరు " అన్నాడు. కర్ణుడు కోపము నిగ్రహించుకోలేక పోయాడు. శల్యా ! ఒక రోజు ఒక బ్రాహ్మణుడు బాహ్లిక దేశస్తులు మధ్యపాన మదోన్మత్తులని, మాంసభక్షకులని, దిగంబరంగా దురాచారాలు చేస్తారని అని నిందించాడు. వారికంటే మద్ర దేశస్తులు అవినీతి పరులని పేర్కొన్నారు. అలాంటి వారికి రాజువైన నీవు నోరుమూసుకు ఉండుట మంచిది " అన్నాడు. శల్యుడు " కర్ణా ! నీ గురించి తెలియనిదా ! భీష్ముని చేత నీవు అర్ధరథుడవు అనిపించుకోలేదా ! అంగదేశంలో జనులు ఆడవాళ్ళను అమ్ముకుంటారట కదా ! అలాంటి వారికి రాజువైన నీవు నన్ను అంటావా ! ఒకరిని అనే ముందు తమ తప్పు తాము తెలుసుసు కొనుట మంచింది " అన్నాడు. వారి వివాదము విన్న సుయోధనుడు వారి వద్దకు వచ్చి సముచిత మాటలతో సర్ధి చెప్పి ఇరువురను యుద్ధోన్ముఖులను చేసాడు.

## శల్యుడుపాండవ పరాక్రమమును శ్లాఘించుట

శల్యుడు " కర్ణా ! నీవు అర్జునుడిని జయించినచో నీవే మహారాజువు. మనకు ఈ రోజు దుశ్శకునము కానవస్తున్నాయి. యుద్ధము ఘోరంగా జరగబోయేలా ఉంది. కర్ణా ! అదుగో అర్జునుడి కపిధ్వజము. అర్జునుడు త్రిగర్త వీరులను చీల్చి చెండాడుతున్నాడు. కర్ణా ! ఎందుకైనా మంచిది. అర్జునుడిని గెలుస్తానని మనం మనం అనుకుని సంతోషిద్దాము. పెద్దగా అనకు పరువు పోతుంది. అర్జునుడిని గెలుచుట ఇంద్రునికైనా సాధ్యము కాని పని. కర్ణా అటు చూడు భీముడు, ధర్మరాజు, నకులసహదేవులు, ఉపపాండవులు అరివీర భయంకరులై ఎలా వెలిగి పోతున్నారో. ఎంతైనా పాండవులు ధర్మపరులు కదా ! కనుక ధర్మం ఎప్పుడూ వారినే వరిస్తుంది " అన్నాడు. కర్ణుడు బదులు చెప్పలేదు. సుయోధనుడు యోధులను చూసి " యోధులారా ! మీ బలపరాక్రమము చూపు సమయం ఆసన్నమైంది. అందరూ ప్రాణాల మీద ఆశ విడిచి యుద్ధము చేయండి. విజయమో వీర స్వర్గమో తేల్చుకోండి " అన్నాడు. అశ్వత్థామ " నా తండ్రిని చంపిన ధృష్టద్యుమ్నుని చంపి కాని ఈ కవచమును విప్పను. భీమార్జునులు అడ్డు వచ్చినా వారిని సంహరించి ధృష్టద్యుమ్నుడిని చంపుతాను " అన్నాడు.

## యుద్ధారంభం

యుద్ధము ఆరంభం అయింది. సుయోధనుడు భీముని తన గజ సైన్యముతో ఎదుర్కొన్నాడు. కర్ణుడు ధర్మరాజును ఎదుర్కొన్నాడు. ధర్మరాజు " అర్జునా ! అటు చూడు కర్ణుడు పరిష్టమైన వ్యూహముతో ఎదుర్కొన్నాడు. మనము కూడా అతడికి తగు రీతిన బదులు చెప్పాలి " అన్నాడు. అర్జునుడు " అన్నయ్యా ! కర్ణుడిని చంపడం పెద్ద పనే కాదు " అన్నాడు. ధర్మరాజు అయితే నీవు కర్ణుడిని గెలువుము, భీముడు సుయోధనుడిని, నకులుడు వృషసేనుడిని, సహదేవుడు సౌబలునీ, శతానీకుడు దుశ్శాసనుడిని, సాత్యకి కృతవర్మను, ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామను, ఉపపాడవులు శిఖండి కలిసి మిగిలిన

ధృతరాష్ట్ర పుత్రులను ఎదుర్కొంటారు. నేను కృపాచార్యుడిని ఎదుర్కొంటాను " అన్నాడు. కాని ఆ రోజు యుద్ధము ధర్మరాజు చెప్పినట్లు జరుగ లేదు. ఎవరి ఇష్టం వచ్చినట్లు వారు తలపడ్డారు. అర్జునుడు కర్ణుడిని ఎదుర్కొన్నాడు. మరొక పక్క సంశక్తులు అర్జునుడిని ఎదుర్కొన్నరు. అర్జునుడు కర్ణుడిని వదిలి సంశక్తులను ఊచకోత కోస్తున్నాడు. సంశక్తులు అర్జునుడిని చుట్టుముట్టారు. అర్జునుడు తన బాణములతో సంశక్తులను చీల్చి చెండాడాడు. కృపాచార్యుడు, కృతవర్మ, సౌబలుడు పాండవులతో పోరుతున్నారు. రక్తం కాలువలు కడుతూ ఉంది. రధములు విరుగుతున్నాయి. గజములు, హయములు చస్తున్నాయి. పదాతిదళముల కళేబరములతో రణభూమి నిండి పోయింది. సుయోధనుడు కర్ణుడికి సాయం వెళ్ళాడు. కర్ణుడు పాంచాల సేనను ఎదుర్కొన్నాడు. పాంచాల సేనకు ధీటుగా ఛేది సేన వచ్చి చేరింది. కర్ణుడు వారిని తరిమి తరిమి స్వర్గ ప్రాప్తి కలిగిస్తున్నాడు.

### కర్ణుడి విజృంభణ

తరువాత కర్ణుడు ధర్మరాజుని ఎదుర్కొన్నాడు. ధృష్టద్యుమ్నుడు కర్ణుడిని ఎదుర్కొన్నాడు. మరొక పక్క ప్రభద్రకులు కర్ణుడిని ఎదుర్కొన్నారు. కర్ణుడు ఏడు బాణములతో ప్రభద్రకులను ఎదుర్కొన్నాడు. అది చూసి పాంచాలురు మహా కోపంతో కర్ణుడి మీదకు వచ్చారు. కర్ణుడు ఇరవై అయిదు బాణములతో ఇరవై అయిదు పాంచాలురను వధించాడు. తరువాత భానుదేవుడు, సేనాబిందు, చిత్రసేనుడు, తపనుడు, శూరసేనుడు అను అయిదుగురు పాంచాలురు కర్ణుడిని ఎదుర్కొనగా కర్ణుడు అయిదు బాణములతో వారిని వధించాడు. కర్ణుడి వెంట అతడి కుమారుడు సుషేణుడు, వృషసేనుడు, సత్యసేనుడు వస్తున్నారు. అప్పుడు ధృష్టద్యుమ్నుడు, శిఖండి, భీముడు, జనమేజయుడు, సాత్యకి, నకుల సహదేవులు, ఉపపాండవులు, కేకయ, మత్స్య యోధులు కర్ణుడిని ఎదుర్కొన్నారు. వారంతా కర్ణుడి మీద అతడి కుమారుల మీద బాణములు గుప్పించారు.

## భీమసేనుడు

అది చూసి సుయోధనుడు, దుశ్శాసనుడు, వారి కుమారులు, గజసైన్యముతో వచ్చి భీముని ఎదుర్కొని సుయోధనుడు అతడి మీద శరవర్షం కురిపించాడు. భీముడు వాటిని చిన్నా భిన్నం చేసి సుయోధనుడి మీద పదునైన బాణములు ప్రయోగించాడు. వాటి ధాటికి సుయోధనుడు అతడి సైన్యము నిలువలేక పోయింది. భీముని ధాటకి గజములు కూలుతున్నాయి. హయములు ప్రాణములు కోల్పోతున్నాయి. అప్పుడు కృపాచార్యుడు భీముని ఎదుర్కొన్నాడు. దుశ్శాసనుడు, కర్ణుడి కుమారులు అతడికి సాయంగా వచ్చి భీముని ఎదుర్కొన్నారు. కర్ణుడి కుమారుడు సుషేణుడు భీముని విల్లు విరిచి ఏడు బాణములు అతడి గుండెలో దిగేలా వేసాడు. భీముడు సుషేణుడి విల్లు విరిచి అతడి మీద పదునాలుగు బాణములు వేసాడు. కర్ణుడి మీద పదునాలుగు బాణములు ప్రయోగించాడు. ఇంతలో కర్ణుడి కుమారుడు అత్యసేనుడు భీముని ఎదుర్కొన్నాడు. భీముడు అతడి సారధిని చంపి, ధ్వజమును కొట్టి మరొక పదునైన బాణము వేసి సత్యసేనుడి శిరస్సు ఖండించాడు. తరువాత కృతవర్మ, కృపాచార్యుల ధనస్సును ఖండించి వారిని క్రూరమైన బాణములతో కొట్టాడు. దుశ్శాసనుడి మీద అయిదు బాణాలను సౌబలుడి మీద ఆరు బాణములను వేసి ఉలూకుని అతడి తమ్ముని రధములు విరిచాడు. కర్ణుడి కుమారుడైన సుషేణుడిని చూసి " ఒరి సుషేణా ! ఈ రోజుతో చచ్చావురా ! అంటూ పదునైన బాణములను అతడి మీద ప్రయోగించాడు. కర్ణుడు ఆ బాణములు మద్యలో తుంచి భీముడి మీద అతి క్రూరమైన మూడు బాణములు వేసాడు. భీముడు తిరిగి సుషేణుడి మీద బాణములు గుప్పించాడు. కర్ణుడు ఆ బాణములను విరిచి భీముని మీద డెబ్బై మూడు బాణములు గుప్పించాడు.

## కురు పాండవ యోధుల సమరం

ఆ సమయంలో నకులుడు కర్ణుడిని ఎదుర్కొన్నాడు. మద్యలో సుషేణుడు నకులుని మీద బాణవర్షం కురిపించి నకులుని విల్లు విరిచాడు. నకులుడు మరొక విల్లు తీసుకుని సుషేణుడి విల్లు విరిచాడు. సుషేణుడు మరొక విల్లు తీసుకుని నకులుని మీద అరవై బాణములు సంధించాడు. నకులుడికి సాయంగా వచ్చిన సహదేవుడి మీద సుషేణుడు ఏడు బాణములు వేసాడు. నకుల సహదేవులిద్దరూ సుషేణుడితో ఘోరంగా యుద్ధము చేస్తున్నారు. సుషేణుడి తమ్ముడు వృషసేనుడు సాత్యకిని ఎదుర్కొని అతడి మీద డెబ్బై ఏడు బాణములు వేసి అతడి సూతుడి మూడు బాణములు వేసాడు. సాత్యకి ఆగ్రహించి వృషసేనుడి విల్లు విరిచి, హయములను చంపి ,పతాకమును విరిచి, అతడి గుండెలకు గురిపెట్టి బాణము వేసి నొప్పించాడు. వృషసేనుడు కత్తి డాలు తీసుకుని సాత్యకిని ఎదుర్కొన్నాడు. సాత్యకి వృషసేనుడి కత్తి డాలు విరిచాడు. అప్పుడు దుశ్శాసనుడు వచ్చి సుషేణుడిని తన రధము మీద ఎక్కించుకుని వెళ్ళాడు.

## కర్ణుడి పరాక్రమము

కర్ణుడు సాత్యకిని ఎదుర్కొని సాత్యకి రధము కూల్చాడు. సాత్యకి మరొక రధము తీసుకుని కర్ణుడిని ఎదుర్కొన్నాడు. ఇంతలో ఉపపాడవులు, ధృష్టద్యుమ్నుడు, శిఖండి, భీముడు,నకుల సహదేవులు సాత్యకికి సాయంగా వచ్చారు. కర్ణుడికి సాత్యకి కి మధ్య ఘోరయుద్ధము జరిగింది. సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, ఉపపాడవులు కలిసి కర్ణుడి మీద శరవర్షం కురిపించాడు. కర్ణుడు వారందరి రధములను విరిచి వారిని విరధులను చేసాడు. కర్ణుడు ధర్మరాజును ఎదుర్కొన్నాడు. ఛేదిసైన్యము ధర్మజునికి సాయంగా వచ్చింది. కర్ణుడు వారిని అందరిని తరుముతున్నాడు. ఇంతలో సాత్యకి, శిఖండి మరి కొందరు వీరులు ధర్మజుడికి సాయం వచ్చారు. వారి మధ్య యుద్ధం తీవ్రమైంది. కర్ణుడి పరాక్రమము ముందు పాండవసేనలు వెలవెలబోయాయి. కర్ణుడు ధర్మరాజు ధనస్సును ఖండించి తొంభై బాణములు ప్రయోగించి ధర్మరాజు కవచమును చీల్చాడు. ధర్మరాజు శక్తి ఆయుధమును కర్ణుడి మీద విసిరాడు. కర్ణుడు శక్తి ఆయుధమును ముక్కలు చేసాడు. ధర్మరాజు కర్ణుడి శరీరమంతా బాణములతో కొట్టాడు. కర్ణుడు ధర్మరాజు కేతనము విరిచి అతడి సారధిని చంపాడు. సాత్యకి, శిఖండి కర్ణుడి మీద శరములు గుప్పించారు. కర్ణుడు వారి రధములు విరిచి వారి ధనస్సులు విరిచి ధర్మరాజు శరీరం అంతా వాడి అయిన బాణములు దించాడు. కర్ణుని పరాక్రమము తట్టుకో లేక ధర్మరాజు తన రధమును పక్కకు మళ్ళించి యుద్ధ భూమి నుండి తొలగి పోయాడు. కర్ణుడు ధర్మరాజు వెంట తరిమి పరిహాసంగా " ఓ ధర్మరాజా ! క్షత్రియ కులములో పుట్టావు. ధర్మాధర్మ విచక్షణ తెలిసిన వాడివి ఇలా భీరువులా యుద్ధ భూమిని వదిలి ప్రాణభయంతో పారిపోతగునా ! నీకు రాజ నీతి తెలియదు. నీవు బ్రాహ్మణుడి వలె పిరికి వాడివి. నా వంటి వీరులతో నీవు పోరాడి గెలువ లేవు. నేను నిన్ను చంపను నీకు యుద్ధం ఎందుకు వెళ్ళి యజ్ఞయాగాదులు చేసి జీవించు. కృషార్జునులు ఉన్న చోటుకు వెళ్ళి దాక్కో " అన్నాడు. ధర్మరాజు సిగ్గుతో తలవంచు కుని అక్కడి నుండి వెళ్ళాడు. కర్ణుడు ధర్మరాజును వదిలి అతడి సైన్యమును హతమారుస్తున్నాడు. పాండవ సైన్యము పారిపోయింది. కౌరవ సైన్యము జయజయ ధ్వానాలు చేసాయి.

## భీమసేనుడి పరాక్రమము


అనేకమంది ధార్తురాష్ట్రులను కౌరవ యోధులను చంపుచున్న భీముడు

ధర్మరాజును కర్ణుడు అవమానించడం చూసిన భీమసేనుడు సాత్యకి ధృష్టద్యుమ్నులతో " నా అన్న భంగపాటు నాకెంతో బాధకలిగించింది. నా అన్నను అవమానించిన కర్ణుడి మీద పగతీర్చుకోవాలి. మీరిద్దరూ ధర్మరాజును కాపాడండి నేను వెళ్ళి కర్ణుడి అంతు చూస్తాను. ఈ రోజు నేనో కర్ణుడో ఎవరో ఒకరే ఉండాలి " అన్నాడు. మహా క్రోధంతో తమ వైపు వస్తున్న భీముని చూసి శల్యుడు " కర్ణా ! అడుగో భీముడు ఆగ్రహంతో వస్తున్నాడు. భీముడు కోపించిన మూడులోకాలు నిలువ లేవు. నీవు అతడిని ఎదుర్కొని నీ బలపరాక్రమలు చూపించు " అన్నాడు. కర్ణుడు " శల్యా ! భీముడు అల్పుడు, అతడు పరాక్రవంతుడా ! అతడిని చంపితే నాకేమి కీర్తి వస్తుంది. అతడిని చంపక యుద్ధము మాత్రము చేస్తాను. అతడి కొరకు అర్జునుడు రావాలి అర్జునుడిని చంపి కీర్తి గడిస్తాను. భీముని ఎదురుగా రధము పోనివ్వు " అన్నాడు. కర్ణుడు భీముని ఎదుర్కొని అతడిపై శరవర్షం కురిపించి అతడి విల్లు తుంచాడు. భీముడు మరొక విల్లందుకుని కర్ణుని వక్షస్థలము మీద గురి చూసి కొట్టాడు. కర్ణుడు భీముని కవచాచ్ఛి చీల్చాడు. భీముడు ఒక బల్లబాణాన్ని ప్రయోగించి కర్ణుడి వక్షస్థలాన్ని కొట్టి అతడిని మూర్ఛిల్లజేసాడు. భీముడు తన అన్నను తూల నాడిన నాలుకను ఖండిస్తానని ఒక ఖడగం తీసుకుని కర్ణుడి రధము మీదకు లంఫించాడు. శల్యుడు భీముని వారించి " భీమసేనా ! ఆగు కర్ణుడు చావలేదు మూర్ఛపోయాడు. నీవు అతడి నాలుక కోస్తే రక్తస్రావంతో ప్రాణాలు విడుస్తాడు. అప్పుడు నీ అన్న ప్రతిజ్ఞ నెరవేరదు. కనుక అతడిని వదిలి పెట్టు " అన్నాడు. భీముడు ఆగి " నిజం శల్యా ! నాడు సభలో ధర్మజుడి మాట విని కర్ణుడిని వదిలాను. నేడు నా అన్న ప్రతిజ్ఞ నేరవేరాలని వదిలి వెడుతున్నాను " అన్నాడు. కర్ణుడు భీముని చేత భంగపడటం చూసిన సుయోధనుడు తన తమ్ములను కర్ణుడికి సాయంగా పంపాడు. వెంటనే శృతవర్మ కురుకుమారులను వెంటపెట్టుకుని భీముని ఎదుర్కొని చుట్టుముట్టారు. వారిని చూసి భీముడు మరింత విజృంభించి శ్రుతవర్మను అతడి అనుచరులను ఒకే వేటుకు హతమార్చాడు. వికటుడు, సముడు, గ్రాధుడు, నందుడు, ఉపనందుడు మొదలైన కురుకుమారులను బల్లెంతో హతమార్చాడు. ఇంతలో కర్ణుడు మూర్ఛ నుండి తేరుకుని భీముని విల్లు విరిచాడు. భీముడు తన గధను కర్ణుడి మీద వేసాడు. కర్ణుడు దానిని ముక్కలు చేసి ప్రకాశవంతమైన పది దివ్యాస్త్రములను భీముని మీద ప్రయోగించాడు. భీముడు వాటిని తప్పించుకుని ఒక బాణాన్ని కర్ణుడి

వక్షస్థలానికి గురిపెట్టి వేసి అతడి కవచాన్ని చీల్చాడు. కర్ణుడు భీముని మీద ఇరవై అయిదు బాణములు ప్రయోగించి అతడి హయములను చంపాడు.

### భీముడు గాంధార సైన్యము ఎదుర్కొనుట

భీముడు రధము దిగి గదను తీసుకుని కర్ణుడి మీదకు లంఘించి అడ్డు వచ్చిన మూడు వేల మంది అశ్వసైనికులను హతమార్చాడు. రధములను విరుస్తూ, హయములను గజములను కాల్బలంతో చంపుతూ రణభూమి అంతా తానే అయి విహరిస్తున్నాడు. ఇంతలో ఆరు వందల గాంధారసేన భీముని చుట్టుముట్టారు. భీముడు వారి సారధులను, హయములను చంపి, రధములను, కేతనములను విరిచి సర్వనాశనం చేసాడు. శకుని మూడు వేల సైన్యాలను భీముని మీదకు పంపాడు. భీముడు కార్చిచ్చు అడవిని కాల్చినట్లు వారిని హతమార్చి వేరొక రధము ఎక్కి యుద్ధము చేయసాగాడు.

### కురు పాండవుల సమరం

మధ్యాహ్న సమయం అయింది. కర్ణుడు తిరిగి ధర్మజుని ఎదుర్కొని తన తీవ్రమైన బాణములతో ధర్మజుని సారధిని చంపాడు. సారధి లేని రధాన్ని హయములు ఎటో లాక్కుని వెళ్ళాయి. అది చూసి భీముడు తిరిగి కర్ణుడిని ఎదుర్కొన్నాడు. ఇంతలో సాత్యకి అడ్డుపడి కర్ణుని ఎదుర్కొన్నాడు. ఇరువురు తమ బాణాలతో ఆకాశాన్ని కప్పారు. కర్ణుడికి సాయంగా కృపాచార్యుడు శకుని, కృతవర్మ, అశ్వత్థామ తమ తమ సైన్యములతో వచ్చారు. యుద్ధము ఘోరంగా సాగుతుంది. రధములు కేతనములు విరుగుతున్నాయి, గజములు హయములు కాల్బలములు చనిపోతున్నాయి, రక్తం వరదలై పారుతుంది. తెగిన తలలు, విరిగిన కాళ్ళు చేతులు, తునాతునకలు అయిన ధనస్సులు, రధములు, నేల మీద దొర్లే కిరీటములు ఛత్రములు చామరముల గుట్టలతో రణ భూమి నిండి పోయింది.

## అర్జునుడు త్రిగర్త సేనలను ఎదుర్కొనుట


అర్జునిని ద్వార సంశప్తకుల సంహారం

తనను ఎదిరించిన త్రిగర్తసేనలతో అర్జునుడు ఘోరంగా యుద్ధము సాగిస్తున్నాడు. సుశర్మ అర్జుడి మీద పది నిశిత శరములు ఉపయోగించి కృష్ణుడి మీద మూడు బాణములు వేసి గాయపరిచాడు. కపిధ్వజమును తెగనరికాడు. కపిధ్వజము మీద ఉన్న హనుమంతుడు బిగ్గరగా అరిచాడు. ఆ అరుపులకు త్రిగర్తలు సైనికులు మూర్చపోయి వెంటనే తేరుకుని అర్జునుడిని చుట్టుముట్టారు. అర్జునుడు వారి మీద బాణప్రయోగము చేస్తుంటే కృష్ణుడు అవలీలగా రధమును బయటకు తీసుకు వచ్చాడు. అర్జునుడు సర్పాస్త్రముతో త్రిగర్త సైనికిల కాళ్ళను చేతులను బంధించగా సుశర్మ గరుడాస్త్రమును ప్రయోగించి వారిని బంధవిముక్తులను చేసి అర్జునుడి మీద ఒక దివ్యాస్త్రము ప్రయోగించాడు. ఆ అస్త్రప్రభావానికి అర్జునుడు మూర్చిల్లి రధము మీద పడ్డాడు. అర్జునుడు మరణించాడనుకుని కురుసేనలు భేరీ మృదంగాలు మ్రోగించాడు. అర్జునుడు మూర్చ నుండి తేరుకుని సుశర్మ మీద బాణములు గుప్పించి సైన్యముపై ఇంద్రాస్త్ర ప్రయోగము చేసాడు. ఇంద్రాస్త్రము నుండి అనేక ఆకృతులు కలిగిన బాణములు వెలువడి త్రిగర్త సైన్యములను బలి తీసుకున్నాయి. పోయిన వాళ్ళు పోగా మిగిలిన పదునాలుగు వేల మంది అర్జునుడిని చుట్టుముట్టారు. అర్జునుడు వారితో భీకరంగా యుద్ధము చేస్తున్నాడు.

## కృపాచార్యుని సమరం

పాండవ సేనల ధాటికి ఆగ లేక కౌరవ సేనలు పారిపోతున్నాయి. సుయోధనుడు, కృతవర్మ, కృపాచార్యుడు, దుశ్శాసనుడు వారిని యుద్ధోన్ముఖులను చేస్తున్నాడు. కృపాచార్యుడు పాంచాల సేనల మీద శరవర్షం కురిపిస్తూ శిఖండి రధమును విరిచి, సారధిని హయములను చంపాడు. శిఖండి తన రధము దిగి కత్తి డాలు తీసుకుని కృపాచార్యుని ఎదుర్కొన్నాడు.

కృపాచార్యుడు శిఖండి మీద బాణములు గుప్పించాడు. ఇంతలో ధృష్టద్యుమ్నుడు కృపాచార్యుని ఎదుర్కొన్నాడు. కృతవర్మ మధ్యలో వచ్చి ధృష్టద్యుమ్నుని ఎదుర్కొన్నాడు. ధర్మరాజు ఉపపాండవులతో అశ్వత్థామను ఎదుర్కొన్నాడు. నకుల సహదేవులు సుయోధనుడిని ఎదుర్కొన్నారు. భీముడు కర్ణుడిని ఎదుర్కొన్నాడు. కృపాచార్యుడు శిఖండి చేతిలో ఉన్న డాలును ఖండించాడు. శిఖండి తన చేతిలో ఉన్న కత్తితో కృపాచార్యునితో యుద్ధము చేస్తున్నాడు. ఇంతలో సుకేతుడు వచ్చి కృపాచార్యుని ఎదుర్కొన్నాడు. శిఖండి అక్కడి నుండి తొలిగి పోయాడు. కృపాచార్యుడు సుకేతుని మీద ఆరు బాణములు ప్రయోగించి అతడి విల్లు ఖండించాడు. సుకేతుడు మరొక విల్లందుకున్నాడు కృపాచార్యుడు దానిని కూడా ఖండించాడు. సుకేతుడు మరొక విల్లందుకుని కృపాచార్యుని విల్లు విరిచి, అతడి అశ్వములను సారధిని కొట్టాడు. కృపాచార్యుడు సుకేతుడి మీద ముప్పది బాణములు ప్రయోగించాడు. ఆ శరముల ధాటికి సుకేతుడు తట్టుకొనలేక పోయాడు. అదను చూసి కృపాచార్యుడు ఒకే బాణంతో అత్సడి శిరస్సు ఖండించాడు. సుకేతుని మరణం చూసి అతడి సైన్యము చెదిరి పోయింది.

### ధృష్టద్యుమ్నుడు

ధృష్టద్యుమ్నుడు కృతవర్మను వక్షస్థలానికి గురిపెట్టి తొమ్మిది బాణములతో కొట్టి కృతవర్మ సారధిని రధమును అశ్వములను ధ్వజమును తన బాణములతో కప్పాడు. కృతవర్మ రధము నుండి దిగి పోయాడు. ధృష్టద్యుమ్నుడు కృతవర్మను వెతుకుతూ అతడి సారధిని చంపాడు. కృతవర్మ నేనిక్కడ ఉన్నాను అని పెద్దగా అరిచాడు. ధృష్టద్యుమ్నుని కృతవర్మ నేల మీద నిలబడి ఒక విల్లందుకుని ఎదుర్కొన్నాడు. కౌరవ వీరుడు అక్కడకు వచ్చి కృతవర్మను రధము మీదకు లాక్కుని తీసుకు వెళ్ళాడు. చేతికి చిక్కిన్మ కృతవర్మ పోగానే ధృష్టద్యుమ్నుడు కౌరవసేనను నాశనం చేయ సాగాడు.

### అశ్వత్థామ ధర్మజుల పోరు

అశ్వత్థామతో యుద్ధము చేస్తున్న ధర్మజునికి సాయంగా సాత్యకి వచ్చి చేరాడు. అశ్వత్థామ వారందరిని తన శరపరంపరతో ముంచెత్తాడు. ధర్మరాజు కూడా అశ్వత్థామ మీద బాణవర్షం కురిపించాడు. అశ్వత్థామ ధర్మజుని విల్లు తుంచి అతడి మీద మూడు బాణంఅములు వేసాడు. సాత్యకి అశ్వత్థామ విల్లు తుంచాడు. అశ్వత్థామ ఒక ఈటెను విసిరి సాత్యకి సారధిని చంపి సాత్యకి మీద బాణములు గుప్పించాడు. సారధి లేని సాత్యకిని రధమును గుర్రములు ఎటో ఈడ్చుకు వెళ్ళాయి. తన మీద శరవర్షం కురిపిస్తున్న పాడవ సేన మీద ఆగ్రహించిన అశ్వత్థామ పాండవసేనను ఊచకోత కోస్తున్నాడు. ఇది విన్న సుయోధనుడు పాండవులు కూడా అశ్వత్థామ చేతిలో హతులైనారని అనుకుని ఆనందించాడు. ఇంతలో ధర్మరాజు అశ్వత్థామను తరమడం చూసి హతాశుడయ్యాడు. ధర్మరాజు అశ్వత్థామను చూసి " గురుపుత్రా అశ్వత్థామా ! నీవు అత్యంత బలశాలివి అస్త్రశస్త్ర పారంగతుడవు నీ పరాక్రమము నా మీద కాక ధృష్టద్యుమ్నుడి మీద చూపు. నీవు బ్రాహ్మణుడవు నీకు జాలి దయ కరుణ కృతజ్ఞత ఏకోశాన లేవు. నీవు బ్రాహ్మణ సహజమైన జపతపాదులను వదిలి విల్లు పట్టి ఇలా యుద్ధము చేయడం ధర్మము కాదు " అన్నాడు. అశ్వత్థామ ఆ మాటలు పట్టించుకొనక ధర్మరాజు మీద బాణములు గుప్పించాడు. అశ్వత్థామ అస్త్రధాటికి ఆగలేక ధర్మరాజు అక్కడి నుండి వెళ్ళాడు.

## కురుపాండవ యోధుల సమరం

భీమసేనుడితో యుద్ధము చేస్తున్న కర్ణుడు కృపాచార్యుడికి సాయంగా వచ్చాడు. భీముడు కౌరవ యోధులను తనుమాడుతున్నాడు. నకులసహదేవులతో యుద్ధం చేస్తూ సుయోధనుడు సహదేవుని ధ్వజము ఖండించి వారిద్దరి ధనస్సులు విరిచాడు. వారు వేరు ధనస్సులు ధరించి సుయోధనుడి మీద శరములు గుప్పించారు. సుయోధనుడు కోపించి వారిరువురిని బాణములతో కప్పేశాడు. వారు సుయోధనుడి చేతిలో మరణిస్తారని అనుకుంటున్న తరుణంలో ధృష్టద్యుమ్నుడు వేగంగా అక్కడకు వచ్చి వారిని రక్షించాడు. సుయోధనుడు ధృష్టద్యుమ్నుడు మీద అత్యంత తీవ్రమైన బాణము ప్రయోగించి అతడి ధనస్సును ఖండించాడు. ధృష్టద్యుమ్నుడు వేరొక విల్లు తీసుకుని సుయోధనుడి మీద బాణవర్షం కురిపించాడు. సుయోధనుడు ధృష్టద్యుమ్నుని ధనస్సు ఖండించి అతడి నుదుటన పది బాణములు నాటాడు. ఆగ్రహించిన ధృష్టద్యుమ్నుడు వేరొక ధనస్సు అందుకుని సుయోధనుడి ధనస్సు, కేతనము, రధమును విరిచాడు. సుయోధనుడు ఏమాత్రం జంకక ధృష్టద్యుమ్నుని బల్లెము, ఖడ్గం, ధ్వజము, అశ్వములను, సారధిని, కవచమును తునాతునకలు చేసాడు. అది చూసిన ధృష్టద్యుమ్నుడి సోదరుడు అతడిని తన రధము మీదకు లాక్కుని తీసుకు వెళ్ళాడు. అప్పటి వరకు సాత్యకితో పోరుతున్న కర్ణుడు అతడిని విడిచి ధృష్టద్యుమ్నుని వెంబడించాడు. సాత్యకి కర్ణుడిని తరుముతున్నాడు. ధృష్టద్యుమ్నునికి కర్ణుడికి మధ్య యుద్ధం ఘోరంగా సాగింది. వారిరువురికి మధ్యలో వచ్చి కర్ణుడిని ఎదుర్కొన్న ఎనిమిది మంది పాంచాలరాకుమారులను కర్ణుడు యమపురికి పంపాడు. తనను చుట్టుముట్టిన చేధి, పాంచాల వీరులను కర్ణుడు సంహరించి

ధర్మరాజు వైపు వెళ్ళసాగాడు. అది చూసిన ఉపపాండవులు, నకులసహదేవులు, ధృష్టద్యుమ్నుడు, శిఖండి, సాత్యకి ఒక్కుమ్మడిగా కర్ణుడిని చుట్టుముట్టారు. మరొక పక్క భీమసేనుడు కౌరవసేనలను నిర్ధాక్షిణ్యంగా సంహరిస్తున్నాడు. అతడి వీరవిహారానికి మారణహోమానికి భయపడి కౌరవయోధులు అతడి ఎదుటకు రావడానికి సాహసించ లేకపోతున్నారు. అర్జునుడు సంశక్తులను సంహరించి మిగిలిన త్రిగర్త సైనికులను తరుముతున్నాడు. త్రిగర్త సైనిలుకు అర్జునుడి ధాటికి పారిపోయారు. అర్జునుడు కర్ణుడి వైపు రధము తోలమన్నాడు. అది చూసిన సుయోధనుడు త్రిగర్త సైనికులను యుద్ధోన్ముఖులను చేసి అర్జునుడితో యుద్ధానికి పంపాడు. కాంభోజసైనికులను తోడు చేసుకుని త్రిగర్తులు అర్జునుడిని ఎదుర్కొని చుట్టుముట్టారు. అర్జునుడు కాంబోజసేనలతో సహా త్రిగర్తల తలలను నరికాడు. రణభూమి అంతా వారి మొండెములతో నిండింది. తనను ఎదుర్కొన్న కాంభోజరాజు సోదరుడిని అర్జునుడు ఒకే బాణంతో అతడి చేతులు నరికాడు. అది చూసి అర్జునుడిని చుట్టుముట్టిన యవనసేనలు అతడి చేతిలో హతమయ్యాయి.

## అశ్వత్థామ అర్జునుడిని ఎదుర్కొనుట

శ్రీకృష్ణుడి రధ సారధ్యంలో అంతటాతానే అయి యుద్ధము చేస్తున్న అర్జునుడిని అశ్వత్థామ ఎదుర్కొని " అర్జునా ! నువ్వు నాతో యుద్ధము చేయుట లేదు నన్ను నీ అతిథిగా స్వీకరించి యుద్ధమును ఆతిధ్యముగా ఇవ్వు " అన్నాడు. అర్జునుడు కృష్ణుడి వంక చూసాడు. కృష్ణుడు అర్జునుడితో " అశ్వత్థామా ! అర్జునుడితో తనివి తీరా యుద్ధము చేసి సుయోధనుడి రుణం తీర్చుకో " అన్నాడు. వెంటనే అశ్వత్థామ కృష్ణుడి మీద అరవై బాణములు వేసి అర్జునుడి మీద మూడు బాణములు వేసాడు. అర్జునుడు అశ్వత్థామ ధనస్సు విరిచాడు. అశ్వత్థామ మరొక విల్లందుకుని అర్జునుడి శరీరం అంతా శరములు నాటి కృష్ణార్జునులను రధంతో సహా బాణవర్షంలో ముంచాడు. కృష్ణార్జునులకు ఏమైందో తెలియక సైనికులు హాహాకారాలు చేసారు. కృష్ణుడు అర్జునుడి వంక చూసి " అర్జునా ! ఇదేమి వింత అశ్వత్థామ నిన్ను గెలువడమా ! నీ పరాక్రమం నశించిందా ! నీలో అధైర్యం ప్రవేశించిందా ! నీ గాండీవం బలం నశించిందా ! లేక గురుపుత్రుడని జాలి చూపుతున్నావా ! " అన్నాడు. శ్రీకృష్ణుడి మాటలకు రోషం తెచ్చుకుని అర్జునుడు కోపంతో అశ్వత్థామ విల్లు విరిచి, కేతనము విరిచాడు. అశ్వత్థామ వెంటనే ఒక బల్లెము తీసుకున్నాడు. అర్జునుడు దానిని కూడా విరిచాడు. ఇది చూసిన సంశక్తులు అర్జునుడిని చుట్టుముట్టారు. అర్జునుడు వారిని అందరిని క్షణకాలంలో చంపాడు. వారి రధము విరిచి, గజములను అశ్వములను చంపాడు. సంశక్తులకు తోడుగా అంగ, వంగ, కళింగ, నిషాద దేశ సేనలు అర్జునుడిని చుట్టుముట్టాయి. ఇంతలో అశ్వత్థామ మరొక విల్లు రధము సమకూర్చుకుని అర్జునుడిని ఎదుర్కొని కృష్ణార్జునుల మీద అత్యంత క్రూరశరములు ప్రయోగించాడు. అర్జునుడు అశ్వత్థామ శిరము మీద, కంఠము మీద, చేతుల మీద, గుండెల మీద పాదముల మీద శరప్రయోగము చేసాడు. అశ్వత్థామ రధాశ్వముల పగ్గములు ఖండించాడు. రధాశ్వములు అదుపు తప్పి రధమును ఎటో తీసుకు వెళ్ళాయి. అశ్వత్థామ తన రధమును అదుపు చేసుకుంటూ కర్ణుడి వైపు వెళ్ళాడు. అర్జునుడు మిగిలిన సంశక్తుల గర్వము అణచడానికి వెళ్ళాడు. ఇంతలో మగధరాజు దండధారుడు గజమును ఎక్కి పాండవ సైన్యంలో జొరబడి సైన్యమును నాశనం చేయసాగాడు. కృష్ణుడు " అర్జునా ! ముందు వాడి పని పట్టు " అని రధమును దండధారుని వైపు పోనిచ్చాడు. దండధారుడు కూడా అర్జునుడి ఎదురుగా గజమును ఎక్కి నిలిచి వారిపై పదునైన బాణము ప్రయోగించి కృష్ణార్జునుల మీద శరములు గుప్పించాడు. అర్జునుడు ఒకే బాణంతో దండ ధారుని చేతులు రెండు నరికి మరొక బాణంతో అతడి గజమును వధించి అతడి సైన్యములను చెల్లాచెదురు చేసాడు.

## పాండ్యరాజు శౌర్యం

అర్జునుడు తిరిగి సంశక్తకసైన్యము మీదకు వెళ్ళాడు. ఇంతలో సుయోధనుడు తన సైన్యముతో కర్ణుడిని చేరాడు. ఇరువురి సేనలు పాండవసేనలను ఎదుర్కొన్నాయి. ఇంతలో పుళింద, బాహ్లిక, ఆంధ్ర, భోజ సైన్యాలు సుయోధనుడికి అండగా నిలిచాయి. అపారమైన సేనావాహినితో సుయోధనుడు, కర్ణుడు పాండవ సైన్యాలను చుట్టుముట్టారు. వారి ధాటికి ఆగలేక పాండవసేనలు పారిపోసాగాయి. పాండ్యరాజు మలయధ్వజుడు కౌరసేనలను కకావికలు చేస్తున్నాడు. అతడిని అశ్వత్థామ ఎదుర్కొన్నాడు. ఇరువురు ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధము చేస్తున్నారు. మలయధ్వజుడు అశ్వత్థామ వింటి త్రాటిని తెంచాడు. అశ్వత్థామ మరొక విల్లందుకుని మలయధ్వజుని మీద శరవర్షం కురిపించాడు. అశ్వత్థామ మలయధ్వజుడు వాయవ్యాస్త్రాన్ని సంధించి అశ్వత్థామ వేసిన బాణములను చెల్లాచెదురు చేసి అశ్వత్థామ చక్రరక్షకులను చంపి, అతడి విల్లు విరిచి, చక్రరక్షకులను చంపాడు. అశ్వత్థామ బెదరక మలయధ్వజుడు వేసిన బాణములను సమర్ధవంతంగా ఎదుర్కొంటున్నాడు. ఇంతలో పాండ్యరాజు ఒక ఏనుగును ఎక్కి ఒకే బాణంతో అశ్వత్థామ తలపై ఉండే మణిని కిందపడేలా కొట్టాడు. అశ్వత్థామ కోపం కట్టలు తెంచుకుని వీరావేశంతో ఊగిపోతూ పాండ్యరాజు అనుచరులను అతడి ఏనుగును చంపాడు. పదునైన భల్లబాణంతో పాడ్యరాజు తలనరికాడు. అది చూసి పాడ్యరాజు సేనలు పారిపోయాయి. సుయోధనుడు అశ్వత్థామను పొగడ్తలతో ముంచెత్తాడు. అశ్వత్థామ కర్ణుడికి అండగా వచ్చి పాండవసేనను తునుమాడసాగాడు. అర్జునుడు పాండవసేనకు అండగా వారి మధ్య నిలువగానే అర్జునుడు ఉన్నాడన్న ధైర్యంతో పాండవసైన్యం నిలబడింది. అప్పటికి ధృష్టద్యుమ్నుడు

కర్ణునితో పోరుతున్నాడు.

## ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామల సమరం

అశ్వత్థామ ధృష్టద్యుమ్నుడిని చూసి " ఓరీ బ్రహ్మఘ్నా ! నా తండ్రిని చంపిన పాపానికి నిన్ను చంపక వదలను. ఈరోజుతో నీ ఆయువు నా చేతిలో మూడింది " అని ధృష్టద్యుమ్నుడి మీదకు ఉరికాడు. ధృష్టద్యుమ్నుడు " అశ్వత్థామా ! నన్ను బ్రహ్మఘ్నా అంటున్నావు స్వధర్మము వదిలి పరధర్మాన్ని ఆశ్రయించిన మీరు బ్రాహ్మణులా ! బ్రాహ్మణులను చంపిన పాపం బ్రాహ్మణ కులానికి అపకీర్తి తెచ్చిన నీ తండ్రిని చంపి నేను పుణ్యము సంపాదించుకున్నాను. నీ తండ్రిని చంపిన ఖడ్గం అలాగే ఉంది. దానితో నీ తల నరుకుతాను. అలా ఒకరిని ఒకరు నిందించుకుంటూ ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామ వింటిని విరిచాడు. అశ్వత్థామ మరొక విల్లందుకుని ధృష్టద్యుమ్ని సారధిని, హయములను చంపి అతడి విల్లు, పతాకమును విరిచాడు. ధృష్టద్యుమ్నుడు తన గధను తీసుకున్నాడు. అశ్వత్థామ దానిని కూడా ముక్కలు చేసాడు. ధృష్టద్యుమ్నుడు కత్తి డాలు తీసుకున్నాడు. అశ్వత్థామ వాటిని నరికి ఒక కత్తి తీసుకుని ధృష్టద్యుమ్నుడిని నరకడానికి ముందుకు దూకాడు. అది చూసిన కృష్ణుడు అర్జునా ధృష్టద్యుమ్నుడు ఆపదలో ఉన్నాడు అతడిని రక్షించు అన్నాడు. అర్జునుడు అతి క్రూరమైన బాణము అశ్వత్థామ మీద వేసాడు. ఆ బాణముల ధాటికి తట్టుకోలేని అశ్వత్థామ తిరిగి రధము దగ్గరకు వచ్చాడు. పక్కనే ఉన్న సహదేవుడు ధృష్టద్యుమ్నుడిని తన రధము మీద ఎక్కించుకుని తీసుకు వెళ్ళాడు. అర్జునుడు అశ్వత్థామను మూర్చిల్లేలా కొట్టాడు. అశ్వత్థామ రధ సారధి రధమును పక్కకు తీసుకు వెళ్ళాడు.

## కురు పాడవయోధుల సమరం


కర్ణునితో పోరాడుతున్న ధర్మరాజు - రజ్మానామా నుండి ఒక దృశ్యం

అశ్వత్థామ పరాజయానికి పాండవయోధులు అర్జునుడిని కొనియాడారు. భేరీ మృదంగ నాదాలు మిన్నంటాయి. అది చూసి కర్ణుడు అర్జునుడిని ఎదుర్కొన్నాడు. త్రిగర్తసేనలు అర్జునుడిని కవ్వించాయి. అర్జునుడు " కృష్ణా ! త్రిగర్తలు మనలను కవ్విస్తున్నారు ముందు వారి పని పడతాను. కర్ణుడి సంగతి తరవాత చూడచ్చు కర్ణుని ఎదుర్కొన్న త్రిగర్తలకు ఒడిన వారిమి ఔతాము " అన్నాడు. కృష్ణుడు రధమును త్రిగర్తల వైపు పోనిచ్చాడు. అర్జునుడు త్రిగర్తసేనలను చీల్చిచెండాడుతున్నాడు. కర్ణుడు ధర్మరాజును ఎదుర్కొన్నాడు. ఇరువురికి నడుమ పోరు ఘోరంగా సాగుతుంది. కర్ణుడు పాండవసేన లోని ప్రముఖులను, రధాశ్వములను, సారధులను వధంచి వారి రధములను, కేతనములను వురుస్తున్నాడు. నకులసహదేవులు, సాత్యకి, ఉపపాండవులు కర్ణుడిని ఎదుర్కొన్నారు. కర్ణుడు ఒక్కడే వారిని ఎదుర్కొని వారిని తన బాణ పరంపరతో ముంచెత్తాడు. సుయోధనుడు గజ సైన్యాలను యుద్ధానికి పంపాడు. అంగ, వంగ, పౌండ్రక, మగధ, సుష్మ దేశాలకు చెందిన గజ సైన్యములు పాండవసేనలపై పురికొల్పాడు. గజసైన్యము పాండవసేనలను కాళ్ళతో తొక్కి నాశనం చేయసాగింది. సాత్యకి అత్యంత సాహసంతో వంగరాజును అతడి గజసైన్యమును నాశనం చేసాడు. నకులుడు పౌండ్ర రాజును, సహదేవుడు సుష్మరాజును ససైన్యంగా వధించారు. రాజులు చనిపోగానే గజములు పాండసేనల మీద విజృంభించాయి. నకులుడు అత్యంత శక్తివంతమైన బాణములు వేసి గజసేనలను నిర్మూలిస్తున్నాడు. ధృష్టద్యుమ్నుడు మొదలైన వారు ఏనుగుల గుంపులను హతమారుస్తున్నారు. యుద్ధము తీవ్రమైంది. రధములు విరుగుతున్నాయి. తలలు, కాళ్ళు, చేతులు తెగి పడుతున్నాయి. ఏనుగుల కళేబరాలు కొండల మాదిరి గుట్టలుగా పడ్డాయి. రక్తం ఏరులై పారింది. సుయోధనుడు ధర్మరాజును పట్టడానికి తన అనుయాయులతో వచ్చాడు. సాత్యకి భీమసేనుడు వారిని ఎదుర్కొని ధర్మరాజును కాపాడారు. కర్ణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ సుయోధనుడికి సాయంగా వచ్చారు. వారంతా భీముని మీద సాత్యకి మీద శరవర్షం గుప్పించి ధర్మరాజు కవచం ఖండించారు. కర్ణుడు పాండవ సేనలను తునుమాడుతూ అర్జునుడి కొరకు ఎదురు చూస్తున్నాడు. అది చూసి కృష్ణుడు " అర్జునా ! కర్ణుడు నీ కొరకు వెతుకుతున్నాడు. వెళ్ళి అతడిని వధించి సుయోధనుడిని ఒంటరి వాడిని చేసి సామ్రాజ్యలక్ష్మిని వరించు " అన్నాడు. భీమసేనుడు, సాత్యకి, ధృష్టద్యుమ్నులతో చేరి కౌరవ సేనలను తరిమి తరిమి కొడుతున్నాడు. భీముడు తనతో తలపడిన నిషాద రాజకుమారుని ఒకే బాణము వేసి అతడి తలను ఏనుగు తలను ఏక

కాలంలో నరికాడు. అది చూసి నిషాద రాజకుమారుడి సైన్యం పారిపోయింది. ప్రళయకాల రుద్రుడి వలె ఉన్న భీముని ఎదింరించడానికి ఎవరికీ సాహసం లేక పోయింది. అది చూసిన దుర్యోధనుడు భీముని అడ్డగించాడు. కర్ణుడు సుయోధనుడికి సాయం వచ్చాడు. కర్ణుడు తన శరములతో శిఖండి విల్లును, కేతనమును ఖండించాడు. శిఖండి అక్కడ నుండి పారిపోయాడు. దుశ్శాసనుడు ధృష్టద్యుమ్నుడు ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధము చేస్తున్నారు. నకులుడు కర్ణుడి కుమారుడైన వృషసేనుడి సారధిని చంపాడు. వృషసేనుడి సైన్యము చెదిరి పోయింది. వృషసేనుడు వేరొక సారధిని తీసుకుని యుద్ధానికి వచ్చాడు. సహదేవుడు శకుని కుమారుడైన ఉలూకుడిని తీవ్రంగా గాయపరిచాడు. ఉలూకుడు ఆ దెబ్బకు పారిపోయాడు. సాత్యకి శకుని ఒకరితో ఒకరు తీవ్రంగా పోరుసల్పుతున్నారు. సాత్యకి శకుని రధాశ్వములను చంపగా శకుని రధము దిగి పారిపోయాడు. భీముడు సుయోధనుడిని సారధిని చంపి రధమును విరుగ కొట్టాడు. సుయోధనుడు మరొక రధము ఎక్కి అక్కడి నుండి తొలిగి పోయాడు. యుధామన్యుడు కృపాచార్యుని ఎదుర్కొని అతడి విల్లు విరిచాడు. కృపాచార్యుడు వేరొక విల్లు తీసుకుని యుధామన్యుడి సారధిని చంపి కేతనమును, విల్లును విరిచాడు. యుధామన్యుడు పారిపోయాడు. అశ్వత్థామ అర్జునుడిని ఎదుర్కొన్నాడు. కృష్ణార్జునుల మీద శరములు గుప్పించాడు.అర్జునుడు అశ్వత్థామ మీద అనేక దివ్యాస్త్రాలు సంధించాడు. ధర్మరాజు చిత్రసేనుడిని ఎదుర్కొని భీముడు, నకుల సహదేవులు, ధృష్టద్యుమ్నుడు సుయోధనుడిని అతడి పరివారాన్ని ఎదుర్కొన్నారు. అది చూసి కర్ణుడు సుయోధనుడికి సాయంగా వచ్చి ధర్మరాజు గుండెలకు గురిపెట్టి బాణము వేసాడు. ఆ దెబ్బకు ధర్మరాజు రధము మీద కూలబడి రధమును పక్కకు పోనిమ్మని చెప్పాడు. కౌరవులు ధర్మరాజును తరిమారు. కేకయ, పాంచాల యోధులు వచ్చి ధర్మరాజును రక్షించారు. భీముడు సుయోధనుడితో యుద్ధం చేస్తున్నాడు. కర్ణుడు కేకయ్స, పాంచాల సేనలను నుగ్గు చేసి ధర్మరాజును తరిమాడు. ధర్మరాజు వెను తిరిగి కర్ణుడి మీద శరవర్షం కురిపించి కర్ణుడి సారధిని హయములను చంపాడు. నకులుడు సహదేవుడు ధర్మరాజుకు సాయంగా వచ్చి కర్ణుడి మీద శరములు గుప్పించారు. కర్ణుడు విజృంభించి ధర్మరాజు తలపాగా కొట్టి అతడి సారధిని చంపాడు. ధర్మరాజు నకులుడి రధము ఎక్కాడు. ఇంతలో శల్యుడు కర్ణుడిని చూసి " కర్ణా ! ఏమిటీ పని నీపరాక్రమము అర్జునుడి మీద చూపాలి కాని ధర్మరాజు మీద కాదు. నీవు పొరపాటున ధర్మరాజును చంపితే అర్జునుడు నిన్ను వధించుట తధ్యం. కనుక ధర్మరాజును వదలి అర్జునుడితో యుద్ధము చెయ్యి. కర్ణా ! అటు చూడు నీ అనుంగు మిత్రుడు సుయోధనుడు భీమసేనుడి చేత చిక్కి నిరాయుధుడయ్యాడు. సుయోధనుడు భీముని చేతిలో మరణించిన నీ శ్రమ వృధా ! నీవు పాండవులను గెలిచినా ప్రయోజనము ఉండదు. కనుక సుయోధనుడిని రక్షించు " అన్నాడు. శల్యుని మాటలు విని కర్ణుడు ధర్మరాజును వదిలి సుయోధనుడి వైపు వెళ్ళాడు. కర్ణుడు తనను విడిచి వెళ్ళగానే ధర్మరాజు నకుల సహదేవులతో తన శిబిరానికి వెళ్ళాడు.

## బయతి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక |

విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి |

యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు

| యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి |

బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ |

ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు |

# కర్ణ పర్వము తృతీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# కర్ణ పర్వము తృతీయాశ్వాసం

కర్ణుడు తన చేత చిక్కిన ధర్మరాజును వదిలి సుయోధనుడిని రక్షించడానికి వెళ్ళాడని తెలియగానే ధృతరాష్ట్రుడు " సంజయా ! కర్ణుడు అలా బుద్ధి లేని పని ఎందుకు చేసాడు. చేత చిక్కిన ధర్మరాజును చంపక ఎందుకు వదిలాడు ? సుయోధనుడు అంత మాత్రం భీమునితో యుద్ధం చేయ లేడా ? కర్ణుడు మోసం చేసాడంటావా ? సరేలే తరువాత ఏమి జరిగిందో చెప్పు అన్నాడు.

## ధర్మరాజు శిబిరముకు వెళ్ళుట

కర్ణుడి చేత విడువ బడిన ధర్మరాజు శిబిరానికి చేరి మెత్తటి శయ్య మీద పరుండి. తన శరీరానికి తగిలిన బాణములు తీయించు కుంటూ తనకు జరిగిన పరాభవానికి బాధపడ సాగాడు. ఇంతలో నకుల సహదేవులు లోనికి వచ్చారు. ధర్మరాజు వారిని వెంటనే భీమునకు సాయంగా వెళ్ళమని చెప్పాడు. నకుల సహదేవులు భీముడికి సాయంగా వెళ్ళారు. అర్జునుడు అశ్వత్థామను ఎదుర్కొన్నాడు. అర్జునుడు వేస్తున్న తీవ్రమైన బాణములు ఎదుర్కొంటూ అశ్వత్థామ అర్జునుడి మీద గధను విసిరాడు. ఆ గధను ముక్కలు చేసి వెంటనే అర్జునుడు అశ్వత్థామ శరీరంలో పది వాడి అయిన బాణములు గుచ్చి అతడి సారధిని చంపాడు. ఆగ్రహించిన అశ్వత్థామ కృష్ణార్జునుల మీద బాణవర్షం కురిపించాడు. అర్జునుడు ఆబాణములు మద్యలో తుంచి అశ్వత్థామ రధాశ్వముల పగ్గములను తెంచాడు. పగ్గములు తెగిన అశ్వములు రధమును ఎటో లాక్కుని వెళ్ళాయి. అది చూసి పాండవ సేనలు జయజయ ధ్వానాలు చేసాయి. కౌరవసేన పారిపోయింది.

## కర్ణుడు భార్గాస్త్రాన్ని ప్రయోగించుట

కురుసేనల వెనుకడుగు చూసి సుయోధనుడు " కర్ణా ! నీవు యుద్ధరంగమున ఉండగా కురుసేనలకు ఈ దుర్గతి ప్రాప్తించింది. నీవు సరిగా యుద్ధము చేసిన పాండవులు నీకు లెక్క కాదు. నీ వివిధాస్త్రాలను ప్రయోగించి నీ పరాక్రమాన్ని చూపించు " అని పురికొల్పాడు. అప్పుడు కర్ణుడు " శల్యా ! చూసావుగా సుయోధనుడి మాటలు మన రధమును అర్జునుడి వద్దకు పోనిమ్ము. అర్జునుడిని, కృష్ణుడిని, భీముని వధించి ఈ సువిశాల సామ్రాజ్యానికి సుయోధనుడిని చక్రవర్తిని చేసి నా ప్రతాపం లోకానికి తెలియజేస్తాను " అని వెంటనే విల్లు ఎక్కు పెట్టి భార్గవాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రము నుండి వివిధ ఆకృతులలో ఆయుధలు వచ్చి పాండవ సేనను నాశనం చేస్తుంది. రధములు విరుగుతున్నాయి. హయములు, ఏనుగులు గుట్టలుగా చచ్చి పడుతున్నాయి. రధములు విరుగుతున్నాయి. ఆ అస్త్రప్రభావానికి తాళ లేని పాండవసేనలు పరుగులు పెట్ట సాగాయి.

## శ్రీ కృష్ణుడు తెలివిగా ప్రవర్తించమని అర్జునుడికి చెప్పుట

అది చూసిన కృష్ణుడు " అర్జునా ! అర్జునా ! కర్ణుడి కోపజ్వాల చూసావుగా ! ఇది నీవు ఆగ్రహించ వలసిన తరుణం కాదు. వివేకం ప్రదర్శించ వలసిన తరుణం . తెలివిగా ప్రవర్తించాలి " అన్నాడు . అర్జునుడు " నిజమే కృష్ణా ! రధమును వెనుకకు మరల్చు " అన్నాడు. అప్పుడు కృష్ణుడు భీమసేనుడి వైపు చూసాడు. భీముడు కర్ణుడితో యుద్ధము చేస్తున్నాడు. భీముని చూసి పాండవసేనలు ధైర్యము తెచ్చుకుని ముందుకు వచ్చాయి. అది చూసి శిఖండి , ధృష్టద్యుమ్నుడు, సాత్యకి, ఉపపాండవులు కర్ణుడిని చుట్టుముట్టారు. అర్జునుడు విశ్రాంతి కోరుకుంటున్నాడని తెలుసుకుని కృష్ణుడు రధమును దూరంగా తీసుకు వెళ్ళి " అర్జునా ! మనము అశ్వత్థామతో యుద్ధం చేసే సమయంలో కర్ణుడు ధర్మరాజును చిక్కించుకున్నాడు. అతడికి ఏమైందో తెలియదు. కర్ణుడితో మనవాళ్ళు యుద్ధం చేస్తున్నారు కనుక మనం ధర్మరాజు క్షేమము కనుక్కుని వచ్చి కర్ణుడితో యుద్ధం చేస్తాము " అన్నాడు. అర్జునుడు నలు దిశలా ధర్మరాజు కొరకు చూసి కనిపించక భీముని వద్దకు వెళ్ళి అడిగాడు. భీముడు " అర్జునా ! నేను కౌరలతో యుద్ధము చేస్తున్నప్పుడు కర్ణుడు ధర్మరాజు శరీరం నిండా బాణాలు వేసాడు. అన్నయ్య


ముందుకు వెళ్ళిన ధర్మజుని వెతకమని అర్జునుడికి చెబుతున్న కృష్ణుడు

యుద్ధ భూమిని విడిచి శిబిరానికి వెళ్ళాడు. కృష్ణుడు మన చెంత ఉండగా అన్నయ్యకు ఏమీ కాదు " అన్నాడు. అర్జునుడు భీమునితో " భీమా ! నేను కర్ణుడితో యుద్ధము చేస్తాను నీవు వెళ్ళి అన్నయ్య క్షేమము కనుక్కుని రా " అన్నాడు. భీముడు " అలాంటి పని నీవు చేస్తావేమో కాని నేను చెయ్యను. భీముడు యుద్ధ భూమి నుండి భయపడి పారిపోయాడని లోకులు అనుకుంటారు. అదుగో సంశక్తులు వస్తున్నారు. నేను వారిని ఎదుర్కొంటాను. నీవు వెళ్ళి అన్నయ్య క్షేమం కనుక్కో " అన్నాడు. ఇక చేసేది లేక అర్జునుడు " కృష్ణా ! మన రధమును త్వరగా ధర్మరాజు శిబిరానికి పోనిమ్ము నాకు అన్నయ్యను చూడాలని ఆతురతగా ఉంది " అన్నాడు.

## అర్జునుడు ధర్మజుని కొరకు శిబిరముకు వెళ్ళుట

అర్జునుడి మాటని అనుసరించి కృష్ణుడు రధమును ధర్మరాజు శిబిరానికి పోనిచ్చాడు. అర్జునుడు లోనికి ప్రవేశించగానే ఒంటరిగా శయ్య మీద పవళించిన ధర్మరాజు కనిపించగానే మనసు కుదుటపడింది. అర్జునుడు ధర్మరాజు పాదాలకు నమస్కరించాడు. అర్జునుడు కర్ణుడిని సంహరించి తన ఆశీర్వాదము కొరకు వచ్చాడనుకుని ధర్మరాజు సంతోషంగా " కృష్ణార్జునులారా ! దేవతలకు కూడా జయింప శక్యముకాని కర్ణుడిని, పరశురామ అస్త్రప్రసాదిత కర్ణుడిని, మహాబల వంతుడైన కర్ణుడిని సంహరించి విజయులై వచ్చినందుకు కృష్ణార్జునులను అభినందిస్తున్నాను. నాకు చాలా ఆనందంగా ఉంది. నాకూ కర్ణుడికి జరిగిన యుద్ధములో కర్ణుడు నా సారధిని చంపి, పతాకమును విరిచి, నా శరీరం నిండా శరములతో నింపాడు. ఆ సమయంలో భీముని చేత చిక్కి నిరాయుధుడైన సుయోధనుడిని రక్షించడానికి వెళ్ళాడు. నేను శిబిరానికి వచ్చాను. అర్జునా ! కర్ణుడు నాకు చేసిన ఘోరావమానానికి నీ వంటి తమ్ముడు ఉన్నందు వలన అవమానభారం తీరింది. కర్ణుడిని ఎలా సంహరించావు. అతడి వెంట అతడి తమ్ములు కుమారులు అతడి బంధువులు సేనలు ఎప్పుడూ వెన్నంటి ఉంటారు కదా ! నీవు ఏమాత్రం గాయపడకుండా కర్ణుడిని చంపి నీ పరాక్రమము లోకానికి నిరూపించావు. అనాడు ద్రౌపదిని అన్న మాటలు నా చెవిలో ఇంకా మారు మ్రోగు తున్నాయి. అర్జునా ! ద్రౌపది పరాభవాగ్నిని చల్లార్చావు. అత్యంత గర్వసమున్నతమైన అతడి తలను ఎలా ఎగురగొట్టావు. అతడు నీ మీద శరప్రయోగం చేస్తున్నప్పుడు నీవు అతడి గుండెలకు గురిపెట్టి కొట్టగా చచ్చాడా " అన్నాడు.

### ధర్మజుడు అర్జునిడిని నిందించుట

అన్నయ్యా ! నేను సంశక్తులతో యుద్ధము చేస్తున్నప్పుడు అశ్వత్థామ తన సేనలతో నన్ను చుట్టుముట్టాడు. నేను ఆ సేనలోని అయిదువందల రధాలను విరిచి రణభూమిని వారి శవాలతో నింపాను. అశ్వత్థామ నన్నూ నా రధాన్ని కనిపించనంతగా శరములతో కప్పి నాకు దిక్కు తోచకుండా చేసాడు. ఆ తరువాత నేను అతడిని తరిమి కొట్టాను. నీ కొరకు వెదికాను నీవు కనపడ లేదు భీమసేనుడు నిన్ను గురించి చెప్పాడు. నీ యోగక్షేమాలు కనుక్కోవడానికి వచ్చాను నా మనస్సు శాంతించింది. ఇక నేను యుద్ధ భూమికి వెళ్ళి నీ మనస్సు ఆనందించేలా కర్ణుడిని వధించి తిరిగి వస్తాను " అన్నాడు. కర్ణుడు ఇంకా ప్రాణాలతో ఉన్నాడని తెలుసుకుని ధర్మరాజు కోపంతో ఊగి పోయాడు. " అర్జునా ! నేను రణభూమి నుండి తిరిగి వచ్చి మీకు అందరికి చులకన అయ్యాను. నేనే కాదు భీముడు, నకులసహదేవులు కర్ణుడి చేత ఓడి పోయారు. ఆఖరికి నీవూ కృష్ణుడు కూడా కర్ణుడి చేతిలో ఓడి పోయారు. ఇక మనకు యుద్ధ భూమిలో పని లేదు. మనమంతా తిరిగి అడవులకు పోయి తాపస వృత్తి స్వీకరిస్తాము. లేకున్న సుయోధనుడి వద్దకు వెళ్ళి అతడి చెప్పుచేతలలో ఉంటాము " అన్నాడు. ఆ మాటలకు అర్జునుడి కళ్ళు నిప్పులు కక్కాయి. ధర్మరాజు తిరిగి " అర్జునా ! నీవు ఇంతటి వాడివి అని తెలిసిన మనము యుద్ధముకు దిగక మనకు తోచిన పని చేసే వాళ్ళము. ముందుగా నీవు నాకు కర్ణుడిని చంపడం చేతకాదని చెప్పి ఉంటే ఈ యుద్ధానికి ఎందుకు అంగీకరిస్తాను. అప్రయోజకులమైన మనకు రాజ్యమెందుకు రాజ్య పాలన ఎందుకు ? యుద్ధముకు ముందు కర్ణుడిని వధిస్తానని చెప్పి ఇప్పుడు ఓడి పోయి వచ్చి నన్ను అవమానాలపాలు చేసావు. అసలు నన్ను ఆకాశానికి ఎక్కించి నాలో ఆశలు కల్పించి పాతాళంలోకి నెట్టడ మెందుకు. ఆ రోజు కృష్ణుడి ముందు నీవు చెప్పినవన్నీ అసత్యములేనా ! నీవు పుట్టినప్పుడు గొప్ప వీరుడివి ఔతావని శత్రువులను నిర్జిస్తావని ఆకాశవాణి, మహా మునులు చెప్పారు. నీవున్నిటినీ వమ్ము చేసావు. నీవు కర్ణుడిని చంపలేవని తెలియక సుయోధనుడితో వైరము పెట్టుకున్నాను. అర్జునా ! నీకేమి తక్కువ. దేవత లిచ్చిన రధము అస్వములు ఉన్నాయి. నీ ధ్వజము మీద కపిధ్వజము ఉన్నది. నీచేత తిరుగులేని గాండీవం ఉంది. అక్షయ తుణీరము ఉంది. అన్నిటికీ మించి దేవదేవుడైన శ్రీకృష్ణుడు సారధిగా నిన్నెప్పుడూ వెన్నంటి ఉన్నాడు. నీవు

కర్ణుడి చేతిలో ఎలా ఓడి పోయావో నాకు అర్ధము కాలేదు. సుయోధనుడు నీవు కర్ణుడిని జయించలేవని ఎప్పుడో చెప్పాడు. కాని నేను నమ్మలేదు నీ పరాక్రమాన్ని నమ్మి భంగపడ్డాను. కోరి కష్టాలు తెచ్చుకున్నాను. మన ఇద్దరినీ మిత్ర రాజులు నమ్మి అనవసరంగా తమ ప్రాణాలు పోగొట్టుకున్నారు " అని అనేక నిష్టూరోక్తులు పలికినా అర్జునుడు ఏమీ పలుక లేదు. ధర్మరాజు ఇంకను శాంతించక " కృష్ణా ! ఇక లాభం లేదు కర్ణుడిని జయించడం మన శక్యము కాదని తెలిసింది. సుయోధనాది శత్రురాజుల ముందు ఘోరావమానం పాలయ్యాను. భీముని దయ వలన ప్రాణాలతో బయట పడ్డాను. పాపం భీముడు ఒక్కడే అర్జునుడిలా పారి పోక ప్రాణాలకు తెగించి యుద్ధము చేస్తున్నాడు " అని తిరిగి " అర్జునా ! ఈ రోజు అభిమన్యుడు, ఘతోత్కచుడు ఉంటే బాగుండేది. అయినా చేసిన పాపాలకు వాళ్ళు మనకు ఎందుకు దక్కుతారు. చుట్టము అంటే ఆపదలో ఆదుకునే వాడు. శ్రీకష్ణుడి వంటి చుట్టము ఉండగా నీవు యుద్ధ భూమి నుండి ఎందుకు వచ్చావు. ఒక్క పని చేయి నీ గాడీవం కృష్ణుడికిచ్చి నీవు రధము తోలు. ఒక్క క్షణంలో కర్ణుడిని వధించి సుయోధనుడి రాజ్యం అపహరించ గలడు. నీవు కుంతీ గర్భాన ఉండగానే గర్భస్రావం అయి ఉంటే ఇంతటి దుర్గతి పట్టి ఉండదు కదా ! " అన్నాడు.

## అర్జునుడు ధర్మజుని వధించుటకు కత్తి దూయుట

అన్ని మాటలు మౌనంగా భరించిన అర్జునుడు అఖరున ధర్మరాజు " నీ గాండీవాన్ని కృష్ణుడికి ఇచ్చి నీవు రధాన్ని తోలు " అన్న మాటలు సహించ లేక పోయాడు. పక్కనే ఉన్న కత్తి తీసుకుని ధర్మరాజును నరకబోయాడు. కృష్ణుడు అర్జునుడి చాయి పట్టుకుని వారించి " అర్జునా ఇక్కడ కత్తితో పని ఏమి? ఇక్కడ మనకు శత్రువులు ఎవరూ లేరు కదా ? మనం ఇక్కడకు ధర్మజుడు క్షేమంగా ఉన్నా లేడా అని చూడ వచ్చాము. క్షేమంగా ఉన్నాడని తెలుసుకున్నాము. ఇది సంతోషించ వలసిన సమయం కాని కోపం తెచ్చుకొనవలసిన సమయం కాదు " అని అన్నాడు. అర్జునుడు " కృష్ణా ! నా గాండీవాన్ని ఎవరికైనా ఇమ్మని అన్న వారి తల నరుకుతానని నా ప్రతిజ్ఞ. ధర్మజుని మాటలు విన్నావు కదా ! అలాంటి మాటలు అన్న వాడిని నరకడం అతడు ధర్మమే కాని అధర్మమం కాదా ! కనుక నా ప్రతిజ్ఞ నెరవేర్చుకుని అసత్యదోషం నెరవేర్చుకుంటాను. పోనీ నీవు లోకజ్ఞానం కలవాడివి కదా నేను ఏమి చేయాలో చెప్పు " అన్నాడు. కృష్ణుడు " అర్జునా ! చాలు వ్యర్ధప్రేలాపనలు ఆపు. ధర్మాధర్మ విచక్షణ తెలిసిన వారు నీ వలె పలుకరు. ఎవరైనా వింటే నీకు పెద్దల ఎడ గౌరవం లేదని అనుకోగలరు. ఏది ధర్మమో ఏది కాదో తెలుసుకుని మాట్లాడు " అన్నాడు. సత్యము అహింస పరమ ధర్మములు. ఆ సత్యమే అహింసాచరణకు తోడ్పడాలి కాని హింసను ప్రేరేపించ కూడదు. మనం చేసే కర్మలలో ధర్మము సూక్ష్మాతి సూక్ష్మంగా ఉంటుంది. కర్మను ఉచితానుచితాలు తెలుసుకుని చేయాలి. నీ అన్నయ్య, నీహితము కోరే వాడు, ధర్మము తెలిసిన వాడు, మనకు మహారాజు అతడిని చంపబూనడం ధర్మం అనిపించుకుంటుందా ! తెలిసీ తెలియని వయసులో చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చకోడానికి ఈ వయసులో ధర్మాధర్మ విచక్షణ మరవడం మూర్ఖత్వం అనిపించుకుంటుంది. పెద్దలు ఇందుకు అంగీకరించరు. ధన, మాన, ప్రాణాలకు ముప్పు వాటిల్లినపుడు అసత్యము పలుకుట దోషం కాదు ఇందుకు నీకు ఒక దృష్టాంతం చెప్తాను " అన్నాడు.

## కౌశికుని కధ

పూర్వము కౌశికుడు అనే బ్రాహ్మణుడు ఉండే వాడు. వాడికి పెద్దలు చెప్పిన మాటలు వినే అలఅవాటు లేదు. తాను నమ్మిందే ఆచరిస్తాడు. అతడు ఒక సారి తన ఆశ్రమంలో తపస్సు చేసు కుంటున్నాడు. కొంత మంది దొంగలు దారిన పోయే బాటసారులను తరుముకుంటూ వస్తున్నారు. బాటసారులు తమ తమ ధనము ఆభరణముల మూటలతో ఆశ్రమ సమీపములోని పొదలలో దాక్కున్నారు. బాటసారులను వెదుక్కుంటూ వచ్చిన దొంగలు తాము తరుముతూ వస్తున్న బాటసారులు ఎక్కడ ఉన్నారని కౌశికుని అడిగారు. కౌశికుడు ధర్మాధర్మ విచక్షణ లేని వాడు కావడం చేత తనకు అసత్యదోషం చుట్టుకుంటుందని అనుకుని వారు పొదల మాటున దాక్కున్న విషయం చెప్పాడు. దొంగలు బాటసారులను చంపి వారి ధనమును దోచుకున్నారు. మరణానంతరం కౌశికుడు ఘోరనరకానికి పోయారు. కనుక అర్జునా !

## అర్జునుడు శాంతించుట

హింసకు కారణమయ్యే సత్యము ధర్మం అనిపించు కోదు. సత్యాసత్యం, ధర్మాధర్మం గురించిన విచక్షణ పెద్దల చేత నిర్ణయించ బడాలి కాని ఎవరికి వారు వారికి తోచినట్లు చేయకూడదు. కనుక నీవు నీ అన్న ధర్మరాజును వధించుట ధర్మం కాదు " అన్నాడు. అప్పటికి శాంతించిన అర్జునుడు " కృష్ణా ! నన్ను మన్నించు. తల్లీ తండ్రి వలె నాకు హితవు చెప్పి నేను అనుచిత కార్యము చేయకుండా కాపాడావు. లేకున్న ఘోరం జరిగి పోయేది. కాని కృష్ణా ! జనులు నన్ను చేసిన ప్రతిజ్ఞ కాపాడని వాడని నిందించకుండా నాకు , నా అన్న ధర్మజునుకి ఆపద వాటిల్లని చక్కని మార్గం సూచించు " అన్నాడు. కృష్ణుడు " అర్జునా ! ధర్మజుడు కర్ణుని వాడి బాణములతో బాధించడమే కాక నీచమైన మాటలతో నిందించాడు కనుక ఆ బాధ భరించ లేక ఏవో

మాటలు అన్నాడే కాని నీ మీద ప్రేమ లేక కాదు. నీకు అన్న ప్రభువు. మిమ్ములను తండివలె కాపాడే వాడు. అతడు నిన్ను అనకూడదా ! నీవు పడకూడదా ! అతడి వంశోద్ధారకులైన నీవు, భీముడు, నకులసహదేవులు అతడి వశంలో ఉంటారు కదా ! మీ మీద కోపం ఎందుకు ఉంటుంది. ఆయనను చంపడానికి నీవు కత్తి ఎత్తావు కదా ! ఆ భావన మనసులో ఉంచుకుని నీ అన్నయ్యలో ఉన్న లోపాలను ఎత్తి చూపుతూ నిందించు. కాని ఆ మాటలు మనసులో పెట్టు కోవద్దని వినయముగా నమస్కరించు. ఆ తరవాత నీకు అనృత దోషం పోయి నీ మనస్సు శాంతపడుతుంది. ఆ పై మనం కర్ణుడిని చంపడానికి వెళదాము.

## అర్జునుడు ధర్మజుని నిందించుట

అర్జునుడు ధర్మరాజును నిందిస్తూ " ఓ ధర్మజా ! అత్యంత పరాక్రమంతుడైన భీముడు అంటే పడతాను కాని కర్ణుడికి వెనుదిరిగి బెదిరి వచ్చిన నీవు అంటే సహిస్తానా ! నా పరాక్రమమేమిటో తెలిసీ నన్ను ఇలా నిందించిన నీ నాలుక వేయి చీలికలు కాదేమి. నన్ను నా పరాక్రమాన్ని నిందించిన నీకు ఏపాటి పరాక్రమము ఉంది. ఎప్పుడైనా ఎవరితోనైనా యుద్ధము చేసి గెలిచావా ! నకుల సహదేవుల పాటి కూడా యుద్ధము చేయలేని నీవు ఇన్ని మాటలు అన్నావు. కాని వారు అలాంటి ప్రేలాపనలు ప్రేలరు. ఆ నాడు జూదము ఆడి ఓడి మమ్ము అరణ్యాలపాలు చేసింది నీవు కాదా ! లేకున్న ఈ మారణ హోమం ఎందుకు ఇన్ని కష్టాలు అవమానాలు ఎందుకు. ఇంత చేసి సిగ్గు లేకుండా నన్ను నిందించావు. అవునులే చేతకాని వాడికి ఓరిమి ఒక కవచం. ఇకనైనా బుద్ధి తెచ్చుకుని దుర్బుద్ధులు మాని పౌరుషం చంపుకుని నోరు మూసుకుని ఉండు. నీ వల్ల ఇన్ని కష్టములు పడ్డాము ఇక నీ మాటలు సహించి ఉండము " అని నిందించి మనసులో ఎంతో సంతాపం చెందాడు. మరలా ఒరలో నుండి కత్తి తీసాడు. కృష్ణుడు కంగారు పడి " మరలా కత్తి ఎందుకు తీసావు " అన్నాడు. అర్జునుడు " ఆ మహానుభావుని ఇన్ని మాటలు అన్నందుకు నాతల నరికి అతడి పాదాల చెంత పెడతాను " అన్నాడు. కృష్ణుడు " అర్జునా ! దానికీ ఒక ఉపాయం ఉందయ్యా ! నిన్ను నీవు పొగుడుకుంటే అది ఆత్మహత్యతో సమానం. కనుక నిన్ను నీవు పొగుడుకో " అన్నాడు. అర్జునుడు " ధర్మజా ! నా పరాక్రమం నీకు తెలియనిదా ! నేను సంశక్తులను నాశనం చేసాను. నా చేత మరణించిన కౌరవ సేనలను ఒక్కతరి పరికించు " అని గర్వంగా పలికి. అంతలోనే అన్నయ్యకు సాష్టాం దండప్రమాణం ఆచరించి " అన్నయ్యా ! నేను నీతో ఏవో కారుకూతలు కూశాను అందుకు నన్ను మన్నించు. వాటిని నీవు పట్టించుకొనక ఎప్పటిలా నన్ను ఆదరించుము. ధర్మజా ! నేను సత్యము పలుకుచున్నాను వినుము నా తనువు, నా ప్రాణం, నా జీవితం నీ ఆధీనములు. అక్కడ భీముడు ఒంటరిగా పోరాడుతున్నాడు. అతడికి సాయంగా వెళ్ళుటకు నాకు అనుజ్ఞ ఇమ్ము. నేను వెళ్ళి కర్ణుని వధించి కౌరవ సేనలను నాశనం చేసి సుయోధనుడి గర్వము అణచాలి. ఈ రోజు కర్ణుడి తల్లి రాధకైనా పుత్రశోకం కలగాలి లేక మన తల్లి కుంతికైనా పుత్రశోకం కలగాలి " అన్నాడు.

## ధర్మజుడు తానను తాను నిందించు కొనుట

అర్జునుడి మాటలు విన్న ధర్మరాజు " అర్జునా ! నీవు పలికినది సత్యమే ! కుంటుంబ పెద్దగా మీ యోగ క్షేమములు చూడ వలసింది పోయి మిమ్ము అనేక కష్టములకు గురి చేసాను. నీవు నన్ను చంపక పోయినా నేను ప్రాయశ్చిత్తం చేసుకుంటాను. నేను ఇప్పుడే సర్వసంగ పత్యాగినై అడవులకు పోతాను. మీరు హాయిగా జీవించండి. నా లాంటి పిరికివాడికి, బలహీనుడికి, యుద్ధమంటే భయపడే వాడికి రాజ్యమెందుకు. భీమసేనుని ఈ కురుసామ్రాజ్యానికి పట్టాభిషిక్తుడిని కావించుము " అని పలికి చకచకా తాను కూర్చున్న ఆసనము దిగి వనవాసం పోవుటకు ఉపక్రమించాడు. అది చూసిన కృష్ణుడు ధర్మజుడి పాదాలకు నమస్కరించి " ధర్మజా ! అర్జునుడి ప్రతిజ్ఞ గురించి నాకు తెలియదు. నీవు గాండీవిని నిందించి నందుకు నిన్ను చంపక పోతే అతడి ప్రతిజ్ఞా భంగం ఔతుంది. చంపితే ఘోరం జరుగుతుంది. కనుక పెద్దలను దూషించుట వారిని చంపడంతో సమానము కనుక నిన్ను దూషించమని అర్జునుడికి చెప్పాను. అందుకు నీవు మనస్తాపం చెందావు. నీ పాదాలు పట్టుకుని చెప్తున్నాను. అర్జునుడిని నన్ను మన్నించు. నేను సత్యము పలుకుతున్నాను వినుము ఈ రోజు అర్జునుడి చేతిలో కర్ణుడు మరణించుట తథ్యము " అన్నాడు. ధర్మజుడు కృష్ణుని లేవనెత్తి అతడి ఎదుట చేతులు జోడించి " మహాత్మా ! కృష్ణా ! ఏమాత్రము విచక్షణా జ్ఞానము లేక నోటికి వచ్చిన కారు కూతలు కూశాను. నా హృదయం కలకబారింది. నన్ను క్షమించి నాకు హితబోధ చేసిన నిన్ను ఎన్నటికీ మరువజాలను " అన్నాడు.



ధర్మజుని పాదములకు నమస్కరిస్తున్న

అర్జునుడు

కృష్ణుడు తలదించుకుని ఉన్న అర్జునుడిని చూసి " అర్జునా ! నీ అన్న ప్రసన్నుడైనాడు. అతడి అనుమతి తీసుకుని మనం యుద్ధానికి వెడదాము. కర్ణుని చంపడమే మన ప్రధమ కర్తవ్యము. రణరంగమున వీరవిహారమొనరించి కర్ణుని వధించి ధర్మజుడి మనసుకు ఆహ్లాదం కలిగించు . అసలు విషయం తెలుసుకొనక ధర్మజుడు తొందర పడి నిన్ను నిందించినందుకే కదా ఇలా జరిగింది. ఆ మాటలకు కోపించి నీవు నీ అన్నను చంపిన ఏమయ్యి ఉండేది. దైవానుగ్రహం వలన ఘోరం జరుగకుండా ఆగి పోయింది " అనగానే అర్జునుడు కళ్ళ వెంట ధారాపాతంగా నీరు కారుతుండగా ధర్మజుడి కాళ్ళ మీద పడ్డాడు. ధర్మరాజు కూడా అర్జునుడిని పైకి లేవనెత్తి కన్నీళ్ళు తుడుచుకుంటూ గట్టిగా అర్జునుడిని హృదయానికి హత్తుకుని " అర్జునా ! ఆ కర్ణుడు నా విల్లు రధము విరిచి ములుకులవంటి మాటలతో నా మనసు గాయపరిచాడు. నాశరీరాన్ని తన వాడి అయిన బాణాలతో బాధించాడు. అలాంటి దుర్మార్గుని నీవు చంపక ఉన్న నేను బ్రతికి ఉండి ఏమి ప్రయోజనము " అన్నాడు. అర్జునుడు " మహారాజా ! నేను ఈ రోజు కర్ణుడిని చంపి నేలను పడవేయక నీ ముఖము చూడను. కృష్ణుడిని సారధిగా పొందిన అర్జునుడు ఆడిన మాట తప్పడు " అని కృష్ణుడిని చూసి " క్లష్ణా ! ఈ రోజు అర్జునుడు కర్ణుడిని చంపుతాడు అని నీ మనసున సంకల్పించు ఆ సంకల్ప బలంతో నేను కర్ణుడిని సంహరిస్తాను " అన్నాడు. కృష్ణుడు " తధాస్తు " అన్నాడు. కృష్ణుడు " ధర్మజా ! నీ తమ్ముడు అర్జునుడిని దీవించి పంపు " అన్నాడు. ధర్మరాజు " అర్జునా ! అనాలోచితంగా నేను అన్న మాటలకు బాధపడకు. శ్రీకృష్ణుడి అనుమతితో నీవు నన్ను అన్న మాటలకు నేను బాధపడను. విజయా ! నీవు కర్ణుడిని గెలిచి విజయుడివి అన్న పేరును సార్ధకం చేసుకుని తిరిగిరా " అన్నాడు.

### కర్ణవధ కొరకు సంకల్పించుట

కృష్ణార్జునులు రధారూఢులై రణరంగముకు బయలుదేరారుకాని అర్జునుడి మనసులో భీతి బెరుకు ఆవహించాయి. అది గమనించిన కృష్ణుడు " అర్జునా ! నీవు అమరులకు అజేయుడవు. నీకు భుజబలము, అస్త్రబలము దైవ బలము ఉన్నాయి. నీ పరాక్రమానికి తట్టుకోలేక భీష్ముడు అంపశయ్య మీద ఉన్నాడు. ద్రోణుడు ప్రాణాలు విడిచాడు. సైంధవుడు రూపు మాసి పోయాడు. ఇక మిగిలింది కర్ణుడు అతడిని చంపి సుయోధనుడి నమ్మకాన్ని వమ్ము చెయ్యి. అతడిని నమ్మే సుయోధనుడు ఈ ఘోర నరమేధానికి దిగాడు. ఇంకా కృపాచార్యుడు, అశ్వత్థామ, శల్యుడు, కృతవర్మ కూడా చావ వలసిన వారే. కృపాచార్యుడిని, అశ్వత్థామను బ్రాహ్మణులని వదిలినా కృతవర్మను నా బంధువని వదలకు. శల్యుడు మీ మేన మామ. అతడు పరుల పక్షాన ఉన్నందున చంపతగిన వాడే. కర్ణుడు మీ కష్టాలకు మూల కారకుడు. లక్షాగృహ దహనము, కపటజూదము, పాండవసతికి జరిగిన అవమానము, ఇంకా సుయోధనుడు చేసిన సమస్త అకృత్యములకు మూలము అతడే. కర్ణుడు సభలో ద్రౌపదిని అన్న మాటలు దుస్సహము అవి నీవింకా మరువ లేదు కదా " నీ మగలు నిన్ను జూదమున ఓడి చేత కాక చేతులు ముడిచి కూర్చున్నారు. ఈ కురు సభలో మగటిమి గల మగవాడిని మగనిగా ఎన్నుకో " అన్నది కర్ణుడే. నేను సంధికై వెళ్ళిన సమయాన సుయోధనుడికి అతడి తమ్ములకు నా పై పగ రగిల్చి నన్ను బంధింప వచ్చుటకు కారణం కర్ణుడే. లోక భీకరంగా పోరు సల్పుతున్న నీ కుమారుడు అభిమన్యుడి విల్లు విరిచి అతడి మరణానికి కారకుడైంది కర్ణుడే. నీవు కర్ణుడిని చంపిన మిగిలిన రాజులు చావగా మిగిలిన దృతరాష్ట్ర కుమారులు నీ ఎదుట ఇక నిలువరు. విజయలక్ష్మి మిమ్ము వరించగలదు " అన్నాడు. అర్జునుడు " కృష్ణా ! నీ తోడు ఉండగా నాకిక కావలసినది ఏముంది. ఈ రోజు నా చేతిలో కర్ణుడి చావు తథ్యము. నా ప్రతాపానికి సుయోధనాదులు కపటజూదం ఆడించినందుకు విచారించాలి. కర్ణుడి మరణం చూసి నాడు విదురుడి మాట విననందుకు కలత పడాలి. ధృతరాష్ట్రకుమాలు కర్ణుడి వధ చూసి రాజ్యం మీద ఆశ వదులు కోవాలి. కర్ణవధ విన్న నా అన్న ధర్మజుడి ముఖంలో ఆనందం చూడాలి " అన్నాడు.

## భీమసేనుని మనోగతము

అప్పటికి వారు రణరంగం సమీపించారు. యుద్ధం ఘోరంగా జరుగుతుంది. ఇరుపక్షముల వారు ప్రాణాలకు తెగించి పోరాడుతున్నారు. కర్ణుడి కుమారులలో ఒకడు ఉత్తమౌజుడి చేతిలో మరణించాడు. అది చూసిన కర్ణుడు ఉత్తమౌజుని రధాశ్వములను, కేతనమును నరికాడు. ఉత్తమౌజుడు కత్తి తీసుకొని తనకు అడ్డంగా వచ్చిన కృపాచార్యుడి రధాశ్వములను నరికి వెంటనే శిఖండి రధము ఎక్కాడు. ఇంతలో అశ్వత్థామ కృపాచార్యుని తన రధము మీద ఎక్కించుకుని తీసుకు వెళ్ళాడు. భీమసేనుడి పరాక్రమానికి తట్టుకోలేక కౌరవ సేనలు పారిపోసాగాయి. అది చూసి భీముడు తన సారధి విశోకుడితో " విశోకా ! అన్న ధర్మజుడు రణభూమి నుండి తొలగి పోయాడు. అన్న క్షేమం కనుగొనుటకు వెళ్ళిన అర్జునుడు కూడా రాలేదు. వారిరువురికి ఏమి జరిగిందో తెలియరాలేదు. వారికి కీడు కలిగిన ఈ యుద్ధముతో ప్రయోజనమేముంది. అయినా నేను శత్రు వినాశనం చేయక తప్పదు. అది సరే మనకు సరిపడా బాణములు ఉన్నాయి కదా! విశోకా అటు చూడు ఆ కేతనమును చూసి అందు ఉన్న రధికులను పోల్చగలవా ! " అన్నాడు. బదులుగా విశోకుడు " భీమసేనా ! మనకు అస్త్రశస్త్రల గురించి చింత లేదు. అవి విస్తారంగా ఉన్నాయి. మన వెనుక వచ్చు బండిలో ఆయుధములు ఇసుమంతైనా తరగ లేదు. నీ చేత గధ

ఉండగా నీకు ఈ ఆయుధములతో పని లేదు కదా ! నీ చేతి గధ చాలదా శత్రు నిర్మూలనకు " అన్నాడు. ఆ మాటలకు భీముడు సంతోషించాడు. అంతలో విశోకుడు " భీమసేనా ! అటు చూడు నీ తమ్ముడు అర్జునుడు ఏనుగుల సమూహాన్ని తరుముతున్నాడు " అన్నాడు. అది విని భీముడు సంతోషంతో ఉప్పొంగి పోయి " విశోకా ! మన రధమును అర్జునుడి వద్దకు పోనిమ్ము " అన్నాడు. వెంటనే విశోకుడు రధమును అర్జునుడి వైపు పోనిచ్చాడు. రణరంగ ప్రవేశం చేసిన అర్జునుడు కౌరవసేనలను తనుమాడి తన పరాక్రమంతో వాటిని తరముతున్నాడు. మరొక వైపు భీముడు కూడా శత్రు సైన్యములను తనుమాడుతున్నాడు. అది చూసి సుయోధనుడు " భీముడు చస్తే కాని పాండవసేన పారిపోదు. ముందు వీడిని చుట్టుముట్టి చంపండి " అన్నాడు. కౌరవసేనలోని ప్రముఖవీరులు భీముని చుట్టుముట్టి ఎదుర్కొన్నారు. భీముడు విచక్షణారహితంగా శత్రుసేనను చంపుతున్నాడు. శకుని భీముని ఎదుర్కొని అతడి వక్షస్థలానికి గురిపెట్టి బాణంతో కొట్టాడు. భీముడు శకుని విల్లు విరిచాడు. శకుని వేరొక విల్లందుకుని భీముని సారధిని, రధాశ్వములను పదునారు బాణములతో కొట్టి తీవ్రంగా గాయపరిచాడు. భీముడు కోపించి శక్తి ఆయుధమును శకుని మీద ప్రయోగించాడు. శకుని లాఘవంగా శక్తి ఆయుధమును పట్టుకుని తిరిగి భీముని మీదకు విసిరాడు. అది భీముని చేతిని గాయపరిచింది. అది చూసి కౌరవసేనలు ఆనందించాయి. వెంటనే భీముడు విల్లందుకుని శకుని శరీరం అంతా శరములతో నింపాడు. శకుని రధము మీద కూలిపోయి మూర్చిల్లాడు. అది చూసిన సుయోధనుడు శకునిని తన రధము మీద ఎక్కించుకుని తీసుకు వెళ్ళాడు.

## కర్ణుడి విజృంభణ


కేకయ రాకుమారుడైన విశొకుడిని చంపుతున్న కర్ణుడు- రాజ్మానామా నుండి ఒక దృశ్యం

భీముడు శిఖండి , ధృష్టద్యుమ్నుడు, ఉపపాండవుల సాయంతో కర్ణుడిని ఎదుర్కొన్నాడు. నకులసహదేవులూ భీమునికి సాయంగా వచ్చి చేరారు. అందరూ కర్ణుని ఎదుర్కొన్నా కర్ణుడు వెరువక వీర విహారం చేస్తున్నాడు. కర్ణుడి పరాక్రమానికి పాండవ సేనలు పారిపోసాగాయి. కర్ణుడి పరాక్రమానికి పాండవ యోధులు ఆశ్చర్యపోతున్నారు. వారంతా తమతమ సేనలతో కర్ణుడిని చుట్టుముట్టారు. కాని కర్ణుడు వెరువక తనను చుట్టుముట్టిన పాంచాల, ఛేది, మత్స్యదేశ సేనలను నాశనం చేసి రణరంగాన్ని పీనుగుల పెంట చేస్తున్నాడు. కర్ణుడికి తోడుగా కృపాచార్యుడు, అశ్వత్థామ, సుయోధనుడు, దుశ్శాసనుడు, కృతవర్మ, మొదలగు వారుచేరి పాండవసేనలో మారణ హోమం సృష్టిస్తున్నారు. మరొక పక్క భీముడు, ధృష్టద్యుమ్నుడు, శిఖండి, నకులసహదేవాదులు చేరి కౌరవసేనను తుదముట్టిస్తున్నారు. ఇరు వైపులా నష్టం అపారంగా ఉంది. అర్జునుడి రధము చూసి శల్యుడు " కర్ణా ! అడుగో అర్జునుడు ఇటే వస్తున్నాడు. అతడిని ఎదుర్కొన లేక కౌరవసేన పారిపోతుంది. ఇది సరి అయిన తరుణం అర్జునుడిని గెలిచి సుయోధనుడి ఋణం తీర్చుకో " అని ప్రోత్సహిస్తూ శల్యుడు తమ రధమును అర్జునుడి ఎదుట నిలిపాడు. ఇంతలో భీముడు అర్జునుడిని కలుసుకున్నాడు. అర్జునుడు ధర్మరాజు క్షేమసమాచారం భీముడికి చెప్పి తాను కర్ణుడిని ఎదుర్కోడానికి పోతూ కౌరవసేనల మీద తీవ్రమైన దాడి చేసాడు. ఇంతలో నీ కుమారులు పది మంది అర్జునుడి మీద దాడి చేసారు. అర్జునుడు వారిని అందరినీ యమసదనానికి పంపాడు. అది చూసి కౌరవ వీరులు తొంభై మంది అర్జునుడిని ఎదుర్కొన్నారు. అర్జునుడు వారందరిని ఒక్కొక్కరిని ఒక్కొక్క బాణంతో సంహరించి మిగిలిన వారిని తరుముతున్నాడు. ఇంతలో కుసేనలు పదమూడు వందల మంది తమ గజ సైన్యముతో అర్జునుడి చుట్టుముట్టారు. అర్జునుడు భీముని సాయంతో గజసైన్యమును తుదముట్టించ సాగాడు. భీముడు తన గధతో ఏనుగుల కుంభస్థలాలను పగులకొడుతున్నాడు. వారు భీముని వదలక వెంటాడసాగారు. భీముని గధా ఘాతానికి అర్జునుడి పదునైన బాణాలాకు ఆగ లేని కౌరవసేనలు భయపడి కర్ణుడి వెనుక దాక్కున్నాయి. కర్ణుడు కూడా విజృంభించి భీముడి కుమారుడు నకులుని కుమారుల విల్లులను విరిచి కేకయరాజ కుమారుని చంపాడు. కేకయరాజు కోపించి కర్ణుడి కుమారుడైన ప్రసేణుడిని చంపాడు. పుత్రశోకంతో కర్ణుడు కేకయరాజును చంపాడు. సాత్యకి మరొక రధము ఎక్కి కర్ణుడి మనుమడైన సుషేణుని ఎదుర్కొని అతడి హయములను చంపి అతడిని చంపడానికి శరప్రయోగం చేసాడు. అప్పుడు కర్ణుడు ఒరేయ్ సాత్యకీ " చచ్చావురా " అని అరుస్తూ సాత్యకి మీద ఒక నిశిత శరమును వేసాడు. ఆ శరమున అడ్డుకున్న శిఖండి కేతనమును కర్ణుడు విరిచి, ద్రుపద కుమారుడైన సుదేవుడిని చంపాడు. అది చూసి పాంచాల సేనలు కర్ణుడిని చుట్టుముట్టాయి. భీముడు అర్జునుడు కర్ణుడిని సమీపించారు. ఉత్తమౌజుడు, యుధామన్యుడు, జనమేజయుడు, శిఖండి, ధృష్టద్యుమ్నుడు అర్జునుడిని దాటుకుంటూ కర్ణుడిని ఎదుర్కొన్నాడు. కర్ణుడు వారందరిని సమర్ధవంతంగా ఎదొర్కొని వారి ధ్వజములను, రధములను, విల్లులను విరిచి హయములను, సారధులను చంపాడు. ఇంతలో ద్రౌపది కుమారులు కర్ణుడిని

చుట్టుముట్టారు. వారి పక్కనే సాత్యకి నిలబడి కర్ణుడు వేసే బాణాలను తుంచుతూ సుయోధనుడి శరీరం నిండా శరములు నాటాడు. అర్జునుడు సుయోధనుడికి సాయంగా వచ్చిన వారందరినీ తరిమి కొట్టాడు.

## భీముడు దుశ్శాసనుడిని వధించుట


దుశ్శాసనుని రక్తం త్రాగుతున్న భీముడు

ఇంతలో దుశ్శాసనుడు భీమునితో తలపడ్డాడు. భీముడు " తమ్ముడా దుశ్శాసనా ! నాడు కౌరవ సభలో నాడు కురుసభలో నీవు చేసిన అకృత్యములకు వడ్డితో సహా ముట్టచెప్పడానికి తరుణం వచ్చింది. నా ప్రతిజ్ఞ నెరవేర్చుకునే సమయం ఆసన్నమయ్యింది. అందుకే భగవంతుడు నిన్ను నా ఎదుట నిలబెట్టాడు " అన్నాడు. దుశ్శాసనుడు హేళనగా నవ్వుతూ " ఓ భీమసేనా ! ఏమిటి అప్పుడే మరిచావా ! మేము మిమ్ము లక్క ఇంట్లో పెట్టి తగులబెట్టడం, నీ అన్నతో మాయా జూదం ఆడించి మీ రాజ్యం కొల్లగొట్టడం, మిమ్ము అడవులకు వెళ్ళగొట్టడం, దిక్కులేని వారి వలె మీరు విరాటరాజు కొలువులో తలదాచు కోవడం మరిచావా ! ఇంతకంటే దైన్యమూ అవమానం ఉంటాయా ! ఇన్ని జరిగినా తగుదునమ్మా! అని యుద్ధానికి వచ్చావా ! అవన్నీ మీరు మరిచినా ! నేనెలా మరువ గలను " అన్నాడు దుశ్శాసనుడు. ఆ మాటలకు బదులుగా భీముడు దుశ్శాసనుడి కేతనమును, వింటిని విరిచి, సారధిని చంపి దుశ్శాసనుడి నుదుటన బాణం నాటాడు. తన రధము తానే నడుపుతూ దుశ్శాసనుడు మరొక విల్లు తీసుకుని భీముని విల్లు విరిచి భీముని సారధిని కొట్టాడు. భీముడు మరొక విల్లు తీసుకుని దుశ్శాసనుడి శరీరంలో ఏభై బాణములు నాటాడు. వెంటనే దుశ్శాసనుడు భీముని రధాశ్వములను చంపాడు. భీముడు తన గధ చేతబట్టి రధము మీద నుండి కిందకు దూకి దుశ్శాసనుడి రధము దగ్గరకు వచ్చి రధాశ్వములను చంపి, రధమును విరిచాడు. దుశ్శాసనుడు కూడా గధ చేత పట్టి తటాలున రధము దిగి భీముని మీద తోమరం వేసాడు. భీముడు ఆ తోమరాన్ని విరిచాడు. దుశ్శాసనుడిని దగ్గర నుండి చూడగానే తాము పద మూడేళ్ళు పడిన పాట్లు గుర్తుకు వచ్చి కోపంతో రగిలి పోయాడు. నాడు కురుసభలో తాను చేసిన ప్రతిజ్ఞ గుర్తుకు వచ్చింది. తన బలం అంతా కూడగట్టుకుని దుశ్శాసనుడి తల మీద బలంగా మోదాడు. ఆ దెబ్బకు కింద పడిన దుశ్శాసనుడి మీద పడ్డాడు భీముడు. దుశ్శాసనుడి మెడ మీద కాలు పెట్టి నులుముతూ " ఒరేయ్ దుశ్శాసనా ! నాడు కురుసభలో మమ్ము అవమానం చేసింది చాలక చావడానికి నన్ను వెదుకుతూ వచ్చావా ! ఈ రోజు నీ చావు తప్పదు " అంటూ దుశ్శాసనుడి గొంతు మీద కాలు పెట్టి తొక్కుతుంటే ఉభయ సేనలూ భయభ్రాంతులతో చూస్తూ దూరంగా పోయాయి. భీముడు దుశ్శాసనుడి శరీరాన్ని పైకెత్తి పట్టుకుని గిరగిరా తిప్పి నేలకేసి బాదాడు. దుశ్శాసనుడి శరీరాన్ని కాలితో ఎగసి ఎగసి మోదసాగాడు. దుశ్శాసనుడి మెడ మీద మోకాలు పెట్టి అదిమి పైకి లేచాడు. దుశ్శాసనుడు బ్రతికున్నాడో చచ్చాడో చూడక వికట్టాట్టహాసం చేస్తూ మోకాళ్ళ మీద కూర్చుని " ఒరేయ్ దుశ్శాసనా! ఈ రోజు నీగుండెలు చీల్చి నీ రక్తం తేనెలా తాగుతాను. పిలవరా ! నీ వాళ్ళను పిలువు ఎవరు అడ్డం వస్తారో చూస్తాను " అంటూ ఒక గండ్రగొడ్డలి తీసుకుని దుశ్శాసనుడి ముఖం మీద ఆడించాడు. ఆ తరవాత నాడు హిరణ్యకశిపుని పొట్టను నరసింహస్వామి చీల్చినట్లు అమిత రౌద్రంతో దుశ్శాసనుడి గుండెలలో తన గోళ్ళు జొనిపి చీల్చాడు. దుశ్శాసనుడి గుండెల నుండి రక్తం పెల్లుబికింది. ఆ రక్తం దోశిలితో పట్టి ఆస్వాదించి మిగిలిన రక్తం శరీర మంతా పూసుకుని తిరిగి దుశ్శాసనుడి ముఖంలోకి చూస్తూ వికట్టాట్టహాసం చేస్తూ పైకి లేచి పూనకం వచ్చినట్లు ఊగుతూ ఎగురుతూ " ఒరేయ్ దుశ్శాసనా ! నీ రక్తం ఎంత రుచిగా ఉందిరా ! ఈ రోజుకు నా దాహం తీరింది. నా ప్రతిజ్ఞ నెరవేరింది " అంటూ అరుస్తున్నాడు. గంతులు వేస్తూ భుజాలు చరుచుకుంటున్నాడు. అతడు మానవుడా ! రాక్షసుడా ! అని అక్కడ ఉన్న వారికి భ్రమ కలిగి శిలా ప్రతిమలవలె నిలిచారు. భీముడు పైకి లేచి నిలిచాడు.శరీరం రక్తమయమై ఉంది. ప్రళయకాల యముని వలె విజృంభించి కౌరవసేనలను తరమ సాగాడు. భీముని చూసి కౌరవసేనలు పారిపోయాయి. భీముడు తిరిగి దుశ్శాసనుడి వద్దకు వచ్చి " ఒరేయ్ పశువా ! అలా పడి ఉన్నావేమి. పిలవరా నన్ను అడ్డుకునేవాడేవడో పిలువు " అని అంటూ దుశ్శాసనుడి ముందు కూర్చుని " ఒరేయ్ పశువా ! నా మీద మీకు అంత కోపం ఎందుకురా ! నేను మీకు చేసిన అపకారమేమి ? నాకు విషం పెట్టారు, నీళ్ళలో తోసారు, పాములచేత కరిపించారు. అందరి ముందు మమ్ము అవమాన పరచింది, ద్రౌపదిని సభకు ఈడ్చుకు వచ్చింది ఇందుకేనా ! నాడు మాయా జూదం ఆడించి నందుకు ఫలితం ఇదేరా ! అనుభవించు " అంటూ పైకి లేచాడు. తనకు దగ్గరగా వస్తున్న కౌరవయోధులను చూసి " చూడండి ఈ దుశ్శాసనుడి దుర్గతి. వీడి వలన వీడి తండ్రి ధృతరాష్టుడు పరువు పోగొట్టు కొని అవమాన పడ్డాడు. నాడు కురుసభలో ముందుగా మందలించి ఉండిన ఇంతటి దుర్గతి పట్టి ఉండేదు కదా ! ఒరేయ్ నాడు కురు సభలో ద్రౌపదిని చూసి " నీకు మగడు లేడు అన్నావు కదా ! ఇప్పుడు చూడరా ! ద్రౌపదికి భర్త ఉన్నాడురా ! నేనేరా ద్రౌపది భర్తను. కానీ మీకౌరవుల భార్యలందరికీ భర్తలు లేకుండా చేస్తానురా ! వారు తమ భర్తల కొరకు భోరున ఏడవాలిరా ! ఒరేయ్ దుశ్శాసనా ! నా ప్రతిజ్ఞ

ఒకటి నెరవేరిందిరా ! నీ అన్న సుయోధనుడి తొడలు విరిచి తల తన్నడం మిగిలింది ఆ ప్రతిజ్ఞ నెరవేర్చు కొనుటకు పోతానురా ! " అంటూ ఉంగిపోతూ దుశ్శాసనుడి శరీరాన్ని గధతో మోది చిత్రవధ చేసాడు. పరస్త్రీని అవమానించి నందుకు ఏమి శాస్తి జరుగుతుందో లోకానికి చాటుతూ దుశ్శాసనుడు మరణించాడు. భీముని భయంకర ఆకృతి చూసిన కర్ణుడు సుయోధనుడు భయంతో కంపించారు. ఎవరికీ కాలూ చేయీ ఆడలేదు. కాని ధృతరాష్ట్ర కుమారులైన కవచి, నిషంగి, పాశి, దండధారుడు, ధనుర్ధహుడు, అలోపుడు, సహుడు, వాతవేగుడు, షండుడు, సువర్చసుడు భీమసేనుడిని ఎదుర్కొన్నారు. భీమసేనుడు పది భల్లబాణాలతో వారి తలలు తుంచాడు. అది చూసిన కర్ణుడు దిక్కు తోచక అటూ ఇటూ చూస్తున్నాడు.

## శల్యుడు కర్ణుడిని హేళన చేయుట

దుశ్శాసనుడి మరణంతో అచేతనుడై నిలిచిన కర్ణుడితో శల్యుడు " కర్ణా ! ఏమైంది భయపడ్డావా ! నీలో పిరికితనం ఆవహించిందా ! నీ మిత్రుడు సుయోధనుడు కూడా దుశ్శాసనుడి మరణం చూసి తన వంతు ఎప్పుడు వస్తుందో నని భయపడు తున్నాడు. నువ్వూ భయపడితే ఎలా ! కృపాచార్యుడు, అశ్వత్థామ మొదలైన వీరులు నీ ఆజ్ఞ కొరకు నిరీక్షిస్తున్నారు. సైన్యమును కూడ గట్టుకుని యుద్ధముకు ఉపక్రమించు. నీ కుమారుడు వృషసేనుడు పాండవులను ఎదుర్కొంటున్నాడు. నీవు అర్జునుడిని ఎదిరించు. యుద్ధభారాన్ని సుయోధనుడు నీ భుజస్కంధాల మీద ఉంచాడు. నీవిలా నిర్వీర్యుడివి కావడం తగదు " అన్నాడు. ఈ మాటలతో చైతన్యం తెచ్చుకుని కర్ణుడు యుద్ధసన్నద్ధుడయ్యాడు.

## వృషసేనుడి పరాక్రమము



వృషసేనుని వధ - రాజ్మానామా నుండి ఒక దృశ్యం

కర్ణుడికుమారుడు వృషసేనుడు భీముని ఎదుర్కొన్నాడు. నకులుడు అడ్డుపడి వృషసేనుడి విల్లు తుంచి, కేతనమును విరిచి, ఛత్రమును విరిచాడు. వృషసేనుడు వేరొక విల్లందుకొని నకులుడి అశ్వములను చంపి, రధము విరుగకొట్టాడు. నకులుడు కత్తి డాలు తీసుకుకొని వృషసేనుడిని ఎదుర్కొన్నాడు. వృషసేనుడు నకులుని ఖడ్గం తుఇంచి నకులుని శరీరం నిండా బాణములు నాటాడు. అది చూసిన యుధామన్యుడు, ఉత్తమౌజుడు, శిఖండి, జనమేజయుడు, ఉపపాండవులు, సాత్యకి రౌద్రంగా వృషసేనుడిని ఎదుర్కొన్నారు. ఇంతలో సుయోధనుడు, కృపాచార్యుడు, కృతవర్మ, అశ్వత్థామ, శకుని వృషసేనుడికి సాయంగా వచ్చాడు. భీముడు వారందరిని తరిమి కొట్టాడు. నకులుడి కుమారుడు కౌరవ సేనలోని గజ సైన్యమును నాశనం చేయసాగాడు. అది చూసి వృషసేనుడు నకులుని కుమారుడి రధ సారధిని చంపాడు. అది చూసి అర్జునుడు వృషసేనుడిని ఎదుర్కొన్నాడు. వృషసేనుడు జంకక అమిత పరాక్రమంతో భీమార్జునుల మీద శరవర్షం కురిపించి శతానీకుడి మీద బాణ ప్రయోగం చేసి నకులుడి మీద ఏడు బాణములు కృష్ణుడి మీద పన్నెండు బాణాలు వేసాడు. అర్జునుడు వేసిన బాణములు మద్యలోనే త్రుంచి అర్జునుడి మీద పది బాణములు కృష్ణుడి మీద తొమ్మిది బాణములు వేసాడు. వృషసేనుడి విజృంభణ చూసిన అర్జునుడు ఆగ్రహించి వృషసేనుడి విల్లు తుంచి, అతడి భుజములు విరుగకొట్టాడు. మరొక బాణంతో అతడి తల నరికాడు. తన ఎదుటనే తన కుమారుడిని అర్జునుడు చంపడం చూసిన కర్ణుడు తల్లడిల్లి పోయి అర్జునుడి ఎదుట రధముతో నిలిచాడు.

## కర్ణార్జునుల యుద్ధ సమారంభం

అప్పుడు అర్జునుడు కర్ణుడు ఒకరికి ఒకరు ఎదురుగా నిలబడి ఉన్నారు. అప్పుడు కర్ణుడు శల్యుని చూసి " మద్రరాజా ! నన్ను అర్జునుడు నన్ను జయించిన మీరు ఏమి చేస్తారు ? " అన్నాడు. నేను కృష్ణార్జునులతో యుద్ధము చేస్తాను " అన్నాడు శల్యుడు. అక్కడ అర్జునుడు కూడా " కృష్ణా !కర్ణుడు నన్ను జయించిన నువ్వేమి చేస్తావు " అన్నాడు. కృష్ణుడు " అర్జునా ! సూర్యుడు పశ్చిమాన ఉదయించినా కర్ణుడి చేతిలో నీవు ఓడి పోవుట జరగదు. నీ ప్రశ్నకు సమాధానం అవసరం లేదు. విధి వక్రించి అలా జరిగితే అలాంటి దురవస్థను నేను నవ్వులాటకైనా భరించ లేను. కౌరవవంశం నిర్మూలించి ఆ కర్ణుడిని, శల్యుని ఒంటి చేత వధించి ఈ కురు సామ్రాజ్యానికి ధర్మరాజును చక్రవర్తిని చేస్తాను. ఇది నిశ్చయము " అన్నాడు. అర్జునుడు " కృష్ణా !

నేను నవ్వులాటకు అన్నాను కాని నీదాకా రానిస్తానా! నాడు కురు సభలో ద్రౌపదికి జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకొనక వదులుతానా ! ఆ త్రిమూర్తులు అడ్డుపడినా నేడు నా చేతిలో కర్ణుడు చావడం తథ్యం. కర్ణుడు తల నా చేత నరకబడటం నీవు వినోదంగా చూడు. కర్ణుడి భార్యను శల్యుడి భార్యను విధవలుగా చేస్తాను " అన్నాడు. ఇరు పక్షముల వారు ఎదురు ఎదురుగా నిలిచారు. కర్ణుడికి అర్జునుడికి మద్య లోకోత్తర యుద్ధము జరుగ బోతుందని దేవతలు సహితము యుద్ధము కనులారా చూడటానికి ఆకాశంలో కూడారు.

## అశ్వత్థామ సుయోధనుడి వద్ద సంధి ప్రస్థావన తెచ్చుట

కర్ణార్జునులు ఒకరితో ఒకరు సమరానికి సిద్ధపడిన సమయానఅశ్వత్థామ సుయోధనుడితో " సుయోధనా ! భీష్ముడు అంతటి వాడు అర్జునుడి చేత ఓడి పోయాడు. ఈ కర్ణుడు అంతకంటే గొప్పవాడా ! అర్జునుడి ముందు నిలువగలడా ! నేను అర్జునుడిని సమాధానపరుస్తాను నీవు కర్ణుడిని అనునయించు. మనం అందరం ధర్మరాజుతో సంధి చేసు కుంటాము. వ్యవహారం చక్కబడుతుంది. భీముడు నకులసహదేవులు ధర్మరాజు చెప్పిన మాట వింటారు. నా మాట విన్న నీవు , నీ సహూదరులూ, సకల రాజన్యులు, సాధారణ జనం క్షేమంగా ఉంటారు. నీవు నన్ను కృపాచార్యుడిని, కర్ణుడిని నమ్ముకున్నావు. నేను కృపాచార్యుడు ఎవరి చేతిలో చావమని అర్జునుడిని గెలువ గలమని అనుకోవడం పొరపాటు. భీష్ముడు, ద్రోణుడు అరివీర భయంకరులనీ వారిని ఎవరు ఓడించ లేరని అనుకున్నారు. కాని కృష్ణుడి సాయంతో అర్జునుడు వారిని గెలువలేదా ! వారు మరణించ లేదా ! మేమూ అంతే కదా ! కనుక పాండవులతో సంధి చేసుకోవడం ఉత్తమం. కృష్ణుడు రాయబారిగా వచ్చినప్పుడు మనం ఏదేదో అన్నామని ఇక సంధి అసాధ్యమని అనుకోవద్దు. నీ తండ్రి ధృతరాష్ట్రుడిని ధర్మరాజు చక్రవర్తిగా అంగీకరిస్తాడు. అతడి పాలనలో మనమంతా హాయిగా ఉంటాము. కర్ణుడు కూడా నా మాట వింటాడు. మాకు నీవు బ్రత కడం కావాలి. బ్రతికి ఉంటే సుఖములు అనుభవించ వచ్చు కదా! చచ్చి ఏమి సాధిస్తావు ! కనుక అసూయా ద్వేషాలు మాని సంధికి ఒడంబడుట మంచిది. అందరికీ శ్రేయోదాయక మైన సంధికి అంగీకరించక ఉన్న సాము చేస్తున్న త్రాటి నుండి పడినట్లు అధ:పాతాళానికి పోతావు జాగర్త " అన్నాడు.

## సంధికి సుయోధనుడి నిరాకరణ

అశ్వత్థామ మాటలు సావధానంగా విన్న విరక్తిగా నవ్వి " అశ్వత్థామా ! నీవు ఎంత వెర్రి వాడవయ్యా ! నా తమ్ముడు దుశ్శాసనుడిని చంపి ఒక శపథం నెరవేర్చు కున్న భీముడు నన్ను చంపి రెండవ శపథం నెరవేర్చక మానతాడా ! ఇంత జరిగిన తరువాత సంధి ఏమి బాగుంటుంది. ఈ సమయంలో కర్ణుడు యుద్ధము మానగలడా ! కానున్నది కాక మానదు. నీ ప్రయత్నము విరమించుట మంచింది. అర్జునుడిప్పుడు బాగా అలసి ఉన్నాడు. కర్ణుడు అవక్రపరాక్రమంతో విలసిల్లు తున్నాడు. ఇప్పుడు కర్ణుడి చేతిలో అర్జునుడి వధ తథ్యం " అన్నాడు. సుయోధనుడు తన సేనలను ఉత్సాహ పరిచాడు.

## కర్ణార్జునుల యుద్ధం

కర్ణుడు అర్జునుడు ఢీకొన్నారు. యుద్ధం తీవ్రం అయింది. అర్జునుడితో కృష్ణుడు " అర్జునా ! అడుగో కర్ణుడు నీ ప్రతాపం చూపించు. కర్ణుడి శరీరం నిండా శరములు నాటు. కర్ణుడు నీకు ఎందులో సరి రాడు. అర్జునా ! విజృంభించి కర్ణుడిని వధించు " అన్నాడు. కర్ణుడిని కూడా కౌరవ వీరులు ఉత్సాహ పరుస్తున్నారు. " కర్ణా ! ఇన్నాళ్ళు అడవులలో మృగముల మాదిరి తిరిగిన ఇప్పుడు యుద్ధానికి వచ్చారు. నువ్వు అర్జునుడిని చంపితే మిగిలిన పాండవులు తిరిగి అడవులకు పోతారు. సుయోధనుడు కురుసామ్రాజ్యాధిపతి ఔతాడు. నీ శక్తిని అంతా ఉపయోగించి అర్జునుడిని చంపు " అన్నాడు. కర్ణుడు అర్జునుడి శరీరంలో పది బాణములు నాటాడు. అర్జునుడు కర్ణుడి శరీరంలో పందొమ్మది బాణములు నాటాడు. కర్ణుడు అర్జునుడి మీద తొమ్మది పదునైన బాణములు ప్రయోగించాడు. అతడు కృష్ణుడిని కూడా వద లేదు. అది చూసిన అర్జునుడు తన బాణములతో కర్ణుడిని రక్తం కారేలా కొట్టాడు. కర్ణుడు కోపించి కృష్ణార్జునులను పదునైన బాణములతో గాయపరిచాడు. అర్జునుడు కర్ణుడి సారధిని, అశ్వములను కొట్టి కర్ణుడి మీద ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. కర్ణుడు వారుణాస్త్ర ప్రయోగంతో దానిని నిర్వీర్యం చేసాడు. అర్జునుడు కర్ణుని మీద మేఘాస్త్ర ప్రయోగం చేసి కౌరవ సేనలను మేఘాలతో కప్పి అంధకారం సృష్టించాడు. కర్ణుడు అనిలాస్త్ర ప్రయోగంతో దానిని నిర్వీర్యం చేసాడు. ఇంతలో కర్ణుడు ఇంద్రశక్తిని ప్రయోగించాడు. కర్ణుడు మంత్రశక్తితో ఇంద్రశక్తిని నిర్వీర్యం చేసి అర్జునుడి మీద పదునైన బాణములు వేసాడు. అది చూసిన భీముడు " తమ్ముడా అర్జునా ! ఈ కర్ణుడు ఈ రోజు మనతో అటో ఇటో తేల్చుకోవాలని వచ్చాడు. నీ ప్రతిజ్ఞా భంగం కాకుండా నీవు చంపుతావా ! లేక నాగధా ఘాతంతో అతడి తల ముక్కలు చెక్కలు చేయనా ! " అన్నాడు. అది చూసి కృష్ణుడు " అర్జునా ! నీవు ప్రయోగించిన దివ్యాస్త్రాలను కర్ణుడు తిప్పి కొడుతున్నాడు. పైగా నిన్ను తీవ్రంగా తన బాణములతో గాయపరుస్తున్నాడు. నీ పస్థితి

కౌరవసేనలో ఉత్సాహాన్ని పాండవసేనలో నిరుత్సాహాన్ని కలిగిస్తుంది. కారణం తెలియక ఉంది. నా చక్రాన్ని ఇస్తాను దానిని ప్రయోగించి కర్ణుడి తల తుంచు " అన్నాడు. అర్జునుడు " కృష్ణా ! అంత పని వద్దులే నేను కర్ణుడి మీద బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగిస్తాను " అని బ్రహ్మాస్త్రాన్ని సంధించాడు. అది కర్ణుడి మీదకు వేగంగా రాసాగింది. కర్ణుడు బెదరక నిశ్చలంగా నిలబడి తన మంత్రశక్తితో దానిని నిర్వీర్యం చేసి కృష్ణార్జునులను తన బాణములతో గాయపరిచాడు. అర్జునుడు కర్ణశల్యులను మీద తొమ్మిదేసి బాణములను ప్రయోగించాడు. కర్ణుడు అర్జునుడి వింటి నారిని తెంచాడు. అర్జునుడు నారిని సరి చేసుకుని కర్ణుడి వింటి నారిని తెంచాడు. అర్జునుడి ధాటికి తాళ లేని కర్ణుడి చక్రరక్షకులు పారి పోయారు. అది చూసి సుయోధనుడు అర్జునుడిని చంపమని తన సైన్యమును ప్రోత్సహించాడు. సుయోధన బలగాలు అర్జునుడిని చుట్టుముట్టాయి. అర్జునుడు వాడి అయిన బాణములు ప్రయోగించి వారిని చెదరగొట్టాడు. ఇరు పక్షముల వీరులు యుద్ధం వదిలి కర్ణార్జునుల యుద్ధం వీక్షించసాగారు. సుయోధనుడు " యోధులారా ! కర్ణుడు అత్యంత పరాక్రమంతో పోరుతుండగా మీరు చూస్తూ ఉండటం భావ్యమా ! పోయి కర్ణుడికి సాయపడండి " అన్నాడు. ఆమాటలకు రోషపడి కౌరవ వీరులు అర్జునుడిని ఎదుర్కొన్నారు. అర్జునుడు పదునైన బాణములు వేసి వారి కేతములు, రథములు, ధనస్సులను విరిచి అశ్వములను పంపాడు. ముందుకు పోతే అర్జునుడు చంపు తున్నాడు. వెనక్కు పోతే సుయోధనుడు హెచ్చరిస్తున్నాడు. కౌరవ వీరులు అయోమయ అవస్థకు లోనయ్యారు.

## అర్జునుడి మీద కర్ణుడు నాగాస్త్రమును ప్రయోగించుట

కర్ణుడు తన వద్ద ఉన్న సర్పముఖాస్త్రాన్ని బయటకు తీసాడు. ఆ అస్త్రానికి అధిపతి తక్షకుని కొడుకైన అశ్వసేనుడు. దానిని అర్జునుడిని చంపడానికే దాచి ఉంచాడు. ఇప్పుడు దానిని తీసి సంధించాడు. అర్జునుడి కంఠానికి గురిపెట్టాడు. కాని గురి కొంచెం కిందకు ఉండటం గమనించిన శల్యుడు " కర్ణా ! నీ గురి తప్పతుంది. అర్జునుడి కంఠానికి సూటిగా గురిపెట్టు " అన్నాడు. తన గురిని అక్షేపించిన శల్యుని మీద ఆగ్రహించిన కర్ణుడు " శల్యా ! నా గురిని ఆక్షేపించే అర్హత నీకు లేదు. చూస్తూ ఉండు ఈ అస్త్రధాటికి అర్జునుడి తల తెగి నేల మీద పడుతుంది " అంటూ సర్పముఖాస్త్రాన్ని ప్రయోగించాడు. తమ వంక నిప్పులు కక్కుతూ వస్తున్న అస్త్రాన్ని చూసి కృష్ణుడు తన బలమంతా ఉపయోగించి రథమును భూమిలోకి అయిదు అంగుళాలు కూరుకుపోయేలా తొక్కాడు. అర్జునుడి కంఠానికి గురిపెట్టిన అస్త్రము గురి తప్పి అర్జునుడి తల మీదగా దూసుకుపోతూ కిరీటాన్ని ఎగురగొట్టింది. ఆ కిరీటాన్ని బ్రహ్మ దేవుడు దేవేంద్రునికి బహూకరించాడు.


సర్పముఖాస్త్రము నుండి అర్జునుని రక్షించిన కృష్ణుడు

దేవేంద్రుడు నివాత కవచులను సంహరించిన సమయంలో అర్జునుడికి బహూకరించాడు. ఆకిరీటమే అర్జునుడికి కిరీటి అనే నామాన్ని ఇచ్చింది. ఇప్పుడది నాగాస్త్ర ప్రభావానికి ధ్వంసం అయింది. అర్జునుడు వెంటనే తెల్లని పాగాను కిరీటంలా చుట్టుకున్నాడు. అర్జునుడి కిరీటమును నేలపడేసిన అస్త్రము తిరిగి అర్జునుడి వైపు దూసుకు వస్తుంది. అది చూసిన అర్జునుడు " ఈ నాగాస్త్రం ఎవరు ఇది నన్ను ఎందుకు తరుముతుంది " అన్నాడు. కృష్ణుడు " అర్జునా ! అప్పుడే మరిచావా ! ఖాండవ వనదహన సమయంలో నీవు అశ్వసేన అనే నాగ కన్య తన తల్లిని రక్షించుకు పోతున్న సమయంలో నీవు ఆ నాగకన్యను చంపావు. ఆమె తరువాత తక్షకుడి కుమారుడు

అశ్వసేనుడిగా జన్మించి నిన్ను చంపడానికి కర్ణుని వద్ద నాగముఖాస్త్రంగా పూజలందుకుంటూ ఉంది. ఇప్పుడు నీవు నీ దివ్యాస్త్రాలతో ఆ నాగ కన్యను సంహరించు " అన్నాడు. వెంటనే అర్జునుడు అశ్వసేనుడిని సంహరించి నాగాస్త్రాన్ని ముక్కలు చేసి కర్ణుడి శరీరం మీద పన్నెండు బాణాలు వేసాడు. తాను ప్రయోగించిన నాగాస్త్రం కృష్ణుడి కారణాన గురి తప్పిందని తెలుసుకుని కర్ణుడు పదమూడు బాణాలను కృష్ణుడి మీద నూరు బాణాలను అర్జునుడి మీద ప్రయోగించాడు. అర్జునుడు ఒకే బాణంతో కర్ణుడి కుండలములు కొట్టాడు. కర్ణుడు బెదరక అర్జునుడిమీద శరవర్షం కురిపించసాగాడు. కర్ణుడి శరములు మధ్యలోనే తుంచి వేస్తున్నాడు అర్జునుడు. కర్ణుడి శరీరం రక్తసిక్తం అయింది. సూర్యుడు అస్తమించే సమయమూ ఆసన్నమైంది. అప్పుడు యమధర్మరాజు అక్కడకు వచ్చి అదృశ్యరూపంలో ఉండి ఆకాశం నుండి " ఇప్పుడు కర్ణుడి రథం భూమిలోకి కుంగి పోతుంది. కర్ణుడికి అవసాన సమయం ఆసన్నమైంది " అన్నాడు. అది విన్నా కర్ణుడు ధైర్యమును వీడక భార్గవాస్త్రాన్ని స్మరించాడు. కాని అతడికి అప్పుడది గుర్తుకు రాలేదు. పరశురామ శాపం పనిచేయడం మొదలైంది అని తెలుసుకున్నాడు. కర్ణుడు మనసులో " నేను ధర్మపరుడిని ధర్మం నన్ను రక్షిస్తుంది అనుకున్నాను కాని అది అసత్యం అయింది " అనుకున్నాడు. అర్జునుడు కర్ణుని మీద శరములు గుప్పిస్తున్నాడు. కర్ణుడు తన బాహుబలాన్ని నమ్ముకున్నాడు.


భూమిలోకి దిగిన చక్రాన్ని ఎత్తుతున్న కర్ణుడు

అర్జునుడు కర్ణుడి మీద బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. కర్ణుడు ఇంద్రాస్త్రంతో దానిని అడ్డుకున్నాడు. కృష్ణుడు అర్జునుడితో " అర్జునా ! నీ బ్రహ్మాస్త్రం ఎందుకు వృధా అయిందో తెలుసా ! నీవు ఉపాయంతో యుద్ధం చేయడం లేదు. నీవు ఉపాయంతో యుద్ధం చేస్తే కర్ణుడు నీ ముందు నిలబడకలిగిన వాడు కాదు. కనుక శ్రమపడక ఉపాయంతో కర్ణుడిని సంహరించు అన్నాడు. ఇంతలో కర్ణుడు రుద్ర అనే అస్త్రం జపించ సాగాడు. అతడి రధచక్రం భీమిలోకి కుంగి పోయింది. అందు వలన కర్ణుడు రుద్రాస్త్ర ప్రయోగం చేయలేక పోయాడు.

## కర్ణుడు చేసిన నేరములు కృష్ణుడు గుర్తు చేయుట


తన రధచక్రం భూమిలో దిగబడిపోయిందని అర్జునిని అడుగుతున్న కర్ణుడు

కర్ణుడు రధం దిగి " అర్జునా ! ప్రస్తుతం నేను విరధుడను. నా రధ చక్రం భూమిలోకి కుంగి పోయింది. నేను దానిని ఎత్తుకొన వలెను. భూమి మీద ఉన్న నా మీద రధం మీద నుండి నీవు బాణప్రయోగం చేయడం ధర్మము కాదు. కనుక రధచక్రం తీసేదాకా నా మీద బాణ ప్రయోగం చేయకుము. ఇది కేవలం నీకు యుద్ధ ధర్మం తెలియ జేయడానికి చెప్తున్నాను కాని నీకు కృష్ణుడికి భయపడి కాదు " అన్నాడు. కృష్ణుడికి సమయం చిక్కింది కర్ణుడిని చూసి నవ్వుతూ " అదేమిటి కర్ణా ! నువ్వు ధర్మాధర్మ విచక్షణ చేయడం ఎప్పటి నుండి ? నీకు ఆపద కలిగింది కనుక ధర్మం గుర్తుకు వచ్చిందా ! అహంకారంతో విర్రవీగు సమయాన ధర్మం గుర్తుకు రాలేదా ! ధర్మమార్గాన పయనించే పాండవులకు జయం తధ్యం. అధర్మమార్గాన చరించే కౌరవులకు అపజయం అనివార్యం. నీవు నీ అనుంగు మిత్రునితో కలిసి చేసిన అకృత్యములు మరచినట్లు ఉంది. పాండవులను లక్క ఇంట్లో పెట్టి కాల్చిన సమయాన అతడిని ప్రేరేపించింది నీవు కాదా ! అప్పుడది నీకు అధర్మం అనిపించ లేదా ! నీకు ఇప్పుడు మాత్రం ధర్మం గుర్తుకు వచ్చిందా ! కపటజూదం ఆడించి నప్పుడు, ద్రౌపదిని అవమానాల పాలు చేసి అనరాని మాటలు అన్నప్పుడూ, పాండవులను కించపరచినప్పుడూ గుర్తుకు రాని ధర్మం ఇప్పుడు గుర్తుకు వచ్చిందా ! పాండవులను అడవులలో ప్రంశాంతంగా బ్రతక నీయక ఘోషయాత్రకు సుయోధనుడిని పురికొల్పినప్పుడు గుర్తుకు రాని ధర్మం ఇప్పుడు గుర్తుకు వచ్చిందా ! అభిమన్యకుమారుని ఒంటరిని చేసి చుట్టుముట్టి పలువురు దాడి చేసి చంపినప్పుడు ధర్మం గుర్తుకు రాలేదా ! ఇవి అన్ని ప్రత్యక్షంగా చేసింది సుయోధనుడే అయినా పరోక్షంగా కారణం నీవు కాదా! " అన్నాడు. కృష్ణుడి ఒక్కొక్క మాట అర్జునుడికి ఆగ్రహం తెప్పించింది. దయాదాక్షిణ్యం లేక కర్ణుడి మీద శరములు గుప్పించాడు. కర్ణుడు కూడా నేల మీద ఉండే అర్జునుడు వేసే బాణములు ఎదుర్కొంటూ అర్జునుడి మీద బాణములు వేస్తున్నాడు. అర్జునుడు కర్ణుని పతాకం విరుగకొట్టాడు. కర్ణుడు మహా కోపంతో అర్జునుడి మీద కృష్ణుడి మీద పదునైన బాణములు వేస్తూ మధ్యమధ్యలో రధచక్రం తీయ ప్రయత్నించినా అది విఫలం అయింది. కృష్ణుడు అర్జునుడికి కర్ణుడిని సంహరించమని చెప్పాడు. అర్జునుడు అత్యంత శక్తివంతమైన మహాస్త్రాన్ని ఎక్కుపెట్టి మనసులో " నేనే కనుక తపస్సు చేయడంలో దానధర్మాలు చేయడంలో గురువులను సేవించడంలో లోపం లేక చరించిన వాడనైె బ్రాహ్మణులను గురువులను తృప్తిపరచిన వాడినై అను నిత్యం పుణ్య కర్మలు ఆచరించే వాడినై ఉంటే ఈ అస్త్రం కర్ణుడిని సంహరించుగాక " అని సంకల్పించి గాండీవాన్ని ఆకర్ణాంతం లాగి అస్త్రప్రయోగం చేసాడు. ఆ దివ్యాస్త్రం నిప్పులు కక్కుతూ వచ్చి కర్ణుడి శిరస్సు ఖండించింది. కర్ణుడి శరీరం నుండి అందరూ చూస్తుండగా ఒక తేజం బయటకు వెడలి సూర్యునిలో కలిసి పోయింది. కర్ణుడి మరణంతో బ్రాహ్మణ శాపం అంతమై అప్పటి వరకు భూమిలో కూరుకు పోయి ఉన్న రధచక్రము భూమిలో నుండి పైకి లేచి భూమి మీద నిలబడింది. సూర్యుడు అస్తమించాడు.

## శల్యుడు కర్ణుని మరణం సుయోధనుడికి వివరించుట


కర్ణుని మరణం

కర్ణుడి మరణం పాండవ సేనలో ఆనందోత్సాహాలు నింపాయి. జయజయ ధ్వానాలు మిన్నంటాయి. కర్ణుడు లేని రధమును తోలుకుని శల్యుడు వెళ్ళి పోయాడు. భీముడు కర్ణుడి మరణానికి ఆనందించి పెద్దగా అరుస్తూ కేకలు వేసాడు. శల్యుడు సుయోధనుడిని చేరి " సుయోధనా ! ఎన్నో యుద్ధాలు చూసాను కాని ఈ రోజు జరిగిన కర్ణార్జునుల యుద్ధం లాంటిది చూడ లేదు. ఒక దశలో కృష్ణార్జునులు సైతం కర్ణుడి పరాక్రమానికి భయపడ్డారు. కాని విధి బలీయం కనుక అంతటి బలశాలి కర్ణుడిని బలి తీసుకుంది. కృషార్జునుల శంఖధ్వానాలు వింటున్నావు కదా! సూర్యాస్థమయం అయింది ఈ రోజుకు యుద్ధం చాలించడం మంచిది " అన్నాడు. కర్ణుడి మరణ వార్త సుయోధనుడిని నిశ్చేష్టుడిని చేసింది. అంతలో కర్ణుడి మరణ వార్త తెలుసుకుని అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ, శకుని, సుశర్మ విషణ్ణ వదనాలతో అక్కడకు చేరారు. సుయోధనుడి దు:ఖానికి అవధులు లేవు. " కర్ణా ! కర్ణా ! " అని అరుస్తూ శిబిరానికి చేరుకున్నాడు.

## కృష్ణార్జునులు ధర్మజునుకి కర్ణుని మరణ వార్త ఎరిగించుట

కృష్ణార్జునులు కూడా యుద్ధంచాలించమని తమ సేనలకు చెప్పారు. అందరూ తమతమ శిబిరములకు చేరారు. అందరూ తమ ధర్మరాజు శిబిరానికి వెళ్ళి అన్న మాట నిలబెట్టు కున్నందుకు ధర్మరాజును అభినందించారు. కృష్ణుడు ధర్మరాజుతో " ధర్మజా! కర్ణుడు ఈరోజు మహా పరాక్రం ప్రదర్శించాడు. నీ ఆగ్రహజ్వాలలే కర్ణుడిని దహించాయి. కర్ణుడి చావుతో నీకు కౌరవుల బాధ తీరింది. నీవు ఇక నిశ్చింతగా ఉండు " అన్నాడు.ధర్మరాజు " అది సత్యము కాదు. నీ అనుగ్రహమే మాకు విజయాన్ని చేకూర్చింది. కాని మరేది కాదు " అన్నాడు. కృష్ణుడు " ధర్మజా! నేను కేవలం నిమిత్త మాత్రుడను. నీ తమ్ములు , బావలు అత్యంత పరాక్రమ వంతులు. అందరి సమిష్టి కృషి వలనే మీకు విజయం చేకూరింది " అని అన్నాడు.

### ధర్మజుడు కర్ణుడిని రణభూమిలో చూచుట

ధర్మరాజు కర్ణుడి మరణానికి ఆనందించి " ఒకసారి రణ భూమికి వెళ్ళి కర్ణుడిని చూడవలెనని కోరికగా ఉంది అన్నాడు. ధర్మరాజు బంధు మిత్రులు తోడురాగా సపరివార సమేతంగా రణ భూమికి వెళ్ళి కర్ణుడు మరణించడం చూడడానికి వెళ్ళాడు. రణభూమిలో తలతెగి పడి ఉన్న కర్ణుడిని అతడి పుత్రులను చూసి ఇక తనకు పునర్జన్మ కలిగినంతగా సంతోషించాడు ధర్మరాజు " అన్నాడు సంజయుడు.

## వనరులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

# శల్య పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

(శల్య పర్వము నుండి దారిమార్పు చెందింది)

## విషయ సూచిక

# ప్రధాశ్వాసం

పదునేడవ నాటి యుద్ధం దుశ్శాసన, కర్ణుల మరణంతో ముగిసింది. మిగిలిన వీరులతో సుయోధనుడు తన శిబిరానికి వెళ్ళాడు. శల్యుడిని తన సేనాధిపతిగా చేసాడు. పద్దెనిమిదవ రోజు యుద్ధానికి ఇరుపక్షములు సమాయత్తమయ్యాయి. ధర్మరాజు అత్యంత పరాక్రమంతో శల్యుని సంహరించాడు. తరువాత క్రమంగా కౌరవ ప్రముఖులు ఒక్కొక్కరుగా మరణించారు. సుయోధనుడు రణ భూమి నుండి తొలగి పోయి ఒక మడుగులో ప్రవేశించాడు. పాండవులు సుయోధనుడిని వెదుకుతూ అక్కడకు వచ్చారు. సూటీపోటీ మాటలతో సుయోధనుడిని యుద్ధోన్ముఖుని చేసారు. భీముడు సుయోధనుడితో గధాయుద్ధం చేసి అతడి తొడలు విరిచాడు. సుయోధనుడు కుప్పకూలాడు. పద్దెనిమిది రోజుల తరువాత సూర్యాస్తమయ సమయానికి సుయోధనుడు కుప్పకూలడంతో భారత యుద్ధం ముగిసింది. ఆ రోజు రాత్రి అశ్వత్థామ కృతవర్మ, కృపాచార్యుడు వెంట రాగా పాండవ శిబిరాన ప్రవేశించి చావగా మిగిలిన ప్రభద్రక, పాంచాల, మత్స్య సైన్యాలను హతమార్చాడు. పాండవులని భ్రమించి ఉపపాండవులను హతమార్చాడు. ఇదంతా కళ్ళారా చూసిన సంజయుడు అమితమైన దు:ఖంతో ధృతరాష్ట్రుడికి యుద్ధవిశేషాలు చెప్పడానికి హస్థినాపురం వచ్చాడు.

## సంజయుడు పదినెనిమిదవనాటి యుద్ధవిశేషములు చెప్పుట

సంజయుడు ధృతరాష్ట్ర మందిరం ప్రవేశించగానే అక్కడ గుమిగూడి ఉన్న ధృతరాష్ట్రుడి కోడళ్ళను , విదురుడిని, గాంధారిని చూసి ఏడుస్తూ " ధృతరాష్ట్ర మహారాజా ! శల్యుడు, శకుని, ఉలూకుడు , సంశక్తులు, కాంభోజులు, శతానీకుడు, యవనులు, పర్వతరాజులు, మ్లేచ్ఛులు ఇలా మనకు సాయం చేయ వచ్చిన సమస్త మహారాజులు ససన్యంగా యుద్ధంలో మరణించారు. కర్ణుడి కుమారులు అందరూ మరణించారు. నీకుమారుడు సుయోధనుడు తొడలు విరుగకొట్టబడి కటిక నేల మీద పడి ఉన్నాడు. భీముడు తన ప్రతిన నెరవేర్చుకున్నాడు. MANA పక్షమున అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ అను ముగ్గురు రధిక త్రయం పాండవ పక్షాన శ్రీకృష్ణుడు, సాత్యకి, పంచపాండవులు, నీ కుమారుడైన యుయుత్సుడు బ్రతికి ఉన్నారు. సుయోధనుడి పదకొండు అక్షౌహినుల సైన్యం సర్వనాశనం అయింది " అన్నాడు.

## దృతరాష్ట్రుడు కుమారుల కొరకు విలపించుట

ఆ మాటలు విన్న ధృతరాష్ట్రుడు, గాంధారి, ఆమె కోడళ్ళు మూర్చ పోయారు. మిగిలిన వారు నిశ్చేష్టులు అయ్యారు. ధృతరాష్ట్రుడు కొంతసేపటికి తేరుకుని పక్కనే ఉన్న విదురునితో " విదురా ! నేను పుత్రహీనుడను అనాధను అయ్యాను. నాకు బంధువు అనే వాడివి నువ్వు మాత్రమే మిగిలావు " అని తిరిగి మూర్చిల్లాడు. దాసీ జనం చేసిన ఉపచారములతో తేరుకుని " విదురా ! నా మనస్సు నా వశమున లేదు " వీరిని తమ తమ నివాసములకు పంపి వేయి " అన్నాడు. విదురుడు స్త్రీలనందరిని వారి వారి నివాసముకు పంపాడు. ధృతరాష్ట్రుడు " విదురా ! ఇప్పుడు నాకు ఏమి గతి ? నా కొడుకులు అందరూ చచ్చినా పాండుసుతులు ఒక్కరు కూడా చావక పోవడం వింత కాదా ! నూరుగురు కుమారులు మరణించినా నా గుండెలు బద్దలు కాకుండా ఉన్నాయంటే నాది గుండా లేక పాషాణమా ! పుట్టు గుడ్డినైన నేను కుమారుల ముద్దు ముచ్చట చూసుకొనుటకు నోచుకొనక పోయినా వారి మరణ వార్త వినవలసిన దుర్గతి మాత్రం దాపురించింది. సుయోధనా ! ఎక్కడ ఉన్నావు మీ అమ్మ గాంధారి పిలుస్తుంది రారా ! ఈ ముసలి తనంలో మమ్ము విడిచి ఎక్కడకు వెళ్ళావు. ఇలా మమ్ములను అనాధలను చేసావే నీవు మా మీద చూపిన ఆప్యాయత ఏమైంది. నిరంతరం సేవలందుకునే నీవు కటిక నేల మీద దొర్లుతున్నావా ! నాడు నాకు చెప్పిన మాటలు మరిచావా ! " నా వెంట భీష్మ, ద్రోణ, కృప, అశ్వత్థామలు ఉన్నారు అన్నావే. కర్ణుడు ఒక్కడు చాలు పాండవులను అందరినీ సంహరించడానికి అన్నావు. వీరుకాక బాహ్లీక, సోమదత్త, శకుని, భూరిశ్రవ, శల్య, సింధురాజులు ఉన్నారని చెప్పావే. వీరు చాలరా పాండవుల జయించడానికి " అన్నావు కదా ! ఈ రోజు ఆ పాండవుల చేతిలో హతమయ్యావా ! శిఖండిని అడ్డుపెట్టుకుని భీష్మిని చంపిన అర్జునుడికి అసాధ్యము ఏముంది ? ద్రోణుడు సామాన్యుడా ! అతడిని అర్జునుడు వధించ లేదా ! జయద్రధుడు సామాన్యుడా ! అతడి తల ఒక్క వేటుతో తుంచ లేదా ! నీవు నమ్మిన కర్ణుడు పాండవులలో ఒక్కరిని వధించాడా ! విధి వైపరీత్యం కాక మరేమి ? బలశాలి శల్యుడు కూడా ఎవరిని వధించ లేదు. నా తమ్ములతో కూడి పాండవులను వధిస్తానని అన్నావు. నీ తమ్ములతో కూడి నీవూ కూలి పోయావు. అదృష్టహీనుడిని అయిన నాకు శుభాలు ఎలా కలుగుతాయి. నా కుమారులంతా మరణించాక నేను ఎవరిని చూసి బ్రతకాలి ? భీమసేనుడు అనునిత్యము సూటీపోటీ మాటలతో వేధిస్తుంటే ఎలా బ్రతుక గలను. నేను అడవులకు పోయి శేషజీవితం గడుపుతాను సంజయా ఆ ఏర్పాట్లు చూడు " అన్నాడు.

## సంజయుడు యుద్ధ వివరణ చేయుట

ధృతరాష్ట్రుడు " సంజయా ! నాకు తెలియక అడుగుతున్నాను. భీష్ముడు, ద్రోణుడు మరణించిన తరువాత ఎవరి అండ చూసుకుని నా కొడుకు యుద్ధాన్ని కొనసాగించాడు. ఇది మూర్ఖత్వం కాక మరేమిటి. విదురుడు అప్పుడే చెప్పాడు. నీకొడుకు మూర్ఖుడు అతడిని వదిలి వేయి అని . నేను విన లేదు ఫలితం అనుభవిస్తున్నాను. సంజయా ! కర్ణుడు మరణించిన తరువాత సైన్యాధ్యక్షుడు ఎవరు. యుద్ధం ఎలా జరిగింది వివరించు. అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ ఎలా బ్రతికి బయట పడ్డారు. ధృష్టద్యుమ్నుడు, శిఖండి పాంచాల , భద్రక, మత్స్య సేనలతో ఉపపాండవులు ఎలా మరణించారు. పాండవులు, సాత్యకి, కృష్ణుడు ఎలా తప్పించుకున్నాడు " అని అడిగాడు. కర్ణుడు మరణించాక సుయోధనుడు పిచ్చెత్తినట్లు అరుస్తూ శిబిరానికి వెళ్ళి లోపలకు రాక ఆరుబయట సమావేశమై దు:ఖం నుండి బయట పడి కార్యాచరణకు పూనుకున్నాడు.

## కృపాచార్యుని సంధి ప్రస్థావన

కృపాచార్యుడు సుయోధనుడితో " సుయోధనా ! క్షత్రియులకు యుద్ధము పరమ ధర్మం. కాని నేను బ్రాహ్మణుడను. క్షత్రియ ధర్మంగా ఒక మాట చెప్తున్నాను. భీష్మ, ద్రోణ, కర్ణులు దైవీ సంపత్తులు అమిత శౌర్యవంతులు. వారంతా అర్జునుడి చేత మరణించారు. అర్జునుడు అగ్ని కృష్ణుడు వాయువు. అగ్నికి వాయువు తోడైతే నాశనం తప్ప మరేమిటి. అదే ఇప్పుడు జరిగింది. ప్రస్థుతం మన వద్ద తగినంత సైన్యము లేదు. ఉన్న వారు అలసి ఉన్నారు. ఇప్పుడు ఎవరు సైన్యాధ్యక్షుడైనా పాండవులను జయించడం అసాధ్యం. కనుక పాండవులతో సంధి చేసుకొనుట ఉత్తమం. పాండవుల మీద కోపం విడిచి పెట్టు. ఈ యుద్ధం పాండవుల మీద నీకు గల అకారణ కోపం కారణంగానే జరిగింది. కొంచం లౌక్యము చూపిస్తే యుద్ధం నివారించబడేది. మరొక్క మాట మనకు శక్తి సామర్ధ్యం అధికంగా ఉన్నప్పుడు యుద్ధం అనుసరణీయం. మన శక్తి తగ్గినప్పుడు సంధి అనుసరణీయం. సకల సామ్రాజ్యానికి అధిపతి కావాలని నీవు తలపెట్టిన యుద్ధం సుఖములు అనుభవించడానికే కదా! ఈ కొద్దిపాటి సైన్యముతో అది సాధ్యం కాదు. ప్రాణంతో ఉంటేనే కదా సుఖములు అనుభవించేది. కనుక ప్రాణములు నిలబెట్టుకునే మార్గం చూడు. సౌమ్యుడైన ధర్మరాజు సంధికి అంగీకరిస్తాడు. కృష్ణుడు సంధికి వ్యతిరేకం కాడు. భీమ, నకుల, సహదేవులు ధర్మరాజు మాట వింటారు. నీవు అంగీకరిస్తే సంధి నెరవేరుతుంది " అన్నాడు.

### సుయోధనుడు సంధిని నిరాకరించుట

కృపాచార్యుని సంధి ప్రస్థావన సుయోధనుడు మర్యాదగానే నిరాకరించాడు. " ఆ చార్యా ! మీరు నా మంచి కోరి నేను చెడిపోవడం చూడ లేక నాలుగు మంచి మాటలు చెప్పారు. ఆ మాటలు నేను అంగీకరించలేను. ఎందుకంటే మాయా జూదం ఆడించి పాండవుల రాజ్యం అపహరించి వారిని అరణ్యములకు పంపాను. నిండు సభలో పాండవ పత్నిని జుట్టు పట్టి ఈడ్పించి ఘోరంగా అవమానించాను. సంధి చేయ వచ్చిన కృష్ణుడిని పట్టి బంధించాలనుకున్నాను. భీష్మ, ద్రోణ, కర్ణుల చావును కళ్ళారా చూసాను. పసి వాడైన అభిమన్యుడిని అధర్మంగా ఒంటరిని చేసి చుట్టుముట్టి కిరాతకంగా వధించాను. దుశ్శాసనుడిని చంపి రుధిరం తాగి భీముడు చంపడం చూసాను. ఇన్ని చేసిన నేను ఈ నాడు సంధి చేసుకుంటే నా తొడలు విరిచి భీముడు రెండవ శపధం నెరవేర్చుకుంటాడని భయపడి సంధి చేసుకున్నానని లోకులు నవ్వి పోరా ! నిందించరా ! ఏమైనా జరగని ఒకరి దయా దాక్షిణ్యాలతో వచ్చే రాజ్యానికంటే యుద్ధం చేసి మరణించి వీర స్వర్గం పొందుట మేలు కదా ! కనుక యుద్ధం కొనసాగించ నిశ్చయించుకున్నాను. అడ్డు చెప్పకండి. మిగిలిన సైన్యాలతో యుద్ధానికి వెళతాను. ఏమో రేపు నేనే గెలువగలనో ఏమో ఎవరికి తెలుసు " అన్నాడు. సుయోధనుడు తన సైన్యాలను ఉత్సాహపరచి యుద్ధోన్ముఖులను చేసాడు. తరువాత మరునాటి యుద్ధానికి తగిన వ్యూహము కొరకు ఆలోచించాడు. అశ్వత్థామ శకుని, కృపాచార్య, శల్య, కృతవర్మలతో కలిసి ఆలోచించి " సుయోధనా ! మనమీ రాత్రి ఈ శిబిరంలో నిద్రించుట శ్రేయస్కరం కాదు. విజయోత్సాహంతో ఉన్న పాండవులు అర్ధరాత్రి మన మీద దాడి జరిపి మనలను సంహరించ వచ్చు. కనుక మనం ఇచ్చటికి దూరంగా వెళ్ళి విడిది చేస్తాము " అన్నాడు. ఆ మాటలకు సంతోషించిన సుయోధనుడు బంధు మిత్ర సహితంగా సైన్యములతో అక్కడకు రెండు ఆమడల దూరంలో ఉన్న సరస్వతీ నదీ తీరంలో విడిది చేసారు. అలసట తీరేలా అందరూ స్నానాలు చేసారు.

## కౌరవ సైన్యాధ్యక్షత

కౌరవ యోధులు సేదతీరిన తరువాత సుయోధనుడు మరునాటి యుద్ధానికి సైన్యాధ్యత ఎవరికి అప్పచెప్పాలో నిర్ణయించమని అశ్వత్థామను అడిగాడు. అశ్వత్థామ " సుయోధనా ! ఈ క్లిష్ట సమయంలో యుద్ధకళానైపుణ్యం ఉన్న వాడు. వయసులో పెద్ద వాడు, తన మేనళ్ళులను వదిలి మన మీద అభిమానంతో తరఫున యుద్ధం చేస్తున్న వాడు అయిన మద్ర

దేశాధిపతి శల్యుడికంటే మన సైన్యాలకు అధ్యక్షత వహించగల వాడు ఎవ్వడు. కనుక మద్రదేశాధిపతి శల్యుని మన సైన్యాధిపతిని చేద్దాము " అన్నాడు. సుయోధనుడు " శల్యమహారాజా ! తమరు మా సకల సైన్యములకు అధ్యక్షత వహించవలసిందిగా కోరుతున్నాను " అని చేతులు జోడించి అడిగాడు. అందుకు శల్యుడు అంగీకరించాడు. వెంటనే సుయోధనుడు సరస్వతీ నదీ జలాలను తెప్పించి శల్యుని సైన్యాధ్యక్షుడిగా అభిషేకించాడు. విజయసూచకంగా కౌరవసేనలు జయజయధ్వానాలు చేస్తూ శంఖం పూరించాయి. పాండవ శిబిరంలో ధర్మరాజు చారులద్వారా ఎప్పటి విషయములు అప్పుడే తెలుసుకుంటున్నాడు. శల్యుడు కౌరవులకు సైన్యాధ్యక్షత వహించిన విషయం తెలుసుకుని " కృష్ణా ! విన్నావా సుయోధనుడు శల్యుడిని కౌరవ సేనకు సైన్యాధ్యక్షుడిని చేసాడు. అందుకు ధీటుగా మనం ఏమి చేయాలి " అని అడిగాడు. కృష్ణుడు " ధర్మరాజా ! శల్యుడు మహా బలవంతుడు, బలశాలి, భుజబల సంపన్నుడు. రణకౌశలంలో భీష్మ, ద్రోణ, కర్ణులను మించిన వాడు. నివురుకప్పిన నిప్పులాంటి శల్యుడు రణరంగమున విజృంభించిన మీరు తట్టుకోవడం కష్టం. శల్యుడిని ఎదుర్కొనగల సమర్ధుడివి నువ్వే కనుక రేపటి యుద్ధంలో శల్యుని సంహరించు ఉపాయం చూడు. అతడి మాద్రికి సోదరుడు మీ మేన మామ అందు వలన మీకు అతడి మీద అభిమానం ఉండవచ్చు కాని ఇప్పుడు అతడు శత్రుపక్షమున సైన్యాధ్యక్షత వహించి యుద్ధం చేస్తున్నాడు. కనుక నిర్ధాక్షిణ్యంగా అతడిని వధించిన నీకు విజయం చేకూరగలదు " అన్నాడు. ధర్మరాజు " కృష్ణా ! నీవు చెప్పినట్లు చేస్తాను. యుద్ధంలో మనకు విజయం ముఖ్యం కాని బంధుత్వాలు కాదు " అన్నాడు.



శల్యుడిని సైన్యాధిపతిగా ఆభిషేకిస్తున్న సుయోధనుడు

## కురుపాండవ యుద్ధవ్యూహాలు

పద్దెమిదవనాటి యుద్ధానికి కురుపాండవ సైన్యాలు సిద్ధంగా ఉన్నాయి. ఆజానుభాహుడైన శల్యుని ముందు నిలుపుకుని కౌరవ సైన్యాలు, పాండవులను ముందు నిలుపుకుని పాండవసైన్యాలు యుద్ధభూమికి చేరాయి " అని సంజయుడు చెప్పగానే ధృతరాష్ట్రుడు " ఇంకెందుకు సంశయం సంజయా ! పాండవులు శల్యుని నా కుమారుని ఎలా సంహరించారో చెప్పు " అని అడిగాడు. సంజయుడు " మహారాజా ! ఇంకా నువ్వు ఇలాంటి మరణవార్తలు వినే స్థితిలో ఉన్నావా ! నేను చెప్పు యుద్ధ విశేషాలు మందుగా విను. మరణవార్తలు ఎలాగూ వినక తప్పదుగా ! " అన్నాడు. " నీ కుమారుడు సుయోధనుడు ఎలాగైనా పద్దెనిమిదవ రోజైనా యుద్ధంలో పాండవులను జయించి రాజ్యాన్ని కైవశం చేసుకోవాలని పేరాశతో ఉన్నాడు. శల్యుడు కురుసైన్యాలను సర్వతోభద్రవ్యూహంలో నిలిపాడు. ముఖద్వారం వద్ద కర్ణుడి పుత్రులతో శల్యుడు నిలిచాడు, కుడి వైపున కృపాచార్యుడు, ఏడమవైపున త్రిగర్త వీరులతో కృతవర్మ నిలిచారు. వెనుకవైపు కాంభోజరాజ సైన్యాలతో కలిసి అశ్వత్థామ నిలిచాడు. మధ్యభాగాన సుయోధనుడు ససైన్యంగా నిలిచాడు. పాండవులు తమ సైన్యాలను త్రిముఖ వ్యూహంగా నిలిపారు. ధృష్టద్యుమ్నుడు, సాత్యకి, శిఖండి మూడు ముఖద్వారాల వద్ద నిలిచారు. భీమార్జునులు ధర్మరాజుకు ముందు రక్షగా నిలిచారు " అని సంజయుడు చెప్పగానే ధృతరాష్ట్రుడు " సంజయా ! ఈ పదిహేడు రోజుల యుద్ధం తరువాత ఎవరెవరికి ఎంత సేనలు మిగిలాయో వివరించు " అని అడిగాడు. మహారాజా ! మనపక్షాన పదకొండు వేల రధములు, పదివేల ఏడు వందల గజములు, రెండు లక్షల హయములు, మూడు కోట్ల సైనికులు మిగిలారు. పాండవ పక్షాన ఆరువేల రధములు, మూడువేల ఏనుగులు, ఒక లక్ష గుర్రములు, ఒక కోటి కాల్బలమూ మిగిలాయి " అన్నాడు.

## యుద్ధారంభం

మరునాడు యుద్ధం ప్రారంభం అయింది. కుక్షేత్ర సంగ్రామంలో ఆఖరి రోజు యుద్ధం ఆరంభం అయింది. ఇరు పక్షముల భేరి మృదంగనాదాలు మిన్నంటాయి. సైన్యాలు ఒకదానితో ఒకటి ఢీకొన్నాయి. యుద్ధం భయంకరంగా సాగుతుంది. ఆరోజు అటో ఇటో తేలాలని ఇరుపక్షములు యుద్ధం సాగిస్తున్నారు. రధములు విరిగి పడుతున్నాయి. కాళ్ళు చేతులు విరిగిన సైనికులు కింద పడి దొర్లుతున్నాడు. కొంత మంది సైనికులు తలలు తెగి పడిపోతున్నారు, గజములు, హయములు కుప్పలుగా పడి ఉన్నాయి. రణభూమి అంతా రక్తసిక్తమై ఉంది. వాటి మద్య రధములు తిరుగుతున్నాయి. వీరులు జంకక భీభత్స వాతావరణంలో కూడా యుద్ధం చేస్తూనే ఉన్నారు.

### నకులుడి శౌర్యం

కర్ణుడి మనుమడు చిత్రసేనుడు నకులుని ఎదుర్కొని అతడి విల్లు విరిచి, నుదుటన మూడు బాణములు నాటి, పతాకమును విరిచి, సారధిని చంపాడు. నకులుడు కత్తి డాలు తీసుకుని చిత్రసేనుడు వేయు బాణములు తప్పించుకుంటూ చిత్రసేనుడి దగ్గరకు వెళ్ళాడు. ఒక్కసారిగా విజృంభించి రథము మీద లంఘించి చిత్రసేనుడి తలని కత్తితో ఖండించాడు. అది చూసిన చిత్రసేనుడి సోదరులు సత్యసేనుడు, సుషేణుడు నకులునితో కలియబడ్డారు. నకులుడు మరొక రథం ఎక్కాడు. సత్యసేనుడు, సుషేణుడు నకులుడి మీద బల్లెములు విసిరారు. నకులుడు అవలీలగా వారి రథాశ్వములను చంపాడు. సత్యసేనుడు మరొక రథం ఎక్కి నకులుడి విల్లు విరిచాడు. నకులుడు శక్తి ఆయుధమును వేసి సత్యసేనుడి మీద ప్రయోగించి అతడి తల తెంచాడు. అది చూసి సుషేణుడు నకులుడి మీద బాణములు గుప్పించాడు. నకులుడు భీముడి పుత్రుడైన శ్రుతసోముని రథం ఎక్కి మరొక విల్లందుకుని సుషేణుడి మీద శరవర్షం కురిపించి సుషేణుడి తలను ఒక అర్ధచంద్ర బాణంతో తుంచాడు.

## శల్యుడి పరాక్రమము

సుషేణుడి మరణంతో కౌరవసేనలు పారిపోయాయి. అది చూసి శల్యుడు సింహంలా ఘర్జిస్తూ కౌరవ సేనలు పారి పోకుండా నిలిపాడు. తిరిగి కౌరవ సేనలు పాండవసేనలతో తలపడ్డాయి. ధర్మరాజుకు రక్షణగా భీమసేనుడు, సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, శిఖండి, ఉపపాండవులు, నకుల సహదేవులు నిలిచారు. శల్యుడు వారితో ముందుగా యుద్ధం చేస్తున్నాడు.ఇంతలో ప్రభద్రక సేనలు, పాంచాల సేనలు శల్యుడిని చుట్టుముట్టాయి. శల్యుడు వారిని శరవర్షంలో ముంచెత్తి వారందరిని యమసదనానికి పంపాడు. అది చూసిన సుయోధనుడు సంతోషించాడు. అది చూసి ధర్మరాజు శల్యుడిని ఎదుర్కొన్నాడు. శల్యుడు ఒక నారాచమును ధర్మరాజు శరీరం చీల్చుకు పోయేలా ప్రయోగించాడు. అదిచూసిన భీముడు ఏడు బాణములు, నకులుడు అయిదు బాణములు, సహదేవుడు తొమ్మిది బాణములు ఉపపాండవులు అనేక బాణములు వేసి శల్యుడిని ఎదుర్కొన్నారు. అది చూసి కృతవర్మ, కృపాచార్యుడు, శకుని, ఉలూకుడు శల్యునికి సాయంగా వచ్చారు. శల్యుడు భీమసేనుడి హయములను చంపాడు. భీముడు తన గద తీసుకుని కౌరవ సేనలను తనుమాడసాగాడు. సహదేవుడు శల్యుని మీద ధారాపాతంగా బాణములు వేసాడు. శల్యుడు సహదేవుడి హయములను చంపాడు. శల్యుడి కుమారుడు రుక్మాంగదుడు సహదేవుడిని ఎదుర్కొన్నాడు. సహదేవుడు కత్తి తీసుకొని కత్తి తీసుకుని తన రథం మీద నుండి కిందికి దూకి రుక్మాందుడి వైపు వెళ్ళి అతడి రథము మీద లంఘించి అతడి తలను తన కత్తితో నరికాడు.

### భీమసేనుడు శల్యుడిని ఎదుర్కొనుట

కుమారుడి మరణం కళ్ళారా చూసిన శల్యుడుకోపం తట్టుకొన లేక పాండవ సైన్యాలను తనుమాడసాగాడు. శల్యుడు ధర్మరాజు మీద అతిక్రూర మైన బాణమును వేసాడు. అది చూసి భీముడు తన గధ తీసుకుని కిందము దిగి శల్యుడి రథానికి కట్టిన అశ్వములను చంపాడు. శల్యుడు భీముడి మీదకు తోమరం విసిరి భీముడి గుండెలను చీల్చాడు. భీమసేనుడు ఆతోమరమును లాగి దానితో శల్యుడి సారధిని చంపాడు. శల్యుడు ముద్గర అనే ఆయుధము తీసుకుని రథము నుండి కిందికి దిగాడు. భీముడు తన గదాయుధంతో శల్యుడిని ఎదుర్కొన్నాడు. ఇరు పక్షముల సేనలు యుద్ధం ఆపి వారి గధాయుద్ధం చూడసాగారు. శల్యుడు, భీముడు సింహఘర్జనలు చేస్తూ గుండ్రముగా తిరుగుతూ రెండు ఏనుగులవలె ఢీకొన్నారు. గధా ఘాతములతో శరీరం రక్తసిక్తం అయింది. ఒకరిని ఒకరు కొట్టుకుని మూర్చ పోయారు. అది చూసి కృపాచార్యుడు శల్యుని తన రథం మీద ఎక్కించుకుని తీసుకు వెళ్ళాడు. భీముడు మూర్చ నుండి తేరుకొని శల్యుడి కొరకు వెదుకుతో పెద్ద అరుస్తున్నాడు. ఇంతలో చేకితానుడి ఆధ్వర్యంలో పాండవసేన భీముని ముందుకు వచ్చి కౌరవసేనలను ఎదుర్కొంది. సుయోధనుడు చేకితానుడి మీద ఒక ఈటెను బలంగా విసిరి చేకితానుడిని చంపాడు.

## శల్యుని శౌర్యం

శల్యుడు తేరుకుని వచ్చి ధర్మరాజును ఎదుర్కొన్నాడు. సుయోధనుడు ధృష్టద్యుమ్నుడిని ఎదుర్కొన్నాడు. అర్జునుడు అశ్వత్థామను ఎదుర్కొన్నాడు. అశ్వత్థామకు సాయంగా త్రిగర్త సేనలు వచ్చి చేరాయి. శల్యుడు ధర్మరాజును అమిత శౌర్యంతో ఎదుర్కొని బాణప్రయోగం చేస్తున్నాడు. ధర్మరాజు శల్యుడి శరీరం నిండా పదునాలుగు బాణములు వేసాడు. శల్యుడు అత్యంత శక్తివంతమైన బాణమును వేసి ధర్మరాజు వక్షస్థలం గాయపరిచాడు. ధర్మరాజు విజృంభించి శల్యుడి చక్రరక్షకులను చంపి, సారధిని చంపాడు. సాత్యకి, భీముడు చేది సేనలతో శల్యుడిని ఎదుర్కొని శరవర్షం కురిపించారు. నకులసహదేవులు శల్యుని ఎదుర్కొన్నారు. శల్యుడు విజృంభించి నకులసహదేవుల మీద శరవర్షం కురిపించాడు. ధర్మరాజు శల్యుని ఎదుర్కొని శల్యుడి


పాండవులతో పోరాడుతున్న శల్యుడు

శరీరం నిండా బాణములు నాటాడు. శల్యుడు ఆ బాణములు ఎదుర్కొని భీమనకులసహదేవుల మీద బాణములు గుప్పించాడు. నకులుడు తన మేన మామను అతి క్రూర బాణములతో కొట్టాడు.
భీమ,నకులసహదేవులు, ధర్మరాజు, సాత్యకులు కూడా శల్యుడి మీద బాణములు వర్షంలా వేసారు. శల్యుని శరీరం అంతా రక్తసిక్తమైంది. అయినా శల్యుడు జంకక ధర్మరాజు వింటిని విరిచాడు. ధర్మరాజు వేరొక విల్లు తీసుకుని శల్యుడి అత్యంత ప్రతిభావంతమైన బాణములతో శల్యుడి సారధిని, హయములను కొట్టాడు. శల్యుడు కోపించి ధర్మరాజును మూర్చిల్లేలా కొట్టాడు. అది చూసి సాత్యకి శల్యుడిని ఎదుర్కొన్నాడు. శల్యుడు సాత్యకి విల్లు విరిచి భీమ, నకుల, సహదేవుల మీద మూడేసి బాణములతో కొట్టాడు. ధర్మరాజు మూర్చ నుండి తేరుకుని శల్యుని తన ముద్గరతో కొట్టాడు. అదేసమయంలో భీముడు బల్లెమును, సహదేవుడు గధను, నకులుడు శక్తిని ఒకేసారి శల్యుడి మీద వేసారు. శల్యుడు కోపించి అందరినీ ఎదుర్కొని అందరినీ మూర్చిల్లేలా కొట్టాడు. శల్యుడి పరాక్రమానికి అయిదుగురూ చచ్చారని భావించి సుయోధనుడు సంతోషించాడు. సాత్యకి, నకుల సహదేవులు ముందుగా తేరుకుని శల్యుడిని ఎదుర్కొన్నారు. ధర్మరాజు తేరుకొని శల్యుని చక్రరక్షకులను చంపాడు. చక్రరక్షకులు లేకున్నా శల్యుడు జంకక యుద్ధం కొనసాగిస్తూ అయిదుగురు వీరులను రక్తం కారేలా కొట్టాడు. ధర్మరాజు దు:ఖించి " కృష్ణుడు చెప్పినది నిజం. భీముని వలన కూడా శల్యుని ఎదుర్కొనుట సాధ్యం కాదు. ఇక శల్యుని తానే సంహరించాలి " అనికుని తన సేనలను చేయి ఊపి పిలిచాడు. శల్యుడు నకులసహదేవ, భీమ, ధృష్టద్యుమ్న, సాత్యకులను తన బాణములతో కప్పాడు.

## అర్జునుడి పరాక్రమం

అశ్వత్థామ నాయకత్వంలో సంశక్తులు అర్జునుడితో యుద్ధంచేస్తున్నారు. అశ్వత్థామ సంశక్తులతో కలిసి అర్జునుడిని వివిధరకాల బాణ, అస్త్ర, శస్త్రములతో చికాకు పరుస్తున్నాడు. అర్జునుడు కోపించి విజృంభించి సంశక్తుల రధములను, కేతనములను, ధనస్సులను విరిచాడు. కవచములను భేధించి హయములను చంపి రెండు వేల మంది సంశక్తులను చంపాడు. అశ్వద్ధామ అర్జునుడిని ఎదుర్కొని అర్జునుడిని పన్నెండు బాణములతోను కృష్ణుడిని పది బాణములతోను కొట్టాడు. అర్జునుడు బ్రాహ్మణుడైన అశ్వత్థామను మనస్సులో నమస్కరించి అశ్వత్థామ సారధిని, హయములను చంపాడు. అశ్వత్థామ ముసలమును, పరిఘను అర్జునుడి మీద ప్రయోగించాడు. పరిఘను, ముసలమును తునాతునకలు చేసి అర్జునుడు అశ్వత్థామ శరీరంలో మూడు బాణములు నాటాడు. అది చూసిన సంశక్తులు అశ్వత్థామను దాటి అర్జునుడిని ఎదుర్కొన్నారు. ఇంతలో తనను ఎదుర్కొన్న పాంచాల రాకుమారుని తలను అశ్వత్థామ ఒకే బాణంతో ఖండించి తిరిగి అర్జునుడిని ఎదుర్కొన్నాడు.

## కురుపాండవ సమరం

సుయోధనుడు ధృష్టద్యుమ్నుని ఎదుర్కొని వాడి అయిన అయిదు బాణములు ధృష్టద్యుమ్నుడి మీద వేసాడు. ధృష్టద్యుమ్నుడు ప్రతిగా సుయోధనుడి మీద డెబ్బై బాణాలను ప్రయోగించాడు. అది చూసిన సుయోధనుడి తమ్ములు అన్నకు సాయంగా వచ్చి ధృష్టద్యుమ్నుని ఎదుర్కొన్నారు. ధృష్టద్యుమ్నుడు కోపించి వారి మీద వాడి అయిన బాణములు ప్రయోగించాడు. శిఖండి ప్రభద్రకులు కృపాచార్యుడు, కృతవర్మలను ఎదుర్కొన్నారు. శల్యుని నకులసహదేవ, భీమ, ధర్మరాజాదులు ఎదుర్కొని సమరం సాగిస్తున్నారు. పోరు ఘోరంగా సాగుతుంది. నకులుడు శల్యుని మీద పది బాణములు వేసాడు. శల్యుడు నకులుని మీద మూడు బాణములు ప్రయోగించి నకులుడి విల్లు విరిచాడు. అయిదుగురు యోధులూ శల్యుని ఎదుర్కొన్నారు. శల్యుడు జంకక వారందరిని తన బాణములతో నొప్పించాడు. సుయోధనుడు తన సైన్యముతో శల్యునికి సాయంగా వచ్చాడు. కృష్ణార్జునులు తమ సైన్యములను ఒక చోట సమీకరించారు. అర్జునుడు కృపాచార్యుని, సహదేవుడు శకునిని, ఉపపాండవులు కౌరవ పక్షాన పోరాడుతున్నమిత్రరాజుల్ను, శిఖండి అశ్వత్థామను, భీముడు సుయోధనుని, ధర్మరాజు నకులుడితో చేరి శల్యుని ఎదుర్కొన్నారు. ఇరు పక్షముల మధ్య ఘోరంగా పోరు సాగుతుంది. శల్యుడు అంతటా తానే అయి సమరం సాగిస్తున్నాడు. మధ్యాహ్న సూర్యుడికి ప్రతిబింబంలా వెలిగి పోతున్న శల్యుడి పరాక్రమానికి పాండవసేనలు ఆగ లేక వెనుకంజ వేస్తున్నాయి. అది చూసి ధర్మరాజు చేతులు ఊపుతూ సైన్యాలను ఉత్సాహపరచి తమ్ములను దగ్గరకు పిలిచి " మీరంతా మీమీ పరాక్రమానికి అనుగుణంగా భీష్మ, ద్రోణ, కర్ణాది యోధులను

చంపారు. ఈ రోజు నేను మహా వీరుడైన శల్యుడిని చంపుతాను. ఎలాగంటే నారధముకు కుడి వైపున నకులుడు, సాత్యకి ఎడమ వైపున సహదేవుడు, ధృష్టద్యుమ్నుడు రక్షణగా ఉంటారు. వెనుక అర్జునుడు, ముందు భీముడు ఉంటారు. ఎందుకంటే శల్యుడికి రక్షణగా కృపాచార్యుడు, కృతవర్మ, అశ్వత్థామ, శకుని నిలుస్తారు " అన్నాడు. ధర్మరాజు చెప్పినట్లే ధృష్టద్యుమ్నుడు, పాండవులు నిలిచారు. అది చూసిన సుయోధనుడు శల్యునికి రక్షణగా కృపాచార్య, కృతవర్మ, అశ్వత్థామ, శకునులను నిలిపాడు. ధర్మరాజు శల్యుని ఎదుర్కొన్నాడు పోరు ఘోరంగా సాగుతుంది.

## శల్యవధ


పాండవులను ఎదుర్కొటున్న శల్యుడు

అర్జునుడు కృపాచార్యుని, కృతవర్మను ఎదుర్కొన్నాడు. శల్యుని సైన్యం ధర్మరాజును చుట్టుముట్టింది. ధర్మరాజు కోపంతో విజృంభించాడు. రధములు విరుగుతున్నాయి. గజములు, హయములు కుప్పలుగా చచ్చి పడుతున్నాయి. రణరంగం అంతా భీభత్సంగా ఉంది. ధర్మరాజు శల్యుడు తమ శంఖములు పూరించి యుద్ధముకు తలపడ్డారు. ఒకరి మీద ఒకరు అస్త్రప్రయోగం చేసుకుని శరీరాలను రక్తసిక్తం చేసుకున్నారు. శల్యుడు ధర్మరాజు విల్లు విరిచాడు. ధర్మరాజు మరొక విల్లు తీసుకుని శల్యుడి విల్లు విరిచి ఎడతెరిపి లేకుండా మూడు వందల బాణములు వేసి శల్యుని హయములను చంపి, కేతనము విరిచాడు. శల్యుడు రధము మీద కూలబడ్డాడు. ఆది చూసిన ఆశ్వత్థామ శల్యుడిని తన రధము మీదకు ఎక్కించి తీసుకు వెళ్ళాడు. శల్యుడు పడిపోగానే ధర్మరాజు పొలికేకలు పెడుతూ విజృంభించాడు. కౌరవ సేనలను ఎదుర్కొని తరుముతున్నాడు. ఇంతలో శల్యుడు మూర్చ నుండి తేరుకుని మరి ఒక రధము మీద ఎక్కి ధర్మజుని ఎదుర్కొన్నాడు. తనను ఎదుర్కొన్న ధృష్టద్యుమ్న, నకుల సహదేవ, సాత్యకులను వాడి అయిన బాణములతో కొట్టి తప్పించి తిరిగి ధర్మరాజును ఎదుర్కొన్నాడు. ధర్మరాజు అత్యంత వాడి అయిన బాణములతో శల్యుని కొట్టాడు. అది చూసి సుయోధనుడు తన సైన్యాలను శల్యునికి సాయంగా పంపాడు. వారి అండ చూసుకుని శల్యుడు ధర్మరాజును ఎదుర్కొని ధర్మరాజు శరీరంలో ఏడు భయంకర బాణములు నాటాడు. సుయోధనుడి సేనలతో భీముడు పోరాడుతున్నాడు. ధర్మరాజు తొమ్మిది భయంకరమైన బాణములు శల్యుని శరీరంలో గుచ్చాడు. ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధం చేస్తున్నాడు. శల్యుడు ఒక బలమైన బాణమును ధర్మరాజు గుండెలకు గురి చూసి కొట్టాడు. ధర్మరాజు శల్యుని తన బాణములతో మూర్చిల్లజేసాడు. అంతలోనే శల్యుడు తేరుకుని ధర్మరాజును ఎదుర్కొని ధర్మరాజు మీద బాణప్రయోగం చేసాడు. ధర్మరాజు శల్యుని కవచం చీల్చాడు. శల్యుడు ధర్మరాజు వింటిని ఖండించాడు. ధర్మరాజు మరొక విల్లు తీసుకుని శల్యునిశరీరం నిండా శరములతో నింపాడు. శల్యుడు తన బాణములతో ధర్మరాజు, భీముల కవచం చీల్చాడు. ఇంతలో కృపాచార్యుడు ధర్మరాజు సారధిని కొట్టాడు. శల్యుడు ధర్మరాజు హయములను చంపాడు. ధర్మరాజు విరధుడయ్యాడు. ధర్మరాజు మనస్సులో " శ్రీకృష్ణుడు నన్ను శల్యుని చంపమని నియోగించాడు. ఆ


శల్యునిపై శక్తిని ప్రయోగించిన ధర్మరాజు

మహానుభావుని మాట వమ్ము అయ్యేలా ఉంది. ఇక నాకు ఆ పరమేశ్వరుడే దిక్కు " అనుకుని రధము మీద నిలబడి " ఓ పరమేశ్వరా ! నీవు త్రిశూలధారివి, నిర్గుణుడివి, నిరాకారుడివి, త్రినేత్రుడివి. సృష్టి, స్థితి, లయ కారకుడివి. త్రిభువనములకు పూజనీయుడివైన నిన్ను నేను ఆశ్రయిస్తున్నాను నన్ను ఈ గండం నుండి కాపాడు " అని మనస్ఫూర్తిగా ప్రార్ధించి మెల్లగా లేచి శల్యుడి మీద శరప్రయోగం చేసాడు. ధర్మరాజు శక్తి హీనుడయ్యాడని తెలుసుకుని శల్యుడు రెట్టించిన ఉత్సాహంతో ధర్మరాజు మీద బాణములు వేసాడు. భీమసేనుడు మధ్యలో వచ్చి శల్యుని విల్లు విరిచి హయములను చంపాడు. శల్యుడు కూడా విరధుడయ్యాడు. కత్తి డాలు తీసుకుని తన వైపు వస్తున్న శల్యుడి మీద తన శక్తిని అంతా ప్రయోగించి " శ్రీకృష్ణుడు శల్యుని చంపని నాకు ఆనతిచ్చాడు. ఈ శల్యుడు నావంతు " అని ధృడసంకల్పం చేసి తన వద్ద పూజలందుకుంటున్న పరమేశ్వర ప్రసాదితమైన శక్తి

ఆయుధమును బయటకు తీసి భక్తితో నమస్కరించి కళ్ళలో నిప్పులు కురిపిస్తూ క్రోధంగా ప్రళయకాల రుద్రునిలా శక్తి కొద్దీ విజృంభించి తన వైపు వస్తున్న శల్యుని మీద గురి చూసి బలంగా విసిరాడు. ఆ శక్తి ఆయుధం నిప్పులు కురుస్తూ శల్యుని వైపు దూసుకు పోయి అతడి కవచమును చీల్చుకొని గుండెలను దూసుకుంటూ భూమిలోకి పోయింది. శల్యుడి శరీరం నుండి రక్తం ధారాపాతంగా కారింది. మొదలు నరికిన చెట్టులా శల్యుడు నేల మీద బోర్లా పడ్డాడు. శల్యుడి ప్రాణాలు అనంత వాయువులలో కలిసాయి. శల్యుడి మరణాన్ని చూసి అతడి తమ్ముడు అమిత క్రోధంతో ధర్మజుని ఎదుర్కొన్నాడు. ధర్మరాజు ఒక పదునైన బల్లెం విసిరి అతడి తల నరికాడు. శల్యుడు, అతడి తమ్ముడు మరణించడం చూసి కౌరవ సేనలు పారిపోసాగాయి.

## శల్యుని బంధువులు పాండవులను ఎదుర్కొనుట

శల్యుని మరణానంతరం సాత్యకి కౌరవసేనను తరుముతున్నాడు. అది చూసి కృతవర్మ సాత్యకి ఎదుర్కొన్నాడు. కృతవర్మ సాత్యకి విల్లు విరిచాడు. సాత్యకి మరొక ధనస్సు తీసుకుని కృతవర్మ రధాశ్వములను, సారధిని చంపాడు. అది చూసి కృపాచార్యుడు కృతవర్మను తన రధము మీద ఎక్కించుకుని తీసుకు వెళ్ళాడు. సాత్యకి పరాక్రమానికి తట్టుకోలేక కౌరవసేనలు పారిపోసాగాయి. పాండవసైన్యం కౌరవసైన్యాలను వెంటాడుతుంది. సుయోధనుడు ఒక్కడే పాండవ సేనకు ఎదురు నిలిచాడు. మరొక రధం సమకూర్చుకుని మరలా కృతవర్మ అక్కడకు వచ్చి తిరిగి ధర్మరాజును ఎదుర్కొన్నాడు. ధర్మరాజు కోపించి కృతవర్మ రధాశ్వములను చంపాడు. అశ్వత్థామ కృతవర్మను ఎక్కించుకుని అక్కడి నుండి వెళ్ళాడు. ధర్మరాజు ఆరు బాణములతో కృపాచార్యుని కొట్టాడు. కృపాచార్యుడు పదహారు బాణములతో ధర్మరాజును కొట్టాడు. సుయోధనుడు తన సైన్యాలను ప్రోత్సహిస్తూ యుద్ధ భూమి అంతా తిరుగుతున్నాడు. సుయోధనుడి మాటలకు ధైర్యం తెచ్చుకుని కౌరవసేనలు పాండవసేనలను ఎదుర్కొన్నాయి. సుయోధనుడి అండ చూసుకుని శల్యుడి సైన్యం ధర్మరాజును ఎదుర్కొన్నాయి. సుయోధనుడు వారిని వారించి " తొందర పడకండి నా వెనుక నిలవండి అందరం కలిసి ధర్మరాజును ఎఎదుర్కొంటాము అన్నాడు " అయినా వారు వినక సుయోధనుడిని దాటి ధర్మరాజును చుట్టుముట్టారు. ఇంతలో భీముడు, నకులసహదేవులు, ఉపపాండవులు, ధృష్టద్యుమ్నుడు, సాత్యకి శిఖండి తమ తమ బలాలతో వారిని చుట్టుముట్టారు. అది చూసి శకుని " సుయోధనా ! శల్యుని బంధువులందరినీ పాండవులు చంపుతారు వారిని కాపాడవయ్యా " అని అరిచాడు. అందుకు " నేనేం చెయ్యను మామా వారు నా మాట కూడా వినక వెళ్ళారు. ఫలితం అనుభవిస్తారు " అని నిర్వేదంగా అన్నాడు. శకుని " అది కాదు సుయోధనా ! వారు నీ పక్షాన యుద్ధం చెయ్యడానికి వచ్చారు. వారు ఆపదలో ఉన్నప్పుడు నువ్వేకదా రక్షించాలి " అన్నాడు. శకుని మాటలు విని సుయోధనుడు " అలాగే వెళ్ళి వారిని రక్షస్తాను " అని వెళ్ళాడు కాని అప్పటికి భీమ, సాత్యకి, నకులసహదేవాదులు శల్యుని బంధువులను నిశ్శేషంగా యమసదనానికి పంపారు. అది చూసి సుయోధనుడి సైన్యం వెనుకకు పారిపోయింది.

## కురుపాండవ యోధుల సమరం

కౌరవసేనలో నిరాశా నిస్పృహలు ఆవరించాయి. ఇక కురుసామ్రాజ్యానికి అధిపతి ధర్మరాజు సుయోధనుడి పతనం తథ్యం అనుకున్నారు. అది గమనించిన సుయోధనుడు ఏనుగు దిగి ఒక రధం అధిరోహించి తన సైన్యం మధ్య తిరుగుతూ వారికి తన శాయ శక్తులా ధైర్యోత్సాహాలు కలిగిస్తూ " సైనికుల్లారా! వెనుకకు మరలండి పిరికి పందల్లా పారిపోకండి. విజయమో వీరస్వర్గమో తేల్చుకోండి మీరు పారి పోయినంత మాత్రాన శత్రువులు మిమ్ము విడువరు తరిమి తరిమి చంపుతారు. అలాంటి దిక్కులేని చావు చచ్చేకంటే వీరోచితంగా పోరాడి మరణించి వీరస్వర్గం అలంకరించండి. మన బలం ఎక్కువగా ఉంది పాండవుల బలం తక్కువగా ఉంది. మనం తప్పక గెలుస్తాము " అన్నాడు. ఆ మాటలకు కౌరవసేనలో ధైర్యోత్సాహాలు పెల్లుబుకి రణభూమికి తిరిగి వచ్చారు. వారంతా భీమసేనుడిని చుట్టుముట్టారు. భీముడు తనగద తీసుకుని కౌరవసేనలో మారణహోమం సృష్టించి ఒక్క దెబ్బకు ఇరవై ఒక్క వేలమందిని యమసదనానికి పంపాడు. మరొక పక్క అర్జునుడు కౌరవసేనలకు తన గాండీవం నుండి వెలువడే బాణాల రుచి చూపిస్తున్నాడు. నకులుడు, సహదేవుడు, సాత్యకి శకునిని ఎదుర్కొన్నారు. శకుని కూడా వారిని ధైర్యంతో ఎదుర్కొన్నాడు. ఇంతలో సాళ్వుడు ఏనుగు ఎక్కి పాండవసేనలో ప్రవేశించి పాండవ సేనను కకావికలు చేస్తున్నాడు. సాళ్వుని ధృష్టద్యుమ్నుడు ఎదుర్కొని తన బాణంతో సాళ్వుని ఏనుగు కుంభస్థలం మీద కొట్టాడు. ఆ దెబ్బకు సాళ్వుని ఏనుగు పారి పోయింది. సాళ్వుడు దానిని దారికి తెచ్చికుని ధృష్టద్యుమ్నుడిని ఎదుర్కొన్నాడు. సాళ్వుని ఏనుగు ధృష్టద్యుమ్నుడి రధాన్ని పైకి ఎత్తింది. అది గమనించిన ధృష్టద్యుమ్నుడు తన గద తీసుకుని కిందికి దూకాడు. భీముడు, సాత్యకి, శిఖండి కూడా సాళ్వుని ఎదుర్కొన్నారు. సాళ్వుడు కూడా అత్యంత ధైర్యసాహసాలతో వారిని ఎదుర్కొన్నాడు. ధృష్టద్యుమ్నుడు తనగదతో సాళ్వుని కుంభస్థలం మీద కొట్టాడు. ఆ దెబ్బకు ఏనుగు కింద పడిపోయింది. సాత్యకి ఒకే దెబ్బతో సాళ్వుని తెల తెగనరికాడు. సాళ్వుని మరణం చూసి కౌరవ సేన పారిపోసాగింది. కృతవర్మ వారిలో ధైర్యోత్సాహలు కలిగించాడు. సాత్యకి ఎనిమిది పదునైన బాణములతో కృతవర్మను కొట్టాడు.

కృతవర్మ సాత్యకి విల్లు విరిచాడు. సాత్యకి మరొక విల్లందుకుని కృతవర్మ సారధిని హయములను చంపాడు. కృతవర్మ విరధుడై ఒక శూలం తీసుకున్నాడు. అది చూసి కృపాచార్యుడు తన రధంలో కృతవర్మను ఎక్కించుకుని అక్కడి నుండి తీసుకు వెళ్ళాడు. అప్పటికి కురుసైన్యం చెదిరి పోయింది. నీ కుమారుడు సుయోధనుడు పాండవులను ఒంటరిగా ఎదుర్కొన్నాడు. పాండవ యోధులంతా చేరి సుయోధనుడిని ఎదుర్కొన్నారు. అంతటా తానై సుయోధనుడు యుద్ధం చేస్తూ ధర్మరాజు మీద నూరు బాణములు భీముని మీద డెబ్బై బాణములు వేసాడు. సహదేవుడు సుయోధనుడిని ఎదిరించారు. కురుసైన్యం ప్రాణముల మీద ఆశ వదులుకుని యుద్ధం చేస్తుంది. శకుని ధర్మరాజు రధాశ్వాలను చంపాడు. సహదేవుడు ధర్మరాజును తన రథం మీద ఎక్కించుకున్నాడు. ధర్మరాజు శకునిని బాణ వర్షంలో తడిపాడు. సుయోధనుడు ధృష్టద్యుమ్నుడి విల్లు విరిచాడు. ధృష్టద్యుమ్నుడు మరొక బాణం తీసుకుని సుయోధనుడి మీద బాణ ప్రయోగం చేసాడు. అంతలో ఉపపాండవులు సుయోధనుడిని ఎదుర్కొన్నారు. ధర్మరాజు మూడు శరములతో కృపాచార్యుని కొట్టి నాలుగు బాణములతో కృతవర్మ హయములను చంపాండు. అశ్వత్థామ కృతవర్మను తన రధం మీద ఎక్కించుకుని తీసుకు వెళ్ళాడు. సుయోధనుడు ఏడు వందల రధములతో ధర్మరాజును చుట్టుముట్టాడు. శిఖండి విజృంభించి ఆ రధములను తన బాణములతో ఖండించాడు. శకుని తన సేనలతో ధర్మరాజును ఎదుర్కొన్నాడు. ధర్మరాజు సహదేవుని పిలిచి శకునిని ఎదుర్కొమ్మని అదేశించాడు. శకుని సహదేవుల మధ్య యుద్ధం ఘోరంగా జాగుతుంది. ఇరుపక్షాల అయిదు వేల మూడు వందల ఏనుగులు నేల కూలాయి. యుద్ధ భూమి అంతా పీనుగుల పెంట అయింది. మిగిలిన ఏడు వందల హయములతో శకుని తప్పించుకున్నాడు. శకుని సుయోధనుడి వద్దకు వెళ్ళి " ముందు పాండవుల వద్దకు వెళ్ళి వారి గజబలమును అశ్వబలమును తుద ముట్టించాలి. తరువాత కాల్బలములను నాశనం చేయవచ్చు" అన్నాడు. శకుని మాటలు విని సుయోధనుడు తన గజ, అశ్వబలాలను సమాయత్తం చేసాడు.

## కృష్ణార్జునుల సంభాషణ

శకుని సుయోధనుల సంభాషణ విని అర్జునుడు " కృషా ! చూసావా పద్దెనిమిది రోజుల యుద్ధం తరువాత కురుసైన్యం పూర్తిగా ఎవైపు చూసినా సుయోధునుడిలో మార్పు రాలేదు. భీష్ముడు పడి పోయిన తరువాత సంధి చేసుకుంటే ఇంత వినాశనం తప్పేది. సుయోధనుడి మూర్ఖత్వం సంధి చెయ్యనివ్వ లేదు. ద్రోణుడు, జయద్రధుడు, భగదత్తుడు మరణించిన తరువార కూడా సుయోధనుడిలో మార్పు రాలేదు. సర్వనాశనం జరిగి పోయింది. సుయోధనుడు ఎవరిని లక్ష్యపెట్ట లేదు. తన ఆప్తులైన కర్ణుడు, దుశ్శాసనుడు మరణించిన తరువాత కూడా అతడికి బుద్ధి రాలేదు. శల్యుడి మరణం కూడా అతడిలో మార్పు తీసుకురాలేదు. అతడి మూర్ఖత్వాన్ని ఏమనాలి ? సుయోధనుడి తనువులో ప్రాణమున్నంతవరకు రాజ్యభోగాల మీద ఆశ అతడిని విడువదు. అతడి తన లోభం వదిలి రాజ్యభాగాన్ని ఇవ్వడు కనుక అతడి మరణం తప్పదని తేలిపోయింది " అన్నాడు. కృష్ణుడు " అర్జునా ! నేను సంధి చేయడానికి కురుసభకు వెళ్ళినప్పుడు విదురుడు కూడా ఇదే అన్నాడు. " కృష్ణా ! నీవి ఇక్కడకు ఎందుకు వచ్చావు? సుయోధనుడు వివేక హీనుడు, దుర్మదాంధుడు. సుయోధనుడు మంచి మాటలతో రాజ్యభాగం ఇవ్వడు కనుక యుద్ధం తప్పదు " అన్నాడు. సుయోధనుడు జన్మించినపుడు మహా మునులు అప్పడు జరిగిన ఉత్పాతాలు చూసి " ఇతడు సమస్త రాజలోకముకు క్షయకారకుడవుతాడు " అని చెప్పారు. అది అక్షరాల నిజమైంది " అన్నాడు. " అవును కృష్ణా ! సుయోధనుడి మూర్ఖత్వం స్వార్ధం అతడి మరణంతో కాని వదలదు. అందుకనే సైన్యం అంతా క్షీణిస్తున్నా ఇంకా యుద్ధం కొనసాగిస్తున్నాడు "అన్నాడు.

## పాండవులు కురుసైన్యాలను నాశనం చేయుట

కృష్ణార్జునులు యుద్ధ విశేషాలు విశ్లేషించి శేషించిన కురు సేనతో యుద్ధముకు తలపడ్డారు. అర్జునుడి ధాటికి ఆగ లేక కురుసేనలు పారిపోతున్నాయి. సుయోధనుడు వారికి ధైర్యం చెప్తూ చేయి ఊపుతూ వారిని యుద్ధముకు పురి కొల్పుతున్నాడు. మరొక పక్క శతానీకుడు ధృష్టద్యుమ్నుడు కౌరవసేనలను తన బణాలతో తుద ముట్టిస్తున్నారు. సుయోధనుడు ధృష్టద్యుమ్నుడిని వక్షస్థలంలో తన బాణముతో కొట్టాడు. ధృష్టద్యుమ్నుడు పదునైన బాణములతో సుయోధనుడిని సారధిని, రధాశ్వములను చంపాడు. సుయోధనుడు రధము దిగి గుర్రము వెక్కి తన గజబలముతో అర్జునుడిని ఎదుర్కొన్నాడు. అర్జునుడు సుయోధనుడి గజబలం మీద బాణములను వర్షంలా కురిపించాడు. మరొక పక్క భీమసేనుడు సుయోధనుడి గజబలమును నిర్మూలిస్తున్నాడు. అది చూసి ధర్మరాజు నకుల సహదేవులతో అక్కడకు చేరుకున్నాడు. సుయోధనుడు వారి మధ్య చిక్కుకున్నాడు. సుయోధనుడు కనపడక అశ్వత్థామ, కృపాచార్యుడు, సుయోధనుడు పాండవుల చేతిలో చనిపోయాడని భ్రమపడ్డారు. వారు సుయోధనుడిని వెదుకుతూ శకుని వద్దకు చేరుకున్నారు. మిగిలిన వారు సుయోధనుడు బ్రతికినా చచ్చినా ఒకటే వెతకడం వృధా అనుకున్నారు. భీముడు కౌరవ గజబలమును ధ్వంశం చేస్తున్నాడు. అది చూసి కౌరవసేనలో చావగా మిగిలిన సేనలు భీముని చుట్టు ముట్టాయి. భీముడు ఆగ్రహోదగ్రుడై వారిని గధతో చావబాదాడు. అయిదు వందల రధములు, ఏడు వందల ఏనుగులు, నిమిది వందల

హయములు పది వేల సైనికులను చంపాడు. మిగిలిన వారు భీముడి వంక చూడటానికే భయపడ్డారు. ధృతరాష్ట్ర మహారాజా ! భీమసేనుడు నీ కుమారులైన దుర్మర్షణుడు, శ్రుతాంతుడు, జైత్రుడు, భూరిబలుడు, జయత్సేనుడు, సుజాతుడు, దుర్విషహుడు, దుర్విమోచనుడు, అరిహుడు, దుష్ప్రదర్షుడు, శ్రుతపర్వుడు, మహాబాహుడు మొదలగు వారిని చంపాడు. సుయోధనుడి తమ్ములలో సుదర్శనుడు మాత్రం మిగిలాడు. సుయోధనుడి వెంట ఇక కొద్ది పాటి సైన్యమే మిగిలింది. అది చూసిన కృష్ణుడు " అర్జునా ! శత్రు సంహారం ముగుసింది. సుయోధనుడు అతడి తమ్ముడు సుదర్శనుడు కొద్ది పాటి సైన్యయం మాత్రమే మిగిలింది. ఇక సుయోధనుడి వధ మాత్రం మిగిలింది. అది పూర్తిగావించి కీర్తిమంతుడివి కా " అన్నాడు. అర్జునుడు " కృష్ణా ! ఇంకా శకుని అతడి వెంట రెండు వందల రథములు, వంద ఏనుగులు, అయిదు వందల హయములు ఉన్నాయి. ఇంకా కృపాచార్యుడు, అశ్వత్థామ, కృతవర్మ మిగిలారు. వీరంతా నాకు ఒక లెక్క లోనిది కాదు. తృటిలో సంహరిస్తాను " అన్నాడు.

## శకుని వధ

కృష్ణుడు రథమును సుయోధనుడి వంకకు పోనిచ్చాడు. సహదేవుడు, భీముడు, సుయోధనుడిని చంపడానికి చెరి ఒక వైపు నుండి వచ్చారు. ఇంతలో శకుని తన సైన్యముతో వారి ముందు నిలిచాడు. శకుని, సుశర్ముడు అర్జునుడిని సుదర్శనుడు భీమసేనుడిని సుయోధనుడు సహదేవుని ఎదుర్కొన్నారు. సుయోధనుడు ఒక బల్లెమును సహదేవుడి మీద వేసాడు. ఆ దెబ్బకు సహదేవుడు మూర్చిల్లాడు. వెంటనే తేరుకుని సహదేవుడు సుయోధనుడి మీద అత్యంత శక్తివంతమైన బాణములు ప్రయోగించాడు. కౌరవ సైనికులు తోమరములతో అర్జునుడిని కప్పారు. అర్జునుడు కోపించి వాడి అయిన బల్లెములతో గాంధార సేనల తలలు నరికాడు. ఇంతలో త్రిగర్త సైనికులు అర్జునుడిని చుట్టుముట్టారు. అర్జునుడు సంశక్తులలో ఒక్కడైన సత్యకర్ముడి తలను నరికాడు. చివరగా మిగిలిన సంశక్తుడు సత్యేషుడిని కూడా చంపాడు. ఆఖరుగా మిగిలిన సుశర్మ వక్షస్థలముకు గురి పెట్టి ఒక బల్లెము విసిరాడు. ఆ బల్లెము సుశర్మ వక్షస్థలం చీల్చింది. తరువాత అర్జునుడు సుశర్మ కుమారులు అందరిని ఒక్కొక్కరిని మూడేసి బాణములతో కొట్టి చంపాడు. సంశక్త సైన్యం పారి పోయింది. భీముడు చావగా మిగిలిన సుయోధనుడి తమ్ముడు సుదర్శనుడిని సంహరించాడు " ఓ ధృతరాష్ట్ర మహారాజా ! ఇక నీకుమారులలో ఒక్క సుయోధనుడు మాత్రమే మిగిలి ఉన్నాడు. శకుని సహదేవుడితో తలపడి పది బాణములు అతడి శరీరంలో గుచ్చాడు. ఆ దెబ్బకు సహదేవుడు మూర్చిల్లాడు. అది చూసి భీముడు శకుని ముందున్న గాంధార సైన్యమును నాశనం చేయసాగారు. అది చూసి కౌరవసేనలు పారి పోయాయి. సుయోధనుడు ధైర్యం చెప్పి వారిని ముందుకు పురికొల్పాడు. సహదేవుడు మూర్ఛ నుండి తేరుకుని శకుని మీద పది బాణములు ప్రయోగించి అతడి విల్లు ఖండించాడు. శకుని వేరొక విల్లు తీసుకొని సహదేవుడి మీద శరవర్షం కురిపించాడు. శకుని కుమారుడైన ఉలూకుడు సదేవ, భీమసేనుల మీద బాణవర్షం కురిపించాడు. సహదేవుడు కోపించి ఒకే ఒక బల్లెము విసిరి ఉలూకుడి తల ఖండించాడు. తన కుమారుడు తన కళ్ళ ముందే చనిపోవడం చూసి చలించిన శకుని ఆగ్రహోదగ్రుడై సహదేవుడి మీద మూడు బాణములు వేసాడు. సహదేవుడు ఆ మూడు బాణములను ఖండించి శకుని విల్లు విరిచాడు. శకుని మహా కోపంతో సహదేవుని కత్తిని, గధను, బల్లెమును ప్రయోగించాడు. సహదేవుడు వాటిని మద్యలో ఖండించాడు. అది చూసి శకుని తన రధ రక్షకులతో సహా అక్కడి నుండి పారి పోయాడు. సహదేవుడు అతడిని నిలువరించి " ఓ గాంధార రాజా ! రాజ ధర్మం విడిచి ఇలా పారి పోవడం నీవంటి సుక్షత్రియునకు తగదు. నాడు జూదం ఆడినినాడు చూపిన చాతుర్యం ఇప్పుడు చూపు. నీవు ఆడించిన మాయా జూదంకు ఫలితం చూసావు కదా సర్వనాశనం అయింది. నాడు జూదంలో ఓడి పోయి తలలు వంచుకున్న మా కోపాగ్ని జ్వాలలల ఫలితం చూసావు కదా ! మమ్ము అవమానించినందుకు సుయోధనుడు తన వారందరిని పోగొట్టుకుని అనుభవిస్తున్నాడు. ఆ సుయోధనుడు చూస్తుండగా నీ తల తెగి నేలను ముద్దాడేలా కొడతాను " అని సహదేవుడు శకుని రధాశ్వములను, కేతనమును, విల్లును ఖండించాడు. అది చూసి శకుని అత్యంత భయంకరమైన శక్తి ఆయుధమును సహదేవుడి మీద విసిరాడు. సహదేవుడు ఆ శక్తి ఆయుధమును ఖండించి రెండు చేతులలో రెండు బల్లెములను తీసుకొని అత్యంత వేగంగా శకుని మీద వేసి అతడి తల ఖండించాడు. శకుని తల నేల పడగానే శరీరం కూడా నేల మీదకు వాలింది. మహాభారత యుద్ధానికి కారణ భూతుడైన గాంధార రాజు శకుని సహదేవుడి చేతిలో మరణించాడు.

## సుయోధనుడి నిష్క్రమణ

శకుని మరణానికి పాండవ సైన్యం హర్షాధిరేకంతో జయజయ ధ్వానలు చేసారు. యోధులు పరమ ప్రమోదంతో శంఖధ్వానం చేసారు. గాంధార సేనలు శకుని మరణం తరువాత కూడా బెదరక తమ రాజు మరణానికి కారకుడైన సదేవుడి మీద తిరగబడింది. సహదేవుడికి సాయంగా అర్జునుడు, భీముడు నిలబడ్డారు. భీమార్జున ధాటికి ఆగలేక వారి ధాటికి గాంధార సైన్యం నశించింది. సుయోధనుడు రణభూమిలో ఒంటరిగా నిలబడ్డాడు. ఎదురుగా ఆనందాతిరేకంతో హర్షధ్వానాలు చేస్తున్నారు. సుయోధనుడు యుద్ధభూమిని వదిలి వేయడానికి నిశ్చయించుకున్నాడు " అని సంజయుడు ధృతరాష్ట్రునికి

చెప్పాడు.ప్పడు ధృతరాష్ట్రుడు సంజయునితో " సంజయా ! ఆ సమయమున ఇరుపక్షాల బలాబలాలు ఎలా ఉన్నాయి " అని అడిగాడు. సంజయుడు " మహారాజా! ఒక్క సుయోధనుడు తప్ప కౌరవ సైన్యం అంతా సర్వ నాశనం అయింది. పాండవ పక్షాన రెండు వేల రథములు, ఏడు వందల ఏనుగులు, అయిదు వందల హయములు, పది వేల కాల్బలం మిగిలారు. సుయోధనుడు తన గదను భుజం మీద పెట్టుకుని రణభూమిని విడిచి ఎటో వెళ్ళాడు " అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పాడు. సుయోధనుడి నిష్క్రమణతో పద్దెనిమిది రోజులు అవిచ్ఛన్నంగా సాగిన యుద్ధం సమాప్తమైంది.


తన శంఖమును ఊది యుద్ధము పూర్తి అయిందని ప్రకటిస్తున్న శ్రీ కృష్ణుడు

## బయటి లింకులు =

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

### పర్వాలు

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

### పాత్రలు

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ధృపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

# శల్య పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# ద్వితీయాశ్వాసం



సుయోధనుడి నిష్క్రమణ గురించి విన్న ధృతరాష్ట్రుడు " సంజయా ! నా కుమారుడు సుయోధనుడు మదం బాగా అణిగి గద చేత పట్టి కాలి నడకన ఏటు వెళ్ళాడు. రారాజుకు ఇంత దౌర్భాయపు స్థితి కలిగిందా ! సరేలే తరువాత ఏమి జరిగిందో చెప్పు " అన్నాడు. సంజయుడు " మహారాజా ! ఏకాదశ అక్షౌహినులకు అధిపతి అయిన సుయోధనుడు వంధి మాగధులు కైవారములు లేకుండా ఒంటరిగా ఏకాకిగా యుద్ధభూమి వదిలి పోయి అక్కడికి క్రోశడు దూరంలో ఉన్న కృష్ణద్వైపాయన మడుగుకు వెళ్ళి మడుగులో దిగి మడుగు అడుగున జలస్థంభన విద్యతో దాక్కుని. నాడు విదురుడి మాట విననందుకు పశ్చాత్తాప పడ్డాడు. సుయోధనుడు వెళ్ళి పోగానే భీమార్జునులు మిగిలిన కౌరవ సైన్యమును సమూలంగా నాశనం చేసారు. మన పక్షాన అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ మాత్రం మిగిలారు. అక్కడే తచ్చాడుతున్న నన్ను సాత్యకి

విశ్రాంతికై సరస్సులో దాగిన సుయోధనుడు

పట్టుకున్నాడు. అక్కడే ఉన్న ధృష్టద్యుమ్నుడు " సాత్యకీ ! వీడిని ఎందుకు పట్టుకున్నావు. వీడి వలన మనకేమి హాని కలుగుతుంది. వీడిని విడిచి పెట్టు " అన్నాడు. సాత్యకి వీడు శత్రు పక్షముకు చెందిన వాడు. శత్రు శేషం మిగలరాదు " అని నన్ను చంపడానికి కత్తి ఎత్తాడు. అప్పుడు అక్కడకు వచ్చిన వ్యాసమునీంద్రుడు " సాత్యకీ ! సంజయుని చంపుట అనుచితము. అతడు నిరాయుధుడు. అతడిని విడిచి పెట్టు " అన్నాడు. సాత్యకి వ్యాసునికి నమస్కరించి నన్ను విడిచి పెట్టాడు. నేను బ్రతుకు జీవుడా అనుకుంటూ అక్కడి నుండి కృష్ణ ద్వైపాయన మడుకుకు వెళ్ళాను. అక్కడ సుయోధనుడిని కలుసుకున్నాను. సుయోధనుడు " సంజయా ! మన పక్షమున ఎవరైనా ! బ్రతికి ఉన్నారా ? " అని అడిగాడు. నేను " సుయోధనా ! అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ తప్ప అందరూ చనిపోయారు " అని చెప్పాను. సుయోధనుడు " ఔను సంజయా ! నేను కూడా పాండవుల పాల బడక తప్పించుకోవడం నా అదృష్టం. పాండవులకు లొంగి పోయి వారి దయాధర్మం మీద బ్రతకడం నాకు ఇష్టం లేదు. అయినా యుద్ధమున విజయం సాధించి పాండవులు సంతోషంగా ఉన్నారు. నా సోదరులను బంధు మిత్రులను సంహరించిన పాడవుల సంతోషం నేను చూసి భరించగలనా ! నా తడ్రికి నా విషయం చెప్పు " అని తాను మడుగులో దాక్కున్నాడు.

## రధికత్రయం సుయోధనుడి జాడ తెలుసుకొనుట

యుద్ధభూమి నుండి పారిపోయున అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ ఒళ్ళంతా దుమ్ము కొట్టుకొని సుయోధనుడి కొరకు వెతుకుతూ నన్ను చూసి " సంజయా ! నువ్వు బ్రతికి ఉన్నావా! మన రారాజు ప్రాణాలతో ఉన్నాడా " అని అడిగారు. నేను సుయోధనుడు కృష్ణద్వైపాయన మడుగులో దాక్కున్న విషయం వారికి చెప్పాను. అది విని వారు దు:ఖించారు. " సంజయా ! రారాజుకు మేము రణరంగంలో చావకుండా మిగిలామని తెలియదు. మా గురించి బాధ పడుతుంటాడు. మేము బ్రతికి ఉన్నా మమ్ము కలుసుకొనుట దుస్తరమని తలచి మడుగులో దాక్కుని ఉంటాడు. అష్టైశ్వర్యములు అనుభవించిన రారాజుకు ఎంత దుర్గతి పట్టింది. మేము సుయోధనుడితో మాట్లాడుతుండగా పాండవులు తమ సైన్యముతో మమ్ము చుట్టుముట్టారు. ఇక అక్కడ ఉండటం క్షేమం కాదని మేము అక్కడి నుండి పారిపోయాము " అన్నాడు కృపాచార్యుడు. తరువాత రధిక ద్వయం కృష్ణ ద్వైపాయన మడుగులో దాగిన సుయోధనుడిని కలుసుకొనుటకు వెళ్ళారు.

## పాండవులు యుయుత్సునితో కౌరవ స్త్రీలను హస్థినకు పంపుట

యుద్ధం అయిపోయిందని తెలుసుకొని కౌరవ స్త్రీలు తమతమ భర్తల కొరకు రోదిస్తున్నారు. నీ కుమారుడు యుయుత్సుడు అక్కడ ఉన్నాడు. అతడు అక్కడ ఉన్న వారితో " సుయోధనుడు పారిపోయాడు. యుద్ధం పరిసమాప్తం అయింది. ఇక ఈ స్త్రీలను హస్థినకు పంపండి " అన్నాడు. అంతలో ధర్మరాజు అక్కడకు వచ్చి యుయుత్సుని కౌగలించుకుని ఓదార్చి " కౌరవ కాంతలందరిని హస్థినకు పంపవచ్చు " అని చెప్పాడు. యుయుత్సుడు అంత:పుర స్త్రీలను వృద్ధ కంచుకలతో సహా హస్థినా పురానికి వెళ్ళాడు. విదురుడు వారికి ఎదురు వచ్చాడు. యుయుత్సుడు జరిగినదంతా చెప్పి రారాజు ఒంటరిగా యుద్ధ భూమిని వదిలి వెళ్ళాడు అని చెప్పాడు. అది విని విదురుడు దు:ఖభారంతో వికలమనస్కుడై " యుయుత్సా ! సంజయుడు వచ్చి ధృతరాష్టునికి జరిగినది వివరించ గలడు. మనమేమి చెప్పనవసరం లేదు నీవు అంత:పుర స్త్రీలను వారి వారి నివాసములకు చేర్చు " అన్నాడు. కౌరవ సైన్యం అక్కడక్కడా ఉన్నారు. రణరంగం నిశ్శబ్దంగా ఉంది. పాడవులు శ్రీకృష్ణుడితో సహా సుయోధనుడిని వెదుకుతూ కృష్ణద్వైపాయన మడుకు వచ్చారు. వారిని చూసి అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ అక్కడ నుండి తప్పుకుని దాక్కున్నారు. సుయోధనుడు ఎక్కడా కనపడ లేదని తిరిగి శిబిరాలకు వెళ్ళారు. కౌరవశిబిరంలోని స్త్రీలకు ఏమీ భయం లేదని నిశ్చింతగా ఉండమని అభయం ఇచ్చాడు

## రధిక త్రయం సుయోధనుడిని కలుసుకొనుట

పాండవులు అక్కడ నుండి వెళ్ళగానే రధిక త్రయం సుయోధనుడిని కలుసుకుని " రారాజా ! పిరికి వాడిలా మడుగులో దాక్కోవడమేమిటి ? లే ముందుకు కదులు మా సాయంతో పాండవుల మీద యుద్ధం ప్రకటించు. పాండవ సేనలను సంహరించు. పాండవులను జయించు. సుయోధనా ! క్షత్రియులకు శత్రువులను జయించడం లేక యుద్ధంలో మరణించి వీరస్వర్గం అలంకరించడమే ధర్మం. అంతేకాని పిరికి వాడిలా ఇలా పారిపోయి దాక్కోవడం ధర్మమా ! " అన్నారు. ఆ మాటలు విన్న సుయోధనుడు రధిక త్రయంతో " యోధులారా ! క్షత్రియ ధర్మం తెలియక కాదు. నా శరీరం గాయాలతో నిండి ఉన్నది. వశం తప్పిన శరీరం విశ్రాంతి కోరుతున్నది. మీరు యుద్ధమున అలసి ఉన్నారు కనుక ఈ రోజుకు విశ్రాంతి తీసుకొండి. రేపటి దినం యుద్ధం చెయ్యవచ్చు " అన్నాడు. ఆ మాటలకు అశ్వత్థామ " రారాజా ! ఏల నీకు అనుమానం నేను ఒక్కడినే పాంచాల

సైన్యాలను సంహరించి పాండవులను చంపి నీకు నీ తండ్రికి సంతోషం కలిగించగలను " అన్నాడు.

## పాండవులకు సుయోధనుడి జాడ తెలియుట

ధర్మరాజు, భీముడు కొంత మంది బోయవారిని పిలిచి వారు వేటాడినప్పుడు సుయోధనుడు కనిపిస్తే చెప్పమని చెప్పారు. ఆ బోయలలో ఒకరు వేటాడిన జంతువును మోసుకొని వస్తూ సుయోధనుడు రధికత్రయంతో మాట్లాడటం చూసి తనలో " తప్పక ఇతనే సుయోధనుడు అయి ఉంటాడు. ఈ విషయం భీమసేనులు, ధర్మరాజుల వారికి చెప్పి మంచి బహుమానం పొందవచ్చు" అనుకుని పరుగు పరుగున భీమసేనుడి శిబిరానికి వచ్చి విషయం ఎరిగించి అంతు లేని బహుమానాలను భీముని నుండి అందుకున్నాడు. భీముడు ధర్మరాజుతో " అన్నయ్యా ! సుయోధనుడి జాడ తెలిసింది. ఇక్కడికి క్రోసెడు దూరంలో ఉన్న కృష్ణ ద్వైపాయన మడుగులో తనకు తెలిసిన క్షుద్రవిద్యతో దాగుకొని ఉన్నాడట. అతడు వెలుపలకు వచ్చి రధికత్రయంతో మాటాడుట చూసిన బోయ వాడు నాకీ విషయం చెప్పాడు " అన్నాడు. ధర్మరాజు ఆ విషయం కృష్ణాదులకు తెలిపి చతురంగబలంతో సుయోధనుడున్న కృష్ణ ద్వైపాయన మడుగు వద్దకు వెళ్ళాడు. పాండవులు వస్తున్న కోలాహలం తెలిసి అశ్వత్థామ " రారాజా ! పాండవులకు నీ విషయం తెలిసినట్లు ఉంది. చతురంగ బలంతో ఇటే వస్తున్నారు. ప్రస్తుతం మా కర్తవ్యం ఏమిటి? వారిని ఎదిరించి యుద్ధం చేయాలా ? లేక ఇప్పుడు తప్పుకుని అదును చూసి దెబ్బ తీయాలా ? " అని అడిగాడు. సుయోధనుడు " అశ్వత్థామా ! ప్రస్తుతం మనమంతా అలసి ఉన్నాము. కనుక ఇప్పుడు మీరు వెళ్ళి విశ్రాంతి తీసుకొని రాత్రి సమయంలో నా వద్దకు రండి తరువాతి ప్రణాళిక ఆలోచిద్దాము. పాండవులు ఇక్కడకు వచ్చినా నా జాడ తెలియదు నేను నాకు తెలిసిన జలస్థంభన విద్యతో మడుగు అడున ఉంటాను " అన్నాడు. ఆ మాటలకు బరువెక్కిన హృదయాలతో రధికత్రయం అక్కడి నుండి వెళ్ళి పక్కన ఉన్న పొదల మాటున దాక్కొన్నారు. నేను కూడా అక్కడు నుండి దూరంగా వెళ్ళి పొదలో దాక్కున్నాను. నాకు అక్కడ ఉన్నా మడుగు వద్ద జరిగేవి స్పష్టంగా తెలియ సాగింది.

## సుయోధనుడిని మడుగు నుండి బయటకు తెచ్చే ప్రత్నం

కృష్ణద్వైపాయన మడుగు వద్దకు వచ్చిన పాడవులతో కృష్ణుడు " ధర్మజా ! సుయోధనుడు నిశ్చయంగా ఈ మడుగులోనే ఉన్నాడు. అతడికి తెలిసిన జలస్థంభన విద్యతో మడుగు అడున దాక్కున్నాడు. అందుకే జలం నిశ్చలంగా ఉన్నది " అన్నాడు. ధర్మరాజు సుయోధనుడు స్వర్గాధిపతి వద్ద దాక్కున్నా నా వద్ద నుండి తప్పించుకొన లేడు " అన్నాడు. కృష్ణుడు " ధర్మరాజా ! ఇలాంటి మాయలు సుయోధనుడు తప్ప వేరెవరు పన్నగలరు. ఇప్పుడు దీనిని మనం వంచనతోనే జయించాలి. కనుక నీవు ఎలాగైనా సుయోధనుడు మడుగు నుండి వెలుపలికి వచ్చేలా చేయాలి " అన్నాడు. ధర్మరాజు " సుయోధనా ! నీ కొరకు అనేక రాజులు మరణించారు. నీవు మాత్రం ప్రాణములు రక్షించుకోవడానికి ఇలా మడుగులో దాక్కోనడం భావ్యమా ? ఇది నీకు వీరమా ? నలుగురూ నవ్వరా ! నీ అభిమానం ఏమయ్యింది ఇలా యుద్ధంలో వెన్ను చూపడం నీకు తగునా ! క్షత్రియకులజుడవైన నీవు ఇలా నీచపు పనులు చేసిన ఇహము పరము రెండూ చెడవా ! నాడు శకుని, కర్ణుడు, దుశ్శాసనాదులను చూసి విర్రవీగావు నేడు ఇలా భీరువువై దాక్కున్నావు. నీ పిరికితనం వదిలి యుద్ధం చేసి మమ్ము జయించిన ఈ భూమండలాధిపత్యం పొందగలవు ఓడిన వీరస్వర్గం అలంకరించ గలవు. కనుక ప్రస్థుత నీ కర్తవ్యం మాతో యుద్ధం చేయటమే నీవు ఆడదానివి కాకున్న మాతో యుద్ధం చేయి " అని ఎత్తి పొడిచాడు.

## సుయోధనుడు మడుగు నుండి ధర్మజునితో మాటాడుట

ఆ మాటలకు రోషపడిన సుయోధనుడు " ధర్మరాజా ! మానవులకు ప్రాణ భయం సహజము కాదా ! నా వద్ద ప్రస్థుతం రధము, సారధి, ఆయుధములు, చక్రరక్షకులు ఏమియును లేవు. నేను యుద్ధమున డస్సి ఉన్నాను. కనుక నేను ఇప్పుడు యుద్ధం చేయ లేను. మీరూ పద్దెనిమిది రోజుల యుద్ధమున అలసి ఉన్నారు కనుక మీరూ విశ్రాంతి తీసుకొని రండి " అన్నాడు. ధర్మరాజు " సుయోధనా ! మేము విశ్రాంతి తీసుకొని ఉన్నాము. నీవు మడుగులో విశ్రాంతి తీసుకున్నావు కదా ఇక వచ్చి యుద్ధం చేయి " అన్నాడు. సుయోధనుడు " ధర్మజా ! నా తమ్ములు, బంధు మిత్రులు యుద్ధమున మరణించారు. ఎవరి కొరకు యుద్ధం తలపెట్టానో వారు లేరు కనుక ఎవరి కొరకు నేను యుద్ధం చేయాలి ? నేను గెలిచినా ఆనందించగల వారు ఎవరు. బంధు మిత్రులతో కూడి రాజ్యం చేసిన ఆనందమే కాని ఒంటరిగా రాజ్య పాలన చేయుటలో ఆనందం ఏమి ? నీకు నీ తమ్ములు అంతా ఉన్నారు కనుక నీవు ఇక ఈ రాజ్యాన్ని ఏలుకో. నేను ఈ రాజ్యాన్ని నీకు ధార పోసి అడవులకు వెళ్ళి తపస్సు చేసుకుంటాను. యుద్ధమున ఓడిన నాకు అభిమానం కోపం లేవు. గజ, తురగ, రధాధి సైన్య రహితమైన ఈ రాజ్యం నాకు వద్దు నీవే ఇక దీనిని నీ తలకు కట్టుకో " అన్నాడు. ధర్మరాజు " సుయోధనా ! నీ మిత్రుడు కర్ణుని మరణానంతరం శల్యుడిని సైన్యాధ్యక్షుని కావించి యుద్ధము చేసినది రాజ్యకాంక్షతో కాదా ! ఒట్టి మాటలు కట్టి పెట్టి


ధర్మజుని తిట్లు విని మడుగు నుంచి బయటకు వచ్చిన సుయోధనుడు

యుద్ధముకు రా ! శత్రుశేషం ఉండగా రాజ్యాన్ని ఏలుకొనుట ధర్మం కాదు. కనుక నిన్ను గెలిచి రాజ్యాన్ని ఏలగలను. నీకు చేతనయితే నా తమ్ములతో నన్ను గెలిచి రాజ్యానికి పట్టభద్రుడివి కా ! అయిదూళ్ళు అడిగిన నిరాకరించిన నీవా నాకు రాజ్యాన్ని ధార పోసేది. రాయబారానికి వచ్చిన కృష్ణుడితో సూది మొన మోపినంత చోటు ఇవ్వనని ఇంత రక్తపాతానికి కారకుడవైన నీవు రాజ్యమును ధారపోస్తావా ! ఇక గెలుచుట అసాధ్యము అని తెలిసి ఇలా మాట్లాడుతున్నావు. నీ వద్ద రాజ్యం ఉంటే కదా నాకు ధార పోసేది. నీ దయా భిక్ష మీద వచ్చే రాజ్యాన్ని నేను స్వీకరించను. నిన్ను సంహరించి కాని రాజ్యభారం వహించను. మా ప్రాణములు నీ చేత ఉన్నాయి, నీ ప్రాణములు మా చేత ఉన్నాయి కనుక యుద్ధమున నిన్ను చంపక తప్పదు. మాకు విషము పెట్టించావు, నీళ్ళలో త్రోయించావు, లక్క ఇంట పెట్టి కాల్పించావు, మాయాజూదంతో రాజ్యమును అపహరించి మమ్ము అడవుల పాలు చేసావు ఇక నీ మత్సరమును సహించి నీ కుట్రలకు మేము బలి కాలేము. కనుక మారు మాటాడక వచ్చి యుద్ధం చెయ్యి " అన్నాడు. సుయోధనుడు " ధర్మజా ! మీరు అయిదుగురు నేను ఒక్కడిని, మీకు రధ, గజ, తురగ సమేత సైన్యము ఉన్నది. నేను ఇప్పుడు ఒంటరిని నిరాయుధుణ్ణి కనుక నేను నీకు కృష్ణుడికి వెరచి ఇక్కడ దాక్కున్నాను మీరు నాతో ఒక్కొక్కరుగా యుద్ధం చేసారంటే నేను మిమ్ము అందరిని యుద్ధమున హతమార్చి భీష్మ, ద్రోణ, కర్ణ, శల్యాదుల ఋణం తీర్చుకొని రాజ్యాన్ని పొందగలను. నీకు యుద్ధ నీతి తెలియజేసాను " అన్నాడు. ధర్మరాజు " సుయోధనా ! నీధైర్యానికి మెచ్చుకుంటున్నాను. మమ్ము అందరినీ ఒంటి చేత్తో సంహరించగనని అనుకోవడం సహజమే. కాని నేను అధర్మపరుడను కాను. నీకు అవసరమైన రథము, ఆయుధములు అన్నీ తీసుకో మాలో ఒక్కడితో యుద్ధం చేయి నీవు గెలిచిన రాజ్యాన్ని నీవే ఏలుకో బంధు మిత్రుల సాక్షిగా అతడు నీతో ధర్మయుద్ధం చేస్తాడు " అన్నాడు. సుయోధనుడు " ధర్మజా ! రథములతో అస్త్రశస్త్రములతో యుద్ధం చేసి విసిగి ఉన్నాను ఇక నేను భూమీ మీద నిలిచి మల్ల యుద్ధం చేస్తాను. గధతో నిన్ను నీ తమ్ములను తృటిలో ఓడిస్తాను " అన్నాడు. ధర్మరాజు ఆలోచనలో పడ్డాడు. అదే అదనుగా తీసుకొని సుయోధనుడు బుసలు కొడుతూ మడుగు నుండి బయటకు వచ్చాడు.

## సుయోధనుడు మడుగునుండి వెలుపలకు వచ్చుట

వెలుపలకు వచ్చిన సుయోధనుడి చూసి పాంచాలురు, పాండవులు అపహాస్యంగా చిరునవ్వు నవ్వారు. సుయోధనుడు " అలా నవ్వకండి. నేను మిమ్మంతా ఒక్కొక్కరుగా బలి తీసుకుంటుంటే అప్పుడు తెలుస్తుందిలే " అన్నాడు. సుయోధనుడికి ఇంకా పాండవులు పాంచాలురతో కలిసి ఒక్కుమ్మడిగా తన మీద దాడి చేస్తారని శంకిస్తూ " నేను యుద్ధమున అలసి ఉన్నాను మన ఒప్పందం ప్రకారం ఒక్కొక్కరుగా నాతో యుద్ధానికి రండి " అన్నాడు. ధర్మజుడు నవ్వి " సుయోధనా ! నాడు అభిమన్యుని మీదకు ఒక్కుమ్మడిగా యుద్ధముకు పోయినట్లుగా భావించ వచ్చు కదా ! " అని " భయపడకు నువ్వు చేసిన అకృత్యమును గుర్తు చేసాను కాని ఆడిన మాట తప్పను. యుద్ధ నీతికి వ్యతిరేకముగా ప్రవర్తించను. నీవు వెంటనే సరి చేసుకొని కవచము, శిరస్త్రాణం ధరించి యుద్ధ సన్నద్ధుడివి అయి మాలో ఒకరిని ఎంచుకొని యుద్ధం చెయ్యి. మాలో నీకు నచ్చినవాడిని జయించిన రాశ్యలక్ష్మిని వరించు లేకున్న వీర స్వర్గం అలంకరించు ఇది నా ప్రతిజ్ఞ. నీకు నచ్చిన ఆయుధములు ధరించు నీవు నాకు తమ్ముడివి కనుక నీవు అడిగినవి ఇస్తాను ప్రాణములు తప్ప " అన్నాడు. సుయోధనుడు " ధర్మజా ! నీ సత్య వాక్పరిపాలనా నాకు తెలియనిదా ! నాకు నీ మీద ఎందుకు కోపం ఉంటుంది ! మనం మనం అన్నదమ్ములం కదా ! " అని కవచాదులను ధరించి యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు. చేతిలో గద ధరించి మేరు పర్వతంలా మెరుస్తూ " ధర్మజా ! సహదేవుడో, నకులుడో, అర్జునుడో, భీముడో లేక నీవో నాతో యుద్ధానికి రండి నా గధకు మిమ్ము ఒక్కొక్కరిగా ఎర వేస్తాను. నాతో గదా యుద్ధం చేయ సాక్షాత్తు ఈశ్వరుడే సాహసించరు మీరెంత " అని డంబంగా అన్నాడు.

## ధర్మజుడి మాటకు కృష్ణుడు ఆందోళనపడుట

సుయోధనుడి ప్రగల్భములకు కృష్ణుడు ధర్మరాజును చూసి " ధర్మరాజా ! నీవిలా అవివేకముతో మాటాడుట ఏమీ బాగ లేదు. నీవింత బుద్ధిహీనుడవని అనుకో లేదు. ఇదేమైనా శకునితో ఆడిన జూదమా ! ఒక్కరిని గెలవగానే రాజ్యం ఇవ్వడానికి. సుయోధనుడు భీముని తప్ప మీలో ఎవరిని కోరుకున్నా గధా యుద్ధముతో మిమ్ము హతమార్చగలడు. ఆఖరుకు ఇది

పందెం యుద్ధం అయింది. ఇందుకేనా ఇంత మారణ హెూమం జరిగింది ఇంత మంది రాజులను సైన్యాలను యుద్ధానికి బలి ఇచ్చింది ? ఇలా పందెంలో ఓడే కదా నీవు నీ తమ్ములతో కలిసి అడవులలో ఇడుములు అనుభవించింది " అన్నాడు. కనుక ధర్మరాజా ! ఇందుకు నేను ఒప్పుకోను. ఒక్కొక్కరుగా యుద్ధం చేసే పని అయితే భీమసేనుని కూడా పంపడాబనికి అంగీకరించను. దుర్యోధనుడు గధావిద్యలో నైపుణ్యం గడించాడు. అతడి నైపుణ్యం ముందు భీముని బలం చాలదు. నీ ఇష్టం జాగర్త " అన్నాడు.

## భీముని కృష్ణుడు ప్రశంసించుట

కృష్ణుడి మాటలు విన్న భీమసేనుడు " అన్నగారి అనుమతి నీ అనుగ్రహం ఉండాలే కాని దుర్యోధనుడే కాదు ఈ మూడు భువనాలలో ఉన్న ఎవరినైనా నేను తృటిలో జయించగలను. ఈ సుయోధనుడు ఒక లెక్కా ! ఈ మాత్రం దానికి అన్నగారిని అంత మాట అనవలెనా ! ఈ రోజు నేను నా గధా ఘాతంతో సుయోధనుడిని చంపి నీకు సంతోషం కలిగిస్తాను " అన్నాడు. కృష్ణుడు భీముని భుజం ప్రేమగా తట్టి " భీమసేనా ! బకాసురుడిని, హిడింబుని, జరాసంధుని, కిమ్మీరుడిని సంహరించిన నీ భుజబలం నాకు తెలియనిదా ! ఏదో మీ మీద ప్రేమతో కలిగిన కలవరంతో అన్నాను కాని వేరేమి లేదు. దుశ్శాసనుడి గుండెలు చీల్చి రక్తం త్రాగుతుంటే చూస్తూ ఊరుకున్నాడే కాని ఏమి చేయని సుయోధనుడి పరాక్రమం నీ ముందెంత ? నా మాటలు పట్టించుకోకు. నాడు కురుసభలో ద్రౌపది జుట్టు పట్టి ఈడ్చినపుడు నీవు చేసిన ప్రతిన ఒకటి నెరవేర్చుకున్నావు. ఇక రెండవది మిగిలి ఉంది సుయోధనుడి తొడలు విరిచి నీ రెండవ ప్రతిజ్ఞ నేరవేర్చి నీ అన్నను పట్టాభిషిక్తుడిని చేసి మీరందరూ సుఖములు అనుభవించండి. నీవిక నీ పరాక్రమం చూపి నీ గధకు పండుగ చెయ్యి నీ వెనుక నేను ఉన్నాను. ఈ రోజు నీ చేత సుయోధనుడు నిర్జీవుడౌతాడు అన్నాడు. కృష్ణుడి మాటలకు భీముడు పొంగి పోయాడు. కృష్ణుడు " భీమసేనా ! ఒక్క మాట సుయోధనుడు గధా యుద్ధంలో నిష్ణాతుడన్నది మరువ వద్దు. ఎన్నో ఏళ్ళు కఠోర శ్రమతో సాధించిన నైపుణ్యం జాగ్రత్త " అని హెచ్చరించాడు.

## భీమసుయోధనులు ఎదుర్కొనుట

సాత్యకి మొదలైన వారు భీముడిని పొగిడారు వారందరిని చూసి భీముడు " ధర్మజా ! ఈ కులనాశకుని మీద నాకు అమిత కోపం ఉంది. అర్జునుడు ఖాండవవనదహనం చేసిన విధంగా నేడు నేను సుయోధనుడిని సంహరిస్తాను. నిన్ను ఈ భూమికి పట్టాభిషిక్తుని చేస్తాను. ఈ రోజు ధృతరాష్ట్రుడు తన కుమారుడి మరణవార్త విని ఏడవక తప్పదు " అని తన గధ తీసుకుని సుయోధనుడి ఎదుట నిలువగానే భీమునిలో పగ రగిలి పోయింది. భీముడు " సుయోధనా ! మమ్ము లక్క ఇంట్లో పెట్టి కాల్పించావు. మా అన్న ధర్మరాజుతో మాయా జూదం ఆడించి మా రాజ్యాన్ని అపహరించావు. ద్రౌపదిని నిండు సభలో అవమానించిన ఫలం ఊరికే పోతుందా అనుభవించు. భీష్మ, ద్రోణ, కర్ణ, శల్యుల వంటి మహా వీరులంతా నీ కొరకు బలి అయ్యారు. నీవు వెంట తెచ్చిన రాజులంతా యుద్ధభూమిలో మరణించారు. ఈ మహా మారణహమానికి మూల పుషుడివైన నిన్ను నేను చంపి ఈ లోకం లోని కాలుష్యాన్ని కడిగి వేస్తాను " అన్నాడు. సుయోధనుడు " భీమా ! అతిగా మాట్లాడకు యుద్ధం చేసి నా చేతిలో చచ్చిపోయి. నన్ను రాజ్యాభి షిక్తుడిని చెయ్యి. నాతో గధా యుద్ధం చేయడానికి ఇంద్రాదులు కూడా భయపడతారు నీ వెంత " అన్నాడు.

## బలరాముని రాక

తన ప్రియ శిష్యుడైన సుయోధనుడు భీమునితో ద్వంధ యుద్ధానికి సిద్ధపడ్డాడని తెలిసి తీర్ధయాత్ర నుండి వస్తున్న బలరాముడు అది చూడాలన్న కుతూహలంతో అక్కడకు వచ్చాడు. ధర్మరాజు తన తమ్ములతో బలరామునకు ఎదురేగి అర్ఘ్యపాద్యములను ఇచ్చి సత్కరించి ఉచితాసనమున కూర్చుండ చేసాడు. బలరాముడు వారితో ప్రియసంభాషణ చేసి ఆనందపరచాడు. శ్రీకృష్ణుడు సాత్యకి అన్నగారికి పక్కనే కూర్చున్నారు. మిగిలిన వారందరూ బలరాముని కుశల ప్రశ్నలు వేసారు. బలరాముడు వారందరిని చూసి " ఈ యుద్ధములో పాల్గొనడానికి ఇష్టపడక నేను తీర్ధయాత్రకు వచ్చాను. మిమ్ము చూసి చాలా రోజులైందనీ భీమసుయోధనులు యుద్ధం చేస్తున్నారని తెలుసుకుని చూడాలన్న కుతూహలంతో ఇక్కడకు వచ్చాను " అన్నాడు. భీముడు, సుయోధనుడు బలరామునకు ఎదురెదురుగా నిలిచి నమస్కరించారు. ధర్మరాజు లేచి భీముడు సుయోధనుడితో ఎందుకు ద్వంధ యుద్ధం చేస్తున్నాడో వివరించి వారి ద్వంధ యుద్ధానికి అనుజ్ఞ ఇమ్మన్నాడు. బలరాముడు అలాగే అనుజ్ఞ ఇచ్చాడు " అన్నాడు సంజయుడు.

## ప్రభాస తీర్ధం

జనమేజయుడు వైశంపాయునితో " మునివర్యా ! యుద్ధారంభంలో బలరాముడు శ్రీకృష్ణుని పాండవపక్షపాతి అని నిందించి యుద్ధములో పాల్గొనడానికి తీర్ధ్తత్రకు వెళ్ళాడు. అలాంటి బలరాముడు భీమసుయోధనుడి ద్వంధయుద్ధానికి ఎలా వచ్చాడు. ఈ మధ్య కాలంలో ఏమి జరిగింది " అని అడిగాడు. వైశయంపాయనుడు " జనమేజయా ! బలరాముడు యజ్ఞానికి కావలసిన సంభారములు సమకూర్చుకుని బ్రాహ్మణులు వెంటరాగా సరస్వతీనది సాగరసంగమం చేసే ప్రదేశానికి వెళ్ళాడు. ఆ ప్రదేశాన్ని ప్రభాసతీర్ధం అంటారు. బలరాముడు ఆతీర్ధాన్ని దాని సమీపతీర్ధాలను సేవించి బ్రాహ్మణులకు గోవులను ధనమును దానం ఇచ్చాడు. ఆ మాట వినగానేజనమేజయుడు ప్రభాసతీర్ధ మహత్యం వివరించమని వైశంపాయనుడిని కోరాడు.


బలరాముని రాక - రాజ్మానామా నుండి ఒక దృశ్యం

## బలరాముని యాత్రా విశేషములు

జనమేజయుని కోరికపై వైశంపాయనుడు " జనమేజయా ! ఈ క్షేత్రమున చంద్రుడు స్నానమాచరించి తన క్షయరోగమును పోగొట్టుకున్నాడు. ఆ కథ వివరించెదను విను. దక్షప్రజాపతి తన కుమార్తెలైన ఇరవై ఏడు మందిని చంద్రునికి ఇచ్చి వివాహం చేసాడు. వారిలో అతి రూపవతి అయిన రోహిణి మీద మక్కువ చేత చంద్రుడు మిగిలిన వారిని నిర్లక్ష్యం చేసాడు. మిగిలిన కుమార్తెలు వ్యధ చెంది తమ బాధను తమ తండ్రికి చెప్పాడు. దక్షుడు చంద్రుడిని పిలిచి అందరినీ సమానంగా చూసుకోవడం ధర్మమని బుద్ధిమతి చెప్పి పంపించాడు. చంద్రుడు దక్షుని మాటను నిర్లక్ష్యం చేసాడు. దక్షుడు కుపితుడై చంద్రుడికి క్షయవ్యాధి పీడితుడవై పొమ్మని శపించాడు. చంద్రుని అందు కల ఓషధీ శక్తులు నశించి పోయి అతడు రోజు రోజుకు క్షీణించ సాగాడు. ఇదంతా తెలుసుకున్న దేవతలు చంద్రుడి వద్దకు వచ్చి కృశించి పోవడానికి కారణ ఏమిటని అడిగి తెలుసుకుని చంద్రుడిని తీసుకుని దక్షుని వద్దకు వెళ్ళారు. దేవతలు చంద్రుడిని శాపప్రభావం నుండి రక్షించమని వేడుకున్నారు. దక్షుడు వారి ప్రార్ధనను మన్నించాడు. భార్యలంరనీ సమానంగా చూడాలని ఎప్పుడూ స్త్రీలనూ, బ్రాహ్మణులను అవమానించ కూడదని చంద్రుడిని కోరాడు. ఆ తరువాత చంద్రుడు సరస్వతీ సాగర సంగమ తీర్ధంలో స్నానమాచరించి క్షయ వ్యాధిని పోగొట్టుకున్నాడు. అప్పటి నుండి చంద్రుడు ప్రతి అమావాస్యకు ఇక్కడ స్నానమాచరించి పౌర్ణిమ వరకు వృద్ధి చెందుతూ 15 రోజుల పాటు వృద్ధిని 15 రోజులు క్షయాన్ని చెందసాగాడు.

### చమసోద్భేదనం

బలరాముడు ప్రభాస తీర్ధంలో స్నానమాచరించి చమసోద్భేదనం అనే తీర్ధమున ఒక రాత్రి విశ్రమించాడు. ఆ తీర్ధ విశేషమును చెప్తాను విను. త్రితుడు, ద్వితుడు, ఏకతుడు అనే ముగ్గురు ముని కుమారులు ఉన్నారు. ఆ ముని కుమారులు క్షత్రియులకు యజ్ఞదీక్ష ఇచ్చి గోవులను దానంగా పొంది ఇంటికి వస్తుండగా పెద్ద వారిద్దరూ మూడవ వాడైన త్రుతుడిని మోసగించి అతని గోవులను కూడా అపహరించాలని అనుకున్నారు. ఇంతలో ఒక తోడేలు వారిని తరమగా పరుగెత్తుతున్న త్రితుడు బెదిరి పాడుబడ్డ బావిలో పడ్డాడు. మిగిలిన ఇద్దరూ గోవులన్నిటినీ తోలుకుని ఇంటికి వెళ్ళారు. బావిలో పడ్డ త్రితుడికి దిక్కు తోచ లేదు. ఇందులో నుండి బయటపడటానికి యజ్ఞం చేసి సోమపానం చేయడమే మార్గమని ఎంచి సంకల్పం చేత మనసులోనే యజ్ఞం చేసాడు. ఆ యజ్ఞానికి దేవతలందరూ ఆహ్వానించబడి వచ్చి హవిస్సులు స్వీకరించారు. ప్రీతి చెందిన దేవతలు త్రితుడిని ఏదైనా వరం కోరుకొమ్మని అడిగారు. త్రితుడు సరస్వతీ నదిని ప్రార్ధించి తనకు పుణ్యజలాలను ఇమ్మని కోరాడు. సరస్వతీ కరుణించి ఆ బావిని తన జలాలతో నింపింది. అప్పటి నుండి ఈ బావిలో నీటితో స్నానమాచరించిన వారికి యజ్ఞం చేసి సోమపానం చేసిన ఫలం లభిస్తుంది అని వరమిచ్చి దేవతలు వెళ్ళారు.

### బలరాముని యాత్రలు

తరువాత బలరాముడు వినశన తీర్ధానికి వెళ్ళాడు. ఆ తీర్ధం తక్కువ జాతి వారికి కనపడితే నశిస్తుంది. కనుక అది **వినశనము** అయ్యింది. ఆ తరవాత బలరాముడు అప్సరసలు నాట్యం చేసే **భూమిక** అనే తీర్ధం చేరి దానిని సేవించాడు. ఆతరువాతబలరాముడు **విశ్వావసుడు** లాంటి గంధర్వులు తపస్సు చేసి తపస్సిద్ధి చెందిన **గంధర్వ తీర్ధం** చెంతకు వెళ్ళాడు.

అక్కడి నుండి బలరాముడు **గర్గ క్షేత్రము**కు వెళ్ళాడు. అక్కడ గర్గుడు చాలా కాలం నివసించాడు. **శంఖ తీర్ధం**, **నైసర్గికం**, నాగధన్వంకు వెళ్ళాడు. **నాగధన్వం** వాసుకి నివసించిన ప్రదేశం. అది వాసుకి దేవతల చేత అభిషిక్తుడైన ప్రదేశం. అక్కడి నుండి బలరాముడు **నైమిశారణ్యం** వెళ్ళాడు. నైమిశారణ్యానికి సరస్వతీ నది చాలా దూరంలో ఉంది. అప్పుడు నైమిశారణ్య వాసులు ఒక క్రతువు ఆచరించి సరస్వతీ నదీమ తల్లి అనుగ్రహం పొంది ఆమెను తమ చెంత ప్రవహించమని కోరారు. సరస్వతీ నది వారి కోరిక మన్నించి తన గతి మార్చుకుని నైమిశారణ్య ప్రాంతంలో ప్రవహించ సాగింది.

## మంకణ మహర్షి

తరువాత బలరాముడు సప్తసారస్వతముకు వెళ్ళాడు. అక్కడ **మంకణుడు** అను మహా ముని నివసిస్తున్నాడు. పూర్వం అక్కడ గంగ బ్రహ్మదేవుడు చేసిన యాగముకు, నైశారణ్యంలోని మునులు చేసిన యాగముకు, వశిష్టుడు చేసిన యాగముకు, గురువు చేసిన యాగముకు, గయుడు చేసిన యాగముకు, **ఉద్దాలకుడు** చేసిన యాగముకు సరస్వతీనది స్త్రీ రూపమున వచ్చి వారి చేత అత్యంత గౌరవ మర్యాదలు పొందింది. అందువలన అది **సప్తసారస్వతం** అయింది. ఒక రోజు మంకణుడు సరస్వతీనదిలో స్నానం చేసే సమయంలో అక్కడికి సమీపంలో స్నానం చేస్తున్న స్త్రీని చూడటంతో అతనికి రేతఃపతనం అయింది. మంకణుడు దానిని ఒక కుండలో భద్రపరిచాడు. అది ఏడుగురు మహా మునులకు జన్మ ఇచ్చింది. ఒక రోజు తాపసి చేతి వేలికి చిన్న దర్భ గుచ్చుకుంది. ఆ గాయం నుండి రక్తం బదులుగా ఆకుపసరు కారసాగింది. అది చూసి మంకణుడు అది చూసిన మంకణ మహర్షి తన తపస్సు ఫలించిందని ఆనందంతో నృత్యం చేయసాగాడు. ఆ నృత్యముకు లోకములన్నీ క్షోభించాయి. అప్పుడు దేవతలు అందరూ పరమశివుని వద్దకు వెళ్ళి జరిగినది అంతా చెప్పారు. అప్పుడు ఈశ్వరుడు మంకణమహర్షి వద్దకు వెళ్ళి " ఇదేనా నీ తపస్సుకు ఫలితం. ఇదేనా ఇక నీ నాట్యం ఆపు " అన్నాడు. అని తన వేలిని మరో వేలితో గీరాడు భస్మం రాలింది. " చూసావా ఈ మాత్రం దానికేనా ఈ నాట్యం " అన్నాడు. అది చూసిన మంకణుడు సిగ్గుపడి నాట్యం ఆపివేసి ఈశ్వరుడిని శరణు వేడాడు. ఈశ్వరుడు మంకణుడి తప్పస్సు క్షీణించ కుండా వరం ఇచ్చాడు.

## వశిష్టాశ్రమం

తరువాత బలరాముడు వశిష్టాశ్రమమునకు వెళ్ళాడు. అది పూర్వం విశ్వామిత్రుడి ఆశ్రమం. విశ్వామిత్రునకు వశిష్టుడి మీద మత్సరం ఉంది. విశ్వామిత్రుడు ఒకసారి సరస్వతీనదిని తలచి ఆమె ప్రత్యక్షంకాగానే వశిష్టుని తీసుకురమ్మని చెప్పాడు. వశిష్ట, విశ్వామిత్రుల తపస్సు తెలిసిన సరస్వతీనది మారు పలుక లేక వశిష్టుని వద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పింది. వశిష్టుడు సరస్వతీనదిని చూసి " విశ్వామిత్రుని మాట వినని ఎడల మహర్షి నిన్ను శపించగలడు కనుక నేను నీతో వస్తాను " అన్నాడు. వశిష్టుడు తపస్సు చేసుకుంటున్న సమయంలో వశిష్టుని తన అలలతో కోసుకుని తీసుకొని విశ్వామిత్రుని వద్దకు వచ్చింది. విశ్వామిత్రుడు వశిష్టుని చంపబూనగా సరస్వతీనది వశిష్టుని తప్పించింది. విశ్వామిత్రుడు సరస్వతినది మీద కోపించి ఆమెను రక్తపుటేరుగా మారి పొమ్మని శపించాడు. రక్తము రాక్షసులకు ప్రీతి కనుక ఒక సంవత్సర కాలం సరస్వతీనది రాక్షసులకు ప్రీతిపాత్రం అయింది. ఒక సారి సరస్వతీనది వద్దకు వచ్చిన మహామునులు ఆమె అవస్థ చూసి ఆమెను అడిగి జరిగిన విషయం తెలుసుకొని తమతమ తపోబలంతో సరస్వతీ నదీ జలాలను పరిశుద్ధం చేసి పుణ్య స్నానాలు చేసారు. అప్పుడు అక్కడకు వచ్చిన రాక్షసులు కొందరు మునులతో " మహామునులారా ! మేము ఇంత వరకు బ్రాహ్మణులను ద్వేషించాము, నరమాంసం భక్షించాము, గురుజనులను పీడించాము, మహా పాతకములను చేసాము. మాకు నిష్కృతిని ప్రసాదించండి " అని వేడుకున్నారు. మహామునులు సరస్వతీ నదిని వేడుకుని రాక్షసులకు నిష్కృతి కలిగించమని అడిగారు. సరస్వతీనది అరుణానదిని తనలో అంతర్వాహినిని చేసి అందులో రాక్షసులను మునగమని చెప్పింది. రాక్షసులు సరస్వతీ నదిలో మునిగి రాక్షస దేహాలు విడిచి దైవత్వం పొందాడు. ఈ విషయం అంతా తెలుసుకున్న ఇంద్రుడు తాను నముచి అను రాక్షసుడిని నమ్మించి మోసగించి చంపి మూట కట్టుకున్న పాపాన్ని సరస్వతీనదీ జలాలలో మునిగి పోగొట్టుకున్నాడు " అని వైశంపాయనుడు జనమేజయునకు చెప్పాడు.

## సోమతీర్ధం

తరువాత బలరాముడు సోమతీర్ధముకు వెళ్ళాడు. అక్కడ సోముడు రాజసూయయాగం చేసాడు. ఆ ప్రదేశంలో ఇంద్రుడు షణ్ముఖుని దేవసేనకు అధిపతిగా అభిషిక్తుడిని చేసాడు. ఆ తరవాత షణ్ముఖుడు తారకాసురుడిని సంహరించాడు. పరమేశ్వరుడు ఒకసారి తన రేతస్సును దేవతల కోరిక మీద అగ్ని ఆ తేజస్సును భరించ లేక బ్రహ్మతో మొరపెట్టుకోగా బ్రాహ్మ ఆ తేజస్సును గంగా నదిలో దాచమని చెప్పాడు. గంగానది కూడా ఆ తేజస్సును భరించలేక హిమాలయాల మీద ఒక తటాకంలో రెల్లు పొదలలో ఉంచింది. అప్పుడు కుమార జననం జరిగింది. అప్పుడు అతడికి కృత్తికలు ఆరుగురు తమ పాలు

ఇచ్చి పోషించి కుమారుడికి తల్లులు అయ్యారు. బృహస్పతి స్వయంగా కుమారునికి జాతకకర్మలు గావించాడు. ఒక రోజు పరమశివుడు పార్వతి సమేతుడై, రుద్రగణాలతో అక్కడకు వచ్చారు. అదే సమయంలో అక్కడకు బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు, దిక్పాలకులు, మరుత్తులు, పితృగణాలు అక్కడకు వచ్చారు. అప్పుడు శివుడు అక్కడ తాను, పార్వతీ, గంగ, అగ్ని ఉన్నారు కదా కుమారుడు ముందు ఎవరికి ముఖ్యత్వం ఇస్తాడు అనుకున్నాడు. అలాగే మిగిలిన వారు అలాగే అనుకున్నారు. వారి మనోగతం తెలుసుకున్న కుమారుడు నాలుగు రూపాలతో వారి వద్దకు వెళ్ళాడు. పరమ శివుడు బ్రహ్మను చూసి " దేవా ! మహా తేజశ్వి అయిన ఈ కుమారునికి తగిన పదవిని మీరే నిర్ణయించండి " అన్నాడు. బ్రహ్మ " మహాదేవా ! ఇతడు దేవతల హితం కోరే వాడు కనుక ఇతడికి దేవ సైన్యాధిపత్యం ఇవ్వండి " అన్నాడు. అక్కడి వారంతా బ్రహ్మదేవుడి మాటకు ఆమోదం తెలిపారు. అందరూ సరస్వతీనదీ తీరం చేరి షన్ముఖుడిని బంగారు సింహాసనం మీద కూర్చుండ పెట్టి బృహస్పతి హోమ కార్యం నిర్వహిస్తుండగా దేవసేనకు అభిషిక్తుడిని చేసాడు. ఈశానుడు, విష్ణువు అభిషేకద్రవ్యాలను పూర్ణకలశాలను పట్టుకున్నారు. గంధర్వులు, అప్సరసలు మంగళ గీతాలు ఆలపించారు. మహామునులు పుణ్యాహవాచనములు నిర్వర్తించారు. లక్ష్మీదేవి, సరస్వతి, శచీదేవుల ఆశీర్వాదంతో షణుముఖునికి ఇక్కడ అభిషేకం జరిగింది. శంకరుడు , విష్ణువు, దేవతలు తమ బలంలో కొంత భాగాన్ని అతడికి కానుకగా ఇచ్చారు. శంకరుడు ఉదయభాస్కరునితో సమానమైన పతకాన్ని, బ్రహ్మదేవుడు రాక్షస సంహారానికి అవసరమైన శక్తిని, విష్ణువు వనమాలను ఇచ్చాడు. పార్వతీ దేవి మాయని పట్టుబట్టలను ఇవ్వగా, గంగాదేవి ఉజ్వలమైన అమృతమయమైన కమండలం ఇచ్చింది, గురువు దండమును, గరుడుడు నెమలిని, **వరుణుడు** తామర తూడులను, కుబేరుడు మేకలను, బ్రహ్మ కృషాజినం బహూకరించాడు. అతడి వైభవమును చూసిన ఈశ్వరుడు " ఇతడు తప్పక రాక్షసులను సంహరిస్తాడు " అని అతడికి భూతమయమైన సైన్యాన్ని ఇచ్చాడు. అప్పుడు అందరూ భేరీ నాదం చేస్తూ శంఖనాదం చేసారు. కుమారుడు " మీరు చంపమన్న శత్రువును చంపుతాను " అని వారితో పలికాడు. ఆ తరువాత కుమారుడు దేవతలను **తారకాసురుడు** బాధించడం తెలుసుకొని తారకారురుడిని శక్తిఆయుధ ప్రయోగంతో ససైన్యంగా సంహరించాడు. ఆ తరవాత లోక కంటకుడైన బలిచక్రవర్తి కుమారుడైన బాణుడిని తన శక్తిఆయుధముతో సంహరించి ముల్లోకాలకు శాంతి కలిగించాడు.

## అగ్ని తీర్ధం

సోమతీర్ధం నుండి బలరాముడు అగ్ని తీర్ధం వద్దకు వెళ్ళాడు. ఇక్కడ " భృగు శాపానికి గురి అయిన అగ్నిదేవుడు అలిగి ఇక్కడ ఉండగా దేవతలు అతడిని బుజ్జగించి సర్వ భక్షకుడివి కమ్మని భృగువు ఇచ్చిన శాపం జరిగినా ఏది భక్షించినా అగ్ని పవిత్రత చెడదని వరమిచ్చారు. అగ్ని సంతసించి తిరిగి తన విధి నిర్వహణకు పూనుకున్న ప్రదేశం ఇదే. అందు వలన ఈ ప్రదేశానికి అగ్నితీర్ధం అనే పేరు వచ్చింది. బలరాముడు ఆ తరువాత కుబేర తీర్ధానికి వెళ్ళాడు.

## బదరి పాచనము

**కుబేరతీర్ధం** నుండి బదరిపాచనం వెళ్ళాడు. పూర్వం భరధ్వాజుని కుమార్తె అయిన ప్రభావతి ఇంద్రుడిని భర్తగా కోరి తపస్సు చేసింది. ఇంద్రుడు వశిష్టుడి వేషంలో ఆమె వద్దకు వచ్చాడు. **ప్రభావతి** తన కోరికను చెప్పింది. ఇంద్రుడు కొన్ని రేగుపండ్లను ఆమెకు ఇచ్చి పచనం చెయ్యమని చెప్పాడు. ఆమె శుచిగా స్నానం ఆచరించి వాటిని పొయ్యి వెలిగించి వండనారంభించింది. అవి ఎంతకూ ఉడక లేదు. ఆమె ఎంతో ప్రయత్నించి విఫలమై పాకం చెడుతుందని తన కాళ్ళను పొయ్యిలో పెట్టి ఉడకపెట్ట సాగింది. ఆమె నిష్ఠకు మెచ్చి ఇంద్రుడు " శుభాంగి నీ నిష్ఠకు మెచ్చితిని. నీవు ఈ శరీరం విడిచి దివ్యదేహం ధరించి దేవలోకం వచ్చిన ఎడల నీ కోరిక తీర్చగలను. ప్రభావతి అలాగే చేసిన పుణ్య ప్రదేశం ఇది కనుక ఈ ప్రదేశం సర్వపాపహరమైంది. రేగుపండ్లకు బదరీఫలం అనే మరొక పేరు ఉన్నది కనుక బదరిపాచనం అయింది. ఆ తరువాత బలరాముడు ఇంద్రతీర్ధం వెళ్ళాడు. అక్కడ ఇంద్రుడు నూరు అశ్వమేధ యాగములు చేసాడు.

## రామ తీర్ధం

ఆ తరువాత బలరాముడు **రామతీర్ధం** వెళ్ళాడు. పరశురాముడు 21 మార్లు భూప్రదక్షిణ చేసి క్షత్రియ సంహారం చేసి అంతటితో తృప్తి చెందక అశ్వమేధ యాగములు, రాజసూయ యాగములు, వాజపేయములు చేసిన ప్రదేశం అది. పరశురాముడు కశ్యపుని ఆధ్వర్యంలో ఆ యాగములు నిర్వహించి తాను జయించిన భూమినంతా కశ్యపునికి దక్షిణ నిమిత్తం ఇచ్చేసిన ప్రదేశం అది. అక్కడ నుండి బలరాముడు యామున క్షేత్రంకు వెళ్ళాడు. అక్కడ వరుణుడు ఎన్నో రాజసూయ యాగములు చేసాడు. అవి పూర్తి కాగానే దేవాసుర యుద్ధం సంభవించింది. అక్కడి నుండిబలరాముడు **అదిత్యతీర్ధం** వెళ్ళాడు. ఆ తీర్ధంలో సూర్యుడు యాగము చేసి జ్యోతిషాధిపత్యం పొందాడు. అక్కడ నుండి బలరాముడు **సారస్వతం** అనే

పేరుగల **వశిష్టతీర్ధం** వెళ్ళాడు. పూర్వం అక్కడ దధీచి అనే ముని ఘోరమైన తపస్సు చేసాడు. ఆ తపస్సుకు ఇంద్రుడు భయపడి తపోభంగం చేయాలని అనుకుంటాడు. దధీచి తపో భంగం చేయడానికి **అలంబుస '** అనే అప్సరసను పంపాడు. దధీచికి అలంబసని చూసి రేత: పతనం అయింది. ఆ రేతస్సును సరస్వతీనది తనలో దాచుకుంది. ఆ కారణంగా సరస్వతీనది ఒక కుమారుని కని అతడిని తీసుకుని వెళ్ళి " మహామునీ ! ఇతడు నీ కుమారుడు. నీ నుండి పతనమైన రేతస్సును భద్రపరచి కుమారుడిని కన్నాను " అని చెప్పింది. దధీచి ఆ కుమారుని ఆలింగనం చేసుకుని సరస్వతీవదితో " అమ్మా ! నీవు బ్రహ్మసరస్సున పుట్టావు, పుణ్యనదులలో మేటివి, నీ జలములలో పితృదేవతలకు తర్పణం విడిచి విశ్వదేవతలు, పితృదేవతలు, గంధర్వులు తృప్తి చెందుతారు. ఈ కుమారుడు నీ పేరుతో సారస్వతుడు అని పిలువబడతాడు. ఇప్పటి నుండి రాబోయే 12 సంవత్సరాలకు తీవ్రమైన కరువు ఏర్పడుతుంది. సారస్వతుడు మహా మునులను ఆ కరువు నుండి రక్షించి వేదాధ్యయనం చేయిస్తాడు " అని చెప్పి ఆ కుమారుడిని సరస్వతీనదికి ఇచ్చివేసాడు. ఆ సమయంలో దేవాసురయుద్ధం వచ్చింది. ఇంద్రుడికి అసురసంహారానికి ప్రశస్థమైన ఆయుధం కావలసి వచ్చింది. దేవతలు ధధీచిని ప్రార్ధించి అతడి వెన్నెముకను ఆయుధము నిమిత్తం అడిగాడు. **ధధీచి** తన దేహత్యాగం చేసి వెన్నెముకను ఇచ్చాడు. ఇంద్రుడు ఆ ఆయుధముతో యుద్ధం చేసి రాక్షసులను జయించాడు . తరువాత 12 సంవత్సరాలకు తీవ్ర క్షామం వచ్చింది. సారస్వతుడు మహా మునులందరినీ చేరదీసి సరస్వతీనదీ తీరమున వేదాధ్యనం చేయించాడు.

## వృద్ధ కన్యాశ్రమం

సారస్వతం నుండి బలరాముడు వృద్ధకన్యాశ్రమం వెళ్ళాడు. వృద్ధకన్యాశ్రంలో ఖని అనే కన్య స్వర్గం మీద ఉన్న ఆపేక్షతో తీవ్ర తపమాచరించి వృద్ధురాలైంది. అప్పుడు నారదుడు ఆమె వద్దకు వచ్చి ఆమె కోరిక తెలుసుకొని " కన్యకా ! నీవు అవివాహితవు. అవివాహితలకు స్వర్గం నిషిద్ధం " అన్నాడు. అప్పుడు ఆమె " తన తపస్సులో సగం ధారపోసి యవ్వనవతియై గాలవుడు అనే ముని యొక్క కుమారుడిని వివాహము చేసుకొని ఒక్క రోజు మాత్రమే సంసారం సాగించి స్వర్గానికి బయలుదేరింది. అందుకు ఆ మునికుమారుడు బాధపడ్డాడు. ఆ వృద్ధకన్య మునికుమారుడి బాధను నివారించే విధంగా ఆ క్షేత్రంలో ఎవరైనా ఒక్క రోజు ఉపవాసం ఉండి దేవతలను, పితృ దేవతలను తృప్తి పరచిన ఎడల 50 సవత్సరాలు బ్రహ్మచర్య వ్రతం ఆచరించిన ఫలితం దక్కుతుంది " అని చెప్పి స్వర్గానికి వెళ్ళింది.

## కురుక్షేత్రం


బలరాముడిని పూజిస్తున్న ధర్మరాజు

బలరాముడు వృద్ధాశ్రమంలో ఉండగా కురుక్షేత్రంలో కౌరవులందరూ మరణించిన విషయం తెలిసి చాలా బాధపడ్డాడు. తరువాత కురుక్షేత్ర సమీపంలో ఉన్న *శమంతక పంచకం'* వెళ్ళి అక్కడి మునులను అడిగి కురుక్షేత్రంలో జరిగిన విషయాలు తెలుసుకున్నాడు. వారు " ఈప్రదేశమును **కురుమహారాజు** దున్నడం వలన ఈ ప్రదేశానికి కురుక్షేత్రం అనే పేరు వచ్చింది. కురుమహారాజు అక్కడ పుట్టిన వారందరూ స్వర్గలోకం వెళ్ళాలన్న కోరికతో భూమిని దున్నాడని తెలుసుకున్న ఇంద్రుడు భూమిని దున్నితే స్వర్గ లోకం ప్రాప్తిస్తుందా ! అని హేళన చేసాడు. అయినా కురుమహారాజు పట్టు విడువక దున్నసాగాడు. అతడి పట్టుదలను చూసి దేవేంద్రుడు ఆ ప్రదేశంలో ఉపవసించి మరణించిన వారికి స్వర్గలోకం ప్రాప్తిస్తుందని వరమిచ్చాడు " అని ఆ ప్రదేశ ప్రాశస్త్యం గురించి చెప్పారు. అప్పుడు అక్కడకు వచ్చిన **నారదుడు** అక్కడకు వచ్చి " ఈ 18 రోజుల యుద్ధంలో కురుసైన్యంలో అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ అనే రధికత్రయం తప్ప మిగిలిన వారంతా మరణించారు. సుయోధనుడు మాత్రం ఒంటరిగా కృష్ణద్వైపాయన మడుగులో జలస్థంభన విద్య ద్వారా దాక్కొని ఉండగా ధర్మరాజు మాటలకు బయటకు వచ్చి భీమునితో యుద్ధము చేయ సిద్ధముగా ఉన్నాడు. వారిరువురు నీ శిష్యులు కనుక నీవు వెళ్ళి వారి యుద్ధం తిలకించు " అని చెప్పాడు. వెంటనే బలరాముడు కురుక్షేత్రం చేరుకున్నాడు. అని **వైశంపాయనుడు** జనమేజయునికి చెప్పాడని సంజయుడు వివరించి " మహారాజా ! బలరాముని చూసి నీ కుమారుడి ముఖం వికసించింది. తన పక్షమున తన గురుదేవుడు ఉన్నాడనుకుని సంతసించాడు. సుయోధనుడు ధర్మనందనుడిని జూసి " ధర్మనందనా ! ఇక్కడికి సమీపంలో శమంతక పంచకంలో మరణించిన వారికి ఉత్తమలోకాలు ప్రాప్తిస్తాయి కనుక యుద్ధం అక్కడ జరగడం మంచిది కదా ! " అన్నాడు. బలరాముడు ఆ మాటను సమర్ధించడం వలన అందరూ అక్కడకు వెళ్ళారు.

## భీమ సుయోధనులు సమరం


భీమ సుయోధనులు గదాయుద్ధం

శ్రీకృష్ణుడు, బలరాముడు, పాండవులు, యాదవులు, పాంచాలురు చతురంగబలాలు చుట్టూ ఉండగా మధ్యలో భీమ సుయోధనులు యుద్ధానికి సన్నద్ధ మయ్యారు. భీముడు " ధర్మరాజా ! ఈ నీచుడు ఎన్నో పాపాలు చేసాడు. ఇతడికి ఈ రోజుతో ఆయుష్షు తీరింది. నాడు సభలో నేను చేసిన శపథం ఈ రోజ వీడి తొడలు విరిచి నెరవేర్చుకుంటాను " అన్నాడు. సుయోధనుడు కూడా " ఈ రోజు నీకూ నా చేతిలో చావు మూడింది. నాతో గధా యుద్ధం చేయడానికి ఈశ్వరాదులే వెనకడుగు వేస్తాడు. ఇక నీ వెంత ! నిన్ను చంపి సర్వం సహా కురు సామ్రాజాధిపత్యం వహిస్తాను " అన్నాడు. ఇలా ఒకరిని ఒకరు దూషించుకుంటుండగా యుద్ధ ప్రారంభసూచిక మ్రోగింది. భీమసుయోధనులు మహా ఉద్రేకంతో యుద్ధం చేయతలపడ్డాడు. బలరాముడు ఆసక్తిగా చూస్తుండగా ఒకరిని ఒకరు బెదిరించుకుంటూ గుండ్రంగా తిరుగుతూ గధలతో మోదుకుంటూ ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధం చేస్తున్నారు. వారి పదఘట్టనలతో భూమి కంపిస్తుంది. వారి కిరీటములు కింద పడ్డాయి, ఆభరణములు క్రిందరాలాయి కవచాలు విరిగి పోయాయి. ఒకరి గధను ఒకరు చుట్టి లాగుతున్నారు. అంతలోనే వెనక్కు తగ్గుతున్నారు. ఏనుగుల మాదిరి ఢీకొట్టుకుంటున్నారు, ఒకరు కొట్టే దెబ్బలు ఒకరు తప్పించుకుంటూ తిరిగి దెబ్బతీస్తూ ఉన్నారు. గధాఘాతముల వలన ఇద్దరి శరీరాలు రక్తసిక్తమయినా వెనక్కి తగ్గ లేదు. కాసేపు సొమ్మసిల్లి తిరిగి బలం పుంజుకుని తిరిగి యుద్ధం చేస్తున్నారు. వారిద్దరి మధ్య జయాపజయాలు నిర్ణయించడం చాలా కష్టం అయింది.

## కృష్ణార్జునులు యుద్ధరీతిని గురించి చర్చించుట

అప్పుడు అర్జునుడు " కృష్ణుడితో " కృష్ణా ! చూసావు కదా భీమసుయోధనులు ఒకరికి ఒకరు తీసిపోకుండా యుద్ధం చేస్తున్నారు. వీరిలో ఎవరిది గెలుపంటావు " అని అడిగాడు. అప్పుడు కృష్ణుడు అర్జునుడితో ఇలా అన్నాడు " అర్జునా ! ఇద్దరూ విధ్యనేర్చుకున్నది ఒకరి వద్దనేగా ! భీముడిది శారీరక బలమే కాని బుద్ధి బలం తక్కువ. సుయోధనుడికి శారీరక బలం, గధాయుద్ధంలో అత్యంత ప్రావీణ్యం, బుద్ధి బలం ఎక్కువ. ఎదుటి వాడు మాయోపాయాలు పన్నుతూ యుద్ధం చేస్తున్నప్పుడు మనం ధర్మయుద్ధం చేయడంలో ప్రయోజనం లేదు. మనమూ మాయోపాయములు పన్నాలి. నాడు భీముడు కురు సభలో సుయోధనుడి తొడలు విరుగకొడతానని శపధం చేసాడు కనుక నాభికి క్రింది స్థానంలో కొట్టడం గధాయుద్ధంలో అధర్మమే అయినా భీముడు శపధం నెరవేర్చుకునే నిమిత్తం కొట్టాడని సమర్ధించ వచ్చు. లేకున్న విజయం సిద్ధించుట దుర్లభం. కనుక మనకు సుయోధనుడి తొడలు విరుచుట ఒక్కటియే మన కర్తవ్యం.

## ధర్మరాజు వలన కలిగిన సంకటం

అదియును కాక ధర్మజుని మాట మనలను చిక్కుల్లో పెట్టింది. భీముడు గెలువకున్న మీరు భీష్మ, ద్రోణ, కర్ణ, శల్యాదులను సంహరించి కష్ట పడి గెలుచుకున్న సామ్రాజ్యం కుటిలుడు, అధర్మపరుడు, దుర్మార్గుడైన సుయోధనుడి హస్థగతం ఔతుంది కనుక భీముడు గెలుచుట అత్యంత అవసరం. అయినా ధర్మజుడు ఇంత బుద్ధి హీనుడు అనుకోలేదు. సమస్త సైన్యాల నాశనం కావడానికి, బంధువులను, మిత్రులను కోల్పోవడానికి కారకుడైన సుయోధనుడిని చుట్టుముట్టి చంపక ద్వంధయుద్ధానికి అంగీకరించడం ఒక్కరిని ఓడించిన సామ్రాజ్యానికి అధిపత్యం ఇస్తానని పలకడం ఎంత మూర్ఖత్వం. భీమసేనుడిని గెలువడం సుయోధనుడి చిరకాలవాంఛ. సుయోధనుడు వచ్చిన అవకాశం జారవిడుస్తాడా ! కనుక ఇక ఆలస్యం చేయక సుయోధనుడిని అధర్మమే అయినా జయించడం అవసరం లేకున్న భీముని గెలిచి సుయోధనుడు సామ్రాట్టు ఔతాడు. తిరిగి అతడి చేతిలో మీకు ఇడుములు తప్పవు జాగ్రత్త " అన్నాడు.

## సుయోధనుడు నేల కూలుట

అర్జునుడు విషయం గ్రహించాడు. కృష్ణుడు భీమసేనుడి వంకనే చూస్తూ అతడు తన వంక చూడగానే తొడ చూపి అక్కడ


గాయపడి నేలపై పడిపోయిన ధుర్యోధనుడు - రాజ్మానామా నుండి ఒక దృశ్యం

కొట్టమని సైగ చేసాడు. ఆ సైగను భీముడు గ్రహించాడు. అధర్మ యుద్ధానికి కృష్ణుడే అనుజ్ఞ ఇచ్చాడు. ఇక ఆలసించకూడదని అనుకున్నాడు. సుయోధనుడి తొడలు విరువడానికి సమయం కొరకు ఎదురు చూస్తున్నాడు. ముందుగా భీముడు ముందుగా సుయోధనుడిని ఒక్క దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బను తప్పించుకుని సుయోధనుడు భీముని తన గధతో సొమ్మసిల్లేలా గట్టిగా మోదాడు. సుయోధనుడు ఒళ్ళు మరచి గాలిలో ఎగురుతూ గిరగిరా తిరుగుతూ భీముని చంపడానికి గధను బలంగా పైకి ఎత్తాడు. ఇది సరి అయిన సమయమని తెలుసుకున్న భీముడు తనకు అనువుగా ఉన్న సుయోధనుడి తొడలు విరుగ కొట్టాడు. సుయోధనుడు తొడలు విరిగి మొదలు నరికిన చెట్టులా నేల మీద పడ్డాడు. సుయోధనుడు నేల మీద పడగానే భీముడు " సుయోధనా ! నాడు కురుసభలో ఏకవస్త్ర అయిన పాంచాలిని సభకు ఈడ్పించి కూర్చోమని తొడ చూపినందుకు ఫలితం అనుభవించు " అంటూ ఎడమ కాలితో ఎగిసి సుయోధనుడి తలను తన్ని " సుయోధనా ! ఇది వంచనతో గెలువడానికి ఇది యక్షక్రీడ కాదు ఇది యుద్ధం. ఒరేయ్ ! మమ్మలిని పశువులనీ, మృగములనీ, బానిసలనీ ఎగతాళి చేసినందుకు ఫలితం అనుభవించు " అని అరిచాడు. " కృష్ణా ! అర్జునా ! పాంచాల వీరులారా ! చూడండి తాకకూడని పరిస్థితిలో ఏకవస్త్ర అయిన ఒక స్త్రీని సభకు ఈడ్పించి ఫలితం అనుభవిస్తున్న ఈ దుర్మార్గుడిని చూడండి. పాంచాలి కోపాగ్నిలో మాడి మసి అయి పోతున్న పాపాత్ముడిని చూడండి. మమ్ము వ్యర్ధులని, బానిసలని అవమానించిన దుర్మార్గులను ససైన్యంగా సమూలంగా నాశనం చేసాము. ఇక మేము స్వర్గానికి వెళ్ళినా నరకానికి వెళ్ళినా ఒక్కటే " అంటూ కుడి కాలు సుయోధనుడి మెడ మీద పెట్టి ఎడమ కాలితో తలను తన్నాడు.

### భీమసేనుడిని ధర్మరాజు మందలించుట

యుద్ధ పరిమాణాన్ని చూసి ధర్మరాజు ఆవేశపడి అవేదనగా " భీమసేనా ! ఆగు ఏమిటీ పిచ్చితనం. ఈ పిచ్చి ప్రేలాపన ఏమిటి. ఆ తల తన్నడం ఏమిటి ! ఇది అధర్మం అన్యాయం చూడ్డానికే సిగ్గు, అసహ్యం వేస్తుంది. యుద్ధంలో సకల సైన్యాలనూ, బంధు మిత్రులనూ పోగొట్టుకుని నా మాట మన్నించి నీతో గధా యుద్ధానికి సిద్ధమై వీరోచితంగా పోరాడి నేలకూలిన సుయోధనుడి తలను తన్నడం న్యాయమా ! ధర్మమా ! లోకం హర్షిస్తుందా ఇంత వరకు భీమసేనుడు ధర్మం తప్పడని పేరు పొందావు. నేడు గర్వంతో విర్రవీగుతున్నావు నీకు ఇందు కలిగిన ప్రయోజనం ఏమిటి ! నీకిది అపకీర్తి కాదా ! " అని భీమసేనుని మందలించి " సుయోధనా ! విధి వక్రించి మన మద్య వైరం ఏర్పడింది. ఒకరిని ఒకరు ద్వేషించుకుని సర్వం పోగొట్టుకుని ఈ స్థితికి వచ్చాము. బాల్యం నుండి నీకు అలవడిన లోభం, మదం, మాత్సర్యం, అధర్మం నిన్నీ పరిస్థితికి చేర్చాయి. నీ వలన మన ఇద్దరి బంధుమిత్రులు నశించారు. ధృతరాష్ట్రుడి కోడళ్ళందరకూ వైధవ్యం ప్రాప్తించింది. ఇందుకు నువ్వే కారణమని లోకం నిందిస్తుంది " అని సుయోధనుడిని ఓదార్చాడు " అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పాడు.

### బలరాముని ఆవేశం

సంజయుడు చెప్పిన దృష్టాంతం విని ధృతరాష్ట్రుడు " సంజయా ! భీమసేనుడు అధర్మంగా నా కొడుకు తొడలు విరుగ కొట్టి పడద్రోయటం చూసిన బలరాముడు తన శిష్యుడైనన భీమసేనుని ఏమీ అనలేదా ! " అని అడిగాడు. సంజయుడు " మహారాజా ! భీమసేనుడు సుయోధనుడిని తొడలు విరిచి పడ గొట్టగానే బలరాముడు కోపంతో పైకి లేచి అక్కడి మహారాజులను చూసి " చూసారా ! ఈ భీమసేనుడి ఆగడం. ఈ అధర్మ యుద్ధం ఎక్కడైనా చూసారా ! గధాయుద్ధంలో నాభికి దిగువన కొట్టడం అధర్మం కాదా ! భీముడు ఇలా సుయోధనుడిని నాభి క్రింద కొట్టి కూల్చడం న్యాయమా ! " అని హలాయుధం పట్టుకుని భీమసేనుడి వైపు పోసాగాడు.

### శ్రీకృష్ణుడు బలరాముని ఆపుట

అప్పుడు శ్రీకృష్ణుడు బలరాముని వద్దకు వెళ్ళి ఆయనను రెండు చేతులతో పట్టి వారించి " అన్నయ్యా ! తాను తనమిత్రులు

వృద్ధిలోకి రావడం శత్రువు అభివృద్ధిని నిరోధించడం మానవ లక్షణం. మిత్రునికి ద్రోహం జరుగుతున్నప్పుడు ఆదుకొనడం ధర్మం పాండవులు మనకు బంధువులు, మిత్రులు, విశేషించి మనకు మేనత్త కొడుకులు. అర్జునుడు మన చెల్లెలు సుభద్రకు భర్త. వారంతా అధర్మపరులైన కౌరవుల చేత అవమానించబడి ఇడుముల పాలయ్యారు. కనుక పాడవులను ఆదుకోవడం అభివృద్ధికి తోడ్పాటు అందించడం మన ధర్మం కాదా ! క్షత్రియులకు ప్రతిజ్ఞ చేయుట ధర్మం భీముడు తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనుట అధర్మం ఎలా ఔతుంది. అన్నయ్యా ! సుయోధనుడి తొడలను భీమసేనుడు తన గధతో భగ్నపరచగలడు అని మైత్రేయ మహర్షి చెప్ప లేదా ! మహా ముని శాపం అసత్యం ఔతుందా ! ఇందు భీమసేనుడి దోషం ఏముంది కనుక నీ అకారణ కోపం ఉపశమింప చేసి శాంతింపుము " అని బలరాముని అనునయించాడు. కాని బలరాముని కోపం తగ్గ లేదు. " కృష్ణా ! ధర్మార్ధ కామ మోక్షములు ఒక దానికి ఒకటి అనుసంధానింపబడి ఉన్నాయి. అవి ఒక దానిని ఒకటి నాశనం చేసుకోవచ్చా ! పురుషార్ధములలో ధర్మాన్ని పక్కన పెట్టి మిగిలిన పురుషార్ధములను పొందు వాడు నిందితుడు కాదా ! నీవు భీముని ప్రతిజ్ఞ, ముని శాపం అంటున్నావు. వాటిని నెరవేర్చుట కొరకు ధర్మం తప్పి ప్రవఎర్తించుట న్యాయమా ! ఏది ఏమైనా భీముడు గధాయుద్ధంలో ధర్మం తప్పి ప్రవర్తించాడనడం కాదన లేని సత్యం " అని చెప్పాడు. కృష్ణుడు " అన్నయ్యా ! ఈ లోకం నిన్ను లవలేశం అయినా దోషం లేని వాడు, ధర్మ నిరతుడు, చక్కని నడవడి కల వాడుగా కీర్తిస్తుంది. ఈ అకారణ కోపం వదిలి పెట్టు భీముడు తన ప్రతిజ్ఞా పాలన చెయ్యడం ఎలా అధర్మం ఔతుంది. అన్నయ్యా ! భీమసేనుడు సుయోధనుడు నిలబడి ఉన్నప్పుడు నాభి క్రింద కొట్ట లేదు అతడి క్రింద ఉండి సుయోధనుడు పైకి ఎగిరి గదతో భీముని చంపుటకు ప్రయత్నించే సమయంలోనే కదా తన ప్రతిజ్ఞా పాలన కొరకు పదమూడేళ్ళు వేచి ఉన్న భీముడు నాభిక్రింద కొట్టింది. అలా చెయ్యక పోతే భీమసేనుడు మరణించడా ! ఆపత్కాలంలో ప్రాణాపాయకాలంలో ధర్మాధర్మ విచక్షణ చేయడం కుదురుతుందా ! భీముని ప్రతిజ్ఞ తెలిసిన సుయోధనుడు తగిన జాగర్త ఎందుకు తీసుకో లేదు. అన్నయ్యా చిన్నతనం నుండి పాండవులను హతమార్చుటకు సుయోధనుడు చేసిన కుటిల ప్రయత్నాలు నీకు తెలియనివా ! కుటిలుడిని కుటిలోపాయంతో చంపడం అధర్మం కాదే ! మన చెల్లెలు కుమారుడైన అభిమన్యుడిని కుటిలోపాయంతో అధర్మంగా చంపిన సుయోధనుడిని చంపడంలో అధర్మం ఏమి ఉన్న దోషమేమి ! ధర్మానికి ధర్మం అధర్మానికి అధర్మం చెల్లుకు చెల్లు అధర్మాన్ని అధర్మం జయించింది " అన్నాడు. బలరాముడు " కృష్ణా ! నీ వాదనాపటిమతో అధర్మాన్ని ధర్మం అని నిరూపించలేవు. నీ దృష్టిలో ఇలాంటి నీచమైన గెలుపు సాధించిన భీముడు నీకు ప్రశంశాపాత్రుడు ఔతాడేమో ! కాని యుద్ధనీతిని అక్షరాలా పాటించిన సుయోధనుడు ఉత్తమ లోకాలను పొందుతాడు " అని రధం ఎక్కి ద్వారకకు వెళ్ళి పోయాడు.

### చింతాక్రాంతుడైన ధర్మరాజును కృష్ణుడు ఓదార్చుట

అప్పుడు శ్రీకృష్ణుడు చింతాక్రాంతుడైన ధర్మరాజు వంక చూసాడు. తల వంచుకుని చింతాక్రాంతుడై నిలబడి ఉన్న ధర్మరాజును చూసి కృష్ణుడు " ధర్మనందనా ! బంధునాశకుడు, పాపాత్ముడు అయిన సుయోధనుడు తాను చేసిన పాపకర్మల ఫలితం అనుభవిస్తున్నాడు. భీమసేనుడు తన ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాడు ఇందుకు బాధపడ వలసిన పని ఏమి " అని పలికిన కృష్ణుడిని చూసి ధర్మరాజు " కృష్ణా ! భీమసేనుడు సుయోధనుడి తొడలు విరుగ కొట్టి తన ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాడు. కాని సుయోధనుడి తల తన్ని అవమానించడం న్యాయమా ! అసలే కురువంశ నాశనముకు నా మనస్సు విచలితమౌతుంది. భీముని చర్య నాకు అమిత దు:ఖం కలిగించింది. భీమసేనుడికి మేము పడిన కష్టాలు గుర్తుకు వచ్చి అలా చేసి ఉంటాడులే ! ఇప్పడిక పాప పుణ్యాల ప్రసక్తి ఎందుకు " అన్నాడు. కృష్ణుడు " ధర్మనందనా ! కురువంశ వినాశకుడు అయిన సుయోధనుడు నేల కూలాడు. ఇప్పుడు నీవు సర్వంసహా కురు సామ్రాజ్యానికి నీవు చక్రవర్తివి. ఇక రాజ్యభారం వహించి ప్రజలను పాలించు " అన్నాడు. అప్పుడు ధర్మరాజు భీమసేనుడితో " నీ ధైర్యం, భుజబలం, శ్రీకృష్ణుడి సాయంతో సుయోధనుడిని నేల కూల్చిన నీకు నా అభినందనలు " అన్నాడు అని సంజయుడు ధృతరాష్ట్రుడితో చెప్పాడు.

### కృష్ణుడు ధర్మరాజును ఓదార్చుట

బలరాముని మాటలకు చింతాక్రాంతుడై చూస్తున్న ధర్మరాజును చూసి కృష్ణుడు " ధర్మనందనా ! బంధునాశకుడు పాపాత్ముడు అయిన సుయోధనుడు తాను చేసిన పాప కర్మల ఫలితం అనుభవిస్తున్నాడు. భీమసేనుడు తన ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాడు. ఇందుకు చింత పడటం ఎందుకు " అన్నాడు. ధర్మరాజు " కృష్ణా ! భీమసేనుడు సుయోధనుడి తొడలు విరిచి తన ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాడు. అయినా సుయోధనుడి తల తన్నడం ఎందుకు. అసలే కురువంశ నాశనం అయినందుకు నా మనస్సు పరితాపం చెందుతున్న నాకు భీమసేనుడి చర్య అమిత బాధను కలిగించింది. భీమసేనుడికి తాను పడ్డ కష్టాలు గుర్తుకు వచ్చి అలా ప్రవర్తించి ఉంటాడులే. ఇక పాప పుణ్యాలను పోనీలే కృష్ణా ఆలోచించి ఏమి ప్రయోజనం " అన్నాడు. కృష్ణుడు " ధర్మ నందనా ! మీ అవమానాలకు కష్టాలన్నిటికీ కారకుడు కుల నాశకుడు, పాపాత్ముడు అయిన సుయోధనుడు నేలకొరిగాడు. ఇక ఈ సర్వం సహా సామ్రాజ్యానికి నీవే చక్రవర్తివి. ఇక రాజ్యభారం వహించి ప్రజలను పాలించు " అన్నాడు. అప్పుడు ధర్మరాజు " భీమసేనా ! నీ సాహసం ధైర్యం శ్రీకృష్ణుడి సహాయంతో సుయోధనుడిని నేల

కూల్చావు. నీకు నా అభినందనలు " అన్నాడు. " అని సంజయుడు చెప్పాడు.

## యోధులు సుయోధనుడి మరణాన్ని విమర్శించుట

సంజయుడి మాటలు విని ధృతరాష్ట్రుడు " సంజయా ! నా కుమారుడు నేలకొరిగిన తరువాత పాండవులు, పాంచాలురు, యాదవులు ఏమి అనుకున్నారో వివరించు " అన్నాడు. సంజయుడు మహారాజా ! సుయోధనుడు నేల కొరగగానే పాండవులు పాంచాలురు ఆనందోత్సాలతో చేసిన భేరీనాదాలు, శంఖ ధ్వనులు మిన్నంటాయి. అందరూ పెద్దగా కేకలు వేస్తూ భీమసేనా ! గధాయుద్ధంలో అత్యంత నేర్పరి అయిన సుయోధనుడి తొడలు విరిచి నేల కూల్చావు. నీవు సుయోధనుడిని కూల్చుతున్నప్పుడు మాకు కలిగిన గుగుర్పాటు ఇంకా తగ్గ లేదు " అని భీమసేనుడిని ప్రశంసించారు. కాని కొంత మంది మాత్రం భీమసేనుడు సుయోధనుడిని అధర్మంగా పడగొట్టాడు " అని తమలో తాము అనుకోవడం విన్న శ్రీకృష్ణుడు " మహా వీరులారా ! భీముడు సుయోధనుడిని అక్రమంగా నేలకూల్చాడని అనుకోవద్దు. ఈ దుర్మార్గుడు ఏకవస్త్ర అయిన ద్రౌపదిని సభకు ఈడ్పించి వలువలు విప్పమని ఆజ్ఞాపించాడు. పాండవులను అనేక విధముల ఇడుముల పాలు చేసిన సుయోధనుడి అక్రమాలు మన్నించి మరచి అర్ధరాజ్యం అడుగుతూ సుయోధనుడితో సంధిని కోరాడు. కాని ఈ పాపాత్ముడు సంధికి అంగీకరించ లేదు. ఈ అధర్మవర్తనుడిని అధర్మంగా నేల కూల్చడంలో దోషం లేదు. విదురాది మహాత్ములు అనేకులు చెప్పినా పెడచెవిని పెట్టి యుద్ధాన్ని కోరుకుని, కురువంశ వినాశనానకి కారణమైన ఈ పాపాత్ముడి గురించి ధర్మాధర్మ విచక్షణలతో పని లేదు. మీ మీ స్థానములకు కదలండి " అని పలికాడు.

## సుయోధనుడు కృష్ణుడిని నిందించుట

ఈ మాటలు విన్న సుయోధనుడు రోషంతో " ఓ కంసుడి దాసుడైన వసుదేవ కుమారుడా ! నీ తప్పులు నీవు తెలుసుకోకుండా సిగ్గు విడిచి ప్రేలుతున్నావా ! నీవు చెప్పిన మాటలు విని అర్జునుడు చేసిన సైగను గ్రహించి భీముడు అధర్మంగా నా తొడలు కొట్టి నన్ను పడగొట్టాడు. లేకున్న ఈ భీములు పది వేలు వచ్చినా నన్ను గధాయుద్ధమున జయించగలరా. లేని ఎడల నేను ఒక్కడినే మీ అందరిని చంపగలను. శిఖండిని ముందు పెట్టి భీష్ముని పడగొట్టించావు, ధర్మరాజుతో అబద్ధం పలికించి ద్రోణుడిని చంపించావు. భూమిలోకి క్రుంగిన రధచక్రమును పైకి తీస్తున్న కర్ణుడి మీద శర ప్రయోగం చేసి కర్ణుడి చంపించావు. ఇన్ని అధర్మములకు ఒడి కట్టిన నిన్ను ఏమనాలి. నీ అక్రమాలకు హద్దు లేదా ! భీష్మ, ద్రోణ, కర్ణ, జయద్రధులను అధర్మంగా కాక ధర్మంగా పడగొట్టుట నీకు నీ పాండవులకు సాధ్యమా " అన్నాడు.

## శ్రీకృష్ణుడు సుయోధనుడి అకృత్యములు ఎత్తి చూపుట

అమాటలు అన్న సుయోధనుడిని చూసి కృష్ణుడు " సుయోధనా ! నీవు చేసిన అక్రమాలు నీకు గుర్తు లేదా ! బాల్యప్రాయంలోనే ప్రారంభించిన అక్రమాలను మరచినటులున్నావు విను. భీముని చేతులు, కాళ్ళు కట్టి నీటిలోకి త్రోయించావు, భీముని చేత విషాహారం తినిపించావు, పాములతో కరిపించావు. కుంతీ సహితంగా పాండు సుతులను లక్క ఇంట పెట్టి దహించాలని చూసావు. ధర్మాత్ముడైన ధర్మరాజును మాయాజూదముకు ఆహ్వానించి మోసంతో అతడి రాజ్యాన్ని అపహరించి యాజ్ఞసేనిని సభకు ఈడ్పించి ఘోర అవమానాల పాలు చేసి వారందరిని అరణ్యవాసానికి పంపావు. అరణ్యవాసంలో ఉన్న పాడవులను అవమానించాలన్న తలంపుతో ఘోష యాత్రకు వెళ్ళావు. అజ్ఞాతవాసం ముగియ కుండానే వారిని బయటకు ఈడ్పించి తిరిగి అరణ్యాల పాలు చేయనెంచి గోగ్రహణం పేరోతో యుద్ధానికి తలపడ్డావు. నీ ఆగడాలను మరచి ధర్మరాజు నన్ను సంధికి పంపించాడు దానిని నీవు తిరస్కరించి ఫలితం అనుభవిస్తున్నావు. నీ లోభత్వం వలన, పాపచింతన వలన, దుర్మదం వలన శాంత చిత్తులైన భీష్మ, ద్రోణులకు హాని కలిగింది. ఇంకాచెప్తాను విను. ద్రుపదుడు భీష్మ, ద్రోణులను పడగొట్టాలని చేసిన యజ్ఞంలో నుండి జన్మించిన శిఖండి, ధృష్టద్యుమ్నుడు భీష్మ, ద్రోణ మరణాలకు నిమిత్తమాత్రులే కాని అసలు వారు పతనం కావడానికి కారణం నువ్వే. నీవే ఈ అకారణ యుద్ధానికి కారణం. యుద్ధములో డస్సిఉన్న సాత్యకిని భూశ్రవసుడు చంపడానికి కత్తి దూసే సమయంలో అతడిని చంపడం అధర్మమా ! బంధువుల మరణిస్తుంటే వీరులెవరైనా చూస్తూ ఊరుకుంటాడా. బాలుడైన అభిమన్యుని అనేకులు చుట్టు ముట్టి చంపడం నీకు అధర్మంగా కనిపించ లేదుకాని. చెల్లెలి వరుస అని చూడక అడవులలో ద్రౌపదిని చెరపట్టిన జయద్రధుని యుద్ధభూమిలో చంపక వదలడానికి అర్జునుడు వెర్రి వాడా ! ఘోషయాత్ర పేరుతో పాండవులను అవమానించడానికివెళ్ళి గంధర్వుల చేత చిక్కిన నిన్ను అర్జునుడు కాపాడిన విషయం మరచుట నీకు ధర్మమా ! గోగ్రహణ సమయంలో సమ్మోహనాస్త్రం ప్రభావితుడవైన నిన్ను అర్జునుడు ప్రాణములతో విడుచుట మరవడం ధర్మమా ! నీవు చేసిన అకృత్యములకు మూల పురుషుడైన కర్ణుడు యుద్ధ భూమిలో చిక్కిన కర్ణుడిని అర్జునుడు ఊరక విడుస్తాడా ! అర్జునుడు విడిచిన బ్రాహ్మణ శాపగ్రస్తుడైన కర్ణుడి రధం పైకి

లేవగలదా ! యుధిష్టరుడు శల్యుడిని చంపడం అధర్మమం అననందుకు పరమ సంతోషం. సుయోధనా ! నీవు బాల్యం నుడి నీ అన్నదమ్ములైన పాండవులను ద్వేషించావు. కాని పాండవులు నిన్ను ఎన్నడూ ద్వేషించలేదు. కురువంశానిని కూకటి వేళ్ళతో పెకలించడానికి మాయాజూదం అనే గునపం పట్టింది నీవే. నీతొడలు విరుగకొడతానని చెప్పిన భీముడు నిన్ను పిడి గుద్దులు గుద్ది వదులుతాడా ! కనుక వృధా మాటలు కట్టిపెట్టు " అన్నాడు. ఆ మాటలు విన్న సుయోధనుడు " కృష్ణా ! నేను అనేక యజ్ఞ యాగాదులు చేసాను, వేద వేదాంగములను చదివాను. ఎందరో మహారాజులతో నీరాజనాలు అందుకున్నాను. నా శత్రువుల మదం అణచి బంధుమిత్రుల సహితంగా స్వర్గసుఖములను అనుభవించడానికి వెళుతున్నాను. మీ దృష్టిలో నేను దుర్మార్గుడనే అయినా మీరంతా మీ శేష జీవితం పశ్చాత్తాపంతో గడపవలసిందే " అన్నాడు.

### పాండవులను కృష్ణుడు ఒదార్చుట

పాండవులు సుయోధనుడి మాటలు విని భీష్మ, ద్రోణ, కర్ణులను అధర్మంగా పడగొట్టామా అని తలలు దించుకున్నారు. వారిని చూసిన కృష్ణుడు " మీరు భీష్మ, ద్రోణ, కర్ణులను అధర్మంగా చంపామని బాధ పడవలదు. మహా యోధులైన వారిని ధర్మయుద్ధంలో చంపుట కష్టం కనుక అనేక ఉపాయములతో వారిని పడగొట్టవలసి వచ్చింది. ఆ మహాయోధులు మామూలుగా మరణించరు. అదియును కాక వారి పూర్వజన్మ సుకృతం వారికి మరణం సంభవించేలా చేసింది. దైవ సంకల్పం తప్పించడం మీ తరమా ! ఈ సంతోషసమయాన మీరిలా చింతించ తగదు " అన్నాడు. అప్పటికి పొద్దు వాలింది. కృష్ణుడు పాంచజన్యము, ధర్మరాజు అనంత విజయము, భీముడు పౌండ్రకము, అర్జునుడు దేవదత్తము, నకుల సహదేవులు సుఘోష అనే శంఖములను పూరించారు. భేరీ మృదంగ నాదములు మిన్నంటాయి. అక్కడి వారు ధర్మరాజు విజయుడు అయినందుకు వేనోళ్ళ కొనియాడారు. పాండవులు కౌరవ శిబిరాలకు వెళ్ళారు. సాత్యకి కూడా వారితో వెళ్ళాడు. ధృష్టద్యుమ్నుడు, ద్రుపదుని దాయాదులు, ద్రౌపదీ సుతులు, మిగిలిన మహారాజులంతా ధర్మజుని అనుమతి తీసుకొని ససైన్యంగా తమ శిబిరాలకు వెళ్ళారు. మరునాడు హస్థినాపురం వళ్ళాలని అనుకున్నారు. పాండవులు కౌరవ శిబిరాలకు వెళ్ళారు. నీ కుమారుడి శిబిరం, నాటకం ముగిసిన రంగస్థలం వలె నిశ్శబ్ధంగా ఉంది. అక్కడి పరిచారికలు ధర్మరాజును సత్కరించి గంధపుష్పాక్షితలు సమర్పించారు.

### అర్జునుడి రధం దగ్ధంకావడము

కృష్ణుడు అర్జునుడితో " అర్జునా ! నీ గాండీవం అక్షయ తుణీరం తీసుకుని ముందు నీవు రథం దిగు తరువాత నేను రథం దిగుతాను అన్నాడు. అర్జునుడు అలాగే అని చెప్పి గాండీవ సహితంగా రథం దిగాడు. తరువాత కృష్ణుడు పగ్గములను నొగల మీద ఉంచి తాను కూడా రథం దిగాడు. కపిధ్వజం మీద ఉన్న హనుమంతుడు భూతగణ సహితంగా తను కూడా రధమును విడిచి వెళ్ళాడు. వెంటనే ఆరథం భగభగ మండి పోయింది. అర్జునుడు ఆశ్చర్యచకితుడై " కృష్ణా ! ఏమిటీ వింత ! " అని అడిగాడు. అప్పుడు కృష్ణుడు " అర్జునా ! ఇప్పటి వరకు యుద్ధంలో గెలవడం నీ మహిమ అనుకుంటున్నావు. కాని కర్ణుడి అస్త్ర ధాటికి ఈ రథం ఎప్పుడో ధగ్ధం అయిపోయింది. కాని నొగల మీద నేను ధ్వజం మీద హనుమంతుడు ఉన్నాము కనుక ఇప్పటి వరకు నిలిచి ఉంది. అందుకే నేను నీ తరువాత రథం దిగాను. హనుమంతుడు ఎగిరిపోగానే రథం ధగ్ధం అయింది. ఇందులో వింత ఏముంది " అన్నాడు. అన్నాడు.



అర్జునుడి రథం దగ్ధంకావడము

## కృష్ణుడు అర్జునుడిని ధర్మరాజుకు అప్పగించుట

కృష్ణుడు ఆతరువాత ధర్మరాజుకు అర్జునుడిని అప్పగిస్తూ " ధర్మరాజా ! యుద్ధారంభంలో ఉపప్లాయంలో నీవు నాన్ను వస్త్రములతో సత్కరించి అర్జునుడిని నాచేత పెట్టి " కృష్ణా ! వీడిని నీవు కాపాడాలి " అని అర్ధించావు. నేను అందుకు అంగీకరించాను. ఇడుగో యుద్ధంలో విజయుడై వచ్చిన అర్జునుడిని సురక్షితంగా నీకు అప్పగిస్తున్నాను " అన్నాడు. ధర్మరాజు " అదేమిటి కృష్ణా ! నీవు లేకున్న మేము ఈ పద్దెనిమిది రోజుల యుద్ధంలో జరిగిన ఈ యుద్ధసాగరాన్ని

దాటగలమా ! నాడు వ్యాసుడు చెప్పనే చెప్పాడు. శ్రీకృష్ణుడు ఎక్కడ ఉంటే విజయం అక్కడే అని. నీ కరుణ వలనే కదా ! మాకీ విజయం ప్రాప్తించింది " అన్నాడు ధర్మరాజు. కృష్ణుడు " ధర్మజా ! ప్రారంభంలో అర్జునుడికి యుద్ధం చేయుట ఇష్టం లేదు. నేను గీతను బోధించి అతడిని రణోన్ముఖుని చేసాను. కానీ ఇప్పటికీ అర్జునుడికి ఈ మారణకాండమున యుద్ధమున ఆసక్తి లేదు. లేకున్న ఇంద్రకుమారుడైన అర్జునుడు ఏపని చేటకైనా సమర్ధుడే. ముల్లోకాలను తృటిలో నాశనం చేయగలడు. ఇందులో నా గొప్పతనం ఏమీ లేదు " అన్నాడు. ఆ ప్రకారం అందరూ సరససల్లాపంలో తేలియాడారు. ధర్మరాజు అత్యధిక సంపదలు కలిగిన సుయోధనుడి ధనాగారం స్వాధీనం చేసుకున్నాడు. మిగిలిన కౌరవ సేనలను చూసుకుంటూ ఆనందంగా తిరుగున్నాడు. కృష్ణుడు " ధర్మనందనా ! సుయోధనుడు లేని ఈ మందిరం పాడుబడింది. ఇక ఇక్కడ ఉండటం మంచిది కాదు. వేరొక ప్రశాంత ప్రదేశముకు పోదాము " అన్నాడు. తరువాత కృష్ణుడు పాండవులను ఓఘువతీ తీరానికి తీసుకు వెళ్ళాడు. ధర్మరాజుకు భయం పట్టుకుంది " అర్జునుడు చేసిన సైగతో భీముడు సుయోధనుడి తొడ విరిచాడు. అది చాలక కాలితో సుయోధనుడి తల నరికాడు. కనుక గాంధారి నన్ను శపిస్తుంది. కనుక ఆమెను శాంతింప చేయాలి. ఈ పని చేయడానికి శ్రీకృష్ణుడే తగిన వాడు " అనుకుని శ్రీకృష్ణుడిని హస్థినాపురం పంపాడు.

## శ్రీకృష్ణుడు ధృతరాష్ట్ర గాంధారీలను ఓదార్చుట

కృష్ణుడు ధర్మరాజు మాట మీద హస్థినాపురం బయలు దేరి వెళ్ళి ధృతరాష్ట్రుడికి వర్తమానం పంపాడు. ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుడిని సాదరంగా తీసుకు రమ్మని చెప్పాడు. కృష్ణుడు ధృతరాష్ట్రుడి అంతఃపురంలోకి ప్రవేశించే సమయానికి అప్పటికే వ్యాసుడు ధృతరాష్ట్ర గాంధారీలను కుమారుల మరణానికి ఓదార్చడానికి వచ్చి ఉండటం చూసి వ్యాసునకు సాష్టాంగ నమస్కారం చేసి ధృతరాష్ట్ర గాంధారీలకు నమస్కరించాడు వారి పక్కన నేల మీద కూర్చుని ధృతరాష్ట్రుడి చేతిని తన చేత పట్టుకుని " మహారాజా ధృతరాష్ట్రా ! నీ కుమారుల వలన మీ వంశం సమూలంగా నాశనం అయింది. ఇలాంటి పరిస్థితి కలుగకూడదని పాండవులు నన్ను రాయబారానికి పంపారని నీకు తెలుసు సంధికి అంగీకరించి ఉంటే ఇలాంటి పరిస్థితి రాదు కదా ! మహారాజా లోకంలో జూదం ఆడటం సహజమే కాని అంతఃపురంలో ఉన్న కుల స్త్రీలను ఏక వస్త్రలను పతివ్రతలను సభకీడ్చించి వలువలు ఊడ్చించి అవమానించడం ఎక్కడైనా ఉందా ! అయినా పాండవులకు కోపం రాలేదు 13 సంవత్సరాలు అరణ్య అజ్ఞాత వాసాలలో ఇడుములు అనుభవించినా వారికి కోపం రాలేదు. అందుకే నీకుమారుడు వారికి చేసిన అవమానాలు సహించి మరచి మన్నించి అయిదు ఊళ్ళు ఇచ్చినా చాలని అర్ధించాడు. నీ కుమారుడు లోభంతో, అహంభావంతో ఆప్రతిపాదన తిరస్కరించాడు. విదురుడు బంధు మిత్రులు మహామునులు ఎంతో చెప్పి చూసారు. కాలోపహతులై నీవు నీకుమారుడు వారి మాటను పెడచెవిన పెట్టారు. విధి నిర్ణయం మార్చలేనిది కనుక ఇక వగచి లాభం లేదు. నిష్కల్మష హృదయులైన పాండవులు వారి మీద కోపగించ వలదని వేడుకుంటూ నన్ను పంపారు. ప్రస్థుతం మీకు కుమారులు లేరు కనుక మీ ఇరువురికి ఉత్తర క్రయలు చేసి ఉత్తమ గతులు కల్పించవలసిన పాండవుల హితం కోరుట మీకు శ్రేయస్కరం. మీకు కలిగిన కష్టానికి ధర్మరాజు ఎంతో దుఃఖిస్తున్నాడు. తన మనో భావాలను తెలుపమని ధర్మరాజు నన్ను మీ వద్దకు పంపాడు అని గాంధారిని చూసి " అమ్మాగాంధారీ ! నీకు సాటి వచ్చు రాజమాతను నేను ఈలోకములో చూడ లేదు. లేకున్న నిండు సభలో పలువురు వినుచుండ నీవు సుయోధనుడికి బుద్ధిమతి చెప్ప ప్రయత్నిస్తావా ! నాడు నీవు పలికిన పలుకులు నా చివులలో ఇప్పటికీ ప్రతిధ్వనిస్తున్నాయి. కాని సుయోధనుడు లోక విరుద్ధంగా నీ మాటలు పెడచెవినబెట్టాడు. తనకు ఏది మేలో తెలుసుకో లేక పోయాడు. సుయోధనుడు అహంకారంతో తుళ్ళక రాజ్యభాగాన్ని ఇచ్చి ఉంటే ఇంతవరకు వచ్చేది కాదు కదా ! నీవు ఆ నాడే చెప్పినట్లు కీడే జరిగింది. కనుక ఇందు పాండవుల దోషం లేదు. కనుక వారిని మన్నించమని వేడుకుంటున్నాను. నీవు కోపించిన ముల్లోకాలూ ధగ్ధం అవుతాయి. నీ పాతివ్రత్య మహిమ అలాంటిది. అందుకనే నిన్ను ప్రార్ధిస్తున్నాను " అన్నాడు. గాంధారి " దాని కేముందిలే కృష్ణా ! అంతా నీవు కోరుకున్నట్లే జరిగినది కదా ! నా కుమారుల మరణనానికి దుఃఖిస్తున్న నాకు నీ మాటలు ఊరట కలిగించాయి. ఈ రాజు దీనుడు, అంధుడు, వృద్ధుడు ఈయనను నీవు పాండుకుమారులు కాపాడాలి " అని గాంధారి పటచెరగును ముఖానికి కప్పుకొని ఏడ్చింది. కృష్ణుడు ఆమెను ధృతరాష్ట్రుడిని పలు విధముల ఊరడించి " ధృతరాష్ట్ర మహారాజా ! జరిగిన దానికి బాధపడ వలదు. అశ్వత్థామ కోపగ్రస్తుడు అతడి వలన పాండవులకు అపకారం కలుగుతుందని నా మనసు కలత చెందుతుంది. నేను వెళ్ళి వస్తాను " అన్నాడు. దానికి ధృతరాష్ట్రుడు " త్వరగా వెళ్ళవయ్యా ! కృష్ణా పాండవులు నిన్ను వేయి విధముల నమ్ముకున్నారు. వారి నమ్మకాన్ని నీవు సఫలం చేయాలి కదా ! వెళ్ళు మరలా కనిపించు " అన్నాడు. శ్రీకృష్ణుడు వారి వద్ద శలవు తీసుకుని వెళ్ళాడు. వ్యాసుడు కూడా వారితో " ధృతరాష్ట్రా !గాంధారీ ! శ్రీకృష్ణుని మీ శోకోపశమనానికి పలికిన మాటలు ఆచరించతగినవి " అని వారిరువురిని ఓదార్చి అక్కడి నుండి వెళ్ళాడు. శ్రీకృష్ణుడు త్వరితంగా అక్కడి నుండి వెళ్ళి **ఓఘువతీనదీ** తీరానికి వెళ్ళి ధర్మరాజు జరిగినది చెప్పాడు. " అని వైశంపాయనుడు జనమేజయునకు వివరించాడు. ఆ తరువాత భారతకధను వివరిస్తూ జనమేజయ మహారాజా ! ధృతరాష్ట్రుడు సంజయుడితో " సంజయా ! భీమసేనుడు నా కుమారుడి తొడలు విరుగకొట్టిన తరువాత ఏమి జరిగింది. నా కుమారుడి గతి ఏమైంది చెప్ప " అని అడిగాడు.

## సుయోధనుడు అశ్వత్థామను సైన్యాధ్యక్షుని చేయుట

సంజయుడు ధృతరాష్ట్రుతో " మహారాజా ! భీమసుయోధనులు యుద్ధం చేసే సమయంలో నేను పక్కనే ఉన్న పొదలలో ఉన్నాను. వారు వెళ్ళి పోగానే నేను వెలుపలికి వచ్చి సుయోధనుడి వద్దకు వెళ్ళాను. ధూళితో నిండిన ముఖము మీద ఉన్న వెంట్రుకలను తొలగించి కళ్ళ నీరు నింపుకుని సుయోధనుడు " సంజయా ! చతస్సముద్ర వేలావలయుత ధరణీ తలంబును ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించిన సుయోధనుడి దుర్గతి చూసావా ! ఏకాదశ అక్షౌహినులకు అధిపతిని, అణుకువ కలిగిన సామంతరాజులు కలిగిన వాడిని అత్యంత వైభవమును అనుభవించిన వాడిని అయిన నేను ఎలా ఉన్నానో చూసావా ! లోక నిందకు వెరువక భీముడు అధర్మంగా నా తొడలు విరిచాడని మన వాళ్ళకు చెప్పు. నాడు భీష్ముని, ద్రోణుని, కర్ణుడిని అధర్మ యుద్ధంలో చంపి నేడు నన్ను భీముడు అధర్మ యుద్ధంలో చంపాడు. ఇదీ ఒక విజయమేనా ! ఇందుకు లోకులు పాండవులను పురుగులు పట్టిపోతారని తిట్టరా ! పాండవులకు ఇది వృధా విజయం కాక మరేమి ! నన్ను అధర్మంగా కూలదోసిన భీముడు ఏమి బాగుపడతాడులే ! సంజయా భీముడు నా తొడలు కొట్టి పడతోసింది చాలక తన వామ పాదంతో నా తలను తన్నాడు. లోకులు దీనిని మెచ్చుతారా ! నేను రారాజుగా ఉన్నప్పుడు నన్ను తృణీకరించారు. నేను పడిపోగానే నన్ను కాలితో తన్నారు. లోకులు ఘర్షించరా ! నేను ఎన్నో యజ్ఞాలు చేసాను. ఎన్నో దానధర్మాలు చేసి ఎందరినో శ్రీమంతులను చేసాను. బ్రాహ్మణులకు అగ్రహారాలను ఇచ్చాను. నా బాహు బలంతో దేశాన్ని సుభిక్షంగా పాలించాను. ఇప్పుడీ శమంతక పంచకంలో మరణించి పుణ్యలోకాలకు పోతాను. నా గురించి నాకు చింత లేదు. పాండవులు నన్ను అధర్మ యుద్ధమున గెలిచి నా రాజ్యమును వశపరచుకున్నారు. నీకు అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ కనపడితే జరిగినది వివరించి నా మాటగా " పాండవులు అందరూ అనుకున్నట్లు ధర్మపరులు కాదు అసత్యవాదులు, అధర్మపరులు ధర్మము అనే ముసుగులో లోకమును వంచిస్తున్నారని వారికి చెప్పు. వారిని ఎన్నటికీ నమ్మరాదు " అన్నాడు.

### అశ్వత్థామ సుయోధనుడిని చూసి విలపించుట

అంతలో చుట్టు జనపదములలో ఉన్న వారు, ముని కుమారులు సుయోధనుడిని చూడ వచ్చారు. వారితో పాటు అక్కడికి వచ్చిన కృతవర్మ, కృపాచార్యుడు, అశ్వత్థామ సుయోధనుడి దురవస్థ చూసి కన్నీరు మున్నీరుగా విలపించారు. అశ్వత్థామ సుయోధనుడి చూసి " రారాజా ! అనేక రాజన్యులు నీచుట్టూ చేరి ప్రశంసింస్తుంటారే ఇప్పుడిలా ఒంటరిగా పడి ఉన్నావా ! కురుసామ్రాజ్య సింహాసాధిష్టుడవైన నువ్విలా కటిక నేల మీద పడి ఉండమని ఆ విధాత నీ నొసటన వ్రాసాడా ! నీ బల సౌర్యములు ఏమయ్యాయి, అహర్నిశం పట్టు ఆ పట్టు ఛత్రములు ఎక్కడ, నీ సైన్యాధిపతు లేమయ్యారు రారాజా ! ఈ నాడిలా ఒంటరిగా దుమ్ము కొట్టుకుని కటిక నేలను పడి ఉన్నావు. పన్నీటి జలకాలు ఆడవా రారాజా ! భీష్మ, ద్రోణ, కర్ణులు నీ పక్కన ఆశీనులై ఉండగా దుశ్శాసన, వికర్ణుల సేవలందుకుంటూ పరివేష్టితుడవై అష్టైశ్వర్యములు అనుభవించిన నిన్ను రాజులంతా మరచినారా ! ఒక్కరూ రారేమి ! నీ విషయంలో లక్ష్మి ఇంత చంచలమైందా ! విధి నీ పట్ల ఇంత క్రూరంగా ప్రవర్తించిందేమి నేనేమి చెయ్యను " అని విలపించాడు.

### సుయోధనుడు అశ్వత్థామను చూసి విలపించుట

అశ్వత్థామను చూసి సుయోధనుడు " గురుపుత్రా ! నీవెరుగనిది ఏమున్నది. మనుజుల విధి విధానములు నీకు తెలియనివి కాదు కదా ! ఆ బ్రహ్మ దృష్టిలో ఆ సుఖదు:ఖాలు వస్తుంటాయి పోతుంటాయి. మనం అన్నిటినీ సమంగా చూడాలి. సుఖదు:ఖాలు వస్తుంటాయి పోతుంటాయి. నా బంధుమిత్రులు మహా వీరులు యుద్ధంలో మరణించిన తరువాత నేను ఒక్కడినే జీవించు ఉండటం ధర్మమా ! నా బాహు బలము, వీర్యము, ధైర్యము సడలి పోగా శత్రువులు నన్ను పడగొట్టి నాకు సద్గతి కలిగించారు. మీరు ముగ్గురూ వారికంట పడక నా కంట పడటం నాకు ఆనందం కలిగిస్తుంది. " అని పాడవులు అక్కడికి వచ్చిన తరువాత జరిగిన విషయములు సవిస్తరంగా వారికి వివరించాడు. అది విని అశ్వత్థామ కోపంతో ఊగి పోయాడు.

### అశ్వత్థామ సైన్యాధ్యక్షునిగా అభిషిక్తుడగుట

అశ్వత్థామ కోపంతో " రారాజా ! నా తండ్రిని అర్జునుడు అధర్మంగా చంపినప్పుడే నా గుండెలు మండి పోయాయి. ఇప్పుడు నిన్ను అక్రమంగా పడతోసారు. ఆ పాడవులను నా అస్త్రములతో దగ్ధం చేయకున్న నేను బ్రతికీ వ్యర్ధమే ! రారాజా ! సుయోధన సార్వభౌమా ! నేను సత్యం పలుకుతున్నాను. పాండవులను, పాంచాలురను వారి బంధుమిత్రులను కృష్ణుడు చూస్తుండగా నేను వధిస్తాను. ఇదే నాప్రతిజ్ఞ నన్ను ఆజ్ఞాపించండి " అని సుయోధనుడి ముందు మోకరిల్లాడు. సుయోధనుని మనసు ఆహ్లాదంతో నిండి పోయింది. " కృపాచార్యా ! వెంటనే పుణ్యజలాలు తెప్పించండి అన్నాడు. వారిని

చూడటానికి వచ్చిన ముని కుమారులను అడిగి పుణ్య జలాలను తెప్పించాడు కృతవర్మ. అప్పుడు సుయోధనుడు కృపాచార్యుని చూసి " కృపాచార్యా ! అశ్వత్థామను సైన్యాధ్యక్షుడిగా అభిషేకించండి. అశ్వత్థామ పుట్టుకతో బ్రాహ్మణుడైనా రారాజు కోరిక మీద యుద్ధం చేయుట పరమధర్మం " అన్నాడు. కృపాచార్యుడు పుణ్యాహవాచన మంత్రములు చదివి అశ్వత్థామను కౌరవసేనకు అధ్యక్షునిగా అభిషేకించాడు. తనకు లభించిన గౌరవానికి అశ్వత్థామ పొంగి పోతూ రారాజును గుండెలకు హత్తుకొని పైకి లేచి సింహ నాదం చేసి " రారాజా ! పాండవులను సమూలంగా నాశనం చేసి నీ దర్శనం చేసుకుంటాను " అన్నాడు. కృతవర్మ, కృపాచార్యుడు వెంటరాగా పాండవశిబిరాల వంకకు వెళ్ళాడు " అని సంజయుడు ధృతరాష్ట్రునికి వివరించాడని వైశంపాయనుడు జనమే జయునికి చెప్పాడు.

## వనరులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభ్రువాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

---

# సౌప్తిక పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

(సౌప్తిక పర్వము నుండి దారిమార్పు చెందింది)

## విషయ సూచిక

# ప్రథమాశ్వాసం

వైశంపాయనుడు జమేజయునకు చెప్పిన మహా భారతకధను సూతుడు సత్రయాగం జరుగుతున్న సమయంలో సూతుడు అను **పౌరాణికుడు** శౌనకాది మహా మునులకు ఈ విదంగా చెప్పసాగాడు. ధృతరాష్ట్రుడు " సంజయా ! రధికత్రయం నా కుమారుడి వద్ద నుండి బయలుదేరి ఎక్కడికి వెళ్ళారు. ఏమి చేసారు " అని అడిగాడు. సంజయుడు" మహారాజా ! అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ మొదలైన రధికత్రయం దక్షిణం దిక్కుగా ఉన్న పాండవశిబిరాల వైపు వెళ్ళారు. ఆ సమయంలో పాండవశిబిరాలలో ఆనందోత్సాహాలు వెల్లివిరిస్తున్నాయి. అందరూ ఆడుతూ పాడుతూ సంతోషాంబుధిలో తేలియాడుతున్నారు. ఆ సమయంలో అక్కడకు వెళితే వారి చేతిలో చావు తప్పదని రధిక త్రయం అక్కడినుండి తూర్పు దిక్కుగా వెళ్ళి కొంతదూరం వెళ్ళి ఒక కొలను వద్ద ఉన్న మర్రి చెట్టు దగ్గర తమ రధములు ఆపారు. సాయం సంధ్యా కార్య క్రమాలు ముగించుకుని వారు ముగ్గురూ భూమి మీద శయ్యలు ఏర్పాటు చేసి మేను వాల్చారు.

## కాకులు గుడ్లగూబలు

కృపాచార్యుడు నిద్రపోయినా అశ్వత్థామకు నిద్ర రాక దిక్కులు చూస్తూ ఉన్నాడు. ఆ మర్రి చెట్టు మీద ఎన్నో కాకులు గూళ్ళు కట్టుకొని ఉన్నాయి. వాటిలో కాకి పిల్లలు ఉన్నాయి. ఆ సమయంలో ఒక గుడ్లగూబ చెట్టు మీద వాలింది. మెల్లగా చప్పుడు చేయకుండా కాకి గూళ్ళను సమీపించి కొన్ని కాకుల పీకలు కొరికింది, మరికొన్నిటిని కాళ్ళు చేతులు విరిచింది, కొన్నింటి పొట్టలు చీల్చింది, మరికొన్నింటి రెక్కలు విరిచింది ఆ ప్రకారం ఆ ఉలూకము నిద్రిస్తున్న కాకులను అతి వేగంగా చంపింది. ఇది చూసిన అశ్వత్థామకు తళుక్కున ఒక మెరుపు మెరిసింది. " నిద్రపోతున్న శత్రువులను సంహరించమని ఈ ఉలూకము నాకు ఉపదేశం ఇచ్చింది. నేను కూడా ఈ విధంగా నిద్రిస్తున్న పాండవులను వధిస్తాను. పాండురాజు కొడుకులను, వారి కొడుకులను, బంధుమిత్ర సహితంగా వధిస్తానని సుయోధనుడికి మాటిచ్చాను. నేను ఒక్కడినే ఎటువంటి సైన్య సహకారం లేకుండా అత్యంత పరాక్రమ వంతులైన వారందరిని సంహరించ లేను. అది మంచిది కాదు. ఏమాత్రం సంశయించక పాడవ శిబిరంలో ప్రవేశించి ఆదమరచి నిద్రపోవు పాండవులను వారి పుత్రులను ఈరోజే బంధుమిత్ర సహితంగా తుదముట్టిస్తాను. రారాజు బొందిలో ప్రాణముడగానే పాండవులు ఏడవడం చూసిన రారాజు సంతోషంగా కన్నుమూస్తాడు. ఈ సమయంలో ధర్మాధర్మ విచక్షణ పనికి రాదు. శత్రువును ధర్మాధర్మ విచక్షణ కంటే ఉపాయమే ముఖ్యము అది శాస్త్రములు అంగీకరిస్తున్నాయి. శత్రురాజుల మీద దండెత్తినపుడు, శత్రురాజులు విడిది చేసినపుడు, శత్రురాజులు ఇరుకు దారిలో వెళుతున్న సమయాన, శత్రువులు నిద్రిస్తున్న సమయాన చంపడం తప్పు కాదని శాస్త్రం చెప్తున్నదని పెద్దలు చెప్తారు కదా ! పైగా నేను క్షాత్రధర్మం అనుసరిస్తున్నాను కనుక ఇది నాకు దోషం కాదు. పాడవులు భీష్ముని, కర్ణుడిని, ద్రోణుడిని పడగొట్టినప్పుడు ధర్మాన్ని పాటించారా ! వారు అధర్మం పాటించినపుడు నేను అధర్మంగా నడచుకున్న ఏమి దోషం. కనుక కల్మషహృదయులగు పాండవులను వారి బంధువులను నిద్రిస్తున్న సమయాన చంపడం రణనీతే కాని నిందార్హం కాదు " అంటూ తనలో తాను నిశ్చయించుకున్నాడు.

## అశ్వత్థామ తన నిశ్చయమును కృపాచార్యునకు వినిపించుట

అశ్వత్థామ తననిశ్చయమును చెప్పడానికి కృపాచార్య, కృతవర్మలను లేపి " మిత్రమా కృతవర్మా ! మామా కృపాచార్యా ! రారాజును ఒక్కడిని చేసి ఆ పాడవులు సుయోధనుడిని అధర్మంగా కూల్చాడు. పదకొండు అక్షౌహినుల సైన్యములకు అధిపతి అయిన సుయోధనుడు దీనుడై నేల పడి ఉన్నాడు. ఆ పాపాత్ముడు భీముడు సుయోధనుడిని కాలితో తన్నాడు. మనం ఉండీ సుయోధనుడు దిక్కు లేని వాడు అయ్యాడు. మనమిప్పుడు ఏమి చేయాలో ఆలోచించండి " అన్నాడు.

## కృపాచార్యుడు అశ్వత్థామకు ధర్మాధర్మములు చెప్పట

కృపాచార్యుడు " అశ్వత్థామా ! నీమసులో మాట చెపితే విని మా మాట చెప్తాము. ముందుగా నేను కొన్ని మాటలు చెప్తాను విను. ఏ పనికైనా పురుష ప్రయత్నము, దైవసహాయం కావాలి. ఏ ఒక్కదానితో కార్యము సానుకూలము కాదు. దేవతలు అనుకూలించి వర్షం కురిపించినా రైతు విత్తనదే మొలకెత్తదు కదా ! అలాగే రైతు విత్తినా దైవం అనుకూలించి వర్షం కురిపించకున్న మొలకెత్తి ఫలితాన్ని ఇవ్వదు. కనుక పురుష ప్రయత్నం, దైవసాయం రెండూ చేరి కార్యసానుకూలతను ఇస్తాయి. ధర్మం తప్పక చేసే ఏపనికైనా దైవసాయము ఉంటుంది. కనుక కార్యం సానుకూలమౌతుంది. అధర్మంతో చేయు పనులు ప్రారంభంలో సుఖములు ఇచ్చినా తరవాత పడవేస్తాయి. అదే మన సుయోధనుడి విషయంలో జరిగింది.

సుయోధనుడు లోభం, కోపం, అసూయ, అహంకారంతో ద్రౌపదిని సభకీడ్చి అవమానించాడు. అందుకు తగిన ఫలితం అనుభవిస్తున్నాడు. మనం ధర్మం తప్పక కార్యం నెరవేర్చాలి. ముందుగా మనం ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళి అతడికి గాంధారికి విషయం చెప్పి వారు ఏమి చెప్పిన అది చేస్తాము. వారు చెప్పిన మాట ధర్మబద్ధం ఔతుంది కాని ధర్మవిరుద్ధం కాదు. కాబట్టి ఆలోచించి ఒక నిర్ణయం తీసుకో " అన్నాడు.

### అశ్వత్థామ శపధం

అశ్వత్థామ కృపాచార్యునితో " మామా ! ధర్మం దేశకాల పరిస్తితులను అనుసరించి మారుతూ ఉంటుంది. దరిద్రంలో ధర్మమనిపించింది ధనవంతుడుగా అధర్మం ఔతుంది. కనుక నేను నమ్మిందే ధర్మం. దానిని నేను నా మరణానికి వెరువక ఆచరిస్తాను. నేను బ్రాహ్మణ వంశంలో పుట్టి నా దౌర్భాగ్యం కొద్దీ విల్లు పట్టాను. క్షాత్రం అవలంబించాను. ఇంత కాలం తరువాత మరలా నేను బ్రాహ్మణ్యం వంక మరలడం నాకు చేత కాదు. అస్త్రసన్యాసం చేసిన నా తండ్రిని దారుణంగా చంపినవాడు బ్రతికి ఉండగా నేను ఎలా ప్రాణంతో ఉండగలను. ఈ రోజు నా తండ్రిని చంపిన దుర్మార్గుడిని అతని బంధువులతో సహా ఏ ఉపాయంతోనైనా హతమారుస్తాను. నా శత్రువులు విజయోత్సాహంలో తేలియాడి ఆనందంగా అలసి సొలసి ఆదమరచి నిద్రిస్తున్నారు. వారిని సంహరించడానికి ఇదే తగిన సమయం. పైగా మనం బ్రతికి ఉన్నామని వారికి తెలియదు నేను వచ్చి వధిస్తానని ఊహించి ఉండరు కనుక ఏమరుపాటున ఉన్న వారి మీద విరుచుకు పడి పీకలు కోసి దారుణంగా చంపి వారి శిబిరాలను పీనుగుల పెంట చేసి భూతములకు ఆహారంగా వేస్తాను. నా తండ్రిని చంపిన వాడి శరీర భాగాలు ఆ పీనుగుల పెంటల మధ్య చెల్లాచెదురుగా గజాశ్వకళేబరాలతో పడి ఉండటం నేను కళ్ళార చూడాలి " అన్నాడు అశ్వత్థామ. అంతా శాంతంగా విన్న కృపాచార్యుడు " అశ్వత్థామా ! నీకు అపకారం చేసిన వాడిని హతమార్చాలని అనుకున్నావు. నీవు దానికి ఒక మార్గం అవలంబిస్తున్నావు. దానికి అభ్యంతరం లేదు. మేము కూడా నీతో ఉండి నీకు తోడ్పాటును అందిస్తాము. ఈ రాత్రికి విశ్రమించి రేపు ఉదయం మన ప్రయత్నాలు ప్రారంభిస్తాము. నీవు ద్విగుణీకృత ఉత్సాహంతో శత్రువులను గెలువగలవు. నీవు యుద్ధ భూమిన నిలిచిన నిన్ను గెలువగల వారు ఎవ్వరు. ఇక నాగురించి చెప్పపని లేదు. కృతవర్మ అమిత శౌర్యవంతుడు, అస్త్రకోవిదుడు, బలాఢ్యుడు. ఇక ఆ కవచము విడిచి కొంత విశ్రాంతి తీసుకో. రేపు ఉదయం పాండవులను ఎదుర్కొని వారిని చంపుట లేక వారి చేతిలో మడయుట ఏదో ఒకటి నిశ్చయం " అన్నాడు కృపాచార్యుడు.

## అశ్వత్థామ కృపాచార్యుని ప్రతిపాదన నిరాకరించుట

అశ్వత్థామ కృపాచార్యుడి మాట విని ఇలా ప్రతిస్పందించాడు. " ఈలోకంలో కోపంలో ఉన్న వాడికి, ధనసంపాదనా వ్యామోహికీ, వ్యాధిగ్రస్తుడికి, కామాతురతతో కన్ను మూసుకు పోయిన వాడికి నిద్ర ఎలా పడుతుంది. నా తండ్రి మరణాన్ని తలచుకొని దహించుకు పోతున్న నా హృదయాన్ని శత్రుసంహారంతో ఆర్పి నా స్వామి సుయోధనుడి ఋణం తీర్చుకుంటాను. అంత వరకు నాకు నిద్ర రాదు. పగలు వారికి అర్జునుడు, కృష్ణుడు అండగా ఉంటాడు కనుక ఎదిరించ లేము. కనుక రాత్రి సమయంలోనే శత్రుసంహారం చేస్తాను . దయచేసి నన్ను వారించకండి. ఈ రాత్రి నేను పాండవులు, వారి బంధు మిత్రులు, సైనికులు గాఢనిద్రలో ఉండగా వారి మీద దాడి చేసి దారుణంగా వధిస్తాను. ఆతరువాత ఆ విషయం రారాజుకు చెప్పి సుఖంగా నిద్రిస్తాను " అన్నాడు.

### కృపాచార్యుడు అశ్వత్థామని నివారించడానికి ప్రయత్నించుట

అశ్వత్థామ మాటలను విని కృపాచార్యుడు " అశ్వత్థామా ! కోపంతో ఉన్న వాడికి కార్యాకార్య విచక్షణ తెలియదు. ప్రస్తుతం నీవు ఆ స్థితిలో ఉన్నావు. ధర్మాధర్మములు ఎరుగక ఉన్నావు. కోపం వదిలి నా మాట విని ధర్మమార్గాన నడిచిన నీకు మేలు జరుగుతుంది. నిద్రిస్తున్న వాడిని, ఆయుధములు విడిచిన వాడిని, జుట్టు ముడివీడిపడిన వాడిని వాహనవైకల్యమును పొందిన వాడిని, శరణుజొచ్చిన వాడిని వధించుట ధర్మం కాదు. పాండవులు వారి సమస్తసైన్యము, పాంచాలురు గాఢ నిద్రలో ఉన్నారు. నిద్రించినవాడు చచ్చినవాడితో సమానం. చచ్చినవాడిని మీదపడి చంపి నరకముకు ఏల పోయేవు. మహాస్త్రకోవిదుడవు, మహారధులలో ప్రధముడవు, అలాంటి నీవు ఇలాంటి నీచ కార్యముకు ఒడబడతావా ! కనుక రేపు యుద్ధములో మనం పాండువీరులతో పోరు సల్పుతాము " అన్నాడు.

## అశ్వత్థామ కృతవర్మ కృపాచార్యులను అంగీకరింపచేయుట

అశ్వత్థామ " మామా ! కృపాచార్యా ! నీవు పెద్ద వాడవు నన్ను శాసించ తగిన వాడవు. నీవు చెప్పింది సత్యము కాని నేను

చెప్పేది వినండి. రాజులంతా చూస్తుండగా అస్త్ర సన్యాసము చేసిన నా తండ్రిని పంచాల రాకుమారుడు ధృష్టద్యుమ్నుడు అది పాతకము అని తలపక నా తండ్రి జుట్టు పట్టుకుని తల నరికాడు. శిఖండిని అడ్డు పెట్టుకుని అర్జునుడు భీష్ముని పడగొట్టాడు. భూమిలో దిగిన రధచక్రాన్ని ఎత్తుతున్న కర్ణుడి మీద అర్జునుడు బాణప్రయోగం చేసి చంపాడు. అర్జునుడు భూరిశ్రవసుడిని భుజములు నరికినందుకు అతడు ప్రాయోపవేశం చేసాడు. ప్రాయోపవేశం చేసిన భూరిశ్రవసుడిని సాత్యకి దారుణంగా చంపాడు. ఇదంతా ఎందుకు ఎక్కడో మడుగులో దాగిన సుయోధనుడిని బయటకు రప్పించి భీముని చేత అధర్మయుద్ధమున కూలత్రోయించారు. ఇన్ని విధముల యుద్ధధర్మాన్ని మీరి యుద్ధధర్మమనే వంతెనను కూల్చిన వారిని వదిలి నన్ను ధర్మంగా నడవమని చెప్పుట న్యాయమా ! " అన్నాడు. మామా ! తొడలు విరిగి నేలమీద ఉన్న సుయోధనుడు దీనంగా పలికిన పలుకులు విని కూడా నీకు ఆగ్రహం కలుగ లేదా ! అందుకనే నేను చేసేది అధర్మమైనా అధర్మమార్గాన నా తడ్రిని చంపిన ధృష్టద్యుమ్నిడిని నేను చంపక వదలను. నన్ను మీరు ఆపలేరు. ఇందు వలన నేను కీటకంగా జన్మించినా బాధపడను " అని అంటూనే రథం ఎక్కాడు అశ్వత్థామ. " అశ్వత్థామా ! నువ్వూ నేను కృతవర్మ ఒకే పని మీద వచ్చాము. అటువంటి సమయాన నీవు ఒంటరిగా వెళ్ళడం భావ్యం కాదు. నేనూ నీతో వస్తాను " అన్నాడు కృపాచార్యుడు. అశ్వత్థామ " మామా ! చాలా సంతోషం నా తండ్రిని చంపిన వాడిని చంపడానికి వెళుతున్న నాకు మీరు తోడుగా వస్తున్నందుకు ఆనందంగా ఉంది రండి " అన్నాడు.

## అశ్వత్థామకు భూతం ఎదురు వచ్చుట

రధికత్రయం పాండవశిబిరాల వైపు వేగంగా కదినారు. అశ్వత్థామ అతి వేగంగా తన రధమును నడుపసాగాడు. కృతవర్మ, కృపాచార్యులు కొంచం వెనుక పడ్డారు. అప్పుడు ఒక భూతం అశ్వత్థామ ఎదుట నిలిచింది. అశ్వత్థామ ఆ భూతానికి బెదరక దాని మీద అస్త్రప్రయోగం చేసాడు. వాటిని అన్నింటిని ఆ భూతం నోరు తెరచి మింగింది. అశ్వత్థామ వద్ద ఉన్న అస్త్రములు అన్నీ అయిపోయాయి. అశ్వత్థామకు ఏమీ చేయాలో తోచక కత్తి తీసుకుని ఆ భూతమును ఎదుర్కొన్నాడు. ఆ కత్తి ఆభూతమును తాకగానే మాడిపోయింది. అశ్వత్థామ తన వద్ద ఉన్న తోమరములు, చక్రాయుధములను ఆ భూతము మీదకు విసిరాడు. అవన్నీ ఆభూతమునకు తాకగానే తునాతునకలు అయ్యాయి. అశ్వత్థామ తన గధను ఆ భూతము మీదకు విసిరాడు. ఆ భూతం ఆ గధను మింగింది. వెనకకు తిరిగి చూసాడు కృతవర్మ, కృపాచార్యుడు కను చూపు మేరలో లేరు. కృపాచార్యుడి మాట వినక ముందుకు దూకినందుకు తనకు తగిన శాస్తి జరిగింది అని చింతించాడు. గోవులను, బ్రాహ్మణులను, బాలురను, వృద్ధులను, అంధులను, మిత్రులను, సఖులను, తోబుట్టువులను, జడులను, ఏమరుపాటున ఉన్న వారిని, నిద్రిస్తున్న వారిని, ఆడువారిని అస్త్రశస్త్రములతో కొట్టడం మహా పాపం. అది ధర్మవిహితం కాదని పెద్దలు చెప్తారు. అట్టి ధర్మమార్గం విడిచి అసుర మార్గం అవలంబించిన వారికి కార్యసిద్ధి కలుగదు. బ్రాహ్మణుడిగా పుట్టి ఇట్టి అపనిందలకు గురి కాగల కార్యమూ నేను చేయవచ్చునా ! అందుకేనేమో నాకు ఈ భూతం దాపురించింది. నాకిక ఎవరు దిక్కు " అని చింతించాడు.

## అశ్వత్థామ ఈశ్వరుడిని ధ్యానించుట



చివరకు అశ్వత్థామ ఈ సమయంలో నాకు ఆ పరమేశ్వరుడే దిక్కు. అని అచంచలమైన మనసుతో అశ్వత్థామ పరమేశ్వరుడిని ద్యానించాడు. ఈశ్వరా ! నేను ఈ గండం గడచి గట్టెక్కిన నిన్ను నానా భూతోపహారములతో కొత్తవిధంగా అర్చిస్తాను. నీకు ప్రీతి కలిగిస్తాను " అని అనేక స్తోత్రములతో శివుని ప్రార్ధించాడు. అప్పుడు అశ్వత్థామ ముందు ఒక బంగారు వేదిక కనపడింది దాని మీద అగ్నిగుండం మండుతూ ఉంది. ఆ అగ్ని నుండి అనేక ఆకృతులతో ప్రధమగణాలు బయటకు వచ్చాయి. వాటికి అశ్వత్థామ భయపడ లేదు. అతడి మనసు ఈశ్వరుడి మీద లగ్నమై ఉంది. ఎంతకీ ఈశ్వరుడు ప్రత్యక్షం కాలేదు. తన విల్లంబులతో ఆ అగ్ని గుండంలో దూకబోయాడు అశ్వత్థామ కాని తనను దహించుటకు సరిపోయిన అగ్ని ప్రజ్వరిల్ల లేదు. అశ్వత్థామ తన విల్లు, అమ్ములు, అస్త్రములు, శస్త్రములు, బాణములు, అనేక విధములైన ఆయుధములు వేసి అగ్నిని చక్కగా ప్రజ్వలింప చేసాడు. అశ్వత్థామ పరమేశ్వరా ! నాకు ఏమిచేయాలో తోచడం లేదు. నా శత్రువులను చంపే బలం, శక్తి ప్రసాదించు లేని ఏడల నేను ఆత్మబలిదానం చేసుకుంటాను అని హర హర మహాదేవ " అంటూ మంటలలో దూకబోయాడు. అప్పుడు అశ్వత్థామకు ఈశ్వరుడు ప్రత్యక్షమై " అశ్వత్థామా ! ఆగు నీ భక్తికి అకుంఠిత దీక్షకు

పాండవ శిబిరముపై దాడి చేయకముందు శివుని ప్రార్థిస్తున్న అశ్వత్థామ

ఆనందించాను నీవు కోరినవరం ఇచ్చాను. కాని ఒక్క మాట నేనూ విష్ణాంశ సంభూతుడైన శ్రీకృష్ణుడూ ఒక్కటే . కృష్ణుడు నన్ను పూజిస్తాడు, కృష్ణుడంటే నాకు ఇష్టం, ఆ కృష్ణుడి మీద గౌరవంతో నేను నిన్ను పాడవ శిబిరముల వైపు పోకుండా ఆపాను. నీ మనసులో మాట తెలుసుకోవాలని నేను ఇన్ని ఆటంకాలు కల్పించాను. ఇంతెందుకు ఆ పాంచాలురకు పోగాలము దాపురించింది. ఈ రోజు వారు నీ చేతిలో చస్తారు, ఇదిగో ఈ ఖడ్గంతో వారిని సంహరించు " అని ఈశ్వరుడు ఒక మహనీయమైన ఖడ్గం అశ్వత్థామకు ఇచ్చి తాను కూడా అశ్వత్థామకు తెలియకుండా అతడిలో ప్రవేశించాడు. అశ్వత్థామలో నూతనోత్సాహం, ధైర్యం, తెగింపు ఉద్భవించాయి. తన రథం దగ్గరకు వెళ్ళగానే తాను అగ్నిలో వేసి దహించిన ఆయుధములు, అస్త్రములు, శస్త్రములు యదాతథంగా రథములో ఉన్నాయి. అశ్వత్థామ రథం మీదకు ఎక్కాడు. ఇంతలో కృపాచార్యుడు, కృతవర్మ వచ్చి చేరారు.

## అశ్వత్థామ ధృష్టద్యుమ్నుడిని వధించుట

రథిక త్రయం పాండవ శిబిరాల వైపు బయలుదేరారు. అశ్వత్థామలో ఆవహించి ఉన్న ఈశ్వరుడిని ప్రమదగణాలు అదృశ్యరూపంలో వెంబడించ సాగాయి. కృపాచార్యుడు, కృతవర్మలను ముఖద్వారమున ఉంచి తాను మాత్రం పాడవశిబిరాలలో ప్రవేశించాడు. ముందుగా దుష్టద్యుమ్నుడి శిబిరంలో ప్రవేశించి మనసులో ఈశ్వరుడిని తలచుకొని, ఈశ్వర దత్తమైన కత్తి చేతబూని కసిగా ధృష్టద్యుమ్నుడిని చూసి ఇన్ని రోజులకు తన తండ్రిని చంపిన వాడిని చంపుతున్నానని సంతోషపడి ధృష్టద్యుమ్నుడిని తన్ని నిద్రలేపాడు. నేల మీదికిలాగి అతడి గుండెల మీద మోకాలు పెట్టి అదిమి అతడిని పిడికిళ్ళతో గుద్దాడు. అశ్వత్థామ చేస్తున్న అనుకోని ఈ హటాత్పరిణామానికి ధృష్టద్యుమ్నుడు నోట మాటలేక పడిపోయాడు. అశ్వత్థామ వింటి నారిని విప్పి ధృష్టద్యుమ్నుడి కంటానికి బిగించి పశువును చంపినట్లు చంపుతున్నాడు. చివరకు నోట పెగల్చుకుని " అశ్వత్థామా ! నన్ను నీ అస్త్రములు శస్త్రములు ప్రయోగించి చంపి నాకు ఉత్తమగతులు కల్పించు ఇలా నీచంగా చంపకు " అని ప్రార్థించాడు. అశ్వత్థామ " వీలు లేదు నా తండ్రిని చంపిన వ్యక్తికి ఉత్తమగతులు కలుగకూడదు. నిన్ను ఇలాగే దారుణంగా చంపుతాను " అని పిడికిలితో గుద్దసాగాడు. అప్పటికే అక్కడ ఉన్న వారు మేల్కొన్నా ! అశ్వత్థామ భీకరాకృతి చూసి రాక్షసుడని ఎవరూ ముందుకు రాలేదు. అశ్వత్థామ తన కాళ్ళతో పిడికిలితో తన్నితన్ని మోదిమోది ధృష్టద్యుమ్నుడిని అతి క్రూరంగా చంపి వింటినారిని తీసి వింటికి కట్టాడు. ధృష్టద్యుమ్నుడి శిబిరం విడిచి వేరొక శిబిరానికి వెళ్ళాడు.

### అశ్వత్థామ పాంచాల వీరులను సంహరించుట

అప్పటి వరకు కళ్ళప్పగించి చూస్తున్నకాపలాదారులు పెద్దగా ఎలుగెత్తి కేకలు వేసారు. అది విని చుట్టుపక్కల శిబిరాలలో ఉన్న సైనికులు, రాజులు నిద్రలేచారు. ఏమి జరిగిందో అని అందరూ ఆందోళనకు గురి అయ్యారు. ఎవరో భయంకరాకారుడు వచ్చి ధృష్టద్యుమ్నుడిని చంపాడని కాపలాదారులు చెప్పారు. " వాడిని పోనీయకండి పట్టుకోండి పొడవండి " అన్న కేకలు మిన్నంటాయి. అందరూ అటువైపు పరుగెత్తారు. అందరూ కలసి అశ్వత్థామను పట్టుకున్నారు. అయినా అశ్వత్థామలో ప్రవేశించిన రుద్రుడి శక్తితో అశ్వత్థామ వారిని ఒక్క క్షణంలో చంపాడు. తరువాత ఉత్తమౌజుడి శిబిరంలో ప్రవేశించి అతడి జుట్టుపట్టుకుని ఈడ్చి నేల మీద పడవేసి కత్తితో అతడి తల నరికాడు. అది చూసిన యుధామన్యుడు అశ్వత్థామను ఎదుర్కొన్నాడు. అదే కత్తితో అశ్వత్థామ యుధామన్యుడి తల తెగనరికాడు. అశ్వత్థామను అడ్డుకునే వారు లేక పోయారు. పాంచాల వీరులను వరుసబెట్టి నరుకుతున్నాడు అశ్వత్థామ. శరీరమంతా రక్తంతో తడిచి అత్యంత భీకరంగా కనిపిస్తున్న అశ్వత్థామను చూడగానే అనేకులు ప్రాణాలు విడిచారు. ద్రుపదకుమారుల శిబిరాలలో ప్రవేశించి వారి ప్రాణాలను యమపురికి పంపాడు అశ్వత్థామ. అశ్వశాలలో, గజశాలలో ప్రవేశించి ఏనుగులనూ గుర్రములనూ తెగనరికాడు. మనిషాపశువా అనే తేడా లేకుండా అడ్డువచ్చిన వారిని అడ్డంగా నరుకుతూ మృత్యుదేవతను తలపింప చేస్తున్నాడు అశ్వత్థామ ఒక్కొక్క శిబిరంలో ప్రవేశించడం అందులో నిద్రిస్తున్న వారిని నరకడం మరియొక శిబిరంలో ప్రవేశించడం ఆ విధంగా మారణకాండ సాగిస్తున్నాడు. అశ్వత్థామను చూసి అంతా " ఎవరో రాక్షసుడు వచ్చి నరుకుతున్నాడు " అని భీతి చెందుతున్నాడు.

### అశ్వత్థామ ఉపపాడవులను సంహరించుట

ఈ కలకలం విని శిఖండి ఉపపాండవులు ఒక వ్యూహంగా నిలిచి అశ్వత్థామను ఎదుర్కొన్నారు. అశ్వత్థామలో ప్రవేశించిన రుద్రుడు విజృంభించి వారందరిని పరమేశ్వర ప్రసాదిత ఖడ్గంతో తృటిలో నరికి వేసాడు. అడ్డం వచ్చిన ప్రతివింధ్యుడిని రెండు ముక్కలు చేసాడు. ఇంతలో భీమసేనుడి కుమారుడైన శ్రుతసోముడు భయంకరంగా అరుస్తూ అశ్వత్థామను ఎదుర్కొన్నాడు. అశ్వత్థామ శ్రుతసోముని ఖడ్గమును ఖండించి అతడిని ముక్కలు ముక్కలుగా నరికాడు. అంతలో నకులుడి కుమారుడైన


ప్రతివింద్యుని చంపిన అశ్వత్థామ

శతానీకుడు అశ్వత్థామను ఎదుర్కొని చక్రాయుధమును ప్రయోగించి అశ్వత్థామను గాయపరిచాడు. అశ్వత్థామ శతానీకుడిని క్రింద పడవేసి అతడి శిరస్సు ఖండించాడు. ఇది చూసిన సహదేవుడి కుమారుడు శ్రుతసేనుడు అశ్వత్థామను ఎదుర్కొని తనగధతో అశ్వత్థామను కొట్టాడు. అశ్వత్థామ తన చేతితో శ్రుతసేనుడి ముఖం మీద చరిచాడు. శ్రుతసేనుడు ముఖం పగిలి చనిపోయాడు. తన సోదరుల మరణం చూసిన అర్జునుడి కుమారుడు శ్రుతకీర్తి అశ్వత్థామను ఎదుర్కొని అతని కత్తికి బలి అయ్యాడు. ఈ విధంగా ద్రౌపదీ పుత్రులంతా అశ్వత్థామ చేతిలో మరణించారు.

### అశ్వత్థామ శిఖండిని చంపుట

శిఖండి వెంట ఉన్న ప్రభద్రకులు అశ్వత్థామను ఎదుర్కొని కొంచెం సమయం యుద్ధం సాగించినా అతడి మానవాతీత శక్తి కారణంగా అతడి చేతిలో నిలువ లేక పోయారు. తరువాత అశ్వత్థామ శిఖండిని రెండు ముక్కలుగా నరికి మిగిలిన వారిని కూడా తెగనరికాడు. ఈశ్వరదత్త ఖడ్గం అడ్డులేకుండా నరికి వేస్తుంది. ఒక్క వేటు వృధా కావడం లేదు. వేటుకు ఒక తల తెగిపడుతుంది. పాంచాలురు, వారి సేనలు, మిగిలిన పాండవ సేనలు, ప్రభద్రకులు, ద్రౌపదీ కుమారులు, ఏనుగులూ , హయములు నిశ్శేషంగా మరణించారు. కాని అశ్వత్థామకు పాండవులు కాని కృష్ణుడు కాని సాత్యకి కాని కనిపించ లేదు. అయినా కొంత మంది పాంచాలసేనలు, పాండవసేనలూ తప్పించుకుని పారిపోతున్నారు. అశ్వత్థామ వారిని కూడా తన శరములతో తరిమి తరిమి చంపుతున్నాడు. అశ్వత్థామ చేతి నుండి తప్పించుకు పారిపోతున్న వారు కొంతమంది ఏనుగులు హయముల కాళ్ళ కింద పడి చనిపోతున్నారు. ఏమి జరుగుతుందో తెలియక అయోమయంలో ఒకరిని ఒకరు చంపుకుంటున్నారు. అర్ధరాత్రి వరకు పాండవ, పాంచాల శిబిరాలలో ఏమి జరుగుతుందో తెలవనంతగా అల్ల కల్లోలితమైంది. తప్పించుకున్న రాజులు సైనికులు ముఖద్వారం వద్దకు రాగా అక్కడ ఉన్న కృపాచార్యుడు, కృతవర్మ వారుని నిర్ధాక్షిణ్యంగా చంపారు.

### రధికత్రయం తృప్తి చెందుట

ఇంతలో తెల తెల వారుతుంది ఆ సౌప్తికవేళలో దారుణ మారణకాండను ముగించుకున్న అశ్వత్థామ కృతవర్మ కృపాచార్యులను కలసి " మామా ! సకల పాంచాలురు చచ్చారు. పాంచాలి కుమారులంతా యమసదనానికి వెళ్ళారు. మత్స్య, ప్రభద్రక సైన్యములు ఒక్కరూ మిగల లేదు. హయములు, ఏనుగులూ చచ్చాయి కాని పాండవులు, కృష్ణుడు, సాత్యకి మాత్రం చావలేదు. వారు ఎక్కడ ఉన్నారో తెలియ లేదు " అన్నాడు అశ్వత్థామ. కృతవర్మ, కృపాచార్యుడు అశ్వత్థామ బలపరాక్రమాలను పొగిడారు. అశ్వత్థామ మామా ! పాండవులను తప్ప మిగిలిన వాళ్ళనంతా చంపాను ఫలితం ఏముంది చెప్పు. అపాండవం చేస్తే రారాజు మనసుకు శాంతి కాని తక్కిన వారిని ఎంత మందిని చంపితే ఏమి ఫలము చెప్పు " అన్నాడు. కృపాచార్యుడు " అదేమిటి అశ్వత్థామా ! ఒకే రాత్రిలో ధృష్టద్యుమ్నుడు మొదలైన పాంచాలురను, ద్రౌపదీ సుతులను వారి వారి సైన్యములను ఒక్కరిని వదలకుండా చంపావు. అది సామాన్యమైన విషయమా చెప్పు " అని కీర్తించారు. " మామా ! కృతవర్మా ! మనమిప్పుడు రారాజు వద్దకు వెళ్ళి జరిగినదంతా అతడికి చెప్పి అతడి మనస్సుకు శాంతి చేకూరుస్తాము " అన్నాడు. రధికత్రయం ముగ్గురూ సుయోధనుడి వద్దకు వెళ్ళారు.

## సుయోధనుడికి వార్త ఎరిగించుట

ఆ సమయంలో సుయోధనుడు రక్తంతో తడిసిన నేలపైపడి దొర్లుతున్నాడు. ఊపిరి అందడం లేదు. ప్రాణాలు శరీరం వదిలిపోవడం లేదు . చాలా అవస్థ పడుతున్నాడు. మరణయాతన పడుతున్నాడు. కాళ్ళు చేతులు స్వాధీనం తప్పుతున్నాయి. ఆ సమయంలో రధికత్రయం అక్కడకు వచ్చారు. " రారాజా ! ధరణీతలంబు అంతయూ ఏకఛత్రంగా పాలించిన నీవు ఇప్పుడిలా కటిక నేల మీద పడి దొర్లుతున్నావా ! ఏమి విధి వైపరీత్యం, నీ ధైర్యం, ధీరత్వం , గధాయుద్ధ సాధనా ఎందుకూ కొరగాకుండా పోయాయా రారాజా ! సుయోధనా. అయినా నీవు ఇప్పుడు పవిత్రమైన శమంతక పంచకంకంలో ప్రాణాలు విడుస్తున్నావు. నీకు ఉత్తమ లోకాలు ప్రాప్తిస్తాయి. బలరాముడి శిష్యులలో అగ్రగణ్యుడవు, అటువంటి నిన్ను అక్రమంగా చంపిన భీముడు ఏమి బాగుపడుతాడు. వాడికీర్తి అంతా నాశనం అయిపోదా ! సుయోధనా ! నాకు

కూడాగుడ్డా ఇచ్చి ఆదరించావు. యజ్ఞ యాగాదులకు కావలసిన ధనం సమకూర్చావు. కాని ఇప్పుడు నాకు కొండంత అండగా ఉన్న నీవు చనిపోతూ ఉంటే నేను బ్రతికి ఉన్నాను. సుయోధనా ! నీకు నేనేమి సేవచెయ్యగలను. నీవు న్యాయంగా యుద్ధం చేసి వీరమరణం పొందుతున్నావు. నీ శత్రువులను హతమార్చి నీ ఆఖరి కోర్కె తీర్చే అదృష్టం మాకు దక్కింది.

#### అశ్వత్థామ తన తండ్రికి సందేశం పంపుట

రారాజా ! నీవు పుణ్యలోకముకు పోయినప్పుడు నా తండ్రిని చూసి ఆయనతో నా మాటగా చెప్పు " ద్రోణాచార్యా ! నిన్ను అన్యాయంగా అక్రమంగా చంపిన ఆ నీచుడు ధృష్టద్యుమ్నుడిని నీ కుమారుడు అశ్వత్థామ పశువును చంపినట్లు అతి దారుణంగా చంపాడు అని చెప్పు . నా తండ్రిని నాకు మారుగా నీవు కౌగలించుకో సుయోధనా ! ఇప్పటికే వీరస్వర్గం అలంకరించిన సోమదత్త బాహ్లికులను భూరిశ్రవసుడిని, సైంధవుని నేను అడిగినట్లు చెప్పు. అయ్యో సుయోధనా ! నిన్ను ఈ స్థితిలో చూసి వచ్చిన విషయం మరిచాను. నీ చెవులకు అమృతోపమయంగా రాత్రి జరిగినది చెప్తాను విను. నేను నిన్న సౌప్తికవేళలో పాండవశిబిరాలలో ప్రవేశించాను. ముందుగా ధృష్టద్యుమ్నుడిని పశువును చంపినట్లు చంపి తరువాత అతడి బంధువులను అందరిని కసితీరా చంపాను , ద్రౌపదీ పుత్రులను పేరుపేరునా వరుసగా చంపాను పాండవ సైన్యాలను ఊచకోత కోసాను. గజములను, హయములను చంపాను. వారి శిబిరాలను పీనుగుల పెంట చేసాను . కాని సుయోధనా ! పాండవులు, కృష్ణుడు, సాత్యకి నా పాలపడ లేదు. నేను వస్తానని ముందుగా ఊహించి కృష్ణుడు వారిని అక్కడ నుండి తప్పించినట్లు ఉన్నాడు. పోనీలే అందరూ చచ్చిన తరువాత వారు ఉండి ఏమి ప్రయోజనములే ! సుయోధనా ! నా మామ కృపాచార్యుడు, కృతవర్మ తోడు లేకున్న ఈ కార్యం సిద్ధించేది కాదు " అన్నాడు.

#### సుయోధనుడు కృతజ్ఞతలు చెప్పుట

ఆ మాటలు విన్న సుయోధనుడికి నోట మాట రాకున్నా ! ఎలాగో నోరు పెగల్చుకొని " అశ్వత్థామా ! భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు చేసిన దానికంటే ఈ రోజు మీరు ముగ్గురూ చేసిన వీరోచిత కార్యం గొప్పది. ఇది చాలా కష్ట సాధ్యమైన కార్యం. భీష్ముడు, కర్ణుడు గొప్పవాళ్ళని పొగుడుతాము కాని ఈ అవసాన దశలో మీరు చేసిన కార్యము మరువరానిది. మీరు సుఖంగా ఉండండి అందరమూ తిరిగి స్వర్గలోకంలో కలుసుకుంటాము " పలికి సుయోధనుడు ప్రాణములు విడుచాడు. సుయోధనుడి శరీరం అనంత వాయువుల్లో కలిసాయి అతడి పార్ధివ శరీరం నేల మీద పడి ఉంది. అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ సుయోధనుడి శరీరానికి ముమ్మారు ప్రదక్షిణం చేసి అక్కడి నుండి తమతమ రధములు ఎక్కి వెళ్ళారు. మరునాడు సూర్యోదయం అయ్యింది. ఇవన్నీ చెప్పడానికి నేను ఇక్కడకు వచ్చాను " అని సంజయుడు ధృతరాష్ట్రుడికి చెప్పాడని **వైశంపాయనుడు** జనమేజయునకు చెప్పాడు.

## ఇవి కూడా చూడండి

## మూలాలు

## వనరులు

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

## పర్వాలు

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

## పాత్రలు

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | దృపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

## ఇతర విషయాలు

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

"http://te.wikipedia.org/w/index.php?title=సౌప్తిక_పర్వము_ప్రథమాశ్వాసము&oldid=760954" నుండి వెలికితీశారు

వర్గం: మహాభారతం

---

- ఈ పేజీకి 08:08, 25 సెప్టెంబర్ 2012న చివరి మార్పు జరిగినది.
- 

# సౌప్తిక పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# ద్వితీయాశ్వాసము

## పాండవశిబిరంలో జరిగిన మారణ కాండను ధర్మరాజుకు ఎరిగించుట

నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంగా సూతుడు శౌనకాది మహామునులకు వైశంపాయనుడు జనమేజయునకు చెప్పిన భారతకధను సవిస్తరంగా చెప్పసాగాడు. మరునాడు తెల్లవారగానే ధర్మరాజు తన సోదరులు భీమార్జున నకులసహదేవులు, కృష్ణుడు, సాత్యకి పరివేష్టించి ఉండగా ధృష్టద్యుమ్నుని రధసారధి పరుగెత్తుకుని వచ్చి సాష్టాంగ దండప్రమాణం ఆచరించి చేతులు కట్టుకుని " ధర్మరాజా ! నిన్న అర్ధరాత్రి మన శిబిరాలలో అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మ ప్రవేశించారు. కృతవర్మ, కృపాచార్యుడు ముఖద్వారమున ఉండగా అశ్వత్థామ మాత్రం ధృష్టద్యుమ్నుడిని అతి దారుణంగా చంపాడు. ఆ తరువాత అతడి సోదరులను, కుమారులను పాంచాలరాకుమారులను, అర్ధరాత్రివేళ అతి క్రూరంగా చంపాడు. తరువాత ప్రభద్రక, మత్స్య, చేది సైన్యములను నిశ్శేషంగా చంపాడు. ఆ తురువాత అతడిని ఎదుర్కొన్న శిఖండి, ఉపపాండవులను ఒక్క తృటిలో వధించాడు. అసురుడి వలె చెలరేగిన అశ్వత్థామ ఎదుట మన సైన్యములు గజములు, హయములు ఆగలేక పోయాయి. అశ్వత్థామ దయాదాక్షిణ్య రహితంగా అందరిని చంపాడు. అతడి చేతిలో తప్పించుకుని వెళ్ళిన వారిని కృపాచార్య, కృతవర్మలు చిత్రవధ చేసారు. ముగ్గురూ అతి క్రూరంగా మన శిబిరాలను పీనుగుల పెంటగా చేసారు. నేను కృతవర్మ చేతికి చిక్కాను. నేను అతడి కాళ్ళు పట్టి వేడగా నన్ను కనికరించి వదిలాడు. ఈ విషయం మీకు విన్నవించడానికి నేను మీ వద్దకు వచ్చాను " అన్నాడు.

### ధర్మరాజు విలపించుట

ఈ విషయం విని ధర్మరాజు మూర్చ పోయాడు. అందరూ అతడికి శైత్యోపచారాలు చేసారు. మూర్చ నుండి తేరుకుని కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ " యుద్ధంలో మరణించడం సహజమే ! కాని నేను విజయంసాధించి విజయోత్సాహంలో ఉన్న తరుణంలో ఈ దారుణం ఏమిటి ? సముద్రం దాటి పిల్ల కాలువలో పడి మరణించి నట్లయింది నా పరిస్థితి. అసలే తండ్రిని పోగొట్టుకున్న ద్రౌపది, తన కుమారుల మరణం, సోదరుల మరణం తట్టుకుని జీవించ కలదా. ద్రౌపదికి ఈ విషయం ఎరుక చెయ్యండి.

### ద్రౌపదికి సందేశం పంపుట

ఆ సమయంలో ద్రౌపది సుభద్రతో సహా విరాటనగరంలో ఉంది. ముందు ద్రౌపది తన తండ్రి మరణానికి చింతిస్తున్న తన తల్లిని ఓదార్చుటకు పాంచాల నగరానికి వెళ్ళింది. తరువాత సుభద్రా సహితంగా విరాటరాజు, ఉత్తరుల మరణానికి కుమిలి పోతున్న సుధేష్ణను ఓదార్చడానికి విరాట నగరం వెళ్ళింది. అక్కడి నుండి ద్వారకకు వెళ్ళాలని విరాటనగరంలోనే ఉంది. ద్రౌపది విరాటనగరం నుండి ఉపప్లావ్యం వచ్చింది. ధర్మరాజు " నకులుడిని చూసి నీవు తక్షణం ఉపప్లావ్యం వెళ్ళి ద్రౌపదిని మిగిలిన స్త్రీలను నీ వెంట తీసుకురా " అని ఆజ్ఞాపించాడు. అన్నగారి ఆజ్ఞ నకులుడు అనుసరించి ఉపప్లావ్యం వెళ్ళాడు. ధర్మరాజు అమిత దుఃఖంతో రోదిస్తూ కృష్ణ, సాత్యకులు వెంట రాగా పాండవశిబిరాలకు వెళ్ళాడు. అక్కడ చెల్లాచెదురుగా పడి ఉన్న తన కుమారుల బంధువుల శవాలను చూసి కన్నీరు మున్నీరుగా విలపించాడు. కృష్ణార్జునులు ఎంత ఓదార్చినా అతడి దుఃఖం ఆగ లేదు. కొంతసేపటికి తేరుకుని తన కొడుకులకూ, బంధు మిత్రులకూ దహనకార్యములు నెరవేర్చాడు. ద్రౌపది కొరకు నిరీక్షిస్తూ ఒక ప్రదేశంలో కూర్చున్నాడు.

### ద్రౌపది విలపించుట

ధర్మరాజు ఆదేశము మేరకు నకులుడు ఉపప్లావ్యం వెళ్ళి ద్రౌపదికి ఈ విషయం చెప్పాడు. తన సోదరుల, కుమారుల మరణానికి ద్రౌపది కుప్పకూలి పోయింది. వెంటనే నకులుడి రధం ఎక్కి పాండవ శిబిరాలకు వచ్చింది. రధం దిగింది కాని నడవ లేక పోయింది. దుఃఖభారంతో ఆగలేక నేల మీద కూర్చుండి పోయింది. భీముడు దగ్గరగా వచ్చి ద్రౌపదిని పట్టుకుని ధర్మరాజు వద్దకు తీసుకు వచ్చాడు. మహారాజా ధర్మనందనా ! ఏమిటీ విధి వైపరీత్యం. రాజ్యలక్ష్మిని కైవశం చేసుకున్న మీకు కుమారుల ముద్దు ముచ్చట చూసుకునే అదృష్టం లేదా ! నాడు అభిమన్యుడు, నేడు కుమారులు ఈ గర్భశోకానికి అంతం లేదా ! " అంటూ బిగ్గరగా ఏడ్చింది. ఇంతలో అశ్వత్థామ తన కుమారులను అర్ధరాత్రి సమయాన గాఢ నిద్రలో ఉండగా

చంపాడని గుర్తుకు వచ్చి కోపంతో ఊగి పోయింది. " మహారాజా ! నా కుమారులు గాఢ నిద్రలో ఉన్న సమయాన గురుపుత్రుడు అశ్వత్థామ అత్యంత క్రూరంగా చంపాడు. అది నా మనస్సులో ఆరనిచిచ్చును రేపింది. అశ్వత్థామను చంపుటకంటే వేరు మార్గం లేదు. మహారాజా ! ధర్మనందనా ! ఇప్పడే నేను భీముడిని పంపి క్రూరాత్ముడైన అశ్వత్థామను చంపిస్తాను. లేని ఎడల ప్రాయోపవేశం చేసి నా ప్రాణత్యాగం చేయడం కంటే వేరు మార్గం లేదు " అని ఘోరమైన ప్రతిజ్ఞ చేసింది. వెంటనే ధర్మరాజు ఆమెను ఓదార్చాడు. " ద్రౌపదీ ! క్షత్రియులు యుద్ధంలో మరణించడం సహజమే కదా ! అలాగే నీ సోదరులూ కుమారులూ మరణించి వీరస్వర్గం అలంకరించాడు. అందుకు నీవు ఇంతటి కఠోరనిర్ణయం తీసుకొన వచ్చునా ! మనశ్వినీ ! శాంతించు, నీ శోకం తగ్గించుకో . నీ కోపం, శోకం అశ్వత్థామను చంపితే కాని పోదని నాకు తెలుసు. కాని అశ్వత్థామ అడవుల పాలై ఉంటాడు. అతడిని చంపినా మనకు ఎలా తెలుస్తుంది " అన్నాడు లౌక్యంగా.

### అశ్వత్థామను చంపమని ద్రౌపది భీమసేనుని పంపుట

ధర్మరాజు మాటలు విన్న ద్రౌపది " అశ్వత్థామకు సహజ శిరోభూషణమైన రత్నమును తీసుకు వచ్చి చూపిన నేను విశ్వసించి బ్రతుకగలను " అన్నది. పక్కనే ఉన్న భీమసేనుడిని చూసి " భీమసేనా ! నీవు క్షత్రియ ధర్మమును గుర్తు తెచ్చుకుని వెంటనే ఆ పాపాత్ముడు అశ్వత్థామను పట్టిచంపి నా మనసుకు శాంతి చేకూర్చు. నాడు లక్క ఇంట్లో మిమ్ము పెట్టినపుడు ఉన్న పౌరుషం, హిండింబాసురుడిని చంపినప్పడు ఉన్న శౌర్యమూ, యక్షులతో యుద్ధం చేసినప్పడు ఉన్న ధైర్యము, కీచకుడిని వధించినప్పడు ఉన్న పరాక్రమము గుర్తు తెచ్చుకో జనులందరూ నిన్ను పొగిడేలా ఆ హంతకుని హతమార్చు " అన్నది క్రోధంతో. ఆమాటలకు భీముడు పౌరుషంతో బుసలు కొడుతూ వెంటనే తనరధం తీసుకుని బయలుదేరాడు. నకులుడు భీమునికి సారధిగా రథం తోలుతున్నాడు. ఇద్దరూ కురుక్షేత్రం వైపు వెళ్ళారు. అక్కడ ఉన్న వారిని అశ్వత్థామ కృపాచార్యుడు, కృతవర్మలతో కలిసి హస్తినాపురం వెళ్ళాడని కాని మరలా తిరిగి వచ్చి గంగానది వైపు వెళ్ళారని, దారి మధ్యలో కృపాచార్యుడు, కృతవర్మ అశ్వత్థామను విడిచి ఎటో వెళ్ళారని అశ్వత్థామ మాత్రం వ్యాసాశ్రమం వెళ్ళాడని చెప్పారు. వెంటనే భీముడు వ్యాసాశ్రమానికి బయలుదేరాడు.

## కృష్ణుడు భీముని కాపాడమని ధర్మజునికి చెప్పుట

భీముడు వెళ్ళిన తరువాత కృష్ణుడు ధర్మరాజుతో ఇలా పలికాడు " ధర్మనందనా ! భీముడు ఒక్కడే అశ్వత్థామ ను ఎదుర్కోవడానికి వెళ్ళాడు. భీముడు ఒక్కడే అశ్వత్థామ పరాక్రమం ముందు చాలడు. మీరందరూ వెళ్ళడం మంచిది. మరొక్క మాట ద్రోణుడు తన కుమారునికి బ్రహ్మశిరోనామాస్త్రమును తన కుమారుడు అయిన అశ్వత్థామకు ప్రీతితో ఇచ్చాడు. ఆ అస్త్రం అశ్వద్ధామ వద్ద ఉన్నది. అశ్వత్థామకు ద్రోణుడు దానిని ప్రయోగించడమే కాని ఉపసంహారం చెప్ప లేదు. ద్రోణుడు దానిని జనావాసాల మీద ప్రయోగించవద్దని ఎంత ఆపద వచ్చినా వేరు అస్త్రముల సాయంతో కాపాడుకోమ్మని కట్టడి చేసాడు. అశ్వత్థామ మహా కోపిష్టి, గర్విష్టి, దురహంకారి, పొగరుబోతు ఎంతటి వారైనా లక్ష్యం లేదు ఇక తండ్రి మాట వింటాడా ! " అన్నాడు.

### అశ్వత్థామ కృష్ణుని చక్రాయుధము అడుగుట

కృష్ణుడు ధర్మరాజుతో అశ్వత్థామ గురించి ఇంకా చెప్తూ " మీరు వనవాసంలో ఉన్నప్పడు అశ్వత్థామ ఒక సారి నా వద్దకు వచ్చి " కృష్ణా ! పూర్వం అగస్త్యుడు తాను బ్రహ్మ వద్ద నుండి పొందిన బ్రహ్మ శిరోనామాస్త్రాన్ని నా తండ్రి ద్రోణుడికి ఇచ్చాడు. నా తండ్రి దానిని నాకు ఇచ్చాడు. కృష్ణా ! నేను దానిని నీకు ఇస్తాను నీ చక్రా యుధమును నాకు ఇస్తావా !" అని అడిగాడు. నాకు అతడి అహంకారం అర్ధమైనా " నేను నా వద్ద ఉన్న ఆయుధములు గధ, ఖడ్గం, ధనస్సు, చక్రము చూపి వీటిలో నీకు ఏది కావాలో నీకు దేనిని ధరించి ప్రయోగించడానికి శక్తి ఉన్నదో దానిని తీసుకో అన్నాను. నీవు నాకు మిత్రుడవు నీవద్ద నుండి నేను ఏదీ తీసుకొనుట ధర్మం కాదు " అన్నాను. సమాధానంగా అశ్వత్థామ " నాకు చక్రాయుధం కావాలి అన్నాడు. నేను " సరే తీసుకో " అన్నాను. అశ్వద్ధామ అమితమైన గర్వంతో ముందు ఏడమచేత్తో సుదర్శనచక్రాన్ని ఎత్తాడు అది కదల లేదు. తరువాత కుడి చేత్తో ఎత్తాడు అది ఇసుమంతైనా లేవ లేదు. చివరకు రెండు చేతులతో ఎత్తి ప్రయత్నించి లేపలేక అలసి పోయి విఫలమై నిలబడ్డాడు.

### చక్రాయుధ మహిమ

నేను అశ్వత్థామను చూసి " అశ్వత్థామా ! నేను హిమవత్పర్వతాల మీద రిక్మిణీసమేతంగా ఉండి కూడా కఠోరబ్రహ్మచర్యం

అవలంబించి, పన్నెండు సంవత్సరాలు ఉగ్ర తపమాచరించి అత్యంత మహిమాన్వితమైన ఈ చక్రాయుధమును పొందాను. దీని ప్రభావం ముందు దేవ, దానవ, గంధర్వాది సమస్త భూతములు సాటి రావు. నా వద్ద ఉన్న చక్రాయుధమును నా అన్న బలబద్రుడు కాని, నా కుమారుడు ప్రద్యుమ్న సాంబులు కాని మిగిలిన యాదవ శ్రేష్టులు కాని అడుగ లేదు. తన తపోదీక్షతో అర్జునుడు గాండీవము, శ్వేతాశ్వములు, కపిధ్వజం పొందాడు. తరువాత పరమశివుని మెప్పించి పాశుపతం పొందాడు. అటువంటి అర్జునుడు నాకు ప్రాణ సమానుడు అడిగిన నేను ఇవ్వనిది ఏమీ లేదు. అర్జునుడు కూడా ఈ చక్రాయుధమును తనకు ఇమ్మని అడగ లేదు. భరతవంశసంజాతులకు గురువైన ద్రోణుడి కుమారుడవైన నీవు దీనిని అడుగ వచ్చా ! అయినా ఈ చక్రాయుధముతో నీవు ఎవరితో యుద్ధం చేయనెంచి నన్ను అడిగావు " అని అడిగాను.

### అశ్వత్థామ మనోగతం

అశ్వత్థామ " కృష్ణా ! నీవు ఈ చక్రాయుధమును నాకు ఇచ్చిన ఏడల నేను ఎలాగైనా నీకాళ్ళు పట్టి అయినా నిన్ను పోరుకు పిలిచి దీనిని నీ మీద ప్రయోగించాలని అనుకున్నాను. కాని ఈ చక్రాయుధమును నీవు నాకు ఇచ్చుట లేదు కదా ! నాకు ఎటువంటి హాని లేదులే. దీనిని నీ దగ్గరే ఉంచుకో. ఎలాగూ మహాభారతయుద్ధంలో నువ్వు నాతో యుద్ధం చేస్తావు కదా ! " అన్నాడు. నాకు నవ్వు వచ్చింది కాని బ్రాహ్మణుడు అడిగాడు కదా అని నేను అతడికి నాకు తోచిన బహుమానములు ఇచ్చి పంపాను. అతడి అహంకారముకు కారణం అతడి వద్ద ఉన్న బ్రహ్మశిరోనామాస్త్రం. క్రూరుడైన అశ్వత్థామ చేతిలో మన భీముడు బాధపడకూడదన్నదే నా కోరిక " అన్నాడు కృష్ణుడు.

## కృష్ణాదులు అశ్వత్థామ వద్దకు వెళ్ళుట

కృష్ణుడు సహదేవుడిని, సాత్యకిని ద్రౌపదికి తోడుగా ఉంచి తానూ ధర్మరాజు, అర్జునుడూ కలిసి భీముడు వెళ్ళిన వైపు వెళ్ళాడు. దారిలో వారు భీముని కలుసుకున్నారు. భీముని అడిగి అశ్వత్థామ ఉన్న చోటు తెలుసుకున్నారు. అందరూ వ్యాసాశ్రమం వెళ్ళి అక్కడ ఒంటినిండా విభూది పూసుకుని నిశ్చలంగా కూర్చుని తపస్సు చేసుకుంటున్న అశ్వత్థామను చూసి భీముడు మిన్నంటిన కోపంతో " ఓరీ అశ్వత్థామా ! కపటసన్యాసి ! బ్రాహ్మణాధమా ! క్రూరాత్ముడా ! నిన్న రాత్రి అంతటి దారుణమారణకాండ జరిపి ఏమీ ఎరుగని విధమున ఇంత త్వరగా తాపసవృత్తిని ఎలా అవలంభించావు. తాపసివైనంత మాత్రాన చావుతప్పదు. చేసిన తపస్సు చాలు లేచి నాతో యుద్ధానికి రా ! " అని సింహం వలె భీముడు గద్దించాడు. అశ్వత్థామ భీముని అతడి పక్కన ఉన్న అర్జునుడిని చేసాడు. అర్జునుడి శస్త్రసంపద ఎరిగిన వాడు కావున పక్కన ఉన్న రెల్లుగడ్డిని తీసుకుని అభిమంత్రించి బ్రహ్మశిరోనామును దాని మీద ఆవహింప చేసి " అపాండవ మగుకాక " అని సంకల్పించి భీమార్జునుల మీదకు ప్రయోగించాడు. ఆ దివ్యాస్త్రం నుండి భయంకరమైన అగ్నిజ్వాలలు వెలువడ్డాయి. పెద్ద విస్పోటం జరిగింది.

### అర్జునుడు బ్రహ్మశిరోనామకాస్త్రమును ప్రయోగించుట

కృష్ణుడు అర్జునుడిని చూసి " అర్జునా ! ఇది బ్రహ్మశిరోనామాస్త్రం. ఇది అత్యంత భయంకర మైంది. దీనికి సాటి మరియొకటి లేదు. దీనిని మరే అస్త్రం నిరోధించ లేదు. నీవు కూడా నీకు ద్రోణాచార్యుడు ప్రసాదించిన బ్రహ్మశిరోనామాస్త్రం ప్రయోగించి అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రమును నిరోధించి నిన్ను నీ సోదరులను కాపాడుకో ! " అని తొందర పెట్టాడు. వెంటనే అర్జునుడు రధము దిగి తన గురువు ద్రోణాచార్యుని మనసులో తలచి గాండీవమును తీసుకున్నాడు. బ్రహ్మశిరోనామాస్త్రమును ఎక్కు పెట్టాడు. అర్జునుడు తనలో " ఈ మహాస్త్రమును నేను అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రమును నిరోధించుటకు మాత్రమే ప్రయోగిస్తున్నాను. ఈ అస్త్రము వలన నాకు కాని, నా సోదరులకు కాని, గురుపుత్రుడు అశ్వత్థామకు కాని హాని కలుగకుండు గాక " అని ప్రార్ధించి అస్త్రప్రయోగం చేసాడు. అర్జునుడు ప్రయోగించిన అస్త్రం అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రాన్ని నిరోధించ ప్రయత్నించింది. రెండు అస్త్రాలు ఒక దానిని ఒకటి ఢీ కొట్టడంతో సముద్రాలు పొంగాయి. ఆకాశం నుండి ఉల్కలు రాలాయి, భూమి కంపించింది, సూర్యుడు కాంతిని కోల్పోయాడు, ఆకాశం నుండి పిడుగులు పడ్డాయి, రాళ్ళ వర్షం పడుతుంది. ఈ ఉత్పాతాలు చూసి జనం భయంతో కంపించి పోతూ అటూ ఇటూ పరుగులెత్త సాగారు. ప్రజల ముఖాలలో ఆశ్చర్యాందోళనలు, భయం భీతి కనిపిస్తున్నాయి.

### నారదుడి రాక

ఈ ఉత్పాదనలు చూసి నారదుడు పరుగు పరుగున వ్యాసుడి వద్దకు వచ్చాడు. నారదుడు వ్యాసుడితో కలిసి కృష్ణార్జునులు


అర్జున అశ్వత్థామలు ప్రయోగించిన అస్త్రాలను చూచి వచ్చిన వ్యాసనారదులు

ఉన్న చోటుకు వచ్చి అర్జున అశ్వత్థాల మధ్య నిలిచి " ఓ అకల్మషులారా ! ఇంతకు ముందు ఎంతో మంది వీరులు, భుజబలసంపన్నులు, శూరులు ఈ పుడమి మీద జన్మించారు గతించారు. వారెవ్వరూ బ్రహ్మశిరోనామాస్త్రమును జనావాసాల మీద ప్రయోగించ లేదు. మీరెందుకు ఈ సాహసానికి ఒడి గట్టారు. " అని అడిగాడు వ్యాసుడు. అర్జునుడు వ్యాసుడు నారదులకు నమస్కరించి " ఓ మహాత్ములారా ! అశ్వత్థామ పాండవవంశ నిర్మూలనకై సంకల్పించి బ్రహ్మశిరోనామాస్త్రము ప్రయోగించాడు. శ్రీకృష్ణుడి ఆదేశం మేరకు ఆ అస్త్రమును నిరోధించుటకు మాత్రమే నేను అదే అస్త్రమును ప్రయోగించాను కాని జనావాసాల మీద ప్రయోగించాలన్న క్రూరమైన తలంపు నాకు లేదు. తమరు ఆజ్ఞాపిస్తే నేను నా అస్త్రమును ఉపసంహరిస్తాను. కాని అలా చేస్తే ఆదుర్మార్గుడు తాను ప్రయోగించిన అస్త్రముతో మమ్ములను అందరినీ దహిస్తాడు మీరు మా క్షేమం కూడా ఆలోచించాలి " అని వినయంగా పలికి అర్జునుడు తాను ప్రయోగించిన బ్రహ్మశిరోనామాస్త్రమును అవలీలగా ఉపసంహరించాడు.

## వ్యాసుడు అశ్వత్థామ అస్త్రమును ఉపసంహరించమని కోరుట

వ్యాసుడు అశ్వత్థామను చూసి " అశ్వత్థామా నీవు కూడా నీవు ప్రయోగించిన మహాస్త్రమును నిరోధించు " అన్నాడు. అశ్వత్థామ తాను ప్రయోగించిన బ్రహ్మశిరమును ఉపసంహరించాలని ప్రయత్నించాడు కాని సాధ్యం కాలేదు. అప్పుడు అశ్వత్థామ వ్యాసుడితో " మహాత్మా ! ఈ భీమసేనుడు సిగ్గు లేకుండా సుయోధనుడిని అక్రమ మార్గమున చంపాడు. అంతటితో ఆగక మునివృత్తి అవలంబించిన నాతో యుద్ధానికి దిగాడు. అందుకని కోపంతో ప్రాణభీతితో వివేకం కోల్పోయి ఈ అస్త్ర ప్రయోగం చేసాను కాని నాకు ఈ అస్త్రాన్ని ఉపసంహరించడం తెలియదు. ఇది పాపం పాండవులను దహించి వేస్తుంది అని తెలిసినా తప్పనిసరి పరిస్థితిలో దాన్ని నేను ప్రయోగించాను " అన్నాడు. అశ్వత్థామ మాటలను సావధానంగా విన్న వ్యాసుడు " అశ్వత్థామా ! నీ తండ్రి ద్రోణుడు తన ప్రియ శిష్యుడైన అర్జునుడికి ప్రీతితో బ్రహ్మశిరమును ఇచ్చాడు. కనుక అర్జునుడు నీకు కీడు తలపెట్టడు. నీవు ప్రయోగించిన అస్త్రమును ఆపడానికే తాను అస్త్ర ప్రయోగం చేసానని చెప్పాడు. మేము కోరినంతనే ఉపసంహరించాడు. ఇంతటి అస్త్ర విద్యా వైభవం కలిగిన అర్జునుడిని వధించడానికి నీ తరం కాదు. ఈ బ్రహ్మశిరోనామాస్త్రమును గురించి చెప్తాను విను " ఇది ప్రయోగించిన దేశంలో పన్నెండేళ్ళు అనావృష్టి సంభవిస్తుంది. కనుక నిన్ను పాండవులను రక్షించడానికి ఈ ఉపాయం చెప్పాను. కనుక తాపస వృత్తిని అవలంబించానని అంటున్నావు కనుక ఈ మహాస్త్రమును ఉపసంహరించి కోపం విడిచి నీ వద్ద ఉన్న శిరోమ్మణిని ఇతడికి ఇవ్వు నిన్ను సంహరించినంతగా సంతోషపడి నిన్ను విడిచిపెడతారు. ఇది అందరికి ఆమోదయోగ్యమైనది. ఆ ప్రకారం చెయ్యి " అన్నాడు.

## అశ్వత్థామ మాట నెగ్గించుకొనుట

అశ్వత్థామ వ్యాసుని చూసి " పాండవులకు రత్నములు కొత్తా ! కౌరవనాధుడి భండాగారమంతా కొల్లగొట్టాడు కదా ! ఇంకా వాళ్ళకు నా రత్నం కావలసి వచ్చిందా మహాత్మా ! ఈ రత్నము ఎవరి దగ్గర ఉందో వారికి చోరభయము, రాక్షస భయము, దేవతల భయము లేదు. అదిగాక అది కలిగిన వారికి ఆకలి, దప్పిక, నిద్ర, రోగము మొదలైనవి ఉండవు. ఏ రత్నమును ఎలా ఇవ్వగలను. కాని నీ మాటను మన్నించి ఈ రత్నమును మీకు సమర్పిస్తున్నాను. కాని ఇప్పుడు చెబుతున్నాను వినండి. నేను ప్రయోగించిన అస్త్రం పాండవపత్నుల గర్భములను విచ్చిత్తిచేసి పిదప శాంతి చెందుతుంది " అన్నాడు. వ్యాసుడు " అశ్వత్థామా ! తథాస్తు, అంతటితో తృపిపడు వేరే దానికి ఆశించకు " అన్నాడు. అశ్వత్థామ ఆలోచనలో పడ్డాడు. " ప్రస్తుతం పాండవపత్నులు ఎవ్వరూ గర్భం ధరించి లేరు. కనుక తన మాటలు వృధా ఔతాయి " అని ఎంచి వెంటనే మాట మార్చి " మహాత్మా ! పాండవేయ రాగపాత్రల గర్భములనిన తత్సంతాన గర్భములని నా అభిప్రాయం. కనుక పాండవ సంతానముల వలన కలిగిన గర్భములన్నింటినీ విచ్చితి చేసి శాంతి పొందుతుంది " అన్నాడు. అది విన్న వ్యాసుడు హతాసుడు అయ్యాడు.

## పాండవ వంశమున ఒక్కరిని నిలుపమని కృష్ణుడు అశ్వత్థామకు చెప్పుట

వారి సంభాషణ విలాసంగా తిలకిస్తున్న కృష్ణుడు " ఈ అశ్వత్థామ వ్యాసుడి మాట అబద్ధం చేసి తన మాటను నెగ్గించుకున్నాడు. ఇప్పుడు నేను వీడి అడ్డుపడక తప్పదు " అనుకున్నాడు. కృష్ణుడి ఆంతర్యం అర్ధం చేసుకున్న వ్యాసుడు

మిన్నకుండి పోయాడు. కృష్ణుడు అశ్వత్థామ తో " అశ్వత్థామా ! పాండుకుమారులను చంపి పాపం మూట కట్టుకున్నావు. ఇప్పుడు వారి సంతానం వారి వారి సంతానముల గర్భవిచ్చిత్తికి పాల్పడ్డావు. ఇది మహాపాపం. కాని నేను వారి సంతానంలో ఒకే ఒక్క గర్భమును కాపాడాలని నిశ్చయించాను. పాండవ వంశాన్ని నిలబెట్టడానికి ఒకేఒక్క గర్భమును నిలిపి మిగిలిన గర్భములను దహించు " అన్నాడు. ఆ మాటలకు అశ్వత్థామకు కోపంవచ్చి " కృష్ణా ! పాండవ పక్షపాతివి కనుక అలా మాట్లాడావు. కాని నేను అలా ఎందుకు చేస్తాను. నీవు విరాట రాజకుమారి ఉత్తరా గర్భాన్ని రక్షించడానికి ప్రయత్నిస్తున్నావు. నీవు ఆ పని చేస్తే నేను ఆ గర్భమును కూడా విచ్చిత్తి చేస్తాను " అన్నాడు. అందుకు కృష్ణుడు " అసంభవం అశ్వత్థామా ! అది ఎన్నటికీ జరగదు. అభిమన్యుని మహాతేజము ఉత్తర గర్భములో దినదిన ప్రవర్ధమానంగా వృద్ధి చెందుతుంది. నీవే కనుక ఆ గర్భముకు హాని కలిగిస్తే నేను దానికి దీర్ఘాయువు ఇస్తాను " అన్నాడు. ఆ మాటలకు అశ్వత్థామ " అస్త్ర దగ్ధుడికి నీవు దీర్గాయువు ప్రసాదిస్తావా ! అది అసంభవం కాని మీరిరువురు ప్రయత్నించండి " అంటూ విలాసంగా నవ్వాడు. కృష్ణుడు " ఇందులో నా ప్రమేయం ఏముంది. ఒక నాడు త్రికాల వేదుడైన బ్రాహ్మణుడు ఉపప్లావ్యంలో ఉన్న ఉత్తర వద్దకు వచ్చి ఆమెను చూసి అమ్మా ! నీపూర్వ పుణ్య ఫలము వలన నీకు ప్రాణములు పరీక్షీణమైన పుత్రుడు జన్మిస్తాడు. ఆ కారణంగా అతడు పరీక్షిత్తు అను నామంతో ఈ భూమిని పాలిస్తాడు. అని పలికాడు. కనుక అశ్వత్థామా ! ఆ బ్రాహ్మణుడి మాటలు అసత్యములు కావు కదా ! కనుక పాండవ వంశమును నీవు నిర్మూలించ లేవు. ఉత్తర గర్భమున జన్మించే వాడు వంశకరుడు ఔతాడు " అన్నాడు.

## కృష్ణుడు అశ్వత్థామను శపించుట



తన శిరోరత్నాన్ని కోల్పోయిన అశ్వత్థామ

ఉత్తర గర్భమును రక్షించాండు కాని కృష్ణుడికి అశ్వత్థామ మీద కోపం చల్లారలేదు " అశ్వత్థామా ! బాల ఘాతకా ! బాలురూ యువకులూ అని లేకుండా అర్ధరాత్రి సమయంలో ఘాఢనిద్రలో ఉన్న వారిని దారుణంగా హత్య చేసినందుకు నీకు ఇదే నా శాపం అనుభవించు నేటి నుండి నీకు అన్నం దొరకదు నీకు ఎవరూ సహాయం చేయరు. నీ ఒంటి నిండా చీమూ నెత్తురు కారుతుంటుంది. ఈ ప్రకారం 3000 సంవత్సరాలు దేశ దిమ్మరివై తిరుగుదువు గాక ! కాని నా చేత రక్షింపబడిన ఉత్తరా గర్భ సంజాతుడు కృపాచార్యుడి వద్ద ధనుర్విద్య నేర్చుకుని అనేక సంవత్సరాలు రాజ్యపాలన చేస్తాడు. అతడి కుమారుడు జనమేజయుడు నీ కళ్ళ ముందే జనరంజకంగా రాజ్య పాలన చేస్తాడు. ఇది సత్యం " అని పలికాడు. ఆ మాటలు విన్న వ్యాసుడు " గురుకుమారా ! నీవు బ్రాహ్మణవంశంలో జన్మించినా క్షాత్రం అవలంబించావు. దారుణమారణ కాండకు పాల్పడ్డావు. ధర్మాధర్మ విచక్షణ మరచి బ్రహ్మశిరోనామాస్త్రమును ప్రయోగించావు. నా మాట కూడా లక్ష్య పెట్ట లేదు. కనుక కృష్ణుడి మాటలు అక్షరాల జరిగి తీరుతాయి " అని పలికాడు. అందుకు అశ్వత్థామ కోపించి " వ్యాస మునీంద్రా ! నీవు కూడా మా లాంటి మనుష్యుల మధ్యనే జీవించు. ఇది నా ప్రతి శాపం " అని చెప్పి తన శిరోరత్నమును పాండవులకు ఇచ్చి తాను తపస్సు చేసుకోవడానికి అడవులకు వెళ్ళాడు. పాండవులు కృష్ణుడు వ్యాసుడికి నమస్కరించి ద్రౌపది ఉన్న చోటుకు వచ్చారు. భీముడు అశ్వత్థామ శిరోరత్నమును ద్రౌపది కి ఇచ్చి " ద్రౌపదీ ! శత్రుకార్యం పూర్తి అయింది. గురుపుత్రుడు అయినందున అర్జునుడు [అశ్వత్థామ ను చంపనిచ్చగించ లేదు. అందుకని అతడి శిరోరత్నమును తీసుకొని అతడి కీర్తిశరీరమును పడగొట్టాము. ఇక అతడు బ్రతికీ చచ్చినట్లే. ఇక నీ దుఃఖమును మాని ధర్మరాజు దుఃఖమును పోగొట్టుము " అన్నాడు. ద్రౌపది మహిమాన్వితమైన ఆ రత్నమును చేత పట్టుకుని ధర్మరాజు తో " ఈ రత్నమును పొందినందుకు నాకు చాలా ఆనందంగా ఉంది. దీనిని పొందుటకు మీరు అర్హులు అని ఆ రత్నమును ధర్మరాజు కు ఇచ్చింది. ధర్మరాజు కూడా తనకు అశ్వత్థామ మీద ఉన్న గౌరవప్రపత్తులకు నిదర్శనంగా ఆ రత్నమును శిరస్సున ధరించాడు. అప్పుడు ధర్మరాజు అందరూ వినేలా తాము అక్కడ నుండి బయలుదేరి వెళ్ళిన తరువాత జరిగినది అంతా ద్రౌపది కి, సహదేవుడికి మిగిలిన వారికి వివరించాడు. బ్రహ్మశిరోనామాస్త్ర ప్రభావం చేత అప్పటి వరకు నిలిచిన పాండవకుమారుల పత్నుల గర్భములు విచ్చిన్నమయ్యాయి. కాని ఉత్తరగర్భము యధాతధంగా ఉన్నది. ఈ విషయం ఉత్తరకు తెలియదు.

## ధర్మరాజు సందేహం

అప్పుడు ధర్మరాజు కృష్ణుడితో " కృష్ణా ! బలంలో శౌర్యంలో ద్రౌపదీ పుత్రులు అత్యంత బలవంతులు కదా ! అశ్వత్థామ ఒక్కడే

వారినందరిని ఎలా చంపగలిగాడు. అతడికి అంతటి శక్తి సామర్ధ్యాలు ఎలా వచ్చాయి. అజేయబలవందతుడు శక్తిసంపన్నుడైన ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామ చేతిలో దారుణంగా చని పోవడానికి కారణమేమిటి ? నాకు వివరించవా ! " అని అడిగాడు. కృష్ణుడు ధర్మనందనా ! ప్రాణికోటి జన్మించుటకు, జీవించుటకు, లయించుటకు కారణ భూతుడైన పరమశివుని తత్వం నాకు బాగాతెలుసు అతడు సంకల్ప మాత్రమున ఈ జీవకోటిని జన్మింప చేయగలడు లయింప చేయగలడు. కాని అతడు భక్త సులభుడు. భక్తితో తప్ప ఇతర మార్గమున అతడిని ప్రసన్నుడుని చేసుకొనుట అసాధ్యము. కనుక అతడి శక్తి ఇంత అని చెప్పుట అసాధ్యము.

### బ్రహ్మ ప్రాణికోటిని సృష్టించుట

తొలుత బ్రహ్మదేవుడు ఈ ప్రాణి కోటిని సృష్టించ వలెనన్న తలంపుతో మహాశివుని వద్దకు వెళ్ళి తన కోరికను చెప్పాడు. అప్పుడు మహాశివుడు " బ్రహ్మదేవా ! ఏకార్యం సిద్ధించుటకైనా తపస్సు ముఖ్యం. తపస్సుతో సాధించ లేని కార్యం ఈ జగతిన ఏదీ లేదు. అందుకని ముందు నేను తపస్సు చేస్తాను " అన్నాడు. తరువాత శివుడు నీటిలో మునిగి తపస్సు చేయడం ప్రారంభించాడు. అలా కొన్ని వేల సంవత్సరాలు గడిచి పోయినా పరమ శివుడు ఎంతకీ బయటకు రాలేదు. బ్రహ్మదేవుడికి విసుగు పుట్టి తుదకు శివుడి సహాయం లేకుండా తన తప: ప్రభావంతో దక్షప్రజాపతిని సృష్టించాడు. బ్రహ్మ " దక్షప్రజాపతీ ! నీవు నా ఆజ్ఞ మీద ప్రజోత్పత్తిని సాగించు " అన్నాడు. దక్షుడు " నా కంటే అధికులు లేకున్న నీవు చెప్పినట్లే సృష్టి కార్యం నిర్వహిస్తాను " అన్నాడు. " దక్షప్రజాపతీ ! శివుడు జలమున మునిగి అనేక వేల సంవత్సరాల నుండి తపస్సు చేస్తున్నాడు. కనుక నీవే ఈ సృష్టిని సాగించు అన్నాడు. తరువాత దక్షుడు దేవతలను, అసురులను, తిర్యగ్జాతులను మొదలగు భూతములను సృష్టించాడు. కాని వాటికి ఆహారం సృష్టించ లేదు. అప్పుడు ప్రాణులు ఆకలితో దక్షుని భక్షించుటకు ప్రయత్నించాయి.

### ప్రాణికోటికి బ్రహ్మ ఆహారం సృష్టించుట

అప్పుడు దక్షుడు బ్రహ్మ వద్దకు వెళ్ళి " ప్రాణి కోటి అంతా ఆహారం కొరకు అలమటిస్తూ నా వెంట పడుతున్నాయి. వీటికి ఆహారం సృష్టించి నన్ను వీటి భారి నుండి రక్షించు " అని ప్రార్ధించాడు. అప్పుడు బ్రహ్మదేవుడు ఓషధులను, ఫలములు, కందమూలములు మొదలైన భక్ష్య ములకు మూలమైన వృక్షములను, పొదలను, లతలను సృష్టించి ప్రాణి కోటికి ఆహారం సమకూర్చాడు. మరియు బహీనమైన జంతువులను బలవంతమైన ప్రాణులకు ఆహారంగా సమకూర్చాడు. ప్రాణులన్నీ ఆనందంగా వెళ్ళి పోయాయి. అప్పటి నుండి సృష్టి నిరాఘాటంగా కొనసాగుతుంది. అప్పటికే సృష్టించబడిన ప్రాణులకు సంతానోత్పత్తి జరుగుతుంది.

### మహాశివుడి ఆగ్రహం

ఈ ప్రకారం సృష్టి క్రమం జరుగుతుండగా మహాశివుడు తపస్సు ముగించుకుని జలము నుండి బయటకు వచ్చి లోకమంతా సృష్టి జరగటం, ప్రాణులకు సంతానం కలగడం సృష్టి నిరాఘాటంగా జరగడం చూసాడు. మహాశివుడికి కోపం వచ్చింది సృష్టించడానికి పనికి రాని లింగం నాకెందుకని లింగము తీసి భూమి మీద పెట్టాడు. అది చూసిన బ్రహ్మ " మహాదేవా ! ఏమిటిది ఎందుకు ఇలా చేసావు " అని అడిగాడు. " బ్రహ్మదేవా ! నేను ప్రాణులను సృష్టించడానికి నేను నీళ్ళలో మునిగి అత్యంత ఉగ్రమైన తపస్సు చేసాను. ప్రాణులను సృష్టించడానికి పనికిరాని ఈ లింగం నాకేల " అని పలికి కోపంతో ఊగి పోతూ మాల్యవంతంకు తపస్సు చేసుకోవడానికి వెళ్ళాడు. మహాశివుని చేత భూమి మీద పెట్టబడిన లింగం బ్రహ్మాది దేవతలకు మహా ప్రకాశవంతంగా సుందరంగా కనిపించింది. ఇంద్రాది దేవతలు దానికి పూజాదికాలు చేయసాగారు. అలాచాలా కాలం గడిచింది.

## దేవతల నిరీశ్వర యాగం

దేవతలంతా ఒక యాగం తలపెట్టారు. యజ్ఞముకు కావలసిన వస్తువులన్నీ సమకూర్చుకున్నారు. యజ్ఞభాగం అందుకోవడానికి తగిన దేవతలను నియమించారు. కాని ఈశ్వరుడికి మాత్రం యజ్ఞభాగం కల్పించ లేదు. యజ్ఞం మొదలైంది. ఈ విషయం తెలిసిన శివుడు ఆగ్రహించి ఒక పొడవైన వింటిని సృష్టించాడు. ఆ వింటిని ధరించి మహోగ్రుడై దేవతలు యజ్ఞం చేస్తున్న ప్రదేశానికి వచ్చాడు. మహాశివుని కోపానికి భూమి దద్దరిల్లింది. ఆకాశం ఘర్జించింది. పర్వతాలు పెకిలించబడ్డాయి. సూర్యచంద్రులు కళ కోల్పోయారు. దేవతలంతా పరుగులు తీసారు. యజ్ఞానికి ఆధ్వర్యం వహిస్తున్న దేవతలు చిత్తరువులయ్యారు. మహాశివుడు ఊగ్రంగా ఆ యజ్ఞమును కొట్టాడు. అక్కడ వేల్చుతున్న అగ్ని పారిపోయింది. యజ్ఞం

ఆగిపోయింది. మహాదేవుడు పూషుని పళ్ళు విరుగకొట్టాడు, సవిత్రుని చేతులు విరిచాడు. భృగుడి కళ్ళు పొడిచాడు. అక్కడ ఉన్న దేవతలు భయభ్రాంతులై అక్కడ ఉన్న యజ్ఞోపకరణములు తీసుకుని తలా ఒక దిక్కుకు పారి పోయారు. కాని మహాశివుడు వారిని పారిపోకుండా అన్ని వైపులా తానే అయి విల్లు సంధించి నిరోధించాడు. దేవతలు చేసేది లేక మహాశివుడి కాళ్ళ మీద పడ్డారు. పారిపోయిన యజ్ఞం అగ్నితోసహా వచ్చి మహాశివుని కాళ్ళ మీద పడింది. మహాశివుడు శాంతించాడు. తన కోపమును ఒక సరస్సులో వేసాడు. ఆ కోపానికి ఆ సరస్సు ఎండి పోయింది. పరమేశ్వరుడి దయ వలన సవితకు చేతులు, పూషుడికి పళ్ళు, భృగుడికి కళ్ళు వచ్చాయి. దేవతలంతా పరమశివుని భక్తితో కొలిచి అతడికి ఆ యజ్ఞంలో భాగం ఇచ్చారు. దేవతల యజ్ఞం నిర్విఘ్నంగా నెరవేరింది.

## పరమ శివుని మహత్యం

ధరరాజా ! పరమేశ్వరుడి లీలలు ఇలా ఉంటాయి. ఆ మహాదేవుడు కోపిస్తే ముల్లోకాలు భస్మం ఔతాయి. ఆ దేవదేవుడు కరుణిస్తే లోకాలు సుభిక్షంగా ఉంటాయి. అశ్వత్థామకు దేవదేవుడు తోడుగా ఉండబట్టి ఉపపాండవులను, శిఖండిని, ధృష్టద్యుమ్నుడిని సంహరించగలిగాడు. కాని ఇది అశ్వత్థామ పరాక్రమం కాదు. ఈ యుద్ధంలో మీరు భీష్ముడిని పడగొట్టడం, ద్రోణ, కర్ణ, శల్యులను చంపడం, సుయోధనుడిని చంపడం, భీముడు తన ప్రతిజ్ఞ నెరవృచుకోవడం ఈశ్వర లీల. అంతే కాని మీ పరాక్రమం కాదు. కనుక సాధించిన విజయానికి ఆనందపడు. కారణాలు వెతక్కు " అన్నాడు కృష్ణుడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభ్రువాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

# స్త్రీ పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

(స్త్రీ పర్వము నుండి దారిమార్పు చెందింది)

## విషయ సూచిక

# ప్రధమాశాసం

వైశంపాయనుడు జనమేజయునకు చెప్పిన మహాభారతకధను సూతుడు శౌనకాది మహామునులకు చెప్పసాగాడు. మహాభారత కధను వింటున్న జనమేజయుడు వైశంపాయుడిని చూసి " మహాత్మా ! తన కుమారుడు సుయోధనుడు భీముని చేతిలో చనిపోయిన విషయం సంజయుడి ద్వారా తెలుసుకుని ధృతరాష్ట్రుడు ఏమి చేసాడు. హస్థినకు వెళ్ళిన రధికత్రయం ఎవరిని కలుసుకున్నారు. తరువాత ఎక్కడకు వెళ్ళారు. అశ్వత్థామ వ్యాసాశ్రమానికి వెళ్ళిన పిదప కృపాచార్యుడు, కృతవర్మ ఎక్కడకు వెళ్ళారు. మహావిజయమును సాధించిన పిదప కుమారుల బంధువుల మరణాన్ని ధర్మరాజు ఎలా తట్టుకున్నాడు "అని అడిగాడు. వైశంపాయనుడు ఇలా చెప్పసాగాడు.

## కుమారుల మరణానికి దు:ఖించిన ధృతరాష్ట్రుడు



ధృతరాష్ట్రుని విలాపం

తన నూరుగురు కుమారులు యుద్ధములో మరణించారు అని తెలుసుకున్న ధృతరాష్ట్రుడు మొదలు నరికిన వృక్షంలాగా కూలి పోయాడు. భరించరాని దు:ఖంలో మునిగి పోయాడు. అతడి హృదయం కకావికలైంది. దు:ఖభారంతో తనలో తానే కుమిలి పోతున్న సంజయుడు " ధృతరాష్ట్ర మహారాజా ! ఏమిటీ వెర్రి. ఎవరి కొరకు దు:ఖ పడుతున్నావు ? నీశోకానికి అంతు లేదా ! దు:ఖాన్ని వదిలి నేను చెప్పేది విను. కురుక్షేత్ర సంగ్రామంలో 18 అక్షౌహినుల సైన్యం మరణించారు. నీ తాతలు, తాండ్రులు, అన్నలు, తమ్ములు, బంధువులు, మిత్రులు, మిత్ర రాజులు, సామంత రాజులు నీ కోసం మరణించారు కదా ! వారికిదహన సంస్కారాలు చేయాలి కదా ! పద యుద్ధభూమికి వెళదాము " అన్నాడు. కాని ధృతరాష్ట్రుడు కదలలేదు తల బాదుకుంటున్నాడు. " సంజయా ! నా కొడుకులంతా చచ్చారయ్యా ! నా వైభవమంతా నశించిందయ్యా ! అతిదీనంగా బ్రతుకుతున్న నాకు ఈ దేహం ఎందుకు. ఒకరి దయాభిక్ష మీద ప్రతకడానికా ! నాదీ ఒక బ్రతుకేనా ! బ్రతికి నేను సాధించేది ఏముంది?.

## ధృతరాష్ట్రుడి పశ్చాత్తాపము

సంజయా ! కృష్ణుడు సంధి చేయడానికి వచ్చినప్పుడు నాకు ఎంతో నచ్చచెప్పాడు. భీష్ముడు, ద్రోణుడు నా హితవు కోరి చెప్పారు. పరశురాముడు లాంటి మహా మునులు ఎందరో బుద్ధిమతి చెప్పారు. నేను దుర్బుద్ధితో వారి మాటలు పెడచెవిన పెట్టాను. పాండవులకు రాజ్యభాగం ఇవ్వ నిరాకరించి ఫలితం అనుభవిస్తున్నాను. కొడుకులను పోగొట్టుకున్నాను. బంధుమిత్రులను పోగొట్టుకున్నాను. అందరూ మరణించారు. దహనక్రియలు చేయడానికి నేను మాత్రం బ్రతికి ఉన్నాను. సంజయా ! రాబోయే ఆపద తెలిసి కూడా పాండవులకు రాజ్యభాగం ఇవ్వ లేదు. కనుక నా అనే వారందరిని పోగొట్టుకున్నాను. సంజయా ! నేను ఇలా కావడానికి నా పూర్వజన్మ సుకృతం కాక వేరు కాదు. అయినా ధర్మరాజు ఉండగా దహనక్రియలు చేయడానికి నేను ఎందుకు ? నా కుమారులను చంపి తమ ప్రతిజ్ఞలు నెరవేర్చుకున్న పాండవులు ఈ పని కూడా చేస్తారులే " అన్నాడు.

## ధృతరాష్ట్రుడికి సంజయుడి హితవు

అతడిని చూసి సంజయుడు " ధృతరాష్ట్ర మహారాజా ! నీకు తెలియని శాస్త్రాలు లేవు అన్నీ తెలిసిన నీవే ఇలా దు:ఖిస్తే

లోకులు నవ్వరా ! ఇంతకు ముందు నీవు సృంజయుడి కథ విన్నావు కదా ! అభిమన్యుడి మరణానికి ధర్మరాజు దు:ఖిస్తుంటే నారదుడు ఈ కథ చెప్పాడు అది విని కూడా నీవు ఇలా దు:ఖిస్తున్నావా ! నీ మంచికోరే మంత్రుల మాట వినలేదని అన్నావు కదా ! నీకూ, నీ కుమారుడికీ శకుని, దుశ్శాసనుడు, కర్ణుడు వీరే కదా మంత్రులు ! వీరే మీకు మంత్రులు అయితే ఇక వినాశనం కాక మిగిలేది మరేమిటి. నీ కొడుకు ఎదుటి వాడి మీద కత్తి దూసాడే కాని మంత్రాంగం మీద దృష్టి మరల్చాడా ! విదురుడు చెప్పింది విన్నాడా ! నీవు అతడికి బుద్ధిచెప్పి అతడిని కట్టడి చేసి అతడి అకృత్యాలను ఆపగలిగావా ! నీకూ నీ కుమారుడికీ లోభత్వం బాగా వంటబట్టి ఎవరి మాటా వినలేదు. కనుక నీ దు:ఖం మాను. నీ పని ఎలా ఉందంటే చుట్టూ మంట పెట్టుకుని మధ్యలో కూర్చుని అయ్యో కాలిపోతున్నాను అని గొంతెండి పోయేలా అరచినట్లు ఉంది. ఈ పరిస్థితిలో అందరూ నిన్ను నిందిస్తారే కాని జాలి చూపుతారా ! నీ కుమారుడి పరుషవాక్యాలకు అర్జునుడి కోపాగ్నికి వారంతా దగ్ధం అయ్యారు. ఇక విచారించడం ఎందుకు " అన్నాడు.

## ధృతరాష్ట్రుడిని విదురుడు మందలించుట

ఇంతలో అక్కడకు విదురుడు వచ్చి ధృతరాష్ట్రుని చూసి " చేసింది చాలక ఇంకా నేల మీద పడి దొర్లిదొర్లి ఏడుస్తున్నావా ! ఏడిచింది చాలు కాని ఇక లే ! " అన్నాడు. విదురుడి మాటలకు ధృతరాష్ట్రుడు లేచి కూర్చున్నాడు. దు:ఖమును ఆపుకున్న ధృతరాష్ట్రుడిని చూసి విదురుడు " ధృతరాష్ట్ర మహారాజా ! పెరుగుట విరుగుట కొరకే కొత్తకొత్త రుచుల కొరకు అర్రులు చాస్తే ఉన్న రుచే పోతుంది పుట్టిన ప్రతి మనిషి చావక తప్పదు. ఎంత దగ్గరైతే అంత దూరం కావడమే ప్రకృతి సహజం. దీనిని తప్పకొనుట ఎవరికైనా సాధ్యమా ! యమధర్మరాజు తన పాశముతో ప్రాణుల ప్రాణమును హరించునప్పుడు వీడు మంచి వాడా, చెడ్డ వాడా, ధనికుడా, పేద వాడా, వీరుడా పిరికి వాడా అని చూడడు ఎలాంటి వాడైనా చావు తప్పదు. యుద్ధం చేస్తేనే మనిషి చస్తాడా ! ఎక్కడ ఉన్నా చావును తప్పించుకో లేడు. కనుక చావును గురించి చచ్చినవారి గురించి దు:ఖించడం దండగ. నీ కుమారులందరూ యుద్ధంలో మరణించి వీరస్వర్గం పొంది స్వర్గసుఖాలు అనుభవిస్తున్నారు. నువ్వు వారికొరకు దు:ఖిస్తున్నావు. అయినా ! పండితుడవు జ్ఞానివి అయిన నీకు తెలియనిది ఏముంది. మనిషి పుట్టిన తరువాత బాల్యము, యవ్వనము, అందచందాలు, ఈ ప్రకృతి, అందున్న పదార్ధములు అన్నీ మిధ్య, అశాశ్వితమైన స్థిరము కాని వాటి కొరకు దు:ఖించుట తగదు. తెలివి కలిగిన వారు దు:ఖించరు. దు:ఖం సర్వ అనర్ధములకు హేతువు. కాగల కార్యము మీద మనసు నిలుపు. మహారాజా ! మామూలు మనుషుల ఆలోచనాపరిధి చిన్నది. కనుక వారు చిన్న దు:ఖమునకు, కూడా తట్టుకోలేరు. తమకు ప్రియమైనది దూరమైనా కోల్పోయినా వారి జ్ఞానం నశించి దు:ఖిస్తారు. చెయ్యకూడని పనులు చేస్తారు. కాని జ్ఞానులకు పండితులకు ప్రియము అప్రియము ఉండదు. అన్నీ సమానంగా చూస్తారు.

## ధృతరాష్ట్రుడు దు:ఖోపశమనం పొందుట

విదురుడి మాటలకు ధృతరాష్ట్రుడు దు:ఖోపశమనం పొంది " విదురా ! నీ మాటలు నా దు:ఖాన్ని ఉపశమింప చేసాయి. విదురా ! నీవు చెప్పినట్లు జ్ఞానులకు పండితులకు అప్రియములు ప్రియములు అనేవి లేకుండా అంతా సమానంగా చూస్తారని చెప్పావు కదా ! వారు అలా ఎలా ఉండగలరు " అని అడిగాడు. విదురుడు " ఓ ధృతరాష్ట్ర మహారాజా ! సంసారమనే వృక్షము అరటి చెట్టు వలె దుర్బలమైంది, నిస్సారమైనది. కాని మానవుడు ఈ సంసారం అందే అనురక్తుడై నిరంతర వ్యధకు గురి ఔతున్నాడు. ప్రస్థుతం మనకు లభించిన ఈ శరీరం పతనమై మరొక శరీరం లభిస్తుంది అంతేకాని ఈ శరీరం శాశ్వతం కాదుకదా ! అది తెలుసుకున్న వాడు నీ మాదిరి వ్యధచెందడు. ఒక ఇంటి నుండి మరొక ఇంటికి పోయిన మాదిరి జీర్ణమైన ఒక వస్త్రమును వదిలి నూతనమైన వేరొక వస్త్రమును ధరించిన మాదిరి ఒక శరీరం వదిలి వేరొక శరారాన్ని ధరిస్తాడు. కుమ్మరి వాడు కుండను చేసే సమయంలో మధ్యలోనే విరుగ వచ్చు, లేకున్న కుండగా తయారైన తరువాత విరుగవచ్చు, దానిని కాల్చే సమయాన విరిగి పోవచ్చు, వాడుకునే సమయాన కింద పడి విరిగి పోవచ్చు. కనుక ఈ మట్టి కుండ ఏ దశలో విరుగుతుందో చెప్ప లేము కదా ! మానవుడూ అంతే ! పురుషుడి తేజస్సు స్త్రీ అండముతో కలిసిన పిండోత్పత్తి జరుగుతుంది అది అండ దశలో విచ్చిత్తి కావచ్చు, ఆ పిండం శిశువుగా రూపుదిద్దుకునే సమయంలో కాని ప్రసవ సమయంలో కాని, శిశువుగా జన్మించిన తరువాత గాని, బాల్యంలో కాని, యవ్వనంలో కాని, వృద్ధాప్యంలోగాని ఎప్పుడైనా సంభవించ వచ్చు. కనుక ఈ శరీరం ఎప్పుడైనా మరణించ వచ్చు. కనుక మరణానంతరం మనం చేసే సుకృత, దుష్కృత ఫలితంగా స్వర్గనరకములు ప్రాప్తిస్తాయి. కనుక మరణించిన వారి కొరకు దు:ఖించడం అవివేకం. వివేకం కల వారు ఈ సంసారం దు:ఖభూయిష్టం అని ఎరిగి దాని అందు చిక్కుకొనరు. కనుక నీవూ చచ్చిన పుత్రులకొరకు విచారించక నీవు ముక్తి పొందే మార్గం ఆలోచించు " అని చెప్పాడు విదురుడు.

## ధృతరాష్ట్రుడు దు:ఖం నివృత్తి గురించి తెలుసుకొనుట

విదురుడి మాటలకు ధృతరాష్ట్రుడు మరికొంత శాంతించిన మనసుతో " విదురా ! అసలు సంసారంలో దు:ఖం ఎందుకు ఉంటుంది. దానిని మనం ఎలా నివృత్తి చేసుకోవాలి " అని అడిగాడు. విదురుడు " మహారాజా ! పురుషుడి తేజస్సు స్త్రీ అండంతో కలిసిన పిండోత్పత్తి జరుగుతుంది అని నీకు ముందే చెప్పాను. క్రమక్రమంగా అవయవ నిర్మాణం జరుగి శిశువుగా రూపుదిద్దుకుంటుంది. ఆశిశువులోనికి ప్రాణవాయువు ప్రవేశించి ఆ శిశువు గిరగిరా తిరుగుతూ బాధను అనుభ విస్తుంది. ఆ శిశువు వేదనను భరించ లేక గర్భముఖద్వారం చేరుకున్న సమయంలో ఆ శిశువును గ్రహములు భూతములు ఆవహిస్తాయి. ఆ తరువాత శిశువు జన్మించడానికి సిద్ధమై గర్భము నుండి బయటకు వస్తుంది. ఆశిశువు బాలుడిగా ఉన్నప్పుడు శుచి, అశుచి తెలియదు. వివేకము తెలియదు. ఆట పాటలతో తెలియక పొరబాటుగా అనేక దుష్టకార్యాలు చేస్తాడు. బాల్య చేష్టలతో బాల్యావస్థ దాటగానే యవ్వనంలోకి ప్రవేశిసించగానే కామపరమైన ఆసక్తి జనిస్తుంది. స్త్రీ సౌఖ్యం కొరకు పాకులాడుతాడు. ఆ సమయంలో అధికంగాడే ఇంద్రియ లోలత్వం వలన సుఖము, దు:ఖము అనుభవిస్తాడు. కోరికలతో వేగిపోతూ అనేక దుష్కార్యములు చేస్తాడు. బాల్యంలాగే యవ్వనమూ గడిచి పోతుంది. వృద్ధాప్యంలోకి ప్రవేశిస్తాడు. అప్పుడు శరీరంలోని బలము శక్తి ఉడిగి పోయి వ్యాధి పీడితుడు ఔతాడు. అయినా ఉచితానుచితాలు తెలియక అనుచిత కార్యములను చేస్తాడు. వ్యాధిప్రాబల్యంతో వయోభారంతో కృంగి కృశించి పోతాడు. అప్పుడు యముడు వచ్చి తన పాశముతో ప్రాణములను హరిస్తాడు. ఈ జీవుడు పోలేక పోలేక యాతన అనుభవిస్తాడు. అంతటితో ఈ జన్మ ముగుస్తుంది. కనుక ఈ లోకం నిరంతర దు:ఖ భూయిష్టమైంది అన్నది స్పష్టము. ఈ మానవులు కామ, క్రోధ, మదోన్మత్తులై లోభంతో అనేక దుష్కృత్యములు ఆచరిస్తారు. కాస్తంత సుఖం ఆశించి ఒకరి జీవితం ఒకరు నాశనం చేసుకుంటూ ఒకరిని ఒకరు చంపుకుంటూ అధర్మపరులౌతారు. చివరకు యమలోక ప్రాప్తిని పొందుతారు. వివేకం కలిగిన వారు పెద్దలను ఆశ్రయించి సన్మార్గమున పయనిస్తారు.

## సంసారమును అధిగమించుట

విదురుడు తన మాటలను కొన సాగిస్తూ ధృతరాష్ట్రమహారాజా ! నేను ఈ సంసారమును ఎలా అధిగమించాలో పెద్దలవలన విని యున్నాను అది నీకు వివరిస్తాను. శ్రద్ధగా విను. దుర్గమైన అడవిలో ఒక బ్రాహ్మణుడు వెళుతున్నాడు. అప్పుడు పులులు, సింహాలు, ఏనుగులు మొదలైన అడవి జంతువులు అతడిని వెన్నంటాయి. ఆ బ్రాహ్మణుడు ప్రాణ భయంతో అడ్డదారిలో పరుగెడగా ఆ క్రూర జంతువులు అతడిని వదిలి వెళ్ళి పోయాయి. ఇంతక్లో ఒక దొంగల గుంపు అతడిని అడ్డగించింది. ఆ బ్రాహ్మహ్మణుడు ప్రాణ భయంతో కాళ్ళు గజగజ వణుకుతుండగా చలన రహితంగా నిలబడ్డాడు. చుట్టూ పరికించి చూసి తనను రక్షించడానికి ఎవరూ లేనందున వెనక్కి తిరిగి పారి పోసాగాడు. వెనుక నుండి దొంగలు ముందు నుండి క్రూరజంతువులు ఎంత పరుగిడినా అడవికి అంతు దొరకడం లేదు. ఇంతలో భయంకరాకారంతో ఉన్న ఒకస్త్రీ అతడిని కౌగలించుకుంది. అతడిలో భయం ఇనుమడించింది. అయిదు తలలు కలిగిన ఏనుగులను చూసాడు. ఆస్త్రీని విడిపించుకుని పరుగెడుతూ లతలతో నిండి పైకి కనిపించని బావిలో పడ్డాడు. పడుతూ పడుతూ బలమైన తీగను ఒక దానిని పట్టుకుని తల కిందులుగా వేలాడ సాగాడు. కిందికి చూడగా ఒక పెద్ద పాము నాలుకలు భయంరంగా చాస్తూ అతడి వైపు రాసాగింది. పైకి చూడగా 6 తలలు 12 కాళ్ళతో ఒక ఏనుగు బావి చెంత ఉన్న ఒక చెట్టు వద్దకు వచ్చింది. ఆ చెట్టు చిత్ర విచిత్ర రంగులతో వెలిగి పోతుంది. తుమ్మెదలు ఆ చెట్టులోని మకరందం తాగుతున్నాయి. కాని నల్లని తెల్లని ఎలుకలు ఆ చెట్టు మొదలును కొరుకుతున్నాయి. ఆ చెట్ల పూల నుండి బొట్టు బొట్టుగా మధువు ఆ బ్రాహ్మణుడి నోట్లో పడుతుంటే అతడు దానిని త్రాగి ఆనందిస్తున్నాడు. ఆ మధువు ఎంత త్రాగినా తృప్తి తీరక తాను ఉన్న దుస్థితిని మరచి ఆనందిస్తున్నాడు. ఈ విధంగా ఆ బ్రాహ్మణుడికి కింద ఉన్న పాము, పైన ఉన్న భయంకరాకార స్త్రీ, క్రూర మృగములు, ఎలుకలు కొరకడంతో ఏనిముషమైనా పాడడానికి సిద్ధంగా ఉన్న చెట్టు, వేచి ఉన్న దొంగలు, ఝూంకారం చేస్తున్న తుమ్మెదలు వీటితో మనసు కకావికలు ఔతున్నా అతడికి జీవితం మీద వ్యామోహం పోలేదు. ప్రాణముల మీద తీపి చావ లేదు " అన్నాడు విదురుడు. ధృతరాష్ట్రుడు " విదురా ! ఈ కథ నాకు అర్ధం కాలేదు. వివరంగా చెప్పు " అన్నాడు.

## సన్మార్గ బోధన

విదురుడు " మహారాజా ! ఈ ప్రపంచంలో పెద్దలు మనుషులకు సన్మార్గ బోధన చేయడానికి ఈ కథ చెప్తారు. ఈ కథ మన జీవితంలాంటిది. ఈ కథని వివరిస్తే కాని అర్ధంకాదు. ఆ బ్రాహ్మణుడు పయనిస్తున్న అడవి సంసారం. అందు ఉన్న క్రూరమృగములు, దొంగలు, మృగముల కొరకు పన్ని ఉచ్చులు రోగములు, భయంకరాకారంతో పయనిస్తున్న స్త్రీ ముసలి తనము, అయిదు తలల ఏనుగు పంచేంద్రియాలు, బావిలో ఉన్న పాము యమధర్మరాజు, ఆ బ్రాహ్మణుడు పట్టుకున్న తీగ బ్రతకాలన్న ఆశ, ఆ ఒడ్డున ఉన్న చెట్టు ఆయుషు, దాని వైపు వచ్చిన ఏనుగు ఒక సంవత్సర కాలం దాని ఆరు తలలు ఆరు ఋతువులు, పన్నెండు కాళ్ళు పన్నెండు నెలలు. ఆచెట్టును కొరుకుతున్న నల్లని తెల్లని ఎలుకలు రాత్రి పగలు, ఆ బ్రాహ్మణుడి చుట్టూ ఝోంకారం చేస్తున్న తుమ్మెదలు కోరికలు. పూలనుండి స్రవిస్తున్న మకరందం సుఖసంతోషాలు. తన

చుట్టూ ఇన్ని బాధలు ఉన్నా జీవుడు ఆ సుఖసంతోషాల కొరకు పాకులాడుతుంటాడు. కలకాలం బ్రతకాలని అనుకుంటాడు. బ్రాహ్మణుడే జీవుడు. ఇదే సంసార చక్రం. వివేకవంతులైన వారు ఈ సంసారచక్రంలో బంధించ బడక వెలుపలి నుండి చూస్తూ శాశ్వితమైన ఆనందాన్ని పొందుతారు. .

## విదురుని జ్ఞానబోధ

ఓ ధృతరాష్ట్ర మహారాజా ! నిరంతరం ప్రాపంచిక సుఖాల కొరకు పరితపిస్తూ ఈ బురద గుంటలో మునుగుతూ తేలుతూ తనను తాను మరచి పోతాడు మానవుడు. శరీరబలం తగ్గగానే రోగాలు ఆవహిస్తాయి. ముసలితనం మీద పడి అందం అంతరించి దైన్యం ఆవహిస్తుంది. సుఖాలు అనుభవించడానికి పనికిరాక దిక్కులేని చావు చస్తాడు. మహారాజా ! ఈ దేహమే ఒక రధము. బుద్ధి రధ సారధి. పంచేంద్రియములే గుర్రములు. మన ఆలోచనలే పగ్గాలు. పంచేంద్రియాలు అనే గుర్రాలు అదుపు తప్పి ప్రవర్తించినప్పుడు బుద్ధి అనే పగ్గాలు పరిష్టంగా లేని ఎడల గుర్రాలు ఇచ్చవచ్చిన రీతిలో ప్రవర్తిస్తాయి. కనుక బుద్ధిని ఉపయోగించి ఆలోచనలు అనే పగ్గాలతో వాటిని నియంత్రించిన మానవుడు దు:ఖభాజనుడు కాడు. పుట్టినప్పటి నుండి ఈ జీవితం యమధర్మరాజు ఆధీనంలో ఉంటుంది. ఈ జీవితం అనేక దు:ఖాలకు మూలము. వివేకవంతులు వివేకము అనే మందును ఉపయోగించి తమ దు:ఖాలను తొలగించుకుంటారు. వివేక వంతులు తమ బుద్ధిని ఉపయోగించి గుర్రములను అదుపులో పెట్టి రధమును సక్రమ మార్గమున నడిపించి ముక్తిని పొందుతారు. కనుక ధృతరాష్ట్ర మహారాజా ! నీ కుమారుల మరణానికి దు:ఖించుట మాని నీ కుమారులు, బంధుమిత్రులకు దహనసంస్కారం జరిపించు " అని అన్నాడు విదురుడు.

## వ్యాసుడి రాక

విదురుడి మాటలతో తిరిగి కుమారులు గుర్తుకు రాగా ధృతరాష్ట్రుడు ఏడుస్తూ మూర్చిల్లాడు. పరిచారికలు అతడి ముఖము మీద చల్లని నీళ్ళు చిలకరించి సేద తీర్చారు. ఇంతలో వ్యాసుడు అక్కడకు వచ్చాడు. అనుకోకుండా వచ్చిన వ్యాసుడికి విదురుడు, సంజయుడు నమస్కరించారు. మూర్చనుండి తేరుకున్న ధృతరాష్ట్రుడికి వ్యాసుడి రాక ఎరిగించారు. ధృతరాష్ట్రుడు చేతులు వణుకుతుండగా వ్యాసుడికి నమస్కరించి " మహామునీ ! చూసితివా ! నా దుర్గతి. నేను ఇంకా ఎందుకు బ్రతికి ఉన్నానో తెలియడం లేదు. ఈ జన్మ ఎంత దుర్భరమో ఇప్పుడు తెలిసింది. నా దుస్థితి చూసారా ! కుమారులంతా మరణించారు బంధుమిత్రులు నశించారు. సంపదలంతా ఊడ్చుకు పోయాయి. అయినా నా ప్రాణములు నన్ను అంటి పెట్టుకునే ఉన్నాయి. ఇది నా దౌర్భాగ్యం కాక మరేమిటి " అని దు:ఖించాడు. ధృతరాష్టుడి దు:ఖం చూసి వ్యాసుడు " కుమారా ! నీ దు:ఖం పోగొట్టడానికే నేను వచ్చాను. సకల శాస్త్రములను తెలిసిన వాడవి, నీతి శాస్త్ర కోవిదుడివి చనిపోయిన కుమారుల కొరకు దు:ఖించుట సమంజసం కాదు. పుట్టిన వాడు మరణించక తప్పదు. ఈ జీవితం ఎవరికి శాశ్వతం కాదన్న జ్ఞానం ఎరిగి దు:ఖం పోగొట్టుకుని నీ తరువాతి కర్తవ్యం నెరవేర్చు. కుమారా ! అసలు నీకుమారులకూ పాండుసుతులకు నీకు తెలియకనే వైరం సంభవించిందా ! కురువంశనాశన కారకుడు నీ కుమారుడు కాదా ! ఇక నీవు దు:ఖించడం తగునా ! జూద క్రీడా సమయమున విదురుడు నీకు అనేక విధముల చెప్పినా నీవు వినక ఫలితం అనుభవిస్తున్నావు. ఇదంతా ఈశ్వర సంకల్పమే పోనీలే బాధపడకు దు:ఖం పోగొట్టుకో బాధపడకు. నీకు మేలు కోరి నీకు ఒక దేవరహస్యం చెప్తాను విను.

## ధృతరాష్ట్రుడికి వ్యాసుడు దేవరహస్యం చెప్పుట

ఒకసారి నేను దేవసభకు వెళ్ళాను. అక్కడ ఇంద్రాది దేవతలు నారదాది మహా మునులు ఉండగా భూదేవి అక్కడకు వచ్చి దేవతలను చూసి ఇలా అన్నది " దేవతలారా ! ఇదివరకు మీరు నాకు పెరిగిన భూభారం తగ్గించడానికి ఉత్సుకత చూపారు. ఎందుకనో ఆ మాట మరిచారు. నాకు రోజు రోజుకు భారం పెరిగి పోతుంది. దీనిని తగ్గించే ఉపాయం ఆలోచించండి " అని అడిగింది. అప్పుడు శ్రీమహావిష్ణువు చిరు నవ్వుతో " భూదేవీ ! నీవడిగిన దానికి తగు సమయం ఆసన్నమైంది. ధృతరాష్ట్రుడు అనే మహారాజుకు నూరుగురు కుమారులు కలుగుతారు. అందులోని జ్యేష్టుడైన దుర్యోధనుడు నీ కోరికను తీరుస్తాడు. ఇది త్వరలో సంభవించగలదు. అతడి కారణంగా కురుక్షేత్ర సంగ్రామం జరుగుతుంది. అతడికి ఈ భూమిలోని రాజులంతా సాయానికి వచ్చి నశించి పోతారు. సోదరసమేతంగా దుర్యోధనుడు మరణిస్తాడు. నీ భారం తగ్గ కలదు " అని పలికాడు. ఆ మాటలకు భూదేవి సంతసించి అక్కడ నుండి వెళ్ళి పోయింది. విష్ణువు ఆదేశానుసారం కలి పురుషుడు దుర్యోధనుడిగా జన్మించాడు. అతడు మహా బలిష్టుడు, కోపిష్టి పరుల ఉన్నతిని సహించ లేడు. అతడు ఎవరిని లక్ష్యపెట్టక అందరితో వైరము పెట్టుకుని అతడికి తోడుగా అతడి మేన మామ శకుని, తమ్ముడు దుశ్శాసనుడు, అంగరాజు కర్ణుడు అనుచరులుగా ఉంటారు. అనేక దుష్కర్మలు ఆచరించి వాటి కారణంగా సోదర, బంధు మిత్ర సమేతంగా నశిస్తాడు. ఇది దేవతల అభీష్టం కనుక నీవు

దు:ఖించ పని లేదు.

## వ్యాసుడు ధృతరాష్ట్రుడికి ధైర్యంచెప్పుట

కానీ నీ మనసులో ఒక సందేహం ఉంది. పాండుసుతులు నిన్ను ఆదరిస్తారో లేదో అని శంకిస్తున్నావు. పాండవుల వలన నీకు కీడు జరుగదు. నీ కుమారుడికి భూమిని అంతా పాలించాలని దుర్బుద్ధి పుట్టి పాండవుల రాజ్యమును అన్యాయంగా అపహరించి వారి రాజ్యాన్ని వారికి ఇవ్వక వారికి కీడు తలపెట్టినా వారు నీ ఎడల ఇంచుక అపకారబుద్ధిని ప్రదర్శించ లేదు. సంధి కొరకు ప్రయత్నించారు. నేను కూడా అనేక విధముల సంధి చేసుకొనుట మంచిదని నీకుమారునకు చెప్పాను నీ కుమారుడు ఎవరి మాటలు లక్ష్య పెట్టక ఇప్పుడు ఫలితం అనుభవించాడు. ఇదంతా దైవనిర్ణయం ఎవరూ తప్పించ లేరుకనుక కనుక నీ కుమారుల కొరకు నీవు చింతించపని లేదు. నీ తమ్ముని కుమారుడు ధర్మరాజు అజాతశత్రువు. అతడు సాటి మనుష్యుల అందే కాదు పశుపక్షులందు జాలి కలిగి ఉంటాడు. ఈ విషయము నీకూ తెలుసు. ధర్మరాజుకు నీ అందు విముఖత లేదు. కనుక పాడవులను నీ కుమారుల వలె ఆదరించు. మహాజ్ఞానివైన నీవు నీ శోకాన్ని జ్ఞానాగ్నిలో దగ్ధంచెయ్యి. ప్రశాంతిని పొందు " అని పలికాడు వ్యాసుడు. ధృతరాష్ట్రుడు వ్యాసుడితో " మహానుభావా ! అమృతతుల్యమైన నీ మాటలు నాకు దు:ఖోపశమనం కలిగించింది. నేను పాండవులను నా కుమారుల వలె ఆదరిస్తాను " అని పలికాడు. ఆమాటలు విని వ్యాసుడు ధృతరాష్ట్రుడిని ఆశీర్వదించి వెళ్ళాడు ధృతరాష్ట్రుడు సంజయుడిని చూసి " సంజయా ! మనం యుద్ధ భూమికి వెళదాము అందుకు కావలసిన సన్నాహములు కావించండి. గాంధారిని అంత:పుర స్త్రీలను ప్రయాణముకు సిద్ధం కమ్మని చెప్పు " అన్నాడు. సంజయుడు ధృతరాష్ట్రాదులు యుద్ధ భూమికి పోవడానికి సన్నాహాలు పూర్తి చేసాడు.

## ధృతరాష్ట్రుడు గాంధారి యుద్ధ భూమికి వెళ్ళుట

పుత్రశోకంతో గాంధారికి అడుగులు తడబడుతున్నాయి. గాంధారికోడళ్ళు కంటికిమంటికి ఏకధారగా ఏడుస్తున్నారు. దు:ఖభారంతో నడుస్తున్న వారు పైట తొలగినా జుట్టు విడివడినా పట్టించికునే స్థితిలో లేరు. కుంతీదేవి వారిని ఓదారుస్తుంది. అందరూ ఓదారుస్తున్నారు. హస్థినాపరంలో ఉన్న సాధారణ స్త్రీలపని అలాగే ఉంది. వారిని ఓదార్చే వారే కరువైయ్యారు. పురుషులంతా యుద్ధ భూమిలో మరణించగా భార్యాబిడ్డలు అనాధలవలె మిగిలారు. వాళ్ళలో వాళ్ళు ఒకరిని ఒకరు ఓదార్చుకుంటున్నారు. అందరి ఇళ్ళు అర్తనాదాలతో నిండి పోయాయి. ఇదంతా చూసి విదురుడికి మనసు కలత చెందింది. యుద్ధపరిణామం ఇంత భయంకరంగా ఉంటుందా ! ఎంత మందిని అని ఓదార్చగలడు. కొంత దూరం నడిచేసరికి రధికత్రయం ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళి " మహారాజా ! నీ కుమారుడు సుయోధనుడు దేవతలు మెచ్చేలా యుద్ధం చేసి వీరమరణం చెందాడు. మేము ముగ్గురం తప్ప మిగిలిన కురుసైన్యమంతా మరణించింది " అన్నారు.

## కృపాచార్యుడు భీమసుయోధన యుద్ధం వర్ణించుట

గాంధారిని చూసిన కృపాచార్యుడు దు:ఖం ఆగక " అమ్మా గాంధారీ ! నీ కుమారులు యుద్ధ భూమిలో వీరోచితంగా పోరాడి తమ ప్రాణాలు సమర్పించి వీరస్వర్గం అలంకరించారు. కనుక నీవు దు:ఖించకమ్మా ! నీ కొడుకుల్లో ఒక్కడూ యుద్ధ భూమిలో వెన్నిచ్చి పారి పోలేదు. యుద్ధముకు జంక లేదు. అమ్మా ! పాండవులకు జయించినా సంతోషం లేదు. భీముడు సుయోధనుడిని అధర్మంగా నాభి కిందభాగాన కొట్టి పడగొట్టింది చాలక తలను కాలితో తన్నాడు. అది విని మాకు కోపం ఆగలేదు. మేము ముగ్గురం పాండవ శిబిరంలో ప్రవేశించి వారి కుమారులను, బంధువులను పాంచాల రాకుమారులను, వారి సైన్యమును గజములను హయములను దారుణంగా చంపాము. కనుక పాండవులవిజయం వ్యర్ధమైంది. ఆ సమయంలో పాండవులు శ్రీకృష్ణుడు సాత్యకి అక్కడ లేరు కనుక బ్రతికి పోయారు. లేకున్న అపాండవమై సుయోధనుడి ఆఖరి కోరిక నెరవేరేది. మేము అర్ధరాత్రి పాడవుల కుమారులను, బంధువులను ససైన్యంతో చంపినవిషయం తెలుసుకున్న పాండవులు క్రోధంతో మమ్ము వెతుకుతుంటారు. కనుక మాకు శలవిప్పించండి వెళతాము " అని శలవు తీసుకుని తమ తమ రధముల మీద వెళ్ళారు. కొంత దూరం పోయిన కృపాచార్యుడు వెనక్కు తిరిగి హస్థినకు వెళ్ళాడు. కృతవర్మ ద్వారకకు వెళ్ళాడు. అశ్వత్థామ గంగా తీరమున ఉన్న వ్యాసాశ్రమానికి వెళ్ళాడు. ఓ జనమేజయ మహారాజా ! వ్యాశ్రమంలో జరిగిన విషయం నీకు ముందే చెప్పాను కదా ! తరువాత ధృతరాష్ట్రుడు అంత: పుర స్త్రీలతో సహా యుద్ధభూమికి వెళ్ళాడు.

## ధర్మరాజు ధృతరాష్ట్రుడికి ఎదురేగుట

ధృతరాష్ట్రుడు యుద్ధభూమికి వస్తున్నాడు అని తెలిసి ధర్మరాజు తన తమ్ములతోనూ కృష్ణుడితోనూ ధృతరాష్ట్రుడికి

ఎదురేగాడు. కాని తన కుమారులను అందరినీ పోగొట్టుకుని మనసంతా దహించుకు పోతున్న మనసుతో వస్తున్న ధృతరాష్ట్రుడిని చూడడానికి ధర్మరాజు మనసులో కలవర పడ్డాడు. ధర్మరాజు వడివడిగా ధృతరాష్ట్రుడికి ఎదురు వెళ్ళాడు. అతడి వెంట సాత్యకి, భీముడు, అర్జునుడు, నకులసహదేవులు, ద్రౌపది వెళ్ళారు.

## కురుసామ్రాజ్య ప్రజలు ధర్మరాజును నిందించుట

ధర్మరాజును చూసి కౌరవ వనితలు హాహాకారాలు చేసారు. మరి కొంత మంది ధర్మరాజును తిట్ట సాగారు " ఇతడు ధర్మరాజట ! ఇతడికి ధర్మం తెలుసా ! ఇతడికి జాలి దయా ఉన్నాయా ! ఉంటే తాతలను, తమ్ములను, బంధువులను, మిత్రులను, గురువులను, కుమారులనూ చంపాడు. వీడికి కనికరమేమిటి ! " అని ఈసడించుకొనగా ! మరి కొంత మంది ధర్మరాజుకు వెళ్ళి " ఓ ధర్మరాజా ! చదువులు చెప్పిన గురువునే చంపడానికి నీకు మనసెలా ఒప్పింది " అని అడిగాడు. మరికొంత మంది " ఓయీ ధర్మరాజా ! చెల్లెలి భర్త అని చూడక జయద్రధుడిని చంపించావే ! శ్మశానం లాగా మారిన ఈ రాజ్యం అంతా కట్టకట్టుకుని ఊరేగు " అన్నారు. ఎవరేమన్నా ! పాండవులు ఒక్క మాట కూడా మాట్లాడ లేదు. అయినా వారు తిట్టడం ఆపలేదు. ఇంకొంత మంది పాండవులకు అడ్డంగా వచ్చి " ఒయీ ! ధర్మరాజా ! నీ వలన కాదా ! అభిమన్యుడు మరణించింది, ద్రౌపది కొడుకులంతా వధించబడింది. నీ మరుదులందరినీ వధించినా నీ రక్త దాహం తీరలేదా ! " అన్నారు. అందరి తిట్లను భరిస్తూ ధర్మరాజు ధృతరాష్టుడి వద్దకు వెళ్ళాడు. పక్కన ఉన్న వారు ధర్మరాజు వచ్చాడని చెప్పగానే ధృతరాష్ట్రుడిలో కోపం ముంచుకు వచ్చి భోరున ఏడుస్తూ ధర్మరాజును కౌగలించుకున్నాడు.

## ధృతరాష్ట్ర హృదయం

తరువాత ధృతరాష్ట్రుడికి పక్కన ఉన్న వారు వలన భీమార్జున, నకుల సహదేవులు కూడా వచ్చారని వినగానే భీముడు అన్న మాట ధృతరాష్ట్రుడిలో కోపాగ్నిని రగిల్చింది. అతడి ముఖం వికృతంగా మారింది దహించుకు పోతున్న హృదయంతో అతడిని కౌగలించుకోబోయాడు. ఏదో ప్రమాదం జరుగుతుందని ముందుగా ఊహించిన కృష్ణుడు తాను ముందే సిద్ధంగా ఉంచిన భీముని విగ్రహాన్ని అతడి ముందుకు తోసాడు. లోహవిగ్రహమే భీముడు అనుకుని ధృతరాష్ట్రుడు ఘాఢకౌగిలిలో బంధించి దానిని ముక్కలు చేసాడు. ఆ ముక్కలు గుచ్చుకుని ధృతరాష్ట్రుడి శరీరానికి గాయాలు అయ్యాయి. ముఖం నుండి రక్తం స్రవించగా ! అతడు మూర్చిల్లాడు. తరువాత " నా కుమారులను చంపిన వాడిని చంపి నా పగ తీర్చుకున్నాను " అంటూ లేచాడు. అతడి ముఖంలో సంతోషం వెల్లి విరిసినా పక్కన ఉన్న వారు ఏదైనా అనుకుంటారన్న జంకుతో దు:ఖాన్ని అభినయిస్తూ భీముడి మరణానికి ఏడవసాగాడు. పక్కన ఉన్న శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుడి భుజం తట్టి ధృతరాష్ట్ర మహారాజా ! భీముడు జీవించే ఉన్నాడు. నీవు దు:ఖించవలసిన అవసరం లేదు. భీముని మీద నీకు ఉన్న క్రోధం ముందుగా ఊహించి అతడికి బదులుగా భీముని వంటి విగ్రహాన్ని నీ ముందుంచాను. నీవు నలిపింది భీముని విగ్రహాన్నే కాని భీముడిని కాదు. ధృతరాష్ట్ర మహారాజా ! నీ బలం ముందు ఈ భీముడెంత ! ఈ మూడు లోకాలలో నీకు సాటి రాగల బలాఢ్యుడెవ్వడు ! కొడుకులు పోయారన్న దు:ఖంతో భీముని చంపాలనుకున్నా భీముడికి నీ చేతిలో చావు లేదు కదా ! అయినా మహారాజా ! భీముడే కాదు పాండవులు అందరిని చంపినా నీ కుమారులు తిరిగి వస్తారా ! అనవసరంగా అపవాదు మూట కట్టుకోవడం తప్ప " అన్నాడు.



భీముని లోహ విగ్రహాన్ని ముక్కలు చేస్తున్న ధృతరాష్ట్రుడు - రాజ్మానామా నుండి ఒక దృశ్యం

## శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుడి దోషం ఎత్తి చూపుట

ధృతరాష్ట్రుడు సిగ్గుతో తలవంచుకున్నాడు. తనవంటికి అంటుకున్న రక్తం గాయాల నుండి స్రవిస్తున్న రక్తం కడుక్కున్నాడు. తిరిగి కృష్ణుడు " ధృతరాష్ట్ర మహారాజా ! వేద వేదాంగ పారంగతుడవు ఎన్నో శాస్త్రములను పురాణములను విని వాటి సారం గ్రహించిన నీవు నీ తప్పు తెలుసుకోకుండా ఇతరులను నిందిస్తూ నీలో నీవే దు:ఖిస్తున్నావు. నాడు నేను, భీష్ముడు, ద్రోణుడు, విదురుడు, మహామునులు నీకు పరి పరి విధముల చెప్పినా లక్ష్యపెట్టక కోరి యుద్ధం కొని తెచ్చుకుని ఇప్పుడు ఫలితం


భాదపడుతున్న ధృతరాష్టుడిని ఓదారుస్తున్న కృష్ణుడు

అనుభవిస్తున్నావు. స్వయంకృతాపరాధముకు చింతించిన ఫలమేమి ! భీమార్జునులను ఎదుర్కొని గెలువగల వీరులు ఈ ఉర్విలో ఉన్నారా ! అది నీవు ఎరుగవా ! నీ మనస్సును నీవు నియంత్రించ లేక పోయావు. నీకుమారుడి చెడునడతను అదుపులో పెట్టడం నీకు చేతకాలేదు. జూదంలో గెలిచామన్న నెపంతో నీవు పాండవ పత్ని నీ కోడలు అయిన ద్రౌపదిని కొప్పు పట్టి సభకు ఈడ్చి దుర్భాషలు ఆడి వలువలు ఊడదీస్తున్నప్పుడు వారిని మందలించి అదుపులో పెట్ట లేని అసమర్ధుడవయ్యావు. కాని భీముడు నాడు చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకుంటూ నీకుమారులను చంపినందుకు అతడిని నిందిస్తున్నావు. ఇది న్యాయమా ధర్మమా ! నీ కుమారుల అవినీతిని దుష్ప్రవర్తనను తలచుకొని నీ కోపాన్ని విడిచి పెట్టు " అని హితవు పలికాడు. ధృతరాష్ట్రుడు " కృష్ణా ! నీవు పలికినదంతా నిజమే. కాని కొడుకులను పోగొట్టుకున్న దు:ఖం భరించలేక అనుచితంగా ప్రవర్తించినందుకు సిగ్గుపడుతున్నాను. నీ మాటలతో నాకు జ్ఞానోదయం అయింది. ఇక మీద పాండుకుమారులను నా కుమారులుగా భావిస్తాను " అని పలికి. తరువాత భీమార్జున నకుల సహదేవులను కౌగలించుకున్నాడు. తరువాత యుయుత్సుడు వచ్చాడని విని కనీసం ఒక్క కొడుకైనా మిగిలాడని అనుకుని సంతోషంగా యుయుత్సుడిని కౌగలించుకున్నాడు.

### వ్యాసుడు గాంధారి శాపం నుండి రక్షించుట

ధృతరాష్ట్రుడు పాండవులతో " పాండుకుమారులారా ! మీ తల్లి గాంధారి వద్దకు వెళ్ళి ఆమెను ఓదార్చండి " అన్నాడు. ధర్మరాజాదులు తమ పెదతల్లి గాంధారి వద్దకు వెళ్ళారు. ఆమెకు నమస్కరించారు. కుమారుల మరణానికి రగిలిపోతున్న మనసుతో గాంధారి ధర్మరాజును శపించడానికి ఉద్యుక్తురాలైంది. అంతలో అక్కడకు వచ్చిన వ్యాసుడికి పాండవులు నమస్కరించారు. గాంధారి మనస్సు తెలుసుకున్న వ్యాసుడు ఆమెను వారిస్తూ " అమ్మా గాంధారీ ! ధర్మరాజును శపించడం ధర్మం కాదు. ధర్మజుడి మీద కోపం మాని శాంతించు. నీకింత రజోగుణం ఎందుకు. సాత్వికంగా ఉండు. నీ కుమారుడు సుయోధనుడు యుద్ధానికి పోతూ నీ ఆశీర్వాదం కోరినప్పుడు నీవు ఏమని ఆశీర్వదించావో తెలుసా ! " ధర్మం ఎక్కడ ఉంటుందో విజయం అక్కడ ఉంటుంది " అన్నావు. అదేనిజమైంది. ఈ మహా సంగ్రామంలో ధర్మమూర్తులైన పాండవులకు విజయం లభించింది. నీ మాట ప్రకారం ధర్మం జయించినట్లే కదా ! అసూయను వదిలి పాండవులలో ఉన్న ధర్మనిరతిని చూడు. నిదానించి యోచించిన నీకే అర్ధం ఔతుంది. అమ్మా ! గాంధారి ! జరిగి పోయిన విషయం తలచి బాధపడిన ఫలితమేమి ! కనుక పాండవుల మీద కోపం మాను " అన్నాడు. .


గాంధారి వారిస్తున్న వ్యాసుడు

### గాంధారి శాంతించుట

ఆ మాటలకు శాంతించిన గాంధారి " మహర్షీ ! నాకు పాండవుల మీద కోపము అసూయ ఎన్నటికీ లేదు. వారికి ఎన్నడూ కీడు తపపెట్ట లేదు. కుమారులను పోగొట్టుకున్న దు:ఖంతో అలా అనుకున్నానే కాని పాండవులు కుంతికి ఎంతో నాకూ అంతే నా కుమారుడి దుర్బుద్ధి దుర్మార్గులైన శకుని, కర్ణ, దుశ్శాసనుల దోర్బోధలు కురు వంశ నాశనానినికి కారణమయ్యాయి కాని వేరు లేదు. కాని భీముడు నా మారుడిని కృష్ణుడి సమక్షంలో నాభి కింద కొట్టి పడగొట్టాడు. అది తల్లినైన నాకు క్షోభ కలిగించదా ! యుద్ధంలో చంపడం చావడం న్యాయమేకాని యుద్ధ నీతిని తప్పి చంపడం అధర్మం కాదా ! ద్రోహం కాదా ! " అని పలికింది. ఆ మాటలు విన్న భీముడు గడగడలాడుతూ గాంధారి వద్దకు వచ్చి ఇలా అన్నాడు " అమ్మా గంధారీ దేవీ ! నేను చేసింది ధర్మమో అధర్మమో ప్రాణభయంతో అలా చేసానో జరిగి పోయింది. దయచేసి నన్ను క్షమించమ్మా ! నా కంటే బలవంతుడు యుద్ధంలో నేర్పరి అతడిని ఓడించడం నాకు వీలైనది కానందున అలా చేసాను. అయినా నీకు తెలియనిది ఏమున్నది. నీ కుమారుడు ధర్మరాజుకు చేసినదంతా ధర్మమా ! ఏక వస్త్రగా ఉన్న ద్రౌపదిని సభకు ఈడ్పించి వలువలు ఊడదీయమిని చెప్పడం ధర్మమా ! తల్లితో సమానమైన వదినకు తొడలు చూపి కూర్చోమని సైగ చేయడం ధర్మమా ! ఆ

సమయంలో ఆగ్రహించిన నేను చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకోవడానికి నీ కుమారుని తొడలు విరిచాను. చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనుట క్షత్రియ ధర్మమం కాదా ! నేను క్షత్రుయుడను కనుక నేను చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చి నా ధర్మం నెరవేర్చుకున్నాను. నాడు కురుసభలోనే ఆ పని చేసి ఉంటే బాగుండేది. కాని ధర్మరాజు నన్ను ఆపాడు కనుక ఊరక ఉన్నాను. అన్న మాట మీర లేక అడవులకు వెళ్ళి అష్టకష్టాలు పడ్డాము. మా అన్నయ్య ధర్మరాజు శ్రీకృష్ణుడిని కురుసభకు రాయబారానికి పంపే సమయాన నా పలుకులు విని ఉంటే నువ్వు నన్ను తప్పు పట్టి ఉండే దానివి కాదు. నేను " సుయోధనా ! అన్నదమ్ములమైన మనకు వైరము తగదు. నలుగురు వేలెత్తి చూపేలా నడుచుకోవడం తగదు మా రాజ్యభాగం మాకిచ్చిన అందరం సుఖంగా ఉంటాము " అన్నాను. నీ కుమారుడు ఆ మాట విని ఉంటే ఇలా జరిగి ఉండేదా ! ఎవరి మాటను లక్ష్యపెట్టక మాతో యుద్ధం కొని తెచ్చుకున్నాడు. పోగొట్టుకున్న రాజ్యం కొరకు ధర్మరాజు, చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనుటకు నేను యుద్ధం చేసాము. మా కర్తవ్యం మేము నిర్వహించాము. సర్వం తెలిసిన నీవే ఏది ధర్మమో నిర్ణయించు " అన్నాడు.

### గాంధారి దుశ్శాసనుడి మరణం గురించి భీముని ప్రశ్నించుట

గాంధారి కొంత సేపు ఆలోచించింది " భీమసేనా ! నీవు చెప్పినది నిజమే అయినా నా కుమారుని తోడలు విరుచుట ధమమా ! నీ ప్రతిజ్ఞ నీవు నెరవేర్చుకున్నావులే ! కాని భీమసేనా ! యుద్ధంలో శత్రువులను చంపవచ్చు కాని సాటి మానవుని గుండెలు చీల్చి రక్తం తాగే క్రూరులు ఎక్కడైనా ఉంటారా ! రాక్షసులు మాత్రమే చేయగలిగిన ఆపని నువ్వు చేసి వృకోదరుడనే నీ పేరు సార్ధకం చేసుకున్నావా ! ఇది ధర్మమా ! " అని అడిగింది. భీముడు " సాటి మానవుడి నెత్తురు తాగడానికి నేను అంతటి క్రూరుడనా ! నాడు ద్రౌపది కొప్పు పట్టి ఈడ్చినప్పుడు నేను చేసిన ప్రతిజ్ఞ చేసుకోవడానికి నేను అలా చేసాను. కాని నెత్తురు నోటికి తాగించానే కాని తాగలేదమ్మా ! అలా చేయడానికి నేను రాక్షసుడనా ! అమ్మా ! ఇంకొక విషయం నేను దుశ్శాసనుడిని చంపినప్పుడు కురువీరులు నన్ను చుట్టుముట్టి ఉన్నారు. స్వీయరక్షణ కొరకు అలా భీకరాకారందాల్చాను కాని నేను అంతటి క్రూరుడను కాదమ్మా ! ఆ సమయంలో నేను అలా చేయకుంటే కురు వీరులు నన్ను ముక్కలు చేసి ఉండే వాళ్ళు. సాటి మనుషుల రక్తంతాగి పెర్రివాడిలా కరుణ లేకుండా తాగెపాతకం చేసేంత దుర్మార్గుడినా ! నేను అంత పాపాత్ముడను కాను నన్ను నమ్ము అమ్మా నేను రక్తం తాగ లేదు " అన్నాడు.

### గాంధారి ఆగ్రహం

గాంధారి అంతటితో ఊరుకోలేదు " భీమసేనా ! నాకు నూరుగురు కొడుకులు ఈ గుడ్డి వాళ్ళను కడతేర్చడానికి ఒక్క కొడుకునైనా మిగల్చకుండా అందరినీ దయాదాక్షిణ్యం లేకుండా చంపావే ! ఇది ధర్మమా ! నూరుగురు కుమారులలో నీకు అపకారం చెయ్యని వాడు ఒక్కడైనా నీకు కనిపించ లేదా ! ఒక్క కుమారుడిని మిగిల్చిన నీ ప్రతిజ్ఞ నెరవేరదా ! నీ అన్న ధర్మరాజు రాజ్యం చేయడానికి నా కుమారుడు అడ్డు వస్తాడని అలాచేసావా ! " అని పక్కకు తిరిగి " ఎక్కడ ఆ మహారాజు ధర్మరాజు " అని కోపంగా అరిచింది. ఆ అరుపుకు ధర్మరాజు గడగడ లాడుతూ " అమ్మా ! ఇక్కడ ఉన్నానమ్మా ! నేనమ్మా ! పాండవాగ్రజుడను ధర్మరాజును. నీ నూరుగురు కుమారులను చంపిన క్రూరుడను, పాపాత్ముడను నన్ను క్షమించకమ్మా ! నీ ఇష్టం వచ్చినట్లు దూషించి నీ శాపాజ్ఞిలో నన్ను ధగ్ధం చెయ్యి. అమ్మా నీ నూరుగురు కుమారులనే కాదు ఈ భూమండలం లోని రాజులందరిని యుద్ధ భూమికి బలి ఇచ్చిన పాపాత్ముడికి నీవు ఏ శిక్ష విధించినా భరిస్తాను అనుభవిస్తాను. బంధు మిత్రులను అందరినీ పోగొట్టుకున్న నాకు ఈ రాజ్యమేల ఈ శరీరంలో ప్రాణం ఎందుకు ! నా లాంటి ద్రోహికి స్వర్గ సుఖాలు ఎందుకు " అని భోరున ఏడ్చాడు. ధర్మరాజు మాటలకు గాంధారికి నోట మాట రాలేదు. ఒక్క నిట్టూర్పు విడిచి కిందకు చూసింది. ఆమె కంటికి కట్టుకున్న బట్ట కిందకు జరిగి ఆమె చూపు ధర్మరాజు కాలి మీద పడి అతడి కాలి గోళ్ళు ఎర్రగా అయ్యాయి. అది చూసి భీమార్జునులు పక్కకు తప్పుకున్నారు. అంతలో గాంధారి శాంతించి ధర్మరాజు తల నిమిరి " నాయనలారా ! మీ అమ్మ కుంతీ దేవిని కలిసి ఆమె దీవెనలు పొందండి " అన్నది. హమ్మయ్య అని పాండవులు నిట్టూర్చి తల్లి కుంతీ దేవి దగ్గరకు వెళ్ళారు.

### పాండవులు కుంతీ దేవిని చూచుట

చాలా కాలం తరువాత పాండవులను చూసి కుంతీ దేవికి దు:ఖము ఆనందమూ కలగలుపుగా స్పందించింది. పాండవులు తాము అరణ్యవాసంలో పడిన బాధలు కుంతీదేవికి చెప్పుకున్నారు. అది విని కుంతీదేవి తల్లడిల్లింది. జరిగిన యుద్ధంలో తన మనుమలు మరణించినందుకు చాలా దు:ఖించింది. తనకు నమస్కరిస్తున్న పాడవులను చూసి వారి తలలు నిమిరి భోరుమంది. " పాండు కుమారులార ఇన్ని రోజులకు మీకు అమ్మ గుర్తుకు వచ్చిందా ! అని వారి శరీరాలు తడిమి కుమిలి

పోయింది. పక్కనే శోక మూర్తిలా ఉన్న ద్రౌపదిని చూసి " అమ్మా ! ఏరమ్మా నా మనుమలు ! అభిమన్యుడు ఎక్కడమ్మా ! ఎక్కడికి వెళ్ళారమ్మా ! నన్ను చూడడానికి ఎందుకు రాలేదు " అని అడిగుతూ పేరుపేరు వరుసనా పిలిచింది.

### గాంధారి ద్రౌపదిని ఓదార్చుట

ఆ మాటలకు ద్రౌపది దు:ఖభారం తాళ లేక మొదలు నరికిన చెట్టులా కుప్ప కూలింది. కుంతీదేవి కోడలిని పొదివి పట్టుకుని భోరుమంది. కొంత సేపటికి తేరుకుని ద్రౌపదిని ఓదార్చి గాంధారి వద్దకు తీసుకు వెళ్ళింది. గాంధారి ద్రౌపదిని ఓదారుస్తూ " అమ్మా ! ద్రౌపదీ ! ఊరుకోమ్మా. పాండవులకు మాత్రం కొడుకులను పోగొట్టుకున్న బాధ లేదా ! మీ అత్త కుంతీదేవికి మాత్రం మనుమలను పోగొట్టుకున్న దు:ఖం లేదా ! అమ్మా ద్రౌపదీ ! నీవు నేను ఒకే మాదిరి శోకం అనుభవిస్తున్నాము. నీకూ కొడుకులు పోయారు. నాకూ కొడుకులు పోయారు. ఇలా జరుగుతుందనే విదురుడు కురు సభలో ఎంతగానో చెప్పి చూసాడు. నేను ఏమాత్రం నా కుమారుల దుశ్చర్యలు ఆప లేక పోయాను కనుకనే ఫలితం అనుభవిస్తూ ఉన్నాను. అయినా అంతా విధివిలాసం కాల మహిమ ఊరుకోమ్మా ! " అని ద్రౌపది ఓదార్చింది.

## = బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభ్రువాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

# స్త్రీ పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# ద్వితీయాశ్వాసం

వైశంపాయన మహర్షి జనమేజయునకు చెప్పిన మహా భారతకధను సూతుడు నైమిశారణ్యంలో శౌనకాది మహామునులకు చెప్పసాగాడు. ఆ ప్రకారంగా ద్రౌపదిని ఓదార్చిన తరువాత యుద్ధభూమికి వెళ్ళింది. వ్యాసమహాముని కరుణ వలన ఆమెకు కళ్ళకు గంతలు ఉన్నా యుద్ధ భూమి సవిస్తరంగా కనిపించసాగింది. సుదూరంలో ఉన్న దృశ్యాలు దగ్గరగా కనిపించసాగాయి. గాంధారి యుద్ధభూమి అంతా పరికిస్తూ ముందుకు నడుస్తుంది. ఆమె కళ్ళు సుయోధనుడి శవం కొరకు గాలిస్తున్నాయి. విరిగిన రధాలు, ముక్కలైన ధ్వజాలు, చచ్చిన ఏనుగులు, గుర్రాలకళేబరాలు గుట్టలుగా పడి ఉన్నాయి. చనిపోయిన సారధులు, సైనికుల శవాలు చెల్లా చెదురుగా పడి ఉన్నాయి. తల ఒక చోట ఉంటే మొండెం మరొక్క చోట ఉంది. అది చూసి గాంధారి మనసు కలత చెందింది. మహా మహా సామ్రాజ్యాలు ఏలిన మహారాజులు నోళ్ళు తెరచుకొని శవాలై పడి ఉన్నారు. వారి శరీరాల నుండి కారిన రక్తం కాలువలై ప్రవహిస్తుంది. వారు ధరించిన విల్లులు, అంబులు, కత్తులు మొదలైన ఆయుధములు గుట్టలుగా పడి ఉన్నాయి. కొంత మంది శరీరాలు గుర్తించ వీలు లేని విధంగా ఉన్నాయి. వాటి కొరకు వచ్చిన రాబందులు, గద్దలు, అక్కడక్కడా ఎగురుతూ దొరికిన శవాన్ని దొరికినట్లు పీక్కు తింటూ తిరుగుతున్నాయి. తోడేళ్ళు స్వైర విహారం చేస్తూ శవాలని చీల్చి కండలు ఊడబెరికి తింటున్నాయి.

### గాంధారి బాధ

ఇదంతా చూసిన గాంధారి మనసు బాధతో విలవిల్లాడింది. తన కుమారుడి మూర్ఖత్వం ఇంతటి మారణహోమానికి దారి తీసిందని బాధపడింది. వ్యాసుడు ధృతరాష్ట్రుడితో శవాలన్నింటికీ సామూహిక దహనకాండలు జరిపించమని చెప్పి వెళ్ళి పోయాడు. పాండవులు, శ్రీకృష్ణుడు, ధృతరాష్ట్రుడిని నడిపించుకుంటూ తీసుకు యుద్ధభూమికి తీసుకు వచ్చారు. గాంధారి కోడళ్ళు అందరూ తమ తమ భర్తల శవాల కొరకు యుద్ధ భూమి అంతా కలియ తిరుగుతున్నారు. ఇతర హస్థినాపుర స్త్రీలు కూడా తమ భ్యర్తల కళేబరాల కొరకు తిరుగుతున్నారు. అందరూ బిగ్గరగా ఏడుస్తూ, కుమారులనూ, భర్తలను పిలుస్తూ తూలుతూ నడుస్తున్నారు. కొంత మంది తమ సోదరులు, భర్తలు, కుమారులు, బంధువులు శవాలుగా పడి ఉండటం చూసి సహించ లేక హాహాకారాలు చేస్తూ మూర్చ పోయారు. మరి కొంత మంది చని పోయిన వారి గురించి తలచుకుంటూ వారి గురించి చెప్పుకుంటూ తలలు బాదుకుంటున్నారు.

### గాంధారి కృష్ణుడితో చెప్పి విలపించుట

ఇది చూసిన గాంధారి మనసు కకావికలు కాగా దూరంగా ఉన్న కృష్ణుడిని దగ్గరకు పిలిచి " కృష్ణా ! చూడవయ్యా ధృతరాష్ట్ర మహారాజు కోడళ్ళు ఎలా ఏడుస్తున్నారో చూడు. వారి భర్తల శవాల కొరకు ఎలా వెదుకుతున్నారో చూడు. ఒకరి భర్తల శరీరాలను ఒకరు వెతుకుతూ ఏడుస్తూ వారి వారి భార్యలను ఏడుస్తూ ఎలా పిలుస్తున్నారో చూడవయ్యా ! నా కుమారుల మీద కసి ద్వేషం పెంచుకున్న వారి కళ్ళు ఈ దృశ్యాలు చూసి చల్లబడ్డాయా ! వీరంతా ఏమి పాపపం చేసారని వీరికి ఈ శిక్షవేసారయ్యా మీరు. అడుగో ద్రోణుడు, కర్ణుడు, శల్యుడు, ద్రుపదుడు వీరంతా చనిపోయినా ముఖంలోని కళ తగ్గకుండా ఎలా వెలిగిపోతున్నారో చూడవయ్యా ! అత్యంత భోగాలను అనుభవించిన ఆ మహానుభావులు ఎలా పడి ఉన్నారో చూడవయ్యా ! వంది మాగధులు కైవారముతోగాని నిద్ర లేవని ఈ మహా మహులు ఈ రోజు నక్కల ఊళల మద్య అచేతనంగా పడి ఉన్నారయ్యా ! హంస తూలికా తల్పమున గాని శయనించని రాజాధిరాజులు కటిక నేలన పడి ఉన్నారయ్యా ! నానా విధ సుఘంధ లేపనాలతో శరీరాలను అలంకరించుకునే రాజాధిరాజులు ధూళి దూసరిత రక్తమయ భూమిలో దొర్లుతున్నారు చూడవయ్యా ! కృష్ణా ! ఇవన్నీ చూసి ఎలా ఊరుకున్నావయ్యా ! ఇదంతా నీవు సాధించిన ఘనకార్యం కాదా ! అటు చూడవయ్యా ! కొంత మంది కౌరవ కాంతలకు తమ భర్తల తలలు కానక ఎలా విలపిస్తూ వెతుకుతున్నారో చూడవయ్యా ! మరి కొందరు తలలు చేత పట్టి మొండెములు కానక అల్లాడుతున్నారయ్యా ! మరి కొందరు ముక్కలై పోయిన తమ భర్తల శరీరభాగాలను ఒకటిగా చేర్చి కుమిలి కుమిలి ఏడు స్తున్నారయ్యా ! మరి కొందరు నక్కలు తోడేళ్ళు చిందర వందర చేయడంతో శరీరాలను కానక క్షోభిస్తున్నారయ్యా ! ఇటువంటి దురవస్థలను చూడడానికి నేను ఈ జన్మలో ఏపాపపం చేసానో కృష్ణా ! నా కొడుకులను, కోడళ్ళను, తమ్ముళ్ళను, బంధువులను ఇలాంటి దుస్థితిలో చూస్తున్నాను " కాని కృష్ణుడు మాటాడక నిశ్శబధంగా గాంధారి వెంట నడుస్తున్నాడు.

### గాంధారి సుయోధనుడిని చూసి విలపించుట

ఇంతలో దూరంగా సుయోధనుడి శవం పడి ఉండటం చూసింది. దిక్కు లేకుండా పడి ఉన్న అభిమానధనుడైన సుయోధనుడి శవం చూసి గాంధారి కుప్పకూలి పోయింది. తన కుమారుడి శవం మీద పడి రోదిస్తూ " నాయనా సుయోధనా ! ఏమిటిది సుయోధనా ! నీ శరీరం దుమ్ము ధూళిలో పడి దొర్లడం ఏమిటయ్యా ! నీ తల్లి గాంధారిని వచ్చాను నన్ను చూసి కూడా లేచి నిలబడవా నాయనా ! కృష్ణా ! చూడవయ్యా నా కుమారుని చూడు. వీడు యుద్ధముకు వెళుతూ నా ఆశీర్వాదం కొరకు వచ్చాడయ్యా ! నాకు పాదాభివందనం చేసాడయ్యా ! అప్పుడు నేను ధర్మమం జయిస్తుందని ఆశీర్వదించాను. అలా ఎందుకు ఆశీర్వదించానో తెలుసా కృష్ణా !నాడు కురు సభలోజూదక్రియ తరువాత పాండవులకు జరిగిన అవమానము ద్రౌపదికి జరిగిన ఘోర పరాభవం కళ్ళారా చూసిన వారు " ఎప్పటికైనా ధర్మం జయిస్తుంది. కౌరవులకు నాశనం తప్పదు " అనుకోవడం నా మనసులో ఇంకా ప్రతిధ్వనిస్తుంది. అందుకే నా కుమారుడని ఉపేక్షించక అలా దీవించాను. కృష్ణా ! నేను ఇంకా ఇలా అన్నాను యుద్ధంలో వెనుతిరిగి పోవడం కంటే వీరమరణం పొందడమే మేలు అన్నాను. అప్పడే వీరస్వర్గం లభిస్తుంది. వస్తే విజయలక్ష్మితో తిరిగి రా ! లేకున్న వీరమరణాన్ని వరించి వీరస్వర్గం అనుభవించు అన్నానయ్యా ! నా కుమారుడు రెండవది నిజంచేసాడు. ఇప్పుడు నేను కడుపు తీపితో ఏడుస్తున్నానే కాని వేరు కాదు. వాడి మరణానికి నేను ఏడవడం లేదు. వీరోచితంగా పోరాడి వీర మరణం పొంది వీరస్వర్గం చేరిన నాకుమారుడి గుర్తించి ఎందుకు దుఃఖిస్తాను. ఈ ముదిమివయసులో నాకూ నా భర్తకు కొడుకుల ఆసరా లేక పోయిందేనన్నదే నా బాధ. కృష్ణా ! నా కుమారుడు అభిమానధనుడు అష్టైశ్వర్య సంపన్నుడు అలాంటి వాడికి ఇలాంటి మరణమా అన్నదే నా బాధ. ఏమి చేస్తాం విదురుడు ఎంతో చెప్పాడు. నా భర్తకు నా కుమారుడికి ఎన్నో విధముల చెప్పాడు. మదించిన గర్వంతో వారా మాటలను పెడచెవిన పెట్టారు. విదురుడి మాట ఒక్కటి విన్నా దుర్మరణాలు తప్పేవి కదా ! పదకొండు అక్షౌహిణుల సైన్యమున్న నా కుమారుడు ఇలా ఒంటరి చావు చచ్చాడయ్యా ! నా భర్త కుమారుడు ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన కురుసామ్రాజ్యం పరుల హస్తగతం అయిందయ్యా ! అది చూసే దౌర్భాగ్యం నాకు పట్టింది " అని

### గాంధారి వైరాగ్యంతో కోడళ్ళను చూసి దు:ఖించుట

కృష్ణా ! పోయిన కొడుకులు ఏటూ పోయారు. బతికి ఉన్న నా కోడళ్ళ దు:ఖమును చూడ లేక పోతున్నానయ్యా ! ఇలాంటి మనో వేదన అనుభవించడానికి వారు చేసిన పాపమేమిటి ! రాజకీయాలేమిటో యుద్ధం ఎందుకు సంభవించిందో ఎరుగని వారికీ ఘోర శిక్ష ఏమిటి. అలా చూడు నా పెద్ద కోడలు భానుమతి భర్త శవాన్ని చూసి ఎలా ఏడుస్తూ తల బాదుకుంటుందో చూడవయ్యా ! కడుపున పుట్టిన కుమారుడి ముఖాన్ని చూసి గుండెలు పగిలేలా రోదిస్తుందయ్యా ! నా కుమారుడు, ఆమె కుమారుడి శవాలు ఆమె కన్నీటితో తడుస్తున్నాయి చూడవయ్యా ! కురులు విరబోసుకుని పిచ్చి వారిలా తిరుగుతున్న నా కోడళ్ళను చూడవయ్యా ! వాళ్ళేమి చేసారని వారికి ఈ చిత్తక్షోభ. నా కుమారుడు సుయోధనుడి సరసన విరాజిల్లిన భానుమతి ముఖాన్ని ఇలా శోకతప్త ముఖంతో నేను ఎలా చూడగలను. నా కుమారులకేమి చచ్చి హాయిగా స్వర్గాన ఉన్నారు. నా కోడళ్ళు గుండెలు అవిసేలా రోదిస్తున్నారు చూడవయ్యా ! వీరి దు:ఖముకు అంతు లేదా ! భీముని చేతిలో హతులైన నాకుమారుల శవాలు చూసి నాకోడళ్ళు భోరు భోరున రోదిస్తున్నారయ్యా ! పాలరాతి భవనాల్లో చందనచేర్చిత ముఖాలతో కళ కళ లాడే వారి ముఖాలు ఈ రోజు మరణించిన భర్తల కొరకు కటిక నేల మీద పడి పొర్లి రోదిస్తున్నారయ్యా ! ఇంకా ముద్దు ముచ్చటలు తీరని లేత వయస్కులైన నా కోడళ్ళకు పట్టిన దుర్గతి చూసావా ! ఇదంతా నేను నా భర్తా చేసిన పాప ఫలితం కాక పోతే ధర్మరాజు నా కుమారులను సంహరిస్తాడా ! అని గాంధారి పలు విధముల విలపిస్తుంది. కృష్ణుడు ఆమె పక్కన నిలబడి మౌనంగా చూస్తున్నాడు. ఆమె మనసులో ఉన్న బాధ, దు!ఖం బహిర్గతమైతే కాని దు:ఖోపశమనం కలుగదని అనుకున్నాడు.

### గాంధారి దుశ్శాసనుడి కొరకు దు:ఖించుట

ఇంతలో గాంధారి దుశ్శాసనుడి శవాన్ని చూసి మహోద్వేగంతో " కృషా ! వీడేనయ్యా నా కుమారుడు దుశ్శాసనుడు. మహాబలసంపన్నుడు. భీముడి గదా ఘాతానికి బలి అయి ఇలా దిక్కు లేకుండా నేల పడి ఉన్నాడు. భీముడు వీడి గుండెలుచీల్చి రక్తంత్రాగిన తరువాత నిర్జీవుడయ్యాడు. వీడు నా కోడలు జుట్టు పట్టి సభకు ఈడ్చినందుకు ఫలితం అనుభవించాడయ్యా ! భీముడి గుండెలు మండేలా ద్రౌపది ఏడుస్తుంటే వీడు నా కుమారుడు సుయోధనుడికి, అంగరాజు కర్ణుడికి ప్రీతి కలిగించడానికి ద్రౌపది వలువలు ఊడదీయ ఉద్యుక్తుడైన వీడి పాపం ఊరికేపోతుందా ! అందుకే దిక్కు లేని చావు చచ్చాడు. వీడి విషయం విని నేను సుయోధనుడితో " కుమారా ! ఈ ద్రౌపది తన అన్న కృష్ణుడి సంరక్షణలో ఉన్న విషయం నీకు తెలుసా ! ఆమెను ఇంత నీచంగా అవమానించడం మీకు మంచిది కాదు. ఇందుకు పర్యవసానం తెలిసే మీరు ఈ పనికి ఒడిగట్టారా ! భీముడి బలపరాక్రమాలు తెలిసే అతడి భార్య ద్రౌపదిని అవమానించారా ! తక్షణమే ఆమెను విడిచి

పెట్టండి. కౌరవకులకాంత ద్రౌపదిని గౌరవించండి. నా తమ్ముడైన శకుని అత్యంత నీచుడు, క్రూరుడు, దౌర్భాగ్యుడు వాడి మాట వినకు వాడి స్నేహం వదులు కౌరవవంశాన్ని రక్షించు " అని ఎన్నో విధముల సుయోధనుడికి చెప్పాను. అయినా నా మాటను ఎవరు వినక ఇలా చచ్చారయ్యా కృష్ణా ! విధిరాతను తప్పించ ఎవరి తరం కృష్ణా !

### గాంధారి భీముని నిందించుట

కృష్ణా ! ఆ భీముడు నాడు కురుసభలో ఎన్ని మాటలన్నా ! ఎంత అవమానించినా ! సహించాడు భరించాడు. సమయం కొరకు పగబట్టిన త్రాచు పాములా కాచుకుని ఉన్నాడు. యుద్ధంలో అవకాశం రాగానే నా కుమారులందరినీ తన గధతో మోది చంపాడు. పగతీర్చుకోవడం న్యాయమే ఇలా గుండెలు చీల్చడం న్యాయమా ! మహా వీరుడైన భీముడికి ఇది తగునా ! ఇందు వలన భీముడికి కీర్తి కలుగుతుందా ! చూడవయ్యా కృష్ణా ! నా కొడుకు దుశ్శాసనుడు ఎలా ఉన్నాడో చూడు. చెల్లాచెదురైన అవయవములను చూడు. సింహం గోళ్ళతో చీల్చినట్లు ఆ భీముడు నా కుమారుడి గుండెలు ఎలా చీల్చాడో చూడు. కనిపెంచిన కొడుకు శరీరం ఇలాంటి స్థితిలో చూసిన తల్లి మనస్సు కుమిలి పోకుండా ఎలా ఉంటుంది కృష్ణా !

### గాంధారి వికర్ణుడి కొరకు దు:ఖించుట

అయ్యో ! వికర్ణుడు ఇక్కడున్నాడు చూడవయ్యా ! ఆ ఏనుగుల కళేబరాల మధ్య వికర్ణుడి భార్య నా కోడలు గుండెలు అవిసేలా ఎలా రోదిస్తుందో చూసావా కృష్ణా ! వికర్ణుడి శరీరం మీద పొడుచుకు తినడానికి వాలు తున్న గద్దలను రాబందులను తోలుతూ భర్త శరీరం మీద పడి రోదిస్తుంది చూడవయ్యా ! కృష్ణా ! ఇలాంటి స్థితిలో కొడుకులను కోడళ్ళను చూసే ధౌర్భాగ్యురాలిని ఎక్కడైనా చూసావా ! ఎలాంటి వీరుడినైనా అవలీలగా ఎదుర్కొనే దుర్ముఖుడు అలాంటి వీరుడు భీముడి గధాఘాతానికి ఎలా బలి అయ్యాడో చూసావా ! నా కొడుకు శూరసేనుడిని చూసావా ! అతడి భార్యలను చూడు భర్త శవం చుట్టూ చేరి ఎలా రోదిస్తున్నారో చూడయ్యా ! కాకులూ గద్దలూ పొడుచుకు తిన్న అతడి శరీరం గుర్తించ వీలు కావడం లేదయ్యా ! కృష్ణా ! నా కుమారుడిని వివిశంతిని చూసావా ! వీడికి సంగీతం అంటే ప్రాణం. ఎప్పుడూ సంగీత విద్వాంశులైన స్త్రీలు సంసేవిస్తుండగా గానామృతంలో తేలియాడే వివిశంతి ఇప్పుడు నక్కల ఊళలు వింటున్నాడు. అని పరిపరి విధముల కుమారుల మరణానికి గాంధారి విలపిస్తుంది.

### గాంధారి అభిమన్యుని కొరకు విలపించుట

కుమారుల కొరకు విలపిస్తున్న గాంధారి అభిమన్యుడి మృతదేహాన్ని చూడగానే భావోద్వేగానికి లోనయ్యింది. ఆమె మనసు బాధతో " కృష్ణా ! వాడేనయ్యా అభిమన్యుడు శత్రు దుర్భేద్యమైన పద్మవ్యూహమును ఛేదించి అరి వీర భయంకరుడైన సుయోధనుడిని ఎదిరించిన మహావీరుడు అభిమన్యుడు. చివరకు ద్రోణ, కర్ణ, అశ్వత్థామ, శల్య, కృపాది యోధాను యోధులందరూ అతడిని చుట్టు ముట్టి కడతేర్చారయ్యా ! చావు కళ ఇసుమంతైనా లేక నిద్రిసతున్నట్లున్న సుభద్రా పుత్రుడి ముఖం చూడవయ్యా ! అందుకే ఉత్తర అతడి ముఖం మీద ముఖం పెట్టి నిద్రలేవమని భర్తను ప్రార్ధిస్తుందయ్యా ! అభిమన్యుడిని అల్లంత దూరంలో చూడగానే పారి పోయే ఆ సుకుమారి. ఇప్పుడు పది మంది ముందు భర్త శరీరాన్ని కౌగలించుకుని నెత్తీ నోరూ బాదుకుంటూ రోదిస్తుందయ్యా ! ఉత్తర ఏమని ఏడుస్తుందో వినవయ్యా ! " ఓ అభిమన్య కుమారా ! మీ అమ్మ సుభద్ర, మీ నాన అర్జునుడు ఎదురు చూస్తున్నారు వారిని వదిలి ఎక్కడకు వెళ్ళావు ? నీ మేనమామ కృష్ణుడు వచ్చాడు లేవవయ్యా ! ఇన్ని మాట్లాడుతున్నా ఒక్క మాటైనా మారు పలుకవేమి ఆర్యపుత్రా ! అయ్యో దైవమా ! గురువుగారు ద్రోణుడు, కృపాచార్యుడు, అంగరాజు కర్ణుడు, గురుపుత్రుడు అశ్వత్థామ న్యాయం ధర్మం తెలిసిన ధర్మాత్ములు ఒంటరి వాడివైన నిన్ను ఒక్కసారిగా దాడి చేసి చుట్టిముట్టి తుద ముట్టించడం న్యాయమా ! ధర్మమా ! వారిదీ మగతనమేనా ! ఇంతటి నీచ కార్యానికి పాల్పడుటకు వారికి మనసెలా ఒప్పిందో ! తాను లేని సమయాన ఆ దుర్మార్గులు నిన్నిలా అధర్మమంగా వధించినందుకు నీ తండ్రి అర్జునుడి మనసెంత రగిలి పోయిందో ! నీ మరణం కలిగించిన దుఖం శత్రురాజులను జయించి రాజ్యలక్ష్మిని కైవంశం చేసుకున్నా ఉపశమించ లేదు కదా ! నన్ను విడిచి స్వర్గానికి వెళ్ళి అక్కడి అప్సరసలతో సుఖించడానికి నీకు మసెలా ఒప్పింది " అంటూ ఉత్తర ను చూడు కృష్ణా ! ఇంత చిన్న వయసులో భర్తృవియోగం ఉత్తర ఎలా సహించగలదు. మహావీరుడైన ఉత్తర తండ్రి విరాటుడు ఆయన పక్కన చేరి **సుధేష్ణ** ఎలా రోదిస్తుందో చూడవయ్యా ! ఆ పక్కన ఆమె కుమారుడు ఉత్తర కుమారుడు పడి ఉన్నాడు. ఆ అభాగ్యురాలు మరణించిన భర్త కోసం ఏడుస్తుందా చచ్చిన కుమారుడి కొరకు విలపింస్తుందా ! చెప్పవయ్యా కృష్ణయ్యా !

### గాంధారి కర్ణుడి కొరకు దు:ఖించుట

కృష్ణా ! అదుగో చూడు కర్ణుడి కళేబరం వద్ద అతడి భార్యలు ఎలా రోదిస్తున్నారో చూడవయ్యా ! ఈ కర్ణుడిని నమ్ముకునే నా కుమారుడు ఈ ఘోర యుద్ధానికి శ్రీకారం చుట్టి తుదకు దుర్మరణం పాలైంది. అటు చూడవయ్యా ! కర్ణుడి ధర్మపత్ని వృషసేనుడి తల్లి అటు భర్త మరణానికి ఇటు కుమారుడి మరణానికి ఎలా విలపిస్తుందో చాడవయ్యా ! అమె రోదన వినవయ్యా ! " నాథా ! పరశురాముని శాపం, బ్రాహ్మణుడి శాపం, అర్జునుడి బాణాలు నిన్ను బలిగొన్నాయా ! " అంటూ విలపిస్తుందయ్యా ! అడుగో మహావీరుడు బాహ్లికుడు, చచ్చినట్లు ఉన్నాడా ! ఘాఢ నిద్రలో ఉన్నట్లు ఉన్నాడయ్యా ! కృష్ణా !

### గాంధారి సైంధవుడి కొరకు దు:ఖించుట

కృష్ణా ! అటు చూడు నా అల్లుడు దుస్సల భర్త జయద్రధుడు. అర్జునుడు చేసిన ప్రతిజ్ఞకు బలి అయిన అభాగ్యుడు. నాడు అరణ్యమున ద్రౌపది ని కామించిన నాడే సగం చచ్చాడు. కాని ఆ నాడు పాండవులు చెల్లెలి భర్త అని వదిలారు. ఈ నాడు చెల్లెలి భర్త అన్న కనికరం మాని చంపారు కదయ్యా ! పాపం దుస్సల భర్త శిరస్సు కొరకు వెదుక్కుంటుందయ్యా ! కుమార్తెను ఇలాంటి దుస్థితిలో చూడడం కంటే దురదృష్టం తల్లికి మరేమి కలదో చెప్పవయ్యా ! కృష్ణా ! నీకు తెలుసో లేదో అర్జునుడు ప్రతిజ్ఞ గురించి విన్న దుస్సల భర్తకు ఎంతగా నచ్చచెప్పిందో " అర్జునుడికి ఈ ముల్లోకాలలో తిరుగు లేదు. నా మాట విని ధర్మరాజు ను శరణు వేడిన అతడు నిన్ను తప్పక కాపాడగలడు " అని పరి పరి విధముల వేడుకున్నా ! సైంధవుడు వినక తన మరణమును తానే కొని తెచ్చుకున్నాడు. " ఏ శుభకార్యానికి వెళ్ళ లేకుండా చేసారని దుస్సల ఎంతగా పాండవులను నిందిస్తుందో వినవయ్యా ! కృష్ణా ! అయినా సైంధవుడు చేసిన అపరాధం ఏమిటి ? యుద్ధధర్మం ప్రకారం భీమ, నకుల, సహదేవ, ధర్మరాజు లను అభిమన్యుడికి సహకరించకుండా ఆపాడు. అయినా ! బాలుడైన అభిమన్యుడు యోధానుయోధులైన భీష్మ, ద్రోణ, కర్ణ, అశ్వత్థామ, శల్యులను ఒంటరిగా ఎదుర్కోవడం అతడి దసుస్సాహసం కాదా ! అతడి తొందరపాటే అతడి మరణానికి కారణమైంది. చంపిన వారిని వదిలి అడ్డగించిన సైంధవుడిని చంపుట న్యాయమా ! ధర్మమా అర్జునుడికే అది తెలియాలి. కృష్ణా ! మహావీరుడైన శల్యుడు ధర్మనిరతిలో ధర్మరాజుతో సమానుడు అటూవంటి వాడు దుర్యోధన పక్షం చేరి కర్ణుడికి సారధ్యం వహించి అతడిని సూటి పోటీ మాటలతో వేధించి అతడి ధైర్యాన్ని నీరుకార్చి అతడి మరణానికి ఒక కారణమయ్యాడే ! అలాంటి శల్యుడూ మరణించక మాన లేదు. శల్యుని చుట్టూ చేరి అతడి బంధువులు ఎలా విలపిస్తున్నారో చూడవయ్యా ! కృష్ణా ! మహేంద్రుడిని కూడా గెలువగలిగిన భగదత్తుడిని చూడు అర్జునుడి మీద ప్రేమతో ఇతడిని దారుణంగా చంపింది నువ్వే కదా !

## గాంధారి భీష్మ ద్రోణుల కొరకు రోదించుట

అడుగో కోరి మరణం కొని తెచ్చుకున్న భీష్ముడు శరతల్పం మీద ఎలా పడుకుని ఉన్నాడో చూసావా ! అతడు అలా మరణాన్ని కోరి ఉండక ఉన్న అతడిని జయించడం మానవమాత్రుల తరమా ! కృష్ణా ! అతడికి నిజమైన శిష్యుడు అర్జునుడు. అతడిని శరతల్పం మీద పరండజేసి అతడికి పాతాళ గంగ తీసుకు వచ్చి దాహార్తి తీర్చిన మహా వీరుడు అర్జునుడే కదా ! సూర్యుడే భూమి మీదకు దిగి వచ్చి శరతల్పం మీద విశ్రమించినట్లు ఉంది. అలాంటి భీష్ముడు మరణిస్తే కురు కుమారులకు దిశా నిర్దేశం చేయగల సమర్ధుడెవ్వడు. ఇంద్రుడితో సమానమైన ద్రోణుడు వేదవేదాంగపారతుడు. ధనుర్వేదం ఔపాశన పట్టాడు. ఎందరో రాకుమారులకు విద్యనేర్పిన వాడు. నేడు దిక్కులేకుండా పడి ఉన్నాడు. విధి ఎంత క్రూరమైంది కృష్ణా ! భీష్మ, ద్రోణులను నమ్ముకునే నా కుమారుడు యుద్ధానికి సిద్ధమయ్యాడు. అయినా అతడి తలను ద్రుపదపుత్రుడు ధృష్టద్యుమ్నుడు దారుణంగా నరికాడు. ఇది ఎలా సంభవించింది. ద్రోణుడి భార్య భర్తశవం పక్కన కూర్చుని ఎలా రోదిస్తుందో చూడు. ద్రోణుడి శిష్యులు అతడిని దహించడానికి కట్టెలు దొరకక అమ్ములు విల్లులు పోగు చేసి చితి పేరుస్తున్నారు చూడు. కృపి మొదలైన వారు ద్రోణుడికి అపసవ్యంగా ప్రదక్షిణ చేసి స్నానం చెయ్యడానికి వెళుతున్నారయ్యా !

## గాంధారి అర్జునసాత్యకులను నిందించుట

కృష్ణా ! సాత్యకి అమానుషంగా తల నరికిన భూరిశ్రవసుడిని చూడు. అతడి శరీరాన్ని నక్కలు గద్దలు ఎలా పీక్కు తింటున్నాయో చూడు. ఆ భూరిశ్రవసుడి పక్కన అతడి తల్లి, కుమారులు, భార్య ఎలా రోదిస్తున్నారో చూడు. కృష్ణా ! అర్జునుడు భూరిశ్రవసుడి భుజము నరికాడు. సాత్యకి తల నరికాడు. అయినా ! కృష్ణా ! మహావీరులైన అర్జునుడు, సాత్యకి మీద ప్రేమతో ఇలా చేసి ఉంటాడంటావా ! సాధువు మంచి వాడు అయిన భూతిశ్రవసువును చంపినందువలన అర్జునుడికి ఏమి ఒరిగింది కృష్ణా ! సాత్యకి సాధించినది ఏమిటి అపకీర్తి మూటకట్టుకోవడం తప్ప. కృష్ణా ! ఇదంతా నీ కళ్ళ ముందే జరిగింది. భూరిశ్రవసుడు సాత్యకితో యుద్ధం చేస్తున్నప్పుడు అర్జునుడు సిగ్గుమాలి అతడి చేయి నరకవచ్చునా ! అర్జునుడు చేసిన పని నీవు హర్షిస్తావా ! కృష్ణా ! " అని పరిపరి విధముల విలపించసాగింది గాంధారి.

### గాంధారి శకునిని నిందించుట

కృష్ణుడు ఒక్క మాట కూడా మాటాడక కుండా గాంధారి ని అనుసరిస్తున్నాడు. ఇంతలో గాంధారికి శకుని కళేబరం కనిపించింది. అది చూడగానే ఆమె ముఖం కోపంతో జేవురించింది. గాంధారి " కృష్ణా ! తన మేనల్లుడు నకులుని చేతిలో చచ్చిన నా తమ్ముడు శకునిని చూసావా ! వీడొక మాయావి వీడి మాయలు నీ ముందు పని చేయలేదు. నాడు మాయా జూదంలో ధర్మరాజు ను అడవులకు పంపాడు. ఇప్పుడు యుద్ధమనే జూదంలో తన ప్రాణాలు ఒడ్డి ఒడిపోయాడు. కురుపాండవులకు మధ్య శత్రుత్వానికి ముఖ్య కారకుడు ఇతడే కృష్ణా ! మేలు చేస్తున్నానని నమ్మించి నాకుమారుని నట్టేట ముంచాడు. వీడు మాత్రం బాగుపడింది ఏముంది. పుత్ర పౌత్రులతో నాశనం అయ్యాడు. అసలు నాకొడుకులకు బుద్ధి అనేది ఉంటే మాయావి అయిన వీడి మాటలు నమ్ముతారా ! అందుకు తగిన ఫలితం అనుభవించారు

### గాంధారి మిగిలిన వారి కొరకు రోదించుట

కృష్ణా ! అదుగో కళింగ దేశాధిపతి, ఇదుగో మగధ దేశాధిపతి, ఇతడు కోసల దేశాధిపతి బృహద్బలుడు. తమ తమ రాజ్యాలలో సకల భోగములను అనుభవించిన వారు నేడు దిక్కులేకుండా పడి ఉన్నారు. వారి చుట్టూ చేరి వారి భార్యా బిడ్డలు ఎలా రోదిస్తున్నారో చూడవయ్యా ! ఇలాంటి రోదనలు ఎక్కడైనా విన్నామా కృష్ణా ! ఇరుగో కేకయ రాజులు. ద్రోణాచార్యుని చేతిలో హతులైనట్లున్నారు. అడుగో పాంచాల రాజు ద్రుపదుడు తన సహాధ్యాయి ద్రోణుడి చేతిలో హతుడైనాడు. చిత్రం చూసావా ! అతడి స్వేత చ్ఛత్రం ఇంకా అతడి మీద ఎండ పడకుండా నిలిచి ఉంది. అటు చూడవయ్యా ! కృష్ణా ! ఆ మహారాజుల భార్యలు కొడుకులూ వారికి దహనక్రియలు గావించి మైల స్నానాలు చేయడానికి వెళుతున్నారు. ఇంకా కొంత మంది మమకారం వీడక వారి తలలను ఒడిలో పెట్టుకుని రోదిస్తున్నారు. కృష్ణా ! ఇతడిని గుర్తు పట్టావా ! వీడే నీ మేనత్త కొడుకు శిశుపాలుని కుమారుడు **దుష్టకేతువు** '. అతడి కుమారుడు **సుకేతుడు**. తాండ్రి కొడుకులిద్దరూ మరణించారయ్యా ! తండ్రి కొడుకుల మరణానికి వారి భార్యలు తల్లులు బంధువులు ఎలా రోదిస్తున్నారో చూడవయ్యా ! కృష్ణా ! అవంతీ పాలకులు విందానువిందులను చూడు. పెను గాలికి కూలిన వృక్షములవలె ఎలా కూలి పోయారో చూడు. ఇదంతా చూస్తుంటే నాకు ఒక సందేహం కలుగుతుంది కృష్ణా !

### గాంధారి కృష్ణుడిని నిందించి శపించుట

భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, అశ్వత్థామ, భూరిశ్రవసువు, కృపుడు, సైంధవుడు, కృతవర్మ నా కుమారుడు సుయోధనుడు వీరంతా అతిరథ మహారథులు. వీరందరితో యుద్ధం చేసి కూడా నువ్వు, నీ తమ్ముడు సాత్యకి, పాండవులు నిరపాయంగా ఎలా బయట పడ్డారయ్యా ! మహాఆద్భుతంగా ఉంది కదూ ! నాకు నమ్మ బుద్ధి కావడం లేదు కృష్ణా ! అపారమైన దైవ బలం ఉంటే కాని ఇది సాధ్యం కాదు. కాని ఆ దైవం కూడా దయమాలి నా నూరుగురు కుమారులకు అన్యాయం చేసిందంటే నా మనస్సు క్షోభిస్తుందయ్యా ! ఏమి చెయ్యగలను నా కుమారులందరిని పోగొట్టుకుని అనాధను అయ్యాను. ఈ ముదిమి వయస్సులో నాకు ఆసరాగా ఒక్క కొడుకుని కూడా మిగల్చలేదయ్యా ! ఆ భీముడు. భీముడు మాత్రం ఏమి చేస్తాడులే ! అంతా నేను నా కొడుకులు చేసుకున్న ప్రారబ్ధం. ఆ నాడు నువ్వు రాయబారానికి వచ్చినప్పుడు విన్నట్లైతే ఇంత జరిగేదా ! నువ్వే కాదు భీష్ముడు, విదురుడు కూడా ఎన్నో హితోక్తులు చెప్పారే ! నేను నా భర్త నాకుమారులు ఆమాటలు వినక పెడచెవిన పెట్టి ఫలితం అనుభవిస్తున్నాము. కృష్ణా ! నాడు కురుసభలో నీవు పలికిన పలికులు నిజమైయ్యాయి. ఈ సర్వనాశనానికి నువ్వే కారకుడవు. ఊరకే హితవులు చెపుతూ కూర్చుని ఉండక నువ్వు నా కుమారులు పాండవుల మీద అసూయతో చేస్తున్న అకృత్యములు ఆపే ప్రయత్నం ఎందుకు చేయ లేదు. నువ్వు తలచిన ఈ యుద్ధం ఆపలేక పోయే వాడివా ! నాడు కొలువులో ఎంత మంది పెద్దలు ఉన్నారు. మానవీయ వాక్చాతుర్యం కలిగిన వాడవు ధర్మవేత్తవు నీవు ఉన్నావు. మీరందరూ కలసి ఈ ఘోరకలికి కారకులయ్యారు. కృష్ణా ! నీవు సుయోధనుడిని నాశనం చేయడానికి ఈ రాయబారనాటకం ఆడి ఎందరో రాజులను ఈ రణభూమికి బలి ఇచ్చావు. ఇందుకు ప్రతిగా అంతకు అంతా నువ్వు అనుభవిస్తావు కృష్ణా ! ఇదిగో ఇదే నీకు నా శాపం. నేను నా జీవితాంతం సంపాదించుకున్న పాతివ్రత్య పుణ్యఫలాన్ని ఫణంగా పెట్టి పలుకుతున్నాను. నీవు ఎలాగైతే ఈ కురుక్షేత్ర సంగ్రామంలో దాయాదులను ఒకరి చేత ఒకరిని చంపించావో అలాగే నీ వారంతా తమలో తాము కలహించుకుని దారుణ మరణానికి గురి ఔతారు. నువ్వు కూడా సరిగ్గా నేటికి సరిగ్గా ఒక్క సంవత్సరం ముప్పైఆరు దినములకు అతి కౄరంగా దిక్కు లేని చావుచస్తావు. నేడు నా వాళ్ళు ఎలా ఏడుస్తున్నారో నాడు నీ వాళ్ళు అలాగే భర్తలను, కుమారులను, బంధువులను పోగొట్టుకుని ఏడుస్తారు. ఇదే నా శాపం అనుభవించు " అని ఘోరంగా శపించింది గాంధారి. శ్రీకృష్ణుడు ఆ శాపాన్ని చిరునవ్వుతో స్వీకరించాడు.

### గాంధారికి కృష్ణుడు సమాధానం చెప్పుట

అమ్మా ! గాంధారీ ! నీవు ఈ రోజు ఇచ్చిన శాపం నాకు కొత్త కాదు. అది ఇంతకు ముందు ఉన్నదే. ఇది వరలో యాదవులు మహా మునిని అవహేళన చేసిన కారణంగా ఆ మహాముని ఇదే విదంగా శపించాడు. నీ నోట ఆమాటలే ఈ రోజు వెలువడ్డాయి. యాదవులకు ఎవరి చేతిలోనూ చావు లేదు. అందు వలన వారు వారిలో వారు కలహించుకుని మాత్రమే అంతమొందగలరు. నీ శాపం అందుకు ఉపకరిస్తుంది " అని పలికాడు శ్రీకృష్ణుడు. ఆ మాటలు విని పాండవులు కంపించిపోయారు. శ్రీకృష్ణుడు లేకున్న తాము జీవించి ఉండడం వృధా అనుకుని తమ జీవితముల మీద ఆశలు వదులుకున్నారు. అప్పుడు శ్రీకృష్ణుడు గాంధారి ని చూసి " అమ్మా ! ఇక లే ! చని పోయిన వారికి దహనక్రియలు జరిపించాలి " అని పలికాడు. గాంధారి పైకి లేచింది ఆమెను పట్టుకుని శ్రీకృష్ణుడు నడిపిస్తూ " అమ్మా ! నీకుమారుడు సుయోధనుడు, దుశ్శాసనుడు చేసిన దుర్మార్గపు పనులు నీవు ఎరుగవా ! నీ కుమారుడి దుష్కృత్యములు నేను కానీ, భీష్ముడు కానీ, ద్రోణుడు కానీ , కడకు నీ భర్త ధృతరాష్ట్రుడు కాని మాన్పలేక పోయాము కదమ్మా ! వారి దుర్నయముల వలన కదమ్మా ! ఇంతటి చేటు దాపురించింది. అందుకు నన్ను నిందించి ప్రయోజనమేమిటి ! ఇక నైనా శోకం మాను. ఇలా శోకిస్తుంటే నీ శోకం రెండింతలు ఔతుంది. నీవు వీరమాతవు. మహావీరులను పుత్రులుగా పొందావు. వారి మరణానికి శోకించతగదు " అన్నాడు. ఈ మాటలకు గాంధారి చింతించడం మానుకుంది.

## ధృతరాష్ట్ర ధర్మరాజులు ఉత్తర క్రియలు గురించి చర్చించుట

ధృతరాష్ట్రుడు ధర్మరాజు ను చూసి " కుమారా ! ఇరు పక్షముల లోని సైన్యముల లెక్క నీకు తెలుసు కదా ! ఇరుపక్షములలో సైన్యం ఎంత మంది మరణించారో చెప్పగలవా ! " అని అడిగాడు. ధర్మరాజు సమాధానంగా " తండ్రీ ! మన సైన్యంలో ఉత్తమ క్షత్రియులు 76 కోట్ల ఇరవై వేల మంది. మిగిలిన సైనికులు 24 వేల మంది యుద్ధంలో చని పోయారు. వీరందరూ యుద్ధంలో చనిపోయారు కనుక వీరస్వర్గం అలంకరించాడు. కాని కొంత మంది భయపడి పారిపోయారు. వారు గుహ్యకలోకానికి వెళతారు. కాని యుద్ధంలో ఏవిధంగా మరణించినా నరకలోకముకు వెళ్ళరు " అన్నాడు ధర్మరాజు. ధృతరాష్ట్రుడు " ధర్మజా ! యుద్ధంలో చనిపోయిన వారిలో అనాధలు అయిన వారు ఉన్నారు కదా ! వారికి అగ్నికార్యం చెయ్యడంలో తప్పేమి లేదు కదా ! " అని అడిగాడు. ధర్మరాజు " మహారాజా ! ఈ యుద్ధమే ఒక మహా యజ్ఞం. ఈ మహా యజ్ఞంలో ఆహుతి అయిన వారందరూ అగ్నికార్యముకు అర్హులే ! ఇక్కడ మరణించిన అనాధలకు అగ్నికార్యం నెరవేర్చి ఉత్తమ గతులు ప్రాప్తించేలా చేద్దాము " అని పలికాడు.

### యోధులకు దహన క్రియలు జరిపించుట

ధర్మరాజు వెంటనే విదురుడు, సంజయుడు, తన పురోహితుడు ధౌమ్యుడిని పిలిపించి భరతవంశ సంజాతకులకు తప్ప మిగిలిన వారికి దహనసంస్కారం చెయ్యమని చెప్పి అందుకు కావలసిన చందనము, అగరు, కస్తూరి మొదలైన సుగంధ ద్రవ్యములను తదితర సామగ్రిని కావలసిన మనుషులను అప్పగించాడు. తరువాత ధర్మరాజు బ్రాహ్మణ సంఘాల తోడ్పాటుతో దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శల్య మొదలైన వారికీ అభిమన్య, ఘటోత్కచ, విరాట, దుష్టకేతు వంటి ప్రముఖులకు నానా దేశాధీశులకు చితులు పేర్పించి అగ్ని కార్యం నిర్వహించాడు. అనాధలుగా మిగిలిన రాజుల కళేబరములకు వేలకు వేలుగా ప్రోగులుగా పెట్టించి సామూహిక దహన క్రియ జరిపించాడు. అందుకు కావలసిన కట్టెలు దొరకక విరిగిన రధములు, బాణములు, ధనస్సు మొదలైనవి సేకరించి దహన క్రియ నిర్వహించాడు. తరువాత ధర్మరాజు ధృతరాష్ట్రుడు అంత:పుర కాంతలతో కలిసి స్నానములు ఆచరించారు. కౌరవులందరికీ ధృతరాష్ట్రుడు తర్పణములు విడిచాడు.



చనిపోయిన వారికి తర్పణములు వదులుచున్న వారి బంధువులు

## కుంతీ దేవి కర్ణుడు తన కుమారుడని చెప్పుట

ఆ సమయంలో కుంతీ దేవి కన్నీటితో అందరూ వింటుండగా " అయ్యా ! అందరూ వినండి. కౌరవులకు పెట్టని కోటగా విరాజిల్లిన కర్ణుడు రాధేయుడిగా లోకానికి

తెలిసి ప్రసిద్ధి చెందిన కర్ణుడు నిజంగా రాధేయుడు కాదు. కర్ణుడు నా కుమారుడు, కౌంతేయుడు మీకందరికి అగ్రజుడు. నేను కన్యగా ఉన్నప్పుడు మంత్ర ప్రభావం వలన భాస్కర ప్రభావంతో సహజ కవచకుండల శోభితుడు కర్ణుడు జన్మించాడు. కనుక మీరు కర్ణుడికి తిలోదకాలు ఇవ్వండి " అని ధర్మరాజుతో చెప్పింది.

### ధర్మరాజు కర్ణుడి మరణానికి విలపించుట

ఆ మాటలకు ధర్మరాజు వివశుడయ్యాడు. మిగిలిన వారు అమిత దు:ఖముకు లోనయ్యారు. ధర్మరాజు ఎలాగో మాట పెగల్చుకుని " అమ్మా ! కర్ణుడు నీకు జ్యేష్టపుత్రుడు, మాకు అన్నగారు కొంగున నిప్పు కట్టుకున్న చందాన ఈ నిజం ఇంత కాలం ఎలా దాచావమ్మా ! ఈ లోకములో ఒక్క అర్జునుడు తప్ప కర్ణుడిని గెలువ గలవారెవ్వరు. అమ్మా ! కర్ణుడిని తొలి చూలిగా ఎందుకు కన్నావమ్మా ! నీకు దుర్వాసుడు ఇచ్చిన వరం మా పట్ల శాపంగా పరిణమించి మాకు అంతులేని శోకాన్ని మిగిల్చింది కదమ్మా ! అమ్మా ! అభిమన్యుడు మరణించినప్పుడు కూడా ఇంత దు:ఖం పొందలేదమ్మా ! ద్రుపదుడి కుమారులు, ధృతరాష్టుడి కుమారులు చని పోయినప్పుడు కూడా ఇంతటి వ్యధ చెందలేదు కదమ్మా ! అమ్మా కర్ణుడు మా అన్న అని తెలిసిన ఈ యుద్ధం జరిగేది కాదు ఈ మారణ హోమం జరిగేది కాదు కదమ్మా ! " అని పరి పరి విధముల వాపోయాడు ధర్మరాజు. వెంటనే ధర్మరాజు కర్ణుడి గోత్ర నామాలు చెప్పి తిలోదకాలు ఇచ్చాడు. తరువాత భీమ, అర్జున, నకుల, సహదేవులు కూడా తిలోదకాలతో తర్పణములు వదిలారు. కర్ణుడు కుంతీ కుమారుడు అని తెలియగానే పాండవ, కౌరవ కాంతలలో హాహాకారాలు చెలరేగాయి. ధృతరాష్టుడు కూడా గాంధారి తో చేరి కుంతీ దేవితో కలిసి ఉదక కర్మ చేయించాడు. వెంటనే ధర్మరాజు కర్ణుని పట్ల సోదరభావంతో కర్ణుడి భార్యలను అతడి బంధువులను పిలిపించి సముచిత రీతిన గౌరవించి ఓదార్చాడు. వారితో కర్ణుడికి ఉత్తమ లోకప్రాప్తి కొరకు అనేక దానధర్మములు చేయించాడు. తరువాత బంధుమిత్రులు అందరితో కలిసి ధర్మరాజు గంగా నదిని దాటి అక్కడ అనేక దాన ధర్మములు చేయించాడు.

## వనరులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

# శాంతి పర్వము

వికీపీడియా నుండి

**శాంతి పర్వము**, మహాభారతంలోని 12వ భాగం. కురుక్షేత్ర యుద్ధానంతరం యుధిష్ఠిరుని పట్టాభిషేకము, భీష్ముడు యుధిష్ఠిరునకు చేసిన ఉపదేశాలు ఈ పర్వంలోని ప్రధాన ఇతివృత్తం.

## విషయ సూచిక



## సంస్కృత మహాభారతం

## ఆంధ్ర మహాభారతం

## విశేషాలు

## మూలాలు

## బయటి లింకులు

- కిశోరీ మోహన్ గంగూలి ఆంగ్ల అనువాదం (http://www.sacred-texts.com/hin/m01/index.htm)

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

# శాంతి పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

వైశంపాయనుడు జనమేజయునకు చెప్పిన మహాభారత కధను సూతుడు శౌనకాది మునులకు చెప్పసాగాడు. ఆ విధంగా ధర్మరాజు తన తమ్ములతో యుద్ధంలో ఇరువైపులా మరణించిన బంధు మిత్రులకు ఉదకకర్మలు నిర్వహించారు. తమతమ బంధువుల వలన కలిగిన అశౌచము తీరేవరకు గంగా నదీతీరంలో సమతల ప్రదేశం ఎంచుకుని కుటీరాలు నిర్మించుకుని నివసించసాగారు. ధృతరాష్ట్రుడు, విదురుడు తమ తమ భార్యలతో అక్కడ ఒకనెల కాలం నివసించారు. ఆ సమయంలో అక్కడకు వ్యాసుడు, **దేవలుడు**, **కణ్వుడు**, నారదుడు మొదలైన మహామునులు ధర్మరాజు ను చూడడానికి వచ్చారు. ధర్మరాజు తన తమ్ములు ద్రౌపదితో చేరి వారికి అర్ఘ్యపాద్యాలు ఇచ్చి సత్కరించాడు. అప్పుడు నారదుడు ధర్మరాజు తో " ధర్మజా ! నీవు అదృష్టవంతుడవు. నీమేలు కోరుతూ శ్రీకృష్ణుడు ఎల్లప్పుడూ నీ వెంట ఉంటాడు. మహాబలశాలి అర్జునుడి సాయంతో నీవు ఈ భూమండలాన్ని జనరంజకంగా సేవిస్తావు. ధర్మజా ! ఇంతటి ఘోరయుద్ధం సంభవించినప్పుడు కూడా నీవు నీ ధర్మమును వీడ లేదు. నీ ధర్మనిరతి నీకు విజయాన్ని చేకూర్చినందుకు నీవు సంతోషిస్తున్నావా ? " అని అడిగాడు.

## విషయ సూచిక

## ధర్మరాజు యుద్ధపరిణామము తలచి చింతించుట

ధర్మరాజు " ఓ నారద మహర్షీ ! శ్రీకృష్ణుడు తన అశేష కృపాకటాక్షములను మా మీద వర్షించాడు కనుక, బ్రాహ్మణుల అనుగ్రహం మేము పొందాము కనుక, భీమార్జునుల భుజబల ప్రదర్శన మాకు విజయాన్ని చేకూర్చింది కాని ఈ యుద్ధములో మేము బంధుమిత్రులను, గురువులను, తండ్రులను కోల్పోయాము. ముఖ్యంగా వంశాంకురాలు అయిన అభిమన్య, ఉపపాండవులను వారి గర్భస్థశిశువులతో కోల్పోయాము. **ఇరావంతుడు**, ఘటోత్కచుల మరణం మా మనసులను కలచివేస్తుంది. మాకు కలిగిన విజయమూ ఒక విజయమేనా ! చెప్పండి " అన్నాడు.

## కర్ణుడి మరణానికి ధర్మరాజు చింతించుట

ధర్మరాజు నారదుడితో ఇంకా ఇలా చెప్పసాగాడు " అదికాక మొదటి నుండి సుయోధనుడికి కుడి భుజంగా ఉన్న కర్ణుడు మా అన్న అని తెలిసి నా మనసు రగిలిపోతుంది. నా తల్లి కుంతీదేవి ఒంటరిగా కర్ణుడిని కలిసి తాను కర్ణుడి తల్లినని చెప్పింది. సూర్యుడి వరప్రసాదిగా కర్ణుడిని తాను కన్నానని అతడికి వివరించింది. ఆమె కౌరవులకూ పాండవులకు మధ్య ఉన్న వైరాన్ని మాన్పించమని కోరింది. అందుకు కర్ణుడు " అమ్మా ! సుయోధనుడు అర్జునుడిని ఎదిరించడానికే నన్ను చేరదీసాడు. ఇన్ని రోజులు సుయోధనుడిని ఆశ్రయించి ఉన్న నేను ఇప్పుడు నా స్వార్ధం చూసుకుని నన్ను పెంచిన వారిని ఇన్ని రోజులు నాతో బంధుత్వం పెంచుకున్న వారిని విడిచి రాలేను కనుక నీవు కోరినట్లు పాండవులను అందరినీ విడిచి పెట్ట లేను. అర్జునుడిని తప్ప మిగిలిన వారినెవ్వరినీ నా చేతబడినా నేను చంపను అన్నాడు " అని పలికి ఆమాట నిలబెట్టుకోవడానికే యుద్ధంలో అతడి చేతికి చిక్కిన మా నలుగురిన్నీ చంపక విడిచిపెట్టాడు. ఈ విషయాలను మా అమ్మ కుంతీదేవి మా నుండి దాచింది కనుక మేము మా అనుజుడినే చంపినాము. అతడు మా అనుజుడని తెలియని కారణంగా ఇంత ఘోరం జరిగింది. ఆనాడు కురు సభలో కర్ణుడు సుయోధనుడిని సంతోష పెట్టడానికి మమ్ము ద్రౌపది అనరాని మాటలు అన్నా నాకు అతడి మీద కోపం రాలేదు. ఒక్కోసారి కర్ణుడిలో మా తల్లి కుంతీదేవి పోలికలు కనిపించినా నేను అంతగా పట్టించుకో లేదు. సుయోధనుడి మాటలకు నాకు కోపం వచ్చినప్పుడు కర్ణుడి ముఖం కనిపించగానే కోపం స్థానంలో నా మనసు శాంతపడేది. ఓ నారద మహర్షీ కర్ణుడిని చంప కుండా నాకు ముఖం చూపవద్దని అర్జునుడిని తూలనాడాను. నేనే నా చేతులారా కర్ణుడిని చంపుకున్నాను. ఓ నారదమునీంద్రా అసలు కర్ణుడి రధచక్రం భూమిలో ఎందుకు కూరుకు పోయింది ? దానికి కారణమేమిటో నాకు వివరించగలరా ! " అని అడిగాడు.

### కర్ణుడి మాత్సర్యం

ధర్మరాజు మాటలకు నారదుడు " ధర్మజా ! కుంతీదేవి కన్యగా ఉన్నప్పుడు దుర్వాసుడు ఇచ్చిన వరం కారణంగా మంత్ర ప్రభావంతో సూర్యదేవుడి వలన కుమారుడిని కన్నది. వివాహత్పూర్వం పుట్టినకారణంగా ఆమె ఆ విషయాన్ని లోకానికి చెప్పడానికి సిగ్గు పడింది. ఆ భయంతో ఆమె ఆ కుమారుడిని నదిలో విడిచింది. సూర్యదేవుడి వలన కుమారుడిని కన్నా కాని ఆమె కన్యాత్వానికి భంగం కలుగలేదు. నదిలో కొట్టుకుని పోతున్న మందసాన్ని తెరిచి చూసిన సూతుడు అప్పటి వరకు తనకు సంతానం కలుగని కారణంగా తానే పెంచుకున్నాడు. కాని కర్ణుడికి మొదటి నుండి మీ మీద మాత్సర్యం పెంచుకున్నాడు. నీ ధర్మనిరతి, భీమార్జునుల పరాక్రమం, నకుల సహదేవుల నీతిశాస్త్ర పాండిత్యం అతడికి నచ్చలేదు. మీరంతా ప్రజాభిమానం పొందడం అతడికి కంటగింపయ్యింది. అది అతడి స్వభావం. మీ మీద మాత్సర్యంతోనే అతడు సుయోధనుడి దరిచేరి అతడితో మైత్రి చేసాడు. విలు విద్యలో అర్జునుడి నైపుణ్యం చూసి ఒక రోజు కర్ణుడు ద్రోణుడి వద్దకు వెళ్ళి తనకు బ్రహ్మాస్త్రం నేర్పి అర్జునుడితో సమానం చేయమని కోరాడు ఆ మాటలకు ద్రోణుడు " కర్ణా ! బ్రహ్మాస్త్రం బ్రాహ్మణులకు క్షత్రియులకు తప్ప ఇతరులకు ఉపదేశించ కూడదు. కనుక నేను నీకు బ్రహ్మాస్త్రం ఉపదేశించ లేను " అన్నాడు. కర్ణుడు మౌనంగా తన మందిరానికి వెళ్ళాడు.

## కర్ణుడు విలువిద్యను అభ్యసించుట

ద్రోణుడు బ్రహ్మాస్త్రం నేర్పించ నిరాకరించిన తరువాత కర్ణుడు మహేంద్రగిరి వద్ద ఉన్న పరశురాముని వద్దకు వెళ్ళి తాను బ్రాహ్మణుడినని అబద్ధం చెప్పి పరశురాముని శిష్యుడిగా చేరాడు. పరశురాముడు కర్ణుడిని తన ప్రియ శిష్యుడిగా స్వీకరించాడు. కర్ణుడు పరశురాముడి వద్ద అస్త్రవిద్యను అభ్యసిస్తున్నాడు. ఒక రోజు కర్ణుడు అస్త్రవిద్యను అభ్యసించే సమయంలో కర్ణుడి బాణం తగిలి ఒక బ్రాహ్మణుడి హోమధేనువు చనిపోయింది. అందుకు కోపించిన బ్రాహ్మణుడు " యుద్ధంలో ప్రాణాపాయ సమయంలో నీ రధచక్రం భూమిలో కూరుకు పోవుగాక " అని శపించాడు. తరువాత కర్ణుడికి పరశురాముడి శాపంకూడా తగిలింది. కర్ణుడు పరశురాముడి వద్ద బ్రహ్మాస్త్రం మొదలు అన్ని అస్త్రములను అభ్యసించాడు. ఒక రోజు పరశురాముడు అలసి పోయి కర్ణుడి తొడ మీద తలపెట్టి నిద్రించసాగాడు. ఒక భయంకరమైన పురుగు కర్ణుడి తొడ తొలిచి రంధ్రం చేయసాగింది. తొడ కదిలిస్తే గురువుగారికి నిద్రా భగం ఔతుందని కర్ణుడు ఆ బాధను మౌనంగా భరించాడు. ఆ గాయం నుండి కారిన రక్తం ప్రశురాముడిని తాకగానే పరశురాముడు నిద్ర నుండి లేచాడు. పరశురాముడు కర్ణుడిని అడిగి విషయం తెలుసు కున్నాడు. పరశురాముడు ఆ పురుగును చూడగానే ఆ పురుగుకు శాపవిమోచనం అయి ఒక రాక్షస రూపం ధరించి " మహాత్మా ! తమరి వీక్షణంతో నాకు శాప విమోచనం అయింది. ధన్యుడ నయ్యాను. నేను "శగ్రస్తుడు" అనే రాక్షసుడిని. నేను పూర్వం భృగు మహర్షి భార్యను అపహరించి ఎత్తుకు పోతుండగా ఆయన ఇచ్చిన శాపంతో ఇలా కీటకంగా మారాను. అమృత సమానమైన మీ చూపులతో శాప విమోచనమైంది " అని చెప్పి వెళ్ళిపోయాడు. తరువాత పరశురాముడు కర్ణుడిని చూసి " కర్ణా ! నీవు చూపించిన సాహసం బ్రాహ్మణోచితం కాదు నీవు ఎవరివో నిజం చెప్పు " అని అడిగాడు. కర్ణుడు భయంతో వణుకుతూ " గురుదేవా ! నేను బ్రాహ్మణుడను కాను సూతుడను " అని బదులిచ్చాడు. పరశురాముడు కర్ణుడు తనతో అసత్యం పలికినందుకు కోపించి " కపటంతో అసత్యమాడి నీవు నా వద్ద నేర్చిన అస్త్ర విద్యలు నీకు పనికి రాకుండా పోతాయి " అని శాపం ఇచ్చాడు. కర్ణుడు ఖిన్నుడై అక్కడ నుండి సుయోధనుడి వద్దకు వెళ్ళి జరిగినది చెప్పాడు. కనుక ధర్మరాజా ! నీ అన్న కర్ణుడు అసత్యం పలుకుటలో ఆరితేరిన వాడు " అన్నాడు.

## శుభాంగి స్వయంవరం

కళింగ దేశపు రాజు **చిత్రాంగధుడు** తన కుమార్తె శుభాంగికి స్వయంవరం ప్రకటించాడు. ఆ స్వయంవరానికి సుయోధనుడు, కర్ణుడితో కలిసి వెళ్ళాడు. ఆ స్వయం వరానికి శిశుపాలుడు, జరాసంధుడు, రుక్మి మొదలైన రాజులు హాజరయ్యారు. స్వయంవరంలో శుభాంగికి ఆమె చెలికత్తె ఒక్కొక్క రాజును పరిచయం చేస్తుండగా **శుభాంగి** ఎవరి మెడలోను వర మాల వేయక సుయోధనుడిని కూడా దాటి పోయింది. అది చూసి సుయోధనుడు కోపించి ఆమెను తన రథం మీద పెట్టమని ఆజ్ఞాపించాడు. అది చూసి స్వయంవరానికి వచ్చిన రాజులంతా సుయోధనుడి మీద విరుచుకు పడ్డారు. సుయోధనుడు వారితో ఘోరంగా పోరాడాడు. కర్ణుడు తన అస్త్ర విద్యా నైపుణ్యంతో రాజులందరితో యుద్ధం చేసాడు. కర్ణుడి ధాటికి తాళ లేక రాజులందరూ పారి పోయారు. సుయోధనుడు శుభాంగిని తీసుకుని హస్థినా పురానికి వెళ్ళాడు. ఆ సమయంలో తనకు జరిగిన పరాభవాన్ని తలచుకుని జరాసంధుడు కర్ణుడిని తనతో యుద్ధం చెయ్యమని కోరాడు. అందుకు అంగీకరించిన కర్ణుడు జరాసంధునితో యుద్ధంచేసాడు. ముందు అస్త్ర శస్త్రములతో యుద్ధంచేసాడు. తరువాత జరిగిన బాహాబాహీ యుద్ధంలో కర్ణుడు జరాసంధుని ఓడించాడు. క ర్ణుడి పరాక్రమానికి మెచ్చిన జరాసంధుడు అతనికి మాలినీ నగరాన్ని బహూకరించాడు.

## కర్ణుని మరణానికి కారణం

కర్ణుడి గొప్పతనానికి కలత చెందిన ఇంద్రుడు కపట బ్రాహ్మణ వేషం ధరించి కర్ణుడి కవచ కుండలాలను దానంగా అడిగి పట్టుకు వెళ్ళాడు. అర్జునుడు కర్ణుడిని వధించ గలగడానికి ఇన్ని కారణాలు ఉన్నాయి. కనుక ధర్మజా ! నేను చెప్పేది శ్రద్ధగా ఆలకించు. మొదట బ్రాహ్మణ శాపం, తరువాత పరశురాముడి శాపం, తరువాత ఇంద్రుడు కవచకుండలాలను పట్టుకు పోవడం, ఆ పై కుంతీదేవికి ఇచ్చిన వరం కారణంగా మీ నలుగురు అన్నదమ్ములను విడుచుట, భీష్ముడు కర్ణుడిని అర్ధ రధుడిగా ప్రకటించుట, తరువాత శల్యుడు తన ములుకుల వంటి మాటలతో కర్ణుడిని హింసించుట ఇన్ని తోడయ్యాయి కనుకనే అర్జునుడు కర్ణుడి ఓడించ గలిగాడు. ధర్మజా ! అది కాక అర్జునుడికి వరుణుడు, పరమశివుడు, ఇంద్రుడు, యముడు, ద్రోణుడు, కృపాచార్యుడు వీరంతా దివ్యాస్త్రాలను ప్రీతితో ఇచ్చారు. అందువలన అర్జునుడు కర్ణుడిని వధించాడు కాని, లేకున్న కర్ణుడిని జయించడం అర్జునికి వీలు కాని పని " అని నారదుడు పలికాడు.

## ధర్మరాజు తల్లి కుంతీదేవిని శపించుట

నారదుడి మాటలను విని ధర్మరాజు తీవ్రమైన శోకంతో మరింత కలత చెందాడు. పక్కనే ఉన్న కుంతీదేవి ధర్మరాజును ఓదారుస్తూ " నేను కర్ణుడిని కలిసి అతడి జన్మ రహస్యం చెప్పి అతడిని మీ వైపు రమ్మని ఆహ్వానించినప్పుడు సూర్యభగవానుడు వచ్చి " కర్ణా కుంతి చెప్పింది నిజం " అని పలికాడు. అయినా కర్ణుడు సుయోధనుడిని వదిలి రావడానికి ఇచ్చగించ లేదు. అటువంటి కర్ణుడిని తలచుకుని ఇప్పుడు ఎందుకు బాధ పడుతున్నావు " అని పలకగా ధర్మరాజు తల్లిని ఏహ్యాభావంతో చూసి " అమ్మా ! నీవు ఈ రహస్యాన్ని మా నుండి దాచినందు వలనే ఈ అనర్ధం జరిగింది కనుక నేటి నుండి స్త్రీలకు రహస్యం దాచే శక్తి క్షీణించును గాక " అని స్త్రీ జాతినంతా ధర్మరాజు శపించాడు. అయినా ధర్మరాజు మనసు కుదుట పడలేదు.

## ధర్మరాజు విరక్తి

యుద్ధ పరిణామాలకు విరక్తి చెందిన ధర్మరాజు " ఎవ్వరూ లేని ఈ రాజ్యం మనకెందుకు ఎక్కాడికైనా వెళ్ళి భిక్షుక వృత్తి స్వీకరించి బ్రతుకు వెళ్ళబుచ్చుదాము. అప్పుడే నా మనస్సుకు శాంతి లభిస్తుంది. అర్జునా ! మనమంతా దాయాదులను చంపాము. అది మనలను మనం చంపుకోవడంతో సమానం కాదా ! ఎందుకీ క్షత్రియ ధర్మం కాల్చనా ! వనములలో ఉండి అహింసావ్రతమును పాటిస్తూ బ్రతకడం ధర్మం కాదా ! అందుకని మనం తిరిగి వనములకు వెడదాము. రాజ్యం అనే ఈ మాంసం ముక్క కొరకు పశువుల మాదిరి కొట్టు కున్నాము, చంపుకున్నాము, వంశనాశనం చేసుకున్నాము. ఇప్పుడు ఇంతటి కుత్సిత బ్రతుకు బ్రతుకుతున్నాము. అర్జునా ! ఈ కురు సామ్రాజ్యమే కాదు. ముల్లోకాధిపత్యం ఇచ్చినా నా మనస్సు శాంతించదు. నాకీ రాజ్యం వద్దు మీరే ఏలుకొండి. మన పెద నాన్న పుత్రవ్యామోహంతో తన కుమారుడైన సుయోధనుడిని కట్టడి చేయ లేక పోయాడు. ఆ నీచుడి వలన వంశనాశనం అయింది. సుయోధనుడిని చంపి మనం మన కోపం తీర్చుకున్నాము కాని, నా మనసంతా శోకపరితప్తమైంది. నేను మాత్రం ఏమి చేసాను. రాజ్యకాంక్షతో యుద్ధానికి సిద్ధపడి పాపం చేసాను. ఈ హేయమైన యుద్ధం వలన లభించిన రాజ్యమును వదిలితేగాని నాకు మనశ్శాంతి లభించి మనసు పరిశుద్ధం కాదు. అందుకని నేను తపోవనానికి వెళ్ళి మునివృత్తి స్వీకరించి శేషజీవితం ఆనందంగా గడుపుతాను " అని ధర్మరాజు అన్నాడు.

### అర్జునుడి కోపం

ఆ మాటలకు అర్జునుడికి పట్టరాని కోపం వచ్చింది. అయినా తమాయించుకుని దానిని మనసులో దాచుకుని పైకి చిరునవ్వు నవ్వుతూ " అన్నయ్యా ! ఇలాంటి మాటలు ఎక్కడన్నా ఉన్నాయా ! ఎప్పుడైనా విన్నామా ! అరివీర భయంకరులమై శత్రువులను ఓడించి రాజ్యలక్ష్మిని చేపట్టాము. అది అంతా మరచి పోయి ఇప్పుడు ముని వృత్తి స్వీకరిస్తానని చెప్పుట తగునా ! మనం సుయోధనుడి మాదిరి అధర్మంగా రాజ్యం పొందలేదు. ధర్మబద్ధంగా రాజ్యాన్ని పొందాం. ధర్మబద్ధమైన రాజ్యమును పాలించకుండా వదలడం ధర్మమా ! అలాంటి వాడివి యుద్ధం చేసి ఇందరు రాజులను చంపడం ఎందుకు. ఇంత చేసి ఇప్పుడు రాజ్యాన్ని వదిలి ముని వృత్తిని స్వీకరిస్తానని చెప్పిన నిన్ను లోకం పిరికి వాడని నిందించదా ! మనం యుద్ధం వలన పొందిన పాపమును అశ్వమేధ యాగం చేసి పోగొట్టుకోవచ్చు. అంతే కాని క్షత్రియ ధర్మాన్ని వదిలి మునివృత్తి స్వీకరించుట అధర్మం కాదా ! అన్ని ధర్మాలకు మూలమైన సంపద లేని నాడు చచ్చినవాడితో సమానం కాదా ! సంపదలు ఉంటే బంధువులు వారంతట వారే మన దగ్గరకు వస్తారు. సంపదలే మిత్రులను మనకు దరిచేరుస్తుంది. సంపద శౌర్యమూ, ధైర్యమూ, సద్బుద్ధి కలుగుజేస్తుంది. రాజ్యసంపద పురుషార్ధాలలో మేటి అలాంటి రాజ్యసంపద మనకు ధర్మబద్ధంగా ప్రాప్తించింది. ఆ సంపదను అనుభవించడం మనధర్మం కాదా ! దేవతలు కూడా దాయాదులను చంపే అభివృద్ధిని సాధించారు. దాయాదులను, శత్రువులను చంపకుండా రాజ్య సంపద లభిస్తుందా ! వేదములు కూడా శత్రుసంహారం చేసి రాజ్యసంపద పొంది యజ్ఞ యాగాదులతో దేవతలను సంతోషపెట్టి చని పోయిన తరువాత ఉత్తమగతులు పొందడమే క్షత్రియ ధర్మం. మన పూర్వీకులైన దిలీపుడు, **నృగుడు'**, అంబరీషుడు, సగరుడు, నహుషుడు, **మాంధాత** మొదలగు రాజులు ఈ ధర్మాన్నే అనుసరించి ఉత్తమగతులు పొందారు. ప్రస్తుతం నిన్ను వరించిన చక్రవర్తిపదవిని త్యజించుట న్యాయమా ! నీవు కూడా నీ పూర్వీకుల వలె యజ్ఞ యాగాదులు చేసి పునీతుడివి కాకపోతే నీకు పుణ్యం ఎలా లభిస్తుంది. అశ్వమేధయాగం చేసిన రాజులంతా పునీతులైయ్యారు " అని అర్జునుడు పలికాడు.

### ధర్మరాజు దు:ఖం

అర్జుడి మాటలు ధర్మరాజు ను స్వస్థుడిని చేయలేక పోయాయి. అతడు తన దు:ఖాన్ని వీడక " అర్జునా ! ఎందుకో నా మనసు రాజ్యపాలనకు అంగీకరించడం లేదు. ఈ లోకంలో తృప్తిని మించిన సంతోషం వేరొకటి లేదు. ఈ నిస్సారమైన సంసారం వీడి

ఒంటరిగా అడవులకు వెళ్ళి అక్కడ ఉన్న తాపసుల పలుకులు వీనులవిందుగా వింటూ కాలం గడపడం ఎంత బాగుంటుంది. నిందను పొగడ్తను సమంగా స్వీకరిస్తూ కత్తితో పొడిచిన వాడిని మేనికి చందమును అలదిన వాడిని ఒకటిగా చూస్తూ మూగవాడిలా మౌనవ్రతం ఆచరిస్తూ పర్ణశాల నిర్మించుకుని ఎవరు ఏమిచ్చినా భగవత్ప్రసాదంగా స్వీకరించి తృప్తి చెందడం కంటే ఆనందం మరొకటి కలదా ! అలా కాకుండా కర్మమార్గంలో ప్రయాణిస్తే పాపం మూట కట్టుకోవడం తప్ప మనకు ఒరిగేది ఏముంది? కనుక నేను మోక్షమార్గముకు దూరం కాలేను. దేవుడి కృప వలన అమృత తుల్యమైన జ్ఞానం లభించింది. అదే శాశ్వతం, అదే మోక్షమార్గం, నేను దానిని వదులుకోలేను " అన్నాడు.

## భీముడి హితవు

ఆ మాటలు విన్న భీమసేనుడు ధర్మరాజుతో " అన్నయ్యా ! నీవు కర్మయోగివి. శృతి విహితమైన కర్మలు ఆచరించకుండా జ్ఞానమార్గం అవలంబించడం న్యాయమా ! యుద్ధంలో అనేక మంది మరణాన్ని చూసి బంధుమిత్రులను పోగొట్టుకుని నీకీ విరక్తి, అసూయ వచ్చాయి. కాని ఈ వైరాగ్యం, ఈ కోపం, ఈ అసూయ యుద్దానికి ముందు వచ్చి ఉంటే ఎంతో మంది రాజులు, బంధువులు, స్నేహితులూ ప్రాణాలు విడువక ఉండే వారు కదా. మేమూ రాజ్యం మీద ఆశ వదిలి మునివృత్తి స్వీకరించి ఉండేవాళ్ళం. ఈ మహాభారత యుద్ధం జరిగేదీ కాదు, ఇంత ప్రాణ నష్టం జరిగి వుండేదీ కాదు. ఆనాడు భీకర ప్రతిజ్ఞ చేసి యుద్ధంలో పాల్గొని అందరినీ చంపి ఇప్పుడు అడవులకు పోతాను అంటే విన్న వారు ఏమనుకుంటారు. నిన్ను హేళన చేయరా ! వెనుకటికి నీ లాంటి వాడొకడు కష్టపడి బావి తవ్వి చివరకు నీళ్ళు త్రాగ కుండా ఊరుకున్నాడట. ఎత్తైన చెట్టెక్కి శ్రమ పడి తేనెపట్టును కొట్టి తేనెను త్రాగక ఊరుకున్నాడట, విస్తరి నిండా మృష్టాన్నం వడ్డించే వరకు ఉండి తరువాత తినకుండా విడిచి వెళ్ళాడట. కోరి వచ్చిన వనితను విడిచి వెళ్ళాడట, నీ భుజ బలంతో పరాక్రమంతో శక్తియుక్తులతో రాజ్యలక్ష్మిని కైవశం చేసుకుని రాజ్యపాలన చేయకుండా అడవులకు పోతాను అనడం కూడా అటువంటిదే కదా ! అయినా నీకు అన్నీ తెలుసు. నీకు నేను చెప్పగలిగినది ఏమున్నది. నీవు అడవులకు పోతుంటే నీ వెనుక మేము నడుస్తుంటే లోకులు నవ్వుతూ " ఈ వెర్రి వాళ్ళు అడవులకు పోతాననే ధర్మరాజు ను ఆపకుండా ఆయన వెనుక వీళ్ళూ వెడుతున్నారు " అని హేళన చెయ్యరా ! నీవు అడవులకు పోయి నీ తమ్ములందరినీ రాజ్యభోగాలకు దూరం చేస్తావా ! ప్రజలను శోకసాగరంలో ముంచుతావా ! ధర్మరాజా ! కర్మ రాహిత్యమే మోక్షమార్గం అయితే అరణ్యంలోని చెట్లు కర్మలు చెయ్యవు కదా ! వాటికి మోక్షం రాలేదు కదా ! అన్నయ్యా కర్మలను త్యాగం చెయ్యడం కాదు కర్మలు ఆచరిస్తూ కర్మఫలాన్ని త్యాగం చెయ్యాలి, తాను చేసే కర్మలన్ని బ్రహ్మార్పణం అంటూ నిష్కామకర్మలో మునిగి తేలాలి. అప్పుడు తత్వజ్ఞానం కలిగి కర్మరాహిత్యమై మోక్షం లభిస్తుంది " అన్నాడు.

## అర్జునుడు కర్మాచరణ విశిష్టత చెప్పుట

భీముడు మాటలకు కూడా ధర్మరాజు లో ఏమీ మార్పు రానందున అర్జునుడు అందుకుని " ధర్మజా ! నాకు తెలిసిన ఒక ఇతిహాసం చెప్తాను విను. పూర్వం కొంత మంది బ్రాహ్మణ బ్రహ్మచారులు తమ కులముకు ఉచితమైన ఆచారములను వదిలి అడవులకు వెళ్ళారు. వారి మీద దయ కలిగిన ఇంద్రుడు ఒక పక్షి రూపంలో వారి వద్దకు వెళ్ళి" మీరు ఎంచుకున్న మార్గం తప్పు " అని చెప్పాడు. ఆ బ్రహ్మచారులు ఆ పక్షిని మహాత్ముడిగా గుర్తెరిగి తమకు తగిన మార్గం ఉపదేశించమని అడిగారు. అప్పుడు పక్షి రూపంలో ఉన్న ఇంద్రుడు ఇలా చెప్పసాగాడు " చతుష్పాదములలో గోవు, శబ్ధములలో మంత్రం, మనుష్యులలో బ్రాహ్మణుడు అత్యంత శ్రేష్టమైన వారని వేదవిదులు చెప్తారు. కనుక బ్రాహ్మణుడు మంత్రోపాసన చేసి తనకు నిర్దేశించిన కర్మలు చెయ్యడం అతడి కర్తవ్యం. కానీ నిర్లక్ష్యంచేత కాని, కోపంచేత కానీ, శోకంచేత కానీ, తనకు నిర్దేశించిన విధ్యుక్త కర్మలను చెయ్యకపోవడం మహాపాతకం. అజ్ఞానులు, అర్ధహీనులు సన్యాసం గురించి తెలియక ఉభయభ్రష్టులు ఔతున్నారు. ఎవరైతే గృహస్థు ధర్మాలను పాటిస్తూ అతిధులను, దేవతలను, పితృదేవతలను సంతృప్తిపరుస్తాడో అతడికి పుణ్యలోకములు అరచేతిలో ఉంటాయి. మంచి కర్మలు చేసి వాటిని బ్రహ్మార్పణం చేస్తే మహదానందం కలుగుతుంది " అని చెప్పాడు. ఆ మాటలు విన్న బ్రాహ్మణ బ్రహ్మచారులు గృహస్థాశ్రమం స్వీకరించి తమతమ విధ్యుక్త ధర్మం నిర్వర్తించుటకు వెనుకకు వెళ్ళారు. కాబట్టి ధర్మరాజా ! నీవు నీ రాజ్యమును జనరంజకంగా పాలించు. యజ్ఞ యాగాదులు చేసి పుణ్యలోకాలను సంపాదించు " అని పలికాడు.

## నకులుడు ధర్మరాజుకు నచ్చచెప్పుట

తరువాత ధర్మరాజు మనస్థాపం నివారించుటకు నకులుడు ఇలా చెప్పాడు. " అన్నయ్యా ! బ్రాహ్మణులు తమ విధ్యుక్త ధర్మమైన యజ్ఞయాగాదులు చేసినపాపము నుండి విముక్తులు ఔతున్నారు. కేవలం యజ్ఞయాగాదులు చేసినందువలన ఏమి ప్రయోజనం ఉంటుంది. ఫలాపేక్ష లేకుండా ధనమును సంపాదించి యజ్ఞయాగాదులు చేసి బ్రాహ్మణులను తృప్తిపరిచిన

అది నిస్సంగప్రవృత్తి ఔతుంది కాని మనలోని కామక్రోధాలను, శోకమోహాలను విడిచి పెట్టకుండా అడవులకు పోయి తపస్సు చేసినందువలన ప్రయోజనం ఏమిటి ? అదియును కాక గృహస్థాశ్రమధర్మం, బ్రహ్మచర్యం, వానప్రస్థం, సన్యాసధర్మాలలో గృహస్థాశ్రమం శ్రేష్టమైంది. క్షత్రియులు ధనమును కూడబెట్టి క్రతువులు చెయ్యకపోయిన పాపం వస్తుందని వేదములు చెప్తున్నాయి, గాఢాంధకార బంధురమైన ఈ విశాలవిశ్వానికి వెలుగునిచ్చే ఈశ్వరుడే ఆశ్రమధర్మాలను వర్ణవ్యవస్థను ఏర్పాటు చేసాడు. ఈ యుద్ధం కూడా ఆయన కల్పించినదే ! భగవంతుడు నిర్ణయించిన యుద్ధమున జరిగిన హింసను తలచి నీవిలా శోకించి నీ ఆశ్రమధర్మమును విడుచుట తగునా ! యుద్ధంలో హింస జరిగిందని బాధపడుతున్నావు. మనకు ముందు పాలించినరాజులు యుద్ధములు చేయలేదా వారు ఉత్తమగతులు పొందలేదా ! నీకు ఈ యుద్ధమున ఏమీ పాపం అంటదు. ధర్మాత్ముడవైన నీకు తప్పక ఉత్తమగతులు ప్రాప్తిస్తాయి. క్షత్రియుని పాలనలో ప్రజలు రక్షణ కోరుకుంటారు. ప్రజలు సుఖంగా జీవించడానికి కావలసిన పరిస్థితులను కల్పించడం రాజువిధి. అది నెరవేర్చకపోవడం పాపంకాదా ! దానధర్మాలు చెయ్యడం క్షత్రియధర్మం. అర్హులైన వారికి నీవు దానధర్మాలు చెయ్యాలి. అవన్ని వదిలి నీవిలా అడవులకు పోవడం ఉత్తమధర్మమా ! నీకిది భావ్యమా ! " అని పలికాడు నకులుడు.

## సహదేవుడి అభిప్రాయం

తరువాత సహదేవుడు " అన్నయ్యా ! మానవుడు పైపైన ఉన్న కోరికలు విడిచి జీవించిన అది మోక్షకారకం ఔతుందా ! అన్నయ్యా ! నీవు కూడా శారీరక సుఖం వదిలి నీ వంశధర్మములు నిర్వర్తించు. మమత బంధమును కలిగిస్తుంది. మమతను విడిచిన మోక్షం లభిస్తుంది. నీవు అడవులకు వెళ్ళినా ఈ లోకంలోని వస్తువులను, సౌఖ్యాన్ని నీ మనస్సు కోరిన అది నీకు ఉత్తమలోక ప్రాప్తికి ప్రతి బంధకం ఔతుంది. అన్నయ్యా ! నీవు నాకు తల్లి, తండ్రి, గురువు, దైవం, చెలి, చుట్టం. నా మాట విని నీ మనస్సుమార్చుకో. నేను చెప్పింది అబద్ధమో, నిజమో నాకు తెలియదు. నేను భక్తితో పలికిన ఈ మాటలను నీవు కరుణతో విశ్వసించు " అని పలికాడు. నకులసహదేవుల మాటలకు ధర్మరాజు బదులు చెప్పలేదు.

## ద్రౌపది రాజధర్మం వివరించుట

అప్పటి వరకు పెదవి విప్పని ద్రౌపది లేచి ధర్మరాజు వద్దకు వచ్చి " నాథా ! మీరు అనుమతి ఇచ్చిన నాకు తోచినమాటలు చెప్తాను " అని, ధర్మజుని అనుమతితో ఈ విధంగా చెప్పసాగింది. " నాథా ! మనం ఆడవులలో ఉన్నకాలాన్ని ఒక్కసారి గుర్తుకు తెచ్చుకోండి. అరణ్య అజ్ఞాతవాసాలు ముగియగానే సుయోధనుడిని చంపి మన రాజ్యసంపదలను తిరిగి కైవశం చేసుకుంటామని మీరు మీ తమ్ములకు నచ్చచెప్ప లేదా ! చెప్పినట్లు రాజ్యాన్ని కైవశం చేసుకుని ఇప్పుడిలా మాటతప్పి రాజ్యత్యాగం చేసి అడవులకు పోతానని చెప్పడం ధర్మమా ! ధర్మం సత్యం వ్రతముగా పెట్టుకున్న మీకు ఈ విధంగా పలకడం న్యాయమా ! రాజు ఎప్పుడూ పేదమనసుతో ఉండ కూడదు. రాజు తన రాజ్యమును, ప్రజలను రక్షించాలి, దుర్మార్గులను నిర్ధయగా శిక్షించి సన్మార్గులను దయతో రక్షించాలి. బ్రహ్మదేవుడు లోకాన్ని రక్షించడానికే క్షత్రియ కులాన్ని సృష్టించాడు. రాజు మనుష్యరూపంలో ఉన్న దేవుడు. అలాంటి రాజు చేతకాని వాడైన దుర్మార్గులు విజృంభిస్తారు. రాజునందు దేవుడు రాజనీతిని ప్రతిష్టించాడు. అపరాధులను శిక్షించడం రాజధర్మం దానిని నెరవేర్చిన ఇహపరములు సిద్ధిస్తాయి. తప్పు చేసిన బ్రాహ్మణుడి నయినా రాజు శిక్షించడమే రాజధర్మం. ఇప్పుడు నీవు అదే రాజధర్మాన్ని నిర్వర్తించావు. రజస్వలను, ఏకవస్త్రను అయిన నన్ను సభకు ఈడ్చి వలువలు ఊడదీసి, తొడచూపి అవమానించిన దుర్యోధన, దుశ్శాసన, కర్ణులను నీవు ఒక రాజుగా శిక్షించావు. అది పాపంకాదు కనుక నీవు చింతించ పనిలేదు. విషప్రయోగం చేసిన వారిని, గృహదహనం చేసిన వారిని, రాజకీయ రహస్యములను బహిరంగపరచిన వాళ్ళను, హంతకులను, పరసతిని కోరిన వారిని, బంధువులను చంపిన వాడిని శిక్షించడం రాజధర్మం. అది పుణ్యకార్యం. దండించ వలసిన వారిని దండించక పోవడం మహాపాపం. రాజు దండనీతిని అవలంబించడం పేదలకు, సాధువులకు, తాపసులకు మేలుచేస్తుంది. వారికి రక్షణ కలిగిస్తుంది, దుష్టశిక్షణ, శిష్టరక్షణ చెయ్య వలసిన రాజు బ్రాహ్మణుల వలె ఇంద్రియనిగ్రహం పాటించడం ధర్మమా ! కనుక నీ మనసులోని శంకను తొలగించు. నాథా ! నా మాదిరి జీవితంలో కష్టపడిన వారు ఉన్నారా ! కాని నేను అన్నీ మరచి గృహస్థు ధర్మాలను విడువక నిర్వర్తించడం లేదా ! కౌరవులు వారి గోతిని వారే తవ్వుకున్నారు. వారిపాపం వారే అనుభవించారు. అందుకు మీరు బాధపడటం ఎందుకు. కనుక మీరు రాజ్యభారం వహించి ప్రజలను జనరంజకంగా పాలించండి. మీకు తెలియని యుద్ధనీతి లేదు. పూర్వం బృహస్పతి, శుక్రుడు యుద్ధనీతిని లోకానికి తెలిపారు. ఆ నీతిని కూలంకుషంగా అభ్యసించిన మీరు ఈ రాజ్యాన్ని పాలించుట ధర్మం " అని చెప్పింది.

## అర్జునుడు రాజనీతిని వివరించుట

అర్జునుడు తిరిగి ఇలా చెప్పసాగాడు. ప్రజలను పాలించవలసిన రాజు దండనీతిని వదిలిన, సన్యాసులు కూడా సన్మార్గం వదిలి అక్రమాలకు పాల్పడతారు. ప్రజలు క్రమము తప్పి ఒకరి ఆస్తిని, ధనమును, భార్యను మరొకరు అపహరిస్తారు. అరాచకం చెలరేగుతుంది. అందు వలన వచ్చే పాపం రాజుకు చుట్టుకుంటుంది. కనుక దండనీతిని పాపంగా తలచవద్దు. దుర్మార్గులను దండించిన రుద్రుడు, గోవిందుడు, ఇంద్రుడు, గుహుడు మొదలగు వారు పాపం పొందారా పైగా వారికి గౌరవాదరాలు లభించాయి. కనుక అన్నయ్యా ! దండనీతి వలన ధర్మం స్థాపించ పడుతుంది. అధర్మం నశిస్తుంది. అన్నయ్యా ! సామాన్య మానవులూ తమ దైనందిక జీవితంలో హింసకు పాల్పడక తప్పదు. మనం తినే పండ్లలో, నీటిలో, కాయలలో ఎన్నో కంటికి గోచరం కాని జీవులు ఉన్నాయి. అహారం కొరకు మనం వాటిని చంపుతున్నాము. మనం కందమూలాల కొరకు భూమిని తవ్వే సమయంలో అనేక జీవులు నశిస్తాయి అవి అన్నీ పాపమును కలిగిస్తాయా ! ప్రాణం నిలుపుకోవడానికి ఆహారం కావాలి, అహారం కావాలంటే హింస తప్పనిసరి. భగవంతుడు కూడా ఒక ప్రాణికి మరొక ప్రాణిని ఆహారంగా సమకూర్చ లేదా ! ధర్మమార్గాచరణలో చేసిన హింస పాపం కాదు. రాజుకు దుర్మార్గులైన శత్రువులను చంపడం అహింస కాదు. అన్నయ్యా ! మనతండ్రి పాండురాజు సంపాదించిన రాజ్యాన్ని మనం తిరిగి పొందుట అన్యాయం ఎలా ఔతుంది ? మనం చేసింది ధర్మయుద్ధమో అధర్మయుద్ధమో ఆ భగవంతుడికి తెలుసు. కనుక దక్షుడవై ఈ రాజ్యాన్ని పాలించు " అన్నాడు.

## భీముని హితవు

ఎంత మంది ఏన్ని చెప్పినా ధర్మరాజులో చలనం లేదు. అప్పుడు భీముడు " అన్నయ్యా ! అన్నీ ధర్మములు తెలిసిన నీకు మేము చెప్పగలిగిన వాళ్ళమా ! కాని నా ఓర్పు నశించింది అందుకని తిరిగి తిరిగి చెప్పవలసి వచ్చింది. న్యాయ మార్గములో సంపాదించిన రాజ్యసంపదను విడుచుట పిరికితనం అనిపించుకుంటుంది. జనం మనలను చూసి పిరికివాళ్ళని చీదరించుకుంటారు. కపటజూదం కారణంగా ఎన్నో కష్టాలు పడ్డాము. అవమానాల పాలయ్యాము. కాని నీవు సత్యాన్ని నమ్ముకున్నావు. మేము నిన్ను అనుసరించాము. యుద్ధములో అనేక మంది శత్రువులను చంపాము. నీకు ఎనలేని కీర్తి లభించింది. రాజ్యలక్ష్మి లభించింది. అసలు మనకు యుద్ధం చేయ వలసిన అవసరం ఎందుకు వచ్చింది. కౌరవసభలో పడిన కష్టాలు, అడవులలో అనుభవించిన ఇడుములు, అజ్ఞాతవాసంల్లో అనుభవించిన వ్యధ వలన శ్రీకృష్ణుని నిర్ణయం మేరకు అతడి సహకారంతో యుద్ధం చేసాము. యుద్ధంల్లో కౌరవులో మనమో చావడం తప్పదని యుద్ధానికి ముందే నీకు తెలియదా ! ఇప్పుడు శత్రువులు చచ్చారని బాధపడటం ఎందుకు ? కనుక అన్నయ్యా ! వచ్చి రాజ్యభారం వహించు " అని భీముడు పలికాడు.

## ధర్మరాజు మునివృత్తిని సమర్ధించుట

భీముడి మాటలు సావధానంగా విన్న ధర్మరాజు " మీరు కోరికలు, మదం, భయంతో సతమతమౌతూ ఈ రాజ్యాన్ని పాలించమని కోరుతున్నారు. కాని రాజ్యపాలన దు:ఖభూయిష్టం అని పెద్దలు అంటారు. రాజుకు నరకం తప్పదని ఆర్యోక్తి. రాజ్య పాలనలో సుఖం శాంతి ఎలా లభిస్తుంది. కామపరమైన భోగములు అనుభవించడంలో ఆనందం ఎక్కడ ఉంది. వాటిని విడిచిన పరమానందం పొందవచ్చు. అరణ్యములలో కందమూలములు తిని జీవిస్తున్న మునులు వెర్రివాళ్ళా ! దుర్మతులు విషయసంబంధ విషయములలో చిక్కుకుని నిరంతర దు:ఖములు పొందుతున్నారు. విజ్ఞులు కోరికలను జయించి ప్రశాంత చిత్తులై జీవిస్తున్నారు. ఈ విషయంలో జనక మహారాజు మాటలు మనకు తెలుసు కదా ! " కోరికలు లేని వాడికి సంపదలతో పని లేదు. మిధిలా నగరం కాలి పోతున్నా నేను ఏ వస్తువూ కాలనట్లే భావిస్తాను " అన్నాడు కదా ! ఆ జనకమహారాజును అందరూ గౌరవించ లేదా ! బాగా ఆలోచించే శక్తి ఉన్న మీరు అజ్ఞానులై శాంతి కాముకుడు నిందార్హుడని అనడం ధర్మమా ! సంసార సుఖాలకు దూరంగా ఉన్న సర్వసంఘ పరిత్యాగికి సంసారంలో పడి కొట్టుకుంటున్న వాళ్ళు పైనున్న వాడికి కొండ క్రింద ఉన్న వాడిలా కనిపిస్తాడు " అని అన్నాడు ధర్మరాజు.

## జనకునికి అతడి భార్య హితవు

ధర్మరాజు మాటలకు అర్జునుడు ఇలా బదులిచ్చాడు. " నీవు చెప్పిన జనక మహారాజుకు ఆయన భార్యకు జరిగిన సంవాదం విను. నీ వలెనే జనకుడు రాజ్యమును వదిలి బిక్షుక వృత్తి స్వీకరించ నిశ్చయించినపుడు ఆయన భార్య " నాధా ! నీవు రాజ్యపాలన వదిలి భిక్షుక వృత్తి స్వీకరించిన ఇక్కడ అతిథి సత్కారాలు, దేవతర్పణములు, పితృ తర్పణములు ఎవరు చేస్తారు ? శిరోముండనం చేయించుకున్న తరువాత భిక్షకొరకు ఇల్లిల్లు తిరగాలి కదా ! మరి ఆ గృహస్థు మీకు అన్నదానం చేసి పుణ్యం పొందుతాడు కదా ! అన్నదానం వలన అధిక పుణ్యం వస్తుంది కదా ! దానం తీసుకునే వాడి కంటే దానం చేసే వాడు గొప్పని నీకు తెలుసు కదా ! వేదవిదులు రాజుల మీద ఆధారపడతారు. రాజైన మీరే మీ కర్తవ్యం వదిలితే మిగిలిన వారికి

దిక్కెవ్వరు ? వారి బ్రతుకులు చెడుపుట మీకు ధర్మమా ! కన్నతల్లినీ కట్టుకున్న దానిని వదిలి, మీ కర్తవ్యం అడవులలో మీరు ఏమిసాధిస్తారు ? ఎండకు చలివేంద్రంగా, చెట్టుకు మధుర ఫలములుగా ఉండి ప్రజల కష్టములు తీర్చవలసిన మీరు ఇలా దీన వృత్తిని స్వీకరించ తగునా ! మీరు చేయదలచిన పని ధర్మవిరుద్ధం. దాని వలన మీకు మోక్షం కలుగుతుందని నేను అనుకోను " అని జనకుని భార్య జనకునితో చెప్పింది.

## కర్మమార్గం

అర్జునుడి మాటలు విన్న ధర్మరాజు " అర్జునా ! వేదాలు మానవులకు కర్మమార్గాన్ని నిర్ధేశించాయి. అదే వేదములు కర్మసన్యాస మార్గమును కూడా చెప్పి దాని వలన ఉత్తమగతులు కలుగుతాయని చెప్ప లేదా ! మానవుడు తన విజ్ఞతతో తనకు తగిన మార్గాన్ని ఎన్నుకోవాలి. ఉత్తమకార్యములు చేస్తే పరలోకప్రాప్తి కలుగుతుంది. నీవు చెప్పినది లోకధర్మం అది తప్పు కాదు. కాని విజ్ఞులు, వేదవిదులు లోకపూజ్యులు చేసేది తప్పని అనగలమా ! నీవు ఇంద్రుడి పుత్రుడవు, భీముడు వాయుపుత్రుడు మీరిరువురు దైవాంశ సంభూతులు అరివీర భయంకరులు. శ్రీకృష్ణుడు మనతో ఉండటం వలన ఆయన తేజస్సు కూడా మీకు సంక్రమించింది. కాని మీరిరువురు యుద్ధవిద్యా విశారదులు కాని ధర్మవేత్తలు తత్వవేత్తలు కారు కదా ! ఈ సంసారం సారహీనమైనదని తత్వవేత్తలు అంటారు. ఆశాపాశములు వదిలి కర్మలు చేయుట మాని నిర్మలమైన మనసు కలవాడు సుఖి. ఎప్పుడూ ధనం సంపదల కొరకు పాకులాడు వాడు ఎన్నడూ సుఖించలేడు. వేదవేదాంగములు చదివి తత్వజ్ఞానమును రుచి చూసి కూడా జ్ఞానం లేని వారు కర్మమార్గమే మంచిదని ప్రభోదిస్తూ కర్మలలో పడి కొట్టు మిట్టాడు తుంటారు కాని శాశ్వత సుఖమును పొందలేరు. జ్ఞానసముపార్జన చేసిన వారు శమము, దమము, త్యాగము శాశ్వతానందం కొరకు మూలములని చెప్తారు. వాటిని నా వంటి విచక్షణ కలవారు అంగీకరించి ఆచరిస్తారు " అని పలికాడు ధర్మరాజు.

## దేవస్థానుడు హితవు చెప్పుట

అక్కడే ఉన్న **దేవస్థుడు** అనే ముని " ఓ ధర్మరాజా ! ఈ లోకములో సుఖంగా జీవించాలంటే అర్జునుడు చెప్పినట్లు సంపదలు, ధనమూ కావాలనడం సత్యం. యోగమార్గముకు చక్కని సోపానములు కలవు నీవు ఆ మార్గమున పయనించిన కాని మోక్షమును పొందలేవు. భోగములు అనుభవించడానికి మాత్రమే ధనార్జన చేయడం తప్పే కాని యజ్ఞ, యాగములు చేయుటకు దాన ధర్మములు చేయుటకు ధనార్జన చేయడం తప్పకాదు. పైగా దాని వలన మోక్షం కలుగుతుంది. యజ్ఞయాగాదులకు వినియోగించడానికి సంపాదించిన ధనం మనస్తాపాన్ని పోగొడుతుంది. దాని వలన శమము, దమము కలుగుతాయి. కనుక ధనం సముపార్జించి యజ్ఞయాగములు, దానధర్మములు చేయుము. ధర్మరాజా ! శివుడు సర్వమేధము అనే యజ్ఞం చేసాడు. దిక్పాలకులు, బ్రహ్మ ఎన్నో యజ్ఞాలు చేసారు. **మరుత్తులు** ఎన్నో యజ్ఞములు చేసి ఖ్యాతి పొందారు. ఒక సారి ఇంద్రుని కోరిక పై బృహస్పతి " ఇంద్రా ! కామము క్రోధము మనసున చేర నీయక ఇంద్రియ నిగ్రహం పాటిస్తూ శోకమును దరి చేరనీయక తాను సుఖుడై ప్రజలను సుఖపెడుతూ రాజ్యపాలన చేసే వాడికి సర్వం వాటంతట అవి వచ్చిచేరతాయి. ధర్మజా ! కర్మలు చెయ్యడం కర్మలు వదలడం రెండూ మేలుకాదు. కర్మలు చేస్తూ దాని ఫలమును ఈశ్వరార్పణం చేయడం ఉత్తమమని పెద్దలు చెప్తారు. మంచి చెడ్డ పనులను సమానంగా చూస్తూ ఎవరికీ ద్రోహం తలపెట్టక క్షత్రియ ధర్మాన్ని పాటిస్తూ రాజ్య పాలన చెయ్యడం ఉత్తమం. నీకు పూర్వులైన రాజులందరూ ఇదే చేసారు. నీకు పూర్వులైన రాజులందరూ ఇదే ఉత్తమమార్గమని ఎంచి దానిని అనుసరించారు. తరవాత వారి కుమారులకు రాజ్యమును అప్ప చెప్పి వానప్రస్థాశ్రం స్వీకరించారు. నీవు కూడా అలాగే చెయ్యి " అని దేవస్థానుడు పలికాడు.

## అర్జునుడు రాజధర్మం చెప్పుట

తరువాత అర్జునుడు ధర్మరాజు తో " అన్నయ్యా ! క్షత్రియ ధర్మం అనుసరించి యుద్ధం చేసావు. యుద్ధంలో చని పోయిన శత్రురాజులు ఉత్తమ గతిని పొందారు. రాజధర్మం రౌద్రమని బాలురకు తెలుసు. రాజ్యపాలనలో పాపాలకు తావు లేదు. రాజనేవాడు రాజ్య పాలన చేస్తూ పదిమందిని పోషించాలి గాని ఒకరు పెడితే తినడం ధర్మమా ! కురువంశ అగ్రగణ్యుడవు ఇది నీకు తగునా ! రాజుల మనసు వజ్రంలా కఠినంగా ఉండాలి కాని ఇలా బేలగా ఉండకూడదు. కనుక శోకం విడిచి రాజ్యభారం వహించు.

## వ్యాసుడు ధర్మజునికి నచ్చచెప్పుట

ఎందరు ఎంత చెప్పినా ధర్మరాజు మనసు మారలేదు. అప్పడు వ్యాసుడు ధర్మరాజు తో " ధర్మరాజా ! అర్జునుడి మాటలు

అక్షరసత్యాలు. అన్ని ధర్మములలోకి గృహస్థధర్మం గొప్పది. మానవులకే కాక పశుపక్ష్యాదులకు అది ధర్మమే. క్షత్రియులకు గృహస్థధర్మము తప్ప మిగిలిన తపస్సు, ఇంద్రియనిగ్రహం, బ్రహ్మచర్యం ఆచరణ యోగ్యం కాదు. ధనం సంపాదించకుండా ఉండటం, ప్రజారక్షణ మరవడం, యుద్ధం చేయకుండా పారిపోవడం క్షత్రియులకు మహాపాతకం. ఇది వేదవాక్కు కనుక వేదమార్గాన నాడిచి ఈ భూమిని జనరంజకంగా పాలించు. ధర్మజా ! నీవు గురువుల వద్ద విద్యను అభ్యసించి ధర్మసూక్ష్మాలను చక్కగా ఎరిగిన వాడివి నీవు వర్ణాశ్రమ ధర్మములు తెలియని వాడివా ! భూమిని పాలించే రాజుకు దడనీతి తప్ప వేరు మార్గం లేదు. నీకు సద్యుముడు ఎలా దండనీతిని అమలు పరచి దుష్టులను శిక్షించి చివరకు మోక్షం పొందాడో తెలియాలి. ఆ కథ నీకు వివరిస్తాను.

## సద్యుమ్నుడు

పూర్వం **బహుదానదీ** తీరంలో లిఖితుడు, శంఖుడు అనే ఇద్దరు బ్రాహ్మణ సహోదరులు ఉన్నారు. ఇద్దరూ ధర్మతత్పరులు. వారి ఆశ్రమంలో కాయలు, పండ్లు సమృద్ధిగా ఇచ్చే వృక్షాలు అనేకం ఉన్నాయి. ఒక రోజు శంఖుడు ఇంట్లో లేనప్పుడు లిఖితుడు ఆశ్రమంలో ఉన్న చెట్ల నుండి బాగా పండిన పండ్లలను కోసి తింటున్నాడు. అప్పుడు **శంఖుడు** అక్కడకు వచ్చి " ఈ పండ్లు ఎక్కడివి " అని అడిగాడు. **లిఖితుడు** " మీ చెట్లో కోసుకున్నాను " అన్నాడు. శంఖుడు " నా అనుమతి లేకుండా నా చెట్టు నుండి పండ్లు కోయవచ్చా ! అది దొంగతనం కాదా ! నీకు పాపం అంటింది. రాజదండనతో కాని ఆపాపం పోదు " అన్నాడు. వెంటనే లిఖితుడు రాజు వద్దకు వెళ్ళి వార్తాహరుల ద్వారా తన రాకను తెలియజేసి రాజును మంత్రులతో వెలుపలకు రప్పించాడు . **సుద్యుమ్నుడు** " విప్రోత్తమా ! మీరు ఇక్కడకు వచ్చిన కారణమేమి ? ఆజ్ఞాపించిన మీరు చెప్పినట్లు చేస్తాను " అని అన్నాడు. అందుకు లిఖితుడు " రాజా ! మీరు మాటతప్పక నేను చెప్పినట్లు చేయాలి. నేను నా సోదరుడి ఆశ్రమం లోని పండ్లను దొంగిలించాను. దానికి మీరు తగిన శిక్ష విధించి నన్ను పాప విముక్తిడిని చెయ్యండి " అని ప్రార్ధించాడు. ఆమాటలకు చాలాబాధను అనుభవించిన రాజు ఇక తప్పదనుకుని లిఖితుడి చేతులు నరకమని దండన విధించాడు. లిఖితుడు రాజుకు దీవించి వెళ్ళాడు. అతడికి దండన అమలుజరిగింది. లిఖితుడు శంఖుడి వద్దకు వెళ్ళి తన తెగినచేతులు చూపి " నేను దండన అనుభవించాను " అన్నాడు. శంఖుడు సంతోషించి " లిఖితా ! ఎవరూ ధర్మమార్గం, తప్పకుడదు. నీ జీవితం ధన్యమైంది. నీవు బహుదానదికి వెళ్ళి దేవతర్పణములు, పితృతర్పణములు విడిచి పెట్టు. లిఖితా ! కల్లుత్రాగడం, గురుపత్నిని కామించడం, బ్రాహ్మణుల సొత్తు అపహరించడం ఇవి మహా పాతకములు. ఈ మహా పాతకములలో ఏ ఒక్కటి ఎవరు చేసినా అది బ్రాహమణుడైనా దండనార్హుడే. రాజు చేత దండింపబడిన వారు పుణ్యలోకాలకు పోతాడు. నీవు కూడా రాజదండన అనుభవించావు కనుక పుణ్యలోకాలకు పోతావు. అందుకు నీవు సంతోషించు " అన్నాడు. వెంటనే లిఖితుడు బహుదా నదికి వెళ్ళి తెగిన చేతులతో దేవతర్పణములు పితృతర్పణములు విడిచాడు. అతడు ఆశ్చర్యపడేలా అతనికి తిరిగి చేతులు వచ్చాయి. లిఖితుడు ఆనందంగా శంఖుని వద్దకు పరిగెత్తి పోయి శంఖుడికి తన చేతులు చూపాడు. శంఖుడు " ఇందుకు ఆశ్చర్యం ఎందుకు ? ఇది దైవకృప చేత నా తపోమహిమ చేత కలిగింది. నీవు నిర్మల మనస్కుడవు కనుక నీకు దైవానుగ్రహం కలిగింది. నిన్ను దండిచిన సుద్యుమ్న మహారాజు తన పితృదేవతలతో సహా పుణ్యాత్ములైయ్యారు " అన్నాడు.

## క్షత్రియ ధర్మం

వ్యాసుడు ఇంకా ధర్మరాజుతో " ధర్మజా ! నీవు కూడా తగిన విధంగా ప్రజారక్షణ కావించుము. నీ తమ్ములు చెప్పిన మాటలు వేదవాక్కు. రాజనీతి దండన చేత తప్ప మరొక విధంగా నిర్వర్తించబడ లేదు. కనుక నీవు శోఖమును వదిలి గొప్పగొప్ప యాగములు, యజ్ఞములు చేసి చక్కగా రాజ్యాన్ని పాలించు. ధర్మనందనా ! నీ తమ్ములు నీ భార్య నీమాట మన్నించి పన్నెండేళ్ళ అరణ్యవాసం ఒక ఏడు అజ్ఞాతవాసం చేసి కష్టములు అనుభవించారు. ఇప్పడు నీవు వారి మాట మన్నించి వారికి సుఖశాంతులు కలుగచెయ్యి. విరాగి అయి అడవులకు వెళ్ళి దేవతలకు పితృదేవతలకు బాధ కలిగించకు. నీకు న్యాయశాసస్త్రం బాగా తెలుసు. ప్రజల మనోభిష్టం తెలుసుకుని శిష్టరక్షణ, దుష్టశిక్షణ చేసి దండనీతిని అమలు పరచే రాజుకు అన్నీ శుభాలే కలుగుతాయి. ప్రజల ఆదాయం నుండి ఆరవ భాగం పన్నుగావసూలు చెయ్యి. ప్రజలన్కు కన్నలబిడ్డల వలె పాలించు. ఇదే మోక్షముకు మార్గం చూపుతుంది. నీ మనసులో ఉన్న భయం సంశయం వదిలి పెట్టు. కాని ధర్మరాజా రాజు అహంకరించి కామ క్రోధవశుడై ప్రజాకంటకంగా పాలిస్తే అతడికి ప్రజలు చేసే పాపంలో నాల్గవభాగం లభిస్తుంది. శత్రువులను నిర్మూలించడం క్షత్రియ ధర్మం, పాపాత్ములైన రాజులతో సంధి చేసుకోవడం దోషం, శత్రువులతో సంధి చేసుకుని తన రాజ్యంలో కొంత భాగం ఇవ్వడం మంచిదికాదు. యుద్ధం చేసి రాజ్యరక్షణ చేయడం క్షత్రియ ధర్మమం. కనుక నీవు యుద్ధం చేసినందుకు చింతింప పని లేదు. దుర్యోధనుడితో సంధి చేసుకోక పోవడం వలన ఈ ఘోర యుద్ధం సంభవించింది అనుకోవడం నీ అవివేకం పూర్వం హయగ్రీవుడనే రాజు యుద్ధములు చేసి శత్రువులను జయించి, దుండగులను శిక్షించి. సన్మార్గులను రక్షించి, యజ్ఞయాగాదులు చేసి, ప్రజారంజకంగా పాలించి తుదకు సద్గతి పొందాడు. కనుక యుద్ధములు రాజులకు కీడు చెయ్యవు. యుద్ధంలో చావడం, చంపడం సహజం కనుక నీవు అనుమానం వదిలి సమర్ధులైన రాజోద్యోగులను నియమించి

రాజ్యకార్యములు నిర్వహించుము " అన్నాడు.

## కలత వీడని ధర్మరాజు

ఇన్ని చెప్పినా కలత వీడని ధర్మరాజును చూసి అర్జునుడి గుండెలు రగిలిపోతున్నాయి. కాని మనసులో కోపందాచి నిలబడి ఉన్నాడు. ధర్మరాజు వ్యాసుడితో " ఓ మహర్షీ ! ఈ యుద్ధంలో ఎంతోమంది స్త్రీలు తమభర్తలను, కుమారులను, సోదరులను పోగొట్టుకున్నారు. వారి విలాపములు శోకసంతాపములు నా హృదయానికి నిద్రలేకుండా చేస్తున్నాయి. ఈ పరిస్థితిలో నేను ఈ రాజ్యమును ఎలా ఏలగలను ? " అన్నాడు.

### సుఖ దు:ఖములు

వ్యాసుడు " ధర్మరాజా ! సుఖదు:ఖములు నీ వశంలో ఉన్నట్లు మాట్లాడుతున్నావు. దు:ఖాలు పొమ్మంటే పోవు, సుఖాలు రమ్మంటే రావు, ఈ లోకంలో అనుభవించే సుఖదు:ఖములకు హేతువు వారు పూర్వజన్మలో చేసుకున్న పాపపుణ్యాలే. అయినా ఈ సుఖదు:ఖములు శాశ్వతం కాదు. సుఖం వెంట దు:ఖం, దు:ఖం వెంట సుఖం వస్తూపోతూ ఉంటాయి. దుర్మార్గులకైనా కాలం కలిసివస్తే అనంత సుఖాలు ప్రాప్తిస్తాయి. ఎంతటి సుగుణవంతుడికి అయినా కాలం కలిసి రాకున్న సంపద లభించదు. కాలం కలిసి రాకున్న మంత్ర తంత్రములు పని చెయ్యవు. వర్షం, తాపం, చీకటి, వెన్నెల దైవ కల్పితములు. కమలం వికసించడం, చెట్లు పుష్పించుట, కాయలుకాయడం, పండ్లుపండడం ఋతు ధర్మం కాల మహిమ. జననం, వృద్ధిపొందుట, క్షీణించుట, మరణించుట కాల ధర్మమే. వీటి కొరకు నీవు దు:ఖించుట అవివేకం.

## సేనజిత్తు మహారాజు

వ్యాసుడు ఇంకా ఇలా చెప్పసాగాడు. " ధర్మజా ! పూర్వం **సేనజిత్తు** మహారాజుకు పుత్రశోకం కలిగింది. అయినా శోకించలేదు. అతడు నీమాదిరి శోకించక తనతానే ఆశోకమును పోగొట్టుకున్నాడు. అతడు పలికిన పలికులు విను " ఈ లోకంలో కొందరు ఇతరులను బాధపెడతారు. మరి కొందరు ఇతరుల చేత బాధను అనుభవిస్తారు. ఇవన్నీ పూర్వజన్మ కర్మలఫలితం కాలమహిమ అనుకోవాలి కాని ఎవరో మనలను బాధిస్తున్నారని చింతించి వాటివలన సుఖం, దు:ఖం పొంద కూడదు. ధనం, భార్య, బంధువులు పోయారని చింతించుట అవివేకం. మనం దు:ఖించినందున బాధలు తొలిగి పోతాయా ! మనకు కలిగే శోకముకు భయముకు ఎన్నో కారణాలు ఉంటాయి. అన్నీ తెలిసిన వాడు శోకముకు భయముకు తలవంచడు. మూర్ఖుడైన వాడు వాటిని తలచుకుని దు:ఖిస్తుంటాడు. సుఖదు:ఖాలు శాశ్వతములు కావు కనుక వాటిని చూసి పొంగుట, కుంగుట తగదు. ఏమీ తెలియని వాడు, అన్నీ తెలిసిన వాడు సుఖ దు:ఖములకు చింతించడు. తెలిసీతెలియని వాడు మాత్రమే సుఖములకు పొంగి దు:ఖములకు కుంగి పోతాడు " అని చెప్పాడు సేన జిత్తు మహారాజు. ఆ మాటలు నీకూ వర్తించి నీ దు:ఖాన్ని పోగొడతాయి ధర్మరాజా ! వర్ణాశ్రమ ధర్మములు ఆచరించి దండనీతిని అమలు చేస్తూరాజ్యమును పాలించుట క్షత్రియ ధర్మం. చనిపోయిన తరువాత కూడా ఎవరిని గురించి ప్రజలు తలచుకుంటారో వాడే సత్పురుషుడు. కనుక క్షత్రిఉయ ధర్మమైన రాజ్యపాలన క్షత్రియుడవైన నీవు చేపట్టు " అని పలికాడు.

## ధర్మరాజు వ్యధ

వ్యాసుడి మాటలు విన్న తరువాత కూడా ధర్మరాజు వికల మనస్కుడై " మహర్షీ ! ఎన్ని చెప్పినా ద్రౌపదేయులనూ, అభిమన్యుడిని, కర్ణుడిని, విరాటుడిని, ధృష్టకేతుని మరువలేకున్నాను. నాకు మనశ్శాంతి లేకున్నది. మునీంద్రా ! నేను ఎంతటి పాపాత్ముడనంటే చిన్నతనంలో మమ్ము చేరదీసి, ఆదరించి, తొడమీద కూర్చుండ చేసి అన్నం తినిపించిన తాత భీష్ముడిని చంపాను, అర్జునుడు వేసిన బాణములు శరీరం అంతా గుచ్చుకుంటూ ఉంటే భీష్ముడు శిఖండి వైపు చూసిన చూపు నేను మరువ లేకున్నాను. పరశురాముడి శిష్యుడిని అంతటి మహాత్ముడిని ఈ తుచ్ఛరాజ్యము కొరకు ఇలాంటి దుర్మరణం పాలు చెయ్యడం నాకు కడుదు:ఖాన్ని కలిగిస్తుంది. విద్య చెప్పిన గురువు నేను అసత్యం పలకనని నమ్మి నన్ను అడిగినపుడు అసత్యం పలికి అతడి మరణానికి కారకుడిని అయ్యాను. గురువు నమ్మకాన్ని వమ్ము చేసి నేను గురుద్రోహిని అయ్యాను. నేను ఎంతటి పాపాత్ముడను గురువును చంపిన వాడికి ఏమి శిక్ష విధించాలో నాకు మీరే చెప్పాలి మహాత్మా ! నా అన్నయ్య కర్ణుడు స్వంత అన్నను చంపి రాజ్యమును నేను ఎలా ఏలగలను. అది నాకు ఎటుల ఆనందాన్ని ఇవ్వగలదు. భగభగ మండే అగ్నివంటి పద్మవ్యూహంలోకి బాలుడైన అభిమన్యుడిని పంపిన నేను ఎంతటి క్రూరాత్ముడను. సుభద్రార్జునులు కనుక నా కౄరత్వాన్ని సహించారు. ఇంకొకరెవరైనా నన్ను నరికిపారవేయరా ! పసివాడిని అగ్నిగుండలో

వేసినవాడికి రాజ్యం పాలించే అర్హత ఎక్కడిది? కడుపున పుట్టిన అయిదుగురు పుత్రులను పోగొట్టుకున్న ద్రౌపది దు:ఖాన్ని నేను ఎట్లు పోగొట్టగలను ? దీనికంతటికీ కారణమైన నన్ను ప్రాయోపవేశం చేసి మరణం కొరకు ఎదురు చూడనివ్వండి " అన్నాడు.

## వ్యాసుడి హితవు

ధర్మజుడు మాటలు విని వ్యాసుడు " ధర్మజా ! క్షత్రియుడవైన నీకు ఈ బేలతనం తగయ్యా ! ఎన్ని చెప్పినా నీ శోకం తీరలేదు. ఈ సారి నీవు నీ బాధలు మరచి మనసుపెట్టి నా మాటలు విను. ఈ లోకమంతా ద్వంధములతో నిండి ఉన్నది వృద్ధి చెందడం నశించడంకొరకే, పుట్టడం మరణించడానికే, పెరగడం తరగడం కొరకే పుట్టడం చావడం కొరకే సుఖం వెటనే దు:ఖం ఉంటుంది. మిత్రులంతా మంచి చేస్తారని , శత్రువులు మాత్రమే కీడు చేస్తారని, మంచి వారికే ధనం ప్రాప్తిస్తుందని, ధనంతోతే సౌఖ్యం వస్తుందని అను కోవడం పొరబాటు. అలా అనుకోవడం బ్రహ్మరాతను ధిక్కరించడమే ఔతుంది. విధాత నిన్ను ఎందుకు పుట్టించాడో నీవు ఆ కర్మను నిర్వర్తించాలి. నా ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తానని అనడం కుదరనిపని.

## జనకుడి బంధువియోగం

వ్యాసుడు పూర్వం తనమాటలను పొడిగిస్తూ " పూర్వం విదేహమహారాజుకు బంధువియోగం కలిగింది. అయనకు అప్పటికి పరిపూర్ణజ్ఞానం కలుగలేదు. అందువలన ఆయన అత్యంతశోఖం అనుభవించి ఇల్లువిడిచి పోవాలని అనుకున్నాడు. ఆ సమయంలో అతడివద్దకు **అశ్మకుడు** అనే బ్రాహ్మణుడు వచ్చాడు. జనకుడు అతడికి అతిధిసత్కారాలు చేసి " విప్రోత్తమా ! మానవునకు సంపద కలిగినప్పుడు బంధువులు ఉన్నప్పుడు కలిగే ఆనందం, అహంకారం, మదము సంపద పోయినప్పుడు కలిగే దు:ఖముకు కారణమేమిటి ? " అని ఆడిగాడు అందుకు ఆ బ్రాహ్మణుడు " ఈ విధంగా చెప్పాడు " జనకమహారాజా ! సంసారం అన్న తరువాత సుఖందు:ఖం సహజం. అవి మానవుడి మనస్సును చెదరగొడతాయి. ఈ లోకంలో ఎక్కువ సుఖంకాని ఎక్కువ దు:ఖంకానీ ఎవరికీ ఉండదు అని తెలుసుకోవడమే జ్ఞానం. ఈ భూమిసమస్తం ఏలే చక్రవర్తికి కూడా వార్ధక్యం, మరణం సహజమే వాటిని ఎవరికీ ఆపకలిగే శక్తి లేదు. జీవితంలో ఏదిజరిగినా బుద్ధి చెదరనీయక అది తన ప్రాప్తమని అనుకోవడం విజ్ఞులలక్షణం. కాలం వలన ప్రతిమనిషికీ ఆహారం, భోగములు, మంచి పడక, మంచి ఆసనములు అన్నీ కాలగమనం వలన కలుగుతుంటాయి తిరిగి పోతుంటాయి. కనుక ఉన్నప్పుడు పొంగడం లేనప్పుడు కుంగడం విజ్ఞులలక్షణం కాదు. కనుక వాటియందు విపరీతకాంక్ష పెంచుకోవడం తగదు. వైద్యులు చక్కగా అభ్యసించి రోగికి మందులు ఎన్నిచ్చినా అన్నీ రోగములు తగ్గవు కదా ! వైద్యులకూ రోగములు రావడం సహజమే ! కనుక అంతా విధిరాతప్రకారం జరుగుతుంది. మానవప్రయత్నం చేయడం మన విద్యుక్తర్మం. ధనవంతుల ఇంట పుట్టడం, యోగుల ఇంట పుట్టడం, అందచందాలు కలిగి ఉండడం, బలవంతులు అవడం, అదృష్టవంతులు అవడం, భోగాలు అనుభవించడం అన్ని పూర్వ జన్మ పుణ్యఫలం. పూటగడవని దరిద్రుడికి తామరతంపరగా పిల్లలు పుడతారు. కాని అత్యంత ధనవంతునికి ఎన్ని వ్రతాలు చేసినా సంతానభాగ్యం కలుగదు. పేదవాడు ఏదితిన్నా హరాయించుకుంటాడు. ధనవంతుడికి పట్టెడన్నంకూడా అరగదు. పరస్త్రీవ్యామోహం, జూదం, సురాపానం, జంతువులను వేటాడడం పెద్దలు నిర్ణయించారు. కాని లోకులనేకులు ఆ మార్గమున పోయి భ్రష్టులవడం దైవసంకల్పములే కాని మరేది కాదు. ఇష్టం అయిష్టములకు కారణం కనుక్కోవడం కష్టం. భార్యాబిడ్డలు నదిలో కొట్టుకు పోతున్న కట్టెలమాదిరి కలిసి విడిపోతూ ఉంటాయి. మానవులు తాను ఎన్నో జన్మలు ఎత్తి ఎందరో తల్లులను, తండ్రులను, పుత్రులను, పుత్రికలను, బందువులను, మిత్రులను పొందుతాడు. ఇన్నివేల మందిలో మానవుడు ఎవరికొరకు ఏడవగలడు ! ఈ జీవితం శాశ్వతం కాదని తెలుసుకొనుట వివేకులలక్షణం. నిరంతర కాలప్రవాహం ఒక సముద్రంలాంటిది. అందు మొసళ్ళు సంచరిస్తుంటాయి కనుక చావు పుట్టులకు అనివార్యం. అని తెలుసుకొని శోకం వదలాలి. జనక మహారాజా ! ఈ శరీరమే మనం అప్పు తెచ్చుకున్నాము. ఇంక దారాసుతులు, బంధుమిత్రులు శాశ్వతమా ! ఎంత ఏడ్చినా చచ్చినవాడు తిరిగి రాడు కదా ! వారికొరకు శోకించిన తీరనిబాధ అనుభవించడం తప్ప మిగిలేది ఏమిటి ? కనుక జనకమహారాజా ! బంధుమిత్రుల శోకమును వదిలి నీ విద్యుక్తర్మమైన రాజ్యపాలన చేసి కీర్తి ప్రతిష్టలు పొందు " అన్నాడు. అశ్మకుడి మాటలతో జనకునికి జ్ఞానోదయం కలిగింది. ఆయన ఇల్లువదిలి పోవాలన్న భావనను వదిలి రాజ్యపాలన చేపట్టాడు. కనుక ధర్మరాజా ! నీవు కూడా క్షత్రియధర్మంగా రాజ్యపాలన చెయ్యి " అన్నాడు.

## ధర్మజుడికి శ్రీకృష్ణుడి హితవు

వ్యాసుడు చెప్పిన మాటలకు ధర్మరాజు బదులు చెప్పకపోవడం చూసిన అర్జునుడు పక్కనే ఉన్న శ్రీకృష్ణుడితో " కృష్ణా ! అనేకంగా బంధువులను, కుమారులు, అన్నదమ్ములు ఒకేసారి యుద్ధంలో మరణించడంవలన ధర్మజుడి మనసు

వికలమైఉంది. నీ అమృతవచనములతో అతడికి ఊరటకలిగించు " అని అర్ధించాడు. అప్పుడు శ్రీకృష్ణుడు ధర్మరాజు వద్దకు పోయి అతడి చేతులు పట్టుకుని అనునయిస్తూ " బావా ధర్మజా ! నీ కెందుకయ్యా ఈ మనోవేదన. నీ బంధుమిత్రులు అవక్రపరాక్రమంతో పోరాడి మరణించి వీరస్వర్గం అలంకరించారు. రాజరికం ఒకకల. రాజులు మాత్రం కాదు ఏ ఒక్కరూ పూర్ణాయుర్దాయంతో ఉండరు. పూర్వం **సంవర్తనుడు** అనే మహాముని ఉండే వాడు. అతడికి దేవగురువు బృహస్పతి అంటే అసూయ ఎక్కువ. అతడు హిమాలయ పర్వతప్రాంతంలో ఉన్న **మరుత్తు** చేత ఎన్నో యజ్ఞ యాగాదులు చేయించాడు. కాని ఆ మరుత్తు కూడా కాలగర్భంలో కలిసిపోయాడు. **సుహోత్రుడు** అనే మహారాజు అశ్వమేధము మున్నగు అనేక యజ్ఞములు చేసాడు. కాని అతడు కూడా కాలగర్భంలో కలిసి పోయాడు. అలాగే అనేక దానధర్మాలు చేసిన **అంగుడు** ఎందరికో వివాహాది సత్కార్యములు చేసి కూడా కాలధర్మం చేయక తప్పలేదు. ఏడు ద్వీపములలో తన రధమును నడిపించిన శిబిచక్రవర్తి కూడా మరణించి ఉత్తమ గతులుపొందక తప్పలేదు. అదే విధంగా దశరధపుత్రుడైన శ్రీరాముడు, **భగీరధుడు** , దిలీపుడు, మాంధాత, యయాతి, అంబరీషుడు, శశిబిందుడు, గయుడు, రంతి దేవుడు, భరతుడు, పృధుచక్రవర్తి వీరందరూ ఈ భూమిని ఏలిన చక్రవర్తులు. ఎన్నో యజ్ఞ యాదులు చేసిన వీరంతా శాశ్వతంగా జీవించ లేదు. అదే విధంగా 21 మార్లు దండ యాత్రర చేసి రాజులనుసంహరించి ఆ భూమిని అంతటినీ కశ్యపప్రజాపతికి దానంగా ఇచ్చిన జమదగ్ని పుత్రుడైన పరశురాముడు ఈ భూమి మీద శాశ్వతత్వం పొందలేదు. ఇవన్నీ నీవు అభిమన్యుడి మరణ సమయంలో శోకతప్తుడవై ఉన్నప్పుడు నారదుడి వలన విన్నావు. కాని అవివేకమును మానలేక ఉన్నావు " అన్నాడు.

## పర్వతుడు

కృష్ణుడి మాటలు విని ధర్మరాజు " కృష్ణా ! నాకు **సృంజయుడి** వృత్తాంతం వినాలన్న కోరిక కలుగుతుంది. వివరించు " అని అడిగాడు. శ్రీకృష్ణుడు " ధర్మనందనా ! నీవు వ్యాసుడి వలన నారదుడి వృత్తాంతం విని ఉన్నావు. పర్వతుడి వృత్తాంతం విని ఉన్నావు అదికూడా చెప్తాను విను. ఒకసారి నారదుడు పర్వతుడు దివినుండి భువికి దిగివచ్చారు. ఆ సమయంలో వారిరువురు ఒక ఒప్పందంచే సుకున్నారు. ఒకరి మానసులోని మాట ఒకరికి దాపరికం లేకుండా చప్పాలన్నదే ఆ ఒప్పందం. అలా చెయ్యని ఎడల శాపగ్రస్తులు ఔతారన్నది ఆ ఒప్పందం. అలా వారిరువురు విహరిస్తూ వారు ఒకరోజు సృంజయుడిని కలుసుకున్నారు. వారు సృంజయుడి కోరికమీద అతడి గృహంలో కొన్ని రోజులు ఉందామని అనుకున్నారు. అప్పుడు సృంజయుడు తన కుమార్తె సుకుమారిని పిలిచి " అమ్మా ! వీరు మహర్షులు. వీరి సేవచేసి తరించు " అని చెప్పాడు. సుకుమారి అందుకు అంగీకరించింది. సుకుమారి సేవలతో నారదుడు, పర్వతుడు ఆనందంగా కాలం గడుపుతున్నారు. అతిలోక సుందరి అయిన సుకుమారి మీద మనసుమరులుగొన్న నారదుడు బయటకు చెప్పకోలేక లోలోపలే కృంగిపోసాగాడు. నారదుడు అలా చిక్కిపోవడం చూసిన పర్వతుడు సందేహించి దివ్యదృష్టితో నారదుడి మనసులో విషయం తెలుసుకున్నాడు. పర్వతుడు తమఒప్పందం ప్రకారం నారదుడు తన మనసులో మాట బయటపెట్టనందుకు ఆగ్రహించి " నారదా ! నీకు సుకుమారి మీద మనసు లగ్నమైన విషయం నా వద్ద దాచి మనఒప్పందాన్ని ఉల్లంఘించినందుకు నేను నిన్ను శపిస్తున్నాను. నీవు ఆమెమీద మనసుపడ్డావు కనుక ఆమెను వివాహంచేసుకోకుండా ఉండలేవు. ఆమెను వివాహం చేసుకున్న మరుక్షణం నీకు కోతిముఖం ప్రాప్తించుగాక ! అని శపించాడు. అందుకు నారదుడు పర్వతుడి మీద కోపించి " నీకిక స్వర్గ లోక ప్రాప్తి ఉండక ఉండుకాక " అని ప్రతిశాపం ఇచ్చాడు. తరువాత నారదుడు శాపానికి భయపడక సృంజయుడి సహాయంతో అతడి కుమార్తెను వివాహం చేసుకున్నాడు. పర్వతుడి శాపవశాన అతడికి కోతిముఖం వచ్చింది. అతడిభార్య సుకుమారి నారదుడి కురూపానికి అసహ్యంచుకోక అతడిని సేవిస్తుంది. ఒక రోజు నారదుడు సమీపంలోని అరణ్యానికి వెళ్ళి అక్కడ పర్వతుడిని కలుసుకున్నాడు. పర్వతుడు నారదుడితో " నారదా ! నీవు నాకు ఇచ్చిన శాపం మరల్చవా ! " అని అడిగాడు. నారదుడు " పర్వతా ! నీవేకదా నాకు ముందుగా శాపం ఇచ్చావు. కనుక నీవు నీ శాపాన్ని ముందుగా మరల్చిన నేను నా శాపాన్ని వెనక్కు తీసుకుంటాను " అన్నాడు పర్వతునితో. నారదుడు పర్వతుడు తమతమ శాపాలను వెనక్కు తీసుకున్నందున నారదుడికి నిజరూపం వచ్చింది. వారిరువురు సృంజయుడి ఇంటికి వెళ్ళారు. అక్కడ సుకుమారి వారిని గుర్తించక ఎవరో కొత్తవాళ్ళనుకుని లోపలకు వెళ్ళబోయింది. అప్పుడు పర్వతుడు " సుకుమారీ ! ఇతడు నారదుడు నీ భర్త. నేను ఇచ్చిన శాపవశాన నారదుడికి వానరముఖం వచ్చింది. నేను నా శాపం వెనక్కు తీసుకున్నందున అతడికి నిజరూపం వచ్చింది " అని చెప్పగానే అప్పుడు సుకుమారి కూడా తనభర్తను గుర్తించింది " అని కృష్ణుడు చెప్పాడు.

## సృంజయుడి వృత్తాంతం

తరువాత కధను నారదుడు చెప్పసాగాడు " ధర్మరాజా ! అలా నేను పర్వతుడితో కొంతకాలం సృంజయుడి ఇంట్లో ఉండి కొన్నిసంవత్సరాల అనంతరం తిరిగి స్వర్గలోకం పోవానని అనుకున్నాము. వెళ్ళే సమయాన మా పట్ల గౌరవాభిమానాలు చూపించిన సృంజయుడికి ఏదైనా మేలు చేయాలన్న తలంపుతో నేను అతడికి దేవతలకన్నా ఉన్నతుడైన కుమారుడు కలగాలని వరం ఇచ్చాను. పర్వతుడికి సృంజయుడికి కలుగబోయే కుమారుడి వలన ఇంద్రుడికి ఏదైనా కీడు కలుగకలదన్న

తలంపుతో " సృంజయా ! ఆ కుమారుడు అర్ధాయుష్కుడు కాగలడు " అన్నాడు. అమాటలకు నాకు కోపంవచ్చి " సృంజయా ! ఆ కుమారుడిని నీకు చేతనైనంత కాపాడుకో. నీ శక్తికి మించి నీకుమారుడికి మరణం సంభవించిన వెంటనే నన్ను తలచిన నేను వచ్చి అతడికి ప్రాణదానం చేస్తాను. అలాగే నేను నీకు ఇంకొక వరం ఇస్తున్నాను. నీ కుమారుడి శరీరంలోని విసర్జితాలు అన్నీ స్వర్ణ మయం ఔతాయి. అందు వలన అతడు సువర్ణష్టీవి అని పిలువబడతాడు " అని అన్నాను. నా మాటలకు **సృంజయుడు** ఆనందపడ్డాడు. తరువాత మేము వెళ్ళి పోయాము. నా వరంవలన సృంజయుడికి ఒక కుమారుడు కలిగాడు. ఆ కుమారుడి మలమూత్రములు, శ్వేదం మిగిలిన విసర్జితాలన్నీ బంగారంగా మారసాగాయి. సృంజయుడి ఇల్లంతా బంగారంతో నిండిపోయింది. ఈ విషయాన్ని పసికట్టిన కొందరు దొంగలు సువర్ణష్టీవిని అపహరించి తీసుకు వెళ్ళి అతడి నోట్లో గుడ్డలుకుక్కి సమీపంలోని అడవిలోకి తీసుకు వెళ్ళారు. అతడి శరీరమంతా శోధించి ఎక్కడా సువర్ణం లభ్యంకాక వారు సువర్ణష్టీవిని చంపి అక్కడే పారవేసి వెళ్ళారు. సృంజయుడు తన కుమారుడు కనిపించక అంతటా వెతికి చివరకు నారదుడిని తలచుకున్నాడు. నేను అతడి వద్దకు వెళ్ళి జరిగిన విషయం తెలుసుకుని సువర్ణష్టీవి మరణ వృత్తాంతం చెప్పాను. సృంజయుడు సువర్ణష్టీవి మరణానికి ఎంతో దు:ఖించాడు. నేను " సృంజయా ! నీ కుమారుడు యమలోకంలో ఉన్నాడు. నీ కుమారుడిని నేను తీసుకు వస్తాను " అని చెప్పి సువర్ణష్టీవిని పునరుజ్జీవితుడిని చేసాను. సృంజయుడు చాలా సంతోషించాడు. నాను సృంజయుడితో " సృంజయా ! ఇంద్రుడు నీ కుమారుడిని చంపడానికి ఎదురు చూస్తున్నాడు. జాగ్రత్తగా ఉండు " అని చెప్పి వెళ్ళాను. దేవేంద్రుడికి సువర్ణష్టీవి వలన తనకు ఆపద కలుగకలదన్న భయం పట్టుకుంది. ఒకరోజు సృంజయుడు తన భార్యాబిడ్డలతో గంగా నదీతీరాన విహరిస్తున్న సమయంలో ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని వ్యాఘ్ర రూపంలో అతడి మీద ప్రయోగించాడు. వజ్రాయుధం తగిన సమయం చూసి వ్యాఘ్రరూపం ధరించి సువర్ణష్టీవిని చీల్చిచంపి మాయం అయింది. సువర్ణష్టీవి మరణానికి దు:ఖిస్తూ సృంజయుడు నన్ను తలచుకున్నాడు. నేను వెళ్ళి సువర్ణష్టీవిని సజీవుడిని చేసి తిరిగి వెళ్ళిపోయాను. సువర్ణష్టీవి దీర్ఘాయుష్కుడై వేలాది సంవత్సరములు రాజ్యపాలన చేసాడు.ధర్మరాజా ! నీవు కూడా నీ పట్టు వదిలి రాజ్యభారం వహించు.

## వ్యాసుడి హితవు

నారదుడి మాటలు విన్న తరువాత కూడా ధర్మరాజు మౌనం వీడలేదు. అది చూసి వ్యాసుడు " ధర్మజా ! క్షత్రియులకు రాజ్యపాలన కంటే వేరే ధర్మంకలదా ! అందువలన వేదవిహితమైన విప్రకర్మలు ఆచరించబడతాయి. విప్రకర్మలు ఆచరించని ఎడల సమాజముకు నష్టం వాటిల్లగలదు. వేదవిహిత విప్రకర్మలు ఆచరించని ఎడల రాజుకు పాపంసంక్రమించి ఉత్తమలోక ప్రాప్తికి ఆటంకంకలుగుతుంది. కనుక ప్రజాపాలనయే నీధర్మం " అన్నాడు.

## వ్యాసుడి జ్ఞానబోధ

ధర్మరాజు వ్యాసుడితో " వ్యాసమహర్షీ ! మీరు చెప్పింది నిజమే. నేను కూడా రాజ్యకాంక్షతో ఈ యుద్ధానికి తలపడి నరమేధం జరగడానికి కారణమయ్యాను. చంపకూడని వారిని చంపాను. నా ఆత్మ దహించుకు పోతుంది. అందువలన నా హృదయం దహించుకు పోతుంది. కాని మీ మాటలు తిరస్కరించుట భావ్యంకాదు. ఏమిచెయ్యాలో తోచడంలేదు. వ్యాసుడు " ఈ పనిచెయ్యాలి ఈ పనిచెయ్యకూడదు అని నిర్ణయించడానికి మనం ఎవ్వరం. మనం నిమిత్తమాత్రులం. అంతా ఈశ్వరాజ్ఞతో జరుగుతూ ఉంటుంది. గొడ్డలి తీసుకుని చెట్టును నరికితే ఆపాపం గొండ్డలికి అంటుతుందా ! సర్వము పరమేశ్వర సంకల్పం చేతనే జరుగుతుందని తెలుసుకున్న నాడు నీకు ఏ పాపం అంటదు. నీవు కర్మ చెయ్యి కర్మఫలాన్ని భగవంతుడికి అర్పించు. జ్ఞానులు వేదంలో చెప్పినదంతా పరమాత్మ పరంగా చేస్తాడు. అందు వలన వారికి ఏపపుణ్యములు అంటవు. యుద్ధంలో శత్రువులను చంపానని దానివలన పాపం అంటగలదని నీవు అనుకుంటే అందుకు తగిన ప్రాయశ్చితం చేసుకో. యజ్ఞయాగములు చేసి పాపపరిహారం చేసుకో. అంతే కాని పాపానికి భయపడి రాజ్యమును, రాజ్యపాలనను, ప్రజలను వదిలివేయడం భావ్యం కాదు " అన్నాడు.

## ధర్మరాజు సంశయం

ధర్మరాజు వ్యాసుడితో " ఓ వ్యాస మహర్షీ ! ఈ యుద్ధంలో నా కుమారులు, మనుమలు, అన్నలు, తమ్ములు, తండ్రులు, తాతలు, మామలు, గురువులు, సంబంధులు, మిత్రులు, అల్లుళ్ళు, బావలు, మరుదులు మరియు ఎంతో మంది రాజులు, మహారాజులు, చక్రవర్తులు నా చేత చంపబడ్డారు. వారికి సంబంధించిన స్త్రీలు వారి భర్తల కొరకు, కొడుకుల కొరకు, తండ్రుల కొరకు శోకిస్తున్నారు. కొందరు ప్రాణాలు కూడా విడుస్తున్నారు కనుక స్త్రీలను చంపిన పాపం కూడా నాకు చుట్టుకుంటుంది. ఇన్ని పాపములు చేసిన నేను నిష్కల్మషుడను ఎలా ఔతాను. ఇంతగా పరితపిస్తున్న నాకు నా మనసు రాజ్యపాలనకు ఎలా

సుముఖత చూపిస్తుంది. ఉగ్రమైన తపస్సు చేసి ప్రాణత్యాగం చేయడం కంటే నాకు మరో మార్గం లేదు " అన్నాడు.

### అశ్వమేధయాగానికి నాంది

ధర్మరాజు మాటలకు వ్యాసుడు " నీ మనసులో శోకము బాధను పక్కనపెట్టి నా మాటలు విను. నీవు చెప్పినవారంతా ఊరికే చావలేదు. రాజ్యముకు ఆశపడి వారి పేరుప్రతిష్టల కొరకు, వారి అభివృద్ధికొరకు యుద్ధం చేసారు. వారి చావువలన నీకు పాపం ఎలా అంటుకుంటుంది. వారికి ఏ కర్మ పరిపక్వమై ఆ మరణాలు సంభవించాయో ఎవరికి తెలుసు ? ఎప్పుడు ఎవరిని ఎలా చంపాలో యముడికి బాగా తెలుసు. ఆ విధంగానే యముడు ప్రాణం హరిస్తుంటాడు. అందుకు నీవు కారణమని తలచి శోకించుట వెర్రి. అందు కొరకు రాజ్యమునువీడి, ఇల్లువిడిచి అడవులకు వెళ్ళుట మరింత వెర్రి. మనలను తోడు బొమ్మల వలె ఆడించే వాడే ఇదంతా చేస్తున్నాడు. ఈ యుద్ధంలో చనిపోయిన రాజుల రాజ్యాలను వారి కుమారులకు పట్టాభిషేకం చెయ్యి. కుమారులు లేకున్న వారి కుమార్తెలకు పట్టాభిషేకం చెయ్యి. అందువలన వారి తల్లులు సంతోషిస్తారు. నీకుపుణ్యం, కీర్తి లభిస్తుంది. ధర్మజా ! యుద్ధంలో జరిగిన నరమేధానికి నీవు చింతించ పనిలేదు. దేవదానవ యుద్ధంలో దేవేంద్రుడు దానవులను అతికిరాతకంగా చంపి నెత్తుటేరులు పారించాడు. ఇంద్రుడు తన దాయాదులైన దానవులను చంపినందుకు మునులు శ్లాఘించారు కాని నిందించ లేదుకదా ! ఆ ఇంద్రుడికి యజ్ఞయాగాదులలో హవిర్భాగం ఇవ్వడం మానారా ! ఆ ఇంద్రుడు స్వర్గలోకాధిపతి అయి పాలించడం లేదా ! ధర్మరాజా ! నీవు కూడా దుష్టులైన నీ అన్నదమ్ములను పుణ్యమార్గంలో యుద్ధంచేసి సంహరించి క్షత్రియధర్మం ఆచరించావు. కనుక దేవేంద్రుడి వలె నీవు కూడా రాజ్యపాలనకు అర్హుడవే ! నీకు ఇష్టం అయితే జజ్ఞయాగాదులు చెయ్యి. ముఖ్యంగా అశ్వమేధం చెయ్యి. అశ్వమేధానికి కావలసిన ద్రవ్యాన్ని సమీకరించడానికి రాజ్యభారం వహించు " అన్నాడు.

### పాపము ప్రాయాశ్చితం

వ్యాసుడి మాటలతో ధర్మరాజు కు శోకవిమోచనం కలిగింది. ధర్మరాజు " వ్యాస మునీంద్రా ! ఏ కర్మానికి ఏ పాపం వస్తుంది. ఏ పాపముకు ఏది ప్రాయశ్చిత్తం. నాకు వివరంగా చెప్పండి " అని అడిగాడు. వ్యాసుడు ధర్మరాజు కు ధర్మసూక్ష్మములు వివరించ సాగాడు. " ధర్మజా ! సూర్యుడు ఉదయించే కాలంలో అస్తమించేకాలంలో నిద్ర పోవడం. అతిథి ఇంటికి వచ్చినప్పుడు సత్కరించక పోవడం, పరస్త్రీలను కామించడం, గురువు మాటకు ఎదురు చెప్పడం, ఉన్న ఊరును నాశనం చెయ్యడం, వేదవిద్యను అమ్ముకోవడం, భగవంతుడిచ్చిన భూమిని అమ్ముకోవడం, సేవకులకు ఆపద వచ్చినప్పుడు కాపాడక పోవడం, ఎల్లప్పుడూ కపటంగా ప్రవర్తించడం, అడవులను తగులపెట్టడం, స్వధర్మం విడిచి పరధర్మం ఆచరించడం, తనకు ఇచ్చినపని చేయకపోవడం, జంతువులను కొట్టడం, హింసించడం, బ్రాహ్మణులకు చెందిన సంపదను హరించడం తనను శరణు వేడిన వాడిని రక్షించ పోవడం, బ్రాహ్మణులను చంపడం మహాపాపములు. అలాగే కొన్ని పనులు పైకి పాపం అనిపించినా అవి నిందించ తగినవి కాదు. అవి ఏమిటంటే యుద్ధంలో కత్తి తీసుకుని తనను చంపడానికి వస్తున్న వాడు వేదవిదుడైన బ్రాహ్మణుడైనా సరే అతడిని చంపితే పాపం రాదు.

## అన్నృత దోషం కలగని కార్యములు

అలాగే బ్రాహ్మణుడి ఆస్తిని సంపదను ఎవరైనా అపహరిస్తుంటే వారిని చంపడం పాపం కాదు. ప్రాణాపాయ సమయంలో, అన్నం, నీళ్ళు దొరకనప్పుడు కల్లు త్రాగినా, తాను తాగేది కల్లు అని తెలియకున్నా దాని వలన కలిగిన పాపం పుణ్య కార్యములు చేస్తే పోతుంది.ప్రాణ హాని కలిగినప్పుడు, ప్రమాదకరమైన ఆపదలు కలిగినప్పుడు బ్రాహ్మణుల ధనమును అపహరించినప్పుడు, వివాహసమయంలో పెద్దలు పనులు నిర్వర్తించే సమయంలో, గురువులను రక్షించే సమయంలో స్త్రీలతో మాట్లాడే సమయంలో తనకు ఉన్న సంపదలు సర్వము, నాశనం అయ్యే సమయంలో అబద్ధములు చెప్పినా అది పాపం కాదు. ఎవరికైనా స్వప్నంలో తేజోపతనము జరిగిన అది దోషం కాదు. అతడి బ్రహ్మచర్యముకు అది దోషం కాదు. అగ్నిలోనేతిని హోమంచేస్తే ఆదోషం పోతుంది. తన అన్న దుర్మార్గుడైనా, చెడు మార్గం పట్టినా, సన్యాసంస్వీకరించినా ఆ సమయంలో అన్న భార్యను స్వీకరించడం తప్పకాదు. గోవులను రక్షించుటకు అడవిని తగులపెట్ట వచ్చు. యజ్ఞయాగాలలో గోవును చంపడం, అర్హుడు కానివాడికి దానం చెయ్యడం, తప్పచేసిన సేవకుడిని శిక్షించక వదలడం పాపాలు కాదు.

### పాపములకు పరిహారం

ధర్మజా ! పైనచెప్పిన బ్రాహ్మణుడిని చంపినదోషం పోవడానికి తాను చేసినపని చెప్పకుంటూ బిక్షాటన చేస్తూ ఒక్క సారి

మాత్రమే భుజిస్తూ, బ్రహ్మచర్యం అవలంభిస్తూ, నేలమీద నిద్రిస్తూ 12 సంవత్సరాలు నియమనిష్టలతో జీవితం గడపాలి. లేనిఎడల ఆరుసంవత్సరాల **కృఛ్రమవ్రతం** ఆచరించాలి. లేనిఎడల మూడు సంవత్సరముల **చంద్రాయణవ్రతం** చేయాలి. నెలకు ఒక్కమారు తింటూ ఒక్కసంవత్సరం గడపాలి. అదీ లేనిఎడల **అశ్వమేధయాగం** చేయాలి. బ్రాహ్మణులకు ఒకలక్ష గోవులను కాని ఒకవంద గుర్రాలను కాని దానంచేయాలి. ఇందు వలన బ్రాహ్మణ హత్యాదోషం, బ్రాహ్మణసొత్తును అపహరించిన దోషంపోతుంది. ఇక సురాపానం చేసిన వాడికి ఆ సురను ఎర్రగాకాచి దానిని వాడిచేత త్రాగించాలి. లేని ఎడల కళ్ళు మూసుకుని నిప్పలలో దూకాలి. లేని ఎడల మహా ప్రస్థానం చేయాలి. లేనిఎడల **భృహస్పతియాగం** చేయాలి, లేనిఎడల భూదానం చేయాలి. అలాచేసిన సురాపానం చేసిన పాపం పోతుంది. గురువు భార్యను కామించిన వాడికి బాగా ఎర్రగాకాల్చిన ఇనుప స్త్రీవిగ్రహాన్ని కౌగలించుకునేలా చేయాలి. లేనిఎడల పురుషాంగం కోసి చేత్తో పట్టుకుని ఆకాశంవైపు చూస్తూ మరణించాలి. లేని ఎడల యుద్ధమున తన గురువుకొరకు ప్రాణత్యాగంచేయాలి. లేనిఎడల ఉన్నధనం అంతా బ్రాహ్మణులకు దానం చేయాలి. బ్రాహ్మణుడి బంగారం దొంగిలించిన పోవడానికి దనికి సరిపడినంత బంగారం తిరిగి ఇవ్వాలి, అసత్యదోషం పోవడానికి ఆ అసత్యం వలన ఎవరికి అపచారం కలిగిందో వారికి సంతోషం కలుగ చేయాలి. గురువును ఎదిరించిన పాపం పోవడానికి ఆ గురువుకు నమస్కరించి గురుదక్షిణ ఇవ్వాలి. పరభార్యను కామించిన వాడు ఆ పాపానికి ఒక సంవత్సరం కృచ్ఛమవ్రతం చేయాలి. వరసకాని స్త్రీని కామించిన వాడికి తడిబట్టలు కట్టుకుని బూడిదలో ఆరునెలలు నిద్రించాలి. పరపురుషునితో సంగమించిన స్త్రీకి రజోదర్శనంతో ఆ పాపం పోతుంది. నరకకూడని చెట్టునినరికినా, జంతువులను చంపినా దాని వలన కలిగేపాపం మూడు రోజులు ఉపవాసం ఉంటే పోతుంది. ఇంకా తెలిసి చేసినవి, తెలియక చేసినవి మితాహారం తీసుకుంటూ ఉదయం సాయంత్రం గాయత్రీ జపంచేస్తే పోతుంది. పూర్వజన్మలో చేసినపాపాలు దానధర్మాలు చేస్తూ పోగొట్టుకోవాలి. అంతే కాని నాస్తికులు, శ్రద్ధ, నియమం లేనివారు ఏమిచేసినా వారు చేసినపాపం పోగొట్టుకో లేరు. ధర్మజా ! ఆస్తికుడవు నియమనిష్టలు కలిగిన నీవు చేసిన స్వల్పపాపమును స్వల్ప ప్రాయశ్చితములతో పోగొట్టుకొన వచ్చు. నీవు చేసినపాపం యుద్ధంచెయ్యడం, అందు వీరులనుచంపడం. అది నీవు క్షత్రియధర్మంగా ఆత్మరక్షణకు చేసింది. కనుక అది పాపంకాదు అని నిరూపించాము నీలోకలిగిన అపారమైనకరుణ పశ్చాతాపంవలన నీవు పరిశుద్ధుడవు అయినావు. కనుక నీవు తప్పస్సు చేయవలసిన పనిలేదు కనుక నీవు నిశ్చింతగా రాజ్యపాలన చేయవచ్చు.

## త్రాగకూడనివి తినకూడనివి

అప్పుడు ధర్మరాజు వ్యాసుడితో " మహాత్మా ! తినకూడనివి ఏవి ? త్రాగ కూడనివి ఏవి ? ఎవరు యోగ్యులు ? ఎవరు అయోగ్యులు ? వివరించండి " అని అడిగాడు. వ్యాసుడు బదులుగా " ధర్మనందనా ! గుర్రము, ఒంటె, గాడిద పాలు త్రాగ కూడదు. బ్రాహ్మణుడు ఆడగుర్రము, ఆడఒంటె, ఆడగాడిద దరిదాపులకు వెళ్ళ కూడదు. మనిషిపాలు అసలు త్రాగ కూడదు. ఈ నిన పది రోజుల లోపల ఆవు పాలు త్రాగ కూడదు. ప్రేతము వెళ్ళిన ఇంటి భోజనం, పురుటి భోజనం, తలారి ఇచ్చిన భోజనం, కులట ఇచ్చిన భోజనం, స్త్రీ సంపాదన మీద బ్రతికేవాడు పెట్టిన అన్నం, ఆట పాటలతో జీవించేవాడు ఇచ్చే అన్నం, జూదరి ఇచ్చే అన్నం, పూలు అమ్ముకునేవాడు ఇచ్చిన అన్నం, ఊరి నుండి వెలివేసినవాడు ఇచ్చే అన్నం, అన్న కంటే ముందు వివాహంచేసుకునే వాడు ఇచ్చే అన్నం తినరాదు. అవి అభోజ్యములు. ఇతరులను పొగడుతూ జీవించేవాడు ఇచ్చిన అన్నం అత్యంతహేయం. నిలవఉన్న అన్నం పాచిపోయిన అన్నం తినరాదు. సురాపానంతో సంబంధించిన అన్నం తినరాదు. పులగము, పాయసం, అప్పములు, నువ్వులతో చేసిన వంటకములు, దేవుడికి అర్చనచేసి నివేదన చేసిన తరువాత కాని తినకూడదు. ఇవి మామూలుగా వండుకుని తినరాదు.

### చేయకూడనివి

గృహస్థాశ్రమ ధర్మమును పాటించే వారు దేవతార్చన చేయకుండా దేవతలకు నివేదించక, పితృదేవతలకు పెట్టక, అతిథులకు పెట్టక తినరాదు. గృహస్థు అయిన వాడు భార్యాబిడ్డలు బంధువులతో సంచరిస్తూనే అంటీ అంటక ఉండాలి. వారి ప్రేమాభిమానాలాకు పూర్తిగా లొంగకూడదు. ధర్మనందనా ! ఇంక అయోగ్యుల గురించి చెప్తానువిను. పాటలుపాడుతూ నృత్యములు చేస్తూ జీవించేవారు. విదూషకులు, దుర్జనులు, నపుంసకులు, మోసగాళ్ళు, వేదం చదవనివాళ్ళు, తక్కువ కులమువాళ్ళు, ఇతరులకు హానిచేయడమే వృత్తిగాపెట్టుకున్న వాళ్ళు దానం ద్వీకరించడానికి అనర్హులు. పేదవాళ్ళు, ఆపదలో ఉన్నవాళ్ళు, దానానికి అర్హులు. నీకు దానగుణం ఎక్కువగా ఉన్నా చెడ్డవాళ్ళకు దానం చేయకూడదు. దాని వలన ప్రయోజనం శూన్యం. అపాత్రాదానం మంచిది కాదు. అనర్హులకు చేసే దానం నపుంసకుడికి కన్యను ఇచ్చినట్లు, బూడిదలో నెయ్యిపోసినట్లు, ఓటికుండలో నీళ్ళుపోసినట్లు ఔతుంది. అర్హుడైనవాడికి చేసేదానం చేసినవాడికి పుచ్చుకున్న వాడికి ఇహ లోకసౌఖ్యం పరలోక సౌఖ్యం కలుగుతుంది. ధర్మజా ! నీకు నేను మంచీచెడు సంక్షిప్తంగా మంచిచెడు గురించి వివరంగా చెప్పాను. నా పలుకులు మన్నించి ధర్మబద్ధంగా ప్రవర్తించు " అన్నాడు.

## ధర్మరాజు స్వస్థ మనస్కుడగుట

ధర్మరాజు వ్యాసుడితో " మహాత్మా ! మీరు చెప్పిన మాటలు నా మనసుకు చాలా హర్షం కలిగించాయి. మీరు ఆనతిచ్చిన ప్రకారం నేను ధర్మమార్గం అవలంబించి రాజ్యభారం వహించి అమంగళం కలగకుండా చూస్తాను. నా మీద కృపతో మీరు రాజధర్మములు వర్ణాశ్రమ ధర్మాలు ఆపద్ధర్మాలు నాకు తెలియ చెప్పండి. నాకు రాజధర్మం ధర్మాచరణ పరస్పర విరుద్ధం తోస్తుంది. అందుకని మిమ్ము ఇలా ప్రార్ధిస్తున్నాను " అన్నాడు. అప్పుడు వ్యాసుడు నారదుడిని చూసి " మహర్షీ ఈ మహారాజును భీష్ముడి వద్దకు తీసుకువెళ్ళాలి. భీష్ముడే ధర్మజుడికి సకల ధర్మములు చెప్పగల సమర్ధుడు " అన్నాడు. అప్పుడు నారదుడు " మహర్షీ ! మీరు చెప్పినది చాలా యుక్తంగాఉన్నది " అని అన్నాడు. అప్పుడు వ్యాసుడు ధర్మనందనుడితో " ధర్మనందనా ! భీష్ముడు కురువృద్ధుడు. ఇంద్రాదులకు కూడా పూజనీయుడు. కుటిలత్వం తెలియనివాడు. పరశురాముడి వద్ద విద్యలునేర్చి విలువిద్యా రహస్యాలను తెలుసుకున్న వాడు. పవిత్రగంగా గర్భమున జన్మించిన వాడు. సుగుణాలకు పుట్టిల్లు. ఆయనకు తెలియని ధర్మసూక్ష్మములు లేవు. చ్యవనుడు, మార్కండేయుడు, వశిష్టుడు మొదలగు మహర్షుల వద్ద ధర్మసూక్ష్మములు తెలుసుకున్న వాడు. తండ్రినుండి స్వచ్ఛందమరణం వరంగాపొంది తన ప్రాణములు మేనిలో నిలుపుకుని ఉన్నాడు. నీవంటే ఎంతో అభిమానం ఉన్న అంతటి మహానుభావుడి వద్దకు నీవు వెళ్ళి ప్రార్ధించిన అతడు నీకు అత్యంత వాత్సల్యంతో నీకు ధర్మసూక్ష్మములు తెలుపగలడు. దీనివలన నీవు ఎంతో కీర్తిమంతుడవు కాగలవన్నది మా అందరి అభిమతం. పైగా భీష్ముడికి అవసాన కాలం సమీపిస్తుంది. ఇంక ఆలస్యంచేయకు " అన్నాడు.

## ధర్మరాజు భీష్ముడి వద్దకు వెళ్ళుటకు సంశయించుట

ధర్మరాజు వ్యాసుడితో " మునివర్యా ! ఎంతో మంది బంధువులను, మిత్రులను వధించిన వాడను ఆయన ఎదుట ఎలా నిలువగలను ? విలువిద్యా విశారదుడైన భీష్ముడిని కృత్రిమసమరంలో కూల్చిన పాతకుడిని తిరిగి ఆయన ఎదుట ఎలా నిలువగలను ఆయన మొహంచూసి ధర్మసూక్ష్మములు చెప్పమని ఎలా అడగను " అన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు " ధర్మజా ! అలా అనుకోవడం ఎందుకు. నీవు వ్యాసమహాముని ఆజ్ఞమేరకు భీష్ముడి వద్దకు వెళుతున్నావు. కాని ఇంతశోకంతో భీష్ముని వద్దకు వెళ్ళకు ముందు నీవు రాజ్యానికి వెళ్ళు తరువాత భీష్ముడి వద్దకు వెళ్ళవచ్చు. నీకొరకు నీతమ్ములు, బ్రాహ్మణులు, పురజనులు ఎదురుచూస్తున్నారు. హస్థినాపురప్రవేశం చేసి వారందరికి ఆనందం కలిగించు " అని పలికాడు. ఈ ప్రకారం వ్యాసుడు, నారదుడు, శ్రీకృష్ణుడు, దేవలుడు చెప్పిన మాటలతో తన శోకమును వదిలిపెట్టిన ధర్మరాజుకు రాజ్యపాలన పట్ల ఆసక్తి కలిగింది. ధర్మరాజు ఆ మునులందరికీ ప్రదక్షిణంచేసి నమస్కరించి వారి ఆశీర్వాదం తీసుకున్నాడు. ఆ తరువాత మునులందరూ తమతమ స్థానాలకు వెళ్ళారు.

## హస్థినాపుర ప్రవేశం


పాండవుల హస్థినాపుర ప్రవేశం

ధర్మరాజు దేవతలను బ్రాహ్మణులను పూజించాడు. తనదర్శనం కొరకు వేచిఉన్న సామంతులను కలుసుకుని వారిచ్చిన కానుకలను స్వీకరించాడు. మరునాడు వేకువనే లేచి అభ్యంగనం ఆచరించి తెల్లనివస్త్రములు విలువైననగలు అలంకరించుకున్నాడు. పదునారు తెల్లనిగుర్రములను కట్టిన రధమును అధిరోహించాడు. భీముడు సారధిస్థానమున కూర్చున్నాడు. అర్జునుడు వెనుక నిలబడి తెల్లనిగొడుగు పట్టుకున్నాడు. నకులసహదేవులు వింజామరలు వీస్తున్నారు. శ్రీకృష్ణుడు సాత్యకి వెంటవస్తున్నారు. విదురుడు, కుంతీదేవి, ఇతర అంతఃపుర స్త్రీలు వారవారి వాహనములలో పల్లకీల మీద వస్తున్నారు. సామంతరాజులు తమతమ సైన్యములతో పక్కన వస్తున్నారు. ఇలా ధర్మరాజు హస్థినాపురానికి పయనమయ్యాడు. వంధిమాగధులు ధర్మరాజు గుణగణాలను కురువంశ చరిత్రను కీర్తిస్తున్నారు. వేదపండితులు వేదపాఠాలను భోధిస్తుండగా ధర్మరాజు హస్థినాపుర ప్రవేశం చేస్తున్నాడు.

## హస్థినాపుర ప్రజల స్వాగతం

ధర్మరాజు వచ్చేవేళకు హస్థినాపురప్రజలు నగరమంతా పచ్చనితోరణాలు కట్టి, గుమ్మాలకు అరటిచెట్లు కట్టి, పూర్ణకళశాలను ఇంటి ముందు అలంకరించి, వాకిట కళ్ళాపిచల్లి ముత్యాలముగ్గులు పెట్టారు. ఆ బాలగోపాలం కొత్తబట్టలు కట్టుకున్నారు. అంతటా పండుగవాతావరణం నెలకొంది. ధర్మరాజు రాజవీధిలో ప్రవేశించాడు. హస్థినాపుర వాసులు తమలోతాము " నలుదిక్కులా రాజులను జయించిన అజాతశత్రువు ఇతడే. రాజసూయయాగము చేసి బ్రాహ్మణులకు ధన, కనక, రత్నములను దానంగా ఇచ్చినది ఇతడే. ధర్మనిరతుడు అని చెప్పతగిన వాడు, శత్రురాజులను జయించి, విజయలక్ష్మిని వరించినది ఇతడే " అని ధర్మరాజును పొగడసాగారు. మరి కొందరు భీమార్జున నకులసహదేవులను పొగడుతున్నారు. వ్రతములు ఆచరించుటలోనూ, అదృష్టంలోను, పాతివ్రత్యంలోనూ ద్రౌపదికి సాటి ద్రౌపదియే నని పాండవసతిని పొగడుతున్నారు. ధర్మరాజు రాజమందిర ముఖద్వారం వద్దకు రాగానే బ్రాహ్మణులు, పుణ్యస్త్రీలు శోభనద్రవ్యములు తీసుకుని ఎదురువచ్చారు. వారు ఇచ్చినవి పుచ్చుకుంటూ ధర్మరాజు గజశాల వద్ద తనరధమును దిగాడు. పురోహితుడైన **ధౌమ్యుడు** పెదనాన ధృతరాష్టుడు మున్నగు వారితో సహా అంతఃపురప్రవేశం చేసాడు. గృహదేవతలకు పూజచేసాడు. బ్రాహ్మణ సంఘములను పిలిచి వారికి బంగారం గోవులను దానంగా ఇచ్చాడు. వారి ఆశీస్సులు తీసుకున్నాడు.

### చార్వాకుడు

ఆ సమయంలో దుర్యోధనుడి మిత్రుడైన చార్వాకుడు అనే రాక్షసుడు బ్రాహ్మణవేషంలో వచ్చి మిగిలిన బ్రాహ్మణులతో కలిసాడు. అతడు ధర్మరాజుతో " ఓ ధర్మరాజా ! సకలబ్రాహ్మణులు నన్ను తమ ప్రతినిధిగాపంపారు. వారిసందేశం విను. మహాపాపములు చేసిన వాడు ఇతడు ఎలా రాజౌతాడు. తండ్రులను, అన్నలను, పుత్రులను శంకలేకుండా చంపాడు. విద్యనేర్పిన గురువు అని చూడక ద్రోణుడిని చంపాడు. వీడిజన్మ ఎందుకు కాల్చనా ! ఈ విధంగా అందరూ నిన్ను అసహ్యించుకుంటున్నారు. ఇంకా నీకీ రాజ్యమెందుకు ? బంధువులను అందరినీ చంపి రాజ్యభోగాలు అనుభవిస్తున్నావు. నీకు మహాపాపం చుట్టుకుంటుంది " అని పలికాడు. చార్వాకుడి మాటలను విన్న బ్రాహ్మణులు ఒకరి ముఖం ఒకరు చూసుకుంటారు. ధర్మరాజు వారివంక చూసి చేతులుజోడించి " బ్రాహ్మణోత్తములారా ! నేను మీకు మొక్కి వేడుకుంటున్నాను. నన్ను మీరు నిందించకండి. ఆదరించండి వ్యాసుడు నారదుడు మొదలగు మహా మునులు నన్ను ఆజ్ఞాపిస్తేనే నేను ఈ రాజ్యపాలనకు ఒప్పుకున్నాను " అని ప్రార్థించాడు. అప్పుడు ఆ బ్రాహ్మణులు " మహారాజా ! ఈ మాటలు మావి కాదు. ఇవి ఎలా వచ్చాయో మాకు తెలియడం లేదు. నీవు ఉత్తమక్షత్రియ ధర్మంతో సముపార్జించిన ఈ రాజ్యలక్ష్మి సుస్థిరతను పొందుతుంది " అని ఆశీర్వదించాడు. వెంటనే చార్వాకుని వంక చూసి దివ్యదృష్టితో అతడు సుయోధనుడి అనుయాయుడు అని తెలుసుకున్నారు. " మహారాజా ! వీడు బ్రాహ్మణుడు కాదు. సుయోధనుడి అనుయాయుడు అయిన రాక్షసుడు. కపటసన్యాసివేషంలో వచ్చి మిమ్మలిని అనరానిమాటలు అన్నాడు. వీడు కుక్కలాగా మొరిగినంత మాత్రాన మీ కీర్తికి కళంకంరాదు. ధర్మాత్ములైన నీ తమ్ముల సాయంతో మీరు రాజ్యలక్ష్మిని చేపట్టవచ్చు " అని పలికారు. వెంటనే బ్రాహ్మణులంతా చార్వాకుడిని చూసి ఒక్కసారి హూంకరించారు. ఆ హూంకారానికి భయకంపితుడై చార్వాకుడు నిజస్వరూపం ధరించి భస్మం అయ్యాడు. ధర్మరాజు ఆ బ్రాహ్మణులందరిని ఆదరించి పంపాడు.

### చార్వాకుడి పూర్వవృత్తాంతం

అప్పుడు శ్రీకృష్ణుడు " ధర్మనందనా ! కృతయుగంలో చార్వకుడు అనే రాక్షసుడు బ్రహ్మను గురించి తపమాచరించాడు. బ్రహ్మ ప్రత్యక్షం కాగానే తనకు సకల భూతములవలన భయంలేకుండా వరం ఇమ్మని అడిగాడు. అప్పుడు బ్రహ్మదేవుడు " నీవు బ్రాహ్మణులకు ఇష్టంలేని పనులు చేయకు. వారికి కోపంతెచ్చినప్పుడు మాత్రమే నీకు మరణం సంభవించగలదు " అని అన్నాడు. ఆ ప్రకారం బ్రహ్మ వరంపొంది చార్వాకుడు దేవతలను పీడించ సాగాడు. దేవతలంతా బ్రహ్మ వద్దకు వెళ్ళి చార్వాకుడి నుండి రక్షణ కల్పించమని ప్రార్థించాడు. బ్రహ్మదేవుడు దేవతలతో " ఇలా జరుగుతుందని నాకు ముందే తెలుసు. అందుకని నేను తగినఏర్పాటు ముందే చేసాను. ద్వాపరయుగంలో చార్వాకుడు సుయోధనుడు అనే రాజుకు మిత్రుడుగా ఉంటాడు. సుయోధనుడి మరణం తరువాత ఈ చార్వాకుడు బ్రాహ్మణులకు మనోవ్యధ కలిగించే పనులు చేసి ఆకారణంగా వారి ఆగ్రహానికి గురి అయి భస్మంఔతాడు " అని చెప్పాడు. శ్రీకృష్ణుడు తరువాత " ధర్మరాజా ! నిన్ను ఎదిరించిన వారిని నాశనం చెయ్యి. ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడు. బ్రాహ్మణులను ఆదరించు. బంధుమిత్రులను సుఖంగా ఉండేలాచేయి. కురుసామ్రాజ్యముకు పట్టాభిషిక్తుడివి కమ్ము " అని పలికాడు.

## ధర్మరాజు పట్టాభిషేకం

పట్టాభిషేకముకు తగు ఏర్పాట్లు జరుగుతున్నాయి. కురుమహాసభలో ఎత్తైన బంగారు సింహాసనం ఏర్పాటు చేసారు. పెద్దలకు,


ధర్మరాజు పట్టాభిషేకం - రాజ్మానామా నుండి ఒక దృశ్యం

మంత్రులకు, సామంతులకు సైన్యాధ్యక్షులకు ఎవరికి తగిన ఆసనములు వారికి ఏర్పాటు చేసారు. ఒక శుభముహూర్తాన ధర్మరాజు మనసులోని బాధను దిగమింగుకుని బంగారుసింహాసనం మీద తూర్పుముఖంగా కూర్చున్నాడు. అతడికి ఎదురుగా బంగారు ఆసనమున శ్రీకృష్ణుడు సాత్యకి సమేతంగా కూర్చున్నాడు. ధర్మరాజు ఇరు పక్కలా మణిమయ పీఠముల మీద భీమార్జునులు కూర్చున్నారు. వెనుక పక్క బంగారు పీటముల మీద నకులసహదేవులు కూర్చున్నారు. వారిపక్కన ఉచితాసనం మీద కుంతీదేవి కూర్చుంది. శ్రీకృష్ణుడి దక్షిణభాగంలో ఒక ఉజ్వలమైన ఆసనంమీద ధృతరాష్ట్రుడు కూర్చుని ఉన్నాడు. అతడికి తూర్పు పడమర దిక్కున విదురుడు, ధౌమ్యుడు కూర్చుని ఉన్నారు. ధృతరాష్ట్రుని వెనుక భాగాన అర్హమైన ఆసనముల మీద గాంధారి, **యుయుత్సుడు**, సంజయుడు కూర్చుని ఉన్నారు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన కృపాచార్యుడికి ధర్మరాజు ధౌమ్యుడి పక్కన ఉచితాసనాన్ని ఇచ్చి సత్కరించాడు. ధర్మరాజు తెల్లని పూలతోను, అక్షితలతోను, బంగారుతోను, వెండితోను భూదేవిని పూజించి ఆమెను తాకాడు. పండితులు, వివిధ దేశాధీశులు, మంత్రులు, ఉన్నతోద్యోగులు, వ్యాపారవేత్తలు, పరిచర్యలు చేసే సేవకులు, వైశ్య ప్రముఖులు, పౌర సంఘాలు, కర్షకులు, జానపదులు, గాయకులు, విదూషకులు, వేశ్యలు మున్నగు వారంతా ధర్మరాజుని సందర్శించారు. ధర్మరాజు వారికి ఉచితమైన కానుకలు ఇచ్చి సత్కరించాడు. ఇంతలో అభిషేకద్రవ్యములు సిద్ధం అయ్యాయి. శ్రీకృష్ణుడి అనుమతితో ధౌమ్యుడు ఈశాన్య దిక్కుగా ఉన్న వేదికను అలంకరించాడు. అందు నవరత్నఖచిత సింహాసనమును ప్రతిష్టించాడు. దానిమీద పులితోలు కప్పాడు. శంఖమును స్థాపించి పూజించాడు. దాని చుట్టు గంగాజలం నింపి వాటిని మంత్రసహితంగా ఆవుపెరుగు, ఆవునెయ్యి, ఆవుపంచితం, గోమయము మొదలగు పంచగవ్యములతో శుద్ధి చేసాడు. ధర్మరాజు చుట్టూ బ్రాహ్మణులు మంత్రపఠనం చేస్తున్నారు. ధౌమ్యుడు ధర్మరాజును తీసుకు వెళ్ళి సింహాసనం మీద కూర్చుండ చేసాడు. ఎదురుగా అగ్నినివేల్చి దేవతాయజ్ఞం చేసాడు. ఇంతలో శుభముహూర్తం సమీపించగానే శ్రీకృష్ణుడు ధర్మరాజును సమీపించి శంఖం పైకెత్తి" ధర్మజా ! నీవు ఈ కురుసామ్రాజ్యానికి అధిపతివి కమ్ము " అని అభిషేకించాడు. ఆ సమయంలో ప్రశాంత చిత్తుడై ధౌమ్యుడు అందించిన బంగారుకలశం లోని గంగాజలాన్ని ధృతరాష్ట్రుడు ధర్మరాజు మీద అభిషేకించాడు. ఆ తరువాత వారి వారి ప్రాధాన్యతను అనుసరించి అందరూ ధర్మరాజును అభిషేకించారు. శంఖములు, భేరీ మృదంగ నాదములు మిన్నంటేలా మ్రోగాయి. ఇలా ధర్మరాజు కురు సామ్రాజ్య పట్టాభిషిక్తుడయ్యాడు.

## బ్రాహ్మణుల దీవెన

ఆ సందర్భంగా ధర్మరాజు బ్రాహ్మణులకు పేదలకు ఎన్నో అన్నదానాలు చేసారు. అప్పుడు పండితులైన బ్రాహ్మణులు ధర్మరాజుకు ఎదురుగా నిలిచి " దేవా ! దైవబలం, మానవీయబలం కలిసిన ఫలితంగా మానవాతీతమైన ఈ విజయం వసుధాధిపత్యం నీకు లభించాయి " అని పలికారు. దానికి ధర్మరాజు " అయ్యా ! మీరు చెప్పిన సద్గుణాలు నాలో ఉన్నాయో లేవో కాని మీరందరూ ఇలా అంటూ ఉంటే పాండవులందరూ అదృష్టవంతులని నేను భావిస్తాను " అని ధృతరాష్ట్రుని చూసి " మాకు తండ్రి గురువు దైవం ఇతడే. ఇతడి ఆజ్ఞలు అమలు చేయడం మీ కర్తవ్యం. మునుపటిలా ఈతడిని మీరు గౌరవించి ఆదరించండి. అదే మాకు ప్రియమైనది. మేము జ్ఞాతులను చంపి ఈ సింహాసనం అధిష్టించడం ధృతరాష్ట్రుడిని సేవించడం కోసమే. మనకందరకూ అధిపతి ధృతరాష్ట్రుడే అని మీరు మరువకండి " అని పలికాడు. తరువాత ధర్మరాజు సభచాలించాడు. ధృతరాష్ట్రుడిని గాంధారిని వారి నివాసాలకు పంపాడు. పౌరులను, జానపదులను సభవిడిచి పోవడానికి అనుజ్ఞ ఇచ్చాడు. కృపాచార్యుని అతడి నివాసానికి సగౌరవంగా పంపాడు.

## ధర్మరాజు రాజ్యనిర్వహణా బాధ్యతలను అప్పగించుట

ధర్మరాజు యువరాజుగా భీమసేనుడిని నియమించాడు. మంత్రాంగం నిర్వర్తించడానికి విదురుని మంత్రిగా నియమించాడు. న్యాయవ్యవహారాలు నిర్వర్తించడానికి సంజయుడిని నియమించాడు. సైనిక నియామకముకు వారి జీతభత్యముల నిర్ణయం తీసుకొనుటకు, సకల కార్య నిర్వహణకు నకులుడిని నియమించాడు. అహంకారులను దుష్టులను శిక్షించుటకు దండెత్తుట జయించుట మొదలైన కార్యక్రమాలకు అర్జునుడిని నియమించాడు. బ్రాహ్మణకార్యములకు శ్రౌత, స్మార్త కర్మల

అనుష్టనమునకు ధౌమ్యుని నియమించాడు. సహదేవుని తన అంతరంగిక కార్యదర్శిగా ప్రధాన అంగరక్షకునిగా నియమించుకున్నాడు. మిగిలిన అధికారములను అర్హులకు అప్పగించాడు. యుయుత్సుడిని, విదురుని, సంజయుని చూసి " మీరు ప్రతి రాచనగరిలో వారి యోగక్షేమాలు పర్యవేక్షించండి. ప్రజాహిత కార్యక్రమాలను ఆయా అధికారులకు అప్పగించి అవి సక్రమంగా జరుగుతున్నాయో లేదో చూడండి " అని అజ్ఞాపించాడు. కుంతీదేవిని ద్రౌపదీ దేవితో అంతఃపురానికి పంపాడు. తరువాత బ్రాహ్మణుల అనుమతితో యుద్ధంలో చనిపోయిన బంధువులందరికీ శ్రాద్ధకర్మలు ఆచరించి. వారి పేరుతో దాన ధర్మాలు చేసాడు. ద్రోణాచార్యునకు, ద్రుపదునకు, వారి బంధువులకు, విరాటుడికి, ప్రత్యేకంగా కర్ణుడికి, అభిమన్యుడికి, పరలోకక్రియలు జరిపించాడు. వారి పేరుతో బ్రాహ్మణ సంతర్పణలు చేయించాడు. దుర్యోధనుడికి అతడి తమ్ములకు ధృతరాష్ట్రుని చేత వైభవంగా నిర్వర్తింప చేసాడు. వారసులు లేనివారికి ధౌమ్యుని చేత కర్మకాండలు దానధర్మములు నిర్వహింపజేసాడు. చనిపోయిన తన బంధువుల ప్రీతి కొరకు వారి వారి పేరుతో వారి రాజ్యములలో చలివేంద్రములు పెట్టించాడు, సత్రములు కట్టించాడు, చెరువులు తవ్వించాడు, దేవాలయములు కట్టించాడు. బ్రాహ్మణులకు గోదానం చేయించాడు. ఇలా వారి రుణం తీర్చుకున్నాడు.

## ధర్మరాజు శ్రీకృష్ణుడిని కీర్తించుట

ధర్మరాజు శ్రీకృష్ణుడి ఎదుట నిలుచి " శ్రీకృష్ణా ! నీ కరుణాకటాక్షాల వీక్షణము వలన నేను ఈ కురు సామ్రాజ్యచక్రవర్తిని అయ్యాను. నా మనసు ఆనందంతో నిండి పోయింది. నీవు సదా మా వెన్నంటి ఉండి మమ్ము కాపాడుతూ ఉన్నావు. నీవు లేకున్న మేమెంత ! మా పరాక్రములు ఎంత ! నీవు ఈ సృష్టికి ఆది పురుషుడవని వేదాలు ఘోషిస్తున్నాయి. నీ గురించి చెప్పడానికి వేదాలకే వీలు కాదు. ఇక మేమెంత. నీ నామస్మరణ చేతనే పాపాలు పోతాయి. పుణ్యములు చేకూరుతాయి. సద్బ్రాహ్మణులు సదా నీ నామస్మరణ చేస్తుంటారు " అని ధర్మరాజు కృష్ణుని విష్ణు, విశ్వాత్మ, జిష్ణు, శర్వ, హంస, దామోదర, శంభు మొదలైన నామములతో కీర్తించాడు. ధర్మరాజు తన తమ్ములవంక తిరిగి " మీరంతా నా వలన అడవులలో కష్టములు అనుభవించారు. నా మూలంగా అజ్ఞాతవాసంలో ఉడిగం చేసారు. నా కొరకు యుద్ధం చేసి నా అన్న వారిని అందరిని పోగొట్టుకుని అమిత దుఃఖముకు గురి అయి, నన్ను చక్రవర్తిని చేసి ధన్యుడిని చేసారు. శ్రీకృష్ణుడి దయతో మనకు ప్రాప్తించిన ఈ రాజ్యాన్ని నాతో పాటు మీరూ అనుభవిస్తూ రాజును, మంత్రాంగమును, ధనాగారమును, హస్థినాపురమును, మన సైన్యాలను, మన ప్రజలను, మన మిత్ర రాజులను కంటికి రెప్పలా కాపాడండి. భీమసేనా నీవు రారాజు మందిరంలో ఉండు, అర్జునా ! నీవు దుశ్శాసనుడి మందిరంలో నివశించు, దుర్మర్షణుడు, దుర్ముఖుల మందిరాలలో నకుల సహదేవులు నివసిస్తారు. విదురుని, సంజయుని, యుయుత్సుని, ధౌమ్యులను చూసి మీరు మీకు ఇచ్చవచ్చిన మందిరాలలో నివసించండి. మా పెదనాన ధృతరాష్ట్రుడు ఇప్పటి వరకు ఆయన నివసించిన మందిరంలో నివసిస్తాడు. శ్రీకృష్ణుడికి, సాత్యకికి అర్జున రాజప్రాసాదములో విడిది ఏర్పాటు చేయండి. అని ఆదేశాలు ఇచ్చి ధర్మరాజు తన అభ్యంతర మందిరానికి వెళ్ళాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక |

విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి |

# శాంతి పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# ద్వితీయాశ్వాసం

ధర్మరాజు కురు సామ్రాజ్యానికి పట్టాభి షిక్తుడయ్యాడు. ధృతరాష్ట్రుడికి, గాంధారికి, విదురుడికి రాజ్యాధికారం ఇచ్చి వారు చెప్పినట్లు రాజ్యపాలన చేయసాగాడు. భర్తలను పోగొట్టుకున్న భార్యల క్షేమసమాచారాలు కరుణతో విచారించి ఉచితరీతిన వారికి సహాయాలు అందచేసాడు. కృపాచార్యుడు, యుయుత్సుడు, సంజయులకు గౌరవ మంత్రుల పదవులు ఇచ్చి సత్కరించాడు. తల్లి కుంతీదేవికి శుశ్రూషలు చేయసాగాడు. ద్రౌపదిని సౌమ్యంగా ఆదరిస్తున్నాడు. ధౌమ్యునకు సకల సంపదలు ఇచ్చి గౌరవించాడు. ఆయన ఆధ్వర్యంలో దేవ, పితృ పూజలు, సంతర్పణలు, విప్రార్చనలు చేయసాగాడు. దీనులను, అనాధల పోషణఏర్పాట్లు చేసాడు. రాచకార్యములన్నీ చక్కబెడుతూ అమితానందం పొందుతున్నాడు. సకల పౌరుల జానపదుల మనస్సుకు ఆనందం కలుగచేసాడు. శ్రీకృష్ణుడిని దైవంలా ఆరాధించ సాగాడు.

## శ్రీకృష్ణుడి ధ్యానం

ఒకరోజు ధర్మరాజు శ్రీకృష్ణుడి మందిరానికి వెళ్ళాడు. కృష్ణుడికి చేతులు జోడించి నమస్కరించి " కృష్ణా ! రాత్రి సుఖంగా నిద్ర పట్టిందా ! నీ మనసు ప్రశాంతంగా ఉందికదా ! నీవు చూపిన ధర్మమార్గమున పయనించిన నేను ఈ రాజ్యాధికారం పొందగలిగాను " అని అన్నాడు. దానికి కృష్ణుడు మారుమాటాడ లేదు. శ్రీకృష్ణుడు అప్పుడు ధ్యానమగ్నుడై ఉన్నాడు. ధ్యానముద్రలో ఉన్న శ్రీకృష్ణుడిని చూసి ధర్మరాజుతో ఇలా అన్నాడు. " కృష్ణా ! నిశ్చలధ్యానంలో ఉన్నావు, క్షరుడవు, అక్షరుడవు నీవే కదా ! ఈ సృష్టికి ఆది, అంతం నీవేకదా ! ఒక్కడుగా ఉన్న వెలుగుతున్న నిశ్చలచైతన్యం నీవే కదా ! పురుషోత్తముడివి నీవేకదా ! నీవు ఎవరిగురించి ధ్యానం చేస్తున్నావు ? దీనికి కారణం ఏమి ? " అని అడిగాడు. అప్పుడు శ్రీకృష్ణుడు ధ్యానం గురించి నవ్వుముఖంతో ధర్మరాజుని చూసి " ధర్మనందనా ! గంగాదేవి రత్నగర్భవాసాన ఎవనిని కన్నదో,


ధ్యాననిమగ్నుడై ఉన్న కృష్ణుమనితో మాట్లాడుతున్న ధర్మరాజు

పరశు రాముడు ఎవరిని తన శిష్యుడిగా స్వీకరించి సకలవిద్యలు నేర్పించాడో, ఆ పరశు రాముడే ఎవరితో యుద్ధం చేసి అలసిపోయాడో, కాశీ రాజు కన్యలవలన సకల రాజన్యులు ఎవరి చేతిలో ఓడిపోయారో, ఎవరు నాలుగువేదములను, ధనుర్వేదమును ఆమూలాగ్రం అభ్యసించాడో, ఆ భీష్ముడు నిర్మలమనస్సుతో నన్ను తలచుకుంటున్నాడు. నా మనసు అతనిలో లీనమైంది " అని అన్నాడు. అప్పుడు ధర్మరాజు ఇలా అన్నాడు " కృష్ణా ! భీష్ముని ప్రతిభావిశేషములు గురించి ఇదివరకు విన్నాను. ఇప్పుడు నీవు చెప్పావు. కృష్ణా ! నాకు మా తాత భీష్ముడిని చూడవలెనన్న కోరిక కలుగుతుంది. నీతో నన్ను చూస్తే ఆయనఎంతో ఆనందిస్తాడు " అని అన్నాడు.

## భీష్ముని స్తుతి

కృష్ణుడు దారుకుని పిలిచి రథం సిద్ధం చేయమని చెప్పాడు. అదే సమయంలో వ్యాసుడు, నారదుడు, దేవస్థాణుడు, వాత్సుడు, దేవరాతుడు, దేవలుడు మొదలైన మహా మునులు భీష్ముడి వద్దకు వెళ్ళాడు. ఆ సమయంలో భీష్ముడు శ్రీకృష్ణుని మనసులో నిలుపుకుని ఇలా ప్రార్ధించ సాగాడు " అగ్ని, సూర్యుడు, బ్రహ్మకు సమానుడైన శ్రీకృష్ణుని మనసారా ప్రార్ధిస్తున్నాను. మహామునులు, దేవతలు, ఎవరిస్వరూపమును తెలుసుకోలేరో, అట్టిస్వరం తెలిసిన వారిని నేను పూజిస్తున్నాను. దు:ఖమును పరమౌషధంగా ఎవరిని శ్రుతులు పేర్కొంటాయో, అతడిని నేను పూజిస్తున్నాను. ఈ సృష్టి ఆది, మధ్యము, అంతం ఎవరై ఉన్నారో అతడిని కొలుస్తున్నాను. ఈ అనంతమైన విశ్వానికి మూలకారకుడైన పుండరీకాక్షుడిని నేను కొలుస్తాను. సహస్రశీర్షుడు, సహస్రాక్షుడు, వేదములే తానైనవాడు, చిన్నవారిలో చిన్నవారిలో చిన్నవాడివి, పెద్దవారిలో పెద్దవాడివి, సహస్రపాదుడు అయిన ఆ దయాళువును నేను ఆరాధిస్తాను, అమృతమూర్తి , ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణవేదం, ఉపనిషత్తులు తానే అయి ఆ పురుషోత్తముడిని నేను తలుస్తాను. దేవకీ గర్భవాసమున యజ్ఞ యాగాదులను సంరక్షించడానికి దేవదేవుని మనసులో ధ్యానిస్తాను, ఒక్కడే పన్నెండు మూర్తులుగా వెలుగుతూ, అదితి గర్భమున జన్మించిన వామన మూర్తిని నేను ధ్యానిస్తున్నాను, దశరధుని కుమారుడిగా జన్మించి రావణసంహారం గావించిన శ్రీరామావతారునిగా నిన్ను ధ్యానిస్తాను. శుక్లపక్షంలో దేవతలను, కృష్ణపక్షంలో పితరులను తన అమృతంతో పోషిస్తున్న ఒషధాధీశుడైన చంద్రుని రూపమైన శ్రీహరిని ధ్యానిస్తాను. గరుత్మంతుని వాహనంగాగల విష్ణువును ధ్యానిస్తాను. వ్యక్తమైన ఈ దేహంలో అవ్యక్తంగా ఉన్న పరమాత్ము డైన విష్ణువును ధ్యానిస్తాను, నిరంతరం శాంతమూర్తులై జీవిస్తున్న యోగులకు మాత్రమే వ్యక్తమైన నీ రూపమును ధ్యానిస్తున్నాను, యాదవకుల తిలకుడైన బలరాముడిగా నిన్ను ధ్యానిస్తాను. దేవకి వసుదేవుల గర్భవాసాన జన్మించి పసిపాపగా ఉండగానే రాక్షస సంహారం చేసి, కంసుని వధించి, అర్జునుడికి సారధ్యం వహించి భూభారాన్ని తగ్గించిన శ్రీకృష్ణుడిగా నిన్ను ధ్యానిస్తున్నాను. కలియుగంలో ధర్మోద్ధరణకు జనించబోవు మహావిష్ణువును నేను ధ్యానిస్తున్నాను. నశించే ఈ భూతములలో అక్షరముగా వెలుగొందుతున్న పరమాత్మను ధ్యానిస్తున్నాను. ఓ పరమేశ్వరా, సుబ్రహ్మణ్యా, భక్తవత్సలా, మహాదేవా, విశ్వప్రకాశా, హృషీకేశా, వరదా, నారాయణా, రాజీవనయనా, హిరణ్యనాభా, అఖిలలోకముల చేత ఆరాధించబడు నామములు కలవాడా, అచ్యుతా, అమృతరూపా, నీకు మనసారా మొక్కుతున్నాను. నన్ను కరుణించు. నిన్ను నిరతం స్మరించువారికి భయ నివారణమై సకలకార్య సాఫల్యం కలుగుతుంది, నీవు మంగళకరుడవు, నీవే పరబ్రహ్మం, నీవే పరము, నీవే సత్యము, నీవే తపసు, నీవే అగ్నివి, నీవే హవిస్సు సకలం విష్ణు స్వరూపమే ! సమస్త విద్యలకు, సమస్తతపములకు మూలం నీవే, నీవు పుట్టక లేనివాడివి, నీవు యజ్ఞస్వరూపుడవు. నిన్ను కనులారాగాంచిన నాకు కల్మషం అంటదు. నేను నీకు శరణాగతుడను నాకు నీవు మోక్షం ప్రసాదించు అని మనసారా విష్ణుమూర్తిని ప్రార్ధించాడు భీష్ముడు. శ్రీ మహావిష్ణువును మనసారా స్తుతించిన భీష్ముని మహాఋషులు అందరూ ఎంతగానో ప్రశంసించారు. శ్రీకృష్ణుడు భీష్ముడు చేసిన స్తుతికి ఆనందభరితుడయ్యాడు.

## శ్రీకృష్ణుడు ధర్మరాజుతో భీష్ముని వద్దకు వెళ్ళుట

శ్రీకృష్ణుడు ధర్మరాజుతో మనం భీష్ముడి వద్దకు వెడదాము " అన్నాడు. శ్రీకృష్ణుడు, సాత్యకి ఒక రథం ఎక్కారు. ధర్మరాజు, అర్జునుడు ఒక రథం ఎక్కారు. భీముడు, నకులుడు, సహదేవుడు మరొక రథం ఎక్కారు. కృపాచార్యుడు, యుయుత్సుడు, సంజయుడు మరొక రథం ఎక్కారు. అందరూ భీష్ముడు అంపశయ్య మీద పడుకుని ఉన్న ప్రదేశానికి వెళ్ళేదారిలో శ్రీకృష్ణుడు ధర్మరాజుకు అయిదు మడుగులు చూపి అతడితో " ధర్మనందనా ! అదుగో దూరంగా కనబడుతున్నాయే అయిదు మడుగులు

వాటిని శమంతక పంచకం అంటారు. పరశురాముడు లోకంలోని రాజులందరినీ సంహరించి పరశురాముడు తన తండ్రికి ఇక్కడే రక్త తర్పణం చేసాడు " అన్నాడు. అప్పుడు ధర్మరాజు " శ్రీకృష్ణా ! ఈ క్రూరమైన పనిని పరశురాముడు ఎందుకు చేసాడు ? ఇందుకు కారణం ఏమి ? మరి ఇప్పుడు ఉన్న క్షత్రియులు ఎవరు ? చచ్చిన వారు ఎలా బ్రతికారు ? ఎలా ఈ భూమిని ఏలారు ? నాకు వివరించవా ! " అని అడిగాడు.

## పరశురాముడి జన్మ వృత్తాంతం

శ్రీకృష్ణుడు ధర్మరాజు కోరిక మీద పరశురాముడి జనన వృత్తాంతం చెప్పసాగాడు " ధర్మనందనా ! పూర్వము **జహ్నుడు** అనే రాజు ఉన్నాడు. అతడి కుమారుడు **ఉపజహ్నుడు**. అతడి మనుమడు **వల్లభుడు**. ముని మనుమడు **కుశికుడు**. కుశికుడు ఘోరతపమాచరించి ఇంద్రుడిని ప్రసన్నుడిని చేసుకుని జగములోకెల్లా అధికుడైన కుమారుడు కావాలని కోరుకున్నాడు. ఇంద్రుడు అలాగేనని వరం ఇచ్చాడు. కుశికుడి కుమారుడు **కౌశికుడు**. అతడే **గాధి**గా లోక ప్రసిద్ధుడయ్యాడు. గాధి కుమార్తె **సత్యవతి**. గాధి తన కుమార్తెను **ఋచీకుడి**కి ఇచ్చి వివాహం జరిపించాడు. అతడు గొప్ప తపశ్శాలి తనకు తన మామగారికి కుమారులు కలగాలని తపస్సు చేసాడు. యాగఫలంగా రెండు పాత్రలయందు హవిస్సును పొందాడు. ఋచీకుడు తన భార్యతో రెండు పాత్రలిచ్చి " ఈ పాత్రలో ఉన్న హవిస్సు సేవించిన వారికి క్షత్రియులందరికీ అజేయుడైన కుమారుడు కలుగుతాడు. ఈ రెండవ పాత్రలో ఉన్న హవిస్సును సేవించిన వారికి అత్యంత తపోధనుడు, ఉత్కృష్ట బ్రాహ్మణోత్తముడు జన్మిస్తాడు. కనుక నీవు దీనిని సేవించుము " అని ఆ పాత్రలను భార్యకు ఇచ్చాడు. తరువాత అతడు స్నానం ఆచరించుటకు వెళ్ళాడు. ఇంతలో అక్కడకు వచ్చిన తల్లిని తండ్రిని చూసి సత్యవతి ఒక హవిస్సు పాత్రను భర్త చెప్పిన విధంగా తల్లికిచ్చింది. గాధి భార్య బుద్ధిపూర్వకంగా ఆ పాత్రలను మార్చింది. కుమార్తె కొరకు ఇచ్చిన హవిస్సును తాను సేవించింది. అదితెలియని సత్యవతి తనతల్లి కొరకు ఉద్దేశించిన హవిస్సును తాను సేవించింది. స్నానం చేసి వచ్చిన ఋచీకుడు జ్ఞానదృష్టితో జరిగినది గ్రహించి " సత్యవతీ ! నీ గర్భమున మహాక్రూరుడు పెరుగుతున్నాడు " అన్నాడు. సత్యవతి తల్లడిల్లి పోతూ భర్తను శరణు వేడింది. ఋచీకుడు " సత్యవతీ ! నేనేమి చేయ లేను. నీ తల్లి గర్భాన బ్రహ్మజ్ఞాని పుడతాడు. నీ గర్భమున క్రూరాత్ముడు జన్మించగలడు " అన్నాడు. సత్యవతి " నాకు పిల్లలు లేక పోయినా పరవా లేదు. క్రూరాత్ముడు మాత్రం వద్దు " అని వేడుకుంది. ఋచీకుడు కరుణించి " సత్యవతీ ! నీ కుమారునికి బదులు నీ మనుమడు క్రూరాత్ముడు ఔతాడు " అని పలికాడు. ఆ విధంగా సత్యవతికి **జమదగ్ని** జన్మించాడు. సత్యవతి తల్లికి విశ్వామిత్రుడు జన్మించాడు. పరశురాముడు ధనుర్విధ్య అభ్యసించాడు.

## కార్తవీర్యార్జునుడు

ఆ సమయంలో హైహయ వంశస్తుడైన **కార్తవీర్యార్జునుడు** అనే రాజు ఏడు దీవులతో కూడిన భూమిని పాలిస్తున్నాడు. కార్తవీర్యార్జునుడికి వెయ్యి చేతులు ఉన్నాయి. కార్తవీర్యార్జునుడు పరాక్రమశాలి నీతిమంతుడు. ఒకరోజు అగ్నిదేవుడు కార్తవీర్యార్జునుడి వద్దకు వచ్చి తనకు ఆహారంకావాలని అడిగాడు. కార్తవీర్యార్జునుడు తన ఆధీనంలో ఉన్న గ్రామములను భక్షించమని అగ్నిదేవుడికి అనుమతి ఇచ్చాడు. అగ్నిదేవుడు అన్ని ముని ఆశ్రమాలతో చేర్చి వశిష్టాశ్రమం కూడా దహించాడు. దానికి వశిష్టుడు ఆగ్రహించి దీనంతంటికి కార్తవీర్యార్జునుడు కారణమని గ్రహించి " కార్తవీర్యార్జునుడి చేతులు పరశురాముడి చేతిలో తెగిపోగలవు" అని శపించాడు. అది తెలిసిన కార్తవీర్యార్జునుడు ఖిన్నుడయ్యాడు. కాలక్రమేణా కార్తవీర్యార్జునుడికి నీతిబాహ్యులైన అనేక మంది కుమారులు కలిగారు. ఒకరోజు వారు అరణ్యముకు వేటకు వెళ్ళి అలసి పోయి జమదగ్ని ఆశ్రమంలో ప్రవేశించి జమదగ్ని ఆతిధ్యం స్వీకరించారు. తమకు **సురభి** సాయంతో ఆతిధ్యం ఇచ్చిన జమదగ్ని యొక్క కామధేనువైన సురభి మీద ఆశతో దౌర్జన్యంగా దానిని పట్టితెచ్చి తమ భవనంలో కట్టివేసారు. ఈ విషయం కార్తవీర్యార్జునుడికి తెలియదు. కాని ఈ విషయమంతా తెలుసుకుని పరశురాముడు యుద్ధంలో కార్తవీర్యార్జునుడి చేతులు నరికి ధేనువును తీసుకు వెళ్ళాడు. ప్రతీకారంగా కార్తవీర్యార్జునుడి కుమారులు **జమదగ్నిని** చంపారు.

## క్షత్రియ సంహారం

జమదగ్ని మరణం గురించి తల్లి వలన తెలుసుకున్న పరశురాముడు కార్తవీర్యార్జునుడి కుమారులతో సహా హైహయవంశ రాజులందరిని చంపాడు. దానితో తృప్తి పడకలోకములో అని క్షత్రియులందరినీ చంపి వారి రక్తంతో తన తండ్రికి రక్తతర్పణం విడిచాడు. తరువాత పరశురాముడు తపస్సు చేసుకోవడానికి వెళ్ళాడు. ఒకరోజు విశ్వామిత్రుడి మనుమడు పరాసు అనేవాడు గర్వాంధుడై పరశురాముడిని చూసి " క్షత్రియులకు భయపడి పిరికి వాడిలా దాక్కున్నావు అని హేళన చేసాడు " ఆ మాటలకు కోపించిన పరశురాముడు బాలురు వృద్ధులు అని చూడక క్షత్రియులందరిని సంహరించాడు. ఈ విధంగా ఈ

ప్రకారం పరశురాముడు ఇరవై ఒక్కమార్లు దండెత్తి క్షత్రియ సంహారం చేసి వారిని సమూలంగా నాశనం చేసాడు. తరువాత పరశురాముడు అశ్వమేధయాగం చేసిన ఆ సందర్భంలో తాను క్షత్రియసంహార సందర్భంలో సంపాదించిన రాజ్యాన్ని కశ్యపునకు దానంచేసాడు. అప్పుడు కశ్యపుడు పరశురాముడు ఇక్కడ ఉంటే ఇంకా ఎంత మంది రాజులను చంపుతాడోనని " పరశురామా ! నీవు క్షత్రియసంహారం ద్వారా పొందిన రాజ్యాన్ని నాకు దానంగా ఇచ్చావు కనుక ఇక నీకు ఇక్కడ నిలువ నీడలేదు. తక్షణమే దక్షిణదేశం పో " అన్నాడు. కశ్యపుడి ఆంతర్యం గ్రహించిన పరశురాముడు అలాగే దక్షిణ దేశానికి వెళ్ళాడు. దక్షిణ దిశలోని సముద్రుడు పరశురాముడికి భయపడి తన తీరం వెంట కొంత భూమిని అతడికి దానంగా ఇచ్చాడు. కశ్యపుడు పరశురాముడి వద్ద తాను పొందిన భూమిని బ్రాహ్మణులకు పంచి తాను తపస్సు చేసుకోవడానికి వెళ్ళాడు. అప్పటి నుండి ఈ భూమికి కాశ్యపి అనే మరో నామం వచ్చింది.

## భూమిని క్షత్రియులను తిరిగి రాజులను చేయుట

తరువాత కొన్ని రోజులకు వైశ్యులలో, శూద్రులలో ప్రముఖులు గర్వించి బ్రాహ్మణులభూమిని వారిభార్యలను అపహరించారు. దాని వలన బ్రాహ్మణులు అదుపు తప్పారు. బ్రాహ్మణులు అదుపు తప్పి మద్యపానం, దొంగతనం, ఇతరుల భార్యలను అపహరించడం మొదలైన అకృత్యాలకు పాల్పడి వారి ధర్మమైన యజ్ఞయాగాదులు మరిచి పోయారు. ధర్మం అంతరించి అధర్మం రాజ్యమేల సాగింది. ఈ అధర్మాన్ని సహించ లేక భూదేవి కుంచించుకుపోయింది. అది చూసి కశ్యపుడు తన ఉరువులతో భూమిని పైకిలేపాడు. అప్పటి నుండి భూమికి ఉర్వి అనే మరోపేరు వచ్చింది. భూదేవి ఆలోచించి " క్షత్రియులు మాత్రమే దండ నీతిని ఉపయోగించి ఈ భూమిని రక్షించగలరు " అనుకుంది. " ఓ మునీంద్రా ! పరశురాముడు చంపగా మిగిలిన క్షత్రియులు ఇంకా అక్కడక్కడ జీవించి ఉన్నారు. వారిని అందరిని పిలిచి ఈ భూమిని పాలించు భారాన్ని వారికి అప్పగించు " పరశురాముడి చేతిలో చావకుండా కొంత మంది హైహయరాజులు బతికి బయటపడ్డారు. అందులో కురువంశ సంజాతుడు **విదూరధుడు** అనే వాడు ఎలుగుబంట్లతో రక్షించబడ్డాడు. సుదానువంశంలో మరొకడు బ్రతికాడు, అతడిని **పరాశరుడు** అనే ఋషి చేరదీసాడు, అతడు శూద్రుడైనా అతడి చేత సర్వకర్మలు చేయించాడు. **శిబి** అనే చక్రవర్తి కుమారుడు గోపతి అడవిలో గోవుల చేత రక్షించబడ్డాడు. **ప్రతర్ధనుడి** కుమారుడు **వత్సుడు** అనే వాడు గోశాలలో దాక్కుని బతికాడు. **దధివాహనుడు** అనే వాడి కుమారుడు **అంగుడు** అనే వాడు గౌతమ మునీంద్రుని చేత రక్షించబడ్డాడు. బృహద్రధకులములో పుట్టిన భూరి అనేవాడు ఒరగ్రుధకూటము అనే పర్వతము మీద కొండ ముచ్చులతో రక్షించబడ్డాడు. మరుత్తుల సంతానమైన నాలుగేళ్ళ వయసు కలిగిన నలుగురు సముద్రుడి చేత రక్షింపబడ్డాడు. వీరంతా ఉత్తమ క్షత్రియులు వీరు ఈ భూమిని సమర్ధవంతంగా పాలించగలరు " అని చెప్పింది. '**కశ్యపుడు**' భూదేవి చెప్పినట్లు ఆ రాజులందరినీ పిలిపించి వారికి ఈ భూమిని అంతటిని పంచి ఇచ్చారు. వారి నుండి అనేక రాజవంశాలు వర్ధిల్లాయి. ఆ విధంగా వర్ధిల్లిన రాజవంశాలన్నీ ఈ మహాభారత యుద్ధంలో అంతరించాయి కాని అక్కడక్కడా కొంత మంది చావక బ్రతికి బయటపడ్డారు " అని శ్రీకృష్ణుడు ధర్మరాజుకు చెప్పాడు.

## శ్రీకృష్ణుడు భీష్ముని కుశలము విచారించుట


అంపశయ్యపై ఉన్న భీష్ముని కలసిన పాండవులు

తరువాత వారంతా **ఓఘువతీ** తీరంలో అంపశయ్యలో పడి ఉన్న భీష్ముడి వద్దకు చేరుకున్నారు. అందరూ తమతమ రధములు దిగారు. శ్రీకృష్ణుడు భీష్ముడి వద్దకు పోయి " ఓ తేజోవంతుడా భీష్ముడా ! నీ మనసు వ్యాకులత చెందక ప్రశాంతంగా ఉందా ! నీ శరీరంలో గుచ్చుకున్న బాణాలు బాధ పెడుతున్నాయా ! ఆ బాధ నీకు కలగక పోవడానికి కారణం నీకు నీ తండ్రి ప్రసాదించిన వరప్రభావమే ! నీకు తెలియని విషయాలు లేవు కదా ! క్షత్రియుడిగా జన్మించి బ్రహ్మచర్యం అవలంబించి రాజ్యాన్ని తృణప్రాయంగా ఎంచావు. నీలాంటి వాడు అరుదుగా జన్మిస్తాడు. దేవ, దానవ, యక్ష, గంధర్వాదులు ఒక్కుమ్మడిగా దండెత్తి వచ్చినా నిన్ను జయించ లేరుకదా ! ఇంద్రియ నిగ్రహం, తపస్సు, సత్యము, దానము, ధర్మనిరతిలో అగ్రగణ్యుడవు. శరీరం అంతా బాణములు గుచ్చుకున్నా " నా ఇష్టం వచ్చినప్పుడు నేను మరణిస్తాను " అని చెప్పిన ధీరోదాత్తుడవు. అష్టవసువులలో అగ్రగణ్యుడవు, గంగాపుత్రుడవు నీకునీవే సాటి. నీ గురించి బ్రహణులు చెప్పగా విన్నాను. ఇడుగో ధర్మరాజు తన వారిని అందరినీ పోగొట్టుకొని బాధాతప్త హృదయుడైన ఇతడికి అమృతోపమానమైన నీ

పలుకులతో నివారణ కలిగించు. నీకు తెలియని విషయములు లేవు. నాలుగు వర్ణములు, నాలుగు వేదములు, నాలుగు ఆశ్రమములు వాటి ధర్మములు నీకు బాగా తెలియును. ప్రవృత్తి, నివృత్తి, సాంఖ్యము, పురాణములు, ఇతిహాసములు, ధర్మశాస్త్రం నీకు కరతలామలకం. ఎవరి మనసులో కలిగిన సంశయమైనా తొలగించగలిగిన సమర్ధుడవు. ఈ ధర్మరాజును ఆదరించి అతడి సంశయం పోగొట్టుము. శోక మోహ బాధిత ప్రజల సంశయ నివృత్తి చేసినప్పుడే కదా నీ లాంటి వారు నేర్చుకున్న విద్యలకు సార్ధకత " అని పలికిన శ్రీకృష్ణుడిని భీష్ముడు నమస్కరించాడు.

## శ్రీకృష్ణుడు రాజధర్మాలు చెప్పడానికి భీష్ముడే తగినవాడని చెప్పట

శ్రీకృష్ణుడి మాటలకు భీష్ముడు " పరంధామా ! యోగీశ్వరేశ్వరుడవు, నీవే కర్తవు, నీవే భర్తవు, నీవే సంహార కర్తవు నేను ఏమి చెయ్యాలో నీవే నిర్ణయించు " అని అన్నాడు. శ్రీకృష్ణుడు " మహానుభావా ! నా అందు నీకు అచంచల భక్తి ఉన్నదని తెలుసు, భక్తి, సత్ప్రవర్తన ఈ రెడే నా నివాసం. ఈ రెండింటిలో ఏది కొరవడినా నేను అక్కడ నుండి తప్పుకుంటాను. నీకు ఆ రెండూ పుష్కలంగా ఉన్నాయి. ఈ రోజు నుండి ఏభై ఆరు రోజులకు సూర్యుడు ఉత్తరాయణంలో సంచరిస్తాడు. అప్పుడు నీవే దేహం విడిచి జన్మరాహిత్యం పొంది మోక్ష స్థితికి చేరుకుంటావు. నీ సహచర మనువులు నీ కొరకు అదృశ్యంగా ఆకాశంలో ఎదురు చూస్తున్నారు. నీవు పరమ పదించిన నీతో నీవు అర్జించిన జ్ఞానం మరుగున పడుతుంది " అని అక్కడ ఉన్న ధర్మరాజాదులను చూపి " భీష్మా ! నీ వల్ల ధర్మభోధనలు వినడానికి వీరంతా వచ్చారు. వీరికి ధర్మ బోధ చేసి నీవు సముపార్జించిన జ్ఞానం వీరికి పంచి ఇచ్చి నీవు ధన్యత చెంది వీరికి ధన్యత కలుగ చెయ్యి " అన్నాడు.

### శ్రీకృష్ణుడు భీష్ముడికి బాధలేకుండా వరమిచ్చుట

భీష్ముడు కృష్ణుడితో " శివంకరా ! అచ్యుతా ! నారాయణా ! నీ పులుకులకు నా జన్మ తరించింది. నేను ధన్యుడనయ్యాను. నీకు ఎదురాడటం నీతో మాట్లాడడం ఆ బ్రహ్మకు కూడా తరం కాదు. ఇక నేనెంత. నా శరీరంలో గుచ్చుకున్న బాణములు బాధిస్తున్నాయి. నోరు ఎండిపోయింది. నా గొంతు నాలుక మాట్లాడ సహకరించడం లేదు. అడిగిన దానికి జవాబు చెప్పేశక్తి నాకులేదు. కనుక ధర్మ సూక్ష్మములు నీవే చెప్పు. నీవు ఉండగా నేను చెప్పడం భావ్యం కాదు. గురువు ముందు శిష్యుడు ఉపన్యసించినట్లు ఉంటుంది " అన్నాడు. ఆ మాటలకు కృష్ణుడు ఇలా అన్నాడు " నీ బాధ నాకు అర్ధమయ్యింది. నీకు మూడు వరాలు ఇస్తున్నాను. నీ శరీరంలో గుచ్చుకున్న బాణముల వలన ఏ బాధ లేకుండా, స్పృహ తప్పి పోకుండా, నీకు నొప్పి తెలియకుండా, అసలు నీకు ఏమి జరకుండా ఉండేలా వరమిస్తున్నాను. నీ మనస్సు ప్రాపంచిక విషయములలో తుగులుకొనక బ్రహ్మజ్ఞానం కలిగేలా మరొక వరం ప్రసాదిస్తున్నాను " అన్నాడు. అప్పుడు దేవదుంధుభులు మ్రోగాయి. పుష్పవృష్టి కురిసింది. అప్పటికి సంధ్యాసమయం అయింది. మునులు, ధర్మరాజు శ్రీకృష్ణుడు మరుసటి దినం వస్తామని భీష్ముడి వద్ద శలవు తీసుకుని తమ తమ రధములను అధిరోహించి హస్థినాపురం వెళ్ళారు.

## శ్రీకృష్ణుడు భీష్ముని యోగక్షేమములు విచారించుట

మరునాడు ఉదయం ధర్మరాజాదులు మంగళ స్నానమాచరించి భీష్ముడి వద్దకు పయన మయ్యారు. ధర్మరాజు అర్జునుడితో " ఈ రోజు మనతో సైనికులు పరిచారికలు వద్దు. ధృతరాష్ట్రాదులు మాత్రం వస్తే చాలు " అని చెప్పాడు. ధర్మరాజు, అర్జునుడు ఒక రధం మీద, భీముడు నకుల సహదేవులు ఇంకొక రధం మీద శ్రీకృష్ణుడు మరొక రధం మీద, కృపాచార్యుడు, సంజయుడు, యుయుత్సుడు మరొక రధం ఎక్కి భీష్ముడి వద్దకు చేరుకున్నారు. వారికంటే ముందుగా నారదాది మునులు భీష్ముడి వద్దకు చేరుకున్నారు. శ్రీకృష్ణుడు, ధర్మరాజాదులు భీష్ముడికి నమస్కరించారు. ముందుగా మాట్లాడేది ఎవరని ఒకరి ముఖం ఒకరు చూసుకొను చుండగా ధర్మరాజు కృష్ణుడితో " కృష్ణా ! భీష్ముడితో మాటాడ తగిన వారు నీవు తప్ప ఎవరు లేరు కనుక నీవు సంభాషణ మొదలు పెట్టు " అన్నాడు. శ్రీకృష్ణుడు భీష్ముడికి దగ్గరగా వెళ్ళి అతడి యోగక్షేమములు విచారించాడు. భీష్ముడు " దేవా! నీ దయ వలన నాకు ఆకలి, దప్పిక, అలసట లేదు. వయోవృద్ధుడినైన నేను ప్రస్తుతం బాలుడి వలె ఉత్సాహభరితుడనై ఉన్నాను. నీవు చెప్పిన విధంగా నేను పాండవులకు ధర్మ సూక్ష్మములు చెప్తాను. కాని సర్వజ్ఞుడవైన నీవు నా చేత చెప్పించడం లోని అంతర్యం ఏమిటి ? " అని అడిగాడు.

## ధర్మరాజు రాజధర్మములు చెప్పమని భీష్ముడిని కోరుట

శ్రీకృష్ణుడు భీష్మా ! ఈ లోకంలో సకల యశస్సుకు కీర్తికి నేనే కారణం. రాజధర్మాలు ధర్మరాజు ద్వారా లోకానికి చెప్పడం వలన నాకు కొత్తగా వచ్చే కీర్తి లేదు నాకు దానిమీద వ్యామోహం లేదు. ఈ అవసాన దశలో ధర్మనిరతుడవైన నీ నోటి నుండి

ధర్మసూక్ష్మములు లోకానికి అందించి నీకు కీర్తి కలిగించాలని ఇలా చేస్తున్నాను. నీవు అన్నీ సందేహాలు తీర్చేవిధంగా సమస్తజ్ఞానం నీలో ప్రవేశపెట్టాను. ఇందు వలన నీ కీర్తి ఆచంద్రార్కాంరం నిలిచి ఉంటుంది. ధర్మరాజు అడిగిన ప్రశ్నలకు నీవు చెప్పే సమాధానాలు ఈ లోకానికి మార్గదర్శకాలు ఔతాయి. నీ జన్మధన్యం ఔతుంది. కనుక నీవు ధర్మరాజు అడిగిన వాటికి తగిన సమాధానాలు చెప్పు " అన్నాడు. ఆ మాటలకు మిక్కిలి ఆనందపడిన భీష్ముడు " కృష్ణా ! ధర్మరాజు పుట్టినప్పుడు మునీంద్రులంతా ఆనందించారు. ఈ భరతకులంలో ధర్మరాజు పరమధార్మికుడు అయ్యాడు. సత్యము, శాంతి, శౌచము, ధర్మము మొదలగు ఉత్తమ గుణాలకు ధర్మరాజు ఆలవాలం అయ్యాడు. కామంతోగాని ధనంతోగానీ, భయంతోగానీ ధర్మం తప్పనివాడు ధర్మరాజు. అలాంటి వాడు నన్ను ఏమి అడగదలిచాడో అడగమను నాకు తోచినంత చెప్తాను " అన్నాడు భీష్ముడు. ఆ మాటలకు కృష్ణుడు నవ్వి " భీష్మా ! ఈ యుద్ధంలో ధర్మరాజు మిత్రులను, బంధువులను, మిత్రులను సంహరించాడు. లెక్కలేనంత మందిని రణభూమికి బలి ఇచ్చాడు. అతడిలో జాలి దయ మచ్చుకైనాలేవు అని నీవు అంటావని నీ ఎదుటికి రావడానికి భయపడుతున్నాడు " అని అన్నాడు. ఆ మాటలకు భీష్ముడు కృష్ణా ! బ్రాహ్మణులకు వేదాధ్యనము, యజ్ఞ యాగాది క్రతువులు నిర్వహించడం విద్యుక్తధర్మం, అలాగే క్షత్రియులకు యుద్ధం చెయ్యడం విద్యుక్తధర్మం. యుద్ధంలో తమను ఎదిరించిన తండ్రులను, తాతలను, బంధువులను, మిత్రులను, కుమారులను, మనుమలను, గురువులను వధించడం ధర్మమేకదా ! ఎందుకంటే వారు వారి ధర్మం మరిచి యుద్ధం చేసారు. అలాంటి వారిని వధించుట ధర్మమే కాని పాపం కాదు ! యుద్ధంలో అధర్మవర్తనులను, అన్యాయం చేసిన వారిని వధించడం పుణ్యమే కాని పాపంకాదు. కనుక ధర్మరాజు ధర్మాత్ముడే ! " అని భీష్ముడు అన్నాడు. ఈ మాటలు విన్న ధర్మరాజు చేతులుజోడించి భీష్ముడి ముందుకువచ్చాడు. భీష్ముడి పాదాలాకు తలతాకించి నమస్కరించాడు. భీష్ముడు ధర్మరాజు తలను తన రెండుచేతులతో పట్టి నుదుటి మీద చుంబించాడు. " ధర్మనందనా ! నీ మదిలో మెదలుతున్న సందేహాలను అడగవయ్యా " అన్నాడు.

## రాజధర్మములు

ధర్మరాజు అందరి అనుమతి పొంది భీష్మునితో " పితామహా ! ధర్మార్థ కామాలలో రాజధర్మం గొప్పది. ఏనుగుకు అంకుశం ఎలాగో, గుర్రానికి పగ్గములు ఎలాగో మానవ మనుగడకు రాజధర్మం అత్యావశ్యం. మా పూర్వులు ఆచరించిన రాజధర్మమును ఆచరించక పోతే అరాచకం పెరుగుతుంది, ధర్మం నశిస్తుంది. ఈ ప్రజలు చేసే పాపాలను రాజధర్మంతోనే అణచి వేయడం ధర్మంతుంది. ధర్మం తెలిసిన ప్రజలు రాజును ధర్మస్వరూపంగా అనుకుంటారు. కనుక రాజుకు రాజధర్మములు తెలుకొన వలసిన అవసరం ఉంది. రాజు రాజధర్మం తప్పితే రాజ్యంలో అరాచకం పెరుగి ధర్మం తగ్గుతుంది. కనుక రాజు ప్రజలు చేసే పాపాలను రాజధర్మంతోనే అణిచివేయాలి. ప్రజలు రాజును ధర్మస్వరూపుడిగా ఆరాధిస్తారు కనుక రాజు రాజధర్మం ఎరిగి పాలన చేయడం అవస్యం కనుక మీరు నాకు రాజధర్మ సూక్ష్మాలను ఎరిగించండి " అని అడిగాడు. భీష్ముడు " తనకు మేలు జరగాలని కోరుకునే రాజు ముందుగా ఏ దేవతలను పూజించాలి. ఏ పనికైనా దైవబలం అవసరం. కనుక మానవ ప్రయత్నంతో పైన చెప్పిన రెండింటినీ చేయాలి. మానవ ప్రయత్నం చేసే రాజుకు దైవసాయం ఉంటుంది. ప్రయత్నం విఫలమైనా రాజు కలత నొందక అది దైవనిర్ణయం అని భావించాలి. రాజుకు శాంతి, దాంతి, విజితాత్మ, శీలం మొదలైన సుగుణములు ఉండాలి. ఇవి ఉన్న రాజుకు సమస్త సంపదలు సమకూడుతాయి. రాజు సత్యసంధత కలిగి విజ్ఞత, మంచి నడనవడి కలిగి రాజ్య పాలన చేస్తూ దండనీతిని జాగరూకతతో అమలు చేస్తే కీర్తిమంతుడు కాగలడు. రాతి నుండి ఇనుము పుడుతుంది, అదే ఇనుముతో రాతిని కొడితే రాయి విరుగుతుంది, నీటి నుండి అగ్ని పుడుతుంది కాని అగ్నితో నీటిని కాల్చాలనుకుంటే అది ఆరిపోతుంది. బ్రాహ్మణుడి వలన రాజు తయారు ఔతాడు. ఆ రాజే బ్రాహ్మణుడిని అవమానిస్తే రాజు నాశనం కాక తప్పదని. నీవు మనసులో పెట్టుకోవాలి. బ్రాహ్మణులు వేదస్వరూపులు కనుక వారిని గౌరవించి ఆదరించు. బ్రాహ్మణుడు తప్పు చేస్తే అతడూ దండనార్హుడే. శుక్రనీతిలో " యుద్ధ సమయంలో అస్త్ర శస్త్ర సహితుడై తన మీదకు వచ్చే బ్రాహ్మణుడిని వధించడం రాజుకు పరమధర్మం. కాని గురువు భార్యను కోరిన వాడిని, పసి పిల్లలను చంపినవాడిని, సాటి బ్రాహ్మణుడిని చంపినవాడిని, రాజద్రోహం చేసిన వాడిని చంపక దేశభహిష్కరణ చేయాలి " అని చెప్పాడు.

## రాజప్రవర్తన

బృహస్పతి రాజ ప్రవర్తన గురించి " రాజు దుర్గరక్షణలో అప్రమత్తతతో వ్యవహరించి చతురంగబలముతో రక్షించాలి. రాజు బ్రాహ్మణులను, వైశ్యులను, క్షత్రియులను వర్ణవివక్షణ లేక సమానంగా చూడాలి. రాజు దయతో వ్యవహరించాలి కాని మెతకదనం చూప కూడదు. మృదుప్రవర్తన వలన రాజు ప్రజలలో చులకన ఔతాడు. అప్పుడు ప్రజలు రాజుతో తమకు ఇష్టం వచ్చిన రీతిలో ప్రవర్తించి ఆటలాడుతారు. అలాగే రాజు క్రూరత్వం ప్రదర్శించ కూడదు. ప్రజలు భయభ్రాంతులు ఔతారు. కనుక అతిమృదుస్వభావం చూపక, అతిక్రూరత్వం చూపక దయ దండన సమపాళ్ళలో రంగరించాలి. ఇది రాజధర్మంలో ప్రధానమైనది. రాజు తన కోపతాపములు ప్రజల ముందు ప్రదర్శించక సంయమనం వహించాలి. రాజు గంభీరంగా ఉండాలి కాని తనక్రింది ఉద్యోగులతో ప్రజలతో పరిహాసాలు పరాచకాలు ఆడకూడదు. అలా చేస్తే రాజును లెక్క చేయక రాజుకు

హానికలిగించే పనులుచేసి రాచరికానికి ముప్పు తీసుకు రాగల ప్రమాదం ఉంది. రాజు ఉద్యోగులతో దయతో గంభీరంగా వ్యవహరించాలి. రాజ్యముకు రాజ్యపాలన కలిగించే వారికి అపకారము తలపెట్టిన వారిపట్ల మెతకదనం వహించక కఠినత్వం వహించాలి. రాజు వారిని వెంటనే వదిలించుకోవాలి. గర్వాంధుడై తన కర్తవ్యం మరచి ప్రవర్తించే వాడిని రాజు వదిలించుకోవాలి కాని భరించ కండా ఉండటమే రాజధర్మం " మరుత్తుకు చెప్పాడు. కనుక ధర్మరాజా ! తప్పు చేసిన వాడు గురువైనా, సుతుడైనా, మిత్రుడైనా మన్నించక కఠినంగా శిక్షించాలి. ప్రజలను బాధిస్తున్న అసమంజసుడిని వదిలి వేసిన **సగరుడు**, బ్రాహ్మణులను బాధిస్తున్న కుమారుడు **శ్వేతకేతువు**ను వదిలి వేసిన **ఉద్దాలకుడు** మనకు ఈ విషయంలో ఆదర్శ మూర్తులు. రాజు సత్యము, ధర్మము, క్షమాగుణం కలిగి పాలన సాగించి ప్రజలను సంతోష పెట్టాలి. రాజు తనకు కీడు సంభవించగలదని భావిస్తే వైదికకర్మల ద్వారా వాటిని నివారించాలి. రాజు చతుర్వర్ణాలను సమంగా ఆదరించాలి. తనను పొగిడే వారిని దూరంగా ఉంచాలి. అవినీతిని అంత మొందించి వారి ధనమును బాధితులకు పంచాలి. ఎవరిని అతిగా నమ్మకూడదు, అలాగని ఎవరి మీద అవిశ్వాసం చూపక విచక్షణతో వ్యవహరించాలి.

### అంత:కలహం

ధర్మజా ! రాజుకు అంత:శత్రువులు ఎక్కడినుండో పుట్టుకు రారు. అతడి ప్రజల నుండి వస్తారు. అది నివారించాలంటే ధర్మనిరతులైన వారిని, అర్ధశాస్త్రంలో నిపుణులను, స్థిరచిత్తులను, రాజాజ్ఞను గౌరవించే వారిని, ఉత్తమ కులతిలకులను, నీతిమంతులను తన కొలువులో చేర్చుకుని పాలన సాగించాలి. అటువంటి రాజు పాలనలో ప్రజలు సంతోషంతో కపటంలేక పుత్రులవలె మెలగుతారు. రాజు అత్యంత పరాక్రమ వంతుడై ఉండాలి. లేని ఎడల ప్రజల ధన, మాన, ప్రాణాలను రక్షించ లేడు. అని శుక్రాచార్యుడు చెప్పాడు. పరాక్రమ హీనుడు, ప్రజలను రక్షించ లేని రాజు చదువుకోని ఋత్విక్కు వంటి వాడు. అని మనువు చెప్పాడు. ప్రజా సంరక్షణయే పరమ ధర్మమని ఇంద్రుడు **భరద్వాజుడు** చెప్పారు. రాజైన వాడు ఎప్పుడూ ఉత్సాహవంతుడై ఉండాలి. న్యాయమార్గమున కాని, అన్యాయ మార్గమున కానీ శత్రువును వధించాలి. అల్పుడని వదిలి వేసిన శత్రువు బలిష్టుడై విషంకక్కే అపాయం ఉంది. కనుక శత్రుసంహారం రాజ్యానికి శ్రేయోదాయకం. ఎన్ని అడ్డంకులు వచ్చినా రాజురాజ్యాన్ని అన్యాక్రాంతం చెయ్యకూడదు " అని చెప్పాడు భీష్ముడు. అప్పటికి సూర్యాస్తమయం అయ్యింది కనుక శ్రీకృష్ణుడు ధర్మరాజాదులు, మహా మునులు భీష్ముడి వద్ద శలవు తీసుకుని వెళ్ళారు.

## నీతి శాస్త్రం


రాజులేని ప్రజలు రాజు కొరకై బ్రహ్మను ప్రార్ధించుట

మరునాడు ఉదయయం శ్రీకృష్ణుడు ధర్మరాజు మహామునులు భీష్ముని వద్దకు వచ్చి చుట్టూ కూర్చున్నారు. ధర్మరాజు చేతులు జోడించి " పితామహా ! మామూలు మానవులకు రాజులకు భేదం లేదుకదా ! ఇద్దరికీ చావు పుట్టుక వ్యాధులు ఉన్నాయి. ఇద్దరికీ తలా , చేతులు, కాళ్ళు సమానమే కదా ! ఇద్దరికీ చావు పుట్టుక వ్యాధులు సమానమే! అలాంటప్పుడు రాజు ప్రజలను తనవశంలో ఎలా ఉంచుకోగలడు ? ఎలా రక్షించగలడు ? ఎలా దండించగలడు ? రాజు దేవుడితో సమానం ఎలా కాగలడు ? దయచేసి వివరించండి " అని అడిగాడు. అందుకు భీష్ముడు " ధర్మనందనా ! కృతయుగంలో ధర్మము చక్కగా ఉంది. ప్రజంతా ధర్మబద్ధులై ప్రవర్తించారు. అందుకని ప్రజలకు ఎవరి రక్షణా అవసరం లేక పోయింది. తరువాత క్రమంగా ప్రజలలో ఇది నాది అది నీది అనే భావం పెరిగి స్వార్ధం పెరిగి లోభత్వం ప్రవేశించింది. క్రమంగా ధర్మమం క్షీణించి ప్రజలు అకృత్యముకు పాల్పడసాగారు. క్రమంగా కోరికలు ప్రబలి ఒకరిమీద ఒకరికి మదం, మాత్సర్యం, ద్వేషం పెరిగింది. వేదాలు చదవడం మానివేసారు. అధర్మం రాజ్యమేల సాగింది. అప్పుడు దేవేంద్రాదులు బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి " దేవా ! మానవ లోకంలో వేదాధ్యాయం సన్నగిల్లింది. యజ్ఞయాగములు చేయడం వదిలారు. ధర్మంక్షీణించింది " అని మొరపెట్టుకున్నారు. బ్రహ్మదేవుడు నవ్వి " నేను దానికి తగిన ప్రతిక్రియ చేస్తాను కలత చెందవద్దు " అని చెప్పాడు.

### బ్రహ్మరచించిన నీతిశాస్త్రం

తరువాత బ్రహ్మదేవుడు నీతి శాస్త్రమును రచించాడు. ఆ నీతి శాస్త్రంలో రాజు, మంత్రి, దుర్గం, కోశాగారం, వార్తా సేకరణ, దండనీతి, మిత్రులు, శత్రువులు, ఉదాశీనుడు, సంధిచేసుకోవడం, రాజతంత్రములు, ధర్మం, అర్ధం, కామము, మోక్షం అనే నాలుగు పురుషార్ధములు పొందుపరిచాడు. ఆ నీతిశాస్త్రం లక్ష అధ్యాయములు కలిగి ఉంది. ఆ నీతిశాస్త్రం లోకములకు ఆచరణయోగ్యమై నిర్మలంగా ఉండడానికి తోడ్పడుతుందని భావించాడు. ఆ సమయంలో బ్రహ్మదేవుడి నొసటి నుండి ఆది అంతం లేనివాడు, ఈ విశ్వమునకు కర్త అయిన వాడు , సర్వభూతములలో తానై ఉన్నవాడు, సనాతనుడు, వికృతం, విశాలం అయిన కన్నులు కల వాడు అయిన శివుడు విశాలాక్షుడు అనే పేరుతో ఆవిర్భవించాడు.**విశాలాక్షుడు** బ్రహ్మ రచించిన లక్ష అధ్యాయములు గల నీతి శాస్త్రమును ఆ మూలాగ్రం చదివాడు. ఈ నీతి శాసత్రం చదవడానికి మానవుల బుద్ధి ఆయుష్షు, బుద్ధి సరి పోదు అని అనుకున్నాడు. అందు వలన ఆ నీతిశాస్త్రమును పదివేల అధ్యాయములకు కుదించి, **వైశాలాక్షము'** అనే నీతిశాస్త్రము రచించాడు. ఆ తరువాత ఆ నీతిశాస్త్రం మహేంద్రుడు చదివాడు. **మహేంద్రుడు** దానిని అయిదు వేల అధ్యాయములకు కుదించాడు. ఆ తరువాత బృహస్పతి అందరికీ అర్ధం అయ్యేలా మూడు వేల అధ్యాయములకు కుదించాడు. దానిని శుక్రుడు వేయి అధ్యాయములకు కుదించాడు. అదే **శుక్రనీతి**. కాల క్రమేణా మునులు దానిని చిన్న చిన్న గ్రంధాలుగా రచించారు. ఇలా నీతిశాస్త్రం వివిధ మార్పులు చెందింది. దేవతలు ఆ తరువాత విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి నీతిశాస్త్ర పరిణామమును వివరించి దానిని అమలు చేయడానికి ఒక సమర్ధుడిని నిర్ధేశించండి అని వేడుకున్నారు.

## ప్రధమ ప్రజాపాలకుడు


వేనుని బాహువులను నుండి ఉద్భవిస్తున్న పృథుమహారాజు

దేవతల కోరికను మన్నించి విష్ణుమూర్తి తన తేజస్సుతో ఒక మానసపుత్రుడిని పుట్టించాడు. అతడి పేరు **విరజుడు**. విష్ణువు అతడిని రాజును చేసాడు. కాని అతడు రాజ్యపాలన పట్ల విముఖత వహించి తన కుమారుడైన కర్దముడికి రాజ్యమును అప్పగించి తాను తపమాచరించడానికి వెళ్ళాడు. **కర్దముడు** కూడా రాజ్యపాలన పట్ల విముఖత వహించి తన కుమారుడైన అనంగుడికి రాజ్యమును అప్పగించి తప మాచరించ డానికి వెళ్ళాడు. **అనంగుడు** నీతి శాస్త్రమును అనుసరించి దండనీతిని ఉపయోగించి రాజ్యపాలన సాంగించాడు. అతడి తరువాత అతడి కుమారుడైన నీతికి పట్టాభిషేకం చేసాడు. **నీతి** మృత్యువు కుమార్తె **సునీధ**ను వివాహం చేసుకున్నాడు. వారికి **వేనుడు** అనే కుమారుడు కలిగాడు. అతడు రాగద్వేషములకు లోనై ప్రజాకంటకుడై మహామునుల హూంకారం చేత హతుడయ్యాడు. మహామునులు తరువాత పాలకుడి కొరకు అతడి తొడను దర్భలతో మధించారు. తొడ నుండి ఒక వికృతాకారుడు అయిన **అశుచి** అనే కుమారుడు జన్మించాడు. మునులు వాడిని చూసి నిరాశపడి " నిషీద నిషీద " ("కూర్చో కూర్చో") అని అన్నారు. అందు వలన అతడు నిషాధుడయ్యాడు. మునులు అతడిని అడవులకు పంపాడు. నిషాధుడి సంతతి నిషాధులై వింధ్యపర్వత శ్రేణులలో అత్యంత క్రూరులై సంచరించ సాగారు. తరువాత మునులు వేనుడి కుడి భుజాన్ని మధించారు. అప్పుడు అతడి భుజం నుండి ప్రకాశించే కవచంతో, ధనుర్బాణాలతో, వేదవేదాంగ, ధనుర్వేద పారంగతుడైన మహాపురుషుడు జన్మించాడు. నీతి శాస్త్రంలో చెప్పబడిన దండనీతి ఆ మహా పురుషుడిని ఆశ్రయించింది. ఆ మహాపురుషుడు మునులకు నమస్కరించి " మహా మునులారా ! నన్ను ఎందుకు సృష్టించారు " అని అడిగాడు. మునులు " ఓ మహాపురుషా ! నీ పేరు **వైన్యుడు** నీవు అహంకారం, క్రోధం, మోహ, లోభం విడిచి నీతి శాస్త్రమును అనుసరించి ధర్మ రక్షణ చేస్తూ ఈ లోకాన్ని పాలించు. నీ ఇష్టా ఇష్టములకు అతీతంగా ప్రజలను రక్షించు. నీతి శాస్త్రమును అనుసరించి ధర్మమును రక్షించి, వేద వేదాంగములను రక్షించి, వర్ణ సంకరమును అరికట్టు. బ్రాహ్మణులను, నీతిమంతులను రక్షించు " అని ఆజ్ఞాపించారు. అప్పుడు ఆ వైన్యుడు " మహామునులారా ! నేను బ్రాహ్మణుల సహాయంతో మీరు చెప్పిన కార్యములు నెరవేర్చ గలను " అని పలికాడు. అందుకు మహామునులు సంతోషపడి వైన్యుడికి బ్రాహ్మణులను మంత్రులుగా నియమించి ఆ మహామునులు వైన్యుడిని సకల భూమండలానికి పట్టాభిషిక్తుడను అయ్యాను. శుక్రుడిని పురోహితుడిగా నియమించారు. వాల ఖిల్యులలో సారస్వతులను మంత్రులుగా నియమించాడు. గర్గుడిని జ్యోతిష్యుడుగా నియమించారు. ఇంద్రుడు, కుబేరుడు అత్యధిక సంపదలను ఇచ్చారు. వైన్యుడు ఈ భూమండలానికి రాజై నీతిశాస్త్రము చెప్పిన రీతిగా దండనీతిని అమలు చేస్తూ రాజ్యపాలన చేయసాగాడు. వైన్యుడి పాలనలో ప్రజలు సుఖశాంతులతో జీవించారు.

## క్షత్రియుడు

ధర్మరాజా ! ప్రజలను, బ్రాహ్మణులను రక్షించాడు కనుక క్షత్రియుడయ్యాడు, ప్రజలను రంజింప చేసే వాడు కనుక రాజు అయ్యాడు. వైన్యుడి సంతతి వారు క్షత్రియులయ్యారు. రాజరికం వహించి దండ నీతిని అమలు చేస్తూ రాజులయ్యారు. కనుక రాజులంతా విష్ణువు అంశలే. ప్రజారక్షణ చేస్తూ పాలించే వాడు విష్ణాంశ సంభూతులు. అందు వలన రాజుల చేతిలో ప్రజా రక్షణాశక్తి ఉంటుంది. శ్రీ మహావిష్ణువు ఫాలభాగం నుండి ఉద్భవించిన లక్ష్మి (సిరి)ధర్మమును ఆశ్రయించి అతడికి భార్య అయి అర్ధము అనే కుమారుడిని కన్నది. అందువలన ధర్మము, సిరి, అర్ధము రాజును ఆశ్రయించుకుని ఉంటాయి. ధర్మరాజా ! అందుకని రాజు సామాన్యుడు కాదు. అతడు పుణ్యాత్ముడు. అతడు స్వర్గలోకముకు పోవడానికి అర్హుడు. దండనీతిని అమలు చేస్తూ ప్రజాపాలన చేయడానికి స్వర్గం నుండి ఈ భూమి మీదకు విష్ణాంశ సంభూతుడు. కనుక వర్ణాశ్రమ ధర్మాలు, అచారవ్యవహారాలు, వేదములు, పురాణములు, ఇతిహాసములు రాజుల ఆధీనంలో ఉంటాయి. విష్ణుమహిమ వలన రాజు సౌందర్యము, శౌర్యము, చతురత మొదలైన సుగుణములు కలిగి ఉంటాడని ప్రజలు అనుకుంటారు. అందుకే రాజు దేవతలతో సమానుడని ప్రజలు అనుకుంటారు. ధర్మరాజా ! నీకు ఇంకా సందేహాలు ఉంటే అడుగు " అని చెప్పాడు భీష్ముడు.

## చతుర్వర్ణాలు

భీష్ముడి మాటలకు బదులుగా ధర్మరాజు " పితామహా ! బ్రాహ్మణ, వైశ్య, శూద్రులు అనే నాలుగు వర్ణాలు, బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమం, వానప్రస్థం, సన్యాసం అనే నాలుగు వర్ణాశ్రమములు వాట్ని ఆచరించు విధానములు ఈ ప్రపంచంలో అనుసరించు రాజధర్మములు వివరించండి " అని కోరాడు. భీష్ముడు " ధర్మనందనా ! కోపం లేకుండా ఉండడం, సత్యం పలుకడం, తన భార్య అందు అనురక్తుడై ఉండటం, రాజ్యమునకు సంబంధించిన రహస్యములను కాపాడడం, పరుల ఎడ ద్రోహచింతన లేకుండుట మొదలైన ఉత్తమగుణములు రాజు పాటించాలి. బ్రాహ్మణుడికి ఇంద్రియ నిగ్రహం అత్యంత అవశ్యం. బ్రాహ్మణుడు రోజు వేధాధ్యయనం చేయాలి. కరుణ, శాంతస్వభావం కలిగి ఉండాలి. బ్రాహ్మణుడు చెడు ప్రవర్తన విడనాడాలి. బ్రాహ్మణుడికి లభించిన సంపదను తన సంతానం కొరకు పరుల కొరకు వినియోగించాలి. క్షత్రియధర్మం ఏమంటే అతడు యజ్ఞ యాగాదులు చేయ్యడం, వేదాధ్యయనం చెయ్యడం, దుర్మార్గులను కఠినంగా శిక్షించడం, ప్రజలను అనురాగంతో పాలించడం, యుద్ధంలో పరాక్రమం చూపడం క్షత్రియధర్మం. అన్నిటికంటే యుద్ధం చెయ్యడం క్షత్రియుడికి పరమ ధర్మం. వైశ్యధర్మములు చెప్తాను. వైశ్యుడు వేదాధ్యయనం చేయాలి, ఉజ్ఞ యాగములు చెయ్యాలి, న్యాయంగా ధనార్జన చెయ్యాలి. ధనం కూడబెట్టాలి. పశు పోషణ, రక్షణ చేయాలి. ఇది వైశ్యుడు పాటించవలసిన ఉత్తమ ధర్మాలు. పైన చెప్పిన మూడు వర్ణాలకు కావలసిన కార్య సహాయం చేయడం శూద్రధర్మం. శూద్రుడు రాజానుమతితో ధనసంపాదన చేయ వచ్చు. కాని దాన, ధర్మాలు చెయ్యడానికి రాజానుమతి లేకుండా చెయ్య వచ్చు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు యజ్ఞ యాగాదులు పరమ ధర్మం.

## ఆశ్రమ ధర్మాలు

తరువాత భీష్ముడుఆశ్రమ ధర్మాలు చెప్పసాగాడు " ధర్మజా ! బ్రహ్మచర్యాశ్రమంలో బ్రహ్మచారి గురుశుశ్రూష చెయ్యడం, ఆగమ శాస్త్రములు అభ్యసించడం, బాహ్య అలంకారముల మీద ఆసక్తి విడవడం, బిక్షుక వృత్తితో జీవించడం, ఎవరి మీద ప్రేమ కానీ ద్వేషం కాని చూపక పోవడం, ఎప్పుడూ మంచి పనులు మాత్రమే చెయ్యడం బ్రహ్మచారి ఆచరించ తగిన ధర్మాలు. గృహస్థు తన భార్య మీద మాత్రమే అనురక్తుడై ఉండాలి. కరుణ, సత్యనిష్ఠ, ఓర్పు, సజ్జన సాంగత్యం, దేవకార్యములు, పితృ కార్యములు శ్రద్ధతో నిర్వహించడం, నిత్యాగ్ని హోత్రం చెయ్యడం, అతిథులను ఆదరించడం గృహస్థాశ్రమ ధర్మాలు. ఒంటరిగాకాని భార్యతోగాని అడవులకు వెళ్ళడం, మానావమానములను వదలడం, ఇంద్రియ నిగ్రహం పాటించడం, జడధారియై వేదాధ్యయనం చెయ్యడం, సజ్జనులతో గోష్టి సల్పడం వానప్రస్థాశ్రమ ధర్మం. సన్యాసి ఒక ప్రదేశంలో ఉండడు. ఆకలి వేసినప్పుడు దొరికింది తింటాడు. రాత్రి సమయం అయినప్పుడు ఎక్కడైనా నిద్రిస్తాడు. సన్యాసి అగ్నికార్యములు చేయ వలసిన అవసరంలేదు. తనకు తానుగా ఏమీ కోరక ఇచ్చినది పుచ్చుకొనుట, ఇంద్రియ నిగ్రహం పాటించుట, వినయంతో ప్రవర్తించుట సన్యాసి ఆచరించ వలసిన ధర్మాలు. ఈ నాలుగు ఆశ్రమాలు బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు ఆచరించ వచ్చు. శూద్రుడు మొదటి మూడు ఆశ్రమాలను ఆచరించ వచ్చు కాని సన్యాసం స్వీకరించ రాదు. ధర్మ పరుడైన బ్రాహ్మణుడు యజ్ఞ యాగములలో దానమును స్వీకరించడానికి అర్హుడు. అటువంటి బ్రాహ్మణుడికి దానం చేసిన రాజు కీర్తిమంతుడు ఔతాడు. రాజు ప్రజల చేత ఈ వర్ణాశ్రమ ధర్మాలు ఆచరింపజేసి సిద్ధి పొందుతాడు. సకల ధ్రర్మములు రాజధర్మానికి లోబడి ఉంటాయి. రాజు దండ నీతిని విస్మరిస్తే య్జ్ఞయాగములకు విఘ్నం కలుగుతుంది. ప్రజలకు కీడు కలుగుతుంది. రాజు దండనీతిని అమలు పరుస్తూ ప్రజలను దయతో పాలిస్తే ప్రజలు సుఖసంతోషాలతో జీవిస్తారు. ధర్మాలలో కెల్లా రాజ ధర్మం గొప్పది. రాజధర్మమును ఆచరించు రాజు దైవసమానుడు.

## మాంధాత

వర్ణాశ్రమ ధర్మాలు, ఆశ్రమధర్మాలు చెప్పిన భీష్ముడుధర్మరాజుతో " పూర్వం **మాంధాత** అనే రాజు విష్ణువును గురించి తపస్సు చేసాడు. మాంధాతకు ఇంద్రుడు ప్రత్యక్షం అయ్యి తనకు నమస్కరించిన మాంధతతో " మాంధాతా ! నువ్వు విష్ణువును ప్రసన్నం చేసుకోవడం అంత సులభంకాదు. అందుకని నేను ప్రత్యక్షం అయ్యావు. నీ కోరిక ఏమిటో నేను నెరవేరుస్తాను " అని అన్నాడు. మాంధాత " మహేంద్రా ! నాకు ఈ సంసారం మీద విరక్తి కలిగించి బికుకవృత్తి మీద ఆసక్తి కలిగించు " అని కోరాడు. అప్పుడు ఇంద్రుడు మాంధాతతో " ఓ మహారాజా ! అన్ని ధర్మములలోకి రాజధర్మం గొప్పది. రాజు కామక్రోధములు విడిచి దండనీతిని అమలు చేస్తూ రాజ్య పాలన చేయాలి. అప్పుడు రాజుకు ఉత్తమ గతులు ప్రాప్తిస్తాయి. అలాంటి మహారాజైన నీకు భిక్షుక వృత్తి ఆచరణ యోగ్యం కాదు. ప్రజలను రక్షించడం, యుద్ధంలో మరణించడం క్షత్రియధర్మం. భిక్షుకవృత్తి రాజధర్మం కాదు. మానవులలో రాజు శ్రేష్టుడు అని వేదములు ఘోషిస్తున్నాయి. అన్నాడు. ధర్మబద్ధమైన దండనీతికి సాటి అయినది వేరే లేదని పెద్దలు చెప్పారు కదా ! కనుక ఓ మహారాజా ! నీవు కామక్రోధములు విడిచి పెట్టి దండనీతిని అమలు చేస్తూ రాజ్యం చెయ్యి. అంతే కాని భిక్షుకవృత్తి నీకు సరికాదు " అని మాంధాతతో ఇంద్రుడు చెప్పాడు. కనుక ధర్మనందనా ! అతిథులను, దీనులను, పేదవారిని దయతో చూడు. సంతోషమూ, అహంకారమూ, దుఃఖం నీ దరికి రానీక నిర్మలమనస్కుడవై ఉండు. స్వార్ధాన్ని విడిచి పెట్టి ప్రజా రక్షణకు పాటుపడు. అదే పరమ ధర్మం " అన్నాడు భీష్ముడు.

## ప్రజాధర్మం

ధర్మరాజు భీష్ముడితో " భీష్మపితామహా ! రాజులు ఆచరించవలసిన ధర్మముల గురించి చెప్పారు. ప్రజలు ఏ ధర్మం ఆచరించి సుఖంగా జీవించగలరు " అని అడిగాడు. భీష్ముడు " ధర్మరాజా ! ప్రజలు తమకు ఒక రాజును నియమించుకుని ఆయనను అభిషిక్తుడిని చేసి ఆయన పాలనలో ప్రజలు సుఖంగా జీవిస్తున్నారు. అలా పాలించే రాజు లేకున్న ప్రజలు ధర్మంతప్పి ఒకరి ధనమును, భార్యను ఒకరు అపహరించుతూ, ఒకరి సొత్తును ఒకరు దోచుకుంటూ విచ్చలవిడిగా ప్రవర్తిస్తారు. ప్రజా జీవితాన్ని సక్రమ మార్గంలో నడిపించడానికి రాజు కావాలి లేకున్న ప్రజాజీవితం అస్తవ్యస్థం ఔతుంది. వ్యవసాయము, వ్యాపారం, గోరక్షణ మొదలైన వృత్తులు నాశనం ఔతాయి. ఒకానొక సమయమున రాజు లేక దొంగతనం, అక్రమప్రవర్తన, దుర్మార్గం పెచ్చుమీరి ప్రజలజీవితం కల్లోలితం అయింది. అప్పుడు సాధారణ ప్రజలు బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి తమకు రాజును ప్రసాదించమని బ్రహ్మదేవుడిని వేడుకున్నారు. బ్రహ్మదేవుడు వారికి '**మనువు**ను రాజుగా నియమించాడు. మనువు అసత్యం పలికే వారికి, దుర్మార్గులకు తాను రాజుగా ఉడలేనని చెప్పాడు. అప్పుడు ప్రజలు " పశువులలో బంగారంలో సగభాగం పన్ను కింద చెల్లిస్తాము. పండించిన పంటలో పదవభాగం ఇస్తాము. వాటితో మంచి సైన్యమును సమకూర్చుకుని నీ పరాక్రమంతో దుష్టులను శిక్షిస్తూ శిష్టులను రక్షిస్తూ రాజ్యపాలన చెయ్యండి. ప్రజలంతా నీ ఆజ్ఞలకు లోబడి ప్రవర్తిస్తాము. అధర్మ వర్తనులు నీ చేత శిక్షించబడతారు. ధర్మాత్ముల పుణ్యంలో ఆరవవంతు నీకు చెందుతుంది. ఇంద్రుడు దేవతలను రక్షించినట్లు మీరు మమ్ము రక్షించండి " అని వేడుకున్నారు. కనుక ధర్మరాజా ! రాజాజ్ఞను పాలించడం ప్రజల కర్తవ్యం. ప్రజలు రాజును దైవంలా పూజించాలి రాజు ఎప్పుడైనా ధర్మం తప్పి ప్రవర్తిస్తే ప్రజలు దానిని సహించాలి. ప్రజలు ఆ విధంగా ప్రవర్తిస్తేనే శత్రువులు కూడా రాజును చూసి భయపడతారు. ప్రజలే రాజును గౌరవించనప్పుడు శత్రువులు అతడిని అలక్ష్యం చేస్తారు. కనుక ప్రజలు రాజుపట్ల భయభక్తులు చూపడం ఉచితం. రాజుకు ఉత్తమమైన సింహాసనం, వాహనములు, మంచి నివాసగృహం, రుచికరమైన ఆహారపదార్ధములు, ఆడంబరమైన వస్త్రములు, అంగరక్షకులను సమకూర్చడం అత్యవసరం. వాటిని సమకూర్చడం ప్రజలకర్తవ్యం " అని భీష్ముడు చెప్పాడు. భీష్ముడు ఇంకా " ధర్మజా! లోకంలో ధర్మములకు రాజు మూలము. రాజు లేని రాజ్యం నీరులేని సరస్సు వంటిది. రాజ్యపాలన లేకున్న సూర్యరశ్మి లేనట్లు ప్రజలు బాధను అనుభవిస్తారు. ప్రజలు రాజు లేకున్న తమతమ సంపదను ప్రశాంతంగా అనుభవించ లేరు. రాజు లేకున్న ప్రజలు భయాందోళనకు లోను ఔతారు. రాజు రక్షణలోనే ప్రజలు యజ్ఞయాగాదులు నిర్వహించగలరు. రాజు శత్రువులను జయించిన సంపదను తన్నాశ్రయించిన వారికి దానం ఇస్తాడు. రాజు చారచక్షుడిగా ప్రవర్తించినప్పుడు సూర్యుడిగా ప్రవర్తించాలి. దుర్మార్గులను శిక్షించునప్పుడు యముడిలా ప్రవర్తించాలి. అందు వలన ప్రజలు రాజును దైవంలా భావించి విరాట్, సామ్రాట్ అని పిలుస్తారు. ఇంద్రియ నిగ్రహం పాటించి రాజును సేవించిన వారిని రాజు సకల సందలతో సత్కరిస్తాడు. రాజుకు ప్రజలు శరీరం వంటి వారు. ప్రజలకు రాజు ఆత్మ వంటి వాడు. ప్రజలు రాజును పూజించాలి. రాజు ప్రజలను రక్షించాలి. పై విషయాలన్నీ బృహస్పతి వసుమనుడు అను రాజుకు చెప్పాడు. **వసుమనుడు** వాటిని పాలిస్తూ రాజ్య పాలన చేసాడు.

## రాజ్యపాలన

అప్పుడు ధర్మరాజు " పితామహా ! రాజు జనపద పాలనము, శత్రు సంహారం ఎలా చెయ్యాలో వివరించండి " అని అడిగాడు.

భీష్ముడు " ధర్మనందనా ! రాజైన వాడు ముందు తనను తాను గెలవాలి. తరువాత శత్రువును గెలవాలి. తనను తాను గెలువని వాడు శత్రువును ఎలా గెలువగలడు ? ధర్మనందనా ! తనను తాను గెలవడము అంటే తన లోని కామ, క్రోధ, మద, మాత్సర్యములను గెలుచి జితేంద్రుడు అగుట. అరిషడ్వర్గాలను గెలిచిన రాజు శత్రువులను సహితం గెలువ గలడు. రాజు తన రాజ్యంలోని సరిహద్దులను, రాజ్యములోని జనసంచార స్థలములను, దుర్గములను, అంతఃపురములను తగిన రక్షకభటులను నియమించి రక్షించాలి. రాజు చారచక్షువుగా ప్రవర్తించాలి. రాజ్యమంతా, శత్రురాజుల వద్ద, అంతఃపురంలో చారులను నియమించి ఎప్పటికప్పుడు విషయశేకరణ చేస్తుండాలి. రాజు తాను బలహీను డైనప్పుడు ఆ విషయం శత్రురాజులు పసికట్టక ముందే మరొక బలవంతుడైన మిత్ర రాజుతో సంధి చేసుకొన వలెను. శత్రు రాజుకు కప్పం కట్టి అయినా తన రాజ్యమును రక్షించుకో వలెను. శత్రు రాజు బలహీనుడైనప్పుడు అతడు మైమరచి ఉండగా అతడి మీద దాడి చేయాలి. విషప్రయోగం చేత కాని, అగ్ని ని ప్రయోగించి కాని అతడి రాజ్యాన్ని చిన్నాభిన్నం చేయాలి. అలా అని ఎవరితో తానుగా శత్రుత్వం వహించి కయ్యానికి కాలు దువ్వ కూడదు. ముందు మంచి మాటలు చెప్పి చూడాలి. తరువాత శత్రురాజులలో విబేధాలు కల్పించి లొంగదీసుకోవాలి. ఆఖరి అస్త్రంగా యుద్ధంచేయాలి. రాజు తన ప్రజలను కన్న తండ్రి వలె పాలించాలి. ప్రజల ఆదాయంలో ఆరవ వంతు మాత్రమే పన్నుగా స్వీకరించాలి. ఆదాయపు వనరులు సమృద్ధిగా లభించే ఆటవీ సంపద, గోవులూ, గనులు మొదలైన వాటిని సమర్ధులైన అధికారులను నియమించి అభివృద్ధి చేయాలి. తన రాజ్యంలో జరిగే అన్ని అభివృద్ధి పనులను రాజు ఒక కంటితో గమనిస్తూ ఉండి అభివృద్ధి సాధించాలి. రాజు తన కోటను ఎల్లప్పుడూ సంరక్షిస్తూ ఉండాలి. పశువులకు గడ్డి, గుర్రములకు దాణా, ప్రజలకు కావలసిన ఆహార పదార్ధాలు, నూనెలు, నెయ్యి, ఔషధములు, యంత్రములను ఎప్పుడూ సమృద్ధిగా ఉంచుకొనవలెను. మంచి నీటికి బావులను తవ్వించ వలెను. సమర్ధులైన వారిని సైన్యములో నియమించ వలెను. శత్రువు తన మీదకు దండెత్తి రావడం పసికట్టి వారు వచ్చు త్రోవలో వారికి వారి సైన్యముకు ఆహార పదార్ధములు, నీరు దొరకకుండా జాగరూకత వహించాలి. రాజ్యములో రాజును, మంత్రులను, జన పదములను, కోశాగారమును, దుర్గమును, మిత్రరాజులను జాగ్రత్తగా చూసుకోవాలి. రాజతంత్రమును సమర్ధవంతముగా నడపాలి. ధర్మము, అర్ధము, కామము అను పురుషార్ధములను పాటించాలి. సత్వ, తమో, రజస్సు గుణాలను సమపాళ్ళలో పాటించాలి. ప్రమాదవశాత్తు అర్ధము కామము బలహీనమైనా ధర్మము తప్పరాదని అంగీరసుడు, భరద్వాజుడు చెప్పారు. రాజైన వాడు ఇంద్రియములకు వశుడు కాక వాటిని జయించాలి. కామము చేత వశుడై వాటి చేత ప్రేరేరింపబడి జూదం, స్త్రీ సంభోగం, మద్యపానం, ధనమును విచ్చల విడిగా ఖర్చు చేయడం, ఇతరులను అనవసరంగా దండించడం, క్రోధితుడై దురుసుగా మాట్లాడడం మొదలైన గుణములను విడవాలి. వేదాధ్యనము, యజ్ఞములు, యాగములు, దాన ధర్మములు చేయాలి. తనకు తనకు హాని తలపెట్టే వారు చెప్పే కుటిలమైన మాటలను నమ్మ కూడదు. నీతిమంతులైన వారితో దైవచింతన కలిగి సుపరిపాలన సాగించాలి. దేవతలను, బ్రాహ్మణులను పూజించాలి. పితృదేవతలకు తర్పణములు క్రియలు చేయాలి. అశుభమును పారద్రోలి నిత్యం శుభమైన కార్యములు చేస్తూ రాజ్యపాలన చేయాలి. అటువంటి రాజు ఈ లోములోనే కాక పరలోకములో కూడా సిద్ధి పొందగలడు " అని భీష్ముడు చెప్పాడు.

## దండనీతి

తరువాత ధర్మరాజు " పితామహా ! రాజు దండనీతిని ఎలా అమలుచేయాలో తెలియచెయ్యండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! కృతయుగం నుండి రాజు దండనీతిని ధర్మమైన పద్ధతిలో అమలు చేస్తున్నాడు. రాజు దండనీతిని ధర్మబద్ధంగా ఆచరించడం వలన ధర్మనిరతి పెరుగుతుంది. మనం చేసే కర్మలు సత్ఫలితాలను ఇస్తాయి. ఋతువులు చక్కగా శుభం చేకూరుస్తాయి. ప్రజల జీవితకాలం పెరుగుతుంది. దున్నకుండానే భూమి ఫలసాయం అందిస్తుంది. తరువాత వచ్చిన త్రేతాయుగంలో ధర్మం క్షీణిస్తూ వచ్చి మూడు పాదాలతో నడుస్తుంది. ప్రజలు దానితోనే సంతృప్తి పడతారు. ఇక ద్వాపరయుగంలో రాజు ధర్మాన్ని రెండు పాదాలతో మాత్రమే నడుపుతాడు. ప్రజలు దానితో సంతృప్తి పడతారు. ఇక రాబోవు కలి యుగంలో రాజులో ధర్మాచరణ మీద శ్రద్ధ క్షీణిస్తుంది. ప్రజలలో అధర్మం పెరుగుతుంది. వర్ణాశ్రమధర్మాలు గతి తప్పుతాయి. ఇదంతా కాలగతిలో జరిగే మార్పులను అనుసరించి జరుగుతుంది కాని రాజైన వాడు రాజు ధర్మాన్ని కృతయుగంలో లాగా ఆచరించిన ధర్మంవర్ధిల్లి నాలుగు పాదములతో నడుస్తుంది. లేకున్న కాలగతిలో క్రమక్రమంగా క్షీణిస్తుంది. రాజు ప్రజలు చేసే తప్పులను జాగ్రత్తగా పరిశీలించాలి. ఎవరైనా తనను తాను పొగొడుతున్నాడంటే అతడికి మదము, అహంకారం, లోభము, దుర్మార్గం ఎక్కువగా ఉంటుందని తెలుసు కోవాలి. అవి లేని వాడు తనను తాను పొగుడుకొనడు. సజ్జనుడైన రాజు నియమ నిబద్ధంగా జీవిస్తాడు. అతడికి పరాక్రమం ఉంటుంది కాని గర్వం ఉండదు. అతడు పరస్త్రీని కోరడు, కోపించడు, సామంతులను ధనం కొరకు వేధించడు. రాజుకు వేదవేదాంగ పారతుడైన పురోహితుడు అవసరం. పురోహితుడు ఎప్పుడూ పురంలో ఉంటూ పురం క్షేమం కోరుతూ రాజును సక్రమ మార్గంలో నడిపించాలి. సామంత రాజుల నుండి కప్పం, కానుకలు స్వీకరించే పనిని రాజు దయ, కరుణ, చతురత కలిగిన మంత్రులకు అప్పగించాలి. రాజు పన్నుల కొరకు ప్రజలను పీడించడం ఆవు పొదుగును కోయడంతో సమానం. తోటమాలి చెట్ల నుండి పండ్లు కోసినంత సున్నితంగా రాజు ప్రజల నుండి పన్నులను వసూలు చేయాలి. ముందు ప్రజలకు అవసరమైన సౌకర్యములు, రక్షణ కల్పించిన తరువాత ప్రజల నుండి పన్నులు గ్రహించాలి. అది రాజుకు ముఖ్యమైన బాధ్యత. ఎన్ని యజ్ఞ, యాగములు దానితో సరి తూగవు.

## బ్రాహ్మణ క్షత్రియులు

తిరిగి భీష్ముడు " ధర్మనందనా ! ఇలాదేవికి **పురూరవుడు** అనే కుమారుడు ఉన్నాడు. అతడు ఈ భూమినంతా పాలించాడు. అతడు ఒక నాడు వాయువును " భూమి బ్రాహ్మణ, క్షత్రియులలో ఎవరి సంపదగా విరాజిల్లుతుంది " అని అడిగాడు. **వాయుదేవుడు** " బ్రహ్మముఖం నుండి బ్రాహ్మణులు, బాహువుల నుండి క్షత్రియులు, తొడల నుండి వైశ్యులు, పాదముల నుండి శూద్రులు జన్మించారు. ఉత్కృష్టమైన ముఖం నుండి జన్మించిన బ్రాహ్మణుడు ఈ భూమి మీద ఉన్న సకలసంపదలను అనుభవించుటకు వాటిని దానం చేయుటకు అర్హుడు. దండనీతిని అమలుచేయుటకు క్షత్రియుడిని, సహజంగా శాంతి కాముకుడైన బ్రాహ్మణుడిని అతడి పురోహితుడిగా నియమించాడు. అటువంటి పురోహితుడికి సకల సంపదలను సమకూర్చి అతడి అడుగు జాడలలో రాజ్యపాలన చేయు రాజు ఈ లోకంలో పరలోకంలో సుఖసంతోషాలు పొందగలడు. ప్రజల యొక్క భయమును పోగొట్టి రక్షించడమే రాజు యొక్క పరమధర్మం " అని వాయుదేవుడు పురూరవునికి చెప్పాడు " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## బ్రాహ్మణ ధర్మం

తరువాత భీష్ముడు " ధర్మనందనా ! పూర్వం శుక్రాచార్యుడు పురోహితుడికి చెప్పిన మాటలు నేను నీకు చెప్తాను. రాజు పురోహితుడి ఆధ్వర్యంతో యజ్ఞ, యాగాదులు చేసి దేవతలను, గరుడ, గంధర్వ, విద్యార్ధులను తృప్తిపరచవలెను. పురోహితుడు లేని రాజ్యాన్ని రాక్షసులు, పిశాచాలు పీడిస్తాయి. రాజుకు అను దినము కలిగే అశుభములను పురోహితుడు శాంతి హోమములతో రక్షించి శత్రు రాజులను పురోహితుడు మంత్ర తంత్రములతో నాశనం చేస్తారు. కనుక ధర్మనందనా ! నీవు ఉత్తముడైన పురోహితుడిని నియమించి రాజ్యపాలన చెయ్యి " అన్నాడు భీష్ముడు. కాని పరిశుద్ధుడు కాని పురోహితుడు రాజుకు హాని కలిగించి తానూ నాశనం ఔతాడు. కనుక రాజు బుద్ధిమంతుడు, ఆరోగ్యవంతుడు, గుణవంతుడు, బుద్ధిమంతుడు అయిన బ్రాహ్మణుడిని నియమించుకోవాలి. సకల కార్యములలో రాజు, పురో హితుడు ఒకే మాట మీద నిలిచి ఆ కార్యమును నిర్వర్తించాలి. ధర్మనందనా ! దీని గురించి ఒక ఇతిహాసం చెప్తాను విను. బ్రాహ్మణుడికి క్షత్రియుడికి ఉన్న సంబంధం గురించి కశ్యప ప్రజాపతి ఇలుడికి ఇలా చెప్పాడు. క్షత్రియుడు బ్రాహ్మణుడి నుండి పుట్టాడు. బ్రాహ్మణుడు క్షత్రియుడి వలన నియమించ బడతాడు. కనుక బ్రాహ్మణుడు, క్షత్రియుడు ఒకరి మీద ఒకరు ఆధార పడి జీవిస్తారు. రాజు పురోహితుడు ఒకరిని ఒకరు గౌరవించుకుంటే ప్రజలు వారిని గౌరవిస్తారు. అధర్మం ప్రజ్వరిల్లుతుంది. రాజు పురోహితుల మధ్య సఖ్యత లేకున్న **రుద్రుడు** ఆగ్రహిస్తాడు. రుద్రుడు ఆగ్రహిస్తే ప్రపంచం సర్వనాశనం ఔతుంది.

### ముచికుందుడు

భీష్ముడు ఇంకా ఇలా చెప్పాడు " కుబేరుడు పురోహితుడు ఎలా ఉండాలన్న విషయం **ముచికుందుడు** తో ఇలా చెప్పాడు. పూర్వకాలంలో ముచికుందుడు అనేరాజు రాజ్య కాంక్షతో కుబేరుడి మీద దండెత్తాడు. కుబేరుడు తన సైన్యమును పంపి ముచికుందుడిని ఓడించాడు. ముచికుందునికి కోపం వచ్చి తన ఓటమికి కారణం పురోహితుడని అనుకుని అతడిని నిందించాడు. ముచికుందుడి పురోహితుడు ముచికుందుడి చేత హోమములు, పూజలు, తపస్సు చేయించి తన మంత్రశక్తితో ముచికుందుడి సైన్యాలకు బలపరాక్రమాలను చేకూర్చాడు. ముచికుందుడు తిరిగి తన సైన్యముతో కుబేరుడి మీదకు దండెత్తాడు. అప్పుడు కుబేరుడు ముచికుందుడితో " నీవు నీ పురోహితుడి మంత్రశక్తితో, తపో బలంతో నా మీద యుద్ధానికి వచ్చావు కాని నీ స్వశక్తితో రాలేదు " అని అవహేళన చేసాడు. అప్పుడు ముచికుందుడు కుబేరునితో " బ్రాహ్మణుడు, క్షత్రియుడు వేరు వేరు కాదు. ఒకరి మీద ఒకరు ఆధారపడి ఉంటారు అని " ఆ బ్రహ్మ అనుగ్రహించాడు. మారు మాటాడక నాతో యుద్ధానికి రా " అన్నాడు. కుబేరుడు " నీతో నేను యుద్ధం చేయను. నీకు కావలసింది నా రాజ్యమే కదా ! దానిని తీసుకో " అన్నాడు. ముచికుందుడు " నీ దయాబిక్షతో వచ్చే రాజ్యం నాకు వద్దు. నిన్ను జయించి నీ రాజ్యం తీసుకుంటాను " అన్నాడు. ముచికుందుడి పరాక్రమానికి సంతోషించిన కుబేరుడు " నేను ఓడాను " అని అంగీకరించాడు. ముచికుందుడు సంతోషించి ఈ సమస్త భూమండలాన్ని అనేక సంవత్సరాలు పాలించాడు. కనుక ధర్మనందనా ! నీవు ఎల్లప్పుడూ ఈ ప్రజలకు అభయ హస్తమిచ్చి, రక్షించి ఈ భూమిని పాలించుటయే రాజధర్మం " అని భీష్ముడు చెప్పాడు.

## బ్రాహ్మలను దండించే విధానం

ధర్మరాజుభీష్ముడితో " పితామహా ! బ్రాహ్మణులు మొదలైన వారు తమ తమ వృత్తి ధర్మములు కుల ధర్మములు విడిచి ప్రవర్తించిన ఏమి చేయవలెను. వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఆపదలు సంభవించిన సమయంలో

ఏ కులము వారైనా తమ తమ కుల ధర్మములను విడిచి ప్రవర్తించిన వారికి ఏ పాపం అంటదు. కాని క్షత్రియుడు పట్టవలసిన కత్తి బ్రాహ్మణుడు పడితే అతడు తన బ్రాహ్మణత్వం కోల్పోయి క్షత్రియుడౌతాడు. అలాగే బ్రాహ్మణుడు తన కులధర్మం వదిలి వైశ్యధర్మమైన వ్యాపారం చేపడితే అతడు వైశ్యుడు ఔతాడు. అలాగే బ్రాహ్మణుడు ధనార్జన నిమిత్తం ఒకరికి ఊడిగం చేసిన అతడు శూద్రుడు ఔతాడు. ఇలాగే తక్కిన వారు కూడా వారి ధర్మం వీడి పరధర్మం ఆచరించిన కులహీనులు ఔతారు. అటువంటి వారు మరలా తమతమ కర్మలను ఆచరించుటకు అర్హులు కారు. రాజు ఈ విషయములు అన్ని తెలుసుకుని ఎవరూ తమ ధర్మం తప్పకుండా చూడాలి. ప్రజలు సంపాదించుకున్న పుణ్యములో కాని పాపములో కాని నాలుగవ వంతు రాజుకు చేరుతుంది. కనుక వర్ణాశ్రమ ధర్మములు తప్పి చరించిన పాపములో నాల్గవవంతు రాజుకు చేరుతుంది కనుక రాజు అనుభవించాలి " అన్నాడు.

## ధర్మరాజు సందేహ నివృత్తి

ధర్మరాజు " పితామహా ! నాకు రాజ్యము చేపట్టాలని కాని రాజ్యసుఖములు అనుభవించాలని కాని లేదు. కాని నేను రాజ్య పాలన చేపట్టి ధర్మరక్షణ, ప్రజారక్షణ నిర్వర్తించగలనా ! అని సందేహం కలుగుతుంది. ఈ రాజ్యం పాప భూయిష్టం. పైగా ప్రజల మీద దండనీతి ప్రయోగించి వారి ఆగ్రహానికి గురి కావాలి. అందుకని ఈ రాజ్యభారం నాకు అక్కరలేదు. మరలా అడవులకు వెడతాను " అన్నాడు. భీష్ముడు నవ్వి " ధర్మనందనా ! క్షత్రియుడవైన నీవు వైరాగ్యం కోరుకునుట రాజధర్మం కాదు. నీ మనసు చాలాసున్నితం. ఇది క్షత్రియలక్షణం కాదు. నీకు బుద్ధిమతి చెప్పటకు నీ తండ్రి పాండురాజు కాని నీ తాత విచిత్రవీర్యుడు కాని, నీ ముత్తాత శంతనమహారాజు లేడు కనుక నామాట విను. ఈ సందర్భంలో నీకు ఒక ఇతిహాసం చెప్తాను విను. పూర్వము **కేకయరాజు** వేదాధ్యనం కొరకు అడవులకు వెళ్ళాడు. అక్కడ అతడిని ఒక రాక్షసుడు పట్టుకున్నాడు. కేకయరాజుకు ఆ రాక్షసుడిని ఎదిరించే బలం లేదు. కేకయరాజు రాక్షసుడితో " ఓ దానవేంద్రా ! నా రాజ్యంలో దొంగతనం లేదు, అక్రమ సంబంధాలు లేవు. నా రాజ్యంలో బ్రాహ్మణులు వేదాధ్యయనం, యజ్ఞయాగములు నిరంతరం చేస్తుంటారు. రాజులు బ్రాహ్మణులను ఆరాధిస్తుంటారు. జనయాగాదులు చేస్తున్నారు. వైశ్యులు గోరక్షణ వ్యాపారం చేస్తూ తమ విధులు నిర్వర్తిస్తున్నారు. పై మూడు జాతులను సేవిస్తూ శూద్రులు జీవనం సాగిస్తున్నారు. ఈ రాజ్యాంలో నాలుగు వర్ణాలు తమధర్మం చక్కగా పాటిస్తున్నారు. నేను నా ప్రజలు ఏం పాపం చేస్తున్నామని నన్ను ఇలా నిర్బంధిస్తున్నావు " అని నిలదీసాడు. కేకయరాజు మాటలకు ఆ రాక్షసుడు సంతోషపడి రాజును ప్రశంశించి విడిచి పెట్టాడు. కనుక ధర్మరాజా ! కేకయ రాజు లాగా రాజు ధర్మం తప్పక రాజ్యపాలన చేసిన అతడికి ఏ పాపం అంటదు " అన్నాడు.

## బ్రాహ్మణ వృత్తి

ధర్మరాజు భీష్ముడిని " పితామహా ! రాజాశ్రయం దొరకని బ్రాహ్మణుడు కష్టకాలంలో ఎలా జీవించాలి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మజా ! బ్రాహ్మణుడు తన వృత్తి ధర్మంలో జీవించడం దుర్భరం అయినప్పుడు ఆపద్ధర్మంగా వైశ్య వృత్తిని స్వీకరించ వచ్చు. కాని ఎక్కువ ధనాశతో ఉప్పు, నువ్వులు, మాంసం, ఆవు, ఎద్దు, అన్నము, నెయ్యి, మద్యము, నూనెలు మొదలైన వ్యాపారాలు చేయరాదు " అని చెప్పాడు. " పితామహా ! యజ్ఞములు ఏ విధంగా ఆచరించాలి " అని ఆడిగాడు. ధర్మనందనా ! యజ్ఞములు శ్రద్ధ ముఖ్యము, మిధ్యాచారంగా యజ్ఞములు చేయకూడదు. వేదములను అపహాస్యం చేయ కూడదు. యజ్ఞ యాగాదులలో బ్రాహ్మణులకు దక్షిణలు సమర్పించి తృప్తిపరచ వలెను. యజ్ఞయాగాదుల కంటే తపస్సు అధికమైనది. తపస్సు వలన ప్రసన్నత, అహింస, సత్యం పలకడం, దయ కలిగి ఉండడం, ఇంద్రియ నిగ్రహం కలిగి ఉండడం అలవడుతుంది . ధర్మరాజు " పితామహా ! రాజు ఎలాంటి స్నేహితులను నమ్మాలి ? నమ్మకమైన స్నేహితులు లేని రాజు రాజ ధర్మమును నెరవేర్చ లేడు కదా ! అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! రాజు ఎవరినీ అతిగా నమ్మ కూడదు. అలాగని ఎవరినీ నమ్మకుండా నమ్మకుండా ఉండ కూడదు. నమ్మీ నమ్మనట్లు ఉండి కార్యం సాధించాలి. రాజుకు ఎల్లప్పుడూ మేలు చేసే వాడే నిజమైన స్నేహితుడు. అతడి స్నేహం వలన రాజుకు సమస్త శుభములు సమకూరుతాయి. ఎప్పుడూ అప్రమత్తుడై ఉండే మిత్రుడి వలన తలచిన కార్యం సఫలం ఔతుంది, పాపచింతన లేక సుఖదు:ఖములు సమంగా ఎంచి కృషి చేసే స్నేహితుడిని రాజు సముచితంగా గౌరవించాలి. అటువంటి మిత్రుడిని మంత్రిగా చేసుకొనిన అతడు కామ, క్రోధ, మోహ వశుడు కాక తన విద్యుక్త ధర్మములు చక్కగా నెరవేర్చ గలడు. రాజుకు అన్నదమ్ములు అవసరం ఎంతో ఉంది. వారు మంచి వారు కాకున్నా రాజు వారిని గౌరవించాలి. బంధు మిత్రులు అన్నదమ్ముల వలన రాజుకు బలం పెరుగుతుంది. అటువంటి రాజు వైపు శత్రువులు కన్నెత్తి కూడా చూడ లేరు. అంగ బలం లేని రాజును శత్రువులు చులకన చేస్తారు. బంధు మిత్రులతో, అన్నదమ్ములతో బేధాభిప్రాయాలు ఉన్నా రాజు వాటిని బయటకు చూపక గంభీరంగా ఉండి అందరితో కలిసి ఉండడం రాజుకు క్షేమకరం. కొంత మంది రాజును పైపైన పొగడుతూ లోపల అతడికి వ్యతిరేకంగా నడుచు కుంటారు. అటువంటి వారు రాజుకు ఎటువంటి హాని అయినా తలపెట్టగలరు. అటువంటి వారిని గుర్తించి రాజు వారిని నాశనం చేయుట క్షేమకరం " అన్నాడు.

## రాజు ధనార్జన


రాజా క్షేమదర్శితో కాలకవృక్షీయుడు

ధర్మరాజు " పితామహా ! రాజు ధనార్జన ఎలా చేయాలో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! రాజుకు ధనార్జన చేయు వ్యక్తి ఎంతో అవసరం. అలాంటి వ్యక్తిని ప్రజలు సహించరు కనుక అతడిని రక్షించవలసిన బాధ్యత రాజుది.దీనికి ఉదాహరణగా ఒక ఇతిహాసం చెప్తాను విను. పూర్వం **కాలకవృక్షీయుడు** అనే ముని ఉండే వాడు. ఆ ముని ఒక కాకిని ఒక పాంజరంలో పెట్టి అది త్రికాల వేది అని అందరికీ చెప్పే వాడు. ఆ కాకిని తీసుకుని ఆ ముని కోసల దేశాధీశుడైన **క్షేమదర్శి** వద్దకు వెళ్ళి " మహారాజా ! నీవు ధనార్జన పట్ల ఏమరుపాటుగా ఉన్నావు. అందు వలన నీకు ఆపద రానున్నది. ఈ కాకి నీ రాజ్యంలోని దొంగలను పట్టి ఇస్తుంది " అని చెప్పాడు. రాజు అతడిని సాదరంగా ఆదరించి తన మందిరంలో విడిది చేయించాడు. ఆ రోజు కొందరు రాజోద్యోగులు ఆ కాకిని పట్టుకుని చంపేసారు. మరునాడు కాలకవృక్షీయుడు ఆ విషయం రాజుకు చెపుతూ " రాజా నా పేరు కాలకవృక్షీయుడు. నేను నీ తండ్రికి మంచి మిత్రుడను. మీ తండ్రి గారు మరణించిన తరువాత ఈ రాజ్యంలోఉండ లేక తపసు చేయడానికి అరణ్యాలకు వెళ్ళాను. నీ తండ్రి గారి తరువాత నీవు రాజువు అయ్యావు. నీ పాలన ఎలా ఉందో తెలుసుకోవడానికి నీ రాజ్యం అంతా తిరిగాను. నీ రాజ్యం సుభిక్షంగా ఉన్నప్పటికీ కొందరి అధముల కుయుక్తి కారణంగా నీ రాజ్యం ఆపదలో ఉందని తెలుసు కున్నాను. ఆ విషయం నీకు చెప్పడానికి వచ్చాను. నాతో తీసుకు వచ్చిన కాకి సాధారణమైనది. దానికి ఎలాంటి మహిమలు లేవు. కాని మహిమలు ఉన్నట్లు అందరిని నమ్మిఆంచాను. అది నిజం బయట పెడుతుందన్న భయంతో దానిని ఆ దుర్మార్గులు చంపారు. కనుక అంతఃపురంలోనే అన్యాయం జరుగుతుంని అర్ధం ఔతుంది. ముందు నన్ను నమ్మినట్లు నటించి నన్ను వెళ్ళగొట్టు. తరువాత ఆ దుర్మార్గులను నేర్పుగా కనిపెట్టి వారిలో వారికి విరోధములు కల్పించి వారిని శిక్షించు. ఆ రాజు అతడి మాట ప్రకారం దుర్మార్గులను శిక్షించి సుఖంగా రాజ్యపాలన చేసాడు. కనుక మిత్రుడు అలా ఉండాలి " అని చెప్పాడు.

## మంత్రి

ధర్మరాజు " పితామహా ! మంత్రి ఎలా ఉండాలి ? " అని భీష్ముడిని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! మంత్రి అనే వాడు జ్ఞానవంతుడై ఉండాలి. పుర జనులకు బంధువుగా మెలిగే వాడుగా ఉండాలి. కార్యశూరుడై ఉండాలి. ధైర్యవంతుడు, శౌర్యవంతుడై ఉండాలి. క్రూరత్వం లేకుండా పరిశుద్ధమైన మనసుకలవాడై ఉండాలి. రాజు పట్ల భక్తి శ్రద్ధలు, అనురాగమూ కలిగి ఉండాలి. సుఖము, దుఃఖంలను సమానంగా చూసేవాడై ఉండాలి. తన చెమటను నెత్తురుగా భావించి పని చేయాలి. ఏ సందర్భంలోనైనా రాజు తన మీద నేరం మోపి , ఆగ్రహించి తిట్టినా కోపించక రాజుతో సంబంధ బాంధవ్యాలను చెడనీయక నిజానిజాలు రాజుకు ఎరుకపరిచే ప్రయత్నం చేయాలి. తనలోని లోపములు కప్పి పుచ్చుకుంటూ ఇతరుల లోపాలను కనిపెట్టి తగురీతిన ప్రవర్తించాలి. పైలక్షణాలు కలవాడే మంత్రిగా ఉండడానికి అర్హుడు. రాజు కూడా మంత్రులను ఆదరించి మృదుమధురమైన వాక్కులతో, చిరునవ్వుతో సంతోషం కలిగించాలి. కేవలం దానధర్మం చేసినందు వలన, ప్రియంగా మాట్లాడినందువలన మాత్రమే ప్రజలకు సంతోషం కలుగదు. రాజు ఎదుటి వారి మనసెరిగి పొందికగా మాట్లాడి వారిని నొప్పించక ప్రవర్తించాలి.

## పాపపరిహారం

ధర్మరాజు భీష్మునితో " పితామహా ! ప్రజలమధ్య వివాదములు పరిష్కరించే సమయంలో రాజుకు పాపం అంట కుండా ఉండే విధం చెప్పండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! రాజుకు తీర్పు చెప్పే సమయంలో స్వచ్ఛత, నిజాయితీ, నిష్పక్షపాతం ఎంతో అవసరం. ఆ తీర్పులు ధర్మబద్ధమై ఉండాలి. తీర్పులు చెప్పేసమయంలో నిత్య సత్యవ్రతులైన బ్రాహ్మణుల సహాయం తీసుకోవాలి. ఇరు పక్షముల వాదనలు శ్రద్ధగా ఓపికగా విని న్యాబద్ధమైన, ధర్మబద్ధమైన తీర్పును చెప్పాలి. ధనవంతులకు ఒక మాదిరి పేద వారికి ఒక మాదిరి తీర్పులు చెప్పకూడదు. నేరముకు తగిన శిక్షలు విధించాలి. రాజులు తీర్పులు చెప్పటంలో పక్షపాతం వహించిన ప్రజలు వివాదములు రాజు దృష్టికి తీసుకు రావాలి. ఉరి శిక్ష విధించడం, నేరస్తుల

ఆస్తులు జప్తు చేయడం, కారాగారంలో బంధించడం వంటి శిక్షలు విధించే సమయంలో న్యాయబద్ధంగా వ్యవహరించాలి. ఇతర రాజుల వద్ద నుండి దూతలు వచ్చిన సమయంలో వారు తమ రాజులు పంపిన వర్తమానం ఉన్నది ఉన్నట్లు చెప్పినప్పుడు రాజు దూతమీద ఆగ్రహించ కూడదు. దూతను చంపుట మహా పాపం, నరకం సంప్రాప్తమౌతుంది. ఇక దూతకు ఉండ వలసిన లక్షణములు చెప్తాను విను. దూత ఉత్తమ కులజుడై ఉండాలి. మంచి శీలవంతుడై ఉండాలి. చెప్పదలచిన సందేశం లౌక్యంగా, నేర్పుతో కార్యం సిద్ధించేలా పొందికగా చెప్పాలి. దూతకు కార్యదక్షత సమయస్ఫూర్తి ఉండాలి. ఇక సైన్యాధ్యక్షుడికి కావలసిన లక్షణాలు విను. సైన్యాధ్యక్షుడికి దుర్భేధ్యమైన వ్యూహములు పన్నే నేర్పు ఉండాలి. యుద్ధముకు కావలసిన యంత్రముల తయారీలో నేర్పు, ఆయుధప్రయోగంలో నేర్పు, యుద్ధంచేయుటలో నేర్పు ఉండాలి. రాజు ఎవరినీ అతిగా నమ్మ కూడదు. తన కుమారులనైనా అతిగా నమ్మితే తన సర్వస్వం కోల్పోయే ప్రమాదం ఉంది. రాజు అందరినీ నమ్మినట్లే నటించాలి కాని ఎవరినీ నమ్మ కూడదు. అదియే రాజధర్మం " అని చెప్పాడు.

## రాజధాని

ధర్మరాజు భీష్ముడితో " పితామహా ! రాజధాని ఎలా ఉండాలి? ఎలా ఉంటే బాగా ఉంటుంది ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మరాజా ! కోటచుట్టూ లోతైన కందకం ఉండాలి. విశాలమైన వీధులు, రెండు వైపులా గృహములు, దుకాణములు ఉండాలి. దుకాణాలలో సమస్త వస్తువులూ లభించాలి. రాజధానిలో సమస్త ధాన్యములు, ఆహారపదార్ధములు సమృద్ధిగా ఉండాలి. నెయ్యి, అన్ని రకాల నూనెలు, ద్రవ్యములు నిలువ ఉంచాలి. పురరక్షణకు ఆయుధాగారములు, అందు సకలవిధ ఆయుధసామాగ్రి, యంత్రములు, రణవిశారదులైన యోధులు ఉండాలి. ప్రజ్ఞావంతులైన పండితులు, విలాసినులు, పరిచారికలు, పరిజనం ఉండాలి. అలాంటి పురంలో ఉన్న ప్రజలకు వారి ఆస్తులకు, రత్నములకు, బంగారముకు, పదార్ధములకు, బంధుమిత్రులకు రక్షణ కల్పించడం రాజుబాధ్యత. రాజు తన రాజ్యంలోని ముఖ్యపట్టణాలలో విశ్వాసవంతులైన ఉన్నతోద్యోగులను, న్యాయాధికారులను మంచి జీతములు ఇచ్చి నియమించి వర్ణాశ్రమ ధర్మాలకు విఘాతం కలుగకుండా రాజ్యపాలన సాగించాలి. రాజు తన రాజ్యములో చోరభయం, దుండగులభయం, జారుల భయం లేకుండా ప్రజలను పాలించ వలెను. రాజు తన రాజ్యంలో పశుసంపదను వృద్ధి చేయాలి. వాణిజ్యం, పశుసంపద, వ్యవసాయం వృద్ధి పొందునట్లు తగిన చర్యలు తీసుకోవాలి. రాజు తన రాజ్యంలో పన్నులు న్యాయబద్ధంగా, ధర్మబద్ధంగా వసూలు చేయాలి. అధికంగా వసూలు చేస్తే దూడకు పాలు వదలకుండా పాలు మొత్తంగా పితికి దూడ మరణానికి కారకులైనట్లు ఔతుంది. కనుక , వ్యాపారషుల మీద, రైతుల మీద, సామంతరాజుల మీద సముచిత పన్నులు విధించి ధానాగారం నింపాలి. ధర్మనందనా ! ధనాగారం నింపడానికి రాజు ధర్మమార్గం అనుసరించాలి. కపటోపాయంతో అధికంగా రాజు ధనం సేకరించడం మంచిది కాదు. ఆ ధనమును అర్హులైన వారికి దానం చేసినప్పుడే ధనసంపాదనకు సార్ధకత లభిస్తుంది. ధర్మనందనా ! పైన చెప్పినట్లు నడుచుకుంటే ప్రజలు సుఖిస్తారు, ధనాగారం నిండుగా ఉంటుంది. యుద్ధంలో శత్రుసంహారం చెయ్యి. శాంతిగా ఉన్నప్పుడు యజ్ఞ యాగాదులు చెయ్యి.

## మాంధాత

ధర్మనందనా ! ఈ సందర్భంలో నీకు మాంధాతకు **ఉతథ్యుడు** చెప్పిన మాటలు చెప్తాను " రాజు ధర్మరక్షణకే జన్మించాడు కనుక రోషం, క్రోధం, కామము వదిలి ధర్మనిరతుడు కావాలి. ఎందుకంటే ధర్మము వలన ప్రజలు వృద్ధి చెందుతారు. ధర్మం బ్రాహ్మణుల నుండి జనించింది కనుక రాజు బ్రాహ్మణులను గౌరవించి ఆదరించాలి. సంపదకలుగగానే అహంకారం వస్తుంది. దేవతలైనా మునీశ్వరులైనా అహంకారంతో నశిస్తారు. కనుక రాజు అహంకారి, పరస్త్రీ కాముకుడు కాకూడదు. ధర్మం తప్పిన రాజ్యంలో వర్షాలు కురవవు. వ్యాధులు వ్యాప్తి చెందుతాయి. రాజు పరాక్రమం నశిస్తుంది. రాజును బంధుమిత్రులు వదిలి వేస్తారు. ప్రజలు దీనత్వం పొందుతారు. శత్రువులు దండెత్తుతారు. కనుక రాజు ధర్మవర్తనుడైన బంధుమిత్రులతో సుఖిస్తాడు. ప్రజలను రక్షిస్తాడు " అని చెప్పాడు " అని భీష్ముడు చెప్పాడు.

## రాజు వృద్ధి చెందుట

ధర్మరాజు " పితామహా ! రాజు ధర్మమార్గంలో ఎలా వృద్ధి చెందగలడు. భీష్ముడు "ధర్మనందనా ! పూర్వం కోసలాధీశుడు **వసుమనుడు** అనే రాజుకు **వామదేవుడు** అనే ముని ఇలా చెప్పాడు " రాజుకు ధనసంపాదన కంటే ధర్మనిరతి ఎంతో ముఖ్యం. దాని వలన, శాశ్వతకీర్తి సకల సిద్ధులు లభిస్తాయి. ధనసంపాదనకు అధర్మంగా ప్రవర్తిస్తే ఆ సంపాదన నిలువదు. అంతే కాక అతడికి అపకీర్తి, నరకము ప్రాప్తిస్తాయి. రాజుకు అత్యధిక సంపాదన కావాలంటే ఇంకా ఇంకా ధర్మనిరతి కావాలి. రాజు తన సైన్యమును ఎప్పుడూ సంతృప్తి పరచాలి. శత్రువులు దండెత్తినప్పుడు అది ఎంతో సహకరిస్తుంది. రాజుకు ఎప్పుడూ

పరాయి దేశముల మీదకు దండెత్తి వారి సంపదలను హరించాలన్న కోరిక ఉండకూడదు. రాజు ఇరుగు పొరుగు రాజులతో సఖ్యతగా ఉండి తన రాజ్యమును వీలైనంత శత్రురహితం చెయ్యాలి. శత్రురాజులు దండెత్తినా సాధ్యమైనంత వరకూ ఉపాయంతో పరిష్కరించాలి కాని యుద్ధానికి పాలడరాదు. తన సైన్యంలో అంతఃకలహాలు చెలరేగినప్పుడు వారితో యుద్ధముకు దిగక సంధి కొరకు ప్రయత్నించాలి. సామ, దాన, బేధ, దండోపాయాలతో ప్రయత్నించి విఫలమైన శుక్రనీతిని ప్రదర్శించాలి. అంటే ముల్లును ముల్లుతోటే తీయాలి అన్నట్లు శత్రువును ఉపేక్షించాలి " అన్నాడు.

## యుద్ధనీతి

ధర్మరాజు " పితామహా ! యుద్ధ సమయంలో అనుసరించ వలసిన నీతి ఏమిటి? " అని భీష్ముడిని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! యుద్ధంలో సమాన నీతిని శత్రువు పట్ల ప్రదర్శించాలి. శత్రువు చతురంగబలంతో వస్తే రాజు చతురంగబలంతో యుద్ధం చేయాలి. శత్రువు ఒంటరిగా వస్తే ఒంటరిగా పోరాడాలి. శత్రువు మాయోపాయాలు, కపటోపాయాలు ఉపయోగిస్తే నీవూ అదే ఉపాయాలు ప్రయోగించాలి. వెను తిరిగి పోతున్న వారిని , ప్రమాదంలో ఉన్న వారిని, కత్తి, ధనస్సు విరిగిన వారిని, గుర్రము మీద నుండి పడిన వారిని, మరొకరితో యుద్ధం చేస్తున్న వారిని, శరణుజొచ్చిన వారిని చంపరాదు. శత్రువును అధర్మ మార్గంలో చంపడం కంటే ధర్మమార్గంలో మరణించడం మేలు. రాజెప్పుడు పడక మీద చావడం కంటే యుద్ధంలోచావడమే ఉత్తమం. విషపూరిత ఆయుధమును ప్రయోగించిన వాడు నరకానికి పోతాడు. శత్రువు మీదకు దండెత్తి అతడి పట్టణం ముట్టడించి, ప్రజలను హింసించడం మహాపాపం. రాజుకు అంతటి కాఠిన్యం తగదు. బ్రాహ్మణుల ఇళ్ళను దేవాలయాలను దోచుకోకూడదు " అని చెప్పాడు.

### పరిహారం

ధర్మరాజు "పితామహా ! అందుకే రాజధర్మం కంటే మహాపాపం మరొకటి లేదు కదా ! ఎలాగైనా రాజుకు అధోగతి తప్పదు కదా ! " అన్నాడు. భీష్ముడు " ధర్మనందనా ! నీవు చెప్పినది నిజమే అయినా ఇందుకు పరిహారం ఉంది. తనను శరణుజొచ్చిన వారిని రక్షించి ఆదరించడం, యుద్ధంలో గాయపడిన వారికి చికిత్స చేయించడం. మరణించిన వారి కుటుంబాలను ఆర్థికంగా ఆదుకోవడం, బ్రాహ్మణులను ఆదరించడం, యజ్ఞయాగాదులు చెయ్యడం వంటి కార్యములతో పరిహారం చేసుకోవచ్చు. రాజు ధర్మపాలన చేస్తే ఉత్తమ గతులుప్రాప్తిస్తాయి " అని చెప్పాడు.

## వీరులకు ఉత్తమ లోక ప్రాప్తి



తన సైనికులతో స్వర్గనరకములు గురించి చెప్పుచున్న జనకుడు

ధర్మరాజు " పితామహా యుద్ధంలో వీర మరణం చెందిన వారికి ఎలాంటి లోకములు ప్రాప్తిస్తాయి ? " అని అడిగాడు. భీష్ముడు అంబరీష ఇంద్రుల మధ్య ఈ విషయంలో జరిగిన సంవాదం వినిపించాడు " ధర్మనందనా ! పూర్వం అంబరీషుడు అనే మహారాజు ఎన్నో యజ్ఞ యాగాదులు చేసి పుణ్యం సంపాదించి మరణానంతరం స్వర్గలోకం వెళ్ళాడు. స్వర్గలోకంలో తన దగ్గర పరిచారకుడు **సుదేవుడు** ఉజ్వలమైన విమానం ఎక్కి తిరగడం చూసి దేవేంద్రుడిని చూసి " దేవేంద్రా ! నా దగ్గర పరిచారకుడు ఎటు వంటి యజ్ఞయాగములు చెయ్యకనే ఎలా నా కంటే అధికంగా స్వర్గసుఖములు అనుభవిస్తున్నాడు " అని అడిగాడు. ఇంద్రుడు " సుదేవుడిని గురించి ఇలా చెప్పాడు " పూర్వం **శృతశృంగుడు** అనే రాక్షసునికి **సదముడు, వదముడు, దముడు** అనే ముగ్గురు కుమారులు ఉన్నారు. వారు నీ మీద దండెత్తినప్పుడు నీవు సుదేవుడిని వారితో యుద్ధం చెయ్యడానికి పంపుతూ " వస్తే విజయంతో రా లేకుంటే ప్రాణంతో తిరిగి రాకు " అని చెప్పావు. వారి గురించి చారుల వలన తెలుసుకున్న సుదేవుడు వారి మాయోపాయములను గురించి తెలుసుకుని వారిని జయించడం సాధ్యం కాని పని అని తలచి సైన్యమును వెనుకకు పంపి శివుని స్మరించి తన తలను శివుడికి అర్పించడానికి ఉద్యుక్తుడై కత్తి పైకెత్తాడు. అప్పుడు శివుడు ప్రత్యక్షమై " మహావీరా! నీ వంటి వాడికి ఇది తగదు. ఎందుకిలా చేస్తున్నావు " అని అడిగాడు. సుదేవుడు " శంకరా ! శత్రువు బలం ముందు నా పరాక్రమం పనికిరాదని తెలుసుకుని జననష్టం కావడం ఇష్ట పడక ఇలా చేసాను " అన్నాడు. అప్పుడు శివుడు అతడికి

దివ్యరథమును, దివ్యధనస్సును, దివ్యమైన అంబుల పొదిని ఇచ్చి ఏ మాత్రం కాలు కింద పెట్టకుండా శత్రుసంహారం చెయ్యమని చెప్పాడు. సుదేవుడు ఉత్సాహంగా వెళ్ళి సదుముడు, దముడిని యుద్ధంలో సంహరించాడు. సోదరుల మరణానికి కోపోద్రేకుడైన విదముడిని ఎదుర్కోవాలని శివుడు చెప్పిన మాట మరచి రథము దిగి విదముడిని ఎదుర్కొని ఒకరిని ఒకరు కత్తితో నరిక్కుని ఇద్దరూ చని పోయారు. రాక్షససైన్యం చెదిరి పోయింది నీకు విజయం చేకూరింది. ఎన్ని యజ్ఞయాగాదులు చేసినా వీర మరణానికి సాటి రావు " అని ఇంద్రుడు అంబరీషుడికి చెప్పాడని " భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు. ధర్మనందనా ! ఒక సారి జనకుడికి ప్రత్యర్ధుడికి యుద్ధం సంభవించింది. అప్పుడు జనకుడు తన సైన్యముతో " మహా వీరులారా ! మీకు వీరమరణం చెందిన వారికి ప్రాప్తించే సకల సుఖాలకు స్థానమైన స్వర్గం కావాలా ! లేక పిరికి వారికి కలిగే నరకం కావాలా !"అని అడిగాడు. జనకుని అంతర్యం తెలుసుకున్న వీరులు ప్రాణాలకు తెగించి పోరాడి జనకునికి విజయం సాధించి పెట్టారు. కనుక ధర్మనందనా ! వీరుడికి స్వర్గద్వారాలు ఎప్పుడూ తెరిచి ఉంటాయి " అని భీష్ముడు చెప్పాడు.

## వనరులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభ్రువాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

---

- ఈ పేజీకి 08:04, 25 సెప్టెంబర్ 2012న చివరి మార్పు జరిగినది.

# శాంతి పర్వము తృతీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# తృతీయాశ్వాసం

వైశంపాయనుడు జనమే జయునకు భారత కధ చెప్తూ " జనమే మహారాజా ! ఈ విధంగా భీష్ముడు ధర్మరాజు సందేహాలకు సమాధానాలు ఇస్తున్న తరుణంలో ధర్మరాజు భీష్ముని " పితామహా ! యుద్ధం చేయడానికి తగు సమయం, యుద్ధానికి చేయ వలసిన సన్నాహాలు తెలియ చేయండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! వానాకాలం శీతాకాలంలో యుద్ధం చేయరాదు. ఎండా కాలం వచ్చే ముందే యుద్ధముకు వెడలుట మంచిది. ఈ సమయంలో పంటలు చేతికి వస్తాయి. ధాన్యపు నిలువలు పుష్కలంగా ఉంటాయి. ఎన్ని రోజులు యుద్ధం చేసినా ఆహారపు కొరత ఉండదు. శత్రురాజు మీదకు యుద్ధానికి వెళ్ళే సమయంలో పచ్చిక బయళ్ళు, నీరు సమృద్ధిగా ఉండే త్రోవలో వెళ్ళడం మంచిది. ఎత్తైన జండాలు, కత్తులు, డాళ్ళు, కవచములు, రధములు, లెక్కకు మించినవి తీసుకు వెళ్ళాలి. శంఖములు భేరీ మృదంగ వాద్యములు దిక్కులు పిక్కటిల్లేలా మ్రోగించాలి. ఆ శబ్ధానికే శత్రు రాజుల గుండెలు అదిరిపోవాలి. సైన్యం విడిది చేయడానికి చదునైన ప్రదేశం ఎన్నుకోవాలి. ముందుగా శత్రు రాజులకు వర్తమానం పంపి వారి ఎత్తుగడలను ముందే ఊహించాలి. శత్రు రాజులు దుర్గమ మార్గంలో ప్రయాణిస్తున్నప్పుడు కాని, వారు ఆదమరచి నిద్రిస్తున్నప్పుడు కానీ హటాత్తుగా వారి మీద పడి చంపాలి. కాల్బలం ప్రయాణించడానికి చెట్లు పుట్టలు ఉన్న గుట్టలు ఉన్న దారిని, అశ్వదళం నీళ్ళు బురద లేని సమతల ప్రదేశం, నేల గట్టిగా ఉండి చక్రములు దిగబడని మార్గమున రధములు నడపాలి. చెట్లు గుట్టలు ఉండే ప్రదేశంలో గజబలం ఉండాలి.

## సేనలను నడిపేపద్ధతి

ధర్మనందనా ! సేనలను నడిపించే పద్ధతి. ముందు కత్తి, డాలు ధరించిన పదాతిదళం యుద్ధానికి వెళ్ళాలి. వారి వెనుక ధనుర్ధారులు నిలవాలి. వారి వెనుక అశ్వికదళం నిలవాలి. అశ్విక దళం వెనుక గజదళం వారి వెనుక రధికులు నిలవాలి. గాంధారం, సింధూర, సౌవీర దేశముల వీరులు కత్తితిప్పడంలో నేర్పరులు. ఔశీనర దేశస్థులు అన్ని రకముల ఆయుధాలను విసరడంలో నేర్పరులు. ప్రాచ్యదేశం వారు గజబలం నడపడంలో, కపటయుద్ధంలో నేర్పరులు. యవనులు, కాంభోజులు, మధుర చుట్టు పక్కల వాళ్ళు అశ్వముల నెక్కి యుద్ధం చేయడంలో ఆరితేరిన వారు. ఘూర్జర దేశస్థులు విలువిద్యలో నైపుణ్యం సంపాదించిన వారు. మాళవదేశస్థులు రథములను ఎక్కి యుద్ధం చేయడంలో నేర్పరులు. ఇంకా యుద్ధంలో ప్రావీణ్యం కలిగిన వారు వివిధ దేశాలలో ఉన్నారు. వారి వారి ప్రావీణ్యముకు తగ్గటుగా వారిని వినియోగించు కోవాలి " అని భీష్ముడు చెప్పాడు.

## యుద్ధమందు విజయం

ధర్మరాజు " పితామహా ! యుద్ధమందు విజయం సాధించాలంటే మన సేనకు ఎలాంటి లక్షణాలు ఉండాలి ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఎల్లప్పుడూ ధైర్యంగా ఉత్సాహంగా ఉండే సైనికులు, సకిలించేగుర్రాలు, ఘీంకరించే ఏనుగులు ఉన్న సైన్యము విజయం సాధిస్తుంది. యుద్ధానికి ముందు పక్షులు అటూ ఇటూ తిరుగాడుతుంటే అతి మంచిశకునము.

అగ్ని జ్వాలలు కుడి వైపుగా తిరుగుతుండడం మంచి శకునము. కాని ధర్మనందనా ! ఎలాంటి కవ్వింపుచర్యలు లేకుండా యుద్ధానికి కాలుదువ్వే రాజుకు పాపం చుట్టుకుంటుంది. యుద్ధంలో పారిపోయే సైనికులను చంపడం మహాపాపం. మనసైన్యం తక్కువైనా ధైర్యోత్సాహంతో ముందుకు ఉరికిన శత్రుసైన్యం అతి పెద్దది అయినా పారిపోతుంది. రాజుకు ఓర్పు ఉండాలి కాని అది హద్దులు మీరి అతిఓర్పు కాకూడదు. అది అనర్ధదాయకం. శత్రురాజు పొగరు పోతుదనాన్ని అణచడం రాజుకు ఉత్తమ ధర్మం " అని భీష్ముడు చెప్పాడు.

## శత్రువు పట్ల ప్రవర్తించ వలసిన తీరు

ధర్మరాజు " పితామహా ! రాజు తన శత్రువుపట్ల ఎలానడచుకోవాలి ? " అని భీష్ముడిని అడిగాడు. భీష్ముడు " ధర్మరాజా ! అదను చూసి శత్రువును తుద ముట్టించాలి గానీ ఎప్పుడూ తూలనాడ కూడదు. శత్రువును మచ్చిక చేసుకుని అదను చూసి తుదముట్టించాలి కాని శత్రువుపట్ల అప్రమత్తత వహించ రాదు. సంధికుదిరే అవకాశం ఉంటే యుద్ధానికి తలపడ రాదు. తనకు కాలంకలిసి రానప్పుడు శత్రువుకు కాలం కలిసి వస్తున్నప్పుడు సంధి కుదుర్చుకుని అవకాశం దొరికినప్పుడు శత్రువును హతమార్చాలి. శత్రువును మెల్ల మెల్లగా నది గట్టునుకోస్తున్నట్లు హతమార్చాలి. అంతే కాని దూకుడు తగదు. శత్రు రాజులందరితో ఏక కాలంలో పగ పెంచుకున్నట్లైతే వాళ్ళంతా ఒక్కటై నిన్ను ఓడించగలరు " అని భీష్ముడు చెప్పాడు.

## ఓడిపోయిన రాజు పట్ల ప్రవర్తించ వలసినది

ధర్మరాజు" పితామహా ! ఓడి పోయిన రాజు ప్రవర్తించవలసిన తీరు వివరించండి " అని భీష్ముడిని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! పూర్వం కోసలదేశపు రాజు **క్షేమదర్శి** విదేహదేశపు రాజు చేతిలో ఓడిపోయి అడవులు పట్టి పోయాడు. అక్కడ అతడు తన వద్ద ఇదివరకు మంత్రిగా ఉన్న కాలకవృక్షీయుడిని కలుసుకున్నాడు. కాలకవృక్షీయుడు క్షేమదర్శితో ఇలా చెప్పాడు " రాజా ! సిరిసంపదలు ఉన్నప్పుడు అవి తనవి కాదను కుంటే సిరిసంపదలు ఉన్నా లేకున్నా ఒకే మాదిరి ఉంటారు. మన కళ్ళ ముందే చనిపోతున్న బంధు మిత్రులను మనం కాపాడు లేక పోతున్నప్పుడు మన వద్ద ఉన్న సిరిసంపదలు పోతున్నప్పుడు మాత్రం ఎలా ఎదుర్కొనగలం. పోయిన బంధువులను చింతించినంత మాత్రాన ఎలా పొందలేమో అలాగే పోగొట్టుకున్న సిరిసంపదలను పొందలేమన్న సత్యం గ్రహించి అంతా దైవఘటన అనుకుంటే అంతా సిరిసంపదలు తామంతట తామే మనను వరిస్తాయి లేకున్న ఎంతటి సిరికూడా నిలువదు. కనుక సిరిసంపదలు శాశ్వితం కాదని గ్రహించి సంయమనంతో మెలగాలి. కాలం కలిసి రానప్పుడు శత్రువు తోనైనా మంచిగా మెలగాలి. కాలం కలిసి వచ్చినప్పుడు సైన్యం సమకూర్చుకుని శత్రువును గెలవాలి " అని చెప్పాడు. తరువాత **కాలకవృక్షీయుడు** విదేహరాజును కలుసుకుని క్షేమర్తితో సంధి చేసుకొమ్మని కోరి ఒప్పించాడు. కోసలరాజు విదేహరాజు వియ్యంతో సంధి చేసుకున్నారు. కనుక ధర్మనందనా ! క్షత్రియుడికి గెలుపు ఓటమి సర్వసాధారణం. కనుక ఓటమికి చింతపడక తరుణోపాయం ఆలోచించాలి " అని చెప్పాడు.

## పరిజనాలు, గణజనాలను చూడవలసిన తీరు

ధర్మరాజు " పితామహా ! రాజు అంతఃపురంలోని పరిజనాలను కార్యస్థానంలోని గణజనాలను ఎలాపాలించాలో చెప్పండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ధనాగారంలో పని చేసే వారిని , మంత్రాంగం చేసే మంత్రులు, ఆయుధాగారంలో పనిచేసే సైనికులు మొదలైన వారిని గణజనం అంటారు. మిగిలిన వారిని పరిజనం అంటారు. గణజనం అందరూ వివిధకులముల వారు అయినందున వారు కులములవారీగా విడిపోయే అవకాశం ఎక్కువ. వారిలోవారికి మాత్సర్యం కలిగి కలహించుకుంటారు కనుక రాజు అందరినీ సమంగా చూస్తూ కలతలు రాకుండా చూడాలి. లేకున్న అలాంటి వారి వలన రాజ్యానికే చేటు వస్తుంది. గణజనం అందరూ ఐకమత్యంగా ఉంటేనే రాజ్యంలో సుఖశాంతులు ఉంటాయి " అని భీష్ముడు చెప్పాడు.

## ధర్మ మార్గాలు

ధర్మరాజు " పితామహా ! ధర్మము నాలుగు విధములు కదా ! అందులో ఏది శ్రేష్టమైనదో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! తల్లి, తండ్రి, గురువు పూజనీయులు. వారిని భక్తితో కొలవవాలి. వారు చెప్పినది ఆచరించండం పరమధర్మం. తల్లి, తండ్రి, గురువు మూడు అగ్నులు, త్రిమూర్తులు, మూడు వేదముల వంటి వారు. వీరందరిలో తల్లి పూజనీయురాలు. సత్యము పలకడం అన్నిటికంటే ఉత్తమధర్మం. అసత్యంపలకడం అధర్మం. కాని ప్రాణరక్షణ కొరకు, ధనరక్షణకు, ప్రజా హితమైనది, ప్రజలకు మేలుచేసేది, ఇతరుల రక్షణచేసేది మొదలైన సమయంలో చెప్పే అసత్యం ధర్మమే ఔతుంది. అలాగే ప్రజలకు కీడుచేసే సత్యం పలుకుట అధర్మమే.

## పాప నివృత్తి

ధర్మరాజు " పితామహా ! ఎటువంటి వారు తాము చేసిన పాపములను నివృత్తి చేసుకోగలరు " అని అడిగాడు. భీష్ముడు " ధర్మరాజా ! వర్ణాశ్రమ ధర్మాలను సక్రమంగా పాటించే వారు, విషయాసక్తి లేని వారు, పరాక్రమం ఉండి తమమీద పడిననిందను ఓర్పుతో భరించే వారు, అతిధులను పూజించే వాళ్ళు, వేదాధ్యయనం చేసేవారు, నిత్యాగ్నిహోత్రులు, యుద్ధంలో వెన్ను చూపని వాళ్ళు, నిత్య సత్యవ్రతులు, సాధుజన పోషకులు, అందరు దేవుళ్ళను దేవతలను సమంగా పూజించు వారు చేసిన పాపమును సులువుగా నివృత్తి చేసుకోగలరు. అలాంటి వారిని ఆ మహావిష్ణువు సదా కాపాడుతుంటాడు. సాక్షాత్తు ఆ మహావిష్ణువు శ్రీకృష్ణుడి రూపంలో నీ చెంత ఉన్నాడు కనుక నీకు ఏ పాపము చెంతచేరదు. ఆ పరమాత్మను భక్తితో కొలిచే వారికి ఏలాంటి పాపం అంటదు " అన్నాడు భీష్ముడు.

## మానవుల భిన్న ప్రవర్తన

ధర్మరాజు ! " పితామహా ! చాలామంది లోపల సౌమ్యంగా ఉండి పైకి దుర్మార్గంగా కనిపిస్తుంటారు. మరి కొందరు లోపల దుర్మార్గంగా ఉండి పైకి చాలా సౌమ్యులుగా కనిపిస్తుంటారు. మరి వారిని గుర్తించడం ఎలాగో వివరించండి " అని అడిగాడు. అందుకు సమాధానంగా భీష్ముడు " ధర్మనందనా ! నీవు అడిగిన దానికి నేను ఒక పులి నక్క కధ చెప్తాను. పురిక అనే పురమును **పౌరికుడు** అనే రాజు పాలించే వాడు. ఆ రాజు చాలాక్రూరుడు. అతడు మరణించిన అనంతరం ఒక నక్కగా పుట్టాడు. పూర్వ జన్మజ్ఞానం కలిగిన ఆ నక్క కనీసం ఈ జన్మలో బాగా బ్రతుకుదామన్న కోరికతో అహింసావ్రతం ఆచరించి ఆకులు అలములు తింటూ చిక్కిశల్యమైంది. అది చూసిన తోటి నక్కలు " ఇదేమి వ్రతం మాంసాహారులం అయిన మనం ఇలా శాకములు తిన వచ్చా ? " అని అడిగారు. అందుకు నక్క బదులు చెప్పలేదు. ఈ విషయం తెలిసిన ఒక పులి నక్క వద్దకు వచ్చి " నక్కా ! నీవు చాలా సౌమ్యుడివి అని విన్నాను. నువ్వు నాతో స్నేహం చెయ్యి లోకం అంతా నన్ను క్రూరుడు అంటున్నది. నీవు నా పక్కన ఉంటే ఆ పేరు సమసి పోతుంది " అని చెప్పింది. " పులిరాజా ! నాకు ఈ లోకంలో ఆశలు లేవు కనుక నా మాటలు నీకు ఇంపుగా ఉండవు అయినా నేను నీ వెంట ఉంటే నీకు నాకు తోచిన మంచి మాటలు చెప్తుంటాను. నాతో నీ స్నేహం నీ వారికి అసూయ రగిల్చి నీ మీద కోపం పెంచుకుంటారు. నీవు అది లక్ష్యం చెయ్యనని నాకు మాటిస్తే నేను నీతో స్నేహం చెయ్యగలను " అన్నది. పులి అందుకు అంగీకరించి నక్కతో స్నేహం చేసింది. అది ఇష్టపడని మిగిలిన పులులు వారిరువురి మధ్య బేధం కల్పించాలని ఒక నాడు పులి తినవలసిన మాంసమును నక్క గుహలో పెట్టాయి. పులి వద్దకు వెళ్ళి నీ మాంసమును నక్క దాచింది కనుక నీవు నక్కను చంపు" అని చెప్పాయి. పులి ఆమాటలను నమ్మి నక్కను చంపమని దేశించింది. కాని పులితల్లి ఆ మాటలు నమ్మక " కుమారా ! నీవు చెప్పుడుమాటలు విని తప్పు చేస్తున్నావు. నక్కను గురించి తెలియక నీవు దాని మీద నింద వేస్తున్నావు. కాని నక్క నీ వారి మీద ఇలాంటి మాటలు చెప్పిందా ! నీ సేవకులు పుట్టుకతోనే మోసగాళ్ళు వారి మాటలకు వినవద్దు. బుద్ధి మంతులను చూసి బుద్ధిహీనులు, అందగాళ్ళను చూసి అందహీనులు, అధికులను చూసి హీనులు అసూయ చెందడం సహజం. రాజువైన నీవు తొందర పడకూడదు. కుమారా ! ఒక్కోసారి ధర్మం అధర్మంలా కనిపిస్తుంది. అధర్మం ధర్మంలా కనిపిస్తుంది. తెలివి కలవాడు వాటి తారతమ్యం ఎరిగి నడవాలి. నక్క గురించి నీకు బాగా తెలుసు. ఆ నక్క కేవలం మాంసం కొరకు నన్ను వంచిస్తుందా. నీ సేవకుల మాటలు నమ్మి నక్కను చంపమని చెప్పడం భావ్యమా ! రాజైన వాడు కూలంకుషంగా విచారించి నిర్ణయించాలి కాని తొందరపాటు నిర్ణయాలు తీసుకోరాదు " అని తల్లిపులి బోధించింది. ఆ తరువాత అక్కడకు వచ్చిన నక్క జరిగినది తెలుసుకుని " పులిరాజా ! నన్ను ముందు అందరి ఎదుట మంచి వాడని మెచ్చుకున్నావు. నాతో స్నేహం చేసే ముందు నీ వారి చెప్పుడు మాటలు వినను అని చెప్పి ఇప్పుడు వారి మాట విని నన్ను చెడ్డ వాడని నమ్మావు. నీవు మాట తప్పావు కనుక నేను ఇక్కడ ఉండడం భావ్యం కాదు నేను ఇక వెడతాను " అని చెప్పి నక్క అక్కడ నుండి వెళ్ళి నిరాహార దీక్షచేసి ప్రాణత్యాగం చేసి పుణ్య లోకాలకు వెళ్ళింది. కనుక ధర్మరాజా ! రాజు చెప్పుడు మాటలు నమ్మి నిర్ణయాలు తీసుకొన రాదు. చక్కగా విచారించి నిర్ణయాలు తీసుకోవాలి " అని చెప్పాడు.

## రాజు ప్రవర్తన

ధర్మరాజు " పితామహా ! రాజైన వాడు ఎలా ప్రవర్తిస్తే సుఖపడతాడు ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! రాజు ఏపని ఆలస్యం చేయకూడదు. ఈ కార్యం నేను చెయ్య లేనని నీరస పడకూడదు. ఈ రెండు లక్షణములు లేని రాజు సుఖపడతాడు. పూర్వం ఒక ఒంటె బ్రహ్మదేవుడిని గురించి తపమాచరించి బ్రహ్మదేవుడిని అడిగి తన మెడ నూరు యోజనముల దూరం సాగాలని వరంపొందింది. అప్పటి నుండి ఆ ఒంటె ఉన్న చోటున ఉండి మెడచాచి ఆహారం తింటూ సుఖంగా ఉండ సాగింది. అలా ఆహారం తింటుండగా ఒక రోజు వానవచ్చింది ఆ ఒంటె తన తలను ఒక గుహలో దూర్చింది.

అంతలో బాగా ఆకలిగా ఉన్న ఒక నక్క దాని భార్యా అక్కడకు వచ్చి అక్కడ కనిపించిన ఒంటె తలను చూసి దాని మెడ పట్టి కొరికితిని ఆకలి తీర్చుకున్నాయి. కనుక ఏ పైనిలోనైనా అలసత్వం పనికి రాదు ధర్మనందనా !" అన్నాడు.

## శత్రు రాజు బలం


సముద్రునితో నదుల సంవాదము

ధర్మరాజు " పితామహా! శత్రురాజు బలం అధికంగా ఉంటే కొద్దిగా సైన్యం ఉన్న రాజు అతడితో ఎలా యుద్ధం చెయ్యగలడు? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఒక సారి సముద్రుడు నదులతో ఇలా అన్నాడు. ఓ నదులారా ! మీరు ఒక్కో సారి ఉధృతంగా గట్లను ఒరుసుకుని ప్రవహించే సమయంలో మహావృక్షాలు సైతం కూకటి వేళ్ళతో పెళ్ళగించుకుని పడి పోతుంటాయి. కాని గట్టున ఉన్న గడ్డి దుబ్బులు అలాగే ఉంటాయి ఏమి కారణం ? " అని ఆడిగాయి. దానికి నదులు " సాగరోత్తమా ! గట్టున ఉన్న వృక్షాలు నిటారుగా పొగరుగా నిలబడతాయి కనుక అవి సమూలంగా కొట్టుకు పోతాయి. కాని గడ్డి దుబ్బులు మాత్రం ప్రవాహానికి అనుకూలంగా తల వంచి ప్రవాహం తగ్గగానే తల ఎత్తుతాయి కనుక అవి సురక్షితంగా ఉంటాయి " అని చెప్పాయి. కనుక ధర్మనందనా ! బలహీనుడైన రాజు తనబలం శత్రువుబలం ముందుగా అంచనా వేసుకుని అందుకు అనుగుణంగా ప్రవర్తించాలి కాని మూర్ఖంగా యుద్ధానికి దిగకూడదు " అని చెప్పాడు.

## ఉన్నత పదవులు

ధర్మరాజు ! " పితామహా ! నా రాజ్యంలో ఉన్నత పదవులలో నియమించుటకు తగిన జనం లభించని ఎడల నేను ఏమి చేయాలి ? " అని ఆడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నీకు ఒక కథ చెప్తాను. పూర్వం ఒక అడవిలో ఒక ముని తపస్సు చేసుకుంటున్నాడు. అతడి ఆశ్రమంలో సాధు జంతువులు క్రూరజంతువులు సఖ్యతగా ఉండసాగాయి. ఆ మునితో ఎప్పుడూ ఒక కుక్క ఉండేది. అది చూసి సహించలేని ఒక పులి దాని మీద పంజా విసరబోయింది. ఆ కుక్క ముని వెనుక దాగింది. అది చూసి ముని ఆ కుక్కను పులిగా మార్చాడు. అది చూసి అసలు పులి పారిపోయింది. ఇంకొక సారి ఒక ఏనుగు దాని మీద దాడి చేసింది. ముని కుక్కను ఏనుగుగా మార్చి కాపాడాడు. ఇలా ఏ జంతువు దాడి చేస్తే ఆ జంతువుగా మార్చి దానిని రక్షించసాగాడు. అది చూసిన కుక్క " నా మీద జాలితో ఈ ముని ఈ విధంగా నన్ను మార్చుతున్నాడు కదా ! ఇలా ఇంకొక జంతువు మీద జాలి పడి దానిని మార్చి నా మీద వదిలితే నా గతి ఏమి కావాలి ? కనుక ఎలాగైనా ఈ మునిని చంపాలి " అని అనుకుంది. అది తన దివ్యచక్షువులతో గమనించిన ముని ఎంతైనా ఈ కుక్క తన నీచప్రవర్తన వదలలేదు అనుకుని దానిని మామూలు కుక్కగా మార్చాడు. అది వివిధ జంతువులుగా మారే శక్తినికోల్పోయింది. కనుక ధర్మనందనా ! దుష్టులకు ఉన్నత పదవులు ఇవ్వరాదు. వారి వారి యోగ్యతను బట్టి ఉన్నత, మద్య, హీన పదవులను ఇచ్చి గౌరవించాలి. శౌర్యమూ, పరాక్రమమూ, సత్యమూ, భక్తి, సత్కార్యములు చేయు బుద్ధి, గంభీర్యము కల వాడు హీన కులజుడైనా ఉన్నత పదవులకు అర్హుడు. అతడికి కులంతో పనిలేదు. సింహం ఎప్పుడూ తోటి సింహాలతో చేరి పని చేస్తుంది కాని కుక్కలతో చేరి పని చెయ్యదు. పరిజనమునకు కులమూ నేర్పరితనం రెండూ ఉండాలి. నేర్పు, భక్తి కలిగిన సేవకులున్న రాజు ఏ కార్యమైనా సాధించగలడు. రాజు కూడా పరాక్రమం కలిగి ఉండాలి కాని పిరికితనం పనికి రాదు. రాజు తన పరిజనంతో కలిసి గూఢచర్యం నడిపాలి. అంతఃపురంలో చారులను నియమించి ఎప్పటికప్పుడు అంతఃపుర రహస్యములను తెలుసుకోవాలి " అని చెప్పాడు.

## దండనీతి

ధర్మరాజుతో భీష్ముడు దండనీతిని గురించి ఇలా చెప్పసాగాడు. ధర్మనందనా ! ఈ దండనీతి గురించి చెప్తాను విను. ఈ దండనీతిని సజ్జనులను రక్షించుటకు దుర్జనులను శిక్షించుటకు ఉద్దేశించబడింది. సాక్షాత్తు విష్ణుమూర్తి దండనీతి రూపంలో ఉంటాడు. దండనీతిలో విష్ణువు ఉన్నప్పుడు ధర్మపాలుడనీ, ధర్ముడనీ, విజయుడనీ, రక్షించేవాడని, శిక్షించేవాడనీ రకరకాల పేర్లతో పిలుస్తారు. దండనీతిని సక్రమంగా పాటించకపోతే అధర్మము, అవినీతి, పిరికితనం, దుఃఖం, నష్టము కలుగుతాయి. దండనీతిని సక్రమంగా పాటిస్తే ధర్మం, సుఖం, నీతి, లాభములు, బలము, రక్షణ కలుగుతాయి.

## దండ నీతి ఉత్పన్నం

ధర్మనందనా ! దండనీతి ఉద్భవించిన తీరు వివరిస్తాను విను. పూర్వం అంగదేశరాజు **వసుహోముడు** భార్యాసమేతంగా హిమాలయ పర్వతానికి వెళ్ళి అక్కడ మునిజనాలను సేవిస్తూ కాలం గడుపుతున్నాడు. ఒక రోజు **మంధా** అనే మహారాజు అతడి వద్దకు వచ్చి తనకు దండనీతిని గురించి చెప్పమని అడిగాడు. వసుహోముడు " ఒక సారి బ్రహ్మదేవుడు యాగం చెయ్య తలపెట్టాడు. అందు కొరకు ఒక మంచి ఋత్విక్కు కొరకు వెతికి ఎక్కడా దొరకక తన తుమ్ము నుండి ఒక ఋత్విక్కును పుట్టించాడు. అతడి పేరు **క్షతుడు**, క్షతుడిని ఋత్విక్కుగా పెట్టుకుని బ్రహ్మదేవుడు యజ్ఞం చెయ్యసాగాడు. తరువాత బ్రహ్మ విష్ణువును తీసుకుని ఈశ్వరుడి వద్దకు వెళ్ళాడు. అప్పుడు ఈశ్వరుడు దండనీతిని సృష్టించి దానిని ముందు తానే అధ్యయనం చేసాడు. నాలుగు వేదములు, ఆరు వేదాంగములు, పురాణములు, ధర్మశాస్త్రములు, న్యాయశాస్త్రము, మీమాంస, వైద్యము, ధనుర్వేదము, గాంధర్వము, అర్ధశాస్త్రము అను పద్దెనిమిది విద్యలను లోక ప్రయోజనం కొరకు సృజించి వాట్ని విష్ణుమూర్తికి అప్పగించాడు. వాటిని బ్రహ్మ తుమ్ము నుండి పుట్టిన క్షతుడి ద్వారా ప్రపంచంలో వ్యాప్తి చేసాడు. తరువాత విష్ణువు తన ఆధీనములో ఉన్న దండ నీతిని అంగీరసుడికి, **అంగీరసుడు** ఇంద్రుడికి, ఇంద్రుడు మరీచికి, మరీచి భృగువుకు, **భృగువు**అనేక మంది మునులకు చెప్పి అధ్యయనం చేయించాడు. దండనీతి ఆ విధంగా లోకంలో విస్తరిఉంచింది. దండనీతిని సమర్ధవంతమైన పనులు చేసిన రాజు ఇహపర సుఖములను పొందుతాడు " అని భీష్ముడు ధర్మరాజుకు వివరించాడు.

## ధర్మం కామం అర్ధం

ధర్మరాజు " పితామహా ! ధర్మము, అర్ధము, కామము గురించి వివరించండి. భీష్ముడు " ధర్మరాజా ! ఇది వరకు **కామందుడు** అనే ముని ఆంగరిష్టుడను రాజుకు చెప్పిన విషయములు నీకు చెప్తాను విను. ఎల్లపుడూ కామము కొరకు దాని వలన వచ్చు సుఖముల కొరకు పాకులాడే వాడికి ధర్మము, అర్ధము ఆచరణ సాధ్యములు కావు. అలాంటి వాడు కష్టముల పాలు ఔతాడు. అతడి వద్దకు స్నేహితులు చేరరు. చివరకు మృత్యువు కబళిస్తుంది. ధర్మాచరణకు అర్ధము అవసరం కాని రాజు ధనసంపాదనలో ధర్మం తప్పరాదు. కామ సంబంధిత కోరికలు విడిచి తక్కిన కోరికలు అనుభవించు రాజు మహోన్నతుడౌతాడు. కనుక ధర్మరాజా ! ధర్మము అర్ధము గొప్పవి " అని భీష్ముడు చెప్పాడు.

## శీలం

ధర్మరాజు " పితామహా ! మనిషికి శీలం ముఖ్యం కదా ! శీలం గురించి దానిస్వరూప స్వభావాలను వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నువ్వు నీ తమ్ములు ఇంద్రప్రస్థంలో సుఖంగా ఉన్న రోజులలో సుయోధనుడు అసూయతో రగిలి పోయాడు. నీవు చేసిన రాజసూయ యాగమును, నీకున్న మయ సభను చూసి ఓర్వ లేక పోయాడు. నీకు పట్టిన అదృష్టముకు అసూయపడి తన తండ్రి దృతరాష్ట్రుడి వద్ద చెప్పుకుని దు:ఖించాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు సుయోధనుడితో " కుమారా ! నీకున్న ఐశ్వర్యంలో ధర్మరాజుకు ఉన్న ఐశ్వర్యం తక్కువే. కాని ధర్మరాజుకు మంచి శీలం ఉంది. నీకు అది లేనిది. ధర్మరాజు ధర్మసంపన్నుడు కనుక నీకు సంపన్నుడిలా కనపడు తున్నాడు. నీవు మంచిప్రవర్తన అలవరచు కుంటే నీకున్న సంపద గుర్తించగలవు. నీ పూర్వీకులైన మాంధాత, నా భాగుడు మొదలైన చక్రవర్తులు తమ శీలసంపద చేత గౌరవాభిమానాలు పొందారు.

## ప్రహ్లాదుని శీలం

భీష్ముడు శీలం గురించి చెప్తూ " ధర్మనందనా ! పూర్వం ప్రహ్లాదుడు తన శీలసంపదతో ఇంద్రుడిని జయించాడు. ముల్లోకాలను ధర్మబద్ధంగా స్వాధీనపరచు కున్నాడు. అప్పుడు ఇంద్రుడు బృహస్పతి వద్దకు పోయి తిరిగి తన రాజ్యమును తిరిగి తన రాజ్యమును సంపాదించుకునే ఉపాయం చెప్పమని అడిగాడు. అప్పుడు బృహస్పతి ఇంద్రుడిని శుక్రాచార్యుడి వద్దకు పంపాడు. ఇంద్రుడు శుక్రాచార్యుడి వద్దకు వెళ్ళి తనకు మేలు కలిగే ఉపాయం చెప్పమని వేడుకున్నాడు. శుక్రాచార్యుడు ఇంద్రుడిని ప్రహ్లాదుడి వద్దకు పంపాడు. ఇంద్రుడు బ్రాహ్మణుడి వేషంలో ప్రహ్లాదుడి వద్దకు వెళ్ళి శిష్యరికం చేయసాగాడు. అతడి భక్తిశ్రద్ధలకు మెచ్చి ప్రహ్లాదుడు ఏమి కావాలని అడిగాడు. ఇంద్రుడు " ప్రహ్లాదా నీవు ఇంద్రుడిని ఎలా గెలిచావు " అని అడిగాడు. ప్రహ్లాదుడు విప్రోత్తమా ! నేను రాజును అనే గర్వంతో ఎవరిని అగౌరవపరచ పరచను. అందరికీ దాన ధర్మములు చేస్తుంటాను. బ్రాహ్మణులను ఆదరిస్తుంటాను. నా శీలమే నన్ను గొప్ప వాడిని చేసి నాకు విజయము చేకూర్చింది " అని చెప్పాడు. ఇంద్రుడు " ప్రహ్లాదా ! నాకు నీ శీలం దానంగా ప్రసాదించు " అని అడిగాడు. ప్రహ్లాదుడు కాదనక తన శీలమును ఇంద్రుడికి దానంగా ఇచ్చాడు. ఇంద్రుడు శీల సంపన్నుడై వెళ్ళి పోయాడు. అప్పుడు ప్రహ్లాదుడి నుండి ఒక తేజో

రూపము బయటకు వచ్చింది. అది ప్రహ్లాదుడి ప్రశ్నకు బదులిస్తూ " నేను నీ శీలాన్ని నిన్ను నన్ను నీవు ఇంద్రుడికి దానంగా ఇచ్చావు కనుక నేను నిన్ను విడిచి అతడి వెంట పోతున్నాను " అని బదులిచ్చింది. అతడి వెంట ధర్మము, సత్యము, మంచి ప్రవర్తన, బలము మొదలైన మంచి లక్షణములు తేజో రూపములతో ప్రహ్లాదుడిని విడిచి ఇంద్రుడి వెంట వెళ్ళారు. చివరకు ఒక స్త్రీ ఆకారం బయటకు వచ్చింది ఆమెను చూసి ప్రహ్లాదుడు నీవు ఎవరని అడిగాడు. అందుకు ఆమె " నేను సిరిని బలము ఎక్కడ ఉంటుందో నేను అక్కడ ఉంటాను " అని చెప్పి వెళ్ళసాగింది. ప్రహ్లాదుడు " అమ్మా ! కొంచెం ఆగు నా వద్ద నాశీలం దానంగా స్వీకరించింది ఎవరు " అని అడిగాడు. ఆమె " ప్రహ్లాదా ! ఇంద్రుడే నీవద్ద పోగొట్టుకున్న స్వర్గాధిపత్యం తిరిగి సంపాదించే నిమిత్తం నీ వద్ద శిష్యరికం చేసి నీ శీలాన్ని దానంగా పొందాడు. ప్రహ్లాదా ! మనిషికి శీలం ప్రదానమైంది. శీలం వలన ధర్మం , ధర్మం వలన సత్యము, సత్యము వలన, మంచి ప్రవర్తన, మంచి ప్రవర్తన వలన బలం వర్ధిల్లుతాయి. కనుక సమస్త సంపదలకు శీలం మూలము " అని చెప్పి సిరి ఇంద్రుడి వద్దకు పోయింది. ఇది విన్న సుయోధనుడు " అసలు శీలం అంటే ఏమిటి ? " అని తండ్రిని అడిగాడు. ధృతరాష్ట్రుడు " త్రికరణ శుద్ధిగా పరుల ఎడ ద్రోహచింతన లేకుండుట, సమస్త భూతములను సమానంగా చూచుట, సిగ్గుపడవలసిన పనులు చేయకుండుట, పరులకు హాని చేయకుండుట, జనులకు ప్రియమైన కార్యములనే చేయుట ఇటువంటి నడవడిని శీలం అంటారు. శీలం ఉన్న వాడికి అపజయం ఉండదు " అని చెప్పాడు. ధర్మనందనా ! నీకు శీలం జన్మత: వచ్చింది. నేను శీలం గురించి చెప్పినది విన్నావు కనుక సచ్ఛీలవంతుడవై మెలగుము " అన్నాడు.


బ్రాహ్మణ వేషములో దైత్యరాజైన ప్రహ్లాదుని దర్శించడానికి వచ్చిన ఇంద్రుడు

## ఆశ దు:ఖం

ధర్మరాజు " ఔను పితామహా ! ఆశకు అంతులేదు అది అనంతము. ఆశపడినది అందక పోయిన అమిత దు:ఖంకలుగుతుంది. సుయోధనుడితో సఖ్యతగా ఉండాలని ఎంతో ప్రయత్నించాను. అతడు నా మాట వినక నన్ను యుద్ధం చేయవలసిన పరిస్థితిలో పడవేసాడు. అందుకు నేను చాలా బాధపడు తున్నాను. ఆశలు అణుచుకోవడం అరుదు కదా ! " అన్నాడు ధర్మరాజు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ సందర్బంలో ఒక కధ చెప్తాను. హైహయ దేశపు రాజు **సుమిత్రుడు** ఒక రోజు వేటకు వెళ్ళి ఒక మృగమును కొట్టాడు. దెబ్బ తిన్న ఆ మృగం పారి పోయింది. సుమిత్రుడు మృగం వెంట పరిగెత్తి అలిసి పోయి ఒక ముని ఆశ్రమం చేరుకున్నాడు. ముని కుమారుడు అతడికి త్రాగడానికి నీళ్ళు ఇచ్చాడు. రాజు సేద తీరగానే ఆముని " రాజా ! ఏపని మీద వచ్చావు ? ఎందుకు దిగులుగా ఉన్నావు ? " అని అడిగాడు. రాజు " మునీశ్వరా ! నేను వేట నిమిత్తమై ఈ అడవికి వచ్చి ఒక జింకను వేటాడాను అది తప్పించుకు పారి పోయింది. దానిని తరుముతూ వచ్చి చిక్కక నిరాశతో అలసటతో ఇక్కడకు వచ్చాను " అని చెప్పాడు. ఆముని " రాజా ! నేను ఒక సారి తీర్ధయాత్రల నిమిత్తం బదరికాశ్రమం వెళ్ళాను. నేను అక్కడ కృశించిన శరీరం కలిగిన **తనుడు** అనే మునిని చూశాను. భక్తితో నమస్కరించిన నాకు అతడు అతిధిసత్కారాలు చేసాడు. అంతలో అక్కడకు ఒక రాజు వచ్చాడు. ఆ ముని, రాజు రాకకు కారణం అడుగగా అతడు " నాకు ఒక గుణవంతుడైన కుమారుడు ఉన్నాడు. అతడు ఒక సారి వేటకువెళ్ళి తిరిగి రాలేదు. అతడిని వెతుక్కుంటూ ఆశగా ఇక్కడకు వచ్చాను. నా ఆశతీరేలా లేదు నా మనసు ఎలా తట్టుకోగలదు మునీంద్రా " అన్నాడు. ముని " రాజా స్థిరచిత్తంతో చేసే కార్యము విజయవంతం ఔతుంది. ధనం కొరకు యాచించిన అవమానం ఎదుర్కొన కుండా పొంద లేరు. ఆశ పడడంలో తప్పు లేదు కానీ అది నెరవేరక పోతే దు:ఖించ కూడదు. కర్తవ్యం చేయాలి కానీ ఫలితం గురించి దు:ఖించ కూడదు. నీ కుమారుడిని నేను ఇస్తానని లోపలకు వెళ్ళి తన తపోమహిమతో రాజ కుమారుడిని తెచ్చి ఇచ్చాడు " అని చెప్పి " రాజా ! వేటకువెళ్ళడం తప్పుకాదు కాని దాని వెంట పరుగెత్తి నిరాశపడి దు:ఖించడం సరికాదు. కనుక మదిలోమృగాన్ని వదిలి రాజధానికి వెళ్ళు ఇక అనవసరంగా వేటకు వెళ్ళకు " అని చెప్పాడు. కనుక ధర్మనందనా ! ఆశ పడటం తప్పు కాదు కానీ ఆశ నెరవేరక పోయిన నిరాశతో అక్రమాలు చేయకూడదు. మనిషికి రాజుకు ధనం అవసరమే కానీ అది ధర్మబద్ధంగా సంపాదించినప్పడే శాంతి లభిస్తుంది. ధన సంపాదనకు అకృత్యాలు చేయక ప్రజల నుండి సానుకూలంగా ధనం రాబట్టాలి. రాజు తాను అందరి కంటే ధనవంతుడు కావాలని తన శక్తికి మించి ధనార్జన చేస్తే అది అనర్ధాలకు దారి తీస్తుంది. అది అసలుకు ముప్పు తెచ్చి ప్రాణాలను హరించగలదు. అలాగని ధనం ఆర్జించక ఊరకున్న లోకులు గౌరవించరు. దొంగలను దోపిడీదారులను సైన్యంలోకి తీసుకుంటే అవస్థలు రావడమే కాకుండా అధర్మపరులున్న రాజు విజయాన్ని సాధించ లేడు.

## వేటగాడి ధర్మం

పూర్వము పారియాత్ర పర్వతము మీద ఒక వేటగాడు ఉండేవాడు. అతడి పేరు **కాపవ్యుడు**. అతడి వృత్తి వేటాడటమే అయినా న్యాయాన్ని, ధర్మాన్ని చక్కగా ఆచరించే వాడు. తల్లి తండ్రులను పూజించే వాడు. మున్యాశ్రమాలలోని మునులకు కంద మూలాలను సమర్పించే వాడు. అక్కడ ఉన్న వేటగాళ్ళందరూ అతడిని తన నాయకుడిగా ఎన్ను కోవాలనుకొని " నీవు అత్యంత బలవంతుడివి, ధర్మాత్ముడివి కనుక నీవు మా అందరికి నాయకుడివిగా ఉండాలి. మేము నీ ఆఙ్ఞను వర్తులం కావాలని అనుకుంటున్నాము " అని అడిగారు. అందుకు కాప్యుడు " నాకు కొన్ని నియమాలు ఉన్నాయి. స్త్రీలను, పిల్లలను చంపకూడదు, వారికి హాని చేయకూడదు. ఆడ జంతువులను వేటాడకూడదు. గోబ్రాహ్మణులను రక్షించాలే కాని వారికి హాని చేయ కూడదు. పంట పొలాలను నాశనం చేయ కూడదు. ప్రజలను బాధించి మనం బాగు పడకూడదు. మీరు ఇలా నడుచుకుంటానని నాకు మాట ఇస్తే నేను మీ నాయకుడిగా ఉంటాను " అని చెప్పాడు. అందుకు వారు సంతోషించారు అలాగే మాట ఇచ్చి అతడిని తమ నాయకుడిగా ఎన్నుకున్నారు. అలా కాపవ్యుడు దొంగతనంతో వేటతో జీవిస్తున్న వారిని సజ్జనులను చేసాడు.

## మూడు చేపల కథ

భీష్ముడు ధర్మరాజుకు తరువాత మూడు చేపల కథ చెప్పాడు " ధర్మనందనా ! ఒక మడుగులో మూడు చేపలు ఉన్నాయి. వాటి పేర్లు **దీర్ఘదర్శి**, **ప్రాప్తకాలఙ్ఞుడు**, **దీర్ఘ సూత్రుడు**. ఇంతలో వేసవి కాలం వచ్చింది. ఎండకు ఆ చెరువులో నీళ్ళు ఇంకి పోసాగాయి. అది చూసిన దీర్ఘదర్శి " మిత్రులారా ! మనం ఉన్న చెరువులో నీళ్ళు ఇంకి పోతున్నాయి. ఇప్పుడే నీరు బాగా సమృద్ధిగా ఉన్న వేరు చెరువులోకి పోదాము " అని చెప్పింది. అందుకు ప్రాప్త కాలఙ్ఞుడు " నీతో నేను ఏకభవించను. చెరువు ఎండి పోయినప్పుడు ఆలోచించాలి కాని ఇప్పటి నుం,డే ఎందుకు దిగులు పడాలి. దీర్ఘ సూత్రుడు " చెరువులో నీళ్ళు సమృద్ధిగా ఉన్నప్పడే ఇలాంటి ఆలోచన ఎందుకు. ఎండి పోయినప్పుడు చూడచ్చులే " అన్నది. దీర్గ దర్శి తన ప్రయత్నం తాను చేసుకుని వేరు చెరువుకు పోయింది. వేసవి తీవ్రమై ఎండ తీవ్రతకు చెరువులోని నీరు పూర్తిగా ఎండి పోయాయి. జాలర్లు చేపలు పట్టడానికి చెరువుకు వచ్చారు. అప్పుడు ప్రాప్త కాలఙ్ఞుడు ఆలోచించి ఒక జాలరి వలలో చచ్చిన చేపలా పడి ఉన్నాడు. ఆ జాలరి ఆ చేపలను గట్టు మీద పెట్టాడు. ప్రాప్తకాలఙ్ఞుడు ఎగిరి పక్కనే ఉన్న బురద గుంటలోకి గెంతి దాక్కున్నాడు. దీర్ఘ సూత్రి మాత్రం ఏ ఉపాయం లేకుండా జాలరి వలలో పడి చనిపోయాడు. రాబోయే ఆపదను ముందుగా పసి కట్టి తప్పించుకున్నాడు నీతి మంతుడైన దీర్ఘదర్శి తప్పించుకున్నాడు. అప్పటికప్పుడు ఉపాయం ఆలోచించి సందేహ ప్రాణి అయిన ప్రాప్తకాలఙ్ఞుడు తప్పించుకున్నాడు. ముందు చూపు కాని ఉపాయం కానీ లేని దీర్ఘసూత్రుడు వలలో చిక్కి ప్రాణాలు వదిలాడు " అని చెప్పాడు భీష్ముడు.

## పలితుడు రోజశుల స్నేహం



ధర్మరాజు భీష్ముడితో " పితామహా ! తన శత్రువుల చేతిలో చిక్కి బలం కోల్పోయిన రాజు తన కష్టముల నుండి ఎలా గట్టెక్కుతాడో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మరాజా ! ఈ సందర్భంలో ఒక కథ చెప్తాను విను. ఒక అడవిలో ఒక మర్రి చెట్టు ఉంది. దాని మొదట్లో **ఫలితుడు** అనే ఒక ఎలుక నివసిస్తుంది. ఆ చెట్టుమీదే **రోజసుడు** అనే పిల్లి కాపురం చేస్తుంది. ఒక బోయ వాడు ప్రతి రోజూ రాత్రి ఆ చెట్టు సమీపంలో ఒక వల పెట్టే వాడు. ఉదయం వచ్చి దానిలో పడిన పక్షులను పట్టుకు పోయే వాడు. ఆ వలలో ఒక రోజు చెట్టు మీది పిల్లి అను కోకుండా చిక్కు కుంది. పిల్లి వలలో పడడంతో ఎలుక నిర్భయంగా బయటకు వచ్చి ఆహారం కొరకు వెదుకుతూ ఉండగా అది ఒక ముంగిసను , గుడ్లగూబను చూసింది. ఎలుకకు పైప్రాణాలు పైనే పోయాయి. వెంటనే ఒక ఉపాయం స్పురించి వలలో ఉన్న పిల్లిని సమీపించి దాని పక్కనే కూర్చుని " ఓ మార్జాలమా ! నేను నీ వల కొరికి నిన్ను రక్షిస్తాను నువ్వు నన్ను గుడ్లగూబ, ముంగిసల బారి నుండి రక్షించు. పిల్లి " మూషికమా ! నీకు పరులకు ఉపకారం చేసే గుణం ఉండడం నాకు ఆనందం కలిగిస్తుంది. నేను నిన్ను రక్షిస్తాను నన్ను చూస్తే ముంగిస, గుడ్లగూబ భయ పడతాయి. కనుక నన్ను విడిపించు " అని చెప్పింది. ఎలుక పిల్లి పక్కన చేరింది అది చూసి ముంగిస గుడ్లగూబ పారి

ఎలుక సహాయముతో వేటగాడి బారినుంచి తప్పించుకుని పారిపోతున్న పిల్లి

పోయాయి. పిల్లి " ఇక తాళ్ళు కొరికి నన్ను విడిపించు " అన్నది. ఎలుక " ఉండు తొందరపడకు " అని వెళ్ళి దూరంగా కూర్చుంది. పిల్లి " మూషికమా ! నీను నీ ప్రాణాలు కాపాడాను కదా నీవు ఇలా ఉపేక్షించ తగునా ! " అన్నది. ఎలుక " మార్జాలమా ! రేపు బోయవాడు కనిపించిన తరువాత త్వరగా వల తాళ్ళను కొరికి నిన్ను విడిపిస్తాను. ఇప్పుడు విడిపిస్తే నన్ను నీవు భక్షంచవచ్చు. బలవంతులతో స్నేహం చేసేటప్పుడు తగు జాగర్తలో ఉండడం మంచిది " అన్నది. తెల్లవారిన పిదప బోయవాడిని అల్లంత దూరంలో చూసిన ఎలుక గబగబా వల తాళ్ళను కొరికింది. బోయవాడికి భయపడి పిల్లి చెట్టెక్కింది ఎలిక కలుగులో దూరి తల కొంచెం బయట పెట్టి జరిగేది చూస్తూ ఉంది. బోయ వాడు వల చూసి నిరాశతో వెళ్ళి పోయాడు. పిల్లి కిందకు వచ్చి ఎలుకతో " మిత్రమా ! నేను నిన్ను కాపాడాను కాని నువ్వు నన్ను నమ్మ లేదు. మనమిరువురం స్నేహం చేద్దాము " అన్నది. ఎలుక " మార్జాలమా ! నీవు చెప్పింది నిజమే అయినా మిత్రువు శత్రువుగా మార వచ్చు. శత్రువు అవసరాన్ని బట్టి మిత్రుడవచ్చు. కనుక ఎవరు ఎప్పుడు మిత్రుడౌతాడో ఎప్పుడు శత్రువు ఔతాడో తెలుసుకోవడం కష్టం. నువ్వు నాకు చేసిన సాయం నేను నీకు సాయం చేసి తీర్చుకున్నాను. అంతటితో చెల్లి పోయింది. బలంతులతో అవసరార్ధం స్నేహం చేసినా కార్యం ముగిసిన పిదప వదిలి వేయకున్న ఆపదలు ఎదురు ఔతాయి. కనుక మనం ఎవరి దారి వాళ్ళము చూసుకుంటాము. అవసరమైనప్పుడు ఒకరికి ఒకరం సహాయం చేసుకుంటాము. భగవంతుడు నన్ను నీకు ఆహారంగా సృష్టించాడు కనుక నీవు ఎప్పుడో ఒక సారి నన్ను చంపక మానవు. ఒక వేళ నీవు విడిచినా నీ కుమారులు, బంధువులు నీ మనసు మార్చవచ్చు. రాత్రంతా ఆకలిగా ఉన్న నీ సమక్షానికి వస్తే నీవు నన్ను తినేస్తావు నేను నీ వద్దకు రాలేను " అన్నది. పిల్లి " ఎలుకా నా ప్రాణ రక్షణ చేసిన నిన్ను నేను ఎలా చంపగలను. " అన్నది. ఎలుక " నీవు నన్ను రక్షించావు నేను నిన్ను రక్షించాను అది చాలు నేను నీ దగ్గరకు రాతగదు. మార్జాలమా ! శుక్ర నీతి ఇలా ఉంది. బలవంతుడైన శత్రువుతో అవసరార్ధం చేసే స్నేహాన్ని వెంటనే విడువకున్న ఎప్పటికైనా శత్రువు వలన ఆపద కలుగ వచ్చు కనుక సాయం చేసాడని శత్రువును గుడ్డిగా నమ్మ కూడదు. నమ్మ కూడని వారిని నమ్మక ఉండడమే కాక నమ్మ తగిన వారిని మితంగా నమ్మాలి. ఎవరినీ గుడ్డిగా నమ్మడం తగదు. ఎంతటి మిత్రులనైనా నమ్మినట్లు నటిస్తూనే నమ్మక ఉండడమే రాజ నీతి " అన్నది. కనుక ధర్మనందనా ! బలవంతుడైన శత్రువును బలహీనుడైన ఇంకొక రాజుతో తాత్కాలిక స్నేహం చేసి ఎదిరించాలి. అంతే కాని శత్రువుతో స్నేహం మాత్రం పొడిగించ రాదు " అని చెప్పాడు.


ధర్మరాజుకు నమ్మదగినవారి గురించి చెబుతున్న భీష్ముడు - రాజ్మానామా నుండి ఒక దృశ్యం

## విశ్వదించతగిన వారు

ధర్మరాజు " పితామహా ! ఎవరిని నమ్మితే మనశ్శాంతి కలుగుతుంది. ఎవరిని నమ్మితే కష్టాలపాలౌతాము. అందరినీ నమ్మతగునా ! లేక ఎవరినీ నమ్మ తగదా ! " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! పూర్వము **బ్రహ్మదత్తుడు** అనే రాజు ఒక చిలుకను పెంచి దానితో స్నేహంగా ఉండ సాగాడు. ఆ చిలుకకు ఒక పిల్ల పుట్టింది. ఆ పిల్లతో రాజ కుమారుడు ఆడుకుంటూ ఉండే వాడు. ఆ చిలుక తన పిల్లతో సమానంగా రాజకుమారుడిని చూడసాగింది. ఒక రోజు చిలుక బయటకు వెళ్ళిన సమయంలో రాజకుమారుడు ఆ చిలుక పిల్లను చంపేసాడు. తిరిగి వచ్చిన చిలుక ఏడుస్తూ " ప్రతి రోజూ పండ్లు ఫలాలు తెచ్చి తన బిడ్డతో సమానంగా చూసినందుకు రాజకుమారుడు నిర్ధాక్షిణ్యంగా చంపేసాడు. రాజ బిడ్డలకు జాలి దయా ఉండవేమో నాకు మాత్రం జాలి ఎందుకు ఉండాలి అని రాజకుమారుడి కళ్ళని తన వాడి అయిన గోళ్ళతో పొడిచి గుడ్డి వాడిను చేసి రాజు ముందు నిలిచి " రాజా నీ బిడ్డ నిర్ధాక్షిణ్యంగా నా బిడ్డను చంపి పాపం చేసి ఫలితం అనుభవిస్తున్నాడు కనుక ఇక నేను ఇక్కడ ఉండడం తగదు కనుక నేను వెళ్ళి పోతున్నాను " అని పలికింది. ఆ రాజు " చిలుకా ! నీవు ఏ పాపం చేయ లేదు కనుక నీకు పాపం అంటదు. నీవు వెళ్ళకు మనం ఎప్పటిలా స్నేహంగా ఉంటాము " అన్నాడు. చిలుక " రాజా నేను నీ కుమారుడి కళ్ళొ పొడిచినందుకు నీకు నా మీద అంతర్లీనంగా కోపం ఉండకపోదు. కనుక నీతో స్నేహం నాకు ఆపత్కరం. కనుక మన స్నేహం అసంభవం " అని చెప్పింది. రాజు " చిలుకా ! నీ పిల్లను నా కొడుకు చంపినందుకు ప్రతిగా నీవు నా కుమారుడి కళ్ళు పొడిచావు కనుక ఆ విషయం అంతటితో తీరింది. నేను నీ వంటి మంచి స్నేహం వదల లేను " అన్నాడు. చిలుక " రాజా ! ఒక సారి స్నేహం చెడి పోయిన తరువాత తీయని మాటలతో ఆ పగ మరచినా చివరకు కీడు రాక మానదు. రాజా ! పగ అయిదు రకాలుగా ఉంటుంది. పరుల భూములు ఆక్రమించుకోవడం వలన కాని దాయాదుల మధ్య ఆస్తి తగాదా


యుధిష్టురినికి బ్రహ్మదత్తుడు చిలుక కధను చెపుతున్న భీష్ముడు - రాజ్మానామా నుండి ఒక దృశ్యం

వలన కాని, ఆడవాళ్ళు మాటా మాటా అనుకోవడం వలన కాని మరొకరికి తీవ్రమైన ఆపద కలగడం వలన కాని పగ పుడుతుంది. ఒక సారి పుట్టిన పగ నివురు కప్పిన నిప్పులా అలాగే రగులుతూ ఉంటుంది కాని చల్లారదు. పగ కనిపించ లేదని పగవాడిని నమ్మితే వినాశనం తప్పదు. ఒక సారి పగపుట్టిన తరువాత తల్లి తండ్రులైనా, అన్నదమ్ములైనా, కన్నబిడ్డలైనా, ప్రాణ స్నేహితులైనా నమ్మరాదు. కనుక మీ తియ్యటి స్నేహం నమ్మి నేను నీతో స్నేహం కొనసాగించ లేను " అని పలికింది. రాజు " చిలుకా ! కాలవశం వలన మంచి చెడు కలుగుతాయి. వాటిని నియంత్రించ లేము కనుక నీ వంటి స్నేహితుడిని నేను వదల లేను " అన్నది. చిలుక " రాజా ! నువ్వు నాతో ఎంతో సౌమ్యంగా మాట్లాడుతున్నా ఆ మాటల వెనుక నాకు పగద్వేషం కనపడుతున్నాయి. కనుక నేను నీతో స్నేహం చేయ లేను " అని చెప్పి చిలుక ఎగిరిపోయింది. కనుక ధర్మరాజా ! రాజు తన వారిని కాని మిత్రులను కాని ప్రజలను కాని నమ్మ రాదు.

## కణిక శత్రుంజయులు

భీష్ముడు ధర్మనందనా ! ఈ సందర్భంలో కణికుడు **శత్రుంజయుడు** అనే రాజుకు చెప్పిన విషయం వివరిస్తాను విను. రాజు బయటకు తియ్యగా మాట్లాడుతూనే లోపల కరుగ్గా ఉండాలి. అందరినీ నమ్మినట్లే ఉండాలి కానీ ఎవరినీ నమ్మ రాదు. దాయాదుల సాయంతో రాజ్యాన్ని జయించి తరువాత వారికి తగిన పారితోషికం ఇవ్వాలి. అంతే కాని వారిని నమ్మి దగ్గరగా ఉంచుకోకూడదు. అవసరానికి రాజు శత్రువును తలకెక్కించుకుని అవసరంతీరగానే కుండలా నేలకేసి కొట్టాలి. మద్యపానము, జూదము, వేట, స్త్రీలోలత్వం రాజులకు వినోద సాధనము. కాని మితిమీరక ఉండాలి. రాజు ఒక కార్యం తలపెట్టిన అది పూర్తయ్యే వరకు ఎవరికీ తెలియనివ్వ రాదు. ఒక వేళ తెలిసినా తెలియనట్లు, చూడనట్లు, విననట్లు ఉండాలి. రాజుకు ఇష్టం లేని పనిని అదుగో చేస్తాను, ఇదుగో చేస్తాను అని కాలయాపన చేయాలి. తరువాత ఎలాగైన చేయక విడువాలి. అత్యంత గర్వంతో విర్రవీగే వాడిని, కార్యా కార్య వచక్షణ లేని వాడిని, మంచీ చెడు తెలియని వాడిని, చెడుమార్గంలో నడిచేవారిని గురువైనా వదలక దండించాలి. తీరని అప్పు, ఆరని నిప్పు, పూర్తిగా తీరని పగ ఎప్పటికైన కీడు చేస్తాయి. మృదుత్వంతో ఏదైనా సాధించ వచ్చు. సామరస్యంతో శత్రువునైనా నాశనం చేయ వచ్చు. కనుక మృధు స్వభావులు ఉత్తములు అది ఉత్తమ గుణం " అన్నాడు.

## కరువులో ద్విజులు

ధర్మరాజు " పితామహా ! ధర్మభ్రష్టత్వం కలిగినప్పుడు కరువు కాటకాలు సంభవిస్తాయి. అప్పుడు ద్విజులైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు ఎలా బ్రతకాలి " అని భీష్ముడిని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! త్రేతాయుగము ద్వాపర యుగసంధిలో పన్నెండు సంవత్సరాల కాలం తీవ్రమైన కరువు సంభవించింది. నదులు, చెరువులు, పచ్చిక బయళ్ళు చివరకు అడవులు ఎండి పోయాయి. ఆహారం దొరకక జంతువులు చచ్చిపోసాగాయి. రాజులు ప్రజల వద్ద ఉన్న ధాన్యాలను పన్నుల రూపంలో దోచుకున్నారు. బలవంతులు బలహీనులను దోచుకోసాగారు. బ్రాహ్మణులు ధర్మం తప్పి ప్రవర్తించ సాగారు. యజ్ఞ యాగాదులు ఆగి పోయాయి. ఆకలికి తాళలేని జనం చనిపోసాగారు. ఆ సమయంలో విశ్వామిత్రుడనే మహర్షి ఆకలికి తట్టుకోలేక ఆహారం కొరకు వెదకుతూ సాయం సమయానికి ఒక పల్లెను చేరుకున్నాడు. విశ్వామిత్రుడు క్షుద్బాధతో సొమ్మసిల్లి పడి పోయాడు. అతడి పక్కన ఒక కుక్క శరీరం పడి ఉంది దాని చర్మం వలిచి మిగిలిన శరీరం అక్కడ ఎండ పెట్టారు. ప్రాణం పోయే సమయంలో కుక్క మాంసభక్షణం చేయడం పాపం కాదని కుక్కమాసం దొంగలించ బోయాడు. అక్కడ ఉన్న ఒక చండాలుడు అది చూసి " అయ్యా ! నీ వెవరు ఈ పనికి ఎందుకు పూనుకున్నావు? " అని అడిగాడు. విశ్వామిత్రుడు " అయ్యా ! నా పేరు విశ్వామిత్రుడు. ఆకలితో ఉన్నాను, చాలా రోజులుగా ఆహార పానీయాలు లేకుండా ఉన్నాను. ప్రాణాలు నిలిపు కోవడానికి కుక్క మాంసం తిన్నా తప్పు లేదనుకుని ఈ కుక్క మాంసం తీసుకుంటున్నాను. అగ్ని పవిత్రుడు అయినా సర్వభక్షకుడు కదా అలాగే నేనూ " అని చెప్పాడు. " మహాత్మా ! అన్ని మాంసాలలోకి కుక్క మాంసం నీచమైనది. దానిని మీ వంటి తాపసులు తీసుకోవడం దోషం కాదా ! " అని అడిగాడు. బ్రహ్మ అండగా ఉన్న నాకు ఏ పాపం అంటదు. ముందు ప్రాణాలు నిలుపుకోవడం ముఖ్యం. బ్రతికి ఉంటే యగ్న యాగాదులు చేసి పాపపరిహారం చేయ వచ్చు. నాకు జీవనాధరం అయిన కుక్కమాంసం వదలను " అన్నాడు. " మహాత్మా ! కుక్క మాంసం తినడం అధమాధమం. మీ వంటి తాపసులు అలాంటి పని చేయ వచ్చా ! " అని అడిగాడు. విశ్వామిత్రుడు " అయ్యా ! అగస్త్యమహాముని రాక్షస మాంసం

తిన్నా అతడి ప్రతిష్ట తగ్గలేదు కదా ! " అని అన్నాడు. చండాలుడు " అగస్త్యుడు రాక్షస బారి నుండి మానవాళిని రక్షించడానికి రాక్షస మాంసం మేకమాంస రూపంలో తిన్నాడు. మీరు మీ ఆకలి మాత్రం తీసుకోవడానికి కుక్క మాంసం తినాలని అనుకుంటున్నారు. మీరు అగస్త్యుడు ఒకటి ఎలా ఔతారు " అని అడిగాడు. విశ్వామిత్రుడు " ఓయీ ! బ్రహ్మజ్ఞానానికి ఆలవాలమైన ఈ దేహం కోసం ఏమీ చేసినా పాపం కాదు. అడ్డులే " అన్నాడు. చండాలుడు " మహాత్మా ! దొరికినఅహారం వదల లేక ఇలా అంటున్నావు కాని దీని వలన మీ తేజసు క్షీణించదా !" అన్నాడు. విశ్వామిత్రుడు " అయ్యా ! నేను బ్రతకాలని అనుకుంటున్నాను. నాకు ఈ మాంసం ఇవ్వు. నేను నిన్ను అడిగి తీసుకుంటున్నాను కనుక నాకు దొంగతనం చేసిన పాపం అంటదు " అని అన్నాడు. చండాలుడు " మహానుభావా ! ఎంతో పుణ్యాత్ములైన మీరు అధముడినైన నా వద్ద దానం పుచ్చుకొనుట ధర్మమా ! నేను ఇంతకంటే కాఠిన్యం వహించ లేను. ఇదుగో కుక్క మాంసం మీ ఇష్టం వచ్చినట్లు చేసుకోండి " అన్నాడు. విశ్వా మిత్రుడు కుక్క మాంసం తిని ప్రాణాలు నిలుపుకున్నారు. ఆ తరువాత వానలు కురిసాయి చెట్లు చిగురించాయి, పంటలు పండాయి కరువు దూరమైంది. విశ్వామిత్రుడు కుక్క మాంసం తిన్న పాపపరిహారం చేసుకున్నాడు. కనుక ధర్మనందనా ! ఆపత్కాలంలో ఏ తప్పు చేసినా దోషం లేదు " అన్నాడు.

## శరణార్థులు



బోయవాని ఆకలి తీర్చటం కోసం నిప్పులో కాలిపోతున్న పావురాలు

ధర్మరాజు " పితామహా ! శరణు జొచ్చిన వారిని ఆపదలలో ఉన్న వారిని ఆదుకున్న వారికి ఏలాంటి ఫలం దక్కుతుంది. భీష్ముడు " ధర్మనందనా ! ఒక బోయవాడు అడవిలో వేటకు వెళ్ళాడు. కొన్ని పక్షులను చూసాడు. ఇంతలో గాలి వాన ప్రారంభమై భయంకరంగా వాన కురిసింది. అడవి జలమయం అయింది. ఆ బోయవాడు ఒక మర్రి చెట్టు కింద తలదాచు కున్నాడు. ఆ బోయ చలికి గడగడలాడుతూ ఇక మీదట వేటాడనని, జీవహింస చేయనని ఆ చెట్టును వేడుకున్నాడు. ఆ చెట్టు మీద ఒక పావురం గూడుకట్టుకుని భార్యతో నిచసితుంది. మగపావురం గూటిలో ఉంది. ఆడ పావురం ఆహారం కొరకు వెళ్ళి గూటికి ఇంకా చేర లేదు. మగ పావురం ఆడ పావురం కొరకు ఎదురు చూస్తూ పరితపిస్తూ " అయ్యో ! అయ్యో ఇంత రాత్రయ్యింది నా భార్య గూటికి చేరలేదు. నా భార్య లేని గూడు కళా విహీనంగా ఉంది. నా భార్యకు ఏమైందో తెలియడం లేదు. నా భార్య లేకున్న నా బ్రతుకిక వ్యర్ధం కదా ! " అనుకుని ఏడుస్తూ ఉంది. ఆ ఆడ పావురం బోయ వాడి వలలో ఉంది. అది తన భర్త మాటలు విని " అహా ! నా జన్మ ధన్యమైంది. నా భర్త మాటలను విని నామనసు పులకించి పోయింది. నేను ఎంత పుణ్యాత్మురాలను " అనుకుని నేను ఇక్కడ ఉన్నాను అని కిచకిచ లాడుతూ చెప్పింది అది విన్న మగ పావురం ఆ అరుపులు వినగానే ఆడ పావురం " అయ్యా ! ఈ వేటగాడు మన అతిథి. ఇతడికి అతిధి సత్కారం చెయ్యి " అన్నది. అది విని మగ పావురం బోయవాడి వద్దకు వచ్చి " అయ్యా ! మీరు నా అతిధి నేను మిమ్ము ఎలా సత్కరించగలనో శెలవియ్యండి " అని అడిగింది. బోయవాడు " అయ్యా ! ప్రస్థుతం నాకు చలి బాధ తీరాలి " అన్నాడు. వెంటనే ఆ పావురం చితుకులు ఏరుకుని వచ్చి మంట వేసింది. ఆ మంటలో చలి కాచుకుని బోయ వాడు తనకు ఆకలిగా ఉంది అన్నాడు. మగ పావురం " అయ్యా ! మేము ఎప్పుడు ఆకలి అయితే అప్పుడే తింటాము కాని రేపటికి దాచుకోము. మీరు పావురములు ఆహారంగా తింటారు కనుక నన్ను ఆహారంగా స్వీకరించండి " అని ఆ మంటలలో దూకింది. అది చూసిన బోయవాడికి జ్ఞానోదయం అయి " ఛీ నాదీ ఒక బ్రతుకేనా ! ఈ పావురానికి ఉన్న జ్ఞానం నాకులేదు కదా ! " అనుకుని వలలోఉన్న పక్షులను వదిలేసాడు. బోయవాడి వలలో నుండి బయట పడిన ఆడపక్షి తన భర్తలేని బ్రతుకు తనకెందుకని మంటలోకి దూకి మరణించింది. అప్పటికే దివ్య విమానంలోకి చేరిన మగ పావురం ఆడపావురం కొరకు ఎదురు చూస్తూ ఉంది. ఇదంతా కళ్ళారా చూసిన బోయ వాడు తన వలను మిగిలిన సామాను వదిలి విరాగిగా పారి వెళ్ళియాడు. కనుక ధర్మనందనా ! తమ శరణు జొచ్చిన ఆ బోయవాడికి అతిథి సత్కారం చేసిన ఫలితానికి పక్షులకు దివ్యత్వం సిద్ధించింది " అని చెప్పాడు.

## పాప పరిహారం

ధర్మరాజు " పితామహా ! తన బుద్ధిపూర్వకంగా చేయని పాపానికి పరిహారం ఎలా చెయ్యాలి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! పరీక్షిత్తు కుమారుడైన జనమేజయుడు. జనమేజయునకు పూర్వజన్మ అందు బ్రహ్మహత్యా పాతకం అంటుకుంది. అతడికి శౌనకుడు అనే ముని పశ్చాత్తాపంతో, పరితపించినా ఎంతటి పాపమైనా పరిహారం చేసుకోవచ్చని


చనిపోయిన బాలునిపై కృప చూపిస్తున్న శివుడు

చెప్పాడు. జనమేజయుడు శౌనకుడి మాట అనుసరించి తీర్ధయాత్రలు చేసి, అశ్వమేధయాగం చేసి తన పాపములను పోగొట్టుకుని రాజ్యపాలన చేసాడు. ధర్మరాజా ! నీకు ఒక కధ చెప్తాను విను. విదిశాపట్టణంలో ఒక బ్రాహ్మణుడి ఇంట్లో ఒక బాలుడు చనిపోయాడు. ఆ బాలుడి శవాన్ని అతడి తండ్రి బంధుమిత్రులతో శ్మశానానికి తీసుకు వెళ్ళాడు. ఆ బాలుడి శవాన్ని శ్మశానంలో పెట్టి తనివి తీరాఏడ్చారు. అక్కడకు వచ్చిన గద్ద వారిని చూసి " అయ్యలారా ! ఎంత సేపు ఏడిస్తే మాత్రం పోయిన వాడు వస్తాడా ! చీకటి పడితే భూతప్రేత పిశాచాలు ఈ రుద్రభూమికి వస్తాయి. అవి మిమ్ములను పీక్కు తింటాయి. కనుక మీరి ఇళ్ళకు చేరండి " అని చెప్పింది. పక్కనే ఉన్న నక్క గద్దకు చీకటి పడితే కళ్ళు కనిపించవు. కనుక వాళ్ళను పంపి శవాన్ని ఆరగించాలని గద్ద చూస్తుంది అని నక్కకు అర్ధం అయింది. నక్క వాళ్ళను చీకటి పడేదాకా వాళ్ళను ఆపగలిగితే ఆ శవాన్ని తాను ఒక్కటే తినవచ్చు అనుకుని వాళ్ళ వద్దకు వెళ్ళి " అయ్యో ! ఏమిటి వెర్రి గద్ద మాటలకు భయపడకండి. అయినా ఇంత అందమైన బాలుడిని వదిలి పోవడానికి మీకు మనసెలా ఒప్పుతుంది. మీ ఏడుపులు ఆలకించి ఏదేవుడైనా మీ పిల్లాడికి ప్రాణదానం చేయ వచ్చు. ఇంకా సూర్యుడు అస్తమించ లేదు కదా ! భయమెందుకు? " అన్నది. అప్పుడు గద్ద " అయ్యా ! ఇంతటి వెర్రి ఎందుకు. ఇప్పటికే ఈ పీనుగ వికృతంగా మారి పోయింది. ఇక ఏం బ్రతుకుతాడు బుద్ధి మాలిన ఈ నక్క మాటలు వినకండి. దయా హీనుడైన యముడు ఇతడి ప్రాణములు హరించాడు. త్వరగా ఈ బాలుడికి ఉత్తరక్రియలు చేసి దానధర్మము చేసి ఉత్తమ గతులు కలిగించండి " అని త్వరపెట్టింది. గద్ద మాటలకు వారు తిరిగి వెళ్ళబోయారు. నక్క అడ్డుపడి " గద్ద మనసు క్రూరం. ఈ బిడ్డను చూస్తుంటే నా మనసు కలుక్కుమంటుంది. మీరు గట్టిగా ఏడవండి ఏ దేవతైనా కరుణించ వచ్చు " అన్నది. గద్ద " నేను పుట్టి పదిహేను వందల సంవత్సరాలు అయింది ఇప్పటి వరకు చచ్చిన వాడు బ్రతికి రావడం నేను చూడ లేదు. చచ్చిన వాడు మరుజన్మ ఎత్తుతాడు కాని బ్రతుకుతాడని నమ్మడం చాదస్తం కాదా ! " అన్నది. గద్ద మాటలకు వెనుతిరిగిన వారితో నక్క " అయ్యలారా ! నా మాట వినండి పూర్వము శ్రీరాముడు ఒక బ్రాహమణుడి కుమారుడిని బ్రతికించి ఇవ్వలేదా ! నారదుడు **సృంజయుడి** కుమారుడిని బ్రతికించ లేదా ! అలాగే ఏ సిద్ధుడో, రాక్షసుడో దయ తలచి మీ బిడ్డను బ్రతికించ వచ్చు " అన్నది. ఇంతలో సూర్యాస్థమయం అయింది మహాశివుడు స్మశానవిహారార్ధం అక్కడకు వచ్చి వారిని చూసి " మీ కేమి కావాలి ? " అని అడిగాడు. వారు శివుడిని చూసి సాష్టాంగ పడి బాలుడిని బ్రతికించమని వేడుకున్నారు. వారి ప్రార్ధనలను ఆలకించిన శివుడు ఆ బాలుడిని బ్రతికించాడు. అతడిని శతాయువుగా దీవించి గద్దకు నక్కకు ఆకలి లేకుండా వరమిచ్చాడు. కనుక ధర్మరాజా ! ఆర్తుల కన్నీళ్ళు తుడవడం రాజు బాధ్యత. తమ పనులను చక్కబెట్టుకోవడానికి కపటంగా మాట్లాడే వారి మాటల నేర్పు గ్రహించి ప్రవర్తించాలి.

## మహావృక్షం

ధర్మనందనా నీకు మరొక కధ చెప్తాను శ్రద్ధగా ఆలకించు. హిమాలయ పర్వత శ్రేణువులలో ఒక పెద్ద మర్రిచెట్టు ఉంది. అది చాలా కాలం నుండి ఉంది కనుక శాఖోపశాఖలుగా విస్తరించి ఉంది. ఒక రోజు నారదుడు ఆ వృక్షముతో " వృక్షరాజమా ! ఇంత విశాలంగా విస్తరించి అనేక పక్షులకు ఆశ్రయం ఇస్తున్నావు. నీవు ప్రచండగాలులకు తట్టుకుని ఎలా నిలిచావు " అని అడిగాడు. ఆ మాటలకు ఆ వృక్షం గర్వపడి " మహాత్మా ! నా కున్న బలంలో పద్దెనిమిదో వంతు కూడా లేని వాయుదేవుడు నన్ను ఏమి చేయగలడు " అన్నది. నారదుడు " వాయు దేవుడి బలానికి పర్వతాలే విరిగిపడతాయి కదా ! ఈ లోకంలో వాయుదేవుడి మీద ఆధారపడని జీవులు ఎవరున్నారు " అన్నాడు. వృక్షం " ఇంతగా విస్తరించిన నన్ను ఎదుర్కొనడం వాయుదేవుడికి సాధ్యం కాని పని " అన్నది బూరుగ చెట్టు. ఈ విషయం నారదుడి ద్వారా విన్న వాయుదేవుడు వృక్షంతో " నా కంటే బలవంతుడివి అన్నావట నిజమేనా ? " అన్నాడు. వృక్షం " నిజమే నేను నీ కంటే బలవంతుడినే " అన్నది. వాయుదేవుడు నవ్వి " ఒక నాడు నీ నీడన బ్రహ్మదేవుడు విశ్రాంతి తీసుకుని నీకు కృతజ్ఞతలు చెప్పాడని నీవు విర్రవీగు తున్నావు. నా బలం ఏమిటో నీకు రేపు రుచిచూపిస్తాను " అని వెళ్ళాడు. బూరుగు ఆలోచనలోపడి " అనవసరంగా నారదుడితో వివాదపడి చిక్కుల్లో పడ్డాను. వాయుదేవుడి బలం ముందు నేనెంత? " అనుకుని రాత్రికి రాత్రి కొమ్మలను విరుగ కొట్టుకుని మోడులా నిలబడింది. మరునాడు అక్కడకు వచ్చిన వాయుదేవుడు " నేను చేయవలసిన పని నీకు నువ్వే చేసుకున్నావు " అని వెళ్ళి పోయాడు. కనుక ధర్మనందనా తనకంటే బలవంతుడితో పోటీ పడితే బలహీనుడు చెడిపోగలడు " అని భీష్ముడు చెప్పాడు.

## ధర్మజుని సందేహాలు

ధర్మరాజు " పితామహా ! పాపమునకు మూలం ఏది ? పాపం ఎక్కడ పుడుతుంది ? పాపం ఎలా ఉంటుంది ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మరాజా ! అన్ని పాపములకు మూలము లోభము. లోభానికి మూలం కోరికలు, కామవాంఛలు, కోపం, అసూయ, ద్రోహ చింతన, ప్రస్త్రీ వ్యామోహం, అత్యాశ, సిగ్గు లేమి, ఓర్పు లేమి మొదలైనవి లోభానికి కారణం. కనుక పాపం రాకుండా ఉండాలంటే లోభానికి దూరంగా ఉండాలి " అన్నాడు. ధర్మరాజు " పితామహా ! అన్ని ఆపదలకు, దుర్గతులకు మూలమైన అజ్ఞానం ఎలా ఉంటుంది ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మజా ! లోభం వలన అజ్ఞానం పుడుతుంది. అజ్ఞానం అన్ని ఆపదలకు మూలం కనుక లోభం వదిలితే అజ్ఞానం దానంతట అదే పోతుంది " అని చెప్పాడు. ధర్మరాజు " పితామహా ! ధర్మనందనా ! ధర్మములన్నింటికీ మూలం ఇంద్రియ నిగ్రహం. ఇంద్రియ నిగ్రహానికి జ్ఞానం తోడైతే ఉత్తమ గతులు లభిస్తాయి. ఇంద్రియ నిగ్రహంతో కామ, క్రోధ, మద, మాత్సర్యాలను జయంచి బ్రహ్మపదం చేరుకుంటాడు. సర్వ ధర్మాలకు తపస్సు మూలం, అహారం, నియమ నిబద్ధతతో చేయబడే తపస్సు వలన పాపములు హరించి సత్యము, శుచిత్వం కలిగి సకల కార్యములు సిద్ధిస్తాయి " అని భీష్ముడు చెప్పాడు. పితామహా ! దేవగణములు, పితృగణములు, బ్రాహ్మణులు సత్యవ్రతమును ప్రశంసిస్తుంటారు కదా ! ఆ సత్యవ్రతమును గురించి చెప్పండి? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! అన్ని ప్రాణులయందు సమానత్వం కలిగి ఉండడం ఇంద్రియ నిగ్రహం, ఓర్పు, ధైర్యము, నిజాయితీ కలిగి ఉండడం, యజ్ఞ యాగములు దాన ధర్మములు చెయ్యడం, పరోపకారం చెయ్యడం, ఈర్ష్య, ద్వేషం లేకపోవడం, అహింస ఇవన్నీ సత్వగుణాలు సత్యరూపాలు సత్యవ్రతాచరణ వలన యోగము, మోక్షము లభిస్తాయి. సత్యవ్రతానికి వేయి అశ్వమేధయాగాలు సాటిరావు " అని చెప్పాడు భీష్ముడు.

## అరిషడ్వర్గాలు

ధర్మరాజు " పితామహా ! కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు అవి ఎలాపుడతాయి వాటిని జయించే మార్గం ఏమిటి శలవివ్వండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! మన మనసులో మెదిలే భావాల నుండి కామం పుడుతుంది. కామస్వరూపం తెలుసుకుంటే కామంనశిస్తుంది. ఇతరులు మనపట్ల ప్రవర్తంచిన తీరుకు ఒక్కోచో కోపం ఉద్భవిస్తుంది. వారి ప్రవర్తన పట్ల ఓర్పువహించి కోపమును జయించాలి. మనకున్నది ఏదీ శాశ్వతంకాదు అని దృఢంగా అనుకుంటే లోభం మాయమౌతుంది. ధర్మప్రవర్తన వలన మోహం నశిస్తుంది, తోటివారంతా సమానమే అనుకుంటే మదంపోతుంది, సత్వగుణం వృద్ధి చేసుకున్న కొద్దీ రజో, తమో గుణాలు నశిస్తాయి. అరిషడ్వర్గాల జోలికి పోని మనుష్యుడికి శుభం కలుగుతుంది. మనుషులలో ధైర్యం లోపించినప్పుడు అరిష్డ్వర్గాలు పట్టి పీడిస్తాయి. వాటిని ధైర్యంగా ఎదిరించినవి దరిచేర లేవు " అన్నాడు. భీష్ముడు తిరిగి " ధర్మనందనా ! ధృతరాష్ట్రుడిపై ఆరు గుణాలు పుష్కలంగా ఉన్నాయి. అందుకే సర్వనాశనం అయ్యారు. నీకు ఆ ఆరుగుణాలు లేనందున్న నీకు విజయం ప్రాప్తంచింది. ఇతరులను హింసించే వాడు పైగుణాలు కలిగిన వారికంటే హీనుడు, నలుగురికి పెట్టి తినేవాడు ఈ లోకం లోను పైలోకం లోను పూజింపబడతాడు. తనకు తన కుటుంబముకు మూడు సంవత్సరాలకు సరిపడా ధనమును సేకరించిన వాడు యజ్ఞములు చేసిన ఫలము పొందుతాడు. ధనధాన్యములు, సిరిసంపదలు కలిగిన వైశ్యుడు యజ్ఞ యాగములు చేయకున్న రాజు ఆ ధనమును గ్రహించి బ్రాహ్మణుల చేత యజ్ఞములు చేయించాలి. తను తినక వేరొకరికి పెట్టక ఉన్న శూద్రుడి సంపదలోని సగ భాగమును పుణ్యకార్యములకు వినియోగించాలి. ఏ రాజ్యములోనైనా బ్రాహ్మణుడు పేద అయిన అది రాజు తప్పే కనుక రాజు బ్రాహ్మణులను కంటికి రెప్పలా కాపాడాలి. ఒక మంచివాడు చెడ్డ వాడితో కొంతదూరం పయనించినా, ఒక చోటకూర్చున్నా, భోజనంచేసినా, పానీయంసేవించినా మంచివాడు కూడా పతితుడు ఔతాడు. అబద్ధం చెప్పడం మహాపాపం అయినా ఆడువారి సమయంలో, వివాహ విషయంలో, పరిహాసంగా, మరణవార్త చెప్పడంలో, ధన, మాన, ప్రాణ రక్షణ కొరకు అబద్ధం చెప్పవలసి వస్తే దోషం ఉండదు. అమాయకుడి మీద నింద వేసిన వాడికి అ నిందకు వచ్చేఫలితం అనుభవించక తప్పదు. అకారణంగా తల్లి తండ్రులను వెడులగొట్టిన వాడు పాపాత్ముడు ఔతాడు " అని చెప్పాడు.

## నకులుని సందేహం

అప్పటికి వరకు అన్ని విషయములు శ్రద్ధగా వింటున్న ఖడ్గవిద్యా విశారదుడైన నకులుడు భీష్ముడిని కొన్ని ప్రశ్నలు అడిగాడు. " పితామహా ! ఆయుధములలో ధనస్సు ఉత్తమం కాని యుద్ధంలో ధనస్సు విరిగినప్పుడు ఖడ్గం ప్రశస్థం అంటారు. ఆ ఖడ్గవిద్యా ప్రశస్థం వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " నకులా !బ్రహ్మదేవుడు సృష్టించిన జీవులు బ్రహ్మదేవుడు నిర్ధేశించిన మార్గంలో జీవించసాగారు. కాని దైత్యులు దేవతలను, సాధువులను హింసించసాగారు. అప్పుడు బ్రహ్మదేవుడు వేయి సంవత్సరాలు తపస్సు చేసి ఆ పైన యాగం చేసాడు. ఆ యాగాగ్ని నుండి ఒక భయంకర భూతం ఆవిర్భవించింది.

దేవతలు, మునులు ఆ భూతాన్ని చూసి భయపడు తుండగా ఆ భూతం ఒక భయంకర ఖడ్గంగా మారి పోయింది. బ్రహ్మదేవుడు మనసులో శివుని తలుచుకోగానే ఈశ్వరుడు ప్రత్యక్షం కాగానే బ్రహ్మదేవుడా ఖడ్గాన్ని ఈశ్వరుడికి ఇచ్చాడు. ఈశ్వరుడు ఆ ఖడ్గంతో దైత్యులను సంహరించాడు. ఆ తరువాత ఈశ్వరుడు ఆ ఖడ్గమును, ఖడ్గవిద్యను విష్ణుమూర్తికి ఇచ్చాడు. ఆ ఖడ్గవిద్య అటు తరువాత విష్ణువు నుండి మారీచికి, **మారీచి** నుండి పరశురాముడికి, పరశురాముడి నుండి మునులకు, మునుల నుండి ఇంద్రుడు, ఇంద్రుడు దిక్పాలకులకు, దిక్పాలకులు మనువుకు ఉపదేశించ బడింది. మనువు నుండి ఆ విద్య వంశాను గతంగా దుష్యంతునకు, దుష్యంతుడి నుండి భరతుడికి వంశాను గతంగా వస్తూ చివరికి ద్రోణుడికి ఉపదేశించ బడింది. ద్రోణుడు మీ అందరికీ సమానంగా నేర్పినా ఆ విద్యలో నువ్వు ప్రావీణ్యం సంపాదించావు " అని చెప్పాడు.

## విదురుడు

అంతలో సూర్యుడు అస్తమించాడు. శ్రీకృష్ణుడు, ధర్మరాజాదులు భీష్ముడి వద్ద శలవు తీసుకుని తమ నివాసములకు వెళ్ళారు. రాజప్రసాదంలో విశ్రాంతిగా ఉన్న సమయంలో " ధర్మ, అర్ధ, కామ, మోక్షములలో ఉత్తమము, మధ్యమము, అయుధములు ఏవి ? నాకు వివరించండి " అని విదురుడిని చూసి అడిగాడు. విదురుడు ఇలా చెప్పసాగాడు. " ధర్మనందనా ! ధర్మంగా ధనం సంపాదించాలి. ఆ ధనంతో కోరికలు తీర్చుకోవాలి కనుక ఉత్తమమైనది ధర్మం. మధ్యము అర్ధము. అధమం కామము " అని చెప్పాడు. అప్పుడు అర్జునుడు " విదురా ! ధర్మ, కామములకు ధనం అవసరమని చెప్పారు కదా ! సన్యాసులకు కూడా తమ యజ్ఞయాగాది కార్యక్రమాలు నిర్వ హించడానికి అవసరమైన ధనం ఉత్తమమైనది కాదా ? " అని అడిగాడు. ఆ మాటలకు నకుల సహదేవులు " ధనము, ధర్మము ఒక దాని మీద ఒకటి ఆధార పడి ఉన్నాయి కనుక ఏ ఒక్కటి ఉన్నా లాభం లేదు. ధనం లేని వాడికి కామం తీరదు కదా ! " అని అడిగారు. విదురుడు " ధర్మము, అర్ధము పేటికదే సాటి. ఒక దాని మీద ఒకటి ఆధారపడి ఉంటాయి. ధనం ధర్మమార్గంలో సంపాదించాలి కనుక ధర్మమే ఉత్తమమైనది. పెరుగులో దాగి ఉన్న వెన్న మాదిరి కామము ధర్మ, అర్ధములలో దాగి ఉంటుంది. సుఖజీవనానికి కామము హేతువు. తుమ్మెద పూవులోని తేనె స్వీకరించిన విధంగా మానవుడు కామం వలన సుఖము పొందుతాడు. కనుక మూడూ ముఖ్యమైనవే అయినా కేవలం కామమును కోరుకునేవాడు అధముడు, అర్ధకామములతో జీవించే వాడు మధ్యముడు. ధర్మంగా ధనం సంపాదించి తద్వారా సుఖం పొందే వాడు ఉత్తముడు " అని చెప్పాడు. తరువాత ధర్మరాజు విదురుడిని, తన తమ్ములను చూసి " పుట్టిన ప్రతి వాడికి వార్ధక్యం తప్పదు. ఈ ధర్మార్ధ కామములు మొదట సంతోషం కలిగించినా తరువాత దుఃఖాన్ని కలిగిస్తాయి. కనుక మనిషి నాలుగవదైన మోక్షాన్ని కోరుకోవడం మంచిది. కాని మోక్షం లభించడం సులువు కాదు. కనుక మానవుడు ధర్మార్ధకామములను ఎక్కువ కాలం మనసున నిలుపక అంటీ ముట్టనట్లుండి మోక్షం కొరకు ప్రయత్నించాలి. సుఖాలతో మదము, దుఃఖత్వంతో దీనత్వం వస్తాయి. మానవుడు వీటికి లోను కాక మోక్షం కొరకు ప్రయత్నించాలి " అని ధర్మరాజు చెప్పాడు. ఆ గోష్టి అంతటితో చాలించి మర్నాడు యధా విధిగా భీష్ముని వద్దకు వెళ్ళారు.

## రాజుకు కావలసిన వారు

ధర్మరాజు " పితామహా ! రాజుకు కావలసిన వాళ్ళు ఎవరు అక్కరలేని వాళ్ళు ఎవరు ? వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఓర్పుగలవారు, ధర్మపరులు, సత్యంపలికే వారు, చంచల బుద్ధిలేని వారు, మదము, కోపం, లోభం లేనివారు, చతురతగా మాట్లాడి కార్యమును సాధించే వారు, తమ రాజుకు సకలసంపదలు చేకూర్చుతుంటారు. వీళ్ళంతా రాజుకు కావలసిన వాళ్ళు. క్రూరుడు, లోభి, ఆశపోతు, చాడీలు చెప్పేగుణం కలవాడు, మందబుద్ధులు, చేసినమేలు మరిచేవారు, అబద్ధాలు చెప్పేవారు, ఒకరితో నిందింపబడిన వారు, పిరికివారు, ధైర్యం లేనివారు, అవినీతిపరులు, దురలవాట్లకు బానిస అయినవారు రాజుకు నష్టం కలిగిస్తారు. వీరు అందరిలో చేసినమేలు మరిచేవారు పరమనీచులు. ఈ సందర్భంలో నీకు ఒక కథ చెప్తాను. ఒక బ్రాహ్మణుడు తన కులధర్మాన్ని వదిలి ఒక బోయవనితను వివాహం చేసుకున్నాడు. బోయవాళ్ళతో చేరి వేటసాగించి మాంసంతినడం లాంటి భోగములు అనుభవించ సాగాడు. మరింత ధనంసంపాదించవలెనన్న కోరికతో వైశ్యులతోచేరి పయనించసాగాడు. ఇంతలో ఒక ఏనుగు వారిని తరిమింది. వర్తకులంతా పారిపోయారు. ఆ బ్రాహ్మణుడు కూడా పరిగెత్తి ఒక మర్రిచెట్టు కిందకు చేరుకున్నాడు. ఆ చెట్టుకింద నాడీజంఘుడు అనే కొంగ నివసిస్తూ ఉంది. ఆ కొంగ బ్రాహ్మణుడితో " భూసురోత్తమా ! ఎక్కడి నుండి వస్తున్నారు. ఏ పనిమీద పోతున్నారు " అని అడిగాడు. అతడు " నేను గౌతముడి కుమారుడను నేను బ్రాహ్మణోచితమైన వేదాధ్యయనం చెయ్యకుండా వ్యామోహంతో ఒక బోయవనితను వివాహం చేసుకుని జీవిస్తున్నాను. అధికంగా ధనం సంపాదించాలని వర్తకులతో కలిసి పోతున్న సమయంలో ఏనుగు చేత తరమబడి ఈ చెట్టుకింద చేరాను " అని చెప్పాడు. నాడీజంఘుడు " బ్రాహ్మణోత్తమా ! బాధపడకు నేను నీ దారిద్ర్యాన్ని పోగొట్టగలను. ముందు నా ఆతిధ్యం నీవు స్వీకరించు " అని పక్కనే ఉన్న నదిలోనుండి చేపలు పట్టుకు వచ్చి కాల్చి పెట్టింది. బ్రాహ్మణుడికి అలవాటైన ఆహారం కనుక అవితిని తనఆకలి తీర్చుకున్నాడు. అప్పుడు నాడీజంఘుడు " మంచి స్నేహితుడు, వెండి, బంగారం, మంచి బుద్ధి ఈ నాలుగూ దారిద్ర్యమును పోగొడతాయి. ఈ నాలుగింటిలో మంచిమిత్రుడు గొప్ప వాడు. నేను

కశ్యపు కుమారుడను. నాతో మైత్రి కావించు నీకు ఐశ్వైర్యం కలుగుతుంది. ఇక్కడకు మూడు యోజనముల దూరంలో మధువ్రజపురం ఉంది. అక్కడ నా మిత్రుడు **విరూపాక్షుడు** అనే రాక్షస రాజు ఉన్నాడు. అతడి వద్దకు వెళ్ళి నేను పంపానని చెప్పు అతడు నీకు కావలసిన బంగారం, రత్నములు ఇస్తాడు " అని చెప్పింది. ఆ బ్రాహ్మణుడు విరూపాక్షుడి వద్దకు వెళ్ళి తనను నాడీజంఘుడు పంపాడని చెప్పి తనకు ధనసంపద కావాలని అడిగాడు. అతడిని చూడగానే అతడు నీచుడని గ్రహించిన విరూపాక్షుడు " మిత్రమా ! నీవు ఎవరవు నీకుల మేమిటి ? " అని అడిగాడు. ఆ బ్రాహ్మణుడు తనను గురించి చెప్పుకున్నాడు. విరూపాక్షుడు మనసులో " ఇతడు ఎలాంటి వాడైతే నా కేమి ఇతడు నాడీజంఘుని మిత్రుడు అదే ఇతడి అర్హత. ఇతడికి కావలసిన ధనం ఇస్తాను. " అని అనుకున్నాడు. ఆ మరునాడు కార్తిక పౌర్ణమి. వేల కొలది బ్రాహ్మణులు విరూపాక్షుడి వద్దకు వచ్చారు. విరూపాక్షుడు వారికి భోజనం పెట్టి బంగారం, వెండి కానుకలు ఇచ్చి పంపాడు. వారితో చేర్చి ఆ బ్రాహ్మణుడికి కూడా భోజనం పెట్టి ఎన్నో కానుకలు ఇచ్చాడు. ఆ కానుకలను మోయ లేక మోస్తూ అతడు నాడీజంఘుడి వద్దకు వచ్చాడు. అతడి మాటలు విని నాడీజంఘుడు తన మాట మన్నించి బ్రాహ్మణుడి దారిద్ర్యాన్ని పోగొట్టిన విరూపాక్షుడిని తలచుకుని సంతోషించాడు. ఆ రాత్రికి బ్రాహ్మణుడు అక్కడే నిదురించాడు. సగంరాత్రిలో బ్రాహ్మణుడు తనలో " నా వద్ద ధనం ఉంది కానీ రేపటికి ఆహారం లేదు " అనుకుని ఒక కర్ర తీసుకుని అక్కడే నిద్రిస్తున్న నాడీజంఘుడి తల పగుల కొట్టి ముక్కలుగా నరికి మూట కట్టాడు. ఇంతలో తెల్లవారింది విపూరాక్షుడి మనసులో కలత రేగింది. ప్రతి రోజూ తన వద్దకు వచ్చే నాడీజంఘుడు ఈ రోజు రాలేదు ఆ నీచుడైన బ్రాహ్మణుడు నాడీజంఘుడికి ఏదైనా అపకారం తలపెట్టాడేమో ? అనుకుని నాడీజంఘుడి వద్దకు భటులను పంపాడు. ఆ భటులు అడవిలో ఉన్న బ్రాహ్మణుడిని అతడి చేతిలోని మాంసపు మూటను చూసారు. వారు ఆ బ్రాహ్మణుడిని పట్టుకుని విరూపాక్షుడి ముందు నిలబెట్టారు. విరూపాక్షుడు మూటలో ఉన్నది నాడీజంఘుడి శరీరానికి చెందినవి అని తెలుసుకుని కోపించి చేసిన మేలు మరచిన ఈ విశ్వాసఘాతకుడిని భక్షించండి " అని ఆజ్ఞాపించాడు. భటులు " అయ్యా ! ఈ పాపాత్ముడిని చంపి తిన్న మాకు పాపం చుట్టు కుంటుంది" అన్నారు. విరూపాక్షుడు " తింటే తినండి లేకున్న లేదు చంపిపారేయండి " అన్నాడు. భటులు ఆ బ్రాహ్మణుడిని కొట్టిచంపి శరీరాన్ని పారవేశారు. అతడి మాంసం ముట్టడానికి కుక్కలు కూడా దగ్గరకు రాలేదు. విరూపాక్షుడు నాడీజంఘుడి శరీరానికి అంత్యక్రియలు నిర్వహించాడు. ఇంతలో అక్కడకు వచ్చిన ఇంద్రుడిని చూచి విరూపాక్షుడు నాడీజంఘుడిని బ్రతికించమని కోరాడు. ఇంద్రుడు " విరూపాక్షా ! నాడీజంఘుడు నీకే కాదు బ్రహ్మదేవుడికి కూడా స్నేహితుడే ! నీవే కాదు బ్రహ్మదేవుడు కూదా అతడి కొరకు విచారిస్తున్నాడు. అటుచూడు నాడీజంఘుడి చితాభస్మం మీద ఒక ఆవు తన దూడకు పాలను ఇస్తుంది. అప్పుడు చిందిన పాలనే అమృతధారలకు నాడీజంఘుడు తిరిగి జీవించాడు చూడు " అన్నాడు. ఇంతలో అక్కడకు వచ్చిన నాడీజంఘుడు చావు బ్రతుకుల్లో ఉన్న బ్రాహ్మణుడిని చూసి అతడిని విడిపించమని విరూపాక్షుడిని కోరాడు. అతడిని విడిచిపెట్టి అతడి బంగారాన్ని కానుకలను అతడికి ఇచ్చి పంపాడు విరూపాక్షుడు. కనుక బ్రహ్మహత్య చేసిన వాడికైనా విముక్తి ఉంటుంది కాని మిత్రుడికి చేసే విశ్వాసఘాతుకానికి నిష్కృతి లేదు. మంచిమిత్రుడు ఈ లోకానికే కాదు పరలోకానికి కూడా సహకరిస్తాడు. ధనము, మిత్రులలో మిత్రుడే గొప్పవాడు. కనుక ఉత్తమ గుణసంపన్నుడు, ఉత్తమకులజుడైన మిత్రుడు అన్ని విధాలా శ్రేష్టుడు " అని చెప్పాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక |

విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి |

యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | దృపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

"http://te.wikipedia.org/w/index.php?title=శాంతి_పర్వము_తృతీయాశ్వాసము&oldid=760943" నుండి వెలికితీశారు

వర్గం: మహాభారతం

---

- ఈ పేజీకి 08:02, 25 సెప్టెంబర్ 2012న చివరి మార్పు జరిగినది.
- 

# శాంతి పర్వము చతుర్ధాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# చతుర్ధాశ్వాసం

వైశంపాయనుడు జనమేజయునకు మహాభారత కధను చెప్పసాగాడు. భీష్ముడు ధర్మరాజుతో నాకు తెలిసిన అన్ని విషయాలు చెప్పాను. నీకు ఇంకా ఏవైనా సందేహాలు ఉంటే అడుగు. నాకు తెలిసినంత వరకు నీకు అన్ని విషయాలు చెప్పాను.

## ఉత్తమ ధర్మము

ధర్మరాజు " పితామహా ! ఇప్పటి వరకు రాజోచితప్రవర్తన, ధర్మాలు తెలియ చెప్పారు. ఇక ప్రజల మంచిచెడులు వారి ధర్మాలు వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! లోకంలో ధర్మం పలువిధముల విస్తరించి ఉంది. అన్ని ధర్మములు అనుసరించ తగినవే అయినా తత్వం తెలిసినవారు మాత్రమే మోక్షమే ఉత్తమమార్గమని చెప్తారు. ఇష్టం, అయిష్టం మరచి ద్వందాతీతంగా సంపదను అనుసరించడమే మోక్షమార్గం. ఇందుకు ఉదాహరణగా నీకొక కధ చెప్తాను. పూర్వం **సేనజిత్తుడు** అనే మహారాజుకు పుత్ర వియోగం కలిగింది. అతడి వద్దకు ఒక ఆప్తుడైన బ్రాహ్మణుడు వచ్చి " మహారాజా ! చింతించడం ఎందుకు పుట్టిన వారికి మరణం తప్పదు. నీ కుమారుడికి మాత్రమే మరణం సంప్రాప్తించిందా ! మూర్ఖత్వంతో ఇలా ఎందుకు చింతిస్తున్నావు ? " అని పలికాడు. మహారాజు " మరి ఈ దుఃఖం పోవాలంటే ఏమి చేయాలి " అని అడిగాడు. బ్రాహ్మణుడు " మహారాజా ! నదీప్రవాహములో ఎన్నో దుంగలు కొట్టుకుని పోతున్నాయి. వాటిలో రెండు దగ్గరకు చేరుతాయి. కొంచెం దూరం పోగానే తిరిగి విడిపోతాయి. భార్యా, పుత్రులు, బంధువులు కూడా అంతే జీవితంలోకి వస్తుంటారు, పోతుంటారు. కనుక శాశ్వతంకాని ఈ శరీరాల కొరకు చింతించడం మూర్ఖత్వంకాదా ! నీ శరీరమే నీ స్వాధీనంలో ఉండదు. ఏది ఎప్పుడు రోగగ్రస్థమౌతుందో నీకు తెలియదు. ఎప్పుడు శాశ్వతంగా పోతుందో నీకు తెలియదు. ఇక భార్యా, పుత్రుల గురించి మోహం ఎందుకు ? మోహం లేనప్పుడు చింత లేదు. మానవునికి సుఖం, దుఃఖం ఒక దాని వెంట ఒకటి వస్తూపోతూ ఉంటాయి. సుఖమూ నిలువదు దుఃఖం నిలువదు. వివేకులు సుఖం వచ్చినప్పుడు పొంగి పోరు. దుఃఖం వచ్చినప్పుడు కుంగి పోరు. మనిషి నాది అనుకున్న వస్తువు దూరమైనప్పుడు దుఃఖిస్తాడు. నాది అన్న సంగం వదిలినప్పుడు దుఃఖం లేదు కదా ! పూర్వజన్మ సంస్కారం అనుసరించి సంయోగ వియోగములు సంభవిస్తాయి. పండితుడికి, పామరుడికి కర్మఫలములు ఒకటిగానే సంభవించినా పండితుడు వాటికి కలతచెందడు. పామరుడు దానిలో లీనమౌతాడు. కనుక ద్వందాతీతంగా ఇష్టం, అయిష్టం వదిలి సుఖదుఃఖాలకు చలించక ప్రవర్తించిన చింతలు ఉండవు. దీని గురించి పింగళ అనేవేశ్య ఇలా చెప్పింది. **పింగళ** ఒక సారి తన ప్రియుడి కొరకు ఎదురు చూస్తూ ఉంది ఎంతకీ అతడు రాకపోయేసరికి తనలో " నేను ప్రియుడి కొరకు ఎదురు చూస్తూ పిచ్చిదాన్ని అయ్యాను. కాని అతడు ఇలా పిచ్చి వాడు కాలేదుకదా ! అలాంటి వాడికొరకు నేను ఎందుకు బాధపడాలి. కనుక నేనిక కళ్ళుమూసుకుని నిద్రపోతాను. నా వద్దకు రాని వాడికొరకు బాధపడే కంటే వచ్చిన వాడే ప్రియుడను కోవడం మంచిది. రానివాడి మీద ఆశపెట్టుకుని కుంగిపోతూ పిచ్చిదానినై సర్వనాశనం అయ్యేదాని కంటే

ఆశవదులుకుని ఉన్న దానితో తృప్తిపడుతుంటాను. కనుక మహారాజా ! లేని దాని కొరకు బాధపడక ఉన్న దానితో సుఖంగా జీవించు. ధర్మనందనా ! ఈ కథలోని అంతరార్ధం గ్రహించి ఉన్నదానితో తృప్తిపడడం నేర్చుకో తృప్తినిమించిన సుఖం, సంపద మరొకటి లేదు.

## ప్రళయం

ధర్మరాజు " పితామహా ! ఈ లోకంలోని జీవజాలం అంతా నశిస్తుందని అనిపిస్తుంది. అలాంటి సమయంలో జనులు ఏమి చేయాలి ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఇందు కొరకు నీకు ఒక కథ చెప్తాను విను. ఒక ఊళ్ళో ఒక బ్రాహ్మణుడు ఉన్నాడు. అతడికి **మేధావి** అనే కుమారుడు ఉన్నాడు. అతడు వేదవేదాంగములు అభ్యసించాడు. ఒక రోజు మేధావి తండ్రితో " తండ్రీ వయసు పెరిగే కొద్దీ జనులకు ఆయుష్షు తగ్గుతుంది కదా ! ఈ విషయంలో జనులు ఎలా ప్రవర్తించాలి ? " అని అడిగాడు. ఆ బ్రాహ్మణుడు " కుమారా ! తరుణ వయసులో వివాహం చేసుకుని సంతానం పొంది యజ్ఞ యాగాదులు చేయాలి. తరువాత వానప్రస్థం స్వీకరించి తుదకు మోక్షం పొంద వచ్చు. జనులు ఇలా ప్రవర్తించి మృత్యువును జయించాలి. " అని చెప్పాడు. కుమారుడు " తండ్రీ ! నీవు మృత్యువు, నీ ఆధీనంలో ఉన్నట్లు మాట్లాడుతున్నావు. మానవుడు తల్లిగర్భం నుండి బయట పడి నాటి నుండి మృత్యువు నిత్యమూ వెన్నంటి ఉంటూ ఎప్పుడు కబళించాలా అని ఎదురుచూస్తూ ఉంటుంది. మానవుడి ఆయుషు సదా ఎండపడి మడుగులోని నీరు ఆవిరై పోతున్నట్లు తరుగుతూ ఉంటుంది. ఇక భార్యాబిడ్డల వ్యామోహంలో ఉన్న వాడికి మృత్యువు ఎప్పుడు కబళిస్తుందో ఎరుగజాలడు. జరిగింది తలుస్తూ జరగబోయే దానికి ప్రణాళికలు వేసే వాడికి మృత్యువు జాడ తెలియనే తెలియనిది. మనిషి కాలం ఆధీనంలో ఉన్నాడు కాని కాలం మనిషి ఆధీనంలో లేదు. మృత్యువుకు స్వపరబేధాలు ఉండవు. బాలుడా, ముదుసలా, స్త్రీయా, పురుషుడా, మేధా, మూర్ఖుడా, ధనికుడా, పేద వాడా అన్న బేధం లేదు. మృత్యువు అందరినీ సమానంగా కబళిస్తుంది. లోకంలో జీవిస్తున్న ప్రతి జీవిని కబళించడానికి ప్రయత్నిస్తున్న మృత్యువుని చూసి జంకక మోహంవదిలి సంసార బంధాలను తెంచి వేయాలి. కనుక నాదన్నది త్యజించి లోకం అసత్యం అని గ్రహించి మృత్యువును జయించాలి. అంతే కాని పెళ్ళి చేసుకుని పిల్లలను కని యజ్ఞయాగాదులు చేసి వానప్రస్థం స్వీకరించి మోక్షపదం చేరవలసిన అవసరం లేదు. యజ్ఞ, యాగాదులలో జీవహింస ఉంటుంది. నేను యజ్ఞం చేస్తున్నాను అన్న అహంకారం ఉంటుంది కనుక అది మోక్షమార్గం కాదు. మనస్సు, వాక్కును శరీరాన్ని నియమబద్ధంగా నిగ్రహించి మోక్షాన్ని పొందాలి. అమృత తుల్యమైన ఆనందం పొందాలంటే అరిష్వర్గాలను వదిలి ప్రాంపంచిక వ్యవహారాలను మరచి ధ్యాననిమఙ్జుడై నిన్ను గురించి నువ్వు తెలుసుకో " మేధావి తండ్రికి చెప్పాడు. కనుక ధర్మనందనా ! ఈ తండ్రి కుమారుల సంవాదం నుండి నీకు నీవుగా ధర్మ సూక్ష్మం గ్రహించి మోక్షాన్ని పొందు " అని చెప్పాడు.

## సంపద సుఖం

ధర్మరాజు భీష్ముడితో " పితామహా ! లోకంలో ధనికులు, పేదవారు ఉన్నారు కదా ! ఎవరు ఎక్కువగా సుఖపడుతున్నారు ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ధనవంతులు పేదవాళ్ళను త్రాసులో ఉంచి తూచినప్పుడు ముల్లు పేదవారి వైపే మొగ్గుతుంది. సంపన్నులకు పేదవారికి ఉన్న గుణదోషాలు చెప్తాను విను. ధనము, సంపద, ఆస్తులు కలిగిన వాడు ఎప్పుడూ తనసంపదను ఎవరు దోచుకుంటారో అని కలతచెందుతూ ఉంటాడు. ఎప్పుడూ మృత్యు ముఖంలో ఉన్నట్లు అశాంతిగా ఉంటాడు. ధనవంతుడు ఉన్నది చాలక అత్యాశకు పోయి మనసు వికలం చేసుకుంటాడు. ధనాన్ని కాపాడు కోవడానికి నిరంతరం చింతిస్తుంటాడు. ధనకారణంగా ఎప్పుడూ ఆగ్రహానికి గురి ఔతాడు. కనుక ధనవంతులకు సుఖం దొరకడం కఠినమే. ధనంలేని వాడు స్వతంత్రుడు, నిర్భీతికలవాడు, ఆగ్రహం రానివాడు, సకల ప్రదేశములలో సంచరించ గలవాడు. మోసం చేయాలన్న ఆశలేక, అత్యాశలకుపోక ప్రశాంత చిత్తతంతో ఉండగలడు. కనుక పేదవాడే సుఖవంతుడు. ధనం చంచలమైనది కనుక తరిగి పోతూ ఉంటుంది. కనుక అది దుఃఖ కారకం. ధనం శాశ్వతం కాదని తెలుసుకుని దాని మీద వ్యామోహం విడిచిన వాడు సుఖవంతుడు.

## ధనతృష్ణ

ధర్మరాజు " పితామహా ! ధనతృష్ణతో కొట్టుకులాడే జీవి ఎప్పుడు సుఖాన్ని పొందగలడు. భీష్ముడు " ధర్మజా ! ధనము సంపాదించిసంపాదించి విసుగుపుట్టి ధనంసంపాదించడం మానుకున్నప్పడే మానవుడికి సుఖం కలుగుతుంది. ఈ సందర్భంలో నీకు ఒకకథ చెప్తాను. ఒక ఊరిలో **మంకి** అనే బ్రాహ్మణుడు ఉండే వాడు. అతడికి ధాపేక్ష అధికం. అందు వలన అతడు రెండు కోడెదూడలను కొని వాటిని తాళ్ళతోబంధించాడు. ఒక రోజు అవి తాళ్ళతో కలిసి పారిపోయాయి. అవి పడుకుని ఉన్న ఒంటెను దాటబోయే సమయానికి అది పైకిలేచి నిలబడిన కారణంగా కోడెదూడలు వాటిమెడకు కట్టిన తాళ్ళకారణంగా

దూడలు చనిపోయి ఒంటె మెడకు రెండు వైపులా వేలాడసాగాయి. అది చూసిన బ్రాహ్మణుడు హడలిపోయి తాను ప్రేమగా పెంచుకున్న దూడలు చనిపోవడం చూసి అక్కడ చేరిన జనులతో " అయ్యలారా ! నేను నా ప్రతిభతో ధనం సంప్రదించాలి అనుకున్నాను అది సాధ్యంకానిది అని తేలి పోయింది. మానవుని ఉన్నతికి దైవానుగ్రహం ఉండాలికాని మానవ ప్రయత్నాలు ఎన్ని చేసినా అవివ్యర్ధమేకదా ! కనుక దైవం మీద భారంవేసి మన ప్రయత్నాలు చేయాలి. కోరికవదలక ఉన్న సుఖం ఉండదు. కోరికలకు మూలం మనస్సంకల్పం. మనస్సులో సంకల్పం లేకుండా ఉండాలంటే ఇంద్రియ నిగ్రహం కావాలి. కోరికలు లేకున్న ధనంతో పని లేదు. కనుక ధనాపేక్ష లేని వాడు ప్రశాంత మనస్కుడై ఉంటాడు. ధనం సంపాదించే కొలదీ తృష్ణ పెరుగుతుంది, దానిని దాచాలన్న తాపత్రయం కలుగుతుంది. కనుక అంతు లేని కోరికలను వదిలిన శాశ్వత ప్రశాంతత పొందగలడు. నేను ధన సంపాదనాపేక్షతో తెచ్చిన దూడలు చనిపోగానే నా లోని ధనాపేక్ష తగ్గింది. నాలో ధనతృష్ణ తగ్గింది, ఇంద్రియ నిగ్రహం కలిగింది, నాలో సహనం కలిగింది, ఇక నాకు లోభం అంటదని సమాధానపడి శేషజీవితం ప్రశాంతంగా గడిపాడు.

## దుఃఖ విముక్తి

ధర్మరాజు " పితామహా ! మానవుడు దేనిని ఆచరించిన సమస్త దుఃఖములనుండి విముక్తి పొందగలడు " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నేను నీకు అజగర కధచెప్తాను. పూర్వము ప్రహ్లాదుడు ఒక బ్రాహ్మణుడిని చూసి తనకు శమము గురించి చెప్పమని అడిగాడు. అందుకు ఆ బ్రాహ్మణుడు " మహారాజా ! ఈ చరాచర జగత్తులో అనుదినము ఏ నిమిత్తము లేకుండా ఎన్నో ప్రాణులు పుడుతున్నాయి, చనిపోతున్నాయి. అందులో మానవులూ ఉన్నారు. ఏ ప్రాణి శాశ్వతం కాదు. ప్రాణం శాశ్వతం కాదని తెలిసీ, మానవులు మరణానికి కలత చెందుతారు. నదులకు వరదలు వచ్చినప్పుడు ఎన్నో దుంగలు కొట్టుకు వస్తాయి. అవి ఒక్కొక్కసారి కలుస్తూ తిరిగి కొంతదూరం పోయి విడిపోతాయి. ఈ సృష్టిలో భార్యాభర్తలు బంధుమిత్రులు అలాగే కలుస్తూ విడిపోతుంటారు. ఈ సత్యం తెలిసిన వాడు సుఖదుఃఖాలకు అతీతుడు అయి శాశ్వత ఆనందం పొందగలడు. నేను సుఖదుఃఖాలకు అతీతుడను కనుక నన్ను అడిగి నీ సందేహాలు తీర్చుకుంటున్నావు. నేను, నాకు మేలు జరగాలని ఎన్నడూ కోరను. దుఃఖం వచ్చిన కలత పడక దానిని పోగొట్టడానికి ప్రయత్నిస్తుంటాను. నేను ఆహారంలో రుచికి ప్రాధాన్యత ఇవ్వక ఏది దొరికినా తింటాను. మృదువైన శయ్యమీద కటిక నేలమీద సమభావంతో నిద్రించగలను. పట్టువస్త్రాలు, నారచీరలు ఏవైనా ధరించగలను. ఏదీ నాకుగాకోరను. లభించినది ఏదైనా తృప్తి చెందగలను. అజగరవ్రతం స్వీకరించి నన్ను వెదుకుతూ వచ్చినది మాత్రం స్వీకరించి ప్రశాంత చిత్తతతో ఉంటాను. తృప్తి, శుభ్రత, ఓర్పు, అంతటా సమభావం, అంతర్దృష్టి ఇదే **అజగరవ్రతం** . ఇది యజ్ఞయాగాదుల వలన లభించదు. ఆత్మజ్ఞానం వలననే ఇది లభించ గలదు. అజగరవ్రతం ఆచరించే వారికి పాపము అంటదు, భయము ఉండదు, శోకముచేరదు, మోక్షము అతడికి దగ్గరగా ఉంటుంది " అని ప్రహ్లాదుడికి బ్రాహ్మణుడు చెప్పాడు.

## కీర్తిప్రతిష్టలు

ధర్మరాజు " పితామహా ! తానుచేసే కర్మఫలం, తనకున్న సిరిసంపదలు, తనకు ఉన్న బుద్ధిబలం, బంధువులకు ఉన్న సిరి సంపదలు వీటిలో వేటి వలన మానవుడికి కీర్తి ప్రతిష్టలు కలుగుతాయి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! మానవుడు తన స్వయం ప్రజ్ఞవలన మాత్రమే కీర్తిప్రతిష్టలు పొందగలడు. కనుక మానవుడికి ప్రజ్ఞ అత్యవసరం. ప్రజ్ఞవలనే మానవుడికి కార్యసఫలత కాగలదు. **బలి**, ప్రహ్లాదుడు, మంకి తన ప్రజ్ఞ వలనే తమ సమస్యలకు పరిష్కారం వెతికి కీర్తిప్రతిష్టలు పొందారు. **కాశ్యపుడు** అనే బ్రాహ్మణుడు ఒకసారి ఒక గంధర్వుడు తోలే రధంతగిలి కిందపడి ఆ అవమాన భారంతో కుమిలి పోతూ ఆత్మహత్యా ప్రయత్నానికి పూనుకున్నాడు. అప్పుడు ఇంద్రుడు ఒక నక్క రూపంలో వచ్చి అతడికి ప్రజ్ఞకలిగించి ఆత్మహత్యా ప్రయత్నం మాన్పించాడు. కనుక మానవుడికి ప్రజ్ఞ ఉండడమే శ్రేష్టం " అని భీష్ముడు చెప్పాడు.

## పుణ్యకార్య ఫలం

ధర్మరాజు " మానవుడు తన దైనందన జీవితంలో దానాలు, ధర్మాలు, తపసు, తల్లితండ్రులకు పెద్దలకు సేవ చేయడం అత్యం నిష్టతో ఒక యజ్ఞంలా చేసినప్పుడు అవి మానవుడికి ఏ రూపంలో ఫలితాన్ని ఇస్తాయి. వివరంగా చెప్పండి " అని అడిగాడు. ధర్మరాజా ! మేలు మీద మేలు కీడు వెంట కీడు ఒక దాని వెంట ఒకటి వస్తుంటాయి పోతుంటాయి. ఒక మనిషి పాపం చేసినట్లైతే ఒక కష్టం వెంట ఒకటి వస్తూనే మనిషిని దారుణంగా దెబ్బ తీస్తుంటాయి. అదే మనిషి పుణ్యాత్ముడైతే అతడికి సుఖం వెంట సుఖం వస్తూనే ఉంటుంది కనుక నిరంతర సుఖసంతోషాలలో మునిగి తేలుతుంటాడు. ధాన్యంలో తాలుగింజలు ఉన్నట్లు మనుష్యులలో పాపాత్ములు ఉంటారు. వారు సమాజానికిపనికిరారు . కాని హానిచేస్తుంటారు. మనిషి చేసిన

పాపపుణ్యాలు నిరంతరం అతడిని వెన్నంటి ఉంటాయి. ఈ లోకంలో ఉన్నంత వరకు అతడు చేసిన పాపపుణ్యాలు అతడిని వెన్నంటడమే కాక చనిపోయిన తరువాత కూడా పాపపుణ్యాలు వాసనల రూపంలో అతడి వెంటవెడతాయి కనుక మనిషి బ్రతికి ఉన్నా చనిపోయినా పాపపుణ్యాల నుండి తప్పించుకో లేడు. తగిన ఋతువులలో చెట్లు చిగిరించి పుష్పించి కాయలు కాసి పండ్లుగా మారిన విధంగా మనిషి చేసిన పాపపుణ్యాలు తమ ఫలాలను కష్టసుఖాలను కలిగిస్తాయి. సాధారణంగా మానవులు మంచిప్రవర్తన కలిగి ఉంటారు. ధాన్యంలో తాలుమాదిరి అక్కడక్కడా దుర్మార్గులు ఉండి ఓర్పు వహించేవారిని, మంచి ప్రవర్తన కల వారిని చేతగాని వారిలా పరిగణిస్తారు. మంచి వారువారి మాటలు పట్టించుకొనక సన్మార్గంలో ప్రవర్తిస్తూ ఫలితంగా సుఖాన్ని పొందుతారు. కనుక ధర్మనందనా ! న్యాయధర్మాలు ఆచరించే వారు తప్పక ఫలితాన్ని పొందగలుతారు " అని చెప్పాడు భీష్ముడు.

## భూతసృష్టి

ధర్మరాజు " పితామహా ! ఈ భూతసృష్టి ఎలా జరిగింది. ఎవరి వలన జరిగింది వివరించండి " అని అడిగాడు. ధర్మనందనా ! ఈ విషయం ఇంతకు ముందు **భృగుమహర్షి** భరద్వాజుడికి వివరించాడు. ఇప్పుడు నేను నీకు చెప్తాను. సర్వవ్యాపి ఆది, అంతం లేని విష్ణువు సృష్టిచేయ సంకల్పించి తననుండి వెయ్యోవంతు భాగంతో అవ్యక్తం అనే పదార్థాన్ని సృష్టించాడు. అవ్యక్తమునుండి మహత్తత్వం అనే ప్రకృతితత్వం పుట్టింది. ఆ ప్రకృతిలోనుండి ఒక పద్మం పుట్టింది. పద్మం నుండి బ్రహ్మ ఉద్భవించాడు. ఆ బ్రహ్మదేవుడి సంకల్పంతో ఆకాశం ఉద్భవించింది. తరువాత ఆకాశంనుండి జలం ఉద్భవించింది. జలం నుండి అగ్ని ఉద్భవించింది. అగ్ని నుండి వాయువు ఉద్భవించింది. అగ్నివాయువుల సమ్మిళితంగా భూమి పుట్టింది. పంచభూతములు బ్రహ్మ అందు ఉన్నాయి. కనుక ఈ భూమి అంతా బ్రహ్మమే. కొండలు పర్వతములు బ్రహ్మకు ఎముకలు, భూమి మాంసము, సముద్రాలు నదీనదాలు బ్రహ్మదేవుడి రక్తం. ఆకాశం బ్రహ్మఉదరం, వాయువు అతడి ఉచ్వాసనిశ్వాసాలు, అగ్ని అతడి తేజస్సు, సూర్య చంద్రులు బ్రహ్మదేవుడి కళ్ళు, ఊర్ధ్వలోకం బ్రహ్మశిరస్సు, పాతాళము బ్రహ్మదేవుడి పాదాలు, నాలుగు దిక్కులు బ్రహ్మదేవుడి నాలుగు చేతులు ఇలా అనంతుడైన విష్ణువు నుండి ఈ ప్రకృతి ఉద్భవించింది. అప్పుడు **భరద్వాజుడు** పంచభూతములు రూపం ఏమిటి ? వాటి పరిమాణం ఏమిటి ? " అని అడిగాడు. **భృగువు** " ఒక పదార్థము నుండి పుట్టిన పదార్ధం ఆ పదార్ధం పోలి ఉంటుంది. అలాగే సర్వవ్యాపి, అనంతుడు అయిన విష్ణువు నుండి పుట్టిన ప్రకృతి పంచభూతములు విష్ణు స్వరూపంలాగే ఉండి అంతటా వ్యాపించి ఉంటాయి. చెట్టు నుండి చెట్టు, పక్షి నుండి పక్షి, జంతువు నుండి జంతువు పుడతాయి. అలా పుట్టిన సర్వమూ తాను దేని నుండి పుట్టాయో దాని స్వరూపంతో ఉండం ప్రకృతినియతి. అలాగే అనంతుడైన విష్ణువు నుండి పుట్టిన పంచభూతములు విష్ణు వలెనే సర్వత్రావ్యాపించి ఉంటాయి " అని భృగువు చెప్పాడు.

## బ్రహ్మ పుట్టుక


బ్రహ్మ పుట్టుక

భరద్వాజుడు భృగుమహర్షిని " మహర్షీ ! బ్రహ్మ పద్మమునుండి పుట్టాడు కదా ! అంటే బ్రహ్మ కంటే ముందే పుట్టిన పద్మాన్ని ఎవరు పుట్టించారు ? ఎలా పుట్టింది ? " అని అడిగాడు. **భృగువు** " భరద్వాజా ! సర్వవ్యాపి అయిన విష్ణుమానస పుత్రుడు ఆద్యుడు. బ్రహ్మకు ఆసనంగా పద్మము పుట్టింది అంతే కాని ఈ సృష్టిలో ముందు వెనుకలు లేవు. పద్మము అంటే మనం అనుకునే పద్మముకాదు పద్మము అంటే భూమి. భూమిపైన ఉన్న ఎత్తైన మేరుపర్వతం పద్మానికి కర్ణిక. పద్మము నుండి సమస్త చరాచర జగత్తు ఉద్భవించింది " అని భృగువు చెప్పాడు. **భరద్వాజుడు** " మహర్షీ ! పంచభూతాలు దేని నుండి ఉద్భవించాయి ? అవి అయిదురూపాలుగా ఎలా మారాయి ? " అని అడిగాడు. భృగువు " భరద్వాజా ! వాయువు నిరంతరం కదిలేది. చైతన్య రూపమైన ఆకాశం శబ్దస్వరూపం. నీరు ద్రవస్వరూపము. అగ్ని వేడిమికి వెలుతుకు ప్రతీక. భూమి ఘనస్వరూపముకు ప్రతీక. వీటి అయిదింటి వలన సృష్టి ఏర్పడింది. ఈ సృష్టిలో ఉన్నవి రెండుజాతులు. ఒకటి స్థావరం అంటే స్థిరమైనవి. రెండవది జంగమములు అంటే జీవముతో కదిలేవి.

### పంచభూతముల గుణాదులు

భరద్వాజుడు " మహర్షీ ! పంచభూతములు ఎలా ప్రవర్తిస్తాయి " అని అడిగాడు. భృగువు " భరద్వాజా ! కదలని వాటికి ప్రతీక అయిన చెట్టు పిడుగుపాటుకు అల్లాడుతుంది కనుక వృక్షాలకు వినికిడిశక్తి ఉన్నట్లేకదా ! గాలికి అనుకూలంగా కదులుతుంది కనుక వృక్షం గాలినిగ్రహిస్తుంది. సూర్యరశ్మి ఉన్న వైపుగా పెరుగుతుంది కనుక వృక్షానికి వెలుతురును గ్రహించే శక్తిఉంది. వేళ్ళతో నీటిని గ్రహించిన వృక్షం అన్ని భాగాలకు సరఫరా చేస్తుంది కనుక వృక్షాలకు నీరుతాగే గుణం ఉంది. వృక్షం సుగంధపూరితమైన పుష్పాలను పుష్పించి కాయలు పండ్లు ఇస్తుంది కనుక వృక్షానికి భూమికి ప్రతీక అయిన ఘ్రాణశక్తి ఉంది. అలాగే కొండలు, పర్వతాలలో కూడా పంచభూత లక్షణాలు ఉంటాయి.

## రసము వాసనా తేజము గురించి వివరించండి


భృగుమహర్షితో భరద్వాజుని ప్రశ్నోత్తరాలు

" పంచభూతగుణాలైన రసము, వాసనా, తేజము వేటిలో ఉంటాయి. వాటిని ఎలా అనుభవిస్తారు " అని అడిగాడు. **భృగువు** " భరద్వాజా ! విషయములు, ఇంద్రియములు, మనసు. మనలో ఉన్న అంతరాత్మ విషయవాంఛలను మనసు ద్వారా సంకల్పించి ఇంద్రియముల ద్వారా అనుభవించి వాటి వలన కలిగే సుఖదు:ఖములను అనుభవిస్తూ ఉంటుంది. జీవుడు క్షేత్రజ్ఞుడనే పేరుతో మనిషి శరీరం అంతా వ్యాపించి ఉంటాడు. ఈ క్షేత్రజ్ఞుడు మానవ సహజమైన సత్వతమోరజో గుణాలకు అతీతంగా సాక్షీభూతంగా ఉంటాడు. ఈ జీవుడు తన జన్మస్థానమైన కైవల్యంవైపు చూస్తూ ఉంటాడు. విజ్ఞులైన వారు సూక్ష్మమైన నిర్మల బుద్ధితో క్షేత్రజ్ఞుడిని గురించి తెలుసుకుని అనంతుడిమీద మనసులజ్ఞం చేసి పరమ శాంతివంతమైన చివరకు శాశ్వత ఆనందంపొందుతారు.

## చాత్రుర్వర్ణ సృష్టి

తొలుత బ్రహ్మదేవుడు సత్యము, ధర్మము, సదాచారము, తపస్సుకు ప్రతీకగా బ్రాహ్మణ సృష్టి చేసాడు. తరువాత క్షత్రియులు, వైశ్యులు, శూద్రులను సృష్టించాడు. వారికి తగిన వర్ణములు కల్పించాడు. బ్రాహ్మణులు తెల్లగానూ, క్షత్రియులు ఎరుపురంగు లోనూ, వైశ్యులు పసుపురంగు లోను, శూద్రులను నలుపురంగు లోనూ పుట్టించాడు. ఈ నాలుగువర్ణాల వారు తమవృత్తి వదిలి వేరువృత్తి చేసిన ఆ వృత్తి కొనసాగించాలి. అలా కాక అనేక వృత్తులు చేసిన జారవృత్తి చేసిన వారు ఔతారు. చత్రుర్వర్ణాల వారు వారి వృత్తులను బట్టి ఒకరికంటే ఒకరు తక్కువగా పరిగణించ పడతారు.

## త్రిగుణములు

అన్ని ధర్మముల కంటే సత్యము ఉత్కృష్టమైనది. సత్యమేబ్రహ్మము, సత్యమేతపము, సత్యం ప్రజలను సృష్టిస్తుంది. సత్యంవలన సృష్టి నిలిచి ఉంది. సత్యము అసత్యము చేత మరుగునపడుతుంది. ఫలితంగా ధర్మము అధర్మము, వెలుగు చీకటి, జ్ఞానము అజ్ఞానము, స్వర్గము నరకము, సుఖము దు:ఖము అని రూపాంతరం చెంది ఉంటాయి అని పెద్దల వలన తెలుసుకుని పెద్దలు అసత్యముకు దూరంగా ఉండి నియమ నిష్టలతో గడుపుతుంటారు. బాధలు రెండురకాలు. బాధులు రెండువిధాలు. తన శరీరానికి వచ్చే వ్యాధులు, ముసలితనం అనేది ఒకటి. రెండవది బంధువులకు వచ్చేది అయిన మానసికబాధ. వాటిని మానవుడు తన నియమ నిష్టలతో అధికమించి సుఖపడవచ్చు. స్థిరచిత్తుడు ఈ రెండు బాధలను జయించి వాటికి లొంగక వైరాగ్యంతో పరమపదము పొందుతాడు " అని **భృగువు** చెప్పాడు.

## ఆచారవిధానాలు

**భరద్వాజుడు** " మహర్షీ ! నాకు ఆశ్రమ ధర్మముల గురించి వివరిస్తారా ! " అని అడిగాడు. భృగుమహర్షి " భరద్వాజా ! బ్రహ్మచారి లక్షణములు వివరిస్తాను. బ్రహ్మచారి గురుభక్తి కలిగి పరమ శ్రద్ధతో వేదాధ్యయనం చేస్తూ, శుచిత్వంతో, వినయంతో, మూడు వేళలలో హెూమహుచేస్తూ బ్రహ్మచర్యం పాటించాలి. గృహస్థు ధనమును, ధాన్యమును ధర్మబద్ధంగా సంపాదించాలి. అతిధిసత్కారములు చేయాలి. అన్నపానములు భోగములు పరిమితంగా చేయాలి. ఇది గృహస్థాశ్రమ ధర్మం. వానప్రస్థులు

కంద మూలములు, ఆకులు, ఫలములు భుజించాలి, భూశైనము చేయాలి. సన్యాసి భిక్షాటన చేస్తూ దొరికినదానిని తిని ప్రశాంతంగా జీవించాలి. ఫలాపేక్ష లేకుండా ఈ నాలుగు ఆశ్రమాలను నిర్వర్తిస్తే మోక్షపదము లభిస్తుంది " అని భృగువు చెప్పాడు.

## ఆధ్యాత్మ విద్య

**భరద్వాజుడు** " పరలోకం ఇహలోకం గురించి వాటికి కల భేదం గురించి వివరించండి " అని అడిగాడు. **భృగువు** " భరద్వాజా ! ఇహలోక సుఖములకు పరలోక సుఖములకు ఏనుగుకు దోమకు ఉన్నంత తేడా ఉన్నది. ఈ లోకంలో సుఖాలకు ఆలవాలమైన ఇళ్ళు, మంచములు, పడకలు, సింహాసనములు, మంచి దుస్తులు, సుగంధద్రవ్యములు, పూలు, సంగీతము, నాట్యము, వినోదములు, ఆరామాలు, స్త్రీజనములు వీటిలో ఒక దానికి ఒకటి పరస్పర బేధము కలిగి ఉంటాయి. పరలోక సుఖాలకు ఇలాంటి బేధం ఉండదు. పాపచింత కలవారు అధోలోకముకు పోతాడు. అక్కడ దు:ఖమే కాని సుఖము ఉండదు. విషయవాంఛల మీద మమకారం లేని వాడికి పాపపుణ్యములు అంటక శాశ్వతానందం పొందుతాడు " అని భృగువు భరద్వాజుడికి చెప్పాడు.

## ఆచార విధులు

ధర్మరాజు " పితామహా ! ఆచారవిధులను గురించి వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! చెడుప్రవర్తన మంచి వాళ్ళను చెడువాళ్ళను బాధపెడుతుంది కనుక మంచిప్రవర్తన కలిగి ఉండడం శ్రేయోదాయకం. రాజమార్గంలో, రచ్చబండల వద్ద, పశువులను కొనుచోట మలమూత్ర విసర్జన చేయ రాదు. ఉదయం సాయంత్రం నదీస్నానం చేసి సూర్యుడికి అర్ఘ్యం ఇవ్వాలి. అసురసంధ్యవేళ నిద్రించరాదు. స్నానం, సంధ్యావందనం చేసిన పిదప భుజించాలి. తినే ఆహారాన్ని నిందించకూడదు. ఆహారాన్ని బ్రహ్మస్వరూపంగా పూజించాలి. తడి కాళ్ళతో నిద్రించరాదు. ఇవి సదాచారములు. ఉదయించే సూర్యుడిని చూడరాదు. ఇతర స్త్రీలను వస్త్రహీనలుగా చూడరాదు. చేసిన పాపం బహిర్గతం చేసి విముక్తిపొందాలి కాని దాచరాదు. దాంపత్యాన్ని జీవితాన్ని బహిర్గతం చేయకూడదు. గురుశుశ్రూష చెయ్యడం, బ్రాహ్మణులను పూజించడం మనిషి ఆయువును వృద్ధిచేసి, లక్ష్మీ కటాక్షం కలిగించి స్వర్గలోకప్రాప్తి కలిగిస్తుంది.

## ఆధ్యాత్మ విధ్య

ధర్మరాజు " పితామహా ! ఆధ్యాత్మవిధ్య గురించి వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! మానవునిలో భూమి నీరు, ఆకాశము, వెలుగు, గాలి అను పంచ భూతములు వాటి గుణములైన శబ్ధము, రసము, గంధము, చలనము, తేజస్సు సముద్రంలో కెటాల వలె పుడుతూ ఉంటాయి అంతమౌతూ ఉంటాయి. ఇంద్రియములు పంచ భూతములకు వశులై వర్తిస్తుంటాయి. మనసు ఇంద్రియాలకు ఆధారమై ఉంటుంది. మనసు ఒక నిర్ణయానికి రావడానికి బుద్ధి తోడ్పడుతుంది. పురుషుడు ఇలా విషయాలను గ్రహిస్తుంటాడు. అలా కాక పురుషుడు భాహ్య విషయాలను వదిలి అంతర్ముఖుడై మనసుని కట్టడి చేసి, బుద్ధితో విషయాలను క్షేత్రజ్ఞుడైన ఆత్మను దర్శనంచేయాలి. ఈ ఆత్మ క్షేత్రజ్ఞుడని, పురుషుడని, భూతాత్ముడని, పరమేశ్వరుడని, బుద్ధి సాక్షి అని, జనన రహితుడని పిలుస్తుంటారు. పురుషుడు అంత:చేతనాన్ని అనుభవంతో తెలుసుకుంటాడు. భాహ్య విషయాలను మాయ అని, కల అని, మిధ్య అని మాయకారణంగా అని తెలియక మానవుడు మోసపోకూడదు. మాయకు సత్వ రజతమో గుణాలు శరీరం. కనుక రజ, తమో గుణాలను వదిలి సత్వ గుణాలన్ని పెంపొందించుకుని జ్ఞాన వంతుడై చివరకు సత్వగుణాన్ని కూడా వదిలి ఆత్మను పరమాత్మలో లీనం చెయ్యాలి.

### యోగము

ధర్మజా ! యోగము గురించి చెప్తాను విను. ఎప్పుడూ తామరాకు మీది నీటిబొట్టు లాగా, మేఘములో మెరుపు తీగలా సదా చలించే మనసును ఏకాగ్రతతో ఉంచుకోవాలి. మనసుకు ఉచ్వాస, నిశ్వాసములు ఆధారములు. వాటి మీద దృష్టినిలిపి క్రమపరచి ఏకాగ్రత సాధించాలి. కష్ట సాధ్యమైన దీనిని అభ్యాసముతో సాధించాలి. అలా యమ, నియమములను అభ్యసించి ఆలోచనలను నిగ్రహించాలి. అప్పుడు క్రమబద్ధం చేసిన శ్వాశ అంతర్నాడి ద్వారా బ్రహ్మపదము చేరి నిశ్చలమైన ఆనందం ఇస్తుంది.

## జపము

ధర్మరాజు భీష్ముడితో " పితామహా ! నాకు జపము దాని మహిమ గురించి వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! జపము గురించి యముడు, మృత్యుదేవత, కాలము, బ్రాహ్మణుడు, ఇక్ష్వాకులకు మధ్య జరిగిన సంవాదము గురించి చెప్తాను. ఈ జపకర్మ వేద విదుల చేత ఆమోదించబడిన కర్మ. జపము చేయువారు అత్యంత శుచిగా ఒక చదునైన ప్రదేశంలో ధర్భాసనం మీద దర్భలు చేత పట్టుకుని కూర్చుని ఇంద్రియములను నిగ్రహించి, మనసును నిగ్రహించాలి. ఇంద్రియములను విషయాసక్తి, డంభము, మత్సరము, అహంకారము, మానము, అవమానము తొలగించి బ్రహ్మచర్యము పాటించాలి. ఈ విధ నియమములను అనుసరించి జపమును ఆచరించిన పురుషుడు సర్వ లోకములను జయించి తుదకు మోక్షము సాధిస్తాడు. అలా కాక అశుచిగా, దుర్గుణముతో, నీచమైన ఆలోచనతో, మనస్సు నిశ్చలము లేకుండా జపము ఆచరించిన పురుషుడు నరకానికి పోతాడు.

### కౌశికుడు ఇక్ష్వాకుడు


కౌశికునికి సావిత్రీ దేవి దర్శనం

పూర్వము వేదవేదాంగ పారంగతుడైన **కౌశికుడు** అనే బ్రాహ్మణుడు అత్యంత నిష్టతో **సావిత్రీదేవిని** గురించి జపము చేసాడు. ఆ నిష్టాపూర్వక జపముకు మెచ్చిన సావిత్రీదేవి ప్రత్యక్షమై ఏమి వరము కావాలో కోరుకొమ్మని అడిగింది. కౌశికుడు తనకు జపమునందు నిష్ఠ కావాలని కోరాడు. సావిత్రీదేవి " ఓ కౌశికా ! నీకు ఉత్తమగతులు కలుగుతాయి. యముడు, కాలము, మృత్యువు నీ వద్దకు వచ్చి మాట్లాడుతారు " అని వరమిచ్చి వెళ్ళింది. కౌశికుడు అలా నూరు సంవత్సరాలు జపతత్పరుడై గడిపాడు. అతడి జపముకు తృప్తి చెంది **ధర్మదేవత** సాక్షాత్కరించి " కౌశికా ! నీ జపము సిద్ధించింది. నీవు సిద్ధి పొందావు. నీవిక ఈ శరీరము విడిచి పుణ్యలోకముకు వెళ్ళు " అని చెప్పింది. కౌశికుడు " ధర్మదేవతా ! నేను జపము చేయాలంటే నాకు ఈశరీరము కావాలి కదా ! కనుక నేను ఎంత దు:ఖమైనా ఓర్చుకుంటాను కాని పుణ్యలోకాలకు వెళ్ళడానికి ఈ దేహము వదలను " అని అన్నాడు. ధర్మదేవత " కౌశికా ! పుణ్యలోకాలకు వెళ్ళకుండా ఎప్పటికైనా వదలవలసిన ఈ శరీరాన్ని వదలనని చెప్పడం ధర్మమా ! " అని అడిగింది. కౌశికుడు " నా తపసుకు ఆలంబనమైన ఈ శరీరమును నేను విడువను " అన్నాడు. ధర్మదేవత " నిన్ను పుణ్యలోకాలకు తీసుకు పోవడానికి యముడు, మృత్యువు, కాలము వచ్చారు చూడు " అని చెప్పింది. అప్పుడు మృత్యువు, యముడు, కాలము ముందుకు వచ్చి తమని తాము పరిచయము చేసుకున్నారు. యముడు " నువ్వు చేసిన జపము ఫలించింది " అని చెప్పాడు. **కాలపురుషుడు** " నీకు పుణ్య లోకాలకు వెళ్ళ వలసిన కాలము సమీపించింది " అన్నాడు. మృత్యుదేవత " కాలపురుషుని ఆదేశం మేరకు నేను నిన్ను తీసుకు రావడానికి వచ్చాను " అని చెప్పింది. కౌశికుడు మారి మాటను పెడ చెవిన పెట్టి " మీరు చెప్పిన పని కాక నేను మీకు ఏమిచేస్తే సరిపోతుంది " అని అడిగాడు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన **ఇక్ష్వాకుడు** అక్కడ ఉన్న దేవతలకు నమస్కరించాడు. కౌశికుడు ఇక్ష్వాకుడికి మర్యాదలు చేసి " మహాత్మా ! నేను నీకు ఏవిధంగా సత్కరించగలను " అని అడిగాడు. ఇక్ష్వాకుడు " మహాత్మా ! క్షత్రియులమైన మేము దానాలు ఇస్తాము కాని దానాలు పట్టము. నీకేమి కావాలో అడుగు నేను తీరుస్తాను " అన్నాడు. కౌశికుడు " ఇహలోక మమకారం ఉన్న వాళ్ళకు మర్యాదలు కావాలి కాని నాకు ఎందుకు ? నా అతిథివైన నీకు నేను కానుకలు సత్కారంగా ఇస్తాను. కనుక అవి దానము కాదు " అన్నాడు. ఇక్ష్వాకుడు " నీకు ఇవ్వాలని అనుకుంటే నీ జపఫలము సగము నాకు ఇవ్వు " అని అడిగాడు. కైశికుడు " నీకు కావాలంటే పూర్తిగా అయినా ఇస్తాను. ఎంత కావాలి " అని అడిగాడు. ఇక్ష్వాకుడు " నీ జపఫలము ఏమిటి ? " అని అడిగాడు. కైశికుడు " నేను ఫలితమును ఆశించి రాలేదు కనుక నా జపఫలము ఏమిటో నాకు తెలియదు. నా జపఫలము ముందు తీసుకుని తరువాత ధర్మవిధులను అడిగి తెలుసుకో " అని అడిగాడు. ఇక్ష్వాకుడు " కైశికా ! ఫలితము తెలియకుండా దానము ఎలా స్వీకరించగలను. నాకు వద్దు " అన్నాడు. కైశికుడు " రాజా ! నీవు అడిగావు, నేను ఇస్తాను కనుక ఇప్పుడు మనకు అసత్య దోషము అంటదా " అని అడిగాడు. ఇక్ష్వాకుడు " నవ్వి క్షత్రియుడనైన నేను నీతో మాటల యుద్ధము చేసాను " అన్నాడు. కౌశికుడు " మహారాజా ! నీవు ఏమి చేసావో కాని నేను త్రికరణ శుద్ధిగా నా జపఫలితాన్ని ఇస్తున్నాను నువ్వు తీసుకుంటానన్నావు. ఇప్పుడు నీవు తీసుకోవడానికి నిరాకరిస్తే క్షత్రియుడివైన నీకు బ్రాహ్మణుడినైన నాకు సత్యవ్రతభంగము వాటిల్ల కలదు. ఇది ధర్మముకాదు. రాజా ! సత్యవ్రతమే తపస్సు, సత్యమే యజ్ఞము, సత్యమే వేదము, శాంతి, ఇంద్రియ నిగ్రహము. ఆ సత్యవ్రతానికి భంగం వాటిల్లినప్పుడు నేను

ఇప్పటి వరకు చేసిన జపతపములు ఫలించవు " అన్నాడు. వీరి మాటలు వింటున్న ధర్మదేవత " మీలో మీకు వాదన ఎందుకు దానము ఇచ్చిన ఫలము కౌశికుడికి, సత్యవ్రతమును పాటించే ఫలము ఇక్ష్వాకుడు పొందగలరు " అని అన్నాడు. అప్పుడు పుణ్యలోకము మానవాకృతిలో వచ్చి " అయ్యా ! మీలో మీకు వాదన ఎందుకు. ధర్మదేవత ! చెప్పినట్లు చేయండి. మీరిద్దరూ సమాన ఫలితం పొడుతారు " అన్నది. ఇక్ష్వాకుడు బ్రాహ్మణుడు కూడా తానిచ్చేది స్వీకరించాలని పట్టుపట్టాడు. కైశికుడు " నేను నియమనిష్టలు, జపతపాదులలో నిమఙ్జమై ఉన్నాను. నేనేదీ కోరను కనుక నేనేది స్వీకరించను. ఇక్ష్వాకుడు " నీకు తగినదే నేను ఇస్తాను. నేను చేసిన సుకృతములఫలము నీకిస్తాను తీసుకో " అన్నాడు. ఇంతలో వికృతమైన వేషధారులు ఇద్దరు అక్కడకు వాదులాడుకుంటూ వచ్చారు. ఇక్ష్వాకుడు వారిని ఎందుకు వాదులాడుకుంటారని అడగగానే " అయ్యా ! నేను గోదానము చేసాను. ఇతడు ఆ గోదానఫలితాన్ని ఇమ్మని అడిగాడు. నేను అలాగే ఇచ్చాను. ఇతడు అది తనకు చాలదని చెప్పి రెండు మంచి జాతి


జపము చేసిన్ బ్రాహ్మడు మరియు ఇక్ష్వాకు రాజుల ఊర్ధ్వగతి

ఆవులను కొనిఆ గోవులను అర్హుడికి దాన మిచ్చాడు. తరువాత ఆదాన ఫలితం నాకు ఇస్తానని చెప్పాడు. నేను మొదట అంగీకరించి తరువాత నిరాకరించాను. అదే మా వాదులాట. మీరే చెప్పండి నేనేం చేయడము ధర్మము " అని అండిగాడు. రెండవ వాడు " అయ్యా ! ముందు అంగీకరించి తరువాత నిరాకరించడం న్యాయమా ? " అని అడిగాడు. ఇది విన్న కౌశికుడు " మహారాజా ! చూసారా వీరి వాదులాట మనవంటిదే. నీవు అంగీకరించినటుల దానం స్వీకరించు లేకున్న నిన్ను శపిస్తాను " అన్నాడు. ఇక్ష్వాకుడు ఇక తప్పదనుకుని దానము స్వీకరించడానికి అంగీకరించి కౌశికుడి వద్ద నుండి దానం స్వీకరించి బదులుగా తాను చేసిన యఙ్ఞఫలమును దానంగా స్వీకరించమని కోరాడు. అప్పుడు అక్కడకు వచ్చిన మానవులు వారితో " అయ్యా! మేము కామము, క్రోధము. మీరిద్దరు ధర్మదేవత చేతను, యముడి చేతను మా చేత పరీక్షింపబడ్డారు. అంతే కాని ఇవ్వడము తీసుకోవడము దైవ నిర్ణయాలు మీ చేత ఏమీలేదు " అన్నారు. అప్పుడు కౌశికుడు " మహారాజా ! నా జపతపాలకు అదిష్టాన దేవత అయిన సావిత్రిదేవి. ఆమె నుండి నేను బలము, శ్రద్ధను పొందాను. ఇక నేకు జపత్పాదులు చేయనవసరం లేదు. నీవు నా పుణ్యఫలమును స్వీకరించి నాకు అవసరం లేకున్నా నీ యఙ్ఞఫలాన్ని నాకు ఇచ్చావు. ఇక నీ దారి నీది నా దారి నాది " అన్నాడు. వారి ధర్మ నిష్టకు మెచ్చిన దేవతలు వారి మీద పూలవృష్టి కురిపించి దేవదుందుభులు మ్రోగుతుండగా కిందకు దిగి వచ్చి వారిని అభినందించారు. **ఆకాశవాణి** " అయ్యలారా ! మీరిద్దరు సిద్ధి పొందారు. మీకిక ఉత్తమ గతులు కలుగుతాయి " అని పలికింది. అప్పుడు కౌశికుడు భవబంధాలు తెంచుకుని అక్కడ ఉన్న ధర్మదేవతకు, యమధర్మరాజుకు, మృత్యుదేవతకు, కాలపురుషుడికి నమస్కరించి, మనసును నిలిపి ప్రాణాలను కనుబొమల మధ్య నిలిపి, ప్రాణాన్ని బ్రహ్మరంధము వద్ద నిలిపి నిశ్చలంగా నిలిపి ప్రాణములను విడిచాడు. అతడి ప్రాణములు దేదీప్యమాన కాంతిగా బయటకు వెడలింది. ఆకాంతికి బ్రహ్మదేవుడు ఎదురు వచ్చి స్వాగతం చెప్పాడు. బ్రహ్మదేవుడు " ఉత్తమ నిష్టతో జపము చేసే యోగులకు వారి పుణ్యవశమున పుణ్యలోక ప్రాప్తి కలుగుతుంది. నిష్టతో జపము చేయడము వలన తమకు తాముగా శరీరము నుండి విడివడి ఉత్తమ లోకములకు వెళ్ళగలరు. కైశికా రా " అనగానే బ్రహ్మరంధ్రం ద్వారా శరీరం నుండి విడివడిన కౌశికుడి ఆత్మ బ్రహ్మదేవుడి ముఖము నందు ప్రవేశించి బ్రహ్మదేవుడిలో ఐక్యమైంది. తరువాత ఇక్ష్వాకుడు కూడా తనకు తానుగా శరీర త్యాగం చేసి బ్రహ్మదేవుడిలో ఐక్యము అయ్యాడు. అది చూసిన దేవతలు ఆశ్చర్య పోతూ కౌశికుడిని, ఇక్ష్వాకుడిని పొగిడారు " అని చెప్పిన భీష్ముడు " ధర్మనందనా ! నిష్టతో జపము చేసిన వారు బ్రహ్మైక్యము పొందగలరు " అన్నాడు.

## ఙ్ఞానయోగము

ధర్మరాజు " పితామహా ! నాకు అన్ని యోగాలకంటే మిన్న అయిన ఙ్ఞానయోగము గురించి వివరించండి " అని అడిగాడు. భీష్ముడు" ధర్మనందనా !ఒకప్పుడు మనువు, బృహస్పతి సంవాదము వినిపిస్తాను విను. మనువు దేవ గురువును ఙ్ఞానయోగము వివరించమని కోరగా బృహస్పతి " అనఘా ! ఙ్ఞానయోగముకు మూలము సత్కర్మాచరణమే. ఇష్టమైనది పొందుటకూ ఇష్టము కానిది విడుచుటకు మానవుడు కర్మాచరణ చేస్తుంటాడు. అటువంటి కర్మలు ముందు సుఖము కలిగించి తరువాత దుఃఖమును కలిగిస్తాయి. కర్మఫలాన్ని ఆశించకుండా చేసే కర్మలు సుఖదుఃఖాలను కలిగించవు. అతడి అరిష్డ్వర్గాలకు అతీతంగా ఉండి ఙ్ఞానయోగ సిద్ధి పొంది చివరకు ఙ్ఞానం పొందుతాడు. పరతత్వము ఆధారరహితము. శబ్ద, గంధ, రస, రూపాదులు లేనిది. అది అగోచరమైనది. పరతత్వానికి స్త్రీ పురుష నపుంసక భేదము లేదు. అది ఙ్ఞానస్వరూపంగా


బృహస్పతి మనువుల సంవాదం

వెలుగుతూ ఉంటుంది. దేదీప్యమానమైన దీపము చుట్టూ ఉన్న వస్తువులను వెలిగించినట్లు జ్ఞానము ఇంద్రియములను, మనసును వెలిగించి వాటికి పట్టిన జాడ్యములను వదిలిస్తుంది. రాజుకు మంత్రులు సాయపడినట్లు జ్ఞానము అనుదిన కార్యములలో ఇంద్రియములకు, మనసుకు తోడ్పడుతుంది. చెట్టులో దాగిన అగ్ని గొడ్డలితో నరికినప్పుడు కనిపించదు అయినా ఒకటికి ఒకటి రాచుకున్నప్పుడు దానిలోని అగ్ని ప్రజ్వలించినట్లు మన శరీరంలో ఉన్న పరతత్వమనే గురువుతో వెగించబడేదే జ్ఞానం. అంతే కాని ఈ శరీరాన్ని హింసించినా బాధపెట్టినా జ్ఞానంకలుగదు. పరతత్వము ఇంద్రియ గోచరము కాదు. అందువలన ప్రతత్వము అస్థిత్వము లేనిదికాదు. వలతో మృగములను పట్టినట్లు, గాలంతో చేపలుపట్టినట్లు, కందకముతో ఏనుగును పట్టుకున్నట్లు, పరతత్వాన్ని జ్ఞానముతో మాత్రమే తెలుసుకోగలము. కనుక జ్ఞానిమాత్రమే పరతత్వము తెలుసుకోగలడు. పాము కాలును పాము గ్రహించినట్లు పరతత్వాన్ని జ్ఞాని మాత్రమే గ్రహించగలడు. అమావాస్యనాడు చంద్రుడు లేనంత మాత్రాన చంద్రుడు లేడని అనగలమా ! అలాగే పరతత్వము కనపడనంత మాత్రాన పరతత్వము లేదని అనగలమా ! రాహువు మింగిన సూర్యుడు కనిపించనంత మాత్రాన సూర్యుడు లేడని అనగలమా రాహువు విడువగానే సూర్యుడు కనిపించినట్లు జ్ఞాననేత్రము తెరవగానే పరత్వము నిర్మలమైన నీటిలో ప్రతిబింబంలా భాసిస్తుంది. అరిషడ్వర్గాలకు లొంగి ఇంద్రియములను బయట ప్రపంచంలో తిరుగునట్లు విడిచిన దు:ఖమును నివారించుట అసాధ్యము. ఇంద్రియములను నిగ్రహించి దృష్టిని ఏకాగ్రతచేసి అంతరావలోకనము చేసి ఆత్మను ఉద్ధరించాలి. నిశ్చలమైన మనసు మలినము లేని అద్దంలా భాసిస్తుంది. ధ్యానయోగము చేత మనసును కట్టడి చేసి విషయవాంఛల నుండి దూరము చేసి త్రిగుణాతీతుడై ఆత్మను పరమాత్మలో లీనం చేయాలి. అదే మోక్షము.

## మాయ త్రిగుణాలు

జ్ఞానమును మాయ కప్పి ఉంచుతుంది. ముందుగా మానవుడు మాయను గురించి తెలుసుకోవాలి. పక్షులు పోయే మార్గము ఎలా తెలుసుకోలేమో మాయ ఎలా ఉంటుందో కూడా తెలుసుకోలేము. మాయకు ఆకారము లేదు కంటికి కనిపించదు. సత్వరజోతమో గుణాలే మాయకు ఆకారము. త్రిగుణాలను తొలగించిన మాయ దానంతట అదే తొలగి పోతుంది. ఆత్మను ఆవరించి ఉన్న త్రిగుణాలను వైరాగ్యము అనే కొడవలితో కోసి వేయాలి. మణులు, మాణిక్యాలు, బంగారు పూసలు, వెండి పూసలను ఒకే దారం ఎలా మాలలా కట్టి ఉంచుతుందో పరమాత్మ జీవాత్మలలో అంతర్లీనంగా ఉండి ఈ లోకాలను నడిపించి ఉంచుతాడు. ఒకే సారము ఉన్న భూమిలో అనేక విధల ఔషధీమొక్కలు ఉన్నట్లు ప్రాణులందు ఉన్న బుద్ధి అనేక విధముల కర్మలకు కారణం ఔతుంది. భూమికంటే జలము, జలము కంటే తేజస్సు, తేజస్సు కంటే వాయువు, వాయువు కంటే ఆకాశము విశాలమైనది. వీటన్నిటికంటే మనసు పెద్దది. మనస్సు కంటే బుద్ధి విశాలమైనది. ఇవి అన్ని కాలానికి లోబడి ప్రవర్తిస్తాయి. ఆ కాలాన్ని శాసించకలిగిన వాడు పరమాత్మ. పరమాత్మకు ఆది, మధ్య, అంతము లేదు. అతడు అవ్యయుడు, వేదములకు అధిపతి. అతడి తలపుకు అందడు, పలుకుకు అందడు, కర్మలకు గోచరము కాడు. అతడే సకల ప్రాణులను భవబంధ విముక్తులను చేయగలడు. మనసును తరువాత బుద్ధిని తరువాత జ్ఞానమును అంతరింపజేసిన అక్షరుడు జ్ఞానమయుడు అయిన విష్ణుసాయుజ్యమును పొందగలడు. ఆ పరతత్వము అవ్యయము, అచ్యుతము, అమలము, అమేయము, అమృతము, అమేయము, అనంతము. అట్టి పరమాత్మను మనసును యమ నియమాలతో మనసును నియంత్రించి మాత్రమే తెలుసుకొనగలము. ఇలా బృహస్పతి మనువుకు పరమాత్మ తత్వము భోదించాడు " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## శ్రీకృష్ణతత్వం

ధర్మరాజు " పితామహా ! నాకు శ్రీకృష్ణతత్వము గురించి తెలుసుకోవాలని ఉంది " అని భీష్ముడిని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నారదాది మునుల వలన నేను తెలుసుకొన్నది ఇప్పడు నీకు చెప్తాను. శ్రీకృష్ణుడే పరమాత్మ అయిన విష్ణుమూర్తి. అతడు తన వినోదము కొరకు భూమి, ఆకాశము, నీరు, వాయువు అను పంచ భూతములను కల్పించాడు. అలా కల్పించిన జలములో ఒక భవ్యమైన తల్పము మీద అతడు శయనించి ఉన్నాడు. అతడి నాభినుండి ఒక కమలము ఉద్భవించింది. ఆ పద్మము నుండి బ్రహ్మాదేవుడు ఆవిర్భవించాడు. బ్రహ్మ తన సంకల్పంచేత ఏడుగురు మానస పుత్రులను

సృష్టించాడు. వారు **మరీచి**, **అత్రి**, **అంగీరసుడు**, **పులస్త్యుడు**, **పులహుడు**, **క్రతువు**, **దక్షుడు**. వారిలో మరీచికి **కశ్యపప్రజాపతి** జన్మించాడు. కశ్యపుడి వలన దేవతలు, రాక్షసులు, గరుడులు, నాగులు మొదలైన జాతులు జన్మించారు. ఆ కశ్యప ప్రజాపతి పుత్రుడు సూర్యుడు. అత్రి మహామునికి చంద్రుడు జన్మించాడు. ఈ సూర్య వంశీయులు, చంద్ర వంశీయులు అనేక సంవత్సరాలు రాజులై ఈ భూమిని పాలించారు. దేశ కాల పరిస్థితులను అనుసరించి రాజవంశస్థులు శాఖోపశాఖలై వర్ధిల్లాయి. ఆ రాజ వంశీయులు తమలో తాము కలహించుకుని విభేదించి యుద్ధములు చేసుకున్నారు. ఆ యుద్ధముల కారణంగా విష్ణువు జనక్షయం చేస్తూ వచ్చాడు. ఆ దేవదేవుడు వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధుడు అనే నాలుగు దివ్యరూపములతో దివ్యనామలతో వినోదించాడు " అని చెప్పి భీష్ముడు శ్రీకృష్ణుడిని చూపి " ధర్మనందనా ! ఈ మహాపురుషుడిని సామాన్య మానవుడిగా చూడటము మన అజ్ఞానము. శ్రీకృష్ణుడు భక్త పరాధీనుడు, తన కటాక్షవీక్షణాలతో భక్తుల కోరికలను తీరుస్తుంటాడు. ధర్మరాజు శ్రీకృష్ణుడికి నమస్కరించాడు.

## పరమాత్మసిద్ధి


వరాహుని స్తుతించుచున్న మునులు

ధర్మరాజు " పితామహా ! ఎవ్వని తలచుకుంటే మానవుడు పరమాత్మను చేరగలడు. ఏ ఉపాయంతో మానవుడికి పరమాత్మచింతన అలవడుతుంది " అని అడిగింది. భీష్ముడు " ధర్మనందనా ! ఈ విషయము నేను నారదుడి ద్వారా విన్నాను. అది ఇప్పుడు నీకు చెప్తాను. అని నారదుడిని, మహా విష్ణువును మనసున తలచుకుని " ఒక సారి నారదుడు " నిన్ను దేవదేవా ! పొందగోరు జనులు నిన్ను ఏ విధంగా తలుస్తారు. ఏ జపము చేస్తారు నాకు తెలపండి " అని అడిగాడు. అప్పడు విష్ణువు " నారదా ! నన్ను ధ్యానించడానికి మూడు లక్షణాలు కావాలి. ఒకటి పరమభక్తి, రెండవది నిర్మలమైనశ్రద్ధ, మూడవది ఇంద్రియనిగ్రహము. అకల్మషహృదయము కల వారికి ఈ మూడుగుణాలు సులభంగా లభ్యమౌతాయి. నిరంతరము నన్ను ధ్యానం చేయడం వలన మనసులోని కల్మషము హరించబడి నిష్కల్మషులౌతారు. ఓం కారముతో మొదలై నమహా అనే పదము వద్ద ఆరు గుణములు కలిగిన ఐశ్వర్యవాచకము, ఈ పదములకు శివ నామంతో చేరిస్తే అది మహామంత్రము ఔతుంది. ఈ మంత్రము వలన ధర్మార్ధ కామ మోక్షములు సిద్ధిస్తాయి. తరువాత నారదుడు అనుస్మృతి గురించి చెప్పసాగాడు. అవ్యక్తుడిని, శాశ్వతుడిని, అఖిలప్రభవై భూమిని పాలించువాడిని, భక్తవత్సలుడిని, విష్ణువును, పరమపురుషుడిని, అక్షయుడిని చేతులు జోడించి ఆశ్రయించాలి. పుండరీకాక్షుడిని, భువనసాక్షిని, నిత్యుడిని, పురాణపురుషుడిని ప్రార్ధిస్తాను. పరుని, సహస్రాక్షుడిని, అక్షరుడిని, లోకైకనాధుడిని, భవ్యుని కొలిచెదను. భూతభవ్యభవత్ప్రభువును, సర్వతోముఖుని, భూతసంప్రవర్తిని, అమృతుని, అచ్యుతుడిని, అనంతుడిని, హృషీకేశుడిని, రవిసహస్రవిభుడిని, హిరణ్యగర్భుడిని, అబ్జనాభుడిని, సత్యుడిని, ఆద్యంతరహితుడిని, భూగర్భుడిని, ప్రభుడిని, ప్రభువును, భక్తిగమ్యుడిని, ధ్యానిస్తాను. అచలుడిని, సూక్ష్మరూపుడిని, వరేణ్యుడిని, సహస్రశీర్షుడిని, అభయకారుడిని, అశీర్షుడిని, నారాయణుడిని, సనాతుడిని, యోగమూర్తిని, లోకాతిరక్తుడిని, ధ్రువుడిని, ఈశ్వరుడిని, హరిని భక్తితో కొలుస్తాను. ఈ చరాచర జగత్తుకు ఎవడు అధిపతో, ఎవని నాభి నుండి పుట్టిన పద్మము నుండి బ్రహ్మ జన్మించాడో, ఎవరి కారణాన ఈ జగములన్నీ సృష్టించబడ్డాయో ఆ ముకుందుడిని నేను కొలుస్తాను. స్థావరములు, జంగమములు, బ్రహ్మదేవుడు మహాప్రళయములో లయమైన తరువాత ఎవరు శాశ్వతముగా ఉంటాడో ఆ నిత్య స్వరూపుడైన విష్ణువును నియమంతో కొలుస్తాను. కాలపురుషుడు, పర్జన్యుడు, భూమి, పంటలు, అన్నీ తానే అయి లీలలు సాగించు వాడు అయిన ఆ వాసుదేవుడిని నేను సదా కీర్తిస్తాను. ఎవరి వలన అగ్నికి, సూర్యుడికి, చంద్రుడికి, గ్రహములకు, నక్షత్రములకు తేజస్సు కలుగుతుందో ఆస్వయం ప్రకాశకుడిని నేను కొలుస్తాను. యజ్ఞధరుడు, పంచయజ్ఞుడు, లక్ష్మీనివాసుడు, యోగముకు ఆధారమైన వాడు, ఈ సర్వజగత్తుకు ఆధారమైన వాడు, ఈ సర్వజగత్తు ఆరాధింపబడు శ్రీహరిని నేను ఆశ్రయించెదను. నిశ్చలమైన వాడిని, పాంధుడిని, సకలలోకధరుడిని, నిరాకారుడిని, సాగరమంత పరిజ్ఞానము కలవాడిని, అయిదు కాలములను ఎరిగిన వాడిని సకలగుణములు కలిగినవాడిని, నిర్గుణుడిని నేను భక్తితో కొలుస్తాను. అగుపించు సకలముకు కారణమైన వాడిని, ఎవ్వరికి కనిపించక ఆవల ఉండువాడిని, భక్తపరాధీనుడిని, వాక్చాతుర్యము కలవాడిని, సకల శుభములు కలిగించేవాడిని నేను స్తుతిచేస్తాను. జ్ఞానులు, యోగులు, జితేంద్రియులు ఎవరిని పొందిన తిరిగి రారో అతడిని నేను శరణు కోరుతున్నాను. ఈ సమస్తలోకములను తన అంశతో నిర్వహించు వాడిని, దయాకరుడిని, పద్మనాభుడిని నేను స్తుతిస్తాను. పంచభూతాత్మక ప్రకృతిని తన పంచముఖాలతో అనుభవించు క్షేత్రజ్ఞుడిని, త్రిగుణాలను లీలగా అనుభవించు మహానుభావుడిని ఆత్మానుసంధానం చేసుకుంటాను. జ్ఞానులు సాంఖ్యులు ఎవరి అందు చేరుతారో ఆ పరమాత్మను నేను ధ్యానిస్తాను. సూర్యుడిలో లీనమై, చంద్రుడిలో ఉండి ప్రకాశించే ఆ

అంతరాత్ముడిని భజిస్తాను. సూర్యుడిలో, తారలలో, చంద్రుడిలో తేజమై ఉన్న వాడిని నేను దర్శిస్తాను. గుణములకు ఆది అయినవాడు, నిర్గుణుడు, లక్ష్మీవల్లభుడు, అజుడు, సూక్ష్ముడు, అంతటా తానై నిండి ఉన్న వాడైన హరిని ప్రసన్నమయ్యే వరకు ప్రణతిస్తాను. అంతటా నీ ముఖములతోను, కళ్ళతోనూ, నీ తలలతోనూ నిండిన, నిర్వికారుడిని, నిర్మలుడిని, సర్వసాక్షి అయిన గోవిందుని నేను కొలుస్తాను. ఓ నారాయణా ! నిన్ను తెలుసుకుంటే కాని ప్రాణులకు ఈ సంసారబంధాలు వీడవు. మనస్సుకు, ఇంద్రియములకు గోచరము కాను నిన్ను చేరుమార్గము ఏది ? సిద్ధులు అరిష్డ్వర్గాలను ఇడిచి నిన్ను కొలుస్తారు. కర్మ ఫలాలను జ్ఞానాజ్ఞిలో ఎవరు దగ్ధము చేయుదురో వారే నిన్ను చేరగలరు. అన్ని దేహములలో ఉండే నీవు దేహదారుడివి కాదు. ద్వందాతీతులయిన యోగులను సదా రక్షించే వాడివి నీవే. ఈ ప్రకృతి, సమస్తభూతములు, బుద్ధి, అహంకారము నీ వలెనే ప్రకాశిస్తున్నాయి. సమస్త సృష్టి నీ మయమే సమస్త సృష్టి నీలో ఒదిగి ఉన్నది. నీ మహిమ వలన భిన్నత్వంలో ఏకత్వం ఏకత్వంలో అనేకత్వము ప్రకాశిస్తున్నాయి. దారములో ఉన్న మణుల వలె సమస్త జగత్తు నీయందు ఇమిడి ఉంది. నీకు పుట్టుక లేదు. నీవు అకారణుడివి. అన్నిటికి కర్తవు. ఈ భూతకోటిని సృష్టించి చివరకు లయము చేసే వాడివి నువ్వే. తత్వము, అతత్వము నీవే. అందరిలో ఉన్న కూటస్తచైతన్యము నీవే. ఓ ముకుందా నాకు ఏవరి అందు ప్రేమ కాని ద్వేషము కాని లేదు. నాకు యుక్తి, బుద్ధి, అహంకారము, సత్వ, రజో తమోగుణములు నాకులేవు. ఏ కర్తవ్యము నాకు లేదు, ధర్మాధర్మములు, ఇంద్రియలోలత్యము విషయవాంఛలు నాకు లేవు. నాకు బాధల నుండి మరణము నుండి మోక్షము ప్రసాదించు దేవా. నిన్నే శరణు వేడే నామీద కరుణ చూపించు. నా జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు పంచ భూతములలో కలిపి నన్ను కటాక్షించు. గోవిందా ఈ పంచభూతాత్మక శరీరమందలి నీటిని నీటి అందు, అగ్నిని అగ్ని అందు, వాయువును వాయువు అందు, ఆకాశతత్వమును ఆకాశమందు, చిత్తము చిత్తము అందు, అహంకారమును అహంకారము అందు కలిపి ఈ వ్యక్త శరీరమును అవ్యక్తమున కలిపి నాలోని త్రిగుణములను తన్మాత్రలను నశింపజేసి నాకు ముక్తిని కలిగించు దేవా ! నన్ను నీలోకి తీసుకుని జనన మరణ చక్రము నుండి నన్ను విముక్తుడిని చెయ్యి. నేను హరి అందు ఉన్నాను నా యందు హరి ఉన్నాడు. నాకు సతతము నిన్ను కొలిచే భాగ్యము కలిగించు దేవా. నేను పూర్వజన్మలో చేసిన పాపపుణ్యములు నా అనుభవములోకి రానిచ్చి ఋణవిముక్తుడిని చేయి దేవా ! ఎల్లపుడూ నిన్ను మనమున తలిచే నన్ను నీవు నీ వాడిగా భావించి వాత్సల్యంతో కాపాడు. వాసుదేవా నన్ను మరువకు. నున్ను సదా నాలో నిలుపుకుంటాను. అవ్యయుడవు, సనాతుడవు, అగ్రాహ్యుడవు, చిన్మయుడవు అయిన నిన్ను పునరావృత్తి లేకుండా పునరావృత్తి రహితము కొరకు స్మరిస్తాను. పరమాత్ముడిని, నారాయణుడిని, ఆది అంతము లేని వాడిని, భక్తసులభుడిని, షడ్వైశ్వర్యములను కలవాడిని ఎల్లప్పుడూ నమస్కరిస్తాను. సర్వకాల సర్వావస్థల అందు నిష్టతో నిన్ను కొలిచిన వాడు సకల పాపముల నుండి విముక్తుడై అవ్యయానందము పొందగలడు. అన్ని కల్మషములను ధ్వంసము చేసే ఈ విష్ణు అను స్మృతిని ఎవడు యజ్ఞము చేసే సమయాన, దానము చేసే సమయాన ఎవడు స్మరిస్తాడో అతడు జ్ఞాని అయినా అజ్ఞాని అయినా తగిన ఫలమును శతాధికంగా పొందగలడు. ఈ అను స్మృతిని దేవతా పూజలలోనూ, పితృ కార్యములోనూ పరమ నిష్టతో చదువుతారో అతడికి పుణ్యలో కములు కలుగుతాయి. ఆ అనుస్మృతిని అమావాస్య, పౌర్ణమి దినాలలో స్మరించిన వాడికి సకల సంపదలు కలుగుతాయి. ఈ అనుస్మృతిని విన్న భగవంతుడిని స్మరించిన వాడికి అతడు అంటరాని వాడైనా హీనకులజుడైనా అతడికి ఉత్తమగతులు కలుగుతాయి. ఇక ఉన్నతజాతుల వారి సంగతి చెప్ప పని లేదు " అని విష్ణు మూర్తి నారదుడికి చెప్పాడు. ఇంకా విష్ణుమూర్తి నారదుడితో " ఓ మునీంద్రా ! మానవుడికి కర్మ ఫలములన్నీ అంతము అయిన తదుపరి మోక్షమును పొందగలడు. అన్ని దానముల కంటే జ్ఞానదానము గొప్పది. జ్ఞాని మరొకజ్ఞానికి బోధించిన అది భూదానము కంటే గొప్పది. కనుక నారదా నేను నీకు చెప్పిన జ్ఞానమును పుణ్యాత్ములకు, పరిశుద్ధ హృదయులకు బోధించు. నారదా ! వేయి అశ్వమేధ యాగల కంటే అధికఫలమూ నా అందు నిశ్చల భక్తి కలిగిన మానవులు పొందగలరు. " అని విష్ణు మూర్తి నారదుడికి చెప్పిన విషయాలను ధర్మనందనా ! నేను నీకు బోధించాను. నీవు కూడా నారదుడిలా ఆ పరమాత్మను నిశ్చలభక్తితో పూజించి కృతార్థుడవు కమ్ము. కోరిన వరములను ప్రసాదించే ఈ అనుస్మృతి పఠించిన బుద్ధి పెరుగుతుంది. దుఃఖములు, బంధములు నశించి నిత్య శుభము కలుగుతుంది " అని భీష్ముడు చెప్పాడు. అది శ్రద్ధగా విని ధర్మరాజు భీష్ముడికి నమస్కరించాడు.

## ముక్తిమార్గం

ధర్మరాజు " పితామహా ! నాకు మోక్ష మార్గము ఉపదేశించు " అని కోరాడు. భీష్ముడు " ధర్మనందనా ! **వార్ణేయ అధ్యాత్మము** అను కధ ఒకటి ఉన్నది. అందులో నీకు తగిన సమాధానము దొరుకుతుంది. పూర్వము వార్ణేయుడు అనే పేరుగల ఒక మాన్యుడైన మునీశ్వరుడు ఉండే వాడు. ఒక రోజు అతడిని అతడి శిష్యుడు నమస్కరించి " గురువర్యా ! మీరు నాకు మోక్షమార్గము ఉపదేశించండి " అని అడిగాడు. అందుకు **వార్ణేయుడు** " కుమారా ! నీకు భక్తి, జ్ఞానము సమృద్ధిగా ఉన్నాయి. నీవు మోక్షమార్గము ఉపదేశము పొందుటకు అర్హుడవు. కనుక సావధానముగా విను. ఈ కాలచక్రము నిరంతరము తిరుగుతూనే ఉంటుంది. అది ఎప్పుడు ఆరంభము అయిందో ఎవరికి తెలియదు. ఎప్పుడు ఆగి పోతుందో తెలియదు. ఈ కాలప్రవాహములో సృష్టి లయము జరుగుతుంటుంది. ప్రళయకాలములో సమస్తప్రకృతి లయమైనా పరమాత్మ మాత్రము మిగిలి ఉంటాడు. తిరిగి సృష్టి ప్రారంభమై తిరిగి జీవజాలసృష్టి జరుగుతుంది. పరమాత్మ నుండి ముని శ్రేష్టులు సకల శాస్త్రములు, సర్వవేదములు పొందుతారు. అలా పొందిన జ్ఞానులు దానిని విపులంగా అనేక శాస్త్రములుగా

విడదీసి లోకులకు అందిస్తారు. ఈ పరిజ్ఞానము దేతలకైనా దుర్లభము. మునులకు సాధ్యము కూడా కానిది. పరమాత్రకు మాత్రమే అది అవగతము. సకల దు:ఖాలకు ఔషధమైన ఈ పరిజ్ఞానాన్ని పరమాత్మ కరుణించు లోకాలకు అందజేస్తాడు. క్రమక్రమముగా గురు శిష్యపరంపరగా ఆ జ్ఞానము లోకములో విస్తరించినది. ప్రకృతి పురుషుల సమ్మేళనంగా చైతన్యము ఉద్భవించింది. ఆ చైతన్యము నుండి బుద్ధి, బుద్ధి నుండి అహంకారము, అహంకారము చిత్తమును ఆశ్రయించి ఉంటుంది. అహంకారము నుండి ఆకాశము, ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి తేజస్సు, తేజస్సు నుండి జలము, జలము నుండి భూమి పుట్టాయి. బుద్ధిని మహత్త్వము అంటారు. మహత్త్వము నుండి ఐదు జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు ఐదు, వీటితో శబ్ద, స్పర్శ, రూపము, రుచి, గంధము అను అయిదు వాటితో మనస్సును చేర్చి పదహారు వికృతులు ఏర్పడినాయి. కుమారా ! శరీరము తొమ్మిది ద్వారములు కలిగిన పుణ్యనగరము. ఈ నగరంలో ఊహకందని రీతిలో పరమాత్మ వ్యాపించి ఉంటాడు. ఆ పరమాత్మను పురుషుడు అంటారు. ఆ పురుషుడు అమరుడు, అవ్యయుడు, అజరుడు, అమేయుడు, అమలుడు. చెట్టునందు దాగి ఉన్న అగ్నిలా పురుషుడు జీవిలలో అవ్యక్తంగా ఉన్నాడు. ఎండిన చెట్లు రాచుకున్నప్పుడు చెట్టు నుండి నిప్పు పుట్టిన విధంగా జ్ఞానాగ్నిలో ధగ్ధుడైన మానవుడు యోగముతో మనస్సును మధించిన పరమాత్మను కనుగొనగలడు. ఈ పురుషుని ఉనికివలననే ప్రాణులు చూచుట, వాసన చూచుట, స్పర్శజ్ఞానము, రుచి తెలుసుకొనుట వంటివి తెలుసుకుంటాము. కుమారా ! ఈ భూతకోటి అవ్యక్తము నుండి వ్యక్తము ఔతాయి, జీవిస్తున్నాయి, నశిస్తున్నాయి. పుట్టడము, పెరగడము, నశించడము వీటికి పురుషుడు సాక్షీభూతుడు. ఈ కాలచక్రముకు అంచులు ఏడు. దానికి అవ్యక్తము కేంద్రము. ఆ చక్రము చుట్టూ పదహారు వలయాలు ఆవరించి ఉంటాయి. వాటి మీద పురుషుడు అధిష్టించి ఉంటాడు. మానవుడు త్రిగుణములకు లోబడి నడుచుకుంటాడు. విజ్ఞుడు వాటికి లోబడక వివేకంతో నడచుకుంటాడు. ఈ లోకములో వేదాంత విధులు అరుదుగా ఉంటారు. వారు ప్రవృత్తి లక్షణముతో ధర్మాచరణ చేస్తుంటారు. సాధారణ మానవులు సుఖములలో తేలుతుంటారు. అందువలన వారు పుణ్యాత్ములు కాలేరు. ప్రవృత్తి కార్యములు చేస్తూ ఉన్న దేహాభిమానము వదలని వారు కామ క్రోధమును విడువ లేరు. కనుక విజ్ఞులు దేహముపై అభిమానమును వదిలివేయాలి. అరణ్యము వంటి ఈ సంసారములో మానవుడు అత్యంత కుతూహలముతో తిరుగుతూ ఉంటాడు. ఎంత ప్రయాణించినా అవతలి ఒడ్డు చేరలేడు. శరీరానికి వచ్చిన రోగమును ఔషధ సేవనముతో నయము చేసుకున్నట్లు దేహాభిమానము పోవడానికి సత్యము, శౌచము, శమము, దమము పాటించాలి. పంచభూతములకు, జ్ఞానేంద్రియాలకు, కర్మేంద్రియాలకు, ఈ భూమిని ఏలే అధిపతులకు అహంకారము నివాసస్థలము. స్మృతి, సంప్రీతి, ప్రసన్నత మొదలైనవి సత్వగుణము వలన జనిస్తాయి. రాగము, ద్వేషము, మోహము, లోభము రజోగుణ ఉత్పన్నములు. దర్పము, శోకము తామసగుణ ఉత్పన్నములు. జ్ఞానసముపార్జనకు ఈ మూడు గుణములు అవరోధములే అయినా మానవుడు ముందు రజో, తామస గుణములను విడిచి వేసి మనస్సును సత్వగుణ ప్రధానము చేయాలి. సత్వగుణము జ్ఞానసముపార్జనకు తోడ్పడుతుంది. మానవుడు అహంకారముతో చేసే పనులవలన మానవుడికి వెలుపలి ప్రపంచబంధము ఏర్పడుతుంది. అది పునర్జన్మకు కారణ మౌతుంది. స్త్రీగర్భములో రూపుదిద్దుకున్న పిండము నవమాసములు పొర్లుతూ బయట ప్రపంచానికి వచ్చి ఈ సంసారబంధాలలో చిక్కుకుని దు:ఖసాగరంలో మునిగి పోతున్నాడు. ఈ సంసార బంధానికి మూలము ఆశ తీగ. ఆ తీగ స్త్రీ అనే కొయ్యకు చుట్టుకుని పాకుతూ ఉంటుంది. ఆశ అనే తీగను ఆదిలోనే తుంచి మోక్షమును పొందాలి. జ్ఞానముకు అజ్ఞానముకు మూలము బుద్ధి. అందు నేను అనే భావమే జీవుడు. ఆ జీవుడు మనసుకు లోబడి కర్మబద్ధుడౌతాడు. మనసును రంజింపజేయడానికి ఇంద్రియములతో కర్మలు చేస్తుంటాడు. రాగద్వేషములను విడిచినగాని సంసారము నుండి విముక్తి కలుగదు.

## ఉత్తముడు

ఈ చరాచర జగత్తులో మానవుడు ఉత్తముడు, మానవులలో బ్రాహ్మణుడు ఉత్తముడు, బ్రాహ్మణులలో వేదాధ్యయనము చేసిన వారు ఉత్తములు, వారిలో జ్ఞానము కల వారు ఉత్తమోత్తములు. జ్ఞానము మానవుడికి కన్ను వంటిది. అజ్ఞాని గుడ్డి వాడితో సమానుడు. మానవునకు క్షమ, సత్యము, శౌచము ధర్మము. బ్రహ్మచర్యము ఉత్తమధర్మము. అందమైన యువతులతో సంభాషించడము, నిరీక్షించడము చేయకూడదు. అలా చేసిన స్త్రీ పురుషులు ఒకరి మనసులో ఒకరు తిష్ట వేస్తారు. ఈ శరీరము రక్తము, మాంసము, ఎముకల మయమని భావించిన ఆకర్షణ పోతుంది. ఇంద్రియ నిగ్రహము, నాడిశుద్ధి ముఖ్యము. దేహములో పది నాడులు, ఐదు జ్ఞానేంద్రియములు పని చేస్తుంటాయి. అన్ని నాడులకు కేంద్రమైన హృదయ స్థానమున దృష్టిని అంతరము లోకి పంపి మనసు నిలిపిన సుఖముల మీద నుండి మరలి **పరబ్రహ్మ** సాక్షాత్కారం పొందగలడు. ఇంద్రియ సుఖములు సంకల్ప జనితములు, మానవుడు మనసులో కూడా ఇంద్రియ లోలుడు కారాదు. మనసు కూడా ఇంద్రియమే దానికి అధిపతి ఇంద్రుడు. యువకులైనా, ముసలివారైనా అజ్ఞాన చేత మూర్ఖులై ఇంద్రియవసులై వర్తిస్తారు. కనుక మానవుడు యమ, నియమాలతో ఇంద్రియములను నిగ్రహించాలి. విషయవాంఛలు బహుచెడ్డవి. వాటికి లోను అయిన మనషుడు మోక్షము పొందలేడు. వాటిన అధిగమించిన కాని పరమపదము చేర లేడు. చావు పుట్టుకల మధ్య రోగములు దు:ఖకారణాలు. వివేక వంతుడు జననమరణ చక్రములో బంధించ బడక మోక్షముకై ప్రయత్నిస్తాడు. వివేకి మనస్సును, వాక్కును, శరీరమును పరిశుభ్రపరచుకుని అహంకారమును వదిలి శాంతము వహించి రాగద్వేషములు వదిలి సాటి జీవులమీద కరుణ కలిగి ఉంటాడు. కపటసన్యాసులు ఇంద్రియనిగ్రహము, త్రికరణశుద్ధి నటిస్తూ ధనసంపాదనకు పాటు

పడతాడు కనుక సాధకులు మోక్షగాములు వారిపట్ల జాగరూకత వహించాలి. మంచిబుద్ధి , ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము కలిగిన వారికి దేవతలు ప్రసన్నులౌతారు. దైవానుగ్రహము వలన మానవుడికి నిర్మలమైన యోగతంత్రములు అలవడతాయి. అప్పుడు మానవుడు నిశ్చల మనస్కుడై అన్నపానాదుల అందు అనాసక్తి కలిగి శారీరక సుఖములకు దూరముగా ఉండాలి . ఆకుకూరలు, కాయకూరలు, కందమూలములు, బిక్షాటనద్వారా లభించిన ఆహారమును సుఖమునందు అనాసక్తుడై ఈ లోకములో నిశ్చలమనస్కుడై మెలగాలి. సాధకుడు జ్ఞానాగ్నితో విజ్ఞానమును ప్రజ్వలింప చేసి జరామరణ దు:ఖము లేని ప్రబ్రహ్మతత్వము పొందగలడు. నిద్రావస్థలో త్రిగుణాత్మకమైన గుణమువలన స్వప్నములు కని తాను సంపాదించిన జ్ఞానము మరచిపోగలడు కనుక యోగి నిద్ర అందు జాగరూకుడై ఉండాలి. నిద్రావస్థలో కర్మేంద్రియాలు విశ్రాంతి తీసుకుంటాయి. స్వప్నావస్తలో మనసు పనిచేసి అప్పటి వరకు అనుభవించిన విషయాలను స్వప్నములో కూడా అనుభవిస్తుంటాడు. స్వాప్నికావస్థలో మనసు మిధ్యాసుఖములను అనుభవిస్తుంది. ఆత్మమాత్రము సాక్షిభూతముగా ఉంటుంది. త్రిగుణాలవలన, వాయువుతో కూడిన దోషమువలన నిజరూపములో చూసిన వాటిని మానవుడు మిధ్యారూపములో అనుభవిస్తాడు. స్వప్నావస్థలో వెలుపలి ప్రపంచం ప్రకాశించక పోయినా ఆత్మ మాత్రము ప్రకాశిస్తూనే ఉంటుంది. కనుక స్వప్నావస్థలో మానవుడు అత్యంత తెలివిగా ఉంటాడు. జ్ఞాని త్రిగుణాలకు అతీతుడై నిశ్చల ఆనందం అనుభవిస్తాడు. మృత్యురూపమైనవ్యక్త, అమృతరూపమైన అవ్యక్తము తెలుసుకోకుండా సాధకుడు మోక్షము పొంద లేడు. అవ్యక్తము మూడు లోకాలకు ఆధారభూతము. అది నివృత్తి మార్గము శాస్త్రప్రమాణము. ఈ ప్రకృతి ధర్మము భూత, భవ్యష్యత్తు, వర్తమాన కాలము బ్రహ్మచేత సృష్టించబడ్డాయని ఆగమ శాస్త్రము చెప్తుంది. దేహములో నివసించే వాడు దేహి త్రిగుణాలు అతడు కట్టుకునే వస్త్రము. ఆ వస్త్రముల చేత కప్పిఉన్న పరమాత్మ ఎవరికి గోచరము కాడు. త్రిగుణాతీతముగా ప్రకాశించే నాల్గవ తత్వమే పరమాత్మ అని వేదములు ఘోషిస్తున్నాయి. మనోవాక్కాయ కర్మలతో ఏకత్వము సాధిస్తూ అత్యంత శౌచముతో నిష్టతో తపమాచరించిన సాధకుడికి మోక్షము ప్రాప్తిస్తుంది. అన్ని తపస్సులలో ఉత్తమమైనది బ్రహ్మచర్యము, అహింసా వ్రతము. ఇవి రెండు పరమధర్మములు. వీటిని ఆచరించిన సాధకుడు నిర్మలజ్ఞానంతో వెలుగొందగలడు. ఈ సంసారము ఆశాపాశములతో దృఢంగా బంధింపబడి ఉంది. దృఢంగా పెరిగిన ఆశాలతను తపస్సు అనే కత్తితో నరకాలి. అప్పడే మానవుడు జ్ఞాని కాగలడు " అని ముని తన శిష్యునకు బోధించాడు. ధర్మరాజా ! నీవు కూడా ఆ ముని పలుకలలోని సత్యమును గ్రహించి కృతార్ధుడివి కమ్ము " అని భీష్ముడు ధర్మరాజుతో చెప్పాడు.

## జనకుడు


పంచశికునికి మహారాజు జనకుని ఉపదేశం

ధర్మరాజు భీష్ముడితో " పితామహా ! మిధిలా నగరాధీశుడు జనకమహారాజు ఏవిధంగా మోక్షము పొందాడో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! భీష్ముడి వద్ద నూరుమంది ఆచార్యులు ఉన్నారు. జనకమహారాజు సతతము వారు చేసే తత్వ బోధలను శ్రద్ధతో ఆలకించే వాడు. ఆ సమయంలో **కపిల** అనే స్త్రీకి జనించిన **పంచశిఖుడు** అనే ముని భూలోకసంచారము చేస్తూ మిధిలా నగరానికి వచ్చాడు. అతడు జనకుడి నూరుమంది ఆచార్యులను తన అతీత తత్వశాస్త్రములో ఓడించాడు. అతడి ప్రతిభకు అచ్చెరువందిన జనకమహారాజు తనకు మోక్షమార్గమును బోధించమని అతడిని కోరాడు. పంచశిఖుడు " మహారాజా ! అజ్ఞానము కోరికలకు మూలము. కోరికలు కర్మలకు మూలము. అవిద్య అనే భూమిలో మోహము, లోభము పెనవేసుకుని అవిద్యా భూమిలో కర్మబీజాలను నాటి అంకురింప చేస్తాయి. ఇది నాకు ఇష్టము ఇది నాకు అయిష్టము అనే భావములు మానవుడి మనసులో చిక్కు బడి అనేక విధములైన కర్మలు చేయడానికి అతడిని పురికొల్పుతాయి. కర్మ బంధములలో చిక్కుకున్న మానవుడు తనను జరా మరణములు కబళిస్తున్న విషయము గమనించ లేడు. మానవుడు బంధువులు, భోగములు, ధనము అస్థిరమైనవని తెలుసుకుని వాటిని దూరము చేసిన మనసుకు శాంతి కలిగి తుదకు మోక్షము కలుగుతుంది " అన్నాడు పంచశిఖుడు. జనకుడు " మహానుభావా ! కేవలము వైరాగ్యము వలనే మోక్షము ప్రాప్తిస్తుందని అన్నారు కదా ! విషయవాంఛల మీద విరక్తుడైన మానవుడికి మోక్షము లభిస్తుందా ! " అని అడిగాడు. పంచశిఖుడు " మహారాజా ! సత్వగుణము అలవరచుకున్న వాడికి సంతోషము, ఇష్టము, సుఖము, ఆనందము, శాంతికలుగుతాయి. రజోగుణ ప్రభావితుడకు ఎల్లప్పడూ దు:ఖం, కలత, ఏడుస్తుండడమూ, అసహనము, అసంతృప్తి, దేనికో వెంపర్లాడడము అలవడతాయి. తామసగుణ ప్రభావితుడికి విపరీతమైన ఉద్వేగభరితమైన ఆలోచనలు, కలలలో షరించడమూ సోమరితనము, భ్రమలో విహరించడము, ఏమరిపాటు, అన్నిటికీ విజృంభించడమూ, ఉద్రేకపడడము, అలసత్వము, ఆలస్యము అనే గుణాలు అలవడతాయి. త్రిగుణాలు కారణ సహితముగానూ ఒక్కొక్క తరి

అకారణముగానూ ఏర్పడి ఒక్కొక్క తరి మానవుడి మీద తిరగబడతాయి. మానవుడు ప్రశాంతముగా ఉన్నప్పుడు అది సాత్వికస్వభామని దుఃఖభరితుడై ఉన్న సమయాన రాజసగుణమని ఏమి చేయాలని లేక స్థబ్ధుగా ఉన్న అది తామసగుణమని ఎరిగి వాటికి దూరముగా ఉండి మనసును నిర్మలము చేసిన మానవుడు మోక్షమును పొందగలడు. మనసును ఆ స్థితిలోకి వైరాగ్యము మాత్రమే తీసుకురాగలదు. త్రిగుణాలను ఆత్మలో లీనముచేసి మనసును తన్మయపరచిన త్రిగుణాలు సముద్రములో కలిసిన నదిలా తమ రూపమును కోల్పోతాయి. త్రిగుణ రాహిత్యముతో మానవుడు కుబుసము విడిచిన పాములా ఆత్మప్రకాశముతో వెలుగొందగలడు " అని వివరించాడు పంచముఖుడు. అలా పంచశిఖుని బోధల వలన వైరాగ్యము చెందిన జనకుడు ఒక సారి మిధిలా నగరము తగులబడి పోతున్నా ధుఃఖించక వైరాగ్యంతో నిశ్చలంగా ఉన్నాడు.

## చతుర్వర్ణాలు

ధర్మరాజు భీష్ముడిని " పితామహా ! ఎట్టివాడు నిర్భయంగా మంగళకరంగా ఉంటాడో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! చతుర్వర్ణాల వారికి శాంతి, ఇంద్రియనిగ్రహము అవసరము. అందునా ! బ్రాహ్మణుడికి ఇంద్రియనిగ్రహము అత్యావశ్యము. శుచిత్వము, కోపము లేకుండా ప్రవర్తించుట, అసూయపడకుండుట, దుఃఖము దైన్యములేక ఉండుట, దురభిమానము, ప్రమాదరహితుడై ఉండుట, వితండవాదము లేకుండుట, సకలప్రాణుల అందు దయకలిగి ఉండుట, గురువులను పూజించుట, తననుతాను పొగడకుండా ఉండడము, ఇతరులను నిందించ ఉండుట, సత్యము మాత్రమే పలుకుట, సత్సంగము, అహింస, నిరాశనిస్పృహలకు లోను కాకుండా ఉండడము, మంచిభావనలు, ఇంద్రియ నిగ్రహము వీటిని దమములు అంటారు. పై గుణములు సాధించిన పుణ్యమూర్తికి ఇహలోకములోనే కాదు పరలోకసుఖములు కలుగుతాయి " అని భీష్ముడు చెప్పాడు.

## వ్రత విధానములు

ధర్మరాజు " పితామహా ! కొంత మంది యజ్ఞాలు చేసే సమయంలో వ్రతము మధ్యలో భోజనం చేసిన వ్రతభంగము కాదా ? " అని అడిగాడు. భీష్ముడు " కుమారా ! బ్రాహ్మణుడి కోరిక ప్రకారము చేయు భోజనము వేదోక్త ప్రకారము చేయు భోజనం వలన వ్రత భంగము కాదు. కాని ఎల్ల వేళలా ఉపవసించడం, సదా బ్రహ్మచర్యము పాటించడము, మాంసభక్షణ చేయక పోవడము, దేవతలను పూజించి తృప్తి పరచిన తరువాత భుజించిన, అమృతసమానమైన భోజనం చేసిన, కలత నిద్ర లేకుండా ఉండుట మంచి లక్షనములు. వాటి స్వరూపము వివరిస్తాను. రోజుకు రెండు మార్లు మాత్రమే భుజించి మధ్యలో ఏమీ తనక ఉన్న వాడు సదా ఉపవాసి. సంతానార్ధమై రుతుకాలంలో మాత్రమే భార్యతో కూడిన వాడు సదా బ్రహ్మచారి. మాంసాహారమైనా పితరులకు, దేవతలకు అతిథులకు పెట్టి భుజించే వాడు మాంసాహారి కాడు. సహపంక్తి భోజనము చేసే వాడు దేవతలను, పితృదేవతలను, అతిథులను తృప్తి పరచిన తరువాత భుజించిన వాడితో సమానము. సేవకులకు పెట్టిన తరువాత భుజించే వాడు తినే అన్నము అమృతముతో సమానము. పగలు నిద్ర పోని వాడు కలత నిద్ర పోని వాడితో సమానము " అని భీష్ముడు చెప్పాడు.

## కర్మసిద్ధాంతం

ధర్మరాజు " పితామహా ! నరుడు చేసే కర్మలకు అతడి పూర్వజన్మ సుకృతాన్ని అనుసరించి సుఖదుఃఖములు, శుభాసుభములు ఉంటాయి కదా ఆ కర్మల కర్త అతడేనా ! కాదా ! అని నాకు అనుమానంగా ఉంది దానిని వివరించండి " అని అడిగాడు. భీష్ముడు ! ధర్మనందనా ! ఒక సారి ఇంద్రుడు ప్రహ్లాదుడి మధ్య జరిగిన సంవాదము వింటే నీ సందేహము తీరుతుంది. సత్వగుణ సంపన్నుడు, ఎల్లప్పుడూ సంయమనం పాటించే వాడు, అహంకారము లేని వాడు, కోపమంటే తెలియనివాడు, నిందను స్తుతిని సమానంగా పరిగణించేవాడు, ఇనుమును బంగారమును సమానంగా విలువ కట్టేవాడు అయిన ప్రహ్లాదుడు తన మందిరములో కూర్చుని ఉండగా ఇంద్రుడు అతడి అంతరంగం తెలుసుకోవాలని అక్కడకు వచ్చి " ప్రహ్లాదా ! నీవు సంపద లేకున్నా దుఃఖించవు, శత్రువుల చేతికి చిక్కుతానన్న భయము లేదు, అసలు ఏమీ చేయవు ఇంతటి బేలగా ఉంటే ఎలా ? " అని అడిగాడు. ప్రహ్లాదుడు " ఇంద్రా ! కలిమి లేమి పక్క పక్కనే ఉంటాయి. సంపదలు ప్రయత్నిస్తే వస్తాయి లేకున్న రావు అనుకోవడము నీ బేలతనమే ! సంపదలు సంపాదించనవసరం లేదు విధి అనుకూలిస్తే వచ్చి పడతాయి ప్రతికూలించిన హారతికర్పూరంలా కరిగి పోతాయి. దీనికి మానవ ప్రయత్నముతో పని లేదు. శత్రువులు ఓడించడం, మిత్రులు కాపాడడము, సంపదల రాకపోక అంతా విధిలిఖితమే. మానవుడి మనసును అనుసరించి భావాలుపుడతాయి, పోతాయి. చంచలమైన మనసులోని భావాలు చంచలమైనవే అని తెలుసుకుని మనసుని నిగ్రహించాలి. తన పనులన్నిటికీ తానేకర్తను అనుకోవడము అవివేకము. అలా అయితే మానవులు చేసే కర్మలన్నిటికీ సమ ఫలితాలు

ఉండాలి కదా ! అఖిలకర్మలకు కర్త ఆ పరమేశ్వరుడే కాని మానవుడు కాదు. తాను చేసే కర్మలకు తానేకర్తను అన్న అహంకారంతో కర్మలు చేసే వాడికి కర్మఫలం అంటుకుటుంది. ఫలాపేక్ష లేక కర్మలను చేస్తూ సుఖదు:ఖాలకు లోను కాక మనసు నిలకడగా ఉంచుకున్న వాడు మహనీయుడు. కనుక దేవేంద్రా ! నేను ఈ లోకములో ఉన్న సకల ప్రాణులకూ అనిత్యములే అని అసత్యములని తెలుసుకుని సంసార బంధములో చిక్కక సంతోషముతో ఉంటాను. శాంతితోను ఇంద్రియనిగ్రహముతో ఉండే వాడికి చింతలు దరిచేరవు. నేను అలా నిశ్చింతగా జీవిస్తున్నాను " అని ప్రహ్లాదుడు అన్నాడు. ఇంద్రుడు " దానవేంద్రా ! నీకు ఇంతటి ప్రశాంతచిత్తము ఎలా అలవడింది చెప్పవా ! " అని అడిగాడు. ప్రహ్లాదుడు " దేవేంద్రా ! ఆత్మావలోకనము, మంచిప్రవర్తన, మనసును ప్రసన్నంగా ఉంచుకోవడము, అప్రమత్తత, పెద్దలను వృద్ధులను గౌరవించుట లాంటి ఉత్తమ లక్షణాలు మానవులకు మేలుచేసి మానవుడికి ప్రజ్ఞా శాంతి ఇస్తాయి. ఇది విన్న ఇంద్రుడు ఆశ్చర్యముతో తిరిగి స్వర్గానికి వెళ్ళాడు " అని చెప్పాడు.

## సిరి సంపదలు

ధర్మరాజు " పితామహా ! రాజు తన సిరిసంపదలు ఎలా పోగొట్టుకుంటాడో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఇంద్రుడికి బలికి మధ్య జరిన సంవాదము చెపితే ఈ విషయము నీకు అవగతము ఔతుంది " అన్నాడు. ఒక సారి ఇంద్రుడు బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి " బ్రహ్మదేవా ! ఒకప్పుడు బలి సిరిసంపదలతో తుల తూగాడు కదా ! ఆ బలి చక్రవర్తి ఇప్పుడేమి చేస్తున్నాడు ? " అని అడిగాడు. బ్రహ్మదేవుడు " మహేంద్రా ! నీ దుష్టతలపు నాకు తెలిసినా నీవు అడిగావు కనుక చెప్తాను విను. ఒంటె, గాడిద, ఆవు, గుర్రము వీటిలో ఏదో ఒకదానిలో ఉంటాడు. అతడిని చంపడము ఉచితము కాదు. అతడిని చంపనని నాకు మాట ఇచ్చి అసత్యదోషము కలగ కుండా చేసుకో " అన్నాడు. ఇంద్రుడు " అలాగే మాట ఇస్తాను అతడిని చంపనుకాని అతడితో మాట్లాడుతాను " అని స్వర్గానికివెళ్ళాడు. తరువాత అతడు గాలించి బలిని పట్టుకుని " బలీ ! ఆనాడు అనేక గజములు నీ వెంట రాగా భద్రగజము మీద ఊరేగిన నీవు ఇప్పుడిలా గాడిద రూపంలో ఊరేగుతున్నావా ! " అని హేళన చేసి " ఓ బలీ " నాడు బంగారపు ఊపస్థంభాను నిర్మించి యాగము చేసిన నిన్నిలాచూస్తే జాలి వేస్తుంది. ఇప్పుడు నీవు గడ్డి, పొట్టు తింటూ నీ పూర్వపు వైభవము తలచుకుని దు:ఖిస్తున్నావు కదా ! ఉన్న మాటచెప్పు " అని హేళన చేసాడు. బలి " మహేంద్రా ! నీకు నా వైభమ కనిపించదులే వాటినిప్పుడు ఒక కొండగుహలో దాచాను. నాకు తోచినప్పుడు వెళ్ళి అనుభవించి వస్తుంటాను. నీవిప్పుడు పెద్దవాడివి కదా మాబోటి పిన్నలసంగతి నీకెందుకు చెప్పు " అన్నాడు. ఇంద్రుడు " అది కాదు బలీ ! అఖిల భూతకోటి సూర్యరశ్మికి కరిగి పోయే మంచులా ఇలా కనపడి అలా వెళ్ళి పోతుంటారు కదా ! చావు పుట్టకలంటే అంతే కదా ! నీ లాంటి బుద్ధిమంతులు వాటికి అతీతులు కదా ! " అన్నాడు. బలి " మహేంద్రా ! వస్తూ పోతూ ఉండే జననమరణాలకు, సుఖదు:ఖాలకు, లాభనష్టాలకు నేను అతీతంగా ఉంటాను. ఇంద్రా ! బుద్ధిమంతులను, బుద్ధిహీనులను, ధనవంతులను, పేదవారిని తారతమ్యము లేకుండా యమధర్మరాజు ప్రాణములు సంహరిస్తుంటాడన్న విషయం తెలిసినవాడు సుఖదు:ఖాలకు తావివ్వక వాటికి అతీతంగా ఉంటాడు. దేవేంద్రా ! నేను ఈ గాడిదరూపంలో పొట్టు, గడ్డి తిన్నా నా మనసు ప్రశాంతిగా ఉంది కనుక నీవెంత హేళనచేసినా నాకు కోపమురాదు. నేను చక్రవర్తిగా ఉన్నప్పుడు నా ముందు నిలబడడానికి భయపడేవాడివి. కనుక నేనెవరో తెలుసుకుని ప్రవర్తించడము మంచిది. వికసించుట వాడిపోవుట విధికృతం. నీలాంటి పెద్దవాడు ఇలా అహంకరించి మాట్లాడడము నీచమైనది. అలా తుళ్ళిపడడము మాని ఎక్కడకు పోతావోపో. నాకు కోపం వస్తే నీవెంత నీ వజ్రాయుధము ఎంత తుళ్ళిపడకు అని కోపంతో చెప్పి అంతలో తమాయించుకుని నా మనసులో కోపము అహంకారము లేవు కేవలము పరిహాసానికి అన్నాను. విధాత ముందు మనమేపాటి. పోయి శాంతచిత్తుడవై జీవించు " అన్నాడు. ఈ సమయంలో బలిశరీరం నుండి ఒక అందమైన వనిత వెలుపలకు పోతూ ఉంది. ఇంద్రుడు " బలీ ఈమె ఎవరు ? " అని అడిగాడు. బలి " ఆమెను అడిగి తెలుసుకో " అన్నాడు బలి. మహేంద్రుడు " అమ్మా ! నీవు ఎవరు ? " అని అడిగాడు. ఆ స్త్రీ " ఇంద్రా ! నా పేరు లక్ష్మీ , శ్రీ అంటారు. మీ ఇరువురికి నేను ఎవరో తెలియక పోవడంలో ఆశ్చర్యం లేదు. ఎందు కంటే ముల్లోకాలలో ఇంత వరకు ఎవరు నన్ను గురించి తెలుసుకొన లేదు " అన్నది. ఇంద్రుడు " అది సరే ఇప్పుడు ఈ రాక్షసచక్రవర్తి నుండి ఎందుకు తొలగి పోతున్నావు " అని అడిగాడు. లక్ష్మి " ఇంద్రా ! సత్యము, ధర్మము, ఇంద్రియ నిగ్రహము, దానగుణము నా నివాస స్థానములు. పై లక్షణములు ఉన్న పరాక్రమవంతుడైన పురుషుడి వద్ద నేను ఉంటాను. బలిచక్రవర్తి వద్ద ఇప్పటి వరకు అవి అన్నీ ఉన్నాయి కనుక నేను అతడి అందు ఉన్నాను. కాలక్రమేణా అతడిలో అవినీతి, బ్రాహ్మణులపట్ల అసూయ పెరిగాయి. మంచి లక్షణములను వదిలిన బలిని ఇప్పుడు నేను వదిలివేస్తున్నాను. నీ వద్ద నేను పైన చెప్పిన గుణములే కాక వేదములు, శాస్త్రములు చెప్పిన ఆచారములు, నీ వద్ద పుష్కలంగా ఉన్నాయి. అందుకుని నీ వద్ద ఉండడానికి నేను నిశ్చయించుకున్నాను. కాని నువ్వు బలి మాదిరి కాకుండా ఏమరుపాటు లేకుండా సచ్చరిత్రుడవై ఉండాలి " అన్నది లక్ష్మి. తనను లక్ష్మి వదిలివెళ్ళిన తరువాత బలి " మహేంద్రా ! సూర్యుడు పశ్చిమాన అంతరించినంత మాత్రాన తన తేజస్సు కోల్పోడు తిరిగి తూర్పున ఉదయించక మానడు. అలాగే నేను గాడిద శరీరంలో ఉన్నంత మాత్రాన నా పరాక్రమము కోల్పోలేదు. నేతిరిగి వచ్చి దేవాసుర యుద్ధములో నిన్ను గెలుస్తాను " అన్నాడు. ఇంద్రుడు " అప్పుడు చూడవచ్చు ప్రస్తుతము నీతో వ్యర్ధ ప్రసంగం చేసే సమయం లేదు. బ్రహ్మదేవుడికి ఇచ్చిన మాట ప్రకారము నిన్ను చంపక వదిలి వెళుతున్నాను " అని చెప్పి అక్కడ నుండి వెళ్ళాడు. బలి కూడా అక్కడ నుండి దక్షిణం

దిక్కుగా వెళ్ళాడు.

## నముచి

భీష్ముడు " ధర్మనందనా ! **నముచి**ని గురించి వినిపిస్తాను. పూర్వము నముచి అనే రాక్షసుడు ఉండే వాడు. అతడికి ఉన్న సంపద అంతా పోయింది. అయినా అతడు చింతపడక ఏకాంతస్థలంలో సంతోషంగా ఉన్నాడు. అతడి వద్దకు ఇంద్రుడు వచ్చాడు. అతడి వద్దకు ఇంద్రుడు వచ్చి " దానవరాజా ! ఉన్న సంపద పోగొట్టుకుని ఆదరించే వాళ్ళులేక పేదరికంలో మగ్గుతున్నందుకు ఎంత చింతిస్తున్నావో కదా ! " అని అన్నాడు. నముచి " దేవేంద్రా ! పోయిన సంపదకొరకు చింత ఎందుకు చింతపడితే పోగొట్టుకున్నది వస్తుందా విచారించడము నిరర్ధకము కాదా ! అలారాక పోగాచింత, దుఃఖము మిగులుతాయి. ఇదంతా తెలుసు కనుక నేను పోయిన వాటి కొరకు దుఃఖించడం లేదు. దేవేంద్రా ! ముల్లోకాలనూ శాసించే వాడు ఒకడు ఉన్నాడు. నీరు పల్లముకు పారినట్లు మనము కోరుకున్నవన్నీ మన వద్దకు వస్తాయి. అయినా ఇది నాకు జరగవలసినది అందుకే ఇలా జరిగింది అనుకుంటే దిగులు, చింత, సంతోషము ఆనందము ఎందుకు వస్తాయి " అన్నాడు. మనకు ప్రాప్తము లేని దానిని మనము మన పరాక్రమముతోనూ , ధైర్యముతోనూ, వీరత్వముతోనూ, ప్రజ్ఞతోనూ, శౌర్యముతోనూ సాధించ లేము. ఈ విషయము తెలుసుకున్న బుద్ధిమంతుడు ఈ విషయం ఎరిగి లేని దానికొరకు చింతించడు. దేవేంద్రా ! మేలు కీడు అనేవి మనము కోరుకుంటే రావు వద్దంటే పోవు. కనుక వాటి కొరకు ఆరాటపడడం తగదు " అన్నాడు.

## ధైర్యము

ధర్మరాజు " పితామహా ! మానవుడికి దుర్దశ కలిగినప్పుడు ఎలా ఉంటాడు దానిని ఎలా ఎదుర్కొంటాడో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! అన్ని రకముల దుర్దశలకు ధైర్యమేమందు. ధైర్యంతో మాత్రమే మనసు గట్టిపడుతుంది. మానవుడు దృఢనిశ్చయంతో ఆ దుర్దశనుండి బయట పడతాడు. ఒకసారి ఇంద్రుడు బలితో చేసిన సంవాదము గురించి చెప్తాను. దేవాసురయుద్ధంలో దేవతలకు మహావిష్ణువు అండదండలతో విజయం లభించింది. అప్పుడు దేవేంద్రుడు, రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, వసువులు, గంధర్వులు, సిద్ధులు మొదలైన వారు పర్యవేష్టించి ఉండగా **ఐరావతము** ఎక్కి మూడు లోకములలో పర్యటిస్తున్నాడు. అలా విహరిస్తూ ఒక కొండగుహలో దాగి ఉన్న బలిని చూసాడు. అత్యంత వైభవంతో వెలిగి పోతున్న దేవేంద్రుడిని చూసినా బలి చలించక నిబ్బరంగా ధైర్యంగా ఉన్న బలిని చూసి " బలీ ! ఉన్న వైభవమంతా పోగొట్టుకుని దీనావస్థలో ఉన్నా శత్రువునైన నా వైభవము చూసి కూడా చలించక ఉన్నావు. నీకు ఈ నిర్వికారము ఎలా కలిగింది. నీ శౌర్యము వలనా ! పెద్దలకు సేవ చేసిన ఫలమా ! లేక నీవు చేసిన తపో మహిమా నాకు తెలియకున్నది. దేవేంద్రుడినైన నన్ను కూడా లక్ష్యపెట్టక ఉండుటకు కలకారణం ఏమి ? " అన్నాడు. బలి " నేను నిన్ను లక్ష్యపెట్ట లేదని అడుగుతున్నావు. లక్ష్యపెట్టడం వలన ప్రయోజనమేమి ? ఇప్పుడు నీవు అనుభవిస్తున్న వైభవము ఒక వైభవమా ! దైవవశమున ఇలాంటి దుస్థితి ఎవరికైనా రావచ్చు. దేవేంద్రా ! నేను నిన్ను ఒక సారి ఓడించి నిన్ను హీనావస్థకు తెచ్చాను. కాని అది నేను చేసినది కాదు. విధి విలాసము. అలాగే ఇప్పుడు నేను అనుభ విస్తున్నది విధికృతమే కాని నీ వలన జరిగినది కాదు. వీటిని భరించడానికి ధైర్యమే ముఖ్యము. దానంతట అవే వస్తూపోయే సుఖదుఃఖాలకు సుఖము వచ్చినప్పుడు అంతా నా వలనే సంభవించిందని దుఃఖము కలిగినప్పుడు విలపించడము మంచిది కాదని విజ్ఞులు చెప్ప లేదా ! స్నేహితులు, బంధువులు, ఐశ్వర్యము, కీర్తిప్రతిష్టలు ఎన్ని ఉన్నా మానవుడికి కలిగే దుర్దశను నివారించ లేరు. అది ఎరిగిన కాలవశమున ఐశ్వర్యము, దారిద్యమూ వస్తూ పోతుంటాయని అర్ధము ఔతుంది. ఒకప్పుడు నా కాలం కలిసి వచ్చింది నేను నిన్ను ఓడించాను. ఇప్పుడు నీ కాలం కలిసి వచ్చి నీవు నన్ను ఓడించావు. కనుక శుభాశుభములకు కాలమేకర్త అని తెలియ లేదా దేవేంద్రా ! నీకూనాకూ మద్య ఉన్న శత్రుత్వమూ కాలవశాన వచ్చినదే ! ప్రస్తుతము నాకాలము బాగా లేదు కనుక నేను ఇప్పుడు నిన్ను ఎదిరించలేను. నీ మీద కోపమూ రాలేదు. నాకు లీలా మాత్రంగా కోపము వచ్చినా చాలు నిన్ను నీగర్వాన్ని ఎడమ చేతితో కాల్చగలను. నీకు విజయగర్వము తలకెక్కింది కనుక కిందా మీదా తెలియక ప్రవర్తిస్తున్నావు. నీవు ప్రాభవము చెందే కాలము సమీపంలోనే ఉంది. ప్రస్తుతము నీవు ఇంద్రుడివి నీకు ముందు ఎందరో ఇంద్రులు రాలేదా పోలేదా ! ఇంద్రులే కాదు బ్రహ్మలు కూడా వస్తూ ఉంటారు పోతూ ఉంటారు. కాలం గడిచే కొద్దీ ఇంద్రులు బ్రహ్మలు వస్తూ పోతున్నప్పుడు ఒక దానవుడు ఓటమి చెందిన ఆశ్చర్యము ఏముంది. దీనికి నీవు నిందించపని లేదు. జ్ఞయాగములు, వ్రతములు, పూజలు చెయ్యడం, మంచి నడవడి కలిగి ఉండడము పతనముకావడమూ కాల మహిమే " అన్నాడు బలి. ఇంద్రుడు కొంత తొట్రుపడి దానిని దాచుకుని " ఇంత హీన స్థితిలో కూడా నీ ధైర్యము, వివేకము, వినయము తగ్గలేదు. ఇందుకు కారణమైన నిష్ఠ ఏమిటో చెప్పవా " అని అడిగాడు. బలి " దేవేంద్రా ఎంత వెర్రి వాడివయ్యా ! నేను ధైర్యము, వినయము, వివేకము, శాంతి నేను ఎక్కడి నుండి తీసుకు రాలేదు అవి నాలో స్వతఃసిద్ధంగా ఏర్పడ్డాయి. మానవులకు కలిగే మహాదశలు దుర్దశలు కాలవశాన వచ్చేవే. ఈ కాలము నదీ ప్రవాహము వంటిది. నది కొంచెం కొంచెంగా కొండనుకూడా ఎలా కోస్తూ తుదకు నామ రూపాలు లేకుండా ఎలా చేస్తుందో అలాగే కాలం మనిషిలోని లోభ, క్రోధ, కామములను పడవేసి క్రమక్రమముగా సమూలంగా

నాశనం చేస్తుంది. అజ్ఞాని దీనిని తెలుసుకొన జాలక ఇప్పటి వరకు బాగ ఉన్న వాడికి ఇంతటి దుర్దశ ఎలా దాపురించింది అని ఆశ్చర్యపడతాడే కాని ఎప్పుడో తనకూ దుర్దశ ప్రాప్తిస్తుందని తెలుసుకోలేడు. దేవేంద్రా భావమూ లేక అత్యుత్తమ తపసు చేసే వాడికి కాలగతిలోకలిగే మార్పులు కరతలామలకంగా శోభిస్తాయి. అలా కాలగతిని సాక్షిగా చూస్తున్నప్పుడు మనసుకు శాంతిలభిస్తుంది. తాను ఆత్మే కాని శరీరముకాదు. కాలగతిలో కలిగే కష్టసుఖాలు శరీరానికేగాని ఆత్మకు కాదు అన్న విజ్ఞానము కలుగుతుంది " అని బలి పలికాడు. బలికి కలిగిన మానసిక పరిపక్వానికి అచ్చెరువందిన ఇంద్రుడు " రాక్షసరాజా ! ఈ ప్రకారంగా కాలగతిని తెలుసుకుని పవిత్రమైన శీలంతో వెలుగొందుతున్నావు. నీ శీలము ఈ లోకంలో ఎందరికో ఆదర్శం. ఈ లోకమంతా నీ అరచేతిలో దర్శిస్తూ త్రిగుణాతీతుడవై నిర్గుణుడవై వెలుగుతూ ఆత్మావలోకనము చేసుకున్నావు. నీకు నువ్వే శాటి. అతి త్వరలో నీకు కలిగిన దుర్దశతొలగి నీకు మేలుకలిగి సకల సుఖములు పొందగలవు " అని పలికి అక్కడ నుడి వెళ్ళాడు. అమృతోపమాయమైన బలి పలుకులు దేవేంద్రుడికి అమృతం కంటే రుచిగా అనిపించి ఆనందింప చేసాయి " అని భీష్ముడు చెప్పాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

"http://te.wikipedia.org/w/index.php?title=శాంతి_పర్వము_చతుర్థాశ్వాసము&oldid=760940" నుండి వెలికితీశారు

వర్గం: మహాభారతం

---

# శాంతి పర్వము పంచమాశ్వాసము

వికీపీడియా నుండి

**వైశంపాయనుడు** జనమేజయుడికి భారత కధను వినిపిస్తున్నాడు. ధర్మరాజు శంకలకు భీష్ముడు చక్కగా సమాధానాము ఇస్తున్నాడు. ఆ క్రమంలో ధర్మరాజు భీష్ముడిని " పితామహా దేహంలోని పురుషుడు ఏ కారణంగా శ్రీమంతుడు ఔతాడు. ఏకారణంగా నశిస్తాడు " అని అడిగాడు.

## విషయ సూచిక

## శ్రీమంతుడు

భీష్ముడు " ధర్మనందనా ! నీకు ఇంద్రుడు లక్ష్మీదేవికి మధ్య జరిగిన సంవాదము చెప్తాను విను. ఒక రోజు నారదుడు లోక సంచారము చేస్తూ మందాకినీ నదిని చేరుకుని అక్కడ స్నానమాచరించి ఆ సమయంలో అప్పటికే ఇంద్రుడు మందాకినీ నదిలో స్నానమాచరించి అనిష్టానం తీర్చుకోవడం చూసి ఇంద్రుడితో సంభాషించ సాగాడు. అప్పుడు ఒక స్త్రీ వచ్చి ఇంద్రుడికి నమస్కరించింది. ఇంద్రుడు " నీవు ఎవరు ఎక్కడకు పోతున్నావు ? " అని అడిగాడు. ఆ స్త్రీ " ఓ ఇంద్రా ! నేను తామరపువ్వు నుండి జన్మించిన లక్ష్మిని. ఇప్పటి వరకు నేను రాక్షసుల వద్ద ఉన్నాను. ప్రస్తుతము వారి ప్రవర్తన నచ్చక ఇప్పుడు నీ వద్దకు వచ్చాను " అన్నది. ఇంద్రుడు " అదిసరే ఇప్పటి వరకు రాక్షసుల వద్ద ఏ గుణములు నచ్చి వారి వద్ద ఉన్నావు ? ఇప్పుడు నీకు వారు ఎందుకు నచ్చ లేదు ? నిన్ను మెప్పించాలంటే ఏమి చేయాలి ? " అని అడిగాడు. లక్ష్మి " ఇంద్రా ! ఇప్పటి వరకు అసురులు దానములు, వేదాధ్యయనము చేయడము, అతిథులను సత్కరించడం వంటి మంచి పనులు చేసారు. ఇప్పుడు వారికి గర్వము పెరిగి మంచి గుణములను విడిచి పెట్టారు. అందుకని నేను వారిని విడిచ పెట్టాను. నీవు సత్యధర్మపరుడవని ఎరిగి నీ వద్దకు వచ్చాను. గురువుల ఎడ భక్తి కల వారు, పితరులను దేవతలను పూజించు వారు, సత్యమును పలికే వారు, దానశీలురు, ఇతరుల ధనమును కాని భార్యలను కాని కోరనివారు, పగలునిద్రించని వారు, వృద్ధులపట్ల బాలలపట్ల స్త్రీలపట్ల దయ కలిగిన వారు, బ్రాహ్మణులను పూజించు వారు, నిత్యము శుచిశుభ్రత కలిగిన వారు, అతిథులకు పెట్టికాని భుజించని వారు నాకు అత్యంత ప్రీతిపాత్రులు. నేను వారివద్ద ఉండడానికి ఇష్ట పడతాను. అలా కాక కామముకు, లోభము, క్రోధములకు


దేవరాజు ఇంద్రునికి నారదునికి లక్ష్మీదేవి ప్రత్యక్షమగుట

లోనై ధర్మమును విడిచిన వారు, గర్విష్టులు, అతిథి సత్కారము చేయని వారు, పరుషవాక్యములు పలుకువారు, క్రూరపు పనులు చేయువారిని నేను మెచ్చను. అటువంటి వారి వద్ద ఉండడానికి నేను ఇష్టపడను " అన్నది లక్ష్మి. ఆ మాటలకు ఇంద్రుడు, లక్ష్మి ఎంతో సంతోషించారు. ఇంద్రుడు లక్ష్మీదేవితోసహా స్వర్గానికి వెళ్ళాడు. కనుక ధర్మరాజా ! లక్ష్మీ దేవి నివాస స్థానములు తెలుసుకుంటివి కదా అలా నడచుకో " అన్నాడు.

## ముక్తి మార్గము

ధర్మరాజు " పితామహా ! ప్రజలు దేనిని ఆచరించిన, ఏవిధ్య అభ్యసించిన ముక్తి పొందగలరు " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ సందర్భంలో నీకు ఒక ఇతిహాసము చెప్తాను విను. పూర్వము **జైగిషల్యుడు** అనే మహాముని **దేవలుడికి** ఇలా చెప్పాడు. శాంతిమతులకు, సౌమ్యులకు ఏధర్మము వర్తిస్తుందో నాకు అదే ఇష్టము. ఆ ధర్మమును నీకు వివరిస్తాను. తనను పొగిడినా, తిట్టినా, ప్రియము చేసినా, అప్రియము చేసినా, తనను ఎవరైనా పొగిడినా బాధించినా అటువంటి వారి ఎడ సమభావం వహించడము జ్ఞానులలక్షణము. కోరిన వస్తువు లభించలేదని చింతించక ఉన్న దానితో తృప్తిపడాలి. తాను అనుకున్నది జరగలేదని చింతించ కూడదు. హర్షము, అభిమానము, అసూయ, మదము, తప్పు చేయడము మొదలైనవి దుర్గుణాలు. ఇంద్రియనిగ్రహము కలవాడు తనకు అవమానము జరిగినా సన్మానము జరిగినట్లే భావిస్తాడు. తనకు సన్మానము జరిగినా అందుకు అధికముగా పొంగిపోక సమభావము కలిగి ఉంటాడు. ఇంద్రియములను అదుపులో పెట్టుకున్నవాడు ప్రశాంత మనస్కుడై ఉంటాడు. దేవతలు సహితము అతడి స్నేహాన్ని కాంక్షిస్తారు " అని చెప్పాడు.

## జనప్రియుడు


ఉగ్రసేనుని కలసిన కృష్ణుడు

ధర్మరాజు " పితామహా ! అఖిల జనులకు ప్రియము కలిగించు వాడు ఎవరు ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ సందర్భంలో శ్రీకృష్ణుడికి ఉగ్రసేనుడికి జరిగిన సంవాదము వినిపిస్తాను. ఒకసారి **ఉగ్రసేనుడు** శ్రీకృష్ణుడితో " కృషా ! లోకంలోని జనులంతా నారదుడిని భక్తి ప్రమత్తులతో పూజిస్తారు కదా ! అతడి అంతటి గొప్ప వాడా ! నారదుడిలో ఉన్న గొప్పతనము ఏమిటి ? " అని అడిగాడు. శ్రీకృష్ణుడు ఇలా చెప్పాడు " నారదుడిలో వేదవిద్య, ఆచారము సమృద్ధిగా ఉన్నాయి కాని అహంకారము కొంచము కూడా లేదు. సచ్ఛీలవంతుడు నిరాడంబర వేషధారి, మత్సరము, గర్వము, మదము, మచ్చుకైనా లేవు. నారదుడు తన పుట్టుకచేత, తపస్సుచేత, తేజముచేత, బుద్ధిచేత, నీతిచేత ప్రసిద్ధిపొందాడు. నారదుడు ధీరుడు, మృదుమధురంగా మాటాడువాడు. కాఠిన్యము, దైన్యము, క్రోధము, లోభము, నిరాసక్తత మచ్చుకూడా లేదు. నారదుడుకు ఈర్ష్య, అసూయ అనేవి, ఎలా ఉంటాయో తెలియదు. కనుక జనులు నారదుడిని కీర్తిస్తారు. ధర్మజా నీవడిగిన ప్రశ్నకు సమాధానము ఇదే ! " అని అన్నాడు.

## కాలప్రమాణము

ధర్మరాజు " పితామహా ! నాకు కాల విభజన గురించి యుగప్రమాణముల గురించి భూతములు అన్ని రకములు ? వాటిని వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ విషయములను పూర్వము వేదవ్యాసుడు శుకుడికి చెప్పాడు. అవే విషయములను నీకు వివరిస్తాను. వేదవ్యాసుడు " కుమారా ! ఈ కాలముకు పంచభూతములకు ఆధారభూతంగా వెలిగే తేజోరూపము ఒకటి ఉంది. ఆ తేజస్సు ఎప్పుడూ చైతన్యవంతంగా ఉన్నట్లు కనిపిస్తుంది కాని ఏ పనీ చేయదు. కేవలం సాక్షీ భూతంగా మాత్రమే ఉంటుంది. ఆ తేజస్సు కేవలం భావనలో

మాత్రమే కనిపిస్తుంది. ఇక కాలప్రమాణము గురించి చెప్తాను విను. 18 నిముషాలు కలిస్తే ఒక **కాష్ట** ఔతుంది. 30 కాష్టలు ఒక **కళ** ఔతుంది. 360 కళలు ఒక **ముహూర్తము**. 30 ముహూర్తాలు ఒక **అహోరాత్రము**. 30 అహోరాత్రములు ఒక **మాసము**. 2 మాసములు ఒక **ఋతువు** ఔతుంది. 3 ఋతువులు ఒక **ఆయనము** ఔతుంది. రెండు ఆయనములు ఒక **సంవత్సరం** ఔతుంది. ఆయనములు రెండు అందులో ఒకటి **ఉత్తరాయణము** రెండవది **దక్షిణాయనము**. ఉత్తరాయణమును **అగ్ని** అంటారు. దక్షిణాయణన్ని **ధూమము** అంటారు. ఉత్తరాయణము మంచి చేస్తుంది. దక్షిణాయణము చెడ్డచేస్తుంది. భూమి మీద మానవులకు ఒక మాసకాలము పితరులకు ఒకరోజు. మానవుల సంవత్సరకాలము దేవతలకు ఒక రోజు. ఇక యుగముల గురించి చెప్తాను విను. దేవతలకు 12,000 సంవత్సరాలు భూమి మీద 4 యుగముల కాలము. మొదటిది కృత యుగము అది 12,000 సంవత్సరమల కాలంలో 40 శాతము అంటే 4,800 సంవత్సరాలు. రెండవది త్రేతా యుగము అది 12,000 సంవత్సరాల కాలములో 30 శాతము అంటే 3,600 సంవత్సరములు. మూడవది ద్వాపర యుగము అది 12,000 సంవత్సర కాలములో 20 శాతము అంటే 2,400 సంవత్సరములు. నాల్గవది కలియుగము అది 12,000 సంవత్సర కాలములో 10 శాతము అంటే 12,00 సంవత్సరాల కాలము. యుగములు మానవ కాలములో :-

- కృతయుగము : 17,28,000 సంవత్సరాలు.
- త్రేతాయుగము : 12,96,000 సంవత్సరాలు.
- ద్వాపరయుగము : 8,64,000 సంవత్సరాలు.
- కలియుగము : 4,32,000 సంవత్సరాలు.

యుగముల మధ్యకాలాన్ని యుగసంధి కాలము అంటారు. యుగ సంధి కాలము కృతయుగమున 400 దేవ సంవత్సరాలు, త్రేతాయుగమున 300 దేవ సంవత్సరాలు, ద్వాపర యుగమున 200 దేవ సంవత్సరాలు, కలియుగమున 100 దేవ సంవత్సరాల కాము ఉంటాయి.

యుగసంధి మానవ కాలములో :-

- కృతయుగము : 1,44,000 సంవత్సరాలు.
- త్రేతాయుగము : 1,08,000 సంవత్సరాలు.
- ద్వాపరయుగము : 72,000 సంవత్సరాలు.
- కలియుగము : 36,000 సంవత్సరాలు.

త్రేతాయుగము నుండి మానవులలో ధర్మము, న్యాయము, ఆయువు, శరీరబలము, ధారుఢ్యము క్రమక్రమంగా తగ్గుతూ ఉంటాయి. ఈ నాలుగు యుగములు ఒక మహాయుగము ఔతుంది. అటువంటి మహాయుగములు వెయ్యి బ్రహ్మదేవుడికి ఒక పగలు. అలాగే ఒక వెయ్యి మహాయుగములు ఒక రాత్రి ఔతాయి. బ్రహ్మ నిద్రించే సమయంలో జగత్తుకు ప్రళయం సంభవిస్తుంది. బ్రహ్మదేవుడు నిద్ర లేవగానే బ్రహ్మదేవుడు సృష్టికి పూనుకుంటాడు. ఇలా సృష్టి క్రమం నడుస్తూ ఉంటుంది.

## బ్రహ్మతత్వము

ఈ బ్రహ్మతత్వము నుండి మహతత్వము పుట్టింది. మహతత్వము నుండి క్రమముగా మనస్సు, గగనము, పవనము, నీరు, భూమి ఒక దాని నుండి ఒకటి ఆవిర్భవించాయి. ఈ పంచభూతములకు శబ్ధ, స్పర్శ, రస, గంధములు గుణములుగా భాసిస్తున్నాయి. ఈ సప్తస్వరూపములను పురుషులు అంటారు. వారంతా సమిష్టిగా సృష్టికార్యము నెరవేరుస్తారు. మనలో ఉన్న తేజోమయమైన పురుషరూపమును బ్రహ్మము అనీ ప్రజాపత్యము అని అంటారు. ఆ పురుషుడు సర్వవ్యాపకుడు, స్రష్ట, బ్రహ్మ, ప్రజాపతి అనే పేర్లతో పిలువబడతాడు. ఆ పురుషుడు సత్యము, నిత్యము అయిన ఆత్మ స్వరూపుడు, ఆ పురుషునకు జగత్తు విషయాలు ఏవీ అంటవు. అతడు దేవతలలో, మునీంద్రులలో, గరుడ, ఉరగ, కిన్నెరులలో, నదులలో, వనములలో, సముద్రాలలో నిండి ఆయాకార్యములు నిర్వహిస్తుంటాడు. ఇక మనుష్యుల స్వభావములు విచిత్రంగా ఉంటాయి. కొందరు తమ ప్రయత్నాల వలన మాత్రమే తనకు అన్నీ లభిస్తున్నాయి అనుకుంటారు. మరి కొందరు అన్నీ దేవుడే ఇస్తున్నాడు అనుకుంటారు. మరి కొందరు పంచభూతాలే సకలమూ చేస్తున్నాడని అనుకుంటున్నారు. ఇక సాత్వికులు అంతటా సమాన దృష్టితో చూస్తూ సుఖదు:ఖాలకు లోనుకాక ఉంటారు. అన్నిటికంటే తపస్సు గొప్పది, తపసుకు

ఇంద్రియ నిగ్రహము , మానశిక శాంతి అవసరము. ఇంకా సాధ్యాయనము వేదాధ్యనము ఈ తపసుకు బలము చేకూర్చి మంచి బలాన్నిస్తుంది. ఈ బ్రహ్మములు శబ్దబ్రహ్మము, పరబ్రహ్మము అని రెండు విధములు. సాధకుడు ముందు శబ్దబ్రహ్మమును ఆరాధించి పరబ్రహ్మాన్ని పొందగలడు. ఈ పరబ్రహ్మ జగత్తును సృష్టిస్తుంది లయము చేస్తుంది కాని తాను దేనిలోనూ పాల్గొనదు.

## లయము

కుమారా ! ఇప్పటి వరకు సృష్టి గురించి చెప్పాను. ఇక లయం గురించి చెప్తాను. ప్రళయకాలంలో ఈ చరాచర జీవరాశులు సమస్తము భూమిలో కలిసిపోతాయి. అంటే మట్టితో నిర్మించబడిన ఈ శరీరాలు తిరిగి మట్టిలో కలిసిపోతాయి. తరువాత ఈ భూమి సమస్తం జలమయమౌతుంది. జలం అగ్నిలోకలుస్తుంది. అగ్ని వాయువులోకలుస్తుంది. వాయువు ఆకాశంలోకలుస్తుంది. ఈ ఆకాశాన్ని మనసులాగుతుంది. మనసు చంద్రుడిలోలీనమౌతుంది. మనసులో పుట్టినసంకల్పాలు చంద్రుడిని తనలో లీనం చేసుకుంటుంది. ఆ సంకల్పాలను జ్ఞానం తనలో ఇముడ్చుకుంటుంది. ఆ జ్ఞానం కాలంలో కలిసి పోతుంది. ఆ తరువాత కాలం కూడా నశిస్తుంది. ఆఖరున శుద్ధతత్వము స్వరూపమై అఖండ జ్ఞానము వెలుగుతూ ఉంటుంది. దానినే బ్రహ్మరూపము అంటారు. ఈ సంహారణకారణము అంతా బ్రహ్మ వలననే జరుగుతుంది " అని వ్యాసుడు చెప్పాడు.

## జాతి ధర్మములు

వ్యాసుడు ఇంకా " కుమారా ! బ్రాహ్మణుడు పుట్టగానే జాతకకర్మ చేస్తారు. తరువాత ఉపనయనము చేస్తారు. తరువాత అతడు గురువు వద్దకు వెళ్ళి వేదములు, శాసత్రములు నేర్చుకుంటాడు. అలా గురువు ఋణము తీర్చుకుంటాడు. తరువాత గురుగారి అనుజ్ఞతో వివాహము చేసుకుని గృహస్థాశ్రమం స్వీకరిస్తాడు. గృహస్థాశ్రమంలో దేవఋణం పితృఋణం తీర్చుకుంటాడు. బ్రాహ్మణులకు యజ్ఞములు చేయడం చేయించడం, వేదాధ్యనం చేయడం, వేదములు ఇతరులకు బోధించడం, దానములు చెయ్యడం, దానములు స్వీకరించడం లాంటి ఆరుకర్మలు బ్రాహ్మణులు చేయతగ్గవి. అన్ని జాతులవారు దానములు చేయవచ్చు. దానముకు అర్హము కాని వస్తువు లేదు. **కాశ్యుడు** అనే రాజు తన ప్రాణములు దానం ఇచ్చి ఒక బ్రాహ్మణుడి ప్రాణములు కాపాడాడు. **శిబిచక్రవర్తి** తన శరీర అవయవములను, తన కుమారుడిని బ్రాహ్మణుడి కొరకు అర్పించాడు. కాశీరాజు **ప్రత్యయనుడు** తన కళ్ళను బ్రాహ్మణుల కొరకు దానంచేసాడు. జనకమహారాజు, పరశురాముడు తమ రాజ్యాలను బ్రాహ్మణులకు దానంచేసాడు. పాంచాలరాజు **బ్రహ్మదత్తుడు** శంఖనిధిని బ్రాహ్మణులకు దానంచేసాడు, ఇంకా బ్రాహ్మణులకు తమతమ ప్రాణములను, శరీరములను, మణులను, బంగారమును, కన్యలను, ఆవులు మొదలైన ప్రశస్త వస్తువులను అనేకులు దానంగా ఇచ్చారు. వారికందరికి ఉత్తమగతులు ప్రాప్తించాయి. దానం చేయడము వలన, వేదాధ్యయనము చేయడము వలన, యజ్ఞము చెయ్యడము వలన నానావిధములైన పాపములు వినాశనం ఔతాయి. కనుక దానగుణము ఆచరించడం ఉత్తమము.

## సంసార నావ

ఈ ప్రకారము పాపములు పోగొట్టుకున్న మానవుడు మితముగా భోజనం చెయ్యడం, ఇంద్రియనిగ్రహం, అరిష్డవర్గాలకు దూరంగా ఉండడము వంటివి చేసి బ్రహ్మపదముకై ప్రయత్నించాలి. అప్పుడు మానవుడు సంసార నది ఆవలి ఒడ్డుకు చేరగలడు. బుద్ధిమంతుడు తన ప్రజ్ఞ అను నావను ఉపయోగించి సంసారమనే నదిని దాటి ఆవలి తీరము చేరగలడు. సంతోషము, భయము, కోపము లేని వాడు, బుద్ధి, ధైర్యము, అప్రమత్తత ఉన్నవాడు, ధర్మము తప్పనివాడు, ఇంద్రియనిగ్రహము కలవాడికి నాశనంలేదు. ఒక్కోసారి మనం చేసే అధర్మకార్యాలు ధర్మంగా అనిపిస్తాయి అప్పుడు శాస్త్రములు పఠించి ధర్మనిర్ణయం చేయాలి. బుద్ధిమంతుడు జ్ఞానము సముపార్జించడానికి వాక్కును, మనస్సును నియంత్రించుకుంటాడు. అట్టివాడు వేదవిదుడైనా, వేదములు చదవకపోయినా, వేదములు చదవకపోయినా, ధర్మాత్ముడైనా , పాపాత్ముడైనా, పైన చెప్పినపద్ధతులు పాటించిన ఈ జరామరణాలతో కూడిన ఈ సంసారాన్ని అవలీలగాదాటకలడు. యోగము అనే రధముకు సదాచారము చక్రము. ప్రాణము కాడికొయ్య. అపానము అక్షము (ఇరుసు). ఉపాయము అపాయము అనేవి నొగలు. జ్ఞానేంద్రియములు అశ్వములు. సర్వతంత్రము అనేది అశ్వములను తోలు చర్నాకోలు. త్యాగము పగ్గములు. సాధకుడు ఈ యోగము అను రధము ఎక్కి మోక్షమార్గమున పయనిస్తాడు. క్రమముగా పంచభూతములను గెలిచి, అహంకారమును పక్కకు నెట్టి, బుద్ధిని పెంపొందించుకుని ప్రకృతిసిద్ధములైన వికారములను పోగొట్టుకుని చివరకు ఈ భూమిని జయించి చివరకు యోగసిద్ధిని పొంది ప్రకాశిస్తాడు. మానవుడు తనలోని అహంకారమును జయించిన అది మనస్సును,

పంచభూతములను, బుద్ధిని జయించే మార్గాన్ని సుగమంచేస్తుంది ఇదే యోగమార్గము. ఇంద్రియములను ప్రపంచవిషయముల మీదకు పోనీయక మనస్సును అంతర్ముఖం చేసి అను సంధానించడమే సాంఖ్యము అంటారు. సాంఖ్యము యోగము వేరువేరు కాదు రెండూ ఒకటే. సారంలేని సంసారముకు కారణం మమతలు, మమకారాలు. సాంఖ్యులకైనా, యోగులకైనా మమతలు వదలడం ముఖ్యము.

## భూతములలో తారతమ్యములు

ఇక భూత్యములలో తారతమ్యములు చెప్తాను విను. భూతములు రెండు విధములు. **స్థావరములు**, జంగములు. స్థావరములు అంటే కదలనివి. **జంగములు** శ్రేష్టమైనవి. జంగములు వీర్యము, అండము, బీజము, స్వేదము మొదలైన వాటి నుండి పుడతాయి. వీటిలో రెండు కాళ్ళ జీవులు, నాలుగు కాళ్ళు, అనేక పాదములు కలిగిన జీవులు ఉంటాయి. ఈ జీవులలో రెండుకాళ్ళు కలిగిన మానవులు మేలు. ఈ మనుష్యులలో జాతి ధర్మములను పాటించే వారు మేలు. వారిలో బ్రాహ్మణులు ఉత్తములు. బ్రాహ్మణులలోవేదాధ్యయనము చేయు వారు ఉత్తములు. వేదాధ్యయనము చేయు వారిలో ప్రవచనము చేయు వారు గొప్పవారు. వారిలో ఆత్మజ్ఞానము కలవారు శ్రేష్టులు. అటువంటి వారు స్వధర్మమును పాటించేవారు, మంచి సంకల్పం కలవారు, దైవారాధికులు అయి ఉంటారు. అటువంటి వారినే బ్రాహ్మణులు అంటారు. అటువంటి వారు అందరి చేత నమస్కారములు, ఆదరము పొందుతాడు. అటువంటి వారితో సమానులు ఈ భీమి మీద ఎవరు ఉండరు. అటువంటి బ్రాహ్మణులను ఆధారం చేసుకునే ఈ ప్రపంచము ధర్మమార్గంలో నడుస్తుంది. అటువంటి బ్రాహ్మణుడు నిర్మలమైన జ్ఞానము కలిగి ఉండాలి, నిష్ఠాగరిష్టుడై ఉండాలి, తనువేదము విధించిన కర్మలను నిష్ఠతో నెరవేర్చాలి. అలాంటి వాడికి ఎలాంటి సందేహములు లేక నిర్మల మనసుతో జీవిస్తాడు. ఈ చరాచరజగత్తును సృష్టించిన మహతత్వాన్ని చేరు కోవడానికి తపసును మించిన సాధనములేదు. బ్రాహ్మణులకు మైత్రి వంటి ధర్మము మరొకటి లేదు. మైత్రీధర్మము సక్రమంగా పాటిస్తే ఇక మిగిలిన కర్మలతో పని లేదు. మైత్రీధర్మము వివేకమును ఇస్తుంది " అని వ్యాసుడు శుకుడితో చెప్పాడు.

## బ్రహ్మపదము

శుకుడు వ్యాసుడితో " మునీంద్రా ! పరమ బ్రహ్మపదము పొందుటకు అవసరమైనది యజ్ఞములా ? యోగమా ? సాంజ్ఞమా ? జ్ఞానమా ? వీటిలో ఏది ముఖ్యమో వివరించండి? " అని అడిగాడు. నీవు చెప్పినవి అన్నీ మంచివే. తపాస్సు, ఇంద్రియ నిగ్రహము, రాగద్వేషములు, లోభములను పక్కన పెట్టే నేర్పు, దృఢమైనవిద్య వీటి వలన కూడా పురుషుడు బ్రహ్మపదమును పొందవచ్చు. ప్రయత్నమీద ఇంద్రియములను నిగ్రహించ వచ్చు. మనస్సును నిగ్రహిస్తే ఇంద్రియము పని చేయడము మానివేస్తాయి. అప్పుడు బ్రహ్మప్రాప్తి పొందడము సులువు. బుద్ధి మనకు కనిపించదు, వినిపించదు కాని బుద్ధివలన మనము పరమాత్మను చూడగలము తెలుసుకోగలము. వినయము, విద్య కలిగిన బ్రాహ్మణుడియందు, ఆవులందు, ఏనుగులందు, వీధికుక్కలందు, కుక్కమాంసము తినువారియందు సమదర్శనము కలవారు బ్రహ్మపదవికి అర్హులు. చరాచరజగత్తులో అన్ని జీవరాశులందు భగవంతుడు ఆత్మస్వరూపుడై వెలుగుతూ ఉంటాడు. ఆ పరమాత్మయందు అన్ని జీవరాశులు సంచరిస్తున్నాయని తెలుసుకున్న వాడు పరబ్రహ్మపదమును పొందగలడు. ఆత్మ క్షరమైనది, జీవుడు అక్షరుడు. జీవిలో మృత్యువు పొంచి ఉంటుంది కనుక క్షరమైనది. అక్షరమనగా మరాణానంతరము పొందే స్వర్గప్రాప్తి అదియే అమృతము. పండితుడైన వాడు అన్నిటినీ సమానంగా చూస్తాడు. ఈ లోకాలను కాలము శాసిస్తుంది. కాలమును జయించిన వాడు పరబ్రహ్మ పదమును పొందగలడు. ఈ శరీరము తొమ్మిది ద్వారములు కలిగిన ఒక పురము. అందులో ఆత్మ వెలుగుతూ ఉంటుంది. యోగులు ఆ ఆత్మను అక్షరము, అమృతము అంటారు. ఆత్మతత్వమును సత్కర్మలు చేస్తూ వైరాగ్యముతో జీవించే యోగి మాత్రమే తెలుసుకోగలడు. అటువంటి యోగులకు కామము, క్రోధము, భయము, నిద్ర, లోభములు ఉండవు. యోగులు వాటిని వదిలి వేస్తారు. పండితుడు కామ సంబంధిత కోర్కెలను సంకల్పములను వదిలి కామమును జయిస్తాడు. సత్వగుణ సంపదతో నిద్రను, మోహమును జయిస్తాడు. గురువులను, పెద్దలను, పండితులను పూజించడము వలన లోభమును వదిలి వేస్తాడు. ఇంద్రియములను నిగ్రహించి కోపమును జయిస్తాడు. దృఢమైన మనసుతో భయాన్ని జయిస్తాడు. ఏ ఒక్క ఇంద్రియము అదుపు తప్పినా యోగి యొక్క ప్రజ్ఞ మొత్తము నాశనం ఔతుంది. కనుక ఇంద్రియములను అదుపులో ఉంచుకోవాలి. మనసును అదుపులో ఉంచుకోవాలి. ద్వేషించినా సన్మానించినా ఒకటిలా స్వీకరించాలి. జనావాసాలలో ఉంటూ ఇది సాధించడము అసాధ్యము కనుక జనావాసమును వదిలి అరణ్యములకు పోయి కొండగుహలలో నివసిస్తూ సాధన చేయాలి. యోగి అయిన వాడు విలువైన బంగారమును, విలువ లేని మట్టిని సమానంగా చూడాలి. కర్మమార్గమును ప్రవృత్తిమార్గమని అంటారు. ప్రవృత్తిమార్గము ఇహలోక బంధములను కలిగిస్తుంది. నివృత్తిమార్గము ఆ బంధములను విడతీస్తుంది. కనుక జ్ఞానులు కర్మమార్గమును వదిలి జ్ఞానమార్గమును అనుసరిస్తారు. కొందరు కర్మమార్గము మేలని అనుకుంటారు. వారు జనన మరణములను తప్పించజాలరు. కర్మవలన చిత్తశుద్ధి కలుగుతుంది కాని అది అవిద్య, మాయకు లోబడి ఉంటుంది. కనుక కర్మలను త్యాగము చేయుట మోక్షమునకు మార్గము "

అని చెప్పాడు వ్యాసుడు.

## ఆశ్రమధర్మాలు

**శుకుడు** " తండ్రీ ! విద్య ఎటువంటి వారికి అబ్బుతుంది ? వివరించండి " అని అడిగాడు. " అరణ్యములో వానప్రస్థులు జీవిస్తారు. వారు భిక్షాటనతో జీవించాలి, ప్రజల మద్యతిరగడం మానివేయాలి. మానము, అవమానము సమానంగా భరించాలి. అప్పుడు ఆధ్యాత్మ విద్య అలవడుతుంది " అని వ్యాసుడు చెప్పాడు. శుకుడు " తండ్రీ ! ఎటువంటి వారికి కర్మలు విడుచుట సాధ్యము కాదు అంటారు కదా ! వారు ఏమి చేయాలి ? " అని అడిగాడు. వ్యాసుడు " కుమారా ! బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థాశ్రమంలో ఉన్న వారు, యతులు, వారివారికి విధించిన కర్మలను నిర్వర్తించాలి. మోక్షమార్గముకు ఈ నాలుగు ఆశ్రమాలు నాలుగు మెట్లవంటివి. మనిషి ఆయుర్ధాయము శతయుస్సుగా నిర్ధారించిన అందు 25 సంవత్సరములు బ్రహ్మచర్య ఆశ్రమంలో గురువుకు సేవలు చేస్తూ వేదవిద్య అభ్యసించవలెను. బ్రహ్మచర్యాశ్రమంలో విషయవాంఛలకు దూరంగా ఉండాలి. విద్యాభ్యాసము పూర్తిచేసుకుని గురుదక్షిణ ఇచ్చి గురువుగారి అనుమతితో వివాహము చేసుకోవాలి. గృహస్థాశ్రమంలో బందువులను ఆదరిస్తూ, అతిథిసత్కారాలు చేస్తూ, సత్యమునే పలుకుతూ, భార్యాపుత్రులను ఆదరిస్తూ, పుత్రులను విద్యావంతులను చేయాలి. ఇలా కర్తవ్యనిర్వహణ చేస్తూ మరొక 25 సంవత్సరాలు గడపాలి. తరువాత వానప్రస్థ్యం స్వీకరించి కందమూలములు తింటూ, తాపసులను సేవిస్తూ, వారికి పెట్టగా మిగిలిన ఆహారాన్ని భుజిస్తూ తపమాచరిస్తూ మరొక 25 సంవత్సరాలు గడపాలి. ఆఖరి 25 సంవత్సరాలు సన్యాసాశ్రమం స్వీకరించి కర్మలను విడవాలి. సన్యాశ్రమంలో తలను నున్నగా గొరిగించుకుని, ఎవ్వరితో కలహించక, వృక్షముల నీడన జీవించాలి. ఈ కాలంలో జనావాసాలలోకి వెళ్ళకూడదు. ఒంటరిజీవితము గడుపుతూ, కామ క్రోధాలకు లోబడక, స్తుతి నిందలన సమంగాస్వీకరించాలి. లభించిన దాన్నిని తిని, ఎక్కడబడితే అక్కడే నిద్రపోవాలి. సకల భూతముల అందు దయకలిగి ఉండాలి. అలాంటి వాడు యతి అని పిలువబడతాడు " అని వ్యాసుడు చెప్పాడు.

## అంతర్యాగము

వ్యాసుడు శుకునికి అంతర్యాగము గురించి వివరించసాగాడు. " కుమారా ! అంతర్యాగము చేసే యోగి తన ప్రాణములను తన అంతరాత్మలో హెూమము చేస్తాడు. అప్పుడు అతనికి పాపములన్నీ తొలగి పోతాయి. ఆత్మ ఒక పక్షి వంటిది. ఆకాశంలో ఎవ్వరికీ కనిపించక ఎగురుతూ ఉంటుంది. అది గుడ్డులో నుండి పుడుతుంది. కేవలము యోగులు మాత్రమే దానిని చూడగలరు. కాలము ఒక చక్రము వంటిది, దానికి అంచులు 6 ఋతువులు, 12 మాసములు పదునైన పళ్ళుగా ఉంటాయి. కాలచక్రము విశ్వమంతా వ్యాపించి గిరగిరా తిరుగుతూ ఉంటుంది. మనశరీరంలో ఉండే జీవుడే రధము. దానికి సారధి మనసు, ఇంద్రియములు అశ్వములు. ఇంద్రియములు అనే అశ్వములు అదుపు తప్పితే రధము దారి తప్పుతుంది కనుక ఇంద్రియములను అదుపులో ఉంచుకోవడము అవశ్యము. మోక్షమును కోరు యోగి సర్వసంకల్పములు విడిచి చిత్తమును **సత్వగుణము** నిలపాలి, మితాహారము తినాలి. అప్పుడు గాలి లేని చోట పెట్టిన దీపంలా చిత్తము స్థిరముగా ఉండి ప్రకాశిస్తుంది. కుమారా ! శుకమునీంద్రా ! వేదాంతసారమును మధించి ఆ వెన్నను నీకు ఇచ్చాను. నీవు దానిని యోగులకు ఇవ్వు. అన్నీ దానముల కంటే విద్యాదానము శ్రేష్ఠమైనది కనుక నీవు దానిని అందరికీ పంచి పెట్టు. ఇంకా నీకు ఏవైనా సందేహాలు ఉంటే అడిగి తెలుసుకో " అన్నాడు. **శుకుడు** " తండ్రీ ! ఇప్పటి వరకూ విన్నదే నాకు సరిగా అర్ధము కాలేదు. కనుక నాకు ఇంకొంచము వివరించండి " అని అడిగాడు శుకుడు. వ్యాసుడు " ఈ సృష్టికర్త పంచభూతములలో అంతటా తానే నిండి ఉండి వాటిని ఈ లోకములో నియోగిస్తాడు. తిరిగి ఈ పంచభూతములను తనలో లీనము చేసుకుంటాడు. ఈ కార్యము నిరంతరము సాగుతూనే ఉంటుంది. తాబేలు తన అవయవములను తనలోకి తీసుకున్నట్లు సృష్టికర్త తనలోకి సృష్టిని తానే లయము చేసుకుంటాడు. పరమాత్మను మాయ ఆవరించినప్పుడు ఈ సృష్టి జరుగుతుంది. మాయ తొలగి పోగానే ఈ సృష్టి అంతా పరమాత్మలో లయం ఔతుంది. ముందుగా పంచభూతములు, ఇంద్రియములు, విషయములు సృష్టించబడతాయి. జ్ఞానేంద్రియములు ఐదు, మనస్సు ఆరవది, బుద్ధి ఏడవది, ఎనిమిదవ వాడు జీవుడు ఇతడే క్షేత్రజ్ఞుడుగా ప్రకాశిస్తుంటాడు. మనసులో తలంపులు పుడతాయి. ఆ తలంపుల మంచిచెడులను బుద్ధి నిర్ణయిస్తుంది. ఆ తలంపులను ఇంద్రియములు ఆచరిస్తాయి. ఈ ప్రక్రియ అంతంటికి క్షేత్రజ్ఞుడైన అంతరాత్మ సాక్షీభూతంగా చూస్తూ ఉంటుంది. సత్వంతో ఉండడము సత్వగుణ లక్షణం. ఎల్లప్పుడూ దు:ఖంతో ఉండడము రజోగుణలక్షణం. ఏ పనీ చేయక సోమరిగా ఉండడము తమోగుణ లక్షణము. ఈ గుణాల ఆధారంగా ఇంద్రియములు పని చేస్తుంటాయి. ఇంద్రియములు, విషయములు, మనసు, బుద్ధి, ఆత్మ క్రమంగా ఒకదాని కంటే ఒకటి ఎక్కువ. బుద్ధి అంతటా విస్తరించి ఉంటుంది. వినడము, చూడడము, రుచి చూడడము, వాసన చూడడము, స్పర్శించడము లాంటి పనులను ఇంద్రియముల ద్వారా బుద్ధి నిర్వహిస్తుంది. ఈ బుద్ధి ఒకసారి పొంగిపోతుంది, మరొక సారి కుంగిపోతుంది, మరొకసారి సుఖదు:ఖములు లేకుండా నిశ్చలంగా ఉంటుంది. ఈ బుద్ధి స్వభావము ఎరిగిన సాధకుడు ఇంద్రియాసక్తి వదిలి ఆత్మ దర్శనము చేసుకుంటే అతడికి సుఖము, దు:ఖము కలుగవు. అత్తిపండులో ఉన్న

పురుగులు పండుకు ఎటువంటి హాని చేయవు. ఆత్మలో ఉన్న విషయవాంఛలు ఆత్మను అంటవు. సాలెపురుగు తన నుండి నుండి దారమును సృష్టించినట్లు సత్వ, రజో, తమో గుణాలు సుఖ దు:ఖములను కలిగిస్తుంటాయి. ఆత్మ వాటికి సాక్షీభూతంగా ఉంటుంది. ఆత్మ నాశనం లేనిది కనుక పురుషుడు సత్వరజోతమో గుణములను వదిలి ఆత్మానుసంధము చేసుకుంటే మోక్షము లభిస్తుంది. బ్రాహ్మణుడికి ఇంద్రియనిగ్రహము ఒక సంపద లాంటిది. ఇంద్రియనిగ్రహము కల బ్రాహ్మణుడికి భయము, శోకము, గర్వము, సంతోషము కలుగవు. మనస్సును నిగ్రహించడము, ఆత్మగురించి తెలుసుకోవడము వివేకవంతుల లక్షణము. ఈ లక్షణముతో మోక్షమును పొంద వచ్చు.

## పరమ ధర్మము

**శుకుడు** " ధర్మములన్నింటి కంటే పరమధర్మము ఏది ? " అని అడిగాడు. వ్యాసుడు " ఇంద్రియ నిగ్రహము, ఏకాగ్రత, అన్నింటి కంటే ఉత్తమధర్మము. మనసుతో ఇంద్రియములను నిగ్రహించి తరువాత బుద్ధిని దానికి అను సంధానము చేయాలి. అప్పుడు పరతత్వాన్ని దర్శించ వచ్చు. మొక్కలు తమకు పూచిన పూలకు వాసన చూడ లేవు. వృక్షములు తన ఫలములను తాను భుజించదు. అలాగే అంతరాత్మ తన నిజస్వరూపమును చూడ లేదు. ఇలా ఇంద్రియ నిగ్రహంతో మనస్సును బుద్ధితో అనుసంధానము చేసి పరతత్వమును దర్శించి శాంతిని పొందాలి. మనిషి పతనానికి మూలము లోభము. దాని పుట్టుక ఎవరికి తెలియదు. లోభము అనే మడుగుకు సంకల్పము అనేది గట్టు. క్రోధము దానిలోని బురద. కోరికలు ఆ మడుగులో సంచరించే పాములు. ఆ మడుగు మోహము అనే గడ్డి, మొక్కలు, నాచుతో కప్పబడి ఉంటుంది. అజ్ఞానులు దానిని కనుగొనజాలరు. సత్యము అనే సాధనతో ఆ మడుగు నిజస్వరూపమును తెలుసుకొనగలడు. కనుక నీవు ఆ లోభముకు లోనుగాక ప్రసన్నాత్ముడవై కొండ మీద నుండి కింద ఉన్న వారిని చూసినట్లు ఈ లోకాన్ని దర్శించు. కనుక అన్ని ధర్మలలోకి ఇంద్రియ నిగ్రహము ఉత్తమధర్మము. కుమారా ! బ్రాహ్మణతత్వము వేదవేదాంగలు చదివినా, యజ్ఞయాగాదులు చేసినా లభించదు. కేవలం ప్రశంతతతోనే బ్రాహ్మణత్వము సిద్ధిస్తుంది. పరులకు భయపడక, పరులను భయపెట్టక సమదృష్టితో జీవించే వాడే బ్రాహ్మణుడు. బంధములలో పెద్దబంధము కామము. కామాన్ని వదిలిన మబ్బు వీడిన చంద్రుడి మాదిరి ఆత్మ ప్రకాశిస్తుంది. కామాన్ని జయించి పరతత్వోపాసనా తత్పరుడైన పురుషుడు సుఖము, సమృద్ధి పొందుతాడు. నాది అన్న భావము లేకనే ఏది మనకు ప్రియము కలిగిస్తుందో, దేనిని భుజించకున్నా మనసుకు తృప్తి కలుగుతుందో, ఏది పొందకున్నా బలము కలుగుతుందో అటువంటి పరతత్వాన్ని వేదముల సాయంతో దర్శించాలి. విషయవాంఛలు, కర్మ బంధాలు, త్రిగుణాలు వదిలిన బ్రాహ్మణుడికి ముసలితనము లేదు, మృత్యువు అతడి దరిచేరదు. ఈ దేహము వేరు, అందులోని దేహి వేరు. ఈ సత్యమును వేదాధ్యయనము చేసిన ప్రశాంతచిత్తులు మాత్రమే దర్శించగలరు. సూర్యుడు నీటిలో బింబరూపములో కనిపిస్తాడు. అలాగే ఆత్మ కూడా బుద్ధిలో ప్రతిబింబ రూపములో కనబడుతుంది. సత్వగుణ ప్రధానులకు ఇది గోచరమౌతుంది. రాత్రి పగలనక సూర్యుడు నిరంతరము ప్రకాశిస్తుంటాడు. అలాగే పరమయోగికి వివేకము అవివేకము ఉండదు. నిరంతరము జ్ఞానముతో ప్రకాశిస్తుంటాడు. అతడికి ఇంద్రియములు ఉన్నా లేనట్లే. అతడి ప్రపంచంలో తిరుగుతూనే సమాధిస్తితిలో ఉంటాడు. మోహము అనే బీజము నుండి కామము అనే చెట్టు మొలకెత్తుతుంది. దానికి ఏమరుపాటు అనే నీరు పోసి పెంచుతుంటారు. ఆ చెట్టుకు ఆకులు అసూయ, కాండము అభిమానము, శోకములు శాఖలు, అనేక విధములైన చింతలు ఉపశాఖలు. పూర్వ జన్మ కర్మల ఫలితంగా ఆ చెట్టు వృద్ధి చెందుతుంది. ఆ చెట్టుకు ఆశలు అనే తీగలు అల్లుకుని ఉంటాయి. ఆ చెట్టుకు కాసిన పండ్లకై దాని పైకి ఎక్కిన వాడు ఎవరైనా నశిస్తాడు. అలాకాక త్యాగము అనే కత్తితో ఆచెట్టును సమూలంగా నరికిన వాడు సకల విధ దు:ఖముల నుండి విముక్తుడు కాగలడు. కుమారా ! ఈ శరీరమే ఒక నగరము అయితే ఈ నగరానికి ప్రభువు బుద్ధి, మనసు మంత్రి, ఇంద్రియాలు పురజనులు, శబ్ద, స్పర్శ, రూప, రుచి, గంధాదులు అక్కడి పురోహితులు. ఈ రాజ్యాన్ని త్రిగుణాలు అనే దొరలు పాలిస్తూ అనుభవిస్తుంటాయి. రాజైన బుద్ధి వివేకము లేక త్రిగుణాలకు బానిసైన నశిస్తుంది, జయించిన శాశ్వత సుఖమును పొందుతాడు " అని వ్యాసుడు శుకునికి చెప్పాడని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## మృత్యుధర్మము

ధర్మరాజు భీష్ముడిని " పితామహా ! కార్యబలము, వీర్యబలము, మనోబలము ఉన్న అనేక మంది రాజులు ఈ యుద్ధములో చనిపోయారు. వీరికి ఎంతబలము ఉన్నా మృత్యువును జయించలేక పోయారు. అది ఎందు వలన జరిగింది ? అసలు మృత్యువు అంటే ఏమిటి ? అది ఎలా జీవరాశులను చంపుతుంది ? వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " పూర్వము **అకంపనుడు** అనే వాడు యుద్ధములో చనిపోయిన తన కుమారుని కొరకు దు:ఖిస్తున్న తరుణంలో నారదుడు అక్కడకు వచ్చి అతడి దు:ఖానికి కారణం అడిగి తెలుసుకుని ఆ దు:ఖము పోగొట్టడానికి అతడికి ఒకకథ వినిపించాడు. నీకు ఆకథ వినిపిస్తే నీ సందేహములు అన్నీ తీరగలవు. బ్రహ్మదేవుడు జగములను సృష్టించి తరువాత సమస్త జీవరాశులను సృష్టించాడు. జీవరాశులు దినదినాభివృద్ధి చెంది చివరకు భూమి అంతా జీవరాశులతో నిండి పోయింది. అప్పుడు బ్రహ్మ ఈ

జీవరాశులను ఎలా సంహరించాలా అని అని ఆలోచించాడు. బ్రహ్మదేవుడి ఆలోచనల వేడిమికి అతడి శరీరము దహించుకు పోసాగింది. బ్రహ్మదేవుడి నుండి పుట్టిన అగ్ని మూడు లోకాలను దహించి వేయడానికి సమాయత్తం అయింది. ఇది చూసిన శివుడు బ్రహ్మదేవుడి వద్దకు వచ్చి బ్రహ్మదేవుడిని శాంతించమని అర్ధించాడు. బ్రహ్మదేవుడు శాంతించగానే శివుడు జీవులను చంపే విధానం ఇది కాదు అని చెప్పి ఆ మంటలను ఆర్పాడు. బ్రహ్మదేవుడి శరీరం నుండి ఎర్రని కన్నులతో ఒక స్త్రీ ఉద్భవించి దక్షిణ దిశగా కదల సాగింది. బ్రహ్మదేవుడు ఆమెను దగ్గరగా పిలిచి " ఓ మృత్యుదేవతా నీవు ఈ ప్రాణులను బలవంతుడు బలహీనుడు అని భేదము చూడక అందరినీ సంహరించు " ని ఆజ్ఞాపించాడు. అప్పుడు **మృత్యుదేవత** కన్నుల నీరు నింపి " బ్రహ్మదేవా ! నీ నుండి పుట్టిన నేను ఇంతటి క్రూరమైన పని ఎలా చేయగలను. నన్ను ఏదైనా ధర్మకార్యము కొరకు నియోగించు " అని కోరింది. బ్రహ్మదేవుడు మృత్యుదేవత కన్నుల నుండి జలజలా రాలుతున్న కన్నీటిని దోసిట పట్టి " మృత్యుదేవతా ! నేను నిన్ను సంహారక్రియ కొరకే సృష్టించాను. నీవు మారు మాటాడక సంహరించవలసినదే " అని అన్నాడు. ఆ మాటలకు మృత్యుదేవత కంపించి " బ్రహ్మదేవా ! నేను మనష్యులను చంపి వారి బంధువుల శోకము చూడ లేను. ఈ పని నా వల్ల కాదు నేను తపస్సు చేసుకోవడానికినుజ్ఞ ఇవ్వండి " అని అడిగింది. బ్రహ్మ " అది ఎలా కుదురుతుంది మానవ సంహారం నీ కర్తవ్యం. నీ అప్పగించిన పని నీవు చేయకున్న అది ధర్మవిరుద్ధము ఔతుంది. కనుక నీవు ఈ పని చేయకతప్పదు. మృత్యుదేవత మారు మాటాడక అక్కడ నుండి **ధేనుకాశ్రమం** వెళ్ళి అక్కడ అనేక సంవత్సరాలు తపస్సు చేసింది. తరువాత హిమాలయాలకు వెళ్ళి బ్రహ్మదేవుడి గురించి తపస్సు చేసింది. బ్రహ్మ దేవుడు ఆమె వద్దకు వెళ్ళి " మృత్యుదేవతా ! నీవిలా తపస్సు చేసి ఏమి ప్రయోజనం. నీవు నీ కర్తవ్యం నెరవేర్చు " అని అన్నాడు. మృత్యుదేవత " మహాత్మా ! ఆ పని నా వల్ల కాదు. నన్ను క్షమించు " అన్నది. బ్రహ్మదేవుడు " మృత్యు దేవతా ! నేను సత్యము పలుకుతున్నాను. మానవ సంహారం నీకు పరమధర్మం. నా మాట కాదనకు ఇందు వలన నీకు ఏ పాపము అంటదు. మరొక్క మాట నీవు ఏడ్చినప్పుడు నేను నీ కన్నీటిని పట్టి ఉంచాను నేను ఆ కన్నీటిని లోకంలోని ప్రజల మీద చల్లుతాను. అవి నానా రకములైన రోగములుగా మారి జనులను పీడిస్తాయి. వాటికి కామక్రోధము తోడౌతాయి ప్రజలు ఆ రోగములతోనే మరణిస్తారు నీవు కేవలము వారి ప్రాణములు మాత్రమే తీస్తావు. నీవు నిమిత్తమాత్రవు మాత్రమే. నీవు పురుషులను చంపు సమయంలో పుషుడుగాను , స్త్రీలను చంపు సమయంలో స్త్రీ గాను, నపుంసకులను చంపు సమయంలో నపుంసకుడి గానూ మారే వరము నీకు అనుగ్రహిస్తున్నాను. నీకు పాపము అంటదు సరి కదా ! ఈ సంకార కార్యమే ధర్మ కార్యము ఔతుంది " అని అన్నాడు. ఆ మాటలకు ధర్మదేవత శాంతించింది. బ్రహ్మదేవుడి మాట వినక పోయిన శాపముకు గురి కావలసి వస్తుందని అనుకుని మానవసంహార కార్యం చేయడానికి ఒప్పకుంది. ఇలా మరణం ఆసన్నము కాగానే జనులు తమ శరీరాలను వదిలి పూర్వాకృత కర్మలను అనుసరించి తిరిగి జన్మిస్తుంటారు " అని భీష్ముడు చెప్పాడు.

## ధర్మము

మృత్యు దేవత గురించి విన్న ధర్మరాజు " పితామహా ! నేను ఇది వరకే దీనిని గురించి విన్నా నేను ఆ సమయంలో అధిక దు:ఖానికి గురీయి ఉండడం వలన అర్ధం చేసుకోలేక పోయాను. ఇప్పడు బాగా అర్ధం చేసుకున్నాను. మంచి వారు ఎప్పడూ ధర్మానికి భయపడుతుంటారు కదా ! నిజంగా ధర్మం అంత గొప్పదా ! వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! వేదముల మీద భక్తి, దృఢమైనస్మృతి, మంచి ఆచారము, అందమైన శరీరము, ఇవే ధర్మములని కొందరి అభిప్రాయము. కాని కేవలం ధనార్జనే ధర్మమని కొందరి అభిప్రాయము. కాని అన్యాయంగా, అధర్మంగా, అబద్ధాలు చెప్పి ధనార్జన చేయడం మహాపాపము. పరులసొమ్ముకు ఆశించక అబద్ధాలు చెప్పక అక్రమాలు చెయ్యకుండా ధనం సంపాదించడమే పరమ ధర్మం. ధర్మము అనేక రూపాలుగా ఉంటుంది. ధర్మము ఇలా ఉంటుంది అని చెప్పలేము. ధర్మాన్ని గురించి నాకు తెలిసింది చెప్తాను విను. ఇతరులు ఏ ఏ పనులు చేస్తే మన మనస్సుకు, శరీరానికి కష్టం నష్టం కలుగుతుందో ఆయా పనులు మనము ఇతరుల పట్ల చేయక పోవడమే పరమ ధర్మం. ఇదే ధర్మ సూక్ష్మం " అని చెప్పాడు.

## సదాచారములు

ఆ మాటలకు సంతోషించిన ధర్మరాజు " తాతగారూ ! నేను అజ్ఞానంతో ఏమేమో అడుగుతున్నాను. అడిగినవే తిరిగి తిరిగి అడుగుతున్నానని కోపము వద్దు. ఉత్తమమైన ఆచారము గురించి వివరించండి అని అడిగాడు. భీష్ముడు " ధర్మరాజా ! వేదములలో వివిధములైన ఆచారము గురించి వివరంగా చెప్పారు. వాటిని ఆచరించడమే మన ధర్మము. పెద్ద వాళ్ళు ఏది ఆచరిస్తే అదే ఉత్తమమైన ఆచారము. ఈ సందర్భంలో నీకు జాబాలికి, **తులాధరుడు** అనే వ్యాపారికి జరిగిన సంవాదం వినిపించెదను విను. పూర్వము **జాబాలి** అనే మహాముని తపస్సు చేసుకుంటున్నాడు. అతడి తల మీద ఒక పిచ్చుక గూడు కట్టింది. అక్కడ గుడ్లుపెట్టి పొదిగి వాటిని పిల్లలనుచేసింది. పెద్ద పిచ్చుక పిల్లతో కలిసి అక్కడ నివసించ సాగింది. ఆ విషయం తెలిసినా జాబాలి వాటిని తరిమి వేయకుండా భరిస్తూ " ఆహా ! నా వంటి ధర్మనిష్టాగరిష్టుడు ఎవరైనా ఉంటారా ! " అని తనను తాను మెచ్చుకోసాగాడు. అప్పడు ఆకాశవాణి " మహాత్మా ! తనను తాను మెచ్చుకునే ధర్మనిష్ట ఎక్కడైనా ఉంటాదా. నీ కంటే


ముని జాబాలి లేదా జాజలి తపస్సు

ధర్మనిష్టా పరుడైన **తులాధరుడు** కూడా ఇలా ఎప్పుడూ మాట్లాడ లేదు ఇక నీ వెంత ? " అని ఎగతాళి చేసింది. ఆ మాటలకు ఆశ్చర్యపడిన జాబాలి " ఆ తులాధరుడు ఎక్కడ ఉంటాడు. నేను అతడిని కలవాలి " అని అడిగాడు. " అతడు వారణాశి పురంలో నివసిస్తున్నాడు " అని ఆకాశవాణి పలికింది. జాబాలి తులాధరుడి మీద కలుగిన మత్సరంతో వారణాశికి వెళ్ళాడు. అక్కడ వ్యాపారం చేస్తున్న తులాధరుడిని చూసాడు. జనులంతా అతడిని ధర్మాత్ముడని పొగుడు తున్నారు. జాబాలిని చూసి తులాధరుడు అతడికి అతిథి సత్కారాలు చేసి " మహానుభావా ! మీ తల మీద పిచ్చుకలు తిరుగుతున్నా చలించక హాయిగా తిరుగుతున్న మీరు జితేంద్రియులు. గౌరవించ తగిన వారు " అని అన్నాడు. అది విన్న జాబాలి " అది సరే నీవు చేసేది వ్యాపారం అందులో ధర్మము తప్పక చేయడం ఎలా సాధ్యము " అని అడిగాడు. తులాధరుడు " అయ్యా ! నేను వస్తువులు కొనడంలో


జాబాలి మహర్షికి సత్కారము చేయుచున్న తులాధరుడు

అమ్మడంలో ఎలాంటి మోసములకు పాల్పడను. కొంత లాభంతో తృప్తి పడతాను . లాభం వచ్చినప్పుడు పొంగిపోక నష్టాలకు కుంగిపోక సమ స్థితిలో ఉంటాను. నేను మట్టిబెడ్డను, బంగారపు ముద్దను సమ దృష్టితో చూస్తాను. నేను ఎవరిని పొగడను తిట్టను. నన్ను నేను పొగొడుకోను. ఇతరులను హింసించను. సాటి జీవులయందు దయ కలిగి ఉంటాను. ఎల్లప్పుడూ సత్యమునే పలుకుతుంటాను. నేను భోగభాగ్యములను కాని, కీర్తిప్రతిష్టలు కాని కోరను. ఎవరికైనా ఉపకారము చేసి నేను ఇంత ఉపకారము చేసాను అని చెప్పుకోను. నాకు దేని మీద మమకారము ద్వేషము లేవు. ఈ లోకమును ఆటవస్తువులాగా చూస్తూ బయట ప్రపంచానికి తామరాకు మీద నీటి బొట్టులాగా ఉంటాను " అని అన్నాడు. జాబాలి " తులాధరా ! నీవు యజ్ఞములు, యాగములు, తపస్సు మొదలగు ధర్మము గురించి మాట్లాడ లేదు. వేదవిధులు వీటిని సత్కర్మలు అంటారు కదా ! మరి ఇవి ఆచరించ తగిన ధర్మము కాదా ! " అని అడిగాడు. " మహాను భావా ! ఈ యజ్ఞములు యాగములు, తపస్సులు ఏవేవో కోరికలు తీరడానికి చేస్తారు. కనుక వాటి అవసరం లేదని నా అభిప్రాయం. దేవతలు వాటిని మెచ్చరని నా భావన. ఈ యజ్ఞ యాగాలు జననమరణ చక్రం నుండి మానవులను విముక్తి చేయ లేదు. ఎవరైతే సత్యమునే ఒక యజ్ఞముగా పాటిస్తూ నిత్య తృప్తుడై ఉంటాడో అతడికి శాశ్వత ఆనందము కలుగుతుంది. అని నా నమ్మకము " అని అన్నాడు తులాధరుడు. జాబాలి " తులాధరా ! నీవు కర్మలు వదల కుండా చేస్తున్నావు కదా ! దానికి ఏమి కారణం ? అని అడిగాడు. అందుకు తులాధరుడు ఇలా చెప్పాడు. తులాధరుడు " ఎవరు సతతము ధర్మమునే ఆచరిస్తాడో, ఎవరు ధర్మముతో చెలిమి చేస్తాడో, ఎవరు నిష్కల్మష హృదయంతో కర్మలు చేస్తుంటాడో, అతడికి కర్మలు ఆచరించక పోతే కలిగే ఆనందము కలుగుతుంది. అన్ని నగరాలూ పుణ్య క్షేత్రములే, అన్ని నదులూ పుణ్య నదులే, నిష్కల్మష హృదయంతో ఉన్న వాడికి అన్నీ పవిత్ర నదులే. వృత్తిధర్మంగా పని చేస్తున్నాను, ఫలితం భగవంతుడికి అప్పగిస్తాను అనుకుని కర్మలు చేసే వాడికి ఏ దోషము అంటదు. ఫలితం ఆశించి చేసే కర్మలకు దోషం అంటకుండా ఎలా ఉంటుంది. నాకు తెలిసిన ధర్మము ఇది. ఇది సరి అయిన ధర్మం ఔనోకాదో సజ్జనులను అడిగి తెలుసుకుంటాము. నీవు ఇన్ని రోజులు తండ్రిలా పోషిస్తున్న ఆ పిచ్చికలు హాయిగా ఎగురుతున్నాయి. వాటిని పిలిచి లాలించు " అని అన్నాడు. అప్పుడు జాబాలి పిచ్చుకలను దగ్గరకు పిలిచాడు.

## ధర్మదూతలు

అవి అతడి దగ్గరకు రాకుండా అలా ఆకాశంలో ఎగురుతూ " ఓ మునీంద్రా ! మేము ధర్మ దేవత దూతలము. ధర్మదేవత పంపగా నిన్ను పరీక్షించడానికి వచ్చాము. మేము మీకు కలిగిన సందేహము తీరుస్తాము. ఎవరి మనసులో ఇతరుల ఎడ ద్వేషము, మాత్సర్యము ఉంటుందో అతడికి ఇతరులతో తగవులాడాలని కోరిక కలుగుతుంది. అందు వలన హింస చెలరేగుతుంది. కనుక మునీశ్వరులు తమలో తాము ద్వేషించడం, మాత్సర్యము వహించడము కూడనివి. స్పర్ధ ధర్మాన్ని

నాశనం చేస్తుంది. ధర్మం నశిస్తే మనిషి నాశనం ఔతాడు. కనుక మానవుడు స్పర్ధను వదలాలి. సత్వగుణము వలన శ్రద్ధ పుడుతుంది. శ్రద్ధ ఉన్న వాడు తాను తెలుసుకో తగిన దానిని తెలుసుకుంటాడు. కనుక ప్రతి మనిషికి శ్రద్ధ ముఖ్యము. శ్రద్ధలేని తపసు, శ్రద్ధలేని యజ్ఞ యాగము నిష్ఫలములు. కనుక శ్రద్ధే అన్నిటి కంటే ముఖ్యము. శ్రద్ధ ధనమువంటిది. అది మనసును చెడు దారిలో పోకుండా కాపాడుతుంది. శ్రద్ధజీవాత్మ యొక్క ప్రసన్నత్వము. యాగము చేయుటకు శ్రద్ధ, శుచిత్వము ముఖ్యము. శ్రద్ధలేని శుచిత్వము, శుచిత్వములేని శ్రద్ధ నిష్ఫలమే. ఇదే విషయాన్ని బ్రహ్మదేవతలతో ఇలా చెప్పాడు. శ్రద్ధ కలిగిన వాడు ఉత్తముడు. అతడి చేతి భోజనము అత్యంత శ్రేష్టము. ధనము వడ్డీకి ఇచ్చి ఆ వడ్డీతో దానధర్మాలు చేసే వాడు, వేదవేదాంగములు చదివినా లోభి అయిన వాడు సమానమే. అందులో యాగములో దానము చేసిన వాడు శ్రేష్టుడు. శ్రద్ధలేని వాడికి దానము చెయ్యడానికి మనస్కరించదు. శద్ధ కలిగిన వాడి మనసులో మత్సరం ఉండదు. అందుకని శ్రద్ధ కలిగిన వాడు శ్రేష్టుడు. అని బ్రహ్మదేవుడు చెప్పాడు " అని పిచ్చుకలు **జాబాలికి** చెప్పాడు. ఆ మాటలు విన్న జాబాలి తులాధరుడిని చూసి " మహాత్మా ! నాకు అన్ని తెలుసు అనుకున్నాను. నాకు ఏమి తెలియదని ఇప్పుడు తెలుసుకున్నాను. నేను మునుల మాటలను వినలేదు కనుక నన్ను నేను పొగుడు కోవడము అనే దోషం నాకు పట్టుకుంది. నీ మాటలతో నాకు దోషము పోయింది. ఇక నేను ప్రశాంత చిత్తంతో జీవిస్తాను " అని పలికాడు జాబాలి. తులాధరుడు " ఓ మహాత్మా ! ఎవరికైనా స్వధర్మ కంటే మించిన ధర్మము మరొకటి లేదు " అని లేదు. తరువాత జాబాలి తులాధరుడి వద్ద శలవు తీసుకుని వెళ్ళి పోయాడు. అని చెప్పి భీష్ముడు " ధర్మనందనా ! తులాధరుడి మాటలు విన్నావు కదా ! వాటిలోని ధర్మ సూక్ష్మాలు తెలుసుకుని ప్రవర్తించు " అన్నాడు.

## కాలము కార్యనిర్వహణ



ఆయుధమును పడవేసి తన తండ్రికి నమస్కరిస్తున్న చిరకారి

ధర్మరాజు " పితామహా ! ఒక కార్యమును నిర్వహించడానికి ఎక్కువ సమయం తీసుకుంటే మంచిదా ! తక్కువ సమయం తీసుకుంటే మంచిదా ! వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఏ కార్యమైనా తొందర పడకుండా చక్కగా ఆలోచించి ఒక నిర్ణయం తీసుకుని తరువాత చేయడం మంచింది. అలా చేసిన కార్యములకు మంచి ఫలితాలు ఇస్తాయి. కాని కొంత మందికి ఓర్పు సహనము ఉండదు. ఏదో చెయ్యాలని తహతహ. అలాంటి వారు ఆలోచించి పని చేసే వాడిని చూసి వారికి చురుకుతనం లేదు అన్నింటా ఆలస్యమే . అది మంచిది కాదు. ఈ సందర్భంలో నీకు **మేధాతిథి** అనే ముని కుమారుడైన **చిరకారి**ని గురుంచిన కధ చెప్తాను. చిరకారి ప్రతి పనిని చక్కగా ఆలోచించి చేస్తాడు అందుకనే అతడిని చిరకారి అని పిలుస్తారు. ఒక సందర్భంలో మేధాతిథికి తన భార్య మీద కోపము వచ్చి ఆమెను చంపమని తన కుమారుడైన చిరకారిని ఆదేశించి బయటకు వెళ్ళాడు. ఏ పని అయినా చక్కగా ఆలోచించి చేసే చిరకారి మనసులో " తండ్రి ఆజ్ఞను మీరడానికి వీలు లేదు కనుక తల్లిని చంపాలి. కాని తల్లిని చంపడం కంటే మహా పాపం మరొకటి లేదు. తండ్రికి నచ్చ చెబుతాము అనుకుంటే తండ్రి ఆజ్ఞను దిక్కరించడము పాపము అని పెద్దలు చెప్తారు. తల్లిని రక్షించుకోవడము కుమారుడి ధర్మము. పుత్రుడికి స్వతంత్రంగా వ్యవహరించే వీలు లేదు. కనుక ఏదైనా ఉపాయము ఆలోచించాలి. తండ్రి ఆజ్ఞ ప్రకారము తల్లిని చంపితే నరకము తప్పదు. తండ్రి ఆజ్ఞను దిక్కరించినా నరకము తప్పదు. తల్లి భూమి, తండ్రి బీజము. జన్మకు కారణమైన తల్లి, తండ్రి ఇద్దరూ ముఖ్యమే ఎవరిని వదలడము కుదరదు. తడ్రికి కుమారుఘు ప్రతి రూపము కనుక తండ్రి ఆజ్ఞను పరిపాలించిన కుమారుడికి ఉత్తమ గతులు ప్రాప్తిస్తాయి. తపస్సు, ధర్మము, విద్య ఇవన్ని తండ్రికి ప్రతిరూపాలు. తండ్రికి ప్రీతి కలిగే పనులు చేసిన దేవతలు కూడా దీవిస్తారు. ఇక తల్లి వైపు కొయ్య నుండి అగ్ని పుట్టినట్లు, తల్లి గర్భము నుండి కాళ్ళు, చేతులు, తల, ముక్కు, చెవులు మొదలైన అంగములతో కుమారుడు పుడతాడు. కుమారుడికి జన్మ నిచ్చే తల్లి ఎంతో గర్భ క్లేశము అనుభవిస్తుంది. తల్లి తన బాగోగుల కంటే కుమారుల బాగోగులకే ఎక్కువ ముఖ్యత్వము ఇస్తుంది. అందుకే తల్లిని మించిన దైవము లేదు. తండ్రికి బిడ్డను పైపైన చూస్తాడు. కాని తల్లి, బిడ్డల గురించి ఎక్కువగా ఆలోచిస్తుంది. కనుక ధర్మశాస్త్రాలు తండ్రి కంటే తల్లికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాయి. కొడుకు బాలుడైనా, ప్రౌఢ వయసులో ఉన్నా, వృద్ధుడైనా తల్లికి కొడుకు మీద ప్రేమ తగ్గదు. కనుక తల్లి ఈ జగతికి మూలాధారము. క్షుద్ర జంతువుకైనా ఉన్నత వంశస్థులకైనా తల్లి ఒకే విధంగా ఉంటుంది. తల్లి ఒడిలో లభించే జీవితము ప్రపంచంలో ఎక్కడా లభించదు. ఎవరికైనా మాతృవియోగం కలిగినప్పుడు అతడు సర్వము కోల్పోయినట్లు బాధపడతాడు. ప్రపంచం అంతా శున్యము అయినట్లు ఉంటుంది. మనసంతా చలించి పోతుంది. ఉన్నవాడైనా, బలవంతుడైనా, బలహీనుడైనా, బుద్ధి ఉన్న వాడైనా, బుద్ధి లేని వాడైనా వీరందరికి తల్లి సంపదతో సమానము. తల్లి జీవించి ఉంటే సకల సంపదలి, సకల సుఖములు ఉన్నట్లే. అటువంటి తల్లిని చంపడం ఎలా చూసినా

మహాపాపమే. ఈ విషయము తెలుసుకోవడానికి పెద్ద విద్యలు అవసరం లేదు. పశువుల కాపరికి కూడా ఇది తెలుసు. తల్లిని చంపడానికి మనసెలా వస్తుంది, చేతులెలా వస్తాయి. ఈ విధంగా పరి పరి విధము చిరకారి ఆలోచిస్తున్న తరుణంలో బయటకు వెళ్ళిన మాధాతిధి " అయ్యో ! ఏదో చిన్న తప్పుకు భార్యను చంపమని కుమారుడికి చెప్పి వచ్చాను. నా కుమారుడు తల్లిని చంపడు కదా ! ఎంత తొందర పడ్డాను. అయినా నాకుమారుడు ఏ పనీ ఆలోచించి కాని చెయ్యడు. తల్లిని చంపడు " అని వడి వడిగా ఇంటికి వస్తూ " కుమారా ! నీ తల్లి నిన్ను నవమాసాలు కని పెంచింది. నేను తొందరపడి ఆమెను చంపమని ఆజ్ఞాపించాను. కాని నువ్వు తొందరపడి ఏపని చెయ్యవు అని నాకు తెలుసు " అని అనుకుంటూ ఇల్లు చేరాడు. తండ్రిని చూసి చిరకారి తల్లిని చంపడానికని ఎత్తిన కత్తిని కిందకు పెట్టి తండ్రికి నమస్కరించాడు. అతడి తల్లి కూడా భర్తకు నమస్కరించింది. వారిరువురిని చూసి మేధాతిధి ఆనందభాష్పాలు రాలి వారిద్దరిని దీవించాడు. మేధాతిథి " ఒక కార్యము చెయ్యవలసి వచ్చినప్పుడు ఆలోచించి ధైర్యంగా చెయ్యాలి. అటువంటి వాడిని లోకము ఆర్యుడని అంటుంది. ఆలోచించక తొందరపడి పని చేసే వాడిని లోకము అనార్యుడని అంటుంది. ఒక పని చెయ్యడానికి ముందు ఇతడు మిత్రుడా, శత్రువా, ఇతడు యోగ్యుడా, అయోగ్యుడా అని ఆలోచించి నిర్ణయించే వాడు బుద్ధిమంతుడు. అలాంటి వాడికి సకల శుభములు కలుగుతాయి " అని అన్నాడు మేదాతిథి. కనుక ధర్మనందనా ! ఏ పైని అయినా ఆలోచించి చేస్తేనే మంచి ఫలితాలు కలుగుతాయి " అని భీష్ముడు అన్నాడు.

### శిక్ష

ధర్మరాజు భీష్ముడితో " పితామహా ! నాకు శిక్షా విధానము గురించి వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మరాజా ! పూర్వము ద్యుమత్సేనుడు అతడి కుమారుడు సత్యవంతుడు నడుమ జరిగిన సంవాదము గురించి చెప్తాను విను. వారిద్దరు నేరస్తులకు వేయు శిక్షలగురించి చెప్తాను విను. ద్యుమత్సేనుడు :-నేరము చేసిన వారిని వధించడము ధర్మమని పెద్దలు చెప్పారు. సత్యవంతుడు :- హింస కర్మ అయినట్లైతే చేయ కూడాని కర్మ ఉంటుందా ? ద్యుమత్సేనుడు:-దొంగలు, హంతుకుల వంటి వారిని వధించకుంటే లోకంలోని ప్రజలు బాధలు అనుభవించాలి. **సత్యవంతుడు** :- అందుకు మరణ దండన కంటే వేరు మార్గము లేదా ?

**ద్యుమత్సేనుడు**:- ఉన్నాయి నేరానికి తగిన శిక్షలు ఉంటాయి. నేరము చేసిన వాడిని చూపులతో చంపడము, పరుషమైన మాటలతో బాధించడం, మందలించడం, ధనరూపము(అపరాధ రూపములో ధనము వసూలు చేయుట)లో శిక్షలు విధించడం, శరీరావయవములు తీసి వేయడము వంటివి జరుగుతాయి. కాని చంపతగిన నేరము చేసినప్పుడు మాత్రము చంపడం తప్ప వేరు మార్గంలేదు. నేరస్థుల ఎడ వీడు నా వాడు, వీడు మిత్రుడు, బంధువు అని పక్షపాతము చూపడము కూడా నేరమే ఔతుంది. శిక్షలు విధించే రాజు ముందుగా తాను నీతి మంతుడుగా ఉండాలి. తన పుత్రులను, మంత్రులను, ఉద్యోగులను నీతి మంతులుగా తీర్చిదిద్దాలి. అప్పుడే అతడు ప్రజాపాలనకు అర్హుడౌతాడు. తన దగ్గరకు వచ్చిన అభియోగాన్ని చక్కగా పరిశీలించాలి. నేరస్థుని పట్ల, బాధితుడి పట్ల మమకారము కాని ద్వేషము కాని లేకుండా సమదృష్టి వహించి తీర్పును చెప్పాలి. మరణదండనకు అర్హుడైనప్పుడు మాత్రమే నేరస్థుడికి మరణ శిక్ష వేయాలి. అలా చేసిన రాజుకు ఏ పాపము అంటదు. మనం రోజూహత్యలు చేయడం చూస్తూనే ఉన్నాము. లోభము చేతగాని కామము చేతగాని మనస్సులో ఏ మాత్రము శంకలేక నేరస్థులు హత్యలుచేస్తున్నారు. అలాటి వారి పట్ల అహింసా వృత్తి వహిస్తే హింస ప్రబలి ప్రజలలో భయాందోళనలు చెల రేగగలవు. అహింస బ్రాహ్మణులకే కాని రాజులకు, క్షత్రియులకు కాదు. రాజు దయా హృదయంతో ప్రజలను కన్నబిడ్డలవలె పాలించాలి, అలాగే దుష్టులను శిక్షించాలి. అప్పుడే ప్రజలు సుఖశాంతులతో జీవిస్తారు. ఈ విధంగా పాలించడం రాజుకు అహింసా వ్రతము పాటించడమే ! " అని ద్యుమత్సేనుడు తన కుమారుడైన సత్యవంతుడికి బోధించాడు. అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## గృహస్థ ధర్మము సన్యాస ధర్మము

ధర్మరాజు " పితామహా ! గృహస్థ ధర్మము, సన్యాస ధర్మము ఈ రెండింటిలో ఆచరించతగిన ధర్మము ఏది ? అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! రెండునూ ఆచరణ యోగ్యములే. ఈ సందర్భంలో నీకు కపిలమహర్షికి ఒక గోవుకూ జరిగిన సంవాదము వినిపిస్తాను. పూర్వకాలంలో **కపిలుడు** అనే మహాముని ఉన్నాడు. అతడు ఒక ధేనువును చూసి " నీవు వేదస్వరూపవు కదా ! " అని అన్నాడు. అక్కడే అదృశ్యరూపములో ఉన్న స్యూమరశ్మి అనే ముని ఆ మాటలు విన్నాడు. ఆ మాటలతో కపిలుడికి వేదముల మీద గౌరవం లేదని తెలుసుకుని సూక్ష్మరూపంలో ఆ గోవులో ప్రవేశించి కపిలుడితో " మహర్షీ ! యతులు వేదములను డాంబికత్వముకు ప్రతి రూపంగా భావిస్తారు. కాని వేదములు ఆచరించతగినవి, గౌరవించ తగినవి. నీ సంగతి చెప్పు. నీకు వేదములు ఆచరించతగినవి కాదా ! " అని కపిలుడు అడిగాడు. కపిలుడు " ఓ ధేనువా ! నాకు వేదములు అన్న ఆదరము కానీ అనాదరము కాని లేవు. అసలు నీవు నన్ను ఇలా ఎందుకు అడిగావు. నీ మనసు

నాకు అవగతము కాకున్నా నాకు తెలిసినంత వరకు చెప్తాను విను. బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము, వానప్రస్థము, సన్యాసము అను నాలుగు ఆశ్రమధర్మాలు. ఆ మార్గంలో నడచుట సంసారుల కర్తవ్యము. వేదంలో విధించిన విధులను ఆచరించడం మానవుల ధర్మము. కాని యజ్ఞములో హింస మంచిదోచెడ్డదో నాకు చెప్పాలి " అని నువ్వే చెప్పాలి. స్యూమరశ్మి " బ్రహ్మదేవుడు యజ్ఞము కొరకే ధాన్యమును, పశువులను సృష్టించాడు. అదీ కాక స్వయంగా తానే యజ్ఞాలు చేసాడు. ప్రాజ్ఞుడు, అజ్ఞాని ఇద్దరూ స్వర్గ సుఖాలు కోరుకుంటారు. కాని యజ్ఞము చేస్తే తప్ప స్వర్గలోకప్రాప్తి కలుగదు. అమలినమైన గృహస్థ ధర్మము లోనే యజ్ఞములు చేయడానికి వీలు ఔతుంది. అలాంటప్పుడు యజ్ఞము హింస అనుకుంటే ఎలాగ ? " అని ధేనువులో ఉన్న ముని పలికాడు. కపిలుడు " కేవలం ఆత్మ సుఖం కోరుకునే వాడు ఇతరములైన సుఖములకు ఆశపడడు. అతడికి కామము, శోకము, విషయవాంఛ ఉండవు. అటువంటి వాడికి స్వర్గ సుఖములు ఎందుకు? కనుక శాశ్వతమైనమోక్షము కొరకు గృస్థాశ్రమము వదిలి పెడతాడు " అన్నాడు. ధేనువులోని ముని " మహర్షి ! మిగిలిన ఆశ్రమములన్ని గృహస్థాశ్రమాన్ని అనుసరించి వర్ధిల్లుతున్నాయి. గృహస్థు మోక్షముకు అర్హుడు కాని ఏ శాస్త్రము చెప్ప లేదు. సమస్త ధర్మములకు, సమస్త కార్యములకు గృహస్థ ధర్మము మూలము. దరిద్రులు, సోమరులు చేయవలసిన కర్మలను వదిలి వేస్తారు. దాని వలన వారికి సద్గతి కలుగదు. వేదాధ్యయనము వదిలిన పాపము చుట్టుకుంటుంది. వేదములను విడుచుట ధర్మము కాదు " అని **స్యూమరశ్మి** చెప్పాడు. కపిలుడు " అయ్యా ! బ్రాహ్మణులు తమ ఆచారవ్యవహారములు పాటించి దేవతలని తృప్తిపరచాలి. బ్రాహ్మణుడు పాటించే ఆచారాలు ఈ విధంగా ఉన్నాయి. సాధకుడు మోక్షప్రాప్తికై శరీరంలోని ద్వారాలను మూసివేస్తాడు. తన ముందు గుట్టగా పడి ఉన్న బంగారాన్ని ముట్టుకోడు. తనను హింసించే వాడిని కూడా చేతితోకొట్టక చేతిని కట్టడిచేస్తాడు. పరస్త్రీలను చేరక ఉపస్థు అనే వాకిలిని మూసివేస్తాడు. కేవలము శరీరము జీవించడానికి మాత్రమే ఆహారంభుజిస్తాడు. అంతే కాని రుచికొరకు ఆహారం తీసుకోడు. అలా ఉదరము అనే ద్వారాన్ని బంధిస్తాడు. ఎప్పుడూ అసత్యము పలుకడు, పరుషముగా మాట్లాడడు, అనవసరమైన వాదనకు దిగడు కనుక అలా నోరు అనే ద్వారాన్ని మూసివేస్తాడు. ఈ నాలుగు ద్వారములను మూసి వేసిన బ్రాహ్మణుడికి తపస్సు, యజ్ఞములు, యాగములు, దానములు, వ్రతములు అవసరంలేదు. అతడికి వేదములతో పనిలేదు. ద్వంద్వాతీతుడు పేరు ప్రతిష్టల కొరకు పాకులాడడు. కళ్ళకు కనపడే ప్రకృతిని కనపడని పరమాత్మను సాక్షీభూతంగా చూస్తుంటాడు. అటువంటి వాడు నిజమైన బ్రాహ్మణుడు. అలా కాని వాడు కర్మలు చేస్తూ కర్మలలో మునిగి తేలుతుంటాడు " అని కపిలుడు చెప్పాడు. అప్పుడు స్యూమరశ్మి తన ఉనికిని తెలిపి " కపిలమహర్షి ! నా పేరు స్యూమరశ్మి. ధర్మ సూక్ష్మములను గ్రహించుట కొరకు ఈ ఆవులలో చేరి మాట్లాడాను. అంతే కాని వేరు కాదు. నేను నిన్ను ఆశ్రయించాను. వేదములు ప్రమాణంగా స్వీకరించిన తరువాత వర్ణాశ్రమధర్మాలను పాటించడమో, పరిత్యజించడమో జరగాలి కదా ! వర్ణాశ్రమధర్మాలను ఆచరించ తగినవా కాదా ! " అని అడిగాడు. కపిలుడు " జ్ఞాని అయిన వాడు ఏ పని చేసినా వాడికి కీడువాటిల్లదు. జ్ఞాని కానివాడు కామానికి కోరికలకు లొంగి కర్మబంధంలో చిక్కుకుంటాడు. అహంకారము, కామము, కోపము లేనివాడు శుభము జరిగినా అశుభము జరిగినా బాధపడడు. త్యాగగుణంతో ఎప్పుడూ ప్రశాంతతో జీవిస్తాడు. మీ మహా ఋషులందరూ జ్ఞానము కలవారే. కాని మీలో ఏ ఒక్కరికో ఏకాత్మ భావన కలుగుతుంది. అలాంటి వాడికి సందేహాలు, కర్మబంధాలు ఉండవు. స్యూమరశ్మి " మహాత్మా ! వేదములు శాస్త్రములు చూపిన దోవనువదలడం వలన మోక్షము రాదు. వేదములు నమ్మకపోవడం వలన కీడు జరుగుతుంది అని తెలుసుకున్నాను. నా సందేహము తీర్చండి " అని అడిగాడు. కపిలుడు " శబ్దబ్రహ్మము, పరబ్రహ్మము అని రెండు. శబ్దబ్రహ్మమును ఆరాధించిన వాడు పరబ్రహ్మమును పొందుతాడు. అసూయ లేని, శమము, దమము, ఆత్మజ్ఞానము కల వాడు వేదములలో చెప్పబడిన ఆచార వ్యవహారాలను శ్రద్ధగా ఆచరిస్తాడు. అటువంటి గృహస్థు సాటి జీవుల ఎడ దయ కలిగి ఉంటాడు. అతడికి స్వాతిశయము, అహంకారము మచ్చుకైనా ఉండవు. శాంత స్వరూపులైన బ్రాహ్మణులు, క్షత్రియులు గృహస్థాశ్రమంలో ఉండి కూడా మోక్షము పొందుతారు. జ్ఞానము ధర్మముకు అధిష్టానము, పరమ సంతోషము ధర్మానికి మూలము, త్యాగము దాని రూపము. కనుక నాలుగు ఆశ్రమాలు ఆచరించ తగినవే. ప్రశాంతమనస్కులు నిరంతర ఆనందం అనుభవిస్తారు. వేదమును చదివినంతనే ప్రయోజనము చేకూరదు. వేదతత్వమును గ్రహించి ఆచరించిన కాని ఫలితము సిద్ధించదు. వేదము చదువునప్పుడు అర్ధము అయినట్లు కనిపించినా వేదము అర్ధము గ్రహించుట కష్ట తరము. మోక్షముకు మూడే మార్గాలు మొదటిది కర్మ ఫలత్యాగము, రెండవది ఇంద్రియ నిగ్రహము, మూడవది శాశ్వతానందము. ఇవి ఒక దాని కంటే ఒకటిగొప్పది " అని చెప్పాడు కపిలుడు. కపిలుని స్యూమరశ్మి ఎంతో ప్రశంసించాడు. ధర్మనందనా ! ఈ సంవాదంలో సూక్ష్మము గ్రహించి నడుచుకో " అన్నాడు భీష్ముడు.

## ధర్మము అర్ధము కామము

ధర్మరాజు భీష్ముడిని " పితామహా ! ధర్మము, అర్ధము, కామములలో ఏది ఉత్తమమైనది ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ సందర్భంలో నీకు కండధారుని చరిత్ర చెప్తాను విను. ఒక బ్రాహ్మణుడు యజ్ఞము చేయ తలపెట్టాడు. కాని అతడి వద్ద ధనము లేదు అందుకని అతడు ధనము కొరకు తపస్సు చేయసాగాడు. అప్పుడు **కండధారుడు** అతడి వద్దకు వచ్చి " విప్రుడా ! నీ కోరిక ఏమిటి అని అడిగాడు ? " ఆ విప్రుడు కండధారుడిని " దేవా ! నాకు ధనము కావాలి " అని అడిగాడు. కండధారుడు దేవతల అనుచరుడూ కుబేరుడి అనుచరుడైన **మణిబద్రుడు** అనే వాడిని తలచుకుని ప్రత్యక్షం

చేసుకుని " మణిభద్రా ! ఇతడికి కావలసిన ధనము ఇమ్ము " అన్నాడు. మణిభద్రుడు " అలాగే ఎంత ధనము కావాలన్నా ఇస్తాను " అన్నాడు. అప్పుడు కండధారుడికి ఒక ఆలోచన వచ్చింది. ఎప్పుడో ఒక సారి చనిపోకతప్పదు. కనుక ఇతడికి ధనముతో పనిఏమిటి ? ఇతడి బుద్ధిని చక్కని మార్గమున పెట్టిన సంపదలు ఇతడి వద్దకు వచ్చిచేరుతాయి. అని అనుకుని ఆ విషయము మణిభద్రుడికి చెప్పాడు. ఆ ఆలోచనకు మణిభద్రుడు కూడా సంతోషించాడు. కండధారుడు ఆ విప్రుని ధర్మమార్గమున పెట్టమని దేవతలను ప్రార్ధించాడు. అప్పుడు ఆ విప్రునికి తపమాచరించవలెనన్న సంకల్పము కలిగి కండధారుడితో " ఓ మహాత్మా ! నేను ఇప్పటి వరకు నిన్ను ధనము అడిగాను. కాని ఇప్పుడు నీ దయ వలన నా మనస్సు తపస్సు మీదకు మరలింది. కనుక నాకు ఇక ధనము అక్కర లేదు. నాకు తపస్సు చేసుకోవడానికి అనుమతి ఇవ్వు " అని ప్రార్ధంచాడు. కండధారుడు ఆ బ్రాహ్మణుడికి తపస్సు చేసుకోవడానికి అనుమతి ఇచ్చి వెళ్ళాడు. తరువాత ఘోరతపమాచరించిన బ్రాహ్మణుడు తన శరీరమును, మనస్సును , మానవత్వము వదిలి దివ్యత్వము పొంది దివ్య శక్తులను పొందాడు. అతడు మనసులో ఇప్పుడిక నేను కోరిన వారికి ధనము ఇవ్వగలను. అప్పుడు విప్రుడు కుండధారుడిని తలచుకుని ప్రత్యక్షము చేసుకుని తపోమహిమతో గంధము, పూలు సృష్టించి కుండధారుడిని పూజించాడు. కుండధారుడు " విప్రోత్తమా ! నీవు నిరంతరము ధర్మాన్ని ఆశ్రయించి, యోగాభ్యాసము చేసి , ఆత్మను అను సంధానము చేసి తరించు " అని చెప్పి అక్కడి నుండి వెళ్ళి పోయాడు.

### అహింస

ధర్మనందనా ! బ్రాహ్మణుడి కధ విన్నావు కదా నీకిక అహింసావ్రతము గురించి చెప్తాను విను. ఒక బ్రాహ్మణుడు అడవిలో ఆశ్రమము నిర్మించుకుని భార్యతో జీవించ సాగాడు. అతడు పొలములో రాలినగింజలను ఏరుకుని జీవనము సాగిస్తున్నాడు. అతడు అహింసావ్రతము ఆచరిస్తూ యజ్ఞములో ఫలములను హవిస్సుగా సమర్పించ సాగాడు. అది వేదవిహిత మార్గము కాదని తెలిసి అతడి శాపానికి భయపడి భార్య ఎదురుచెప్పక ఊరకున్నది. ఇంద్రాది దేవతలు హవిస్సును స్వీకరించ లేదు. అక్కడకు ఒక జింక వచ్చి విషయము తెలిసి చెప్పలేదని మునిపత్నిని నిందించి తనను చంపి ఆ మాంసముతో దేవతలకు హవిస్సులు ఇవ్వమని కోరింది. అందుకు ఆ బ్రాహ్మణుడు అందుకు అంగీకరించ లేదు. ఆ జింక కొంత దూరము పోయి తిరిగి వచ్చి " ఓ విప్రోత్తమా ! నీకు నేను దివ్యదృష్టి ఇచ్చాను నీ కొరకు ఎవరు వచ్చారో చూడు " అన్నాడు. ఆ బ్రాహ్మణుడు దివ్య దృష్టితో చూసి అక్కడ ఉన్న అప్సరసలను, గంధర్వులను చూసి ఆ జింక చెప్పినట్లు దానిని హింసించడానికి పూనుకున్నాడు. అంతటితో అతడి తపస్సు భగ్నమైంది. ఆ జింక ఒక దేవతాస్వరూపము దాల్చి " విప్రోత్తమా ! నేను ధర్మదేవతను నిన్ను పరీక్షించడానికి ఇక్కడకు వచ్చాడు. నీకు ఒక ధర్మసూక్ష్మము చెప్తాను విను. అహింస మహాపాపము. కాని అవసరమైన చోట జీవహింస చేసినా అది ధర్మమే ఔతుంది. యజ్ఞము కొరకు కూడా అనవసర జీవహింస చేయకూడదు. నీవు జీవులను బలి ఇవ్వకుండానే నీ యజ్ఞము పూర్తి అయ్యేలా అనుగ్రహిస్తాను " అని చెప్పి వెళ్ళింది.

## పాపకార్యముల నుండి విముక్తి

ధర్మరాజు భీష్ముడిని " పితామహా ! పురుషుడు పాపకార్యము చేయడానికి కారణమేమిటి ? ధర్మకార్యాలు చేయడానికి కారణమేమిటి ? పాపకార్యముల నుండి, పుణ్య కార్యముల నుండి ఎలా విముక్తి చెందుతాడు " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! మానవుడు ఇంద్రియములతో గంధము, రసము మొదలైన వాటిని ఆస్వాదించి లోభము మోహములకు లోనౌతాడు. ఆ కారణంగా అధర్మముగా ప్రవర్తిస్తాడు. అందు వలన పాపకార్యములు చేసి పాపము మూట కట్టుకుంటాడు. ఈ విషయము ముందే గ్రహించి మనసును విషయముల నుండి మరలించి సజ్జన సాంగత్యము చేసిన ఇంద్రియ నిగ్రహం కలుగుతుంది. ఆ తరువాత పాపచింత తొలగి ధర్మాచరణ అందు ఆసక్తి కలిగి ఆ తరువాత ముక్తి పొందుతాడు " అని భీష్ముడు చెప్పగానే ధర్మరాజు " పితామహా ! మీరు క్లుప్తంగా చెప్తే నేను గ్రహించ లేకున్నాను. కనుక వివరించండి అన్నాడు. భీష్ముడు " ధర్మనందనా ! కుండలు చేయడానికి కుమ్మరికి కుండలు చేసే నేర్పరి తనము, కుమ్మరి సారె, మెత్తటి మట్టికావాలి. కనుక ఏపనికైనా నేర్పరితనం అవసరం. ధర్మనందనా ! కోపము, క్షమాగుణము తోను, కోరికలు లేక పోవడము, సత్వగుణాన్ని పెంపొందించుకోనడము, మితనిద్ర, ధైర్యము, రాగద్వేషములను వదులి జాగరూకతతో భయాన్ని వదిలి, అభ్యాసముతో వస్తువుల మీద వ్యామోహం భ్రాంతినివదిలి, మితాహారంతో రోగములను అధిగమించి, శబ్ద, రూప, రస, గంధములు నిస్సారమని గ్రహించి తృప్తిగా జీవించి లోభత్వమును, దయాగుణము చేత ధర్మాన్ని, విచక్షణా జ్ఞానంతో కర్మలను అరికట్టాలి. పై గుణాలతో కామక్రోధములను జయించి కడు నేర్పుతో ముక్తిని సాధించాలి.

### ఆశ

ధర్మరాజు " పితామహా ! ఈ మహాభారతయుద్ధములో అన్నలను తమ్ములను, బంధువులను, స్నేహితులను చంపుకోవడము కేవలం ఆశ తోడనే కదా ! మరి ఈ ఆశను తొలగించే ఉపాయము చెప్పండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! మాండవ్యముని జనకుడితో చెప్పినది వింటే నీకు అది అవగతమౌతుంది. ఒక సారి మాండవ్యుడనే ముని జనకుడి వద్దకు వచ్చి " మహారాజా ! నా లోని ఆశ చావడానికి నన్ను శిక్షించండి " అని అడిగాడు. జనక మహారాజు " మునీంద్రా ! నీకు ఉన్న సంపదలు నీకు దుఃఖమును దోషమును తెచ్చి పెడతాయి. మనకు ఆశ లేకున్న దుఃఖములు, దోషములు దరి చేరవు. అందుకే మిధిలానగరము తగలబడుతున్నా నాకు ఏమీ జరగనట్లే ఉంటుంది. కామసంబంధిత సుఖము ఏదైనా ఆశను, కోరికను విడిచిన తరువాత వచ్చే ఆత్మసుఖముకు సరికాదు. ఆవుకు కొమ్ములు పెరుగుతున్న చందాన మనలో ఆశా దినదిన ప్రవర్ధమానం ఔతుంది. ఆశామోహములు నా ఇల్లు, నా వాళ్ళు, నా ధనము, నా బంధువులు అనే భావములు కలిగిస్తాయి ఆశామోహాలు విడిచిన ఆశ ఆవిరి అయి ఇంకి పోయి జ్ఞానజ్యోతి వెలుగుతుంది. ఓ మునీంద్రా ! దొరికిన దానిని అనుభవిస్తూ దొరకని దానికి చింతించక ప్రశాంతచిత్తంతో ఉంటే అతడి మనసులోకి ఆశ ప్రవేశించదు. ఈ ఆశను దుర్మార్గులు విడువలేరు. ఈ ఆశకు ముసలితనము, రోగము, చావు లేదు కానీ అది మనిషి ప్రాణంతీస్తుంది. ఆశను జయించిన వాడు ఆనందము పొందుతాడు కనుక మునీంద్రా ! నీవు, సుఖములు, దుఃఖములు అనే ద్వంద్వములకు లోనుకావద్దు. అంతఃకరణలో శాంతిపొందు. అదే నీకు అఖండశాంతిని ఇస్తుంది. అని జనకుడు చెప్పాడు " కనుక ధర్మనందనా ! నీ ప్రశ్నకు జనకుడి మాటలే సమాధానము అని భీష్ముడు చెప్పాడు.

## అవశాన కాలము

ధర్మరాజుభీష్ముడిని " పితామహా ! మానవుడికి అవసాన కాలము ముంచుకుని వస్తున్నప్పుడు అతడు దేనిని ఆచరించాలి. ఈ విషయము ఇదివరకే మీరు నాకు చెప్పారు. కాని వివరంగా వినవలెనన్న కోరిక కలుగుతుంది " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఒక బ్రాహ్మణుడికి **మేధావి** అనే కుమారుడు ఉన్నాడు. అతడికి అపరిమితమైన మేధాసంపత్తి ఉంది. ఒక రోజు మేధావి తన తడ్రితో " తండ్రీ ! మనిషికి దినదినము ఆయువు తరిగిపోతున్నప్పుడు అతడేమి చేయాలి ? " అని అడిగాడు. బ్రాహ్మణుడు " కుమారా ! ప్రతిపురుషుడు తన జీవితంలో బ్రహ్మచర్యము, వేదాభ్యాసము, వివాహము, సంతానము పొందడము, ధనసంపాదన, యజ్ఞయాగములు చెయ్యడము తరువాత వానప్రస్థము గడిపి ఆ పిదప సన్యాసం స్వీకరించడం ఇంతకన్నా ఏమి చేయగలడు " అని చెప్పాడు. అందుకు మేధావి " మానవునికి పుట్టినది మొదలు ముసలితనము మరణము వెంటాడుతుంటాయి కదా ! అది ఎరుగక తీరికగా వర్ణాశ్రమధర్మాలు ఆచరించడం ధర్మమా ! మనముచేయవలసిన ధర్మకార్యాలు వెంట వెంటనే చేయకున్న మరణం మన కొరకు ఆగదు కదా ! ఇది చేయతగిన పని, చేయకూడని పని ఆలోచిస్తూ ఉన్న యముడు తరుణం చూసి తనవైపు లాగక ఊరక ఉంటాడా ! తండ్రీ ! మృత్యువు అమృతము రెండు మనలోనే ఉన్నాయి. మనలోని మోహమే మృత్యువు, మనలోని తత్వ విచారమే అమృతము. తండ్రీ ! జీవహింస చేసే యజ్ఞముల కంటే జ్ఞానయజ్ఞము మేలు కదా ! కనుక నేను అహింసాయుతమైన కర్మయజ్ఞము చేస్తాను. యోగమార్గావలంబన, తపస్సు, కర్మఫలములను విడుచుట కాక వేరు కర్మలు మనకు హితము కలిగిస్తాయా ! అంతా మనకే కావాలి అన్న అత్యాశ దుఃఖాన్ని కలిగిస్తుంది. విషయ సుఖములను త్యాగము చెయ్యడానికి మించిన సుఖము ఉంటుందా ! నీవు విషయ వాంఛలు శాశ్వతము కాదని తెలుసుకో. నీవు మనసు ప్రశాంతంగా ఉంచుకుని ఆత్మ పరిశీలన చేసుకో " అని కుమారుడు చెప్పాడు. ఆమాటలకు ఆ బ్రాహ్మణుడు ఆనందిం,చి దానిని ఆచరించి ముక్తి పొందాడు. ధర్మనందనా ! మేధావి మాటలలోని అంతరార్ధము గ్రహించిన నీకు సమాధానము దొరుకుతుంది " అని చెప్పాడు.

## బ్రహ్మపదము హరిత గీత

ధర్మరాజు " పితామహా ! ఎటువంటి శీలము కలవాడు బ్రహ్మపదము పొందుతాడు " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! మితంగా ఆహారం తీసుకుంటూ ఇంద్రియ సుఖములను త్యజించి మోక్షము కొరకు ప్రయత్నించాలి. ఈ సందర్భంలో నీకు హరిత గీత చెప్తాను. పూర్వము హరితుడు అనే మహాముని కొంత మంది పండితులకు ఇలా బోధించాడు. సాధకుడైన వాడు నిష్టతో ఇల్లు వదలాలి. కోరికలకు దూరంగా ఉండాలి. త్రికరణ శుద్ధిగా పరులకు కీడి చెయ్యకూడదు. అందరి పట్ల సమదృష్టి కలిగి ఉండాలి. పొగడ్తలకు పొంగడము, నిందకు కుంగడము ఉండ కూడదు. నివాసగృహాలను త్యజించి దేవాలయములో నిద్రించాలి, అడవులలో ఉన్నప్పుడు కొండగుహలలో తలదాచు కోవాలి. భోజన సమయంలో మాత్రమే భిక్షాటన చేయాలి. తనకు కావలసిన దాన్నికంటే ఎక్కువ తీసుకొనక సున్నితంగా తిరస్కరించాలి. ఎల్లప్పుడూ ఆత్మాను రక్తుడై ఉండాలి. ఇలాంటి వాడికి మోక్షము కరతలామలకము " అని చెప్పాడు.

## వృత్త గీత


సనకాది మునులను కలసిన శుకచార్య వృత్రాసురులు

ధర్మరాజు " పితామహా ! నేను క్షత్రియుడిని పైగా చక్రవర్తిని, ఇంద్రియములను జయించి రాజసము వదిలి త్రిగుణములను వదిలి శాంతి సుఖము ఎప్పుడు పొందుతానో కదా ! " అని ధర్మరాజు ఆవేదన చెందాడు. దేవాసుర యుద్ధములో వృత్తాసురుడనే రాక్షసుడు పడి పోయాడు. అప్పుడు రాక్షసులు అతడిని సురక్షిత స్థావరానికి తీసుకు వెళ్ళారు. కాని వృత్తాసురుడి మొహంలో విషాదఛాయలు కనిపించక నిర్మలంగా ఉన్నాదు. అప్పుడు రాక్షస గురువైన శుక్రుడు " వృత్తా ! శత్రువులు నీ రాజ్యము, సంపదలు అపహరించారు కదా ! నీకు ఏమాత్రము దు:ఖము కలుగక పోవడానికి కారణం ఏమిటి ? " అని అడిగాడు. **వృత్తాసురుడు** " కలిమి లేములు కాలవశాత్తు వస్తుంటాయి పోతుంటాయి. అజ్ఞానులు మాత్రమే కలిమి ఉన్నప్పుడు దర్పము, పోయినప్పుడు దైన్యము అనుభవిస్తుంటారు. సంపదలు అశాశ్వతము అని తెలిసిన వాడు సంపదలు ఉన్నా పోయినా బాధపడక నిర్మల మనస్కుడై ఉంటాడు. లోకం లోని ప్రాణులన్నీ కర్మవశాన దేవతలు గాను, మనుష్యుల గాను, జంతువులు గాను జన్మలు ఎత్తుతూ మరణిస్తూ ఉంటారు. ఈ విషయము నాకు తెలుసు కనుక నేను ఎందుకూ బాధ పడను " అని అన్నాడు వృత్తుడు. శుక్రాచార్యుడు వృత్తుని గురించి మనశుద్ధి తెలుసుకోవాలని " ఓ వృత్తాసురా ! నీవు రాక్షసరాజువు నీవు ఇంత విరక్తిగా పడడము తగదు " అని అతడిని రెచ్చగొట్టాడు. వృత్తుడు చలించక " గురుదేవా ! పూర్వము నేను పూర్వము దేవతలను జయించాలని ఘోరమైన తపస్సు చేసి విజయము సాధించి ముల్లోకాలు జయించి సమస్త సంపదలు అనుభవించాను. ఏదో పాపం చేసాను కనుక అవన్నీ ఇప్పుడు పోయాయి. ఇప్పుడిక దు:ఖించడం ఎందుకు. ఇక నేను సుకృత దుష్కృతముల జోలికి పోకుండా తటస్థుడనై నిర్మలచిత్తుడనై విష్ణువును పూజిస్తాను. నేను ఇంద్రుడితో యుద్ధము చేసే సమయంలో అతడి పక్కన విష్ణుమూర్తిని చూసి అతడి మహత్యానికి ఆశ్చర్య పోయాను. గురువర్యా ! నాకు విష్ణువు మహిమ గురించి వివరించండి " అని అడిగాడు. అలాగే చెప్పబోతున్న సమయంలో అక్కడకు వచ్చిన సనత్కుమారుడిని చూసి శుక్రాచార్యుడు " ఋషివర్యా ! ఈ దానవేంద్రుడికి విష్ణుమహిమ గురించి వివరించండి " అని అడిగాడు. **సనత్కుమారుడు** " సర్వవ్యాపి అయిన విష్ణువుకు భూమియే పాదాలు, ఆకాశమే తల, దిక్కులే భుజాలు అలా విష్ణువు సర్వదేవమయుడై సర్వవ్యాప్తుడై ఉన్నాడు. ఈ చరాచర జీవులను సృష్టించడం, పోషించడం, చంపడం ఆయన లీలామాత్రంగా చేస్తుంటాడు. మానవుని జీవితంలో అనేక వర్ణములుగా వస్తుంటాయి. పూర్వజన్మ కర్మవిశేషము చేత అనేక వర్ణములలో ఫలితము అనుభవిస్తుంటాడు. ఇలా జననమరణ చక్రంలో చిక్కుకుని నిరంతరము జీవుడు పరిభ్రమిస్తుంటాడు. జీవుడు ఉత్తముడు, అధముడు, మధ్యముడు అను మూడు విధములైన జన్మ ఎత్తుతుంటాడు. దేవతాజన్మ ఉత్తమం, మానవజన్మ మధ్యమం, పశుపక్ష్యాదుల జన్మ అధమం. ఈ జన్మలో ఒకరికి ఉపకారము చేసిన వాడికి మరుజన్మలో ఉత్తమమైన జన్మ లభిస్తుంది. ఈ జన్మలో పరులకు అపకారం చేసిన వాడికి మరు జన్మలో అధమ జన్మ లభిస్తుంది. పుణ్యకార్యాచరణతో జీవుడు మాలిన్యము వదిలి పవిత్రుడౌతాడు. ఎన్ని ఎక్కువ పుణ్య కార్యాలు చేస్తే అంత మంచి జన్మ లభిస్తుంది. అప్పుడు అతడు దు:ఖము వదిలి నిర్మలానందాన్ని పొందుతాడు. ఏ జీవుడు సదా తెల్లనివర్ణమును మనసున తలుస్తుస్తాడో అప్పుడు అతడికి విష్ణు భావన కలుగుతుంది " అన్నాడు సనత్కుమారుడు. అమృతోపమాయమైన ఆమాటలు విన్న వృత్తుడు శుద్ధమనస్కుడై విష్ణుసాయుజ్యం పొందాడు.

## ఇంద్రుడు వృత్తాసురల మధ్య యుద్ధము

ధర్మరాజు " పితామహా ! వృత్తుడు ఇంతటి విష్ణుభక్తుడు కదా అతడికి ఇంద్రుడితో యుద్ధము ఎందుకు సంభవించింది " అని అడిగాడు. భీష్ముడు" ఇంద్రుడు అపారమైన దేవసేనతో రాక్షసరాజు వృత్తాసురుడి మీదకు వెళ్ళి రాక్షససైన్యాలను చూసి జంకుతూ రాక్షసరాజైన వృత్తుడితో తలపడ్డాడు. పర్వతాకారంతో యుద్ధము చేస్తున్న వృత్తుడిని చూసి ఇంద్రుడికి వణుకు పుట్టింది. వృత్తుడు ఇంద్రుడిని మూర్ఛిల్లజేసాడు. అప్పుడు వశిష్టుడు తన తపో మహిమతో ఇంద్రుడి మూర్ఛ నుండి కోలుకునేలా చేసి తిరిగి యుద్ధానికి పురికొల్పాడు. దేవగురువైన బృహస్పతి ఇంద్రుడికి విజయం కలిగించమని ఈశ్వరుడిని ప్రార్థించాడు. ఈశ్వరశక్తి ఇంద్రుడిలో ప్రవేశించింది. వృత్తుడిని చంపడానికి ఇంద్రుడు వజ్రాయుధాన్ని ఎత్తగానే విష్ణువు ఆ వజ్రాయుధంలో ప్రవేశించాడు. అప్పుడు శివుడు " ఇంద్రా ! ఈ వృత్తుడు 60,000 దివ్య సంవత్సరములు బ్రహ్మ గురించి తపస్సు చేసాడు. ఆ తపస్సుకు మెచ్చిన బ్రహ్మ వృత్తుడికి మహోగ్రమైన బలాన్ని ప్రసాదించాడు. ఆ బలాన్ని నేను నా తేజముతో నాశనం చేస్తాను. అనగానే ఇంద్రుడు వజ్రాయుధంతో కొట్టి పడగొట్టాడు. దేవతలు తూర్యనాదములతో, విజయఘోషతో ఇంద్రుడిని పొగిడారు. వజ్రాయుధపు ఘాతముతో విష్ణువు వృత్తునిలో ప్రవేశించాడు. విష్ణుస్పర్శ తగలగానే వృత్తుడు మాలిన్యము తొలిగి పునీతుడయ్యాడు. ఇంద్రుడు శివుడికి నమస్కరించి " శంకరా నీ దయతో కదా నేను ఈ

విజయము సాధించాను " అని స్వర్గానికి వెళ్ళాడు.

## బ్రహ్మహత్యా పాతకము

స్వర్గానికి వెళ్ళిన ఇంద్రుడికి మనశ్శాంతి లోపించింది. అతడికి బ్రహ్మహత్యాపాతక భయముపట్టుకుంది. ఇంద్రాది దేవతలు బ్రహ్మ వద్దకు వెళ్ళి తరుణోపాయము చెప్పమని అడిగాడు. బ్రహ్మ ఆ పాపమును అందరికి పంచి విముక్తి పొందమని చెప్పాడు. అప్పుడు ఇంద్రుడు బ్రహ్మహత్యా పాతకమును పంచి ఇవ్వడానికి అగ్నిని, గడ్డిని, ఓషధులను చెట్లను, జలమును, స్త్రీలను పిలిచి బ్రహ్మహత్యాపాతకమును పంచుకొమ్మని ఆజ్ఞాపించాడు. అందుకు వారు భయముతో అంగీకరించారు. ప్రతిగా ఇంద్రుడు వారికి కోరికలను ప్రసాదిస్తూ చెట్లను తుంచిన వాడికి నరికిన వాడికి, అగ్నిని ప్రజ్వలింపచేయక హవిస్సులను వేసినవాడికి, జలములో మల మూత్రములను విడిచిన వాడికి, నదిలో ఉమ్మి వేసిన వాడికి, బహిష్టు సమయంలో స్త్రీని చేరిన వాడికి బ్రహ్మహత్యాపాతకము చుట్టుకుంటుందని వరమిచ్చాడు. ఇంద్రుడు బ్రహ్మహత్యా పాతకము నుండి విముక్తుడయ్యాడు. ఇంద్రుడు బ్రహ్మ అనుమతితో అశ్వమేధయాగము చేసి స్వర్గాన్ని పాలించసాగాడు. వృత్తుడి శరీరము నుండి కారిన రక్తము పుట్టగొడుగులుగా మారాయి. కనుక బ్రాహ్మణులు పుట్టగొడుగులను ఆహారముగా స్వీకరించరు " అని చెప్పి భీష్ముడు " ధర్మనందనా ! నీవు కూడా ఇంద్రుడిలా శత్రువులను జయించి కీర్తిని పొందు " అని చెప్పాడు.

## జ్వరము

ధర్మరాజు సందేహంతో " పితామహా ! వృత్తుడికి జ్వరము వచ్చిందని విన్నాను. వృత్తాసురుడికి ఆజ్వరము వచ్చింది " అని అడిగాడు. భీష్ముడు " ధర్మరాజా ! వెండి కొండ మీద పార్వతీ సమేతంగా పరమశివుడు, దేవతలు, మునులు, యక్షులు మొదలగు వారు సేవిస్తుండగా కొలువు తీరి ఉన్నాడు. అప్పుడు సతీదేవి భర్తను చూసి నాధా ! వీరంతా ఎక్కడికి పోతున్నారు " అని అడిగింది. శివుడు " దేవీ ! **దక్షుడు** చేయు యాగములో తమ తమ హవిర్భాగములు తీసుకొనుటకు వెడుతున్నారు " అన్నాడు. **సతీదేవి** " నాధా ! మీరు ఎందుకు పోవడము లేదు మీ హవిర్భాగము మీరూ పొందాలి కదా ! " అని అడిగింది. శివుడు " దేవీ ! దక్షుడు నన్ను యాగముకు పిలువ లేదు. నాకు హవిర్భాగమునూ ఏర్పరచ లేదు. అందుకని నేను వెళ్ళ లేదు " అని చెప్పాడు. ఆ మాటలకు కోపించిన సతీదేవి కోపమును నిగ్రహించుకుని మౌనంగా ఊగిపోయింది. భార్య అంతర్యము గ్రహించిన శివుడు తన ప్రమధ గణములతో పోయి దక్షుడి యజ్ఞమును నాశనం చేసాడు. యజ్ఞమునకు విచ్చేసిన దేవతలు, మునులు, యక్షులు తొక దిక్కుకు పారి పోయారు. అప్పుడు బ్రహ్మదేవుడు " పరమశివా ! నీకు ఈ యాగములో హవిర్భాగము కల్పిస్తాము శాంతించు " అన్నాడు. ఆ మాటలకు శివుడు శాంతించాడు. బ్రహ్మదేవుడు " పరమేశ్వరా ! నీ నుదుటి నుండి పుట్టిన స్వేదము నుండి ఒక పురుషుడు ఉద్భవించాడు. అతడు **జ్వరము** అనే పేరుతో ప్రసిద్ధి చెందుతాడు. అతడు జీవులను ఆవహిస్తాడు. అతడు ఏకరూపములో ఉంటే ప్రజలుభరించ లేరు కనుక అతడికి వివిధ రూపాలను ప్రసాదించండి " అని అడిగాడు. అప్పుడు శివుడు జ్వరాన్ని ఏనుగులకు తలనొప్పిలాగా, పాముకు కుబుసంగా, గోవులకు పాదాల నొప్పిగా, లేళ్ళకు తన రూపము తాము చూడడానికి నిరోధంగా, గుర్రములకు పార్శ్వపు నొప్పిగా, నెమళ్ళకు ఈకలు రాలునట్లుగా, కోకిలలకు కళ్ళ వ్యాధిగా, చిలుకలకు ఎక్కిళ్ళుగా, మేకలకు కంగారుతనంగా, పులులకు అలసటగా, మనుష్యులకు చావు



దక్ష యాగ విధ్వంసం



దక్షుని యాగములో శివుడు ప్రత్యక్షమగుట

పుట్టులకు కలిగే వ్యాధిగా విభజిస్తున్నాను " అని చెప్పాడు.

## ఆచరించవలసిన కర్మలు

ధర్మరాజు " పితామహా ! శాస్త్ర తత్వము తెలిసిన వాడికి అనుమానాలు అధికము. పరమాత్మ గురించి ఎవరికి తెలియదు. అలాంటి వాడు ఎలాంటి కర్మలు ఆచరించాలి " అని అడిగాడు. భీష్ముడు ధర్మరాజా ! గురుపూజ, వేదాధ్యయనము, వృద్ధులకు సేవ చెయ్యడము చేయవలసిన సత్కర్మలు. నారదుడు ఈ విషయము ఒక సారి గాలవుడికి చెప్పాడు. ఒక సారి **గాలవుడు** నారదుడి వద్దకు వచ్చి " మునీంద్రా ! నేను చాలా శాస్త్రములు అధ్యయనము చేసాను. కాని నా మనసులో ఏదోవెలితి ఉంది నాకు సంపూర్ణజ్ఞానము ప్రసాదించండి " అని అడిగాడు. బదులుగా " నారదుడు గాలవా ! మానవుడు ముందు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమం గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలి. పాపకర్మలను అన్నింటినీ వదిలి పుణ్యకర్మాచరణ చేయాలి. మనసు పరిశుద్ధం చేయాలి. సమస్తప్రాణుల పట్ల దయకలిగి ఉండాలి. సజ్జనసాంగత్యము చేయాలి, ఎప్పుడూ మధురంగా సౌమ్యంగా మాట్లాడాలి. దేవతలను, పితృదేవతలను ఆరాధించాలి. అహంకారమును వదిలి పెట్టాలి. ఏ వస్తువు కొరకు ఎవరిని యాచించకూడదు. ఇంద్రియ నిగ్రహము కావాలి. విషయ వాంఛలకు దూరంగా ఉండాలి. పరనింద, ఆత్మపొగడ్త మాని వేయాలి. సోమరితనము, అధిక ప్రసంగం, మాత్సర్యం, కోపము ఉండకూడదు. ఎల్లప్పుడూ అతిథి సత్కారం చెయ్యాలి. వేదాధ్యయనము, వేదాంగచర్చలు, యజ్ఞయాగములు, బ్రాహ్మణ సన్మానము జరిగే ప్రదేశములలో నివసించాలి. ఇలాంటి ఋజువర్తనుడికి సకల దోషములు తొలగి జ్ఞానోదయం ఔతుంది " అని నారదుడు గాలవుడికి వివరించాడు " అని భీష్ముడు చెప్పాడు.

## కాలపాశము

ధర్మరాజు " పితామహా ! కాలము అవిచ్ఛిన్నము కదా ! నా బోటి వాడు ఈ కాలపాశమును ఎలా చేధించగలడు ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ విషయము పూర్వము సగరమహారాజు **అరిష్టనేమి** అనే మునిని అడిగాడు. ఆముని చెప్పిన మాటలు నేను నీకు చెప్తాను " మహారాజా ! మానవుడు ఎప్పుడూ భార్య, బిడ్డలు, ధనము, ధాన్యము, పశువులు మొదలైన వ్యామోహములో పడి తన మనసును వ్యాకుల పరచుకుంటూ ఉంటాడు. అటువంటి వాడికి మోక్షము దుర్లభము. వయసు ముదురిన తరువాత అయినా భార్యను వదిలి ఏకాంత ప్రదేశముకు పోవాలి. ప్రశాంతమైన ఏకాంత ప్రదేశముకు పోవాలి. అతడికి పుత్రులు ఉన్నా వారిని వదిలి వెళ్ళాలి. అప్పుడే అతడికి వైరాగ్యము శాంతి కలుగుతాయి. కాని ఈ సంసార లంపటంలో ఉన్నవాడు " అయ్యో ! నేను లేకపోయిన వీరు ఏమై పోతారు ? ఎలా బ్రతుకుతారు ? అని వాళ్ళకు సేవలు చేస్తూ చస్తాడు. అప్పుడు బంధుమిత్రులు ఎవరూ అతడిని ఆదుకొన లేరు. ఈ విషయాన్ని గ్రహించి ముందే వైరాగ్యము అలవరచు కోవాలి. అతడి సేవలను అందుకున్న బంధుమిత్రులు అతడికి ముక్తి కలిగించ లేరు కనుక ముందే ఆ విషయము గ్రహించి సంసారం నుండి బయటపడి జ్ఞానసముపార్జన చేయాలి . ప్రతిరోజు ఎందరో పుట్టడము మరణించడమూ కళ్ళారా చూస్తున్నాము. చచ్చేవాడు ఏదీ పట్టుకు పోడని గ్రహిస్తే ఏదీశాశ్వతం కాదని అనుభవంలోకి వచ్చి ముక్తిమార్గంలోకి ప్రవేశిస్తాడు. అలాకాక ఈ సంసార లంపటంలో కొట్టిమిట్టాడే వాడు ఎన్నటికీ ముక్తిమార్గము చేరలేడు. మానవుడు ఈ ద్వందాల నుండి బయటపడి మృష్టాన్నము పచ్చడి మెతుకులు, కటికనేల మృదువైన పట్టు పరుపులను, జింకచర్మమును చీనీ చీనాంబరములను, సమదృష్టితో చూడాలి. అటువంటి వాడికి ముక్తి సులువుగా లభిస్తుంది. ఎంతో మంది చక్రవర్తులు ఈ భూమండలాన్ని పాలించారు. వారంతా కాలగర్భంలో కలిసి పోతూ పూచికపుల్ల కూడా తీసుకు పోలేదు. ఈ విషయము గ్రహించిన సాధకుడు మోక్షము పొందుతాడు. ధనసంపాదన కష్టము కాని దు:ఖములు మాత్రము అవలీలగా చుట్టుముట్టుతాయి. ఈ విషయము తెలుసుకున్న వాడు తిరిగి జననమరణ ఉచ్చులో పడక మోక్షముకొరకు ప్రయత్నిస్తాడు. కనుక మహారాజా ! నీవు గృహస్థాశ్రమంలో ఉన్నా తామరాకు వలె నీటి బొట్టులా అంటీ ముట్టనట్లు ఉండు. అహంకారము లేక మమతలను మమకారములను వదిలిన మోక్షప్రాప్తి నీకు సులువౌతుంది " అని అరిష్టనేమి బోధించాడు " అని చెప్పిన భీష్ముడు " ధర్మనందనా ! నీ ప్రశ్నకు సమాధానము లభించింది కదా " అన్నాడు.

## దానవులు శుక్రాచార్యుడు

ధర్మరాజు " పితామహా ! దానవులు ధర్మద్వేషులు కదా ! వారికి శుక్రాచార్యులు గురువుగా మంత్రిగా ఎలా ఉన్నాడు. ఆ శుక్రుడికి ఆపేరు ఎలా వచ్చింది " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! శుక్రుడి అసలు పేరు **భార్గవుడు**. భార్గవుడికి యోగ బలము ఎక్కువ. భార్గవుడు కుబేరుడిని మోసగించి అతడి సంపదలన్ని అపహరించాడు. **కుబేరుడు** ఈ విషయము ఈశ్వరుడికి మొరపెట్టుకున్నాడు. ఈ విషయము విన్న ఈశ్వరుడు కుపితుడయ్యాడు. శివుడు కళ్ళ నుండి నిప్పులు రాలుస్తూ

ఎక్కడా ఆ భార్గవుడు ? అని హూంకరించాడు. అది తెలిసిన భార్గవుడు భయపడి ఒక పొదలో దాక్కున్నాడు. శివుడు అతడిని పట్టుకుని మ్రింగివేసి తిరిగి శుక్లరూపములో బయటకు విడిచాడు. అయినా శివుడి కోపము తీర లేదు. అప్పుడు పార్వతి " పరమశివా ! ఈ భార్గవుడు నీ కడుపు నుండి బయటకు వచ్చాడు కనుక ఇతడు మనకు పుత్రసమానుడు. పుత్రుడి మీద కాఠిన్యము తగదు కనుక అతడి మీద దయ చూపండి " అన్నది. శివుడు శాంతించాడు. శివుడి శుక్లముగా వచ్చాడు కనుక అతడు ఆతరువాత శుక్రుడు అయ్యాడు " అని చెప్పాడు.

## తపోధర్మము పరాశరగీత

ధర్మరాజు " పితామహా ! మీరు చెప్తున్న కొద్దీ నాకు వినవలెనని కుతూహలము పెరగడము లేదు. కాని ఏమి అడగాలో తెలియకున్నది కనుక మీరే నాకు మంచి ధర్మములు ఉపదేశించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నీకు పరాశరగీతను చెప్తాను. పూర్వము **జనకమహారాజు** కోరిక మేరకు **పరాశరుడు** ధర్మబోధ చేస్తూ " మానవుడు ఇహలోక సౌఖ్యములు, పరలోక సౌఖ్యములు, ధర్మకార్యములే అని తలచి చిన్న విత్తనము ద్వారా ఫలమును పొందినట్లు ధర్మాచరణ వలన సుఖము పొందాలి. మంచి పనులకు సుఖము చెడ్డ పనులకు దు:ఖము కలుగుతుంది. సుఖదు:ఖములు మానవుడిని వదలక వెన్నంటుతూ ఉంటాయి. మానవుడు త్రికరణశుద్ధిగా అన్యాయము అధర్మము చెయ్యక ఉన్న సత్గతికలుగుతుంది. సత్పదమనగా సత్యము, మనో నిగ్రహము, అహింస. మనోరధానికి కట్టిన కోరికలనే గుర్రాలు అన్ని వైపులా పరుగెడుతుంటాయి. బుద్ధి అనే పగ్గములతో వాటిని అదుపులో పెట్టి మనసును సన్మార్గములో నడపాలి. భగవంతుడు మానవుడికి ఇచ్చిన పూర్ణాయుస్సును దుర్గుణాలతో మానవుడు మట్టిపాలు చేసుకుని అకాలమరణం పొందుతుంటాడు. అలాకాక మంచి మార్గాన పయనించి జీవితాన్ని సుఖమయం చేసుకోవాలి. అధర్మము, అక్రమము, అవినీతి వలన ప్రాప్తించిన సంపదలవలన తాత్కాలిక సుఖము లభించినా అది శాశ్వతము కాదు. ఆ సుఖములు పాము వలె కాటేసి దు:ఖాల పాలు చేస్తాయి. కనుక ధర్మకర్మాచరణ ఉత్తమమైనది. విష్ణుస్థుతి, తపస్సు చేయడము, ధర్మప్రవర్తన వలన మనసుకు శాంతి లభిస్తుంది. పై సుగుణముల వలన ఎంతటి దుర్మార్గుడు కూడా సన్మార్గుడౌతాడు. గృహములో అగ్ని హోత్రము ఉన్న వాడిని వేదము పుణ్య పురుషుడు అంటుంది. ఎందుకంటే తల్లి, తండ్రి, గురువు, సన్మార్గము, బలము, బుద్ధి ఇవన్నీ అగ్ని స్వరూపాలు. సాధుజన సాంగత్యముతో ఎంతటి దుర్మార్గుడైనా సన్మార్గుడౌతాడు. బ్రాహ్మణులను సేవించిన శూద్రులు కూడా ఇహలోక సుఖములు, పరలోక సుఖములు పొందగలరు. ఈ మానవుడి శరీరము అనిత్యము. ఈ సత్యమును తెలుసుకున్న మానవుడు సుఖదు:ఖములకు చలించక ధర్మమార్గమున పయనించాలి. ఇది ఏ జాతి వాడికైనా అనుసరణీయము. ఎక్కువ ఫలము ఆశించి తక్కువ పాపమైనా చెయ్యకూడదు. ఫలము తక్కువని పుణ్యకార్యాచరణ మానకూడదు. అందువలన ఇహపర సుఖములు కలుగుతాయి. ప్రతి మనిషి స్వధర్మము పాటించాలి. స్వధర్మము విడిచి ఎన్ని ధర్మములు చెప్పినా అవి వ్యర్ధమే. యజ్ఞములు చెయ్యని బ్రాహ్మణుడు, ప్రజారక్షణ చెయ్యని క్షత్రియుడు, ధర్మమార్గమున విత్తము సంపాదించని వైశ్యుడు, విప్రుల సేవ చెయ్యని శూద్రుడు అధర్మపరులే ! ధర్మముగా సంపాదించినది లేశమైనా అది అఖండ ఫలితాన్ని ఇస్తుంది. అన్యార్జితమైన ఆస్తి, ధనము కోటి రెట్లు ఉన్నా అది నిష్ఫలమే అని పెద్దల ఉవాచ. బ్రాహ్మణుడు పేదరికము చేత బాధించబడిబ అతడు క్షత్రియ ధర్మము, వైశ్య ధర్మము ఆచరించ వచ్చు. కాని సేవకా ధర్మము ఆచరించిన అతడు నరకానికి పోతాడు. శూద్రుడు తన జీవనాధారము నశించినప్పుడు వైశ్యధర్మము, పశుపోషణ, వ్యవసాయము చేసి జీవించ వచ్చు.

## పరమగతి

జనక మహారాజా ! పూర్వము రాక్షసులు మానవులు చేస్తున్న ధర్మకార్యములు సహించ లేక మానవులను ఆవహించారు. అందు వలన మానవులు అధర్మవర్తనులు అయ్యారు. మానవులలో గర్వము, రోషము ప్రవేశించి యజ్ఞ యాగములు చెయ్యడము ఆపివేశారు. అది చూసి దేవతలు చింతించి శివుడి వద్దకు పోయి మొరపెట్టుకున్నారు. శివుడు దేవతల మొర ఆలకించి తన త్రిశూలమును పంపాడు. ఆ త్రిశూలము శక్తి వలన మానవులలోని రాక్షసత్వం నశించింది. అలా శివుడు ప్రజారక్షణ చేసిన తరువాత యజ్ఞయాగములు యధావిధిగా జరిగాయి. కనుక జనకమహారాజా నీవు కూడా రాక్షసత్వము అణచి వేసి వారిలో ధర్మనిరతిని పెంచు. ఇక తపసు గురించి చెప్తాను విను. పూర్వము విధ్యాధరులు, మునిపుంగవులు, దేవతాగణములు తపస్సు చేయడం వలననే వైభవం పొందారు. బ్రహ్మదేవుడు కూడా తపస్సు చేతనే సమస్త లోకములను సృష్టించాడు. రాజులు కూడా తపస్సు వలననే కీర్తి గడించారు. మనకు సుగంధము, పట్టుపరుపులు తపసు వలనే ప్రాప్తించాయి. మానవుడు భార్య, బిడ్డలు, ధనము, భోగములు , సంపదలతో విసిగి పోయినప్పుడు నిర్మల మనసుతో చేసిన తపసు అతడికి ఉపశాంతి కలిగిస్తుంది. లోభము సుఖదు:ఖాలను కలిగిస్తుంది. కాని ఆ సుఖదు:ఖాలు కూడా తపస్సు లేమి వలనే సంభవిస్తాయి. సుఖము వచ్చినప్పుడు అహంకరించడం దు:ఖంకలిగినప్పుడు కుంగిపోవడం సహజం. కాని తపమాచరించిన వాడు అన్నిటినీ సమానంగా చూడగలడు. తపస్సిద్ధి పొందిన మానవుడికి ధర్మార్ధకామమోక్షములు ప్రాప్తిస్తాయి " అని పరాశరుడు జనకుడికి బోధించాడు.

## చతుర్వర్ణాలు పుత్ర జననం

జనకుడు పరాశరుడితో " ఓ మహర్షీ ! మానవుల కర్మలను అనుసరించి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అని నాలుగు చతుర్వర్ణాలుగా విభజన జరిగింది కదా ! మరి వారిలో హెచ్చు తగ్గులు ఎందుకు. తండ్రి తానే పుత్రుడుగా జన్మిస్తాడు అంటారు కదా ! అది ఎలా అని వివరించండి ? " అని అడిగాడు. **పరాశరుడు** " జనక మహారాజా ! బ్రహ్మ ముఖము, భుజములు, తొడలు, పాదముల నుండి జన్మించారు. వారు జన్మించిన ప్రదేశము అనుసరించి వారిలో బేధాభిప్రాయాలు ఏర్పడ్డాయి. తండ్రి తన మానసిక శరీరస్థితిని తన తేజస్సులో నిక్షిప్తము చేసి భార్యద్వారా పుత్రుడికి జన్మ ఇస్తాడు కనుక కుమారుడు తండ్రికి ప్రతి రూపము ఔతాడు. ఋష్యశృంగాదులు అలా జన్మించిన వారే కదా ! " అని పరాశరుడు చెప్పాడు. జనకుడు " చతుర్వర్ణ ధర్మాలు గుణగణాలు వివరించండి " అని జనకుడు అడిగాడు. పరాశరుడు " మహారాజా ! దానము పుచ్చుకోవడము, యజ్ఞయాగాదులు చేయించడము, వేద విద్యలు బోధించడం బ్రాహ్మణుల ముఖ్య విదులు. ప్రజారక్షణ రాజుకు విధించబడిన విశేష బాధ్యత క్షత్రియుడి ముఖ్యవిధి. వ్యవసాయము, పశుపోషణ, వ్యాపారము, ధనార్జన వైశ్యుడికి విధించబడిన ధర్మము. శూద్రులకు సేవా ధర్మము ముఖ్యము. కాని అన్ని వర్గముల వారికి సాధారణ ధర్మాలు ఉన్నాయి. సత్యము, శుచి, అహింస, అసూయద్వేషములు లేకుండుట, అతిథి సత్కారము, పితరులకు శ్రాద్ధకర్మలు చేయడము ప్రధానధర్మాలు. ఏ మానవుడికి పరస్త్రీవ్యామోహము తగదు. విశేషధర్మాలు పాటిస్తూ సాధారణధర్మాలు ఆచరించే మానవుడికి ఇహపర సుఖములు తధ్యము. విశేషధర్మాలను విడిచి పరధర్మమును ఆచరించిన వాడికి పాపము తప్పదు.

## అహింస

ఇక హింస అహింస అహింసాకరమైన పనులగురించి చెప్తాను విను. మానవుడికి శమము, దమము ముఖ్యము. అవి లేని వారికి హింసాప్రవృత్తి కలుతుంది. అహింస వలన శమము, దమము ప్రాప్తిస్తాయి. ప్రజారక్షణ కొరకు యుద్ధము చెయ్యడములో క్షత్రియుడికి హింస చేయక తప్పదు. అందుకు పరిహారం చెప్తాను. యుద్ధరంగములో శత్రువు కింద పడినా, పారిపోతున్నా, రధము గుర్రము లాంటి వాహనము నుండి కింద పడినప్పుడు అతడిని చంపకూడదు. కాని మానవుడు ఎన్ని పుణ్యకార్యాలు చేసినా అవి అహింసతో సాటిరావు. న్యాయమార్గంలో అహింసాయుతంగా చేసిన యుద్ధములో మరణించిన వాడికి మోక్షము లభిస్తుంది. యుద్ధంలో వీరుడు తన కంటే బలవంతుడిని కాని సమానబలవంతుడిని కాని సంహరించిన అతడికి పుణ్య లోకాలు ప్రాప్తిస్తాయి. శరీరము త్రిగుణాలు, పంచేంద్రియాలు, పంచభూతములతో చేయబడినదని తెలిసిన ఎవరైనా అధర్మకార్యాలు చేయగలరా ! పుట్టిన వాడికి చావుతప్పదని తెలుసుకుని అశాశ్వతమైన ఈ శరీరం అనుభవించే సుఖములు అశాశ్వతమైనవని తెలిసిన వాడు అధర్మానికి ఒడిగట్టడు. సజ్జనుడు ధర్మాత్ముడు అయిన వాడు ఉత్తరాయణంలో జరిగే యుద్ధం మొదలైన కారణాల వలన మరణిస్తాడు. దుర్జనుడు ఆత్మహత్య, విషప్రయోగము, ఉరి వేసుకోవడం, నీళ్ళలో మునగడం వలన మరణిస్తాడు. మానవులకు తన అజ్ఞానమే తనకు బద్ధ విరోధి. మానవుడు తన అజ్ఞానం వలన అకృత్యాలకు అధర్మాలకు పాల్పడి నశించి పోతాడు. మానవ జన్మ ఉత్తమమైనది ఏకులంలో జన్మించినా సరే ! మానవజన్మలోనే సద్గతి పొందే అవకాశం ఉంది. ఫలాపేక్ష లేక చేసిన పుణ్యకార్యాలు, అతిథిపూజలు, పుణ్యయాత్రా స్నానము శాశ్వత సుఖాన్ని ఇస్తుంది " అని **పరాశరుడు** జనకుడికి చెప్పాడు.

## పరమగతి

జనకుడు పరాశరుడిని " పరమగతి అంటే ఏమిటి ? ఏ పని చేస్తే మేలు కలుగుతుంది ?ఏ పని చేస్తే నాశనం ఉండదు ? " అని అడిగాడు. జనకమహారాజా విషయవాంఛలకు లోను కాక ఉండడమే మేలైనది. మంచిజ్ఞానం సంపాదించడమే పరమగతి. అన్ని కర్మలలోకి తపస్సు నాశనంలేనిది. తెలివి కలిగినవాడు విషయవాంఛలలో మునిగి తేలుతున్నా తామరాకు వలె నీటిబొట్టులా ఉంటూ ప్రాపంచిక విషయాలను వదిలి తటస్థంగా ఉంటాడు. జ్ఞానము లభించినందుకు అది పర్యవసానం. అజ్ఞానులకు చిత్తము విషయవాంఛల వైపు లక్క కర్రకు అతుక్కున్నట్లు గాఢతరంగా ఆకర్షితమై వాటిలో సదా మునిగి తేలుతుంది. సూర్యకాంతశిల సూర్యకిరణాలకు ఆకర్షితమైనట్లు మంచి విషయాలకు మంచిమనసు స్పందిస్తుంది. సదా భగవంతుడిని ధ్యానించే మనసు భగద్చింతనతో మునిగి పోయినట్లు. అరటి చెట్టు బెరడులా ఈ ప్రపంచం నిస్సారమైనదని ఎరిగిన జ్ఞాని చివరకు ముక్తి పొందగలడు. పుట్టినదాది ప్రాపంచిక విషయాలలో కొట్టుమిట్టాడే మానవుడు ఆత్మను ఉద్ధరించ లేడు. గుడ్డివాడు అలవాటు పడిన పరిసరాలలో అనాయాసంగా తిరిగిన విధంగా ఈ సంసారంలో తిరుగుతూ ఉంటాడు కాని బయటపడడానికి ప్రయత్నించడు. తామరతూడును నీటితో కడిగి బురదను వదిలించినట్లు జ్ఞానమనే పవిత్ర జలముతో కడిగిన బుద్ధి దేదీప్యంగా ప్రకాశిస్తుంది. ఎలుకను పట్టి తినడానికి పిల్లి ఉన్నట్లు మృత్యువు తనను కబళించడానికి పొంచి ఉన్న విషయం ఎరగని మానవుడు కడుపు నింపుకోవడానికి కోరికలు తీర్చుకోవడానికి జీవిత కాలాన్ని వెచ్చిస్తాడు. బరువు

ఎక్కువైన పడవ సముద్రాన్ని ఎలా దాటలేదో కోరికలు ఎక్కువైన జీవి సంసార సాగరాన్ని దాటి ఆవలి ఒడ్డుకు చేర లేడు. కనుక కోరికలు, అత్యాశ ప్రతిబంధకాలని గ్రహించాలి. మానవుడు భార్యా, బిడ్డలు, అన్నదమ్ముల కొరకు నిరంతరం శ్రమించినా ఆఖరి దశలో వారు ఆదుకుంటారన్న నమ్మకం లేదు. మరణాంతరం ఆదుకునేది అతడి పుణ్యమూ, జ్ఞానమే అని గ్రహించి జ్ఞానసముపార్జన చేసిన అది అతడిని ఆదుకుంటుంది. మబ్బు పట్టిన సమయాన సూర్యకాంతి కనపడ పోయినా అది సూర్యుడిని ఎన్నటికీ వెన్నంటి ఉన్నట్లు సమదృష్టి కలిగిన ధర్మాత్ముడిని జ్ఞానము ఎన్నడు వదలదు " ఇలా పలు విధముల పరాశరుడు చేసిన బోధలకు జనకుడు పరవశించాడు " భీష్ముడు ధర్మజుడికి చెప్పాడు.

## దమము సత్యము క్షమ హంసగీత


సాధ్యులకు హంస రూపములోని బ్రహ్మ ఉపదేశము

ధర్మరాజు సందేహం తీరని మనసుతో " పితామహా ! మీరు చెప్పినట్లు దమమము, సత్యము, క్షమ అంతటి ఉత్తమమైన గుణాలా ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నీవు హంసగీత వింటే నీ సందేహములు తీరగలవు. ధర్మరాజా ! ఒక సారి బ్రహ్మదేవుడు హంసరూపంతో ఒక కొలనులో క్రీడించసాగాడు. అప్పుడు కొంత మంది సాధ్యులు ఆ హంసను చూసారు. " హంసరాజమా ! మేము సాధ్యులము అనే దేవతలము. నీకు అన్ని విద్యలు తెలుసు కనుక మా సందేహములు సమాధానం చెప్పండి. అన్నిటింటి కంటే ఉత్తమమైనది ఏది ? చిత్తము ఎప్పుడూ దేని అందు లీనమై ఉంటుంది. పురుషుడు ఈ కర్మ బంధము వలన ఎలా విముక్తుడు కాగలడు " అని అడిగారు. హంసరూపం లోని బ్రహ్మ ఉన్న బ్రహ్మ " క్షమ, సత్యము, ఇంద్రియ నిగ్రహము, సత్యము పలకడము, అత్యంత మహిమ కలిగినవి. సమస్త ధర్మములలో అవి కీర్తించ తగినవి. అవి నీతికరమైనవి, ఇతరులను బాధపెట్టేవి, నిష్ఠూరమైన మాటలు, ధర్మకార్యముకు పనికి రానివి సత్యములు కావు కనిక నిజమే అయినా సజ్జనుడు అలాంటి వాటిని పలకడు. సజ్జనుడు ఇతరుల నిందలకు, అవమానములకు చలించక శాంతం వహిస్తాడు. అతడి కీడుచేసిన వాడికి మేలుచేస్తాడు, కొట్టిన వాడిని కూడా క్షమిస్తాడు. వాదసారము సత్యము, సత్యసారము ఇంద్రియనిగ్రహము, ఇంద్రియనిగ్రసారము మోక్షము. కనుక సత్యవ్రతుడికి మోక్షము తథ్యము. పంచ జ్ఞానేంద్రియము, పంచ కర్మేంద్రియములను అదుపులో పెట్టుకున్న వాడు సర్వ ధర్మములను ఆచరించినట్లే . ఇంద్రియనిగ్రహంతో పాపం నశించి ఆత్మ నిర్మలమై మోక్షప్రాం ప్రాప్తిస్తుంది. మనసును అదుపులోఉంచిన వాడికి మోక్షము కరతలామలకం అని పెద్దలు చెప్తారు. పరులను నిందించినప్పుడు అతడి పాపములు తనకు అంటుకుంటాయి. కనుక ఇతరులను నిందించతగదు. కోపము అన్ని విధాలా అనర్ధం. కోపిష్టి చేసిన తపసు, జపము, దేవతార్చన, వ్రతములు, దానములు, యజ్ఞము, పితృకార్యములు మొదలైన పుణ్యకార్యములు నిష్ఫలములు. మౌనం కంటే మంచి పలుకు మేలు. ఈతరులకు ప్రీతి కలిగించే సత్యము పలికే వాడిని దేవతలు కూడా మెచ్చుకుంటాడు " అని హంస రూపములో ఉన్న బ్రహ్మ సాధ్యులకు చెప్పాడు. సాధ్యులు " హంసరాజమా ! ఈ లోకము దేని వలన కప్పబడి ఉన్నది ? జీవుడు ఎందుకు ప్రాకాశ హీనుడౌతాడు ? మిత్రులు విడి పోవడానికి కారణం ఏమిటి ? మోక్షం లభించడానికి కారణం ఏమిటి ? అని అడిగారు. హంస రూపంలో ఉన్న బ్రహ్మ " సాధ్యులారా ! ఈ లోకమంతా అజ్ఞానము చేత కప్పబడి ఉంది. మాత్సర్యముకు లోనైన జీవుడు ప్రకాశించ లేడు. లోభి మిత్రులను కోల్పోతాడు. సదా విషయవాంఛలలో తేలే వాడికి మోక్షం లభించదు " అని హంసరూపంలోని బ్రహ్మ చెప్పాడు. సాధ్యులు " తమలోతాము లీనం అయ్యే వాడు ఎవరు ? అందరికీ ప్రీతి కలిగించే వాడు ఎవడు ? బలవంతుడు ఎవడు ? కలహ మార్గము నుండి తొలిగి పోగలిగిన వాడు ఎవడు ? " అని అడిగారు. హంసరూపం లోని బ్రహ్మ " ప్రాజ్ఞుడు తనలో తానే లీనమై బలవంతుడై కలహస్వభావమును వదిలి వేస్తాడు " అని చెప్పాడు. సాధ్యులు " హంసరాజమా ! విప్రుడు దైవత్వం ఎప్పుడు పొందగలడు ? ఎందు వలన సాధుత్వం పొందుతాడు ? ఎందు వలన దుర్జనుడౌతాడు ? ఎందు వలన మనిషిగా చరిస్తాడు ? వివరించ గలరా ! " అని అడిగారు. హంసరూపం లోని బ్రహ్మ " విప్రుడు వేదాధ్యనంతో దైవసమానుడౌతాడు. పుణ్యకార్యాచరణతో సాధుత్వం లభిస్తుంది. దుర్మార్గము వలన దుర్మార్గుడు ఔతాడు. శుచిశుభ్రత విడిచి విషయవాంఛలలో మునిగి పోయిన వాడు మానవుడౌతాడు " అని చెప్పి బ్రహ్మ తన నిజరూపం ధరించి వారిని దీవించి బ్రహ్మలోకం వెళ్ళాడు " అని చెప్పిన భీష్ముడు " ధర్మనందనా ! ఈ హంస గీత వలన నీ సందేహం తీరిందా ! " అని అడిగాడు.

## సాంఖ్యము యోగము

ధర్మరాజు " పితామహా ! యోగశాస్త్రము, సాంఖ్యయోగము గురించి వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! సాంఖ్యులు తాము అను సరించేదే ఉత్తమమైనది అని చెప్తారు. కాని నాకు రెండూ సమానమైనవే అని చెప్తారు. యోగులు ప్రత్యక్ష సాక్ష్యాన్ని నిజము అని నమ్ముతారు. సాంఖ్యులు వేదములు, శాస్త్రములు ప్రమాణమని చెప్తారు. కానీ ఆచరణలో రెండూ ఒకటే, ఇద్దరి లక్ష్యము ఒక్కటే శాస్త్ర రూపంలో రెండింటికీ బేధం ఉన్నా ఫలితం ఒక్కటే. సర్వభూతముల అందు ప్రేమగా ఉండడం, నియమ నిష్టలు పాటించడం, శుచి శుభ్రత పాటించడం రెండింటిలో ఉంటాయి కదా ! " అని భీష్ముడు చెప్పాడు. ధర్మరాజు " పితామహా ! భూతదయ, శౌచము, నియమ పాలన సాంఖ్యులకు యోగులకు ఒకటే అయినా శాస్త్రములు మాత్రం రెండుగా ఎందుకు ఉన్నాయి ? " అని అడిగాడు ధర్మరాజు. భీష్ముడు " ధర్మనందనా ! యోగులు తమ యోగ బలముతో కామము, కాంక్ష, మోహము, రాగము తొలగించుకుని ఉన్నత స్థితిని పొందుతాడు. కనుక యోగికి యోగబలం ముఖ్యము. బలహీనుడైన వాడు ప్రవాహ వేగానికి కొట్టుకు పోయినట్లు యోగబలం లేని వాడు విషయవాంఛల ప్రవాహంలో కొట్టుకు పోతాడు. మదించిన ఏనుగు ప్రవాహాన్ని అడ్డగించినట్లు యోగి యోగబలంతో విషయవాంఛల ప్రవాహాన్ని మళ్ళించి చిత్తమును ముక్తిమార్గం వైపు మళ్ళించగలడు. మృత్యువు కూడా అటువంటి యోగి వద్దకు రావడానికి భయపడతాడు. యోగి తన ఇచ్ఛకు వచ్చినట్లు ప్రవర్తించినా సంసారంలో చిక్కుకొనడు. యోగి యోగములో నైపుణ్యం సాధించి మోక్షం అనే లక్ష్యాన్ని చేదించి మోక్ష సౌధంపైన నిలువగలడు. రధికునకు సారధి వలె, యోగమార్గంలో నిశ్చలుడైన యోగి ఆత్మను సరి అయిన మార్గంలో నడిపించగలడు. మనిషి శిరస్సు, నాభి, హృదయము, పొట్ట, చెవులు, పక్కలు వీటి వలన ఆత్మను దర్శించ వచ్చు " అని భీష్ముడు చెప్పాడు.

## యోగి ఆహారము

ధర్మరాజు " పితామహా ! యోగి తినవలసిన ఆహారం ఏమిటి ? తినకూడని ఆహారం ఏమిటి ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! యోగి నూనెతో చేసిన పదార్ధములను తినకూడదు. ఆకలి తీరే విధంగా మితాహారం, జలము తీసుకోవాలి. రుచికరమైనవైనా పొట్ట నిండా భుజించ కూడదు. కామము, క్రోధము, నిద్రను, ఆశను, భయమును వదిలి పెట్టాలి. నిర్జనప్రదేశంలో కూర్చుని శ్వాశనిశ్వాశను అదుపులో పెట్టుకుని తనలోతాను ఆనందం అనుభవిస్తూ మోక్షమును పొందాలి . ఇది **అసిధారావ్రతం** కత్తి మీద సాము వంటిది ఆచరణకు అంత సులభమైనది కాదు. కాని చిత్తశుద్ధి కలిగిన యోగికి అసాధ్యమైనది లేదు. యోగసిద్ధుడు అన్నిటికీ అనాసక్తుడు. యోగి పుట్టినప్పుడు సంయోగము మరణించునప్పుడు దీనత్వం ఉండవు. భోగం వలన సుఖం భోగహీనత వలన దు:ఖం కలుగదు. ధర్మనందనా ! నీకు యోగవిధానం చెప్పాను " అని చెప్పాడు.

## సాంఖ్యయోగము

ధర్మరాజు " పితామహా ! నాకు సాంఖ్య శాస్తం గురించి వివరిస్తాను " అని చెప్పాడు. భీష్ముడు " ధర్మనందనా ! పూర్వం కపిలుడు చెప్పిన సాంఖ్య శాస్త్రం గురించి నీకు వివరిస్తాను. మానవుడు ముందు జ్ఞానం సంపాదించాలి. తరువాత ప్రపంచ విషయాలను జాగ్రత్తగా గ్రహించాలి. ఇది ఒక్కోదానికి ఒక్కో విధంగా ఉంటుంది. పశువులు, పక్షులు, మానవులు, దేవతలు, గంధర్వులు, పితరులు, సిద్ధులు, గరుడులు, కిన్నెరలు భిన్నంగా ప్రవర్తిస్తారు. వీరి గురించి తెలుసుకోవడం అవసరమా ! అని నీవు అనుకోవద్దు. అన్నీ విషయములు తెలిసి ఉంటే వాటి నుండి తప్పించుకోవడం తేలిక. ధర్మనందనా ! చెవికి శబ్దం, కంటికి రూపం, చర్మానికి స్పర్శ, నాలుకకు రుచి, ముక్కుకు వాసన, కడుపులో జఠరాగ్ని, ఆకాశంలో వాయువు, అగ్నిలో జలం, జలములో భూమి, ఇంద్రుడిలో చేతులు, వామనుడి అందు కాళ్ళు, ధనంలో లోభం, తమోగుణంలో బుద్ధి, రజోగుణంలో తమోగుణం, సత్వగుణంలో తమోగుణం ఉన్నాయి. సత్వగుణం ఆత్మలో అను సంధానమై ఉంటుంది. ఆత్మ నారాయణుడు, పరమేశ్వర రూపంలో లీనమై ఉంటుంది. ఆ పరమాత్మ మోక్షాసక్తుడు. ఆ మోక్షానికి దేనితో సంబంధం లేదు. సత్వ, రజో, తమోగుణ ప్రధానమైన ప్రకృతిలో 16 వికారాలు ఉన్నాయి. మనలో ఉన్న ఆత్మకు ఆధారం ఈ ప్రకృతియే. ఆత్మ స్వయం ప్రకాశితమైన ఒక తేజోమయరూపం. రెండు రూపములుగా ప్రకాశించే ఈ ఆత్మ ఒక రూపంతో పంచేంద్రియాల ద్వారా ఈ లోకంలోని విషయాలను అనుభవిస్తుంటుంది. ఇంకొక రూపం తటస్తంగా ఉండి సాక్షీ భూతంగా చూస్తూ ఉంటుంది. మనలో ఉన్న వాయువు ఒకటే అయినా అది అయిదు విధాలుగా పని చేస్తుంది. మానవుడు ఈ వాయువులను నిశితంగా పరిశీలించిన ఆత్మ దర్శనం లభిస్తుంది. అటువంటి మానవుడు తాను మాతృ గర్భంలో ఉన్నప్పుడు, జననకాలంలో పడే వ్యధ, బాల్యంలో ఉండే మూర్ఖత్వము, యవ్వనంలోని రాగద్వేషాలు, విషయాసక్తి, వార్ధక్యము లోని దీనావస్థ తెలుసుకుని వాటి నుండి విముక్తిపొందడానికి ప్రయత్నిస్తాడు. ఈ మానవుడు పుణ్యకార్యములు చేసి స్వర్గముకు వెళ్ళి అక్కడ పుణ్యము పాపము లేని తటస్థజీవితము గడిపి పుణ్యము కరిగిపోయిన పిదప తిరిగి మానవుడిగా జన్మించి విషయాలలో చిక్కుకుంటాడు. పాపకార్యములు చేసిన మానవుడు పశుపక్ష్యాది జన్మలు ఎత్తుతాడు. జ్ఞాని ఈ రెండింట చిక్కక మోక్షంపొందుతాడు. అజ్ఞాని తనకు కలిగే వృద్ధాప్యమూ, మరణము గురించి ఎరుగక ఎదుటి వాడికి వచ్చే వృద్ధాప్యము, చావు

గురించి చింతింస్తున్నాడు. మిగిలిన వారు తాము చిరకాలం జీవిస్తామని విర్రవీగుతుంటాడు. ధర్మనందనా ! ఈ దేహములో కామము, క్రోధము, భయము, నిద్ర, నిట్టూర్పు, అనే అయిదు దోషములు ఉన్నాయి. క్షమవలన కోపము, సంకల్పం లేనందున కామము, ప్రమాదము లేనందు వలన భయము, సజ్జన సాంగత్యం వలన నిద్ర, మితభోజనం వలన నిట్టూర్పులు నివారించ వచ్చు. ఇవీ సాంఖ్యయోగులు ఆచరించే విధానము. సాంఖ్యయోగి ప్రాపంచిక విషయములు పక్కకు పెట్టి సాంఖ్యము అనే ఓడను ఎక్కి జ్ఞానము అనే చుక్కానితో సంసార జీవితమును అవలీలగా దాటగలడు. ఈ సంసారం అనే ఓడలో దుఃఖం అనే నీరు ఉంటుంది. అందులో వ్యాధులు, రోగములు అనే మొసళ్ళు, భయాలు అనే పాములు సంచరిస్తుంటాయి. ప్రవాహమే హింస, విషయాసక్తి బురద, ఆశలు సుడిగుండాలు. ఆ సముద్రంలో అట్టడుగున సుఖసంతోషాలు అనే రత్నాలు ఉన్నాయి. ఆ సముద్రముకు తీరం సత్యం, ఈ సంసార సాగరమును దాటిన వాడిని సూర్యుడు తన లోకముకు తీసుకు పోతాడు. తరువాత జీవుడు సూక్ష్మరూపంలో తామరతూడులో ఉన్న సన్నని ద్వారము గుండా ప్రయాణిస్తాడు. ఆ జీవుని ప్రవాహుడు ఆకాశంలోకి చేరుస్తాడు. తరువాత అతడు పరమాత్మలో ఐక్యం ఔతాడు " అని భీష్ముడు చెప్పాడు.

## ముక్తి పొందిన జీవుడు

ధర్మరాజు " పితామహా ! పరమాత్మలో చేరిన జీవుడు తన పూర్వ వృత్తాంతము గురించి తలచుకుంటాడా లేక మరచిపోతాడా ! మోక్షము చెందిన తరువాత జీవుడి పరుస్థితి ఏమిటి ? తన పూర్వస్థితికన్నా భిన్నంగా ఉంటాడా ? మోక్షం పొందిన జీవుడు పూర్వచింత ఉంటుందా ! వివరించండి ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! **కపిలమహర్షి** ఈ విషయం గురించి వివరంగా చెప్పాడు. మానవుడు స్పర్శ చేత కాని వినడం చేత కాని ఆత్మను తెలుసుకోలేడు. మనసు ద్వారానే ఇంద్రియములను తెలుసుకోగలడు. జ్ఞానస్వరూపుడైన మానవుడు మనసు ద్వారా ఇంద్రియములను తెలుకున్నా లేకున్నా ఒకటే. ముక్తి పొందిన మానవుడికి ఇంద్రియములు జడపదార్ధముతో సమానము. వాటిపని అవి మనసుతో పని లేకుండా చేసుకు పోతుంది. సాధకుడు ఈశరీరములో ఉండగానే మోక్షంపొందిన తరువాత ఇంద్రియములను అవి చేసే పనులను నిర్వికారంగా చూస్తుంటాడు. సాధకుడు తన లోని పంచభూతములను, బుద్ధిని, మనసుని అణిచిపెట్టి, పరమాత్మను చేరుకుంటాడు. అలా పరమాత్మను చేరుకున్న వాడికి ఇక జన్మ ఉండదు. జన్మరాహిత్యం పొందడమే మోక్షం. ఇంతకు మించిన దశ వేరేలేదు. దీనిని మానవుడు గురువు వద్ద ఉపదేశం పొంది నియమానుసారం సాధించాలి. ధర్మరాజా ! దీనిని సాంఖ్య పద్ధతి అంటారు. పరమపదాన్ని చేరడానికి ఇంతకంటే ఉత్తమమార్గం వేరేలేదు. ఈ పద్ధతిని బ్రహ్మదేవుడు కూడా గౌరవిస్తాడు. నీవు కూడా ఇలా నిర్మల మనస్కుడవై మోక్షం పొందు. ధర్మనందనా యోగులు జ్ఞానుల మధ్యతేడా చాలా స్వల్పం. యోగి చూసిన విధంగానే సాంఖ్యుడు చూస్తాడు వారిద్దరి దృష్టికూడా ఒకటే. కనుక మునులు, యోగులు, సాంఖ్యులు ఒకే మార్గంలో పయనిస్తాడు. వారి పేర్లలో బేధమే కాని అవి ఒక దానిలో ఒకటి సంచరిస్తాయి. తత్వవేత్తలు కూడా దీనిలో అబేధం చూడరు. మానవుడు యోగ మార్గం లేక సాంఖ్యమార్గమున సంచరిస్తూ మోక్షప్రాప్తికి ప్రయత్నించే సమయంలో దారి తప్పి మోక్షముకు చేర లేకపోయినా అతడికి స్వర్గ ప్రాప్తి తదథ్యం. స్వర్గ సుఖాలు అనుభవించిన తరువాత తిరిగి జ్ఞానుల ఇంట మానవుడుగా జన్మను ఎత్తి సాధన కొనసాగించి మోక్షం పొందుతాడు. కనుక ధర్మజా ! నీవు కూడా ఈ మార్గమే అవలంబించు " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు " అని **వైశంపాయనుడు** జనమేజయునకు భారత కధను చెప్పాడు.

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

# శాంతి పర్వము షష్టమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# షష్టాశ్వాసం ప్రధమ భాగం

యోగసాంఖ్య యోగులు అక్షరమైన పరబ్రహ్మమును పొందారు అని భీష్ముడు చెప్పగా ధర్మరాజు " తాతగారూ ! ఉత్తరాయణము ప్రవేశించుటకు కొద్ది రోజుల వ్యవధిమాత్రమే ఉన్నది. కాని నేను మీ నుండి తెలుసుకోవలసిన విషయములు అనంతములు. దయచేసి నాకు అన్ని విషయములు వివరించండి ? " అని అడిగాడు.

## అక్షరము

భీష్ముడు బదులుగా " ధర్మనందనా ! నీకు వశిష్టుడికి జనకుడికి జరిగిన సంభాషణ వివరిస్తాను. ఒక సారి జనకుని వద్దకు వచ్చిన వశిష్టమహామునికి నమస్కరించి అతిథిసత్కారం చేసి " మునివరా ! ఆద్యంతం లేనిది, పునరావృత్తి రహితమైనది, నాశనం లేనిది, శుభప్రదమైనది అయిన తత్వం గురించి వివరించండి " అని అడిగాడు. వశిష్టుడు " నేత్రములు, కళ్ళు , ముఖం, చేతులు, కాళ్ళు ఉండి కూడా ఆద్యంతం వృద్ధి క్షయం లేనిదానిని అక్షయం అంటరు. అక్షరం నుండి 24 క్షరతత్వములు ఉద్భవించాయి. అక్షరతత్వం విక్రియగా వైరుధ్యం పొందడమే ప్రకృతి అవ్యక్తం అంటారు. వాటి నుండి మహతత్వం దాను నుండి అహంకారం దాని నుండి పంచభూతములు వాటి అయిదు గుణాలైన శబ్ధ, స్పర్శ, రూప, రస, గంధాదులు పది ఇంద్రియములు మనసు పుట్టాయి. ఇలా 24 క్షరతత్వాలు గోచరాలు ఔతాయి. 25 వ తత్వమైనక్షర తత్వమే పరతత్వము. ఈ అక్షరతత్వము సత్వగుణముతో చేర్చి తనకు అర్హమైన ధర్మములు ఆచరించి దివ్యత్వము పొంది స్వర్గసుఖాలు అనుభవిస్తుంది. రజోగుణముతో కలిసి మానవునిగా పాప పుణ్యకార్యాలు చేస్తూ కష్టసుఖాలను సమానంగా అనుభవిస్తుంది. తమోగుణముతో కలిసి కేవలం పాపకార్యములాచరించి పశుపక్ష్యాది జన్మలెత్తి దుఃఖమును నరకమును అనుభవిస్తుంటుంది. అక్షరతత్వము వర్ణరహితమైనది అయినా సత్వగుణంతో చేరి శ్వేత వర్ణం, రజోగుణంతో చేరి ఎరుపు వర్ణం, తమోగుణంతో చేరి నలుపు వర్ణంగా భ్రమింప చేస్తుంది. అక్షరతత్వం గుణరహితమైనా అహంకారంతో చేరి అనేక విధములైన వికారము పొందుతూ ఉంటుంది. అక్షరతత్వం అమలినమైనది అయినా త్రిగుణాత్మకమై యజ్ఞములు, యాగములు, ఉపవాసము, భూశైనము, నియమ నిష్టలు, సన్యాసం, ముని వేషధారణ చేసి నారచీరలు ధరించి జడలుకట్టించి దండధారణ మొదలైనవి చేసి శరీరమును బాధపెడుతూ ఉంటుంది. అక్షరతత్వానికి చావు పుట్టుకలు లేవు. అది అమలినము అమృతము అయినది. కాని తనను తాను మరచి ఈ అవలక్షణములను తనకు ఆపాదించుకుని భ్రమలా ఉంటుంది. తనను తానుతెలుసుకున్న నాడు మబ్బువిడిచిన చంద్రుడిలా ప్రకాశిస్తుంది " అని వశిష్టుడు చెప్పాడు.


కరాళజనకునికి వశిష్ట మహర్షి ఉపదేశం

## జంతుసృష్టి

స్త్రీకి కాని పురుషుడికి కాని విడిగా సంతానోత్పత్తి చేసే శక్తి లేదని స్త్రీ పురుషుల కలయిక వలనే పునరుత్పతి సాధ్యమని వేదములు ఘోషిస్తున్నాయి. ఆ జీవికి స్త్రీ నుండి రక్తము, చర్మము, మాంసము లభిస్తాయి. పురుషుడి నుండి మజ్జ, ఎముకలు, నరాలు లభిస్తాయి. మొత్తం ప్రాణికోటికి ఇలాగే జరుగుతుంది. ప్రకృతి పురుషుడు ఒకరిని ఒకరు ఆకర్షించడం వలనే ఈ సమస్త సృష్టి జరుగుతుంది కదా ! స్త్రీ పురుష సంబంధాలు వారిప్రవర్తన వలన తెలుస్తుంది కాని మోక్షమార్గం ఎలా ఉంటుందో తెలియడం లేదుకదా ! అవ్యక్తము, అనుపమానమూ, అతీంద్రియము, అనంతము, అనామము, అమలము అయిన తేజస్సు ఒకటి ప్రకాశిస్తుందని వేదాలు చెప్తున్నాయి కదా ! ఆ తత్వాన్ని గురించి వివరించండి " అని జనకుడు వశిష్టుడిని కోరాడు. వశిష్టుడు "మహారాజా ! సకల శాస్త్రములను అధ్యయనం చేసిన నువ్వువాటిని సరిగా అర్ధం చేసుకోలేక పోయావు. అర్ధం చేసుకోలేని విద్య వ్యర్ధంకదా ! కనుక నేను చెప్పేది శ్రద్ధగా విను " సాంఖ్యము యోగము ఒక దానిని ఒకటి అనుసరించి ఉంటాయి కాని రెండూ ఒకటే. సాంఖ్యముకు మూలము వేదము. ఈ సృష్టిలోని సకల ప్రాణులకు మూడు లింగాలు ఉన్నాయి. కాని ఆత్మకు లింగబేధము లేదని వేదాలు ఘోషిస్తున్నాయి. విత్తనము నుండి విత్తనము, మనిషి నుండి మనిషి, ఇంద్రియముల నుండి ఇంద్రియములు, మనసు నుండి మనసు పుడుతుంది. కాని ఆత్మబీజము నుండి కాని , మనిషి నుండి కాని, ఇంద్రియముల వలన కాని మనసు వలనకాని జన్మించదు. ఆత్మ నిర్గుణము, నిరాకారము,

నిర్వికల్పము. కనుక ఆత్మకు సుఖదు:ఖము భవబంధాలు లేవు. ప్రకృతికి లింగబేధము లేకున్నా దాని నుండి ఉద్భవించిన ప్రాణులకు లింగబేధము ఉంది. ఋతువులకు రూపము లేకున్నా వాటి స్వభావాల అనుసరించి వాటికి నామాలు ఉన్నాయి. కనుక ప్రకృతిలో గుణములు ఉన్నా ఆత్మకు గుణములు అంటవు. ఇదే అక్షరముకు క్షరముకు కల బేధము. వీటిని ఏకము అనేకము, తత్వము నిస్తత్వము, దర్శనము అదర్శనము అని కూడా పిలుస్తారు. అక్షరపరబ్రహ్మము మూఢులకు అవివేకులకు కనబడదు. వివేకము కలిగిన సాంఖ్యులు, యోగులు తమ బుద్ధితో వివేచనతో ఈ 25వ తత్వమైన అక్షరపరబ్రహ్మాన్ని తెలుసుకొనగలరు " అని చెప్పాడు.

## ఆత్మ ఏకత్వము అనేకత్వము

జనకుడు " మహర్షీ ! ఆత్మకు ఏకత్వము అనేకత్వము ఉన్నాయి కదా ! అలాగే విద్య అవిద్య ఉన్నాయి కదా ! నా బుద్ధిమాంధ్యము వలన నేను తెలుసుకొనజాలక ఉన్నాను కనుక క్షరము, అక్షరము, సాంఖ్యము, యోగము గురించి వివరించండి " అని అడిగాడు. వశిష్టుడు " జనకమహారాజా ! యోగమనగా ధ్యానము. అది రెండు విధములు. మొదటిది ప్రాణాయామము, రెండవది మానసిక ఏకాగ్రత. మొదటిది సగుణోపాసన రెండవది నిర్గుణోపాసన. ప్రాణాయామము మూత్రవిసర్జన సమయంలో భోజనము చేసిన తరువాత చెయ్యకూడాదు. యోగి మితాహారము తీసుకోవాలి. ఇంద్రియములను నిగ్రహించాలి. శబ్ధ, రస, రూప, గంధాదుల వంక మనసు మరల్చకూడదు. బుద్ధి మనసునందు నిలిపి మనసును ఆత్మ అందు నిలపాలి. కోరికలు విసర్జించి శిలాసదృశ్యముగా ఉండాలి. అలాంటి యోగి పగటికి రాత్రికి బేధము లేక నిరంతర ధ్యానములో మునిగి ఉంటాడు. గాలిలేని చోట వెలిగేదీపంలా నిశచలమనస్కుడై ఆనందం అనుభవిస్తాడు. దీనినే యోగము అంటారు. ప్రకృతివాదులైన సాంఖ్యులు ఈ ప్రకృతిని అవ్యక్తము అంటారు. ప్రకృతికి జన్మనిచ్చే ధర్మము ఉంది కనుక తానుగా బుద్ధి, అహంకారము, పంచభూతములు, విషయవాంఛలు, ఇంద్రియములుగా లోకమంతా విస్తరించి ఉంటుంది. దీనికి పురుషుడు అధిష్టానుడు. ఈ సృష్టి అనులోమానుపాతంగా జరుగుతూ ఉంటుంది. సంహారసమయంలో విలోమానుపాతంగా జరుగుతుంది. జననమరణ సమాయాలలో ప్రకృతి ప్రకోపిస్తుంది. ప్రకృతి, క్షేత్రము, అవ్యక్తము మూడూ ఒకటే. దానిని సత్వము అనికూడా అంటారు. జీవుడికి క్షేత్రము గురించి తెలుసు కనుక అతడిని క్షేత్రజ్ఞుడు అంటారు. జీవుడు ఈ అవ్యక్త పురములో ఉండడం వలన అతడిని పురుషుడు అంటారు. క్షేత్రము క్షేత్రజ్ఞుడు అన్నది తెలుసుకోవడమే జ్ఞానం. పురుషుడికి ఈ జ్ఞానము తెలుసు. ప్రకృతి సగుణాత్మకము పురుషుడు నిర్గుణుడు. 24 వికారములకు సాక్షిగా పురుషుడు నిలిచి ఉంటూ కైవల్యాం పొందుతాడు అదే పునరావృత్తి రహితమార్గము. ఈ సత్యము తెలిసిన వాడికి మరణం అంటే భయం ఉండదు.

## విద్య అవిద్య

జనక మహారాజా ! నీకు సాంఖ్యమును యోగమును, అక్షరము గురించి వివరించాను. ఇంక విద్య అవిద్య గురించి వివరిస్తాను. విద్య అంటే 25 వ తత్వమైన అక్షర పరబ్రహ్మము. కర్మేంద్రియములకు జ్ఞేనేంద్రియములు, జ్ఞానేంద్రియాలకు మనసు, మనసుకు పంచభూతములు, పంచభూతములకు అహంకారం, అహంకాముకు బుద్ధి, బుద్ధికి అవ్యక్తము, అవ్యక్తముకు 25వ తత్వమైన అక్షర పరబ్రహ్మము వరుసగా విద్యగా పరిగణించబడతాయి. జనకమహారాజా ! నీకు క్షరముఅక్షరము గురించి ఇంతకు ముందు వివరించాను. కొందరు ప్రకృతిని క్షరమని, జీవుడిని అక్షరమని అనుకుంటారు. మరి కొంత మంది ప్రకృతి, జీవుడు కూడా క్షరమని అంటారు. మరి కొంతమంది జీవుడు, ప్రకృతి కూడా అక్షరని అంటారు. రెండింటికీ ఆది అంతము లేక పోవడము, ఈశ్వరతత్వం కలిగి ఉండటం వలన సారూప్యము ఏర్పడింది. జీవుడు, ప్రకృత్తి సహజములైన మహత్తు, అహంకారములతో చేరి, ప్రకృతి తానుగా తలుస్తాడు. అప్పుడు జీవుడు క్షరమౌతాడు. అదే జీవుడు ప్రకృతి వికారములకు లోబడక స్వతంత్రుడైతే అక్షరుడౌతాడు. జీవుడికి జ్ఞానప్రకాశం కలుగగానే ఈ విధంగా అనుకుంటాడు " ఇంత కాలము ప్రకృతి అనుకుంటున్నాను. ఈ ప్రకృతి తన వికృతులతో నన్ను భ్రమింప చేసింది. కాని నీరు నీటిలోని చేప వేరు అన్నట్లు ప్రకృతి వేరు, జీవుడు వేరు. నేను నిష్కళంకుడను, నాకు రూపము లేదు, నాకు ఈ ప్రకృతితో సంబంధం లేదు కనుక నేను దానికి దూరంగా ఉంటాను. అసలు ఈ తప్పు ప్రకృతిది కాదు నాదే, సంగమం అంటే ఏమిటో తెలియని వాడిని ప్రకృతితో ఎందుకు కలిసాను. నాకు ఇన్ని రూపములు సంభవించడానికి కారణం ఈ ప్రకృతే కారణం కదా ! ఈ ప్రకృతితో కలిసిన కారణంగా మమతా మమకారాలు చెలరేగి జన్మ వెంట జన్మ వస్తున్నాయి. ఇప్పుడు నేను ఈ ప్రకృతిని వదిలి నిర్మలంగా ఉన్నాను. అహంకారం మమత కారణంగా ప్రకృతి ఇన్ని రూపాలు ధరించడానికి కారణం అయింది. నేను ఈ రెండింటిని వదిలితే ప్రకృతి నన్ను ఏమీ చెయ్య లేదు. సోమరితనం, చెడు అలవాట్లయందు ఆసక్తి ప్రకృతి లక్షణములు. అందుకే ఈ ప్రకృతిని వదిలి నిశ్చలానందాన్ని పొందాలి " ఇలా ఆలోచుస్తూ జీవుడు అక్షరత్వమును పొందుతాడు. ధర్మనందనా ! పూర్వము ఈ విద్యను బ్రహ్మ వశిష్టుడికి చెప్పాడు, వశిష్టుడు నారదునికి చెప్పాడు, నారదుడు నాకు చెప్పాడు, నేను నీకు చెప్పాను. దీని వలన నీకు శాశ్వతానందం కలుగుతుంది.

## వసుమంతుడు

భీష్ముడు ధర్మరాజుకు ఇంకా ఇలా చెప్పసాగాడు. ఒకరోజు **వసుమంతుడు** అనే రాజు వేటకై అడవికి వెళ్ళి అక్కడ భృగువంశ సంజాతుడైన ఒక మునిని చూసి " మునిపుంగవా ! ఈ లోకములో కాని పరలోకములో కాని ఆచరించతగిన ధర్మము ఏదో చెప్పండి " అని అడిగాడు. అందుకు ఆముని " మహారాజా ! మనం ప్రతి రోజు చేసే మంచి పనులు చెడ్డ పనుల వలన మనకు సుఖముదు:ఖము కలుగుతున్నాయి. అత్యాశతోను పనులు చెయ్యాలనుకోవడం తప్పు. తియ్యటి తేనె కొరకు కొండమీదకు ఎగబాకుతున్నామని అనుకుంటారు కాని అక్కడ నుండి జారితే విరగబడతాము తెలుసుకోరు. ధర్మాన్ని జ్ఞానాన్ని నిర్మలమైన మనస్సుతో అభ్యసించాలి. ఎల్లప్పుడూ సత్సంగంతో గడపాలి. అలా చేసిన మానవునికి ఇహలోక సుఖమే కాక పరలోకసుఖము ప్రాప్తిస్తుంది. బ్రాహ్మణులకు హితమైన పనులు చెయ్యాలి. అర్హులకు దానమివ్వాలి. ఇచ్చిన తరువాత దానికి బాధపడకూడదు. క్రోధమును కామమును వదలాలి. మనసు దృఢంగా ఉంచుకోవాలి. మనసికంగా బలహీనుడైనందు వలన పూర్వము **మహాభిషుడు** బ్రహ్మలోకం నుండి భూమికి జారాడు. **యయాతిమహారాజు** మనో ధైర్యము ఉండటం చేత ఆపదల నుండి బయటపడ్డాడు " అని చెప్పిన ముని మాటలకు వసుమంతుడు కామక్రోధములను వదిలి మనోధైర్యము పొంది ధర్మ మార్గాన నడిచాడు.

## యాజ్ఞవల్క్యుడు

ధర్మరాజు " పితామహా ధర్మము అధర్మము అను బేధము లేనిది, చావు పుట్టుకలు లేనిది, సకల సందేహములను నివృత్తి చేయకలిగినది, శుచియై, నిత్యమై, అవ్యక్తమై, ధు:ఖ రహితమై, ఆనందమయమై, పరతత్వమై ఉంటుందో దానిని నాకు వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నీకు జనకుడు యాజ్ఞవక్యుల మధ్య జరిగిన సంభాషణ గురించి వివరిస్తాను. సకలలోకములలోకెల్లా విజ్ఞానఖని అయిన యాజ్ఞవల్క్యుడితో జనకుడు " మునీంద్రా ! ఇంద్రియములు, అవ్యక్తము అయిన ప్రకృతి, బ్రహ్మము, పరతత్వము, పంచభూతములు ఎలా పుట్టాయి. ఎలా లయమౌతాయి. ఆకాలమును గురించి వివరించండి " అని అడిగాడు. అందుకు **యాజ్ఞవల్క్యుడు** " మహారాజా ! సృష్టిని, లయమును ప్రకృతి కల్పిస్తుంది. ఒక రోజులో పగలు పది కల్పములు, రాత్రి ఒక కల్పము ఉంటాయి. పగలు సృష్టి జరుగుతుంది, రాత్రి లయము జరుగుతుంది. ఈ లోకము లోని జీవరాశులకు జీవనాధారముగా ఓషధులు సృష్టించబడ్డాయి. సృష్టికార్యము కొరకు బ్రహ్మ సృష్టించబడ్డాడు. ఆ బ్రహ్మ పంచభూతములు సృష్టించాడు. వాటికి శబ్ద, స్పర్శ, రస, రూప, గంధములు అను గుణములను సృష్టించాడు. వీటిని గ్రహించడానికి పంచ జ్ఞానేంద్రియములను పంచ కర్మేంద్రియములను సృష్టించాడు. ఈ ఇంద్రియములకు మనసు అధినేత. జ్ఞానేంద్రియములైన కన్ను, ముక్కు, చెవి మనసు చేతనే విషయము గ్రహిస్తాయి కాని స్వయముగా ఏమీ చేయలేవు. మిగిలిన అన్ని అవయమలు మనసుచేత నియంత్రించబడతాయి. ఈ విషయము జ్ఞానులు అజ్ఞాలు సమానంగా గ్రహించగలరు. ఇంద్రియములు విశ్రమించినా మనసు విశ్రమించదు. కనుక ఇంద్రియములను ప్రాపంచిక విషయముల నుండి నిగ్రహించి మనసును అదుపులో ఉంచాలి. అది అభ్యాసము మీద అలవడుతుంది.

## ప్రళయము

ఇక ప్రళయము గురించి వివరిస్తాను. రాత్రి కాగానే అవ్యక్తమైన ప్రకృతి అహంకార పూరితుడైన పురుషుని ప్రభోదిస్తుంది. ఆ పురుషుడు 12 రూపములు ధరించి సర్వభూతములను లయం చేస్తాడు. ఆ తరువాత భూమి అంతా జలమయమౌతుంది. ఆ జలమును కాలాగ్ని ఆవిరి చేస్తుంది. కాలాగ్నిని వాయువు తుదముట్టిస్తుంది. వాయువు ఆకాశంలో లయమౌతుంది. ఆ కాశం మనసులో లయమౌతుంది. ఆ మనసును అహంకార పూరితుడైన పురుషుడు కబళిస్తాడు. ఆ అహంకారం అవ్యక్తమైన ప్రకృతిలో లీనమౌతుంది. ఇలా రాత్రి జరుగుతుంది. తరువాత పగలు రాగానే తిరిగి పున:సృష్టి జరుతుంది.

### ఆధ్యాత్మము ఆదిభౌతికము ఆది దైవతము

ఇక ఆది భూతము, ఆది దైవతము, ఆధ్యాత్మము గురించి చెప్తున్నాను. మన శరీరంలోని పాదము, ఆపానము, జననేంద్రియము, చేతులు, నాలుక ఆధ్యాత్మము. అవి వరుసగా నడచుట, విసర్జించుట, సృష్టించుట, కార్యనిర్వహణ అనునవి అది భూతములు. వీటికి వరుసగా విష్ణువు, సూర్యుడు, ప్రజాపతి, ఇంద్రుడు అది దేవతలు. అలాగే కళ్ళు, నాలుక, ముక్కు, చర్మము, చెవి ఆధ్యాత్మములు. వాటి గుణములైన దృష్టి, రుచి, వాసనా, స్పర్శ, శబ్దములు అధిభూతములు. వాటికి వరుసగా సూర్యుడు, వరుణుడు, భూమి, వాయువు, ఆకాశము అదిదేవతలు. మనసు ఆధ్యాత్మము, మనసు విషయాలను గ్రహించడం స్పందించడం అనేవి అది భూతములు. మనసుకు అదిదేవత చంద్రుడు. ఇది వేదప్రమాణము. బుద్ది ఆధ్యాత్మము

విషయ పరిజ్ఞానము, శాస్త్రపరిజ్ఞానము దానికి అధిభూతములు. బుద్ధికి క్షేత్రజ్ఞుడు అదిదైవతము. అహంకారము ఆధ్యాత్మము. బుద్ధికి అభిమానము, స్వాతిశయము అధి భూతము. దానికి అదిదేవత **బ్రహ్మము**.

## ప్రకృతి పురుషుడు

ఇంక ప్రకృతి పురుషుడు గురించి వివరిస్తాను. ప్రకృతి తన ఇష్టం వచ్చిన విధంగా త్రిగుణాల ఆధారంగా అనేక రకములైన వికృతులను ఒక ఆటగా పెంపొందిస్తూ ఉంటుంది. ఒక దీపము అనేక దీపములు వెలిగిస్తున్నట్లు ఈ ప్రకృతి అనేక రూపములను ఆవిష్కరిస్తుంది. సంతోషము, ఆనందము, ఆరోగ్యము, కోపరహితమైన స్వభావం, మంచి నడవడి, పరిశుభ్రత, ప్రకాశవంతంగా ఉండటం, మనసు స్థిరంగా ఉండటం, అహింస, నీతి నియమము, సిగ్గు, శ్రద్ధ, సత్యము, శుచి, ఆచారము, కరుణ, లోభరహిత నడవడి, కామవాంఛలు, ఇతరుల మీద చాడీలు చెప్పని గుణం సత్వ గుణాలు. తగవులాడుట, అహంకారము, గర్వము, కామవాంఛలు, కోపము, నిర్ధయ, మాత్సర్యము, భోగలాలసత, దు:ఖము ఇవి రజోగుణ లక్షణాలు. సదా ఏడుపు, అధికమైన మోహంతో ఉండటము, ఎప్పుడూ తింటూ ఉండటం, అనవసరమైన వాదనకు దిగడం, మూర్ఖత్వం, ఒకరితో ఒకరికి కలహాలు పెట్టడం ఇవి తమోగుణ లక్షణాలు. జీవాత్మ ఈ గుణములకు అతీతుడు కాని జీవుడు అనేక రూపములతో కళంకితుడౌతున్నాడు. జీవుడు చైతన్య మూర్తి ప్రకృతి చైతన్య రహితమైనది. జీవుడి ప్రకాశంతో ఎప్పుడూ వెలుగుతున్నా జీవుడు ప్రకృతికి వశవర్తియై ఉంటాడు. జీవాత్మ తన నిజ స్థితిని తాను తెలుసుకోలేదు. జీవాత్మ ప్రకృతికి లోనై త్రిగుణాత్మకమైన కర్మలను ఆచరిస్తూ ఉంటుంది. సత్వగుణ ప్రధాన కర్మలను ఆచరించి స్వర్గ లోక ప్రాప్తి పొందుతూ ఉంటుంది. రజోగుణ ప్రధాన కర్మలను ఆచరించి మానవజన్మ ఎత్తుతుంది. తమోగుణ ప్రధానకర్మలను ఆచరించి రౌరవాది నరకములను పొందుతుంది. తనను తాను తెలుసుకున్న జీవుడు ఈ త్రిగుణములలో చిక్కు కొనక అంతర్ముఖుడై అక్షర రూపమైన ప్రబ్రహ్మ పదమును పొందుతాడు అని యాజ్ఞవల్క్యుడు చెప్పాడు.

## జీవుడు జీవాత్మ

జనకుడు " మునివర్యా ! పురుషుడు చైతన్యవంతుడని ప్రకృతి జడమని చెప్పారు కదా దానిని వివరించండి " అని అడిగాడు. **యాజ్ఞవల్క్యుడు** " జనకమహారాజా ! సగుణము అగుణము కాదు. అగుణము సగుణము కాదు. త్రిగుణాత్మకము అవ్యక్త్యమైన ఈ ప్రకృతి చైతన్యవంతమైన **జీవాత్మ** స్థితి ఎలా పొందుతుంది. జీవాత్మ సహజ స్థితి తెలుసుకునే జ్ఞానం ప్రకృతకి లేదు. కాని పురుషుడికి ప్రకృతి దాని స్వభావము తెలుసు. కనుక ఈ ప్రకృతి అచేతనము. పురుషుడు చేతనత్వం కలవాడు. సదా ప్రకృతిలో విహరిస్తున్న పురుషుడికి దాని వికారములు అంటవు. ఇది ప్రకృతి పురుషుల సంబంధము. సదా నీటిలో ఉండే తామర రేకులకు నీరు అంటదు. అలాగే పురుషుడు ప్రకృతిలో లీనమై ఉన్నప్పటికీ **ప్రకృతి** వికారములు అంటవు.

## యోగము ప్రాణాయామము

జనకమహారాజా ! నీకిక యోగము గురించి చెప్తాను. సాంఖ్యము కలుగు జ్ఞానము యోగముతో కలిగే బలమూ రెండూ సాటి లేనివి. కొంత మంది సాంఖ్యము యోగము వేరు వేరు అంటారు కాని నాను మాత్రం రెండూ ఒకటే అని భావిస్తాను. '**మనోధారణ** ప్రాణాయామము అనునవి రెండు ప్రధాన యోగములు. మొదటిది నిర్గుణము రెండవది సగుణము. మనో ధారణ అంటే మనసును ఏకాగ్రతగా ఉంచడం. **ప్రాణాయామము** అనగా శ్వాసను క్రమపద్ధతిలో వదిలి పీల్చడం. ఇది మానవుడికి అసౌకర్యం కలిగించదు. క్రమపద్ధతిలో ప్రాణాయామం చేస్తూ ఇంద్రియములను అదుపులో ఉంచుకున్న వాడు యోగసిద్ధి పొందగలడు. ప్రాణాయామం చేసే సాధకుడు నియమ నిష్టలు పాటించాలి. ప్రాణాయామముకు రోజూ కొంత సమయము పాటించాలి. శరీరముకు అసౌకర్యం కలుగని రీతిలో ప్రాణాయామం అభ్యసించాలి. ఇలా ప్రాణాయామం పగలు రాత్రి అభ్యసించాలి. దీని వలన లోపలి వెలుపలి శరీరం శుద్ధి పొందుతుంది. యోగసిద్ధికి ప్రాణాయామము దానివలన కలిగే అంత: బాహ్య శుద్ధి మూలము. ఇది సగుణతంత్రం. మనోధారణ నిర్గుణతంత్రము. ఇంద్రియములను మనసులో, మనసును అహంకారంలో, అహంకారమును బుద్ధిలో, బుద్ధిని ప్రకృతిలో లీనం చేయడమే ధ్యానం. నిరంతరం ధ్యానంలో నిమగ్నమైన వాడికి ముసలితనము లేదు. యోగికి మలినములు అంటవు, నిరంతర ఆనందము పొందుతూ పరమాత్మ దర్శనం పొందుతాడు. యోగి గాలిలో పెట్టిన దీపంలా నిశ్చలంగా ఉంటాడు. నిర్మలాకాశంలా ఉంటాడు, అటుపోటులకు చలించని సముద్రంలా ఉంటాడు. అతడి చుట్టూ భయంకర శబ్ధాది మనసుని కలవర పెట్టే విషయములను పట్టించు కొనడు. దీనినే యోగ మార్గం అంటారు. కాని ఈ మార్గంలో నడవడానికి ఎలాంటి అలసత్వం పనికి రాదు. ఎల్లప్పుడూ జాగరూకుడై ఉండాలి. ఈ యోగికి ఎవరికి అందని మోక్షం లభిస్తుంది.

## మరణం లోకాలు

మరణ సమయంలో ఈ యోగికి పాదముల నుండి ప్రాణములు పోయినట్లైన **విష్ణుపదము**, పిక్కల నుండి పోయిన వసువులు ఉండే లోకమును, జానువుల(మోకాళ్ళ) నుండి పోయిన సాధ్యులు ఉండే లోకము లభిస్తుంది, విసర్జకావయవము నుండి పోయిన **సూర్యలోకము** లభిస్తుంది, తొడల నుండి పోయిన **ప్రజాపతిలోకము** లభిస్తుంది, జననేంద్రియముల నుండి పోతే భూలోకప్రాప్తి లభిస్తుంది, పార్శ్వముల నుండి పోతే మరుత్తుల లోకము ప్రాప్తిస్తుంది, బొడ్డులోనుండి పోతే **చంద్రలోకము** లభిస్తుంది, చేతుల నుండి పోతే స్వర్గలోక ప్రాప్తి లభిస్తుంది, వక్షస్థలం నుండి పోతే **కైలాసప్రాప్తి** లభిస్తుంది, ముఖములో నుండి పోతే విశ్వదేవతలు ఉండే లోకం లభిస్తుంది. చెవుల నుండి పోతే దిక్పాలకులు ఉండే లోకం లభిస్తుంది. ముక్కుల నుండి పోతే వాయుదేవుడు ఉండే లోకం లభిస్తుంది. కళ్ళ నుండి పోతే అగ్ని దేవుడు ఉండే లోకం లభిస్తుంది. కనుబొమల నుండి పోతే అశ్వినీ దేవతలుండే లోకం ప్రాప్తిస్తుంది. నుదురు నుండి పోతే పితృ దేవతలు ఉండే లోకం లభిస్తుంది. తలపైభాగం(బ్రహ్మరంధ్రం ) నుండి పోతే శాశ్వతానందం ఇచ్చే మోక్షం లభిస్తుంది.

## మరణ సమయము

మరణసమయం ఆసన్నమైనప్పుడు ఆకాశంలో అరుంధతీనక్షత్రం కనిపించదు. ముక్కు చెక్కినట్లు కనపడినా, చంద్రుడు మలినంగా కనపడినా అతడి ఆయుస్షు ఒక సంవత్సరమని తెలుసుకోవాలి. ముఖవర్చస్సు పెరిగినా తరిగినా, తెలివితేటలు పెరిగినా తరిగినా అతడి ఆయువు ఆరునెలలే అని తెలుసుకోవాలి, పూర్ణచంద్రుడిలో, సూర్యబింబంలో వెలితి కనపడితే అతడి ఆయుర్దాయం ఏడురోజులే అని తెలుసుకోవాలి. దేవాలయముకు వెళ్ళినప్పుడు దేవుడికి సమర్పించిన పుష్పములు, సుగంధద్రవ్యములు దుర్గంధం వెదజల్లితే అతడి ఆయుస్షు ఆరునెలలు మాత్రమే చెవులు ముక్కు వాలిపోయినా దంతములు రంగుమారినా కళ్ళలో కాంతి సన్నగిల్లినా, శరీరం నల్లబడ్డా అతడికి తక్షణమే మృత్యువు అని తెలుసుకోవాలి. మానవుడు అంత్య కాలంలో చేరినప్పుడు ఏ కారణం లేకుండానే కళ్ళలో నుండి నీరు కారుతూ ఉంటుంది. తలమీద నుండి పొగలు సెగలు వచ్చినా అతడికి చివరి దశ ఆసన్నమైనదని తెలుసుకోవాలి. యోగి అయిన వాడు ఈ సూచనలు గమనించి నిరంతర ధ్యానసమాధిలో ఉండి జీవుడిని ప్రమాత్మలో కలపడానికి ప్రయత్నిస్తాడు. అటువంటి యోగి ప్రాణములు విడువగానే పరమాత్మలో లీనమై శాశ్వతానందం పొందుతాడు.

## పరతత్వము

జనకమహారాజా ! **పరతత్వము** గురించి వివరిస్తాను. ఈ ప్రశ్న సూక్ష్మమైఅది కనుక వివరిస్తాను. నేను సూర్యుడిని గురించి తపస్సు చేసాను. సూర్యుడు నాకు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మని చెప్పాడు. **యజుర్వేదము** అధ్యయనము చేసే శక్తిని ప్రసాదించమని నేను కోరాను. యజుర్వేదాధ్యయన శక్తి ప్రసాదించే సమయాన నన్ను నోరు తెరవమని చెప్పాడు నేను నోరుతెరవగానే వాగ్దేవి నానోట్లో ప్రవేశించింది. నా శరీరం తాపంతో దహించుకు పోయింది. సూర్యుడు నన్ను చూసి కొంచెం సమయము ఓర్చుకుంటే చల్లబడుతుంది అన్నాడు. తరువాత సూర్యుడు " ఓ విప్రుడా ! నీకు వేదవిద్య లభిస్తుంది. నీకు సాంఖ్యము యోగము లభిస్తుంది. నీ మనసు ఉల్లాసంగా ఉంటుంది " అని పలికి సూర్యుడు వెళ్ళాడు. నేను నా స్వగృహముకు వెళ్ళి సరస్వతీదేవిని ఉపాసించాను. నాకు సరస్వతీదేవి ప్రత్యక్షం అయింది. ఆ దేవిని చూడగానే నాకు యజుర్వేదము స్ఫురణకు వచ్చింది. నేను యజుర్వేదమును అధ్యయనం చేసి శిష్యులకు నేర్పుతూండగా కొంత కాలం గడిచింది.

## విశ్వావసుడు

ఇంతలో విశ్వావసుడు అనే గంధర్వుడు ఒక రోజు నావద్దకు వచ్చాడు. నేను అతడికి అతిథి సత్కారాలు చేసిన తరువాత అతడు నన్ను " విశ్వము అనగా ఏమి ? అ విశ్వము అనగా ఏమి ? మిత్రావరుణులు ఎవరు ? జ్ఞానము జ్ఞేయము అనగాేమి ? తపస్సు అనగా ఏమి ? తపస్సు కానిది ఏమి ? సూర్యుడు అతి సూర్యుడు ఎవరు ? విద్య అనగా ఏమి ? అవిద్య అనగా ఏమి ? తెలుసుకో తగినది ఏది ? తెలుసుకో కూడనిది ఏమి ? కదిలేవి ఏవి ? కదలనివి ఏవి ? వేదములు ఆమోదించినవి ఏవి ? నాకు వివరించాండి " అని అడిగాడు. నేను " భూత వర్తమాన కూడిన అవ్యక్తమైన ప్రకృతియే విశ్వము అంటారు. గుణరహితుడైన పురుషుడు అవిశ్వము. మిత్రావరుణులే పురుషుడు, ప్రకృతి. జ్ఞానము, జ్ఞేయము, తపస్సు, తపస్సు కానిది, సూర్యుడు, అతి సూర్యుడు, ఇవన్ని ప్రకృతి పురుషులు. విద్య, అవిద్య, తెలుసుకో తగినది, తెలుసుకో లేనిది, కదిలేది, కదలనిది వరుసగా ప్రకృతి పుషులను తలపిస్తాయి. అజములు, అవ్రణములు, అక్షయములు,

అతీంద్రియములు ప్రకృతి పుషులు అంటారు. ఈ రెండు తత్వములు కలిసిన రోజు ప్రకృతి పురుషుని వలె గోచరిస్తుంది. వేదార్ధమును తెలుసుకో లేని వాడు వేదము చదివినా ప్రయోజనం లేదు కేవలం కంఠశోష మిగులుతుంది. వేదముల అర్ధము, సారము తెలుసుకున్న పండితుడు క్షరము అక్షరమైన పరతత్వము గురించి తెలుసుకోకలడు. అప్పుడు క్షరమును వదిలి పెట్టి **అక్షరయోగము** కొరకు ప్రయత్నిస్తాడు. 25వ తత్వమైన **అక్షరతత్వము** తెలుసుకున్నవాడు **పరతత్వము** గురించి తెలుసుకుంటాడు. ప్రకృతి పురుషులను వేరు వేరుగా చూడవచ్చు. 25వ తత్వము అయిన అక్షర తత్వము 26వ తత్వమైన పరతత్వము ఒకటే. 26వ తత్వమే పరమేశ్వరుడు అతడే పురుషోత్తముడు. అది నిరంజనుడు, నిత్యము, జ్ఞానము, ఆనంద స్వరూపము " అని యాజ్ఞవల్క్యుడు పలికాడు.

## పురుషుడు ప్రకృతి

విశ్వావసుడు " 25వ తత్వము గురించి దానికన్న మిన్న అయిన పరతత్వము గురించి **నారద, జైగీష, దేవల, కపిల, సుమంత, పైల** మొదలైన మహా మునుల గోష్టిలో విన్నాను. కాని అర్ధము చేసుకోలేక పోయాను కనుక మిమ్ము ఆశ్రయించాను. దయచేసి వివరించాండి " అని అడిగాడు. యాజ్ఞవల్క్యుడు " విశ్వావసా ! సమయంలో నీ మనసులో చేరిన మలినంవలన నీకు అర్ధము కాలేదు. కనుక మనసు నిశ్చలం చేసి విను. అవ్యక్తమైన మైన ప్రకృతి పురుషుడు వేరు అని తెలుసు కదా ! పురుషుడు ప్రకృతితో చేరి అనేక రూపములు పొందుతూ జనన మరణ చక్రంలో ఇరుక్కు పోతూ ఉంటాడు. పురుషుడిని **జీవుడు** అంటారు. ప్రకృతి పురుషుడిని చూడలేక పోయినా పురుషుడు ప్రకృతిని చూస్తూ అందులో లీనమై ఇక పరమాత్మ వైపు చూడ లేడు. కాని పరమాత్మ ఈ పురుషుడిని ప్రకృతిని సాక్షీ భూతంగా చూస్తూ ఉంటాడు. పురుషుడు పరమాత్మను దర్శించే ఉపాయము చెప్తాను. పురుషుడు ప్రకృతితో స్నేహం చేస్తూ ప్రకృతే తాను అనుకుని క్రమంగా ప్రకృతిలో లీనమౌతాడు. అందువలన అహంకారం పెరుగుతుంది. ప్రకృతిలోని వస్తువుల మీద మమకారం పెరిగి వాటిని పొందాలన్న కోరిక పెరుగుతుంది. పురుషుడు ప్రకృతిని చూస్తున్నంత కాలం పరమాత్మను దర్శించ లేక జీవుడిగా మిగిలి పోతాడు. ఎప్పుడైతే పురుషుడు తానే ప్రకృతి ప్రకృతే తాను అన్న భావన విడిచి నీటిలో ఉన్న తామరలా తాను వేరు నీరు వేరు అనుకుంటాడో అప్పుడు ప్రకృతిలో సంచరిస్తున్న పురుషుడు తాను వేరు ప్రకృతి వేరు అని తెలుసుకుని పరమాత్మను దర్శిస్తాడు. పురుషుడికి జనము, వృద్ధాప్యము, మరణము తప్పవని తెలుకుని యోగి సాంఖ్యమును, యోగమును ఆశ్రయించి మమకారాన్ని వదిలి పునర్జన్మ లేని పరతత్వాన్ని పొందుతాడు. ప్రకృతి వేరు తాను వేరని పురుషుడు భేదం గ్రహించినప్పడే పరమాత్మను చేరగలడు. పురుషుడు వేరు పుషోత్తముడు వేరని సామాన్యులు అనుకుంటారు కాని విజ్ఞులకు అభ్యాసం వలన ఇద్దరూ ఒకరే అని గ్రహించగలుగుతారు. అజ్ఞాని మాత్రం పురుషుడు వేరు పురుషోత్తముడు వేరని అనుకుంటారు. మమకారమును పోగొట్టుకున్నప్పడు పురుషోత్తముడిని గురించి తెలుసుకోగలుగుతారు " అని చెప్పాడు. యాజ్ఞవల్క్యుని బోధలకు సంతృప్తి చెందిన విశ్వావసుడు వెళ్ళి పోయాడు.

## యాజ్ఞవల్క్యుడు

యాజ్ఞవల్క్యుడు జనకుడితో ఇంకా ఇలా చెప్పడు. " జనక మహారాజా ! నేను చెప్పిన విధముగా ఆచరించిన మానవులు, దేవతలు పురుషోత్తముని గురించి తెలుసుకోగలరు. జనన మరణములను జయించడమే ముక్తి అంటారు. జజన మరణాలను జ్ఞాన సముపార్జన వలన మాత్రమే జయించగలరు. కనుక జ్ఞాన సముపార్జన ముఖ్యము. జ్ఞానము గురుముఖత: లభ్యమౌతుంది. గురువుకు కులము అనేది ముఖ్యము లేదు. జ్ఞానమును ఉపదేశించిన వాడే గురువు. గురువు వద్ద అత్యంత శ్రద్ధాసక్తులు శిష్యునకు లేకున్న జ్ఞానము లభించదు కనుక శిష్యుడికి శ్రద్ధాసక్తి ముఖ్యము. అజ్ఞానంతో జనన మరణ చక్రంలో ఇరుక్కున్న జీవుడు జ్ఞానంతో మాత్రమే ఆ చక్రము నుండి విడివడగలడు. జనకమహారాజా ! నీవు ఇక నేను చెప్పినవి శ్రద్ధగా ఆచరించిన మోక్షమును పొందగలవు " అని చెప్పాడు. ఆ మాటలకు జనకుడు అమితానందం పొందాడు. ధర్మనందనా ! జనకుడికి యాజ్ఞవల్క్యుడు చెప్పిన మాటలు వింటివి కదా నీవు కూడా వాటిని శ్రద్ధగా ఆచరించి ముక్తిని పొందు " అని భీష్ముడు పలికాడు.

## గృహస్థధర్మము మోక్షము

ధర్మరాజు " పితామహా ! గృహస్థధర్మాలను విడువకుండా మోక్షసాధన సాధ్యమేనా ? వివరించండి. " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నీకు జనకుడికి సులభకు మధ్య జరిన సంభాషణ వివరిస్తే ఈ విషయము అవగతము ఔతుంది. జనకుడు యోగధర్మం లో చిక్కు పోయినప్పడు ఆయన రాజ్యంలోని **సులభ** అనే స్త్రీ ఆయన జ్ఞాన పరిజ్ఞానం పరీక్షించాలని అందమైన భిక్షుకి వేషంలో ఆయన సభకు వచ్చింది. జనకమహారాజు ఆమెకు కడుపార భోజనం పెట్టించాడు. సులభ ఆయనను

పరీక్షించాలని తన అందచందాలతో ఆకర్షించాలని ప్రయత్నించింది. జనకుడు నవ్వుకుని " అమ్మా ! నీవు ఎవరు ? ఎక్కడ నుడి వచ్చావు ? ఇక్కడకు వెళుతున్నావు ? నీ భర్త ఎవరు ? నీవు ఏమి చేస్తుంటావు ? అని అడిగాడు " అందుకు సులభ మౌనం వహించింది. జనకుడు " సరే నేను చెప్పేది విను. అమ్మా నేను **పంచశిఖుడు** అనే మహర్షి శిష్యుడను. ఆయనద్వారా నేను సాంఖ్యము, యోగము, రాజ్యపాలన అనే మూడు దీక్షలు అభ్యసించాను. పైన చెప్పిన మూడు మోక్షమార్గములు కనుక పరతత్వాన్ని పొందటానికి ప్రయత్నిస్తున్నాను. మోక్షముకు వైరాగ్యము మూలము. వైరాగ్యమును దృఢమైన జ్ఞానముతో లభిస్తుంది. నేను వైరాగ్యమును అందువలన జ్ఞానమును పొందాను. రాజ్యపాలన చేస్తూ రాజ్య సుఖముల మధ్య ఉండి కూడా నిస్సంగుడనై తిరుగుతున్నాను. ఎవరైనా నా కుడి భుజానికి చందనము రాస్తూ ఎడమ భుజము నరికినా నేను కోపించను నాకు మట్టి బంగారము రెండూ సమమే. మోక్షగాములు జ్ఞానము, కర్మ రెండింటిని గురించి అత్యంత నిష్టతో ఆచరించాలని చెప్తారు. నాకు మాత్రం మా గురువుగారి శాసనమే అత్యంత నిష్ట. కొందరు గృహస్థధర్మము సన్యాసానికి అడ్డు అని అనుకుని సన్యాసం స్వీకరించినా మనసు గృహస్థజీవితాన్ని మరువ లేదు. మనసులో కోరికలు పెట్టుకుని సన్యాసం స్వీకరించినా ఫలితం లేదు. కేవలము దండము కమండలము ధరించి తల గొరిగించుకుని కాషాయము కట్టినంత మాత్రాన మోక్షము రాదు. ఆత్మజ్ఞానము పొందాలి. గృహస్థాశ్రమంలో ఉండి కూడా ఆత్మజ్ఞానము పొంద వచ్చు. అలాంటి వారికి చివరకు మోక్షము లభిస్తుంది.

## సన్యాసము

సన్యాసం స్వీకరిస్తే గృహస్థాశ్రమంలో ఉన్న దు:ఖములు తొలగి పోతాయని చాలా మంది సన్యాసం స్వీకరిస్తారు. కాషాయం ధరిస్తారు. రాజుగా నాకు పట్టే ఛత్రం వంటిదే కాషాయము ధరించడము. సుఖాన్నిచ్చినా దు:ఖాన్ని ఇచ్చినా నాకు రాజలాంఛనాలు తప్పవు. సన్యాసులకు కాషాయం మోక్షం ఇచ్చినట్లు నాకు ఛత్రమూ మోక్షం ఇస్తుంది. కనుక మోక్షము జ్ఞానము వలన వస్తుంది కాని కాషాయ వస్త్రధారణా కమండలము ఇవ్వదు. నేను రాజునైనా ఈ ప్రాపంచిక సుఖములను త్యజించి మోక్షమార్గాన్ని అవలింబించాను. కనుక నాకీ రాజలాంఛనాలు అడ్డురావు కాని నీవు ఎవరు ? ఎందుకు నన్ను పరీక్షించ వచ్చావు. దాని వలన నీకు కలిగే ప్రయోజనము ఏమిటి ? ఓ మగువా ! నీవు బ్రాహ్మణ స్త్రీవి, యోగినివి, పరుల భార్యవు ప్రస్తుతము నీవు భర్త వద్ద లేనట్లుంది. నేను క్షత్రియుడను రాజును గృహస్థాశ్రంలో ఉన్న వాడిని. నిష్టగా ఆచార వ్యవహారములు పాటించు వాడిని. నీవు నా మీద మరులు కొనడం అపకీర్తి హేతువు ఇందుకు బాధ్యురాలవు నీవే. ఇందుకు ఫలితము నీదే. నన్ను కోరి నీవిలా సుందర రూపంలో వచ్చావు. యోగశక్తిని ఉపయోగించి అధర్మంగా కోరిక తీర్చుకోవడానికి మలినమైన బుద్ధితో నీ స్వస్వరూపము దాచి నా వద్దకు వచ్చావు. ఇది యోగినులు అవలంబించే పద్ధతి కాదు. నీ కుటిల ప్రయత్నము మాను. ఇంతటి చిన్న వయసులో నీకీ యోగవిద్య ఎలా అబ్బింది " అని అడిగాడు. అందుకు బదులుగా సులభ " మహారాజా ! చెప్పే వాడికి వినే వాడికి ఇంపైన మాటలే మంచి మాటలు ఔతాయి కాని మిగిలినవన్నీ మూర్ఖపు మాటలే. ఈ ప్రపంచం పంచ భూతాత్మకము. పంచ భూతములు కలిసినట్లే కనిపించినా వేటికి అవి స్వతంత్ర ప్రతిపత్తిని కలిగి ఉంటాయి ఒక దాని మీద ఒకటి ఏదీ ఆధారపడదు. శరీరంలో పంచ భూతములు, పది ఇంద్రియములు మనసు ఇవన్నీ కలిసినట్లు ఉన్నా వేటికి అవే ప్రత్యేకత కలిగి ఉంటాయి. అలాగే మానవులందరూ పైగుణాలు కలిగి కలిసినట్లు కనిపించినా ఎవరికి వారే ప్రత్యేకత కలిగి ఉంటారు. ఈ చైతన్యము జవనాశ్వము వలె పరుగులు తీస్తూ ఉంటుంది కనుక ఎవరు ఎక్కడ ఉంటారో ఎక్కడి నుండి వచ్చారో ఎవరికి తెలుసు. మహారాజా ! నిన్ను నీవు ఎలా దర్శిస్తావో లోకంలోని ప్రజలందరిని అలాగే దర్శించాలి కదా ! అటువంటి నీవు నన్ను చూసి నీవు ఎవరు ? అలా వచ్చావు ? అని అడగవచ్చునా ! క్షత్రియుడవైన నీవు నీ పాలనలో ఉన్న ప్రజలను మంచివారు, మధ్యస్థులు, చెడ్డవారని విభజించి వారిని సామ, దాన, బేధ, దండోపాయాలతో పాలిస్తుంటావు అలాగే శత్రువులను జయిస్తావు.అటువంటి నీవు ముక్తి మార్గంలో పయనించే యోగివి ఎలా ఔతావు ? ముక్తి మార్గం అంటే ఇదేనా ? రాజా ! విషయవాంఛలకు, జయాభిలాషకు లోబడిన నీవు యోగివి కావు" అన్నాడు.

## పరిక్షార్ధం సులభ వాదన పొడిగించడం

సులభ " మహారాజా ! నీకు నువ్వు జ్ఞానివి అనుకుంటున్నావు. అది ఒక మానసికరుగ్మత కనుక నీ బంధువులకు చెప్పి వైద్యం చేయించు. లేకున్న నాకిలా నీతులు చెప్పవు. ఇవన్నీ విన్న తరువాత కూడా నీవు నేను ఎందుకు ముక్తుడను కాను అని అడిగిన నేను చెప్పే సమాధానము విను. రాజువైన నీవు సదా ధర్మార్ధ కామాల గురించి ఆలోచిస్తూ రాజ్య తంత్రముల గురించి ఆలోచిస్తూ ఉంటావు. మేలుకొనమని, స్నానాదులు చెయ్యమని, భోజనం చెయ్యమని సేవకులు చెప్పిన కాని వినవు. నీ చుట్టూ ఉన్న మంత్రులు, సామంతులు, సుందరీ మణులు నీ మెప్పును ఆశిస్తూ నీ పనులను నిన్ను చేసుకోనివ్వరు. నీకు ఏ పని చెయ్యడానికి స్వతంత్రం ఉండదు నీకు నచ్చిన భోజనం కూడా నీ అంతట నిన్ను తిననివ్వరు. నీవు అర్హత అనర్హత తెలుసుకుని దానం చెయ్యాలి. కనుక ధనం ఎలా కూడబెట్టాలో ఆలోచన చేస్తూ ఉండాలి. నీ పక్కనే ఉంటూ గోతులు తవ్వే వారిని సదా ఒక కంట కనిపెట్టే ఉండాలి. కనుక రాజా ! రాజులకు సుఖాలు తక్కువ దు:ఖాలు తక్కువ. అలాంటి రాజులు ముక్తి

మార్గంలో ఎలా ప్రయణించగలరు. కనుక నువ్వు ముక్తి మార్గంలో పయనిస్తున్నానని చెప్పడం అబద్ధం. రాజా ! పంచశిఖ మహర్షి వద్ద ఉపదేశం పొందిన నీవు నేను నీ దగ్గరకు రాగానే అసహ్యించుకున్నావు. ఇదేనా ద్వందమును వదిలి ముక్తి మార్గంలో ప్రవర్తించే యోగులు ఆచరించే విధానం. మోక్షాసక్తుడు ద్వందమును వదలాలి, దేనియందు ఆపేక్ష లేక నిర్వికారంగా, చెలించని మనసుతో ఉండాలి. యతులు జనావాసాలను వదిలి అరణ్యవాసం చేయాలి. నీవు ముక్తుడవని పొరపాటు పడి నిర్వికారుడవని అనుకుని నీ మనస్సు నందు ప్రవేశించాను. నేను నిన్ను నా అవయములతో ముట్టుకోలేదు అయినా నీవు నన్ను చూసి భయపడి దూషించావు. అలా ఎందుకు చేసావు ? రాజా ఈ సభలోని పెద్దలు వింటూ ఉండగా నీవిలా మాట్లాడడం న్యాయమా ! ఎదుటి వారిని ఇలా కించపరచడం ధర్మమా ! అత్యంత గోప్యమైన స్త్రీ పురుష సంబంధాలను గురించి బహిరంగంగా మాట్లాడటం మీ కీర్తికి, గొప్పతనానికి హాని కదా ! ఇది ధూర్తలక్షణం కాదా ! మహరాజువైన నీకు ఇలాంటి నికృష్టులకు కూడా తగని మాటలు తగునా ! తామరాకు మీద నీటి బొట్టులా జీవిస్తున్న నా వంటి యోగిని గురించి తెలుసుకోలేని నువ్వు పంచశిఖమహర్షి శిస్యుడని చెప్పుకోవడం అబద్ధం కాదా ! రాజా ! నీవు గృహస్థ ధర్మానికి, మోక్షమార్గానికి కూడా దూరం అయ్యి రెండింటికి చెడిన రేవడివి అయ్యావు. అన్ని తెలుసును అనుకుని భ్రమలో పడి బ్రతుకుతూ ఉన్నావు. ముక్తులు ముక్తులు కలవడం సాధారణం. ఆకాశంలో ఆకాశం కలిసినట్లు శూన్యంలో శూన్యం కలిసినట్లు ముక్తి మార్గంలో ఉన్న వారిని చూసినప్పుడు ముక్తిమార్గులు కలిసి పోతారు. యోగినిని అయిన నన్ను నీవు చూసినప్పుడు చలించావు కనుక నీవు ముక్తి మార్గమున చరించడం అబద్ధము. మనము ముక్తులము కాదని అనుకున్నా మన కలయిక అధర్మం కాదు. నేను ప్రశస్తమైన చరిత్ర కలిగిన ప్రధన మహారాజు వంశ సంజాతని. నేను క్షత్రియ కాంతను. నా పేరు సులభ. నా పూర్వీకులు శతశృంగ పర్వతముల మీద ఎన్నో యజ్ఞ యాగములు చేసారు. సాక్షాత్తు దేవేంద్రుడే వారి వద్దకు వచ్చి పరమార్ధము గురించి సద్గోష్టి చేసేవాడు. నాకు వివాహం చేసుకోదగ్గ పురుషుడు లభించక మోక్షమార్గంలో పయనిస్తున్నాను. నాను క్షత్రియ వనితను కనుక మన కలయిక అధర్మం కాదు. ఇక దాపరికం ఎందుకు నేను నిన్ను పరీక్షించ వచ్చాను. కాని నీవు ముక్తి మార్గంలో పయనించడం లేదని తెలుసుకున్నాను " అని అనర్గళంగా చెప్పిన సులభ జనకుడి ముఖం చూసి నవ్వుతూ " జనక మహారాజా ! నీవు ముక్తి మార్గంలో పయనిస్తున్నావా లేదా అని పరీక్షించడం అగ్ని వేడిగా ఉంటుందా చల్లగా ఉంటుందా అని పరీక్షించడం వంటిది. నేను కేవలం అజ్ఞానంతో ఇలా ప్రవర్తించానని అనుకో ! జనకమహారాజా ! నీ మాటలలో ఇసుమంతైనా అసత్యం, దోషము లేదు. మునులతో కూడా కీర్తింపతగిన నీకు మోక్షము కరతలామలకం. నేను రాగానే మీరు నన్ను ఎంతో గౌరవించారు. అందుకని మీతో ఇలా మాట్లాడితే ఎలా ఉంటుందో అని హాస్యముకు ఇలామాట్లాడాను. నేను చెప్పినవన్నీ అబద్ధములు నేను నిన్ను పరీక్షించడానికి వచ్చానన్నది మాత్రమే నిజం. సౌజన్య మూర్తులైన మీరంతా నన్ను మన్నించండి " అన్నది సులభ. ఆ మాటలకు జనకుడు మంత్రులు ఇతర సభికులు తేకగా ఊపిరి తీసుకున్నారు. సులభ వాఖ్చాతుర్యానికి అభినందించారు. ఆరోజుకు సులభ అక్కడే ఉండి మరునాటికి తన దోవన తాను పోయింది " అని చెప్పిన భీష్ముడు " ధర్మనందనా ! జనక సులభల సంవాదనతో నీ సందేహం తీరింది కదా ! " అని అడిగాడు.

## శుకుడు వైరాగ్యము

ధర్మరాజు " పితామహా ! వ్యాసపుత్రుడైన శుకునకు వైరాగ్యము ఎలా కలిగింది " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! వ్యాసుడి కుమారుడైన **శుకుడు** మొదట సాధారణంగానే ఉన్నాడు. అందరితో కలిసి పోయి శరీరము శాశ్వతం అనుకుని తనకు వ్యాధులు, మరణం ఉంటాయన్న విషయం మరచి విషయవాంఛలలో మునిగి పోయాడు. అది చూసిన వ్యాసుడు తన కుమారుడికి వైరాగ్యం బోధిస్తూ " కుమారా ! శుకా ! నీవు ఇంద్రియములను, మనసును తప్పుమార్గమున పోనీయక అదుపులో ఉంచుకుని వాటిని సరి అయిన మార్గములో పెట్టు. కోపరాహిత్యం, సత్యం పలకడం, ఇంద్రియములను అదుపులో పెట్టుకోవడం, ధర్మమార్గంలో నడవడం, సత్ప్రవర్తన కలిగి ఉండటం, తపస్సు చేయడం, అహింసామార్గము అవలంబించడం ఇవి ధర్మమార్గమాలు. వీటిని అవలంబిస్తూ ఆకలి దప్పులను అదుపులో పెట్టుకో. నీవు సంపాదించిన బిక్ష ముందు దేవతలకు సమర్పించి తరువాత అతిథులకు పెట్టి తరువాత నీవు భుజించు. పంజరంలో పిట్టలా శరీరంలో ఉన్న జీవుడిని మరిచి నీ ఇచ్చ వచ్చిన రీతిలో చరించడం ధర్మము కాదు. ఒక్కోరోజు గడిచే కొద్దీ కొంత ఆయుస్షు లెక్కన నీ ఆయుష్షు తరుగుతూ ఉంటుంది. చివరకు మృత్యువు నిన్ను కబళిస్తుంది. ఆ విషయం ఎరుగక నిద్రావస్థలో ఉండటం నీకు ధర్మమా ! ఈ శరీరం రక్త మాంసమయం. జగతిన ఉన్న ప్రాణులన్నీ అంతే. శరీరక సుఖములకు అలవడిన మానవుడు పెద్దల మాటను పెడచెవిన పెట్టి లోకము గురించి తలపక తామనుకున్నదే నిజమని భ్రమిస్తుంటారు. శారీరక సుఖమే ప్రధానమని అనుకోవడంలో ముందుగా సుఖం ఉన్నా తరువాత ఆపద కలిగిస్తుంది. కనుక బుద్ధిమంతులు నడిచే తోవను వదిలి దుర్మార్గులు నడచు తోవను నడవడం నీకు ధర్మంకాదు. ధర్మమార్గాన నడిచే సజ్జనుల బాటలో నడుస్తూ వారి ఉపదేశములను విను. సాలెపురుగువలె నీ చుట్టూ బంధనం కలిగించుకోవడం అజ్ఞానుల లక్షణం. సంసారంలో ఇంద్రియములే జలం, కామ, క్రోధ, లోభములే మొసళ్ళు. ఆ సాగరం దాటడానికి జ్ఞానం ఒక్కటే మార్గం. మూఢునిలా కోరికలతో మనసుని తృప్తి పరుస్తూ ఉంటే నీకు తెలవకుండా మృత్యువు నిన్ను కబళిస్తుంది. నీవలా ఉండ వద్దు. బ్రాహ్మణత్వం పొందడం చాలా కష్టం. నీ పూర్వజన్మ సృకృతం వలన నీకీ జన్మ లభించింది. నీవు దానిని వృధా చేస్తున్నావు. నీవు ఇకనైనా దుష్టసాంగత్యం వదిలి తృస్సు, ఇంద్రియ నిగ్రహం,

నిశ్చలత్వం, వివేకము మొదలైన మంచి గుణములను అలవరచుకో. కుమారా ! నీవు బ్రాహ్మణ జన్మ ఎత్తింది శారీరక సుఖము అనుభవించడానికి కాదు. నియమ నిష్టలతో జీవితము గడిపి పరలోక సుఖములు అనుభవించడానికి కదా ! ఇహలోక కామ సుఖములు అనుభవించడం తన మెడకు తాను ఉరి వేసుకోవడమే కదా ! వివేకవంతులు ఆపని ఎన్నటికి చెయ్యరు. ఒక వేళ చేసినా ఆ ఉరిత్రాడు తెంచుకుని జ్ఞానమార్గంలో నడవడం అలవర్చుకోవాలి. మూర్ఖులు మాత్రమే ఈ విషయము గ్రహించ లేక ఉరిత్రాడుకు వ్రేలాడుతూ ఉంటారు. కుమారా ! శరీరంలో ప్రాణం ఉన్నంత వరకే నిన్ను భార్యాబిడ్డలు, మిత్రులు అనుగమిస్తారు. ఆ తరువాత నిన్ను మరచి పోతారు. కనుక వారితో పొద్దుపుచ్చక వైరాగ్యం అలవరుచుకుని నిన్ను నీవు తెలుసుకుని ఆత్మసాక్షాత్కారం చేసుకో. ముసలితనము, మరణము పుట్టినప్పటి నుండి నిన్ను వెన్నంటుతూ ఉంటాయి. కనుక మృత్యువు నీ కొరకు వేచి ఉండక ఎప్పుడైనా కబళించ వచ్చు మంచి పనులు చేయడానికి ముహూర్తం కొరకు ఎదురుచూడ వద్దు. కుమారా ! బార్యా బిడ్డలు నీ వెంట రారు. నిన్ను శ్మశానానికి మోసుకు వెళ్ళి అక్కడ కాల్చి వారిదారిన వారు పోతారు. ఇన్ని రోజుల నుండి వెంట ఉన్న నిన్ను అనుగమించని వారి కొరకు తాపత్రయపడుతూ వల్లమాలిన మమకారం పెంచుకోవడం ఎందుకు ? కాలం ఈ లోకాన్ని అతలాకుతలం చేస్తుంది కనుక ధైర్యంతో ప్రాపంచిక విషయములను వదిలి అంతర్ముఖుడవు కా ! కుమారా ! నీవు ఈ జన్మకు ముందు ఎన్నో జన్మలు ఎత్తావు. ఆ జన్మలో భార్యా బిడ్డలు, మిత్రులు ఉన్నారు వారూ మరణించారు. అలాగే ఈ జన్మలోని వారూ మరణించే వారే ! కనుక నీవూ , నీ భార్యా బిడ్డలు, బంధు మిత్రులు నిరంతరం పుడ్తూ చస్తూనే ఉంటారు. ఈ సత్యం తెలుసుకో . వివేక వంతులు" నేను ఎవరిని ? ఎవరి వాడను ? ఎక్కడ నుండి వచ్చాను ? ఎక్కడకు పోతాను ? పుట్టక పూర్వము ఎవరి వాడనో తెలియదు. మరణించిన తరువాత ఎవరి వాడనో తెలియదు. ఎక్కడ నుండి వచ్చానో తెలియదు. ఎక్కడకు పోతానో తెలియదు. అని తలచిన నీకిక బంధనాలు ఉండవు. కష్టాలు భార్యమీద వ్యామోహంతో మొదలై పరలోకం వరకు వెన్నంటి ఉంటాయి. కనుక వివేకవంతులు భార్యా వ్యామోహంలో పడరు. అనుభవించకుండా, దానం చెయ్యకుండా దాచుకున్న ధనం ఎందుకు ? ఇంద్రియములను జయించలేని ధనం, దర్పం ఎందుకు. ధర్మప్రవర్తన లేని వేదాధ్యనం లేని శాస్త్రవిజ్ఞానం నిష్ప్రయోజనం. ఇంద్రియములను జయించ లేని ఆత్మ దర్శనం ఎందుకు. కనుక కుమారా ! సంసారం త్యజించి జితేంద్రియుడవు కమ్ము " అని ఉపదేశించాడు. ధర్మనందనా ! ఇలా తండ్రి వలన బోధింపబడిన వాడై శుకుడు వైరాగ్యం పొందాడు " అని భీష్ముడు చెప్పాడు.

## శుకజననం


ఆకాశమార్గమున నిప్పు వలె వస్తున్న శుకుని చూస్తున్న వ్యాసాదులు

ధర్మరాజు " పితామహా ! శుకుడు వ్యాసుడి కుమారుడని చెప్పారు కదా ! శుకుడి జన్మవృత్తాంతం ఏమిటి ? అతడి తల్లి ఎవరు ? వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! పూర్వము మేరు పర్వతంలో కర్ణికార వనము అని ఒక వనము కలదు. ఆ ప్రాంతంలో వ్యాసుడు పుత్రుడి కొరకు శివుడి గురించి తపస్సు చేస్తున్నాడు. శివుడు ప్రత్యక్షమై ఏమి వరం కావాలని అడిగాడు. అప్పుడు వ్యాసుడు జలము, వాయువు, ఆకాశము, భూమి, అగ్నితో సమానుడైన పుత్రుడు కావాలని శివుని కోరాడు. అలాగే ఇస్తాను అని శివుడు వరమిచ్చి అంతర్ధానం అయ్యాడు. అలా వరమును పొందిన వ్యాసుడు హోమము చెయ్యడానికి అరణిని మధించ సాగాడు. అప్పుడు **ఘృతాచి** అనే అప్సరస అక్కడకు వచ్చింది. ఆమెను చూసిన వ్యాసుడు మోహపరవశుడైయ్యాడని గ్రహించిన ఘృతాచి చిలుకరూపం దల్చింది. తిరిగి వ్యాసుడు అరణిని మధిస్తున్నా మనసులో ఘృతాచి రూపం నిలిచి పోయింది. అప్పుడు వ్యాసుడి తేజస్సు వెలుపలికి వచ్చి అరణిలో పడింది. వ్యాసుడు ఇది గ్రహించకనే అరణిని మధించడంతో అరణి నుండి వ్యాసుడి శుక్లము సంయోగంతో ఒక బాలుడు జన్మించాడు. అతడే శుకుడు. అతడు పుడుతూనే అగ్నివలె వెలిగిపోసాగాడు. అప్పుడు మందాకిని స్త్రీ రూపం ధరించి శుకుడికి పురిటి స్నానం చేయించింది. ఆకాశం నుండి కమండలం, జింక చర్మము శుకుడి ముందు పడ్డాయి. దేవ దుంధుభులు మ్రోగాయి. దేవతలు పూల వానలు కురిపించారు. ఇంద్రాది దేవతలు, పార్వతి సమేతంగా శివుడు అక్కడికి వచ్చి అందరూ కలిసి శుకునకు ఉపనయనము చేయించారు. దేవేంద్రుడు శుకుడికి దివ్యకమండలం ఇచ్చాడు. దేవతలు మాసిపోని దుస్తులను ఇచ్చారు. వేదములు తమకు తాముగా శుకుడిలో చేరాయి. శుకుడు బృహస్పతిని తన గురువుగా ఎంచుకున్నాడు. బృహస్పతి వద్ద వేదాధ్యనం చేస్తున్నా ఆశ్రమంలో ఉన్న సహాధ్యాయులతోటి ఆటపాటల వలన చదువు మీద శ్రద్ధ చూపలేక పోయాడు. అప్పుడు శుకుడు తండ్రి అయిన వ్యాసుడి వద్ద సాంఖ్యము, యోగమును ఉపదేశం పొంది వైరాగ్యం పొందాడు. ఆ తరువాత శుకుడు

బ్రహ్మచర్యం, గృహస్థాశ్రమం, వానప్రస్థాశ్రమం అందు శ్రద్ధ చూపక మోక్ష మార్గం చూపమని తండ్రిని కోరాడు. వ్యాసుడు " కుమారా ! నీవు విదేహరాజైన జనకుడి వద్దకు వెళ్ళి అడిగిన అతడు నీకు మోక్షమార్గం చూపగలడు. నీవు సర్వశక్తి సమన్వితుడవైనా నీవు జనకుడి వద్దకు పాదచారివై వెళ్ళు. అతడి ముందు అహంకారం ప్రదర్శించక వినయం చూపించు " అని వ్యాసుడు చెప్పాడు.

## శుకుడు జనకుడు


మిథిలానగర రాజభవన ద్వారము వద్ద శుకమహర్షి

తండ్రి మాటప్రకారం శుకుడు కాలినడకన మిథిలానగముకు చేరాడు. రాజభవనంలోకి ప్రవేశించబోతుంటే భటులు అడ్డగించారు. కాని శుకుడు కోపించక ప్రశాంతంగా నిలబడిన శుకుడిని చూసి భటులు కంగారుపడి లోపలకు వర్తమానం పంపాడు. తరువాత అతడిని భటులు సగౌరవంగా శుకుడిని లోపలకు తీసుకు వెళ్ళారు. జనకుడు పురోహితులను ఎదురు పంపి శుకుడిని ఆహ్వానించి అతడి అతడి కాళ్ళు కడిగి సింహాసనం మీద కూర్చుండజేసాడు. ఇది చూసి మంత్రులు ఆశ్చర్యచకితులు కాగా అత్యంత సౌందర్యవంతులైన స్త్రీలు వచ్చి నాట్యంచేయసాగారు. శుకుడు ఎలాంటి వికారానికి లోనుకాక వారిని చూడసాగాడు. జనకుడు శుకుడికి అన్నపానములు ఏర్పాటు చేయమని బ్రాహ్మణులకు చెప్పాడు. అలా జనకుడు అతడి వెంట ఉండి అతడికి అన్ను సదుపాయములు చేస్తూ అనేక మాటలు చెప్తూ

ఆరోజు గడిపాడు. మరునాడు జనకుడు శుకుడి వద్దకు వచ్చి " వచ్చిన కారణమేమిటి ? " అని అడిగాడు. శుకుడు " మా తండ్రిగారు చెప్పగా ! నేను మీ వద్దకు మోక్షమార్గ ఆసక్తుడనై వచ్చాను. విప్పుడి కర్తవ్యం ఏమిటి ? మోక్షం ఎలా పొంద వచ్చు వివరించండి " అని అడిగాడు.


శుకమహర్షిని పూజిస్తున్న జనకుడు

జనకుడు " లోక పూజ్యుడైన చరిత్ర కలవాడా ! బ్రాహ్మణుడు ఉపనయనం చేసుకుని యజ్ఞోపవీతం ధరించి, బ్రహ్మచర్యం పాటిస్తూ వేదములు అభ్యసించాలి. తరువాత వివాహము చేసుకుని భార్య వలన సంతానం పొందాలి. యజ్ఞ యాగములు చెయ్యాలి. దేవతలను, పితృదేవతలను తృప్తిపరచాలి. అతిథులను సత్కరించాలి. తరువాత వానప్రస్థ ఆశ్రమం స్వీకరించి అడవులకు వెళ్ళాలి. అక్కడ కాషాయాంబర ధారణ చేసి అతిథి సత్కారం చేసి వైరాగ్యం పొందాలి. తన ఆత్మ అందు అగ్నిని వ్రేల్చి అందు కోరికలను వేల్చాలి. తుదకు పరమపదమైన బ్రహ్మపదం చేరాలి " అన్నాడు జనకుడు.

## ఆశ్రమధర్మాల అవసరం

శుకుడు " జనకమహారాజా ! మీరు చెప్పినది సాధారణ బ్రాహ్మణుడికి వర్తిస్తుంది. ప్రజ్ఞకలిగి జ్ఞానోదయమైన వాడికి ఈ మూడు ఆశ్రమములతో పని ఏమిటి ? జ్ఞానదృష్టితో బ్రహ్మపదము గురంచి ఎరిగిన వానికి ఈ మూడు ఆశ్రమధర్మాచరణ అవసరమా ! ఈ విషయమై వేదములు ఏమి వివరిస్తున్నాయి ! " అని అడిగాడు. జనకుడు " నీవన్నట్లు జ్ఞానము విజ్ఞానము మోక్షసాధనములు. వాట్ని గురుముఖత: నేర్చుకోవాలి. వాటి వలన ముక్తి పొంద వచ్చు. జీవుడు చివరిగా జ్ఞానవిజ్ఞానాలను కూడా వదిలి వేస్తాడు. పూర్వము ఋషులు, మనుజులు, ధర్మభ్రష్టులు, కర్మభ్రష్టులు కాకుండా సన్మార్గంలో నడవడానికే ఈ నాలుగు ఆశ్రమాలు ఉన్నాయి. ఈ నాలుగు ఆశ్రమాలు సక్రమంగా పాటించిన వాడు ముక్తి పొందడం తథ్యం. అలా కాకుండా పూర్వజన్మ పుణ్యము వలన జ్ఞానోదయమైన వాడు ఈ మూడు ఆశ్రమాలు వదిలి బ్రహ్మచర్యం వలన ముక్తిని పొంద వచ్చు. అతడు త్రిగుణాతీతుడై కలిగి బ్రహ్మచర్యంలో ముక్తి పొందకలిగిన వాడికి ఈ మూడు ఆశ్రమాలతో పని లేదు. మానవుడు ముక్తి పొందాలంటే సత్వమార్గము అవలంబించాలి. లేకున్న అది అసాధ్యము. ఈ విశ్వం తన అందు ఉన్నట్లు తాను విశ్వం అందు ఉన్నట్లు తలచిన వాడు ముక్తి పొందుతాడు. యయాతిమహారాజు " జ్యోతిస్వరూపుడైన పరమాత్మ మన ఆత్మలోనే ఉన్నాడు

అని తెలుసుకుని ముక్తిని పొందాడు. ఇది తెలుసుకున్న మునులు తమవలన పరులకు పరుల వలన తమకు భయంలేకుండా బ్రతకగలడు. అప్పుడతడు ముక్తి పొందగలడు. నాకు అది కావాలి, ఇది వద్దు అని తలపక సకల ప్రాణుల అందు సమదృష్టి కలిగి, కోరికలను వదిలి పెట్టి, పరులకు కీడు తల పెట్టని మానవుడు ముక్తి పొందగలడు. దృశ్యములందు, శబ్దములందు సమదృష్టి కలిగి విషయములలో లీనం కాకుండా, రాగద్వేషములు, సుఖ దు:ఖముల అందు ప్రభావితం కాకుండా జీవించ కలిగిన మానవుడు ముక్తిని పొందగలడు. ఇనుమును, బంగారమును, నిందను, స్తుతిని సమంగా భావించేవాడికి తాబేలు తన డిప్పలోకి తాను ముడుచుకున్నట్లు ఇంద్రియములను తనలోనికి లాగగలిగిన వాడికి ముక్తి తప్పక లభిస్తుంది. నేను చెప్పిన విషయాలు నీ తండ్రి దయవలన నీకు ప్రాప్తించాయి. నేను చెప్పినదాని కంటే నీకు తెలిసినది ఎక్కువ. బాల్యచాపల్యము వలన, నీ భావనలో సందేహములు, భయములు ఉండటం వలన నీవు సర్వజ్ఞుడన్న విషయము నీవు ఎరుగక ఉన్నావు. జ్ఞానము స్మగ్ర రూపం తాల్చినప్పుడే మోక్షము సిద్ధించగలదు. కనుక నీవు దృఢసంకల్పంతో పరిపూర్ణత సాధించు. నీకిక కొరత లేదు. మోక్షం తప్పక సిద్ధిస్తుంది. నీ సంశయములు వదిలి పెట్టు. పుట్టక ముందు నువ్వు ఎక్కడ ఉన్నావో అదే నీ శాశ్వత స్థానం " అని జనకుడు శుకుడికి జ్ఞానబోధ చేసాడు. జనకుడి జ్ఞాన బోధలతో శుకుడు సంశయములు తీరి తానెవరో తెలుసుకుని తిరిగి తన తండ్రి వద్దకు వెళ్ళాడు.

# షష్టాశ్వాసంద్వితీయ భాగం

సంశయరహితుడై శుకుడు వాయువేగ మనోవేగాలతో తండ్రి అయిన వ్యాసుని చేరడానికి హిమాలయాల వైపు బయలు దేరాడు. వ్యాసుడు తన శిష్యులైన **సుమంతుడు, వైశంపాయనుడు, జైమిని, పైలుడు** అనే వారితో వేదాధ్యాయనం చేయిస్తున్నాడు. శుకుని చూసిన వ్యాసుడు సంతోషించాడు. శుకుడు తండ్రి పాదములకు నమస్కరించి కూర్చున్నాడు. తనకు జనకుడికి జరిగిన సంభాషణ సారమును వివరించాడు. వ్యాసుడు శుకుని కూడా తన శిష్యులతో చేర్చి వేదాధ్యయనం చేస్తున్నాడు. ఒక రోజు వ్యాసుడి శిష్యులు వ్యాసుడితో " గురువర్యా ! వేదాధ్యయనంలో మేము అయిదుగురిమే ఈ లోకంలో అందరికన్నా మిన్నగా ముందుండాలి. మమ్మల్ని మించి ఇంకెవరికి వేదం చెప్పకూడదు. ఇలా మాకు వరం ప్రసాదించండి " అని కోరాడు. వ్యాసుడు " ఆసక్తి కలిగిన బ్రాహ్మణ కుమారులకు వేదవిద్య నేర్పిన వాడికి బ్రహ్మపదము కరతలామలకము. ఈ మాట మీరు వినలేదా ! ప్రతివాడు కష్టములు అనుభవించిన తరువాత సుఖము అనుభవిస్తాడు. మానవుడు ఎన్నటికీ స్వార్ధపూరితుడు కాకూడదు. కనుక ఇటువంటి కోరిక మీకు ధర్మంకాదు " అన్నాడు. ఆ మాటలు విన్న శిష్యులు ఒకరిని ఒకరు చూసుకుని " గురువర్యా ! మీరు మమ్ము ఇక్కడే ఉంచితే అది ఎలా సాధ్యం ఔతుంది. మేము పర్వతశిఖరం దిగి ఆసక్తులైన వారిని వెతికి పట్టుకుని వారితో వేదాధ్యయనం చేయించమంటారా ! వారితో యజ్ఞయాగములు చేయించమంటారా " అని అడిగారు. వ్యాసుడు " శిష్యులారా ! మీరు ఇది చెప్పడానికి ఇంత డొంక తిరుగుడుగా మాట్లాడడం అవసరమా ! మీరు పర్వతశిఖరములు దిగి జనావాసాలకు వెళ్ళి విద్యాదానం చేస్తానంటే నేను కాదనగలనా ! " అని వాత్సల్యంగా అన్నాడు. శిష్యులు వ్యాసుడి కాళ్ళ మీద సాష్టాంగ పడ్డారు. వ్యాసుడు వారిని లేవనెత్తి దీవించి " ఈ మూడు లోకాలలో మీకు ఇష్టం వచ్చిన చోటుకు వెళ్ళండి. మీరు జాగ్రత్తగా ఉంటూ వేదములను ప్రచారం చెయ్యండి " అన్నాడు. వ్యాసుడి నలుగురు శిష్యులు వెళ్ళగానే వ్యాసుడు తన కుమారుడితో ఆశ్రమంలో ఒంటరిగా మిగిలి పోయాడు.

## వ్యాసాశ్రమమునకు నారదుడి ఆగమనము

ఒకనాడు నారదుడు వ్యాసాశ్రమమునకు వచ్చి అక్కడ వేదఘోష వినిపించక పోవడం చూసి ఆశ్చర్యపోయాడు. వ్యాసుడితో " వేదఘోష వినిపించక పోవడానికి ఏమి కారణం ? " అని అడిగాడు. వ్యాసుడు " నారదా ! శిష్యులంతా నన్ను విడిచి వెళ్ళారు " అని చెప్పాడు. నారదుడు " అయితే మాత్రం ఏమి ? నీవు నీ కుమారుడైన శుకునితో కలిసి వేదపఠనం చెయ్యవచ్చు కదా ! " అన్నాడు. వ్యాసుడికి తన పొరబాటు తెలిసి వచ్చింది. వెంటనే తన కుమారుడైన శుకుడితో కలిసి వేదాధ్యయనం చేయడం ప్రారంభించాడు. ఒక రోజు పెనుగాలి వీచింది. వెంటనే వ్యాసుడు వేదాధ్యయనం ఆపాడు. శుకుడు " తండ్రీ ! ఈ గాలి ఎందుకు వీస్తుంది " అని అడిగాడు. వ్యాసుడు " కుమారా ! దేవమార్గంలో విష్ణువు పితృమార్గంలో సూర్యుడు పైకి కిందికి పయనించడం వలన ఈ ఝుంఝుమారుతం వీస్తున్నది. కుమారా ! నీకు వాయువుల గురించి చెప్తాను. **సమానవాయువు** దేవతలలో జన్మించాడు. సమానుడికి **ఉదానవాయువు**, ఉదానుడికి వ్యానము అను వాయువు జన్మించాడు. వ్యానుడికి అపానుడు, అపానుడికి అపానుడికి ప్రాణుడు జన్మించారు. ప్రపంచం అంతా ఈ ఐదు వాయువులతో నిండి ఉంది. **ప్రవహుడు, ఆవాహుడు, ఉద్వహుడు, వివహుడు, పవహుడు, పరాహుడు** అను ఏడుగురు వాయుదేవతలు. వీరు అదితి పుత్రులు. వీరు మొదట చెప్పిన పంచ వాయువులతో కలిసి ఉంటారు. వర్షములు రాకడకు పోకడకు ఈ వాయువులే కారణం. విష్ణువు నిట్టూర్పు వేగము అపరిమితము. దేవతలు విమానాలలో తిరుగుతున్నప్పుడు ఝుంఝుమారుతం వీస్తుంది. ఇలాంటి సమయంలో వేదాధ్యయనం చేసిన కీడు జరుగుతుంది కనుక ఆపి వేసాను " అని చెప్పిన వ్యాసుడు తరువాత స్నానం

చెయ్యడానికి ఆకాశగంగ వద్దకు వెళ్ళాడు.

## శుకుడికి నారదమహర్షి దివ్య బోధ


శుకదేవునికి ఉపదేశిస్తున్న నారదుడు

శుకుడు నారదుడు వింటుండగా వేద పఠనం చేసాడు. నారదుడు అందుకు మెచ్చుకుని ఏమి వరము కావాలో కోరుకో అని అడిగాడు. **శుకుడు** " నారద మహర్షి ! ఈ లోకంలో పుట్టిన వాడికి హితమైనది ఏది ? వివరించండి " అని కోరాడు. నారదుడు " కుమారా ! పూర్వము **సనత్కుమారుడు** మునీశ్వరులకు చెప్పిన మాటలే నీకూ చెప్తాను. సత్యవాక్పరిపాలనమే తపస్సు. మానవుడి నేర్చిన విద్య అతడికి కన్ను వంటిది. త్యాగమే సుఖదాయకము. కోరికలే దు:ఖహేతువు. మానవుడు ఇహ లోకబంధములలో చిక్కుకుంటే ఈ జన్మలో కాదు కదా ! పైజన్మలో కూడా ముక్తి లభించదు. కామము, క్రోధము ముక్తి సాధించడానికి శత్రువులు. ఈ రెండు వదిలిన వాడికి ముక్తి తధ్యం. ఇతరుల నుండి ఏమీ ఆశించక సమస్తకర్మలను త్యాగం చేసిన పండితుడికి దు:ఖము దరి చేరక ముక్తి సిద్ధిస్తుంది. ఇతరులను తాకకపోవడం, ఎమీ ఆసక్తితో చూడక పోవడం, ఇతరులతో మాట్లాడక పోవడము ఇవి కూడా ముక్తి మార్గములే. అహింసావ్రతం ఆచరిస్తూ ఇంద్రియ నిగ్రహం పాటిస్తూ, చపలత్వం వదిలిన వాడికి ముక్తి కరతలామలకం. సనత్కుమారుడు మునులకు ఇలా బోధించాడు. భార్యాబిడ్డలు బంధుమిత్రుల మోహంలో పడిన మానవుడు ఊబిలో పడిన ఏనుగులా అటూ ఇటూ కొట్టుకుంటాడే కాని దాని నుండి బయటపడ లేడు. నిరంతర భోగములలో మునిగి తేలే వాడు వలలో చిక్కిన జింక వలె గిల గిలా కొట్టు కుంటూ ఉంటాడు. ధర్మము, అధర్మము, సత్యము, అసత్యము రెండింటినీ వదిలి పెట్టాలి. అది ఎలా సాధ్యపడుతుందంటే అహింసను పాటిస్తే అధర్మము విడిచి పెట్టవచ్చు. కర్మను వదిలినప్పుడు ధర్మమును వదలచ్చు. బుద్ధిని ఉపయోగించి సత్యమును అసత్యమును వదిలి పెట్టవచ్చు. ఆత్మసాక్షాత్కారం పొందిన వాడికి బుద్ధితో పనిలేదు. పండితుడు దైనందిక కార్యాలలో వస్తూపోతూ ఉండే శోకమును భయమును పట్టించుకోడు. కుమారా ! పంచభూతములు దశ ఇంద్రియములు, మనసును మూట కట్టుకుని ఉన్న ఈశరీరం కొరకు తాపత్రయ పడకూడదు. భార్యాబిడ్డలకు, బంధుమిత్రులకు , ఊరిలో జనాలకు కలిగే బాధలకు మనం విచలితులం కాకూడదు " అని నారదుడు శుకుడికి చెప్పగానే శుకుడికి ఉన్న కొంచం మాయకూడా తొలగి పూర్తి వైరాగ్యం కలిగి " మహర్షి ! నీ మాటలతో నా సందేహములన్నీ తీరి జ్ఞానోదయం అయింది. సూర్యుని దయపొంది సర్వము త్యజించి యోగసిద్ధి సాధిస్తాను " అని చెప్పి నారదమహర్షి వద్ద శలవు తీసుకుని తన తండ్రి అయిన వ్యాసుడి వద్దకు వెళ్ళి తన నిశ్చయం తెలియ చేసాడు. పుత్రుడి జ్ఞానసంపదకు వ్యాసుడు ఆనందించాడు. శుకుడు తండ్రికి నమస్కరించి బయలు దేరాడు. వ్యాసుడికి ఇంకా పుత్ర మమకారం తీరకు " నాయనా ! శుకా ! నిన్ను ఇంకా కనులార చూడాలని ఉంది కొంత సమయం నా వద్ద ఉండకూడదా ! " అని అడిగాడు. కాని శుకుడిలో ఇప్పుడు ఏ మమకారం లేదు అతడు మారుమాటాడక నిర్వికారంగా అలా వెళ్ళి కైలాస శిఖరం వరకు పోయాడు. శుకుడు అక్కడ ఒక సమతల ప్రదేశంలో తూర్పు ముఖంగా కూర్చుని ఆత్మావలోకనం చేసుకున్నాడు. సూర్యుడు ప్రత్యక్షం కాగానే శుకుడు సూర్యుడికి సాష్టాంగ నమస్కరించి సూర్యుని వలన ఆత్మతత్వాన్ని తెలుసుకున్నాడు. అదేసమయంలో అక్కడకు చేరిన నారదుడితో " మహర్షి ! మీ దయవలన నాకు వైరాగ్యం కలిగింది. నాకు సరి అయిన మార్గం దొరికింది అని చెప్పి త్రిగుణాతీతుడై యోగశక్తితో శుకుడు ఆకాశ మార్గాన పోతూ దారిలో ఉన్న పర్వతాలను , చెట్లను చూసి నమస్కరించి " నన్ను వెతుకుతూ వచ్చే నాతండ్రి నన్ను పిలిచినప్పుడు మీరు నా కొరకు బదులు పలకండి " అని ప్రార్ధించాడు. అవి శుకుడి ప్రార్ధన మన్నించాయి.

## శుకుడి ఆకాశయానం

ఆ తరువాత **శుకుడు** ఉత్తరదిక్కుగా పయనమయ్యాడు. అతడు అతి తక్కువ ఎత్తులో గంగాతీరంలో ఆకాశమార్గాన వెళ్ళసాగాడు. ఆ సమయంలో వస్త్రాలను గట్టున విదిలి గంగానదిలో స్నానం చూస్తున్న అప్సరసలు శుకుడిని చూసి కూడా వికారము చెందక అలా స్నానమాడసాగారు. వ్యాసుడు కూడా తన యోగశక్తితో ఆకాశమార్గాన శుకుడిని పిలుస్తూ పోసాగాడు . అతడికి వృక్షాలు పర్వతాలు బదులు చెప్పసాగాయి. అప్పటికే శుకుడు సర్వభూతాత్మకుడయ్యాడు. గంగాతీరాన చేరిన వ్యాసుడిని చూసిని అప్సరసలు కంగారు పడి వస్త్రధారణ చేసి వ్యాసుడికి నమస్కరించారు. తన దివ్యశక్తితో అప్సరసల మనసులోని విషయం గ్రహించిన వ్యాసుడు కుమారుడి వైరాగ్య సంపదకు ఆనందించినా తనను తలచుకుని సిగ్గుపడ్డాడు.

అప్పుడు మహాశివుడు వ్యాసుడి వద్దకు వచ్చి " వ్యాసామునీంద్రా ! నాడు నువ్వు నీ తపస్సుతో నన్ను మెప్పించి నా వద్ద నుండి పంచభూతములకు అతీతుడైన కుమారుడు కావాలని అడిగావు కదా ! నేను నీకు అలాంటి కుమారుడిని ప్రసాదించాను. నీ తపోవిశేషం, నా ప్రభావం కలిసి శుకుడికి పరమగతి లభించింది. నీవు దీనికి ఆనందించాలి కాని విచారించడమెందుకు. వ్యాసమహర్షీ ! నీ కుమారుడి కీర్తి ఆచంద్రార్కం వర్ధిల్లుతుంది " అని చెప్పి మహాశివుడు అంతర్ధానం అయ్యాడు " అని చెప్పిన భీష్ముడు ధర్మజా ! శుకచరిత్ర చదివిన వారికి విన్న వారికి ఆయురారోగ్యాలు ఐశ్వర్యాలు లభించడమే కాక తుదకు మోక్షం లభిస్తుంది " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## ఆరాధించవలసిన దైవం

ధర్మరాజు " పితామహా ! మీ వలన నేను నాలుగు వర్ణాల గురించి తెలుసుకున్నాను అలాగే వారు ఆరాధించవలసిన దైవము గురించి చెప్పండి " అని భీష్మడిని అడిగాడు అని వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పాడు. **వైశంపాయనుడు** " జనమేజయా ! నేనిప్పుడు నీకు భీష్ముడి చేత ధర్మరాజు చెప్పబడిన విష్ణుకథను చెప్తాను. భీష్ముడు " ధర్మనందనా ! ఒక రోజు నా తండ్రి వలన నేను విన్న నారాయణ నారద సంవాదాన్ని వివరించి నీకు చెపితే నీకు కలిగిన సందేహం తీరగలదు. అవ్యయుడు, సనాతనుడు, విశ్వాత్ముడు అయిన నారాయణుడు అనే మహాముని బదరికావనంలో తపస్సు చేసుకుంటున్నాడు. నారదుడు ఆయనకు భక్తితో నమస్కరించి " మహర్షీ ! మోక్షసిద్ధికి ఆరాధించవలసిన దైవము గురించి వివరించండి " అని కోరగా నారాయణుడు " నారదా ! ధృవము, అచలము, ఇంద్రియములకు గోచరము కానిది, సూక్ష్మమైనది, సాటిలేని ఏకైక శక్తి, సకల ప్రాంణులలో అంతరాత్మగా వెలుగొందేది పరమాత్మ ఒక్కడే " అన్నాడు. నారదుడు " మహర్షీ ! నీవు లోకరక్షణార్ధమై మీరీ అవతారమెత్తారు అని విద్వాంసులు చెప్తారు కదా ! అప్పుడు నీ మూల ఆకృతి ఎలా ఉంటుంది నాకు చెప్పు మహర్షీ ! నాకు గురుభక్తి, వేదముల అందు ఆసక్తి ఉంది. నీ మూల స్వరూపము గురించి తెలుసుకోవడానికి నాకు అర్హత ఉంది అని నీవు అనుకున్నట్లైన నాకు తెలుపుము " అని అడిగాడు. నారాయణుడు " నారదా ! ముందు ఏకాగ్రత సాధించు. అప్పుడు నీకు పరమాత్మను దర్శించే శక్తిని నీకు ప్రసాదిస్తాను " అన్నాడు. ఆ మాటలకు తృప్తి చెందిన నారదుడు నారాయణుడికి నమస్కరించి నారదుడు ఆకాశమార్గాన మేరుపర్వత సమీపానికి వెళ్ళాడు. అక్కడ క్షీరసాగరానికి ఉత్తరదిక్కున ఉన్న శ్వేతద్వీపములో ఆహారము తీసుకోకుండా, ఇంద్రియ నిగ్రహము కలిగి, చెమటపట్టని, శరీరము నుండి సుగంధములను వెదజల్లుతున్న మునీశ్వరులను చూసాడు " అని చెప్పగానే ధర్మరాజు " పితామహా ! ఆ మహానుభావులు ఎవరు వివరించండి " అని ఆసక్తితో అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఆ మహాపురుషుల గురించి పూర్వము కొంత మంది నా తండ్రికి మునులు చెపుతున్నప్పడు విన్నది నేను నీకు చెప్తాను.

## ఉపరిచర మనువు

పూర్వము **ఉపరిచరమనువు** అనే విశిష్టమైన ఆచారసంపన్నుడు ఉన్నాడు. అతడు సత్యము, ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము, విష్ణుభక్తి, నైతికబలము కలవాడు. ఈ భూమినంతా పాలించిన ఉపరిచరమనువు బ్రాహ్మణుల అందు భక్తి, యజ్ఞయాగముల అందు ప్రీతి ఉన్నాయి. ఉపరిచరమనువు రాజ్యమును వదిలి అడవులకు వెళ్ళి తపస్సు చేయసాగాడు. దేవేంద్రుడు ఉపరిచరమనువును చూసి " మహారాజా ! నీకీ తపసు ఎందుకు నేను నీతో సఖ్యము చేయదలిచాను కనుక నీవు నీ రాజ్యముకు వెళ్ళి పరిపాలన చేస్తూ నీవు కోరినప్పడల్లా **అమరావతికి** వస్తూ పోతూ ఉండు. నీవు ఆ విమానము ఎక్కి నీకు ఇష్టము వచ్చిన చోటికి వెళ్ళ వచ్చు " అన్నాడు. ఇంద్రుడి మాట కాదన లేక ఆ విమానాన్ని స్వీకరించాడు. ఆ విమానాన్ని ఇంతకు పూర్వము **వసువు** ఎక్కి తిరిగాడు కనుక అతడు ఉపరిచరమనువు అని కారణ నామధేయుడయ్యాడు.

## సప్తఋషులు ధర్మశాస్త్రాలు

కల్పాదిలో **మరీచి, అంగీరసుడు, అత్రి, పులహుడు, పులస్త్యుడు, క్రతువు, వశిష్టుడు** అనే మహామునులూ చిత్రుడు, శిఖండి అను వార **స్వాయంభువమనువు** తో చేరి విష్ణువు గురించి అనేక సంవత్సరాలు తపస్సు చేసారు. విష్ణువు వారికి ప్రత్యక్షం అదృశ్యరూపంలో గోచరించి వారితో " మీరంతా ధర్మశాస్త్రాలు రచించే శక్తి కొరకు నా గురించి తపస్సు చేసారు. నేను మీలో సరస్వతీదేవిని నియోగించాను. మీరు రచించు ధర్మశాస్త్రములు సకల జగములకు హితవును, గౌరవమును కలిగిస్తాయి. **అంగీరసుడు** అనే మహామునికి బృహస్పతి అనే కుమారుడు జన్మిస్తాడు. అతడు మహాత్ముడు వ్రాసిన ధర్మశాస్త్రములను చదవి అధ్యయనం చేయడానికి అర్హుడు కనుక మీరు అతడికి ధర్మశాస్త్రములను భోదించండి. బృహస్పతి ఉపరిచరమనువుకు ఆ ధర్మశాస్త్రములు బోధిస్తాడు. అతడు ధర్మశాస్త్రములు అధ్యయనం చేయగల సమర్ధుడు. ఉపరిచరమనువు బృహస్పతి వలన భోదించబడిన ధర్మశాస్త్రాలను లోకముకు అందిస్తాడు. ఉపరిచర మనువు

యజ్ఞయాగముల అందు ఆస్కుడు, నా భక్తుడు. అతడి వలన ధర్మశాస్త్రములు లోకములో ప్రచారమౌతాయి " అని చెప్పాడు.

## ఉపరిచరమనువు అశ్వమేధయాగము

ఉపరిచరమనువు అశ్వమేధయాగము చేయసాగాడు. ఆయాగముకు సప్తరుషులు ఋత్విక్కులుగా విచ్చేసారు. ఆ యాగముకు బృహస్పతి ప్రధానఋత్విక్కుగా ఉన్నాడు. ప్రజాపతి పుత్రులైన **ఏకతుడు, ద్వితుడు, త్రితుడు** అను మునులు సదస్యులుగా వ్యవహారించారు. ఆ ఆశ్వమేధయాగము జరుగుతున్న సమయంలో అహింసావ్రతుడైన మహారాజు మనువు ఆ యజ్ఞములో జంతుబలికి అంగీకరించ లేదు. జంతువులకు బదులుగా అరణ్యకములో చెప్పబడిన మంత్రములను పఠించి విష్ణువును ప్రసన్నం చేసుకున్నాడు. అతడి నిష్ఠకు మెచ్చిన విష్ణువు అదృశ్యరూపంలో వచ్చి తన హవిర్భాగమును స్వీకరించాడు. అది చూసిన బృహస్పతికి కోపము దుఃఖము ఒక్కటిగా వచ్చి ఉపరిచరమనువుతో బృహస్పతి " మనుమహారాజా ! యజ్ఞములో **పురోడాశము** సమర్పించినప్పుడు దేవతలు స్వయంగా వచ్చి హవిస్సును స్వీకరించాలి. కాని విష్ణువు అదృశ్యరూపంలో వచ్చి స్వీకరించాడు. అది నాకు బాధ అన్పించింది " అన్నాడు. మహారాజు బృహస్పతిని అనునయించాడు. అక్కడ ఉన్న సదస్యులు " దేవగురూ ! మీరు అలకమానండి. హరికి సమర్పించిన హవిర్భాగము హరి స్వీకరించాడు. అందుకు మీరు ఎందుకు బాధపడతారు ? అసలు విష్ణువును ప్రత్యక్షంగా చూడటము ఎవరికి సాధ్యము. బ్రహ్మమానస పుత్రులమైన మేము విష్ణు దర్శనం కోరి ఎన్నో ఏళ్ళు తపస్సు చేసినప్పుడు " అశరీరవాణి " పాల సముద్రములో ఒక దీవి ఉన్నది. అందు తెల్లటి వారు, ఇంద్రియనిగ్రహం కల వారు, దివ్యదేహం కలవారు, ఆకలి లేనివారు అయిన విష్ణుభక్తులు ఉన్నారు. వారికి మాత్రమే విష్ణువు తన స్వస్వరూపముతో దర్శించే భాగ్యమును కలిగించాడు. ఆ సమయంలో మీరు అక్కడకు చేరగలిగితే మీకు విష్ణుదర్శనం ఔతుంది " అని పలికింది.

## విష్ణు లోకము

ఆ మాటలను విని మేము శ్వేతద్వీపముకు వెళ్ళాము. అశరీరవాణి చెప్పినట్లు అక్కడ ప్రకాశవంతమైన దివ్యదేహము కలవారు అయిన విష్ణుభక్తులు కనిపించారు. ఇంతవరకు ముల్లోకాలలో అటువంటి వారిని మేము చూడ లేదు. వారి ముందు సహస్ర భానుప్రకాశంతో సమానమైన రూపము వారి ముందు ప్రత్యక్షం అయింది. అప్పుడు వారు జయాభవ, విజయా భవ, జయ హృషీకేశ, పుండరీకాక్ష అని అని జయధ్వానాలు చేసారు. మేము ఎంత ప్రయత్నించినా మా కన్నులతో ఆ తేజో రూపము చూడలేక పోయాము. అప్పుడు అశరీర వాణి " బ్రహ్మమానస పుత్రులారా ! మీరు విష్ణుమూర్తిని చూడలేదని దిగులు చెందకండి. విష్ణుభక్తులను చూసిన విష్ణువును దర్శించినట్లే. అయినా మీరు చేసిన తపస్సు, నియమ నిష్ఠలు మీకు విష్ణుదర్శనం చేస్తాయి. కాని మీ తపస్సు విష్ణుదర్శనముకు చాలదు. అనేక సంవత్సరాలు అత్యంత భక్తితో తపస్సు చేసిన కాని విష్ణుదర్శనం లభించదు " అని వినిపించింది. ఆ మాటలు విని మేము వెను తిరిగాము. కనుక బృహస్పతీ నీవు విష్ణుదర్శనం గురించి ఆలోచించక మిగిలిన యజ్ఞకార్యము సమాప్తము చెయ్యి " అని చెప్పారు. ఆ మాటలు విన్న బృహస్పతి యోగమును శ్రద్ధగా పరిసమాప్తము చేసాడు. అలా ఉపరిచరమనువు జనరంజకముగా పాలన సాగించాడు.

## దేవతలకు మునులకు మద్య జరిగిన చర్చ

ఒక సారి దేవలోకములో దేవతలకు మునులకు మద్య యజ్ఞయాగములను గురించిన చర్చ జరుగుతుంది. దేవతలు అందరూ యజ్ఞములో **అజములను** బలి ఇవ్వాలని తీర్మానించారు. మునులు దానికి వ్యతిరేకించి అజములకు యుగములు మారినప్పుడు అర్ధము మారుతుందని చెప్పారు. కృతయుగములో అజములంటే ఔషధులు అని అంటారు. ఇంతలో అక్కడకు వచ్చిన ఉపరిచరమనువును చూసి దేవతలు మునులు వారి వివాదము పరిష్కరించమని కోరాడు. ఉపరిచరమనువు దేవతల పక్షం వహించి యజ్ఞములో అజములను బలి ఇవ్వాలని తీర్పు చెప్పాడు. వేదార్ధమును పక్షపాతము వహించి వక్రీకరించినందుకు మునులు కోపించి ఉపరిచరమనువును శపించారు. ముని శాపప్రభావము వలన మనువు భూమిలోని ఒక లోయలో పడి పోయాడు. దేవతలు అతడి వద్దకు వచ్చి అతడికి ఆకలిదప్పులు లేకుండా చేసి మహా విష్ణువు అనుగ్రహంతో తిరిగి పూర్వ స్థితిని పొందగలవు. అని ఊరడించి వెళ్ళారు. ఉపరిచరమనువు విష్ణువును గురించి ధ్యానించడం మొదలు పెట్టాడు. అతడి భక్తికి మెచ్చి గరుత్మంతుడిని పంపి ఉపరిచరమనువుని బ్రహ్మలోకం పంపాడు. ఉపరిచరమనువు విష్ణుమూర్తి మహిమకు కరుణకు ఆనందించాడు.

## మహానుభావులు


విష్ణువుని దర్శించిన నారదుడు

భీష్ముడు ధర్మరాజుతో " ధర్మనందనా ! నేను నీకు శ్వేతద్వీపంలో ఉండే మహా పురుషులగురించి చెబుతుండగా ప్రసంగవశాత్తు **ఉపరిచరమనువు** గురించి చెప్పాను. ఇక ఆ మహానుభావుల గురించి చెప్తాను. నారదుడు శ్వేతద్వీపముకు వెళ్ళి అక్కడ ఉన్న అద్భుత శరీరాలతో ప్రకాశిస్తున్న మహాపురుషులను చూసి వారికి నమస్కరించాడు. వారుకూడా నారదుడిని ఆదరించారు. అప్పుడు నారదుడు విష్ణువును గురించి స్తోత్రం చేయడం మొదలు పెట్టాడు. అప్పుడు నారదుడి ముందు విష్ణుమూర్తి ప్రత్యక్షం అయ్యాడు. విష్ణువు అనేక శిరస్సులు, అనేక బాహువులు, అనేక పాదములు, అనేక రంగులతో కమండలంతో ఓంకారము గాయత్రిని జపిస్తూ చతుర్వేదములు పారాయణం చేస్తూ నారదుడి ముందు ప్రత్యక్షం అయ్యాడు. నారదుడు వినయంతో విష్ణుమూర్తికి నమస్కరించాడు. అప్పుడు విష్ణుమూర్తి " నారదా ! నన్ను చూడడం అందరికీ సాధ్యం కాదు. లేశమాత్రమైనా అహంకారము లేనంత మాత్రాన అనన్య భక్తివలన నీవు నన్ను చూడగలిగావు. నీకు కావలసిన వరము కోరుకో " అన్నాడు. నారదుడు " పరాత్పరా ! నీ దివ్యదర్శనం కంటే నా కేమీ వద్దు " అన్నాడు. విష్ణువు " ఎవరు ఇంద్రియనిగ్రహము కలిగి త్రిగుణాతీతుడై ప్రళయకాలంలో కూడా నిశ్చలంగా వెలుగుతుంటాడో అతడే ఆత్మసాక్షి, అజుడు, నిష్కళంకుడుగా వెలుగుతుండే అతడు క్షేత్రజ్ఞుడు, జీవుడు అనబడే వాసుదేవుడు అతడే, సంకర్షణుడు అతడే. మనస్సు , అహంకారమే ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు అని అంటారు. ఇది నామాయ నేను 24 తత్వములకు అధినాధుడనైన 25వ తత్వమును. పరపురుషుడను నాకంటే వేరు పరము లేదు. మహామునులు సతతము ఎవరి కొరకు తపస్సు చేస్తుంటారో ఆ వాసుదేవుడను నేనే. ఈ చరాచర జగత్తులో ఉన్న సకలభూతములలో ఉన్న ధాతుశక్తి వేరుగా లేదు ఆ శక్తిని నేనే. ఆ జీవశక్తి సర్వవ్యాప్తంగా సకల లోకములలో విస్తరించి ఉంది. లేని ఎడల ఈ లోకలో చైతన్యము లేదు. జీవుడు వేరు శరీరము వేరు జీవుడిని గురించి నేను తెలుసుకున్నాను అనుకోవడము నా మాయవిలాసము. ఆ మాయ నేను కల్పించినదే. జీవుడికి నాకు భేదము లేదు రెండూ ఒకటే. అచంచలమైన భక్తితో నన్ను కొలిచిన వారికి నేను ముక్తి ప్రసాదిస్తాను. **అదిత్యులు, మరుత్తులు, రుద్రులు** మొదలైన దేవతా గణములు, బ్రహ్మదేవుడు, చతుర్వేదములు నా స్వరూపములే. నేనే బ్రహ్మదేవుడిని సృష్టించి ఈ సృష్టి కార్యము అప్పగించి నేను నిర్వికారంగా, నిమిత్త మాత్రంగా, ఏకాకిగా కోరిన వారికి సహకరిస్తాను.

## లోకరక్షణ

ఒక్కోసారి జగద్రక్షణార్ధమై అవతారం ఎత్తుతుంటాను. వరాహరూపంలో హిరణ్యాక్షుడిని, నరసింహరూపంలో హిరణ్యకశిపుని, పరశురాముడిగా క్షత్రియకులాన్ని, ధశరధపుత్రుడిగా రావణుడిని సంహరించాను. యాదవకుల సంజాతుడనై ఇంద్రకుమారుడి సాయంతో భూభారాన్ని తగ్గించాను. పూర్వము నేను **నరుడు, నారాయణుడు** అనే రెండు రూపాలతో మునులుగా అవతరించి లోకరక్షణ చేసాను. తరువాతి కాలంలో మానవరూపంలో అవతరించి లోకకంటకులైన **కాలయనుడిని, కంసుడిని, మురాసురుడిని, నరకాసురుడిని, బాణాసురుడిని** సంహరించాను. బాణాసుర వధసమయంలో నన్ను ఎదిరించి నిలిచిన దేవసేనాని కుమారస్వామితో, మహాశివుడితో పోరాడి బాణాసురుడి గర్వము అణిచాను. అంతకు ముందు మత్స్యత్వము, కూర్మత్వము పొంది దేవతలను వేదములను రక్షించాను. ధర్మరక్షణ కొరకు నేను చేయవలసినది చేసాను. నేను చేయవలసిన కార్యము పూర్తికాగానే నేను తిరిగి నా మూల ప్రకృతిలో చేరిపోతాను. నారదా ! నీవు ఏకాగ్రచిత్తుడవై నన్ను ధ్యానించినందున ఇది నీకు చెప్పాను " అని విష్ణువు భోదించాడు. తరువాత నారదుడుకి శ్వేతద్వీపంలోని మహాపురుషులను చూపి నారదా కాంతి దేహధారులై నిరంతరం నన్నే ధ్యానించే ఈ మహాపురుషులకు నీ ఉనికి భంగము కలిగిస్తుంది కనుక నీవు ఇక ఇక్కడ నుండి వెళ్ళు " అని చెప్పాడు.

## బదరికావనము

విష్ణుమూర్తి ఆదేశంతో నారదుడు శ్వేతద్వీపము నుండి బదరికావనము వెళ్ళి అక్కడ ఉన్న నరనారాయణులను దర్శించుకున్నాడు. అక్కడ తాను సాక్షాత్తు విష్ణుమూర్తి ముఖత: విన్న వేదార్ధసారమును, యోగము, సాంఖ్యముల సారమును మునులందరికీ ఉపదేశించాడు. అక్కడి నుండి బ్రహ్మసభకు వెళ్ళి అక్కడి వారికి విస్ణుమూర్తి సందేశం వినిపించాడు. అలా ఆ ఉపదేశం క్రమంగా ముల్లోకాలలో వ్యాపించింది. దానిని నేను నా తండ్రి శంతనుడి ద్వారా విని ఇప్పుడది

నేను నీకు చెప్పాను. ఈ ఉపదేశమును దేవతలు మునులు ఎంతో శ్లాఘిస్తారు. వారు విష్ణుమూర్తిని భక్తితో పూజిస్తారు, శ్రద్ధతో జపిస్తారు, ఏకాగ్రతతో ధ్యానిస్తారు. ధర్మనందనా ! నీవు కూడా విష్ణుమూర్తిని అనన్య భక్తితో పూజించి తరించు. నీవు దీనిని విష్ణుభక్తులకు, నీతిపరులకు, ఇంద్రియ నిగ్రహము కల వారికి మాత్రమే ఉపదేశించు. నీవిప్పటి వరకు విన్న కథలేవి ఈ ఉపదేశముకు సాటి రావు. **ఇది విన్న వారికి, తెలుసుకున్న వారికి ఆయురారోగ్య ఐశ్వర్యములు తప్పక సిద్ధిస్తాయి.** అని భీష్ముడు నారదుడికి స్వయంగా విష్ణుమూర్తి ఉపదేశించిన ఉపదేశమును ధర్మరాజుకు ఉపదేశించాడు. ఈ పవిత్రమైన ఉపాఖ్యానమును పఠించుతూ పాండవులు విష్ణుమూర్తిని భజిస్తూ కాలంగడిపారు " అని వైశంపాయనుడు జనమే జయుడికి చెప్పాడు.

## వ్యాసమహర్షి ఆకాశగమనం

జనమేజయమహారాజా వ్యాసుడు కూడా విష్ణుమూర్తిని తలచుకుంటూ ఆకాశమార్గాన ప్రయాణిస్తున్నాడు " అని **వైశంపాయనుడు** చెప్పగా **జనమేజయుడు** " మహర్షీ ! నీవు మోక్షము అత్యంత సుఖప్రదము చెప్పావు. కాని సదా ప్రాపంచిక సుఖములలో మునిగితేలే ప్రజలు వారే కాక దేవతలు కూడా హవిర్భాగాలు పొందడానికి చూపించే ఉత్సుకత మోక్షసాధన అందు చూపరు కదా ! ఇలా ఎందుకు జరుగుతుంది అని నా మనసు సదా మధనపడుతుంది. మానవులే కాక దేవతలు సహితము ఇలా మోక్షమార్గమును వదిలి కర్మబంధాలలో చిక్కుకు పోవడానికి కారణమేమిటి ? నాకు వివరించండి " అని అడిగాడు. వైశంపాయనుడు " జనమేజయమహారాజా ! వ్యాసభగవానుడు తన శిష్యులకు నాలుగు వేదములను భారతమును బోధించాడు. ఆ సమయంలో సుమంతుడు, పైలుడు, జైమిని నీవు అడిగిన విధంగా మేము మా గురువు గారిని అడిగాము. అప్పుడు మా గురువైన వ్యాసుడు " నేను ఒకప్పుడు భూతభవిష్యత్తు వర్తమానం తెలుసుకోవడానికి క్షీరసాగరంలో తపస్సు చేసాను. ఆ నారాయణుడి దయ వలన నాకు భూత, భవిష్యత్తు వర్తమానం తెలుసుకునే దివ్యజ్ఞానం లభించింది. దాని ప్రభావంతో నేను ఈ కల్పంలో బ్రహ్మదేవుడు మొదలైన వారు చేసిన పనులు చూడగలిగాను. వాటిని మీకు చెప్తాను. **మరుత్తులు, ఆదిత్యులు, వసువులు, రుద్రులు** మొదలగు దేవతా గణములు, మునులు, బ్రహ్మదేవుడిని చూసి మాకర్తవ్యము బోధించండి అని అడిగారు. బ్రహ్మదేవుడు " నా మనసులో మెదిలే విషయమే మీరు నాకు గుర్తుచేసారు. మనమందరం విష్ణుమూర్తిని అడిగి మన కర్తవ్యం తెలుకుందాము రండి " అని వారిని విష్ణులోకము తీసుకు వెళ్ళి అక్కడ వారంతా కలి విష్ణువును గురించి తపస్సు చేయగా వారికి అప్పుడు ఒక దివ్యమైన వాక్కు వినిపించింది.

## పరమాత్మ వాణి

దివ్యవాణి " దేవతలారా ! మునులారా ! మీరు వచ్చిన పని నాకు తెలుసు. బ్రహ్మదేవుడు ఈ లోకములకు గురువు. ఆయన చెప్పినదే వేదవాక్కు. నాకు కూడా ఆయన చెప్పినదే వేదవాక్కు. మీరందరూ కలిసి వేదోక్తంగా యజ్ఞము చేసి అందు నాకు హవిర్భాగం కల్పించండి " అని పలికింది. ఆ మాటలకు ఆనందించిన బ్రహ్మదేవుడు ఒక యాగముకు ఏర్పాటు చేయమని దేవతలకు ఆదేశం ఇచ్చాడు. దేవతలందరూ వేదోక్తంగా యాగం చెయ్యడానికి పూనుకున్నారు. ఆ యాగమునందు విష్ణుమూర్తికి హవిర్భాగము కల్పించారు. విష్ణుమూర్తి అదృశ్యరూపంలో ఆకాశంలో నిలబడి " దేవతలారా ! మునులారా ! మీరు నేను చెప్పినట్లు యజ్ఞము చేసారు. మీరు చేసిన పుణ్యముకు తగిన ప్రతిఫలం ఇస్తాను. **మరీచి, పులహుడు, అంగీరసుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు, వశిష్ఠుడు** అను బ్రహ్మమానసపుత్రులు వేదములకు ఆచార్యులు. వీరు ఏర్పరిచిన నియమాలు, ఆచారములు, పద్ధతుల ప్రకారం మానవులు యజ్ఞములు చేస్తారు. అందులో మీకందరికి హవిర్భాగములు సమర్పిస్తారు. దానితో వారు తృప్తి పొందుతారు. బ్రహ్మమానస పుత్రులైన **సన, సనక, సనంద, కపిల, సనత్కుమారులు** సహజమైన జ్ఞానసంపద కలిగి ముక్తి గురించే సదా చింతిస్తుంటారు. వీరు మోక్షధర్మములను జగములకు వివరిస్తారు. మీ అందరికి తల్లి, తండ్రి, గురువు బ్రహ్మదేవుడే. అతడు నా అభీష్టము మేరకు లోకాలను శాసిస్తాడు. నా నుండి పుట్టిన రుద్రుడు లోకాలకు ఆరాధనీయుడు, పూజ్యుడు, సకల వరములను ప్రసాదించు కరుణామయుడు. ఇక మీరు వెళ్ళి మీ విధించిన వేదోక్త కర్మలను బ్రహ్మ, మరీచి, ప్రజాపతులు చెప్పినట్లు విని ఆచరించండి. ఇది కృతయుగము అను పేరుతో ఉత్తమమైన కాలంగా వర్ధిల్లుతుంది. యజ్ఞయాగములలో పశువధ చేయరాదు. ఇందు ఏమాత్రము సందేహము లేదు " అన్నాడు. దేవతలు, మునులు విష్ణుమూర్తికి నమస్కరించి వెళ్ళారు.

## హయగ్రీవుడు

దేవతలు, మునులు వెళ్ళినా అక్కడే ఉన్న బ్రహ్మదేవుడి ముందు హయగ్రీవరూపంలో వేదాధ్యయనం చేస్తూ దండ కమండలములతో ఎదుటకు వచ్చి నిలబడ్డాడు. అప్పుడు విష్ణువు బ్రహ్మదేవుడిని కౌగలించుకుని బ్రహ్మదేవా ! నీవు సర్వ

లోకములకు విధాతవు, గురుడవు, అధిపతివి అందుకే నేను ఈ జగముల భారం నీ అందు ఉంచి నేను సుఖంగా ఉన్నాను. ఈ లోకమును సక్రమంగా నడపడం నీ బాధ్యత. ఈ లోకమును నడపడంలో ఏదైనా సమస్యలు వచ్చినప్పుడు నేను కల్పించుకుని తీర్చుతుంటాను " అని చెప్పి అంతర్ధానం అయ్యాడు. ఇలా యజ్ఞయాగములలో అగ్రభాగమునకు అర్హుడు, యజ్ఞధారి అయిన అయిన మహావిష్ణువు ప్రవృత్తి ధర్మమును నిర్వహించడానికి బ్రహ్మదేవుని, దేవతలను నియమించి తాను మాత్రం నివృత్తి ధర్మమును నిర్వర్తిస్తూ జ్ఞానమూర్తి అయి సర్వత్రా సంచరిస్తున్నాడు. అని వ్యాసుడు వైశంపాయనుడికి చెప్పాడు.

### విష్ణుతత్వము

వ్యాసుడు ఇంకా ఇలా " వైశంపాయనా ! ఈ సమస్త లోకములను వాటిని పదిలంగా రక్షిస్తూ తిరిగి వాటిని తనలో లీనం చేసుకునే విష్ణుమూర్తిని నేను కొలుస్తాను. అజుని, విశ్వమే తన రూపముగా కలవాడిని, మృత్యుంజయుడిని, దేవతలకు అధినాధుడిని, ఆది అయిన వాడిని, నాలుగు వేదములను అధ్యయనం చేసిన వాడిని, ఆత్మతో కాని ఎరుగ లేని వాడిని, ఈశానుడిని, నాశనం లేని వాడిని, అన్ని తపములకు కర్మఫలదాతను నేను ఆశ్రయిస్తాను. ఈ విధంగా వ్యాసుడు నారాయణుడిని స్తుతించాడు. వ్యాసుడు మమ్ము చూసి నా పూర్వ వృత్తాంతము మీకు చెప్పాను. మీరు కూడా నాకు విష్ణుమూర్తి చెప్పిన ఉపదేశములను ఆచరించండి. ఆ పరమేశ్వరుడిని కొలవండి. వేదముల చెప్పిన ప్రకారము నడవండి " అమ్మి మాకు చెప్పాడు. మేము వ్యాసుడు చెప్పిన విధముగా ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదముల ప్రకారము ఈ త్రిలోకాధిపతిని స్తుతించాము. మనసులో ఆరాధించాము " అని వైశంపాయనుడు జనమేజయునకు చెప్పాడు. జనమేజయ **మహారాజా ! వ్యాసుడు మాకు బోధించిన పుణ్యప్రదమైన విష్ణుతత్వము చదినను విన్న విప్రుడు వేదవేదాంగములను చదివిన ఫలమును పొందుతాడు, క్షత్రియుడు సర్వత్రా విజయము పొందుతాడు, వైశ్యుడు ధనలాభము పొందుతాడు, శూద్రుడు అత్యంత సుఖములను పొందుతాడు. పెళ్ళికాని వారికి పెళ్ళి జరుగుతుంది. గర్భిణీ స్త్రీలకు సుఖప్రసవం జరుగి మంచి పుత్రుడిని పొందుతుంది. గొడ్రాలు సంతానవతి ఔతుంది " అని వైశంపాయనుడు ఫలశృతి చెప్పాడు.**

## విష్ణు నామములు నిర్వచనాలు

జనమేజయుడు వైశంపాయనుడిని " మునివరా ! నిర్వచింప వీలుకాని గూఢమైన విష్ణునామాలను నాకు వివరించండి " అని అడిగాడు. **వైశంపాయనుడు** " జనమేజయమహారాజా ! పూర్వము అర్జునుడు శ్రీకృష్ణుడిని ఇదే అడిగాడు. అందుకు కృష్ణుడు అర్జునునికి వివరించిన విష్ణునామప్రాశస్తము గురించి చెప్పాడు. " అర్జునా ! నీవు నేను సనాతులమైన నరనారాయణులము. ఈ ప్రపంచాన్ని ఉద్ధరించడానికి ఈ భూమి మీద అవతరించాము. నీకు నేను గూఢమైన నా నామములు వాటి అర్ధములు వివరిస్తాను. అర్జునా ! నారములు అనగా జలములు. ఆయనము అనగా నివసించు స్థలము. నేను సదా జలములో నివసిస్తాను కనుక నాకు నారాయణుడు అనే నామము వచ్చింది. ఈ జగములన్నీ నాలో నివసిస్తాయి. నేను జగమంతా ఉంటాను కనుక నన్ను వాసుదేవుడు అంటారు. ఇంద్రియములను నిగ్రహించడము కంటే ఉత్తమమైన ధర్మము లేదు. అట్టి జనులు సదా నన్ను కొలుస్తుంటారు. జగములన్నీ నా ఉదరములో ఉన్నాయి కనుక నన్ను దామోదరుడు అంటారు. అన్నము, జలము, ఆహారము, అమృతము, వేదములు, పృశ్ని పేరుతో పిలువబడుతూ ఉంటాయి. అవి నా గర్భంలో ఉన్నాయి కనుక నన్ను పృశ్నిగర్భుడు అంటారు. సూర్యకాంతి, చంద్రకాంతి, అగ్ని శిఖలు, నాకు తల వెంట్రుకల వంటివి. అందుకని నన్ను కేశవుడు అంటారు. లోకరక్షణార్ధము నేను బ్రాహ్మణతత్వము, క్షాత్రము అవలంభిస్తుంటాను. బ్రాహ్మము బ్రాహ్మణులకు, క్షాత్రము క్షత్రియులకు పరమ ధర్మములు. కనుక బ్రాహ్మణులు, క్షత్రియులు తమ ధర్మములు తప్పక నెరవేరుస్తూ ముల్లోకముల విరాజిల్లుతుంటారు. బోధించడం, స్థాపించడం అగ్నికి చంద్రునికి కర్తవ్యములు. అఖిల లోకములను ఆనందింపచేసే సూర్యచంద్రులు నా రూపమే. సూర్యచంద్రుల రూపంలో లోకములకు మేలు చేసినందు వలన **వరదుడు, లోకభావనుడు, ఈశ్వరుడు, హృషీకేశుడు** మొదలైన నామములు నాకు వచ్చాయి. యజ్ఞములో హవిర్భాగమును హరిస్తాను కనుక నాకు హరి అనే నామము వచ్చింది. గోవులను రక్షించడానికి గుహాలో పడకుండా కొండను ఎత్తి పట్టుకున్నాను కనుక నాకు గోవర్ధనుడు అనే నామము వచ్చింది. నేను రోమరహితుడనై అందంగా ఉంటాను కనుక నాకు శిపివిష్టుడుఅనే పేరు వచ్చింది. నేను భూమిని దున్నుతుంటాను కనుక నా వర్ణము నలుపు కనుక నన్ను కృష్ణుడు అంటారు. నేను సత్వగుణ ప్రధానుడను నన్ను సత్వగుణము వీడదు, సత్వగుణమును ఆచరిస్తాను. నా జన్మ సత్వగుణ ప్రధానము కనుక నాకు సాత్వతుడు అన్న పేరు వచ్చింది. నాకు చ్యుతి లేదు కనుక నాకు అచ్యుతుడు అన్న పేరు వచ్చింది. మానవశరీరములో మూడు ధాతువుల రూపములో ఉంటాను కనుక నాకు త్రిధాతువు అన్న పేరు వచ్చింది. నా తేజస్సు వలన ఘృతము ఏర్పడింది కనుక నాకు ఘృతార్చి అనే పేరు వచ్చింది. ధర్మములలో వృషము అత్యుత్తమము. ఆ ధర్మమును నేనే కనుక నాకు వృషుడు అన్న పేరు వచ్చింది. ఆది, మధ్యము, అంతము లేని వాడను కనుక నాకు **అనాది,**

**అమధ్యుడు, అనంతుడు** అని కూడా పులుస్తారు. సదా శుచి అయిన మాటలు వింటాను కనుక నాకుశుచిశ్రవుడు అన్న పేరు వచ్చింది. వరాహావతార సమయముంలో నేను ఒకే కొమ్ముతో భూమిని పైకెత్తి పట్టుకున్నందున నాకు ఏకశృంగుడు అనే పేరు వచ్చింది. నేను ఎల్లప్పుడు ఈ లోకమును చైతన్యవంతము చేస్తాను కనుక నన్ను విరించి అంటారు. నేను విద్య రూపంలో అశరీరంగా సూర్యుడిలో లీనమై ఉంటాను కనుక నన్ను కపిలుడు అంటారు. యోగమును హిరణ్యము అంటారు కనుక అటువంటి యోగము నా కుక్షిలో ఉంది కనుక నన్ను హిరణ్యగర్భుడు అంటారు. ధర్మరక్షణార్ధము నరుడిగా నారాయణుడిగా ఈ లోకములో ఉధ్బవించాను కనుక నన్ను ధర్మజుడు అంటారు. నేను నరనారయణులుగా గంధమాధన పర్వతము మీద తపస్సు చేసుకుంటున్న సమయాన పరమశివుడు దక్షయజ్ఞము ధ్వంశం చేయపూనగా ఆ యజ్ఞము నావక్షస్థలంలో దాగింది. అప్పుడు నా వక్షస్థలము మీద ఉన్న కేశములు ముంజముల(గడ్డిపోచల) వలె మారినవి. అందుకని నాకు ముంజకేశుడు అని పేరు వచ్చింది. అప్పుడు యజ్ఞమును తరుముతూ వచ్చిన మహాశివుడు నాతో కలియబడ్డాడు. అప్పుడు నేను ఒక బాణమును అభిమంత్రించి పరశువు రూపంలో శివుని మీదకు విసిరాను. అప్పుడు మహాశివుడు ఆ పరశువును ఖండించాడు కనుక నాకు ఖండపరశువు అని పేరు వచ్చింది.

## శివకేశవుల యుద్ధము

అనిచెప్పిన కృష్ణుడితో అర్జునుడు " కృష్ణా ! నీవు మహాశివుడు చేసిన యుద్ధంలో ఎవరు గెలిచారు. నాకు చెప్పవా ! " అని అడిగాడు.కృష్ణుడు " అర్జునా ! ఆ సమయంలో రుద్రుడు నారాయణుడు ఒండొరులతో యుద్ధంచేయ సంకల్పించారు. రుద్రుడు తన త్రిశూలంతో నారాయణుడి వక్షస్థలం తాకాడు. నారాయణుడు తన చేత్తో రుద్రుడి మెడ పట్టుకున్నాడు. అది తెలిసి అక్కడకు బ్రహ్మదేవుడు అక్కడకు వచ్చి ఇద్దరినీ సమాధానపరిచాడు. బ్రహ్మదేవుడు " మహాశివా ! నీవు ఈ జగములంతకూ శివుడవు. శివుడంటే శుభంకరుడు. కనుక నీవు నీ కోపమును ఉపసంహరించు. జ్ఞానులందరికి శివుడు కేశవుడికి మధ్య భేధములేదని తెలుసు. వేదములతో తెలుకొనతగినది, నిర్గుణమైనది, ద్వంద్వములకు అతీతమైంది, అరూపమైంది అయిన ఒకే మూల తత్వము రెండు రూపములతో విరాజిల్లుతుంది. శివకేశవ తత్వము అంటే అదే. నిజానికి శివకేశవులకు భేధము లేదు. నరనారాయణులు ఈ జగత్తుకు ఆది పురుషులు. నీ దివ్యబుద్ధితో చూస్తే అది నిజమని మనమంతా ఆయన నుండి ఉద్బవించామని అవగతమౌతుంది. కనుక మహాశివా వెంటనే నీవు నారాయణుడిని ప్రసన్నం చేసుకో " అని శివుడిని ప్రార్ధించాడు. అప్పుడు శివుడు ప్రసన్నుడై తన కోపమును విడిచిపెట్టి నారాయణుడికి నమస్కరించాడు. నారాయణుడు " మహాశివా ! ఎవరైతే నిన్ను తెలుసుకుంటాడో వారు నన్ను తెలుసుకున్నట్లే ! నిన్ను సేవిస్తే నన్ను సేవించినట్లే. మహాశివా ! శివకేశవులకు బేధము లేదు. మహాశివా ! ఈ రోజు నుండి నా గుండెల మీద ఉన్న **శ్రీవత్సము** నీ త్రిశూలముకు గుర్తుగా ఉంటుంది. నీ కంఠము మీద ఉన్న నలుపు ఈ రోజు నుండి నా గుర్తుగా నా చేతిముద్రతో **శ్రీకంఠము**గా పిలువబడుతుంది " అని విష్ణువు చెప్పి " అర్జునా ! ఆ విధంగా నాకూ మహాశివుడికి మధ్య సఖ్యత కుదిరింది. ఇది చూసి బ్రహ్మ మొదలైన దేవతా సమూహములు ఆనందించారు. కనుక అర్జునా ! నేను వివిధ రూపములతో ఈ లోకములో ప్రవర్తిస్తుంటాను. నీవు కూడా అభవుడు, అమృత్యుడు అయిన శివుని పూజించి తరించు. నేను పక్కన ఉండి సదా రక్షించాను కనుక మహా భారత సంగ్రామంలో నీకు విజయము లభించింది. నీవు యుద్ధం చేసే సమయంలో మహాశివుడు త్రిశూలధారి అయి నీరధము ముందు నిలిచి శత్రు సంహారంచేసాడు. ఆ కారణంగానే నీవు విజయుడివి అయ్యావు. నీవు ఈ విషయం తెలుసుకోవడం మంచిది " అని కృష్ణుడు అర్జునుడికి చెప్పాడు " అని వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పాడు.

## నరనారాయణులు

జనమేజయుడు " మునీంద్రా ! అటు మహాశివుడు ఇటు విష్ణువు తోడుగా ఉండగా అర్జునుడికి విజయం లభించడంలో ఆశ్చర్యం ఏముంది. నారదుడు శ్వేతద్వీపంలో మహావిష్ణుదర్శనం చేసుకుని వచ్చిన తరువాత నరనారాయణుడికి నారదుడికి మధ్య జరిగిన సంభాషణా వివరములు చెప్పండి " అని అడిగాడు. **వైశంపాయనుడు** " నరనారాయణులు నారదుడికి అతిథి సత్కారములు చేసి శ్వేతద్వీప విశేషణాలు వివరించండి " అని అడిగారు. నారదుడు " మీ కృపాకటాక్షంతో నేను శ్వేతద్వీపంలో మహావిష్ణువును దర్శించాను. ఆయన రూపముకు మీ రూపముకు ఏమీ తేడా లేదు. అక్కడ తెల్లని శరీరము కలవారు, ఆకలిదప్పులు లేని వారు, ఇంద్రియనిగ్రహము లేని వారు, మౌనంగా ఉండే వారు అయిన మానవులను చూశాను. వారు విష్ణుమూర్తిని భక్తిశద్ధలతో కొలుస్తున్నాడు. విష్ణుమూర్తి కూడా వారితో విహరిస్తున్నాడు. నన్ను కృప చేసి నాకు క్షేత్రజ్ఞుడు, తన రాబోవు జన్మల గురించి, అవతారముల గురించి తెలియజేసాడు. ఆ శ్వేతద్వీపము చాలా ప్రశాంతంగా ఉంది. అక్కడ సూర్యచంద్రులు గాలిలేదు . మహావిష్ణువుకు ఏకాంత చిత్తముతో ధ్యానించే వారంటే ఇష్టమని తెలిసి నేను విష్ణువును ఏకాంతచిత్తంతో ధ్యానించాను. తరువాత విష్ణువు వద్ద శలవు తీసుకుని మీ వద్దకు వచ్చాను. నేను కూడా ఇక్కడే ఉండి మీదయకు పాత్రుడనౌతాను అన్నాడు. నరనారాయణుల అనుమతి పొంది నారదుడు బదరికావనంలో వేయి దివ్య సంవత్సరాలు తపస్సు చేసి తరువాత నరనారాయణుల వద్ద శలవు తీసుకుని హిమాలయాలకు వెళ్ళాడు. అక్కడ తన

శిష్యబృందంతో పూజలంకుంటున్నాడు.

## హరిమహిమ



బ్రహ్మకు వేదాలను తిరిగి ఇస్తున్న హయగ్రీవుడు

జనమేజయ మహారాజా ! సమస్త పాపహరమైన హరికథను భక్తిశ్రద్ధలతో విన్నావు. నీవు ఎల్లప్పుడూ విష్ణుమూర్తిని భక్తితో కొలుచిన నీకు మహోన్నతి కలుగుతుంది. హరిని ద్వేషించే వారు ఇహలోక సుఖాలకు పరలోక సుఖాలకు దూరము కావడమే కాక వారి పితరులకు కూడా నరకము ప్రాప్తిస్తుంది. ముల్లోకములలో ఉన్న వారందరికి హరియే ఆత్మ. హరిని ద్వేషించడం అంటే వారిని వారు ద్వేషించుకున్నట్లే అలాంటి వారికి ఆపదలు తధ్యము. మా గురువైన వ్యాసమహర్షి కూడా విష్ణువు అవతారమే. ఆయన చేత రచింపబడిన లోక పూజనీయమైన భారతము మనకు అందరికి తెలుసు. అటువంటి భారతమును అధ్యయనం చేసే శక్తి సాక్షాత్తు విష్ణుమూర్తికి తప్ప వేరెవరికి సాధ్యం కాదు. భారతంలో చెప్పబడిన ధర్మములు చెప్పడం మా గురుదేవులకే సాధ్యం " అని చెప్తున్న వైశంపాయనుడిని చూసి జనమేజయుడు " మహాత్మా ! మహావిష్ణువు హయగ్రీవుడిగా బ్రహ్మలోకం వెళ్ళాడు అన్నారు కదా ! పురుషోత్తముడైన విష్ణుమూర్తికి హయగ్రీవ అవతారం ఎత్తవలసిన అవసరం ఏమి ఉన్నది ? వివరించండి " అని అడిగాడు. వైశంపాయనుడు " జనమేజయమహారాజా ! ప్రళయకాలంలో శ్రీ మహావిష్ణువు యోగ నిద్రలో ఉండి ప్రళయము అంతరించిన తరువాత మేలుకొని తిరిగి సృష్టి చేయాలని సంకల్పించాడు. వెంటనే అహంకారం ఆవిర్భవించింది. విష్ణునాభి నుండి కమలంలో ఆవిర్భవించిన ఆ అహంకారముకు బ్రహ్మ అన్న నామధేయము జరిగింది. బ్రహ్మ ముందుగా వేదములను సృష్టించాడు. ప్రళయ కాలములో లయమైన సత్వ, రజో, తమో గుణాలలో మొదటిది అయిన సత్వ గుణము ముందుగా పుట్టింది. బ్రహ్మ సత్వగుణ సంపన్నుడయ్యాడు. రజో తమో గుణాలు రాక్షసగుణాలు అయ్యాయి ! వారిలో ముఖ్యులు మధు కైటభుడు. వారు తొలుతగా పుట్టిన వేదములను తీసుకుని పోయి పాతాళంలో దాచి పెట్టారు. " సృష్టికి మూలము వేదములే , అవి లేకుండా సృష్టి చేయలేను, నన్ను ఈ ఆపద నుండి ఎవరు రక్షిస్తారు " అనుకుని బ్రహ్మదేవుడు విష్ణువుని అనేక విధముల స్తుతించాడు. జలములలో శయనించి ఉన్న విష్ణువు హయగ్రీవ రూపంతో వేదములను వెదుకుతూ పాతాళముకు వెళ్ళి భయంకరంగా ప్రణవ నాదం చేసాడు. ఆ నాదం విన్న మధు కైటబులు ఆ ప్రణవ నాదం వినవచ్చిన దిక్కుకు పరుగెత్తారు. ఇంతలో హయగ్రీవుడు వేదముల బంధనములు ఊడదీసి తీసుకు వెళ్ళి బ్రహ్మదేవుడికి ఇచ్చి తిరిగి యధావిధిగా శయనించాడు.

## మధు కైటబులు

ప్రణవధ్వని వచ్చిన దిక్కుకు పరుగెత్తిన మధుకైటభులకు అక్కడ ఎవరూ కనపడక వేదములు పెట్టిన చోటుకు వెళ్ళి చూసి అక్కడ వేదములు కనిపించక పోవడంతో వారికి భయంకరమైన కోపము వచ్చింది. నానారభస చేస్తూ అటూఇటూ తిరుగుతూ ఉండగా యోగనిద్రలో ఉన్న విష్ణుమూర్తి వారికి కనిపించాడు. వారు విష్ణువును యుద్ధముకు ఆహ్వానించగా విష్ణువు యుద్ధోన్మాదులైన మధుకైటబులను సంహరించాడు. అలాసృష్టి జరగడానికి సాయం చేసాడు. బ్రహ్మదేవుడు సృష్టిచేయడం ప్రారంభించాడు. అప్పటి నుండి **హయగ్రీవుడు** అన్ని అవతారముల కంటే మహిమాన్వితుడయ్యాడు. వేదములను రక్షించిన హయగ్రీవుడిని వేదములు సదా ఆశ్రయించి ఉంటాయి. జనమేజయమహారాజా ! హరి త్రిగుణములలో హెచ్చుతగ్గులను కలిగిస్తుంటాడు కనుక మానవులలో కూడా త్రిగుణములు హెచ్చుతగ్గులుగా ఉంటుంది. అందుకే మానవులలో ఒకరు గుణవంతులు మరొకరు గుణరహితులు ఔతారు. మానవులలో త్రిగుణాలకు కారణం అయిన శ్రీహరి త్రిగుణాలను నాశనంచేసే శక్తి ఆయనకే ఉంది. వేదములు, యజ్ఞములు, పుణ్యకార్యములు, పంచభూతములు శ్రీహరి రూపాలే " అని వైశంపాయనుడు చెప్పాడు.

## ఏకాగ్రత

**జనమేజయుడు** " మహాత్మా ! ఏకాగ్రచిత్తులు గొప్ప వారు అన్నావు కదా ! అసలు ఏకాగ్రత అంటే ఏమిటి ? " అని అడిగాడు.

**వైశంపాయనుడు** " జనమేజయా ! పూర్వము శ్రీకృష్ణుడు మీ తాతగారైన అర్జునుడికి భారతయుద్ధ ఆరంభంలో సాంఖ్యము, యోగముల సారము బోధించారు. దానినే **భగవద్గీత** అంటారు. అది నేను ఎప్పుడో విన్నాను ఇప్పుడు నీకు చెప్తాను శ్రద్ధగా విను. ఏకాగ్రత ధర్మమును పూర్వము నారాయణుడికి ఉపదేశించాడు. దానిని బ్రహ్మ దక్షుడికి ఉపదేశించాడు. దక్షప్రజాపతి తన మనుమడైన సూర్యుడికి ఉపదేశించాడు. సూర్యుడు దానిని మనువుకు ఉపదేశించాడు. మనువు ఇక్ష్వాకుడికి ఉపదేశించాడు. ఇక్ష్వాకుడి నుండి ఆ ఏకాంతిక ధర్మము యోగ్యులైన వారికి పరంపరగా అందజేయబడింది. ఈ ఏకాంతిక ధర్మమును మహావిష్ణువు నుండి ఉపదేశం పొందిన నారదుడు తన శిష్యులకు ఉపదేశించాడు. వారి నుండి వారి శిస్యులకు అలా పరంపరగా సకల జనులకు చేరింది. ఏగాగ్రత ధర్మము దుర్మార్గులకు మాత్రము అవగతము కాదు. ఈ ఏకాగ్రత ధర్మము అహింసకు మూలము. ఈ అహింసా వ్రతముతో శ్రీహరి ప్రీతి చెందుతాడు. హరి అన్నా క్షేత్రజ్ఞుడు అన్నా ఒకటే. శ్రీహరి తన భక్తులకు వాసుదేవాది నాలుగు రూపములలో దర్శనం ఇస్తాడు. ఈ నలుగురిలో **వాసుదేవుడు** ప్రధముడు, రెండవ వాడు **సంకర్షణుడు**, మూడవ రూపము **ప్రద్యుమ్నుడు**, నాల్గవ రూపము **అనిరుద్ధుడు**. ఎన్ని రూపములలో దర్శనం ఇచ్చినప్పటికీ అంతర్లీనంగా ఉండే రూపము ఒక్కటే. ఆ దైవస్వరూపము మన ఇంద్రియములకు గోచరం కాదు. అనన్య భక్తి, తపస్సు, మనో నిగ్రహం, ఇంద్రియ నిగ్రహం కలవారికి మాత్రమే ఆ దైవస్వరూపము గోచరమౌతుంది. ఏకాంతధర్మము శాంత మనస్కుడికి కరతలామలకం. ఈ ఏకాగ్ర ధర్మము మనలోని అన్ని చింతలను తుడిచి వేయు ఆయుధము " అని వైశంపాయనుడు చెప్పాడు.

## నోములు వ్రతాలు

**జనమేజయుడు**" మహాత్మా ! ప్రజలు అత్యున్నతమైన ఏకాగ్రతావ్రతం ఆచరించక ఏవోవో పూజలు నోములు వ్రతాలు ఏ ప్రయోజనాన్ని ఆచరిస్తున్నారు ? వివరించండి " అని అడిగాడు. **వైశంపాయనుడు** " మహారాజా ! మనస్సు త్రిగుణముల వలన ప్రభావితమౌతుంది. అందులో ఉత్తమమైన సాత్వికగుణము కలవారి యోగక్షేమములు శ్రీ మహావిష్ణువే చూసుకుంటాడు. వారే ఏకాగ్రచిత్తం కలిగిన ఏకాంతికులు. వారికి దైవచింత తప్ప వేరే వ్యాపకం లేదు. రాజసము తామసము అవలంబించిన వారు ప్రాపంచిక విషయాలలో మునిగి భోగలాలసలో నిమజ్జులై ఉంటారు. అలాంటి వారు శ్రీహరికృపకు పాత్రులు కాలేరు. ఏకాంతికులు ఏకాంతచిత్తంతో సేవించే వారు విష్ణుమూర్తి మనసులో చోటుచేసుకుంటారు. ఈ విషయాన్ని వేదాలు కూడా ఉద్ఘాటిస్తున్నాయి. మా గురువుగారు దయతో నాకు ఉపదేశించిన ఈ ఉపదేశము విని నేను పవిత్రుడనైనాను. జనమేజయా ! నీవు కూడా ఆచరించగలిగిన ఏకాగ్రవ్రతము ఆచరించి ఏకాగ్రతతో శ్రీహరిని ధ్యానించి తరించి శాశ్వతత్వాన్ని పొందు " అని వైశంపాయనుడు. జనమేజయుడు" ఓ మహర్షీ ! లోకములో యోగము, సాంఖ్యము, వేదములు, పాశుపతము, పంచరాత్రము, ఇంకా అనేక సాధనాలు ఉన్నాయి కదా! అన్నిటికీ నిష్టలు ఒకే విధంగా ఉంటాయా ! లేక వేరువేరుగా ఉంటాయా ! అసలు వీటిని ఎవరు ఉపదేశించారు ? " అని అడిగాడు. వైశంపాయనుడు " జనమేజయమహారాజా ! వేదములకు, సాంఖ్యముకు, యోగముకు, ఇతర శాస్త్రాలకు మూలకర్త శ్రీహరే ! అన్నీ ఆయనను చేరడానికి ఉన్న మార్గాలే ! వేదములను నారాయణ పుత్రుడు అయిన వ్యాసుడే చేత ఉపదేశించబడింది. సాంఖ్యమును **కపిలుడు** ఉపదేశించాడు, యోగమును **హిరణ్యగర్భుడు** ఉపదేశించాడు, పాశుపతమును శివుడు ఉపదేశించాడు, వైష్ణవము అను పంచరాత్రమును సాక్షాత్తు విష్ణుమూర్తి చేత ఉపదేశింపబడింది " అని వైశంపాయనుడు చెప్పాడు.

## వ్యాసుడు

**జనమేజయుడు** " మహర్షీ ! తమరు వ్యాసుడు పరాశరుడి పుత్రుడని అన్నారు కదా ! మహావిష్ణువుకు కుమారుడు ఎలా అయ్యాడు " అని అడిగాడు. **వైశంపాయనుడు** " మహాభారతకథను రచించి అలసి పోయిన వ్యాసుడు అలసి పోయి హిమాలయాలకు వెళ్ళి తపస్సు చేసుకుంటున్నాడు. అక్కడ వ్యాసుడు శిష్యుల చేత పరచర్యలు అందుకుంటూ వారికి వేదములను భారతమును దాని అర్ధములను బోధిస్తున్నాడు. ఆ సమయంలో నేను మరి కొందరు శిష్యులు వ్యాసుడికి పాదాభివందనం చేసి " గురువుగారూ ! తమరిని నారాయణుడి పుత్రుడు అంటారు కదా ! అది ఎలా సంభవించింది " అని అడిగాము. వ్యాసుడు " ఆది కాలములో సృష్టి చేయ సంకల్పించిన నారాయణుడు ముందుగా నాభి కమలము నుండి బ్రహ్మను సృష్టించాడు. బ్రహ్మ సకల జీవకోటిని సృష్టించాడు. బ్రహ్మముఖము నుండి వేదములు పుట్టాయి. ఆ వేదములు అధ్యయనం చేయడానికి శ్రీమన్నారాయణుడు **అపాంతరతముడు** అనే వాడిని మనసంకల్పం చేత సృష్టించాడు. అతడు నారాయణుడిని తన కర్తవ్యము ఏమిటని అడిగాడు. నారాయణుడు నీవు వేదములను అధ్యయనం చేసి వాటిని వ్యాసం చెయ్యి అని చెప్పగా వేదవ్యాసుడు అందుకు అంగీకరించాడు. అప్పటికి కలగాపులగంగా ఉన్న వేదములను అధ్యయనం చేసిన అపాంతరతముడు వాటిని నాలుగు వేదములుగా విభజించాడు. దానికి ప్రీతి చెందిన నారాయణుడు " ఇలారా వేదవ్యాసా ! నీవు నా కుమారుడవు . నీవు అన్ని మన్వంతరములలో ఉంటావు. నీకు త్రికాలజ్ఞానము ప్రసాదిస్తున్నాను. నీకు నా కధలు, ధర్మములు, ఈ లోకములో చేయతగిన అన్ని కార్యములు గోచరిస్తాయి. నీవు రాబోవు కాలములో

పరాశరకుమారుడిగా జన్మిస్తావు. నీకు పుట్టిన కుమారులు కురుసామ్రాజ్యాన్ని పాలిస్తారు. వారు వారి కుమారులు రాజ్యకాంక్షతో ఒకరితో ఒకరు కలహించి యుద్ధములు చేసి సర్వనాశనం ఔతారు. అపాంతరతమా ! కాలక్రమేణా ! మరలా వేదములు ఒకదానితో ఒకటి కలిసి పోతాయి. ఈ లోకములకు కలిగిన ధర్మసందేహములను తీర్చగలిగిన వాడివి నీవే. నీవు సాంఖ్యమును , యోగమును అభ్యసించి లోక పూజితుడవు ఔతావు. కుమారా ! ఇన్ని చేసినా నీకు వైరాగ్యము సిద్ధించదు కాని నీకు విరాగి అయిన పుత్రుడు జన్మిస్తాడు. అతడికి వైరాగ్యము సిద్ధిస్తుంది వెళ్ళు " అని చెప్పి విష్ణుమూర్తి అంతర్ధానం అయ్యాడు " అని చెప్పిన వ్యాసుడు నాకు త్రికాలజ్ఞం లభించింది కనుక నాకు పూర్వ జన్మలలో జరిగినది అన్నీ అవగతమయ్యింది. నేను నారాయణుడి మానసపుత్రుడను. నేను ప్రతిజన్మలో నారాయణుడి గురించి తపస్సు చేసి ఆయన దయకు పాత్రుడను ఔతాను " అని నా గురువు వ్యాసుడు తన పూర్వజన్మ వృత్తాంతమును మాకు వివరించావు " అని వైశంపాయనుడు చెప్పాడు.

### నారద నారాయణ సంవాదము

వైశంపాయనుడు " జనమేజయా ! నారద నారయణ సంవాదము, నారదుడు బదరికాశ్రమంలో నరనారాయణులను కలుసుకుని శ్వేతద్వీపము విశేషాలు గురించివివరించడం, నారయణుడి అనుమతి తీసుకుని నారదుడు బదరికావనంలో తపస్సు చేయడం, తిరిగి హిమవత్పర్వతాలకు వెళ్ళి తపస్సు చేయడం, హయగ్రీవుడి వృత్తాంతం అన్నీ మాకు మా గురువుగారు చెప్పే సమయంలో అక్కడ ఉన్న శ్రీకృష్ణుడు, ధర్మరాజాదులు విన్నారు, అర్జునుడి కోరిక మేరకు శ్రీకృష్ణుడు తన నామార్ధములను వివరించాడు. **వేదములు, సాంఖ్యము, యోగము, పాశుపతము, పంచరాత్రము, ఏకాంతిక ధర్మము** వాటి గురించి మా గురువుగారు వివరించగా ధర్మరాజాదులు విన్నారు. ఇప్పుడు నీ కోరిక మీద నేను నేను నీకు చెప్పాను. ఈ లోకంలో ఏకాంతిక ధర్మముకు మించినది మరొకటి లేదు " అని జనమే జయుడికి చెప్పాడు.

## ఉత్తమ ధర్మము

ధర్మరాజు " పితామహా ! ఈ లోకములో ధర్మములన్నీ చెప్పారు కదా ! వాటిలో ఆచరించతగిన ఉత్తమధర్మము ఏది ? " అని భీష్ముడిని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! అన్ని ధర్మములు ఉత్తమమైనవే పనికిరాని ధర్మము ఏదీ లేదు. వాటిలో వారివారికి నచ్చిన ధర్మాలు వారు ఆచరిస్తారు. తమకు నచ్చిన ధర్మాలను ఆచరించే జనులను అనేకులు మన జీవితంలో తారసపడతారు. ఒక సారి నారదుడు లోక సంచారము చేస్తూ దేవేంద్రుడి వద్దకు వెళ్ళాడు. దేవేంద్రుడు నారదమునిని తగురీతిని సత్కరించి ఉచితాసనమున కూర్చుండ పెట్టి " నారద మునీంద్రా ! నీవు అన్ని లోకములను సంచరిస్తుంటావు కదా ! నీకు ఎక్కడైనా అత్యంత ఆశ్చర్యకరమైనది కనిపించిందా ! " అని అడిగాడు. నారదుడు " గంగానదికి దక్షిణ తీరంలో మహాపద్మము అనే నగరములో భృగుడు అనే బ్రాహ్మణుడు నివసిసిస్తున్నాడు. అతడు ధర్మపరుడు, సత్యవాది, అహింసా వాది, ఇంద్రియనిగ్రహము కలవాడు, తనకు ఉన్న దానితో తృప్తిచెందే వాడు. కోపము అసలే లేని వాడు, తాను న్యాయంగా సంపాదించిన ధనముతో దేవ కార్యములు, పితృ కార్యములు, అతిథి సత్కారములు చేసే వాడు. అతడికి తగినట్లు వినయ సంపన్నులైన కుమారులు కలిగారు. అయినా అతడు సదా ఏ కార్యము చేస్తే మేలు కలుగుతుంది, ధర్మకార్యాలు ఏవి ఆలోచిస్తూ ఉండే వాడు. ఒకరోజు వారి ఇంటికి ఒక బ్రాహ్మణుడు వచ్చాడు.

### ఆత్మదర్శనం

**భృగుడు** అతడికి అతిథి సకారాలు చేసి " అనఘా ! నేను ప్రతిరోజు ఆత్మ దర్శనం చేయడానికి ప్రత్నిస్తాను కాని నా మనసును ప్రాపంచిక విషయముల నుండి మరల్చలేక పోతున్నాను. కనుక నాకు ఆత్మదర్శనం సాధ్యం కావడం లేదు. నాకు మార్గము ఉపదేశించండి " అని అడిగాడు. బ్రాహ్మణుడు " భృగూ ! నేను కూడా ! నీ మాదిరి ఆత్మదర్శనం చేసుకోవాలని ప్రయత్నం చేసి ప్రాపంచక విషయాలలో పడి పొంద లేక పోయాను. నాకూ సరి అయిన దారి కనపడ లేదు. నాకు సరి అయిన మార్గము గోచరించ లేదు. కొందరు బ్రహ్మచర్యము వలన, కొందరు గృహస్థాశ్రమంలో ఉండి, మరి కొందరు తపమాచరించి, కొందరు యజ్ఞయాగములు చేసి, మరి కొందరు నిష్కామ కర్మలు చేసి మరి కొందరు ఆత్మదర్శనం పొందారు. కొంత మంది తల్లి తండ్రులను సేవించి, మరి కొందరు భక్తితో భవంతుడిని కొలిచి, కొందరు మంచి నడవడి ప్రవర్తనతో, కొందరు ఇంద్రియ నిగ్రహముతో ప్రశాశాంత జీవితము గడుపుతూ, కొంరౌ సత్యము, అహింస పాటించి ఆత్మ దర్శనం పొందుతారు. ఆత్మ దర్శనానికి అనేక కార్యములు ఉన్నా అది అంత సులువైనది మాత్రం కాదు. నైశారణ్యములో ఉన్న **గోమతినదీ** తీరాన **మహాపద్మతటాకము** తీరాన ఒక మహాసర్పము నివసిస్తుంది. ఆ మహాపద్మతటాక తీరంలో పూర్వము మాంధాత తపమాచరించాడని ప్రతీతి. అక్కడ ఉన్న నాగరాజు పేరు **పద్ముడు**. అతడు మహా ధర్మాత్ముడు, దయకల వాడు. అతడికి

అతిథులంటే ప్రేమ ఎక్కువ. నీవు పద్మనాభుడిని దర్శించి అతడి వద్ద ఉపదేశం పొంద వచ్చు " అన్నాడు.

## సూర్యరధము

**భృగువు** బంధు మిత్రుల అనుమతి తీసుకుని మిత్రుల అనుమతి తీసుకుని భృగువు నైశారణ్యముకు వెళ్ళాడు. అక్కడ నాగేంద్రుడిని దర్శించగా అతడి భార్య భృగువును భక్తితో పూజించి " మహానుభావా ! తమరు ఇక్కడకు వచ్చిన కారణం ఏమిటి ? " అని అడిగింది. భృగువు " అమ్మా ! నేను నీ భర్తను దర్శించాలని వచ్చాను. నీ భర్త ఎక్కడ ? " అనీడిగాడు. అందుకు ఆమె " నా భర్త ఒక సంవత్సరానికి ఒక మాసము సూర్యరధానికి పగ్గంగా ఉంటాడు. ఈ మాసము అతడి వంతు కనుక వెళ్ళాడు. ఇంకా ఒక ఎనిమిది రోజుల అనంతరం వస్తాడు. మీరు వచ్చిన పని చెపితే నేను ఆపని చేయగలిగితే చేస్తాను " అన్నాడు. భృగువు " అమ్మా ! నేను నీ భర్తను చూడ వచ్చాను కనుక నేను అతడి కొరకు వేచి ఉంటాను. అతడు రాగానే నా గురించి చెప్పమ్మా " అని అడిగాడు. అలా ఆరు రోజులు గడిచే వరకు భృగువు ఆహారపానీయములు ముట్ట లేదు. నాగేంద్రుడి సేవకులు వచ్చి " అయ్యా ! మాకు అన్నిటి కంటే అతిథిసేవ ముఖ్యము. మీరు అన్యధా భావించ మా ఆతిథ్యము స్వీకరించి మేము తెచ్చిన అన్నము, ఫలములు, కందమూలములలో వాటిలో ఏపైనా మీకు ప్రీతికరమైనవి తినండి " అని వేడుకున్నారు. భృగువు " అయ్యా ! మీరు ఇంత చెప్పవలెనా ! నేను నాగరాజు దర్శనం చేసుకునే వరకు ఆహారం ముట్టను. నాకు ఆకలి దాహము కలగడము లేదు. మీకు ఎటువంటి మాట రానీయను. ఇక రెండుదినములలో నాగరాజు రాకున్న నేను మీ ఆతిథ్యము స్వీకరిస్తాను " అన్నాడు. వారు వెళ్ళి పోయారు. ఎనిమిదవ రోజుకు సూర్యుడి వద్ద నుండి నాగరాజు వచ్చాడు. నాగరాజు భార్యతో " అతివా అందరూ క్షేమంగా ఉన్నారు కదా ! దేవ కార్యములు, అతిథి పూజలు చక్కగా జరుగుతున్నాయా ! నేను లేనందున్న పొరపాట్లు జరుగ లేదు కదా ! " అన్నాడు. అందుకు ఆయన భార్య " నాధా ! మీరు ఇంతగా చెప్పాలా ! మీరు నాకిచ్చిన శిక్షణ వలన దేవతా పూజలు, అతిథి సత్కారాలు చక్కగా చేసాను. నాధా ! శిష్యులకు గురువు ఎడల భక్తి. బ్రాహ్మణులకు వేదముల ఎడ భక్తి, క్షత్రియులకు ప్రజారక్షణలో భక్తి, వైశ్యులకు ధనసంపాదనలో భక్తి, శూద్రులకు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను సేవించడంలో భక్తి, యజమాని ఎడల సేవకులకు భక్తి, సర్వులకు ఉపకారం చేస్తూ ఆదరించడం గృహస్థులకు భక్తి, ఏకాంతంలో తపస్సు చేయడం యోగులకు భక్తి, పతి ఎడల భార్యకు భక్తి ఇవి ప్రతివారు ఆచరించతగిన సువ్రతములు. అనేక ధర్మశాస్త్రాలు తెలిసిన మీ భార్యను నేను మీకు అయిష్టమైన పనులు చేస్తానా ! నాధా నాది ఒక మనవి మీ దర్శనార్ధమై మన ఇంటికే ఒక పావనుడైన బ్రాహ్మణుడు మన ఇంటికి వచ్చాడు. అతడు మీ దర్శనం ఆశించి నిరాహారి జపము చేస్తూ అయి ఎనిమిది రోజులుగా వేచి ఉన్నాడు. మీరు వెళ్ళి ఆయనను పరామర్శించండి " అన్నది. నాగరాజు " లలనా ! దేవతలు, అసురులు గౌరవించే నేను ఒక సామాన్య బ్రాహ్మణుడిని పరామర్శించడానికి వెళ్ళడమా ! " అన్నాడు. ఆమె " నాధా ! అలా కాదు. మీ దర్శనం కోరి ఎనిమిది దినముల నుండి నిరాహారి అయి వేచి ఉన్న బ్రాహ్మణుడి కోరిక తీర్చకపోవడం ధర్మమా ! ఆ బ్రాహ్మణుడిని నిరాశపరచిన పాపంలో ఇప్పటి వరకు నీవు సంపాదించిన పుణ్యము, ఉచితానుచిత జ్ఞానము, కృపాగుణము, ధర్మశాస్త్ర పాండిత్యము దగ్ధంచేస్తావా ! నీ ధర్మనిరతి ఇదేనా ! బ్రాహ్మణుడిని నిరాశపరచిన బ్రహ్మహత్యాపాతకము చుట్టుకుంటుంది. నాధా ! మౌనవ్రతముతో ధృఢమైన జ్ఞానను, దానం చేసినందు వలన అభ్యుదయము, ఎదుటి వారి ఆశలు సఫలం చేసినందు వలన నరకబాధలు తొలగి పోతాయి స్వర్గసుఖాలు కలుగుతాయి అని పెద్దలు చెప్తారు కదా ! వర్షం కొరకు వేచిచూచే చాతక పక్షిలాగా ఆ బ్రాహ్మణుడు నీ కొరకు ఎదురు చూస్తున్నాడు. నీవు రోషము తగ్గించుకుని బ్రాహ్మణుడిని పరామర్శించండి " అని హిత బోధ చేసింది. నాగరాజు " తరుణీ ! ఎవరో అపరిచితుడిని చూడడానికి నాకు రోషము వచ్చినది నిజము. నాలో కలిగిన గర్వము, రోషం నీ బోధనతో తొలగించి నేను అధర్మవర్తనుడిని కాకుండా కాపాడావు. పూర్వము ఈ గర్వము కోపము చేతనే **కార్తవీర్యార్జునుడు, రావణాసురుడు** వరుసగా పరశురాముడి చేతిలో శ్రీరాముడి చేతిలో మరణించారు. కనుక కోపము వదలడం మేలు కలిగిస్తుంది. భృగువు ఆయన దర్శనం చేసుకుని నీ వంటి భార్య వలననే కదా ! నాకు ఇంతటి పాపములో కూరుకు పోవలసిన ఆపద తప్పింది కదా ! " అని చెప్పి నాగరాజు వడివడిగా బ్రాహ్మణుడిని చూడడానికి వెళ్ళాడు.

## మహాపద్మడు

నాగరాజును చూసిన భృగువు సంభ్రమంతో ఎదురువెళ్ళాడు. ఇద్దరూ ఒకరి క్షేమము ఒకరు తెలుసుకున్న తరువాత ఒక చెట్టు కింద కూర్చున్నారు. నాగరాజు " మహాత్మా ! తమరు ఎనిమిది దినముల నుండి నా కొరకు వేచి ఉన్నారు . మీ కోరిక ఏదైనా తప్పక నెరవేరుస్తాను " అన్నాడు. బ్రాహ్మణుడు " నాగరాజా ! నీ గురించి విని నీ వద్దకు వచ్చాను. నీవు సూర్యభగవానుడి వద్దకు వెళ్ళావని విన్నాను. అందుకని మీ కొరకు ఎదురు చూస్తున్నాను. మీరు నా సందేహములు తీర్చండి " అని అడిగాడు. నాగరాజు " మీ వంటి వారి సందేహము తీర్చడమే నా జన్మకు ధన్యత అడగండి " అన్నాడు. బ్రాహ్మణుడు " నాగరాజా ! నా సందేహములు తరువాత అడుగుతాను. ముందుగా మీరు సూర్యరధము వెంట వెళ్ళునప్పుడు జరిగిన అద్భుతముల గురించి వివరించండి " అని అడిగాడు. నాగరాజు " బ్రాహ్మణోత్తమా ! ఆశ్చర్యములలో ఆశ్చర్యము **ఆదిత్యుడు**. అతడి వలన ఈ

లోకములోని జీవజాలము చైతన్యంతో జీవిస్తుంది. సూర్యకిరణ ప్రభావంతో **దేవతలు, వాలఖిల్యులు, మహామునులు, సిద్ధులు, పక్షిజాతులు** హాయిగా జీవిస్తున్నారు. సూర్యకిరణ వేడితో వేడిక్కిన జలములు మేఘముల రూపుచెంది వర్షిస్తున్నాయి. ఇంతకంటే అద్భుతము ఏమి కావాలి. బ్రాహ్మణోత్తమా ! సూర్యుడు వర్షములు కురిపిస్తున్నాడు. తిరిగి కిరణముల వేడిచేత ఆ నీటిని లాక్కుంటున్నాడు ఇంతకంటే వేరొక ఆశ్చర్యము ఏమి ? ఈ సూర్యుడి వలన బీజములు వృక్షములు ఔతాయి. ఇది అద్భుతము కదా ! ఇంత ఎందుకు ఆ నిరంజనుడు, అక్షరుడు, అజరుడు, అవ్యయుడు, శాశ్వతుడు అయిన పురుషోత్తముడు సూర్యుడి ద్వారా వెలుగుతున్నాడు. ఇంత కంటే వేరొక అద్భుతము ఏమి ?

## అగంతకుడు

ఒకరోజు మధ్యాహ్నము సూర్యుడిలా వెలిగిపోతున్న ఒకడు ఎదురు వచ్చాడు. అతడిని చూసి సూర్యుడు తన చేతిని అందివ్వగా అతడు సూర్యుడి చేతిని పట్టుకుని క్రమంగా అతడిలో లీనం అయ్యాడు. ఇంతవరకు రధము మీద కూర్చున్న వాడు సూర్యుడా ! లేక వచ్చిన వాడా సూర్యుడా ! అన్న సందేహము రధము లాగుతున్న నాగరాజులందరికీ కలిగినా ! నేను మాత్రము ధైర్యము చేసి సూర్యుడిని అడిగాను. సూర్యుడు ప్రేమగా నన్ను చూసి " వచ్చిన వాడు దేవతలు, యజుడు, గంధర్వుడు, నాగజాతి వాడు ఎవరూ కాదు. **ఉంఛవృత్తి**తో జీవించు వాడు. అతడు నియమ నిష్టలతో జీవితము గడుపుతూ, కందమూలములు, ఫలములు, నీరు మాత్రమే స్వీకరించి జీవిస్తున్నాడు. అతడికి కోరికలు లేవు, తనకు ప్రాప్తము లేని దానికి అర్రులుచాచడు, సర్వభూతహితుడు అందుకే అతడు సిద్ధిపొంది సూర్యలోక ప్రవేశం చేసాడు " అని చెప్పాడు. బ్రాహ్మణోత్తమా ! ఇలాంటి అద్భుతాలు ఎన్నింటినో చూసాను " అని నాగరాజు చెప్పాడు. ఆ మాటలు విన్న భృగు నాగరాజుతో " నీ మాటలతో నా సందేహములన్నీ తీరిపోయాయి. ఇక నేను వెళ్ళి వస్తాను " అన్నాడు. నాగరాజు " అదేమిటి బ్రాహ్మణోత్తమా ! ఎంతో కష్టపడి ఇంత దూరము వచ్చావు. నీవు వచ్చిన పని చెప్ప లేదు. నీ కోరిక ఏమిటో అడుగు నేను తీరుస్తాను. నాయందు నీవు ఉన్నావు నీ అందు నేను ఉన్నాను మన ఇద్దరి అందు ఈ ప్రపంచం ఉంది. నిశ్చింతగా ఉండండి " అన్నాడు నాగరాజు. భృగు " నాగరాజా నీవు చెప్పినది నిజము. నీవు నేను ఈ సమస్త జీవరాశులు అంతా ఒకటే. ఎలాంటి భేదము లేదు. నేను ఏమి తెలుసుకోవడానికి వచ్చానో అది నాకు అవగతము అయినది. నాకు ఆత్మదర్శనం అయింది. అందరినీ సమ దృష్టితో చూడాలన్నది ఒక వ్రతముగా పెట్టుకుంటాను. ఇక నాకు శలవు ఇప్పించండి " అని చెప్పి భృగువు అక్కడ నుండి వెళ్ళి పోయాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ |

# అనుశాసనిక పర్వము

వికీపీడియా నుండి

**అనుశాసనిక పర్వము**, మహాభారతంలోని 13వ భాగం. భీష్ముడు యుధిష్ఠిరునకు చేసిన చివరి ఉపదేశాలు (అనుశాసనాలు) ఈ పర్వంలోని ప్రధాన ఇతివృత్తం.

## విషయ సూచిక



## సంస్కృత మహాభారతం

## ఆంధ్ర మహాభారతం

## విశేషాలు

## మూలాలు

## బయటి లింకులు

- కిశోరీ మోహన్ గంగూలి ఆంగ్ల అనువాదం (http://www.sacred-texts.com/hin/m01/index.htm)

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

# అనుశాసనిక పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# ప్రథమాశ్వాసము

ధర్మరాజు భీష్ముడితో " పితామహా ! మీరు నాకు ఎన్నో ఉపదేశించారు. కాని నా మనసుకు కొంచెం కూడా శాంతి కలుగ లేదు. పట్టుబట్టి ఎంతో మందిని బంధువులను యుద్ధములో వధించాను. మిమ్ము అతి దారుణంగా శరతల్పగతుడిని చేసాను. ఇంత చేసిన నాకు మనశ్శాంతి ఎలాకలుగుతుంది. పితామహా ! నేను సుయోధనుడిని రాజ్యం ఇరువురము పంచుకుని పరిపాలిద్దాము అని ప్రాధేయపడ్డాను. అతడు అందుకు సమ్మతించ లేదు. నేను మాత్రం పోతే పోనీలే అతడికే రాజ్యాన్ని వదిలి వేద్దాము అని అనుకున్నానా ! అలా ఉండక కోపంతో రగిలి పోయి పట్టుదలలకు పోయి యుద్ధం చేసాను ఫలితం సర్వనాశనం అయింది. ఈ నాడు పశ్చాత్తాపపడి ప్రయోజనమేమి ? ఇక నాకు దు:ఖం తప్ప శాంతి ఎలా కలుగుతుంది " అని బాధపడ్డాడు. భీష్ముడు ఊరడింపుగా " ధర్మనందనా ! చింతించకుము అంతా దైవనిర్ణయమే. దానిని తప్పించుట మనచేతిలో లేదు మనము కర్తలమూ కాదు.

## బ్రాహ్మణ వనిత

దీనికి ఒక కథ చెప్తాను విను. ఒక ఊరిలో గౌతమి అను బ్రాహ్మణ వనిత ఉండేది. ఆమెకు ఒక కొడుకు ఉన్నాడు. అతడు ఒక రోజు పాము కరిచి చనిపోయాడు. అది చూసి ఆమె దు:ఖించ సాగింది. అంతలో అది చూసిన బోయవాడు ఆ కుర్రాడిని కరిచిన పామును పట్టి తెచ్చి " అమ్మా ! ఇదిగో నీ కుమారుడిని కరిచిన పామును పట్టి తెచ్చాను. దీనిని ఏమి చెయ్యమటావో చెప్పు. తలపగులకొట్టి చంపమంటావా ! లేక నిలువునా చీల్చి చంపమంటావా ! నీవు ఎలా చెప్తే అలా చేస్తాను " అన్నాడు. గౌతమి " అన్నా ! ఈ పామును విడిచి పెట్టు " అన్నది. బోయవాడు " అమ్మా ! ఇది నీ కుమారుని చంపింది కదా! " అన్నాడు. గౌతమి " అన్నా! విధివశాత్తు ఈ ఆపద వచ్చింది. నాకుమారుడు చనిపోయాడు. అందుకు దు:ఖించడము సహజమే అయినా ! దానికి కారకులు అయిన వారిని చంపడం అధములు చేసే పని. ఉత్తములు , ధర్మపరులు ఆ పని చెయ్యరు. జరిగిన ఆపదను వెంటనే మరచి పోతారు. అన్నా ! నీవు ఆ పామును చంపినంత మాత్రాన నా కుమారుడు బ్రతుకుతాడా ! దానిని విడిచి పెట్టు " అన్నది. బోయవాడు " అమ్మా ! నీ మాటలు నాలాంటి వాడికి అర్ధము కాదు. చంపిన వాడిని చంపడమే నాకు తెలిసిన ధర్మము. కనుక ఈ పామును చంపుతాను " అని అన్నాడు. గౌతమి " అన్నా ! నీ పేరు అర్జునుకుడు. అంటే తెల్లని వాడివి, స్వచ్ఛమైన వాడివి, అమాయకుడివి నీవు ఇలా ప్రవర్తించ తగదు . అయినా నేను హింసకు ఎలా సహిస్తాను " అన్నది. బోయవాడు " అమ్మా ! నా మాట విను జనులను బాధించే వారిని చంపడమే ధర్మము దాని వలన పాపము రాదు " అన్నాడు. గౌతమి " తాను బంధించిన వాడు శత్రువైనా అతడిని చంపడము అధర్మము కదా ! " అన్నది. అమ్మా ! ఈ పామును చంపి ఈ పాటు వలన బాధించబడు వారిని రక్షించడం ధర్మము కాదా ! వృత్తాసురుడిని దేవేంద్రుడు చంపలేదా ! మహాశివుడు దక్షయజ్ఞం ధ్వంసం చేయ లేదా ! అవన్నీ ధర్మములు అయినప్పుడు. ఇది మాత్రము ఎందుకు ధర్మము కాదు. కనుక ఈ పామును చంపుటకు అంగీకరించు " అన్నాడు.



గౌతమి యొక్క ఆదర్శపూరితమైన క్షమాగుణము

## పామువాదన

వీళ్ళ సంభాషణ మౌనంగా విన్న పాము బోయవానితో " అన్నా ! ఇందు నాతప్పు ఏమీ లేదు **మృత్యుదేవత** నన్ను ఆవహించింది. నేను ఆ బాలుడిని కరిచి చంపాను. అంతే కాని నాకు ఆ బాలుడి మీద కోపము కాని ద్వేషము కాని లేదు " అని పలికింది పాము. బోయ వాడు " మరీ మంచిది మృత్యుదేవతకు ఆయుధమైన నిన్ను చంపడం తప్పు కాదు " పామును చంపబోయాడు. పాము " అయ్యా ! కుమ్మరి వాడు కుండలు చేసే సమయంలో కుండ పగిలితే తిరిగే సారెదా కుమ్మరి వాడిదా తప్పు. అయ్యా నరులు కనపడితే నన్నే చంపుతారు కదా ! అటువంటి నాకు ఇతరులను చంపే శక్తి నాకు ఏది " అన్నది. బోయవాడు " బాగా చెప్పావు సర్పమా ! ఎదుటి వాడు బాణం వేసినప్పుడు బాణము వేసిన వాడిది తప్పా బాణాది తప్పా అని ఆలోచిస్తూ ఊరుకుంటామా ! వేగంగా వస్తున్న బాణాన్ని వేరొక బాణంతో మధ్యలోనే తుంచమా ! అందులో పాపము ఏముంది. అయినా ఎవరో చెప్పారని వచ్చి బాలుని కరిచి ప్రాణములు హరించిన నిన్నే కాదు మృత్యుదేవత చేతి ఆయుధాలైన నీలాంటి పాములన్నింటినీ చంపాలి " అన్నాడు. అందుకు పాము నవ్వి " అన్నా యజ్ఞములు, యాగములు, యజమాని ఆజ్ఞ మేరకు పురోహితులు చేయించినా యజ్ఞఫలితము యజమానికి చెందుతుంది. కనుక ఈ బాలుడిని చంపిన పాపము మృత్యుదేవతే కాని నాది కాదు " అన్నది.

## మృత్యుదేవతవాదన

అంతలో **మృత్యుదేవత** అక్కడకు వచ్చి పాముని చూసి " సర్పరాజమా ! నీవు ఏ పాపము చేయలేదు. నేను నీకు చెప్పినట్లే యముడు నాకు చెప్పాడు. నేను యముని ఆజ్ఞను పాటించినట్లే నీవు నా ఆజ్ఞను పాటించావు కనుక ఇందులో నా పాపము, నీ పాపము ఏమీ లేదు. **సూర్యుడు, చంద్రుడు, అగ్ని, ఆకాశము, జలము, గాలి, ఈ ప్రకృతి** అన్నీ యముని చేతిలో ఉన్నాయి " అని మృత్యుదేవత పలికింది. పాము " నువ్వు చెప్పినది నేను చేస్తే అది నా తప్పు అని అంటున్నారు. నీవు పంపావని నేను చెప్పాను. ఇది యముని తప్పా, నీ తప్పా అని చెప్పడానికి నేను ఎవరిని " అని " బోయవాడితో " అన్నా ! మృత్యు దేవత మాట విన్నావు కదా ! నువ్వు నా తప్పు అంటున్నావు. ఈ తప్పు నాకు అంటగట్టడం ధర్మమా ! " అన్నది. బోయవాడు నవ్వి " నువ్వూ మృత్యువు ఇద్దరూ పాపాత్ములే నాకు మీ ఇద్దరిలో ఎవరిని చూసినా భయము లేదు " అన్నాడు. ఇంతలో యమధర్మరాజు అక్కడకు వచ్చి " మీకు కలిగిన ధర్మసందేహం తీర్చడానికి నేను వచ్చాను. అసలు ఈ బాలుడి మరణానికి కారణం ఇతడి కర్మలఫలమే కాని వేరు కాదు. నేను కాని, పాము కాని, మృత్యుదేవత కాని కాదు. మనిషి చేసుకున్న కర్మలే ఫలితంగా పుట్టుకు, మరణము, సుఖము దుఃఖము కలుగుతాయి. వాటిని ఎవరూ తప్పించుకో లేరు. ఈశ్వరుడికైనా కర్మఫలం అనుభవించక తప్పదు కనుక ఈ కుర్రాడు ఎంతటి వాడు కనుక ఎవరిని నిందించ వలసిన అవసరము ఏముంది " అన్నాడు. అప్పుడు గౌతమి తాను చెప్పిన మాటలే యమధర్మరాజు చెప్పడం చూసి " అన్నా ! యమధర్మరాజు చెప్పినది విన్నావు కదా ! నాకు పుత్రశోకం కలగాలని ఉంది కనుక అనుభవిస్తున్నాను. ఇది వెనుక జన్మలో నేను చేసిన కర్మల ఫలితము. దీనికి ఎవరిని నిందించిన ఫలితమేమి ? కనుక ఆ పామును విడిచి పెట్టు " అన్నది. ఇందరి మాట విని బోయవాడ జ్ఞానోదయము పొంది ఆ పామును విడిచి పెట్టాడు. కనుక ధర్మనందనా ! యుద్ధంలో నీ బంధువులు మరణానికి కారణం నీవు కాదు. వారి వారి దుష్కర్మలకు కలిగిన ఫలితమే ! నీవు వారి మరణానికి దుఃఖించడం వృధా ! " అని చెప్పాడు.

## మృత్యుభయము

ధర్మరాజు " పితామహా ! ఈ లోకములో ఉంటూ కూడా మృత్యుభయాన్ని పోగొట్టుకో కలడా ! " తెలియ చెయ్యండి. భీష్ముడు " ధర్మనందనా ! ధర్మం తప్పని వాడికి స్థిరబుద్ధి కలవాడికి ఏదీ అసాధ్యము కాదు. ఈ సందర్భంలో నీకు ఒక కథ చెప్తాను. పూర్వము ఇక్ష్వాకువంశంలో |దుర్యోధనుడు అనే రాజు ఉండేవాడు. అతడిని **నర్మదానది** మోహించి మానవరూపము ధరించి అతడిని వివాహము చేసుకుంది. వారు ఒక అందమైన కుమార్తెను కని **సుదర్శన** అను నామకరణం చేసి అల్లారు ముద్దుగా పెంచుకున్నారు. దుర్యోధనుడు **నిత్యాగ్నిహోత్రి** కనుక కుమార్తెను తన అగ్ని గృహంలో నిత్యాగ్నిహోత్ర ఏర్పాట్లు చూడడానికి నియోగించాడు. ఆమె కూడా అగ్ని కార్యంలో తండ్రికి సాయంచేయసాగింది. ప్రతిరోజు తన వద్ద తిరుగుతున్న సుదర్శనను చూసి మోహించిన అగ్నిదేవుడు ఆమెను చూసి " లలనా ! నీ అందు నాకు ప్రీతి కలిగింది కనుక నేను నిన్ను వివాహమాడగోరుతున్నాను " అని అడిగాడు. అందుకు సుదర్శన " దేవా! నేను అస్వతంత్రను నా వివాహప్రసక్తి నాతల్లి తండ్రుల వద్ద తీసుకురావాలి " అన్నది. దుర్యోధనుడు ఒక యాగం తలపెట్టి యాగంలో భాగంగా బ్రాహ్మణులకు దానాలు ఇవ్వసాగాడు. ఆ సమయంలో అగ్ని దేవుడు ఒక బ్రాహ్మణరూపము ధరించి " రాజా ! నాకు దానంగా మీ కుమార్తెను ఇవ్వండి " అని అడిగాడు. రాజు తన మనసులో " ఈ నిరుపేద బ్రాహ్మణుడికి నా కుమార్తెను ఎలా ఇవ్వగలను " అని పరిపరివిధాల

చింతించి తన కుమార్తెను ఇవ్వ నిరాకరించాడు. అగ్నిహోత్రుడు అలిగి యాగసమయంలో నిస్తేజుడు అయ్యాడు. యాజ్ఞీకులు పురోహితులు ఎన్ని మంత్రాలు చదివి ఆవాహన చేసినా అగ్నిహోత్రుడు వెలుగలేదు. ఇంతలో అగ్నిదేవుడు వచ్చి ఋత్విక్కులకు తన మనసులోని కోరికను తెలియజేసాడు. వారు రాజుకు ఆ విషయము చెప్పారు. దుర్యోధనుడు తనలో " అయ్యో ! అగ్నిదేవుడు ఈ విషయము తనకు నేరుగా చెప్పవచ్చు కదా ! " అనుకుని అతడు తన కుమార్తెను అగ్ని దేవుడికి ఇచ్చి వివాహము చేసి యజ్ఞము పూర్తి చేసాడు.

## అగ్నిదేవుడు సుదర్శన

అగ్నిదేవుడికి సుదర్శనకు ఒక కుమారుడు కలిగాడు. అతడికి **సుదర్శనుడు** అను నామకరణం చేసాడు. అతడు సుగుణసంపన్నుడు ధర్మపరుడు. సుదర్శనుడు పెద్దవాడై తాతగారి రాజ్యభారమును వహించి రాజ్యపాలన చేయసాగాడు. సుదర్శనుడికి వివాహమై ఒక కుమారుడిని పొందాడు. అతడి పేరు **ఓఘువంతుడు**. ఓఘువంతుడికి ఒక కుమార్తె **ఓఘువతి** ఒక కుమారుడు **ఓఘరథుడు**కలిగారు. ఓఘువతికి వివాహ వయసురాగానే ఆమెకు తగిన వరుడి కొరకు వెతికి చివరకు తాతగారైన సుదర్శనుడితో వివాహము జరిపించారు. ఓఘువతిని చేపట్టిన సుదర్శనుడు " నేను గృహస్థధర్మమును పాటిస్తూ మృత్యువును జయిస్తాను " అని ప్రతిజ్ఞ చేసాడు. తరువాత అతడు కురుక్షేత్రముకు వెళ్ళి అక్కడ ఒక పర్ణశాల నిర్మించుకుని భార్య ఓఘువతితో గృహస్థ జీవితం కొనసాగించాడు. ఒక రోజు సుదర్శనుడు భార్యతో " ఓఘువతీ ! నాకు అతిథి పూజలంటే మక్కువ ఎక్కువ. అందు వలన నేను గృహంలో ఉన్నా లేకున్నా ! నీవు మాత్రము అతిథి మర్యాదలు చేయాలి. ఎందుకంటే ఎవరి ఇంట్లో అతిథి తన కోర్కెలు తీర్చుకుంటారో ఆ గృహస్థు కృతార్థుడు ఔతాడు. మన ఇంటికి వచ్చిన అతిథి ఏకోరిక కోరినా నీవు ఆ కోరిక సంకోచించచక తీర్చాలి. పతి ఆజ్ఞ నెరవేర్చడమే సతికి ధర్మము కదా ! " అని అన్నాడు. భర్త మాటలకు ఓఘువతి అంగీకరించింది. సుదర్శనుడు సమిధల కొరకు అడవికి పోయిన సమయంలో వారి ఇంటికి ఒక అతిథి వచ్చాడు. ఓఘువతి అతడికి అతిథి మర్యాదలు చేసింది. అతడు ఓఘువతి వంక మోహంతో చూసి " లలనా ! నా మనసు నీ అందు లగ్నమైనది కనుక నీవు నా కోరిక తీర్చు. అతిథి మర్యాద చేయడమూ అతడి కోరిక తీర్చడము ధర్మము కదా ! నీకు తెలియనిది ఏమున్నది. అది నీధర్మమని నీభర్త నీకు చెప్ప లేదా ! " అన్నాడు. ఓఘువతి " మహానుభావా ! మీరు మరే కోరిక అడిగినా తీరుస్తాను " అన్నది. కాని అతడు " లలనా ! నాకు మరే కోరికా అవసరం లేదు " అన్నాడు. ఓఘువతి " తన భర్తమాట గుర్తుకు వచ్చి భర్తమాట నెరవేర్చిన తన శీలం పోతుంది. తీర్చక పోతే తన భర్తమాటలను ఉల్లంఘించినట్లౌతుంది అనుకుని చివరకు అతడి కోరికకు అంగీకరించింది " ఇంతలో సుదర్శనుడు తిరిగి వచ్చి ఓఘువతిని పిలిచాడు. అతిథి ఓఘువతిని మాట్లాడకుండా కట్టడి చేసాడు. ఆ బ్రాహ్మణ అతిథి శాపానికి భయపడి ఓఘువతి మాటాడక ఊరకున్నది. భార్య ఎంతకీ పలకనందున సుదర్శనుడు పర్ణశాలలోకి తొంగిచూసి ప్రేమగా ఓఘువతిని పిలిచాడు. బ్రాహ్మణుడు లోపల నుండి " ఓ యజమానీ ! నీ భార్య నాకు అతిథి సత్కారము ఇస్తుంది. నీకు గృహస్థధర్మాలు అతిథి సత్కారాలు తెలుసు కనుక కోపించకుము " అన్నాడు. అప్పుడు సుదర్శనుడు లోపల ఉన్న " అతిథితో మహాభాగా ! నీకు ఆతిథ్యము ఇచ్చినందు వలన నా జన్మధన్యము అయింది. అతిథి పూజలు నిర్వహించే గృహము ధన్యము పవిత్రము అంటారు కదా ! అతిథిపూజ అయ్యేంత వరకు నేను వెలుపల ఉంటాను " అని " అతిథీ ! నా మనసు నా వాక్కు ఒక్కటే దీనికి ఈ **భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు** సాక్షి " అన్నాడు. అప్పుడు ఆకాశవాణి " ఇతడు ధన్యుడు అందరూ గౌరవించ తగిన వాడు " అని పలికింది. అప్పుడు లోపల ఉన్న వ్యక్తి తేజోమంతుడై సాక్షాత్కరించి " సుదర్శనా ! నేను ధర్మదేవతను. నీ చిత్తము ఎటువంటిదో తెలుసుకోవడానికి వచ్చాను. నీవు నిశ్చలవ్రతుడవు. నీవు ధర్మము ఎప్పుడు తప్పుతావో అప్పుడు నిన్ను చంపాలని మృత్యుదేవత నీ వెంటనే పొంచి ఉన్నది. కాని నీవు మృత్యువును జయించావు. నీ భార్య కూడా మహాపతివ్రత. మీరు సశరీరంగా ఊర్ధ్వలోక ప్రవేశానికి అర్హులు. కనుక మీకు ఎప్పుడు ఊర్ధ్వలోకాలకు రావాలని అనిపిస్తుందో అప్పుడే ఊర్ధ్వలోకాలకు భార్యాసమేతంగా రావచ్చు. నీవు చేసిన సగభాగం తప: ఫలము చేత నీ భార్య ఓఘువతి పుణ్యనది అయి ఈ లోకములో ప్రవహిస్తూ జనులను పావనం చేస్తుంది. మిగిలిన సగం తప: ఫలము వలన నీకు సేవచేస్తుంది. నేను నీ ఇంటికి రావడము నీ భార్యను కోరడమూ అన్నీ నీ కీర్తి లోకాలకు తెలియజేయడానికే నేను కల్పించాను. అంతే కాని నీ భార్యశీలానికి ఎంటువంటి హానీ జరగలేదు . ఇది నిజము " అని పలికి అంతర్ధానం అయింది. ధర్మనందనా ! ఇదీ **ఓఘువతీనది** చరిత్ర. ఈ కథసారాంశం ఏమంటే గృహస్థుకు అతిథి పూజకు మించిన పరమధర్మము వేరొకటి లేదు " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## బ్రాహ్మణత్వము

ధర్మరాజు " పితామహా ! బ్రాహ్మణులు కాక ఇతరులు తాము చేసే గుణకర్మల వలన బ్రాహ్మణత్వము పొందవచ్చునా ! " అని తన సందేహం వెలిబుచ్చాడు. భీష్ముడు " ధర్మనందనా ! బ్రాహ్మణత్వము పొందడం చాలా దుర్లభ్యం. ఎన్నో జన్మలు ఎత్తిన తరువాత కాని బ్రాహ్మణజన్మ లభించదు. ఈ విషయము గురించి నీకు ఒక ఇతిహాసము చెప్తాను విను. పూర్వము

**మతంగుడు** అనే విప్రకుమారుడు ఉండే వాడు. అతడు తండ్రి ఆదేశానుసారము ఒక యజ్ఞానికి వెడుతున్నాడు. దారిలో అతడు ఒక గాడిదపిల్లను కర్రతో గట్టిగా కొట్టాడు. ఆ గాడిద పిల్ల ఏడుస్తూ తనతల్లి వద్దకు వెళ్ళి జరిగిన సంగతి చెప్పింది. ఆ గాడిద తన కూతురుతో " అమ్మా ! ఇతడు చండాలుడు, క్రూరుడు అందుకే నిన్ను అలా కొట్టాడు " అని చెప్పింది. గాడిదమాటలను అర్ధము చేసుకున్న విప్రకుమారుడు " గాడిద ఊరికే అలా అన లేదు. గాడిద మాటలలో ఏదో అంతరార్ధము ఉంది. లేకుంటే అలా ఎందుకు అంటుంది " అనుకున్నాడు. విప్రకుమారుడు ఆ గాడిద వద్దకు వెళ్ళి తన జన్మరహస్యము చెప్పమని అడిగాడు. గాడిద " విప్రకుమారా ! నీ తల్లి కామంతో ఒక క్షురకుని వలన నిన్ను కన్నది. కనుక నీవు బ్రాహ్మణుడివి కాదు " అని చెప్పింది. ఆపై అతడికి యజ్ఞముకు వెళ్ళడానికి మనస్కరించక ఇంటికి తిరిగి వెళ్ళి తండ్రితో " తండ్రీ ! నేను బ్రాహ్మణ స్త్రీకి క్షురకుడికి పుట్టాను కనుక నేను బ్రాహ్మణుడను కాను. ఆ గార్ధభము ఏదో శాపవశాన ఇలా జన్మ ఎత్తి ఉంటుంది. లేకున్న ఈ నా జన్మరహస్యము ఎలా తెలుస్తుంది. తండ్రీ ! నేను తపస్సు చేసి బ్రాహ్మణత్వము సంపాదిస్తాను " అని చెప్పి మతంగుడు తపస్సు చేయడానికి అడవులకు వెళ్ళాడు.

## మతంగుడి తపసు

మతంగుడు కొన్ని సంవత్సరాలు తపస్సు చేసి ఇంద్రుడిని ప్రసన్నము చేసుకున్నాడు. ఇంద్రుడు ప్రత్యక్షమై " కుమారా ! నీవు తపస్సు ఎందుకు చేస్తున్నావు ? నీ కోరిక ఏమిటి " అని అడిగాడు. మతంగుడు " దేవా ! నాకు బ్రాహ్మణత్వము ప్రసాదించండి " అని అడిగాడు. ఇంద్రుడు " కుమారా ! బ్రాహ్మణత్వము మహత్తరమైనది. ఇతరులకు అది లభ్యము కాదు కనుక మరేదైనా వరము కోరుకో " అని అన్నాడు. మతంగుడు " అయ్యా ! నా కోరిక తీర్చడం మీకు కుదరదు కనుక మీరు వెళ్ళండి. నా తపస్సు కొనసాగిస్తాను " అన్నాడు. ఇంద్రుడు వెళ్ళగానే మతంగుడు తన తపస్సు కొనసాగించి ఒంటి కాలి మీద మరొక నూరేళ్ళు తపస్సు చేసి ఇంద్రుడిని ప్రత్యక్షం చేసుకున్నాడు. ఇంద్రుడు " కుమారా ! నీ పట్టు విడువక ఉన్నావు! శూద్రుడు ఇలాంటి తపస్సు చేస్తే చస్తాడు జాగ్రత్త అని బెదిరించి అసలు బ్రాహ్మణత్వము ఎలా సిద్ధిస్తుందో నీకు తెలుసా ! ఇంతకంటేపది రెట్లు తపస్సు చేస్తే కాని ఒక చండాలుడు శూద్రుడు కాలేడు. దాని కంటే నూరు రెట్లు తపస్సు చేస్తే కాని శుద్రుడు వైశ్యుడు కాలేడు. దాని కంటే వేయిరెట్లు తపస్సు చేసిన కాని వైశ్యుడు క్షత్రియుడు కాలేడు. దాని కంటే పది వేల రెట్లు తపస్సు చేసిన కాని క్షత్రియుడు దుర్మార్గుడైన బ్రాహ్మణుడు కాలేడు. దానికంటే లక్షరెట్లు తపస్సు చేస్తే కాని దుర్మార్గు డైన బ్రాహ్మణుడు ఇంద్రియములను, మనస్సును జయించి, సత్యము అహింసలను పాటించి, మాత్సర్యము విడిచి పెట్టి సద్బ్రాహ్మణుడు కాలేడు. అటువంటి సద్బ్రాహ్మణత్వము ఒక వంద సంవత్సారాల తపస్సుకు వస్తుందా ! చెప్పు " అన్నాడు. ఒక వేళ బ్రాహ్మణ జన్మ పొందినా దానిని నిలబెట్టు కొనుట కష్టము. ఒక్కొక్క జీవుడు అనేక జన్మల తర్వాత కాని బ్రాహ్మణజన్మ ఎత్త లేడు. అలా ఎత్తినా అతడు దానిని నిలబెట్టుకోలేడు. ధనవాంఛ, కామవాంఛ , విషయాసక్తితో సదాచారములను వదిలి దుర్మార్గుడు ఔతాడు. తిరిగి బ్రాహ్మణజన్మ రావడానికి ఎన్నో ఏళ్ళు పడుతుంది. అటువంటి బ్రాహ్మణజన్మ కొరకు నీవు తాపత్రయపడి నీ వినాశనము ఎందుకు కొని తెచ్చుకుంటావు. నీ కిష్టమైన మరొక వరము కోరుకో ఇస్తాను తపస్సు చాలించు " అన్నాడు. మారుమాటాడని మాతంగుడి మొండి తనము చూసి విసుగు చెంది ఇంద్రుడు వెళ్ళి పోయాడు. మాతంగుడు తిరిగి తన తపస్సు కొనసాగించాడు. కాలి బొటనవేలి మీద నిలబడి శరీరం అస్థిపంజరము అయ్యేవరకు తపస్సు చేసాడు. అతడి శరీరము శిధిలమై పడిపోతుడగా ఇంద్రుడు పట్టుకున్నాడు. ఏమిటి నాయనా ఇది పెద్ద పులిలా నిన్ను మింగగలిగిన బ్రాహ్మణత్వము నీకెందుకు చక్కగా వేరు వరములు అడిగి సుఖపడు " అన్నాడు. మాతంగుడు అంగీకరించగానే ఇంద్రుడు " నీవు చంఢదేవుడు అనే పేరుతో అందమైన స్త్రీల పూజలందుకుని వారి వలన నీ కోరికలు ఈడేర్చుకుంటావు " అని వరాలు ప్రసాదించాడు.

## విశ్వామిత్రుడి బ్రాహ్మణత్వము

మతంగుడి మాట కథ విన్న ధర్మరాజు " పితామహా ! ఇంద్రుడు చెప్పినట్లు బ్రాహ్మణత్వము పొందడం దుర్లభము అయిన క్షత్రియుడైన విశ్వామిత్రుడికి బ్రాహ్మణత్వము ఎలా సిద్ధిస్తుంది " వివరించండి అని అడిగాడు. ధర్మనందనా ! జాహ్నవీదేవికి తండ్రి అయిన **జహ్నుడు** అనే వాడి వంశములో**గాధి** జన్మించాడు. గాధి కూతురు **సత్యవతి**. సత్యవతిని తనకిచ్చి వివాహము చేయమని **రుచీకుడు** అడగగా గాధి అంగీకరించక బదులుగా చెవి తెల్లగా ఉన్న వేయి గుర్రములను కట్నంగా ఇస్తే సత్యవతిని ఋచీకుడి కిచ్చి వివాహము జరిపిస్తానని షరతు పెట్టాడు. ఋచీకుడు అందుకు రోషంతో అంగీకరించి గుర్రములను వెతికి తెస్తానని చెప్పాడు. ఋచీకుడు వరుణుడి వద్దకు వెళ్ళి " నాకు తెల్లని చెవులు కలిగిన వేయిగుర్రాలను ఇవ్వు " అని అడిగాడు. వరుణుడు " ఈ మాత్రానికి ఇంత దూరము రావాలా ! నీవు కోరిన వెంటనే నీ ఎదుట నిలబడతాయి " అని చెప్పాడు. వెంటనే ఋచీకుడు గంగానది ఒడ్డుకు వెళ్ళి పద్మాసనము వేసుకుని కూర్చుని కళ్ళు మూసుకుని " నాకు తెల్లని చెవులు కలిగిన వేయి గుర్రాలు కావాలి " అని కోరుకోగానే అతడి ఎదుట తెల్లని చెవులు కలిగిన వేయిగుర్రాలు నిలబడ్డాయి. అప్పటి నుండి ఆ ప్రదేశము అశ్వతీర్ధముగా ప్రసిద్ధి చెందింది. ఋచీకుడు ఆ గుర్రాలను గాధికి ఇచ్చాడు. గాధి చేసేది లేక

సత్యవతిని ఋచీకుడికి ఇచ్చి వివాహము చేసాడు.

## గాధి రుచీకులకు పుత్ర భాగ్యము

ఋచీకుడు కొన్ని సంవత్సరాలు సత్యవతితో కాపురము చేసిన పిదప సంతానం కావాలని కోరిక కలిగి " సత్యవతీ ! సంతానము కొరకు నేను యజ్ఞములో ఇచ్చే **చరువు** సంపాదిస్తాను " అన్నాడు. సత్యవతి తల్లి కూడా తనకూ సంతానం కావాలని అందు కొరకు తనకు కూడా చరువు కావాలని కోరింది. ఋచీకుడు అందుకు అంగీకరించి రెండు చరువులు సంపాదించి దానిని తన తపశక్తితో నింపాడు. వాటిలో ఒక చరువులో ఉన్న యజ్ఞశేషాన్ని భుజించిన వారికి ఉజ్వలంగా ప్రకాశించే బ్రాహ్మణుడు పుడతాడు అని రెండవ చరువులోని యజ్ఞ శేషాన్ని భుజించిన రాజసభావం కలిగిన పుత్రుడు పుడతాడు. ఋచీకుడు సత్యవతిని చూసి " సత్యవతీ ! ఇది ఒకటి క్షాత్ర శక్తి ప్రధాన పుత్రుడిని ఇస్తుంది నీవు దానిని నీ తల్లికి ఇవ్వు. రెండవది సాత్వికత, బ్రాహ్మణత్వము ప్రధానుడైన పుత్రుడిని ఇస్తుంది దానిని నువ్వు స్వీకరించు. తరువాత ఋతు సమయంలో నీవు మేడి చెట్టును నీ తల్లి రావి చెట్టును కౌగలించుకున్న మీకు సంతానము కలుగుతుంది " అని చెప్పాడు. కాని విధివిలాసంగా చరువును తీసుకునే సమయంలో చరువులు, కౌగలించుకున్న వృక్షములు తారుమారై ఫలితంగా వారు ధరించిన గర్భాలు తారుమారయ్యాయి. ఇదంతా దివ్యదృష్టితో తెలుసుకున్న ఋచీకుడు సత్యవతితో " సత్యవతీ ! మీ చరువులు వృక్షములు తారుమారయ్యాయి. ఫలితంగా నీ గర్భంలో దుర్మార్గుడైన క్షత్రియుడు పెరుగుతున్నాడు అని చెప్పాడు. ఆ మాటకు తల్లడిల్లిన సత్యవతి " సద్బ్రాహ్మణుడివైన, తపశ్శాలివైన మీకు దుర్మార్గుడైన క్షత్రియుడు కలిగిన మీకు అపకీర్తి కదా ! నీ మహిమ చేత ఈ అవాంతరము నివారించు " అని వేడుకుంది. అందుకు ఋచీకుడు అంగీకరించి " ఈ ప్రభావము ఒక జన్మకాలము పొడిగించి నీకు సద్బ్రాహ్మణుడు నీకుమారుడికి క్షత్రియాంశ కలిగిన కుమారుడు జన్మిస్తాడు " అని వరం ఇచ్చాడు. అలా సత్యవతికి **జమదగ్ని** జన్మించాడు. జమదగ్ని కుమారుడు పరశురాముడు క్షత్రియాంశతో జన్మించి క్షత్రియ కుల వినాశకుడయ్యాడు. సత్యవతి తల్లికి విశ్వామిత్రుడు జన్మించినా అతడికి బ్రాహ్మణధర్మమునందు ఆసక్తి కలిగింది. ఈ కారణంగా పరశురాముడికి క్షత్రియత్వము, విశ్వామిత్రుడికి బ్రాహ్మణత్వము వచ్చాయి " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## వీతహవ్యుడు బ్రాహ్మణత్వము

ధర్మరాజు " పితామహా నాకు ఈ సందర్భంలో నాకు మరొక కథ గుర్తుకు వస్తుంది. పూర్వము వీతహవ్యుడు అనే క్షత్రియుడు బ్రాహ్మణత్వము పొందాడు అని విన్నాము అది ఎలా జరిగిందో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! మనువు పరంపరలో **శర్యాతి** వంశం ఒకటి. ఆ వంశలో జన్మించిన హైహయుడు వత్సదేశాన్ని పాలించాడు. అతడికి వీతహవ్యుడు అని కూడా పేరు ఉండేది. అతడికి పది మంది భార్యలు ఉండేవారు. వారి ద్వారా అతడు యోధులు, బలాఢ్యులు అయిన నూరుగురు పుత్రులను పొందాడు. హైహయుడి కుమారులు కాశీరాజైన హర్యశ్వుడి మీదకు దండేత్తి అతడిని ఓడించారు. అతడి తర్వాత అతడి కుమారుడు **సుదేవుడు** రాజయ్యాడు. హైహయుడి కుమారులు తిరిగి సుదేవుడి మీదకు దండెత్తి అతడిని కూడా ఓడించారు. ఆ తరువాత సుదేవుడి కుమారుడు **దివోదాసు** రాజయ్యాడు. హైహయుడి కుమారులు దివోదాసును యుద్ధానికి పిలిచి అతడిని ఓడించారు. అతడు భయంతో పారిపోయి భరద్వాజుడిని శరణుజొచ్చి హైహయకుమారులు తన తండ్రిని చంపి తనను కూడా ఓడించారని చెప్పాడు. **భరద్వాజుడు** దివోదాసు భయమును పోగొట్టి " నీకు ఒక హైహయకుమారులను హతమార్చగలిగిన ఒక కుమారుడిని ప్రసాదిస్తాను " అని చెప్పి దివోదాసు చేత పుత్రకామేష్టి యాగము చేయించాడు. ఆ యాగఫలంగా అతడికి ఒక కుమారుడు కలిగాడు. అతడు 13 సంవత్సరాల ప్రాయానికి వచ్చాడు. వాడి పేరు **ప్రత్యర్ధనుడు**. భరధ్వాజముని అనుగ్రహంతో ప్రత్యర్ధనుడు వేదములు, ధనుర్వేదము అభ్యసించాడు. దివోదాసు అతడిని యువరాజుగా అభిషేకించాడు. ప్రత్యర్ధనుడు హైహయుల మీదకు దండేత్తి హహాయకుమారులను అందరినీ హతమార్చడమే కాక హైహయుడి మీదకు లంఘించాడు. హైహయుడు పారి పోయి **భృగుమహర్షి** శరణుజొచ్చాడు. భృగుమహర్షి అతడిని తన ఆశ్రమంలో దాచాడు. అతడిని తరుముకుంటూ అక్కడకు వచ్చిన ప్రత్యర్ధనుడు భృగుమహర్షిని చూసి నమస్కరించాడు. భృగుమహర్షి అతడితో " నీవు ఇక్కడకు వచ్చిన పని ఏమిటి ? " అని అడిగాడు. ప్రత్యర్ధనుడు జరిగినది యావత్తు భృగుమహర్షికి వివరించి తాను హైహయుడిని తరుముకుంటూ వచ్చిన విషయము చెప్పాడు. భృగుమహర్షి " ఇక్కడ ఎవరూ రాజవంశీయులు లేరు ఇక్కడ ఉన్న వారంతా బ్రాహ్మణులైన నా శిష్యులే " అన్నాడు. ప్రత్యర్ధనుడు నవ్వి " మహర్షీ ! మీరు అసత్యము పలుకరు కదా ! హైహయుడు క్షత్రియుడు కాదు అని చెప్పి అతడిని క్షత్రియకులము నుండి వెలివేసారు కనుక నేను వచ్చిన పని పూర్తి అయింది. నాకు కావలసినది కూడా అదే. మహర్షీ నా మీద కూడా కొంత కరుణ చూపండి " అని పలికి వెనుతిరిగాడు. అప్పటి నుండి హైహయుడు బ్రాహ్మణత్వము స్వీకరించి గొప్ప తపస్సు చేసాడు. కృత్సమదుడు అనే కుమారుడిని పొందాడు. అతడి వంశంలో **సుతేజసుడు, వర్చసుడు, విహవ్యుడు, సత్యుడు, సంతుడు, శ్రవసుడు, దమసుడు, ప్రకాశుడు, వాగీంద్రుడు, ప్రమతి, రురుడు, సముదుడు, శునకుడు,**

**శౌనకుడు** అనే బ్రాహ్మణులు జన్మించారు. ఇలా హైహయుడు అనే వీతహవ్యుడు ఒక బ్రాహ్మణ వంశ కర్త అయ్యాడు అని " చెప్పాడు.

## దైవము పురుషప్రయత్నను


వశిష్టునితో బ్రహ్మ ప్రశ్నోత్తరాలు

ధర్మరాజు " పితామహా ! దైవబలము పురుషప్రయత్నము ఏది గొప్పది ? వివరించండి " అన్నాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఇదే ప్రశ్నను పూర్వము వశిష్టుడు బ్రహ్మను అడిగాడు. అప్పుడు బ్రహ్మదేవుడు చెప్పిన విషయాన్ని నీకు చెప్తాను. క్షేత్రము, మానవప్రయత్నము, విత్తనము మూడు వేరు వేరు. మూడు కలిస్తే కాని విత్తనము మొలకెత్తదు. భూమిలో విత్తనము వేస్తే విత్తనములు మొలకెత్తుతాయి. విత్తనము భూమిలో వేయడానికి పురుషప్రయత్నము కావాలి. కేవలము భూమి విత్తనము ఉన్నంత మాత్రాన విత్తనము మొలకెత్తదు. కనుక పురుషప్రయత్నము కావాలి. అన్నీ దైవమే చూస్తాడు అనుకుంటే ఫలితము రాదు కనుక పురుషప్రయత్నము అవసరము. పురుషప్రయత్నము ఉంటేనే దైవబలము కూడా తోడౌతుంది. ఉదాహరణగా నిప్పురవ్వ చిన్నదే అయినా బాగా గాలి వీస్తేనే అది పెద్దమంట ఔతుంది. మనము చేసే పని చిన్నది అయినా దైవబలము తోడైతే అతి బలపడుతుంది. నేతితో దీపము పెట్టినప్పుడు నెయ్యి తగ్గిన తరువాత దీపము కొడిగట్టి పోతుంది. అలాగే మనము చేసే పనులకు దైవబలము లోపిస్తే ఆ పని విజయవంతము కాలేదు. పరశురాముడు, **భృగువు, బలిచక్రవర్తి** గొప్ప వాళ్ళే అయినా వారికి వారు చేసే పనిలో పవిత్రత లోపించింది కనుక దైవబలము లోపించింది కనుక వారు అపజయం పాలయ్యారు. కనుక ఏపనికైనా దైవానుకూలము ముఖ్యము. ఏ పనికైనా పురుష ప్రయత్నము దైబలము సమానంగా కావాలి కనుక రెండూ ముఖ్యమైనవే " అన్నాడు.

## మంచి పనులు ఫలితము

ధర్మరాజు " పితామహా ! మంచి పనులకు మంచి ఫలితాలు ఉంటాయి అంటారు కదా ! ఏ మంచి పనికి ఎలాంటి ఫలితము ఉంటుంది " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఒక్కో పనికి ఒక్కో ప్రత్యేక ఫలితం ఉంటుంది. ఆకలితో ఉన్న బాటసారికి అన్నం పెడితే వచ్చే ఫలితం అంతా ఇంత కాదు. రోజు చేసే అగ్ని ఉపాసన మనపనులను విజయవంతం చేయడానికి తోడ్పడుతుంది. మనం మంచి వస్తువులు ఇతరులకు దానం చేస్తే మనకు అవసరమైన సమయాలలో ఆ వస్తువులు అయాచితంగా లభిస్తాయి. మౌనం పాటిస్తే మన జ్ఞానం వృద్ధి చెందుతుంది. తపస్సు చేస్తే అధిక భోగములు చేకూరుతాయి. ఉపవాసం చేస్తే మనస్సు నిర్మలంగా ఉంటుంది. అహింసావ్రతము ఆచరిస్తే రూపము, బలము, ఐశ్వర్యము చేకూరుతాయి. ఉపవాసం చేస్తే మనస్సు నిర్మలంగా ఉంటుంది. కేవలం ఫలములు, నీరు త్రాగి జీవించిన వాడికి రాజ్యప్రాప్తి కలుగుతుంది. వేదములు చదివితే సుఖాలు ప్రాప్తిస్తాయి. వేదార్ధము గ్రహిస్తే పరలోకసుఖము ప్రాప్తిస్తుంది. సత్యవ్రతము పాటిస్తే మోక్షప్రాప్తి కలుగు తుంది. ధర్మనందనా మంచి పనులకు మంచి ఫలితము కలిగినట్లే చెడుపనులకు చెడు ఫలితాలు కలుగుతాయి. ఏ విత్తు వేస్తే ఆ చెట్టు మొలుస్తుంది కదా ! మానవుడికి ముసలితనము వచ్చి పళ్ళు ఊడిపోయి, వెంట్రులకు రాలిపోయి, చెవులు వినపడక, కళ్ళు కనపడక పోయినా అతడిలో కోరికలు మాత్రము చావవు. ప్రాణములు పోయినా కోరికలు విడువవు. ఇది మామూలు మనుషులకే కాదు పండితులకు కూడా ఈ బానిసత్వము తప్పదు. ఆఖరిదశ వరకు ఈ కోరికల మీద మోహము విడిచి పెడదాము అన్న ఆలోచన కూడా రానివ్వరు. వెలుపలి ప్రపంచంలో విహరించే వారికి పుణ్యకర్మలు సుఖాన్ని పాపకర్మలు దుఃఖాన్ని కలుగచేస్తాయి " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## యజమానుడు సేవకుడు

ధర్మరాజు భీష్ముడిని " పితామహా ! నాకు ఒక సందేహము తమ యజమానుల ఎడల అతడి దయా దాక్షిణ్యాల మీద బ్రతికే సేవకుడు ఎలా నడచుకోవాలి వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! కాశీపట్టణంలో ఒక బోయవాడు ఉండే వాడు. అతడు ఒక రోజు వేటకొరకు అడవికి వెళ్ళి ఒక లేడిమీద విషముపూసిన బాణమును వేసాడు. కాని ఆ బాణము గురితప్పి ఒక చెట్టును తాకింది. ఆ చెట్టు పూలుపండ్లతో నిండి ఉన్నది. ఆ విషపూరిత బాణము ఆ చెట్టును నిలువునా

పూలు విరుగకాసిన పండ్లలతోసహా దహించివేసింది. ఆ చెట్టు మీద నివసిస్తున్న చిలుక ఆ చెట్టు దహించ బడినా ఇన్ని రోజుల నుండి కాపాడిందన్న విశ్వాసంతో దానిని విడువక అక్కడే నివసించసాగింది. ఎండ వచ్చినా గాలి వచ్చినా వర్షము వచ్చినా అది ఆ చెట్టును విడువ లేదు. ఆ చిలుక గురించి విన్న ఇంద్రుడు మామూలు మనిషి రూపంలో దాని వద్దకు వచ్చి " ఓ చిలుకా ! ఈ చెట్టు మాడిపోయింది కదా ! ఈ అడవిలో ఫల పుష్పాలతో నిండిన ఇన్ని వృక్షాలు ఉండగా ఈ చెట్టును పట్టుకుని ఎందుకు వేలాడుతున్నావు " అని అడిగాడు. చిలికు " మహేంద్రా ! ఈ చెట్టు ఫలపుష్పాలతో నిన్ను నిండుగా ఉన్నప్పుడు ఆ చెట్టును అంటిపెట్టుకుని ఉండి ఆ చెట్టు ఎండి పోయినప్పుడు వదిలి వెళ్ళడము కృతగఘ్నుత కాదా ! " అన్నది. మారువేషములో వచ్చిన నన్ను మహేంద్రా ! అని సంభోదించడం చూసి ఇంద్రుడు ఖంగుతిన్నాడు . ఈ చిలుక పూర్వ జన్మలలో చేసుకున్న పుణ్యఫలము వలన తనను గుర్తించిందని తెలుసుకుని " చిలుకా ! నా దర్శనం వ్యర్ధము కాదు కనుక ఏదైనా వరము కోరుకో " అన్నాడు. ఆ చిలుక " ఈ చెట్టును పూర్వము ఉన్నట్లు ఫలపుష్పాలతో అలరారే విధముగా చెయ్యి " అని కోరుకుంది. ఇంద్రుడు వెంటనే ఆ చెట్టు మీద అమృతమును చల్లాడు. ఆ చెట్టు పూర్వములా ఫలపుష్పాలతో శోభిల్లింది. ధర్మనందనా ! చూసావా ఇంద్రుడు వరమిచ్చినా తన కొరకు కోరుకొనక తనకు ఆశ్రయమిచ్చిన చెట్టు శ్రేయస్సును కోరుకున్న చిలుకలా భృత్యులు సదా యజమాని శ్రేయస్సు కోరుకుంటాడు " అని చెప్పాడు.



ధర్మమూర్తియైన చిలుక మరియు ఇంద్రుల సంభాషణ

## యజమానులు భ్రుత్యులు

ధర్మరాజు భీష్ముడితో " పితామహా ! యజమానులు భృత్యులను ఎలా ఆదరించాలి ? వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! వేదములు చదువుతూ, తపస్సు చేస్తూ , జనులకు ధర్మబోధ చేస్తూ ఇహపరలోకములలో సుఖమును కలిగించే బ్రాహ్మణుడు సదా పూజనీయులు. భార్యకు భర్త ఎలా పూజనీయుడో అలాగే రాజుకు బ్రాహ్మణుడు పూజనీయుడు. బ్రాహ్మణుడు పలికే ప్రతి పలుకు పవిత్రమైనదే ! సద్బ్రాహ్మణుడు తనను కష్టమును సుఖమును కలిగించిన ఇంద్రుడికైనా దు:ఖమును సుఖమును ఫలితములను ఇవ్వ కలిగన సమర్ధుడు. రాజు బ్రాహ్మణుడిని తన పుత్రుడివలె ఆదరించాలి. గురువు వలె గౌరవించాలి. అగ్నివలె పూజించాలి. వేదములలో ఈ ప్రస్తావన వివరిస్తాను విను. బ్రాహ్మణ జాతిని పరాభవించిన వాడి పుణ్యములు సమస్తము నశిస్తాయి అని ఋగ్వేదము చెప్తింది. జపము, హోమము, యాగము, యజ్ఞములు బ్రాహ్మణుడి ఆధ్వర్యంలోనే జరగాలి అనే **యజుర్వేదము** చెప్తుంది. ఒక నెలపాటు బ్రాహ్మణులను అర్చించిన సకల పాపములు హరిస్తాయని సామవేదము చెప్తుంది. బ్రాహ్మణులను ఆదరించక పోవడము తప్ప వేరేకీడు ప్రపంచంలోనే లేదు అని యజుర్వేదము చెప్తుంది.

## ధర్మము జ్ఞానము

ధర్మరాజు " పితామహా ! ఏది శ్రేష్టమైన ధర్మము ఏది ? ఉత్కృష్టమైన జ్ఞానము ఏది ? " అని అడిగాడు. భీష్ముడు " ఒక రోజు కొంతమంది బ్రాహ్మణులు శ్రీకృష్ణుడు వింటుండగా మద్రదేశాధీశుడితో శల్యమహారాజా ! యజ్ఞమూర్తి, యజ్ఞ కర్త మూర్తి, యజ్ఞ కలన మూర్తి అయిన విష్ణుమూర్తిని తెలుసుకోవడమే జ్ఞానముల కంటే ఉత్తమమైన జ్ఞానము. ఆ విష్ణు మూర్తియే శ్రీకృష్ణుడు. ఈ బాలుడు వసుదేవుడి కుమారుడు కంసుడి చెల్లెలు అయిన దేవకి సుతుడు. ఇతడిని యజ్ఞ పురుషుడు అనడానికి కారణం ఏమిటి ? " అని అడిగారు. ఆ మాటలు విన్న కృష్ణుడు నన్ను చూసి ఈ ప్రశ్నకు సమాధానం ఇవ్వకలిగిన వాడివి నువ్వే కనుక నువ్వే జవాబు చెప్పు అని నన్ను అన్నాడు. నేను కృష్ణుడికి నమస్కరించి " శ్రీకృష్ణుడే సర్వమయుడు, వేదమయుడు, వేదములకు అర్ధము, వేదములు ఎరిగిన వాడికి ఇష్టుడు, శ్రీకృష్ణుడే సాక్షాత్తు విష్ణువు అని తెలుసుకొనడమే ఉత్తమ బ్రాహ్మణత్వానికి ఫలము " అని చెప్పాను. నా మాటలు విన్న బ్రాహ్మణులు శ్రీకృష్ణత్త్వము చక్కగా తెలుసుకున్నారు. అని చెప్పిన తరువాత మద్రదేశాధీశుడి సందేహము తొలగి పోయినది. ధర్మనందనా ! నీకు కృష్ణ తత్వము తెలుసునని నాకు తెలుసు. అయినా నీ ప్రజ్ఞను ఒక్క సారి జ్ఞాపకము చెయ్యడానికిది చెప్పాను " అని చెప్పాడు.

## మాటతప్పట

ధర్మరాజు " పితామహా ! ఎవరైనా బ్రాహ్మణులకు ఇస్తానని చెప్పినది ఇవ్వక ఎగవేసిన కలుగు ఫలితమేమి ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! దీనికి సమాధానంగా నీకొక కధ చెప్తాను. ఒక అడవిలో ఒక నక్క ఒక కోతి స్నేహంచేసాయి. ఒక రోజు కోతి నక్కతో " మిత్రమా ! నీవు పూర్వజన్మలో ఏమి పాపము చేసావో కాని ఈ జన్మలో చచ్చిన శవాలను ఆహారముగా తినే గతి పట్టింది " అన్నది. అప్పుడు ఆ నక్క కు పూర్వ జన్మస్మృతి కలిగినది " మిత్రమా ! నేను పూర్వ జన్మలో ఒక బ్రాహ్మణుడికి కొంత ధనము ఇస్తానని ఇవ్వకుండా ఎగ వేసాను. దానికి ఫలితంగా ఈ జన్మలో నాకు చచ్చిన శవాలను అహారంగా తినే గతి పట్టింది " అన్నది. కనుక ధర్మనందనా ! బ్రాహ్మణుడికి ఇస్తానన్నది ఇవ్వక ఎగవేసిన ఇటువంటి జన్మ లభిస్తుంది "అని అన్నాడు.

## కులము విద్య

ధర్మరాజు " పితామహా ! తక్కువ కులములో పుట్టినా కూడా గొప్పగుణములు, మంచిప్రవర్తన ఉన్న వాడికి మంత్రతంత్ర విద్యలు నేర్పడం దోషమా ధర్మవిరుద్ధమా ! " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ సందర్భంలో నీకు ఒక కధ చెప్తాను. పూర్వము హిమాలయాలలో అనేక మంది బ్రాహ్మణులు తపస్సు చేసుకుంటున్నారు. వారి వద్దకు ధర్మనిష్టా గరిష్టుడు, మంచి గుణగణములు కలవాడు, గొప్ప ప్రవర్తన కలవాడు అయిన శూద్రుడు వచ్చి అయ్యా ! మీరందరూ తపస్సు చేసుకుంటున్నారు కదా ! నాకు కూడా తపస్సు ఎలా చెయ్యాలో ఉపదేశించండి " అని అడిగాడు. అందుకు బ్రాహ్మణులు " ఓ ధర్మాత్మా ! నీవు శూద్రుడవు కనుక నీకు వైదిక విద్య ఉపదేశించడం తగదు. నీవు మాకు శుశ్రూషలు చేయుటకు తగినవాడవు " అన్నారు. ఆ శూద్రుడు కూడా అలాగే అని అక్కడే చిన్న పర్ణశాల వేసుకుని ఆ విప్రులకు సేవ చేస్తున్నాడు. కాని విప్రులు చేస్తున్న కార్యములు చూస్తూ తాను కూడా అతిథిపూజలు, దేవ, పితృ పూజలు చేస్తున్నాడు. ఒక రోజు అక్కడ తపస్సు చేసుకుంటున్న విప్రులకు గురువు గారు అతడి ఆశ్రమముకు వెళ్ళి అక్కడ శూద్రుడు చేస్తున్న అతిథి, దేవ, పితృ పూజలు చూసి సంతోషించాడు. అతడు చేస్తున్న పూజలలో లోపాలను ఎత్తి చూపి పూజలు సరిగా పద్ధతులు ఉపదేశించి వెళ్ళాడు. ఆ శూద్రుడు కూడా గురువుగారి ఉపదేశమును అనుసరించి ఆచరించాడు. కాల క్రమమున గురువుగారు శూద్రుడు మరణించారు. మరు జన్మలో శూద్రుడు రాజకుమారుడుగా, గురువుగారు సకల వేద శాస్త్రములకు నిలయమైన బ్రాహ్మణుడి ఇంట్లో జన్మించి పెరిగి పెద్ద వాడై గుణసంపన్నుడయ్యాడు. కాలక్రమమున ఆ రాజకుమారుడు ఆ బ్రాహ్మణకుమారుని పురోహితుడిని చేసుకుని సకల సంపదలు సమకూర్చాడు. కాని ఆ రాజకుమారుడు బ్రాహ్మణ కుమారుడిని చూసి సన్నగా నవ్వాడు. ఆ బ్రాహ్మణ కుమారుడికి మాత్రము రాజకుమారుడు తనను చూసి ఎందుకు నవ్వుతున్నాడో అర్ధము కాలేదు. బ్రాహ్మణకుమారుడు " రాజకుమారా ! మీరు నన్ను చూసినప్పుడల్లా సన్నగా నవ్వుకుంటున్నారు. నా వలన ఏదైనా అపరాధము జరిగిందా ! దయ చేసి తెలియజెయ్యండి " అని అడిగాడు. రాజకుమారుడు " విప్రోత్తమా ! నాకు పూర్వజన్మజ్ఞానం కలదు. కిందటి జన్మలో నేను శూద్రుడను. మీరు గురువు గారు. మీరు నాకు వైదికవిద్యలోని మెళుకువలు, తపస్సు ఎలా చెయ్యాలో, దేవ, పితృకార్యములు ఎలా చెయ్యాలో బోధించారు. తత్ఫలితంగా ఇప్పుడు మీరు ఒక రాజకుమారుడికి సేవ చేస్తున్నారు. అది గుర్తుకు వచ్చి నవ్వుకుంటున్నాను. అంతే కాని మీ వలన ఏదోషము లేదు. ధర్మపరుడివి అయిన నీలో లోపం ఎందుకు ఉంటుంది " అని చెప్పాడు. కనుక ధర్మనందనా ! వైదికవిద్యను, మంత్రతంత్రములను బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులలో అర్హత కలిగిన వారికి మాత్రమే ఉపదేశించాలి " అని చెప్పాడు.

## లక్ష్మీ నివాసము

ధర్మరాజు " లోకంలో ఉన్న అనేక జనులలో లక్ష్మీదేవి ఎవరింట నివసిస్తుంది " అని అడిగాడు.భీష్ముడు " ధర్మనందనా ! ఒక సారి రుక్మిణీ దేవి లక్ష్మీదేవిని ఈ ప్రశ్న వేసింది. అప్పుడు లక్ష్మీదేవి ఋక్మిణీ దేవికి చెప్పిన విషయములు నేను నీకు చెప్తాను. నిత్యము సత్యము పలికే వారు, శుచిగా శుభ్రంగా ఉండే వారు, గురువుల ఎడ భక్తి కలవారు, ఎల్లప్పడూ అప్రమత్తంగా జాగ్రత్తగా ఉండేవారు, సదా దక్షతతో దీక్షితులుగా ఉండేవారు, మంచి పనులు చేసే వారు, మలినము లేని వారు, ఎప్పుడూ మంచి పనులు చేసే వారు, వుజ్ఞావంతులు, తపస్సు చేసే వారు, తనకు ఉన్నంతలో దానము చేసే వారు, బ్రహ్మచర్యము పాటించే వారు, ఇంద్రియ నిగ్రహము కల వారు నాకు ప్రేమ పాత్రులు నేను వారి వెంట ఎప్పుడూ ఉంటాను. ఇక క్రూరాత్ములు, నాస్థికులు, కృతఘ్నులు, దుర్మార్గుల వద్ద అసలు ఉండను. ఇక స్త్రీల వాద ఎవరి ఎంగిలి తినని వారు, ఇల్లు వాకిలి శుభ్రంగా ఉంచుకునే వారు వారి అందు నివసిస్తాను. ఇక భర్తకు ఎదురు చెప్పే వారు, ఇతరులను నిందించు వారు, భర్తకు తెలవకుండా పర పురుషుల ఇళ్ళకు వెళ్ళే వారు, ఎప్పుడూ నిద్రించె వారు వారి వద్ద నేను ఉండను. మరియు నేను **తామర పువ్వులందు, పూల తోటలందు, ఫలవృక్షముల అందు నేను నివసిస్తాను** " అని లక్ష్మీ దేవి రుక్మిణీ దేవికి చెప్పింది " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## స్త్రీలు పురుషులు దాంపత్యము

ధర్మరాజు " పితామహా ! దాంపత్య జీవితంలో అధికమైన ఆనందించేది స్త్రీయా ! పురుషుడా ! అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! పూర్వము భంగాస్వనుడు అనే రాజుకు సంతానము కలుగ లేదు. సాధారణంగా యజ్ఞము ఇంద్రుడి అనుమతి తీసుకుని చేయాలి. కాని భంగాస్వనుడు ఇంద్రుడి అనుమతి లేకుండా యజ్ఞము చేసి నూరుగురు కుమారులను పొందాడు. ఆ రాజు సంతోషంగా ఉన్నాడు కాని ఇంద్రుడు తన అనుమతి లేకుండా యజ్ఞము చేసినందుకు అతడి మీద కక్షకట్టాడు. ఒకరోజు **భగాస్వనుడు** వేటకు పోయాడు. ఇంద్రుడు అదను చూసి అతడిని దారితప్పేలా చేసాడు. ఫలితంగా ఆ రాజును గుర్రము ఎటోతీసుకుని వెళ్ళింది. ఇంతలో అతడికి బాగా దాహము వేసి గుర్రము దిగి సమీపంలోని కొలనులో దిగి ఆనీటిని సేవించాడు. వెంటనే ఆ రాజు ఆశ్చర్యపోయేలా అతడికి స్త్రీత్వము ప్రాప్తించింది. అయాచితంగా ప్రాప్తించిన స్త్రీత్వానికి ఆ రాజు చాలా చింతించి " ఈ వేషముతో రాజధానికి వెళ్ళి నేను నా భార్యా పిల్లకు , పురజనులకు ఎలా ముఖము చూపగలను " అని విచారించి " అయినా ఇలా అడవిలో ఉండలేను కదా ! " అనుకుని చివరకు రాజధానికి వెళ్ళి మంత్రులను పిలిచి విషయము చెప్పి తన పెద్ద కుమారుడిని రాజ్యాభిషిక్తుడిని చేసి తాను మాత్రము తపస్సు చేసుకోవడానికి అడవులకు పోయి అక్కడ మునిపుంగవులతో నివసించ సాగాడు.

### భగస్వనుడు మునిపుంగవుడిని వివాహమాడుట

అక్కడ ఉన్న ఒక ముని స్త్రీలాగా మారిన రాజును చూసి మోహించి వివాహమాడారు. భగాస్వనుడు మునివలన స్త్రీగా అత్యంత బల సంపన్నులైన నూరుగురు కుమారులను పొందాడు. ఆ తరువాత అతడు నూరుగురు కుమారులను తీసుకుని రాజ్యానికి వెళ్ళి అక్కడ ఉన్న తన కుమారులతో " కుమారులారా ! నేను పురుషుడిగా ఉన్నప్పుడు మిమ్ము కుమారులుగా పొందాను స్త్రీగా ఉన్నప్పుడు ఈ నూరుగురు కుమారులను పొందాను కనుక వీరు మీ అన్నదమ్ములు. ఇక మీదట మీరంతా ఈ రాజ్యాన్ని పంచుకుని పాలించండి " అన్నాడు. తండ్రిమాట పాలించి వారు రాజ్యాన్ని పంచుకుని పాలించసాగారు. ఇది చూసిన ఇంద్రుడు " నేను ఈ రాజుకు కీడు చేద్దామనుకుంటే అది అతడికి మేలు అయ్యింది. ఎలాగైనా వీరి మద్య బేధము కల్పించాలని సంకల్పించి ఒక బ్రాహ్మణుడి రూపము దాల్చి భగాస్వనుడికి పురుష రూపంలో కలిగిన పుత్రుల వద్దకు వెళ్ళి " రాజకుమారులారా ! ఏమిటీ వెర్రి ఎవరో తీసుకు వచ్చి వీరు మీ తమ్ముళ్ళు అని చెప్పగానే నమ్మడమేనా ! అసలు వీరి తండ్రి ఎవరు ? ఎవరికో పుట్టిన కుమారులు మీ తమ్ముళ్ళు ఎలా కాగలరు " అని వారిలో కలతలు రేపాడు. అలాగే భగాస్వనుడు స్త్రీగా ఉన్నపూడు జన్మించిన కుమారుల వద్దకు వెళ్ళి లేని పోని మాటలు చెప్పి అన్నదమ్ముల మద్య ద్వేషము రగిల్చాడు. అన్నదమ్ములు బద్ధశత్రువులై ఒకరితో ఒకరు కలహించి యుద్ధము చేసుకుని చివరకు అందరూ మరణించారు. చని పోయిన కుమారులను చూసి స్త్రీ రూపంలో ఉన్న భగస్వనుడు గుండెలు బాదుకుని రోదించసాగాడు. ఇది చాటుగా చూస్తున్న ఇంద్రుడు " అమ్మా నీవు ఎవరు ? ఎందుకిలా రోదిస్తున్నావు ? " అని ఏమీ ఎరుగని వాడిలా అడిగాడు. అప్పుడు ఆమె తాను యజ్ఞ ము చెయ్యడము కుమారులను కనడము అడవిలో దారి తప్పి కొలనునీరు త్రాగి స్త్రీగా మారడము మునిద్వారా కుమారులను కనడము పూసగ్రుచ్చినట్లు చెప్పాడు. అది విన్న ఇంద్రుడు తన నిజరూపంతో ప్రత్యక్షమై " రాజా ! నేను ఇంద్రుడను నీవు నా అనుమతి తీసుకోకుండా యజ్ఞము చేసినందుకు నీ మీద కోపించి ఈ కష్టాలు నీకు కలిగించాను " అని చెప్పాడు. భస్వానుడు " దేవా ! అజ్ఞానంతో తెలియక పొరపాటు చేసాను. అయినా దేవతలకు అధిపతి వైన నీవు పగ తీర్చుకోడానికి నేను తగిన వాడినా ! కనుక నన్ను దయతో రక్షించు " అని వేడుకున్నాడు. ఇంద్రుడు " రాజా ! నీకు నేను ఒక వరము ఇస్తున్నాను. నీవు పురుషుడిగా ఉన్నప్పుడు పొందిన పుత్రులనైనా లేక స్త్రీగా ఉన్నప్పుడు పొందిన పుత్రులనైనా బ్రతికిస్తాను ఎవరు కావాలో నీవే ఎంచుకో " అన్నాడు. రాజు సిగ్గుపడుతూ స్త్రీగా ఉన్నప్పుడు కలిగిన కుమారులను బ్రతికించమని కోరుకున్నాడు. ఇంద్రుడు " అదేమిటి రాజా ! మిగిలిన వారు నీ కుమారులు కాదా ! " అని అడిగాడు. భగస్వానుడు " వారు కూడా నా పుత్రులే వారికి నేను తండ్రిని, వీరికి నేను తల్లిని. తండ్రి ప్రేమ కంటే తల్లి ప్రేమ గొప్పది కదా ! " అని చెప్పాడు. ఇంద్రుడు " రాజా ! నీ సత్యనిష్టకు సంతోషించాను. నీకుమారులు అందరినీ బ్రతికిస్తాను " అని " రాజా ! నీకు ఇంకొక వరము ఇస్తాను నీవు పోగొట్టుకున్న పురుషత్వము ఇస్తాను " అన్నాడు. భగస్వానుడు " మహేంద్రా ! నా కుమారులను బ్రతికించావు అదే చాలు. నేనిలా స్త్రీగానే ఉంటాను " అన్నాడు. ఇంద్రుడు " అదేమిటి రాజా ! పురుషుడవైన నీవు స్త్రీగా ఉండి పోతాననడానికి కారణం ఏమిటి ? " అని అడిగాడు. స్త్రీగా ఉన్న భగస్వానుడు సిగ్గు పడి " మహేంద్రా ! నేను స్త్రీగా ఉండడములో ఆనంద పడుతున్నాను కనుక ఇలాగే ఉండి పోతాను " అన్నాడు. దేవేంద్రుడు నవ్వి అలాగే అగుగాక అని చెప్పి వెళ్ళాడు " అని చెప్పి భీష్ముడు " కనుక ధర్మనందనా ! నీవడిగిన ప్రశ్నకు నా సమాధనము ఇదే ! " అని భీష్ముడు చెప్పాడు.

## వైష్ణవము

ధర్మరాజు " పితామహా ! తమరు అంపశయ్య మీద ఉండి కూడా నేను అడిగే ప్రశ్నలకు ఓపికగా సమాధానం చెప్పారు. నేను ఎన్నో ధర్మసూక్ష్మాలు తమ ముఖతః విన్నాను. కాని అవి ఏవి జననము, మరణము వీటి వలన వచ్చే దుఃఖం తొలగించవు కదా ! ఎన్నో జన్మల నుండి ఎంతో మంది తల్లి తండ్రులకు పుడుతూ మరణిస్తూ ఈ సంసార చక్రంలో నేనిక తిరుగ లేను. పితామహా ! గర్భవాసముకు స్వర్గము నరకము ఉంటాయా చెప్పండి. ఈ చరాచర జగత్తు అసత్యము కనుక నేను ఈ జగత్తును విషతుల్యముగా చూస్తాను. నాకు ఈ రాజ్యము వద్దు సంసారము వద్దు. నాకు మోక్షకారకమైన వైష్ణవధర్మము ఉపదేశించండి. ఈ యుగములో వైష్ణవధర్మము కనిపించడం లేదని వ్యాసుడు చెప్పాడు. కనుక నేను అది మీ నుండి తెలుసుకొనగోరుతున్నాను " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ఏమిటీ వెర్రి. 18 రోజులు యుద్ధము చేసి శత్రువులను జయించి రాజ్యము కైవశము చేసుకుని ఇలా మాట్లాడటము నీకే చెల్లింది. లేకున్న క్షత్రియులకు ఇది తగదు. నీవు మిధిలా నగరాధిపతి జనకుడిలా మాట్లాడుతున్నావు. నిర్యాణము అనునది శాశ్వత సుఖాన్ని ఇస్తుంది. దానిని ఇలా ఉంటుంది అని వర్ణింపజాలము. జీవుడికి అది అతీతము. ప్రకృతులు ఎన్నో ఉన్నా ఆకృతి ఒక్కటే . అదే అన్నింటికీ మూలము. ఆకృతి ఎన్నో జీవాత్మలుగా రూపాంతరము చెందినా అది ఎటువంటి వికారము చెందదు. అది తన స్వస్వరూపము మరువదు. సంసారము అనే మార్గము సుగమంగా కనిపిస్తుంది. మోక్షమార్గము కామము, క్రోధముతో కప్పబడి ఉంటుంది. కనుక కామము, క్రోధములను విడిచి సత్వగుణమును ఆశ్రయించి జీవితము గడపాలి దానినే వైష్ణవమని అంటారు. నీవుఈ ధర్మమును పాటించి సంసార భయమును వీడి మోక్షము సాధించు " అని భీష్ముడు చెప్పాడు.

## తత్వములు

ధర్మరాజు " పితామహా ! తత్వములు, అధ్యాత్మములు, అదిదైవతములు, అదిభూతములు అను వాటికి కర్త భర్త హర్త అయి సకల భూతములకు ఆధారభూతమైన పరమాత్మను గురించి వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! సనకుడు, సనందుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు, ఈ నలుగురు బ్రహ్మమానస పుత్రులు. వీరు కాక బ్రహ్మకు **మరీచి, భృగువు, అంగీరసుడు, అత్రి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు** అను ఆరుగురు కుమారులు ఉన్నారు. అందు సనత్సుజాతుడు బొటనవ్రేలి ప్రమాణంలో ఉండి అగ్ని మాదిరి మండుతుంటాడు. ఒక ప్రదేశాన నిలువక సదా లోకాలన్నీ చుట్టివస్తాడు. ఒక రోజు సనత్సుజాతునకు నారదుడు **మేరుపర్వతము** మీద కనిపించాడు. ఆయన చెప్పిన విషయము నేను నీకు చెప్తాను. విష్ణుమూర్తికి పదివేల సంవత్సరములు రాత్రి, పదివేల సంవత్సరాలు పగలు. ఇరవై వేల యుగములు ఒక రోజు. విష్ణువు రూపమును అవ్యక్తము అంటారు. విష్ణువు రాత్రు నిద్రించి పగలు సృష్టి ఆరంభిస్తాడు. సృష్టిచేయ సంకల్పించిన విష్ణువు శుక్లమును అండాకారములో జలములో విడిచిపెడతాడు. తరువాత తన నాభి నుండి బ్రహ్మను సృష్టించాడు. ఆయనను సృష్టికి కర్తగా నియమించాడు. తరువాత బ్రహ్మను అహంకారము ఆవహించింది. తరువాత మనసు, బుద్ధి, ఇంద్రియములు, పంచభూతములైన **ఆకాశము, గాలి, అగ్ని, జలము, భూమి** అను పంచభూతములను సృష్టించాడు. పంచభూతములకు గుణముగా **శబ్ధము, స్పర్శ, రూపము, రసము, గంధము** ఆవిర్భవించాయి. తరువాత **దేవతలు, మునులు, రాక్షసులు, గంధర్వులు, కిన్నెరలు, నరులు, జంతువులు** మొదలైన జీవజాతులు ఆవిర్భవించాయి. వీటన్నింటినీ అహంకారము ఆవహించింది. ఇవి అన్నీ అవ్యక్తమైన సంసారసాగరమున పుడుతూ మరలా చస్తూ మరలా పుడుతూ జనన మరణ చక్రంలో పడి తిరుగుతుంటారు. ఈ సృష్టి స్థితి లయములకు కారకుడైన విష్ణువు జీవరాసులకు శుభాశుభములు కలిగిస్తూ ఈ సంసార చక్రాన్ని తిప్పుతూ వినోదిస్తుంటాడు. పంచభూతములు, పంచ గుణములు, మహతత్వము, పది ఇంద్రియములు, అహంకారము, మనసు, బుద్ధి అను 24 తత్వములు.

### అధ్యాత్మము అదిభూతము అధిదైవతములు

**చెవి** అధ్యాత్మము అయితే **శబ్ధము** అదిభూతము. **దిక్కులు** అధిదైవతములు. **చర్మము** అధ్యాత్మము అయితే **స్పర్శ** అదిభూతము, **గాలి** దానికి అదిదైవతము. **కళ్ళు** అధ్యాత్మము అయితే **రూపము** అది భూతము **సూర్యుడు** దానికి అదిదైవతము. **నాలుక** ఆధ్యాత్మము అయితే **రుచి** దానికి అదిభూతము **నీరు** దానికి అదిదైవతము. **ముక్కు** అధ్యాత్మము అయితే **వాసన** దానికి అదిభూతము **భూమి** దానికి అదిదైవతము. వీటిని బుద్ధి ఇంద్రియత్రయము అంటారు. **పాదములు, విసర్జకావయవము, జననేంద్రియము, చేతులు, నోరు** కర్మేంద్రియములు అనునవి అధ్యాత్మికములు. పైన చెప్పిన అవయవములకు వరుసగా **నడక, విసర్జనము, ఆనందము, పని, మాట** అధిభూతములు. వాటికి వరుసగా **విష్ణువు, సూర్యుడు, బ్రహ్మ, ఇంద్రుడు, అగ్ని** అధిదైవతములు. **అహంకారము, మనసు, బుద్ధి** ఆధ్యాత్మకములు, వీటికి **అభిమానము, సంకల్పము, నిశ్చయము** అధిభూతములు. వాటికి **మేధస్సు, చంద్రుడు, బ్రహ్మ** అధిదైవతములు. ఇవన్నీ విష్ణువు నుండి పుట్టి లయమౌతాయి. అవ్యక్తము అంటే మూల ప్రకృతి. అందులో పురుష చైతన్యము చేరితే ఆ ప్రకృతి చైతన్యవంతమౌతుంది. అప్పుడు ఈ ప్రపంచమంతా అంతా వైభవంతో నడుస్తుంది. ఈ సృష్టికంతా ఆధారం విష్ణువు. పరమశివుడి అనుమతితో బ్రహ్మ జననమరణములు నిర్వహిస్తూ ఉంటాడు " అని సనత్సుజాతుడు నారదుడికి చెప్పాడు "

అని చెప్పి భీష్ముడు " ధర్మజా ! ఈ సృష్టికంతకూ మూలము 25వ తత్వము అయిన పరమాత్మ. వేద వేదాంత పురాణ వేద్యుడైన ఆ పురుషుడు ఎల్లప్పుడూ వెలుగుతూ ఉంటాడు. అతడే కాలాంతకుడైన అచ్యుతుడు, అనంతుడు, యోగి జనముల హృదయములలో నివసించే వాడు, విష్ణువు, అద్వయుడు, అసంగుడు. అతడే పరమాత్మ " అని భీష్ముడు పలికాడు.

## విష్ణుస్వరూపము

ధర్మరాజు " పితామహా ! మహానుభావులు అగ్నులను తమయందు సమాహితం చేసుకుంటారు కదా ! అటువంటి వారు విష్ణుమూర్తిని ఎటువంటి వాడిగా భావిస్తారు ? వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! క్షీరసాగరమధనంలో అమృతం పుట్టగానే దేవతలు దానవులకు యుద్ధం జరిగింది అందులో దానవులు దేవతలను జయించి అమృతము కైవశము చేసుకున్నారు. దేవతలు బ్రహ్మదేవుడిని ఆశ్రయించారు. అప్పడు ఆకాశము నుండి " దేవతలారా ! నేను మిమ్ము గెలిపించడానికి వస్తున్నాను " అన్న మాటలు వినిపించాయి. అంతలో విష్ణుమూర్తి గరుఢారూడుడై శంఖ చక్ర గధా సహితుడై అసురుల మీదకు యుద్ధానికి వచ్చి వారిని జయించి వెంటనే అంతర్ధానం అయ్యాడు. అది చూసి ఆశ్చర్యచకితులైన దేవతలు " ఈ మహానుభావుడు ఎవరు ? " అని బ్రహ్మదేవుడిని అడిగారు. బ్రహ్మదేవుడు " దేవతలారా ! ఆయన విష్ణుమూర్తి వైకుంఠములో ఉంటాడు. ఆయన ఇలా ఉంటాడు అని నాకు వర్ణించడానికి శక్తిచాలదు. అయినా ఆయన రూపము తెలుసుకోవడానికి నేను ఒకకథ చెప్తాను.

## మునులతో గరుత్మంతుడు

హిమాలయాలలో మునులు, సిద్ధులు తపసు చేసుకుంటున్న తరుణంలో అక్కడకు గరుడుడు వచ్చి వారికి నమస్కరించాడు. వారు అతడిని సుఖాసీనులను చేసి " గరుడా ! నిన్ను ఒక విషయం అడగాలని ఉంది " అని అడిగారు. అందుకు గరుడుడు " ధన్యుడను అడగండి చెప్తాను " అని అన్నాడు. మునులు సిద్ధులు " గరుడా ! విష్ణు భక్తుడపై సదా విష్ణువుకు సమీపంలో ఉండే నీవు మాకు విష్ణుతత్వము ఎరిగించగల సమర్ధుడవు. కనుక భక్త సులభుడైన విష్ణుతత్వము గురించి మాకు వివరించు " అని అడిగారు. మహానుభావులారా ! ఈ మూడు లోకములను విష్ణుమూర్తి రక్షిస్తున్నాడు అని మాత్రమే నాకు తెలుసు. అంతమాత్రాన నాకు అన్ని తెలుసునని అనుకోవడం కష్టం. మీకు నాకే కాదు ఎవరికైనా విష్ణుతత్వము గురించి చెప్పడము కష్టమే. నేను విన్న ఆయన కథలను కావాలంటే చెప్తాను. నేను దేంద్రుడిని జయించి అమృతభాండమును తీసుకు వెడుతున్న తరుణంలో ఆకాశం నుండి " గరుడా ! నీ పరాక్రమానికి మెచ్చాను ఏదైనా వరం కోరుకో " అనే మాటలు వినిపించాయి. అప్పుడు నేను " అయ్యా ! మీరెవరో నాకు తెలియదు మీరెవరో నాకు తెలిపి వరాలను ఇవ్వండి " అన్నాను. ఆ మాటలకు బదులుగా ఒక నవ్వు వినిపించి తరువాత " కాలక్రమేణా నీకు నేనెవరో తెలుస్తుంది. నీవు నా వాహనముగా ఉండు. నీకు వ్యాధులు సోకవు మరణం ఉండదు. అసురులను జయిస్తావు " అన్న మాటాలు చెప్తూ ఒక కాంతిపుంజము నా ఎదుట నిలిచింది. నేను ఆకాంతి స్వరూపానికి చేతులెత్తి నమస్కరించి " మహానుభావా ! నేను నీకు వాహనమౌతాను. నీవు ఎక్కిన రథముకు నన్ను ధ్వజముగా నియమించమని నేను కోరుకుంటున్నాను " అని అడిగాను. " అలాగే జరుగుతుంది " అని చెప్పి ఆ కాంతి స్వరూపం మాయమయ్యింది. ఆ మాటలకు ఆశ్చర్యానందాలు కలిగాయి.

## గరుత్మంతుడు కశ్యపుడు

నేను నా తండ్రి కశ్యపుడి వద్దకు వెళ్ళి ఈ విషయం తెలియజేయగా నా తండ్రి నాతో " కుమారా ఆమహానుభావుడెవరో కాదు అతడే నారాయణుడు. నీ మీద కలిగిన దయవలన నీకు దర్శనమిచ్చాడు. నేను ఆయనను దర్శించవలెనన్న కోరికతో ఆయనను ఆరాధిస్తూ యోగసమాధిలో ఉండి తపమాచరించాను. ఆయన నాకు అనేక శరీరాలతో ఉన్న తన విశ్వరూపము చూపి " కశ్యపా ! నీలో ఇంకా కోరికలు చావలేదు. మనసులో కోరికలు పెట్టుకుని నన్ను చూడడం జరగని పని. నీ వు నిస్సంగుడవైనప్పుడు నన్ను దర్శించగలవు " అన్నాడు. అటువంటి దివ్యమూర్తికి సేవలు చేసే భాగ్యము లభించిన నీవు అదృష్టవంతుడవు నీ జన్మ ధన్యమైంది. నీవు వెంటనే బదరికాశ్రముకు వెళ్ళి అక్కడ ఆ దివ్యమూర్తిని సేవింపుము " అని చెప్పాడు. నేను వెంటనే బదరికాశ్రము వెళ్ళి అక్కడ **అచ్యుతుడు, పుండరీకాక్షుడు, గోవిందుడు, లోకజనకుడు, నారాయణుడు** అను దివ్యమూర్తిని దర్శించి అతడికి భక్తితో నమస్కరించాను. ఆ పీతాంబరధారి శంఖు చక్ర గధా ధారి అయి అష్ట భుజములతో ఉన్న నారాయణుడు " వచ్చావా ! మంచి పని చేసావు నా వెంట రా " అంటూ ఉత్తర దిక్కుకు వెళ్ళాడు.

## గరుత్మంతుడు నారాయణుడిని వెంబడించుట


తపస్సుచేసుకొంటున్న శివుడు

నేను ఆయనను అనుసరిస్తూ ఎన్నో యోజనములు పయనించాను. అక్కడ ఏ విధమైన ఇంధనము లేకుండా మండుతున్న అగ్నిలో ఆ పీతాంబరధారి ప్రవేశించాడు. నేను ఆయనను అనుసరించాను. అక్కడ పార్వతీ సహితుడైన శివుడు తపస్సు చేస్తున్నాడు. నారాయణుడు వారిని దాటి వెళ్ళాడు. నేను ఆయనను అనుసరించాను క్రమంగా గాంఢాంధకారం అలుముకుంది నాకు ఏమీ కనిపించ లేదు. " ఈ దిక్కుకు రా " అన్న శబ్దము వినిపించింది. నేను దిక్కు తోచక అటుపై వెళ్ళాను. క్రమక్రమంగా చీకట్లు అంతరించి అక్కడ ప్రకాశవంతమైన వెలుగు ప్రసరించింది. అక్కడ సూర్యుడు పట్టపగలు మాదిరి ప్రకాశవంతంగా వెలుగుతున్నాడు. కమ్మని సంగీతము వినవస్తుంది. తామర కొలనులు ఉన్నాయి. అందమైన మగవారు ఆడవారు నారాయణ మూర్తిని పూజిస్తుండగా ఆయన అలా వెళుతుండగా నేను ఆయనను అనుసరించాను. నేను ఆ వెలుగును తట్టుకోలేక స్వామీ అని అరిచాను. ఆయన వాత్సల్యంతో " వినతాకుమారా ! నేను నిన్ను మరచిపోతానా ! నా వెంట రా ! నీవు నన్ను చూడలేదని బాధపడకు. మమతలు, అహంకారం మనసున రానీక నిశ్చల మనసుతో ఏకాగ్రచిత్తులైన వారు మాత్రమే నన్ను చూడగలరు. నీకు నా మీద కలిగిన భక్తిప్రత్తులు కారణంగా నీవు కేవలం నా స్థూల శరీరము మాత్రమే చూడగలుగుతున్నావు " అని స్వామి నాతో అన్నాడు. అప్పటికి అమితమైన వేడి తేజస్సు చల్లబడింది. నేని తిరిగి స్వామిని అనుసరించాను. నారాయణుడు ఆకాశానికి ఎగిరాడు నేను కూడా ఆయన వెంట ఎగిరాను. అక్కడ స్వామి అంతర్ధానం అయ్యాడు. ఇటురా ! అన్న శబ్దం వినిపించి నేను అటుగా వెళ్ళాను. అక్కడ తెల్లటి హంసలు విహరిస్తున్న తామర కొలను కనిపించింది. అక్కడ నారాయణుడు స్నానం చేస్తుండగా నేను ఆయన వద్దకు చేరబోయాను. ఆయన నాకు కనిపించ లేదు బదులుగా వెలుగుతున్న కొన్ని వందల అగ్నులు కనిపించి వేధ ఘోషలు వినవచ్చాయి. అప్పుడు కొన్ని వందల గరుడపక్షులు నన్ను చుట్టుముట్టగా నేను భయ భ్రాంతుడనయ్యాను. నేను **అచ్యుతా, శివా, సహస్రాక్షా, వేదమయా , అనాది నిధనా, త్రిభువనైక నాథా, త్రినైనా , గోవిందా , పద్మనాభా, హరా, కృపా విధేయా** అని పెద్దగా స్వామిని స్తోత్రం చేసాను. అప్పుడు స్వామి నా ఎదుట ప్రత్యక్షమై " వినతా పుత్రా ! భయపడకు " అని నా భుజం తట్టాడు. నేను కళ్ళు తెరిచి చూడగా బదరికాశ్రమంలో ఉన్నాను. అది చూసి ఆశ్చర్యచకితుడనై ఇదంతా విష్ణుమాయ అని తెలుసుకుని పులకించిపోయాను. అప్పుడు నాముందు ఎనిమిది భుజములతో ప్రత్యక్షమైన నారాయణుడిని చూసి స్వామి ముందు మోకరిల్లి " మహానుభావా ! నేను నీ పాదసేవకుడను అయితే, నేను నీ దయకు పాత్రుడనైతే, నేను వినడానికి అర్హుడనైతే నీ మహిమ నాకు తెలిసేలా చెప్పు " అని అడిగాను.

## విష్ణు మహిమ

నారాయణుడు " వినతా పుత్రా ! దేవతలు కానీ, గంధర్వులు కానీ, దనుజులు కానీ ఇప్పటి వరకు నా నిజ స్వరూపము ఎరుగరు. అఖిలభూతములు నా యందు జన్మించి, నాయందు పెరిగి, నా యందే నశిస్తాయి. అఖిలభూతములు నాయందు ఉంటాయి. నేను అఖిల భూతములందు ఉంటాను. నన్ను తెలుసు కోవాలంటే జీవాత్మను పరమాత్మ వైపు మళ్ళించాలి. కామమును, అహంకారమును, కోపమును, జడత్వమును వదిలి పెట్టాలి. ఇతరుల నుండి ఏదీ గ్రహించకూడదు. అహింసను అవలంబించి మనసును నిర్మలంగా ఉంచుకుని నిత్య తృప్తులై ఉండాలి. అలాంటి వారికి నేను దర్శనం ఇస్తాను. సాంఖ్యయోగము అవలంబించినప్పటికి బాహ్యముతో సంబంధబాంధవ్యాలు తెంచుకోలేని వారికి నిశ్చయబుద్ధి లేని వారికి నేను కనిపించను. అధికమోహములో పడి కొట్టుకుంటూ పూజలు, వ్రతములు, ఉపవాసములు ఆడంబరముగా చేసే వారికి నేను కనిపించను. ఏకాంతమనస్కులు నన్ను దర్శించగలరు. రజ, తమోగుణులకు కాక కేవలం సత్వగుణము కలవారికి మాత్రమే నేను దర్శనమిస్తాను. **వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ** అని నాలుగు విధములుగా విభజింపబడి ప్రాణులందు **ఆత్మ, బుద్ధి, అహంకారము, మానస్సు** అనే నాలుగు విధములుగా ప్రవర్తిస్తుంటాను. ఇది నా స్థూల రూపము. నీవు కూడా నన్ను తెలుసుకుని నాయందు భక్తితో సదా నన్ను ధ్యానిస్తూ నా నిజస్వరూపమును తెలుసుకో " అని నారాయణుడు నాకు తెలియజేసాడు.


ధర్మరాజుకి ఉపదేశిస్తున్న మునులు

నారాయణుడు నాకు చెప్పినది నేను మీకు చెప్పాను " అని సుపర్ణుడు మునులకు సిద్ధులకు చెప్పినది విని వారు ఆనంద పరవశులై " మహానుభావా ! నీ వలన మేము విష్ణుతత్వము విని ధన్యులమైయ్యాము. ఈ కథ అత్యంత పుణ్యదాయకమై విన్న వారికి ఆయురారోగ్యాలను ప్రసాదిస్తుంది. **ఈ కథ విన్న బ్రాహ్మణులకు వేదవిద్య అలవడుతుంది. క్షత్రియులకు జర్వత్రా విజయము లభిస్తుంది. వైశ్యులకు సంపద అభివృద్ధి చెందుతుంది. శూద్రులకు సకల శుభములు చేకూరుతాయి. సర్వజనులు ఇహపరసౌఖ్యాలను పొందుతారు.** అని పొగిడారు. ధర్మనందనా ! ఈ కథ పూర్వము బ్రహ్మదేవుడు వసువులకు చెప్పగా వసువులు మా తల్లి గంగాదేవికి చెప్పినప్పుడు నేను విన్నాను. ఇప్పుడు నీకు చెప్పాను. ధర్మనందనా ! మనసులో చేసే సకలవిధ సంకల్పములను విడిచి పెట్టి ఆత్మను అగ్నియందు ప్రతిష్టించి బాహ్యసంబధములు విడిచి ధ్యానమగ్నుడవై విష్ణువును ధ్యానించి మోక్షమును సాధించు. ఇలా చేసిన వారికి మోక్షము సులువుగా లభిస్తుంది " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడని **వైశంపాయనుడు** జనమేజయుడికి చెప్పాడు.

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

"http://te.wikipedia.org/w/index.php?title=అనుశాసనిక_పర్వము_ప్రథమాశ్వాసము&oldid=760931" నుండి వెలికితీశారు

వర్గం: మహాభారతం

---

- ఈ పేజీకి 07:56, 25 సెప్టెంబర్ 2012న చివరి మార్పు జరిగినది.

# అనుశాసనిక పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# ద్వితీయాశ్వాసము

భీష్ముడు చెప్పిన విష్ణుతత్వమును విని తరించిన ధర్మరాజు భీష్ముడితో " పితామహా ! వివాహసమయంలో కన్యాదానం చెయ్యడానికి ఎలాంటి వరుడు కావాలి ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఇది తెలుసుకేందుకు నీకు నేను ఒక కధ చెప్తాను. **అష్టావక్రుడు** అనే మునికుమారుడు వదాన్యుని కుమార్తె సుప్రభను వివాహమాడాలని అనుకుని తనకోరికను వదాన్యుడికి తెలిపాడు. వాదాన్యుడు అందుకు అంగీకరించి అష్టావక్రుడిని ఉత్తరదిక్కుగా వెళ్ళమని చెప్పాడు. అలా ఎందుకు చెప్పావని అష్టావక్రుడు అడుగగా **వదాన్యుడు** " కుమారా ! ఉత్తరదిక్కున కుబేరుడి నగరం దాటిన తరువాత ఉన్న హిమాలయ పర్వతాలలో శివుని కొరకు పార్వతీదేవి కలిసి తపస్సుచేసిన ప్రదేశం అతిపవిత్రం అయింది. అక్కడ పార్వతీ పరమేశ్వరులు విహరిస్తుంటారు. ఆ ప్రదేశం దాటితే ఒక వనము కనిపిస్తుంది. అక్కడ ప్రౌఢవయస్కురాలైన ఒక పవిత్రురాలైన స్త్రీ కనిపిస్తుంది. నీవు ఆ స్త్రీని కలిసి వస్తే నేను నీకు నా కుమార్తెను ఇచ్చి వివాహము చేస్తాను " అని వదాన్యుడు చెప్పాడు. అష్టావక్రుడు కుబేరుడు ఉండే నగరానికి ప్రయాణమయ్యాడు. కుబేరుడిని కలుసుకుని అతడి ఆతిధ్యం స్వీకరించాడు. కుబేరుడు ఏర్పాటు చేసిన అందమైన నృత్యాలు చేసిన స్త్రీలెవ్వరు అష్టావక్రుడిని ఆకర్షించ లేదు. తరువాత శివపార్వతులు విహరిస్తున్న ప్రదేశం చేరుకున్నాడు. తరువాత వదాన్యుడు చెప్పిన కడిమివనానికి చేరుకున్నాడు. అక్కడ ఎన్నో బంగారు మేడలను చూసి తాను వచ్చినట్లు వారికి వర్తమానం పంపాడు. అందమైన వనితలు అతడికి ఎదురు వచ్చి స్వాగతం చెప్పి అష్టావక్రుడిని లోనికి తీసుకు వెళ్ళారు.

## అష్టావక్రుడు ప్రౌఢ

అక్కడ అష్టావక్రుడు ఒక ప్రౌఢను చూసాడు. ఆమె అతడిని తన పక్కన కూర్చొబెట్టుకుని అతడికి ఎన్నో మర్యాదలు చేసింది. ఇంతలో రాత్రి అయింది చలివేళలో అతడి పక్కన చేరిన ఆ ప్రౌఢ అతడిలో ఎటువంటి చలనం లేకపోవడం చూసి " ఆర్యా ! పురుషులైన మిమ్ము ఇటువంటి అందమైన స్త్రీ ఆకర్షించ లేక పోవడమేమిటి. నా సంపదలన్నీ నీ పరం చేస్తాను నన్ను మీ భార్యగా స్వీకరించండి. నేను మీ సేవ చేసుకుని బ్రతుకుతాను " అని వేడుకుంది. అష్టావక్రుడు " అమ్మా ! పరస్త్రీలను కోరడం దోషము. బ్రాహ్మణుడికి శూద్రస్త్రీని చేరడం అత్యధిక దోషం. అదే బ్రాహ్మణ స్త్రీకి అది మహాపాతకము. నేను అవివాహితుడను కనుక నేను ఒక కన్యను వివాహమాడతలిచాను " అన్నాడు. ఆ ప్రౌఢ " అర్యా ! నేను మీ అందానికి వశురాలనైయ్యాను. మోహపరవశులు వావివరుసలు వంశహాని లెక్క చేయరు కదా ! నన్ను వివాహమాడండి " అని వేడుకుంది. అష్టావక్రుడు " మీరిలా మాటాడ తగదు. ఇలాటి వారిని నేను ఎరుగను. నీ కోరిక మానుకో " అని పలికాడు. అప్పుడు ఆ స్త్రీ " చిరునవ్వు నవ్వి " పోదువు కాని ఉండు " అన్నది. అష్టావక్రుడు " నువ్వు దూరంగా ఉంటే ఉంటాను " అని మనసులో " ఈమె ఎవరో శాపగ్రస్థ లాగ ఉంది. లేకున్న ఇలా ప్రవర్తించదు కదా ! " అనుకున్నాడు. తెల్లవారిన తరువాత అష్టావక్రుడికి ఆ స్త్రీ స్నానికి తగిన ఏర్పాటు చేసి స్నానము చేయించింది. అతడికి మృష్టాన్నము పెట్టి భుజింపచేసి విశ్రమించడానికి శయ్యను ఏర్పాటు చేసి విశ్రమించమని చెప్పింది. అష్టావక్రుడు అందుకు అంగీకరించక పోవడంతో ఆమె " మహాభాగా ! నేను కన్యనే తగిన వరుడు దొరకక ఇలా కన్యగా మిగిలాను. నా అదృష్టం వలన మీరు దొరికారు కనుక నన్ను వివాహమాడండి " అన్నది. అష్టావక్రుడు " అమ్మా ! బాల్యంలో తండ్రి, వివాహానంతరం భర్త, వృద్ధాప్యంలో కుమారుని సంరక్షణలో స్త్రీ జీవించాలి కానీ ఎన్నటికీ స్వతంత్రురాలు కాదు. కనుక నీకు నీవుగా వివాహము చేసుకొన తగదు. నన్ను అలా కోరినా నేను అందుకు అంగీకరించను. ఇంతకూ నీవు ఎవరు ? నన్నిలా ఎందుకు పరీక్షిస్తున్నావు ? " అని అడిగాడు. ఆమె " మహాభాగా ! నిన్ను పరీక్షించడానికి వదాన్యుడు నన్ను ఇక్కడకు పంపాడు. నీ నిష్టకు నేను మెచ్చాను. వదాన్యుడు కూడా నిన్ను అల్లుడుగా అంగీకరించి తన కుమార్తెను ఇచ్చి వివాహము చేస్తాడు " అని చెప్పింది. అష్టావక్రుడు ఆమెకు నమస్కరించి తిరిగి వెళ్ళాడు. వదాన్యుడు తన కుమార్తె సుప్రభను అష్టావక్రుడికి ఇచ్చి వివాహం చేసాడు. కనుక ధర్మనందనా ! వరుడి గుణ గణాలను పరీక్షించి కన్యను ఇవ్వాలి.

## బ్రహ్మ ఋషి

ధర్మరాజు " పితామహా ! బ్రాహ్మణుడైన మునీశ్వరుడుకి శూద్రస్త్రీకి కలిగిన వ్యక్తి బ్రహ్మర్షి కాగలడా ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నీకు వివాహవిధి గురించి చెప్తాను. బ్రాహ్మణుడు తనకులములోని కన్యనే కాక మిగిలిన మూడు కులములలోని కన్యలను వివాహము చేసుకొనవచ్చు. క్షత్రియుడు తనకులములోని కన్యనే కాక మిగిలిన రెండు కులములలోని కన్యలను వివాహము చేసుకొనవచ్చు. వైశ్యుడు తనకులములోని కన్యనే కాక శూద్రజాతి కులములలోని కన్యలను వివాహము చేసుకొనవచ్చు. ఇది వివాహముకు పెద్దలు నిర్ణయించిన పద్ధతి. ఇలాకాక ఎవరైనా తన కులము కంటే అధిక కులముకు చెందిన కన్యలను వివాహమాడిన వర్ణసంకరము జరుగుతుంది. తల్లి ఏకులముకు చెందినది అయినా బిడ్డ తండ్రి కులముకు చెందిన వాడు ఔతాడు. ఇది సకల కులముకు ఆమోదయోగ్యమైన పద్ధతి. విశేషంగా తపోనిష్టా గరిష్టులైన మునికి తక్కువ కులముకు చెందిన సంతానం బ్రాహ్మణులే ఔతారు. క్షత్రియులకు వైశ్య, శూద్రుల వలన కలిగిన సంతానం క్షత్రియులే ఔతారు. పశువులకు, పక్షులకు బ్రాహ్మణుల వలన కలిగిన సంతానం బ్రాహ్మణులే ఔతారు. కనుక బ్రాహ్మణులకు, క్షత్రియులకు క్షేత్రముకంటే బీజమే ప్రధానము. వశిష్టుడు, ఋష్యశృంగుడు, అగస్త్యుడు, వ్యాసుడు, మందపాలుడి కుమారులు, ద్రోణుడు, కృపాచార్యుడు పుట్టిన విధము నీకు తెలుసుకదా ! వారందరికి తండ్రి కులమే సంక్రమించింది కదా ! మనువు ఈ విషయములో " నదుల యొక్క, మునుల యొక్క, సిద్ధుల యొక్క, పుట్టుక గురించి తర్కించ తగదు. మహాత్ములు వారి జన్మల వలన కాక గుణముల వలనే ప్రకాశిస్తారు " అని భీష్ముడు పలికాడు.

## విప్రుడు దానము

ధర్మరాజు " విప్రుడు దానము పుచ్చుకోవడానికి అతడు చేసే వృత్తి ప్రధానమైనదా ? లేక అతడు సన్యాసి అవడం వలన నిర్ణయించ బడుతుందా ? తెలపండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మజా ! మంచి బ్రాహ్మణుడు తాను చేసే మంచి పనుల వలన దానమునకు అర్హుడుగా నిర్ణయించబడతాడు. అతడు సన్యాసియా, సంసారియా అన్నది ముఖ్యమైనది కాదు " అన్నాడు. ధర్మరాజు " పితామహా ! పురజనులు బ్రాహ్మణులకు శ్రద్ధగా ఇచ్చు దానములు పాపము కాదు కదా ! " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! శ్రద్ధగా ఇచ్చు దానములు పాపములు పోగొడతాయి కాని పాపములు కలిగించవు. కాని పైకి ధర్మములు పలుకుతూ లోపల అధర్మవర్తనుడైన వాడు దానము పుచ్చుకొనుటకు అనర్హుడు. ఈ విషయములో ఒక సారి భూదేవికి, కశ్యపుడికి, అగ్నికి, మార్కండేయునకు మధ్య ఒక చర్చ జరిగింది. దాని సారాంశము ఏమంటే ఎంతటి ఉన్నత

కులమున జన్మించిన వారైనా వేదములు, శాస్త్రములు, పురాణములు చదివినా శీలము సత్ప్రవర్తన లేకున్న అతడికి ఉత్తమగతులు కలుగవు. ఎంతో విద్య నేర్చుకుని అనేక సన్మానాలు పొందిన వాడు ఎదుటి వారి విద్యను చులకన చేసి మాట్లాడిన అతడికి బ్రహ్మ హత్యాపాతకము చుట్టుకుంటుంది. వేయి యజ్ఞములు చేసిన ఫలము కంటే సత్యవాక్యము పలికిన ఫలితము రెండితలు ఉంటుంది. ధర్మనందనా ! మద్యము మాంసము తినడం మాని వేసిన జీవితాంతము బ్రహ్మచర్యము పాటించిన ఫలితం కంటే అధికమైన ఫలితం దక్కుతుంది. ఇంద్రియనిగ్రహమును పాటిస్తూ ఈ లోకములో సంచరించడాన్ని శౌచం అంటారు " అని భీష్ముడు చెప్పాడు.

## పురుషార్ధములు

ధర్మరాజు " పితామహా ! ధర్మము, అర్ధము, కర్మము, మోక్షము పురుషార్ధములు అంటారు కదా ! వాటిని ఎప్పుడు ఆచరించాలి ? తెలపండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! మనీషికి అర్ధము మీద, కామము మీద కోరిక ఉండడము మంచిది కాదు. ఎప్పుడూ ధర్మాచరణ మీదనే ధ్యాస ఉండడం మంచిది. అర్ధము, కామములతో ధర్మమును ముడివేయాలి. ధర్మము పగలు, కామము రాత్రి, అర్ధము తెల్లవారు ఝామున ఆచరించాలి. ధర్మనందనా ! గురువులను, బ్రాహ్మణులను పూజించడం వలన పుణ్యం వస్తుంది. బ్రాహ్మణ నింద, వేదాధ్యయన విసర్జన, అగ్నిని విడుచుట పాపము " అని భీష్ముడు చెప్పాడు. భీష్ముడు " పితామహా ! మీరు చెప్పినది నాకు అర్ధము కాలేదు. ఇంతకూ దానముకు అర్హులు ఎవరో వివరంగా చెప్పండి " అని అడిగాడు ధర్మరాజు. భీష్ముడు " ధర్మనందనా ! ధర్మపరులు, కోపము లేని వారు, సదా సత్యము పలుకు వారు, ధీరులు, తన పని తాను సక్రమంగా చేసే వారు, ఇంద్రియములను జయించిన వారు, సర్వభూతముల అందు దయకలిగిన వారు, లోభత్వము లేని వారు, శుచిగా ఉన్న వారు, దానము చెయ్యడానికి అర్హులు, వేదాధ్యయనము చేయువారు, తత్వవిధులు అయిన బ్రాహ్మణులు దానము స్వీకరించుటకు అర్హులు. అర్హులు కాని వారికి దానము చేయుట తగదు. తాను చేసిన దానము వలన ఒక బ్రాహ్మణుడు తృప్తి చెందిన సర్వదేవతలు, మునులు, పితరులు తృప్తి చెందుతారు. కనుక యోగ్యుడైన బ్రాహ్మణుడికి దానము ఇవ్వడము మంచిది. ధర్మనందనా ! ఉదయము దేవతలను, దేవుళ్ళను మధ్యాహ్నము అతిధులను అంటే మానవులను సాయంకాలము పితృదేవతలను ఆరాధించాలి. ధర్మనందనా ! చాలాకాలము కిందట తయారు చేసిన ఆహారమును, శుభ్రముగా లేని ఆహారమును, ఒకరు తిని విడిచిన పదార్ధములను, మంత్ర పూరితముగా దేవుడికి నైవేద్యము చేయని పదార్ధములను, పురుగులు వెంట్రుకలు పడిన పదార్ధములను తినరాదు. దేవకార్యములకు పితృ కార్యములకు అర్జించిన ధనమును చోరులు అపహరించ కుండా భద్రపరచాలి. మదించిన వాడిని, తెలివి లేని వాడిని, పిచ్చి వాడిని, పాపములు చేసే వాడిని, నపుంసకుని, కుష్టురోగులను, పాపాత్ముడైన పురోహితుడిని, వైద్యము రాని వైద్యుడిని, నియములను వదిలిన వాడిని, అపస్మారకుడిని, రోగగ్రస్థుడిని, క్షయరోగిని, మద్యము విక్రయించు వారిని, వేదవిద్యను విక్రయించి వాడిని తక్షణం వదిలి వేయాలి. ధనము వడ్డీకి ఇచ్చి జీవించు వాడిని, అగ్నిహోత్రం చేయని వారిని, మనుష్యులను విక్రయించు వారు దేవకార్యములకు పితృకార్యములకు పనికి రారు " అని భీష్ముడు చెప్పాడు.

## దేవకార్యము పితృకార్యము

ధర్మరాజు " పితామహా ! దేవకార్యములు, పితృకార్యములు నిర్వహించునప్పుడు దానములు పుచ్చుకొనుటకు ఎవరు అర్హులు ? " అని అడిగాడు. భీష్ముడు " అతిధులకు భోజనము పెట్టి తృప్తి పరచడానికి ధనము కావలసిన వారు, దొంగలవలన సర్వము కోల్పోయిన వారు, వ్రతములు చేయుటకు యాచించే వారు, గురువులను, తల్లితండ్రులను, భార్యాబిడ్డలను పోషించడానికి ధనము లేక ఇబ్బంది పడేవారు, తనకు వచ్చిన వ్యాధిని నయము చేసుకో వడానికి ధనము లేనివారు దేవ పితృ కార్యములలో దానము స్వీకరించడానికి అర్హులు. సత్రములు, మంటపములు, నీడ కొరకు వేసిన పందిళ్ళు, నలుగు కూర్చునే రచ్చబండను కూల్చే వారు, గురువులను నిందించే వారు, వేదములను నిందించే వారు, వేదవిద్యను అమ్ముకునే వారు, ఇతరుల మీద చాడీలు చెప్పేవారు, అనుకున్న ఒప్పందాన్ని ఉల్లంఘించే వారు, ఇతరుల సంపాదన మీద పడితినే వారు, చేసిన మేలు మరిచే వారు, పరుల భార్యలను కోరు వారు, మంత్రశాస్త్రములను నాశనం చేసే వారు. మదంతో విర్ర వీగే వారు. అనాధలను, బాలలను, వృద్ధులను, సన్యాసులను మోసం చేసే వారు. అతిథులకు తనకింద పనిచేసే వారికి తిండి పెట్టక తినేవారు " నరకానికి పోతారు. మారణాయుధాలను, తలవెంట్రుకలను విక్రయించడం, కన్నెపిల్లలను, బ్రాహ్మణులను, గోవులను కత్తులతో నరకడం, గురువులను, తనను నమ్మకంగా సేవించు సేవకుడిని విడిచి పెట్టడం, పదిమంది నడిచే దారిన ముళ్ళు పరచి ప్రజలను ఇబ్బంది పెట్టు వారు నరకముకు పోవడం తధ్యము. నేరం చెయ్యని వాడిని శిక్షించే రాజు, ప్రజలను రక్షించ వలసిన రాజు కర్తవ్యం మరచి ప్రవర్తించడము, తమవద్ద దాచడానికి ఇచ్చిన వస్తువును తిరిగి ఇవ్వని వాడిని, గోవులను ముక్కు పట్టి పీడించు వారికి అధోగతి తప్పదు.

## పుణ్యకార్యములు

పదిమందికి ఉపయోగించే సత్రములు కట్టించడం, తోటలు వేయించడం, మంచి నీటి బావులు తవ్వించడం, భయంతో బాధలతో ఉన్న వారిని కాపాడడము, కన్యాదానము, గోదానము, భూదానము, వాహనదానము, సేవకుల దానము, కీడుచేసిన వారిని క్షమించడం, భార్యాబిడ్డలను , బంధువులను ఆదరించడం, దానధర్మములకు చేసిన ఖర్చును గొప్పలుగా చెప్పకొనక పోవడం, దుర్మార్గులకు దూరంగా ఉండడం స్వర్గద్వారాలు " అని చెప్పాడు.

## బ్రహ్మహత్యాపాతకము

ధర్మరాజు " పితామహా ! కొన్ని పనులు బ్రహ్మహత్యా పాతకములు అన్నారు కదా ! హింస లేకుండా హత్యలు ఎలా ఔతాయి ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ ప్రశ్నను నేను ఒక సారి వ్యాసుడిని అడిగాను. వ్యాసుడు నాకు చెప్పినది నేను నీకు చెప్తాను. బ్రాహ్మణులను, పేదవారిని పిలిచి వారికి భోజనం పెట్టకపోవడం. మంచికులములో పుట్టి వేదవిద్యను నేర్చిన బ్రాహ్మణుడిని అతడి వృత్తిని అతడు చేయకుండా అడ్డగించడం, నీళ్ళు త్రాగడానికి వచ్చిన ఆవులను నీరు త్రాగకుండా ఆపడము, గుడ్డివారికి, చెవిటివారికి, కుంటివారికి ఇచ్చిన ధనమును అపహరించడం. వేదములను, శాస్త్రములను నిందించడం బ్రహ్మహత్యా సమాన పాపములు. కోపంతో ఊళ్ళకు ఊళ్ళు తగులబెట్టడం, పళ్ళ తోటలను నాశనం చెయ్యడం, అబద్ధపు సాక్ష్యం చెప్పి బ్రాహ్మణులకు ఇతరులకు శోకం కలిగించడం బ్రహ్మ హత్యతో సమాన పాపములు. రూపము గుణము శీలము ఉన్న వరుడికి ఇచ్చి వివాహము చెయ్యక తనకు నచ్చిన విధముగా కన్యను తగని వరుడికి ఇచ్చి వివాహము చెయ్యడం బ్రహ్మ హత్యా సమాన పాపము " అని భీష్ముడు చెప్పాడు.

## పుణ్యతీర్ధములు

ధర్మరాజు " పితామహా ! నాకు తీర్ధ విశేషాలు తెలియజేయండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! పూర్వము గౌతముడికి అంగిరసుడు వివరించిన విశేషములు నీకు వివరిస్తాను. **చంద్రభాగ, వితస్తనదీ** తీరాలలో ఏడు దినములు ఉపవాసము చేసిన వాడు మునిసమానుడు ఔతాడు. కాశ్మీరదేశంలో పారే నదులలో నదులలో నీరు త్రాగితే స్వర్గలోక ప్రాప్తి కలుగుతుంది. **పుష్కర తీర్ధము, ప్రభాస తీర్ధము, నైశారణ్యము, ఇంద్ర మార్గము, దేవిక, స్వర్గ బిందువు** వీటిలో స్నానం చేసిన అప్సరసలతో విమానవిహారము ప్రాప్తిస్తుంది. గంధమాధన పర్వతములలోని **ఇంద్రతోయ, కరతోయ** అనే నదీతీరాన మూడు రోజులు ఉపవాసము ఉండి స్నానమాచరించిన వారికి అశ్వమేధ యాగము చేసిన ఫలితము కలుగుతుంది. **కనఖలములో, గంగాద్వారములో, కుశావర్తములో, బిల్వకములో** స్నానము చేస్తే పాతకములు తొలగి పోతాయి. కైలాసశిఖరమున గంగాస్నానము చేసిన దేవతాదర్శనం ఔతుంది. ఒకనెల పాటు ఆహారము భుజించక అగ్నిని ఆరాధించిన వారికి సకలసిద్ధులు ప్రాప్తిస్తాయి. **భృగుతుంగము** అను సరస్సులో మూడురోజులు ఉపవాసము ఉండి స్నానము చేసిన బ్రహ్మహత్యాపాతకము తొలగిపోతుంది. **సుందరికాసరస్సులో** స్నానము చేసిన మరుజన్మలో అత్యంత సుందరాకారము ప్రాప్తిస్తుంది. **వైమానికము** అనే తీర్ధములో స్నానం చేస్తే స్వర్గలోకప్రాప్తి కలుగుతుంది. కృత్తిక, అంగారకుల సేవచేస్తే, పాపములు నశించి స్వర్గలోకప్రాప్తి కలుగుతుంది. **విపాశానదిలో** మూడు రోజులు స్నానము చేస్తే పునర్జన్మ ఉండదు. **కృత్తికా ఆశ్రమంలో** స్నానము పితృతర్పణం చేసిన వాడికి శివసాన్నిధ్యము కలుగుతుంది. **ద్రోణ శర్మ, శరస్థంబము, దేవదారు వనమును** సేవించిన వారికి అప్సరస వంటి భార్య దొరొకుతుంది. **చిత్రకూటము, జనస్థానం** సేవించిన వారికి రాజ్యసంపదలు కలుగుతాయి. **శ్యామాశ్రమంలో** ఒక నెల పాటు నిరాహారంగా ఉంటే అతడికి అంతర్ధాన ఫలము కలుగుతుంది. **కైశికవాలములో** మౌనంగా నిరాహారంగా 21 రోజులు గడిపితే అతడు ముక్తిని పొందగలడు. మతంగవాపిలో ఒక రాత్రి గడిపితే సిద్ధుడు ఔతాడు. **నైమిశారణ్యమున** ఒకమాసము నివసించిన పురుషమేధము చేసిన ఫలము పొందగలడు. అలాగే **ఉత్పలావనములో** చేసిన సగము అశ్వమేధయాగము చేసిన ఫలము పొందగలడు. గంగా యమునా సంగమములో ఉన్న **కాలాంజనము** అను పర్వతము మీద స్నానము చేస్తే విముక్తిమార్గము పొందుతాడు. **వైవసత్వతీర్ధంలో** స్నానము చేసిన అనేక సంపదలు పొందుతాడు. **ప్రయాగక్షేత్రములో** మూడుకోట్ల పదివేల పుణ్యతీర్ధములు వచ్చి కలుస్తాయి. ప్రయాగలో ఒకనెల గడిపిన వాడికి ముక్తి లభిస్తుంది. **గంగానదిలోను, బ్రహ్మకపాలం** లోనూ ఒక మాసం రోజులు ఉపవాసము ఉంటే చంద్రలోకప్రాప్తి కలుగుతుంది. **అష్టావక్రము కలవింకము, దేవహ్రదుము** వీటిలో స్నానము చేసిన నరుడికి బ్రహ్మలోకప్రాప్తి కలుగుతుంది. **రామహ్రదములో** 12రోజులు నియమంగా ఉపవాసము ఉంటే సకలదోషములు హరిస్తాయి. **మహాహ్రదంలో** నెల రోజులు ఉపవాసం ఉంటే జమదగ్ని పొందిన లోకములు ప్రాప్తిస్తాయి. వింధ్యపర్వతము మీద నెల రోజులు తపస్సు చేస్తే సకలధర్మములు అలవడతాయి. నర్మదానదిలో స్నానము చేస్తే రాకుమారుడిగా పుడతాడు. జంబుద్వీపంలో మూడుమాసముల ఒక్క రోజు నివసిస్తే సర్వసిద్ధులు ప్రాప్తిస్తాయి. **గోకాముఖంలో** స్నానము చేసి తండులికాశ్రముకు పోయి,

నార చీరలు ధరించి, శాకాహారము తింటూ శాంతిగా జీవిస్తే పదిమంది కన్యలకు భర్త అయి ఆరోగ్యవంతుడుగా అకాలమరణం లేకుండా జీవిస్తాడు. **కుల్యతీర్ధంలో** మూడు రాత్రులు నిరాహారంగా, శుచిగా, అఘమర్షణ జపం చేస్తే అతాడికి అశ్వమేధయాగము చేసిన ఫలితము దక్కుతుంది. ఆర్షిసేనాశ్రమంలో ఉన్న **ఉజ్జానకము** అనే తీర్ధములో స్నానము చేసిన మానవుడు సకల పాపములు హరించబడతాయి. **పిండారకములో** ఒక రాత్రి గడిపిన వాడికి అగ్నిష్టోమ ఫలము దక్కుతుంది. **ధర్మారణ్యములో** ఉన్న **బ్రహ్మసరస్సులో** స్నానం చేసిన మానవుడు పుండరీక యాగము చేసిన ఫలితము దక్కుతుంది. హిమాలయ పర్వతములలో మునులకు సేవ చేస్తూ తపస్సు చేస్తే సర్వసిద్ధులు ప్రాప్తించి బ్రహ్మలోకప్రాప్తి కలుగుతుంది. ధర్మనందనా ! పుణ్యతీర్ధములను సేవించునప్పుడు కామము, క్రోధము, మదము, లోభము లేని ప్రశాంత చిత్తముతో ఉండాలి. అలా ఉండగలిగినప్పుడే తీర్ధములు సేవించిన ఫలము దక్కుతుంది. ధర్మజా ! నిజానికి అన్ని తీర్ధములు మనసులోనే ఉంటాయి. ఇంద్రియములను నిగ్రహించడం, తపస్సు చేయడం, మనస్సును అదుపులో ఉంచడం, ఇవన్నీ తీర్ధసేవనంతో సమానములే. కేవలము వట్టి నీళ్ళతో స్నానము చేసిన శరీరము శుభ్రపడుతుంది కాని మనసులోని కల్మషములు తొలగవు. **ధర్మనందనా ! దొరకని వాటికి తాపత్రయ పడకుండా దొరికిన వాటితో సంతృప్తి చెంది, కోరికను జయించిన వాడికి ఏ తీర్ధములతో పని లేదు. అటువంటి వారు సదా పవిత్రులే.** ధర్మనందనా ! మానవుడు ఎంతో శ్రమకోర్చి దుర్గమమైన ప్రదేశములో ఉన్న అన్ని తీర్ధములు సేవించ పని లేదు. ఆ తీర్ధములను మనసున స్మరించిన చాలు సకల పాపములు హరించబడతాయి " అని భీష్ముడు చెప్పాడు. ఇంతలో శరతల్పగతుడైన భీష్ముడిని చూడడానికి **అత్రి, వశిష్టుడు, భృగువు, పులహుడు, పులస్త్యుడు, క్రతువు, అంగిరసుడు, అగస్త్యుడు, కణ్వుడు, గౌతముడు, విశ్వామిత్రుడు, జమదగ్ని** మొదలైన మహామునులు తమ తమ శిష్యులతో సహా అక్కడకు వచ్చారు. వారిని చూసిన పాండవులు ఆశ్చర్యచకితులై వారికి భక్తిశరద్ధలతో నమస్కరించారు. భీష్ముడిని చూసిన పిమ్మట వారంతా అక్కడ నుండి వెళ్ళారు.

## జనపదములు పర్వతములు నదులు

ధర్మరాజు " పితామహా ! ఏయే జనపదములు, ఏయే పర్వతములు, ఏయే నదులు పవిత్రమైనవో మహత్తుగలవో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నీకొక ఇతిహాసము చెప్తాను. ఉంఛవృత్తితో జీవితము సాగించే ఒక బ్రాహ్మణుడి ఇంటికి ఒక సిద్ధుడు అతిథిగా వచ్చాడు. ఆ బ్రాహ్మణుడు ఆ సిద్ధుడికి అతిధి మర్యాదలు చేసాడు. ఆ బ్రాహ్మణుడు కూడా నువ్వు అడిగినట్లే సిద్ధుడిని అడిగాడు. ఆ సిద్ధుడు బ్రాహ్మణుడికి గంగానదీ మహత్యము వివరిస్తూ " ఏయే ప్రాంతములో గంగానది ప్రవహిస్తుందో ఆయా ప్రదేశములు పవిత్రములు ఔతాయి.

### గంగానది మహిమ

గంగానదిలో భక్తితో స్నానం చేసి పూజిస్తే వారికి యజ్ఞములు, బ్రహ్మచర్యము, తపస్సు, దానములు చేసిన ఫలము చేకూరుతుంది. మానవుడి అస్థికలు ఎన్ని సంచ్వత్సరాలు గంగానదిలో నానుతుంటాయో అన్ని సంవత్సరాలు స్వర్గంలో ఉంటాడు. గంగానది లేని దేశము, సోమము లేని యజ్ఞము, చంద్రుడు లేని రాత్రి, సూర్యుడు లేని పగలు, ఆత్మధర్మము లేని ఆశ్రమము, పూలు లేని చెట్లు మాదిరి శోభించ లేదు. **చాంద్రాయణవ్రతము**లు నూరు చేసినా గంగాజల పానము చేసిన దానితో సమానము కాదు. అగ్నిలో పడిన దూది దగ్ధము అయినట్లు గంగానిదిలో స్నానము చేసిన మానవుడికి పాపములు దగ్ధము అవుతాయి. దేవతలకు అమృతము వంటిది మానవులకు గంగాజలము. దిక్కు లేని వారికి గంగానది పరమ దిక్కు అని మునివాక్కు లు చెప్తున్నాయి. గంగానది ఇసుక తలమీద పెట్టుకుని గంగానది మట్టి నుదుటిన ధరించిన వారి పాపములు నశిస్తాయి. గంగానది మీద నుండి వచ్చే గాలులు తగిలినా పాపాలు నశిస్తాయి. గంగాస్నానము చేసిన అటు ఏడుతరాలు, ఇటు ఏడుతరాలు పితృదేవతలు తరిస్తారు. అంతెందుకు ఎక్కడ స్నానము చేస్తున్నా గంగలో మునుగుతున్నట్లు భావన చేసినా గంగాస్నాన ఫలము దక్కుతుంది. గంగను చూసిన వాడు మానవుడు గంగను చూడని వాడు పశువుతో సమానము, గుడ్డివాడితో సమానము. దేవతలు, ఇంద్రుడు కూడా సదా గంగను స్మరిస్తారు ఇక మానవుల సంగతి చెప్పనలవి కాదు. మరణసమయంలో గంగను స్మరించిన వాడికి ముక్తి తధ్యము. గంగాస్నానను చేసిన వాడికి రాజభయము, చోరభయము, పాపభయము, భూతభయము కలుగవు. దివి నుండి భువికి దిగి వచ్చిన గంగానదిని సాక్షాత్తు శివుడే తన శిరస్సున ధరించాడు. ఇక మానవుల గురించి చెప్పనేల. మానవులకు ఇంద్రుడు, గ్రహములకు సూర్యుడు, నక్షత్రములకు చంద్రుడు ఎలాగో మానవులకు గంగానది అంతే. సగరకుమారులు కపిలముని శాపానికి గురి అయి దగ్ధమైనప్పుడు గంగానది వారి మీద ప్రవహించి వారిని పునీతులను చేసింది. ఆ గంగానదిని భగీరధుడు తన తపస్సుతో భూమి మీదకు తీసుకు వచ్చాడు. గంగానది చంద్రుడి మీద నుండి అక్కడ నుండి సూర్యలోకము మీదగా విష్ణువు పాదాల నుండి జాలు వారి శివుడి శిరస్సు మీద పడి అక్కడి నుండి హిమాలయ పర్వతముల నుండి భూమి మీదకు వచ్చింది. అచంచలమైన భక్తితో ఎవరు గంగను పూజించి, ఆశ్రయిస్తారో వారికి గంగ సకల సంపదలను ప్రసాదిస్తుంది " అని సిద్ధుడు

బ్రాహ్మణుడికి చెప్పాడు " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## జనపూజితుడు

ధర్మరాజు " పితామహా ! సర్వజనములతో పూజింపబడు వాడు ఎవరో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఒకసారి నారదుడు శ్రీకృష్ణుడి వద్దకు వచ్చి శ్రీకృష్ణుడి అతిథిసత్కారాలు అందుకున్నాడు. శ్రీకృష్ణుడు " నారదా ! నీవు అత్యంత మక్కువతో ఎవరిని మొక్కుతావు ? " అని అడిగాడు. " కృష్ణా ! వరుణుడికి, వాయుదేవుడికి, భూమికి, ఆకాశానికి, అగ్నికి, ఈశానుడికి, షణ్ముఖుడికి, మహాలక్ష్మికి, విష్ణువుకు, బ్రహ్మదేవుడికి, బృహస్పతికి, చంద్రుడికి, నీటికి, భూమికి ఎవరు భక్తితో పూజిస్తారో నేను వారిని భక్తితో నమస్కరిస్తాను. ఇంకా వేదాధ్యయనం చేసే వారు, తపోధనులు, దేవతలను పూజించువారు, భూదానము, గోదానము, ధనదానము, ధాన్యదానములను చేయు వారు, అతిథిపూజ చేయువారు, పితృతర్పణం చేయువారు, భిక్షాటనతో శాంత చిత్తముతో జీవించువారు, ఎల్లప్పుడు సత్యమునే పలుకువారు వీరికి నేను భక్తితో నమస్కరిస్తాను. ధర్మము, అర్ధము, కామము సమానంగా భావించు వారు. అహంకారము, అధిక మమకారము లేనివారు, మంచి నడవడి కలవారు, లోలత్వము లేని వారు వీరందరికి నేను నమస్కరిస్తాను. కృష్ణా నీవు కూడా వీరిని పూజించి శుభలు పొందు " అని చెప్పాడు. కనుక ధర్మనందనా ! నీవు కూడా అలా ప్రవర్తించి శుభములు పొందు " అని భీష్ముడు చెప్పాడు.

## రాజు కర్తవ్యము


భూదేవి కృష్ణుల సంవాదము

ధర్మరాజు " పితామహా ! రాజ్యము చేసే రాజులకు ప్రధాన కర్తవ్యము ఏమిటో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! పట్టాభిషిక్తుడైన రాజుకు ప్రధమకర్తవ్యము బ్రాహ్మణపూజ. బ్రాహ్మణులు సుఖశాంతులతో జీవించు రాజ్యము సుభిక్షంగా ఉంటుంది. బ్రాహ్మణులను అవమానించిన రాజ్యములో అనేక కష్టములు కలుగుతాయి. విప్రులు ఘటనాఘటన సమర్ధులు. విప్రులకు అనుకూలంగా ఉన్న వారు రాజ్యాధిపతులు కాగలరు. విప్రులను అవమానించిన వారు రాజ్యభ్రష్టులు కాగలరు. బ్రాహ్మణుడు కోపిస్తే దేవేంద్రుడు కూడా తట్టుకో లేడు. విప్రులు శాపానుగ్రహ సమర్ధులు. పూర్వము ద్రవిఢ దేశాధిపతులు బ్రాహ్మణులను అవమానించి శూద్రులైనారు. కనుక ధర్మనందనా నీవు ఎల్లప్పుడూ బ్రాహ్మణులను పూజింపుము. సదాచారము కలిగిన బ్రాహ్మణుడికి భోజనము పెట్టిన అతడి పితృదేవతలు తరిస్తారు. భూదేవికి విష్ణుమూర్తికి బ్రాహ్మణుల విషయమై ఒకసారి సంవాదము జరిగింది. విష్ణుమూర్తి భూదేవితో " దేవీ ! నీవు లోకమాతవు కదా ! నిన్ను ఒక విషయము అడుగుతాను. పాపములు పోగొట్టుకోవడానికి చేయవలసిన పనులు ఏవి ? " అని అడిగాడు. భూదేవి " నాధా ! బ్రాహ్మణులను సేవించినా ! పూజించినా ! విప్రులకు హితము చేసినా పాపములు నశిస్తాయి. అహల్యను కోరుకున్నందుకు ఇంద్రుడికి శరీరము నిండా కన్నులు కలుగుతాయని శపించింది బ్రాహ్మణుడైన గౌతముడే కదా ! " అని జవాబు చెప్పింది. కనుక ధర్మనందనా ! నీవు ఏమరపాటు లేక బ్రాహ్మణులకు పూజ చెయ్యి. పుట్టుకతోనే బ్రాహ్మణులు పూజనీయులు. ముందుగా బ్రహ్మదేవుడు బ్రాహ్మణులను సృష్టించి వారితో " మీకు ధర్మనిరతి తప్ప వేరు పని లేదు. మీరు ధర్మమును సదా రక్షించడమే మీ కర్తవ్యము. అందు వలన మీకు శుభములు కలుగుతాయి. బ్రాహ్మణుడు మిగిలిన వర్ణముల వారికి మార్గదర్శకుడిగా ఉండాలి. నిత్యము వేదాధ్యయనము, అగ్నిహోత్రము ఆచరించాలి. క్షత్రియులు మీ మాటను అనుసరించి నడచుకుంటారు. ఎవరైనా అగ్నిని తాకవచ్చు, హిమాలయమును కదిలించ వచ్చు, గంగానదిని మూట కట్టవచ్చు కాని విప్రులను మాత్రము అవమానించ రాదు. విప్రులను కొలవడం కల్పవృక్షము వంటిది " అని బ్రహ్మ చెప్పాడు.

## ఇంద్రుడు శంబరుడు

భీష్ముడు ఇంకా " ధర్మనందనా ! ఈ విషయంలో ఇంద్రుడికి శబరుడికి మధ్య జరిగిన సంభాషణ చెప్తాను విను. **శంబరుడు** జటాసురుడి కొడుకు. **జటాసురుడు** ఉన్నతమైన స్థానంలో ఉన్నాడు. అప్పుడు ఇంద్రుడు జటాసురుడి వద్దకు వెళ్ళి " నీకు ఈ

ఉన్నత స్థితి ఎలా వచ్చింది. జటాసురుడు " నాకు బ్రాహ్మణుల మీద కోపము అసూయ లేవు. నేను ఎల్లప్పుడు బ్రాహ్మణులను రక్షిస్తాను. అందుకే నాకు ఈ వైభవము కలిగింది. దేవాసురయుద్ధములో బ్రాహ్మణుల అనుగ్రహము వలనే కదా దేవతలు గెలిచారు. అది చూసి నా జనకుడు చంద్రుడితో " ఆహా ! విప్రులు మహానుభావులు కదా అందుకే దేవతలు గెలిచారు " అన్నాడు. అప్పుడు నా జనకునితో చంద్రుడు " బ్రాహ్మణులు, తపస్సు, వేదాధ్యయనము ఎల్లప్పుడు ఆచరిస్తారు. బ్రాహ్మణుడు ఎంత దూరము వెళ్ళి అయినా గురుశుశ్రూష చేసి విద్యను అభ్యసిస్తాడు. తరువాత తపస్సు చేస్తాడు. అది బ్రాహ్మణుడికి విధించిన కర్మ. కనుక బ్రాహ్మణుడు అందరికీ అధికుడు. అటువంటి బ్రాహ్మణులను ఆదరించిన శుభములు, అవమానించిన అశుభములు కలుగుతాయి అనడంలో సందేహం లేదు " అని చెప్పగా నేను విన్నాను. చంద్రుడి మాటలు మన్నించి నా జనకుడు బ్రాహ్మణులను పూజించాడు. అందుకనే తేజస్సుతో వెలుగొందుతున్నాడు. నా తండ్రి మాదిరి నేను కూడా బ్రాహ్మణులను పూజించి ఇంతటి ఉన్నత స్థితికి చేరాను " అని శంబరుడు ఇంద్రుడికి చెప్పాడు. కనుక ధర్మనందనా ! నీవు కూడా ఎల్లప్పుడూ బ్రాహ్మణులను పూజించి ఆదరించి శుభములు పొందుము " అని భీష్ముడు చెప్పాడు.

## రాజు ఆదరించ తగిన వారు

ధర్మరాజా " పితామహా ! సదా తనవెంట ఉండేవారు దూరంనుండి వచ్చినవారు వీరిలో ఉత్తములెవ్వరు. ఎవరిని ఆదరించాలి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! క్రోధమూ, ఈర్ష్య లేని వారు, స్నేహితులు, బంధువులు, సంబంధులు, ఋత్విజులు, పురోహితులు వీరంతా ఆదరించతగిన వారే. దూరం నుండి వచ్చిన వారిలో తెలియని వారిలో ఆచారశీలురు, విద్యావంతులు, గౌరవనీయులు అందరూ పూజింపతగిన వారు " అని భీష్ముడు చెప్పాడు. ధర్మరాజు " పితామహా ! లోకంలో ఉన్న పాపాలన్నింటికీ స్త్రీలు మూలకారణం అంటారు కదా ! అలా ఎందుకు అంటారో చెప్పండి " అని అడిగారు. భీష్ముడు " ధర్మనందనా ! స్త్రీలు నీవు చెప్పినటువంటి వారే. ఈ సందర్భంలో నీకు నారదుడికి పంచచూడ అనే అప్సరసకు జరిగిన సంవాదము తెలుపుతాను. ఒకసారి నారదుడు లోక సంచారము చేస్తూ పంచచూడ అనే అప్సరసను చూసి " లలనా ! నిన్ను ఒక విషయము అడుగుతాను చెప్పు " అని అడిగాడు. పంచచూడ " మహాత్మా ! అడగండి నాకు తెలిసినంత వరకు చెప్తాను " అని పలికింది. నారదుడు " వనితల స్వభావము ఎలా ఉంటుందో నాకు తెలిసేలా చెప్పు " అని అడిగాడు. పంచచూడ " అదేమిటి మహామునీ ! నేను వనితను. వనితలు మరొక వనితల గురించి చెడుగా ఎలా చెప్తారు " అనుకున్నావు. నారదుడు " నీవు నిజము చెప్పిన నీకు దోషము ఏమీ రాదు చెప్పు " అని అడిగాడు. పంచచూడ " మహాత్మా ! స్త్రీస్వభావములు మీరు ఎరుగనివా ! అయినా మీరు అడిగారు కనుక చెప్తాను. మంచి కులమున పుట్టీ, గౌరవమర్యాదలు కలిగి ఉండీ, ఒకరికి భార్య అయి ఉండీ స్త్రీ పరపురుషుడితో తిరుగుతుంది. ఇంది స్త్రీ స్వభావము ఇందుకు ఏమని చెప్పాలి. ఇది ఎవరికి అర్ధము కాదు. స్త్రీలు సర్వదోషముకు కారణము. పురుషుల మంచితనము మగువలకు అర్ధము చేసుకొనక పరాయి పురుషులను పొగుడుతుంటారు. రాజదండన భయము లేకపోతే స్త్రీలను అదుపు చేయడం కష్టమే. ఎన్ని కట్టెలు వేసినా అగ్నికి తృప్తి ఉండదు. ఎన్ని నదులు కలిసినా సముద్రుడికి తృప్తి ఉండదు. ఎంత మంది ప్రాణాలు హరించినా మృత్యుదేవతకు తృప్తి ఉండదు " అని చెప్పిన **పంచచూడ** మాటలకు నారదుడు తృప్తి చెందాడు. ధర్మనందనా నీ ప్రశ్నకు ఇదే సమాధానము " అని భీష్ముడు చెప్పాడు.

## స్త్రీలరక్షణ

ధర్మరాజు " పితామహా ! మరి అలాంటి స్త్రీలను ఎలా కాపాడు కోవాలి ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! స్త్రీలు అసురుల మాయల కంటే మించిన మాయలు కల వారు. ఈ సందర్భంలో నీకు ఒకకధ చెప్తాను. మొదట స్త్రీలు దోషము, మాయా మర్మము లేక సాధువులుగా ఉండే వారు. అందుకే స్త్రీలకు దైవత్వము లభించింది. ఇది చూసి అసూయ పడిన దేవతలు బ్రహ్మకు మొర పెట్టుకున్నారు. బ్రహ్మ అప్పుడు మాయలు మర్మాలు స్త్రీల లక్షణముగా ఏర్పరిచి స్త్రీలకు మోహము ఎక్కువగా ఉండేలా చేసాడు. అందు వలన స్త్రీలు మోహపరవశులై పురుషులను వారి కోరికలకు బలి చేయసాగారు. పురుషులు స్త్రీల కొరకు రోషము, కోపముకు లోనై దైవత్వము కోల్పోయారు. ఇది చూసి దేవతలు తృప్తి చెందారు. కనుక స్త్రీల మాయామర్మములు కలవారు కనుక వారి మనసు గ్రహించడం పురుషులకు కష్టమే. ఇందుకు నీకు ఒకకధ చెప్తాను. పూర్వము **దేవశర్మ** అనే ముని ఉండే వాడు. అతడి భార్య చాలా సౌందర్యవతి. దేవశర్మ ఒక యజ్ఞము కార్యము మీద పోతూ తన శిష్యుడైన విపులుడిని చూసి " విపులా ! నా భార్య అతిలోకసుందరి. ఆమె కొరకు దేవేంద్రుడు పొంచి ఉన్నాడు. నేను ఇంద్రుడి ఉపాయము తిప్పి కొడుతూ నా భార్యను రక్షిస్తున్నాను. నేను ఇప్పుడు యాగము చేయడానికి వెడతాను. ఇంద్రుడికి పరుల భార్యలమీద కన్ను. కనుక నీవు నా భార్యకు రక్షణగా ఉండాలి " అని చెప్పాడు. విపులుడు " గురువుగారూ ! మీరు చెప్పినట్లే చేస్తాను. కాని ఇంద్రుడు మాయావి కనుక ఏరూపంలో వస్తాడో తెలుసుకోవడం ఎలాగ ? " అని అడిగాడు. దేవశర్మ " విపులా ! నీవు చెప్పినది నిజమే ! మాయావి అయిన ఇంద్రుడు పక్షుల రూపంలో జంతువుల రూపంలో కూడా రాగలడు కనుక జాగ్రత్త పడాలి. దేవేంద్రుడు నా భార్య మీద కన్ను వేసి ఆమె చుట్టూ తిరుగుతున్నాడు. అందులో సందేహం లేదు. నేను

ఆశ్రమంలో లేనని తెలిసిన ఇంద్రుడు నా భార్య కొరకు తప్పక వస్తాడు. కనుక నీవు జాగరూకత వహించాలి " అని చెప్పాడు. విపులుడు " గురుదేవా ! మీరు చెప్పినట్లు చేస్తాను " అన్నాడు. దేవశర్మ నిశ్చింతగా యాగము చేయడానికి వెళ్ళాడు. విపులుడు జాగ్రత్తగా గురుపత్నిని కాపలా కాస్తున్నాడు. అతడికి ఒక ఆలోచన వచ్చి " నేను గురు పత్నిని యోగశక్తితో ఆవహిస్తాను. అప్పుడు దేవేంద్రుడు గురుపత్నిని ఏమీ చేయలేడు. నేను యోగ శక్తితో ఆవహించిన విషయము గురువుగారికి తెలిసే అవకాశము లేదు " అనుకున్నాడు. ఆ తరువాత శిష్యుడి ఆత్మ గురుపత్నిని ఆవహించింది. శిష్యుడి ఆత్మ ప్రవేశించడంతో ఆమె ఆత్మ జడత్వం పొందింది. ఇంద్రుడు ఆమె మీద కోరికతో పక్కనే ఉన్న శిష్యుడు నిద్ర పోతున్నాడని అనుకుని ఆమె ను సమీపించి తన కోరిక తెలిపాడు. ఆమె జడత్వము వహించినందు వలన ఇంద్రుడికి జవాబు ఇవ్వ లేదు. ఇంద్రుడు ఆమెను త్వరపెట్టాడు. గురుపత్నిలో ఉన్న శిష్యుడు ఇంద్రుడితో " ఇంద్రా ! నీవు ఇక్కడకు వచ్చిన పని ఏమి ? " అని అడిగుతూ ఆమెను స్పృహ తప్పేలా చేసాడు. ఇంద్రుడు ఇదంతా చూసి భయపడ్డాడు. శిష్యుడు గురుపత్నిని వదిలి బయటకు వచ్చి ఇంద్రుడితో " గౌతముడి శాపంతో ఒళ్ళంతా కళ్ళు చేసుకున్నా నీకు బుద్ధి రాలేదు కదా ? దేవేంద్రుడివై ఉండి ఇంద్రియములు అదుపులో పెట్టుకోలేని నీ బుద్ధి కుత్సితమైనది కదా నీచుడా. ఇలాంటి పని చేస్తే నా గురువు గారి కోపాగ్నికి భస్మము కాగలవు జాగ్రత్త " అన్నాడు. దేవేంద్రుడు తన యోగబలముతో విపులుడి శక్తి గ్రహించాడు. విపులుడు తిరిగి " మా గురువు దాకా ఎందుకు నేనే నిన్ను దహించగలను కాని మనసు రావడం లేదు బ్రతికి పోయావు వెళ్ళు " అని అన్నాడు. ఇంద్రుడు బతుకు జీవుడా అంటూ వెళ్ళి పోయాడు. గురువు గారు వచ్చిన తరువాత " గురువు గారు ! మీరు లేనప్పుడు దేవేంద్రుడు ఇక్కడకు వచ్చాడు. కాని నా యోగబలానికి భయపడి వెళ్ళి పోయాడు " అని చెప్పి తాను రుచి శరీరంలో ప్రవేశించిన విషయం చెపితే గురువు గారు ఏదైన అనుకుంటాడని చెప్ప లేదు.

### దేవకాంత పూలదండ

ఒక రోజు ఆకాశ మార్గాన పోతున్న దేవకాంత మెడలోని పూలదండ **దేవశర్మ** తలమీద పడింది . దేవశర్మ దానిని భార్యకు ఇచ్చాడు. ఆ సమయంలో రుచి అక్క భర్త అయిన **చిత్రరధుడు** దేవశర్మను, రుచిని తమ ఇంట్లో జరిగే ఉత్సవానికి రమ్మని ఆహ్వానించాడు. చిత్రరధుడి ఇంటికి పోతూ రుచి ఆ దండను అలంకరించుకుని వెళ్ళింది. ఆ పరిమళముకు ఆకర్షింపబడిన ఆమె సోదరి ఆదండను గురించి సోదరిని అడుగగా ఆమె ఆ పూలు తమ ఆశ్రమంలో ఉన్నాయని చెప్పి తన భర్తతో అటువంటి పూలను తన సోదరికి తెచ్చి ఇవ్వమని కోరింది. దేవశర్మ విపులుడిని పిలిచి ఆ పుష్పములు ఎక్కడ ఉంటాయో వెతికి పట్టుకు రమ్మని చెప్పాడు. విపులుడు తన యోగశక్తితో ఆ పుష్పములు ఉన్న ప్రదేశం తెలుసుకుని ఆ పూలను తీసుకుని వస్తూ మార్గమద్యంలో ఇద్దరు స్త్రీ పురుషుల వాదన విన్నాడు. ఆ స్త్రీ నాది తప్పు అయిన " విపులుడికి పరలోకములో పట్టినగతి నాకు పడుతుంది " అన్నది. అతడు అది విని ఇంకా ముందుకు సాగాడు అక్కడ ఆరుగురు జూదరులు ఆడుతూ మద్యలో కలహించి " నాది తప్పయితే పరలోకములో విపులుడికి పట్టినగతి నాకు పడుతుంది " అని అన్నాడు. ఈ మాటలు విన్న విపులుడు తాను చేసిన తప్పేమిటి " ఒక వేళ తాను గురువుగారు లేని సమయంలో ఆమె శరీరంలో ప్రవేశించిన విషయం గురువుగారికి చెప్ప లేదు కదా ! అందు వలన నాకు పాపం వచ్చింది ఏమో " అని తర్కించుకుంటూ గురువుగారిని చేరి ఆ పూలను గురువుగారికి సమర్పించాడు. విపులుడు ఒంటరిగా ఉన్న సమయంలో గురువుగారు విపులుడితో " విపులా నీవు వచ్చు మార్గములో ఇద్దరు స్త్రీ పురుషులు ఆరుగురు జూదరులు కనిపించారు కదా వారు ఎవరో తెలుసా " అని అడిగాడు. విపులుడు వారు ఎవరో తెలియదని చెప్పాడు. గురువు " నీవు నా భార్యను రక్షించడానికి నా భార్య శరీరంలో ప్రవేశించావు. అది పాపమని వారనుకున్నారు నిజంగా అది పామని నేను అనుకుంటే నేను నీకు శాపం ఇచ్చేవాడిని కాని వరాలు ఎందుకు ఇస్తాను ? ఆ స్త్రీ పురుషులు పగలు రాత్రి. ఆ జూదరులు ఆరు ఋతువులు " అని చెప్పాడు. గురువుగారి ఔదార్యానికి శిష్యుడు ఆశ్చర్య పోయాడు. గురువు గారు ఇంకా విపులుడితో " రాత్రి పగలు ఆరు ఋతువులు మనుష్యులు చేసే మంచి పనులు చెడ్డ పనులు గమనిస్తుంటారు. కనుక మనం ఎవరికి తెలియకుండా తప్పు చేయవచ్చని అనుకోవడం పొరబాటు. నీవు ఒక స్త్రీని రక్షించడానికి విజ్ఞతతో చేసిన పని మంచిదే కాని తప్పు కాదు ఇలా చేసి నా గౌరవం కాపాడావు. అందుకని ఆ విషయం నాకు చెప్పక దాచడం పాపము కాదు " అని చెప్పాడు. అని చెప్పి భీష్ముడు ధర్మనందనా ! స్త్రీల గురించి నీకు చెప్పాను. స్త్రీలలో అనేక విధములు ఉంటారు. అందులో మంచి వారు కులస్త్రీలు ఉంటారు. వారి వలనే ఈ భూమి క్రమం తప్పక పరిభ్రమిస్తుంది. పాతివ్రత్యం పాటించే స్త్రీ దైవం వంటిది. మానవుడికి ధర్మము, సుఖము, పేరు ప్రతిష్ఠలు మంచి భార్య వలన లభిస్తాయి అనడంలో ఏ విధమైన సందేహం లేదు " అని చెప్పాడు.

## కన్యను ఎన్నుకోవడము

ధర్మరాజు " పితామహా ! కన్యావరణం ఎలా చెయ్యాలి వివరించండి " అన్నాడు. భీష్ముడు " ధర్మనందనా " వధువు తండ్రి మంచి కులము, శీలము, విద్య కల వాడిని పిలిచి తన కన్యను నీటితో సహా దానము ఇవ్వడము **బ్రాహ్మణవివాహం**. క్షాత్ర వివాహంలో కన్య **స్వయంవరంలో** పురుషుడిని వరిస్తుంది. పరస్పరం ప్రేమించుకున్న తరుణంలో ఆ పురుషుడికి కన్యను

ఇచ్చి వివాహం చెయ్యడమే **గాంధర్వం**. ఇది క్షత్రియవివాహాలలో పెద్దలు అంగీకరించిన వివాహాలలో ఒకటి. గాంధర్వవివాహములో కట్నం తీసుకున్నప్పుడు అది **అసురవివాహం** ఔతుంది. ఇక కన్యమీద కోరికతో ఆమెకు సంబంధించిన వారిని చంపి ఆమె దు:ఖిస్తున్నా లెక్క చేయక బలవంతంగా తీసుకు వచ్చి వివాహం చెయ్యడం **రాక్షసవివాహం** అంటారు. ఇలా అయిదు విధముల వివాహాలలో మూడు ధర్మసమ్మతాలు. మిగిలిన అసుర, రాక్షస వివాహాలు ధర్మసమ్మతాలు కాదు పైగావి దూషింపతగినవి. తల్లి, తండ్రి, అన్నదమ్ములు లేని కన్య వివాహముకు పనికి రాదు. బ్రాహ్మణుడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కన్యలను వివాహమాడవచ్చు. కాని శూద్రకన్యను వివాహమాడడం ఆమె వలన సంతానం కనడం నిషేధం. క్షత్రియుడు ముందుగా క్షత్రియకన్యను చేసుకున్న తరువాత వైశ్యకన్యను చేసుకో వచ్చు. వైశ్యుడు, శూద్రుడు తమ కులము కన్యలను వివాహమాడాలి. కొన్ని ప్రత్యేక సందర్భాలలో క్షత్రియులు, వైశ్యులు శూద్రకన్యలను వివాహమాడవచ్చు " అని భీష్ముడు చెప్పాడు.

### బ్రాహ్మణుడు శూద్రకన్య

ధర్మరాజు " పితామహా ! మీరు బ్రాహ్మణుడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కన్యలను మాత్రమే వివాహమాడాలని అన్నారు. కాని బ్రాహ్మణుడు శూద్రకన్యలను వివాహమాడినట్లు విన్నాము అదెలా సాధ్యము " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా కొన్ని విషమసమస్యలు వచ్చినప్పుడు బ్రాహ్మణుడు శూద్రకన్యను వివాహమాడవచ్చు. ప్రేమించి కాని, శూద్రకన్య ధనం మీద ఉన్న కోరికతో కొందరు బ్రాహ్మణులు శూద్రకన్యలను వివాహమాడి ఉండ వచ్చు. కాని బ్రాహ్మణుడికి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యకన్యల వలన కలిగిన సంతానం బ్రాహ్మణుడు ఔతాడు కాని శూద్రకన్య వలన కలిగిన సంతానం బ్రాహ్మణుడు కాజాలడు.

## బ్రాహ్మణ ఆస్తి పంపకము

ధర్మరాజు " పితామహా ! బ్రాహ్మణ శూద్ర స్త్రీకు పుట్టిన సంతానానికి కూడా తన తండ్రి ఆస్తిలో భాగం ఉంటుంది కదా ! నాలుగు వర్ణముల స్త్రీలను వివాహమాడిన బ్రాహ్మణుడి సంతానానికి ఆస్తి పంపకం ఎలా జరగాలి ? వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ముందు ఆ బ్రాహ్మణుడి ఆస్తిని పది భాగములుగా విభజించాలి. దానిలో నాలుగు భాగములు బ్రాహ్మణ స్త్రీ సంతానానికి ఇవ్వాలి. మూడు భాగములు క్షత్రియ స్త్రీ వలన కలిగిన స్త్రీకి ఇవ్వాలి. రెండు భాగములు వైశ్య స్త్రీ వలన కలిగిన సంతానానికి ఇవ్వాలి. శూద్ర స్త్రీ వలన కలిగిన సంతానం తండ్రి ప్రేమతో ఇచ్చిన భాగము తీసు కోవాలి కాని ఆస్తి కొరకు తండ్రిని, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య సంతానాన్ని ఎదిరించ కూడదు. అలాగే బ్రాహ్మణుడికి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుల వలన కలిగిన సంతానం శూద్ర స్త్రీ వలన కలిగిన స్త్రీకి కలిగిన సంతానానికి ధర్మంగా రావలసిన ఆస్తిని ఇవ్వకుండా ఎగకొట్ట కూడదు " అని చెప్పాడు.

### మిగిలిన వారి ఆస్తి పంపకము

" ధర్మనందనా ! క్షత్రియుడి ఆస్తిని ఎనిమిది భాగములుగా విభజించాలి. అందులో నాలుగు భాగములు క్షత్రియ కాంత వలన కలిగిన సంతానానికి ఇవ్వాలి. మూడు భాగములు వైశ్య కాంత వలన కలిగిన సంతానానికి ఇవ్వాలి. ఒక భాగము శూద్రస్త్రీ వలన కలిగిన స్త్రీకి ఇవ్వాలి. శూద్రస్త్రీ సంతానం తమ ఆస్తి కొరకు తగవులాడక ప్రేమతోనే పొందాలి. క్షత్రియ, వైశ్య సంతానం శూద్రస్త్రీ సంతానికి ధర్మంగా ఇవ్వ వలసిన ఆస్తిని ఇవ్వక ఎగకొట్ట కూడదు. సంతానం తన ఆస్తి కొరకు వైశ్యుడి ఆస్తి అయిదు భాగములుగా చేసి నాలుగు భాగములు వైశ్య వనిత వలన కలిగిన సంతానానికి ఇవ్వాలి. ఒక భాగము శూద్ర స్త్రీ వలన కలిగిన స్త్రీకి ఇవ్వాలి. ఇక్కడ శూద్ర స్త్రీ సంతానం తన భాగము కొరకు తగవులాడక ప్రేమతోనే పొందాలి. అలాగే వైశ్య స్త్రీకి కలిగిన సంతానం శూద్ర స్త్రీ సంతానానికి ధర్మంగా ఇవ్వ వలసిన ఆస్తిని ఎగకొట్ట కూడదు. ఇక శూద్రుడి సంతానం అతడి సంతానం సమానంగా పంచుకోవాలి. ఇక వైదిక కర్మలు, స్నానము, భోజనము వంటి సమస్త కర్మల మీద అధికారము బ్రాహ్మణ స్త్రీదే కాని మిగిలిన వారికి ఉండదు " అని భీష్ముడు చెప్పాడు.

## కుమారులు

ధర్మరాజు " పితామహా ! పలువిధముల కుమారులు ఉంటారు అంటారు కదా ! వారు ఎవరో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మరాజా ! ఎవరికైనా తన కులములో వివాహమాడిన కన్యకు ధర్మబద్ధంగా పుట్టిన పెద్దకుమారుడు **వారసుడు** ఔతాడు. పుత్రులు లేని వారు తమ కుమార్తె కుమారుని అల్లుడు, కూతురు సమ్మతితో దత్తు తీసుకున్న కుమారుడు **దౌహిత్రుడు** ఔతాడు. అతడు పుత్రసమానుడు ఔతాడు. సంతానం లేని వారు భర్త అనుమతితో భార్యకు అర్హులైన వారి వలన

కలిగిన కుమారుడు కూడా పుత్రసమానుడే ఔతాడు. ఇతడు **ఔరసపుత్రుడు** అని పిలువబడతాడు. సంతానము లేని వారు ఇతరుల నుండి జలధార ద్వారా దత్తముగా స్వీకరించిన కుమారుడు కూడా పుత్రసమానుడు ఔతాడు. ఇతడు **దత్రిముడు, దత్తపుత్రుడు, దత్తుడు, దత్తుకొడుకు** ఔతాడు. తల్లితండ్రులు లేని వాడిని దగ్గరకు చేర్చి ప్రేమగా పెంచిన పుత్రుడు **కృత్రిముడు** అని పిలువబడతాడు. పరునిభార్య వలన సంతానము కనిన అతడు పరుని కుమారుడిగా చెలామణి ఔతాడు కనుక అతడు **గూఢజుడు** అని పిలువబడతాడు. తల్లి తండ్రుల వలన వదిలి పెట్టబడిన పుత్రుడు **అపవిద్ధుడు** అని పిలువబడతాడు. వివాహ పూర్వము కన్యకు కలిగిన పుత్రుడు **కానీనుడు** అని పిలువబడతాడు. అతడు వివాహము అయిన పిదప ఆ స్త్రీ భర్తకు కూడా అతడు పుత్రుడు ఔతాడు. వివాహత్పూర్వము గర్భము ధరించిన స్త్రీని తెలిసి కాని తెలియక కాని వివాహము చేసుకున్న తరువాత పుట్టిన కుమారుడికి ఆ స్త్రీని వివాహమాడిన పురుషుడు తండ్రి ఔతాడు. అతడు **సహోఢుడు** అని పిలువబడతాడు. భర్తను వదిలిన స్త్రీ, భర్తచేత వదిలిపెట్టబడిన స్త్రీ, వైధవ్యము పొందిన స్త్రీకి కలిగిన సంతానము అతడి జన్మకు కారణమైన పురుషుడి కుమారుడు ఔతాడు. అతడిని **పౌనర్భుడు** అంటారు. తల్లి తండ్రులు లేని వాడు, తల్లి తండ్రుల చేత వదలబడిన వాడు తనకు తానుగా ఎవరికైనా దత్తుపోయిన అతడు **స్వయందత్తుడు** అని పిలువబడతాడు. తల్లి తండ్రుల వలన అమ్మబడిన వాడు కొనుక్కున్న వాడికి కుమారుడు ఔతాడు. అతడు **క్రీతుడు** అని పిలువబడతాడు. ఈ పన్నెండు విధముల కలిగిన వాడు కుమారులే అయినా ఔరసపుత్రుడికే తల్లి తండ్రులకు ఉత్తర క్రియలు చేసే అధికారం ఉంటుంది.

## స్నేహాలు

జాలరుల వలలో పడ్డ చ్యవనుడు

ధర్మరాజు" పితామహా ! ఒకరిని ఒకరు చూడడం వలన కాని ఒకరితో ఒకరు కలిసి జీవించడం వలన కాని కలిగే స్నేహాలు ఎలా ఉంటాయి ? వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ సందర్భంలో నీకు చ్యవన నహుష సంభాషణ వినిపిస్తాను శ్రద్ధగా విను. భృగు వంశంలో జన్మించిన వాడు **చ్యవనుడు**. అతడు గొప్ప తపోధనుడు. అతడు గంగా యమునా సంగమస్థానంలో నీటిలో మునిగి సమాధిస్థితిలో ఉన్నాడు. అప్పుడు అతడిని చేపలు చుట్టుముట్టి అతడిని తాకుతూ తిరుగుతున్నాయి. ఆ చేపల స్పర్శకు ఆనందిస్తూ చ్యనునుడు 12 సంవత్సరాలు గడిపాడు. ఒక రోజు చేపలు పట్టే జాలరులు ఆ ప్రాంతానికి వచ్చి చేపలకొరకు వేసిన వలలో చేపతో చ్యవనుడు కూడా చిక్కుకున్నాడు. అతడిని చూసి భయపడిన జాలరులు భయపడి " మునీంద్రా మీరు నీటిలో ఉన్న విషయము మాకు తెలియదు కనుక మా తప్పు కాచి మమ్ము రక్షించండి " అని వేడుకున్నారు. అందుకు చ్యవనుడు " ఇందులో మీ తప్పు ఏమీ లేదు. నేను నీటి అడుగున ఈ చేపలతో సహజీవనము చేస్తున్నాను కనుక వీటితో నేను మరణించాలని అనుకుంటున్నాను. కనుక మీరు నన్ను కూడా వీటి తో పాటు వెలకు అమ్మండి " అని అన్నాడు. ఆ మాటలకు జాలరులు మరింత భయపడి ఆ దేశమును ఏలే రాజు నహుషుడి వద్దకు వెళ్ళి జరిగినది వివరించారు. రాజు **నహుషుడు** పురోహితులతో వచ్చి చ్యవనుడికి సాష్టాంగ నమస్కారం చేసి " మహానుభావా ! ఈ జాలరులు చేసిన తప్పుకు తగిన పరిష్కారం తెలియచేయండి " అని అడిగాడు. అందుకు చ్యవనుడు " ఈ జాలరులు వారి వృత్తి ధర్మంగా చేపలు పడుతున్నారు. కనుక అది వారి తప్పు కాదు. వీరు చాలా కష్టించి చేపలను, నన్ను పట్టారు కనుక వారి కష్టానికి తగిన ప్రతి ఫలము ఇచ్చి పంపండి " అని అన్నాడు. నహుషుడు ముని కోపించనందుకు సంతోషించి మంత్రులను పిలిచి ఆ జాలరులకు వేయి మాడలు ఇచ్చి పంపమన్నాడు. ఆ మాటలకు చ్యవనుడు " నా ఖరీదు వేయి మాడలా " అన్నాడు. నహుషుడు " అలాగైతే " లక్ష మాడలు ఇవ్వండి " అన్నాడు. చ్యవనుడు " నా విలువ లక్షమాడలా " అన్నాడు. నహుషుడు " కోటి మాడలు ఇచ్చి పంపండి " అని అన్నాడు. చ్యవనుడు " నా ఖరీదు కోటిమాడలా " అని అడిగాడు. నహుషుడు పంతానికి పోయి " అర్ధరాజ్యం ఇస్తాను " అన్నాడు. చ్యవనుడు " అలా కాదులే మహారాజా ! మరొక మాట చెప్పు " అని అన్నాడు. నహుషుడు " నా పూర్తి రాజ్యము ఇస్తాను " అన్నాడు. చ్యవనుడు " మహారాజా ! మంత్రులతో ఆలోచించి తగిన వెల నిర్ణయించు " అన్నాడు.

### అవిజాతుని సలహా

నహుషుడు " మంత్రులతో ఉన్న రాజ్యం అంతా ఇస్తానన్నాను కదా ! ఇంతకంటే నావద్ద ఇవ్వడానికి ఏముంది " అని

దుఃఖించాడు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన అవిజాతుడు అనే ముని జరుగుతున్న విషయము విని " మహారాజా ! చింతించకండి. ఇప్పుడే మునికి తగిన వెల నిర్ణయిస్తాను " అన్నాడు. నహుషుడు " మునీంద్రా ! అదేదో చెప్పి పుణ్యం కట్టుకుని నన్ను రక్షించండి " అని వేడుకున్నాడు నహుషుడు మంత్రులతో. **అవిజాతుడు** " మహారాజా ! గోవు బ్రాహ్మణుడు బ్రహ్మదేవుడు రెండు జాతులుగా పుట్టించినా ఒక జాతికి చెందిన వారే. గోవు క్షీరము వలన పాలు, పెరుగు, నెయ్యి వంటి యాగసంభారాలు సమకూడుతాయి. ఆ యాగము చేయతగిన వాడు బ్రాహ్మణుడు. కనుక వీరిరువురు సమానులే. సకల వేదాంగ విదుడైన బ్రాహ్మణుడికి విలువ నిర్ణయించడం ఈశ్వరుడికి కూడా శక్యము కాదు. సకలదేవతా స్వరూపమైన గోవు కూడా అంతే కనుక బ్రాహ్మణుడికి సమానంగా గోవును దానంగా ఇచ్చి చ్యవనుడిని విడిపించండి " అని అన్నాడు. ఆ మాటలకు సంతోషించి నహుషుడు " మహానుభావా ! నన్ను కరుణించండి . మీకు వెల నిర్ణయించ కలిగిన శక్తి నాకు ఉందా ! కనుక తమకు బదులుగా గోవును దానము ఇస్తాను " అని అన్నాడు. చ్యవనుడు నవ్వి " నీ నిర్ణయానికి సంతోషించాను. నహుషమహారాజా ! గోవు అంటే అగ్ని, గోవు అంటే అమృతము, యజ్ఞములో గోవు అత్యంత పవిత్రమైన స్థానాన్ని అలంకరిస్తుంది. స్వర్గలోక సమానము దేవతలకు కూడా పూజనీయము. కనుక నాకు బదులుగా గోవును ఇవ్వండి " అన్నాడు. వెంటనే నహుషుడు గోవును తెప్పించి జాలరులకు ఇచ్చాడు. జాలరులు గోవును చ్యవనుడికి సమర్పించారు. చ్యవనుడు " జాలరులారా మీకు చేపలకు స్వర్గ ప్రాప్తి కలిగిస్తాను " అని వరం ప్రసాదించాడు. తరువాత చ్యవనుడు, అవిజాతుడు నహుషుడికి వరం ఇవ్వడానికి సంకల్పించి నహుషుడికి సతతము ధర్మపరత్వము, ఇంద్రుడితో సమానమైన సంపదలు ప్రసాదించారు. తరువాత నహుషుడు రాజధానికి వెళ్ళాడు " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.



చ్యవనుడికి బదులుగా గోవును దానంగా ఇస్తున్న నహుషుడు

## పరశురాముడు విశ్వామిత్రుడు

ధర్మరాజు " పితామహా ! ఉత్తమమైన బ్రాహ్మణ వంశములో పుట్టిన పరశురాముడు క్షత్రియ లక్షణములు కలిగి ఉండడం, క్షత్రియ వంశంలో కౌశికపుత్రుడిగా పుట్టిన విశ్వామిత్రుడికి బ్రాహ్మణలక్షణాలు అలవడడం చిత్రవిచిత్రంగా ఉంది. మీ వలన ఇది కొంత విన్నాను. పూర్తిగా వినాలన్న కుతూహలం కలుగుతుంది వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! చ్యవనుడు, కుశికుడు వీరి సంవాదము చెప్పి నీ సందేహం తీర్చగలను. చ్యవనుడు ఒక బ్రాహ్మణుడు. కుశికకులము వలన తమ వంశముకు ముప్పు రాగలదని తెలుసుకుని చ్యవనుడు కుశిక వంశానికి నాశనం కలిగించాలని అనుకున్నాడు. అతడు కుశికమహారాజు వద్దకు వెళ్ళాడు. కుశిక మహారాజు చ్యవనుడికి అర్ఘ్యపాద్యాలు ఇచ్చి సత్కరించి " మహారాజా ! నేను ఒకవ్రతము చేయ సంకల్పించాడు. నీవు నీ భార్య నాకు సేవ చెయ్యాలని నా కోరిక " అని అన్నాడు. అందుకు కుశికుడు సంతోషముగా ఒప్పుకున్నాడు. ఆ రాజు చ్యవనుడికి ఒక నివాసము ఏర్పాటు చేసి అతడికి స్నానాది వసతులు కలిగించి " మునీంద్రా ! ఇక్కడ మీకు సకల సంపదలు ఉన్నాయి. మేము మీకు ఏమి సేవలు చెయ్యాలో చెప్పండి " అని అడిగాడు. చ్యవనుడు " మహారాజా ! నేను భోజనం చేసి నిద్రపోతాను నీవు నీ భార్య నా కాళ్ళు పట్టండి. నేను లేచే వరకు నన్ను నిద్ర లేపద్దు " అన్నాడు రాజదంపతులు అందుకు అంగీకరించారు. ముని నిద్రకు ఉపక్రమించగానే రాజదంపతులు కాళ్ళు పట్టసాగారు. చ్యవనుడు కదలిక లేకుండా అలా నిద్రపోతూనే ఉన్నాడు. రాజదంపతులు నిద్రాహారాలు మాని కాళ్ళు పట్టసాగారు. ఇలా ఇరవై ఒక్క రోజులు నిద్ర పోయి ఇరవై రెండవ రోజు నిద్ర లేచి ఎవరికీ చెప్పకుండా ఆస్థలము విడిచి పోయాడు.

## కుటీరములో చ్యవనుడు

రాజురాణి అతడిని వెంబడించారు. **చ్యవనుడు** నగరము దాటిన తరువాత అంతర్ధానం అయ్యాడు. అది చూసి రాజు రాణి మూర్ఛ పోయి తరువాత తేరుకుని " అయ్యో ఆ ముని చెప్పకుండా పోయాడే " అని చింతిస్తూ రాజధానికి పోవాలని తిరిగి పోతూ కుటీరానికి వెళ్ళి చూసారు. ఆశ్చర్యంగా అక్కడ నిద్రపోతున్న మునిని చూసి ఆనందించి తిరిగి కాళ్ళు పట్ట సాగాడు. తిరిగి నిద్రకు ఉపక్రమించిన చ్యవనుడు 21 రోజులు నిద్ర పోయి 22 వ రోజు నిద్ర లేచి " నాకు స్నానము చెయ్యాలని ఉంది " అని అన్నాడు. రాజదంపతులు మునిని కూర్చో పెట్టి సువాసనలు గుభాళించే నూనెతో మర్ధన చేసారు. కాని ఆ ముని వారిని

తిట్టి అక్కడ నుండి వెళ్ళి పోయి కొంతసేపటి తిరిగి వచ్చాడు. రాజు రాణి కోపించక అతడికి తలకు పోసి దివ్యమైన భోజనము పెట్టారు. ఆ పదార్ధములను చూసి ముని తిరిగి అక్కడ నుండి వెళ్ళాడు. రాజ దంపతులు ఆ ముని భోజనం చేయనందుకు బాధపడ్డారు. ముని మరునాడు తిరిగి వచ్చి " రాజా నీవు రధము సిద్ధము చేసి గుర్రాలకు బదులుగా మీరు రధము లాగుతూ ఉండండి నేను రధములో కూర్చుని రత్నములు, బంగారము, గోవులు, గుర్రములు యాచకులకు దానం ఇస్తాను " అన్నాడు. రాజు మారు పలుకక ముని కోరిన విధంగా అంగీకరించాడు. ముని కోరిన విధముగా రత్నములు, బంగారము, గోవులు తెప్పించి రధమును సిద్ధం చేసి దాని మీద మునిని కూర్చుండ చేసి గుర్రములకు బదులుగా రధమును లాగసాగారు. ముని చర్నాకోలు తీసుకుని వారిని గుర్రములు మాదిరి కొడుతూ యాచకులకు రత్నములు, బంగారము, గోవులను ఇవ్వసాగాడు. అలా రాజదంపతులు చర్నాకోలుతూ దెబ్బలు తింటూ నిద్రాహారాలు లేక ఎన్నో దినాలు రధము లాగసాగారు. ఇది చూసిన ప్రజలు తమలో " ఈయన కూడా ఒక తపస్వియా ! ఇది కూడా తపో మహిమేనా ! ఈ రాజదంపతులు ఈ హింసను ఎలా సహిస్తున్నారో ! ఇది అన్యాయము. అనుకుంటూ రధము వెంట వెళ్ళసాగారు. చ్యవనుడు కూడా వారి ముఖములో విసుగు కాని కోపము కాని చూడ లేదు. అతడు వారి సహనముకు ఆశ్చర్యపడుతూ నగరము వెలుపలి వరకు రధములో వెళ్ళాడు. తరువాత రధము దిగి రాజదంపతులకు కట్టిన పగ్గాలు తీసి వారిని విడిపించి వారి శరీరములను ప్రేమతో నిమిరాడు. ఆశ్చర్యంగా వారి శరీరానికి తగిలిన గాయాలు మాని వారు స్వస్థులు అయ్యారు. ముని వారిని చూసి " రాజా ! మీరు అలసి పోయారు. నేను మీకు వరాలు ఇస్తాను. మీరిక రాచనగరుకు వెళ్ళండి. నేను గంగాతీరానికి వెళ్ళి నా వ్రతమును పూర్తి చేస్తాను. మీరు రేపు నా వద్దకు రండి " అని అన్నాడు. వారు " మహాత్మా ! మాకు అలుపు ఆయాసము లేవు . మీ స్పర్శతో మాగాయాలు మాని మాకు నూతనోత్సాహము వచ్చింది. ఇదంతా మీ మహిమే స్వామీ " అన్నారు. రాచదంపతులు తమ నగరుకు తిరిగి వెళ్ళారు.

## గంగాతీరములో చ్యవనుడు

మరునాడు ఉదయము గంగా తీరానికి వెళ్ళిన రాజదంపతులు అక్కడ ఒక దివ్య భవనం చూసారు. వారు ఆశ్చర్యముతో భవనములో అడుగు పెట్టి లోపల ఒక పక్క వేదాధ్యయనము, ఒక పక్క సంగీత నృత్య వినోదములు, మరొక పక్క కోకిలలు లాంటి సుందర పక్షులకు ఆలవాలమైన తోటలు, మరొక పక్క తామరలు హంసలు కలిగిన మడుగులు, మరొక పక్క విహరించడానికి అనువైన చిన్న కొండలు దాని మీద విహరిస్తున్న దేవతలు ఉండడము చూసి తాము స్వర్గ లోకములో ఉన్న అనుభూతిని పొందారు. అక్కడ ఒక చోట శయ్య మీద పడుకుని ఉన్న చ్యవనుడిని చూసారు. వెంటనే చ్యవనుడు ఆ దివ్యభవనము కూడా మాయము అయి గంగాతీరము అడవి కనిపించాయి. అక్కడ **చ్యవనుడు** తపసు చేసుకుంటూ కనపడ్డాడు. రాజురాణితో " దేవీ ! చూసావా యోగబలము అంటే ఇదే. మానవులకు రాజ్యము సంపాదించడం సులభము . కాని సుబ్రాహ్మణత్వము, తపస్సు చాలా కష్టము. ఈ మహాముని తపోశక్తి వలన ఎన్ని సృష్టించాడో చూడు " అని అన్నాడు. ఇంతలో ముని కళ్ళు తెరిచి వారిని తన దగ్గరకు పిలిచాడు. రాజదంపతులు మునికి నమస్కరిస్తూ దగ్గరకు వెళ్ళారు. ఆ ముని వారిని దీవించి " రాజా ! నీవు నీ భార్య ఇంద్రియములను చక్కగా వశవర్తులును చేసుకున్నారు. మీకు ఇన్ని కష్టాలు కల్పించినా మీకు కోపము రాలేదు. నేను మిక్కిలి ఆనందించాను. మీరు కోరిన వరములు ఇస్తాను కోరుకోండి " అని అన్నాడు.

## కుశికుని కోరిక

రాజు " మహానుభావా ! నిన్ను సేవించడం కంటే వేరు వరము ఎందుకు. మీరు మా ఇంటికి వచ్చి నివసించిన రోజులు ఉన్న కాలంలో అనేక అద్భుతాలు జరిగాయి అందుకు కారణం తెలుకోవాలని అనుకుంటాను " అని అడిగాడు. చ్యవనుడు " రాజా ! ఒక సారి బ్రహ్మదేవుడు దేవతలు మునులు ఉన్న సభలో ఇలా అన్నాడు " భృగువంశము కుశికవంశము వాటి లక్షణాలైన బ్రాహ్మణము, క్షాత్రము మారిపోయి వర్ణసంకరం జరుగుతుంది " అని చెప్పడం నేను విన్నాను. భృగువంశానికి వర్ణసంకరం జరగడం సహించలేక నేను కుశికవంశమును నాశనం చేద్దామని మీ వద్దకు వ్రతము నెపముతో వచ్చాను. నేను మిమ్ము పెట్టే కష్టాలు సహించ లేక మీరు నన్ను నిందిస్తారని నేను మిమ్ము శపించ వచ్చని అనుకున్నాను. కాని మీరు చూపించిన సహనానికి నేను ఆనందించి మీకు వరాలు ఇస్తాను అన్నాను. మీరు వద్దన్నారు. మీకు స్వర్గం ఎలా ఉంటుందో చూపాను. రాజా ! నీకు క్షాత్రము కంటే బ్రాహ్మణము మీద మక్కువ ఎక్కువ. నీకు మూడో తరంలో ఒక బ్రహ్మతేజోదీప్తుడు జన్మిస్తాడు. ఇక నీకు కావలసిన వరము కోరుకో " అన్నాడు. కుశికుడు " మహాత్మా ! ఇంతకంటే కావలసిన వరము ఏమిటి ? నా సంతానముకు ధర్మతత్పరత, బ్రాహ్మణత్వము కలిగేలా చూచి అనుగ్రహించు " అని వేడుకున్నాడు. చ్యవనుడు " రాజా ! నీ కోరిక నెరవేరుతుంది. నీ మనుమడు త్రిలోక పూజితుడు ఔతాడు " అని అన్నాడు.

## కుశికుడి సందేహం

కుశికుడు చ్యవనుడి ముందు ఒక సందేహం వెలిబుచ్చాడు. " మునీంద్రా ! నా మనుమడు ఏ ప్రకారంగా బ్రాహ్మణత్వం పొందుతాడో చెప్పండి " అని అడిగాడు. చ్యవనుడు " రాజా ! నా వంశంలో **రుచీకుడు** అనే వాడు జన్మిస్తాడు. అతడు నీ కుమారుడు **గాధి** కుమార్తెను వివాహం చేసుకుంటాడు. ఆ రుచీకుడికి **జమదగ్ని** అనే కుమారుడు జన్మిస్తాడు. ఆ జమదగ్ని ధనుర్వేదమును కూలంకుశంగా అభ్యసిస్తాడు. జమదగ్ని కుమాడైన రాముడు తండ్రి నుండి ధనుర్వేదమును అభ్యసిస్తాడు. ఆ ధనుర్విద్య సమస్త రాజలోకమును నాశనం చేస్తుంది. ఇది విధివిలాసం. విధివిలాసం వలననే గాధి భార్య, ఋచీకుడి భార్య అనాలోచితంగా చేసిన పనివలన సద్బ్రాహ్మణుడైన ఋచీకుడికి మనుమడిగా క్షాత్ర ధర్మావలంబికుడైన పరశురాముడు జన్మిస్తాడు. క్షత్రియుడైన కుశికుడికి మనుమడుగా బ్రాహ్మణత్వము అవలంబించిన విశ్వామిత్రుడు జన్మిస్తాడు. ఈ వర్ణసంకరము జనుల చేత శ్లాఘించబడి కీర్తిదాయకమౌతుంది. ఇలా బ్రహ్మవాక్కు ఫలించి సత్ఫలితాన్ని ఇస్తుంది. ఇక నేను తీర్థయాత్రకు వెడతాను. మీరు సుఖంగా ఉండండి " అని పలికి చ్యవనుడు వెళ్ళి పోయాడు. ధర్మనందనా ! ఇది విశ్వామిత్ర పరశురాముల వృత్తాంతము " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## దానము

ధర్మరాజు " పితామహా ! నాకు దానము దాని మహిమ గురించి వివరించండి " అనీడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! మంచి పాలిచ్చే పాడి ఆవును ఒక సంద్బ్రాహ్మణుడికి దానంగా ఇస్తే ఆ ఆవుకు ఎన్ని రోమాలు ఉంటాయో అన్ని సంవత్సరాలు స్వర్గలోకంలో సుఖాలు అనుభవిస్తారు. అతడికి అటు ఏడుతరాలు ఇటు ఏడు తరాలు సద్గతులు పొందుతారు. గోదానము కాక ఇతరదానములు కూడా చెయ్య వచ్చు. కన్యాదానము, భూదానము, గృహదానము, కనకదానము, అన్న దానము, జలదానము, వస్త్రదానము, శయ్యాదానము, ఆసనదానము, వాహనదానము మొదలైనవి సద్బ్రాహ్మణులకు దానంగా ఇస్తే ఇహ లోకములోను, పర లోకములోను సుఖములు అనుభవిస్తాడు. కాని ధర్మనందనా ఎవరైతే దానము కొరకు తన వద్దకు వచ్చిన వానికి అతని మనోరధము ఎరిగి అతడికి కావలసినది దానంగా ఇస్తే అది అత్యుత్తమదానము ఔతుంది. భయంతో ఉన్న వాడికి అభయం ఇవ్వడం అన్నింటికంటే శ్రేష్టమైనది. యుద్ధములో ప్రాణములు దానంగా ఇవ్వడం ఉత్తమోత్తమం. శత్రువు ఎటువంటి వాడైనా అతడు శరణు కోరినప్పుడు ప్రసన్నమైన మనసుతో అతడి కోరిక తీర్చిన వాడు పురుషోత్తముడు అని అంటారు. భార్యా బిడ్డలను పోషించ లేక బాధపడుతున్న వాడికి సాయంచెయ్యడం అతడి దుఃఖాన్ని పోగొట్టడం అత్యంత గొప్పగుణం. తన భార్యను తప్ప అన్యకాంతలను యజ్ఞయాగములు చెయ్యడంలో ఆసక్తి కల వారు, అటువంటి సద్బ్రాహ్మణులను వెతికి వారికి దానం చెసిన వాడు మూడు లోకములలో పూజనీయుడు " అని భీష్ముడు చెప్పాడు.

## ఉత్తమ దానము

ధర్మరాజు " పితామహా ! దానము కొరకు తన వద్దకు వచ్చి వానికి దానము చెయ్యడం మంచిదా! లేక తనను ఏదానము కోరక పోయినా అతడి మనసు తెలుసుకుని దానము చెయ్యడం మంచిదా ! భీష్ముడు " ధర్మనందనా ! అడిగిన వాడికి అందరూ సహజముగా దానము చేస్తారు. కాని అడుగ కుండా ఎదుటి వాని మనసెరిగి దానం చెయ్యడమే ఉత్తమం. సత్పురుషుడికి దానం ఇవ్వడం మరణం వంటిది. దానం కావాలా అని అడగబడడం అంతకంటే పెద్ద చావు వంటిది. కనుక అడగని వాడి మనసెరిగి దానము చెయ్యడం వలన తనను తాను రక్షించుకుని దానం పుచ్చుకున్న వాడిని రక్షిస్తాడు " అని భీష్ముడు చెప్పాడు.

## దానము ఫలితము

ధర్మరాజు " పితామహా ! దానము యజ్ఞము వంటిది. దానం చెయ్యడంలో అనేక ధర్మవిధులు ఉన్నాయి. కాని ఆ దానములలో అధిక ఫలము ఇచ్చే దానము ఏదో చెప్పండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ధనము, ధాన్యము, గోవులు, మణులు, భూమి , జలము, అన్నము మొదలైనవి వినయ పూర్వకంగా బ్రాహ్మణులకు దానం ఇస్తే మంచి యజ్ఞములు చేసిన ఫలము దక్కుతుంది. కనుక ధర్మనందనా ! నీవు కూడా ఎల్లప్పుడు దాన ధర్మములు చేస్తుండు.

### భూదానము

దానములలో ఉత్తమమైనది భూదానము. మనకు అవసరమైన వస్త్రములు, ధాన్యము, రత్నములు మనకు భూముల నుండి లభిస్తుంది. బంగారము, వెండి, వస్త్రములు, ధాన్యము, వివిధములైన రత్నములను ఇస్తున్న భూమిని దానం ఇస్తే దానం ఇచ్చిన వాడు ఉత్తమఫలములు పొందుతాడు. దానము చేసిన వాడు భూమి ఉన్నంతకాలము స్వర్గములో ఉంటాడు.

భూమిని కొంచంగా దానము చేసినా అతడు మరుజన్మలో రాజ్యములు పాలిస్తాడు. యుద్ధములో వీరమరణం పొందిన క్షత్రియుడికి భూదానం చేసినఫలితం లభిస్తుంది. భూదానము బ్రహ్మహత్యా పాతకమును హరిస్తుంది. పాపాత్ముడు భూమిని దానంచేసినా భూమికి ఆ పాపం అంటదు. భూదానము అశ్వమేధయాగము చేసిన ఫలము ఇస్తుంది. దారిద్యముతో బాధపడుతూ ఎవరిని యాచించకుండా జీవించే బ్రాహ్మణుడికి దానము చేసిన భూదాన ఫలితము అంత అని చెప్పనలవి కాదు. యాగం చేసినప్పుడు శాంత చిత్తులైన బ్రాహ్మణులకు భూదానము చెయ్యడం అత్యంత ముఖ్యము. అర్హుడైన బ్రాహ్మణుడికి గోవుచర్మము మేర భూమిని దానము చేసినా అది దానము ఇచ్చిన వాడి సకల పాపములను హరిస్తుంది. యుద్ధములో మరణించి వీరస్వర్గము పొందిన వారు, సతతము గురువులను పూజించు వారు, అనేక పుణ్యకార్యములు చేసిన వారు ఎవరూ భూదానము చేసిన వారికి సరితూగ లేరు. భూదేవి సహితము కోరి భూగీతను ప్రజకు అందించింది. ఆ గీతను అనుసరించి పరశురాముడు భూదానము చేసాడు.

### భూగీత

భూనదానము గురించి భూదేవి స్వయంగా ఇలా అన్నది . ఇహ లోకము లోను పరలోకములోను సుఖము కావాలని కోరుకునే వారు నన్ను దానము చెయ్యండి. భూదానముకు సరి అయిన దానము మరొకటి లేదు. సంతోషముగా నన్ను దానము చేస్తే నాకు సంతోషము కలుగుతుంది. అలాకాక దుష్ట చింతనతో ఆ భూధానముకు అడ్డు తగులుతే నాకు బాధ కలుగుతుంది. ఎటువంటి దుర్మార్గుడైనా సహృదయముతో భూదానము చేసిన అతడికి నేను ఇహలోకములో మేలు చేస్తాను. ధర్మనందనా ! భూదాన విషయములో బృహస్పతి ఇంద్రుడికి చెప్పిన మాటలు విను. " దేవేంద్రా ! భూమిని రత్నగర్భ అంటారు. కనుక భూదానము చేసిన వాడికి హయములు, ఏనుగులు, రత్నములను, కన్యలను దానము చేసిన ఫలితం కలుగుతుంది. భూమి నుండి బంగారము లభిస్తుంది కనుక ఆ భూమిని దానము చేసిన వాడిని చూసి భూతములు తృప్తి చెందుతాయి. రాజులు తమ పరిపాలనా విధినిర్వహణలో తెలిసో తెలియకో అనేక పాపములు చేస్తుంటారు. ఆ పాప పరిహారానికి భూదానము ఉత్తమమైన మార్గము. ఎవరైతో తాముదానంగా ఇచ్చిన భూమిని తిరిగి తీసుకుంటారో వారు నరకానికి పోక తప్పదు. భూమిని దానము చేస్తానని దానము ఇవ్వకున్న మహా పాపము వస్తుంది. అలాగే అడుగక ముందు దానము చేసిన వాడికి పుణ్యము వస్తుంది " అని బృహస్పతి చెప్పాడు.

### దానముగా ఇవ్వతగినవి

ధర్మరాజు " పితామహా ! దానపరుడైన మానవుడికి ఇవ్వతగిన వస్తువులను తెలియచెయ్యండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! అన్నము, బంగారము, జలము, ప్రముఖంగా దానము చెయ్యడానికి అర్హమైనవి. వీటిలో అన్నదానము ప్రముఖమైనది. మునులు దేవతలు కూడా అన్న దానము గురించి ప్రస్థుతి చేస్తుంటారు. యఙ్ఞయాగములలో కూడా అన్నముకు విశిష్ఠస్థానం ఉంది. కనుక అన్నదానముకు మించిన దానము వేరొకటి లేదు. కనుక అన్ని పుణ్యకార్యములలో అన్న దానము తప్పక చెయ్యాలి. అన్నము ప్రాణాధారము కనుక మనకు, మన వాళ్ళకు లేక పోయినా అన్నమును అతిధులకు దానము చేసిన వారికి అధికమైన పుణ్యము వస్తుంది. బాగా అలసిపోయిన వాడు, తపస్వి, బాలుడు, వికలాంగుడు, స్త్రీ వీరు ఆకలితో అన్నము పెట్టమని అడిగిన గృహస్థు కోపగించక వారికి అన్నము పెట్టి ఆకలి తీర్చాలి. ఆకలితో ఉన్న కుక్కకు కాని, కడజాతి వాడికి కాని అన్నము పెట్టిన వాడికి ఎంతో పుణ్యము లభిస్తుంది. మునులకు, పితరులకు, దేవతలకు అన్నదాన విధులు నిర్వహించిన అది కర్మలన్నింటిలో శ్రేష్ఠము. అన్నదానము చెయ్యడానికి కులము, విద్య, వృత్తి అడ్డు రాకూడదు. అడగగానే బ్రాహ్మణులకు అన్న దానము చెయ్యాలి. ధర్మనందనా ! బ్రాహ్మణులకే కాదు అన్ని జాతుల వారికి కులముల వారికి అన్న దానము చేసిన నీకు సకల శుభములు చేకూరగలవు " అని భీష్ముడు చెప్పాడు.

### నక్షత్రములు దానము

ధర్మరాజు " పితామహా ! నాకు నక్షత్రసంబంధిత దానముల గురించి తెలియచెయ్యండి " అని అడిగాడు. భీష్ముడుమునుములు, చంద్రుడి నక్షత్రములో **అన్నము**, ఆరుద్ర నక్షత్రములో **గోవు**ను, అదితి నక్షత్రములో **తీపిపులగము**, బృహస్పతి నక్షత్రములో **బంగారము**, ఆశ్లేషా నక్షత్రములో **ధనము**, మఖానక్షత్రములో **ఉప్పు, నువ్వులు** దానము చేయుట శ్రేష్టం. భగుడు అధిదేవతగా ఉన్న తార నక్షత్రములో **చెరుకురసము**, ఉత్తరఫల్గుణీ నక్షత్రములో పాలతో వండిన **పౌష్టికాన్నము**, సూర్య తారలో **ఏనుగులు, రధములు**. చిత్తా నక్షత్రములో **శ్రీగంధపు చెక్క**, స్వాతీ నక్షత్రములో తనకు ప్రీతికరమైనది దానము చేయ వలెను. విశాఖనక్షత్రములో **ఎద్దు**, అనూరాధ నక్షత్రములో **పైపంచలు**, జ్యేష్టా నక్షత్రంలో **ముల్లంగి, కరివేపాకు**, మూలానక్షత్రములో **మంచి ఫలములు**, పూర్వాషాఢలో **పెరుగు**, ఉత్తరాషాఢలో **తేనెతో**

**వండిన అన్నము**, విష్ణువు, వసువులు, నీరు అధిదేవతలుగా కలిగిన నక్షత్రములలో **దుప్పట్లు, వాహనములు, యవలు** దానముగా ఇవ్వ వలెను. పూర్వాభద్ర, ఉత్తరాభద్రలో **మాంసము**, రేవతి నక్షత్రంలో **కంచు పాత్రతో కూడిన గోవు**, అశ్విని నక్షత్రంలో **గుర్రపు బండి**, భరణీ నక్షత్రములో **నువ్వులు, ఆవులు** దానము చెయ్యడం మంచిది. ఈ ప్రకారం దానము చేసిన మానవుడు ఊర్ధ్వ లోకాలకు పోగలడు.

### ఇతర దానాలు

ధర్మనందనా అన్ని దానములకు ప్రత్యామ్నాయం సువర్ణదానం. ఏదైనా వ్రతం చేసిన సమయంలో సువర్ణదానం చేసిన ఆయుష్షు పెరుగుతుంది, మనిషి పునీతుడౌతాడు, భావశుద్ధి కలుగుతుంది. అని పూర్వము హరిచంద్రుడు చెప్పాడు. దాహార్తికి మంచినీరు ఇవ్వడం అన్నింటి కంటే ఉత్తమ దానం అని మనువు చెప్పాడు. నీరుదానం చెయ్యడమంటే మరో అర్ధం ఉంది. చెరువులు, బావులు, కొలనులు నిర్మించడం నీటిదానమే. ఈ దానము చేసిన వారు పుణ్యలోకాలకు పోయారు. ఎవరు తవ్వించిన కొలను, చెరువులలో ఆవులు నీళ్ళు త్రాగుతాయో ఆ కులము మొత్తం సద్గతి పొందుతుంది. ఎవరు తవ్వించిన బావి, చెరువు, కొలనులో దాహార్తులు మంచి నీరు త్రాగి దాహం తీర్చుకుంటారో అతడికి పాపములు అంటవు. దానములలో తరువాతి స్థానం ఘృతము. నెయ్యిని యజ్ఞ యాగములందు ఉపయోగిస్తారు కనుక అగ్నిదేవుడు, యజ్ఞపురుషుడు ప్రీతి చెందుతారు. కుండలు బ్రాహ్మణులకు దానం చేస్తే అతడు ధనవంతుడౌతాడు. గొడుగులు దానంచేసిన పుత్రులను పొందుతాడు. వాహనములు దానంచేసిన సకల కోరికలు సిద్ధిస్తాయి. చెప్పులు దానం చేస్తే శత్రునాశనం ఔతుంది. నువ్వులు పితృదేవతలకు ఆహారంగా సృష్టించాడు బ్రహ్మ. నువ్వులు దానం చేసిన వాడికి పాపములు నశిస్తాయి. తిలదానం గొప్పది కనుక మునులు కూడా దీనిని స్వీకరిస్తారు. అటువంటి తిలాదానం చేసినవారు మునుల కంటే శ్రేష్టుడు ఔతాడు. పుణ్యకార్యాలలో, యజ్ఞయాగాలలో దానాలు చెయ్య వచ్చు. దానం ఎప్పుడైనా ఎక్కడైనా చెయ్య వచ్చు.

### గోదానమహిమ

ధర్మనందనా ! గోదానమహిమ గురించి వివరిస్తాను. గోవులు తపోధనుల కంటే గొప్పవి. గోవుల హోమమునకు కావలసిన పాలు, పెరుగు, నెయ్యి ఇస్తాయి. గోవుశరీరములో పనికిరానిది ఏమీ లేదు. దాని పేడ, మూత్రము, చర్మము అన్ని పవిత్రములే. పైగా గోవులు మనకు అన్ని పనులు చేసి పెడతాయి. వేదములు గోవులు, బ్రాహ్మణుడు ఒకటే అని చెప్తున్నాయి. కనుక గోదానము చేసిన వాడికి ముక్తి లభిస్తుంది. గోవులను బ్రాహ్మణులకు దానం చేసిన పాపం నశించి పుణ్యలోకాలకు చేరగలరు. ఆవు పాలు అమృతముతో సమానమని దేవేంద్రుడే చెప్పాడు కనుక ఆవు పాలు దానము చేసిన అమృతము దానము చేసిన దానితో సమానఫలము దక్కుతుంది. గోదానము చేసిన మన ప్రాణములు దానం చేసినట్లే. కాని గోవులను అర్హులకు మాత్రమే దానం చెయ్యాలి. క్రూరులకు, నాస్థికులకు, దుర్మార్గులకు దానం చేసిన వాడు దుఃఖముకు గురి ఔతారు. కనుక గోదానము ఇవ్వాలంటే అతడు అర్హుడే అని తెలుసుకుని దానం చెయ్యాలి. ధర్మనందనా ! రోగం వచ్చిన దానిని, బక్క చిక్కినది, చూలు కాని ఆవును దానం చెయ్యరాదు. మోక్షప్రాప్తికి గోదానం చేసిన మోక్ష ప్రాప్తి కలుగుతుంది. ఎన్ని గోవులను దానము చేసిన అంత ఫలితము ఉంటుంది.

## మిగిలిన దానములు

ధర్మనందనా ! తరువాతి స్థానము అన్న పానీయాలది. అందులో అన్నము చాలా గొప్పది. అన్నమును దేవ లోకములో అమృతమని, నాగకులములో, సుధ అని, పితృలోకములో స్వధ అని పిలుస్తారు. మహాత్ములు అన్నమును ప్రాణము అని కూడా పిలుస్తారు. కనుక అన్న దానము ప్రాణ దానముతో సమానము. అన్నము కంటే జలము గొప్పది. అన్నము వండడానికి కూడా జలము అవసరము కదా ! చంద్రుడు జలము నుండి పుట్టాడు కదా ! ఓ షధులంటికీ చంద్రుడు ఆధారము కనుక అన్నము కంటే జలము ఉత్తమము. మానవుడు తన వద్ద ఉన్న అన్నమును దేవతలకు నివేదించాలి, పితరులకు తర్పణము చేయాలి, అతిధులను సత్కరించాలి.

### తిల దానము

ధర్మనందనా ! తరువాత తిలదానము గొప్పది. దాని గురించి ఒకి ఇతిహాసము చెప్తాను విను. పూర్వము మద్య దేశంలో **పర్ణశాల** అను ఊరు కలదు. ఆ ఊరిలో **శర్మ** అను బ్రాహ్మణుడు నివసించే వాడు. ఆ శర్మను యముడు పిలిచి ఈ విధముగా ఉపదేశించాడు " దానములలో నువ్వుల దానము గొప్పది. ఎందు కంటే నువ్వులను పితరులు ఇష్టంగా తింటారు. నువ్వులు

ఆహారంగా తీసుకుంటే పాపములు హరిస్తాయి. బుద్ధి పుణ్యకార్యముల వంక మరలుతుంది. కనుక నీవు ఎల్లప్పుడు నువ్వులను దానంగా ఇవ్వు. అలాగే వస్త్రదానము చేస్తే దేవతలు, దీపదానముకు పితరులు సంతోషిస్తారు " అని యముడు స్వయముగా చెప్పాడు కనుక తిలదానము చాలా గొప్పది. ఇక సంగ్రహంగా చెప్పాలంటే దానము చేయ తగ్గవి మూడు భూదానము, విద్యాదానము, గోదానము. ఇంతకు మించిన దానములు లేవు. గురువు శిష్యుడికి విద్యాదానము చేసిన భూదాన ఫలితము దక్కుతుంది. గోదానము కూడా భూదానముతో సమానమైనది. గోమయముతో దేవతా గృహములు, పితృ కార్యములు చేయు గృహములు అలికిన వాటికి పవిత్రత చేకూరు తుంది. జీవించి ఉన్నంత కాలము భోజనముకు ముందు ఆవుకు పిడికెడు గడ్డి పెట్టిన వాడికి బ్రాహ్మణుల కోరిక తీర్చిన ఫలము దక్కుతుంది.

## గోదానము లోకము

ధర్మనందనా ! దీనిలో ఒక ధర్మసూత్రం ఉంది. గోదానము మంచిబుద్ధితో చేసిన వాడికి మంచి ఫలితము కులుగుతుంది. చెడుబుద్ధితో చేసిన చెడుఫలితము కలుగుతుంది. ఈ సందర్భంలో ఒకకధ చెప్తాను. **ద్వారావతి** నగరంలో ఒక బావిలో ఒక పెద్దతొండ నివసిస్తూ ఉంది. ఒక రోజు అది మనుష్యుల కంట పడింది. దానిని బావిలో ఉండనిస్తే నీరు పాడౌతుందని ఆ ఊరి జనులు దానిని పెద్ద తాళ్ళతో బయటకు తీయడానికి ప్రయత్నించారు కాని వారు ఎంతటి ప్రయత్నము చేసినా దానిని బయటకు తీయలేక పోయారు. వారంతా శ్రీకృష్ణుడి వద్దకు వెళ్ళి ఈ విషయము చెప్పారు. శ్రీకృష్ణుడు అక్కడకు వచ్చి ఆ తొండను బయటకు తీసాడు. శ్రీకృష్ణుడిని చూసి తాను నృగు మహారాజునని తెలిపింది. శ్రీకృష్ణుడు దానిని గుర్తుపట్టి " అయ్యా ! అనేక గోవులను దానము చేసిన నీకు ఈ గతి ఎలా పట్టింది " అని అడిగాడు. తొండ " ఏమని చెప్పదును కృష్ణా ! నేను ఒకరోజు ఒక బ్రాహ్మణుడికి ఒక గోవును దానంగా ఇచ్చాను. ఆ బ్రాహ్మణుడు దానిని మేతకని బయటకు తోలిన సమయంలో ఆ గోవు మా గోవులతో కలిసి అలవాటు ప్రకారం మా మందలో చేరి మా ఇంటికి వచ్చింది. అది గోపాలాకులు గమనించ లేదు . మరు నాడు నేను దానమివ్వడానికి గోవులను తెమ్మని గోపాలకులకు చెప్పగా వారు మిగిన గోవులతో నేను దానం ఇచ్చిన గోవును కూడా తీసుకు వచ్చారు. ఆ విషయము తెలియక నేను ఆగోవును దానంగా ఇచ్చాను. ఆ గోవును దానంగా పొందిన బ్రాహ్మణుడు గోవును తోలుకుని పోతుడగా అంతకు ముందు ఆ గోవును దానంగా పొందిన బ్రాహ్మణుడు తన గోవును వెతుకుతూ ఆ గోవును చూసాడు.



నచికేతునికి తొండ రూపము నుండి విముక్తి

### గోవు కొరకు బ్రాహ్మణులు వాదించుకొనుట

అతడు ఆ గోవును చూసి " ఈ గోవును నాకు రాజగారు దానంగా ఇచ్చారు " అని అన్నాడు. రెండవ బ్రాహ్మణుడు కూడా " ఇది రాజు నాకు దానంగా ఇచ్చిన గోవు " అన్నాడు. వారు కొంతసేపు వాదించుకుని చివరకు రాజు గారి వద్దకు గోవుతో సహా వెళ్ళాడు. నేను జరిగినది విచారించిన మీదట తెలుసుకున్నాను. ఒకసారి దానమిచ్చిన గోవును తిరిగి దానము ఇచ్చుట పొరపాటు అని తెలుసు కనుక పొరపాటును సరి దిద్దడానికి మొదటి బ్రాహ్మణుడికి ఆ గోవు బదులు లక్ష గోవులను ఇస్తానని చెప్పాను. అతడు " ఆ గోవు మా పాలిట మహా లక్ష్మి. అది నా కుమారుడికి అడిగినదే తడవుగా పాలను ఇస్తుంది కనుక నాకు ఆ గోవే కావాలి " అన్నాడు. నేను రెండవ బ్రాహ్మణుడితో ఆ గోవుకు బదులుగా మణులు బంగారం ఇస్తాను దానిని తిరిగి ఇవ్వమని అడిగాను. అతడు " మీ రాజ్యము మొత్తము ఇచ్చినా నాకు వద్దు. నాకు దానంగా ఇచ్చిన గోవే నాకు కావాలి " అన్నాడు. తరువాత నాకు మృత్యు సంభవించి నేను యమధర్మ రాజు వద్దకు వెళ్ళాను. యమధర్మరాజు ప్రేమతో " రాజా ! నీవు ఎన్నో దాన ధర్మాలు చేసావు. నీకు చాలా పుణ్యము వచ్చింది. కాని నీవు ఒక సారి దానంగా ఇచ్చిన గోవును తిరిగి దానం ఇచ్చావు. తెలక చేసినా అది పాపాము కనుక నీకు దుర్దశ సంభవించింది. కనుక నీవు ముందు దుర్గతి అనుభవిస్తావో సద్గతి అనుభవిస్తావో తేల్చుకో " అన్నాడు. నేను ముందుగా దుర్గతి అనుభవించడానికి అంగీకరించాను. వెంటనే పై నుండి కిందకు తల కిందులుగా భూమి మీద పడ్డాను. అలా పడడం ఒక ముని చూసి నన్ను చూసి జాలి పడి " నీవు తొండ జన్మ ఎత్తుతావు. కొంతకాలానికి నీకు శ్రీకృష్ణుడి చేతి స్పర్శ తగిలి నీ దుర్దశ తొలగి సద్గతి కలుగుతుంది " అని చెప్పాడు. ఇంతకాలానికి నాకు నీ చేతి స్పర్శ తగిలింది కనుక ఇక నేను దుర్దశ తొలగి సద్గతికి పోతాను " అన్నాడు. శ్రీకృష్ణుడు " విప్రుల సొమ్ము అపహరించడం రాజులకు మహా పాపము. తనకు తెలియకుండా నృగుడు విప్రుడి సొమ్ము అపహరించి ఇలాంటి దుర్గతిని పొందాడు " అని నృగుడితోను అక్కడ గుమి కూడిన ప్రజలతోను చెప్పాడు.

### గోదానము ఫలము

ధర్మరాజు భీష్ముడితో " పితామహా ! నాకు గోదానము చేసినందు వలన కలిగే ఫలితము చెప్పండి " అని అడిగాడు. భీష్ముడు ధర్మనందనా " ఈ సందర్భంలో నీకు ఒక ఇతిహాసము చెప్తాను. ఔద్ధాలకుడు అనే ముని ఉండే వాడు అతడి కుమారుడు **సచికేతుడు**. ఒక రోజు ఔద్ధాలకుడు సచికేతుడిని పిలిచి " కుమారా ! నేను ఇంటి వద్ద సమిధలు, కలశము, పువ్వులు మరచి వచ్చాను. నీవు పోయి తీసుకునిరా " అని చెప్పాడు. సచికేతుడు ఉత్సాహంగా తండ్రి చెప్పినవి తీసుకు రావడానికి వెళ్ళాడు. అతడు పోయి చూసే ఏరు పొంగి వస్తువులు ఏటిలో కొట్టుకు పోయాయి. వస్తువులు కనపడని సచికేతుడు తిరిగి వెళ్ళి తండ్రితో వస్తువులు కనపడ లేదని చెప్పాడు. అప్పటికే ఔద్ధాలకుడు ఆకలితో ఉండడంతో కుమారుడి మీద ఆ మాటలకు కోపగించి " వస్తువులు కనపడక పోతే ఇక్కడకు ఎందుకు వచ్చావు. యముడి దగ్గరకు పో " అన్నాడు. తండ్రి కోపంతో అన్న మాటలకు కుమారుడు గడగడ లాడుతూ తండ్రి కాళ్ళ మీద పడ్డాడు. కాని అప్పటికే అతడు యమపురిచేరుకున్నాడు. అది చూసి ఔద్ధాలకుడు తల్లడిల్లి పోయి చేజేతులా కుమారుడిని చంపుకున్నానని ఏడవసాగాడు. ఇంతలో తెల్ల వారింది. తెల్లవారగానే సచికేతుడు కళ్ళు తెరవడం చూసి ఔద్ధాలకుడు ఆనందించి " నాయనా ! పుణ్య లోకములకు వెళ్ళి నా కొరకు తిరిగి వచ్చావా ! " అని అంటూ కుమారుడిని గుండెలకు హత్తుకున్నాడు. సచికేతుడు " తండ్రీ ! నీవు నన్ను ఎముడి వద్దకు వెళ్ళమన్నావు కదా ! అలాగే నేను యముడి వద్దకు వెళ్ళాను. యముడు నన్ను దగ్గరకు పిలిచి ఉచితాసనము ఇచ్చి అర్ఘ్య పాద్యములు ఇచ్చాడు. నేను ఎముడిని " నేను ఎక్కడ ఉన్నాను " అని అడిగాను. యముడు " నాయనా ! నిన్ను మీ తండ్రి యమ లోకానికి పొమ్మని చెప్పినందు వలన నీవు యమ లోకము వచ్చావు. అంతే కాని నీకు ఆయుర్దాయము ఇంకా ఉంది. నీ తండ్రి నీ కొరకు దు:ఖిస్తున్నాడు వెళ్ళు " అన్నాడు. నేను " అలాగే వెడతాను. ఇక్కడ పుణ్య లోకాలు ఉంటాయట కదా ! నాకు వాట్ని ఒక్క సారి చూపించరా ! " అని అడిగాను. వెంటనే యముడు ఒక రథము తెప్పించి నన్ను ఎక్కించుకుని పుణ్య లోకాలకు తీసుకు వెళ్ళాడు. నేను నయనానంద కరంగా వాటిని చూస్తూ అక్కడ దివ్యాభరణాలు ధరించి తితుగుతున్న వారిని చూసి " మహాత్ములారా ! మీరెవరు ? ఏమి పుణ్యము చేసుకుని ఇలా అనుభవిస్తున్నారు ? " అనీడిగాను. వారు " కుమారా ! మేము చేసిన గోదాన ఫలము వలన ఈ భోగములు అనుభవిస్తున్నాము " అని చెప్పారు. తరువాత నేను యముడికి నమస్కరించి ఇక్కడకు వచ్చాను.

### గోదానము లోకాలు

ధర్మరాజు " పితామహా ! గోదానము చేసిన వారు పొందు లోకమును గురించి వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! గోదానము చేసిన వారు పొందే లోకము పేరు గోలోకము. అక్కడ నిర్మల మనస్కులు, సత్యము పలుకు వారు, ఇంద్రియములని నిగ్రహించుకున్న వారు, మనో నిగ్రహము కలవారు, ఎల్లప్పడు గురువులను పూజించు వారు కూడా ఉంటారు. గోలోకముకు మించిన పుణ్యలోకము మరొకటి లేదు. అక్కడ కాలము ఉండదు. అలసట, రోగములు, ఆకలి, దప్పిక ముసలితనము ఉండదు. అక్కడ ఉన్న వారు సదా ఆనందంలో మునిగి ఉంటారు. గోదానముకు మించిన దానము మరొకటి లేదు. కాని గోదానముకు వినియోగించే ధనము ధర్మముగా సంపాదించినది అయి ఉండాలి. ఇతరుల సొమ్ముతో దానము చెయ్యరాదు. కనుక ధర్మనందనా ! నీవు కూడా గోవులను అర్హులైన వారికి దానము చేసి పుణ్యలోకములు పొందుము " అని భీష్ముడు చెప్పాడు.

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

# అనుశాసనిక పర్వము తృతీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# తృతీయాశ్వాసం

అంపశయ్య మీద ఉన్న భీష్ముడితో ధర్మరాజు " పితామహా ! మనం రోజు చేసే కర్మలలో భక్తి శ్రద్ధలతో చేయవలసిన పనులేవో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నియమ నిష్ఠలను శ్రద్ధతో పాటించాలి. వేదములు అధ్యయనం చేయడం వేదములను అర్ధం చేసుకోవడం అర్ధము చేసుకున్నది దానిని ఇతరులకు నేర్పడము చేయాలి. మనస్సును ఆధీనంలో ఉంచుకోవడం, ఇతరుల నుండి ఏవస్తువును తీసుకొనక పోవడం, తాను చెయ్యవలసిన పనులను భక్తిశ్రద్ధలతో చెయ్యడం, ఇంద్రియములను స్వాధీనంలో ఉంచుకోవడం, ఎల్లప్పుడు సత్యము పలకడం, ఎల్లప్పుడు విద్యను అభ్యసించడం, తనకున్నది పరులకు ఇవ్వడంలో ఆసక్తి కనబరచడం, బ్రహ్మచర్యము పాటించడం, తల్లితండ్రులకు సేవ చెయ్యడం, గురువులకు సేవ చెయ్యడం, ఇతరుల మీద దయకలిగి ఉండడం, గోవులను సంరక్షించడం పైన చెప్పిన పనులన్ని అత్యంత శ్రద్ధతో చేయతగినవి " అని భీష్ముడు చెప్పాడు.

## గోదాన విధి

ధర్మరాజు " పితామహా ! గోదానము ఇవ్వవలసిన విధానం వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ గోదానమహిమ గురించి పూర్వము బృహస్పతి మాంధాతకు చెప్పాడు. ఒక పుణ్యదినము అందు బ్రాహ్మణుల అనుమతి తీసుకుని ఆ రోజంతా ఉపవాసము ఉండి గోవులు ఉన్న మంద వద్దకు పోయి ఒకరోజు ఆ గోశాలలో ఉండి మరునాడు సూర్యోదయమున తాను దానము ఇవ్వదలచిన గోవును పేరు పెట్టి పిలిచి బ్రహ్మదేవుడు చెప్పిన మంత్రము ఈ విధముగా

పఠించుతూ " ఈ గోవు నా తల్లి, ఈ ఎద్దు నా తండ్రి, ఈ గోవుగర్భం స్వర్గం, ఈ గోవు నిలిచిన ప్రదేశం పుణ్యలోకం ఇచ్చిన వ్యక్తికి శాశ్వత సుఖసంతోషాలు లభిస్తాయి. ఇక దానము పుచ్చుకునే వాడు విద్యాభ్యాసము చేసే విద్యార్ధి కాని, వ్రతములు చెయ్యడంలో ఆసక్తి ఉన్న వాడు కాని, ఎటువంటి పాపములు చెయ్యనివాడు కాని, శాంతచిత్తుడు కాని, ఇంద్రియ నిగ్రహము కలవాడు కాని, కోపము లేనివాడు కాని అయి ఉండవలెను. మహారాజా ! ఆశ్వీజమాసంలో కృష్ణపక్షంలో అష్టమి నుండి మూడు రోజులు దీక్షలో ఉండి గోమూత్రము గోమయము పుచ్చుకుంటే అతడు కోరినకోరికలు సిద్ధిస్తాయి " అని మాంధాతకు చెప్పాడు. కనుక ధర్మనందనా నీవు కూడా పై నియమములు ఆచరించి గోదానము చెయ్యి. పొద్దుననే లేచి కాలకృత్యములు తీర్చుకుని ఉపవాసము ఉండి గోదానము చేస్తే ఎంతో పుణ్యము వస్తుంది. ఇక కపిలవర్ణ గోవును దానం చేస్తే సకలపాపములు నశించగలవు " అని భీష్ముడు చెప్పాడు.

## కపిల గోవు విశిష్ఠత

ధర్మరాజు " పితామహా ! కపిలగోవు విశిష్ఠత తెలపండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! పూర్వము దేవతలకు ఆకలి వేసింది. వారంతా బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళారు. బ్రహ్మదేవుడు వారికి అమృతం ఇచ్చాడు. దేవతలు ఆ అమృతము సేవించారు. ఆ అమృతపు సువాసనల నుండి **కామధేనువు** ఉద్భవించింది. కామధేనువు నుండి మరి కొన్ని ఆవులు జన్మించాయి. ఆ ఆవులన్ని హిమాలయాల మీద విహరిస్తున్నాయి. ఆ సమయంలో ఒక లేగదూడ తన తల్లిదగ్గర పాలు తాగుతుంది. ఆ పాల నురగ గాలికి ఎగిరి అక్కడే తపస్సు చేసుకుంటున్న పరమశివుడి తల మీద పడింది. పరమశివుడికి కోపం వచ్చి మూడో కన్ను తెరచి ఆ ఆవులను చూసాడు. ఆ ఆవులన్ని ఆ కోపాగ్ని వేడికి ఎర్రగా అయిపోయాయి. ఆవులన్ని బెదిరి తలో దిక్కుకు పారి పోయాయి. ఈ సంగతి తెలుసుకున్న బ్రహ్మదేవుడు పరమశివుని వద్దకు వచ్చి " మహేశా ! నీ తల మీద ఉన్న చంద్రుడు నిరంతరం నీ మీద అమృతం కురిపిస్తుంటాడు కదా ! లేగ దూడల నోటి నుండి వచ్చే నురగ కూడా అమృత సమానము కదా ! అది ఎంగిలి ఎలా ఔతుంది ! గోవు పాలు అమృతమైతే వాటి నురగ కూడా అమృతమే కదా ! దీనికి ఆగ్రహిస్తే ఎలా ! వాటిని కరుణించు " అని వేడుకుని ఒక మంచి ఎద్దును శివుడికి కానుకగా ఇచ్చాడు. పరమశివుడు శాంతించి ఆ ఎద్దును తన వాహనముగా చేసుకుని ఆవులను ఆప్రాంతంలో తిరగడానికి అనుమతి ఇచ్చాడు. వెంటనే బెదిరి పోయిన ఆవులు తిరిగి వచ్చాయి. శివుడు " బ్రహ్మదేవా ! ఈ గోవులన్ని నా మూడవ కంటిచూపుతో ఎర్రగా అయిపోయాయి. ఇప్పటి నుండి ఇవి అతి శ్రేష్ఠమై నవిగా భావించబడతాయి " అని వరం ఇచ్చాడు. అప్పటి నుండి కపిలగోవులనబడే ఎర్రటి గోవులు దానం ఇవ్వడం ఆనవాయితి అయింది " అని భీష్ముడు చెప్పాడు.

## సౌదాసుడు


సౌదాసునితో గోవుల మహాత్యమును గురించి చెప్పచున్న వసిష్ఠుడు

భీష్ముడు " ధర్మనందనా ! ఇక్ష్వాకు కులములో సౌదాసుడు అనేవాడు జన్మించాడు. ఆయన పురోహితుడు వసిష్ఠుడు. ఒక రోజు **సౌదాసుడు** వశిష్ఠుడిని చూసి " మహాత్మా ! ఈ లోకములో పవిత్రమైనది ఏది ? " ని అడిగాడు. వశిష్ఠుడు " సౌదాసా ! ఆవు పవిత్రమైనది. ఆవు హవిస్సుకు పుట్టినిల్లు. అన్ని జీవులకు గోవు ఆధారము. గోవులు ఉన్న చోట లక్ష్మి నివసిస్తుంది. గోవు ఈ సంసార సాగరాన్ని దాటడానికి పనికి వచ్చే పడవ. స్వర్గలోకమును చేరడానికి నిచ్చెన వంటిది. మానవులు తమ కున్న గోసంపదలో పదింట ఒక దానిని దానంగా ఇవ్వాలి. గోవును ఉదయం స్మరించి నమస్కరించడం అధికమైన పుణ్యం ప్రసాదిస్తుంది. ఆవు పేడ, ఆవు పంచితము పవిత్రమైనవి. కాని ఆవు మాంసము తినడం మహా పాపము. మానవులకు పీడ కలల వలన వచ్చే ఫలితం గోవును స్మరించిన నివారించ బడుతుంది. ఆవు పేడతో ఇల్లు శుభ్రం చెయ్యడం, ఆవు పంచితం ఔషధంగా తీసుకోవడం మంచిది. బ్రాహ్మణులు గోసంపద కాపాడుకుంటూ ఉంటారు. గోదానము వలన అనంతమైన సుఖాలు కలుగుతాయి " అని వశిష్ఠుడు సౌదాసుడికి గోవుల విశిష్ఠత గురించి చెప్పాడు.

## యజ్ఞములకు మూలము


గోవులకు వరమిస్తున్న బ్రహ్మదేవుడు

భీష్ముడు " ధర్మనందనా ! ఒకసారి వ్యాసుడి కుమారుడైన **శుకుడు** గోవుకు సమానమైనది ఈ లోకంలో మరేదీ లేదు. యాగములకు మూలకారణం గోవు. ప్రారంభంలో ఆవులకు కొమ్ములు లేవు. బ్రహ్మదేవుడు " గోవులు పరమపవిత్రములు. యజ్ఞముకు గోవులు మిక్కిలి అవశ్యము. గోవును చూసినంతనే దురితములు తొలగి పోతాయి. ఎవరైతే గోవును పూజిస్తారో వారు స్వర్గసౌఖ్యములు పొందగలరు. కుమారా ! ఆవు ఔషదులకు నిలయము. గోవు పంచితమును ఆవుపాలు, ఆవునెయ్యి, ఆవుపేడతో కలిపి మూడు దినములు సేవించిన సకలరోగములు నశిస్తాయి. తరువాత మూడు దినములు ఉపవాసము చేసి ఆవుగిట్టలతో తొక్కించిన యవలతో కాచిన గంజి సేవించిన తేజోవంతులు ఔతారు. ఈ విధంగా సేవించి దేవతలు రాక్షసులను గెలిచారు. ఆవునెయ్యిని సేవించడం వలన ఉదాత్తుడు ఔతాడు. ఆవు నెయ్యిని దానం చేసిన ఎంతో పుణ్యము వస్తుంది. ప్రతి రోజు ఆచమనం చేసి గోవుల మధ్య గోమతి మంత్రం జపించిన అంతఃకరణ శుద్ధి బాహ్య శుద్ధి ఏర్పడుతుంది. ఈ గోమతి మంత్రమును అగ్ని కార్యము, గోవులసమక్షము, బ్రాహ్మణుల ఎదుట చదివిన కోరిన కోరికలు సిద్ధిస్తాయి. అందు వలన గోవును మించిన వస్తువు ఈ లోకములో లేదు " చెప్పాడు. ధర్మనందనా విన్నావు కదా ! గోవుల మహత్యము " అని భీష్ముడు చెప్పాడు.

## గోలోకము

ధర్మరాజు భీష్ముడితో " పితామహా ! ఈ మూడు లోకములకు బ్రహ్మదేవుడు అధిపతి. బ్రహ్మలోకమును గోలోకము అంటారట ఎందుకు " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! పూర్వము విశ్వకర్మ గొప్ప తపస్సు చేసాడు. అమృత రూపిణి కామరూపి అయిన సురభి అనే కన్యని మానస పుత్రిగా సృష్టించాడు. ఆమెతో పాటు మహా తేజోవంతుడైన ఒక పురుషుడిని కూడా సృష్టించాడు. ఆ పురుషుడు ఆ కన్యను చూసి మోహించి ఆమె కొరకు పరితపించ సాగాడు. అది చూసిన బ్రహ్మ "**మార్తోభవ** " (నీ పరితాపము ఉపశమించు కాక) అని దీవించాడు. అతడికి మార్తాండుడు అని పేరు పెట్టి అతడికి సురభిని ఇచ్చి వివాహము జరిపించి " మీ రిరువురికి పుట్టిన సంతానం యజ్ఞయాగాదులకు అవసరమైన పాలు, పెరుగు, నెయ్యి సమకూరుస్తాయి " అని చెప్పాడు. వారిరువురికి గోవులు సంతానంగా జన్మించాయి. ఆ గోవులు కూడా మానవులకు, దేవతలకు కోరినవి ఇస్తూ వారి చేత పూజలు అందు కుంటున్నాయి " అని భీష్ముడు చెప్పాడు.

## సురభి మార్తాండుడు

ధర్మరాజు " పితామహా ! **సురభి** మార్తాండులకు కలిగిన సంతానం గురించి వివరించండి " అని అడిగాడు. ధర్మనందనా ! ముందుగా సురభి మార్తాండులకు పదకొండు మంది ఉద్భవించారు. వారే బ్రాహ్మణులకు మూల పురుషులు. వారే ఏకాదశ రుద్రులు. వారి పేర్లు **అజపాదుడు, అహిర్బుధ్న్యుడు, త్రయంబకుడు, వృషాకపి, శంభుడు, కాపాలి, రైవతుడు, హరుడు, బహురూపుడు, ఉగ్రుడు, విశ్వరూపుడు**. ఈ ఏకాదశరుద్రులను లోకమంతా పూజించారు. ఏకాదశ రుద్రుల తరువాత గోసమూహం పుట్టింది. ఆ ఆవుల ముఖంలో కొమ్ములలో నాలుకలో ఇంద్రుడు, మలద్వారము మూత్రములో వాయుదేవుడు, మూపురంలో శివుడు, పాదాలలో దేవతలు, కడుపులో అగ్నిదేవుడు, ఆవుపాల పొదుగులో సరస్వతి, ఆవు పేడలో లక్ష్మీదేవి, ఆవు పంచితంలో కీర్తి, రక్తంలో చంద్రుడు కొలువై ఉన్నారు. గోవు హృదయంలో **భగుడు** అనే దేవత, పాలలో బ్రహ్మదేవుడు, వెంట్రుకలలో అనుష్ఠానములు, తోకలో యమధర్మరాజు, ఆవు కన్నులలో సూర్యుడు, చర్మములో **తపస్సు**, తేజము అధిష్ఠాన దేవతలుగా ఉన్నారు. ఆవు కాళ్ళలో ఉన్న కీళ్ళలో **సిద్ధులు** కొలువై ఉన్నారు. సమస్త దేవతలకు ఆలవాలమైన గోవు మహత్యము ఏమని వర్ణింపగలము.

## సుమిత్రుడు

సమస్తదేవతలకు ఆలవాలమైన ఆవు గురించి ఈ సందర్భంలో నీకు ఒక ఇతిహాసము చెప్తాను. **త్రిశిఖరము** అనే కొండ ఉండేది. ఆ కొండప్రాంతంలో భృగువంశంలో పుట్టిన కొంత మంది మునులు ఆశ్రమాలు నిర్మించుకుని తపస్సు చేసుకుంటున్నారు. వారిలో **సుమిత్రుడు** ఒకడు. ఒకరోజు **అంగీరసుడు** అనే బ్రాహ్మణుడు **గోశర్కర** అనే తీగను సుమిత్రుడికి

ఇచ్చాడు. సుమిత్రుడు దానిని తన గోవులకు ఆహారంగా ఇచ్చాడు. ఆ ఓషధిని తిన్న ఆవులు ఏపుగా పెరిగి ఆ గోవులకు తామర తంపరగా సంతానం పెరిగింది. అలా ఆ గోవుల సంతతి పెరిగి మందగా ఏర్పడ్డాయి. సుమిత్రుడు ఆ ఆవుల మందను చూసి బాగా మురిసి పోయాడు. ఆ ఆవు దూడలు తల్లుల పాలు త్రాగుతుంటే వాటి నుండి వచ్చే నురగను తాను సేవించసాగాడు. అప్పటి నుండి అతడికి **ఫేనుడు** చూసి అక్కడే స్నానం చేస్తున్న గోవులు " మీరు ఎవరు ? ఇక్కడ ఏమి చేస్తున్నారు ? మీకీ రూపములు ఎలా వచ్చాయి " అని అడిగాయి. అప్పడు స్త్రీ రూపంలో ఉన్న గోవులు " మేము బ్రాహ్మణులకు సేవ చేస్తాము. యజ్ఞములకు, పితృకార్యములకు, అతిధి సత్కారములకు, బ్రాహ్మణులకు ఆహారంగా ఉపయోగపడే పాలు ఇస్తాము. బ్రాహ్మణుల పొలములో పని చేయడానికి మా పిల్లలను పంపుతాము. మేము చేసే మంచి పనుల వలన మాకు గోలోక ప్రాప్తి కలిగింది. కాని మీరు మంచి పని చేసే వారిని చూసి అసూయ చెందుతారు. కనుక మీకు మీ దూడలకు ఈ దుర్గతి పట్టింది " అని పలికాయి. మిగిలిన గోవులు తమ తప్పు తెలుసుకుని తమకు తరుణోపాయము చూపమని కాంతల రూపంలో ఉన్న గోవులను అడిగాయి.

## రంతిదేవుని యజ్ఞము

ఆ గోవులు " **రంతిదేవుడు** ఒక యజ్ఞము చేస్తున్నాడు. మీరు అక్కడకు వెళ్ళండి. ఆయన మిమ్మల్ని ఆయజ్ఞములో బలి ఇస్తాడు. మీకు గోలోకప్రాప్తి కలుగుతుంది " అని పలికాయి. వెంటనే ఆ ఆవులన్ని రంతిదేవుడి వద్దకు వెళ్ళడానికి సిద్ధం అయ్యాయి. కాని అందులో ఒక గోవు సందేహం వెలిబుచ్చింది. " మనం మన యజమాని సుమిత్రుని అడిగి కదా వెళ్ళాలి అని అంది. కొన్ని ఆవులు " సుమిత్రుడు మనము వెళ్ళడానికి సుమిత్రుడు అనుమతి ఇవ్వడు. కనుక మనం అతడిని చంపుదాము అప్పడు అతడు కూడా గోలోకముకు వస్తాడు " అన్నాయి. కాని కొన్ని ఆవులు సుమిత్రుడిని చంపలేక పోయాయి. కొన్ని కపిలగోవులు మాత్రం " మేము సుమిత్రుడిని చంపుతాము. దానికి బదులుగా మీరు మాకు ఏమి ఇస్తారు " అని అడిగాయి. మిగిలిన ఆవులు కపిలగోవులతో " ఈ రోజు నుండి అన్ని రంగుల ఆవులలో ఎర్రని గోవులు శ్రేష్టమైనవిగా పరిగణించబడతాయి " అని వరం ఇచ్చాయి. వెంటనే ఆ ఆవులు మారురూపంలో తమ యజమాని సుమిత్రుడి వద్దకు వెళ్ళి " అయ్యా ! ఇప్పటి వరకు మీరు గోపూజ చేసారు. మేము ఎంతో సంతోషించాము. మీకు ఏమి వరం కావాలో కోరుకోండి " అని అడిగాయి. అందుకు సుమిత్రుడు " నాకు ఇప్పటి వలె ఎప్పటికి ఆవుల అందు భక్తి, శ్రద్ధ ఉండేలా అనుగ్రహించండి " అని కోరుకున్నాడు. ఆ ఆవులు " అలాగే అనుగ్రహిస్తాము మేము గోలోకము వెడుతున్నాము. మీరు కూడా మాతో రండి " అన్నాయి. సుమిత్రుడు " నేను నా గోవులను విడిచి ఎక్కడకు రాను " అన్నాడు. మారు వేషములో ఉన్న గోవులు అతడి శరీరమును తమ కొమ్ములతో ఎత్తి కింద పడవేసాయి. సుమిత్రుడు ప్రాణాలు వదిలాడు. అతడి శరీరం మాత్రం కింద పడింది. ఆత్మమాత్రం గోలోకం పోయింది. అక్కడ ఉన్న గోమాతలు సుమిత్రుడిని ఆదరించి మర్యాదలు చేసి అతడికి జరిగినది చెప్పి నీకు మేలే జరిగింది కాని నిన్నిలా దారుణంగా చంపిన ఎర్రని ఆవులకు మాత్రం ముఖం నల్లగా మాడి పోతుంది " అని శాపం పెట్టాయి.

## రంతిదేవుడు

ఆవులన్నీ రంతిదేవుడి వద్దకు వెళ్ళి " అయ్యా మీరు మమ్ము యజ్ఞములో బలి ఇచ్చి మాకు గోలోక ప్రాప్తి కలుగజేయండి " అని వేడుకున్నాయి. **రంతిదేవుడు** " అది ఎలాగ చేస్తాను అది పాపము కదా ! ఆ పని చేసి నేనెలా పాపము మూట కట్టుకుంటాను. నాకు ఉత్తమ గతులు ఎలా ప్రాప్తిస్తాయి " అని అన్నాడు. అయ్యా ఇది మా నిర్ణయం కాదు దేవతల నిర్ణయం మీరు ఆచరించాలి " అన్నాయి. రంతిదేవుడు " అయితే నాది ఒక నిబంధన మీలో ఏ ఒక్క గోవైనా మోహపరవశంతో బలికి అంగీకరించక పోయిన నేను యజ్ఞం ఆపి వేస్తాను " అని అన్నాడు. అందుకు గోవులు అంగీకరించాయి. రంతిదేవుడు " గోవులను వరుసగా బలి ఇచ్చి యజ్ఞంలో హోమం చేసాడు. ఇంతలో ఒక ఆవు తన దూడతో " అయ్యో ఈ కౄరాత్ములు నన్ను చంపడానికి వస్తున్నారు నేను చచ్చి పోతే నీ గతి ఏమిటి ? " అని ఏడ్చింది. వెంటనే రంతిదేవుడు ఆమాటలు విని యజ్ఞము ఆపించాడు. మిగిలిన ఆవులన్నీ బ్రతికి పోయాయి. అప్పటి వరకు బలి ఇచ్చిన గోవులు గోలోకము వెళ్ళాయి. రంతిదేవుడు స్వర్గానికి వెళ్ళాడు. ఇదీ గోవుల మహిమ " అనిచెప్పి " ఇంకా శుకుడికి గోమహిమ గురించి చెప్పిన మాటలు వివరిస్తాను విను. " కుమారా ! గోవులను మొదట బ్రహ్మ సృష్టించాడు. ఈ చరాచర జగత్తుకు మూలాధారము గోవు. దేవతలకు, సిద్ధులకు, సాధ్యులకు గోవు తల్లి వంటిది. బ్రహ్మపదమును కోరు వాడు గోవును మనసుతో కాని, కర్మలతో కాని, వాక్కుతో కాని బాధించకూడదు. ఇది బ్రహ్మ వాక్కు వేదము కూడా గోవులకు పవిత్రత ఆపాదించింది. ఏ గోవును పూజించి దేవతలు మానవుల కంటే గొప్ప వాళ్ళు అయ్యారో అటువంటి గోవుల కంటే పవిత్రమైనది ఈ లోకములో ఏముంది. యజ్ఞ యాగములలో గోవులకు ఉన్న పవిత్రత నీకు తెలిసిందే కదా ! ఉపనిషత్తులన్నీ గో స్వరూపాలే అనే బ్రహ్మదేవుడు చెప్పాడు. గోపూజ పవిత్రమైన యజ్ఞము వంటిది. మానవులు ఎక్కువగా **కపిలగోవు**లను పూజిస్తారు. వాటిని దానంగా ఇస్తారు. దానితో వారి పాపాలన్నీ తొలగి పోతాయి " అని వ్యాసుడు చెప్పాడు.

## కపిల గోవు మహిమ

**శుకుడు** తన తండ్రి అయిన వ్యాసుడితో " తండ్రి గారూ ! కపిలగోవులకు అంత మహత్యము ఎలా వచ్చింది " అని అడిగాడు. వ్యాసుడు " ఒకసారి దేవతల సంఘానికి కనపడకుండా తనను దాచమని అగ్నిదేవుడు గోవులను వేడుకున్నాడు. అలాగే అని గోవులు అగ్నిదేవుడిని దాచి పెట్టాయి. దేవతలు అగ్ని దేవుడిని వెతుకుతూ చివరకు ఆవుల వద్ద ఉన్నాడని తెలుసుకుని " గోవులారా ! అగ్నిదేవుడిని దాచడం లోకములకు మంచిది కాదు. కనుక అగ్నిదేవుడు ఎక్కడ ఉన్నాడో చెప్పండి " అని అడిగారు. ఆవులు వారిమాట మన్నించి అగ్నిదేవుడు దాగి ఉన్నచోటు చూపాయి. దేవతలు అగ్నిదేవుడితో గోవులకు ఏదైనా వరం ప్రసాదించమని అడిగారు. అగ్నదేవుడు తాను దాగి ఉన్న కారణంగా వాటికి ఎర్రరంగు వస్తుంది అని వరమిచ్చాడు. పైగా ఆవులలో ఎర్రటి ఆవులు శ్రేష్టమైనవని వాటిని పూజించిన వారికి ఉత్తమ లోకాలు ప్రాప్తిస్తాయని చెప్పాడు. కపిలగోవును దానం ఇచ్చిన వాడు పుచ్చుకున్న వాడు కూడా పుణ్యలోకాలకు పోతారని వరమిచ్చాడు.

## కపిల గోవు లక్షణములు

**శుకుడు** " తండ్రీ ! కపిలగోవు లక్షణము ఏమిటో వివరించండి " అని అడిగాడు. వ్యాసుడు " కుమారా ! సాధారణంగా కపిల గోవులకు చెవులు, ముక్కు, కళ్ళు, కొమ్ములు కపిల వర్ణంలో ఉంటాయి. అలాకాక ఏ ఒక్క చోట ఎర్రగా ఉన్నా చాలు. అది కపిల గోవు అని పిలువబడుతుంది. ఇక శరీరం అంతా ఎర్రగా ఉంటే ఇక దాని మహిమ చెప్ప వలసిన అవసరం లేదు. కపిల గోవు మీద బరువు వెయ్యరాదు. దానిని హింసించ రాదు. దానిని బలికి ఉపయోగించ రాదు. కపిలగోవును కాలితోకాని చేతితోకాని గోటితోకాని కర్రతోకాని కొట్టిన వాడు నరకానికి పోతాడు. కపిల గోవుకు వేళకు మేత నీరు పెట్టినవాడు సద్గతికి పొందుతాడు. గోవులతో పాటు, బ్రాహ్మణులు, గాయత్రీమాత, వసంతకాలము, సత్యము, బంగారము పుట్టాయని పెద్దలు చెప్తారు. దానము ఇవ్వ తగిన వస్తువులలో ఆవులు, బంగారము, భూమి శ్రేష్టమైనవి అని " వ్యాసుడు తన కుమారుడైన శుకుడికి వివరించాడు " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## గోమయము


గోవులను ఆశ్రయము కొరకు ప్రార్థించున్న లక్ష్మీదేవి

ధర్మరాజు " పితామహా ! గోమయములో లక్ష్మీదేవి ఉంటుందని చెప్తారు నిజమేనా ! " అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ సందర్భంలో గోవులకు లక్ష్మీదేవికి జరిగిన సంవాదం చెప్తాను. ఒక సారి లక్ష్మీదేవి గోవులమంద లోకి వెళ్ళింది. ఆవులన్నీ లక్ష్మి దేవిని చూసి " నీవు ఎవరు ? మాలోకి ఎందుకు వచ్చావు ? " అని అడిగాయి. లక్ష్మీదేవి " నేను మీలో ఉండడానికి వచ్చాను " అని చెప్పింది. గోవులు " నీవు చంచలమైన దానివి కనుక మాలో ఉండ తగవు " అన్నాయి. ఆ మాటలకు లక్ష్మీదేవి దుఃఖించి " గోవులారా ! నేను ఇదివరకు రాక్షసుల వద్ద ఉన్నాను. వారి దుష్ప్రవర్తనకు కోపించి దేవతల వద్దకు వెళ్ళాను. కనుక రాక్షసులు చెడిపోయారు. దేవతలు బాగుపడ్డారు. నేను తమవద్ద సదా ఉండాలని మానవులు నాకు పూజలు చేస్తుంటారు. మీరేమో నేను మీ వద్దకు వస్తానంటే వద్దంటున్నారు " అని పలికింది. గోవులు " ఎన్ని చెప్పినా నీవు చంచలమైన దానివి. నిలకడ లేని నిన్ను మాలో చేర్చుకోలేము. నీ ఇష్టం వచ్చిన చోటుకు వెళ్ళు " అన్నాయి. లక్ష్మీదేవి " నన్ను మీరిలా అవమానిస్తే నేను ఎక్కడకు పోను. నన్ను ఎవరు రానిస్తారు. అందుకని నేను మీ వద్ద ఉంటాను " అన్నది. గోవులు " లక్ష్మీదేవి ! మా మూత్రము, గోమయము, పవిత్రములు అని వేదములు చెబుతున్నాయి. నీవు వాటిలో నివసించు " అని అన్నాయి. అప్పటి నుండి ఆవు పంచితము, ఆవుపేడ లక్ష్మీదేవికి స్థానములు అయ్యాయి.

## కామధేనువు

ఒకరోజు కామధేనువు తపస్సు చేయగా బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై " నీకు ఏమి వరం కావాలో కోరుకో " అని అడిగాడు. కామధేనువు " బ్రహ్మదేవా ! నేను కోరిన వెంటనే నా వద్దకు వచ్చారు. అంత కంటే నాకు కావలసినది ఏమున్నది " అన్నది

కామధేనువు. ఆ మాటలకు బ్రహ్మదేవుడు సంతోషించి " నీ లోకమైన గోలోకము అన్ని లోకముల కంటే పైగా ఉండేలా వరం ఇస్తున్నాను. గోలోకము సత్యలోకం కంటే పైన ఉంటుంది " అని పలికాడు. ధర్మనందనా ! గోవులమహిమ అలాంటిది " అని భీష్ముడు చెప్పాడు.

## సువర్ణము

ధర్మరాజు " పితామహా ! గోవుల మహత్యము గురించి చెప్పారు. కాని సర్వయజ్ఞములలోదానం ఇవ్వతగినది సువర్ణము అని విన్నాను. వేదములలో కూడా సువర్ణదక్షిణేతిపై అని చెప్పారు కదా ! అని చెప్పారు కదా ! దానము ఇవ్వ తగిన వస్తువులలో భూమి, సువర్ణము, గోవులు శ్రేష్టమైనవి అని తమరు అన్నారు కదా ! మరి సువర్ణము యొక్క విశేషములు చెప్పండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! మా తండ్రి చనిపోయిన తరువాత నేను మా తండ్రికి శ్రాద్ధవిధులు చేయడానికి గంగా తీరముకు వెళ్ళాను. నేను నా తల్లి గంగాదేవి సాయంతో శ్రాద్ధవిధులను యధావిధిగా నిర్వర్తించాను. పిండప్రదాన సమయం వచ్చింది. పిండములు పెట్టడానికి ధర్భలు నేలమీద ఉంచాను. వాటిమీద నేను పిండం ఉంచేసమయాన ఉంగరములు కంకణములు కల ఒకచేయి. ఆ పిండముకొరకు చేయిచాచింది. ఆ చేతిని నా తండ్రి శంతనుడిదిగా గుర్తించాను. ఆహా సాక్షాత్తు నా తండ్రి నేను పెట్టే పిండము కొరకు తన చేతినిచాచాడు. ఏమి నా అదృష్టము అని మురుసిపోయాను. కాని నా తండ్రి చేతిలో పిండము పెడితే శాస్త్రం అంగీకరించదు. పిండము దర్భల మీద పెట్టాలి కాని నేరుగా చేతిలో పెట్టడం శాస్త్రవిరుద్ధం. అందుకని నేను పిండం చేతిలోపెట్టక దర్భలమీద పెట్టాను. అంతలో నా తండ్రి చేయి మాయమై నా పితృ, పితామహ, ప్రపితామహులు సాక్షాత్కరించి " రాజా ! నీ తండ్రి అడిగాడు కదా అని చేతిలోపెట్టక పిండం దర్భల మీద పెట్టి ధర్మం నిలబెట్టావు. నీ పిండ ప్రధానంతో మేము చాలా తృప్తి చెందాము. అదీకాక నీవు భూమికి బదులుగా గోవులకు బదులుగా సువర్ణ దానంచేయడం మాకు హితం చేకూర్చినది. ఎందుకంటే సువర్ణము పావనమైనది. సువర్ణము ఇచ్చిన వాడిని పుచ్చుకున్న వాడిని పవిత్రులను చేస్తుంది. కనుక ఇక మీద నువ్వు యజ్ఞములలో గోదానము, భూదానముకు బదులు సువర్ణదానము చెయ్యి " అని పలికి నా పితరులు అంతర్ధానం అయ్యారు. ధర్మనందనా ! ఇది నేను స్వయంగా చూసిన విషయం నీకు చెప్పాను

## పరశురాముడు సువర్ణ దానం

ధర్మనందనా ! ఇరవై ఒక్కమారు దండెత్తి క్షత్రియులను చంపిన అందుకు పరశురాముడు ప్రాయశ్చితము చేయగోరి వాజపేయజ్ఞము చేసాడు. కానీ పరశురామునికి యజ్ఞము చేయడంతో తీరికచిక్కక వశిష్టుడు మొదలైన మునుల వద్దకు పోయి తాను చేసిన పాపములు పోవడానికి తగినమార్గము చూపమని అడిగాడు. అందుకు వశిష్టుడు " రామా ! సువర్ణము అగ్నితో సమానము. దేవతలుకూడా అగ్నితో సమానము. కనుక సువర్ణదానము చేసిన దేవతలను దానముచేసిన ఫలము వస్తుంది అని వేదములు చెప్తున్నాయి. కనుక నీవు కూడా సువర్ణదానం చేసి నీ పాపములు పటాపంచలు చేసుకో " అన్నాడు.

## అగ్నిదేవుడు జంతువుల శాపాలు

సువర్ణం గురించి బ్రహ్మదేవుడు చెప్పినది చెప్తాను. పార్వతి పరమేశ్వరులు ఒకరిని గురించి ఒకరు తపస్సు చేసి తుదకు వివాహం చేసుకున్నారు. వారి దాంపత్య ఫలితంగా శివుడి తేజస్సు అగ్ని లో నిక్షిప్తం అయింది. ఆ సమయంలో తారకాసురుడు మునులను దేవతలను బాధించసాగాడు. వారు బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి మొర పెట్టుకొనగా బ్రహ్మదేవుడు " దీనికి నేను తగిన ఏర్పాటు చేసాను. మీరు వెళ్ళి అగ్ని దేవుడిని వేడుకోండి " అని చెప్పాడు. దేవతలు మునులు అగ్నిదేవుడి వద్దకు వెళ్ళారు. కాని వారికి అక్కడ అగ్నిదేవుడు కనిపించ లేదు. ఒక కప్ప కనిపించి అగ్నిదేవుడు పాతాళంలో ఉన్నాడని చెప్పింది. తన ఉనికి చెప్పిన కప్ప మీద అగ్నిదేవుడు కోపించి " కప్పల నోటికి రుచి తెలియకుండు కాక " అని శాపం ఇచ్చాడు. కాని దేవతలు తమకు సాయం చేసినందుకు బదులుగా కప్పలకు " ఎండా కాలంలో నీరు దొరకక కప్పలు చనిపోయినా వానా కాలంలో తిరిగి జీవం పోసుకుని బెక బెక మంటూ అరుస్తాయి " అని వరం ఇచ్చారు. ఇంతలో అగ్నిదేవుడు కనిపించ కుండా పోయాడు. తిరిగి దేవతలు అగ్నిదేవుడిని వెతుకుతూ వెళ్ళారు. ఒక ఏనుగు తన తొడముతో సైగ చేస్తూ అగ్నిదేవుడు ఉన్నాడని ఒక రావిచెట్టును చూపింది. అగ్ని దేవుడు కోపించి " ఇప్పటి నుండి ఏనుగులకు నాలుక తిరుగబడుతుంది " అని శాపం ఇచ్చి దేవతలకు కనిపింకుండా వెళ్ళి జమ్మిచెట్టులో ప్రవేశించాడు. దేవతలు ఏనుగు చేసిన సాయానికి బదులుగా " నాలుక తిగబడినా మీకు అన్ని రుచులు చక్కగా తెలుస్తాయి " అని వరం ఇచ్చారు. ఇంతలో ఒక చిలుక అగ్నిదేవుడు జమ్మి చెట్టులో ఉన్నాడని దేవతలకు మునులకు చెప్పింది. దేవతలు మునులు అంతా జమ్మి చెట్టును చుట్టు ముట్టారు. అగ్ని దేవుడు చిలుక మీద కోపించి " నన్ను గురించి చెప్పినందుకు మీకు కూడా నాలుక తిరుగబడుతుంది

" అని శపించాడు. దేవతలు మునులు తమకు చేసిన సాయానికి బదులుగా చిలుకకు " నాలుక మడతపడినా చిలుకలకు చక్కని పలుకులు అలవడతాయి " అని వరం ఇచ్చారు.

## కుమారస్వామి జననము

ఇక తప్పించుకోలేని అగ్నిదేవుడు దేవతలను మునులను చూసి వారు వచ్చిన పని ఏమిటి అని అడిగాడు. వారు వారికి తారకాసురుడి వలన కలిగిన బాధలు గురించి చెప్పి తారకాసురుడు చనిపోయే మార్గం చెప్పమని చెప్పి " అగ్నిదేవా ! నీవు మా క్షేమం కోరితే మేము నీ మహిమను లోకం అంతా చాటుతాము " అన్నారు. అగ్నిదేవుడు అంగీకరించి తన లోని శివుడి రేతస్సును గంగానదిలో వదిలాడు. అప్పుడు గంగాదేవి గర్భంధరించి ఆ గర్భమును భరించలేక పక్కనే ఉన్న రెల్లుపొదలలో ఆ గర్భాన్ని నిక్షిప్తం చేసింది. అప్పుడు ఆ రెల్లుపొదలలో ఒక బాలుడు జన్మించాడు. ఆరుగురు కృత్తికలు ఆ బాలుడిని పెంచారు. ఆ బిడ్డ నాది అంటే నాది అని అందరూ ఎత్తుకోసాగారు. ఆ బిడ్డ ఆరు ముఖాలతో ఆరుగురు కృత్తికల నుండి పాలుత్రాగాడు. అలా ఆ బాలుడు అగ్నిపుత్రుడు, గంగాదేవి పుత్రుడు, కార్తికేయుడు అనే పేర్లతో ఖ్యాతిపొందాడు. ఆ తరువాత అతడు **దేవసేన**కు అధిపతి అయి తారకాసురుడిని సంహరించి దేవతలకు మునులకు ఆనందం కలిగించాడు. మహాశివుడు హిరణ్మయుడు. హిరణ్మయమైన శివుడి రేతస్సును గ్రహించి భద్రపరచిన అగ్నిదేవుడు కూడా సువర్ణకాంతులతో ప్రకాశించాడు. బంగారము ఏర్పడిన విధానం ఇదే. అందువలన బంగారముకు జాతరూపము అని పేరు వచ్చింది. బంగారం అంతమహిమ కలది. సువర్ణదానం అందుకే అంత ప్రశస్థం పొందింది " అని వశిష్టుడు పరశురాముడికి చెప్పాడు. ఆ మాటలు విన్న పరశు రాముడు సువర్ణ దానాలు చేసాడు. కనుక ధర్మనందనా ! నీవు కూడా మిక్కుటంగా సువర్ణదానం చేసి కీర్తి పొందు " అని భీష్ముడు ధర్మరాజుకు సువర్ణదాన మహిమ గురించి చెప్పాడు.

## పితృయజ్ఞము

ధర్మరాజు " పితామహా ! పితృయజ్ఞము గురించి నాకు వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! దేవతారాధన కంటే పితృదేవతలను ఆరాధించడం ఎంతో గొప్పది. మనుష్యులకు తమ పితృదేవతలను ఆరాధించడం సర్వశుభములు చేకూరుస్తుంది. ప్రతి అమావాస్య నాడు పితృయజ్ఞము, పిండప్రదానం భక్తిశ్రద్ధలతో చేసిన వాడు నిత్యము పితృదేవతలను ఆరాధించిన ఫలము పొందుతాడు. పితృయజ్ఞము చేయాలో వివరిస్తాను. పాడ్యమి నాడు పితృదేవతలను పూజించిన వాడు అందమైన భార్యను పొందుతాడు. విదియనాడు పితృదేవతలను పూజించిన వాడికి అందమైన కుమార్తెలు జన్మిస్తారు. తదియ, చవితి తిధుల నాడు పితృదేవతల పూజించిన వాడు ధనికుడు ఔతాడు. పంచమినాడు పితృదేవతలను పూజించిన వాడు పుత్రవంతుడు ఔతాడు. షష్ఠి నాడు పితృదేవతల పూజించిన వాడు విద్యావంతుడు ఔతాడు. సప్తమినాడు పితృదేవతల పూజించిన వాడు వ్యవసాయ భూములకు అధిపతి ఔతాడు. అష్టమినాడు పితృదేవతల పూజించిన వాడు వ్యాపారవేత్త ఔతాడు. నవమినాడు పితృదేవతల పూజించినవాడు ఆవుల మందలను పొందుతాడు. దశమినాడు పితృదేవతల పూజించినవాడు లోహసంపదలు పొందుతాడు. ఏకాదశి నాడు పితృదేవతల పూజించినవాడు మంచి కుమారులను పొందుతాడు. ద్వాదశి, త్రయోదశినాడు పూజించినవాడు ధనధాన్యములను పొందుతాడు. చతుర్ధశినాడు పితృదేవతల పూజించినవాడు వీరస్వర్గం పొందుతాడు. పౌర్ణమి అమావాస్యలనాడు పితృదేవతల పూజించినవాడు సకలకోరికలను పొందగలడు.

### పితృకార్య విధులు

ధర్మనందనా ! శ్రాద్ధకర్మ చేయుటకు కృష్ణపక్ష తిధులు, అపహార్ణము మంచివి. కాని పాడ్యమి, దశమి, చతుర్ధశి పితృ కార్యముకు పనికి రావు. పితృ కార్యములో తిలలు, పాయసము, నెయ్యి ఉత్తమము. ఆవుల పాలు, పెరుగు, వెన్న, నెయ్యి శ్రేష్టము. మత్స్యములు, మాంసము తగినంతగా ఉపయోగించిన ఫలితము లభిస్తుంది. పితృదేవతల అర్చనలో గొర్రె మాంసం, ఖడ్గ మృగ మాంసం, గండ మృగ మాంసం, మేక మాంసం, ఒక దాని కంటే ఒకటి మేలైనవి.

## నక్షత్రాలు పితృకార్య విధులు

కృత్తిక నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **శత్రుభయం** ఉండదు. రోహిణి నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **పుత్రసంతానప్రాప్తి** కలుగుతుంది. మృగశిర నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **ఓజస్సు** ప్రాప్తిస్తుంది. ఆరుద్ర నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **క్రూరుడౌతాడు**. పునర్వసు నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన తన **కృషిఫలిస్తుంది**. పుష్యమి

నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన మంచి **పుష్టిగా ఉంటారు**. ఆశ్లేష నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **వీరకుమారులు** జన్మిస్తారు. మఖ నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **కులము వర్ధిల్లుతుంది**. పూర్వ ఫల్గుణి నక్షత్రము పితృకార్యం నిర్వహించిన **సౌభాగ్యవంతులు ఔతారు**. ఉత్తర ఫల్గుణి నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **సంతానవంతులు** ఔతారు. హస్త నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **కార్యసఫలత** సిద్ధిస్తుంది. చిత్త నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన '**అందమైన సంతానం** కలుగుతుంది. స్వాతి నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **వర్తక వాణిజ్యములు వృద్ధి** చెందుతాయి. విశాఖ నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **సంతాన ప్రాప్తి** కలుగుతుంది. అనూరాధ నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **రాజ్యాధికారం** దక్కుతుంది. జ్యేష్ట నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **రాజపూజితులు** ఔతారు. మూల నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **అరోగ్యం** ప్రాప్తిస్తుంది. పూర్వాషాఢ నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **ఆరోగ్యం** ప్రాప్తిస్తుంది. ఉత్తరాషాఢ నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **సకలశోకాలు** తొలగి పోతాయి. శ్రవణ నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **ఉత్తమగతులు** ప్రాప్తిస్తాయి. ధనిష్ఠ నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **రాజ్యాధికారం** ప్రాప్తిస్తుంది. శతభిష నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **కార్య సాఫల్యత** సిద్ధిస్తుంది. పూర్వాభాద్ర నక్షత్రము, ఉత్తరాభాద్ర నక్షత్రములలో పితృకార్యం నిర్వహించిన **గోసంపద** పెరుగుతుంది. రేవతి నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **లోహవృద్ధి** కలుగుతుంది. అశ్విని నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **అశ్వసంపద**వృద్ధి చెందుతుంది. భరణి నక్షత్రములో పితృకార్యం నిర్వహించిన **ఆయుః ప్రమాణం** వృద్ధి చెందుతుంది " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## పితృకర్మ బ్రాహ్మణుల యోగ్యత అయోగ్యత

ధర్మరాజు" పితామహా ! పితృ కార్యములలో పూజించుటకు ఎటువంటి యోగ్యతలు కలిగిన వారు కావలెను " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! దేవతాసంబంధ కార్యములకు మంచి బ్రహ్మణులు దొరికితే చాలు. మరీ పరీక్షలు అవసరం లేదు. కాని శ్రాద్ధకర్మలకు మాత్రం అర్హులైన బ్రాహ్మణులను మాత్రమే నియమించాలి. శ్రాద్ధకర్మలకు నియోగించబడే బ్రాహ్మణులు ఎటువంటి దుర్గుణములు లేని వారై ఉండాలి. సకల విద్యలను ఎరిగిన వాడై ఉండాలి. పది మంది సరసన భోజనంచేయకలిగిన అర్హత కలిగిన వాడై ఉండాలి. జూదరులు, ఇతరులకు విషప్రాయులు, వేదాధ్యయనము చేయనివాడు, ధనము వడ్డీకి ఇచ్చు వాడు, పాటలు పాడి జీవించువాడు, గ్రామాధికారిగా పనిచేస్తూ జీవించువాడు, కుష్ఠురోగి, వ్యాపారి, మద్యము విక్రయించే వాడు, ఖండాంతరాలలో వ్యాపారం చేయువాడు, రాజుగారి దగ్గర పనిచేసేవాడు. కూర్చుని భోజనం చేయడానికి అనర్హులు కనుక వీరు పితృకార్యములలో భోజనం చేయడానికి అనర్హులు. భోజనం చేసే సమయంలో తలపాగా ధరించకూడదు. చెప్పులు వేసుకుని భుజించకూడదు. పితృకార్యములకు తయారు చేసిన వంటకములు నువ్వులు నీళ్ళు చల్లి శుద్ధిచేసిన ఎలాంటి దోషం ఉన్నాపోతుంది. శాంతచిత్తులు, మంచి గుణము శీలము కలవారు, ఇంద్రియ నిగ్రహం కలవారు, అధ్యాపకుడు, దయకల వాడు, జ్ఞాని అయిన వాడు, వ్యాకరణశాస్త్రము, ధర్మశాస్త్రం, పురాణములు, బ్రహ్మజ్ఞానములో నిష్ణాతులు అయిన వారు పంక్తి భోజనముకు అర్హులు. శ్రాద్ధకర్మలకు బ్రాహ్మణుడిని నియోగించే ముందు అతడి యోగ్యత పరీక్షించాలి. ఒకసారి నియోగించిన తరువాత అతడు అయోగ్యుడు అని తేలితే యజమాని పడేబాధ అంతాఇంతా కాదు. పై పద్ధుతులన్నీ సక్రమంగా పాటిస్తూ శ్రాద్ధకర్మ నిర్వర్తించే వారికి ఉత్తమ గతులు ప్రాప్తిస్తాయి.

## అత్రి మహాముని

బ్రహ్మమానస పుత్రుడైన **అత్రిమహాముని** కుమారుడు దత్తాత్రేయుడు. దత్తాత్రేయుడి కుమారుడు **నిమి**. నిమి కుమారుడు **శ్రీమంతుడు**. శ్రీమంతుడు మరణించిన తరువాత అతడికి నిమి శార్ధ కర్మలు నిర్వర్తిస్తూ తన తాత అయిన అత్రిమహామునిని తలచుకున్నాడు. అప్పుడు అత్రిమహాముని అక్కడకు వచ్చి శ్రాద్ధకర్మలు పర్యవేక్షించ సాగాడు. అప్పుడు శ్రాద్ధకర్మల గురించి తన మనుమడైన నిమికి చెప్తూ " శ్రాద్ధములో బ్రాహ్మణులుగా కూర్చొను వారు పంక్తిభోజనముకు అర్హులై ఉండాలి. బ్రాహ్మణులకు వేసిన దర్భాసనాలు కుడి వైపుకు తిరిగి ఉండాలి. శ్రాద్ధములో తిలలు సమృద్ధిగా ఉండాలి. మంచిదర్భలు సేకరించాలి. దర్భలు పెట్టే సమయంలో వాటి కొనలు దక్షిణం వైపు ఉంచాలి. శ్రాద్ధముకు చేయు వంటకములలో **మునగ ఆకు, ఉల్లిపాయ, చెడి పోయిన మాంసము, మలినమైన ఉప్పు, నల్ల జిలకర, కరివేపాకు, ఇంగువ** వాడరాదు. పూరి పంటధాన్యము, నేరేడు పండు కూడా శ్రాద్ధముకు పనికి రాదు. శ్రాద్ధముచేసే ప్రదేశములలో **కుక్కలు, రజస్వల అయిన స్త్రీలు, వ్యభిచారము చేయు వారు, కడజాతి** వారు తిరుగ కూడదు. శ్రాద్ధము జరిగేసమయంలో **తుమ్మడం, ఏడవడం** చేయకూడదు. శ్రాద్ధకర్మలు ప్రశాంతంగా చేయాలి. శ్రాద్ధకర్మలు ఇలా విధిగా నియమనిష్టలు పాటించాలి.

### పితృదేవతలు

అత్రిమహాముని నిమితో " బ్రహ్మదేవుడు శ్రాద్ధ కర్మలలో **ఆర్యముడికి, సోముడికి, అగ్ని**కి భాగములు ఏర్పరిచాడు. శ్రాద్ధకర్మలలో పితృదేవతలతో పాటు విశ్వదేవతలను అర్చించి వారికి భాగం ఇవ్వాలి. దేవతలలో పూషముల్లైన వారు 60 మందికి సమాన భాగములు ఏర్పరిచారు. కొండలలో, అడవులలో ప్రయాణం చేసే సమయంలో, నదులు దాటే సమయంలో శ్రాద్ధంపెట్టవలసి వస్తే ఈ అరవై మంది దేవతలను తలచిన వారికి శుభం చేకూరుతుంది.

## మునులు శ్రాద్ధ కర్మ

కుమారా ! ఒక సారి కొంత మంది మునులు శ్రాద్ధకర్మలు నిర్వర్తిస్తున్నారు. అందరూ ఒకేసారి శ్రాద్ధకర్మలు నిర్వహించడం వలన ఆ రదార్థాలను పితృదేవతలు మిక్కుటంగా ఆరగించడం వలన అజీర్తిచేసింది. వారు చంద్రుడి వద్దకు వెళ్ళి తమకు అజీర్తి చేసిందని చెప్పారు. చంద్రుడు వారిని అగ్నిదేవుడి వద్దకు వెళ్ళమని చెప్పాడు. పితృదేవతలు అందరూ బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి తమకు అజీర్తి చేసినవిషయం చెప్పారు. బ్రహ్మదేవుడు వారికి పక్కనే ఉన్న అగ్ని దేవుడిని చూపి మీకు వచ్చిన అజీర్తిని అగ్నదేవుడు హరిస్తాడు అని చెప్పాడు. అగ్నిదేవుడు పితృదేవతలతో " ఇప్పటి నుండి మీరు మీ ఆహారము తీసుకునే సమయంలో నా ద్వారా తీసుకోండి. అప్పుడు మీరు తీసుకున్న ఆహారపదార్ధములు బాగా జీర్ణం ఔతాయి " అని చెప్పాడు. అప్పటి నుండి పితృదేవతలు తమ పితృభాగాలను అగ్ని ముఖంగా తీసుకోసాగారు. కనుక శ్రాద్ధకాలంలో అగ్నిని అర్చించాలి. అందు వలన పితృదేవతలు సంతృప్తి చెందడమే కాక అగ్నిదేవుడి భయానికి రాక్షసులు ఆచాయలకు కూడా రారు. కనుక శ్రాద్ధకర్మలలో అగ్నిని అర్చించాలి. అందు వలన పితృదేవతలు కూడా తృపి చెందుతారు. పితృ, పితామహ, ప్రపితామహులను శిష్టమైన ఆచారముతో భక్తితో శ్రద్ధతో అర్చించాలి. ఆ సమయంలో యజ్ఞోపవీతమును అపసవ్యముగా మార్చుకోవాలి. చనిపోయిన పితరులకు పిండప్రధానంతో వారి ప్రేతభావన తొలగిపోయి ఉత్తమగతులు కలుగుతాయి. చనిపోయిన వారికి వారి కొడుకులలో ఒక్కరైనా గయలో పిండప్రదానం చేస్తారని ఆశతో ఎక్కుమంది పుత్రులు కావాలని కోరుకుంటారు. పితరులకు, కన్యాదానము, నల్లటి ఆంబోతును వదలడం ఎక్కువ ప్రీతి పాత్రము " అని అత్రిమహాముని నిమికి చెప్పినట్లు శ్రాద్ధవిధిని భీష్ముడు ధర్మరాజుకు వివరించాడు.

## ఉపవాస వ్రతము

ధర్మరాజు " పితామహా ! ఉపవాసవ్రతమును తపస్సు అని అంటారు కదా ! దాని గురించి నాకు వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మరాజా ! ఆహారము తీసుకోకుండా ఉపవాసము ఉండడం తపస్సు అనిపించుకోదు. అలా ఆహారం తీసుకోకుండా ఉండడం ఆత్మను హింసించడం ఔతుంది. అసలు తపస్సు అంటే నిష్టతో చేసేది. అవి సత్యము పలడం, బ్రహ్మచర్యం, నిత్యము శుచిగా ఉండడం, మౌనంగా ఉండడం, నియమ నిబద్ధంగా జీవితం గడపడం, ఇతరుల మీద దయ కలిగి ఉండడం, ఎదుటి వారి మనసును కాని శరీరం కాని నొప్పించక పోవడం, తనకు ఉన్నదానిలో దానం చెయ్యడం వీటిని తపస్సు అంటారు " అని చెప్పాడు.

## దానపరుడు

ధర్మరాజు " పితామహా ! ఉన్నదాంట్లో ఇతరులకు దానం చేసే వాడు. ఎవరి వద్ద ఉచితంగా ఏమీ తీసుకొననివాడు వీరి గుణములు ఎలాంటివి ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ సందర్భంలో నీకు సప్తఋషులకు వృషాదర్భి అనే వానికి జరిగిన సంవాదం వివరిస్తాను. **శ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, గౌతముడు, భరద్వాజుడు, జమదగ్ని, వశిష్టుడు** సప్తఋషులు. వశిష్టుడు భార్య **అరుంధతి**. ఆమె ఎప్పుడూ భర్తను వెన్నంటి ఉంటుంది. వారందరికి **గండ**అనే వనిత పరిచర్యలు చేస్తూ ఉంటుంది. ఆమె భర్త పేరు పశు సఖుడు. అతడు కూడా వారికి పరిచర్యలు చేస్తూ ఉండే వాడు. ఆ పది మంది తపసు చేయడంలో ఎంతో ఆసక్తి కనబరుస్తూ ఉండేవారు.

## అనావృష్టి సప్తఋషులు

అలా ఉండగా ఒకసారి భయంకరమైన అనావృష్టి ఏర్పడింది. తినడానికి తిండి కూడా దొరకని పరిస్థితి ఎదురైంది. జనములకు ప్రాణాలు రక్షించుకోవడం దుర్లభం అయింది. ఆ సమయంలో **కశ్యపుడు** మొదలైన ఋషులు ఆహారం కొరకు వెతుకుతున్నారు. **శిబిచక్రవర్తి** కొడుకు యాజ్యుడు రాజయ్యాడు. అతడు తనకుమారుడు **నీలుడు** అనే వాడిని యజ్ఞదక్షిణగా ఋత్విక్కులకు ఇచ్చాడు. ఆ **నీలుడు** కాలంతీరి చనిపోయాడు, వారి పరిచారకులు మొత్తం పదిమంది తమ ఆకలి తీర్చుకోవడానికి ఆ శవం చుట్టూచేరారు. ఆ సమయంలో **వృషాదర్భి** అనే మహారాజు వేటకువెళ్ళి తిరిగి వస్తున్నాడు. ఆ రాజు

విరివిగా దానధర్మాలు చేసే వాడు. శవాన్ని తినడానికి సన్నద్ధమౌతున్న మునులను చూసి ఆగి " అయ్యా ! మీరందరూ ఆకలితో ఉన్నారు. అందుకే శవాన్ని తినడానికి సిద్ధపడ్డారు. నా వెంట రండి మీకు కావలసిన ఆహారము సమకూరుస్తాను. అంతే కాదు మీకు ధనము, ధాన్యము, బండ్లు, గోవులు, గ్రామములు బహుమతిగా ఇస్తాను " అని అన్నాడు. అది విని సప్తఋషులు " మహారాజా ! మేము ఎవరి వద్దా ఏదీ పుచ్చుకొనము. రాజుల వద్ద చేయిచాచి తీసుకున్నది మాకు విషతుల్యము. మీకు మా గురించి తెలియదు కనుక ఇలా మాట్లాడుతున్నావు " అని అన్నారు.

## వృషాదర్భి కృత్తి

మునుల మాటకు రాజు మనసులో బాధ పడుతూ రాజధానికి వెళ్ళాడు. రాజు కొన్ని కృత్రిమ ఫలాలను తయారు చేయించి వాటిలో బంగారం పెట్టి వాటిని తన మంత్రులకు ఇచ్చి మునులకు ఇమ్మని పంపాడు. మంత్రులు వాటిని తీసుకుని మునుల వద్దకు వెళ్ళి వాటిని మునులకు ఇచ్చారు. వారు వాటిని తీసుకుని అవి బరువుగా ఉండడం గమనించి వాటిని సున్నితంగా తిరస్కరించారు. మంత్రులు తిరిగి వెళ్ళి ఆ విషయం రాజుతో చెప్పారు. అదివిన్న **వృషాదర్భి**కి కోపం వచ్చింది. వెంటనే ఆయన ఒక యజ్ఞము చేసి యజ్ఞము నుండి **కృత్తి** అనే రాక్షసిని ఆవాహన చేసాడు. హోమంలో నుండి కృత్తి అనే రాక్షసి పుట్టి ఆయన ఎదుట నిలబడి " రాజా ! నాతో వచ్చిన పని ఏమిటి " అని అడిగింది. వృషాదర్భి " నీవు వెళ్ళి కశ్యపుడు మొదలైన ఋషులను ముక్కలు ముక్కలుగా నరికివెయ్యి " అని ఆజ్ఞాపించాడు. కృత్తి వెంటనే సప్తఋషుల వద్దకు వెళ్ళింది. ఆ సమయంలో మునులు అడవిలోఫలాల కొరకు, కాయల కొరకు అన్వేషిస్తున్నారు. ఆ సమయంలో శునస్సకుడు అనే సన్యాసి వారి వద్దకు వచ్చి నమస్కరించాడు. అతడు కూడా వారితో కలిసి ఆహారం కొరకు అన్వేషించ సాగాడు. వారికి ఏమీ దొక లేదు చివరకు తామర తూండ్లు అయినా తినాలనుకుని కొలను వద్దకు వెళ్ళారు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన కృత్తి వారికి అడ్డంగా నిలబడింది. మునులు ఆమెతో " నీవు ఎవరు ? నీకు ఇక్కడ ఏమి పని ? అడ్డు తొలగు అన్నారు " అని వారు కొలనులో దిగ బోయారు. కృత్తి " నేను ఎవరిని అయితే ఏమి ఈ కొలనుకు కావలి ఉన్నాను. మీరు దీనిలో దిగడానికి వీలు లేదు " అని పలికింది. మునులు " మాకు ఆకలిగా ఉంది తినడానికి ఏమీ దొక లేదు. ఈ కొలనులో దిగి ఇక్కడ ఉన్న తామరతూడ్లు తిని ఆకలితీర్చుకోవాలని అనుకున్నాము " అన్నారు. కృత్తి అలా అయితే మీరు మీ పేర్లు చెప్పి కొల్సనులో దిగండి " అన్నది. సప్త ఋషులకు విషయం అర్ధం అయింది. అది ఒక రాక్షసి అని అది తమను సంహరించడానికి వచ్చిందని తెలుసుకున్నారు. అడిగింది కనుక తమ పేర్లను నిర్వచనంతో సహా ఎవరికి అర్ధం కాకుండా చెప్పారు. వారు చెప్పిన పేర్లను అర్ధం చేసుకో లేక కృత్తి దిక్కులు చూస్తుంది. ఇంతలో శునస్సఖుడు తన పేరు చక్కగా అర్ధం అయ్యేలా చెప్పినా కృత్తికి అది అర్ధం కాలేదు. కృత్తి శునస్సఖుడిని " నీ పేరు అర్ధం లేకుండా చెప్పావు. సరిగా చెప్పు " అని గద్దించింది. శునస్సఖుడు " నా పేరు సరిగా చెప్పినా అర్ధం చేసుకోలేక పోయావు ఈ తప్పు నీది కదా ! నీకు ఎలా చెప్పినా అర్ధం కాదు. ఇదిగో ఈ మంత్రదండం నీకు తగిన బుద్ధిచెప్తుంది " అని తన మంత్రదండముతో కృత్తి తలమీద కొట్టాడు. ఆ దెబ్బకు కృత్తి నేలమీద పడి భస్మం అయ్యింది.

### మునుల శపథం

తరువాత మునులు కొలనులో దిగి తామరతూడ్లను తీసుకుని వాటిని నీటిలో శుభ్రం చేసి కొలను పక్కన పెట్టారు. సంధ్యావందనం చేసుకోవడానికి కొలనులో దిగి సంధ్యావందనంచేసి కొలను బయటకు వచ్చిచూసే సరికి తామరతూండ్లు కనిపించ లేదు. వారికి అనుమానం వచ్చి శునశ్శఖుడిని మధ్యవర్తిగా పెట్టుకుని ఈ విధంగా శపథం చేయసాగారు. ముందుగా **అత్రిమహర్షి** లేచి " నేను కనుక తామర తూండ్లు దొంగిలించి ఉంటే ఆవును తన్నడం వలన, సూర్యుడికి అభిమఖంగా మలమూత్ర విసర్జన చేయడం వలన, వేదములు చదువకూడని రోజులలో వేదాధ్యయనం చేయడం వలన కలుగు పాపములు నాకు కలుగు కాక " అని శపథం చేసాడు. తరువాత వశిష్ఠుడు లేచి " ఈ తామరతూడ్లు దొంగిలించిన వాడు వేదాధ్యయనం మానిన పాపం, సన్యాసిగా ఉండి కామకలాపం చేసిన పాపం, కుక్కను వెంట పెట్టుకుని తిరిగిన పాపముల పోతాడు " అని పలికాడు. తరువాత కశ్యపుడు లేచి " అవసరం లేకున్నా మాంసంతినడం, న్యాయసభలో ఒకరి పక్షం వహించడం, దుష్టులకు దానం చెయ్యడం, కట్టుకున్న భార్యతో పట్టపగలు చేరడం, విద్యా వంతులైన బ్రాహ్మణులను లోభబుద్ధితో ఏడిపించడం, సరకు అంతా ఒకేసారి కొని తరువాత లాభముకు అమ్మడం వంటి పాపములు ఈ తామరతూండ్లు దొంగిలించిన వాడికి కలుగు కాక " అని పలికాడు. తరువాత **భరద్వాజుడు** లేచి " ఈ తామరతూండ్లు దొంగిలించడం ఎట్టిదనిన జ్ఞాతులపట్ల, గోవులపట్ల, స్త్రీలపట్ల ధర్మం విడిచి ప్రవర్తించిన దానితో సమానం. యజ్ఞకుండంలో వేయవలసిన హవిస్సును కంపలలో మండుతున్న అగ్నిలో వేయడం, గురువును కించపరుస్తూ విద్యను అభ్యసించడం " అని పలికాడు. తరువాత జమదగ్ని లేచి " ఈ తామరతూండ్లు దొంగతనం ఎలా జరిగిందంటే రజస్వల అయిన భార్యతో చేరడం, తాగే నీటిలో మలమూత్రములు విసర్జించడం, ఎప్పుడూ పగప్రతీకారంతో రగిలి పోవడం, భార్యసంపాదన మీద జీవించడం ఈ తామరతూండ్లు దొంగిలించడం సమానం. ఇతరులను అతిధులుగా ఆదరించడానికి బదులు తమలోతామే ఒకరిని ఒకరు ఆదరించడంతో, అనవసరంగా పగను పెంచుకోవడం, పాడి

ఆవును కొట్టడం వంటి పాపము చేసిన దానికి ఏ పాపం వస్తుందో ఈ తామరతూండ్లు దొంగిలించిన వాడికి వస్తుంది " అని పలికాడు. గౌతముడు లేచి " వేదము చదువుకొని కూడా వేదాధ్యయనం చేయకపోవడం, రోజు అగ్ని ఆరాధన చేయక పోవడం, మద్యం విక్రయించడం, వర్ణసంకరం చేసి శూద్రస్త్రీని పెళ్ళి చేసుకోవడం మొదలైన పాపములు ఈ తామరతూండ్లు దొంగిలించిన వాడికి సంక్రమిస్తుంది " అని గౌతముడు చెప్పాడు. తరువాత విశ్వామిత్రుడు లేచి " అర్హత కలవారిని వదిలి అర్హత లేని వారిని పనిలో పెట్టుకోవడం, అధర్మవర్తనుడు, కపటి అయిన రాజును సేవించడం వంటి పాపములు ఈ తామరతూండ్లు దొంగిలించిన వానికి సంక్రమిస్తుంది " అని అన్నాడు. ఇదంతా విని **అరుంధతి** నవ్వి " ఎప్పుడూ అత్తగారిని ఆక్షేపించడం, తిట్టడం, భర్తపట్ల అనిచితంగా ప్రవర్తించడం, వండుకున్నది ఎవరికి పెట్టకుండా తానే తినడం వంటి పాపములు తామరతూండ్లు దొంగిలించిన వాడికి తగులుతాయి " అన్నది అరుంధతి.ఇంతలో సేవకురాలు గండ " వండినవంట ముందు తానే తినడం, పని చేయడములో సోమరిగా కుటిలముగా ఉండడం, అబద్ధాలు చెప్పడం, కన్నకూతురిని ధనము కొరకు అమ్ముకోవడం, మంచివారికి కీడు చెయ్యడం వంటి పాపములు ఈ తామరతూండ్లు దొంగిలించిన వానికి సంక్రమిస్తాయి. అదీ కాక ఈ తామరతూండ్లు దొంగిలించిన వాడు జీవితం అంతా ఒకరికి దాస్యం చేస్తుంటాడు " అని పలికింది. ఆమె భర్త పశుసఖుడు " ఈ తామరతూండ్లు దొంగిలించిన వాడికి సంతానం కలుగదు గర్భదరిద్రుడు ఔతాడు " అన్నాడు.

### శునస్సఖుడు

ఇదంతా విన్న శునస్సఖుడు " ఈ తామరతూండ్లు దొంగకు ఇవ్వడం వేదవేదాంగములు చదివిన బ్రాహ్మణోత్తముడికి తనపుత్రికను దానం ఇవ్వడం వంటిది " అన్నాడు. ఆ మాటలకు అందరూ ఆశ్చర్య పోయారు. అదేమిటి నువ్వు ధర్మవచనాలు పలుకుతున్నావు. అంటే తామరతూడులు దొంగిలించినది నువ్వే అన్న మాట. ఆకలితో అల్లాడి పోతున్నాము. దయచేసి ఆ తామరతూండ్లు మాకు ఇవ్వు " అని అడిగాడు. శునస్సఖుడు " అయ్యా ! నిజం చెప్తున్నాను. ఈ తామరతూండ్లు కనిపించక పోతే మీరు ఏమి అనుకుంటారో అని తెలుసుకోవడానికి ఈ తామరతూండ్లను దాచి పెట్టాను. ఇవిగో తీసుకుని మీ ఆకలి తీర్చుకోండి " అని తాను దాచిన తామరతూండ్లను తెచ్చి ఇచ్చి " మహానుభావులారా ! మీ మీద కోపించి వృషాదర్భి మిమ్మల్ని చంపడానికి హొమం చేసి హొమగుండం నుండి కృత్తి అనే రాక్షసిని సృష్టించి మీ మీదకు పంపాడు. అది తెలిసిన నేను ఆ రాక్షసిని చంపాను. ఇక ఎందుకు దాపరికం నేను దేవేంద్రుడను. మీరంతా లోభత్వం వదలడం వలన మీకు పుణ్యలోకాలు సిద్ధించాయి. రండి పుణ్యలోకాలకు పోదాము " అని దేవేంద్రుడు సప్తఋషులను, అరుంధతిని పుణ్య లోకాలకు తీసుకుపోయాడు. ధర్మనందనా ! ఇదంతా వారు ఇతరులకు ఇచ్చినది పుచ్చుకొనక పోవడం, లోభం విడిచిపెట్టడం వంటి సద్గుణాల వలన జరిగింది. కనుక నీవు కూడా లోభమును విడిచి పెట్టు. ఒకరి సొత్తుకు ఆశించకు " అని భీష్ముడు చెప్పాడు.

## పితృకార్యము గొడుగులు చెప్పులు

ధర్మరాజు " పితామహా ! పితృకార్యములలో గొడుగులు, చెప్పులు దానంగా ఇస్తారు కదా ! అలా ఎందుకు ఇస్తారు ? వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ సందర్భంలో జమదగ్నికి సూర్యుడికి జరిన సంవాదం వినిపిస్తాను. ఒక సారి జమదగ్ని తన భార్య రేణుకాదేవితో కలిసి ఆశ్రమం వదిలి దూరంగా వెళ్ళి విహరించసాగాడు. అప్పుడు జమదగ్ని విల్లు పట్టుకుని ఉన్నాడు. రేణుకాదేవి అంబుల పొది పట్టుకుని ఉంది. జమదగ్ని ఆరుబయట బాణములు వదులుతున్నాడు. రేణుకాదేవి ఆబాణములు తిరిగి తెచ్చి జమదగ్నికి ఇస్తుంది. ఇలా మద్యాహ్నం అయింది. సూర్యుడు నడి నెత్తి మీదకు వచ్చాడు. ఒక సారి రేణుకదేవి బాణములు తీసుకు రావడంలో ఆలస్యం జరిగింది. జమదగ్ని **రేణుకాదేవి**ని చూసి " ఇంత ఆలస్యం జరిగిందేమి ? " అని అడిగాడు. రేణుకాదేవి " నాధా ఎండవేడిమి ఎక్కువగా ఉంది. అందుకని కొంతసేపు చెట్టునీడన నిలబడ్డాను. అందుకని ఆలస్యం అయింది " అని బదులు చెప్పింది రేణుక. జమదగ్ని కోపించి " ఏమీ ఆ సూర్యుడు నీకు తాపం కలిగించాడా ? ఉండు సూర్యుడికి తగిన బుద్ధి చెప్తాను. నా బాణములతో సూర్యమండలం కప్పి వేస్తాను " అని అన్నాడు. ఆ మాటలు సూర్యుడు విని బ్రాహ్మణ వేషంలో జమదగ్ని వద్దకు వచ్చి " అయ్యా సూర్యుడి మీద కోపం మానండి " అని వేడుకున్నాడు. జమదగ్ని " నువ్వు మాట్లాడకు పక్కకు పో నేను ఈ సూర్యుడిని కాల్చి వేస్తాను " అని అన్నాడు. సూర్యుడు " మునీంద్రా తాపసులైన మీరు కోపిస్తే ఎలాగా ! సూర్యుడి తాపము చేతనే కదా జలములు వేడెక్కి మేఘములుగా మారి వర్షరూపంలో లోకాలకు నీరు లభిస్తుంది. దానివలన మనకు ఒషధులు, పంటలు లభిస్తాయి కదా ! మరి సూర్యకిరణాలు తపించక పోతే ఎలాగ " అని అన్నాడు. అప్పటికి జమదగ్ని శాంతించ లేదు. సూర్యుడు నిజస్వరూపంతో జమదగ్ని ముందు నిలిచి " మునీంద్రా ! నా వల్ల ఏదైనా అపరాధం జరిగి ఉంటే క్షమించండి " అని వేడుకున్నాడు. ఆ మాటలకు జమదగ్ని శాంతించాడు. వెంటనే సూర్యుడు గొడుగు చెప్పులు సృష్టించి జమదగ్నికి ఇచ్చి " మహర్షి ఈ సాధనము ఇంతకు ముందు లేవు. ఈ గొడుగు వేసుకుంటే సూర్యతాపము సోకదు, ఈ చెప్పులు వేసుకుంటే ఎండవేడిమికి కాళ్ళు కాలవు. ఈ గొడుగును, చెప్పులను బ్రాహ్మణులకు దానంచేస్తే పుణ్యం లభిస్తుంది " అని అన్నాడు. ఆ వస్తువులను స్వీకరించిన

జమదగ్ని సంతోషించాడు. ధర్మరాజా ! గొడుగు, చెప్పులు సూర్యుడి చేత సృష్టించబడ్డాయి. వాటిని దానంగా ఇస్తే పుణ్యలోకాలు లభిస్తాయి " అని భీష్ముడు చెప్పాడు.

## శూద్రుడి ప్రవర్తన

ధర్మరాజు " పితామహా ! శూద్రుడు ఏ ప్రకారం చేస్తే ఇహ లోకంలోను, పరలోకంలోను సుఖములు పొందగలడు. భీష్ముడు " ధర్మనందనా ! పూర్వము పరాశరుడు తన శిష్యులకు కొన్ని ధర్మసూక్ష్మములు తెలియ చేసాడు. ఆ వాక్యముల సారాంశం ఇది. శూద్రుడైన వాడు ఇంద్రియములను జయించి అంత: శత్రువులైన కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యాలను జయించి గర్వమును వదిలి పెట్టి, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులముల వారికి భక్తితో శుశ్రూషలు చేసిన ఈ లోకములోనూ పరలోకము లోనూ సుఖపడగలడు. అలాకాక తన ధర్మమును వదిలి వేదాధ్యయనము, తపస్సు చేస్తే ఈ లోకములోనే కాక పరలోకములో కూడా హీనుడౌతాడు. బ్రాహ్మణుడికి వేదాధ్యయనం, క్షత్రియుడికి బలపరాక్రమాలు, వైశ్యునికి వాణిజ్యము శూద్రుడికి సేవకా వృత్తి అధిక ధనాలు. ఇది వేదము చూపిన మార్గము. ఈ మార్గములలో నడిచిన వారు ఉత్తమ గతులు పొందుతారు. అలా కాక స్వధర్మం వదిలి పరధర్మమును ఆచరించిన ఇహలోకంలోను పరలోకంలోను కూడా దుర్గతి కలుగుతుంది.

## శౌచము

ధర్మనందనా ! నీకు **పరాశరుడు** తన శిష్యులకు శౌచము గురించి చెప్పినవి చెప్తాను. మానవుడు మలమూత్ర విసర్జన పగలు ఉత్తర దిక్కున, రాత్రి దక్షిణదిక్కున చేయడం మంచిది. ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలం ఉత్తరదిక్కుగా మలమూత్రములను విసర్జించి అవయవములను సున్నితంగా ఎడమచేతితో శుభ్రపరచుకోవాలి. లేని ఎడల రోగములు ప్రాప్తిస్తాయి. తరువాత చేతిని చక్కగా కడుగుకుని తరువాత చేతులకు మట్టి పూసుకుని రుద్దుకుని కడగాలి. తరువాత పాదములను శుభ్రంగా కడుగు కోవాలి. మలమూత్రములను బహిరంగ ప్రదేశములో విసర్జించ కూడదు. దూరంగా చాటుగా చేయాలి. మలమూత్ర విసర్జన తరువాత నురగలేని మంచి నీటితో ఆచమనం చేయాలి. ఆచమనం చేసిన తరువాత నోటిని తుడుచుకోవాలి. తలమీద నీళ్ళు చల్లుకోవాలి. తరువాత శుభ్రమైన నీటితో కళ్ళు, ముక్కు, చెవులు, భుజములు, గుండెలు, బొడ్డు తుడుచుకోవాలి. తలమీద నీళ్ళతో తుడుచుకోవాలి. ఆచమనం చేసేటప్పుడు తూర్పుముఖంగా గాని, ఉత్తరముఖంగా కానీ కూర్చోవాలి. ఇలా చేసిన ఋగ్యజుర్సామ వేదములు సంతోషిస్తాయి. నీటితో ఆచమనం చేసిన అధర్వణవేదం సంతోషిస్తుంది. అలా ధర్మశాస్త్రములు, ఇతిహాసములు, పురాణములు సంతోషిస్తాయి. కాళ్ళు కడగడం వలన పుండరీకాక్షుడు సంతోషిస్తాడు. నీటితో కళ్ళు తుడుచుకుంటే సూర్యుడు సంతోషిస్తాడు. ఇది ఆచమనవిధి. ఈ ఆచనమును ప్రతి ఒక్కరు వస్త్రములు మార్చుకొనినప్పుడు, జంధ్యమును మార్చుకొనినప్పుడు, అన్న పానముల వేళలందు చేయాలి. అన్నము తిన్న తరువాత ఆహారపు ముక్కలు పళ్ళ మధ్య ఇరుక్కుంటాయి కనుక మూడు మార్లు పుక్కిలించి ఆ నీటిని ఉమ్మి వేసి ఆ తరువాత ఆచమనం చేయాలి. ఈ ఆచమనం అన్ని వర్గముల వారు చేయాలి.

## వర్ణాశ్రమ ధర్మాలు

ధర్మనందనా ! **పరాశరుడు** వర్ణాశ్రమ ధర్మాలు ఇలా వివరించాడు. బ్రాహ్మణుడు జపంచెయ్యడం, యజ్ఞంచెయ్యడం, వేదాధ్యయనంచెయ్యడం వంటివి చేస్తాడు. అదే అతడికి బ్రతుకుతెరువు. బ్రాహ్మణుడికి తపస్సు శోభను చేకూర్చున్నాము. క్షత్రియునికి రాజ్యపాలన శోభను చేకూరుస్తుంది. క్షత్రియుడి యజ్ఞయాగములు చేయిస్తాడు. దండనీతి క్షత్రియుడికి జీవనాధారం. వైశ్యుడు నిర్దుష్టమైన హవ్యములను యజ్ఞయాగములకు సమకూరుస్తాడు. వైశ్యుడికి వ్యాపారం, వాణిజ్యం జీవనాధారం. వైశ్యుడు అతిథులను సత్కరిస్తాడు. శూద్రుడికి పరిచర్యలు చేయడం యజ్ఞము. మిగిలిన మూడు వర్ణాల వారికి సేవలు చెయ్యడమే అతడికి బ్రతుకుతెరువు. అతడు తన పనిలో ఎక్కువ సామర్ధ్యం చూపించి మెప్పు పొందుతాడు. పైన చెప్పిన ధర్మాలు ఆచరించ తగినవి. యతులు అన్ని వర్ణముల వారికి పూజనీయులు. ప్రియమైన మాటలు పలకడం, శాంతంగా ఉండడం, ఇంద్రియనిగ్రహం కలిగి ఉండడం, మంచి నడవడి ప్రవర్తన కలిగి ఉండడం, అలసత్వం లేకుండా ఉండడం, ఆశను జయించడం, శాయశక్తులా ఈ సంసారాన్ని దాటడానికి ప్రత్నించడం, తనకు కావలసిన వస్తువులను ధర్మ మార్గంలో సంపాదించడం, సన్యాసులకు సేవ చేయడం యతి జీవితం గడపవలసిన విధానం ఇది. శూద్రుడికి దాన ధర్మాలు చేయవలసిన అవసరం లేదు కాని యతులపట్ల ఆదరము, భక్తి ప్రదర్శించిన దానధర్మాలు చేసిన ఫలం దక్కుతుంది. దారి తప్పిన బాటసారులను, యతులను కనిపెట్టి వారికి దాహం ఇచ్చి సేవ చెయ్యడం శూద్రుడి విధి. యతులకు వ్యాధి వస్తే వైద్యం చేయించడం, వారికి అన్న పానములు సమకూర్చి సేవ చెయ్యడం వలన శూద్రుడికి పుణ్య లోకాలు ప్రాప్తిస్తాయి.

## అన్ని వర్ణాలవారు ఆచరించవలసిన ధర్మాలు

అన్ని వర్ణాల వారు తప్పక ఆచరించవలసిన సామాన్య ధర్మాలు పరుల ధనముకు ఆశించక ఉండడం, అందరినీ తన వలెనే ఆదరించడం, ఈ లోకంలో ఉన్న అన్ని వస్తువులను నీటిలో పుట్టే తరంగాల వలె చూసి దేని మీద ఆసక్తి లేకుండా ఉండడం, సాటిప్రాణుల మీద దయకలిగి ఉండడం, సాటివారికి మేలు చెయ్యడం, తాను చేసిన పుణ్యం తనతో వస్తుంది అని నమ్మడం, అందరూ ఆచరించ వలసిన ధర్మములు. పొరపాటున ఎవరైనా తెలియక చెడ్డ పని చేసిన దానికి వారు ప్రాయశ్చితం చేసుకోవాలి. జీవహింస చేసినప్పుడు దానికి తగిన ప్రాయశ్చితం చేసుకోవాలి. సాటి మనిషిని చంపిన వచ్చే పాపం అనేక సంవత్సరములు భిక్షాటన చేసిన కాని పోదు. మద్యపానం, గురుపత్నిని కోరడం వంటివి ఘోరమైన పాపములు. తన ప్రాణములు బలి ఇచ్చినా ఆ పాపములు పోవు. పై విషయములు తెలుసుకుని పరలోక భీతితో పాపభీతితో దైవచింతనతో జీవితం గడపాలి. శూద్రుడికి కఠినమైన నియమనిష్ఠలు లేవు కనుక అతడి ధర్మసూక్ష్మములను గ్రహించి ఉత్తమలోకములు పొంద వచ్చు.

## జరగబోయే కీడుకు సూచన

పరాశరుడు జరుగబోయే కీడు ఎలా తెలుసుకోవాలి అన్నది వివరించాడు. ఉత్తరదిక్కున బంగారు వర్ణం కలిగి ఉన్న వానిని దక్షిణ ముఖంగా నిలిచి ఉండడం చూసిన వానికి మూడు సంవత్సరాలలో మరణం సంభవిస్తుంది అని తెలుసుకోవాలి. సూర్యబింబం తేజోవిహీనంగా కనిపించిన వానికి రెండు సంవత్సరాలలో మరణం సంభవిస్తుంది. వెన్నెలలో కనపడే తన నీడకు చిల్లులు కనబడడం చూసిన వానికి ఒక సంవత్సరంలో మరణం సంభవిస్తుంది అని తెలుసుకోవాలి. తన నీడ తల లేకుండా కనపడిన ఆరు నెలలో మరణం సంభవిస్తుందని తెలుసుకోవాలి. చెవులను చేతులతో మూసినప్పుడు ఏ శబ్దం వనిపించక ఉన్న అతడికి నెల రోజులలో మరణం సంభవిస్తుంది అని తెలుసుకోవాలి. చెవులు ముక్కులు పని చేయక కళ్ళలో జీవం పోయి కనిపించిన అతడికి అది ఆఖరి రోజని తెలుసుకోవాలి. పైన చెప్పిన అరిష్టములు సంభవించినప్పుడు మానవుడు ధైర్యం కోల్పోకూడదు. ముందు జీవితము మీద కోరికను ఆశలను వదిలి పెట్టాలి. మనసు నిలకడగా ఉంచుకుని ఏకాగ్రచిత్తులై ధ్యానం చేసిన పరమాత్మ అనుగ్రహం పొందాలి. అటువంటి వ్యక్తి మరణించిన మరుజన్మలో అతడి కర్మఫలమును అనుసరించి విప్ర, వైశ్య, క్షత్రియ కులములలో సంపన్నుడై జన్మించి సుఖములు అనుభవించి పరలోకములో కూడా సుఖములు అనుభవిస్తాడు.

## వైరాగ్యము

ఆ జన్మ ఎత్తినప్పుడు అతడికి జ్ఞానోదయం కలుగుతుంది. ఈ ప్రపంచంలో ఉన్నవన్నీ అశాశ్వతం, ఏదీ మన వెంటరాదు, అన్నింటికీ పుట్టుక మరణం తప్పవు, అటువంటి వాడికి వెంపర్లాడడం వృధా ! అని తెలుసుకుంటాడు. ఈ సంసారం దు:ఖమయం, అనంతమైన దుఖం తరువాత కొద్దిపాటి సుఖంలభిస్తుంది. దానికే మనం ఆనందపడతాము. వెంటనే దు:ఖం ముంచుకొస్తుందని తెలుసుకోలేము. కనుక ఈ సుఖముల మీద మమకారం పెంచుకోవడం వృధా. అని ఆలోచించి ధర్మపరుడై జీవిస్తాడు. చేసిన పనికి ఫలితం తప్పక ఉంటుంది. చెయ్యని పనికి ఫలితంఉండదు. కర్మఫలము తప్పించుకోవడం ఎవరికీ సాధ్యం కాదు అనే సత్యాన్ని గ్రహిస్తాడు. కర్మఫలము తప్పించుకోవడం ఎవరికి సాధ్యం కాదని తెలుసుకుంటాడు. సత్కారముల వలన కలిగిన పూణ్యము వలన స్వర్గసుఖాలు అనుభవించి పుణ్యము క్షీణించిన పిదప జ్ఞానులు ఉన్న కుటుంబంలో పుట్టి దేవతలను , పితరులను, అతిధులను పూజిస్తాడు, గృహస్థాశ్రమం స్వీకరించి భార్యాపుత్రులతో సుఖములు అనుభవించి తరువాత వైరాగ్యము పొంది తనవారిని వదిలి పెట్టి గురువులను సేవించి సాంఖ్యయోగ రహస్యాలను అభ్యసిస్తాడు. తరువాత సన్యాసాశ్రమం స్వీకరిస్తాడు. దేవాలయములలో కొండగుహలలో నివసిస్తూ భిక్షాటనతో జీవిస్తాడు. రాగద్వేషములను వదిలి పెట్టి సుఖదు:ఖములకు అతీతుడౌతాడు. అహంకారం వదిలిపెట్టి నిత్యము తృప్తిగా జీవిస్తాడు. ఎవరి ఆధీనంలో ఉండక, ఒకచోట నిలువక తిరుగుతూ ఉంటాడు. చివరకు అక్షరతత్వాన్ని తెలుసుకుని పరమాత్మలో ఐక్యమైపోతాడు.

## శూద్రుడు ముక్తి

అటువంటి సన్యాసులను సేవించిన శూద్రుడు కూడా తమ పాపములు పటాపంచలు చేసుకుని పరమాత్మలో లీనమైపోతాడు. ఇతరవర్ణముల వారికి ఈ సౌలభ్యం లేదు. శూద్రులకు సేవకాధర్మము కర్తవ్యము కనుక పవిత్రులైన సన్యాసులను సేవించిన సునాయాసంగా ముక్తిని పొందగలడు. జనులందరూ మోక్షాసక్తులే అయినా శూద్రులకు సులభంగా మోక్షప్రాప్తి కలుగుతుంది.

కాని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు కూడా తమ ఇంద్రియములను నిగ్రహించి మోక్షమును పొందుగలరు. కాని అన్నింటికి ముందు తమ పాపప్రవర్తన వదలి సన్మార్గంలో నడవాలి. పాపచింత కలవారికి జ్ఞానమార్గము కనపడదు. తరువాత మంచి గురువులను ఆశ్రయించి వారు ఉపదేశించినది ఆచరణలో పెట్టాలి. మంచి గురువు దొరికాడు జ్ఞానోదయం జరిగిందని గర్వించకూడదు. అలా గర్వించినవాడు తిరిగి పాపకూపంలో పడిపోతాడు. అసలు జ్ఞానం కలిగింది అన్నదానికి నిదర్శనం పాపం లేకుండా ఉండడమే. మనిషికి జ్ఞానం కలుగే కొలది శాంత గుణం అలవడాలి. గర్వం నశించాలి. అప్పుడు గురువులకు సేవచేస్తూ ముక్తిని పొందగలడు. మానవుడు తమ ఇంద్రియములను అదుపులో పెట్టుకోవాలి. పైన చెప్పిన వాటిని ఆచరించు యుక్తుడైన వాడికి పరమ సాక్షాత్కారం లభిస్తుంది. యుక్తుడు కాని వాడికి పరమాత్మ సాక్షాత్కారం లభించదు. దీనిని సౌఖ్యమార్గం అంటారు. సౌఖ్యమార్గమున నడుస్తూ అహంకారం గర్వము వదిలి సేవిస్తూ గురువులను ముక్తిని పొందాలి. సన్యాశాశ్రమం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు మాత్రమే పరిమితం. శూద్రులకు మాత్రం సన్యాసులను సేవించడము వలన ముక్తి లభిస్తుంది. బంగారుకొండ పక్కన ఉండే కాకి కూడా బంగారంలా మెరుస్తుంది. అలాగే పవిత్రుడైన సన్యాసి సాహచర్యం చేసిన వ్యక్తి పవిత్రుడౌతాడు. కనుక శుద్రుడికి సన్యాసాశ్రమం తపస్సు చేసి పుణ్యము ఆర్జించవలసిన అవసరం లేదు " అని **పరాశరుడు** తన శిష్యులకు చెప్పాడు అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## మానవులలో పూజనీయులు

ధర్మరాజు " పితామహా ! మానవులలో కూడా దేవతలు సైతం మొక్క తగిన వారు ఉన్నారని విన్నను. అలాంటి వారు ఎలా ఉంటారో తెలియచేయండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఇదే ప్రశ్న ఒక సారి దేవేంద్రుని సారధి అయిన మాతలి అడిగాడు. అందుకు దేవేంద్రుడు ఇచ్చిన సమాధానం వివరిస్తాను. కామము, అర్ధము ధర్మ మార్గముననే పొందు వారు. స్త్రీలు కోరే అందము రూపము ఉండి కూడా స్త్రీలపట్ల కామము లేని వారు, అధికమైన విద్య, ధనము ఉండి కూడా గర్వము లేని వారు. ఇంద్రియములను జయించిన వారు, తాను వివాహమాడిన స్త్రీ అందు తృప్తి కలిగిన వారు, తపస్సు అనే ధనము మీద మమకారం కలిగిన వారు, ఎల్లప్పుడూ సత్యమునే పలికే వారు, పరమ శౌచులూ, అనవసరమైన పనులను తల మీద వేసుకుని సతమతం కానివారు, వీరందరూ మానవులైనా దేవతలకు కూడా పూజనీయులే " అని చెప్పాడు.

## చెరువులు

ధర్మరాజు " పితామహా ! చెరువులు తవ్వించడంలో గల ధర్మవిశేషములు తెలపండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మరాజా ! తటాకములు దేవతలకు జంతువులకు ఆశ్రయాలు. చెరువులో ఆవులు నీరు తాగుతాయి కనుక చెరువులు తవ్వించిన వాడు పుణ్య లోకాలకు పోతాడు. చెరువులు తవ్వించిన వాడు ఈ లోకములో కూడా కీర్తి, అయిశ్వర్యం పొందుతాడు. చెరువులు నీటితో నిండి ఉన్నంత కాలం తవ్వించిన వాడికి యజ్ఞములు చేసిన ఫలం కలుగుతుంది. అదే చెరువులకు గట్టు మీద చెట్లను నాటితే ఆ చెట్లు పక్షులకు స్థావరమై మనుషులకు, జంతువులకు నీడ ఇస్తున్నాయి. కనుక వాటిని నాటిన వారికి సకలసౌఖ్యములను ఇస్తాయి. చెరువులు తవ్వించిన వారి పితరులు పుణ్య లోకములకు పొందుతారు. చెరువులు తవ్వించడం, చెట్లు నాటించడం దేవతలకు, మానవులకు మేలు చేస్తుంది " అని భీష్ముడు చెప్పాడు.

## గృహస్థ ధర్మము

ధర్మరాజు " పితామహా ! గృహస్థ ధర్మాన్ని వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ విషయంలో భూదేవికి విష్ణుమూర్తికి జరిగిన సంవాదం గురించి చెప్తాను. నీ లాగే ఒక సారి విష్ణుమూర్తి భూదేవిని అడిగితే భూదేవి " గృహస్థు ప్రతి రోజు అగ్ని కార్యము చెయ్యాలి. అత్యంత భక్తితో భూతబలి ఇవ్వాలి. ఇందు వలన దేవతలు సంతోషిస్తారు. గృహస్థు ప్రతి దినము తన పితరులకు అన్నము, పాలు, పండ్లు, నీరు నివేదించాలి. వైశ్వదేవము అనే క్రియ గృహస్థు తప్పక చెయ్యాలి. తరువాత తన శక్తిమేర పేదలకు దానము చెయ్యాలి. పేద బ్రాహ్మణులను వెదికి వారికి భిక్ష వెయ్యాలి. ప్రతి రోజు అతిధులను సత్కరించాలి. ఏ కారణం చేత అయినా అన్నం తినే ముందు మొదటి ముద్దను అగ్నిహోత్రములో వెయ్యాలి. మొదటిది **శ్రౌతబలి** ఇది వేదములలో



గృహస్థ ధర్మము కృష్ణ భూదేవిల సంవాదము

చెప్పబడినది. ఈ బలి ధర్మముకు, ఓషధులకు, వనములకు, రాక్షసులకు సంబంధించినది. రెండవది స్మార్త బలి. ఇది పశువులకు, పక్షులకు సంబంధించినది. గృహస్థు రెండు బలులు విధిగా చెయ్యాలి. ఇది గృహస్థ ధర్మం. బ్రాహ్మణులు ఈ విధిని నిర్వర్తించిన తరువాతనే భోజనం చెయ్యాలి "అని భూదేవి విష్ణుమూర్తికి చెప్పింది " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడని **వైశంపాయనుడు** జనమేజయుడికి చెప్పాడని సూతుడు శైనకాది మునులకు చెప్పాడు.

## వనరులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రథుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

---

# అనుశాసనిక పర్వము చతుర్థాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# చతుర్ధాశ్వాసం

### దేవతారాధన పూజకు తగిన పూలు

ధర్మరాజు " పితామహా ! దేవతలను దీప ధూప నైవేద్యములతో ఆరాధిస్తారు కదా ! ఆవిశేషములు ఏమిటో చెప్పండి " అని అడిగాడు. భీష్ముడు**సువర్ణుడు** అనే మహామునికి, సువర్ణుడు నారదుడికి, నారదుడు నాకు చెప్పారు. నేను ఇప్పుడు నీకు చెప్తాను. ఈ భూమిమీద ఓషధులు అత్యుత్తమమైనవి. ఓషధీవృక్షాలలో పూలుపూసే చెట్లు ఇంకా ఉత్తమమైనవి. ఆ పుష్పములతో దేవతలను అర్చించిన మానవులకు శుభములు మనస్సు వర్ధిల్లుతాయి. అందు వలన పూలను సుమమనస్సులు అని అంటారు. పూలతో దేవతలను అర్చించిన దేవతలుహర్షించి మన కోరికలు తీరుస్తారు. అందువలన దేవతలను సుమమనస్కులు అని అంటారు. మంచిసువాసన కలిగి, మంచిరూపము కలిగి, తెలుపువర్ణము కలిగి ముళ్ళులేని చెట్లకు పూచినపూలు దేవతారాధనకు మేలైనవి. అటువంటి పూలను దేవతలు ప్రీతితో స్వీకరిస్తారు. తామరలు, సన్నజాజులు, తులసీదళాలు, దేవతలకు మిక్కిలి ఆనందాన్ని ఇస్తాయి. యక్షులకు నీటిలోపుట్టిన పూలు అధిక ఆనందం కలిగిస్తుంది. ముళ్ళ చెట్లకు పూసినవి, ఎర్రనివి, ఘాటైనవాసనకలిగిన పూలు శత్రువులను చంపడానికి అధర్వణ వేదములో చెప్పబడిన మంత్ర, తాంత్రిక పూజలు మరియు ప్రయోగాలలో వినియోగిస్తారు. ఘాటైనవాసన కలిగిన పూలు రాక్షసులను, భూతగణములను ఆకర్షిస్తాయి. నలుపు, తెలుపు కలిగిన మంచి పరిమళాలను వెదజల్లు పూలు మానవులు ఇష్టపడతారు. దేవాలయములలో, పితృవనంలో పూసిన పూలను స్త్రీలు అలంకరించుకొన కూడదు. పూలవాసనతో దేవతలు, పూలనుచూసినంతనే యక్షులు, పూలవాసన ఆస్వాదిస్తూ సర్పములు ఆనందిస్తాయి. మంచిపూలతో దేవతలను అర్చించిన దేవతలు తృప్తిపొంది మానవుల కోరికలు తీరుస్తారు.

### ధూపము

ఇక ధూపము గురించి చెప్తాను. **సల్లకీ** అనే చెట్టునుండి తీసినపొడితో వచ్చే ధూపము దేవతలకు ప్రీతి కరమైనది. అగరు ధూపము యక్షులకు, గంధర్వులకు నాగజాతికి ప్రీతికరమైనది. అన్నింటి కంటే శ్రేష్టమైనది కర్పూరముతో వేసే ధూపము. తియ్యనివాసన వచ్చే ధూపము దేవతలకు ప్రీతికరం. ఘాటైనవాసన వచ్చే ధూపం రాక్షసులకు ప్రీతికరం. కారమైన ధూపం అంటే కళ్ళ మండి నీళ్ళు వచ్చే ధూపము యక్షులకు ప్రీతికరం. కనుక దేవతలకు ప్రీతికరమైన వేసిన ధూపము మానవులకు పరమపుష్ఠిని ఆయుష్షును పెంచుతుంది. అలాగే యక్షులు, రాక్షసులు, నాగులు మానవులు వేసిన ధూపముతో తృప్తి చెంది వారి కోరికలను తీరుస్తారు. మంచిగంధము అగరు ధూపములు మానవుల మనసుకు ఆహ్లాదం కలిగిస్తాయి.

### దీపారాధన

దేవతలను పూజించే సమయంలో దీపారాధన చేయాలి. దాని వలన అక్కడ ఉన్న భూతములు, రాక్షసులు మొదలైన కుత్సితమైన జాతులు పారిపోతాయి. దీపం వెలిగిస్తే బాహ్య అంతర చీకట్లు తొలగిపోతాయి. **దీపారాధన** వలన చీకట్లు తొలగి జ్ఞానజ్యోతి వెలుగుతుంది. మనసు ధర్మచింతన వైపు మరలుతుంది. ప్రమిదలో నెయ్యి తక్కువ ఉండకూడదు. వత్తి సన్నగా ఉండకూడదు. సగం సగం వెలిగించ కూడదు. దీపారాధన చేసిన చక్కటి వెలుగు రావాలి. చీకట్లు పూర్తిగా తొలగి పోవాలి. దేవుడి వద్ద ఉన్న దీపము దొంగిలించిన వాడికి కళ్ళుపోయి గుడ్డివాడు ఔతాడు. నలుగురు కూర్చొను చావడి లోను, కొండమీద, దేవుడిగుడిలో దీపము వెలిగించిన వాడు ఐశ్వర్యవంతుడు ఔతాడు. **ఆవునెయ్యి దీపము** అత్యంత శ్రేష్టము. తరువాత' **బర్రె, మేకల నెయ్యితో** కూడా దీపము పెట్టచ్చు. జంతువుల కొవ్వుతోను, ఎముకలరసము తోను, మాంసమురసముతో దీపము వెలిగించిన మహాపాపము. దీపములను దానం చేసిన వాడికి ఉత్తమ లోకాలు ప్రాప్తిస్తాయి.

### నైవేద్యము

తయారుచేసిన ఆహారం ముందుగా దేవతలకు నివేదన చేసి తరువాత భుజించాలి. నివేదన చెయ్యక తిన్న ఆహారం రాక్షసాహారం ఔతుంది. అందు వలన మానవుడు తన ఇంట తయారు చేసుకున్న ఆహారమును ముందుగా దేవుడికి నివేదించి తరువాత భుజించాలి. **నువ్వులపిండి, పాలు, పెరుగు, నెయ్యి** మరియు **సువాసన ద్రవ్యములు** వేసి కమ్మటివాసన వచ్చే పదార్ధములు దేవతలకు ప్రియము చేకూరుస్తాయి. ప్రతిరోజు దేవతలకు నివేదనచేయు వ్యక్తికి సకల విధ శుభములు కలుగ గలవు. **ఉరగములకు, యక్షులకు, అసురులు** మొదలైన భూతములకు **రక్తము మాంసము** కలిపిన పిండములు **మద్యము** అమిత ప్రీతిని కలిగిస్తాయి. సాత్వికులు సాత్వికాహారము (సౌమ్యబలి), తామసులు తామసాహారము (అసౌమ్యబలి) వారి వారి ఇష్ట దేవతలకు బలి ఇచ్చి వారి కోరికలను విన్నవించి అందుకు తగిన ప్రతిఫలము పొందుతారు " అని చెప్పాడు భీష్ముడు.

## దేవతారాధనా ఫలము

ధర్మరాజు " పితామహా ! **పూలు, ధూపము, దీపము, బలి** ప్రదానము వీటిని దేవతలకు అర్పించడం వలన కలిగే ఫలములను వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! పూర్వము నహుషమహారాజు ఈ భూమిని పరిపాలిస్తున్నాడు. ఆయనకు తను రాజు అనే గర్వములేదు. సత్వనిష్టతో దేవతలను, పుష్పములతోను, ధూప, దీప నైవేద్యములతో అర్చిస్తూ ఉండే వాడు. అలాగే పితృ దేవతలను కూడా తగు విధముగా తర్పణాది కార్యములతో అర్చించే వాడు. అలాగే రాక్షసులను, యక్షులను, భూతములను, భుజంగములను, పూలతోను వివిధములైన ద్రవ్యములతోను అర్చించే వాడు. ఈ పూజ ఫలితంగా నహుషుడు దేవేంద్ర పదవిని కూడా పొందగలిగాడు. తుదకు నహుషుడు సప్తర్షులు మోసే పల్లకిలో కూడా ఊరేగినప్పటికి తాను నిత్యము చేసే పూజానుష్టానములు విడువ లేదు. నహుహుడు బ్రహ్మసభకు కూడా వెళ్ళగలిగాడు అంటే అతని నిత్యపూజా విధానమే కారణము. అయినా నహుషుడు చేసిన చిన్న తప్పిదము కారణంగా ముని శాపానికి గురై భూపతనం చెందాడు. ధర్మనందనా ! దీపారాధన అత్యంత శ్రేష్టమైనది. దైవ సన్నిధిలో ఎంత సేపు దీపము వెలుగుతుందో అన్ని దేవతా సంవత్సరాలు మానవుడు సుఖ సంతోషాలతో జీవిస్తాడు. స్వర్గలోకప్రాప్తి కూడా పొందగలడు " అని భీష్ముడు చెప్పాడు.

## బ్రాహ్మణుడి ధనము

ధర్మరాజు " పితామహా ! నాది ఒక చిన్న సందేహము. బ్రాహ్మణుడి ధనము హరించిన వాడు ఏ గతి పొందుతాడు వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! మానవులు ఈ లోకాలన్నింటా చేసే పాపములలో బ్రాహ్మణుడి ధనము దొంగిలించడం మహాపెద్దది. బ్రాహ్మణుడి ధనమును హరించినవాడి కులము సర్వనాశనం అవడం తథ్యము. అతడు మరుజన్మలో నీచకులమున జన్మిస్తాడు.

### క్షత్రబంధు

పూర్వము క్షత్రబంధు అనే రాజు ఉండేవాడు. అతడు ఒక రోజు రాజ్యపర్యటన చేయసాగాడు. ఊరి చివర ఒక కడజాతి వాడు పోతున్న సమయంలో పక్కనే ఉన్న బ్రాహ్మణుడి పొలములో నుండి ధాన్యపు గింజలు ఎగిరి పడుతున్నాయి. కడజాతి వాడు నేర్పుగా ఆ గింజలు మీద పడకుండా వెళ్ళసాగాడు. రాజు ఆ కడజాతి వాడిని పిలిచి " నీవు ఎందుకు ఆ ధాన్యపు గింజలు మీద పడకుండా వెళుతున్నావు " అని అడిగాడు. కడజాతి వాడు " అయ్యా పూర్వజన్మలో నేను బ్రాహ్మణ కుమారుడను. బ్రహ్మచర్య వ్రతమును నిష్టతో ఆచరిస్తున్నాను. ఒక రోజు భిక్షాటన చేసి భిక్ష తెచ్చి ఒక నది ఒడ్డున కూర్చుని ఆ భిక్ష తినసాగాను. ఆ పక్కనే ఒక బ్రాహ్మణుడి పొలము ఉంది. గాలి బలంగా వీచడం వలన ఆ పొలంలో నుండి వచ్చిన ధూళి నేను తినబోయే అన్నము మీద దట్టంగా పడింది. ఆ విషయము తెలియని నేను ఆన్నము భుజించాను. ఆ కారణంగా నేను ఈ జన్మలో కడజాతి వాడిగా పుట్టాను. నేను పూర్వ జన్మలో చేసుకున్న పుణ్యము కారణంగా నాకు పూర్వజన్మ స్మృతి ఉన్నది. నిన్న రాత్రి నాకు ఒక కల వచ్చింది. ఆ కలలో నాకు ఒక బ్రాహ్మణుడు కనిపించి " రేపు **క్షత్రబంధు** అనే రాజుతో చేయబోయే సంవాదంతో నీకు కలిగిన కష్టం తొలగిపోతుంది " అని చెప్పాడు. ఆ స్వప్న ఫలితంగా మీరు నాకు కనిపించారు " అని చెప్పాడు. తరువాత ఆ కడజాతి వాడు మరణించి ఉత్తమ గతులు పొందాడు " అని భీష్ముడు ధర్మరాజుతో చెప్పాడు.

## స్వర్గలోకము

ధర్మరాజు " పితామహా ! స్వర్గలోకము అని అంటారు కదా ! అక్కడ సుఖసంతోషాలు ఒకే విధంగా ఉంటాయా ! లేక పలురకాల సుఖసంతోషాలు ఉంటాయా వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! పుణ్యకర్మలు అనేక విధాలుగా ఉంటాయి కదా ! అలాగే ఒక్కొక్క రకమైన పుణ్యకర్మకు ఒక్కొక్క రకమైన స్వర్గ సుఖము లభిస్తుంది. ఒక్క మాటలో చెప్పాలంటే స్వర్గంలో సుఖమేకాని దు:ఖం అసలు ఉండదు.

### గౌతముడు ఇంద్రుడు

ధర్మనందనా ! **గౌతముడు** అనే బ్రాహ్మణుడు ఒకవనంలో తపస్సు చేసుకుంటున్నాడు. ఒకరోజు అతడికి తల్లిలేని ఏనుగు పిల్ల కనిపించింది. గౌతముడు ఆ ఏనుగు పిల్లను తీసుకు వచ్చి తానే దానికి తల్లి తండ్రి అయి పెంచాడు. కాలక్రమంలో అది పెరిగి పెద్ద ఏనుగు అయింది. ఒక నాడు దేవేంద్రుడు ఆ రాజ్యమును ఏలుతున్న రాజు వేషంలో గౌతముడి వద్దకు వచ్చి ఆ ఏనుగును తనకు ఇమ్మని అడిగాడు. గౌతముడు " రాజా ! నేను ఈ ఏనుగును కన్నకొడుకు వలె పెంచాను. ఇది రోజు నాకు సేవ చేస్తుంది. నాకు సమిధలు తెచ్చింది. నేను లేని సమయంలో పర్ణశాలను కాపాడుతుంది. కనుక నేను దీనిని మీకు ఇవ్వ లేను " అని చెప్పాడు. దేవేంద్రుడికి కోపము వచ్చి " గౌతమా ! నీవు తపస్సు చేసుకునే వాడివి. నీకు ఆవులు కావాలి కాని ఏనుగులు ఎందుకు ? నీకు కావలసినంత బంగారము ఇస్తాను. ఈ ఏనుగును నాకు ఇవ్వు " అని అడిగాడు. గౌతముడు అంగీకరించక " అయ్యా ! ఈ ఏనుగు తల్లి లేని పిల్లగా నా వద్దకు వచ్చింది. నేను దీనికి తల్లినై పెంచాను. నాకు ఈ ఏనుగు మీద ఉన్న ప్రేమకు మీరు వెల కట్టలేరు. కనుక మీరు పదివేల గోవులను ఇచ్చినా కోటి బంగారునాణాలను ఇచ్చినా ఈ ఏనుగును నేను ఇవ్వను " అన్నాడు. రాజు " గౌతమా ! ఏనుగులు రాజులకు వాహనములు. నాకు ఇది వాహనంగా కావాలి. దీనిని నేను బలవంతంగా నైనా తీసుకోగలను. కనుక నీవు ఇష్టపూర్వకంగా ఈ ఏనుగును నాకివ్వడం మంచిది " అన్నాడు.

### ఏనుగుని ఇవ్వడానికి గౌతముని షరతులు

చివరకు **గౌతముడు** ఏనుగును ఇవ్వడానికి అంగీకరిస్తూ " రాజా ! పుణ్యకార్యములు చేసిన వాడికి సుఖములు, పాపకార్యములు చేసిన వాడికి కష్టములు కలిగించగలిగిన ప్రదేశం అయిన **యమసభకు** వస్తే నేను ఈ ఏనుగును నీకు ఇస్తాను. ఆ మాటలకు రాజువేషంలో ఉన్న ఇంద్రుడు నవ్వి " గౌతమా ! పాపములు చేసిన వారు నాస్తికులు పోయే చోటు అయిన యమసభకు నేను ఎలా రాగలను " అన్నాడు. గౌతముడు " రాజా ! అదేమిటి యముడు పుణ్యాత్ముడు కదా ! అక్కడకు రానని చెప్పడం మర్యాదగా ఉంటుందా ! " అన్నాడు. ఇంద్రుడు " అది కాదయ్యా ! యముడు తల్లి, తండ్రులని

అక్కను భక్తితో పూజించి పుణ్యాత్ముడయ్యాడు. అక్కడకు నేను రాను " అని అన్నాడు. గౌతముడు " సరేలే గంగానది ఒడ్డుకు రా అక్కడ నేను ఏనుగును ఇస్తాను " అన్నాడు. ఇంద్రుడు " గౌతమా ! నదీతీరాన అతిథులను సత్కరించి పిదప భుజించేవారు, పరుల నుండి ఏమీ పుచ్చుకునే వారు ఉంటారు కనుక అక్కడకు నేను ఎలా రాగలను ? " అని అడిగాడు. గౌతముడు " కానీ **మేరుపర్వతము** వద్దకు రా అక్కడ నేను ఈ ఏనుగును ఇస్తాను. ఇంద్రుడు " అదేమిటయ్యా ! మృదువుగా మాట్లాడే వారు, ఎల్లప్పుడు సత్యము పలికేవారు, సర్వభూతములను ప్రేమించేవారు, అందరి మీద దయ కలిగినవారు ఉంటారు అక్కడకు నేను ఎలా రాగలను " అన్నాడు. గౌతముడు " అయితే నారదుడు విహరించే వనముకు రా అక్కడ ఏనుగును ఇస్తాను " అన్నాడు. ఇంద్రుడు " అక్కడ ఉన్న నృత్యకళా కోవిదులతో నారదుడు వినోదిస్తూ ఉంటాడు. అక్కడకు నేను ఎలా రాగలను " అన్నాడు. గౌతముడు " పోనీ '**ఉత్తరకురుభూములకు** రా అక్కడ దేవతలు విహరిస్తుంటారు. దేవేంద్రుడు కూడా అక్కడకు వచ్చి దేవతల కోరికలు తీరుస్తుంటాడు. అక్కడ నీకు ఏనుగును ఇస్తాను " అన్నాడు. ఇంద్రుడు " అది కుదరదయ్యా ! అక్కడకు కామము, హింస విడిచి పెట్టిన వారు వస్తారు. ఆచోటుకు రావడం నా తరంకాదు " అన్నాడు. గౌతముడు " చంద్రుడి ఇంటికి రా అక్కడ నీకు ఏనుగును ఇస్తాను " ఇంద్రుడు " అక్కడ కుదరదులే. అక్కడ దానం చేసే వారు, మరొకరి దానము పుచ్చుకొనని వారు అక్కడకు వస్తారు. నేను దానం తీసుకోవడానికి అక్కడకు ఎలా రాగలను " అని అన్నాడు. గౌతముడు " పోనీ **సూర్యలోకముకు** రా ! అక్కడ ఇస్తాను " అన్నాడు. ఇంద్రుడు " మంచితపస్సు, సాధ్యాయనం చేసే వారు వస్తారు. కనుక అక్కడకు నేను రాలేను " అన్నాడు. గౌతముడు " పోనీ **వరుణలోకముకు** రా ! అక్కడ నీకు ఏనుగును ఇస్తాను " అని అన్నాడు. ఇంద్రుడు " యజ్ఞ, యాగములు, నిత్యాగ్ని హెూత్రములు చేసే వారు వస్తారు. అక్కడకు నేను రాను " అని అన్నాడు. గౌతముడు " పోనీ ఇంద్రుడి వద్దకు రా అక్కడ ఇస్తాను " అన్నాడు. ఇంద్రుడు " అమ్మో అక్కడకు యుద్ధ వీరులూ, యజ్ఞమును చేసిన సోమయాజులు, నూరేండ్లు జీవించిన మానవులు ఉంటారు. అక్కడకు నేను రాను " అన్నాడు. గౌతముడు " పోనీ **ప్రజాపతి లోకానికి** రా అక్కడ ఏనుగును ఇస్తాను " అన్నాడు. ఇంద్రుడు " అక్కడకు **అశ్వమేధయాగము** చేసినవారు వస్తారు. నేను అక్కడకు రాను " అన్నాడు. గౌతముడు " పోనీ **గోలోకము**కు రా అక్కడ ఇస్తాను " అన్నాడు. ఇంద్రుడు " అక్కడకు గోదానము చేసిన వారు, తీర్ధయాత్రలు సేవించిన వారు, నిరంతరం బ్రహ్మచర్యము అవలంబించువారు వస్తారు. అక్కడకు నేను రాను " అన్నాడు. గౌతముడు " రాజా ! శీతోష్ణములు, సుఖదుఃఖములు, మిత్రులు శత్రువులు లేని ద్వదందములకు అతీతమైన **బ్రహ్మలోకము**కు రా ! అక్కడ నీకు ఏనుగును ఇస్తాను " అన్నాడు. ఇంద్రుడు " అది కుదరదులే ! అక్కడకు సంగత్యము లేని వారు, ఆత్మజ్ఞానంతో ప్రకాశించే వారు, ఎల్లప్పుడూ వ్రతనిష్ఠ కలిగిన వారు, ఆధ్యాత్మ విద్యయందు ఆసక్తికలవారు వస్తారు. అక్కడకు నేను రాలేను " అన్నాడు.

### గౌతముడు ఇంద్రుడిని గుర్తించుట

గౌతముడు " మహాత్మా ! మీరు సామాన్యులు కారు సాక్షాత్తు దేవేంద్రులు. లేని ఎడల సకల లోకముల గురించి తెలియడం ఎలా సాధ్యం. దేవేంద్రా ! నీవు అన్ని లోకములు తిరుగుతుంటావు కదా ! నీవు పోకూడని లోకము ఏది ? " అని అడిగాడు. ఆ మాటలకు దేవేంద్రుడు సంతోషించి " మహాత్మా నీకు ఏమి కావాలో కోరుకో " అని అడిగాడు. గౌతముడు " దేవేంద్రా ! నేను ఈ ఏనుగును బిడ్డలా పెంచుకున్నాను దీనిని నా వద్ద ఉండనివ్వు " అని వేడుకున్నాడు. ఇంద్రుడు " గౌతమా ! నాకు ఆ మాత్రము తెలియదా ! ఆ ఏనుగు చూడు ప్రేమతో నీ తల మీద తన తొండముతో తడుముతూ వాసన చూస్తుంది. నిన్ను నీ బిడ్డను ఎలా వేరు చెయ్యగలను. మారు వేషములో ఉన్న నన్ను దేవతలు సహితం గుర్తుపట్ట లేరు. నీవు నీ పుణ్యవశమున నన్ను గుర్తు పట్టగలిగావు. నీకు నీ ఏనుగుకూ స్వర్గలోకప్రాప్తి కలిగిస్తాను నీవు నీ ఏనుగుతూ స్వర్గలోకములో శాశ్వతంగా ఉండండి " అని స్వర్గలోకానికి ఆహ్వానించాడు. గౌతముడు ఆ ఆహ్వానాన్ని మన్నించి ఏనుగుతో స్వర్గలోకముకు వెళ్ళాడు " ఇదీ స్వర్గలోకము కథ అని భీష్ముడు చెప్పాడు.

## తపోధర్మము

ధర్మరాజు " పితామహా ! మీరు తపోధర్మము గురించి చెప్పారు కదా ! తపోధర్మము కంటే మించిన ధర్మము మరొకటి లేదా " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ధర్మములన్నీ మంచివే అందులో తపోధర్మము మిక్కిలి శ్రేష్టము. తపస్సు అనగా ముఖ్యముగా మితంగా భుజించడం. ఒక సారి **భాగీరధుడు** బ్రహ్మసభకు వెళ్ళాడు. భాగీరధుడిని చూసిన బ్రహ్మ " నిర్మల తపస్సు చేస్తే కాని ఇక్కడకు రావడం సాధ్యము కాదు. ఎలాంటి తపస్సు చేయని నీవు ఎలా ఇక్కడకు వచ్చావు " అని అడిగాడు. భాగీరధుడు " బ్రహ్మదేవా ! నేను గోదానములు, భూదానములు, కన్యాదానము, రాజసూయయాగములు, అశ్వమేధయాగములు ఎన్నో చేసాను. కాని నేను అవి చేసినంత మాత్రాన ఇక్కడకు రాలేదు. ఒకసారి బ్రాహ్మణులు అంతా చేరి ఒక చోట యజ్ఞము చేస్తున్నారు. అప్పుడు వారి యజ్ఞానికి ఎన్నో అవరోధాలు కలిగాయి. నేను ఆ అవరోధాలు తొలగించి వారి యజ్ఞం సక్రమంగా జరిగేలా చూసాను. అందుకు వారు నన్ను " బ్రహ్మలోక ప్రాప్తి రస్తు " అని దీవించారు. అందుకని నేను బ్రహ్మలోకానికి వచ్చాను. నేను ఆకలిదప్పులు మాని బ్రాహ్మణులకు సేవ చేసాను. అందుకు మించిన తపస్సు ఏదైనా ఉందా "

అని అన్నాడు. ఆ మాటలు విన్న బ్రహ్మదేవుడు భగీరధుడిని ఎంతో ఆదరించాడు. ధర్మనందనా ! నీవు కూడా బ్రాహ్మణులను భక్తితో సేవింపుము " అని అన్నాడు భీష్ముడు.

## ఆశీర్వాదము ఆయుష్షు

ధర్మరాజు " పితామహా ! శ్తాయుష్మాన్భవ అనేది వేద వాక్కు కదా ! అయినా చాలామంది అల్పాయుష్కులుగా మరణించాడానికి కారణం ఏమిటి ? ఆయుష్షు వృద్ధి చెందడానికి కారణం ఏమిటి ఆయుష్షు క్షీణించడానికి కారణం ఏమిటి ? " అని అడిగాడు. భీష్ముడు ధర్మనందనా ! సదాచారము, నియమబద్ధ జీవితము ఆయుష్షును పెంచి వాడికి సంపదలు, కీర్తి కలిగిస్తుంది. దురాచారము, నియము లేని జీవితము ఆయువును క్షీణింపజేస్తుంది. సృష్టిలోని సమస్త భూతములు వాడిని తిరస్కరిస్తాయి. కనుక సదాచారము నియమబద్ధంగా జీవించుట మంచిది. ఉత్తములు నడచుమార్గమున నడిచిన నియమబద్ధ జీవితము అలవడుతుంది.

### ఆయువు క్షీణించే పనులు

గురువుగారి మాటలను దిక్కరించడం, పిట్టలను చంపడం, పనీపాట లేక గోళ్ళుకొరకడం, పుల్లలను తుంచడం, ఉదయము సాయంత్రము సూర్యుని వంక తేరిపార చూడడం ఆయువును క్షీణింపజేస్తాయి. సత్యము పలకడము, ప్రశాంతంగా ఉండడం, జీవహింస మానడం, త్రికాలములలో సంధ్యావందనం చేయడం, ప్రతిరోజు దేవతారాధన చెయ్యడం ఆయువును వృద్ధిచేస్తుంది. ఇతరుల భార్యను కోరడం ఆయువును క్షీణింపచేస్తుంది. అందులో మిత్రుడిభార్య, గురువుగారిభార్య, తనకంటే వయసులో పెద్ద వారిభార్య, రాజులభార్యలు, తన కంటే చిన్నవారి భార్యలు, వైద్యుల భార్యలు, సేవకుల భార్యలు, పనివారి భార్యలు, పండితుల భార్యలను కోరిన ఆయువు క్షీణిస్తుంది. తను ఆచరించ తగనిది అయినా వ్రతాన్ని ఆచరించిన ఆయువును వృద్ధిచేస్తుంది. గోశాలల దగ్గర, దేవాలయాల వద్ద, రచ్చబండల వద్ద మూత్రవిసర్జన చేయకూడదు. అలాగే నిలబడి మూత్రవిసర్జన చేయరాదు. భోజనముకు ముందు కాళ్ళు చేతులుకడగాలి. నిలబడి భోజనము చేయరాదు. ఎంగిలిచేత్తో బ్రాహ్మణుడుని, ఆవును, అగ్నిని తాకరాదు. పెద్దవాళ్ళు కనపడినప్పుడు చిన్నవాళ్ళు నమస్కరించాలి. వేదాధ్యయనము చేయునప్పుడు తలమీద చేతులు పెట్టుకోకూడదు. నిద్రపోయే ముందుగా స్నానము చేయాలి. రెండు చేతులతో తలనుగోకరాదు. తలకు పూసిన నూనెను ఒంటికి రాయకూడదు. గురువుల ఏడల శత్రుత్వము కూడదు. గురువులు కోపించినా సర్దుకు పోవాలి కాని గురువును తిట్టరాదు. గురువుల విషయంలో అసత్యములు చెప్పరాదు. బ్రాహ్మణులు, గోవులు, క్షత్రియులు, వృద్ధులు, బరువులు మోయు వారు, దుర్బలులు, గర్భిణీ స్త్రీలు ఎదురుగా వస్తున్నప్పుడు తప్పకుని దారి ఇవ్వాలి. బ్రాహ్మణులు , మంగళకరమైన వస్తువులు, చెట్టు కనిపించిన ప్రదక్షిణ పూరితంగా నమస్కరించాలి. పూర్ణిమ, అమావాస్య, చతుర్దశి, అష్టమి, ద్వాదశి తిథులలో జన్మ తిథులలో గృహస్థు బ్రహ్మచర్యము పాటించాలి. చాడీలు చెప్పక కూడదు, తగవులు పెట్టుకొన కూడదు, ఒక కాలును మరొక కాలుతో తోమరాదు. ఈ పనులు ఆయువును క్షీణింప చేస్తాయి. వికలాంగులను, దరిద్రుడిని, విద్యాహీనుని, అందవికారుని అపహాస్యము చేయుట తిట్టుట మహా పాపము. వారిని నిందించడం దేవతలను నిందించడముతో సమానము. పళ్ళు తోమునప్పుడు, మూత్ర విసర్జన చేయు సమయములలో మాటాడ రాదు. సూర్యోదయము, సూర్యాస్తమయ కాలలలో నిద్రించరాదు. ప్రతిరోజు తండ్రికి నమస్కరించాలి. తరువాత గురువులకు, బ్రాహ్మణులకు నమస్కరించాలి. ఉదయము దేవతార్చనకు ముందు ఎవరి వద్దకు పోరాదు. వివాహానికి ముందు స్త్రీని కోరకూడదు, అవివాహితను కోరకూడదు. ఉత్తరము, పడమర తలపెట్టి నిద్రించ రాదు. స్నానం చెయ్యక ముందు పై పూతలు పుయ్యకూడదు. ఒకరు విడిచిన వస్త్రము కట్టరాదు. ఒకరు తిన్న పదార్ధమును తినకూడదు. అన్యమనస్కగా భుజించకూడదు. భుజించే సమయంలో ఉద్రేకపూరితంగా మాటాడక మౌనంగా భుజించాలి. ఒకరి చేతి నుండి ఉప్పు తీసుకొన రాదు. రాత్రి పూట తేనె, పెరుగు తినరాదు. ఎదుటి వానికి పెట్టక తిన రాదు. పక్కవాడికి తక్కువ రకం భోజన పదార్ధాలు వడ్డించి తాను శ్రేష్టమైన పదార్ధాలు తినకూడదు. నెయ్యి, తేనె, పాయసము, నీరు తాను తినగా మిగిలినది మరొకరికి ఇవ్వరాడు. పితరులకు తర్పణము వదిలే ముందు ఆచమనం చెయ్యాలి. పగటిపూట దాంపత్యము కూడనిది. అక్కచెళ్ళెళ్ళు, గురువులు, మిత్రులు, పండితులు, దాయాదులు పేదవారుగా ఉన్న వారిని చేరతీసి పోషించడం, సాయం చేయడం ఆయువును వృద్ధిచేస్తుంది. పావురాళ్ళు, చిలుకలు, శార్ధీకములు, పుష్పలతలు, బంగారముతో చేసిన వస్తువులు, ఇంట్లో ఉండవలసిన మంగళ వస్తువులు. గ్రద్ద, దీపము పురుగులు, గుడ్లగూబలు, ఇంట్లో ప్రవేశించరాదు. అలా జరిగిన శాంతిచెయ్యాలి. సాయం సంధ్యాసమయంలో చదవడం తినడం పనికిరాదు. రాత్రి పూట శ్రాద్ధములు పెట్ట రాదు. క్షురకర్మ, అభ్యంగన స్నానము, అమోద యోగ్యమైన తిధులలోనే ఉత్తరముఖము, తూర్పు ముఖముగా కూర్చుని చెయ్యాలి. మనిషి చనిపోయిన తరువాత 11, 12 రోజులలో సపిండీకరణ, ఏకోదిష్టము అనే కర్మలు చేస్తారు. ఆ రోజుల్లో రాత్రిళ్ళు భోజనం చెయ్యకూడదు. పిలువకుండా ఎవరింటికీ భోజనముకు పోరాదు. ఏదైనా ఒక కార్యమును సాధించే విషయంలో తల్లితడ్రులకు, కుమారులకు హితబోధ చెయ్యవచ్చు. క్షత్రియుడు విద్యలు ఈ విధంగా ఆచరించాలి. గుప్పపుస్వారీ, ఏనుగును ఎక్కడం,

రథము తోలడం, నానా విధములైన ఆయుధములను ప్రయోగించే నేర్పు, యుద్ధ తంత్రము గురించి తెలుసుకోవడం, దండనీతిని అభ్యసించడం, అర్ధశాస్త్రము, ధర్మశాస్త్రము, కామశాస్త్రము, సర్వశాస్త్ర అధ్యయనం, వేదాధ్యయనం, ప్రజాపాలన, యజ్ఞములు చెయ్యడం వంటి క్షత్రియోచిత విద్యలను క్షత్రియులు విధిగా నేర్చుకోవాలి. రజస్వల అయిన స్త్రీని ముట్టుకోరాదు. అన్ని ఆచారములలోకి ఇతరుల పట్ల దయకలిగి ఉండడం సదాచారము. సదాచారముతో జీవించిన ఆయుస్షు పెరుగుతుంది " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## అన్నదమ్ముల విధులు

ధర్మరాజు " పితామహా ! ఈ లోకములో అన్నదమ్ములు ఎలా ప్రవర్తించాలో తెలియజెయ్యండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! చిన్న వాళ్ళయిన తమ్ములు పెద్ద వారైన అన్నల ఎడల భక్తి శ్రద్ధలతో మెలగాలి. అలాగే అన్నయ్యలు కూడా తమ తమ్ముల పట్ల వాత్సల్యముతో ప్రవర్తించాలి. తమ్ములలో ఒకడు బుద్ధిహీనుడైనా పరవాలేదు కాని అన్నమాత్రము బాధ్యతా యుతంగా ప్రవర్తించక ఉన్న ఆ కుంటుంబం నాశనం ఔతుంది. అన్నదమ్ములు తమలో తాము తగవులు వదిలి పెద్దలు ఇచ్చిన ఆస్తిని సమంగా పంచుకోవాలి. అలా చేసిన లోకము వారిని కీర్తిస్తుంది. అలా చేయక వారిలో ఏ ఒక్కడైనా స్వార్ధంతో అంతా స్వాధీనం చేసుకున్న ఆ కుంటుంబం చిన్నాభిన్నంమై అపకీర్తి పాలు ఔతుంది. తండ్రి తరువాత తండ్రి అంతటి వాడు అన్నయ్య. ఆయన భార్య తల్లి తరువాత తల్లి వంటిది. తల్లి తండ్రుల మరణానంతరం అన్నవదిన తల్లి తండ్రులతో సమానము. అన్నదమ్ములు ఎవరైనా మిగిలిన అన్నదమ్ములకు ద్రోహం చేసిన అతడు శిక్షార్హుడు ఔతాడు. తల్లి తరువాత అక్క తల్లి వంటిది. చిన్నతనంలో తనకు పాలిచ్చి పెంచిన ఆయాలు దాదులు తల్లివంటి వారే. తండ్రి తొలి గురువు. తండ్రి గురువుకంటే పదింతలు పెద్ద. తండ్రి కంటే తల్లి పదింతలు పెద్దది. తల్లి తండ్రులు శరీరం ఇచ్చి ఈలోకలోకి తీసుకు వస్తారు. గురువు విద్యాబుద్ధులు నేర్పి మరుజన్మ ప్రసాదిస్తాడు. గురువు ఇచ్చినజన్మ అజరామరమైనది కనుక గురువు అధికంగా పూజించ అర్హుడు " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## ఉపవాస వ్రతము

ధర్మరాజు " పితామహా ! ఉపవాసవ్రతము బ్రాహ్మణులకు క్షత్రియులకు మాత్రమే నిర్దేశింపబడింది. మిగిలిన వర్ణములకు కాదు అంటారు కదా ! పైగా ఎక్కువ ఉపవాసములు చెయ్యడం దోషము అంటారు కదా ! అసలు ఉపవాసము అంటే ఏమిటి ? దానికి ఉండవలసిన యోగ్యతలు ఏమిటి ? ఉపవాసము వలన కలుగు ఫలితం ఏమిటి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నువ్వు అడిగినట్లే నేను **అంగీరసుడు** అనే మునీశ్వరుడిని అడిగాను. ఆయన చెప్పినది నీకు చెప్తాను విను. బ్రాహ్మణుడు, క్షత్రియుడు మూడు రాత్రులు ఉపవసించ వచ్చు. శరీరము సహకరించి అనారోగ్యము పాలుకాకున్న మరి కొన్ని రోజులు ఉపవశించ వచ్చు. వైశ్యులు, శూద్రులు నాలుగు పూటలు మించి ఉపవసించ రాదు. పౌర్ణమి, శుక్లపక్ష అష్టమి, చతుర్దశి, శుక్లపక్ష పంచమి, షష్టి, అలాగే బహుళ పంచమి, షష్టి ఉపవాసముకు తగిన పర్వ దినములు. రోజుకు ఒక రోజు మాత్రమే తిని ఉపవాసము ఉండు బ్రాహ్మణుడికి అందమైన భార్య, సంతానం కలుగి ఐశ్వర్యవంతుడు ఔతాడు. ఇలా ఒక్క సంవత్సరము ఉపవాసము ఉన్న అతడికి ఈ లోకములోని సౌఖ్యములన్నీ పొందుతారు. ఎన్ని రోజులు ఉపవాసము ఉంటే అన్ని సౌఖ్యములు కలుగుతాయి. ఒక సంవత్సరములో 15 రోజులు ఉపవసించిన పుణ్యలోకప్రాప్తి కలిగుతుంది. ఒక మాసము ఉపవసించిన బ్రహ్మలోకప్రాప్తి కలుగుతుంది. కాని ఎవరూ సంవత్సరంలో ఒక మాసము మించి ఉపవసించ రాదు. యుగయుగానికి మనుష్యునికి ఉపవాస సామర్ధ్యము మారుతుంది కనుక వారి కాల ప్రమాణం అనుసరించి ఉపవాస దినముల సంఖ్య మారుతుంటుంది. తల్లిని మించిన గురువు, వేదముకు మించిన శాస్త్రము, ధర్మముకు మించిన లాభము లేదు. పవిత్రములైన వాటిలోకెల్లా బ్రాహ్మణుడు పవిత్రుడు. కనుక బ్రాహ్మణుడిని భక్తితో పూజించాలి. పూర్వము దేవతలు మునులు ఉపవాసధర్మము అనుసరించి గొప్పవాళ్ళు అయ్యారు. విశ్వామిత్రుడు తన జీవితమంతా ఏక భుక్త్యము చేసి బ్రాహ్మణత్వము పొందాడు. కనుక ఉపవాసముకు మించిన వ్రతము లేదు. ఉపవాసవ్రతము అనుసరించడం వలన మనసు శరీరము పవిత్రమౌతాయి. పైన చెప్పిన ఉపవాస ధర్మము లోకముకు అంగీరస మహర్షి అందించాడు. అంగీరసుడు చెప్పిన విధంగా వ్రతాచరణ చేసిన మానవుడికి పాపములు అంటవు " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## యజ్ఞ సమాన పుణ్యములు

ధర్మరాజు " పితామహా ! యజ్ఞములు చేయవలెనని మీరు అనేకమార్లు చెప్పారు కాని యజ్ఞములు చెయ్యడానికి ఎంతో ధనము కావాలి కదా ! మరి యజ్ఞములు చేయలేని వారి సంగతి ఏమిటి ? వారు ఎలాంటి పుణ్యకర్మలు ఆచరించాలి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! అందరికీ యజ్ఞములు యాగములు అందరికీ సాధ్యం కాదు కనుక **అంగీరసుడు**

ఉపవాస వ్రతం ఉపదేశించాడు. ఉపవాస వ్రతం చెయ్యడం కష్టమని కదా యజ్ఞముల గురించి అడిగావు. ఉపవాసము చెయ్యడంలో తేలికైన విధము చెప్తాను విను. రోజుకు రెండు సార్లు అనగా పగటి పూట ఒక సారి రాత్రి పూట ఒక సారి మాత్రమే భోజనము చేసి భోజన సమయంలో మాత్రమే నీరుత్రాగి మధ్యలో ఏమీ తినకుండా త్రాగకుండా ప్రతి రోజు అగ్నిని ఆరాధించే వారు ఉపవాస వ్రతము ఆచరించినట్లేనని పెద్దలు చెబుతారు. ఇది కూడా ఆచరించడం కష్టమని తలచిన అంగీరసుడు చెప్పిన మిగిలిన ఉపవాసవ్రతములు ఆచరించవచ్చు " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## శ్రీకృష్ణుని తత్వము

ధర్మరాజు " పితామహా ! శ్రీకృష్ణుడు జ్ఞానప్రతీక అంటారు కదా ! ఆయన బోధనలు నాకు వినవలెనని కోరిక కలుగుతుంది. కనుక శ్రీకృష్ణతత్వము నాకు వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ సందర్భంలో నీకు హర, సనత్కుమార సంవాదానాన్ని వివరిస్తాను. పూర్వము ఒక కోరికతో పరమశివుడు సనత్కుమారుడి వద్దకు వెళ్ళాడు. పరమశివుడికి **సనత్కుమారుడు** అతిథి మర్యాదలు చేసి సత్కరించాడు. పరమ శివుడు కొన్ని సందేహాలు తీర్చమని సనత్కుమారుడిని అడిగాడు. సనత్కుమారుడు అది తన భాగ్యమని చెప్పాడు. శివుడు " మహాత్మా ! ధ్యానముతో దర్శింపతగిన వస్తువేది ? తత్వములు ఎన్ని ? సాంఖ్యము యోగము వాటి తత్వములు ఎన్ని ? సాంఖ్యము యోగము వాటి తత్వములు ఏవి ? ఇంకా ఆధ్యాత్మిక విషయములను వివరించు " అని అడిగాడు. సనత్కుమారుడు " మహాశివా ! తత్వములు 24 అని కొందరు, 23 అని కొందరు, 25 అని కొందరు అంటారు. ప్రాకృతులు 23 అంటారు. వారు మనస్సు బుద్ధి ఒకటే అని అంటారు. అది సరి కాదు. పరిశుద్ధమైన 24 అనే వారు పరిశుద్ధమైన మనసే బుద్ధి అంటారు. నేను మాత్రము 25వ తత్వము ఉంది అని నమ్ముతాను. అదే **అధిష్ఠానము**. 24 తత్వములు 25వ తత్వములో లీనమైఉంటాయి. కనుక 24 తత్వాలు ఉన్నాయనడము, లేవు అనడము అంటారు. రెండూ సంభవమే. ఈ లోకములో పంచభూతములు ఐదు. వాటి గుణములు అయిదు. ఇంద్రియములు పది. ఇవి కాక బుద్ధి, మనసు, అహంకారము, ప్రకృతి కలిపి మొత్తము 24. ఈ 24 నాలుగు తత్వములను అధిష్ఠించి ఉండేది 25వ తత్వము. బాగా తెలిసిన వాడు 24 తత్వములు కూడినది దేహము అని అంటారు. 25వ తత్వమైన పరమాత్మ కట్టెలో నిప్పు దాగి ఉన్న చందాన శరీరమంతా ఆవహించాడు. కాని మానవుడితో ఉన్న సజమైన ఈర్ష్య, అసూయ, దురభిమానము ఈ జ్ఞానమును అంట నీయదు. నేను నాది అనుకుంటూ నిత్యమూ ఈ దేహమే తానని భ్రమిస్తూ సంసారంలో తిరుగుతుంటాడు. వేదము పరమాత్మతత్వము, బ్రహ్మమును గురించి తెలియజేస్తుంది. దానిని అమృతత్వ తత్వము అంటారు. అమృతత్వతత్వము అన్ని తత్వములకంటే మేలైనది. దానిని ఎరిగిన వాడు మృత్యుంజయుడు ఔతాడు. అది తత్వములక్కన్నింటికీ ఈశ్వరుడు. ఇంతకు మించిన ఈశ్వరుడు లేడు. ఇది సత్యము నిత్యము రహస్యము. పరమశివా ఈ తత్వములు పైనుండి కిందకు వచ్చిన సృష్టి, కింద నుండి పైకి వెళ్ళిన లయము అంటారు. వీటన్నింటినీ దాటన్నింటినీ దాటి **బ్రహ్మపదము** చేరడమే ఏకత్వము అంటారు. శ్రద్ధలేని వాడికి, మనసులో ఏకాంతత లేని వాడికి, ఇంద్రియములను జయించని వాడికి, వేదాధ్యయనము చేయని వాడికి ఈ జ్ఞానము సిద్ధించదు.

### అధ్యాత్మము అధిభూతము అధిదైవతము

తరువాత **సనత్కుమారుడు** పరమశివుడికి అధ్యాత్మము, అధిభూతము, అధిదైవతము గురించి చెప్పసాగాడు. " ఈశ్వరా ! సకల జీవులలో ఈ అధ్యాత్మమము సమానంగా నిండి ఉంటుంది అని తెలుసుకోవడమే నిజమైన జ్ఞానము. కాని ఈ జ్ఞానమును మునుపు దేవతలు, రాక్షసులు, గంధర్వులు, మానవులు తెలుసుకోలేక అజ్ఞానంలో పడ్డారు. అసలు **బ్రహ్మతత్వము** ఇంత వరకు ఎవరూ తెలుసుకొన లేదు. ఆ బ్రహ్మత్వత్వమే ఓంకారము. అహంకారము పూర్తిగా నశించిన కాని బ్రహ్మతత్వము గోచరము కాదు. ఈ బ్రహ్మము నిష్కళంకము, సుఖప్రదము, అఖిలము జ్ఞానదాహార్తిని తీర్చ కలిగిన సామర్ధ్యశాలి. ఈ బ్రహ్మము అప్రమేయము, అవిజ్ఞేయము, అచలము, ఆది అంతము లేనిది, విమలము, అవ్యయము, ఇంద్రియ గోచరము కానిది, అచ్యుతము, సత్ అసత్ కలిసి భాసించేది. ఈ బ్రహ్మ తత్వము ముందు నారాయణుడికి తెలుసు నారాయణుడి వలన దేవతలు, మునులు, సిద్ధులు, సాధ్యులు, గంధర్వులు తెలుసుకున్నారు. బ్రహ్మతత్వము అందరికీ గోచరము కాదు బవబంధ విముక్తుడు మాత్రమే బ్రహ్మతత్వము తెలుసుకొన కలడు. ముందు జీవుడు అహంకారము వదిలి జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మనసు చేసే పనులను వదిలి వేయాలి. అప్పుడు అతడి మనసు బుద్ధి పరమాత్మలో లీనమౌతుంది. పరమ శివా ! ఇలా 23 తత్వములు పరమాత్మలో లీనమైన తరువాత ఇక పరమాత్మను చూచుట ఏముంది ? అదే అద్వైత స్థితి.

### మానవశరీరంలోని దేవతాస్వరూపములు

పరమశివా ! మానవశరీరంలో ఉండే దేవతా స్వరూపము వివరిస్తాను. నాలుక మీద చంద్రుడు, తలలోసరస్వతి, ప్రాణములలో వాయువు, ఉదానములో మెరుపులు, వ్యానములో **పర్జన్యుడు**, వక్షస్థలంలో ఆకాశం, బలములో**కౌశికుడు**, అపానములో **ఈశానుడు**, సమానములో మిత్రుడు, అప్సరసలు, కన్నులలో సూర్యుడు దేహములో భూమి, పాదాలలో విష్ణువు. ప్రబుద్ధుడు, అబుద్ధుడు. యోగి అయిన వాడు. ఈ దేవతలందరినీ సమంగా ఆదరిస్తూ తన ప్రాణములు ఊర్ధ్వ ముఖంగా ప్రయాణింపజేసి శిరస్సులో నిలుపుతాడు. ఆ సమయంలో యోగి వ్యక్తమైన బ్రహ్మను దర్శిస్తాడు. అదే అవ్యక్త స్థితి. అబుద్ధుడు వ్యక్త రూపం తెలుసుకుంటాడు. ప్రబుద్ధుడు అవ్యక్త రూపం తెలుసుకుంటాడు. నిజానికి అబుద్ధుడు ప్రబుద్ధుడు ఆత్మ యొక్క రెండు దశలు మాత్రమే. ఆత్మ ఒక్కటే. అవ్యక్త రూపము తెలుసుకున్న యోగికి ఈ ప్రపంచంలో ఎవ్వరూ సాటిరారు. యోగులకు తప్ప మిగిలిన వారికి ఆ స్థితి దుర్లభం. ఆత్మ క్షరము, అక్షరము, పరము అనే మూడు స్థితులలో వ్యక్తమౌతూ ఉంటుంది. 25వ తత్వమే **ప్రబుద్ధము** అంటారు. ఈ 25వ తత్వము ప్రకృతితీ కలిసిన **అబుద్ధుడు** అంటారు. ఈ అబుద్ధుడిని 26వ తత్వముగా పిలుస్తారు. ఈ అబుద్ధుడు మాటకు మనసుకు అందడు. ఈ అబుద్ధుడు తనకు తానుగా తెలుసుకుంటూ ప్రబుద్ధుడు ఔతాడు. లేక తనకు తాను ప్రకృతిగా తలచిన అజ్ఞానంలో పడతాడు. ఆ అజ్ఞానము తొలగిన ప్రబుద్ధుడు ఔతాడు.

## మునిజన వృత్తి

పరమశివా ! ఇక మునిజనులు చేసే పనులను వివరిస్తాను. **మునివృత్తి**స్వీకరించిన వాడు అడవులలో కొండ గుహలలో నివసించాలి. ఇంద్రియనిగ్రహము పాటించాలి. విషయవాంఛలను వదిలి పెట్టిన అతడు యోగి ఔతాడు. గురువుగారి బోధనలను పాటిస్తాడు. ఆహారాన్ని తగ్గిస్తాడు. తదనుగుణముగా మూత్ర విసర్జన కూడా తగ్గి పోతుంది. క్రమంగా ఆహారం తీసుకోవడం ఆపి నిశ్చలుడౌతాడు. అప్పుడు ఆత్మ సాక్షాత్కారం లభిస్తుంది. అందుకు నిర్జనమైన ప్రశాంత ప్రదేశము కావాలి. అప్పడే యోగి తమము, అస్తమము, జ్ఞానము, అజ్ఞానము వంటి ద్వందములు లేని స్థితిని పొందుతాడు. అదే అద్వైత స్థితి. ఈ అద్వైతస్థితిని పొందిన యోగులు తమ తమ దుఃఖముల నుండి విముక్తులౌతారు. జరామరణములు లేని స్థితిని పొందుతారు. వారికి అణిమాది అష్టసిద్ధులు సిద్ధిస్తాయి. అటువంటి యోగులు యక్షులు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు మొదలైన భూతకోటిని మించి పోతారు. స్వేచ్ఛాజీవులుగా మారి పోతారు. ఈశ్వరా ! భవ్యయోగ తత్పరులమైన నేను, మా సహ జన్మలైన సనక సనంద, సనత్సుజాతులు కూడా ప్రస్థుతము అదే స్థితిలో ఉన్నాము. కనుక యోగధర్మము కంటే ఉత్తమమైన మార్గము వేరొకటి లేదు. మోక్షము పొందడానికి యోగధర్మము నిచ్చెన వంటిది.

## సాంఖ్యము

పరమశివా ! యోగము గురించి చెప్పాను. ఇప్పడు సాంఖ్యం గురించి చెప్తాను. సాంఖ్యయోగులు యోగము, సాంఖ్యము ఒకటే అని భావించి ఈ భవసాగరమును దాటి తరిస్తారు. ఇంద్రియముల కంటే మనస్సు, మనస్సు కంటే అహంకారము, అహంకారము కంటే బుద్ధి, బుద్ధి కంటే ప్రకృతి గొప్పవి. వీటన్నింటికీ అధికుడు పురుషుడు. పరమశివా ! పంచభూతములు ఐదు, వాటి గుణములు ఐదు, ఇంద్రియములు పది, మనస్సు , బుద్ధి, అహంకారము, ప్రకృతి నాలుగు. మొత్తము 24 తత్వములు. చేతనుడైన పురుషుని ఆశ్రయించుకుని అచేతనమైన ప్రకృతి కూడా చైతన్యవంతం ఔతుంది. మొత్తము 23 తత్వములు 24 వ తత్వమైన ప్రకృతి అనే మహాసముద్రపు అలల మీద తేలియాడుతూ ఉంటాయి. పురుషుడు గుణరహితుడైనా ప్రకృతితో చేరిన పురుషుడు గుణములు కలవాడుగా ఔతాడు. అందు వలన మిగిలిన 23 తత్వములు కూడా పురుషుడికి వాటి వాటి గుణములు ఆపాదిస్తాయి. తాను వేరు ఈ ప్రకృతి వేరు వేరు ఈ 23 తత్వములు వేరు అని తెలుసుకుని ప్రకృతిని ఉపేక్ష చేసి పొగలేని నిప్పులా ప్రకాశిస్తాడు. అలా కాక ఈ ప్రకృతే తానని అహంకరించి తానే ఈ సృష్టికి లయకు కర్త అని భావించిన పురుషుడు వికారమును పొంది ఈ ప్రకృతిని ఎదిరించ లేక దానికి వశుడై తమోగుణ ప్రధానములైన ఈ ప్రాపంచిక సుఖములలో మునిగి పోతాడు. 25వ తత్వమైన పురుషుడు ప్రకృతిని పట్టించుకొనక ఉపేక్షించిన 26వ తత్వమైన పరమానంద స్థితిని పొందుతాడు. కనుక పురుషుడు సత్యగుణమును ఆశ్రయించి తత్వజ్ఞానము అలవరచుకుంటే ప్రకృతిలో లీనంకాకుండా చిదానంద రూపుడౌతాడు. ఈ 26వ తత్వమే విద్య. కాని దానికి విద్య అవిద్య అనే గుణములు లేవు. దానికి ఆది అంతము లేదు, మార్పు లేదు, అజామరుడు, అనంతుడు, ఆత్మస్వరూపంగా ప్రకాశిస్తాడు

## సాంఖ్యయోగుల గుణములు

మహాదేవా ! ఈ సాంఖ్యయోగమును అభ్యసించిన వారు చక్కని జ్ఞానసంపదతో ప్రకాశిస్తారు. రాబోయే అరిష్టములను ముందుగా కనిపెట్ట కలిగిన పాటవము కలిగిఉంటారు. కనుక రాబోయే అరిష్టములు అరికట్టగలుగుతారు. యోగాభ్యాసకులైన

మునులు తమకు రాబోయే అరిష్టములనుముందే తెలుసుకుని సర్వాంగధారణతో అన్ని తత్వములను ఏకంచేసి మృత్యువును జయిస్తారు. నీటిలో చేప మేడిపండులో పురుగులు ఎలా ఉంటాయో అలాగే తాను కూడా ఈ లోకములో సంచరిస్తుంటానని తెలుసుకున్న సాధకుడు ఈ ప్రకృతి నుండి విడివడి అవ్యయత్వము పొందుతాడు. తామరాకు మీద నీటిబొట్టులా పురుషుడు ఈ లోకములో సంచరిస్తూ కూడా తత్సంబంధమైన వికృతికి లోను కాకుండా నిర్లిప్తంగా, నిశ్చలంగా, అజరామరంగా వెలుగొందుతాడు. ఈ ప్రకారంగా ప్రకృతిని వదిలి పెట్టిన 25వ తత్వమైన పురుషుడు 26వ తత్వమును పొంది విమల, శివ, నిరంజన స్వరూపుడై వెలుగొందుతాడు. పరమశివా ఈ జ్ఞానమును నాకు, లోకానికి పూర్వము నా గురువైన కపిలమహర్షి అనుగ్రహించాడు. ఆయన కింద శిక్షణపొందిన అనేక మంది శిష్యులు ఆయన భోధనతో జ్ఞానవంతులు అయ్యారు. నేను కూడా అనేక మంది శిష్యులకు ఈ జ్ఞానాన్ని బోధించాను. ఎందరో దివ్యమునులు దీనిని శ్లాఘించారు. గార్గ్యుడు, గౌతముడు, కాత్యాయనుడు మొదలైన మహా మునులు ఈ బోధనతో తమ తమ మనసులోని సందేహాలను తీర్చుకున్నారు. వారు ఈ ప్రకృతి సంపర్కము వదిలి దివ్యత్వము పొందారు. పరమశివా పురుషుడు ప్రకృతితో కలవడమే బంధము కలవకుండా ఉండడమే మోక్షము " అని చెప్పి సనత్కుమారుడు ఆకాశమార్గాన వెళ్ళి పోయాడు. శివుడు కూడా తన దివ్యమైన మనో పధంలో విహరించసాగాడు " అని భీష్ముడు ధర్మరాజుకు వివరించాడు.

## పవిత్ర తీర్ధము

ధర్మరాజు " పితామహా ! ఎన్నో తీర్ధాలు ఉన్నాయి కదా ! అందులో పరమ పవిత్రమైన తీర్ధము ఏది వివరించండి ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! తీర్ధములు అన్నీ మేలైనవే. అందులో పవిత్రము అపవిత్రము అంటూ ఏమి లేదు. అన్ని తీర్ధములలో **మానసతీర్ధము** పరమ పవిత్రమైనది. దాని పేరు సత్యము. దానికి స్థానము **ధృతి** అనే సరోవరము. ఎవరైతే రజస్సు, తమోగుణాలను పక్కనపెట్టి సత్యాన్ని చేతధరించి ఆ సరోవరంలో స్నానము చేస్తాడో అతడు పరిశుద్ధుడౌతాడు. రాగద్వేషములను వదిలి ఇంద్రియనిగ్రహము పాటించు మహాత్ములందరూ పవిత్రతీర్ధముతో సమానులే. వారిని సేవించడం ద్వారా మానవుడికి పుణ్యతీర్ధసేవనఫలం దక్కుతుంది. తపస్సుచేయడం, ఇంద్రియనిగ్రహము కలిగి ఉండడం, అహింసనుపాటించడం, మనస్సును నిగ్రహించడం, శుభ్రతకలిగి ఉండడం ఇవన్నీ పుణ్యతీర్ధసేవతో సమానములే. పైగుణములు లేకుండా కేవలం నదీజలాలలో మునిగినంత మాత్రాన పుణ్యతీర్ధసేవన ఫలము దక్కదు. కేవలం శరీరము శుభ్రపడుతుంది కాని మనసు శుభ్రపడదు కదా ! దొరకని వాటి కొరకు ఆశపడకపోవడం, దొరికిన వాటితో తృప్తి చెందడం, ఎల్లప్పుడు తృప్తితో సంతృప్తితో ఉండడం, ఆశాపాశములు విడిచి పెట్టడం పాటించే నరులకు వేరు తీర్ధములు అవసరం లేదు " అని భీష్ముడు పలికాడు.

## ఉత్తమ పదము

ధర్మరాజు " తాతగారు ! మానవుడు ఏ విధంగా ప్రవర్తిస్తే ఉత్తమపదము చేరుకుంటాడు. మానవుడు చనిపోయిన తరువాత ఈ దేహము విడిచి పెట్టి తనతో దేనిని సాయంగా తీసుకు వెడతాడు ? వివరించండి " అని అడిగాడు. భీష్ముడు" ధర్మనందనా ! నీవు అడిగినవి నిగూఢమైనవి. వాటిని చెప్పడానికి ఒక్క బృహస్పతి మాత్రమే తగిన వాడు. ఆయన ఇక్కడకు వస్తున్నాడు. నీ సందేహములను ఆయనను అడిగి తెలుసుకో " అని భీష్ముడు చెప్పాడు. భీష్ముడు ఆ మాటలు అంటూ ఉండగానే దేవగురువు బృహస్పతి అక్కడకు వచ్చాడు. ధర్మరాజు తన తమ్ములతో సహా అతడికి ఎదురేగి బృహస్పతికి అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి ఉచితాసనము మీద ఆసీనుడిని చేసి ధర్మరాజు తాను ముందు భీష్ముడిని అడిగిన ప్రశ్నను అడిగాడు. బృహస్పతి " ధర్మనందనా ! పుట్టే ముందు, చచ్చిన తరువాత, పుణ్య లోకములలోను, నరకంలోను జీవుడు ఉంటాడు. ఈ లోకంలో తల్లి, తండ్రి, భార్య, కుమారులు, కుమార్తెలు, బంధువులు స్నేహితులు స్మశానం వరకు మాత్రమే వెళ్ళి తిరిగి పోతారు. నరుడు చనిపోయిన తరువాత అతడి ధర్మమే అతడికి తోడుగా వస్తుంది. కనుక బ్రతికి ఉన్నప్పడే మానవుడు ధర్మకార్యములు చెయ్యాలి. అలా ధర్మకార్యములు చేయని వాడు, ధర్మము వదిలి ప్రవర్తించే వాడు, నరకానికి పోతాడు " అని పలికాడు బృహస్పతి.


యుధిష్టురునికి ఉపదేశిస్తున్న బృహస్పతి

## జీవుడు ధర్మము

ధర్మరాజు " ఈ శరీరాన్ని వదిలపెట్టి వెళ్ళే జీవుడిని ధర్మము ఎలా అనుసరిస్తుంది ? " అని అడిగాడు. బృహస్పతి " ధర్మనందనా ! పంచభూతములు, వాటి గుణములు అయిన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులూ బుద్ధి, ధర్మము జీవుడిని అనుసరించి వెడతాయి " అని పలికాడు. ధర్మరాజు " మహాత్మా ! రేతస్సు ఎలా ఏర్పడుతుంది ? " అని అడిగాడు. బృహస్పతి " ధర్మనందనా ! మానవుని శరీరము పంచభూతాత్మకము. మనస్సు దేహంలో ఉంటుంది. అన్నం దేహాన్ని పోషిస్తుంది. మానవుడిలో కలిగిన కామము రేతస్సును ఏర్పరుస్తుంది. స్త్రీ పురుషుల కలయిక వలన స్త్రీ గర్భాశయము చేరిన రేతస్సు గర్భము ధరింపచేసి పిండరూపము పొందుతుంది. అలా జన్మించిన మానవుడు తాను చేసుకున్న పుణ్యఫలముగా సుఖములు అనుభవిస్తాడు. పాపాలు చేసుకుంటే దు:ఖములు అనుభవిస్తాడు. పూర్వజన్మలో తాను చేసుకున్న పాపపుణ్యాలు ధర్మాధర్మములు అతడికి సుఖదు:ఖములు కలుగచేస్తాయి. కనుక మానవుడు సదా ధర్మకార్యములు చేయాలి. పాపకార్యములకు దూరంగాఉండాలి. పూర్వజన్మలో అధర్మము, పాపకార్యములు చేసిన వారు మానవజన్మకు బదులు పశుపక్ష్యాదులుగా క్రిమి కీటకాలుగా జన్మిస్తాడు. అదే నరకము. నరకము అంటూ వేరీది లేదు.

## కర్మ సిద్ధాంతము

ఇక నీకు కర్మ గురించి చెప్తాను విను. జననీ, జనకులు, గురువులకు మేలుచేస్తే సుఖము వారికి కీడుచేస్తే దు:ఖము కలుగుతాయి. వీరు కాక తక్కిన విషయములలో పాపముచేస్తే దానికి ప్రాయశ్చితము ఉంది కాని తల్లి, తండ్రి, గురువుల పట్ల చేసిన అపచారమునకు, పాపముకు పరిష్కారము లేదు. ఆహారధాన్యమును అపహరించిన వాడు మరుజన్మలో ఎలుకగాను, పందికొక్కుగాను, కుక్కగానూ జన్మిస్తాడు. పరులభార్యను కోరువాడు తోడేలుగాను, రాబందుగాను, కోతిగాను, గ్రద్దగానూ పుడతాడు. చివరకు పురుగుగాను పుడతాడు. అప్పటికి కాని ఆపాపముపోదు. ఎవరైతే తన కూతురును ఒకరికి ఇచ్చి పెళ్ళి చేసి మరలా మనసు మార్చుకుని ఆమెను వేరొకరికి అప్పగిస్తాడో అతడు పురుగుజన్మ ఎత్తుతాడు. దేవకార్యము చేసిన తరువాత పితరులకు నివేదనము చేయకుండా భోజనము చేయువాడు కాకిజన్మ ఎత్తుతాడు. అన్నగారిని తిట్టిన వాడు పక్షిజన్మ ఎత్తుతాడు. శూద్రుడు బ్రాహ్మణ స్త్రీని కోరిన అతడు పురుగుగా పుడతాడు. చేసిన మేలు మరచినవాడు నరకబాధలు అనుభవిస్తాడు. ధనము మీద వాంఛతో నిరాయుధుడిని చంపినవాడికి పక్షిజన్మ వస్తుంది. ఆ జన్మలో చావుదెబ్బలు తింటూ మారణాయుధాల వలన మరణిస్తాడు. స్త్రీని చంపినవాడు మరుజన్మలో అనేక రకములైన నరకబాధలు అనుభవిస్తాడు. అన్నము, పాలు దొంగిలించిన వాడు వాటిలో పురుగులుగా జన్మిస్తాడు. పండ్లను, ఇనుమును, వెండి, బంగారమును దొంగలించిన వాడు వరుసగా కోతి, కాకి, పక్షి, క్రిమిగా పుడతాడు. ఇతరుల దుస్తులు అపహరించిన వాడు కుందేలుగా పుడతాడు. ఇతరులు తన వద్ద ధనమును అపహరించి వంచించిన నమ్మక ద్రోహి చేప మొదలైన నీచ జన్మలు ఎత్తుతాడు. పైన చెప్పిన పాపాలు స్త్రీలు చేస్తే పురుషులు ఎత్తిన జన్మలలో వారికి భార్యలైపుట్టి వారితోచేరి నరకబాధలు అనుభ్యవిస్తారు .

### పాపపరిహారము

బృహస్పతి " ధర్మనందనా ! చేసిన పాపములు దానధర్మము వలన నశిస్తుంది. అన్ని దానములలో అన్నదానము శ్రేష్టము. న్యాయముగా సంపాదించిన ధనముతో అన్నదానము చేసిన అది అన్ని పాపములను హరిస్తుంది. చివరకు తాను భిక్షగా తీసుకు వచ్చినది అయినా బ్రాహ్మణుడికి పెట్టి అతడి ఆకలి తీర్చిన అతడికి పుణ్యలోకములు కలుగుతాయి. బ్రాహ్మణుడు వేదాధ్యయనము చేసినందు వలన, తాను నేర్చుకున్నది పదిమందికి బోధించడం వలన, క్షత్రియుడు అటువంటి బ్రాహ్మణులను పోషించడం వలన ఉత్తమ లోకాలను పొందుతాడు. వైశ్యుడు ధర్మంగా చేసిన ఆర్జనతో అనన్నదానము చేసి పుణ్యం సంపాదించ వచ్చు. శూద్రుడు తాను శ్రమపడి తెచ్చిన ధనముతో అనన్నదానము చేసి పుణ్యలోకములకు పోతాడు. ఏ కులము వాడైనా తాను తినబోయే ముందు ఇతరులకు పెట్టి తినిన సద్గతి కలుగుతుంది. కనుక ధర్మనందనా అన్ని దానములలో అన్నదానము గొప్పది. దాని వలన సర్వ పాపములు నశిస్తాయి " అని అన్నాడు బృహస్పతి.

## అహింస

ధర్మరాజు " మహాత్మా ! ధ్యానము, ఇంద్రియనిగ్రహము, గురువులను భక్తితో సేవించుట, అహింసను పాటించుట, నిత్యము దేవుడిని పూజించడం, తపస్సు వీటన్నింటిలో మిక్కిలి సేవించవలసినది ఏది ? వివరించండి " అని అడిగాడు. బృహస్పతి " ధర్మనందనా ! నీవు చెప్పిన ఆరుమార్గములు మంచివే. కాని వీటి అందు అహింస పరమధర్మము. అహింస సకలవ్రతములను ప్రకాశింపజేస్తుంది " అని చెప్పి బృహస్పతి స్వర్గలోకముకు వెళ్ళి పోయాడు. తరువాత ధర్మరాజు " పితామహా ! సర్వదేవతలు, బ్రాహ్మణులు, మునులు అందరూ అన్ని ధర్మములలో అహింస పరమధర్మమని చెప్తారు కదా ! ఆ అహింస గురించి వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఒక్క మాటలో చెప్పాలంటే అన్ని ధర్మాలు అహింస

అనే ధర్మంలో ఇమిడి ఉన్నాయి. ఈ అహింస నాలుగుపాదములతో నడుస్తుంటుంది. ఆ పాదములలో ఏ ఒక్కటి కుంటుపడినా ధర్మము కుంటుపడుతుంది. మనసుచేత కాని, వాక్కుచేత కాని, శరీరముచేత కాని పరులను హింసించడం, మాంసముతినడం ఇవి హింసామార్గాలు. మాంసం తినడం హింసాత్మకమైనదే. కనుక ఈ నాలుగు మార్గాలలో హింసను వదలాలి. ఆంసం తినడం మీద మక్కువ వదలడమూ అహింసయే " అని భీష్ముడు చెప్పాడు.

### పితృకార్యము మాంసము

ధర్మరాజు " పితామహా ! పితృకార్యములలో మాంసము ప్రధానంగా వాడతారు కదా ! మరి మృగములను చంపకపోతే మాంసము ఎలా వస్తుంది " అని ఎదురు ప్రశ్న వేసాడు " అని ఎదురుప్రశ్న వేసాడు. భీష్ముడు " ధర్మనందనా ! మాంసము తినడం మానడము **అశ్వమేధయాగము**తో సమానము. మాంసముతినడం కోసము జంతువులనుచంపడం, చంపించడం మహాపాపము. కాని శ్రాద్ధాలలో , యాగాలలో వేదవిధిని అనుసరించి మాంసభక్షణ జరుగుతుంది. దానివలన దోషము ఉండదు. కాని రుచికొరకు కడుపు నింపుకొనుట కొరకు మాంసంతినడము జంతువులను చంపడం మహాపాపము. మాంసము తినడం ఆపితే అదే ఒక తపస్సు అని శాస్త్రాలు చెప్తున్నాయి. మాంసమురుచి అన్ని రుచులకన్నా ఎక్కువ. కనుక మాంసముతినడం ఆపిన అతడు దేవతాసమానుడు. సాటి ప్రాణులనుకాని మాంసము రాదు. అంతే కాని రాళ్ళనుండి చెట్లనుండి మాంసము వస్తుందా ! మాంసము కొరకు ప్రాణులను వేటాడే సమయంలో ప్రాణులను చంపుసమయంలో చంపే వాడికి చిన్న దెబ్బ తగిలినా అతడు విలవిల్లాడుతుంటాడు కదా ! అదే నొప్పి చంపబడే ప్రాణులకు ఉంటుంది కదా ! ఆ మాత్రము గ్రహించక ప్రాణులను చంపితినడం పాపము కాదా ! ఆ మాత్రము గ్రహించ కుండా మాంసంకొరకు ప్రాణులను చంపడం ఏమి న్యాయం ? కనుక మాంసం తినడము కొరకు జీవహింస మానడం ఉత్తమలక్షణం. మానవులు మాంసం తినడం మానుకుంటే జంతువులు భయం లేకుండా బ్రతుకుతాయి. స్వాయంభువ మనువు కూడా ఇదేమాట చెప్పాడు. మార్కండేయ మహర్షి కూడా మాంసము తినడం మానిన ఆయుర్ధాయము పెరుగుతుందని చెప్పాడు. మాంసము తినే వాడు రాక్షసుడితో సమానుడు. మాంసముతినడం మానిన తరువాతనే దేవతలకు దేవత్వము కలిగింది. మాంసభోజనం మానడము నూరేళ్ళు తపస్సు చేసిన దానితో సమానము. తపస్సుచేసినా దానధర్మములు చేసినా బ్రహ్మలోక నివాసము ప్రాప్తింస్తుందో లేదు చెప్పలేము కాని మాంసము తినడం మానివేసిన బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది. ఆషాఢము, శ్రావణము, బాద్రపదము, ఆశ్వీజము ఈ నాలుగు మాసాలలో మాంసము తినడము మానిన రోగములు రావు, ఆయుస్సువృద్ధి చెందుతుంది, బలవంతుడు ఔతాడు **సగరుడు, దిలీపుడు, నలుడు, నృగుడు, భగీరధుడు** మొదలగు చక్రవర్తులు వర్షాకాలము నాలుగు నెలలు మాంసాహారము మానివేసి కీర్తిమంతులయ్యారు " అన్నాడు భీష్ముడు.

### మాంసాహారము మీద మక్కువ

ధర్మరాజు " పితామహా ! మాంసభక్షణం ఇంత పాపం అని తెలుసి కూడా మానవులు కాయకూరలు, పండ్లు భక్ష్యములు ఎందుకు తినరు. మాంసాహారము మీద మక్కువ ఎందుకు చూపిస్తారు " అని అడిగాడు. ఆ మాటలకు భీష్ముడు నవ్వి " ధర్మనందనా ! ఒక సారి మాంసమును భుజించిన వాడు దాని రుచికి దాసోహం అయి దాని నుండి తప్పించుకో లేడు. మాంసము తినడం వలన వీర్యశక్తి పెరుగుతుంది, పని చేసి అలసిన వాడికి నూతనశక్తి ఇస్తుంది, గాయములను శీగ్రగతిన మాన్పుతుంది ఫలములలో, భక్ష్యములలో, కాయకూరలలో ఈ శక్తిలేదు. మాంసభక్షణ వలన కలిగే దోషము దానము వలన పోతుంది. యజ్ఞయాగాదులలో మాంసభక్షణ వలన దోషములేదు అని శాస్త్రాలు చెప్తున్నాయి. అగస్త్యుడు మాంసభక్షణ గురించి చెప్తూ ఇలా అన్నాడు. వేటాడడం పరమధర్మము. అందులో పక్షులు, మృగములను చంపడం ధర్మము. ఆ మాంసముతో దేవకార్యములు, పితృకార్యములను నిర్వర్తించడం కూడా ధర్మమే. కాని కేవలము రుచిగా తినడం కొరకు దేహాన్ని పెంచుకొనడం కొరకు మాంసం తినడం జంతువులనుచంపడం పాపమే. ఇతర జంతువుల పక్షులమాంసంతో దేహాన్ని పోషించడం మహాపాపము. మాంసంతినడం వలన వచ్చేపాపము దానధర్మము వలన పోవడం నిజమే అయినా ఆతరువాత మాంసభక్షణ నిలిపి వేయకున్న పాపము పోదు కనుక అహింసకు మించిన పరమధర్మము వేరొకటి లేదు. దయకల వాడు ప్రాణుల అందు ప్రాణభయాన్ని చూడగలడు. అందువలన దయకలిగి ఉంటాడు. ప్రాణుల ఎడల క్రూరత్వాన్ని చూపిస్తే అవి కూడా అతడి అందుక్రూరత్వము చూపిస్తుంది. కనుక మానవుడు ప్రాణుల అందు దయకలిగి అహింసను పాటించుట పరమధర్మము " అని భీష్ముడు చెప్పాడు.

## ఊర్ధ్వలోకములు

ధర్మరాజు " పితామహా ! మేము చేసిన యుద్ధములో ఎంతోమంది మరణించారు కదా ! వారికి ఏ లోకములు ప్రాప్తిస్తాయి

తెలపండి. ఎందుకంటే మానవులు అందరూ బ్రతకడం సుఖాలు అనుభవించడానికి అని చావడం దు:ఖహేతువు అని భావిస్తారు కనుక ఎవరు తమతమ ప్రాణములను వదులుటకు సులభముగా అంగీకరించ లేరు. అందుకని అడిగాను " అన్నాడు ధర్మరాజు. భీష్ముడు " ధర్మనందనా ! నీకు ఈ సందర్భంలో ఒక కీటకముకు వేదవ్యాసుడికి మధ్యజరిగిన సంభాషణ చెప్తాను విను. ఒకసారి వేదవ్యాసుడు బండ్లు పోయే దారిలో వేగంగా పరుగెడుతున్న ఒక పురుగును చూసి " ఓ పురుగా ! ఎందుకు అలా వేగంగా ఎందుకు అలా భయంతో వేగంగా పరుగెడు తున్నావు " అని అడిగాడు. ఆ పురుగు " ఓ మహాత్మా ! చూసారా ఈ దారిలో అతి వేగంగా బండ్లు వస్తున్నాయి. ఈ బండ్లశబ్దము, ఎద్దుల రంకెలు మనుష్యుల అరుపులు నాకు బెదురు పుట్టిస్తున్నాయి. బ్రతకడం సుఖం, చావడం దు:ఖంకదా ! అందుకని ఆ బండ్ల కిందపడి చావకుండా ఇంకా కొంత కాలం బ్రతుకుదామని వేగంగా పరుగెడుతున్నాను. ఏమైనా ప్రాణులకు ప్రాణభీతి ఎక్కువ కదా ! " అన్నది. వ్యాసుడు " నీవా చిన్న పుగువు. నీవు సుఖములు అనుభవించ లేవు. అటువంటి సమయంలో నీకు ప్రాణభయం ఎందుకు ? నీకు చావే సుఖముకదా ! అప్పుడు ఈ భయాలు ఉండవు " అన్నాడు. ఆ మాటలకు ఆ పురుగు నవ్వి " మహాత్మా ! పురుగులకు కీటకములకు ఇంద్రియ సుఖములు లేవని మీరు ఎలా చెప్పగలరు. మా పద్ధతిలో మేము కూడా మానవుల వలె మా దారిలో ఇంద్రియ సుఖములను అనుభవిస్తాము. అందుకే మాకుకూడా ప్రాణభయము బ్రతుకు మీద ఆశ ఉన్నాయి. అయినా మునీంద్రా ! నా మనసు తెలుసుకోవాలని అడుగుతున్నావు కాని ఆ మాత్రము నీకు తెలియదా చెప్పు.

### పురుగు పూర్వజన్మ

నేను పోయిన జన్మలో శూద్రుడను చాలా ధనవంతుడను. ఆ జన్మలో నేను చాలాక్రూరుడను, అనాచారిని, అతిలోభిని. దయ, జాలి లేని వాడిని. దురుసుగా ఉండే వాడిని. అన్ని దుర్గుణములు కలిగినవాడిని. కాని నేను నా తల్లిని భక్తితో సేవించే వాడిని. ఒక నాడు మా ఇంటికి ఒక బ్రాహ్మణుడు అతిథిగా వచ్చాడు. నేను అతడిని భక్తితో పూజించాను. అందువలన నాకు పునర్జన్మస్మరణ కలిగింది. అప్పటి నుండి నాకు మంచిపనులు చేస్తే సుఖాన్ని ఇస్తాయి అనే స్మరణ కలిగింది. కనుక మునీంద్రా ! నాకు ఆ విషయముల గురించి సవిస్తరంగా వివరించండి " అని అడిగింది. వ్యాసుడు " ఓ కీటకమా ! నిన్ను చూడగానే నీ పూర్వజన్మ వృత్తాంతం నాకు తెలిసింది. నీవు గతజన్మలో పాపములు చేసినందు వలన నీకు పురుగుజన్మ వచ్చిందని నాకు తెలుసు. అలాగే నీవు కొన్ని పుణ్య కార్యములు కూడా చేసావు. అందు వలననే నేను నీతో మాట్లాడుతున్నాను. నా తపోబలము చేత నేను నీకు ఈ పురుగుజన్మ నుండి విముక్తి కలిగిస్తాను. నీకు మనుష్యజన్మ ఎత్తి పుణ్యకార్యములు చేయవలెనన్న కోరిక కలగడం కూడా గతజన్మలో నీవు చేసిన పుణ్యకార్యముల ఫలమే ! మానవులు తాముచేసిన పుణ్యకార్యములవలన దేవతలౌతారు. తాము చేసిన పాపకార్యముల వలన ఇలా కీటకముల జన్మ ఎత్తుతారు. నీవు గతజన్మలో చేసిన పుణ్య కార్యముల వలన నీకు గతజన్మస్మృతి కలగడమే కాక నా దర్శనభాగ్యము కూడా కలిగింది. నేను నీకు ఉత్తమగతులు ప్రసాదిస్తాను. ఇక నుండి నీవు జంతువుగాను, మానవులలో వరుసగా శూద్ర, వైశ్య, క్షత్రియ జన్మలెత్తి తుదకు బ్రాహ్మణజన్మ ఎత్తుతావు. నీకు అన్ని జన్మలలో పూర్వ జన్మస్మృతి ఉంటుంది " అని ఆ పురుగుకు వరం ఇచ్చాడు. ఆ పురుగు వ్యాసుడి పాదాలు తాకి ప్రాణాలువదిలింది. ఆ తరువాత వ్యాసుడు వెళ్ళి పోయాడు.

### పురుగు తరువాత జన్మలు

కాలక్రమేణా ! ఆ పురుగు వరుసగా అన్ని జన్మలు ఎత్తుతూ క్షత్రియ జన్మలో ఒక రాజ్యానికి రాజయ్యాడు. రాజ్య సుఖాలు అనుభవిస్తున్నాడు. ఒక రోజు ఆ రాజు వ్యాసుడి ఆశ్రమానికి వెళ్ళాడు. రాజు వ్యాసుడి పాదాలకు నమస్కరించాడు. వ్యాసుడు రాజుకు తగు విధంగా మర్యాదచేసి " రాజా ! ఈ జన్మలో నీవు తపస్సు చెయ్యి. ఆవుల కొరకు, బ్రాహ్మణుల కొరకు యుద్ధములో ప్రాణములు వదులు. నీకు బ్రాహ్మణజన్మ వస్తుంది " రాజు కూడా వ్యాసుడు చెప్పినది చేసి యుద్ధములో ప్రాణాలు వదిలి మరుజన్మలో బ్రాహ్మణుడిగా పుట్టాడు. ఆ బ్రాహ్మణజన్మలో ఎన్నో యజ్ఞయాగాలు చేసాడు, పుణ్యక్షేత్రాలు దర్శించాడు, దానధర్మాలు చేసాడు. తరువాత ఒక సారి వేదవ్యాసుడిని దర్శించుకున్నాడు. వ్యాసుడు సంతోషించి అతడిని కీర్తి ప్రతిష్ఠలతో అలరారమని దీవించాడు. ధర్మనందనా ! కనుక ధర్మనందనా ! యుద్ధములో మరణించిన వారికి ఉత్తమ గతులు ప్రాప్తించుట తధ్యము. ఇందు అనుమానము ఏదీ లేదు " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## విద్య తపస్సు దానము

ధరరాజు " పితామహా ! విద్య, దానము, తపస్సు వీటిలో ఏది మంచిది వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ సందర్భంలో నీకు వ్యాసుడు **మైత్రేయుడు** మధ్య జరిగిన సంవాదము వినిపిస్తాను. ఒక సారి వ్యాసమహాముని కాశీనగరానికి వెళ్ళి ఆ సమయంలో కాశీ నగరంలో ఉన్న **మైత్రేయమహర్షి** వద్దకు వెళ్ళాడు. మైత్రేయుడు

వ్యాసుడికి తగు మర్యాదలు చేసి తృప్తిగా భోజనం పెట్టాడు. వ్యాసుడు ఆ మర్యాదలకు తృప్తి చెంది " మైత్రేయా ! దానములలో అన్నదానము శ్రేష్టమైనది. నువ్వు నాకు అన్నదానము చేసి తృప్తిపరచావు. దానము ఇవ్వతగిన వస్తువులలో అన్నము చాలా శ్రేష్టమైనది. ఈ దేహము అందులో ఉన్న ప్రాణులు దేహములో ఉన్న బలము అన్నీ అన్నమువలన కలిగివే కదా ! మైత్రేయా ! తపస్సు చేస్తే మనసులో ఉన్న కల్మషములన్నీ తొలగి పోతాయి. ఆ తపస్వి అంతకు ముందు చేసిన దానము వలన విద్య నేర్చుకొనడం సులభం ఔతుంది. అతడు నేర్చిన విద్య అతడి తపస్సును వృద్ధిచేస్తుంది. కనుక తపస్సు విద్యాదానముల వలన పెంపొందుతాయి. దానములలో కెల్లా అన్నదానము గొప్పది. ఎంతటి దుష్టుడైనా అతడు చేసిన దానముల వలన పవిత్రుడౌతాడు " అని వ్యాసుడు మైత్రేయుడికి చెప్పాడు. కనుక ధర్మనందనా ! అన్నీ ధర్మమములలో అన్నదానము గొప్పది. దానములలో అన్నదానము గొప్పది " అని భీష్ముడు చెప్పాడు.

## స్త్రీ



దేవలోకమున సుమన్ శాండిలి సంవాదము

ధర్మరాజు " పితామహా ! మీరు అన్ని విషయములు చెప్పారు కాని స్త్రీల గురించి చెప్ప లేదు. స్త్రీల గురించి వినవలెనని కోరికగా ఉంది " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ సందర్భంలో నీకు కైకేయీ శాండిలీ సంవాదము గురించి చెప్తాను. కేకయరాజకుమారి **సుమన** దేవలోమలో ఉన్న **శాండిలి**ని చూసి " కాంతామణి నీకు దేవలోకనివాసము ఎలా కలిగింది " అని అడిగింది. అందుకు శాండిలి ఇలా బదులు చెప్పింది " కైకేయీ ! నేను అత్తగారికి మామగారికి ఎదురు చెప్పకుండా వారినిసేవించాను. దేవతారాధనలు, పితృశ్రాద్ధములు, అతిథిపూజలు చెయ్యడంలో అలసత్వము చూపించ లేదు. అన్నీ శ్రద్ధగాచేసాను. నేను ఎప్పుడూ వీది వాకిట నిలుచో లేదు. నేను వీధి మొహము చూడ లేదు. అందరి ముందు బిగ్గరగా నవ్వలేదు. విద్యార్ధులకు విద్యావంతులకు బిక్ష పెట్టడంలో ఏ మాత్రం అశ్రద్ధ చూప లేదు. భర్త ఇంటికి రాగానే సపర్యలు చేసాను. నా పిల్లలను మంచి వారుగా పెంచాను. నా భర్తకు ఏది ఇష్టమో అదే నాకు ఇష్టము అంతే కాని నాకని వేరు ఇష్టాలు లేవు. నా భర్త బయటకు వెళ్ళినప్పుడు నేను ఆయన తిరిగి వచ్చే వరకు నేను పూలు పెట్టుకోను. మంచి బట్టలు ఆభరణాలు ధరించను. రుచి కలిగిన పదార్ధములను చేసుకుని తినను. పొదుపుగా ఉంటాను. మా బంధువులను అందరిని సమంగా ఆదరిస్తాను. మా ఇంట్లో ఉన్న ఆవులను స్వయంగాపోషిస్తాను. ఇంటి వ్యవహారములో భర్తకు ఎదురు చెప్పను. మా ఇంట ఉన్న నిత్యాగ్నిహొత్రమును జాగ్రత్తగా కాపాడుతుంటాను. మా ఇంటి రహస్యములను రచ్చకీడ్చను. నేను గర్భిణీస్త్రీగా ఉన్నప్పుడు రుచి కలిగిన భోజనము మాని ఏది అవసరమో అదే భుజిస్తాను. కనుక నాకు దేవలోకప్రాప్తి కలిగింది " అని శాండిలిని **కైకేయి**కి చెప్పింది. ధర్మనందనా ! నీ సందేహము తీరింది కదా ! " అన్నాడు భీష్ముడు.

## శ్రేష్టమైనది

ధర్మరాజు " పితామహా ! సర్వశాస్త్రములలో చెప్పబడినది శ్రేష్టమైనది అయిన కార్యము ఏదీ " చెప్పండి అని అడిగాడు. భీష్ముడు " పితామహా ! ధర్మనందనా ! ఈ సందర్భంలో నీకు నారదుడు, **పుండరీకుడు** వీరి మధ్యజరిన సంభాషణ గురించి చెప్తాను. శ్రద్ధగావిను. ఒకప్పుడు పుండరీకుడు నారదుని నీవు నన్ను అడిగిన ప్రశ్న అడిగాడు. నారదుడు " పంచభూతములు 5, వాటి గుణములు 5, జ్ఞానేంద్రియములు 5, కర్మేంద్రియములు 5, మనసు, బుద్ధి, అహంకారము ఇవి 23. 24వ తత్వము ప్రకృతి. 25వ తత్వము పురుషుడు. అతడు సర్వాభూతాత్మకుడు. అతడిని నరుడు అని కూడా అంటారు. ఆ నరుని వలన కలిగిన తత్వమే నారములు. ఆ నారములకు అధిపతి నారాయణుడు. ఆ నారాయణుడు అనంత విశ్వమును తన అందు ఆవిర్భవించపజేసి లయంచేస్తుంటాడు. విభుడుగా విరాజిల్లుతుంటాడు. ఈ నారాయణుడినే **పరబ్రహ్మ, పరతత్వము, పరమపదము, ఈశ్వరుడు, విష్ణువు** అని పిలుస్తుంటారు. అఅ నారయణుడే జగత్తు అంతా నిండి ప్రకాశిస్తుంటాడు. ఇంకా ఆ నారాయణుడు, **వాసుదేవుడు**, ఆత్మ అనే వేదాంతవిషయములలో సంభోదించబడుతూ ఉంటాడు. నరుడికి కూడా అవే పేర్లు ఉంటాయి. నరనారాయణుడికి భేదము లేదు. సర్వ శాస్త్రములను పరిశీలించిన పిమ్మట, దృఢమైన విచారము చేసిన పిమ్మట నారాయణుడిని స్మరించ వలెనని చెప్పబడింది. కనుక నారాయణుడే అనుష్టించ తగినవాడు. మానవులు కొంచము సమయమైనా నారాయణుడిని తలచుకుంటే అతడికి ఉత్తమగతులు కలుగుతాయి. ఇంక సదా నరనారాయణుడిని తలిచే వారిగురించి చెప్పను అలవి కాదు. కనీసం మరణ సమయంలో అయినా " ఓం నమో నమో నారాయణా " అని స్మరిస్తే చాలు

అతడికి ఉత్తమపధము లభిస్తుంది. నారాయణశబ్ధమే బ్రహ్మము. కనుక నిరంతరం నారాయణ నామస్మరణ చేసే వాడు తమ పాతకములు పోగొట్టుకొనుటే కాక తనను ఆశ్రయించిన వారి పాతకము కూడా పోగొట్ట కలిగిన శక్తివంతుడు ఔతాడు. ఇది బ్రహ్మ వాక్కు. మానవుడు ఏ ఆశ్రమంలో ఉన్నప్పటికీ నారాయణ నామస్మరణ ఏమరక చెయ్యడం అతడి విధి. లేని ఎడల అతడికి ఉత్తమగతులు కలుగవు. ఈ విష్ణువు భక్తితో తప్ప వేరు విధముగా గోచరము కాడు. అందుకే విష్ణువుకు భక్తవత్సలుడు అనే నామము సార్ధమైనది " అని నారదుడు పుండరీకుడికి విష్ణుమహిమను వివరించాడు. పుండరీకుడు విష్ణువును భక్తితో అర్చించాడు. అప్పుడు పుండరీకుడికి కలలో శంఖు, చక్ర, గదా, శార్గము నాలుగు చేతులలో ధరించి వక్షస్థలమున శ్రీవత్సము అను పుట్టు మచ్చతో తామరరేకుల వంటి కన్నులు కల వాడు, కిరీటము , కుండలములు ధరించిన వాడు, కౌస్థభమణిని ధరించిన వాడు అయున **శ్రీమన్నారాయణుడు** కనిపించాడు. ఆ రూపము పుండరీకుని మనసులో శాశ్వతముగా నిలిచి పోయింది. ధర్మనందనా నీవు కూడా ఆ విష్ణుస్వరూపమును నిరంతరము మనసులో నిలిపుకొని ధ్యానించు. నీకు సకల శుభములు కలుగుతాయి " అని భీష్ముడు చెప్పాడు.

## దానధర్మము ప్రియభాషణ


సామ నీతి విజయం

ధర్మరాజు " పితామహా ! సాధారణంగా మానవులు దానధర్మములు చేస్తుంటారు. ఇతరులతో ప్రియంగా మాట్లాడుతుంటారు రెండింటిలో ఏది గొప్పది ? తెలియ చెయ్యండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! రెండూ మంచివే. ఈ రెండూ ఎదుటి వాడి మనసును బట్టి చేయాలి. దానము గురించి చెప్పనసరం లేదు దానము సదా శ్లాఘనీయమే. ప్రీతికరంగా మాట్లాడడం గురించి నీకు ఒకకధ చెప్తాను విను. ఒక బ్రాహ్మణుడు పనిమీద నిర్మాన్యుష్యమైన అడవిలో వెళుతున్నాడు. అప్పుడు ఒక రాక్షసుడు అతడిని చంపి అతడి మాంసము తినవలెనన్న తలంపుతో ఆ బ్రాహ్మణుడిని పట్టుకున్నాడు. ఆ బ్రాహ్మణుడు భయము చెందక నిర్మలంగాను నిశ్చలంగాను ఉన్నాడు. అతడి ధైర్యానికి ఆశ్చర్యపోయిన రాక్షసుడు " బ్రాహ్మణోత్తమా ! నీవు నా ప్రశ్నలకు జవాబు చెపితే నిన్ను విడిచి పెడతాను. లేని ఎడల నిన్ను చంపితింటాను " అన్నాడు. బ్రాహ్మణుడు అందుకు అంగీకరించాడు. రాక్షసుడు " నా శరీరము డస్సిపోయింది అలసి పోయింది అందుకు కారణం ఏమిటి ? " అని అడిగాడు. బ్రాహ్మణుడు " మహాత్మా ! నీవంటి మహాత్ముడు అడిగితే చెప్పక ఊరుకుంటానా ! నీవు చెడ్డవాడివి అని తెలిసి నీ బంధువులు అందరూ నిన్ను వదిలి వెళ్ళారు. అందుకు నీవు బాధ పడుతున్నావు. నీవు దరిద్రంతో బాధపడుతూ నీకు లభించని ధనము గురించి చింతిస్తున్నావు. మొహమాటానికి పోయి ఇతరుల చేతిలో ఓడిపోయిన అదిచూసి వారు అది తమ ప్రతాపమని పొంగిపోవడం చూసి ఓర్వలేకున్నావు. దుర్మార్గులు నీ చుట్టూచేరి పొగడుతుంటే పండితులు నిన్ను పొగడలేదని మనసులో బాధపడుతున్నావు. ఈ బాధలవలన నీవు మనసులో కృశించిపోతున్నావు. నీవు చెప్పిన మాటలను సభ ఆమోదించకపోవడం, నీవు చేసిన పాడు పనులకు నీ భార్య బాధపడుతుంటే ఆమెను నీవు అనునయించ లేని దుస్థితిలో ఉన్నావు. నీ సొమ్మును ఇతరులు ఎత్తుకు పోతున్నారని తెలిసి నీ సొమ్మును రక్షించు కోలేక బాధపడుతున్నావు. చాటు మాటుగా నిన్ను గురించి చెప్పే మాటలు నీ బంధువులు నిజమని నమ్మడం దాని వలన కలిగే దు:ఖాన్ని నీవు మనసులో దాచుకోలేక బయటకు చెప్ప లేక కుమిలి పోతున్నావు. ఇవి నీ క్షీణతకు కారణాలు. నీ భార్యా బిడ్డలు వారి దుష్ప్రవర్తనతో నిన్ను ఇబ్బంది పెట్టడం, నీ తల్లి తండ్రులు, సోదరులు రోగములతో బాధపడం నీ పూర్వ జన్మలో నీవు ఒక బ్రాహ్మణుడికి చెందిన ఆవును చంపడం, దుష్టబుద్ధితో బ్రాహ్మణుల సొమ్మును, దేవుడిసొమ్మును అపహరించడం, నీ ధనమును పోగొట్టుకుని పరితపించడం, నీ బంధువులు చనిపోవడం, దుర్మార్గుడైన నీ సేవకుని వలన కలిగిన నష్టానికి నీవు బాధ్యుడవు కావడం వీటి వలన కూడా ఒక మానవుడు కృంగి కృశించి పోతాడు " అని బ్రాహ్మణుడు రాక్షసుడికి చెప్పాడని భీష్ముడు చెప్పాడు.

## పురాణగాధ

ధర్మరాజు సందేహాలు ఇక లేనట్లు " పితామహా ! అందరికీ వినిపించేలా ఒక ప్రాచీన గాధ ఒకటి వినిపించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నీకు ఉమామహేశ్వర సంవాదము వినిపిస్తాను. ఈ సంవాదం శ్రీకృష్ణుడి సన్నిధానంలో వినిపించడం నా పూర్వ పుణ్యపుణ్యవిశేషంగా భావిస్తున్నాను. శ్రీకృష్ణా ! నీ అనుమతితో ఈ కధను ధర్మరాజుకు


తపస్సు చేసుకుంటున్న శ్రీకృష్ణుడు

వినిపిస్తున్నాను. పుత్రసంతానంకోరి శ్రీకృష్ణుడు **రుక్మిణీదేవి**తోసహా హిమాలయాలకు వెళ్ళాడు. అక్కడ 12 సంవత్సరములు అత్యంత దీక్షతో వ్రతంచేసాడు. వ్రతదీక్షవలన శ్రీకృష్ణుడు చాలా నలిగిపోయాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుడిని చూడడానికి **నారదుడు, వ్యాసుడు, వాల్మీకి, దేవలుడు, కశ్యపుడు** మొదలగు వారు తమ తమతమ శిష్య బృందముతో అక్కడకు వచ్చారు. వారికి శ్రీకృష్ణుడు అర్ఘ్యము పాద్యము ఆసనము ఇచ్చి సత్కరించి ఇష్టాగోష్టి జరుపుతున్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడి ముఖము నుండి ఒక మహాగ్ని వెలువడింది. ఆ అగ్ని అక్కడ ఉన్న అడవిని కాల్చింది. ఆ అడవులలోఉన్న మృగములు, పక్షులు, తపస్సు చేసుకుంటున్న సిద్ధులు, సాధ్యులు, మునులు ఆందోళన చెందుతున్నారు. అది గమనించిన శ్రీకృష్ణుడు తన శుభప్రదమైన చూపులతో ఆ మంటలను ఆర్పి వేసాడు. అడవులు మరలా యధాస్థితికివచ్చాయి. ఈ సంఘటన చూసి మునులందరూ ఆశ్చర్యపోయారు. వారిని చూసి శ్రీకృష్ణుడు " మీరు ఈ అగ్నిని చూసి ఏమనుకున్నారు ఉన్నది ఉన్నట్లు చెప్పండి " అని అడిగాడు. మునులంతా ముక్త కంఠముతో ఇలా అన్నారు. దేవా ! ఈ సమస్త జగతి నీ నుండి సృష్టించబడి నీలోనే లయం ఔతుంది. సకల చరాచరజీవజాలము నీ ఆధీనములో ఉన్నాయి కదా. అంతా నీ సంకల్పము వలనే జరిగిఉంటుంది. కనుక ఇది ఎలా జరిగిందో నీవు చెపితే కాని మాకుతెలియదు. అందుకే ఇది చూసి ఆశ్చర్యపోయాము " అని అన్నారు. అప్పుడు శ్రీకృష్ణుడు " మహా మునులారా ! మీరు ప్రసన్నంగా ఉండడమే ఈ సృష్టికి ఆధారము. కనుక మీకు ఆ అగ్ని గురించి చెప్తాను వినండి. పూర్వము అస్త్రవిద్యా ప్రవీణుడైన ఒక రాక్షసుడు ఉన్నాడు. వాడి అస్త్రవిద్య నా ముఖం నుండి వచ్చి బ్రహ్మలోకానికి వెళ్ళింది. బ్రహ్మదేవుడు నాకు మన్మధుడిని కొడుకుగా ప్రసాదించాడు. నా ముఖం నుండి పుట్టిన అగ్ని పోతూ పోతూ ఈ అడవిని కాల్చింది. నేను నా చల్లని చూపులతో తిరిగి ఈ అడవిని పునరుజ్జీవింప చేసాను. మీరు చూసింది అదే " అని అన్నాడు.

## పురాణకధ


శివ పార్వతులు

శ్రీకృష్ణుడు మునులతో " మునిసత్తములారా ! మీ సందర్శన భాగ్యము కలగడం నా అదృష్టంగా భావిస్తున్నాను. మీరు కూడా ఒక పుణ్యకధను నాకు వినిపించండి " అని అడిగాడు. మునులు " మహాత్మా ! మీరు ముల్లోకాలకు పెద్దలు. మీకు తెలియనిది ఏముంది. నీకు ఈ మూడు యుగములలో తెలియని కధ ఈ భూమండలములో ఏముంది ? " అన్నారు. అందుకు మునులు నవ్వి " మహా మునులారా ! నేను మానవ గర్భసంజాతుడను కనుక మానవ మాత్రుడను. నా బుద్ధికూడా అదే స్థితిలో ఉన్నది. కనుక మీరు ఆ విషయము మరువకూడదు. ఈ పరిస్థితిలో మీరు చెప్పే కధ నాకు తెలియనిదే ఔతుంది " అని అన్నాడు. మునులంతా " శ్రీకృష్ణా ! నీకు చెప్పగల సమర్ధుడు నారదుడే కనుక నారదుడే ఒక కధ చెప్తాడు " అని వారు నారదుడిని చూసి " నారదా ! నీవు ఇంతకు ముందు చూసినది విన్నది అయిన ఒక కధను శ్రీకృష్ణుడికి వినిపించండి " అన్నాడు. నారదుడు పరమసంతోషంతో శ్రీకృష్ణుడికి మునులకు భక్తితో నమస్కరించి వారికి ఉమామహేశ్వర సంవాదము వినిపించ సాగాడు " నేను ఒక సారి తీర్ధసేవనము చేస్తూ తిరుగుతూ తిరుగుతూ హిమవత్పర్వతానికి వచ్చి అక్కడ ఒక అందమైన ఉద్యానవనంలో **ప్రధమ గణములు, దేవతలు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, మునులు, భూతగణములు** మొదలైన వారితో కొలువు తీరిన మహేశ్వరుడిని చూసాను. నేను కూడా ఈశ్వరుడికి నమస్కరించి వారితో పాటు అక్కడ కూర్చున్నాను. ఆ సమయంలో అక్కడకు వచ్చిన పార్వతీదేవి పరిహాసంగా వెనుక నుండి ఈశ్వరుడి కన్నులు మూసింది. ఆ హటాత్పరిణామానికి జగమంతా చీకటి అయిపోయి సూర్యుడు చంద్రుడు కళతప్పి లోకములన్నీ అంధకారంలో మునిగి పోయాయి. ఆ సమయంలో పరమేశ్వరుడు తన మూడవ కంటిని తెరిచాడు. పరమేశ్వరుడి మూడవ కంటి నుండి అగ్ని జ్వాలలు చెలరేగి హిమవత్పర్వతాన్ని దహించసాగాయి. హిమవంతుడు పార్వతీదేవి తండ్రి. అందువలన తన తండ్రికి కలిగిన కష్టానికి పార్వతీదేవి తల్లడిల్లి పోయింది. వెంటనే పార్వతీదేవి శివుడి

పాదాల మీద పడి నమస్కరించింది. శివుడు ప్రసున్నుడై మూడవ కన్ను మూసాడు. అప్పుడు హిమవత్పర్వతం మీద చెలరేగిన మంటలు చల్లారిపోయాయి. అప్పుడు పార్వతి శివుడితో " పరమేశ్వరా ! ఈ సమయంలో నీవు నొసటి కన్ను తెరవడానికి కారణం ఏమిటి ? ఇది రహస్యము కాకపోతే నాకు చెప్పండి. పరమేశ్వరుడు " పార్వతీ ! నీకు చెప్పడానికి వీలు కాని రహస్యములు ఏమున్నాయి ? నేను లోకపాలకుడను. నాకు ఏది జరిగితే లోకాలకు అదే జరుగుతుంది. నీవు నా కళ్ళు మూసినప్పుడు నాకు ఏమీ కనిపించ లేదు కనుక లోకాలు అంధకారంలో మునిగి భయభ్రాంతం అయిపోయాయి. నీ చేతులు తియ్యకుండా ఈ లోకాల అంధకారము పోగొట్టడానికి నేను మూడవ కన్ను తెరవవలసి వచ్చింది " అని అన్నాడు. వెంటనే పార్వతి " పరమేశ్వరా ! నీకు నాలుగు ముఖాలు ఉండడానికి కారణం ఏమిటి ? " అని అడిగింది. శివుడు " పార్వతీ ! సుందోపసుందులు అని భుజబలసంపన్నులైన ఇద్దరు రాక్షసులు ఉన్నారు. వారు ఏ అస్త్రశస్త్రములకు చావు రాకుండా వరం పొందారు. వారిని చంపడానికి **మయుడు** లోకములో ఉన్న అందచందాలను, లావణ్యాలను పోగుచేసి అందాల రాశి అయిన **తిలోత్తమ**ను సృష్టించాడు. అతడు ఆమెను నా వద్దకు తీసుకు వచ్చాడు. తిలోత్తమ నా చుట్టూ ప్రదక్షిణం చేసింది. దేవకార్య నిమిత్తము సృష్టించబడిన ఆమె నా చుట్టూ తిరిగే సమయంలో నేను ఆమెను నాలుగు వైపుల నుండి ఆమెను చూసాను. అందుకని నాకు నాలుగు ముఖాలు ఏర్పడ్డాయి " అన్నాడు. పార్వతి " ఈశ్వరా ! నీకు కంఠంలో నలుపు ఎలా కలిగింది " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! పూర్వము దేవతలు, దానవులు అమృతం కొరకు పాల సముద్రాన్ని మధించే సమయంలో ముందుగా పుట్టిన హాలాలం లోకాలను దహించడం ఆపడానికి దేవతల వేడుకోలు మన్నించి ఆ విషాన్ని నేను మింగి దానిని లోకరక్షార్థం మింగకుండా కంఠములో ఉంచిన కారణంగా నా కంఠము నలుపు అయింది " అని చెప్పాడు. పార్వతి " మహాదేవా ! నీకు అన్ని ఆయుధములో పినాకిని అంటే ఎందుకు అంత ఇష్టము " అని అడిగింది. శివుడు " పార్వతీ ! కృతయుగంలో **కణ్వుడు** అనే మహాముని తపస్సు చేస్తున్నాడు. అతడి మీద పుట్టాలుపెరిగాయి. ఆ పుట్టమీద ఒక వెదురుగడ పెరిగింది. ఆ వెదురుగడ లోకములో లేని విధంగా పొడవుగా పెరుగింది. ఆ సమయంలో బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై కణ్వుడికి వరాలు ప్రసాదించాడు. అతడి మీద పెరిగిన వెదురుతో బ్రహ్మ విష్ణువుకు శార్ఙ్గము, నాకు పినాకము చేసి మిగిలిన ముక్కతో గాండీవము చేసి దానిని తాను తీసుకువెళ్ళాడు. బ్రహ్మదేవుడు ఇచ్చినది కానుక నాకు **పినాకము** అంటే ఇష్టము. పార్వతి " ఈశ్వరా ! ఈ భూమి మీద ఇన్ని జంతువులు ఉండగా నీవు మాత్రము ఎద్దును వాహనముగా చేసుకోవడానికి ఏమి కారణము ? " అని అడిగింది. " పార్వతీ ! పూర్వము నేను హిమాలయము మీద తపస్సు చేసుకొను సమయంలో నా చుట్టూ ఆవులు మేస్తూ నా తపస్సుకు భంగం చేసిన తరుణంలో నేను వాటిని కోపంగా చూడగా అవి బాధ పడ్డాయి. అప్పుడు బ్రహ్మదేవుడు వచ్చి వాటిని ఓదార్చి నాకు ఒక ఎద్దును దానంగా ఇచ్చాను. అప్పటి నుండి ఎద్దు నాకు వాహనం అయింది. పార్వతి " దేవా ! ఈ భూమి మీద ఇన్ని భవనములు, నివాస స్థలాలు ఉండగా ఎప్పుడూ వెంట్రుకలు, కపాలాలు, ఎముకలు, దుర్గంధం నిండి మురికిగా ఉండే శ్మశానంలో ఎందుకు నివసిస్తున్నారు " అని అడిగింది. శివుడు " పార్వతీ ! క్రూరమైనభూతములు జనులను బాధపెడతాయి. ఆ భూతకోటి ధాటికి ప్రాణికోటి అంతా నాశనం అయింది. ఈ విషయం తెలుసుకున్న బ్రహ్మ నా వద్దకు వచ్చి దీనికి ప్రతీకారం చేయమని నన్ను వేడుకున్నాడు. నేను కూడా ఆ భూతముల నుండి జనులను కాపాడాలని నిశ్చయించుకుని ఆ భూతములు నివశించు శ్మశానంలో నివసించి వాటిని నాశనం చేస్తుంటాను. లోకరక్షణార్థమై నేను శ్మశానవాశిని అయ్యాను. మునులు సహితం శ్మశానంలో నివసించడానికి ఇష్టపడతారు " అని చెప్పాడు. పార్వతి " నాథా ! నీవు బూడిద శరీరానికి పూసుకుని, ఎముకలను పాములను ఆభరణంగా చేసుకుని, త్రిశూలధారి అయి భీకర రూపంలో ఉండడానికి కారణం ఏమిటి ? " అని అడిగింది. శివుడు " పార్వతీ ! ఈ లోక స్వరూపము రెండు విధములుగా ఉంటుంది కదా ! శీతలము, ఉష్ణములతో సకల లోకములు నిండి ఉన్నాయి. ఈ జగత్తు అంతా సౌమ్యము, ఆగ్నేయము అనే రెండు యోగముల సంయోగము. అందులోని సౌమ్యతను విష్ణువు భరించాడు, ఉగ్రతను నేను భరించాను. అందుకని నేను ఉగ్ర స్వరూపముతో ఉంటాను. ఇంకా ఏమైనా సందేహాలు ఉన్నాయా " అని అడిగాడు. పార్వతి " ఈశ్వరా వర్ణాశ్రమ ధర్మాలు తెలపండి ఈ లోకాలు తరిస్తాయి " అని అడిగింది అని నారదుడు మునులకు చెప్పాడని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## బయటి లంకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస

# అనుశాసనిక పర్వము పంచమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# పంచమాశ్వాసం

## వర్ణాశ్రమ ధర్మాలు

పార్వతీదేవి మహాశివుని వర్ణాశ్రమధర్మముల గురించి వివరించమని అడుగగా శివుడు " పార్వతీ ! పూర్వము బ్రహ్మదేవుడు లోక హితము కొరకు నాలుగు వర్ణాలను సృష్టించాడు. అవి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణములు. బ్రహ్మ ముఖము నుండి బ్రాహ్మణులు, బాహువుల నుండి క్షత్రియులు, తొడల నుండి వైశ్యులు, పాదముల నుండి శూద్రులు జన్మించారు. అందుకని ఆ జాతులలో తర, తమ బేధాలు కలిగాయి. వారు చేసే పనులలో కూడా తారతమ్యాలు కలిగాయి.

## విప్రులు

విప్రులు లోకముకు ఆధారము. వారిని పరాభవిస్తే లోకానికి చేటు కలుగుతుంది. వారిని సన్మానించి వారికి దానధర్మాలు చేస్తే లోకానికి మేలు కలుగుతుంది. బ్రాహ్మణుడు పేదవాడైనా , ధనవంతుడైనా, విధ్యావంతుడైనా, విద్యలేని వాడైనా అతడిని నిందించ రాదు, బాధించరాదు. వారిని బాధించిన వారికి ఈ లోకములోనే కాదు పరలోకములో కూడా సుఖసంతోషాలు కలువు. బ్రాహ్మణుడిని దూషించడం దైవాన్ని దూషించడంతో సమానము. బ్రాహ్మణుడి సొత్తును అన్యాయంగా దోచుకోవడం దేవుడి సొత్తును అన్యాయంగా దోచుకోవడంతో సమానము.

### విప్రుల ధర్మాలు

ఇక విప్రుల ధర్మాలు ఏవంటే వేదాధ్యయనము, యజ్ఞములు చేయడం, ఇతరులతో యజ్ఞములు చేయించడం, దానములు చెయ్యడం, తాను నేర్చిన విద్యలు ఇతరులకు బోధించడం, ఇతరుల నుండి దానములను స్వీకరించడం, మనసులో కాని వాక్కులో కాని కోపం లేకుండా ప్రశాంతంగా ఉండడం, తపస్సు చేయడం, ఎల్లప్పుడు సత్యమునే పలకడం, శుచిగా ఉండడం ఇవి విప్రుల ధర్మము. ఆపద సమయాలలో తప్ప విప్రులు వాణిజ్యాలు చేపట్టరాదు. బ్రాహ్మణుడు ప్రతిరోజు అగ్ని కార్యము చెయ్యాలి. శూద్రులు ఇచ్చిన ఆహారము భుజించరాదు. పరకాంతలవంక కన్నెత్తి చూడరాదు. తన నిజ భార్యతోనే తృప్తిపడాలి. రోజుకు రెండు పూటలు మాత్రమే భోజనముచెయ్యాలి. హింసాప్రవృత్తి పనికిరాదు. ఇంటిని పరిసరములను శుభ్రముగా ఉంచుకోవాలి. అతిథులకు అన్నంపెట్టాలి. తపస్సు చేసుకోవాలి. ఇలాంటి ధర్మకార్యముల కొరకు ధర్మమును పరిరక్షించుట కొరకు మాత్రమే బ్రాహ్మణులను సృష్టించాడు.

## క్షత్రియధర్మాలు

క్షత్రియులకు బ్రాహ్మణులను రక్షించడం ప్రధమధర్మము. వారితోపాటు భూమిమీద ఉన్న సకలప్రాణులను రక్షించాలి. క్షత్రియుల వలన ఈ భూమి వర్ధిల్లుతుంది. క్షత్రియుల పాలనలో ప్రజలు సుఖసంతోషాలతో జీవిస్తారు. క్షత్రియులు వేదాధ్యయనం చెయ్యాలి, యజ్ఞము చెయ్యాలి, దానధర్మము చెయ్యాలి. సాధువులను రక్షించి పోషించాలి. దుష్టులను శిక్షించాలి. ఎల్లప్పుడూ ఉత్సాహంగా ధైర్యంగా ఉండాలి. ఇంకా క్షత్రియులు అస్త్ర శస్త్ర విద్యలో నైపుణ్యం సాధించాలి. ప్రజలకు వచ్చిన అదాయంలో ప్రజాపాలన నిమిత్తము ఆరవ వంతు మాత్రమే పన్నుగా స్వీకరించాలి. తనవద్ద పనిచేసేవారిని దయతో చూడాలి. ప్రజలు తమ తగవులు తీర్చే సమయంలో నిష్పక్షపాతంగా ఉండాలి. ఇవి రాజుకు విధించిన ధర్మాలు.

## వైశ్యధర్మాలు

ఇక వైశ్యధర్మాలు వివరిస్తాను. వైశ్యులు ఎల్లప్పుడూ లోకానికి మేలుచెయ్యాలి. అందరికీ ఉపకారము చెయ్యాలి, అధికంగా శ్రమించాలి, వ్యాపారము పశుపోషణ చెయ్యాలి. వైశ్యులు కూడా వేదాధ్యయనము, యజ్ఞములు చెయ్యడం, దానములు చెయ్యడం వైశ్యులకు విధించబడిన ధర్మాలు. ఉపనయన కర్మవలన వైశ్యులు ద్విజులు ఔతారు కనుక అతిథులను సత్కరించడం వైశ్యులకు పరమధర్మము. వైశ్యులు **నువ్వులు, గంధము, రసము** కూడిన పదార్ధములతో వైశ్యులు వ్యాపారము చెయ్యరాదు. ఇక శూద్రులు మిగిలిన మూడు జాతులను సేవించి సేవచెయ్యడం సౌమ్యంగా విధేయులుగా ఉండడం వారికి విధించబడిన ధర్మము.

## ఆశ్రమవాస ధర్మాలు

పార్వతీ ! ఆశ్రమధర్మాలు వివరిస్తాను. మొదటి ఆశ్రమము **బ్రహ్మచర్యము**. ఈ ఆశ్రమంలో పరమనిష్టతో ఉండాలి. గురువును ఆశ్రయించి విద్యను నేర్చుకోవాలి. వేదాధ్యయనం చెయ్యాలి. ప్రతి రోజు అగ్ని కార్యము చెయ్యాలి. గురువుగారి కొరకు తన కొరకు భిక్షను స్వీకరించాలి. తరువాత **గృహస్థాశ్రమధర్మము**. ఇది మిగిలిన ఆశ్రమధర్మాలకు పునాది. గృహస్థాశ్రమంలో శుచిశుభ్రత పాటించడం, భార్యను సంతోషపెట్టడం, పంచయజ్ఞములు చెయ్యడం, పంచయజ్ఞములు అనగా **దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము, బ్రహ్మయజ్ఞము, మనుష్యయజ్ఞము** వీటిని నిష్ఠతోచెయ్యడం, వేదాధ్యయనమునందు ఆసక్తి కలిగి ఉండడం, దానధర్మాలు చెయ్యడం, హోమములు చెయ్యడం బ్రాహ్మణుడికి విధించబడిన ధర్మము. తరువాత **వానప్రస్థాశ్రమం**. ఈ వానప్రస్థాశ్రమంలో బ్రహ్మచర్యము పాటించడం, శాకాహారభోజనం, నారచీరలు ధరించడం, కోరికలు లేక ఉండడం వానప్రస్థాశ్రమ ధర్మాలు. తరువాతది **సన్యాసాశ్రమం**. సన్యాసికి కోపము రాకూడదు. ఇంద్రియ నిగ్రహము కలిగి ఉండాలి. తనకంటూ ఏమీ ఉంచుకొన కూడదు. ఓర్పుతో ఉండాలి. అడవులలో ఉన్న మునులతో కూడి సత్సంగంలో పాల్గొనాలి. ఎల్లప్పడూ మనస్సును ప్రశాంతంగా పెట్టుకోవాలి. మంచి ప్రవర్తన కలిగి ఉండాలి. పరిశుభ్రంగా ఉండాలి. సత్యవ్రతము, అహింసావ్రతము ఆచరించాలి. భిక్షాటనతో జీవించాలి. నేలమీద పడుకోవాలి. సాటి మానవుల ఎడల, ప్రాణుల ఎడ కరుణతో మెలగాలి. ఎల్లప్పుడూ ఆత్మవిచారము, తత్వచింతనా చెయ్యాలి. ఇవి సన్యాసి ఆచరించవలసిన ధర్మాలు " అని పరమశివుడు పార్వతీదేవికి చెప్పాడు.

## మునులు తపస్సు

" పరమశివా ! చాలామంది మునులు ఋషులు తపస్సు చేస్తారు కదా ! దాని గురించి చెప్పండి " అని అడిగింది పార్వతి. పరమశివుడు " పార్వతి ! చాలామంది ఏవోవో కోరికలు తీరాలని తపస్సు చేస్తూ ఉంటారు. కాని తపస్సు అంటే

వానప్రస్థాశ్రమంలో ఉన్నవారు చేసే ఒక ధర్మము. తపస్సు చేసే ముందు ఇంద్రియ నిగ్రహము పాటించాలి. ఉదయము సాయంత్రం యోగాభ్యాసం చెయ్యాలి. అలా కాకుండా ఏవేవో కోరికలతో తపస్సు చేస్తే కొంతకాలం స్వర్గసుఖములు అనుభవించి ఆ తపఃఫలం తరిగి పోగానే తిరిగి భూమిమీద జన్మిస్తారు. అంతే కాని తిరిగిరానిలోకాలకు వెళ్ళలేరు. ఇంకా కొంతమంది ఆ హారం తీసుకోకుండా కఠోరనియమాలతో పంచాగ్నుల మధ్య నిలబడి ఘోరంగా తపస్సుచేస్తారు. అలాంటి వారు కూడా కేవలం అప్సరకాంతలతో చేరి భోగములు అనుభవించి తృప్తిపడతారు. ఆ తపః ఫలం పూర్తికాగానే తిరిగి మానవులుగా జన్మిస్తారు. అలా కాక ఎలాంటి కోరికలు లేకుండా తపస్సు చేసే వారు ముందుగా అహింసావ్రతము ఆచరిస్తారు. మనసా వాచా కర్మణా ఎవరికీ అపకారం హానిచెయ్యరు. సాటి ప్రాణుల ఎడల దయ, కరుణ కలిగి ఉంటారు. అందరి జీవులలో ఉండే ఆత్మ ఒక్కటే అని భావిస్తారు. అలాంటి వారు కూడా మరణానంతరం తమ భార్యాబిడ్డలతో స్వర్గ సుఖాలు అనుభవించి తిరిగి ఆ పుణ్యఫలం కరిగి పోగానే తిరిగి భూలోకంలో జన్మిస్తారు. ఈ రీతిగా తపస్సు చేసే వారందరూ స్వర్గసుఖాలతోనే తృప్తిపడుతుంటారు " అని పరమశివుడు పార్వతీ దేవికి వివరించాడు.

## వనవాసం

" నాథా ! వనవాస విశేషములు దాని ఫలితాలు వివరించండి " అని పార్వతీదేవి అడిగింది. పరమశివుడు " పార్వతీ ! ఉపవాసవ్రతము అనగా ఆహారము తీసుకోకుండా ఉండడం, నేల మీద పడుకోవడం, మౌనంగా ఉండడం, యోగాసనములు చెయ్యడం, నియమిత వేళలలో పరిత ఆహారం తీసుకోవడం అనే నియమాలు పాటించాలి. అలా చేస్తే వారు **చంద్రలోకము, వాయులోకము, యక్షలోకము, గంధర్వ లోకము, నాగ లోకము** మొదలైన లోకములకు వెడతారు. అక్కడ కొంతకాలము నివసిస్తారు. ఈ వ్రతాలన్నీ వానప్రస్థములో చేసిన వారికి పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి " అని శివుడు చెప్పాడు.

## భిక్షాటన

పార్వతీదేవి " నాథా ! విరాగులు ఇల్లిల్లు తిరిగి భిక్షను స్వీకరించి ఉదరపోషణ చేసుకుంటారు కదా ! వారి గురించి తెలియ జెయ్యండి " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! అలాంటి వారు ఎక్కువగా ఉపవాసము చేస్తారు, ఉన్నచోట ఉండరు, ఊరూర తిరుగుతుంటారు, పుణ్యతీర్ధములు సేవిస్తూ ఉంటారు, పుణ్యనదులలో స్నానము చేస్తుంటారు, తలంతా జడలుగట్టి భిక్షాటనతో జీవిస్తారు. నెలలో ఎక్కువ రోజులు ఉపవాసముతో గడుపుతారు కనుక శరీరంకృశించి ఉంటుంది. తృణధాన్యమును వండుకుని తింటారు. మరణించిన తరువాత వారుకూడా స్వర్గసుఖాలు అనుభవిస్తారు " అని పరమేశ్వరుడు చెప్పాడు.

## వైఖాసనసులు

పార్వతీదేవి " నాథా ! వైఖానసులగురించి వివరించండి " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ **వైఖానసులు** నియమనిష్ఠలు కలిగిన వారు. వారు తృణధాన్యములను సేకరించి దానిని దంచి పచనముచేసి ఆహారంగా తింటారు. పండ్లుకొరికి తింటారు. మరికొందరు పక్షుల మాదిరి దొరికిన గింజలను దొరికినట్లు తింటారు. కొందరు ఆకులను తింటారు. మరి కొందరు నీటినిమాత్రమే త్రాగి బ్రతుకుతారు. మరి కొందరు గాలిమాత్రమే భోజనంచేసి బ్రతుకుతారు. మరి కొందరు సుష్టుగా భోజనంచేస్తారు. వీరందరూ ఇంద్రుడికి ఇష్టమైన వారు. వారు చాలాకాలము స్వర్గసుఖాలు అనుభవిస్తారు. ఇవన్నీ వానప్రస్థాశ్రమంలో ఆచరించ వలసిన ధర్మాలు. ఇవి అన్నీ తపస్సు కిందకు వస్తాయి. వీళ్ళుగాక అంగుష్ఠ మాత్రులు ఉన్నారు. వారు **వాలఖిల్యులు**. వారు సూర్య కిరణములను ఆహారంగా స్వీకరిస్తారు. ఈ లోకములన్నీ వారి వలననే నిలిచి ఉన్నాయి. ఇతరత్రా సాధించ లేని కార్యములు తపస్సు వలన సాధించబడతాయి. తపస్సు గొప్పది.

## ధర్మము

పార్వతీ ! నీకు ధర్మముల గురించి వివరిస్తాను. ధర్మములలోకెల్లా గృహస్థధర్మము గొప్పది. అది అందరికీ యోగ్యమైనది. కాని మిక్కిలి సూక్ష్మమైనది. గృహస్థధర్మములో అతి పనికిరాదు. ఏదైనా సమతుల్యంగా ఉండాలి. ఏ కాలంలో చేయవలసిన పనులు ఆయా కాలాలలో చెయ్యాలి. మనస్సు నిశ్చలంగా ఉంచుకోవాలి. ధర్మబద్ధంగానే ధనమును సంపాదించాలి. ధర్మబద్ధంగానే కామోపభోగాలు అనుభవించాలి. అదే గృహస్థధర్మము. ఇక నివృత్తిధర్మము గురించి వివరిస్తాను. నివృత్తిధర్మము మోక్షముకు మార్గము. ఇంద్రియనిగ్రహము, భూతదయ, సత్యమునే పలుకడం, కోరికలను విడిచిపెట్టడం, మనస్సు నిలకడగా ఉంచుకోవడం ఇవి నివృత్తిమార్గాలు. ఇంకా ఆకలిదప్పులతో వచ్చిన అతిథికి అతనికి దాహముకు నీళ్ళు ఇచ్చి ఆకలితీరేలా భోజనం పెట్టడం ధర్మాల్లోకెల్లా పరమధర్మము. ఈ అతిథి సత్కారము ఒక్క గృహస్థ ఆశ్రమంలోనే

వీలుకలుగుతుంది. మిగిలిన ఆశ్రమాలలో అతిథి సత్కారాలకు వీలులేదు. అందుకని అన్ని ధర్మములలోకెల్లా గృహస్థుధర్మము గొప్పది " అని చెప్పాడు.

## గృహస్థు చేయవలసిన పనులు

పార్వతీదేవి " నాధా !గృహస్థు చేయవలసిన ముఖ్యమైన పనులు ఏవి ? " అని అడిగింది. శివుడు " దేవీ ! గృహస్థాశ్రమంలో సతికి పతిసేవ ముఖ్యము. పతిభక్తి ముఖ్యధర్మము " అని చెప్పాడు శివుడు. పార్వతి " నాధా ! మానవునికి తల్లితండ్రులు చనిపోతే, లేక భార్యకు భర్త చనిపోతే వారు చేయవలసిన పనులు ఏవి ? " అని అడిగింది. శివుడు " పార్వతీ ! తల్లితండ్రులు చనిపోయిన గృహస్థు ఏమరకుండా అతిథి సత్కారం, పితృతర్పణములు, దేవతారాధనా చెయ్యాలి. భర్తను కోల్పోయిన భార్యలు బ్రహ్మచర్యము పాటించాలి. గృహస్థు అష్టమి, చతుర్దశి, పున్నమి, అమావాస్య రోజులలో బ్రహచర్యము పాటించాలి. తన ఇంటిలోని ధాన్యమును ఎలుకలు, పక్షులు భుజించిన అందుకు బాధపడక వాటి ఆకలితీరిందని అనుకోవాలి. ఇంక యతీశ్వరులు ఎక్కడ ఉన్నా ఏమి చేస్తున్నా ఆలోచనలు కట్టిపెట్టి నిస్సంగంగా ఉండాలి. అలా చేసిన వాడు ముక్తిపొందగలడు " అని పరమశివుడు చెప్పాడు.

## రాజు యొక్క గొప్పతనం

పార్వతి " మహేశ్వరా ! రాజులకు కూడా సామాన్య మానవుల వలె శరీరము, వాటి అవసరాలు, ఆకలిదప్పులు, స్నానము భోజనము మొదలగు పనులు జరుగుతాయి కదా ! కాని రాజు ఎందులో అధికుడు ? అందరూ అతడికి నమస్కారాలు ఎందుకు పెట్టాలి ? రాజు యొక్క ఆగ్రహానికి అనుగ్రహానికి లోబడి ఎందుకు ఉండాలి ? రాజులు సర్వాధికారులుగా ఎందుకు శోభిల్లుతూ ఉంటారు ? " అని అడిగింది. శివుడు " పార్వతీ రాచరికము అనేది పూర్వజన్మలో చేసిన అధికమైన తపస్సు ఫలితంగా లభిస్తుంది. ఆ కారణం చేత రాజు అందరి చేత గౌరవాభిమానాలు పొందుతాడు. అతడు తప్పచేసిన వారిని శిక్షించడానికి, మంచివారిని రక్షించడానికి అధికారము కలిగి ఉంటాడు. కాని రాజు నీతిమంతుడై ఉండాలి. అతడి నీతి అతడిని కాపాడుతూ ఉంటుంది. రాజు నీతిమంతుడైతే ప్రజలు కూడా నీతిమంతులు ఔతారు. రాజు ఇంద్రియములను జయించిన శత్రువులను కూడా జయిస్తారు. రాజు యోగ్యులైన వారిని నీతి మంతులను తన వద్ద మంత్రులుగా నియమించాలి. తనవద్ద పని చేసే సైనికులను దయతో చూడాలి. అప్పడే సైన్యము అతడికి విధేయులై ఉంటారు. రాజు ఎల్లప్పుడూ హితులైన వారినే తనవద్ద మంత్రులుగా దగ్గర చేర్చుకోవాలి. రాజు అనుసరించే నీతినిజాయితీ అతడికి ధనమును సంపాదించి పెడుతుంది. అతడికోటను రక్షిస్తుంది. అతడి ప్రజలనురక్షిస్తుంది. రాజు అనవసర ఖర్చులు పెట్టకూడదు. అవసరమైన ఖర్చులు పెట్టడానికి వెనుకాడ కూడదు. రాజు తన స్వీయరక్షణలో ఏమర పాటు చూపకూడదు. రాజు ఎప్పుడూ పుణ్యకార్యములు చేస్తుండాలి. పాపకార్యముల జోలికి పోరాదు. న్యాయవిచారణ చేసి శిక్షలు విధించే సమయంలో నిష్పక్షపాతంగా వ్యవహరించాలి. రాజు ఒకరిమీద ప్రేమ ఒకరి మీదకోపము ప్రదర్శించరాదు. తన గురించి తనపాలన గురించి ప్రజలు ఏమనుకుంటున్నారో వేగుల వారి ద్వారా ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ తదనుగుణంగా పాలన కొనసాగించాలి. రాజు ఎల్లప్పుడూ సత్యమునే పలకాలి. రాజైన వాడు ప్రియంగా పలకాలి. పరుషంగా మాట్లాడ కూడదు. విద్యాధికుడు అయి ఉండాలి. మిత్రుల ఎడల శత్రువుల ఎడల ఉపాయంగా వ్యవహరించాలి. సేవకుల అందు ఉపాయముతో వ్యవహరించాలి. రాజు ఎవరితో అనవసరంగా కయ్యము పెట్టుకో కూడదు. కాని అవసర సమయంలో తన పరాక్రమం ప్రదర్శించాలి. రాజు యజ్ఞములు, యాగములు చేసి దానధర్మములు చేయాలి. ఇంక రాజు అన్యాయం చేస్తే నరకానికి పోతాడు. రాజు చేసిన పాపములు ఎన్నటికీ అతడిని వదలక జన్మజన్మాంతరం వెన్నాడుతూ ఉంటాయి. పైన చెప్పిన ధర్మములను పాటించిన రాజు పుణ్య లోకాలకుపోతాడు " అని పరమేశ్వరుడు పార్వతీదేవికి వివరించాడు.

## పరమ ధర్మము

పార్వతీదేవి " నాధా ! ధర్మములలో పరమ ధర్మము ఏది ? " అని అడిగింది. పరమశివుడు " అహింస అన్ని ధర్మములలో ఉత్తమ ధర్మము " అన్నాడు శివుడు. పార్వతీదేవి " నాధా ! హింస చెయ్యకుండా మానవులు జీవించడం అసాధ్యము కదా ! మరి అహింసను ఎలా ఆచరించగలరు వివరించండి " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! నీ వన్నది నిజమే. నేలమీద పాకేచీమలు, కంటికి కనిపించని సూక్ష్మజీవులు, దోమలు, నల్లులు, క్రిమి కీటకాదులను చంపకుండా మనిషి బ్రతకలేడు. కాని ఆహారము కొరకు జీవహింస చేయడం పాపము. ఫలములు, కాయలు, ఆకులు తిని బ్రతకవచ్చు కదా ! పాలుత్రాగి బ్రతుక వచ్చు కదా ! ఇంద్రియనిగ్రహముతో జీవించిన వారు మహాత్ములు ఔతారు. కనుక అహింసను పాటించుట కష్టము కాదు.

## అహింస

అహింస అనేది వేరు విధముగా చెప్ప వచ్చు. చావు పుట్టుకలు ప్రాణులధర్మము. దానిని ఎవరూ తప్పించ లేరు. ఒకడు పెట్టిన దీపములో శలభములు పడి మరణించిన ఆ పాపము దీపము పెట్టిన వాడికి అంటదు. రైతు పొలము దున్నే సమయంలో నాగటిచాలులో పడి అనేక జీవులు చచ్చిపోతుంటాయి. ఆ పాపము దున్నేవాడికి అంటదు కదా ! మానవులు తమతమ దైనందిన పనులు చేసుకుంటుంటే ఆయువు తీరిన ప్రాణులు చచ్చిపోతూ ఉంటాయి. ఆ పాపపములు ఆయా మానవులకు అంటదు. ఆ ప్రాణులను తామే చంపామని అనుకోవడం మూర్ఖత్వమే ఔతుంది. పుణ్యకార్యములకు కాని పాపకార్యములకు కాని బుద్ధిముఖ్యము. ఏ పని అయినా బుద్ధి పూర్వకంగా చేస్తేనే ఆ ఫలము పనిచేసిన వాడికి సంక్రమిస్తుంది. ఈ సందర్భంలో నీకు ఒక విషయం చెప్తాను. తమకుచావు మూడిన గోవులు రంతిదేవుడు వద్దకు వెళ్ళి రంతి దేవుడు చేసే యజ్ఞములో ఆహుతి అయ్యాయి. ఆ గోవులను చంపిన రక్తము **చర్మణ్వతి** అనే నదిగా ప్రవహిస్తుంది. ఆ నదిలో స్నానము చేసిన వారు పాపములు నశించి పుణ్యాత్ములు ఔతారు. ఆ యజ్ఞములో చనిపోయిన గోవులన్నీ ఉత్తమలోకాలకు పోయాయి కనుక ఆ గోవులను చంపిన పాపము **రంతిదేవుడికి** అంట లేదు.

## క్షత్రియులు హింస

యుద్ధములో ఇరుపక్షాలు ఒకరిని ఒకరు నరుక్కుంటారు. కాని యుద్ధములో చచ్చిన వాళ్ళు స్వర్గానికిపోతారు. కనుక వాటిని హింస అని చెప్పడానికి వీలు కాదు. రాజుకు వేటకు పోవడం జంతువులను వేటాడడం రాజధర్మము. క్రూరమృగములను పంట పొలమును నాశనం చేస్తాయి. మానవులను చంపి వారికి హానిచేస్తాయి. రాజు వేటలో ఆ క్రూరమృగములను చంపినందువలన అతడికి పాపము అంటదు. రాజుచేతిలో చచ్చిన మృగములకు పుణ్య లోకములు ప్రాప్తిస్తాయి. రాజు దండించతగిన వారిని విడిచిపెట్టినా దండించ తగని వారినిదండించినా, తప్పుచేయని వాడికి శిక్షవిధించినా, బ్రాహ్మణులను హింసించినా రాజు హింస చేసినట్లే. **నహుషుడు** బ్రాహ్మణులను హింసించి శాపోహహతుడైనాడు. అలాగే ఇంద్రుడు **గౌతముడి**కి అపకారము చేసి శాపం పొందాడు. కనుక రాజైనవాడు బ్రాహ్మణులకు అపకారం చెయ్యకుండా రాజ్యపాలన చెయ్యాలి. అప్పడే అతడికి సకల శుభములు కలుగుతాయి. పార్వతీ ! యజ్ఞములలో, యాగములలో జంతువులను ఉపస్థంభముకు కడతారు. వాటిని శాస్త్ర సమ్మతంగా వధిస్తారు. అలా వధించబడిన మృగములకు పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి. యజ్ఞము చేసిన వాడికి పుణ్యము వస్తుంది. కనుక యజ్ఞ యాగములలో జంతువులను వధించుట హింస కాదు " అని అన్నాడు శంకరుడు.

## లోక జీవనం

పార్వతీదేవి " నాథా ! లోకములో జనుల జీవనవిధానం గురించి తెలపండి " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ఈ మానవ లోకము కర్మభూమి. స్వర్గము సుఖములకు ఆలవాలము. భూమి మీద జంతువులు పుట్టడం దు:ఖములకు మూలము. మానవులకు జీవనం గడపడానికి ధనము కావాలి. ధర్మంగా జీవించాలన్నా కోరికలు తీర్చుకోవాలి అనుకున్నా ధనము కావాలి కదా ! విద్య, వర్తకము, సేవావృత్తి, కర్షకవృత్తి ధన సంపాదనకు మూలములు. విద్య కలవాడు నిందపడకుండా బతకాలి. కర్షకుడు నేలయొక్క తత్వము తెలుసుకుని సేద్యము చేయాలి. వర్తకుడు వస్తువుల ధరల హెచ్చుతగ్గులు తెలుసుకుని వ్యాపారము చేయాలి. వచ్చిన లాభములో కొంత మాత్రమే వాడుకుని మిగిలినది పెట్టుబడికి చేర్చి వ్యాపారము చేయాలి. అప్పడే లాభాలు ఆర్జించగలడు. పశువుల యొక్క పోకడలు తెలుసుకోవాలి. ఆ ప్రకారము పశువులను కాచే సేవకుడు ధనము, కీర్తి పొందుతాడు. పరుల ధనము పరుల భార్యలను కోరకుండా ఉండడం దైవమును పూజించడం, పితృదేవతలను ఆరాధించడం, ఇతరులపట్ల కరుణ కలిగి ఉండడం, అతిథులను ఆదరించడం ప్రతి మానవుడు ఆచరించవలసిన ధర్మములు " అని చెప్పాడు మహేశ్వరుడు.

## కర్మ పరిపక్వత

పార్వతి " నాథా ! మానవులు నాలుగు వర్ణములుగా విభజింపబడ్డారు కదా. వారికి కర్మలు విధించారు కదా ! ఆ కర్మలు ఎలా పరిపక్వము ఔతాయి. వివరించండి ? " అని అడిగాడు. పార్వతి " మానవులను వర్ణములుగా విభజించిన తరువాత వారి వారికి తగిన కర్మలు విభజించబడ్డాయి. ఆ కర్మలు శ్రద్ధతోచేయు మానవులు స్వర్గంలో సుఖాను అనుభవించి తిరిగి అదే కులములో పుట్టి సుఖములను అనుభవిస్తారు. అలా కాకుండా తమ వృత్తి ధర్మాలను వదిలి ఇతర ధర్మాలు ఆచరించిన మానవులు మరణం తరువాత ఆయాకులములలో తిరిగి జన్మిస్తారు. మానవులు ఎంత పుణ్యము చేస్తే వారు అంతకంటే

ఉత్తమకులములో జన్మిస్తారు. తరువాత తిరిగిరాని లోకాలు పొందుతారు. దేవతాంశలలో జన్మించిన వారు ఆపదలు వచ్చినప్పుడు కుంగిపోరు. గర్వంతోమదించరు. తన శౌర్యంతో పాపులను గెలుస్తారు. తమ బంధుమిత్రులతో సఖ్యతతో మెలగుతారు. దీనులను కరుణతో చూస్తారు. వారిని రక్షిస్తారు. దైవాంశతో పుట్టిన వారికి కోపం రాదు. సౌమ్యంగా ఉంటారు " అని మహేశ్వరుడు చెప్పాడు.

## సంపదలు దరిద్రము

పార్వతీదేవి " నాధా ! మానవ లోకములో కొంతమంది సుఖసంతోషాలతో సిరిసంపదలతో తులతూగుతుంటారు. సుఖాలను అనుభవిస్తుంటారు. కాని కొంతమంది దరిద్రంతో బాధపడుతుంటారు. దీనికి కారణం ఏమిటి ? " అని అడిగింది పార్వతి. పరమశివుడు " గతజన్మలో కాకులకు కూడా మెతుకులు పెట్టకుండా పిడికెడు భిక్షము వెయ్యకుండా పిసినారిగా గడిపిన వాడికి ఈ జన్మలో దరిద్రం చుట్టుకుంటుంది. తినడానికి తిండి కట్టడానికి బట్టలేక బాధపడతాడు. అలా కాక పేదవారికి అన్నపానములు ఇచ్చిన వాడికి తన బంధువులను స్నేహితులను కష్టకాలంలో ఆదుకున్నవాడికి మరుజన్మలో సిరిసంపదలు కలుగుతాయి. సుఖంగా జీవిస్తారు. కనుక సుఖదుఃఖములు వారి వారి పూర్వజన్మ కర్మపరిపక్వత వలన కలుగుతుంది. అంతేకాని బ్రహ్మదేవుడికి ఒకరి మీద ప్రేమ మరొకరి మీద ద్వేషము ఉండదు. దేవుడు ఎవరిని పేదవాడుగా పుట్టించడు. ఎవరైనా ఈ జన్మలో పేదవాడుగా జన్మించి కష్టములు అనుభవిస్తున్నాడంటే అది అతడు పూర్వజన్మలో చేసిన పాపములఫలము అని తెలుసుకోవాలి. పార్వతీ ! కొంత మందికి సంపదలు ఉంటాయి కాని వారు కడుపునిండా తినరు, అనుభవించరు అలా సంపదఉన్నా దరిద్రము అనుభవిస్తుంటారు. ఎందుకో తెలుసా ! వీరు పూర్వ జన్మలో ఎవరికీ పిడికెడు అన్నము పెట్టి ఉండరు. బంధువులు, మిత్రులు పోరగా బలవంతంగా పరులకు ఉపకారం చేసి ఉంటారు. అలాంటి వారు సిరిసంపదలు ఉన్నా అనుభవించలేరు. కొంతమంది తమకు ఏమీ లేకపోయినా బంధుమిత్రుల సహాయంతో తిండికి గుడ్డకు లోటులేకుండా జీవిస్తుంటారు. అలాంటి వారు పూర్వజన్మలో తమకు శక్తి లేకపోయినా ఇతరులకు దానధర్మములు చేయవలెనని మనసులో ఘాఢంగా కాంక్షిస్తుంటాడు. అందువలన ఈ జన్మలో కూటికి గుడ్డకు లోటు లేకుండా జీవిస్తుంటారు. ఈ జన్మలో కొంతమంది అయాచితంగా ధనము లభిస్తుంది. అలాంటి వారు పూర్వజన్మలో పేదలకు అన్నదానము, ధనరూప దానము, వస్త్రదానము చేసి ఉంటారు. ఈ జన్మలో శ్రమతో ధనము సంపాదించే వారు పూర్వ జన్మలో ఎవరిని తిప్పించుకోకుండా పేదవారు అడగగానే దాన ధర్మములు చేసినవారు. కొంతమందికి ఎంత శ్రమపడ్డా ధనముచేకూరదు. అలాంటి వారు పూర్వజన్మలో లోభులై తమను యాచించిన వారిని రేపురా మాపురా అని తప్పించుకుని చివరకు మొండిచెయ్యి చూపి ఉంటారు. కొంత మందికి ముసలితనంలో అలాంటి వారు యవ్వనంలో ఉన్నప్పుడు దానధర్మములు చెయ్యకుండా ముసలితనంలో దానధర్మములు చేసినవారు. కొంతమంది తమకు మిక్కుటంగా ధనము కలిగినప్పటికీ వారికి ఉన్న రోగముల చేత తిండికూడా తినలేని స్థితిలో ఉంటారు. అలాంటి వారు పూర్వజన్మలో మంచిస్థితిలో ఉన్నప్పుడు దానము చేయకుండా వ్యాధిపీడితుడైన తరువాత దానధర్మములు చేసి ఉంటారు. ఈ జన్మలో అందంగా ఉన్నవారు పూర్వజన్మలో శాఖాహారం తిన్నవారు. ఈ జన్మలో కురూపులుగా ఉన్నవారు పూర్వజన్మలో అందగాళ్ళై కురూపులను ఎగతాళి చేసి బాధించిన వారై ఉంటారు. పూర్వజన్మలో ఏకపత్నీవ్రతుడై ఉన్న వాడికి ఈ జన్మలో సౌందర్యవతీ, సౌశీల్యవతీ, గుణవతీ అయిన భార్య లభిస్తుంది. అలా కాక భార్యను కష్ట పెట్టినవాడికి ఈ జన్మలో భార్యాసుఖం దూరమౌతుంది. ఈ జన్మలో విద్యా, విజ్ఞానము, జ్ఞానము కలిగి ఉండికూడా పేదరికంతో బాధపడే వాడు క్రితం జన్మలో దానధర్మములు చేయాలి అని తెలిసి కూడా దానధర్మములు చేయని వాడే. ఈ జన్మలో తెలివితేటలు లేకపోయినా కూడా అధికంగా ధనము సంపాదించిన వాడు. కిందటి జన్మలో తెలివి తక్కువ వాడైనా పేదసాదలకు దానధర్మములు చేసిన వాడై ఉంటాడు. ఈ జన్మలో విద్యావంతుడు మేధావి అయిన వాడు పూర్వజన్మలో గురువులను సేవించి విద్యావంతుడై తాను నేర్చుకున్న విద్యను ఇతరులకు నేర్పించిన వాడై ఉంటాడు. కొంత మందికి విద్య నేర్చుకోవాలని అనుకున్నా విద్య రాదు. అటువంటి వాడు పూర్వజన్మలో విద్యావంతులై గర్వించి సాటి విద్యావంతులను అవమానించి ఉంటారు. ఈ జన్మలో ఏరకమైన బాధలు లేకుండా రోగాలు లేకుండా భార్యా బిడ్డలతో సుఖంగా జీవిస్తున్న వారు పూర్వ జన్మలో సత్యము పలుకుచూ ఇతరుల మీదదయ చూపుతూ దానధర్మములు చేసినవారు. ఈ జన్మలో మాటవినని భార్య, మూర్ఖులైన కుమారులు, ఒంటి రోగముతో నిండా బాధపడే వారు కిందటి జన్మలో కోపంతోనూ, దురాశతోనూ, నాస్థికత్యముతో విర్రవీగిన వారు. ఈ జన్మలో పుట్టుగుడ్డి వాడు లేక మధ్యలో చూపుపోయిన వాడు పూర్వజన్మలో అందగాడై ఉండి ఇతరుల భార్యల వంక చెడుభావనతో చూసిన వాడు. ఈ జన్మలో చెవిపోటుతో బాధపడే వాడు పోయిన జన్మలో మంచి వారిని పరుషమైన మాటలతో బాధపెట్టినవాడై ఉంటాడు. ఉదరవ్యాధులతో బాధపడేవాడు పోయినజన్మలో ఇతరులకు విషం పెట్టినవాడు. మూత్రకోశ వ్యాధులతో బాధపడే వాడు పోయిన జన్మలో కన్యలను, పర కాంతలను శీలము కాజేసిన వాడు. ఈ జన్మలో క్షయరోగముతో బాధపడుతున్న వాడు పోయిన జన్మలో పరుల ఆహారమును అపహరించిన వాడై ఉంటాడు. ఈ జన్మలో కుష్ఠురోగముతో బాధపడే వాడు పూర్వ జన్మలో పరులను దారుణంగా హింసించిన వాడై ఉంటాడు. ఈ జన్మలో కుంటివాడుగా ఉన్నవాడు పోయిన జన్మలో పరుల కాళ్ళుచేతులు విరిచిన వారై ఉంటారు. ఈ జన్మలో చర్మరోగంతో బాధపడే వారు పోయిన జన్మలో మంచి వారిని హింసించిన వారు. ఈ జన్మలో పాదములకు రోగములు వచ్చిన వారు పోయినజన్మలో పాదములు కడగకుండా దేవుని వద్దకు వెళ్ళిన వారే. ఇంకా

పేద వారిని, అమాయకులను నిష్కారణంగా పాదములతో తన్నినవారే. ఈ జన్మలో కడుపులో రోగములతోను, జ్వరముతోనూ, శరీరం అంతా రోగములతో బాధపడేవారు పోయినజన్మలో జంతువులను చంపినవారు గురువులను బాధపెట్టినవారు. ఈ జన్మలో గూనివాడు, మరగుజ్జువాడు పోయిన జన్మలో ధాన్యంలో తాలుగింజలు కలిపి అమ్మినవాడు, తప్పుడు కొలతలతో ప్రజలను బాధపెట్టినవాడు. ఈ జన్మలో వెర్రివాడు పిచ్చివాడు పోయిన జన్మలో అమాయకులను మోసగించి ధనం సంపాదించినవారు. ఈ జన్మలో సంతానము లేనివారు పోయిన జన్మలో తల్లితండ్రులకు శ్రాద్ధం పెట్టనివారు, పసిపిల్లలను చంపినవారు. ఈ జన్మలో నపుంసకులు పోయినజన్మలో ఎద్దులకు వృషణాలు కొట్టినవారు. ఈ జన్మలో వైధవ్యము పొందిన వనిత పోయిన జన్మలో భర్తనుమోసగించి ధనము సంపాదించినది, తనభర్తను వదిలి మరియొకరి భర్తనుకోరింది. ఈ జన్మలో గొప్పవంశంలో పుట్టి కూడా చేయకూడని పనులు అందరూ ఏవగించుకునే పనులు చేసిన వారు పూర్వజన్మలో అహంకారంతో, గర్వంతో, మదంతో ఇతరులను అవమానించిన వారు. ఈ జన్మలో సేవకులుగా సేవకావృత్తి చేస్తూ యజమానులు పెట్టే బాధలను భరిస్తున్న వారు పూర్వజన్మలో అమాయకులను నిరపరాధులను కొడుతూ తిడుతూ హింసించినవారే. ఈ జన్మలో చెయ్యని నేరానికి శిక్ష అనుభవించేవారు. పూర్వజన్మలో నిరపరాధిని శిక్షించినవాడే. ఈ జన్మలో ఒక్కసారిగా బంధుమిత్రులను పోగొట్టుకున్న వాడు. పూర్వజన్మలో నిర్దాక్షిణ్యంగా ఎందరినో చంపినవాడు. ఈ జన్మలో తనకున్న ధనమును పోగొట్టుకున్న వాడు పూర్వజన్మలో తనదగ్గర దాచిన ఇతరుల ధనమును వారిని మోసము చేసి అపహరించిన వాడు. పార్వతీ నేను పైన చెప్పిన పాపములు చేసిన వారందరూ ముందు నరకము అనుభవించి తరువాత మానవులుగా పుట్టి ఆ కర్మ ఫలము అనుభవిస్తున్న వారే. క్రితము జన్మలో తక్కువ పాపములు చేసిన వాడు మానవుడుగా జన్మిస్తాడు. ఏ జన్మలో చేసిన పాపాలు ఆ జన్మలో అనుభవానికి రావు " అని పరమశివుడు పార్వతీదేవికి చెప్పాడు.

## రాజదండన

పార్వతీదేవి " నాధా ! మనుషులు తాము చేసిన పాపకర్మలకు ఫలితము మరుజన్మలో అనుభవిస్తారు కదా ! కాని మానవులు వారు చేసిన పాపకర్మలకు రాజుల చేతిలో, న్యాధికారుల చేతిలలో శిక్షలు అనుభవిస్తున్నప్పుడు వారి పాపకర్మలు ఈ జన్మలోనే ఫలితము అనుభవించినట్లు ఔతుంది కదా ! ఇది తమరు చెప్పిన దానికి పరస్పరవిరుద్ధము కాదా ! " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! రాజులు న్యాయాధికారులు తప్పు చేసిన వారికి నిష్పక్షపాతంగా శిక్షలు వేస్తారు. ఆ శిక్షలు చూసి మిగిలిన వారు నేరములు చేయకుండా నియత్రింఅడానికి అలా చేస్తారు. ఆ శిక్షలు అనుభవించడం అన్నది పూర్వజన్మ పాపఫలితమే. ఈ జన్మలో చేసిన పాపపుణ్యములు మరుజన్మలో అనుభవించక తప్పదు " అన్నాడు శివుడు. పార్వతీ దేవి " దేవా ! రాజ దండన వలన పాపకర్మల ఫలితము తొలగిపోతుందా పోదా ! " అనీడిగింది. శివుడు " రాజదండనకు గురి అయిన వాడు యమదండన తప్పించుకుంటాడు. కాని అపరాధిని విడిచిపెట్టినా నిరపరాధిని శిక్షించినా రాజుకు, అధికారికా నరకము తప్పదు. కనుక ఎటువంటి వారైనా తాము చేసిన కర్మల ఫలము అనుభవించక తప్పదు " అన్నాడు శివుడు.

## కర్మ ప్రేరణ

పార్వతీదేవి " నాధా ! మానవుడు చేసే కర్మలు తన సంకల్పంతో చేస్తాడా ! లేక గ్రహస్థితి అనూల ప్రతికూలములను అనుసరించి చెస్తాడా ! వివరించండి " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! మానవుడు గ్రహ సంచారము కారణంగా శుభములు అశుభములు అయిన కర్మలు చేస్తూ ఉంటాడు. తన కర్మలన్నింటికీ తానే అధికారి. గ్రహాలు ఏవీ మానవులను ప్రేరేపించి కర్మలను చేయించవు. తాను చేసే కర్మలకు తానే కర్త కనుక ఆ కర్మల ఫలితము తాను అనుభవించక తప్పదు " అని పరమేశ్వరుడు చెప్పాడు.

## మరణం

పార్వతీదేవి " నాధా ! చావు అనునది ఏమి ? దాని స్వరూపము ఏమిటి ? " అని అడిగింది. పరమశివుడు " దేవి ! ఆత్మ నిత్యము, శాశ్వతము. దేహము అశాశ్వతము. దేహము ముసలితనముచేత రోగములచేత కృంగి కృశించి పోతుంది. దేహము వాసయోగ్యము కానప్పుడు జీవాత్మ ఈ దేహమును వదిలిపోతుంది. అదే మరణము. జీవాత్మ కృశించి వడలిన దేహమును వదిలి తిరిగి వేరొక శరీరమును ధరించి శిశువుగా జన్మించడమే పుట్టుక. కనుక జీవుడు ఈ జననమరణ చక్రములో నిరంతరం పరిభ్రమిస్తూ ఉంటాడు " అని పరమేశ్వరుడు చెప్పాడు. పార్వతీ దేవి " నాధా ! బాలుడు చిన్నతనంలో చనిపోతే వృద్ధుడు చాలా కాలము బ్రతకడానికి కారణం ఏమిటి ? " అని అడిగింది పార్వతి. పరమేశ్వరుడు " దేవీ ! ఈ కాలము శరీరమును కృశింప చేస్తుంది కాని చంపదు. మానవులు పూర్వజన్మలో చేసిన కర్మల ఫలితంగా జీవితం పొడిగించబడడం తగ్గించబడడం జరుగుతూ ఉంటుంది. పొడిగిస్తే చాలా కాలం బ్రతుకుతాడు. తగ్గిస్తే మరణం సంభవిస్తుంది " అని చెప్పాడు ఈశ్వరుడు.

పార్వతీదేవి " నాధా ! మనిషికి ఆయుష్షు ఎందువలన పెరుగుతుంది ? ఎందువలన తగ్గుతుంది ? " అని అడిగింది పార్వతి. పరమేశ్వరుడు " పార్వతీ ! మానవుడు ప్రశాంతముగా బ్రతికితే ఆయువు పెరుగుతుంది. అశాంతిగా జీవిస్తే ఆయువు క్షీణిస్తుంది. మానవుడు క్షమించడం నేర్చుకోవాలి. శుచిగా ఉండాలి. అందరి మీద దయకలిగి ఉండాలి. గురువుల ఎడ భక్తికలిగి ఉండాలి. వీటన్నింటిని మానవుడి ఆయువు వృద్ధిపొందుతుంది. అధికమైన కోపము కలిగి ఉండడం, అబద్ధాలు చెప్పడం, ఇతరుల ఎడల క్రూరంగా ప్రవర్తించడం, అపరిశుభ్రంగా ఉండడం, గురువులను ద్వేషించడం వీటివలన ఆయువు క్షీణిస్తుంది. పార్వతీ " తపస్సుచేతనూ, బ్రహ్మచర్యముచేతనూ, మితాహారం చేతనూ, రోగం వచ్చినప్పుడు తగిన ఔషధములు సేవించడం చేతనూ ఆయుర్దాయము పెరుగుతుంది. పైన చెప్పిన కర్మలు అతడు తన పూర్వజన్మ సుకృతంగా చేస్తాడు. ముందు జన్మలో పుణ్యం చేసుకున్న వాళ్ళు స్వర్గానికి పోయి అక్కడ సుఖములు అనుభవించి తిరిగి భూలోకములో జన్మిస్తారు. వారికి ఆయుష్షు ఎక్కువగా ఉంటుంది. వారు అకాల మరణం చెందరు. ముందు జన్మలో పాపము చేసుకున్న వాళ్ళు నరకానికి పోయి కష్టములు అనుభవించి భూలోకములో తిరిగి జన్మిస్తాడు. అతడు అల్పాయుష్కుడౌతాడు. అందువలన అకాలమరణం సంభవిస్తుంది " అని పరమేశ్వరుడు చెప్పాడు.

## జీవాత్మ స్త్రీ పురుషులు

పార్వతీదేవి " నాధా ! మానవులలో స్త్రీలు, పురుషులు అని రెండు రకాలు ఉంటారు కదా ! స్త్రీ పురుషులలో జీవాత్మ ఎలా ఉంటుంది " తెలియజెయ్యండి. పరమశివుడు " పార్వతీ ! పుట్టడం స్త్రీగానూ, పురుషుడిగానూ పుట్టినా వారిలో ఉండే జీవాత్మ ఒక్కటే. దానికి స్త్రీ పురుష లింగభేదం లేదు. మనస్సు, బుద్ధి, హంకారము అందరికీ ఒక్కటే. అందరిలోనూ పంచభూతములు వాటి తన్మాత్రలు ఒక్కటే. మానవుడు చేసే కర్మలకు జీవాత్మ బాధ్యుడుకాడు. మానవుడు తనలోని సత్వ, రజో, తమోగుణ ప్రకోపముచేత పలువిధ కర్మలుచేస్తుంటాడు. జీవాత్మ ఆ కర్మలను సాక్షీభూతంగా చూస్తుంటాడు. సత్యము పలకడం, ఇతరులపట్ల దయకలిగి ఉండడం, ఎప్పుడూ మత్తులో జోగుతుండడం లేక నిద్రపోతూ ఉండడం ఇవన్నీ **తామసగుణములు**. సత్వగుణ ప్రధానుడికి పుణ్య లోకాలు ప్రాప్తిస్తాయి. రజోగుణ ప్రధానుడికి మానవ జన్మ ప్రాప్తిస్తుంది. తమోగుణ ప్రధానుడు పశుపక్ష్యాదులుగా జన్మిస్తాడు. ఈ మూడు గుణములను అధిగమించిన వాడు ముక్తి పొందుతాడు. ఈ సత్వ, రజో, తమో గుణముల కారణంగా కర్మలు చేసే వాడికి శుభములు, అశుభములు కలుగుతుంటాయి. ఒక్కోసారి దానికి భిన్నంగా కూడా జరుగుతుంటుంది. అధికారులు సేవకులను తిట్టి పనిచేయించుకోవడం పాపము కాదు, వైద్యుడు శస్త్రచికిత్స చేసి రోగిని కాపాడుతాడు అది పాపముకాదు. గురువు విద్యార్ధిని దండించి విద్యాబోధ చేసాడు. అది పాపము కాదు. అవి సుకృతములే కనుక సుకృత ఫలితమే వారికి వస్తుంది. జీవులు గర్భము నుండి, గుడ్డు నుండి, చెమట నుండి జన్మిస్తుంటాయి. వీటికి అన్ని ఇంద్రియములు ఉంటాయి. కాని విత్తనముల నుండి పుట్టిన చెట్లకు స్పర్శ జ్ఞానము మాత్రము ఉంటుంది. గర్భము నుండి పుట్టిన జీవులలో మానవుడు గొప్పవాడు. అతడికి ధర్మాధర్మవిచక్షణ, మంచిచెడుల విచక్షణ ఉంటాయి. ఈ జ్ఞానము లేనియడల అతడు పశువుతో సమానము. చీకటి రెండు విధములు రాత్రివేళ అలముకునే ఒకటి చీకటి. రెండవది అజ్ఞానము వలన కలిగే అంధకారము. మొదటి చీకటి వెలుగు రాగానే అంతరిస్తుంది. మనిషిలో అలముకున్న చీకటిని విద్యవలన శాస్త్ర విజ్ఞానమువలన నశిస్తుంది. మానవులలో పుట్టిన చీకటిని పారద్రోలడానికి బ్రహ్మ వేదములు, శాస్త్రములు సృష్టించాడు. వేదములు, శాస్త్రములు అధ్యయనం చెయ్యడం వలన ఏది చెయ్యాలో ఏది చెయ్యకూడదో తెలుస్తుంది. దాని వలన అజ్ఞానము చీకట్లు తొలగి పోతాయి. కామము, కోపము, లోభము, మోహము, మదము, మాత్సర్యము మొదలైన గుణములు శాస్త్రాధ్యయనం వలన నశిస్తాయి. విజ్ఞానాన్ని పెంపొందిస్తాయి. అలాంటి వాడు కొంచం పుణ్యము చేసినా ఎక్కువ ఫలితం వస్తుంది. శాస్త్రజ్ఞానము లేకుండా అజ్ఞానాంధకారంలో మునిగిన వాడు ఎన్ని పుణ్య కార్యాలు చేసినా అతడికి లభించే ఫలము తక్కువే " అన్నాడు శివుడు.

## పూర్వ జన్మ స్మృతి

" పార్వతీ ! నరుడు మరణించగానే జన్మించిన అతడికి పూర్వజన్మ స్మృతి ఉంటుంది. వాడిని జాతి అమరుడు అంటారు. కాని వయసు వచ్చేసరికి పూర్వజన్మ స్మృతి పోయి మామూలు మనిషి ఔతాడు. ఇలా కొంత మందికి మాత్రమే జరుగుతుంది. ఇలా పూర్వజన్మ స్మృతి కలగడణం వలన పూర్వజన్మ ఉందని రుజువు మానవులకు ఔతుంది. ఒక్కోసారి మరణించిన మానవుడు తిరిగి బ్రతకడం జరుగుతుంది. ఒక్కోసారి యమభటులు పొరపాటున ఒకరికి బదులు ఒకరిని తీసుకు పోతుంటారు. యముడు ఆ పొరపాటును సరిదిద్ది తిరిగి భూలోకానికి పంపిస్తాడు. ఇలాంటివి అక్కడక్కడా జరుగుతుంటాయి " అని చెప్పాడు శివుడు. పార్వతీదేవి " మహాదేవా ! స్వప్నము అంటే ఏమిటి ? " అని అడిగింది. " పార్వతీ ! నరుడు నిద్రించే సమయంలో ఇంద్రియములు పని చెయ్యవు. కేవలము మనసు మాత్రమే పని చేస్తుంది. ఆ మనస్సు దర్శించేది స్వప్నము లేక కల అంటారు. ఒక్కోసారి ఈ స్వప్నంలో జరగబోయే విషాయాలు కూడా కనిపిస్తాయి " అని చెప్పాడు మహేశ్వరుడు.

## కర్మకు బాధ్యులు

పార్వతీదేవి ! మానవులు కర్మలు చేస్తుంటారు కదా ! ఆకర్మలను మానవుల చేత దేవుడు చేయిస్తుంటాడా ! లేక వారంతట వారు సంకల్పించి చేస్తుటారా " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! దేవుడు ఏ పనీ చెయ్యడు. కాని దేవుడు మానవుడి కర్మలకు తన సహాయము అందిస్తాడు. మానవుడు చేసే కర్మలకు తగిన ఫలము అందిస్తాడు. ఏ పని చెయ్యాలో నిర్ణయించి కర్మలు చేసేది మానవుడే. ఇందులో దైవప్రమేయము ఏదీలేదు. పూర్వజన్మ కర్మఫలితంగా మానవుడు తను చేయవలసిన కర్మలను నిర్ణయించి కర్మలుచేస్తాడు. మానవుడు పూర్వజన్మలో చేసే పనులు దైవములు అయితే ఈ జన్మలో చేసేపనులు పౌరుషములు అనగా అవే పురుషప్రయత్నములు. ఒక పనిచెయ్యడానికి మనిషి చేసే ప్రయత్నములు వ్యవసాయము వంటిది. దైవ సహాయము మొక్కకు అందించబడే గాలి, నీరు వంటిది. నేలను తవ్వితే భూగర్భము నుండి నీరు ఉద్భవిస్తుంది. అలాగే ఆరణి మధిస్తే అగ్ని పుడుతుంది. అలాగే ఏ పనికైనా పురుషప్రయత్నము ఉంటేనే దైవము కూడా తోడై చక్కటి ఫలితాలను అందిస్తాడు. పురుషప్రయత్నము లేకుండా దైవము సహాయపడతాడని అనుకుంటే కేవలము దైవము చూస్తాడని ఊరకుంటే దేవుడు ఫలితాన్నివ్వడు. కనుక పార్వతీ ! ఏ పని సాధించాలని అనుకున్నా పురుషప్రయత్నము తప్పకకావాలి. అప్పడే దేవుడు సత్ఫలితాలను ఇస్తాడు.

## జీవుడు గర్భప్రవేశము

పార్వతీదేవి " నాధా ! మరణానంతరము జీవుడు మరొక దేహములో ప్రవేశిస్తాడని అన్నారు కదా ! జీవుడు మరొక గర్భములో ఎలా ప్రవేశిస్తాడు ? " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! స్త్రీపురుషుల కలయిక వలన స్త్రీ గర్భము ధరించినప్పుడు పిండము ఉత్పత్తి ఔతుంది. ఆ పిండములో **జీవుడు** ఉండి శిశువుగా పునర్జన్మ పొందుతాడు. జీవుడు స్త్రీ గర్భములో రూపుదిద్దు కోవడానికి దైవసహాయము తప్పని సరి. పార్వతీ ! నీకొక రహస్యము చెప్తాను. పూర్వము మానవులందరికీ పూర్వజన్మ స్మృతి ఉండేది. అందువలన మానవులందరూ తమనుతాము సంస్కరించుకుని పుణ్యకార్యములు చేసి స్వర్గలోక సుఖములు పొందుతూ ఉండే వారు. అందరూ స్వర్గములో ప్రవేశించడంతో స్వర్గములో తొక్కిసలాట అధికమైనది. వీరందరికీ స్వర్గసుఖములు కలింగించడం దేవతలకు శ్రమ కలిగించింది. దేవతలందరూ బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి తమకష్టము చెప్పకున్నారు. బ్రహ్మదేవుడు యోచించి మానవులకు ఉన్న పూర్వజన్మ స్మృతి తీసివేసి దాని స్థానంలో మానవులకు కోరికలు, కామము, మదము, మాత్సర్యము, మోహము, లోభము మొదలైన దుర్గుణములు కల్పించాడు. దాని ఫలితంగా మానవులకు కోరికలు ఎక్కువై ఆ కోరికలు తీరడానికి చెడ్డపనులు చేయడానికి సంకల్పించారు. ఆ కోరికలు తీరకపోతే కోపము వచ్చేది. ఆ కోపము కారణంగా మానవులు మరణానంతరం స్వర్గానికి వెళ్ళలేక పోయారు. కాని నరకానికి మానవుల రాక ఎక్కువైనది. నరకంలో తాకిడి తగ్గించడానికి బ్రహ్మదేవుడు ఒక ఉపాయము ఆలోచించి స్వర్గానికి నరకానికి సమానంగా మానవులు వెళ్ళే ఏర్పాటు చేసారు. మానవులకు స్వర్గము, నరకము వాటి స్థితిగతులు కేవలం శాస్త్రపరిజ్ఞానము వలననే తెలిసే ఏర్పాటు చేసాడు. కనుక స్వర్గ నరకాల పరిజ్ఞానము మానవులు వారికి వారుగా తెలుసుకునే శక్తినికోల్పోయారు " అని పరమేశ్వరుడు చెప్పాడు.

## పునర్జన్మ

పార్వతీదేవి " నాధా ! భూలోకంలో పునర్జన్మ ఉందని కొందరు లేదని కొందరు వాదులాడుకుయంటారు. ఈ సందేహము ఎంతకీ మానవులను వదలడం లేదు కనుక దాని గురించి వివరించండి " అని అడిగింది. పరమేశ్వరుడు నవ్వి " ఈ సందేహం మానవులకే కాదు దేవతలకు కూడా ఉంది. ఈ విషయంలో ఎవరికీ ఖచ్చితమైన అభిప్రాయంలేదు. పునర్జన్మ ఉన్నది కాని ఈ విషయము వేదపరిజ్ఞానము కలవారికే బోధపడుతుంది " అని అన్నాడు ఈశ్వరుడు. పార్వతి " నాధా ! మానవులు చనిపోగానే వారికి ఉన్న ఆకారము పోతుంది. అంటే స్థూల శరీరము పోతుంది. శరీరమే లేనప్పుడు యమభటులు ఈ మానవుడిని ఎలా యమలోకానికి తీసుకు వెళ్ళగలరు ? " అని అడిగింది. శివుడు " పార్వతీ ! ఆయువు తీరగానే మానవుడు ఈ శరీరాన్ని విడిచి పెడతాడు. అప్పుడు యమభటులు ఆ ప్రాణాన్ని ఒక సూక్ష్మశరీరంలో ప్రవేశపెడతారు. తరువాత మంచివారు, ధర్మాత్ములు, పుణ్యకార్యములు చేసిన వారు అయిన మానవులను చక్కటి రాజ మార్గములో తీకసుకు వెళ్ళి యమధర్మరాజు ముందు నిలబెడతాడు. యముడు వారు చేసిన పుణ్యకార్యములను విచారించి పుణ్యలోకములకు పంపుతాడు. కొంచం తక్కువగా పుణ్యం చేసుకున్న వారిని తిరిగి మానవ లోకంలో పుట్టమని పంపుతాడు. పాపం చేసిన వారిని నరకానికి పంపుతాడు " అని పలికాడు.

## నరకము

పార్వతీదేవి " నాథా ! నరకమనగా ఏమి ? అది ఎలా ఉంటుంది " అని అడిగింది. శివుడు " దేవీ ! ఈ భూమికి కిందుగా రౌరము, హారౌరము, కంటకావనము, అగ్ని కుండము, పంచాష్టకము అనే అయిదు నరకాలు ఉన్నాయి. మానవులు చేసిన పాపమును అనుసరించి ఆయా నరకాలకు వెళ్ళి శిక్షలు అనుభవిస్తుంటారు. అక్కడ కాల్చడము, నరకడం, కట్టడము, కొట్టడము, కుక్కల చేత కరిపించడం, క్రిముల చేత పీడించడం, గద్దల చేత పొడిపించడం మొదలైన నరక బాధలు పెడతారు. ఆ ప్రకారము పాపములు చేసిన వారు నరక బాధలు అనుభవించి పునీతులు ఔతారు. తరువాత భూలోకములో పురుగులుగా, తరువాత పక్షులుగా, తరువాత జంతువులుగా, తరువాత మానవులుగా జన్మిస్తారు " అని పలికాడు.

### పాపములు

పార్వతీదేవి " నాథా ! మీరు పాపములు అని చెప్పారు కదా ! అసలు పాపమంటే ఏమిటి ? " అని అడిగింది. పరమేశ్వరుడు " పార్వతీ ! మానవుడు మూడు విధములైన పాపములు చేస్తాడు. అవి మనస్సుతోనూ, వాక్కుతోనూ, శరీరంతో చేస్తాడు. ఇతరులకు ధనం ఉందే అని ఏడుస్తూ వాటిని అపహరించాలని అనుకోవడము, తన ఎదుటగా చెడ్డ పనులు, చెయ్య కూడని పనులు జరుగుతుంటే చూసి ఆనందించడమూ అడ్డు చెప్పక పోవడం, ధర్మకార్యములు, దైవ కార్యములు చేసే వాడికి అడ్డు దగలడం, చెయ్యనీయకుండా ఆపడం ఇవన్నీ మనసుతో చేసే పాపములు. అబద్ధాలు చెప్పడం, ఇతరులను తిట్టడం, కఠోరంగా మాట్లాడడం ఇవి వాక్కుతో చేసే పాపములు. ఇతరులను కొట్టడం, చంపడం, అక్రమంగా బంధించడం, అడ్డమైన తిండులు తినడం, మద్యం త్రాగడం. పరాయి స్త్రీలను చెరపట్టుట, అనుభవించడం ఇవి శరీరంతో చేసే పాపములు. ఈ పాపాలన్నింటికీ మద్యపానం మహా పాపము. దీని వలన ఎన్నో అనర్ధాలు కలుగుతాయి. ఇలా మానవులు పాపకూపంలోకి పోతుంటారు " అన్నాడు.

## పుణ్యములు

పార్వతీదేవి " నాథా ! పాపములగురించి చెప్పారు మరి పుణ్యకార్యముల అంటే ఏమిటి ? అవి ఎలాఉంటాయి ? " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! పుణ్యలు కూడా మూడు రకాలు. **ఔపరమికము, నిరుపకరణము, సోపకరణము** అని మూడు విధములు.

### ఔపకరణము

**ఔపరిమికము** అంటే పాపములు చెయ్యకుండా ఉండడం. పాపకార్యములను విడిచిపెట్టుట. వాటి జోలికిపోకుండా ఉండడం. ఈ పని చెయ్యడానికి ధనము అవసరము లేదు. మనసులో అనుకుంటే చాలు. అన్నీ సుఖాలే కలుగుతాయి. చెడ్డపనులు చెయ్యకుండా ఉండడం మన చేతిలోపని. అదీ చెయ్యక పోతే నరకానికి పోక తప్పదు. చెడ్డ పనులను చెయ్యడం మానిన తరువాత వేదములు, శాస్త్రములు, పురాణములు చదివి అర్ధము చేసుకొని ఆచరించాలి. ఇంద్రియములను అదుపులో పెట్టుకోవాలి. దీనివలన ఈ లోకములో సుఖములు అనుభవించవచ్చు పరలోకములో స్వర్గసుఖములను అనుభవించ వచ్చు.

### నిరుపకరణము

నిరుపకరణము అంటే శౌచము అంటే శుభ్రముగా ఉండడం. అంటే కేవలం శుభ్రంగా ఉంటే చాలదు. మనసు కూడా నిర్మలంగా ఉంచుకోవాలి. అబద్ధాలు చెప్పకూడదు. శాంతంగా ఉండాలి. ఇంద్రియములను అదుపులో ఉంచుకోవాలి. మనసును అదుపులో ఉంచుకోవాలి. మంచి ప్రవర్తనతో మెలగాలి. శక్తిమేరకు ఉపవాసాలు చేయాలి. శక్తి కొద్ది వ్రతములు ఆచరించాలి. బ్రహ్మచర్యము పాటించాలి. దీనిని నిరుపకరణము అంటారు. మొదట చెప్పిన శౌచము బాహ్యము, అభ్యంతరము అని రెండు రకములు. బాహ్యశుచి అంటే శరీరాన్ని శుభ్రంగా ఉంచుకోవాలి. తినే ఆహారము పరిశుభ్రంగా ఉండాలి. కంటితో చూసింది, చెవులతో విన్నది బయటకు చెప్పాలి. చెప్పింది చేయాలి. అంటే ఎల్లప్పుడూ నిజమే చెప్పాలి. అభ్యంతరం అంటే మనసును ఎలాంటి వికారాలకు లోను కాకుండా నిర్మలంగా ఉంచుకోవాలి.

### స్నానములు

దేవీ ! పుణ్య నదులలో స్నానము చేస్తే దేహం పవిత్రమౌతుంది. సముద్రములలో కలిసే నదులను తీర్ధములు అంటారు. తీర్ధములలో స్నానము చేసిన పుణ్యము వస్తుంది. ఈ నదులలో కూడా మునీశ్వరులు తమతమ పాదములు మోపిన ప్రదేశములు పరమ పవిత్రమైనవి. అలాగే నదులు సముద్రములలో కలిసే సంగమ ప్రదేశములు పరమపవిత్రములైనవి. ఈ పుణ్య తీర్ధములలో స్నానము చేసే ముందు కాలకృత్యములు తీర్చుకోవాలి. శుభ్రంగా స్నానం చెయ్యాలి. ఎల్లప్పుడూ దూరంగా ఉండి శ్రమతో కూడిన తీర్ధయాత్ర మంచిది. దగ్గరలో ఉన్న తీర్ధములలో స్నానం ఫలితం ఇవ్వదు.

### సోపకరణము

పార్వతీ పుణ్యములలో మూడవది సోపకరణము. ధనము, ధాన్యము సమృద్ధిగా ఉండి దానధర్మములు, పితృకార్యములు, దేవకార్యములు చేయు గృహస్థులు చేయు పుణ్య కార్యములను సోపకరణము అంటారు. గృహస్థులు తాము న్యాయంగా సంపాదించినధనము, ధాన్యమును వేదములు చదువుకున్న బ్రాహ్మణులకు పుణ్యతీర్ధములందు దానము చెయ్యడం వలన పుణ్యమువస్తుంది. ఈ దానములు కూడా మూడురకములు. తన శక్తికి మించి దానధర్మములు చెయ్యడం ఉత్తమము, తన శక్తికి తగినట్లు దానధర్మములు చెయ్యడం మధ్యమము. తనకు శక్తి ఉండి కూడా దానికి తగినట్లు దానధర్మము చెయ్యక పోవడం అధమం. దానములు దేవ కార్యములలో పితృకార్యములలో చెయ్యతగినవి. తనకు ఇష్టమైన వస్తువులను బ్రాహ్మణులకు ఇవ్వడంవలన పుణ్యం వస్తుంది. కొంత మంది దానము చేసిన తరువాత అయ్యో ఇంత దానముచేసానే అని చింతించే వారు ఉంటారు. అలాగే దానము చేసిన తరువాత తాను చేసిన దానమును పొగుడుకునే వారు, పొగిడించుకునే వాళ్ళు, ప్రచారము చేసే వాళ్ళు ఉంటారు. వారికి ఆదానము చేసిన ఫలము దక్కదు. గుప్తదానము శ్రేష్ఠమైనది " అని పరమశివుడు చెప్పాడు.

### దానము ఇవ్వతగిన వస్తువులు

పార్వతీదేవి " నాధా ! దానము ఇవ్వతగిన వస్తువుల గురించి తెలపండి " అని అడిగింది. శివుడు పరమశివుడు " పార్వతీ ! అన్నము నీరు అన్నీ జీవులకు ప్రాణాధారము. కనుక దానము చెయ్యతగిన వస్తువులలో నీరు ముఖ్యమైనవది. అతిథులకు అన్నము నీరు ఇచ్చి తృప్తిపరిస్తే వారికి స్వర్గలోకసుఖములు ప్రాప్తిస్తాయి. బంగారము అగ్నితో సమానము. కనుక బంగారము దానం చెయ్యడం అగ్నిని దానము చెయ్యడంతో సమానము. తరువాత స్థానము గోదానము చెయ్యడము. గోవును బ్రాహ్మణులకు దానము చేసిన ఆ గోవు శరీరము మీద ఎన్ని రోమములు ఉంటాయో అన్ని సంవత్సరాలు స్వర్గలోక సుఖాలు అనుభవిస్తాడు. కపిలగోవు దానము ఇంకా పవిత్రమైనది. కపిలగోవును దానము ఇచ్చిన 21 తరాల పితరులు స్వర్గానికి వెడతారు. తరవాతది భూదానము. భూదానము చేసిన వారు ఆ భూమి ఉన్నంత కాలము స్వర్గసుఖములు అనుభవిస్తారు. భూమిలో సకల సంపదలు ఉంటాయి కనుక భూమిని దానం చేసిన సకల సంపదలను దానము చేసినట్లే . తరువాత దానము కన్యాదానము. కన్యాదానము చేస్తే యమధర్మరాజు ప్రీతి చెందుతాడు. దేవతలు హర్షిస్తారు. కన్యాదానము చేసిన వాడికి తేజస్సు, యశస్సు కలుగుతాయి. తరువాతి దానము విద్యాదానము. విద్యాదానము అర్హులకు మాత్రమే చేయాలి. అపాత్రా దానము చేయరాదు. విద్యాదానము చేసిన వారికి శాశ్వతంగా స్వర్గలోకము ప్రాప్తిస్తుంది. కొంత మందికి విద్య రాదు. అటువంటి వారు విద్యాదానము చెయ్య లేరు. అటువంటి వారు బాగా విద్యవచ్చిన గురువులకు దక్షిణ ఇచ్చి వారి చేత విద్య చెప్పించిన ఎడల వారే స్వయంగా విద్యచెప్పించిన ఫలితం దక్కుతుంది. పార్వతీ నువ్వులు దానము చేస్తే అగ్ని ష్టోమ ఫలము, వస్త్రములను దానంగా ఇచ్చిన అన్నీ పీడల నుండి విముక్తి, దాసదాసీ జనములను దానంగా ఇస్తే ఆత్మ సంతృప్తి, నదులను, జలప్రవాహాలను దాటిస్తే దుఖములన్నీ తొలగి పోతాయి. ప్రయాణము చేయు బాటసారులకు రహదారుల పక్కన సత్రములు కట్టి ఆశ్రయము కల్పించిన సకల శుభములు కలుగుతాయి. ఇవీ దానముకు కలుగు ఫలములు " అని మహేశ్వరుడు చెప్పాడు.

### యజ్ఞములు వాటి ఫలములు

పార్వతీదేవి " నాధా ! యజ్ఞములు వాటి ఫలములు చెప్పండి " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! యజ్ఞములు రెండు విధములు. ఒకటి వైదికయజ్ఞము. రెండవది లౌకికయజ్ఞము. వైదికయజ్ఞము అనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు న్యాయంగా ధనము సంపాదించి ఆ ధనముతో దేవతలను తృప్తి పరచడానికి ఋత్విక్కులతో చేయించే యజ్ఞములు వైదికయజ్ఞము అంటారు. దేవతలకు ఉత్సవములు, బ్రహ్మోత్సవములు, గీత, వాద్య, నృత్య ప్రదర్శనలు ధూపదీప నైవేద్యములు, ఊరేగింపులు, రథోత్సవములు మొదలైనవి లౌకిక యజ్ఞములు అని అంటారు. ఈ రెండూ దేవతలకు ప్రీతి పాత్రములే. దాన ధర్మములు చెయ్యడం, మంచి వ్రతాలు ఆచరించడం, ఇవన్నీ కూడా యజ్ఞములకు సాటిరావు. యజ్ఞము చేసిన వాడు

లోకోత్తరుడు. అతడికి ఇవ్వడము అతడి నుండి తీసుకొనడము అధికమైన పుణ్యము కలుగజేస్తుంది. కాని వైదికయజ్ఞములు శ్రద్ధాభక్తితో చెయ్యాలి. కాని మనస్సు ఎక్కడో పెట్టి చెయ్యరాదు. అలా చేసిన యజ్ఞము చేసిన ఫలము దక్కదు.

### పితృ యజ్ఞములు

పార్వతీదేవి " నాధా ! మీరు దేవ యజ్ఞము గురించి చెప్పారు. పితృ యజ్ఞము గురించి కూడా తెలపండి " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! గయ, కురుక్షేత్యము, గంగ మొదలైన పుణ్యక్షేత్రములు అధికంగా ఫలితము ఇస్తాయి. మాఘమాసము, బాధ్రపదమాస బహుళపక్షము, అమావాస్య, ద్వాదశి, నవమి తిథులు ఆ తిథులలో అపహార్ణ సమయము, పితృకార్యములకు శ్రేష్ఠము. అపహార్ణ కాలము, దౌహిత్రుడు, నువ్వులు, పితృ కార్యములకు శ్రేష్ఠము. పితృకార్యములకు కోపము పనికి రాదు. అతి శుభ్రంగా ఉండాలి. మనసు నిర్మలంగా ఉండాలి. పితృకార్యములలో నెయ్యి, పెసల పప్పుతో చేసిన పాయసము, పిండి వంటలు ప్రధానమైన వంటకములు. పితృకార్యములకు శుక్లపక్షము, అనగా అమావాస్య తరువాత వచ్చు పాడ్యమితిథి పౌర్ణమి వరకు ఉండే తిథులు, ఉదయకాలము, మధ్యాహ్నానికి ముందు చెయ్యాలి. సరితిథులు, పుట్టిన రోజులు పితృకర్మలకు పనికి రావు. ఇంక పితృ కర్మలకు పిలువబడిన వారు వేదము చదివిన వారు అయి ఉండాలి. రోగిష్టివాడు, వికలాంగుడుకారాదు. సరిగోత్రికుడు, భార్యచనిపోయిన వాడు, ఇతర కులముల వారు పనిక రారు. పితృ కార్యములలో నియమించిన వారిని గంధము, పుష్పములు, ధూపము, దీపములతో అర్చించాలి.

### పిండప్రధానం

పార్వతీదేవి " నాధా ! మానవులు చనిపోగానే మరలాజన్మ ఎత్తాలి కదా ! మరి ఎవరి కొరకు ఈ పితృ కార్యాలు పిండప్రదానాలు చెయ్యాలి. వివరంగా తెలియ జెయ్యండి " ఆ ప్రశ్న పార్వతీదేవి అడగగానే అక్కడ ఉన్న వారంతా ఆశ్చర్యపోయారు. పరమశివుడు ఏమి సమాధానం ఇస్తాడో అని ఆతురతగా ఎదురు చూసారు. పరమశివుడు " పార్వతీ ! నువ్వు అడిగిన ప్రశ్న చాలా సందేహాలతో కూడుకున్నది పరమరహస్యము కూడా. పితరులు కూడా దేవతల వంటివారే ! దేవతలు ఉత్తరదిక్కున ఉంటారు. దేవతాపూజకు హవ్యము అనీ పితృకార్యములకు కవ్యము పేర్లు. పితృకార్యములు చేస్తే దేవతలు సంతోషించి ఆ కర్తకు ఆయుస్షు, ధనము, కీర్తి ప్రసాదిస్తారు. పితృగణములు దేవతలకు, అసురులకు, గరుడులకు, యక్షులకు మొదలగు వారు పూజనీయులు. పార్వతీ శ్రద్ధగా విను కుంచెడు ధాన్యము కలవాడు ఆ కుంచడు ధాన్యమును దానంగా ఇచ్చినా కోటి రూపాయలు ధనం ఉన్న వాడు ఆ కోటి రూపాయలు దానంగా ఇచ్చినా రెండూ సమానమే. కనుక దానములు తన శక్తికి తగ్గట్టు చేయాలి. అప్పడే ఫలితాన్ని ఇస్తాయి. ఏ దానము చేసినా మనసులో తిట్టు కోకుండా ప్రేమతో మనసారా ఇస్తే ఆ దానము సత్ఫలితాన్ని ఇస్తుంది " అని చెప్పాడు ఈశ్వరుడు.

## ధర్మములు

పార్వతీదేవి " నాధా ! ధర్మము నానా విధములుగా ఉంటుంది కదా ! ఆ ధర్మము యొక్క విశేషముల గురించి తెలియజెయ్యండి " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! పార్వతీ శృతులలో చెప్పిన ధర్మముల గురించి వివరిస్తాను. ధర్మములలో జాతిధర్మములని, కులధర్మములనీ, గుణధర్మములనీ, శరీరములను బట్టి కాలము బట్టి మారే ఆపద్ధర్మము అని ధర్మములు అయిదు విధములు.

### పుణ్యము లోకములు

పార్వతీదేవి " నాధా ! పుణ్యలోకములో భోగములు ఎలా ఉంటాయో వివరించండి " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! ఆ లోకములో పుష్పములు ఆయా ఋతువులను పూస్తూ ఉంటాయి. **కల్పతరువుల** నుండి శరీరానికి లేపనము సువాసనలు వెదజల్లు తుంటాయి. అక్కడ అమృతమే ఆహారము. అక్కడ దుస్తులు మలినము లేనివి. ఆభరణములు నిరుపమానంగా మెరుస్తూ ఉంటాయి. అక్కడ అందరూ పరస్పర స్నేహభావంతో మెలగుతుంటారు. అక్కడ ఉన్న వారి మనసులో మార్దవము, సుగుణములు విరాజిల్లుతుంటాయి. అక్కడ సుఖము తప్ప దు:ఖము లేదు. అక్కడ కోపము మొదలైన దుర్గుణాలకు తావు లేదు. అక్కడ ఉన్న వారు రోగములు, ముసలితనము అనేది తెలియకుండా నిరంతరము ఆనందములో తేలియాడు తుంటారు " అని మహేశ్వరుడు చెప్పాడు.

### సుగతి దుర్గతి

పార్వతీదేవి " నాధా ! చనిపోయిన తరువాత వీరు సుగతికి పోవాలి. వీరు దుర్గతికి పోవాలి అని ఎవరు నిర్ణయిస్తారు " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! తనతోటి వారికి కీడుతలపెట్టని వారు, ఎల్లప్పుడు సదా ధర్మంగా బ్రతికేవారు, సజ్జనులను, గురువులను పూజించేవారు, ఎల్లప్పుడూ సత్యమునే మట్లాడేవారు, దీనులను ఆదరించు వారు, అతిధులను పూజించు వారు, ఇతరులపట్ల దయ జాలి కలిగిన వారు, వీరంతా స్వర్గమునకు పోవడానికి అర్హులు అని తెలుసుకొన వలెను " అని చెప్పాడు.

## ఉత్తమ ధర్మము

పార్వతీదేవి " స్వామీ ! ధర్మాలు ఎన్నో ఉన్నాయి కదా ! అందులో ఉత్తమధర్మము ఏది ? " అని అడిగింది. పరమేశ్వరుడు " పర్వతరాజపుత్రీ ! పురుషార్ధములు నాలుగు. ధర్మము, అర్ధము, కామము, మోక్షము. అందులో మొదటి మూడు అయిన ధర్మ, అర్ధ, కామముల వలన కలిగే సుఖములు అశాశ్వతములు. అవి ఎన్నటి కైనా నశిస్తాయి. కాని ఆఖరిది అయిన మోక్షము శాశ్వతమైనది, సుఖప్రదమైనది. అది ఎన్నటికీ నశించదు. కనుక మొదటి మూడు పురుషార్ధముల కంటే మోక్షము అత్యుత్తమమైనది. మోక్షము ఎలా పొందాలో నీకు చెప్తాను. మానవుడు గృహస్తాశ్రమము స్వీకరించిన తరువాత ఋణములు అన్నీ తీర్చుకుంటాడు. అంటే దేవ ఋణము, పితృఋణము, ఋషిఋణము, మనుష్యఋణము తీర్చుకుంటాడు. తరువాత వానప్రస్థముకు వెళతాడు. అక్కడ అడవులలో నివసిస్తాడు. ప్రశాంత వాతావరణంలో నిర్మలమైన మనస్సుతో మునుల నుండి సాంఖ్యమును అభ్యసిస్తాడు. సాంఖ్యమనగా 25 తత్వముల జ్ఞానము తెలుసు కొనడమే. తరువాత యోగాభ్యాసము చేస్తాడు. సాంఖ్యము యోగము రెండూ ఒక్కటే. తరువాత సుఖదు:ఖములు, రాగద్వేషములు మొదలగు ద్వందములను జయిస్తాడు. తరువాత శౌచము, బ్రహ్మచర్యము, శాంతజీవనము, మితాహారము తీసుకోవడము పాటిస్తాడు. మనస్సును అంతర్ముఖంచేస్తాడు. మధ్య మధ్య వచ్చే అవాంతరములను తొలగించుకుంటూ మోక్షమార్గాన పయనిస్తాడు. ఇదీ మోక్షమార్గము. ఇది నిరంతర అభ్యాసము వలన మాత్రమే కలుగుతుంది. ఈ మోక్షమార్గము మానవుడిని జననమరణచక్రము నుండి విముక్తుడిని చేస్తుంది. మానవుడు సంసారము నందు విముఖత చెందనంత వరకూ మోక్షమార్గములో పయనించ లేడు. ఈ ప్రాపంచిక విషయముల మీద మనసు విరక్తి కలిగినప్పుడే మానవుడు మోక్షమును పొందగలడు. పార్వతీ ! మనసులో ఉన్న చింతలన్నీ వదిలి పెడితే కాని అందరి అందు సమత్వము, సమభావన కలిగితే కాని తృష్ణ, ఆశ, లోభత్వము విడిచి పెడితే కాని పైన చెప్పిన విరక్తి కలుగదు. వాటి స్వభావము వివరిస్తాను. ధనము ఉన్నా పోయినా, దగ్గర బంధువులు చని పోయినా దాని గురించి విచారించడం మానుకోవాలి. పోయిన ధనము గురించి, చనిపోయిన బంధువుల గురించి దు:ఖించడం వలన దు:ఖము పెరుగు తుందే కాని తరగదు. కనుక దు:ఖించడం అనవసరము. ఎందుకంటే సుఖము, దు:ఖము ఒకదాని వెంట వస్తూ పోతుంటాయి. స్వర్గలోకాధిపతి దేవేంద్రుడికి కూడా సుఖము దు:ఖము ఒకటి వెంట ఒకటి వచ్చాయి. ఈ ప్రపంచంలో మన కంటికి కనిపించే ప్రతి ప్రాణి ప్రతి వస్తువు పరిణామం చెందడం కానీ నాశనం కావడం కాని తధ్యము. ఈ సత్యము తెలిస్తే దు:ఖము కలుగదు. కనుక నాశనం అయ్యే వాటి గురించి చింతించడం అవివేకము. ఇతరుల నుండి ధనమును వస్తువును స్వీకరించే వాడు పట్టు పురుగు తన దారములతో తనను ఎలా బంధించుకుంటుందో అలా తనను తాను బంధించుకుంటాడు. పార్వతీ ! మానవుడికి ధనము సంపాదించడం, సంపాదించిన ధనం కాపాడడడం, ఆ ధనమును ఖర్చు చెయ్యడం, ఆ ధనము పోతే దాని కొరకు దు:ఖించడం ప్రధాన వ్యాపకాలు. కనుక ధనము అన్ని దు:ఖములకు మూలకారణము. ధనము లేకపోతే దు:ఖము ఉండదు.

### ఆశ

ధనము తరువాత ఆశ మానవుడిని నాశనం చేస్తుంది. ఆశను మించిన దు:ఖము మరొకటి లేదు. ఆశను వదిలితే కలిగే సుఖము దేనికీ సమానము కాదు. ఆశ అనేది మనిషితోపాటు పుడుతుంది. మనిషి చచ్చేదాకా అతడిలో ఉన్న ఆశచావదు. కనుక ఆశ ప్రాణాలను తీయకలిగిన ప్రాణాంతక వ్యాధి. కోరికలు అనేవి ఒకటి వెంట ఒకటి పుడుతూ ఉంటాయి. కోరికలు అనుభవిస్తే తీరేవి కాదు. అగ్నిలో నెయ్యి వేస్తే అగ్ని ఆరిపోతుందా ! అలాగే అనుభవించే కొద్దీ కొత్త కొత్త కోరికలు పుట్టుకు వస్తుంటాయి. కోరికలను ఆశను అదుపులో పెట్టుకుంటే అంతులేని సుఖంకలుగుతుంది. మానవుడు ఇంద్రియములను నిగ్రహించుకోవాలి. ఇంద్రియములను వాటి ఇష్టము వచ్చినట్లు పోనిస్తే అవి చేయకూడని పనులు చేసి దు:ఖముకలిగిస్తాయి. అలాకాకుండా కోరికలను నిరోధిస్తే మానవునికి సుఖము కలుగుతుంది. మరణం తరువాత సద్గతులు కలుగుతాయి. ఎప్పుడూ ధనము సంపాదించడం లోనూ ఇంద్రియ సుఖములు అనుభవించడంలోనూ మునిగి తేలే వాడిని మృత్యువు ఒక్క సారిగా మీదపడి అడవిలో పెద్దపులి మేకమీద పడి కబళించినట్లు కబళిస్తుంది. మానవుడు సంపాదించిన ధనము, అతడు చేసిన

ధర్మములు, యజ్ఞములు, యాగములు, అతడిని మృత్యువు నుండి కాపాడ లేవు. పుట్టిన వాడు చావక తప్పదు. కేవలం మోక్షసాధనతోనే ఈ జనమరణ చక్రము నుండి విముక్తి పొందగలడు. మానవుడి జీవితంలో ఒక్కొక్కరోజు, ఒక్కొక్క నెల, ఒక్కొక్క సంవత్సరం గడిచేకొద్దీ అతడి ఆయువు క్షీణిస్తుంది. అతడు మృత్యయువుకు దగ్గర ఔతుంటాడు. కనుక రేపటి పని ఈ రోజు, తరువాత చెప్పిన పని ఇప్పుడే చెయ్యాలి. కాలయాపన, అలసత్వము, సోమరితనము పనికి రాదు. కాలముకు వశుడైన మానవుడికి ఏమరిపాటు సహజము. కాలం గడిచే కొద్దీ ఆయుష్షు తరిగి పోతుందని గ్రహించిన నాడు ఈ సంసారం మీద విరక్తి కలుతుంది. ఆ విరక్తిమార్గము ముక్తికిసోపానము. పార్వతీ ప్రాపంచిక సుఖముల మీద కోరిక ఆశ లేక పోతే అతడు మనస్సును జయించగలడు. దాని వలన ముక్తి లభించి జరామరణచక్రము నుండి విముక్తి పొందగలడు.

## సాంఖ్యము

పార్వతీ ! ఇప్పుడు నీకు సాంఖ్యము గురించి చెప్తాను. ఈ సాంఖ్యయోగము సంసారము అనే జబ్బుకు మంచి మందు. సాంఖ్య యోగులు జ్ఞాన సముపార్జనతో ముక్తి చెందుతారు. కాని ఈ శరీరముతో తపస్సు చేయడ, శరీరాన్ని సుష్కించచేయడం వృధా ప్రయాశ. కేవలం జ్ఞానము వలనే మోక్షం పొందగలము. ఈ ప్రకృతికి అవ్యక్తము అనే పేరు కూడా ఉంది. ఈ ప్రకృతిలో నుండి మహత్తత్వము, అహంకారము, మనస్సు, ఇంద్రియములు, పంచభూతములు, వాటి గుణములు, ఆవిర్భవించాయి. ఇవి అన్నీ కలిపి 24. 25వ తత్వము ఆత్మ. ఈ ఆత్మ సత్వ, రజొ తమో గుణముతో ప్రభావితం ఔతుంది. వీటి ఆధారంతో ప్రకృతిలో సృష్థి జరుగుతుంది. అవ్యక్తమైన ప్రకృతి ఏక అణువు. అనగా అణువు ఒక్కటే అవిచ్చిన్నము. కంటికి కనపడదు. ఇదే సృష్టికి ప్రధానము.

### త్రిగుణములు

సౌఖ్యము, తృప్తి, ప్రకాశము సత్వగుణ లక్షణములు. సుఖదు:ఖాలు, రాగద్వేషములు, మొదలగు ద్వందములు రజోగుణ లక్షణములు. అజ్ఞానము, భయము, అంతా తనకు తెలుసు అనే భ్రాంతి, విపరీతమైన జ్ఞానము కలిగి ఉండడం, ఏ పనీ చెయ్యకపోవడం, అలసత్వము ఇవి తమోగుణ లక్షణములు. సత్వగుణము ప్రధానంగా కలవాడికి, ధైర్యము, విజ్ఞానము, శ్రద్ధ, దేని మీద మోహము లేకపోవడము, ఇతరుల పట్ల దయ, ఎప్పుడూ సంతోషంగా ఉండడం అనేవి ప్రధాన గుణములు. ఈ గుణములు లేకపోతే సత్వగుణము కూడా నశించి పోతుంది. కోపము, లోభము, కామము, ద్రోహచింతన, దు:ఖము ఇవి రజోగుణ గుణములు. ఈ గుణములు విడిచిపెడితే రజోగుణము నశించిపోతుందు. ఎల్లప్పుడూ ప్రతిదానికి సంశయించడము, విషాదము, జడత్వము ఇవి తమోగుణ లక్షణములు. ఈ గుణములు తగ్గించుకుంటే తమోగుణము నశించి పోతుంది. ఈ మూడు గుణాలు ప్రతి మనిషిలోనూ హెచ్చుతగ్గులుగా ఉంటాయి. ఒక్కటి ఎక్కువైతే మిగిలినవి తగ్గుముఖం పడతాయి. రెండు ఎక్కువగా ఉంటే మిగిలినది తగ్గుముఖం పడుతుంది. సత్వగుణము ఎక్కువగా ఉన్నప్పుడు మనిషి తేజస్సుతో ప్రకాశిస్తుంటాడు. సదా సంతోషంగా ఉంటాడు. రజోగుణము ఎక్కువగా ఉన్న మనుషి ఎప్పుడూ కోపంగా ఉంటాడు. సదా దు:ఖిస్తుంటాడు. తమోగుణము అధికంగా ఉంటే కామము, కోరికలు, సకలము అన్నీ తనకు కావాలని అనుకొని అవి దక్కక పోతే జితేంద్రియుడు ఔతాడు. ఈ గుణముల ప్రభావంతో చేసేపనుల వలననే మానవులకు దేవలోకప్రాప్తి మనుష్యలోకములో పుట్టడం లేక జంతువులలో పశుపక్ష్యాదులలో పుట్టడం జరుగుతూ ఉంటుంది. మహతత్వమును బుద్ధి అనికూడా అంటాము. ఈ బుద్ధి వివేకముకు, జ్ఞాననముకు గుర్తు. ఈ బుద్ధి వివేకముకు జ్ఞానముకు గుర్తు. అహంకారము సృష్టికి మూలము. అహంకారము వదిలితే ముక్తి దానంతట అదే వస్తుంది. ఇక మనస్సు ఇది ఇంద్రియముల ద్వారా ప్రకృతిలో సంచరిస్తుంటుంది. ఇంద్రియలోతత్వమునకు, ఇంద్రియనిగ్రహముకు ఈ మనసే కారణము. ఈ శరీరము పంచభూతముల గుణములైన శబ్ద, స్పర్శ, రస, గంధ రూపములు ఈ శరీరము ద్వారా ప్రకటించబడుతూ ఉంటాయి. ఈ దేహము ఆత్మ కాదు, ఆత్మ కంటే వేరైనది. జీవాత్మ ఈ శరీరంలో అవ్యక్తంగా ప్రకాశిస్తున్నాడు. కాని మానవులు తామే ఆత్మ అనే అజ్ఞానంలో ఉంటాడు. అన్నీ తామే చేస్తున్నామని, తమవలనే అన్నీ జరుగుతున్నాయని భ్రమపడుతుంటారు. తాను వేరు మనసు వేరు అనుకుని మనసును ప్రకృతి నుండి పరమాత్మ వైపు మళ్ళించిన మానవుడు ముక్తి పొందుతాడు. దేహాభిమానము పూర్తిగా నశిస్తేగాని ఇది సాధ్యము కాదు. ఈ తత్వమే 25వ తత్వము ప్రకృతిని వదిలి పెట్టి ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ విజ్ఞానము పరమ శాంతిప్రదము. అన్నింటికీ అధిష్టానం అయినది 26వ తత్వము. దానికి ఈ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అంటవు. ఇది నిత్యము, శాశ్వతము, అవ్యయము. అన్నింటిలోను ఉంటుంది. సర్వే సర్వత్రా వ్యాపించి ఉంటుంది. అతి సూక్ష్మమైనది. అత్యంత విశాలమైనది, ఇంద్రియములకు గోచరము కాదు. ఇదే 26వ తత్వము. ఆ తత్వమును పరమాత్మ అని పిలుస్తారు. ఇదే మోక్షపదము. సమదృష్టి కలిగిన వారు మోక్షముకు అర్హులు. పార్వతీ నీకు చెప్పిన ఈ సాంఖ్యము కపిల మహర్షి సేవించిన ధర్మము.

## యోగము

పార్వతీ ! ఇక యోగమార్గము గురించి వివరిస్తాను. ఈ దేహము, ఇంద్రియములు, మనసు, బుద్ధీ, ఆత్మ ఇవన్నీ ఒకటే కాని వేరు కాదు అనుకోవడమే యోగము. ప్రతిరోజూ అగ్నిహోత్రము చెయ్యడం, అధికంగా మాట్లాడకుండా ఉండడం, సత్వగుణము కలిగి ఉండడడం, అర్హులైన వారికి దానంచెయ్యడం, వేదాభ్యాసంచెయ్యడం, ఎల్లప్పుడూ శుచిగా ఉండడం, సత్యముపలకడం, వీటిని అనుసరించడం వలన మానవుడిలోని పాపాలునశిస్తాయి . శుచిగాశుభ్రంగా ఉండాలి. ఏకాంత ప్రదేశంలో ఒక ఆసనముమీద కూర్చోవాలి. నడుము దగ్గర నుండి తల వరకు నిటారుగా కూర్చోవాలి. ఇంద్రియములను మనస్సును ఏకం చెయ్యాలి. మనస్సును ఆత్మలో లీనముచెయ్యాలి. ప్రాణ, ఆపాన వాయువులను క్రమబద్ధం చెయ్యాలి. మానవుడు మనసును ఈ దశకు రాగానే ఇష్టం వచ్చినట్లు పోనీయరాదు. ప్రాణవాయువు ఆపానవాయువుతో కూడి ఊర్ధ్వ ముఖంగా పయనించి శిరస్సు దగ్గరకు చేరుతుంది. అప్పుడు **జీవాత్మ పరమాత్మగా** మారుతుంది. ఈ యోగమును అనుసరించడానికి సోమరితనము, పరధ్యానము, అత్యాశ, ఇతరులపట్ల ఆదరం లేకపోవడం, రోగములు, స్వప్నములు, లోభత్వము, భయము, కామము, క్రోధము, సుఖములు అనుభవించాలన్న కోరిక, చంచలత్వము మొదలైన దుష్టగుణములు అత్యంత విరోధములు. పైన చెప్పిన గుణములు ఉన్నవారు యోగాభ్యాసానికి అర్హులు కారు. ఈ యోగాభ్యాసమును నిష్ఠతో చేసిన అష్టసిద్ధులు సిద్ధిస్తాయి. అలాంటి యోగి స్వేచ్ఛగా ఎక్కడంటే అక్కడ తిరగగలడు. యోగి ఎక్కువగా నిద్ర పోకూడదు. అలాగని అసలు నిద్రపోకుండా ఉండ కూడదు. ఎక్కువగా తిన కూడదు. అలాగని అసలు తినకుండా ఉండ కూడదు. మితభోజనం, మితనిద్ర యోగికి యోగసిద్ధి కలిగిస్తుంది. యోగధర్మము ఇదే " అని మహేశ్వరుడు పార్వతీదేవికి చెప్పాడు.

## పరమాత్మలో లీనం

పార్వతీదేవి " మీ దయ వలన సాంఖ్యము, యోగము గురించి తెలుసుకున్నాను. భక్తులు పర్మమాత్మలో లీనం కావడానికి ఎటువంటి పరిచర్యలు చేయాలి " అని అడిగింది. పరమశివుడు " పార్వతీ ! దేవతలకు కాని మానవులకు కాని పరమాత్మను గురించి తెలుసుకోవడం అసాధ్యం. ఎందుకంటే సాంఖ్యము, యోగము రెండూ పరమాత్మ స్వరూపాలే. ఆ పరమాత్మను నేనే. నేను సనాతుడను, అవ్యయుడిని, సత్యమే నాస్వరూపము. నా దయలేనిది ఎవరూ నన్ను దర్శించలేరు. నన్ను చేరుకోవడానికి మంత్రము, జపము, నిరంతర పరమాత్మచింతన, స్తోత్రములు, నమస్కారములు ఇవన్నీ నిష్టతో చేసిన పరమాత్మను చేరుకోవచ్చును. పూర్వము నేను నాలుగు ఆశ్రమములను గురించి పాశుపత్రవ్రతము గురించి నలుగురు విప్రులకు బోధించాను. వారు దానిని తమ శిష్యులకు బోధించారు. అలా లోకమంతా వ్యాపించింది. సకల శుభములు కలగడడానికి, శుచిగా ఉండడానికి, నా స్వరూపమైన లింగార్చనకు నేను విభూతిని రూపొందించాను. యోగులు ఆ విభూతిని, శరీరము అంతా అలముకొని, కపాలము చేత బూని, తలగొరిగించుకుని, భిక్షాటన చేస్తూ, మనోనిగ్రహంతో మెలగుతూ, నా మీదనే మనసు నిలిపి, ఇతరకోరికల మీదకు మనసు పోనీయక పరమానందకరమైన అనుభూతిని అనుభవిస్తారు. కేవలం ఈ ప్రకారం సంగమును విడిచిన యోగులు నా సాయుజ్యమును పొందగలరు. నిరాకారంగా నిస్సంగంగా నన్ను పూజించుట కొరకు నేను మూడు లోకములలో ఏ ఆకారము లేని శివలింగాలను స్థాపించాను. ఆ లింగములను నా స్వరూపంగా పూజిస్తే నేను వారికి ప్రసన్నుడను ఔతాను. ఆ లింగములను ఎవరికి ఎలా తోచినట్లు అలా పూజ చేయవచ్చు. వారివారి శక్తిని అనుసరించి పూజించవచ్చు. పాలతో, నేతితో, నీటితో ఆ లింగములను అభిషేకించ వచ్చు. నాకు మారుగా ఆ లింగములను గంధము, పుష్పములు, ధూపము, దీపము, నైవేద్యము శక్తికి తగిన విధంగా ఆరాధించ వచ్చు. ఆ లింగములను పూజించిన నన్ను పూజించినట్లే.

## స్త్రీ ధర్మము

పరమశివుడు " పార్వతీ ! నా గురించి నేను చెప్తాను కదా ! మరి స్త్రీధర్మము గురించి నీ నుంచి తెలుసుకోవాలని అనుకుంటున్నాను. చెప్పవా " అని అడిగాడు. ఆ మాటలకు పార్వతీదేవి సిగ్గుపడి " అయ్యో ! నేను మీకు చెప్పగలదాననా ! మీరు సర్వజ్ఞులు మీకు తెలియనిది లేదు. కాని నన్ను కోరారు కనుక నేను చెప్పకుండా ఉండడం భావ్యము కాదు. అందుకని నాకు తెలిసినంత వరకు స్త్రీ ధర్మము గురించి చెప్తాను. కాని నేను ముందు నన్ను ఎన్నడూ విడువకుండా సేవించే నదులతో సంప్రదించి తరువాత మనవి చేస్తాను " అని చెప్పి **గంగా, యమునా, గోదావరి, కౌశికి, కావేరి, కృష్ణవేణి, పెన్న, నర్మద, బాహుద, రేవ, తమస** మొదలైన నదులను మనసులో తలచుకుంది. వారు స్త్రీ స్వరూపములతో పార్వతి ముందు నిలిచారు. వారికి పరమేశ్వరుడు తనను స్త్రీ ధర్మము గురించి అడిగాడని తనకు ఎలా చెప్పాలో తెలియక మిమ్ము పిలిచానని తెలిపింది. వారు " పార్వతీ ! నీ కంటే ఎక్కువగా మాకు ఏమి తెలుసు. నీకు తెలిసినంత వరకు స్త్రీ ధర్మము గురించి నీ భర్తకు చెప్పి ఆయనను సంతోషపెట్టు. మేము కూడా నీ నోటి నుండి వచ్చు అమృతధారలను వినడానికి కుతూహలంగా ఉన్నాము "


సమస్త నదులను శివునకు పరిచయము చేయుచున్న పార్వతి

అన్నారు. అప్పుడు " పార్వతీదేవి " మహేశ్వరుడి మీద చూపు నిలిపి " ఓ దేవా ! నీ అనుగ్రహంతో నాకు అబ్బిన తెలివితో మీ అందరకీ స్త్రీ ధర్మము గురించి చెబుతున్నాను. స్త్రీ వివాహాత్పూర్వము కన్య అని పిలువబడుతుంది. తల్లి తండ్రులు కాని, పినతండ్రి కాని, మేనమామలు కానీ, అన్నదమ్ములు కానీ వీరిలో ఎవరైనా కన్యకు తగిన వరుడితో వివాహము జరిపించడానికి అర్హులు. స్త్రీ వివాహానంతరం భర్తకు ఆమె మీద సర్వహక్కులు సంక్రమిస్తాయి. భర్తయే భార్యకు ప్రభువు, దైవము. భర్తతో కూడి భార్య ఆయన అనుమతితో దేవతా పూజలు, పితృతర్పణములు, అతిధి పూజలు ఆచరించాలి. ఎల్లప్పుడూ భర్త హితము కోరాలి. ఇటువంటి పతివ్రత ఈ లోకములోనే కాదు పరలోకములో కూడా సుఖములు అనుభవిస్తుంది.

## బ్రాహ్మణుడి భార్యలు

పార్వతీదేవి స్త్రీ ధర్మములగురించి ఇంకా చెప్తూ " ఈ సందర్భంలో ఒకకధ చెప్తాను వినండి అని ఇలా చెప్పసాగింది. ఒక బ్రాహ్మణుడికి ఇద్దరు భార్యలు. మొదటి భార్య సదా అతడి క్షేమము కోరుతూ ఆయన చెప్పినా చెప్పక పోయినా దేవతాపూజలు, పితృతర్పణలు, అతిధిపూజలు, చేస్తూ ఉండేది. రెండవభార్య భర్తను అనుసరిస్తూ ప్రతిపనీ ఆయన అనుమతితో చేస్తుడేది. ఆ భర్త, ఇద్దరు భార్యలు ఒకేసారి మరణించారు. భర్త రెండవభార్య భర్తను అనుసరిస్తూ స్వర్గానికి పోయారు. భర్త అనుమతి తీసుకోకుండా దేవతాకార్యములు చేసిన రెండవభార్యను యముడు స్వర్గలోకముకు పోవడానికి అనుమతి ఇవ్వలేదు. యముడు ఆమెతో " నీవు నీ భర్త అనుమతి లేకుండా పూజలు చేసినందు వలన నీకు స్వర్గలోకార్హత లేదు. కనుక నిన్ను తిరిగి నీ శరీరంలో ప్రవేశపెడతాను " అని శాసించాడు. ఆమె విలపిస్తూ తనను కాపాడమని యమధర్మరాజును వేడుకుంది. ఆమె మాటలకు కరిగిపోయిన యమధర్మరాజు " ఓ వనితా ! భర్త అనుమతి లేకుండా పుణ్యకార్యము చేయడం తగదు. మరు జన్మలోనైనా భర్త అనుమతితో పుణ్యకార్యములు చెయ్యి " అన్నాడు. పార్వతీదేవి ఇంకా స్త్రీధర్మము గురించి చెప్తూ ఇలా అన్నది. భర్తకు ఇష్టం అయిన వంట వండిపెట్టాలి. ఆయన కోరినప్పుడు ఆయనకు సుఖాన్ని అందించాలి. భార్య భర్తమాటకు ఎదురు చెప్పకూడదు. అతడి ఇష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించకూడదు. పొరపాటున భర్త తాను చెయ్యవలసిన కార్యములను మరచిపోతే ఆయనకు గుర్తు చెయ్యాలి. తనకు మరొక సవతి ఉన్నచో ఆమెతో సఖ్యతతో మెలగాలి. భర్త తన వద్ద ఏదైనావస్తువు దాచిన దానిని భద్రంగాదాచి అతడు అడిగినప్పుడు అందచెయ్యాలి. భర్త తనకు ఏది ఇచ్చినా దానిని సంతోషంగా స్వీకరించాలి. భర్త ధనవంతుడినా, అందగాడైనా, కురూపి అయినా, తెలివి కలవాడైనా, ఆరోగ్యవంతుడైనా, అనారోగ్యంతో బాధపడుతున్నా, భర్తను భార్య గౌరవించాలి. ప్రేమతో ఆదరించాలి. వయసు వచ్చిన కుమారుడితోనైనా స్త్రీ ఒంటరిగా ఉన్నప్పుడు ఒకే శయ్య మీద కుర్చోకూడదు. పశుపక్ష్యాదులకు ఆహారం పెట్టడం, యాచకులకు అన్నదానం చెయ్యడం, దేవతలకు పితృదేవతలకు పూజచెయ్యడం. ఆ పనులన్నీ భర్త క్షేమంకోరి భార్య చెయ్యడం భార్య కర్తవ్యం. పరమేశ్వరా ! స్త్రీలందరూ ధర్మపరులు కారుకదా ! అధర్మపరులు అయిన స్త్రీలను రాక్షసి అంటారు. అటువంటి స్త్రీలు పరపుషులను కోరుకుంటారు. అటువంటి స్త్రీలు అసురవంశంలో జన్మించిన వారు. అటువంటి స్త్రీలకు మనసు నిలకడ ఉండదు. ఎప్పుడూ సుఖవాంఛల మీద కోరిక కలిగి ఉంటారు. క్రూరమైన పనులు చెయ్యడంలో ఆసక్తి కలిగి ఉంటాడు. అటువంటి స్త్రీ ధనమును విచ్చలవిడిగా ఖర్చు పెడుతుంది. ఆమెకు కోపము ఎక్కువ. భర్తయందు, పిల్లల అందు ప్రేమ ఉండదు. ఇంటి పనులు చెయ్యదు. నిర్లక్ష్యము ఎక్కువ. ఎప్పుడూ అబద్ధాలు చాడీలు చెప్తుంటుంది. ఎప్పుడూ నిద్రపోవడానికి అలవాటు పడుతుంది. వీరివలన భర్త వంశం మొత్తము నరకానికి పోతుంది. అటువంటి స్త్రీలు కూడా తమతప్పు తెలుసుకుని భర్తకు అనుకూలంగా ప్రవర్తిస్తే వారు కూడా భర్తతో స్వర్గానికి పోగలరు. అలా కాకుండా జీవితమంతా భర్తను నానా హింసలు పెట్టినా, భర్తచనిపోయిన తరువాత ఆయనతో **సహగమనము** చేసిన భార్య, భర్తతో పుణ్యలోకాలకు పోతుంది. ఇందులో ఒక ధర్మసూక్ష్మము ఉంది. స్త్రీలు సంతానవంతులు అయినప్పుడు చనిపోయిన భర్తతో సహగమనము చెయ్యకూడదు. అది అధర్మము " అని పార్వతీదేవి పరమేశ్వరుడికి స్త్రీల ధర్మము గురించి వివరించింది " అని నారదుడు శ్రీకృష్ణుడికి వివరించాడు.

## పరమ పదము

ధర్మరాజు " పితామహా ! మీరు చెప్పిన శివపార్వతీ సంవాదము విన్నాను. నా జన్మధన్యం అయింది. పితామహా మరొక సందేహము. పరమపదము అంటారు కదా ! అది ఎలా సిద్ధిస్తుంది తెలపండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నిరంతర నారాయణధ్యానము. నిరంతరము నారాయణుడిని పూజించడం, స్తుతించడం, నారాయణుడి కధలు వినడం,

మానవులకు మేలు చేస్తుంది. విజ్ఞులను సేవించడం వలన పరమపదము పొందడానికి అర్హత కలుగుతుంది. ఈ సందర్భంలో నీకు ఒకకథ చెప్తాను. పూర్వము ఒక రాక్షసుడు ఒక విద్వాంశుడిని రాజభటులు శిక్షించడం చూసిన ఒక వేశ్య " రాజభటులారా ! ఈయన మావాడు తెలిసిన వాడు. ఇతడిని ఎందుకు దండిస్తున్నాడు " అని చెప్పి విద్వాంసుడిని వారి బారినుండి విడిపించింది. మరుజన్మలో ఆ వేశ్య బ్రాహ్మణ వనితగా జన్మించింది. కనుక విద్వాంశులను గౌరవించడం వలన మనకు ఉత్తమజన్మ లభిస్తుంది " అని భీష్ముడు చెప్పాడు.

## మానవుడు శాంతి

ధర్మరాజు " పితామహా ! మానవులు, దరిద్రము, వ్యాధులు, దు:ఖము వీటితో బాధపడుతూంటారు కదా ! ఆ సమయంలో వారికి శాంతిచేకూర్చే మార్గము ఏది ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నీవు చెప్పిన దు:ఖములతో బాధలుపడుతున్న వారు భక్తితో, శ్రద్ధతో, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను, వినాయకుడిని, కుమార స్వామిని, అగ్నిదేవుని, వాయుదేవుడిని, సూర్యచంద్రులను, దేవేంద్రులను, వరుణ భగవానుడిని, యమధర్మరాజును, కుబేరుడిని, కామధేనువును, సప్తసముద్రాలను, గంగయమున మొదలైన మహానదులను, మరుత్తులను, అశ్వినీదేవతలను, వసువులను, రుద్రులను, దేవతలను, పితృదేవతలను, వాలఖిల్యాది సిద్ధులను, వేదవ్యాస, వాల్మీకీ, నారద, అగస్త్య, గౌతమ, కశ్యప, అత్రి, కణ్వ మొదలైన మహామునులను, రంభ ఊర్వశి మొదలైన అప్సరసలను, ధర్మము, తపస్సు, సత్యము, మొదలైన వాటిని రాత్రింపగళ్ళను, నక్షత్రములను, గ్రహములను, అశ్వినీ మొదలైన నక్షత్రాల సముదాయాలను, మాసములు, రుతువులు, సంవత్సరములు, వైనతేయులు, సర్పరాజములను, కాశీ, గయ మొదలైన పుణ్యక్షేత్రములను, నైమిశారణ్య, దండకారణ్యము మొదలైన అరణ్యములను, మేరుపర్వతము, హిమవత్పర్వతము, కైలాస పర్వతము మొదలైన పర్వతమ్ములను, నాలుగు దిశల ఉన్న భూమిని, ఆకాశమును, రావి మొదలైన వృక్షరాజములను బ్రాహ్మణులను, చక్రవర్తులను, తనను పాలించేరాజును మనసారా ధ్యానించాలి. నమస్కరించాలి. మీరందరూ నన్ను రక్షించండి. నాకు ఆయురారోగ్య ఐశ్వర్యములను అభివృద్ధిని, పరమానందమును ప్రసాదించండి అని మనసారా కోరుకోవాలి. తరువాత నారాయణ మంత్రము శ్రద్ధగా పఠించాలి.

### నారాయణ జపం

ఓం నమో భగవతే వాసుదేవాయ, నమ: పురుషోత్తమాయ, నమ: సర్వలోక గురువే, నమ: సర్వలోక పితామహాయ, నమ: సర్వలోక ప్రధానాయ, నమ: సర్వలోకేశ్వరాయ, నమ: సర్వలోక విశిష్టాయ, నమ: సర్వలోక సుఖప్రదాయ, నమ: సర్వలోక భర్తాయ, నమ: సర్వలోక కర్తాయ, నమ: సర్వలోక హర్తే, నమ: సర్వలోకనిధయే, నమ: సర్వలోకనధనాయ, నమ: సర్వలోకోద్భవకరాయ, నమ: విష్ణవే, నమ: ప్రభవిష్ణవే అని పఠించాలి. ఈ మంత్రం పఠించిన వారికి సమస్త భయములు, కష్టాలు, పాపములు నశించి శుభములు కలుగుతాయి అని భీష్ముడు ధర్మరాజుకు మహావిష్ణు మంత్రమును ఉపదేశించాడు " అని వైశంపాయనుడు చెప్పాడు.

## మహనీయ దైవము

ధర్మరాజు భీముడిని " పితామహా ! సమస్త లోకములలో మహనీయదైవము ఎవరు? ఏ దేవుని నామాలను మానవులు పారాయణచేయాలి? ఎవరిని సేవించిన మానవులు పాపముల నుండి విముక్తిపొంది సకలశుభములు పొందగలరు. ఏ జపము ఉత్తమమైన జపము? ఏ జపము చేసిన మానవులు జననమరణ చక్రము నుండి విముక్తి పొందగలరు? దయతో వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! అఖిల జగములకు ప్రభువు అనంతుడు. అతడిని పురుషోత్తముడు అని అంటారు. ఆ పురుషోత్తముడిని మానవులు వేయినామములతో స్తుతిస్తారు. ఎవరైతే ఆ దేవదేవుని వేయి నామాలతో దృఢమైన భక్తితో ఎనలేని విశ్వాసంతో అర్చిస్తారో వారిని ఆదేవదేవుడు ఆద్యంతములు లేనివాడు, సకలలోకములతో కీర్తించబడువాడు, సర్వలోకపూజితుడు, సర్వలోకుల కోరికలను తీర్చువాడు, సర్వలోకనాయకుడు, సకల జగములకు పూజనీయుడు, సర్వజగములను సృష్టించినవాడు, సర్వలోకనాధుడు వారి పాపములను పోగొట్టి సకల శుభములను కలుగజేస్తాడు. ఆ పురుషోత్తమ స్తుతి ధర్మములలోకెల్లా ఉత్తమధర్మము. ఆ పురుషోత్తముడిని పూజించడము నాకు అత్యంతప్రియము. ఆ పురుషోత్తముడు పరమపదము, అతడే పరబ్రహ్మము, మంగళప్రదుడు, సకల మంగళములు కలుగ చేయువాడు, సకల భూతకోటికి మూలపురుషుడు, పరమపవిత్రుడు, పరమ తేజస్వరూపుడు యుగాంతంలో సమస్తలోకములు అతడిలో లీనం ఔతాయి. తిరిగి యుగారంభంలో అతడి నుండే సకలలోకములు సకలజీవులు ఉద్భవిస్తాయి. అతడే మహావిష్ణువు. అతడిని వేయి నామములతో పూజించిన వారికి సకల భయములు, పాపములు తొలగి శుభములు కలుగ కలవు " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు. ఆ తరువాత భీష్ముడు ధర్మరాజుకు విష్ణుసహస్రనామ

ఉపదేశం చేసి " ధర్మనందనా ! ఈ విష్ణుసహస్ర నామార్చన చేసిన మానవులు పొందని శుభములు ముల్లోకలలో ఏదిలేదు. **ఈ నామార్చన చేసిన విప్రుడు వేదవేదాంత విద్యలను, క్షత్రియుడు సకల విజయాలను, వైశ్యుడు సమస్త సంపదలను, శూద్రుడు సక శుఖములను పొందుతారు.** ఈ నామార్చన చేసిన మానవుడు ధర్మార్ధ కామ మోక్షములలో ఏది కోరిన దానిని పొందగలడు. ఈ సహస్రనామములను భక్తితో పఠించిన వారికి వంశాభివృద్ధి, సొంపు, ఐశర్యము, కీర్తి, పెంపు కలిగి వర్ధిల్లగలడు. ఈ సహస్రనామార్చన జనులలో భయమును పోగొట్టి **వీర్యము, తేజస్సు, కంతి, బలము, రూపము** కలుగుతాయి. ఈ నామార్చన సకల రోగములను పోగొట్టి సంపూర్ణ ఆరోగ్యములను కలిగిస్తుంది. శ్రద్ధగా ప్రతిరోజు సహస్రనామములతో విష్ణువును అర్చించే వారికి జననమరణ రోగ రాహిత్యమైన పరమపద ప్రాప్తి కలుగుతుంది. విష్ణు భక్తులకు దుర్మార్గము, మదము, మాత్సర్యము, లుబ్ధత్వము వంటి దుర్గణములు దరిచేరవు. ఆ పురుషోత్తముడిని భూమి, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, సముద్రములు, నదీనదములు, యక్షులు, గంధర్వులు, కిన్నెరలు, కింపురుషులు, ఉరగములు, పన్నగములు సకల చరాచరములు ఆ విష్ణువును అనుసరిస్తుంటాయి. మానవునిలోని బుద్ధి, దృతి, మనసు, తేజము అన్నీ విష్ణుమయమే. వేదవేదాంగములు సకలశాస్త్రములలో ఉన్న ధర్మములన్నీ విష్ణుస్వరూపమే. సాంఖ్యము, యోగము, తంత్రము, శిల్పము, సమస్త కర్మలు, వేదములు, శాస్త్రములు అన్నీ విష్ణురూపమే. ఈ లోకములలో మహత్భూతము విష్ణువే. సమస్త భూతములకు ఆత్మ విష్ణువే. విష్ణువు సర్వవ్యాపి. సకల శుభములను కలిగించి పరమపదమును కలిగించే ఈ సహస్రనామార్చన చేసిన మానవుడు ధన్యుడు. కనుక ధర్మనందనా నీవు కూడా విష్ణుసహస్ర నామార్చన చేసి ఐశ్వర్యములను పొంది బంధు మిత్రులతో సుఖములు అనుభవించు " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.


పురుషోత్తముడు

## పూజార్హులు

భీష్ముడు ఉపదేశించిన విష్ణుసహస్రనామ మహిమ విన్న తరవాత ధర్మరాజు మహదానందం పొందాడు. అయినా ధర్మరాజుకు సందేహాలు ఇంకా మిగిలి ఉన్నాయి. అందుకే ధర్మరాజు భీష్ముడితో " పితామహా ! పూజించడానికి, నమస్కరించడానికి అర్హులు ఎవరు. ఎవరికి ఆనందం కలిగిస్తే మానవులకు శుభములు కలుగుతాయి. ఎవరికి హాని కలిగిస్తే మానవులకు హాని, అశుభములు కలుగుతాయి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ఈ లోకములో పూజించడానికి అర్హులు బ్రాహ్మణులే. బ్రాహ్మణులకు హాని కలిగించినట్లయితే సాక్షాత్తు దేవేంద్రుడికి కూడా తిప్పలు తప్పవు. బ్రాహ్మణులు సంతోషించిన సకల శుభములు కలుగుట తధ్యము. బ్రాహ్మణులు ఈ లోకముకు ఆధారము. బ్రాహ్మణులు ధర్మముకు వారధిలాంటి వారు. సకలశాస్త్రములు వేదవేదాంగములు ప్రవచించడానికి అర్హులు బ్రాహ్మణులు మాత్రమే. విప్రులకు తపస్సు, సత్యవాక్కు ధనముతో సమానము. బ్రాహ్మణులకు ఒక్క పూట భోజనము పెట్టిన వాడి పాపములు పటాపంచలు ఔతాయి. దేవతలకు కూడా దేవతలు బ్రాహ్మణులు బ్రాహ్మణులే. బ్రాహ్మణుడు బాలుడైనా పూజనీయుడే. ఇక వృద్ధ బ్రాహ్మణుని విషయము చెప్పనలవి కాదు " అని భీష్ముడు చెప్పాడు.

### బ్రాహ్మణుల మహిమ

ధర్మరాజు " పితామహా ! బ్రాహ్మణులను గురించి ఇంత గొప్పగా చెప్పావు కదా ! బ్రాహ్మణులను పూజించిన వారికి కలుగు శుభములు ఎవి ? వారిని ఇంతగా పూ జించడానికి బ్రాహ్మణులలో ఉన్న విశిష్ట గుణములు ఏవి ? " అని అడిగాడు. " ధర్మనందనా ! నీ సందేహానికి సమాధానంగా పవనార్జున సంవాదం వినిపిస్తాను. కార్తవీర్యార్జునుడు వేయచేతులు కలిగిన మహావీరుడు. అతడు తనకు కలిగిన బలగర్వము వలన " ఈ ముల్లోకములలో నాకు సాటి బలవంతుడు లేడు " అని బిగ్గరగా పలికాడు. అది విన్న ఒక భూతము బదులుగా " ఒరాజా ! నీ విలా పలుకతగదు. లోకములకన్నా భూసురులైన బ్రాహ్మణులు అధికులని నీకు తెలియదా ! " అని పలికింది. అందుకు కార్తవీర్యార్జునుడు బ్రాహ్మణులు రాజులను ఆశ్రయించుకుని జీవిస్తారు కదా ! అలాంటి బ్రాహ్మణులు రాజులకంటే అధికులు ఎలా ఔతారు ? నాకు అనుగ్రహం వస్తే బ్రాహ్మణులను ఆదరిస్తాను. కోపము వస్తే అందరినీ దండిస్తాను " అని చెప్పాడు. ఈ మాటలకు ఆ భూతము మారుపలుకక వెళ్ళి పోయింది. ఆ

సమయంలో వాయుదేవుడు తనను తాను ఎరిగించుకుని " ఓ రాజా ! నీవు బ్రాహ్మణులను రక్షిస్తున్నానని అనుకుంటున్నావు. కాని ఆ బ్రాహ్మణుల రక్షణలోనే నీవు ప్రజలను రక్షిస్తున్నావని తెలుసుకో. ముల్లోకాలలో పూజనీయులు బ్రాహ్మణులే. అహల్యను కోరిన ఇంద్రుడు గౌతమ ముని శాపం పొంద లేదా! అగస్త్యుడు సముద్రమును పొపోసన పట్ట లేదా! భృమహర్షి అగ్ని దేవుడిని శపించ లేదా!" అన్నాడు. ఆ మాటలకు కార్తవీర్యార్జునుడు బదులు పలుక లేదు.

## ఉచధ్యుని వృత్తాంతం

వాయుదేవుడు తిరిగి కార్తవీర్యార్జునితో " ఓ మహారాజా ! నీకు ఒక కథచెప్తాను విను. పూర్వము అంగీరస వంశంలో జన్మించిన ఉచధ్యుడు చంద్రుడి కుమార్తెను కోరగా చంద్రుడు తన కుమార్తెను ఉచధ్యుడికి ఇచ్చి వివాహము చేసాడు. వారిరువురు ఆనందంగా జీవిస్తున్న తరుణంలో వరుణుడు చంద్రుని కుమార్తె మీద కోరిక పెంచుకుని ఉచధ్యుడు స్నానికై నదీతీరానికి వెళ్ళిన తరుణంలో ఉచధ్యుడి భార్యను అపహరించి తీసుకుని వెళ్ళి తన అంతఃపురంలో ఉంచాడు. ఈ విషయం నారదుడికి తెలిసి ఉచధ్యుడికి విషయం తెలిపాడు. ఉచధ్యుడు " దిక్కులకు అధిపతి అయిన వరుణుడికి పరుల భార్యల మీద మక్కువ పెంచుకొనుట తగదు. నీవు ఉచధ్యుడి వద్దకు వెళ్ళి నేను ఇలా చెప్పానని చెప్పు " అని చెప్పాడు. నారదుడు ఈ విషయం వరుణుడికి చెప్పాడు. కాని కామంతో కళ్ళు మూసుకు పోయిన వరుణుడు " నారదా ! నీవు చెప్పినా సరే నేను ఉచధ్యుని భార్యను విడువను " అని చెప్పాడు. నారదుడు ఉచధ్యుని వద్దకు వెళ్ళి " ఉచధ్యా ! వరుణుడు నా మాటను కూడా గౌరవించక నీ భార్యను వదలడానికి నిరాకరించడమే కాక నన్ను తన వారితో బయటకు గెంటించాడు " ఆ మాటలు విన్న ఉచధ్యుడు ఆగ్రహించి సముద్రజలాలను ఒక్క గుక్కలో పీల్చి వేసి లోకాలను గడగడలాడించాడు. వరుణుడు కూడా గడగడ లాడుతూ ఉచధ్యుని భార్యను తీసుకు వచ్చి అతడికి సమర్పించి తనను మన్నించమని వేడుకున్నాడు. కనుక రాజులకంటే బ్రాహ్మణులు గొప్పవారు " అని వాయుదేవుడు కార్తవీర్యార్జునుడికి చెప్పాడు.

## దేవతలను రక్షించిన బ్రాహ్మణులు


కార్తవీర్యార్జునునికి వరమిస్తున్న దత్తాత్రేయుడు

వాయుదేవుడు తిరిగి " పూర్వము దేవతలు రాక్షసుల చేతిలో ఓడి పోయి ఇక్కట్ల పాలైన తరుణంలో అగస్త్యుడు రాక్షసులను జయించి దేవతలను రక్షించాడు. మరొకసారి రాక్షసులు దేవతలను ఓడించి వారిని హింసల పాలు చేసిన తరుణంలో దేవతలు వశిష్టుడికి వెళ్ళి మొరపెట్టుకున్నారు. వశిష్టుడు ఆగ్రహించి ఒక్క హూంకారం చేసి రాక్షసులను భస్మము చేసాడు. కనుక దేవతల కంటే కూడా బ్రాహ్మణులు గొప్పవారు " అని వాయుదేవుడు చెప్పాడు. కార్తవీర్యార్జునుడు బదులు పలుక లేదు. వాయుదేవుడు తిరిగి " ఒకసారి రాక్షసులకు దేవతలకు జరిగిన యుద్ధంలో రాహువు సూర్య చంద్రులను తన అస్త్ర ప్రయోగంతో మూర్చిల్ల జేసాడు. లోకాలన్ని చీకట్లలో మునిగి పోయాయి. రాక్షసులు దేవతలను తరిమికొట్టారు. వారు అత్రిమహామునికి మొరపెట్టుకొనగా అత్రి మహాముని తన తపోమహిమతో సూర్య, చంద్రుల మూర్చను పోగొట్టి లోకాలను కాంతివంతం చేసి రాక్షసులను నాశనం చేసి దేవతలను రక్షించాడు. కనుక బ్రాహ్మణులు ముల్లోకాలకు గొప్పవారు " అని చెప్పాడు. వాయుదేవుడు ఇంకా ఇలా చెప్పాడు " కార్తవీర్యార్జునా ! ఒకసారి ఇంద్రుడు అశ్వినీ దేవతలకు సోమపానముకు అర్హత లేదని శాసించంచాడు. అప్పుడు అశ్వినీ దేవతలు చ్యవనుడిని ఆశ్రయించారు. చ్యవనుడు అశ్వినీదేవతలకు మేలు చేయడము కొరకు ఇంద్రుడితో పగ తెచ్చుకున్నాడు. ఇంద్రుడు చ్యవనుడిని చంపాలనినుకున్నాడు. ఇంద్రుడు చ్యవనుడి మీదకు ఒక కొండను, వజ్రాయుధాన్ని విసిరాడు. చ్యవనుడు వాటిని తిప్పి కొట్టి చేసి మదుడు అను రాక్షసుడిని సృష్టించి వారి మీదకు పంపాడు. మదుడు దేవతలను దేవేంద్రుడితో సహామింగి వేసాడు. అప్పుడు వారంతా చ్యవనుడిని ప్రార్థించి తమ స్వస్వరూపాలను తిరిగి పొందారు. ఇంద్రుడు దేవతలతో సహా చ్యవనుడికి ప్రణామం చేసి తమను మన్నించమని కోరాడు. చ్యవనుడు ఇంద్రుడిని అశ్వినీదేవతలకు సోమపానార్హత కలిగించమని కోరాడు. ఇంద్రుడు దేవతలకు సోమపానార్హత కలిగించాడు. చ్యవనుడు బ్రాహ్మణుడైనా దేవేంద్రుడికంటే గొప్పవాడని అనిపించుకున్నాడు కదా ! " అన్నాడు. ఇంతచెప్పినా కార్తవీర్యార్జునుడు అంగీకరించక మౌనం వహించాడు. అప్పుడు వాయు దేవుడు తిరిగి " మహారాజా ! అంతెందుకు నీ గురువు బ్రాహ్మణుడు అయిన దత్తాత్రేయుడి మహిమవలెనే కదా నీవింత గొప్పవాడివి అయి ఇంతటి మహా బలపరాక్రమాలు సంపాదించి రాజులలో మాణిక్యములా వెలుగుతున్నావు. నీవే

కాదు మానవులు, దేవతలు కూడా బ్రాహ్మణుల మహిమవలెనే మనుగడ సాగిస్తున్నారు. కనుక నీవు కూడా బ్రాహ్మణుల మహిమను గుర్తించి వారిని పూజించి సౌఖ్యములను పొందు " అన్నాడు. కార్తవీర్యార్జునుడి గర్వము అంతటితో అణిగి పోయి బ్రాహ్మణుల గొప్పతనము అంగీకరించి బ్రాహ్మణులను పూజించి సుఖములను పొందాడు. కనుక ధర్మరాజా ! నీవు కూడా బ్రాహ్మణులను పూజించి సౌఖ్యములను పొందు " అన్నాడు భీష్ముడు.

## బ్రాహ్మణ పూజ

ధర్మరాజు " పితామహా ! ఎంత విన్ననూ నాకు **శ్రీకృష్ణతత్వము** వినవలెనని కోరికగా ఉన్నది. నాకు ఇంకా బ్రాహ్మణమహిమలు వివరించండి " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! నాకు ఇంద్రియములు, వాక్కు, మనస్సు దుర్బలము అయ్యాయి. నేనిక అలసి పోయాను. దక్షిణాయనము అయిపోవస్తుంది. ఉత్తరాణము సమీపిస్తుంది. నేను ఇక నిష్క్రమించ వలసిన కాలము సమీపిస్తుంది. శ్రీకృష్ణుడికి బ్రాహ్మణతత్వము బాగా తెలుసు. అతడు సర్వజ్ఞుడు. అతడు నీకు బ్రాహ్మణమహిమలు వివరిస్తాడు. నాకు కృష్ణతత్వము బాగా తెలుసు. అతడు వరాహరూపము ఎత్తి భూమిని అవలీలగా తన కోరల మీద ఎత్తాడు. ఈ భూమి మీద జీవజాలము ఆవిర్భావము శ్రీకృష్ణలీల కాక మరేమి ? అతడు తన నాభికమలము నుండి బ్రహ్మను సృష్టించి ఈ సృష్టికార్యము జరిపించాడు. బ్రహ్మ కారకుడే కాని మూలము శ్రీకృశష్ణుడే. ఎప్పుడైతే దనుజులు ధర్మమును నశింపచేస్తారో అప్పుడు శ్రీకృష్ణుడు అవతరించి ధర్మమును కాపాడి ధర్మాత్ములను రక్షిస్తాడు. దేవతలు, విశ్వపతి, దిక్పాలకులు, పరమేశ్వరుడు అన్నీ శ్రీకృష్ణుడే. కాలము, జగత్తు, దిక్కులూ అన్నీ తానే అయి ఉన్నాడు. యజ్ఞ స్వరూపుడైన శ్రీకృష్ణుడిని ఋత్విక్కులు వేద మంత్రములతో స్తుతిస్తారు. ఋగ్వేదములో శ్రీకృష్ణస్తుతి వింతకాదు. యజ్ఞము, ఋత్విక్కులు, యజ్ఞ సామాగ్రి, మంత్రములు, యజమాని అన్నీ ఆయనస్వరూపమే. సూర్యచంద్రులకు వెలుగును ఇచ్చే పరంజ్యోతి స్వరూపుడు అతడే. అతడే సత్యము, నిత్యము, అజరామరమైన పరమపదము " అని భీష్ముడు ధర్మరాజుకు చెప్పాడు.

## శ్రీకృష్ణుడు చెప్పిన బ్రాహ్మణ మహిమ

ధర్మరాజు " శ్రీకృష్ణుడి ముందు ప్రణమిల్లి " దేవదేవా ! శ్రీకృష్ణా ! నాకు బ్రాహ్మణతత్వము వినవలెనన్న కోరిక తీరలేదు కనుక నన్ను కరుణించి వివరించవా ! " అని వేడుకున్నాడు. శ్రీకృష్ణుడు " ధర్మనందనా ! నేను ప్రద్యుమ్నుడికి చెప్పిన విషయాలు నీకు వివరిస్తాను. మానవులకు ధర్మార్ధకామమోక్ష సాధనకు, దేవతార్చనకు, పితృదేవతార్చనకు, ఇహలోకసౌఖ్యములు పొందుటకు కారణం అందుకు సహకరించే బ్రాహ్మణులే. దేవతలకు కూడా ఆయుష్షు, సంపద, కీర్తి కలగడానికి కారణం బ్రాహ్మణులే. బ్రాహ్మణులు అనుగ్రహిస్తే సంపదలు పొందగలరు. బ్రాహ్మణులు ఆగ్రహించిన ఎంతటి వారైనా భస్మము కాగలరు. ఇహలోక సుఖములకే కాక పరలోక సుఖములు పొందుటకు కూడా కారణం బ్రాహ్మణులే. ఇది తెలపడానికి నీకు ఒక వృత్తాంతం చెప్తాను విను. దుర్వాసుడనే మహాముని ఉండే వాడు. అతడు వింతమనస్కుడు. అతడి చేష్టలు ఎవరికి అర్ధము కావు. ఒకసారి మంచముమీద నిద్రిస్తాడు. ఒకసారి నేలమీద నిద్రిస్తాడు. మన మిచ్చినప్పుడు ఆహారము తినడు. తను అనుకున్న వెంటనే ఆహారము అందివ్వవలసినదే. ఒక్కోసారి ఏమీతినడూ. ఒక్కోసారి వందమంది భోజనము ఒక్కడే తింటాడు. ఒక నాడు దుర్వాసుడు మా ఇంట పాయసం కావాలని అడిగాడు. మేము అతడికి పాయసం ఇచ్చిన వెంటనే దానిని కొంచం తిని తరువాత తన ఒంటికి పూయమని కోరాడు. నేను అలాగే చేసాను.

## రుక్మిణి దుర్వాసుడి రధములాగుట

తరువాత అతడు దానిని రుక్మిణీ దేవి ఒంటికి రాసి ఆమెను ఒక రధానికి గుర్రములా కట్టి తాను ఆ రధమ మీద కూర్చుని రుక్మిణిని ఆరధము లాగమని చెప్పాడు. ఆమె అలాగే లాగింది. రుక్మిణి రధము లాగుతుంటే అతడు దానిని వీధులలో తిప్పాడు. నేను ఆయన మీద అలుగక ఆ రధము వెంటవెళ్ళాను. కాని యాదవులు ఆగ్రహించి నాకొరకు ఆయనను ఏమీ అనలేక నా వెంట నడిచారు. కొంతదూరము పోయిన పిదప రుక్మిణి సొమ్మసిల్లి పడిపోయింది. అప్పుడు **దుర్వాసుడు** రధము దిగి రుక్మిణి మీద మట్టిచల్లి దక్షిణదిక్కుగా వెళ్ళిపోయాడు. నేను అతడి వెంటవెళ్ళి అతడి కాళ్ళుపట్టి రమ్మని వేడుకున్నాను. ఆయన నన్ను కరుణించి " కృష్ణా ! కరుణించి కృష్ణా నీవు కోపాన్నిజయించావు. నేను నీకు ఒక వరం ఇస్తున్నాను. ఇక మీదట జనులు అందరూ వారు వారిని ఎంతగా ఆరాధిస్తారో అంత కంటే ఎక్కువగా నిన్ను ఆరాధిస్తారు. నేను నిన్ను పాయసము నా ఒంటికి రాయమని చెప్పినప్పుడు నీవు నా ఒంటికి అంతా రాసావు కాని పాదాలను వదిలావు కనుక నీవు పాదానికి హాని కలగడం ద్వారా ఈ లోకం నుండడి నిష్క్రమిస్తావు. అయినా అది నిన్ను నీ స్వస్థలమైన వైకుంఠానికి చేర్చి నీకు మేలుచేస్తుంది . నీవు నన్ను పూజించినట్లే మిగిలిన బ్రాహ్మణులను పూజించి సౌఖ్యములను పొందు " అని చెప్పి రుక్మిణీ దేవి వద్దకు వెళ్ళి " అమ్మా ! నీవు నీ సౌందర్య, సౌభాగ్యములతో అప్రతిహతంగా పదహారువేల భార్యలలో అగ్రగణ్యవై వర్ధిల్లగలవు "

అని వరం ఇచ్చి వెళ్ళి పోయాడు. ధర్మనందనా ! అప్పటి నుండి మాశరీరాలు వింత కాంతులతో విరజిల్లుతున్నాయి. అప్పటి నుండి మా ఇంట సిరి సంపదలు తులతూగుతున్నాయి. అప్పటి నుండి నేను బ్రాహ్మణులను పూజిస్తున్నాను. కనుక నీవు కూడా బ్రాహ్మణులను పూజించి సౌఖ్యములను పొందు " అని చెప్పాడు.

### దుర్వాస జననం

ధర్మరాజు " కృష్ణా ! దుర్వాసుడు పరశివుడి అంశ అని అంటారు కదా ! అది ఎలా జరిగింది వివరించు " అని అడిగాడు. శ్రీకృష్ణుడు " ధర్మనందనా ! ఏ మానవుడైతే పరమశివుని ధ్యానించి శతరుద్రులను ఆరాధిస్తాడో అతడికి ఇహలోకములోను, పరలోకములోను దొరకని సుఖము లేదు. శివుడికి మించిన దైవము లేదు. అతడే మహాదేవుడు. అతడు ఆగ్రహించి మూడో కంటిని తెరిచాడా వేద విరుద్ధులైన వారు భస్మము కాక తప్పదు. అతడికి ఆగ్రహానికి దక్షాయజ్ఞము ధ్వంశం అయిన విషయము లోక విదితమే కదా ! అతడి ఆగ్రహము వలన సూర్యుడికి కళ్ళు పోయి అనుగ్రహము వలన ఆ కళ్ళు తిరిగి వచ్చాయి కదా ! మిక్కిలి బలవంతులైన త్రిపురాసురులు లోకకంటకులై బాధిస్తున్నప్పుడు మహాశివుడు దేవతల మొర విని ఆ మూడు పురములను ఒకే అస్త్రముతో ధ్వంశం చేసి దానిని తన తొడ మీద పెట్టుకున్న తరుణంలో ఆ అస్త్రము ఒక బ్రాహ్మణ బాలుని ఆకారము దాల్చింది. అప్పుడు దేవతలు అతడు ఎవరని ప్రశ్నించగా ఈశ్వరుడు అతడికి **దుర్వాసుడు** అని నామకరణం చేసాడు. అతడే మా ఇంటికి వచ్చిన దుర్వాసుడు " అని శ్రీకృష్ణుడు ధర్మరాజుకు చెప్పాడు.

### శివపూజ

ధర్మరాజు శ్రీకృష్ణుడితో " శ్రీకృష్ణా ! శివనామములు జపిస్తే సమస్తసంపదలు, జ్ఞానము కలుగుతుందని అంటారు కదా ! ఆ నామములను వాటి అర్ధములను తెలుపవా " అని అడిగాడు. శ్రీకృష్ణుడు " ధర్మనందనా ! వాస్తవానికి పరమశివుని పరిపూర్ణంగా పూజించడానికి నామాలను వాటి అర్ధాలను వివరించడానికి నేనే కాదు బ్రహ్మదేవుడు కూడా చెప్పలేడు. కాని నీవు అడిగావు కనుక పరమశివుని నామాలను వాటి అర్ధాలను నీకు నేను వివరిస్తాను . అగ్నివాయువు, దేవేంద్రుడు, మరుత్తులు, సూర్యుడు, వసువులు అందరూ పరమశివుని స్వరూపాలే. అంతటి మహిమాన్వితమైన పరమేశ్వరుని మహిమలు ప్రీతితో చెప్పడము శ్రద్ధగా వినడము సర్వార్ధసాధకము. ఈశ్వరతత్వము మహాతత్వము. సమస్తమునులు, ఋషులు అతడిని మహేశ్వరుడుని, హరుడని స్తుతిస్తుంటారు. ఉగ్రత్వము, అఖండమైన ప్రతాపం కలవాడు కనుక రుద్రుడని అంటారు. దేవతల కందరికీ దేవుడు కనుక దేవతలు అతడిని మహాదేవుడు అంటారు. సమస్తసత్కర్మలకు శుభప్రదమైన ఫలితాలను ఇస్తారు కనుక జనులు అతడిని శివుడు అంటారు. సుస్థిరమైన తేజస్సుతో ప్రకాశిస్తుంటాడు కనుక అతడిని స్థాణువు అంటారు. చరాచర జీవులన్నింటా తానై చరిస్తుంటాడు కనుక అతడు బహురూపుడని స్తుతిస్తుంటారు. ఆయన జటాఝూటములతో, ధూమ్రవర్ణముతో ప్రకాశిస్తుంటాడు కనుక ఆయన జనులచేత ధూర్జటి అని పిలువబడుతంటాడు. విశ్వదేవతలందరూ అతడిని విశ్వరూపుడని పిలుస్తారు. అనేక నేత్రములతో చూస్తుంటాడు కనుక అతడిని సర్వ చక్షువు అని అంటారు. వృషభవాహనమును అధిష్టించి తిరుగుతుంటాడు అనుక ఆయనను వృషభవాహనుడు అంటారు. మహాశివుడు జనులను రక్షిస్తూ వారిని లయము చేస్తుంటాడు. పరమేశ్వరుడిని అన్ని నామములతో స్తుతించిన వారికి ఇహలోక సుఖములే కాక పరలోక సుఖములు కూడా కలుగుతాయి. వ్యాసమహర్షి పరమశివుని గురించి విశేషమైన స్తోత్రము రచించాడు. శివుడు సర్వజగములకు నిత్యసాక్షి, భూతములన్నింటే ముందున్నవాడు. అతడు సుభావహమూర్తి, నిరామయుడు. శివుడి ముఖము నుండిఅగ్ని నుండి పుట్టింది. అతడిని భక్తితో ఆరాధించిన వాడికి అతడు మోక్షము ప్రసాదిస్తాడు. ఈ శివస్తోత్రం రోజు భక్తితో పఠించిన వారికి సకల సుభములు కలుగుతాయి " శ్రీకృష్ణుడు ధర్మరాజుకు పరమశివుని నామ మహత్యము గురించి వివరించాడు.

### అనుష్టించ తగిన ధర్మము

ధర్మరాజు భీముడిని " పితామహా ! ధర్మములు పలు విధములు కదా ! వాటిలో అనుష్టించ తగిన ధర్మములు ఏవి ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! ధర్మముల గురించి ధర్మవేత్తలు మాత్రమే చెప్పగలరు. కాని కాలానుగుణంగా ధర్మము కూడా మారుతూ ఉంటుంది. ఒక్కో సారి ధర్మము కూడా తనరూపు మార్చుకుంటుంది. ఒక్కోసారి అధర్మము కూడా ధర్మములా గోచరిస్తుంది. ఒకోసారి ధర్మసూక్ష్మములు తెలియని వారు అధర్మమును ధర్మమని తలచి ప్రచారము చేస్తుంటారు. అందు వలన సాధారణ జనులు అవస్థల పాలౌతారు. అందువలన, ధర్మసూక్ష్మములను తెలిసిన వారి లన శాస్త్రాధ్యయనము వలన ధర్మమును తెసుకుని ప్రవర్తించాలి. ధర్మనందనా ! ధర్మసూక్ష్మములు తెలుసుకోవడానికి మూడుమార్గాలు ఉన్నాయి. వీటినే మునులు అనుసరించారు. నీవు అనవసర సందేహాలను వదిలి నా మాటలను విను. అహింస, దానగుణము,

సత్యముపలకడము, కోపమును నిగ్రహించడము ఉత్తమధర్మములు. కనుక ఈ గుణములు అనుసరించు. ఎల్లప్పడు బ్రాహ్మణులను పూజించు. సకల విచారములను వదిలి నిర్మలచిత్తముతో ఉండడమే ఉత్తమధర్మము " అని భీష్ముడు చెప్పాడు. ధర్మరాజు " పితామహా ! సాధారణంగా ఎవరు ధర్మాన్ని పాటిస్తారు? ఎవరు ధర్మాన్ని ద్వేషిస్తారు? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! మొదట బ్రహ్మముఖము నుండి ధర్మము పుట్టింది. సత్యవాక్కు పలికే వారు ధర్మమును ఉపాసించి పాటిస్తారు. వారు ఊర్ధ్వలోకాలకు పోతారు. రజోగుణము, తమోగుణము కలిగిన వారు ధర్మాన్ని ద్వేషిస్తారు. వారు నరకానికిపోతారు " అని చెప్పాడు భీష్ముడు.


అంపశయ్యపైనున్న భీష్మునితో మాట్లాడుతున్న ధర్మరాజు

## సాధువులు

ధర్మరాజు " పితామహా ! సాధువులు ఎవరు ? సాధువులు కాని వారు ఎవరు వివరించండి? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! సాధువులు కాని వారు ధర్మమును తమంతట తాము ఒకరు చెప్పినావినరు. తెలుసుకోలేరు. భోధించినా అర్ధము చేసుకోలేరు. అర్ధము చేసుకోవడానికి ప్రయత్నించరు. శాస్త్రములను అధ్యయనము చెయ్యరు. వారిని అసాధువులు అంటారు. సాధుజనులు ధర్మమును తమంతట తాము తెలుసుకోవడానికి ప్రత్నిస్తారు. వేదములు, శాస్త్రములను అధ్యయనము చేసి తెలుసుకుంటారు. పెద్దలు, మునులు, ఋషులు చెప్పినది విని ఆచరిస్తారు. సాధుజనులు ఎల్లప్పడు సత్యమునే పలుకుతారు. పరస్త్రీలను కన్నెత్తి చూడక ధర్మపత్ని అందే తృప్తి చెందుతారు. గురువులను పెద్దలను గౌరవించి పూజిస్తారు. శరణు కోరిన వారిని రక్షిస్తారు. కపటము లేక నడుచుకుంటారు. ఇంద్రియ నిగ్రహము కలిగి ఉంటారు. జీవుల ఎడ ప్రేమ కలిగి ఉండి అహింసకు దూరంగా ఉంటారు. తెలియక చేసే పాపములకు ప్రాయశ్చితము చేస్తారు. దానములను గుప్తముగా చేస్తారు. నిర్మల మనస్కులై సదా సంతోషము అనుభవిస్తారు. ఇవి సాధులక్షణములు " అని చెప్పాడు.

## పూర్వజన్మ సుకృతము

ధర్మరాజు " పితామహా ! కొంతమందికి అప్రయత్నముగా ధనము వచ్చి పడుతుంది. మరి కొంతకొంత మందికి గురువు లేకున్నా అన్ని విద్యలూ అబ్బుతాయి. మరి కొంత మందికి గురువులు ఎంత భోదించినా విద్య అబ్బదు. కొంతమంది ఎన్ని రోగములు ఉన్నా చావరు. మరి కొంత మంది బలవంతులు కూడా చిన్న దెబ్బకే మరణిస్తారు. ఈ విపరీతములకు కారణం ఏమిటి ? " అని అడిగాడు. భీష్ముడు " ధర్మనందనా ! వీటన్నిటికీ పూర్వజన్మ సుకృతమే కారణము. విత్తనము లేకనే చెట్లు మొలవవు కదా ! అలాగే పూర్వజన్మలో చేసిన సుకృతములు మంచి ఫలితాలను దుష్కృతములు చెడ్డ ఫలితాలను ఇస్తాయి. పూర్వజన్మలో ధర్మము చేసిన వారికి ఈ జన్మలో అయాచితంగా ధనము లభిస్తుంది. పూజలుతపస్సు చేసిన వారికి ఈ జన్మలో అపారమైన సౌఖ్యములు కలుగుతాయి. గురువులకు శుశ్రూష చేసిన వారికి అప్రయత్నముగా చదువులు అబ్బుతాయి. క్రిందటి జన్మలో అహింసను పాటించిన వారు ఈ జన్మలో దీర్గకాలము జీవిస్తారు. కనుక సాధుజనులు ధర్మమును పాటిస్తూ, దానములు చేస్తూ, తపస్సుచేస్తూ, గురువులను గౌరవిస్తూ, పెద్దలను మన్నిస్తూ, అతిధులను సత్కరిస్తూ సత్ప్రవర్తనులై ఉండాలి. అటువంటి వారు ఈ జన్మలో కాక మరుజన్మలో కూడా సుఖములు అనుభవిస్తారు. ధర్మమును ఆచరిస్తూ, దానధర్మములు చేస్తూ ధర్మమును భోదిస్తూ స్నానము జపము, తపస్సు, సంధ్యా వందనము చేస్తూ మితాహారము తీసుకుని మనసు నిర్మలంగా ఉంచుకున్న మానవుడు మోక్షము పొందడానికి కూడా అర్హుడు. ధర్మనందనా ! నీ కంటి వెలుగు వ్యాసుడు నీకు శ్రీకృష్ణుడి అండ కూడా ఉంది. వీరి అండతో నీవు ప్రజలను పాలిస్తూ నీ తమ్ములతో సుఖముగా జీవించు " అని చెప్పాడు. ఆ సమాధానంతో ధర్మరాజు సంతృప్తి చెందాడు.

## వ్యాసుడు

భీష్ముడు చెప్పి ముగించిన తరువాత వ్యాసుడు " శాంతనవా ! నీ ఉపదేశములతో ధర్మరాజు విజ్ఞానవంతుడు అయ్యాడు. ధర్మరాజే కాదు అతడి తమ్ములు, ధృతరాష్ట్రుడు, శ్రీకృష్ణుడు, ఇక్కడ ఉన్న సమస్తరాజన్యులు కూడా ధన్యులు అయ్యారు. ఇక ధర్మరాజుకు హస్థినాపురముకు పోవుటకు అనుజ్ఞ ఇమ్ము. తగిన సమయం చూసి తిరిగి నీ వద్దకు వస్తాడు " అని చెప్పాడు. భీష్ముడు " వింటివి కదా వ్యాసుడి మాటలు ఇక నీవు నీతమ్ములతో హస్థినాపురం పోయి జనరంజకంగా రాజ్యపాలన చెయ్యి.

సదా నీ అందు ధర్మము నెలకొని ఉంటుంది. యయాతి మహారాజు వలె యజ్ఞయాగాదులు నిర్వహించు. బంధు మిత్రులను ఆదరించు. ప్రజలను కన్న బిడ్డల వలె పాలించి రక్షించు. నీ తల్లిని, తమ్ములను, ధృతరాష్ట్రుని, గాంధారిని, విదురుని చక్కగా ఆదరంతో చూసుకుంటూ సుఖంగా రాజ్యపాలన చేయి. ఇప్పడిక హస్థినకు వెళ్ళి సూర్యుడు మకరరాశిలో ప్రవేశించగానే తిరిగి నా వద్దకు రా " అని చెప్పి ధర్మరాజును ఆశీర్వాదం చేసాడు. ధర్మరాజు భీష్ముడికి నమస్కరించి " పితామహా మీరు చెప్పినట్లే చేస్తాను " అని చెప్పి హస్థినాపురానికి శ్రీకృష్ణుడు, తన తమ్ములతో ప్రయాణం అయ్యాడు. మంగళ వాయిద్యములు మ్రోగుతుండగా పుణ్యాంగనలు అక్షితలు చల్లుతుండగా హస్థినాపుర ప్రవేశం చేసాడు. ముందుగా పెదతల్లి గాంధారిని దర్శించుకుని ఆమె ఆశీర్వాదం తీసుకుని, ధృతరాష్ట్రుడిని కలుసుకుని అతడి ఆశీర్వాదము తీసుకుని, తరువాత తన తల్లి కుంతీ దేవిని కలుసుకుని ఆమె ఆశీర్వాదం తీసుకుని, భార్య ద్రౌపదిని కలుసుకుని ఆమె యోగక్షేమములు కనుక్కున్నాడు. తరువాత నగరవాసులను కలుసుకుని ఇష్టాగోష్టి చేసాడు. బ్రాహ్మణులకు దానధర్మాలు చేసాడు. యుద్ధములో భర్తలను, కుమారులను పోగొట్టుకున్న స్త్రీలను ఓదార్చి వారికి ఆశ్రయము కల్పించి వారిని ధనముతో సంతోషపెట్టాడు. తరువాత కురుసామ్రాజ్యానికి పట్టాభిషిక్తుడై రాజ్యపాలన చేపట్టాడు. తన తమ్ములకు వారి వారి పనులను అప్పగించి తాను విశ్రాంతి భవనంలోకి ప్రవేశించాడు.

## ఉత్తరాయణము


చనిపోబోతున్న భీష్ముడిని సందర్శించడానికి వచ్చిన శ్రీకృష్ణుడు పాండవులు - రాజ్మానామా నుండి ఒక దృశ్యం

యాభైదినములు గడిచాయి సూర్యుడు మకరరాశిలో ప్రవేశించాడు. ఉత్తరాయణము మొదలైంది. ధర్మరాజు తన తమ్ములు, గాంధారి, ధృతరాష్ట్రుడు, కుంతీదేవిని, శ్రీకృష్ణుడిని, విదురుడిని, సంజయుడిని, యుయుత్సుడిని , ధౌమ్యుడిని మిగిలిన నగర పెద్దలను తీసుకుని నూతనవస్త్రాలను, చందనం, అగరు వంటి సుగంధద్రవ్యాలను తీసుకుని భీష్ముడు అంపశయ్య మీద ఉన్న ప్రదేశానికి వెళ్ళాడు. అంత దూరం ఉండగానే రధములు దిగి అంతా పాదాచారులై భీష్ముని వద్దకు వెళ్ళారు. అప్పటికే వ్యాసుడు, నారదుడు, **దేవలుడు** వంటి మహామునులు అక్కడికి చేరుకున్నారు. ధర్మరాజాదులు వారందరికి భక్తి శ్రద్ధలతో నమస్కరించారు. ధర్మరాజు భీష్ముడితో " పితామహా ! నేను ధర్మతనయుడిని వచ్చాను. నీకు నమస్కరిస్తున్నాను నా మాట వినండి. ఉత్తరాయణం వచ్చింది. అందుకని అగ్ని మొదలైన సామాగ్రి తీసుకుని వచ్చాను. శ్రీకృష్ణుడు, ధృతరాష్ట్రుడు, నా తమ్ములు కూడా వచ్చారు. కళ్ళు తెరిచి చూడండి " అని ప్రార్ధించాడు.

## భీష్ముడి చివరి బోధ

"భీష్ముడు మెల్లగా కళ్ళు తెరిచి అందరినీ ఒక సారి చూసి ధర్మరాజు చేతిని తన చేతిలోకి ప్రేమతో తీసుకుని నిమురుతూ " వచ్చావా కుమారా ! మాఘుమాసము శుక్లపక్షము నా మనస్సుకు ఆహ్లాదము కలిగిస్తుంది " అని ధృతరాష్ట్రుడిని చూసి " కుమారా ! నీకు అన్ని ధర్మములు తెలుసు. జరుగుతున్నది జరగబోయేది తలచుకుని కలతపడ వద్దు. సద్భావంతో ఆలోచిస్తే పాండునందనులు నీ కుమారులు కాదా ! వారిని ఆదరంతో చూడు. దయతో ఆదరించి వారి శుశ్రూషలు అంకుని వారికి కర్తవ్య బోధచేస్తూ రాజ్యపాలనలో సహకరించు. ధృతరాష్ట్ర కుమారా ! ధర్మరాజు నీ పట్ల ప్రేమ కలిగి ఉన్నాడు. అతడికి ద్వేషించడం అంటే తెలియదు. కనుక నీవు పాండునందనులను వాత్సల్యముతో చూసుకో. నీ కుమారులు దుర్మార్గులు, లోభత్వము కలవారు, కుత్సిత స్వభావులు, క్రోధబుద్ధి కలవారు, అధర్మపరులు, అవినీతిపరులు వారి కొరకు నీవు చింతించ పనిలేదు " అన్నాడు. తరువాత శ్రీకృష్ణుడిని చూసి " శ్రీకృష్ణా, వాసుదేవా, సమస్త జీవులలో నివసించే వాడా, శంఖు, చక్ర, గధా, పద్మములను నాలుగు చేతులతో ధరించువాడా, త్రివిక్రమా, పరమపురుషా, దేవతలతో పూజింపుబడువాడా, వరదా నేను నీకు నస్కరిస్తున్నాను. భార్యాబిడ్డలు లేని వాడిని, నీవే నాకుదిక్కు నన్ను ప్రేమతో ఆదరించు. నేను నీ భక్తుడను నీవే నా బలము. నేను నీ భక్తుడను నన్ను అధికమైన కరుణతో ఆదరించి రక్షించు. నాకిక అనుజ్ఞ ఇవ్వు. పాండుకుమారులకు నీవే అండ. వారికి మార్గదర్శకుడివై వారిని ఆదరంచు. దుర్మార్గులైన కౌరవులకు నేను అనేకమార్లు శ్రీకృష్ణుడు ఎక్కడ ఉంటే అక్కడే విజయము ఉంటుంది అని చెప్పాను. అయినా కుబుద్ధి అయిన సుయోధనుడు వినలేదు. తన వారిని అందరిని బలి పెట్టి తానూ మరణించాడు. కృష్ణా ! నీ వెవరో నేను ఎరుగుదును. నరనారాయణులు లోక

రక్షణార్ధమై ఈ లోకములో లీలామానుష విగ్రహాలై సంచరిస్తున్నారని వారే కృష్ణార్జునులని నారదమహర్షి వ్యాసుడు చెప్పగా తెలుసుకున్నాను " అని అన్నాడు.

## భీష్ముడి స్వర్గలోకయాత్ర

శ్రీకృష్ణుడు " దేవవ్రతా ! ఇందులో నీ తప్పు ఏమీ లేదు. నీవు పుణ్యాత్ముడవు. నీకు నీ తండ్రి పట్ల భక్తిశ్రద్ధలు కల వాడవు కనుకనే మృత్యువు నీ పట్ల సేవకుని వలె ప్రవర్తిస్తూ వేచి ఉన్నది. నేను నీకు అనుజ్ఞ ఇస్తున్నాను నీవిక ఈ దేహయాత్ర చాలించి వసువులలో చేరుకొనుము " అని పలికాడు. ఆ మాటలకు భీష్ముడు ఆనందభరితుడై " ధృతరాష్టుడిని, ధర్మరాజును, మిగిలిన పాండుసుతులను ఇంకా అక్కడ ఉన్న అందరినీ ప్రేమతో చూస్తూ " మీ అందరి వద్ద ఇక శలవు తీసుకుంటున్నాను " అని అన్నాడు. అందరినీ కౌగలించుకున్నాడు. " మీరు అందరూ సత్యమును పలకండి. క్రూరత్వమును వదలండి " అని బోధించాడు. తాను ఇంతకు ముందు రాజులవద్ద గెలుచుకున్న ధనమును బ్రాహ్మణులకుదానంగా ఇచ్చాడు. ధర్మరాజును పిలిచి " ధర్మనందనా ! బ్రాహ్మణులు పూజింపతగిన వారు. అందులో ఋత్విక్కులు, ఆచార్యులు, వృద్ధులు మరింత పూజింపతగిన వారు " అని పలికి తరువాత మౌనం వహించాడు. భీష్ముడు యోగధారణ చేసి జీవాత్మను పరమాత్మతో అనుసంధానం చేసాడు. అన్ని వాయువులను సులభంగా ఊర్ధ్వముఖంగా ప్రయాణం చేయించాడు. ఒక్కొక్క అవయవం నుండి ప్రాణములను వెనక్కి లాగుతున్నాడు. అక్కడ ఎముకలు మాయమౌతున్నాయి. అది చూసి అక్కడ ఉన్న మునులు, రాజులు ఆశ్చర్యచకితులై చూస్తూ భీష్ముడిని పలు విధములుగా శ్లాగించారు. ఆ సమయంలో భీష్ముడి జీవాత్మ మూర్ధమును చీల్చుకుంటూ ఒక ఉల్కవలె ప్రకాశిస్తూ ఆకాశంలోకి లేచి కొంత దూరం పోగానే అదృశ్యం అయింది. దేవతలు దుందుభులు భీష్ముడి మీద మ్రోగిస్తూ పూలవాన కురిపించారు. సిద్ధులు, సాధ్యులు భీష్ముడిని వేనోళ్ళ పొగిడారు. ఈ విధంగా భీష్ముడు స్వర్గలోకం చేరాడు.


భీష్ముని మరణం- రాజ్మానామా నుండి ఒక దృశ్యం

## భీష్ముడి దహన సంస్కారం

తరువాత ధర్మరాజాదులు, విదురుడు, యుయుత్సుడు మొదలగు వారు భీష్ముడి శరీరానికి దహనసంస్కారానికి ఏర్పాటు చేసారు. చందనము, అగరు వంటి చెక్కలతో చితిపేర్చారు. అందరూ స్నానాలు చేసారు. వేదపఠనాల మధ్యహోమాగ్ని వెలిగించారు. భీష్ముడి పార్ధివ శరీరాన్ని తలవైపు నకుల సహదేవులు కాళ్ళవైపు ధృతరాష్ట్ర ధర్మరాజులు పట్టుకుని చక్కగా అలంకరించిన వాహనము మీద చేర్చారు. నకులసహదేవులు, ధర్మరాజు, ధృతరాష్టుడు మోస్తుండగా భీమార్జునులు చామరములు వీస్తున్నారు. యుయుత్సుడు ఛత్రము పట్టాడు. వృద్ధ కౌరవస్త్రీలు వింజామరలు వీచారు. **ధౌమ్యుడు** పౌరోహిత్యము వహించాడు. అందరూ కలిసి భీష్ముడి శరీరాన్ని చితిమీద చేర్చారు. చితిమీద నేతిని పోసారు. చితికినిప్పు అంటించారు. ఆ విధంగా భీష్ముడికి వైభవంగా దహనసంస్కారాలు చేసి అందరూ స్నాదికాలు చేసి భీష్ముడికి నువ్వులు నీళ్ళు వదిలారు.

### గంగాదేవి రోదించుట

ఆ సమయంలో గంగాదేవి రోదిస్తూ గంగాజలం నుండి బయటకు వచ్చి " అయ్యో దేవవ్రతా ! ముల్లోకాలలో నీ కంటే పరక్రమవంతుడు లేడని అనిపించుకున్నావు కదా ! మీకు తెలుసు కదా ! నా కుమారుడు దృఢవ్రతుడు, బుద్ధిశీలుడు, క్షత్రియధర్మము బాగా తెలిసినవాడు. అందరి అందు కృప కలిగినవాడు. తనతండ్రి అందు ప్రేమ భక్తికలవాడు. తన తమ్ముల కొరకు కాశీరాజు కుమార్తెలను తీసుకు వచ్చి వివాహము జరిపించాడు. అన్ని విద్యలయందు ఆరితేరిన వాడు. పెద్దల ఎడ గౌరవము కలిగినవాడు. తన గురువు పరశురాముడినే ఎదుర్కొని గెలిచిన వాడు. అలాంటి మహిమాన్వితుడు శిఖండి చేతి దెబ్బలు తిని శరతల్పగతుడై చివరకు మరణించాడు. ఇది చూసికూడా నా హృదయం బద్దలుకాలేదంటే నాది వజ్రసమాన హృదయమే కదా ! " అని రోదిస్తూ ఉంది.



గంగాదేవిని ఓదార్చుతున్న వ్యాసకృష్ణులు

## వ్యాసుడు గంగాదేవిని ఓదార్చుట

అప్పుడు వ్యాసుడు " అమ్మా ! భాగీరథీ ! నీ శోకాన్ని విడిచి పెట్టు. నీ కుమారుడు పరమగతి పొందాడు. నీ కుమారుడు ఒక వసువు. అతడు శాపవశాత్తు మానవుడిగా జన్మించాడు. అతడు తిరుగు లేని వీరుడు. అతడిని దేవేంద్రుడు కూడా జయించడం సాధ్యము కాదు. శిఖండి నీ కుమారుడిని పడగొట్టలేదు. నీ కుమారుడు కావాలనే తన శరీరంలో బాణములు నాటించుకుని శరతల్పగతుడై తనకు తానుగా మరణాన్ని ఆహ్వానించి మరణాన్ని పొంది స్వర్గలోకము చేరాడు. అంతే కాని అతడిని ఎవరు జయించలేదు. ఇంత కాలము మృత్యువును దూరంగా ఉంచి ఉత్తరాయణం రాగానే తనకు తానుగా మరణించాడు. అతడి కొరకు నీవు శోకించ తగదు " అని వ్యాసుడు గంగాదేవిని ఓదార్చాడు. తరువాత శ్రీకృష్ణుడు, ధృతరాష్ట్రుడు, ధర్మరాజాదులు గంగాదేవి వద్ద శలవు తీసుకుని హస్థినకు వెళ్ళారు. గంగాదేవి జలములలో కలిసి పోయింది.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

# అశ్వమేధ పర్వము

వికీపీడియా నుండి

**అశ్వమేధ పర్వము**, మహాభారతంలోని 14వ భాగం. యుధిష్ఠిరుడు చేసిన అశ్వమేధయాగం ఈ పర్వంలోని ప్రధాన ఇతివృత్తం.

## విషయ సూచిక



## సంస్కృత మహాభారతం

## ఆంధ్ర మహాభారతం

## విశేషాలు

## మూలాలు

## బయటి లింకులు

- కిశోరీ మోహన్ గంగూలి ఆంగ్ల అనువాదం (http://www.sacred-texts.com/hin/m01/index.htm)

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • **అశ్వమేధ పర్వము** • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభ్రువాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రథుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

---

# అశ్వమేధ పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# ప్రధమాశ్వాసం

భీష్ముని నిష్క్రమణ ధర్మరాజుని మరింత క్షోభకు గురిచేసింది. చిన్నప్పటి నుండి చేరదీసి మంచిబుద్ధులు నేర్పి, మంచిచెడు నేర్పి, తానుతన మరణానికి కారణమని తెలిసునా తనను మన్నించి తాను అడిగిన ధర్మసందేహాలన్నీ ఇసుమంత కూడా విసుగు చూపక ఓర్పుగా తీర్చిన భీష్ముడు ఉత్తరాయాణ పుణ్యకాలము రాగానే తనువు చాలించడం ధర్మరాజును కలచి వేసింది. అతడి శరీరం దుఖఃతో పటుత్వము తప్పిపోయి తూలుతుంది. క్రమంగా శరీరం కింద పడబోతున్న సమయంలో భీముడు పట్టుకుని మెల్లిగా కూర్చోపెట్టాడు. ఇది విన్న ధృతరాష్ట్రుడు ధర్మరాజు దగ్గరగా వచ్చి " ధర్మనందనా ! నీ నీవెదుకు ఇలా చింతిస్తున్నావు. నీవు నీ క్షాత్రధర్మము నెరవేర్చావు. ఇది నీవు చింతించ వలసిన సమయము కాదు. నీవిక నీ తమ్ములతో కలిసి రాజ్యాధికారము చేపట్టు. నేను కాని సుయోధనుడు కాని విదురుని మాటలు చెవి పెట్ట లేదు అందుకే నేనీనాడు పుత్రశోకంతో నిర్దోషి అయిన గాంధారితో పుత్రశోకము అనుభవిస్తున్నాను. నా కుమారుడు తన తమ్ములతో చేరి హతుడైనాడు. ఇప్పుడు జరిగిన యుద్ధానికి జనక్షయానికి కారణం నేను నా కుమారుడే. ఇందులో నీ తప్పు ఇసుమంత కూడా లేదు. నాయనా ధర్మనందనా నేనూ గాంధారీ ఒంటరి వాళ్ళము అయ్యాము ఇక మాకు దిక్కు నీవే. మాఇద్దరినీ జాగ్రత్తగా చూసుకోవలసిన వాడివి నీవే " అని అన్నాడు. ఆ మాటలకు ధర్మరాజు ఏమీ బదులు పలుక లేదు. అప్పుడు శ్రీకృష్ణుడు " ధర్మనందనా ! నీవిలా బాధపడినంత మాత్రాన పోయిన వారు తిరిగి రారు కదా ! నీవిలా శోకిస్తుంటే వారి ఆత్మ శాంతించదు కదా ! సుయోధనుడు వీరోచితంగాపోరాడి వీరస్వర్గము పొందారు. వారికొరకు శోకించుట తగదు. భీష్ముడు నీకు అనేక ధర్మసూక్ష్మాలు వివరించాడు కదా ! అవి విన్న తరువాత కూడా నీవిలా శోకించుట తగదు. భీష్ముడే కాదు నారదుడు, వ్యాసుడు చెప్పిన నీతి వాక్యాలు గుర్తుకు తెచ్చుకుని నీవు ఒక మహాయాగానికి కర్తవుకా! దేవతలకు, పితరులకు ప్రీతి కలిగించే విధంగా భక్తితో పూజలు, తర్పణాలు చేయించు. రాజ్యాధికారము చేపట్టి ప్రలను కాపాడు. అతిధి అభ్యాగతులను ఆదరించు. బంధుమిత్రులను ఆదరించు " అని ఓదార్చాడు. అప్పుడు ధర్మరాజు అక్కడే ఉన్న వ్యాసుడి ముఖము వంక చూసి " దేవా ! నీకు నా ఎడల ప్రేమ, దయా ఉన్నాయి కదా. నాయందు దయ ఉంచి నాకు వనవాసముకు అనుజ్ఞ ఇవ్వండి. లేకున్న నాకు నా తాత , భీష్ముడు నా అన్న కర్ణుడు మొదలైన వారిని చంపినపాపానికి నిష్కృతి ఎలా ఉంటుంది. నేను చేసిన మహాపాపలు పోయే మార్గము ఏమిటి? కనుక నాకు వనవాసముకు అనుజ్ఞ ఇవ్వండి " అని ప్రాధేయపడుతూ అడిగాడు.

## వ్యాసుడు కోపించుట

ధర్మరాజు మాటలకు వ్యాసుడు కోపించి " ధర్మనందనా ! ఇప్పటి వరకు నేనూ భీష్ముడు చెప్పిన ధర్మోపదేశాలన్నీ వరదలో కొట్టుకు పోయాయా ! గంగలో కలిసిపోయాయా ! మళ్ళీ మొదటికి వచ్చావు. నీ బుద్ధి ఒప్పుకున్నా లేకున్నా జరిగిన దానికి కర్తవు నీవు కాదు. ఈశ్వరుడే అందుకు కర్త. అతడే మానవాళికి శుభాశుభములు కలిగిస్తుంటాడు. ఇందులో నీ తప్పు ఏమీ లేదు. అయినా నీకు పాపము చేసానని శంఖ ఉంటే యజ్ఞయాగాదులు దానధర్మాలు చేసి పాపములు తొలగించుకో. అంతే కాని వెర్రివాడిలా వనవాసముకు పోతానని అనకు. నీవు అశ్వమేధ యాగము చేసి దానిలో ఘనంగా బ్రాహ్మణులకు దానధర్మములు చేసి వారిని తృప్తిపరచిన నీ దుఃఖం కొంత ఉపశమిస్తుంది " అన్నాడు. ఆమాటలకు ధర్మరాజు మనసు మార్చుకుని వ్యాసుడితో " మహాత్మా ! తమరు చెప్పినట్లే అశ్వమేధ యాగము చేస్తాను. కాని అశ్వమేధయాగ నిర్వహణకు దానధర్మాలు చేయడానికి అత్యధికంగా ధనము కావాలి కదా ! ప్రస్తుతము నా వద్ద అంత ధనము లేదు. జరిన యుద్ధములో సైనికులంతా చనిపోయారు వారి భార్యలు మాత్రమే ఉన్నారు. వారిమీద అధికమైన పన్నులు వేసి వేధించలేను. మామీద ఉన్న అసూయతో సుయోధనుడు దుర్మార్గులైన రాజులందరినీ చేరదీసి ధనమును దుర్వినియోగము చేసి ధనములను భూములను పాడు చేసాడు. ఇప్పుడు ధనాగారములో ధనము లేదు. ప్రస్థుతము ధనము సంపాదించే మార్గమేది లేదు. మీరే ఏదో మార్గము చెప్పి యాగమును జరిపించండి " అని అడిగాడు. వ్యాసుడు ధర్మరాజువంక ఆదరంతో చూసి " ధర్మనందనా ! పూర్వము మరుత్తు అనే మహారాజు యజ్ఞము చేసి మహా ధనరాశులను బ్రాహ్మణులకు దానంగా ఇచ్చాడు. బ్రాహ్మణులకు ఆ ధనము మిక్కుటమైంది. వారు ఆధనమును తమకు కావలసినది ఉంచుకుని మిగిలిన ధనమును దాచి పెట్టారు. వారు " ఈ నిధిని ఎవరు కనుగొంటారో వారే దానికి స్వంతదారులు ఔతారు " అని చెప్పి వారు దానికి వారసులను నిర్ణయించారు. ఆ ధనమును ఇంకా ఎవరూ తీసుకొనలేదు నీవు ఆధనమును స్వాధీనపరచుకుని యాగమును నిర్వహించ వచ్చు " అని చెప్పాడు.

## మురుత్తు కధ

ధర్మరాజు వ్యాసుడితో " మహాత్మా ! మరుత్తు ఆ ధనము ఎలా సంపాదించాడు. అది అక్రమసంపాదనా లేక సక్రమ

సంపాదనా ? " అని అడిగాడు. వ్యాసుడు " ధర్మనందనా ! నీకు మరుత్తుకథ చెప్తాను అప్పడే నీ సందేహాలు తీరగలవు. కృతయుగములో మనువుకు ప్రజాని అనే కుంమారుడు ఉండేవాడు. అతడి కుమారుడు **క్షుతుడు**. క్షుతుని కుమారుడు **ఇక్ష్వాకు**. ఇక్ష్వాకుకు నూరుగురు కుమారులు. వారిలో పెద్దవాడు **వింశుడు**. వింశుని కుమారుడు **వివంశుడు**. వివిశుంతుడికి 15 మంది కుమారులు. వారిలో పెద్ద వాడు **ఖనీనేత్రుడు**. అతడు అధికమైన బలము శౌర్యము కలవాడు కాని పరమదుర్మార్గుడు. అతడు 14 మంది తమ్ములనుచంపి రాజ్యాధికారము చేజిక్కించుకున్నాడు. ఖనీనేత్రుడు ఎవరినీ నమ్మేవాడు కాదు. ప్రజలను ద్వేషించే వాడు. అతడి ఆగడములను సహించ లేని మంత్రులు అతడి పదావీచ్యుతుడిని చేసి అతడి కుమారుడికి పట్టంకట్టారు. ఖనీనేత్రుడి కుమారుడు ఎంతో దయామయుడు. ధర్మపాటిస్తూ సదా సత్యము పలికే వాడు. అతడు ఉన్నంతా దాన ధర్మములు చేసి చివరకు దరిద్రుడు అయ్యాడు. కోశాగారంలో ధనములేక సైన్యములకు జీతభత్యములు కూడా ఇవ్వలేని పరిస్థితి నెలకొన్నది. సైన్యము క్షీణించింది అది తెలుసుకున్న శత్రురాజులు రాజ్యము మీద దండెత్తివచ్చి అతడిని రాజ్యభ్రష్టుడిని చేసారు. చివరకు అతడు తనవారితో అడవుల పాలయ్యాడు. కాని ఆరాజు ఏ మాత్రం చింతించక నియమ నిష్ఠలతో తపస్సు చేయనారంభించాడు. అప్పుడు ఒక అద్భుతం జరిగి అతడి తపోఫలముగా అతడి ముందు అపారమైన సైన్యం ఉద్భవించింది. ఆ రాజు ఆసైన్యంతో వెళ్ళి శత్రువులను జయించి తన రాజ్యమును తిరిగి సంపాదించుకున్నాడు. ఆ రాజు ధర్మనిష్ఠతోనూ సత్యవాక్పరిపాలనతో జనరంజకంగా పాలన చేసాడు. అతడు అంగీరసుడిని ఉపద్రష్టగా పెట్టుకుని అనేక యజ్ఞయాగములు చేసాడు. ఆరాజు పేరు **కరంధముడు** అతడి మనుమడే **మరుత్తు**. అతడు ధర్మతత్పరుడు, కీర్తిమంతుడు, మహాబలవంతుడు, తేజస్సు కలిగిన వాడు, వేదవేదాంగ పారంగతుడు, విష్ణు సమానమైన వాడు. అతడు అశ్వమేధయాగము చేయతలపెట్టి యాగముకు కావలసిన సామానులను దాచి పెట్టడానికి పెద్ద పెద్ద బంగారు కుండలను తయారు చేయించాడు. ఆ యాగములో బ్రాహ్మణులకు అధికంగా దానములు చేశదూ. ఆయన తృప్తి పడలేదు. బ్రాహ్మణులకు దైనందిక జీవితానికి కావలసిన చెంబులను బిందెలను కూడా బంగారముతో చేయించి దానము చేసాడు. ఆ ధనము అతడికి ఎలా వచ్చిందో చెప్తాను. అతడి తాతైన కరంధముడు అధికంగా యాగములు చేసి సశరీరంగా స్వర్గలోకము చేరాడు. కరంధముడి కుమారుడు కూడా తండ్రి వలెనె ప్రజలను కన్న బిడ్డలవలె పాలించాడు. అతడిపేరే **అవిక్షత్తు**. అవిక్షత్తు కుమారుడే మరుత్తు.

## మరుత్తు బృహస్పతిని యజ్ఞముకు ఉపద్రష్టగా ఆహ్వానించుట

మరుత్తు ఇంద్రుడిని కూడా లెక్క చేయలేదు. అదిచూసి ఇంద్రుడు అసూయ చెందాడు. మరుత్తు ఒక యజ్ఞము చేయ తలపెట్టి ఆ యజ్ఞముకు ఉపద్రష్టగా బృహస్పతిని ఆహ్వానించినట్లు తెలుసుకున్న ఇంద్రుడు బృహస్పతి చెంతకు వెళ్ళి " మరూత్తు తాను చేయబోవు యజ్ఞముకు మిమ్ము ఆహ్వానించాలని అనుకుంటున్నాడు. దేవగురువైన మీరు ఒక మానవుడు చేయు యజ్ఞానికి ఉపద్రష్టగా వ్యవహరించడం అవమానంకాదా ! కనుక మీరు అతడికి యజ్ఞముకు ఉపద్రష్టగా ఉండాలనుకుంటే నన్ను మరచిపోయి అతడి దగ్గరే ఉండండి. లేకున్న ఇక్కడ ఉండండి " అన్నడు. బృహస్పతి " దేవేంద్రా! నాకు నువ్వే కావాలి. నేను మరొకరికి ఎలా యజ్ఞానికి ఆధ్వర్యం వహించ గలను నేను నిన్ను వదలను " అన్నాడు. తరువాత మరుత్తు బృహస్పతి వద్దకు వెళ్ళి " మహాత్మా ! నేను అశ్వమేధయాగము చెయ్యాలని అనుకున్నాను. మీరు దానికి ఉపద్రష్టగా ఉండి యజ్ఞాన్ని నిర్వహించండి. తమరు అంగీకరిస్తారని నేను అన్నీ ఏర్పాట్లు చేసాను " అని అడిగాడు. బృహస్పతి మరుత్తుతో " మరుత్తూ ! నేను రాలేను దానికి ఒక కారణం ఉంది. అదే సమయంలో ఇంద్రుడు ఒక యజ్ఞము చేయ తలపెట్టాడు. దానికి నేను ఉపద్రష్టగా ఉండి యజ్ఞ నిర్వహణ చేయాలి " అన్నాడు. మరుత్తు " మహత్మా ! అలా అంటే ఎలా. మీ తండ్రిగారు మా తాతగారైన కరంధముడికి మీ తండ్రిగారైన అంగీరసుడు ఉపద్రష్టగా ఉండి ! అనేక యజ్ఞయాగాలు చేయించాడు. అలాగే మీరు కూడా ఉపద్రష్టగా ఉండి ఎలాగైనా నేను చేయతలపెట్టిన యజ్ఞాన్ని నిర్విఘ్నంగా జరిగేలా చూడండి " అని అర్ధించాడు. అందుకు బృహస్పతి " మరుత్తు మహారాజా ! నేను దేవతలకు ఉపద్రష్టగా ఉండి యజ్ఞము చేయిస్తాను. కనుక మానవుడివి అయిన నీకు ఉపద్రష్టగా ఉండ లేను. కనుక నీవు వేరు ఉపద్రష్టను నియమించుకుని యజ్ఞమును నిర్వహించండి " అని చెప్పాడు. ఇక మరుత్తు ఏమీ మాట్లాడ లేక అవమానభారంతో వెనుదిరిగాడు. మార్గమధ్యంలో నారదుడు కనిపించి " మరుత్తు మహారాజా ! ఎక్కడి నుండి వస్తున్నావు ఏ పనిమీద వెడుతున్నావు. అని అడిగాడు. మరుత్తు " నారదమహర్షీ ! నేను తలపెట్టిన అశ్వమేధయాగానికి ఉపద్రష్టగా ఉండమని అడగడానికి బృహస్పతి వద్దకు వెళ్ళి అర్ధించాను అందుకు అతడు తాను దేవతలకు ఉపద్రష్టగా ఉండి యజ్ఞ నిర్వహణ చేస్తుంటానని అందువలన మానవుడైన నాకు ఉపద్రష్టగా ఉండ లేనని నిరాకరించాడు. నేను అవమాన భారంతో తిరిగి వెడుతున్నాను. ఇంత అవమానం మోస్తూ బ్రతికి ఉండడం ఎందుకు ? " అని చెప్పాడు. నారదుడు " మరుత్తు మహారాజా ! బృహస్పతి కాకుంటే మరొకరు దొరకరా ! అంగీరసుడి చిన్న కుమారుడైన సంవర్తనుడిని అతడి అన్న అయిన బృహస్పతి అవమానించి ఇంటి నుండి తరిమి వేయగా అతడి విరాగి అయి దిగంబరంగా అడవుల వెంట తిరుగుతున్నాడు. నీవు ఎలాగైనా అతడిని అర్ధించి నీ యజ్ఞానికి ఉపద్రష్టగా నియమించుకుని యజ్ఞమును నిర్వహించ వచ్చు " అని సలహా ఇచ్చాడు. మరుత్తు " నారదా ! సరి అయిన సమయంలో సరి అయిన సలహా ఇచ్చి నన్ను ఆదుకున్నావు. ఆ **సంవర్తనుడు** ఎక్కడ ఉంటాడు. అతడిని ఎలా తీసుకు రావాలి నాకుచెప్పి తోడ్పడండి " అని అడిగాడు. నారదుడు " మరుత్తు మహారాజా ! సంవర్తనుడు కాశీ పట్టణంలో పిచ్చివాడిలా తిరుగుతుంటాడు. అతడిని గురించి తెలుసు

కోవాలంటే నీవు ఒకపని చేయాలి. నీవు ఒక శవమును పెట్టుని కాశీనగర ముఖద్వారంలో నిలబడి ఉండు ఆ శవమును చూసి ఎవరు పారిపోతారో అతడే సంవర్తనుడని తెలుసుకో. నీవు అతడిని వెంబడించి ఏకాంత సమయం చూసి భక్తితో ప్రార్థించి నీ యాగముకు ఉపద్రష్టగా ఉండమని అడుగు. అతడు తనను గురించి నీకు ఎవరు చెప్పారు అని అదిగినప్పుడు. నాకు నారదుడు చెప్పాడు అని చెప్పు. అతడు ఇప్పుడు నారదుడు ఎక్కడ ఉన్నాడని అడుగుతాడు. నీవు నారదుడు ఈ సంగతి నాకు చెప్పి అగ్నిప్రవేశం చేసాడని చెప్పు " అని చెప్పాడు.

## సంవర్తనుడు


1 - దేవాపిని కలసిన మరుత్తు 2 - మరుత్తునితో సంవర్త ముని సంవాదం

మరుత్తు నారదుడి మాట విని సంవర్తనుడి కొరకు కాశీపట్టణం వెళ్ళాడు. మరుత్తు కాశీపట్టణంలో ఒక శవమును పెట్టుకుని నగరముఖద్వారం వద్ద ఉన్నాడు. అక్కడకు ఒక వెర్రి వాడువచ్చి ఆశవాన్ని చూసి దెబ్బతిన్న జంతువులా పరిగెత్తసాగాడు. అతడే సంవర్తనుడని తెలుసుకున్న మరుత్తు అతడిని వెంబడించి కొంతదూరం వెళ్ళి అతడి ఎదురుగా నిలిచాడు. ఆ వెర్రివాడు మరుత్తు మీద దుమ్మెత్తి పోసి అతడిమీద ఊసి వెర్రివాడిలా ప్రవర్తించాడు. మరుత్తు కోపించక అతడిని వెంబడించాడు. నిర్జనప్రదేశానికి చేరుకున్న ఆ వెర్రివాడు ఒక వటవృక్షం కింద కూర్చున్నాడు. మరుత్తు అతడికి సాష్టాంగ నమస్కారం చేసి వినయంగా నిలిచాడు. **సంవర్తనుడు** " ఓయీ ! నిన్ను ఎవరు పంపారు. నువ్వు చెప్పింది నిజమైతే నీ కోరిక నెరవేరుతుంది. లేకున్న నీ తల వెయ్యిముక్కలు ఔతుంది " అని అన్నాడు. మరుత్తు " అయ్యా నాకు మీ గురించి నారదుడు చెప్పాడు " అనిచెప్పాడు. సంవర్తనుడు " ఇప్పుడు ఆ నారదుడు ఎక్కడ ఉన్నాడు " అని ఆడిగాడు. మరుత్తు " మహాత్మా ! నన్ను మీవద్దకు వెళ్ళమని చెప్పి నారదుడు అగ్నిప్రవేశం చేసాడు " అని చెప్పాడు. సంవర్తనుడు " ఇప్పుడు నీవు వచ్చిన పని ఏమిటి ? " అని అడిగాడు. మరుత్తు " మహాత్మా ! మీరు నేను చేయబోయే యజ్ఞముకు ఉపద్రష్టగా ఉండి యజ్ఞమును పూర్తిచేయండి " అని అర్థింస్తూ " మహాత్మా ! నా పేరు మరుత్తు. మా తాత కరంధముడు. మీ తండ్రి అంగీరసుడు మా తండ్రికి ఉపద్రష్టగా ఉండి అనేక యజ్ఞములు చేయించాడు " అని చెప్పాడు. అప్పుడు మరుత్తు ముఖంలోకి ప్రీతితో చూస్తూ సంవర్తనుడు " మరుత్తు మహారాజా ! నీ గురించి నీవు చెప్పావు కదా ! ఇక నా గురించి చెప్తాను విను. నేను మా అన్న బృహస్పతి చేత అవమానించబడి నా ఇంటిని, సంపదను, అన్నను వదిలి ఇలా అడవుల వెంట విరాగిగా తిరుగుతున్నాను. నాబోటి పేదవాడు నీకు ఉపద్రష్టగా ఉంటే నీకు ఏమి గౌరవం ఉంటుంది. కనుక బృహస్పతిని ఉపద్రష్టగా ఉంచుకుని యాగమును పూర్తి చేసుకో. అలా కాకుండా నన్నే ఉపద్రష్టగా చేసుకోవాలంటే నీవు మా అన్నవద్ద అనుమతి తీసుకోవాలి. నాకు మా అన్న అంటే విపరీతమైన గౌరవం ఉంది " అన్నాడు. మరుత్తు " మహాత్మా ! నేను మీ వద్దకు వచ్చే పూర్వమే మీ అన్నను ఉపద్రష్టగా ఉండమని కోరాను. కాని అతడు నన్ను అవమానిస్తూ " దేవతలకు ఉపద్రష్టగా ఉన్న నేను మానవులకు ఉపద్రష్టగా ఉండలేను అని నన్ను తిప్పి పంపాడు. ఇప్పుడు నేను తిరిగి ఎలా బృహస్పతి వద్దకు వెళ్ళగలను " అని అన్నాడు. సంవర్తనుడు " సరే నేను నీకు ఉపద్రష్టగా ఉండి యాగము చేయిస్తాను. కాని ఏకారణంగా నైనా యాగము నీ భగ్నం అయినచో నేను నిన్ను శపించి నీకుకీడు కలిగించగలను. కనుక జాగ్రత్తవహించి యజ్ఞకార్యములు నిర్వహించు. నేను నీకు ఉపద్రష్టగా వ్యవహరిస్తున్నానని నా అన్నకు తెలిస్తే అతడు నిన్ను ద్వేషించి యజ్ఞముకు భంగంకలిగించి నిన్ను నా శాపానికి గురి చేయగలడు. కనుక జాగ్రత్తవహించడం మంచిది " అని చెప్పాడు. మరుత్తు " మహాత్మా ! నాకు నీ కృప లభించింది. నా కిక విచారములేదు. దేవేంద్రుడు, ఇంద్రుడే కాదు పరమేశ్వరుడే అడ్డువచ్చినా నేనిక చలించను. నేను నాప్రయత్నంలో విఫలమైతే సూర్యుడు, చంద్రుడు ఉన్నంత కాలం నాకు పుణ్యలోకాలు ఉండవు " అని శపథం చేసాడు. సంవర్తనుడు " మరుత్తు మహారాజా నేను నిన్ను ఆ మహేంద్రుడి కంటే ధనవంతుడిని చేసి నీ చేత యజ్ఞము చేయిస్తాను " అన్నాడు.

## మరుత్తుని ధనవంతుని చేయుట

సంవర్తనుడు తిరిగి " మరుత్తుమహారాజా నేను నిన్ను మహేశ్వరుని కంటే ధనవంతుని ఎలా చేయగలనని అనుకుంటున్నావు కదా ! నేను చెప్పేది శ్రద్ధగావిను. హిమాలయాలకు ఉత్తరభాగాన ఉన్న **ముంజవంతం** అనే పర్వతం ఉంటుంది. అక్కడ శివుడు, పార్వతితో కలసి దేవతలు, సిద్ధులు, గరుడులు, గంధర్వులు మొదలైన వారితో చేరి విహరిస్తుంటారు. అక్కడ ఆకలి

దప్పులూ రోగాలు మొదలైనవి ఉండవు. అప్పుడు పూలుపండ్లు సమృద్ధిగా ఉంటాయి. ఆ కొండమీద బంగారు కొండలు బంగారు ఇసుక పుష్కలంగా లభిస్తుంది. మనం అక్కడకు పోయి శివపార్వతులను ప్రార్ధించి వారి కరుణతో బంగారురాళ్ళను ఇసుకను తీసుకు వస్తాము. రాజా నీవు సేవకులను సిద్ధం చేసుకో. ఎంత మందిని తీసుకు వెడితే అంత సంపదను తీసుకురావచ్చు " అని చెప్పాడు. సంవర్తనుడిని తీసుకువెళ్ళి మరుత్తు ఆ పర్వతం వద్దకు తీసుకు వెళ్ళి పార్వతీ, పరమేశ్వరులను ప్రార్ధించి ఆయన కరుణతో అంతు లేని సంపదలను తీసుకుని నగరానికి వచ్చారు. ఆవిధంగా మరుత్తు ధనవంతుడై యజ్ఞ వాటిక మొదలు సమస్తసామాగ్రి బంగారముతో చేయించి మహా విభవంతో యజ్ఞం ప్రారంభించాడు.

## బృహస్పతి చింత

ఇది గమనించిన బృహస్పతి తనలో తాను కృంగి కృశించి పోతున్నాడు. దేవేంద్రుడు ఇది గమనించి " గురువర్యా ! దేవతలకు గురువై ఉండి కూడా మీరిలా ఎందుకు శోకిస్తున్నారు. ఇందుకు కారణమైన వారు ఎవరో చెప్పినట్లైన వారిని నేను కఠినంగా శిక్షిస్తాను " అన్నాడు. బృహస్పతి " దేవేంద్రా ! మరుత్తు చేసే యజ్ఞానికి నా విరోధి అయిన **సంవర్తనుడు** ఉపద్రష్టగా ఉన్నాడు. అతడు ఉపద్రష్టగా ఉండి యజ్ఞము చేయిస్తున్నందుకు నా మనస్సు చాలా చింతిస్తుంది. అతడిని ఎలాగైనా ఉపద్రష్టగా ఉండకుండా నిరోదించాలి " అని చెప్పాడు. ఇంద్రుడు అగ్నిదేవుడిని పిలిచి " మరుత్తు ఒక యజ్ఞము చేస్తున్నాడు. నీవు ఎలాగైనా మరుత్తును ఆ యజ్ఞముకు బృహస్పతిని ఉపద్రష్టగా ఉంచమని నా మాటగా చెప్పి అంగీకరించ చేయాలి " అన్నాడు. అగ్నిదేవుడు అందుకు అంగీకరించి మరుత్తు వద్దకు తన నిజస్వరూపంతో వెళ్ళాడు. మరుత్తు అగ్ని దేవుడికి అర్ఘ్యపాద్యాలు ఇచ్చి సత్కరించాడు. అగ్నిదేవుడు మరుత్తుతో " మరుత్తు మహారాజా ! నన్ను దేవేంద్రుడు నీ వద్దకు దూతగా పంపాడు. బృహస్పతి నీ యజ్ఞానికి యాజకత్వం వహించడానికి అంగీకరించాడు. అందు వలన నీవు మానుష్యత్వం వీడి దేవత్వం పొంద వచ్చు. కనుక నీవు బృహస్పతిని యాజకుడిగా చేసి యజ్ఞము నిర్వహించాలని ఇంద్రుడు తన మాటగా చెప్పమన్నాడు " అని చెప్పాడు. మరుత్తు " అగ్నిదేవా ! దేవగురువు బృహస్పతికి శతకోటి నమస్కారాలు. నేను చేయబోవు యజ్ఞానికి యాజకుడిగా ఉండమని చెప్పినప్పుడు ఆయన నన్ను మానవుడినని చులకన చేసి నిరాకరించాడు. నేను తరువాత కష్టపడి బృహస్పతి తమ్ముడిని అతిప్రయాసతో నేను చేయబోవు యజ్ఞానికి యాజకుడిగా ఉండడానికి సమ్మతిపచేసి యజ్ఞముకు కావలసిన ఏర్పాట్లు చేస్తున్నాను. అందుకు సంవర్తనుడు సమర్ధుడని నమ్ముతున్నాను " అన్నాడు. అగ్నిదేవుడు " మరుత్తూ ! దేవగురువు నీకు యాజకుడిగా ఉంటే నీకు దేవేంద్రుడు అంతు లేని పుణ్యలోక ప్రాప్తి కలిగిస్తాడు కదా ! " అన్నాడు. ఈ మాటలను సావధానంగా విన్న సంవర్తనుడు " అగ్నిదేవా ! నీవింకా ఇలా మాట్లాడుతుంటే నేను నిన్ను నా కంటి చూపుతో కాల్చివేస్తాను " అని ఆగ్రహముతో అన్నాడు. ఆ మాట్లకు అగ్నిదేవుడు భయపడి దేవేంద్రుని వద్దకు తిరిగి వెళ్ళి " దేవేంద్రా ! నీ మాటగా నేను మరుత్తుకు బృహస్పతిని యాజకుడిగా చేసుకొమ్మని చెప్పాను. కాని మరుత్తు ఇప్పటికే బృహస్పతి తమ్ముడైన సంవర్తనుడిని యాజకునిగా నియమించి యజ్ఞానికి సన్నాహాలు చేసుకుంటున్నాడు. అందువలన బృహస్పని యాజకుడిగా అంగీకరించ లేనని చెప్పాడు. నే బలవంత పెట్టడానికి ప్రయత్నించడం చూసిన సంవర్తనుడు ఆగ్రహించి నన్ను భస్మం చేస్తానని చెప్పాడు. అందుకని నేను భయపడి నీ వద్దకు తిరిగి వచ్చాను " అని చెప్పాడు. ఇంద్రుడు " అగ్నిదేవా ! నీవు తిరిగి వెళ్ళి మరుత్తును ఎలాగైనా నయానా భయానా బృహస్పతి యాజకత్వానికి ఒప్పించు. అలా ఒప్ప కోక పోతే నా వజ్రాయుధాన్ని ప్రయోగించి అతడిని యమసదనానికి పంపుతానని బెదిరించు " అని చెప్పాడు. అగ్నిదేవుడు " దేవేంద్రా ! నాకు తిరిగి వెళ్ళలంటే భయంగా ఉంది. సంవర్తనుడు నన్ను సంవర్తనుడు భస్మం చేస్తాడని భయపడుతున్నాను. కనుక నా బదులుగా వేరెవరినైనా పంపు " అన్నాడు. ఇంద్రుడు " అగ్నిదేవా ! అందరిని భస్మం చేయగల నిన్ను వేరొకరు భస్మం చేయడమేమిటి ? " అన్నాడు. అగ్ని దేవుడు " దేవేంద్రా ! అలా అంటావేమిటి. నీకు యోగశక్తి తెలియనిదా ! **వృత్తాసురుడు** నిన్ను ఓడించి నీ సింహాసనం ఆక్రమించిన విధానం మరిచావా. అశ్వినీదేవతలకు సోమపానం లేదని నీవు నిరాకరించినప్పుడు చ్యవనుడు నిన్ను పెట్టిన బాధలు అప్పుడే మరిచావా. **చ్యవనుడు** నీ వజ్రాయుధాన్ని తిప్పికొట్టలేదా ! నీవు విధిలేకనే కదా **అశ్వినీదేవతలకు** సోమపాన అర్హత కలిగించావు . కనుక దేవతలబలం కంటే బ్రాహ్మణుల బలం గొప్పది కదా !" అని చెప్పాడు.

## గంధర్వుడైన ధృతరాష్ట్రుడిని దూతగా పంపుట

ఇంద్రుడు ఇక గత్యతరం లేక అగ్నిదేవుడిని వదిలి ధృతరాష్ట్రుడు అనే గంధర్వుడిని మరుత్తు వద్దకు పంపాడు. ఇంద్రుడు " ధృతరాష్ట్రా ! నీవు మరుత్తు వద్దకు పోయి అతడు చేయు యజ్ఞముకు బృహస్పతిని యాజకుడిగా పెట్టుకొమ్మని నా సందేశంగా చెప్పు. ఈ విషయం నీవు సంవర్తనుడి సమక్షంలో చెప్పు " అని గంధర్వుడైన ధృతరాష్ట్రుడికి చెప్పాడు. ధృతరాష్ట్రునికి ముందు జరిగిన విషయమేది తెలియదు. ధృతరాష్ట్రుడు మరుత్తు వద్దకు వెళ్లి " ఓరాజా ! నీవు యాగముకు బృహస్పతిని యాజకుడిగా నియమించమని దేవేంద్రుడి ఆజ్ఞ. ఇలా చేస్తే దేంద్రుడు సంతోషిస్తాడు లేకున్న తన వజ్రాయుధాన్ని నీ పై ప్రయోగించగలడు " అనిచెప్పాడు. మరుత్తు " గంధర్వరాజా ! ముందుగా నేను చేయు యజ్ఞానికి యాజకత్వను వహించమని బృహస్పతిని

కోరాను. కాని ఆయన నేను మానవుడినని హేళన చేసి యాజకత్వం చేయ నిరాకరించాడు. తరువాత నేను అతిప్రయాస మీద సంవర్తనుడిని యాజకత్వము చేయమని అభర్ధించి ఒప్పించాను. ఇప్పుడు నేను సంవర్తనుడిని కాదని బృహస్పతిని యాజకుడిగా పెట్టుకుంటే నేను మిత్రద్రోహిడుని కాదా ! జరిగిన విషయం ఇంద్రుడికి తెలుసు. సిద్ధులకు సాధ్యులకు తెలుసు " అని అంటూ ఉండగానే ఇంద్రూడు ప్రయోగించిన వజ్రాయుధం మురుత్తువైపు దూసుకుని వచ్చింది. ధృతరాష్ట్రుడు " రాజా ! అటుచూడు వజ్రాయుధం నీ మీదకు దూసుకు వస్తుంది. దానిని ఎలా ఎదుర్కుంటావో నీ ఇష్టం " అన్నాడు. అప్పుడు సంవర్తనుడు చిరునవ్వు నవ్వి " రాజా ! భయపడకు. నా సంస్థంభన విద్యతో వజ్రాయుధాన్ని తిప్పికొడతాను. ఒక్క వజ్రాయుధాన్నే కాదు. దేవతలు ప్రయోగించే ఏ ఆయుధాన్నైనా నేను నా సంస్థంభన విద్యతో తిప్పికొట్టగలను " అని సంవర్తనుడు చెప్పాడు. ఇంతలో తన వైపు వస్తున్న వజ్రాయుధాన్ని చూసి " మహాత్మా ! నన్ను ఈ వజ్రాయుధం భారి నుండి రక్షించండి " అని వేడుకున్నాడు. సంవర్తనుడు మహారాజా ! నీవిక వజ్రాయుధాన్ని గురించి మరచి పోయి ఏదైనా వరాన్ని కోరుకో " అన్నాడు. మరుత్తు " మహాత్మా ! మీరుండగా నాకు ఇంద్రుడి వలన భయంలేదు. మీ తపోశక్తితో ఇంద్రుడికి నా మీదున్న కోపమును పోగొట్టి దెవేంద్రుడు దిక్పాలకాది దేవతలతో యజ్ఞానికి విచ్చేసి నేను సమర్పించు హవ్యమును స్వీకరించి నాకు పుణ్యలోకప్రాప్తి కలిగించండి " అని కోరాడు. సంవర్తనుడు నా ఆహ్వానం మీద దేంద్రుడు సోమపానం చేయడానికి వస్తాడు. అతడితో దేవతలందరూ వస్తారు. ఇక నీవు యజ్ఞాన్ని మొదలు పెట్టు " అన్నాడు.

## యజ్ఞ పరిసమాప్తి

**సంవర్తనుడు** వజ్రాయుధాన్ని అంతదూరంలో ఆపి దానిని తిరిగి ఇంద్రుని వద్దకు తిప్పి పంపాడు. ధృతరాష్ట్రుడిని సగౌరవంగా పంపించాడు. తరువాత సంవర్తనుడు దేవతలను ఆవాహన చేసి ఆహ్వానించాడు. దేవతలు సంవర్తనుడి ఆహ్వానం అందుకుని యజ్ఞానికి విచ్చేసారు. మరుత్తు సంవర్తనుడి ఆజ్ఞమీద దేవేంద్రాది దేవతలను సగౌరవంగా ఆహ్వానించి అర్ఘ్యపాద్యములు ఇచ్చి సత్కరించాడు. వారికి ఆసనాలు సమర్పించి " చేతులు జోడించి " దేవేంద్రా ! నా ఆహ్వానాన్ని మన్నించి నీవు దేవతలతో చేరి నా గృహముకు విచ్చేసి నా జన్మసఫలం చేసావు. దయాసాగరా నా అందు కోపం మానుకుని కరుణించి నన్ను చల్లగాచూడు " అని అని తిరిగి " దేవేంద్రా ! ఈ మహాత్ముడు బృహస్పతికి స్వయానా తమ్ముడు. మహా తపస్వి. నా అభ్యర్ధన మన్నించి నేను చేస్తున్న యజ్ఞానికి యాజకత్వం వహిస్తున్నాడు " అని చెప్పాడు. దేవేంద్రుడు " మరుత్తు మహారాజా ! నీ వలన నేను ప్రీతి చెందాను. బృహస్పతికి తమ్ముడైన ఈ సంవర్తనుడు మహిమాత్వితుడని చెప్పడంలో సందేహము ఏముంది " అన్నడు. సంవర్తనుడు " దేవేంద్రా ! నేను పిలువగానే యజ్ఞముకు విచ్చేయడం నా తపఃఫలం కాక మరేమిటి ? నీ రాకతో మరుత్తు చేస్తున్న ఈ క్రతువు పుణ్యాలరాశి అయింది. కరుణాతరంగా ! నీ దయ నా మీద ప్రసరింప చేసిన ఈ యజ్ఞము మంత్రలోపం లేకుండా నిర్వహిస్తాను. నీవు దయతో వీక్షించు. నీ రాకతో మరుత్తు పుణ్యలోక అర్హత పొందాడు " అన్నాడు. సంవర్తనుడి ప్రశంశలకు మహదానంద భరితుడైన దేవేంద్రుడు " దేవతలారా ! ఈ యజ్ఞవాటికను ఉదాత్తంగా తీర్చిదిద్దండి. గంధర్వులను అప్సరసలను పిలిచి నృత్యసంగీత కార్యక్రమాలు ఏర్పాటు చేయండి. ఈ యజ్ఞము నిర్విఘ్నంగా జరిగే ఏర్పాటు చేయండి " అని ఆజ్ఞాపించాడు. సంవర్తనుడు యజ్ఞమును చక్కగా నిర్వహించి దేవతలకు సోమపానం అందించాడు. దేవతలంతా సోమపానం స్వీకరించి సంతుష్టులు అయ్యారు. వారంతా మరుత్తు వీడ్కోలు అందుకుని స్వర్గలోకం చేరారు .

## బ్రాహ్మణులు మరుత్తు ఇచ్చిన దానములు

దేవతలు యజ్ఞముకు వచ్చి సోమరసపానము చేసి వెళ్ళిన తరువాత కూడా యజ్ఞము కొనసాగింది. యాగము పూర్తికాగానే మరుత్తు బ్రాహ్మణులకు అపారంగా దానధర్మాలు చేసారు. అంతే కాక ఆ యజ్ఞ నిర్వహణకు వాడిన బంగారు పాత్రలు కలశములు కూడా బ్రాహ్మణులకు దానంగా ఇచ్చాడు. తరువాత సంవర్తనుడి ఆజ్ఞ మేరకు జనరంజకంగా పాలన సాగించాడు. కాని బ్రాహ్మణులకు ఒక చిక్కువచ్చి పడింది. వారు దానంగా పొందిన బంగారమును మోసుకు వెళ్ళ లేక వారి జీవనముకు కావలసినంత బంగారము మాత్రం వెంట తీసుకుని మిగిలినది బంగారు కళశలలో భద్రపరచి " ఈ నిధిని భవిష్యత్తులో ఎవరు కనుక్కుంటారో వారికి ఈ నిధి స్వంతం ఔతుంది " అని శాసనం వ్రాసిపెట్టి పోయారు. ధర్మనందనా ! నీవు ఆనిధిని స్వాధీన పరచుకుని అశ్వమేధ యజ్ఞమును నిర్వహించ వచ్చు " అని వ్యాసుడు చెప్పాడు.

## శ్రీకృష్ణుడు ధర్మజుని దుఃఖోపశనుడిని చేయుట

వ్యాసుడు అశ్వమేధ యజ్ఞానికి కావలసిన ధనము సమకూర్చుకునే మార్గం చెప్పినా ధర్మరాజుకు శోకము తగ్గ లేదు. అది చూసి శ్రీకృష్ణుడు " ధర్మనందనా ! వ్యాసుడు చెప్పిన తరువాత కూడా నీవిలా చింతించ తగదు. ఏపని అయినా నిశ్చింతగా నిర్మలంగా చెయ్యాలి కాని ఇలా చింతించడం తగదు. ఇప్పటివరకు బోధించిన జ్ఞానం ఏమైంది. నీకింకా కామ, క్రోధ, మద,

మాత్సర్య, మోహాలు తగ్గినట్లులేదు. ఇక నీ ఆలోచనలు కట్టి పెట్టి యాగనిర్వహణ చేపట్టు. నీ దుఃఖమును ఉపశమించడానికి నీకు నేను ఒక వృత్తాంతం చెప్తాను. **వృత్తాసురుడు** దేవలోకమును జయించి భూలోకమును కూడా జయించి భూలోకముకు సహజముగా ఉండే వాసనను లాగి వేసాడు. అప్పుడు ఇంద్రుడు తన వజ్రాయుధమును ఇంద్రుడి మీద ప్రయోగించాడు. అప్పుడు వృత్తాసురుడు భూమిని విడిచి ఆకాశము, వాయువు, జలము, తేజస్సులో ప్రవేశించాడు. వృత్తాసురుడు నీటి నుండి రసమును, అగ్ని నుండి రూపమును, వాయువు నుండి వాసను, ఆకాశము నుండి శబ్దమును లాగి వేసాడు. అలా పంచభూతముల లోని తన్మాత్రలను తన వశము చేసుకుని ప్రచండవిక్రమంతో వృత్తాసురుడు విజృంభించాడు. ఇంద్రుడు తిరిగి తన వజ్రాయుధమును వృత్తాసురుడి మీద ప్రయోగించాడు. వృత్తాసురుడు పంచ భూతములను వదిలి ఇంద్రుడిలో ప్రవేశించాడు. ఆ దెబ్బకు ఇంద్రుడు మూర్చితుడయ్యాడు. వశిష్ఠుడు తన మంత్రశక్తితో ఇంద్రుడి మూర్చను పోగొట్టాడు. ఇంద్రుడు తనలో ప్రవేశించిన వృత్తాసురుడిని వజ్రాయుధము ప్రయోగించి నాశనం చేసాడు. ఇదంతా రహస్యంగా జరిగినా ఇంద్రుడు దీనిని మునులకు చెప్పాడు. మునులు నాకు చెప్పారు. కనుక ధర్మనందనా ! అంతఃశత్రువులను ఆ విధంగా నిర్మూలించాలి.

## మనసును నిర్మలపరచుకునే మార్గం

శ్రీకృష్ణుడు ఇంకా ఇలా చెప్పసాగాడు. వ్యాధులు రెండు విధములు. ఒకటి శారీరకము రెండవది మానసికము. శరీరానికి వాతపిత్త శ్లేష్మములు సమపాళ్ళతో ఉన్నప్పుడే ఆరోగ్యము సమంగా ఉంటుంది. ఏది వికటించినా శరీరం రోగగ్రస్థమౌతుంది. అలాగే మనసు సత్వ, రజో, తామస గుణాలతో ప్రకాశిస్తుంది. త్రిగుణాలను అదుపులో ఉంచినప్పుడే మనసు ప్రశాంతంగా ఉంటుంది. లేని ఎడల మనసు అస్తవ్యస్థమౌతుంది. శరీరవ్యాధులు మానసికవ్యాధి ఏ ఒక్కటి ఒంటరిగా రావు. ఒక దానితో ఒకటి అనుబంధమై వస్తాయి. శరీర మనసులు వ్యాధిగ్రస్థమైనప్పుడు అది గడ్డుకాలమే. దానినే కర్మానుష్ఠానం అంటారు. దానిని నీవింకా అభ్యాసం చెయ్యలేదు కనుక అది నీకింకాతెలియదు. కనుకనే నీవిలా ప్రవర్తిస్తున్నావు. ప్రస్థుతం నీకు శరీరము, మనసు అశ్వస్థంగా ఉన్నాయి కనుక నీవిలా ప్రవర్తిస్తున్నావు. వాతపిత్త కఫాలు, త్రిగుణాలు చెరి ఒక వైపు లాగుతున్న సమయంలో నీవిక స్వస్థుడివై ఉండ లేవు కదా ! ఏకవస్త్ర అయిన ద్రౌపదిని సభకీడ్చి వలువలు ఊడ్చి అవమానించిన విషయం నీ మనసు నుండి తీసి వెయ్యి, పన్నెండేళ్ళు అడవులలో నీ తమ్ములు భార్యతో కలసి ఇడుములు అనుభవించిన విషయం మనసును నుండి తుడిచిపెట్టు. జటాసురుడు, **సైంధవుడు** పెట్టిన బాధలు గుర్తుచేసుకోకు, విరాటనగరంలో అనుభవించిన కష్టాలు అవమానాలు మరచిపో, కర్ణుడు, ద్రోణుడు, భీష్ముడితో యుద్ధము చేయ లేదని అనుకో. అసలు యుద్ధమే జరగలేదనుకో. ఇప్పుడిక యుద్ధము వలన కలిగిన మేలుకాని కీడు కాని నీ మనసులో ఉండవు.

## అసలైన యుద్ధము

శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇంకా ఇలా చెప్పాడు. అసలు అది యుద్ధముకాదు మిధ్య అని ఎందుకు అన్నానంటే నిజమైన యుద్ధము గురించి చెప్తాను విను. కౌరవులు నీ శత్రువులు కాదు నీకు నిజమైన శత్రువు నీ మనసే. నీ మనసు కౌరవులు నీ శత్రువులు అని చెప్పినందు వలన నీవు వారు నీ శత్రువులు అని అనుకుని వారితో యుద్ధం చేసావు. నీకు నిజమైన స్నేహితుడు నీ ఆత్మే. నీ మనస్సే మిత్రుత్వానికి శత్రుత్వానికి కారణం. మనసు ప్రశాంతంగా ఉంచుకుంటే అంతా ప్రశాంతంగా ఉంటుంది. కనుక నీవు నీ అంతఃశత్రువులను జయించి మనసును నీవు ప్రశాంతంగా ఉంచుకుంటే అంతాప్రశాంతంగా ఉంటుంది. అది చేయక నీవు అంతఃశత్రువులను జయించలేక ఇలా మధనపడి దుఃఖించడం వలన ప్రయోజనం ఏమిటి ? ఇక నీవు నీ బుద్ధిని ఉపయోగించి సన్మార్గమున పయనించు. ధర్మనందనా ! మృత్యువు అనేది రెండక్షరములు బ్రహ్మము అనేది మూడక్షరాలు. అలాగే మమ అంటే నేను. నమమ అంటే నేను కాదు. ఈ రెండింటి నడుమ నిత్యము పోరు జరుగుతూనే ఉంటుంది. **బ్రహ్మము** అంటే పుట్టుక మృత్యువు అంటే చావు. ఈ రెండింటికీ నడుమ కనపడని యుద్ధం నిత్యము జరుగుతూనే ఉంటుంది. పుట్టిన వాడిని ఎలా చంపాలా అని మృత్యువు ఎదురు చూస్తూ ఉంటుంది. మరణించిన వాడిని ఎలా పుట్టించాలా అని బ్రహ్మము ప్రయత్నిస్తుంటాడు. ఆత్మ ఈ రెండింటికి అతీతమైనది . దానికి నాసనము లేదు. ఆత్మకు శరీరానికి సంబంధం లేదు. ఆత్మ నాశనం లేనిది. శరీరము అశాశ్వతం అయినది. శరీరానికి ఉండే నాశనత్వం, పరిమితత్వము ఆత్మకు లేవు. ఆత్మ అఖండము. ఈ భూమిని పాలించే రాజులకు ఈ భూమి మీద మమకారము లేక దానిని ఇంకా పాలించాలన్న కోరిక వదిలినప్పుడు వారికి ఏ పాపం అంటదు. అలాగే సర్వముత్యజించిన సన్యాసికి అడవులలో కందమూలములను భుజిస్తున్నా ప్రాపంచిక సుఖముల మీద, భోగముల మీద ఆశచావక ఉంటే అతడు అడవులలో ఉండీ ప్రయోజనం లేదు. అలాంటి వాడు సదామృత్యువుకు చేరువలో ఉన్నాడని తెలుసుకో. ధర్మనందనా ! నీవు యుద్ధంలో శత్రువులను జయించావని అనుకుంటున్నావు. కాని అది గెలుపు కాదు. నీవు నీ అంతఃశత్రువులను గెలిచినప్పుడే అది నిజమైన గెలుపు ఔతుంది.

## అంత:శత్రువులు

అంతశత్రువులలో ప్రధముడు కాముడు. కామము అంటే కోరిక. ఈ ప్రపంచంలో కోరిక లేనిది ఏ కార్యము లేదు. జపము, తపము, వేదవేదాంగ పఠనము, శాస్త్రపఠనం, దానధర్మాలు వంటి సమస్త కర్మలు కామముతో ముడి పడి ఉంటాయి. ఎవరూ నిష్కామంగా కర్మ చెయ్యరు. ఆ కాముడు ఒకసారి " నాకు దగ్గరగా నా ప్రభావంతో ఉన్నవాడు ఎవ్వరూ నన్ను జయించలేరు. నన్ను జయించాలని అనుకుంటే వేదములను తెలుసుకోవాలి. నన్ను వేదజ్ఞానముతో మాత్రమే జయించగలరు. నన్ను హతమార్చాలని ఎవరు నన్ను తలచుకుంటూ ఉంటారో నేను అతడి వెంట అతడికి తెయకనే ఉంటాను. కనుక నన్ను అలాంటి వారు ఎన్నటికీ జయించలేరు. కోరికను జయించాలని ఒకడు తపస్సు చేస్తాడు. కోరికలను జయించాలని అనుకోవడమూ ఒక కోరికే ఇక నన్ను జయించడమేమిటి ? మోక్షగామికి కూడా మోక్షము కావాలన్న కోరికను నేనే కనుక నన్ను జయించడమన్నది అసాధ్యం " అన్నాడు. కనుక ధర్మనందనా ! ఏపనైనా నేను చెయ్యాలి దీని వలన నాకు లాభంకావాలి అని కోరిక పెట్టుకోకుండా చెయ్యడం, చేసే పనిని అపారమైన శ్రద్ధతో చెయ్యడం, అడవులకు వెళ్ళి తపస్సు చేసే సమయంలో కూడా నాకు మోక్షం కావాలని కోరక లేక తపస్సు చేయడం, చివరకు మోక్షం కావాలన్న కోరిక కూడా లేక ఉండడం ఇలాంటి లక్షణములతో కోరికను జయించ వచ్చు. ఇలా ఉండడం సామాన్య మానవులకు అసాధ్యం కనుక కాముడు తనను ఎవరూ జయించలేరని ప్రకటించు కున్నాడు. ఇక మాటలతో పని లేదు. నీలోని కాముని అంపివేసి నిర్వికారంగా నిష్కామంగా యాగమును నిర్వహించిన నీకు పుణ్యలోకప్రాప్తి కలుగుతుంది. అప్పుడు కాముడే నీకు సాక్షిగా ఉంటాడు. అయినా ధర్మనందనా ! నీవు ఎంత ఏడ్చినా పోయినవారు తిరిగి రారుకదా ! కనుక వారిని మరచిపో. కలలో కూడా వారినిక తలవకు. వారి కొరకు దు:ఖించడం మాని విరివిగా యజ్ఞయాగాదులు నిర్వహించి ఈ లోకాన్ని మెప్పించు. నీకు పుణ్యలోకప్రాప్తి కలుగుతుంది " అన్నాడు.

## ధర్మజుడు ఊరడిల్లుట


దుఖితుడైన ధర్మరాజుని ఓదార్చుతున్న నారదుడు

తరువాత వ్యాసుడు, నారదుడు, **దేవస్థానుడు** తమకు తోచిన హితవచనాలు చెప్పారు. **భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు, ద్రౌపది** కూడా తగిన హితవచనాలు పలికారు. ధర్మరాజుకు అప్పుడు దు:ఖోపశమనం కలిగింది. అశ్వమేధయాగము చేయడానికి అంగీకరించి మునులకు వీడ్కోలు పలికి యుద్ధములో బంధుమిత్రులను హతమార్చినదానికి ప్రాయశ్చితం చేసుకోవడానికి కొంతకాలం గంగాతీరాన ఉండాడానికి అనుమతి తీసుకున్నాడు. తరువాత వ్యాసమహామునుకి నమస్కరించి " మహాత్మా మీ దయ వలన నాకు నిధిరహస్యం తెలిసింది. మిమ్ము తోడ్కొని వెళ్ళి నిధిని స్వాధీనపరచుకుని యాగమును నిర్వహిస్తాను " అని చెప్పాడు. తరువాత ధృతరాష్ట్రుడితో కలసి భీష్ముడికి యధావిధిగా అంత్యక్రియలు నిర్వహించారు. తరువాత అనేక దానధర్మాలు చేసారు. కొన్ని రోజులపాటు అక్కడే ఉండి తరువాత ధృతరాష్ట్ర శ్రీకృష్ణాదులతో హస్థినాపురానికి చేరి నిర్మల మనస్కుడై ప్రజా పాలనలో నిమఙ్ఞమయ్యాడు. ఈ కధ వీంటున్న **జనమేజయుడు** భారత కధ అక్కడతో ముగిసింది అనుకుని వైశంపాయనుడిని " మహాత్మా ! ఆ విధంగా ధర్మరాజు ప్రజలను కన్నబిడ్డలవలె పాలిస్తుంటే శ్రీకృష్ణుడు అర్జునుడు ఏమి చేస్తున్నారో వివరించండి " అని అడిగాడు. **వైశంపాయనుడు** భారతకధను కొనసాగించి చెప్పసాగాడు.

## శ్రీకృష్ణారుజునులు

**వైశంపాయనుడు** " జనమేజయమహారాజా ! ధర్మరాజు అలా ప్రజారంజకంగా పాలిస్తున్న తరుణంలో శ్రీకృష్ణుడు, అర్జునుడు విలాసవంతంగా కాలంగడుపుతూ విహారయాత్రలు చేస్తున్నారు. అప్పడప్పడూ అర్జునుడు అభిమన్యుడిని గుర్తు చేసుకుని చింతాక్రాంతుడు ఔతున్నాడు. అప్పడంతా శ్రీకృష్ణుడు అర్జునుడిని ఓదారుస్తూ వచ్చాడు. మయసభ నిర్మాణం కాగానే జూదం జరిగింది వెంటనే పాండవులు అడవులకు వెళ్ళారు. ఇప్పడు పాండవులు రాజ్యాధికారం పొందారు కనుక ఇప్పడు మయసభను తనివి తీరా చూడడానికి శ్రీకృష్ణుడు అర్జునుడితో కలిసి మయసభను చూడడానికి వెళ్ళి మయసభను అణువణువునా చూసి ఆనందించారు. ఒకరోజు శ్రీ కృష్ణుడు అర్జునుడితో " అర్జునా ! భీముని బలపరాక్రమంతోనూ

నకులసహదేవుల విలువిద్యా కౌశలంతో నీ గాడీవంతో కౌరవులను గెలిచి ధర్మరాజు జనరంజకంగా రాజ్యపాలన చేస్తున్నాడు. మీ వంటి సోదరులు కలిగిన ధర్మరాజు కలిగిన ధర్మరాజు ఎంతటి ధన్యుడోకదా ! అర్జునా నేను ద్వారకను విడిచివచ్చి చాలా రోజులు అయింది. నాకు మా తండ్రి వసుదేవుడిని, మా తల్లి దేవకీదేవిని, నా అన్న బలరాముడిని చూడాలని కోరికగా ఉంది. మనము హస్తినకు పోగానే తగిన సమయము చూసి మీ ధర్మరాజుతో నా ద్వారక ప్రయాణం గురించి చెప్పు. మీ అన్న అనుమతి లేనిది నేను వెళ్ళలేను. ధర్మజుడు చెప్పినది వినడమే నా వ్రతము. తగిన సమయము చూసి ధర్మజుడి అనుమతి తీసుకుని ద్వారకకు వెడతాను " అని అన్నాడు. అర్జునుడు " అలాగే బావా. నేను తగిన సమయము చూసి అన్న ధర్మజుడికి చెప్తాను . కాని నేను నిన్ను ఒకవిషయము అడగాలి " అన్నాడు. శ్రీకృష్ణుడు " అర్జునా ! సందేహమెందుకు అడుగు " అనిన్నాడు. అర్జునుడు " కృష్ణా ! యుద్ధారంభమున నేను విషాదంలో కుంగిపోతూ ఈ యుద్ధము చేయలేనని చెప్పినప్పుడు నీవు నాకు కొన్ని విషయములు చెప్పావు. నేను యుద్ధము కారణంగా ఆ విషయాలను మనసులో నిలుపుకోలేక పోయాను. నాకు ఆ విషయాలు తిరిగి వినాలని ఉండి. చెప్పవా " అని అడిగాడు.

## బ్రహ్మవిద్య


కృష్ణునితో అర్జునుని ప్రశ్నోత్తరాలు

శ్రీకృష్ణుడు ఆమాటలకు పకపకా నవ్వుతూ అర్జునుడిని గట్టిగా హత్తుకుని " అర్జునా నీకు బుద్ధితత్వము బొత్తిగాతెలియదు. శ్రద్ధ అసలేలేదు. ఏపనికైనా ఏకాగ్రత అవసరం. బుద్ధి చేసే కార్యము మీద నిలిపి శ్రద్ధతో చేసిన కార్యము సఫలమౌతుంది " అంటూ సున్నితంగా మందలించాడు. " అర్జునా ! ఆరోజు నేను బ్రహ్మపదమును ఎలా అధిరోహించాలో చెప్పాను. నీవు శ్రద్ధ వహించని కారణంగా అవి నీ బుద్ధిలో నిలుపుకోలేక పోయావు. వాటిని నేను తిరిగి ఎలా చెప్పగలను. కాని నీకు ఆ విషయము అర్ధమయ్యేలా ఒకకథ చెప్తాను శ్రద్ధగా విను . ఒకసారి నా వద్దకు వచ్చిన ఒక బ్రాహ్మణుడిని నేను తత్వజ్ఞానమును ఉపదేశించమని అడిగాను. అప్పుడు ఆ బ్రాహ్మణుడు " కృష్ణా ! నేను ఒకసారి **కశ్యపుడు** అనే సిద్ధుడిని చూసాను. అతడు మహాజ్ఞాని, ఇంద్రియములను జయించిన వాడు. ఈ సంసారబంధాలను విడిచిన వాడు. అనేక మంది మహాత్ములచేత పూజలందుకున్న వాడు. నేను ఆయన వద్ద శిష్యరికం చేసాను. ఆయన నాకు చేసిన బోధలను నేను నీకు వినిపిస్తాను " అని చెప్పి నాకు వినిపంచాడు. అవి నేను నీకు చెప్తాను విను అర్జునా ! ఆసిద్ధుడు బ్రాహ్మణుడితో " బ్రాహ్మణోత్తమా ! నేను ఎల్లప్పుడు పుణ్యకార్యములే చేసాను. అందుకని నేను ఇహలోకసుఖాలే కాక పరలోకసుఖాలు కూడా అనుభవించాను. కాని ఒకేఒక తప్పుతో స్వర్గము చేజారిపోయి స్వర్గభ్రష్టుడిని అయ్యి తిరిగి మానవలోకములో జన్మించాను. కామక్రోధ అహంబావములకు లోనయి అనేకజన్మలు ఎత్తుతూనే ఉన్నాను. ఈ జన్మలలో నాకు ఎంతోమంది తల్లులు, తండ్రులు, సోదరులు, సోదరీమణులు, బంధువులు, మిత్రులు, శత్రువులు కలిసారు విడిపోయారు. ఎన్నో జాతులలో పుట్టాను. ఎంతో నరకబాధలు అనుభవించాను. ఎన్నో కష్టములు సుఖములు అనుభవించాను. ఎంతో శ్రమ, బాధలు అనుభవించాను. ఎంతమంది చేత మర్ధించబడ్డాను. ఎంతోమంది చేత చంపబడ్డాను ఎంతోమంది చేత బంధింపబడ్డాను. ఈ జనమరణాలతో విసిగిపోయాను. నాకిప్పుడు జ్ఞానోదయం అయింది. ఇప్పుడు నాకిక ఈ మనుషులతో సంబంధం లేదు. ఇప్పుడు నాకిక సుఖదు:ఖాలతో పని లేదు. ఇక నేనీ బంధములతో చిక్కుకొనక ఈ లోకమును సాక్షీభూతంగా చూస్తూ ఉంటాను. బ్రహ్మస్థితినిపొంది శాశ్వతబ్రహ్మపదమును పొందుతాను. ఇక ఈ జననమరణచక్రంలో ఇరుక్కోను బ్రాహ్మణోత్తమా నీ భక్తి శ్రద్ధలకు మెచ్చి నిన్ను నా శిష్యుడిగా స్వీకరించాను. నీవు నా దగ్గర ఏమేమి నేర్చుకోవాలని అనుకుంటున్నావో అది నేను నీకు నేర్పుతాను " అని అన్నాడు సిద్ధుడు.

### తత్వజ్ఞానము

అప్పుడు ఆ బ్రాహ్మణుడు " మహాత్మా ! నాకు పరతత్వము గురించి తెలియజేయండి " అని అడిగాడు. ఆ సిద్ధుడు పరతత్వము గురించి ఇలా చెప్పసాగాడు " ధర్మసాధనకు సాధనమైన ఈ శరీరాన్ని మానవుడు జాగ్రత్తగా కాపాడుకోవాలి. శరీరం రోగగ్రస్థం కాకుండా ఆరోగ్యంగా ఉండేలా చూసుకోవాలి. తగిన సమయాలలో మాత్రం సరైయిన ఆహారం తీసుకోవాలి. కాని కొంతమంది మానవులు వేళాపళా లేకుండా కంటికి కనిపించిందంతా ఇష్టం వచ్చినదంతా తింటూ ఉంటారు. మరికొంతమంది పుణ్యం వస్తుందని తలచి కఠోరనియమాలతో శరీరాన్ని శుష్కింప చేస్తుంటారు. ఇవి రెండూ శరీరానికి మంచివి కాదు. మరికొంత మంది సమయము లేదని సరిగా ఉడికీ ఉడకనివి, పుచ్చి పోయినవి, కుళ్ళిపోయినవి అని చూడక తినకూడనివి

తాగకూడనివి అని కూడా చూడక దేహానికి చెరుపు చేయాస్తాయని తెలిసీ తింటారు. మరికొంత మంది భుజించిన తరువాత కూడా మొహమాటం కొరకు వెంటవెంటనే తింటూతాగుతూ ఉంటారు. కొంతమంది తిన్నవెంటనే నిద్రకు ఉపక్రమిస్తారు. ఇలాంటివి చేసినప్పుడు శరీరంలో పిత్తవాతశ్లేష్మాలు అస్తవ్యస్తంగా మారిపోయి శరీరం వ్యాధిగ్రస్థం ఔతుంది. కొంతమంది తమశరీరానికి విరుద్ధమైన పనులు చేస్తూ ఉంటారు. ఉద్రేకాన్ని ప్రదర్శిస్తుంటారు. దాని వలన కూడా శరీరం రోగగ్రస్థం ఔతుంది. మరి కొంత మంది తీరని కోరికలతో సదా సతమతమౌతూ ఉంటారు. అందువలన కూడా శరీరం రోగగ్రస్థం ఔతుంది. అహారనియమాలు, మానసిక భావాల అసమానతలు శరీరాన్ని రోగగస్థం చేయడం కాక ప్రాణాంతకం అయి చివరకు మరణానికి దారితీస్తాయి.

## వాత పిత్త శ్లేష్మాలు

నీకు ఇక శ్లేష్మము గురించి చెప్తాను. శ్లేష్మము ఎక్కువ అవడం ఒక దోషము. అది ఏ అవయవము మీద తన ప్రభావాన్ని చూపితే ఆ అవయవము రోగగ్రస్థమై చివరకు అన్ని అవయవాలకు సోకి చివరకు మరణానికి దారితీస్తుంది. శ్లేష్మము గొంతుకు అడ్డుపడినప్పుడు శ్వాస ఆడక ఎగశ్వాస వచ్చి చివరకు **జీవుడు** శరీరాన్ని వదిలివేస్తాడు. మానవుడికి జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు మొత్తం పది ఉన్నాయి. వీటిని మనస్సు నియంత్రిస్తూ ఉంటుంది. బుద్ధివీటికి మంచిచెడు చెప్తుంది. వీటి నియంత్రణకు లోబడి ఇంద్రియములు తమకు కావలసిన సుఖములు అనుభవిస్తూ ఉంటాయి. ఎప్పుడైతే శరీరంలో శ్లేష్మము అధిక మైనప్పుడు ఇంద్రియములకు అది అడ్డుపడి వాటిని పనిచేయ నివ్వక వ్యాధికి మూలకారణమై మిగిలిన అన్ని అవయవముల పనులు ఆగిపోతాయి. తరువాతది వాతము. వాతము అంటే వాయువు. వాయువు శరీరం అంతా ప్రసరిస్తూ ఉంటుంది. మానవుని ఆహారనియమాల వలన దోషపూరితమైన వాయువు వ్యాధిని కలుగచేస్తుంది. వాత సంబంధిత వ్యాదులు క్రమంగా శరీరం అంతా వ్యాపిస్తాయి. నాలుకను చాపడం, చేతులు కాళ్ళు మడవడం చాపడం వంటి పనులను వాతము నియత్రిస్తుంటుంది. దోషపూరితమైన వాయువు ఆయా అవయవాలను పని చేయకుండా ఆపి వేస్తాయి. ఈ వాయువులు ఏక సమయంలో రెండు మూడు అవయవాలకు వ్యాపిస్తే దానిని సన్నిపాత వాతము అంటారు. అది మరణానికి దారి తీస్తుంది. వాతపిత్తశ్లేష్మములు అస్థవ్యస్థమై ఈ శరీరాన్ని రోగగస్థం చేసి చివరకు మరణానికి గురిచేస్తాయి. ఈ శరీరం నివసించడానికి యోగ్యం కానప్పుడు జీవుడు ఈ శరీరాన్ని వదిలి వెళ్ళి పోతాడు.

### ఊర్ధ్వలోకాలు

ఈ శరీరాన్ని వదిలిన **జీవుడు** తాను చేసిన కర్మల శేషాన్ని అనుభవించదనికి తిరిగి వేరు శరీరంలో ప్రవేశిస్తాడు. ఆ జన్మలో తాను పూర్వజన్మలో చేసిన పాపపుణ్య ఫలితంగా కష్టసుఖాలను అనుభవిస్తాడు. పామలు చేసిన కష్టాలు పుణ్యాలు చేసిన సుఖాలు అనుభవిస్తాడు. ఏ బంధనాలు లేని జీవుడు మోక్షమును పొందగలడు. పుణ్యకార్యములు, ధర్మకార్యాములూ చేసిన మానవుడు **సూర్యమండలం, చంద్రమండలం, నక్షత్రమండలం** వెడతాడు. అక్కడ వారు చేసిన పుణ్యము సుఖములుగా అనుభవించి పుణ్యము తీరగానే మానవ లోకంలో తిరిగి జన్మిస్తారు. కర్మశేషము లేని వారు మాత్రమే తిరిగిరాని మోక్షపదవిని పొందగలరు. మానవుడు గత జన్మలో చేసిన శుభాశుభములు మరుజన్మకు కారణం ఔతాయి. దానిని తప్పించుకోవడం ఎవరి తరము కాదు. స్త్రీపురుష సమాగమంతో తల్లి గర్భంలో పిండంగా ఏర్పడి శరీరధారి అయిన జీవుడు తొమ్మిది మాసముల గర్భవాసానంతరం ఈ లోకములో ప్రవేశించి తన గతజన్మల కర్మశేషాన్ని అనుభవిస్తాడు. మానవుడు జన్మరాహిత్యం పొందనంతకాలం ఇలా పుడ్తూ చస్తూ తిరిగి పుడుతూ మరలా చస్తూ సుఖదు:ఖాలను అనుభవిస్తూనే ఉంటాడు. మానవుడు మోక్షము పొందనంత కాలం జననమరణ చక్రభ్రమణం నుండి విముక్తి ఉండదు.

### ముక్తి

మోక్షము ఎలా వస్తుందో చెప్తాను. శమము, దమము కలిగి ఉండడం, దానాలు చేయడం, ధర్మ ప్రవర్తన కలిగి ఉండడం, బ్రహ్మచర్యం పాటించడం, పరుల సొమ్మును కాని పరుల భార్యను కాని ఆశించక ఉండడం, నియమ జీవితం గడపడం, ఇంద్రియ నిగ్రహం కలిగి ఉండడం, శుభ్రంగా ఉండడం, సత్యం పలకడం, పెద్దల ఎడ గురువుల ఎడ గౌరవం కలిగి ఉండడం, దేవతలను పితరులను పూజించడం, సదా శుభకార్యములు చెయ్యడం, ధైర్యంగా ఉండడం, క్రూరత్వం వదిలి పెట్టడంవంటి పుణ్యకార్యాలు చెయ్యాలి. ఆ పుణ్యకార్యాలను ఆధారం చేసుకుని మోక్షసాధనకు ప్రయత్నించాలి. ధర్మాచరణ అత్యంత ముఖ్యమైనది. ధర్మాచరణ గురువుల వద్ద పెద్దల వద్ద అభ్యసించాలి. గురువులను పెద్దలను అనుసరిస్తూ వారి హితవచనాలను శాంతవచనాలను వింటూ జీవితం దిద్దికుంటూ ధర్మాచరణ పాటిస్తూ అది ఒక వ్రతం మాదిరి పాటించాలి. ఇంద్రియములు నిగ్రహించి శాంతిమయ జీవితం సాగిస్తూ **పరబ్రహ్మ**ను అను నిత్యము భజించాలి. అటువాంటి మానవునికి

బ్రహ్మమే సముద్రాలు, ఋత్విక్కు, అగ్ని, యాగము , జలము, మంత్రం అతడు సదాబ్రహ్మము నందు చరిస్తూ ఆనందమయుడై ఉంటాడు. అతడిని కామము కాని మోహము కాని బాధించలేవు. క్రమంగా అతడికి సంసారము అందు విరక్తికలుగుతుంది.

### క్షరము అక్షరము

బ్రహ్మదేవుడు ముందుగా క్షరమును సృష్టించాడు. దానికి అతీతంగా అక్షరతత్వాన్ని సృజించాలి. అక్షరమే అమృతము. ఈ క్షరము అక్షరము జంటతోనే సృష్టియావత్తు ఉద్భవించింది. ఈ సృష్టికి బ్రహ్మ జననమరణాలను సృజించి నిరంతరం జనమరణ చక్రభ్రమణంలో తిప్పుతుంటాడు. ఇలా జనమరణ చక్రభ్రమణం చేస్తున్న మానవుడు తాను చేసిన పుణ్యకార్యముల వలన వివేకవంతుడై సుఖదు:ఖాలు సిరిసంపదలు ఈ దేహము అశాశ్వతమని తెలుసుకుంటాడు. నిరంతరం కర్మలు చెయ్యడం ఒక వ్యాధిగా భావించి కోరికలను మోహములను త్యజించి మోక్షము వైపు పయనిస్తాడు. తనకున్న పాపములను ప్రక్షాళన చేసుకుని మరలా సంసారచక్రంలో పడకుండా జాగ్రత్త వహిస్తాడు. పుట్టుక వ్యాధులు ముసలితనము మరణం జీవుని పరిణామాలని తెలుసుకుని వాటి కొరకు ఆరాటపడడం వ్యర్ధం తలచి మోక్షము కొరకు ప్రయత్నిస్తాడు. అప్పుడు అన్ని చింతలను వదిలి పెట్టి ఆలోచనలను కట్టి పెట్టి ఎవరి మీదా ఆధార పడకుండా ఒంటరియై చరిస్తాడు. భయమును వదిలి మనసును అదుపులో ఉంచి కోరికలను, కోపమును ఇంద్రియములను జయిస్తాడు. మానము అవమానము వంటి ధ్వందములను వదిలి వేస్తాడు. సర్వభూతములలో పరమేశ్వరుడిని ధ్యానిస్తూ ఆత్మజ్ఞానం పొందుతాడు. సుఖదు:ఖములను, కష్టసుఖాలను, ప్రేమద్వేషములను వీటిని సమంగా చూసినవాడు, ధర్మమును అధర్మమును, ఆశనిరాశల వంటి ద్వంధములను వదిలివేసిన వాడు, ధర్మార్ధకామములను వాదిలి మోక్షము కొరకు ప్రయత్నించిన వాడు, జరిగినది జరుగుతున్నది జరగబయేది వేటికీ తాను కర్తను కాదని తెలుసుకున్న వాడు మోక్షాపదవికి అర్హుడు. అది పంచభూతాత్మలకు అతీతముగా అతీతంగా ఏఆధారంగా లేక ఉంటుంది. అది నిర్గుణము పంచభూతగుణములకు అతీతంగా ఉంటుంది. ఆ మోక్షపదవికి నిరంతర సాధన అవసరం. మనసు ప్రశాంతంగా ఉంచుకుని సర్వ సంకల్పములను వదిలి నిరంతరసాధన చేతనే మోక్షపదవిని పొందగలరు.

### యోగి

ఇప్పుడిక నీకుయోగి జనముల గురించి చెప్తాను విను. ఆత్మ అతిసూక్ష్మమైనది కనుక దానిని బాహ్యనేత్రములతో చాడలేము. కేవలము జ్ఞానసేత్రముతో మాత్రమే చూడగలము . ఒక్క యోగిమాత్రమే దానిని తెలుసుకోగలడు. ముందుగా యోగి తనశరీరము నుండి జీవాత్మను వేరుచేయడం నేర్చుకుని జీవాత్మను దర్శిస్తాడు. తరువాత తాను పరమాత్మను కూడా చూడగలడు. పరమాత్మ దర్శనం తరువాత ఈ జనమరణచక్రము నుండి విముక్తుడౌతాడు. తరువాత ఆ యోగి రోగములు ముసలినముల చేత బాధింపబడడు. అతడికి సంతోషం దు:ఖములు ఉండవు. అతడు అప్పుడు ఇతరులకు కూడా మోక్ష మార్గమును బోధించడానికి అర్హుడు. యోగి ఈ శరీరం అశాశ్వతం అని తెలుసుకుంటాడు కనుక దేహపోషణకు ముఖ్యత్వం ఇవ్వడు. సదా ఆత్మ దర్శనానికి ప్రయత్నించే ఆ యోగికి భయం ఉండదు. రాగ ద్వేషములు అతడికి సుఖదు:ఖములు కలిగించవు. అటువంటి యోగి వికారములకు లోను కాక ఇంద్ర పదవిని కూడా తుచ్చముగా భావిస్తాడు. సదా అంతర్ముఖుడై ఆత్మదర్శనం చేస్తూ మనస్సును నిశ్చలంగా ఉంచుతాడు. యోగి అయిన వాడు మనసును ఆత్మయందు లగ్నము చేసి నిశ్చలాత్ముడై **బ్రహ్మపదము**ను పొందుతాడు. ఈ బ్రహ్మపదమును సాధారణ నేత్రములతో చూడ లేము. చెవులతో విన లేము . ప్రశాంతమనసుతో మాత్రమే ఆ బ్రహ్మపదమును దర్శించగలము. ఈ పరబ్రహ్మతత్వము అంతటా చేతులు తలలు కలిగి వ్యాపించి ఉంటుంది. సూర్యుడి వలె దేదీప్యమానంగా వెలుగుతున్న ఆ పరమాత్మను యోగులు మాత్రమే దర్శించగలరు. ఈ శరీరం నుండి జీవాత్మను వేరు చేసి పరమాత్మ వైపు మళ్ళించి పరమాత్మతో అనుసంధానం చేసినప్పుడే పరబ్రహ్మదర్శనం కలుగుతుంది. బ్రహ్మవిద్యా రహస్యసర్వం నీకు చెప్పాను కనుక ఇక నీవు సుఖంగా వెళ్ళ వచ్చు " అని సిద్ధుడు బ్రాహ్మణునికి పరబ్రహ్మ తత్వమును బ్రాహ్మణుడికి బోధించాడు. తనకున్న సంశయములను పోగొట్టుకున్న శిష్యుడు అక్కడ నుండి వెళ్ళిపోయాడు. సిద్ధుడుకూడా ఆ ప్రదేశం వదిలి వెళ్ళాడు. అర్జునా విన్నావు కదా ! ఆనాడు యుద్ధ భూమిలో నీకు చెప్పిన విషయాలు ఇప్పుడు బ్రాహ్మణ సిద్ధుల సంభాషణగా నీకు చెప్పాను. ఈ బ్రహ్మ విద్యను శ్రద్ధ లేని వారికి నీవు బోధించకూడదు. ఈ బ్రహ్మవిద్యను నేను దేవతలకు బోధించాను. మానవులలో నీకు బోధించాను. ఈ బ్రహ్మవిద్యను నీవు స్త్రీ పురుషబేధము చూడక ఏ జాతి వారికైనా వారి శ్రద్ధను అనుసరించి బోధించవచ్చు. బ్రహ్మవిద్యకు ప్రతి మానవుడూ అర్హుడే. అందరికీ ఈ బ్రహ్మవిద్య అవశ్యమే. ఎవరైతే ప్రాపంచిక సుఖములను వదిలి **బ్రహ్మజ్ఞానము**ను అభ్యసిస్తారో వారు మోక్షపదవికి అర్హులు అనడంలో ఎటువంటి సందేహంలేదు. అర్జునా నేను చెప్పతగినంత చెప్పాను. ఇంతకంటే నీకు వేరెవరూ చెప్ప లేరు " శ్రీకృష్ణుడు అర్జునుడికి బ్రహ్మజ్ఞానము గురించి వివరించాడు.

# అశ్వమేధ పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# ద్వితీయాశ్వాసం

## బ్రాహ్మణుడు తపోమార్గము

శ్రీకృష్ణుడు అర్జునుడికి గీతాసారాన్ని బోధించే క్రమంలో ఇలా చెప్పాడు. " అర్జునా ! **అభయ** అనే పేరుతో ప్రసిద్ధులైన ఒక భార్య ఒక భర్త మధ్య జరిగిన సంవాదమును నీకు వినిపిస్తాను. పూర్వకాలంలో ఒకబ్రాహ్మణుని అతడి భార్య ఒక రోజు **బ్రహ్మవిద్య** బోధించమని కోరింది. ఆబ్రాహ్మణుడు " భార్యామణీ ! నాకు తెలిసిన వరకు **బ్రహ్మవిద్య** నీకు బోధిస్తాను. చెవులతో వినుట, నేత్రములతో చూచుట, చేతులతో చేయుట వాటిని కర్మలు అంటారు. అజ్ఞానంలో కొట్టుకుంటున్న మానవులు తాము చేసే కర్మలన్నీ సిద్ధిస్తాయని అనుకుంటూ ఉంటారు. ప్రపంచంలో కర్మచేయకుండా ఉండకలిగిన వాడులేడు. ప్రతి ఒక్కరూ ఏదో ఒకకర్మ చేస్తూనే ఉంటాడు. అది ప్రాణులకు సహజము. పని చేయక సోమరిగా ఉండడం మూర్ఖత్వమని జనులు అంటారు. కానీ కర్మలన్నీ విడిచి పెట్టడమే **బ్రహహ్మపదము**. నా వరకు నేను సదా ఆత్మను బ్రహ్మయందు నిలిపి ఉపాసిస్తాను. దానిని **నిష్కర్మ** అంటారు. బాహ్యప్రపంచంలో చేసేది అంతా కర్మయే. కర్మచెయ్యకుండా ఉండడం అసాధ్యం. **అగ్ని సోముడు** కలిసి ఈ సృష్టిని చేస్తుంటారు. **బ్రహ్మ అక్షరతత్వము** గురించి వివరిస్తాను. **అక్షరపరబ్రహ్మము** భూతాత్మకమూ కాదు, వాటి తన్మాత్రల మయం కాదు. అందువలన అక్షర పరబ్రహ్మమును బాహ్యనేత్రములతో దర్శించ లేము. కేవలం బుద్ధి, జ్ఞానములతో మాత్రమే దర్శించగలరు. మనలో ఉండే **ప్రాణ, ఆపాన, వ్యాన, ఉదాన, సమాన** అను పంచవాయువులు బ్రహ్మ నుండే ఉద్భవించాయి. అవి తిరిగి బ్రహ్మలోనే లీనం ఔతాయి. ప్రాణముకు అపానముకు మద్య ఉదానవాయువు తిరుగుతుంటుంది. మానవుడు ప్రాణ అపాన వాయువుల వద్ద నిద్ర పోతున్నప్పుడు వ్యాన, సమాన వాయువులు వాటిలో కలసిపోతాయి. మానవుడు ఉదాన వాయువులో నిద్రించునప్పుడు మాత్రము ప్రాణ, అపాన వాయువులు విడిచిపెట్టవు. పైన చెప్పిన పంచ వాయువులు, వాటికి మనసు, బుద్ధి కలిస్తే అవి వైశ్వానరుడికి నాలుకల వంటివి. **వైశ్వానరుడంటే** అగ్నిదేవుడు. అందుకే అగ్నిదేవుడిని **సప్తజీహ్వుడు** అని పిలుస్తారు. కనుక మానవుల దేహములలో అగ్నిదేవుడు ఆత్మరూపంలో వెలుగుతుంటాడు. వాసన చూడడం, తినడం, చూడడం, వినడం, ఆలోచించడం, ఇతరుల నుండి తెలుసుకొనడం, స్పృజించడం ఈ ఏడు మనలో వెలిగే అగ్నికి సమిధలు. తినేవాడు, చూసేవాడు, స్పృజించేవాడు, వినేవాడు, ఆలోచించేవాడు, వాసన ఆఘ్రాణించే వాడు, తెలుసుకునే వాడు ఋత్విక్కులు. ఈ ఋత్విక్కులు సమిధలను మనలో ఉన్న ఆత్మ అనే అగ్నికి ఆహుతి అర్పిస్తుంటారు. మనలో నిత్యమూ జరిగే ఈ హోమమును **సప్తహోమము** అంటారు. వైశ్వానరునికి ముఖములు పది. అవి **దిక్కులు, వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు, విష్ణువు, బ్రహ్మ, మిత్రావరుణులు. శబ్ధము, రూపము, స్పర్శ, రసము, గంధము, మాట, పని చేయుట, గంతవ్యము, విసర్జన, ఆనందము** ఈ పది ఆ పది ముఖముల హోమద్రవ్యములు. **కళ్ళు, ముక్కు, చర్మము, నాలుక, చెవులు, పాదములు, చేతులు, జననేంద్రియము వీటిని దశహోత్ర విధి** అంటారు. ఈ రెండు విధులను తెలుసుకున్న యోగి తనలో ఉన్న జీవాత్మను ఉపద్రష్టగా చేసుకుని తనలోనే నిత్యము యోగము చేస్తుంటాడు. చివరకు ఈ జననమరణచక్రము నుండి విముక్తి పొందుతాడు. ఇది తెలియని వాడు ఈ జనమరణచక్రంలో పడి గిరగిరా తిరుగుతుంటాడు.

### ఓంకారం

ఓంకారం నుండి వాక్కు పుట్టింది. ఆ ఓంకారం అనుసరించి మనసు నాలుగు పురుషార్ధముల సాధనకు ప్రయత్నము చేస్తుంది " అన్నాడు బ్రాహ్మణుడు. అప్పుడు ఆయన భార్య " నాధా ! మనసులో సంకల్పిస్తే కదా నోటి నుండి వాక్కు వస్తుంది. మరి అటువంటి సమయాన వాక్కును అనుసరించి మనసు ఎలా ప్రవర్తిస్తుంది " అని అడిగింది. బ్రాహ్మణుడు " నీవనది వాస్తవమే కాని వాక్కు మనసు ఒక దానితో ఒకటి అనుసంధానమై పని చేస్తాయి. మనసు సంకల్పించింది తప్ప వాక్కు మరొకటి పలుక లేదు. ఒకసారి మనసు వాక్కు బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి తమలో ఎవరు గొప్ప చెప్పమని అడిగాయి. మనస్సే గొప్పది అని

బ్రహ్మదేవుడు తక్కున సమాధానం చెప్పాడట. పక్కనే ఉన్న సరస్వతి " నాధా ! నేను వాక్కు దేవతను. అలాంటి నేను మీ పక్కన ఉండగా మనస్సు గొప్పది అని మీరు ఎలా చెప్పారు ? " అని అడిగింది. అందుకు బ్రహ్మ " దేవీ ! మనస్సు రెండు విధములు. ఒకటి స్థిరమైనమనసు రెండవది చరమైనమనసు. స్థిరమైన మనసు నా వద్ద చరమైన మనసు నీ వద్దా ఉన్నవి. నీ అనుగ్రహం వలన పుట్టిన అన్ని వర్ణములు, అక్షరములు, విద్యలు, మంత్రములు మొదలైన వాటిని చంచల మనసు అంటారు. చంచలచిత్తము కంటే స్థిరచిత్తము మంచిది కదా ! " అని సమాధానం చెప్పాడు. అప్పుడు సరస్వతి ఏమీ బదులు పలుక లేదు " అని బ్రాహ్మణుడు భార్యకు చెప్పాడు.

### వాక్కు

అప్పుడు బ్రాహ్మణునిభార్య " నాధా ! బ్రహ్మదేవుని మాటలకు చింతించిన సరస్వతి ఎలా తేరుకుంది " అని అడిగింది. బ్రాహ్మణుడు " తరుణీ ! వాక్కు అనునది ప్రాణము ఆపానము వలన కలుగుతుంది. అందులో ప్రాణవాయువే బ్రహ్మ. అది తెలియచెప్పి బ్రహ్మ సరస్వతి చింతను పోగొట్టగలిగాడు. కనుక వాక్కు మనసు యొక్క ధర్మమని తెలుసుకున్న వాడు మోక్షమునకు అర్హుడు. ఇంకా వాక్కు మనసు వీటి ధర్మాలను వివరిస్తాను. ప్రాణం అపానంలో కలిస్తుంది. అప్పుడు వాక్కు తన సహజమైన శబ్దమును వదిలిపెట్టి పంచభూతములలో కలిసి వ్యానుడి ప్రేరణతో శరీరం అంట వ్యాపిస్తుంది. అప్పుడు మనసు ప్రశాంతత పొందుతుంది. మనసలా ప్రశాంతత పొందడమే ముక్తికిమార్గం. వాక్కు అనేది బయటకు ఉచ్చరించేది. దీనిని ఘోషిణి అంటారు. బయటకు కన్పించనిది అఘోషిణి. అఘోషిణి అంటే మనసులో అనుకునేది. ఇందు అఘోషిణి ఉత్తమమైనది. ఆ వాక్కు అవ్యయము. శబ్దరూపం లేనిది ఉజ్వలంగా ప్రకాశించేది. ఆ వాక్కు **బ్రహ్మస్వరూపము**. జ్ఞానేంద్రియములు ఐదు మనసు బుద్ధి ఈ ఏడు జీవాత్మను ఆశ్రయించుకుని ఉంటాయి. దేని పని అది చూసుకుంటుంది. ఒకదాని పని ఒకటి చెయ్యవు. వాసన చూడడం అన్నది ముక్కు మాత్రమే చేస్తుంది. మిగిలిన వాటికి అది చేత కాదు. నాలుక రుచి చూస్తుంది మిగిలిన ఇంద్రియాలు ఆ పని చెయ్యవు. కళ్ళు రూపాన్ని చూడగలవు. మిగిలిన అవయవాలు ఆ పని చెయ్యలేవు కదా ! స్పర్శను చర్మము గ్రహిస్తుంది, చెవులు శబ్దమును గ్రహిస్తాయి. ఏదైనా విషయం శకించడం మనసు ధర్మము. మిగిలిన ఏ అవయవములు ఈ పని చెయ్య లేవు. మంచి చెడు తెలుసుకోవడం జాగృతం చెయ్యడం బుద్ధి చేసే పని. ఆపనిని మిగిలిన అవయవములు చెయ్య లేవు.

### ఇంద్రియములు మనసు

ఒకప్పుడు మనసుకు ఇంద్రియములకు వాగ్వివాదం జరిగింది. మనసుతో ఇంద్రియములు ఒకసారి ఇలా అన్నాయి. " ఓ మనసా ! మనస్సు ఇంద్రియములు ఒకటే కదా ! ఇందులో మనసు గొప్ప ఏమిటి ? " అని అడిగాయి. అప్పుడు మనసు ఇంద్రియములతో " ఇంద్రియములారా ! నేను సంకల్పించక ఉన్న మీరు ఏపని చెయ్య లేరు. నేను లేకపోతే కళ్ళు, ముక్కు, చెవులు, పని చెయ్య లేవు. నేను లేకున్న ఇంద్రియములు ఉన్నా లేకున్నా ఒకటే కనుక మీ కంటే నేనే గొప్ప " అన్నది. ఇంద్రియములు " మనసా ! అంతమాత్రం చేత నీవు గొప్పదానివి అయ్యావా ! మేము లేకుండా నీవు దేనినీ అనుభవించ లేవు. ముక్కు లేకుండా నీవు వాసన చూడలేవు, కళ్ళు లేకుండా నీవు రూపమును గ్రహించ లేవు. మాలో ఏ ఒక్కటి లేకున్నా నీవు ఏమీ చెయ్య లేవు. పోనీ ఒక దానితో మరొక్క దాని పని చేయించగలవా అంటే అదీ చెయ్యలేవు. కనుక మేమంతా ఉంటేనే నువ్వు అన్నీ అనుభవించగలవు. ఇందులో నీ గొప్పతనం ఏమిటి ? అదీ కాక మేము అనుభవించిన తరువాతే నువ్వు అనుభవిస్తున్నావు. అంతేకాదు నీవు ఏ కారణం చేత అయినా పని చేయ లేక పోతే నీవు మా లోని **ప్రాణశక్తి** వలననే నీవు తిరిగి పనిచెయ్యగలవు. మేము ఉంటేనే నీవు అనుభవించగలుగుతున్నావు. లేకున్న నీవు ఏమీ అనుభవించ లేవు. కనుక నీకు స్వత:సిద్ధంగా ఏమీ అనుభవం లేదు కనుక మామీద అధారపడక తప్పదు. కనుక నువ్వు మేము కలిస్తేనే ఈ శరీరం సుఖములను అనుభవిస్తుంది. ఇందులో ఎవరి గొప్పతనం లేదు " అన్నాయి ఇంద్రియములు. ఆవాదనకు మనసు బదులు చెప్పలేక పోయింది " అని చెప్పాడు బ్రాహ్మణుడు భార్యతో.

### పంచవాయువులు

బ్రాహ్మణుడు ఇంకా " వనితా ! నీకు మరొక విషయం చెప్తాను. ఒకసారి మానవుని శరీరంలో పని చేస్తున్న **ప్రాణ, అపాన, వ్యాన, సమాన, ఉదాన** వాయువులు తమలో ఎవరు గొప్ప అని బ్రహ్మదేవుడిని అడిగాయి. అందుకు బ్రహ్మదేవుడు నవ్వి " మీలో ఎవరు ఉన్నప్పుడు మిగిలిన వాయువులు పని చేస్తాయో ఎవరు లేకున్న మిగిలిన అవయవములు పని చెయ్యవో అదే మిగిలిన వాటి కంటే గొప్ప " అని చెప్పాడు. అప్పటికీ ఆ వాయవులు అక్కడ నుండి కదలక తాము గొప్ప అంటే తాము గొప్ప అని వాదించుకున్నాయి. బ్రహ్మదేవుడు నవ్వి " ఆ విషయం నాకు తెలియదా ! మీలో అందరూ విశేష ప్రవృత్తి కలవారే. మీలో

ఎవరు లేకపోయినా మిగిలిన వారు తమ పని చెయ్య లేరు. ఒక్కొక్కరు ఒక్కొక్క సారి ఒక్కొక్క పని చేస్తాయి. ఎప్పుడు ఏ వాయువు పని చేస్తుందో అదే అప్పుడు గొప్పది. కనుక మీరంతా ఐకమత్యంతో పని చేసినప్పుడు అందరూ గొప్ప వారే. కనుక ఐకమత్యంతో అందరూ నడవండి " అని చెప్పాడు. ఆ మ్మాటలువిన్న వాయువులు మారుమాటాడ లేక అక్కడ నుండి వెళ్ళి పోయాయి. ఒకసారి **దేవమతుడు** నారదుడితో " మహర్షీ ! మానవుడి శరీరంలో ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన వాయువులు ఉంటాయి కదా ! తల్లి గర్భంలో ఉన్న శిశువులో మొదటగా ఏ వాయువు పని చేయడం పెట్టుతుంది తెలియజేయండి " అని అడిగాడు. నారదుడు " పురుషుడిలోని సమానవాయువు స్త్రీలోని వ్యానము అనే వాయువులు కలసి పని చేసినప్పుడే పిండం ఉత్పత్తి ఔతుంది. ఆ పిండములోకి ప్రాణ ఆపాన వాయువులు చేరినప్పుడు పిండం ఉఛ్వాస నిశ్వాస తీసుకోవడం ప్రారంభిస్తుంది. ప్రాణవాయువు కిందకు ప్రసరిస్తుంది. ఆపానవాయువు కిందికి ప్రసరిస్తుంది. ఈ రెండు వాయువులతో అగ్ని చేరిన తరువాత ఉదాన, వ్యాన, సమాన వాయువులు ఉత్పన్న మౌతాయి. ఈ అయిదు వాయువులు శిశువు శరీరం అంతా ప్రసరిస్తాయి కనుక ఈ వాయువులలో అంతర్లీనంగా అగ్ని నిక్షిప్తమై ఉంటుంది. ఈ అగ్నిని ఉదానము అని కూడా అంటారు. ప్రాణ ఆపాన వాయువులనే ఉంది లేదు, రాత్రి పగలు, శుభము అశుభము, సత్యము అసత్యము మొదలగు ద్వంద్వములు అని కూడా అంటారు. మనలో ఉన్న అగ్నితత్వము, వాయుతత్వము, శరీరతత్వము తెలిసిన నిపుణులు మాత్రమే గ్రహించగలరు " అని నారదుడు బ్రాహ్మణుడితో చెప్పాడు. వనితామణీ ! ఈ ప్రపంచంలో జరిగే పనులన్నింటికీ మూలము కర్త, కర్మ, కరణము. కరణము అంటే సాధనము. ముక్కు, చెవులు, నాలుక మొదలైన జ్ఞానేంద్రియములు కరణములు. వాసన చూడడం, రుచి చూడడం, తాకడం, ఆలోచించడం మొదలైన పనులు జీవుడు చేస్తాడు. వీటితో **జీవుడు** సుఖములు అనుభవిస్తాడు.

## మోక్షమార్గము

బ్రాహ్మణుడు ఇంకా ఇలా చెప్పసాగాడు " లలనామణీ ! జీవుడు ఈ కర్మలన్నింటినీ వదిలిపెట్టి మోక్షమార్గమున కూడా పయనించగలడు. కారణము కర్మలను అనుభవించే భోక్త **జీవుడు**. జీవుడు ప్రాపంచిక విషయాలను వదిలి సకలవిషయాలను ఆత్మలో ఆహుతి చేసినప్పుడు విషయవాంఛలు భస్మమై అవిద్య నశిస్తుంది. జీవుడు అవిద్య అనే పొగ నుండి విముక్తుడై దేదీప్యమానంగా వెలుగుతాడు. అదే మోక్షం అందరూ దీనిని యోగయజ్ఞము అంటారు. దీనికి దక్షిణ కోరికలను విడిచిపెట్టడమే. అపుడు సర్వవ్యాపి అయిన భగవంతుడు ఆనందించి ఆ జీవుడికి మోక్షము ప్రసాదిస్తాడు. అలాకాక భోక్త అయిన జీవుడు ప్రాపంచిక సుఖముల అందు ఆసక్తుడై ప్రవర్తించిన బంధనములో చిక్కుకుని పతనమౌతాడు. లలనామణీ ! ప్రపంచమును శాశించు వాడు ఒక్కడే. నేను అతడి శాసనమును పాటిస్తాను. ఈ లోకముకు గురువు ఒక్కడే. అతడి బోధనలను నేను శిరసావహిస్తాను. శ్రోత ఒక్కడే అతడే నేను. నాకు శత్రువు వలన ఆపద వచ్చినప్పుడు నేను శత్రువుకు కూడా తలవంచుతాను. ఈ సంసారమును దాటే మార్గము పెద్దలవలన తెలుసుకుంటాను. ఒకసారి దేవతలు బ్రహ్మదేవుడు వద్దకు వెళ్ళి తమకందరికీ హితమైన మార్గము చెప్పమని అడిగారు. బ్రహ్మదేవుడు వారితో " అక్షరోపాసనసే మీకు హితమైన మార్గం" అని చెప్పాడు. నేను కూడా ఆ మార్గమునే అవలంబిస్తున్నాను. కనుక లలనామణీ ! నేను ఈ సంసారం అనే అరణ్యమును దాటే ప్రయత్నములో కోపము అనే చీకటిని, లోభము అనే పామును, కామము అనే కోటను దాటి ప్రస్తుతం ఒక అడవిలో ఉన్నాను " అని అన్నాడు.

## అడవి

బ్రాహ్మణి " నాధా ! అ అడవి ఎలా ఉంటుంది ? " అని అడిగింది. బ్రాహ్మణుడు " లలనామణీ ! ఆ అడవిలో చిన్నాపెద్ద తారతమ్యం లేదు. సుఖదుఃఖాలు అసలు లేవు. చింత భయమూ లేదు. అడవిలో ఉన్న చెట్లకు పంచరంగుల ఫలాలు ఉన్నాయి. అవి చాలా తియ్యగా ఉండి అడవిలోని అతిథులను ఆనందపరుస్తుటాయి. ఆ అడవికి సామాన్యులు రారు. మహర్షులు అక్కడ ప్రశాంతంగా తపస్సు చేసుకోవడానికి వస్తారు. ఆ అడవికి యజమాని సూర్యుడు. ఆ అడవిలో బ్రహ్మసంభవమైన నీరు ప్రవహిస్తుంటుంది. ఆ అడవిలోని పర్వతముల మీద తపస్సు చేసిన ఋషులు ముక్తిని పొందుతుంటారు. ఆ అడవిలో ఉన్న ఋషులు శాంతులైన మహాప్రతిభావంతులు. వారు వైరాగ్యంతో బ్రహ్మానందస్తితిలో ఉంటారు. నేను కూడా ఆఅడవిలో ఉండే మునులవలె నిస్సంగత్యంతో ఉంటాను. నేను ప్రతిఫలం ఆశించి ఏ కర్మలు చెయ్యను కనుక నాకు కర్మ బంధములు అంటవు. రానున్నన్నది రాకమానదు, జరుగనున్నది జరుగకమానదు, ఆపదలను ఆపలేమని భావించి నేను వృధాప్రయాస వ్యర్ధమని భావించి నేను తామరాకుమీద నీటిబొట్టులా ఈ ప్రపంచంలో తిరుగుతుంటాను.

## అధర్వుడు యాజకుడు

లలనామణీ ! నీకు అధర్వునికి యజ్ఞములు చేసే యాజకుడికి జరిగిన సంవాదం వివరిస్తాను. ఒకసారి ఒక యజ్ఞములో ఒక మేకను అలంకరించి దానిని బలి ఇవ్వడానికి సిద్ధం చేసి దాని మీద నీళ్ళను చల్లుతున్న యాజకుడిని చూశీ ఒక యతి " అయ్యా ! ఇంతటి పవిత్ర యజ్ఞములో జీవహింస చేయడం తప్పు కాదా ! ? అని అడిగాడు. అప్పుడు ఆ **యాజకుడు** " అయ్యా ! మీరు వేదములు పఠించినట్లు లేదు. ఇది వేదములలో చెప్పిన విధి. ఈ మేక చనిపోయిన తరువాత స్వర్గసుఖములు అనుభవిస్తుంది. అప్పుడు ఆ యతి " మీరు చెప్పినట్లు ఈ మేక స్వర్గలోకం పోయినా ! ఈ మేకను బలి ఇచ్చినందుకు మీకు కలిగు ఫలం ఏమిటి ? " అని అడిగాడు. యాజకుడు " యజ్ఞములో జంతువును బలి ఇవ్వ వచ్చని వేదములు ఘోషిస్తున్నాయి. అందువలన యజ్ఞము చేసిన వారు యజ్ఞములు చేయిస్తున్న మేము స్వర్గముకు నిశ్చయముగా వెడతాము. ఇందులో తప్పేమిటి " అని అన్నాడు. యతి " మీరు చెప్పేది సరికాదు. వేదములలో జీవహింస తప్పని పదేపదే చెప్పారు " అన్నాడు. యాజకుడు " మీరు అలా చెప్తున్నారు కదా ! తమరు సమాధిలో ఉన్న సమయాన ఉఛ్వాస నిశ్వాసములను బంధించి శరీరములు హింస్తున్నారు కదా ! అది కూడా హింసే కదా ! " అప్పుడు యతి " నేను చేసేది తపస్సు నేను దానిలో పరిపక్వత పొందాను. జ్ఞానస్వరూపమైన అక్షరతత్వాన్ని తెలుసుకున్నాను. క్షరతత్వాన్ని నా జ్ఞానంతో వివేకంతో నశింపచేసాను. ఐహిక సుఖములను విడిచి మోక్షప్రాప్తి కొరకు నేను చేస్తున్న యాగమును హింస అనడం మూర్ఖత్వము కాక మరేమిటి ? " అని అడిగాడు. యాజకుడు " యతీంద్రా ! నాకు అదేమీ తెలియదు. యజ్ఞములో బలి ఇవ్వమని వేదములు చెప్తున్నాయి. నేను యజ్ఞము చేస్తున్నాను. నేను వేదవిధిని నిర్వహిస్తున్నాను. ఈ యజ్ఞము చేసిన నాకు పాపము అంటదు. యజ్ఞమును చేసిన ఉత్తమగతులు పొందవచ్చున్నది మాత్రమే నాకు తెలిసిన విషయం " అన్నాడు. యతి " నీవు చేసే జీవహింసతో కూడిన యజ్ఞము కంటే నేను చేసే తపోయజ్ఞము గొప్పది అన్నాను కాని వేరేమి కాదు " అన్నాడు. యాజుకుడు ఆ మాటలకు అంగీకరించాడు.

### కార్తవీర్యార్జునుడు

బ్రాహ్మణుడు ఇలా కొనసాగించాడు " పూర్వము **కార్తవీర్యార్జునుడు** అనే రాజు పరశురాముడు అనే బ్రాహ్మణుడికి తీరని అపకారము చేసాడు. దానికి ప్రతీకారంగా పరశురాముడు కార్తవీర్యార్జునుడి చేతులు నరికివేసి అతడిని దారుణంగా చంపి వేసాడు. ఆ పగతో కార్తవీరార్జునుడి కుమారులు పరశురాముడు ఇంట్లో లేని సమయము చూసి అతడి తండ్రి **జమదగ్ని**ని చంపారు. దానితో ఆగ్రహోదగ్నుడైన పరశురాముడు కార్తవీర్యార్జునుడి కుమారులందరిని చంపాడు. వారినే కాక క్షత్రియుల మీద 21 సార్లు దండెత్తి సమూలంగా నాశనంచేసాడు. అప్పటికి కాని అతడి పగ చల్లార లేదు. అప్పుడు అతడి పితృదేవతలు ప్రత్యక్షమై పరశురాముడితో " పరశురామా ! బ్రాహ్మణుడివి అయిన నీవిలా చేయడం తప్పు కాదా !" అని అడిగారు . అప్పుడు పరశురాముడు " పితృదేవతలారా ! నేను చేసేది మహాయజ్ఞము యజ్ఞములో ఈ క్షత్రియులందరూ బలి పశువులు. యజ్ఞములో బలి ఇవ్వడం వేదధర్మము. నేను వేదధర్మాన్ని పాటిస్తున్నాను. మీరు నాకు అడ్డు రాకండి " అన్నాడు పరశురాముడు. పితృదేవతలు తిరిగి " పరశురామా ! యజ్ఞములో తపోయజ్ఞమే శ్రేష్టమైనది. నీవు కూడా **తపోయజ్ఞము** చేసి శాంతివహించు. భగవంతుడు నిన్ను కరుణిస్తాడు. అసలు మనము కరుణించ వలసినది బాహ్యశత్రువులను కాదు అంత:శత్రువులను. ఆయుధములు అంత:శత్రువులను జయించలేవు. తపస్సు ఒక్కటే అంత:శత్రువులను జయించగలదు. కనుక నీవు కూడా అంత:శత్రువులను జయించి ఆత్మసుఖం అనుభవించు " అని చెప్పారు. పరశురాముడు **పితృదేవతల** మాటలు మన్నించి హింసవదిలి తపోమార్గము అవలంబించాడు.

### అంబరీషుడు

వనితామణీ ! నీకు నవగుణములు గురించి వివరిస్తాను. వాటిలో **స్థంభము, అభిమానము, హర్షము** అనునవి సత్వగుణ ప్రధానము. **శోకము, సంరంభం, శోకము, రజోగుణ** ప్రధానములు. **మోహము, నిద్ర, స్వప్నము** ఇవి తమోగుణ ప్రధానములు. వీటిని తగు అస్త్రములు ప్రయోగించి వధించాలి. అంత కంటే ముందు ఇంద్రియములను జయించాలి. తరువాత మోక్షమార్గములో పయనించాలి. మోక్షమార్గమును అడ్డగించే ప్రధాన శత్రువులను గురించి తెలుసుకోవడానికి నీకు అంబరీషుడి కధ చెప్తాను. పూర్వము అంబరీషుడు అనే రాజు ఉండే వాడు. అతడు రాజనీతిలో గొప్ప వాడు. శత్రువులను జయించి ప్రజలను కన్న బిడ్డలవలె పాలిస్తున్నాడు. ఒకరోజు అంబరిషుడు తన ఆస్థాన పండితులను చూసి " పండితులారా ! నేను శత్రువులందరినీ జయించాను కాని అది ఒక జయము అనిపించుకోదు. ఎందుకంటే నన్ను ఇంకా **అరిష్వర్గాలు, రోగములు, మృత్యువు** మొదలైన అంత:శత్రువులు వేధిస్తున్నాయి. వాటిని గెలువకనే నాకు సంపూర్ణ విజయం ఎలా లభిస్తుంది " అని చెప్పి అంబరీషుడు అప్పటి నుండి అరిషడ్వర్గాలను జయించే ప్రయత్నము కొనసాగించాడు. ఆ తరువాత అంబరీషుడు శాంతితో రాజ్యపాలన సాగించసాగాడు. కనుక తరుణీ ! ముక్తిని పొందాలంటే అరిష్వర్గాలను జయించడం ముఖ్యము.

## జనకుడు బ్రాహ్మణుడు

బ్రాహ్మణూడు తన భార్యతో ఇంకా ఇలా చెప్పాడు. " ఒక సారి ఒక బ్రాహ్మణుడు జనకమహారాజు రాజ్యంలో ఒక అనుచితమైన పని చేసాడు. దాని ఫలితంగా రాజు అతడిని తన రాజ్యం నుండి బహిష్కరించాడు. అప్పుడు అతడు జనకమహారాజుతో " రాజా ! నన్ను రాజ్యము నుండి వెళ్ళమని చెప్పావు కదా ! నీ రాజ్యము ఎంత విస్తరించి ఉందో చెప్పు నేను దాని వెలుపలికి వెడతాను " జనకుడు ఆ మాటకు జవాబు చెప్పక కొంత సమయము మౌనంవహించి " అయ్యా ! ఈ రాజ్యము నాది కాదు. నాకిది నా తాత ముత్తాతల నుండి సంక్రమించింది. నాది కాని రాజ్యమును నాదని నేను ఎలా చెప్పగలను ? " అన్నాడు. అప్పుడు ఆ బ్రాహ్మణుడు " అదేమిటి మహారాజా ! ఈ రాజ్యము నీది. నువ్వు దీనికి రాజువు. ఏదీ నీది కాదని అనుకుంటూ ఈ రాజ్యపాలన సాగిస్తున్న రహస్యము తెలుసుకోవాలని ఉంది " అని అడిగాడు. జనకమహారాజు " బ్రాహ్మణోత్తమా ! నే పుట్టక ముందే ఈ రాజ్యము రాజ్యాధికారము ఉన్నాయి. నేను పోయిన తరువాత కూడా అవి అలాగే ఉంటాయి. కనుక వాటిని నావి అని ఎలా చెప్పగలను. నేను ఈ రాజ్యము నేను అనుభవిస్తున్నా ఇది నాది కాదని భావిస్తూ రాజ్యపాలన సాగిస్తున్నాను " అన్నాడు. అప్పుడు బ్రాహ్మణుడు నవ్వుతూ " జనక మహారాజా ! నేను యమధర్మరాజును నిన్ను పరీక్షించడానికి వచ్చాను. నీవు నిష్కామకర్మ యోగివి, జ్ఞానివి నీ మనస్సు సదా శాంతితో వర్ధిల్లుగాక " అని ఆశీర్వదించి యమధర్మరాజు వెళ్ళి పోయాడు.

## బ్రాహ్మణుడి వైరాగ్యము

తిరిగి తన భార్యతో బ్రాహ్మణుడు " వనితామణీ ! నేను వైరాగ్యంతో ఇల్లు విడిచి పోవాలని సంకల్పించగా నా మనసు గ్రహించిన నీవు నన్ను వైరాగ్యము నుండి మరలచడనికి **ఆత్మబోధ** చెయ్యమని అడిగావు. నీ మనసుగ్రహించి కూడా నేను ఏమీ ఎరుగనట్లు **ఆత్మబోధ** చేసాను. నేనిక బ్రహ్మచర్యము అవలంబిస్తాను. ఇక ఎంత మాత్రం ఈ సంసారములో ఉండ లేను. నేను జీవన్ముక్తుడను అయ్యాను. కాని నువ్వు మాత్రం నన్ను సామాన్యుడిగా చూస్తున్నావు. నేను ఎంతోసాధన చేసి యోగిని అయ్యాను. ఇక నేను ఈ ఇంటికి పరిమితం కాలేను. ఈ ప్రపంచం అంతా నాది. నేను అంతటా నిండి ఉన్నాను. స్వార్గాధిపత్యమూ నాకిక అవసరం లేదు. ఈ వైరాగ్యమే నాకిక సర్వ సంపదలతో సమానము. అన్ని కొయ్యలలో అగ్ని ఉన్నట్లు ఈ చరాచరజగత్తు అంతా భగవంతుడు నిండి ఉన్నాడు. నదులన్నీ సముద్రంలో కలిసిన విధంగా అందరూ భగవంతుడిని చేరుకుంటారు. ఈ శరీరంతో భగవంతుడిని చేరుకుంటాము. ఈ శరీరంతో చేసే కర్మలన్నింటికీ మొదలు అంతం ఉంటాయి. అవి మానవుని బంధనంలో ఇరికిస్తాయి. నేనిప్పుడు కర్మబంధ విముక్తుడనైయ్యాను . నాకిక మృత్యుభయం లేదు కనుక నన్ను ఇప్పుడు అడ్డుపెట్టక నువ్వు కూడా నా మార్గములో పయనించి మోక్షమును పొందు " అని చెప్పాడు. ఆ మాటలు విన్న బ్రాహ్మణి " నాథా ! సామాన్యులకు అర్ధము కాని గుహ్యమైన రహస్యాలను ఒక వేళ అర్ధము అయినా గుర్తు ఉండని రహస్యాలను మీరు నాకు బోధించారు. నేను కృతార్ధురాలను అయ్యాను " అన్నది. బ్రాహ్మణుడు " లలనామణీ ! బ్రాహ్మణుడు అరణి అయితే గురువు ఉత్తర అరణి రెండూ కలిసినప్పుడే జ్ఞానాగ్ని పుడుతుంది " అని అన్నాడు. బ్రాహ్మణుడు అరణి అని గురువు ఉత్తర అరణి అని తెలుసుకున్న బ్రాహ్మణి తన భర్తను ఇలా అడిగింది " నాథా ! అటువంటి బ్రాహ్మణుడిని కకుక్కునేది ఎలా ? " అని అడిగింది. బ్రాహ్మణుడు " వనితామణీ ! అటువంటి బ్రాహ్మణోత్తముడిని తెలుసుకోవడానికి ఎలాంటి సాధనము లేదు. అతడి లక్షణములు ఇంద్రియములకు గోచరించవు. అతడు గుణాతీతుడు, సుద్ధసత్వగుణ సంపన్నుడు , అహంకారం లేని వాడు " అని చెప్పాడు. భర్తబోధనల వలన జ్ఞానము కలిగిన బ్రాహ్మణి భర్త అడుగు జాడలలో నడిచి ముక్తిని పొందింది " అని శ్రీకృష్ణుడు అర్జునుడికి చెప్పాడు.

## బ్రహ్మము

అర్జునుడు " శ్రీకృష్ణా ! భార్యా భర్తలు అయిన ఆ బ్రాహ్మణుడు బ్రాహ్మణి అంత గొప్పవారా ! వారిని గురించి ఇంకా వినాలన్న కుతూహలం కలుగుతుంది. వివరించండి " అని అడిగాడు. అందుకు శ్రీకృష్ణుడు నవ్వి " అర్జునా ! నా మనసే బ్రాహ్మణుడు నా బుద్ధి బ్రాహ్మణి. ఇంద్రియాతాతీతమైన ఆ పరమాత్మను నేనే " అని అర్జునుడితో చెప్పాడు. అది విన్న అర్జునుడు శ్రీకృష్ణుడితో " శ్రీకృష్ణా ! నీ బోధనల వలన నా మనసు సూక్ష్మగ్రాహి, వివేకవంతం అయినది. కనుక నాకు బ్రహ్మము గురించి తెలుసుకోవాలని ఉన్నది తెలియజేయవా " అని అడిగాడు. శ్రీకృష్ణుడు " అర్జునా ! నీ ప్రశ్నకు బదులుగా గురుశిష్య సంవాదం చెప్తాను. నీవు అడిగినట్లే ఒక శిష్యుడు తన గురువును అడిగాడు. అప్పుడు ఆ గురువు బృహస్పతి, **భరద్వాజుడు, గౌతముడు, భార్గవుడు, కశ్యపుడు, వశిష్ఠుడు, అత్రి, విశ్వామిత్రుడు** మొదలైన మహామునులను తోడు తీసుకుని బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి నమస్కరించి " దేవ ! హితము అనగా ఏమి ? హితము పొందుటకు సులభమైన మార్గము ఏది ? " అని అడిగాడు. అప్పుడు బ్రహ్మదేవుడు " ఈ చరాచరజగత్తు సత్వగుణంలోనే జన్మిస్తాయి. కొంత కాలము ఆ సత్వగుణములో సంచరించిన తరువాత రజోగుణము తమోగుణము జీవుడిని ఆశ్రయిస్తాయి. ముందుగా సత్వగుణము గురించి వివరిస్తాను.

సత్వగుణము మహిమాన్వితమైన గుణము కనుక యోగులందరూ సత్వగుణమును ఆశ్రయించి కామమును క్రోధమును పూర్తిగా వదిలివేస్తారు. ఆ సత్వగుణమును అనుసరించుటకు తగిన మార్గము చెప్తాను. ధర్మమునకు నాలుగు ఆశ్రయములు నాలుగు కాళ్ళ వంటివి. ఈ ధర్మము అన్ని వర్గముల చేత అనుష్టించచబడుతుంది. ఉత్తమ ధర్మమైనదానిని అనుసరించి జీవులు ముక్తిపొంద వచ్చు. పైన చెప్పిన నాలుగు ఆశ్రమాలలో ఆత్మసాక్షాత్కారం పొందని వారు మోక్షమును పొందలేరు. అది అన్ని వర్గాల వారికి సమానము. మరుత్తులు, ఆదిత్యులు, దేవతలు ఎవరైనా మోక్షము పొందాలంటే ఆత్మదర్శనమే సులభమైన మార్గము. **ఆధ్యాత్మదర్శనం** అంటే 24 తత్వము గురించి తెలుసుకోవడమే. వాటిని గురించి వివరిస్తాను. భూమి మొదలైన పంచభూతములు అయిదు. వాటి తన్మాత్రలైన రూప, రస, గంధాదులు అయిదు. ఇంద్రియములు 10. మనసు బుద్ధి అహంకారం 3. ప్రకృతి 1. అన్నీ కలిపి 24 తత్వములు. జీవుడు అహంకారము వదిలి జననమరణ రహస్యం తెలుసుకుని 24 తత్వముల నిజరూపము తెలుసుకుని అజ్ఞానము వదిలి జ్ఞానము సముపార్జిస్తాడో అప్పుడు అతడు సంసార బంధముల నుండి విడివడి మోక్షమార్గము వైపు పయనిస్తాడు.


మునులకు ఉపదేశిస్తున్న బ్రహ్మ

## త్రిగుణములు

మానవ దేహానికి నవరంధ్రాలు ఉన్నాయి. ఈ తొమ్మిదిరంధ్రముల ద్వారా మనసు సత్వ, రజో, తమో, గుణాల ప్రభావంతో బాహ్య ప్రపంచంతో సంబంధాలను పెట్టుకుంటుంది. అందుకే ఈ దేహము వ్యక్తము. దానిలో అంతర్లీనంగా ఉండే పరమాత్మ అవ్యక్తము. కనుక వ్యక్తమైన దేహము మీద భ్రాంతిని వదిలి అవ్యక్తమైన పరమాత్మ దర్శనానికి ప్రయత్నించాలి. కాని అది చాలా కష్టసాధ్యము. ఇంద్రియములను, మనసును, త్రిగుణములను జయించిన వాడే మోక్షమార్గమున పయనించగలడు. పైన చెప్పిన త్రిగుణాలు ఒక దానితో ఒకటి కలసి పనిచేస్తాయి. ఒకదానికి ఒకటి ఆసరాగా ఉంటాయి. ఒకదాని వెంట ఒకటి వస్తాయి. ఒక దానికి మరొకటి సహకరించుకుంటాయి. కనుక సత్వరజోతమో గుణములను గుర్తించి వాటిని నివారించడంసాధ్యం. ఒక దానిని నిరోధిస్తే మరొకటి విజృంభిస్తుంది. **లోభము, శోకము, భ్రాంతి, నిద్ర, భయము, వికారము, దురభిమానము, వికారము, మంకుతనము, పాపకార్యములందు ఆసక్తి, అధిక కోపము, ఇతరులను మోసగించడం, అసూయ, ద్వేషం** ఇవి తమోగుణ ప్రధానము. ఈ జన్మలో **పాములు, తేళ్ళు, పశువులుగా, పందులుగా, కుక్కలుగా, చేపలుగా, కోళ్ళగా, కాకులుగా, క్రిములుగా, చీమలుగా, దోమలుగా, నక్కలుగా, గుంటనక్కలుగా, జింకలుగా, చెట్లుగా** జీవనం గడుపుతుంది గత జన్మలో తమోగుణముతో జీవితం గడిపిన వారే. ఈ విషయమును గమనించిన వారు తామసగుణము నుండి బయట పడి అధోగతి నుండి తప్పించుకుంటారు.

### రజోగుణము

ఇక రజోగుణము గురించి చెప్తాను. **బలము, శౌర్యము, మదము, ప్రాభవము, సుఖము, దుఃఖము, స్నేహం చెయ్యడము, మిక్కుటమైన కోరికలు, కాంక్షలు, ఏదీ నచ్చక పోవడం, ప్రతాపము, ఇతరులతో పోట్లాడడమూ, ఈర్ష్య, పరుషభాషణ, తిట్టడం, కామప్రవృత్తి, దాని గురించి అబద్ధాలు చెప్పడం, తన గురించి తాను గొప్పలు చెప్పడం, పొగడ్తల అందు ఆసక్తి** ఇవి రజో గుణ ప్రధానుల లక్షణము. రజోగుణ ప్రధానులు నీతి అవినీతి తేడా గ్రహించి ధనము సంపాదించి వాటితో కోరికలు తీర్చుకుంటూ కేవలం ప్రాపంచక విషయముల అందు ఆసక్తులై సుఖజీవనము సాగిస్తూ ఉంటారు. ఇవి రజోగుణ లక్షణములని గ్రహించిన వారు రజోగుణమును విడిచి సత్వగుణమువంక పయనిస్తారు.

### సత్వగుణము

ఇక సత్వగుణము గురించి వివరిస్తాను. **సంతోషము, ప్రకాశము, ప్రియభాషణ, ఆనందము, కరుణ, క్షమాగుణము, సత్యము, శౌచము, ధైర్యము, లోభము లేక ఉండడం, ఓర్పు వహించుట, సత్ప్రవర్తన, అసూయ లేకుండుట, అహింస పాటించుట, ఇతరుల ఎడ కోపము ప్రదర్శించ పోవడము, అన్నింటికి హడవిడి చెయ్యక పోవడము, అందరి ఎడల**

**సమభావము కలిగి ఉండడము, దయ, శ్రద్ధ కలిగి ఉండడము, ఇతరులను గౌరవించడం, క్రూరత్వము విడిచి పెట్టడము** ఇవి సత్వగుణ ప్రధానములు. సత్వగుణ ప్రధానులు **అహంకారము, కామాతురత, అత్యాశ, మమకారము** లేని వారై సదా దైవచింతనలో ఉంటారు. ఈ గుణముల జ్ఞానము ఎరిగిన వాడు వాటి అందు చిక్కడు. ఈ మూడు గుణములు వేరుగా ఉండవు. ఒక దానివెంట ఒకటి ఉంటాయి. ఈ మూడు గుణములలో ఒకటి ప్రకోపించినప్పుడు మరొకటి దానివెంట ఉండి మరొక గుణమును లేకుండా చేస్తుంది. తమస్సు అధోముఖంగా ప్రవహిస్తుంది. రజస్సు మధ్యస్థంగా ఉండి సత్వగుణము ఊర్ధ్వముఖంగా ప్రవహిస్తుంది. ఈ మూడు గుణముల ప్రభావము నుండి బయట పడాలంటే వీటిని నిసర్జించడమే మార్గము. అలా కాక ఈ మూడు గుణములకు లోనైన వారిలో సాత్వికులు స్వర్గలోకముకు పోతారు. రజోగుణప్రధానులు భూలోకములో జన్మిస్తారు. తమోగుణ ప్రధానులు జంతుజన్మలు ఎత్తి నరక బాధలు అనుభవిస్తారు. మానవులు సత్వరజతమోగుణ ప్రభావితులై ధర్మార్ధకామములతో కూడిన కర్మలు చేస్తూ ఉంటారు. కనుక మానవులు త్రిగుణాలను వదిలి నిర్గుణులై ప్రవర్తించాలి.

## అహం

మన శరీరములో **ప్రాణ, అపాన, సమాన, వ్యాన, ఉదాన** వాయువులు ఉన్నాయి. వాటిలో ప్రాణము సత్వగుణము, అపానము రజోగుణము, ఉదానము తమోగుణము. ఈ మూడింటిలో సాత్వికము ఉత్తమమైన గుణము. ఈ మూడు గుణములు సమానంగా ఉండడమే అవ్యక్తము. అదే మహత్తత్వము శాశ్వతమైన బ్రహ్మపదము. ఈ అవ్యక్తము సత్తు, అసత్తులకు అతీతమైనది. ఈ అవ్యక్తము నుండి తెలుసుకున్న వాడు విజ్ఞానవంతుడై మోక్షపదవిని పొందగలడు " అని బ్రహ్మదేవుడు మునులతో చెప్పాడు. బ్రహ్మదేవుడు ఋషులతో ఇంకా ఇలా చెప్పాడు. " ఋషులారా ! అవ్యక్తము నుండి మహతత్వము పుడుతుంది. ఆమహతత్వమును బుద్ధి ధృతి అంటారు. ఈ బుద్ధితో మానవుడు బయట ప్రపంచంలో జరిగేవన్నీ గ్రహించగలుగుతాడు. కనుక బుద్ధికి ప్రపంచంలో ఉన్నత స్థానం ఉంది. ఈ బుద్ధి నుండి అహంకారం పుడుతుంది. ఈ లోకములో ఇన్ని పనులు జరగడానికి కారణం ఈ అహంకారమే. ఈ అహంకారమే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు **వేదాధ్యయనం, వ్రతములు, తపస్సు, యజ్ఞములు** చేస్తున్నారు. ఈ అహంకారతత్వ మహిమ వల్లనే ఈ ప్రపంచంలో సకలకార్యములు జరుగుతున్నాయి. ఈ అహంకారతత్వము నుండి పంచభూతములు పంచభూతముల నుండి తన్మాత్రలు ఆవిర్భవించాయి. ఈ తన్మాత్రలను పొందడానికే మానవులు తాపత్రయ పడుతూ విషయవాంఛలలో తేలియాడుతుంటారు. సకల జీవులూ ఈ మోహాంధకారంలో మునిగి పోతూ ఎన్నటికి బయట పడలేవు. కాని జ్ఞానులు మాత్రము జ్ఞానమనే ఆయుధముతో నిష్కామకర్మలు ఆచరిస్తూ ఈ మోహాంధకారమును ఛేధించి బ్రహ్మపదమును పొందగలరు.

## తత్వములు

ఈ ప్రాపంచక సుఖములు అశాశ్వతము. సుఖంవెంట దు:ఖము. దు:ఖమువెంట సుఖము వస్తూ ఉంటాయి. ఈ విషయ సుఖములే అన్ని వికారములకు మూల కారణము. **విషయసుఖము**ల మీద మోహము లోభాన్ని కలుగజేస్తుంది. ఆ లోభానికి ప్రభావితుడైన మనిషి బుద్ధిని కోల్పోయి దురాలోచనలు చేసి పాపాలు చేస్తాడు. మానవశరీరము రక్తము, మాంసము, ఎముకలతో చేయబడినది. కాలము తిరగానే ఈ శరీరము కరిగిపోతుంది. కాని మానవులు ఈ శరీరము శాశ్వతమని నమ్మి అనేక పాపాలుచేసి నశిస్తారు. మానవులలోని పంచప్రాణములు బుద్ధి, వాక్కు, మనసు ఈ ఎనిమిదిని అంతరాత్మ అంటారు. లోకములో జరిగే సమస్తకార్యములకు ఈ ఎనిమిది తత్వములే కారణము. కుండచేయడానికి మట్టి ఎంత అవసరమో ప్రపంచంలోని సకలకార్యాలకు ఈ ఎనిమిది తత్వములే కారణము. పెద్దలుచేసే జ్ఞానబోధ నుండి ఈ విషయములను గ్రహించాలి. అహంకారం నుండి జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, మనస్సు కలిపి పదకొండు తత్వములు ఏర్పడతాయి. వీటివలన ప్రభావితము కాకుండా బుద్ధి స్వతంత్రముగా ప్రవర్తిస్తుంది. ఆ బుద్ధిని వాడుకున్న వాడు **ఆత్మజ్ఞానము** పొందగలడు.

## ఆధ్యాత్మతత్వము

బ్రహ్మదేవుడు ఇంకా ఇలా చెప్పాడు " ఋషులారా ! ఇప్పటి వరకు ప్రాణులగురించి చెప్పాను. ఇప్పుడు **ఆధ్యాత్మతత్వము** గురించి చెప్తాను. పంచభూతములు ఐదు. అవి **భూమి, నీరు, వాయువు, అగ్ని, ఆకాశము**. ఈ ప్రకృతిలో మూడుతత్వములు ఉన్నాయి. అవి **ఆధ్యాత్మము, అధిదైవతము, అధిభూతము**. చెవి ఆధ్యాత్మము అయితే శబ్దము అధిభూతము. ఆ శబ్దము వచ్చు దిక్కు అధిదైవతము. చర్మము అధ్యాత్మము అయితే స్పర్శ అధిభూతము. ఆ స్పర్శ నుండి పుట్టే విద్యుత్తు అధిదైవతము. నాలుక అధ్యాత్మము అయితే రుచి అధిభూతము. చంద్రుడు అధిదైవతము. ముక్కు

అధ్యాత్మము అయితే వాసన అధిభూతము. వాయువు అధిదైవతము. ఇక కర్మేంద్రియాల గురించి చెప్తాను. వాక్కు ఆధ్యాత్మము అయితే మాట అధిభూతము, అగ్ని అధిదైవతమ. చేతులు ఆధ్యాత్మము అయితే పని చేయడము అధిభూతము, వాటికి దేవేంద్రుడు అధిదైవతము. పాదములు అధ్యాత్మము అయితే నడవడము అధిభూతము. **భభ్రువు** అధిదైవతము. విసర్జకావయవము అధ్యాత్మము అయితే విసర్జము అధిభూతము. **మిత్రుడు** అధిదైవతము. జ్ఞానేంద్రియములు అధ్యాత్మము అయితే శుక్రము అధిభూతము. **ప్రజాపతి** అధిదైవతము. మనసు ఆధ్యాత్మము అయితే ఆలోచన అధిభూతము. చంద్రుడు అధిదైవతము. బుద్ధి అధ్యాత్మము అయితే విషయ పరిజ్ఞానము అధిభూతము, బ్రహ్మ అధిదైవతము. ఈ విషయ పరిజ్ఞానము కలిగిన మానవుడు వీటి మోహములో పడకుండా మోక్షప్రాప్తిని పొందుతాడు.

## నివృత్తి మార్గము

బ్రహ్మదేవుడు ఋషులతో " ఋషులారా ! ఇప్పుడు మీకు **నివృత్తిమార్గము** చెప్తాను. తాబేలు తన అవయవాలను డిప్పలోకి ఎలా లోపలికి తీసుకుంటుందో అలాగే విద్వాంసుడు బయటప్రపంచంలోని కోరికలనుండి తన అవయవములను మనసు లోనికి తీసుకుని మనసును ఆత్మవంక మరలిస్తాడు. అడ్డూఆపు లేకుండా విజృంభించే కోరికలను ఎవరు అదుపు చేయగలడో అతడే ధీరుడు. అతడు సత్వరజతమో గుణాలను విడనాడి మొక్షమార్గమున పయనిస్తాడు. ఇంద్రియనిగ్రహము చాలా కష్టమైన పని. ఈ ఇంద్రియములకు అతీతంగా ఆత్మవెలుగుతూ ఉంటుంది. ఆత్మను దర్శించిన వాడే మోక్షముకు అర్హుడు. పంచభూత నిర్మితమైన ఈ శరీరంతో సంసారసాగరాన్ని దాటడము కష్టసాధ్యము. ఎందుకంటే సంసారంలో ఇంద్రియ సుఖాలు, దు:ఖాలు, రోగాలు వస్తూపోతూ ఉంటాయి. ఈ సంసారానికి కామము క్రోధము అధిపతులు. కనుక మానవుడు ముందుగా కామమును, క్రోధమును జయించాలి. అప్పడే సంసారసాగరాన్ని సులభంగా దాటగలడు. ఒక దీపము అనేక దీపాలను వెలిగించినట్లు ఒక్క **పరమాత్మ** అనేక ఆత్మలుగా వెలుగొందుతున్నాడు. ఈ విషయాన్ని తెలుసుకుని అన్ని భూతములలో పరమాత్మను దర్శిస్తారు. పామరులు ఈ విషయాన్ని ఎరుగక అనేక అవస్థలు పడుతున్నారు. ఈ పరమాత్మకు **అనిలిడు, అగ్ని, సోముడు, విష్ణువు, అజుడు, శివుడు** అనే పేర్లు ఉన్నాయి. ధర్మము లక్షణము అహింసావ్రతము. అధర్మము లక్షణము హింస. మనుష్యుల లక్షణము కర్మలు చెయ్యడం. ఆకాశం లక్షణం శబ్దం, వాయువు లక్షణం స్పర్శ, జ్యోతి లక్షణం వెలుగు రూపము, నీటి లక్షణం, భూమిలక్షణం వాసన, విద్యకు లక్షణం సత్యం పలకడం, మనసు లక్షణం ఆలోచన చింత, బుద్ధి లక్షణం విచక్షణ, మహత్తు లక్షణం ధ్యానం చెయ్యడం, ఆవ్యక్తం లక్షణం ధ్యానం చెయ్యడం, సాధుస్వభావం, యోగము లక్షణం ప్రవృత్తి, జ్ఞాని లక్షణం కర్మబంధములు విడుచుట. జ్ఞానంతో కూడిన సన్యాసం మోక్షము కలిగిస్తుంది. ద్వంధములకు అతీతమైన యోగిని రోగములు, మృత్యువు బాధించవు. ఈ ప్రకృతి అవ్యక్తము. దీనిని క్షేత్రము అంటారు. ఈ ప్రకృతి సత్వరజోతమో గుణముల నుండి పుట్టింది. అన్నీ తెలిసిన మనలో ఉన్న అంతరాత్మయే పురుషుడు. అతడికి అంతా తెలిసినా గుణాతీతుడైన అతడు స్థిరంగా ఉంటాడు. అతడు దేనికీ ప్రభావితుడు కాడు. **జీవాత్మ** ప్రకృతి నుండి విడిపడి పరమాత్మ వంక పయనించిన నాడు ముక్తి పొందగలడు.

## శ్రేష్టమైనవి

జ్యోతిస్సులలో సూర్యుడు, పంచభూతములలో అగ్ని, విద్యలలో **సావిత్రీదేవి**, దేవతలలో **ప్రజాపతి**, వేదములలో **ఓంకారం** పక్షులలో డేగ, యజ్ఞవిధానములో **హవిస్సు**, పర్వతాలలో **మేరుపర్వతము**, వృక్షములలో జువ్వి, దిక్కులలో **ఊర్ధ్వము**, నదులలో గంగానది, సరస్సులలో సముద్రము, నాలుగు ఆశ్రమములలో **గృహస్థాశ్రమము**, ప్రజాపతులలో నేను, తత్వములలో **విష్ణుతత్వము**, దేవతలలో ఈశ్వరుడు శ్రేష్టము. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు వేరుగా పిలువబడినా ముగ్గిరిలో ఉన్న **పరమాత్మతత్వము** ఒక్కటే. ఈ ఏకత్వాన్ని గుర్తించడమే **బ్రహ్మజ్ఞానము**. రాత్రి పగలు ఒకదాని వెంట ఒకటి ఎలా వస్తాయో కష్టం వెంట సుఖం, సుఖం వెంట కష్టం వస్తాయి పోతాయి. సుఖములు వచ్చినప్పడు పొంగి పోవడము కష్టం వచ్చినప్పడు కుంగి పోవడంతగదు. ప్రపంచంలో పుట్టిన ప్రతివస్తువు పెరగడనమూ తరగడమూ జరుగుతూ ఉండడం సహజము. పుట్టినవస్తువు మరణించుట సహజం. సుఖాలన్నీ దు:ఖానికి బాట వేస్తాయి. విజ్ఞులు ఈ విషయము తెలుసుకుని అన్నింటి అందు సమదృష్టితో ప్రవర్తిస్తారు.

## ఆశ్రయములు

బ్రహ్మదేవుడు ఋషులకు గృహస్థాశ్రమధర్మముల గురించి ఇలా చెప్పసాగాడు " ఆశ్రమములలో **బ్రహ్మచర్యము** మొదటిది. బ్రహ్మచారి గురువుకు శుశ్రూష చేస్తూ వేదాధ్యయనం చెయ్యాలి. ప్రతిరోజు భిక్షాటనచేస్తూ ఆహారము సేకరించాలి. బిల్వవృక్షము నుండి సేకరించిన దండమును ధరించాలి. శుచిగా, శుభ్రముగా ఉండాలి. బ్రహ్మచర్యము పాటించాలి.

ఇంద్రియములను అదుపులో ఉంచుకోవాలి. **యజ్ఞోపవీతము** ను ధరించాలి. మొలనూలు ధరించాలి. మితభాషణ చెయ్యాలి. ఒద్దికగానూ నియమంగానూ ప్రవర్తించాలి. సత్యముపలకాలి, మనసు ప్రశాంతంగా ఉంచుకోవాలి. రెండు వేళలా అగ్నికార్యము నిర్వహించాలి. పాపకార్యముల జోలికి వెళ్ళకుండా ఉండాలి. ఇవి బ్రహ్మచారి ఆచరించ వలసిన విధానములు. గృహస్థు బయట ప్రపంచంలో తిరిగే సమయంలో ధర్మము, న్యాయము పాటిస్తూ ఆ విధంగానే నడవాలి. పరస్త్రీవంక కన్నెత్తి చూడకూడదు. నిర్మలమైన జీవితంగడపాలి. పంచయజ్ఞములు పాటించాలి. అతిథులను ఆదరించాలి. అతిథులకు పెట్టి తానుభుజించాలి. తెల్లని వస్త్రములను ధరించాలి. శక్తికొద్దీ దానములు చెయ్యాలి. ఇంద్రియ నిగ్రహము పాటించాలి. సదా శుచిగా ఉండాలి. అందరితో మైత్రివహించాలి. క్షమాగుణము కలిగి ఉండాలి. వేదాధ్యయనము, యజ్ఞయాగములు చెయ్యాలి. సత్పురుషులు ఇచ్చే దానములు స్వీకరించాలి. నిష్పక్షపాత బుద్ధి కలిగి ఉండాలి. పాపకార్యములకు దూరంగా ఉండాలి. ఇవీ గృహస్థాశ్రమ ధర్మాలు. తరువాత ఆశ్రమము వానప్రస్థము. వానప్రస్థులు జనపదములను వదిలి వెళ్ళాలి. అరణ్యములో కుటీరములు నిర్మించుకుని జీవించాలి. రెండు పూటలా స్నానం ఆచరించాలి. సంధ్యావందనం చెయ్యాలి. బ్రహ్మచర్యము పాటించాలి. అరణ్యములో లభించే ధాన్యము, పండ్లు, కాయలు, ఆకులు, దుంపలు ఆహారం స్వీకరించాలి. నార వస్త్రాలను, చర్మములను ధరించాలి. భూశయనం చెయ్యాలి. అతిథులను సత్కరించాలి. వేదాధ్యయనం అగ్నిహోత్రము ప్రతి నిత్యము చెయ్యాలి. ఇంద్రియములను అదుపులో పెట్టుకోవాలి. ఇవి వానప్రస్థులు ఆచరించ వలసిన ధర్మములు. సన్యాసాశ్రమ ధర్మాలను వివరిస్తాను. సన్యాసి సకల ప్రాణుల ఎడ దయకలిగి ఉండాలి. అహింసను పాటించాలి. గతించిన విషయానికి విచారించ కూడదు. జరగనున్న వాటిని గురించి ఆసక్తి కనబరచగూడదు. జరుగుతున్న దానిని గురించి మాత్రమే ఆలోచిస్తూ జీవిక సాగించాలి. తాబేలు తన అవయవములను డిప్పలోకి లాగినట్లు సన్యాసి బాహ్యవిషయాలను లోనికి లాగివేసి నిరాసక్తత కలిగి ఉండాలి. కేవలం భిక్షాటనచేసి జీవించాలి. రేపటికి తన కొరకు ఏమీ దాచుకొనకూడదు, కూడబెట్ట కూడదు. రోజుకు ఒక రోజు మాత్రమే భుజించాలి. ఇతరుల నుండి ఆహారము వస్త్రములను తప్ప వేరేమి గ్రహించకూడదు. స్నేహము, ప్రశంశలకు, కోపతాపములకు లొంగకూడదు. అసూయ కోపము ఉండ కూడదు. ఇంద్రియములను మనసును నిగ్రహించుకోవాలి. బ్రహ్మచర్యము పాటించాలి. క్రమజీవితము పాటించాలి. సత్యము, అహింస పాటించాలి. ఇవి సన్యాసి ఆచరించ వలసిన ధర్మమ్ములు.

## సన్యాసి ఉండవలసిన ప్రదేశములు

బ్రహ్మదేవుడు ఋషులతో సన్యాసి ఉండవలసిన ప్రదేశముల గురించి ఇలా చెప్పసాగాడు. " **చెట్ల కింద, నదీతీరములలో, జనము లేని చోట, అడవులలో, కొండగుహలలో, దేవాలయములలో** నివసించాలి. కుటిలత్వముతో ఏమీ సంపాదించకూడదు. తన గొప్పతనము గురించి ప్రచారము చేయ కూడదు. తన వద్దకు వచ్చే ప్రజలతో అంటీ ముట్టనట్లు ఉండాలి. ఇవి సన్యాసిలక్షణము. సన్యాసము అంటే తపస్సు చేసుకోవడము. తపస్సు వలననే జ్ఞానము సంపాదించి సన్యాసి పరమాత్మదర్శనం చేస్తాడు. తపస్సు వలన సన్యాసి రజో తమో గుణాలను వదిలి సత్వగుణ ప్రధానుడు ఔతాడు. మొక్షమార్గముకు అదే తొలిమెట్టు. సన్యాసి తపో మార్గములో ద్వంద్వములను వదిలి మోక్షము కొరకు ప్రయత్నించాలి.

### సంసార వృక్షం

ఋషులారా " సంసారము అనేది మహావృక్షము. ఈ వృక్షముకు అవ్యక్తము అనేది విత్తనము. బుద్ధి అనేది కాండము. అహంకారమే దీని కొమ్మలు. పంచభూతములు దీని ఆకులు రెమ్మలు. ఇంద్రియములు ఈ చెట్టుకు ఉండే తొర్రలు. ఈ సంసార వృక్షానికి మంచి చెడు అనే పండ్లు కాస్తుంటాయి. ఆశలు అనే చిగుళ్ళు ఎప్పుడూ చిగురిస్తూనే ఉంటాయి. ఈ చెట్టును నరకడానికి **జ్ఞానము**అనే కత్తి కావాలి. జ్ఞానము అనే కత్తితో సంసారము అనే వృక్షాన్ని నరికిన వాడు బ్రహ్మపదమును పొందగలడు. దానికి యోగసాధన అవసరము. ఆ యోగసాధన ద్వారా ముందు జీవాత్మను దర్శించాలి. క్షణకాల దర్శనమైనా అది మిక్కిలి ఆనందాన్ని కలిగిస్తుంది. తరువాత ఈ విషయ వాంఛలను వదిలి ముక్తిమార్గమున పయనిస్తాడు. ఋషులారా ! మీకు తెలియనిది ఏమున్నది. వేదములు చదివిన తత్వవేత్తలు మీరు. ఆత్మసాక్షాత్కారానికి సత్వమార్గము తప్ప మరొక మార్గము లేదు. సత్యము, ఆనందము, అహింస, క్షమాగుణము, మంచిప్రవర్తన, సన్యాసము, ఒకరికి ఇచ్చే గుణము, విజ్ఞానము ఇవి సాత్విక గుణములు. **పరమాత్మ**ను చేరుకోవాడానికి ఈ సాత్వికగుణములే సోపానాలు " అని అన్నాడు బ్రహ్మదేవుడు.

### అనుసరించవలసిన ధర్మములు

ఋషులు బ్రహ్మదేవుడితో " బ్రహ్మదేవా ! ధర్మములు అనేక విధములు అంటారు కదా ! వాటిలో దేనినీ అనుసరించిన మేలు

జరుగుతుంది. మేము అందరమూ అన్ని ధర్మములను అనుసరిస్తూ అన్నీ ధర్మములను అనుసరిస్తూ వాటిలో ఏది మంచిది అనే నిర్ణయానికి రాలేక పోతున్నాము. కనుక నిశ్చయమైన ధర్మమేదో దానిని మాకు బోధించండి. ఇంకా సత్వగుణముకు పురుషుడికి ఉన్న సంబంధము వివరించండి " అని అడిగారు. బ్రహ్మదేవుడు వారితో " ఋషులారా ! సకల ధర్మములలో అహింస పరమధర్మము. అహింసను అవలంబించే వాడికి ఉత్తమమైన జ్ఞానము లభిస్తుంది. అదే మోక్షముకు మార్గము. నిరంతర కోరికలతో సతమతమయ్యే వాడు ప్రాపంచక సుఖములు అనే బంధములో చిక్కుకుంటాడు. అందు వలన జననమరణ చక్రములో తిరుగుతూ ఉంటాడు. కోరికలు సహజమే. వాటిని తీర్చుకోవడానికి కర్మలుచెయ్యడమూ సహజమే. కాని ఫలితము ఆశించక కర్మలుచేసినప్పుడు కర్మబంధములు అంటవు. ఫలాపేక్ష లేకుండా చేసే కర్మల వలన మానవుడు బంధములో చిక్కడు. అదే మోక్షముకు మార్గము. కనుక మానవుడు బయటి ప్రపంచములో విహరించే సమయంలో మానవుడు తామరాకు మీద నీటి బొట్టువలె వ్యవహరించాలి. దేనిమీదా ఆసక్తి చూపకూడదు. అప్పుడు అతడికి ఏ బంధములు అంటవు. పరతత్వము దర్శించడానికి సత్వము అనేది **దివిటీ** వంటిది. కనుక పరతత్వ సాధనలో సత్వము ఒక మంచి సాధనము. సత్వగుణ సాధనతో యోగులు **పరతత్వము**ను సాధించి ముక్తిని పొందుతారు. కనుక సత్వము ముక్తిని పొందడానికి ఒక మంచి ఉపాయము. ఎవరైనా ఉపాయము లేనిది ఏదీ సాధించ లేడు. కనుక సత్వము ముక్తికి తరుణోపాయము. సాధకుడు సత్వగుణముతో తను తాను శుభ్రపరచుకోవాలి. తాను తలపెట్టిన కార్యము సిద్ధిస్తుందా లేదా అన్న సందేహము వదిలి పెట్టాలి. తాను శక్తివంతుడిని అన్న విషయాన్ని గుర్తుంచుకోవాలి. నిరంతరసాధన చేస్తూ సాధకుడు ఆత్మజ్ఞానము కలిగే వరకు నిరంతరము సత్వగుణమును అవలంబించాలి. ఒకసారి **ఆత్మసాక్షాత్కారము** కలిగిన తరువాత సత్వగుణము కూడా వదిలి నిర్గుణుడై ముక్తి కొరకు సాధన చెయ్యాలి. ఋషులారా ! మరలా చెప్తున్నాను. అవ్యక్తము నుండి మహతత్వము మహతత్వము నుండి అహంకారము అహంకారము నుండి పంచభూతములు వాటి నుండి శబ్ద, రూప, రస, స్పర్శ, గంధములు ఏర్పడ్డాయి. వీటి వలననే విషయములు ఏర్పడతాయి. ఈ విషయ వాంఛలలో మానవుడు మునిగితేలుతుంటాడు. ఎవరైతే వీటిని గురించి తెలుసుకుంటాడో అతడూ ఈ విషయాలను తేలికగా అధిగమించగలడు. విషయముల గురించి తెలుసుకుంటూ పంచ భూతముల గురించి తెలుసుకోవాలి. పంచభూతముల గురించి తెలుసుకున్న మానవుడు శరీరము పంచభూతాత్మకము అని తెలుసుకుని దేహాభిమానము వదిలి ముక్తిమార్గములో పయనిస్తాడు. రథసారధి రథముకు కట్టిన గుర్రాలను నియంత్రించినట్లు మనసు ఇంద్రియములను అదుపులో ఉంచుతుంది. దానికి బుద్ధి తోడ్పడుతుంది. అందుకనే ఈ శరీరము అనే రథములో అధిరోహించి ఉన్న అంతరాత్మ స్వేచ్ఛగా విహరిస్తుంది. ఈ రహస్యమును తెలుసుకున్న సాధకుడు నిర్గుణుడై ముక్తిపథంలో పయనిస్తాడు. సముద్రంలో అలలు ఎలా పైకి లేస్తూ కింద పడుతూ ఉంటాయో అలాగే ఈ చరాచర జీవరాశులు అవ్యక్త మైన ప్రకృతిలో పుడుతూ పెరుగుతూ చస్తూ ఉంటాడు. ఈ అవ్యక్తమైన ప్రకృతి అవ్యయుడైన పరమాత్మ నుండి ఆవిర్భవించింది. కనుక ఈ ప్రకృతి శాశ్వతము కాదు. ఈ సత్యము తెలిసిన వాడు మోహబంధములలో చిక్కడు. పరమాత్మను దర్శించడానికి తపస్సే కారణము కనుక సాధకుడు తపోధనము సంపాదించాలి. పూర్వము ప్రజాపతులందరూ తపో మార్గముతోనే ఈ సృష్టికార్యము నిర్వహించారు. ఆకులూ అలములు తిని మహామునులు తపసు చేసి మహాజ్ఞానము పొందగలిగారు. తపస్సు వలన తను నేర్చుకున్న విద్యలో నైపుణ్యం సిద్ధిస్తుంది. ఏ ఇతర మార్గములో పొందవచ్చు. బ్రాహ్మణులను హింసించడం, మద్యపానము మొదలైన దుర్గుణములను తపోమార్గము దూరంచేస్తుంది. తపస్సువలన సమస్త భూతకోటి తృప్తి చెందుతుంది. ఈ తపోదీక్షలో సాధకులు, యోగులు, మమతలు, అహంకారము వదిలి పెట్టి బ్రహ్మపదము పొందుతారు. ఈ బ్రహ్మపదము పొందడానికి ముందు రజోగుణము, తమోగుణము వదిలిపెట్టి సత్వగుణమును ఆశ్రయించాలి. క్రమంగా ఆ సత్వగుణమును కూడా వదిలి నిర్గుణుడై పరమాత్మలో ఐక్యము ఔతాడు. వేదముల అంతమున ఉన్న ఉపనిషత్తుల సారమే జ్ఞానసముపార్జనకు ముఖ్యమైనది. ఈ ఉపనిషత్తులను అధ్యయనం చేయడంద్వారా జ్ఞానము సిద్ధిస్తుంది. ఉపనిషత్తులను అధ్యయనం చేయుటద్వారా ఆత్మజ్ఞానము కలుగుతుంది. మనలో ఉన్న జ్ఞానమే క్షేత్రజ్ఞుడు. మానవుడు కర్మజీవి. ఎప్పుడూ ఏదో ఒక పని చేస్తుంటాడు. ఆ పనిలో లీనం ఔతుంటాడు. ఆ పనులను మనసు పెట్టి చేస్తూ ఉంటాడు. కాని ఆత్మమాత్రం ఏ పనిలో లీనం కాకుండా సాక్షీభూతంగా చూస్తూ ఉంటుంది. ఇదియే యోగసాధన. ఈ ప్రకృతి అవ్యక్తము. మానవుడు ప్రకృతిలో సంచరిస్తూ ఉంటాడు. కాని తనలోని ఉన్న అవిద్య కారణంగా తాను చేసే ప్రతి పనిలోనూ మమతాను బంధాలు పెంచుకుంటాడు. తాను చేసే పనిని మమతానురాగాలు లేకుండా నిర్మలంగా మమతానురాగాలు లేకుండా చేస్తే ఆ బంధనాలు అంటవు. దాని వలన వచ్చే దు:ఖము అంటదు. యోగులు రెండురకాలు. జ్ఞానయోగులు, కర్మ యోగులు. జ్ఞానయోగులు జ్ఞానయోగమే మేలంటారు. కర్మయోగులు కర్మచేయడమే మేలంటారు. కాని వేదము ముందుగా కర్మలుచెయ్యాలి. పదహారు వికారాలతో **పరమాత్మ**ను సేవించాలి. క్రమేణా కర్మలు వదిలి జ్ఞానయోగము అవలంబించాలి. ఎందుకంటే జ్ఞానమే పురుషుని యొక్క స్వభావము. ఈ జ్ఞానము కలిగిన సాధకుడు కర్మలను వదిలి జ్ఞానయోగము అవలంబించి తుదకు ముక్తిని పొందుతాడు. కనుక మానవుడు నిత్యమూ తాను చేస్తున్న కర్మలలో లీనం కాకుండా మనసును స్థిరముగా నిలిపి కోరికలను వదిలి అన్నింటి ఎడలా సమభావము కలిగి ముక్తిని పొందగలరు. ఋషులారా ! బ్రాహ్మణులారా ! అన్ని విషయాలు మీకు వివరంగా చెప్పాను. మీరు ఈ విధంగా మీ మీ కర్మలు నిర్వర్తించండి. మీకు **పరమపదసిద్ధి** కలుగుతుంది " అని బ్రహ్మదేవుడు ఋషులకు మునులకు జ్ఞానోపదేశము చేసాడు. అని గురువు శిష్యుడికి చెప్పాడు. పైవిధంగా శ్రీకృష్ణుడు అర్జునుడికి జ్ఞానబోధ చేసాడు.

## గురుశిష్యులు

అప్పుడు అర్జునుడికి ఒక సందేహము కలిగింది. అర్జునుడు " శ్రీకృష్ణా ! ఇంతకూ ఆ గురువు ఎవరు ? ఆ శిష్యుడుఎవరు ? " అని అడిగాడు. శ్రీకృష్ణుడు పకపక నవ్వి " అర్జునా ! ఇంకా అర్ధము కాలేదా ! ఆ గురువును నేను. ఆ శిష్యుడు నా మనసే. నీ మీద ప్రీతితో నీకు జ్ఞానబోధ చేసాను. నీవు నిర్మలము, చంచలము కాని నీ మనసును నా మీద నిలిపి ఆధ్యాత్మమును అనుసరించు. నీలో ఉన్న చింతలు అన్నీ సమసి పోతాయి. ఇప్పుడు చెప్పిన అన్ని విషయములు నీకు నేను యుద్ధముకు ఆరంభంలోనే చెప్పాను. నీ మనసును ఇంద్రియములను నిగ్రహించుకుని అచంచలమైన మనసుతో **ఆత్మజ్ఞానం**లో రమించు " అని శ్రీకృష్ణుడు అర్జునుడికి జ్ఞానబోధచేసాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్ఠరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రథుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

# అశ్వమేధ పర్వము తృతీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# తృతీయాశ్వాసము

శ్రీకృష్ణుడు అర్జునుడికి ఆత్మ విద్య బోధంచిన తరువాత " అర్జునా ! నా చిత్తము నా తండ్రి వసుదేవుడిని చూడాలని ఆరాట పడుతుంది. నేను త్వరగా ద్వారకకు వెళ్ళాలి. మీ అనుమతి కొరకు ఎదురు చూస్తున్నాను " అని అన్నాడు. అర్జునుడు " కృష్ణా ! అయితే మనము వెంటనే హస్థినకు వెడదాము. నేను నీ ద్వారక ప్రయాణము గురించి ధర్మరాజుకు చెప్పి ఒప్పిస్తాను. ఆయన కూడా నిన్ను సంతోషముగా ద్వారకకు పంపుతాడు " అని అన్నాడు తరువాత కృష్ణార్జునులు రధము ఎక్కి హస్థినకు పయనమయ్యారు. మార్గమధ్యములో " కృష్ణా ! నీ దయ వలన కౌరవసైన్యము అనే సాగరమును దాటాము. యుద్ధములో శత్రువులను జయించాము. భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు మొదలైన మహా వీరులను జయించాము. నీవు ముందుగా శత్రువులను చంపిన తరువాత మేము ఈ కీర్తి ప్రతిష్ఠలను పొందాము. ధర్మరాజు పట్టాభిషిక్తుడయ్యాడు. ఈ జయము నీది. నీవు సర్వాంతర్యామివి. నీ మహిమగురించి పొగడటము మా తరమా ! దామోదరా ! నీవు ఈ విశ్వసంవిధాతవు. నీ తేజస్సే **అగ్నిష్టోమము**. నీవే కాలస్వరూపుడవు. నీ ఉఛ్వాసనిశ్వాసములే వాయువు. నీ క్రోధమే మృత్యువు. నీ అనుగ్రహమే లక్ష్మీకటాక్షము. నీ మూలముగానే మానవులకు జనన మరణాలు సంభవిస్తున్నాయి. ఈ చరాచరజగత్తు నీ వలనే ఉద్భవించింది. నీవు భావాతీతుడవు. నీవు సర్వజగత్పతివి. కృష్ణా ! నారదుడు, **దేవలుడు, కౌశికుడు**, వ్యాసుడు మొదలైన మహామునులు, భీష్ముడు, చెప్పిన మంచి మాటలు విని నీవు సకల ధర్మస్వరూపుడవని తెలుసుకున్నాను. నీవు నా మీద ఉన్న కరుణాకటాక్షముతో ఆధ్యాత్మవిద్యను బోధించావు. అది విని నేను బ్రహ్మానందం పొందాను " అని అర్జునుడు శ్రీకృష్ణుడిని భక్తితో స్తుతించాడు. ఆ మాటలు విన్న వాసుదేవుడు అర్జునుడిని అభినందిస్తూ ఆదరంగా చూసాడు. కృష్ణార్జునులు హస్థినాపురము పోయి ముందుగా ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళి ధృతరాష్ట్ర గాంధారీల ఆశీర్వాదము తీసుకున్నారు. తరువాత కుంతీదేవి ఆశీర్వాదము తీసుకున్నారు. తరువాత విదురుడు, ధౌమ్యుడు, **యుయుత్సుడు**, సంజయుడు మొదలగు వారిని కలుసుకుని తరువాత ధర్మరాజు వద్దకు వెళ్ళరు. ధర్మరాజు శ్రీకృష్ణుడిని ఆలింగనము చేసుకున్నాడు. అర్జునుడు అన్నగారికి భక్తితో నమస్కరించాడు.

## శ్రీకృష్ణుని ద్వారక ప్రయాణ ప్రస్థావన

మరునాడు కృష్ణార్జునులు కలిసి ఆస్థాన మండపములో ఉన్న ధర్మరాజు వద్దకు వెళ్ళారు. అర్జునుడు ధర్మరాజుతో " అన్నయ్యా ! మన బావ శ్రీకృష్ణుడు హస్థినకు వచ్చి చాలా రోజులు అయ్యింది కదా ! ద్వారకలో శ్రీకృష్ణుడి తండ్రి వసుదేవుడు అతడి సోదరులు అతడి కొరకు ఎదురు చూస్తుంటారు కదా ! వారిని చూడాలని శ్రీకృష్ణుడు కూడా ఆతురతగా ఉన్నాడు. అందువలన తమరు అనుమతిస్తే శ్రీకృష్ణుడు ద్వారకకు బయలు దేరుతాడు. అక్కడ దేవకీ వసుదేలనూ అన్న బలరాముడిని చూసి వారితో కొంతకాలము గడిపి తిరిగి హస్థినకు వస్తాడు " అని అన్నాడు. ధర్మరాజు సంతోషముగా " తమ్ముడూ అర్జునా ! అలాగే చేస్తాము. కృష్ణా తమరు ద్వారకకు వెళ్ళి మా బదులుగా తమరి తల్లి దేవకీదేవికి తండ్రి వసుదేవుడికి మా నమస్కారములు తెలియజెయ్యండి. తక్కిన బంధువుల మిత్రుల యోగక్షేమును అడిగినట్లు చెప్పండి. కొన్నిరోజులు వారితో గడిపి తరువాత తమరు నేను చేయబోవు అశ్వమేధయాగముకు బంధుమిత్ర సమేతంగా సపరివారంగా రండి " అని సాదరంగా ఆహ్వానము తెలిపాడు. తరువాత శ్రీకృష్ణుడు కుంతీదేవి అనుమతి తీసుకున్నాడు. ద్రౌపది సుభద్రలను కలుసుకుని వారి అనుమతి తీసుకున్నాడు. సుభద్రను హస్థినకు తీసుకు వెళ్ళడానికి కుంతీదేవి అర్జునుల అనుమతి తీసుకున్నాడు.

## శ్రీకృష్ణుడు ఉదంకుడిని కలుసుకొనుట

శ్రీకృష్ణుడు ద్వారకకు పయనమయ్యాడు. రధము ముందుకు పోతుందే కాని శ్రీకృష్ణుడి మనసు మాత్రము అర్జునుడి మీద నుండి మరల లేదు. రధము ముందుకు పోతుంటే శ్రీకృష్ణుడు అర్జునుడు కనిపించినంత సేపు వెనక్కి తిరిగి చూస్తూనే ఉన్నాడు. శ్రీకృష్ణుడు సాత్యకి ఒక రధము మీద ఉంటే సుభద్ర వేరొక రధము మీద ప్రయాణం చేస్తున్నారు. అలా ద్వారకకు వెడుతూ శ్రీకృష్ణుడు ఉదంకుడి ఆశ్రమము చూసి అయన వద్దకు వెళ్ళాడు. ఉదంకుడు శ్రీకృష్ణుడిని చూసి " కృష్ణా ! పాండవులు కౌరవులు ఇరువురి నడుమ సయోధ్య కుదిర్చావా ! కౌరవులు, పాండవులు ఎవరి రాజ్యములు వారు పాలిస్తూ క్షేమంగా ఉన్నారా ! " అని ఏమీ ఎరుగని వాడిలా అడిగాడు. శ్రీకృష్ణుడు కూడా ఏమీ ఎరుగని వాడిలా " మహర్షీ ! నేను కురు పాండవుల సంధి ప్రయత్నం చేస్తూ వారితో అనేక విధముల వాదించి నయానా భయానా చెప్పాను. కొంచం గద్దించి కూడా చెప్పాను. అయినా సుయోధనుడు అతడి తమ్ములు పెడచెవిన పెట్టారు. నాతోచేరి మహర్షులు, మునులు, భీష్ముడు, ద్రోణుడు సంధి చేసుకోవడమే మేలని పలు విధముల చెప్పారు. కాని సుయోధనుడు లోభత్వముతో సంధికి అంగీకరించాడు. కురుపాండవులకు జరిగిన యుద్ధములో కౌరవులు సమూలంగా నాశనం అయ్యారు. పాండవులు ఐదుగురు తప్ప ఇరువర్గాలలో ఎవరూ మిగల లేదు. కాల నిర్ణయమును ఎవరు తప్పించగలరు " అని చెప్పాడు.

## ఉదంకుడి ఆగ్రహం


తన విశ్వరూపమును చూపించనమని శ్రీకృష్ణుడిని అడుగుతున్న ఉదంకుడు

ఈ మాటలకు ఉదంకుడు కోపంతో ఊగిపోతూ " కృష్ణా ! దీనికంతా నువ్వే కారణం. నువ్వు తలచు కుంటే సంధి కుదిరేది. నీకు శక్తి ఉండి కూడా ప్రయత్నించక నీ మోసంతో కౌరవులను సమూలంగా నాశనం చేసావు. ఇంత ఘోరము నీ వలననే జరిగింది కనుక నేను నిన్ను శపిస్తున్నాను " అని కోపంతో పలికాడు. ఆ మాటలు విన్న కృష్ణుడు " మహర్షీ ! నేను చెప్పబోవు మాటలు విని తరువాత మీ ఇష్టము వచ్చిన విధముగా చెయ్యండి. మహర్షి మునులకు కోపంము తగదు. కనుక శాంతం వహించి ప్రశాంత చిత్తముతో నేను చెప్పేది వినండి. అనవసరంగా నాకు శాపం ఇచ్చి తమరి అమూల్యమైన తపోబలం వ్యర్ధము చేసుకోకండి " అని అన్నాడు. ఉదంకుడు శాంతించి " సరే నువ్వు చెప్పదల్చుకుంది ఏదో చెప్పు శాంతంగా వింటాను " అని అన్నాడు. శ్రీకృష్ణుడుచిరునవ్వు నవ్వి " ఉదంకా ! నేనెవరో నీకు తెలియచెప్తాను. సత్వరజోతమో గుణములు నా యందే ఉండి నా ఆజ్ఞానుసారం ప్రవర్తిస్తాయి. మరుత్తులు, వసువులు మొదలైన దేవతాగణములన్ని నా అందే ఉద్భవించాయి. ఈ విశ్వమంతా నేను వ్యాపించి ఉన్నాను. ఈ సృష్టి అంతా నా అందే వ్యాపించి ఉంది. పర, అపర తత్వములు నేనే. ఓంకారము, వేదములు, నాలుగు వర్ణములు , నాలుగు విధములైన ఆశ్రమాలు, వాటికి సంబంధించిన సమస్త కర్మలు, స్వర్గము, మోక్షము అన్నీ నేనే నా రూపాలే. యజ్ఞయాగాలలో నన్ను స్థుతించి యజ్ఞఫలమును పొందుతుంటారు. పాపములు చేసిన వారు కూడా నన్ను భజించి వారి పాపములకు ప్రాయశ్చితము చేసుకుంటారు. ఈ లోకములో అధర్మము పెచ్చుపెరిగి పోయనప్పుడు నేను అవతరించి అధర్మమును రూపుమాపి ధర్మమును రక్షిస్తాను. నేను బ్రహ్మాగా, ఈశ్వరుడుగా, విష్ణువుగా ఆయా విధులు నిర్వహిస్తూంటను. అంటే సృష్టి, స్థితి, లయములను నేను మూడు రూపములలో నిర్వర్తిస్తుంటాను. ధర్మముకు హాని జరిగినప్పుడు అధర్మవర్తకులను రూపు మాపి ధార్మికులను రక్షించి లోకోపకారము చేస్తాను. ఉదంకా నేను సర్వసమర్ధుడిని అయినా అధర్మవర్తనులైన కౌరవులతో ధర్మవర్తనులైన పాండవులను కలపడానికి ఎంతో ప్రయత్నము చేసాను. నేను చేసిన ప్రయత్నమును వ్యాసుడు, మొదలైన మహా మునులు కూడా ప్రశంసించారు. కాని దుర్మదులైన కరవులకు నా మాటలు రుచించ లేదు. అందువలన యుద్ధమే శరణ్యం అయినది. అధర్మవతనులైన కౌరవులు సమూలంగా నాశనం అయ్యారు. జరిగిన విషయం నీకు చెప్పాను. ఇక నీవు చెయ్యతలచినది చెయ్యి " అన్నాడు. ఉదంకుడు " శ్రీకృష్ణా ! నీవు ఎవరో నీ మహిమలు ఏమిటో నాకు ముందే తెలుసు. కాని నేను తాత్కాలిక కోపానికి గురి అయ్యాను. అందుకే నిన్ను నిందించాను. నీ అమృతతుల్యమైన వాక్కులతో నా మనసులోని మాలిన్యాలను కడిగివేసావు. కాని నాకు ఒక కోరిక ఉంది. మహోన్నతమైన నీ విశ్వరూపము చూడాలని కోరికగా ఉంది. నేను అందుకు అర్హుడిని అనుకుంటే నాకు నీ విశ్వరూపము చూపించు " అని ప్రార్ధించాడు. ఉదంకుడి మాటలు మన్నించిన శ్రీకృష్ణుడు నాడు యుద్ధభూమిలో అర్జునుడికి చూపించిన విశ్వరూపమును ఉదంకుడికి చూపించాడు. అనిర్వచనము, అద్భుతమైన ఆవిశ్వరూపమును చూసిన ఉదంకుడు ఏకకాలమున భయము ఆనందము ఆశ్చర్యముకు లోనై చేతులు జోడించి శ్రీకృష్ణుడిని ఇలా స్తుతించాడు. " పుండరీకాక్షా ! ఈ భూమి అంతా నీ పాదపద్మములతో నిండి పోయింది. ఆకాశమంతా నీ శిరస్సులతో నిండి పోయింది. నీ యొక్క నడుము అంతరిక్షము అంతా నిండి పోయింది. నీ భుజములు, చేతులు అన్నిదిక్కులను ఆక్రమించాయి. లెక్క లేనన్ని శిరస్సులతో చేతులతో కాళ్ళతో ఈ విశ్వం అంతా నీవే నిండి ఉన్నావు. మహాత్మా ! నీ విశ్వరూపమును కళ్ళారా చూసి ధన్యుడిని అయ్యాను. నా మనస్సు తృప్తి చెందింది. లోకోత్తరమైన ఈ విశ్వరూపమును ఉపసంహరించి నీ జగన్మోహనాకారమైన నీ సహజరూపమును ధరించమని ప్రార్ధిస్తున్నాను కృష్ణా ! " అని ఉదంకుడు ప్రార్ధించాడు.

## ఉదంకుడు అమృతం

ఉదంకుడి ప్రార్ధన మన్నించి శ్రీకృష్ణుడు తన విశ్వరూపమును ఉపసంహరించి " ఉదంకా ! ఏదైనా వరము కోరుకో ఇస్తాను " అన్నాడు. ఉదంకుడు " మహాత్మా ! సామాన్యులకు దుర్లభమైన నీ విశ్వరూపమును కనులారా చూసాను. నాకు ఇంత కంటే ఏమి కావాలి. ఈ భాగ్యము నాకు చాలు " అన్నాడు. శ్రీకృష్ణుడు " ఉదంకా ! నా విశ్వరూపమును దర్శించిన నీకు శుభములు కలుగుతాయి. కాని నీకు ఒక వరము ఇవ్వాలని నేను కోరుకుంటున్నాను. అడుగు " అని కృష్ణుడు పలికాడు. ఉదంకుడు " కృష్ణా ! ఈ ప్రాంతం అంతా కరువు ప్రాంతం. వర్షపు జలము కాని భూగర్భజలము కాని దొరకవు. కనుక నేను ఎప్పడు

అనుకుంటే అప్పుడు నాకు జలము లభించే వరము ప్రసాదించు " అని అడిగాడు. శ్రీకృష్ణుడు " ఉదంకా ! దానికేముంది నీకు నీరు కావాలని అనిపించినప్పుడు నన్ను స్మరించిన నీకు నీరు లభిస్తుంది " అని వరము ఇచ్చాడు. తరువాత శ్రీ కృష్ణుడు ద్వారకకు వెళ్ళాడు. ఒకరోజు ఉదంకుడికి దాహము వేసింది. అప్పుడు ఉదంకుడికి కడజాతి వాడు ఒకడు కనిపించాడు. అతడి ఒంటి మీద బట్టలు లేవు. చాలా మురికిగా ఉన్నాడు. అతడి చుట్టూ కుక్కలు తిరుగుతున్నాయి. కాని అతడి ఒంటి మీద నిర్మలమైన జలము స్రవిస్తుంది. అతడు ఉదంకుడిని పిలిచి " ఉదంకా ! నీకు దాహము వేస్తుంది కదా నాశరీరము నుండి స్రవించే నిర్మలమైన జలము త్రాగు " అని అన్నాడు. ఉదంకుడు అది విని ఆగ్రహించి అతడిని అక్కడ నుండి వెళ్ళి పొమ్మని అరిచాడు. అప్పుడు ఆ కడజాతివాడు కుక్కలతో సహా మాయం అయ్యాడు. ఇంతలో కృష్ణుడు అక్కడ కనిపించాడు. ఉదంకుడు " కృష్ణా ! నిన్ను తలచుకుంటే జలము లభిస్తుందని అన్నావు కదా ! నీవేమో నన్ను ఈ కడజాతి వాడి శరీరము నుండి లభించే జలము త్రాగమని అంటున్నావు. ఇదేనా నీవు నాకు ఇచ్చే వరము " అని అడిగాడు. శ్రీకృష్ణుడు " నీకు నేనిచ్చిన మంచి అవకాశము జారవిడిచావు. నేను నీకు అమృతము ప్రసాదించమని దేవేంద్రుడిని కోరాను. మానవులు అమృతము త్రాగడానికి అర్హులు కాదు అని దేవేంద్రుడు నాతో అని నా మాట కాదని అనలేక ఇంద్రుడు " దేవా ! నీవు కోరిన విధంగా నేను ఉదంకుడికి అమృతము ఇస్తాను కాని నేను అతడి వద్దకు కడజాతివాడి రూపములో వెడతాను. అతడు నేను ఇచ్చే అమృతమును ఇష్టపడ పోతే నేను చేయకలిగింది ఏమీ లేదు " అని అన్నాడు. ఇంద్రుడు నీ వద్దకు కడజాతివాడి రూపములో వచ్చి అమృతము త్రాగమని చెప్పాడు. దానిని నీవూ తిరస్కరించావు. ఇక నేను ఏమి చేయగలను. కాని నీకు నేను ఇంకొక వరము ఇస్తాను. నీకు సంవత్సరం పొడవునా ఎప్పుడు ఎప్పుడు కోరుకుంటే అప్పుడు నీరు లభించే వరము ప్రసాదిస్తున్నాను. నీవు కోరుకున్న వెంటనే మేఘములు నీ వద్దకు వచ్చి వర్షము కురిపిస్తాయి. అలా వర్షాన్ని కురిపించే మేఘాలను జనులు ఇక నుండి ఉదంక మేఘాలని పిలుస్తారు. నీ కోరిక ఈ విధముగా నెరవేర కలదు " అని పలికాడు " అని వైశంపాయనుడు జనమేజయుడికి ఉదంకోపఖ్యానము వినిపించాడు.

## ఉదంకుడి వృత్తాంతం


ఉదంకుడి వృత్తాంతం

ఉదంకుని వృత్తాంతం విన్న **జనమేజయుడు** వైశంపాయనుడితో " మహాత్మా ! ఉదంకుడికి శ్రీకృష్ణుడిని కూడా శపించగలిగిన శక్తి ఎలా వచ్చింది? " అని అడిగాడు. **వైశంపాయనుడు** " జనమేజయా ! ఉదంకుడికి కల గురుభక్తి వలన గువుకు అతడు చేసిన శుశ్రూష వలన ఉదంకుడికి అంతటి శక్తి వచ్చింది. ఉదంకుడు గౌతమునికి శిష్యుడు. విద్యాభ్యాసము పూత్రి అయిన తరువాత మిగిలిన శిష్యులందరికి **గౌతముడు** ఎవరికి తగిన వరాలు వారికి ఇచ్చి పంపాడు. కాని ఉదంకుడికి మాత్రము ఏ వరము ఇచ్చి పంపలేదు. ఉదంకుడు గురువు వద్దనే ఉండి గౌతముడికి భక్తితో శుశ్రూష చేయసాగాడు. ఒకరోజు ఉదంకుడు మిక్కిలి బరువైన కట్టెలమోపు తీసుకు వచ్చి ఆశ్రమం వద్ద పడవేసే సమయంలో అతడి జడ ఒకటి ఆ కట్టెల మోపులో చిక్కి తెగిపోయింది. అతడి జడ లోని వెంట్రుక తెల్లగా మెరిసి పోవడము చూసిన ఉదంకుడు తనకు వయసు మీరి పోయిన విషయము గ్రహించి బాధను ఓర్వలేక ఏడవసాగాడు. అది చూసిన గౌతముడు ఉదంకుడి కన్నీళ్ళు భూమి మీద పడకుండా పట్టమని తన కుమార్తెను పంపాడు. తండ్రి ఆజ్ఞ మీద గౌతముడి పుత్రి ఆ కన్నీళ్ళను పట్టడానికి ప్రయత్నించి అవి సలసల కాగుతుండటము వలన వాటిని జారవిడిచింది. అది చూసి గౌతముడు " ఉదంకా ! ఎందుకు ఏడుస్తున్నావు ? " అని అడిగాడు. ఉదంకుడు " గురువుగారూ ! మీరు మిగిలిన శిష్యుల మీద చూపిన దయ నా మీద చూప లేదు. వారు వెళ్ళి హాయిగా గృహస్థులై సుఖపడుతున్నారు. నేను మాత్రము ఇలా ముసలివాడిని అయ్యాను. ఇక నాకు వివాహము కాదు. అందుకే ఈ ఏడుపు " అని చెప్పాడు. గౌతముడు " ఉదంకా ! దిగులుపడకు. నీకు మరలా యవ్వనం ప్రసాదిస్తున్నాను. అంతే కాక నా కుమార్తెను నీకిచ్చి వివాహము చేస్తాను. నీవిక గృహస్థాశ్రమం స్వీకరించి సంతోషాన్ను అనుభవించు " అని అన్నాడు. గౌతముడు తన కుమార్తెకు కూడా అప్పటికే వయసు మీరి పోయిందని గ్రహించి ఆమెకు కూడా యవ్వనం ప్రసాదించి వారిరువురికి వివాహము చేసాడు.

### ఉదంకుడి గురుదక్షిణ

**గౌతముడు**ఉదంకుడికి తన కుమార్తెను ఇచ్చి వివాహము చేసిన పిదప **ఉదంకుడు** " గురువర్యా ! మీరు నాకు యవ్వనాన్ని

యవ్వనవతి అయిన కుమార్తెను ఇచ్చి వివాహము చేసారు. మీ ఋణము ఎలా తీర్చుకోగలను. మీరు నాకు ఏదో ఒక పని చెప్పండి. అది నెరవేర్చి నా ఋణము తీర్చుకుంటాను. అదే నా గురుదక్షిణ " అన్నాడు. గౌతముడు " అదేమిటి ఉదంకా ! నీవు నాకు వేరే గురుదక్షిణ ఇవ్వాలా ! నీ గురుభక్తి మంచి నడవడిక ఇదే నీ గురుదక్షిణ " అని చెప్పి బయటకు వెళ్ళాడు. అప్పుడు ఉదంకుడు తన గురుపత్ని **అహల్య** వద్దకు వెళ్ళి " అమ్మా ! తమరైనా చెప్పండి తమకు నేను ఏ విధంగా గురుదక్షిణ సమర్పించుకోవాలో " అని అడిగాడు. అందుకు అహల్య " అదేమిటి మీ గురువుగారి మాటే కదా నామాట. అయినా నువ్వు అడిగావు కనుక నేను చెప్తున్నాను. నీవు **మిత్రసఖుడు** అను వాని వద్దకు వెళ్ళి అతడి భార్య వద్ద ఉన్న కుండలములు తెచ్చి నాకు ఇవ్వు " అని చెప్పింది. ఉదంకుడు కుండలములు తెచ్చే పనిమీద వెళ్ళాడు. కొంతసేపటికి ఆశ్రమానికి తిరిగి వచ్చిన గౌతముడికి ఉదంకుడు కనిపించక పోయేసరికి భార్యను అడిగాడు. అహల్య ఉదంకుడిని కుండలములకు పంపిన విషయము చెప్పింది. గౌతముడు " **సౌదాసుడు** రాక్షసుడు. అతడు శాపవశాన మనుష మాంసము తింటూన్నాడు. ఈ విషయము ఉదంకుడికి తెలియదు కనుక ఏమి జరుగనున్నదో " అని గౌతముడు కలవర పడ్డాడు. ఆ మాటలకు అహల్య కలవర పడి " నాథా ! నాకు ఈ విషయము తెలియదు కనుక పంపాను. మీరు ఎలాగైనా ఉదంకుడిని కాపాడండి " అని ప్రార్థించింది. గౌతముడు నవ్వి " నువ్వు నిశ్చింతగా ఉండు ఉదంకుడికి ఎలాంటి ఆపదా రానివ్వను " అన్నాడు. అని భార్యను ఊరడించాడు.

## సుదాసుడి భార్య

**ఉదంకుడు** ఒక అడవిలో సౌదాసుడిని కలుసుకున్నాడు. **మిత్రసఖుడికి** సౌదాసుడన్న పేరుకూడా ఉన్నది. ఉదంకుడు కలుసుకున్న సమయంలో సౌదాసుడు ఆ నిర్జన ప్రదేశంలో ఎర్రటి కళ్ళతో రక్తసిక్త శరీరముతో భయంకరముగా ఉన్నాడు. అయినా ఉదంకుడు సౌదాసుడిని చూసి భయపడ లేదు. ధైర్యంగా తన ముందు నిలబడిన ఉదంకుడిని చూసిన సౌదాసుడు " ఎవరు నువ్వు ఎక్కడకు వెడుతున్నావు. ఈ రోజు ఆహారము దొకక అవస్థ పడుతున్నాను. సరి అయిన సమయంలో వచ్చిన నిన్ను ఇక చంపి తినకవదలను " అన్నాడు. అందుకు ఉదంకుడు " రాజా ! నేను మాగురువు గారి పనిమీద వెళుతున్నాను. గురుకార్యము మీద వెళ్ళే నన్ను చంపుట మహా పాపము. ఇంతటి అధర్మకార్యానికి ఒడిగట్టుతావా " అని అన్నాడు. సౌదాసుడు " బ్రాహ్మణా ! నీకు దినములో మూడవ ఝాముున మనుష్య మాంసము తినమని దేవతలు ఆదేశించారు. కనుక నా ఆకలిని నిన్ను తిని తీర్చుకుంటాను అని అన్నాడు. ఉదంకుడు " అలాగా సరే నేను ముందు నాగురువుగారి కార్యము నెరవేర్చి తరువాత నీ ఆకలి తీర్చగలను నన్ను నమ్ము. అయ్యా ! తమరు మిమ్మలిని యాచించిన వారి కోరికలను తీరుస్తారు కదా ! నేనిది నా కొరకు కోరడము లేదు. గురుపత్ని కొరకు అడుగుతున్నాను. కనుక నా కోరిక తప్పక తీరుస్తారని నమ్ముతున్నాను " అని అడిగాడు ఉదంకుడు. ఆ మాటలకు సౌదాసుడు " నీ కోరిక ఏమిటి ? " అని అడిగాడు. ఉదంకుడు " మహాత్మా ! నా గురుపత్ని తమరి భార్య కుండలములు కావాలని అడిగింది. అవి మీరు ఇప్పిస్తే నేను వాటిని గురుపత్నికి సమర్పించి తిరిగి వచ్చి మీకు ఆహారము కాగలను " అని అన్నాడు. అందుకు సౌదాసుడు " ఆ కుండలములు నావి కాదు కదా ! పరుల సొమ్ము నేను ఎలా ఇవ్వగలను " అన్నాడు. ఉదంకుడు " నేను మీ భార్య కుండలములు కోరుతున్నాను అది పరుల సొమ్ము ఎలా ఔతాయి " అన్నాడు. సౌదాసుడు " అయితే నువ్వు నా భార్య వద్దకు వెళ్ళి నేను చెప్పానని చెప్పి కండలములు తీసుకో " అన్నాడు. ఉదంకుడు " అయ్యా మీ భార్య ఉండే ప్రదేశము నాకు చెప్పండి " అని అడిగాడు. సౌదాసుడు " ఆ కనపడేదే ఆమె నివాసము " అని చెప్పాడు. ఉదంకుడు సౌదాసుడి భార్య వద్దకు వెళ్ళి " మా గురుపత్ని **అహల్య**. మీ కుండలములు అడిగి తెమ్మని నన్నుపంపింది. మీరు కుండలములు ఇస్తే నేను వెడతాను " అని అన్నాడు. సౌదాసుడి భార్య " నువ్వు ఉదంకుడివి అని నా భర్త సౌదాసుడు నిన్ను పంపాడనినాకు నమ్మకము ఏమిటి ? " అని అడిగింది. ఉదంకుడు తిరిగి సౌదాసుడి వద్దము వెళ్ళి " నీ భార్య నన్ను గుర్తు తీసుకురమ్మని అడిగింది కనుక నాకు ఏదైనా గుర్తు ఇచ్చి పంపు" అన్నాడు. సౌదాసుడు "నేను చెప్పే మాటలు జాగ్రత్తగా చెపితే నా భార్య నిన్ను గుర్తించి కుండలము ఇస్తుంది" అన్నాడు. ఉదంకుడు సౌదాసుడి భార్య వద్దకు వెళ్ళి సౌదాసుడి మాటలు చెప్పగానే సౌదాసుడి భార్య మదయంతి సంతోషముతో " కుమారా ! ఈ కుండలముల కొరకు దేవతలు, గంధర్వులు, నాగులు పొంచి ఉన్నారు. వారు ఈ కుండలములు పొందడానికి అనేక ఉపాయములు పన్నుతుంటారు. కనుక నీవు జాగ్రత్త వహించాలి. ఈ కుండలములను నీవు నేల మీద పెట్టినా, ఈ కుండలములకు ఎంగిలి సోకినా, ఏమరుపాటున నిద్రించినా వీటిని అపహరించే ప్రమాదము ఉంది. నీవు ఈ కుండలములను భక్తితో సేవించి పూజించిన నీకు ఆకలిదప్పులు ఉండవు. నీకు అగ్నివలన, విషమువలన, భూత ప్రేత పిశాచములవలన భయము ఉండదు. ఈ కుండలములను పిల్లలు అయినా పెద్దలు అయినా ఎవరికైనా ఖచ్చితంగా సరిపోతాయి. ఈ కుండలములు బంగారమును కురిపిస్తాయి. అందువలన వీటిని అత్యంత అప్రమత్తతతో తీసుకు వెళ్ళి నీ గురుపత్నికి సమర్పించాలి " అని మదయంతి తగు జాగ్రత్తలు చెప్పి కుండలములను ఉదంకుడికి ఇచ్చి ఆశీర్వదించి పంపింది.

### ఉదంకుడు సుదాసుడిని ఓదార్చుట

సౌదాసుడి భార్య మదయంతి వద్ద కుండలములు తీసుకున్న ఉదంకుడు సౌదాసుడి వద్దకు వచ్చి " రాజా ! నీ దయ వలన నేను కృతార్ధుడను అయ్యాను. కాని నాకు ఒక సందేహము మిగిలి పోయింది. నీవు నీ గుర్తుగా చెప్పిన మాటలు నాకు అర్ధము కాలేదు. మీకు అభ్యంతరం లేకపోతే వాటి అర్ధము వివరించండి " అని అడిగాడు. సౌదాసుడు " బ్రాహ్మణ కుమారా ! లోకములో క్షత్రియులు బ్రాహ్మణులను పూజిస్తారు. నేను కూడా బ్రాహ్మణులను పూజిస్తాను. నేను బ్రాహ్మణులపట్ల చేసిన చిన్న అపరాధము నన్నిలా మానవ మాంసభక్షకుడిగా చేసింది. నేను చేసిన పాపముకు పరిహారము బ్రాహ్మణపూజ ఒక్కటే మార్గము. అది అంతగా పని చేస్తుందని తెలియకున్నా అంతకంటే వేరు మార్గము లేదు. ఇదే నేను చెప్పిన మాటలకు అర్ధము. బ్రాహ్మణుడవైన నీకోరిక మన్నించి నీకు కుండలములను ఇవ్వమని చెప్పాను. అందువలన నా పాపమును కరిగించాలని అనుకున్నాను " అనిచెప్పాడు. ఉదంకుడి దర్శనము వలన సౌదాసుడికి పూర్వజన్మ జ్ఞానము, దానము చెయ్యాలన్న బుద్ధి, వినయము కలిగాయి. ఉదంకుడు సౌదాసుడిని చూసి " మహానుభావా ! నీ దయ వలన నాకు కుండలములు లభించాయి. నేను వెళ్ళి వీటిని నా గురుపత్నికి సమర్పించి తిరిగి నీ వద్దకు వచ్చి నీ ఆకలి తీరుస్తాను " అని చెప్పాడు. సౌదాసుడు నేను చంపుతానని తెలిసీ నా వద్దకు తిరిగి వస్తానని అన్నావు. నేను నీ సత్యదీక్షకు ప్రీతి చెందాను నీ తపోమహిమ వలన నన్ను దుఃఖ విముక్తిడిని చెయ్యి " ఉదంకుడు " రాజా ! మంచి మనసు కల వారికి పొరపాటున ఆపద కలిగినా అవి వెంటనే తొలగి పోతాయి. నీ సుగుణములే నీ పాపములను పోగొడతాయి. నా గురువు కృప నీ మీద ప్రసరించింది. ఇక నీకు శుభము జరుగుతుంది " అని చెప్పాడు. ఉదంకుడు సౌదాసుడి వద్ద సెలవు తీసుకుని జింకచర్మముతో చేసిన సంచిలో పెట్టిన కుండలములతో సహా గురుపత్ని వద్దకు ప్రయాణము వెళ్ళాడు.

### ఉదంకుడి కుండలములను తస్కరించుట

ఉదకుండి కుండలములను తీసుకు వెళుతూ ఉదంకుడికి మార్గమధ్యంలో ఆకలి వేసింది. ఉదంకుడు కుండలములు ఉన్న సంచిని ఒక పండ్లచెట్టుకు తగిలించి చెట్టు ఎక్కి పండ్లను కోసి తినసాగాడు. అప్పుడు అకస్మాత్తుగా వీచిన గాలికి చెట్టు ఊగడంతో నేలకు తగిలించిన సంచి కింద పడింది. అక్కడ పొంచి ఉన్న ఒక నాగపాము ఆ సంచిని నోటకరచుకుని వేగంగా పోసాగింది. ఉదంకుడు ఆ పామును వెంబడంచగా అది ఒక పుట్టలోకి దూరింది. ఉదంకుడు ఒక కర్రను తీసుకుని ఆ పుట్టను తవ్వసాగాడు. ఆ తవ్వకానికి భూమి కంపించింది. ఇంతలో దేవేంద్రుడు అక్కడకు బ్రాహ్మణవేషంలో వచ్చి " బ్రాహ్మణోత్తమా ! అంత చిన్న కర్రతో తవ్వి పాతాళమును చేరడము సాధ్యమా ? ఇక్కడి నుండి పాతాళముకు వెయ్యి యోజనముల దూరము ఉంది. నీ కుండలము తస్కరించిన నాగుపాము ఎవరో కాదు. అతడు నాగరాజు అయిన ఇరావంతుడి కుమారుడు. ఉదంకుడు " దేవా ! అతడు పాతాళానికివెళ్ళినా నేను అతడిని వెంబడించి వెళ్ళి కుండలములను తీసుకు వస్తాను " అన్నాడు. దేవేంద్రుడికి ఉదంకుడి పట్టుదల నచ్చింది. అందువలన ఉదంకుడి చేతి కొయ్యకు వజ్రాయుధానికి ఉన్న శక్తిని ప్రసాదించాడు. ఉదంకుడు ఆ కర్రతో ఒక్క పోటుపొడవగానే భూదేవీ వజ్రాయుధ దెబ్బకు భయపడి పాతాళానికి దారి ఇచ్చింది. ఆ దారిగుండా ఉదంకుడు పాతాంలో ఉన్న నాగలోకానికి వెళ్ళాడు. పటిష్టమైన కోటగోడలు, ద్వారములు, అగడ్తలు ఉన్న నాగలోకాన్ని చూడగానే ఉదంకుడికి తాను కుండలములు పొందడము అంత సులువైన పనికాదని తెలిసింది. ఇంతలో అతడి ఎదుట అరుణవర్ణములు కలిగిన ఒక గుర్రము కనిపించింది. నలుపురంగు దేహము, శ్వేతవర్ణ తోక కలిగిన ఆ గుర్రము ఉదంకుడితో " ఉదంకా ! నీవెవరో నాకు తెలుసు. నేను నీవు రోజు ఆశ్రమంలో పూజించే అగ్నిహోత్రుడిని. నాకు కుండలములు ఎక్కడ ఉన్నాయో నీకు చెప్తాను. నీవు ఏమీ అనుకోకుండా నా వెనుక భాగంలో ఉదు " అన్నాడు. ఉదంకుడు ఆ గుర్రము వెనుక భాగంలో ఊదగానే ఆ గుర్రము శరీరము నుండి వచ్చిన సెగలుపొగలు నాగలోకమంతా వ్యాపించాయి. వాయుభక్షకులైన నాగులకు ఆ పొగవలన ఊపిరి ఆడలేదు. నాగులంతా విలవిలా కొట్టుకోసాగారు. కుండలములు దొంగిలించిన ఇరావంతుడి కుమారుడు కూడా గిలగిలా కొట్టుకోసాగాడు. వేరు మార్గాంతరము లేక నాగరాజులు కుండలములు తీసుకు వచ్చి ఉదంకుడికి ఇచ్చి శరణు వేడారు. ఉదంకుడు వారిని క్షమించి వెంటనే తన ఆశ్రమానికి వెళ్ళి గురుపత్నికి కుండలములు అందచేసాడు. గౌతముడు ఉదంకుడిని చూసి " ఉదంకా ! రాక్షస ప్రవృత్తి కలిగిన సౌదాసుడిని ప్రసన్నము చేసుకుని కుండలములు సంపాదించడము. అగ్నిదేవుని ప్రసన్నము చేసుకుని కుండలములు నాగరాజుల నుండి సంపాదించడము నీవే చేయగలవు. ఇది వేరొకరు చేయలేరు " అన్నాడు. అని **వైశంపాయనుడు** జనమేజయుడికి ఉదంకుడి వృత్తాంతము చెప్పాడు.

## శ్రీకృష్ణుడు ద్వారకకు చేరుట

**వైశంపాయనుడు** జనమేజయునకు శ్రీకృష్ణుడు ద్వారకకు చేరిన వృత్తాంతము ఇలా చెప్పసాగాడు. " జనమేజయ మహారాజా ! ఉదంకుడి వద్ద నుండి శ్రీకృష్ణుడు ద్వారకకు చేరుకున్నాడు. ఆ సమయంలో రైవతక పర్వతానికి ఉత్సవాలు

జరుగుతున్నాయి. ద్వారకాపురి వాసులంతా ఆ ఉత్సవానికి పోవడానికి సమాయత్తము కాసాగారు. శ్రీకృష్ణుడి రాకతో వారు ఆగి పోయి శ్రీకృష్ణుడికి స్వాగతము పలికారు. శ్రీకృష్ణుడు ముందు తల్లి తండ్రులైన దేవకీ వసుదేవులను అన్న బలరాముడిని కలిసి వారికి నమస్కరించాడు. వారికి ధర్మరాజు తరఫున ప్రణామములు అందించాడు. తరువాత తన తమ్ముళ్లను వారి భార్యలను కుమారులను వారి భార్యలను కలిసి వారికి ఆనందము కలిగించాడు.

## శ్రీకృష్ణుడు కురుక్షేత్ర యుద్ధవిశేషాలు వసుదేవుడికి ఎరిగించుట



కురుక్షేత్ర యుద్ధవిశేషాలను తన తల్లిదండ్రులకు చెప్పుచున్న శ్రీకృష్ణుడు

ఒక రోజు వసుదేవుడు శ్రీకృష్ణుడిని తన వద్ద కూర్చోబెట్టుకుని " నాయనా శ్రీకృష్ణా ! మహాభారత యుద్ధము జరిగిందని వాళ్ళు చెప్పుకుంటుంటే విన్నాను. కాని పూర్తి విషయాలు తెలియ లేదు. ఆ యుద్ధ విశేషాలు వినాలన్న కుతూహలంగా ఉంది " అని అడిగాడు. శ్రీకృష్ణుడు " తండ్రీ ! మహాభారత యుద్ధము 18 రోజులు జరిగింది. ఆ యుద్ధవిశేషాలు చెప్పాలంటే చాలారోజులు పడుతుంది. అందుకని ప్రముఖులు మాత్రము చేసిన యుద్ధవిశేషాలను క్లుప్తంగా వివరిస్తాను. ఇరువైపులా మొహరించిన సైన్యము 18 అక్షౌహినులు. అందులో కౌరవ సైన్యము 11 అక్షౌహినులు. పాండవుల సైన్యంలో 7 అక్షౌహినులు. కౌరవ సైన్యాధ్యక్షుడు భీష్ముడు. అర్జునుడు శిఖండిని ముందు పెట్టుకుని భీష్ముడిని పడగొట్టాడు. భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలము వచ్చేవరకు అంపశయ్య మీద కాలము గడిపి తరువాత శరీరము వదిలి పెట్టాడు. భీష్ముడు పడిపోయిన పిదప ద్రోణుడు సర్వసైన్యాధ్యక్షుడు అయ్యాడు. ద్రోణుడు అయిదు రోజుల వరకు సైన్యాలను నడిపించిన తరువాత ధర్మరాజు సహాయంతో ద్రుపదుడి కుమారుడు దృష్టద్యుమ్నుడు ద్రోణుడిని చంపాడు. తరువాత అంగదేశాధ్యక్షుడు కర్ణుడు సర్వసైన్యాధ్యత వహించాడు. కర్ణుడు రెండు రోజులపాటు యుద్ధము కొనసాగించి తుదకు అర్జునుడి చేతిలో పరమపదించాడు. మరునాడు శల్యుడి సారధ్యములో కౌరవసేన యుద్ధముకు సమాయత్తము అయ్యింది. కాని సగము రోజులోనే ధర్మరాజు చేతిలో పరమపదించాడు. తరువాత వచ్చిన శకుని వచ్చీ రాగానే నకులుడి చేతిలో మరణించాడు. అప్పటికే సుయోధనుడి తమ్ములంతా యుద్ధములో మరణించారు. ఒంటరిగా మిగిలిన సుయోధనుడు అవమానభారంతో ఒక మడుగులో దాక్కున్నాడు. అతడి జాడ తెలుసుకుని ధర్మరాజు భీముని సహాయముతో సుయోధనుడి తొడలు విరిచి చంపాడు. సుయోధనుడి మరణంతో పాండవులకు సంపూర్ణ విజయము లభించింది. కాని అంతలో దొర్లిన అపశృతి వలన ఒకరోజు ద్రోణ పుత్రుడు అశ్వత్థామ పాండవశిబిరములో ప్రవేశించి దుష్టద్యుమ్న, శిఖండి, ఉపపాండవులతో సహా పాండవసైన్యాలను సర్వనాశనము చేసాడు. కృతవర్మ, కృపాచార్యులు ఈ యుద్ధములో అశ్వత్థామకు సహకరించారు. ఆ రోజు నేను సాత్యకి పాండవులతో ఓఘానదీ తీరానికి వెళ్ళినందు వలన మేము బ్రతికి బయటపడ్డాము. ఇలా 18 రోజుల కురుక్షేత్రయుద్ధము ముగిసింది. కౌరవ పక్షంలో కృతవర్మ, అశ్వత్థామ, కృపాచార్యుడు పాండవ పక్షములో చేరిన **యుయుత్సుడు** తప్ప మిగిలిని వారందరూ మరణించారు. ఇదీ భారత యుద్ధకథ " అని శ్రీకృష్ణుడు భారత యుద్ధ విశేషాలను క్లుప్తంగా వసుదేవుడికి వివరించాడు.

### వసుదేవుడికి అభిమన్యుడి మరణవార్త తెలుపుట

కురుక్షేత్రయుద్ధ విశేషాలు విన్న వసుదేవుడు చింతాకాంతుడయ్యాడు. అభిమన్యుడి మరణవార్త వసుదేవుని ఇంకా క్రుంగదీస్తుందని చెప్పలేదు. కాని సుభద్ర దు:ఖం ఆపుకోలేక " అన్నా ! మీ తండ్రి వసుదేవుడు. అది విని దు:ఖిస్తున్న వసుదేవుడిని అక్కడ ఉన్న యాదవులను ఓదార్చడము కృష్ణుడివంతైంది. ధృతరాష్ట్రుడితో చేరి ధర్మరాజు కౌరవులందరికి అంతిమ క్రియలు జపించినతీరు బ్రాహ్మణులకు దానములు ఇవ్వడము వారిపేరు మీద అనేక ధర్మకార్యాలు నిర్వహించడము సవిస్తరంగా వివరిండు. అందరూ మెల్లమెల్లగా ఆ దు:ఖమునుండి బయట పడ్డారు " అని **వైశంపాయనుడు** జనమేజయుడికి చెప్పాడు.

## ఆశ్వమేధయాగము

**జనమేజయుడు** " వైశంపాయన మహర్షీ ! వ్యాసుడు ధర్మరాజును అశ్వమేధయాగమును చేయమని ఆదేశించాడు కదా ! ధర్మరాజు ఆయాగమును ఎలా నిర్వహించాడు " అని అడిగాడు. వైశంపాయనుడు " జనమేజయ మహారాజా ! వ్యాసుడు తన మీద ఉన్న వాత్సల్యముతో అశ్వమేధయాగము చేయమని ఆదేశించిన తరువాత ధర్మరాజు తన తమ్ములను పిలిచి " భీమార్జున నకులసహదేవులారా ! వ్యాసుడి ఆదేశము విన్నారు కదా ! యాగనిర్వహణకు కావలసిన ధనము మన వద్దలేదు. కనుక వ్యాసుడు చెప్పినట్లు బ్రాహ్మణులు దాచిన ధనము తీసుకురావలసిన అవశ్యకత ఉంది. హిమాలయములలో ఉన్న ఆ నిధిని తీసుకురావడానికి కావలసిన మార్గము గురించి, చేయవలసిన ఏర్పాటు గురించి మీరు నాకు మీ అభిప్రాయములు చెప్పండి " అని అడిగాడు. జవాబుగా భీముడు " అన్నయ్యా ! ధర్మనందనా ! మనము ఆ పరమేశ్వరుడిని నియమ నిష్టలతో పూజించి ఆయన కరుణ పొంది ప్రమధగణములను పూజించి, భూతబలులు సమర్పించి ఆ నిధిని తీసుకు వస్తాము. కనుక ధనముగురించిన చింతతో పనిలేదు. ఆ కార్యము సాధించడానికి సముచిత సైన్యము కావాలి " అని భీముడు చెప్పాడు. భీముని మాటలకు అర్జునుడు, నకులసహదేవులు తమ అంగీకారము తెలిపారు. తమ్ముల మాటలకు ధర్మరాజు సంతోషించాడు. అందరూ కలిసి హిమాలయములకు పోవడానికి నిశ్చయించుకున్నారు. తరువాత పెదనాన ధృతరాష్ట్రుడి అనుమతి తీసుకోవడానికి వెళ్ళారు. ధర్మరాజు ధృతరాష్టుడికి చెప్పగానే ధృతరాష్ట్రుడు తన కుమారులు లేనందుకు విలపించాడు. ధర్మరాజు ధృతరాష్ట్రుడి పాదములు పట్టుకుని గాంధారి వింటూ ఉండగా వ్యాసమహర్షికి తనకు జరిగిన సంభాషణ వ్యాసుడు తనను అశ్వమేధయాగము చేయమని చిప్పిన విషయము చెప్పి యాగము చేయడానికి ధృతరాష్ట్రుడి అనుమతి పొందాడు. తరువాత తన తల్లి కుంతీదేవి వద్దకు వెళ్ళి ఆమెకు యాగము గురించి చెప్పాడు. ఆ మాటలు విని కుంతీదేవి సంతోషంతో యాగముకు అనుమతి ఇచ్చింది. కుంతీదేవి అనుమతి తీసుకున్న ధర్మరాజు ఆస్థానమండపానికి వెళ్ళి యుయుత్సుడికి హస్థినాపుర భాద్యత అప్పగించి అతడికి తోడుగా విదురుడిని నియమించాడు. సైన్యాధిపతులను పిలిచి ప్రయాణసన్నాహములు చెయ్యమని ఆదేశించాడు. తరువాత సమస్తదేవతలకు, పితరులకు పూజలు చేసాడు. అగ్నికార్యము నిర్వహించాడు. ధౌమ్యుడికి నమస్కరించి తరువాత రధము మీద కూర్చున్నాడు. మార్గమద్యములో బ్రాహ్మణుల వద్ద పుణ్యస్త్రీల వద్ద ఆశీర్వాదములు స్వీకరిస్తూ తన పురోహితుడు ముందుగా నడువగా హిమాలయములకు పయనమయ్యాడు. ధర్మరాజు వెంట భీమార్జున నకులసహదేవులు రధముల మీద అనుసరించారు. మార్గమద్యములో సామంతరాజులు కూడా వారితో కలిసారు. అందరూ కలిసి ఒక సమతలప్రదేశంలో విడిది చేసారు.

## పాండవుల శివార్చన

ఆ సమయంలో అక్కడకు వ్యాసుడు వచ్చాడు. ధర్మరాజు వ్యాసుడికి స్వాగతము పలికి అర్ఘ్యపాద్యములు ఇచ్చి సత్కరించి ఉచితాసనమిచ్చి కూర్చుండబెట్టాడు. తరువాత జరుగవలసిన కార్యక్రమము గురించి వ్యాసుడిని అడిగాడు. వ్యాసుడు " ధర్మనందనా ! ఈ రోజు రాత్రికి మీరందరూ ధర్భాసనము మీద పడుకోండి. రేపు ఉదయమే లేచి శివుని అర్చించండి " అని చెప్పాడు. మరునాడు ఉదయము పాండవులందరూ వేకువఝామునే నిద్ర లేచి స్నానాధికాలు కానిచ్చారు. తరువాత ధర్భాసనము మీద శివుని ప్రతిష్టించి ధూప దీప నైవేద్యములతో పూజించారు. పాయసమును సమర్పించారు. తరువాత ప్రధమగణములను ఆవాహన చేసి పూజించారు. కుబేరుడు, మణిభద్రుడు మొదలైన యక్షులను భక్తితో ఆవాహన చేసి పూజించారు. తరువాత పురోహితుడు **ధౌమ్యుడు** ముందు నడువగా ధర్మరాజు తన తమ్ములతో నిధి ఉన్న చోటుకు వెళ్ళాడు. నిధిని ఆవహించి ఉన్న భూతములను ఎర్రని పూలతో, మాంసముతో కూడిన అన్నముతో,పేలాలతో అర్చించారు.

## పాండవులు నిధిని తీసుకుని మరల్చుట

భూతములను తృప్తిపరచిన తరువాత ఆ ప్రదేశములో తవ్వమని ఆదేశించాడు. కొంతలోతు త్రవ్వగానే ఆ నిధి బయటపడింది. ధర్మరాజు వ్యాసుడి పాదములకు నమస్కరించాడు. వ్యాసుడు ధర్మరాజును ఆశీర్వదించాడు. తరువాత ధర్మరాజు నిధికి బలులు సమర్పించి పూజలు చేసాడు. తరువాత నిధిని అనేక బండ్ల మీద ఎక్కించారు. బంగారు బిందెలు, చెంబులు, గృహోపకరణ వస్తువులు, రోళ్ళు, రోకళ్ళు ఉన్నాయి. ఇంకా బంగారు దిమ్మలు, కణికలు ఉన్నాయి. ధర్మరాజు వాటిని మూటలు కట్టించి సంచులతో ఎత్తించి బండ్ల మీద ఎత్తించాడు. వేలకొద్దీ వాహనములలో అక్కడక్కడా మజిలీలు చేస్తూ ప్రయాణము సాగించాడు.

## పరీక్షిత్తు జననం

శ్రీకృష్ణుడు ద్వారకలో ధర్మరాజు చేయబోవు యాగము గురించి ధర్మరాజు యాదవ ప్రముఖులకు తెలిపిన ఆహ్వానము గురించి తెలిపాడు. తరువాత ధర్మరాజు హిమాచలముకు పోవుట నిధినితరలించుట విని సంతోషించాడు. శ్రీకృష్ణుడు, కృతవర్మ,

**బలరాముడు**, సాత్యకి, **ప్రద్యుమ్నుడు, సాంబుడు** మొదలగు యాదవ ప్రముఖులతోకలసి హస్థినాపురముకు వచ్చాడు. వారిరాక విని ధృతరాష్ట్రుడు, గాంధారి సంతోషించి యుయుత్సుడిని, విదురుడిని వారిని తీసుకురావడానికి పంపాడు. **యుయుత్సుడు**, విదురుడు శ్రీకృష్ణుడిని, బలరాముడిని మిగిలిన యాదవ ప్రముఖులను స్వాగతము పలికి అంతఃపురానికి తీసుకువచ్చారు. అత్తగారైన కుంతీదేవిని కలుసుకున్నారు. సుభద్ర తన అత్తగారైన కుంతీదేవి వద్దకు పోయి ఆమె ఆశీర్వాదము తీసుకుంది. యుయుత్సుడు, విదురుడు శ్రీకృష్ణ, బలరామ యాదవ ప్రముఖులకు తగిన విడిది ఏర్పాట్లు చేసారు. ఆ సమయంలో నిండు గర్భిణి అయిన అభిమన్యుడి ధర్మపత్ని ఉత్తర గర్భాన తమరి జనకుడు పరీక్షిత్తు జన్మించాడు అని దాసీలు ప్రసూతిగృహము నుండి వచ్చి చెప్పగానే అందరూ ఆనందోత్సాహాలలో తేలియాడారు. అంతలోనే గర్భములోనే బిడ్డ చనిపోయాడు అని తెలుసుకుని అందరూ దుఃఖసాగరంలో మునిగి పోయారు.

## కుంతీ అభిమన్యుడి కుమారుడిని బ్రతికించమని వేడుకొనుట

పరీక్షిత్తు జననంలో జరిగిన అపస్మృతి గురించి విన్న శ్రీకృష్ణుడు, సాత్యకిని వెంట పెట్టుకుని కుంతీదేవి వద్దకు వెళ్ళాడు. అప్పుడు కుంతీ శ్రీకృష్ణుడితో " కృష్ణా ! నాకు నీవు తప్ప వేరెవరు లేరు నీవే శరణు. నీ మేనల్లుడు అభిమన్యుడికి కలిగిన కుమారుడు చనిపోయాడు. క్రూరాత్ముడు అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రము మహిమ వలన మాడి మసి అయ్యాడు. కృష్ణా ! బ్రతికించకలిగిన శక్తి నీక్లే ఉంది.ఆనాడు నీవిచ్చిన మాట చేసిన ప్రతిజ్ఞ గుర్తుచేసుకో. " ఉత్తర గర్భమును రక్షిస్తాను. గర్భములో శిశువును బ్రతికిస్తాను " అని నీవు ప్రతిజ్ఞ చేసావు. కృష్ణా ! నా ప్రాణములు, ద్రౌపది, సుభద్రల ప్రాణాలు నీ చేతిలో ఉన్నాయి. బిడ్డ బ్రతికితే మేము బ్రతుకుతాము. లేకున్న మేము ప్రాణాలు విడిచి పెడతాము. ఈ బిడ్డ చనిపోయిన పాండవ వంశపితరులకు పిండప్రధానము చెయ్యడానికి, తిలోదకాలు ఇవ్వడానికి కూడా ఎవ్వరూ మిగలరు. కనుక ఈ బిడ్డను బ్రతికించి మత్స్యరాజకుమారి శోకమును పోగొట్టు . కృష్ణా ! పాండవ వంశాన్ని రక్షించిన నీవే పాడవ వంశాంకురాన్ని కాపాడి వారి వంశాన్ని నిలబెట్టు " అని వేడుకుంటూనే శోకభారంతో నేలకు ఒరిగింది.

## సుభద్ర తన మనుమడిని బ్రతికించమని వేడుకొనుట

అక్కడే ఉన్న సుభద్ర " అన్నా ! ఆ అశ్వత్థామ భీముడిని చంపడానికి బ్రహ్మశిరోనామకాస్త్రమును ప్రయోగించాడు. కాని ఆ అస్త్ర ప్రభావానికి నేను నా భర్త అర్జునుడు ఫలితము అనుభవిస్తున్నాము. వంశాంకురాన్ని పోగొట్టుకున్నాము. నీ మరిది అర్జునుడు ఇప్పటికీ అభిమన్యుడి మరణానికి తలచితలచి శోకిస్తున్నాడు. ఇప్పుడు మనుమడు కూడా చనిపోయాడని తెలిస్తే పరిస్థితి ఏమౌతుందో అని భయంగా ఉంది. ఇక ధర్మరాజు, భీముడు, నకులసహదేవులు ఈ శోకాన్ని ఎలా తట్టుకుంటారో ? అన్నయ్యా ! అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రమును ప్రయోగించినప్పుడు నీవు దానిని నిర్వీర్యము చేస్తానని మాటిచ్చావు. మేము కూడా ఊరట చెందాము. నీ ప్రయత్నము ఫలించినట్లు లేదు. మా అందు దయ ఉంచి పాండవవంశాంకురాన్ని రక్షించి పాండవకులమును రక్షించు. అన్నయ్యా నీవు ఉండగా పాండవులకు భంగపాటులేదు. నీ ఎదురుగానే అశ్వత్థామ పాండవకుల వంశోద్ధారకుడిని నాశనం చేసాడు. భక్తవత్సలా ! ఈ చరాజరజగత్తులో చనిపోయిన బ్రతికించే శక్తి నీకే ఉంది అని నాకు తెలుసు అలాంటి నీవు నీ మేనత్త కొడుకు, ప్రియసఖుడు, ఆప్తుడు, బావ అయిన అర్జునుడి మనుమడు అకాల మరణాన్ని చూస్తూ ఊరుకుంటావా అన్నయ్యా ! దుఃఖభారంతో మేము నీ శక్తి తెలియక ప్రవర్తించినందుకు మమ్ము క్షమించి ఈ బిడ్డను బ్రతికించు " అని దీనంగా వేడుకుంది.

## శ్రీకృష్ణుడు పరీక్షిత్తుని బ్రతికించుట

కుంతీ సుభద్రలు శోకించుట చూసిన శ్రీకృష్ణుడి మనసు ద్రవించింది. అందరూ వింటూ ఉండగా శ్రీకృష్ణుడు " ఎవరూ విచారించకండి. ఈ బిడ్డను నేను బ్రతికిస్తాను " అని పెద్దగా అన్నాడు. ఆ మాటలకు అందరూ ఊరట చెందారు. కుంతీ, సుభద్రల, ద్రౌపదీదేవి వెంటరాగా కృష్ణుడు ప్రసూతిగృహానికి వెళ్ళాడు. తెల్లటిపూలు, ఆవాలు, లాజలు, పూర్ణకుంభంతో పుణ్యజలాలు తెప్పించి అగ్నిహోత్రము జ్వలింపచేసాడు. పదునైన ఆయుధములను, లేజివుళ్ళను పేర్చారు. అందరికంటే ముందు ద్రౌపది " అమ్మా ! ఉత్తరా ! నిన్ను చూడడానికి శ్రీకృష్ణుడు వచ్చాడు. లేచి కళ్ళు తెరచి చూడమ్మా ! " అన్నది. ఉత్తర కళ్ళు తెరచి భారంగా కూర్చుని కృష్ణుడికి నమస్కారము చేసి " దేవాదిదేవా ! నీవు నీ భక్తుల ఆర్తి బాపుతావని ప్రతీతి. ఈ మృతశిశువును బ్రతికించి ఈ వంశాన్ని రక్షించు. నీ దయ నా మీద చూపించు. ఈ మృతశిశువును పునరుజ్జీవితుడిని చెయ్యి. నేను భర్తను పోగొట్టుకున్నాను. తుదకు నా బిడ్డను కూడా పోగొట్టుకున్నాను. ఇక నేను ఎలా బ్రకగలను. భక్తవత్సలా ! నీ మేనల్లుడి కుమారుడిని చంపకలిగిన సామర్ధ్యము అశ్వత్థామకు ఉందా ! కృష్ణా ! నా భర్త అభిమన్యుడు చనిపోయినప్పుడే నేను సహగమనము చేయవలసి ఉంది. కాని ఈ బిడ్డకోసము బ్రతికాను. ఇప్పుడు నేను చనిపోయి


పరెక్షిత్తును బ్రతికిస్తున్న శ్రీకృష్ణుడు

స్వర్గముకు పోయినప్పుడు నా భర్త అభిమన్యుడు తన కుమారుడిని గురించి అడిగితే ఏమని చెప్పను. పరంధామా ! నా కుమారుడిలా చనిపోతాడని అనుకుంటే ఆరోజే సహగమనము చేసేదానిని. నాకు కుమారుడు కలగగానే శ్రీకృష్ణుడికి చూపి పోవాలని అనుకున్నానే. ఆ క్రూరాత్ముడు అశ్వత్థామ నా కుమారుడిని చంపి నా ఆశలను వమ్ము చేసాడు " అంటూ బిడ్డను ఒడిలో పెట్టుకుని ఏడుస్తూ ఉంది. ఉత్తర ఆ మృతశిశువును చూసి " కన్నా ! లేవరా నీ తాత శ్రీకృష్ణుల వారువచ్చారు. లేచి నమస్కారము చెయ్యి. పెద్దలు వచ్చినప్పుడు అలా పడుకుని ఉండడము తగునా ! " అంటూ మరణించిన కుమారుడిని తలచుకుని విలపించిన ఉత్తర సొమ్మసిల్లి పడిపోయింది. ఆమె శోకమును చూసిన వారంతా కన్నీరు మున్నీరుగా విలపించసాగారు. శ్రీకృష్ణుడు " అమ్మా ఉత్తరా ! విలపించకు నీ కుమారుడిని నేను బ్రతికిస్తాను " అని అన్నాడు. వెంటనే పాదప్రక్షాళన చేసాడు, ఆచమనము చేసి శుచి అయ్యి అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామాస్త్రమును నిర్వీర్యము చేసాడు. మృతశిశువును శయ్యమీద ఉంచమని చెప్పాడు. శ్రీకృష్ణుడు అ శిశువును చూసి " ఈ శిశువును బ్రతికించి ఉత్తర, సుభద్ర, పాడవులకు ఆనందం కలిగిస్తాను " అని పలికాడు. తరువాత శ్రీకృష్ణుడు " నేను శత్రువులతో సైతము ఎన్నడూ అబద్ధము ఆడని వాడను అయితే, యుద్ధభూమిలో ఎన్నడూ వెనుకంజ వేయని వాడిని అయితే ఈ శిశువు పునరుజ్జీవితుడు ఔతాడు. బ్రాహ్మణుల ఎడల నా మనస్సు భక్తిప్రపత్తులు కలవాడిని అయితే ఎల్లప్పుడూ ధర్మము తప్పని వాడిని అయితే ఉత్తర కుమారుడు పునరుజ్జీవితుడు అగుగాక. అర్జుని ఎడల ఏనాడూ బేధభావము లేని వాడిని అయితే ఈ బాలుడు జీవించుగాక. ధర్మసంస్థాపన నిమిత్తము నేను కంసాదులను సంహరించింది నిక్కమైతే కంసాదులను నేను సంహరించింది జనులకు ఆమోదయోగ్యమైతే ఈ శిశువు జీవించు కాక . నేను సదాబ్రహ్మచర్యమును అవలంబించి, సత్యము పలుకుతూ, ధర్మము తప్పని వాడిని అయితే ఈ బాలుడు బ్రతుకుగాక " అని శ్రీకృష్ణుడు గాఢంగా పలికాడు. ఆ మాటలకు బాలుడిలో చలనము కలిగింది. మెల్లిగా కాళ్ళు చేతులు కదిలాయి. నెమ్మదిగా కళ్ళుతెరిచాడు. అది చూసిన కుంతీదేవి, సుభద్ర, ద్రౌపది మొదలగు వారు అమితానందము పొందారు. వారికళ్ళలో ఆనంద భాష్పాలు కురిసాయి. వారు పులకాకితులు అయ్యారు. అక్కడ ఉన్నవారు అంతా కేరింతలు కొట్టారు. ఆకాశము నుండి దివ్యవాణి శ్రీకృష్ణుడిని స్తుతించింది. జనమేజయా ! అప్పుడు మీ తండ్రిగారు ఉన్న ఆ పురిటిగది మీ తండ్రి గారి తేజస్సుతో ప్రకాశించింది. అప్పటి వరకు చలనము లేకుండా పడి ఉన్న శిశువులో చలనము కలగడము చూసిన ఉత్తర ఆనందము పట్టలేక బిడ్డను పొదివి పట్టుకుని శయ్యదిగి పరుగున వచ్చి శ్రీకృష్ణుడి కాళ్ళ మీద పడిపోయింది. శ్రీకృష్ణుడు ఆమెను ఆదరంతో లేవనెత్తాడు. యాదవులు అందరూ ఆ బిడ్డకు అనేక అలంకారాలు బహుమతులుగా సమర్పించారు. శ్రీకృష్ణుడు అందరూ వింటూ ఉండగా " పాండవవంశము అంతరించింది అనుకున్న తరుణంలో జన్మించిన ఈ బాలుడికి పరీక్షిత్తు అని నామకరణము చేస్తున్నాను " అని ప్రకటించాడు. ఆ విధంగా నీ తండ్రికి పరీక్షిత్తు అనే నామము సార్ధకము అయింది. జనమేజయ మహారాజా మీ వంశము అలా శ్రీకృష్ణుడి కృప వలన వర్ధిల్లింది " అని **వైశంపాయనుడు** చెప్పాడు.

## పాండవులకు శ్రీకృష్ణాదులు స్వాగతం చెప్పుట

పరీక్షిత్తు జన్మించిన తరువాత ఒక మాసము తరువాత ధర్మరాజు ససైన్యముగా భీమార్జున నకుల సహదేవులతో వేలాది వాహనములకు ఎక్కించిన బంగారురాశులతో హస్థినాపురము చేరుకున్నారు. వారికి స్వాగత సన్నాహాలు చేయమని శ్రీకృష్ణుడు యుయుత్సుడు, విదురుని నియోగించాడు. హస్థినాపుర వీధులను శోభాయమానముగా అలంకరించారు. తోరణాలు కట్టారు, అరటి స్థంభాలు కట్టారు, కస్తూరితో కళ్ళాపి చల్లారు. ముత్యాల ముగ్గులు పెట్టారు. పూర్ణకుంభముతో పాండవులకు స్వాగతము పలికారు. శ్రీకృష్ణుడు, బలరాముడు, యాదవులు, యుయుత్సుడు, విదురుడు పాండవులకు ఎదురేగి స్వాగతము చెప్పారు. పాండవులు సువర్ణరాశులతో సహా హస్థినాపురప్రవేశము చేసారు. ధర్మరాజు తన తమ్ములతో ముందుగా ధృతరాష్ట్ర, గాంధారులను దర్శించారు. తరువాత కుంతీదేవిని దర్శించుకుని తరువాత సభామండపము చేరారు. పాండవులు సభామండపము చేరి కొలువుతీరగానే పరీక్షిత్తు జననవిశేషాలను విన్నారు. ఉత్తర ప్రసవించిన మృతశిశువును శ్రీకృష్ణుడు పునరుజ్జీవితుడిని చేసి అతడికి పరీక్షిత్తు అని నామకరణము చేసిన విషయము విని పాండవులు ఆనందాశ్చర్యాలకు లోను అయ్యారు. తమ వంశమును నిలబెట్టిన శ్రీకృష్ణుడిని వారు వేనోళ్ళ కొనియాడారు.

## అశ్వమేధయాగారంభం



ధర్మరాజుకు అశ్వమేధ యాగము చేయమని సలహా ఇస్తున్న శ్రీకృష్ణుడు

తరువాత కొన్ని రోజులకు పాండవుల వద్దకు వ్యాసుడువచ్చాడు. పాండవులు అతడికి ఎదురేగి సత్కరించారు. ధర్మరాజు " వ్యాసుడిని చూసి " మునీంద్రా ! తమరి దయవలన అశ్వమేధయాగముకు కావలసిన ధనము సమకూరింది. తమరు అనుమతిస్తే యాగమును ఆరంభిస్తాను " అని అడిగాడు. వ్యాసుడు " ధర్మనందనా ! నీకు శుభము అగుగాక. అశ్వమేధయాగము నిర్విఘ్నముగా నెరవేరుగాక " అని ఆశీర్వదించాడు. ధర్మరాజు " శ్రీకృష్ణా ! ఆపద్బాంధవా ! నీ కృపాకటాక్షములతో భారత యుద్ధములో విజయము సాధించాము. ఈ అశ్వమేధయాగము కూడా నీ చేతుల మీదుగా జరిపించి మమ్ము కృతార్ధులను చెయ్యి. మాకు తల్లి, తండ్రి, గురువు, దైవము అన్నీ నీవె. నీవు ఆజ్ఞాపించు మేము నీ అజ్ఞానువర్తులమై అశ్వమేధయాగమును నెరవేరుస్తాము " అని శ్రీకృష్ణుడిని ధర్మరాజు ప్రార్ధించాడు. శ్రీకృష్ణుడు " ధర్మనందనా ! వ్యాసుడు ఆజ్ఞాపించాడు. మనము యజ్ఞము నిర్వహిస్తాము. ఈ యాగముతో నీ పరితాపము పటాపంచలు ఔతుంది. అన్ని ఫలముల కంటే అశ్వమేధయాగ ఫలము మేలైనది అని నేను నీకు ముందే చెప్పాను. నేను నిన్ను అశ్వమేధయాగము చెయ్యమని చెప్పాను అందుకని ఇక నా అనుజ్ఞ నీకు అవసరము లేదు. యజ్ఞకర్తవైన నీవు ,మమ్ము ఆజ్ఞాపించు. మేము నీ ఆజ్ఞానువర్తులమై యాగమును నిర్వహిస్తాము " అన్నాడు. ఆ మాటలకు సంతోషించిన ధర్మరాజు వ్యాసుడితో " మహానుభావా ! యాగదీక్షకు తగిన ముహూర్తము మీరే నిర్ణయించి తగిన సంస్కారమును ఆచరించండి " అని ప్రార్ధించాడు. వ్యాసుడు " ధర్మనందనా ! ఈ యాగమును నేను, యజ్ఞవల్క్యుడు, పైలుడు ముగ్గురమూ కలిసి నిర్వహిస్తాము. రాబోవు చైత్ర మాసములో పౌర్ణమి నాడు దివ్యమైన ముహూర్తము. యజ్ఞాశ్వము కొరకు అశ్వ నిపుణులను నియమించు. యాగములో వెదోక్తముగా విడువబడిన అశ్వము ఈ భూమండలము అంతటా తిరుగుతూ ని యశస్సును భూమండలము అంతా వ్యాపింపచేస్తుంది. యాగముకు కావలసిన సంభారములు సిద్ధము చేయించు " అని ఆదేశించాడు వ్యాసుడు. ధర్మరాజు అశ్వశాస్త్రము తెలిసిన వారిని పిలిపించి సకల శుభలక్షణములు కలిగిన అశ్వమును ఎంపిక చేసి తీసుకు రమ్మని ఆజ్ఞాపించాడు. యజ్ఞముకు కావలసిన పనిముట్లను బంగారముతో చేయించమని ఆజ్ఞలు జారీచేసారు. త్వరలోనే ఉత్తమాశ్వము యజ్ఞానికి కావలసిన పనిముట్లు తయారయ్యాయి. ధర్మరాజు వ్యాసుడి వద్దకు వెళ్ళి అన్ని ఏర్పాట్లు పూర్తి అయ్యాయి అని తెలియచేసాడు. వ్యాసుడు అశ్వమును చూసి తృప్తి చెందాడు. ధర్మరాజు " మహర్షీ ! ఈ అశ్వమును వెదోక్తముగా అర్చించి వదలిన తరువాత దీని వెంట దీని రక్షణార్ధము వెళ్ళవలసిన వీరుడెవరో మీరు నిర్ణయించండి. వ్యాసుడు " ధర్మనందనా ! వేరెవరు దివ్యాస్త్రకోవిదుడు, బుద్ధిమంతుడు, పరాక్రమశాలి, శౌర్యవంతుడు అయిన అర్జునుడే అందుకు సమర్ధుడు. నీవు యాగదీక్షలో ఉంటావు. భీముడు, నకులుడు రాజ్యరక్షణ భారము వహిస్తారు. సహదేవుడు అంతఃపుర రక్షణభారము వహిస్తాడు " అని వ్యాసుడు చెప్పాడు. ధర్మరాజు " అర్జునా ! వ్యాసుడి మాటలు విన్నావు కదా ! ఈ యాగశ్వమును రక్షించ వలసిన భాద్యత నీదే. ఈ పని వేరెవరికి సాధ్యము కాదు. కనుక యాగాశ్వము రక్షణభాద్యత వహిస్తూ అశ్వము సంచరించు ప్రాంతాలలో ఉన్న రాజులకు ఇది యాగదీక్షలో ఉన్న యాగాశ్వము అని చెప్పి దీనిని నిరాటంకంగా అన్ని ప్రాంతంలో తిరిగేలా చూడు. ఈ యాగాశ్వమును పట్టుకున్న రాజులను చంపక వారిని యాగముకు ఆహ్వానించు " అని ధర్మరాజు అర్జునుడితో చెప్పాడు. వ్యాసుడు ఆదేశించిన విధముగా రాజ్య రక్షణకై భీముని, నకులుని నియోగించి అంతఃపుర రక్షణకు సహదేవుడిని నియమించాడు. మిగిలిన పనులకు ఆయారంగాలలో నిష్ణాతులను నియమించాడు. ధృతరాష్ట్ర, గాంధారిల అనుమతి తీసుకున్నాడు. తల్లి కుంతీదేవి అనుమతి తీసుకుని ద్రౌపదితో చేరి యాగము చేయడానికి ఉద్యుక్తుడు అయ్యాడు " అని **వైశంపాయనుడు** జనమేజయునకు చెప్పాడని సూతుడు శౌనకాది మునులకు చెప్పాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ

# అశ్వమేధ పర్వము చతుర్థాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక

# చతుర్థాస్వాసం

అశ్వమేధయాగము ముహూర్తము సమీపింగానే వ్యాసుడు మొదలైన ఋత్విక్కులు వేదహితముగా ధర్మరాజు చేత యాగదీక్ష చేయించారు. ధర్మరాజు దండము ధరించి **కృష్ణాజినము** మీద కూర్చున్నాడు. తరువాత యాగాశ్వమును పూజించి యాగాశ్వమును వదిలి పెట్టాడు. యాగాశ్వము బయలు దేరింది. అర్జునుడు గాడీవము చేతబూని తన సైన్యముతో యాగాశ్వముకు రక్షణగా వెంబడించాడు. హస్థినాపుర ప్రజలందరూ పురవీధులలో రెండు వైపులా నిలిచి అర్జునుడిని ఆశీర్వదించారు. వారి ఆశీర్వాదాలు వినయంగా స్వీకరిస్తూ అర్జునుడు యాగశ్వముకు రక్షణగా బయలుదేరాడు. అర్జునుడి వెంట యజ్ఞవల్క్య శిష్యుడు మరికొంత మంది బ్రాహ్మణులతో అర్జునుడి వెంట బయలుదేరాడు.



యాగాశ్వమును అనుసరిస్తున్న అర్జునుడు



అశ్వమేధయాగ సంధర్బంగా తామ్రధ్వజునితో పోరాడుతున్న అర్జునుడు-రాజ్మానామా నుండి ఒక దృశ్యం

## ఆశ్వము త్రిగర్త దేశములో ప్రవేశించుట

యాగాశ్వము ఉత్తర దిక్కుగా ప్రయాణిస్తూ త్రిగర్తదేశంలో ప్రవేశించింది. త్రిగర్తాధీశుని కుమారులు, మనుమలు ఉత్సాహవంతులై అశ్వమును పట్టడానికి ముందుకు ఉరికారు. అర్జునుడు వారితో అనునయంగా ఇలా చెప్పాడు. " రాకుమారులారా ! ఇది ధర్మరాజుతో విడువబడిన యాగాశ్వము. దీనికి కీడుతలపెట్టిన అది ధర్మరాజుకు కీడుతలపెట్టిన దానితో సమానము. మనలో మనకు వైరము ఎందుకు సఖ్యతతో ఉంటాము. ధర్మరాజు నాతో " మహాభారత యుద్ధములో రాజులందరూ మరణించారు. ప్రస్తుతము వారి కుమారులు మాత్రమే ఉన్నారు. నీవు వారిమీద దయ చూపించు. వారిని చంపవద్దు. వారికి మనమధ్య కల బంధమును వివరించి వారితో స్నేహబంధాన్ని వృద్ధి చేయ ప్రయత్నించు " అని చెప్పాడు. కనుక నేను మీతో పోరాడను. మీరు కూడా ధర్మరాజుతో సఖ్యతను ఏర్పరచుకుని మీ ప్రాణములు రక్షించుకోండి. అని వినయంగా పలికిన అర్జునుడి మాటలను పెడచెవిన పెట్టిన త్రిగర్తాదీశుడు **సూర్యవర్మ** అర్జునుడి మీద శరవర్షము కురిపించాడు. అర్జునుడికి యుద్ధము చేయక తప్పలేదు కనుక సూర్యవర్మ బాణాలను మధ్యలోనే తుంచి వేసాడు. సూర్యవర్మ తమ్ముడు **కేతువర్మ** అన్నకు తోడుగా యుద్ధానికి వచ్చాడు. అర్జునుడు అతడి బాణములను కూడా మధ్యలోనే తుంచివేసి వారిని యుద్ధరంగము నుండి తరిమివేసాడు. తరువాత కేతువర్మ తమ్ముడు **ధృతవర్మ** అర్జునుడిని ఎదిరించి తన బాణకౌశలముతో అర్జునుడిని మెప్పించాడు. అర్జునుడు అతడి బాణములను మధ్యలో తుంచుతూ అతడిని వదిలివేసినా అతడు అర్జునుడి మీద వాడి అయిన బాణములు వేసి బాధించాడు. అర్జునుడు

కోపించి అతడిమీద వాడి అయిన బాణ ప్రయోగము చేసాడు. అతడు అర్జునుడి చేతి మీద వేసిన బాణము దెబ్బకు అర్జునుడు గాండీవమును జారవిడిచాడు. అది చూసిన త్రిగర్తసేనలు హర్షధ్వానాలు చేసినా సైన్యాధీశులు మాత్రము " అర్జునుడు ధర్మరాజు మాట మీద గాండీవము జారిపడినా ఊరుకున్నాడు కాని అర్జునుడు కోపించిన మనమంతా భస్మముకాక తప్పదు " అని చెప్పి అర్జునుడికి ఎదురుగా వారంతా నిలిచారు. ఇంతలో అర్జునుడు కింద పడిన గాండీవమును చేత పట్టుకుని పిడుగుల వంటి బాణములను ప్రయోగించి త్రిగర్త సైన్యాలను పీనుగుపెంట చేసాడు. త్రిగర్తదేశ సైన్యాలు చెదిరిపోగా మిగిలిన వారు అర్జునుడిని శరణువేడారు. అర్జునుడు వారిని వెంబడించక వదిలివేసాడు. ఇలా అర్జునుడు త్రిగర్తసైన్యాలను జయించాడు.

## అశ్వము ప్రాగ్జ్యోతిషపురంలో ప్రవేశించుట

తరువాత అశ్వము ప్రాగ్జ్యోతిషపురములో ప్రవేశించింది. భగదత్తుడికుమారుడు **వజ్రదత్తుడు** ప్రాగ్జ్యోతిషపురమును పాలిస్తున్నాడు. అతడు హయమును అడ్డగించి అర్జునుడిని ఎదుర్కొన్నాడు. అర్జునుడి వాడి అయిన బాణముల ధాటికి తాళలేక పారి పోయిన వజ్రదత్తుడు హయమును వదిలి పారిపోయి తిరిగి ఏనుగు ఎక్కి వచ్చాడు. అర్జునుడు ముందు వజ్రదత్తుడి బాణములను మధ్యలో తుంచినా అతడి మీద వాడి అయిన బాణ ప్రయోగము చేయ లేదు. వజ్రదత్తుడు అర్జునుడి మీద ప్రయోగించిన వాడి అయిన బాణములకు ప్రతిగా అర్జునుడు కూడా వాడి అయిన బాణములు ప్రయోగించి వజ్రదత్తుడిని కింద పడవేసాడు. కింద పడిన వజ్రదత్తుడు తిరిగి ఏనుగు ఎక్కి అర్జునుడిని తన బాణములతో కప్పి వేసాడు. ఇలా వారి మధ్య మూడు రోజులపాటు హోరాహోరీగా యుద్ధము సాగింది. నాలుగవ రోజున వజ్రదత్తుడు విజృంభించి " అర్జునా ! నా తండ్రి వృద్ధుడు కనుక అతడు యుద్ధములో మీ చేత మరణించాడు. కాని యువకుడిని అయిన నన్ను జయించడము అసాధ్యము " అన్నడు. అంటూ అర్జునుడి మీదకు కొండవంటి ఏనుగును తోలి అర్జునుడి మీద బాణవర్షము కురిపించాడు. అర్జునుడు ఒకే బాణముతో ఆ ఏనుగును పడగొట్టి వజ్రదత్తుడిని కింద పడవేసి అతడిని చూసి " వజ్రదత్తా ! ఈ యాగాశ్వమును వదులుతూ ధర్మరాజు నన్ను ఈ యాగాశ్వముకు రక్షకుడిగా నియమించి " అర్జునా ! ఈ అశ్వమును అడ్డగించిన వారిని వధించక వారిమీద కరుణ వహించు" అని చెప్పాడు. కనుక నేను నిన్ను చంపను. నాకు నీ మీద ఎలాంటి కోపము లేదు. ధర్మరాజు తరఫున నేను నిన్ను బంధుమిత్ర సమేతంగా వచ్చే చైత్రశుద్ధ పౌర్ణమి నాటికి ధర్మరాజు నిర్వహిస్తున్న అశ్వమేధయాగానికి ఆహ్వానిస్తున్నాను. నీవూ అ యాగముకు వచ్చి యాగమును జయప్రదము చెయ్యి " అని పలికాడు. వజ్రదత్తుడు కూడా అందుకు సమ్మతించి యాగాశ్వమును వదిలి అర్జునుడితో సంధి చేసుకున్నాడు.

## అశ్వము సింధుదేశములో ప్రవేశించుట

తరువాత యాగాశ్వము సింధుదేశములో ప్రవేశించింది. సింధుదేశపురాజు సైంధవుడు మహాభారతయుద్ధములో మరణించగా అతడి కుమారులు మనుమలు మాత్రము రాజ్యముచేస్తున్నారు. వారంతా అర్జునుడి మీద ఒక్కసారిగా విరుచుకుపడ్డారు. వారి ధాటికి అర్జునుడు తట్టుకోలేక గాడీవమును జారవిడిచి తిరిగి శక్తిని కూడతీసుకుని వారిమీద విరుచుకు పడి సింధురాజుల మీద వారి సైన్యాలను చీల్చిచెండాడి రణభూమిని శవాల పెంటకుప్పగా మార్చాడు. సైన్యము చెల్లాచెదురు అయినా సింధురాజులు సైన్యాలను కూడదీసుకుని యుద్ధానికి తలపడ్డారు. అర్జునుడు వారితో ధర్మరాజు చెప్పిన శాంతి వచనాలు చెప్పాడు. అయినా సింధురాజులు వాటిని పెడచెవిన పెట్టి అర్జునుడిని ఎదుర్కొన్నారు. అర్జునుడు చేసేది ఏమి లేక వారి వీరులను సంహరించారు. అప్పడు **దుస్సల** రోదిస్తూ వారి వద్దకు వచ్చింది. అర్జునుడు దుస్సలను చూడగానే రధము దిగి ఆమెను సమీపించాడు. దుస్సల అర్జునుడితో " అన్నయ్యా ! వీడు నీ మేనల్లుడి కుమారుడు. నీ మనుమడు. వీడిని రక్షించు " అన్నది. అర్జునుడు " అమ్మా దుస్సలా ! నా మేనల్లుడు ఎక్కడ? " అని అడిగాడు. దుస్సల " అన్నా ! తన తండ్రి సైంధవుడు నీ చేతిలో భారతయుద్ధములో మరణించిన విషయము తెలిసి నా కుమారుడు చాలా దు:ఖించాడు. ఇప్పుడు నువ్వు వచ్చిన విషయము తెలిసి గుండె ఆగి మరణించాడు. ఇప్పడు వీడొక్కడే వంశాంకురము మిగిలాడు " అని చెప్పింది. ఆ మాటాలకు అర్జునుడు కూడా దు:ఖించాడు. తిరిగి దుస్సల " అన్నయ్యా అర్జునా ! ధృతరాష్టులు మీకు చేసిన అపకారములు, సైంధవుని అనుచిత ప్రవర్తన మనసులో పెట్టుకోకు. తండ్రి లేని వాడైన నా మనుమడిని రక్షించు " అని మనుమడితో అర్జునుడికి పాదాభివందనము చేయించింది. అర్జునుడు " అమ్మా ! నీ సోదరుడు సుయోధనుడు దుర్మార్గుడే కాని మేము మాత్రము తక్కువా చెప్పు. ఇంతటి ఘోరయుద్ధానికి మేము కూడా కారణం అయ్యాము. రాచకులములో పుట్టడం ఎంతటి మహాపాపము. దుస్సలా ! నీ మనుమడికి హానిచెయ్యను నీవూ భయపడవలసిన పని లేదు " అని పలికాడు. ఆ మాటలకు దుస్సల సంతోషించిన దుస్సల మనుమడిని తీసుకుని వెళ్ళింది. అర్జునుడు అశ్వాన్ని విడిపించుకుని జయిత్రయాత్ర సాగించాడు.

## అశ్వము మణిపూర్వక నగరంలో ప్రవేశించుట

ఆ తరువాత యాగాశ్వము నిరాఘాటంగా పయనిస్తూ మణీపూర రాజ్యములో ప్రవేశించింది. మణిపూరాజ్యాన్ని అర్జున చిత్రాంగధల కుమారుడైన బభ్రువాహనుడు పాలిస్తున్నాడు. **బభ్రువాహనుడు** తనతండ్రి అర్జునుడు యాగాశ్వరక్షకుడిగా రాజ్యంలో ప్రవేశించాడన్న విషయము తెలుసుకుని అర్జునుడికి స్వాగతము చెప్పడానికి తగిన ఏర్పాటుతో ఎదురు వచ్చాడు. కాని అర్జునుడు తన కుమారుడైన బభ్రువాహనుడు వీరమును ప్రదర్శిస్తూ అశ్వమును పట్టకుండా తనకు స్వాగతము పలకడము భీరుత్వములా అనిపించింది. అందుకని అర్జునుడు " బభ్రువాహనా ! నీవు నా కుమారుడివి పైగా వీరుడివి. నీవిలా పిరికివాడిలా స్వాగతము పలుకక నీ వీరమును ప్రదర్శించి నన్ను ఎదుర్కొనడమే క్షత్రియ ధర్మము. అలా ఎదిరించినప్పుడే ఉత్తమక్షత్రియుడవు అనిపించుకుంటావు. అప్పుడే నీకు రాజయ్యే అర్హత ఉంటుంది " అంటూ బభ్రువాహనుడిని రెచ్చగొట్టాడు. అయినా బభ్రువాహనుడికి అర్జునుడిని ఎదుర్కొనడానికి మనస్కరించక తిరిగి రాజ్యానికిపోసాగాడు. మార్గమద్యంలో బభ్రువాహనుడిని కలుసుకున్న నాగరాజ కుమార్తె అయిన **ఉలూపి** అతడిని కలుసుకుని " బభ్రువాహనా నేను అర్జునుడి పత్నిని నీకు తల్లిని. అర్జునుడు తనకుమారుడైన నిన్ను వీరుడిలా చూడాలని అనికుంటాడే కాని పిరికివాడిలా స్వాగతం చెప్పాలని ఎదురు చూడడు. కనుక యాగాశ్వమును అడ్డగించి నీ తండ్రి అర్జునుడి ముందు నీ వీరమును ప్రదర్శించి అతడికి ఆనందము కలిగించు. ఇది ఉత్తమ క్షత్రియధర్మము " అని ఉలూపి బభ్రువాహనుడితో చెప్పింది. బభ్రువాహనుడు ఉలూపికి నమస్కరించి " అమ్మా ఉలూపి ! నేను నా తండ్రి అయిన అర్జుడితో యుద్ధము చేయ మనస్కరించక తిరిగి పోతున్నాను. కన్న తండ్రితో యుద్ధము చేయడము ధర్మము కాదని అకున్నాను. లేకున్న నేను యుద్ధము చేయలేక కాదు ఇక నేను యుద్ధముచేయక తిరిగి రాను. ఇప్పుడు నా తల్లివైన నీ అనుమతి లభించింది. కనుక నాకిక ఎవరి అనుమతితో పని లేదు. నేను నా తండ్రి అర్జునుడిని ఎదుర్కొని యుద్ధము చేసి నా తల్లి తండ్రులను ఆనందపరుస్తాను " అని చెప్పాడు.

## బభ్రువాహనుడు అర్జునుడిని ఎదుర్కొనుట

**బభ్రువాహనుడు** తల్లికి నమస్కరించి తనతండ్రి అర్జునుడితో యుద్ధానికి సన్నద్ధము అయ్యాడు. ముందుగా అశ్వాన్ని బంధించి తరువాత అర్జునుడిని ఎదుర్కొన్నాడు. ముందుగా బభ్రువాహనుడు అర్జునుడి మీద బాణప్రయోగము చేసాడు. అర్జునుడు కుమారుడు వేసిన బాణములను మద్యలోనె తుంచివేసి బభ్రువాహనుడి శరీరములో నాటేలా పదునారు బాణములు ప్రయోగించాడు. బభ్రువాహనుడు బదులుగా ఇరువది బాణములు అర్జునుడి శరీరములో నాటాడు. కుమారుడి యుద్ధకౌశలానికి మురిసిపోయిన అర్జునుడు ముండూఘమను శరమువేసి బభ్రువాహనుడి ధ్వజమును విరిచాడు. బభ్రువాహనుడు బెదరక అర్జునుడి భుజములో గుచ్చేలా ఒక బాణమును ప్రయోగించాడు. అర్జునుడు ఆదెబ్బకు దిమ్మతిరిగినా అంతలోనే తేరుకుని కుమారుడి యుద్ధకౌశలానికి మెచ్చుకుని తిరిగి బభ్రువాహనుడి మీద శరప్రయోగము చేసాడు. బభ్రువాహనుడు వాటిని అన్నింటినీ మద్యలోనే తుంచాడు. కుమారుడి యుద్ధకౌశలానికి అర్జునుడిలో ఒకింత కోపము వచ్చింది బదులుగా బభ్రువాహనుడి శరీరము అంతా బాణములు గుచ్చాడు. బభ్రువాహనుడు కూడా పట్టరాని కోపంతో ఒక బాణాన్ని అర్జునుడి గుండెలలో సూటిగా గుచ్చాడు. ఆ బాణము అర్జునుడి గుండెలను చీల్చుకుంటూ బయటకు వెళ్ళింది. అర్జునుడు నేలకు ఒరుగుతూ బభ్రువాహనుడి మీద బాణాలను ప్రయోగించాడు. ఆ బాణముల ధాటికి బభ్రువాహనుడు కూడా నేలకు ఒరిగాడు.



బభ్రువాహనుని చేతిలో అర్జునుని మరణము--రాజ్మానామా నుండి ఒక దృశ్యం

## చిత్రాంగద దు:ఖించుట

చిత్రాంగదకు అర్జునుడు, బభ్రువాహనుడు నేలకొరిగిన విషయము తెలిసి పరుగు పరుగున యుద్ధభూమికి తరలి వచ్చింది. ఉలూపీ కూడా యుద్ధభూమికి వచ్చింది. ఉలూపీణీ ఛుసిన చిత్రాంగద " ఉలూపీ ! నీ వలన ఎంత ఘోరము జరిగిందో చూసావా ! తండ్రి కొడుకులను యుద్ధానికి పురికొలిపిన ఫలితంగా వారిరువురు ఇలా అచేతనులయ్యారు. నీవూ పతివ్రతవు కాదా ! నీకు ధర్మము తెలియదా ! నీవు ఈ పసివాడిని తండ్రిమీద ఎందుకు యుద్ధానికి పురికొల్పావు. నీవె మనభర్త అర్జునుడిని పునరుజ్జీవితుడిని చెయ్యాలి. నీ వలననే ఈ ఘోరము జరిగింది కనుక అర్జునుడిని పునరుజ్జీవితుడిని చేయవలసిన బాధ్యత నీదే " అన్నది చిత్రాంగద. తరువాత చిత్రాంగద అర్జునుడిని చూసి " నాధా మహావీరా ! ఎందరి ప్రాణాలనో కాపాడిన నీవిలా నీ ప్రాణాలు కాపాడ లేక పోయావు. ప్రాణనాధా ! ఎన్ని రోజులైంది నిన్ను చూసి. కళ్ళు తెరచి చూడండి నేను మీ చిత్రాంగదను వచ్చాను. మీరు మీ అన్న గారి యాగాశ్వమును కాపాడాలి. లేవండి యాగాశ్వము వెంట వెళ్ళండి " అని శోకించింది చిత్రాంగద. మరలా ఉలూపిని చూసి ఇతడు మన ఇద్దరికి భర్త. నాకుమారుడి చేతిలోనే నా భర్త ప్రాణాలు పోయేలా చేసావు. నీవు ముందు నా భర్తను బ్రతికించక పోయినచో నేను ప్రాయోపవేశము చేస్తాను " అని దృఢంగా చెప్పింది.

## బభ్రువాహనుడు విలపించుట

ఇంతలో మూర్చ నుండి లేచిన **బభ్రువాహనుడు** ఏడుస్తున్నా చిత్రాంగదను చూసి " అమ్మా ! నీవు శోకించడము నేను ఎన్నడూ చూడ లేదు. ఇది కూడదు తగదు అని చూడక కన్నతండ్రిని యుద్ధములో చంపిన మహాపాపిని నేను. నా పాపానికి నిష్కృతి లేదు " అని తల్లి పక్కన కూర్చుని బభ్రువాహనుడు విలపించసాగాడు. ఇంతలో అక్కడకు వచ్చిన యాజ్ఞవల్క్య శిష్యులు మిగిలిన బ్రాహ్మణులు అక్కడకు వచ్చారు. వారిని చూసిన బభ్రువాహనుడు " అయ్యో ! ఈ బ్రాహ్మణులు అర్జునుడిని అనుసరించి వచ్చారు. ఇక్కడ అర్జునుడు విగతజీవుడై పడి ఉన్నాడు " అని శోకించసాగాడు. తిరిగి ఉలూపిని చూసి " అమ్మా ! నీ మాట మీద నిన్ను సంతోషపరచాలని కదా నా తండ్రి అర్జునుడితో యుద్ధము చేసాను. నా తండ్రి మరణానికి నేనే కారణమయ్యాను. ఇప్పుడు నీకు సంతోషంగా ఉందా ! తండ్రినిచంపిన నా పాపానికిక నిష్కృతిలేదు. నాకిక మనశ్శాంతి లేదు ఉత్తమలోక ప్రాప్తిలేదు " అని విలపించసాగాడు. తరువాత పైకి లేచిన బభ్రువాహనుడు తల్లి చిత్రాంగద అక్కడ చేరిన జనులు వినేలా " నా తండ్రి లేని లోకంలో నేనిక బ్రతుకలేను. నేనిక నా తండ్రితో కలసి ప్రాయోపవేశము చేస్తాను. వీరుడు, రాజు, ధార్మీకుడు, మీదు మిక్కిలి నా తండ్రి అయిన అర్జునుడిని చంపిన నాకిక ప్రాయోపవేశమే గతి " అని నేల మీద మౌనంగా కూర్చున్నాడు.

## ఉలూపి బభ్రువాహనుడిని ఓదార్చుట


అర్జునుని కలసిన బభ్రువాహనుడు

అప్పటి వరకు ఒక్క మాట మాట్లాడక ఊరక ఉన్న ఉలూపి కళ్ళు మూసుకుని తన మనసులో నాగజాతికి ప్రియమైన సంజీవమణిని స్మరించింది. వెంటనే ఉలూపి చేతిలో సంజీవనీ మణి ప్రత్యక్షము అయింది. ఉలూపి బభ్రువాహనుడిని చూసి " కుమారా ! ఏమిటయ్యా ఈ వెర్రి. మీ అందరికి పిచ్చి ఏమైనా పట్టిందా ! లేకున్న అర్జునుడు ఏమిటి చావడము ఏమిటి సాక్షాత్తు దేవేంద్రుడికి కుమారుడైన అర్జునుడు యుద్ధమున మరణిస్తాడా ! అతడిని చంపకలిగిన వీరుడు ఈ లోకంలో ఉన్నాడా ! నీ శక్తిని పరీక్షించడానికి అర్జునుడితో పోరాడమని చెప్పి అర్జునుడి అభిమతము నెరవేర్చాను. మీలో ఎవరూ చావలేదు. కేవలము మూర్చపోయేలా చేసాను. అర్జునుడు చనిపోయాడని అనుకోవడము కేవలము నీ భ్రమ. నీ తండ్రి అర్జునుడు ఇప్పుడే లేచి కూర్చుంటాడు చూడు " అని పలికింది. ఆ మాటలకు అందరూ ఒక్కసారిగా ఆనందాశ్చర్యచకితులు అయ్యారు. ఉలూపి బభ్రువాహనుడి చేతిలో ఆమణిని పెట్టి " కుమారా ! ఈ మణిని అర్జునుడి గుండెల మీద పెట్టు " అని చెప్పింది. బభ్రువాహనుడు ఆ మణిని అర్జునుడి గుండెల మీద పెట్టగానే అర్జునుడు నిద్ర నుండి మేల్కొన్నట్లు లేచి బభ్రువాహనుడిని చూసి " కుమారా ! కుశలమా " అని అడిగాడు. అప్పుడు బభ్రువాహనుడు " మీ దయ వలన అంతా క్షేమమే " అని అర్జునుడి కాళ్ళకు మొక్కాడు. అర్జునుడు తన చుట్టూ చిత్రాంగద, ఉలూపి, బ్రాహ్మణులను వారి ముఖాలలోని ఆశ్చర్యానందాలను చూసి " కుమారా ! వీ రందరి ముఖాలలో ఆనందము ఆశ్చర్యము విషాదము ఒక్కసారిగా కనిపిస్తున్నాయి. పైగా మన ఇరువురి మధ్య యుద్ధము జరుగుతున్న సమయంలో చిత్రాంగద, ఉలూపి ఎందుకు వచ్చారు అని అడిగాడు. అప్పుడు బభ్రువాహనుడు ఉలూపిని చూపి " తండ్రీ !

ఈమెను అడగండి ఈ మహానుభావురాలు జరిగినది అంతా మీకు వివరిస్తుంది " అని సవివరంగా చెప్పాడు.

### ఉలూపి ఎరిగించిన రహస్యము

అర్జునుడు ఉలూపిని చూసి " ఉలూపీ ! ఏమి జరిగింది. కుమారుడు **బభ్రువాహనుడు** కాని అతడి తల్లి **చిత్రాంగద** కాని నీ పట్ల అనుచితంగా ప్రవర్తించారా ! నీ రాకకు కారణము ఏమిటి ? " అని అడిగాడు. ఉలూపి చిరునవ్వు నవ్వి నాథా ఇందులో ఎవరి తప్పు లేదు. ఎవరూ నాపట్ల అనుచితముగా ప్రవర్తించ లేదు. మీరు కాని, కుమారుడైన బభ్రువాహనుడు కాని, చిత్రాంగద కాని అనుచితంగా ప్రవర్తిస్తారా ! తాము నా పట్ల దయ వహించి నేను చెప్పేది శరద్ధగా వినండి. బభ్రువాహనుడు మీతో యుద్ధము చేస్తున్న తరుణంలో కుమారుడు వలన మీకు అశుభం జరిగింది. ఇందుకు ఒక కారణము ఉంది. మీరు భారతయుద్ధములో శిఖండిని ముందు పెట్టుకుని తాతగారైన గంగాపుత్రుడు అయిన భీష్ముడిని పడగొట్టారు. అందు వలన మీకు సంక్రమించిన పాపపరిహారము చేయకున్న మీకు నరకప్రాప్తి కలుగుతుంది. అందు వలన నేను పాతాళము నుండి వచ్చి మీ పాపముకు నివృత్తి చేసాను. ఇది నాకు ఎలా తెలిసింది అంటే ఒకరోజు నేను గంగానదిలో స్నానము చేస్తున్న తరుణములో వసువులు కూడా వచ్చి గంగా నదిలో స్నానము చేస్తున్నారు. అప్పుడు గంగాదేవి తన నిజరూపములో వచ్చి వసువులతో మాట్లాడసాగింది. అప్పుడు వసువులు గంగాదేవితో " అమ్మా ! భీష్ముడు నీ కుమారుడు, వసువులలో ఒకడు. అలాంటి భీష్ముడిని అర్జునుడు శిఖండిని అడ్డు పెట్టుకుని పడకొట్టాడు. అయినా భీష్ముడు తనకుతాను ఏర్పరుచుకున్న నియమము ప్రకారము శరసంధానము చేయలేదు. ఆ కారణముగా భీష్ముడు అంపశయ్య మీద పడి పరమపదించాడు. నిరాయుధుడైన భీష్ముడిని కుత్సితంగా, నీచంగా జయించాడు. అలాంటి అర్జునుడిని మేము శపించాలని అనుకున్నాము " అన్నారు. అందుకు గంగాదేవి తన ఆమోదము తెలిపింది. ఇది విన్న నేను నాగలోకముపోయి జరిగిన విషయము నా తండ్రి నాగరాజుకు వివరించాను. నా తండ్రి వసువుల వద్దకు వెళ్ళి అర్జునుడిని క్షమించమని పలు విధముల ప్రాధేయపడ్డాడు. చివరకు వారు కరుణించి ఒక నియమము పెట్టారు. అది ఏమంటే అర్జునుడు తన కుమారుడైన బభ్రువాహనుడి చేతిలో యుద్ధము చేసి నేలకు ఒరిగిన ఆ పాపము పోతుంది అని చెప్పారు. నా తండ్రి ఈ విషయము నాకు చెప్పారు. నేను తగిన సమయము కొరకు వేచి చూస్తున్నాను. ఇప్పుడు మీరు యాగాశ్వరక్షణ నిమిత్తము ఇక్కడకు వచ్చి బభ్రువాహనుడిని తమతో యుద్ధము చేమని చెప్పడమూ బభ్రువాహనుడు తమతో యుద్ధము చేయ మనస్కరించక తిరిగి పోవాడమూ తెలుసుకుని నేను బభ్రువాహనుడిని మార్గ మధ్యములో ఆపి తమతో యుద్ధానికి ప్రోత్సహించాను. కుమారుడి చేతిలో తమరు ఓడి పోయారు. అందువలన నీ పాపము నశించినది. నేను సంజీవమణిని బభ్రువానుడికి ఇచ్చి మిమ్ము పునరుజ్జీవితుడిని చేసాను. తరువాత జరిగినది మీకు అందరికీ తెలిసినదే " అని **ఉలూపి** అర్జునుడితో సహా అందరికి తెలిపింది.

### అర్జునుడు చింత్రాంగాదులను విడిచి వెళ్ళుట

**ఉలూపి** మాటలకు అర్జునుడు సంతోషించాడు. అర్జునుడు అక్కడ ఉన్న వారిని అందరినీ చూసి " రాబోవు చైత్రశుద్ధ పౌర్ణమి నాడు హస్థినాపురములో వ్యాసుడు చెప్పిన విధంగానే అశ్వమేధయాగము చేస్తాము. ధర్మరాజు ఆధ్వర్యములో అశ్వమేధయాగము చేస్తున్నారు. తమరు అందరూ బంధుమిత్ర సమేతంగా విచ్చేయమని ధర్మరాజు తరఫున ఆహ్వానము అందచేస్తున్నాను " అని చెప్పాడు. బభ్రువాహనుడు " తండ్రిగారూ ! తమరు మా నగరముకు విచ్చేసి మా ఆతిధ్యము స్వీకరించాలని కోరుతున్నాను " అని బభ్రువాహనుడు ప్రార్థించాడు. అర్జునుడు " కుమారా ! యాగదీక్షాలో ఉన్న నేను నగరప్రవేశము చేయకూడదు " అని అర్జునుడు బభ్రువాహనుడికి చెప్పి **ఉలూపి, చిత్రాంగద**ల వద్ద శలవు తీసుకుని యాగాశ్వమును అనుసరించాడు.

### అశ్వం రాజగృహనగరంలో ప్రవేశించుట

యాగాశ్వము రాజగృహము అనే నగరములో ప్రవేశించింది. రాజగృహనగరాన్ని పరిపాలిస్తున్న జరాసంధుడి మనుమడు **మేఘసంధి** యాగాశవమును పట్టి బంధించి అర్జునుడితో " అర్జునా ! ఇదేమన్నా విరాటనగర అంతఃపురము అనుకున్నావా ! ఆడవాళ్ళ మధ్య తిరగడానికి. ఇది రణరంగము ఇక్కడ యుద్ధము చేయాలి . నేను హయమును పట్టుకున్నాను నువ్వు నాతో యుద్ధము చెయ్యాలి " అని అర్జునుడిని రెచ్చగొట్టాడు. అర్జునుడు నవ్వి " రాజా ! నాకు నీ మీద ఎలాంటి కోపము లేదు. ఇది యాగాశ్వము దీనిని పట్టుకున్న వారిని చంపవద్దని ధర్మరాజు నన్ను యాగాశ్వరక్షకుడిగా పంపుతూ చెప్పాడు. ఉన్న విషయము నీకు చెప్పాను. తరువాత నీ ఇష్టము " అని అన్నాడు. అర్జునుడి మాటలను అలుసుగా తీసుకుని మేఘసంధి అర్జుడి మీద శరవర్షము కురిపించాడు. అర్జునుడు తనను తాను రక్షించుకుంటూ మేఘంధి బాణములను ఖండించస్తూ మేఘసంధి సారధిని కాని మేఘసంధి సారధినిగాని గాయపరచ లేదు. మేఘసంధి అది అలుసుగా తీసుకుని అర్జునుడి

శరీరము అంతా బాణములతో గాయపరిచాడు. అర్జునుడు కోపించి ఇక మేఘసంధిని వదిలితే ప్రయోజనము లేదని ముందుగా మేఘసంధి హయములను కొట్టి చంపాడు, తరువాత సారధిని చంపాడు, తరువాత పతాకమును కూల్చాడు, తరువాత రధమును కూలగొట్టాడు. రధము నుండి కిందకు దిగిన మేఘసంధి గధను తిప్పుతూ అర్జునుడితో తలపడ్డాడు. అప్పుడు కూడా అర్జునుడు మేఘసంధిని గాయపరచక అతడి గధను మాత్రము పడగొట్టి అతడిని నిరాయుధుడిని చేసి " మేఘసంధీ ! ధర్మరాజు మాటను మన్నించి నేను నిన్ను చంప లేదు. అందు వలన ఇంతవరకు నాతో యుద్ధముచేసి జీవించి ఉన్నావు. క్షత్రియధర్మము పాటించి అశ్వమును పట్టావు. నాతో యుద్ధము చేసావు. ఇక శాంతము వహించి యుద్ధము మానుము " అన్నాడు. మేఘసంధి అలోచించి అర్జుడి మాటను మన్నించడమే మేలనుకుని అర్జునుడికి నమస్కరించాడు. అర్జునుడు మేఘసంధిని కౌగలించుకుని అశ్వమేధయాగముకు మేఘసంధిని ధర్మరాజు తరఫున ఆహ్వానించాడు. మేఘసంధి అర్జునుడి ఆహ్వానాన్ని మన్నించాడు. అర్జునుడు యాగాశ్వమును అనుసరించి ముందుకు సాగాడు.

## యాగాశ్వదిగ్విజయ యాత్ర

యాగాశ్వము ఆ తరువాత **వంగదేశము, పౌండ్రదేశము, మ్లేచ్ఛదేశము** మొదలైన రాజ్యములలో ప్రవేశించింది. అర్జునుడు ఆయా రాజులను జయించి వారిని ధర్మరాజు తరఫున అశ్వమేధయాగముకు ఆహ్వానించాడు. తరువాత అశ్వము చేధిరాజ్యములో ప్రవేశించింది. చేధిరాజ్యాన్ని **శిశుపాలుడి** కుమారుడు **శరభుడు** పాలిస్తున్నాడు. శరభుడు ముందు అశ్వమును బంధించినా తరువాత తెలివి తెచ్చుకుని అర్జునుడితో సంధి చేసుకున్నాడు. అర్జునుడు చేధిరాజుకు ధర్మరాజు తరఫున అశ్వమేధయాగానికి ఆహ్వానము తెలిపాడు. తరువాత అర్జునుడు టెంకణ దేశ రాజైన **కిరాతరాజు**ను జయించాడు. తరువాత **కోసల, కాశి** రాజ్యాలను జయించాడు. తరువాత దశార్ణదేశాధీశుడు **చిత్రాంగధుడు** కూడా మొదట ఎదిరించినా తరువాత లొంగి పోయాడు. తరువాత అశ్వము నిషాదదేశము చేరింది. ఆ దేశమును ఏకలవ్యుడి కుమారుడు పాలిస్తున్నాడు. అతడు అర్జునుడి మీదకు ససైన్యముగా యుద్ధానికి వచ్చాడు. కాని ఎంతో కాలము అర్జునుడి ముందు నిలువ లేక తుదకు అర్జునుడికి లొంగి పోయాడు. తరువాత అశ్వము దక్షిణంగా పయనించిది. **పౌండ్రదేశము, ఆంధ్రదేశము, ద్రవిడదేశము, కేరళదేశము, కర్నాటకదేశము**లలో సంచరించింది. అర్జునుడు ఆయా దేశాధీశులను యుద్ధము చేసి ఓడించాడు. తరువాత అశ్వము **సౌరాష్ట్రదేశము**లో ప్రవేశించింది. **గోకర్ణము** చేరి తరువాత **ద్వారక** చేరింది. అర్జునుడి రాక విన్న యాదవులు అర్జునుడికి ఘనమైన సత్కారాలు చేసారు. తరువాత అశ్వము పశ్చిమ సముద్రతీరాన పయనించి పాంచాలదేశంలో ప్రవేశించింది.



వింధ్య పర్వతాలలో రాతిపై నిలబడిపోయిన యాగాశ్వం - రాజ్మానామా నుండి ఒక దృశ్యం.

## అశ్వము గాంధారదేశంలో ప్రవేశించుట

తరువాత **గాంధారదేశము**లో ప్రవేశించింది. గాంధారదేశమును శకుని కుమారుడు పాలిస్తున్నాడు. అతడు కూడా బాల్యచాపల్యము చేత అర్జునుడిని ఎదుర్కొన్నాడు. అర్జునుడు తన అన్న ధర్మరాజు సందేశము ఎరిగించాడు. కాని శకుని కుమారుడు మొండిగా అర్జునితో యుద్ధము చేసాడు. గాంధారసేన అంతా అర్జునుడి చేతిలో మరణించినా శకుని కుమారుడు విడువక యుద్ధము కొనసాగించాడు. అతడి బలపరాక్రమాలకు అర్జునుడు ముచ్చటపడి " కుమారా ! మా అన్న ధర్మరాజు నన్ను యాగరక్షకుడిగా నియమించి జయిత్రయాత్రలో ఎవరిని చంపవద్దని అశ్వమేధయాగానికి ఆహ్వానము మాత్రము తెలియచెయ్యమని చెప్పాడు. కనుక ఇక యుద్ధము కొనసాగించుట అనవసరము " అనునయంగా పలికాడు. అయినా శకుని కుమారుడు వినక పదునైన బాణములను అర్జునుడి మీద ప్రయోగించాడు. విధిలేక అర్జునుడు శకుని కుమారుడి కిరీటమును పడగొట్టాడు. అక్కడ ఉన్నవారు అందరూ " అర్జునుడు తలచుకుంటే శకుని కుమారుడి తల ఎగురకొట్టే వాడు. కాని అర్జునుడు దయతలచి విడిచిపెట్టాడు " అన్నాడు. అయినా శకుని కుమారుడు వినక తిరిగి అర్జునుడి మీద బాణప్రయోగము చేసాడు. అర్జునుడు కేవలము ఆబాణములను మాత్రమే తిప్పికొట్టాడు. అది చూసిన గాంధారసేనలు పారిపోయాయి. శకుని కుమారుడు అర్జునుడితో యుద్ధము చేస్తున్నాడని తెలిసి అతడి తల్లి, మంత్రులు యుద్ధభూమికి వచ్చారు. వారు శకుని కుమారుడిని విడువమని అర్జునుడిని వేడుకున్నారు. అర్జునుడు వెంటనే యుద్ధము ఆపి శకుని భార్యకు నమస్కారము చేసి శకుని కుమారుడితో " కుమారా ! నీవు నాతో యుద్ధము చేయడము నాకు బాధ కలిగించింది. నాకు ధర్మరాజు ఎవరిని

చంపవద్దని చెప్పాడు. ఆ విషయము నీకు ముందే చెప్పాను నీవు వినలేదు. అయినా నేను నిన్ను చంపలేదు. నీవు మా పెదనాన ధృతరాష్ట్రుడికి, మా పెదమ్మ గాంధారికి దగ్గర బంధువువు. యుద్ధముచెయ్యడానికి మనమేమైనా శత్రువులమా ! ఇకనైనా శాంతించి యుద్ధముమాను " అన్నాడు. ఆ మాటలకు శాంతించిన శకుని కుమారుడితో అర్జునుడు " కుమారా నీవు బంధుమిత్ర సమేతంగా ధర్మరాజు చేస్తున్న అశ్వమేధ యాగముకు రావలసిందని ధర్మరాజు ఆహ్వానము తెలియజేయమని నాకు చెప్పాడు " అని యాగముకు ఆహ్వానించాడు. తరువాత అర్జునుడు అశ్వమును వెంబడించాడు. అశ్వము తరువాత హస్థినాపురానికి తిరుగు ప్రయాణము అయ్యింది.

## యాగశాల నిర్మాణం

అర్జునుడు యాగాశ్వాన్ని వెంబడిస్తూ ఆయారాజులను జయిస్తూ దిగ్విజయయాత్ర చేస్తున్న విషయము ఎప్పటికప్పుడు చారులద్వారా వింటూ ధర్మరాజు పరమాందభరితుడు అవుతున్నాడు. ఇంతలో మాఘశుద్ధపౌర్ణమి రానే వచ్చింది. ధర్మరాజు కొలువు తీర్చి తమ్ములను కొలువుకు ఆహ్వానించి " భీమసేనా ! నీ తమ్ముడు అర్జునుడు యాగాశ్వము వెంట జైత్రయాత్ర ముగించుకుని హస్థినకు తిరిగి వస్తున్నాడని వర్తమానము అందింది. ఇక చైత్రమాసము రావడానికి అధిక సమయము లేదు. మహామునులను, రాజులను ఆహ్వానించాలి కనుక వార్తాహరులను సిద్ధము చెయ్యి. అలాగే యాగనిర్వహణకు ఒక యాగశాలను నిర్మించడానికి సన్నాహాలు చెయ్యి. యాగముకు వచ్చు రాజులకు, మునులకు, ప్రముఖులకు తగిన ఏర్పాట్లు చెయ్యండి. తగిన అతిథి గృహములను నిర్మించడానికి ఏర్పాటు చెయ్యండి " ఆదేశించాడు. భీముడు వెంటనే వాస్తుశిల్పులను పిలిపించి యాగశాలను విడిది గృహములను వెనువెంటనే నిర్మింపజేసాడు. భూమండలము అంతాతిరిగి రాజులను మునులను ఆహ్వానించడానికి బ్రాహ్మణులను పంపాడు. ధర్మరాజు ఆహ్వానాన్ని అందుకున్న రాజులు తమతమ సైన్యములతో మునులు తమ శిష్యబృందముతో హస్థినాపురము చేరుకున్నారు. వారందరిని చూసిన ధర్మరాజు పరమానందభరితుడు అయ్యాడు. వారి, వారి అంతస్తులను అనుసరించి వారికి అతిథిమర్యాదలు, భోజనసదుపాయాలు, విడుదులు ఏర్పాటు చేయించాడు. ఈ ఏర్పాట్లన్నీ సేవకులకు అప్పగించక ధర్మరాజు తానే స్వయముగా పర్యవేక్షించ సాగాడు. భీముని ఆధ్వర్యంలో నిర్మింపజేసిన యాగశాలను, అతిథిగృహాలను చూసిన శ్రీకృష్ణుడు, వచ్చిన అతిథులు ఎంతో సంతోషించారు. **జనమేజయమహారాజా** ! అతిథిసత్కారాలు ఎలా జరుగుతున్నాయని అంటే లక్షమంది ఒకసారి భోజనము చేస్తే ఒక **నగారా** మోగుతుంది. ఆ నగారా ఎడతెరిపి లేకుండా అలా మోగుతూనే ఉంది. అంటే అన్ని లక్షల మంది భోజనము చేస్తున్నారన్నమాట " అని **వైశంపాయానుడు** జనమేజయుడికి చెప్పాడు.

## అర్జునుడు హస్థినకు వచ్చుట

భీముడి ఆధ్వర్యములో నిర్మింపబడిన యాగశాలను, అతిథిగృహములను చూసి శ్రీకృష్ణుడు, వచ్చిన అతిథులు, ఎంతో సంతోషించారు. జనమేజయ మహారాజా ! లక్షమంది ఒకసారి భోజనము చేస్తే ఒకసారి నగారా మ్రోగుతుంది. అలా నగారా ఎడతెరపి లేకుండా మ్రోగుతూనే ఉంది. అంటే ఎడతెరపి లేకుండా లక్షల మంది భోజనము చేస్తునారన్న మాట " వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పాడు. ధర్మరాజు భీమసేనుడి సహాయంతో వచ్చిన అతిధులను పూజించాడు. ఆ పూజలు అందుకున్న శ్రీకృష్ణుడు, బలరాముడు, సాత్యకి, యాదవప్రముఖులు మొదలగు వారు ఎంతో సంతోషించారు. ఇంతలో అర్జునుని దగ్గర నుండి వర్తమానము వచ్చిందని శ్రీకృష్ణుడు ధర్మరాజుకు ఇలా చెప్పాడు. " ధర్మనందనా ! అర్జునుడు తాను కలసిన రాజులందరిని అశ్వమేధయాగానికి ఆహ్వానించాడట. వారందరూ యాగముకు వస్తున్నారట. వారు మన విరోధులైనా ప్రస్థుతము మన ఆహ్వానము మన్నించి వస్తున్నారు. కనుక వారిని పూజించడము మన కర్తవ్యము. అదీ కాక " మణీపురాధీశుడు నా కుమారుడైన **బభ్రువాహనుడు** యాగముకు వస్తున్నాడు. అతడికి తగిన మర్యాదలు చెయ్యండి " అని అర్జునుడు నీకు చెప్పమని చెప్పాడు. ఆ మాటలకు సంతోషించిన ధర్మరాజు " శ్రీకృష్ణా ! నేనూ విన్నాను. అర్జునుడు అనేక మందిని యుద్ధమున జయించి వారితో మిత్రత్వము వహించి యాగముకు ఆహ్వానము తెలిపాడు. కృష్ణా ! అర్జునుడు మొన్న జరిగిన యుద్ధములో **భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు** మొదలైన మహాయోధులతో యుద్ధముచేసి ఎంతో శ్రమపడ్డాడు. అంతలోనే తిరిగి అశ్వమేధయాగము కొరకు యుద్ధములో పాల్గొన్నాడు. అయ్యో ! నా వలన అర్జునుడికి ఎన్ని కష్టాలు దాపురించాయి. కృష్ణా ! నిన్ను ఒకటి అడగాలని అనుకుంటున్నాను. అర్జునుడి దేహము అనేక శుభలక్షణములతో కూడి ఉన్నది కదా ! మరి ఈ యుద్ధములు ఒకదాని వెంట ఒకటిగా ఈ యుద్ధములు అతడికి ఎందుకు ప్రాప్తిస్తున్నాయి . అతడి అంగాలలో ఏదైనా దోషము ఉందా ! నీకేమైనా తెసుసా " అని అడిగాడు. శ్రీకృష్ణుడు " ధర్మనందనా ! నీవు చెప్పినది నిజమే. అర్జునుడు సకలలక్షణ సమన్వితుడు. కానీ ఒక లోపము ఉంది. అతడికి శరీరముకు తగినట్లు కాక కొంచము అధికముగా అతడి పిక్కలు ఉన్నాయి. అందువలననే అతడికి ఈ కష్టాలు కలుగుతున్నాయి. ఇప్పుడు అర్జునుడి కష్టాలు అన్నీ తొలగి పోయాయి " అని అన్నాడు.

## అర్జునుడు హస్థినలో ప్రవేశించుట

ఇంతలో అక్కడకు అర్జునుడి వద్ద నుండి ఒకదూత వచ్చాడు. ఆ దూత ధర్మరాజుకు నమస్కరించి " మహారా ! అర్జునుల వారు హస్థినాపుర సమీపానికి విచ్చేసారు. రేపు తమరిదర్శనము చేసుకుంటారు అని తమరికి మనవి చేయమన్నారు " అని చెప్పాడు. ఆ మాటలు విన్న **ధర్మరాజు, భీమ, నకుల, సహదేవులు, శ్రీకృష్ణుడు** పరమానందభరితులయ్యారు. అర్జునుడి రాక కొరకు ఎదురుచూస్తున్నారు. మరునాడు అర్జునుడు యాగాశ్వమును అనుసరిస్తూ హస్థినాపురప్రవేశము చేసాడు. వంధిమాగధులు, హస్థినాపురప్రజలు అర్జునుడిని వేనోళ్ళ కొనియాడసాగారు. అర్జునుడు యాగశాలను సమీపించగానే **ధర్మరాజు, భీముడు, నకుల సహదేవులు, శ్రీకృష్ణుడు, బలరాముడు, యాదవులు** అర్జునుడికి ఎదురు వెళ్ళి స్వాగతము పలికి సాదరంగా యాగశాలకు తీసుకుని వెళ్ళారు. అర్జునుడు ముందుగా ధృతరాష్ట్ర గాంధారులను తరువాత కుంతీదేవిని దర్శించి వారి ఆశీర్వాదములు అందుకున్నాడు. ఇంతలో అర్జునుడి భార్యలు **ఉలూపి, చిత్రాంగధలు బభ్రువాహనుడు** హస్థినకు వచ్చి చేరారు. అర్జునుడు తన భార్యలను, కుమారుడిని ధర్మరాజు వద్దకు తీసుకు వెళ్ళి పరిచయము చేసాడు. తరువాత ధృతరాష్ట్ర, గాంధారీల వద్దకు వెళ్ళి వారి ఆశీర్వాదము అందుకున్నాడు. తరువాత తల్లి కుంతీదేవికి కోడళ్ళను మనుమడిని చూపించాడు. కుంతీదేవి వారిని ఆనందముతో ఆదరించి ఆశీర్వదించింది. తరువాత చిత్రాంగధ, ఉలూపి ద్రౌపదిని సుభద్రను కలిసారు. అందరూ అరమరికలు లేకుండా మాట్లాడుకున్నారు. ఈ విధంగా అశ్వమేధయాగ సన్నాహాలు పూర్తి అయ్యాయి.

## యాగదీక్ష


అశ్వమేధ యాగములో అశ్వమును ముక్కలుగా చేస్తున్న ద్రౌపది.

వ్యాసుడు ధర్మరాజుతో " ధర్మనందనా ! ఈ యజ్ఞము గొప్పది. నీవు యజ్ఞముకు కావలసిన ధనము సంపాదించావు. కనుక యాగమును నిర్విఘ్నముగా నిర్వహించు. అశ్వమేధయాగము సమాప్తి అయ్యేరోజున చేసే స్నానము పవిత్రమైనది. ఆ స్నానముతో సమస్త పాపములు తొలగి పోతాయి. నీవు భారతయుద్ధములో అన్నదమ్ములను, గురువులను, బంధువులను, మిత్రులను చంపిన పాపము అంతా ఆ స్నానము వలన పోతుంది. నీకిక శుభములు కలుగుతాయి. వ్యాసుడి ఆదేశానుసారము ధర్మరాజు యాగదీక్ష పునాడు. ఋత్విక్కులు యజ్ఞకాండ నిర్వహిస్తున్నారు. మంత్రాలు పఠిస్తూ అగ్నిలో హోమద్రవ్యాలు వేలుస్తున్నారు. వేదమంత్రాలను ఉచ్చారణ చేస్తూ సోమలతల నుండి **సోమరసము**పిండుతున్నారు. యజ్ఞముకు వచ్చిన వారికి భీముడు భోజన సదుపాయలు చూసే పనిని నిర్వహిస్తున్నాడు. అందరి చేత కొసరి కొసరి తినిపిస్తున్నాడు. లేదు అనకుండా సంతర్పణలు చేయిస్తున్నాడు. యజ్ఞముకు వచ్చిన వారు అందరూ వట్టిచేతులతో తిరిగి వెళ్ళడము లేదు. ఆ యజ్ఞవాటిక దేవయజ్ఞమును తలపించ చేస్తుంది. భూలోకములో ధర్మరాజుతో నిర్వహించ పడుతున్న ఈ యజ్ఞమును దివి నుండి దేవతలు సహితము ఆసక్తితో తిలకిస్తున్నారు. ప్రధాన యజ్ఞవాటికను చతురస్రాకారముగా బంగారు ఇటుకలతో నిర్మించారు. యజ్ఞవాటిక ఎటు చూసినా 18 మూరలు పొడవు ఉండేలా నిర్మాణము జరిగింది. గరుడుని ఆకారముతో యజ్ఞవాటిక నిర్మాణము జరిగినది. ఋత్విక్కులు **ఉపస్థంభాలు** పాతారు. మొత్తము 21 ఉపస్థంభాలు పాతబడ్డాయి. వీటిలో **ఖాదిరములతో చేసిన స్థంభములు 6, మోగుతో చేసిన స్థంభాలు 6, దేదారు కర్రలతో చేసిన స్థంభాలు 2, శ్లేషాతక చెట్టు కొయ్యతో చేయబడిన స్థంభం 1 స్థంభము ఒకటి 21.** ఇవి కాక అలంకరణార్ధము పాతిన బంగారుస్థంభాలు అనేకము. ఆ ఉపస్థంభాలకు నాలుగుకాళ్ళ జంతువులు, పక్షులు, జలచరములను కట్టారు. ఆ ప్రాణులు మొత్తము 300. ప్రధాన ఉపస్థంభానికి యాగాశ్వమును కట్టారు. ఆ యజ్ఞముకు విచ్చేసిన వేదవ్యాసుడి శిష్యబృందము అందరిలో ప్రత్యేకముగా వెలిగి పోతున్నారు. తరువాత ఉపస్థంభాలకు కట్టిన 300 జంతువులను, పక్షులను, జలచరాలను బలి ఇచ్చారు. తరువాత యజ్ఞాశ్వమును బలి ఇచ్చే తరుణము ఆసన్నము కాగానే ద్రౌపదిని యజ్ఞాశ్వముకు సమీపముగా రమ్మని చెప్పి యజ్ఞాశ్వమును వధించారు. ద్రౌపది స్వహస్థాలతో ఆ అశ్వము యొక్క వివిధావయవములను హోమములో వేల్చి దేవతలకు హవిస్సు రూపములో అందజేసింది. యజ్ఞాశ్వము యొక్క ప్రధాన భాగాలు ఆ మాంసము హోమములో కాలుతుంటే వచ్చే వాసనను పాండవులు ద్రౌపది ఆస్వాదించి ఎంతో ఆనందించారు. ఋత్విక్కులు మిగిలిన మాంసమును శాస్త్ర విధిగా హోమములో వేసారు. ఆ విధముగా అశ్వమేధయాగము సమాప్తము అయ్యింది.

## యాగములో జరిగిన దానధర్మాలు

ధర్మరాజు సదస్యులకు కోటివేల **నిష్కములు** దానముగా ఇచ్చాడు. వ్యాసుడికి **ధర్మరాజు** తనరాజ్యమును దానముగా ఇచ్చాడు. వ్యాసుడు " ధర్మనందనా ! నీవు నాకు భూమిని దానంగా ఇచ్చావు. నేను ఈ భూమిని ఏమి చేసుకుంటాను. దానికి సమానమైన బంగారమును దానముగా ఇవ్వు " అని అన్నాడు. ధర్మరాజు " వ్యాసమునీంద్రా ! అశ్వమేధయాగ సమాప్తంలో భూదానము చెయ్యాలని ఆర్యులు అంటారు. అందు వలన అర్జునుడి వలన జయింపబడిన భూమిని నీకు దానము ఇచ్చాను. నాకు ఇక రాజ్యము లేదు. కనుక వనవాసముకు వెడతాను. అంతేకాని ఇచ్చిన రాజ్యము తిరిగి తీసుకోను " అన్నడు. వ్యాసుడు " ధర్మతనయా ! నీ చేత దానముగా స్వీకరించబడిన ఈ భూమి నాకే స్వంతము అనుటలో ఎటువంటి సందేహము లేదు. అందుకని మేము తిరిగి ఈ భూమిని నీకు అమ్ముతున్నాము నువ్వు తగిన వెల ఇచ్చి దానిని తిరిగి నీవే తీసుకో. ఇది రాజధర్మము ఇందులో ఎమీ తప్పులేదు " అని వ్యాసుడు చెప్పాడు. ఆ మాటలు విన్న శ్రీకృష్ణుడు కూడా వ్యాసుడు చెప్పినట్లే చెయ్యమన్నాడు. అప్పుడు ధర్మరాజు కోటికోట్లమాడలు కుప్పగా పోసి " నేను దానముగా ఇచ్చిన భూమి వెల ఇంత " అన్నాడు. వ్యాసుడు ఆ బంగారమును తీసుకుని రాజ్యాన్ని ధర్మరాజుకు తిరిగి ఇచ్చాడు. ఆ బంగారమును వ్యాసుడు యాగముకు వచ్చిన బ్రాహ్మణులకు దానముగా ఇచ్చాడు. ధర్మరాజు యాగము కొరకు తయారుచేసిన బంగారు పళ్ళెములు, బిందెలు, ఇతర వస్తువులు బ్రాహ్మణులకు పంచి పెట్టాడు. బ్రాహ్మణ దానములు అయిన తరువాత క్షత్రియులకు ఆ తరువాత వైశ్యులకు, ఆ తరువాత శూద్రులకు, ఆ తరువాత ఇంకా తక్కువ జాతి వారికి అపారముగా దానములు చేసాడు. యజ్ఞముకు వచ్చిన వారంతా అత్యంత సంతుష్టులై వారి వారి నివాసములకు వెళ్ళారు. వేదవ్యాసుడు తన వంతుకు వచ్చిన ధనమును కుంతీదేవికి ఇచ్చాడు. కుంతీదేవి ఆ ధనమును పేదలకు పంచి ఇచ్చింది. జనమేజయ మహారాజా ! దానములలో ధర్మరాజు రెండవ **మరుత్తు** అనిపించుకున్నాడు. యజ్ఞము పరిసమాప్తి అయిన తరువాత ధర్మరాజు తమ్ములతో భార్య ద్రౌపదితో యజ్ఞస్నానము చేసాడు. ఈ యజ్ఞముతో ధర్మరాజు తన మనసును శరీరాన్ని పవిత్రము చేసుకున్నాడు. ఆ యజ్ఞమును నిర్విఘ్నముగా జరిపించిన వ్యాసుడికి ధర్మరాజు సాష్టాంగప్రమాణము చేసాడు. ధర్మరాజును దీవించి వ్యాసుడు తన శిష్యులతో అక్కడ నుండి వెళ్ళి పోయాడు.

## యాగానంతరం రాజులను సత్కరించుట

వ్యాసుడు తన శిష్యులతో వెళ్ళిన తరువాత ధర్మరాజు " యాగముకు వచ్చిన రాజులకు సముచిత సత్కారాలు చేసాడు. **బంగారమును, మణులను, నగలను, మాణిక్యాలను, నగలను, ఏనుగులను, అశ్వములను, వేశ్యల**ను కానుకగా ఇచ్చాడు. బభ్రువాహనుడికి సముచుత సత్కారము చేసి తన దేశముకు వెళ్ళడానికి అనుమతి ఇచ్చాడు. ఎన్ని రోజులుగానో అర్జునుడికి దూరముగా ఉన్న **ఉలూపి, చిత్రాంగదలు** తమ భర్త అర్జునుడి వద్ద ఉండి పోయారు. **బభ్రువాహనుడు** మాత్రము తన దేశానికి తిరిగి వెళ్ళాడు. అందరికంటే ముందుగా యాగము చూడడానికి వచ్చిన శిశుపాలుని భార్యను ధర్మరాజు సముచితంగా సత్కరించాడు. ఆమె మనుమడిని సింధుదేశానికి అధిపతిగా పట్టాభిషిక్తుడిగా చేసాడు. తరువాత భారత యుద్ధములో ఓడిపోయి చనిపోయిన రాజుల రాజ్యాలను వారి వారసులకు ఇచ్చివేసాడు. అందరూ వెళ్ళిన తరువాత కూడా శ్రీకృష్ణుడు, బలరాముడు, యాదవ ప్రముఖులు ఉండిపోయారు. శ్రీకృష్ణుడికి, బలరాముడికి, సాత్యకికి, మిగిలిన యాదవ ప్రముఖులకు ధర్మరాజు అనేక రత్నాభరణాలు, విలువైన కానుకలు ఇచ్చి సత్కరించాడు. ధర్మరాజు చేసిన సత్కారాలకు తృప్తిచెందిన యాదవప్రముఖులు ద్వారకకు తిరిగి వెళ్ళారు " అని **వైశంపాయనుడు** జనమేజయునికి అశ్వమేధయాగ విశేషములు తెలిపాడు.



అశ్వం తిరిగివచ్చిన తరువాత జరిగిన విందులో యుధిష్టురినితో మాట్లాడుతున్న కృష్ణుడు - రాజ్మానామా నుండి ఒక దృశ్యం

## అశ్వమేధయాగములో జరిగిన విశ్మయం

**జనమేజయుడు** ధర్మరాజు చేసిన అశ్వమేధయాగము గురించి వింటూ వైశపాయనుడితో " వైశంపాయన మహర్షీ ! అత్యంత వైభవోపేతంగా జరిగిన అశ్వమేధయాగములో విస్మయం కలిగించే విషయము ఏదైనా జరిగిందా వివరించండి " అని అడిగాడు. **వైశంపాయనుడు** బదులుగా "

జనమేజయమహారాజా ! మీ తాతగారైన ధర్మరాజు యాగము చేస్తున్న సమయంలో ఒక ముంగిస యాగశాలకు వచ్చింది. అక్కడ ఉన్న ఋత్విక్కులను సదస్యులను బ్రాహ్మణులను చూసి " ఈ అశ్వమేధయాగము సక్తుప్రస్థుని ధర్మమును కొంచము కూడా పోలదు " అని ప్రకటించింది. ఆ మాటలు విన్న అక్కడ బ్రాహ్మణులు ఆశ్చర్యపోయారు. అప్పుడు ఋత్విక్కులు ముంగిసతో " ఈ యాగములో మంత్రపఠనము, కర్మకాండ, వివిధ దానధర్మాలు పలువురి ప్రశంశలను పొందాయి. ధర్మరాజు ఈ యాగమును నిర్వహించిన తీరు, శ్రద్ధ, భక్తి, అందరికీ యోగ్యము అయింది. ఇందులో జరిగిన ధర్మవిరుద్ధ కార్యము ఏమి ? " అని అడిగారు.



అశ్వమేధయాగములోకి వచ్చిన ముంగిస

## బ్రాహ్మణుడి కధ

అందుకు ఆ ముంగిస " ధర్మక్షేత్రము అని పిలువబడుతున్న ఈ కురుక్షేత్రములో ఒక బ్రాహ్మణుడు ఉండే వాడు. అతడు మానము, అభిమానము, కామములను జయించిన వాడు అతి సౌమ్యుడు. అతడు భార్య, కుమారుడు, కోడలుతో గృహస్థజీవనము సాగించే వాడు. అతడు ఉంఛవృత్తి సాగిస్తూ పొలములో రాలిపడిన గింజలను ఏరుకుని తృప్తిగా జీవనం సాగించే వాడు. ఒకసారి తీవ్రమైన అనావృష్టి వచ్చి ఎక్కడ చూసినా ఆహారము లభించడము కష్టము అయింది. ఒక రోజు వారు నలుగురూ పొలముకు వెళ్ళి గింజలు ఏరుకుని వచ్చి వాటితో పేలపిండి చేసి దేవతారాధనా సంధ్యా వందనము చేసి పేలపిండిని నలుగురూ సమానంగా పంచుకున్నారు. వారు ఆ పేలపిండిని తినడానికి సిద్ధము ఔతున్న తరుణములో వారి వద్దకు ఒక బాటసారి అతిథిగా వచ్చాడు. వారు నలుగురూ ఆ అతిథికి ఎదురు వెళ్ళి సాదరంగా ఆహ్వానించి కుటీరము లోనికి తీసుకుని వెళ్ళి అతిథి మర్యాదలు చేసారు. అప్పుడు ఆ బ్రాహ్మణుడు " మహానుభావా ! ఈ పేలపిండి అన్యార్జితము కాదు. ధర్మముగా సంపాదించింది కనుక మీరు దీనిని తీసుకుని మీ ఆకలి తీర్చుకోండి " అని అన్నాడు. ఆ పేలపిండిని తిన్న తరువాత కూడా అతడి ఆకలి తీరలేదు. అప్పుడు ఆ బ్రాహ్మనుడి భార్య ముందుకు వచ్చి " నాధా ! నా వంతుకు వచ్చిన పేలపిండిని అతిథికి ఇచ్చి అతడి ఆకలి తీర్చండి " అన్నది. అప్పుడు ఆ బ్రాహ్మణుడు " నోరులేని పక్షులు కూడా తమ భార్యలకు ఆహారము తెచ్చి ఇస్తాయి. అలాంటప్పుడు నేను నీ అహారమును ఎలా తీసుకొనగలను ? " అన్నాడు. ఆ మాటలకు అతడి భార్య " నాధా ! భార్యకు భర్తయే దైవము, చుట్టము, స్నేహితుడు, తల్లి, తండ్రి, గురువు అన్నీ. కనుక భర్తకర్తవ్యము నెరవేర్చడము భార్య ధర్మము కదా ! మీరు మీ భాగము పేలపిండిని ఇచ్చారు కనుక తరువాత ఇవ్వవలసిన బాధ్యత నాది. అదీ కాక మీరు తినకుండా నేను మాత్రము ఎలా తినగలను. కనుక పేలపిండిని అతిథికి ఇవ్వడములో సంకోచించవలసిన అవసరము లేదు " అన్నది. బ్రాహ్మణుడు ఇక తప్పదనుకుని పేలపిండిని అతిథికి సమర్పించాడు. ఆ పేలపిండి అతిథి ఆకలి తీర్చలేదు. అతడు ఇంకా విచారముగా ఉన్నాడు. బ్రాహ్మణుడు అతిథిని సంతోషపెట్ట లేకపోయినందుకు చింతించసాగాడు. తండ్రి బాధను చూసిన తనయుడు " తండ్రీ ! ఇందు కొరకు ఇలా చింతించ తగునా ! నా వంతు వచ్చిన పేలపిండిని అతిథికి ఇచ్చి అతడిని తృప్తి పరచండి " అన్నాడు. అందుకు ఆ బ్రాహ్మణుడు " కుమారా ! ఎంతైనా పెద్ద వాళ్ళకంటే చిన్న వాళ్ళకు ఆకలి ఎక్కువ. నీ నోటి వద్దనుండి ఆహారమును నేను ఎలా తీసుకొనగలను ? " అన్నాడు. ఆ మాటలకు కుమారుడు " తండ్రీ ! కుమారుడు అంటే తండ్రికి ప్రతిరూపము కదా ! మీ దుఃఖము తీర్చడము కుమారుడిగా నా కర్తవ్యము కాదా ! కనుక సంకోచము వదిలి ఈ పేలపిండిని అతిథికి ఇవ్వండి " అన్నాడు. కుమారుడి మాటలకు తృప్తిచెంది బ్రాహ్మణుడు కుమారుడి వంతు పేలపిండిని అతిథికి ఇచ్చాడు. అంతటితో అతిథి ఆకలి తీరలేదు. అది చూసి బ్రాహ్మణుడు చింతించసాగాడు. అది చూసిన కోడలు తన వంతు పేలపిండిని మామగారి ముందు పెట్టి " మామగారూ ! ఈ పేల పిండిని కూడా పెట్టి అతిథి ఆకలి తీర్చండి " అన్నది. అది విని బ్రాహ్మణుడు " అమ్మా ! నీవు కోడలివి. మా దరిద్రములో భాగము పంచుకున్నావు. సరి అయిన ఆహారము లేక సుకుమారమైన నీ శరీరము శుష్కించి పోయింది. దొరక్క దొరక్క ఈ రోజు పేలపిండి దొరికింది. ఇది కూడా ఇచ్చి నీవు ఆకలితో ఎలా ఉండగలవు నీవు ఆకలితో అలమటిస్తూ ఉంటే నేను ఎలా ఉండగలను ? " అని బాధపడ్డాడు. అందుకు కోడలు " మామగారూ ! మీరు నాకు గురువులు. ఈ దేహములో ప్రాణమ్ములు ఉన్నంత వరకు గురువుకు శుశ్రూష చేయడము శిష్యుని కర్తవ్యము. కనుక ఈ పేలపిండిని అతిథికి సమర్పించి మీకు సేవ చేసుకునే భాగ్యము నాకు ప్రసాదించండి " అని బదులిచ్చింది. ఆ మాటలకు సంతోషించిన బ్రాహ్మణుడు ఆ పేలపిండిని అతిథికి ఇచ్చాడు. అతిథి ఆ పేలపిండిని తిని అమ్మయ్యా నా ఆకలి తీరింది అన్నాడు. అది విని నలుగురూ సంతోషించారు. అప్పుడు ఆ అతిథి బ్రాహ్మణుడితో " మిత్రమా ! నేను యమధర్మరాజును మిమ్ము పరిక్షించడానికి మీ ఇంటికి అతిధిగా వచ్చాను. నీ యొక్క , మీ కుటుంబము యొక్క ధర్మనిరతిని సద్గుణ సంపత్తిని చూసి ఆనందించాను. నీ అందు పెద్దల ఎడ భక్తి, అతిథుల పట్ల వినయము, చేసే పనిమీద శ్రద్ధ మిక్కుటముగా ఉన్నవి. నీవు చేసిన దానము దేవతలు పై నుండి చూసి ప్రశంసిస్తున్నారు చూడు " అన్నాడు. దేవేంద్రుడు

వారి మీద పూలవాన కురిపించాడు.

### యముని ప్రశంశ

యమధర్మరాజు " బ్రాహ్మణోత్తమా ! దేవలోకములో సప్తఋషులు నీ కొరకు ఎదురు చూస్తూ ఉన్నారు. నీవు నీ భార్య, కుమారుడు, కోడలితో స్వర్గానికి రా " అని తిరిగి " మహాభాగా ! ఆకలి అన్నింటి కంటే చెడ్డది. ఆకలి బుద్ధిని, వివేకమును మట్టు పెడుతుంది. ఆశ దయాగుణమును నాశనము చేస్తుంది. నీవు, నీ భార్య, కుమారుడు, కోడలు, ఆశను జయించారు. అతిథి పూజ చేసి దివ్యత్వము సాధించారు. నీ దానగుణముకు మెచ్చిన బ్రహ్మ తమ లోకానికి మిమ్ము ఆహ్వానించారు. **బ్రహ్మలోకము** నుండి త్వరలో విమానము వచ్చింది. బ్రాహ్మణోత్తమా! తనకు ఉన్న సంపదలో దానము ధర్మము చెయ్యడము గొప్ప విషయము కాదు. ధర్మముగా సంపాదించినది కొంచమైనా తమకంటూ ఏమీ మిగల్చకోకుండా యోగ్యుడైన వాడికి దానము చెయ్యడం ఉత్తమోత్తమము " అని పలికి యమధర్మరాజు తన దివ్యమైన రూపమును వారికి చూపించాడు. ఇంతలో ఆకాశము నుండి ఒక దివ్యమైన విమానము కనపడింది. అది చూసిన దేవతలు ఆశ్చర్య పోయారు. బ్రాహ్మణుడు, ఆయన భార్య, కుమారుడు, కోడలు యముడికి సాష్టాంగప్రమాణము ఆచరించారు. " బ్రాహ్మణోత్తమా ! అదుగో బ్రహ్మదేవుడు పంపిన దివ్య విమానము మీరంతా ఆదివ్య విమానము ఎక్కి బ్రహ్మలోకము వెళ్ళండి. అని యమధర్మరాజు చెప్పాడు. అప్పుడు ఆబ్రాహ్మణుడు, భార్య, కుమారుడు, కోడలుతో సహా ఆ దివ్య విమానము ఎక్కి బ్రహ్మ లోకము వెళ్ళాడు. ఇదంతా నేను పక్కనే ఉన్న కలుగులో నుండి చూసాను. నేను వెంటనే **సక్తుప్రస్థుడు**, యమధర్మరాజు కాళ్ళు కడిగిన నీటిలో అటూ ఇటూ పొర్లినప్పుడు నా శరీరానికి ఒక వైపు మాత్రమే ఆ నీరు అంటుకుంది. ఆ నీటి ప్రభావంతో నా శరీరము సువర్ణమయము అయ్యింది. ఆ రోజు నుండి నేను ఎక్కడ యజ్ఞ యాగములు జరుగుతున్నా అక్కడకు వెడుతుంటాను. ఎందుకంటే నా శరీరము రెండవ వైపు కూడా సువర్ణమయము ఔతుందని నా ఆశ. కాని ఇంతవరకు జరగ లేదు. ధర్మరాజు లోకోత్తరమైన యాగము చేస్తున్నాడని విని ఇక్కడకు వచ్చాను కాని ఇక్కడ ఉన్న నీటిలో ఎంత పొర్లినా నా శరీరము నా మిగిలిన శరీరము సువర్ణము కాలేదు. ఎందు కంటే కేవలము పొలములో రాలిన గింజలు ఏరుకుని తినే బ్రాహ్మణుడు చేసే దానముకు ధర్మరాజు చేసే ఈ అశ్వమేధయాగము సాటిరాదు అని తెలుసుకున్నాను " అని ముంగిస అక్కడనుండి వెళ్ళింది.

### యాగము జంతుబలి

**జనమేజయమహారాజు** " వైశంపాయనమహర్షీ ! రాజులు యజ్ఞములు చెయ్యడంలో, మునులకు తపస్సు చేసుకొనడము, బ్రాహ్మణులు మనోనిగ్రహము, ఇంద్రియ నిగ్రహములలోఆసక్తి చూపుతారు కదా ! రాజులు ఎన్నో యజ్ఞ యాగములు చేసి కీర్తిగడించి పుణ్యలోకాలకు పోతారని విన్నాము కదా ! ధర్మరాజు అశ్వమేధయాగమును అత్యంత ఉదాత్తరీతిలో నిర్వహించాడు కదా ! ఇంతకు ముందు రాజులకంటే సత్యము, శౌచమూ, భక్తి, శ్రద్ధలతో నిర్వహించాడు కదా ! అతడు చేసిన యాగమును వ్యాసుడి వంటి మహర్షులు కూడా మెచ్చుకున్నారు కదా ! దేవేంద్రుడు చేసినట్లు అశ్వమేధయాగము చేసాడు కదా ! అటువంటి యాగమును ముంగిస గర్హించి అవహేళన చేయడానికి కల కారణము ఏమిటి ? " అని అడిగాడు. **వైశంపాయనుడు** " జనమెజయమహాఅరాజా ! ధర్మరాజు నిర్వహించినశ్వమేధయాగములో ఎంతో జీవహింస జరిగింది. దేశమంతాతిరిగివచ్చిన అశ్వాన్నికూడా బలి ఇచ్చారు. 300 మూగజీవులను కూడా చంపారు. ఇంతటి జీవహింసతో కూడుకున్న అశ్వమేధయాగము కంటే ఆ బ్రాహ్మణుడు చేసిన తపోయజ్ఞము ఎంతో మేలైనది అని ఆ ముంగిస చెప్పింది. ఆ బ్రాహ్మణుడు చేసిన సాత్విక , తపోయజ్ఞము వలన తన శరీరము సగభాగము సువర్ణమయము అయింది అని చెప్పింది కనుక అది అబద్ధము అని త్రోసిపుచ్చ లేము " అన్నాడు వైశంపాయనుడు.

### అగస్త్యుని యాగం

ఈ విషయమును వివరించడానికి ఒక ఇతిహాసము చెప్తాను " పూర్వము ఒక సారి దేవేంద్రుడు ఒక యజ్ఞము చేయ తలపెట్టాడు. ఆ యజ్ఞముకు అనేక వేల మంది ఋత్విక్కులు, మునులు, దేవతలు వచ్చారు. యజ్ఞవాటికను తయారు చేసారు. అగ్నిని వేల్చారు. యజ్ఞములో బలి ఇవ్వడానికి అనేక జంతువులను సమకూర్చారు. అది చూసిన మునులు దేవేంద్రుడితో " దేవేంద్రా ! నీవు చేసిన యజ్ఞములో ఇన్ని జంతువులను బలి ఇవ్వాలా ! యజ్ఞముకు ఇంత జీవ హింస చేయాలా ! జంతువులకు బదులుగా మూడు సంవత్సరాలు నిలువ ఉంచిన విత్తనములను యజ్ఞద్రవ్యములుగా వాడ వచ్చును కదా ! ఇది కృతయుగధర్మమని వేదము చెప్తుంది కదా ! కనుక వేదోక్తముగా యజ్ఞము చెయ్యి. కన్నీరు కారుస్తున్న జంతువులను చూసి కనికరించి ఈ యజ్ఞములో జీవ హింస మానుకో " అన్నారు. కాని దేవేంద్రుడు వారి మాట విన లేదు. మునులు కూడా జీవహింస వద్దని పట్టుబట్టారు. దేవ లోకము ఈ వాదనతో రెండు ముక్కలు అయ్యింది. దేవతలు దేవేంద్రుని

పక్షము వహించారు. ఆ యాగమును చూడడానికి వచ్చిన దేవేంద్రుడి స్నేహితుడు ఉపరిచరమనువు ఇరు పక్షముల కోరికమీద మధ్యవర్తిత్వము వహించాడు. అందరూ కలసి విషయము వివరించి యజ్ఞములో జీవహింస మంచిదా కాదా అని చెప్పమన్నారు. దేవేంద్రుడి మిత్రుడైన ఉపరిచర మనువు యజ్ఞములో జీవహింస సరి అయినదే అని చెప్పాడు. అలా చెప్పినందుకు అతడు నరకానికి వెళ్ళాడు. కనుక జనమేజయ మహారాజా ! జీవహింస లేని యజ్ఞము ఉత్తమమైనది అనుటలో ఇసుమంత అయినా సందేహము లేదు " అని వైశంపాయనుడు చెప్పాడు.

## దానము ధనము

**జనమేజయుడు** " మహర్షీ ! మీరు చెప్పినది నిజమే. ఆ బ్రాహ్మణుడి త్యాగము కొనియాడతగినది. దానము చెయ్యడానికి ధర్మమార్గములో సంపాదించిన ధనము మాత్రమే యోగ్యమైనది అని ఇంకా వివరించండి " అని అడిగాడు. వైశంపాయనుడు " జనమేజయ మహారాజా ! ఈ విషయము వివరించడానికి నీకు ఒక కథ చెప్తాను. పూర్వము అగస్త్యుడు 12 సంవత్సరాలు నిరాఘంటముగా సాగే ఒక యాగము చేయడానికి పూనుకున్నాడు. ఆ యాగమునకు అనువజ్ఞులు అయిన మునులు, ఋత్విక్కులు వచ్చారు. యజ్ఞముకు తగిన ఏర్పాట్లు జరుగుతున్నాయి కాని ఇంద్రుడు మాత్రం వర్షం కురిపించలేదు. కనుక ఓషధులు లభించలేదు. కనుక బ్రాహ్మణులకు, ఆహుతులకు దానధర్మములు చెయ్యడానికి భోజనము పెట్టడానికి ధనము, ధాన్యము లేదు. ఈ యాగము ఎలా నిర్వహిస్తాడో అని అందరూ ఆతురతతో ఎదురుచూస్తున్నారు. ఎందు కంటే అగస్త్యుడు 12 సంవత్సరాలు దీక్షలో ఉన్నాడు. ధర్మమార్గములో వచ్చినది తప్ప వేరొకటి ముట్టడు. ధర్మమార్గములో ధాన్యము రావలంటే వర్షాలు పడాలి. పంటలు పండాలి. ఏమి జరుగనున్నదో అని అందరూ విచారంగా ఎదురు చూస్తున్నారు.

## అగస్త్యుడు మునులకు ధైర్యము చెప్పుట


యజ్ఞ సమయములో పతిజ్ఞ చేయుచున్న ఆగస్త్యుడు

ఆ మాటలు విన్న అగస్త్యుడు " మహామునులారా ఋత్విక్కులారా ! నేను చేయబోవు ధర్మయజ్ఞముకు దేవేంద్రుడు సహకరించి వర్షములు కురిపిస్తే సరి, లేకున్న నేను ఇంద్రపదవిని స్వీకరించి లోకములను పాలిస్తాను. మీరిక నిశ్చింతగా ఉండండి. అదీ కాకపోతే ఈ మూడు లోకాలలో ఉన్న యజ్ఞద్రవ్యాలను తీసుకువచ్చి యజ్ఞము చేస్తాను. ఈ సంవత్సరము ఉత్తర కురుభూములలో వర్షములు సమృద్ధిగా పడ్డాయి. ధాన్యాలు పుష్కలంగా ఉన్నాయి. యాగసమయంలో అన్నదానము చేయడానికి అక్కడ నుండి ధాన్యము తెప్పిస్తాను. నేను యజ్ఞములో విత్తనములు వేసి వేల్చడము వలన లోకానికి ఏమన్నా కీడు జరుగుతుందా ! విత్తనములతో యజ్ఞము చేస్తే యజ్ఞముకు ఆటంకము జరుగుతుందా ! కనుక ఈ విషయములో మీరు ఇక చింతించ పని లేదు " అన్నాడు. ఆ మాటలకు అక్కడ చేరిన మునులు " మహర్షీ ! ఇంత చిన్న విషయానికి మీరు మీ తపోశక్తిని ఎందుకు వ్యర్ధము చేసుకుంటారు. ఇతరుల వద్ద నుండి ధనము తీసుకొనడము ఎందుకు, ఉత్తర కురుభూముల నుండి ధాన్యము తెప్పించిడము ఎందుకు, పంటలు పండించడానికి ఉపయోగించే విత్తనములతో యజ్ఞము చెయ్యడము ఎందుకు. మాకు కావలసిన వస్తువులు, యజ్ఞముకు కావలసిన వస్తువులు మేము మా ఆశ్రమాల నుండి తీసుకు వచ్చి యజ్ఞమును నిర్విఘ్నముగా జరిపిస్తాము " అన్నారు. ఈ విషయము అంతా తెలుసుకున్న [[ఇంద్రుడు[[ తన పదవి ఎక్కడ ఊడుతుందో అని భయపడి వర్షములు పుష్కలముగా కురిపించి బృహస్పతిని తోడు తీసుకుని భయభక్తులతో అగస్త్యుడి వద్దకు వచ్చాడు. అగస్త్యుడు ఇంద్రుడిని సాదరంగా ఆహ్వానించాడు. యజ్ఞము నిర్విఘ్నముగా జరిగింది. దేవేంద్రుడిని సాదరంగా స్వర్గలోకముకు పంపాడు. యజ్ఞముకు వచ్చిన మునులకు, ఋత్విక్కులను భక్తితో పూజించి తగినసత్కారము చేసి పంపాడు. ఈ విధంగా అగస్త్యుడు హింసకు తావు లేని యజ్ఞము చేసి కీర్తి గడించాడు. కనుక జనమేజయ మహారాజా ! ధర్మమార్గమున సంపాదించిన ధనముతో చేసే యజ్ఞము హింసకు తావు లేకుండా చేసే యజ్ఞము మనోజ్ఞమై వెలుగుతుంది " అని **వైశంపాయనుడు** జనమేజయుడికి చెప్పాడు.

## ముంగిస పూర్వ కథ

**జనమేజయుడు** వైశంపాయనుడిని " మహర్షి ! ఇది వరకు మీరు ఒక ముంగిస మనుషభాషలో మాట్లాడింది అని చెప్పారు కదా ! ఆ ముంగిస పూర్వజన్మలో ఎవరో ఒక మహానుభావుడు అయి ఉంటాడు. ఆ విషయము వివరించండి " అని అడిగాడు. **వైశంపాయనుడు** ఒకసారి **పితృకార్యము** చేయ సంకల్పించి ఒక కొత్తకుండలో తమ ఇంటిలో ఉన్న హోమధేనువు పాలుపితికి ఒక ప్రదేశములో పదిలంగా పెట్టాడు. అప్పుడు అతడిలోని **క్రోధదేవత** సాకారముగా వచ్చి పొరపాటున చేసినట్లు ఆ పాలకుండను పడగొట్టింది. పాలు అన్ని నేలపాలు అయ్యాయి. అది చూసిన జమదగ్ని కోపించ లేదు. అప్పుడు కోపదేవత " జమదగ్నీ ! సాధారణంగా భృగు వంశస్తులు మహాకోపిష్టులు కదా ! అది నిజము కాదు అని నీవు నిరూపించావు. నేను ఓడి పోయాను. నీ పట్ల అపరాధము చేసినందుకు నన్ను క్షమించు " అన్నది. **జమదగ్ని** " అదేమిటి నీవేమి తప్పు చేసావు. ఒక వేళ నీవు తప్పు చేవని భావిస్తే దానిని నీ మనసు నుండి తీసి వెయ్యి. అయినా నీవు మా పితృదేవతలకు చేయు శ్రాద్ధకర్మలకు విఘ్నము కలిగించావు. అందువలన **పితృదేవతలు** నిన్ను శపించగలరు. కనుక నీవు ఇక్కడ నుండి వెళ్ళిపో " అన్నాడు. జమదగ్ని మాట మన్నించి క్రోధదేవత అక్కడ నుండి వెళ్ళి పోయింది. తరువాత జమదగ్ని ఆహ్వానము మీద అక్కడకు వచ్చిన పితృదేవతలు జరిగిన విషయము తెలుసుకున్నారు. వారు జరిగినదానికి కోపించి " నీవు చేయబోవు శ్రాద్ధకర్మకు విఘ్నము కలిగించిన క్రోధదేవతను నీవు శపించక విడిచి క్షమించరాని శాంతము వహించావు. అందువలన నీవు ముంగిసపై పుట్టు " అని శపించారు. అప్పుడు జమదగ్ని " పితృదేవతలారా ! బ్రాహ్మణులకు కోపము తగదు అంటారు కదా ! అందుకని క్రోధదేవతను శపించ లేదు. నా అపరాధము మన్నించి నాకు శాపవిమిక్తి కలిగించండి " అని వేడుకున్నాడు. పితృదేవతలు శాంతించి " కుమారా ! మహా పండితులు ఉన్న సభలో ఒక మహాధర్మమును అధర్మము అని నిరూపించి శాపవిముక్తుడవై మోక్షపదవిని పొందు " అన్నారు. జనమేజయమహారాజా ! ఆ ముంగిస గతజన్మలో జమదగ్ని. మరుజన్మలో ముంగిసగా జన్మించి ధర్మరాజు చేసిన అశ్వమేధయాగాన్ని అధర్మమని నిరూపించి శాపవిముక్తి పొందింది " అని **వైశంపాయనుడు** చెప్పాడు.

## బయటి లింకులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

# ఆశ్రమవాస పర్వము ప్రథమాశ్వాసము

వికీపీడియా నుండి

(ఆశ్రమవాస పర్వము నుండి దారిమార్పు చెందింది)

## విషయ సూచిక

# ప్రధాశ్వాసము

ధర్మరాజు చేసిన అశ్వమేధయాగము గురించి విన్న **జనమేజయుడు** వైశంపయనుడిని " మహర్షీ ! అ విధముగా పితృపితామహుల నుండి సంక్రమించిన రాజ్యసంపదను స్వీకరించిన పాండవులు ధృతరాష్ట్రుని పట్ల ఏవిధముగా ప్రవర్తించారు. కుమారులు, మిత్రులు, అమాత్యులను పోగొట్టుకున్న ధృతరాష్ట్రుడు, అష్టైశ్వర్యాలు పోగొట్టుకున్న ధృతరాష్ట్రుడు ఆయన భార్య గాంధారి ఏ విధంగా ప్రవర్తించారు వివరించండి " అని అడిగాడు.

## ధర్మరాజు ధృతరాష్ట్రుడి పట్ల వహించిన శ్రద్ధ

**వైశంపాయనుడు** " జనమేజయమహారాజా ! ధర్మరాజు అతడి తమ్ములు ధృతరాష్ట్ర గాంధారులను ఏ లోపము లేకుండా గౌరవప్రదంగా చూసుకుంటున్నారు. పాండవులు రోజూ ధృతరాష్ట్రుడిని కలుసుకుని ఆయన ఆదేశాలను స్వీకరిస్తున్నారు. విదురుడు, **యుయుత్సుడు** ఆయనను ఏమరక సేవిస్తూ అతడికి కావలసినవి అడిగి అందిస్తున్నారు. ధృతరాష్ట్రుడు గాంధారి కూడా పాండవుల పట్ల ప్రేమాభిమానాలతో ప్రవర్తిస్తున్నారు. కుంతీదేవి కూడా అక్క గాంధారిని ప్రతి రోజూ వచ్చి పలకరిస్తూ ఉంది. ద్రౌపది, సుభద్ర అత్తగారైన గాంధారిని సేవిస్తున్నారు. ఆమెకు విలువైన కానుకలను సమర్పిస్తున్నారు. **ఉలూపి, చిత్రాంగధ**లు కూడా గాంధారిని సేవిస్తున్నారు. ధర్మరాజు అనుమతితో ధృతరాష్ట్రుడు ఎన్నో ధర్మకార్యాలు చేస్తున్నాడు. దేవాలయములు కట్టించాడు, సత్రములు నిర్మించాడు, చెరువులు తవ్వించాడు, బ్రాహ్మణులకు అగ్రహారాలు, మిగిలిన జాతుల వారికి గ్రామములు నిర్మించాడు. చక్రవర్తి ధర్మరాజును చూడవచ్చే సామంతరాజులు ముందుగా ధృతరాష్ట్రుడిని చూసి తరువాత ధర్మరాజును చూసే వారు. ధర్మరాజు కూడా అందుకు ఎంతో సంతోషించేవాడు. పెదనానకు కుమారులు లేని కొరత లేకుండా ధర్మరాజు ఎంతో జాగ్రత్తవహించ సాగాడు. అది కాక ధర్మరాజు తన తమ్ములకు, అమాత్యులకు, సైన్యాధిపతులకు ఇలా ఆదేశాలు ఇచ్చాడు. " పెదనాన, పెదతల్లి గారు పుత్రులను పోగొట్టుకుని దు:ఖంతో ఉన్నారు. వారికి ఏ లోటు రాకుండా చూడండి. నాకు ఏవిధమైన గౌరవ మర్యాదలు ఇస్తారో అదే విధమైన గౌరవ మర్యాదలు వారికి ఇవ్వండి " అని ఆదేశించాడు. ధర్మరాజు మాటలను తమ్ములు, అమాత్యులు, సేవకులు పాటించారు.

## ధృతరాష్ట్రుడి పట్ల భీముడి ప్రవర్తన

ధర్మరాజు మీద ఉన్న గౌరవంతో భీముడు ధృతరాష్ట్రుని మీద గౌరవము ఉన్నట్లు నటించినా మనసుమాత్రము ధృతరాష్ట్రుని చూడగానే ఉడికిపోయేది. ధృతరాష్ట్రుడిని చూడగానే భీముడికి మాయాజూదము వలన తాము పడిన బాధలు, అరణ్య అజ్ఞాత వాసముల వలన తాము అనుభవించిన బాధలు గుర్తుకు వచ్చేవి మనసు మండి పోయేది. భీముడు మాత్రము ధృతరాష్ట్రుడిని చూడగానే మండిపడే వాడు. ధర్మరాజు మాత్రము అందుకు భిన్నంగా ఉండేవాడు. సుయోధనుడు అతడి తమ్ములకు శ్రాద్ధకర్మలు ఆచరించే సమయములో ధృతరాష్ట్రుడి చేత అనేక దానధర్మములు చేయించే వాడు. ధృతరాష్ట్రుడికి తనకుమారులు ఉన్నప్పటికంటే ఇప్పుడు రాచమర్యాదలు అధికంగా జరిగేవి. ధర్మరాజు ధృతరాష్ట్రుడి వలన అతడి కుమారుల వలన తాము అనుభవించిన కష్టాలను, వారి తమకు చేసిన అపకారాలను మనసులోకి రానిచ్చేవాడు కాదు. ధర్మరాజు మనసెరిగి మిగిలిన వారు ధృతరాష్ట్రుడి గురించి కాని, అతడి కుమారుల గురించి కాని, వారి దుష్ప్రవర్తన గురించి కాని చెడ్డగా చెప్పేవారు కాదు. ప్రజలు కూడా ధృతరాష్ట్రుడికి ధర్మరాజుకు బేధము చూపక ఇరువురిని సమానంగా గౌరవించే వారు. ధృతరాష్ట్రుడు కూడా క్రమముగా తన కుమారులను మర్చిపోయి ధర్మరాజు మీద ప్రేమాభిమానాలు కురిపించే వాడు. కాని భీముడిని చూసినప్పుడు ధృతరాష్ట్రుడి గుండె మండిపోయేది. కారణము భీముడు తన కుమారులను చంపాడని అతడు మరచి పోలేకపోవడమే. వారిరువురు ఒకరి మీద ఒకరు మండి పోతున్నా పైకి మాత్రము మర్యాదగా మాట్లాడుకునే వాళ్ళు. అయినా భీముడు మాత్రము ఒక్కోసారి ధృతరాష్ట్ర గాంధారులు వింటూ ఉండగా " ఈ గుడ్డివాడి కొడుకులందరిని చంపేశాను. నా పాలబడ్డ వాడు ఎవడైనా చావకుండా బయట పడ్డాడా. ఆ కౌరవులు బుద్ధిలేక మాతో యుద్ధానికి వచ్చారు కాని నా సంగతి తెలిసినవారు ఎవరైనా మాతో పెట్టుకుంటాడా ! సుయోధన, దుశ్శాసనులను మట్టు పెట్టిన ఈ భుజాలను నేను పూజచేస్తాను. కౌరవులను సమూలంగా నాశనము చేయడానికి అనుకూలించిన ఆదైవానికి శతకోటి వందనాలు " అని అంటూ ఉండేవాడు. భీముడు అలా అంటూ ఉండేవాడని ధర్మరాజుకు, అర్జునుడికి, కుంతీదేవికి, ద్రౌపదికి తెలియదు. నకులసదేవులు మాత్రము భీముని మాటలకు సంతోషించే వారే కాని ధర్మరాజుకు భయపడి బదులు చెప్పేవారు కాదు. ధృతరాష్ట్ర, గాంధారులు మాత్రము ఏమీ అనలేక మనసులో బాధపడుతూ ఊరుకుండే వారు.

## ధృతరాష్ట్రుడి పశ్చాత్తాపము

ఈ విధంగా 15 సంవత్సరాలు గడిచాయి. ఒక రోజు ధృతరాష్ట్రుడు " తన బంధువులను, మిత్రులను, ధర్మరాజును సమావేశపరచి వారితో " ఆర్యులారా ! నా వలనే నాకుమారులు నాశనము అయ్యారు అని మీకు బాగాతెలుసు. నా కుమారుడు సుయోధనుడు లోభి, అతిక్రూరుడు, దాయాదులకు ద్రోహము చేసేవాడు. అయినా అతడిని ఈ కురుసామ్రాజ్యానికి చక్రవర్తిని చేసాను. రాయబార సమయాన శ్రీకృష్ణుడు చెప్పిన మంచి మాటలు కూడా సుయోధనుడు పెడచెవిన పెట్టాడు ఫలితము అనుభవించాడు. ఒక్క కృష్ణుడే కాదు, భీష్ముడు, ద్రోణుడు, విదురుడు, సంజయుడు ఎన్నో విధాలుగా నాకు నచ్చ చెప్పడనికి ప్రయత్నించారు. చివరకు నా భార్య గాంధారి కూడా నన్ను నిందించింది. కాని నాకు హితవు చెప్పిన అందరి మాటలను నేను పెడచెవిన పెట్టాను. ఇది తలచుకున్న నా మనసు బాధపడుతుంది. చివరకు నా కుమారులు యుద్ధమును కోరుకుని యుద్ధములో ఓడి పోయి యుద్ధభూమి నుండి తిరిగి రాకుండానే అక్కడే మరణించారు. యుద్ధములో మరణించి వీరస్వర్గము అలంకరించిన నాకుమారుల కొరకు నేనిక చింతించడము లేదు " అన్నాడు.

## ధృతరాష్ట్రుడి వానప్రస్థ ప్రస్తావన

జరిగిన దానికి పశ్చాత్తాప పడిన ధృతరాష్ట్రుడు ధర్మరాజును దగ్గరగా పిలిచి " ధర్మనందనా ! నీ దయవలన నేను సుఖజీవితమును గడుపుతున్నాను. నాకుమారులకు శ్రాద్ధకర్మలు ఆచరించు సమయంలో దానధర్మాలు చేసి నాకుమారులకు పుణ్యలోక ప్రాప్తి కలుగునట్లు చేసావు. నా వలన నువ్వు నీ తమ్ములు ఎన్నో కష్టాలు అనుభవించారు. నీ భార్య ద్రౌపది అలవి కాని అవమానము చవిచూసింది. నిన్ను, నీ తమ్ములను, నీ భార్యను ఇన్ని అవమానములు చేసిన నా కుమారులను నీ తమ్ములు చంపడము సమంజసమే కనుక దానిని నేను తప్పుపట్టను. అవన్నీ మరచి నువ్వు మా పట్ల ఎంతో గౌరవమర్యాదలు చూపిస్తున్నావు. ఈ సందర్భములో నేను నీకు ఒక విషయము చెప్పాలని అనుకుంటున్నాను. ఈ రాజ్యంలో ప్రజలు ఏమి చెప్పాలనుకున్నా రాజుకు చెప్పి అనుమతి తీసుకుని చేయడమే ధర్మము. అందుకనే నేను నీతో చెప్పకుంటున్నాను. మాకు ముసలితనము వచ్చింది. ఇక ఎక్కువ రోజులు బ్రతకము. క్షత్రియుడన్న వాడు యుద్ధభూమిలో మరణించాలి. లేకున్న తపస్సుచేసి తనువు చాలించాలి. మాకు రెండవ మార్గమే శరణ్యము. మన పూర్వీకులు అనేక మంది వార్ధక్యములో తపస్సుచేసి ముక్తిపొందారు. కనుక నేను గాంధారి అడవులకు వెళ్ళి నారచీరలు ధరించి కంద మూలములు తింటూ తపసు చేసుకుంటూ నిన్ను దీవిస్తుంటాము " అని అన్నాడు.

## ధర్మరాజు ఆవేదన చెందుట

ధృతరాష్ట్రుడి మాటలు విన్న ధర్మరాజు " పెదనానగారూ ! మీరూ పెదతల్లి గారూ అడవికి వెళ్ళి కందమూలములు తింటూ అరణ్యవాసము చేస్తూ ఉంటే ఇక్కడ నేను రాజ్యసుఖములు అనుభవించగలనా. ఈ రాజ్యపాలన నాకు సుఖాన్ని ఇస్తుందా ! పెదనానగారూ ! నాకు తెలుసు ఇక్కడ మీరు పైకి సుఖముగా ఉన్నట్లు కనిపిస్తున్నా సుఖముగా లేరు. దుఃఖముతో పరితపిస్తున్నారు. మీ మాటలు నన్ను చాలా బాధపెడుతున్నాయి. మీరు లేని నాకు ఈ రాజ్యము అక్కర లేదు. పెదనాన గారూ నాకు తల్లి, తండ్రి, గురువు, దైవము అన్నీ మీరే అనుకున్నాను. అటువంటి మీరు అడవులకు పోతే నేను హస్థినాపురములో ఎలా ఉండగలను. ఒక పని చేస్తాము. తమరి కుమారుడు యుయుత్సుడికి రాజ్యాభిషేకము చెయ్యండి. నేను కూడా మీతో అడవులకు వస్తాను. మనము అందరము అక్కడే ఉందాము. **యుయుత్సుడు** సాక్షాత్తు మీ కుమారుడు ఈ రాజ్యాన్ని పాలించడానికి అర్హుడు. అతడు పరాయివాడు కాదు కదా ! పెదనాన్న గారూ ! నేను ఇప్పటికే యుద్ధములో బంధువులను, మిత్రులను కోల్పోయాను. ఆ దుఃఖాన్ని తట్టుకోలేక పోతున్నాను. మీరు కూడా వెళ్ళారంటే నేను ఎలా ఉండగలను. పెదనాన్నా ! ఈ రాజ్యము మీది మీరే ఈ రాజ్యానికి రాజు. మీకు అనుమతి ఇవ్వడానికి నేను ఎవరిని. మీరు నీ కుమారులు చేసిన దురాగతములు గుర్తుపెట్టుకున్నారు కాని నేను మాత్రము మరచిపోయాను. అవన్నీ కర్మవశాన జరిగినవే కాని ఎవరూ చేసినవి కాదు. అమ్మా గాంధారీమాతా ! నాకు నాతల్లి కుంతీదేవి నీవూ ఒకటే ఇద్దరినీ ఒకేలా పూజించి గౌరవిస్తాను. అటువంటి మీరు లేకున్న నేను హస్థినలో ఎలా ఉండగలను. ఇన్ని చెప్పినా మీరు వినక పోతే నేను కూడా మీతో చస్తాను. నిజము చెప్పున్నాను. ఇలా మనసు కష్టపెట్టుకుని అడవులకు పోతే నేనిక్కడ రాజ్యసుఖాన్ని అనుభవించ లేను. మీకు కలిగిన పుత్రశోకము, నష్టములు అన్నీ విధివశాత్తు కలిగినవే. కనుక వాటిని మరచి హాయిగాసుఖముగా ఉండండి. అరణ్యవాస ఆలోచన ఇక మరవండి. బంధుమిత్రులను పోగొట్టుకున్న దుఃఖాన్ని నేను మీ ఇద్దరినీ సేవించుకుంటూ మరచి పోదామని అనుకుంటూ ఉంటే మీరిలా నన్ను విడిచి వెళ్ళడము తగునా ! కనుక నా ప్రార్థన మన్నించి ఈ అరణ్యవాస ఆలోచన మానుకుని నా దుఃఖాన్ని దూరము చెయ్యండి " అంటూ ధర్మరాజు ధృతరాష్ట్రుడి పాదముల మీద పడి ప్రాధేయపడ్డాడు.

## ధృతరాష్ట్ర గాంధారులు ధర్మరాజును ఓదార్చుట

ధృతరాష్ట్రుడు ధర్మరాజును పట్టుకుని పైకెత్తి కౌగలించుకుని " నాయనా ధర్మనందనా ! నీవు నాకు ఎంతో భక్తితో సేవలు చేస్తున్నావు. నేను కాదనకుండా స్వీకరిస్తున్నాను. నాకు వయసు వచ్చింది. ఈ వయసులోనైనా తపస్సు చేసుకో వద్దా ! ఇన్ని రోజులు రాజ్యపాలన చేసినందుకు నాకూ ప్రజల పాపాలలో భాగము ఉంటుంది కదా ! ఈ వయసులో నైనా నేను తపసు చేసుకుని ఆ పాపాలు పోగొట్టుకోవాలి కదా ! " అని ధృతరాష్ట్రుడు విదురుడిని, సంజయుడిని, కృపాచార్యుడిని చూసి " అయ్యా ! మీరైనా దయచేసి ధర్మరాజుకు చెప్పండి. నాకిక మాట్లాడే శక్తి లేదు " అంటూ శోషవచ్చి గాంధారి మీద పడిపోయాడు. అది చూసిన ధర్మరాజు దు:ఖించి " అయ్యో ! వెయ్యి ఏనుగుల బలము కల ధృతరాష్ట్రుడు కూడా ఒక అబలను ఆసరా చేసుకుని పడిపోయాడు కదా ! ఎంతటి వారికైనా ఈ దుర్దశ తప్పదు కదా " అని విలపించాడు. గాంధారి " నాయనా ధర్మనందనా ! మీ పెద తండ్రిగారికి వయసు అయిపోయింది. ఆయన వానప్రస్థము పోవాలని అనుకుంటున్నారు. నిద్రాహారాలు మాని ప్రతిరోజు అదే ఆలోచిస్తున్నారు. అందుకని ఆయనను అరణ్యాలకు పోవడానికి అనుమతి ఇవ్వు " అన్నది. అందరూ కలసి ధృతరాష్ట్రుడి మీద నీళ్ళు చల్లారు. తేరుకున్న ధృతరాష్ట్రుడు తిరిగి ధర్మరాజుతో " ధర్మనందనా ! నేను ఎలాగైనా తపస్సు చేసుకోవడానికి అడవులకు వెళ్ళవలసినదే. ఈ విషయము తేలే వరకు నేను అన్నపానాలు ముట్టను " అన్నాడు. ఇంతలో అక్కడకు వచ్చిన వ్యాసుడికి అందరూ నమస్కరించారు.

## వ్యాసుడు ధృతరాష్ట్రుడి ప్రస్థావనను బలపరచుట

వ్యాసుడు " ధర్మనందనా ! మీ పెదనాన మాటను మన్నించు. ఆయనను తపసు చేసుకోవడానికి వెళ్ళనివ్వు. వృద్ధుడు, బంధువర్గమును పోగొట్టూకున్న వాడు అయిన మీ పెదనాన అడవులకు వెళ్ళి పోవాలని తపసు చేసుకోవాలని అనుకోకుండా ఊరుకుంటాడా ! గాంధారి కూడా పుత్రశోకమును ఇన్నిరోజులు మనసులోనే అణచుకున్నది. ఆమె మనసుకు ప్రశాంతత కావాలి. ఆమెకు కూడా తన భర్త తపసు చేయాలని కోరిక ఉండదా ! అది చెప్పడానికే ఇక్కడకు వచ్చాను. వీళ్ళను అడవులకు పోనివ్వు. వారు తపసు చేసి ఉత్తమగతులు పొందగలరు. అది అందరికి శ్రేయస్కరము. ధర్మనందనా ! నీవు ఇన్ని రోజులూ వీరికి సేవ చేసావు. ఇకనైనా వీరిని తమకు ఇష్టము వచ్చిన విధముగా జీవించనివ్వు. ధర్మనందనా ! క్షత్రియులకు యుద్ధభూమిలో మరణించడమో లేకున్న తపమాచరించి ఆ ధ్యానములో తనువు చాలించడమో ఉత్తమము. అంతే కాని సంసారసాగరాన పడి వ్యాధులతో మరణించడము అధమము. మీ పెదనాన అలా అధమముగా మరణించడము నీవు కోరుకుంటావా ! " అన్నాడు. ధర్మరాజు ఇక మారుమాటాడ లేక " మహాత్మా ! నీ మాట మాకు శిరోధార్యము. నీ ఆజ్ఞ ప్రకారమే నేను చేస్తాను. అయినా మీ అనుమతి లభించిన తరువాత నా అనుజ్ఞ ఏపాటిది. అయినా లాంఛనప్రాయంగా పెదనాన అరణ్య వాసముకు అనుమతి ఇస్తున్నాను " అని అన్నాడు. ఆ మాటలకు సంతోషించిన వ్యాసుడు " కుమారా ధర్మనందనా ! నీ తండ్రి పాండురాజు తన అన్నగారైన ధృతరాష్ట్రుడిని సింహాసనము మీద కూర్చుండబెట్టి అతడిచేత ఎన్నో యజ్ఞయాగములను, పుణ్యకార్యములను చేయించాడు. తాను రాజ్యభారము వహించి అన్నగారి చేత రాచరికపు భోగములను అనుభవింప చేసాడు. తన అన్నగారిని భక్తితో సేవించాడు. నీవూ కూడా నీ తండ్రి అడుగు జాడలలో నడిచి ఈ కురు సామ్రాజ్యాన్ని విస్తరింపజేసావు. ఆయన ఆయన కుమారులు నీకు నీ తమ్ములకు చేసిన దుర్మార్గము అన్నీ మరచి నీవు నీ పెదనానను ఇన్ని రోజులు సేవించావు. ఇన్ని రోజులు రాజభోగములు అనుభవించాడు. ఇకనైనా తపసు చేసుకోవడానికి అనుమతి ఇవ్వు. అది నీ ధర్మము " అని అన్నడు. ఆ మాటలను చెప్పి వ్యాసుడు తనదారిన తాను వెళ్ళాడు. ధర్మరాజు ధృతరాష్ట్రుడితో " పెదనాన గారూ ! మీరు ఏమి చేయాలను అనుకున్నారో, విదురుడు, సంజయుడు, **యుయుత్సుడు**, కృపాచార్యుడు ఏమి చేయాలని అనుకున్నారో అది చేయండి. నాకు అభ్యంతరము లేదు. ఇప్పుడు మీ రంతా అలసి పోయి ఉన్నారు. పోయి భోజనము చేయండి " అని ప్రాధేయపడ్డాడు. ధర్మరాజు మాట మన్నించి ధృతరాష్ట్రుడు గాంధారితో సహా లోపలకు వెళ్ళాడు. అయన వెంట సంజయుడు, విదురుడు, యుయుత్సుడు, కృపాచార్యుడు కూడా వెళ్ళారు.

## ధృతరాష్ట్రుడు ధర్మరాజుకు రాజనీతిని బోధించుట

ధృతరాష్ట్రుడి వానప్రస్థముకు తగిన ఏర్పాటులు జరుగుతున్నాయి. మరునాడు ధర్మరాజును ధృతరాష్ట్రుడు ఏకాంతమందిరము లోనికి తీసుకుని వెళ్ళి " ధర్మనందనా ! ఈ రాజ్యము ఏడు అంగములతో కూడి ఉన్నది. రాజ్యపాలన ధర్మబద్ధంగా చెయ్యాలి. అది చాలా కష్టము. నాకు తెలిసినంత వరకు రాజనీతి గురించి నీకు చెప్తాను. ధర్మనందనా ! నీవు ఎప్పుడూ విద్యావంతులను, వృద్ధులను సేవిస్తూ వారికి తగిన ధనసహాయము చేసి వారి ప్రీతికి పాత్రుడవున కమ్ము. పెద్దలు చెప్పిన నీతులను విని ఆ విధముగా ఆచరించు. రాజ్యము ఎంత జాగ్రత్తగా చూస్తావో ఇంద్రియములను కూడా అలాగే అదుపులో ఉంచుకో. నీ ఇంద్రియములను అదుపులో ఉంచుకుంటే అవి నిన్ను కాపాడతాయి. ఇక మంత్రులను నియమించే సమయంలో వారి పూర్వచరిత్రలను, నిజాయితీని పరిగణకు తీసుకోవాలి. ఇంద్రియ నిగ్రహము కలవారినే మంత్రులుగా నియమించాలి. ఇక రాజ్యపాలనలో ఎంతో మంది శత్రువులు ఉంటారు. వారి యొక్క కదలికలు, నడవడికలు, వారి యొక్క ఆప్తులు, బంధుమిత్రులు వారి కదలికలను అనుక్షణము జాగ్రత్తగా తెలుసుకుంటూ ఉండాలి. ధర్మనందనా ! ఇక పుర

రక్షణావ్యవస్థను, శాంతి భద్రలతను పటిష్టము చేయాలి. నీకు నమ్మకమైన వారిని నీకు భోజనసమయంలో నీకు సహాయకులుగా నియమించాలి. ఆడవాళ్ళ రక్షణ చాలా ముఖ్యమైనది కనుక వారి రక్షణకు తగిన ఏర్పాట్లు చేయాలి. ధర్మనందనా ! నీవు ఏమి చేయాలన్నా మంత్రులందరిని ఆలోచించి నిర్ణయము తీసుకోవాలి. నీవు నీ మంత్రులతో కలసి రహస్యముగా తీసుకున్న నిర్ణయాలను రహస్యముగా ఉంచాలి. ధర్మనందనా ! రాజు తీసుకునే నిర్ణయాలు బయటకు తెలిస్తే జరిగే నష్టాన్ని నివారించడము కష్టము కనుక మంత్రివర్గ నిర్ణయాలు గోప్యముగా ఉంచాలని మంత్రులకు నొక్కి చెప్పాలి. ఇక న్యాయ నిర్ణేతలుగా బాగా చదువుకున్న వారిని నియమించాలి. అపరాధులను శిక్షించే సమయంలో వారు చేసిన అపరాధము ఏ పరిస్తితిలో చేసాడో, ఆ నేరము ఎంత తీవ్రతరమైనదో గుర్తించి దానికి తగినంత శిక్షను విధించాలి. రాజు ఉదయాన లేచి దేవతార్చన చేసి తరువాత క్రిందటి రోజు ఆదాయవ్యయాలు చూడాలి. తరువాత భోజనము చెయ్యాలి. సాయంత్రము వేళలో ప్రజలకు దర్శనము ఇవ్వాలి. వారి బాధలు వినాలి. రాత్రి వేళలో గూఢాచారులను దూతలను కలసి మంతనాలు సాగించాలి. ఏదైనా కొత్త సంగతి, అత్యవసరమైన పరిస్థితి ఏర్పడినప్పుడు ఆలస్యము చేయక బద్ధకించక దానిని వెంటనే పరిష్కరించాలి. ఆలస్యము చేయడము తగదు. ధర్మనందనా ! ఈ విధముగా పరిపాలన సాగిస్తూ రాజ్యపాలనకు కావలసిన ధనమును నీవు ధర్మబద్ధంగానే సంపాదించాలి. ప్రజలకు ప్రభుత్వానికి విఘాతము చేసే వాడిని కనిపెట్టి వారిని కఠినముగా శిక్షించి వారి ప్రయత్నమును వమ్ము చేయాలి. ధర్మనందనా ! ప్రభుత్వ కార్యాలయములో నేర్పు చూపే వారిని గుర్తించి వారిని ఆదరించాలి. వారికి ఏ లోటు లేకుండా చూసుకుంటూ వారి జీవనోపాధి సక్రమముగా జరిగేలా ఏర్పాటు చేయాలి. వారు చేసిన మంచి పనులకు ప్రోత్సాహక బహుమతులను ఇచ్చి వారిని పదిమందిలో గౌరవించాలి. నీ మీద ప్రేమ, భక్తి, స్నేహము, శౌర్యము కలవారిని సేనాధిపతిగా నియమించాలి. ఎన్ని కష్టాలు వచ్చినా ధైర్యముగా నిలిచే వారినే సేనాధిపతులను చెయ్యాలి. ప్రతి వారిలో తప్పులు ఉంటాయి. నీ తప్పును నీ కింద వారికి తెలియనివ్వక నీ కింద వారి తప్పులను గమనించి సరిదిద్దాలి.

## శత్రుజయము

ధర్మనందనా ! నీ శత్రువు వద్ద బుద్ధిమంతుడు, నిజాయితీ పరుడు, పరాక్రమవంతుడు, శ్రమకోర్చి పనిచేసేవాడు ఉన్నట్లైతే వారిని నానా రకములైన బహుమతులు ఇచ్చి నీకు అనుకూలంగా పనిచేసేట్టు చేసుకో. సాధారణంగా పొరుగురాజులతో వైరము కలుగుతుంది. అటువంటి వారి పట్ల చాలా జాగ్రత్తగా ఉండు. నీవు ఏమరుపాటుగా ఉన్నప్పుడు నీ మీద దాడి చేసే అవకాశము ఉంటుంది. నీతో సమానమైన నీ కంటే బలమైన శత్రువుతో సంధి చేసుకుని మిత్రులను చేసుకో. నీ కంటే బలహీనుడైన శత్రువును యుద్ధము చేసి ఓడించు. నీ కంటే బలహీనుడైన రాజు మిత్రుడైతే అతడిని సామంతుడిని చేసుకుని ఆదరించు. యుద్ధము రెండు రకాలు. ఒకటి కోటను ముట్టడించి శత్రుకు బయటి నుండి సహాయము అందకుండా చేసి బలహీనుడిని చేసి ఓడించడము. దీనిలో ప్రాణనష్టము తక్కువ. రెండవది నేరుకు నేరుగా నిలబడి యుద్ధముచేయడము. దీనిలో సైన్య నష్టము ఎక్కువే. ఈ రెండింటిలో దేనిని అనుసరించాలో నీవే సమయానుకూలముగా నిర్ణయించాలి. ఈ రెండింటికి సైన్యము పటిష్టముగా ఉండడము ముఖ్యము. నీ శత్రురాజ్యంలో మంత్రులు రాజుకు ఎదురు తిరిగినట్లు సమాచారము అందినప్పుడు నీవూ దానిని అదనుగా తీసుకుని వారిలో విభేదాలు కల్పించి శత్రువు మీద దాడి చేసి సులభంగా జయించాలి. ఎంత ప్రయత్నించినా నీ రాజ్యము లోని రహస్యాలు, నీ స్వంత రహస్యాలు బయటకు పొక్కనీయకుండా జాగ్రత్త వహించు. పొరుగురాజులతో యుద్ధము చేసేకంటే సంధి ఉత్తమము. శత్రువును జయించడానికి అనువైన సమయము చూసి దాడిచేసి లోబరుచుకోవాలి. శత్రువును స్వేచ్ఛగా ఉండనిచ్చి అతడు ఆదమరచి ఉన్నప్పుడు దాడిచేసి ఓడించాలి. పొరుగురాజు మీద దండెత్తే ముందు అతడి బలము, సైన్యబలము, అతడి శక్తియుక్తులు, అతడి శత్రువులు, అతడి మిత్రులు, అతడి విశ్వాసపాత్రులు ఇవన్నీ తెలుసుకున్న తరువాత అతడి మీద దాడి చేసి జయించడానికి వ్యూహము పన్ని జయించాలి. రాజులకు రెండు విధములైన బలాలు ఉంటాయి. ఒకటి తన స్వంత బలము. అంటే స్వంత సైన్యము. రెండవది మిత్ర బలము. అంటే అతడికి కష్టసుఖాలలో అతడి వెంట ఉండి సహాయసహకారాలు అందించే మిత్రసైన్యాల బలము. కనుక నీవు నీ మిత్రులెవరో గ్రహించి వారికి ప్రాముఖ్యత ఇచ్చి వారిని అన్ని విధముల సంతోషపెట్టాలి. నీవు శత్రురాజ్యమును జయించినప్పుడు ఆ ప్రజలకు నీ మీద అభిమానము కలిగేలా ప్రవర్తించాలి. వారిని అన్ని విధాల ఆదుకున్నప్పుడు శత్రురాజ్యములో కూడా నీ కీర్తి పెరిగుతుంది. అంటే నీ రాజ్యములోని ప్రజలను శత్రురాజ్యంలోని ప్రజలను అందరినీ రాజు దయతో చూడాలి.

## రాజధర్మము

ధర్మనందనా ! రాజైన వాడు వివిధశాస్త్రములను అభ్యసించి అందులో పారంగతుడు కావాలి. ప్రజలను వారి ఆస్తులను జాగ్రత్తగా కాపాడాలి. అందరి ఎడలా దయతో ప్రవర్తిస్తూ, ప్రజలకు ఇబ్బంది కలగని విధముగా పన్నులు విధించాలి. అలా పాలించినప్పుడు రాజుకు ఆ రాజ్యము కామధేనువే ఔతుంది. ధర్మబద్ధంగా రాజ్యపాలన చేసే రాజు ఇహలోకసుఖాలతో పాటు పరలోకసుఖమూ ప్రాప్తిస్తుంది. ప్రజలను దయతో, ప్రేమతో, పక్షపాతము లేకుండా కన్నబిడ్డల వలె కాపాడే రాజుకు

అశ్వమేధయాగము చేసిన ఫలితము కంటే అధిక ఫలితము లభిస్తుంది. నాయనా ధర్మనందనా ! ఇదివరకే నీకు నీ తాత భీష్ముడు, వ్యాసుడు, కృపాచార్యుడు ఎన్నో నీతివాక్యాలు చెప్పారు. నీవూ వాటిని శ్రద్ధగా విని పాటిస్తున్నావు. అయినా నీ మీద నాకున్న మమకారము వలన నేనునీకు నాకు తెలిసిన రాజనీతిని భోధించాను. అయినా నీకు తెలియని రాజనీతి ఏముంది. నిరంతరము పెద్దలను సేవిస్తూ ఉండు నీకు సకలశుభములు కలుగుతాయి " అని ధృతరాష్ట్రుడు ధర్మరాజుకు రాజనీతి బోధించాడు. ధర్మరాజు " పెదనాన గారూ తాత భీష్ముడు ఇప్పుడు లేరు. శ్రీకృష్ణుడు ద్వారకలో ఉన్నాడు. ప్రస్తుతము మీరు తప్ప నాకు పెద్ద దిక్కు లేరు. తమరు ఉపదేశించిన రాజనీతి సూత్రాలను నేను అక్షరాల పాటిస్తాను " అన్నాడు. " ధర్మనందనా ! ఇక నీవు విశ్రాంతి తీసుకో అని చెప్పి ధృతరాష్ట్రుడు అంతఃపురానికి వెళ్ళాడు.

## ధృతరాష్ట్రుడు హస్థినాపుర వాసుల వద్ద అనుమతి తీసుకొనుట

ధృతరాష్ట్రుడు అంతఃపురంలోకి వెళ్ళగానే గాంధారి " మనము అరణ్యముకు ఎప్పుడు వెళ్ళాలి " అని అడిగింది. " గాంధారీ ! మన అరణ్యవాసముకు వ్యాసమహర్షి అనుమతి ధర్మరాజు అనుమతి లభించాయి. ఇక ఆలస్యము చేయవలసిన పని లేదు. మనము వెంటనే అరణ్యముకు బయలుదేరవచ్చు. ఎన్నో పాపాలు చేసిన నీ కుమారులకు నేను తపమాచరించి ఉత్తమగతులు కలిగిస్తాను. మనము అరణ్యాలకు పోయే ముందు నీ కుమారులకు ఉత్తమగతులు కలిగేలా కలిగేలా కొన్ని దానధర్మాలు చేసి వెడదాము " అని అన్నాడు ధృతరాష్ట్రుడు. అరణ్యములకు వెళ్ళే ముందు ధృతరాష్ట్రుడు హస్తినాపుర వాసుల వద్ద అరణ్యవాసముకు అనుమతి తీసుకోవాలని అనుకున్నాడు. ధర్మరాజు అందుకు తగిన ఏర్పాట్లు చేసి హస్తినాపుర ప్రముఖులను రావించాడు. ధృతరాష్ట్రుడు వారితో " హస్థినాపుర వాసులారా ! ఇన్ని రోజులు మీరూ కౌరవులు కలసి ఉన్నారు. వయసు పైబడిన వారు వానప్రస్థము వెళ్ళడము ధర్మము. నేను కూడా వానప్రస్థము వెళ్ళాలనుకుంటున్నాను. మీ రంతా మంచి మనసుతో నన్ను దీవించండి " అని వేడుకున్నారు. ఆమాటలు హస్థినాపురవాసులు కళ్ళనీళ్ళ పర్యంతము అయ్యారు. వారిని చూసి ధృతరాష్ట్రుడు తిరిగి " ఈ హస్థినాపురమును మనకు తెలిసి శంతనమహారాజు పాలించాడు. తరువాత ఈ రాజ్యమును భీష్ముడు కాపాడి విచిత్రవీర్యుని రాజును చేసాడు. విచిత్రవీర్యుని కుమారుడనైన నేను పుట్టుగుడ్డిని కనుక ఈ రాజ్యము పాండురాజు చేత కాపాడబడినది. తరువాత దుర్మార్గులైన నా కుమారులు పాండవులతో యుద్ధముచేసి ఓడిపోయి వీరస్వర్గము అలంకరించారు. ఈ దుస్థితికి నిజానికి నేనే కారకుడిని. నన్ను క్షమించి అయినా నాకు అరణ్యవాసము చెయ్యడానికి అనుమతి ఇవ్వండి. నా భార్య గాంధారి వృద్ధురాలు. కుమారులను పోగొట్టుకున్నది. వృద్ధలమని తలచి అయినా మాకు అరణ్యవాసముకు వెళ్ళడానికి అనుమతి ఇవ్వండి. ఇప్పుడు ఈ హస్థినకు రాజు ధర్మరాజు. కురుసామ్రాజ్యానికి చక్రవర్తి. నాలుగు దిక్కులకు ప్రతినిధులుగా ఉన్న తన తమ్ముల మధ్య దేవేంద్రుడిలా వెలిగిపోతున్నాడు. ఇక మీరంతా ధర్మరాజుకు అనుగుణంగా నడవండి. ధర్మరాజు పాలనలో మీరంతా సుఖసంతోషాలతో జీవిస్తారని అనుకుంటున్నాను. నా వలన నేను నా వాళ్ళకు నష్టము కలిగించాను కాని మీకు మాత్రము ఎలాంటి హానికలిగించ లేదు. అందుకే ధర్మపరుడైన ధర్మరాజును సింహాసనము మీద ఉంచి నేను అరణ్యములకు వెడుతున్నాను. హస్థినాపుర వాసులారా నేను ఇంత వరకు మీకు ఎలాంటి హాని కలిగించలేదు. మిరు కూడా నాకు ఎలాంటి కష్టము కలిగించలేదు. ఇప్పుడు కూడా అలాగే నన్ను సాదరంగా అరణ్యవాసానికి పంపండి " అనగానే పురప్రముఖులు తమ దుఃఖాన్ని ఆపలేక పోతున్నారు. ధృతరాష్ట్రుడు తిరిగి " అయ్యలారా ! ఈమె నా భార్య గాంధారి సద్వర్తనురాలు. ఇన్ని రోజులు నన్ను నీడలా అనుసరించి ఉన్నది. ఈమెతో సహా అరణ్యవాసముకు వెళ్ళడానికి నాకు అనుమతి ఇవ్వండి. వ్యాసుడు, ధర్మరాజు నాకు అరణ్యవాసానికి అనుమతి ఇచ్చారు. ఇక మీరు సంతోషముగా అరణ్యవాసానికి నన్ను సాగనంపండి " అని అన్నాడు.

## హస్థినాపుర వాసుల ప్రతి స్పందన

ధృతరాష్ట్రుడి మాటలకు హస్థినాపురవాసులు భోరుమన్నారు. తరువాత పురప్రముఖులలో ఒకడు లేచి " ధృతరాష్ట్రమహారాజా ! భరతకులభూషణా ! పౌరులంతా నన్ను తమ ప్రతినిధిగా మాట్లాడమన్నారు. నా మాటలు సావధానంగా వినండి. కురువంశరాజులు ఎవరూ తగని పనులు చేయలేదు. ప్రజలను కన్న బిడ్డలవలె చూసుకున్నారు. ఆ మాటకు వస్తే సుయోధనుడు చేసిన అనర్ధమైన పని ఏమిలేదు. దానికి మీరు చింతించ వలసిన పని ఏమిలేదు. తమరికి వ్యాసభగవానుడు ఆనతిచ్చినట్లు మీరు ఆచరించండి. అయినా మీ అరణ్యవాస ప్రతిపాదన మేము తట్టుకోలేక పోతున్నాము. తమ గుణగణములు తలచుకుంటూ మేము మీరు మామధ్య ఉన్నట్లు భావించుకుంటాము. మీ తాతగారు శంతనమహారాజు, మీ నాన్న విచిత్రవీర్యుడు, తమరు, తమరి కుమారుడు సుయోధనుడు అందరూ ప్రజారంజకంగానే పాలించారు. ఇందులో తమరిని కాని తమరి కుమారుడు సుయోధనుడిని కాని తప్పు పట్టవలసిన పని లేదు. ఇక యుద్ధము అంటారా అది విధిని అనుసరించి జరిగినది. భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యులు, అశ్వత్థామ, శల్యుడు, సుయోధనుడు, భీమార్జున నకులసహదేవులూ, ధృపదుడు, విరాటుడు, ధర్మరాజు అందరూ విధిప్రేరణ వలననే ఒకరితో ఒకరు యుద్ధము చేసారు.

అందులో కొందరు వీరస్వర్గము చేరారు. క్షత్రియకులమంతా సర్వనాశనము అయ్యింది. ఇందుకు ఎవరూ కర్తలు కాదు. తమరు ఎప్పుడూ ధర్మాన్ని పాటించారు కనుక మీకు ఉత్తమలోక ప్రాప్తి కలుగుతుంది అనడములో సందేహము లేదు. ప్రస్తుతము మేము మా అదృష్టము వలన పాండవులపాలనలో ఉన్నాము. మూడు లోకములను పాలించడానికి సమర్ధులైన పాడవులకు ఈ పరిపాలనా బాధ్యతలు అప్పగించావు. అది చాలా సంతోషము. ధర్మరాజు ఎంతో ముందుచూపు కలవాడు. అతడి మంత్రులు సమర్ధులు. ధర్మరాజు శత్రువుకైనా అపకారము చేయజాలడు. ఇక మాకు అపకారము చేస్తాడని అనడము కల్ల. ధర్మరాజు తమ్ములు కూడా అన్న మాట జవదాటని ధర్మాత్ములే. ఇప్పటికే ధర్మరాజు దేవతలకు ధూపదీప నైవేద్యాలకు అగ్రహారాలు, బ్రాహ్మణులకు మాన్యాలు ఇచ్చాడు. పాండవులు మంచివారికి ప్రాణము ఇస్తారు. దుష్టులను కఠినంగా శిక్షిస్తారు. వారికి అహంకారము, మదము, మాత్సర్యము, లోభము మచ్చుకు కూడా లేవు. వారి తల్లి కుంతీదేవి, పాండవుల ధర్మపత్ని ద్రౌపదీదేవికి మామీద ఎనలేని ప్రేమ. వారు తరతమ భేధము లేక మా అందరిని ఆదరంతో పలకరిస్తారు. కనుక మేము అందరమూ పాండవుల చేతిలో వారి ధర్మపత్ని చేతిలో సుఖసంతోషాలతో జీవిస్తాము. మీరు మాగురించిన చింతవీడి మీకు తోచిన విధంగా అరణ్యములకు వెళ్ళండి " అని పురప్రతినిధి ధృతరాష్ట్రుడికి సభాముఖంగా విన్నవించాడు. ఆ మాటలకు ధృతరాష్ట్రుడు సంతోషించాడు. ఆ విధంగా ధృతరాష్ట్రుడు హస్థినాపుర వాసులకు వీడ్కోలు చెప్పారు.

## ధృతరాష్ట్రుడి దానధర్మాల ప్రస్తావనను భీముడు అడ్డగించుట

మరునాడు ధృతరాష్ట్రుడు విదురుడిని పిలిపించి " విదురా ! నేను మరణించిన బంధువులకు శ్రాద్ధకర్మలూ వారి ఆత్మశాంతి కొరకు దానధర్మాలూ చేయాలను అనుకుంటున్నాను. అవి చేసికాని నేను అరణ్యవాసానికి వెళ్ళను " అన్నాడు. విదురుడు ధర్మరాజుకు ధృతరాష్ట్రుడి అభీష్టము తెలియజేసాడు. ఆ మాటలు విన్న భీముడు కోపోద్రిక్తుడై ఏదో పలుకబోతున్న సమయంలో అర్జునుడు అతడిని వారించి " భీమసేనా ! శాంతించు. ధృతరాష్ట్రుడు మనకు రాజు. అతడిప్పుడు వయోవృద్ధుడు. యుద్ధములో భీష్ముడు, ద్రోణుడు మొదలైన ఎంతో మంది బంధువులు, మిత్రులు, పెద్దలు మరణించారు. వారికి శ్రాద్ధకర్మలు ఆచరించడానికి మనలను అర్ధిస్తున్నాడు. మనము అందుకు అంగీకరించక ఉన్న మనకు మనవంశముకు అపకీర్తి కదా ! ఇది ధర్మవిరుద్ధము కదా ! అన్నగారు సమ్మతించిన కార్యమును వ్యతిరేకించడము తగునా ! మనము అర్ధరాజ్యము కొరకు ధృతరాష్ట్రుడిని అర్ధించాము. ఇప్పడు ఆ ధృతరాష్ట్రుడు కేవలము శ్రాద్ధకర్మలు చెయ్యడానికి మనలను అర్ధిస్తున్నాడు. మనము ఈ మాత్రము చెయ్యలేమా ! కనుక ధృతరాష్ట్రుడు చేయతలపెట్టిన శ్రాద్ధకర్మలను చేయించడము మన ధర్మము ఇందుకు నీవు అడ్డు చెప్ప వలదు " అన్నాడు. అర్జునుడి ధర్మనిరతికి ధర్మరాజు ఆనందించాడు కాని భీముడు మాత్రము శాంతించ లేదు అర్జునుడి మాటలు లక్ష్యపెట్ట లేదు " అర్జునా ! ఇంతకు ముందు చేసిన శ్రాద్ధకర్మలు, దానధర్మములు చాలవా ! భీష్ముడు వంటి పెద్దలకు శ్రాద్ధకర్మలు చెయ్యడనికి మనము లేమా ! ఆయన చెయ్యాలా ! అయినా ధృతరాష్ట్రుడు వంటి దుర్మార్గులు చేసిన శ్రాద్ధకర్మలను ధర్మాత్ములైన మన పితృదేవతలు స్వీకరిస్తారా ! అన్నయ్యా ! ఈ ధృతరాష్ట్రుడి వలన మనము అనుభవించిన కష్టాలు అప్పడే మరిచావా ! మనము బాధలు పడుతున్నప్పడు ఈ **భీష్ముడు, బాహ్లికుడు** ఏమి చేస్తున్నారు. ఒక్కరైనా ఇది ధర్మము కాదని ధృతరాష్ట్రుడిని నివారించారా ! అటువంటి బంధువులు అసలు బంధువులా ! వారికి శ్రాద్ధకర్మలు ఆచరించడము అవసరమా ! వారికి ఊర్ధ్వలోకాలు ప్రాప్తించకపోతే వచ్చే నష్టము ఏమిటి ? అంతగా అవసరము అనుకుంటే తన కుమారుడైన కర్ణుడికి కుంతీదేవి శ్రాద్ధకర్మలు చెయ్యచ్చు. అందులో దోషము ఏమీ లేదు. అయినా అన్నయ్యా ఆనాడు నిండు సభలో మన ద్రౌపదిని అవమానించిన విషయము, అన్న ధర్మనందనుడితో కలసి మనమంతా అడవులలో ఇడుములు పడిన విషయము అప్పడే మరచి పోయి ఇప్పుడు తండ్రి అంటున్నావా ! మరి ఈ తండ్రి ఆరోజు ఎక్కడకు వెళ్ళాడు. సభలో కూర్చుని ఉన్నాడు కదా ! అలాంటి వాడు ఒక తండ్రేనా ! అప్పుడు భీష్ముడు మొదలైన పెద్దలు సభలో ఉన్నారు కదా ! అప్పుడు వారికి మనతో ఉన్న బంధుత్వము గుర్తుకు రాలేదా ! ఈ సంగతులు విదురిడికి తెలియవా ఈ రోజు ఈ విషయము చెప్పడానికి ఇక్కడకు వచ్చాడు " అలా సాగుతున్న భీముడి వాక్ప్రవాహాన్ని ధర్మరాజు వారించాడు. అర్జునుడు భీమసేనుడితో " అన్నయ్యా భీమసేనా ! ధృతరాష్ట్రుడు మనము గౌరవించ తగిన వాడు. ఇక ఒక్క మాట కూడా మాటాడ వద్దు. పెదనాన గారి కోరిక నెరవేర్చడము అన్నగారి అభిమతము. అన్నగారి అభిమతము నెరవేర్చడము మన కర్తవ్యము " అని భీముని వారించి విదురుడిని చూసి " పేదనాన ధృతరాష్ట్రుడు ఏవిధముగా శ్రాద్ధకర్మలు ఆచరించాలని అనుకుంటున్నాడో ఆ విధముగానే ఆచరించ వచ్చు. ఈ విషయము ధృతరాష్ట్రుడికి తెలియచేయ వచ్చు " అని చెప్పాడు. అర్జునుడి మాటలకు ధర్మరాజు సంతోషించి " విదురా ! మా పెదనాన ధృతరాష్ట్రుడు ఎంత ధనము వెచ్చించి అయినా శ్రాద్ధకర్మలు ఆచరించవచ్చని మా పెదనాన ధృతరాష్ట్రుడికి మనవి జెయ్యండి. విదురా ! అరణ్యాములో పడ్డకష్టాలు తలచుకుని భీమసేనుడు ఏదో అన్నాడు. ఆ మాటలను మనసులో పెట్టుకోవద్దని ధృతరాష్ట్రుడికి మనవి చెయ్యి. అయినా భీమసేనుడు ఏమి అన్నా ఏమి ఔతుంది. ధృతరాష్ట్రుడు మాకు పరమదేవత. ఆయన నన్ను ఈ కురుసామ్రాజ్యానికి చక్రవర్తిని చేసాడు కనుక ఆయన మా తండ్రిగారు. ఆయన తనకు ఇష్టము వచ్చిన విధముగా శ్రాద్ధకర్మలను ఆచరించమని మనవి చెయ్యండి. అందుకు తగిన ఏర్పాట్లను అర్జునుడు చేస్తాడు. బ్రాహ్మణులకు అగ్రహారాలు, ధనము, ధాన్యాలు విరివిగా దానము చెయ్యమని చెప్పండి " అని చెప్పాడు.

## ధృతరాష్ట్రుడు శ్రాద్ధకర్మలు నిర్వహించుట

విదురుడు పాండవులతో మాట్లాడిన తరువాత ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళి " ధృతరాష్ట్ర మహారాజా ! నీకు నచ్చిన విధముగా భీష్మాదులకు శ్రాద్ధకర్మలు, దానధర్మాలు చెయ్యమని చెప్పాడు. నీ కుమారులు పుణ్యలోకాలు పొందేవిధంగా బ్రాహ్మణులకు బంగారము, రత్నములు, గ్రామములు, హయములు, గోవులు మిక్కుటముగా దానము చెయ్యమని చెప్పాడు. తరువాత భీముడు అన్న మాటలు కూడా చూచాయగా చెప్పి ధృతరాష్ట్ర మహారాజా ! నీవు భీముడు అన్న మాటలను లక్ష్యపెట్ట వద్దు. భీముడు దుర్మదుడు అతడి మాటలు పట్టించుకోవలసిన పని లేదు. ఆ మాటలకు ధృతరాష్ట్రుడు సంతోషించాడు. కార్తికమాసములో పౌర్ణమి తిధియందు ధృతరాష్ట్రుడు పెద్దలకు శ్రాద్ధకర్మలు ఆచరించాడు. ధర్మరాజు బంగారముతో చేసిన వస్తువులను పంపించాడు. ధృతరాష్ట్రుడు ముందు బాహ్లీకుడికి, భీష్ముడికి, సోమదత్తుడికి, ఆయన పుత్రులకు శ్రాద్ధకర్మలు ఆచరించాడు. ఆ తరువాత సుయోధనుడు మొదలైన నూరుగురు కుమారులకు శ్రాద్ధకర్మలు ఆచరించాడు. తరువాత సింధురాజు సైంధవుడికి అతడి బంధువులకు, మిగిలిన రాజులకు, ద్రోణుడికి తనకు తోచిన విధంగా శ్రాద్ధకర్మలు ఆచరించాడు. తనకు గుర్తు ఉన్న బంధువులు అందరికి శ్రాద్ధకర్మలు ఆచరించాడు. తరువాత 15 రోజులపాటు నిర్విరామంగా దాన ధర్మాలు చేసాడు. అందుకు తగిన నిధులు, సంభారాలు, బంగారము, రత్నములు, గోవులు, హయములు, వస్త్రములు, స్త్రీలు, గ్రామములు సమకూర్చాడు ధర్మరాజు. ధృతరాష్ట్రుడు చేసినవి కాకుండా ధర్మరాజు గ్రామములు బ్రాహ్మణులకు దానముగా ఇచ్చాడు. తరువాత అరణ్యములకు పోవడానికి తగిన సన్నాహములు చేసుకున్నాడు.

## ధృతరాష్ట్రుడు అరణ్యవాసముకు బయలు దేరుట


గాంధారి ధృతరాష్ట్రులు తదితరులు వనవాసమునకు బయలుదేరుట- రాజ్మానామా నుండి ఒక దృశ్యం

ధృతరాష్ట్రుడు మరునాడు అరణ్యవాసానికి కావలసిన సన్నాహాలు చేసుకున్నాడు. మరునాడు ఉదవసీయము అనే యజ్ఞం చేసాడు. పాండవులకు మిగిలిన వారికి తాను అరణ్యాలకు పోతున్న విషయము తెలియజేసాడు. పట్టువస్త్రములను విడిచి గాంధారీ సహితముగా నారవస్త్రాలను ధరించాడు. ఆభరణాలు, ఆడంబరాలు విడిచిపెట్టాడు. పురోహితులు అగ్నిహోత్రముతో సహా వెంట నడువగా ధృతరాష్ట్రుడు గాంధారీ సహితముగా అరణ్యాలకు పోవడానికి సిద్ధము అయ్యాడు. ఆ సమయములో కుంతీదేవి అక్కడకు వచ్చింది. దుఃఖము ముంచుకు వస్తుండగా గాంధారీ వెంట నడిచింది. ధృతరాష్ట్రుడు వెడుతున్న వంక చూస్తున్న ధర్మరాజు దుఃఖము తాళలేక కింద పడిపోయాడు. పక్కనే ఉన్న అర్జునుడు, భీముడు, నకులసహదేవులు, యుయుత్సుడు, సంజయుడు, **ధౌమ్యుడు** మొదలైన వారు కూడా దుఃఖముతో కుమిలిపోయారు. కుంతీదేవి గాంధారి భుజము మీద చెయ్యి వేసి నడుస్తూ ఉంది. ద్రౌపది, **సుభద్ర, చిత్రాంగద, ఉలూపి, ఉత్తర** ఇంకా అంతఃపురజనాలు శోకిస్తూ నడుస్తున్నారు. కొంత మంది బిగ్గరగా రోదిస్తున్నారు. జూదము ఆడిన తరువాత ఏ విధముగా దుఃఖించారో ఆ విధంగా దుఃఖించసాగారు. వీధులకు అటూ ఇటూ నిలబడి చిన్నా, పెద్దా, ఆడా, మగా తేడా లేకుండా పౌరులంతా దుఃఖిస్తున్నారు. ధృతరాష్ట్రుడు పురద్వారము సమీపించగానే తనతో వస్తున్న వారిని నివువమని ప్రార్ధించాడు. విదురుడు కూడా ధృతరాష్ట్రుడితో అరణ్యానికి వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. విదురుడితో పాటు సంజయుడు కూడా వారితో అరణ్యాలకు వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. **యుయుత్సుడు**, కృపాచార్యులు కూడా వెంట వస్తానని అంటే ధృతరాష్ట్రుడు వద్దని వారించి ధర్మరాజుకు అప్పగించాడు. తన కోడళ్ళను సముచితమైన మాటలతో అనునయించాడు. వారంతా ధృతరాష్ట్రుడికి గాంధారికి నమస్కరించి శలవు తీసుకున్నారు.

## ధర్మరాజు శోకించుట

ధర్మరాజు కుంతీదేవిని చూసి " అమ్మా ! ధృతరాష్ట్రుడు నాకు పితృసమానుడు ఆయన అడవులకు వెడుతున్నాడు. నేను కూడా ఆయన వెంట వెళ్ళి ఆయనకు శుశ్రూషలు చేస్తాను. నీవు అంతఃపురవాసులను తీసుకు వెళ్ళు " అన్నాడు. కుంతీదేవి " కుమారా ! రాజ్యము చెయ్యవలసిన వాడవు నీవు తనతో రావడానికి నీ పెదతండ్రి అంగీకరిస్తాడా ! కనుక నీవు అంతఃపుర జనాలను తీసుకు వెళ్ళు. అక్కగారికి సేవచేయడానికి నేను వారితో వెడతాను. వారికి సేవలు చెయ్యడానికి నీకు తెలియదు.

నేను స్త్రీని పైగా సమర్ధురాలను. కనుక నేను వారితో అడవులకు వెడతాను. ఇంత కాలము కలసి ఉన్నాము. ఇప్పుడు వారు అడవులకు వెడితే నా మనసు ఎలా ఒప్పుతుంది " అన్నది కుంతీదేవి. ఆ మాటలు విన్న పాండవులు అయిదుగురూ కుంతీదేవిని ఆపడానికి ఎంతో ప్రయత్నించారు. అయినా కుంతీదేవి వినక ధర్మరాజుతో " కుమారా ! నేను వీరితో అడవులకు వెళ్ళడానికి నిశ్చయించుకున్నాను. ఇక నీవేమి మాటాడకు. ఎవరు చెప్పినా నేను వినను. నకులసహదేవులను జాగ్రత్తగా చూసుకో. నా పెద్దకుమారుడు కర్ణుడిని మరువకు. నేను కపటబుద్ధితో కర్ణుడి జన్మరహస్యము మీకు చెప్పకుండా దాచి మహాపాపము చేసాను. దానిని తలచుకుంటూ నేను బాధపడని రోజు లేదు. నేను చేసిన పాపము తొలగి పోయేలా కర్ణుడి పేరు మీద విరివిగా దానధర్మములు చేయి. నా పెద్దకుమారుడు కర్ణుడు నా కుమారుడు అర్జునుడి చేతిలో దారుణముగా చంపబడ్డాడు అని తెలిసినా నా గుండెలు బద్దలు కాలేదు. నాది గుండెకాదు బండరాయి కదా ! నేను ఎంత కఠినాత్మురాలో కాదా ! నీవు నీ తమ్ములు సదా కర్ణుడిని తలచుకుంటూ ఉండండి. ధర్మనందనా ! నీ భార్య ద్రౌపదిని అనురాగంతో చూడండి. నీ తమ్ములు భీమార్జున నకులసహదేవుల మనసు తెలుసుకుని ప్రవర్తించు. వారికి కావలసినది వారు అడగకనే సమకూర్చు. ఇంటి విషయములలో పడి రాజ్యపాలన, ధర్మపాలనా మరువకు. నా నిర్ణయము మారదు. ఇంక మీరు తిరిగి వెళ్ళండి " అని కుంతీదేవి పలికింది. భీమార్జున నకులసహదేవులు కళ్ళలో ధారాపాతంగా నీరు కారుతుండగా తలలు వంచుకుని నిలబడ్డరు. ధర్మరాజు " అమ్మా ! ఏమిటిది ఇంత హటాత్తుగా ఈ నిర్ణయము తీసుకున్నావు. నిన్ను నేను ఎలా అడవులకు పంపగలను. చిన్నప్పటి నుండి మాకు మార్గోపదేశము చేసిన నీవు ఇప్పుడు కూడా అలాగే మా చేత రాజ్యపాలన చేయించు. అంతే కాని ఇలా అడవులకు వెడితే ఎలాగా ! నీవు కృష్ణుడు మమ్ములను అనుక్షణము కనిపెట్టి మార్గోపదేశము చేయక పోతే మేము ఇంత వారము అయ్యే వారిమా ! అమ్మా మమ్ము నీ కోడళ్ళను మనుమలను విడిచి అడవులలో ఎలా ఉండగలవు అమ్మా ! " అన్నాడు. అయినా కుంతీదేవి బదులు చెప్పకుండా గాంధారి వెంట నడచి వెడుతూనే ఉంది.

## కుంతీ నిర్ణయమును భీములు వారించుట

ఇలా వీలుపడదని భీముడు కుంతీదేవికి అడ్డుపడి " అమ్మా అమ్మా ! ఏమిటమ్మా ఇది. నీవు మమ్ము వదిలిపెట్టి వెళ్ళడానికి కారణము ఏమిటమ్మా ! నీ ఆదేశము మీదనే మేముయుద్ధము చేసి శత్రువులను చంపి రాజ్యమును చేపట్టాము. సుఖించవలసిన తరుణములో ఇలా అడవులకు వెళ్ళడము భావ్యమా చెప్పు. అమ్మా ! నీవు అరణ్యములో ఏమి చెయ్యాలని అనుకుంటున్నావో అది ఇక్కడే చెయ్యమ్మా ! నీకు ఇష్టము వచ్చినట్లు దానధర్మాలు చెయ్యి. అమ్మా ! నీకు గుర్తుందా నకులసహదేవులు అరణ్యములలో ఎన్ని కష్టాలు పడుతున్నారో అని నీవు కుమిలి పోయావు కదా ! తిరిగి రాజ్యము సంపాదించడానికి మమ్మలిని యుద్ధానికి పురికొల్పావు కదా ! మేము యుద్ధము చేసి రాజ్యమును సంపాదించిన తరువాత మమ్మలిని వదిలి నీవిలా అరణ్యవాసానికి వెళ్ళడము తగునా ! " అని కుంతీదేవిని ఆపడానికి భీముడు ప్రత్నించాడు. భీముని మాటాలు విని సుభద్ర, ద్రౌపది ఎంతో దుఃఖించారు. కుంతీదేవి పరిచారికల దుఃఖానికి అంతు లేకుండా పోయింది.

## కుంతీ పరుషవాక్యములతో భీముని నివారించుట

వారందరినీ చూసి కుంతి కొంచము కఠినముగా మాట్లాడక పోతే వారు వెనుకకు మరలరు అని పరిచారికలతో మాట్లాడినట్లు " నిజమేనమ్మా ! నా కుమారులూ నా కోడళ్ళు నిండు కొలువులో అనుభవించిన అవమానాలను, వారు అరణ్యములో అనుభవించిన కష్టాలను చూసి సహించలేక వీరిని యుద్ధానికి పురికొల్పింది నేనే. అయినా లోకోత్తర పరాక్రమవంతులు అయిన నా కుమారులు ఆ విధముగా కష్టాలు అనుభవిస్తుంటే ఏ తల్లి అయినా ఓర్చుకుని ఉంటుందా ! చెప్పండి " అని చెప్పి పక్కనే ఉన్న ద్రౌపదిని ముందుకు త్రోసి ధర్మరాజుతో " చూడు ఈమె కుసుమకోమలి. ఈమెను తల్లిలా పూజించవలసిన ఈమె మరిది ఈమెను నిండు సభకు కొప్పు పట్టుకుని ఈడ్చుకు వచ్చి కొంగు పట్టుకుని లాగి ఘోర అవమానాలకు గురిచేసాడు. దానిని మీరు సహించారు. కాని నేను మాత్రము సహించలేక పోయాను. కురువంశ ప్రతిష్ఠ సర్వనాశనము ఔతుంటే సహించలేక పోయాను. అందుకే మిమ్ము యుద్ధముకు పురికొల్పాను. కృష్ణుడితో అలా మాట్లాడాను. అంతమాత్రాన భీమసేనుడు నన్ను ఈ రోజు ఇలా మాట్లాడుతూ నన్ను ఎత్తి పొడుస్తున్నాడు. నేనిక ఏమి చెప్పగలను " అన్నది. ఆ మాటలకు భీముడు సిగ్గుపడి బాధతో కుమిలి పోయాడు. అది చూసి సహించ లేక భీముడిని ధర్మరాజుకు చూపి " ధర్మనందనా ! నేను ఊరికే నవ్వులాటకు అన్నాను. అంతే కాని భీముని కించపరచడానికి కాదు. అయినా మీరు నాకు తక్కువేమి చేసారు. నేను కోరినట్లు దానధర్మాలు చెయ్యనిచ్చారు. నేను కూడా మీరు అశ్వమేధయాగము చేయడము కళ్ళారా చూసాను. ధన్యురాలను అయ్యాను. ఈ జన్మకు ఇక కావలసినది అనుభవించడానికి ఏమి ఉంది. నాకు ఈ రాజ్యసుఖముల మీద విసుగు పుట్టింది. అందుకని నన్ను వారితో అరణ్యాలకు వెళ్ళనివ్వు. జీవిత చరమాంకములో తపస్సు చేసుకుంటూ పుణ్యలోకాలకు పోతాను. ఆ పని నేను ఒంటరిగా చేయలేను కదా ! ఇప్పుడు నాకు గాంధారి, ధృతరాష్ట్రుడు తోడు దొరికారు. ఇంత కంటే నాకు కావలసినది ఏముంది. అందుకని నన్ను మీరు మనస్ఫూర్తిగా అడవులకు వెళ్ళనివ్వండి. నేనిక ధృతరాష్ట్రుడికి, గాంధారికి సేవ చేసుకుంటూ తపస్సు చేసుకుంటూ ఈ శేషజీవితాన్ని ఆనందంగా, ప్రశాంతముగా గడుపుతాను

" అని చెప్పింది.

## ధర్మరాజు కుంతిని ధృతరాష్ట్ర గాంధారులకు అప్పగించుట

జరిగినదంతా దూరము నుండి చూస్తున్న విదురుడు ధృతరాష్ట్రుడికి విషయము వివరించాడు. ధృతరాష్ట్రుడు విదురుడితో " నీవు వెళ్ళి కుంతితో ధర్మరాజు చెప్పినట్లు చేయమని చెప్పు " అన్నాడు. విదురుడు, సంజయుడు కుంతీదేవి వద్దకు వచ్చి ఎంత నచ్చ చెప్పినా కుంతీదేవి వారి మాటలను వినలేదు. తన పట్టుదల వదలకుండా తన కొడుకులను కోడళ్ళను చూసి " మీరు ఎందుకు నా వెంట వస్తారు. నేను అడవులకు వెడుతున్నాను. మీరు ఇక మీమీ రాజభవనములకు వెళ్ళండి " అని చెప్పంది. ఇక కుంతి తన నిర్ణయము మార్చుకోదని వారికి తెలిసింది. వారందరూ ఆమెకు ప్రదక్షిణ చేసి నమస్కరించి అక్కడే దు:ఖిస్తూ నిలిచారు. పాండవులు మాత్రము ఆమెకు వీడ్కోలు చెప్పడానికి ఆమెతో కొంత దూరము నడచి ఆమెను ధృతరాష్ట్రుడి వద్దకు తీసుకు వెళ్ళి తరువాత ధర్మరాజు ధృతరాష్ట్రుడితో " మీరు అడవికి వెళుతున్నారని తెలిసి మా తల్లి కుంతీదేవి కూడా తమతో వస్తానని పట్టుపట్టింది. మేము ఎంత చెప్పినా వినడము లేదు. ఇక మా తల్లి బాధ్యత మీదే. ఆమెతో మీరు సేవలు చేయించుకోండి " అని తల్లి కుంతీదేవిని ధృతరాష్ట్ర గాంధారీలకు అప్పగించి భారమైన హృదయాలతో హస్థినాపురముకు తిరిగి వచ్చారు.

## ధృతరాష్ట్రాదులు గంగాతీరము చేరుట

ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతీ, విదురుడు, సంజయుడు అందరూ గంగాతీరము చేరుకున్నారు. అక్కడ విడిది చేసి గంగానదిలో స్నానము ఆచరించి సంధ్యావందనము మొదలైన నిత్యపూజలు చేసారు. అగ్నిహోత్రము వెలిగించి అగ్నిని పూజించి తరువాత భోజనాది కార్యక్రమాలు పూర్తి చేసుకున్నరు. ధృతరాష్ట్రుడు దర్భలతో చేసిన శయ్యమీద కూర్చున్నాడు. గాంధారి, కుంతి, విదురుడు, సంజయుడు కూడా తమతో వచ్చిన ఋత్విక్కులతో కలసి విశ్రాంతి తీసుకున్నారు. మరునాడు ఉదయము తెల్లవారగానే ప్రాతఃకాల విధులు నిర్వర్తించారు. గంగానది దాటి కురుక్షేత్రములో ప్రవేశించారు. అక్కడ ఉన్న **శతాయువు** అనే రాజర్షి ధృతరాష్ట్రుడు గాంధారీ మొదలైన వారితో వచ్చాడని తెలిసి వారిని చూడడానికి వచ్చాడు. శతాయువు ధృతరాష్ట్రుడిని, గాంధారిని, కుంతిని, విదురుడిని, సంజయుడిని, ఋత్విక్కులను తన ఆశ్రమముకు తీసుకు వెళ్ళాడు. అక్కడ ఉన్న ప్రశాంతతను చూసిన ధృతరాష్ట్రుడు అక్కడే ఉండాలని కోరుకున్నాడు. అతడి కోరిక మీద వెంటనే అక్కడ పర్ణశాలలు నిర్మించారు. అందరూ వనవాసములో ఆచరించతగిన పద్ధతులు ఆచరించసాగారు. నారచీరలు కట్టుకుని కందమూలములు తింటూ పర్ణశాలలో నివసించసాగారు. కాలక్రమేనా ధృతరాష్ట్రుడు ఎముకలపోగుగా మారాడు. అతడి తపస్సు రోజురోజుకు తీవ్రరూపము తాల్చింది. అని **వైశంపాయనుడు** జనమేజయుడికి చెప్పాడని సత్రయాగ సందర్భములో నైమిశారణ్యములో సూతుడు శౌనకాది మునులకు చెప్పాడు. ఇలా అడవిలో తపసు చేసుకుంటున్న ధృతరాష్ట్రుడిని చూడడానికి **నారదుడు, పర్వతుడు, దేవలుడు, మౌంజాయనుడు** అనే మహర్షులు వచ్చారు.

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక |

విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి |

యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు

# ఆశ్రమవాస పర్వము ద్వితీయాశ్వాసము

వికీపీడియా నుండి

## విషయ సూచిక



# ద్వితీయాశ్వాసము

## నారదుడు

ఆవిధముగా తపస్సు చేస్తున్న ధృతరాష్ట్రుడి వద్దకు నారదుడు, **దేవలుడు, పర్వతుడు, మౌంజాయనుడు** అను మహర్షులు వచ్చారు. వారితో **శతాయువు** కూడా వచ్చాడు. కుంతి వారికి అతిథిసత్కారాలు చేసింది. తరువాత వారు ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళారు. ధృతరాష్ట్రుడు వారికి సంభ్రమంతో నమస్కరించాడు. వారు ధృతరాష్ట్రుడిని ఆశీర్వదించాడు. ధృతరాష్ట్రుడు వారికి దర్భాసనము ఇచ్చి కూర్చోమని చెప్పాడు. అప్పుడు నారదుడు " ధృతరాష్ట్రమహారాజా ! శతాయువు అని ఒక మహారాజు ఉండే వాడు. ఆయన తాత గారు **సహస్రచిత్యుడు** తన కుమారుడికి రాజ్యము ఇచ్చి అడవులకు వచ్చి ఇదే ప్రదేశములో తపస్సు చేసి ఇంద్రుడితో మిత్రుత్వము పొందాడు. ఆయన కాకుండా **పృషధుడు, శైలాలయుడు, పురుకుత్సుడు** ఇక్కడే తపసు చేసి స్వర్గలోకము పొందారు. నాకు వారందరూ తెలుసు. ఈ ఆశ్రమంలో తపసు చేయడము అందరికీ సాధ్యము కాదు. వ్యాసుడి దయ వలన నీకు ఆ అదృష్టము కలిగింది. ఇక్కడ తపసు చేయడము వలన నీవు కూడా వారి వలెనే ఉత్తమ గతులు పొదుతావు. నీ భార్య గాంధారి కూడా నిన్ను అనుసరించి వస్తుంది. మీకు సేవలు చేసినందుకు కుంతీదేవి కూడా ఉత్తమ గతులు పొంది తన భర్త పాండురాజును చేరుకుంటుంది. ఇప్పుడు పాండురాజు స్వర్గలోకములో ఉన్నాడు. సదా నిన్నే తలచుకుంటున్నాడు. యమధర్మరాజు ఆత్మగా కలిగిన విదురుడు కూడా యమధర్మరాజును చేరుకుంటాడు. సంజయుడు కూడా మిమ్ము అనుసరించి వస్తాడు " అని చెప్పాడు. ఆమాటలు విన్న ధృతరాష్ట్రుడు, గాంధారీ, కుంతి ఎంతో సంతోషించారు. ఆ శతాయువు నారదుడిని " నారదమహర్షీ ! మీకు అన్నీ తెలుసు కదా ! నాకు ఒక సమాధానము చెప్పండి. మీరు కురుసార్వభౌముడికి ఉత్తమ గతులు కలుగుతాయని చెప్పారు కదా అది ఎలాగో వివరించండి. అందుకు నారదుడు " శతాయువూ ! నేను ఒకసారి దేవేంద్రుడితో ముచ్చటిస్తున్న సమయములో ధృతరాష్ట్రుడి ప్రస్థావన వచ్చింది. ధృతరాష్ట్రుడి తీవ్రమైన తపసు గురించి దేవలోకము అంతా ప్రశంసించారు. అప్పుడు దేంద్రుడు " నారదా ! ఇంతటి తీవ్రమైన తపస్సు చేస్తున్న ధృతరాష్ట్రుడు తన భార్య గాంధారితో సహ దేవలోకము చేరుకుంటాడు " అన్నాడు ఇంద్రుడు. ఆ సమయములో అక్కడ ఉన్న పాండురాజు అది విని చాలా సంతోషించాడు " అని నారదుడు చెప్పాడు. ఆ మాటలు విని ధృతరాష్ట్రాదులు సంతోషించారు. నారదాది మహామునులు అక్కడి నుండి తమ నివాసాలకు వెళ్ళారు.

## పాండవులు ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళుట

హస్థినాపురములో పాండవులు కూడా తనతల్లి కుంతీని తలచుకుని విచారిస్తున్నారు. పెదతండ్రి ధృతరాష్ట్రుడు, పెదతల్లి గాంధారి అడవిలో ఎన్ని కష్టాలు అనిభవిస్తున్నారో అని దుఃఖిస్తున్నారు. ముసలిప్రాయంలో సుఖపడవలసిన తరుణంలో అడవులలో కష్టములు అనుభవిస్తున్నారని కుమిలిపోతున్నారు. హస్థినాపుర ప్రజలు కూడా వారిని తలచుకుని ఎంతో బాధపడుతున్నారు. పాండవులు విదురుడిని, సంజయుడిని తలచుకుని కూడా దుఃఖిస్తున్నారు. రాచభోగములను వదిలి అడవులలో ఆకులు అలములు తిని బ్రతకవలసిన అవరము ఏమున్నదని విలపిస్తున్నరు. వారినిచూసి ద్రౌపది, సుభద్ర కూడ బాధపడుతున్నారు. ఇక ఉండలేక పాండవులు అందరూ ధృతరాష్ట్రాదులను చూడడనికి అరణ్యముకు వెళ్ళడనికి నిశ్చయించుకున్నారు. ఆ సమయములో సహదేవుడు అన్నలకు నమస్కరించి " తల్లి కుంతీదేవిని చూడాలని నేను ముందె అనుకున్నను కాని మీరు ఏమి అంటారో అని చెప్పలేదు. మనతల్లి కుంతీదేవి తన బావ ధృతరాష్ట్రుడికి, తన అక్క గాంధారికి సేవలు చెయ్యడనికి వారితోపాటు అడవులకు వెళ్ళింది. అక్కడ నారచీరలు కట్టుకుని ఆకులు అలములు తింటూ ఎలా ఉందో అని నాకు బెంగగా ఉంది అన్నయ్యా ! అందుకని ఆలస్యము చెయ్యకుండా అరణ్యములకు వెళ్ళి వారిని చూసి రావడము మంచిది " అని అన్నాడు. ఆమాటలు విన్న ద్రౌపది కూడా " సహదేవుడు చక్కగా చెప్పాడు. మీరు తక్షణము కుంతీదేవిని చూడడానికి అడవులకు వెళ్ళడము సముచితము. కాని మరొక్క విషయము. మా కోడళ్ళము అందరమూ అత్తగార్లను చూడడానికి ఉవ్విళ్ళూరుతున్నాము. మేమంతా ప్రయాణానికి సిద్ధముగా ఉన్నము " అన్నది. ధర్మరాజు అందుకు సమ్మతించాడు. ప్రయాణానికి తగిన సన్నహాలు చెయ్యమని ఆదేశాలు జారీ చేసాడు. హస్థినాపురప్రజలు ఎవరైనా తమతో రావచ్చని. అలావచ్చే వారికి తగిన ఏర్పాట్లు చెయ్యమని ఆదేశాలు ఇచ్చాడు. తాము లేని సమయములో నగరరక్షణార్ధము **యుయుత్సుడిని, కృపాచార్యుడిని, ధౌమ్యుడిని** నియమించాడు. అలా పాండవులు అడవులకు వెళ్ళడానికి సన్నాహాలు చేసుకున్నారు.

## పాండవులు ఆశ్రమానికి చేరుట

భీముడు గజబలముతో, అర్జునుడు రధములతో, నకులుడు అశ్వబలముతో, సహదేవుడు కాల్బలముతో బయలు దేరారు. ద్రౌపది వంటి అంతఃపుర స్త్రీలు పల్లకీలలో, బంగారు రధములలో బయలుదేరారు. ధర్మరాజు 16 అశ్వములు కూర్చిన రధములో బయలుదేరాడు. అలా ధర్మరాజు గంగానదిని దాటి కురుక్షేత్రములో శతాయువు ఆశ్రమానికి సమీపములో ఉన్న ధృరాష్ట్రుడి ఆశ్రమానికి చేరుకున్నాడు. అందరూ తమ రధములు దిగి కాలినడకన ఆశ్రమము వద్దకు వెళ్ళారు. ధర్మరాజు అక్కడ ఉన్న వారిని " ధృతరాష్ట్రుల వారు ఎక్కడ " అని అడిగాడు. వారు " యమునలో స్నానము చెయ్యడానికి వెళ్ళాడు " అని చెప్పారు. వెంటనే ధర్మరాజు మొదలైన వారు యమునా నదీతీరానికి వెళ్ళారు. అప్పటికే యమునలో స్నానము

జపతపాదులు ముగించుకుని ధృతరాష్ట్రుడు మొదలగు వారు వారికి ఎదురు వచ్చారు. కుంతీదేవి పాండవులను చూసి పొదివిపట్టుకుని అందరినీ ఆశీర్వదించింది. సహదేవుడు కుంతీదేవి పాదాల మీదపడి ఏడ్చాడు. కుంతీదేవి గాంధారికి, ధృతరాష్ట్రుడికి తన కుమారులు వచ్చిన విషయము చెప్పింది. పక్కనే ఉన్న సంజయుడు పాండవులను చూసి సంతోషముగా పలకరించాడు. ద్రౌపది మొదలైన అంతఃపుర స్త్రీలు అందరూ వచ్చి గాంధారికి, కుంతికి నమస్కరించారు. వారు అంతఃపురస్త్రీలను ఆదరించారు. తన వారు అందరూ చుట్టూ ఉండగా ధృతరాష్ట్రుడికి తాను హస్థినాపురములో ఉన్నట్లు అనిపించింది. అందరూ కలసి ఆశ్రమానికి వెళ్ళారు.

## ధృతరాష్ట్రుడు ధర్మరాజును కుశలము విచారించుట

పాండవులు, ధర్మరాజు అరణ్యాలకు వచ్చారని తెలిసి చుట్టుపక్కల ఉన్న మునులు, ఋషులు వారిని చూడవచ్చారు. అక్కడకు వచ్చిన పాండవులు మునులకు పాదాభివందనము చేసారు. ఆ మునులు పాండవులను తమకు పరిచయము చెయ్యమని కోరారు. సంజయుడు " ఈయన ధర్మరాజు, ఈయన భీముడు, ఈయన అర్జునుడు, ఈయన నకులుడు, ఈయన సహదేవుడు, ఈమె ద్రౌపది. ఈమె శ్రీకృష్ణుడి చెల్లెలు అర్జునుడి భార్య అయిన సుభద్ర. **ఉలూపి, చిత్రాంగదలు** కూడా అర్జునుడి భార్యలు. ఈమె ఉత్తర. యుద్ధములో వీరమరణము పొందిన అభిమన్యుడి భార్య " తరువాత పాండవుల ఇతర భార్యలను కూడా వారికి పరిచయము చెసాడు. పరిచయాలు అయిన తరువాత ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో " ధర్మనందనా ! నీవు, నీ తమ్ములు, నీ మిత్రులు, బంధువులు అందరూ కుశలమే కదా ! నీ అంతరంగ పరిజనము సుఖముగా ఉన్నారా ! నీవు నీ పెద్దలు నడచిన మార్గమునే నడుస్తున్నావా ! దేవాలయములు, బ్రాహ్మణులకు ఇచ్చిన అగ్రహారములు మాన్యములు అన్యాక్రాంతము కాకుండా కాపాడుతున్నావా ! ప్రజకు బాధకలిగించని విధంగా పన్నులు విధించి కోశాగారాన్ని నింపుతున్నవు కదా ! నీవు నీ మిత్రులపట్ల స్నేహభావము శత్రువులపట్ల కాఠిన్యము ప్రదర్శిస్తున్నావు కదా ! నీకు మిత్రులు శత్రువులు కాక తటస్థముగా ఉన్న రాజుల పట్ల అప్రమత్తముగా ఉంటున్నావు కదా ! ఎందుకంటే వారు ఎప్పుడు ఏవైపు ఉంటారో తెలియదు కదా ! దేవతలను, పితృదేవతలను, అతిథులను నైవేద్యములు భోజనములు పెట్టి తృప్తిపరుస్తున్నావు కదా ! నీ రాజ్యములో నాలుగువర్ణాల వారు తమకు విధించిన వృత్తులు క్రమము తప్ప కుండా పాటిసున్నారు కదా ! నీ రాజ్యములో బాలలు, వృద్ధులు, స్త్రీలు, అందరూ, భయము లేకుండా జీవిస్తున్నారు కదా ! నీ ఆజ్ఞను పురప్రజలు ఖచ్చితముగా పాటిస్తున్నారు కదా ! " అని గబగబా ప్రశ్నించాడు.

## ధర్మరాజు ధృతరాష్ట్రుడిని కుశలము విచారించుట

ధృతరాష్ట్రుడు కుశలము విచారించిన దానికి బదులుగా ధర్మరాజు " పెదనానగారూ! మీరు నాకు చేసిన రాజనీతి ఉపదేశమువలన రాజ్యపాలన అంతా చక్కగా జరుగుతున్నది. కాని మా దిగులంతా తమరి గురించే. తమరి తపసు ఎలా కొనసాగుతుంది. మా తల్లి కుంతీదేవి తమకు సేవలు చేస్తున్నది కదా ! మా పెదతల్లి గాంధారి తపస్సు బాగా సాగుతుంది కదా ! విదురుల వారు ఇక్కడ లేరు ఎక్కడకు వెళ్ళారు ? నాకు వారిని చూడాలని ఉన్నది. నేను వెంటనే విదురుడిని చూడాలని అనుకుంటున్నను " అని అడిగాడు. ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో " కుమారా ధర్మరాజా ! నేను ఇక్కడ బగానే ఉన్నాను. నా తపసు బాగా సాగుతుంది. కుంతి మాకు బాగా సేవలు చేస్తుంది. గాంధారి తపసు బాగా జరుగుతుంది. సంజయుడు కూడా తనకు తోచిన విధముగా తపసు చేస్తున్నాడు. కాని విదురుడు మాత్రము ఎక్కడ ఉంటాడో ఎక్కడ తిరుగుతుంటాడో తెలియదు. వేళకు ఆహారము తీసుకోడు. ఒక్కోసారి గాలి, నీరు మాత్రమే అహారముగా తీసుకుంటాడు. ఒక్కో సారి అది కూడా తీసుకోడు. చాలా విచిత్రముగా ప్రవర్తిస్తుంటాడు. మనుష్యులు తిరగడానికి భయపడే ఈ కారడవిలో ఒంటరిగా స్వేచ్ఛగా నిర్భయముగా సంచరిస్తుంటాడు. ఈ క్షణములో ఇక్కడ ఉంటాడు. మరు క్షణములో ఎక్కడ ఉంటాడో తెలియదు. ఇక్కడే ఎక్కడో తిరుగుతున్నాడు చూడు అని దూరముగ తిరిగుతున్న విదురుడిని ధర్మరాజుకు చూపించాడు ధృతరాష్ట్రుడు.

## ధర్మరాజు విదురుని అనుసరించుట

ధృతరాష్ట్రుడు చూపించిన వైపు చూసిన ధర్మరాజుఅక్కడ విదురుడు ఉండడము చూసాడు. విదురుడి శరీరము అంతా మట్టి కొట్టుకుని ఉంది. దుస్తులు ధరించ లేదు. జుట్టంతా జడలు కట్టి ఉంది. ఆశ్రమ సమీపానికి వచ్చి అక్కడ అధికముగా జనము ఉండడము చూసి దూరముగా పోసాగాడు. ఇది చూసిన ధర్మరాజు " విదురా ! విదురా ! ఆగు. నేను ధర్మందనుడను నిన్ను చూడడానికి వచ్చాను " అని అరుస్తూ విదురుడి వెంట పరిగెత్తాడు. విదురుడు ఒక చెట్టూ కింద నిలబడ్డాడు. ధర్మరాజు పరుగున వెళ్ళి విదురుడి ముందు నిలబడ్డాడు. విదురుడు నిశ్చలంగా నిలబడ్డాడు. ధర్మరాజు " విదురా ! నేను ధర్మనందనుడను నిన్ను చూడ వచ్చాను. కళ్ళుతెరవండి " అని ప్రార్ధిచాడు. విదురుడు కళ్ళు తెరచి ధర్మరాజు వైపు తదేకంగా

చూస్తూ తన యోగ బలముతో తన శరీరాన్ని విడిచి పెట్టాడు. విదురుడి ఇంద్రియములు, విదురుడి ప్రాణములు విదురుడిని విడిచి పెట్టి తేజో రూపములో ధర్మరాజులో ప్రవేశించాయి. విదురుడి పాంచభౌతిక శరీరము కింద పడిపోయింది. ధర్మరాజు అప్పుడు ఇనుమడించిన కాంతితో ప్రకాశించాడు. ఇది చూసిన ధర్మరాజు ఆశ్చర్యచకితుడై విదురుడికి అంత్యక్రియలు నిర్వర్తించాలని తలచాడు. అప్పుడు ఆకాశము నుండి ఒక వాక్కు వినిపించింది " విదురుడు యతీశ్వరుడు. యతిధర్మము స్వీకరించాడు. అతడి శరీరానికి అగ్నిసంస్కారము చేయ కూడదు. కనుక అతడి శరీరాన్ని అక్కడే విడిచి పెట్టు " అని వినిపించింది. తరువాత ధర్మరాజ వడివడిగా నడుస్తూ ఆశ్రమానికి వెళ్ళి అక్కడ ఉన్న వారికి జరిగినదంతా వివరించాడు. అది విని అందరూ ఆశ్చర్యచకితులు అయ్యారు. తరువాత ధర్మరాజును చూడడానికి వచ్చిన తాపసులు అందరూ ధృతరాష్ట్రుడి వద్ద శలవు తీసుకుని అక్కడ నుండి వెళ్ళారు. తరువాత ధృతరాష్ట్రుడు ధర్మరాజును చూసి " ధర్మనందనా ! నీకు ఫలములు, దుంపలు ఇస్తాను ఆహారముగా స్వీకరించు " అన్నాడు. అలాగే అని ధృతరాష్ట్రుడి ఆతిథ్యాన్ని ధర్మరాజు సంతోషంగా స్వీకరించాడు. అందరూ ధృతరాష్ట్రుడు భోజనముగా ఇచ్చిన ఫలములను, కందమూలములను సంతోషముగా స్వీకరించారు. ఆ రోజు రాత్రి ఆశ్రమంలో నిద్రించారు. తెల్లవారిన తరువాత కాలకృత్యములు, సంధ్యావందనము మొదలైన కార్యక్రమమాలు పూర్తిచేసుకున్న తరువాత భార్య ద్రౌపది, తమ్ములతో, పరివారముతో కలసి ఆశ్రమము అంతా తిరిగి చూసారు. తరువాత ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చి అతడికి నమస్కరించి ఎదురుగా ఒక ఆసనము మీద కూర్చుని ఇష్టాగోష్టి జరిపాడు. ఆ విధముగా ధర్మరాజు ఒక మాసము కాలము తన పరివారముతో అరణ్యములో గడిపాడు.


విదురుడి నుండి తేజో రూపము ధర్మరాజులో ప్రవేశించుట

## వ్యాసుడు ధృతరాష్ట్రుడి ఆశ్రయముకు వచ్చుట

ఒకరోజు ధృతరాష్ట్రుడు, ధర్మరాజు శతాయువు మొదలైన మహా మునులతో కుర్చుని సంభాషిస్తున్న తరుణములో అక్కడకు వ్యాసుడు వచ్చాడు. ధృతరాష్ట్రుడు ధర్మరాజు అర్ఘ్యపాద్యములు ఇచ్చి సత్కరించారు. ధృతరాష్ట్రుడిని చూసి వ్యాసుడు " ధృతరాష్ట్రా ! నీకు వనవాసము అలవాటు అయ్యిందా ! తపసు ఆచరిస్తున్నవా ! తాపసులకు అనువైన పనులను నియమము తప్పక ఆచరిస్తున్నవా ! నీ పుత్రులు మరణించిన శోకమును నీ మనసులో నుండి తొలగి పోయిందా ! నీ భార్య గాంధారి దు:ఖమును మరచి పోయిందా ! నీకు నీ భార్యకు పరిపూర్ణ జ్ఞానము లభించిందా ! కుంతీదేవి మీకుసేవలు చక్కగా చేస్తుందా ! మీరు అడవిలో ఉంటే తాను రాజభవనములో ఉండలేనని కుంతి మీతో అరణ్యాలకు వచ్చింది. ఆమె త్యాగము వర్ణనాతీతము కదా ! నీవు ధర్మరాజు మీద, భీమార్జున నకుల సహదేవుల మీద ప్రేమానురాగాలు కలిగి ఉన్నావా ! నీ మనసు నిర్మలంగా ఉన్నదా ! నీ మనసు నిర్మలమైనదా ! ధృతరాష్ట్రమహారాజా ! శత్రుత్వము, ఒకరికి అపకారము చేసే గుణమును కలకాలము నిలుపుకోకూడదు. మనసు సదా నిర్మలంగా నిలుపుకున్నప్పుడే సంపదలు కలుగుతాయి. విదురుడు శరీరము వదిలాడని విన్నాను. విదురుడు ఎవరో కాదు. అతడు సాక్షాత్తు యమధర్మరాజు. మాండవ్యముని శాపము కారణంగా మానవజన్మ ఎత్తాడు. బ్రహ్మదేవుడి ఆదేశాన్ని అనుసరించి అంబిక యొక్క దాసికి పుత్రుడిగా శూద్రగర్భమున జన్మించాడు. అతడే కాదు ధర్మరాజు కూడా యమధర్మరాజు ప్రతిరుపమే. అందుకే విదురుడు యోగబలముతో తన అంశను ధర్మరాజులో కలిపాడు. అటువంటి దేవతా స్వరూపుడైన ధర్మరాజు చేత సేవలు అందుకుంటున్నందుకు సంతోషంగా ఉందా ! " అన్నాడు.

## ధృతరాష్ట్రుడి వైరాగ్యము

ధృతరాష్ట్రుడు వ్యాసుడితో వినయముగా " వ్యాసమునీంద్రా ! ఈ వనవాసము నాకు ఏమాత్రము బాధకలిగించడము లేదు. నా దేహము చిత్తము తపసు చెసుకోవడములో నిమగ్నము అయ్యాయి. నేను కాని గాంధారి కాని పుత్రశోకమును ఇసుమంత కూడా అనుభవించడము లేదు. ఆ దు:ఖమును మేము ఎప్పుడో మరచిపోయాము. నాకు ధర్మరాజు మీద, అతడి తమ్ముల మీద నాకు అంతులేని అనురాగము ఉంది. ఈ ధర్మరాజు సాక్షాత్తు ధర్మదేవతా స్వరూపుడని నాకు తెలుసు. ఆ మాటలను నేను ఎప్పటికప్పుడు నా మాటలతో చేతలతో ధర్మరాజుకు తెలియజేస్తున్నాను. కుంతి రాజభోగములు వదులుకుని మా వెంట అరణ్యాలకు వచ్చి మాకు సేవలు చెయ్యడము మాకు ఎంతో ఆశ్చర్యము కలిగిస్తుంది. తమరి దయవలన మాకు అధ్యాత్మపరిజ్ఞానము, మానసిక నిర్మలత్వము కలిగాయి " అని వినయముగా చెప్పాడు. ఆ సమయములో ద్రౌపది, సుభద్ర మొదలైన అంత:పురకాంతలు వ్యాసుడి దర్శనము కొరకు వచ్చి ఆయనకు భక్తితో నమస్కరించారు. వారిని అందరిని

వ్యాసుడు ఆశీర్వదించాడు. తరువాత ధృతరాష్ట్రుని చూసి వ్యాసుడు " మీ అందరికి మీ మనసులలోని చింతలను తీర్చి మంచిబుద్ధి కలిగించే తలంపుతో ఇక్కడకు వచ్చాను. మీకు ఇష్టము వచ్చినది అడగండి. మీ కోరికలు తీరుస్తాను " అని అన్నాడు.

## ధృతరాష్ట్రుడు వ్యాసుడిని కోరిన కోరిక

వ్యాసుడికి బదులిస్తూ ధృతరాష్ట్రుడు " వ్యాసమునీంద్రా ! తమరు మా మీద దయతో మా వద్దకు రావడమే మహాభాగ్యము. ఇంతకంటే మేము కోరేది ఏముంటుంది. మీ దయ మాకు లభించింది అంతకంటే అధికమైనది ఏమున్నది. మీరు మా వద్దకు రావడము మమ్ము ఆదరించడముతో నా జన్మ ధన్యము అయింది. నాకు ఉత్తమలోక ప్రాప్తి కలుగుతుందో లేదో అన్న భయము పోయింది. నేను ధన్యులలో ధన్యుడిని అయ్యాను. అయినా మీరు కోరమన్నారు కనుక అడుగుతున్నాను. నా కుమారుడు దుష్టస్వభావము కలవాడు. పాండవులు పాపస్వభావము లేనివారు, పుణ్యాత్ములు. అటువంటి వారిని నీ కుమారుడు సుయోధనుడు పరాభవించాడు. తన మిత్ర రాజులందరిని ససైన్యముగా యుద్ధ భూమికి బలి ఇచ్చాడు. భీష్మ, ద్రోణ, కర్ణులను బలి ఇచ్చి చివరకు తాను కూడా బలి అయ్యాడు. అధముడైన సుయోధనుడి కొరకు తమ భార్యా, బిడ్డలను, రాజ్యాలను వదిలి వచ్చిన నానా దేశాల రాజులకు ఎటువంటి సద్గతులు లభించాయి. మరణించిన తరువాత వారు పొందిన లోకములు ఏమిటి వారు ఏమయ్యారో తెలియజేయండి " అని అడిగాడు.

## గాంధారి కోరిన కోరిక

గాంధారి వ్యాసుడికి నమస్కరించి " వ్యాసమునీంద్రా ! భారతయుద్ధము జరిగి 16 సంవత్సరాలు అయ్యాయి. ఈ 16 సంవత్సరాలు నా భర్త ధృతరాష్ట్రుడు కొడుకుల కొరకు పరితపిస్తూ ఉన్నాడు. ఆయనే కాదు నేను, ద్రౌపది, సుభద్ర, కుంతి, నా కోడళ్ళు నూరుమంది, యుద్ధములో చనిపోయిన **భూరిశ్రవుడు, సౌమదత్తుడు, బాహ్లీకుడి** భార్యలు యుద్ధములో చనిపోయిన తమ భర్తలు, కొడుకులు ఎలా ఉన్నారో అని పరితపిస్తున్నారు. వారిని చూడాలని ఆతురతగా ఉన్నరు. ఈ సృష్టిలో ఎన్ని లోకాలు ఉన్నాయో అన్నీ నీ యోగశక్తితో చూపగల సమర్ధులు మీరు. మాకు ఈ మాత్రము చుపలేరా ! కనుక మాకు మా బంధువులు ఎక్కడ ఉన్నారో చూపండి. మా దుఃఖములు తొలగించండి. ఇదే మా కోరిక " అని అందరి కోరికగా గాంధారి చెప్పింది.

## కుంతీదేవి సందేహము

కుంతీదేవి వ్యాసుడికి నమస్కరించిన సమయములో కుంతీదేవికి తన కుమారుడు కర్ణుడు మనసులో మెదిలాడు. కుంతి మనసు బాధపడింది. అది వ్యాసుడు గ్రహించి " అమ్మా కుంతీదేవి ! గాంధారి తన కోరిక తెలియజేసింది. నీ మనసులో కోరిక కూడా తెలియజేస్తే అది కూడా తీరుస్తాను " అని అన్నాడు. కుంతీదేవి వ్యాసుడికి నమస్కరించి " వ్యాసమునీంద్రా ! నీవు దేవతలకు దేవతవు. నీవు నా భర్తకు తండ్రివి. నిన్ను మామామగారుగా పొందడము మా అదృష్టము. నా మీద దయ ఉంచి నా విన్నపము ఆలకించు. నేను కన్యగా ఉన్నప్పుడు దుర్వాస మహాముని మా తండ్రి వద్దకు వచ్చాడు. ఆయనకు సేవలు చెయ్యడానికి నా తండ్రి నన్ను నియమించాడు. నా సేవలకు **దుర్వాసుడు** మెచ్చుకుని " నీకు ఒక వరము ఇస్తాను కోరుకో " అన్నాడు. నేను " మహనుభావా ! మీ దయ మా మీద ఉన్నది నాకు అంతే చాలు. నాకు ఇక ఏ వరమూ అవసరము లేదు " అని అన్నాను. దుర్వాసుడు " నేను వరము ఇస్తానని అన్నప్పుడు నీవు కాదని అనకూడదు. అడుగు " అన్నాడు. నేను భయపడి " నాకు పుత్రుడిని ప్రసాదించమని అడిగాను " అప్పుడు ఆ ముని నాకు ఒక మంత్రము ఉపదేశించి " ఈ మంత్రము మననము చేసి ఏ దేవతను పిలిస్తే ఆ దేవత వచ్చి నీకు పుత్రుడిని ప్రసాదిస్తాడు. కుంతీ ! సాక్షాత్తు యమధర్మరాజు నీకు కుమారుడిగా జన్మిస్తాడు " అని చెప్పాడు. తరువాత దుర్వాసుడు వెళ్ళిపోయాడు. నేను బాల్యచాపల్యము చేత ఆ మంత్రమును పరీక్షించాలని ఏ దేవతను పిలవాలా అని ఆలోచిస్తుండగా ఆకాశములో సూర్యుడు కనిపించాడు. నేను మంత్రము మననము చేసి సూర్యదేవుడుని ప్రార్థించాను. నేను ఇది కేవలము వినోదము కొరకు చెసాను. కాని సుర్యదేవుడు నిజంగానే నా ముందు ప్రత్యక్షమై " నీకు ఏమి వరము కావాలో కొరుకో " అని అడిగాడు. నాకు భయము వేసి చేతులు జోడించి " అయ్యా ! మీరు ఎందుకు వచ్చారు ? వెళ్ళిపోండి " అని ప్రార్థించాను. అందుకు సూర్యదేవుడు " కన్యామణీ ! వృధాగా ఎవరినైనా ఆహ్వానించడము తప్పు. నీకు మంత్రము ఎవురు ఉపదేశించాడో నేను వారిని శపిస్తాను " అని కోపంతో అన్నాడు. నేను భయముతో వణికిపోయను. నా బాల్యచాపల్యము వలన నిరపరాధి అయిన గురుదేవులు దుర్వాసులవారు శాపగ్రస్థులు కావడము ఇష్టపడక " దేవా ! తమరు నా మీద దయ ఉంచి తమరితో సమానతేజస్సు కలిగిన పుత్రుడిని ప్రసాదించండి " అని కోరాను. అప్పుడు సూర్యభగవానుడు " కన్యామణీ ! నీకు నా తేజోప్రభావముతో నాతో సమానుడైన

తేజస్వి కుమారుడిగా జన్మిస్తాఅడు. నీవు కన్యవు కనుక నీ కన్యాత్వము చెడకుండా వరము పుత్రుడు కలిగేలా వరము ప్రసాదిస్తున్నాను " అని పలికాడు. తరువాత సూర్యభగవానుడు వెళ్ళి పోయాడు. నేను గర్భవతిని అయ్యాను. తల్లి తండ్రులకు తెలియకుండా అంతఃపురములో పుత్రుడిని ప్రసవించాను. కాని కన్యను అయిన నేను లోకనిందకు వెరచి కుమారుడిని పెంచలేక నదిలో విడిచి పెట్టాను. ఇది నాకు ఒక కలగా జరిగి పోయింది. తమరు జ్ఞానులు కనుక జరిగినది అంతా గ్రహించారు. కాని ఆ పుత్రుడు నాకు కలిగిన విధానము నదిలో వదిలిన విధానము నాకు ఇంకా బాధ కలిగిస్తుంది. నేను చేసింది పాపమో కాదో నకు తెలియక పోయినా నేను నా కుమారుడిని నిర్ధయగా నదిలో వదిలి వేసినందుకు ఇప్పటికీ నా హృదయము దహించుకు పోతుంది. ఆ భయము ఇప్పటికీ నన్ను వదలడము లేదు కనుక మీరు నా భయాన్ని పోగొట్టండి. మరణించిన తన కుమారుడు ఎటువంటి ఉత్తమ గతులు పొందారో తెలుకోగోరుతున్న ఈ ధృతరాష్ట్రుడి కోరికను తీర్చండి. ఇదే మీరు నాకు ఇచ్చే కోరిక " అని అని వేడుకొన్నది.

## కురుక్షేత్ర రహస్యము

వ్యాసుడు కుంతీదీవితో " కుంతీ ! నీవు చెప్పినది యదార్ధము. ఇందులో నీ తప్పు ఏమీ లేదు. దేవతలు ఇలాంటి అద్భుతాలు చేస్తూ ఉంటారు. కర్ణుడు అలా జీవించవలసి ఉన్నది. కనుక నీవు కర్ణుడిని నదిలో వదిలి పెట్టావు. కర్ణుడి పుట్టుక వలన నీ కన్యాత్వము భంగము కాలేదు కనుక నీవు స్త్రీలలో అగ్రగణ్యురాలవు. నీవు నిష్కలంక చరితవు అనడములో ఎటువంటి సందేహము లేదు. గాంధారీ నీవు కోరినట్లు నీ కుమారులను, బంధువులను, సోదరులను, కుంతి తన కుమారుడైన కర్ణుడిని, మీ మీ బంధువులను చుస్తారు. ద్రౌపది, సుభద్ర, మిగిలిన స్త్రీలు వారివారి పుత్రులను, కుమారులను, మనుమలను చూస్తారు. నేను ఈ పని చేయడానికే ఇక్కడకు వచ్చాను. నీ యొక్క, నీ భర్త యొక్క, కుంతి యొక్క, చింతలు పోగొట్టడానికి మీరు కోరిన కోరికలు నెరవేరుస్తాను. కాని గాంధారీ ! నీవు నీ కుమారుల గురించి, మనుమల గురించి చింతించ వలదు. వారు యుద్ధము చెసి వీరమరణము పొందారు. భారతయుద్ధము ఇలా జరగాలని ఎప్పుడో నిర్ణయించబడినది. ఎందరో దేవతలు తమ తమ అంశలతో ఈ భూమిమీద జన్మించారు. నీ భర్త పూర్వజన్మలో ధృతరాష్ట్రుడు అనే గంధర్వరాజు. అతడు ఈ జన్మలో అంధరాజుగా జన్మించాడు. యమధర్మరాజు అంశతో పుట్టిన వాడు ధర్మరాజు. వాయుదేవుడి అంశతో జన్మించిన వాడు పుట్టిన వాడు భీముడు, అశ్వినీ దేవుల అంశతో జన్మించిన వారు **నకులసహదేవులు** నరనారాయణులలో నరుడు అర్జునుడిగాను నారాయణుడు శ్రీకృష్ణుడిగాను జన్మించారు. ద్వాపరుడు శకునిగాను, కలి అంశతో సుయోధనుడు జన్మించారు. రాక్షసాంశలతో దుశ్శాసనాది నీ మిగిలిన కుమారులు జన్మించారు. సూర్యుడి అంశతో కర్ణుడు, చంద్రుడి అంశతో అభిమన్యుడు జన్మించారు. అగ్నిలో నుండి పుట్టిన ద్రౌపదికి అన్నగా అగ్ని దేవుడే ధృష్టద్యుమ్నుడుగా జన్మించాడు. వాయుదేవుడి అంశతో అతడి సోదరుడు శిఖండి జన్మంచాడు. బృహస్పతి అంశతో కులగురువు ద్రోణుడు జన్మించారు. అష్టవసువులలో ఎనిమిదవ వసువు శాపగ్రస్థుడై దేవవ్రతుడుగా జన్మించి భీష్ముడుగా ఖ్యాతి గాంచాడు. రుద్రుడి అంశతో అశ్వత్థామ జన్మించాడు. మిగిలిన రాజులంతా దేవతాంశలతో రాక్షసాంశలతో జన్మించారు. కనుక వీరంతా కారణజన్ములు. వారి వారి జన్మసాఫల్యము పొందగానే ఈ లోకాన్ని విడిచారు. కనుక ఎవరు ఎవరినీ చంపలేదు. ఇక మీరందరూ నాతో గంగాతీరానికి వచ్చారంటే అక్కడ మీ మనసులోని దుఃఖాన్ని పోగొట్టేలా మీ మీ మిత్రులను, కుమారులను, పౌత్రులను, బంధువులను చూపిస్తాను " అన్నాడు. అందరూ వ్యాసుడితో గంగాతీరానికి చేరారు. వారితో శతాయువు వంటి మునులు కూడా ఆ ఆశ్చర్యము చూడడానికి గంగాతీరము చేరారు. అప్పటికి సాయంత్రము అయింది. బంధుదర్శనము రేపు చేద్దామని వ్యాసుడు చెప్పాడు. అక్కడకు చేరిన వారంతా ఆ రాత్రి తమ వారిని చూడాలన్న ఉత్సుకతతో శతసంవత్సరాల పాటు ఎదురు చూసినట్లు ఎదురు చూసారు.

## వ్యాసుడు చేసిన అద్భుతము

మరునాడు ఉదయమే అందరూ నిద్రలేచి ప్రాతఃకాలము నిర్వర్తించ వలసిన విధులను నిర్వర్తించారు. ధృతరాష్ట్రుడు, గాంధారీ, కుంతీ, పాండవులు ఉత్సాహంతో వ్యాసుడి వద్దకు పోయి ఆయన చుట్టూ చేరారు. సకల జన్సమూహము జరగబోవు అద్భుతము తిలకించడానికి ఆతృతగా ఎదురు చూస్తున్నారు. వ్యాసుడు గంగానదిలో దిగి ఒక్క మునక వేసి పైకిలేచి చేతులు చాచి " అందరూ రండి " అని ప్రేమగా పిలిచాడు. ఇంతలో పెద్దగా చప్పుడు వినిపించింది. బిల బిల మంటూ నీళ్ళలో నుండి యుద్ధములో చనిపోయిన దుర్యోధనుడు, అతడి నూరుగురు తమ్ముళ్ళు, అతడియావత్తు కుంటుంబము, అభిమన్యుడు, అశ్వత్థామ చేతిలో హతమైన ఉపపాండవులు, మొదలగు పాండురాజు సంతతి వారు, కర్ణుడు, బాహ్లికుడు, మొదలైన కురుప్రముఖులు, ద్రుపదుడు, అతడి సంతతివారు, విరాటుడు, అతడి కుమారులు, శకుని అతడి అన్నదమ్ములు, అతడి కుమారులు, వీరందరికి ముందు భీష్ముడు, ద్రోణుడు ముందు నడువగా గంగానది నుండి దివ్యశరీరధారులై వెలుపలికి వచ్చారు. ధృతరాష్ట్రుడు అంధుడు కనుక వారిని చూడలేదు. వ్యాసుడు అతడికి దివ్యదృష్టి ప్రసాదించాడు. గాంధారి కూడా తన కళ్ళకు కట్టూకున్న వస్త్రమును తొలగించింది. అందరూ తమ పుత్రపౌత్ర సమేతంగా బంధువులను చూసారు. వారంతా నవ్వుతు తుళ్ళుతూ ప్రేమగా హాయిగా ఒకరితో ఒకరు మాట్లాడుకుంటున్నారు. వీరేనా యుద్ధములో ఒకరి మీద ఒకరు


చనిపోయిన వీరులను పర్లోకముల నుండి ఆవాహన్ చేస్తున్న వ్యాసుడు

కత్తులు నూరుకున్నది. సుయోధనుడిలో పుర్వము ఉన్న అభిమానము, క్రౌర్యము మచ్చుకు కూడాలేవు. అంతా ప్రేమమయముగా ఉన్నారు. అందరూ కలసి ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చారు. వారిరాక అక్కడి వారికి ఆశ్చర్యము ఆనందము కలిగించింది. చిన్న వారందరూ తమకన్నా పెద్ద వారికి నమస్కారాలు చెస్తున్నారు. పెద్ద వాళ్ళు చిన్న వారిని ఆశీర్వదించారు. అంతా ఆనందంగా ఉన్నారు. అక్కడ దివ్యశరీరులు మానశరీరులు కలసిమెలసి ఉన్నారు. భీష్ముడు తనకంటే చిన్న వారిని, ద్రోణుడు తన శిష్యులను, తమ తమ తండ్రులను, తల్లులను, కొడుకులను, కూతుళ్ళను, మనుమలను, మనుమరాళ్ళను, బావలను, మరుదులను, అన్నలను, తమ్ములను, అక్కల్ను, చెల్లెళ్ళను, అత్తగార్లను, మామగార్లను, కోడళ్ళను, అల్లుళ్ళను తదితర బంధువులను కలుసుకున్నారు. కుశల ప్రశ్నలు వేశుకున్నారు. ఆ రోజంతా అందరూ పూర్వ వైరములు మరచి హాయిగా గంగాతీరములో గడిపారు.

## దివ్యశరీరులకు వీడ్కోలు

మరునాడు ఉదయము దివ్యశరీరులు మానవశరీరుల వద్ద వీడ్కోలు తీసుకున్నారు. తిరుగుప్రయాణానికి సిద్ధము అయ్యారు. దివ్యసరీరులు తమ తమ లోకాలకు వెళ్ళడానికి గంగానదిలో దిగారు. వారికి వీడ్కోలు పలకేసమయములో వ్యాసుడు " చనిపోయిన మీ భర్తలను కలుసుకున్నరు. మీలో ఎవరైనా మీ భర్తలను అనుసరించి వారితో దివ్యలోకాలకు వెళ్ళాలని అనుకుంటే వెళ్ళవచ్చు అలాంటి వారు వచ్చి గంగానదిలో మునగండి. వెంటనే యుద్ధములో చనిపోయిన వీరుల భార్యలు అందరూ ధృతరాష్ట్రగాంధఅరీల అనుమతి తీసుకుని తమ భర్తలను అనుసరించడానికి గంగానదిలో మునిగారు. వెంటనే వారంతా తమ మానవశరీరలను వదిలి దివ్యసరీరాలను ధరించి తమ భర్తలను అనుసరించారు. ఆ దృశ్యమును చూసిన వారు ఆశ్చర్యచకితులు అయ్యారు. ఆ విధముగా అక్కడ వారికి వ్యాసుడి దయ వలన బంధు సమాగమము జరిగింది. ధృతరాష్ట్రుడికి తిరిగి అంధత్వము ప్రాప్తించింది. శతాయువు మొదలైన మహామునులు ధృతరాష్ట్రుడి వద్ద శలవు తీసుకుని తమ నివాసములకు వెళ్ళారు. వ్యాసుడు ధృతరాష్ట్రుడితో " కుమారా ! చూసావా నీ కుమారులు ఈ లోకముకంటే పై లోకాలలో సుఖముగా ఉన్నరు. ఇకనైనా వారి మరణము గురించి చింతించ వలదు. ధర్మరాజు ఇక్కడకు వచ్చి ఒక మాసము అయ్యింది. అతడు నీవు వెళ్ళమని చెప్పే వరకు వెళ్ళడు. అతడు వెళ్ళక పోతే అక్కడ రాజ్యపాలన కుంటువడుతుంది " అని వ్యాసుడు చెప్పాడు. ధృతరాష్ట్రుడు " మునీంద్రా ! అలాగే చెప్తాను. మీ దయ వలన నాకు కుమారులను చూసే భాగ్యము కలిగింది. కృతార్ధుడను అయ్యాను " అన్నాడు.

## ధృతరాష్ట్రుడు ధర్మరాజును రాజ్యముకు మరలమని చెప్పుట

ధృతరాష్ట్రుడు ధర్మరాజుతో " నాయనా ధర్మతనయా ! నీవు ఇక్కడకు వచ్చి చాలారోజులు అయింది. అక్కడ రాజ్యపాలన కూడా చెయ్యాలి కదా ! అక్కడ ఉంటేనే కదా అను దినము రాచకార్యములు సక్రమంగా నడిచేది. నీవు రాజనీతి గురించి భీష్మాదుల వలన తెలుసుకున్నావు. నేను ప్రత్యేకముగా చెప్పవలసినది ఏమీ లేదు. నీవు రాజధానిలో లేని సమయము చూసి శత్రువులు విజృంభించే ప్రమాదము ఉంది. కనుక నీవు నీ తమ్ములను తీసుకుని వెంటనే హస్థినాపురము వెళ్ళు. నీ రాకవలన నా మనసులో ఉన్నబాధ మయము అయ్యింది. ఇప్పుడు నా మనసు ప్రాపంచక విషయముల మీదలేదు తపస్సు చేయాలని మాత్రమే ఉంది. మీరు ఇక్కడ ఉంటే నా తపసుకు భంగము కలుగుతుంది. కనుక నీవు నీ అన్నదమ్ములు, అంతఃపుర స్త్రీలు, పరివారముతో సహా రాజధానికి తిరిగి వెళ్ళండి " అన్నాడు. ధర్మరాజు చేతులు జోడించి " పెదనాన్నా ! మీరు చెప్పినట్లే చేస్తాను. రాజ్యభారము వహించడానికి భీముడిని, అర్జునుడిని, నకులసహదేవులను పంపి నేను ఇక్కడే ఉండి మీ పాదసేవ చేసుకుని తరిస్తాను. నాకు అనుమతి ఇవ్వండి " అన్నాడు. ఆ మాటలకు గాంధారి " కుమారా ! ధర్మనందనా ! నీవు ఇలా మాట్లాడ తగదు. నీవు ఇక్కడ సన్యాసదీక్ష తీసుకుని ఇక్కడ ఉంటే అక్కడ రాజ్యపాలన ఎవరు చెస్తారు. నీ యొక్క మా యొక్క పితరులకు ఎవరు శ్రాద్ధకర్మలు నిర్వహిస్తారు. కనుక నీవు రాజధానికి వెళ్ళడమే ఉత్తమము " అని గాంధారి పలికింది. ధర్మరాజు " అమ్మా ! మీరు ఎన్ని చెప్పినా ఇంత ప్రశాంతముగా ఉన్న ఈ అరణ్యమును విడిచివెళ్ళడానికి నా మనస్సు ఒప్పడము లేదు. నా మనసులో ఇదివరకటిలా రాజ్యకాంక్ష లేదు. అమ్మా ! అటు పాంచాలవంశము లోనూ ఇటు మత్స్య వంశము లోనూ స్త్రీలు తప్ప పురుషులు అందరూ యుద్ధములో మరణించారు. కేవలము స్త్రీలు మాత్రమే మిగిలారు. ఇదంతా నా వలనేకదా జరిగింది. ఆ వంశములో కేవలము ఒక్క పురుషుడు కూడా లేని రాజ్యము నాకు అవసరము లేదు.

భారతయుద్ధము జరిగినప్పటి నుండి నా మనసు రాజ్యపాలన మీద లేదు తపసు మీదనే లగ్నము అయి ఉంది. నేను మీకు ఎటువంటి ఇబ్బంది కలిగించను. నన్ను ఇక్కడ ఉండడానికి అనుమతించండి. మరేమీ మాట్లాడకండి " అన్నాడు. వెంటనే సహదేవుడు ఇలా అన్నాడు " అన్నయ్యా ! నేను కూడా ఇక్కడే ఉండి తపసు చేసుకుంటాను. నా తల్లి కుంతికి, మా పెదనాన ధృతరాష్ట్రుడికి, గాంధారికి సేవలు చేసుకుంటూ ఉంటాను. తమరు అంతఃపుర కాంతలను తీసుకుని హస్థినాపురము వెళ్ళండి " అన్నాడు. తన చిన్న కుమారుడు అన్న మాటలకు పొంగి పోయిన కుంతీదేవి సహదేవుడిని గుండెలకు హత్తుకుని " నాయనా ! సహదేవా ! మీరు అందరూ రాజధర్మములో సమర్ధులు. మీరు సమర్ధవంతముగా రాజ్యపాలన చేయాలి కాని మాకు సేవలు చేస్తూ అరణ్యములలో ఉండ తగదు. ఇంకో మాట మీరు ఇక్కడ ఉంటే మాకు తపోభంగం కావడము నిశ్చయము. మాకు ఏకాగ్రత కుదరదు. మీరు ఇక్కడ ఉండడము మాకు కీడే కాని మేలు కాదు. కనుక మీరందరూ హస్థినకు వెళ్ళండి. ఇది నా మాట ఒక్కటే కాదు. బావగారు ధృతరాష్ట్రుడు, అక్క గాంధారుల మాట కూడా ఇదే. కనుక మీరిక పోయి రావచ్చును " అని చెప్పింది. ఇక చెసేది ఏమీ లేక ధర్మరాజు పెదతండ్రి వద్ద శలవు తీసుకున్నాడు. ధృతరాష్ట్రుడు భీమార్జున, నకులసహదేవులను ఆలింగనము చేసుకుని ఆశీర్వదించాడు. పాండవులందరూ ధృతరాష్ట్రుడి పాదములకు నమస్కరించి ఆయన ఆశీర్వాదము తీసుకున్నారు. తరువాత పాండవులు పెదతల్లి గాంధారికి తల్లి కుంతీదేవికి నమస్కరించి వారి దీవెనలు పొందారు. తరువాత ద్రౌపది, సుభద్ర మొదలైన అంతఃపుర కాంతలు కూడా అందరి వద్దా శలవు తీసుకున్నారు. అందరూ తిరిగి హస్థినాపురము వెళ్ళారు.

## నారదుడి రాక

తరువాత కొన్ని దినములు గదచిన తరువాత ధర్మరాజు తన తమ్ములతో ఇష్టాగోష్టి జరుపుతున్న సమయములో అక్కడకు నారదుడు వచ్చాడు. పాండవులు నారదుడికి అర్ఘ్యపాద్యములు ఇచ్చి సత్కరించి ఉచితాసనము మీద కూర్చుండబెట్టారు. ధర్మరాజు నారదుడితో " మహానుభావా ! తమరు ఎక్కడి నుండి వచ్చారు. తమరి రాకకు కల కారణము ఏమిటి ? " అని అదిగాడు. నారదుడు " ధర్మనందనా ! నేను లోకసంచారము చెస్తూ ఎన్నో దేశాలు తిరిగాను. నిన్ను చూసి చాలారోజులు అయింది కనుక నిన్ను చూడాలని వచ్చాను. గంగానది వద్ద ఉన్న మునుల వలన మీ పెదనాన ధృతరాష్ట్రుడి తపసు గురించి విన్నాను " అన్నాడు. అది విని ధర్మరాజు " మహాత్మా ! మా పెద తండ్రిగారూ, మా పెద తల్లిగారూ, మా తల్లి కుంతి క్షేమమేనా ? వారికి ఏ ఇబ్బంది కలగ లేదు కదా ! " అని అడిగాడు. నారదుడు " ధర్మనందనా ! నీకు అన్ని విసయాలు సవిస్తరముగా చెప్తాను. సావధాన చిత్తుడవై విను. మీరందరూ ధృతరాష్ట్రుడి ఆశ్రమము నుండి వచ్చిన తరువాత కొంత కాలము బాగానే జరిగింది. ఒక రోజు మీ పెద తండ్రి ధృతరాష్ట్రుడు, పెద తల్లి గాంధారి, మీ తల్లి కుంతి, సంజయుడు అగ్నిహోత్రముతో సహా తపసు చెసుకోడానికి గంగానదీ తీరములో ఉన్న అరణ్యాలకు వెళ్ళారు. అక్కడ ధృతరాష్ట్రుడు కేవలము గాలి మాత్రమే తింటూ తపసు చేయసాగాడు. గాంధారి కూడా కేవలము నీరు మాత్రమే ఆహారముగా తీసుకుని తపసు చెయసాగింది. మీ తల్లి కుంతి మాసముకు ఒకసారి మాత్రము ఆహారము తీసుకుంటూ తపసు చేయసాగింది. సంజయుడు వారముకు ఒకసారి మాత్రము ఆహారము తిని తపసు చెయసాగాడు. ఇలా యాజకులు నిత్యము అగ్నిహోత్రము రగిలిస్తూ ఉండేవారు. ఒక్కోసారి ధృతరాష్ట్రుడు ఒంటరిగా తిరుగుతూ ఉండే వాడు. ఒక రోజు వారందరూ గంగానదిలో స్నానము చేసి వస్తున్న సమయములో అడవికి నిప్పు అంటుకుని దావానలము తీవ్రముగా వ్యాపించింది. అడవి అంతా చుట్టుముట్టింది. పక్షులూ జమ్తువులు కకావికలు అయిపోయాయి. గాంధారీ, ధృతరాష్ట్రులు నిరాహారముగా ఉన్న కారణాన అక్కడ నుండి వేగంగా పరిగెత్తి ఆ మంటల బారి నుండి ప్రాణములు రక్షించుకొన లేక అక్కడె నిలబడిపోయరు. ధృతరాష్ట్రుడు సంజయుడితో " సంజయా ! నీవు అగ్నిజ్వాలలు లేని చోటుకు పారిపో. పారి పోవడానికి మాకు శక్తిలేదు కనుక మేము రాలేము. నివు పారిపొయి నీ ప్రాణములు రక్షించుకో " అని చెప్పాడు. సంజయుడు " మహారాజా ! జీవితమంతా కలసి ఉన్నాము. ఇక మీదటకూడా అలాగే ఉంటాము. నా ప్రాణాలు కాపాడుకోవడానికి మిమ్ము వదిలి వంటరిగా వెళ్ళ లేను. ధృతరాష్ట్రుడు " సంజయా ! మేము తప్పించుకునే పరిస్థిలో లేము. కాని నీవు తప్పించుకు పారి పోగలవు. ఇది పాపము కాదు వెళ్ళిపో " అని అన్నాడు ధృతరాష్ట్రుడు. ఎలాగైతేనేం ధృతరాష్ట్రుడు సంజయుడిని అక్కడ నుండి పారిపోవడానికి సమ్మతింపజేసాడు. తరువాత ధృతరాష్ట్రుడు, గాంధారీ, కుంతీ ఆయన పక్కనే కూర్చున్నారు. సంజయుడు ఆ మంటలు తప్పించుకుని హిమాలయాలకు పారిపోయాడు. ధృతరాష్ట్రుడు, గాంధారీ, కుంతీలను ఆ మంటలు చుట్టుముట్టాయి. చివరకు వారు ముగ్గురూ మంటలకు ఆహుతి అయ్యారు. ఇదంతా నాకు గంగాతీరాన ఉండే మునులు చెప్పారు. ధృతరాష్ట్రుడు, గాంధారీ, కుంతీలు అడవులకు వెళ్ళడము. మీరు వారిని చూడడానికి రావడము. తిరిగి మీరు హస్థినకు వెళ్ళడము. ఆ మునుల వలన తెలుసుకున్నాను. తరువాత నేను ధృతరాష్ట్రుడు, గాంధారీ, కుంతీల మృతదేహాలను కూడా చూసాను. ఈ విషయము నీకు చెప్పి పోదామని వచ్చాను. వారంతా ఉత్తమలోకాలకు వెళ్ళారు. నీవిక బాధపదవలసిన అవసరము లేదు " అన్నాడు.

## పాండవులు పెద్దలకు తిలోదకాలు సమర్పించుట

నారదుడు చెప్పిన విషయము విని ధర్మరాజు భీమార్జున నకులసహదేవులు దు:ఖముతో రోదించసాగారు. ఈ విషయము అంత:పుర స్త్రీలకు తెలిసి అంతా శోకసముద్రములో మునిగి పోయారు. ధృతరాష్ట్రుడు, గాంధారి, కుంతీదేవి దావానలములో ఆహుతి అయ్యారు అన్న విషయము హస్థినాపురము అంతా వ్యాపించింది. జనులంతా తండోపతండాలుగా రాజప్రాసాదానికి రాసాగారు. అంతా తమమహారాజు మరణానికి ధు:ఖిస్తున్నారు. తన ఏడుపుని దిగమింగుకుని ధర్మరాజు నారదుడితో " మునీంద్రా ! ఎవరి చావు ఎక్కడ వ్రాసి పెట్టి ఉందో ఎవరికి తెలుసు. మేమంతా ఉండగా మా పెదనాన కురువృద్ధుడు దిక్కు లేని చావు చచ్చాడు. నూరుగురు కుమారులు ఉండీ, వెయి ఏనుగుల బలము ఉండీ కూడా ధృతరాష్ట్రుడు నిస్సహాయంగా అగ్నికి ఆహుతి అయ్యారు. పట్టు పానుపు మీద హాయిగా నిద్రిస్తూ వంధిమాగధుల కైవారాలతో నిద్ర లేవవలసిన ధృతరాష్ట్రుడు ఇప్పుడు కటిక నేల మీద పడి ఉండి నక్కలు తోడేళ్ళ ఊళలు వింటూ దిక్కు లేకుండా పడి ఉన్నాడు. నారదా ! గాంధారి తన భర్తతో మరణించింది. ఆమె గురించి చితించవలసిన పని లేదు. కాని మా తల్లి కుంతీదేవి మేమంతా రాజభోగాలు అనుభవిస్తుంటే అడవులకు వెళ్ళి అక్కడ అగ్నికి ఆహుతి అయ్యింది. ఆమె గురించే నా దు:ఖం అంతా. ఆమె కడుపున పుట్టిన భీమార్జునులు, నేను, మాద్రీ సుతులు నకులసహదేవులు ఇంతమంది కుమారులను పెట్టుకుని మా తల్లి అనాధగా దిక్కులేని చావుచచ్చింది. ఆమె గురించి దు:ఖించకుండా ఎలా ఉండగలను చెప్పు. నారదా ! తమరికి తెలుసు కదా ! ఖాండవనదహన సమయములో అర్జునుడు అగ్నిదేవుడికి చేసిన సాయము మరచి అగ్నిదేవుడు మా తల్లిని ఎలా దహించాడు. ఆఅగ్నిదేవుడికి కృతజ్ఞత లేదా ! అగ్నిదేవుడు ఇంత కృతఘ్నుడా ! మునీంద్రా ! ఇక ఎంత వగచి ఏమి ప్రయోజనము. మా పెదనాన, పెదతల్లి, మా తల్లి అగ్నికి ఆహుతి అయ్యారు కదా ! వారికి మేము ఏమి చెయ్యాలి చెప్పండి " అని అడిగాడు. నారదుడు " ధర్మనందనా ! నీకు మరో విషయము చెప్పాలి. ఇది జరిగిన ముందు రోజ ధృతరాష్ట్రునికి విరక్తి అధికమై అగ్నికి ప్రత్యేక పూజలు చేసి అగ్నిదేవుడి వద్ద శలవు తీసుకున్నాడు. ఆ అగ్నిని వేల్చిన ఋత్విక్కులు అగ్నికి అక్కడ ఉద్వాసన చెసి అగ్నిని అక్కడే వదిలి వెళ్ళారు. ఆ అగ్ని కార్చిచ్చుగా మారి ఆ అడవిని దహించి వేసింది. ఆ అగ్నిలో వారు ఆహుతి అయ్యారు. కనుక నీవు, నీ తమ్ములు, ద్రౌపది మొదలైన అంత:పుర కాంతలు అందరూ గంగానదికి వెళ్లి స్నానము చేసి మీ పెదనాన ధృతరాష్ట్రుడికి, గాంధారికి, కుంతీదేవికి తిలొదకాలు ఇవ్వండి " అన్నాడు. వెంటనే పాండవులు, అంత:పురకాంతలు, పురజనులు అంతా గంగాతిరానికి వెళ్ళి గంగా స్నానము చేసి తిలోదకాలు ఇచ్చారు. పదిరాత్రులు గంగాతీరమున కుటీరాలు నిర్మించుకుని అక్కడే నివశించారు. సమర్ధులైన వారిని పిలిపించి ధృతరాష్ట్రుడు, గాంధారీ, కుంతీదేవిల అస్థికలు సేకరించి వాటిని గంగానదిలో నిమజ్జనము చేసారు. శ్రాద్ధకర్మలు శ్రద్ధగా చేసారు. దానధర్మాలు విరివిగా చేసాడు. వారికి ఉత్తమలోక ప్రాప్తికి కావలసిన అన్ని కార్యక్రమములను శ్రద్ధగా చెసారు. శ్రాద్ధకర్మలు జరిగిన 12 రోజులు నారదుడు అక్కడే ఉండి అన్ని సక్రమంగా జరిపి ధర్మరాజును అతడి తమ్ములను ఆశీర్వదించాడు. తరువాత ధర్మరాజు తన తమ్ములతో అంత:పురకాంతలతో హస్థినాపురము చేరాడు. ఈ విధముగా ధృతరష్టుడు భారతయుద్ధము తరువాత 15 సంవత్సరములు హస్థినాపురములోను 3 సంవత్సరములు అరణ్యములోను గడిపి పరలోకము చేరుకున్నాడు " అని భారతకధను **వైశంపాయనుడు** జనమేజయుడికి వినిపించాడు.

## వనరులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక |

విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి |

యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు

# మౌసల పర్వము

వికీపీడియా నుండి

ధర్మరాజుకు పట్టాభిషేకము జరిగి 35 సంవత్సరాలు పూర్తి అయిన తరువాత 36వ సంవత్సరములో కొన్ని ఉత్పాతాలు జరిగాయి. ఉదయము పూట తీవ్రమైన గాలులు వీచాయి, ఇసుక తుఫానులు వీచాయి, ఆకాశము నుండి ఉల్కలు రాలి పడ్డాయి. మేఘాలు లేకుండానే పిడుగులు పడ్డాయి. సూర్యుడికి, చంద్రుడికి చుట్టూ ఎర్రటి వలయాలు ఏర్పడ్డాయి, మంచుకురిసింది, వేసవి కాలములో కూడా చలిగాలులు వీచాయి. ఇలా అనేక ఉత్పాతాలు సంభవించాయి. ప్రతిరోజూ ఏదో ఒక ఉత్పాతము కనపడసాగింది. ఈ ఉత్పాతాలకు కారణము తెలియక ధర్మరాజు మనసు కలవరపడ సాగింది. కొంత కాలానికి ధర్మరాజుకు ఒక దుర్వార్త అందింది. దాని సారాంశము ఏమిటంటే శ్రీకృష్ణుడు, బలరాముడు తప్ప మిగిలిన యాదవులు అందరూ ఒకరితో ఒకరు కలహించుకుని మరణించారన్నది. ఈ దుర్వార్తను విన్న ధర్మరాజు వెంటనే తమ్ములను పిలిచి ఈ వార్త తెలిపాడు. ఈ దుర్వార్తను విన్న అందరూ శోకసముద్రములో మునిగి పోయారు " ఇలా **వైశంపాయనుడు** ఈ మాట చెప్పగానే జనమేజయుడు " మునీంద్రా ! యాదవులు అందరూ కలహించుకుని మరణించటము ఎమిటి ? ఇలా ఎలా జరిగింది ? " అని అడిగాడు.

## విషయ సూచిక

## మునులు యాదువంశమును శపించుట


మునులకు సాంబుని స్త్రీ అని చూపుతున్న యాదవులు

జనమేజయుడి ప్రశ్నకు బదులుగా **వైశంపాయనుడు** " జనమేజయమహారాజా ! ఈ విషయము ఇప్పటిది కాదు. చాలాకాలము కిందట జరిగిన దానికి ఇది ఫలితము. చాలాకాలము కిందట **కణ్వుడు**, నారదుడు, విశ్వామిత్రుడు మొదలైన మునులు శ్రీకృష్ణుడిని చూడడానికి ద్వారకకు వచ్చారు. ఈ మునులను చూసిన యాదవులకు ఆ మునులను ఆట పట్టించాలన్న దుర్బుద్ధి కలిగింది. వెంటనే వారు వారిలో చిన్న వాడైన సాంబుడికి ఆడవేషము వేసి అతడిని మునుల వద్దకు తీసుకు వచ్చి " మునులారా " ఈమె మా స్నేహితుడు బభ్రుడి భార్య. వారికి చాలా రోజులుగా సంతానము లేదు. అసలు వారికి సంతానము కలుగుతుందా లేదా ? తెలియజేయండి " అని అడిగారు. వారి మిఖాలు చూడగానే మునులు వారు తమను హేళన చేస్తున్న విషయము గ్రహించి " వీడు శ్రీకృష్ణుడి కుమారుడు ఇతడు మగవాడు. వీడు ఒక ముసలమును కంటాడు. ఆ ముసలము **శ్రీకృష్ణుడు, బలరాముల**ను తప్ప మిగిలిన యాదవులు అందరిని సర్వనాశనము చెస్తుంది. బలరాముడు మాత్రము యోగనిష్టతో సముద్రములో ప్రవేశిస్తాడు. శ్రీకృష్ణుడు నేలమీద పదుకుని ఉండగా జర అను రాక్షసి శ్రీకృష్ణుడిని చంపుతుంది. మీ కపటనాటకముకు ఇది తగినశిక్ష " అని శపించిన ఋషులు శ్రీకృష్ణుడిని చూడకుండా వెళ్ళిపోయారు. ఈ విషయము శ్రీకృష్ణుడికి తెలిసినా జరగనున్నది జరగక మానదు అని మిన్నకుండి పోయాడు. మరుసటి రోజే మునుల శాపము ఫలించి సాంబుడు ఒక ముసలమును ప్రసవించాడు. అది చూసి యాదవులు ఆశ్చర్యచకితులై ముసలమును సాంబుడిని వసుదేవుడి వద్దకు తీసుకు వెళ్ళారు. **వసుదేవుడు** భయభ్రాంతుడు అయ్యాడు. వసుదేవుడు ఆ ముసలమును చూర్ణము చేసి సముద్రములో కలపమని యాదవులకు చెప్పాడు. అందూవలన వసుదేవుడు ఇక ఆ ముసలము వలన ఆపద ఉండదు అనుకున్నాడు. యాదవులు వసుదేవుడు చెప్పినట్లు చేసి ఆ విషయము అంతటితో మరచిపోయారు. కాలము గడచింది మహాభారత యుద్ధము జరిగింది. తన కుమారుల మరణాన్ని శ్రీకృష్ణుడు ఆపలేదన్న బాధతో గాంధారి తన కుమారుల వలెనే యాదవులు అందరూ దుర్మరణము పాలు కాగలరని శపించింది. తరువాత కొంత కాలానికి ద్వారకలో ఉత్పాతాలు సంభవించాయి. దానికి తోడు యమధర్మరాజు తన చేత యమపాశము ధరించి ద్వారకలో సంచరిస్తున్నాడన్న వార్త ద్వారకలో పొక్కింది. అది విన్న యాదవులు భయభ్రాంతులు అయ్యారు.


రోకలిని రుద్దుతున్న యాదవులు

## ద్వారకలో దుశ్శకునాలు

ద్వారకలో అనేక దుశ్శకునాలు పొడచూపసాగాయి. చిలుకలు రాత్రుళ్ళు గుడ్లగూబలలా వికృతముగా అరవసాగాయి. మేకలు నక్కల వలె పగటి వేళలో ఊళ వేయసాగాయి. యాదవులందరూ దుర్వ్యసనాలలో మునిగి తేలుతూ మునులను, బ్రాహ్మణులను అవమానించసాగారు. యదవులు త్రాగుడు, జూదానికి బానిసలు అయ్యారు. యాదవ స్త్రీలు భర్తలను లెక్కచేయక బానిసల వలె ప్రవర్తించసాగారు. తినే ఆహారములో అప్పటికి అప్పడే పురుగులు వస్తున్నాయి. ఈ అశుభములను చూసి శ్రీకృష్ణుడు ఆలోచనలో పడ్డాడు. నాడు గాంధారి ఇచ్చిన శాపము 35 సంవత్సరముల అనంతరము పని చేయడము మొదలైంది. యాదవులకు ఇక సర్వనాశనము తప్పదు. ఒకరితో ఒకరు కలహించుకుని మరణించక తప్పదు. అది ఒక పుణ్యభూమిలో కొట్టుకుంటే పుణ్యము వస్తుంది అనుకుని యాదవులతో ఒకసభ చేసి " యాదవులారా ! మనము అందరము కలసి సముద్రుడికి ఒక జాతర చేయాలి. ఈ విషయము అందరికీ తెలిసేలా ఒక చాటింపు వేయించండి " అని ఆదేశించాడు. అలా సముద్రుడికి జాతర చేసే విషయము ద్వారకావాసులు అందరికి తెలిసింది. ఆ రోజు రాత్రి యాదవులు అందరికి వింత స్వప్నములు వచ్చాయి. నల్లగా భయంకరముగా ఉన్న స్త్రీలు ఇళ్ళలోకి జొరబడి తమ స్త్రీలను బలవంతముగా ఈడ్చుకు వెళ్ళారు. వారి ఆయుధములను నాశనము చేసారు. వారి ఆభరణములను దొంగలు ఎత్తుకు పోయారు. మరునాడు శ్రీకృష్ణుడి చక్రాయుధము, గరుడధ్వజము, శ్రీకృష్ణుడి రధముకు కట్టే అశ్వములు **శైభ్యము, వలాకము, సుగ్రీవము, మేఘపుష్పము** అనే నాలుగు, ఆయన రధము అన్ని ఆకాశములోకి ఎగిరి పోయాయి. ఇంతలో ఆకాశము నుండి " యాదవులు అందరూ సముద్రతీరానికి బయలుదేరండి " అని బిగ్గరగా వినిపించింది.

## సముద్రుడికి జాతర

యాదవులకు శ్రీకృష్ణుడి ఆయుధములు , రధము ఆకాశముకు ఎగిరి పోయినా, వారి ఆయుధములు నాశనము అయినా, ఆభరణములు దొంలు ఎత్తుకు పొయినా ఇసుమంత కూడ బాధ కలగ లేదు. వారంతా మద్య మాంసములు భుజించడములో మునిగిపోయారు. వివిధములైన భక్ష్య, భోజ్యములను తయారు చేసుకున్నారు. ఆహారపదార్ధములను, మద్యమును బండ్లకు ఎక్కించుకుని సముద్రతీరానికి బయలుదేరారు. అన్నీ తెలిసినా ఏమీ ఎరుగనట్లు శ్రీకృష్ణుడు వారి వెంట నిర్వికారముగా బయలు దేరాడు. బలరాముడు కూడా తన ఆభరణములను తీసివేసి నిరాడంబరముగా కాలి నడకన వారి వెంట నడిచాడు. యాదవస్త్రీలంతా చక్కగా అలంకారములు చేసుకుని పల్లకీలలో బయలుదేరారు. అందరూ సముద్రతీరానికి చేరుకున్నారు. అక్కడ ముందే వేసి ఉన్న పందిళ్ళలో కూర్చున్నారు. **ఉద్ధవుడు** తపసు చేసుకుంటానని శ్రీకృష్ణుడికి చెప్పి హిమాలయాలకు వెళ్ళాడు. బలరాముడు ఒంటరిగా ఒక చెట్టు కింద కూర్చుని యోగ సమాధిలోకి వెళ్ళాడు. యాదవులు ఇవేమి పట్టించుకొనక మద్యమాంసములు సేవించి విచ్చలవిడిగా ప్రవర్తించసాగారు. బ్రాహ్మణ సంతర్పణకు తయారు చేసిన పదార్ధములను కోతులకు పంచి పెట్టారు. అవి తినడము చూసి కేరింతలు కొట్టసాగారు. మద్యమాంసములు సేవించి శరీరము స్వాధీనత తప్పేలా ప్రవర్తించ సాగారు.

## యాదవులలో చెలరేగిన స్పర్ధ

యాదవప్రముఖులు అయిన సాత్యకి, కృతవర్మ, **గదుడు, చారుదేష్ణుడు, ప్రద్యుమ్నుడు** కూడా మద్యము సేవించి ఒకరితో ఒకరు పరిహాసాలు ఆడుకూంటున్నారు. అప్పడు సాత్యకి కృతవర్మను చూసి రోషముగా " ఒరేయ్ కృతవర్మా ! శత్రువులైనా ! నిద్రించేసమయాన చచ్చిన వారితో సమానము. అలాంటి వారిని చంపడానికి ఏ నీచుడూ ప్రయత్నించడు. అలాంటిది ఈ కృతవర్మ అంతటి నీచకార్యానికి ఎలా ఒడిగట్టాడు రా ! ఏరా ప్రద్యుమ్నా ! అదీ ఒక వీరత్వమా ! అదీ ఒక శత్రుసంహారమా ! అది పాపకార్యమని నీకు తెలియదా ఏమి ? " అని హేళన చేసాడు. ప్రద్యుమ్నుడు " ఎప్పుడో జరిగినదానికి ఇప్పుడు వాదన ఎందుకు పోనివ్వు. ఈ కృతవర్మ చేసిన దానికి ప్రజలు అందరూ ఇతడిని నానా తిట్లు తిడుతున్నారు. ఇంకా మీరు ఎందుకు తిట్టడము " అని అన్నాడు. సాత్యకి అన్న దానికి కృతవర్మకు కోపము నషాళానికి అంటింది " ఒరేయ్ సాత్యకి ! నీకు సిగ్గు లేదురా ! నా సంగతి నేను చేసిన యుద్ధము సంగతి నీకు ఎందుకురా ! నీ సంగతి నీవు చూసుకో. అర్జునుడు చేయి నరికినందుకు **భూరిశ్రవుడు** యోగసమాధిలోకి వెళ్ళాడు. అటువంటి వాడి తల నరిన విషయము అప్పుడే మరిచావా ! అదీ ఒక యుద్ధమేనా ! అప్పుడే ఆ విషయము మరిచావా ! పైగా శ్రీకృష్ణుడు కూడా పక్కనే ఉన్నాడు కదా " అన్నాడు. ఆ మాటలకు శ్రీకృష్ణుడికి కోపము వచ్చింది. కోపముగా కృతవర్మ వంక చూసాడు. అప్పుడు " సాత్యకి " అన్నయ్యా ! వీడి సంగతి ఎవరికి తెలియదు. నాడు సత్రాజిత్తు వద్ద ఉన్న మణిని కాజేయడానికి వీడు తమ్ముడు శతధ్వనుడితో చేరి సత్రాజిత్తును చంపలేదా ! " అని అన్నాడు. ఆ మాటాలు విన్న **సత్యభామ** తన తండ్రి మరణము గుర్తుకు వచ్చి ఏడుస్తూ కృష్ణుడి వద్దకు వచ్చింది. ఏడుస్తున్న ముద్దులభార్యను చూసి శ్రీకృష్ణుడు కోపముతో ఊగిపోయాడు.

## సాత్యకి కృతవర్మను వధించుట

అది చూసిన సాత్యకి అన్నకు వదినకు సంతోషము కలిగించేలా ఒక్క ఉదుటున కృతవర్మ మీదకు దూకి " అందరూ వినండి ఈ దుర్మార్గుడు కృతవర్మ అశ్వత్థామతో చేరి నిద్రిస్తున్న ఉపపాండవులను నిర్దాక్షిణ్యముగా చంపాడు. వీడిని ఇక వదలకూడదు. వీడికబ్రతకకూడదు. వీడు కూడా అలాగేచావాలి " అని అరచి వరలో నుండి కత్తిని బయటకులాగి ఒక్క ఉదుటున కృతవర్మ తల నరికాడు. సాత్యకి అంటితో ఆగక కృతవర్మకు చెందిన భోజకులందరితో కలబడ్డాడు. అది చూసిన భోజకులు, అంధకులు విజృంభించి సాత్యకిని చుట్టుముట్టారు. ఇంత జరుగుతున్నా శ్రీకృష్ణుడు తన తమ్ముడు సాత్యకిని వారించడానికి కాని, రక్షించడానికి కాని ప్రత్నించక మౌనంగా చుస్తూ ఉన్నాడు. ప్రద్యుమ్నుడు మాత్రము సాత్యకికి అందగా నిలిచాడు. ప్రద్యుమ్నుడి అండ చూసుకుని సాత్యకి విజృంభించి తన వారితో కలసి భోజక అంధక కులముల వారితో యుద్ధముకు దిగాడు. ఇరువర్గాలకు యుద్ధము జరిగింది. అక్కడ ఏ ఆయుధములు లేవు. అక్కడ సముద్ర ఒడ్డు పొడుగున పెరిగిన తుంగ మొక్కలను పెరికి ఒకరితో ఒకరు కలబడ్డారు. చాలాకాలము కిందట యాదవులు చేసిన చిలిపిపనికి ఫలితముగా మునులు ఇచ్చిన శాపానికి పుట్టిన ముసలమును అరగదీసి సముద్రములో కలిపారు. అది సముద్రము నుండి కొట్టుకు వచ్చి ఒడ్డున ఇప్పుడు తుంగగా రూపుదాల్చి సముద్రపు ఒడ్డున మొలిచి ఉంది. ఆ తుంగలో ముసలము శక్తి నిక్షిప్తము అయి ఉంది. ఇప్పుడు ఇన్ని సంవత్సరాల తరువాత మునుల శాపము ఫలించింది. ఆ తుంగ మొక్కలతోనె యాదవులు ఇప్పుడు కొట్టుకుంటూన్నారు.

## యాదవకులములో అంతర్యుద్ధము

ఆ సమయములో యాదవులు అందరూ మద్యము సేవించిన మత్తులో ఉన్నారు. ఆ తుంగమొక్కలతో కొడుతుంటే ఒక్కొక్క దెబ్బకు ఒక్కొక్క యాదవుడు చస్తున్నాడు. ఈ విషయము వారికి ఆ మత్తులోఅవగతము కాలేదు. తండ్రి, కొడుకు, అన్న, తమ్ముడు, బావమరిది అనే విచక్షణ లేకుండా కొట్టుకుంటూన్నారు. అంతా కింద పడుతున్నారు. తిరిగి లేచి చచ్చేలా కొట్టుకుంటున్నారు. కాని కృతవర్మకు చెందిన అంధక, భోజకులస్థులు ఎక్కువగా ఉండడముతో సాత్యకికి చెందిన వృష్ణి వంశస్థులు అందరూ నశించారు. **అనిరుద్ధుడు, గదుడు, సాత్యకి, ప్రద్యుమ్నుడు సాంబుడు** చచ్చి కింద పడ్డారు. ఇది చూసిన కృష్ణుడికి మునుల శాపము వలన అలవి మాలిన కోపము వచ్చింది. మిగిలిన తుంగకర్రలను తీసుకుని చావగా మిగిలిన భోజక, అంధక వంశస్థులను అందరినీ సమూలంగా నాశనము చేసాడు. యాదవ వంశము అంతా సమూలముగా నాశనము అయింది. ఆ రణభూమిలో కృష్ణుడు ఒంటరిగా నిలబడి పోయాడు. చావగా మిగిలిన వారిలో కృష్ణుడి రధసారధి **దారుకుడు, బభ్రుడు** మిగిలారు. వారు భయము భయముగా కృష్ణుడి వద్దకు వచ్చి " కృష్ణా ! యాదవులు అందరూ మరణించారు. బలరాముడు ఎక్కడ ఉన్నాడో తెలియదు. మనము వెంటనే బలరాముడిని వెదకటము మంచిది " అన్నారు.



ఘర్షణ పడుతున్న యాదవులు

## బలరాముని పరలోక యాత్ర

అందరూ బలరాముడిని వెతుకుతూ వెళ్ళారు. ఆ సమయములో బలరాముడు ఒకచెట్టు కింద యోగసమాధిలో కూర్చుని ఉన్నాడు. కృష్ణుడు దారికుని చూసి " దారుకా ! నీవు వెంటనే హస్థినకు వెళ్ళు. ఇక్కడ యాదవకులము అంతా సర్వనాశనము అయింది అని చెప్పి అర్జునుడిని తీసుకురా ! " అని అన్నాడు. వెంటనే **దారుకుడు** రథము ఎక్కి హస్థినకు వెళ్ళాడు. కృష్ణుడు బభ్రుడిని చూసి " నీవు వెళ్ళి సముద్రపు ఒడ్డున ఉన్న స్త్రీలను అంతఃపుర జనాలను ద్వారకకు చేర్చు " అన్నాడు. సరే అని **బభ్రుడు** వెళ్ళబోతున్న సమయములో అంతలో అటుగా వెడుతున్న బోయవాడి చెతిలోని తుమ్మపరక ఎగిరి వచ్చి బభ్రుడికి తగిలి బభ్రుడు అక్కడికక్కడే మరణించారు. ఋషుల శాపప్రభావము చూసి కృష్ణుడు సైతము ఆశ్చర్యపోయాడు. తరువాత కృష్ణుడు బలరాముడి వద్దకు వెళ్ళి " అన్నయ్యా ! నువ్వూ నేను తప్ప యాదవులు అందరూ మరణించారు. నేను వెళ్ళి అంతఃపుర స్త్రీలను ద్వారకకు చేర్చి వస్తాను. అప్పటి వరకు నువ్వు ఇక్కడే ఉండు " అన్నాడు. తరువాత కృష్ణుడు సముద్రతీరానికి వెళ్ళి అక్కడ ఉన్న స్త్రీలను తీసుకుని ద్వారకకు వెళ్ళాడు. తరువాత తండ్రి వసుదేవుడి వద్దకువెళ్ళి " తండ్రీ ! నేను భారతయుద్ధము చూసాను. అక్కడ కురుపాండవులు నాశనము కావడము చూసాను. ఈ రోజు యాదవులు అందరు కొట్టుకుని మరణించడము చూసాను. మీరు, నేను, బలరాముడు తప్ప యాదవులు అందరూ మరణించారు. బంధువులు, మిత్రులు లేని చోట నేనిక ఉండలేను. నా కంటే ముందుగా బలరాముడు యోగసమాధి లోకి


బలరాముని పరలోక యాత్ర

వెళ్ళాడు. నే కూడా వెళ్ళి అతడితో పాటు తపసు చేస్తాను. ఇక్కడ విషయాలు అన్నీ ఇక మీరు చూసుకోండి. నేడో, రేపో అర్జునుడు ఇక్కడికి వస్తాడు. అతడు మీకు తోడుగా ఉంటాడు " అన్నాడు. ఆ తరువాత కృష్ణుడు వసుదేవుడి పాదములకు నమస్కరించాడు. అప్పటికే యాదవుల మరణవార్త విన్న **వసుదేవుడు** శ్రీకృష్ణుడి వీడ్కోలు వినగానే చైతన్యము కోల్పోయి నిశ్చేష్టుడై స్పృహ తప్పిపడిపోయాడు. వసుదేవుడి పరిస్థితి చూసి అంతఃపుర స్త్రీలు హాహాకారాలు చేసారు. కృష్ణుడు వారిని ఓదారుస్తూ " ఏడవకండి. అర్జునుడ ఇక్కడకు వస్తాడు. అతడు ఇక్కడ చెయవలసిన పనులు చేస్తాడు. నేను అన్నగారి వద్దకు వెడతాను " అని చెప్పి బలరాముడి వద్దకు వెళ్ళి " అన్నయ్యా ! అంతఃపుర స్త్రీలను ద్వారకకు చేర్చాను. తండ్రిగారి అనుమతి తీసుకుని ఇక్కడకు వచ్చాను " అన్నాడు. బలరాముడిలో చలనము లేదు. బలరాముడి ముఖము నుండి ఒక పెద్ద నాగము వెలువడి బయటకు రాగానే బలరాముడు యోగశక్తితో ప్రాణములు శరీరము నుండి వదిలి పెట్టాడు. బలరాముడి ప్రాణాలు సముద్రము మీదుగా వెళ్ళి ఆకాశములో కలిసిపోయాయి. ఆదిశేషుడి అవతారమైన బలరాముడికి నాగజాతి ఎదురుగా వచ్చి స్వాగతము పలికింది. నాగ ప్రముఖులు అందరూ బలరాముడి ఆత్మకు స్వాగతము పలికారు. అలా బలరాముడు విష్ణులోకములో ప్రవేశించి చివరకు విష్ణుమూర్తిలో కలసి పోయాడు.

## శ్రీకృష్ణుడి నిర్యాణము


కృష్ణుడిపై బాణమును వేస్తున్న బోయవాడు

బలరాముడు ఈ తన అవతారము చాలించడము కళ్ళారా చూసిన శ్రీకృష్ణుడు తాను కూడా అవతారము చాలించవలసిన సమయము వచ్చిందని అనుకున్నాడు. తాను ఈ భూలోకములో ఏ కార్యనిర్వహణకు అవతరించాడో అది ఎలా నిర్వహించాడో తలచుకుంటూ దిక్కుతోచకుండా తిరుగుతున్నాడు. ఇప్పుడు తాను ఎలా ఈ శరీరము వదిలి పెట్టాలో అని ఆలోచించసాగాడు. శ్రీకృష్ణుడికి గతము గుర్తుకు వచ్చింది. ఒకసారి **దుర్వాసుడు** తన ఒంటికి పాయసము పూయమని కోరినప్పుడు తాను శరీరము అంతా పూసి అరికాలుకు పూయలేదు. అప్పుడు **దుర్వాసుడు** " కృష్ణా ! నీ మరణము అరికాలులో ఉంది " అన్నాడు. అది గుర్తుకురాగానే తాను ఎలా ప్రాణాలు వదిలి పెట్టాలో అర్ధము అయింది. శ్రీకృష్ణుడు నేలమీద పడుకుని ఇంద్రియములను నిగ్రహించి యోగసమాధిలోకి వెళ్ళాడు. అ సమయములో జర ఆరణ్యములో ప్రవేశించింది. జర అక్కడ తిరుగుతున్న వేటగాడిని ఆవహించింది. అతడి కళ్ళకు పడుకుని ఉన్న కృష్ణుడి కాళ్ళు ఒక లేడి అనే భ్రాంతిని కలుగజేసింది. వెంటనే వేటగాడూ పడుకుని ఉన్న శ్రీకృష్ణుడి కాలుకు గురిపెట్టి ఒక బాణమును వదిలాడు. ఆ బాణము పడుకుని ఉన్న శ్రీకృష్ణుడి పాదములో గుచ్చుకుని బయటకు పొడుచుకు వచ్చింది. ఆహా జింక చచ్చింది అనుకుని దానిని తీసుకు పోవాలని అనుకుని దగ్గరకు వచ్చిన వేటగాడికి దగ్గరకు రాగానే మాయ తొలగిపోయి అక్కడ ఉన్నది జింక కాదని శ్రీకృష్ణుడు అని తెలుసుకున్నాడు. అది చూసిన వేటగాడు భయముతో వణికిపోయి భోరుమని ఏడుస్తూ శ్రీకృష్ణుడి కాళ్ళ మీద పడ్డాడు. శ్రీకృష్ణుడు అతడిని ఓదార్చి తాను ఈ మానవ శరీరమును వదిలి వైకుంఠము చేరుకున్నాడు. వైకుంఠములో ఉన్న **ఋషులు, సిద్ధులు, సాధ్యులు, మరుత్తులు, మునులు, విశ్వదేవతలు, స్వర్గాధిపతి దేవేంద్రుడు** తిరిగి వైకుంఠము చేరిన శ్రీకృష్ణుడికి ఘనస్వాగతము చెప్పారు.

## శ్రీకృష్ణుడు వైకుంఠమును చేరుట

వైకుంఠము చేరిన శ్రీకృష్ణుడితో దేవేంద్రుడు " మహాత్మా ! ధర్మరక్షణలో ఒక భాగముగా నీవు ఆడే జగన్నాటకములో ఒక భాగంగా ఈ భూమిమీద అవతరించావు. **కంసుడు, నరకుడు** మొదలైన లోక కంటకులను సంహరించావు. భ్రష్టుపట్టిన భరతకులమును పరిశుభ్రము చేసావు. తిరిగి వైకుంఠము చేరుకున్నావు. నీవు ఆది పురుషుడవు, అజరామరుడవు నీకు ఆది అంతము లేదు. నీకు మరణము ఏమిటి. శ్రీకృష్ణుడిగా జన్మించడము, మరణించడము అంతా నీ లీల. ఓ మహాత్మా

మానవుల కష్టాలు నీ కష్టాలుగా భవిస్తావు కనుక నిన్ను నమ్ముకున్న నీ భక్తుల కష్టాలు తీరడానికి నీవు ప్రతి యుగములోను అవతరించాలి " అన్నాడు. ఆ మాటలను చిరునవ్వుతో విన్నాడు శ్రీకృష్ణుడు. ఇంతలో బ్రహ్మదేవుడు వచ్చి చేతులు జోడించి వేదమంత్రములతో స్తుతించాడు. అప్పుడు శ్రీమహావిష్ణువు అందరినీ చూసి " అనిరుద్ధమనే పేరు కలిగింది, ప్రద్యుమ్నమనే కాంతి కలిగింది, సంకర్షణమనే భావముతో ప్రకాశించేది, వాసుదేవుడు అనే నామముతో పిలువబడేది, అనన్యమైనది, అద్వితీయమైనది, జ్ఞానముతో కూడుకున్నది, ఏ దోషము లేనుది అయిన విష్ణుపదమును నాకు నేనుగా సిద్ధించుకున్నాను. పరమమంగళకరమైన ఈ విష్ణుపదమును నేను స్వీకరిస్తున్నాను. ఓ సుకృతులారా మీరు అందరూ మీ మీ నెలవులకు వెళ్ళండి " అన్నాడు. అలా మునులను దేవతలను పంపిన తరువాత నారాయణుడు తన మూలస్థానము చేరుకున్నాడు.

## దారుకుడు హస్తినకు చేరుట

శ్రీకృష్ణుడి ఆదేశముతో హస్తినకు చేరిన **దారుకుడు** హస్తినకు పోయి పాండవులను కలుసుకుని యాదవులకు వారి చిన్నతనములో మునులు ఇచ్చిన శాపము. ఆ శాపఫలితముగా యాదవులు అందరూ మద్యము సేవించి ఆ మత్తులో ఒకరిని ఒకరు కొట్టుకుని మరణించడము. యాదవకులము అంతా అంతరించడము అంతా వివరించి చెప్పాడు. బలరామ కృష్ణులు అడవిలోకి వెళ్ళిన విషయము చెప్పాడు. అర్జునుడిని తీసుకుని శ్రీకృష్ణుడు రమ్మని చెప్పిన విషయము చెప్పాడు. యాదవులు అందరూ నశించిన విషయము విన్న పాండవులు శోకసముద్రములో మునిగిపోయారు. అంతఃపురానికి ఈ వార్త అందింది. ద్రౌపది, సుభద్ర మొదలగు వారు పెద్ద పెట్టున ఏడవడము మొదలు పెట్టారు. అంతా సద్దుమణిగాక దారుకుడు " అర్జునా ! శ్రీకృష్ణుల వారు తమరిని వెంటనే ద్వారకకు రమ్మని ఆదేశించారు " అన్నాడు. అర్జునుడు ధర్మరాజు అనుమతి తీసుకుని వెంటనే ద్వారకకు బయలుదేరాడు.

## అర్జునుడి ద్వారక ప్రవేశము

అర్జునుడు దారుకుడితో వేగంగా ద్వారక చేరుకున్నాడు. ద్వారక అంతా నిర్మానుష్యముగా ఉంది. ఎక్కడా జనసంచారము లేదు. శ్రీకృష్ణుడు బలరాముడు ఎక్కడా కనిపించ లేదు. అర్జునుడి మనసు కీడు శంకించింది. ఏదో విపరీతము జరిగి ఉంటుంది అనుకున్నాడు. అర్జునుడు దారుకుడు వెంటరాగా రాజసౌధానికి వెళ్ళాడు. అర్జునుడిని చూడగానే శ్రీకృష్ణుడి భార్యలు అందరూ భోరుమని ఏడ్చారు. అర్జునుడు కూడా వారి భాదను చూసి తట్టుకో లేక శోకముతో కింద పడి పోయాడు. రుక్మిణీ, సత్యభామలు అర్జునుడి సమీపానికి వచ్చి దుఃఖము ఎక్కువై కిందపడి ఏడుస్తున్నారు. వారిని అందరిని ఓదార్చడము అర్జునుడి వంతయింది.

## వసుదేవుడు విలపించుట



తరువాత అర్జునుడు దారుకుడు వెంట రాగా వసుదేవుడిని చూడడానికి వెళ్ళాడు. అర్జునుడికి ఒక సందేహము పట్టుకుంది. మామూలుగా యాదవులు బంధువులు చనిపోతే ఏడవడము ఒక విధముగా ఉంటుంది. ఇప్పుడు వీరంతా ఏడవడము వేరు విధముగా ఉంది. ఇంతకూ శ్రీకృష్ణుడు ఎక్కడ ఉన్నాడు. అతడికి ఏమైంది. అతడిని గురించి ఎవరు చెప్తారు అని దిక్కులు చుస్తున్నాడు. దారుకుడికి కూడా ఏమి తెలియక అతడు కూడా బిక్కమొఖము వేసుకుని చూస్తున్నాడు. **వసుదేవుడు** కూడా శయ్యమీద పడుకుని భోరున ఏడుస్తున్నాడు. అర్జునుడిని చూడగానే **వసుదేవుడు** పైకి లేచి అర్జునుడిని పట్టుకుని విలపించాడు. చనిపోయిన యాదవులను అందరినీ పేరుపేరున తలచుకుని ఏడుస్తున్నాడు. కాసేపటికి వసుదేవుడి దుఃఖము ఉపశమించినది. తరువాత వసుదేవుడు అర్జునుడితో " అర్జునా ! ఎంతో పరాక్రమవంతులు, దేవతల చేత కూడా పొగడబడిన వారు అయిన యాదవవీరులు ఒకరితొ ఒకరు కలహించుకుని సమూలముగా నాశనము అయ్యారు. ఈ ఘోరము ఎక్కడైనా ఉందా ! నీకు ఒక విషయము తెలుసా ! నీ శిష్యుడు **ప్రద్యుమ్నుడు**, సాత్యకి ముందుగా మరణించారు. ఇంత ఘోరము జరిగిన తరువాత కూడా నేనింకా బ్రతికి ఉన్నాను. నాదీ ఒక బ్రతుకేనా ! అయినా వీళ్ళకేమి చెడుకాలము దాపురించింది. సాత్యకి, కృతవర్మ ఒకరిని ఒకరు రెచ్చగొట్టుకున్నారట. దానితో కొట్టుకోవడము

వసుదేవునికి యాదవ వినాశనమును గురించి చెప్పుచున్న అర్జునుడు

మొదలైంది. ఇదంతా ముందే నిర్ణయించబడింది. వీళ్ళు చిన్నతనములో చేసిన పాపము మునుల శాపము ఇలా పరిణమించినది. యాదవకులము నాశనము అయింది. ఒకరిని అనుకుని ఎమి లాభము. నీ కొక విషయము తెలుసా అర్జునా ఇదంతా శ్రీకృష్ణుడి సమక్షములో జరిగినది. శ్రీకృష్ణుడు తలచుకుంటే ఈ పోట్లాట ఆపలేడా ! అయినా ఆపలేదంటే యాదవ కులనాశనము గురించి శ్రీకృష్ణుడికి ముందుగానే తెలుసు అందుకనే ఆపలేదు. ఇదంతా విధిలిఖితము. యాదవ నాశనము కావాలని శ్రీకృష్ణుడికి తెలుసు. లేకపోతే ఉత్తర గర్భములో ఉన్న పరీక్షిత్తును కాపాడిన వాడికి ఇది ఒక పెద్ద విషయమా చెప్పు. విధి నిర్ణయము అని సరిపెట్టుకోవడము తప్ప మనము చేయగలిగినది ఏమీ లేదు " అన్నాడు.

## వసుదేవుడు కృష్ణుడిని గురించి చెప్పుట

అర్జునుడు ఆలోచిస్తున్నాడు వసుదేవుడు యాదవుల పోట్లాట గురించి చెప్తున్నాడు కాని కృష్ణుడికి ఏమయ్యింది ఎక్కడ ఉన్నాడు అని చెప్పలేదు. కనుక శ్రీకృష్ణుడు క్షేమముగా ఉన్నాడు. అతడికి ఏమి కాలేదు అని తన మనసును సమాధానపరచుకున్నాడు. అర్జునుడు అలా ఆలోచిస్తున్న సమయములో **వసుదేవుడు** తిరిగి అర్జునుడితో " ఏమి చెప్పను అర్జునా ! అలా యాదవులు తుంగకర్రలతో కొట్టుకుని మరణించిన తరువాత శ్రీకృష్ణుడు అంత:పుర కాంతలను వెంట పెట్టుకుని ద్వారకకు వచ్చాడు " అన్నాడు. అర్జునుడు ఇక ఆగలేక " అదిసరే ! ప్రస్తుతము కృష్ణుడు ఎక్కడ ఏమి చేస్తున్నాడు. నేను కృష్ణుడిని వెంటనే చూడాలి " అని వసుదేవుడితో అన్నాడు. వసుదేవుడు " ఇక్కడే ఉన్నాడు. అంత:పుర కాంతలను తీసుకు వచ్చిన తరువాత నా వద్దకు వచ్చి " తండ్రీ ! ప్రస్తుతము భోజక, అంధక కుల యాదవులు వృష్టి వంశము వారు ఒకరితో ఒకరు కలహించుకుని సమూలముగా మరణించారు. నేను అర్జునుడి కొరకు దారుకుడిని పంపాను. అర్జునుడు ఈ సమయానికి వస్తూ ఉంటాడు. అర్జునుడు నీకు భక్తుడు, నీ ఆజ్ఞను పాటిస్తాడు, అన్ని పనులు చేయగల సమర్ధుడు, కార్యదక్షుడు, పరాక్రమవంతుడు నాకు అర్జునుడికి ఏ భేదము లేదు. నేనే అతడూ అతడే నేను అతడి సాయంతో నీవు మిగిలిన యాదవులను రక్షించు. అర్జునుడు అంత:పుర కాంతలను, బాలురను, వృద్ధులను కాపాడతాడు. ఇంక కొన్ని దినములలో సముద్రము పొంగి ద్వారకానగరము సముద్రములో కలసి పోతుంది. యాదవులు ఈ విధముగా కొట్టుకుని మరణిస్తున్న తరుణములో బలరాముడు అడవిలో ఒక చెట్టు కింద కూర్చుని యోగసమాధిలో మునిగి పోయాడు. నాకు కూడా ఆ మార్గము ఉత్తమము అని అనిపిస్తుంది. కనుక మీరు నాకు తపసు చేసుకోవడానికి అనుమతి ఇవ్వండి నేనిక అడవిలో తపమాచరిస్తాను. నీవు అర్జునుడు చెప్పిన విధముగా చెయ్యి. మరణించిన యాదవులకు అర్జునుడు ఉత్తర క్రియలు నిర్వహిస్తాడు. అంతే కాదు కాలక్రమంలో అర్జునుడే మీకు అందరికి అంత్యక్రియలు నిర్వహిస్తాడు " అని శ్రీకృష్ణుడు నాతో చెప్పాడు. ఆ తరువాత స్రీకృష్ణుడు వెళ్ళాడు. ఇప్పుడు నీవు వచ్చావు. అంతకు మించి నాకు ఏమీ తెలియదు. అర్జునా ! ఏ కారణము లేకుండా కొడుకులు, మనుమలు, బంధువులు ఇలా హటాత్తుగా పీనుగులు అయినప్పుడు ఆ భాద తట్టుకోవడము నా వలన ఔతుందా చెప్పు. ఆహారము, నీరు కూడా సహించడము లేదు. నా ప్రాణము మాత్రము ఈ దేహమును విడిచి పోవడము లేదు. ఏమి చెయ్యను ? నా వల్ల ఏమీకాదు. ఇక ఈ యాదవకుల స్త్రీలను, బాలురను, వృద్ధులను, అశ్వసందను నీవే కాపాడాలి. ఈ భాద్యతను శ్రీకృష్ణుడు నీ భుజస్కందముల మీద పెట్టాడుకదా ! " అన్నాడు.

## అర్జునుడు ద్వారకాపుర వాసులను హస్థినకు ఆహ్వానించుట

వసుదేవుడి మాటలు విన్న అర్జునుడు మనసులో ఇలా అనుకున్నాడు. శ్రీకృష్ణుడు లేని ద్వారకలో నేను మాత్రము ఎలా ఉండగలను. వేంటనే హస్థినకు వెళ్ళాలి అనుకుని వసుదేవుడితో " అనఘా ! ఈ విషయములో ధర్మరాజు ఒక నిర్ణయము తీసుకున్నాడు. ఆ నిర్ణయము ప్రకారము నేను అంత:పుర కాంతలను, యాదవస్త్రీలను, బాలురను, వృద్ధులను తీసుకుని హస్థినకు వెళతాను. అక్కడ వారంతా సుఖముగా ఉండే ఏర్పాటు జరిపిస్తాము. మీరు దయచేసి నాతో హస్థినకు రండి. అంతా విధిలిఖితము అనుకుని ఊరడిల్లండి " అన్నాడు. తరువాత అర్జునుడు దారుకుడితో " దారుకా ! మనము శ్రీకృష్ణుడు వెళ్ళిన దారిన వెళ్ళి శ్రీకృష్ణుడి కొరకు వెతుకుతాము. ఇక్కడ జరుగవలసిన పనులను అందరినీ పిలిచి ఆదేశాలు ఇస్తాము. అందు వలన అందరినీ పిలువు " అన్నాడు. **దారుకుడు** ద్వారకలో ఉన్న మంత్రులను, బ్రాహ్మణులను, వైశ్యులను, శూద్రులను, పుర ప్రముఖులను అందరినీ **సుధర్మ** అనే రాజమందిరముకు పిలిచి " ఈ రోజు మొదలు ఏడవనాటికి సముద్రము పొంగి ద్వారకసముద్రములో మునిగి పోతుంది అని ఆకాశవాణి చెప్పగా అందరూ విన్నారు. కనుక మనము అందరము ద్వారకను విడిచి ఇంద్రప్రస్థనగరానికి వెళదాము. అక్కడ మీరు అందరూ సుఖముగా ఉండవచ్చు. మీకు అవసరమైన సామాను మూటలు కట్టండి. స్త్రీలకు, బాలురకు, వృద్ధులకు బండ్లు కట్టండి. అన్నింటినీ సిద్ధముగా ఉంచుకుని ఎప్పుడైనా ద్వారకను వదలడానికి సిద్ధముగా ఉండండి. ధర్మరాజు పాలనలో మీరు అందరూ ద్వారకలో ఉన్నంత సుఖముగా ఉండగలరు " అని అందరికీ ఆదేశాలు ఇచ్చాడు. వారందరూ వెళ్ళిన తరువాత మంత్రులతో సమాలోచన జరుపుతూ " ఏనుగులతోను,

గుర్రాలతోను, లాగే బండ్లను, రధములను సిద్ధము చెయ్యండి. స్త్రీలను బాలురను తీసుకు వెళ్ళడానికి పల్లకీలను, బండ్లను ఏర్పాటు చెయ్యండి. ఏయే సామానులు ఎలా ఇంద్రప్రస్థము చేర్చాలో ప్రణాళిక వెయ్యండి. మీలో ఒర్పును నశింపజేయకండి. చనిపోయిన యాదవులు ఇక ఎలాగూరారు. ధర్మరాజు మీకు మీ దు:ఖాలను మరిపించే పాలన అందిస్తాడు. వసుదేవుడి మనుమడైన వజ్రదేవుడిని ఇంద్రప్రస్థానికి రాజుగా ధర్మరాజు నియమించ వచ్చు. కనుక ఈ విషయములో మీరు కలత చెందవలసిన పని లేదు " అన్నాడు.

## వసుదేవుడు తనువు చాలించుట

ఆరోజు రాత్రికి కృష్ణుడు ఉన్న మందిరములోనే పూజలు భజనలతో కాలము గడిపాడు. మరునాడు సూర్యోదయము కాగానే కాలకృత్యాలు సంధ్యావందనాలు పూర్తిచేసుకుని బయటకు రాగానే **వసుదేవుడు** తన పాంచభౌతిక కాయాన్ని వదిలి పెట్టాడాన్న విషయము తెలిసింది. అప్పటికే అంత:పుర స్త్రీలు వసుదేవుడి మరణానికి పెద్దపెట్టున శోకిస్తునారు. వసుదేవుడి భార్యలు వసుదేవుడితో సహగమనానినికి సిద్ధము ఔతున్నారు. అర్జునుడు భారమైన హృదయముతో వసుదేవుడి మందిరానికి వచ్చాడు వసుదేవుడి శరీరానికి పన్నీటిస్నానము చేయించాడు. వసుదేవుడికి పట్టువస్త్రాలను ధరింపజేసి ఆభరణాలతో అలకంకరింపజేయించి పులమాలలతో అలంకరింపజేయించబడిన రధము మీదకు ఉంచారు. ముందు వేదపండితులు వేదమంత్రములు పఠిస్తూ నడువగా వసుదేవుడి శవయాత్ర సాగింది. అర్జునుడు పాదాచారియై రధము వెంట నడిచాడు. వసుదేవుడి భార్యలైన **దేవకీదేవి, రోహిణి, భద్ర, మదిర** చక్కగా అలంకరించికొని పల్లకీలలో కూర్చున్నారు. ఆ పల్లకీలు కూడా శవయాత్ర వెంట సాగాయి. ద్వారకా నగరవాసులు అందరూ శవయాత్రలో కన్నీరుగా మున్నీరుగా ఏడుస్తూ వెంట నడిచారు. వసుదేవుడి ఉద్యానవనంలో మంచిగంధపు చెక్కలతో చితి పేర్చారు. వసుదేవుడి శరీరాన్ని చితి మీద ఉంచారు. అర్జునుడు శాస్త్రోక్తంగా శవదహన క్రియను జరిపించాడు. వసుదేవుడి వెంట వసుదేవుడి భార్యలు చితిలో ప్రవేశించారు. ఆ దృశ్యము చూసిన కంటతడి పెట్టని వారు లేరు. కొందరు చితిలో నెయ్యిపోసి మటలను ప్రజ్వలింపజేసాడు. జనము హాహాకారాలు చేసారు. ఆ విధముగా వసుదేవుడి అంత్యక్రయలు పూర్తి అయ్యాయి. తరువాత వజ్రుడు మొదలైన వారు, ఆడవారు వసుదేవుడికి తర్పణములు వదిలారు. అందరూ ద్వారకకు చేరుకున్నారు.

## అర్జునుడు యాదవులకు దహన సంస్కారములు చేయించుట

అర్జునుడు తరువాత యాదవులైన **భోజక, అంధక, వృష్టి** వంశాల వారు కొట్టుకుని మరణించిన ప్రదేశానికి బ్రాహ్మణులను, పండితులను తీసుకుని వెళ్ళాడు. వారితో పాటు ఆ కొట్లాటలో చనిపోయిన వారి బంధువులు కూడా వచ్చారు. ఒక్కొక్కరు తమ బంధువులను గుర్తుపట్టి ఏడుస్తునారు. కొందరు మూర్చపోయారు. అది చూసిన అర్జునుడు చింతాక్రాంతుడై అక్కడ శోకిస్తున్నవారిని ఓదార్చాడు. తరువాత అక్కడ చనిపోయిన వారికి యదోచితముగా వేదోక్తముగా అగ్ని సంస్కారము చేయించాడు. చవొయిన వారి బంధువుల చేత వారికి తర్పణములు విడిపించారు. సామూహికంగా దశదిన కర్మలు చేయించాడు. అర్జునుడు ఆ విధముగా యాదవులందరికి ఉత్తమలోక ప్రాప్తి కలిగేలా చేసాడు. అర్జునుడి మనసులో ఎప్పుడెప్పుడు కృష్ణుడిని చూస్తామా అని ఆతురతగా ఉంది. అమ్త:పుర స్త్రీలను, ద్వారకాపుర వాసులను, బాలురను, వృద్ధులను, సన్మస్త ద్వారకాపుర వాసులను ఇంద్రప్రస్థముకుచేర్చమని దారుకుదికి చెప్పాడు. అందుకు తగిన ఎర్పాట్లు చేసాడు.

## అర్జునుడు శ్రీకృష్ణుడి కొరకు వెదకుట

అర్జునుడు ఆ తరువాత కృష్ణుడిని వెతుక్కుంటూ అడవిలోకి వెళ్ళాడు. అర్జునుడు మనసులో " అయ్యో కృష్ణా ! నువ్వు నీ తండ్రిని సంరక్షించడానికి నన్ను హస్తిన నుండి ద్వారకకు పిలిపించావు. నేను ఇప్పుడు మీ తండ్రి మరణవార్తను నీకు చెప్పడానికి నీ వద్దకు వస్తున్నను. ఎవరికైనా ఇంతటి దౌర్భాగ్యము కలుగుతుందా ! అయినా నేనిప్పుడు వసుదేవుడి మరణవార్తను బలరామ, కృష్ణులకు చెప్పడము ఎందుకు ? మీరు చెప్పిన పనిని సక్రమంగా పూర్తి చేసాను అని చెపితే సరిపోతుంది కదా ! " అని తన మనసుకు సర్ది చెప్పుకున్నాడు. ఇంతలో అర్జునుడికి గాంధారి ఇచ్చిన శాపము మనసులో మెదిలింది. గాంధారి శాపము ఇచ్చే సమయములో అర్జునుడు కృష్ణుడి పక్కనే ఉన్నాడు. గాంధారి " ఎవ్వరూ నీ పక్కన లేనప్పుడు నువ్వు దిక్కు లేకుండా చస్తావు " అని శపించింది. అయినా మహానుభావుడైన శ్రీకృష్ణుడి మీద ఇలాంటి శాపాలు ఫలిస్తాయా ! ఇలా పరిపరి విధముల ఆలోచిస్తూ అర్జునుడు శ్రీకృష్ణుడి కొరకు పిచ్చివాడిలా పరితపిస్తూ వెతకసాగాడు. అర్జునుడి వెంట వస్తున్న వాళ్ళకు ఇటు కాదు అటు అని చెప్పడానికి సాహసించ లేక పోతున్నారు. అలా కొన్ని రోజులు వెదికిన తరువాత ఒక రోజు ఒక బోయవాడు వారితో " మీరు దేని కొరకు వెదుకుతున్నారు? "అని అడిగాడు. అర్జునుడు "

ఇక్కడ ఎక్కడో శ్రీకృష్ణుడు తపసు చేసుకుంటున్నాడట అతడి కొరకు మేము వెదుకుతున్నాము " అన్నాడు. ఆ బోయవాడు " నేను శ్రీకృష్ణుడిని చాలా రోజుల కిందట చూసాను. తరువాత చూడలేదు. నేను కూడా మీ వెంటవచ్చి వెతుకుతాను రండి " అన్నాడు. ఆ బోయవాడితో చేరి అర్జునుడు కృష్ణుడి కొరకు వెదకసాగాడు. ఆ బోయవాడూ చెప్పిన ఆధారాలను అనుసరించి వారు కృష్ణుడు పడిపోయిన ప్రదేశానికి చేరుకున్నారు. అక్కడ వారు దిక్కు లేకుండా దివ్యకాంతులు వెదజల్లుతూ పడి ఉన్న శ్రీకృష్ణుడి పార్థివదేహాన్ని చూసారు. ఆ దృశ్యము చూసిన అర్జునుడు అక్కడకక్కడే మూర్చిల్లాడు. పక్కన ఉన్న వారు నీళ్ళు తీసుకువచ్చి అర్జునుడి ముఖము మీద చల్లారు. అర్జునుడు మూర్చ నుండి లేచి శ్రీకృష్ణుడి శరీరాన్ని కౌగలించుకుని భోరున ఏడ్చాడు. అప్పటి వరకు ఉన్న ధైర్యమూ నిగ్రహము అతడిలో సడలిపోయాయి. కళ్ళ వెంట నీరు ధరాపాతంగా కారి పోతున్నాయి. నోటమాట రాలేదు. పక్కన ఉన్న వారికి అర్జునుడిని పలకరించే సాహసము చెయ్యలేక పోయారు. కొంచము సేపటికి తెప్పరిల్లిన అర్జునుడు " అయ్యో ! కృష్ణా ! నీకా ఈ దురవస్థ. నీ వంటి మహాత్ముడు ఇలా కటిక నేల మీద పడి ఉండడమా ! అంటూ కృష్ణుడి పాదాల వంక చూసి అరికాలులో దిగిన బాణము గమనించాడు. అతడికి దుర్వాసుడి మాటలు గుర్తుకు వచ్చాయి. అర్జునుడు ఒక్కసారిగా ఆశ్చర్యపోయాడు. కృష్ణుడి దేహము అంతా పరికించి చూసాడు. అరికాలు మాత్రము నల్లగా కమిలి ఉంది. మిగిలిన దేహము దివ్య కాంతులు వెదజల్లుతూ ఉంది. నిదురిస్తున్నట్లు కనిపిస్తున్న శ్రీకృష్ణుడిని అర్జునుడు కళ్ళు ఆర్పకుండా చూడసాగాడు. పక్కన ఉన్న వాళ్ళు " అయ్యా ! తరువాత కార్యక్రమాలు చూడండి. మనము పోయి ద్వారకలో ఉన్న వారిని పిలిచి అంత్యక్రియలకు ఏర్పాటు చేద్దాము. లేకున్న శ్రీకృష్ణుడి శరీరాన్ని ద్వారకకు తీసుకు వెడదాము. ఎలా చెయ్యాలో మీరే శలవియ్యండి " అన్నారు.

## అర్జునుడు శ్రీకృష్ణుడికి బలరామునికి దహనక్రియలు నిర్వహించుట

అర్జునుడు ఆలోచించి చూడగా **ద్వారక** మునిగి పోతుంది అన్న రోజు మరునాడే అని గ్రహించాడు. అర్జునుడు తన వెంట వచ్చిన వారితో " రేపు ఉదయము ద్వారక సముద్రములో మునుగుతుంది. కనుక మనము ఈ రాత్రికి ద్వారకకు వేళ్ళాలి. అందరినీ సమాయత్తము చేసి రేపు ఉదయానికి ముందుగా ద్వారకను విడిచి పెట్టాలి. లేకున్న అంటు లేని ప్రాణనష్టము జరుగుతుంది కనుక మనము శ్రీకృష్ణుడి నిర్యాణము గురించి ఎవ్వరికీ ఇప్పుడు చెప్పవద్దు. ప్రస్తుతము శ్రీకృష్ణుడి అంత్యక్రియలు మనము నిర్వహిస్తాము " అన్నాడు. బరువెక్కిన హృదయముతో శ్రీకృష్ణుడి అంత్యక్రియలు చేసాడు అర్జునుడు. శ్రీకృష్ణుడి పార్థివదేహాన్ని వేదోక్తంగా దహనము చేసాడు. బలరాముడు కూడా ఆ పరిసరాలలో ఉంటాడని అనుకుని చుట్టుపక్కల వెదుకసాగారు. కొంత సేపటికి వారిశ్రమ ఫలించి ఒక చెట్టు కింద కూర్చున్నట్లు ఉన్న యోగసమాధిలో ప్రాణములు వదిలిన బలరాముడి పార్థివ శరీరము వారికి కనిపించింది. అర్జునుడికి ఏడవడానికి కూడా సమయము చిక్కలేదు. భక్తిశ్రద్ధలతో బలరాముడికి దహన సంస్కారము చేసాడు. ఆ విధముగా అర్జునుడు శ్రీకృష్ణ బలరాములకు అత్యంత భక్తిశ్రద్ధలతో దహనసంస్కారములు చేసాడు. తరువాత తనవెంట వచ్చిన వారిని తీసుకుని ద్వారకకు వేళ్ళాడు. మార్గమధ్యములో దారుకుడితో " దారుకా ! మనము చేసిన పని సరి అయినది అని నేను నమ్ముతునాను. లేకున్న శ్రీకృష్ణుని మరణవార్తను విన్న **రుక్మిణీ, సత్యభామ** మొదలైన భార్యల దు:ఖము ఆపడము మనతరమా చెప్పు. వారంతా సహగమనము చేస్తాము అంటే మనము ఆపగలమా ! రాత్రంతా వారిని ఓదారుస్తుంటే తెల్లవారిన తరువాత సముద్రము పొంగి ద్వారక మునిగి పోతుంటే ద్వారకవాసులను కాపాడ లేదన్న అపఖ్యాతి నాకు వస్తుంది. పైగా శ్రీకృష్ణుడి మాట తప్పిన వాడిని ఔతాను. కనుక మనము వడిగా ద్వారకకు చేరుకుంటాము " అన్నాడు. అందరూ కలసి త్వరగా ద్వారక చేరుకున్నారు.

## యాదవుల హస్థిన ప్రయాణము

అప్పటికి ద్వారకలో ప్రయాణఏర్పాట్లు అన్నీ పూర్తయ్యాయి. రుక్మిణి మొదలైన అష్టభార్యలు, 16 వేల భార్యలు, అంత:పుర స్త్రీలు, ద్వారకాపుర వాసులు అందరూ పల్లకీలలోను, రధముల, బండ్ల , ఏనుగుల, అశ్వముల మొదలైన వాహనముల మీద ద్వారకను దాటడానికి సిద్ధముగా ఉన్నారు. అర్జునుడు, దారుకుడు రాగానే అందరూ కదిలారు. అర్జునుడి నాయకత్వములో **దారుకుడు** అందరినీ ద్వారక నుండి ప్రయాణము చేయించాడు. శ్రీకృష్ణుడి అంత:పుర స్త్రీలు 16 వేల మంది, 8 మంది భార్యలు, బలరాముని నలుగురు భార్యలు, పల్లకీలలో కుర్చున్నారు. వారివెంట సేవకులు నడుస్తున్నారు. వారివెంట బండ్లలో వారికి కావలసిన సామానులు తీసుకుని వెళుతున్నారు. వారి వెనుక ద్వారకాపురి వాసులు అందరూ తమతమ వాహనములు ఎక్కి వెళుతున్నారు. వారందరికి వెనుకగా అర్జునుడు తన రధము మీద బయలుదేరాడు. వారందరూ ద్వారకను దాటగానే సూర్యోదయము అయింది. సూర్యుడు రాగానే సముద్రము ఒక్కసారిగా పొంగింది. ద్వారకానగరాన్ని సముద్రపు అలలు ముంచెత్తాయి. అర్జునుడు యాదవులు ఒక్కసారి వెనుతిరిగి చూసారు. సముద్రము ఒక్కసారిగా ద్వారకను ముంచెత్తడము చూసి గగ్గోలుపెట్టారు. అర్జునుడి నేతృత్వములో వారంతా ఇంద్రప్రస్థము వైపు ప్రయాణము సాగించారు. అందరూ దారిలో విడిది చేసారు. ఆ రాత్రి దొంగల దండు ఒకటి వారి మీద దాడి చేసింది. కేవలము యాదవులు స్త్రీలు మాత్రమే ఉన్నారు. వారి వెంట ఒక్క వీరుడు మాత్రమే ఉన్నాడు. అతడిని కట్టడిచేస్తే అపారమైన ధనసంపద దోచుకోవచ్చు

అనుకున్నారు. ఒక్కసారిగా నిద్రిస్తున్న స్త్రీల మీద, యాదవుల మీద పడి వారి వద్ద ఉన్న నగలు, ధనము అపహరించడము మొదలు పెట్టారు. ఇంతలో అర్జునుడు అక్కడకు వచ్చి వారిని మర్యాదగా వెళ్ళిపొమ్మని హెచ్చరించాడు. అయినా దొంగలు వినక స్త్రీల నుండి నగలు అపహరించడము ఆపలేదు. అర్జునుడు కోపించి వారి మీద బాణములు ప్రయోగించాడు. మొరటుతనముతో రాటుదేలి ఉన్న దొంగలను ఆబాణములు ఏమాత్రము గాయపరచ లేకపోయాయి. అర్జునుడు తమమీద బాణములు వెయ్యడము చుసి దొంగలు అర్జునుడి మీద ఎదురు దాడి చేసారు. అర్జునుడు ఎదురు దాడికి దిగ లేదు. అతడికి ఏ అస్త్రములు స్ఫురించ లేదు. అందు వలన మామూలు బాణములు ప్రయోగించడము మొదలు పెట్టాడు. అర్జునుడి తూణీరములో బాణములు అయిపోయాయి కాని దొంగలు దోపిడీ చేయడము ఆపలేదు. అర్జునుడికి ఇదంతా దైవలీల అని అర్ధము అయింది. ధనము, నగలు వదిలి పెట్టి రుక్మిణీ మొదలైన స్త్రీలను రక్షించాడు. దొంగలు దోచుకున్న నగలు, ధనముతో పారి పోయారు. రధములు, బండ్లు తీసుకు వెళ్ళడానికి వీలు కాక అక్కడే వదిలి వెళ్ళారు. అలా సర్వమూ కోల్పోయి కట్టుబట్టలతో వారంతా కురుక్షేత్రము చేరుకున్నారు. వారి రాక విన్న హస్థినాపురవాసులు అక్కడకు వచ్చారు. జరిగిన విషయాలను అర్జునుడు వారికి వివరంచాడు.

## హస్థినలో యాదవులకు తగిన ఏర్పాటు చేయుట

అన్న ధర్మరాజు ఆజ్ఞానుసారము అర్జునుడు యాదవ స్త్రీలకు, బాలురకు, వృద్ధులకు తగిన ఏర్పాట్లను చేసాడు. కృతవర్మ కుమారుని అతడి తల్లి, కుమారులతో మృత్తికావత పురములో నివసించడానికి ఏర్పాటు చేసాడు. మృత్తికావత పురానికి కృతవర్మ కుమారుడిని పట్టాభిషిక్తుడిని చేసాడు. సాత్యకి కుమారుడిని సరస్వతీ నగరానికి పట్టాభిషిక్తుడిని చేసాడు. మిగిలిన వారిని ఇంద్రప్రస్థముకు తీసుకు వెళ్ళాడు. శ్రీకృష్ణుడి మనుమడు వజ్రుడిని ఇంద్రప్రస్థానికి పట్టాభిషిక్తుడిని చేసాడు. అక్రూరుడి భార్యను, అతడి కుమారులను వజ్రుడి సంరక్షణలో ఉంచాడు. అందరిని తగు ప్రదేశములలో సురక్షితముగా ఉంచాడు. ఇక శ్రీకృష్ణుడి అష్టభార్యలు, బలరాముడి భార్యలు అర్జునుడితో ఉన్నారు. వారికి బలరామ, శ్రీకృష్ణుల నిర్యాణ వార్తను ఎలా చెప్పాలా అని ఆలోచించ సాగాడు.

## శ్రీకృష్ణ నిర్యాణ వార్తను ఎరిగించుట

అర్జునుడు ఒకరోజు మనసు దిటవు చేసుకుని రుక్మిణి, సత్యభామ తదితరులను సమావేసపరిచి తాను దారుకుడితో బలరామ శ్రీకృష్ణులను వెదకడము అక్కడ బోయవాడు కనిపించడము అతడిని స్రీకృష్ణుని గురించి అదగడము వరకు చెప్పి ఆ తరువాత ఏడుస్తూ ఉండి పోయాడు. వారందరికి బలరామ శ్రీకృష్ణులు పరమ పదించారు అన్న విషయము అర్ధము అయింది. అందరు పెద్ద పెట్టున రోదించడము మొదలు పెట్టారు. కొంతసేపు అయిన తరువాత వారు మనసు దిటవు చేసుకుని " నాయనా ! అర్జునా ! అయినది ఏదో అయినది. తరువాత ఏమి జరిగినదో చెప్పు " అన్నారు. అర్జునుడు " **దారుకుడు** నేను బలరామ, కృష్ణులను వెదుకుతూ ద్వారకానగరము మరిచాము. రోజులు లెక్కించి ఆ మరునాడు ద్వారక మునిగి పోతుంది అని తెలుసుకున్నాము. ఈ విషయము మీకు చెబితే మీరు చేయవలసిన కార్యక్రమాలలో మునిగిపోయి ద్వారకానగరముతో సహా మునిగి పోతారని భావించి మేమే బలరామ క్రిష్ణులకు అంత్యక్రియలు నిర్వహించాము. ఆ రాత్రికి రాత్రి మిమ్ములను ద్వారకానగరము దాటించాము. మీ అందరి ప్రాణాలను రక్షించాలని ఇలా చేసాము కాని నా మనసులో ఏదో తప్పు చేసానన్న భాద వేధిస్తున్నది. ఏమీ చేయలేని పరిస్థితి. మీరంతా నన్ను మన్నించి నాకు ఏపాపము అంటకుండా చూడడండి " అని వారికి ప్రణామము చెసాడు. రుక్మిణీ తదితరులు అర్జునుడిని లెవనెత్తి " నాయనా అర్జునా ! విధి నిర్ణయము అలా ఉంటే నీవు మాత్రము ఏమి చేస్తావు ? నీవేమి కావాలని చెయ్యలేదు కదా ! ఇక జరగవలసిన కార్యక్రమాలు చూడు " అన్నారు. శ్రీకృష్ణుడి ఎనిమిది మంది భార్యలలో రుక్మిణీ, జామవతి తదితరులు శ్రీకృష్ణుడితో సహగమనము చెస్తామని అన్నారు. అది విని బంధువులు అందరూ ఏడ్చారు. వారిని వారించడానికి ప్రయత్నించారు. కాని వారు వినలేదు. వారిని పల్లకీలలో ఊరేగించి చితి వద్దకు తీసుకు వచ్చారు. మంచి గంధపు చెక్కలతో చితిపేర్చి బ్రాహ్మణులు అగ్ని కార్యము నిర్వహించారు. సహగమనము చెయదలచిన వారు చితిలో దూకారు. సత్యభామ తదితరులు తపసు చెసుకోవడనికి అడవులకు వెళ్ళారు.

## అర్జునుడు వ్యాసుడిని దర్శించుట

రుక్మిణి తదితరుల సహగమనము తరువాత అర్జునుడు వ్యాసుడి ఆశ్రమానికి వెళ్ళి అతడిని దర్శించుకున్నాడు. అర్జునుడు వ్యాసుడికి భక్తితో నమస్కరించి " మహాత్మా ! యాదవులు అందరూ తమలో తాము కొట్టుకుని మరణించారు. శ్రీకృష్ణుడు, బలరాముడు పాంచభౌతిక శరీరాలను వదిలి తమ స్వస్థానము చేరారు. ద్వారకానగరము సముద్రములో మునిగి పోయింది. నేను అంతఃపురస్త్రీలను, యాదవులను తీసుకు వస్తుండగా దారి మధ్యలో దొంగలు మా సర్వస్వము దోచుకుని వెళ్ళారు. ఆ

సమయములో నాకు ఏ అస్త్రము మంత్రసహితముగా స్ఫురణకు రాలేదు. గాండీవము దాని శక్తి చూప లేదు. నాకు మాత్రము కారణము తెలియ లేదు. అమ్ములపొదిలో అమ్ములు అయిపోయాయి. కేవలము మనుషులను మాత్రమే కాపాడి వారిని ఇంద్రప్రస్థము చేర్చాను. సాత్యకి, కృతవర్మ సంతతిని రాజ్యాభిషిక్తులను చేసి యాదవులను వారి స్థానములలో నిలిపాను. తమవద్దకు వచ్చాను. తరువాతి కర్తవ్యము భోదించండి " అని ప్రార్ధించాడు. వ్యాసుడు " అర్జునా ! దుర్వాసుడి పలుకులు, యాదవులకు మునులు ఇచ్చిన శాపము, గాంధారి శాపము వృధా పోదు కదా ! అంతా విధివిలాసము ఎవరికి తప్పింపశక్యము కాదు. యాదవనాశనము గురించి శ్రీకృష్ణుడికి ముందే తెలుసుకనుకనే వారు కలహించుకునే సమయములో తటస్థంగా ఉన్నాడు కాని వారిని వారించడానికి ప్రయత్నము చెయ్యలేదు. శ్రీకృష్ణుడికి మునుల శాపమును నివారించడము తెలియదా ! అలా చెయ్యడము శ్రీకృష్ణుడికి ఇష్టము లేదు కనుకనే ఉపేక్ష వహించాడు. యాదవనాశనము జరగాలన్నది శ్రీకృష్ణుడి సంకల్పము. నీవు యుద్ధము చేస్తున్నప్పుడు నీ ముందు శ్రీకృష్ణుడు రథము మీద కూర్చుని రుద్రుడి సాయముతో నీ శత్రువులను చంపాడు. నీవు నీ పరాక్రమంతో చంపానని అనుకున్నావు. అలాంటి కృష్ణుడు కాలము కలసి రాకుంటే దొంగలబారి నుండి నిన్ను రక్షించలేదు. శ్రీకృష్ణుడు అవతారపురుషుడు. భూభారము తగ్గించి ధర్మరక్షణ చేయడానికి అవతారము ఎత్తాడు. తాను సంకల్పించిన కార్యక్రమాలు నెరవేర్చి అవతారము చాలించి స్వస్థానము చేరుకున్నాడు. అటువంటి కృష్ణుడి వలన గీతాభోద విన్న నీవు దు:ఖించ తగదు. శ్రీకృష్ణుడి సాయంతో భూభారాన్ని తగ్గించడానికి మాత్రమే నీ అక్షయ తుణీరాలు, గాండీవము ఉపయోగపడ్డాయి. ఆ కార్యము నెరవేరగానే అవి నిర్వీర్యము అయ్యాయి. అస్త్రములు కాని, శస్త్రములు కాని పురుషప్రయత్నము కాని దైవానుగ్రహము ఉంటేనే ఫలిస్తాయి. నీవు జ్ఞానివి దీనికి శోకించతగదు. నా వలననే అంతా జరిగిందని గర్వించకూడదు. మీ పాండవులు కూడా ఈ శరీరము వదల వలసిన సమయము ఆసన్నము అయింది. అందుకు తగిన ప్రయత్నములు చేసి ఉత్తమగతులు పొందండి " అని వ్యాసుడు పలికాడు. ఆ మాటలు విన్న అర్జునుడి మనసులో శోకము, మోహము దూరము అయ్యాయి. అతడి మనసు నిశ్చలానందముతో తొణికిసలాడింది. ఆతరువాత అర్జునుడు హస్థినాపురముకు వచ్చాడు. ధర్మరాజు తదితరులకు అప్పటి వరకుజరిగిన విషయాలు బలరామ, శ్రీకృష్ణుల నిర్యాణము, తాను వ్యాసుడిని దర్శించడము అంతా సవివరముగా చెప్పాడు " అని వైశంపాయనుడు జనమేజయుడికి భారతకధను చెప్పసాగాడు.

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • **మౌసల పర్వము** • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

# మహాప్రస్థానిక పర్వము

వికీపీడియా నుండి

(మహాప్రస్థానిక పర్వము నుండి దారిమార్పు చెందింది)

శ్రీకృష్ణుడు, బలరాముడు నిర్యాణము చెందారు. యాదవులు అందరూ మరణించారు. అర్జునుడిని వ్యాసుడు మహాప్రస్థానికి సిద్ధమవమని చెప్పాడు. అదే విషయాన్ని అర్జునుడు ధర్మరాజుకు చెప్పాడు. ఆ మాటలు విన్న ధర్మరాజు అర్జునుడితో " అర్జునా ! అన్నిభూతములను కాలుడు కాల్చకమానడు. మనము కూడా ఈ శరీరాన్ని వదలవలసిన కాలము ఆసన్నము అయింది. మనము కూడా అన్ని కర్మలను త్యజించవలసిన కాలము సమీపించింది. నీ అభిప్రాయము అదేకదా ! " అని అడిగాడు. అర్జునుడు " అన్నయ్యా ! మీరు చెప్పినది నిజము. కాలానికి సాటి కాలమే. మనము కూడా కాలముతో పయనించక తప్పదు " అన్నాడు. వెంటనే ధర్మరాజు భీమ, నకుల, సదేవులను పిలిపించాడు. వారికి అన్ని విషయములు చెప్పాడు. వారు కూడా ధర్మరాజు మాటలకు అంగీకారము తెలిపారు.

## విషయ సూచిక



## ధర్మరాజు కురుసామ్రాజ్య వారసులను నిర్ణయించుట

ధృతరాష్ట్రుడి వారసులలో **యుయుత్సుడు** ఒక్కడే మిగిలాడు. ధర్మరాజు యుయుత్సుడిని కురుసామ్రాజ్యానికి పట్టభిషిక్తుడిని చేసాడు. పరిక్షిత్తుని యువరాజుగా పట్టభిషిక్తుడిని చేసాడు. యుయుత్సుడికి రాజ్యపాలన గురించిన విషయములు అన్నీ వివరించాడు. తరువాత సుభద్రతో " అమ్మా సుభద్రా ! ఈ భరత సామ్రాజ్యానికి నీ మనుమడు ఉత్తరాధికారి అయ్యాడు. శ్రీకృష్ణుడి మనమడు **వజ్రుడు** ఇంద్రప్రస్థానికి రాజు అయ్యాడు. ఈ విధముగా కురువంశము, యాదవవంశము వర్ధిల్లుతాయి. ఈ రెండు వంశాలను నీవే రక్షించాలి " అని సుభద్రను రెండు వంశాలకు సంరక్షకురాలిగా నియమించాడు. తరువాత భారతయుద్ధములో మరణించిన వీరుల కుటుంబాలకు అగ్రహారాలు, గ్రామాలు, ధనము ఇచ్చి వారి పోషణకు తగు ఏర్పాట్లు చేసాడు. బ్రాహ్మణులకు గోదానములు, భూదానములు, సువర్ణ దానములు విరివిగా చేసాడు. పరిక్షిత్తును కృపాచార్యుడికి శిష్యుడిగా అప్పగించాడు. తరువాత హస్థినాపురప్రజలతో ఒక సభ ఏర్పాటు చేసాడు.

## పాండవులు మహాప్రస్థానికి తరలుట

ధర్మరాజు హస్థినాపుర వాసులను పిలిచి ఏర్పాటు చేసిన సభలో హస్థినాపుర వాసులతో " హస్థినాపుర వాసులారా ! మా అయిదుగురికి బదులుగా అభిమన్యుడి కుమారుడిని మహారాజుగా నియమించాను. అతడి మీద కూడా మీరు మీ ప్రేమ అభిమానము చూపండి " అని చెప్పాడు. హస్థినపుర వాసులకు పాండవులు వెళ్ళిపోతున్నారన్న విషయము అర్ధము అయింది. వారు " మహారాజా ! ఏమిటిది ? మమ్ములను ఇలా వదిలి పెట్టి వెళ్ళడము మీకు ధర్మమా ! నీవు ప్రేమమూర్తివి, కరుణామూర్తివి అంటారే ఇదేనా మీ కరుణ. మేమంతా నిన్ను చూసుకుని కదా బ్రతుకుతున్నది. మీరు లేక మేము ఎలా బ్రతుకగలము. మమ్ము వదిలి వెళ్ళడము భావ్యమా " అని ప్రార్ధించారు. వారిని ధర్మరాజు అనునయ వాక్యాలతో అనునయించాడు. తరువాత పాండవులు, ద్రౌపది తమ వస్త్రములను మార్చుకుని నారచీరలను, నారవస్త్రాలను, జింకచర్మాలను ధరించారు. ఆభరణములను తీసివేసారు. తరువాత అగ్ని కార్యములు నెరవేర్చి అగ్నిని నీటిలో నిమజ్జనము చేసారు. అందరూ అంతఃపురమును విడిచి బయలుదేరారు. పాండవులు ముందు నడువగా ద్రౌపది వారిని వెంబడించింది. వారి వెంట ఒక కుక్క కూడా వెంబడించింది. హస్థినాపురవాసులు వీధులకు అటూ ఇటూ నిలబడి వారికి కన్నీటితో వీడ్కోలు పలుకుతున్నారు. పాండవులు అలా వెళుతున్నప్పుడు హస్థినాపురవాసులకు జూదములో ఓడి అడవులకు వెళుతున్న దృశ్యము గుర్తుకు వచ్చింది. వారి వెంట యుయుత్సుడు సైన్యముతో నడుస్తున్నాడు. అతడి వెంట విచారవదనముతో **పరీక్షిత్తు** నడుస్తున్నాడు. అందరూ హస్థినాపుర పొలిమేరలకు వచ్చారు. ధర్మరాజు హస్థినాపుర వాసులతో ఇక ఆగమని చెప్పాడు. వారంతా పాండవులకు ప్రదక్షిణలు చేసారు. పాండవులు ద్రౌపదితో ముందుకు సాగారు. యుయుత్సుడు, పరీక్షిత్తు వెనుదిరిగి హస్థినాపురము చేరుకున్నారు. అర్జునుడి భార్య ఉలూపి తన పుట్టిల్లు అయిన నాగలోకము చేరింది. **చిత్రాంగధ** తన కుమారుడు అయిన బభ్రువాహనుడి వద్దకు చేరింది. కృపాచార్యుడు, **ధౌమ్యుడు** ధర్మరాజు ఆదేశానుసారము హస్థినాపుర బాధ్యతలను స్వీకరించారు.

## అర్జునుడు గాండీవమును వరుణదేవుడికి ఇచ్చుట



గాండీవమును విసర్జించుచున్న అర్జునుడు

పాండవులు ద్రౌపది అలా ప్రయాణిస్తూ ముందుకు సాగి గంగానదిని దాటి తూర్పు సముద్రతీరానికి చేరుకున్నారు. వారి వెంట కుక్క కూడా వారిని అనుసరించి పోసాగింది. అప్పుడు వారికి అగ్నిదేవుడు ప్రత్యక్షమై " అర్జునా ! శ్రీకృష్ణుడి సుదర్శనచక్రము ఎప్పుడో వైకుంఠము చేరింది. నీవు ఇంకా ఈ గాండీవము వదలక ఉన్నావు. దుష్టసంహారణార్ధము నేను ఈ గాండీవాన్ని వరుణుడి వద్ద నుండి తీసుకువచ్చి నీకు ఇచ్చాను. ఇది నీకు ఇచ్చిన కార్యము నెరవేరింది కనుక దీనిని ఇక వరుణదేవుడికి అప్పగించు " అన్నాడు. అర్జునుడు అందుకు అంగీకరించి గాండీవమునకు నమస్కరించి దానిని సముద్రపునీటిలో వదిలాడు. గాండీవము వరుణుడిని చేరింది. తరువాత అగ్నిదేవుడు అదృశ్యము అయ్యాడు.

## పాండవులు ఒకరి తరువాత ఒకరు పడిపోవుట



నడవలేక పడిపోయిన ద్రౌపది

పాండవులు దక్షిణ దిక్కుగా ప్రయాణించి అక్కడ నుండి పడమరగా ప్రయాణించి పడమర సముద్రతీరము చేరుకున్నారు. నీటిలో మునిగిన **ద్వారక** సమీపముకు వెళ్ళారు. తరువాత వారందరూ ఉత్తర దిక్కుగా ప్రయాణించి హిమవత్పర్వతము చేరుకున్నారు. అక్కడ నుండి ప్రయాణించి మేరుపర్వతము చేరుకున్నారు. ఇప్పుడు వారు యోగసమాధిలో ఉన్నారు కనుక వారికి నడకశ్రమ తెలియడము లేదు. ముందుగా ద్రౌపదికి యోగసమాధి సడలింది. ద్రౌపది ఇక

నడవలేక నేలమీద పడిపోయింది. అది భీముడు చూసి ధర్మరాజుకు చెప్పాడు. ధర్మరాజు భీముడితో " భీమా ! పాంచాలరాజపుత్రి ద్రౌపదిని అర్జునుడు మత్స్య యంత్రము కొట్టి గెలుచుకున్నాడు కనుక ఈమెకు అర్జునుడంటే అధికమైన ప్రేమ, అనురాగము. ఈమె ప్రేమలో పక్షపాతము ఉన్నది కనుక ఈమె చేసిన పుణ్యములు ఫలించక ఇలా పడి పోయింది " అన్నాడు. భీముడు ద్రౌపది వంక చూసాడు. అప్పటికి ఆమె మరణించింది. ధర్మరాజు నిర్వికారముగా ఆమె శవమును అక్కడే వదిలి ముందుకు సాగాడు. మిగిలిన నలుగురు ధర్మరాజును అనుసరించారు. ఇంతలో సహదేవుడు నేల మీద పడ్డాడు. సహదేవుడు పడి మరణించడము చూసిన భీముడు ధర్మరాజుతో " అన్నయా ! సహదేవుడు కింద పడిపోయాడు. సహదేవుడు అహంకారము అంటే ఏమిటో తెలియదు. నిన్ను సదా భక్తితో సేవించాడు. మా అందరిలో సన్మార్గచరితుడు. అతడిలా పడిపోవడానికి కారణము ఎమిటి ? " అని అడిగాడు. ఆ మాటలకు ధర్మరాజు " అతడికి తన కంటే ప్రాజ్ఞుడు ఈ లోకములోనే లేడన్న గర్వము ఉంది. ఆ గర్వాతిశయముతోనే అతడు కింద పడిపోయాడు " అని చెప్పాడు. ఆ తరువాత ధర్మరాజు సహదేవుడిని కూడ ద్రౌపదిలాగానే అక్కడే వదిలి నిర్వికారముగా ముందుకు నడిచాడు. నకులుడు, అర్జునుడు భీముడు ధర్మరాజును అనుసరించారు. కుక్క మాత్రము వారిని వదలకుండా వెన్నంటింది. మరి కొంత దూరము పోయాక నకులుడు కింద పడి మరణించాడు. అది చూసి భీముడు తట్టుకోలేక పోయాడు. ధర్మరాజుతో " అన్నయ్యా ! నకులుడు కూడా పడిపోయాడు. అతిసుందరుడు, మంచితనముకు మారుపేరు, అత్యంత శౌర్యవంతుడు, సుగుణాలఖని, ధైర్యవంతుడు ఇటువంటి మంచి గుణములు ఒక్కటిగా రాశిపోసినట్లు ఉండే వాడు. ఇతడిలో ఏ దుర్గుణము ఉందని ఇలా పడిపోయాడు ? " అని అడిగాడు. ధర్మరాజు " భీమా ! నువ్వు చెప్పినది నిజమే ఇతడికి లేని సుగుణములు లేవు. కానీ ఈ లోకములో తన కంటే అందగాడు లేడని గర్వము ఉంది. ఆ కారణముగా ఇతడిలా పడి పోయాడు " అని చెప్పి తిరిగి ధర్మరాజు నిర్వికారముగా ముందుకు సాగాడు. కుక్క కూడా వారిని వదలక వెంబడిస్తుంది. అప్పటివరకు జరిగినది మౌనంగా గమనిస్తున్న అర్జునుని మనసు బాధతో మునిగిపోయింది. తరువాత వంతు తనదేనా అని అనుకున్నాడు. అలా అనుకునేంతలో అర్జునుడు కూడా కిందపడి మరణించారు. అది చూసి భీముడు " అన్నయ్యా ! అర్జునుడు కూడా పడి పోయాడు. ఎన్నడూ అబద్ధము ఆడి ఎరుగడు, అతడికి ఉన్న సుగుణములు, సౌర్యపరాక్రమములు ఎవరికి లేవు. అర్జునుడు పడిపోవడానికి కారణము ఎమిటి ? " అని అడిగాడు. ధర్మరాజు కొంచెము ఆలోచించి " అవును ఇతడు అత్యుత్తమ ధనుర్ధారి. అదే అతడి గర్వముకు మూల కారణము. పైగా ఇతడు ఒక్క రోజులో కౌరవులందరినీ చంపుతానని అతడు చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చ లేదు. అది నెరవేర్చ లేదు. అందుకే ఆడినమాట తప్పిన వాడు అయ్యాడు. అందుకే అతడికీ దురవస్థ " అని అర్జునుడిని అక్కడే మిగిలిన వారిలా వదిలి నిర్వికారముగా ముందుకు నడిచాడు. అది చూసి భీముడికి కూడా భయము పట్టుకుంది. భయం భయంగా నడుస్తూనే నేలమీద కూలిపోతూ " ధర్మరాజా ! నేనుకూడా పడిపోయాను. నాలో ఉన్నలోపము ఏమిటి ? నాకు తెలియచెప్పు " అని అడిగాడు. ధర్మరాజు " భీమసేనా నీవు అత్యుత్తమ గధాదారివి, పరాక్రమవంతుడవు కాని తిండి పోతువు. అనవరంగా మాట్లాడతావు. నికు అనవసరమైన విషయాలన్ని మాట్లాడతావు. అందుకే నీకు ఈ దురవస్థ " అని నిర్వికారముగా భీముడిని వదిలి ముందుకు సాగాడు. కుక్క మాత్రము అతడిని వెన్నంటి వెళుతూనే ఉంది.

## ఇంద్రుడు ధర్మరాజును కలయుట

అలా ధర్మరాజు నిర్వికారముగా ముందుకు పోసాగాడు. కోత దూరము పొయిన తరువాత మహేంద్రుడు ధర్మరాజు ముందు రధముతో వచ్చి నిలిచాడు. ఇంద్రుడిని చూసి ధర్మరాజు వినయముతో నమస్కరించాడు. ఇంద్రుడు ధర్మరాజును తన రధము మీద కూర్చోమని చెప్పాడు. ధర్మరాజు బాధతో " మేము అయిదుగురు అన్నదమ్ములము ద్రౌపది బయలుదేరాము. నా నలుగురు తమ్ములు ద్రౌపది నేలకూలారు. వారు లేనిది నేను ఎక్కడకు రాను. వారు కూడా నాతో వచ్చేలా చెయ్యి " అన్నాడు. అప్పుడు ఇంద్రుడు " ధర్మనందనా ! వారందరూ వారివారి శరీరమును వదిలిపెట్టి స్వర్గలోకము చేరుకున్నారు. వారిని అందరిని నీవు స్వర్గలోకములో చుస్తావు. వారు మానవ దేహాలను వదిలారు కనుక తిరిగి ఆ దేహమును పొందడము అసాధ్యము కనుక నాతో నీవిప్పుడు స్వర్గానికి రా " అని అన్నాడు. ధర్మరాజు ఇంద్రుడితో " మహేంద్రా ! మేము హస్థినాపురము నుండి బయలుదేరినప్పటి నుండి ఈ శునకము నన్ను వెన్నంటి వస్తుంది. దీనిని వదిలి పెట్టి నేను మాత్రము స్వర్గానికి ఎలా రాగలను కనుక నాతో పాటు ఈ శునకాన్ని కూడా స్వర్గానికి తీసుకుని వెడదాము " అన్నాడు. ఆ మాటలకు ఇంద్రుడు నవ్వి " ధర్మనందనా ! అది ఎలా సాధ్యము. నీ వెంట వచ్చిన కారణముగా శునకానికి ఎలా స్వర్గలోక ప్రాప్తి కలుగుతుంది. దీనిని స్వర్గానికి తీసుకు పోకూడదు కనుక నీవు మాత్రము రధము ఎక్కు " అన్నాడు. ధర్మరాజు " మహేంద్రా ! లోకపాలకుడవు అయిన నీకు తెలియనిది ఏమున్నది. ఈ శునకము అత్యంత



తంతో పాటు వాచ్చి కుక్క కోసం

స్వర్గమును వద్దనుచున్న ధర్మరాజు

భక్తిశ్రద్ధలతో నన్ను వెన్నంటి వచ్చింది. ఇప్పటి వరకు నన్ను వెన్నంటి వచ్చి నన్ను సేవించిన ఈ శునకమును వదిలి నేను మాత్రము ఎలా స్వర్గానికి రాగలను. నన్ను భక్తితో సేవించిన ఈ శునకమును వదిలి నేను మాత్రము స్వర్గ సుఖములను అనుభవించగలను " అని అన్నాడు. ఇంద్రుడు " ధర్మనందనా ! కుక్కలకు స్వర్గలోక ప్రాప్తి లేదు. నీకు శుభము కలుగు తున్నప్పడు దీనిని వదిలి పెట్టడము న్యాయమే. ఇందులో దోషము ఏమి లేదు " అన్నాడు. ధర్మరాజు " భక్తితో సేవించిన వారిని వదిలిరావడము బ్రహ్మహత్యాపాతకముతో సమానము అంటారు. నీవు అన్ని ధర్మములను తెలిసిన వాడివి కనుక నీకు చెప్పే పని లేదు కదా ! " అన్నాడు. కనుక కేవలము స్వర్గసుఖాలను అనుభవించడానికి నన్ను భక్తితో సేవించిన ఈ శునకమును వదిలి స్వర్గానికి రాజాలను " అన్నాడు. ఇంద్రుడు " ధర్మనందనా ! ఏదైనా వ్రతము చెసేవాడు కుక్కను ముట్టుకుంటే వ్రతభంగము అయినది అనుకుంటాడు. మహాపాపమని అనుకుంటాడు. అలాంటి సమయాన నీవు ఈ కుక్క గురించి ఎందుకు పట్టుబడుతున్నావు. దీనిని వదిలి వచ్చి హాయిగా స్వర్గసుఖములను అనుభవించు. అయినా ధర్మనందనా ! నీ భార్య ద్రౌపది, నీ నలుగురు తమ్ములు నీ కళ్ళ ఎదుటే మరణించినా చలించని వాడివి ఈ కుక్కను మాత్రము ఎందుకు వదలనంటున్నావు ? " అని అడిగాడు. ధర్మరాజు " మహేంద్రా ! నీవు సకలలోకపాలకుడవు. అన్ని ధర్మములు ఎరిగిన వాడవు, ధర్మదేవతవు. నీతో వాదించగల అర్హత కలిగిన వాడిని కాదు నేను. అయినా నాకు తోచిన ధర్మము నేను చెప్తాను. నాకు తోచిన ధర్మము చెప్పడము తప్పు కాదు. ద్రౌపది, భీమార్జున, నకులసహదేవులు నా కళ్ళెదుటే చనిపోయారు. వారి కొరకు ఎంత ఏడ్చినా వారు తిరిగిరారు. అది లోకధర్మము జగమెరిగిన సత్యము. మమ్ము వెన్నంటి వచ్చిన ఈ కుక్కమాత్రము మరణించ లేదు. కనుక దీనిని వదిలిరావడము ధర్మమా ! శరణు వేడిన వారిని వదలడము, మంచి మిత్రుడికి ద్రోహము చెయ్యడము, స్త్రీలను చంపడము, బ్రాహ్మణుల ధనము అపహరించడము వలన ఏ పాపము వస్తుందో నన్ను నమ్మి వెన్నంటి వచ్చిన ఈ శునకమును వదిలిన ఆ పాపము వస్తుంది. అమ్త పాపమును నేనిప్పుడు ఎలా మూట కట్టుకోను. నెను అనుభవిమ్చ వలసిన స్వర్గ సుఖముల విషయము వదిలి పెట్టండి. నేను ఇంత వరకు సంపాదించిన పుణ్యము ఈ శునకమును ఆదరంచిన కారణముగా నశించినా ఫరవా లేదు నాకు స్వర్గసుఖములు వద్దు. నన్ను ఇలా వదిలిపెడితే ఈ అరణ్యములో తపసు చేసుకుంటాను. నాకిది చాలు " అన్నాడు.

## యమధర్మరాజు

అప్పటి వరకు శునకరూపములో ఉంది ధర్మరాజు చెప్పేది వింటున్న యమధర్మరాజు తన నిజరూపమునుదాల్చి అతడి ముందు సాక్షత్కరించాడు. ధర్మరాజు సంభ్రమాశ్చర్యాలతో తన ముందు నిలచిన యమధర్మరాజుకు నమస్కరించాడు. యమధర్మరాజు " నాయనా ధర్మతనయా ! నీ పుణ్యచరిత్ర, నీ ధర్మనిరతి, నిర్మలమైన బుద్ధి, భూతదయ, నీ దయాగుణము నాకు ఎంతగానో నచ్చాయి. భూలోకములో నీ వంటి వారు ఉంటారా అని నాకు సందేహము కలుగుతుంది. ఇందుకు ముందు నీవు ద్వైతవనములో ఉండగా నీ యొక్క ధర్మనిరతిని నేను పరీక్షించాను. నీకు గుర్తుందా ! నీ తమ్ములు నీటి కొరకు వచ్చి నా ఆధీనములో ఉన్న సరసులో నా ప్రశ్నలకు సమాధానము చెప్పకనే దిగి స్పృహతప్పి పడిపోయారు. అప్పుడు వారిని వెతుకుతూ నీవు వచ్చావు. అప్పడు నేను వారిలో ఒకరిని బ్రతికిస్తాను నీకు ఎవరు కావాలో కోరుకొమ్మని అన్నప్పడు నీవు చెప్పిన సమాధానము నాకు ఎంతగానో నచ్చింది. కుంతీ తనయులలో నీవు బ్రతికి ఉన్నావు కనుక మాద్రీ తనయులలో నకులుడిని బ్రతికించమని అడిగావు. అలా ధర్మనిరతిని ప్రదర్శించడము లోకములో ఎక్కడైనా ఉంటుందా ! నిన్ను విశ్వాసముతో వెన్నంటి వచ్చిన కుక్క కొరకు సాక్షాత్తు ఇంద్రుడు దిగి వచ్చి రధము ఎక్కమని చెప్పినా నిరాకరించిన నీ ధర్మనిరతి కొనియాడ తగినది. నీకు సాటి అయిన వాడు స్వర్గలోకములో లేడు. నీ ధర్మనిరతిని ఇంద్రుడు గమనిస్తూనే ఉన్నాడు. ఇంక నీవు ఈ శరీరముతో సిద్ధ పధములో పుణ్యలోకాలకు వెళ్ళు. అక్కడ నీకు సకలసౌఖ్యాలు లభిస్తాయి " అని అన్నాడు యమధర్మరాజు. ఆ సమయములో అక్కడకు **గంధర్వులు, దేవఋషులు, మరుత్తులు, అశ్వినులు, వసువులు** పరమానందముతో వచ్చారు. వారంతా ధర్మరాజును ఇంద్రుడు తీసుకు వచ్చిన రధము మీద కూర్చుండబెట్టారు. రధము కదిలింది. వారంతా వెంటరాగా ధర్మరాజు పుణ్యలోకాలకు వెళ్ళాడు.

## నారద మహర్షి ధర్మరాజును స్వర్గములో కలయుట

స్వర్గలోకములో ధర్మరాజును చూసి నారదమహర్షి " దానాలతో, ధర్మాలతో, తపసులతో పుణ్యాన్ని అర్జించిన వారిని గురించి విన్నాను. కాని ధర్మరాజు కీర్తి కాంతుల ముందు అవి వెల వెల పోతున్నాయి. ఆ రాజులలో ఎవ్వరూ కూడ శరీరముతో స్వర్గానికి రాలెదు. ఆ గౌరవము కేవలము ధర్మరాజుకు మాత్రమే దక్కింది " అని ధర్మరాజును ప్రశంసించాడు. ధర్మరాజు నారదుడిని చూసి " నారదమునీంద్రా ! నేను నా తమ్ములను చుసే వరకు సుఖాలు అనుభవించ లేను. ఇంతకూ వారు ఎక్కడ ఉన్నారు. అది ఎంత దుర్గమమైనా నాకు చూపించండి. నన్ను అక్కదకు తీసుకు వెళ్ళండి. నాకు నా తమ్ములను యుద్ధములో నా కొరకు పోరాడిన రాజులను చూడాలన్న కోరికగా ఉంది " అని అడిగాడు. ఇంద్రుడు " ధర్మనందనా ! నీవు

చేసిన పున్యకార్యముల వలన నీవు సశరీరముగా స్వర్గానికి రాగలిగావు. స్వర్గానికి వచ్చినా నీవు మానవమాత్రులకు ఉండే స్నేహభావాన్ని వదలలేక ఉన్నావు. అదుగో అటుచూడు దేవఋషులు, గంధర్వులు, దేవతలు ఎంత ఆనందముగా ఉన్నారో. వారిని చూసి అయినా నీ మనసులో దుఃఖమును వదిలి సుఖముగా ఉండు. నీవు చేసిన పుణ్యవిశేషము చేతనువ్వు పొందిన ఈ పదవిని నీ తమ్ములు ఎలా పొందగలరు. మానవలోకమును వదిలి దేవలోకము వచ్చిన నీవు మానవ సంబంధాల కొరకు ఇలా తపించడము తగనిపని. ఇప్పుడు నువ్వు దివ్యరూపములో ఉన్నావన్న విషయము మరువ వద్దు " అన్నాడు. ఆ మాటలు ధర్మరాజును సమాధానపరచ లేకపోయాయి. " మహేంద్రా ! మీరు ఎంతచెప్పినా నేను నా సోదరులను బంధు మిత్రులను ద్రౌపదిని చూడకుండా ఉండలేను. ఒక్కసారి వారిని అందరిని చూసిన తరువాత మీరు చెప్పినట్లు చేస్తాను. నాకు అదే ఆనందాన్ని కలుగచేస్తుంది " అని అన్నాడు. " అని **వైశంపాయనుడు** జనమేజయుడికి మహాప్రస్థాన కథ వినిపించాడు.

## వనరులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత



వర్గం: మహాభారతం

---

# స్వర్గారోహణ పర్వము

వికీపీడియా నుండి

మహాభారత కధను వింటున్న **జనమేజయుడు** వైశంపాయనుడితో " మునివర్యా ! మాతాతలైన పాండవులు స్వర్గారోహణ చేసిన తరువాత. ఏలోకాలకు వెళ్ళారు ఎక్కడ ఉన్నారు తెలియజేయండి " అని అడిగాడు.

## విషయ సూచిక



## స్వర్గములో సుయోధనుడిని చూసి ధర్మరాజు కలత చెందుట

**వైశంపాయనుడు** " తన బంధువులను చూడవలెనని పట్టుబట్టిన ధర్మరాజు కోరికను ఇంద్రుడు మన్నించాడు. వెంటనే ఒక దూతను పిలిచి " ఈయన ధర్మరాజు. ఈయనకు తన వారిని చూడాలని కోరికగా ఉంది. నీవు ఈయనను తీసుకు వెళ్ళి ఆయన బంధువులను అందరినీ చూపించు. ఆ దేవదూత ధర్మరాజును తన వెంట తీసుకువెళ్ళాడు. ధర్మరాజు వెంట నారదుడు, **దేవఋషులు** కూడా వెళ్ళారు. ముందుగా వారు పెద్ద సింహాసనము మీద కూర్చున్న సుయోధనుడు కనిపించాడు. ఆయన చుట్టూ దేవకాంతలు సేవలు చేస్తున్నారు. సుయోధనుడు అంతులేని సుఖాలు అనుభవిస్తున్నాడు. అది చూసి ఆశ్చర్యపోయిన ధర్మరాజు దేవమునులతో " దేవమునులారా ! ఈ సుయోధనుడు పరమ లోభి. ఇతడికి ముందు చూపు లేదు. అనేక దేశములు ఏలే రాజులను యుద్ధముకు పిలిపించి వారి రధ, గజ, తురంగ, కాల్బలములతో సహా మరణించేలా చేసాడు. రాజసూయ యాగము చేసి పవిత్రురాలైన ద్రౌపదిని నిండు కొలువుకు ఈడ్చుకు వచ్చి ఘోరముగా అవమానించాడు. అలాంటి వాడు స్వర్గసుఖాలు అనుభవిస్తునాడు. వీడితో చేరి నేను స్వర్గసుఖాలు అనుభవించాలా ! వీలులేదు నన్ను నా తమ్ములు భీమార్జున నకుల సహదేవులు ఉన్నచోటికి తీసుకు వెళ్ళండి " అని వెనకకు తిరిగాడు.

## నారదుడు ధర్మరాజును సమాధానపరచుట

అప్పుడు నారదుడు నవ్వి " ధర్మరాజా ! సుయోధనుడు లోపభూయిష్ఠమైన ఈ శరీరమును వదిలి పెట్టాడు. ఇప్పుడు దివ్యదేహముతో ప్రకాశిస్తునాడు. అందు వలన దేవతల చేత గౌరవించబడుతున్నాడు. ఇతడు యుద్ధములో మరణించాడు. యుద్ధములో రాజులను చంపాడు. అది పాపము ఎలా ఔతుంది. భూలోకములో చేసిన పాపములు ఇక్కడ ఎందుకు తలచడము. ఇది పుణ్యలోకము. ఇక్కడ ఏ పాపము అంటదు. ధర్మరాజా ! నీవు స్వర్గలోకానికి వచ్చి కూడ మానవ సహజమైన ఈర్ష్యా ద్వేషాలను వదలక ఉన్నావు. ఇక్కడ వాటికి తావు లేదు. కనుక నీలోని కోపతాపములను, ఈర్ష్యా ద్వేషములను వదిలి సమత్వమును పొందుము. నీవు ఆడిన జూదము దాని వలన కలిగిన దు:ఖమును మరచి ప్రశాంత చిత్తుడవై ఉండు " అన్నాడు. ధర్మరాజు " మహర్షీ ! పుణ్యము చెసిన వారికి స్వర్గము పాపులకు నరకము ప్రాప్తిస్తుంది అని అంటారు కదా ! ఈ సుయోధనుడు పాపి. ఇతడు ఇతరులకు అపకారము తప్ప ఉపకారము ఎన్నడూ చేయ లేదు. ఇతడు కురువంశ వినాశకుడు. రాజులందరిలో అధముడు. వీడు స్వర్గములో ఉండడమా ! ఇతడు దేవతలకు పూజనీయుడా ! పోనీలే అది మీ స్వర్గవాసుల ఇష్టము. అతడు స్వర్గ సుఖములు అనుభవించనీ. నన్ను నా తమ్ములు, నా భార్య, నా కుమారుల వద్దకు తీసుకు వెళ్ళండి. నేను వారిని చూడాలి.

## ధర్మరాజు కర్ణుడుదిని చూడడానికి తహతహలాడుట

ధర్మరాజు తిరిగి " మహాఋషులారా ! నేను తిలతర్పణము ఇస్తున్న సమయములో మా తల్లి కుంతీదేవి నా వద్దకు వచ్చి కర్ణుడు తన కుమారుడు అని తెలిపింది. అతడి జన్మరహస్యము కూడ చెప్పింది. అప్పటి నుండి నాకు కర్ణుడిని చూడాలన్న కుతూహలము కలుగుతుంది. ఆ పరాక్రమవంతుడు మేము కలసిన మమ్ము ఇంద్రుడు కూడా జయించ లేడు కదా ! కర్ణుడు మా అన్న అని తెలియక నేను కర్ణుడిని చంపమని అర్జునుడికి చెప్పి పాపము చేసాను. ఆ పాపము నన్ను ఇంకా వెన్నంటి వేధిస్తుంది. కర్ణుడిని చూడడానికి నా మనసు తహతహలాడుతుంది. దయచేసి నన్ను మా అన్న కర్ణుడి వద్దకు తీసుకు వెళ్ళండి. అది కాక నాకు ద్రుపదుడు, **యుధామన్యుడు**, విరాటుడు, **శంఖుడు** మొదలగు వారిని చూడాలని ఉంది. నేను మొదటి నుండి నా తమ్ములను, నా భార్యను చూడాలని అడుగుతున్నాను. ఒక వేళ వారు స్వర్గములో లేకుంటే వారులేని స్వర్గములో నేను ఉండలేను. వారికి లేని స్వర్గసుఖములు నాకు అవసరము లేదు. వారు ఎక్కడ ఉంటే అక్కడే నాకు స్వర్గము. నన్ను త్వరగా అక్కడకు తీసుకువెళ్ళండి " అన్నాడు.

## ధర్మరాజు నరకములో ప్రవేశించుట

ధర్మరాజు కోరిక విన్న దేవదూత " మహాత్మా ! నీ మనసులో ఏ కోరిక పుడుతుందో దానిని నెరవేర్చమని దేవేంద్రుడు నాకు ఆనతి ఇచ్చాడు. నేను అలాగే చేస్తాను. మీరు నాతో రండి " అన్నాడు. ధర్మరాజును దేవదూత తీసుకువెడుతున్న దారి అంతా దుర్గంధభూయిష్టముగా ఉంది. దారిలో వెంట్రుకలు, ఎముకలు కుప్పలుగా పడి ఉన్నాయి. దోమలు, ఈగలు ముసురుతూ ఉనాయి. శవాలు కుప్పలుగా పడి ఉన్నాయి. ఆ శావాల కొరకు కాకులు తిరుగుతున్నాయి. శవాల మీది నుండి వచ్చే దుర్గంధము ముక్కులను బద్దలు కొడుతుంది. వారు వైతరణీ నదిని సమీపించారు. నదిలోని నీరు సలసలా కాగుతున్నాయి. దని ఒడ్డున సూదులవలె, కత్తుల వలె ఉన్న ఆకులు ఉన్న మొక్కలు ఉన్నాయి. అక్కడ నానావిధములైన పాపములకు శిక్షను అనుభవిస్తున్న పాపులను చూసి ధర్మరాజు " ఇంకా ఎంతదురము వెళ్ళలి " అని అడిగాడు. దేవదూత " ఇదంతా దేవతల ఆధీనములో ఉన్నది. మనము రావలసిన ప్రదేశముకు వచ్చాము " అన్నాడు. కాని ధర్మరాజుకు పాపులు అక్కడ పడుతున్న అవస్థ చూస్తూ ఉండడానికి మనస్కరించ లేదు. అందుకని అక్కడ నుండి వెళ్ళి పోవాలని అనుకున్నాడు. అప్పుడు ధర్మరాజుకు కొన్ని గొంతులు ఇలా వినిపించాయి. " ఓ పుణ్యచరితా ! నీ రాకవలన మా పాపములు అన్నీ పోయాయి. నీ శరీరము నుండి వచ్చే పరిమళము వలన మా బాధలు ఉపశమించాయి. మాకు ఇక్కడ హాయిగా సుఖముగా ఉంది. నిన్ను చూడడము వలన మా బాధలు దూరము అయ్యాయి. నీవు కాసేపు ఇక్కడే ఉండి మాకు



ధర్మరాజుకు నరకమును చూపించున్న దేవదూత

సంతోషము కలిగించు " అన్న మాటలు వినిపించాయి. అప్పుడు ధర్మరాజు " ఆహా ! వీరు ఇక్కడ ఎన్ని బాధలు అనుభవిస్తునారో కదా ! " అనుకుని అక్కడే నిలబడ్డాడు. ధర్మరాజు పెద్దగా " మీరు ఎవరు ఎందుకు ఈ బాధలు అనుభవిస్తునారు? " అని అడిగాడు. వారు " మేము ఎవరమో కాదు. నీ అన్నదమ్ములము **కర్ణుడు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవులము**. మేమంతా ఇక్కడ నరకబాధలు అనుభవిస్తునాము " అని వినిపించింది. మరొకపక్క నుండి " మహారాజా ! నేను ద్రౌపదిని, నేను ధృష్టద్యుమ్నుడిని, మేము ద్రౌపది పుత్రులము " అన్న మాటలు వినిపించాయి.

## ధర్మరాజు తనవారిని నరకములో చూసి కలత చెందుట

ఆ మాటలు విన్న ధర్మరాజు ఒక్కసారిగా నిశ్చేష్టుడై " అయ్యో భగవంతుడా ! మా తమ్ములకు, ద్రౌపదికి ఈ దుర్గతి పట్టడము ఏమిటి ? వారు ఏపాపము చేసారని ఇటువంటి నరకయాతనలు అనుభవిస్తునారు. ఇంద్రుడు దేవతలు పరమనీచులు కాకపోతే నా తమ్ములకు, ద్రౌపదికి ఇలంటి నరకబాధలు అనుభవించ వలసిన అగత్యము ఏమిటి. ఇక్కడ ధర్మము లేదు, న్యాయము లేదు. లేకున్న నా తమ్ములు, ద్రౌపది సామాన్యమైన వారా ! వారు పరమ నిష్ఠాగరిష్టులు, సత్యము, దయ కలిగిన వారు, దానశీలురు, యజ్ఞయాగములు చేసిన వారు. అటువంటి వారికి ఈ దుర్గతి పట్టడము ఏమిటి ? కనీసము జీవితములో ఒక్కరికి కూడా మేలు చేయని సుయోధనుడికి స్వర్గసుఖాలా ! అతడి చుట్టూ అంతమంది దేవకాంతలా ! అంతులేని భోగాలా ! కనిసము వీసమెత్తైనా పాపము చెయ్యని నా వారికి నరకయాతనలా ! దైవము న్యాయము, ధర్మము మరచినట్లు ఉంది " అని చింతించసాగాడు. తిరిగి " ఇదంతా నిజమా ! లేక దేవతల మాయా ! నా భ్రాంతియా ! లేక నేను కలగంటున్నానా ! " అని పరిపరి విధముల చింతించసాగాడు. ధర్మరాజుకు ఇంద్రుడి మీద చాలా కోపము వచ్చింది. పక్కనే ఉన్న దేవదూతను చూసి " ఓ దేవదూతా ! ఇక నాకు నీ సాయము అవసరము లేదు. నిన్ను ఎవరు పంపారో వారి వద్దకు తిరిగి వెళ్ళు. నా తమ్ములు, నా భార్య నరక బాధలు అనుభవిస్తున్నప్పుడు నాకు స్వర్గసుఖాలతో పని లేదు. వారు ఎక్కడ ఉంటే నేను అక్కడే ఉంటాను. నా మాటలు యధాతధంగా ఇంద్రుడికి చెప్పు " అని అన్నాడు.

## ఇంద్రాదులు ధర్మరాజు వద్దకు వచ్చుట

దేవదూత ఇంద్రుడి వద్దకు వెళ్ళి జరిగినది చెప్పాడు. వెంటనే దేవేంద్రుడు దిక్పాలకులను, దేవఋషులను తీసుకుని ధర్మరాజు వద్దకు వచ్చాడు. యమధర్మరాజు కూడా తన కుమారుడిని అనునయించడానికి వారితో వచ్చాడు. వారి రాకతో అక్కడ ఉన్న వాతావరణము అంతా మారి పోయింది. నరకయాతనలు లేవు, దుర్గంధము లేదు. శవాలగుట్టలు మాయమయ్యాయి. ఎముకల పోగులు లేవు. పాపుల ఆక్రందనలు ఆగిపోయాయి. పైన తిరుగుతున్న కాకులు గద్దలు లేవు. వైతరుణీనది జాడలులేవు. పిల్లతెమ్మెరలు వీచసాగాయి. అహ్లాదకరమైన చల్లని వాతావరణముతో అంతటా మనోహరమైన పరిస్థితి నెలకొన్నది. ఆ సమయములో ధర్మరాజు వద్దకు **రుద్రులు, గంధర్వులు, వసువులు, ఆదిత్యులు, నాగులు, సిద్ధులు** ఆనందముగా వచ్చారు. అప్పుడు ఇంద్రుడు ధర్మరాజుతో " నీవు నరకములో ఉండడము ఏమిటి ? నిన్ను తీసుకు పోవడానికి దేవతలు అందరూ ఇక్కడకు వచ్చారు. నీకు శాశ్వతబ్రహ్మలోక పదవి లభించింది. నీలోని వికారములు అన్నీ నశించాయి. నీకు సద్బుద్ధి కలిగింది. ధర్మనందనా ! ఒక్కమాట. రాజ్యంతే నరకం ధృవం అని వేదములు చెప్తున్నాయి. అంటే రాజ్యము చేసిన వాడికి నరకము తప్పదు. అందుకే నీకు నరకద్వార దర్శనము అయ్యింది. ధర్మనందనా ! పుణ్యము, పాపము ఒక దానిని వెన్నంటి ఒకటి ఉంటాయి. పుణ్యము చేసుకున్న వారికి స్వర్గము, పాపము చేసుకున్న వారికి నరకము ప్రాప్తిస్తుంది. కొద్దిగా పుణ్యము చేసుకున్న వాడు తాను చేసుకున్న పుణ్యముకు సరిపడా స్వర్గసుఖములను ముందుగా అనుభవించి తరువాత దీర్ఘకాలము నరకవాసము చెయ్యాలి. కొద్దిగా పాపము చేసిన వారు ముందుగా నరకయాతన అనుభవించి తరువాత స్వర్గసుఖాలను దీర్ఘకాలము అనుభవించాలి. ఇది ఇక్కడి నియమము. నీవు చెసిన కొద్ది పాపముకు నీకు నరకద్వార దర్శనము అయింది. ఇక నీవు దీర్గకాల స్వర్గమును అనుభవిస్తావు. నీకు కలిగిన మనస్థాపము వలన నీకు ఇది చెప్పవలసి వచ్చింది. నీ అన్న కర్ణుడికి ఉత్తమ లోక ప్రాప్తి కలిగింది. నీ తమ్ములు భీమార్జున నకులసహదేవులకు ఉత్తమ లోకప్రాప్తి కలిగింది. వారందరూ తమతమ ఉత్తమ స్థానాలలో ఉజ్వలంగా ప్రకాశిస్తున్నారు. నీవు వారిని అందరిని చూసి సంతోషించు. నీవు చేసిన స్వల్ప పాపముకు నీకు నరకద్వార దర్శనము నీవు చేసిన రాజసూయయాగము, అశ్వమేధయాగము, యజ్ఞములు, దానములు, ధర్మములు, వ్రతములకు నీకు ఉత్తమలోకప్రాప్తి కలిగింది. నీ పుర్వీకులు అయిన **మాంధాత, నలుడు, హరిస్చంద్రుడు, దుష్యంతుడు, భరతుడు** ఎటువంటి ఉత్తమలోకాలు పొందారో అటువంటి ఉత్తమలోకాలు నీకు ప్రాప్తించాయి. నిన్ను అభినందించడానికి **సిద్ధులు, సాధ్యులు, గరుదులు, గంధర్వులు, నాగులు** వచ్చారు అని వారిని అందరిని చూపాడు. ధర్మరాజు వారందరికి వినయముగా నమస్కరించాడు. ఇంద్రుడు తిరిగి " ధర్మరాజా ! ఇది ఆకాశగంగ. పుణ్యమే ఇలా ఆకృతి దాల్చింది. నీవు ఇందులో స్నానము చేసి దివ్యదేహముతో ప్రకాశించు " అన్నాడు.

## యమధర్మరాజు ధర్మరాజుతో మాటాడుట

తరువాత యమధర్మరాజు ధర్మరాజు వద్దకు వచ్చి " కుమారా ! నేను నిన్ను మొదటిసారిగా ద్వైతవనంలో, రెండవసారి మేరుపర్వతములో కుక్క రూపములోమూడోసారి ఇక్కడా నిన్ను పరీక్షించాను నీ మనసుచలించ లేదు. నీ మనసులో శమము, దమము మొదలగు గుణములు పుష్కలముగా ఉన్నాయి. నీవు జితేంద్రియుడవు. నీకు పెట్టబడిన పరీక్షలు పూర్తి అయ్యాయి. నీవు గెలిచావు. ఇక నీవు స్వర్గసుఖములు అనుభవించ వచ్చు. రాజులకు నరకము తప్పదు అని వేదోక్తి కనుక నేను ఇంద్రుడు కలసి నీకు నరకద్వార దర్శనము కలిగించాము. నీవు విన్న కర్ణ, భీమ, అర్జున, నకుల, సహదేవ, ద్రౌపది ఆక్రందనలు అన్నీ మేము కల్పించినవి. నీ తమ్ములు, కర్ణుడు, ద్రౌపది పుణ్యలోకాలు చెరుకున్నారు. ఇంద్రుడు చెప్పినట్లు నీవు ఆకాశగంగలో మునుగు. నీకు ఈ సంసారభావము నేను, నీవు అన్న భేదభావము నశిస్తాయి. మానవసహజమైన రాగముద్వేషము, సుఖముదుఃఖము నశిస్తాయి. దైవత్వము సిద్ధిస్తుంది. తరువాత స్వర్గసుఖములు అనుభవిస్తున్న నీ సోదరులను, నీ భార్యను ఆనందంగా చూడు. ఆలస్యము ఎందుకు ఆకాశగంగలో స్నానము చెయ్యి " అని చెప్పాడు. తరువాత యమధర్మరాజు ధర్మరాజును ఆకాశగంగ వద్దకు తీసుకుని వెళ్ళాడు. ధర్మరాజు ఆకాశగంగలో పుణ్యస్నానము చేసాడు. వెంటనే తన మానుష శరీరమును వదిలి దివ్యశరీరము ధరించాడు. ఎప్పుడైతే ధర్మరాజు దివ్యకాంతితో కూడిన శరీరము ధరించాడో అతడిలోని వైరము, మాత్సర్యము, స్నేహము, చంచల స్వభావము, గర్వము, దుఃఖము అన్నీ సమసి పోయాయి. ధర్మరాజు సాక్షాత్తు అగ్ని వలె ప్రకాశించ సాగాడు. ఎదురుగా ఉన్న ఇంద్రుడిని, యమధర్మరాజును స్తుతించి వారితో కలసి ముందుకు సాగాడు.

## ధర్మరాజు స్వర్గలోకములో

స్వర్గములో అర్జునుడు చతుర్భుజములు, శంఖచక్రములు, గదాయుధములతో ప్రకాశిస్తున్న శ్రీమహావిష్ణువును సేవిస్తునాడు. ద్వాదశాదితుల పక్కన పదమూడవ ఆదిత్యుడిగా ప్రకాశిస్తున్న కర్ణుడిని, మరుత్తులలో ఒకడుగా ప్రకాశిస్తున్న భీమసేనుడిని, అశ్వినీదేవతల వలె ప్రకాశిస్తున్న నకులసహదేవులను చూసాడు. కొంచము దూరములో మహారాణిలా దివ్యకాంతితో వెలిగి పోతున్న ఒక స్త్రీమూర్తిని చూసి ఇంద్రుడితో " దేవా ! ఈమె ఎవ్వరు ? " అని అడిగాడు. ఇంద్రుడు " ధర్మనందనా ! ఈమె మహాలక్ష్మి ద్రుపదుడికి కుమార్తెగా అయోనిజగా జన్మించింది. మహేశ్వరుడి ఆజ్ఞను అనుసరించి ఈమె మానవకాంతగా అవతరంచింది. ఆ పక్కన ఉన్న గంధర్వులు ఆమె కుమారులు ఉపపాండవులు. ఆ పక్కన ఉన్న వాడు గంధర్వరాజైన ధృతరాష్ట్రుడు. ఇతడు మీ పెదనాన ధృతరాష్ట్రుడిగా జన్మించాడు. తరువాత అయా అంశలతో యాదవవీరులైన సాత్యకి, కృతవర్మ అక్కడ స్వర్గ సుఖములు అనుభవిస్తున్నారు అదిగో చూడు. ధర్మనందనా ! సుభద్ర గర్భమున చంద్రాంశతో జన్మించిన వాడు అభిమన్యుడు రెండవ చంద్రుడివలె ప్రకాశిస్తునాడు చూడు " అని చెప్పాడు. ఇంతలో అటుగా వస్తున్న ఒక విమానము చూపి ఇంద్రుడు " ధర్మనందనా ! అటు చూడు మీ తండ్రి **పాండురాజు**తన భార్యలైన కుంతి, మాద్రిలతో ఇటు వస్తునాడు " అని చూపించాడు. తరువాత అష్టవసువులలో ఒకడైన భీష్ముడిని, బృహస్పతి పక్కన కూర్చుని ఉన్న ద్రోణుడిని చూసాడు. తరువాత గంధర్వ, యక్ష, గుహ్యక గణములతో కలసి ఉన ద్రుపదుడిని, విరాటుడిని, వారి అన్నదమ్ములను, కుమారులను, బంధువులను, కేకయ, పాండ్యరాజులను నానాదేసముల నుండి వచ్చి మహాభారతయుద్ధములో ప్రాణములు విడిచిన రాజులను చూపించి " వీరంతా ఉత్తమ లోకాలు పొందారు " అని వివరించి చెప్పాడు.

## వైశంపాయనుడు చెప్పిన దేవ రహస్యము

స్వర్గమములో కురుక్షేత్ర సమరములో మరణించిన రాజులను చూపించిన విషయము విన్న **జనమేజయుడు** వైశంపాయనుడిని " మునివర్యా ! తమరు అందరి విషయములు చెప్పారు. వీరందరూ ఉత్తమ లోకాలు పొందారు అని చెప్పారు. వీరందరూ ఎంత కాలము స్వర్గములో ఉంటారు ? శాశ్వతముగా స్వర్గములోనే ఉండిపోతారా ! లేక కొంతకాలము మాత్రము ఉండి తరువాత మానవజన్మ ఎత్తుతారా ! వివరించండి " అని అడిగాడు. వైశంపాయనుడు " మహారాజా ! అది దేవరహస్యము. దానిని వేదవ్యాస మహర్షి నా మీద దయ ఉంచి నాకు చెప్పాడు. అది మీకు చెప్తాను. ప్రద్యుమ్నుడు సనత్కుమారుడిలో కలిసాడు. ధృతరాష్ట్రుడు, గాంధారీ కుబేరలోకములోకి చేరారు. పాండురాజు కుంతీ, మాద్రిలతో కలసి స్వర్గములో ఉన్నాడు. అభిమన్యుడు చంద్రుడిలో కలసి పోయాడు. ద్రోణాచార్యుడు బృహస్పతిలో కలసి పోయాడు. శకుని ద్వాపరుడిలో కలసి పోయాడు. సుయోధనుడు కొంత కాలము స్వర్గములో స్వర్గ సుఖములు అనుభవించిన తరువాత నరకలోకములో తాను చెసిన పాపములకు తగిన శిక్షలు అనుభవించి తిరిగి కలిపురుషుడిలో కలసిపోయాడు. మిగిలిన కౌరవులందరూ తాము చేసిన పుణ్యకార్యములకు తగినంత స్వర్గసుఖములు, పాపకార్యములకు తగినంత నరకయాతనలు అనుభవించి తరువాత రాక్షస గణములలో ఐక్యము అయ్యారు. కర్ణుడు తన తండ్రి అయిన సూర్యుడిలో కలసి పోయాడు.

భీష్ముడు అష్టవసువులలో చివరి వాడు అయి వసువులలో చేరాడు. ద్రుపదుడు, విరాటుడు, **ధృష్టకేతువు, భూరిశ్రవుడు, శల్యుడు, శంఖుడు, ఉత్తరుడు** వీరందరూ వీశ్వదేవతలలో కలసి పోయారు. ధృష్టద్యుమ్నుడు అగ్నిలో కలసి పోయాడు. అప్పటికే ధర్మరాజు శరీరములో కలసి పోయిన విదురుడు ధర్మరాజుతో చేరి యమధర్మరాజుతో కలసి పోయాడు. బ్రహ్మదేవుడి ఆదేశానుసారము బలరాముడు అనంతుడిలో కలసి పోయాడు. శ్రీకృష్ణుడితో రాసలీలలు సలిపిన 16 వేల గోపికలు సరస్వతీ నదిలో స్నానము చేసి అప్సరసలుగా మారి మహావిష్ణువును సేవిస్తునారు. శ్రీకృష్ణుడితో సహగమనము చేసిన రుక్మిణీదేవి లక్ష్మీదేవిలో కలసి పోయింది. శ్రీకృష్ణుడి మిగిలిన భార్యలు లక్ష్మీదేవిలో కలసి పోయారు. జనమెజయ మహారాజా ! మహాభారత యుద్ధములో చనిపోయిన వారు నేను చెప్పిన వారు చెప్పని వారు అందరూ వారి వారి అంశలు అయిన **దేవతా, రాక్షస, యక్ష, గుహ్యక, గంధర్వ** బృందములో కలసి పోయారు. జనమెజయ మహారాజా ! కురుపాండవుల విషయములతో కూడిన ఈ భారత కధను ఉపకధా సహితముగా నికు వివరించాను. సర్పయాగ సందర్భములో భగవానుడైన వెదవ్యాస మహర్షి అనుమతితో నెను చెప్పిన ఈ భారత కధను నీవు శ్రద్ధతో విని జ్ఞానము సముపార్జించావు " అని అన్నాడు **వైశంపాయనుడు**.

## భారతకధ

**జనమేజయుడు** చేసిన సర్పయాగములో వేదవ్యాస మహర్షి ఆదేశానుసారము **వైశంపాయనుడు** ఈ మహాభారతకధను జనమేజయుడికి వివరించాడు. ఆ సమయములో అక్కడ ఉన్న వ్యాసమహర్షి శిష్యుడు **ఉగ్రశ్రవసుడు** ఈ భారత కధను ఆమూలాగ్రము విన్నాడు. నైమిశారణ్యములో శౌనకమహర్షి తలపెట్టిన సత్రయాగ సందర్భములో శౌనకాది మహర్షులు ఉగ్రశ్రవసుడిని పుణ్యకధను వినిపించమని కోరడముతో ఉగ్రసవసుడు తాను విన్న మహాభారతకధను రసవత్తరంగా వారికి వినిపించాడు. తరువాత వారితో " మహామునులారా ! నేను జనమేజయుడు సర్పయాగము చేసిన సందర్భములో వైశంపాయన మహర్షి ఈ భారత కధను వినిపించగా దానిని ఆమూలాగ్రము విన్నాను. ఆ కధను నేను మీకు ఇప్పుడు నేను వివరిస్తాను. సత్రయాగము ఆస్థీకుని ప్రయత్నము వలన ఆగిపోయింది. సర్పయాగమును ఆపి సర్పములను రక్షించిన ఆస్తీకుడిని జనమెజయుడు పుజించి తగు విధముగా సత్కరించాడు. ఋత్విక్కులకు కానుకలను ఇచ్చాడు. తరువాత వేదవ్యాస మహర్షుని, వైశంపాయనుడిని వేదోక్తముగా సత్కరించిన తరువాత జనమేజయుడు హస్థినాపురము ప్రవేశించాడు. ఋషులారా ! ఈ భారతకధను రచించిన వేదవ్యాస మహర్షి ఋషులలో అగ్రగణ్యుడు సత్యము గ్రహించిన వాడు, వేదములే రూపుగా ధరించిన వాడు, విజ్ఞానఖని, బ్రహ్మజ్ఞాని, శౌచము, శాంతి, క్షమ, దాంతి, తపోనిష్ట కల వాడు. ధర్మములను ఉపదేశించదములో దిట్ట. పాండవుల కీర్తి ప్రతిష్ఠలను లోకముకు చెప్పడానికి, అనేకమంది రాజులను గురించి సామాన్య జనులకు తెలియ పరచడానికి, దేవదేవుడైన వాసుదేవుడి లీలా విశేషములను వివరించడనికి, సర్వ దేవజాతులు ఎలా పుట్టారు ఎలా లీనము అయ్యారు అన్న విషయము సామాన్యులకు అందించడనికి, సకల విధమైన ధర్మములను లోకానికి అందించడానికి పంచమ వేదముగా పేరు తెచ్చుకున్న ఈ భారతకధను రచించాడు. ఈ ఇతిహాసమును వ్యాసుడు మూడు సంవత్సరముల కాలము రచించాడు. ధర్మ, అర్ధము, కామము, మోక్షము అను పురుషార్ధములలో చెప్పబడిన ధర్మసుక్ష్మములు ఈ మహాభారత కధలో సమూలముగా చెప్పబడ్డాయి. ఈ మహాభారతకధలో చెప్పబడిన ధర్మాలు లోకములో ఎక్కడైనా చెప్పబడి ఉండ వచ్చు కాని ఈ కధలో చెప్పని ధర్మాలు లోకములో చెప్పలేదని వ్యాసుడు స్వయముగా చెప్పాడు. సర్పయాగ సందర్భములో వ్యాసుడి ఆదేశానుసారము వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పిన ఈ భారత కధను ఆమూలాగ్రము విని నేను ధన్యుడిని అయ్యాను. ఆ వెదవ్యాసుడి కరుణ వలన మీ అందరి ఆదరాభిమానాలతో నేను మీకు వినిపించాను.

## ఫలములు

ఈ పుణ్యకధను మొదటి నుండి చివరి వరకు పర్వదినములలో ఎవరు భక్తిశ్రద్ధలతో వింటారో వారికి పాపములు నశించిపోయి స్వర్గలోక సుఖములు అనుభవించి చివరకు మోక్షము పొందుతారు. వారు చేసిన బ్రహ్మహత్యా మొదలగు ఘోరపాపములు సహితము నశిస్తాయి. దైవకార్యములు, పితృకార్యములు జరిగే సమయములో ఈ మహాభారతకధను ఎవరు బ్రాహ్మణులకు వినిపిస్తారో వారికి ఆయా పుణ్యకార్యములు చెసిన ఫలితము దక్కుతుంది. ఈ మహాభారతకధను పుర్తిగా వినకున్నా ఏ కొంచము అయినా చెవినోకినా వారి సమస్త పాపములు నశిస్తాయి. మునులారా ! ముందు ఈ భారతకధను జయ అనే పేరుతో ప్రసిద్ధి చెందినది. అందుకని క్షత్రియులు ఈ ఇతిహాసమును వింటే వారికి సదా జయము కలుగుతుంది. కన్యలు వింటే మంచి వరుడు దొరుకుతాడు. మునులారా ఈ భారత ఇతిహాసములో అత్యంత ముఖ్యుడు శ్రీకృష్ణుడు. ఆ శ్రీకృష్ణుడి మీద అచంచలమైన భక్తి విశ్వాసములతో ఈ మహాభారత ఇతిహాసమును వింటారో వారికి పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి. వ్యాసమహర్షి కరుణతో ఎవరికి ఈ ఇతిహాస అర్ధము స్పురిస్తుందో అట్టి వాడికి వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, సకలశాస్త్రములు అవగతమౌతాయి. జనులు అతడిని కీర్తిస్తారు. అతడికి బ్రహ్మజ్ఞానము అలవడుతుంది " అని సుతుడైన ఉగ్రశ్రవసుడు

శౌనకాది మునులకు తృప్తికలిగేలా మహాభారతకధను చెప్పాడు. అది విన్న శౌనకాది మునులు పరమానందము చెంది ఉగ్రశ్రవసుడిని ఘనముగా సత్కరించాడు.

## వనరులు

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • **స్వర్గారోహణ పర్వము** • హరివంశ పర్వము

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | దృపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

"http://te.wikipedia.org/w/index.php?title=స్వర్గారోహణ_పర్వము&oldid=759786" నుండి వెలికితీశారు

వర్గం: మహాభారతం

---

# హరివంశ పర్వము

వికీపీడియా నుండి

మహాభారతమును తన తాతలైన పాండవుల ఘనచరిత్రను సంపూర్ణముగా విని జనమేజయుడు తనకు కలిగిన అసంతృప్తిని దాచలేక వైశంపాయనుడితో " మహాత్మా ! భారతమును పూర్తిగావిన్నా నా మనసున అసంతృప్తి మిగిలి ఉంది. అందుకు కారణం మహానుభావుడైన శ్రీకృష్ణుడు జన్మించిన యదువంశము గురించి భారతంలో అవసరమైనంత వరకే చెప్పబడినది. మీరు సర్వజ్ఞులు కనుక నాకు శ్రీకృష్ణుడు జన్మించిన వృష్టివంశ చరిత్ర వినిపించి నన్ను ధన్యుడిని చేయండి " అని అడిగాడు. వైశంపాయనుడు అదివిని చిరునవ్వు నవ్వి. జనమేజయమహారాజా ! నీకు కలిగినట్లే వ్యాసుడికి అసంతృప్తి కలిగింది. సక్షాత్తు విష్ణంశ సంభూతుడైన వ్యాసుడు భారతము వ్రాసి ముగించిన పిదప భగవంతుడు ధర్మరక్షకుడైన శ్రీకృష్ణుడు జన్మించిన వృష్టివంశ చరిత్రను ఖిలపర్వము అనే పేరుతో రచించాడు. భారతం పద్దెనిమిది పర్వాలే ఖిలపర్వము దానిలో ఒక భాగం అయింది. ఖిలపర్వము చేరితేనే అది మహాభారతం అయ్యింది. ఇక వృష్టివంశ చరిత్ర శ్రీకృష్ణుడి లీలావైభవం ఆలకించు జనమేజయ మహారాజా ! " అని వైశంపాయనుడు చెప్పి వృష్టివంశముగురించి చెప్పసాగాడు.

## విషయ సూచిక

## చంద్రుడి జననము

వృష్టివంశముకు మూల పురుషుడు చంద్రుడు. చంద్రుడి తండ్రి బ్రహ్మ మానసపుత్రుడు సప్తరుషులలో ఒక్కడు అయిన అత్రిమహర్షి. అత్రిమహర్షి ఒకసారి లోకహితమును కోరుతూ తపమాచరించాడు. అప్పుడు అతడు ఉఊర్ధ్వరేతస్కుడు కాగా ఆ రేతస్సు బిందువులుగా అతడి కన్నుల నుండి స్రవించి అది దిక్కులన్నింటిని ఆక్రమించగా ఆ రేతోతేజమును దశదిశలు భరించజాలక భూమి మీద వదిలి వేసాయి. అప్పుడు బ్రహ్మ లోకములను రక్షించ తలచి వేయిాశ్వముల రధమును చేసి అందు ఉంచాడు. ఆ రేతస్సు తేజోవంతమైన బాలుడై బ్రహ్మరధమును అధిరోహించి లోకమంతా తిరిగి సామ్రాజ్యమును సాధించి రాజతేముతో వెలుగసాగాడు. అది చూసిన దక్షప్రజాపతి తన 27 కుమార్తెలను చంద్రుడికి ఇచ్చి వివాహము జరిపించాడు. తరువాత చంద్రుడు అత్రిమహర్షి హెూతగా, భృగుమహర్షి అధ్వర్యుడుగా, నారదమహర్షి ఉద్ఘాతగా రాజసూయమును చేసాడు. ఆ యాగముకు సనత్కుమారుల వంటి మహామునీ పరివేష్టితుడైన విష్ణువు తిలకించాడు. యాగసమాప్తి అందు హిరణ్య, రత్న, రజిత గర్భాయిన ముల్లోకాలు దానముగా ఇవ్వబడినవి. ఆ యాగ ప్రభావముగా చంద్రుడు ధృతి, ప్రభ, కీర్తి, ధృష్టిని పొంది అధిక తేజముతో విరాజిల్లాడు. మిక్కుటమైన సంపదలు చంద్రుడికి అత్యధిక అధిశయము కలించింది. అతడు గర్వాంధుడై భృహస్పతిని ఓడించి అతడి భార్య తారను బలవంతంగా తీసుకు వెళ్ళాడు. ఎంత మంది విడువమని నచ్చ చెప్పినా చంద్రుడు దానిని పెడచెవిన పెట్టాడు.

## దేవదానవయుద్ధము

ఈ అధర్మాన్ని సహించలేని శివుడు దేవతలమీద బ్రహ్మశిరము అను అస్త్రమును ప్రయోగించి బలహీన పరిచాడు. దేవతలు బలహీనులు కాగానే దానవులు విజృభించి దేవతల మీదకు యుద్ధానికి వచ్చారు. ఆయుద్ధములో దేవతలు అనేకులు మరణించారు. దేవతలు చివరకు దానవులకు ఝుడిసి బ్రహ్మను శరణువేడగా బ్రహ్మదేవుడు బృహస్పతిని పిలిపించి చంద్రుని తారను రప్పించి తారను భృహస్పతికి ఇప్పించాడు. కాని అప్పటికి తార గర్భవతిగా ఉన్నందున అమె అప్పుడు ఒక బాలుని ప్రసవించింది. ఆ బాలుడు తారను చూసి ఆగ్రహించి తనకు ఇలాంటి జన్మ ఇచ్చిందుకు తల్లిని శపించ తలిచాడు. బ్రహ్మదేవుడు ఆ బాలుని వారించి శాపించకుండా ఆపాండు. తరువాత బ్రహ్మ తారను అడిగి ఆ శిశువు చంద్రుడిది అని తెలుసుకుని పుట్టిన శిశువును చంద్రుడికి ఇప్పించి తారను భృహస్పతివెంట పంపాడు.

## భోజవంశము

చంద్రుడు తన పుత్రుని చూసి అతడి ప్రకాశము చూసి మురుసి పోయాడు. అతడికి బుధుడు అని నామకరణము చేసాడు. బుధుడికి ఇలతో వివాహము జరిగినది. వారికి పురూరవుడు జన్మించాడు. పురూరవుడుని ఊర్వశి వరించి వివాహము చేసుకొన్నది. వారికి ఆయువు, అసమాయువు, ధృఢ్ఢఆఆయువు, పరమాయువు, శతాయువు అను పుత్రులు కలిగారు. ఆయువుకు నహుషుడు, వృద్ధశర్ముడు, రంభుడు, రజి, అనేయుడు అను పుత్రులు కలిగారు. వారిలో నహుషుడికి యయాతి, సంయాతి, ప్రయాతి అనుపుత్రులు కలిగారు. యయాతికి దేవయాని వలన యదువు, తుర్వసుడు కలిగారు. శర్మిష్ఠ వలన ద్రుహ్యుడు, పూరుడు అను పుత్రులు కలిగారు. యదువుకు సహస్రజిత్తు, క్రోష్టుడు, నలుడు, రిపుడు అను కుమారులు కలిగారు. సహస్రజిత్తుకు హేహయుడు, వేణుహయుడు, హైహయుడు అను కుమారులు కలిగారు. హైహయునకు ధర్మనేత్రుడు, కార్తి, సహస్రజిత్తు, మహిష్మంతుడు, భద్రశ్రేణ్యుడు, దుర్దముడు, ధేనుకుడు అను కుమారులు కలిగారు. ధేనుకునకు కృతవీర్యుడు, కృతాజ్ఞి, కృతధన్వుడు, కృతాంజలుడు జన్మించారు. కృతవీర్యునకు కార్తవీర్యుడు అను కుమారుడు కలిగాడు. కార్తవీర్యునకు శూరుడు, శూరసేనుడు, ధృష్టుడు, జయధ్వజుడు అను కుమారులు కలిగారు. జయధ్వజుడు అవంతీ పురరాజయ్యాడు. అతడి నూరుగురు కుమారులు తాలజంఘులు. తాలజంఘుల వంశంకరుడు వృషుడికి మధువు అను కుమారుడు కలిగాడు. మధువు వలన మాధవులు, వృష్టి వలన వృష్టులు వృద్ధి చెందారు.

## అంధకవంశము

Andhaka Vamsamu

**వృష్ణి వంశము**

**శ్యమంతకమణి కథ**

**భూదేవి విలాపము**

**సముద్రుడు శంతనుడు**

**శ్రీకృష్ణుడి అవతారము**

**పూతన వధ**

**శకటాసుర సంహారము**

**శ్రీకృష్ణుడి బాలక్రీడలు**

**యమళార్జున భంజనము**

**బృందావనముకు తరలుట**

**కాలకలి నిర్మూలనము**

**నీలాపరిణయము**

**కాళీయమర్ధనము**

**బలరాముని ప్రభావము**

**బలదేవుడు**

**గోవర్ధనోద్ధరణ**

**రాసక్రీడలు**

**వృషభాసుర వధ**

**కంసుడి కలత**

**కేశి సంహారము**

**మధురకు పయనము**

**మధురలో ప్రవేశించుట**

**కుబ్జను అనుగ్రహించుట**

**కంసుడి విల్లును విరచుట**

**కంసుడి జన్మ రహస్యము**

**కంస వధ**

**ఉగ్రసేనుడికి పట్టముగట్టుట**

**గురుకుల వాసము**

**జరాసంధుడి దండయాత్ర**

**నృగాలవాసుదేవుడి సంహారము**

**జరాసంధుడి దందయాత్ర**

**కాలయవనుడి అంతము**

**ద్వారక నిర్మాణము**

**రుక్మిణీ కల్యాణము**

**ప్రద్యుమ్నుడు**

**శుభాంగి స్వయంవరము**

**అనిరుద్ధుడి పరిణయము**

**బలరాముడి జూదము**

**నరకాసుర వధ**

**సురకన్యల విముక్తి**

**పారిజాతాపహరణము**

**ఘంటాకర్ణ విముక్తి**

**పౌండ్రుని వధ**

**శివకేశవ సమాగమము**

**బాణాసుర వృతాంతము**

123

**శివకేశవ సంగ్రామము**

**ఉషాపరినయము**

**వరుణుని జయించుట**

**వనరులు**

**మహాభారతం - ఆంధ్ర మహాభారతం - వ్యాసుడు - కవిత్రయం**

---

**పర్వాలు**

ఆది పర్వము • సభా పర్వము • వన పర్వము లేక అరణ్య పర్వము • విరాట పర్వము • ఉద్యోగ పర్వము • భీష్మ పర్వము • ద్రోణ పర్వము • కర్ణ పర్వము • శల్య పర్వము • సౌప్తిక పర్వము • స్త్రీ పర్వము • శాంతి పర్వము • అనుశాసనిక పర్వము • అశ్వమేధ పర్వము • ఆశ్రమవాస పర్వము • మౌసల పర్వము • మహాప్రస్థానిక పర్వము • స్వర్గారోహణ పర్వము • **హరివంశ పర్వము**

**పాత్రలు**

శంతనుడు | గంగ | భీష్ముడు | సత్యవతి | చిత్రాంగదుడు | విచిత్రవీర్యుడు | అంబ | అంబాలిక | విదురుడు | ధృతరాష్ట్రుడు | గాంధారి | శకుని | సుభద్ర | పాండు రాజు | కుంతి | మాద్రి | యుధిష్టరుడు | భీముడు | అర్జునుడు | నకులుడు | సహదేవుడు | దుర్యోధనుడు | దుశ్శాసనుడు | యుయుత్సుడు | దుస్సల | ద్రౌపది | హిడింబి | ఘటోత్కచుడు | ఉత్తర | ఉలూపి | బభృవాహనుడు |అభిమన్యుడు | పరీక్షిత్తు | విరాటుడు | కీచకుడు | ద్రోణుడు | అశ్వత్థామ | ఏకలవ్యుడు | కృతవర్మ | జరాసంధుడు | సాత్యకి | దుర్వాసుడు | సంజయుడు | జనమేజయుడు | వేదవ్యాసుడు | కర్ణుడు | జయద్రధుడు | శ్రీకృష్ణుడు | బలరాముడు | ద్రుపదుడు | | ధృష్టద్యుమ్నుడు | శల్యుడు | శిఖండి

**ఇతర విషయాలు**

పాండవులు | కౌరవులు | హస్తినాపురం | ఇంద్రప్రస్థం | రాజ్యాలు | కురుక్షేత్ర యుద్ధం | భగవద్గీత

"http://te.wikipedia.org/w/index.php?title=హరివంశ_పర్వము&oldid=744612" నుండి వెలికితీశారు

వర్గం: మహాభారతం